

ॐ



# పురాణములు

విచారణ

## మదాంధ్ర పద్మ పురాణము- 1,2,4





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year
1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject
Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language
Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీమదాంధ్ర

# పద్మపురాణము

(ఆదిఖండ భూమిఖండ బ్రహ్మఖండత్రయాత్మకము)

ప్రథమసంపుటము.

శ్రీమహీశూరమహారాజాస్థానమహావిద్వాన్
కావ్యకళానిధి ఆశుకవికేసరి విద్యాభూషణ శతావధాన
పిసుపాటి చిదంబరశాస్త్రి ప్రణీతము

ప్రకాశకుఁడు—
విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి
ఆంధ్రాధ్యాపకుఁడు
వేంకటగిరిరాజ కళాశాల
నెల్లూరు
1953

శ్రీ మాత్రే నమః

# పరిచయము

శ్లో. యస్మా దిదం జగ దజాయత యత్ర తిష్ఠ
త్యంతే సమ స్త మిద మ స్త ముపైతి యత్ర।
తస్మై నమ స్సదసదాదివికల్పశూన్య
చైతన్యమాత్రవపుషే పురుషో త్తమాయ.

శ్లో. అచతుర్వదనో బ్రహ్మా, ద్విబాహు రపరో హరిః।
అఫాలలోచన శ్శంభు, ర్భగవాన్ బాదరాయణః.

సకలవిజ్ఞానమూలకందములు వేదములు. అందు లేనిది లేదు. అందలివిజ్ఞానమే సర్వత్ర ప్రపంచితమైనది. అది మహాగంభీరము.తదర్థవ్య క్తికే షడంగములుమున్నగునవి యేర్పడినవి. అయినను వేదవేదాంగవ్యాసంగము కావింపలేనివారి కెల్లఁ దద్గంభీరార్థమును గరతలామలక మొనర్పఁ దలఁచి పరమకారుణికు లగుమహర్షులు వేదార్థవర్ణనపరము లగుపురాణేతిహాసములరచనకుఁ బూనుకొనిరి. "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అని కదా యార్షవచనము. కాని యీ పురాణేతిహాసములకుఁగూడఁ బ్రథమప్రకాశనస్థానము బ్రహ్మయే. "అస్య మహతో భూతస్య నిశ్శ్వసిత మేత ద్య దృగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వాంగిరస ఇతిహాసః పురాణమ్" (బృహదారణ్యకము.) జీవునకు నిశ్శ్వాసముతో యావద్ద్రవ్యభావిత్వరూపసంబంధ మున్నట్లు శాశ్వతుఁ డగుపరమాత్మకు వేదేతిహాసపురాణములతో యావద్ద్రవ్యభావిత్వరూపసంబంధము (అనఁగా శాశ్వతసంబంధము) కలదనియుఁ గావుననే వేదములవలె నితిహాసపురాణములును శాశ్వతము లనియును పై శ్రుతివాక్యము సూచించుచున్నది. కల్పాంతమునం దంతర్హితము లైనయాపురాణములను గల్పాదియందుఁ జతుర్ముఖబ్రహ్మ మరల స్మరించి దేవతలకు మరీచ్యాది మునులకు నుపదేశించెను. అది యేకరూపము. శతకోటి ప్రవి స్తరము. దానిని వ్యాసభగవానుఁడు నాలుగులక్షలగ్రంథము (=శ్లోకములు) గా సంగ్రహించి పదునెనిమిదిపురాణములు గా విభజించెను. ఇప్పుడు మనము పఠించుచున్నష్టాదశపురాణము లివియే.

శ్లో॥ పురాణం సర్వశాస్త్రాణాం, ప్రథమం బ్రహ్మణా స్మృతమ్।
అనంతరం చ వక్త్రేభ్యో, వేదా స్తస్య వినిర్గతాః.
పురాణ మేక మే వాసీ, చ్ఛతకోటిప్రవి స్తరమ్.

ఇత్యాదిపురాణవచనములఁ బ్రదర్శించి యీవిషయము విష్ణుపురాణవ్యాఖ్యకు గువిష్ణుచి త్తీయమున నిట్లు నిర్వచింపఁబడినది.

శ్రీ మాత్రే నమః

# పరిచయము

శ్లో. యస్మాదిదం జగదజాయత యత్ర తిష్ఠ
త్యంతే సమస్త మిద మస్త ముపైతి యత్ర।
తస్మై నమ స్సదసదాదివికల్పశూన్య
చైతన్యమాత్రవపుషే పురుషోత్తమాయ.

శ్లో. అచతుర్వదనో బ్రహ్మా, ద్విబాహు రపరో హరిః।
అఫాలలోచన శ్శంభు, ర్భగవాన్ బాదరాయణః.

సకలవిజ్ఞానమూలకందములు వేదములు. అందు లేనిది లేదు. అందలివిజ్ఞానమే త ప్రపంచితమైనది. అది మహాగంభీరము. తదర్థవ్యక్తికే షడంగములుమున్నుగ మేర్పడినవి. అయినను వేదవేదాంగవ్యాసంగము కావింపలేనివారి కెల్లఁ ంరార్థమును గరతలామలక మొనర్పఁ దలఁచి పరమకారుణికు లగుమహ వేదార్థవర్ణనపరము లగుపురాణేతిహాసములరచనకుఁ బూనుకొనిరి. "ఇతి పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్" అని కదా యార్షవచనము. కాని పురాణేతిహాసములకుఁగూడఁ బ్రథమప్రకాశనస్థానము బ్రహ్మయే. "అస్య తో భూతస్య నిశ్శ్వసిత మేత దృదృగ్వేదో యజుర్వేద స్సామవేదో౽థర్వాంగి ఇతిహాసః పురాణమ్" (బృహదారణ్యకము.) జీవునకు నిశ్శ్వాసముతో యావ ద్భావిత్వరూపసంబంధ మున్నట్లు శాశ్వతుఁ డగుపరమాత్మకు వేదేతిహాసపురా లతో యావద్ద్రవ్యభావిత్వరూపసంబంధము (అనఁగా శాశ్వతసంబంధము) కల ముఁ గావుననే వేదములవలె నితిహాసపురాణములును శాశ్వతము లనియును సతివాక్యము సూచించుచున్నది. కల్పాంతమునం దంతర్హితము లైనయాపురా ంలను గల్పాదియందుఁ జతుర్ముఖబ్రహ్మ మరల స్మరించి దేవతలకు మరీచ్యాది పలకు నుపదేశించెను. అది యేకరూపము. శతకోటి ప్రవిస్తరము. దానిని సభగవానుఁడు నాలుగులక్షలగ్రంథము (=శ్లోకములు) గా సంగ్రహించి పదు ంటదిపురాణములు గా విభజించెను. ఇప్పుడు మనము పఠించునష్టాదశపురాణము మే.

శ్లో. పురాణం సర్వశాస్త్రాణాం, ప్రథమం బ్రహ్మణా స్మృతమ్।
అనంతరం చ వక్త్రేభ్యో, వేదా స్తస్య వినిర్గతాః.
పురాణ మేక మే వాసీ, చ్ఛతకోటిప్రవిస్తరమ్.

ఇత్యాదిపురాణవచనములఁ బ్రదర్శించి యీవిషయము విష్ణుపురాణవ్యాఖ్య సవిష్ణుచిత్తీయమున నిట్లు నిర్వచింపఁబడినది.

"అయమర్థః. కృతయుగే వేదా త్పూర్వం బ్రహ్మణా దృష్టస్య శతకోటి ప్రవిస్తరస్య పురాణస్కంధస్య బ్రాహ్మసంజ్ఞస్య త్రేతాయాం పున ర్బృహస్పత్యష్టా దశర్షిభి ర్గ్రంథకోట్యా సంక్షిప్య బ్రాహ్మపాద్మాద్యష్టాదశపురాణాత్మనా విభక్త స్యైకాదశాధికశతసంహితస్య పున ర్ద్వాపరాంతే తస్య సారం వేదవ్యాస శ్చతు ర్లక్ష్యా సంక్షి ప్యాష్టాదశపురాణసంహితాం కృత్వా రోమహర్షణం సూత మధ్యాపయ దితి"

## పురాణములకుఁ బంచమవేదత్వము

ఇతిహాసపురాణములకుఁ బంచమవేదత్వప్రతీతి వేదములందే కానవచ్చు చున్నది. "ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మథర్వణం చతుర్థ మితిహాసం పురాణం పంచమం వేదానాం వేదమ్" ఛాందోగ్యోపనిషత్తు.

శ్లో. పురాణాని చతుర్లక్షా, న్యేతాని ధరణీతలే।
తథా మహాభారతం చ, లక్షసంఖ్యం ప్రకీర్తితమ్.
పంచలక్ష మిదం రాజన్, కథితం బ్రహ్మ కేవలమ్।
వేదః పంచమనామైమ, లోకనిస్తారకః పరః.

పద్మపురాణము.

ఇతిహాసము గూడఁ బురాణములలో నంతర్భూత మనియే చెప్పియున్నారు. "ఇతిహాసస్య పురాణే ష్వంతర్భావః" (విష్ణుపురాణవిష్ణుచిత్తీయవ్యాఖ్య.)

పురాణములకు నితిహాసములకుఁ గలప్రధానభేద మిది. పురాణకర్త యితి హాసములలో నాఖ్యానములను (=స్వయముగాఁ జూచినవిషయములను) బ్రధానము గాను సృష్ట్యాదితత్త్వమును దక్కువగాను జెప్పును. పురాణములలో నుపాఖ్యా నములను (=వేదములవలన వినినవిషయములను) సృష్ట్యాదితత్త్వమును బ్రధానము గాను నాఖ్యానములను దక్కువగాను జెప్పును. కావుననే యితిహాసవిషయములు పురాణములలోను బురాణవిషయము లితిహాసములలోను నున్నవి.

## పురాణములకు "జయ"నామము

అష్టాదశపురాణములకు "జయము" అనుపేరు గలదు.

శ్లో. నారాయణం నమస్కృత్య, నరం చైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం, తతో జయ ముదీరయేత్. మహాభారతము.

"జయం"

శ్లో. అష్టాదశపురాణాని, రామస్య చరితం తథా।
కార్ష్ణం వేదం పంచమం చ, యన్మహాభారతం విదుః.
తథైవ విష్ణుధర్మాశ్చ, శివధర్మాశ్చ శాశ్వతాః।
జయేతి నామ తేషాం చ, ప్రవదంతి మనీషిణః.

ఇతి భవిష్యవచనాత్పురాణాదికం వా, "చతుర్ణాం పురుషార్థానా మపి హేతౌ జయోఽస్త్రియా" మితికోశా దన్యం వా సర్వపురుషార్థప్రతిపాదకం గ్రంథం శారీరక సూత్రభాష్యాదిరూప ముదీరయేత్." నీలకంఠీయవ్యాఖ్య.
"జయం. జయ త్యనేన సంసార మితి జయో గ్రంథః"

భాగవతము ౧ స్కం. ౨ అ. శ్రీధరీయవ్యాఖ్య.

పై గ్రంథములనుబట్టి ధర్మార్థకామమోక్షప్రతిపాదకమై సంసారజయమునకు సాధనభూత మగుగ్రంథమునకు జయనామము కల దని తేలినది. అట్టిగ్రంథములు:- అష్టాదశపురాణములు, మహాభారతము, రామాయణము, విష్ణుధర్మములు, శివధర్మములు, శారీరకసూత్రభాష్యము మున్నగునవి.

## పురాణశబ్దనిర్వచనము

ఈశబ్దమును బలువురు పలువిధముల నిర్వచించి యున్నారు. మొదట వ్యాస భగవానునినిర్వచనమును బ్రదర్శించి పిమ్మట మఱికొన్ని నిర్వచనములు ప్రదర్శింతును.

శ్లో. యస్మా త్పురా హ్యన క్తీదం, పురాణం తేన త త్స్మృతమ్.

బ్రహ్మాండపురాణము. ప్రక్రియాపాదము.

పురా = అతీతానాగతవృత్తములను. అనక్తి = పొందించునది (తెలుపునది) పురాణము అని వ్యుత్పత్తి. పురా భవమ్ (=పూర్వమందుఁ బుట్టినది) అని కొందఱు. పురా = అతీతానాగతావర్థా. అణతి (= భూతభవిష్యద్విషయములను జెప్పునది.) అని కొందఱు. పురాపి నవం పురాణమ్ (=పూర్వమందును గ్రొత్తది. అనఁగాఁ బూర్వపూర్వయుగములందలి విషయములను దెలుపునవి యైనను ఎప్పటి కప్పుడు నవ్యనవ్యములై మానవహృదయముల నాకర్షించునవి పురాణము లని భావము)

## పురాణరచనాక్రమవిధానములు

అష్టాదశపురాణములలోఁ బద్మపురాణమునే మొదటఁ గృష్ణద్వైపాయన మహర్షి రచియించె నని, పిమ్మట సర్వపురాణములనుండి సారము నాకర్షించి భాగవతము రచియించె నని పద్మపురాణమునఁ గలదు.

శ్లో. తత్ర పద్మపురాణం తు, ప్రథమం చ ప్రణీతవాన్।
తతోఽన్యాని పురాణాని, కృత్వా షోడశ తు క్రమాత్.
అష్టాదశం భాగవతం, సార మాకృష్య సర్వతః।
కృతవాన్ భగవాన్ వ్యాసః, శుక మధ్యాపయ త్స్వయమ్,

ఆఖ్యానోపాఖ్యానగాథాకల్పవృత్తాంతనిర్ణయములతో సర్గాది పంచలక్షణ యుక్తమును నష్టాదశపురాణసంక్షేపరూపమును నగుపురాణసంహితను వేదవ్యాస మహర్షి రచియించెను.

శ్లో. ఆఖ్యానైశ్చా ప్యుపాఖ్యానై, ర్గాథాభిః కల్పశుద్ధిభిః।
పురాణసంహితాం చక్రే, పురాణార్థవిశారదః.

విష్ణుపురాణము. ౩, ౬. ౧౫.

శ్లో. స్వయందృష్టార్థకథనం, ప్రాహు రాఖ్యానకం బుధాః।
శ్రుతస్యార్థస్య కథన, ముపాఖ్యానం ప్రచక్షతే.

ఆఖ్యానై ర్భారతాదీతిహాసైః, ఉపాఖ్యానై స్తత్ప్రసక్తై ఋభునిదాఘకథాద్యైః. గాథాః పితృపృథివీగీతాద్యాః, కల్పశుద్ధి ర్వారాహాదికల్పవృత్తాంత నిర్ణయః. పితృకల్పమంత్రకల్పవిధి ర్వా, ఏతై స్సహ సర్గాదిపంచలక్షణాం పురాణ సంహితామష్టాదశపురాణానాం సంక్షేపరూపాం వ్యాసశ్చక్రే. (విష్ణుచిత్తీయవ్యాఖ్య)

పురాణకర్త స్వయముగాఁ జూచి చెప్పినది యాఖ్యానము. (ఉదా: భారత కథ, మొ.) వేదములవలన విని చెప్పిన దుపాఖ్యానము. (ఉదా: హరిశ్చంద్ర కథ, మొ.) పితృగీతలు, పృథివీగీతలు మున్నగునవి గాథలు. వారాహాదికల్ప నిర్ణయము కల్పశుద్ధి.

## పురాణలక్షణము

శ్లో. సర్గశ్చ ప్రతిసర్గశ్చ, వంశో మన్వంతరాణి చ।
వంశానుచరితం చేతి, పురాణం పంచలక్షణమ్.

తత్ర సర్గ స్త్రివిధః. ప్రథమమధ్యమాంత్యభేదేన. తత్ర ప్రథమసర్గో మూల ప్రకృతే శ్చతుర్వింశతితత్త్వప్రాదుర్భావః. మధ్యమసర్గ స్తత్త్వవిశేషై శ్చతుర్దశ లోకమనుప్రజాపతీంద్రదేవసప్తర్షిప్రముఖారంభః. అంత్యసర్గో భూలోకే మనుష్య, పశు, మృగ, పక్షి, సరీసృప, స్థావరవిశేషాణాం ప్రతిశరీరారంభః. ప్రతిసర్గః ప్రదర్శిత సర్గస్య త్రివిధస్య ప్రతిలోమసర్గః ప్రళయః. వంశో బ్రహ్మాదేః పుత్రపౌత్రపరం పరానుగతః శరీరసంతతిప్రవాహోఽద్యాఽపి వర్తమానః. మన్వంతరమ్–బ్రహ్మణో దివసః కల్పః. తస్మిన్ కల్పే చతుర్దశ మనవః. ఏకసప్తతిచతుర్యుగావృత్తి రేకో మనుః. మనో ర్మన్వంతరప్రాప్తికథనం మన్వంతరమ్...వంశానుచరితం వంశజానాం మహతా మాచారగుణసంకీర్తనమ్.

(ప్రపంచహృదయము. ఉపాంగప్రకరణము. 45పు.)

సర్గము = ప్రథమమధ్యమాంత్యసృష్టి (ఇదియే బ్రహ్మాండసృష్ట్యాదిసృష్టి) ప్రతి సర్గము = ప్రళయము (=పై మూఁడువిధములగుసృష్టికిఁ బ్రతిలోమసృష్టి) వంశము

= బ్రహ్మాద్యుల పుత్రపౌత్రపరంపరానుగత మగు శరీరసంఘాతప్రవాహము. (ఇందే సూర్యచంద్రఋషివంశములును జేరును) మన్వంతరము = స్వాయంభువు మున్నగు మనువుల కాలమునందలి దేవతాధర్మాదిస్థితి. వంశానుచరితము = వంశజాతు లగు మహాపురుషులయాచారగుణములను వర్ణించుట. ఇట్టిపంచలక్షణములు గలది పురాణము.

## మహాపురాణలక్షణము

మహాపురాణము దశలక్షణోపేతము.

౧. సర్గము = కారణసృష్టి ( = బ్రహ్మసృష్టి)

౨. విసర్గము = బ్రహ్మసృష్టి ననుసరించి బ్రహ్మమానసపుత్రు లగుదక్షమరీచ్యాదులు కావించినసృష్టి.

౩. వృత్తి = భూతములకు ఆవశ్యకము లగుజీవికాసాధనములు. (ఆహారాదులు)

౪. రక్ష = దుష్టసంహారమునకై నభగవదవతారములు. వానిలీలలు.

౫. మన్వంతరము = స్వాయంభువు మున్నగుమనువులకాలమునందలి దేవతాధర్మాదిస్థితి

౬. వంశము=బ్రహ్మాదులపుత్రపౌత్రపరంపరానుగత మగుశరీరసముదాయ ప్రవాహము.

౭. వంశానుచరితము = వంశజాతు లగుమహాపురుషులయాచారగుణములవర్ణనము.

౮. సంస్థ=ప్రళయము (ఇది నైమిత్తిక, ప్రాకృతిక, నిత్యా,ఽఽత్యంతిక భేదమునఁ జతుర్విధము).

౯. హేతువు = సృష్టికి హేతుభూతుఁ డగుజీవునిగుఱించి తెలుపునది.

౧౦. అపాశ్రయము = జాగ్రత్స్వప్నసుషుప్తులు అనునవస్థాత్రయమునఁ గనఁబడు విశ్వతైజసప్రాజ్ఞులు అనుమాయావృత్తులు మూఁడింటియందును బరమాత్మ సాక్షిమాత్రుఁడై యుండును. దీనినిగుఱించి తెలుపునది. భాగ. ౧౨. ౬ అ.

మఱియొకచో నిట్లున్నది.

శ్లో. మహతాం చ పురాణానాం, లక్షణం కథయామి తే।
సృష్టి శ్చాపి విసృష్టిశ్చ, స్థితి స్తేషాం చ పాలనమ్.
కర్మణాం వాసనా వార్తా, మనూనాం తు క్రమేణ చ।
వర్ణనం ప్రళయానాం చ, మోక్షస్య చ నిరూపణమ్.
ఉత్కీర్తనం హరే రేవ, దేవానాం చ పృథక్ పృథక్.
బ్రహ్మవైవర్తము. (శ్రీ) కృష్ణజన్మఖండము. ౧౩౨ అ.

## ఉపపురాణలక్షణము

ఉపపురాణము పంచలక్షణోపేతము. అవి సర్గాదులు. అష్టాదశపురాణముల వలె నేకకర్తృకములు గాక నానామునికర్తృకము లగుటయు వీని కొకవిశేష లక్షణము.

శ్లో. సర్గశ్చ ప్రతిసర్గశ్చ, వంశో మన్వంతరాణి చ।
వంశానుచరితం విప్ర, పురాణం పంచలక్షణమ్.
ఏత దుపపురాణానాం, లక్షణం చ విదు ర్బుధాః।
బ్రహ్మవైవర్తము. శ్రీకృష్ణజన్మ. ౧౩౨ అ.

''అన్యా న్యుపపురాణాని, మునిభిః కథితా న్యపి'' కూర్మపురాణము.

## మహాపురాణములు

ఇవి పదునెనిమిది. ఇవి యన్నియును వ్యాసప్రోక్తములే. 1. బ్రహ్మ 2. పద్మ 3. విష్ణు, 4. శివ, 5. భాగవత, 6. భవిష్య, 7. నారద, 8. మార్కండేయ, 9. అగ్ని, 10. బ్రహ్మవైవర్త, 11. లింగ, 12. వామన, 13. స్కాంద, 14. మత్స్య, 15. కూర్మ, 16. వరాహ, 17. గరుడ, 18. బ్రహ్మాండపురాణములు.

పురాణశబ్దము మహాపురాణపరముగాఁ గూడఁ బురాణములం దెల్లెడల వాడఁబడియున్నది.

## ఉపపురాణములు

ఇవియును బదునెనిమిది.

శ్లో. ఆద్యం సనత్కుమారోక్తం, నారసింహం తతః పరమ్।
తృతీయం వాయవీయం చ, కుమారేణ చ భాషితమ్.
చతుర్థం శివధర్మాఖ్యం, స్సాక్షా న్నందీశభాషితమ్।
దుర్వాస సోక్త మాశ్చర్యం, నారదీయ మతః పరమ్.
నందికేశ్వరయుగ్మం చ, తథై వోశన సేరితమ్।
కాపిలం వారుణం సాంబం, కాళికాహ్వయ మేవ చ.
మాహేశ్వరం తథా కల్కి, దైవం సర్వార్థసిద్ధిదమ్।
పరాశరోక్త మపరం, మారీచం భాస్కరాహ్వయమ్.
కూర్మపురాణము.

దేవీభాగవతాదులలో మహాపురాణోపపురాణపరిగణనమున నొక కొంత భేదము గలదు. దానికిఁ గల్పభేదాదికము కారణము కావచ్చును. ఇఁక దేవీభాగవత, విష్ణుభాగవతములవిషయమున నేది మహాపురాణమో యేది

బ్రహ్మాండం బ్రహ్మవైవర్తం, మార్కండేయం తథైవ చ.
భవిష్యం వామనం బ్రాహ్మం, రాజసాని నిబోధత।
మాత్స్యం కౌర్మం తథా లైంగం, శైవం స్కాందం తథైవ చ.
ఆగ్నేయం చ షడేతాని, తామసాని నిబోధ మే.

పద్మపురాణము. ఉత్తరఖండము. ౨౬౩ అ.

విష్ణు,నారద, భాగవత, గరుడ, వరాహ, పద్మపురాణములు సాత్త్విక పురాణములు.

బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామన పురాణములు రాజసపురాణములు అగ్ని. మత్స్య, కూర్మ, లింగ, శివ, స్కంద పురాణములు తామసపురాణములు.

ఇట నొకకొంత పరిశీలన మవసరము. సత్త్వరజస్తమోగుణములు కల్పములవి కాని పురాణములవి కావు. సాత్త్వికరాజసతామసకల్పములందు రచితములైన పురాణములందు సాత్త్వికాదివ్యవహార మౌపచారికము.

శ్లో. అసంఖ్యాతా స్స్మృతాః కల్పా, బ్రహ్మవిష్ణుశివాత్మకాః।
కథితాశ్చ పురాణేషు, మునిభిః కాలచింతకైః.
సాత్త్వికే ష్వథ కల్పేషు, మాహాత్మ్య మధికం హరేః।
తామసేషు మహేశస్య, రాజసేషు ప్రజాపతేః.
క్వచి ద్బ్రహ్మ క్వచి ద్విష్ణుః, క్వచి ద్రుద్రః ప్రశస్యతే।
నానేన తేషా మాధిక్యం, న్యూనత్వం వా కథంచన.
తత్తత్కల్పాంతవృత్తాంత, మధిగమ్య మహర్షిభిః।
తాని తాని ప్రణీతాని, విద్వాం స్తత్ర న ముహ్యతి. కూర్మపురాణము.

ఈసాత్త్వికాదివిభాగ మొక్క పురాణములకే కాదు. వేదములకును గానిపించుచున్నది. "యజుర్వేదము సాత్త్వికము. ఋగ్వేదము రాజసము. సామవేదము తామసము" శివపురాణము. వాయుసంహిత.

స్మృతులకు శాస్త్రములకు సైతము సాత్త్వికాదిభేదము చెప్పఁబడినది. గౌతమ, శంఖ, లిఖితాదిస్మృతులు, న్యాయసాంఖ్యాదిశాస్త్రములు తామసములు. ఇట్లే మంత్రములకుఁ ద్రిమూర్తులకుఁ గూడ నీభేదము వ్యాపించినది. వేయేల? నిత్యము నిర్గుణము నగు పరమాత్మ యొక్కఁడు తక్క సగుణ మెల్ల సాత్త్వికాది భేదమునకు లోఁబడినదే. సకలచరాచరజగత్సృష్టికి మూలకారణము పరమేశ్వరునియిచ్ఛ. దీనినే ప్రకృతి యని, ప్రధాన మని, అవ్యాకృత మని వ్యవహరింతురు. దీనిగుణములే సత్త్వరజస్తమస్సులు. ప్రకృతికల్పిత మగుసృష్టియందంతట

దానిగుణములు సంక్రమించి యున్నవి. కావునఁ ద్రిమూర్తులు మొదలణువు వఱకును గలసర్వజగత్తునందును సాత్త్వికాదిభేదము సంభవించినది. ఈభేదమే మానవులలో సైతము కలిగినది. సత్త్వగుణ మధికముగా నుండువారు సాత్త్వికులు. రజోగుణ మధికముగా నుండువారు రాజసులు. తమోగుణ మధికముగా నుండువారు తామసులు. వీరిలో సాత్త్వికు లుత్తమాధికారులు మోక్షకాంక్షులు. రాజసులు మధ్యమాధికారులు స్వర్గాదిఫలకాంక్షులు. తామసు లధమాధికారులు ఐహికఫలకాంక్షులు. ఇట్టిత్రివిధప్రకృతులవారు వారివారియిచ్ఛల కనుకూలము లగుదేవతాదికమును జూపి, తత్తన్మహిమాదికమును దెలిపిననే కాని సరి యగుశ్రోతకు రారు. అందుచేతనే యకారణకారుణికుఁ డగువేదవ్యాసమహర్షి చే సాత్త్వికపురాణములందు మోక్షసాధనములు, రాజసపురాణములందు స్వర్గాదిసాధనములు, తామసపురాణములం దైహికఫలసాధనములు ప్రధానముగను దక్కిన విషయము లప్రధానముగను వర్ణింపఁబడినవి. మఱియుఁ దత్తత్ప్రకృతుల కనుకూలము లగుదేవతలు, మంత్రములు, ఉపాసనలు నుపదేశించి, వీరి కెల్లఁ దరణోపాయము చూపింపఁబడినది.

కావుననే తత్తద్గుణాశ్రయు లగుబ్రహ్మవిష్ణుమహేశ్వరులలో నెక్కువతక్కువలు లేవని, వీరి కందఱకు నిర్గుణము నిరంజనము నిత్యము శుద్ధము నగుచైతన్యమే మూల మని సకలపురాణములందును దెలుపఁబడియే యున్నది. ఈరహస్యమును సమరసభావముతో గ్రహించిననే సకలపురాణములకు సమన్వయము కుదురఁ గలదు.

## పురాణరచనోద్దేశము.

కరుణామయుఁ డగుపరమేశ్వరుఁడు మానవసమాజము నెల్ల నుద్ధరింపఁ దలఁచి వారివారియధికారమునకుఁ దగునట్లు కర్మమార్గము, ఉపాసనామార్గము, జ్ఞానమార్గము అనుమూఁడుమార్గములను వేదములందు నుపనిషత్తులందును బ్రదర్శించెను. ఆవేదములు ప్రభుసమ్మితములు. ప్రభువు "ప్రజలు ఈపని చేయవలెను. ఈపని చేయరాదు" అని శాసించినట్లే వేదములును "ఈకర్మము చేయవలెను. ఈకర్మము మానవలెను" అని ప్రజలను శాసించు చున్నవి. ఇట్టివేదములవలన నత్యల్పసంఖ్యాకు లగుసాత్త్వికప్రకృతులు మాత్రమే తరింతురు. వారికిఁ గారణజిజ్ఞాస యుండదు. వేదములం దీశ్వరవచనము లనెడియచంచలవిశ్వాసమే వారిని వానియడుగుజాడలలో నడిపించును. వీరు ఉత్తమాధికారులు. ఇఁక రజస్తమఃప్రకృతికు లగుమానవులను సైతము తరింపఁజేయుటకై పురాణములు మహర్షులచే నిర్మింపఁబడినవి. ఇవి సుహృత్సమ్మితములు. తల్లిదండ్రులమాటలు లెక్కచేయక యథేచ్ఛముగా సంచరించుజనునకు మంచిమనస్సు గలమిత్రుఁడు నెమ్మదిగా దగ్గ

ఆకుఁ జేరి, ఆయాప్రస్తావములు దెచ్చి దినదినమును మంచిత్రోవను బోధించుచు మెల్లమెల్లగా నాత్రోవలోనికి మరలునట్లు పురాణము లాయాకథలమూలమున, వారివారిసంభాషణములమూలమున, ఆయాదేవతలమహిమలను ప్రశంసించుట మూలమున రజస్తమఃప్రకృతికు లగుమానవులచిత్తవృత్తుల నాకర్షించి వారికి హితవును బోధించును.

మఱియు సకలవిజ్ఞాననిధు లగువేదములలోనినిగూఢార్థమును సర్వజనులకు సులభముగాఁ దెలియుశైలిలోఁ బురాణములు వెల్లడించి యున్నవి. అందుఁ బలువురు దేవతలను దదుపాసనలను దన్మహిమలను వర్ణించుట త్రివిధప్రకృతు లగు జనుల నెల్ల నాకర్షించి వారిని శ్రేయోమార్గమునకు మరలించుటకే యని తెలిపియే యున్నాను.

మఱియొకమాట. గణితము, భూగోళము, ఖగోళము, శకునశాస్త్రము, వ్యాకరణము, న్యాయవేదాంతకాపిలాదిశాస్త్రసిద్ధాంతములు, ఛందస్సు, నిరుక్తము, యోగము, సదాచారములు, ధర్మములు, తీర్థక్షేత్రమహిమలు, ప్రాచీనచరిత్రలు, ఆయుర్వేదము, వృక్షాయుర్వేదము, పంచభూతశక్తులు, పరస్పరద్వేషరహితులై మానవులు సుఖజీవనము సాగించుతెరువులు, ఇవి యవి యన నేల? సకలవిషయములును దరిచినకొలఁదిఁ బురాణసాగరమునుండి వెలువడుచున్నవి. ఇట్టి విజ్ఞానసాగరము లగుపురాణములను మనకుఁ గటాక్షించినపరమకారుణికుఁ డగువేదవ్యాసభగవానునకుఁ జేతులు జోడించి మాఱుమాటాడక తదుక్తమార్గమున సంచరించుటయే మనకుఁ గర్తవ్యము. అప్పుడే భారతదేశము సర్వోత్తమము కాఁగలదు.

## పురాణవేత్తకు సర్వజ్ఞబిరుదము.

అష్టాదశమహాపురాణములు, అష్టాదశోపపురాణములు, మహాభారతము తెలిసినవారికి భవిష్యపురాణము "సర్వజ్ఞ" బిరుద మొసఁగి యున్నది.

శ్లో. యే త్వేతాని సమస్తాని, పురాణాని చ జానతే।
భారతం చ మహాబాహో, తే "సర్వజ్ఞా" మతా నృణామ్.

"బాగుగాఁ బురాణములను దెలిసికొననివాఁడు- నాలుగువేదములు ఉపనిషత్తులు షడంగములు తెలిసికొన్నను విచక్షణుఁడు కాఁడు" అని బ్రహ్మాండపురాణము వ్యతిరేకమార్గమునఁ బైవిషయమునే దెలుపుచున్నది

శ్లో. యో విద్యా చ్చతురో వేదాన్, సాంగోపనిషదో ద్విజః।
న చే త్పురాణం సంవిద్యా, న్నైవ స స్యా ద్విచక్షణః. (ప్రక్రియాపాదము.)

## పద్మపురాణము — తన్నామనిర్వచనము.

పద్మపురాణము రచనలో మొదటిదిగాను, పురాణములలో రెండవదిగాను పరిగణింపఁబడినది. పరిమాణమునఁ గూడ నిది ద్వితీయస్థానము నాక్రమించుచున్నది. (ప్రథమస్థానము నాక్రమించినపురాణము లక్షశ్లోకాత్మక మగు స్కాందము.) ఇందలిశ్లోకసంఖ్య యేఁబదియైదువేలు. ఇందు ఆది, భూమి, బ్రహ్మ, పాతాళ, సృష్ట్యుత్తరఖండము లనునాఱు ఖండములు గలవు ఇది పద్మకల్ప వృత్తాంతమును వెల్లడించుచున్నది. ఆకల్పమున విష్ణుదేవునినాభినుండి క్షోణీలక్షణముతో నొప్పుపద్మ మొకటి యుద్భవిల్లెను. ఆపద్మము హిరణ్మయము. బహుయోజనవిస్తృతము. అదియే యాకల్పమున భూమి యయ్యెను. దానికేసరములే హిమవన్మేరుకైలాసాదిశైలము లయ్యెను. అందుచేతనే యాకల్పమునకుఁ "పద్మకల్ప" మనుపేరు వచ్చినది. ఆకల్పవృత్తాంతమును దెలుపుచుండుటచే నీపురాణమునకును "పద్మపురాణ" మనునామధేయము కలిగెను. ఇందుఁ బ్రధానప్రతిపాద్యము హరిపారమ్యము. చైత్రాదిద్వాదశమాసమాహాత్మ్యములు, షడ్వింశత్యేకాదశులస్వరూపమహిమాదికము, పితృభక్తివిష్ణుభక్తిమాహాత్మ్యము, భగవద్గీతామహిమము, రామనామవైభవము, పంచాఖ్యానము మున్నగు నితరవిషయములు వేలకొలఁది ప్రతిపాదితములు. అవి విషయసూచికలలో నీయఁబడియుండుటచే నిక్కడ మరల వివరింపలేదు. ఏపురాణమునను లేనియష్టాదశపురాణాత్మకవిష్ణుస్వరూప మిందుఁ దెలుపఁబడుట విశేషము. (చూ. ఆం. పద్మ. ఆది. 827–828) ఇతరపురాణములను జదువునప్పుడు మనకుఁ గలుగునసేకసందేహము లీపురాణమును జదివినఁ దీఱఁగలవు. ఇందులకుఁ బాతాళఖండమున వర్ణించినపూర్వకల్పరామాయణాదిక ముదాహరణము.

## ఆంధ్రీకరణము

ఇట్టిపద్మపురాణమును సంపూర్ణముగ నాంధ్రీకరించి యాంధ్రభారతికి నైవేద్యము జేసినభాగ్యము శ్రీచిదంబరశాస్త్రిగారి కొక్కరికే దక్కినది.

శ్రీనాథునితాత కమలనాభామాత్యుఁడు "పద్మపురాణసంగ్రహము" రచియించినాఁడఁట! (చూ. భీమఖండము. ౧–౧౦) దానిజాడయే యెక్కడను గానరాదు మడికిసింగనమంత్రి "ఉత్తరఖండము" మాత్రమే తెనుఁగుచేసియున్నాఁడు.

శ్రీ శాస్త్రిగారు వాగనుశాసనునివలెఁ గవితాజీవితములందు బహునియమవంతులు. వీరు పద్మపురాణరచనలోఁ జాలనియమములు పాటించియున్నారు. ఉదాహరణమునకై యొండు రెండు తెలిపెదను. (లళలకుఁ దప్ప) అభేదయతిని గాని, అభేదవర్గయతిని గాని వీ రీమహాగ్రంథమున వాడనే లేదు. ఋవిభక్తియతినే కాని, ఋకారయతిని వాడలేదు. ఇట్టివానిని బరిశోధకులు పరిశీలింపఁగలరు.

శ్రీశాస్త్రిగారికవిత వారియెడఁదవలె బహునియమకలిత మైనను మృదుమధురము. వీరిప్రవర్తనవలె శైలిసైతము వక్రతావిరహితము. వీరికవితాధార గంగాఝరివలె నిరర్గళము, స్వచ్ఛము. వ్యర్థపదములు మందునకైనను గానరావు. ఆదినుండి తుదివఱకు గ్రంథ మంతయు నొక్కశైలిలో నడచినది. ఆయాసందర్భములకనుకూలములై రసోద్బోధకము లగువృత్తములు వాడఁబడినవి. (చూ. ఆది. ౨౩౧-౨౩౮.) ఇట బాణాసురునిశివభక్తి తోటకవృత్తములలోఁ దొణికిసలాడుచున్నది. ఇట్లే యుత్తరఖండమున మార్కండేయునిశివభక్తి యమునియెడఁ గల వాత్సల్యభావము మత్తకోకిలవృత్తమున వ్యక్తమగుచున్నవి. ఒక్కయాంధ్రదేశమునే కాక యాసేతుహిమాచలము తమమధురకవితాస్రవంతినిలో ముంచి తేల్చిన శ్రీచిదంబరకవీంద్రునికవితారీతుల నిప్పు డిటఁ బ్రత్యేకముగాఁ బ్రశంసింప వలెనా?

ఆంధ్రీకరణము మక్కికి మక్కిగాఁ గాక స్వతంత్రగ్రంథమువలె సాగినది. అయినను మూలస్థవిషయములను మాత్ర మెక్కడను విడువలేదు.

ఒకవిషయమే ప్రసంగవశమునఁ గొంత యొకఖండమునను మఱికొంత యింకొకఖండమునను మూలమునఁ జెప్పబడినప్పుడు దానిని బాఠకులసౌకర్యముకై యాంధ్రీకరణమున నొక్కచోటనే చేర్చి చెప్పియున్నారు. ఉదా: ౨౬ ఏకాదసులమహిమాదికము. (చూ. ఆం. పద్మ. బ్రహ్మ. ౪౧౨-౬౩౫ వఱకు) ఇది మూలమున బ్రహ్మఖండము. ౧౫ అధ్యాయమున, ఉత్తరఖండము. ౩౫ అధ్యాయము మొదలు ౬౪ అధ్యాయమువఱకును గలదు.

ఇట్టిచిఱుమార్పులు కొన్ని యట నటఁ గలవు. ఆంధ్రీకరణమునందలివిశేషములనెల్ల విపులముగా నాల్గవసంపుటమునఁ దెలుపఁదలఁచియుండుటచే నీవిషయ మిప్పు డింతటితో ముగించుచున్నాను.

## ముద్రణప్రయత్నము

"శ్రీమదాంధ్రపద్మపురాణ" రచయిత యీమహాగ్రంథ మచ్చుపడకయుండగే కాలధర్మము నొందుటచేఁ దదాజ్ఞావశవర్తులమై నేను శ్రీమాయన్నగారు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నేతద్గ్రంథముద్రణమునకై యథాశక్తి యత్నింపఁ దొడగితిమి. ఈసందర్భమును గుర్తించిన శ్రీ వేంకటగిరిరాజకళాశాలావిద్యార్థులు పదశోత్తరశతాధికసహస్రరూప్యములు (రు. 1116-0-0) సమర్పించి తమభాషాభిమానమును వెల్లడించిరి. గురుభక్తిభరితాత్ము లగునీవిద్యార్థులకుఁ గృతిపతియగు కాశీవిశ్వేశ్వరుఁడు సర్వదా సకలశ్రేయము లొసఁగి ప్రోచుఁగాక యని యాశీర్వ

దించు చున్నారము. ఇప్పు డిప్పుడే మఱికొందఱు పెద్దలుసైతము మాసహాయ్యముసకుఁ జేయూఁత యిచ్చుచున్నారు. వీరిపవిత్రనామధేయము లనుబంధమునఁ బ్రకటింపఁ బడినవి.

ఈ కార్యము బహుద్రవ్యసాధ్య మగుటచే నిందుల కీక్రిందిప్రణాళిక యేర్పఱుపఁ బడినది.

| | | | |
|---|---|---|---|
| 1. మహారాజపోషకులు | ... | రు. | 1000-0-0 |
| 2. రాజపోషకులు | ... | రు. | 250-0-0 |
| 3. పోషకులు | ... | రు. | 100-0-0 |
| 4. సహాయులు | ... | రు. | 50-0-0 |
| 5. ప్రోత్సాహకులు | ... | రు. | 25-0-0 |

పైనైదు తెఱఁగులవారికి ముద్రిత మైన వెంటనే ప్రతిసంపుట మొక్కొక్క ప్రతి పంపఁబడును. వీరినామధేయములుసైతము గ్రంథమున ముద్రింపఁబడును.

ఏతద్గ్రంథముద్రణమునకుఁ జెందినవస్తుసంభారము నుంచుకొనుటకై తమ యింటఁ దావొసంగినమహోదారులు భాషాభిమానులు శ్రీతూములూరి శివరామయ్యపంతులు (B. A. B. L.) గారికిఁ గృతజ్ఞతాపూర్వకనమోవాకములు.

శ్రీకాశీవిశ్వేశ్వరునికరుణాకటాక్షమున నేఁటికిఁ బ్రథమసంపుటము ప్రకటింపఁ బడినది. ఇందు ఆది, భూమి, బ్రహ్మఖండములు మూఁడును గలవు. ఇఁక ముద్రింప వలసినవి పాతాళ, సృష్ట్యుత్తరఖండములు మూఁడు. ఈ మూఁడుఖండములు పెద్దవి గావున నొక్కొక్కటి యొక్కొక్కసంపుటముగా ముద్రింపవలసియున్నవి. ఉదారు లగునాంధ్రమహోదయులతోడ్పాటుతో నచిరకాలముననే తక్కినసంపుటములను గూడఁ బ్రకటించి యాంధ్రభాషామతల్లికి సమర్పింపఁగల మని విశ్వసించుచున్నాఁడను.

నెల్లూరు
30-11-1953

ఇట్లు
విన్నవించుభాషాసేవకుఁడు,
పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి
ఆంధ్రాధ్యాపకుఁడు - వేంకటగిరి రాజకళాశాల

మహీశూరమహారాజాస్థానమహావిద్వాన్ కావ్యకళానిధి
ఆశుకవి కేసరి విద్యాభూషణ శతావధాని
బ్రహ్మశ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రి
జీవితచరిత్రసంగ్రహము.

## వంశము

ఆంధ్రదేశమున వెలనాటిబ్రాహ్మణశాఖ మిక్కిలి పేరుగాంచినది. ఇందు గుంటూరుమండలాంతర్గతకరవదిగ్రామవాస్తవ్యులు, శ్రీరామభక్తాగ్రగణ్యులు, సహజకవితావిలసితులు పిసుపాటి పేరుభట్టుగారు సుప్రసిద్ధులు. వీరిపుత్రులు శ్రీరామ రాఘవ లక్ష్మీనారాయణ వేంకటరమణ సీతారామ సుబ్రహ్మణ్యనామధేయులు ఆరుగురు. వీరిలో నైదవవారగుసీతారామయ్యగారిని వంగవోలుపురవాసులు సహజౌదార్యులు పిసుపాటి చిదంబరముగారికి దత్తపుత్రునిఁగా నొసఁగిరి. సీతారామయ్యగారికి వంగవోలుతాలూకా పోతవరగ్రామవాస్తవ్యులు పాలపర్తి సుబ్బయ్యగారు తమపుత్రిక యగుకనకాంబ నిచ్చి వివాహముచేసిరి. ఈదంపతులకు శ్రీచిదంబరశాస్త్రిగారు ఖరసంవత్సరమాఘబహుళనవమీసోమవారమునాఁడు (22-2-1892) మాతామహగృహమున జన్మించిరి. శ్రీశాస్త్రిగారిమాతామహి లింగమ్మ. మేనమామ అచ్యుతరామశాస్త్రి. ధర్మపత్ని అచ్యుతరామశాస్త్రిగారిద్వితీయపుత్రిక యగునలివేణమ్మ.

శ్రీ చిదంబరశాస్త్రిగారికి సుబ్రహ్మణ్యశాస్త్రి, విశ్వేశ్వరశాస్త్రి అనునిరువురు తమ్ములును, కామాక్షమ్మ, వేంకటసుబ్బమ్మ, అన్నపూర్ణమ్మ అనుముగ్గురు చెల్లెండ్రును గలరు. వీరిద్వితీయసోదరి వేంకటసుబ్బమ్మగారికుమారుఁడు-పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి. ఏతత్సోదరభాగినేయులు మువ్వురును వీరియొద్దనే సంస్కృతాంధ్రకావ్యనాటకాలంకారాదిజ్ఞానమును, అవధానకరణశక్తియును, ఉభయభాషాకవితాపాటవమును సంపాదించియున్నారు. శ్రీశాస్త్రిగారు చక్కనివిమర్శనశక్తి గలవారు. కావుననే పాఠప్రవచనాదిసమయములలో శిష్యులకు సవిమర్శముగా విద్యారహస్యముల నెల్ల వివరించి బోధించుచుండెడివారు.

### బాల్యము — విద్యాభ్యాసము.

నాలుగేండ్లప్రాయమున శ్రీశాస్త్రిగారు మాతామహగృహమున నుండఁగా నొకసాముద్రికశాస్త్రవేత్త వీరినిఁ జూచి "ఈకుఱ్ఱవాఁడు నిరంతరము రాజసభలలో విహరించి గొప్పకీర్తి నార్జింపఁ గలఁడు" అని చెప్పినాఁడఁట! ఆయనమాట సర్వవిధముల నిజమైనది. వీరు కరవదిగ్రామమునఁ గరవది రామదాసుపంతులు అనువారియొద్ద బడిచదువు చదివి సంస్కృతవిద్య నభ్యసించుటభిలాషతో నిడుమానూరిలో శ్రీగొల్లపూడి సుబ్బరామశాస్త్రిగారియొద్ద శబ్దమంజరి యొండు రెండు

కావ్యములు చదివి, అటనుండి కుంచనదరమున కేఁగి కొన్నాళ్లట నుండి కాళిదాసత్రయము ముగించి పిమ్మట శ్రీచిట్టావూరి సీతారామశాస్త్రిగారియొద్ద సికింద్రాబాదుపాఠశాలలో నైషధాంతము కావ్యములు పఠించి, తిరుపతి కేఁగి యట శ్రీవేంకటేశ్వరసంస్కృతపాఠశాలలో హర్షచరిత్ర, కాదంబరి, కరిగిరిచంపువు, భారత, రామాయణచంపువులు మున్నగుగ్రంథములు చదువుటయేగాక యసామాన్యమేధాశాలులు విద్వత్కవిప్రవరులు నగుశ్రీనరకంఠీరవశాస్త్రిగారిసాన్నిధ్యము వలన సంస్కృతమున మధురకవితాలాభమును గూడఁ బొందిరి. పైఁగాఁ దర్కవ్యాకరణశాస్త్రాంబుధికృతావగాహులు, అభినవకాళిదాసబిరుదాంకితులు నగు శ్రీశంకరభట్టశాస్త్రిగారితోఁడిమైత్రి వీరిలలితకవితామంజరికి మఱింతపరిమళము చేకూర్చినది. అనారోగ్యకరముగా నుండుటచే నంతతో నాచోటు వదలి గోదావరీ మండలములోని యిందుపల్లికిఁ జేరి యచ్చట నేలేశ్వరపురామశాస్త్రిగారియొద్ద శాకుంతల మురారిప్రభృతినాటకములు కువలయానందసాహిత్యదర్పణాద్యలంకార గ్రంథములు చదివి చక్కనిసాహిత్యము నలవఱచుకొనిరి. అటుపైని వ్యాకరణ శాస్త్రము నభ్యసింపఁ దలఁచి ఆగిరిపల్లి కేఁగి యట సంస్కృతపాఠశాలావ్యాకరణోపాధ్యాయులుశ్రీజయంతిభగీరథశాస్త్రిగారియొద్దఁబాణినీయము నధ్యయనించుచు నవకాశ మున్నప్పుడెల్లఁ బాణినీయసాధితము లగుశబ్దవిశేషములు ప్రయోగించుచు సంస్కృతమున మిక్కిలి వేగముగాఁ జక్కనికవన మల్లుచుండిరి. ఆసమయముననే శ్రీవేలూరి శివరామశాస్త్రిగారుగూడ నచట వ్యాకరణశాస్త్రము నధ్యయనించుచుండిరి. శ్రీశివరామశాస్త్రిగారిసాహచర్యమువలన వీరి కాంధ్రగ్రంథపఠనాభినివేశమును, ఆంధ్రకవితాభిలాషయును గలిగినవి. సుప్రసిద్ధవైయాకరణులు కంభంపాటి రామమూర్తిశాస్త్రి, జయంతిసూర్యనారాయణశాస్త్రి, వారణాసి రామబ్రహ్మశాస్త్రిప్రభృతులు వీరి సహాధ్యాయులు. ఒకనాఁడు శ్రీవారణాసి రామబ్రహ్మశాస్త్రిగారు సంస్కృతమున వీరియాశుకవితాశక్తిని బరీక్షింపఁ దలఁచి కాముకీవిరాగులసంభాషణరూప మగునొకశతకమును శుకరంభాసంవాదమువంటి దానిని ఒకదినములో రచింపఁ గోరిరి. వల్లెయని శ్రీశాస్త్రిగా రప్పుడే యారంభించి శతకము వ్రాసి తమగురువులయు సహాధ్యాయులయు సమక్షమున మఱునాఁడు వినిపించి వారిమెప్పుల నందిరి. అందలివి స్థాలీపులాకన్యాయమునఁ గొలఁదిశ్లోకములుదాహరింతుము.

కాముకీ:- శ్లో. తన్యాస్తు శారదకళానిధిపూర్ణబింబ
న్యక్కారి హాససదనం వదనం సరాగమ్ ।
యో వా న పశ్యతి త దేకమతిః పురస్తా
ద్ధిక్ తస్య జీవిత మజాగళగ స్తనాభమ్.

విరాగీ:- శ్లో. ఫాలే చ భస్మితమనోభవ మక్షి యస్య
మస్తే కలానిధికలా కమనా విభాతి।
తం యో న పశ్యతి తదేకమనా స్సమాధా
ధిక్ తస్య.........................

కాముకీ:- శ్లో. కస్తూరికాతిలకశోభితఫాలభాగాం
గాంగేయరత్నమయభూషణభూషితాంగీమ్।
నో య స్సదా స్మరతి తాం భువి కంబుకంఠీం
ధిక్ తస్య.........................

విరాగీ:- శ్లో. రుద్రాక్షశోభితగళం చ విభూతిపుండ్రై
రాజన్ముఖాంబుజ మమేయచరిత్ర మాద్యమ్।
మృత్యుంజయం స్మరతి యో న హృదా సదాఽపి
ధిక్ తస్య.........................

కాముకీ:- శ్లో. యో వా దృశా ప్రసవబాణగణం సృజంతీం
కాంతాం వహ న్మరసి మూలధనం మమేయమ్।
ఇత్థం వదం స్తదధరోత్థసుధాం న పాతి
ధిక్ తస్య.........................

విరాగీ:- శ్లో. బ్రహ్మస్వరూప మమలం రస మద్వితీయం
పాతుం ప్రయత్న మపి య స్సతరా మకుర్వన్।
మోహేన పాతి వనితోష్ఠరసం విగంధం
ధిక్ తస్య.........................

ఇట్లే యీశతక మంతయు మనోహరశైలీభావభాసురమై యున్నది.

అది శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులమధురకవితాస్రవంతి యాంధ్ర దేశమునం దెల్లెడల వెల్లివిరియుచున్న కాలము. ఆనాఁడు వారియవధానములు ఆశుకవితాధోరణి సకలాంధ్రజనహృదయములఁ జూఱకొనినవి. అవి చూచియు వినియు ననేకులు కవులు నవధానులును బయలుదేఱిరి. అందు శ్రీ చిదంబరశాస్త్రిగారు నైత మొకరు. అయినను గొనవఱకు ఆకార్యమును సాగించి గడిదేఱినవా రత్యల్పసంఖ్యాకులే. అందును శ్రీ తిరుపతి వేంకటకవులు సైతము నేఁగనియాంధ్రేతరమండలములలో (అనఁగాఁ గర్ణాట ద్రావిడ మళయాళ కాశీ వర్మాంగాదిమండలములలో)ఁ గూడఁ దమయత్యద్భుతావధానకౌశలమును, ఆశుకవితానైపుణమును బ్రకటించి మహత్తరసత్కారగౌరవముల నంది యాంధ్ర దేశమునకును గౌరవము చేకూర్చినవా రొక్క చిదంబరశాస్త్రిగారే యనుట నిర్వివాదము. తమసతీర్థ్యు లగు

శ్రీ శివరామశాస్త్రిగారప్పుడప్పుడే యవధానములు చేయ నారంభించుటయు శ్రీ శాస్త్రిగారియవధానకరణశక్తిసముపార్జనకు ద్విగుణీకృతోత్సాహము నొసంగినది. ఎట్టికఠినకార్యము నైనను బట్టినపట్టు విడువక సాధించుట శాస్త్రిగారికి జన్మసిద్ధగుణము.

ఆ. పట్టు పట్టరాదు పట్టి విడువరాదు
పట్టెనేని బిగియఁ బట్టవలయుఁ
బట్టి విడుటకంటెఁ బడి చచ్చుటయె మేలు ......

అని కదా వేమనసూక్తి! శ్రీశాస్త్రిగారు తమవ్యాకరణశాస్త్రాధ్యయనము సమాప్తము కాఁగానే యవధానములు చేయ దొరఁకొని మొదటియష్టావధానము తమగురువులసన్నిధిని ఆగిరిపల్లిలోనే 16-2-1910 తేదిని విజయవిలసితముగా నెఱవేర్చి వారియాశీఃపూర్వకాభినందనభాగ్యము నందిరి.

పిమ్మట రాజమహేంద్రవరవాస్తవ్యులు ఆదిభట్ల రామమూర్తిశాస్త్రిగారిశిష్యులు న్యాయవేదాంతమంత్రశాస్త్రనదీష్ణులు నగు శ్రీ చల్లాసూర్యనారాయణశాస్త్రిగారియొద్దఁ దర్కగ్రంథములు చదివిరి. పిఠాపురాస్థానవేదాంత విద్వాంసులు "శాస్త్రరత్నాకర"రాదిబిరుదాంకితులు శ్రీ దెందుకూరి నరసింహశాస్త్రిగారియొద్ద వేదాంతశాస్త్రము నభ్యసించిరి. వేదాంతశాస్త్ర మనిన వీరికిఁ జిన్నతనమునుండియు మిగుల మక్కువ. కావుననే యందు స్వతంత్రకృషిసైతము హెచ్చుగాఁ గావించిరి. గోదావరీమండలమునందలియనాతవరగ్రామవాసులు, మంత్రమూర్తిబిరుదాంకితులు శ్రీ నూఁకల సుబ్రహ్మణ్యశాస్త్రిగారియొద్దఁ బాదుకాంతదీక్షను గైకొని కొంతకాలము నిరంతరము మంత్రదీక్షలతోఁ గడపిరి. ఆసమయముననే మంత్రమహోదధి మంత్రమహార్ణవము శారదాతిలకము పరశురామకల్పసూత్రములు మున్నగు ననేకమంత్రశాస్త్రగ్రంథముల నామూలచూడముగాఁ బరిశీలించిరి. కొంతకాలము యోగశాస్త్రమునఁ బరిశ్రమించి యాసనప్రాణాయామధ్యానాద్యష్టాంగములను బాగుగా నభ్యసించిరి. వీరియవధానాభ్యాసమునకు యోగశాస్త్రప్రవేశ మెంతేని యుపయోగించినది. కావుననే మైసూరుమహారాజుసభలో నవధానవిషయము నీవిధముగా నిరూపించి యున్నారు,

శ్లో. చిత్తైకాగ్ర్య మిహావధాన ముదితం దేశే వివిక్తే పునా
రాత్రౌ త త్సమవాప్యతే సుకృతిభిః కాలే తురీయే తథా।
అభ్యాసే సతి దేశకాలనియమోఽప్యాస్తాం నిరస్త స్స్వయం
సైషా యోగవిద శ్చిదంబరకవే రాత్మానుభూతిస్స్మృతిః.

వీ రష్టావధానమునఁ "బుష్పాణాం గణనం పురాణకథన" మిత్యాదిప్రాచీన పద్ధతి కొంత మార్చి యంతకన్నఁ గష్టతమ మగుపద్ధతి నిర్వచించి నిర్వహించి యున్నారు. (చూ. అవధానాదర్శము)

1920 సం॥ ప్రాంతమున ధర్మశాస్త్రవ్యాసంగమునకుఁ బూనుకొని కొంత కాలము తదేకదీక్షతో మను, యాజ్ఞవల్క్య, పరాశరాదిస్మృతులు, తద్వ్యాఖ్యలు, నిర్ణయసింధు, వైద్యనాథదీక్షితీయాదినిబంధనగ్రంథములు సమగ్రముగా నవలోడనము చేసిరి.

ఆరంభించిన కార్యమును అసమగ్రముగా వదలుట వీరి కనభ్యస్తము. అది గాక కుశాగ్రమువంటివీరి మేధకుఁ జొరరానివిషయమును లేదు. కావుననే యిన్ని విషయములలోను వీరు నిరూఢప్రజ్ఞ నార్జించిరి.

## వాణీకటాక్షము

శ్రీ శాస్త్రిగారి కుపనయన మయినది మొదలు గాయత్రీమంత్రము జపించుటకై కనులు మూసినంతనే భ్రూమధ్యమున వాణీబీజ మగు "ఐం" అనునక్షరము (దేవనాగరీలిపిలో) గోచరించుచు జపము నాఁపి కనులు దెఱచినతోడనే యంతర్హిత మగుచు నుండెడిదఁట! కొంతకాలమువఱకు వీ రీవిషయమును సరిగా గుర్తింపలేక పోయిరి. కాని మంత్రశాస్త్రజ్ఞానపూర్వకముగా మంత్రపురశ్చరణము లారంభించిన పిదప జన్మాంతరోపాసనాసిద్ధ మగునీబీజస్వరూపము వీరికి బాగుగా గోచరించినది. అయినను వీ రీవిషయమును జిరకాల మెవ్వరికిని దెలుప లేదు. తమయంత్యరచన యగుశ్రీమదాంధ్రపద్మపురాణమున మాత్రము

కం. మనమున కత్యుత్సాహం
బెనయఁగ నాకనులయెదుట నెల్లపుడును ద
ర్శనమిచ్చుచుండువాగ్భవ
మును గొల్తు మదీయపూర్వపుణ్యఫలంబున్.

ఆం. పద్మ. ఆదిఖం. ౧౧.

అని యీరహస్యమును వెల్లడించి యున్నారు. (వాగ్భవము = వాణీబీజ మగు "ఐం" అను నక్షరము.) ఇట్లు వాణీకటాక్షము వీరియందుఁ బ్రసరించియుండుటచేతనే వీరు గద్వాల, కాశీ, శృంగేరి, మున్నగుచోట్లఁ దటస్థించినవివాదముల లోను, బరీక్షలలోను విజయములను జూఱకొనిరి. మఱియును వీరు చిన్నతనము నుండియు నేగ్రంథము వ్రాసినను, ఏసభలో నిలిచినను బరదేవతాస్తుతి వదల లేదు, ఇది వీరికిఁ గలపరమేశ్వరీభక్తికిఁ బ్రబలనిదర్శనము,

## దేశాటనము - సభలు

15-2-1910 తేదిని శ్రీవేలూరిశివరామశాస్త్రిగారు ఆగిరిపల్లిలో అష్టావధానము చేసిరి. మఱునాఁడే శ్రీచిదంబరశాస్త్రిగారి మొదటియష్టావధానము ఆగిరిపల్లిలో 16-2-1910 తేదిని జరిగినది. ఆసభలో విజయముతోపాటు గురువుల యాశీర్వాదములు

శ్లో. అస్యాం సభాయాం బుధపూరితాయాం
సమాచరత్యద్య హి లీలయైవ।
యోఽష్టావధానం శతమానుషాణాం
మన్యే వధానం స కరిష్యతీతి.

(వారణాసి సత్యనారాయణశాస్త్రీ)

ఇత్యాదిమిత్త్రులప్రశంసలును లభించినవి. 11-9-1910 తేదిని మరల నచటనే యొకయష్టావధానము జరిగినది.

శాస్త్రాధ్యయనము 1911 సంవత్సరాంతమునకు ముగించుకొని చిదంబరశాస్త్రిగారు ఆశుకవితావధానాభ్యాసము నధికముగాఁ జేయఁదొడఁగిరి. 10-3-1912 తేదీని గుడివాడయష్టావధానసభలో

సీ. మొదట సంస్కృతము చెప్పి దయ చూపినసుబ్బ
రామశాస్త్రికి సత్ప్రణామ మొసఁగి
పిదపఁ గావ్యముల నేర్పి ప్రశంసఁ గన్నసీ
తారామశాస్త్రిపాదముల కెఱఁగి
అటుమీఁద నాటకార్థ్యటుల నేర్పినయట్టి
రామశాస్త్రివతంసురాణఁ గొలిచి
ఆమీఁదఁ బాణినీయమును బోధించిన
గురు భగీరథశాస్త్రివరు నుతించి
గీ. చిన్నినాకై తకన్నెకు వన్నెచిన్నె
లలరఁ జేసినకవిచంద్రములఁ దలంచి
సలలితాష్టావధానమ్ము సలుపఁ బూని
నాఁడ దయయుంచు మోగుడివాడతల్లి.

అని గురువందనము గావించిరి. అచ్చటనే 17-3-1912 తేదిని మరల నొక యష్టావధానసభ జరిగినది. పై రెండుసభలలోను సత్కారములు, సభ్యులప్రశంసలు విరివిగా లభించినవి. చలి దీఱినది. ధైర్యము నెలకొనినది. ఈ రీవిషయమును శ్రీచెళ్ళపిళ్లవేంకటశాస్త్రిగారికి లేఖమూలమున నిట్లు తెలిపిరి,

చ. జయ మిటఁ గల్గె రెంటనరుసల్ సభ చేసితి; కీర్తిఁ దీర్చె; మీా
దయఁ బరమేశ్వరీదయను దన్పితి సభ్యుల వేఁకశేశ్వరా
హ్వాయకవివర్య, కార్య మిది యయ్యె; నిఁకన్ జనవచ్చు నంచు నేఁ
బయనముఁ బూనితిన్ విజయవాటికి మీామదిఁ జిత్తగింపుఁడీ.

గుడివాడ 19-3-1912
పరీధావి సం॥ చైత్రశుక్లప్రతిపత్తు
విధేయుఁడు,
పి. చిదంబరశాస్త్రి.

పిమ్మట అమలాపురము మున్నగుతావులలో అష్టావధానములే కాక శతావధానములు గూడఁ జేయ నారంభించిరి.

## 1913

బాపట్లపురవాసి అష్టావధాని (శ్రీ) వేమూరి నృసింహశాస్త్రిగారు చిదంబరశాస్త్రిగారి సమస్యాపూరణశక్తిని సాహిత్యపటిమను బరీక్షించుటకై "బభౌ మయూరో లవశేషసింహః" అనునొక క్లిష్టసమస్య నిచ్చి పూరింపఁ గోరిరి. వారీసమస్యను బలువురు శతావధానుల కిచ్చినట్లును దానిని వారు పూరింపలేక వదలినట్లును జెప్పిరి. ఆసమస్యను మనశాస్త్రిగారిట్లు పూరించి సంస్కృతమున నొక వ్యాఖ్యగూడ వ్రాసి, వినిపించి వారిమెప్పుల నందిరి.

### స మ స్యా పూ ర ణ ము

శ్లో. కాంకే ఖగే ఘే జచచే ఛచాఛో
జార్ఘే ఞటేఠే డఢఢో ణతోఽథ ।
దదాం దధానో ను న పాపపోఫః
"బభౌ మయూరో లవశేషసింహః"

ఈసమస్యాపూరణము (శ్రీ) శాస్త్రిగారియేకాక్షరనిఘంటుపాండిత్యమునకు ద్యోతకము. దీనివ్యాఖ్య "రాజసభావిహారము" నఁ గాంచ నగును. ఈవిధముగా నెట్టికఠినసమస్యల నైనను (శ్రీ)శాస్త్రిగారవలీలగాఁ బూరించుచుండిరి. 3-12-1913 తేదిని బిక్కవోలుగ్రామమున సుబ్రహ్మణ్యషష్ఠికి జరుగుకవితాసభల కేఁగిరి. ఆనాఁటిసభలో సంస్కృతమున "నలచరిత్రమును" ఆశువుగా రచింపుఁ డని సభ్యులు కోరిరి. అంతఁ బదిమంది పండితకవులు వరుసగా నొక్కొక్క రొక్కొక్కశ్లోకము చెప్ప నారంభించిరి. వేగముగాఁ గవిత సాగనివారిని వదలి తరువాతివారు చెప్పనేర్పాటు కావించుకొనియుండిరి. రెండుమూఁడు వరుసలు తిరుగునప్పటికి (శ్రీ) చిదంబరశాస్త్రిగారును, (శ్రీ) పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారును మాత్రమే మిగిలిరి. ఈయిరువురు నొకరి కొకరు తీసిపోవక సుమారు నూటయేఁబది శ్లోకములలోఁ గథ యంతయు నాశువుగా రచించిరి. ఆనాఁటియాశువున కచ్చెరువడి

బిక్కవోలుగ్రామకరణము శ్రీ తక్కెళ్లపాటి వేంకటనరసయ్యగారు ప్రోత్సహింపఁగా బిక్కవోలు సుబ్రహ్మణ్యస్వామిచరిత్రమును "సుబ్రహ్మణ్యేశ్వరీయము" అనుపేర నాంధ్రమున నొక ప్రబంధముగా రచించియా దేవునకే శ్రీశాస్త్రిగారు కృతియిచ్చిరి.

పిమ్మట సురభికంపెనివారికోరికపై "శ్రీరామాంజనేయ" మనునాటకమును వ్రాసిరి. ఆనాటకమును సురభికంపెనివారు మొదటఁ బెంటపాడుగ్రామమునఁ బ్రదర్శించి యానాఁడు వచ్చినద్రవ్యము నంతను శ్రీశాస్త్రిగారికి సత్కారపూర్వకముగా నొసఁగిరి. ఆసభలోఁ బలువురుకవులు పలువిధముల శ్రీశాస్త్రిగారికవితను బొగడిరి. మచ్చున కొకటి రెండు

ఉ. చందనపాదపంబునను జక్కనిపూవులు పూయురీతి మే
ల్కుందనమందుఁ దావి యొనగూడినకైవడి పాలలోపలన్
బొందుగఁ బంచదార పడుపోలిక చెర్కునఁ బండు గల్గునా
చందము గాదె నీకుఁ గలసాహితికి న్గవితాచమత్కృతుల్.

చ. చవిఁ గనుపండితాళికిఁ బ్రశస్తరసాలఫలంబు గాయక
ప్రవరులకున్ సుధాకలితభాండ మఖండదిగంతకీర్తిభృ
త్కవులకుఁ గండచక్కెర యథార్థము సుమ్ము భవత్ప్రణీత మా
నవనవమాధురీమిళితనాటకరాజము శ్రీ చిదంబరా!.

పెంటపాడు. } తిరుమల రాఘవాచార్యులు
కోన రాఘవయ్య

శ్రీ శాస్త్రిగారు వేంకటగిరిసంస్థానమునకు 1914 సంవత్సరమున నేఁగిరి. అప్పటిప్రభువు శ్రీశ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్రులు. వీరు మంచిపాండిత్యము విమర్శనశక్తి కలవారు. కావునఁ గవులపాండిత్యమును బరీక్షింపక దర్శనసత్కారములు జరిపెడివారు కారు. అందుచేతనే శ్రీ శాస్త్రిగారు పంపినవిజ్ఞాపనపత్రమునందలి "శతవధానంబును సాధింపఁగాఁ జూచి యానంద మొంద నీ కాశ గలదొ" అనుదానిలోని "వధాన" శబ్దసాధుత్వమును గూర్చి లేఖమూలమున శాస్త్రిగారిని బ్రశ్నించిరి. దానికి,

క. అపి యని యవ యని వెలసిన
యుపసర్గంబులయకార మూఁడు నటంచున్
బ్రపఠించె భాగురిమహ
ర్షి పాణినిమహర్షి యటులు చెప్పఁడు భూపా.

క. నృపవర! యవధానపదం
బపిధానపిధానపదములట్టు లకార
వ్యపగత మయ్యును గాకయు
నుపయుక్తం బగుట శాస్త్రయుక్తము సుమ్మా.

అని వీరు సమాధానము వ్రాసి పంపిరి. దానిపై రాజుగారు హ్రస్వాక్షరముపై నర్థబిందుపూర్వక "క" ప్రాసముతోఁ గందపద్యము చెప్పవలె నని మఱియొక ప్రశ్న పంపిరి. వెంటనే యాశువుగా

క. ఇఁక వినుము భూప! బుధున క
ణఁకువయు, సభకున్ బుధుండు, నమ్మికఁ బురి, నా
యఁకరము రాజన్యునకుఁ, గొ
లఁకునకు రాయంచయును నలంకారంబుల్.

అని సమాధానము వ్రాసి పంపిరి. దానిపైఁ రాజుగారు గొన్ని సమస్యలు పంపి పూరింపుఁ డని చెప్పిపంపిరి. వానిని శాస్త్రిగారు చక్కఁగాఁ బూరించిరి. వానిలో నొక్కటిమాత్ర ముదాహరింతును. తక్కినవి "రాజసభావిహారము" అనుగ్రంథమునఁ జూడ నగును.

సమస్య:- తురకలు సంధ్య వార్చుచుఁట తొయ్యలి తోయము లిమ్ము వారికిన్.

చ. ధరణిసురుల్ సమర్థులు స్వధర్మవిధానమునందు, భూజనో
ద్ధరణమునందు ధీరులు, సుధారస మొల్కెడిభాషణంబులన్
గురువులు, క్రోధభార మొనగూడినఁ దిట్టులు దిట్టుపట్టునన్.

ఈవిధముగా నొకవారము దినములు మహారాజు ప్రశ్నలు పంపుట శాస్త్రిగారు సమాధానము లంపుటయు జరిగినతరువాత మహారాజు శాస్త్రిగారికి దర్శన మిచ్చి గొప్పసత్కారము చేసిరి. అప్పుడు

ఉ. వచ్చితి రాజసత్కృతులవైభవ మొందఁ "దదేవలగ్న" మం
చిచ్చటి కేను ముందుగనె యీవు కవిత్వపరీక్ష చేసి వి
ద్వచ్చయ మెల్ల మెచ్చెడివిధంబున సత్కృతి చేసినాఁడ వ
భ్యుచ్చయసూచకంబుగ నృపోత్తమ! మత్కవితాలతాంగికిన్.

చ. ఇరువదివత్సరంబులకు నించుక న్యూనము నావయస్సు రా
ట్పరిచయభాగ్య మిట్టితఱిఁ బ్రాప్తము గాఁగలయోగ మబ్బె మా
గిరితనయాకృపామృతము కేవలమే మదుపాత్తశక్తికిన్
గరణము గాని వే ఱొకటి గాదు సుమీ నరపాలచంద్రమా!

అని తమయాశయమును వెల్లడించిరి.

వీరు సందర్శించినసంస్థానములలో మొదటిది వేంకటగిరి. అటుపిమ్మట వదాన్యశేఖరు లగు శ్రీముద్దుకృష్ణయాచేంద్రుల దర్శించి వారిచే సత్కారముల నందిరి. వీరు రచించిన 'శ్రీరామాంజనేయము' అనునాటకమును ముద్దు కృష్ణయాచేంద్రులవా రచ్చు వేయించిరి. శాస్త్రిగారు వారు చూపినయాదరమును

క. వింటివి నాగ్రంథంబులు, కంటివి నాయాశుకావ్యకౌశల్యము నీ
వంటికవీంద్రుఁడు దుర్లభుఁ, డంటివి నీ వెంతరసవిదగ్రణివో నృపా!

క. ఊరును బేరును నిలిపెడి, మీరలు గాకున్న నెవరు మీకంటెను స
త్కారార్హు లనుచు నీతో, సారటు లెక్కించి త్రిప్ప సాగితి వధిపా!

ఇత్యాదిగా వాకొనిరి. పిమ్మట సరసాగ్రేసరు లగు రాజా శ్రీచెలికాని జగన్నాథరావుగారియొద్ద 'అష్టావధానము' చేసి సత్కృతుల నందిరి. అది మొదలు తఱచుగ వేంకటగిరిసంస్థానమునకు వీ రేఁగుచుండుట తత్ప్రభువులు వీరిని సత్కరించుచుండుట చాలకాలము సాగినది. 1914 సంవత్సరమున శ్రీరాజగోపాలకృష్ణ యాచేంద్రు లారంభించినసత్కారగౌరవములు వీరికుమారులు శ్రీరాజా గోవింద కృష్ణయాచేంద్రులును, వీరిమనుమలు ప్రకృతమహారాజులు నగుశ్రీసర్వజ్ఞకుమార కృష్ణయాచేంద్రులవారును శ్రీశాస్త్రిగారికి సాగించుచునే వచ్చిరి.

పిమ్మట సుప్రసిద్ధాశుకవి శతావధాని శ్రీఅవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారును వీరును గలిసి కొన్నిసభలు కావించిరి. అట్టిసభలలో యాదగిరినృసింహ స్వామిదేవాలయమున జరిగినయష్టావధానసభ యొకటి. ఆసభలో నవ్వారివారి యాశుకవితాకౌశలము చిదంబరశాస్త్రిగారియవధాననైపుణము సభ్యుల నానంద వార్ధినిమగ్నులఁ గావించినవి. మఱునాఁడు (22-11-1914) వీ రిరువురును గలిసి యాశుకవితాసభ గావించిరి. ఆసభలో నీయిరువురయాశుకవనములు సమానధాటిలో నడచినవి. ఒకరి నొకరు మీఱ లేకపోయిరి. ఆయత్యద్భుతాశుకవితాసభను సభ్యులే కాక దేవస్థానాధికారులును మిగుల మెచ్చుకొని యీజంటకవులకుఁ జెఱి నూటపదాఱులు, పట్టువస్త్రములు సత్కరించిరి. ఆసమయమున అయినాపురము సీతారామశాస్త్రిగా రిచ్చినదుష్కరప్రాససమస్య.

ఉ. ఆః ఖలుఁ డిట్లు మ మ్మఁడుగునా? యన శోమహనీయవాక్యపా
థఃఖనులార! నిర్జితసుధామధురోక్తులచేత నామనో
దుఃఖము వాయ దీనితుదిఁ దోఁచుసమస్యను బూర్తి చేయుఁడీ
"దుఃఖము గాదె చక్రనివధూటిరతంబు విదగ్ధకోటికిన్".

దీనిని

ఉ. గీఃఖననంబు లేల పరికించి వచించెద నొక్కమాట 'జా
రాః ఖలు పాపినో'యని తిరంబుగఁ బల్కెడిఛాందసోక్తులన్
భాఃఖచితోక్తులంబలె మనంబున నెంచకుఁడీ నిరర్థధీ
"దుఃఖము గాదె చక్కనివధూటిరతంబు విదగ్ధకోటికిన్"

అని శ్రీ చిదంబరశాస్త్రిగారు పూరించిరి. దానికి సంతసించి శ్రీసీతారామ శాస్త్రిగారు

ఉ. ఎన్నఁడు చూడఁ గల్గునో కవీశ్వరవర్గము? నీసమస్య కిం
కెన్నఁడు పూర్తి గల్గునో? మఱెన్నఁడు నామది సంతసిల్లునో?
పన్నగశాయి! యంచతిప్రపన్నత యాదగిరీశు వేఁడ నా
కన్ని లభించె నేఁటికిఁ జిదంబరశాస్త్రికవీంద్ర! నీకృపన్.

అని శాస్త్రిగారిని బొగడిరి.

శాస్త్రిగారును, అవ్వారిసుబ్రహ్మణ్యశాస్త్రిగారును గొలఁదికాలము మాత్రమే యిట్లు కలిసి సభలు చేయుట ఘటిల్లినది. ఐనను దానివలనఁ జిదంబర శాస్త్రిగారియాశుకవితాధాటి మిగుల వర్ధిల్లినది.

## 1915

అటుపిమ్మట యథాపూర్వముగా శ్రీ శాస్త్రిగారొక్కరే సభాప్రచారము సాగించుచు నిజాము రాష్ట్రములోనివనపర్తిసంస్థానమున రాక్షసనంవత్సరగణపతి నవరాత్రములలో (15,16-9-1915) ఏఁబదియైదుమందికి శతావధాన మొనర్చి నూటపదార్ల సత్కార మందుకొనిరి. అందలి సమస్యలు ప్రశ్నలు తత్పూరణములు సమాధానములు పఠితల కత్యంతప్రమోదదాయకములు. వీనినిబట్టి శ్రీశాస్త్రిగా రప్పటికే యవధానకృత్యమున నెంతగా నాఱితేఱినది వెల్లడి కాఁగలదు. ఒక మచ్చుతునుక. సమస్య. "మానపూజాపహారః"

శాస్త్రిగారిపూరణము.

శ్లో. సోఽయం రాజా భువి విజయతాం సుస్థిరం రాఘవేంద్రః
క్రీడాకాలే పటుతరబలే దానధారాప్రసంగే।
సంపల్లక్ష్మ్యాం హరిహరపదాంభోరుహద్వంద్వభాగే
కీర్తిశ్యామాకుచయుగతటే "మానపూజాపహారః"

ఈ సమస్యలో నొకచమత్కారము కలదు. దానిని ముందుగా గుర్తింపనిచో నీసమస్యను సరసముగాఁ బూరించుట యశక్యము. ఐనను శ్రీ శాస్త్రిగారీసమస్యను వినినవెంటనే యిందలికిటుకును గ్రహించి పై రీతిని బూరించిరి. ఆరహస్య మిది.

అంత్యాక్షరముతో మొదటనుండి యొక్కొక్క యక్షరమును గలుపుచు రావలెను. అప్పుడు — మారః, నరః, పూరః, జారః, పరః, హారః — అనునవి యేర్పడును. వీని కనుకూలముగా సమస్యను బూరించుకొనవలెను. ఇప్పుడు పై పూరణ మెంతచక్కగాఁ గావింపఁబడినదో పాఠకులకు విశదము కాఁగలదు.

పిమ్మటఁ గారుమంచిగ్రామమునఁ బుష్పగిరిపీఠాధిపతి శ్రీ విద్యాశంకర భారతీస్వామివారిసన్నిధియం దష్టావధానశతావధానసభలు రెండును నవంబరు నెల 26,27,28 తేదులలోఁ జేసి మిక్కిలిగా సత్కృతులైరి.

## 1916

శ్రీ శాస్త్రిగారు జగ్గయ్యపేటలోఁ బురజనులయాదరమున శతావధానాష్టావధానాశుకవితాసభలు మూఁడును సామాజికసన్నుతులు మిన్నుముట్ట నెఱవేర్చిరి. ఆశువున వర్ణ్యము "పార్వతీపరిణయగాథ". గంటకు నూటికిఁ బైఁగాఁ బద్యములు చెప్పినారఁట!. అటఁ బలువురు కవీశ్వరులు వీరికవితావైభవమును మిగుల సన్నుతించుచుఁ బలుపద్యములు చెప్పి యున్నారు. మచ్చునకు ముచ్చటగా మూఁడు పద్దెములు.

ఉ. కూర్చెడికూర్పులన్ సుపదగుంభనముల్ గవితాప్రసాదముల్
మార్చెడిమార్పులన్ సరసమంజులకోకిలకాకలీకలా
భ్యర్చితమైనకంఠముహాయల్ మది కింపు జనింపఁజేసె, మేల్
తేర్చినతేనె మీకవిత దివ్యము భవ్యము నవ్యమై తగున్.

ఉ. ముద్దులు మూటగట్టునుడిపోడిమి గల్గి శతావధానముల్
దిద్దెడినేర్పు గల్గి గడి దేఱినమేటికవీంద్రమండలిన్
దద్దయుఁ గీర్తి గాంచినచిదంబరశాస్త్రిశతావధానిగా
రద్దిర! యస్మదాదుల ముదంబుధి ముంచిరి యాశువైఖరిన్.

శతావధాని, సంపన్ముడుంబి, సింగరాచార్యులు.

ఉ. కౌరవశత్రువైననరుగాండివముక్తశరాళిపోకడల్
మీఱి, రయంబునన్ మహి గమించెడియాజడివానచిన్కులన్
గేరి, వెసన్ భవద్ధృదయగేహమునందు జనించి హృద్యవా
గ్ధోరణి నిర్గమించుపదగుంభితసల్లలితాశువున్ సభా
స్తారులు మెచ్చ కుందురె చిదంబరశాస్త్రివరేణ్య! యిత్తఱిన్.

కొండపల్లి, లక్ష్మణపెరుమాళ్ళరావు.

అవధానికి సకలశాస్త్రసంప్రదాయపరిజ్ఞాన మత్యావశ్యకము ఈ విషయము జగ్గయ్యపేట, తిరుపతి మున్నగు ప్రదేశములందలియవధానములలో శ్రీ శాస్త్రిగారి

కిచ్చినప్రశ్నలు వ్యక్తపఱుచుచున్నవి. జగ్గయ్యపేటశతావధానమునందలిప్రశ్న.
'పరా పశ్యంతీమధ్యమానాం స్థానాని తత్సాక్షీ చ వర్ణ్యాః'

శాస్త్రిగారిసమాధానము.

శ్లో. వృత్తే ప్యా స్తే పర మిహ పరా నిర్వికల్పానుభూతిః
పశ్యంతీ చ ప్రథితభుజగే వ్యస్తి విస్ఫూర్తి భావా।
ఇచ్ఛారూపా పశుషు నితరాం విద్యతే మధ్యమాఽసౌ
తాసాం సాక్షీ కలయతి పర స్సచ్చిదానందరూపః.

తిరుపతిసంస్కృతాష్టావధానమున (3-2-1924) ఛందోభాషణము.

ప్రశ్నః - కా నదీ పాణినే స్తంత్రే?
ఉత్తరమ్ - యూస్త్ర్యాఖ్యౌ తు నదీ స్మృతౌ.
(ప్ర) - గౌతమే కతి మానాని?
(ఉ) - చత్వా ర్యాహు ర్మనీషిణః.

## 1918

కాకినాడ, వరంగలు, పెద్దాపురసంస్థానము మున్నగుచోట్ల శతావధానాష్టావధానాశుకవితాసభలు విరివిగా జరిగినవి.

## 1919

దొంతి, గణపురసంస్థానములలో శతావధానసభలు రెండు మహోజ్జ్వలముగా సాగినవి. 2-9-1919 తేదిని దొంతిసంస్థానశతావధానమున "శతచంద్రం నభస్తలమ్" అనుసమస్య నీయఁగా

శ్లో. విధే! పిధేహి శుభ్రాంశు, మద్యైకోఽపి సుదుస్సహః।
కురు ప్రియాసమాశ్లేషే, "శతచంద్రం నభ స్తలమ్"

అని మిగుల సరసముగాఁ బూరించిరి. సమస్యాపూరణమున నిట్టిమెలఁకువలు శ్రీశాస్త్రిగారికి వెన్నతోఁ బెట్టినవి.

ఏలూరు, మైలవరము, భువనగిరి మున్నగుపట్టణములలో ననేకాష్టావధాన శతావధానాశుకవితాసభలు చేసి విజయలక్ష్మిబిగికౌఁగిళ్లలో మైమఱచిరి.

## 1920—నంద్యాల

కవిపండితసమ్మానములు చేయునాంధ్రసంస్థానములలో గద్వాలసంస్థానము మేటి. ఆసంస్థానమునఁ బ్రతివత్సరము మాఘపూర్ణిమకుఁ గవితాపరీక్షలు జరుగును. ఈపరీక్షలలోఁ బాల్గొనుటకై సిద్ధార్థిసంవత్సరమున శ్రీశాస్త్రిగా రేఁగుచుఁ

ద్రోవలో నంద్యాలలో దిగి యొకధనిక బ్రాహ్మణగృహస్థు నింటి కేఁగిరి. ఆగేస్తు వీరిని సామాన్యవిప్రునిఁగాఁ దలఁచి యాతిథ్య మీయక నిరాకరించెను. అప్పుడు

చ. అతిథుల నాదరించు టది యట్టుల నుండఁగనిమ్ము; మేదినీ
పతిముకుటీమణీకిరణపాటలితాంఘ్రిసరోరుహోధరీ
కృతకుకవిప్రకాండపరికీలితదుర్మదతుంగశృంగుఁ డ
ద్భుతకవిచంద్రుఁ డం చయిన భోజనముల్ సమకూర్పరాదొకో?

అని యాశువుగా నొకపద్యము చెప్పిరి. కొంతభాషాజ్ఞానము గలయాగృహస్థుఁ డది వినిన వెంటనే శ్రీశాస్త్రిగారి నాదరించి షడ్రసోపేతభోజనము పెట్టి నాయపచారము క్షమింపుఁ డని ప్రార్థించెను. కావుననే కదా పెద్దలు "విద్యాబంధు రసౌ విదేశగమనే" అని నొడివి యున్నారు!

## గద్వాల సంస్థానము — ప్రథమదర్శనము

అటనుండి గద్వాల కేఁగిరి. మహారాజప్రథమదర్శనమున సభలోఁ దమ విషయ మెల్ల నాశుపద్యధోరణిలో మహారాజునకు విన్నవించిరి. అందుండి రెండు మూఁడుపద్యములు మాత్ర ముదాహరింతును.

ఉ. ఖాండవముల్ ధనంజయముఖంబున వేల్వఁగ నీ సమస్తభూ
మండలముల్ జయింపఁగ సమర్థత పార్థుఁడు దాల్చినట్టు లొ
క్కండను నేన తాల్తు నధికారము నాశుకవిత్వ మల్ల ను
ద్దండశతావధానము ప్రధానవిధిన్ బొనరింప భూధవా!

ఉ. గంటకు నిన్ని యన్ని యని గట్టిగ నొక్కి వచింప నేల? ని
ష్కంటకరీతి నోరు క్షణకాలము గూడను నాఁగకుండ నొ
క్కంటను దప్పకుండ నొడికంబుగ నే రచియింతు భూప! మీ
వంటిరసజ్ఞు లెల్ల వహవా వహవా యన నాశుపద్యముల్.

ఉ. ప్రాసము దప్పకుండ యతిభంగము వాటిలకుండ సద్విని
న్యాసము మాఱకుండ గమనమ్ము గణమ్ము తొలంగకుండ ను
ల్లాసముతోడ నాశుకృతులన్ గురియించుచు నుండుపట్టునన్
వ్రాసెద నంచుఁ బూనుకొనువానికిఁ జేసెద శృంగభంగముల్.

మఱునాఁటిసభలో సంస్థానవిద్వాంసు లిచ్చినకఠినసమస్యలు సరసముగాఁ బూరించి వారికి మిగుల సంతసము చేకూర్చిరి. పూర్ణిమనాఁడు హైమవతి యను నొక వేశ్య గానసభ కావించెను. ఆగానమునకు మెచ్చికొని శ్రీచిదంబరశాస్త్రిగారు

ఉ. కమ్మని తేనె లొల్కఁగను గానము చేసితి, వద్ది శ్రోత్రసా
ఖ్య మ్మొనగూర్చి యున్నయది; మైనను గొందఱు మెచ్చరేమొ పో
ని మ్మది యెట్టు లుండినను నే నిజమాడెద నీముఖేందుబిం
బమ్మున కీయ వచ్చు శతపద్యము లైనఁ గురంగలోచనా!

అని యొకపద్యము చెప్పిరి. వెంటనే పసపురాటు భుజంగారెడ్డి యనునొకకవి 'రాజసన్నిధిని వేశ్యను వర్ణింతురా' యని శాస్త్రిగారి నాక్షేపించుచు నొకపద్యము నాశువుగాఁ జెప్పెను. దానికి సమాధానముగా శ్రీశాస్త్రిగారు

ఉ. ఈవు భుజంగనామము వహించియు వేశ్యను జేనియొద్ద సం
భావన సేయరా దనుచుఁ బల్కుట భావ్యము గాదు; కాన నీ
భావమునం దొకప్పుడును బణ్యవధూటులఁ జేక సేయఁగాఁ
బోవక యున్నచో నపుడె పొందెదు పేరికిఁ దగ్గకీరితిన్.

అని సమయస్ఫూర్తితో సచమత్కారముగా నొకపద్యమును జెప్పిరి. దానిపై భుజంగారెడ్డికవి మఱికొన్ని ప్రసంగములు తెచ్చి యాశుపద్యములు చెప్పుటయును శాస్త్రిగారు వాని కన్నింటికిని సమాధానములు చెప్పుచుఁ దమయాశుకవితాపాటవము నపారముగాఁ బ్రదర్శించిరి. నడుమ నడుమ భుజంగారెడ్డికవి సమాధానము చెప్పుటకై పూనుకొని యాశుకవిత సాగక తడఁబడుచుండఁగా శ్రీశాస్త్రిగారు

క. తడఁబడెద వేల? యాశువు
నుడువుటకై పూనుకొని ఘనుల్ గలసభలోఁ
గుడి యెడమ లేదె? సింహము
కడనా? హరిణములకుప్పిగంతులయాటల్.

సీ. శతవధానవిధానచాకచక్యముఁ జూపఁ
గలరేని రండు వాక్కలహ మేల?
అష్టావధానవిద్యాపాటవముఁ జూపఁ
గలరేని రండు వాక్కలహ మేల?
ఆశుధారాకవిత్వాటోపమును జూపఁ
గలరేని రండు వాక్కలహ మేల?
సంస్కృతాంధ్రగ్రంథసంధానమును జూపఁ
గలరేని రండు వాక్కలహ మేల?

గీ. చతురమతి యగుగద్వాలజనవిభుండు
సాక్షియై యుండ నేతత్సభాంగణమునఁ
దారతమ్యం బెఱుంగక తప్పుదారిఁ
బడినమీగర్వ మెల్లను బాపువాఁడ.

గీ. కవుల మనుగర్వమునఁ గన్ను గానకుండ
నిన్న మొన్నటిదాఁక ననేకగతుల
సంచరించితి రిఁకమీఁద సాగఁబోవు
వచ్చియున్నాఁడు శ్రీచిదంబరుఁడు నేఁడు.

ఇత్యాదిగా హిమవన్నగాగ్రసంపతద్గాంగఝురీవేగధిక్కృతిచణ మగు నాశుకవితావాహిని నతివేలముగాఁ బ్రవహింపఁజేయ ఔచ్చ్యపడినభుజంగారెడ్డి యొకకాగితముపై రెండుపద్యములు వ్రాసి లేచి సభలోఁ బఠించి శ్రీశాస్త్రిగారికి సమర్పించెను. అందుండి యొకటి.

చ. ధరణి శతావధానసువిధానయశోమహనీయ! యోచిదం
బరకవిసార్వభౌమ! పలుభంగులఁ గైత యొనర్తు నంచు సం
బరపడి పైని నీదగునపారకవిత్వమహాప్రభావసా
గరమున కోడి ఔచ్చ్యపడి గౌరవబుద్ధి చెలంగుచుండ నీ
చరణము లంటి మ్రొక్కితిని సైఁపుము నేను భుజంగరాయఁడన్.

ఇట్లు,

సిద్ధార్థిసం. మాఘశుద్ధపూర్ణిమ
గద్వాల
పసపురాటు భుజంగారెడ్డివ్రాలు.

అటుపైని శ్రీశాస్త్రిగారు

క. తరతమభావము నెఱుఁగక, చరియించినకతన నింత జరుగఁగ వలసెన్
గరుణించినాఁడఁ బొమ్మిఁక, ధరణిసురులు క్షణికకోపధారులు వత్సా!

అని వెంటనే ప్రసన్నులైరి.

ఆసభలో జరిగినవిశేషములు కొంతవఱకు సవిస్తరముగా "రాజసభావిహారము"న నవలోకింప నగును. శ్రీశాస్త్రిగారు నాఁటిసభలోఁ గావించినకవితావీరవిహార మవలోకించి యానందింపవలసినదే కాని వర్ణింప నలవి యైనది గాదు. ఆనాఁటిసభలో విజయముతోపాటు "ఆస్థానకవిపదవి" గూడ శ్రీశాస్త్రిగారికి లభించెను. పిమ్మట సకుటుంబముగాఁ గొంతకాల మచ్చటనే నివసించిరి.

## బెళగల్లు

ఆసమయముననే గద్వాలమహారాజసోదరుఁ డగు శ్రీతిరుమలరెడ్డిగారికి బెళగల్లుగ్రామమున వివాహము జరిగినది. దైవమువిన్నజమీందారు వదాన్యుఁడు సరసాగ్రేసరుఁడు నగు శ్రీరామిరెడ్డిగారు కన్యాదాత. గద్వాలాస్థానకవులు గావున శ్రీశాస్త్రిగారు గూడ వివాహమునకు కేఁగిరి. అచ్చట వివాహసమయమున శ్రీశాస్త్రిగారిచే శ్రీరామిరెడ్డిగారియగ్రజులు మైసూరురెడ్డిగారు శతావధానము చేయించి నూటపదాఱులు సేలువలు సత్కరించిరి. అవధానాంతమున నట

(శ్రీ) శాస్త్రిగారి ననేకులు విద్వత్కవులు పద్యములతోఁ బొగడిరి అందుండి మచ్చునకు రెండు మూఁడు పద్యములు.

ఉ. ధారణ కడ్డు లేదు కవితావిషయంబున లోటు రా దలం
కారము వీడఁబోదు రసకాండము లేఁగ దిఁ కెన్నియో చమ
త్కారము లుల్లసిల్లె నవధానపుదీక్షను మీరు నిల్వ నో
సూరివరేణ్య! మీమహిమ చోద్యము చోద్య మి దెల్లభంగులన్.

గాడేపల్లి, వీరరాఘవశాస్త్రి, శతావధాని.

సీ. ఒక్కచోఁ జక్కెరముక్క లక్కజముగఁ
బేర్చినమాడ్కి సంప్రీతిఁ గొల్పి
ఒకచోట గాంగవీచికలఘుమంఘుమా
ర్భటి తెఱంగున హుటాహుటి ఘటించి
ఒక్కచో మలయానిలోత్ఫుల్ల కేతకీ
సౌరభంబట్టులు సౌరు నెఱపి
ఒక చోట మత్తాళినికరఝుంకారంబు
విధమున వీనులవిందుఁ జేసి

గీ. ఒక్కచో ముగ్ధకాంతాసముజ్జ్వలాంగ
మార్దవంబు చందంబున మహిమఁ గూర్చి
తావకశతావధానవిధాన మలరె
సారధుర్య! చిదంబరశాస్త్రివర్య!

గోపాలుని, సుబ్బరామయ్య.

సీ. మందరపర్వతమథితాబ్ధిసంభూత
యశాసుధాధార మీయాశుధార
త్రైలోక్యజిత్స్మరధనురుదితేక్షుర
సాంచితధార మీయాశుధార
మందారమంజరీబృందగళన్మరం
దానూనధార మీయాశుధార
ఖచరరాట్పాలితకామధేనుస్తనో
ద్యత్పయోధార మీయాశుధార

గీ. కలితనందనారామమాకందబృంద
సంచరత్కీరచంచూనిశాతహేతి
దళితతత్ఫలానర్గళోద్గళితఫలర
సాభినవధార నిజము మీయాశుధార. బుగ్గ, రామకవి.

పిమ్మట ఆత్మకూరు, వనపర్తి సంస్థానములలో నాశుకవితాసభలు కావించి తత్ప్రభువులసత్కారము లందుకొని కర్ణాటదేశభూషణం బగుమహీశూరపురము నకుఁ బయనించిరి.

## మైసూరు సంస్థానము

మైసూరులోఁ దెలుఁగు వచ్చినవారే యరుదు. కావుననే యట శ్రీశాస్త్రి గారిసభ లన్నియును సంస్కృతభాషయందే సాగినవి. మైసూరుపురమున శ్రీశాస్త్రి గారిమొదటిశతావధానము 16-11-1920 తేదిని మహీశూరమహారాజగురుపీఠ మగుపరకాలమఠమున జరిగినది. ఆసభను డాక్టర్, రాధాకుముదముఖర్జీ, ఆర్. శ్యామ శాస్త్రిప్రభృతిసంస్కృతాంగ్లాదిభాషావిశారదులు, సంస్థానవిద్వాంసులు ననేకు లలంకరించియుండిరి. సభాధ్యక్షులు షట్ఛాస్త్రపారంగతులు, అలంకారమణిహారాది మహాగ్రంథకర్తలు, మహారాజగురువులు నగువాగీశబ్రహ్మతంత్రపరకాలస్వామి వారు. ఇట్టిమహావిద్వత్సభలో నల్లరను శ్రీశాస్త్రిగారు స్వీయశతావధానానంద సాగరమున ముంచి తేల్చిరి. పిమ్మటఁ బ్రాచ్యకోశాలయము (Oriental Library) మున్నగుచోట్ల మఱికొన్ని యవధానములు, ఆశుకవితాసభలు సాగినవి. ఈవిష యము లన్నియు నెప్పటి వప్పుడు ''సంపదభ్యుదయ'' అనుకర్ణాటకపత్రికలోఁ బ్రకటితము లగుచుండెను.

## అవధానము—ఆస్థానమహావిద్వదవీప్రాప్తి

శ్రీశ్రీకృష్ణరాజఒడయరుమహారాజులకు సంస్థానమున నవధానసభ చేయింపుఁ డని శాస్త్రిగారువిజ్ఞప్తి పంపుకొనిరి. దానిపై మహారాజు 'అష్టావధానసభ' కాజ్ఞ యిచ్చుచు నఱగంటకాల మవకాశ మిచ్చిరి. ఎంతవేగముగాఁ జేసినను రెండుగంటలకాలము నకుఁ దక్కువ పట్టనియష్టావధానసభను అఱగంటలోఁ జేయుట యెటులా యని శ్రీశాస్త్రిగా రనుమానించిరి. అప్పుడు మైసూరుపురన్యాయవాదియు నాంధ్రుఁడు నగు శ్రీ కే. చంద్రశేఖరయ్యగారు 'సమయము చాల దని మహారాజునకుఁ దెలిపిన యెడల మరల నిట్టియవకాశమే దొరకదు. మహారాజు సంస్కృతభాషాభిజ్ఞుఁడు. కనుక మృదుమధుర మగుమీయాశుకవితాగాంగఝురిలో వారి నోలలాడించి, తన్మయులఁ గావించి గడచినకాలము తెలిసికొనలేకుండునట్లు చేయవలెను. అట్టి శక్తి మీకుఁ గలదు. కావున సంశయింపక వెంటనే మీయంగీకారమును దెలియఁ జేయుఁ' డని చెప్పిరి. ఆప్తమిత్త్రు లగువారియాలోచనచొప్పుననే శ్రీ శాస్త్రిగారు తమయంగీకారము మహారాజునకుఁ దెలిపిరి. ఆస్థానమహావిద్వాంసులు పృచ్ఛకులై యుండ మహీశూరమహారాజసన్నిధియం ''దష్టావధానసభ'' 14-12-1920 తేదిని గావింపఁబడినది. అవధానారంభమున నవధానమును గుఱించియు మహారాజును గుఱించియుఁ దమకవితాశక్తిని గుఱించియు నేఁబదశ్లోకములకుఁ బైఁగా నాశువుగాఁ

జెప్పిరి. మహారాజు ఆమధురకవితామకరందమును గ్రోలుచుఁ దన్మయుఁడై యుండ నవధానము నారంభించి ప్రశ్నముల కన్నింటికిని దగుసమాధానములు సెప్పుచు నడుమ నడుమ రంజకతాభంగము లేకుండ నాశుపద్యములు గుప్పుచు నత్యద్భుత చాకచక్యముతో 1½ గంటకాలములో నవధానమును ముగించిరి. ఆనాఁడు ప్రదర్శించినయాశుకవితావైభవము అవధాననైపుణి కని విని తీరవలసినవే గాని వర్ణింప నలవి యగునవి కావు. "అవధాన మవసిత" మ్మని శ్రీశాస్త్రిగారు తెలుపువఱకును సామాజికు లగువిద్వాంసులును మహారాజును దన్మయు లయియే యుండిరఁట! అనంతరము మహారాజు గడియారము చూచుకొని తా మిచ్చిన కాలముకన్న నొక గంటకాల మధికముగాఁ గడచినను దా మది గుర్తింపలేనియట్లు చేసినశ్రీశాస్త్రిగారికవితాశక్తికి నవధాననైపుణ్యమునకు నచ్చెరువడి ముక్కుపై వ్రేలు వైచికొని యానాఁటిసభ ముగించిరి. మఱునాఁడు సత్కారసభ జరిగినది. అందు మహారాజు సంస్థానమర్యాద లన్నియును శ్రీశాస్త్రిగారికి జరిగించి, గొప్పపారితోషికము నిచ్చి 1-1-1921 నుండిగౌరవమాసవేతనముతోడి యాస్థానవిద్వత్పదవినిగూడనొసఁగిరి. అంతతోఁ దృప్తి నొందక 1-6-1921 నుండి గౌరవమాసవేతనాభివృద్ధితోఁ గూడిన యాస్థానమహావిద్వత్పదవి, ఆస్థానశతావధానిపదవి నొసఁగి గౌరవించిరి. అది మొదలు శ్రీశాస్త్రిగారికి జీవితాంతమువఱకు గౌరవవేతనము ప్రతిమాసము లభించుచుండెను. 30-10-1924 లో మహారాజు పెట్టించినకవితాపరీక్షకై "మహీశూర రాజ్యాభ్యుదయచంపువు"ను రచించి సంస్థానసత్కారమును బడసిరి. 20-12-1920 తేదిని మైసూరుపురమందిరమునఁ బౌరులు శతావధానసభను జేయించి సువర్ణపదకమును బహూకరించిరి. మైసూరులో నెక్కడ విన్నను గన్నడపుఁబలుకులే గాని మృదుమధుర మగు తెనుఁగుమాట యొకటియుఁ జెవిని బడమి నొకపరి శ్రీశాస్త్రిగారిట్లు చెప్పిరి.

సీ. మూడబేకులలోన నోడాడి యోడాడి
హోకుసాకులలోన నలసి సొలసి
బట్టిహోగిరులలోఁ బచరించి పచరించి
నానునీనులలోన నాని నాని
అల్లియిల్లులలోన నల్లిబిల్లుల నాడి
హేళికేళులలోన సీఁది యీఁది
నోడుబేడులలోన నూల్కొని నూల్కొని
యూటవూడులలోన నొదిఁగి యొదిఁగి

గీ. యష్టయిష్టులలోపల నడఁగి యడఁగి
సాఁదీరులలోపల నూరి యూరి
శ్రుతిపుటంబున కెంతేని హితవు దఱుఁగఁ
బరిచరించితి మహిశూరపురమునందు.

తరువాత నంజనగూడు, శివమగ్గ, తీర్థహళ్లి మున్నగు చోట్ల నాశుకవితా ష్టావధానశతావధానసభలు జరిగినవి.

## శృంగేరి

పిమ్మట శృంగేరి కేఁగిరి. అచ్చటనాదిశంకరస్థాపితశ్రీశృంగేరీశారదాపీఠాధిపతి జగద్గురు శ్రీశ్రీచంద్రశేఖరభారతీస్వామివారిసన్నిధియం దష్టావధానసభ నత్యద్భుతముగా నెఱవేర్చిరి. అందుఁ బృచ్ఛకులు-సర్వశాస్త్రవిశారదు లగు శ్రీస్వామివారు, తదాస్థానవిద్వాంసులును. ఇట్టిమహాపండితసభలో శ్రీశాస్త్రిగారు స్వమతగురుపీఠ మగుటచేఁ దమప్రజ్ఞావిశేషమును బ్రదర్శింపఁ దలఁచి నిషేధాక్షరిలోఁ బ్రత్యక్షరమును ఏకాక్షరమాత్రనిషేధము గాక రెండేసియక్షరములను నిషేధింపఁ గోరిరి. శ్రీవారుగూడఁ బట్టుదలతో నట్లే యని మఱి నలువురు పండితులు తామును గలిసి నిషేధించిరి, ఐనను అవలీలగా నిషేధాక్షరిని శ్రీశాస్త్రిగారు నిర్వహించి శ్రీవారియాశీఃపూర్వకప్రశంసాసత్కారములకుఁ బాత్రులైరి. శృంగేరీ సత్రభోజనకాలమున

శ్లో. కామక్రోధాదయో యేన, యాంతి నామావశేషతామ్ ।
తస్మై జగద్గురో స్సత్త్ర, భోజనాయ నమో నమః.

అని హాస్యరసగర్భితముగా నొకశ్లోకము చెప్పిరి. దేశయాత్రాచరిత్రమునఁ బైసందర్భమునే యిట్లు వ్రాసికొనియున్నారు.

శ్లో. తుంగభద్రానదీస్నానం, సత్త్రే రక్తాన్నభోజనమ్।
మతే స్వాపో మమ ప్రాప్తా, భిక్షుకాణా మివ స్వయమ్.

## కాశీ

పిమ్మటఁ గాశీనగరమున కేఁగి యటఁ గాశీమహారాజాస్థానమునఁ గాశీమహావిద్వాంసు లందఱు చేరియున్నమహాసభయం దష్టావధాన మొనరించిరి. అవధానమధ్యమున నొకపండితుఁడు లేచి మీరు సమస్యాపూరణము నాలస్యముగాఁ జేయుచున్నా రని యాక్షేపించెను. దానికి శాస్త్రిగారు అవధానమున ధారణ యుండవలయును. కావునఁ గొంతయాలస్యము కాక మాన దనియు నైనను దాము వేగముగనే చేయుచున్నా మనియును మొదట సరసముగా సమాధాన మిచ్చిరి. దానికిఁ బృచ్ఛకుఁడు నే నింతకన్న శీఘ్రముగా సమస్యాపూరణము, అవధానము

గూడఁ గావింపఁగల నని మరల శాస్త్రిగారి నాక్షేపించెను. దానిపై శాస్త్రిగారికిఁ గోపము వచ్చి యట్లైన నీసమస్యను బూరింపు మని తమకు నవాబుపేఁటశతావధానమున నిచ్చినదియుఁ దముచేఁ బూరింపఁబడినదియు నగు "మానపూజాపహారః" అనుసమస్య నొసఁగిరి. ఆపండితుఁ డాసమస్యను బూరింప నెంత యత్నించినను మార్గము తెలియక తబ్బిబ్బుపడు చుండెను. ఈలోపల శ్రీ శాస్త్రిగా రవధానము సక్రమముగాఁ బూర్తిచేసి 'మీరు సమస్యను బూరించితిరా' యని యాపండితు నడిగిరి. ఆతఁడు దానికి జంకుచుఁ 'బూరణ మింకను గా లే' దనెను. కొంతసేపటివఱకు నూఱకుండి వెనుకటివలెనే మరల శాస్త్రిగా రాతని నడిగిరి. అప్పు డాతఁడు తప్పులతడక యగునొకపూరణమును జదివెను. ఆమహాసభలో నందలిదోషముల నెల్ల నుద్ఘాటించి నవాబుపేఁటశతావధానమునఁ దాము గావించినపూరణమును గూడ సభ్యులకు వినిపించిరి. అప్పుడు సభ్యులగుధర్మప్రాణ, ద్రావిడ లక్ష్మణశాస్త్రి ప్రభృతులు నిండుసభలో శ్రీశాస్త్రిగారిపూరణమును మెచ్చుకొని యాపండితుని పూరణము దోషభూయిష్ఠ మని, సమస్యలోనికిటుకే యాపండితునకుఁ దెలియలే దని స్పష్టముగాఁ జెప్పి యాపండితుని మందలించిరి. అంతటఁ గాశీమహారాజు శ్రీశాస్త్రిగారికి నూటపదార్లు పట్టుసేలువలు సత్కరించిరి. కాశీనగరమున మఱిరెండాశుకవితాసభలు జరిగినవి.

## దర్భాంగ

కాశీమహారాజసభలో విజయము నార్జించి, భారతధర్మమహామండలి సభాధ్యక్షు లగుదర్భాంగమహారాజ శ్రీశ్రీరమేశ్వరసింహప్రభువులసన్నిధిని మఱియొకయష్టావధానము చేసిరి. అందలిసభ్యులు పలువురు మహామహోపాధ్యాయులు. ఆయవధానమున శాస్త్రిగారు ప్రదర్శించిననైపుణ్యపాండిత్యములకు వారు మిగుల సంతసించిరి. శ్రీమహారాజు పండితప్రేరణమున శ్రీశాస్త్రిగారికి నూటపదార్లతోపాటు "కావ్యకళానిధి" అనుబిరుదమును గూడ నిచ్చి తమయానందమును వెల్లడించిరి.

## 1922—ముక్త్యాల

ముక్త్యాలజమీందారు ఒక్కదినములో నూఱుపద్యములకుఁ దగ్గకుండ నొక యాశుకావ్యము నిర్మింపఁ గోరిరి. వర్ణ్యము భాగవతప్రసిద్ధ మగు "కపోతకిరాతకథ". శ్రీశాస్త్రిగారు వారు కోరినకావ్యము నొక్కదినములోనే రచించి వినిపించిరి. అందులకు మెచ్చుకొని శ్రీజమీందారుగారు నూటపదార్లు మిక్కిలివిలువగల పట్టువస్త్రములు సత్కరించిరి.

## అనంతశయనసంస్థానము

పిమ్మట దసరామహోత్సవములలో వార్షికనియమము ననుసరించి మైసూరు సంస్థానమున కేఁగి యక్కడనుండి తిరువాన్కూరు (అనంతశయన) సంస్థానమున్ కేఁగిరి. అచ్చటఁ బ్రాచ్యకోశాలయమున మహామహోపాధ్యాయ, తదుపై గణపతి శాస్త్రిగారి యాధ్యక్ష్యమున నవధానస్వరూపవివరణోపన్యాసపూర్వకముగా నొక యష్టావధానసభ (2-10-1922) జరిగినది. ఆసభకుఁ బలువురు విద్వాంసులు సంస్థానోద్యోగులు వచ్చి శ్రీశాస్త్రిగారియవధానశక్తికి, ఆశుకవితాధాటికి మిక్కిలి యానందించిరి. పిమ్మటఁ బురజనులయాదరమున (Unian club) 10-10-1922 అష్టావధానసభ జరిగినది. పుర మంతయు నవధానాశుకవితాప్రశంసలతో మాఱు మ్రోఁగినది.

పిదప (12-10-1922) శ్రీమదనంతశయనమహారాజ మహామహిమ శ్రీశ్రీరామవర్మ సన్నిధియం దష్టావధానసభ యతిమనోహరముగా జరిగినది. అడిగినప్రశ్నల కన్నింటికిని జక్కనిసమాధానములు చెప్పఁబడినవి. సభాంతమున నానందతుందిలహృదయారవిందుఁ డగు శ్రీమహారాజు స్వయముగాఁ "కవివీర సింహకంకణము"తో శ్రీశాస్త్రిగారికరము నలంకరించిరి. మూఁడునూటపదాఱులు సేలువలు బహూకరించిరి. శ్రీగణపతిశాస్త్రిగారిప్రేరణచే ననంతశయనగ్రంథావళీముద్రితగ్రంథముల నెల్ల నొసఁగిరి. పిమ్మట మహారాజ్ఞి మున్నగుమహిళామణులు సంస్కృతభాషాపాండిత్యభూషితలు పలువురు బాలికాపాఠశాలలో నొక యష్టావధానసభ చేయించిరి. అందు స్త్రీలే పృచ్ఛకురాండ్రు. నేఁటికిని కేరళదేశమున సంస్కృతాభిమానము పెల్లుగా నుండుట యెల్లరకును విదితమే. ఈసభలోఁ గేరళదేశపుఁజారును వర్ణింపుఁ డని కోరఁగా శ్రీశాస్త్రిగారు

శ్లో. అ స్తీతి కేచి దమృతం నిగదంతి చంద్రే
కేచి ద్వద న్తి లలనాధరపల్లవేషు।
బ్రూమో వయం సదసి సంప్రతి కేరళీయై
రాకల్పితే సురభిశాల్మరసే మనోజ్ఞే.

అని మిగుల సరసముగా వర్ణించిరి.

శ్రీశాస్త్రిగారిహృదయమును గేరళదేశము తత్రత్యజనవేషములు దేవాలయాదులు మిగుల నాకర్షించినవి. కావుననే దేశయాత్రాచరిత్రమున

శ్లో. కేరళేషు పురశ్చూడాః, పుమాంసః కుక్కుటా ఇవ।
లతా ఇవ ఫలోపేతాః, స్త్రియో విగతకంచుకాః.

శ్లో. దేవాలయానాం సౌభాగ్యం, కేరళే ష్వేవ విశ్రుతమ్।
గో(శ్రీ)రాష్ట్రప్రభూతానాం, ప్రజానాం తపసాం ఫలమ్.
శ్లో. స్నాత్వా నిబద్ధకేశాంతాః ప్రాతర్దేవ్యాలయం గతాః।
దృశ్యంతే కేరళే దేశే, స్త్రియో భక్తిసమన్వితాః.
శ్లో. ఏకైకో హ్రద ఆరామః, కూపః ప్రతిగృహం తథా।
కేరళే పరిదృశ్యంతే, సర్వత్రాఽపి మనోహరాః.
శ్లో. ఆశ్రమా ఇవ లక్ష్యన్తే. మహర్షీణాం పురాతనాః।
విశాలే కేరళే దేశే, సదనాని సమంతతః.
శ్లో. మృదుసంభాణా దృశ్యాః, స్మితజ్యోత్స్నావృతాననాః।
కృశావలగ్నా స్సుదృశః, కేరళీయా మనోరమాః.
శ్లో. వార్షికీం జన్మవర్ధస్తిం, మద్రాతుం తస్య భూభృతః।
పిష్టప్రవాహై శ్శ్వేతేషు, రాజమార్గే ష్వహం గతః.
శ్లో. అద్భుతః కేరళీయానాం, రాజభక్తిధ్వని శ్శ్రుతః।
తత్రాఽఽస్తే భాగినేయస్య, రాజ్యం దేయ మితి క్రమః.

రాజు వీథిని బోవునపుడు కేరళస్త్రీలు "ఉలూలు" అనుధ్వని చేయుదురఁట! అనర్ఘరాఘవనాటకమున భట్టమురారియు నీయులూలుధ్వనిని వర్ణించియున్నాఁడు. (శ్రీ)శాస్త్రిగారు తాము పర్యటించినదేశములలోనియాచారాదులు సభావృత్తాంతములు "దేశయాత్రాచరిత్రము"న వర్ణించియున్నారు.

## మధుర

23–10–1922 మధురానగరమున "రామనాధగీర్వాణకళాశాల"లో అభినవభట్టబాణ, విద్యావారిధి, ఆర్. కృష్ణమాచార్యులు (M. A.) గారియాధిపత్యమున "అష్టావధానసభ" జరిగినది. అవధానము సభ్యతులు మిగుల సన్నుతించిరి. పిమ్మట (శ్రీ)రంగమున (శ్రీ)శంకరాచార్యగురుకులమున నొకయష్టావధానసభ జరిగినది. గురుకులవిద్వాంసులు (శ్రీ)శాస్త్రిగారిని మిగుల వినుతించి సత్కరించిరి.

## 1923 - బెంగుళూరు

బెంగుళూరిలో "(శ్రీ)సీతారామమందిరము"న నొకయష్టావధానసభ (23–6–1923) జరిగినది. అచ్చటనే 24–6–23 తేదిని ఆశుకవితాసభలో గంటకు నూఱుశ్లోకములు రచియింపఁబడినవి. రామశతకము వర్ణ్యము. దేవాలయాధికారులుచితసత్కృతి చేసినారు. 9–12–1923 ఆర్యధర్మబోధినీసభయం దష్టావధానమొనరించి సువర్ణపదకబహూకృతి నందుకొనిరి. ఈయవధానమున నవధానకృత్యముతోపాటు ఎనిమిది సమస్యలుపూరింపఁబడినవి.ఇం దిది విశేషము. శివగంగామఠమున

నొక యష్టావధానసభ జరిగినది. పిమ్మట ఆర్యధర్మబోధినీసభ వారు యోగశాస్త్రోప న్యాసపూర్వక మగు మఱియొకయష్టావధానమును దమసభలోఁ జేయించి సత్కరించిరి. మొత్తము నాలు గష్టావధానసభలు, ఒకయాశుకవితాసభ బెంగుళూరుపురమున మహోజ్జ్వలముగా జరిగినవి.

## వ్యాసరాయపీఠము

15-11-1923 సోసలలో శ్రీవ్యాసరాయపీఠాధిపతి, విద్యావారిధి దేశికనామక మధ్వాచార్యసన్నిధానమునం దష్టావధానసభఁ గావించి, తార్కికశిరోమణి యగు శ్రీవారిసత్కారముల నందుకొనిరి. శ్రీవారు అంతతో నాఁగక శ్రీశాస్త్రిగారి "శతావధాన" నైపుణ్యమును గూడఁ బరిశీలింపఁ దలఁచి 21-11-1923 తేదిని "శతావధాన"సభ చేయించి యాశీర్వచనపూర్వకముగా నూటపదాఱు రూప్య ములు మిగుల విలువ గలపట్టువస్త్రములు సత్కరించిరి.

## "ఆశుకవి కేసరి" బిరుదము

అటనుండి గజారణ్యక్షేత్రము దక్షిణకాశీ యనుప్రసిద్ధి నొందినతలకాడుపురికి వెడలిరి. అచట 26-11-1923 తేదిని అష్టావధానసభ చేసిరి. 27-11-1923 తేదిని బూర్ణమంగళకామాక్షీదేవీసన్నిధిని దేవాలయాధికారులప్రేరణమున "భార్గవ చరిత్ర" మాశుకావ్యముగా రచింపఁబడినది. హిమవద్గిరిదరీసంప్రవహద్గాంగఝురీ వేగమున నందు గంటకు నూటికెక్కువగా శ్లోకములు దొరలినవి. ఆయత్యాశు కవిత కచ్చెరువడినవిద్వత్సభ్యు లాసభలో "ఆశుకవి కేసరి"యనుబిరుద మిచ్చి శాస్త్రిగారిని సత్కరించిరి. దేవాలయాధికారులు నూటపదార్లు బహూకరించిరి. అచట నొకలోభిని గుఱించి శ్రీశాస్త్రిగారు "దేశయాత్రాచరిత్రము"న

శ్లో. తతః కశ్చి న్మహైశ్వర్యో, దానమానవివర్జితః।
నామ్నా శ్యామో గుణై శ్శ్యామో, వర్ణేన శ్యామతాం గతః.
శ్యామావతార స్సందృష్టః ...

అని వర్ణించి యున్నారు. కవులదృష్టి కెక్కినవారికిఁ గీర్తి యేని యపకీర్తి యేని శాశ్వతముగా నుండును గదా!

## 1924

విక్రమసింహపురమున (నెల్లూరు) "సంస్కృతకళాశాల"లోను "కన్యకా పరమేశ్వరీ దేవాలయము"నను 19,24-1-1924 తేదులలో రెం డష్టావధానసభలు విజయోత్తేజితములుగా జరిగినవి. కన్యకాపరమేశ్వరీదేవాలయమున జరిగినసభకు మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారధ్యక్షత వహించిరి.

## తిరుపతి

శ్రీ వేంకటేశ్వరసంస్కృతకళాశాలలో (3-2-1924) జరిగినయష్టావధానమున శ్రీశాస్త్రిగారు ప్రదర్శించినయాశుకవితావధానకౌశల్యములకుఁ బాండిత్యమునకు మిగుల నానందమును నచ్చెరుపాటును జెందినమహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, శ్రీకపిస్థలము దేశికాచార్యులవారు

శ్లో. పండితసదసి చిదంబర, శాస్త్రికృతాష్టావధానేన ।
ఆనందాద్భుతసింధ్వో, స్సంభేదే మగ్నమానసా స్సర్వే.

అని యభినందించి యున్నారు. ఈసభ యంతయుఁ గేవలసంస్కృతమున సవిమర్శముగా సాగినది. శ్రీశాస్త్రిగారు పండితవిమర్శల కన్నింటికిఁ దగినసమాధానములు చెప్పి వారిని మిగుల సంతసపఱిచిరి. అచటనే మఱునాఁడు (4-2-1924) కేవలాంధ్రమున నొకయష్టావధానసభ జరిగినది. అందు సభ్యులిచ్చినదుష్కరప్రాసనమస్య. 'ప్రాజ్ఞగమందు శంభుఁడు సుభద్రను గూడఁగఁ బుట్టె గాంధియే' దీనిని శాస్త్రిగారు

ఉ. రజ్ఞిలయం బినుం డుదయరోచి నెసంగు నెటన్; మతంగజ
త్వాజ్ఞవవస్త్ర మెవ్వఁడు సదా ధరియించు; మహేంద్రసూతి యే
దృజ్ఞలినన్ రమింప నుదయించె ఘనుం డభిమన్యుఁ; డాంగ్లభూ
భుజ్ఞివహంబుతో నెదిరి పోర నెవండు జనించె నిర్ధరన్.

అని పూరించిరి. సరిగా నాసమయమునకే కారాగారమునుండి గాంధిమహాత్ముని వదలినట్లు తంత్రీవార్త వచ్చినది. ఈ విచిత్రసంఘటనకు "రవి గాననిచోఁ గవి కాంచునే కదా" యనుచు సామాజికు లత్యంతానందముతో శ్రీశాస్త్రిగారి నభినందించిరి. అటకు వచ్చినపౌరులే యానాఁటిసభలో శ్రీశాస్త్రిగారికి సత్కారము గావించిరి.

6-2-1924 సరస్వతీవిలాససభలో "ప్రహ్లాదచరిత్రము" ఆంధ్రమున నాశుకావ్యముగా రచింపఁబడినది. గంటకు నూఱుపద్యములకుఁ దగ్గఱ శరవేగముతోఁ గవిత సాగినది.

10-2-1924 మఱల నొకయాంధ్రాశుకవితాసభ జరిగినది. అందు వర్ణ్యము "రామదాసచరిత్రము", నాఁడు సకలసామాజికహృదయంగమముగాఁ గవితాఝురి ప్రవహించినది. క్షేత్రవాసిబ్రాహ్మణులు చక్కనిసత్కారము గావించిరి. శ్రీనాగపూఁడి కుప్పుస్వామిగారు (B. A.) పద్యములతోఁ బ్రశంసించిరి.

అలమేలుమంగాపురమున(చిఱుతానూరు)ద్వైతమతస్థాపనాచార్య, ఉత్తరాది మఠాధిపతి, శ్రీసత్యధ్యానతీర్థస్వామిసన్నిధియందు(15-2-1924) "శ్రీపద్మావతీచరి

4

త్రము''ను సంస్కృతమున నాశుకావ్యముగా రచించిరి. ఒకగంటకాలములో సుమారు నూటముప్పదిశ్లోకములు చెప్పినారఁట ! అందలివి రెండు శ్లోకములు.

శ్లో. సత్యధ్యానయతీంద్రసన్నిధి రయం ప్రాజ్ఞా స్సదస్యాః పున
ర్వక్తవ్యం ఘటికాశతం నిరుపమం వృత్తం నవత్వాస్పదమ్ ।
సోఽయం సాంప్రతికో మహా నవసరః ప్రాప్తః కవిత్వప్రదే!
మాతః! పద్మవతి!త్వదీయకరుణాపీయూషధారాగ తేః.

శ్లో. లేఖకాః పంచ విఖ్యాంతే, పంచబాహుబలాన్వితాః ।
పంచాననో యథాఽహం స్యాం, తథా దేవి! ప్రసీద మే.

16–2–1924 అచ్చటనే ''అష్టావధాన''సభ గూడ జరిగినది. శ్రీవారి యాశీఃప్రశంసాపూర్వకసత్కారముల నందుకొని యటనుండి 1–3–1924 నాఁటికి గద్వాలసంస్థానమునకుఁ జేరిరి.

## గద్వాలసంస్థానము—[ద్వితీయసందర్శనము]

అక్కడ మహారాజసభలో శ్రీశాస్త్రిగారు

సీ. మహిశూరరాష్ట్రక్షమాపాలునాస్థాన
మందు విద్వత్పదం బధిగమించి
దర్భాంగభూపాలుదర్బారులోపలఁ
గావ్యకళానిధిఖ్యాతి గాంచి
వారణాసీరాజవరునిసన్నిధియందుఁ
గవిసింహ మనెడిగౌరవము నొంది
తిరువానుకూరుధాత్రీనాథుసభలోనఁ
గవివీరసింహకంకణము వడసి

గీ. శృంగగిరిపీఠపతిబహూకృతి గ్రహించి .
యంది పరకాలపీఠనాయకునికాన్క
వ్యాసరాయపీఠాధీంద్రునాదృతి గొని
యరుగుదెంచితి మరల నీదరికి భూప!

అని యాత్మవృత్తాంత మాశుకవితాధోరణిలోఁ జెప్పఁగా విని మహారాజు పరమానందభరితుఁడై ''చిదంబరకవీంద్రులరాకచే — నాలుగుసంవత్సరములకు — మరల మాదర్బారుకుఁ గళ వచ్చినది'' అని నిండుసభలో శ్రీశాస్త్రిగారిని నుతించి మిగుల గౌరవించెను.

1920 సం. లో శ్రీశాస్త్రిగారియాశుకవితామృతము నాకంఠముగఁ గ్రోలి యున్నవాఁడు గద్వాలమహారాజు. కావుననే యానాఁ డంతగౌరవము చేసినాఁడు.

కాని, ఆగౌరవము సంస్థానోన్నతోద్యోగి యగు శ్రీ ఆదిపూడి ప్రభాకర రావుగారి కసూయాజనక మైనది. అందుచే వారెట్లైని (శ్రీ) శాస్త్రిగారి కవమానము ఘటిల్లఁజేసి మహారాజునకు వారిపైఁ గలగౌరవము తొలఁగింపవలె నని నిశ్చయించుకొని యవకాశము దొరకినపు డెల్ల శాస్త్రిగారిపై నున్నవి లేనివి దోషములు కల్పించి మహారాజునకు బోధించు చుండిరి. మఱియు (శ్రీ) రావుగారు సరిగా నాసమయమునకే యటకు వచ్చినయున్న (శ్రీ) ఉపద్రష్ట సుబ్రహ్మణ్యశాస్త్రి గారిచే రహస్యముగా నతికఠినము లగుపదునాఱు ప్రశ్నలు సంఘటన చేయించి యుంచుకొని కవితాపరీక్ష యనుపేర మహారాజుసమ్మతి వడసి హఠాత్తుగా నొక నాఁటిసభలో "నేఁడు కవితాపరీక్ష జరుగును. అందుఁ బాల్గొన్నవారికే యీ యేఁడు సత్కారము జరుగును. శతావధానులు సైత మీప్రశ్నలకు సమాధానములు వ్రాయవలెను. ఇది మహారాజు సెలవు" అని ప్రకటించి యాప్రశ్నపత్రముల నొసఁగెను. ఈకఠినపరీక్ష (శ్రీ) చిదంబరశాస్త్రిగారిమీఁది ద్వేషముచే వారికొఱకే కల్పింపఁబడిన దని యెల్లరకును దెలిసినను, పరిస్థితి యందఱును సమాధానములు వ్రాయవలసినట్లే యేర్పడినది. ఐనను ఆ ప్రశ్నలలో నొకదానికి మాత్రమే కొందఱు సమాధానము వ్రాసిరి. మఱికొందఱు రెండింటికి, ఇంకను గొందఱు మూఁడింటికి మాత్రమే బదులు వ్రాసిరి. వేఱొకకొంద ఱొక్కదానికిఁ గూడ సమాధానము వ్రాయకయే విడిచిపెట్టిరి. చిదంబరశాస్త్రిగారు మాత్రము వారికి సహజ మగుపట్టుదలతోఁ బదునాఱు ప్రశ్నలకును జక్కనిసమాధానములు నియమితకాలమున వ్రాసి యుత్తమసమ్మానమును స్వీకరించిరి. ఈప్రశ్నలు తత్సమాధానములు నవధానసంగ్రహమునఁ బ్రకటింపఁబడును. ఈపరీక్షనాఁటికి మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, వేదము వేంకటరాయశాస్త్రిగారు గూడ గద్వాలలో నున్నారఁట!.

కవితాపరీక్షలో శ్రీశాస్త్రిగారి కవమానము ఘటింప నెంచి విఫలప్రయత్నులైనప్రభాకరరావుగారు సంపూర్ణశతావధానము చేయించి యందుఁ బరాభవింపఁ దలఁచి ధారణకు వీలుపడనిరీతిని నూఱు ప్రశ్నలు సంఘటించి యుంచి మహారాజుచేత శాస్త్రిగారికి "శతావధానము చేసి సత్కారములు గైకొనుఁ" డని చెప్పించెను. అందులకుఁ గవికేసరి యగు శ్రీశాస్త్రిగా రించుకయు సంశయింపక "వల్లె" యనిరి. వెంటనే 20-4-1924 పగలు 10 గంటలకు "శతావధాన" మారంభ మగు నని ప్రకటించిరి. ఆనాఁడు సభ్యులు శాస్త్రిగారును సమయమునకు వచ్చిరి. కాని, మహారాజు నిద్రించుచుండెను. వా రెప్పుడు మేలుకొందురా యని యందఱు కనుపెట్టుకొని యుండిరి. మధ్యాహ్నము 2 గంటలకు మహారాజు మేలుకొనెను. తఱచుగా రాత్రి దర్బారు సాగించుట పగలు చాలసేపటివఱకు నిద్రిం

చుట వీరికిఁ బరిపాటి. వెంటనే పరిచారకులు "10 గంటలనుండి శతావధానిగారు సభ్యులు తమకొఱకు నిరీక్షించుచున్నా"రని విన్నవించిరి. వేగముగాఁ గాల్య కృత్యములు నెఱవేర్చికొని మహారాజు సభకు వచ్చి "అవధానము నారంభింపుఁ" డని సెలవిచ్చెను. అప్పటికిఁ బగలు మూఁడుగంట లైనది. అయినను వెడలిపోవక యెనుబదినలుగురు సభ్యులుమాత్రము నిలిచిరి. అప్పుడు శ్రీప్రభాకరరావుగారు తాను సిద్ధపఱిచియుంచినప్రశ్నపత్రములను (84) బృచ్ఛకుల కొసఁగి వారితో "మేము వ్రాసియిచ్చిన ప్రశ్నలనే కాని మీయిష్టము వచ్చినప్రశ్నముల నడుగ వీలు లే" దని చెప్పి - అవధానిగారితో "ఇతరశతావధానులవలె మీరును మూఁడు దినములలో నవధానము చేయ వీలు లేదు. దినమునకు 12 గంటలచొ. రెండు దినములలోనే శతావధానము ముగింప వలె"నని చెప్పిరి. వైరికల్పితము లగు నెట్టికష్టముల కైన నోర్చి శతావధానము చేసి శత్రుజయముతోపాటు విజయలక్ష్మిని జేపట్టవలయు ననుపట్టుదలతో నున్నశ్రీశాస్త్రిగారు రావుగారి మాటకు "వల్లె" యని యవధానకృత్య మారంభించిరి. ఈ విధముగాఁ బగలు మూఁడుగంటల కారంభించినయవధానము రాత్రి మూఁడుగంటలవఱకును జరిగినది.

అప్పటికి శాస్త్రిగారు ప్రథమపాదము ముగించి ద్వితీయపాదమున డెబ్బది పాదములు చెప్పిరి. ఇఁకఁ బదునాలుగు పాదములు చెప్పిన ద్వితీయపాదముసైతము ముగియును. అప్పుడు ప్రభాకరరావుగారు "శాస్త్రిగా రవలీలగా నవధానము ముగించి మహారాజసత్కృతులు వడయఁ గలరు. దానికి విఘాతము గలిగించుట కింతకన్న నవకాశము దొరక" దని తలఁచి లేచి శ్రీశాస్త్రిగారితో ని ట్లనెను. "అయ్యా, ఇప్పటి కవధాన మారంభమై పంద్రెండుగంట లైనది. మీ రెనుబది నాలుగుప్రశ్నలకు సమగ్రముగా రెండుపాదములు ముగింపలేదు. ఇంకను 14 పాద ములు మిగిలి యున్నవి. కావున నియమితకాలమున మీ రవధానము చేయలేక యోడిపోయినారు" అని పలికెను. ఏకాగ్రమనోనిష్ఠాగరిష్ఠులై మహాయోగివలె నున్నశతావధానిగారి కామాట మిగులఁ గోపకారణ మైనది. ఐనను వీరితో మాటాడుట నిష్ప్రయోజన మని తలఁచి మహారాజును బిలిపించి యిట్లు పలికిరి. "మహారాజా! ప్రభువు పక్షపాతరహితుఁడై న్యాయాన్యాయములు చక్కఁగాఁ బరిశీలించి న్యాయనిర్ణయము కావింపవలె నని వేదశాస్త్రములు ఘోషించు చున్నవి. కావున నాపలుకుపలుకులను శ్రద్ధతో విని న్యాయము నిర్ణయింపుఁడు. తమసంస్థానమున నెందఱో మహాకవు లవధానములు చేసి యున్నారు. ఆయవధాన ములు తమరు చూచి యున్నారు. శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులు మొదలీనాఁటి దనుక నవధాను లెల్లరు దినమునకు 8 గంటలచొప్పున మూఁడు దినములలో (అనఁగా 24 గంటలలో) సంపూర్ణశతావధానము గావించు చున్నారు. అందును

మొదటిదినమున మొదటిపాదమే చెప్పవలెను. నేటివఱకు మొదటిదినముననే ప్రథమద్వితీయపాదములు రెండును జెప్పినవారు -నేను దప్ప- మఱి యెవ్వరును లేరు. అది య ట్లుండనిండు. అవధానారంభమున నిండుసభలోఁ దమసమక్షమున శ్రీప్రభాకరరావుగారు దినమునకుఁ బండ్రెండు గంటలచొప్పున రెండుదినములలో (అనఁగా 24 గం. లో) నవధానము ముగింపవలె నని మాత్రమే చెప్పియున్నారు గాని మొదటిదినముననే ప్రథమద్వితీయపాదములు పూర్తిగాఁ జెప్పవలయు నని చెప్పలేదుగదా! దానికి సభ్యులు తమరును సాక్షులే. ఇఁక నేటినాయవధానమున రెండవపాదమున 14 పాదములు మాత్రము మిగిలి యున్నవి. ఇవియును మూఁడు నాలుగు పాదములును రేపు నియమితకాలము దాఁటకుండఁగనే చెప్పి ముగింతును. అది మీకు సమ్మతము గాదేని యిప్పుడే యొకయఱగంటకాల మవకాశ మిచ్చి నచో నీపదునాల్గుపాదములు గూడఁ బూరింతును. రేపటి పండ్రెండుగంటలలో నీయఱగంటకాలము తగ్గించుకొనవచ్చును.

మఱియొక్కమాట. మొదటిపాదమున నవధాని నూఱువిషయములును ధారణ కనుకూల మగురీతిలో నమర్చుకొనుటయుఁ బ్రశ్నలకు సమాధానము లెట్లెట్లు చెప్పవలయునో నిర్ణయించుకొనుటయు నత్యావసరము. అందుచేతనే యవ ధానమున మొదటిపాదమునకు హెచ్చుకాలము పట్టును. ఇది యవధానరహ స్యము. కావుననే మొదటిదినమున నవధాను లందఱును మొదటిపాదముమాత్రమే చెప్పుదురు. అదిగాక దానివలన మఱునాఁటిసభాప్రారంభకాలమువఱకుఁ దాను జెప్పినప్రథమపాదమును గట్టిపఱుచుకొనుటకు నితరపాదముల నాలోచించుకొనుట కును నవధాని కవకాశము దొరకును. ఇఁక నాయవధానము నెట్లేని భగ్న మొనరింపఁ దలఁచి ప్రభాకరరావుగారు మూఁడుదినములను రెండుదినములకుఁ గుంచించిరి. ఐనను మదుపాస్య యగుపరమేశ్వరిపై భారము వైచి నేనీకార్యము నిర్వహింపఁ బూనుకొని యింతవఱకు సక్రమముగా నెఱవేర్చితిని. రేపటిసభలోఁ దక్కినవి గూడఁ బూరింపఁగలను. ఇంకొక్కమాట. ఈనాఁటిసభ పగలు పది గంటల కారంభ మగు నని నేను దొమ్మిదిగంటలకే భుజించి వచ్చితిని. ఇప్పుడు రాత్రి నాలుగుగంట లైనది. ఆహారమా లేదు. సమయమా నిద్రాసమయము, చెప్పునదియా కవిత. చేయునదియా యవధానము. ఐనను అన్నింటికి నోర్చి నే నీకార్యము సక్రమముగా సాగించితిని.

ఇది ధార్మికసంస్థానము. ధర్మపరిపాలకుఁడు శ్రీకేశవస్వామి. ఈవిషయము ప్రభువులు మనమునం దుంచుకొని వ్యవహరింపఁ గోరుచున్నాను. ఇటుపైని మహారాజుచిత్తము'' అని. పిమ్మట మహారాజు ఈపని యంతయుఁ బ్రభాకరరావు గారిపై నుంపఁబడినది. వారితో నాలోచించెదరి తెలిపెద మని సభ చాలించిరి.

శాస్త్రిగారు వారముదినములవఱకు సభాసమాధానములకై నిరీక్షించినను మహారాజెట్టి సమాధానమును బంపనందున నిఁక సభ చేయింప రని నిశ్చయించుకొని కొందఱు సభ్యులతో (శ్రీ) కేశవస్వామిదేవాలయమున కేఁగి యచ్చటనే తక్కిన పాదము లన్నియును జెప్పి (శ్రీ) కేశవస్వామిసన్నిధియం దెనుబదినాలుగు పద్యములు నొప్పగించి స్వామికిఁ గర్పూరహారతి యిచ్చుచు నాశువుగా

ఉ. ఏమి వచించిరో కుజను? లే మని తా గ్రహియించెనో? మ జే
మేమి తటస్థ మైనదియొ? యే గ్రహచారము సంభవించెనో?
భూమితలాధినేత వినఁ బూనని హేతువుచేతఁ గేశవ
స్వామి! శతావధానకృతి సర్వము నీకడ నొప్పగించితిన్.

క. తెలిసికొని గుణము దోషము
ఖలులను శిక్షించునీవె కాక మ ఱెవ్వం
డిలలో ధర్మము నిలుపం
గలవాఁడు గలండు తెలుపఁగా వలెనె? హరీ!

అని రెండుపద్యములు చెప్పిరి. పిమ్మట రాజుగారికిఁ బద్యములలో నొక రిజిష్టరులేఖ వ్రాసిరి.

రి జి ష్ట రు లే ఖ

క. నే నొనరించెడిమనవిని
వీనులకుం దెచ్చికొమ్ము విని దోషమ్మున్
బూనకు మిది ధార్మికసం
స్థానం బగుటను వచింపఁ దలఁచితి భూపా!

క. ఎనుబదినాలుగు ప్రశ్నల
కనర్గళప్రతిభతోడ నవధానంబున్
బొనరించితి నసమయమున
ననుసంగతి నీకుఁ దెలియదా? జననాథా!

క. సమయము రాతిరి, కార్య
క్రమమా యొకపట్టునంద కాఁదగినది, యీ
సమయములకు లోఁబడి నా
సమర్థతను జూప మెచ్చఁజనదే భూపా!

ఆ. పగలు మూఁడుగంట లగునంత నారంభ
మవల మూఁడుగంట లగుడు రేయి
నంత మిట్టు లెవ్వఁ డవధాన మొనరించెఁ
జెప్పుమయ్య! నీవె క్షితితలేంద్ర!

ఉ. ఇచ్చినప్రశ్న లెట్టివొ? వహించినకార్యభరంబ దెట్టిదో?
యిచ్చినకాల మెంతొ? వచియించిన దెంతొ? గ్రహించికొమ్ము నే
నిచ్చటఁ జేసినట్టు లెవఁడేనియు నొక్కదినంబునందె వి
ద్వచ్ఛ్రయ మానసన్ శతవధానము చేసెనె? మేదినీశ్వరా!

క. ధారణకు భంగ మొదవెడు
తీరునఁ బ్రశ్నంబు లేఁగుదెంచినను మహా
ధీరతతోఁ గావించిన
పూరణమున కెవఁడు ముదము పొందఁడు భూపా!

ఉ. శత్రుజనంబు చుట్టుకొని సంభ్రమమున్ గలిగించుచుండ నే
మాత్రముగూడ జంకక సమర్థతతోడ శతావధానమున్
ఛాత్రులు మెచ్చఁ దావకసభాస్థలిఁ జేసితి నన్నసంగతిన్
నేత్రము లున్నవారు గమనింపకపోవరు మేదినీశ్వరా!

ఉ. నే నొకరుండ నిల్చి ధరణీతలవల్లభ! నీసంభాగణ
స్థానములోపలన్ శతవధానము చేసితి నన్నదాని కీ
మానవు లెల్ల సాక్షులు క్షమాపతి నీవు నిజంబు పల్కు మే
దైనను లోప మిందుఁ గల దంచు నెడందకుఁ దోఁచె నేనియున్.

క. వ్యాకరణదోష మున్నదొ?
వైకల్యము ధారణకును వచ్చెనొ? లేదా
చేకుఱెనొ లోటు కైతకు?
నేకడఁ జూపెదవు లోప మీవు? నృపాలా!

ఉ. ఓ న మ యంచుఁ జెప్పికొను చుండెడివాఁ డెవఁడో వచింప నీ
మానసమందుఁ బెట్టికొని మా కెటులేని పరాభవంబు సం
ధానము చేయ నెంచితివి; దైవము లేదొకొ సాక్షి; యాతఁ డె
వ్వానికిఁ జేయ నెంచెనొ యెవం డెఱుఁగున్ ధరణీతలాధిపా!

ఉ. మూలలయందుఁ జేరికొని మూల్గుచు నుండెడివారిమాటలన్
జాలఁగ విశ్వసించుట రసాతలవల్లభు లైనవారికి౯
మే లొనగూర్పఁగాఁ గలుగునే? యది మెత్తురె లోకులెల్ల? సి
గ్గోలలతోడ నేమి పని? కూర్పుము నేర్పున నేఁడె సత్సభ౯.

ఉ. ఆసభలోపల౯ రసికు లైనమహాజను లెల్ల విద్వదు
ల్లాసముఁ గొల్పువాఙ్మయవిలాసము లొల్క శతావధానము౯
జేసితి నందురో మఱియుఁ జేయఁగ లే దని యందురో సము
ల్లాసముతోడఁ గన్గొను మలంతులమాటలు నమ్మఁ జెల్లునే?

చ. రసికత గల్గినట్టికవిరాజులు మెచ్చ శతావధాన విం
పెసఁగ నొనర్చినందులకు నెల్లరు సంతసిలన్ బహూకృతిన్
వెస నొనరించి కీరితిని నిల్పుము దిక్తటులందు భూప! నీ
రసులు వచించుమాట విని రాణకు లోపము చేయఁబోకుమా.

క. గద్వాలరాజ్య మనఁగను
విద్వాంసులపూజకొఱకె వెలసె ననుచు భూ
భృద్వర! జను లాడుదు రా
సద్వార్తను దగదె నీకు సంరక్షింపన్.

క. సుకవిని సమ్మానించుట
సకలమునకు గౌరవంబు సలుపుటయె సుమీ
సుకవిని ననాదరించుట
సకలమున కనాదరంబు సలుపుటయె నృపా!

క. నే నర్థి నగుచు నెవనిన్
భూనాయక! వేఁడికొనఁగఁ బోయెడివాఁడన్
గాను సుమీ నావిద్యను
గానఁబఱిచి ప్రతిఫలంబు గైకొను చుందున్.

చ. గొడవల కేమి నేను సభఁ గూర్చెడివాఁడను గా నటంచు నీ
యెడలను బట్టు పట్టునెడ నీవు మదీయవధానవృత్తమున్
విడువక చెన్నకేశవునివీనులకున్ వినిపించి నేను నీ
గడియెనె మాట గట్టుకొని ధాత్రీవర! కాలికి బుద్ధి చెప్పెదన్.

ఈరిజిష్టరు లేఖ శ్రీరాజుగారు చదివించుకొని మిగుల నాగ్రహపడుచుండి రనియును మీరు వెంటనే యిటనుండి వెడలి పోవకున్న గొప్పచిక్కు కలుగు ననియును రాజమాతులుఁడు వయోగుణవృద్ధుఁడు విద్వత్పక్షపాతియు నగు నమరవాయి తిమ్మారెడ్డిగారు చెప్పినవెంటనే శ్రీకేశవస్వామిసన్నిధి కేఁగి

సీ. విద్వత్కవుల గౌరవించెడిప్రభు వంచు
నెంచి సన్నిధి కేఁగు టెంచుటయును
తాను జేసిననిబంధనలకు లోఁబడి
శతవధానంబును జలుపుటయును
అవధానమునఁ జెప్పినట్టిపద్యంబులు
విను మంచు మనవి గావించుటయును
చేసినమనవికిఁ జెవి యొగ్గమింజేసి
న్యాయ్యరీతిని లేఖ వ్రాయుటయును

గీ. తప్పులుగఁ దోఁచెనో యేమొ ధరణిపతికిఁ
గానిచో నాగ్రహం బేల కలుగవలయుఁ
దప్పులో యొప్పులో విప్పి చెప్పుమయ్య
సర్వసాక్షివి కేశవస్వామి! నీవు.

క. సెలవీయు మింక నేఁగెదఁ
దెలుపంగాఁ దగినయట్టిదేవుఁడ వగుటన్
దెలిపితి నీకడ నంతయు
ఫల మీయఁగ దేవ! నీదె భారము సుమ్మా.

అని విన్నవించి శతావధానిగారు గద్వాలనుండి బయలుదేఱి యాదోని కేఁగిరి.

శాస్త్రిగారు వెడలిపోయిననాఁడే మహారాజునకు సన్నిపాతజ్వర మారంభమైనదఁట! ఎన్నయో వైద్యములు చేయించిరఁట! ముడుపులు గట్టిరఁట! ఏమి చేసినను జ్వరము తగ్గలేదఁట! చివరకు 26-5-1924 తేదిని గద్వాలమహారాజు శ్రీసీతారామభూపాలుఁడు స్వర్గస్థుఁ డైనాఁడఁట! శ్రీ శాస్త్రిగారు దేశయాత్రా చరిత్రమున నీసందర్భమున నిట్లు వ్రాసి యున్నారు.

శ్లో. అమోఘవాగ్బ్రహ్మమనః క్లేశసంజననేన వా।
దైవశాపేన వా కర్మపరిపాకేన వా పునః ।
సన్నిపాతజ్వరాక్రాంత, స్తదారభ్య మహీపతిః ।
ఏకమాసాంతరే కాలే, కాలధర్మ ముపాగతః.

## ఆదోని - హైమవతీవిలాసరచన

పిమ్మట నాదోనిలో శతావధానాష్టావధానసభలు మేనెల 10, 11, 12 తేదులలో సత్కారమేదురములుగా సాగినవి. 14 తేదిని బదినేహాలుగ్రామమున శతావధానసభ యద్భుతముగా జరిగినది. పలువురు కవులు శాస్త్రిగారి యవధాన నైపుణ్యమును బద్యములలోఁ బ్రశంసించిరి. శ్రీబదినేహాలు తమ్మిరెడ్డిగారు బంగారు గొలుసుతోడిసువర్ణపతకమును నూటపదాఱులును సత్కరించిరి. పిమ్మట రెడ్డిగారి ప్రేరణచే "హైమవతీవిలాస" మనుమూఁడాశ్వాసములమృదుమధురప్రబంధము నొకనెలదినములలో వ్రాసి శ్రీ మల్లికార్జునస్వామికిఁ గృతియిచ్చి శ్రీతమ్మిరెడ్డిగారి సభక్తికసత్కారములకు భాజన మైరి. ఆగ్రంథము వెంటనే యచ్చువేయించి రెడ్డిగారు శాస్త్రిపాదులకు సమర్పించిరి.

## పీఠికాపురసంస్థానము - సంపూర్ణశతావధానము

పిమ్మట రక్తాక్షిశారదనవరాత్రములకు శ్రీశాస్త్రిగారు పీఠికాపురసంస్థానమున కేఁగిరి. అట మహారాజునకుఁ బంపినవిజ్ఞాపనపత్రమునుండి రెండు మచ్చుతునుకలు.

సీ. సంస్కృతాంధ్రప్రజ్ఞ చాలకుండఁగఁ గైత
సెప్పెడికవులలోఁ జేరఁబోను
కవితారసామృతగ్రహణయోగ్యత లేక
యుండువారలచెంత నుండఁబోను
ధనధాన్యములు గల్గియును దాత యనిపించు
కొననివానిసమీపమునకుఁ బోను
కవిచంద్రులకుఁ జేయఁదగుగౌరవము నెఱుం
గనివానిమొగమేని గానఁబోను
గీ. కవనసారస్య మేమియుఁ గాంచకుండ
బహుమతులు సేయవచ్చినఁ బడయఁబోను
నీకు నెఱిఁగించినాఁడ నా నిర్ణయముల
నరయుమయ్య మహారాజ! యాంధ్రభోజ!

సీ. ఆశుకవిత్వంబు నల్లఁ బూనితి నేని
హరిదశ్వవాహంబు లడలవలయు
అష్టావధానంబు నాచరించితి నేని
యష్టమూర్తులు సిగ్గునొందవలయు
శతవధానంబును సలుపఁబూనితి నేని
శతధృతి స్థైర్యంబు సడలవలయు
నేత్రావధానంబు నెఱవేర్చితి నేని
చతుశ్శ్రవుం డైన జంకవలయు
గీ. సంస్కృతాంధ్రప్రబంధప్రచారమునకు
దంటతన మేర్పడఁగఁ బూనుకొంటి నేని
యంబ నాముందుఁ దాండవం బాడవలయు
భూరిగుణజాల! పీఠికాపురనృపాల!

ఆంధ్రభాషాభిమానులు వదాన్యులు నగుమహారాజుగారు శాస్త్రిగారిని సంపూర్ణశతావధాన మొనరింపఁ గోరిరి. "వల్లె" యని శ్రీశాస్త్రిగారు 1924 అక్టోబరు 4,5,6 తేదులలో సంపూర్ణశతావధానము చేసి పృచ్ఛకులుగా నున్న మహామహోపాధ్యాయులను శతావధానులను దదితరమహావిద్వాంసులను మహారాజును మహానందతుందిలహృదయారవిందులఁ గావించి మహోత్కృష్టము లగుసన్నుతులు సత్కారములు నందుకొనిరి. ఆనాఁటిశతావధానమును గుఱించి నేఁడుగూడఁ బ్రశంసించువారు పలువురు గలరు. శతావధానారంభమునఁ జెప్పిన యొక్కపద్యము మాత్ర ముదాహరింతుము.

ఉ. నీమముతోడ నీపనికి నేను గడంగితిఁ గాని కత్తిపై
సామిది, దీనిలోఁ బడినఁ జావక చచ్చినవాఁడె, నిల్చెనేని
మృతి నొందినన్ బ్రతికి నిల్చినవాఁడె జగంబులోన, నీ
జామున నెట్లు చూచెదవొ చల్లనిచూపులతల్లి! శాంకరీ!

## 1925—బెజవాడ

ఈ సంవత్సరమున జరిగినసభలలో బెజవాడశతావధానము ప్రధానము. అం దిచ్చినసమస్యలు ప్రశ్నలు కఠినము లైనను ఉల్లాసహేతువులు. మచ్చున కొక్కసమస్య. "కా ఖా గా ఘా కిజ కాటన్నాయా టీజ"

దీనికి శాస్త్రిగారిపూరణము.

"చా ఛా జా ఝా చిజ చంచన్నాయా ఛీజ
తా థా దా ధా తిజ తాతన్నాయా థూజ
పా ఫా బా భా పిజ పాపన్నాయా ఫీజ"

అవధానాంతమునఁ బృచ్ఛకునకు శాస్త్రిగారికి నీసమస్యను గుఱించి యీ విధముగా సంభాషణ సాగినది.

పృచ్ఛ :— అవధానిగారూ! మీసమస్యాపూరణమున కర్థము గలదా?

శాస్త్రి :— మీసమస్య కర్థము గలదా?

పృచ్ఛ :— కలదు. గంపెఁడర్థము గలదు.

శాస్త్రి :— మాపూరణమునకుఁ గూడ మూఁడుగంపలయర్థము గలదు ముందుగా మీయర్థము చెప్పుఁడు. పిమ్మట మాయర్థము చెప్పెదను.

పృచ్ఛ :— కాటన్నాయఁ డనునొకధనికుఁ డుండెడివాఁడు. ఆతఁడు విద్యాగంధశూన్యుఁడు. కాని తనపేరు పలుమార్లు చెప్పుచుఁ బొగడువారి నతఁడు ధనరాసులతో ముంచివేయును. ఈగుట్టు తెలియనికవులు గాయకులు మున్నగువా రతనియొద్ద నొక కానిగూడఁ దేలేక "లోభి"యని వానిని నిందింపఁజొచ్చిరి మేధావి యొకఁ డీరహస్యము నెట్లో కనిపట్టి యాతనియొద్ద కేఁగి తాళము వేయుచు నీపాద మునే రకరకములుగా గానముచేసి గొప్పసత్కారము నొంది వచ్చెను. ఇది యీసమస్యలోఁ గలభావము.

శాస్త్రి :— ఈయనంతసృష్టిలో మీకాటన్నాయనివంటివారే మఱి మువ్వురు గలరు. వారు చంచన్నాయఁడు, తాతన్నాయఁడు, పాపన్నాయఁడు అనువారు. మీమేధావికన్న మామేధావుల లధికులు. కావుననే వ్యంగ్యరీతిని ఛీ, థూ అని వారిమాఢ్యమును నిందించుచునే వారిచే సత్కృతు లైనారు.

పృచ్ఛ :— అవధానిగారూ! మీరు అపారమేధాసంపన్నులు. అన్నివిధ ములల నాఱితేఱినవారు. కనుకనే మాకు నోరు విప్పుటకుఁగూడ నవకాశము లేకుండఁ

జేసినారు. నే నీసమస్య ననేకుల కవధానములలో నిచ్చియున్నాను. కాని యొక్క రును బూరింప లేదు. అవలీలగా మీరు పూరించితిరి. మీకు నానమోవాకములు.

## 1926—అన్నవరము—వాక్సిద్ధి.

అన్నవరమున శ్రీ సత్యనారాయణస్వామికల్యాణోత్సవములలో శ్రీ శాస్త్రిగారు శతావధాని, శ్రీ చెళ్లపిళ్లవేంకటశాస్త్రిగారు, కవిసార్వభౌమ, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు సభ్యత్ములై యున్నసభయం 'దష్టావధాన' మొనర్చిరి. అష్టావధాన మనుపేరేగాని పృచ్ఛకు లిరువదిమందికిఁ బైఁగాఁ గలరు. సాధారణముగా శ్రీ శాస్త్రిగారి యష్టావధానము లన్నియు నిట్లే జరుగుచు వచ్చినవి. సభ ప్రారంభమైనవెంటనే పెద్దపెద్దమేఘము లాకస మంతయు నలముకొనినవి. దిక్కులఁ జీకటులు గ్రమ్మినవి. ఆచ్ఛాదనము లేనియాచోట సభ యిఁక సాగ దని యందఱకును దోఁచెను. అప్పుడు

చ. ప్రళయ మనఁ మహాజలధరంబులు పైకొని చిమ్మఁజీకటుల్
గాలిపెడి దిక్కులన్; దలఁచుకొన్నవధానము విఘ్న మొందఁగాఁ
గలుగునవస్థ యెన్నఁడును గాన భవత్కృపచేత; నేఁ డిటుల్
గలిగెను; మంచిచెడ్డలను గైకొనుదానవు నీవె శాంకరీ!

అని యొకపద్యము నాశువుగాఁ జెప్పిరి. వెంటనే యత్యద్భుతముగా నెక్కడి మేఘము లక్కడ శమించిపోయినవి. అందఱును * వీరివాక్సిద్ధికి మెచ్చుకొనిరి. అవధానము చక్కఁగా సాగినది. ఈయవధానమునఁ జెప్పినయపార మగు నాశుకవితను ధారణాపటిమను అధ్యక్షు లిరువురు మిగులఁ బ్రశంసించిరి దేవాలయధర్మకర్తలు శ్రీరాజా, ఇనుగంటి రాజగోపాలరామసూర్యప్రకాశ రాయణింగారు నూటాలు లిచ్చి సత్కరించిరి.

---

* శ్రీశాస్త్రిగారి వాక్సిద్ధి కనేకనిదర్శనములు గలవు. అందుండి * మఱి యొక్కటి మాత్ర ముదాహరింతును. లక్షరూప్యములు వెలచేయు శ్రీగద్వాల మహారాజుగారివజ్రపుటుంగరములు మూఁడు పరిచారకు లెవరో యపహరించిరి. అప్పుడు మహారాజీసంగతి తెలుపఁగా శ్రీశాస్త్రిగారు

ఉ. ఎక్కడ కేఁగు నుంగరము? లెవ్వఁడు తీసి భరింపఁ గల్గు? నీ
ప్రక్కకు వచ్చు నీరయిదురాత్రులలోపల; సంశయంబు నీ
కక్కఱ లేదు; రాణి యెడ నా తెరువాటుబికారిశీర్షముల్
వ్రక్కలొనర్తు నిక్కముగ నాకవితాకరవాలధారచేన్.

అని యాశువుగా నొక్కపద్యము చెప్పిరి. సరిగా గడువులోపలనే యుంగరములు దొరకినవి. మహారాజీసంఘటనకు మిక్కిలి యాశ్చర్యపడిరి.

## శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువందితపదవి

పిమ్మట శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుసంపాదకులు కళాప్రపూర్ణ శ్రీజయంతి రామయ్యపంతులుగారియాహ్వానము ననుసరించి శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు కార్యాలయమున 1926 సం॥ నవంబరునెలలోఁ బండితులుగాఁ జేరిరి. ఇది మొదలు భాషావిమర్శనము హెచ్చినది. అవధానప్రచారము తగ్గినది ఐనను అనువత్సర మొకనెల సెలవుపెట్టి యవధానప్రచారము సాగించుచునే యుండిరి. మఱియు దసరాసెలవులలో నేదే నొకసంస్థానమున కేఁగుచునే యుండిరి. అందువలననే యవసానసమయమువఱకును వీరి కాశుకవితావధానశక్తి యిను మంతయుఁ గొఱ వడలేదు.

## 1927

అన్నవరమున (16-5-1927) ప్రభవవైశాఖశుద్ధపూర్ణిమకు జరిగినకవితా పరీక్షలో సంస్కృతమున సువర్ణపదకబహుమాన మందుకొనిరి.

## 1928

అన్నవరమున (4-5-1928) విభవవైశాఖపూర్ణిమకు జరిగినకవితాపరీక్షలో నాంధ్రమున సువర్ణపదకబహుమానము కైకొనిరి.

## బొ బ్బి లి స ం స్థా న ము

బొబ్బిలిసంస్థానమున శ్రీరాజా, శ్వేతాచలపతి రామకృష్ణమహీజానియొద్ద విభవశారదనవరాత్రములలో (20-10-1928) అష్టావధానసభ చేసి నూటపదార్లు సేలువలు కైకొనిరి. వదాన్యులగు శ్రీరాజుగారు శ్రీశాస్త్రిగారికవితామృతప్రవాహమున నోలలాడి నూటపదాఱులు వార్షికముగా నిచ్చెద మని సెలవిచ్చిరి. అట్లే యీశ్వరవత్సరాంతమువఱకును (1928 మొదలు 1937 వఱకు) వార్షికముగా శ్రీరాజుగారు నూటపదాఱు లొసఁగిరి.

## వి జ య న గ ర ము

శ్రీకాంచీకామకోటిపీఠాధిపతులసన్నిధియం దష్టావధానము గావించి యాశీః ప్రశంసామేదురము లగుశ్రీవారిబహుమతులు పడసిరి.

## 1932

## కొ చ్చి స ం స్థా న ము

శ్రీశాస్త్రిగారు కొచ్చిసంస్థానమున కరిగిరి. అట మూఁడుశాస్త్రములలో మహావిద్వాంసుఁడు కొచ్చియువరాజు నగుశ్రీకేరళవర్మసన్నిధియందుఁ దమవృత్తాంతము నిట్లు విన్నవించిరి.

శ్లో. శ్రుణు కేరళవర్మవిభో!, కించి ద్విని వేదయామి మమ గాథామ్।
నామ్నా చిదంబరోఽహం, వశ్యా కవితైవ మమ హి సర్వస్వమ్.

శ్లో. గౌరవం క్వచి దగౌరవం క్వచి, ద్భూషణం క్వచన దూషణం క్వచిత్।
సర్వతః పరిపదుత్సుకాత్మనా, నిర్విచార మనుభూయతే మయా.

శ్లో. కదాచి దత్యుత్తమసౌధవాసైః, కదాచి దత్యల్పకుటీరవాసైః।
గజాశ్వయానేషు గతైః కదాచి, ద్భ్రాంతి క్షుణాః పాదగతైః కదాచిత్.

శ్లో. రాజాధిరాజసాష్టాంగ, ప్రణామై రర్చనం క్వచిత్।
ద్వారేషు ధనినాం భూయో, భటై రుచ్చాటనం క్వచిత్.

శ్లో. సమర్పితైష్షడ్రసభోజనైః క్వచిత్, క్షుధాఽనవాప్తాభ్యవహారయా క్వచిత్।
ప్రబోధయంతిస్వయమేవ మేక్షణాః, ప్రభో! విచిత్రాం సుఖదుఃఖయోర్దశామ్.

శ్లో. అత్యుత్కటేషు సుఖదుఃఖపరంపరాయాః
ప్రాప్తేష్వపి ప్రచలనేషు బహుప్రకారైః।
భూయః ప్రచారయతి హన్త శరీరయంత్రే
ప్రాణానిలం సుకవితాఽమృతవల్లరీ మే.

వెంటనే 30–6–1932 తేదిని యువరాజు అష్టావధానసభ చేయించి సత్కరించెను. పిమ్మట 2–7–1932 తేదిని కొచ్చిమహారాజు శ్రీరామవర్మసన్నిధియం దష్టావధానసభ కావించి సువర్ణపదకము నూటపదార్లును బహుమానముగాఁ బడసిరి. తరువాత మహారాజ్ఞి శ్రీమతి కుంజక్కావాదేవి 6–7–1932 స్వయముగా నొకయష్టావధానసభ చేయించి శాస్త్రిగారిని సత్కరించెను. తిరువాన్కూరు బాలికా పాఠశాలలో వలె నిటఁ గూడఁ గేవలము స్త్రీలే పృచ్ఛకురాండ్రు. కేరళ దేశమున సంస్కృతభాషాపాండితీభూషిత లగుస్త్రీలు పలువురు నేడున్నైతము గలరఁట! పై విధముగాఁ గొచ్చిసంస్థానమున మూఁడు సభలు జరిగినవి. ఈసమయమునఁ గేరళ దేశీయమాంత్రికులలోఁ బలువురతో సంభాషించి యనేకములు మంత్రశాస్త్ర విషయములు శ్రీశాస్త్రిగారు సేకరించిరి.

## జయపురసంస్థానము

(1–10–1932) జయపురసంస్థానమున కేఁగి శ్రీవిక్రమదేవవర్మమహారాజ సన్నిధానమునందష్టావధానసభ మహోజ్జ్వలముగాఁ గావించి నూటపదాఱులు వార్షికముగాఁబడసిరి. ఈవార్షికము 1936 సంవత్సరము దనుక సాగినది.

## 1935–శివగంగ

శ్రీశాస్త్రిగారు 12–8–1935 తేదిని శివగంగామఠాధిపతిసన్నిధియం దష్టావధాన మొనర్చిరి. దానికిఁ బరితోష మందినశ్రీమదభినవగంగాధరసుబ్రహ్మణ్య

భారతీస్వామిగారు ప్రశస్తసత్కారము గావించిరి. బహుమానసమయమునఁ జెప్పిన యీశ్లోక మొక్కటి గమనింపఁదగినది.

శ్లో. అష్టావధాన మవలోక్య భవాన్ మదీయం
మధ్యేసభం య దకిర స్మయి తే కటాక్షాన్।
స్వామి న్నతః పరతరం బహుమాన మన్య
దస్మాదృశాం కవయతాం కిము వాంఛనీయమ్.

## రామేశ్వరము

పిమ్మట సకుటుంబముగా రామేశ్వరయాత్ర కేఁగిరి. అటఁ దీర్థయాత్రతో పాటు కవితాయాత్రగూడఁ గొంత సాగించిరి. అచ్చట దేవీకల్యాణమండపమున వరుసగా రెండుదినములు రెండష్టావధానసభలు జరిగినవి. తైర్థికులు పౌరులు పలువు రాసభలకు వచ్చి మిగుల నానందించిరి. ఈవిధముగా శాస్త్రిగారు దర్భాంగ మొదలు రామేశ్వరమువఱకును గలయావద్భారతదేశమును దమకవితాసుధా వాహినిలో నోలలాడించిరి. ఈవిషయమునే

సీ. తిరుపతివేంకటేశ్వరసుధీవరు లవ
ధానాశుకవితాప్రధానగురువు
లాంధ్రదేశమ్మునం దఖిలస్థలంబుల
నీరాజనం బిచ్చినారు నీకు
వారిమార్గమునందె వర్తించినమహాత్ముఁ
డస్మదగ్రజుఁడు చిదంబరకవి
యాంధ్రపద్మపురాణ మతిహృద్యతమశైలి
వెలయించినట్టికవిప్రకాండుఁ
డాసేతుశీతనగావనీనాయకు
లిచ్చినకాన్క లందిచ్చినాఁడు.

అని యాంధ్రసాహితీయోషకు విన్నవించి యున్నాను.

## 1937 - మైసూరు

మైసూరుపురమున ధర్మాధికారి,ఆస్థానమహావిద్వాన్,కుణిగల్ రామశాస్త్రి గారిభవనమునం దష్టావధానసభ 21-6-1937 తేదిని విద్వత్ప్రమోదావహమై ప్రవర్తిల్లినది.

## 1938 — సికింద్రాబాదు

సికింద్రాబాదునగరమున 18-2-1938 అష్టావధానసభ సభ్యుల కానందము నాపాదించినది.

## 1940 - చెన్నపురి

చెన్నపురియం దష్టావధానాశుకవితాసభ (2–6–1940) జరిగినది. సువర్ణ పదకాదిబహుసూనములు కవిస్తుతులు చేకూరినవి. మచ్చున కొక్కటి.

మ. కవు లెవ్వారలొ యెందఱో గలరు, వీరల్ సంస్కృతాంధ్రోరువై
భవముల్ నవ్యమరందబిందుచయసంపాతంబులై తోఁచున
త్కవిమూర్ధన్యు భవాదృశుల్ భువిఁ గనంగాఁ గల్గునే? కావ్యకా
ర్యవిశేషజ్ఞ! చిదంబరార్య! కవిధీరంమన్యభూభృత్పవీ!

దోమా, వేంకటస్వామిగుప్త. శతావధాని.

## కాకినాడ

పీఠికాపుర రాజకళాశాలలో జరిగిన "యాంధ్రాభ్యుదయోత్సవము" లలో నత్యద్భుతాశుకవితాసభ సాగినది. అధ్యక్షులు శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు. నాఁటియాశువు నధ్యక్షు లతివేలముగాఁ గొనియాడిరి.

## 1941

వేంకటగిరిసంస్థానమున రాజా, శ్రీ వేంకటరాజగోపాలకృష్ణయాచేంద్రులసన్నిధియం దష్టావధానసభ చేసి నూటపదార్లచే సత్కృతులైరి.

మే నెలలో శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువిద్వత్పదవిని బరిత్యజించిరి.

## 1942

మార్చి నెలలో సకుటుంబముగాఁ గాశిగయాప్రయాగములు సేవించిరి. అప్పుడే పద్మపురాణము నాంధ్రీకరించి శ్రీ కాశీవిశ్వేశ్వరునకుఁ గృతియిచ్చుటకు సంకల్పించిరి. ఈసత్సంకల్ప మాదేవదేవునికృపచే నిర్విఘ్నముగను సమగ్రముగను 1951 మార్చి నెలనాఁటికి నెఱవేఱినది.

## 1942

జూన్ నెలలో వేంకటగిరిసంస్థానమున కేఁగి రాజా, శ్రీ సర్వజ్ఞకుమారకృష్ణయాచేంద్రులసన్నిధియం దష్టావధానసభ యత్యాశుకవితాసముపబృంహితముగా సాగించిరి.

శ్రీ రాజుగారు, తత్సోదరులు రాజా, శ్రీ వేంకటరాజగోపాలకృష్ణయాచేంద్రులవారును మిగుల నానందముతో నూటపదార్లు సత్కరించి, తమయాస్థానవిద్వత్పదవి నలంకరింపఁ గోరిరి. ఇది శ్రీ కాశీవిశ్వనాథుని ప్రేరణముగా భావించి శ్రీ శాస్త్రిగారు పద్మపురాణాంధ్రీకరణకార్యనిర్వహణమునకై యటఁ బ్రవేశించిరి. ఆసందర్భమునఁ జెప్పినపద్యములనుండి రెండుమాత్ర ముదాహరింతుము.

చ. కవి యనువాని కెల్ల నిది కాఁదగుకార్యము గాదు సంస్కృతాం
ధ్రవిదుఁడు లోకవేత్తయు గుణజ్ఞుఁడు గ్రంథవిమర్శకుండు ప
ట్టు విడువనట్టివాఁడును గడుంగడు విశ్రుతిఁ గోరువాఁడు స
త్కవి యగువాఁ డొకానొకఁడు గాక, తదన్యుఁడు దీని కర్హుఁడే?
చ. అవనితలాధినాథ! వినుమా విభవంబు లశాశ్వతంబు లీ
భువనమునందు నెప్పుడును బోనిది యొక్కయశంబ దానికై
కవులను నొద్దఁ జేర్చికొని గ్రంథములన్ రచియింపఁజేసి భూ
ధవులు స్వనామధేయమును స్థాపనముం బొనరింతు రుర్వరన్.

వేంకటగిరిసంస్థానమునఁ బ్రవేశించినదాది శాస్త్రిగారు ప్రధానముగాఁ బురాణాంధ్రీకరణకార్యమునే కావింపఁ జొచ్చిరి. ఎప్పుడు వ్రాసినచిత్తుప్రతి నప్పుడే యచ్చువేయించుట కనువగునట్లు వ్రాయించు చుండిరి. ఈవిధముగా వేంకటగిరి సంస్థానమున 1942 ఆగస్టునెల మొదలు 1948 ఆగస్టునెలవఱకు ఆది, భూమి, బ్రహ్మ, పాతాళఖండములు నాలుగును సమగ్రముగా నాంధ్రీకరించిరి.

## 1943 వేంకటగిరి

రాజా, శ్రీవేంకటరాజగోపాలకృష్ణయాచభూపాలపుత్త్రికావివాహసమయమునం దష్టావధానసభ చేసి శ్రీశాస్త్రిగారు నూటపదాఱులు సేలువలు సత్కారముగాఁ బడసిరి.

## 1944 సికింద్రాబాదు

సికింద్రాబాదు నగరమున ఫిబ్రవరినెలలో రెం డష్టావధానసభలు నొక యాశుకవితాసభయు విద్వత్కవులసన్నుతులు మిన్ను ముట్ట సాగినవి. అర్థసత్కారములు చేకూరినవి.

## 1945

అన్నవరము శ్రీసత్యనారాయణస్వామిసన్నిధియందు వైశాఖపూర్ణిమ నాఁడు తమయాంధ్రపద్మపురాణమునందలికొన్నిఘట్టములు వినిచి సభ్యుల నానందతుందిలహృదయారవిందులఁ గావించిరి. దేవాలయధర్మకర్తలు రాజా, శ్రీఇనుగంటి వేంకటరామసూర్యప్రకాశరాయణింగారు సువర్ణకుండలములు సమర్పించి నూటపదాఱులు వార్షికముగా నేర్పఱచిరి. ఈవార్షికము 1950 వఱకును సాగినది.

## 1948

సెప్టెంబరునెలలో శ్రీశాస్త్రిగారు వేంకటగిరిసంస్థానమును వదలవలసి వచ్చినది. అప్పటికి శ్రీమదాంధ్రపద్మపురాణమున – ఆది, భూమి, బ్రహ్మ, పాతాళ ఖండము లాంధ్రీకృతము లైనవి. ఇది మొత్తముగ్రంథములో సగము మాత్రమే. ఇఁక సృష్టిఖండము, ఉత్తరఖండము అనురెండుఖండము లాంధ్రీకరింపఁబడవలసి

యున్నవి. ఈరెండు ఖండములును మిగుల బెద్దవి. కావుననే యివి రెండును సగము గ్రంథము. ఐనను తలపెట్టినకార్యమును తుదముట్టింపక వదలని శ్రీశాస్త్రిగారు తక్కినగ్రంథమును శీఘ్రముగా రచింప నెంచి తదనుకూలసాహాయ్యమునకై నెల్లూరుపురమున కేతెంచిరి. శ్రీశాస్త్రిగారు సంసారనిర్వహణభార మంతయుం దమమూంపుననే భరించుటచే యశోధనము మాత్రమే వారికి మిగిలినది. అందుచే నితరులసాయము కోరవలసివచ్చినది. పురమందిరమునం గవిసార్వభౌమ, శ్రీ శ్రీపాద, కృష్ణమూర్తిశాస్త్రిగారియాధ్యక్ష్యమున నొకసభ జరిగినది. అందుం బద్మపురాణము నందలికొన్నిఘట్టములు చదివి వినిపించిరి. న్యాయవాదిశేఖరులు, సంస్కృతాంధ్రాంగ్ల భాషాకోవిదులు, ధార్మికవతంసులు, శ్రీమంతులు నగుబ్రహ్మశ్రీఇంగువ, శ్రీకృష్ణయ్య గారు (B. A., B. L.) పురాణరచన ముగియువఱకును శ్రీశాస్త్రిగారికుటుంబమునకుం గావలసినప్రధానద్రవ్యము (బియ్యము) నిచ్చెద మని యాసభలోం బ్రకటించి తమ జన్మస్థాన మగుకరేడుగ్రామమునం దమయింటనే నివసించి పురాణశేషమును రచి యింపం గోరిరి. దానికి శ్రీశాస్త్రిగారు "వల్లె" యని యటం బ్రవేశించిరి. పిమ్మట నితరవ్యయములకై కొందఱు భాషాభిమానులు శ్రీశాస్త్రిగారికి సహాయపడిరి.

1. శ్రీతూములూరి,శివరామయ్యగారు. B. A., B. L. నెల్లూరు. రు. 116/-
2. శ్రీచివుకుల,మార్కొండయ్యగారు. B. A., B. L. నెల్లూరు. ,,
3 శ్రీధరణికోట,సుబ్రహ్మణ్యముగారు. కరేడు. ,,
4. శ్రీ దేవరపల్లి, వేంకటకృష్ణారెడ్డిగారు. ఉలవపాడు ,,
5. శ్రీవాకా,సుబ్బారెడ్డిగారు. కరేడు. ,,
6. కీ. శే. శ్రీరేబాల,పట్టాభిరామిరెడ్డిగారు. నెల్లూరు. 100/-
7. శ్రీతిక్కవరపు,రామిరెడ్డిగారు. నెల్లూరు. ,,
8. శ్రీబెజవాడ,రామచంద్రారెడ్డిగారు. బుచ్చిరెడ్డిపాలెము. 58/-
9. శ్రీపులుగిండ్ల, వేంకటకృష్ణయ్యగారు. B. A., B. L. నెల్లూరు. ,,

శ్రీశాస్త్రిగారి ట్లుదారులతోడ్పాటుతోం గరేడుగ్రామమున 14-11-1948 తేదిని బ్రవేశించి తదాది రాత్రిందివము శ్రమించి 15-3-1951 నాంటికి "శ్రీమదాంధ్ర పద్మపురాణ" రచనను ముగించుకొని పునఃపరిశీలనము గూడం గావించుకొని యట నుండి మరల నెల్లూరుపురమున కేతెంచిరి. కాని, శరీరనిరపేక్ష మగుదీక్షతో నతి వేగముగా నహోరాత్రములు గార్యమును సాగించుటచే శ్రీశాస్త్రిగారియారోగ్యము చెడినది.

## అనుగ్రహము

శ్రీశాస్త్రిగారు రుగ్ణులై సింహపురమున నుండంగా నొకనాండు స్వప్నమున సరస్వతీదేవి దర్శన మిచ్చి "శ్రీమదాంధ్రపద్మపురాణము నా కత్యంత మామో

దము గొల్పిన''దని సెలవిచ్చి తన చేత నున్న మల్లెపూలదండను సభక్తికముగా నొగ్గిన శాస్త్రిగారిదోసిట నునిచి యంతర్ధాన మయ్యెను. ఈవిషయము నంతను మఱునాఁ డుదయముననే మాతోఁ జెప్పి తమశ్రమ మిప్పటికి సార్థకమైన దని శ్రీశాస్త్రి పాదులు మిగుల నానందించిరి. అప్పు డప్పుడు శ్రీశాస్త్రిచరణులకు వాగ్దేవి యిట్లు స్వప్నమున దర్శన మిచ్చుచుండుటయు నాయావిషయములు తెలుపుచుండుటయు జరుగుచుండెడిది.

## కృతిసమర్పణము

శ్రీశాస్త్రిగారు తమగ్రంథము లెల్ల భగవదంకితములు గావించి జన్మము సఫలం బొనర్చుకొనిరి. మఱియు వారికడపటికృతి యగుపద్మపురాణముకృతిప్రదాన మున నింకొకవిశేషము సైతము గల దనియు, అది మహాభాగ్య మనియు వారే వచించియున్నారు.

క. హరిహృదయం బఁట కృతి; కృతి,పరిగ్రహీత యవిముక్తపతి యగువిశ్వే
శ్వరుఁ డఁట; కృతిదాత చిదం,బరుఁ డఁట;యిది యింతయంతభాగ్యమె తలఁపన్?
ఆం. పద్మ. ఆది. ౨౫.

[కృతి = పద్మపురాణము. హరిహృదయము = పురాణరూపుఁ డగువిష్ణువునకు హృదయము. (చూ. ఆం. పద్మ. ఆది ౮౨౮) అనఁగా శివుఁడు అని భావము. ''శివస్య హృదయం విష్ణు, ర్విష్ణోశ్చ హృదయగ్ం శివః'' అని శ్రుతి. ఇఁకఁ గృతిదాతృప్రతిగ్రహీతలు గూడ శివులే. ఈవిధముగా - దేయదాతృప్రతిగ్రహీతల కేకత్వము (అనఁగా శివత్వము) ఘటిల్లుట తమమహాభాగ్య మని కవిహృదయము.]

## నిర్యాణము

శ్రీచిదంబరశాస్త్రిగారు 1951 అక్టోబరు నెలలో సింహపురినుండి తెనాలి కేఁగి యచ్చటనే (11-12-1951) ఖరసంవత్సరమార్గశీర్షశుక్లచతుర్దశీకృత్తికా నక్షత్రయుక్తభౌమవాసరమున రాత్రి 8 గంటలకు ''శివోఽహం'' మ్మని భావించుచు శివునితో నైక్యము నొందిరి.

## కైమోడ్పు

ఉ. నీమహిమం బచింత్యము; గణింప నశక్యము నీకవిత్వశో
భామహిమం; బుదాత్తము భవత్కృతి; తావకపాత్రపోషణ
శ్రీమహిమం బమేయము; విశిష్టము నీయవధానవైభవం
బోమహిమాకరా! తెలుపు మోపినభంగి; ననుగ్రహింపుమీ.

విద్వాన్, పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి
విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి

శతావధాని శ్రీపిసుపాటి చిదంబరశాస్త్రిగారి గ్రంథములు

## సంస్కృతగ్రంథములు

1. పంచాయతనపంచశతి.

2. కృష్ణరాజాభ్యుదయము.

3. అవధానాదర్శము. (విద్వాన్, పి.సుబ్రహ్మణ్యశాస్త్రికృతభావబోధినీవ్యాఖ్యానసహితము)

4. రాజధర్మము. (అర్థశాస్త్రకావ్యము-విద్వాన్, పి. విశ్వేశ్వరశాస్త్రికృతజయవ్యాఖ్యాసంవలితము.) (అముద్రితము)

5. అష్టకకదంబము. (63 అష్టకములు) ,,

6. శివసూత్రసంగ్రహము. ,,

7. తృణభావబోధిని. ("తృణ మంతరతః కృత్వా బభాషే జనకాత్మజా" అను వాల్మీకి రామాయణవాక్యమునకు భావవివరణము.) ,,

8. దేశయాత్రా చరిత్రము. ,,

9. మహీశూరపురాభ్యుదయచంపువు ,,

## ఆంధ్రగ్రంథములు

### పురాణము

10. శ్రీమదాంధ్ర పద్మపురాణము. (4 సంపుటములు)

### ప్రబంధములు

11. హైమవతీవిలాసము.
12. సుబ్రహ్మణ్యేశ్వరీయము.
13. కపోత కిరాతము.
14. కన్యకాంబాచరిత్రము.

### నాటకములు

15. శ్రీ రామాంజనేయము.
16. శ్రీ కృష్ణసందేశము.
17. పంచవటీయము. (అముద్రితము)
18. ప్రచండగాధేయము. ,,
19. మోహినీ రుక్మాంగదము. ,,

### గ్రంథలక్షణము

20. అర్ధానుస్వారశకటరేఫనిర్ణయము. ,, (సోదాహరణము—అసంపూర్ణము.)

### శతకములు, తదితరములు

21. దత్తాత్రేయ శతకము.

22. సీతారామ శతకము.

23. దారుణ శతకము.

24. రాజరాజేశ్వరీ శతకము.

25. పాయకరావుపేటసీతారామశతకము.

26. రాజసభావిహారము. (అముద్రితము) (ఇందు-దర్భాంగ్, కాశి, మైసూరు, అనంతశయనము, కొచ్చి, శృంగేరి, గద్వాల, వేంకటగిరి, పిఠాపురము, బొబ్బిలి, జయపురము మున్నగు సంస్థానములలోని ప్రభువుగుఱించి 1910 నుండి 1950 వఱకు సంస్కృతాంధ్రభాషలలోఁ జెప్పిన పద్యములు, అచ్చటిసభావృత్తాంతములు, అచ్చటి పండితులు, ప్రభువులు నొసంగినప్రశంసాపత్రములు బిరుదములు మున్నగునవి గలవు)

27. శృంగారభూషణము. ('శృంగార తిలకము' అనుసంస్కృతగ్రంథమునకు ఆంధ్రీకరణము)

28. గోవిందగీతము.

29. భారతీయప్రబోధము.

### గద్య గ్రంథములు

30. షోడశమహారాజచరిత్రము.
31. మహాభారతనీతికథాసంగ్రహము.
32. సప్తర్షిచరిత్రము. (అముద్రితము)

### అవధానములు

33. పీఠికాపురసంస్థాన శతావధానము. (సంపూర్ణము)
34. నవాబుపేటసంస్థానశతావధానము.
35. బెజవాడ శతావధానము.
36. ఒంగోలు శతావధానము.
37. గద్వాలసంస్థాన శతావధానము. (అముద్రితము)
38. ఆశుకవితావధానసంగ్రహము. ,,

## ప్రశంసాపత్త్రిములు

శ్లో. మహాత స్తమసః పారే, పురుషం హ్యాతి తేజసమ్।
యం జ్ఞాత్వా మృత్యు మత్యేతి, తస్మై జ్ఞేయాత్మనే నమః.

శ్రీయుక్త! పండిత! చిదంబరశాస్త్రిమహాశయ! మహీశూరమహారాజాస్థాన శతావధానిన్!

జ్ఞానస్య జననీ విద్యా. అవిద్యారూపం తమో యయా నిరస్యతే సా విద్యా. పారమార్థికం చ తస్యా విద్యాయాః స్వరూపం సంస్కృతాం దేవగిరం ద్వారీకృత్యైవ జగతి ప్రాకాశ్యత. సాంప్రత మధఃపతితాయా మార్యజాతౌ సద్విద్యాం పునః ప్రచారాజ్ఞానోద్యమరాహిత్యాదిదోషజాతం చ దూరీకృత్య యావ దస్యాం ధర్మశక్తి ర్న పున రావిర్భావ్యతే తావ దస్యా జీవనరక్షా కర్తుం న శక్యతే. ఆదిశిక్షితాయా మాదిమననశీలాయా మాదివిజ్ఞానవిది జగద్గురుత్వేనాభిమతాయా మార్యజాతౌ సద్విద్యాయాః పున ర్వికాసార్థం సనాతనధర్మస్య పున రభ్యుదయసాధనపురస్సరం జగత్కల్యాణకారిణ్యా ధర్మశక్తే రావిర్భావార్థం చ సకలధర్మసభాధర్మాలయానాం సమష్టిరూపాయాః శ్రీభారతధర్మమహామండలాఖ్యాయా విరాడ్ధర్మసభాయాః స్థాపన మభూత్. అత్ర యే కేచిత్ శ్రీసరస్వతీదేవ్యాః కృపాస్పదీభూతాః సంస్కృతజ్ఞా విద్వాంసో విద్యోన్నతౌ రతా స్తే సర్వే ప్యస్యాః స్వజాతీయవిరాడ్ధర్మసభాయాః ప్రేమభాజనా నీతి భవత స్సంస్కృతవిద్యాయాం యోగ్యతయా ప్రసన్నేయం స్వజాతీయధర్మమహాసభా సద్విద్యాయాః సమ్మానవృద్ధ్యర్థం భవన్తం కావ్యకళానిధి విద్యోపాధిరూపాలంకారేణాలంకృత్య పరమం ప్రమోద మశ్నుతే. సర్వజ్ఞానమయస్య సర్వశక్తిమతః పరమేశ్వరస్య చరణకమలయో స్సవినయం ప్రార్థయతే చ భవత ఆధ్యాత్మిక్యున్నతి ర్భూయాదితి శమ్.

శ్రీకాశీధామ్ని శ్రీభారతధర్మమహామండలప్రధానకార్యాలయః
తిథౌ కృష్ణపక్షే మాఘమాసే 1978వర్షే
కవీంద్రనారాయణసింహః.
ప్రధానాధ్యక్షః.

శ్రీ రమేశ్వరసింహః
మహారాజాధిరాజ, మిథిలేశ, జీ. సీ. ఆ. ఈ. ఈ. కే. బీ. ఈ. సభాపతిః
శ్రీభారతధర్మమహామండలస్య.

---

ప్రశంసాపత్త్రిము లనేకములు గలవు. అందుండి కొలఁదిగా నిటఁ బ్రకటించుచున్నారము. తక్కినవి "రాజసభావిహారము"నఁ బ్రకటింపఁబడును.

శ్లో. శ్రీమంతౌ తౌ హయముఖ,లక్ష్మీనారాయణౌ శ్రియం తనుతామ్।
రాజయువరాజభూతౌ,పరకాలాస్థానరాజ్యసీమని యౌ.

శ్రీమద్వేదమార్గప్రతిష్ఠాపనాచార్యైః పరమహంసపరివ్రాజకాచార్యైః శ్రీమత్కవితార్కికకంఠీరవచరణనలినయుగలవిన్యస్తాత్మభరైః శ్రీమద్రామానుజసిద్ధాంతనిర్ధారణసార్వభౌమైః శ్రీమన్మహీశూరశ్రీకృష్ణరాజేంద్రసార్వభౌమసంతతిపరమాచార్యైః శ్రీమత్పరకాలసంయమివరాస్థానమూర్ధాభిషిక్తైః శ్రీవాగీశబ్రహ్మతంత్రపరకాలస్వామిభిః కవివర్యే శ్రీమచ్చిదంబరశాస్త్రి ణ్యనేకనారాయణస్మరణపూర్వక మనుగృహీతం సప్రశస్తి మంగళాశాసనశ్రీముఖపత్త్రమ్.

రౌద్రివత్సరాశ్వినకృష్ణైకాదశ్యాం శ్రీహయగ్రీవలక్ష్మీనారాయణాస్థానా మస్మత్సమక్షం నిర్వర్తితాయా మధికారిభి ర్విద్వన్నివహైశ్చ నిరంతరాయాం పరిషది యథావిద్వదభిలాషం ఛందోవృత్తాలంకృతిభి రేకదా నిర్దిష్టా న్విషయాన్ శ్లోకరూపేణ ప్రాథమికపాదమాత్ర మే వోత్తరయన్ ద్వైతీయీకతార్తీయీకతురీయావృత్త్యా వపృష్ట్యైవ తత్తద్విషయా నవశిష్టపాదత్రయేణ స్వప్రతిభాబలేన వైచిత్ర్యవ్యంగ్యభంగ్యాదీ నత్యజన్నేవ కావ్యగుణాన్ ఝటితి వదమానః పారిషద్యానా మస్మాకం చాంతరంగం విస్మయహర్షజలనిధౌ న్యమజ్జయ త్కవి రయం స్వవిరచితేన శతావధానేన. ఆశాస్మహే చైన మితోఽపి భగవాన్ శ్రీహయాననః శ్రేయసా భూయసా సంయునక్త్వితి. నారాయణస్మృతిః. శ్రీః.

---

Mahamahopadhyaya
T. GANAPAITSASTRI, HON. M. R. A. S.
*Curator of Oriental Literature.*
**TRAVANCORE STATE.**

ఆంధ్రదేశాంతర్గతవంగోలుపురాభిజన ఏష శ్రీచిదంబరపండిత ఇహాద్య సమ్మేళితే విద్వత్సమాజే ఽష్టావధానవిద్యాపాటవం తథా నిపుణం చ చమత్కృతం చ ప్రకాశితవాన్, యథా శతావధానిత్వప్రథానుగుణ మవధానశత మప్యనేనేషత్కర మితి సామాజికై రమాని. లోకోత్తరాయా నామాస్య మేధాయా అవధేయే ష్వర్థే ష్వస్ఖలిత మసకృత్ పర్యాయావగాహన మనవద్యసరసోచితనానాశ్లోకావిర్భావనసుభగం విస్మయనీయ మస్మాభి రుపలబ్ధమ్. శ్రీమాననన్తశయనమహారాజశ్చ మహామహిమా శ్రీరామవర్మా శతావధానికశిఖామణి మేనం కనకవలయోత్తమవితరణాదినా బహ్వమన్యత.

**Trivandrum**
**2-10-1922**

తరువై, గణపతిశాస్త్రీ
మహామహోపాధ్యాయః

శ్లో. శ్రీమతా విద్వదగ్రణ్యా, చిదంబరమనీషిణా।
శతావధానం వ్యరచి, ప్రాచ్యకోశాలయే ఒధునా.
నిర్దిష్టనృత్తవిషయాన్, బహూనాం సర్వతోముఖాన్।
తాం స్తాన్ ప్రశ్నాన్ ఝటి త్యేవ, సము త్తరితవాన్ స్వయమ్.

శ్లాఘ్యా కిలాశుకవితా, తత్రాఽపి సరళా భృశమ్।
అవధానేన సహితా, కం వా న పరితోషయేత్.
గైర్వాణ్యా మాంధ్రభాషాయా, మపి ప్రావీణ్య మద్భుతమ్।
ధారణాశ క్తి మత్యంతం. విమృశ్య ముద మాప్నుమః.
ఇత్థం మహీశూరపురీ, ప్రాచ్యకోశాలయస్థితైః।
ప్రశ స్తిపత్త్రికా దత్తా, విద్వద్భి ర్గుణలోలుపైః.

మైసూరు
28-11-1920

R. శ్యా మ శా స్త్రీ. B. A.
Curator,
Govt. Oriental Library, Mysore.

కే.రంగస్వామిఅయ్యంగార్.తర్కవిద్వాన్, లైబ్రేరియన్.
జి. వేంకటనరసింహశాస్త్రీ. సాహిత్య, ధర్మశాస్త్ర, వేదాన్తవిద్వాన్.
శ్రీనివాసగోపాలాచార్యః, వ్యాకరణవిద్వాన్.
సోమేశి నరసింహాచార్యః. న్యాయ, వ్యాకరణవిద్వాన్.

---

శ్రీమన్మహీశూరపుర్యాం శ్రీహయగ్రీవమఠే శ్రీ శ్రీపరకాలస్వామినాం సన్నిధౌ ప్రవ ర్తితాయాం మహావిద్వజ్జనసభాయాం శతావధానిభిః బ్రహ్మశ్రీ చిదంబరశాస్త్రిభి ర్నిర్వ ర్తితం శతావధాన మత్యద్భుత మస్మాక మమంద మానంద మజీజనత్. అత్ర చ శాస్త్రిణా మతివేలం సంస్కృతాంధ్రోభయభాషాకవితా కౌశల మసాధారణం ధారణావిశేషం చ సమాకలయ్య ప్రమోదాతిశయే నాస్మాభి ర్వితీర్ణ మిదం ప్రశ స్తిపత్త్రం విజయతా న్తరామ్.

పండితరత్నం, లక్ష్మీపురం శ్రీనివాసాచార్యః. ఆస్థానమహావిద్వాన్.
ఆస్థానధర్మాధికారీ, కాశీ శేషవేంకటాచలశాస్త్రీ వ్యాకరణప్రధానోపాధ్యాయః.
మహామహోపాధ్యాయః, పంచాపగేశశాస్త్రీ.అద్వైతవేదాన్తోపాధ్యాయః.
పెరియకోళం రామచంద్రాచార్యః. ద్వైతవేదా న్తప్రథమోపాధ్యాయః,
ఆస్థానమహావిద్వాన్.

బ్రహ్మతర్కం శ్రీకృష్ణాచార్యః. తర్కశాస్త్రముఖ్యోపాధ్యాయః,
ఆస్థానమహావిద్వాన్.

కరపత్తూరు వేంకటరామశాస్త్రీ. వేదభాష్యోపాధ్యాయః, ఆస్థానమహావిద్వాన్.
హాసనాభిజనో నరసింహశర్మా. సాహిత్యముఖ్యోపాధ్యాయః, ఆస్థానమహావిద్వాన్.
దూసి నరసింహాచార్యః. మీమాంసాశాస్త్రోపాధ్యాయః, ఆస్థానమహావిద్వాన్.
సి. నరహరిదైవజ్ఞః. జ్యోతిశ్శాస్త్రప్రధానోపాధ్యాయః, ఆస్థానమహావిద్వాన్.
ద్వివేది సుబ్రహ్మణ్యావధానీ. ఋగ్వేదముఖ్యోపాధ్యాయః, ఆస్థానమహావిద్వాన్.
అయ్యాఘనపాఠీ. యజుర్వేదముఖ్యోపాధ్యాయః, ఆస్థానమహావిద్వాన్.
భాగ్యవల్లీ శ్రీనివాసాచార్యః. సాహిత్యవిద్వాన్.

మైసూరు
8-11-1920

శ్రీమన్మహీశూరమహారాజసంస్కృతపాఠశాలా.

---

శ్రీయుత పిసుపాటిచిదంబరశాస్త్రిణా కవివర్యేణ విరచితాన్ సంస్కృతాంధ్ర గ్రంథాన్ కాంశ్చి దవాలోకిషి. అస్య కవితా రసనిష్యందినీ ప్రసాదగుణభూయిష్ఠా సముచితపదలంకారశోభితా చ సహృదయానందదాయినీ చకాస్తి. కవివరేణ్యోఽయం రక్తాక్షిసంవత్సరశారదనవరాత్రసమయే శ్రీపీఠికాపురమహారాజ శ్రీసూర్యరాయసంఘటితాయాం విద్వత్సభాయాం శతావధానం ప్రతిజ్ఞాయ విద్వచ్ఛతేన ప్రత్యేక ముపదిష్టచ్ఛందఃకల్పనాదిక మనుసృత్య ప్రథమ మేకైకపాదం విరచయ్య పున రపృష్ట్వైవ పర్యాయక్రమేణ ద్వితీయపాదాదిరచనేతి నియమ మనురుధ్య షష్టిఘటికాపరిమితే కాలే శతపద్యా న్యారచయ్య ధారణాబలేన సర్వా ణ్యపి పద్యాని పునః పఠిత్వా చ తత్ర సన్నిహితాన్ విద్వద్వరేణ్యాన్ మహారాజ మమాత్యాదీంశ్చ విస్మయానందసంభరితాంతరంగా నకరోత్. మహారాజోఽపి విద్వజ్జనానా మానంద ముపజనయన్ సముచితసత్కారై ర్బహూచకార కవివరేణ్యం చిదంబరశాస్త్రిణ మితి తత్ర సన్నిహితోఽహం సానందం ప్రకటయితు ముత్సహే. ఇతి నివేదయితా.

తాతా సుబ్బరాయశాస్త్రీ. మహామహోపాధ్యాయః, కళాప్రపూర్ణః,
మహారాజసంస్కృతకళాశాలాప్రధానోపాధ్యాయః.
విజయనగరసంస్థానమ్.

---

# విషయసూచిక

శ్రీరస్తు

# శ్రీమదాంధ్రపద్మపురాణము

## ఆదిఖండము

---



మంగళశ్లోకము

ష్ణుత్వం పరిపాలనే ద్రుహిణతాం సృష్టౌ లయే రుద్రతాం
సంప్రాప్య స్వయమేక ఏవ బహుధా సంపద్యమానః ప్రభుః।
విశ్వస్యాంతరివ స్థితో బహిరపి స్వజ్యోతిషా భాసయ
న్నాదిత్యాద్యఖిలగ్రహాన్ భవతు నః క్షేమాయ విశ్వేశ్వరః. 1

—: దేవతా ప్రార్థన :—

శా. శ్రీవాణీహృదయేశ్వరుల్ సఖులు కాశీపార్వతీజాహ్నవుల్
దేవేరుల్ సుర లెల్ల సేవకులు గా దీపించుచున్ శిష్టులన్
గావన్ దుష్టుల రూపుమాపఁగను దీక్షాయుక్తుఁడై యుండు కా
శీవిశ్వేశ్వర దేవ దేవునకు నా చిత్తంబు నర్పించెదన్. 2

చ. సకలజగంబులందుఁ గలజన్ముల కెల్లను సర్వదేవతా
త్మిక యయి వాంఛితార్థములు దీర్చుచు నుండెడి దేవి కన్నపూ
ర్ణకు జగదేకమాతకుఁ బ్రణామసహస్రము లాచరింతు మా
మకకృతికన్యపై స్వకృపమాదర ముంచి యనుగ్రహింపఁగన్. 3

శా. ఆనందంబున నెల్లవేళల నిజధ్యానంబు గావించుచున్
జ్ఞానోపార్జనముం బొనర్చికొని సంసారాంబుధిన్ బల్వల
స్థానీయంబుగఁ జేసికొంట కవకాశం బిచ్చి న న్నోముల
శ్రీనారాయణులన్ భజించెదను నాక్షేమంబు నేఁ గోరుచున్. 4

క. మతిహీనుల నేని బృహ, స్పతులను గావించి లోకశాసనపీఠ
స్థితులను జేసెడివాణీ, చతురాననులను దలంతు జాడ్యము ద్రోలఁగన్. 5

మ. అమరేంద్రాదులకున్ లభింపఁగ నశక్యంబైనయానందయో
గము చేఁ గాలముఁ ద్రోయు భాగ్యము నొసంగం జాలు కారుణ్యభై
క్షము నర్థిం జెడినాకు మంజుకవితాసామ్రాజ్యపట్టాభిషే
కము గావించినయాజగజ్జననికిన్ గైమోడ్పు లర్పించెదన్. 6

గీ. అఖిలజను లెన్నఁగా సంస్కృతాంధ్రభాష, లందు రెంటను శతఘంటికావధాన
కౌశలము ఘటికాశతగ్రంథకరణ, శక్తియును నా కొసంగినశక్తి నెంతు. 7

సీ. మహిశూరపురమహీమండలేంద్రునిసభా, స్థలి మహావిద్వత్పదంబు గొనుట
దర్భాంగకుంభినీధవునిసదస్సులోఁ, గావ్యకళానిధిఖ్యాతి గొనుట
తిరువనందపురిభూవరునియోలగములోఁ, గవిసింహకంకణము గొనుట
రత్నాద్రిసత్యనారాయణస్థానిలోఁ, దపసియకండలద్వయము గొనుట
గీ. పెక్కుసభలందు నూర్లబిరుదములును, బుధవరేణ్యులసంస్తవంబులును గొనుట
యేజగన్మాతకృపను నా కేరుపడెనొ, యామె కభివాదశతంబు లాచరింతు. 8

క. ఒనగూర్చి సూర్యరాయాంధ్రనిఘంటుకృతిప్రణేతృతను నాకు జగం
బున సుప్రసిద్ధి గలిగిం, చినపరదేవత నుపాస్తిచేసెద నెదలోన్. 9

క. నవనవకుమార్గములఁ బడి, చవి చెడిపోకుండఁ బ్రాచ్యసత్పథమున మ
త్కవితాకన్యను నడిపెడి, భవానిచరణాబ్జములకుఁ బ్రణతు లొనర్తున్. 10

క. మనమున కత్యుత్సాహం, బెనయఁగ నాకనులయెదుట నెల్లపుడును ద
ర్శన మిచ్చుచుండు వాగ్భవ, మును గొలుతు మదీయపూర్వపుణ్యఫలంబున్. 11

క. అనుజుల నిరువుర భగిని, తనయుని నొక్కరునిఁ బండితప్రవరుల సా
ధ్వీని సతిని నుత్తమస్వస, లను నా కొనగూర్చినట్టిలలితన్ దలఁతున్. 12

గీ. విఘ్నదేవత లెవ్వని ప్రస్మరింప, నావరింతురొ దంతావళాస్యు నతనిఁ
దలఁపులోఁ బాదుకొల్పుదుఁ దలఁచినట్టి, కార్యమున కంతరాయంబు గలుగకుండ.

—: గురువందనము :—

క. ఎవనిరసనాగ్రమున ను, ద్భవమయ్యెనొ వాణి మొదట భద్రాకృతితో
నెవఁ డిడెనొ కావ్యభిక్షను, గవుల కతనిఁ దెలతు నాదికవి వాల్మీకిన్. 14

చ. సకలపురాణకర్తయయి సంసృతివార్ధినిమగ్నులైనవా
రికి సువివేకనౌకను దరించుటకై కరుణించి మార్గద
ర్శకుఁ డనుపేరు గాంచినపరాశరసూతికి వ్యాసమౌనికిన్
త్రికరణశుద్ధితోడ నొనరింతు నజస్రనమస్సహస్రముల్. 15

క. హృద్యతమసాహితీ శ్రీ, విద్యా వ్యాకరణ తర్క వేదాంతము లా
స్వాద్యముగ నా కొసంగిన, విద్యాదేశికుల దానవీరుల నెంతున్. 16

క. భారద్వాజసగోత్రుని , భూరియశోధనుని విప్రపుంగవుని సదా
చారుని మజ్జనకుని సీ, తారామాభిధుని నెన్నుదన్ మదిలోనన్. 17
క. సీతారామపదాంభో, జాతసిలీనాంతరంగషట్పద యనుప్ర
ఖ్యాతిన్ గడియించినమా, మాతకుఁ గనకాంబ కివె నమస్కారంబుల్ 18
గీ. మత్పితామహులకు ధర్మతత్పరులకు, వంగవోలుమహాగ్రామవర్తనులకు
సకలుషులకుఁ గామాక్షీచిదంబరులకు, నాచరింతుఁ బ్రణామసహస్రములను. 19
గీ. అవిరతపరోపకారసంప్రాప్తకీర్తి, ధర్మధనులకు మత్ప్రపితామహులకు
బండెమ్మాంబకుఁ బరదేశిభట్టునామ, ధేయునకు వందనంబులు చేయువాఁడ. 20
గీ. అవ్వయకులింగమనుదాతకైనసుబ్బ, యాహ్వయునిన త్తియకురుక్మిణమనుమామ
కైనయచ్యుతరామయాహ్వయుని నెంతు, గౌతమసగోత్రులనుధర్మకౌతుకులను. 21

—: సుకవిపురస్కారము: —

చ. తెనుఁగును సంస్కృతంబును మథించి మహాకృతిజాతిరత్నముల్
జనులకుఁ జెందునట్లు వెదచల్లిరయట్టిసనాతనాధునా
తనకవిసార్వభౌములపదంబులకున్ వినయంబుతోడ వం
దనము లొనర్తుఁ గాకవివితానము వెల్వెలఁబాఱి చూడఁగన్. 22

—: భాగ్యసంస్తవము :—

ఉ. నన్నయతిక్కనాదికవినాయకు లెన్నొ మహాపురాణముల్
మున్ను దెలుంగు సేసియును ముఖ్యతమం బగుపాద్మ మాంధ్రభా
ష న్నొలకొల్పరైరి నిజశక్తి దెలుంగనియట్లు వారిలో
నెన్నికకెక్కి నేను గృతకృత్యుఁడ నయ్యెడిభాగ్య ముండుటన్. 23
క. చెప్పెడునది పాద్మం బఁట, చెప్పించెడితల్లి పలుకుఁజెలి యఁట దానిన్
జెప్పిన మోక్షము గలదఁట, చెప్పక యట్టిది మఱొండు చెప్పఁగ నేలా. 24
క. హరిహృదయం బఁట కృతి కృతి, పరిగ్రహీత యవిముక్తపతి యగువిశ్వే
శ్వరుఁ డఁట కృతిదాత చిదంబరుఁ డఁట యిది యింతయంతభాగ్యమె తెలఁపన్.
క. తగు ననఁగను గృతికన్యల, భగవంతున కిచ్చుకొనెడిభాగ్యముకంటెన్
మిగిలినభాగ్యం బున్నదె, జగమున నెందేని కావ్యసంతానులకున్. 26
క. జననము శ్రోత్రియవంశం, బున వాసం బాంధ్రదేశమున సద్వ్యాసం
బున మతి సుకావ్యరచనం, బున ననురాగమును బూర్వపుణ్యఫలంబుల్. 27

—: కృతిసమర్పణము :—

వ. ఇట్లు దేవతాప్రార్థనాకుకవినందన సుకవిపురస్కారభాగ్యసంస్తవంబులం గావించి యష్టాదశమహాపురాణంబులలో నుత్తమపురాణంబును బురుషోత్తమదివ్యకథా పవిత్రంబును మోక్షసాధనంబును నగుపద్మపురాణంబు నాంధ్రీకరించి జన్మ

సాఫల్యంబొదవ నఖిలజగన్నివాసి యయ్యును లోకానుగ్రహార్థంబు వారాణసీ
క్షేత్రంబు నిత్యనివాసంబుగా నంగీకరించి యుండు. 28

క. మూర్తిత్రయస్వరూపున, కార్తజనత్రాణపరున కఖిలజ్ఞునకున్
గర్తకుఁ గారయితకుఁ గృతి, భర్తకుఁ గాశీశ్వరునకుఁ బూర్ణునకున్. 29

క. అకలంకునకుఁ జిదంబరు, నకు నాశ్రితజనశరణ్యునకు నిత్యునకున్
సకలజగదేకనాయకు, నకుఁ బరమేశ్వరునకున్ బినాకధరునకున్. 30

క. ఆది కనాదికి శరదం, భోదాకారునకు నన్నపూర్ణాహృత్ప్రా
సాదవిలాసవిహారా, స్వాదికి విశ్వేశ్వరునకు నద్వైతునకున్. 31

వ. ఉపాయనంబుగా సమర్పింపం బూని తత్పురాణకథాక్రమంబు విన్నవించెద. 32

—: పద్మపురాణ ప్రవచనారంభము :—

క. శ్రీశనిధీంద్రాద్యమర, ప్రాశస్త్యాధానచణకృపావీక్షణ భ
క్తాశంసితార్థపూరణ, కాశీపురవిశ్వనాథ గౌరీనాథా. 33

వ. అవధరింపుము. 34

క. ఒకసమయంబునఁ బూర్వము, సకలమునీంద్రులును గూడి చనుదెంచిరి కౌ
తుకమున మహాత్ముఁ డగు శౌ, నకునిఁ గనుంగొనఁ దలంచి నైమిషమునకున్.

క. అరుదెంచినయమ్మునులకుఁ, బరమానందమున నర్ఘ్యపాద్యాదివిధుల్
నెరపి కుశలప్రసంగము, జరిపెను శౌనకుఁడు వారు సంతసిలంగన్. 36

క. అంతట నమ్మును లందఱుఁ, జింతాంతరములను దొఱఁగి శ్రీపతికథలన్
వింతలుగఁ జెప్పికొనుచును సంతోషముఁ జెందుచున్నసమయమునందున్. 37

సీ. మును పృథుక్షితినాథుఁ డొనరించినమఖంబు, నను హవిర్వ్యత్యాసమునను జేసి
యగ్నికుండంబున నావిర్భవించి వ్యా, సమహర్షికడఁ బురాణముల నెల్లఁ
జదివి రహస్యార్థసహితంబుగను జెప్పి, మహనీయు లున్నధామంబులందు
సకలజనంబులు సంస్తవం బొనరింపఁ, బౌరాణికుం డనుపేరు వడసి
గీ. తాఁ బురాణంబుఁ జెప్పెడితఱిని రోమ, హర్షమును గలిగించుట నందఱకును
రోమహర్షణుఁ డనుసార్థనామ మొంది, నట్టి సూతుఁడు విచ్చేసి యచ్చటికిని.

క. అందున్నమహర్షులకున్, వందన మొనరించుటయును వార లమందా
నందమున గౌరవం బిం, పొందఁగ బ్రహ్మాసనంబు నొసఁగి యతనికిన్. 39

క. సూతా నీయాగమనము, చేతోమోదంబు గలుగఁ జేసెడి మాకున్
బూతము లైనపురాణ, వ్రాతములు వచించుపుణ్యవంతుఁడ వగుటన్. 40

క. హరికథలకంటె నఘములు, హరియించెడికథలు వేఱ యగపడవు సుమీ
హరికంటెను భవసింధువుఁ, దరియింపఁగఁ జేయుదేవతలు లేరు సుమీ. 41

క. వినినార మెన్నిమాఱులొ, వనజాక్షునిచరితములను వారును వీరున్
వినిపింప వినినకొలఁదిని, విన వలయు నటంచు నుత్సవించెడిఁ గోర్కుల్. 42

క. హరిపారమ్యముఁ దెలిపెడి, హరినాభిసరోజవిషయ మంతయును సవి
స్తరముగ నెఱిఁగించెడిదొక, పురాణమును జెప్పు మయ్య పూతచరిత్రా. 43

చ. అనవుడు దేహమందుఁ బులకాంకురముల్ వెలయంగఁ గన్నులన్
బెనఁగొన హర్షబాష్పములు నెమ్మి మనంబు హరింప నేమియున్
గనఁగొన లేమి నొక్కక్షణకాలము చేష్టలు దక్కి యుండి ని
ద్రను గని మేలుకాంచినవిధంబున సూతుఁడు గాంచి బోధమున్. 44

క. మునులార నన్ను ధన్యుని, నొనరింపఁగ మీకు వాంఛ యుదయించెఁ బరా
త్మునిపుణ్యగాథ దెలిమిని, వినిచెద నాకింతకంటె వేఱేమిటికిన్. 45

క. అని పలికి సవినయంబుగ, మనమున గురువైనవ్యాసమహామునీంద్రుని భా
వనచేసి భక్తితో నీ, యనువున వినిపింపఁ దొడఁగె నత్తపసులకున్. 46

క. కల దొకమహాపురాణము, కలిహర మైనదియు విష్ణుగాథామృతమున్
జిలుకునదియుఁ బద్మాహ్వయ, కలితం బైనదియు మోక్షకర మైనదియున్. 47

వ. కల్పాంతంబునందు జగంబు లన్నియు నర్ణవమయంబులు గా మరలఁ గల్పాదియందు మత్స్యరూపుఁ డగుపుండరీకాక్షునిచే నర్ణవమునుండి వేద వేదాంగపురాణంబులతోడం గూడ నమ్మహాపురాణం బుద్ధృతం బై దేవలోకంబున శతకోటిప్రవిస్తరంబుగను భూలోకంబునఁ జతుర్లక్షపరిమితంబుగను బ్రతిష్ఠింపఁబడియె. అందు మున్ను బ్రహ్మచేఁ బంచపంచాశత్సహస్రశ్లోకపరిమితం బగుగ్రంథంబు ప్రకాశితంబయ్యె. అయ్యది యాదిఖండంబును భూమిఖండంబును బ్రహ్మఖండంబును పాతాళఖండంబును సృష్టిఖండంబును నుత్తరఖండంబును ననునాఱుఖండంబులు గలిగి యున్నయది. 48

—: పద్మపురాణనామ నిర్వచనము :—

క. హరినాభిపద్మవార్తా, కర మై శల్లక్షణములఁ గ్రాలుటచేతన్
సురనరలోకంబులలోఁ, బరగెఁ బురాణంబు గూడఁ బద్మము నాఁగన్. 49

గీ. ఆపురాణంబునందు మీ రడిగినట్టి, యంశముల కెల్ల నుత్తరం బనువు గాఁగఁ
జెప్పఁబడియుంట నయ్యది చెప్పకుండ, నితరములు వేయి చెప్పిన నేమి ఫలము.

క. దాని వినినంతమాత్రన, నానాజన్మాంతరోపనతపాతకసం
తానం బెల్ల నశించు ద, వానలకీలలను దరుచయంబులు వోలెన్. 51

గీ. శ్రద్ధతోడను విన్న సంశయము లేదు, ప్రాప్త మగుటకు మోక్షసామ్రాజ్యపదము
శ్రద్ధ లేకుండ విన్నను సంఘటిల్లు, సద్గతిప్రద మగుపుణ్యసంగ్రహంబు. 52

క. కావునఁ బద్మపురాణము, నేవిధమున నైన వలయు నెల్లరు వినఁగాఁ
గావు సమంబులు దానికి, నేవియు నది మాధవునకు హృదయం బగుటన్. 53

గీ. ఆపురాణంబు హరి బ్రహ్మ కతఁడు నార, దున కతండు పరాశరతనయునకును
నతఁడు నాకును నెఱిఁగించె నదియె మీకు, నే నెఱింగింతు విప్రుఁడు మానులార. 54

క. మును భీష్ముం డొక్క దినం, బున సంతస మొదవఁ బాద్మమును వినెడి విధం
బును గాంక్షించుటయును వి, ప్లనిరెఁ బులస్త్యుండు వికసితాననుఁ డగుచున్. 55

—: పద్మపురాణశ్రవణవిధాయకకథనము :—

వ. బ్రాహ్మముహూర్తంబునం దుత్థితుండై పద్మాసనంబునం గూర్చుండి సహస్రార బునందు శ్వేతవస్త్రోపవీతుండును శ్వేతమాల్యధరుండును శ్వేతగంధానులేపనుండును నగుగురుని ధ్యానించి నదికిం బోయి బ్రహ్మమంత్రంబుచే దంతకాష్ఠంబును మంత్రించి "ఆపోహిష్ఠా" యనుమంత్రంబుచే నేడుమాఱులు సంస్కరించి "దేవస్యత్వా" యనుమంత్రంబు జపించి "యుంజాన" యనుమంత్రంబుచే హస్తంబునం దుంచుకొని "ఈశావాస్య" యనుమంత్రంబుచేఁ బ్రక్షాళనంబు గావించి "బ్రహ్మోదన" యనుమంత్రంబుచే నోటం బెట్టి రుద్ది దూరముగాఁ బాఱవైచి దానిం జూడవలయు ఆకాష్ఠంబు సమ్ముఖంబుగాఁ బడెనేని దేవతాలబ్ధియును మంత్రసిద్ధియునుం గలుగు పరాఙ్ముఖంబుగాఁ బడెనేని దేవత లెల్లఁ బరాఙ్ముఖు లగుదురు. ఉత్తరదిక్కునం బడెనేని కార్యసిద్ధి సందిగ్ధం బగు. దక్షిణంబుగాఁ బడెనేని మృత్యుప్రదం బగు. తరువాత స్నానసంధ్యాదు లాచరించి గురుసన్నిధికిం జేరవలయు. గురుండు షోడశారపద్మంబు గాని నవనాభపద్మంబు గాని యష్టదళపద్మంబు గాని లిఖించి తన్మండలంబుం జూపి సితవస్త్రంబుచే శిష్యునకు నేత్రబంధంబు గావించి మండలంబున నష్టదిక్కులందును నష్టదిక్పాలకుల స్థాపించి పూజించి పూర్వంబునఁ గమండలువును దక్షిణంబున స్రుక్కును బశ్చిమంబున హంసమును నుత్తరంబున స్రువమును నాగ్నేయంబున బృసియును నైరృతిభాగంబునఁ బాదుకలును వాయవ్యభాగంబున యోగపట్టంబును నీశానభాగంబున గళంతికయును నుంచి పూర్వదిక్కునందు విష్ణువును బ్రహ్మను ఋగ్వేదంబును బురాణేతిహాసంబులను దక్షిణదిక్కునందు శంకరుని గాయత్రిని యజుర్వేదంబును ఛందస్సును బశ్చిమదిక్కునందు రవిని సావిత్రిని సామవేదంబును జ్యోతిషంబును నుత్తరదిక్కునందు ఋషులను సరస్వతిని నథర్వవేదంబును ధర్మశాస్త్రంబులను బ్రతిష్ఠించి పూర్వదళంబున బలరాముని నీశానుని భాస్కరుని దక్షిణదళంబునఁ బ్రద్యుమ్నుని సద్యోజాతుని దివాకరునిఁ బశ్చిమదళంబున ననిరుద్ధుని వామదేవునిఁ బ్రభాకరుని నుత్తరదళంబున వాసుదేవునిఁ దత్పురుషుని గ్రహరాజును

ప్రతిష్ఠాపించి యథాక్రమంబుగఁ బూజించి యఘోరుని మండలమందంత
టను వర్ణించి పిదప దిఙ్మండలంబులం దష్టకలశంబులను మధ్యంబున బ్రాహ్మ
కలశంబును స్థాపించి పూజించి ముక్తికామునకు బ్రహ్మకలశంబుచేతను
రాజ్యార్థికి నింద్రకలశంబుచేతను బ్రతాపకాంక్షికి నాగ్నేయకలశంబుచేతను
మృత్యుజయాభిలాషికి యామ్యకలశంబుచేతను శత్రుధ్వంసకాంక్షికి నైరృత
కలశంబుచేతను పాపనాశనార్థికి వారుణకలశంబుచేతను నారోగ్యకామికి
వాయవ్యకలశంబుచేతను ధనకాంక్షికిఁ గౌబేరకలశంబుచేతను జ్ఞానార్థికి నీశాన
కలశంబుచేతను నభిషేకంబు గావింపవలయు. సర్వకలశాభిషిక్తుండగు
వాఁడు బ్రహ్మసదృశుండు గాని భూమండలాధిపతి గాని యగు. అట్లభి
షేకంబు గావించి పరీక్షితుండై యున్నశిష్యునకు నాగ్నేయధారణచేఁ బాప
దాహంబును వాయుధారణచేత దగ్ధపాపవిధూననంబును సోమధారణచే నమృ
తాప్యాయనంబును గావించి దాన నప్తాత గలిగించి. 56

క. హరిహరవిధులను గురువును, సురలను విప్రులను దాపసుల గ్రహముల భూ
పరిపాలకులను గూరిమి, తిరస్కరింపంగ నమునఁ దెలిపి సనుయమునన్. 57

వ. "ఓం నమో బ్రహ్మణే భగవతే సర్వరూపిణే హుం ఫట్ స్వాహా" అనుషోడ
శాక్షరమంత్రంబుచే గర్భాధానాదిసర్వాహుతులు హోమంబుచేయించి
హోమాంతంబున శక్త్యనుగుణంబుగా శిష్యుం డొసంగెడిగురుదక్షిణ
గ్రహింపవలయు.

గీ. అట్లు దీక్షితుఁడగుట ననంతమైన, పుణ్యమును మహిమంబును బొంది వినినఁ
బాద్మము ద్విజుండు చెందును బ్రహ్మపదము, నఖిలపుణ్యక్రియాఫలావాప్తివలన. 59

గీ. భరతవర్షంబునందు నుద్భవము నొంది, దీక్షితుల మయి గురునికటాక్షముననుఁ
బాద్మమునువినుభాగ్యంబుఁబడయుటెపుడొ,యనితపించుచునుందురనవహముసురలు

వ. స్త్రీశూద్రులుశ్రద్ధాభక్తిపురస్సరంబుగానాలకించినఁదత్ఫలంబువడయంగలుగు.

క. అనవుడు భీష్ముఁడు సంతస, మొనయఁగ నెడఁ బాద్మకల్పసృష్టిక్రమమున్
వినఁ గాంక్షించుటయును ని, ట్లని యేఁ బులస్త్యుండు పులకితాంగుం డగుచున్. 62

—: పాద్మకల్పసృష్టిప్రకారకథనము :—

సీ. జననాథ నారాయణునిమహత్త్వముఁ జెప్ప, నలవి గా దెట్టివారలకు నైన
నైనను నారాయణావతారం బగు, ద్వైపాయనమహర్షివలన నేను
వినినదానిని నీకు వినుతు నాలింపుము, పద్మనాభునిగాథ పాపహరము
స్థావరజంగమాత్మకమైనవిశ్వంబు, లన్నియుఁగూడ నారాయణుండె

గీ. ప్రణవమును వేదములునునారాయణుండె, యజ్ఞముయజ్ఞఫలము నారాయణుండె
యాదిమధ్యాంతములును నారాయణుండె, లేదు నారాయణేతరం బేది గాని.

వ. కల్పాంతంబునందు నారాయణుండు జగత్సంహారార్థంబు వాయురూపంబునఁ బ్రాణంబులను లాగికొని యాదిత్యరూపంబునఁ బ్రజ్వరిల్లుచుఁ బ్రదీప్తగభస్తిచయంబుచే సాగరంబులను నదులను గూపంబులను హ్రదంబులను నెండించి ప్రాణిజాతంబునం దుండుమూత్రశుక్లరక్తాదిద్రవపదార్థంబును జతువులను లాగికొని సర్వప్రపంచంబులను నిర్జలంబుగావించి సంవర్తకానలరూపంబున నఖిలలోకంబులను దహించి భస్మంబుగావించి యాభస్మంబు ధరియించి మహాకృష్ణమేఘరూపంబున క్షీరసంకాశం బగుదివ్యోదకవృష్టిచే మేదినిం దృషిపఱిచి సప్తార్కచంద్రపవనపావకాకాశంబును బ్రాణివివర్జితంబును వస్త్వంతరరహితంబును నేకార్ణవీభూతంబును నగునమ్మహాజలంబునం దేకాకియై సనాతనస్వరూపంబున శయనించి మహాయోగసమాధినిష్ఠాగరిష్ఠుండై యుండె.

సీ. అతిసురూపం బేవో యాతఁ డెవ్వఁడో యతం డొనరించుచుండెనీ యోగ వేదో
యావిధంబునను నేకార్ణవోదకమునఁ గదలక యుండు కాల మెంతో
తెలిసికొనంగ నేదిక్కునం దేనియు, నొకఁడును లేఁ డాతఁ డొకఁడె తక్క
విశ్వంబు లన్నియు విశ్వకారకుఁ డైన, యతనిగర్భంబులో నణఁగి యుండె
గీ. నట్టులుండంగ దత్కుక్షియందు భూమి, యందుఁ బోలె మార్కండేయుఁ డనుమహర్షి
సంచరించుచు దైవవశమున దారి, దొలఁగి తద్వక్త్రమునుండి వెలికి వచ్చి. 65

సీ. కాంచి యేకార్ణవాకారంబుగా నున్న, జగమును లోన నాశ్చర్య మొదవ
నిపు డున్నజగ మెల్ల నెటు వోయె నెక్కడ, నేనుంటి నాకు దిక్కెవ్వ రిచట
భ్రాంతియో లేక స్వప్నంబొ యియ్యది కాదు, స్వప్నంబు భ్రాంతియు సత్యమగుట
నని వితర్కించుచు నాత్మలో వడఁకుచు, భయముచే నెటుఁ బోవఁ బథము లేమిఁ
గీ. జూచి యొకచోట నాసీనుఁ జొచ్చియున్న, దివ్యరూపంబు నొకదానిఁ దెలివినొంది
నీ వెవఁడ వని యడుగుచు దైవమాయ,వలన వెంటనె మరల లోపలికిఁ బోయె.

ఉ. అట్టులు లోనికిం జనినయమ్ముని శ్రీపతికుక్షిలోనఁ గ
న్పట్టెడిసర్వలోకముల బాగుగఁ జూచి యి దేమి యిట్లు చూ
పట్టెడి నింతలోన నిది భ్రాంతియొ మాయయొ కాకయున్నఁ గ
న్పట్టక యున్న యప్పుడు కనంబడినట్టిమహార్ణవం బిటన్. 67

మ. అని లోలోపల సంశయించుచును సత్యాసత్యముల్ దేలకుం
టను విశ్వాసము లేనిమానసముతోడన్ బుణ్యతీర్థంబులన్
జనులన్ యాగములన్ నదీనదములన్ గ్రామంబులన్ శైలకా
ననసందోహములన్ గనుంగొనుచు వింతన్ జెందుచున్ సారెకున్. 68

ఆ. తిరిగి తిరిగి లోన దివ్యవర్షశతంబు, దైవికముగ నొక్కతఱుణమందు
మరల విష్ణువక్త్రమార్గంబులోనుండి, వెలికి వచ్చి చూచి జలము నెల్ల. 69

క. కనఁబడమి జనులు పురములు, గనఁబడమిని గాననములు గనఁబడమి గిరుల్
గనఁబడమి భూమి యేమియుఁ, గనఁబడమిని భీతి నొంది కడకొకచోటన్. 70

సీ. పవళించి న్యగ్రోధపత్త్రంబుమీఁదను, దేలుచు జలముపైఁ దెప్ప వోలె
రవికోటిదీప్తిచే రాజిల్లుచుండిన, బాలు నొక్కనిఁ గాంచి భయముఁ జెంది
కంపించుచుండఁగఁ గని బాలుఁ డాతనిఁ, గరుణాకటాక్షవీక్షణముతోడ
రమ్ము నాకడకు మార్కండేయ నీకు నే, నభయం బొసంగితి నని వచించె

గీ. నంత నామాట విని ముని యాగ్రహించి, నన్ను దీర్ఘాయు వని పిల్చి నళినజుఁడును
నామమునఁ బిల్వ నపమతి నాకుఁ గల్గె, నెవ్వఁడవొ నీవు నీనామ మేమొ చెపుమ.

సీ. అనుటయు బాలుఁ డిట్లనియె నభ్యామ వత్స, జనకుండ నేను ముజ్జగములకును
నారాయణుండు నాపేరు నీతండ్రిపు, క్షాత్త్రైయై తపియించి యాంగికసుఁడు
వరమును బొందె నావలనఁ బూర్వము లయ, కాలంబులందు లోకములు లేమి
జలములో యోగినై శయనించి యున్నసన్, వీక్షించుచుతుఁ డుద్భవించునట్లు

గీ. దాన దీర్ఘాయువైతి వద్దాని కేనె, కారణంబైతి నాపైనిఁ గసల నగునె
యనుడు నమ్మౌని సాష్టాంగ మాచరించి, సైఁపు మపచార మని వేఁడి సవినయముగ.

గీ. దేవ నీమాయ యెట్టిదో తెలియరాదు. పవ్వళింపఁగ బాలరూపమున నిట్టు
లొంటిగను హేతు వేమియో యుదధియందు, నెట్టివాఁ డవో నీవు నాకెఱుఁగఁ జెపుమ.

వ. అని ప్రార్థించుటయు నారాయణుం డాతని కిట్లనియె. 74

సీ. వినుము కుమార నావృత్తాంత మొకకొంత, వినిపించెదను నీకు విశదముగను
నొకదినంబున నేనె యొనరింతు సృష్టియుఁ, బ్రళయంబు గూడఁ బ్రపంచములకుఁ
బగలు సృష్టియు రేయి ప్రళయంబు జరుగును, బ్రళయంబునను లోకములను నెల్లఁ
గుక్షిలోపల నుంచుకొని యోమి సర్గంబు, నలుపు కాలము రాఁగ వెలికి విడుతు

గీ. విలయమును జెందు జగములు ప్రళయమందు, సర్వము జలాత్మకంబగు సమయమునను
నాజలంబునఁ గ్రీడింతు నర్భకుండ, నగుచు స్వేచ్ఛ గలిగెడునంతవఱకు. 75

ఆ. నేనె సృష్టికర్త నేనె రక్షణకర్త, నేనె ప్రళయకర్త నేనె బ్రహ్మ
హరిహరాత్మకుఁడను నంతరాత్మను నేనె, సర్వలోకములకు సాక్షి నేనె. 76

సీ. దయ నేనె నేనె సత్యము నేనె ధర్మంబు, యజ్ఞంబు నేనె హవ్యంబు నేనె
నేనె సూర్యుండను నేనె చంద్రుండను, క్షమ నేనె పంచభూతములు నేనె
బ్రాహ్మణుండను నేనె బ్రహ్మచర్యము నేనె, కాలంబు నేనె సాంఖ్యంబు నేనె
వైవాహము నేనె వర్షంబు నేనె వర్ణాశ్రమంబులు నేనె యతిని నేనె

గీ. వేదములు నేనె తత్ప్రోక్తవిధులు నేనె, ప్రణవమును నేనె మంత్రతంత్రములు నేనె
యిది యది యటంచు వచియింప నేల నేనె, జంగమస్థావరాత్మకజగము లెల్ల. 77

గీ. మరల సర్గంబు గావింపఁ దరుణ మయ్యె, నిపుడె నాకుక్షిలోనికి నేఁగి నీవు
కాంచెదవు కాక నాసృష్టికౌశలంబు, నని తెఱచి నోరు లోనికిఁ గొనియె నతని. 78
ఆ. అమ్మునీంద్రుఁ డతనియాస్యంబులోనుండి, మున్నువోలె గర్భమునను జేరి
విస్మయంబుతోడ విశ్వంబులను నెల్లఁ, గాంచుచుండె మొదటఁ గాంచినట్లు. 79
సీ. అంతటఁ బద్మాక్షుఁ డానీటిలో విహ, రించుచు నుండంగ నంచవోలెఁ
గలిగె నాతనికి సంకల్పంబు సృజియింప, జగముల నంత నాజలములోన
సంక్షోభ మొదవె నాసంక్షోభమున నీట, నొక్కసూక్ష్మచ్ఛిద్ర ముద్భవించె
నాఛిద్రముననుండి యావిర్భవించి వా, యువు క్షుబ్ధ మొనరించె నుదక మెల్ల
గీ. సలిలమారుతసంఘర్షశక్తివలన, నగ్ని పుట్టి పయఃప్రవాహంబు నెల్ల
శోషిలఁగఁజేసె నంత నాసూక్ష్మరంధ్ర, మాకసం బయి సర్వంబు నావరించె. 80
సీ. అప్పుడు పుండరీకాక్షుండు మదిలోనఁ, బృథివిని సృజియింప నెంచుచుండ
నిజనాభియందు క్షోణీలక్షణములతో, నొప్పారుపద్మ మొం డుద్భవించె
నాపద్మము హిరణ్మయము బహుయోజన, విస్తృతం బుదితరవిప్రభంబు
వేదవేత్తలచేత మేదిని గా నదె, పాద్మకల్పమునఁ జెప్పంగఁబడియె
గీ. దానికేసరములె దేవతలకు ఋషుల, కాశ్రయము లగుశృంగవదస్తవింధ్య
నీలమందరకైలాసనిషధమేరు, హిమవదాదిమహాగిరు లెల్ల వింటె. 81
గీ. అమ్మహాకేసరములమధ్యమున నుండు, నట్టిమధువె సమస్తపుణ్యాస్రవంతు
లకు నఖిలపుణ్యతీర్థంబులకును స్థాన, మయి వెలుంగుజంబుద్వీప మవనినాథ. 82
క. అది యధ్వరంబులకు నెల, వది దానతపోజపవ్రతాదులకును నా
స్పద మిది యది యన నేటికి, నది పుణ్యక్రియల కెల్ల నాశ్రయము సుమీ. 83
వ. మఱియును నసంఖ్యాతంబు లగుక్షుద్రపర్వతంబులును దదాశ్రయంబు లగు మ్లేచ్ఛదేశంబులును గాననంబులును నాపద్మంబునకుఁ బూర్వపర్ణంబులు. దాని యధోభాగపర్ణంబులు దైత్యులకును బన్నగంబులకును నివాసస్థానంబులు. వానిమధ్యప్రదేశంబు మహాపాపకర్ములుండెడియసహ్యనరకస్థానంబు. మఱియును దద్విశేషంబులు వినుము. 84

—: నానాద్వీపపర్వతవర్ష నదీజనపదాదివృత్తాంతకథనము :—

చ. కలదు సుదర్శనం బనునొకానొకద్వీపము చక్రమట్లు వ
ర్తుల మయి పర్వతంబులు నదుల్ వనముల్ ధనధాన్యసంపదల్
గలిగినమేటిదేశములు గల్గి మఱిక లవణాబ్ధివేష్టనం
బెలసియుఁ గాంచువారలకు నెంతయు విస్మయ మావహిల్లఁగన్. 85
గీ. దానియంశద్వయంబునఁ దనరుచుండు, శశము నా నొక్కద్వీప మంశద్వయమునఁ
బిప్పలం బనుద్వీపంబు నొప్పుచుండు, నన్యభాగంబు లన్నియు నప్మయములు. 86

వ. శకద్వీపంబునందుఁ బూర్వపశ్చిమసముద్రములరెండుప్రక్కలను వ్యాపించి ప్రాగాయతంబులై హిమవంతంబును హేమకూటంబును నిషధంబును నీలంబును శ్వేతంబును శృంగవంతంబును ననునాఱురత్నపర్వతంబులు గలవు. వీని మధ్యవిష్కంభ మనేకసహస్రయోజనములు. అందుఁ బుణ్యదేశంబులును బుణ్యవర్షంబులును ననేకంబులు గలవు. వానిలో నానాజాతు లగుప్రాణికోటులు వసియించుచుండు. అందులో నిది ప్రథమ మగుభారతవర్షంబు దీనికిఁదరువాత హైమవతంబును దానికిఁ బిమ్మట హేమకూటంబును దదనంతరంబు హరివర్షంబును నీలపర్వతంబునకు దక్షిణభాగమందును నిషధపర్వతమునకు నుత్తరభాగమందును బ్రాగాయతం బగుమాల్యవత్పర్వతంబునుం గలవు. మాల్యవంతమునకుఁ బిదప గంధమాదనపర్వతంబు గలదు. ఆరెంటికిని నడుమ మేరుపర్వతంబు గలదు. అది యెనుఁబదినాలుగువేలయోజనంబులపొడుగును నంతియె క్రింది భాగంబును గలదియై క్రిందుగను మీఁదుగను నడ్డముగను లోకముల నావరించియుండె. అచ్చట సుపార్శ్వాపత్యం బగుసుముఖం బనువిహగంబు స్వర్ణమయంబు లగువాయసంబులం గాంచి.

క. అనుకొనియె మున్ను దనమన,మున నుత్తమమధ్యమాధముల నేకముగా
నొనరించెడి యిచ్చోటను, జనదు నిలువ నాకు నొక్కక్షణమే ననుచున్. 88

వ. దానిపార్శ్వంబులందు భద్రాశ్వంబును కేతుమాలంబును జంబూద్వీపంబును నుత్తరకురువులును ననునాలుగుపుణ్యద్వీపములు గలవు. 89

సీ. తారలు సూర్యచంద్రగ్రహంబులు నుండు, ధగధగ మనుచు నెద్దానియందు
కార్తస్వరాకృతుల్ గలిగినభవనముల్, తనరారుచుండు నెద్దానియందు
నప్సరోగణయుక్తులై దేవయోనిసం, తతులు క్రీడింతు రెద్దానియందు
బ్రహ్మరుద్రేంద్రాదిబర్హిర్ముఖులు మహో, ధ్వరము లొనర్తు రెద్దానియందు
గీ. గానములు సేయుచుందు రెద్దానియందు, నారదాదిమహర్షు లానంద మొదవ
నెందు సప్తర్షులును వసియించుచుందు, రమ్మహామేరువును గొనియాడఁ దరమె.

క. కనకాచలమూర్ధంబున, దనుజులతోఁ గూడి యుండు దైత్యగురుండున్
గనకాచలసంబంధం, బున నుండు ననేకరత్నభూమీధరముల్. 91

గీ. త్ర్యంబకసఖుండుజాంబూనదాద్రినుండి, నాలుగవయంశమును సువర్ణముగ్రహించి
దానిలోనికలాంశంబు మానవులకు, నొసఁగు ధనదుం డనెడికీర్తి యొసఁగఁ దనకు.

ఉ. ఉన్నది కర్ణికారవన మొక్కటి సర్వఋతుప్రసూనసం
పన్నము గాఁగ మేరుగిరిమధ్యమునన్ హరుఁ డుండె దానిలోఁ
దన్నవసూనమాలికను దాల్చి పదంబులదాఁకఁ గాంతతోఁ
గన్నులకాంతి దీరఁగను గాంచుచు నుండ మహాత్ము లెల్లరున్. 93

క. హరిదశ్వత్రితయమువలెఁ, బరగెడు నేత్రత్రయమున భాసిల్లుమహే
శ్వరునిఁ దిలకింపఁ జాలరు, దురితంబు లొనర్చినట్టిదుర్మతు లెపుడున్. 94

సీ. అమ్మహామేరుగిరిశిఖరమ్మునుండి, విశ్వరూపంబుతో బయల్ వెడలి దుర్ని
వారముగ వచ్చుగంగాస్రవంతిఁ గుసుమ, మాలవలెఁ దాల్చె నాశూలి మస్తకమున.

క. శతవర్షసహస్రంబులు, శితికంఠుఁడు గంగఁ దాల్చి శిరమున మేరు
క్షితిధరమధ్యంబున సు, స్థితుఁ డయ్యెను విస్మయంబుఁ జెంద సుపర్వుల్. 96

క. అమ్మేరువుపశ్చిమపా, ర్శ్వమ్మున సంపదల నొప్పెసఁగు జంబూఖం
డమ్మనను కేతుమాలా, ఖ్యమ్మగు నొకజనపదంబు గ్రాలుచు నుండున్. 97

ఆ. అచట నుండుజనుల కాయువు పదివేల, వత్సరములు లేవు వ్యాధిశోక
ములును నందుఁ బూరుషులు సువర్ణాకారు, లప్సరస్సమాన లబ్జముఖులు. 98

గీ. గంధమాదనశైలశృంగంబులందు, నాధిపత్యంబు వహియించి యధివసించు
గుహ్యకాధీశ్వరుఁడు గుహ్యకుల నునచ్చ, రలును గంధర్వులను రాక్షసులును గొలువ.

గీ. గంధమాదనపార్శ్వభాగమునఁ బదునొ, కొండు వేలేఁడు లాయుష్య ముండు జనుల
కందు నరులు కృష్ణాకృతి నందు రుత్ప, లాకృతులతోడ దీపింతు రబ్జముఖులు.

వ. అందు నీలంబును శ్వేతంబును నిలావృతంబును హైరణ్యకంబును నైరావతంబును నను నైదు వర్షంబులు గలవు. ఈ వర్షంబులందు చరాచరంబు లగు భూతంబు లన్నియును నుపనివిష్టంబులై యుండు. ఇందలి దేవమానుషాదివృద్ధి బహువిధంబుగా నుండు.

గీ. అందులోపల ధర్మకామార్థవిధుల, చేత నాయుఃప్రమాణంబుచే ననామ
యంబుచేతను సుగుణగణంబుచేత, నుత్తరోత్తరవర్ష మత్యుత్తమంబు. 102

వ. శశద్వీపపార్శ్వంబునందుఁ గర్ణద్వీపంబు గలదు. అందు నాగద్వీపకాశ్యపద్వీపంబులును గర్ణద్వీపశిలం బగు మలయపర్వతంబునుం గలవు. అచ్చటన హేమకూటంబును గైలాసంబును నను మహాపర్వతంబులు గలవు. అందు వైశ్రవణుండు గుహ్యకులతోడ విరాజిల్లుచుండు. కైలాసంబునకును మైనాకంబునకును నుత్తరంబుగా మణిమయం బగు హిరణ్యశృంగపర్వతంబు గలదు. తత్పార్శ్వభాగంబునఁ గాంచనవాలుకంబును దివ్యంబును నగు విష్ణుసరస్సు గలదు. అచ్చట మున్ను భగీరథుండు గంగను సందర్శించుచు ననేకవత్సరంబులు నివసించె. అచ్చట స్వర్ణమయంబు లగు క్షేత్రంబులును మణిమయంబు లగు యూపంబులునుం గలవు. అందు సహస్రాక్షుండు యాగంబులు గావించి సిద్ధిం బడసె. మఱియు నందు నరనారాయణులును బ్రహ్మయును మనువును సదాశివుండును నాదిత్యుండును సర్వభూతంబులచే నుపాసింపంబడుచుందురు. అచ్చట సహస్రయుగసత్త్రంబు జరుగుచుండు. త్రిపథగ బ్రహ్మలోకంబునుండి బయలు వెడలి

మొదట నచ్చోటఁ బ్రతిష్ఠితమై వటోదక నలిని పావని సరస్వతి జంబువు సీత
సింధువు అను నేడురూపంబులు దాల్చి ప్రవహింపం దొడంగె. అవియే సప్త
గంగ లని త్రిలోకవిశ్రుతిం గాంచె. అచ్చట నచ్చట సరస్వతి దృశ్యాదృశ్య
రూపంబుగాఁ బ్రవహించుచుండు. హిమవంతంబునందు రాక్షసులును హేమ
కూటంబునందు గుహ్యకులును నిషధంబున నాగులును గంధర్వులును శ్వేతం
బున దేవాసురులును నీలంబున బ్రహ్మర్షులును శృంగవంతంబున దేవతలును
నివసించు చుందురు. నిషధంబున గోకర్ణం బనుమహాతపోవనంబు గలదు. నీల
పర్వతంబునకు దక్షిణపార్శ్వంబునందును మేరుపర్వతంబునకు నుత్తరపార్శ్వంబు
నందును నుత్తరకురువు లనుపుణ్యదేశంబులు గలవు. 103

క. సతతమును బుష్పఫలసం, యుతములును మనోజ్ఞములును నుద్యచ్ఛ్రీరాం
చితములును నభీప్సితఫల, వితరణచణములును గలవు వృక్షము లచటన్. 104

క. కలధౌతవాలుకాంచిత,ములు మణిమయములును నైనభూములతోడన్
విలసిల్లెడునుత్తరకురు, వులమహిమము తరమె మానవులకున్ దెలియన్. 105

క. త్రిదివచ్యుతు లగువారలె, యుదయించుచు నుందు రచట నుత్తమవంశా
భ్యుదయములను నాకృతిసం, పదలను బదొకొండు వేలపరమాయువునన్. 106

క. అనురూపం బగురూపం, బనామయత్వంబు సదృశ మగుగుణములు గ
ల్గినవార లగుచుఁ బుట్టుచు, మనుచుందురు దంపతులు సమంబుగ నచటన్. 107

క. క్షీరులు నాఁబడుతరువుల, క్షీరము నమృతంబుపోలికిని ద్రావుటచే
నీరోగు లగుచు జను లొ, ప్పారుదు రచ్చోట నిత్యహర్షముతోడన్. 108

క. కలుషము నెఱుంగమిని ని, ర్మల మానసు లగుచు నధికమహిమముతోడన్
విలసిల్లుచుందు రచ్చటఁ, జలుపుచును దపంబు మానిసందోహంబుల్. 109

గీ. అచట మృతులైన ప్రాణుల నాక్షణంబ, మోచికొనిపోయి దరులను వైచుచుండు
నమితబలమును దీక్ష్ణతుండములు గలిగి, భాసిలుచు నుండు భారుండపక్షిగణము.

వ. ఉత్తరకురువులవృత్తాంతఁబు సంగ్రహంబుగాఁ జెప్పంబడియె. మేరుపర్వత
పూర్వపార్శ్వంబునందు భద్రాశ్వంబు గలదు. దానియందు భద్రశాలం బను
మహావనంబు గలదు. 111

గీ. నిత్యఫలపుష్పయుతమును నిఖిలసిద్ధ, చారణనిషేవితంబును సంస్తుతమును
యోజనోత్సేధమును నయియొప్పుచుండు, నందుఁగాలామ్రమ నెడుమహాద్రుమంబు.

గీ. అచటఁ బురుషులు తేజోబలాన్వితులును, నమలమతులును శ్వేతవర్ణాంచితులును
జంచలాక్షులు కుముదవర్ణాంచితలును, జంద్రశీతలగాత్రలు చంద్రముఖులు. 113

గీ. వారి కెల్లను బది వేలవత్సరంబు, లాయురభ్యుదయంబు కాలామ్రరసము
గ్రోలుచుండుటఁ జేసి యేకాలమునను, వాడు నవయౌవనమున నొప్పారుచుంద్రు.

వ. నీలంబునకు దక్షిణంబుగను నిషధంబునకు నుత్తరంబుగను సుదర్శనం బను గొప్పజంబూవృక్షంబు గలదు. 115

క. అది ప్రాక్తన మది పావన, మది కిన్నరసిద్ధచారణాదినిషేవ్యం
బది సర్వకామఫలదం, బదె జంబూద్వీపసంజ్ఞ కాధారంబుౕ. 116

వ. జంబూద్వీపంబు లక్షయోజనపరిమాణంబు గలిగి యుండె. అచ్చటఁ బంచాశత్స హస్రయోజనపరిమితం బైనమాల్యవత్పర్వతంబు గలదు. దానిశిఖరంబునం దనేకపర్వతంబులు గలవు. 117

గీ. అచట నుండెడివా రెల్ల హాటకాభు, లైనవా రూర్ధ్వరేతస్కు లైనవారు
బ్రహ్మలోకంబునుండి విభ్రంశ మొంది, నట్టిఁడులు బ్రహ్మవాదు లైనట్టివారు. 118

వ. అమ్మహానీయులు భూతరక్షణార్థంబు మార్తండమండలంబుం బ్రవేశించి యరు వదిమూఁడు వేలవత్సరంబులు భాస్కరునిఁ బరివేష్టించి యరుణునకు ముందుగా నరుగుచును నాదిత్యతాపతప్తులై యరువదిమూఁడు వేలవత్సరంబులు చంద్ర మండలముం బ్రవేశించుచు నుందురు. మఱియును శ్వేతపర్వతంబునకు దక్షి ణంబుగను నిషధపర్వతంబునకు నుత్తరంబుగను రమణకం బనువర్షంబు గలదు. అందుండుమానవులు నిస్సపత్నులును పతిప్రియదర్శనులును శుక్లాభిజనసం పన్నులును నిరంతరహర్షభరితులును నై పంచశతోత్తరైకాదశసహస్రవర్షా యుష్కు లగుచుందురు. నీలపర్వతంబునకు దక్షిణంబుగను నిషధపర్వతంబు నకు నుత్తరంబుగను హిరణ్మయం బనువర్షంబు గలదు. అచ్చట హైరణ్వతి యనునదియును పక్షిరాజగు గరుత్మంతుండును గలరు. అచ్చట నుండుజనులు మహాబలశాలులును నిరంతరహర్షమానసులును నై పంచశతోత్తరద్వాదశ సహస్రవర్షపరిమితాయుష్కు లగుచుందురు. మఱియు నచ్చట శృంగవంతం బను పర్వతంబు గలదు. దానికి మూఁడు శృంగంబులు గలవు. అం దొక్కటి మణిమయంబును మఱియొకటి స్వర్ణమయంబును వేఱొకటి సర్వరత్నమయం బును గా నుండె. అచ్చట స్వయంప్రభ యగుశృంగిణీదేవి నిత్యంబును నివ సించియుండు. శృంగవంతంబునకు నుత్తరంబుగా సముద్రాంతంబునం దైరావ తం బను వర్షంబు గలదు. అందు 199

గీ. లేదు మార్తండగమనంబు లేదు ముదిమి, మానవులకు ననక్షత్రుఁ డైనచంద్రుఁ
డుండు నావృతమైయున్న జ్యోతివోలె, వెలయు నాయువు పదుమూఁడు వేలయేండ్లు.

గీ. ఉండెదరు దేవలోకవిచ్యుతినిఁ గాంచి, నట్టివా రచ్చటను నిరాహారు లగుచుఁ
బద్మవర్ణప్రభాగంధభరితు లగుచు, శాంతు లగుచును వీతరజస్కు లగుచు. 121

వ. క్షీరార్ణవంబునకు నుత్తరభాగంబున హరివర్షంబు గలదు. 122

గీ. అష్టచక్రము స్వర్ణమయంబు భూత, యుక్తము మనోజమువ పీతిహోత్రవర్ణ
మధిక తేజోవిరాజిత మైనశకట, మందు వసియించి వైకుంఠుఁ డచట నుండు.

గీ. అఖిలభూతంబులకుఁ బ్రభు వతఁ డతండె, భూతపంచకమును సర్వభువనములకుఁ
గర్తయు నతండె యాతఁడె కారయితయు, నతఁడె సృష్టియునుఁ బ్రళయమునునతఁడె.

గీ. అతఁడు సకలాంతరాత్ముఁడు యజ్ఞ మతఁడు, సర్వభూతంబులకుఁ దదాస్యంబు వహ్ని
యతఁడె నారాయణుండు నారాయణుండె, యతఁడు వా రిద్దఱును నొండెయగుటఁ జేసి.

వ. వైవస్వతమనువును, బ్రియమిత్త్రిందుడును, బృథువును, వైన్యుండును, నిక్ష్వా
కువును, నంబరీషుండును, మాంధాతయును, నహుషుండును, యయాతియును,
ముచుకుందుండును, గుబేరోశీనరుండును, ఋషభుండును, నైలుండును, నృగుం
డును, గుశికుండును, గాధియును, సోముండును, దిలీపుండును మున్నగుమహా
త్ములకును సర్వభూతంబులకును బ్రియంబును నుత్తమంబును నగు భారత
వర్షంబునందు మహేంద్రంబును, మలయంబును, సహ్యంబును, శుక్తిమంతం
బును, ఋక్షవంతంబును, వింధ్యంబును, పారియాత్రంబును ననుసప్తకులపర్వ
తంబులు గలవు. వానిసమీపదేశంబులందు సారవంతంబులును విపులంబులును
నత్యచ్ఛ్రితంబులును నవిజ్ఞాతంబులును నగుపర్వతసహస్రంబులు గలవు. మఱి
యును నిందు నార్యులును, మ్లేచ్ఛులును, మిశ్రులును నగుమానవులు గలరు.
మఱియును గంగ, సింధువు, సరస్వతి, విపుల, గోదావరి, నర్మద, బహుద,
శతద్రువు, చంద్రభాగ, యమున, దృషద్వతి, విపాశ, వేత్రవతి, కృష్ణవేణి,
యిరావతి, వితస్త, పయోష్ణి, దేవిక, వేదస్మృతి, వేదశిర, త్రిదివ, సింధు
లాకృమి, కరీషిణి, చిత్రవహ, త్రిసేన, గోమతి, ధూతపాప, చందనకౌశికి,
నాచిత, రోహితారణి, రహస్య, శతకుంభ, సరయువు, చర్మణ్వతి, వేత్రవతి,
హస్తిసోమ, దిశ, శరావతి, భీమ, భీమరథి, కావేరి, వాలుక, వాపి, శతమలి,
నీవార, మహిత, సుప్రయోగ, పవిత్ర, కృష్ణల, వాజిని, పురుమాలిని,
పూర్వాభిరామ, వీర, మాలావతి, పలాశిని, పాపహర, మహేంద్ర, పాట
లావతి, యసిక్ని, కుశవీర, మరుత్వ, ప్రవర, మేన, హోర, ఘృతవతి,
యనాకతి, యనుష్ణి, సేవ్య, కాపి, సదావీర, యధృష్య, కుశచీర, రథచిత్ర,
జ్యోతిరథ, విశ్వామిత్ర, కపింజల, యుపేంద్ర, బహుల, కువీర, యంబువాహిని,
వైనంది, పింజల, వేణ, తుంగవేగ, విదిశ, కృష్ణవేగ, తామ్ర, కపిల, ధేనువు,
సకామ, దేవస్వ, హవిస్స్రావ, మహాపథ, శిప్ర, పిచ్ఛల, భారద్వాజి, కౌశికి
శోణ, బాహుద, చంద్రమ, దుర్గ, యంతశ్శిల, బ్రహ్మమేధ్య, పరోక్ష, రోహి,
జంబువు, సునాస, తపస, దాసి, సామాన్య, వారణ, యసి, నీల, ధృతికరి,
పర్ణశ, మానవి, వృషభ, భావ, కృష్ణ, మందవాహిని, బ్రాహ్మణి, మహా

గౌరి, చిత్రోత్పల, చిత్రరథ, మంజుల, రోహిణి, మందాకిని, వైతరణి, కోశ,
శుక్తిమతి, అనంగ, వృషకాహ్వయ, కుమారి, ఋషికుల్య, మారిష, లౌహిత్య,
కరతోయ, సుపుణ్య మున్నగు పుణ్యనదు లసంఖ్యేయంబులుగాఁ గలవు. మఱి
యును గురువులు, పాంచాలములు, సాల్వములు, మాద్రేయములు, జాంగల
ములు, శూరసేనములు, పుళిందములు, బౌధములు, మాలములు, మత్స్య
ములు, కుసట్టములు, సౌగంధ్యములు, కాశ్యపరకాశికోసలంబులును, చేది
కరూశంబులు, భోజసింధువులును, నుత్తమములును, దశార్ణములును, మేకల
ములును, నుత్కలములును, నైకపృష్ఠయుగంధరములును, బోధములును,
మద్రములును, ఐరరములును, గుకురములును, గుంత్యవంత్యపరకుంతిగోమం
తంబులును, మల్లకములును, బుండ్రకములును, విదర్భములును, నృపవాహిక
లును, నశ్మకంబులును, నుత్తరాశ్మకంబులును, గోపరాష్ట్రంబులును, నధి
రాజ్యంబులును, మల్లరాష్ట్రంబులును, గేరళంబులును, మాలవంబులును,
నుపవాస్యంబులును, వక్రావక్రాతపంబులును, శకములును, విదేహంబులును,
మాగధంబులును, సద్మంబులును, మలజంబులును, విజయంబులును, అంగ
వంగకళింగంబులును, యకృల్లోమంబులును, మల్లంబులును, సుదేష్ణంబులును,
ప్రహ్లాదంబులును, మహిషంబులును, శశకంబులును, బాహ్లీకంబులును, వాటధా
నంబులును, నాభీరంబులును, గాలతోయకంబులును, బరాంతాపరాంతంబులును,
బంకలంబులును, జర్మచండకంబులును, నటవీశేఖరంబులును, మేరుభూతంబు
లును, నుపావృత్తానుపావృత్తంబులును, సురాష్ట్రంబులును, కేకయంబు
లును, గుట్టాపరాంతంబులును, మాహేయంబులును, గక్షంబులును, సాముద్ర
నిష్కుటంబులును, నంధ్రంబులును, నంతర్గిరులును, బహిర్గిరులును, నంగమ
లదములును, మగధములును, సత్వతరంబులును, ప్రావృషేయంబులును, భార్గ
వంబులును, భార్గములును, గిరాతంబులును, భాసురంబులును, నిషాదములును,
నిషధములును, నానర్తనైరృతంబులును, బూర్ణలంబులును, బూతిమత్స్యంబు
లును, గుంతిలంబులును, గుశకంబులును, దీరగ్రహంబులును, నీజికంబులును,
గల్పకారణంబులును, దిలభాగంబులును, మసారంబులును, మధుమత్తంబు
లును, గకుందకంబులును, గాశ్మీరంబులును, సింధుసౌవీరంబులును, గాంధా
రంబులును, దర్వకంబులును, నభీసారంబులును, గలద్రుతంబులును, సౌరిలం
బులును, దర్వీబల రట్ట సుదామంబులును, సుమల్లికలును, బంధాకరీకషంబు
లును, గుళిందంబులును, గంధికంబులును, వనాయువశపార్శ్వరోమకుశబిందు
వులును, కాచ్ఛంబులును, గోపాలకచ్ఛంబులును, జాంగలంబులును, సిద్ధంబు
లును, దామ్రలిప్తికలును, నౌడ్రమ్లేచ్ఛంబులును, సైరింధ్రంబులును, బార్వతీ

యంబులును, ద్రవిడంబులును, ప్రాచ్యంబులును, మూషికంబులును, బాల
మూషికంబులును, కిష్కింధంబులును, ఝల్లికంబులును, కర్ణాటకంబులును,
మాహిషకంబులును, కుంతలంబులును, సౌహృదంబులును, నలకాననంబులును,
గోకుట్టకంబులును, జోలంబులును, కొంకణంబులును, మణివాలుకంబులును,
సమంగంబులును, కనకంబులును, నూరీషాంగారంబులును, ధ్వజిన్యుత్సవసంకేత
మాల్యసేవిత్రిగర్భంబులును, వ్యాఘ్రకంబులును, గోకంబులును, ప్రోష్ఠంబు
లును, కుంగవేగధరంబులును, వింధ్యపౌలీయంబులును, బులిందంబులును,
వల్బలంబులును, మాలవంబులును, మలదంబులును, సువర్ణకంబులును, బర్బ
రంబులును, సపరవర్తకంబులును, గాలదంబులును, ముసలంబులును, స్తనవాలు
కంబులును, జండకంబులును, కురటంబులును, దోమరంబులును, హాన్యమా
నంబులును, సుతీర్థాప్రాతిసృంజయంబులును, సనిదాయంబులును, శివాటంబు
లును, దపానంబులును, సూతిపంబులును, ఋషికంబులును, విదర్భంబులును,
స్తంగనంబులును, బరతంగకంబులును, జవనంబులును, కంభోజంబులును,
దారుణంబులును, కులట్యంబులును, హూణంబులును, బాసికంబులును, రమ
ణంబులును, దరదంబులును, దశమానికంబులును, శూరాభీరంబులును, ఖాండీ
కంబులును, తుషారంబులును, బద్రాగ్రపంబులును, గిరిగహ్వరంబులును, నాత్రే
యంబులును, భరద్వాజంబులును, స్తనపోషకంబులును, ద్రోషకంబులును,
కరభంజకంబులును మున్నగునసంఖ్యాకజనపదంబులు గలవు. మఱియును
గృతయుగంబును, ద్రేతాయుగంబును, ద్వాపరయుగంబును, కలియుగంబును
ననునాలుగు యుగంబులు క్రమంబుగాఁ గలవు. కృతయుగంబునందు నాలుగు
వేలును ద్రేతాయుగంబునందు మూఁడు వేలును, ద్వాపరయుగంబునందు రెండు
వేలును నాయుర్వర్షప్రమాణంబు జనంబులకు విహితం బయ్యె. కలియుగంబున
నాయుఃప్రమాణంబు లేమిం జేసి గర్భస్థు లగుచుండఁగనే కొందఱును
బుట్టినతరువాతఁ గొందఱును ననియతంబుగా మరణించుచుండును. 126

క. కృతయుగమున బలసత్త్వ, ప్రతిభాగుణయుతులు ధర్మపరు లెల్లజనుల్
శ్రుతయుతులు రూపవంతులు, జితేంద్రియులు వీరు లమలశీలురు రాజుల్. 127

క. త్రేతాయుగమున నభిజన, జాతులు సత్యాభిరతులు జను లెల్లరు సం
ఖ్యాతీత గుణసమేతులు, స్వాతంత్ర్యాన్వితులు చక్రవర్తులు రాజుల్. 128

క. ద్వాపరయుగమున నుత్సా, హోపేతు లమేయవీర్యయుతు లన్యోన్య
వ్యాపాదనతత్పరులు ప్ర, తాపసమంచితులు జనవితానము లెల్లన్. 129

క. కలియుగమున గర్వులు లో, భు లసూయాపరులు దుష్టబుద్ధులు పాపా
త్ము లసత్యవాదులును గో, పులు మాయావులును నగుచుఁ బుట్టుదురు జనుల్.

వ. మఱియును జంబూద్వీపంబును శాకద్వీపంబును కుశద్వీపంబును శాల్మలి ద్వీపంబును క్రౌంచద్వీపంబును శకద్వీపంబును పుష్కరద్వీపంబును నను సప్త ద్వీపంబులు గలవు. జంబూద్వీపంబునందు షట్సహస్రోత్తరాష్టాదశసహస్ర యోజనంబులనై శాల్యంబు గలజంబుపర్వతంబు గలదు. దానికంటె ద్విగుణ వైశాల్యంబు గలలవణసముద్రంబు గలదు. లవణసముద్రంబు నానాధాతుచిత్రి తంబు లగుపర్వతంబులచేతను నానాజనపదంబులచేతను వ్యాప్తంబై యుండె. శాకద్వీపంబు జంబూద్వీపంబుకంటె ద్విగుణాధికం బగుపరిమాణంబు గలదియై క్షీరసముద్రంబు నావరించి యుండె. 131

క. కల నచటం బుణ్యజనపద, ము లసంఖ్యాకములు మరణమును జెందక న ర్థిలుచుందు రందుఁ దేజః, కలితు లగుచు జనము లెల్లఁ గలకాలంబున్. 132

వ. అందు మేరువు, మలయము, జలధారము, రైవతకము, శ్యామము, దుర్గము, కేసరి యనుసప్తమణిపర్వతంబులు గలవు. మేరుపర్వతంబు దేవర్షిగంధర్వాది సంయుతంబై యుండు. మలయపర్వతంబు ప్రాగాయతంబై యుండు. అచ్చట నుండి మేఘంబులు బయలువెడలుచుండు. జలధారపర్వతంబునుండి వాసవుండు నిత్యంబును జలంబు గ్రహియించుచు వర్షాకాలంబునందు వర్షంబు గురియించు చుండు. రైవతకంబునందు రేవతీనక్షత్రంబు ప్రతిష్ఠితం బయ్యె. శ్యామపర్వ తంబు నవమేఘప్రభాభాసమానంబై యున్నతంబై రైవతకంబునకు నుత్తరం బుగా నుండె. శ్యామగుణం బాపర్వతంబునుండి వచ్చుటం జేసి దానికి శ్యామ నామధేయంబు గలిగె. 133

క. ఆమహీధరము తెఱంగున, శ్యామాకృతు లెసఁగ నచటిజను లెల్లరు ని త్యామోదభరితు లగుచును, క్షేమంబున నుందు రిష్టసిద్ధులు గలుగన్. 134

వ. దుర్గశైలంబు మహోదయంబై యున్నయది. కేసరిపర్వతంబు కేసరయుతంబై యుండు. అప్పర్వతంబునుండియే వాయువు బయలువెడలు చుండు. అప్పర్వతం బుల కన్నింటికిని యోజనవిష్కంభంబు ప్రవిభాగంబువలన ద్విగుణంబుగా నుండు. మేరువునకు మహామేరువును మలయంబునకు మహాకాశంబును జల ధారంబునకు జలదంబును రైవతకంబునకుఁ గౌమారంబును శ్యామంబునకు మణికాననంబును దుర్గంబునకుఁ గుముదోత్తరంబును కేసరంబునకు మహాదాకి యును ననువర్షంబులు గలవు. మఱియును శాకద్వీపమధ్యంబునందు జంబూ ద్వీపపరిమితం బగుశాకవృక్షంబు గలదు. మఱియును. 135

క. కల నచటఁ బుణ్యజనపద, ములు శంకరుఁ డచట నుండు మునులును గీర్వా ణులుఁ జారణులును సిద్ధులుఁ,గొలుచుచు నుండంగఁ బ్రమథకోటులతోడన్. 136

క. కల రచట నాల్గువర్ణం,బులవారు స్వధర్మరతులు ముదిమియు మృతియున్
గలుగక సర్వర్తువులో, పల స్రోతస్వినులు వోలెఁ బడయుచు వృద్ధిన్. 137

వ. గంగయును సుకుమారియును గుమారియును సీతయును శివోదకయును మణిజలయును నిక్షువర్ధనికయును మున్నగు నసంఖ్యేయమహాపుణ్యనదులు శతసహస్రంబులుగా నక్కడనుండి ప్రవహించు చుండు. అచ్చోటనుండి వాసవుండు వర్షించు చుండు. 138

క. ఆపరమమంగళము లగు, నాపగలమహత్త్వ మెన్న నలవియె నాకున్
దాపఘులను బాపములను, బాపం గల నవి నిజప్రభావముచేతన్. 139

వ. మఱియును నచ్చట మృగంబులు మశకంబులు మానసంబులు మల్లకంబులు ననునాలుగు పుణ్యజనపదంబులు గలవు. మృగంబులందు బ్రహ్మభూయిష్ఠులును విహితకర్మపరాయణులును నగు బ్రాహ్మణులును మశకంబులందు ధార్మికులును సర్వకామప్రదాయకులును నగు రాజన్యులును మానసంబులందు ధర్మోపజీవు లగు వైశ్యులును, మల్లకంబులందు ధర్మశీలు రగుశూద్రులును గలరు. 140

క. దండనము చేయు తేఁడును, దండనమును నచట లేవు ధర్మముచే వా
రుండెదరు బద్ధు లగుచును, నొండొరువులు రక్షకులుగ నొండొరువులకున్. 140

వ. ఉత్తరద్వీపంబులును బర్వతంబులును దధిసురాదుగ్ధసముద్రంబులచే నావరింపంబడియె. మధ్యమద్వీపంబునందు గౌరవర్ణం బగుమనశ్శిలపర్వతంబును బశ్చిమద్వీపంబునందు నారాయణసఖం బగుకృష్ణపర్వతంబును గలవు. అచ్చట దివ్యంబు లగురత్నంబులను స్వయముగాఁ గేశవుండు రక్షించుచుఁ బ్రసన్నుండై ప్రజాసౌఖ్యంబు నాపాదించు చుండు. కుశద్వీపంబునందుఁ గుశస్తంభంబును శాల్మలిద్వీపంబున శాల్మలివృక్షంబును, క్రౌంచద్వీపంబున మహాక్రౌంచపర్వతంబును జనపదమధ్యంబునఁ జాతుర్వర్ణ్యంబుచేఁ బూజింపంబడుచుండు. మఱియును గోమంతం బను మహాపర్వతంబు గలదు. అచ్చట నారాయణుండు జ్ఞానిసంయుతుండై నిత్యంబును నివసించియుండు. శరద్వీపంబునందు విద్రుమచితంబగు సునామపర్వతంబును హేమపర్వతంబును గుముదపర్వతంబును బుష్పవత్పర్వతంబును గుశేశయపర్వతంబును హరిపర్వతంబును ననునాఱు మహాపర్వతంబులు గలవు. వాని కన్నింటికిని నంతరవిష్కంభము ద్విగుణంబు గా నుండు. మఱియును ఔద్భిదంబును రేణుమండలంబును సురథంబును లంబనంబును ధృతిమంతంబును బ్రభాకరంబును గాపిలంబును ననునేడు వర్షంబులు గలవు. 142

క. దేవులు గంధర్వులు ప్రజ, లావర్షములందు సంప్రహర్షముతోడన్
గావింతురు విహరణములు, లే వచ్చటిప్రజకు మృతియుఁ గ్లిష్టస్థితియున్. 143

క. చోరులును మ్లేచ్ఛజాతులు, లే రావర్షములలోన లే రవినీతుల్
గౌరాకారము గలసుఖ, మారుల యెల్లరును నందు మసలెడివారల్. 144

వ. క్రౌంచపర్వతంబునకుఁ బిదప వామనపర్వతంబును వామనపర్వతంబునకుఁ బిమ్మట నంధకారపర్వతంబును నంధకారపర్వతంబునకుఁ బిదప మైనాకపర్వతంబును మైనాకపర్వతంబునకుఁ బిమ్మట గోవిందపర్వతంబును గోవిందపర్వతంబునకుఁ బిదపఁ బుండరీకపర్వతంబును బుండరీకపర్వతంబునకుఁ బిమ్మట దుందుభిస్వనపర్వతంబును గలవు. ఆపర్వతంబులకు ముందువిష్కంభము ద్విగుణంబై యుండు. క్రౌంచంబునకుఁ గుశలదేశంబును వామనంబునకు మనోనుగదేశంబును మనోనుగంబునకుఁ బిదప నుష్ణదేశంబును నుష్ణదేశంబునకుఁ బిమ్మట ప్రావరదేశంబును ప్రావరదేశంబునకుఁ బిదప నంధకారకదేశంబును నంధకారకదేశంబునకుఁ బిమ్మట మునిదేశంబును మునిదేశంబునకుఁ బిదప దుందుభిస్వనదేశంబునుం గలవు. 145

గీ. దేవగంధర్వచారణసేవితంబు, లగుచు నాదేశములు పొలుపారుచుండు
గౌరవర్ణాన్వితులు గ నక్కడను నుండు, జనులు విలసిల్లుచుందురు సంతతమును.

వ. పుష్కరద్వీపంబునందుఁ బుష్కరం బనుమహాపర్వతంబు గలదు. 147

క. సతతము మహర్షులును దే, వతలును సేవించుచుండ వైభవమున నా
క్షితిధరమున నుండుఁ బ్రజా, పతి సకలద్వీపములకుఁ బాలకుఁ డగుచున్. 148

వ. ఆద్వీపంబునం దుండు ప్రజ లెల్లరును స్వయముగా నుపస్థితం బగుసిద్ధాన్నంబు భుజియించుచుందురు. అందుండు బ్రాహ్మణులకు బ్రహ్మచర్యంబుచేతను సత్యంబుచేతను దమంబుచేతను నారోగ్యాయుఃప్రమాణంబులు ద్విగుణాధికంబులై యుండు. అటుపిమ్మటఁ జతురస్రం బగుమహాశైలం బొకండు గలదు. అం దష్టదిగ్గజంబులు గలవు. అమ్మహాపర్వతంబుతిర్యగూర్ధ్వాధోభాగంబుల పరిమాణంబు చెప్ప నలవి గాదు. సకలదిశలకును నక్కడనుండి వాయువులు ప్రవర్తిల్లుచుండు నం దుండుదిగ్గజంబు లావాయువులను దొండంబులచేఁ బీల్చికొనుచు విడిచిపెట్టుచుండు. ఇంకను ననేకద్వీపంబులును ననేకవర్షంబులును ననేకపర్వతంబులునుం గలవు. వానిని లెక్కించుట కాదిశేషుం డైనను శక్తుండు గా నేరఁడు. 149

క. ఈపాద్మకల్పసృష్టిక, థాపీయూషంబు గ్రోలుధన్యుఁడు విగళ
త్పాపుఁ డయి యుండు దివిష, ద్రూపంబున దివిని మేను దొలఁగినపిదపన్. 150

ఆ. పర్వమందు దీనిఁ బఠియించినను విన్నఁ, జాలు నరకబాధ సైఁప లేక
వెతలు గుడుచుచుండుపితరుల నెల్లను, నూర్ధ్వలోకమునకు నుద్ధరింప. 151

క. అని చెప్పుటయును భీష్ముం, డనఘాధికం బైనహర్ష మావహిలంగన్
మనమునఁ దదాజ్ఞ గైకొని, చనియె హరిద్వారమునకుఁ జలుపఁ దపంబున్. 152
క. అనవుడు మునీంద్రు లి ట్లని, రనఘా నీచెప్పినట్టియంశంబుల నె
ల్లను వినుట నమృతపానం,బును జేసినయట్టితృప్తిఁ బొందితిమి సుమీ. 153
క, ఐనను నొకకోరికి మా,మానసముల నొదవెఁ దీర్థమహిమంబు విన
గా ననుడు సూతుఁ డెంతయు, నానందము నొంది యంతరంగమునందున్. 154
క. మునులార నేఁడు మీరలు, ననుఁ గాంక్షించినవిధంబున నె ముున్న వసి
ష్ఠుని నడుగ దిలీపుం డ, మ్మునినరుఁ డి ట్లనియె రాజమూర్ధన్యునకున్. 155

—: నా నా తీ ర్థ మా హా త్మ్య క థ న ము :—

గీ. ద్రవిణసాధ్యంబు లైనయధ్వరము లెన్ని, శతసహస్రంబు లేనియు సాటి గావు
గవ్వయును లేక భవవార్ధిగట్టుఁ జేర్చు, నట్టితీర్థాటనమునకు ననఘనాథ. 156
గీ. అధిప యతిరాత్రపౌండరీకాదిముఖము, లాచరించు నఫలము తీర్థాభిగమన
ఫలమునకుఁదక్కువని చెప్పఁబడియెగుహ్య,మైనఋషియజ్ఞమగుటఁదీర్థాటనంబు.
గీ. సర్వభూతంబులందాత్మసామ్య మెనయు,వాఁడును జితేంద్రియుండగు వాఁడు సత్య
నిష్ఠ గలవాఁ డహంకారనిర్గళితుఁడును, దీర్థఫలపాత్రు లగుదురు వారివేంద్ర.158
గీ. అప్రతిగ్రహణం బనుహస్తశుద్ధి, చెడనిసంతుష్టి యనియెడుచిత్తశుద్ధి
కలిగి విద్యాతపఃకీర్తికలితుఁ డగుచు, వెలసిన దృఢవ్రతుఁడు తీర్థఫలము నొందు.
గీ. తీర్థములలోన నుత్తమతీర్థ మాది, తీర్థ మొక్కటి కలదు పృథ్వీకళత్ర
పుష్కరం బను పేరను బొలుచు చుండు,నది వివిధతీర్థసాన్నిధ్య మొదవి యెపుడు.
క. వసియించుచు నుందురు స, ర్వసమయములయందుఁ దీర్థరాజంబునఁ దా
పసులును సిద్ధులు సాధ్యులు, వసురుద్రాదిత్యముఖులు వసుధాధీశా. 161
చ. తప మొనరించి దేవతలు దానవులున్ మును లాస్థలంబునన్
వ్యపగతపాపులై నిజనిజాభిమతంబులసిద్ధి నొంది రె
ల్లపుడును బద్మయోనియుఁ దదాశ్రయమున్ బెడఁబాయ కుండు నే
నెపుడును గూడ దాని స్మరియించుచు నుండుదుఁ బార్థివోత్తమా. 162
క. పితృదేవతార్చనాభ్యు, ద్యతమానసుఁ డగుచు నచట నభిషేకము నే
కృతబుద్ధి సలుపు నాతఁడు, శతాశ్వమేధములఫలము సంప్రాపించున్. 163
గీ. పుష్కరమునందు నొక్కవిప్రునకు నేని, భోజనము పెట్టునాతఁ డాపుణ్యమునను
శాశ్వతబ్రహ్మలోకవాసంబు వడసి, దివ్యరూపంబుతోడను దేజరిల్లు. 164
గీ. ఉభయసంధ్యలయందు నేయుత్తముండు,పుష్కరంబును మానసంబున స్మరించు
నతఁడఖిలతీర్థములఁ దానమాడినట్టి ఫలము నొకత్రుటిలో నొందఁగలుగుఁజూవె.

క. జననము మొదలుగఁ గావిం, చినపాపము లన్నియును నశేషమ్ముగ నా
శన మొంది తీరుఁ బుష్కర, మున కేఁగినయంతమాత్రమున నెల్లరకున్. 166

గీ. సురల కెల్లరకును మధుసూదనుండు, ప్రథముఁడై యుండినట్లు తీర్థముల కెల్లఁ
బుష్కరం బాదిమం బనఁ బొల్చు జగతి, దానిమహిమం బమేయము ధరణినాథ.

గీ. అగ్నిహోత్రంబు నూఱేండ్లు నాచరించు
బ్రాహ్మణుఁడు చెందుఫలము పూర్ణముగఁ బడయు
నొక్కకార్తికపూర్ణిమ నుండె నేని
పుష్కరమునందు నెవఁ డేసి భూవరేంద్ర. 168

క. పుష్కరగమనోద్యోగము, పుష్కరమునఁ జేయుదానములు ధర్మములున్
బుష్కరతీర్థనివాసము, దుష్కృతకోటులను దొలఁగఁ ద్రోయును భూపా. 169

వ. పుష్కరంబునకుఁ బ్రదక్షిణంబుగా నశ్వమేధఫలప్రదంబును వైకుంఠప్రాపకంబును నగుజంబూమార్గంబు ప్రవేశించి యచ్చట నైదురాత్రు లుండినవారు నరకమార్గముం గనుంగొనకుందురు. పిదప స్వర్గప్రదంబును దుర్గతిచ్ఛేదకంబును నగుతండులికాశ్రమంబు గలదు. అక్కడనుండి యగస్త్యాశ్రమంబుం బ్రాపించి యందుఁ ద్రిరాత్రోపవాసంబును బితృదేవతార్చనంబును గావించినజనుం డగ్నిష్టోమఫలంబు నొందు. పిమ్మటఁ గన్యాశ్రమంబున ఫలంబు లాహారంబుగాఁ గొని త్రిరాత్రంబులు వసియించినవాఁడు కౌమారంబు వడయు. పిమ్మటఁ బ్రవేశమాత్రంబున సర్వపాపహరం బగుధర్మారణ్యంబునకుం జేరి పితృదేవతల నర్చించి సర్వకామసమృద్ధయాగఫలంబు గాంచు. పిదప దానికిఁ బ్రదక్షిణముగా యయాతిపతనక్షేత్రమున కేఁగె నేని హయమేధయాగఫలంబు నొందు. తరువాత మహాకాలంబు గలదు. అందుఁ గోటితీర్థంబును స్పృశియించినమాత్రంబున శతాశ్వమేధఫలంబు గలుగు. పిదప భద్రవటం బనుప్రసిద్ధిం బడసినశివతీర్థంబు గలదు. అచ్చట మహాదేవదర్శనంబు గావించి తదనుగ్రహంబున గోసహస్రదానఫలంబు వడయు. దానంజేసి సర్వసంపత్సమృద్ధంబును నసపత్నంబును నగు గణాధిపత్యంబు నొందు. 170

చ. కలదు కళింగమం దమరకంటకభూధర మందు రేవ నాఁ
గలదు స్రవంతి యొం డఖిలకల్మషనాశని యందు స్నానముల్
సలుపుచు మూఁడుకాలములు సల్పి తపంబును సత్వరంబుగా
ఫలమును గాంచఁ గల్గిరి సుపర్వులు దానవులున్ నృపోత్తమా. 171

గీ. కనఖలాచలమందు గంగాస్రవంతి,యును గురుక్షేత్రరాజమందును సరస్వ
తియును బూతము లఖిలప్రదేశములను,నర్మదానది పూత యనంగఁ బొలుచు.

గీ. త్రిదినపావనము సరస్వతీజలంబు, సప్తదినపావనము యమస్వసృజలంబు
స్నానమాత్రపావనము ద్యోనదిజలంబు, రేవజలము దర్శనమాత్రపావనంబు. 173

ఆ. నర్మదాజలంబునను మున్గి యమరకం, టకమునందు నిరశనవ్రతంబు
కలిమి నొక్కరాత్రి గడపినమానవుఁ, డుభయకులసహస్ర ముద్ధరించు. 174

గీ. శ్రాద్ధ మొనరించి నర్మదాజలమునందుఁ, బిండ మర్పించెనేని యాపిండ మొకఁడె
చాలుఁ బితరుల నాభూతసంప్లవంబు, దృప్తిపఱుపంగఁ భూతధాత్రీకళత్ర. 175

ఆ. అమరకంటకాద్రి కన్నిదిక్కుల రుద్ర, కోటి యుండునట్టిచోటఁ దీర్థ
మాడెనేని చాలు నది రుద్రకోటికి, సంఘటిల్లఁజేయు సమ్మదంబు. 176

గీ. పర్వతమునకుఁ బశ్చిమభాగమందు, శంకరుం డుండు నచ్చోట స్నానమాడి
శ్రద్ధతోడను బితృతృప్తి సలుపునాతఁ, డుభయవంశములను గూడ నుద్ధరించు.

గీ. అతనిపితృదేవతలు స్వర్గమందు నెల్ల, విధముల సుఖించి యఱువదివేలయేండ్లు
జననమరణప్రవాహఘట్టనము లేని, రుద్రలోకంబు నవలఁ జేరుదురు భూప. 178

గీ. యోజనంబులకొలఁదిగా నున్నతంబు, విస్తృతంబును నైనపృథ్వీధరంబు
పైని నఱువదికోటు లర్వదిసహస్ర, ములును గలవు మహాతీర్థములు నరేంద్ర.

సీ. అప్సరస్త్రీయుక్తుఁ డయి నూఱు వేలేఁడు, లమరపురీసౌఖ్య మనుభవించు
ననుభవించి వసుంధరాధిపాన్వయమందు, నవనినాథుండు గా నవతరించు
నవతరించి చిరాయురారోగ్యసంపద, లెల్లవేళల నొప్ప నుల్లసిల్లు
నుల్లసిల్లి యనన్యయోగ్యమైనప్రశస్తి, నెల్లదిక్కుల నల్లిబిల్లిగొలుపు

గీ. శౌచము నహింసయును బ్రహ్మచర్యమును జి
తేంద్రియత్వం బఖిలభూతహితముఁ బడయు
నమరకంటకపృథ్వీధరమునయందు
క్షేత్రపాలకసేవ చేసినజనుండు. 180

గీ. అగ్నిసలిలప్రవేశంబు లాచరించి, యైన ననశనవృత్తిచే నైన నసువు
లమరకంటకశైలమునందు విడుచు, నట్టివారికి లేదు జన్మాంతరంబు. 181

గీ. అమరకంటకగిరిశిఖరముననుండి, పతనమును జెంది ప్రాణవిచ్యుతిని గన్న
యుత్తమునకుఁ బునర్జన్మ ముండెనేని, యతనిఁబోలెడిఘనుఁ డుండఁడవనియందు.

వ. ఆపర్వతంబునకుఁ బశ్చిమభాగంబునఁ గోటితీర్థంబు గలదు. అచ్చట రుద్రుండు జ్వాలేశ్వరుం డనుపేరఁ బరగుచుండు. ఆప్రదేశంబునఁ బిండప్రదానంబు గావించెనేని పితరులు పదివేలయేండ్లవఱకును సంతృప్తి నొందుదురు. నర్మదామహానదికి దక్షిణభాగంబునఁ గపిలానది గలదు. అన్నదియందు శతకోటితీర్థంబులు గలవు. అచ్చటఁ గావించినపుణ్యకార్యంబులు కోటిగుణంబుగా ఫలియించు. కాలవశంబునఁ దత్తీరంబునం బడినవృక్షంబులు సైతము నర్మదాజలస్పర్శ

భాగధేయంబునంజేసి సద్గతిం జెందుచుండు. విశల్యయనుమతియొక్క పుణ్యనది నర్మదాసంశ్రయంబున విరాజిల్లుచుండు. అందు స్నానంబు గావించిననరుండు విశల్యుం డగు. సర్వపాపప్రణాశిని యగునన్నదీమతల్లిక యమరకంటకపర్వతంబునకు విచ్చేసిన దేవర్షిగణంబుచే నుత్పాదింపంబడియె. తత్తోయంబున మునింగి యొక్కరాత్రి యుపవాసంబు గావించినజనుండు శతకులంబుల నుద్ధరించు. 183

గీ. నర్మదానది నెచట నైనను మునుంగ, లభ్యమగు నశ్వమేధఫలంబు భూప
నర్మదోత్తరకూలమునను వసించు, వారు త్రిదివంబునందున్నవారు చూవె. 184

వ. గంగాసరస్వతీనదులయందుం గావించినస్నానదానంబులు సమానఫలంబు లని మహేశ్వరుండు భాషించె. ఫేనోర్మిసహితం బగునర్మదాతోయంబు సర్వపాపహరంబు. నర్మదాతటంబున నహోరాత్రోపవాసంబు గావించిన బ్రహ్మహత్యావిముక్తి కలుగు. నర్మదామహానది లోకోపకారార్థంబు ధర్మకాంక్షు లగు మహాత్ములచే యజ్ఞోపవీతపరిమితంబు లగుబహురూపంబులు గా విభజింపంబడియె. తత్తత్స్థానంబులందు స్నానంబు గావించిన మహాపాతకంబులు నయితము పటాపంచ లగు. 185

—: త్రిపురసంహారవృత్తాంతకథనము :—

క. జ్వాలేశ్వర మనుతీర్థము, త్రైలోక్యప్రథిత మొండు తనరారెడు భూ
పాలక తద్వృత్తాంతము, నాలింపుము విస్మయంబు నాపాదించున్. 186

గీ. పూర్వమందు నింద్రాదిసుపర్వు లెల్ల, భయవికంపితులై 'పాహి పాహి' యనుచు
నార్తరవములతో నంధకారికడకు, నరిగి మొఱవెట్ట విని హరుం డనునయించి.

ఉ. ఏమి ప్రమాదమేర్పడియె నేమి భయంబు జనించె నింద్రము
ఖ్యామరులార మీముఖములందు వికాసము లేనికారణం
బేమియొ నాకుం జెప్పుఁ డన నెల్లసుపర్వులు మ్రొక్కి శూలికిన్
స్వామి కలం డొకం డసురనాథుఁడు బాణుఁడు నాఁగ నుర్వరన్. 188

క. ఆతఁడు బలదర్పితుఁ డై, కాతరభావంబు లేక గగనమున మహా
భూతమువలెఁ ద్రిపురాధి, స్థాత యగుచు విహరణంబు సలుపుచు నుండున్.

క. యాగములు చేయునిమ్ములు, భాగవతులు గలిగినట్టిపట్టులును మహా
యోగులు గలచోటులు భూ, భాగంబున వానికతనఁ బాడై పోయెన్. 190

గీ. స్వైరసంచారి యగువానిచర్యవలన, సంచలించుచు నున్నవి జగము లెల్ల
బ్రతుకఁ జాలము నీపాలఁ బడినవార, మిందఱముగూడను ననుగ్రహింపు మభవ.

శా. కావం గల్గినవాఁడ వార్తులను దుర్గర్వాంధులన్ రూపఱన్
గావింపం గలవాఁడ వార్తజనరక్షాదుష్టశిక్షార్థమై

యావిర్భావము గన్న దైవమవు మ మ్మాపన్నులఁ బ్రోవఁగా
నీవే తప్పఁ బరం బెఱుంగము భవానీనాధ పాలింపవే. 192.

క. అని ప్రార్థించిన నీశ్వరుఁ, డనిమిషులకు సుప్రసన్నుఁ డయి సురలారా
చనుఁ డీక సుఖముండుఁడు మీ, పనివీఁదనె యుందు నేను భయ మొందకుఁడీ.

క. అనవుడు దేవత లెల్లరు, మనమున మోదంబు గదుర మరలన్ ద్రిదివం
బున కేఁగుదెంచి యాదై, త్యనిసంహారంబు గోరు చుండఁగ నంతన్. 194

మ. నిటలాక్షుండు నిశాచరప్రమథనోన్నిద్రాత్ముఁడై నర్మదా
తటముం జేరి స్మరించె నారదుని నంతన్ దేవతామౌని య
చ్చటికిన్ దక్షిణమంద వచ్చి పరమేశా యానతిమ్మంచు ని
ల్చుటయున్ మ్రోలిలను నానతిచ్చెను గిరీశుం డిట్టు లమ్మౌనికిన్. 195

క. నారద బాణుం డనెడును, రారాతి యొకండు లోక మంతకు వెత చే
కూరుచుచు నుండె దానికిఁ, గారణము తదీయకంబుకంధరలె సుమీ. 196

క. వారలు పరమపతివ్రత, లారామారత్నములమహత్త్వముచేఁ జే
కూరెను ద్రిపురములకు స, చారక్షమ మైనదివ్యశక్తి మునీంద్రా. 197

క. ఆత్రిపురములకు నాధుం, డై త్రిదశారాతి జగదపాయనిదానం
బై త్రిమ్మరుచున్నాఁ డది, మాత్రము సహింప రాదు మాబోఁటులకున్.

క. కావున సతతము భర్తయె, దైవం బని యెంచుచుండు దైత్యసతులకున్
భావమ్ములఁ జాంచల్యం, బావిర్భావంబు నొందున ట్లొనరుపుమా. 199

క. ఆచలనమె దైత్యుల, శ్రీచలనము నీకు వేయి చెప్పఁగ నేలా
వే చనుము దేవకార్యము, నీచాతుర్యంబుతోడ నెఱవేఱుపుమా. 200

చ. అనవుడు భక్తినమ్రవదనాంబుజుఁడై సురమౌని శంకరా
జ్ఞను గొని యాక్షణంబ దితిజప్రభు వేలుపురంబుఁ జేరి యా
దనుజకులావతంసము యథావిధిఁ జేసినగౌరవంబుఁ గై
కొని నుడుపం దొడంగెఁ గడు గొప్పగ దానములన్ వ్రతంబులన్. 201

క. ఆసమయములందును బా, ణాసురునకుఁ బట్టమహిషి యైనయనౌప
మ్యాసతి దేవమునీంద్రుని, డాసి యిటులు పల్కఁగాఁ దొడంగెను భక్తిన్. 202

గీ. అడుగఁ దలఁచితి నొకమాట యమరమౌని, కనికరము నీకు నామీఁదఁ గలిగెనేని
దానములలోన నుత్తమదాన మేదొ, వ్రతములం దేది యుత్తమవ్రతమొ చెపుమ.

క. అనవుడు నారదుఁ డాయమ, కును ని ట్లనె వేదపారగుం డగుభూదే
వునకుఁ దిలధేనుదానం, బొనరించుట యుర్వి యెల్ల నొసఁగుటె సుమ్మా. 204

గీ. అట్టిదానంబు గావించినట్టిధన్యు, లక్షయం బగుస్వర్గమునంద యుందు
రనుభవించుచు నింద్రాదు లనుభవించు, సకలభోగంబులను గూడ జలజగంధి.

వ. మఱియు నొకమాట వినుము. చతుర్థియును సప్తమియును ద్వాదశియును సంక్రాంతియును విషువంబును దినచ్ఛిద్రముఖంబును ననుదివంబులు పుణ్యావహంబులు. ఈదినసంబులయం దుపవాసవ్రతంబు గావించినపడంతులకు స్వర్గంబు కరతలామలకంబు సుమా. 206

క. ఉపవాసవ్రతమును నే, రుపుతో రక్షించుకొనుసరోజాక్షుల నొక్కపుడును గడగంటను నూ, రుపుతోఁ గనలేఁడు కలిపురుషుఁడు లతాంగీ. 207

క. కావింపఁ దగినదానము, గావింపఁగఁ దగినవ్రతము గావించితి నీకై వసము నింతి యెట్టులు, కావింపఁగఁ దగునొ యటులు కావింపు మిఁకన్. 208

గీ. పోయివచ్చెద ననవుడుఁ బూవుఁబోఁడి, స్వామి నీచెప్పినట్టుల సలుపుదానదానము గ్రహింపు మీవె నే ధన్య నగుదు, నంతకంటెను బాత్రులింకెవరు నాకు.

క. ఇచ్చెద హిరణ్యరాసుల, నిచ్చెద భూములను గృహము లిచ్చెద నే మే మిచ్చిన సాఫల్యమె నా, యిచ్చెడిదానమున కిత్తు నే నవి యెల్లన్. 210

చ. అనవుడు మౌని యిట్లనియె నాయమతోన్ తరుణీమణీ తపో
ధనులము మేము మాకు ధనధాన్యము లేల గృహంబు లేల ని
ర్ధనుఁడు కుటుంబి యైనయొక బ్రాహ్మణవర్యున కిమ్ము సర్వముర్
గనియెద వీవు జన్మమును గాంచినదానికి సార్థకత్వమున్. 211

ఉ. మాయెడ నుంచుభక్తియె సమస్తము నిచ్చుట మాకు వేఱుగా
నీయఁగఁ గైకొనంగ నెదియేనియు లే దిఁకఁ బోయినత్తు నం
చాయతివల్లభుండు త్రిపురాసురకాంతలచిత్తవృత్తులన్
గాయముచేయకుండఁగ నెకైకొని నేర్పున నేఁగె నంతటన్. 212

క. త్రిపురములలోన నెన్నియొ, విపరీతముగాఁగ నుద్భవించె మహోత్పాతపరంపరలు జనంబుల, కపరిమితంబైనభీతి యాపాదిల్లన్. 213

క. ఇది యిటు లుండఁగ ధూర్జటి, యద నెఱిఁగినవాఁడు గాన నాక్షణమున నర్మదదరి మాహేశ్వరి మను, పదమునకున్ జేరి త్రిపురభంగోత్సుకుఁడై. 214

సీ. ధనువుగాఁ జేసి మందరధరిత్రీధరం, బును వాసుకిని గుణంబుగను జేసి
పంకజనేత్రుని బాణంబుగను జేసి, మాహేశ్వరమును ధామముగఁ జేసి
యశ్వంబులుగఁ జతురామ్నాయములఁ జేసి, బలముగాఁగను జేసి ప్రమథగణము
నాశ్వినేయులను రథాంగంబులుగఁ జేసి, చాపాంతముగ దివస్పతినిఁ జేసి

గీ. యాశుగమునఁ గుబేరుని నగ్ని నెదుట, వాయువును నోట దక్షిణవామకరము
లందు యమకాలులను రథాంగారకముల, యందు గంధర్వపతులను ననువుపఱచి.

గీ. పద్మజుని సారథిగను నేర్పఱిచి తాను, సర్వసర్వంసహాతలస్యందనంబు
నధివసించి తదేకలక్ష్యంబు గలిగి, స్థాణువుగను సహస్రవత్సరము లుండె. 216

వ. అంత నొక్కనాఁడు. 217

గీ. ఎపుడుత్రిపురంబులునుగూడి యేఁగుదెంచి,యాడుచుండెనొయంతరిక్షాంగణమున
నపుడె విషమాంబకుఁడు త్రిశల్యమున వాని,నొక్కసారిగ భేదించె దిక్కు లదర.

క. భేదించి త్రిపురముల హరుఁ, డాదిత్యులగోడు మాన్ప నపమృత్యువు ను
త్పాదింప దానవులకున్, రోదసులను నిండి కాలరూపము దాల్చెన్. 219

గీ. అంతఁ బ్రళయాంతకుఁడు వోలె నవఘళించె, సప్తజిహ్వాలతోడ వైశ్వానరుండు
వానికిం దోడు సంవర్తకానిలుండు, తాను గూడ విజృంభించెఁ దక్షిణంబ. 220

గీ. ఇరువురును గూడి భీకరాకృతులతోడ, దాడివెడలిరి త్రిపురవిధ్వంసమునకు
నగ్నియును వాయువును నేక మైనయపుడు,కాదగిన దేదియోయది కాఁదొడంగె.

సీ. భగ్నంబు లయ్యెను బ్రాసాదతతు లెల్లఁ, దరువు లన్నియును దగ్ధంబు లయ్యె
సదనంబు లన్నియు జ్వాలాన్వితము లయ్యె, గోపురశిఖరముల్ కూలిపోయె
వ్యోమయానంబులు నామశేషము లాయెఁ, బ్రాకారములు పటాపంచలాయె
సలిలాశయంబులు సడమదంబై పోయె, రథ్యావితానముల్ రగులుకొనియెఁ

గీ. బ్రజలహాహారవంబులు పరువులిడియెఁ, బశుపతత్త్రివిరావముల్ ప్రబలమయ్యె
నంధకారంబువలె ధూమ మావరించె, నేమిచెప్పుదుఁ ద్రిపురదుష్కృతఫలంబు.

క. దానవశవకోటులతో, దీనారావములతోడఁ ద్రిపురమ్ములు దా
వానలఘోరజ్వాలా, లీనారణ్యములువలె జ్వలింపఁ దొడంగెన్. 223

గీ. అగ్నిపర్వతములచేత నాక్రమింపఁ బడియెఁ ద్రిపురంబు లాత్మీయబలము తఱిఁగి
పాతకము హెచ్చినకొలందిఁబాడుచేయు,జగములుబ్బూఁతలూఁగించుమగలనేని.

క. అప్పుడు బాణాసురుఁ డా, ముప్పును గనుఁగొని సమస్తమును ద్ర్యంబకుఁడే
యిప్పని చేసెను శూలికిఁ, దప్పు మఱొక్కనికిఁ జెనయఁ దరమే నన్నున్. 225

క. అని తలపోయుచుఁ దా న, ర్చనచేసెడిత్రిభువనేశ్వరం బనులింగం
బును దాలిచి మస్తకమునఁ, జనుదెంచె నొకండ నగరచత్వరమునకున్. 226

గీ. అటులు చనుదెంచి దైత్యేంద్రుఁ డార్తితోడ,మనమునఁదలంచి శర్వుని ననియెనిట్లు
దేవ తప్పున్న దండింపు మీవు నన్నుఁ,గాని లింగంబు మాత్రము గాదు చెఱుప.

క. కాలుపుము నన్ను శంకర, కాలుపఁ దగినంతపాతకము చేసినచోఁ
గాలక తూలక ప్రేలక, నాలింగము మాత్ర మున్న నా కదె చాలున్. 228

క. సమయింపఁ దగినదోషము, సమకూడెన యేని నన్ను సమయింపఁ గదే
ప్రమథాధినాథ నాలిం,గము మాత్రము చెడక యుండుఁ గాక స్థిరముగాన్.229

క. ననుమథియించిన నా కది, యనుమతమే కాని నాభవాంతరమందున్
మనసిజహర త్వల్లింగా, ర్చనభాగ్యము మాత్ర మొకఁడు సమకూర్పఁ గదే.230

తోటకము. హర చంద్రకిరీట జోహారు సుధా, కరశేఖర జోతలు కామహరా
కరుణింపుము దుష్కృతకర్మనిరా, కరణాహితకంకణ కాలతనూ. 231

తోటకము. గిరిజాహృదయాబ్జనికేతన ని, ర్జరరక్షణదీక్షిత సర్వగుణా
కర శంకర సాధునికాయసము,ద్ధరణా త్రిపురాసురదర్పహరా. 232

తోటకము. తరుణీతనయావసథప్రభవ, స్మరణవ్యసనాహృతసత్త్వుఁడ నై
చరియించితి నాయపచారములన్, గిరిశా క్షమియింపుము కేల్మొగుతున్. 233

తోటకము. బహుజన్మము లెత్తితిఁ బాతకముల్,సహియింపఁగఁ రానివి సల్పితి నా
కిహమున్ బరమున్ గలదే త్వదను, గ్రహ మీశ్వర నాయెడఁ గల్గనిచోన్.

క. అని బహువిధములఁ బ్రార్థన, మొనరించిన శివుఁ డనుగ్రహాపేతుం డై
తనపరివారముతోడన్, గనఁబడి దైత్యాధినాథునకు ని ట్లనియెన్. 235

క. వత్సా నీయెడ నాకున్, వాత్సల్యము గలిగె భయము వల దుండుము నీ
పుత్త్రాసహముతోడను బహు, వత్సరములు సురలకును నవధ్యుఁడ వగుచున్.

గీ. అని వరం బిచ్చి బాణున కంధకారి, గగనమున మండుపురములు గాంచె రెండు
కాంచినంతనమరకంటకముననొక్క,-పురము శ్రీశైలముననొక్కపురముఁబడియె.

క. అప్పురములు పడినంతన, యుప్పరమున కెగసె జ్వాల యొక్కటి దెసలన్
గప్పిన తేజముతోడను,నుప్పతిలఁగ సాధ్వసము దివౌకసులకున్. 238

క. స్మరహరుఁ డది గనుఁగొని తన, శరమును మాహేశ్వరమున స్తంభించి శిఖిన్
దరలించి యంత మూఁడవ. పురమును రక్షించె నసురపుంగవునకు నై. 239

క. అంతట నాపురముం గొని, సంతోషముతోడఁ దిరుగ సాగెను గగనం
బంతయును దైత్యనాథుఁడు, చింతాలేశమును లేక శివతేజమునన్. 240

క. జ్వాలలతోడఁ బురంబులు, కూలి పడినచోటు రుద్రకోటులచేతన్
గ్రాలుటయె కాక గ్రాలెను, జ్వాలేశ్వర మనెడితీర్థవర్యం బగుచున్. 241

గీ. కావున నమరకంటకగ్రామమునకుఁ, బోయిననరుండు పదునాల్గుభువనములను
బాలనముచేసితీఱు నబ్దములు వేయి,కోటులును బైని ముప్పదికోటు లధిప. 242

గీ. చంద్రసూర్యోపరాగముల్ సంభవించి, నపు డమరకంటకాద్రికి నరిగె నేని
యశ్వమేధంబు గావించినంతకంటె, దశగుణాధికఫలము నాతండు చెందు. 243

క. స్నానంబును గావించిన, మేనులు విడిచినను నచట మేదినిలోనన్
గానక జన్మము మరలన్, మానవు లుండెదరు విష్ణుమందిరమందున్. 244

క. అమరేశ్వరదేవునిశై, లమునందును దన్నదీజలంబునఁ దత్తీ
రమునందుఁ దపము చేయుచు, శమఘను లుండెదరు సర్వసమయములందున్. 245

వ. పిదప రేవాకావేరీసంగమతీర్థంబు గలదు. 246

క. ఘోరంబుగ రేవాకా, వేరీసంగమమునందు విషమేక్షణునిం
గూరిచి తపముం జేసెఁ గు, బేరుం డొకవర్షశతము పృథివీపాలా. 247
క. ఆతనితీవ్రతపమునకుఁ, జేతోమోదంబు గలుగ శితికంఠుఁడు దా
నేతెంచి వత్స వరమొకఁ, డేతత్క్షణమంద కోరు మిచ్చెద ననుడున్. 248
క. దాక్షాయణీమనోహర, వీక్షించితి వేని కరుణ వెలయఁగ నన్నున్
యక్షులకు నెల్లరకు న, ధ్యక్షుఁడ నగు నట్లు వరము దయచేయఁగదే. 149
క. అని వేఁడుటయును నట్టులె, యని యీశ్వరుఁ డానతిచ్చి యంతర్హితుఁ డ
య్యెను నంత యక్షలోకం,బున కధిపతి యై ధనాధిపుఁడు విలసిల్లెన్. 250
క. కావున వలయును రేవా, కావేరీసంగమమునఁ గావింపఁగ నా,
ప్లావమును వంచితుల మై, పోవల దనునట్టిబుద్ధి పొడమినవారల్. 251
క. కావేరియు నర్మదయును, గావించును సకలపాతకప్రమథనమున్
భూవర తత్సంస్పర్శము, గావించుట దినము చూఱగ్గొనుటె సుమా. 252
ఉ. స్నానము చేసి తజ్జలమునన్ వృషభధ్వజునిన్ భజించినన్
గానక కాని కాంచియును గాని యొనర్చినపాతకౌఘముల్
తోన నశించుఁ బావకములోఁ బడవైచినదూది వోలె న
ద్దానన సంఘటిల్లు శివధామనివాసము మర్త్యకోటికిన్. 253
గీ. అచల నగ్నిప్రవేశంబు నాచరించి, కాని యనశనవృత్తిచేఁ గాని తనువు
విడిచిపెట్టినదేహి యావృత్తి లేని, గతికిఁ జేరు నటంచు శంకరుఁడు పలికె. 254
క. సమకూరితీఱు గంగా, యమునాసంగమమునందుఁ బ్రాప్తించుమహా
ర్థము రేవాకావేరీ, సమ్మాగమమునందు మనుజసంతతి కెల్లన్. 255
వ. మఱియును నర్మదోత్తరకూలంబునందు యోజనవిస్తృతంబును సర్వపాపహరంబును నగుపత్త్రేశ్వరం బనుతీర్థంబు గలదు. అచ్చట స్నానంబు గావించిననరుండై మువేలవత్సరంబులు కామరూపధరుండై దేవతలతోఁ గూడి విహరించుచుండు. మఱియును గర్జనం బనునొకానొకతీర్థంబు గలదు. తదీయప్రభావంబువలన దానికింద్రజిత్తీర్థ మనునామంబు ప్రాప్తించె. అచ్చట మేఘుండు నిత్యసన్నిహితుండై యుండు. మేఘరావం బనుమఱియొకతీర్థంబు గలదు. అచ్చట నిత్యంబును మేఘంబులు గర్జించుచుండుటయే కాక మేఘనాదుండు వరప్రసాదంబు వడసి గణరూపంబున నివసించి యుండె. బ్రహావర్త మనుమఱియొకతీర్థంబు గలదు. అచ్చట బ్రహ్మ నిత్యమును సన్నిహితుం డై యుండు. బ్రహ్మావర్తంబున స్నానంబు గావించిననరుండు బ్రహ్మలోకంబున నిత్యనివాసంబు వడయు. అంగారేశ్వరం బనుమఱియొండు తీర్థంబు గలదు. అచ్చటఁ గావించినస్నానంబు రుద్రలోకప్రాప్తికరంబు. అటుపిమ్మటఁ గపిలాతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించిననరుండు

గోసహస్ర ప్రదానఫలంబు నొందు. పిమ్మటఁ గాంచీతీర్థం బనుమహాతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించిన జనుండు గోలోకనివాసభాగ్యంబు వడయు. ఆపైని గుండలేశ్వరతీర్థంబు గలదు. అచ్చట రుద్రుండు పార్వతీసమేతంబుగా సన్నిహితుఁడై యుండు. తత్తీర్థంబున స్నానంబు చేసిననరుండు దేవతలకును నవధ్యుండగు. తరువాతఁబిప్పలేశ్వరం బనుమహాతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించె నేని రుద్రలోకంబు ప్రాప్తించు. పిమ్మట విమలేశ్వరం బనుతీర్థంబు గలదు. అచ్చట నీశ్వరుండు దేవశిఖను బ్రతిష్ఠాపించె. అందుఁ బ్రాణత్యాగంబు గావించిన రుద్రలోకంబు ప్రాప్తించు. అనంతరంబ పుష్కరిణీతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించినంతమాత్రంబున దేవేంద్రునియర్థాసనంబు నధిష్ఠింపం గలుగు. పిదప నర్మదాతీర్థంబు గలదు.

గీ. నదులలోపల నర్మదానదికి సాటి, యైననది గానరా దది యంధకారి
తనువినిస్సృతి యగుటను దరతరంబ, పావనముచేయు జంగమస్థావరముల.

దండకము. రేవా పవిత్రీకృతస్వాశ్రితా దేవసంఘాతసంస్తూయమానప్రభావా సమస్తాఘవిచ్ఛేదినీ పుణ్యతోయా భవాంభోధిసంతారిణీ కృత్తివాసోవపుర్నిస్సృతా సర్వజాడ్యాపహారీ యశేషప్రపంచార్చితా స్వప్రకాశా కృపాంభోనిధీ జ్ఞానదాత్రీ మహైశ్వర్యదా తాపసారాధితా భక్తకల్పద్రుమంబా సరిద్రత్నమా నీకుఁ గేల్మోడ్పు నిష్కల్మషా నీకు జోతల్ స్వమాహాత్మ్యసంశోభినీ నీకు దండంబు విశ్వాధికా నీకు సాష్టాంగముల్ తల్లి జోహారు సర్వాపదుద్ధారిణీ మ్రొక్కు నిత్యోత్సవా కర్ణసంస్పర్శముల్ లోకవంద్యా నమస్కారముల్ శోకహంత్రీ ప్రణామంబు దేవీ నమస్తే నమస్తే నమః.

క. అని యీ విధమున రేవను, ననిమిషులును దాపసులును నానందమునన్
వినుతించి పరమసుఖముం, గనుఁగొని రీస్తవము వినినఁ గలుగు శుభంబుల్.

వ. పిదప శూలభేదాతీర్థంబు గలదు. శూలిచే నచ్చట శూలంబు నిపాతితం బగుటచే నాక్షేత్రంబు శూలభేదాతీర్థం బనునామంబునం బరగె. అచ్చట స్నానంబు గావించి మహాదేవుని నర్చించునరుండు గోసహస్రదానఫలంబు నొందు. మూఁడు దినంబు లావిధంబున నాచరించినవాఁడు జన్మరాహిత్యముం బడయు. అనంతరంబు నర్మదేశ్వరంబును నాదిత్యేశ్వరంబును వరుణేశ్వరంబును నీరాజేశ్వరంబును ననుమహాపుణ్యతీర్థంబులు గలవు. తద్దర్శనంబున సర్వతీర్థసేవాఫలంబు లభించు. పిమ్మటఁ గోటితీర్థం బనుమహాతీర్థంబు గలదు. అచ్చట మున్ను దానవాసురులకు గొప్పయుద్ధంబు తటస్థించె. అయ్యుద్ధంబున నసురులకోటి శిరంబులం దెగవ్రేసి బలదర్పితు లగుదానవులు శూలపాణి నచ్చటఁ బ్రతిష్ఠించి తల్లింగంబుపై నాకోటిశిరంబు లుపాయనంబుగా నుంచిరి. దానంజేసి శూలపాణి

కోటీశ్వరాఖ్యం బడసె. అమ్మహాతీర్థంబు దర్శించినవా రెల్లరును దేహంబు తోడన స్వర్గంబున కేఁగఁ దొడంగిరి. అంత నింద్రుం డసూయావిష్టమానసుం డై యాతీర్థ రాజంబును వజ్రకీలయంత్రితముం జేసె. నది మొదలుగ లోకులకు దేహంబుతోడిస్వర్గగమనం బుడిగె.

క. అది బహుమాహాత్మ్యము గల, యది దానను దీర్థమాడిన నైనను రాట్పదము మహీతలమున శివ, పదము పరంబునను గలుగుఁ బ్రాణుల కెల్లన్.

వ. పిదప నగస్త్యేశ్వరం బనుదీర్థంబు గలదు. అందు స్నానంబు గావించిన బ్రహ్మహత్యామహాపాపవిముక్తుం డగు. మఱియు నచ్చోటఁ గార్తికకృష్ణచతుర్దశి యందు నేకాగ్రమానసంబున నగస్త్యేశ్వరుని ఘృతంబుచే స్నానంబు చేయించిననరుం డిరువదియొక్కతరంబులవఱకును దనవంశము నంతయును నీశ్వరధామంబున నిలుపంగలండు. మఱియు నచ్చోటఁ గావించిన దానంబులు కోటిగుణఫలదాయకంబు లగు. అనంతరంబు రవిస్తవతీర్థంబు గలదు. అందు స్నాతుం డయ్యె నేని మహారాజసింహాసనస్థుం డగు. నర్మదాదక్షిణకూలంబున శక్రతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసి యొక్కరాత్రి యుపవాసంబు గావించి జనార్దనుని నర్చించిన గోసహస్రదానఫలంబును వైకుంఠంబును బ్రాప్తించు. పిదప ఋషితీర్థంబు గలదు. అందు స్నానంబు గావించె నేని కైలాసవాసభాగ్యంబు చేకూరు. మఱియు నంద నారదతీర్థంబు గలదు. అందలిస్నానంబు గోసహస్రదానఫలప్రదంబు. పిదప దేవతీర్థంబు గలదు. అది మున్ను బ్రహ్మచే నిర్మింపంబడియె. నందలిస్నానంబు బ్రహ్మలోకప్రదంబు. పిదప నమరస్థాపితం బగునమరకంటకతీర్థంబు గలదు. అందలిస్నానంబు గోసహస్ర దానఫలం బొసంగు. పిమ్మట వామనేశ్వరతీర్థంబు గలదు. తత్తీర్థసందర్శన మాత్రంబున బ్రహ్మహత్యావిముక్తుం డగు. పిదప నీశానేశతీర్థంబును వటేశ్వర తీర్థంబును గలవు. తత్తీర్థదర్శనంబునం జేసి జన్మంబునకుఁ బర్యాప్తఫలంబు చేకూరు. పిమ్మట భీమేశ్వరతీర్థంబు గలదు. తత్తీర్థస్నానమాత్రంబున సకల వ్యాధిదుఃఖనిర్ముక్తుం డగు. పిమ్మట వారణేశ్వరతీర్థంబు గలదు. తత్స్నానంబున సర్వాపద్విముక్తుం డగు. పిదపసోమతీర్థంబు గలదు. అందు భక్తిసమన్వితుం డయి స్నానంబు గావించి చంద్రదర్శనంబు చేసెనేని తత్క్షణంబ దివ్య దేహంబు దాల్చి యరువది వేలవత్సరంబులు సదాశివుండువోలె శివలోకంబున విరాజిల్లు. పిదపఁ బింగళేశ్వరతీర్థంబుఁ గలదు. తత్తీర్థంబునఁ గపిలాదానంబు గావించెనేని తద్ధేనుతత్సంతతిరోమపరిమితంబు లగువర్షసహస్రంబులు రుద్ర లోకమునందు వసియించు. ఆతీర్థంబునందుఁ బ్రాణత్యాగంబు గావించిన సూర్య చంద్రు లుండునంతవఱకును స్వర్గసుఖంబు వడయు. నర్మదాతటంబు నాశ్ర

యించిన మానవులు మరణించినపిదప స్వర్గసుఖంబు సులభంబుగాఁ గైకొందురు. పిమ్మట సురభికేశ్వరంబును గోటికేశ్వరంబును ననుతీర్థంబులు గలవు. తత్తీర్థ స్నానంబునఁ గలుగుపుణ్యంబునకు మితి కానరాదు. పిదప నందితీర్థంబు గలదు. తత్స్నానంబున నందీశ్వరుండు తుష్టుండై సోమలోకనివాసంబు ననుగ్రహించు. పిదప ద్వీపేశ్వరం బనువ్యాసతీర్థంబు గలదు. అచ్చట నొకమహానది ప్రవహించి వ్యాసమహర్షి హుంకారంబు గావింప భయంపడి తత్తపోవనంబునకు దక్షిణపార్శ్వంబుగా నేఁగె. తత్తీర్థంబునకుఁ బ్రదక్షిణంబు గావించిన వ్యాసుండు సంప్రీతుం డై వాంఛితఫలసిద్ధి నొసంగు. మఱియు నచ్చట వ్యాసేశ్వరుని వేదికా సహితంబుగా సూత్రపరివేష్టితుం గావించిన రుద్రుండువలె నక్షయకాలంబు క్రీడించు. పిదప నేరండీతీర్థంబు గలదు. దానికి నర్మదాసంగమంబు ప్రాప్తించుటం జేసి యాతీర్థంబు దుష్కృతనిబర్హణంబునందుఁ ద్రిలోకవిశ్రుతిం గాంచె. అచ్చట నాశ్వినశుక్లాష్టమినాఁడు స్నానంబు గావించి యుపవాసంబుచేసి యొక్కబ్రాహ్మణుని భుజియింపం జేసినఁ గోటిబ్రాహ్మణసమారాధనంబు గావించినఫలంబు ప్రాప్తించు. ఏరండీసంగమస్నానంబు సర్వపాపహరంబు. ఆతీర్థమునకుఁ బ్రదక్షిణంబు గావించెనేని సప్తద్వీపవతి యగుపృథివికిఁ బ్రదక్షిణంబు గావించినఫలంబు చేకూరు. పిదప సువర్ణతిలకతీర్థంబు గలదు. అందు స్నానంబుచేసి కాంచనదానంబు గావించిన సువర్ణవిమానంబుతోడ రుద్రలోకంబునం బ్రతిష్ఠితుం డగు. కాలవశంబున నెన్నఁడేని తల్లోకచ్యుతి సంభవించె నేని భూలోకంబున మహావీరుం డగురాజేంద్రుండుగా జన్మించు. పిదప నిక్షునదీసంగమతీర్థంబు గలదు. అచ్చట మహేశ్వరుండు సన్నిహితుండై యుండు. అందు స్నానంబు గావించిన గాణపత్యపదంబు ప్రాప్తించు. పిదప స్కందతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించిన జన్మించినది మొదలు చేసిన పాతకంబు లన్నియును దక్షణంబ పటాపంచలగు. పిమ్మట నాంగిరసతీర్థంబు గలదు. అందు స్నానంబుచేసిన గోసహస్రదానఫలంబును రుద్రలోకనివాసభాగ్యంబును సమకూరు. పిదప లాంగలతీర్థంబు గలదు. అందు స్నానమాత్రంబున సప్తజన్మార్జితంబు లగునఘంబు లెల్ల భస్మీభూతంబు లగు. పిదప సంగమేశ్వరతీర్థంబు గలదు. తత్స్నానంబు రాజ్యప్రదంబు. పిదప భద్రతీర్థంబు గలదు. అందు గావించినదానంబు కోటిగుణం బగు. తత్తీర్థంబున స్నానంబు గావించినపడంతి కాళీరూపముం బడసి రుద్రపత్నియగు. పిదప నంగారేశ్వరతీర్థంబు గలదు. తత్స్నానమాత్రంబున రుద్రలోకావాసంబు లభించు. అందు నంగారకచతుర్థినాఁడు గావించినస్నానం బక్షయప్రమోదప్రదంబు. పిదప నయోనిసంగమతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించిన మరల జన్మంబు

లేదు. పిదపఁ బాండవేశ్వరతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించిన సురాసురుల కవధ్యుండై యశేషకాలంబు ప్రమోదించుచు విష్ణులోకంబున కరిగి యచ్చట మహాభోగంబు లనుభవించి కాలవశంబున మర్త్యలోకంబున మహారాజుగా నవతరించు. పిదపఁ గంభోతికేశ్వరతీర్థంబు గలదు.అం దుత్తరాయణ సంక్రమణకాలంబున స్నానంబు సలిపినం గోరినకోరికి యెల్ల సిద్ధించు. పిదపఁ జంద్రభాగాతీర్థంబు గలదు. అందు స్నాతుం డగువాఁడు చంద్రలోకంబున వసియించు. అనంతరంబు శక్రతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించి సువర్ణదానంబు గాని నీలవృషోత్సర్జనంబు గాని కావించినఁ దద్వృషభతత్సంతతిరోమపరిమితంబు లగువర్షసహస్రంబులు కైలాసనివాసభాగ్యంబు గలుగు. కాలవశంబునఁ దత్పరిచ్యుతి సంభవించె నేని భూతలంబున నేకచ్ఛత్రాధిపతిగా నవతరించు. పిదప బ్రహ్మావర్తతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించి పితృతర్పణంబు చేసి యొక్కరాత్రి యుపవసించి పిండప్రదానంబు గావించె నేని సూర్యుండు కన్యాగతుం డగునప్పుడు గావించినపిండప్రదానంబుతో సమానమగుపుణ్యంబు నాపాదించు. పిదప నర్మదేశ్వరం బనుతీర్థంబు గలదు. అందుఁ గావించినస్నానం బశ్వమేధఫలం బొసంగు. నర్మదోత్తరకూలంబునందు నాదిత్యాయతనతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించి చేసినదానం బక్షయపుణ్యఫలప్రదం బగు. దరిద్రులును వ్యాధిగ్రస్తులును బాపులును బవిత్రులై సూర్యలోకంబు వడయుదురు. మాఘశుక్లసప్తమినాఁ డమ్మహాతీర్థంబునం దుండువారలు పునర్జన్మంబున రూపసంపన్నులై స్త్రీవల్లభు లగుదు రని మార్కండేయుండు తెలిపె. పిదప మాసేశ్వరం బనుతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించిన స్వర్గలోకంబునందుఁ బదునలువు రింద్రులు నడచువఱకును మహానందంబున నుండు. దానికి సమీపమంద నాగేశ్వరతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపిన ననంతకాలంబు నాగకన్యకలతోఁ గ్రీడించుయోగంబుగలుగు. పిదపఁ గుబేరభవనతీర్థంబు గలదు.అయ్యది కుబేరుఁడు తపంబు గావించినపుణ్యస్థలంబు. పిదపఁ గాలేశ్వరతీర్థంబు గలదు. అందుఁ గుబేరుండు వరంబు వడసి సంతోషితుం డయ్యె. అందు స్నానంబు గావించిన సంపత్సమృద్ధి గలుగు. దానికిఁ బశ్చిమముగా మారుతాలయతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించి కాంచనదానంబు చేసె నేని పుష్పకవిమానంబు నెక్కి వాయులోకంబునకుం జను. అటుపిమ్మట యమతీర్థంబు గలదు. మాఘకృష్ణచతుర్దశినాఁ డందు స్నానంబు గావించి నక్తభోజనం బొనరించె నేని యోనిసంకటంబు నొందకుండు. పిదప నహల్యాతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించిన నప్సరస్సమాగమంబు చేకూరు. ఆతీర్థంబునంద యహల్య తపంబు చేసి మోక్షసామ్రా

జ్యముం బడసె. అందుఁ జైత్రశుక్లత్రయోదశినాఁడు కామదేవదినంబున నహల్యను బూజించినవాఁడు సర్వజనప్రియుండును గామదేవుండువలె స్త్రీవల్లభుండును నగు. పిదప సోమతీర్థంబు గలదు. ఆతీర్థంబునందుఁ జంద్రగ్రహణంబు ప్రాప్తించినప్పుడు స్నానంబు గావించిన సర్వపాపవిముక్తి గలుగు. మఱియు నందుఁ జాంద్రాయణవ్రతంబు గావించె నేని చంద్రలోకంబు ప్రాప్తించు. మఱియును నంద యగ్నిజలానశనంబులచే మృతుం డయ్యె నేని వానికి జన్మాంతరంబు లేదు. పిదప స్తంభతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించిన సోమలోకనివాసభాగ్యంబు చేకూరు. పిమ్మట విష్ణుతీర్థంబు గలదు. అచ్చట విష్ణువుచే నసురసంహారంబుగావింపంబడియె.ఆతీర్థంబునఁ గావించినస్నానదానాదికంబులు విష్ణుప్రీతికరంబులు. మఱియు నందు నహోరాత్రోపవాసంబు గావించె నేని బ్రహ్మహత్యామహాపాతకంబు సైతముఁ దొలంగు. పిదప నమోహకం బనిప్రసిద్ధికెక్కినతాపసేశ్వరతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించి పూర్ణిమయందును నమావాస్యయందును యథావిధిగ శ్రాద్ధంబు గావించి తత్తీర్థతోయమధ్యంబున గజాకారములం దాల్చి యుండుశిలలపైని పిండప్రదానంబు గావించె నేని పితరులు మేదిని యున్నంతకాలంబును దృప్తులై యుందురు. అందు వైశాఖమాసంబునఁ జేయుపిండప్రదానంబు విశేషఫలప్రదంబు. పిదప సిద్ధేశ్వరతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపిన గణపతిసామీప్యంబు సిద్ధించు. పిదప భార్గవేశతీర్థంబు గలదు. అందు విష్ణుహుంకారంబున దానవులు నామశేషులైరి. తత్తీర్థంబునందు స్నానంబు సలిపిన సమస్తపాపక్షయం బగు. పిదప శుక్లతీర్థంబు గలదు. తత్తీర్థప్రభావం బనిర్వాచ్యంబు. మున్ను మార్కండేయుండు తీర్థములలో నుత్తమతీర్థం బెయ్యది యని వినయవినమితోత్తమాంగుండై మహేశ్వరు నడుగుటయు. 258

గీ. ధరణిలోపల శుక్లతీర్థం బనంగఁ, దీర్థ మొక్కటి కలదు తత్తీర్థమహిమ
మే మని నచింతు నద్దానినామమునన, చూడ నయ్యెడిఁ దత్పారిశుద్ధ్య మెల్ల.

క. ఒనరించు శుక్లతీర్థం, బనిశమును నశేషపాపహరణము ధ్యాన
మ్మున దర్శనమున స్పర్శం, బున స్నానంబునను దానమున ధర్మమునన్. 260

క. విను పూర్వము చాణక్యుం, డనియెడిరాజర్షి సిద్ధి నందెను క్షణమా
త్రన శుక్లతీర్థమునఁ దప, మును జేసినకారణమున మునులు నుతింపన్. 261

వ. నేను పార్వతితోడం గూడఁ గైలాసమునుండి బయలుదేఱి వైశాఖకృష్ణచతుర్దశినాఁడు శుక్లతీర్థంబునందు వసియింతు. దేవకిన్నరగంధర్వవిద్యాధరాదు లెల్లరును విమానస్థులై యంతరిక్షంబునం దవలోకించు చుందురు. ఆసమయంబున శుక్లతీర్థంబునం గావించుస్నానదానంబు లాజన్మపాతకవిముక్తిం గావించు.

పూర్వవయస్సునం జేసినపాపంబు లన్నియును శుక్లతీర్థంబునం దొక్కయహో రాత్రోపవాసంబునం బటాపంచ లగు. శుక్లతీర్థంబునం జేయుతపోదానయజ్ఞ బ్రహ్మచర్యాదులకుం గ్రతుశతంబులేనియు సరి కానేరవు. కార్తికకృష్ణచతుర్దశి నాఁడు శుక్లతీర్థంబునం దుపవాసంబు చేసి వృషభధ్వజలింగంబునకు ఘృతంబున నభిషేకంబు గావించిన నిరువదియొక్కతరంబులవారితోఁ గూడఁ దాను మద్ధామంబునం దుండు. శుక్లతీర్థంబునఁ గావించినస్నానంబు పునర్జన్మముం దొలంగించు. శుక్లతీర్థంబునఁ బ్రభాతకాలంబున స్నానంబు గావించి వృషభధ్వజుని నర్చించి నృత్యగీతాదిమంగళంబులచే రాత్రి జాగరంబుచేసి మఱునాఁడు కల్యకృత్యంబులు నిర్వర్తించికొని యాచార్యుని విత్తశాఠ్యంబు చేయక భోజనతాంబూలాదులచే సత్కరించినవాఁడు దివ్యయానారూఢుం డై యప్సరోగణంబులు స్తుతింపఁ గైలాసంబున నాభూతసంప్లవంబు నివసించు. శుక్లతీర్థంబునఁ గనకదానంబు గావించి నాకు ఘృతాభిషేకంబు గావించినపడంతి చతుర్దశమహేంద్రులు గడచునంతవఱకును దేవలోకంబునం దుండు. అయనమందుఁ గాని చతుర్దశియందుఁ గాని సంక్రాంతియందుఁ గాని విషువంబునందుఁ గాని శుక్లతీర్థంబున స్నానంబు గావించి యొక్కయుపవాసంబు చేసి యథాశక్తి దానంబు గావించెనేని సర్వంబును నక్షయం బగు. శుక్లతీర్థంబునందు బ్రాహ్మణునకు వివాహంబు చేసెనేని యనేకసహస్రవర్షంబులు మల్లోకంబున నివసించు. శుక్లతీర్థంబునకు సాటి యగుతీర్థంబు గానరా దని మహేశ్వరుండు నచియించె. పిదప నరకతీర్థంబు గలదు. అచ్చోట స్నానంబు గావించినమాత్రంబున నరకలోకదర్శనంబు గానేరదు. మఱియు నత్తీర్థంబునం దుంచినయస్థులు తత్క్షణంబ నశియించి దివ్యరూపంబు గలనరుండై యావిర్భవించు. పిదప గోతీర్థంబు గలదు. తద్దర్శనమాత్రంబున సర్వపాపక్షయం బగు. పిదపఁ గపిలాతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించిన గోసహస్రదానఫలంబు లభియించు. జేష్ఠమాసంబునఁ జతుర్దశినాఁ డుపవాసంబు గావించి కపిలాదానంబు చేసెనేని శివతుల్యత్వంబు వడసి పునర్జన్మంబు లే కుండు. అంగారకచతుర్థినాఁడు గాని యంగారకనవమినాఁడు గాని యంగారకామావాస్యనాఁడు గాని యీశ్వరునకు ఘృతస్నానంబు గావించి బ్రాహ్మణులను యథాశక్తిగా భుజియింపఁ జేసెనేని పుష్కరవిమానారూఢుం డై పరివారసహస్రసమేతుండై రుద్రుండువలె నక్షయకాలంబు కైలాసంబునందు వసియించు. కర్మయోగంబువలన నెప్పు డైనను బునర్జన్మంబు ప్రాప్తించెనేని మర్త్యలోకంబున సర్వశక్తిసహితుండును రూపవంతుండును నగుచక్రవర్తిగా నవతరించు. పిదప ఋషితీర్థంబు గలదు. శాపదగ్ధుఁ డగుతృణబిందు వనునొకఋషి యాతీర్థంబునందుఁ గొంతకాలంబు వసించి తత్తీర్థప్రభావం

బున శాపవిముక్తిం బడసె. పిదప గణేశ్వరతీర్థంబు గలదు. అందు శ్రావణ కృష్ణచతుర్దశినాఁడు గావించినస్నానంబున రుద్రలోకప్రాప్తియును బితృతర్పణంబున ఋణత్రయవిముక్తియుం గలుగు. గణేశ్వరతీర్థమున కనతిదూరంబున గంగావదనతీర్థంబు గలదు. అకాముఁడైనను సకాముఁడైనను నాతీర్థంబునఁ బర్వదినంబునందు స్నానంబు చేసెనేని సకలపాపవిముక్తియును బితృతర్పణంబు గావించెనేని ఋణత్రయవిముక్తియునుం గలుగు. దానికిఁ బశ్చిమభాగంబున దశాశ్వమేధికతీర్థంబు గలదు. తత్తీర్థంబునం దొక్కరాత్రి యుపవాసము గావించి పర్వదినంబున స్నానంబు చేసి పితృతర్పణంబు గావించెనేని దశాశ్వమేధఫలంబు సిద్ధించు. దశాశ్వమేధికమునకుఁ బశ్చిమభాగంబున భృగు వను నొకబ్రాహ్మణుండు మహేశ్వరునింగూర్చి వర్షసహస్రంబు తపంబు గావించుటయు నాతనిపైఁ బుట్ట లేర్పడియె. 262

సీ. అది చూచి పార్వతి యాశ్చర్యమగ్న యై,యీతఁ డెవ్వం డని యీశు నడుగ
నీశ్వరుం డాయమ నీక్షించి యీశ్వరి, విను భృగు వనునొకముని యితండు
ననుఁ గూర్చి బహుకాలముననుండి తప మాచ,రించుచు నున్న వాఁ డంచుఁ బలుక
నాతల్లి హసియించి భూతేశ నీ కను, గ్రహ మిప్పటికి నైనఁ గలుగ లేదె.
గీ. యనుటయును దేవి యతిఘోర మగుతపంబు, చేయుచున్నను వీనికిఁ జిత్తమందు
శాంతి యేర్పడకుండినకారణమునఁ, గలుగ దాయెను నా కనుగ్రహము గూడ.

క. దీనికి నిదర్శనంబును, గానఁబఱుతు ననుచు శివుఁడు గనుమూసి మదిన్
ధ్యానము సేయఁగ ధర్మము, తా నప్పుడె వృషభతనువు దాలిచి వచ్చెన్.

క. అరుదెంచిన వృషముఁ గని, హరుఁడు వృషభరాజ పుట్ట లాచ్ఛాదింపన్
ధరణి నొకద్విజుఁడు తప మా, చరించుచును నుండె వాని క్షమ గనుఁగొనుమా.

క. అనవుడు నీశ్వరునానతి, గొని వృషభము భూతలమునకుం దిగి భృగు వుం
డినచోటి కరిగి శృంగము, లను బుట్టలు చీల్చిపైకి లాగెను వానిన్. 266

క. అంతట నమ్ముని క్రోధా, క్రాంతుం డయి దానిఁ గరయుగంబునఁ ద్రోసెన్
గంతుగొని యది చనంగ న, నంతపథంబునకు నాతఁ డతిరోషమునన్. 267

క. ఎచ్చటి కేఁగెదు నిలువుము, చచ్చెదు నాచేత నిన్నుఁ జంపక విడువన్
ద్రుచ్చా యని యఱచుచుఁ గన్, విచ్చు లురలఁ జూచుచుండె నిర్జరపథమున్.

గీ. అవుడు రుద్రుఁడు నవ్వఁగా నాతపస్వి, యాక్షణంబున శివునిసమక్షమునకు
వచ్చి నిలుచుండి యాతనిచిచ్చుకన్ను, చూచి నిశ్చేష్టుఁ డగుచును క్షోణిఁ బడియె.

ఉ. అంతటఁ గొంతసేపటికి నాతఁడు తెల్వి యొకింత వచ్చి క్షా
మాంతకుఁ డాచరించినయహంకృతిభంగ మెఱింగి నిర్గళ

త్స్వాంతవికారుఁ డై ప్రణతి సల్పి నుతింపఁ దొడంగె నిట్టు లా
ద్యంతవిహీనుఁ డై నత్రిపురారిని భక్తిపురస్సరంబుగన్. 270

దండకము. నాథా భవానీసనాథా దురత్యాహతాత్ముండ దుర్మానభూతాభిభూతుండఁ గ్రోధాగ్నితప్తుండ దుర్గర్వశైలాధిరూఢుండ నీచాతినీచుండఁ బాపాత్ముఁడన్ మత్సరోపేతుఁడన్ శాసనీయేంద్రియాధీనుఁడన్ హీనుఁడన్ త్వద్గుణస్తోత్రముం జేయ నే నెంతవాఁడన్ భుజంగేంద్రుఁడే వేయి శీర్షంబులున్ వంచె మృత్యుం జయా నిన్నె నే దిక్కుగా నెంచుకొన్నాఁడ నాపైని నీపూర్ణకారుణ్యధారా ప్రసారంబు గావింపవే మామకీనాపచారంబు సైరింపవే ఘోరసంసార పాథోధితీరంబు నన్ జేర్పవే మోహపాశంబు ఛేదింపవే ధూర్జటీ తండ్రి నీ వేను బుత్రుండఁ బాలింపవే నన్ను దేవా యమేయప్రభావా ప్రసన్నస్వభావా భవద్భక్తికిన్ సాటి గానేర నష్టాంగయోగంబులున్ వేదమంత్రంబులున్ దానముల్ ధర్మముల్ యజ్ఞముల్ దేవతోపాసనల్ తండ్రి మూర్తిత్రయాత్ముండ వీవే ప్రపంచంబు లెల్లన్ సృజింపంగఁ బోషింపఁగన్ సంహరింపంగ నీకంటె నన్యుం డెవం డుండు దక్షుండు స్వామీ గిరీశా మహేశా నమస్తే నమస్తే నమస్తే నమః. 271

క. అని స్తోత్రము గావించుట, యును మృత్యుంజయుఁడు కరుణ యుద్భవిలంగన్
మనమున నాద్విజునిఁ గనుం, గొని యిచ్చెద వరము కోరుకొను మని పలికెన్.

గీ. అంత నాబ్రాహ్మణుఁడుమహాహ్లాదమొదవ, స్వామియిదిరుద్రవేదిగావలయుననుచు
నభిలషింపఁగ నట్టులే యగు నటంచు, నానతిచ్చి తిరోహితుం డయ్యె హరుఁడు.

వ. అది మొదలుకొని యీశ్వరుండు నివసించుటంజేసి బ్రహ్మాదిసకలదేవతలును భృగుతీర్థంబును సేవింపఁ జొచ్చిరి. తత్తీర్థదర్శనంబున సర్వపాపవిముక్తి యగు. అందలిస్నానం బశ్వమేధఫలప్రదంబు. తత్తీర్థంబున మరణంబు తటస్థించెనేని పునర్జన్మంబు లేదు. అచ్చటఁ జంద్రసూర్యోపరాగసమయంబులందుఁ గావించు దానధర్మంబు లక్షయఫలంబులు. ఆతీర్థంబునందుఁ గోటితీర్థంబులు గలవు. పిమ్మట గౌతమేశ్వరతీర్థంబు గలదు. అచ్చట స్నానంబు గావించి యుపవాసము చేసెనేని కాంచనవిమానారూఢుండై బ్రహ్మలోకమునకుం జను. పిదప ధౌతపాపతీర్థంబు గలదు. అచ్చటఁ గావించినస్నానంబు బ్రహ్మహత్యామహాపాపాపహంబు. ఆతీర్థంబునందుఁ బ్రాణత్యాగంబు గావించెనేని చతుర్భుజుండును ద్రినేత్రుండును నగు. పిదప హిరణ్యద్వీపతీర్థంబు గలదు. అచ్చట స్నానంబు గావించెనేని యైశ్వర్యసంపన్నుండును రూపవంతుండును నగు. పిదపఁ గనఖలతీర్థంబు గలదు. మున్ను గరుత్మంతుఁ డాతీర్థంబునఁ దపంబు సలిపె. అచ్చట యోగిని యోగులతోడఁ గ్రీడించుచు నీశ్వరునితోడ నృత్యంబు గావించు

చుండు. తత్తీర్థస్నానంబు రుద్రలోకప్రదంబు. పిదప నీశతీర్థంబు గలదు. అయ్యాదియీశ్వరునకుం గూడ నూర్ధ్వగతిప్రదంబు. అనంతరంబు వారాహతీర్థంబు గలదు. అచ్చటవరాహరూపంబు దాల్చి పరమేశ్వరుం డర్చింపంబడియె. వారాహతీర్థంబున ద్వాదశినాఁడు స్నానంబు గావించెనేని విష్ణులోకప్రాప్తి చేకూరు. పిదప రుద్రకన్యాసంగమతీర్థంబు గలదు. తత్తీర్థంబునఁ గావించినస్నానంబున దేవీధామంబు లభించు. పిదప దేవతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపెనేని దేవతలతోడఁ గూడి ప్రమోదించు. పిదప శిఖితీర్థంబు గలదు. అచ్చటఁ జేయుదానంబు కోటిగుణం బగు. అమావాస్యనాఁ డచ్చట స్నానంబు గావించి యొక్కబ్రాహ్మణునకు భోజనంబు పెట్టెనేని కోటిబ్రాహ్మణసంతర్పణంబు గావించినఫలంబు చేకూరు. అనంతరంబు విహంగేశ్వరతీర్థంబు గలదు. తత్తీర్థదర్శనంబున సర్వపాపవిముక్తియగు. పిదప నశ్వతీర్థంబు గలదు. అచ్చట స్నానంబు సలిపెనేని సుభగుండును దర్శనీయుండును భోగవంతుండును నగు. పిదపఁ బితామహతీర్థంబు గలదు. అది బ్రహ్మనిర్మితంబు. అందు స్నానంబు గావించి పితరుల నుద్దేశించి తిలోదకపిండప్రదానంబులు సలిపెనేని సర్వంబును నక్షయం బగు. పిదప సావిత్రీతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని సర్వపాపవిముక్తుండై బ్రహ్మలోకనివాసభాగ్యముం బడయు. అందే మనోహరతీర్థంబు గలదు. దానం గావించినస్నానంబు పితృలోకప్రదంబు. పిదప మానసతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసెనేని రుద్రలోకావాప్తి చేకూరు. పిదపఁ గ్రతుతీర్థంబు గలదు. అచ్చట స్నానంబు గావించెనేని పశుపుత్రధనాదిసర్వసంపదలును గలుగు. పిదపఁ ద్రిదశజ్యోతితీర్థంబు గలదు. 274

గీ. అందు ఋషికన్యకలు పదిమంది తపము, నాచరించిరి మున్నంధకారిఁ గూర్చి
వామదేవుఁడెభర్తకావలయున నెడి, కోర్కితమడెందములయందుఁ గొనలుసాఁగ.

క. వారలతపమునకుం ద్రిపు, రారి ముదం బొంది భిక్షుకాకారముతోఁ
జేరి తదంతికముఁ జను, త్కారముగాఁ బెండ్లియాడెఁ దత్కన్యకలన్. 276

క. ఆతీర్థమునకు దశక, న్యాతీర్థం బనెడినామ మది మొదలుగ వి
ఖ్యాతంబయ్యెను దానన్, స్నాతుం డగునేని సమయు సకలాఘంబుల్. 277

వ. పిదప స్వర్గబిందుతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని నరకలోకంబును దర్శింపఁడు. పిదప నప్సరేశతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపెనేని నాకలోకంబున నచ్చరలతోడంగూడి సుఖయించు. పిదప భారభూతతీర్థంబు గలదు. అం దుపవాసంబు చేసి యీశ్వరు నారాధించెనేని రుద్రలోకావాప్తి చేకూడు. మఱియు నందు మృతుం డయ్యెనేని గణేశ్వరత్వంబు ప్రాప్తించు. మఱియును గార్తికమాసంబున నందు మహేశ్వరుం బూజించిన నశ్వమేధ

శతగుణఫలంబు ప్రాప్తించు. మఱియును నందు నూఱు దీపంబులు నేతితో వెలిఁగించెనేని సూర్యసన్నిభం బగువిమానము నధిష్ఠించి శివలోకంబునకుం జను. మఱియును నందు శ్వేతవృషభదానంబు గావించెనేని వృషభయానంబున రుద్రలోకంబునకుం జేరు. మఱియును నందు భక్ష్యభోజ్యపాయసాదులతోడ సదక్షిణంబుగా బ్రాహ్మణసంతర్పణంబు గావించెనేని సర్వంబును గోటిగుణం బగు. మఱియును నందు నర్మదాజలంబుచే వృషభధ్వజుని నభిషేకించెనేని దుర్గతి సంభవింప నేరదు. మఱియును నందుఁ బ్రాణత్యాగంబు గావించెనేని సకలపాపవిశుద్ధిం బడసి కైలాసనివాసభాగ్యంబుం జెందు. మఱియును నందు జలప్రవేశంబు గావించెనేని హంసయానంబున రుద్రలోకంబునకుం జేరి చంద్రసూర్యులును బర్వతంబులును సముద్రంబులును గంగాదిమహానదులును నుండునంతవఱకును నందు నివసించు. మఱియును నాతీర్థంబునం దనశనవ్రతంబు నెఱవేర్చిన నరుండు మరల గర్భవాసముం గాంచఁడు. పిదప నటవీతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని మహేంద్రుని యర్ధాసనంబు లభియించు. పిదప శృంగతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని గణేశ్వరత్వంబు గలుగు. అవల నేరండీనర్మదాసంగమతీర్థంబు గలదు. అందుపవాసంబు చేసి స్నానంబు గావించెనేని బ్రహ్మహత్యాపాపవిముక్తుం డగు. పిదప నర్మదోధదిసంగమతీర్థంబు గలదు. అచ్చట నింద్రుండు బహుయజ్ఞంబులు చేసి స్వర్గాధిపత్యంబు నడసె. అందు స్నానంబు గావించెనేని త్రిగుణాశ్వమేధఫలంబు ప్రాప్తించు. పిదప విమలేశ్వరతీర్థంబు గలదు. అచట దేవగంధర్వసిద్ధచారణాదులును ఋషిసంఘంబులును ద్రిసంధ్యంబును విమలేశ్వరుని నారాధింతురు. ఆతీర్థంబునం దుపవాసంబు గావించి విమలేశ్వరుని దర్శించినవారు సర్వపాపవిముక్తులై రుద్రలోకావాసభాగ్యంబు వడయుదురు. అనంతరంబు కేశినీతీర్థంబు గలదు. అం దొక్కరాత్రి యుపవసించెనేని బ్రహ్మహత్యాపాతకవిముక్తి గలుగు. అచ్చటన యోజనాభ్యంతరంబున సాగరావర్తస్థితుం డగు సాగరేశ్వరుని దర్శించెనేని సర్వతీర్థదర్శనంబు గావించినవాఁ డయి సర్వపాపవిముక్తిం బడసి రుద్రలోకనివాసభాగ్యంబు నొందు. అమరకంటకంబునందు నర్మదాసంగంబు గలిగి యున్నంతవఱకును దశకోటి తీర్థంబు లేర్పడియె. ఆతీర్థంబు లన్నియును సాగ్నిహోత్రులును దివ్యజ్ఞానసమేతులును నగు ఋషిపుంగవులచే సేవింపంబడు చుండు. యమున సూర్యలోకంబును సరస్వతి బ్రహ్మలోకంబును నర్మద విష్ణులోకంబును మోక్షంబును నొసంగు. సరయూ గండకీ సింధు చంద్రభాగా కౌశికీ తాపీగోదావరీభీమాపయోష్ణీ కృష్ణవేణీ కావేరీ తుంగభద్రాదిమహానదులలో నర్మదామహానది యగ్రస్థానంబు నాసాదించె.

సీ. క్షణములోపల సప్తజన్మార్జితము లైన, పాపంబులను రూపుమాపు రేవ
యింద్రలోకావాస మీయఁగా మును బ్రహ్మ, పరులచే నిర్మింపఁబడియె రేవ
కోరువారలకు వైకుంఠంబు కరతలా, మలకంబుగాఁ జేయఁ గలుగు రేవ
సమకూర్చి యాత్మవిజ్ఞానంబు మోక్షుల, కీశసమాగమము గల్గించు రేవ
గీ. తనజలంబున మునిఁగిన జనుల కెల్ల, సర్వకామఫలంబు నీఁజాలు రేవ
నిరయములలోనఁ గూలిననరుల నెల్ల, నుద్ధరింపంగ నుద్భవం బొందె రేవ.
గీ. అట్టులపునర్భవాధాత్రి యైన రేవ,యందు స్నానంబు సలుపుట యన్నఁ బూర్వ
జన్మశతపుణ్యరాశిచే సంఘటిల్ల, వలయు నే కాని కలుగదు సులభముగను. 280
వ. పిదప దక్షిణసింధువునందు జితేంద్రియుండై బ్రహ్మచర్యవ్రతం బనుష్ఠించెనేని యగ్నిష్టోమఫలంబు వడసి విమానారూఢుం డయి స్వర్గంబు నధిష్ఠించు. పిదపఁ జర్మణ్వతీమహాతీర్థంబు గలదు. అందు నియతాశనుండై రంతిదేవాభ్యనుజ్ఞాతుం డయ్యెనేని యగ్నిష్టోమఫలంబు సిద్ధించు. అనంతరంబు హిమవత్ప్రభవం బగు నర్బుదతీర్థంబు గలదు. పూర్వము దానియందుఁ బృథివికి ఛిద్రం బేర్పడియె. తత్తీర్థంబునందు త్రిలోకవిశ్రుతం బగువసిష్ఠాశ్రమంబు గలదు.అచ్చట నొకరాత్రి గడపెనేని గోసహస్రదానఫలంబు లభియించు. పిదపఁ బింగాతీర్థంబు గలదు. బ్రహ్మచర్యంబునఁ దత్తీర్థంబు నుపస్పృశించినమాత్రంబునఁ గపిలాశతప్రదానఫలంబు చేకూరు. పిమ్మట లోకవిశ్రుతం బగుప్రభాసతీర్థంబు గలదు.
ఆ. అనిలసారథియును నమరులముఖమును, నైనవీతిహోత్రుఁ డధివసించు
నచట నెపుడుఁ గూడ నద్దానిమహిమము, చెప్ప నలవి గాదు క్షితితలేంద్ర.
వ. తత్తీర్థరాజంబునందుఁ బ్రయతమానసుండై స్నానంబు గావించెనేని యగ్నిష్టోమాతిరాత్రఫలంబు వడయు. అనంతరంబు సరస్వతీసాగరసంగమతీర్థంబు గలదు. అందుఁ ద్రిరాత్రంబులు స్నానంబు గావించి పితృతర్పణంబు చేసెనేని వైశ్వానరుండువలె దీవ్యమానాకారుండై యమృతాంశుండువలె నాహ్లాదకరుండై గోసహస్రదానఫలంబును వాజిమేధఫలంబునుం గలిగి నాకలోకంబు వడయు. పిదప వరదానతీర్థంబు గలదు. అచ్చట మున్ను దుర్వాసుండు విష్ణువునకు వరం బొసంగె. తత్తీర్థంబున స్నానంబు గావించెనేని గోసహస్రదానఫలంబు ప్రాప్తించు. పిదప ద్వారవతి కేఁగి పిండారకతీర్థంబునందు స్నానంబు గావించెనేని యపరిమితం బగుసువర్ణంబు లభియించు. తత్తీర్థరాజంబునఁ బద్మలక్షణలక్షితంబు లగుముద్రాశతంబులును ద్రిశూలాంకితంబు లగుపద్మంబులును నిప్పటికిని గానంబడుచుండు. అచ్చట మహాదేవుండు నిత్యసన్నిహితుండై యుండు. పిదప సింధుసాగరసంగమతీర్థంబు గలదు. అందు స్నాతుండై దేవర్షిపితృతర్పణంబు గావించెనేని దివ్యతేజోదీప్యమానుండై వరుణలోకంబు వడయు. అచ్చట శంకు

కర్ణేశ్వరుని నర్చించెనేని దశగుణం బగునశ్వమేధఫలంబు గలుగు. పిదపఁ దిమితీర్థంబు గలదు. అచ్చట బ్రహ్మాదిదేవతలు మహేశ్వరు నుపాసించి సిద్ధి వడసిరి. అందు స్నానంబు సలిపి దేవగణావృతుం డగురుద్రునిఁ బూజించెనేని జన్మించినది మొదలుగాఁ జేసినపాపంబు లన్నియును బటాపంచ లగు. మున్ను మహావిష్ణువు సకలదేవతలచేఁ బ్రార్థింపంబడి తత్తీర్థంబునందుఁ దిమిరూపంబునం బ్రాదుర్భవించి సోమకాసురసంహారంబు గావించి త్రిదివంబు నిష్కంటకం బొనరించె. పిదప వసుధారాతీర్థంబు గలదు. అచ్చోట గమనమాత్రంబున హయమేధఫలంబు ప్రాప్తించు. అందు స్నానంబు గావించి పితృదేవతా తర్పణంబు చేసెనేని విష్ణులోకావాప్తి కలుగు. దానియందె వసుతీర్థం బనుమఱి యొకతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపి సలిలపానంబు గావించెనేని వసువుల కిష్టుం డగు. పిదప సింధుతమం బనుతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని బహుసువర్ణంబు లభియించు. పిదప బ్రహ్మతుంగం బనుతీర్థంబు గలదు. దానికి దగ్గఱినంతమాత్రమున బ్రహ్మలోకనివాసభాగ్యంబు సిద్ధించు. పిమ్మట సిద్ధనిషేవితం బగుశక్రకుమారికాతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని శక్రలోకంబు ప్రాప్తించు. పిదప దేవనిషేవితం బగురేణుకాతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని చంద్రుండువలె నిర్మలుం డగు. పిమ్మటఁ బంచనదతీర్థంబు గలదు. అందు నియతాశనుం డయ్యెనేని పంచయజ్ఞఫలంబు చేకూరు. పిదప భీమాస్థానం బనుతీర్థరాజంబు గలదు. అందు స్నాతుం డయ్యెనేని మరల గర్భవాసదుఃఖంబు లేకుండు. పిదప గిరికుంజరతీర్థంబు గలదు. అందుఁ బితామహుని నమస్కరించినమాత్రంబున గోసహస్రదానఫలంబు సమకూరు. అనంతరము విమలతీర్థంబు గలదు. అందు స్వర్ణరజతమత్స్యంబు లిప్పుడును గానంబడుచుండు. తత్తీర్థంబున స్నానంబు గావించెనేని వాజపేయఫలంబు వడసి సర్వపాపవిముక్తాత్ముండై సద్గతిం జెందు. పిదపఁ గాశ్మీరంబులందు వితస్తాఖ్యం బగుమహాతీర్థంబు గలదు. అది తక్షకునకు భవనంబుగా నుండె. అందు స్నానంబు గావించెనేని సర్వపాపవిముక్తుండై వాజపేయఫలంబు వడయు. పిదప మలహం బనుపుణ్యతీర్థంబు గలదు. చరమసంధ్యాకాలంబునఁ దత్తీర్థంబు నుపస్పృశించి శక్త్యనుసారంబుగా వీతిహోత్రునకుఁ జరువును నివేదించెనేని యయ్యది పితరుల కక్షయం బగు. వైశ్వానరునకు నివేదించినచరువు గోశతసహస్రదానంబుతోడను రాజసూయశతంబుతోడను నశ్వమేధసహస్రంబుతోడను సమానం బగు. అనంతరంబు రుద్రాస్పదతీర్థంబు గలదు. అందు మహాదేవుని నారాధించెనేని యశ్వమేధఫలంబు ప్రాప్తించు. పిదప మణిమంత మనుతీర్థంబు గలదు. అందు బ్రహ్మచర్యంబున సమాహితమనస్కుఁడై యొక్కరాత్రి

గడపెనేని యగ్నిష్టోమఫలంబు లభియించు. పిమ్మట దేవికాతీర్థంబు గలదు. తత్తీర్థంబునందు విప్రు లుదయించి రని శాస్త్రజ్ఞులు వచియింతురు. అయ్యది త్రిశూలపాణికి స్థానంబు. అందు స్నానంబు గావించి మహేశ్వరు నారాధించెనేని సర్వకామసమృద్ధయాగఫలంబు సిద్ధించు. దానియంద రుద్రప్రియంబును దేవర్షిసంస్తుతంబును నగుకామతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని క్షిప్రంబ కాంక్షాసిద్ధి చేకూరు. దేవికాతీర్థం బర్ధయోజనవిస్తారంబును బంచయోజనాయతంబునుంగా నుండె నని విద్వాంసులు సెప్పుదురు. పిదప దీర్ఘసత్త్రింబు గలదు. అందు బ్రహ్మాదిదేవతలును సిద్ధులును మహర్షులును నియతవ్రతంబున దీక్షితులై యుందురు. దీర్ఘసత్త్రింబు గమనమాత్రంబున రాజసూయాశ్వమేధఫలంబు నొసంగు. అనంతరం బవినాశతీర్థంబు గలదు. మేరుపృష్ఠంబునం దంతర్హితయై ప్రవహించుసరస్వతి యాతీర్థంబునందుండి చమసోద్భేదశివోద్భేదనాగోద్భేదతీర్థంబులందుఁ గానంబడుచుండుం గావునఁ జమసోద్భేదంబునందు స్నానంబు గావించెనేని యగ్నిష్టోమఫలంబును శివోద్భేదంబునందు స్నానంబు సలిపెనేని గోసహస్రదానఫలంబును నాగోద్భేదంబునందు స్నానం బొనరించెనేని నాగలోకావాసభాగ్యంబునుం జేకూరు. పిదప శశయానతీర్థంబు గలదు. అనువత్సరంబును నచ్చట శశరూపప్రతిచ్ఛన్నంబులై పుష్కరంబులు సరస్వతియందుఁ గార్తికమాసమునందు స్నానంబు చేయుచుండు. తత్తీర్థంబునందు స్నానంబు గావించెనేని గోసహస్రదానఫలముం జెంది సదాశివుండువలె విద్యోతమానుం డగు. పిమ్మటఁ గుమారకోటితీర్థంబు గలదు. అచ్చటఁ బితరుల నర్చించెనేని యయుతగోదానఫలంబు వడసి కులంబు నుద్ధరించినవాఁ డగు. అనంతరము రుద్రకోటితీర్థంబు గలదు. 283

సీ. అందుఁ బూర్వము కోటిమంది తపోధనుల్, స్నానంబు సల్పి హర్షంబుతోడఁ
జని యీశ్వరాలయంబునకు రుద్రుని నేను, ముందుఁ జూతును నేను ముందుఁ జూతు
ననుచు నావేశంబునను గర్భగృహమున, కహమహమికతోడ నరుగుచుండ
హరుఁడు వారలభక్తి కానందమును జెంది, కోటిమందికి రుద్రకోటి యగుచు

గీ. సులభముగ దర్శనం బిచ్చెఁ జూచి యెల్ల, తాపసులును క్షణంబులో ధన్యులైరి
యది మొదలు గాఁగ నాక్షేత్ర మవనినాథ, రుద్రకోటి యనంగ నారూఢి కెక్కె.

వ. అందు స్నానంబు గావించెనేని యశ్వమేధఫలంబు వడసి వంశోద్ధారకుం డగు. పిదప సరస్వతీసంగమతీర్థంబు గలదు. బ్రహ్మాదిదేవతలును సిద్ధచారణులును ఋషులును జైత్రశుక్లచతుర్దశినాఁడు స్నానార్థ మచ్చటికి వచ్చుచుందురు. ఋషులసత్త్రియాగంబు లచ్చట సమాప్తము లగుచుండు. అందు స్నానంబు

గావించెనేని సకలపాపశుద్ధిం బడసి శివలోకావాసభాగ్యముం జెందు. పిదపఁ
గురుక్షేత్రంబు గలదు. 285

క. చనియెదము కురుక్షేత్రం, బునకుం జని యచట వాసముం జేయుదు మం
చనిశమును బలుకుచుండెడి, జనులకు దూరముగ నుండు సకలాఘంబుల్. 286

క. అనకున్నను నోటను మన, మునను గురుక్షేత్రశబ్దమునునైన స్మరిం
చినఁ జాలు నగ్నిలోనై, చినతూలమువోలె సమయుఁ జేసినయఘముల్.

క. అట్టికురుక్షేత్రమునకు, నెట్టులొ సుకృతమునఁ జేసి యేఁగినయేనిక్
జుట్టుకొను మొట్టమొదటనె, చుట్టును హయమేధరాజసూయఫలంబుల్.

గీ. ఎపుడుచూచిన నచటికి నేఁగుచుండ్రు, హరిహరచతుర్ముఖులును నిర్జరులు ఋషులు
యక్షగంధర్వులును సిద్ధులచ్చరలును, జారణులుఁ బన్నగులును విశ్వంభరేంద్ర.

వ. అందు మత్తర్ణకుం డనుద్వారపాలునకు నమస్కరించెనేని గోసహస్రదాన
ఫలంబు చేకూరు. పిదప విష్ణుస్థానంబు గలదు. అచ్చట ననవరతమును విష్ణువు
సన్నిహితుండై యుండు. అందు స్నానంబు గావించి విష్ణుసందర్శనంబు చేసె
నేని యశ్వమేధఫలంబును వైకుంఠావాప్తియుం గలుగు. పిదపఁ బారిప్లవతీర్థంబు
గలదు. అయ్యది గమనమాత్రంబున నగ్నిష్టోమాతిరాత్రఫలంబు నొసంగు.
పిదపఁ బృథివీతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసెనేని గోసహస్రదానఫలంబు
సిద్ధించు. పిదప శాల్వికినితీర్థంబు గలదు. అచ్చట దశాశ్వమేధికంబున స్నానంబు
సలిపెనేని గోసహస్రదానఫలంబు గలుగు. పిదప నాగతీర్థంబు గలదు. అచ్చట
సర్పిర్నదియందు స్నానంబు చేసెనేని యగ్నిష్టోమఫలంబును నాగలోకా
వాప్తియుం గలుగు. పిదప నతర్ణకుం డనుద్వారపాలుని దర్శించి యం దొక్క
రాత్రి గడపెనేని గోసహస్రదానఫలంబు ప్రాప్తించు. పిమ్మటఁ బంచనదంబు
గలదు. అందు నియతాశనుండై కోటితీర్థంబు నుపస్పృశించెనేని హయ
మేధఫలంబు గలుగు. పిదప నాశ్వనేయతీర్థంబు గలదు. అందు స్నానంబు
చేసెనేని రూపవంతుం డగు. పిదప వారాహతీర్థంబు గలదు. మహావిష్ణువు
మున్నచట వరాహరూపంబున నివసించె. తత్తీర్థంబున నొక్కదినం బుండెనేని
యగ్నిష్టోమఫలంబు ప్రాప్తించు. పిదప జయినీక్షేత్రంబు గలదు. అచ్చట నొక్క
దినంబు స్నానంబు చేసెనేని రాజసూయఫలంబును గోసహస్రదానఫలంబును
సిద్ధించు. పిమ్మటఁ గృతశౌచతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసెనేని పౌండ
రీకఫలంబును గృతశౌచత్వంబునుం గలుగు. పిమ్మట ముంజీవటతీర్థంబు గలదు.
అం దొక్కరాత్రి నివసించెనేని గాణపత్యంబు సిద్ధించు. అచ్చట నే లోకవిశ్రుత
యగుపంపానదియందు స్నానంబు సలిపెనేని సర్వకామసిద్ధి సమకూరు. అది
కురుక్షేత్రంబునకు ద్వారంబు. పిదప రామహ్రదతీర్థంబులైదు గలవు. మున్ను

పరశురాముండు కోపాతిశయంబున సర్వక్షత్త్రివధంబు గావించి తద్రుధిరప్రవాహంబుచేఁ బంచహ్రదంబులు నిండించి యారక్తంబునఁ బితృతర్పణంబు గావించె. దాని కాతనిపితరులు సంతృప్తులై వ్యోమంబునందుండి యాతని కిట్లనిరి. 290

క. నీ వొనరించినపనికిఁ, భావంబున మాకు మిగులఁ బ్రమదం బొదవెఁ
గావునఁ గోరుము నీకుఁ, గావలసినవరము లీయఁగలము కుమారా. 291

వ. అని పలుకుటయుం బ్రాంజలియై పరశురాముండు వారలకు సప్రశ్రయంబుగా నిట్లనియె. 292

సీ. మహనీయులార కుమారునిమీఁదను, గలిగెనేనియు ననుగ్రహము మీకు
నేను జేసెడితపం బెపుడును నంతరా, యము లేక యభివృద్ధి నంద వలయు
క్షత్త్రియులను నెల్లసమయించుటను నాకుఁ, బ్రాప్తించినయఘంబుపాయవలయు
రక్తపూర్ణము లైనహ్రదము లీయైదును, బుణ్యతీర్థములుగాఁ బొసఁగ వలయు

గీ. ననుచుఁ బ్రార్థించుటయువారలతఁడుకోరి, నట్టికోర్కు లుఫలియించునట్లువరము
లను బ్రసాదించి మఱియు నిట్లనిరి రామ, యైదుహ్రదములు నీపేర నలరుఁగాక.

గీ. ఈహ్రదంబులలోపల నెవ్వఁడేని, స్నాన మొనరించి పితృతర్పణంబు సలిపె
నేని పితరులు వరముల నిత్తు రతని, కనుచుఁ బలికి యంతర్ధాన మైరి భూప. 294

వ. కావునఁ బుణ్యతీర్థంబు లగురామహ్రదంబులందు స్నానంబు గావించి పరశురాము నర్చించెనేని బహుసువర్ణావాప్తియును నీప్సితావాప్తియుం గలుగు. పిదప వంశమూలతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని వంశంబు నుద్ధరించినవాఁ డగు. పిదపఁ గాయశోధనతీర్థంబు గలదు. అచ్చట స్నానంబు సలిపెనేని కాయశుద్ధిం బడసి యుత్తమలోకంబులం జెందు. పిమ్మటఁ ద్రైలోక్యదుర్లభం బనుతీర్థంబు గలదు. అందుఁ బూర్వము విష్ణువుచే లోకంబు లుద్ధరింపం బడియె. ఆతీర్థంబునందు స్నానంబు చేసెనేని భగవంతునిచే నుద్ధరింపఁబడువాఁ డగు. పిమ్మట లోకోద్ధారం బనుతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసెనేని నిజలోకోద్ధారకుం డగు. పిదప శ్రీతీర్థంబు గలదు. అందు స్నానంబుచేసెనేని లక్ష్మీప్రాప్తి సమకూరు. అనంతరము కపిలాతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించి పితృదేవతల నర్చించెనేని కపిలాసహస్రప్రదానఫలంబు చేకూరు. పిదప సూర్యతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసి యుపవసించి పితృదేవతల నర్చించెనేని యగ్నిష్టోమఫలంబు వడసి సూర్యలోకావాసభాగ్యంబు నొందు. పిదప గోభవనతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని గోసహస్రదానఫలంబు లభించు. పిదప గంగాతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని యత్యుత్తమవీర్యోపేతుం డగు. పిదప ద్వారపాలకుం డగులవర్ణకునిపేర నొకతీర్థంబు గలదు. అది సరస్వతియం దుండు. ఆలవర్ణకతీర్థంబునందు స్నానంబు గావించె

నేని యగ్నిష్టోమఫలంబు గలుగు. పిమ్మట బ్రహ్మావర్తతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని బ్రహ్మలోకావాప్తి చేకూరు. పిమ్మట సుతీర్థంబు గలదు. అచ్చటఁ బితరులు దేవతలతోఁగూడ సన్నిహితులై యుందురు. అందుఁ బితృదేవతార్చనంబు గావించెనేని యశ్వమేధఫలంబును బితృలోకనివాసభాగ్యంబును గలుగు. పిదపఁ గాశీశ్వరతీర్థంబులు గలవు. వానియందు స్నానంబు సలిపెనేని సర్వవ్యాధివిముక్తియు బ్రహ్మలోకప్రాప్తియుం గలుగు. అచ్చటనె మాతృతీర్థంబు గలదు. అందు స్నాతుం డయ్యెనేని ప్రజావృద్ధియును స్వర్గప్రాప్తియును గలుగు. అనంతరము శీతవనతీర్థంబు గలదు. తద్దర్శనమాత్రంబునఁ బావనత్వంబు గలుగు. అచ్చటనె స్నాతలోకార్తిహ మనుమఱియొక తీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని సర్వార్తివిముక్తియు నుత్తమలోకంబును బ్రాప్తించు. పిదప మానుషతీర్థంబు గలదు. 295

గీ. వ్యాధశరపీడితాంగములగుచుఁ గృష్ణ,హరిణములు పూర్వ మాతీర్థమందు మునిఁగి
మానుషాకారములతోడఁ గానఁబడియె,నసఁగఁ దత్తీర్థమహిమ మేమనఁగవచ్చు.

వ. అందు స్నాతుం డయ్యెనేని సర్వపాపవిశుద్ధిం బడసి స్వర్లోకావాసముం జెందు. తత్తీర్థంబునకుఁ బూర్వభాగంబునందుఁ గ్రోశమాత్రదూరంబున నాపగ యను పుణ్యనది గలదు. తత్తటంబునఁ బితృదేవతల నుద్దేశించి విప్రునకు శ్యామాకభోజనంబు పెట్టెనేని యనంతపుణ్యంబు గలుగు. మఱియు నచ్చట నొక్కబ్రాహ్మణునకు భోజనంబు పెట్టెనేని కోటిబ్రాహ్మణసమారాధనంబు గావించిన ఫలంబు ప్రాప్తించు. ఆతీర్థంబునం దొక్కరాత్రి నివసించెనేని యగ్నిష్టోమఫలంబు చేకూరు. తరువాత బ్రహ్మస్థానతీర్థంబు గలదు. అచ్చట సప్తర్షికుండంబులందు స్నానంబు గావించి బ్రహ్మను బూజించెనేని సర్వపాపమోచనంబును బ్రహ్మలోకప్రాప్తియుం గలుగు. మఱియును నందుఁ గేదారతీర్థమునందు స్నానంబు సలిపెనేని నిర్దగ్ధాఖిలపాతకుఁడై యంతర్ధానంబుఁ జెందు. పిదప సేవకతీర్థంబు గలదు. అందుఁ గృష్ణపక్షచతుర్దశినాఁడు వృషభధ్వజారాధనంబు చేసెనేని సర్వకామసమృద్ధియును స్వర్గలోకప్రాప్తియుం గలుగు. సేవకతీర్థంబునందు మూఁడుకోట్లతీర్థంబులు గలవు. అచ్చటన యిలాస్పదతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసి దేవపిత్రర్చనంబు గావించెనేని వాజపేయఫలంబు ప్రాప్తించు. మఱియును గిందానకింయజ్ఞతీర్థంబులందు స్నానంబు సలిపెనేని దానయజ్ఞఫలంబుం బడయు. మఱియును గలశీతీర్థంబునందు జలోపస్పర్శంబు గావించెనేని యగ్నిష్టోమఫలంబు చేకూరు. మఱియును రామజన్మ మనుప్రఖ్యాతిం బడసిన నారదతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసి ప్రాణోత్సర్జనంబు గావించెనేని నారదప్రసాదంబున దుర్లభంబు లగునుత్తమలోకంబులు ప్రాప్తించు. అచ్చటన

పుండరీకతీర్థంబు గలదు. శుక్లపక్షదశమినాఁ డందు స్నానంబు గావించితేని పౌండరీకఫలంబు సమకూరు. పిదపఁ ద్రిలోకవిశ్రుతం బగుత్రివిష్టపతీర్థంబు గలదు. అచ్చటన వైతరణి యనుపుణ్యనది గలదు. అందు స్నానంబు గావించి శూలపాణి నర్చించెనేని సర్వపాపవిముక్తియును బరమపదంబునుం బ్రాప్తించు. పిదప ఫలకీవనంబు గలదు. అచ్చట దేవతలు సంతతంబును దపంబు గావించుచుందురు. అచ్చట దృషద్వతీమహానదియందు స్నానంబు సలిపి దేవతారాధనంబు గావించెనేని యగ్నిష్టోమాతిరాత్రఫలంబు లభియించు. అచ్చటన సర్వదేవతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసెనేని గోసహస్రదానఫలంబు చేకూరు. అచ్చటన పాణిఖ్యాతతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసి దేవతాతర్పణంబు గావించెనేని రాజసూయఫలంబును ఋషిలోకనివాసంబునుం గలుగు. పిదప మిశ్రకతీర్థంబు గలదు. అందు సకలతీర్థంబులును ద్విజస్నానార్థంబు వ్యాసమహర్షిచే మిశ్రితంబు లయ్యె నని పెద్దలు చెప్పుదురు. మిశ్రకతీర్థంబునందు స్నానంబు గావించినవాఁడు సర్వతీర్థావగాహనఫలంబు వడయు. పిదప వ్యాసవనంబు గలదు. అచ్చట మనోజవతీర్థంబునందు స్నానంబు సలిపెనేని గోసహస్రదానఫలంబు ప్రాప్తించు. పిదప దేవీస్థానం బగుమధువటీతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపి పితరులను దేవతలను నర్చించెనేని దేవీప్రసాదంబున గోసహస్రదానఫలంబు సమకూరు. పిదపఁ గౌశికీదృషద్వతీసంగమంబు గలదు. అందు స్నానంబు గావించెనేని సర్వపాపంబులును భస్మీభూతంబులగు. పిదప వ్యాసస్థలీతీర్థంబుగలదు.

ఉ. వ్యాసుఁడు పుత్రశోకమున నచ్చట దేహము వీడ యత్నముం
జేసినయంత దేవతలు చేరి యనేకవిధప్రబోధముల్
చేసి విషాదముం దొలఁగఁ జేసిరి మానికిమున్న తత్స్థలిన్
డాసినఁ జాలు నెన్నఁడును డాయఁగఁ జాలవు పుత్రశోకముల్. 298

వ. పిదప ఋణాంతం బనుకూపంబు గలదు. అందుఁ దిలప్రస్థంబు సమర్పించెనేని ఋణవిమోచనంబును సద్గతియుఁ బ్రాప్తించు. అచ్చటన దేవీతీర్థంబునందు స్నానంబు చేసెనేని గోసహస్రదానఫలంబు లభియించు. పిదప నహస్తీర్థంబును సుదినతీర్థంబును నను రెండుపుణ్యతీర్థంబులు గలవు. వానియందు స్నానంబు చేసెనేని సూర్యలోకప్రాప్తి గలుగు. అనంతరంబు మృగధూమతీర్థంబు గలదు. అచ్చట రుద్రపదంబునందు స్నానంబు సలిపి శూలపాణి నర్చించెనేని యశ్వమేధఫలంబును గోటితీర్థంబునందు స్నానంబు సలిపెనేని గోసహస్రదానఫలంబును సమకూరు. పిదప వామనతీర్థంబు గలదు. అందు విష్ణుపదంబున స్నానంబు గావించి వామను నర్చించెనేని సర్వపాపవిముక్తియును విష్ణులోకావాప్తియుం గలుగు. పిదపఁ గులంపునతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపెనేని కులం

బంతియును బావనం బగు. పిదపఁ బవనహ్రదంబు గలదు.అందు స్నానంబు గావించెనేని వాయులోకావాసంబు చేకూరు. పిదప నమరహ్రదంబు గలదు. అందు స్నానంబు గావించి యమరాధిపు నర్చించెనేని దేవతాప్రసాదంబున స్వర్గలోకావాసభాగ్యంబు చేకూరు. పిదప శాలిసూర్యతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసెనేని గోసహస్రదానఫలంబు గలుగు. పిదప సరస్వతియందు శ్రీకుంజతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని యగ్నిష్టోమఫలంబు ప్రాప్తించు. పిదప నైమిషకుంజం బనుతీర్థంబు గలదు. నైమిషారణ్యావాసులగు తపోధనులు తీర్థయాత్ర గావించుకొనుచుఁ గురుక్షేత్రంబున కేఁగినప్పు డచ్చట సరస్వతీనదియందు ఋషులస్నానపానతపోధ్యానంబుల కనుకూలంబుగా నాతీర్థంబు నేర్పరించిరి. తత్తీర్థంబునందు స్నానంబు గావించెనేని గోసహస్రదానఫలంబు ప్రాప్తించు. పిదపఁ గన్యాతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపెనేని యగ్నిష్టోమఫలంబు సిద్ధించు. పిదప బ్రహ్మస్థానం బను తీర్థంబు గలదు. 299

గీ. అందు వర్ణావరుం డగునతఁడు స్నాన, మాచరించెనయేని బ్రాహ్మణ్య మొదవు
భూసురుం డందు స్నానంబు చేసెనేని, కలుగు నపునర్భవం బగుగతి నరేంద్ర.

వ. పిదప సోమతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని సోమలోకప్రాప్తి గలుగు పిదప సప్తసారస్వతతీర్థంబు గలదు. 301

—: మంకణమహర్షి వృత్తాంతకథనము :—

సీ. మును మంకణుం డనుమునివరేణ్యుం డందుఁ, దపము గావించెడితరుణమందుఁ
దనహస్తము కుశాగ్రమున క్షతం బగుడు నా,క్షతమునుండి తొరంగె శాకరసము
తద్రసంబును జూచి తాపసుం డమితహ,ర్షము చేత నృత్యంబు సలుపఁ దొడఁగె
నతనిశక్తికి లోఁగి యటు లిటు లూఁగంగ, సాగెను స్థావరజంగమములు

గీ. సంతతమహాభయావిష్టు లగుచు బ్రహ్మ, మొదలుగాఁగల వేల్పులుమునులుఁగూడి
ప్రమథనాథునిసన్నిధానమున కేఁగి,విన్నవించిరి జరుగుచు నున్నవిధము. 302

గీ. అంత జగదవనార్థమై హరుఁడు భూమి, కరుగుదెంచి మునీంద్రునిదరికి నేఁగి
యనఘ నీ విట్లు దీర్ఘనృత్యంబు సలుప, నేమి కారణ మయ్యె నా కెఱుఁగ జెపుమ.

క. అని పలుకుటయును నీశ్వరుఁ, డని తెలిసియు నాతఁ డమితహర్షములోనన్
మునిఁగినకతమున నృత్యము, నొనరించుచు నిట్టు లనియె నుగ్రునితోడన్.

గీ. కాంచు మీశ్వర మత్కరక్షతమునుండి, జాఱుచున్నది శాకరసంబు దీని
కతన హర్షంబుగలిగె నుత్కటము గాఁగ,నిదియె హేతువు నాదీర్ఘనృత్యమునకు.

క. నాయొనరించినతపమున, కీయెడఁ గానంగఁబడియె నీసిద్ధి మహిన్
జేయంగఁ దగినకృత్యం, బేయదియును లేదు నాకు నింక గిరీశా. 306

క. అనవుడు మృత్యుంజయుఁ డా, తనిఁ గనుఁగొని నవ్వి మునివతంసము హర్షం
బున నాడ వలసినంతటి, పని యేమియు నిందు లేదు పరికింపంగన్. 307
క. కనుఁగొనుము నన్ను నీ వివు, డని తెలియఁగఁ బల్కియొక్కస్వాంగుళ్యగ్రం
బున స్వాంగుష్ఠముఁ గొట్టుట,యును క్షతముననుండి భస్మ మురిగ్ని రాలెన్.
క. అది చూచి మంకణుఁడు తన, మదిలోపల సిగ్గు వొడమి మన్నింపుము నా
మదచేష్టిత మని శర్వుని, పదములపైఁ బడియె గర్వభంగము గాఁగన్. 309
వ. అట్లు పదంబులపై వ్రాలి లేచి మంకణమహర్షి బద్ధాంజలియై కట్టెదుట నిలువంబడి.
సీ. సచరాచరము లగుసర్వజగంబులు, సృజియింపఁబడుట నీచేతఁ గాదె
యఖిలలోకములకు నాధార మగుచును, నిలుచు దేవుండవు నీవ కాదె
బ్రహ్మాదు లెల్లరు భయ మొకింతయు లేక, వర్తిల్లుచుంట నీవలనఁ గాదె
యొకవ్యక్తియును లేక యుగసంక్షయంబున, నడఁగియుండుటయు నీయంద కాదె
గీ. కర్మముల కెల్లఁ గర్తవు కారయితవు, నీవ సర్వేశ్వరుండవు నీవ సర్వ
శక్తిసంపన్నుఁడవు నీవ సర్వ మీవ, తండ్రి నీప్రాభవ మెఱుంగఁ దరమె నాకు.
వ. అని నుతించుటయును. 312
గీ. చెడక వర్ధిల్లుఁ గాక నీచేయుతపము, నేను నీయాశ్రమమునందు నిలిచియుందు
నిందులోఁ గ్రుంకి నను భజియించునట్టి, ప్రాణి కిహపరములను దుర్లభము లేదు.
క. అని యానతిచ్చి వృషకేతనుఁ డంతర్ధాన మొందెఁ దత్కాలమునన్
జననాథ పుణ్యవంతులు, చని సేవించెదరు సప్తసారస్వతమున్. 314
వ. పిదప నౌశనసతీర్థంబు గలదు. అచ్చట భగవానుం డగుకార్తికేయుండు భార్గవ
ప్రియచికీర్షం ద్రిసంధ్యంబును సాన్నిధ్యంబుచేసి యుండు. అందు స్నానంబు గావిం
చెనేని కుమారప్రియుం డగు. పిదపఁ గపాలమోచనతీర్థంబు గలదు. అందు
స్నానంబు సలిపెనేని సర్వపాపవిమోచనంబు గలుగు. పిదప నగ్నితీర్థంబు
గలదు. అచ్చట స్నానంబు సలిపెనేని యగ్నిలోకప్రాప్తియును వంశోద్ధారక
త్వంబునుం గలుగు. అచ్చటనె విశ్వామిత్రతీర్థంబు గలదు. అందు స్నానంబు
చేసెనేని బ్రాహ్మణ్యంబు సమకూరు. అచ్చటనె బ్రహ్మయోనితీర్థంబు గలదు.
అందు స్నానంబు గావించెనేని బ్రహ్మలోకనివాసభాగ్యంబు వడయుటయే
కాక సప్తపురుషపర్యంతమును స్వకులంబును బావనంబుచేసినవాఁ డగు. పిదపఁ
బృథూదకం బనుప్రఖ్యాతి గలకార్తికేయతీర్థంబు గలదు. అందు స్నానంబు
గావించి దేవర్షిపితృతర్పణంబు లొనరించి కార్తికేయున కభిషేకంబు చేసెనేని
యశ్వమేధఫలంబును స్వర్గలోకావాప్తియును సమకూరు. 315
క. జ్ఞానముచే నైనను న, జ్ఞానముచే నైన జనులు సలిపినయఘసం
తానము దానం జేసిన, స్నానముచేతన నశించు క్ష్మాతలనాథా. 316

గీ. ధరణిలోపల నుండు క్షేత్రములలోన, నుత్తమంబు కురుక్షేత్ర ముత్తమంబు
దానికంటె సరస్వతి దానికంటె, నుత్తమంబులు తీర్థము లుర్వరేంద్ర. 317

క. అత్తీర్థంబులకంటెను, నుత్తమము పృథూదకము నృపోత్తమ దానన్
బత్తిమెయిఁ దనువు దొరఁగిన, యుత్తములకు గర్భవాస మొదవదు మరలన్.

వ. పృథూదకతీర్థమాహాత్మ్యంబు వ్యాసమహర్షిచేతను సనత్కుమారునిచేతను మిగుల వర్ణింపంబడియె. పృథూదకతీర్థంబునంటిపరమపవిత్రతీర్థంబు మఱియొండు గానరాదు. అచ్చటన మధుపూరం బనుమఱియొకతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని గోసహస్రదానఫలంబు సమకూరు. పిదప సరస్వత్యరుణాసంగమతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించి త్రిరాత్రం బుపవసించెనేని బ్రహ్మహత్యాపాతకవిముక్తుం డగు. మఱియు నగ్నిష్టోమాతిరాత్రఫలంబు గలిగి యేడుతరంబులవంశస్థుల నుద్ధరించినవాఁ డగు. అచ్చటనే యవకీర్ణం బనుమఱియొకతీర్థంబు గలదు. అది బ్రాహ్మణోద్ధరణార్థంబు దర్భియనుమహర్షిచే నిర్మింపంబడియె. అందు వ్రతోపనయనంబులచేఁ గాని యుపవాసంబుచేఁ గాని బ్రాహ్మణుండు క్రియామంత్రసమేతుం డగు. క్రియామంత్రవిహీనుం డైనను విప్రుం డందు స్నానంబు గావించెనేని చీర్ణవ్రతుం డగు. మఱియును నందు దర్భిమహర్షిచే నాలుగుసముద్రములును నిర్మితంబు లయ్యె. అందు స్నానంబు గావించెనేని చతుస్సహస్రగోదానఫలంబు వడసి దుర్గతిం బొరయకుండు. పిదప శతసహస్రకతీర్థంబును సాహస్రకతీర్థంబునుం గలవు. ఆరెండుతీర్థంబులందుఁ గావించినస్నానదానోపవాసంబులు సహస్రగుణఫలోపేతంబు లగు. పిదప రేణుకాతీర్థంబు గలదు. అచ్చట స్నానంబు సలిపి పితృదేవతార్చనంబు గావించెనేని సర్వపాపవిశుద్ధిం బడసి యగ్నిష్టోమఫలముం జెందు. పిదప విమోచనతీర్థంబు గలదు. దానిని స్పృశియించెనేని ప్రతిగ్రహకృతంబు లగుపాతకంబులు దొలంగు. పిదపఁ బంచవటంబు గలదు. అందు యోగేశ్వరుం డగువృషభధ్వజుండు నిత్యనివాసంబు గావించి యుండె. అమ్మహాదేవుని నర్చించెనేని క్షిప్రసిద్ధియును స్వర్లోకావాసఫలంబును జేకూరు. పిదపఁ దైజసతీర్థంబు గలదు. అయ్యది సతతంబును స్వతేజంబుచే దీప్యమాన మై యుండు. అచ్చట మున్ను బ్రహ్మాదిదేవతలును మహర్షులును దేవసేనాధిపతి గాఁ గార్తికేయున కభిషేకంబు గావించిరి. అది మిగులఁ బుణ్యస్థలంబు. దానికిఁ బూర్వభాగమందుఁ గురుతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని సర్వపాపవిముక్తిం బడసి రుద్రలోకముం జెందు. పిదప స్వర్గద్వారంబు గలదు. అయ్యది గమనమాత్రమున నగ్నిష్టోమఫలంబును బ్రహ్మలోకనివాసభాగ్యంబును జేకూర్చు. పిదప నస్థిపురంబునందుఁ బావనతీర్థంబు గలదు. అందుఁ బితృ

దేవతాతర్పణంబు గావించెనేని యగ్నిష్టోమఫలంబు చేకూరు. అచ్చోటన గంగాహ్రదం బనుకూపంబు గలదు. అందు మూఁడుకోట్లతీర్థంబులు గలవు. అచ్చట స్నానంబు చేసెనేని బ్రహ్మలోకనివాసంబు సిద్ధించు. పిదప స్థాణువటతీర్థంబు గలదు. అచ్చట స్నాతుండై యొక్కరాత్రి నివసించెనేని రుద్రలోకంబు చేకూరు. పిదప బదరీవనంబు గలదు. అందు వసిష్ఠాశ్రమంబు గలదు. అచ్చటఁ ద్రిరాత్రం బుపవసించి బదరీఫలభక్షణంబు గావించెనేని సదాశివతుల్యుం డగు. పిదప నింద్రమార్గతీర్థంబు గలదు. అచ్చట నహోరాత్రోపవాసంబున స్వర్లోకావాసంబు గలుగు. పిదపఁ ద్రైలోక్యవిశ్రుతతీర్థంబు గలదు. అం దాదిత్యాశ్రమంబు గలదు. అందు స్నానంబు గావించి సహస్రాంశు నారాధించెనేని సూర్యలోకప్రాప్తియును వంశోద్ధారకత్వంబును గలుగు. పిదప సోమతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని సోమలోకప్రాప్తి కలుగు. పిదప దధీచతీర్థంబు గలదు. అందుఁ దపోనిధి యగుసారస్వతుం డుదయించె. అచ్చట స్నానంబు గావించెనేని వాజపేయఫలంబును సారస్వతగతియును జేకూరు. పిదపఁ గన్యాతీర్థంబు గలదు. అచ్చట బ్రహ్మచర్యవ్రతంబునఁ ద్రిరాత్రోపవాసంబు గావించెనేని దివ్యకన్యాశతప్రాప్తియును బ్రహ్మలోకావాప్తియునుం గలుగు. పిదప సన్నిహితాతీర్థంబు గలదు. 319

గీ. అవనియం దుండుతీర్థము లాకసమునఁ, గానఁబడుతీర్థములు నుదపానములును
మునులు సురలును బుణ్యాయతనము లెల్ల, సన్నిహితమగు చుండునాసన్నిహితను.

వ. అందు గ్రహణకాలంబునను నమావాస్యనాఁడును బితృతుద్దేశంబుగా శ్రాద్ధంబు గావించెనేని యశ్వమేధసహస్రఫలంబు ప్రాప్తించు. 321

గీ. మానవులలోన నెటువంటిహీనుఁడైన, సన్నిహితలోన స్నానంబు సలిపెనేని
పాతకము లన్నియును దుల్లి పద్మవర్ణ, యానమున బ్రహ్మలోకంబు నధిగమించు.

వ. పిదప ద్వారపాలకుం డగుమచక్రుకునకు నభివాదనంబు గావించి యచ్చటన గంగాహ్రదతీర్థంబున స్నానంబు గావించెనేని రాజసూయాశ్వమేధఫలంబులు సమకూరు. 323

గీ. ధరణిలో నైమిశంబు పూతంబు నాక, మునను బరమపవిత్రంబు పుష్కరంబు
త్ర్యంతలాధిప మూఁడులోకములయందుఁ, బూతతమము గురుక్షేత్రభూతలంబు.

గీ. ఏమి చెప్పుదుఁ గాలిచే నెగురఁగొట్టఁ, బడినయట్టికురుక్షేత్రపాంసు వొకఁడు
దనువునకు సోఁక నెట్టిపాతకము లేని, తత్క్షణంబ నశించి సద్గతి లభించు. 325

క. ఇలను గురుక్షేత్రంబున, నొలయుసరస్వతికి దక్షిణోత్తరభాగం
బులయందు వసించినధ, న్యులు ద్రిదశాలయమునందు నుండెడివారల్. 326

క. ధన్యంబు గురుక్షేత్రం, బన్యక్షేత్రంబు లేవి యైనను దత్సా
మాన్యంబు వడయఁ జాలవు, జన్యులను నశోచ్యులుగను జలుపుటయందున్.

వ. తరండకారండకంబులకును రామహ్రదంబులకును మచక్రుకునకును మధ్యంబున నుండుకురుక్షేత్రస్యమంతపంచకంబు పితామహుని కుత్తరవేది యని పెద్దలు చెప్పుదురు. పిదప ధర్మతీర్థంబు గలదు.అచ్చట మున్ను యమధర్మరాజు గొప్ప తపంబు గావించి స్వనామాంకితంబుగా నాపుణ్యతీర్థంబు సేర్పఱిచె. అందు స్నానంబు చేసెనేని యేడుతరంబులవంశస్థుల నుద్ధరించినవాఁ డగు.పిదపఁ గలాప వనతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపెనేని యగ్నిష్టోమఫలంబును విష్ణు లోకప్రాప్తియునుం గలుగు. పిదప సౌగంధికవనంబు గలదు. అందు బ్రహ్మాది దేవతలును ఋషులును గిన్నరోరగసిద్ధచారణగంధర్వాదులును దపంబు గావించిరి. అయ్యది ప్రవేశమాత్రంబున సర్వపాపవిమోచనంబు గావించు. ఆవనంబు నందు సరస్వతి ప్రవహించుచుండు. వల్మీకనిస్రుతం బగుతజ్జలంబున స్నానంబు గావించి పితరుల నర్చించెనేని యశ్వమేధఫలంబు ప్రాప్తించు. పిదప నీశానాధ్యుషితతీర్థంబు గలదు. అది వల్మీకంబునుండి వచ్చుచుండు. అందు స్నాతుం డయ్యెనేని కపిలాసహస్రదానఫలంబును వాజిమేధఫలంబునుం జేకూరు. పిదప సుగంధాశతకుంభాపంచయజ్ఞతీర్థంబుల నధిగమించెనేని స్వర్లోకావాససుఖంబు సమకూరు. అచ్చటన త్రిశూలపాతం బనుతీర్థంబు గలదు. అందు శూలి కభిషేకంబు గావించి పితరుల నర్చించెనేని గాణపత్యంబు లభించు. పిదప రాజగృహ తీర్థంబు గలదు. అయ్యది దేవీస్థానంబు. అమ్మహాదేవి దివ్యవర్షసహస్రంబు శాకాహారవ్రతంబు నవలంబించి తనసన్నిధికి వచ్చుచుండెడితపోధనులకు శాకంబున నాతిథ్య మిచ్చుచుండుటంజేసి శాకంభరి యనునామంబు వడసె. తత్తీర్థంబున బ్రహ్మచర్యంబు నవలంబించి త్రిరాత్రంబు శాకాహారంబుచేఁ గడపిన ద్వాదశవర్షంబులు శాకాహారంబు గావించినఫలంబు దేవీప్రసాదంబునం గలుగు. పిదప సువర్ణతీర్థంబు గలదు. 328

క. హరి యచ్చోటను బహువత్సరములు ధూర్జటిని గూర్చి తప మొనరింపన్
బరితుష్టుఁడై గిరీశుఁడు, వరము లనేకము లొసంగె వైకుంఠునకున్. 329

వ. అందు స్నానంబు గావించి వృషధ్వజునిం బూజించెనేని యశ్వమేధఫలంబును గాణపత్యంబును లభియించు. పిదప ధూమవంతీతీర్థంబు గలదు.అచ్చట మూఁడు రాత్రు లుపవసించెనేని కోరినకోర్కు లన్నియును సిద్ధించు. పిదప దేవీతీర్థంబునకు దక్షిణభాగంబున రథావర్తతీర్థంబు గలదు. అచ్చట మహాదేవుని నర్చించెనేని తత్ప్రసాదంబున సద్గతి లభించు. పిమ్మట ధారాతీర్థంబు గలదు. అందు స్నానము చేసెనేని యెట్టిశోకమును గలుగ నేరదు. పిదప మహాగిరినమస్కా

రంబు గావించి స్వర్గద్వారతుల్యం బగుగంగాద్వారంబునఁ గోటితీర్థంబునందు స్నానంబు గావించెనేని పౌండరీకఫలంబును వంశోద్ధారకత్వముం గలుగు. అందొక్కరాత్రి యుండెనేని గోసహస్రదానఫలంబు గలుగు. మఱియును నందు సప్తగంగతీర్థంబునందును త్రిగంగతీర్థంబునందును శక్రావర్తతీర్థంబునందును దేవపితృతర్పణంబు గావించెనేని పుణ్యలోకావాప్తి కలుగు. పిదపఁ గనఖలతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించి త్రిరాత్రంబు లుపవసించెనేని యశ్వమేధఫలంబును స్వర్గలోకావాసభాగ్యంబునుం గలుగు. పిదపఁ గపిలావటతీర్థంబు గలదు. అందొక్కరాత్రి నివసించెనేని గోసహస్రదానఫలంబు చేకూరు. పిదపఁ గపిలుం డనునాగేంద్రునితీర్థంబు గలదు. ఆనాగతీర్థంబునందు స్నానంబు గావించెనేని కపిలాసహస్రదానఫలంబు చేకూరు. పిదప లలితక యని ప్రఖ్యాతిం బడసినశంతనుతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపెనేని దుర్గతి కలుగనేరదు. పిదపఁ గాళిందీతీర్థంబు గలదు. 330

—: యమునా మాహాత్మ్యము :—

గీ. పుష్కరమును బ్రహ్మావర్తమును సువర్ణ
మును గురుక్షేత్ర మవిముక్తమును బృథూద
కమును ననుతీర్థములయందుఁ గలుగనట్టి
ఫలము గలుగును యమునలోపల మునుంగ. 331

సీ. ఆయురభ్యుదయంబు నభిలషించెడివారు, నారోగ్యభాగ్యంబు గోరువారు
యౌవనసంపద నర్థించువారును, మంచిరూపమును గాంక్షించువారు
దారిద్ర్యపాథోధి దాఁట నెంచెడివారు, పాపంబునకు భయపడెడివారు
వంశాభివృద్ధిని వాంఛించువారును, జింతితసిద్ధి నాసించువారు
గీ. నిహసుఖంబులు చెంద నూహించువారు, పరమున సుఖంబులకు నాసపడెడివారు
పరిహరింపఁగఁ గూడ దెప్పటికి నైన, దివ్యతమ మైనయామునతీర్థ మధిప. 332

క. కామముతోడను నైనను, గామము లేకుండ నైనఁ గావించినచో
యామునతీర్థస్నాన మి,హాముత్రవిషాదములను నందఁడు భూపా. 333

గీ. శ్రద్ధ లేకుండఁ గర్మముల్ సలిపెనేని, యర్థఫల మిచ్చు నవి యెట్టి వైనఁ గాని
శ్రద్ధ లేకున్న యమునలోఁ జలిపినట్టి, స్నాన మిడుఁ బూర్ణఫలము విశ్వంభరేంద్ర.

గీ. యమునలో స్నాన మొనరించుప్రాణులకును
బాపము నశించుఁ బుణ్యంబు వడయు వృద్ధి
పక్షయుగమునఁ గువలయబాంధవునకు
క్షయము వృద్ధియు సంప్రాప్త మయినయట్లు. 335

గీ. వివిధరత్నంబులును సరిద్విభునివలన, సుఖముగాఁ బ్రాప్త మగునట్లు లఖిలసంప
దలును గాళిందిస్నానంబునలనఁగలుగుఁ,గలుగు నదిపూర్వపుణ్యంబువలననధిప.
క. కామగవి కామములు చిం,తామణి చింతితము లిడువిధంబున నొసఁగుఁ
యామునతీర్థస్నానము, భూమీశ్వర వాంఛితార్థముల నన్నింటిన్. 337
గీ. కృతయుగంబునఁ దపమును త్రేతయందు
జ్ఞానమును ద్వాపరమున యజ్ఞంబుఁ గలియు
గమున దానము శ్లాఘనీయములు కాని
సర్వయుగములయందును శ్లాఘ్య యమున. 338
ఆ. కర్మభూమి యయి ప్రకాశించుభారత,వర్షమందు నుండువాఁ డెవండొ
యేని యమునలోన స్నానంబు గావింపఁ,డేని నిష్ఫలంబు వానిజనువు. 339
ఆ. అంబరమునఁ జంద్రబింబ మమావాస్య,యందుఁ గాంతిహీన మైనయట్లు
యమునలోన స్నాన మాచరింపక చేయు,కర్మ మెల్ల నిష్ప్రకాశ మధిప. 340
క. యమునాస్నానమువోలెం,బ్రమదము గలిగింప లేవు మాధవునకు దా
నములును వ్రతంబులును యా,గములును దపములును బుణ్యకర్మము లెల్లన్.
గీ. సకలవర్ణాశ్రమములవారికిని ధర్మ, మును సతంబు ధారావర్షముగను గురియు
నధిప యమునాస్రవంతిలో నాచరించు,మజ్జనంబున కెంతటిమహిమ గలదొ.
గీ. మనుజవల్లభ రవితేజమునకు సాటి, యైన తేజంబు వేఱొండు లేనియట్లు
యామునస్నానమునకు నీడైనయట్టి, క్రతువు లేవియుఁ గూడను గానరావు.
గీ. యమునలోపలఁగావించినట్టిస్నాన, మొనరుచును మూఁడుకార్యంబులనున రేంద్ర
యఖిలపాపక్షయంబును నచ్యుతునకు, సమ్మదంబును స్వర్లోకసంస్థితియును.
సీ. స్నాయుబద్ధంబును జర్మావృతంబును, మలమూత్రరక్తాస్థిమాంసయుతము
దుర్గంధపూర్ణంబు దోషాలయంబును, రోగమందిరమును రాగగృహము
నశ్వరంబును గృతఘ్నంబు క్రూరము జరా, శోకమృత్యువిపత్సమాకులంబు
నశుచియుఁ దాపత్రయావిష్టమును దురా, శాహతంబును బాపసంచితంబు
గీ. రౌరవద్వారమును నధర్మప్రియంబు, పరజనద్రోహసంతాపకరము దుర్భ
రమునుబిశునంబునగుశరీరమునకొక్క,యామునజలంబయఖిలదోషాపహంబు.
గీ. ఎంత బల ముండినను భోగ మెంత యున్న, నెంత రక్షణ మున్నను నేమి ఫలము
క్షణికమగు దేహమునకుశాశ్వతసుఖంబు,నొసఁగుయమునాజలస్పర్శ మొదవదేని
గీ. తోయములలోన నుండుబుద్బుదములట్టు, లండజములందు నుండుప్రత్యండములవి
ధంబునను యాముననిమజ్జనంబు లేని,మానవులు పుట్టుచుందురు మరణమునకె.
సీ. విష్ణుభక్తుఁడు గానివిప్రుఁడు హతుఁడు పిం,డము వెట్టనట్టిశ్రాద్ధము హతంబు
వరణంబు వేఁడెడిక్షత్రియుండు హతుండు, హత మనాచార మున్నట్టికులము

హతము క్రోధసమేత మైనతపంబు దం, భమునఁ గావించుధర్మము హతంబు
హతము ప్రమాదసంయుత మైనశ్రుతము దా, ర్ఢ్యంబు లేకుండుజ్ఞానంబు హతము
గీ. హత మనభ్యాసదూషిత మైనవిద్య, హతముమాయాప్రకల్పిత మైనభక్తి
యమునఁ జూడనివానిజన్మముహతంబు, శ్రవణమట్కృగ మైనమంత్రము హతంబు.
సీ. పతిభక్తి లేనట్టిభామిని హత యహం, కార ముండెడిబ్రహ్మచారి హతుఁడు
హత యుపజీవ్య యైనట్టికన్య విరోధ, దాయకం బైనబోధంబు హతము
హతము శూద్రుఁడు చేయునట్టియోగము హతం, బాత్మార్థ మొనరించునట్టిపాక
మశ్రోత్రియున కిచ్చునట్టియీవి హతంబు, హతము సత్యము లేనియట్టివాణి
ఆ. శ్రద్ధ లేక చేయుసత్కర్మము హతంబు,హతము వ్యగ్రచిత్త మైనజపము
హతము జీవనార్థ మగువ్రతంబు హతము, యమునగాలి సోఁకనట్టిమేను. 349.
గీ. హత మకించను లగువారి కైహికంబు, హతము కృపణుల కుండెడునట్టిధనము
జీవననిమిత్త మగుతీర్థసేవ హతము, హతము గాళిందిలోఁ గ్రుంకనట్టితనువు.
గీ. యమునలోపలఁ జేయుస్నానమునఁ జేసి, భస్మమై పోవు వహ్నిలోఁ బడినతూల
రాశివలె నుపపాతకరాశితోడఁ,గలిసికొనుచు మహాపాతకములు భూప. 351
గీ. యమున కేఁగెడునపుడె కంపమునుజెందు,చుండును సమస్తపాపము లుర్వరేంద్ర
దానిలోపలఁ గ్రుంకినతత్క్షణంబ,మాయమై పోవుఁ దత్తీర్థమహిమ నేమొ. 352
గీ. యమునలో స్నాన మొనరించి నంతమాత్ర,విడువఁబడి సర్వపాతకవితతివలన
దీప్యమానుండు గా నుండు దేహి మేఘ,పటలముక్తుం డయినశీతభానుఁ డట్లు.
క. దహనుఁడు సమిత్సమూహము,దహియించువితాన నఘవితానము నెల్లన్
దహియించును యమునాజల,మహిమము చెప్పంగఁ దరమె మాబోఁటులకున్.
క. ఏవాఁ డేనియు యమునా,పావనతోయమున మునిఁగి పైకిన్ మరలన్
దా వచ్చునపుడు జ్వలనుని, కైవడి నరుదెంచు దీప్తకాయముతోడన్. 355
క. పాపిష్ఠు లైనవారలు, పాపింతురు శుద్ధి పాపరహితులు దివమున్
బ్రాపింతు రొక్కపరి యము,నాపగలోపలను దీర్థమాడినయెడలన్. 356
క. కల దధికారము యమునా, సలిలస్నానంబునందు సకలజనులకున్
జలజాక్షునిభక్తియెడన్, బలె సర్వజనాఘనాశనక్షమ మగుటన్. 357
క. జ్ఞానముచే నైనను న,జ్ఞానముచే నైన భ్రమవశంబువ నైనన్
మానుగఁ జేసినయఘసం, తానముఁ గాళిందిమజ్జనము దొలఁగించున్. 358
క. యమునాస్నానమెమంత్రము, యమునాస్నానంబె తపము యమునాస్నానం
బె మహాప్రాయశ్చిత్తముయమునాప్లవ మఖిలపాతకాపహ మగుటన్. 359
గీ. కలుగు నాధ్యాత్మికజ్ఞానకౌశలంబు, గలిగినట్టులు కాళిందిజలమునందు
స్నాన మొనరింపఁగను బుద్ధిమానవులకు, బహుళజన్మాంతరాభ్యాసపాటవమున.

క. భవకర్దమంబు గడుగఁగన్, దవునదియును బరమపావనం బగునదియున్
భువనమ్ములోన యమునా, స్రవంతిజల మొకఁడె పాండురాజతనూజా. 361

చ. యమునజలంబు ద్రావెడి మహాత్ముల కేల యొసంగఁ బంచగ
వ్యములను భూరితీర్థముల నాడఁగ నేల సమస్తపుణ్యకా
ర్యములఫలంబు నీయఁ గలయట్టియమస్వసృతోయపానమే
సమకొనఁజేయుచుండఁగను సర్వశుభంబులు ప్రాణికోటికిన్. 362

క. యమునకు మధురాసంగమ, మమరినచోటను నొనర్చునాప్లావముచే
సమకూరు నాత్మవిజ్ఞా, నముచే నొనగూడుముక్తి నరులకు భూపా. 363

గీ. మానవుఁడు భక్తిభావంబులోన నొలయ, యామునజలంబునను దీర్థమాడెనేని
కల్పకోటిసహస్రముల్ గైటభారి, సన్నిధానంబున నె నివాసంబు చేయు. 364

క. ఉందురు కల్పశతంబులు, బృందారకలోకమందుఁ బితరులు పూర్ణా
నందమున యమునలోపల, నందను లొనరించుమజ్జనంబున నధిపా. 365

వ. అనంతరంబు సుగంధతీర్థంబు గలదు. అచ్చట స్నానంబు గావించెనేని సర్వపాపవిముక్తుండై బ్రహ్మలోకంబు నాసాదించు. పిదప రుద్రావర్తతీర్థంబు గలదు. అందు స్నాతుం డయ్యెనేని స్వర్లోకవాసి యగు. పిమ్మట గంగాసరస్వతీసంగమతీర్థంబు గలదు. అందు స్నానంబు సలిపెనేని యశ్వమేధఫలంబును నమరలోకవాసంబుం జేకూరు. అచ్చటన కర్ణహ్రదంబున స్నానంబు గావించి శంకరుని నారాధించెనేని దుర్గతివిజయంబును సద్గతిప్రాప్తియును సమకూరు. పిదపఁ గుబ్జామ్రకతీర్థంబు గలదు. అందుఁ గావించినయాప్లావంబు గోసహస్రదానఫలంబు నొసంగి యమరపురనివాసభాగ్యంబు చేకూర్చు. పిమ్మట నరుంధతీవటతీర్థంబు గలదు. అందు మూఁడురాత్రు లుపవసించి సాముద్రకజలంబు నుపస్పృశించెనేని గోసహస్రదానఫలంబుతోడన త్రిదివంబు ప్రాప్తించు. పిదప బ్రహ్మావర్తతీర్థంబు గలదు. అందు బ్రహ్మచర్యంబున సమాహితమనస్కుండై స్నానంబు సలిపెనేని యశ్వమేధఫలంబు వడసి నాకంబు నధిష్ఠించు. పిదప యమునాప్రభవతీర్థంబు గలదు. అందు యమునాజలంబు నుపస్పృశించెనేని యశ్వమేధఫలంబు వడసి బ్రహ్మలోకనివాసి యగు. పిదప దర్వీసంక్రమణతీర్థంబు గలదు. అయ్యది గమనమాత్రంబున వాజిమేధఫలంబు నొసంగి త్రిదివనివాసభాగ్యంబు ప్రసాదించు. పిదప సింధుప్రభవతీర్థంబు గలదు. అందుఁ బంచరాత్రం బుండెనేని బహుసువర్ణప్రాప్తి గలుగు. పిదప దేవతీర్థంబు గలదు. అయ్యదిప్రాప్తిమాత్రంబున నశ్వమేధఫలంబును నొశనసగతియుం బ్రసాదించు. పిదప ఋషికుల్యాతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించి వసిష్ఠదర్శనం చేయుచు శాకాహారంబుతోడ నొకమాసంబు గడపెనేని ఋషిలో

భాగ్యంబు చేకూరు. పిదప భృగుతుంగతీర్థంబు గలదు. అచ్చటి కేఁగినంతన యశ్వమేధఫలంబు ప్రాప్తించు. పిమ్మట వీరప్రమోక్షతీర్థంబును డాసినంత సర్వపాపవిమోచనం బగు.పిదప విద్యాతీర్థంబు గలదు. తత్తీర్థంబు నుపస్పృశించెనేని సర్వవిద్యాలాభంబు సమకూరు. పిదప మహాశ్రమతీర్థంబు గలదు. అందు నిరాహారంబుగా నొక్కరాత్రి నివసించెనేని పుణ్యలోకంబుల నధివసించు. పిమ్మట మహాలయతీర్థంబు గలదు. తత్తీర్థంబునందు షష్ఠకాలోపవాసంబుచే నొక్కమాసంబు నివసించెనేని దశపూర్వదశాపరవంశస్థుల నుద్ధరించి తాను దరియించు. పిదప మహేశ్వరతీర్థంబు గలదు. తత్తీర్థంబును దర్శించెనేని సర్వకార్యసిద్ధియును బహుసువర్ణప్రాప్తియుం గలుగు. పిదప వేతసికాతీర్థంబు గలదు. అయ్యది పితామహునిచే నిషేవింపంబడియె. తత్తీర్థంబు గమనమాత్రంబున నశ్వమేధఫలంబు చేకూర్చి సద్గతికిం జేర్చు. పిదప సుందరికాతీర్థంబు గలదు. అది సిద్ధనిషేవితంబు. అందు స్నానంబు గావించెనేని సురూపప్రాప్తి గలుగు. పిదప బ్రాహ్మణికాతీర్థంబు గలదు. తత్తీర్థంబునకుం బోవువాఁడు పద్మవర్ణయానంబున బ్రహ్మలోకంబునకుం జనువాఁడు. పిదప నైమిషంబు గలదు. అయ్యది ద్విజనిషేవితం బగుపవిత్రక్షేత్రంబు. అందు బ్రహ్మ దేవగణంబుతోడం గూడి నిత్యనివాసంబు గావించుచుండు. నైమిషంబును బ్రార్థించినమాత్రంబున సంచితాఘరాశియం దర్ధంబుతఱఁగిపోవు. నైమిషంబునం బ్రవేశించెనేని సర్వపాపరాశియును నిశ్శేషంబుగా నశియించు. పృథివిలో నున్నతీర్థంబు లెల్లను నైమిషంబున నుండు. అచ్చట నొక్కమాసంబు నివసించెనేని సప్తకులంబుల నుద్ధరించినవాఁ డగు. నైమిషంబున నియతాశనుండై స్నానంబు గావించెనేని రాజసూయమహాక్రతుఫలంబు వడయు. నైమిషంబున నుపవసించి ప్రాణంబులు విడిచెనేని దేవలోకంబునందు దేదీప్యమానుండై యుండు. పిదప గంగోద్భేదతీర్థంబునందుఁ ద్రిరాత్రోపవాసంబు గావించెనేని వాజపేయఫలంబు వడసి యెల్లకాలంబును బ్రహ్మభూతుండై యుండు. పిమ్మట సరస్వతీతీర్థంబునందుఁ బితృదేవతాతర్పణంబు గావించెనేని సారస్వతలోకంబులందు వసియించు. పిదప బాహుదాతీర్థంబు గలదు. అం దొక్కరాత్రి నివసించెనేని దేవసత్త్రియాగఫలంబు వడసి స్వర్లోకంబున నిత్యసంతోషంబు గలిగి యుండు. పిదప రజనీతీర్థంబు గలదు. అందుఁ బితృదేవతార్చనంబు గావించెనేని వాజపేయఫలంబు ప్రాప్తించు. పిదప విమలాశోకతీర్థంబు గలదు. అయ్యది యమృతకరుండువోలె నాహ్లాదంబు గలిగించుచుండు. అం దొక్కరాత్రి నివసించెనేని స్వర్గనివాసంబు చేకూరు. పిదప గోప్రతారం బనుసరయూతీర్థంబు గలదు. అచ్చట మున్ను రాముండు సభృత్యబలవాహనంబుగా స్వర్గంబున కరిగె.

త్తీర్థంబునందు స్నానంబు గావించెనేని సర్వపాపవినిర్ముక్తిం బడసి స్వర్లోక
వాసభాగ్యంబు నొందు. పిమ్మట రామతీర్థంబున గోమతియందు స్నానంబు
సలిపెనేని యశ్వమేధఫలంబు వడసి స్వకులంబు పావనంబు గావించు. అచ్చటన
శతసాహస్రక మనుమతియొకతీర్థంబు గలదు. శుచియై దాని నుపస్పృశించెనేని
గోసహస్రదానపుణ్యంబు వడయు. పిదప నూర్ధ్వస్థానం బనుపుణ్యక్షేత్రంబు
గలదు. అందుఁ గోటితీర్థంబున స్నానంబు గావించి కుమారస్వామి నర్చించెనేని
గోసహస్రదానఫలముం బడసి మిగులఁ దేజస్వి యగు. అనంతరంబు వారాణసీ
క్షేత్రంబు గలదు. 366

—: వారాణసీ మాహాత్మ్యము :—

క. వినుము మును మేరుశిఖరం, బున ముదమున నున్నసమయమున భర్తను గ
న్గొని యిట్టు లడిగె గిరిసం, దన లోకుల నుద్ధరించుతలఁపు గలిగినన్. 367

గీ. కర్మయోగంబు ధ్యానయోగంబు సాంఖ్య
యోగమును మున్నుగాఁ గలయోగములను
జేయుటకు శక్తిచాలనిచేతనులకు
దేవ నినుఁ గాంచువెర వెన్నఁ దెలియఁ జెపుమ. 368

క. అనవుడు లోకానుగ్రహ, మున నడిగినయామెప్రశ్నమున కెదలోనన్
జనియింపఁగ సంతోషము, గని తద్వదనాంబుజంబుఁ గరుణాదృష్టిన్. 369

క. చానా నానిజరూపము, గానం గలత్రోవ జ్ఞానఘనులకు సులభం
బై నను నంతటికంటెను, గానఁ దగునుపాయ మొకటి కల దజ్ఞులకున్. 370

వ. అది యే దంటి వేని. 371

గీ. తీర్థములలోన నుత్తమతీర్థ మగుచు, క్షేత్రములలోన నుత్తమక్షేత్ర మగుచు
జ్ఞానములలోన నుత్తమజ్ఞాన మగుచు, నవనిలో నుండు నవిముక్త మంబుజాక్షి.

క. అది నాకుఁ బ్రియతమం బగు, సదనం బచ్చోట సర్వసమయములం దుం
డుదు నేను నన్నుఁ గనుచుం, డెద రెల్లరుఁ గూడ నందు నివసించినచోన్. 373

క. నాక్షేత్రము నేవేళను, వీక్షింప రముక్తు లెల్లవేళల ముక్తుల్
వీక్షించుచుందు రెవ్వరు,వీక్షింతురొ వారె నాకు వీక్షణపాత్రుల్. 374

ఆ. అది మహాశ్మశాన మం దుండుఁ బుణ్యతీ, ర్థంబు లెల్ల నాయతనము లెల్ల
సర్వభూతములను సంసారపాథోధి, తటముఁ జేర్పఁ దగినతరణి యదియ. 375

ఆ. అదియె వారణాసి యని కాశి యనియును, నామములను దాల్చె నళినగంధి
పరమగుహ్యమైనపదము నా కది యని, తెలిసికొనుటె యెల్లఁ దెలిసికొనుట.

క. అవిముక్తంబునఁ జేసిన, హవనము దానంబు ధ్యాన మధ్యయనంబున్
నవమును జపమును దపమును, నవినాశనములుగ నుండు నాకల్పంబున్. 377

గీ. కలికి జన్మాంతరసహస్రములను బెరిఁగి, నట్టియఘరాసు లవిముక్తమందుఁ గాలు
పెట్టి పెట్టకమునుపె కన్పట్టకుండ, మాయ మై పోవుఁ దన్మహిమంబువలన. 378

సీ. బ్రాహ్మణు లైనను రాజన్యు లైనను, వైశ్యు లైనఁ జతుర్థవర్ణు లైనఁ
జాన లైనను మ్లేచ్ఛు లైనను సంకీర్ణు, లైనను బాతకయోను లైన
మృగము లైనను గడ్డి మేయుజంతువు లైన, ఖగము లైనను గీటకంబు లైనఁ
జీమ లైనను లేక దోమ లైనను మఱి, యితరంబు లగుజీవు లేవి యైన

ఆ. మరణ మొందెనేని మద్రాజధానిలో, వృషభవాహనముల నెక్కి చంద్ర
ఖండములను దాల్చి గరళకంఠములతోఁ, దిరుగుచుండు నచటి తెరువులందు. 379

క. మరణించెనేని కాశీ, పురమునయం దెట్టిపాపములు చేసినపా
మరుఁ డైనను గాంచం డొక, తరుణమునం దేని దండధరునిపురంబున్. 380

క. అతిదుర్లభ మగుమోక్షము, జతపడుటకు ఘోర మైనసంసారము సం
హత మగుటకు నవిముక్తస్థితి యొక్కఁడె సులభ మైన తెరువు లతాంగీ. 381

క. అక్కఱలే దాచారము, లక్కఱలే దర్చనాదు లవిముక్తమునం
దొక్కనివాసమె చాలును, జక్కనిమార్గంబుఁ జూప సంసారులకున్. 382

క. కలికి యవిముక్తవాసము, వలనఁ గలుగునట్టిసుగతి వైదుష్యముచేఁ
గలుగదు జపతపములచేఁ, గలుగదు కలుగదు ప్రకృష్టకర్మంబులచేన్. 383

క. అవిముక్తమందు మరణము, చవిచూడనివాఁడు జన్మశతముల కైనన్
భవవార్ధి దాఁట నేరక, నివసించుచు నుండు గర్భనిరయములందున్. 384

క. దోషసహస్రంబులచే, దూషిత మగుమేని కఖిలదోషము లుడుపన్
భేషజ మవిముక్తమె యని, భాషించిరి పెద్దలెల్లఁ బంకజవదనా. 385

క. ఒనగూడెనేని యొకపరి, జనునకు నవిముక్తమందుఁ జావు మఱెన్నం
డును గలుగ నేర దెచ్చో, టను జన్మము లేకపోవుటను నాతనికిన్. 386

గీ. జన్మమృత్యుజరాశోకసంప్లవంబు, లేనిధామంబునకుఁ జేరు మానవుండు
కలిగెనేని యదృష్టంబువలన నెన్నఁ, డైన నవిముక్తనిధనభాగ్యము మృడాని.

క. అవిముక్తమె పరమపదం, బవిముక్తమె పరమతత్త్వ మవిముక్తంబే
శివరూపము శివరూపమె, యవిముక్తము దాఁపనేల యతివా నీకున్. 388

క. నాపురమున వసియించెడి, పాపాత్ముల కేని పరమపద మొసఁగుదుఁ బ్రా
ణాపాయసమయమున నే, నాపద్బాంధవుఁడ నగుచు నంభోజాక్షీ. 389

క. వారాణసిలో నుండెడి, వారలె జాపకులు వారె వాయ్వాహారుల్
వారలె దాతలు హోతలు, వారలె సత్పురుషు లన్న వారలె తరుణీ. 390

వ. గయాప్రయాగ నైమిశారణ్య శ్రీశైల మహాబల కేదార భద్రకర్ణ పుష్కర కురు
క్షేత్ర భద్రకోటి నర్మదా మ్రాతకేశ్వరీ శాలగ్రామ కుబ్జామ్ర కోకాముఖ ప్రభాస

విజయేశానగోకర్ణ భద్రకర్ణంబు లన్ త్రిలోకవిశ్రుతంబు లగుపుణ్యతీర్థంబు లందు నిధనంబు నొందువారలు వారాణసీక్షేత్రంబునఁ గాలధర్మంబు నొందిన జీవులు చెందినట్లు పరతత్త్వముం జెందఁ జాలరు. 391

క. సులభంబు లగును నితర, స్థలములలో గంగయును వ్రతంబులు శ్రాద్ధం
బులు దానజపతపంబులు, కలికి సులభములు గావు కాశీపురిలోన్. 392

క. సతి వినుమీ జన్మాంతర, శతములనుండియును బిగువు సడలనియఘసం
తతి నెల్ల నొక్కత్రుటిలో, హతమార్చును జహ్నుతనయ యవిముక్తమునన్.

వ. గంగను స్మరించుటచేఁ బాతకంబును గీర్తించుటచే నతిపాతకంబును దర్శించుటచే గురుపాతకంబును గంగాస్నానంబుచేతను గంగాజలపానంబుచేతను గంగాజలతర్పణంబుచేతను మహాపాతకంబును భస్మీభూతంబు లగు. గంగాతీరంబునం బెట్టినపిండంబును గంగాజలంబునం గలిపినపిండంబును నరకస్థులు గీటాదిజంతువులు స్థావరములు నైనపితరులను దక్షిణంబ స్వర్గంబున కెక్కించు.

గీ. స్వర్గసోపానమార్గంబు శార్ఙ్గిచరణ, నళినమధుధార సంసారజలధితరణి
ధర్మరసఝరి జాహ్నవి తల్లివోలెఁ, జలువు మలశుద్ధి నెట్టికశ్మలుల కేని. 395

క. నిలువఁబడి యొక్కపదమున, నలయిక లేకుండ యుగసహస్రము తపమున్
జలిపినవారును గంగా, సలిలస్నాతులకుఁ దగరు సామ్యము నొందన్. 396

క. ఒనరును గంగామజ్జన, మున సంతృప్తియును సర్వభూతసమత్వం
బును నిజధర్మపరత్వం, బును ననియెడిమూఁడునుగుణములు మనుజులకున్.

గీ. సర్వవేదానుగతుఁ డగు స్నాతుఁ డయ్యె, నేని జాహ్నవిలోపల మానవుండు
సర్వవేదమయుం డౌటఁ జక్రపాణి, చక్రధరమయి యగుటను జహ్నుతనయ.

గీ. అన్యదేశంబున నొనర్చినట్టియఘము, దగ్ధమైపోవుఁ ద్రిపథగాతటమునందుఁ
ద్రిపథగాతీరమున నొనర్చినయఘంబు, నాశమును జెందుఁ ద్రిపథగాస్నానమునను.

గీ. స్వర్గలోకంబునందు దేవతల మర్త్య, లోకమున మానవుల నధోలోకమందు
నురగముల నుద్ధరించుచు నుంటఁ ద్రిపథ, గాభిధానంబుఁ దాల్చె గంగాభవాని.

గీ. ఉద్ధరించును జాహ్నవి యొక్కసారి, స్నాన మొనరించు నెడ నిజజలమునందు
సతిని విడిచినపతి నైనఁ బతిని విడిచి, నట్టిసతి నైనఁ బితృపరిత్యాగి నైన.

క. అవిముక్తమునందు సదా, శివుండ నగునన్నుఁ గొలుచుజీవులు సర్వా
ఘవిముక్తు లగుచుఁ గాంతురు, రవితేజమునన్ గణేశ్వరత్వము నబలా. 402

క. వనజాక్షి ధర్మ మొనరుచు, జను లొండొక్కట సహస్రజన్మంబులచేఁ
గనియెడిపరమార్థంబును, గనియెద రొకజన్మమున నె కాశీవాసుల్. 403

క. జ్ఞానము యోగము ముక్తియుఁ, గానఁ గలుగు నొక్కపుట్టుక నె యవిముక్త
స్థానమున దానికంటెను, గానమములు హెచ్చె తపము గావింపంగన్. 404

క. అవిముక్త మయ్యె నాచే, నవిముక్తం బగుటఁ గాశి యది యెల్లరకున్
జవిచూపు మోక్షసుఖమును, నివసించినఁ జాలు నొక్కనిమిషం బచటన్.
గీ. అధిక మగుతీర్థ మవిముక్త మవని నున్న, తీర్థములకంటె నచ్చటఁ దెలివి దప్ప
సమయమున నేనె చేయుదు జంతువులకుఁ, బ్రణవమంత్రోపదేశంబుఁబద్మగంధి.
క. ఇనబింబమందు హృదయం, బున నాభీమధ్యమునను భ్రూమధ్యమునం
దును మూర్ధమునను నుండెడి, యనవద్యం బైన తేజ యవిముక్త మనన్. 407
క. వరణకు నసికిని నడుమన్, బరగెడిధామంబె వారణాసి యనంగన్
ధరలోన వెలయు నయ్యది, పరతత్త్వంబునకు ముఖ్యపదము భవానీ. 408
గీ. బ్రహ్మయును విష్ణువును దివస్పతియు సురలు, యక్షగంధర్వపన్నగరాక్షసులును
సతము ననుఁగొల్చుచుందు రచ్చట నెకొనఁ, గాశికెనయైన నెలవొండు గానరాదు.
క. అవిముక్తవాస మబ్బుట, కవకాశము గలుగనీయ వఘములు గానన్
ద్రివిధము లగుకరణములను, నెవరును గావింపఁ గూడ దెపుడును నఘముల్.
క. ఇది దేవరహస్యం బి, య్యదియె పురాణములలోన నగపడుచుండున్
విదితము గా దందఱకును, విదితముగాఁ గానఁబడియు విశ్వమునందున్. 411
క. అని మధురమధురసూక్తుల, ననిమిషులును బరమఋషులు నందఱుఁ గూడన్
వినుచుండఁగఁ గాశీమహి,మను శర్వుఁడు వినిచెఁ దుహినమహీధరసుతకున్.
గీ. వాసుదేవుఁడువోలె దేవతలలోనఁ, జంద్రమకుటుఁడువోలె నీశ్వరులలోన
ధామములలోన నవిముక్తధామ మొకఁడె, శ్రేష్ఠ మైనది చూవె ధాత్రీకళత్ర.
క. పూర్వము శతజన్మంబుల, శర్వానియారాధనంబు సమకూరినచో
నుర్విస్థలి నవిముక్తం, బుర్వీశ్వర దొరకు వాసముండుట కెపుడున్. 414
క. ఇలలో నున్నను నెపుడును, దెలియంగా లేరు వామదేవాలయమున్
గలికల్మషదగ్ధాత్ములు, తెలిసికొనెద రాత్మహితము దెలిసినవారల్. 415
క. అరుగుదు నవిముక్తమునకు, నరుగుదు శివరాజధాని కరుగుదుఁ గాశీ
పురమున కనుచును గాలము, జరిపినను నివాసఫలము సంప్రాప్తించున్. 416
క. హరరాజధానిమహిమము, పరమాద్భుత మనుచు వలదె పలుకఁగ మదిలో
స్మరియించినంతమాత్రన, హరియించుచు నుండు నది మహాపాపములన్. 417
క. అవిముక్తమునఁ గుటుంబము, నివేశములు గలిగి సతము నివసించెడిమా
నవు లొనరించెడిపాతక, నివహములను శివుఁడు చేయు నిర్దగ్ధములన్. 418
క. లోకులు చెప్పినఁ బితరులు, వాకొనినను దేశికుండు వల దనినను న
వ్యాకుల నాలింపక మో, క్షాకాంక్షులు వారణాసి కగు నేఁగంగన్. 419
ఆ. కాశి దప్ప వేఱె గతి లేదు పితృమాతృ, వర్జితులకు బంధువర్జితులకు
వ్యాధివికలులకు జరాభిభూతులకును, నాపదుపహతులకు నగతికులకు. 420

ఆ. కాశి దప్ప వేఱె గతి లేదు భవపాశ, బద్ధులకును గర్మబద్ధులకును
ఘోరపాతకులకు దారిద్ర్యహతులకు, ధ్యానదానమానహీనులకును. 421
ఆ. కాశి దప్ప వేఱె గతి లేదు యోగవి, భ్రష్టులకు విమోహనష్టులకును
బంధుజనులలోనఁ బడరానియిక్కట్లు, పడినవారలకును బతితులకును. 422
గీ. ఔర యానందకాననం బౌర కాశి, యౌర యవిముక్త మౌర మహాశ్మశాన
మౌర శివరాజధాని సంసారవహ్ని, తప్తులను గాచుపీయూషధార యౌర.
గీ. కాపిలంబున నేని సాంఖ్యమున నేని, యోగమున నేని చేకూర కుండునట్టి
సుగతి నొసగెడి క్షేత్రంబు జగతిలోన, నొక్క వారాణసియె తక్క నొండు లేదు.
ఆ. విశ్వనాథుఁ డనెడిపితృహోత్రుఁడు ప్రాణి, కర్మబీజములను గాల్చుచుండు
మరల మొలవకుండ మతిమంతు లుందు రా, కారణమునఁ జేసి కాశిలోన. 425
క. కాశియె యోగము భోగము, కాశియె యాగాదిపుణ్యకర్మము లెల్లన్
గాశియె స్వర్గము కాశియె, కాశియె మోక్షంబు ప్రాప్తి గలవారలకున్. 426
గీ. కామ మేడ మదం బేడఁ గాలుఁ డేడ, నేడఁ బాపంబు జర యేడ నేడ భీతి
యేడ జాడ్య మహంకార మేడ నేడ, వాసనాపీడ కాశీనివాసులకును. 427

—: ఓంకారలింగమాహాత్మ్యము :—

గీ. అచట నోంకార మనులింగ మతిరహస్య, మైనదియు ఋషిసేవిత మైనదియును
కలుషహర మైనదియునొండుగలదుదాని,స్మరణమునఁగల్గు మోక్షంబుమానవులకు.
గీ. ప్రణవనాదంబు సేయునాప్రణవలింగ,మందుఁ బంచాయతనవిగ్రహంబుతోడ
నుండి శితికంఠుఁ డానంద మొందుచుండు,నదియుఁబంచాయతనరూప మగుటఁ జేసి.
గీ. పాశుపత మైనజ్ఞానంబె పలుకఁబడియె, మునులచేతను బంచాయతన మటంచు
నదియె యోంకారలింగ మయ్యదియె శివుఁడు,దానికిని శివునకును భేదంబు లేదు.
వ. పాశుపతజ్ఞానంబు శాంత్యతీత శాంతి యపరావరవిద్యా ప్రతిష్ఠ నివృత్తి యని యైదువిధంబులుగా నుండుటం జేసి పంచాయతనం బని చెప్పంబడియె. పంచాయతనంబు లింగరూపముం జెంది యుండి యంతకాలంబున జీవుల కోంకారంబు నుపదేశించుచుండుటం జేసి యోంకారలింగం బనునామముం బడసె. 431
క. కనఁ జాలరు తత్స్థానం, బును మును లేనియును సతతమును ద్రిభువనపా
వన మగుభాగీరథితట,మున నది గోచర్మమాత్రముగ నుండు నృపా. 432
వ. కృత్తివాసేశ్వరలింగంబును మధ్యమేశ్వరలింగంబును విశ్వేశ్వరలింగంబును గపర్దీశ్వరలింగంబును నోంకారలింగంబును వారణాసియం దుండుగుహ్య లింగంబులు. 433
క. ఆయేనుగుహ్యలింగము, లేయోగియుఁ గూడఁ జాలఁ డీక్షింపంగన్
మాయాభిదుఁ డగునవియు, క్తాయతనాధిపునను గ్రహము లేకున్నన్, 434

—: కృత్తివాసేశ్వరలింగమాహాత్మ్యము :—

సీ. వచియించెదను గృత్తివాసేశ్వరమహత్త్వ, మొకయింత వినుము నీ పుర్వారేంద్ర
దంతిరూపము దాల్చి దైత్యుఁ డొక్కఁడు మున్ను, చని కృత్తివాసేశసవిధమునకు
నట జపించుచు నుండినట్టి బ్రాహ్మణులను, నొక్కపెట్టునఁ జంప నుద్యమింప
నాలింగముననుండి యాక్షణంబున నుగ్రుఁ, డావిర్భవించి ప్రత్యక్షముగను
గీ. శూలమునఁ జంపి యాగజాసురుని వాని, కృత్తి ధరియించి కృత్తివాసేశ్వరుండు
నాఁగ విలసిల్లె నాస్వామినామమున నె,వెలసె లింగము గూడఁ బృథ్వీకళత్ర. 435
గీ. అచటఁ దపము తపోధను లాచరించి, చనిరి తనువులతోడ నా సద్గతులకు
గాన నాస్థాన మాదిత్యగణము లెల్ల, విడువక వసించుచుందు రేవేళ నేని. 436
క. కలుగునో కలుగదో మోక్షము, స్థలాంతరమునందు జన్మశతముల కైనన్
గలుగు నొకజన్మమునకే, వలనుగ సేవింపఁ గృత్తివాసేశ్వరునిన్. 437
గీ. యుగయుగంబున వేదపారగులు గూడి, కృత్తివాసేశ్వరమును గీర్తించుచుందు
రఖిలసిద్ధుల కాలయం బనుచు నెఱిఁగి, సముచితము లైన వేదమంత్రములచేత.
క. నందింపఁ జేయుచుందురు, కొందఱు ధ్యానములచేతఁ గొందఱు స్తుతులన్
గొందఱు క్రతువులఁ గొందఱు, వందనములచేతఁ గృత్తివాసేశ్వరునిన్. 439
క. కలియుగ మధర్మబహుళము, కలుషమయం బనెడు తెలివి గలిగినవారల్
నెలకొని యవిముక్తంబున, వలయును గొలువంగఁ గృత్తివాసేశ్వరునిన్. 440

—: కపర్దీశ్వరలింగమాహాత్మ్యము :—

వ. ఇంకఁ గపర్దీశ్వరమాహాత్మ్యంబు చెప్పెద నాలకింపుము. 441
సీ. ఆఁకటిపెల్లున నసురుఁ డొక్కఁడు మున్ను, ద్వీపియై యొకలేడివెంటఁ బడియె
హరిణి భయంబునఁ బరువువాఱుచుఁ బోయి, యలసి కపర్దీశ్వరాంతికమునఁ
జిక్కె వ్యాఘ్రమునక్షుఁ జీల్చి గోళ్లను దాని, ద్వీపి రక్తము త్రావి వెడలిపోయె
నంత నాలేడిదేహమునుండి యొకమహా, జ్వాల మండుచు నాకసమున కేఁగె
గీ. నేఁగి యది యుప్పరంబునం దిందుమౌళి, తోడ వృద్ధోక్షవాహంబుతోడ మూఁడు
కనులతోడను నల్లనిగళముతోడఁ, గానఁబడియె మహాశ్చర్యకరము గాఁగ. 442
ఆ. అపుడు పుష్పవర్ష మాకసముననుండి, కురిసి రమరు లమితకౌతుక మొదవ
నంత నాక్షణంబునందు గణేశ్వరి, యగుచు జ్వాల మాయమయ్యె నధిప. 443
క. అది చూచి కపర్దీశ్వర, పదమాహాత్మ్యంబు నెఱిఁగి బ్రహ్మర్షులున్
త్రిదశర్షులు నాస్థానము, వదలక వసియించి రాత్మవాంఛలు దీరన్. 444
క. కావున నె కపర్దీశ్వర, సేవాభాగ్యంబు కార్యసిద్ధుల నెల్లన్
గావించి పరమపదమున్, గైవసమొనరించుఁ బాపకర్ముల కైనన్. 445

—: పిశాచమోచనతీర్థమాహాత్మ్యము :—

క. జననాథ యా ప్రదేశం, బున నొకతీర్థము పిశాచమోచన మనుపే
రను నొప్పుచుండెఁ దన్మహి, మను జెప్పెద వినుము లేశమాత్రము నీకున్. 446

సీ. శంకుకర్ణుం డనుక్ష్మాసురుం డొక్కఁడు, నైష్ఠికదీక్షాగరిష్ఠుఁ డగుచు
శివరూపమును నుపాసించుచు నధివసిం, చెను గపర్దీశ్వరక్షేత్రమందు
నటు లుండ నొక్కనాఁ డచటికి నొకప్రేత, మే తెంచి క్షుధచేత నేడ్వఁ దొడఁగె
నది చూచి కరుణాళు వగుచు నాద్విజుఁడు నీ, వెవఁడ వీ విటకు రా నేల చెపుమ

గీ. యని యడుగుటయుఁ బ్రేత మాతనికి మ్రొక్కి
స్వామి ప్రాగ్జన్మమున నేను క్ష్మాసురుఁడను
నప్పు డిది పుణ్య మిది పాప మనుచు నైనఁ
దలఁపనైతిని ధనమదాంధ్యంబుచేత. 447

క. పూజింపనైతి గోవులఁ, బూజింపకపోతి సవనభుజులను ద్విజులన్
బూజింపనైతి నతిథులఁ, బూజింపకపోతి బుద్ధి బూడిదఁ గలిసెన్. 448

గీ. కాని దైవికముగ నొక్కకాలమందుఁ
గాశిలో విశ్వనాథలింగమును జూచు
టయును దాఁకుటయును మ్రొక్కుటయును నాకుఁ
గలిగె నద్దాన యమపురిం గాంచనైతి. 449

క. మును చేసినయఘములె నా, కొనరించెను బ్రేతజన్మ మొఱలుచు నుంటిన్
బెనుబూతమునకు నాఁకలి, పెనుబూతమువోలెఁ దవిలి పీలిచివైచెన్. 450

క. అనఘా నేను దరించుట, కను వైనయుపాయ మేది యైనను నున్నన్
గనుఁగొని నాహీనదశన్, గనికరమున నానతిమ్ము కా దనకుండన్. 451

క. అనవుడుఁ బ్రేతము నాతఁడు, గనుఁగొని యి ట్లనియె నీవు కాశీశ్వరునిన్
గనుఁగొంటివి తాఁకితి వం, దన మొనరించితివి దాన ధన్యత యొదవెన్.

గీ. ఆమహాపుణ్యమునఁ జేసి యరుగుదెంచి, నాఁడ వీస్థానమునకు నీనాఁటితోడఁ
దీరె నీకర్మ మెల్ల నీతీర్థమందు, మునుఁగు మిపుడె కపర్దీశ్వరునిఁ దలంచి. 453

క. అనుడుఁ గపర్దీశ్వరునిం, దనమనమునఁ దలఁచికొనుచుఁ దత్క్షణమున సం
జనితానందముతోడను, మునిఁగెను బ్రేతము పిశాచమోచనమందున్. 454

ఆ. మునిఁగి లేచి చంద్రముకుటంబుతోడను, భోగిగణముతోడ యోగిగణము
తోడఁ బ్రమథగణముతోడను నాలింగ, మంద లీనమయ్యె నద్భుతముగ. 455

క. అది చూచి శంకుకర్ణుం, డెదలో విస్మయము గలుగ నీశ్వరశక్తిన్
మదిఁ దలఁచి తలఁచి కనులను, ముదశ్రువులు మేనఁ బులకమొలకలు వెలయన్.

క. శరణము వేఁడెద నొక్కనిఁ, బురాణపూరుషు నశేషభువనాధిపతిన్
హరిదశ్వునిఁ బావకునిం, బరాత్పరునిఁ బావనునిఁ గపర్దీశ్వరునిన్. 457

సీ. ఆద్యంతరూపుని నద్వయాకారునిఁ, గపిలాధిరూఢునిఁ గాలగళుని
సకలభూతాంతరసన్నివిష్టుని హిర, ణ్మయుని యోగీంద్రు నానందఘనుని
హరుని సహస్రపాదాక్షిశీర్షునిఁ బర, బ్రహ్మరూపునిఁ దమఃపరుని శివునిఁ
గాలాత్మకుని నిందుమౌళిఁ బినాకిని, విశ్వజన్మస్థితివిలయకరుని

గీ. నామరూపాదిరహితు నామ్నాయవిదితు, నచ్యుతుని వ్యాపకుని నఖిలావభాసి
మానిజనగోచరుని నవాఙ్మనసగమ్యు, నభినుతింతుఁ బ్రణామింతు నాశ్రయింతు.

క. అని యీవిధమున స్తోత్రం, బొనరిచి దండప్రణామ మొనరింపఁగ నా
తనియెదుటను నావిర్భవి, లెను నప్పుడె యొక్కవిమలలింగం బధిపా. 459

క. ఆవిమలలింగమును భూ, దేవుఁడు గుతుకంబుతోడఁ దిలకించుచు నే
భూవర యత్యాశ్చర్యం, బానహిలన్ దానిలోన నైక్యము నొందెన్. 460

క. ధరణీతలాధిప యీపర, మరహస్యం బగుకపర్దిమాహాత్మ్య మెఱుం
గరు పండితులును మోహము, దురతిక్రమ మెంతయూర్జితులకును నైనన్. 461

గీ. శంకుకర్ణుం డొనర్చినసంస్తవంబు, ననుదినంబును జదివిన వినిన నఖిల
పాతకవిముక్తు లగుచును బరమపదము, చేరుదురు మర్త్యు లెవ రేని క్షితితలేంద్ర.

—: మధ్యమేశ్వరలింగమాహాత్మ్యము :—

గీ. మధ్యమేశ్వరలింగంబుమహిమ యింక, నించుక వచించెదను విను మిందుమౌళి
నిరతమును దానియం దుండు గిరిజతోడ, రుద్రగణములతోడ నున్నిద్రుఁ డగుచు.

సీ. దేహ మంతటను భూతిని బూసికొని కంఠ, మందు ధరించి రుద్రాక్షమాల
తాలిచి పాశుపతవ్రతదీక్షను, జేయుచు రుద్రపారాయణంబు
శూలి నారాధించుచును నాస్థలంబున, నొకవత్సరము దాఁక నుండె శౌరి
యంతట నొకనాఁడు హరుఁడు ప్రత్యక్షమై, వైకుంఠున కభీష్టవర మొసంగి

గీ. వాసుదేవునిఁ బూజించువారె నన్నుఁ, దెలిసికొనియెడిజ్ఞానంబు గలుగువారు
హరిని విడనాడువారు నన్నరయ నేర, రని వచించి యంతర్ధానమయ్యె నధిప.

ఉ. కావున స్నానమున్ జలిపి గాంగజలంబున భక్తితో మహా
దేవుని మధ్యమేశ్వరుని దిక్కుగ నెంచి భజించినన్ జగ
త్పావనమూర్తులై సకలపాపవిముక్తిని జెంది మానిసం
సేవిత మైనధామమును జెందుదు రంతమునందు భూవరా. 465

ఆ. అచటఁ బాపకర్మ లైనను దేహముల్, విడిచి రేని యొక్కగడియలోన
బ్రహ్మవిదులు చెందుపరమపదంబును, బడయుదురు విధూతపాపు లగుచు. 466

క. అచ్చటఁ గలిగినజ్ఞానం, బచ్చటితపమచటిదాన మచ్చటిశ్రాద్ధం
బచ్చటఁ బెట్టినపిండము, హెచ్చగు నొకటొకటె కులము లేడుఁ దరింపన్. 467

క. ఈమాహాత్మ్యము చదివిన, నీమాహాత్మ్యంబు వినిన నెవఁడేని పరం
ధామమున కేఁగు విగళి, తామ్యక్రోధాదిషడ్వికారుం డగుచున్. 468

ఆ. కల వనేకతీర్థములు పావనంబులు, వారణాసిలోన వసుమతీంద్ర
వానిలోనఁ గొన్ని వచియింతుఁ బెద్దల, వలనఁ దెలిసికొనినవాని నీకు. 469

వ. విశ్వరూపతీర్థంబును దాళతీర్థంబును నాకాశతీర్థంబును ఋషభతీర్థంబును సునీల తీర్థంబును గౌరీతీర్థంబును ప్రాజాపత్యతీర్థంబును స్వర్గద్వారతీర్థంబును జంబుకేశ్వరతీర్థంబును ధర్మతీర్థంబును గయాతీర్థంబును మహానదీతీర్థంబును నారాయణ తీర్థంబును వాయుతీర్థంబును జ్ఞానతీర్థంబును వారాహతీర్థంబును యమతీర్థంబును సమ్మార్జితకతీర్థంబును నగ్నితీర్థంబును గలశేశ్వరతీర్థంబును నాగతీర్థంబును సోమతీర్థంబును సూర్యతీర్థంబును బర్వతతీర్థంబును మణికర్ణికాతీర్థంబును ఘటోత్కచతీర్థంబును శ్రీతీర్థంబును బితామహతీర్థంబును గంగాతీర్థంబును దేవేశ తీర్థంబును యయాతితీర్థంబును గాపిలతీర్థంబును సోమేశతీర్థంబును బ్రహ్మ తీర్థంబునుం గలవు. 470

—: బ్రహ్మలింగమాహాత్మ్యము :—

సీ. బ్రహ్మ మున్నొకకపురాణలింగము దెచ్చి, యచ్చోట నుంచి స్నానార్థ మరుగ
నంతలో గోవిందుఁ డాలింగమును దాను, స్థాపించె నచ్చోట సత్వరముగ
నజుఁడు స్నానము చేసి యరుదెంచి స్థాపితం, బైనలింగముఁ జూచి హరిని గాంచి
యేను స్థాపింపఁగా నెంచి తెచ్చినలింగ, మీవు స్థాపింపఁగా నేల చెపుమ

గీ. యనుటయును విష్ణు వజునితో ననియె నిట్లు, నాకు నీకంటె భక్తి పినాకిపైని
హెచ్చుగా నుంట నీకార్య మిట్టు లయ్యె, నైన నీలింగ ముండు నీయాఖ్య ననియె.

వ. అది మొదలుకొని యాలింగంబు బ్రహ్మలింగం బనుఖ్యాతి వడసె. మఱియును భూతేశ్వరతీర్థంబును ధర్మతీర్థంబును గంధర్వతీర్థంబును వాహ్నేయతీర్థంబును దౌర్వాసికతీర్థంబును వ్యోమతీర్థంబును జంద్రతీర్థంబును జింతాంగదేశ్వర తీర్థంబును విద్యాధరేశ్వరతీర్థంబును గేదారతీర్థంబును నుగ్రతీర్థంబును గాలంజర తీర్థంబును సారస్వతతీర్థంబును బ్రభాసతీర్థంబును రుద్రకర్ణహ్రదతీర్థంబును గోకిల తీర్థంబును మహాలయతీర్థంబును హిరణ్యగర్భతీర్థంబును గోప్రేక్షతీర్థంబును నుపశాంతతీర్థంబును శివతీర్థంబును వ్యాఘ్రేశ్వరతీర్థంబును ద్రిలోచనతీర్థంబును లోలార్కతీర్థంబును నుత్తరతీర్థంబును గపాలమోచనతీర్థంబును శుక్రేశ్వర తీర్థంబును నానందపురతీర్థంబును మున్నగుపుణ్యతీర్థంబులుం గలవు. 472

గీ. కాశిలో నుండుతీర్థముల్ గణనసేయఁ, గల్పకోటిశతంబులుఁ గడచిపోవు
లేదు వానికి మితి చెప్ప లేము గాన, నింకఁ దీర్థాంతరములు నీ కెఱుకపఱుతు.

—: గయాతీర్థమాహాత్మ్యము :—

గీ. కలదు గయ యనుతీర్థ మొక్కటి నరేంద్ర, దానిలోఁ గాలువెట్టినతత్క్షణంబ
కలుగు హయమేధసవనంబు సలిపినట్టి, ఫలము తన్మహిమంబు చెప్పంగఁ దరమె.

గీ. అచ్చట మహానదీజలమందుఁ దీర్థ, మాడి పితృతర్పణము చేయునట్టివాఁడు
స్వకులమును నుద్ధరించి యక్షయము లైన, లోకములు చెందువాఁడు ధాత్రీకళత్ర

క. గయలోఁ బ్రాక్తన మగున, క్షయవట మొకఁ డుండె దానిసన్నిధి దత్తం
బయినది సమస్తమును న, క్షయముగఁ బితరులకుఁ దృప్తి గలిగించు నృపా.

వ. అందు బ్రహ్మారణ్యోపసేవితం బగుబ్రహ్మసరస్తీర్థంబు గలదు. అది గమనమాత్రంబునం బౌండరీకక్రతుఫలంబు ననుగ్రహించు. తత్తీర్థంబునందుఁ బరమేష్ఠిచేఁ బ్రతిష్ఠింపంబడినయూపంబునకుఁ బ్రదక్షిణంబు గావించెనేని వాజపేయఫలంబు గలుగు. మఱియును నందు ఫల్గుతీర్థంబు గలదు. అయ్యది దర్శనమాత్రంబున నశ్వమేధఫలంబు నొసంగు. పిమ్మట ధేనుకతీర్థంబు గలదు. అం దొక్కరాత్రి నివసించి తిలధేనుదానంబు చేసెనేని సర్వపాపవిముక్తిం బడసి సోమలోకనివాసభాగ్యంబు నొందు. అచ్చోటఁ బర్వతంబునందు మున్ను వత్సంబులతోడం గూడి కపిల సంచరించె. తత్ఖురన్యాసంబు లిప్పటికిని నచ్చటఁ గన్పట్టుచున్నయవి. తత్పాదంబు లుపస్పృశించెనేని సమస్తపాపంబులును దొలంగు. పిదప గృధ్రవటం బనుశివక్షేత్రంబు గలదు. అందు వృషభధ్వజుని సన్నిధానంబున భస్మస్నానంబు గావించెనేని బ్రాహ్మణుండు ద్వాదశవార్షికవ్రతంబు నెఱవేర్చినవాఁ డగు. ఇతరవర్ణంబులు సర్వపాపవిముక్త లగుదురు. పిదప నుదయపర్వతంబు గలదు. అందు సావిత్రపదంబు గానంబడుచుండు. అచ్చట బ్రాహ్మణుం డొకపరి సంధ్య నుపాసించెనేని ద్వాదశవర్షంబులు సంధ్య నుపాసించినవాఁ డగు. అచ్చటనె యోనిద్వారం బనుమఱియొకపుణ్యతీర్థంబు గలదు. దానం బ్రవేశించినమాత్రంబున యోనిసంకటంబునుండి విముక్తుం డగు.

క. ధరణీశ్వర గయలోపల, నిరయార్హుం డేని యొక్కనెల యుండినచోఁ
బరిశుద్ధుఁ డగుచుఁ బితరులఁ, దరియింపంజేయు నేడుతరములవారిన్. 478

గీ. గయకుఁ జని శ్రాద్ధ మొనరింపఁ గలిగినట్టి
పుత్త్రుఁ డొకఁడైనఁ దమవంశమున జనింప
వలయు నని కోరుచుండు రన్వహము నరక
భీతు లైనట్టిపితరులు భూతలేంద్ర. 479

క. కనవలయును బహుపుత్రులఁ, జను నందొకఁడైన గయకుఁ జలుపు నొకండై
నను నీలవృషోత్సర్జన, మొనరించును వాజిమేధ మొక్కండైనన్. 480

—: నీలవృషలక్షణకథనము :—

వ. లోహితవర్ణంబును బాండురపుచ్ఛాగ్రంబును శ్వేతఖురవిషాణంబును నగునృషభంబు నీలవృషం బనియును నీలవృషోత్సర్గం బశ్వమేధయాగసమానం బనియును శాస్త్రంబులఁ జెప్పంబడియె. పిమ్మట ధర్మపృష్ఠతీర్థంబుగలదు. అచ్చట ధర్ముండు నిత్యనివాసంబుగా నుండు. ధర్మసేవనంబువలన వాజిమేధఫలంబు లభియించు. పిదప బ్రహ్మతీర్థంబు గలదు. అచ్చట నియమవ్రతుండై బ్రహ్మ నర్చించెనేని రాజసూయాశ్వమేధఫలంబు ప్రాప్తించు. పిదప రాజగృహతీర్థంబుగలదు. తదుపస్పర్శంబు గావించెనేని కక్షీవంతుం డనుతపోధనుండువలె నిత్యసంతుష్టుండై యుండు. అచ్చట యక్షిణీప్రసాదంబున బ్రహ్మహత్యావిముక్తి కలుగు. పిదప మణినాగతీర్థంబు గలదు. అచ్చట మణినాగనైత్యకంబును భుజియించెనేని పాము కఱచినను విష మెక్కకుండు. తత్తీర్థంబునం దొక్కరాత్రి యుండెనేని సర్వపాపవిముక్తుండగు. పిదప గౌతమవనంబుగలదు. అచ్చట నహల్యాహ్రదంబున స్నానంబు సలిపెనేని పరమపదప్రాప్తి చేకూరు. పిదప శ్రీతీర్థంబు గలదు. తద్గమనమాత్రంబున శ్రీయుతుండగు. అందుఁ ద్రిలోకవిశ్రుతం బనుకూపంబున స్నానంబు గావించెనేని వాజిమేధఫలంబు చేకూరు. మఱియును నందు జనకరాజర్షికూపంబు గలదు. అది ప్రాప్తిమాత్రంబున సర్వపాపవినాశనముం గావించి యశ్వమేధఫలంబును సోమలోకంబును బ్రసాదించు. పిదప సర్వతీర్థజలోద్భవం బగుగండకీతీర్థంబుగలదు. దానిం బ్రాపించినమాత్రంబున వాజపేయఫలంబును సూర్యలోకవాసముం గలుగు. పిదప ధ్రువతపోవనంబు గలదు. తత్ప్రవేశమాత్రంబున గుహ్యకలోకంబు వడయు. పిదప విశాలానది కలదు. అం దవగాహంబు గావించెనేని యగ్నిష్టోమఫలంబును స్వర్గలోకవాసంబునుం గలుగు. పిదప మాహేశ్వరధారాతీర్థంబు గలదు. అందు స్నాతుం డయ్యెనేని యశ్వమేధఫలంబు వడసి కులంబు నుద్ధరించినవాఁ డగు. పిదప దేవపుష్కరిణి గలదు. దానిం బ్రాపించెనేని వాజపేయఫలంబు వడసి దుర్గతిం జెందకుండు. పిదప మాహేశ్వరపదతీర్థంబు గలదు. అందు స్నానంబు చేసెనేని వాజిమేధఫలంబు గలుగు. అచ్చటఁ గోటితీర్థంబులు గలవు. 481

క. మును రక్కసుఁ డొక్కనిచేఁ, గొనిపోవంబడినతీర్థకోటిని మరలన్
గొనివచ్చి యందె స్థాపిం, చెను గూర్మాకారుఁడై నశ్రీపతి యధిపా. 482

వ. అందు స్నానంబు గావించెనేని పౌండరీకఫలంబును విష్ణులోకప్రాప్తియుం గలుగు. పిదప సాలగ్రామక్షేత్రంబు గలదు. అందు నారాయణుండు నిత్యనివాసంబుగా

నుండు. అచ్చట గోవిందసందర్శనంబు గావించెనేని ఋణవిముక్తుండై యశ్వమేధఫలంబును వైకుంఠావాసభాగ్యంబునుం బడయు. సాలగ్రామక్షేత్రంబునందు సర్వపాపవిమోచనం బనునొక్కకూపంబు గలదు. ఆకూపంబునందు నాల్గు సముద్రంబులును సన్నిహితంబులై యుండు. అందు జలోపస్పర్శంబు గావించెనేని దుర్గతిం బొరయకుండు. మఱియు నందు జాతిస్మరతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని జాతిస్మరత్వంబు గలుగు. పిదప వటేశ్వరపురంబు గలదు. అం దుపవాసంబు గావించి కేశవు నర్చించెనేని యభీష్టలోకప్రాప్తి గలుగు. పిదప వామనతీర్థంబు గలదు. అందుఁ బుండరీకాక్షుని నమస్కరించెనేని దుర్గతి దూరుం డగు. పిదప భరతాశ్రమంబు గలదు. అందు మహాపాతకనాశని యగు కౌశికియందు స్నానంబు గావించెనేని రాజసూయయాగఫలంబు సమకూరు. పిదపఁ జంపకారణ్యంబు గలదు. అచ్చట నొక్కరాత్రి యుపవసించెనేని గోసహస్రదానఫలంబు చేకూరు. పిదప గోవిందతీర్థంబు గలదు. అందు గౌరీసమేతుం డగువిశ్వేశ్వరుని నవలోకించెనేని మిత్త్రావరుణలోకంబులు ప్రాప్తించు. మఱియు నందుఁ ద్రిరాత్రోపవాసంబు గావించెనేని యగ్నిష్టోమఫలంబు ప్రాప్తించు. పిదపఁ గన్యాసంవేద్యతీర్థంబు గలదు-పరిశుద్ధుండై దానిం బ్రాపించెనేని ప్రజాపతిమనులోకంబులు వడయు. కన్యాసంవేద్యతీర్థంబునం దేమాత్రమేనియు దానంబు గావించెనేని యది యక్షయం బని మహర్షులచేఁ జెప్పం బడియె. పిదప నిష్ఠావాసతీర్థంబు గలదు. గమనమాత్రంబున నయ్యది యశ్వమేధఫలంబును విష్ణులోకంబునుం బ్రసాదించు. నిష్ఠాసంగమమునందు దానంబు గావించువారు బ్రహ్మలోకంబునందు వసియింతురు. అచ్చట వసిష్ఠాశ్రమంబు గలదు. అందు స్నానంబు గావించెనేని వాజపేయఫలంబు వడయు. పిదప దేవర్షిగణసేవితం బగుదేవకూటంబు గలదు. దానిం బ్రాపించెనేని వాజిమేధఫలంబు వడసి కులంబు నుద్ధరించినవాఁ డగు. పిదపఁ గౌశికహ్రదంబు గలదు. అచ్చట విశ్వామిత్రుండు తపస్సిద్ధిం బడసె. అం దొక్కమాసంబు వసియించెనేని యశ్వమేధఫలంబు వడయు. తత్సేవాభాగ్యంబున దుర్గతిదూరుండై బహుసువర్ణంబు నొందు. పిదప వీరాశ్రమవాసి యగుకుమారుని సేవించెనేని యశ్వమేధ ఫలంబు వడసి యమరలోకనివాసభాగ్యంబు నొందు. పిదప నందినీతీర్థంబునం దుండుపుణ్యకూపంబు నధిగమించెనేని నరమేధయాగఫలంబు వడయు. పిదపఁ గాళికాసంగమంబునం గౌశిక్యారుణానదులలో స్నానంబు గావించి త్రిరాత్రం బుపవసించెనేని సర్వపాప విముక్తుం డగు. పిదప నుర్వశీతీర్థంబునందును సోమాశ్రమమందును గుంభకర్ణాశ్రమమందును స్నానంబు గావించెనేని జగత్పూజ్యత్వంబు గలుగు. పిదపఁ గోకాముఖతీర్థంబునందు స్నానంబు

గావించెనేని జాతిస్మరత్వంబు వడయు. పిదప ఋషభద్వీపంబునందుఁ గ్రౌంచ నిషూదనుని సేవించి సరస్వతీసలిలం బుపస్పృశించెనేని దేవతావిమానస్థుండై విరాజిల్లు. పిదప నౌద్యానకతీర్థంబునందు స్నాతుం డయ్యెనేని సర్వపాప విముక్తుం డగు. పిదప బ్రహ్మర్షి సేవితం బగుబ్రహ్మతీర్థంబుం బ్రాపించెనేని వాజపేయఫలంబు లభియించు. పిదపఁ జంపాభాగీరథీదండార్పణంబులయందు స్నానంబు గావించెనేని గోసహస్రదానఫలంబు ప్రాప్తించు. పిదప విద్యాతీర్థంబు నుపస్పృశించెనేని విద్వాంసుం డగు. పిదప రామప్రసాదంబుచేఁ దీర్థరాజంబుగాఁ జేయఁబడినలౌహిత్యతీర్థంబునందు స్నాతుం డయ్యెనేని బహుసువర్ణప్రాప్తి కలుగు. పిదపఁ గరతోయాతీర్థంబున స్నానంబు గావించి త్రిరాత్రోపవాసంబు చేసెనేని యశ్వమేధఫలంబును శక్రలోకంబునుం బడయు. పిదప గంగాసాగర సంగమంబునందు స్నానంబు గావించెనేని దశగుణాశ్వమేధఫలంబు ప్రాప్తించు. పిదప గంగాద్వీపంబునందు స్నానంబు సలిపి త్రిరాత్రోపవాసంబు గావించెనేని సర్వకామసిద్ధి చేకూరు. పిదప వైతరణీనదియందును విరాట్తీర్థంబునందును నవగాహనంబు గావించెనేని యమృతాంశుండువలె విరాజిల్లు. పిదప శోణ జ్యోతిరథీసంగమంబున స్నానంబు గావించి పితృదేవతాతర్పణంబు గావించెనేని యగ్నిష్టోమఫలంబు చేకూరు. పిదప శోణనర్మదాప్రభవంబునందు వంశ గుల్మంబు నుపస్పృశించెనేని వాజిమేధఫలంబు గలుగు. కోసలయందు ఋషభ తీర్థంబునఁ ద్రిరాత్రంబు లుపవసించెనేని వాజిమేధఫలంబు లభియించు. అచ్చట గాలతీర్థము నుపస్పృశించెనేని ఋషభతీర్థఫలంబుకంటె దశగుణాధికం బగు ఫలంబు వడయు. పిదపఁ బుష్పవతీతీర్థంబు నుపస్పృశించి త్రిరాత్రం బుపవ సించెనేని గోసహస్రదానఫలముం బడసి కులంబు నుద్ధరించినవాఁ డగు. పిదప బదరికాతీర్థంబునందు స్నానంబు సలిపెనేని దీర్ఘాయువును స్వర్లోకనివాసభాగ్యం బును జేకూరు. పిమ్మట జామదగ్న్యనిషేవితం బగుమహేంద్రక్షేత్రంబునందు రామతీర్థంబున స్నానంబు గావించెనేని వాజిమేధఫలంబు వడయు. అచ్చటన మతంగుని కేదారతీర్థంబు గలదు. అందు స్నానంబు గావించెనేని గోసహస్ర దానఫలంబు లభియించు. పిదప శ్రీపర్వతంబునందు నదీతీరంబు నుపస్పృశించి దేవహ్రదంబున స్నాతుం డయ్యెనేని యశ్వమేధఫలంబును బరమపదంబునుం బ్రాప్తించు. శ్రీపర్వతంబున మహాదేవుండు దేవీసమేతంబుగా బ్రహ్మాది త్రిదశులు భజింప నివసించి యుండె. పిదపఁ గావేరీతీర్థంబునందు స్నానంబు గావించెనేని గోసహస్రదానఫలంబు ప్రాప్తించు. పిదప గోకర్ణక్షేత్రంబునందు త్రిరాత్రంబు లుపవసించి బ్రహ్మాది దేవతలచేతను దపోధనులచేతను సిద్ధచారణ గంధర్వకిన్నరోరగులచేతను భూతయక్షపిశాచపన్నగులచేతను మానవులచేతను

సరిత్సాగర శైలంబులచేతను నుపాసింపఁబడుచుండుసదాశివుని నర్చించెనేని దశాశ్వమేధఫలంబును గాణపత్యంబునుం బడయు. అచ్చట ద్వాదశరాత్రంబు లుపవసించెనేని కృతార్థుం డగు. మఱియు నచ్చటన గాయత్రీస్థానంబు గలదు. అందుఁ ద్రిరాత్రంబులు నివసించెనేని గోసహస్రదానఫలంబు లభియించు. మఱియును నచ్చట ద్విజుండు గాయత్రిని జపించెనేని నిరుపమవాగ్విభవాన్వితుం డగు. పిదప సంవర్తుం డను బ్రహ్మర్షివాపియందు స్నానంబు గావించెనేని మిగుల రూపవంతుం డగు. పిదప వర్ణోద్యతీర్థంబున స్నానంబు సలిపి పితృదేవతాతర్పణంబు గావించెనేని మయూరహంసయుక్తం బగువిమానంబు నధిష్ఠించు. పిదప గోదావరీ తోయంబున స్నానంబు గావించెనేని వాయులోకప్రాప్తి గలుగు. పిదప వేణాసంగమంబున స్నాతుం డయ్యెనేని వాజపేయఫలంబును వరదాసంగమం బున స్నాతుం డయ్యెనేని గోసహస్రదానఫలంబును జేకూరు. పిదప బ్రహ్మస్థూణా తీర్థంబునందు స్నానంబు గావించి త్రిరాత్రంబు లుపవసించెనేని గోసహస్ర దానఫలంబును స్వర్లోకనివాసభాగ్యంబును గలుగు. పిదపఁ గుబ్జాపవతీర్థంబు నందు స్నానంబు గావించి త్రిరాత్రోపవాసంబు చేసెనేని గోసహస్రదానఫలంబు గలుగు. పిదప దేవహ్రదంబునందును జ్యోతిర్మాత్రిహ్రదంబునందును గన్యా శ్రమంబునందును మహేంద్రుండు క్రతుశతంబు గావించి స్వర్గరాజ్యాధిపత్యంబు వడయుటం జేసి యచ్చట స్నానంబు గావించెనేని యగ్నిష్టోమశతఫలంబు ప్రాప్తించు. పిదప సర్వదేవహ్రదంబున స్నానంబు చేసెనేని గోసహస్రదాన ఫలంబును జాతిమాత్రహ్రదంబున స్నానంబు చేసెనేని జాతిస్మరత్వంబును లభియించు. పిదపఁ బయోష్ణీసరిత్తునందు స్నాతుండై పితృదేవతార్చనంబు గావించెనేని గోసహస్రదానఫలంబు గలుగు. పిదప దండకారణ్యంబునందు శరభంగాశ్రమంబును శుకాశ్రమంబును బ్రాపించెనేని దుర్గతిం జెందక స్వకులంబు నుద్ధరించినవాఁ డగు. పిదప జమదగ్నినిషేవితం బగుసూర్పారకతీర్థంబునందును రామతీర్థంబునందును స్నానంబు గావించెనేని బహుసువర్ణప్రాప్తి గలుగు. పిదప సప్తగోదావరంబున స్నాతుం డయ్యెనేని మహాపుణ్యంబు వడసి దేవలోకంబు నధిష్ఠించు. పిదప దేవపథంబును బ్రాపించెనేని దేవసత్రయాగపుణ్యంబు ప్రాప్తించు. పిదపఁ దుంగకారణ్యంబు గలదు.

సీ. వేదంబు లన్నియు విస్మృతంబులు గాఁగ, ము న్నందుఁ గలయట్టిమునుల కెల్ల
నంగిరస్తనుజన్ముఁ డైనసారస్వతుం, డవ్వారియుత్తరీయములయందు
నునవిష్టుఁ డగుచును నోంకారమును విధి, యుక్తంబు గాఁగను నుచ్చరించె,
నంతఁ బూర్వాభ్యస్త మైనవేదము లెల్లఁ, దత్క్షణంబ యుపస్థితంబు లయ్యె.

గీ. నపుడు హరిహరపరమేష్ఠు లఖిలదేవ, యుక్తు లగుచును భృగుని నియుక్తుఁ జేయ
నతఁడు మునులకు నర్ఘ్యయనార్హ్యభావ, మొదవ సంస్కార మొనరించె యుక్తరీతి.

క. అంతట మును లెల్లరు న, త్యంతప్రమదంబుతోడ నామ్నాయములన్
జింతన మొనరించుచు నుప, శాంతిం గొని యుండి రఖిలజగములయందున్.

వ. తుంగకారణ్యంబుం బ్రవేశించినమాత్రంబున సకలపాపక్షయం బగు. అం దొక్కమాసం బుండెనేని బ్రహ్మలోకప్రాప్తియును వంశోద్ధారకత్వంబునుం గలుగు. పిదప మేధావనంబునందుఁ బితృదేవతాతర్పణంబు గావించెనేని యగ్నిష్టోమఫలంబును స్మృతిమేధాసంపత్తియుం బడయు. పిదపఁ గాలంజరపర్వతంబుం బ్రాపించెనేని గోసహస్రదానఫలంబు చేకూరు. పిదపఁ జిత్రకూటపర్వతంబున మందాకినియందు స్నానంబు గావించి పితృదేవతార్చనంబు గావించెనేని యశ్వమేధఫలంబును సద్గతియుం జేకూరు. పిదప గుహస్థానంబు గలదు. అందు మహాసేనుండు నిత్యసన్నిహితుండై యుండు. అచ్చటఁ గోటితీర్థంబునందు స్నాతుండయ్యెనేని గోసహస్రదానఫలంబు ప్రాప్తించు. దానికిఁ బ్రదక్షిణంబుగా శివస్థానంబుం జేరి యందు మహాదేవుని నర్చించెనేని సుధాంశుండువలె విరాజిల్లు. అచ్చట నొకకూపంబు గలదు. అందు నాలుగుసముద్రములును నివసించియుండు. తత్కూపంబు నుపస్పృశించి ప్రదక్షిణంబు గావించెనేని పావనుండై సద్గతిం జెందు. పిదప శృంగబేరపురంబు గలదు. అచ్చట మున్ను దాశరథి యగు రామభద్రుండు గంగను దాఁటె. తద్గంగానదియందు స్నానంబు గావించెనేని విధూతపాతకుండై వాజపేయఫలంబు వడయు. పిదప ముంజవటం బనుసదాశివక్షేత్రంబు గలదు. అందు మహాదేవుని నర్చించి ప్రదక్షిణంబు గావించెనేని గాణాపత్యంబు వడయు. పిదపఁ బ్రయాగం బనుతీర్థరాజంబు గలదు.

—: ప్ర యా గ తీ ర్థ మా హా త్మ్య ము :—

క. మును ధార్తరాష్ట్రసంక్షయ, మొనరించినపిదప రాజ్య మొనగూడుటయున్
గనుఁగొని యుధిష్ఠిరుఁడు భ్రా, తృనిషూదనజనితశోక మేర్పడ మదిలోన్. 487

సీ. శమియించె నేకాదశచమూధవుం డైన, ధృతరాష్ట్రజుఁడు భ్రాతృసుతులతోడఁ
గూలెను శస్త్రాస్త్రగురు వైనద్రోణుండు, పండితుం డైనభీష్ముండు మడిసె
నీల్గె మహాబలాన్వితుఁ డైనకర్ణుండు, శ్లాఘ్యవర్తనుఁ డైన శల్యుఁ డడఁగె
సమసిపోయిరి దురాసదు లైనశూరులు, శాంతమయ్యెను బంధుజాల మెల్ల

గీ. వారితోఁ బోక జీవచ్ఛవములు వోలె, మిగిలి యున్నార మూర్విలో మేముమాత్ర
మేగురము భోగభాగ్యంబు లెవరి కింక, నెట్టులీర క్తసిక్తాన్న మిముడు మాకు.

క. చలుపుదునో యోగంబును, జలుపుదునో తీర్థసేవ సలుపుదునో వ్రతం
బులు నాచేసినపాతక, ములశాంతికి నేది గతియొ పొడవడ దాయెన్. 489

సీ. ఇంతకార్యంబు చేయించినకృష్ణుని, నడుగంగ నెట్లు నోరాడు నాకుఁ
బుత్రశతంబును బొలియించి యే మని, ధృతరాష్ట్రు నడుగంగ నేను బోదుఁ
గావించి గోత్రసంక్షయము నేమొగమున, వ్యాసుని నడుగ నే నభిలషింతు
ధర్మహాని యొనర్చి ధర్మజ్ఞు లగువారి, నడుగంగ నే నెట్లు లాసపడుదు
గీ. ననుచుఁ దలపోయుచును విహ్వలాత్ముఁ డగుచు
నాననము వంచికొని యుండ నతనిఁ జూచి
తల్లియును దొయ్యలియును సోదరులు గూడ
ఖిన్ను లయి బాష్పములు గార్చుచున్న నంత. 490

వ. వారణాసీనివాసి యగుమార్కండేయమహర్షి పాండవులు చెందువిషాదంబు యోగదృష్టిచేఁ దెలిసికొని శీఘ్రంబుగా హస్తినాపురంబున కేతెంచి వారలకు దర్శనం బిచ్చుటయు యుధిష్ఠిరుం డమ్మహానీయుని నర్ఘ్యపాద్యాదివిధులచే నాదరించి సప్రశ్రయంబుగా ని ట్లనియె. 491

క. అనఘా యస్మద్వృత్తము, గనుఁగొని యోగమున మమ్ముఁ గరుణించుటకై
చనుదెంచినదైవము వని, యనుకొందును జూచినట్టు లరుదెంచుటచేన్. 492
క. అని యూరకున్న నమ్మని, యనియె యుధిష్ఠిరున కిట్టు లధిపా రాజ
న్యునకు స్వధర్మము యుద్ధము, గనుక నె యద్దాన లేదు కలుషము నీకున్.
క. ఐనను నీమనమున లో, కానుగ్రహమునకుఁ బుట్టినట్టిభయంబున్
మానుచుట నాకు ధర్మము, గా న నుపాయంబు వినుము కలుషము లుడుగన్.
చ. ఇల నొకతీర్థరాజ ముదయించెఁ బ్రయాగసమాహ్వయంబునన్
గలుషము లెల్ల దానిఁ బొడగాంచినమాత్రమునన్ శమించుఁ ద
త్స్థలమహిమం బెఱుంగుటకు సాధ్యము గా దజరుద్రకేశవా
దులకును నస్మదాదులస్థితుల్ నచియింపఁగ నింక నేటికిన్. 495
చ. కలకలలాడుచున్ బహువికాసముతోడను బ్రహ్మవిష్ణురు
ద్రులును మునీంద్రులున్ జలనిధుల్ దిగధీశులు యక్షులున్ సుప
ర్ణులును సరిత్తులున్ విషధరుల్ సురకిన్నరసిద్ధసాధ్యులున్
నెలకొని యుందు రచ్చటను నిత్యనివాసము గాఁగ భూవరా. 496
క. ఏనఃపశువర్గమునకు, సూనాస్థానముగఁ బద్మసూనుఁ డొనర్చెన్
మానవనాథ ప్రయాగ, స్థానమున సితాసితాంబుధారాఘురమున్. 497
గీ. ఆదివట మక్షయవటంబు శ్యామవటము
నాఁగఁ బేర్వడి ప్రళయంబునను క్షయంబు
నొందకుండుఁ బ్రయాగమునందు వటము
దానిమహిమంబు వర్ణింపఁ దరము గాదు. 498

గీ. చామరములు సితాసితసలిలనదులు, ఛత్త్ర మాదివటంబు గా జానుమీఱుఁ
దీర్థరాజం బనఁ బ్రయాగతీర్థ మొకఁడె, ధరణిలో నున్నపుణ్యతీర్థములలోన.

గీ. ఎక్కుంచు బ్రహ్మపదమున, కక్కజముగ నొక్కక్షణమునంద ప్రయాగ
మ్మెక్కపరి వేణిలో నెకసక్కెంబున కేని మునుఁగ జాల్ముల నేనిన్. 500

సీ. వెలసెఁ బ్రయాగంబు విశ్రుతం బగుచును, త్రైలోక్యమునఁ దీర్థరాజ మనఁగ
నది స్మరించినను బుణ్యము లెల్ల వరియించు, నది పేరుకొనిన నభ్యుదయ మొదవు
నది కనుంగొనిన నాపద లాపదను జెందు, నచటి కేఁగినఁ బాయు నఘము లెల్లఁ
దన్మృత్తికావాప్తిఁ దనరుఁ బవిత్రత, యందు స్నానము చేయఁ జెందు దివము

గీ. నది ప్రజాపతి కాస్పద మైనక్షేత్ర, మక్కడ సమస్తతీర్థము లధివసించు
నందు మరణంబు సంప్రాప్త మయ్యెనేని, మరలఁ గలుగదు జన్మంబు మానవేంద్ర.

సీ. షష్టిధనుస్సహస్రములు ప్రోచుచు నుండు, జాగరూకతతోడ జహ్నుసుతను
నక్షయవటమును రక్షించుచుండును, జేత శూలముఁ బట్టి శితిగళుండు
కాచుచుండును బ్రయాగమును స్వయంబుగా, వజ్రహస్తుం డయి వాసవుండు
కాళింది నెపుడును బాలించుచుండును, సప్తవాహనుఁ డయి జలజహితుఁడు

గీ. మండలంబును నేలు నేమఱక శౌరి, స్థానమును నోముదు రశేషదైవతములు
గానఁ గల్మషదూషితు లైనవారు, చేరఁగాఁ జాల రామహాక్షేత్రమునకు.

క. సురలును సిద్ధులు విద్యా, ధరులును మొదలైనపుణ్యధను లచ్చోటన్
జరియించుటచేతన ని, ర్జరలోకమునన్ వసింపఁ జాలిరి భూపా. 503

క. అది యజ్ఞభూమి యమరుల. కది తీర్థము లన్నిటికిని నధిపతి యట న
ర్వాదికోటులు పదివేలుం, బొదిగొనుచును నుండుఁ దీర్థములు నరనాథా. 504

క. గంగాయమునానదులకు, సంగమ మాతీర్థమందు సమకూరెను ద
త్సంగమదేశమె పృథివి కె, సంగెను జఘనంబు నాఁగ క్ష్మాతలనాథా. 505

గీ. నాల్గు వేదము లధ్యయనంబు చేసి, నట్టివానికిఁ గలపుణ్య మనృత మాడ
నట్టివానికిఁ గలపుణ్య మబ్బుతీరు, స్నాన మొనరించెనేని తత్సంగమమున.

క. గంగాయమునాతటినీ, సంగమమున దేహములను జాలించినయు
త్తుంగాత్ములు వసియింతురు, భంగము లేకుండఁ ద్రిదశభవనమునందున్. 507

సీ. త్రిదివంబునందు వర్తిల్లి యమ్మహనీయు, లనుపమభోగంబు లనుభవించి
పుణ్యంబు క్షీణించిపోయినపిమ్మట, భువిని జంబూద్వీపమున జనించి
తదధీశ్వరత్వంబుఁ దాలిచి పరలోక, సాధనంబు లగుకర్మములు చేసి
యంతకాలమునఁ బ్రయాగతీర్థంబును, స్మరియించి ప్రాణముల్ పరిహరించి

గీ. స్వర్ణమయమైనభూమియు సర్వకామ, ఫలము లొసఁగెడివృక్షముల్ గలిగియుండు
బ్రహ్మలోకంబునకుఁ జేరి పరమఋషుల,తోడనుసుఖంబులొందుచుందురు నరేంద్ర.
సీ. పాటలవర్ణయు భర్మశృంగయుఁ బయ, స్వినియు రౌప్యఖురయుఁ జేలగళయు
నగుకపిలను శాంతుఁ డైనబ్రాహ్మణునకు, గంగాయమునస్వస్సృసంగమమున
దాన మొసంగినఁ దద్ధేనుతనువునం, దున్నట్టిరోమంబు లెన్ని యన్ని
వర్షసహస్రముల్ స్వర్గమం దుండి పై, నుత్తరకురువులం దుద్భవించుఁ
గీ. గాన గోదానమునకు సమాన మైన, దాన మేదియు లేదు పాతకసముద్ర
ములను దాఁటించుటకు దిక్కు గల దొకండె, ధేను వనియెడితరణి ధాత్రీకళత్ర.
సీ. గంగాయమునస్వస్సృసంగమంబునను బం, చాగ్ని సాధకుఁ డైనయట్టివాఁడు
తనదేహమందు నుండినరోమకూపంబు, లన్ని వే లేం డ్లుండి యమరపురిని
బిదప జంబూద్వీపపృథ్వీపతిగను వి, శ్వంభరాతలమందు సంభవించి
యఖిలభోగంబుల ననుభవించి భజించు, నాతీర్థరాజంబు నంతమందు
గీ. నచట సలిలప్రవేశంబు నాచరించు, నట్టిపుణ్యాత్ముఁ డఘవిముక్తాత్ముఁ డగుచు
సైంహికేయుండు విడిచినచంద్రమసుని, చందమునఁ దేజరిల్లు విశ్వంభరేంద్ర.
సీ. తత్సంగమంబునఁ దలక్రిందుగా నుండి, యూర్ధ్వపాదుం డయి యోగమునను
జ్వాలాశనంబును జలిపిన నివసించి, శతసహస్రాబ్దముల్ స్వర్గమందు
సురలు గంధర్వకిన్నరులును సేవింప, నఖిలభోగంబుల ననుభవించి
యగ్నిహోత్రిగఁ బుట్టి యటుమీఁద ధరణిలో, నాతీర్థమును జేరు నంతమందు
గీ. నచట ఖండించి తనదేహ మండజముల, కర్పణము చేయుపుణ్యాత్ముఁ డధివసించి
చంద్రలోకంబున సహస్రశతసమలును, నవల జన్మించు భువిని లోకాధిపతిగ.
క. గంగాయమునామధ్యము, నం గన్యాదాన మొసఁగినను నిహసుఖముల్
సాంగముగ ననుభవించి ప, యిం గనుఁ ద్రిదశాలయమున నెల్లసుఖంబుల్.
క. వినినను బ్రయాగనామము, ననినను నోటను బ్రయాగ మనుచుఁ బ్రణామం
బొనరించినను బ్రయాగం, బున కఖిలాఘములు సమసిపోవును ద్రుటిలోన్.
ఆ. అచటఁ జేయుదాన మణుమాత్ర మైనను, గొండవోలెఁ బెరుఁగుచుండు నధిప
కావున నె ప్రయాగగమనంబు దేవుఁడు, మాను మనినఁ గూడ మానఁ దగదు.
గీ. గంగ ప్రవహించుచుండు నక్కడఁ ద్రివహ్ని
కుండములమధ్యమున మహీమండలేంద్ర
యెన్ని దుష్కృతములు చేసియున్నఁ గాని
నాశనము నొందు నవి తత్ప్రవేశమున నె. 515

క. గంగాసాగరసంగమ, గంగాద్వారప్రయాగగతులను మూఁటన్
గంగానది దుర్లభ నృప, పుంగవ యన్యప్రదేశముల సులభ సుమీ. 516

గీ. మంగళంబుల కెల్లను మంగళంబు, పావనంబుల కెల్లను బావనంబు
తీర్థముల కెల్ల నగ్రిమతీర్థ మఖిల, తటినులందును నుత్తమతటిని గంగ. 517
గీ. త్రిపథగానదియుత్తరతీరమందుఁ, గలదు మానసతీర్థ మొక్కటి నరేంద్ర
యచ్చటఁ ద్రిరాత్ర ముపవాస మాచరింపఁ, గలుగుఁ దక్షిణమున సర్వకామసిద్ధి.
గీ. కామ మున్నను లేకున్న గంగలోన, మరణ మొందినపుణ్యాత్ముఁ డరిగి దివికి
నందు మితి లేనిభోగంబు లనుభవించి, కడకు జన్మించుఁ బ్రభువుగాఁ బుడమిలోన.
గీ. ఎన్ని పాతకములు చేసియున్నఁ గాని, యన్నిటినిఁ గూడ నాతీర్థమందుఁ జేయు
భీష్మసూమజ్జనంబు గృపీటయోని,యింధనములనుబోలె దహించు నధిప. 520
గీ. కృతయుగంబునఁ బుణ్యంబు లెల్లతీర్థ
ములును త్రేతాయుగంబునఁ బుష్కరమును
ద్వాపరమునఁ గురుక్షేత్రధరయుఁ గలియు
గమున భాగీరథియును బుణ్యములు భూప. 521
గీ. అనశనము భృగుతుంగమునను మహాల
యమున దానము పుష్కరమందుఁ దపము
మలయమున నగ్నినిధనంబు గలియుగమునఁ
ద్రిపథగామజ్జనమును దరింపఁజేయు. 522
గీ. కిల్బిషము లెల్ల హరియించుఁ గీర్తనమున, దర్శనంబున సకలభద్రము లొసంగు
స్నానమునఁ బానమునను నొనర్చు సద్గ, తులను నేడుతరములవారలకు గంగ.
ఆ. ఎంతదాఁక నెవనియెముకలు గాంగతో, యంబునందు నుండు నంతదాఁక
నతఁడు స్వర్గలోకమం దుండు దేవతా, కోటు లెల్లఁ దన్నుఁ గొలుచుచుండ. 524
గీ. గంగ కీడైనతీర్థంబు గానరాదు
వాసుదేవునిఁ బోలుదైవంబు లేదు
బ్రాహ్మణునితోడ సామ్యంబు వడయఁ దగిన
మానవుఁడు లేఁ డనుచుఁ బితామహుఁడు వలికె. 525
క. అదె సిద్ధక్షేత్రం బ, య్యదియె తపోవనము నరవరాగ్రణి గంగా
నది యెచ్చట నుండునొ త, త్ప్రదేశమహిమంబు దరమె భాషింపంగన్. 526
గీ. ప్రళయకాలంబునందును బ్రజ్వరిల్లి, ద్వాదశాదిత్యులును జగత్సంక్షయంబు
సలిపినపుడును క్షతి లేక నిలిచియుండు,నచట వటమూలము వసుంధరాధినాథ.
ఆ. సూర్యచంద్రపవనశూన్యమై యేకార్ణ, వముగ భువన మున్నసమయమందు
వనజలోచనుండు వటమూలమున నుండుఁ, బవ్వళించి రేయి పవలుఁ గూడ. 528
క. మేనుల నావటమూల, స్థానంబున విడుచునట్టి జనులు సమస్త
స్థానములు విడిచి బ్రహ్మ, స్థానమునం గలుగు శాశ్వతంబుగ నుండన్. 529

గీ. బ్రహ్మచర్యంబునను వటపాదపంబు, గలుగుచోటను యోగసంకలితుఁ డగుచు
సంపపసింప బ్రహ్మజ్ఞాన మొదవి మరల, గర్భవాసశ్రమంబును గనఁ డతండు.
గీ. జహ్నుతనయకుఁ బూర్వపార్శ్వంబునందు, గలదు కూపం బొకం డందుజలధు లెల్ల
సంవసించుటచేఁ బ్రతిష్ఠాన మనెడి, ఖ్యాతి గైకొనె నది త్రిలోకములలోన. 531
ఆ. అచట నియమయుక్తుఁ డగుచుఁ ద్రిరాత్రంబు, లధివసించెనేని యఘము లెల్లఁ
దొలఁగి యశ్వమేధఫలము సంప్రాప్తించు, నవనినాథ యెవనికైనఁ గాని. 532
గీ. జనవరేణ్య ప్రతిష్ఠానమునకు నుత్త, రముగ భాగీరథికిని బూర్వముగఁ దీర్థ
ముండె హంసప్రపతనాఖ్య నొంతు దాన, మునిఁగి దివమున నాకల్పమును వసించు.
సీ. హంసపాండురమును నాయతంబును రమ్యమును నైనయూర్వశీపులినమందుఁ
బితృతర్పణము చేయునతఁ డరువదివేల, యరువదినూఱులహాయనములు
పితృదేవతాసమన్వితుఁ డయి కొలువంగ, నమరు లెల్లను ద్రిదివమున నుండి
పుణ్యంబు క్షీణింపఁ బుడమిపైఁ బుట్టి యై, శ్వర్యపూర్ణం బైనవంశమందు
గీ. నూర్వశీసమ లగుకన్య లొక్కశతము, తన్ను వరియింప వారితోఁ దాను గూడి
యనుపమము లైనభోగంబు లనుభవించు, స్వకృతపుణ్యంబునం జేసి ధూర్జటేంద్ర.
ఆ. అంతకాలమందు నాతీర్థమున స్మరి, యించి మరలఁ బుట్టి యిల నతండు
క్షితికి నెల్ల నేకపతి యయి కీర్తితో, నఖిలభోగములను ననుభవించు. 535
ఆ. ప్రాణములను వీడనాడిన నచ్చోటఁ, గోటితీర్థమందుఁ గువలయేంద్ర
స్వర్గమందుఁ గోటివర్షసహస్రము, లఖిలభోగములను ననుభవించు. 536
వ. మఱియు నచ్చట వాసుకితీర్థమునకు నుత్తరభాగంబున భోగవతీతీర్థంబును దశాశ్వమేధికతీర్థంబునుం గలవు. అందు స్నానంబు గావించెనేని యశ్వమేధఫలంబు లభియించు. ప్రయాగతీర్థరాజంబునకు దక్షిణంబుగా యమునోత్తరకూలంబునందు ఋణప్రమోచనం బనునొకపుణ్యతీర్థంబు గలదు. తత్తీర్థంబున నొక్కరాత్రి నివసించెనేని సర్వఋణవిముక్తిం బడసి సూర్యలోకనివాసభాగ్యముం జెందు. 537
గీ. తీర్థరాజంబునందుఁ బృథ్వీకళత్ర, విను మనాశకఫలమును వినుతు నీకుఁ
బదపదంబున హయమేధ ఫలము గలిగి, నరుఁడు తరియింపఁ జేయు స్వాన్వయము నెల్ల.
గీ. పంచయోజనవిస్తారభరిత మగుచు, నలరెడిప్రయాగమండలమందుఁ జొచ్చు
నాతఁ డడుగున కడుగున కశ్వమేధ, ఫలము గనునంచు మును చెప్పెఁ బద్మభవుఁడు.
క. కాళిందీమాహాత్మ్యము, నాలింపుము భూప వేయి యామడ లున్నన్
గాళింది యనుచుఁ బలికినఁ, జాలు నశేషాఘములును శాంతింపంగన్. 540
సీ. యమునను గీర్తించునతఁడు పుణ్యము లెల్లఁ, గావించుకొనఁ గల్గుఁ గైవసముగ
నర్కపుత్త్రిని గాంచునతఁడు గాంచు నశేష, భద్రంబులను గొంగు పైఁడి గాఁగఁ

గాళిందిలో నవగాహనం బొనరించి, సలిలపానంబును జలునవ్రతఁడు తనవశంబున నేడు తరముల వారల, నొకత్రుటిలోపల నుద్ధరించుఁ

గీ. బితృపతిస్వసృజలమునఁ బ్రీతితోడఁ,
ప్రాణములు వాయువాఁ డొందుఁ బరమపదము
పావనత్వంబునందుఁ బ్రభావమందు
యమునయును గంగయును రెండు సమము లధిప. 541

ఆ. ఎచటనుండి గంగ యేతెంచియుండెనో, యచ్చటనుండి యమున యరుగుదెంచె గానఁ ద్రిపథగకును గాళిందికిని భేద, మెంచుకొనెడివాఁడు వంచితుండు. 542

వ. కాళిందికి దక్షిణతటంబునం దగ్నితీర్థంబును బశ్చిమతటంబునందు హరవరం బనుధర్మరాజతీర్థంబును నుండె. అందు స్నానంబు గావించెనేని త్రిదివంబును నిధనంబు నొందెనేని యపునర్భవత్వంబునుం బ్రాప్తించు. మఱియు న త్తీర్థంబులం దింకను దీర్థసహస్రంబులు గలవు. కాళిందికి నుత్తరభాగంబున విరజం బనునా దిత్యతీర్థంబు గలదు. అచ్చట నింద్రాద్యమరు లెల్లరునుం గూడి నిత్యంబును సంధ్య నుపాసించు చుందురు. మఱియును నచ్చటఁ బాపహరంబు లగునేక తీర్థంబులు గలవు. త త్తీర్థంబులందు స్నానంబు గావించెనేని స్వర్గంబును మర ణించెనేని యపునరావృత్తియుం గలుగు. నైమిషంబును బుష్కరంబును గోతీర్థం బును సింధుసాగరంబును గురుక్షేత్రంబును గయయును గంగాసాగరంబును మున్నగుమహాపుణ్యతీర్థంబులు ముప్పదికోటులపదివేలు ప్రయాగతీర్థంబునం గలవు. మూఁడుకోటులయేఁబదితీర్థంబులును బ్రయాగతీర్థషోడశాంశంబునకుం జాల వని వాయుదేవుండు వలికె. 543

గీ. వసుమతీశ్వర కంబలాశ్వతరయుగము, భోగవతియుఁ బ్రతిష్ఠానమును బ్రయాగ మును బ్రజాపతికిని వేది యనుచు యోగ, సిద్ధి గలవారిచే మున్ను చెప్పఁబడియె.

గీ. మూర్తిమంతంబు లగు వేదములునుసధ్వ,రములును దపోధనులును నిర్జరులుఁగూడి కొలుతురు ప్రయాగమును జగంబులను మూఁట,దానికంటెనుబుణ్యతీర్థంబులేదు.

గీ. స్వర్గ్యమును బావనమును సేవ్యమును సుఖముఁ
బుణ్యమును ధర్మ్యమును శ్రేష్ఠమును మనోహ
రమును గుహ్యము నగుతీర్థరాజమహిమ
చెప్పినను విన్న సర్వార్థసిద్ధి గలుగు. 546

గీ. ఎవ్వఁ డైశ్వర్యమదముననేని లేక, మోహమున నేనియును మానమునను దీర్థ యాత్ర గావించు నాతీర్థయాత్రవలన, నాతనికి లేదు ఫలము ధాత్రీతలేంద్ర. 547

గీ. అధిప పితృకార్యమునకైన నాత్మకార్య, మునకు నైనను దేవతార్చనకు నైన దేని కైనను మతి గలమానవుండు, దీర్థమునఁ జేయ రాదు ప్రతిగ్రహంబు. 548

క. కావున బ్రాహ్మణుఁ డగువాఁ, డేవిధి నైనను బ్రమాద మేర్పడ కుండం
గా వలయు దీర్థములలో, భూవర లేకున్నఁ బతనమును వాఁ డొందున్. 549
ఆ. అశుచి దుర్మతియును నశ్రద్ధధానుఁడు, త్యక్తమంగళుఁడును ననునలువురు
పాపవంతులకును బ్రత్యక్ష మైనను, నేది యేని చెప్పరాదు భూప. 550
గీ. బ్రహ్మ యెట్టులు పూజింపఁబడునో సర్వ, భూతములయందు నాచందమునను సకల
భువనములయందుఁగూడను బూజ్య మగుచుఁ,దీర్థరాజంబుపొలుచుఁ బృథ్వీశశక్ర.
గీ. తీర్థరాజప్రవేశ మొందిననరుండు, కొంచె మైనను వస్యంబుఁ గోరుకొనఁడు
దేవతాత్వంబు వడసి యర్థించునొక్కొ, మానుషత్వంబు నెవఁడేని మానవేంద్ర.
క. కావున విశ్వాసము గల, పావనుఁడ వటంచు నీకుఁ బరమరహస్యం
బీవిధమున నెఱిఁగించితి, భూవర కైకొని ప్రమాణముగ శాస్త్రంబున్. 553
చ. అనవుడు ధర్మరాజు సహజాన్వితుఁడై ధరణీసురాజ్ఞ గై
కొని వెసఁ దీర్థరాజమునఁ గ్రుంకి పయిన్ బితృదేవతర్పణం
బొనరిచె నంత నచ్చటికి నుత్సుకతన్ జనుదెంచెఁ గృష్ణుఁ డా
య్యన నభిషిక్తునిం జలిపి రండఱు ధర్మజు రాజ్య మేలఁగన్.
ఉ. అంతట ధర్మరాజు వసుధామరకోటి కనేకదానముల్
నంతస మేర్పడన్ జలిపె స్వర్గము గూడఁ బ్రతిధ్వనింపఁగా
నింతటివాఁడు లేఁ డనుచు నెల్లరు స్తోత్రములం బొనర్ప న
త్యంతకుతూహలంబునను నత్తఱిఁ గృష్ణుఁడు వల్కె నీవిధిన్.
శా. బావా ధర్మతనూజ స్నేహమున నే భాషించుచున్నాఁడ నీ
భావంబందు స్మరించుచుండు మెపుడున్ భక్తిం బ్రయాగంబు స్వ
ర్గావాసంబు నొసంగు నయ్యది సమస్తాఘంబులన్ మాపుటన్
లే వద్దానిని బోలునట్టి క్రతువుల్ లే వెట్టిధర్మంబులున్. 556
క. ఇది పరమర్షిరహస్యం, బిది యామ్నాయములసార మిది త్రిదివౌకః
పదమునకు మూలమంత్రం, బిది సేవ్యము నీకు నాకు నెల్లరకు నృపా. 557
క. ఋతవాదియు శుచియు దృఢవ్రతుఁడుఁ బ్రతిగ్రహము లేనివాఁడును భూత
వ్రతతుల నాత్మోపమ్య, స్థితిఁ జూచునతండుఁ జెందుఁ దీర్థఫలంబున్. 558
క. అనవుడుఁ బ్రయాగతీర్థం, బును స్మరియించుచును ధర్మపుత్రుఁడు రాజ్యం
బును గైకొని పాలించెను, మనుజులు దేవతలు గూడ మానింపంగన్. 559
ఆ. విష్ణుదేహములుగ విలసిల్లుఁ దీర్థము, లెల్ల వానిలోన నేది యేని
యొక్కతీర్థము విధియుక్తంబుగా నుపా, సించెనేని ముక్తిఁ జెందు నరుఁడు.
క. తీర్థములు విష్ణుమయములు, తీర్థనిషేవణమె వాసుదేవార్చన త
త్తీర్థములకంటెఁ బాపా, పర్థహరము లేదు వేఱుపాయము కలిలోన్. 561

ఉ. తీర్థములన్ భజించినను దీర్థనిమజ్జన మాచరించినన్
దీర్థములన్ స్పృశించినను దీర్థమహాత్త్వము నాలకించినన్
దీర్థములన్ వచించినను దీర్థములన్ నివసించినన్ భవా
నర్థముపాలు గాక చరితార్థులు గాఁగల రెల్లమానవుల్. 562

క. మనుజులకు సేవనీయము, లనవరతము బ్రాహ్మణుఁడును నశ్వత్థంబున్
వనజాక్షుఁడుఁ దీర్థచయం, బును దులసియు ననుచు వేదములు ఘోషించున్.

క. కావించె నేని తీర్థని, షేవణము దొలంగు నఘము చేకుఱు నట్టుల్
గావింపకున్న నరకము, పోవవు ధర్మమునఁ గాని పూర్వాఘంబుల్. 564

ఆ. కొన్ని గమ్యములును గొన్ని యగమ్యముల్, గలవు పుణ్యతీర్థములు నరేంద్ర
యాశ్రయింపఁబడియె నవి దేవతలచేత, మునులచేత సుకృతధనులచేత. 565

గీ. సర్వతీర్థావగాహంబు సలుపఁ దలఁచి, నట్టివాఁడు మనంబులో నైన వాని
యందు నాప్లావ మొనరించినట్లు తలఁచి, కొనినఁ దత్స్నానఫలము చేకూరు నధిప.

ఆ. పూర్వజన్మసుకృతమునఁ జేసి యాస్తిక్య, మొదవు దానివలన నొదవుఁ దీర్థ
సేవ యాస్తికత్వసిద్ధి సర్వపుమర్థ, సాధనంబు చూవె జనవరేణ్య. 567

గీ. స్వర్గమును జెందుఁ బుణ్యంబు సలుపువాఁడు
దురితమును జేయువాతఁడు నరక మొందుఁ
గాన రెండును గమనింపఁ గలుగువాఁడు
పుణ్య మగుతీర్థమును వీటిఁబుచ్చఁ దగదు. 568

—: తీర్థమాహాత్మ్యశ్రవణపఠనఫలకథనము :—

ఆ. ఎవఁడు తీర్థమహిమ నెపుడును జదువునో, యెవఁడు వినునొ శ్రద్ధ యేర్పడంగ
నతని కాచరింతు రభిషేకమును దీర్థ, దేవతలు స్వకీయతీర్థములను. 569

సీ. సంప్రీతు లగుదురు చంద్రశేఖరుఁడును, నర్మదయు మృకండునందనుఁడును
వంధ్యయు సంతానవతి యగు దుర్భగ, యగునితంబినియును నగును సుభగ
వేదసంపన్నుఁడై వెలయును విప్రుండు, జయశాలియై యుండు క్షత్త్రియుండు
వైశ్యుండు ధనధాన్యవైభవయుతుఁ డగుఁ, బడయును సద్గతిఁ బాదజుండు
గీ. నరకలోకంబును గనుంగొనఁడు కుయోని, యందుఁ బుట్టఁడు స్వాభిమతార్థములను
నెల్ల నీడేర్చుకొను నెవఁడేని తీర్థ, మహిమ చదివిన వినినను మానవేంద్ర. 570

గీ. సర్వపాపహరంబును శత్రుహరము, శాంతిదాయకమును మోక్షసాధనంబు
ధర్మ్యమును స్వర్గ్యమును బవిత్రమును సుఖము, కీర్తిదము దీర్థవంశానుకీర్తనంబు.

క. అకృతవ్రతులకుఁ జోరుల, కకృతాత్ములకశుచులకును నన్నృజుమతుల కా
స్తికభావశూన్యమానసు, లకుఁ దీర్థనిమజ్జనం బలభ్యము భూపా. 572

గీ. నేను జెప్పినరీతిని నీవు గూడ, నియమమును నాదరమును శ్రద్ధయును గలిగి
తీర్థసేవ యొనర్పుము పార్థివేంద్ర, పుణ్యమభివృద్ధి నొందును బుణ్యమున న. 573
గీ. రామునివిధంబునను బురూరవునిచంద, మున భగీరథుని తెఱంగునను యయాతి
వలె మహాభిషుఁడట్లు నిర్మలుఁడ వగుచు, వెలసెదవు తీర్థయాత్ర గావింతు వేని.
క. జననాథ నేను నీకుఁ, వినిచినతీర్థములమహిమ విన్నను బఠియిం
చినను నెటువంటిపాతకి, యును బాపవిముక్తుఁ డగుచు నొందును సుగతిన్. 575
గీ. అనవుడుఁ దదుక్తు లన్నియు విని దిలీపుఁ, డఖిలతీర్థాటనమునఁ గృతార్థుఁ డయ్యె
నశ్వమేధసహస్రము నాచరించి, నట్టిఫల మబ్బుఁ దీర్థపర్యటనమునను. 576
క. అనుటయు మహర్షు లెల్లరుఁ, గని సంతోషమును సూత కలుషహరముగాఁ
గను మంచివిశేషంబులు, వినిచితి విం కొకటి వినఁగ వేడుక యయ్యెన్. 577
ఆ. సకలతీర్థసేవ సలిపినఫల మొక్కు, కర్మ మొనరుచుట నె కలుగ వలయు
నట్టికర్మ మేది యైనను గల దేని, తెలుపుమయ్య మాకుఁ దేటపడఁగ. 578

—: విష్ణుభక్తిమాహాత్మ్యకథనము :—

క. అని యడుగుటయును సూతుఁడు, కనుఁగొని వారలను గౌతుకం బొదవఁగ ని
ట్లనియె హరిభక్తి యొకటియె, యనువుగ నిడు నిఖిలతీర్థయాత్రాఫలమున్. 579
క. హరియె త్రిలోకారాధ్యుఁడు, హరియె సమస్తామరేశ్వరాధీశ్వరుఁడున్.
హరియె నిగమాగమాత్ముఁడు, హరికం టెను లేదు పర మిహాపరంబులలోన్. 580
క. హరి హరి యని జపియించిన, నరగునను సమస్తమంత్రజపఫల మొదవున్
హరినామజపంబునకున్, సరి యైనజపంబు లేదు జగములయందున్. 581
క. హరినామమహామంత్రము, దురితపిశాచమును బాఱఁదోలును ద్రుటిలోఁ
బరమంత్రము లద్దానికి, సరి గా వేవియును నెంత సత్త్వంబున్నన్. 582
సీ. అఖిలతీర్థావగాహాఫలంబు చేకొనుఁ, గేశవునకుఁ బ్రదక్షిణ మొనర్చి
గంగచందమున లోకము పావనము చేయు, నారాయణునిముందు నాట్య మాడి
తల్లిస్తన్యంబును ద్రావండు మరలను, మాధవునకుఁ బ్రణామంబు చేసి
వైవస్వతునిక్రూరవదనంబు గాంచఁడు, పుండరీకాక్షునిపూజ సలిపి
ఆ. చక్రపాణిదివ్యచరితంబు గీర్తించి, రూపుమాపు నఖిలపాపములను
శౌరిపదమునందు స్వాంతంబు నర్పించి, ముక్తుఁ డగు భవప్రసక్తినుండి. 583
క. హరిప్రతిమారూపంబును, దరిసించినవాఁడు మిగుల ధన్యుఁడు హరిపై
సరస మగునట్టికావ్యము, విరచించినవాఁడు జన్మవిరహితుఁడు సుఁడీ. 584
క. కరతాళము లొనరించుచు, హరియెదుటను బాటపాడునట్టినరునిదు
ర్భరపాతకౌఘ మెల్లను, గరతాడిత మైనరీతిఁ గడకుం బోవున్. 585

ఆ. విష్ణుభక్తు లగుచు వెలసినవారలు, శ్వపచు లైన మ్లేచ్ఛజాతు లైన
నంద్యు లనిన నింక వసుధామరాదుల, మహిమ చెప్పఁ దరమె మాదృశులకు. 586
క. హరిగాథలు వినియెడుసు, త్పురుషులసందర్శనమునఁ బూతాత్ముఁ డగుకా
దురితౌఘుఁడు లోనరించిన, నరుఁడును నిఁక నేల తద్ఘనత్వము చెప్పన్. 587
క. తీర్థములలోన నుత్తమ, తీర్థము హరినామ మందు దిగుపుణ్యాత్మల్
తీర్థీకరింతు రఖిలముఁ, దీర్థము వే జేల నామతీర్థముకంటెన్. 588
గీ. మస్తకమునందు విష్ణునిర్మాల్యతులసి, దాల్చినను దిన్న విష్ణుసాధర్మ్య మొదవు
నది హరిప్రీతిదాయక మది సమస్తభువనపావన మది సాధుపూజితంబు. 589
క. హరిహరుల నభేదంబుగ. నరసెడిపుణ్యాత్మ లగుదు రపునర్భవు లా
పరమరహస్యము దెలియక, హరిహరులకు భేద మెంతు రజ్ఞులు జగతిన్.  590
క. హరికంటె హరుని వేఱుగఁ, బరికించెడివారు నరకపతితు లగుచు దు
ర్భరయాతనలను గుడుతురు, హరిహరులం దొకఁడు గూడ నరయఁడు వారిన్.
క. హరి తన్నుఁ గొలుచుచుండెడి, పురుషుం డజ్ఞాని యైన బుధుఁడైనను భూ
సురుఁ డైన శ్వపచుఁ డైనను, దరియింపఁగఁ జేయు భక్తతత్పరుఁ డగుటన్.
క. తనకంటెను దననామం, బున నధికం బైనశక్తి పురుషోత్తముఁ డుం
చినకతన విష్ణునామం, బునకు సమం బగుపదార్థములు లే వెందున్. 593
క. ఫలగౌరవమును నాయా, సలఘుత్వముఁ గానఁబడుటఁ జర్చింతురొ యే
కలుషాత్ములు హరికీర్తన, ఫలవిషయమునందు నరకపతితులు వారల్. 594
క. హరినామమహావజ్రము, దురితాద్రివిదారణము చతుర్భుజసేవా
చరణారుణప్రతాపము, పరితాపతమిస్రగర్వభంజనము సుఁడీ. 595
సీ. హరిపూజ గావించుకరములు కరములు, శ్రీపతికథ వినుచెవులు చెవులు
బలివైరికడ కేఁగుపదములు పదములు, గరుడధ్వజునిఁ జూచుకనులు కనులు
నారాయణా యనునాలుక నాలుక, సరసిజాక్షుని మ్రొక్కుశిరము శిరము
కృష్ణా యనఁగ నిక్కుకేశముల్ కేశముల్, మాధవునిఁ దలంచుమనసు మనసు
గీ. నళిననాభునిర్మాల్యతులసి మూరు, కొనెడినాసిక నాసిక కనకచేలు
పాదములపైని నెలకొనుప్రజ్ఞ ప్రజ్ఞ, దనుజహరునకు నర్పించుతనువు తనువు.
గీ. కృష్ణనామాక్షరము లాలకించినంతఁ, గనుల నశ్రులు పులకలు గాత్రములను
బొడమకుండెడిమనుజులు పుట్ట నేల, భువనచక్రంబునకు భారభూతులుగను. 597
క. నామోచ్చారణమాత్రము,చే మోక్షము నిచ్చుహరిని సేవింపంగన్
గామమ్ము లేనిమనుజ, స్తోమము వంచితము గాదె దుష్కర్మముచేన్. 598
ఆ. ఫలము లేని వేయిపలుకులు పలుకుదు, రంతె కాని కృష్ణ యనెడునక్ష
రములు రెండు నోట రానీయ రెపుడును, బహుళపాపకర్మనిహతమతులు. 599

గీ. నాల్క యుండియుఁ గూడఁ గృష్ణా యటంచు
నొక్కపరి యైనఁ బిలువక యుండువారు
ముక్తిసోపానమున నెక్క మొనసి కూడఁ
బతన మొందెదభాగ్యవర్జితులు గారె. 600

సీ. హరిపాదపద్మంబు లంతరంగమునందుఁ, దాల్చిన వేళ యధ్వరము లేల
శిరముపై వైకుంఠచరణాంబుకణములు, చల్లుకొన్నను వేళ స్నాన మేల
సంకర్షణునినామసంకీర్తనంబును, జలుపుచుండిన వేళ జపము లేల
మధుసూదనునికథామహిమంబులను బ్రబో, ధము చేసినను వేళ దాన మేల
గీ. శౌరిగుణములు విని హర్షసాగరమున, మగ్నతను గన్న వేళ సమాధి యేల
యంబుజాక్షునిభక్తిరసంబు గ్రోల, మురగి యున్నను వేళ సామ్రాజ్య మేల. 601

క. హరిభక్తిసుధను గ్రోలెడి, నరులను గలిసర్పదంశనక్ష్వేళంబుల్
దురితహాలాహలమును నే, కరణి సమర్థంబు లగును గలఁగింపంగన్. 602

సీ. నరకంబులందు నానాక్లేశములు చెంది, యటుమీఁద నుద్భిజ్జుం డయ్యెనేని
స్థావరాద్యాకృతుల్ దాల్చి కర్మఫలంబు, ననుభవించి మనుష్యుఁ డయ్యెనేని
గర్భనివాస దుఃఖము దాఁటి శైశవ, బహుదోషనిర్ముక్తి వడసెనేని
యౌవనమందుఁ గామాంధ్యంబులోఁ జిక్కి, యెట్టకేలకును గట్టెక్కెనేని
గీ. వార్ధకంబున వ్యాధులు వ్యసనములును
బెరిఁగి మృతి చెంది మరలను నరక మొందు
నంతె కాని భవోన్ముక్తి నంద లేఁడు
హరిపదాంభోజములు గొల్వనట్టివాఁడు. 603

క. ఆయాసరహితజీవన, మాయాసము లేనిమరణ మచ్యుతచరణ
ధ్యాయికిఁ గాక తదన్యున, కాయత్తం బగునె యెంత యసురుసు రైనన్. 604

క. బల మున్న యెడల వ్యర్థము, సలుపక మనుజుండు విష్ణుసాన్నిధ్యమునన్
జలుపంగ వలయు నృత్యం, బులు గానంబులును బంధమోచన మొదవన్. 605

క. ధన మున్న యెడల దుర్వ్యయ, మొనరింపక విష్ణుతృప్తి యొనరించుటకై
వినియోగపఱుపఁగాఁ దగు, ధనమున కదె ఫలము మోక్షదాయక మగుటన్. 606

క. దానము స్వర్గమునకు సో, పానం బగు విష్ణుభక్తిపరు లైనయనూ
చానులయెడ వినియుక్తం, బైనను నది ప్రీతిహేతు వగుటను హరికిన్. 607

గీ. మానసంబున స్మరియించుమాత్రమున నె, సకలదోషంబులను బాపి స్వపద మిచ్చు
నట్టిశౌరిని విడనాడునట్టివాఁడు, దీపముఁ ద్యజించి తమములోఁ దిరుగువాఁడు.

క. హరిపాదాంబువు గ్రోలిన, హరిగుణముల నెంచికొన్న హరికథ విన్నన్
హరిసా[illegible] చేకొన్నను. హరిఁ గన్నను ముక్తి కరతలామలక మగున్. 609

క. హరిభక్తి కంతరాయము, శరుణీదృగ్జాల మందుఁ దగులుకొనక నే
ర్పరు లైనవార లగుదురు, చరితార్థులు హరిపదైకసంస్మరణమునన్. 610
క. మునులార కర్మయోగం, బున నారాధించుపుణ్యపురుషులను గనుం
గొనినట్లు హరి తదన్యులఁ, గనుంగొనఁ డహేతుకానుకంపాదృష్టిన్. 611
క. అనవుడుఁ దద్వాక్యంబులు, విని మానులు కర్మయోగవిషయము మాకున్
వినిపింపు మనుచు నర్థిం, చిన వారికి సూతుఁ డిట్లు చెప్పఁ దొడంగెన్. 612

—: కర్మయోగకథనము :—

క. మునులార మీరు ప్రశ్నిం, చినచందంబునను మున్ను కృష్ణద్వైపా
యనుని ఋషు లడుగుటయు నా, యనఘుఁడు వచియించె నిట్లు లమహాత్మనులకున్.
క. మునులకు మనుప్రజాపతి, వినిచెను మును కర్మయోగవిధ మదె మీకున్
వినిచెద నేను సమాహిత, మనస్కు లయి వినుఁడు లోకమంగళకాముల్. 614
ఆ. కర్మయోగ మనినఁ గాని సనాతన, ధర్మ మనినఁ గాని తత్త్వ మొకటె
యది శ్రుతిప్రసిద్ధ మది త్రికాలాబాధ్య, మది యభీప్సితము జనార్దనునకు. 615
సీ. ధాత్రిని బ్రాహ్మణక్షత్రియవైశ్యశూ, ద్రు లనంగ వర్ణముల్ గలవు నాల్గు
వానిలోఁ బూర్వపూర్వంబుగా నుండువ, ర్ణంబు శ్రేష్ఠంబు జన్మంబువలన
నుపనయనం బగ్నిహోత్ర మధ్యయనముఁ, గల వాదివర్ణత్రికంబునకును
నాల్గవవర్ణంబునకుఁ ద్రివర్ణంబుల, సేవ ధర్మంబుగాఁ జెప్పఁబడియె
గీ. వర్ణములు నాలుగింట నేవర్ణ మేని, స్వస్వధర్మాచరణమును వదల కుండె
నేని స్వర్గంబునకు నేఁగు మానె నేని, నిరయమున కేఁగు నిదె శాస్త్రనిర్ణయంబు.

—: బ్రహ్మచర్యాశ్రమధర్మకథనము :—

సీ. అవనిసురుండు గర్భాష్టమవర్షమం, దైన నష్టమవర్షమందు నైన
విహితోపనయనుఁడై వహియించి యజినవా, సోదండమేఖలాసూత్రములను
గావించుకొనుచు సంధ్యావందనంబును, నాచరించుచు నగ్న్యుపాసనంబు
భుజియించుచును భైక్షభోజనంబును శయ, నించుచు రేయి స్థండిలమునందు.
గీ. బ్రహ్మచర్యవ్రతంబు గాపాడుకొనుచు
నప్రమత్తతతోడ నహర్నిశంబు
గురునిసాన్నిధ్యమున భక్తి కుదురుకొనఁగఁ
జదువ వలయును వేదముల్ శాస్త్రములును. 617
గీ. బ్రహ్మచేతను నిర్మింపఁబడియెఁ బూర్వ
మందుఁ గార్పాసమునఁ ద్రిగుణాత్మకముగ
నొక్కసూత్ర మయ్యది కర్మయోగమునకుఁ
దాల్ప వలయును ద్విజులు ప్రధానముగను. 618

ఆ. బద్ధశిఖుఁడు గాక బ్రహ్మసూత్రము లేక, సలుపునట్టికర్మములు ఫలంబు
నీయఁజాలకునికి నెపుడును బ్రహ్మసూ, త్రమును శిఖయు ద్విజుఁడు తగదు విడువ.

గీ. దక్షిణభుజంబు నెత్తి యదక్షిణాంస
మందుఁ దాల్చిన నుపవీత మనియుఁ గంఠ
మునను బేరుగ ధరియించినను నివీత
మనియు నాసూత్రము సమాహ్వయముల నొందు. 620

క. మానీంద్రులార సవ్యం, బైనభుజం బెత్తి దక్షిణాంసంబున సం
ధానింపఁబడిన నది ప్రా, చీనావీతం బటంచుఁ జెప్పంగఁబడున్. 621

సీ. జపమును జలిపెడిసమయంబునను నర్ఘ్య, యనమును నొనరించునవసరమున
నగ్న్యగారమున నున్నప్పుడు హోమంబు, గావించుచుండెడికాలమందు
సాధుసంగమమందు సంధ్యలయందును, ధరణీసురులసన్నిధానమందు
గురువును సేవించుతరుణంబునందు భో, జనకాలమందు గోస్థానమందు

గీ. దైవకార్యంబు లొనరించుతరుణమందు, ద్విజుఁడు వర్తింప నగు నుపవీతి యగుచు
నగును నుండంగను నివీతి యయి మనుష్య, కార్యముల నొనరించెడికాలమందు.

క. మానీశ్వరులార ద్విజుం, డైననరుం డెట్టిస్థానమం దున్నను బ్రా
చీనావీతిగ నుండం, గా నగుఁ బితృకార్యకరణకాలమునందున్. 623

గీ. లౌకికజ్ఞాన మైన నలౌకిక మగు, జ్ఞాన మైన నాధ్యాత్మికజ్ఞాన మైనఁ
గలుగఁ జేసినగురునకుఁ జలుప వలయు, నాదియందు ద్విజుం డభివాదనంబు.

గీ. సవ్యపాదంబు సవ్యహస్తమున దక్షి
ణాంఘ్రితలమును దక్షిణహస్తమునను
దాఁకుచును దేశికునకు వందనము చేయఁ
దగును బ్రాహ్మణుఁ డగువాఁడు తప్పకుండ. 625

గీ. అడుగ నగుఁ గుశలంబు బ్రాహ్మణుని నడుగ
నగును క్షత్త్రియుని ననామయంబు నడుగ
నగును వైశ్యుని క్షేమంబు నడుగ నగును
నవరవర్ణుని నారోగ్య మవనిసురుఁడు. 626

వ. జనకుండును జననియును నుపాధ్యాయుండును జ్యేష్ఠభ్రాతయును మహీపతియును
మాతులుండును శ్వశురుండును బితామహుండును మాతామహుండును వర్ణ
శ్రేష్ఠుండును బితృవ్యుండును మాతామహియును గురుపత్నియును బితృసోదరి
యును మాతృసోదరియును శ్వశ్రువును బితామహియును జ్యేష్ఠసోదరియును
ధాత్రియును గురువులుగాఁ జెప్పంబడిరి. 627

ఆ. కూరుచుండు మనుచు గురువు చెప్పకమున్నె
కూరుచుండుటయును గురునియెదుట
నావలించుటయును హసియించుటయు నొడల్
విఱుచుకొనుటయును వివేక మడఁచు. 632

గీ. గురువునకుఁ జెప్పకుండఁగా నరుగుటయును
జరణములు చాఁచుకొనుటయు గురునియెదుట
గురునియాసనశయ్యాదిపరికరముల
నాక్రమించుటయును దుష్కృతావహములు. 633

క. గురు వధ్యాపనమునకున్, బరాఙ్ముఖుఁడు గాక యుండుపర్యంతము త
త్పరిసరమున ననుదినమును, బరమోత్సాహంబుతోడఁ బఠియింపఁ దగున్.

క. గురునకుఁ గుశపుష్పాదులు, నిరతంబును దెచ్చియిచ్చి నియమంబునఁ ద
త్పరిచర్య చేయుచుండినఁ, జరితార్థత్వంబు బ్రహ్మచారికిఁ గలుగున్. 635

ఆ. గురునిపేరు పేరుకొనఁగూడదు పరోక్ష,మందుఁ గూడ గురుని ననుకరింపఁ
జనదు గమనమునను సంభాషణమునను, జేష్టితమున నెట్టిచేఁతనైన. 636

క. గురునియెడన్ వర్తించిన,వరుసను ఛాత్త్రుండు సతము వర్తింపనగున్
గురుపత్నీసుతబంధుని,కరమందును లోప మించుకయు లేకుండన్. 637

గీ. గురులలోపల మొదటియేగురు విశేష,ముగను బూజ్యులు వారిలో మొదటిముఖ్యు
రధిపు లందును జనని యత్యంతపూజ్య, తన్ను గర్భంబునను మోసి కన్నకతన.

గీ. తల్లితోడ సమం బైనదైవతంబు, లేదు పితృతుల్యుఁ డగువాఁడు లేఁడు గురువు
కాన వారలపరిచర్యకంటె నధిక, మైనకార్యము లే దెందు నాత్మజునకు. 639

క. జననీజనకులు తనుజ, న్మనిగుణములచేత మోదమును జెందిన న
త్తనయుండు సకలధర్మం, బును బడసినవాఁడ తత్ప్రమోదముకతనన్. 640

క. త్రికరణములచేతను దం, డ్రికిఁ దల్లికిఁ బ్రియము గొలుపుకృత్యములను జే
యక యుండ రాదు తనయుం, డొకనాఁడును వారిఋణము నోపమిఁ దీర్పన్.

క. జననీజనకులవలనను, ననుజ్ఞ గొనకుండ నన్య మగుధర్మంబున్
బొనరింప రాదు తనయుఁడు, తనయుచ్చైర్గతికి నది నిదానం బగుటన్. 642

క. ఒనరించి గురునిపరిచ,ర్యను వానియనుజ్ఞ వడసి యరుదెంచినశి
ష్యునకున్ విద్యాఫల మిహ, మునఁ బరమున స్వర్గలాభమును బ్రాప్తించున్.

క. జనకసముని జ్యేష్ఠభ్రా, తను నవమానించినట్టి తమ్ముఁడు గూలున్
దనచేసినదుష్కర్మము,ననుజేసి యపారఘోరనరకములందున్. 644

క. తనభుజమున భూభారం, బును దాలిచి సుతులఁ దండ్రివోలెన్ బ్రజలన్
మనిచెడిభూమీంద్రునకున్, జనుఁ గావింపఁగఁ బూజ జనముల కెల్లన్. 645

గీ. జ్ఞానకర్మగుణోపేతు లైనఁ గూడ, క్షత్త్రియాదులు భూమినిర్జరులవలనఁ
గూడ దభివాదనంబును గొనఁగ విప్రు, లఖిలవర్ణంబులకుఁ బూజ్యు లగుటఁ జేసి.

గీ. బ్రాహ్మణుల కగ్ని గురువు వర్ణముల కెల్ల, గురువు విప్రుఁడు నాతికి గురువు భర్త
యందఱకుఁ గూడను గురు వభ్యాగతుండు, కాన నభ్యాగతునిపూజ గాదు విడువ.

గీ. అఖిలజనులకుఁ గూడ విద్యయును గర్మ, మును వయస్సును బాంధవ్యమును ధనంబు
పూజనీయంబు లగు నందుఁ బూర్వపూర్వ,ము త్తరోత్తరమునకంటె నుత్తమంబు.

గీ. మార్గ మీయంగ వలయు బ్రాహ్మణున కంధు, నకును రోగికి దుర్బలునకును భార
వాహునకు భూపతికి సతివకును వృద్ధు, నకును నెంతటివాఁడేని న్యాయ మదియ.

గీ. శిష్టగృహములనుండి తెచ్చికొని భిక్ష, దినదినంబును నది నివేదించి గురున
కతని యనుమతి గొని తిన నగును మాని, యగుచు వ్రతదీక్షితుం డైనయట్టివాఁడు.

గీ. గురుకులమునందు దాయాదకులమునందు
బంధుకులమందుఁ దగ దొనర్పంగ భిక్ష
పరగృహంబులు లేకున్నఁ బరిహరించి
పూర్వపూర్వంబు తగుఁ బరంబున గ్రహింప. 651

గీ. కూడ దేకాన్నమును దినఁ గూడ దేఁగ, నధరవర్ణాసవర్ణసంస్థాయములకు
భిక్ష యాచింపఁగా వ్రతదీక్షితుండు, వ్రతికి భిక్షాశనం బుపవాససమము. 652

గీ. భూసురుండు భవచ్ఛబ్దపూర్వకముగ, క్ష్మావరుండు భవచ్ఛబ్దమధ్యముగను
నూరుజుండు భవచ్ఛబ్ద ము త్తరముగ, నడుగ నగు భిక్ష బ్రహ్మచర్యంబునందు.

క. అన్నంబును బూజించిన, నన్నంబును జూచి హర్ష మందిన నపు డా
యన్నము ప్రసాదగుణసం, పన్నం బగు టొండె గాక ప్రతిహర్షించున్. 654

క. అన్నంబును నిందించిన, నన్నమె దుష్కృతము లెల్ల నాపాదించున్
దిన్నను నధికముగను నా, యన్నమె యుడిగించు నాయురారోగ్యములన్. 655

గీ. ప్రాఙ్ముఖుం డయి గాని యహస్కరునకు, నభిముఖుం డయి గాని నిత్యమును నన్న
మారగింపంగ వలయును నంతె కాని, యారగింపంగఁ గూడ దుదఙ్ముఖముగ.

వ. స్నానభోజనపానంబు లొనరించినప్పుడును నిందురించి లేచినప్పుడును రథ్యావ
సర్పణంబునందును నోష్ఠావలేహస్పర్శంబులందును వసనధారణంబునందును
రేతోమూత్రపురీషోత్సర్గంబులందును నవాచ్యభాషణంబునందును నిష్ఠీవనంబు
నను నధ్యయనారంభమందును గాసశ్వాసంబులందును జత్వరంబు గాని శ్మశా
నంబు గాని త్రొక్కినప్పుడును సంధ్యాకాలంబులందును చండాలమ్లేచ్ఛసంభాష
ణంబునందును స్త్రీశూద్రోచ్ఛిష్టభాషణంబునందును ఉచ్ఛిష్టపురుషదర్శ
నంబునందును రక్తపాతంబునందును దుమ్మినప్పుడును నాసామలవిసర్జనంబు
గావించినప్పుడును నమేధ్యస్పర్శంబునందును నప్రయతజన స్పర్శంబునందును

జాఱినవస్త్రంబు స్పృశియించినప్పుడును గేశస్పర్శంబు గావించినప్పుడును శౌచార్థి
యగువాఁ డాచమింప వలయు. 657

సీ. క్షారము గాక యుష్ణము గాక ఫేనబుద్బుదములు లే కుండునుదకముననను
నాచమింపఁగఁ దగు నాసీనుఁడై ప్రాఙ్ముఖముగఁ గాని యుదఙ్ముఖముగఁ గాని
యాచమింపఁగఁ గూడ దాసనపాదుకా, స్థితుఁ డగుచును నన్యచిత్తుఁ డగుచుఁ
దల్పస్థుఁ డగుచును జల్పించుచును హసిం, చుచును బోవుచును జూచుచును దెసలు

గీ. కరము జానువునకు బహిర్గతము చేసి, నట్టిఁ డగుచును నుత్థితుఁ డగుచు సూత్ర
రహితుఁడగుచునునంగుళివిహితశబ్దుఁ,డగుచుసలిలస్థుఁడగుచునునశుచియగుచు.

గీ. శిరమునను గంఠమునను బ్రావరణ మెసఁగ
నుండఁగను ముక్తకేశశిఖుండు గాక
చేసికొని పాదశౌచంబు చేయ వలయు
నాచమనమును శుద్ధతోయంబుచేత. 659

గీ. ఆచమింపఁగ రాదు వర్షాంబువునను, నేకహస్తార్పితమును నుద్ధృతము నైన
జలమునను వీక్షితము గానిసలిలముననను, నావిలజలంబునను బ్రదరాంబువునను.

గీ. ఆచమనసలిలము హృదయమును జొచ్చె
నేని విప్రుఁడు కంఠము నెనసెనేని
క్షత్రియుఁడు ప్రాసితం బైనమాత్ర వైశ్యుఁ
డతినయమున శూద్రుఁడు స్పృశించినంత శుచులు.

సీ. అంగుష్ఠమూలంబునం దుండు రేఖయం, దును బ్రాహ్మతీర్థంబు తనరుచుండు
స్థితిని గైకొనియుండుఁ బితృతీర్థ మంగుష్ఠ, తర్జనీయుగళమధ్యంబునందుఁ
దనరారుఁ గాయతీర్థంబు కనిష్ఠికా, నామికాయుగమూలధామమందు
నొనరు నంగుళ్యగ్రమున దైవతీర్థంబు, వెలయు నాగ్నేయ మంగుళులనడుమ

గీ. నదియె సౌమికతీర్థాహ్వయమును బడసెఁ, గానఁ దీర్థవిభేదంబు గాంచి మొదట
నాచమనహోమతర్పణార్ఘ్యాదివిధులు, సలుప నగు ధర్మమున బుద్ధి గలద్విజుండు.

వ. ఇంక నాచమనవిధానంబు వచియించెద.

—: ఆచమనవిధికథనము :—

సీ. ప్రయతుఁడై బ్రాహ్మతీర్థమున ముందుగ జల, ప్రాశనంబును ద్రివారంబు సలిపి
యోష్ఠముల్ తుడిచి యంగుష్ఠమూలంబున,స్పృశియించియంగుళిత్రితయముననను
దరువాత నంటి నేత్రములను రెంటిసిఁ, గూడ ననామికాంగుష్ఠమును
బిమ్మట నాసాపుటమ్ము నంగుష్ఠంబు, చేతను దర్జనిచేతఁ దాఁకి

గీ. యంతమీఁదను శ్రోత్రద్వయంబు ముట్టి, కొని కనిష్ఠిక చేత నంగుష్ఠముననను
బైని హృదయంబు శిరము నుపస్పృశింప, వలయుఁ గ్రమముగ నెల్లయంగుళులచేత.

గీ. జ్ఞానకర్మగుణోపేతు లైనఁ గూడ, క్షత్త్రియాదులు భూమినిర్జరులవలనఁ
గూడ దభివాదనంబును గొనఁగ విప్రు, లఖిలవర్ణంబులకుఁ బూజ్యు లగుటఁ జేసి.

గీ. బ్రాహ్మణుల కగ్ని గురువు వర్ణముల కెల్ల, గురువు విప్రుఁడు నాతికి గురువు భర్త
యందఱకుఁ గూడను గురు వభ్యాగతుండు, కాన నభ్యాగతునిపూజ గాదు విడువ.

గీ. అఖిలజనులకుఁ గూడ విద్యయును గర్మ, మును వయస్సును బాంధవ్యమును ధనంబు
పూజనీయంబు లగు నందుఁ బూర్వపూర్వ, ముత్తరోత్తరమునకంటె నుత్తమంబు.

గీ. మార్గ మీయంగ వలయు బ్రాహ్మణున కంధు, నకును రోగికి దుర్బలునకును భార
వాహునకు భూపతికి నతివకును వృద్ధు, నకును నెంతటివాఁడేని న్యాయ మదియ.

గీ. శిష్టగృహములనుండి తెచ్చికొని భిక్ష, దినదినంబును నది నివేదించి గురున
కతని యనుమతి గొని తిన నగుచు మౌని, యగుచు వ్రతదీక్షితుం డైనయట్టివాఁడు.

గీ. గురుకులమునందు దాయాదకులమునందు
బంధుకులమందుఁ దగ దొనర్పంగ భిక్ష
పరగృహంబులు లేకున్నఁ బరిహరించి
పూర్వపూర్వంబు తగుఁ బరంబున గ్రహింప. 651

గీ. కూడ దేకాన్నమును దినఁ గూడ దేఁగ, నధరవర్ణాసవర్ణసంస్థ్యాయములకు
భిక్ష యాచింపఁగా వ్రతదీక్షితుండు, వ్రతికి భిక్షాశనం బుపవాససమము. 652

గీ. భూసురుండు భవచ్ఛబ్దపూర్వకముగ, క్ష్మావరుండు భవచ్ఛబ్దమధ్యముగను
నూరుజుండు భవచ్ఛబ్ద ముత్తరముగ, నడుగ నగు భిక్ష బ్రహ్మచర్యంబునందు.

క. అన్నంబును బూజించిన, నన్నంబును జూచి హర్ష మందిన నపుడా
యన్నము ప్రసాదగుణసం, పన్నం బగు టొండె గాక ప్రతిహర్షించున్. 654

క. అన్నంబును నిందించిన, నన్నమె దుష్కృతము లెల్ల నాపాదించున్
దిన్నను నధికముగను నా, యన్నమె యుడిగించు నాయురారోగ్యములన్. 655

గీ. ప్రాఙ్ముఖుం డయి గాని యహస్కరునకు, నభిముఖుం డయి గాని నిత్యమును నన్న
మారగింపంగ వలయును నంతె కాని, యారగింపంగఁ గూడ దుదఙ్ముఖముగ.

వ. స్నానభోజనపానంబు లొనరించినప్పుడును నిందురించి లేచినప్పుడును రథ్యావసర్పణంబునందును నోష్ఠావలేహస్పర్శంబులందును వసనధారణంబునందును రేతోమూత్రపురీషోత్సర్గంబులందును నవాచ్యభాషణంబునందును నిష్ఠీవనంబునను నధ్యయనారంభమందును గాసశ్వాసంబులందును జత్వరంబు గాని శ్మశానంబు గాని ద్రొక్కినప్పుడును సంధ్యాకాలంబులందును చండాలమ్లేచ్ఛసంభాషణంబునందును స్త్రీశూద్రోచ్ఛిష్ట భాషణంబునందును ఉచ్ఛిష్టపురుష దర్శశంబునందును రక్తపాతంబునందును దుమ్మినప్పుడును నాసామలవిసర్జనంబు గావించినప్పుడును నమేధ్యస్పర్శంబునందును నప్రయతజన స్పర్శంబునందును

జాతినవస్త్రంబు స్పృశియించినప్పుడును గేశస్పర్శంబు గావించినప్పుడును శౌచార్థి
యగువాఁ డాచమింప వలయు. 657

సీ. క్షారము గాక యుష్ణము గాక ఫేనబుద్బుదములు లే కుండునుదకమునను
నాచమింపఁగఁ దగు నాసీనుఁడై ప్రాఙ్ముఖముగఁ గాని యుదఙ్ముఖముగఁ గాని
యాచమింపఁగఁ గూడ దాసనపాదుకా, స్థితుఁ డగుచును నన్యచిత్తుఁ డగుచుఁ
దల్పస్థుఁ డగుచును జల్పించుచును హసిం, చుచును బోవుచును జూచుచును దెసలు
గీ. కరము జానువునకు బహిర్గతము చేసి, నట్టెఁ డగుచును నుత్థితుఁ డగుచు సూత్ర
రహితుఁడగుచునునంగుళివిహితశబ్దుఁ,డగుచుసలిలస్థుఁడగుచునునశుచియగుచు.
గీ. శిరమునను గంఠమునను ప్రావరణ మొనయ
నుండఁగను ముక్తకేశశిఖుండు గాక
చేసికొని పాదశౌచంబు చేయ వలయు
నాచమనమును శుద్ధతోయంబుచేత. 659
గీ. ఆచమింపఁగ రాదు వర్షాంబువునను, నేకహస్తార్పితమును నుద్ధృతము నైన
జలమునను వీక్షితము గానిసలిలమునను, నావిలజలంబునను ప్రదరాంబువునను.
గీ. ఆచమనసలిలము హృదయమును జొచ్చె
నేని విప్రుఁడు కంఠము నెనసెనేని
క్షత్రియుఁడు ప్రాసితం బైనమాత్ర వైశ్యుఁ
డతివయును శూద్రుఁడు స్పృశించినంత శుచులు.
సీ. అంగుష్ఠమూలంబునం దుండు రేఖయం,దును బ్రాహ్మతీర్థంబు తనరుచుండు
స్థితిని గైకొనియుండుఁ బితృతీర్థ మంగుష్ఠ,తర్జనీయుగళమధ్యంబునందుఁ
దనరారుఁ గాయతీర్థంబు కనిష్ఠికా,నామికాయుగమూలధామమందు
నొనరు నంగుళ్యగ్రమున దైవతీర్థంబు, వెలయు నాగ్నేయ మంగుళులనడుమ
గీ. నదియె సౌమికతీర్థాహ్వయమును బడసెఁ, గానఁ దీర్థవిభేదంబు గాంచి మొదట
నాచమనహోమతర్పణార్ఘ్యాదివిధులు, సలుప నగు ధర్మమున బుద్ధి గలద్విజుండు.
వ. ఇంక నాచమనవిధానంబు వచియించెద.

—: ఆచమనవిధికథనము :—

సీ. ప్రయతుఁడై బ్రాహ్మతీర్థమున ముందుగ జల, ప్రాశనంబును ద్రివారంబు సలిపి
యోష్ఠముల్ తుడిచి యంగుష్ఠమూలంబున,స్పృశియించియంగుళిత్రితయమునను
దరువాత నంటి నేత్రములను రెంటినిఁ, గూడ ననామికాంగుష్ఠమును
బిమ్మట నాసాపుటమ్ము నంగుష్ఠంబు, చేతను దర్జనిచేతఁ దాఁకి
గీ. యంతమీఁదను శ్రోత్రద్వయంబు ముట్టి, కొని కనిష్ఠికచేత నంగుష్ఠమునను
బైని హృదయంబు శిరము నుపస్పృశింప, వలయుఁ గ్రమముగ నెల్లయంగుళులచేత.

సీ. హరిహరబ్రహ్మలు హర్షించెదరు త్రివా, రంబు చేసినజలప్రాశనమునఁ
బరిమార్జనమున నుపస్పర్శమునను హ, ర్షింతురు యమునయుఁ ద్రిపథగయును
నయనసంస్పర్శంబునను బ్రీతు లగుదురు, ద్వాదశాత్ముఁడును జైవాతృకుఁడును
నానంద మొందుదు రాశ్వినేయులు నాసి, కాపుటసంస్పర్శకరణమునను
గీ. శ్రవణసంస్పర్శమునఁ దృప్తు లవుదు రనలుఁ
డనిలుఁడును సంతసించెద రఖిలసురులు
హృదయసంస్పర్శనమున సంప్రీతి నొందుఁ
బరమపురుషుఁడు మస్తకస్పర్శనమున. 665

సీ. చైత్యంబునందు గోష్ఠమునందు నదియందు, గోమయంబునయందుఁ గూపమందు
వల్మీకమందు శాద్వలమందు బిలమందుఁ, గాష్ఠంబునందు మార్గంబునందు
నగ్నియందు జలంబునందు భస్మమునందు, దేవాలయమునందుఁ దీర్థమందు
గర్తంబునందు వృక్షమునందు గిరియందుఁ, దోయాంతికమునందు ఛాయయందు
గీ. నాకసమునందు నుద్యానమందు క్షేత్ర, మందు శృంగాటకంబునయందు నూష
రంబునందు శ్మశానదేశంబునందుఁ, జలుప రాదు విణ్మూత్రవిసర్జనంబు. 666

సీ. అగ్నికిఁ జంద్రున కాదిత్యునకు మహీ, సురుల కావులకును గురువులకును
దేవాలయములకు దైవతంబులకును, నంబువులకును నితంబినులకు
నభిముఖుం డగుచును నరుగుచు నుత్థితుం, డగుచును సద్రవ్యహస్తుఁ డగుచు
జ్యోతియు దెసలుఁ జూచుచు నగ్నుఁ డగుచును, బాదుకాఛత్త్రోపపన్నుఁ డగుచు
గీ. విడువ రాదు విణ్మూత్రముల్ విడువ వలయు
దక్షిణశ్రవణమున సూత్రమును జేర్చి
యుత్తరాభిముఖంబుగా నుండి పగలు
దక్షిణాభిముఖంబుగాఁ దనరి రేయి. 667

వ. పాంసులంబును గర్దనుంబును బరశౌచశిష్టంబును మార్గస్థంబును నూషరదేశస్థితంబును దేవాలయస్థితంబును గూపస్థితంబును జలస్థితంబును వల్మీకస్థితంబునుం గానిమృత్తికను గూలంబునుండి గ్రహియించి నిర్మలం బగునుద్ధృతోదకంబుచే లేపగంధంబులు వోవునట్లు శౌచంబు గావించుకొన వలయు. 668

సీ. ధరియింప రాదు గంధము మాల్యములు ఛత్త్రి, పాదుక లంజనాభ్యంజనములు
దర్శింప రాదు నృత్యంబును విన రాదు, గానవాదిత్రనిస్వానములను
కా రా దధీనుండు గామలోభక్రోధ, సంతోషనిద్రావిషాదములకు
భుజియింప రా దాజ్యమును క్షారలవణముల్, పర్యుషితంబును భక్ష్యములును
గీ. పరుల బాధింప రా దతిభాషణములు, పలుక రాదు కుచేష్టలు సలుప రాదు
దాంభికత్వంబు కల నైనఁ దాల్ప రాదు, బ్రహ్మచర్యవ్రతంబునఁ బరగుద్విజుఁడు.

సీ. ఋగ్వేదమును బఠియించిన సురలకు, క్షీరాహుతిని బ్రీతి చేసినట్ల
యజురధ్యయనమున నమరుల దధ్యాహు,తిని సంతసంబు నొందించినట్ల
సామంబు చదివిన సర్పిరాహుతిచేత, బర్హిర్ముఖులఁ దృప్తిపఱిచినట్ల
యాకలించిన నధర్వామ్నాయమును దేవ,తలను మధ్వాహుతిఁ దనిపినట్ల
గీ. యంగములును బురాణేతిహాసములును, దెలిసికొను నెడల వపాహుతులను జేసి
యాదితేయుల నతులితాహ్లాదవార్ధి,యందుఁ దేలించుచును నోలలార్చినట్ల.
గీ. వేదశాస్త్రపురాణాదివిద్య లెల్ల, విడిచి పరవిద్యలకుఁ బాలుపడుద్విజుండు
వేదబాహ్యుండు భాషింప రాదు కూడి, వానితోడను బ్రాహ్మణుఁ డైనవాఁడు.
గీ. వేదపాఠమాత్రంబు గావించి దాని, యర్థమును గుర్తెఱుంగక యంతతోడఁ
దృప్తుఁడై యుండునట్టిపృథ్వీసురుండు, పంకమునఁ బడ్డవృషభముపగిదిఁ గుందు.
ఆ. బ్రాహ్మణుండు సహస్రపరమయు శతమధ్య, యును దశావరయును ననఁగ వెలసి
నట్టి వేదమాత నహరహంబు జపింప, వలయు నెల్లవిద్దియలకు మొదట. 673
గీ. అదియె జపయజ్ఞ మదియె బ్రాహ్మణులశక్తి
యదియె మోక్షప్రదాయక మైనవిద్య
దానిఁ బోలంగ లేవు వేదములు గాని
శాస్త్రములు గాని యెట్టిశస్త్రములు గాని. 674
క. ఒకప్రక్కను గాయత్త్రిని, నొకప్రక్కను శ్రుతుల నెల్ల నుంచి తులను మీఁ
దికి నెత్త స్వయంభువు దే, లికగా వేదములసిబ్బి లేచెను బైకిన్. 675
క. గాయత్త్రి లోకపావని, గాయత్త్రియె వేదమాత గాన జగములన్
గాయత్త్రిజపముతో సరి, చేయం దగుజపము లేదు క్షితిదేవులకున్. 676
గీ. అర్థసంధాన మొదవ గాయత్త్రి జపము, నహరహంబును శ్రద్ధతో నాచరించు
నట్టిధాత్రీసురుండు దేహాంతమందు, నపునరావృత్తి యగుధామమందుఁ జేరు.
గీ. మొదటఁ బ్రణవంబుఁ జేరిచి పిదప మూఁడు
వ్యాహృతులు గూర్చి సావిత్రి నంతమందు
సంఘటించినమంత్రరాజంబుకంటెఁ
దారకము లేదు భూమిబృందారకులకు. 678
వ. శ్రావణపూర్ణిమయందుఁ గాని యాషాఢపూర్ణిమయందుఁ గాని భాద్రపద
పూర్ణిమయందుఁ గాని బ్రాహ్మణునకు వేదోపాకర్మంబును బుష్యమాసంబునఁ
బూర్ణిమయందుఁ గాని రోహిణియందుఁ గాని వేదోత్సర్జనబును విధియింపం
బడియె. శుక్లపక్షంబునందు వేదంబులును గృష్ణపక్షంబునందు వేదాంగపురా
ణాదులును నధ్యయనంబు గావింప వలయు. 679

సీ. హరిహరబ్రహ్మలు హర్షించెదరు త్రివా, రంబు చేసినజలప్రాశనమునఁ
బరిమార్జనమున నుపస్పర్శమునను హ, ర్షింతురు యమునయుఁ ద్రిపథగయును
నయనసంస్పర్శంబునను బ్రీతు లగుదురు, ద్వాదశాత్ముఁడును జైవాతృకుఁడును
నానంద మొందుదు రాశ్వినేయులు నాసి,కాపుటసంస్పర్శకరణమునను
గీ. శ్రవణసంస్పర్శమునఁ దృప్తు లవుదు రనలుఁ
డనిలుఁడును సంతసించెద రఖిలసురులు
హృదయసంస్పర్శనమున సంప్రీతి నొందుఁ
బరమపురుషుఁడు మస్తకస్పర్శనమున. 665
సీ. చైత్యంబునందు గోష్ఠమునందు నదియందు, గోమయంబునయందుఁ గూపమందు
వల్మీకమందు శాద్వలమందు బిలమందుఁ, గాష్ఠంబునందు మార్గంబునందు
నగ్నియందు జలంబునందు భస్మమునందు, దేవాలయమునందుఁ దీర్ఘమందు
గర్తంబునందు వృక్షమునందు గిరియందుఁ, దోయాంతికమునందు ఛాయయందు
గీ. నాకసమునందు నుద్యానమందు క్షేత్ర, మందు శృంగాటకంబునయందు నూష
రంబునందు శ్మశానదేశంబునందుఁ, జలుప రాదు విణ్మూత్రవిసర్జనంబు. 666
సీ. అగ్నికిఁ జంద్రున కాదిత్యునకు మహీ, సురుల కావులకును గురువులకును
దేవాలయములకు దైవతంబులకును, నంబువులకును నితంబినులకు
నభిముఖుం డగుచును నరుగుచు నుత్థితుం, డగుచును సద్వ్యాహస్తుఁ డగుచు
జోతియు దెసలుఁ జూచుచు నగ్నుఁ డగుచును, గాదుకాచ్ఛ...సన్నుఁ డగుచు
గీ. విడువ రాదు విణ్మూత్రముల్ విడువ వలయు
దక్షిణశ్రవణమున సూత్రమును జేర్చి
యుత్తరాభిముఖంబుగా నుండి పగలు
దక్షిణాభిముఖంబుగాఁ దనరి రేయి. 667
వ. పాంసులంబును గర్దమంబును బరశౌచశిష్టంబును మార్గస్థంబును నూషరదేశ
స్థితంబును దేవాలయస్థితంబును గూపస్థితంబును జలస్థితంబును వల్మీకస్థితం
బునుం గానిమృత్తికను గూలంబునుండి గ్రహియించి నిర్మలం బగునుద్ధృతోద
కంబుచే లేపగంధంబులు వోవునట్లు శౌచంబు గావించుకొన వలయు. 668
సీ. ధరియింప రాదు గంధము మాల్యములు ఛత్త్రి, పాదుక లంజనాభ్యంజనములు
దర్శింప రాదు నృత్యంబును విన రాదు, గానవాదిత్రనిస్స్వానములను
కా రా దధీనుండు గామలోభక్రోధ, సంతోషనిద్రావిషాదములకు
భుజియింప రా దాజ్యమును క్షారలవణముల్, పర్యుషితంబును భక్ష్యములును
గీ. పరుల బాధింప రా దతిభాషణములు, పలుక రాదు కుచేష్టలు సలుప రాదు
దాంభికత్వంబు కల నైనఁ దాల్ప రాదు, బ్రహ్మచర్యవ్రతంబునఁ బరగుద్విజుఁడు.

సీ. ఋగ్వేదమును బఠియించిన సురలకు, క్షీరాహుతినిఁబ్రీతి చేసినట్ల
యజురధ్యయనమున నమరుల దధ్యాహు,తిని సంతసంబు నొందించినట్ల
సామంబు చదివిన సర్పిరాహుతిచేత, బర్హిర్ముఖులఁ దృప్తిపఱిచినట్ల
యాకలించిన నథర్వామ్నాయమును దేవ,తలను మధ్వాహుతిఁ దనిపినట్ల
గీ. యంగములును బురాణేతిహాసములును, దెలిసికొను నెడల వపాహుతులను జేసి
యాదితేయుల నతులితాహ్లాదవార్ధి,యందుఁ దేలించుచును నోలలార్చినట్ల.
గీ. వేదశాస్త్రపురాణాదివిద్య లెల్ల, విడిచి పరవిద్యలకుఁ బాలుపడుద్విజుండు
వేదబాహ్యుండు భాషింప రాదు కూడి, వానితోడను బ్రాహ్మణుఁ డైనవాఁడు.
గీ. వేదపాఠమాత్రంబు గావించి దాని, యర్థమును గుర్తెఱుంగక యంతతోడఁ
దృప్తుఁడై యుండునట్టిపృథ్వీసురుండు, పంకమునఁ బడ్డవృషభమువగిదిఁ గుందు.
ఆ. బ్రాహ్మణుఁడు సహస్రపరమయు శతమధ్య, యును దశావరయును నననగ వెలసి
నట్టివేదమాత నహరహంబు జపింప, వలయు నెల్లవిద్దియలకు మొదట. 673
గీ. అదియె జపయజ్ఞ మదియె బ్రాహ్మణులశక్తి
యదియె మోక్షప్రదాయక మైనవిద్య
దానిఁ బోలంగ లేవు వేదములు గాని
శాస్త్రములు గాని యెట్టిశస్త్రములు గాని. 674
క. ఒకప్రక్కను గాయత్రిని, నొకప్రక్కను శ్రుతుల నెల్ల నుంచి తులను మీఁ
దికి నెత్త స్వయంభువు దే, లికగా వేదములసిబ్బి లేచెను బైకిన్. 675
క. గాయత్రి లోకపావని, గాయత్రియె వేదమాత గాన జగములన్
గాయత్రిజపముతో సరి, చేయం దగుజపము లేదు క్షితిదేవులకున్. 676
గీ. అర్థసంధాన మొదవ గాయత్రి జపము, నహరహంబును శ్రద్ధతో నాచరించు
నట్టిధాత్రీసురుండు దేహాంతమందు, నపునరావృత్తి యగుధామమందుఁ జేరు.
గీ. మొదటఁ బ్రణవంబుఁ జేరిచి పిదప మూఁడు
వ్యాహృతులు గూర్చి సావిత్రి నంతమందు
సంఘటించినమంత్రరాజంబుకంటెఁ
దారకము లేదు భూమిబృందారకులకు. 678

వ. శ్రావణపూర్ణిమయందుఁగాని యాషాఢపూర్ణిమయందుఁ గాని భాద్రపద పూర్ణిమయందుఁ గాని బ్రాహ్మణునకు వేదోపాకర్మంబును బుష్యమాసంబునఁ బూర్ణిమయందుఁ గాని రోహిణియందుఁ గాని వేదోత్సర్జనబును విధియింపం బడియె. శుక్లపక్షంబునందు వేదంబులును కృష్ణపక్షంబునందు వేదాంగపురాణాదులును నధ్యయనంబు గావింప వలయు. 679

గీ. శౌచమును నియమములును సద్గుణములు, గలిగి యున్నట్టిశిష్యుని గడకుఁ జేర్చి
యనుదినంబును జెప్పఁగా నగును గురువు, శ్రద్ధతోడను వేదశాస్త్రముల నెల్ల.
క. దరినుండి సేవ చేయుచు, నిరతము శుశ్రూషుఁ డగుచు నియమము లెల్లన్
బరిపాలించెడిఛాత్త్రునిఁ, గరుణింపనిగురువు వానికలుషము నొందున్. 681
గీ. అన్నదాతయు గురుపుత్త్రుఁ డంబుదాత
శక్తుఁడును ధార్మికుండును జ్ఞానదాత
శుచియు శుశ్రూషుఁడును గృతజ్ఞుఁడును సాధు
వాప్తుఁడును బాత్రు లుచితవిద్యల నొసంగ. 682
వ. భూకంపంబును నశనిపాతంబును నుల్కాపాతంబును నగ్న్యుత్పాతంబును నుపల రుధిరపాంసువర్షంబులును నకాలమేఘప్రాదుర్భావంబును మున్నగువిప్లవంబులందును మెఱుపు మెఱసినప్పుడును మేఘంబు గర్జించునప్పుడును వర్షంబు గురియునప్పుడును బ్రతిసూర్యుండును నింద్రధనువును దోఁకచుక్కయును నుద్భవించినప్పుడును మహితాత్ములు గ్రామంబునకు వచ్చినప్పుడును సంధ్యాకాలంబులందును హస్త్యశ్వాదుల నధిష్ఠించినప్పుడును ఋతుసంధియందును రోదనసమయంబునందును సలిలంబునం దుండునప్పుడును నర్ధరాత్రంబునందును విణ్మూత్రంబులు విసర్జించునప్పుడును నుచ్ఛిష్టుండు గా నుండునప్పుడును శ్రాద్ధభోజనంబు గావించినప్పుడును శ్మశానంబునందును నృపులసన్నిధియందును మంచు గురియునప్పుడును గ్రామనగరంబులందు దుర్గంధము వ్యాపించినప్పుడును జంద్రపరివేషంబునందును సూర్యపరివేషంబునందును సప్తమీచతుర్దశ్యమావాస్యాపూర్ణిమాప్రతిపత్తులందును నష్టకలయందును గ్రామమున శవం బున్నప్పుడును జండాలుండు గనంబడుచుండునప్పుడును బతితసకాశంబునందును బ్రదోషంబునందును బాదప్రక్షాళనోత్సాదనానులేపనాదిస్వైరికర్మంబులందును శ్లేష్మాతకమధుకశాల్మలికోవిదారకపిత్థవృక్షచ్ఛాయలందును జాతాశౌచమృతాశౌచంబులు ప్రాప్తించినప్పుడును సంగ్రామోద్యానదేవతాసమీపంబులందును గాళ్ళుచాఁచుకొనియును రెడ్డిగము వైచుకొనియును శయనించియును వేదాధ్యయనంబు చేయ రాదు. మఱియును సబ్రహ్మచారియును నాచార్యుండును రాజును మరణించినప్పుడును గ్రహణసూతకంబునందును త్రిరాత్రంబు లధ్యయనంబు గావింప రాదు. తత్సమయంబులందు రాక్షసులు హింసింతురు గావున నయ్యవి యనధ్యాయంబులుగాఁ బరిగణింపంబడియె. సంధ్యోపాసనాబ్రహ్మయజ్ఞాదినిత్యకర్మంబుల కనధ్యాయంబులు లేవు. మఱియును గ్రహణంబును భూకంపంబును నశనిపాతంబును నుల్కాపాతంబును నగ్న్యుత్పాతంబును మున్నగువిప్లవంబులం దప్ప వేదాంగధర్మశాస్త్రపురాణేతిహాసాదులకును ననధ్యాయంబులు లేవు. 683

—: గృ హ స్థా శ్ర మ ధ ర్మ క థ న ము :—

గీ. ఉక్తధర్మానుపాలనయుక్తుఁ డగుచు, శ్రద్ధతో వేదశాస్త్రముల్ చదివి ద్విజుఁడు
పిదప గురుదక్షిణ నొసంగి తదనుమతిని, నవల నభ్యంజనస్నాన మాచరించి.
సీ. యజ్ఞోపవీతద్వయంబును వైణవ, దండంబు సలిలకమండలువును
స్వర్ణకుండలములు ఛత్త్రి ముష్ణీషంబు, పాదుకల్ గంధ ముపానహములు
వసనయుగ్మంబును గుసుమమాల్యములును, మంగళవస్తుసంభారములును
ధరియించి లోకసందర్శనీయాకృతి, గలిగి యుత్సాహసంకలితుఁ డగుచు
గీ. మంగళాకారయును నసమానగోత్ర
జాతయు సవర్ణయును శీలశౌచయుతయు
నాత్మసదృశయు నైనకన్యను గ్రహింప
వలయు విధియుక్తముగ గృహ్యావహ్ని యెదుట. 685
గీ. ఆర్షపరిణయమందుఁ గన్యాప్రదాత, గోద్వయమ్మును దగును గైకొనఁగ నంతె
కాని యేపరిణయమునం దేని తగదు, కన్య నిచ్చినవాఁడు శుల్కము గొనంగ.
క. కన్యాశుల్కము గొన్నను, గన్యావిక్రయమువలనఁ గలిగెడియఘముల్
గన్యాప్రదాత చెందును, మాన్యులు గమియింప రాకుమార్గమునందున్. 687
క. ఋతుకాలగామి యగుచును, బ్రతిషిద్ధదినంబు లుడిగి ప్రమదామణితోఁ
గుతుకమున గృహ్యధర్మము, లతిక్రమింపక గృహస్థుఁ డగు వర్తింపన్. 688
గీ. శ్రాద్ధదినమునఁ గాని పర్వమునఁ గాని, తరుణితోఁ గూడినను గల్గు ధర్మహాని
పగటిపూఁట రమించిన మగువతోడ, సంభవించు నాయుష్యనాశనము గృహికి.
గీ. పొందఁ దగు ఋతుకాలమునందు సతిని, నామె ప్రార్థించినను సపత్న్యభిలాష
మాత్మలోఁ గల్గినను దన కంతె కాని, యన్యమార్గంబు గృహికి లే దతివ నెనయ.
క, ఋతుకాలగామియును నిజ, సతీరతుండును గృహస్థసంజ్ఞాశబ్దా
న్వితు లయ్యు బ్రహ్మచారుల, సతతంబును భూరిపుణ్యశాలులు వారల్. 691
గీ. ఋతువు షోడశరాత్రు లాఋతువునందుఁ, బ్రథమదినములు నాల్గును బాపవిధుని
మూలమఘలన్ను వర్జించి ముదిత నెనయ, నగును శ్రేయోభిలాషి యైనట్టిగేస్తు.
గీ. సన్నిధానంబునను ఋతుస్నాత యైన, భార్య యుండంగఁ దద్భోగపరుఁడు గాక
యుండ రా దట్టు లుండిన నుందు రతని, పితరు లా నెల యా పెశోణితమునందు.
క. కావున ఋతుదివసంబులు, గావింపక వితగ సతిని గవయఁ దగు సుతుల్
కావలసిన సమరాత్రులఁ, గావలసిన సుత లయుగ్మకాలమునందున్. 694
వ. మఱియును సమానాధికులతో సఖ్యంబును ధర్మగోపనంబును బాపఖ్యాపనం
బును గావించుచు సర్వభూతానుకంపాన్వితుం డగుచు భార్యాసంరక్షణంబు
గావించుకొనుచు వయఃకర్మార్థశ్రుతాభిజనంబులకుం దగునట్లు ధర్మంబు నాచ

రించుచుఁ బరధర్మంబు నుజ్జగించుచు శ్రుతిస్మృత్యుదితంబును సాధుజనసేవితం
బును నగునాచారంబును సేవించుచుఁ బితృపితామహాదు లేఁగినసన్మార్గంబున
నేఁగుచు నిత్యస్వాధ్యాయశీలుండును నిత్యయజ్ఞోపవీతియును సత్యవాదియును
జితక్రోధుండును లోభమోహవర్జితుండును సావిత్రీజపపరాయణుండును
మాతాపితృసేవాపరుండును బ్రాహ్మణహితకరుండును దాతయును యజ్వయును
శ్రాద్ధకర్తయును దేవతారాధననిరతుండును నగుచు గృహస్థుండు వర్తించెనేని
బ్రహ్మలోకంబున నిత్యనివాసంబు వడయు. 695

గీ. ఆశ్రయించుచు ధర్మకామార్థములను
నాచరించుచు నతిథిదేవార్చనలను
క్షమయు దయయును గలిగినజనుఁడు పాత్రుఁ
డగు గృహస్థాహ్వయమున కనర్హుఁ డొరుఁడు. 696

గీ. శమము దమమును విజ్ఞానసత్యములును
క్షమయు నధ్యాత్మతత్త్వనిష్ఠయును దయయు
క్ష్మాసురునిలక్షణంబులు గా నెఱింగి
యప్రమత్తుఁడు గా నుండ నగు ద్విజుండు. 697

సీ. ధర్మార్థకామసంతతిసేవయందు నె, ప్పుడును బ్రమాదంబు వొంద రాదు
ధర్మంబు లేనియర్థము గాని కామంబు, గాని కాదు విముక్తికారణంబు
ధర్మసాధన మైనతనువును రక్షించు, కొన నగు నేవిధంబునను నైన
దేహంబు లేకున్న దేవదేవుం డైన, వాసుదేవునిఁ జెంద వశము గాదు

గీ. ధర్మ మన్నను హరి యన్నఁ దత్త్వ మొకఁడె
ధర్మశూన్యుండు హరిని జెందంగ లేఁడు
గాన ధర్మంబు సేవించుమానవుండె
శ్రీపతిపదాంబుజాతసంసేవకుండు. 698

సీ. ఏభూతమున కేని హింస చేయఁగ రాదు, తృష్ణకు లోఁగి వర్తింప రాదు
ధర్మవర్జితులును దుర్మతులును వ్యాధు, లుండుగ్రామంబునం దుండ రాదు
పరులమర్మంబులు బయలుపెట్టఁగ రాదు, పరులచిత్తము నొవ్వఁ బలుకరాదు
వసియింప రాదు పుల్కసమూర్ఖగర్విత, చండాలపతితసూచకులతోడ

గీ. ననృతమును నహితంబును నప్రియమును, బలుక రాదు వివాదంబు సలుప రాదు
సాధువులతోడ గురులతో సతులతోడ, వశుఁడు గా రాదు షడ్వైరివర్గమునకు.

క. గురువునకు దేవునకు భూ, సురునకు దానంబుసేయఁ జూచెడిదాతన్
బురికొల్పక వారించిన, నరునకు గతి లేదు వేఱె నరకము దక్కన్. 700

గీ. విషము విషము గాదు విషము బ్రాహ్మణస్వము, దాని నపహరించుదానికంటె
లేదు పాతకంబు లేదపమృత్యువు, లేదు రౌరవంబు లేదు కీడు. 701

క. దేవస్వ మపహరించినఁ, గావించు నఘౌఘకోటులను గాపున నసువుల్
పోవునపుడేని కూడదు, దేవస్వము నపహరింప ధీమంతులకున్. 702

క. అనవరతంబును యాచక, యనుపాపము చేయుచుండునఘనూధముయా
చనకుని యాచించెడిమ, ర్త్యునకున్ దత్ప్రాణహరణదోషము నచ్చున్. 703

గీ. ఫలము గాని పత్త్రిము గాని జలము గాని
తృణమునుం గాని తుదకు మృత్తికయుఁ గాని
పరులద్రవ్యంబు కొనరాదు నరక మొదవు
దానఁ దత్స్వామియనుమతి లేనియెడల. 704

క. ఫలమూలకాష్ఠతృణములు, సలిలములును బుష్పములును శాకములును దొం
గిల వచ్చు ధర్మమునకై, కలుగదు చౌర్యమున నొదవుకలుషము దానన్. 705

క. జపతపములు ధర్మములును, గపటంబునఁ జేయఁ దగదు కావించినచో
నుపయోగవిరహితములై, విపరీతఫలంబు ననుభవింపఁగఁ జేయున్. 706

ఉ. ఒక్కనిపేరు వెట్టుకొని యొక్కనివేషము దాల్చి వృత్తికై
యక్కడ నక్కడన్ దిరుగునట్టియభాగ్యులు వారిపాపముల్
పిక్కటిలంగఁ బెట్టికొని పెంచినదేహములందుఁ జచ్చి పైఁ
బొక్కుచుఁ బాపయోనులను బుట్టుదు రంతె ఫలంబు దానికిన్. 707

గీ. యోనిసంబంధమును యాజ్ఞయును బరస్ప,రాభిభాషణములును స్నేహమునునాల్గు
పతనహేతువులని చెప్పఁబడియెఁ గాన,నవి యనర్హులయెడలఁ జేయంగఁ దగదు.

సీ. అశ్రోత్రియునకును నవరవర్ణునకును, విహితవర్ణాచారవిరహితునకు
నొనరించుదానంబునను గువిచారముల్, పొనరించుటను గర్మలోపమునను
గులధర్మములు మానుకొనుట నసత్యముల్, పలుకుటను నభక్ష్యభక్షణమునఁ
బరదారసంసర్గకరణంబునను రాజ,సేవను బతితసంసేవనమున

గీ. గోవులకు బ్రాహ్మణులకును దేవతలకు, నాగ్రహము గలిగించుట నవిహితముల
నాచరించుటవలనను నన్వయంబు, లంకురంబులు లేకుండ నస్తమించు. 709

గీ. హిమమహీధరవింధ్యశైలములమధ్య, మునను గృష్ణమృగంబును బుణ్యనదియుఁ
గలుగు దేశంబునను నాస్తికులు వసింప, నట్టిదేశంబునను నుండ నగు ద్విజుండు.

వ. ఏకశయ్యయును నేకాసనంబును నేకపంక్తియును నేకభాండపక్వాన్నమిశ్ర
ణంబులును సహమజ్జనంబును సహాధ్యయనంబును సహభోజనంబును సహ
యాజనంబును యోనిసంబంధంబును నధ్యాపనంబును ననుపదునొకండుదోషం

బులు సంకరంబు జనంబులకును. సంకరంబు పాపకర్మంబుల బొనడంచి నరకంబు
నాపాదించు. 711

క. కావున సాంకర్యమునకుఁ, దా వోవఁగనిపద్ధతులను దగు పట్టింపన్
బావనధర్మము తప్పకుం,గావలయు నటన్న శ్రేష్ఠ గలిగినవారల్. 712

గీ. పంక్తిభేదంబు గలుగును భస్మమునను, ద్వారమున నగ్నిపలనను స్తంభమునను
సలిలమున మార్గమునను శాస్త్రంబు దెలిసి, సంచరించినఁ గలుగదు సంకరంబు.

క. మునులను గురులను దేవత, లను వేదంబులను విప్రులను నిందింపన్
జన దట్టులు నిందించిన, జనులకు నిష్కృతులు లేవు శాస్త్రములందున్. 714

ఆ. అన్యదూషణమును నాత్మస్తవంబును, నింద్యములుగఁ బరిగణింపఁబడియెఁ
గాన నట్టిపనులు గావించువారికిఁ, గలుగు నింద్యకార్యకరణఫలము. 715

గీ. పరులు నిందించుచుండినఁ బలుకకుండఁ, గర్ణములు మూసికొనఁ దగుఁ గాని యెడల
నావలకు నేఁగఁగాఁ దగు నంతె కాని, యెదురుగా నిల్చి దూఱుట హితము గాదు.

గీ. తగదు బహుబంధుజనవిరోధంబు తగదు, దేవతల వేదములను భూదేవతలను
దూషణము చేయువారలతోడ నునికి, పరులయౌన్నత్యమున కీసుపాటు తగదు.

గీ. పాపవంతులపాపముల్ బయలుపఱుపఁ, దగదు తత్తుల్యపాతకుం డగునుగానఁ
బాపరహితులయెడలఁ బాపములు వలుకఁ, దగదు మిథ్యాభిశంసకుం డగును గాన.

గీ. పాపరహితులకంట బాష్పములు గాఱు, నవి హరించును బశుకళత్రాత్మజులను
గాన మిథ్యాభిశంసకుఁ డైనవాని, కెందునను లేదు నిష్కృతి యెంచి చూడ.

సీ. ఉదయాస్తమయముల నొందునప్పుడు మేఘ,సంఛన్నుఁడై యున్నసమయమందు
నాకాశమధ్యమునం దున్నవేళను, నాదర్శజలగతుఁ డైన తఱిని
దగదు సందర్శింపఁ దపనసుధాంశుల, గ్రహముల నశుచివై కాంచ రాదు
తైలోదకములందుఁ దనరూపు గాంచ రా, దొప్ప దుచ్ఛిష్ట మన్యులకు నొసఁగ

ఆ. నాసనస్థుఁ డైనయపుడు తుమ్ముడునప్పు, డావలించునప్పు డాఁగించు
నపుడు నగ్నుఁ డైనయపుడు భార్యను జూడఁ,దగదు కీడు గలుగు దానివలన. 720

ఆ. మావటీఁడు లేనిమత్తగజంబును, గ్రోధయుక్తుఁ డైనగురునిముఖము
మైథునప్రవిష్టు మలమూత్రములు విస, ర్జించుచుండువానిఁ గాంచ రాదు. 721

గీ. పరులతోడను భాషించుపట్ల నుండఁ, గూడ దుచ్ఛిష్టుఁడుగ నవగుంఠితుఁడుగఁ
దగదు హీనుల సేవింప దైన్య మొందఁ,దగదు నిందించుకొనుటయుఁ దగదు తన్ను.

ఆ. కాంచనము గాని చంద్రునిఁ గాని చండ, హేళిపరివేషమును గాని యింద్రధనువు
గాని శరవహ్నిఁ గాని నక్షత్రములను, గాని వచియింపఁ గూడ దెవ్వానికేని.

క. గోవులు మేసెడిమేఁతకుఁ, ద్రావెడుతోయమున కంతరాయము నెపుడున్
గావింప రాదు ఖేదము, గోవులు చెందినను గీడు కులమున కొదవున్. 724

గీ. ఆస్తికుఁడు కాసెవానితో నశుచితోడ, దగ్ధహస్తునితోడ నుదక్యతోడ
మాటలాడంగఁదగదు బ్రాహ్మణుఁడు వారి, కలుషములు తన్ను నంటెడి కారణమున.
గీ. భ్రూణహత్యాఘమును దాను బొందు భక్తి, మఱియు గుణశీలియు దోషవర్జితయు నైన
భార్యను ద్యజించు గృహమేధి పడయువాఁడు, చెందు ఫలము నె తన్మైత్రి చేయువాఁడు.
సీ. ఆహారమునఁ గాని యావాసమునఁ గాని, సహచరుం డగువానిఁ జనదు విడువఁ
దల యంటి మిగిలిన తైలంబు ముఖభుజా, ద్యవయవంబులకు రాయంగ రాదు
నగ్నుఁడై యవగాహనము చేయఁగా రాదు, దహనంబుపై నుండి దాఁట రాదు
గోటితో భూమిని గోఁకంగఁ గూడదు, బంధింప రాదు గోబ్రాహ్మణులను
గీ. సతతమును నింద్రియములను జనదు తాఁకఁ, దగదు క్రీడింప సప్రశస్త్రములతోడ
నంగనఖవాద్యముల నొనర్పంగ రాదు, సలిల మంజలితోడను జనదు త్రాగ. 727
సీ. కదలింపఁ గూడదు కరపాదవాఙ్నేత్ర, కర్ణమేహనకుక్షికాయములను
గూడదు జలమును గొట్టంగఁ గుక్షితోఁ, గరములతోడను గాళ్ళతోడఁ
బాషాణములచేతఁ బ్రహరింపఁ గూడదు, మూలముల్ ఫలములు సాలములును
గుహ్యప్రదేశంబు కూడదు ముట్టంగఁ, జనదు పీఠము లాఁగఁ జరణమునను
ఆ. పనికి రాదు మ్లేచ్ఛభాషణంబు ముసంగఁ, జన దగాధమైన సలిలమందుఁ
దగదు పరుసులెత్తఁ దగినంత పని లేక, కడుగ రాదు కాళ్లు కాంస్యమందు. 728
సీ. నఖభేదనాస్ఫోటనచ్ఛేదనవిలేఖ, నము లనుపనుల నొనర్ప రాదు
తగదు పాదమునఁ బాదప్రక్షాళనము చేయఁ, గాదు చిచ్చునఁ గాళ్లు కాఁచికొనఁగ
నుచ్ఛిష్టుఁ డగుచును నుండ రాదు సతంబుఁ, జనుచు మార్గమునందుఁ జదువ రాదు
నృత్య మాడఁగ రాదు రెండు చేతులతోడఁ, గూడదు శిరమును గోఁకికొనఁగ
గీ. తాకిక స్తోత్రములను నుల్లాసపఱుప, రాదు సురలను వాదిత్రవాదనములు
గానములు చేయ రాదు నిష్కారణముగఁ, దగదు నఖరోమములను దంతములఁ ద్రుంప.
సీ. తల్పంబునందు నుత్సంగంబునందు నుం, చికొని భక్ష్యములు భక్షింప రాదు
జలమందు విణ్మూత్రములు విడువఁగ రాదు, కూడ దక్షములతోఁ గ్రీడ సేయ
నిష్కారణంబుగ నిష్ఠీవనము చేయఁ, దగదు బాహుల దాఁట దగదు నదిని
శూన్యగృహంబున సుప్తుఁడు గా రాదు, చెప్పులు కూడదు చేతఁ బట్ట
గీ. గోవులకు బ్రాహ్మణులకును దేవతలకు, శ్వసనునకు నగ్నికిని రవిచంద్రులకును
నృపతికిని నభిముఖముగా నెపుడు గాని, చనదు పాదములను బాఱఁజాఁచికొనఁగ.
గీ. ఒసఁగు నెడలను గేస్తు విధ్యుక్తముగను, బాత్రునకు నన్నమును గాని పాలు గాని
కందమూలఫలంబులు గాని కడకు, సలిలమును గాని గోదానఫలముఁ జెందు. 731
గీ. అతిథి యగువాఁడు గేస్తు గేహంబునుండి, యరుగవలసిన యెడల భగ్నాశుఁ డగుచు
నతని యాజన్మసంచితంబైన పుణ్య, మంతయును గొని పోవుఁ దా నరుగునపుడు.

గీ. పిదప భుజియింపఁ దగు గేస్తు మొదట దేవ, పితృమనుష్యుల కర్పించి ప్రీతితోడ
నట్లు గాకుండఁ గేవల మాత్మకొఱకుఁ, దినిన నాతండు పాపంబు దినినవాఁడ.
గీ. అఘము షష్ఠ్యష్టమీతిథులందు నుండు, సంతతంబును దైలమాంసములలోనఁ
గానఁ దగ దుపయోగింప వాని నపుడు, తనకు శ్రేయసము గోరుకొనెడివాఁడు.
గీ. తగ దమావాస్యయును జతుర్దశియుఁ గూడ, క్షౌరమునకును సంగనాసంగతికిని
దగదుపరభుక్తములగువస్త్రములుదాల్పఁ,దగదుతొడుగంగఁబరులపాదత్రములను.
సీ. భుజియింప రా దొకపుట్టంబుతోడను, దినఁగూడ దుత్కటాసనముమీఁదఁ
దగ దారగింపంగఁ దనపత్నితోఁ గూడ, ఋతుమతి యగుకాంత నెనయరాదు
భుజియించుచుండెడిపొలఁతిని గనరాదు, గానఁ గూడదు నగ్న యైనదానిఁ
జూపింపరా దింద్రచాపంబు ధేనువు, చేఁపెడిక్షీరంబు చెప్ప రాదు
గీ. తగదు భుజియింప సంధ్యాద్వితయమునందు,నన్యపరిభుక్తపాత్రమునందు భిన్న
భాజనమునను దినరాదు పగటియందుఁ,దక్రమును రేయిఁ బెరుఁగును ద్రావరాదు.
సీ. అశుచివస్తువు దగ దగ్నిలో వైవంగఁ, బ్రాణిహింసను నొనర్పంగ రాదు
తగదు వక్త్రమున నూఁదంగ నగ్నిని జిచ్చు, నను గాళ్లు గాఁచుకొనంగ రాదు
తగదు మ్రొక్కఁగ ముట్టుదానికిఁ గూడదు, కాంస్యపాత్రమునందుఁ గాళ్లు గడుగఁ
దార్యత్రికాసక్తి తగ దారగింపంగ, రాదు సంతృప్తిగా రాత్రులందు
గీ. పండుకొని తినరా దార్ద్రపాదుఁ డగుచుఁ,బండుకొన రాదు తగ దొనర్పంగ గమన
శీర్షసంస్పర్శనముల నుచ్ఛిష్టుఁ డగుచుఁ, జలుపఁ గూడదు మనుజులసంస్తవంబు.
గీ. కూడ దాత్మను దూషించుకొనఁగ నొరుల,మర్మములు ప్రకటీకరింపంగ రాదు
చండరశ్మికి నుదయించుచుండునట్టి, సమయమందుఁ బ్రణామంబు సలుప రాదు.
గీ. అపరిశుద్ధుండుగా నుండినపుడు శయన,యానభోజనపానాధ్యయనజపంబు
లొనరుపఁగరాదునిదురించుచున్న వానిఁ,గూడదుతటాలుననుమేలుకొల్పుటయును.
గీ. స్నానముద్వర్తనమును భోజనము గతియు,స్వాప మధ్యయనంబును జలుప రాదు
సంధ్యలందునుమధ్యాహ్నసమయమందుఁ,దగదుచైత్యంబునందుండుతరువునఱక.
గీ. అగ్నిపరిచర్య చేయరా దనిమిషులను,యతులను నుతింపఁగాఁదగ దశుచి యగుచుఁ
దగదు స్పృశియింప నుచ్ఛిష్టుఁడగుచు ద్విజుల,గోవులను వీతిహోత్రుని దేవతలను.
సీ. తగదు పాదంబుచేతను దాఁక దేవతా, ప్రతిమాకృశానుగోబ్రాహ్మణులను
బాదపంబుల నెక్క రా దుండఁగా రాదు, ప్రేతధూమమున బాలాతపమున
స్వయముగా వినిపింపఁ జనదు మరణవార్త,యగ్నిలోపలఁ గూడ దగ్ని నుంపఁ
జన దనలంబును జల్లార్చుటయు నీట, మండించుటయు నాస్యమారుతమునఁ
గీ. దగదు సలిలంబునం దమేధ్యమును విషము
రక్తమును వైచుటయును వీర్యమును విడుచు

టయును నిష్ఠీవనము చేయుటయును మైథు
నమును జలువుటయును నెట్టినరున కేని. 742

సీ. ఆర్ద్రవస్త్రునకుఁ దైలాభ్యక్తునకు రోగి,కశుచి కుచ్ఛిష్టున కాచరింపఁ
దగదు ప్రణామంబు తగదు చేయఁగ నర్క,భౌమవారముల నభ్యంగవిధిని
బనికిరా దుపవేశ మొనరింపఁగను గలి,క్ష్మారుహాదీపికాచ్ఛాయలందుఁ
గూడ దస్పృశ్యునితోడఁ గ్రుద్ధునితోడఁ, బతితునితోడ సంభాషణంబు

గీ. తగదు సమ్మార్జనీధూళి తనువునందు, సోఁకుటయు హీనజాతులఁ దాఁకుటయును
భస్మకంటక కేశకపాలకుల్య, సహిత దేశనివాసంబు సలువుటయును. 743

వ. మలమూత్రవిసర్జవమైథునకాలంబులం దుపయుక్తం బగువస్త్రంబును బిత్రు దేవతా
కార్యంబులం దుపయోగింపం దగదు. 744

గీ. గొంతుకూర్చుండుటయు గొంతుకూరుచుండి
శిరముపైఁ బెట్టికొనుటయుఁ గరయుగంబు
తగదు భుజియింప భార్యతోఁ దగదు మొదట
సమ్మతించినసమయంబు చనదు విడువ. 745

గీ. మాటలాడుచు నవ్వుట మాటిమాటి, కారగించుచు నుంటయు ననుచితంబు
నీట జిరకాల ముంటయు నిప్పుకలను, హస్తమున ముట్టుకొనుటయు ననుచితంబు.

సీ. ఏకాకిగాఁ జరియింప రా దెపుడును, మెలఁగంగ రా దధార్మికులతోడ
గమనించునపుడు మార్గమునందుఁ బాదుకల్, దండంబు జలము లేకుండ రాదు
గోవున కగ్నికి దేవాలయమునకు, నప్రదక్షిణముగా నరుగ రాదు
చన దయాజ్యునిచేత సవనంబు చేయింప, దేవాలయమున నిద్రింపఁ దగదు

గీ. పశువులకు మృగములకును బక్షులకును, గలహములు పెట్ట రా దస్యకాంతతోడఁ
జలుప రాదు ప్రసంగముల్ తెలుప రాదు, దాను జేసినదానముల్ ధర్మములును.

వ. దేవాలయచ్ఛాయయును దేవచ్ఛాయయును సిద్ధచ్ఛాయయును గోచ్ఛాయ
యును బ్రాహ్మణచ్ఛాయయును యతిచ్ఛాయయును యోగిచ్ఛాయయును
దాఁట రాదు. తసనీడ చండాలులును బతితులును రోగులును నవరజాతులును
దాఁట రాదు. 748

గీ. బ్రహ్మహత్యాకరుఁడు సురాపానకరుఁడు, స్వర్ణచోరుండు గురుసతీసంగతుండు
వారితో నుండువాఁడును వార లైదు, గురు ను బంచమహాపాతకులుగ నైరి.

క. పంచమహాపాతకు లా, ర్జించినపాపమున నరకశిక్షలోపల దుః
ఖించుచు నాకల్పము వసి, యించెద రాపనులు గూడ దెవరును జేయుః. 750

వ. నర్తకాన్నంబును జండాలచర్మకారాన్నంబును గణాన్నంబును గణికాన్నం
బును షండాన్నంబును లోహకారాన్నంబును వృత్తికాన్నంబును సూతకా

న్నంబును నయాజ్యయాజకాన్నంబును విశ్వాసఘాతుకాన్నంబును రజకకులాలు నాపితాన్నంబును దస్కరాన్నంబును జిత్రకారాన్నంబును వార్ధుషికా న్నంబును బతితాన్నంబును బౌనర్భవాన్నంబును నభిశస్తాన్నంబును స్వర్ణకా రాన్నంబును శైలూషాన్నంబును వ్యాధాన్నంబును వంధ్యాన్నంబును నాతు రాన్నంబును జికిత్సకాన్నంబును నన్నవిక్రయికాన్నంబును గులటాన్నంబును నాస్తికాన్నంబును దేవతాగోబ్రాహ్మణదూషకాన్నంబును శ్వపచాన్నంబును సోమవిక్రయికాన్నంబును భృతకాధ్యాపకాన్నంబును నుచ్ఛిష్టభోక్త్రన్నంబును గదర్యాన్నంబును శస్త్రాజీవాన్నంబును శీతరుదితాన్నంబును శిల్పకారాన్నంబును బాపాన్నంబును శ్రాద్ధాన్నంబును శావాన్నంబును వృథాపాకాన్నంబును గృతఘ్నాన్నంబును దిధిషూపత్యన్నంబును బరివేత్రన్నంబును సంస్కారవర్జితంబును దోషదత్తంబును నవమానితంబును గ్రిమిదుష్టంబును భావదుష్టంబును నసత్సంస్పృష్టంబును శునకాఘ్రాతంబును జండాలపతితరజస్వలావీక్షితంబును బశుమనుష్యాఘ్రాతంబును గుష్ఠిస్పృష్టంబును గాకకుక్కుటసంస్పృష్టంబును బర్యుషితంబును నగునన్నంబును భుజియింప రాదు.

గీ. ఏ యన్నమున నుండు మనుజునియఘము లెల్లఁ, గానఁ బాతకియన్నంబు గాఁగఁ దినఁగ
నట్లు గాకుండ భుజియించినట్టులైన, వానిపాపంబులనె తిన్నవాఁడు వాఁడు. 752

గీ. భూసురుఁడు జున్నుపాలును బుట్టగొడుగు, లశుననిర్యాసమాంసపలాండువులును
జనదు భుజియింపఁగా దూడ చచ్చినట్టి, యావుపాలును నవిదూన మాన రాదు.

గీ. తైలసంబంధ మగుపదార్థములు దధియు, రాత్రి భుజియింప రాదు తక్రమునఁ గలిసి
నట్టిక్షీరంబుఁ ద్రాగ రా దాన రాదు, దేవతల కేదియును నివేదింపకుండ. 754

గీ. తగదు వీక్షింప స్పృశియింపఁ దగదు త్రావఁ, దగదు పడలకు నీయంగఁ దగదు కాన
నట్టిమద్యంబు త్రావిన యవనిసురుఁడు, కర్మవిభ్రష్టుఁ డగు వానిఁ గాంచ రాదు.

గీ. అవరవర్ణులయన్నంబు నగ్రవర్ణు, లారగించుటవలనను నఘము గలుగు
నగ్రవర్ణులయన్నంబు నవరవర్ణు, లారగించుటవలనఁ బుణ్యంబు గలుగు. 756

గీ. చచ్చునప్పుడు నాలుగుజాతులందు, నెవనియన్నంబు గుక్షిలో నెవని కుండు
వానివర్ణంబులోపల వాఁడు పుట్టుఁ, గాన నవరాన్నములు హైన్యకారణములు.

వ. ఏకభుక్తంబు దేవాన్నంబు. ద్విభుక్తంబు నరాన్నంబు. త్రిభుక్తంబు ప్రేతాన్నంబు. చతుర్భుక్తంబు శోణపాన్నంబు. 758

సీ. ఆచారమున నొందు నాయువు నారోగ్య, మును ధనంబును స్వర్గమోక్షములను
నాచారహీనుఁ డల్పాయువు రోగియు, దుఃఖియు సజ్జనదూషితుఁడును
నిర్ధనుండును ఘోరనిరయగామియు నగు, నాచారవర్జితుం డైనవానిఁ
జేయుంగఁజాల వామ్నాయముల్ పూతుని, నిశ్శరణ్యుఁడు వాఁడు నిశ్చయముగఁ

సీ. శౌచ నాచారమును నదుఁ డైనవాఁడు, తెలిసికొని యాచరింపంగ వలయు ననఘ
వినుశౌచ నాచారవిషయంబు విశదముగను, నఖిలపురుషార్థ సాధనం బగుయు చూవె.
సీ. అనుదినంబును గృహంబును గోమయంబున, నుపలేపనము చేయు నొప్పు మొదటఁ
బాత్రపీఠాదులఁ బ్రక్షాళనముచేయ,వలయును బరిశుద్ధి గలుగఁ బిదప
భస్మంబుచేఁ గాంస్యపాత్రంబుఁ దామ్రపాత్రం బమ్లమున శిల దైలమునను
లోహపాత్రం బగ్నిదాహంబుచే స్వర్ణ,రౌప్యపాత్రములు నీరంబునలన
గీ. మృత్తికాభస్మముల మణి పృథ్వి మేఘ
వర్షణంబున ఖననంబువలన దాహ
నమున నుపలేపనమున శౌచమును జెందుఁ
దెలిసికొని పారిశుద్ధ్యంబు సలుప వలయు. 760

—: నానాదానమాహాత్మ్యకథనను :—

వ. దానంబు నిత్యం బనియు నైమిత్తికం బనియుఁ గామ్యం బనియు విమలం బనియు
నాలుగువిధంబులు గాఁ జెప్పంబడియె. 761
ఆ. అనుపకారి యైనయవనినిర్జరునకు, ఫలము గోరకుండఁ బ్రతిదినంబు
భావశుద్ధితోడఁ గావించుదానంబు, తనరుచుండు నిత్యదాన మనఁగ. 762
క. తా నొనరించినయఘునం, తానము శాంతించుకొఱకు ధాత్రీసురసం
తానమునకు నర్పించెడి,దానమె నైమిత్తికాభిధానం బయ్యెన్. 763
క. మానిను లైశ్వర్యము సం, తానము మొదలైన వెల్లఁ దన కొనఁగూడన్
జ్ఞానినిర్జరుల కొసంగెడి, దానమె పేర్వడియెఁ గామ్యదానము నాఁగన్. 764
గీ. ధర్మనిష్ఠిత మైనచిత్తంబుతోడ,బ్రహ్మవిదు లైనబ్రాహ్మణప్రవరులకును
నీశ్వరప్రీతికరముగా నిచ్చునట్టి,దానము తనర్చు విమలాభిధానమునను. 765
గీ. దానములలోన నుత్తమదాన మనఁగ,విమలదానంబ మాటలు వేయి యేల
దారుణం బైనసంసారవారిరాశి,గట్టు చేర్చెడినావ యైనట్టికతన. 766
గీ. పాత్రుఁ డగుబ్రాహ్మణుండు సంప్రాప్తమైన
యపుడె యర్జింప వలయు నర్థార్థి యైన
పురుషుఁ డొకటికిఁ బదిరెట్లు దొరక దంత
కంటె లాభకరం బైనకాల మొండు. 767
గీ. దాఁచుకొనినది దక్కదు దక్కుఁ గొట్టకొనకుఁ బాత్రునియం దుంచుకొనిన దొకటి
యీరహస్యము తెలిసినవార లెవరొ,స్వర్గసోపానముల నెక్కువారు వారె. 768
గీ. పాత్రుఁ డని చెప్పఁబడియెను శ్రోత్రియుండు
వ్రతి తపస్వి కుటుంబి నిర్ధనుఁడు శిష్టుఁ

సప్తసంఖ్యాస్థలేషు కూరేషు పాపాత్మా
పావనః స ధార్మికో నై బ్రాహ్మణాయచ. 769

వ. ఇక్షుయవగోధూమవ్రీహియుక్తమగు భూమిని పాత్రునకు నర్పించువాఁడు సర్వపాపవిముక్తుండై పునరావృత్తి లేనిధామంబు నొందు. పాత్రునకు గోచర్మమాత్రమైన భూమి నొసఁగువాఁడు శాశ్వతబ్రహ్మలోకంబు నధిష్ఠించు. దానంబులలో భూదాన మత్యుత్తమంబుగాఁ జెప్పంబడియె. 770

గీ. అన్నదానము భూదాన మనెడి రెండు, దానములు తుల్యఫలములు వానికంటె నధిక మనిరి విద్యాదాన మంతకంటెఁ, జేయఁ దగుముఖ్యదానముల్ క్షితిని లేవు.

సీ. శాంతుఁడు గులీనుఁడును బ్రహ్మచర్యపరుఁడు
శుచియు ద్విజుఁడును నైనశిష్యునకు వేద
శాస్త్రములు సెప్పువిప్రుఁడు శాశ్వతముగఁ
బాదుకొనియుండుఁ బరమేష్ఠిభవనమందు. 772

గీ. ప్రతిదినంబును శ్రద్ధతో బ్రాహ్మణునకు, స్వర్ణదానంబు గావించుసజ్జనుండు తాను జేసినపాపముల్ తన్ను విడువ, నంతమున సత్యలోకంబు నధిగమించు.

వ. వైశాఖపూర్ణిమయందు విధ్యుక్తంబుగ నుపవాసంబు గావించి ధర్మరాజప్రీతికరంబుగా సంకల్పించి కృష్ణతిలలచే బ్రాహ్మణుల నేగురం గాని యేడ్వురం గాని పూజించెనేని జన్మంబు మొదలుకొని చేసినపాపంబు లన్నియును నాక్షణంబ నంద నశియించు. మఱియును వైశాఖపూర్ణిమయందు ధర్మరాజు నుద్దేశించి బ్రాహ్మణునకుఁ దిలసహితకృష్ణాజినంబును హిరణ్యంబును మధువును ఘృతంబును నుదకుంభంబును ఘృతాన్నంబును నర్పించెనేని నరకభయంబునుండి విముక్తుం డగు. మఱియును వైశాఖపూర్ణిమయందు సువర్ణతిలయుక్తంబు లగు నుదకుంభంబులు బ్రాహ్మణుల కేగురకుం గాని యేడ్వురకుం గాని యర్పించెనేని బ్రహ్మహత్యాపాపంబునుండి విముక్తుం డగు. మాఘమాసంబునఁ గృష్ణద్వాదశినాఁ డుపవాసంబు గావించి కృష్ణతిలలచే హోమంబు గావించి బ్రాహ్మణులకుఁ దిలదానంబు చేసెనేని జన్మంబు మొదలుకొని చేసినపాపంబులన్నియును దొలంగు. అమావాస్యయందుఁ బరమేశ్వరప్రీతికరంబుగా మనంబునందు సంకల్పించి బ్రాహ్మణున కేమాత్ర మిచ్చినను దక్షణంబ జన్మకృతం బగుపాతకంబు నశియించు. కృష్ణచతుర్దశియందు సదాశివుని నుద్దేశించి బ్రాహ్మణారాధనంబు గావించెనేని వానికిఁ బునర్జన్మంబు లేదు. కృష్ణాష్టమియందు మహాదేవప్రీతికరంబుగా సంకల్పించి పాదప్రక్షాళనాదివిధులచే బ్రాహ్మణుని నర్చించెనేని సర్వపాపవిముక్తుండై యూర్ధ్వగతిం జెందు. కృష్ణాష్టమియును గృష్ణచతుర్దశియును నమావాస్యయును నీశ్వరారాధనంబునకు ముఖ్యదినంబులుగాఁ జెప్పంబడియె.

ఏకాదశినాఁడు నిరాహారుండై ద్వాదశినాఁడు పాసు దీర్చి సుద్దేశించి బ్రాహ్మ
ణుని నర్చించెనేని పరమపదంబు ప్రాప్తించు. శుక్లద్వాదశి విష్ణుప్రీతికరం బగు
తిథి యగుటం జేసి యానాఁడు తప్పక బ్రాహ్మణారాధనంబు గావింప వలయు.

ఆ. హరిని గూర్చి కాని హరునిఁ గూర్చి కాని, యనవిసురుల కిచ్చినట్టిద్రవ్య
మంత కంత యగుచు నంతంత యగుచును, నంతమునకుఁ గాఁ ననంతఫలము.

గీ. ఎవ్వఁ డేదేవునిం గూర్చి యిష్టపడునొ, పూజ గావింప నతఁడు విప్రునకుఁ బూజ
యొనరించినచోఁ దదుద్దేశమునను దుష్టిఁ, బొందు నా దేవుఁ డదె నిజపూజ యగుట.

క. భూదేవాకారంబుల, తో దేవత లెల్ల నుండుదురు పుడమిని నా
నాదోషబహుళసంసా, రోదధిమగ్నులగుజనుల నుద్ధరింపన్. 777

గీ. బ్రాహ్మణులు లేనివేళను బ్రతిమలందు, దేవతాప్రాణములను బ్రతిష్ఠ చేసి
పూజ గావించి ఫలమును బొంద వచ్చుఁ, గాని యది విప్రపూజకుఁ గాదు సాటి.

సీ. ఆరోగ్యమును బొంద నాకాంక్ష గల దేని, చలుపంగ నగుఁ గర్మసాక్షిపూజ
కార్యసిద్ధుల నొందఁ గామంబు గల దేని, యొనరింప నగు గజాననునిపూజ
బ్రహ్మవర్చసమున భావంబు గల దేని, చేయంగ నగు సురజ్యేష్ఠుపూజ
యైశ్వర్యమునకునై యాశ యేర్పడె నేని, కావింప నగు శతక్రతునిపూజ

గీ. భోగమునకు సుధాంశుని యోగమునకు, నైశ్వరజ్ఞానమునకును నష్టమూర్తి
బలమునకు వాయువును భవవిలయమునకు, హరిని ధనమున కగ్నిని నగును గొలువ.

సీ. అభయప్రదాయకుం డైశ్వర్యమును వేద, దాత బ్రహ్మము ధాన్యదాత సుఖముఁ
జంద్రసాలోక్య మాచ్ఛాదనప్రదుఁ డశ్వ, దాత యానము ద్రవ్యదాత లక్ష్మిఁ
దైలప్రదాత సంతానంబు జలదాత, తృప్తిని నేత్రముల్ దీపదాత
సర్వంబు భూదాత స్వర్ణదుం డాయువు, యానశయ్యాప్రదాయకుఁడు పత్ని

గీ. హర్మ్యములు గృహదాత రూప్యప్రదాత, రూపమును గోప్రదుం డుష్ణరుచిపదంబు
జాఠరాగ్నిప్రదీప్తిఁ గాష్ఠప్రదాత, పాతకవిముక్తి నన్నప్రదాత వడయు. 780

గీ. శాకఫలమూలపత్త్రముల్ శక్తికొలఁది, బ్రాహ్మణులకుక్షిలో నుంచుభాగ్యవంతు
లోలలాడుచునుందు రేకాలమునను, బ్రమదకలశాంబునిధితరంగములలోన. 781

ఆ. రుగ్ణుఁ డైనభూసురునకు నాహారంబు, గాని యౌషధంబు గాని యిచ్చు
నట్టిపుణ్యమూర్తు లాయురారోగ్యసౌ, ఖ్యములు గలిగి యుందు రన్వహంబు.

క. గాత్రచ్ఛేదక మగునసి, పత్త్రవనం బనెడినరకపథ మొందమికిన్
సూత్రము వెదకెడువారలు, ఛత్త్రోపానహము లియఁ జను విప్రులకున్. 783

సీ. గ్రహణసంక్రాంత్యాదికాలంబులందు శ్రో, త్రియున కిచ్చునది యక్షయఫలంబ
కాశీగయాప్రయాగముఖతీర్థముల శ్రో, త్రియున కిచ్చునది యక్షయఫలంబ

నర్మదాగంగాదినదులలోపలను శ్రో, త్రియున కిచ్చునది యక్షయఫలంబ
దంతకామ్యోత్తమోత్తమకాననముల శ్రోత్రి,యున కిచ్చునది యక్షయఫలంబ

గీ. యచట నిచటను నన నేల యెచట నైన,నాత్మలోనఁ దలంచి కృష్ణార్పణముగ
శుద్ధ మగుబుద్ధితోడను శ్రోత్రియునకుఁ,గా నొసంగిన దెల్ల నక్షయఫలంబ. 784

గీ. ప్రాణులకు లేదు దానధర్మంబుకంటె, నధికధర్మంబు గాన స్వర్గార్థి యైన
వాఁడు మోక్షార్థి యైనట్టివాఁడు గూడ,దాన మొనరింపవలయుఁ బాత్రము నెఱింగి.

గీ. సన్నిహితు లైన శ్రోత్రియస్నానుకులను, వదలి తగ దన్యులకు నీయ వారికంటె
నన్యుఁ డధికగుణాన్వితుఁ డయ్యె నేని,యీయఁ దగు నాతనికి సన్నిహితుల విడిచి.

గీ. ద్రవ్య మార్జించి యెవ్వఁడు బ్రాహ్మణులను, దేవతలను స్మరింపక తినుచు నుండు
నతనిఁ దనరాష్ట్రమునఁ నుండి క్షితిపరుండు, వెడల నడువంగఁ దగుఁ గొని విత్తమెల్ల.

గీ. ఈయఁ గూడదు జలబిందు వేని తుదకుఁ, బాతకికి నాస్తికునకు నపండితునకు
భస్మ మగు నగ్నిలో నుంపఁబడినకట్టె, యెఱుఁగున నపాత్రదత్త మేదియును గాని.

గీ. పొట్ట నిండను దన్నను బెట్ట వలయుఁ, దగును దగ దనకుండను ధార్మికునకె
పోవుచున్నను బ్రాణముల్ భుక్తి లేక, తగదు పెట్టంగ నెపుడు నధార్మికునకు.

ఆ. తగుఁ బ్రతిగ్రహింప ధార్మికు లైన బ్రా, హ్మణులవలన విప్రుఁ డంతతోడఁ
గడవ దేని వృత్తి క్షత్త్రియవైశ్యుల, వలన సంగ్రహంబు సలుప వలయు. 790

గీ. సలిపెనేని మంత్రోపదేశంబు ద్విజున, కవరవర్ణుఁడు ద్విజుఁడును నతఁడు గూడ
నధమగతి నొందుదురు సందియంబు లేదు, కానఁ దదుభయకృత్యముల్ కాదు చేయ

గీ. తస్నానుడండును శూద్రుఁడుఁ గలిసి చేయఁ, జనదు వ్యాపారమును నట్లు సలిపి రేని
విప్రుఁ డగు వేదబాహ్యుఁడు వృషలుఁ డధమ,గతిని జెందెడివాఁ డగుఁ గట్టకడకు.

గీ. బ్రాహ్మణుండు దురాశకుఁ బాలుపడక, వృత్తిసంకోచమును నొనరింప వలయు
లోభగుణమున కించుక లొంగు నేని, పతన మొనగూడు బ్రాహ్మణ్యపథమునుండి.

క. సిరి గలిగి బ్రాహ్మణుం డయి, దరిద్రు లగు బ్రాహ్మణులను దరిఁ జేర్పనిమ
మ్మరునకు నిహలోకమునను, బరలోకంబునను శృంగభంగము గలుగున్. 794

క. వేదాధ్యయనమువలనన్, గాదు సవనకర్మములను గాదు తపమునన్
గా దొకసంతోషముచే, భూదేవుఁడు చెందునట్టిపుణ్యము చెందన్. 795

క. సంతోషింపని బ్రాహ్మణుఁ, డంతంబున నేగు నంతకాలయమునకున్
సంతతమును భూతంబుల, స్వాంతములను గలఁత వెట్టుచోరుఁడు వోలెన్. 796

క. అతిథుల నభ్యాగతులను, వ్రతుల సతీసుతుల హితుల రక్షించుచు దే
వతలను గొలుచుచు వ్రతములు,క్రతువులు గావించుచుండఁగా వలయు గృహుల్.

వ. గృహస్థుం డగువానికి దినప్రథమభాగంబున దంతధావనస్నానసంధ్యా హోమాదులును దినద్వితీయభాగంబున వేదాభ్యాసంబును సమిత్పుష్పకుశాది

సంపాదనంబును దినతృతీయభాగంబున న్యాయార్జనంబును యదృచ్ఛాలాభ సంతోషంబును యాజనాధ్యాపనవిశుద్ధద్రవ్యప్రతిగ్రహంబులును దినచతుర్థ భాగంబున స్నానసంధ్యాబ్రహ్మయజ్ఞపితృతర్పణాదులును బంచాయతనదేవతా ర్చనంబును బంచమహాయజ్ఞభూతబలికాకశ్వానబలులును సర్వభూతబలియును నతిథికొఱకు గోదోహనకర్మమాత్రకాలంబు ద్వారనిరీక్షణంబును నతిథిపూజ యును భిక్షువునకును బ్రహ్మచారికిని భిక్షాదానంబును బితృమాతృగురుబంధు గర్భిణీవృద్ధబాలాతిథిభోజనానంతరము భుజించుటయును విహితంబులు. ప్రాణా హుతులను జిహ్వచే గ్రహింప వలయుం గాని దంతములచే నమలం దగదు. మొదట ద్రవరూపం బగుమధురరసంబును నడుమఁ గఠినరూపంబు లగులవణా మ్లంబులును దుదిని ద్రవరూపంబు లగుకటుతిక్తంబులును భుజియింపం దగు. ముని కష్టగ్రాసంబులును వనవాసికి షోడశగ్రాసంబులును గృహస్థునకు ద్వాత్రిం శద్గ్రాసంబులును బ్రహ్మచారి కమితభోజనంబును విహితంబు లయ్యె. శాస్త్ర విరుద్ధభక్ష్యభోజ్యాదులు భోజనానర్హంబులు. కాంస్యపాత్రభోజనం బాయుః ప్రజ్ఞాయశోబలప్రదంబు. భోజ్యాన్నంబునుండి ఘర్మరాజచిత్రగుప్తసర్వభూతబలి యవశ్యకార్యంబు. దినషష్ఠసప్తమభాగంబులందు సన్మార్గాక్షరోక్తి యగునితి హాసపురాణాదివినోదంబును దినాష్టమభాగంబున లోకయాత్రయు బహిస్సం ధ్యయును గావించి యగ్ని నుపాసించి భుజియింపం దగు. సాయంప్రాతఃకాలంబు లందుఁ దాను భుజింపకున్నను వైశ్వదేవబలికర్మంబు లొనర్ప వలయు. భోజ నానంతరంబు భగవచ్చింతనంబు గావించి శయనింపం జను. స్వగృహంబునందుఁ బ్రాక్ఛిరశ్శయనంబును శ్వశురగృహంబున దక్షిణాశిరశ్శయనంబును బ్రవాసం బునఁ బశ్చిమశిరశ్శయనంబును విహితంబులు. ఉదక్ఛిరశ్శయనంబు నిషిద్ధంబు. అగస్త్యమాధవముచుకుందకపిలాస్తీకు లేగురును సుఖశాయు లగుటం జేసి వార లను శయనకాలంబున స్మరియింపం దగు. శయ్యాశిరస్సమీపంబున జలపూర్ణ కుంభంబు నుంచి గారుడాదిమంత్రంబులచే నాత్మరక్ష ప్రతిదినంబును గావించు కొనం దగు. యామద్వయశయనంబు బ్రహ్మత్వప్రదంబు. 798

గీ. ప్రతిదినంబును నుక్తధర్మముల నెల్ల, జాగరూకతతోడను శక్తికొలఁది
నాచరించుచునుండుగృహస్థుఁ డఖిల, సిద్ధులను జెంది చివరకుఁ జెందు ముక్తి.

క. జరుపంగ స్వధర్మంబులు, పరిపాలింపంగ నాత్మపరివారంబుల్
సిరి లేనియగ్రజన్ముఁడు, పరిగ్రహింపంగ నొప్పుఁ బలువురవలనన్. 800

—: వానప్రస్థాశ్రమధర్మకథనము: —

క. ఈవిధమున గార్హస్థ్యము, సేవించి సగంబు వయసు చెల్లినపిదపన్
గావింప వలయు వనమున, నావాసము సుతుల కొసఁగి యఖిలార్థములన్. 801

నర్మదాగంగాదినదులలోపలను శ్రోత్రియున కిచ్చునది యక్షయఫలంబ
దండకారణ్యతీర్థకాననముల శ్రోత్రియున కిచ్చునది యక్షయఫలంబ
గీ. యెచట నెచటను దన నేల యెచట నైన, నాత్మలోనఁ దలంచి కృష్ణార్పణముగ
శుద్ధ మగుబుద్ధితోడను శ్రోత్రియునకుఁ, గా నొసంగిన దెల్ల నక్షయఫలంబ. 784
గీ. ప్రాణులకు లేదు దానధర్మంబుకంటె, నధికధర్మంబు గాన స్వర్గార్థి యైన
వాఁడు మోక్షార్థి యైనట్టివాఁడు గూడ, దాన మొనరింపవలయుఁ బాత్రము నెఱింగి.
గీ. సన్నిహితు లైన శ్రోత్రియబ్రాహ్మణులను, వదలి తగ దన్యులకు నీయ వారికంటె
నన్యుఁ డధికగుణాన్వితుఁ డయ్యె నేని, యీయఁ దగు నాతనికి సన్నిహితుల విడిచి.
గీ. ద్రవ్య మార్జించి యెవ్వఁడు బ్రాహ్మణులను, దేవతలను స్మరింపక తినుచు నుండు
నతనిఁ దనరాష్ట్రమున నుండి క్షితిపవరుండు, వెడల నడువంగఁ దగుఁ గొని విత్తమెల్ల.
గీ. ఈయఁ గూడదు జలబిందు వేని తుదకుఁ, బాతకికి నాస్తికునకు నపండితునకు
భస్మ మగు నగ్నిలో నుంపఁబడినకట్టె, తెఱఁగున నపాత్రదత్త మేదియును గాని.
గీ. పొట్ట నింపను నన్నను బెట్టవలయుఁ, దగును దగ దనకుండను ధార్మికునకె
పోవుచున్నను బ్రాణముల్ భుక్తి లేక, తగదు పెట్టంగ నెపుడు నధార్మికునకు.
ఆ. తగుఁ బ్రతిగ్రహింప ధార్మికు లైన బ్రా, హ్మణులవలన విప్రుఁ డంతతోడఁ
గడవ దేని వృత్తి క్షత్త్రియవైశ్యుల, వలన సంగ్రహంబు సలుప వలయు. 790
గీ. సలిపె నేని మంత్రోపదేశంబు ద్విజున, కవరవర్ణుఁడు ద్విజుఁడును నతఁడు గూడ
నధమగతి నొందుదురు సందియంబు లేదు, కానఁ దదుభయకృత్యముల్ కాదు చేయ
గీ. బ్రాహ్మణుండును శూద్రుఁడుఁ గలిసి చేయఁ, జనదు వ్యాపారమును నట్లు సలిపి రేని
విప్రుఁ డగు వేదబాహ్యుఁడు వృషలుఁ డధమ, గతిని జెందెడివాఁ డగుఁ గట్టకడకు.
గీ. బ్రాహ్మణుండు దురాశకుఁ బాలుపడక, వృత్తిసంకోచమును నొనరింప వలయు
లోభగుణమున కించుక లొంగు నేని, పతన మొనగూడు బ్రాహ్మణ్యపథమునుండి.
క. సిరి గలిగి బ్రాహ్మణుం డయి, దరిద్రు లగుబ్రాహ్మణులను దరిఁ జేర్పనిము
ష్కరునకు నిహలోకమునను, బరలోకంబునను శృంగభంగము గలుగున్. 794
క. వేదాధ్యయనమువలనన్, గాదు సవనకర్మములను గాదు తపమునన్
గా దొకసంతోషముచే, భూదేవుఁడు చెందునట్టిపుణ్యము చెందన్. 795
క. సంతోషింపని బ్రాహ్మణుఁ, డంతంబున నేఁగు నంతకాలయమునకున్
సంతతమును భూతంబుల, స్వాంతములను గలఁత వెట్టుచోరుఁడు వోలెన్. 796
క. అతిథుల నభ్యాగతులను, వ్రతుల సతీసుతుల హితుల రక్షించుచు దే
వతలను గొలుచుచు వ్రతములు, క్రతువులు గావించుచుండఁగా వలయు గృహుల్.
వ. గృహస్థుం డగువానికి దినప్రథమభాగంబున దంతధావనస్నానసంధ్యా
హోమాదులును దినద్వితీయభాగంబున వేదాభ్యాసంబును సమిత్పుష్పకుశాది

సంపాదనంబును దినతృతీయభాగంబున స్వాధ్యాయాభ్యసనంబును యదృచ్ఛాలాభ
సంతోషంబును యాజనాధ్యాపనవిశుద్ధద్రవ్యప్రతిగ్రహంబులును దినచతుర్థ
భాగంబున స్నానసంధ్యాబ్రహ్మయజ్ఞపితృతర్పణాదులును బంచాయతనదేవతా
ర్చనంబును బంచమహాయజ్ఞభూతబలికాకశ్వానబలులును సర్వభూతబలియును
నతిథికొఱకు గోదోహనకర్మమాత్రకాలంబు ద్వారనిరీక్షణంబును నతిథిపూజ
యును భిక్షువునకును బ్రహ్మచారికిని భిక్షాదానంబును బితృమాతృగురుబంధు
గర్భిణీవృద్ధబాలాతిథిభోజనానంతరము భుజించుటయును విహితంబులు. ప్రాణా
హుతులను జిహ్వచే గ్రహింప వలయుం గాని దంతములచే నమలం దగదు.
మొదట ద్రవరూపం బగుమధురరసంబును నడుమఁ గఠినరూపంబు లగులవణా
మ్లంబులును దుదిని ద్రవరూపంబు లగుకటుతిక్తంబులును భుజియింపం దగు.
ముని కష్టగ్రాసంబులును వనవాసికి షోడశగ్రాసంబులును గృహస్థునకు ద్వాత్రిం
శద్గ్రాసంబులును బ్రహ్మచారి కమితభోజనంబును విహితంబు లయ్యె. శాస్త్ర
విరుద్ధభక్ష్యభోజ్యాదులు భోజనానర్హంబులు. కాంస్యపాత్రభోజనం బాయుః
ప్రజ్ఞాయశోబలప్రదంబు. భోజ్యాన్నంబునుండి ధర్మరాజచిత్రగుప్తసర్వభూతబలి
యవశ్యకార్యంబు. దినషష్ఠసప్తమభాగంబులందు సచ్ఛాస్త్రావలోకన యుగునితి
హాసపురాణాదివినోదంబును దినాష్టమభాగంబున లోకయాత్రయు బహిస్సం
ధ్యయును గావించి యగ్ని నుపాసించి భుజియింపం దగు. సాయంప్రాతఃకాలంబు
లందుఁ దాను భుజింపకున్నను వైశ్వదేవబలికర్మంబు లొనర్ప వలయు. భోజ
నానంతరంబు భగవచ్చింతనంబు గావించి శయనింపం జను. స్వగృహంబునందుఁ
బ్రాక్ఛిరశ్శయనంబును శ్వశురగృహంబున దక్షిణాశిరశ్శయనంబును బ్రవాసం
బునఁ బశ్చిమశిరశ్శయనంబును విహితంబులు. ఉదక్ఛిరశ్శయనంబు నిషిద్ధంబు.
అగస్త్యమాధవముచుకుందకపిలాస్తీకు లేగురును సుఖశాయు లగుటం జేసి వార
లను శయనకాలంబున స్మరియింపం దగు. శయ్యాశిరస్సమీపంబున జలపూర్ణ
కుంభంబు నుంచి గారుడాదిమంత్రంబులచే నాత్మరక్ష ప్రతిదినంబును గావించు
కొనం దగు. యామద్వయశయనంబు బ్రహ్మత్వప్రదంబు. 798

ప్రతిదినంబును నుక్తధర్మముల నెల్ల, జాగరూకతతోడను శక్తికొలఁది
నాచరించుచునుండుగృహస్థుఁ డఖిల, సిద్ధులను జెంది చివరకుఁ జెందు ముక్తి.
జరుపంగ స్వధర్మంబులు, పరిపాలింపంగ నాత్మపరివారంబుల్
సిరి లేనియగ్రజన్ముఁడు, పరిగ్రహింపంగ నొప్పుఁ బలువురవలనన్. 800

—: వానప్రస్థాశ్రమధర్మకథనము: —

క. ఈవిధమున గార్హస్థ్యము, సేవించి సగంబు వయసు చెల్లినపిదపన్
గావింప వలయు వనమున, నావాసము సుతుల కొసఁగి యఖిలార్థములన్. 801

వ. పత్నితోఁ గాని పత్నిని దనయులకడ నుంచి కాని వానప్రస్థుండు వనంబున
కేఁగి చీరవసనుండును జటాధారియును త్రిషవణస్నాతుండును బంచయజ్ఞపరా
యణుండును నిత్యకర్మానుష్ఠాతయును నిత్యస్వాధ్యాయనిరతుండును నిష్ప్రతి
గ్రహుండును సర్వభూతానుకంపాన్వితుండును వాగ్యతుండును ననుత్సృష్టరోమ
నఖుండును నిష్ట్యాగ్రయణచాతుర్మాస్యకరుండును నిర్ద్వంద్వుండును
నిర్భయుండును జితేంద్రియుండును బ్రహ్మచారియును నగుచు ఫాలకృష్టంబుల
వర్జించి ఫలమూలాదిపవిత్రాహారంబులు పగలుమాత్రమ భుజియించుచుఁ బరి
వాదమృషావాదనిద్రాలస్యంబులు వర్జించి శిలయందుఁ గాని ప్రోక్షితభూమి
యందుఁ గాని శయనించుచు యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యాన
ధారణాసమాధ్యష్టాంగయోగంబు లభ్యసించుచు వేదాంతజ్ఞానంబు నార్జించుచు.

క. ఏయాహారము దినుఁ డా, నాయాహారమునఁ బితృసురాతిథితృప్తిం
జేయుచు హరిచింతనముం, జేయుచు ననిశంబు తపము చేయఁగ వలయున్.

వ. అట్లు గాకున్న నాత్మయం దగ్న్యారోపణంబు గావించుకొని మునివృత్తి నవ
లంబించి యాత్మసంసిద్ధికొఱ కుపనిషన్మంత్రజపంబు గావించుచు భగవద్ధ్యాన
పరుండై ఫలమూలాదివన్యాహారంబులచేఁ గాని యంతికగ్రామంబున కేఁగి
తెచ్చుకొనినయష్టగ్రాసభిక్షాన్నంబుచేఁ గాని జీవయాత్ర గావింప వలయు. 804

గీ. కడపి యాయు స్తృతీయభాగంబు నట్లు, లడవిలోపలఁ బైఁ దురీయాశ్రమంబు
నొందఁ దగుఁ దీవ్రవైరాగ్య మొదవెనేని, లేనియెడల సన్న్యాసంబు హానికరము.

—: సన్న్యాసాశ్రమధర్మకథనము :—

వ. ప్రాజాపత్యేష్టి గాని యాగ్నేయేష్టి గాని కావించి బ్రహ్మాశ్రమస్వీకారంబు
గావించి యాయుశ్చతుర్థభాగంబు గడప వలయు. జ్ఞానసన్న్యాసంబు వేదసన్న్యా
సంబు గర్మసన్న్యాసంబును నని మూఁడువిధంబులుగా సన్న్యాసంబు చెప్పంబడియె.
ద్వంద్వరహితుండును నిర్భయుండును బ్రహ్మభూతుండును నగువాఁడు జ్ఞాన
సన్న్యాసి యనియును జితేంద్రియత్వంబును ముముక్షుత్వంబును నిష్పరిగ్రహ
త్వంబునుం గలిగి సంతతవేదాధ్యయనంబు గావించువాఁడు వేదసన్న్యాసి
యనియును బ్రహ్మార్పణంబుగా మహాయజ్ఞాదిసత్కర్మంబు లొనరించుచు వశీకృ
తేంద్రియుండై యుండువాఁడు కర్మసన్న్యాసి యనియును జెప్పంబడియె. 806

గీ. ఉక్తసన్న్యాసములలోన నుత్తమంబు, జ్ఞానసన్న్యాస మది గలవాని కెందు
నేదియును జేయఁదగినది లేదు వాఁడు, ధూతకలుషుఁడు కర్మబద్ధుండు గాఁడు.

క. శ్రోతవ్యంబును లేద, ధ్యాతవ్యము లేదు వాని కెందును నేక
జ్ఞాతృత్వముచేత నెవి, జ్ఞాత మగుటఁ జేసి జ్ఞేయ మైనది యెల్లన్. 808

సీ. ప్రాప్త మైనట్టి భైక్షంబు గొనఁ దగు, నప్రాప్తమునకుఁ గా దాశపడఁగ
సమదృష్టి గాఁ దగు శత్రుమిత్త్రులయందు, మానంబునను నవమానమునను
నాత్మసహాయుఁడై యఖిలంబుఁ జరియింపఁ, దగు నేకవాసంబు తగదు చేయ
జీవితం బన్నను జెంద రాదు ముదంబు, మరపిల్లఁగా రాదు మరణ మన్న
గీ. నొంద రాదు భయంబు శీతోష్ణములకు, నభిలషింపఁగ రా దేపదార్థ మేని
తనకు భూతంబులకును ఖేదంబు నెంచు, కొనఁగ రాదు సన్న్యాసంబుఁ గొనినద్విజుఁడు

సీ. తనయెత్తు స్వర్ణంబు ధారవోసినఁ గూడఁ, జను విలోకింప లోష్టంబుకేళి
నచ్చరల్ తనయొద్ద నాడుచుండినఁ గూడ, లక్షింపఁ దగు విమలతలమాఁడ్కి
మృష్టాన్నమును సమర్పించి వేఁడినఁ గూడఁ, దగు గరళాన్నంబుపగిదిఁ జూడ
శయనింపఁ దల్పముల్ సమకూర్చినను గూడఁ, గాంచంగఁ దగుఁ గంటకములఁబోలె
గీ. నగును నుండంగ దృక్పూత మైనచోట, నగును బటపూత మైనతోయంబు ద్రావ
నగును ఋతపూత మైనవాక్యంబు పలుక, నగును హృత్పూత మైనకార్యంబు సలుప
గీ. తన్ను హింసించుటకుఁ బూనుకొన్నవాని, యెడల నైనను దాల్ప రా దీరసంబు
ముండియగుచును గాని త్రిదండియగుచుఁ, గాని తగు నుండ సన్న్యాసి యైనద్విజుఁడు.

వ. అట్లు సన్న్యాసంబు గావింపం దగు వైరాగ్యం బుదయింప దేని సుతులయందు గృహభారం బంతయును బెట్టి తాను నిర్లేపుఁడై గృహమునంద యుండి శిఖాయజ్ఞోపవీతంబు లుజ్జగింపక గృహస్థవిధుల ననుష్ఠించుచు నాత్మవిచారంబు గావించుచు భిక్షాశనంబున దేహయాత్ర వెడలించుచుఁ గామక్రోధాదివర్జితుండై బ్రహ్మచర్యంబు నవలంబించి పరమేశ్వరధ్యానం బొనరించుచుండం దగు. అది మోక్షసాధనం బగుమార్గంబు. 812

గీ. సత్య మస్తేయమును నహింసయును దమము
క్షమము ముదమును బ్రహ్మచర్యమును దయయు
ననునవి వ్రతంబులుగఁ జేసికొనినవాఁడు
నిలయమున నున్న నడవి నుండినను నొకటె. 813

వ. ఆశ్రమనిష్ఠుఁ డగుసన్న్యాసికిఁ గాషాయవస్త్రకౌపీనంబులు ధరియించుటయు సప్తాగారంబులందుమాత్రమ భిక్షించుటయు నేకకాలమంద భుజించుటయు నలాబూదారుమృణ్మయవైణవపాత్రంబులలో నేదేని పాత్రంబుగాఁ జేసికొనుటయు గృహంబులకడ భిక్ష యని యొక్కపరి కేక వైచి యధోముఖుండై గోదోహమాత్రకాలంబు నిరీక్షించుటయుఁ బ్రాప్తం బైనభిక్షాన్నంబు నాదిత్యునకుం జూపి ప్రాఙ్ముఖుండై కూరుచుండి పంచప్రాణాహుతులును గ్రహించి యష్టగ్రాసంబులు భుజియించి కరపాదప్రక్షాళనంబు గావించుకొని యాచమించుటయును విహితధర్మంబులు. 814

సీ. సంఘాతములకు నాత్మ యైనదియును, నాది యైనదియును సకలమునకు
సత్య మైనదియును జ్ఞాన మైనదియును, నాద్యంతవిరహితం బైనదియును
నానాప్రకంబైన గూడ నగు నైనదియును మ,హాత్మకంబైన మహా త్తైనదియును
నిది యని యది యని యెంచ రానిదియును, నపరోక్షముగ నుండునట్టిదియును

ఆ. వెలుఁగులకును నెల్ల వెలుఁగైనదియుఁ దమః,పార మైనదియును బరమగుహ్య
మైనదియును నేక మైనదియును నగు, బ్రహ్మ మనఁగ నేన పరము లేదు. 815

క. నేనె సకలాంతరాత్ముఁడ, నేనె సమస్తమును ననుచు నెపుడును ననుసం
ధానము సేయుచు నుందురు, జ్ఞాను లయిన యతులు శాస్త్రసమ్మతరీతిన్. 816

క. హరి యన్నను శివుఁ డన్నను, బరమాత్ముం డన్న నొకటె భావం బది య
ట్టి మద్వైతంబును నా, పరతత్త్వమె తాను నిజము పరికింపంగన్. 817

గీ. తన్ను దేవునికంటెను భిన్నునిఁగను, నెంచుకొనువాఁడు దేవునిఁ గాంచ లేఁడు
వానిశ్రమ మెల్ల బూదిలో నైచినట్టి, నేతిధార తెఱంగున నిష్ఫలంబు. 818

క. తానె పరాత్పరుఁ డనియును, దానె మహాదేవుఁ డనియుఁ దలఁపున ననుసం
ధానము చేసెడిబ్రహ్మ, జ్ఞానికి మృతి లేదు లేదు జననము గూడన్. 819

క. అటు లనుసంధానముచే, యుటకున్ దగుశక్తి గలుగకుండిన నది సం
ఘటన మగువఱకు హృత్సం, పుటమునధ్యానింప వలయుఁ బురుషోత్తమునిన్.

గీ. అట్లు ధ్యానంబు చేయుచు నాశ్రమమున,నుచిత మగువిధు లాచరించుచును నుండ
వలయు నటు గాక విచ్యుతి గలిగెనేని,నలిపికొనఁ దగు నిష్కృతుల్ శాస్త్రమెఱిఁగి.

గీ. ధర్మమున కైన యతి యనృతంబు దగదు, పలుక దైవికముగ నట్లు పలికెనేని
నలుప వలయుఁ బ్రాణాయామశతము నేక,దివస ముపవాసమును నిష్కృతిగ నతండు

వ. భిక్షుండు హింస నెన్నఁ డైనను దైవికంబుగా నొక్కసారి కావించెనేని కృచ్ఛ్రాతికృచ్ఛ్రప్రాయశ్చిత్తమునం గాని చాంద్రాయణప్రాయశ్చిత్తమునం గాని శుద్ధుండును నభ్యాసంబునం బతితుండును నగు. మఱియును యాచనయును జౌర్యంబును నెన్నఁడేని దైవికంబుగా నొక్కసారి కావించెనేని నిర్వేదంబున శుద్ధుండును నభ్యాసంబునం బతితుండును నగు. రేయి స్త్రీదర్శనంబున వీర్యస్ఖలనం బాదవెనేని షోడశప్రాణాయామంబులచేతను బగలు ప్రాణాయామశతంబుచేతను శుద్ధుండగు. ఏకాన్నశ్రాద్ధాన్నప్రత్యక్షలవణభోజనంబులందుఁ బ్రాజాపత్యంబున విశుద్ధుం డగు. బ్రహ్మచారిగృహస్థవానప్రస్థయతిధర్మంబులు సంగ్రహంబుగాఁ జెప్పంబడియె. 823

క. ఈధర్మంబులు మూకులకు, సాధువులకు శిష్యులకును జను బోధింపన్
బోధింపఁ జనదు ధార్మిక, బాధకులకు నాస్తికులకుఁ బాపాత్ములకున్. 824
క. అని చెప్పి యదృశ్యత్వం, బును జెందె సవిస్మయముగ మును లెల్లఁ గనుం
గొనుచుండ మీకుఁ జివరకు, వినఁ దగినరహస్య మొకటి విజ్ఞాపింతున్.
గీ. కలియుగంబున హరిభక్తికంటె వేఱె, ధర్మములు లేవు భవవార్ధితరణమునకు
నెట్టిధర్మంబులును హృషీకేశభక్తి, షోడశాంశాంశమునకును నీడు గావు. 826

—: పురాణాత్మకవిష్ణుస్వరూపకథనము :—

క. ఒకదేహంబు పురాణా, త్మక మైనది గల దనేకతనుధరుఁ డగుశౌ
రికి నది సేవించినచో, సకలఫలంబులును గూడ సంప్రాప్తించున్. 827
సీ. పాద్మము హృదయంబు బ్రాహ్మము మూర్ధంబు, మఱిగారుడము వామనము త్వచము
భాగవతము దొడల్ బ్రహ్మాండ మస్థులు, మాత్స్యము మెదడు కౌర్మంబు వెన్ను
లైంగవారాహముల్ దక్షిణవామగు, ల్ఫంబులు నారదీయంబు నాభి
లోమముల్ స్కాందము వామదక్షిణభుజ, ద్వంద్వంబు శైవంబు వైష్ణవంబు
గీ. వామపాద మాగ్నేయంబు వామజాను, తలము బ్రహ్మవైవర్తంబు దక్షిణోరు
పర్వము భవిష్య మపసవ్యభావ మొంది, నట్టిపదము మార్కండేయ మచ్యుతునకు.

—: పద్మపురాణప్రాశస్త్యకథనము :—

గీ. అందులోపలఁ బాద్మ మత్యంతముఖ్య, మగుపురాణము వినఁగ నారాయణునకు
హృదయ మగుటను నద్దాన నొదవినట్టి, సకలభావంబులును నిందు సమకుఱుటను.
గీ. ఈపురాణము సకలసంతాపహరము, పాపహరము సమస్తసంపత్కరంబు
వినిన వినిపించినను జదివినను దీని, జన్మసాఫల్య మొదవు నిస్సంశయముగ. 830
క. జనుఁ డఖిలపురాణములను, వినినఫలముఁ బాద్మ మొకటి విన్నను జెందున్
వినిన నొకయాదిఖండము, గనుఁ బాద్మము నెల్ల వినినఁ గనియెడిఫలమున్. 831
సీ. విద్వాంసులను గౌరవించినవాఁ డగు, నొసఁగినవాఁ డగు నుర్వి యెల్ల
సకలవేదములును జదివినవాఁ డగు, నగు స్వర్ణతుల నిచ్చినట్టివాఁడు
సవనంబు లన్నియుఁ జలిపినవాఁ డగుఁ, జెందినవాఁ డగు సిద్ధు లెల్ల
బీదల కన్నంబు పెట్టినవాఁ డగుఁ, దీర్చినవాఁ డగుఁ దృషితతృష్ణ
గీ. బ్రాహ్మణుల గోవులను గావఁ బ్రాణములను, విడిచిపెట్టినవాఁ డగు వివిధపాప
ములను దాఁటినవాఁ డగు ముక్తుఁ డగును, వేడ్కతో నాదిఖండంబు వినినవాఁడు.

గీ. తలఁపఁగా వలయును సత్త్వగుణము నెపుడు, సలుప వలయును సజ్జను లుండుచోట
వలయు సత్తీర్థములఁ దానములు సేయ, నిత్యపురాణశ్రవణమును జలుప వలయు.

క. మునివర్యులార పాద్మం, బను కల్పక సారరూపమును బ్రాకృతికం
బును నైనయాదిఖండం, బును వినిచినవారు బ్రాప్తముగ మోక్షనిలయోక్. 834

క. దేవాదిదేవ మునిగణ, భావితపాదారవింద పరిపాలితసం
సేవకజన విశ్వేశ్వర, భావుకగుణభరిత భువనపావనచరితా. 835

స్రగ్విణీవృత్తము

దారుణాఘవ్రజధ్వాంతమార్తండ సం
సారతూలానలజ్వాలలోకత్రయా
ధారభూతా శ్రితోద్ధారబద్ధాదరా
వారణాసీపురావాస విశ్వేశ్వరా.

: గద్యము :

చిదంబరకవీంద్రప్రణీతం బైన శ్రీమదాంధ్రపద్మపురాణంబున

నాదిఖండము

సమాప్తము.



# శ్రీమదాంధ్రపద్మపురాణము

## భూమిఖండము



కంఠ కృపాపూర్ణా
లోకనపాలితసమస్తలోకా విబుధా
నీకశ్లోకితబృహద
ప్రాకృతగుణ విశ్వనాథ ప్రమథసనాథా. 1

వ. అవధరింపుము. 2

క. జనియించినతోడనె యే, యనువున నోనగూడె భక్తి హరియెడఁ బ్రహ్లా
దున కది వినిపింపుము మా, కని సూతుని నడుగ మునుల కతఁ డిట్లనియెన్. 3

—: ప్రహ్లాదపూర్వజన్మవృత్తాంతకథనము :—

క. మును మా దేశికుఁ డగువ్యా, సునకున్ వచియించెఁ బద్మజుం డాప్రహ్లా
దునివృత్తాంతము వ్యాసుఁడు, వినిపించెను నాకు నదియె వినిచెద మీకున్. 4

గీ. పూర్వకల్పంబునను బశ్చిమోర్వరాంబ, రాంతమున యందు ద్వారక యనెడిపురము
భాసిలుచు నుండె సర్వసంపదలతోడఁ, గాంచువారల కాశ్చర్యకరము గాఁగ. 5

—: శివశర్మ తనపుత్రులపితృభక్తిని బరీక్షించుట :—

సీ. ఆపురంబున నుండె నఖిలవేదవిదుండు, శివశర్మ యనునొక్క క్షితిసురుండు
పంచాగ్ను లట్టు లాబ్రాహ్మణోత్తమునకుఁ, బ్రభవమొందిరి నిజపత్నియందుఁ
గ్రమముగా యజ్ఞశర్మయు వేదశర్మయు, ధర్మశర్మయు విష్ణుశర్మయు మఱి
సోమశర్మయు నాఁగ సూను లేగురు పితృ, భక్తిపరాయణుల్ భవ్యమతులు

గీ. వారిభక్తి పరీక్షింపఁ గోరి విష్ణు, సంప్రసాదసమాగతసర్వసిద్ధి
యైనశివశర్మ యొక్కనాఁ డాత్మమాయ, కతనఁ దనపత్ని మృతనుగాఁగానఁబఱిచె.

క. మరణించినతమతల్లిని, బరిగొని సుతు లెల్లఁ గనుల బాష్పము లురలన్
బరితాప మొందఁ దొడఁగిరి, పరిపరివితములను దుఃఖపరవశు లగుచున్. 7

గీ. అపుడు జ్యేష్ఠసుతుం డైనయజ్ఞశర్మ, కానతిచ్చెను శివశర్మ యామె యవయ
వముల నెల్లను ఖండింపవలయు ననుచు, నతఁడు మఱుమాట వలుకక యట్ల చలిపె.

క. ఆతనిపితృభక్తికిఁ గడుఁ, జేతోమోదంబుఁ గాంచి శివశర్మ తనూ
జాతులలోపల రెండవ, యాతనిఁ దనకడకుఁ బిలిచి యానతియిచ్చెన్. 9

క. కనుఁగొంటి నిపుడె పితృం, జనుచుండఁగ నొక్కపూర్ణచంద్రాస్యను దా
నిని నా కొనగూర్చి నా, యనంగతాపమును మాన్పుమయ్య కుమారా. 10

చ. అనవుడు వేదశర్మ జనకాజ్ఞను మూర్ధమునందుఁ దాల్చి చ
య్యనఁ జని దారి నేఁగెడిలతాంగిని గాంచి నమస్కరించి నా
జనకుఁడు నిన్నుఁ గోరెడిని జాన మనోజశరాభితప్తుఁడై
ననుఁ గరుణించి రమ్ము తరుణం బిదె నీకు శుభంబు గల్గెడిన్. 11

చ. అనుటయు నాలతాంగి ద్రవిణాంగన నైనను నేను ముట్ట నొ
ల్లను ముదివాని వ్యాధిశిథిలం బగుగాత్రమువాని నేటి కీ
పని తలఁ దాల్చి వచ్చితివి పంచశరోపమరూప నిన్నుఁ గాం
చిన నిది యేమొ నామనసు స్నేహరసాంబుధి నోలలాడెడిన్. 12

క. ఆముదిమివానితోడను, నేమి ప్రయోజనము నీకు నేతద్గాత్ర
స్వామి వయి యనుభవింపుము, కామసుఖంబులను నితరగాథలు చాలున్. 13

క. నీసుకుమారశరీరము, నీసౌందర్యాతిశయము నీయౌవనమున్
భూసురవంశలలామమ, చేసేతను నడవిపాలు చేసికొనకుమా. 14

చ. అనుటయు నాతఁ డి ట్లనియె నమ్మ యధర్మవచఃప్రసక్తులన్
ననుఁ గలఁగింప నేమిటికి నామత మట్టిది గాదు నీవు నా
జనకునికోర్కె దీర్చునెడ సర్వజగంబులు నీకుఁ గైవసం
బొనరుచువాఁడ నాపలుకు లొక్కపుడున్ విత గావు నమ్ముమా. 15

చ. అనవుడు నాపడంతి వసుధామరనందన యట్టిశక్తి యుం
డినయెడ నీకుఁ జూపు మిపుడే సకలామరకోటి నాకుఁ గ
న్గొనియెద నంచుఁ బల్కుటయుఁ గొంకును జంకును లేక విప్రనం
దనుఁడు నిజాంతరంగమున ధ్యానముచేసె సుపర్వకోటులన్. 16

ఉ. ధ్యానముచేసినంత నఖిలామరవర్గము వచ్చి యాపయో
జాననకున్ ద్విజన్మునకు నయ్యెడ దర్శనమిచ్చి యేఁగ న
మ్మానిని విస్మయాకలితమానసయై భవదీయశక్తి య
న్యూనము కాని దీనను ద్విజోత్తమ కల్గదు తృప్తి నామదిన్. 17

చ. అనుటయు వేదశర్మ మనమందు విషాదము చెంది తల్లి నీ
పనిచినకార్యముం జలుపుభారము నాయది నీకుఁ దృప్తి యే
యనువునఁ గల్గునో యటుల యానతియిమ్ము మ తేదియేని నా
జనకునకై కళేబరము సైతము కోరిన ధారవోసెదన్. 18

క. నావుడు నాకామిని భూ, దేవోత్తమ తలఁచితేని తృప్తిని నాకున్
గావింప నిమ్ము కృత్తము, గావించి భవచ్ఛిరంబు కొన్కఁగ నాకున్. 19

క. అని పలుకుటయును మనమున, నెన లేనిప్రహర్ష మొంది పృథ్వీసురనం
దనుఁ డప్పుడె ఖడ్గముచేఁ, దనతల తెగఁ గోసి యిచ్చెఁ దరుణీమణికిన్. 20

ఉ. అంతట నాశిరంబు గొని యానవలా శివశర్మయొద్ద క
త్యంతరయంబునన్ జని సుతాన్వితుఁడై యతఁ డుండ భూతవృ
త్తాంతము నెల్లఁ జెప్పుటయు నాతఁడు తచ్ఛిరమున్ గ్రహించి లోఁ
జింతిలి దాని నిచ్చెఁ దనచెంతన యుండినధర్మశర్మకున్. 21

శా. దానిం గైకొని ధర్మశర్మ పితృచింతన్ మాన్పఁగా నెంచి లో
ధ్యానించెన్ సమవర్తి నాతఁడు ప్రశస్తంబైనతద్భక్తికిన్
లోనై నిల్చెను వచ్చి కట్టెదుట నాలోకించి యాధర్మునిం
దా నిట్టుల్ వచియించె నాతనికిఁ జేతఃప్రీతి సంధిల్లఁగన్. 22

గీ. నేను పితృభక్తి గలవాఁడ నేని నాదు, భక్తికిని నీవు సంతసపడితి వేని
యిపుడ బ్రతికింపుమయ్య నీ వితని ననుచుఁ, దనకరంబున నున్నమస్తకముఁ జూపె.

క. తిలకించి తచ్ఛిరంబును, బలికెను వైవస్వతుండు పరమప్రీతిన్
గొలిపెడుమీపితృభక్తియె, సలుపఁగలదు వీనిఁ బ్రాణసంయుక్తునిఁ గాన్. 24

చ. అని వచియించి యేఁగుటయు నాశిర మప్పుడె నిద్రనుండి మే
ల్కనినవిధంబునన్ దెలివి గాంచి ప్రభాంచిత మైనమేనితో
డను గను లెత్తి చూచె నికటంబున నుండినతండ్రి మానసం
బున నమితప్రమోదమును బొందుచు నుండఁగఁ బుత్రభక్తికిన్. 25

వ. అంతట శివశర్మ విష్ణుశర్మం దిలకించి యి ట్లనియె. 26

ఉ. ఈనళినాక్షిమీఁద నుదయించెను భావము నాకు వత్స య
ద్దానికి నంతరాయముగ దాపురమయ్యె జరాదిదుఃఖముల్
గాన దివంబునుండి వడిగా నమృతంబును దెచ్చి యిమ్ము త
త్పానముచేత నాసకలబాధలు దీఱి సుఖింతు నింతితోన్. 27

చ. అనుటయు విష్ణుశర్మ ముదితాంతరుఁడై ప్రణమిల్లి తండ్రికిన్
ఘనపితృభక్తి రక్షకము గాఁ ద్రిదివంబున కేఁగుచుండఁగాఁ
గనుఁగొని వజ్రి తద్గతివిఘాత మొనర్పఁ దలంచి మేనకా
వనరుహలోచనన్ బనిచె వాఁ డరుదెంచెడిత్రోవ కడ్డుగన్. 28

క. ఆనళినాక్షి పురందరు, నానతి గొని యేఁగి నందనారామమునన్
దేనెలసోనలు గురియఁగ, గానము గావించుచును బికస్వానముతోన్. 29

క. ఊఁగుచును దీవయుయ్యాల, నాఁగుచు భూసురుఁడు వచ్చె ననుకొని నడుమన్
లోఁగునొ లోఁగడొ ద్విజుఁ డని, ప్రేఁగుచు లోలోన మిగుల వెనుబడు చుండెన్.

ఉ. ఆసమయంబునందు వసుధామరసూనుఁడు వచ్చుత్రోవలో
డాసియుఁ గూడ నందనము డాయనియట్టులె యందుఁ జంచలా
భాసురగాత్రియై వెలయుభామను జూచియుఁ జూడనట్టులే
యోసరనీనిపాట వినియున్ విననట్టులె యేఁగు చుండఁగన్. 31

క. అత్తఱిణి యతనిచేతో, వృత్తిం గని విస్మయాపహృతమానసయై
తత్తఱిలియు రాజాజ్ఞా, యత్తయగుటఁ జేసి చివర కాతనిఁ బిలిచెన్. 32

క. పిలుచుటయు నతఁడు మీఁదనె, నిలిచి సతీ యేల నన్ను నిలిపితి వనినన్
గలకంఠకంఠి కన్నీ, రొలుకఁగ నిట్లనియె నాద్విజోత్తముతోడన్. 33

క. హరిణాక్షి యొంటిపాటునఁ, జరియించుచుఁ బంచబాణశరహతిచేతన్
దురపిల్లుచుండఁ జూచుచుఁ, బురుషుఁ డయినవాఁడు విడిచి పోవం దగునే. 34

చ. అనుటయు నాతఁ డిట్లనియె నంగన నే శివశర్మనందనుం
డను విజితేంద్రియుండను దృఢవ్రతుఁడన్ బితృభక్తిదీక్షితుం
డను గుణికాత్మజాతులకడంకను లోఁగెడువాఁడఁ గాను గా
మినులకు నేల నాపయి భ్రమించెద వన్యులు లేరె కాముకుల్. 35

క. అని పలికి యచట నొకత్రుటి, యును నిలువక పోవుచుండ నుర్వీసురనం
దనుఁ డాకసమున విఘ్నము, లొనరింపఁ దొడంగె నింద్రుఁ డొక్కమ్మడిగన్.

గీ. ఎన్ని విఘ్నంబులొనరించుచున్నఁ గాని, కలఁత చెందక పితృభక్తిబలమువలన
నన్నిటిని గూడ సమిధల నగ్నివోలె, భస్మమొనరించు చుండె నాబ్రాహ్మణుండు.

ఉ. అంతట నింద్రుఁ డుగ్రుఁ డయి యాతనిపైఁ గురియింపఁ జొచ్చె న
త్యంతనిశాతబాణనిచయంబును దానికి విప్రుఁ డల్గి నే
నెంత సహించుచున్నఁ దల కెక్కుచు నుండినవాఁడు వజ్రి శా
సింతును వీని వే యొకనిఁ జేయుదు నింద్రుని దేవకోటికిన్. 38

క. పితృభక్తిరతునితోనా, యితనికిఁ జెల్లాట మీతఁ డేమనుకొనెనో
బ్రతుకునె ఫణిపై నడు గిడి, నతఁ డిదె కనఁబఱుతు నాసమర్థత ననుచున్. 39

క. కను లెఱ్ఱచేసి యాకస, మును జూచుచు నున్నసమయమున 'దాసోఽహం'
మ్మనుచుఁ జనుదెంచి యింద్రుఁడు, వినయాంజలితోడ నిలిచె విప్రుని యెదుటన్.

క. నిలిచి మహాత్మా నీయెడఁ, జలిపిననాతప్పు లెల్ల సైరింపుము నీ
వలిగిన బ్రహ్మాండంబులు, నిలుచునె నే ననఁగ నెంత నిలువఁబడంగన్. 41

క. నీపితృభక్తికి మెచ్చితిఁ, గోపము చాలించి కోరుకొను మే దేనిన్
బాపింపఁ జేయుదును నీ, దాపున కది యెల్ల నెంతదవ్వుల నున్నన్. 42

క. అని ప్రార్థించుటయును ద్విజ, తనయుఁడు శాంతించి దేవతావల్లభ నీ
కనుతాపము గలిగినయెడ, ననుగ్రహింపుము బిరాన నమృతము నాకున్. 43

చ. అనుటయు వజ్రహస్తుఁడు ప్రహర్షము నొంది మనంబులోపలన్
జనకహితార్థమై సుతుఁడు సల్పినచేఁతకు మెచ్చి కొంచు నొ
య్యన నమృతప్రపూర్ణ మయినట్టిఘటంబు నొసంగె విప్రనం
దనునకు దుస్సహం బయినతన్మహిమంబు దలంకు గొల్పఁగన్. 44

క. ఆయమృతకుంభముం గొని, వాయుజవంబునను మరల వచ్చినత్రోవన్
బోయి ద్విజనందనుఁడు తన, నాయన కర్పించె దాని నయభయములతోన్.

—: శివశర్మ పితృభక్తిపరితుష్టుఁడై పుత్రులకు వరం బిచ్చుట :—

క. అంతట శివశర్మ మన, స్సంతోషముఁ జెంది యాత్మజన్ములఁ గని మీ
యంతర్విశుద్ధభక్తికి, నెంతయు మెచ్చితిని గోరుఁ డిచ్చెద వరమున్. 46

చ. అనవుడు నాతనూజులు మహాత్మ ప్రసన్నుఁడ వైతి వేని మా
జనని సజీవయై మరల సమ్మదమున్ గలిగించుఁగాక మా
కనుటయు నట్ల యయ్యెడు మటం చనియెన్ శివశర్మ యంతలో
నసె చనుదెంచె నాయమ ప్రణష్టధనం బుపలబ్ధ మైనటుల్. 47

క. అరుదెంచి యామె తనపతి, చరణములకు మ్రొక్కి మొదట జలజల కంటన్
దొరలఁగ బాష్పజలంబులు, పరిరంభణ మాచరించెఁ బరిగొనుసుతులన్. 48

గీ. అట్లు పరిరంభణ మొనర్చి యామె యిట్టు,లనియె నానందవివశాంతరంగయగుచుఁ
గోరుకొందురు సుతులు చేకూరవలయు, ననుచు నరు లిట్టిసాహాయ్యమునకె కాదె.

ఆ. పుణ్యవంతు లైనపుత్రులు గలిగిన, సతులు గాక భాగ్యవతులు గలరె
యువిదలకును గర్భ ముండినదానికి, ఫలము సత్సుతులను బడయు టాకటె. 50

ఉ. పుట్టితి నుత్తమం బయినభూసురవంశమునందు మీఁదఁ జే
పట్టితి దేవతుల్యుఁ డగుభర్తను గర్భమునుండి కంటి మీ
యట్టితనూజరత్నముల సార్థకమయ్యెను జన్మ మెల్ల నే
నెట్టితపంబు చేసి జనియించినదాననొ భూతలంబునన్. 51

క. నావుడు నామెకుఁ బ్రణతులు, గావించి భవత్పవిత్రగర్భంబున మే
మావిర్భవించుటనె పితృ, సేవాభాగ్యంబు జనని చేకుఱె మాకున్. 52

క. మీమాహాత్మ్యమె మూలము, మామహిమకుఁ దల్లి యల్పమానవులము మా
సామర్థ్య మెంత పితరులు, క్షేమంకర మైనతలఁపు చేయక యున్నన్. 53

క. అని పుత్రులు పలుకుటయును, గనుఁగొని శివశర్మ యేమి కావలయునొ యిం
కను మీకుఁ గోరుకొనుఁ డని, కనికరమున ననుడు వారు కౌతుక మొదవన్.

ఆ. తండ్రి మాకు విష్ణుధామంబు దయచేయు, మంతకంటె వేఱె యాస లేదు
కరుణ గలిగి నీవు వర మీయ నెంచిన, వాఁడ వగుట నిట్టివాంఛ వొడమె.
క. అనుటయు శివశర్మ ముదం,బును జెంది సుతాభిలాషమున కట్టులె యా
ననుటయును నపుడె వేంచే,సెను గరుడారూఢుఁ డగుచు శ్రీపతి యటకున్.
క. హరి ప్రత్యక్షం బగుటయుఁ, బరీక్షితాత్ము లగునాత్మభవులు నలువురున్
హరిరూపు లగుచు నేఁగిరి, హరివెంటనె గరుడి నెక్కి హరిపదమునకున్. 57
వ. అంతట శివశర్మ కనిష్ఠపుత్రుం డగుసోమశర్మం జూచి. 58
ఆ. తలఁపు గలిగె నోయి తనయ యీనాఁడు నా, కతివతోడఁ దీర్థయాత్ర కేఁగ
నుండి యింటఁ బ్రోచుచుండుము నీవు మే, మరుగుదెంచుదాఁక నమృతఘటము.
క. అని యానతిచ్చి సుతునకుఁ, జనియెను శివశర్మ యాత్ర సలుపఁగ సతితో
డను సోమశర్మ పితృశా, సనమును పాలించు చుండె సదనమునందున్. 60
క. పదియేండ్లు గడచువఱకును, బదిలముగను జేసి తీర్థపర్యటనంబున్
దుదకు శివశర్మ మదిలో, సదనమునకు వచ్చుతలఁపు సమకూరంగన్. 61
క. తనమాయావిలసనమునఁ, దనువునఁ గుష్ఠంబు గలుగఁ దరుణికిఁ దనకున్
జనుదెంచె నొకదినంబునఁ, దనసద్మమునకు విషాదతప్తుం డగుచున్. 62
క. అరుదెంచినతలిదండ్రుల, చరణములకు మ్రొక్కి సోమశర్మ సభక్త్యా
దరమునను వారిదుస్థితి, పరికించి సహింపలేనిపరితాపమునన్. 63
ఆ. ఇట్టు లనియెఁ దండ్రి యేమిపాపంబునఁ, గలిగె నీయవస్థ కలుషరహితు
లైనమీకుఁ జెప్పుఁ డనుటయు శివశర్మ, పలికె నిట్టు లాత్మభవునితోడ. 64
క. చేసితి మేజన్మమునన్, గాసిం బడఁగలిగినట్టికర్మము దానం
జేసి యొనగూడె మా కీ, దోసము పూర్వార్జితములు దొలఁగవు వత్సా. 65
క. మాకొఱకు నీవు తండ్రీ, శోకింపకు మేమి ఫలము శోకించినచోఁ
గా కుండదు కాఁ దగినది, చేకూరదు కాని దెంతచీకాకైనన్. 66
వ. అనుటయు సోమశర్మ కర్మఫలం బనుభవింపక తప్ప దని తలంచి తత్పరిచర్యా
పరాయణుండై. 67
సీ. తానయి శ్లేష్మమూత్రపురీషముల నెత్తుఁ, గొంచె మేనియును జుగుప్స గొనక
స్నానంబు చేయించుఁ జక్కఁగా వాసన, పోవునట్టులు మేనిపుండ్లు కడిగి
పుట్టముల్ స్వయముగాఁ గట్టును నిజహస్త, ములతోడఁ బరిశుద్ధముగను నుదికి
పాకంబు గావించి పరిశుభ్రముగ నుండ, షడ్రసోపేతభోజనము వెట్టు
గీ. బహుళపరిమళవస్తుసంభరిత మగుచు, శోభిలఁగఁ దమ్ములమ్ములు చుట్టి యిచ్చు
నింపయినతల్పముల శయనింపఁ జేసి, పాదముల నొత్తు నిద్దురపట్టువఱకు, 68

క. తనమూఁపులపై నిడికొని, చని తీర్థస్నానములను జలిపించును ద
జ్జననీజనకుల నాతఁడు, తనయుఁ డనఁగ నతఁడె కాక తదితరుఁ డగునే. 69

క. జననీజనకులు నిత్యం, బును జేయం దగినకర్మముల నెల్లను దా
నొనరించును దత్ప్రతినిధి, గను వారికిఁ దత్ఫలంబు గలిగెడిభంగిన్. 70

క. ఈ విధమున మాతాపితృ, సేవాపరుఁ డగుచు వారు చిత్తములోనన్
భావించినపను లెల్లన్, గావించుచు నుండె న త్తనయుఁ డనుదినమున్. 71

క. అటులేన్ శివశర్మ సము, త్కటకోపముతోడ నొక్కతఱిఁ జెడఁ దిట్టున్
బటపట రదములు గొఱుకుచుఁ,దటాలునను దన్ను నొక్కతఱిఁ బాదమునన్. 72

ఆ. తండ్రికోపమునకుఁ దనమదిలోపల, నించు కేని తాప మెనయకుండఁ
బ్రతిపదంబుఁ దత్సపర్యాక్రియలయంద, చూడ్కి నిలిపి యుండె సోమశర్మ. 73

క. తిట్టినను గొట్టినను దన, పట్టు విడువకుండఁ బరమభక్తి మెయిం గ
న్పట్టెడితనయుని వేఱొక, పట్టున శివశర్మ దలఁచి పరిశోధింపన్. 74

క. అమృతఘటంబున నుండిన, యమృతము తనమాయచేత హరియించి సుతో
త్తమ నీకడ ము న్నుంచిన, యమృత మిపుడు ద్రావ వలయు నది యిమ్మనియెన్.

వ. అనుటయు సోమశర్మ జనకాజ్ఞ నొఁదలం దాల్చి రేఁబవలుం దాను గంటిని
ఱెప్పవోలె భద్రముగఁ గాచుచుండినయమృతఘటంబుం గాంచి దానిపైని
గీలితం బొనరించినమూఁత దీసి చూచి యందు నమృతబిందువు గూడ లేమిం
జింతించి యున్నది యున్నయట్లు చెప్పిన జనకునకు మనఃక్లేశంబు గలుగు నని
తలంచి యెట్టకేలకు ధైర్యంబు దెచ్చికొని. 76

గీ. శమము దమమును సత్యశౌచములు గలిగి, ధర్మపరిపాలనైకతత్పరుఁడ నగుచు
నేను బితృసేవ చేసితినేని యిపుడె,యమృతపరిపూర్ణమగుఁగాక యమృతఘటము.

క. అని పలుకుటయును దత్క్షణ, మున నె యమృతకుంభ మమృతపూర్ణం బయ్యెన్
గని యాతం డది గైకొని,చని వినయముతోడ నుంచె జనకునియెదుటన్. 78

క. ఉనిచినయమృతఘటంబున్, గనుఁగొని సుతభక్తి కమితకౌతుక మొదవం
గను వారు పూర్వరూపం, బును దాలిచి కానఁబడిరి పుత్రున కంతన్. 79

ఆ. సోమశర్మ వారిఁ జూచి నీరోగుల, సూర్యబింబకాంతిశోభితులను
మదిని విస్మయంబు ముదము నేపారంగ, నాక్షణంబ యడుగులందు వ్రాలె. 80

క. అంతట శివశర్మ మదిన్, సంతోషము నొంది దీవనలచేత సుతున్
సంతోషపఱిచి యేఁగెన్, గాంతామణితోడ విష్ణునగరంబునకున్. 81

వ. అంతట సోమశర్మ సాలగ్రామక్షేత్రంబునకుం జేరి. 82

ఆ. విషయవిముఖుఁ డగుచు విజనప్రదేశంబు, నాశ్రయించి తపము నాచరించెఁ
గొంత కాల మచట నంతలో నతని కా, సన్నమయ్యె మరణసమయ మపుడు.

గీ. దానవులు గొంత చేరెంచి వానిదరికిఁ, జలుపఁ దొడఁగిరి భీషణస్థానములను
నేమి పాపమొ కాని యాసోమశర్మ, యంతరంగము సాధ్వసాక్రాంత మయ్యె.
క. ఆసాధ్వసంబుతోడనె, భూసురుఁ డసువులను విడిచిపుచ్చెను దానం
జేసి యొనగూడె నతనికి, నాసురదేహంబు విధిని నగునే గడవన్. 85
సీ. అంత నాతఁడు హిరణ్యకశిపుం డనియెడి, నామంబు గలదైత్యనాయకునకుఁ
గమలాఖ్య యైనతత్కాంతయం దుదయించి, ప్రహ్లాదుఁ డనెడిపేరను జెలంగి
దేవాసురులకుఁ బ్రాప్తించినయనిలోన, నఖిలాత్మకుం డైనహరిని గాంచి
పూర్వజన్మజ్ఞానమును బొంది తనవృత్త,మంతయు నెఱిఁగించి యచ్యుతునకు
గీ. స్వామియీదైత్యకాయంబుసంహరించి,ననుఁగృతార్థుఁ జేయుమీయనుచు వేఁడ
నపుడు కరుణాళు వగుటను నతనిశిరము, చక్రధారను ఛేదించెఁ జక్రపాణి.
ఆ. అటులు చక్రనిహతుఁ డగుటయుఁ బ్రహ్లాదుఁ, డతనికన్నతల్లి యైనకమల
పుత్రశోకభారమున వచ్చుకన్నీళు, లేఱు లగుచుఁ బాఱ నేడ్వఁ దొడఁగె. 87
క. రేలును బవళులు శోక, జ్వాలావృత యగుచు నామె శమియింపఁగ లో
నూలుకొనుచుండ సురముని, యాలోపల నరుగుదెంచె నాయమకడకున్. 88

—: సోమశర్మ ప్రహ్లాదుఁడుగాఁ బుట్టుట :—

సీ. అరుదెంచి నారదుం డాసాధ్వి నీక్షించి, సాహసం బొనరింపఁ జనదు నీకు
హరిభక్తుఁడై పుట్టి యతఁడు నీకడుపునఁ, బ్రహ్లాదుఁ డనెడుపేర నెసంగి
దానవకృత్యముల్ లేనివాఁడుగ నుండి, దేవభావంబునఁ దేజరిల్లి
సకలలోకప్రశంసాభాజనం బయి, యింద్రసింహాసనం బెక్కఁ గలఁడు
గీ. చాన యీమాట వెలిపుచ్చఁ జన దటంచుఁ,జెప్పి ధైర్యంబు గొలిపి యాశీలవతికిఁ
గానఁ బడకుండ రెండవకంటి కేఁగె, మరలఁ దా నేఁగుదెంచినమార్గమున నె.
క. తరువాతఁ గొన్నిదివసము, లరుగుటయును గర్భ మొదవి యామెకుఁ బుట్టెన్
హరిభక్తుఁ డైనకొమరుఁడు, సురలు దివమునుండి కురియ సుమవర్షంబుల్. 90
క. అమితాహ్లాదకుఁ డగుచును, నమితాహ్లాదమునఁ బుట్టినట్టికతన నా
కొమరునకుఁ బేరు వెట్టిరి, ప్రమాణవిదు లెల్లఁ గూడి ప్రహ్లాదుఁ డనన్. 91

—: ప్రహ్లాదుఁ డింద్రపదంబు నొందుట :—

క. జనియించిన దాదిగ నా, తనయుఁడు హరిపాదభజనతత్పరుఁ డగుచున్
గొనియె నృసింహానుగ్రహ, మున సకలసురాధిపత్యమును ద్రిదివమునన్. 92
క. శక్తుం డయ్యును నాతఁడు, సక్తుఁడు గాకుండ స్వర్గసామ్రాజ్యరమా
భోక్త యయి యుండె నన నిఁక, ముక్తిం గను టెంత యావిమోహాత్మునకున్.
క. అనుటయు మఱి యెవ్వరికై, నను నింద్రపదంబు గలిగెనా యనుచును న
మ్మును లడుగుటయును సూతుఁడు, వినిపింపఁ దొడంగె నిట్లు వేడుకతోడన్. 94

వ. దైత్యదానవు లెల్లరును జక్రపాణిచే వధియింపఁబడుటయు దేవత లందఱుంగూడి బద్ధాంజలులై యచ్యుతునిమ్రోల నిలువంబడి. 95

క. దేవా మహానుభావా, నీవలనను శత్రుభీతి నేఁడు దొలంగెన్
దేవతలకు నీకంటెన్, దైవ మెవఁడు గలఁడు త్రిభువనంబులయందున్. 96

క. త్రైలోక్యము నేలుటకున్, జాలినపుణ్యాత్ము నొకని స్వారాజ్యరమా
పాలకునిఁగ దయచేసి కృ, పాళూ మాయాపదలను బాపంగదవే. 97

క. అని యభ్యర్థించుటయును, జనార్దనుం డిట్టు లనియె సాధ్వస మొందన్
బనిలేదు మీకు సువ్రతుఁ, డనునొకవిప్రుం డధీశుఁ డగు దివమునకున్. 98

గీ. అతఁడు వైష్ణవతేజస్సమన్వితుండు, మత్పదాంభోజపరతంత్రమానసుండు
చిరము వైకుంఠమున నివసించినట్టి, పుణ్యవంతుఁడు త్రైలోక్యపూజితుండు. 99

క. సురలార నిర్భయంబుగ, నరుగుం డిఁక మీర లనుచు నావిబుధులకున్
వర మిచ్చి చూచె నదితిని, బరిసరమున నున్నలోకపావనచరితన్. 100

క. కనుఁగొనుటయు మాధవుఁ డా, వనజాయతనేత్ర భక్తవత్సల నానం
దనులకు లోపము గలుగునె, నెన రొప్పఁగ నీవు తోడునీడగ నుండన్. 101

గీ. కాని నామది నొకకోర్కి గలిగె నీవు, దాని నెఱవేర్పఁ దలఁచితి వేని నాకు
గర్భముననిన్నుసుతునిఁగాఁగాంచఁగలుగు,నట్టిభాగ్యంబుదయచేయుమంబుజాక్ష

—: విష్ణు వదితికి జన్మించునట్లు వర మిచ్చుట :—

క. అని యడుగుటయును హరి యి, ట్లనియెను నాయమకు దేవి యమరులకార్యం
బున కీవు మర్త్యదేహం, బును దాల్చెద వపుడు నేను బుట్టెద నీకున్. 103

వ. అది యె ట్లంటివేని ద్వాదశత్రేతాయుగంబునందు నిర్వక్రపరాక్రమంబున సర్వక్షత్రియవధంబు గావించి భూభారంబు నుద్ధరింప జమదగ్నిమహర్షి వలన నీగర్భంబునందుఁ బరశురాముఁ డనుపేరను జతుర్వింశత్రేతాయుగంబునందు సర్వదైత్యసంహారంబు గావించి ధర్మస్థాపనం బొనరింప రామభద్రుం డనుపేరను నష్టావింశద్వాపరయుగాంతంబునందు భూభారహరణార్థంబు వాసుదేవుం డను పేరను నీయుదరంబున జన్మింతు. 104

గీ. కాని యిప్పుడు దేవి నీగర్భమందుఁ, బుట్టఁగలఁ డింద్రుఁడుగ నొక్కభూసురుండు
దాని కంగీకరింపు మద్దాన నీకుఁ, గలుగుఁ గీరితి మూఁడులోకంబులందు. 105

క. అనవుడు సంతోషంబున, వనజాక్షున కెఱఁగి యదితి వచ్చినత్రోవన్
జనుదెంచి యింటి కి ట్లని, యెను బతి యగుకశ్యపునకు బుతుకాలమునన్. 106

ఆ. ప్రాణనాథ యింద్రపదపాత్రుఁ డైనత, నూజు నొకని నా కనుగ్రహింపు
మనుచు వేఁడికొనఁగ నామెమస్తకమున, హస్త ముంచి యిట్టు లనియె నతఁడు,

గీ. దానవులు గొంత చేరెంచి వానిదరికిఁ, జలుపఁ దొడఁగిరి భీషణస్వానములను
నేమి పాపమొ కాని యాసోమశర్మ, యంతరంగము సాధ్వసాక్రాంత మయ్యె.
క. ఆసాధ్వసంబుతోడనె, భూసురుఁ డసువులను విడిచిపుచ్చెను దానం
జేసి యొనగూడె నతనికి, నాసుర దేహంబు విధిని నగునే గడవన్. 85
సీ. అంత నాతఁడు హిరణ్యకశిపుం డనియెడి, నామంబు గలదైత్యనాయకునకుఁ
గమలాఖ్య యైనతత్కాంతయం దుదయించి, ప్రహ్లాదుఁ డనెడిపేరను జెలంగి
దేవాసురులకుఁ బ్రాప్తించినయనిలోన, నఖిలాత్మకుం డైనహరిని గాంచి
పూర్వజన్మజ్ఞానమును బొంది తనవృత్త,మంతయు నెఱిఁగించి యచ్యుతునకు
గీ. స్వామియీదైత్యకాయంబుసంహరించి, ననుఁగృతార్థునిఁ జేయుమీయనుచు వేఁడ
నపుడు కరుణాళు వగుటను నతనిశిరము, చక్రధారను ఛేదించెఁ జక్రపాణి.
ఆ. అటులు చక్రనిహతుఁ డగుటయుఁ బ్రహ్లాదుఁ, డతనికన్నతల్లి యైనకమల
పుత్రశోకభారమున వచ్చుకన్నీళ్లు, లేఱు లగుచుఁ బాఱ నేడ్వఁ దొడఁగె. 87
క. ఏలును బవళులు శోక, జ్వాలావృత యగుచు నామె శమియింపఁగ లో
నూలుకొనుచుండ సురముని, యాలోపల నరుగుదెంచె నాయమకడకున్. 88

—: సోమశర్మ ప్రహ్లాదుఁడుగాఁ బుట్టుట :—

సీ. అరుదెంచి నారదుం డాసాధ్వి నీక్షించి, సాహసం బొనరింపఁ జనదు నీకు
హరిభక్తుఁడై పుట్టి యతఁడు నీకడుపునఁ, బ్రహ్లాదుఁ డనెడుపేరనె యెసంగి
దానవకృత్యముల్ లేనివాఁడుగ నుండి, దేవభావంబునఁ దేజరిల్లి
సకలలోకప్రశంసాభాజనం బయి, యింద్రసింహాసనం బెక్కఁ గలఁడు
గీ. చాన యీమాట వెలిపుచ్చఁ జన దటంచుఁ, జెప్పి ధైర్యంబు గొలిపి యాశీలవతికిఁ
గానఁ బడకుండ రెండవకంటి కేఁగె, మరలఁ దా నేఁగుదెంచినమార్గముననె.
క. తరువాతఁ గొన్ని దివసము, లరుగుటయును గర్భ మొదవి యామెకుఁ బుట్టెన్
హరిభక్తుఁ డైనకొమరుఁడు, సురలు దివమునుండి కురియ సుమవర్షంబున్. 90
క. అమితాహ్లాదకుఁ డగుచును, నమితాహ్లాదమునఁ బుట్టినట్టికతన నా
కొమరునకుఁ బేరు వెట్టిరి, ప్రమాణవిదు లెల్లఁ గూడి ప్రహ్లాదుఁ డనన్. 91

—: ప్రహ్లాదుఁ డింద్రపదంబు నొందుట :—

క. జనియించిన దాదిగ నా, తనయుఁడు హరిపాదభజనతత్పరుఁ డగుచున్
గొనియె నృసింహానుగ్రహ, మున సకలసురాధిపత్యమును ద్రిదివమునన్. 92
క. శక్తుం డయ్యును నాతఁడు, సక్తుఁడు గాకుండ స్వర్గసామ్రాజ్యరమా
భోక్త యయి యుండె నన నిఁక, ముక్తిం గను టెంత యావిమోహాత్మునకున్.
క. అనుటయు మఱి యెవ్వరికై, నను నింద్రపదంబు గలిగెనా యనుచును న
మ్మునుల నడుగుటయును సూతుఁడు, వినిపింపఁ దొడంగె నిట్లు వేడుకతోడన్. 94

వ. దైత్యదానవు లెల్లరును జక్రపాణిచే వధియింపఁబడుటయు దేవత లందఱుం గూడి బద్ధాంజలులై యచ్యుతుని మ్రోల నిలువంబడి. 95

క. దేవా మహానుభావా, నీవలనను శత్రుభీతి నేఁడు దొలంగెన్
దేవతలకు నీకంటెన్, దైవ మెవఁడు గలఁడు త్రిభువనంబులయందున్. 96

క. త్రైలోక్యము నేలుటకున్, జాలినపుణ్యాత్ము నొకని స్వారాజ్యరమా
పాలకునిఁగ దయచేసి కృ, పాళూ మాయాపదలను బాపంగదవే. 97

క. అని యభ్యర్థించుటయును, జనార్దనుం డిట్టు లనియె సాధ్వస మొందన్
బనిలేదు మీకు సువ్రతుఁ, డనునొకవిప్రుం డధీశుఁ డగు దివమునకున్. 98

గీ. అతఁడు వైష్ణవతేజస్సమన్వితుండు, మత్పదాంభోజపరతంత్రమానసుండు
చిరము వైకుంఠమున నివసించినట్టి, పుణ్యవంతుఁడు త్రైలోక్యపూజితుండు. 99

క. సురలార నిర్భయంబుగ, నరుగుం డిఁక మీర లనుచు నావిబుధులకున్
వర మిచ్చి చూచె నదితిని, బరిసరమున నున్నలోకపావనచరితన్. 100

క. కనుఁగొనుటయు మాధవుఁ డా, వనజాయతనేత్ర భక్తవత్సల నానం
దనులకు లోపము గలుగునె, నెన రొప్పఁగ నీవు తోడునీడగ నుండన్. 101

గీ. కాని నామది నొకకోర్కి గలిగె నీవు, దాని నెఱవేర్పఁ దలఁచితి వేని నాకు
గర్భముననిన్ను సుతునిఁగాఁగాంచఁగలుగు,నట్టిభాగ్యంబుదయచేయుమంబుజాక్ష

—: విష్ణు వదితికి జన్మించునట్లు వర మిచ్చుట :—

క. అని యడుగుటయును హరి యి, ట్లనియెను నాఁడుమకు దేవి యమరులకార్యం
బున కీవు మర్త్యదేహం, బును దాల్చెద వపుడు నేను బుట్టెద నీకున్. 103

వ. అది యెట్లంటివేని ద్వాదశత్రేతాయుగంబునందు నిర్వక్రపరాక్రమంబున సర్వక్షత్రియవధంబు గావించి భూభారంబు నుద్ధరింప జమదగ్నిమహర్షి వలన నీగర్భంబునందుఁ బరశురాముఁ డనుపేరను జతుర్వింశత్రేతాయుగంబునందు సర్వదైత్యసంహారంబు గావించి ధర్మస్థాపనం బొనరింప రామభద్రుం డనుపేరను నష్టావింశద్వాపరయుగాంతంబునందు భూభారహరణార్థంబు వాసుదేవుం డను పేరను నీయుదరంబున జన్మింతు. 104

గీ. కాని యిప్పుడు దేవి నీగర్భమందుఁ, బుట్టఁగలఁ డింద్రుఁడుగ నొక్కభూసురుండు
దాని కంగీకరింపు మద్దాన నీకుఁ, గలుగుఁ గీరితి మూఁడులోకంబులందు. 105

క. అనవుడు సంతోషంబున, వనజాక్షుని కెఱఁగి యదితి వచ్చినత్రోవన్
జనుదెంచి యింటి కి ట్లని, యెను బతి యగుకశ్యపునకు బుతుకాలమునన్. 106

ఆ. ప్రాణనాథ యింద్రపదపాత్రుఁ డైనత, నూజు నొకని నా కనుగ్రహింపు
మనుచు వేఁడికొనఁగ నామెమస్తకమున, హస్త ముంచి యిట్టు లనియె నతఁడు,

క. చానా నీవు దలంచిన, సూనుఁడు నీగర్భమందుఁ జొచ్చును దీవ్రం
బై నతపం బొనరింపం, గా నగు ననుటయును నదితి గౌతుక మొదవన్. 108

—: సువ్రతుం డింద్రుండుగాఁ బుట్టుట :—

క. వనవాసము గావించుచుఁ, దనువు కృశింపంగ ధ్యానతత్పర యగుచున్
బొనరింపఁ దొడఁగెఁ దపమున్, దనగర్భము వర్ధిలుచుఁ గనంబడు చుండన్. 109

గీ. అటులువర్ష శతంబునింకుటయునొక్క, శుభముహూర్తంబుననుబుట్టెసుతుఁడొకండు
దివ్యకాయము భానుదీప్తియును విష్ణు, తేజము చతుర్భుజములును దేజరిల్ల. 110

సీ. కుసుమవర్షంబులు కురిసిరి దేవత, లమలంబు లయ్యె సంద్రములు నదులు
చెలరేఁగి మ్రోఁగె మంగళతూర్యనాదముల్, దీప్యమానము లయ్యె దిక్తటములు
పాటలు పాడి ర్రబముగను గంధర్వు, లాడిరి నాట్యము లప్సరసలు
సలిపి రాశీర్వాదములు సప్తఋషులును, గ్రహము లుచ్చైచ్ఛస్థానగతము లయ్యె

గీ. బ్రాహ్మణులు గూడి వేదమంత్రములచేతఁ, జక్కఁగా నొనరించిరి సంస్తవములు
ముజ్జగములును నాహ్లాదమున మునింగె, నవతరింపంగ సువ్రతుం డమరపతిగ.111

వ. బ్రహ్మవిష్ణుమహేశ్వరులును దేవతలును బృహస్పతియును గశ్యపుండునుం గూడి యక్కుమారునకు వసుదత్తుం డనియును వసుదుం డనియును నాఖండలుం డనియును బిడౌజుం డనియును బాకశాసనుం డనియును శక్రుం డనియును నింద్రుం డనియును నామకరణంబులు గావించి విధ్యుక్తంబు లగుసంస్కారంబు లెల్ల నొనరించి యొక్కసుముహూర్తంబున స్వర్గరాజ్యాభిషేకంబు గావించిరి. 112

గీ. అంత నాసూనుఁ డింద్రత్వ మంది విష్ణు, సంప్రసాదాగతాఖిలశక్తి యగుచు
వీర్యముననుదపంబున వీనికంటె, నధికుఁ డన్యుండు లేఁ డనుఖ్యాతి నొందె.113

క. అనుటయును సువ్రతునిప్రా, గ్జనికథ నాలింపఁ బారికాంక్షులు గోరం
గను సూతుఁ డమితహర్షం, బెనయఁగ వారలకుఁ జెప్ప నిట్లు దొడంగెన్. 114

—: సువ్రతుని పూర్వజన్మవృత్తాంతము :—

క. మునులార పూర్వకల్పం, బున రేవాతీరదేశమునయందును వా
మనతీర్థ మనెడిక్షేత్రం, బునఁ గౌశికకులజుఁ డొక్కభూసురుఁ డుండెన్. 115

ఆ. అతఁడు సోమశర్మ యనునామమును దాల్చి, తనకుఁ గలిగినట్టిధనవిహీన
తకును బుత్రహీనతకును లోలోపలఁ, బరితపించు చుండెఁ బ్రతిదినంబు. 116

ఆ. అతనిభార్య సుమన యనుసాధ్వి యొకనాఁడు, కాంతి లేనితన్ముఖంబుఁ జూచి
యార్య పాపహేతు వైనవిషాదంబు, గలుగ నీకు నేమి కతమొ చెపుమ. 117

క. అని యడుగుటయును గాంతా, మును మన మే మేమి పాపములు చేసితిమో
తనయులు లేమియు లేమియు, వినిహతుల నొనర్చె మనల వే తెమిటికిన్. 118

క. అని సోమశర్మ పలుకుట యును సుమన వచించె నిట్టు లోకమాటను నే
విని చెదను వినుము నాయెడ, ననుగ్రహం బొదవెనేని యనఘా నీకున్. 119

వ. లోభబీజంబును మోహమూలంబును నసత్యస్కంధంబును మాయాశాఖా
సమూహంబును దంభకౌటిల్యపత్త్రంబును గుబుద్ధిపుష్పంబును నృశంసతాగంధం
బును నజ్ఞానఫలంబును ఛద్మపాషండతాచౌర్యేర్ష్యాదిపక్షిగణంబును నధర్మఫల
రసంబును నశ్రద్ధాఋతుయుతంబును భావోదకసంవర్ధితంబును నగుసంసార
వృక్షంబునీడ నాశ్రయించి సంతసించుచుఁ బక్వంబు లగుతత్ఫలంబు లారగించుచు
నుత్కటం బగుతత్ఫలరసంబుం ద్రావుచు సంతృప్తుండై యుండునరుం డధోగతి
పాలగు. కావున. 120

క. ధనపుత్రకళత్రాదుల, ననిశంబును గోరుకొనుచు నాదుఃఖముతో
మునుఁగుచుఁ దేలుచు నుండెడి, మనుజునకు సుఖంబు లేశమాత్రముఁ గలదే.

వ. పితృమాతృపుత్రమిత్రకళత్రబాంధవధనంబులు దత్సంసారసంబంధంబు గల
వగుటం జేసి తద్వ్యామోహంబు విద్వాంసునకుం జెల్ల దని పలుకుటయు సోమ
శర్మ యామెతోడ ని ట్లనియె. 122

క. కలికీ సంసారమునకుఁ, గలిమికిఁ బుత్రాదులకును గలసంబంధం
బులు దెలుపు మెట్టివో యవి, తెలిసికొనం గోర్కి యుప్పతిల్లెడు నాకున్. 123

క. అనవుడు నాసుమ యి ట్లని, మెను నీ కెఱుఁగంగ రాని దే మున్నది యై
నను నీయానతిచొప్పున, విని చెద నా తెలిసినంత వినుము మహాత్మా. 124

—: నానావిధకుపుత్రస్వరూపనిరూపణము :—

వ. పుత్రులు ఋణానుబంధు లనియు న్యాసాపహారకు లనియు శత్రువు లనియుఁ
బ్రియు లనియు నుదాసీను లనియు ననేకభేదంబులు గా జనియించుచుందురు.
క్రమంబున నాపుత్రులసంసారధనసంబంధంబులు వివరించెద. 125

క. కొని ఋణము నెవఁడు తీర్పక, చనిపోవునో వాని కపరజన్మమునందున్
జనియించు నుత్తమర్ణుఁడు, తనయుఁడుగాఁ బూర్వదత్తధనము గ్రహింపన్. 126

సీ. పుత్రరూపంబునఁ బుట్టి వాని కతండు, బాల్యంబునం దాటపాటలకును
జవ్వనంబున సురాశాలలకును జార, కాంతలకును ద్యూతకారులకును
ధన మంతయును గూడ వినియోగ మొనరించి, వేశ్మభూముల నెల్ల విక్రయించి
యన్న మోరామచంద్రా యంచుఁ దలిదండ్రు, లేడ్చుచుఁ దిరుగంగ నేడిపించి

గీ. చచ్చిపోయిన వారికి శ్రాద్ధ మైనఁ, జలుపకుండఁగ నాస్తికాచారుఁ డగుచుఁ
బిదపఁ జను నప్పు గైకొని పెట్టినట్టి, కష్టము లనుభవింపక గడవఁ దరమె. 127

గీ. మఱియు ఋణమును దీర్పక మరణ మొంది, నట్టియధమర్ణులు ప్రదాతకపరజన్మ
మంను సుతులుగ జన్మించి యతనిఋణము, దీర్చికొని పోవుచుందురు తీఱినంత.

వ. ఇంక న్యాసాపహారకులవృత్తాంతంబు వివరించెద. 129

సీ. న్యాసంబు హరియించినట్టిమానవునకుఁ, బుట్టు న్యాసస్వామి పుత్త్రుఁ డగుచు
జనియించి దినదినంబును వృద్ధి నొందుచు, నల్లాదముద్దుగా నాడుకొనుచుఁ
జలుపుచు మధురభాషణములు చెవులలో, నమృతంబు చిలికించినట్టిపగిదిఁ
బరమభక్తిని గనంబఱుచుచుఁ బ్రేమంబు, వర్ధిల్లునట్టులు వర్తిలుచును

గీ. క్రమముగా న్యాస మెల్లఁ బ్రాణములు గొనిన
చాయను హరించి చచ్చు నల్పాయు వగుచుఁ
బుట్టు మరలను మరలను గిట్టు నట్లె
తాను గన్నదుఃఖము తలిదండ్రు లొంద. 130

సీ. నాతండ్రి పోతివే నాయయ్య పోతివే, యని తల్లిదండ్రులు వనరుచుండ
వారల వీక్షించి వాఁడు పక్కున నవ్వి, తలిదండ్రు లెవ్వరు తనయు లెవరు
మున్ను నాన్యాసార్థమును హరియించి నా, ప్రాణంబులను దీసినట్లు గాదె
యనుభవింపక తీఱునట్టిది గాదు గా, వించినకర్మ మేవేళ కైన

గీ. నొకరికి సుతుండఁ గాను నే నొకరు నాకుఁ, దల్లిదండ్రులు గారు నాధనము మీరు
మున్ను హరియించుటను నేను గొన్నవాఁడ, మరల నేఁ డని పల్కి క్రమ్మఱక పోవు.

వ. ఇంక శత్రుపుత్త్రులవృత్తాంతంబు వివరించెద. 132

గీ. వైరము వహించి బహువిధవ్యథలు పెట్టి,నట్టివారికి బాధితుం డాత్మజుఁడు గఁ
బుట్టి తలిదండ్రులను దిట్టి కొట్టి చంపి, తుదకుఁ జనుఁ బూర్వవైరంబు తొలఁగిపోవ.

వ. ఇంకఁ బ్రియపుత్త్రులవృత్తాంతంబు వివరించెద. 134

క. అనిశంబును నుపకారము, లొనరించుచు స్నేహభావ మొదవంగఁ గనుం
గొనువారికిఁ బ్రియసుతుఁడు గ, జనియించును నుపకృతుండు చచ్చినపిదపన్.

గీ. అట్లు సుతుఁడుగ నుదయించి యతఁడు దల్లి,దండ్రులను బ్రీతితోడ నాదరముతోడఁ
గొలుచుచునువాఁడమృతులైనఁ జలిపి తృప్తి,గలుగ వారికి శ్రాద్ధముల్ కడకుఁ బోవు.

వ. ఇంక నుదాసీనపుత్త్రులవృత్తాంతంబు వివరించెద. 137

గీ. మంచిపనిలోనఁ జేరక మాన్పకుండఁ, జెడ్డపని నూర కుండిన చేతనులకుఁ
బుట్టుచుందు రుదాసీనపుత్త్రులుగను, మంచిపనివారుఁ గీడ్పాటు గాంచువారు.

గీ. అట్లు వారలు పుట్టి పూర్వానుబంధ, మునను దలిదండ్రులకుఁ గష్టములను మాన్పఁ
గను సుఖంబులు చేకూర్పఁ గను నొకింత, యేనియును దోడుపడ రుదాసీను లగుట.

క. తలిదండ్రులు సతులును మి, త్త్రులు భృత్యులు బాంధవులును దురగంబులు నే
స్గులును బశువులును బుత్త్రుల, వలెనె నిజనిజానుబంధవర్తుల చూవే. 140

గీ. న్యాసము హరింప లేదు ఋణంబు చేయ
లే దొకనియొద్ద నొకని కీ లేదు ఋణము

స్నేహమును ద్వేషమును నుదాసీనతయును
లేదు మును మన కందుచే లేరు సుతులు. 141

గీ. మఱియు నొకమాట పూర్వజన్మంబునందు, నెవ్వనికిఁ గూడ నణుమాత్ర మేని ద్రవ్య
మీయ మైత్రిమి మన మదె హేతు వయ్యె, నాథ మనసాంప్రతికనిర్ధనత్వమునకు.

క. దత్త మగు నెడల వచ్చును, దత్తము గాకున్న నెట్లు దాపురమగు 'నా
దత్త ముపతిష్ఠతే' యని, వేత్తలు వచియించుమాట వితథం బగునే. 143

క. ప్రాప్తవ్యం బగు నెడలను, బ్రాప్తం బై తీఱు నది యనాయాసముగన్
బ్రాప్తవ్యము గానియెడన్, బ్రాప్తముగా దెదియు నెన్ని పాటులు పడినన్. 144

క. కావున దుఃఖము నుడుగుము, భావములోపలను శాంతి పాదుకొలుపుమీ
కేవలసాంసారికమో, హావిష్టులువోలె తగునె యగడుపడంగన్. 145

చ. అనుటయు నాతఁ డిట్లనియె నాయమకున్ దరుణీమతల్లి నీ
వనినది యెల్లఁ దప్పక యథార్థమ యైనను వంశవృద్ధి కా
సను వహియించుచుండెదరు సాధువు లేమి కతంబొ దానికిన్
వినిచెదవేని నాకు విన వేడుక యయ్యెడు నంచుఁ బల్కఁగన్. 146

—: సుపుత్రప్రాప్తిప్రకారకథనము :—

ఉ. ఆయమ చెప్పఁగాఁ దొడఁగె నాతని కిట్లు మహానుభావ నీ
శ్రేయము గోరి నేను వివరించెద నన్వయమున్ దరింపఁగాఁ
జేయుటకున్ సమర్థులు సుశీలురు శాశ్వత మైనపుణ్యమున్
జేయక యున్నచోఁ గలుగ నేరరు దుర్లభు లట్టిపుత్రకుల్. 147

గీ. సత్యధర్మరతుండును శాస్త్రవిదుఁడుఁ
బ్రాజ్ఞుఁడును జ్ఞానియును బితృభక్తిపరుఁడు
దాంతుఁడును శాంతుఁడును హరిధ్యానరతుఁడుఁ
దపసియును నగుపుత్రుఁ డుత్తముఁడు చూవె. 148

ఉ. చాలు సుశీలుఁ డైనతనుజన్ముఁ డొకండె ఋణానుబంధజుల్
వేలకువేలు పుట్టినను లేదు ఫలం బిసుమంత యేనియున్
దాలిచి వాని గర్భమునఁ దల్లి కృతార్థతఁ జెందుఁ దండ్రికిన్
మేలిమి గల్గు నట్టిగుణనీరధి పుత్రుఁడుగాఁ జనించుటన్. 149

గీ. పుణ్యమున నుదయించు సుపుత్రుఁ డొదవుఁ, బుణ్యమున శుద్ధవంశంబు పుణ్యమున నె
మంచిచావును మంచిజన్మమును గలుగుఁ, గానఁ బుణ్యంబె సౌఖ్యనిధాన మనఘ.

గీ. అనుటయును సోమశర్మ యాయమను గాంచి
పుణ్య మన నెట్టిదియొ వచింపుము లతాంగి

వినఁగ వేడుక గలిగెడు ననుడు నామె
యేరుపడునట్టు లతనితో నిట్టు లనియె. 151

—: పుణ్యావిర్భావప్రకార కథనము :—

గీ. బ్రహ్మచర్యతపోయజ్ఞపంచకములు, శౌచ మస్తేయమును నహింసయును శక్తి
మర్ష మునుదానమునునియమమునున నెడి, యంగములచేతధర్మోదయంబుగలుగు.

క. తనయభ్యుదయమునకు సా, ధన మగునాతని కొసంగు ధర్మము పుణ్యం
బును బుణ్యముచేతను నై, కొనుచుండు నతండు దాను గోరిన దెల్లన్. 153

క. అనుటయు ధర్మము నెవ నై, నను జూచినవారు గలరె నళినాయతలో
చన చెప్పు మనుచు వాంఛిం, చిన నాయమ వాని కిట్లు చెప్పఁ దొడంగెన్.

—: ధర్ముఁ డత్రిపుత్రులకు సపరివారముగాఁ బ్రత్యక్ష మగుట :—

సీ. అత్రినందనులు దత్తాత్రేయుఁ డనియును, దుర్వాసుఁ డనియును దొల్లి గలరు
ధర్మస్వరూపంబు దర్శింపఁగా నెంచి, వా రిద్దఱును నిరాహారు లగుచుఁ
బదివేలవర్షముల్ పంచాగ్నిమధ్యంబు, నను జలమధ్యంబునను వసించి
యతిఘోరముగఁ దపం బాచరించినను బ్ర, త్యక్షంబు గాదయ్యె ధర్మమూర్తి

గీ. యంత దుర్వాసుఁ డధికకోపారుణాక్షుఁ, డగుచు శపియింపనుండ నయ్యవసరమున
ధర్మము మహీసురాకృతి దాల్చి వచ్చె, సపరివారంబు గాఁగఁ దత్సవిధమునకు.

క. చనుదెంచి యత్రిపుత్రునిఁ, గనుఁగొని మునివర్య తపము గావించుచుఁ జె
ల్లునె యాగ్రహంబు చెందఁగఁ, గొన నగునె తపఃఫలంబు క్రోధాంధులకున్.

క. అనుటయు దుర్వాసుం డి, ట్లనియెను నీ వెవఁడ విచటి కరుదేరంగాఁ
బని యేమి వీర లెవ్వరు, వినిపింపుము క్రోధగాథ వినిచెదఁ బిదపన్. 157

వ. అనుటయు ధర్ముం డాతని కి ట్లనియె. 158

సీ. బ్రహ్మచర్యం బిదె రాసుతుం డీబ్రాహ్మ, ణుండు సత్యం బిద్విజుండు దపము
దాన మీబాపఁడు దమ మీద్విజన్ముఁ డీ, సర్వంసహాసుధాశనుఁడు నియతి
యీబాడబుఁడు శౌచ మీసాధ్వి శుశ్రూష, క్షమ యీలతాంగి యీకాంత శాంతి
ప్రజ్ఞ యీతల్లి యీపంకజాక్షి యహింస, శ్రద్ధ యీతన్వి యీచాన మేధ

గీ. యీమె దయ నాకు జనయిత్రి యేను ధర్ముఁ
డనెడివాఁడను నీక్రోధ మపనయింప
నరుగుదెంచినవార మే మందఱమును
మానికులదీప నీసన్నిధానమునకు. 159

—: దుర్వాసుఁడు ధర్మునకు శాపం బిచ్చుట :—

క. అనవుడు దుర్వాసుం డి, ట్లనియెను నాక్రోధ మార్ప నగునే నీకున్
జను మిప్పుడు కనఁబడితివె, కనులకుఁ బదివేలయేండ్లు గడచినపిదపన్. 160

క. ఇప్పటి కైనను గోపం, బుప్పతిలినమీఁదఁ గాదె యొకవేను మాపైఁ
దప్పనిపనిగ ననుగ్రహ, మప్పా మోఘముతె బ్రాహ్మణామర్షంబుల్. 161
క. అని పలికి నీవు దాసీ, తనయుఁడవు గ సుఖము లేనిధరణీపతివి గాఁ
గను జండాలుండవు గను, జనియింపు మ టంచు మూఁడు శాపము లిచ్చెన్.
వ. అనుటయు సోమశర్మ యాశ్చర్యంబు నొంది తన్వీ యాపయిని ధర్ముఁ డేమయ్యెఁ
దద్వృత్తాంతం బెఱింగింపు మని యడుగుటయు నాయమ యాతని కి ట్లనియె.
గీ. పుట్టెను యుధిష్ఠిరుం డనుభూపతిగను, భరతవంశంబునను వీరబాహుఁ డనెడి
శ్వపచుఁడుగను హరిశ్చంద్రనృపతి నేప, దాసికిని విదురుఁడుగను ధర్ముఁ డనఘ.
గీ. అనుటయును సోమశర్మ యి ట్లనియె దేవి, బ్రహ్మచర్యాదు లెల్ల ధర్మమున కుదయ
సాధనము లంటి వానిలక్షణము లేవొ, తెలుపుమా నాకు నీ కవి తెలిసె నేని.
వ. అని యడుగుటయు నప్పతివ్రతామణి యాతని కి ట్లనియె. 166

—: బ్రహ్మచర్యాదిస్వరూపనిరూపణము :—

సీ. వదల కుంటయు నిజవంశసదాచార, మును నిత్యమును సత్యముననె రతియు
ఋతువేళలనెయాత్మసతిఁగూడుటయు నన్య, కాంతపైఁగామంబు గలుగమియును
బ్రహ్మచర్యంబు నాఁబడు గృహమేధికి, నుంఛవృత్తియును బరోపకృతియుఁ
గామకోపంబులు లేమియు నాచార, మును బ్రహ్మచర్యంబు వనగతునకు
గీ. ధ్యాననిష్ఠయు జ్ఞానవర్తనముఁ బాప, విముఖతయును సతీసంగవిముఖతయును
సత్యదమవృత్తియును బ్రహ్మచర్యముగను, యతికిఁ జెప్పంగఁబడియె మహానుభావ.
క. పరకాంతాలౌల్యంబును, బరధనకాంక్షయును లేక పలికిన దెల్లన్
బరమార్థంబు గ నుండుటె, పరగును సత్యంబు నాఁగఁ బావనచరితా. 168
గీ. అన్నము జలంబు వసనంబు నాసనంబు
ఛాయయును శయ్యయును బ్రదేశమును దుదకుఁ
దృణము నేనియు నాదర మెనయఁ బ్రతిది
నమును బాత్రుల కిడుటె దానము మహాత్మ. 169
గీ. అన్వహము దేవతాబ్రాహ్మణార్చలందు, దానధర్మంబులందు వ్రతంబులందు
నఖిలలోకోపకారకార్యంబులందు, నిలుక డను దాల్చి యుండుటె నియతి యనఘ.
గీ. పరులు నిందించినను గోపపడక యుంట, కొట్టినను గొట్టుటకుఁ బూనుకొనక యుంట
తొక్కటము లెన్ని వచ్చినఁ దోఁణకకుంట, క్షమయటంచు వచింతురు శాస్త్రవిదులు.
క. చలిపెడిస్నానాచమనం, బులవలన విరాగభావమున లోపలనున్
వెలుపలను గలుగుశుద్ధియె, యలరారును శౌచ మనెడియభిధానమునన్. 172
క. తన కుండినట్లె యన్యుల, కును గల దని బాధ యెంచికొని తృణమున కై
నను గ్లేశము గలిగింపని, యనువున నుండుటె యహింస యనఁబడు ననఘా.

క. భూతములకుఁ దనవలనన్, గాతర్యం బించుకేని గలుగనిభంగిన్
రాతిరియును బవలును సం, ప్రీతిని మెలఁగుటయె శాంతిపేరను బరఁగున్. 174

క. పరకాంతాపరధనముల, హరియింపక యుండు టొకఁడె యస్తేయ మనం
బరగును దమ మనఁ బరగును, జరియించెడియింద్రియములజన మడఁచుటయే.

క. తనయెడలను దేశికునకు, ననుగ్రహము గల్గునట్టు లతఁడు నియోగిం
చినపను లెల్లను జేయుచు, నునికియె శుశ్రూష యనఁగ నొప్పు మహాత్మా.

గీ. సాంగముగ నున్నధర్మంబు నాశ్రయించి, నట్టినరునకు ధర్మమే యఖిలసౌఖ్య
ములను నిహపరములలోనఁ గలుగఁ జేసి, కట్టకడకు భవాంభోధిగట్టుఁ జేర్చు.

చ. అనుటయు సోమశర్మ ముదితాననుఁడై సతి నీకు నీకథన్
వినిచినవార లెవ్వ రని వేడుకతో నడుగంగ నామె యి
ట్లనియెను బ్రాణనాథ చ్యవనర్షి యనన్ విని యుందు తండ్రి యా
యనఘుఁడు నాకు బాల్యమున నాతఁడు నన్నెడఁబాయ కుండెడిన్. 178

గీ. అట్టు లెడఁబాయ కుండ నన్నతఁడు పోవు, నాశ్రమములకు దేవతాయతనములకుఁ
గూడఁ దోడ్కొనిపోవు నాకును వివేక, మొదవున ట్లట్టు లుండంగ నొక్కనాఁడు.

గీ. కౌశికాన్వయజాతుఁ డొక్కండు వేద
శర్మ యనుబ్రాహ్మణుండు విషాదతప్తుఁ
డగుచు నొకచోట నుండఁగా నతనిఁ గాంచి
యడిగె మాతండ్రి యిది యేమియయ్య యనుచు. 180

గీ. అడుగుటయు వేదశర్మ యి ట్లనియెఁ దండ్రి, యేమి చెప్పుదు నావంశ మింతతోడ
నంతరించుచు నుండె లేఁ డర్భకుండు, పితరులకు దుర్గతులను దప్పించువాఁడు.

క. అని చెప్పుచుండ నచటికిఁ, జనుదెంచెను సిద్ధుఁ డొకఁడు చనుదెంచినయా
తనికి సభక్త్యుపచారము, లొనరించిరి వేదశర్మయును మాపితయున్. 182

ఆ. అట్టు లుపచరించి యార్తికారణమును, వినిచి రాతనికిని విని యతండు
ధర్మసేవనంబె తగుమందు దీనికి, ననుచు ధర్మగాథయును వచించె. 183

క. ఆకథను వింటి సిద్ధుని, వాకున నాఁ డిపుడు చెప్పవలసినకతనన్
నీకు వచించితి నింతియు, కాక మఱొక్కరికిఁ జెప్పఁగా లేదు సుమీ. 184

ఉ. అంతట వేదశర్మ స్వగృహంబునకుం జని ధర్మసేవ న
త్యంతము శ్రద్ధతోఁ జలిపి యాత్మజులన్ ధనధాన్యసంపదల్
వింతగఁ జెందె నట్టులె ఫలింపవె నీకును నీప్సితార్థముల్
చింతిల నేల ధర్మము భజింపు మనుద్యమమున్ ద్యజింపుమీ. 185

—: ధార్మికులజన్మమరణములు :—

గీ. అనుటయును సోమశర్మ యి ట్లనియె సాధ్వి, ధర్మ సేవ యొనర్చినధార్మికులకు
జన్మమృత్యువు లెట్టివి సంఘటిలునో, తెలుపుమీ నాకు విన< గుతూహలముగ లిగె.

చ. అనుటయు నామె యి ట్లనియె నాతనితోడను ధర్మ సేవనం
బొనరిచినట్టివారలకు నుత్క్రమణం బగుకాలమందు మే
కొనదు శ్రమంబు తాప మొనగూడదు కల్గదు తృష్ణ సంభ్రమం
బెనయదు స్వేదకంపనము లేర్పడ వుండదు క్లేశ మేదియున్. 187

—: పుణ్యమరణస్థానములు :—

వ. అగ్నిగృహంబునను గోష్ఠంబునను దేవాలయంబునను నారామంబునను నశ్వస్థానంబునను గజస్థానంబునను నశ్వత్థవటాశోక బ్రహ్మవృక్షశ్రీవృక్షచూతవృక్షసాన్నిధ్యంబునను దేవబ్రాహ్మణసన్నిధానంబునను రాజగృహంబునను రణభూమియందును మరణంబు ప్రాప్తించెనేని పుణ్యలోకంబులు గలుగుం గావున నట్టి పుణ్యస్థలం బేదేని యవసానకాలంబున ధర్మాత్ములకుఁ దటస్థం బగు. ఆప్రదేశమున నెలకొని. 188

గీ. చేయుచును బరమేశ్వరచింతనంబు, ననుభవించుచు నానంద మాత్మలోన
నామహాపుణ్యధను లనాయాసముగను, గదలుదురు బ్రహ్మరంధ్రమార్గంబునుండి.

గీ. అంత సురదూత లరుదెంచి యమృతమునను, దీర్ఘమాడించి వారిని దేవయాన
మునను గూర్చుండఁగాఁ బెట్టికొని స్తవంబు, లాచరించుచుఁ గొనిపోదు రమరపురికి.

క. చనుదెంచువారి కెదురుగఁ, జని ధర్మసమేతుఁ డగుచు శక్రుఁడు కావిం
చినకర్మమునకుఁ బ్రతిఫల, మనునట్టు లొసంగు దేవతాకారములన్. 191

క. దేవత లయి వారలు సం, భావింపంబడుచుఁ ద్రిదశపరివారముచేఁ
గావించినపుణ్యము సరి, పోవువఱకు నుందు రమరపురమున నంతన్. 192

క. జనియింతురు వారలు భువి, ననవద్యము లైనయన్వయములందుఁ బురా
తననిజధర్మానుగ్రహ, మున మరలను గూడ ధర్మమునె సేవింపన్. 193

—: పాపిష్ఠులజన్మమరణములు :—

గీ. అనుటయును సోమశర్మ యి ట్లనియెఁ దన్వి, పాపములు చేయువారలు పడయునట్టి
జన్మమరణంబు లెట్టిలక్షణము గలవొ, తెలుపుము సవిస్తరంబుగాఁ దెలిసెనేని.

వ. అని యడుగుటయు నావివేకవతీమతల్లి యాతని కి ట్లనియె. నాథా మలమూత్రదూషితం బగుదేశంబునను జండాలవాటికయందును గర్దభాదు లుండెడిప్రదేశంబునను వేశ్యాగృహంబునను నస్థిచర్మనఖకేశావృతం బగుస్థానంబునను బాపవంతు లాక్రమించినచోటను నాస్తికపూరితం బగు స్థలంబునను బాపిష్ఠులకు మరణంబు ప్రాప్తించు. అట్టిసమయంబున. 195

గీ. భీషణాకారులును గ్రూరభావములును, సర్పహస్తులు వికృతలోచనులు దీర్ఘ
జిహ్వులును నీలవర్ణులు సింహముఖులు, కుటిలగాత్రులు నగుయమభటులు రాఁగ.

క. వారలను గనుంగొని హా, హారావము లెసఁగ నేడ్చు రాపాపులు చే
కూర నెడ భయము నేనుల, నూరఁగఁ జెమ్మటలు గనుల నొడియఁగ ధారల్.

వ. మఱియును.

క. చలిపినప్రాణావ్యాఘుంబులు, పిలపిల వెతెంచి కంఠబిలమున కడ్డై
నిలిచి కఫాకారంబున, నలయిక గలిగించి నొంచు నాపాతకులన్. 199

క. ధనగృహకాంతాదులపై, నెనసిన మోహంబు విడిచి యేఁగఁగ లేమిన్
జనకుండ నిలువ లేమిని, వనటదు రరిఁ బద్ధకపులవలె నాపాపుల్. 200

గీ. తెలివి వచ్చినయపు డెల్లఁ దలఁచికొనుచు, నాత్మపరివారమును దమయార్జనమును
దెలివి దప్పినయట్టివేళలను నెల్ల, విస్మరించుచుఁ గుడుతురు వెతలు వారు. 201

గీ. అట్టు లాపాతకులు బాధ లనుభవించు, చును శరీరాభిమానంబు చననికతన
బ్రతికియుండినయట్టివారలును జచ్చి, నట్టివారును గాక యల్లాడు చుండ. 202

గీ. అట్టిదుర్భరసమయమునందు రేఁగి, యమభటులు గాలములను దేహములనుండి
వారలను బైకి లాగి దుర్వారముగను, బాఱిపోకుండ బిగియించి పాశములను.

వ. నోటఁ బట్టరానితిట్టులం దిట్టుచుఁ గశాగదాదండంబులఁ గొట్టుచుఁ బరశువుల నఱకుచుఁ గుంతంబులఁ బొడుచుచు ముష్టిజానువులఁ గ్రుమ్ముచుఁ బాదంబుల మట్టుచుఁ గంటకప్రదేశంబులందును ద్వాదశాదిత్యసంతప్తమార్గంబులందును బర్వతశిఖరంబులందును నీహారస్థానంబులందును బడ వైచి యీడ్చికొనిపోయి యంతకునియంతికంబున నిలుపుదురు. 204

గీ. గాసివడి పూర్ణముగఁ గళాకాంతు లుడిగి
నిలువఁబడియున్న యాపాతకులకు నెదుటఁ
గానఁబడు నంతకుఁడు మృత్యుకల్పుఁ డగుచుఁ
బ్రళయకాలానలోజ్జ్వలత్ప్రభలతోడ. 205

క. ఆతనిఁ గనుఁగొని భయమునఁ, జేతంబులు చెదరి విగతచేతను లగునా
పాతకుల నపుడె నారక, యాతనలం గుడుప శమనుఁ డాజ్ఞాపింపన్. 206

వ. యమకింకరులు తదాజ్ఞ శిరంబులం దాల్చి నానావిధాయుధపాణులై కట్టెదుట నిలువంబడి కటికవారలం జూచి బిట్టఱచుగొఱ్ఱియలచందంబున హాహారావంబులం జేయుచుండునాపాతకుల నీడ్చికొనిపోయి తత్తత్పాతకానుగుణంబు లగు నానావిధనరకయాతనలం బడ వైచి సహస్రయుగంబులు గడచువఱకును వేచుచుందురు. పిదప నాపాపులు భూలోకంబున స్థావరజన్మంబులం దాల్చి క్రమంబుగాఁ గీటకక్రిమిపక్షికాదిజన్మంబులును శునకరాసభమార్జాలసూకరసర్పవ్యాఘ్ర

పతత్త్రిముఖజన్మంబులును జంబూలభిల్లపుళిందాదిజన్మంబులును బడయుదురు. 207

చ. అనుటయు సోమశర్మ వనజానన నీవు వచించినట్టి దె
ల్లను వినినాఁడ నాకు సుతలాభము గల్గకయున్న మానసం
బునకు సుఖంబు లే దెటులు పుత్త్రుఁడు గల్గునొ సత్వరంబుగా
వినిచెదవేని నాహృదయవేదన యాఱు నటంచుఁ బల్కుడున్. 208

వ. ఆయమ యాతని కిట్లనియె. 209

క. అనఘా సుతకాంక్ష భవ, న్మనమునఁ దీవ్రముగ నుండెనను శీఘ్రమునన్
జనుము వసిష్ఠునియంతిక, మున కాయనఘుం డుపాయమును బోధించున్. 210

చ. అనుటయు సోమశర్మ సరయంబున జాహ్నవి కేఁగి తత్తటం
బునఁ దప మాచరించుచును బొల్చువసిష్ఠునకున్ బ్రణామముల్
పొనరిచి నిర్ధనత్వమును బుత్త్రవిహీనతయున్ ఘటిల్లఁగాఁ
దనకు నిదాన మేమొ ప్రణిధానమునన్ వచియింప వేడినన్. 211

—: దారిద్ర్యపుత్త్రానుత్పత్తి హేతుకథనము :—

వ. అమ్మహాముని యాతని కిట్లనియె. 212

సీ. బ్రాహ్మణోత్తమ పూర్వజన్మంబునను నీవు, జన్మించితివి శూద్రజాతియందు
కలిగిరి నీకు లక్షణయుక్తు లగుపుత్త్రు, లనుకూల యైనయర్ధాంగియందు
కృషిపశుపాలనాకృత్యంబులను దప్ప, నితరధర్మముల నీ వెఱుఁగ వైతి
ధాన్యంబు దధిపయస్త్రక్రాజ్యములు విక్ర,యించి యార్జించితి వెంతొ ధనము
గీ. కట్టితివి చిన్నిపోయినపుట్టములను, బెట్టితివి భూమిలో లంకెబిందియలను
నడిగినను గొడుకుల కేని పడఁతి కేని, చివర కైనను నీగుట్టు చెప్ప వైతి. 213

క. హరి యని యొకనాఁ డేనియుఁ, బొరపాటున నైన ననకపోతివి నోటన్
విరచింపవైతి వెపుడును, నొరులకు నొక్కించు కేని యుపకారంబున్. 214

గీ. ఒరుల కొక గవ్వ యైన ము న్నొసఁగ కున్న, కతన నీనాఁడు ద్రవ్యంబు గలుగదయ్యె
లేమి ననుబంధములు పుణ్యమామతిలమిఁ, గలుగదు కుపుత్త్రులునుసుపుత్త్రులునునీకు.

గీ. అనుటయును సోమశర్మ యిట్లనియె ననఘ, పూర్వజన్మంబునను నెట్టిపుణ్యమేని
యేను గావింప కుండిన నెట్లు గలిగె, నీభవంబున బ్రాహ్మణ్య మిది వె చెపుమ. 216

క. అనుటయు వసిష్ఠుఁ డిట్లని, యేను వానికి నొక్కపుణ్య మిావు పరేచ్ఛన్
బొనరించితి పూర్వము దా, నను బ్రాహ్మణ్యంబు నీకు నాయన కలిగెన్. 217

గీ. అనుటయును సోమశర్మ మహాత్మ నేను, బూర్వమున నొనరించినపుణ్య మేమొ
దాని నొనరింపఁ జేసినధన్యు లెవరొ, తెలుపు మని దోసిలొగ్గి ప్రార్థించుటయును.

వ. వసిష్ఠమహర్షి యాతని కిట్లనియె. 219

—: బ్రాహ్మణ్యోత్పాదకపుణ్యకథనము :—

సీ. హరిభక్తుఁడైన బ్రాహ్మణుఁ డొక్కరుఁడు మున్ను, గావించుచును దీర్ఘసేవ లెల్లఁ
చేయుచు భూప్రదక్షిణము దైవికముగా, నీ వున్నయూరికి నేఁగుదెంచె
నది విని నీపుత్రు లర్ధాంగియును ద్వాద, దృష్టవశమునఁ బ్రేరేప నిన్ను
నీ వేఁగి యతనిసన్నిధికిఁ బ్రార్థించి తో, డ్కొనివచ్చి వాని నీగోష్ఠమందు
గీ. నునిచి సకలపదార్థము లొసఁగి చేసి, నాఁడ వుపచారములు మఱునాఁడు విష్ణు
శయనదిన మయ్యె నీచేత సముచితముగ, నతఁడు చేయించె హరిదినవ్రతము నాఁడు.
క. కావించితివి వ్రతంబును, గావించితి ద్వాదశిని సఖండముగా భూ
దేవసమారాధనమును, గావున బ్రాహ్మణ్య మిపుడు గలిగెను నీకున్. 221
క. ఆరాధింపుము హరిని ద, దారాధనమునను దొలఁగు నఘ మెల్లను జే
కూరును సకలార్థములును, నారాయణుఁ డొకఁడె దిక్కు నాకును నీకున్. 222
చ. అనుటయు సోమశర్మ చరితార్థుఁడ నైతిని నీయనుగ్రహం
బున ననుచున్ వసిష్ఠునకు మ్రొక్కి గృహంబున కేఁగుదెంచి మా
నిని కెఱిఁగించి సర్వమును నేను దపం బొనరింపఁ బోదు నా
కనుమతి యిమ్ము సాధ్వి యన నాయమ నేనును వత్తు నం చనన్. 223
సీ. ఆయమతోఁ గూడి యతఁ డేఁగి నర్మదా, కపిలానదీసమాగమమునందు
స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లొనరించి, కూరుచుండి తదీయతీరమందు
జపియింపఁ దొడఁగె నిశ్చలమనంబున ద్వాద, శాక్షరమంత్రంబు హరిని గూర్చి
యటు జపించుచు నుండునవసరంబున వాని, కంబుజాక్షుండు ప్రత్యక్షమయ్యె
గీ. నంత నాతఁడు పెన్నిధి యబ్బినట్లు, సంతసము చెందుచును మహాస్తవ మొనర్చె
దానికి జనార్దనుండు ముదంబు నొంది, కోరుకొనుమయ్య తీర్తు నీకోర్కె లనియె.
గీ. అనుటయును సోమశర్మ యాహ్లాద మెనయఁ, ద్వత్పదాంభోజభక్తిచిత్తమున నెపుడుఁ
బాయకుండఁగ దారిద్ర్యబాధ దొలఁగ, సత్సుతుఁడు గల్గఁ గరుణింపు జలజనయన.
వ. అని వేఁడుటయు. 226
గీ. అటులె యగుఁగాక యని మీఁద నచ్యుతుండు, వాని కిహమున దుఃఖంబు లేనియట్లు
కొనకు వైకుంఠపదము చేకూరునట్లు, వరము లిచ్చి యగోచరత్వంబు నొందె.
ఉ. అంతట సోమశర్మ సఫలాశయుఁడై తనకాంత కెల్లవృ
త్తాంతముఁ జెప్పుచున్ నిజగృహంబునకున్ జనుదెంచె నంతలో
వింతగ ధాన్యరాసులును వెండియు రత్నములున్ సువర్ణముల్
గాంతులు మిన్ను ముట్టఁగను గ్రాలుచు నుండె గృహాంగణంబునన్. 228
క. అది చూచి మహాశ్చర్యము, గదురఁగ నాద్విజుఁడు విష్ణుకారుణ్యముచే
నొదవినఫల మిది యనుకొని, ముదమున ధర్మములు చేయ మొనసెను దావన్.

క. నెలకొల్పెను దేవాలయ, ముల నిల్పెను ధర్మసత్త్రముల విద్యాశా
లల నేర్పఱించెఁ బుణ్యాం, బలవడియెడిపనుల నెల్ల నాతఁ డొనర్చెన్. 230

ఉ. అంతట సోమశర్మ ముద మందఁగ గర్భము దాల్చెఁ దన్మనః
కాంత క్రమంబునన్ గడవఁగా దినముల్ నెలలున్ జనించె భా
స్వంతుఁడువోలె నొక్కతనుజన్ముఁడు దీప్తులు దిక్తటంబులన్
గంతులు వైచుచున్ ద్రిభువనంబులఁ గూడను మేలుకొల్పఁగన్. 231

గీ. ఆముహూర్తంబుననె చతురాననుండు, సురలతోఁ గూడి మేదిని కరుగుదెంచి
యక్కుమారునకు సువ్రతుఁ డనెడిపేరు, వెట్టి వేంచేసె సంతోష ముట్టిపడఁగ.

వ. తదనంతరంబు సోమశర్మ యక్కుమారుని భగవదంశసంభూతునిఁగా భావించి తదావిర్భావంబునఁ దనవంశం బంతయుం బావనం బయ్యె నని మిగుల నానందించుచుఁ దజ్జన్మోత్సవప్రయుక్తంబు లగుదానధర్మంబు లనేకంబులొనరించెనంత.

క. ప్రతిపచ్చంద్రుఁడువలె నా, సుతుఁ డభ్యుదయంబు నొందుచును హరిపై నిన్
మతి నిలిపి పూర్వజన్మా, గతవాసనచేత ముదము గాంచుచు నుండెన్.

క. అనిశముఁ దదేకచింతన, మును గావించుచును లోకమును గనుగొనుచుం
టను వానికిఁ గానంబడు, జనార్దనుం డఖిలవస్తుసంఘములందున్. 235

క. అరుదెమ్ము కృష్ణ పోదమె, గరుడధ్వజ పలుక వేమి కమలాక్ష హరీ
పరువెత్తు మనుచు నాడును, బరమానందమున నతఁడు బాలురతోడన్. 236

క. చదువకయె సువ్రతునకున్, విదితము లైపోయె నఖిలవిద్యలు గూడన్
జదువుల కెల్లను నెల వగు, చదు వనఁబడువిష్ణుభక్తి సమకూరుటచేన్. 237

వ. అంత నాసువ్రతునకు గర్భాష్టమవర్షంబు చేకూరుటయు సోమశర్మ యుపనయనంబు గావించి క్రమంబున వివాహంబు చేసె. 238

క. అంతట సువ్రతునకు స, త్సంతానము గలిగెఁ గలిగె సంతానము ద
త్సంతతికిఁ గలిగె దానికి, సంతతి యతిముదము సోమశర్మకుఁ గలిగెన్. 239

వ. అట్లు బహుకాలంబు సుఖంబుగా గతించుటయు నారాయణుండు వారలకుఁ బరలోకసుఖంబు ప్రసాదింప నెంచి నిజధ్యానపరాయణచిత్తవృత్తియై తీవ్రసమాధి నున్నసువ్రతునకుఁ బ్రత్యక్షంబై మహానందంబు గలిగించి మాతాపితృకళత్రసహితంబుగా నాతని వ్యోమయానం బెక్కించుకొని నిజధామంబునకుం జనియె. అంత. 240

ఆ. వార లెల్లఁ గూడి వైకుంఠమున నుండి, విపులసౌఖ్య మనుభవించు చుండఁ
గశ్యపునకుఁ బుట్టి కాంచె నింద్రత్వము, సువ్రతుండు విష్ణుచోదనమున. 241

వ. అని వచించుటయు మహర్షులు సూతునితో ని ట్లనిరి. 242

ఆ. అనఘ పూర్వజన్మమునవాసనను జేసి, ప్రాప్తమయ్యె విష్ణుభక్తి సువ్ర

తునకు నంటి సువ్రతునిపూర్వజన్మవృ, త్తాంత మెఱుకపఱుపుమయ్య మాకు.
వ. అనవుడు సూతుఁడు వారల కిట్లనియె. 244
క. మునులార మీరు ప్రశ్నిం, చినవిధమున వ్యాసుఁ డడుగ సృష్టికరుని న
మ్మునికిఁ బితామహుఁడు వచిం, చినమాటలె మీకు నేను జెప్పెద వినుఁడీ.
సీ. వైదిశం బనెడియాహ్వాయము గల్గినయట్టి, పుర మొకం డుండెను భూతలమున
దానికి రుక్మాంగదక్షితీంద్రుఁడు ఋతు, ధ్వజునిపౌత్రుం డుండె వల్లభుఁడుగఁ
గల దావసుంధరాతలవల్లభునకు సం, ధ్యావళి యనియెడిధర్మపత్ని
యాదేవియందు ధర్మాంగదుఁ డనియెడు, కొడు కుద్భవించె నాక్షోణిపతికి
గీ. తండ్రియభిలాషమునుదీర్పఁదలఁచియతఁడు, తనశిరంబిచ్చె మోహినియనెడిచెలికి
శ్రీనివాసుఁడు మెచ్చి తచ్ఛీలమునకు, వాని వైకుంఠమున నుంచె మేనితోడ.
గీ. అటులు ధర్మాంగదుండు సహస్రసమలు, నిండువఱకును నుండి యానెలవునంద
క్షీణ మగుటయుఁ బుణ్యంబు క్షోణియందు,సోమశర్మకు జనియించె సువ్రతుఁడుగ.
మ. అనుచున్ వ్యాసుఁడు బ్రహ్మ కిట్లనియె దేవా మున్ను ధర్మాంగదుం
డనుజేఁ డొక్కరుఁ డింద్రుఁడై కృతయుగంబం దుండె సృష్ట్యాదిలో
నని పెద్దల్ వచియింతు రీనృపుఁడు వాఁడా కానిచో నన్యుఁడా
వినిపింపంగదె నామనంబు విన నువ్విళ్ళూరెడుం నావుడున్. 248
వ. అమ్మునీంద్రునకుఁ బద్మోద్భవుం డిట్లనియె. నాయనా దినంబులును వారంబు
లును బక్షంబులును మాసంబులును ఋతువులును సంవత్సరంబులును యుగం
బులును మన్వంతరంబులును గల్పంబులును బోవుచు వచ్చుచు నుండునట్లు
కల్పాంతంబులందు వేదంబులును స్మృతులును బురాణంబులును దేవతలును
బ్రాహ్మణులును మున్నగుసచరాచరప్రపంచంబు లన్నియును నేనును నారా
యణునియందు లయంబు నొందుచుఁ గల్పాంతరంబులందు నారాయణునివలన
యథాపూర్వంబుగా మరల నావిర్భవించు చుందుము. ఆసమయంబున రామా
ద్యవతారపురుషులును ధర్మోత్తరు లగుయయాతినహుషాదిమహీపాలురును
మహాత్ము లగుమన్వాదులును నింద్రపదంబు నధిష్ఠించు చుందురు. తత్ప్రకారం
బునఁ బూర్వకల్పంబునం దింద్రపదంబు నధిష్ఠించినధర్మాంగదుండ యీకల్పంబు
నందు సువ్రతుండుగా నవతరించినధర్మాంగదుం డని యెఱుంగునది. 249
క. అనుటయు వ్యాసుఁడు సంతస, మును జెంది విరించిబోధమునకున్ దదను
జ్ఞను బడసి నిజనివాసం, బున కేఁగె నటంచుఁ జెప్పి ముగియించుటయున్.
వ. అమ్మహర్షులు సూతునితో ని ట్లనిరి. 251
గీ. సృష్టివిషయంబుఁ జెప్పితి చిత్రముగను, సనఘ సృష్టము లైనపదార్థములకు
నాధిపత్యంబు వహియించినట్టివార, లెవ్వ రెవ్వరో వచియింపు మెఱుకపడఁగ.

ప్రాపంచికాధిపత్యనిరూపణము :—

క. అనుటయు సూతుం డా తపో, ధనులకు ని ట్లనియె నర్థ్మాతనుబట్టి విరిం
చనుఁ డీయఁ దొడఁగె రాజ్యము, లను దాపసులార వారలకు వారలకున్.

వ. మానవులకుఁ బృథువును వృక్షంబులకును బ్రాహ్మణులకును గ్రహంబులకును నక్షత్రంబులకును యజ్ఞంబులకును దపంబులకును ధర్మంబులకును జంద్రుండును దీర్థంబులకును దోయంబులకును రత్నంబులకును వరుణుండును యక్షులకుఁ గుబేరుండును నాదిత్యులకు విష్ణువును బుణ్యంబులకు దక్షప్రజాపతియును దైత్య దానవులకుఁ బ్రహ్లాదుండును బితృలోకంబునకు యముండును యక్షరాక్షస పిశాచోరగకంకాళకూశ్మాండాదిభూతంబులకును బేతాళాదిభూతాధిపతులకును మృత్యుంజయుండును బర్వతంబులకు హిమవంతుండును నదులకును దటాకంబులకును గూపంబులకును బుష్కరతీర్థంబును గంధర్వులకుఁ జిత్రరథుండును నాగములకు వాసుకియును సర్పములకుఁ దక్షకుండును వారణంబుల కైరావతంబును నశ్వంబుల కుచ్చైశ్శ్రవంబును బక్షులకు గరుత్మంతుండును మృగంబులకు సింహంబును గోవులకు గోవృషంబును వనస్పతులకుఁ బ్లక్షంబును బూర్వదిక్కునకు వైరాజపుత్రుం డగుసుధన్వుండును దక్షిణదిక్కునకుఁ గర్దమప్రజాపతి పుత్రుం డగుశంఖపదుండును బశ్చిమదిక్కునకు వరుణప్రజాపతిపుత్రుం డగుపుష్కరుండును నుత్తరదిక్కునకు నలకూబరుండును బితామహాదేశంబున నాధిపత్యంబులు వడసి సప్తద్వీపముద్రితం బగుపృథివీచక్రంబు నిప్పటికిని ధర్మంబునం బాలించు చుండిరి. 254

—: దనువు దితికిఁ బుత్రనాశముం దెలుపుట :—

వ. అది య ట్లుండఁ గశ్యపునిభార్యలలో నొక్కతె యగుదనువు పుత్రశోకాభి తప్తమానసయై తనసపత్ని యగుదితికడ కరిగి కంట జలజలఁ గన్నీరు గార్చుచు నేడ్చుచుండ దితి యామెం జూచి. 255

సీ. చెలియలా యేల యేడ్చెదు చెప్పుమమ్మ, యొక్కపుత్రుండు గలిగినయువిద లెల్ల
భాగ్యవతులుగ నుండ నీపాప మేమి, సుతశతంబును గాంచినసుదతి వీవు.

గీ. అధికబలవీర్యధైర్యసమన్వితాత్ము, లైనదానవవరు లసంఖ్యాకు లాత్మ
జన్ము లయి నీకు రెండుపార్శ్వముల నుండ, నేమి లోపంబు గలదు నీ వెద్ద నతివ.

చ. అనుటయు నామె యి ట్లనియె నాదితికిన్ జలజాక్షి యేమి చె
ప్పను విధియోగమున్ మనసపత్ని మనోరథ మెల్లఁ దీరెఁ ద
త్తనయుఁడు స్వర్గరాజ్యమును దాల్చె భవత్సుతులున్ మదీయనం
దనులును జక్రిచేత నిధనంబును జెందిరి యుద్ధభూమిలోన్. 258

క. తన వేఁడిమిచేఁ దృణముల, ననలము దహించినట్లు లస్మత్సుతులన్

వనజాక్షుఁడు చక్రముచే, వినిహతులను జేసె మనము విధిహతలము గాకా.

క. సమరము దేవాసురులకు, సమకొనఁగా నేల యందు శౌరికి నాక్రో
శము గలుగ నేల యసురులె, సమయంగా నేల యెట్టిశాపమొ యకటా. 260

క. అని విలపించుటయును దితి, విని వెంటనె పుత్రశోకవిహ్వలమతియై
తనయులఁ జేరొ్కనుచును గొ, ల్లున నేడువఁ దొడఁగె గుండెలో దడ పుట్టన్.

—: సుతశోకసంతప్త యగుదితికిఁ గశ్యపుఁడు జ్ఞానోపదేశముం జేయుట :—

సీ. అటు లేడ్చుచున్న యర్ధాంగి నీక్షించి ధై, ర్యమున ని ట్లనియెఁ గశ్యపమహర్షి
సుదతి యీవిధమున శోకింపఁ జెల్లునె, సర్వంబు దెలిసినసతివి నీవు
సంసార మనునింద్రజాలంబునను నేమి, సంబంధ మున్నది జంతువులకుఁ
దలిదండ్రు లెవ్వరు తనుజన్ము లెవ్వరు, భర్త లెవ్వరు చూడ భార్య లెవరు

గీ. తనయులైతిరి మీరలు దక్షునకును, భార్యలైతిరి నాకు నీభవమునందు
మేమమున్నెవ్వరమొమున్ను మీర లెవరొ, యింక మీఁదట నెవ్వరికెవరొ యేమొ.

క. నీతనుజన్ములధర్మము, చేతను హతులైరి చింత సేయకు మెదలో
నాతీ పుణ్యము శోకము, చేతను నశియించు దానఁ జేడ్పా టొదవున్.   263

క. తమకావించినదుష్క, ర్మమె నాశనహేతు వయ్యె మనతనయులకున్
రమణీమణి గోవిందుఁడు, నమరులును నిమిత్తమాత్ర మంతియ సుమ్మా.

క. తననాఁటినబీజమునకు, ననువుగఁ గర్షకుఁడు ఫలము నందునటులె నీ
తనయులు చేసినకర్మం, బునకుం దగినట్టిఫలముఁ బొందిరి కలికీ.   265

క. దురపిల్లరు పరులకునై, పరమార్థజ్ఞాన మున్న పండితులు గృహో
దరి చెఱుపక యుండునె యె, వ్వరిపాపము వారి నేల వగచెదు చెపుమా.

—: పరమాత్మ జీవభావము నొందుట :—

సీ. వనజాక్షి పరమార్థమును నీకు నెఱిఁగింతు, విను మొకనిమిషంబు వీను లొగ్గి
కలఁ డాత్మ యనఁగ నొక్కఁడు సర్వమయుండు, సర్వశక్తియుతుండు సాత్త్వికుండు
కలిసి జ్ఞానధ్యానములతోడ నాతండు, తిరుగుచుండె వివిక్తదేశమందు
నటు లుండ నొక్కనాఁ డతని కేగురు దైవికముగఁ బ్రజ్ఞానిధుల్ గానఁబడిరి

గీ. యంతటను వారిఁ గనుగొని యాతఁ డిట్టు, లనియె జ్ఞానంబుతోడ నీ వరిగి వారి
చెంతకుఁ దదీయమైనవృత్తాంత మెల్ల, నెఱిఁగికొని రమ్ము నా జ్ఞాన మిట్టు లనియె.

క. స్వామీ నీ వతిశుద్ధుఁడ, వేమాత్రము గూడ మచ్చ యెనయనివిద్వ
ద్గ్రామణివి వారితోడను, నేమి ప్రయోజనము నీకు నెఱుఁగం జెపుమా.   268

క. అనుటయును నాత్మ యి ట్లని, యెను జ్ఞానమ వారితోడ నేను సఖిత్వం
బును నెరపఁ దలఁచినాఁడను, గనుఁగొన వారలను గౌతుకం బేర్పడఁగన్.

చ. అనుటయు జ్ఞాన మి ట్లనియె నాత్మకు దేవర వారు దుష్టవ
వర్తనులు తదీయసంగమము తప్పక చేటొనగూర్చుఁ గాన నీ
వనుకొనినట్టియాశయ మసాయకరం బనుచున్ బ్రబోధముం
గని మది నాత్మ యుండె నవికారుఁడు గాఁగను నాగహారకర్. 270
ఉ. అప్పుడు వార లేగుదను నాత్మను గన్గొని వేఁడు చూడఁగా
గొప్పగుణంబు లేర్పడినకోవిదుఁ డంచును దోఁచె వినితో
నిప్పుడు మైత్రి మాకు ఘటియిల్లఁగఁ జేయు మటంచు బుద్ధితోఁ
జెప్పిన నామె యాత్మకడఁ జేరి వచింపఁ జొడంగె నీవిధిన్. 271
క. దేవా నీసుగుణములకు, భావంబున మెచ్చి నిన్నుఁ బరమాప్తునిఁగాఁ
గావించుకొనెడితలఁపున, నీవేళను నేఁగుదెంచి రేగుడు మూర్తుల్. 272
ఉ. వారలు తత్త్వసూపు లనివార్యమహామహిమాన్వితుల్ జగ
ద్ధారకు లూర్జితాశయులు త్వద్విమలాకృతి నేఁడు గాంచుటన్
గోరిరి నీసఖిత్వమును గూర్చుటకున్ నను మీకు మీకుఁ జే
కూరినచెల్మి లోకములకున్ శుభదం బగు నంచు వచ్చితిన్. 273
క. నను బుద్ధి యని వచింతురు, జను లెల్లరు మీకు మీకు సఖ్యము చేకూ
రిన స్వర్ణమునకుఁ బరిమళ, మొనగూడుటె యనుచుఁ జెప్ప నొప్పదె యనఘా.
క. ధ్యానము నిన్నుం జెఱుచును, జ్ఞానము నీకంతరంగశత్రువు వీనిన్
మానినయెడ ని న్నపరిమి,తానందాంబుధిని నోలలార్తురు వారల్. 275
చ. అనుటయు జ్ఞాన మి ట్లనియె నాతనితోడను దీనిమాటలన్
వినకుము వారిస్నేహము వివేకము నంతను రూపుమాపి ని
న్ననిశము గర్భవాసనిరయంబునఁ ద్రోయును దేవ లోకమం
దును నెటువంటివారికిని దుస్సహవాసము మేలు గూర్చునే. 276
క. ధ్యానమును నేనుఁ బోదుము, కానంబడకుండ నీమకనులకు నాయ
జ్ఞానులు నీకడఁ జేరిన, హీనులు గలచోట నిలుతురే మతిమంతుల్. 277
క. అని పలుకుటయును బుద్ధిని, గనుఁగొని యి ట్లనియె నాత్మ కల్యాణి చిరం
తనమిత్త్రము లగుజ్ఞానం,బును ధ్యానము నిపుడు విడిచిపుచ్చుట తగునే. 278
క. జ్ఞానధ్యానము లనఁగా, హానిం బడనీక నన్ను ననుపదమును బ్ర
హ్మానందవార్ధిఁ దేల్చుచుఁ బ్ర, ధానసుహృన్మణులు వానిఁ దగునే విడువన్. 279
క. కావున వారలతోడం, గావింపఁగ మైత్రి మనసు గలుగదు సాకున్
నావుడు మతి తనవచ్చిన, త్రోవం జని తెలిపె వారితో నావిధమున్. 280
క. ఆవృత్తాంతము విని యా, యేవురుఁ జని యాత్మకడకు నీశ్వర విని నీ
పావనగుణములు చెలిమిన్, గావింపఁ దలంచి వచ్చినారము నీతోన్. 281

ఆ. మ మ్మెఱింగి యెఱిఁగి మామహిమంబుల, నొసఁగవలయు మాకు నుత్తరంబు
నని వచించుటయును నాత్మ దన్మహిమము, లెఱుఁగఁ దలఁచి వారి కిట్టు లనియె.
క. మీ కున్నశక్తి గుణములు, నాకడ వచియింపుఁ డిపుడు నాహృదయంబున్
గైకొనియెనేని యవి మిముఁ, జేకొందును నేను మైత్రి చేకూరంగన్. 283
గీ. అనుటయును నాకసం బిట్టు లనియె నపుడు, స్వామి బాహ్యాంతరావకాశముల నెల్ల
నావరించి వసింతుఁ గాయమున నేను, నేను లేకున్న లోకముల్ నిలువ లేవు.
క. నాకుఁ గలగుణము శబ్దం, బాకర్ణించుటకు శ్రుతుల నాత్మభటులఁ గాఁ
జేకొంటిఁ బేరుకొనియెద, రాకాశ మటంచు నన్ను నామ్నాయవిదుల్. 285
గీ. అనుటయును వాయు వి ట్లనియెను మహాత్మ, భువనముల నెల్ల నేన నిల్పుదును నన్ను
వాయు వని పిల్చెదరు నాప్రవర్తనంబు, సర్వలోకప్రవర్తనసాధనంబు. 286
క. నేను శుభాశుభకర్మని, దానంబుగ స్పర్శగుణముఁ దాలిచి ప్రాణా
పానవ్యానోదానస, మానాఖ్యల నొంది మేన మసలుచు నుందున్. 287
గీ. అనుటయును వహ్ని యి ట్లనియెను మహాత్మ, నేను దీపించుచును మేనిలోన నుండి
నడుపుదును దేహయంత్రంబు నాదుభటులు, నయనములు రూపమంతయు నాగుణంబు.
క. వెలుపల లోపలఁ గూడను, గలిగినద్రవ్యములు గాంచఁగాఁ గలుగుట నా
వలనను గాక మదన్యుల, వలనను ఘటియిల్ల దేను వైశ్వానరుఁడన్. 289
క. అనుటయును సలిల మి ట్లని, యెను దేవ శరీరమందు నేను నివాసం
బొనరింతు నమృతరూపము, నను బుట్టి ఘటిల్ల సలిలనామము దానన్. 290
క. నావలన నిలుచు భువనము, లేవేళను నేను లేనియెడల నశించున్
గావున నె నాకు రసమును, గావించె నజుండు గుణము గాఁగ మహాత్మా. 291
గీ. అనుటయును భూమి యి ట్లను నాత్మతోడ, నయ్య నఖలోమచర్మమాంసాస్థిరూప
మునను నే నుందుఁ దనువునఁ దనువు నిలుచు, నావలన నాగుణంబు గంధంబు చూవె.
క. భూమి యని పేరు వడసితి, స్వామీ నే నఖిలలోకజాలంబునకున్
ధామ మయి యుండెదను నా, సామర్థ్యము గూడ దేనె చాటుకొనంగన్. 293
క. అనుటయుఁ దోడనె యచటికిఁ, జనుదెంచి వచించె నాస స్వామి సుగంధం
బును నొసఁగుచు దుర్గంధం, బును దొలఁగించుచును గాయమున నే నుందున్.
క. స్వామీ నాసిక యనియెడు, నామము గలదాన నేను నాకుం బ్రభు వీ
భూమి యిరువురము గూడన్, స్వామిహితంబునకె కాంచినారము భవమున్.
క. అనుటయును నరుగుదెంచి ర, సన యి ట్లనియెను బ్రభూ రసజ్ఞ యనెడిదా
నను నేను జలము నాదొర, తనువున కర్పింతు షడ్విధం బగురసమున్. 296
క. అనుటయు నేతెంచి విలో, చనంబు లి ట్లనియె మేము చక్షువులము మే
ననె యుండి జ్వాలనభటులము, గను రూపంబులను నెల్లఁ గనియెద మనఘా.

క. అనుటయును వచ్చి త్వచ మి, ట్లనియెను స్పర్శంబువలన నరయుచు నెల్లన్
దనువున కావరకము గాc,గను నే నుండెదను స్వామికార్యంబునకై. 298
క. శీతాతపవర్షాద్యు, త్పాతభయం బుడిపి మేను పాలింతును నే
వాతమునకుc జెలి యనువి, ఖ్యాతిం గయికొంటిc జర్మ మనియెడిదానన్. 299
క. అనుటయును వచ్చి శ్రుతు లి, ట్లనియెను దేవా వసింతు మనిశము దేహం
బున మేము స్వామికార్యం, బునకు గ్రహించుచును శబ్దపుంజము లెల్లన్. 300
క. మేము శ్రవణంబు లనియెడి, నామమునను గీర్తికెక్కి నానావిశ్వ
క్షేమమునకు మాప్రభు వగు, వ్యోమముతోc గూడి వెలయుచుందుము దేవా.
క. అనుటయును వచ్చి మతి యి, ట్లనియెను నానిర్ణయమున నన్నియుc గాయం
బును నడపు నేను బుద్ధిని, నను విడనాడినను సర్వనాశనమ ప్రభూ. 302
క. అనుటయును గర్మ మేతెం, చినదై యి ట్లనియె నేనె చేటునకును మే
లునకును బ్రేరణకర్తను, ననుc బిలుతురు దేవ కర్మనామముతోడన్. 303
క. అనుటయును నాత్మ యి ట్లని, యెను వింటిని మీప్రభావ మెల్లను నామై
త్రిని మీర లేప్రయోజన, మున కాసించితిరొ వినcగ మోదము గలిగెన్.
చ. అనుటయు వార లిట్టు లని రందఱు మే మొకcడైనచో జనిం
చును నొకపిండ మందుc బరిశుద్ధుcడ వీవు ప్రభుండవై వసిం
చినc ద్వదనుగ్రహంబున వసింతుము మేమును నందె స్వామి నీ
కనిశముc బాదసేవకులమై భవదీయహితంబు గోరుచున్. 305
క. అనుటయు జ్ఞానధ్యానము, లనఘా నీబోటివాని కర్హము గా దీ
పని యనుచు నెంత వారిం,చినను వినక యాత్మ పరవశీకృతుc డగుచున్.
క. వారలచెలిమికి నంగీ,కారం బొనరింప నపుడె గర్భస్థితి చే
కూరెను రాగద్వేషా, ద్యారంభంబునను నాత్మ కాశ్చర్యముగన్. 307
ఆ. పూతిగంధయుక్తమును మలమూత్రాది, కలుషితమును నైనగర్భమందు
నుండ లేక చెంత నున్నభూతములను, జూచి యాత్మ యేడ్వc జొచ్చె నిటులు.
క. అకటా మీమాటలు విని, వికలాత్ముcడ నైతి నెంత వెఱ్ఱినొ పంచా
త్మకులార మీకు న్యాయమె, యకపటమతి నైననన్ను నల్లాడింపన్. 309
క. నిస్సంగుcడ నగునను మీ, దుస్సంగము గూర్చె గర్భదుర్గతిలోనన్
డస్సితిc గ్రుస్సితి వ్రస్సితి, నిస్సీ యీయిడుమ దాcట నెట్టులు నేర్తున్. 310
క. అని విలపించుచు నుంటయుc, గనుcగొని తత్త్వంబు లాత్మగతిని మహాత్మా
మనెదవు చిరకాలము గై, కొనెదవు రాజ్యంబు నోర్చుకొనుమీ యార్తిన్.
క. నీవు మహాప్రభుcడవు నిను, సేవించెద ముండి మేము సేవకులము గా
దేవా గర్భనివాసము, గావించెడికాల మల్పకాలమ నీకున్. 312

క. గర్భము పూర్ణము గాఁగనె, నిర్భయముగ బయటఁ బడెదు నీ వేడ్వంగా
నర్భకుఁడవె నిలుచునె నీ, యార్భాటముక్రింద జగము లటుపైని ప్రభూ. 313
క. అనుటయును నాత్మ క్లేశం, బును సైఁపఁగ లేక గర్భమునునుండి పలా
యన మొనరించెడియత్నం, బొనరింపఁగ నయ్యె గర్భ ముచ్చ్వాసము గాన్.
గీ. అంత నాత్మ యధోముఖుఁ డగుచు మోహ
జాలమునఁ జిక్కి గదలఁగాఁ జాల కునికి
గర్భమునయంద యుండి యిక్కట్లు పడుచు
మూర్ఛిలుచుఁ దెప్పిఁదేలుచును మొత్తుకొనుచు. 315
శా. అమ్మా జ్ఞానము నీనుడుల్ వినమి నే నల్లాడుచున్నాఁడ గ
ర్భమ్మందుం బడి దిక్కు లేదు దరిఁ జేర్పన్ నన్ను నీకంటె రా
వమ్మా నాయపరాధముల్ సయిఁపుమమ్మా తాళలేనమ్మ భూ
తమ్ముల్ చేసినబోధముల్ వినుటచేతన్ హాని నా కేర్పడెన్. 316
క. అని మొఱపెట్టుటయును గనుఁ, గొని జ్ఞానము దరికిఁ జేరికొని యిట్లనియెన్
మును నే నెంత వచించిన, వినవైతివి స్వామి దైవవిధి యిటు లుంటన్. 317
గీ. వినదానికి వగచి కార్యంబు లేదు, ధ్యానమును వేడికొను మిట్టితరుణమందు
గర్భనరకవిముక్తి సౌఖ్యము గ నీకుఁ, గలుగుటకు నింతకంటె మార్గంబు లేదు.
వ. అని వచించుటయు. 319
గీ. ఆత్మ దానను గొంత ధైర్యము వహించి, ధ్యానమును వేడుకొనియె నాధ్యానమప్పు
డరుగుదెంచి తదంతికమందు నిలిచె, నతనిచిత్తంబునకు సౌఖ్య మావహిల్ల. 320
క. తదనంతర మాతఁడు తన, యెద జ్ఞానము ధ్యానమును వహించి విరాగం
బొదవఁ దనుస్మృతి లేమిని, గదలక వసియించె సుఖముగా గర్భమునన్. 321
ఆ. అట్టు లుండి గర్భమందు సుఖంబుగా, నెదను దలఁచికొనియె నిట్టు లతఁడు
కలిగె నాకు నిట్టికష్ట మీపాడుదే, హంబునందుఁ జొచ్చినట్టికతన. 322
క. జ్ఞానధ్యానంబులు నా, కానందము గొలిపె నిట్టియవసరమున నే
వీని విడనాడువాఁడను, గా నింకను నెట్టిప్రళయకాలమునందున్. 323
ఆ. గర్భనిరయముక్తి గలిగినతోడనే, యీనికృష్టతనువు నేను విడిచి
నశ్వరంబు గానినాయాత్మసుఖమున, ననుదినమును నోలలాడుచుందు. 324
క. అని యీవిధమునఁ జింతన, మొనరించుచు నుండఁ బ్రసవ మొనరుటకు జనిం
చినప్రాజాపత్యానిల, మున వేదన యొదవె గర్భమున నొకనాఁటన్. 325
క. ఆవేదన సంక్షోభము, గావింపఁగ నాత్మ కతఁడు గ్లానిం బడి మూ
ర్ఛావివశుఁ డగుచు నెట్టులొ, దైవవశంబునను భూమితలమునఁ బడియెన్. 326

వ. అట్లు భూస్పర్శంబు గలిగినమాత్రంబున నయ్యాత్మను ప్రాజాపత్యానిలంబు జ్ఞానధ్యానంబులతోడ వేఱుపఱిచె. 327

గీ. అంతటనుబంచభూతసహాయుఁడగుచు,ధ్యానమునుజ్ఞానమునుగూడనతఁడుమఱచి తగులువడియెను మోహబంధంబునందు, జాలమున మీను చిక్కిన చందమునను.

గీ. అంత దినదినమును మోహ మాక్రమింపఁ
గార్యము నకార్యమును గూడఁ గాంచ లేమిఁ
గుడుచుచును మలమూత్రముల్ గొన్ని నాళ్లు
గ్రుమ్మరుచు నాటపాటలఁ గొన్ని నాళ్లు. 329

గీ. ఒప్పిదము గానిపనులు చేయుచును దుదకుఁ
గడపి బాల్యంబు నెట్లొ యిక్కట్లతోడ
నతఁడు యౌవనమును జెంది యతివ యనుచు
సుతు లనుచు గేహ మనుచును వెతలఁ బడుచు. 330

క. కామక్రోధాదిమహా, వ్యామోహములందుఁ జిక్కి యటు నిటుఁ గదలం గామిని బంకనిమగ్నత, యామతిలినవృషభమట్లు లారట మొందెన్. 331

గీ. అంత వార్ధకమును జెంది యాత్మ వ్యాధు,లకును నాధులకును వికలత్వ మొంది మానభంగదురాశాభిమానములను,నిహతుఁ డగుచును నేప్చుచు నహరహంబు.

గీ. కాంచె నొకనాఁడు దైవయోగమున నొకని,నంబరము లేక తిరుగు చున్నట్టివాని సంగవర్జితుఁ డగువాని శాంతుఁ డైన, వాని దేహాభిమానంబు లేనివాని. 333

క. కని యతని నాత్మ గతమతి, నినుఁ జూడఁగ నాకుఁ దోఁచె నిర్లజ్జుఁడ వం చును లేనియెడల నెవఁ డై,నను నీవలె నున్నవాఁడె నరుఁ డీపుడమిన్. 334

క. జనులు వృద్ధలు యువతీ, జనులును వర్తించుచోట సందేహము నీ మనమున నుంతయుఁ గలుగక, యనావృతుఁడ వగుచు నుండ నగునే నీకున్.

గీ. అనుటయును వీతరాగుఁడిట్లనియెనతని,కెవ్వరమునగ్నులముచూడనెఱుఁగఁబడదె జ్ఞానవసనంబు దాల్చిన నేనొ లేక,పురుషమర్యాద నెఱుఁగనినరుఁడ వీవొ. 336

గీ. అనుటయును నాత్మ వీతరాగునకు నిట్టు, లనియె సర్వజ్ఞ పురుషమర్యాద యనఁగ నేమొ వచియింపు మనుటయు నిట్టు లనియె, నాతనికి వీతరాగుఁ డాహ్లాద మొదవ.

గీ. ఎన్ని సుఖదుఃఖములు లభియించు చున్నఁ, గలఁగకుండఁగఁజిత్తంబునిలిపికొనుచు నుండవలయును విషయవశుండు గాక,యాస్థితియ సూవె పురుషమర్యాదయనఁగ.

క. ఉండెడివాఁ డొక్కఁడ యయి, యుండఁగ వేఱొండు గలుగ నుండెడిత్రప కె వ్వం డగు లక్ష్యము మతిమం, తుండవు నీ కేదియేని తోఁచినఁ జెపుమా. 339

క. ఉండు నసంఖ్యాకములుగ, నుండెడు దేహములలోన నొకజీవుఁడె చం ద్రుం డొకఁడె వివిధజలఘట, షండంబులలోన నుండుచాయను జగతిన్. 340

క. సతిదేహము నజ్ఞానుల,పతనమునకు సృష్టిచేసె బ్రహ్మ కచకుచా
కృతివిభవంబులతోడను, నతని కది వినోద మెఱుఁగఁ డజ్ఞుఁడు దానిన్. 341
క. తెలిసినపురుషుఁడు కచకుచ, ములకున్ లోఁబడఁడు ప్రకృతిపురుషులలోనన్
గలుగమి భేద ముపాధుల, వలనఁ గలుగుభేద మరయ వాస్తవ మగునే. 342
క. దానను బురుషుం డనినను, జాన యనిన నొకటె లజ్జ జనియించునొకో
చానవలనఁ బురుషునకున్, జానకుఁ బూరుషునివలన సత్యము గనినన్. 343
క. కుమ్మరి మృత్పిండము చ, క్రమ్మున నిడి చేసినట్లు ఘటముల విధి లో
కమ్ముల సృజించె నవి క్షణి, కమ్ములు నిత్యములె లజ్జ గలుగఁగ వానన్. 344
క. అటు గానియెడల భూతము, లెటఁ జూచిన నుంట లజ్జ నెవఁడైనను జెం
దుట గలిగెనె జగమున నె, చ్చటనేనియు వానివలనఁ జర్చించితివే. 345
క. బలహీనలును జరావ్యా, కులలును వళియుతలు నైనగోతుల మూఢుల్
పిలిచెదరు వృద్ధ లని వృ, ద్ధలె వారలు వారివలనఁ ద్రప యేమిటికిన్. 346
గీ. జ్ఞానమున సంతతము వర్ధమాన యగుచు, జీవునిఁ ద్యజింపకుండ వసించునట్టి
యొకసుమతి గాక యువతి యింకొకతె యగునె,కలుగునే తోలుబొమ్మలవలనలజ్జ.
క. మేనులనె చెంది యాత్మ, స్థానములుగ జ్ఞానమును నొసంగుచు నెపుడున్
మానవుల నోము చేతన, యా ననియెడిమాత గాక యన్యలె మాతల్. 348
క. కరుణావిరహితహృదయాం,తర లగుచును నరుల గర్భనరకములోనన్
దొరలుచుమాతలు మాతలె, పరార్థవిదుఁ డేల సిగ్గుపడు వారలకున్. 349
చ. అనుటయు నాత్మ యిట్లనియె నాతనితోడను స్వామి నామనం
బునఁ గలతాప మంతయును బోయె భవద్వచనామృతంబు నా
నినత్రుటిలోన నన్ను భవనీరధిమగ్నుని నుద్ధరింప వ
చ్చినవిధి వీ వెవండవు వచింపుము నాఁగను నాతఁ డిట్లనున్. 350
క. కామక్రోధాదులు నా, సామీప్యంబునకు రావు స్వచ్ఛుఁడఁ గర్మ
వ్యామోహము నన్నంట ద,నామయుఁడను వీతరాగుఁ డనియెడివాఁడన్. 351
క. నాకుఁ గలఁ డొక్క భ్రాత వి,వేకుం డనువాఁడు వానివిధముం దెలియం
గాక భువనంబు లన్నియుఁ, జీకా కగుచుండె నేమి చెప్పఁగ వలయున్. 352
క. అనుటయును నతని కిట్లని,యెను నాత్మ మహాత్మ నా కొకించుక నీ వా
తనిలక్షణంబు చెప్పుము, కనికరము జనించెనేని కరుణార్ద్రునిపై. 353
క. అనుటయును వీతరాగుఁడు, తనమనమున నొక్కక్షణము ధ్యానించి వివే
కునిఁ బిలిచె నాత్మయెడఁ దన, కొనరినయుద్ధరణబుద్ధి యుద్రేకింపన్. 354
వ. అంత,

సీ. క్షమ శాంతి యనియెడిసహధర్మచారిణు, లుభయపార్శ్వంబులఁ దొప్పుచుండ
ధీధారణ లనుపుత్రికలు మహోత్సాహ, మనువారిధిని నోలలార్చుచుండ
సత్యధర్మము లనుసచివులు జాగరూ, కతతోడ నెడ లేక కాచుచుండ
యోగం బనెడితనయుండు మోక్షం బను, గురువును సౌఖ్యంబు గొలుపుచుండ
ఆ. నిష్పరిగ్రహుఁడును నిరహంకృతియు నిరా, శుఁడును ద్వంద్వవిరహితుఁడును నిర్మ
లుఁడును సుగుణభూషణుఁడును నైనవివేక, చక్రవర్తి వచ్చె సత్వరంబ. 355
క. చనుదెంచి వీతరాగునిఁ, గనుఁగొని యిట్లనియె నేమికతమున రావిం
చినవాఁడవొ నను సోదర, యనుటయును వివేకునకును నతఁ డిట్లనియెన్. 356
క. కనుము పురస్థితుఁ డగునీ, తని నాత్మ యితండు పంచతత్త్వములవశం
బునఁ జిక్కి దిక్కు గానక, వనరుచు నున్నాఁడు దీనవత్సల వింటే. 357
క. అనుటయు వివేకుఁ డాత్మను, గనుఁగొని యిట్లనియె నేమి కంటివి సౌఖ్యం
బును సంసారంబున నీ, వనఘా వచియింపు మనుడు నతఁ డిట్లనియెన్. 358
ఆ. స్వామి మొదట గర్భవాసంబునను మహా, దుఃఖ మనుభవించి తుదకు నెట్లొ
పడితి భూమిమీఁదఁ బడ్డది మొదలుగాఁ, గాంచినాఁడ నష్టకష్టములను. 359
క. ఒకనాఁ డైనను నాకున్, సుక మనియెడిమాట లేదు సొలసితి సాంసా
రికనానావిధదుఃఖ,ప్రకరంబులలోనఁ జిక్కువడి మిక్కిలిగన్. 360
క. జననీజనకులమరణం,బును నర్ధాంగులవియోగమును సుతులలయం
బును నర్థనాశమును గ, ల్గెను జిత్తము చెడియె మేను క్షీణం బయ్యెన్. 361
గీ. చచ్చిపోవుద మన్నను జావు రాదు, పాడుసంసారవార్ధిలోపల మునింగి
యుడ్డుగుడుచుచు నున్ననా కొక్కఁ డైనఁ, గానరాఁ డుద్ధరించెడిమానవుండు. 362
క. అనుటయు వివేకుఁ డిట్లని, యెను శుద్ధుఁడ వీవు నీకు నేర్పడినయవ
స్థను బాపి సౌఖ్యమును గొ, ల్పును జ్ఞానము దాని శరణుపొందుము వత్సా. 363
గీ. అనుటయును నాత్మకొంత ధైర్యమువహించి, జ్ఞానమును వేఁడుకొనియె నాక్షణమునంద
జ్ఞాన మరుదెంచి తత్సన్నిధానమునకు, వానితో నిట్లు లనియె సమ్మాన మొదవ.
క. స్వామీ నను మఱచితివో, యేమో నాపేరు జ్ఞాన మేను ద్వదీయ
క్షేమము గోరినభృత్య, గ్రామణి నని తెలిసికొనుము కడ కిపు డైనన్. 365
క. మును నే నెంతగ వారిం, చినను వినక దుష్టమతులస్నేహము గావిం
చినకతన నిట్టియాపద, లొనగూడెను జూవె యుత్తమోత్తమ నీకున్. 366
గీ. ఐనదానికి వగచి కార్యంబు లేదు, ధ్యానమును వేఁడికొనుము సత్వరము నీవు
చెందెదవు సౌఖ్యమును దానిపొందువలన, ధ్యానమును నేనుఁ గలుగ నీ కవ్యమేల.
క. అని పలుకుటయును ధ్యానం, బును నుద్దేశించి యాత్మ మొఱవెట్టఁగ వెం
టనె తద్దీనారవమున్, విని ధ్యానము వచ్చి యాతనికి ని ట్లనియెన్. 368

క. అనఘా నివాతదేశం, బునఁ గలదీపంబు ధూమమును విడిచి వెలిం
గినరీతి వెల్గెదవు నినుఁ, గనుఁగొనునెడ నీవు తొలఁగి కలుషము లెల్లన్. 369

క. నను విడనాడక యుండిన, నిను నీ వెఱుఁగంగఁగలవు నిర్ద్వంద్వుఁడ వై
తనరెడునీకు విషాదం, బనునది యెక్కడిది తత్త్వ మవలోకింపన్. 370

క. భూతంబులసాంగత్యము, చేతను లక్షించె నిట్టిచేష్టాటు లజా
తాతంకుఁడ వగునీ కు, త్పాతము లెక్కడివి నిజము పరికింపంగన్. 371

గీ. నిశ్చలోపాసనంబున నిలిచి సర్వ,కాలములయందు నేకాంతగతుఁడ వగుచు
ధ్యాన మొనరించునెడ నాత్మ నాత్మచేత, నొందెదవు శోకరహితమై యుండుపదము.

క. అని బోధించుటయును నిజ,మును నాత్మ యెఱింగి జ్ఞానమును ధ్యానంబున్
మనమందు నిలిపికొని తన, తనువును విడనాడి సౌఖ్యధామముఁ జెందెన్. 373

క. కాన శరీరికి మేనికె, కానము సంబంధ మెట్లు కలుగును జాయా
సూనులు ధనమును మున్నగు, వానికిఁ బ్రాణికిని నింక వనజదళాక్షీ. 374

సీ. పంకజాక్షుఁడె పరబ్రహ్మంబు తిలకింప, నతఁడె సనాతనుం డతఁడె సాక్షి
యతఁడె విశ్వములను నజుఁ డయి సృజియించుఁ, బాలించు విష్ణువై ప్రజల నతఁడె
హరుఁ డయి యాతండె హరియించు నఖిలంబు, నాత్మయై యుండు దేహమున నతఁడె
యతనికంటెను భిన్న మగునది వేఱొండు, కానంగ రాదు లోకంబులందు

గీ. వాని హృదయంబు సత్యంబు వానితనువు, ధర్మ మాసత్యధర్మముల్ తగవు విడువ
నవి త్యజించిరి నీసుతు లంబుజాక్షి, దాన వారల కాపద దాపరించె. 375

గీ. అది నేను వచించినయాత్మ యనఁగఁ, దెలిసికొంటివె యెవఁడో యిందీవరాక్షి
యతఁడె విష్ణువు వాఁడె పాపాత్ము లైన, యట్టిదైత్యుల వధియించినట్టివాఁడు.

క. పుట్టించెనో యెవఁ డాతఁడె, గిట్టించెను దీని కేల ఖేదము నొందన్
నెట్టన చేసినకర్మము, కట్టి కుడుప కున్నె యెంత కాఱియపడినన్. 377

గీ. కర్మ ముండును ద్వివిధంబుగాఁగఁ బుణ్య,మనియుఁ బాపంబనియును బుణ్యంబువలనఁ
గలుగు సద్గతి పాపంబువలనఁ గలుగుఁ, బతన మివి జంతువులకుఁ దప్పవు లతాంగి.

క. బల మున్నను బరివారము, గలిగిన నన్వయవిశుద్ధి గలిగిన నవి ని
ష్ఫలము లిహపరసుఖంబుల్, గలిగింపఁగఁ బుణ్యహీనునకుఁ గమలాక్షీ. 379

గీ. గిరులయం దున్నతంబుగాఁ బెరిఁగినట్టి, క్ష్మారుహంబులు వాయువేగంబువలన
మూలములతోడ ధరణిపైఁ గూలినట్లు, పతితు లగుదురు ధర్మవర్జితులు తన్వి.

గీ. పుణ్యమును ధర్మమును దపంబును ఋతంబుఁ, గలిగియుండినచోటను నిలుచుఁ జక్రి
చక్రి నిలిచినచోటను జయము గలుగు, నట్టిభాగ్యంబు లేదు నీయాత్మజులకు. 381

గీ. సత్యధర్మపరాయణస్వాంతు లగుచు, నాదితేయులు వర్తిల్లి రదియె హేతు
వమ్మహాత్ముల కభ్యుదయంబు గలుగఁ, దెలిసికొని నిశ్చయంబు శాంతింపు మతివ.

క. అని బోధించుటయును దితి, వనజాక్షి గ్రహించి యున్న వార్తవ మెల్లన్
మనమునఁ జొచ్చినదుఃఖం, బును మరలుచుకొనియె మౌనిపుంగవులారా. 383
క. అనవుడు మౌనులు సూతునిఁ, గనుఁగొని యిట్లనిరి చావఁగా మిగిలినయ
ట్టినిశాచరవీరులు చే, సినపని యే మైన నున్నఁ జెప్పుము మాకున్. 384

—: సూతుఁడు హతశేషు లగురాక్షసులవృత్తాంతముం జెప్పుట :—

క. అనవుడు సూతుం డిట్లని, యెను హతశేషు లగుదైత్యు లెల్లరు శీఘ్రం
బునఁ జని కశ్యపమౌనీం, ద్రునికడకి ట్లనిరి ఖేదరోషము లెనయన్. 385
క. దేవతలును రాక్షసులును, గావించుచు నుండ యుద్ధకర్మముఁ దంద్రీ
గోవిందుఁ డేఁగుదెంచి క, రావిక లొనరించె నసురగణముల నెల్లన్. 386
గీ. అంతతోఁ బోక చంపెఁ జక్రాయుధమున, దైత్యదానవులను నెల్లఁ దప్పి బ్రతికి
వచ్చినారము మేము నీవలన మాకు, జయము చేకూరు ననెడినిశ్చయముతోడ.
ఆ. మేము సంఖ్యలోన మిగులుగా నున్నను, బలపరాక్రమములు గలిగి యున్న
నల్పులైన త్రిదశు లాహవవిజయంబు, గాంచుటకును నేమి కారణంబు. 388
క. అని యడుగుటయును గశ్యప. మునివరుఁ డిట్లనియెఁ బుణ్యమును దపమును వా
రొనరించి హరికటాక్షం, బునకున్ గురి యగుటచేతఁ బొందిరి జయమున్. 389
క. కావున ధర్మముఁ దపమును, గావింపఁగ వలయు జయము గావలె నంచున్
భావింతు రేని కర్మము, గావింపక ఫలము చెందఁ గలుగునె యెందున్. 390
క. అని సెప్పుటయును జనకుని, యనుమతి గొని తప మొనర్ప నరిగి రరణ్యం
బునకు మునుముందు గోవిం, దునిసాధించెడితలంపుతోడను వారల్. 391
క. చని యట్లు హిరణ్యాక్షుం, డును మఱియు హిరణ్యకశిపుఁడును మున్నగున
ట్టినిశాచరు లతిఘోరము, గను జేసిరి తపము ముజ్జగంబులు వడఁకన్. 392
గీ. అంతటను వారు కోరినయట్టివరము, లన్నియును నిచ్చి తత్తపమాఁపె బ్రహ్మ
యావరంబులచే వార లాక్రమించి, రఖిలలోకంబులను గూడ నడ్డు లేక. 393
క. వారలు పెట్టెడిబాధల, కోరువఁగా లేక సురలు యోగులు సిద్ధుల్
చారణులు మున్నుగాఁ గల, వారలు చని చెప్పి రసురవార్తలు విధికిన్. 394
క. పరమేష్ఠి విని సమస్తము, హరికడకున్ సురసమేతుఁ డయి యేగి తదా
శరవృత్తాంతము దెలిపిన, తరువాతను శౌరి క్రోధతామ్రాక్షుండై. 395
క. హరియించి హిరణ్యాక్షుని, వరాహరూపమున నమరవర్గము పొగడన్
నరసింహాకారంబున, హరియించె హిరణ్యకశిపు నటు తరువాతన్. 396
ఉ. అంతట సర్వలోకముల కార్తి తొలంగెను ధర్మముల్ నిర
త్యంతరవృత్తితోడఁ దనరారెను సాధువు లెల్లవారలున్

సంతసమొంది రాత్మజులచావు విషాదముగొల్పుటన్ మనః
కాంతునిగుండె తల్లడిలఁగా దితి యేడ్చెఁ దదంతికంబునన్. 397

—: కశ్యపుఁడు దితికి వరం బిచ్చుట :—

క. ఆయేడుపు విని కశ్యపుఁ, డాయమ నోదార్చి యింతి యనుతాపంబున్
జేయకుము గతమునకు నిపు, డేయది వాంఛితము కోరు మిచ్చెద వరమున్.
క. అనుటయుఁ దేజోయుక్తుం, డును జగదేకప్రవీరుఁడును నగునొకనం
దనుని దయచేయు మేటికిఁ, దనయులు పదివేగు రప్రధానులు దేవా. 399
క. అని దితి ప్రార్థించుటయును, గనికరమునఁ గశ్యపుండు కాంతా నీకో
రినసుతుఁడు గలుగు శీఘ్రమ, యని తనహస్తంబు నుంచె నాయమతలపై.
క. అంతట శతవర్షంబులు, సంతోషముతోడ మేరుశైలంబున నా
యింతి యొనరించెఁ దపము ని, రంతరముగ గర్భ మంతకంతకుఁ బెరుఁగన్. 401
క. నిండుటయు గర్భ మామె క, ఖండబలపరాక్రమప్రకాశసమేతా
త్ముం డగునాత్మభవుం డొ, క్కం డొకనాఁ డుద్భవించెఁ గడలు వెలుంగన్.
వ. అంతఁ గశ్యపమహర్షి యాకుమారునకు విధ్యుక్తసంస్కారంబు లొనరించి బలుం
డని నామకరణంబు గావించి క్రమంబుగ బ్రహ్మచర్యానుష్ఠానంబున నియోగించె.

—: బలాసురుఁడు మహేంద్రహతుం డగుట :—

క. బలుఁ డది మొదలుగఁ దపమున్, జలిపి మహాఘోరముగను శతవర్షము లా
వల నొకదినమునఁ దల్లిని, దిలకింపఁగ వచ్చి మ్రొక్కె దితిపదములకున్. 404
క. మ్రొక్కుటయు నతని నాయమ, యక్కునఁ జేర్చుకొని నేటి కగపడితెనె నీ
దృక్కులకుఁ బరిభవాగ్నిని, జిక్కి పరితపించుతల్లి చిన్నికుమారా. 405
క. మీయన్నలఁ బెక్కురఁ జ, క్రాయుధుఁడు వధించె నతిబలాన్వితుల సురల్
సాయపడఁగ నాపగ పెడఁ, బాయక ననుఁ గాల్చుచుండుఁ బావకమువలెన్.
క. పురుహూతుని సురలను ద,త్పరిరక్షకుఁ డైనచక్రధరునిం ద్వరలో
బరిమార్చి నామనంబును, నెరియించెడుశోక మార్ప నెంచుము పుత్రా. 407
క. అనవుడు బలాసురుఁడు దితి, జననికి ని ట్లనియెఁ దల్లి శాంతింపుము నే
నొనరించి తపము శాత్రవ,హననం బొనరింతు నీకు హర్షము గలుగన్. 408
క. అనుటయు శుభ మగుఁగావుతఁ, జను మని దితి పలికె నంతఁ జని జలధితటం
బున బలుఁడు తపము సేయం, గను గడఁగుచు నుండ నట్టికాలమునందున్.
ఆ. అదితివలన వానియతిసాహసంబును, విని పురందరుండు వెఱ జనింప
వైచె నతనిమీఁద వజ్రాయుధము నంత, నతఁడు పడియెఁ బుడమి నసువు లుడిగి.
క. అంతట దేవత లెల్లరు, సంతోషముఁ జెంది రాత్మజక్షయము దితి
స్వాంతంబున కత్యంతము, చింతావహ మగుట నామె చింతిలి మిగులన్. 114

క. తనభర్త చెంతకుం జని, తనులను బాష్పంబు లొడికలుగాఁ గాఱం
గను వెక్కి వెక్కి యేడిచె, మనబలునిం బిలుకుమార్చె మఘవుం డనుచున్.

—: కశ్యపుఁ డగ్నికుండమున వృత్రాసురునిఁ బుట్టించుట :—

గీ. ఆవిలాపంబు విని కశ్యపర్షిమౌళి, మండిపడుచును దనతలనుండి పెఱికి
జ్వలనకుండంబునం దొక్క జటను వేల్చె, వాసవాంతకుఁ డుదయింపవలయు ననుచు.

క. ఆక్షణమునఁ బుట్టెను బిం, గాక్షుఁడు దంష్ట్రావిశంకటాస్యుఁడు క్రూరా
వేక్షణుఁడు భీషణుఁడు ఘన, కుక్షియుతుం డొకఁడు వహ్నికుండమునందున్.

క. పుట్టి యతఁడు కశ్యపముని, కట్టెదుటను నిలిచి యేమి కార్యమునకు నన్
బుట్టించితో యొాపని య, ట్టిట్టనక యొనర్తు నానతీయుము తండ్రీ. 415

క. అనవుడుఁ గశ్యపుఁ డి ట్లని, యెను వృత్రుం డనెడిపేర నెసఁగి సునాసీ
రుని గెలిచి స్వర్గరాజ్యము, గొని నీవు యథేచ్ఛ మేలుకొనుము కుమారా. 416

క. అని పలుకుటయును వృత్రుఁడు, ధనురామ్నాయంబు నేర్చి ధైర్యము శౌర్యం
బును గలిగి క్షాత్రతేజం, బున నానాఁటికిని వృద్ధిఁ బొందుచు నుండెన్. 417

—: ఇంద్రుఁడు వృత్రాసురుని వధించుట :—

గీ. ఇంద్రుఁ డాతనివలన నూహించి భయము, వాని నెటులేని వధియింపవలయు ననుచు
నెంచికొని యాత్మలోన రావించి సప్త, ఋషులఁ దనకడ కవ్వారి కిట్టు లనియె.

క. అనఘాత్ములార వృత్రుం, డనియెడి దైత్యుండు బహుబలాన్వితుం డా
తనితోడ నాకు సఖ్యము, నొనగూర్పుం డర్ధరాజ్య మొసఁగెద ననుచున్.

క. అనవుడు సప్తర్షులు వృ, త్రునికడకుం జని పురందరునితో సఖ్యం
బొనరింపు మర్ధరాజ్యం, బును నాతఁ డొసంగు దైత్యపుంగవ నీకున్. 420

గీ. అనుభవింపుము స్వర్గరాజ్యమును విబుధు, లెల్లఁ గొలువంగ రాత్రించరేంద్ర నీవు
వాసవునితోడఁ గూడి సింహాసనమునఁ, గూరుచుండెడి మేలు చేకూరె నీకు.

గీ. పూర్వవిద్వేషములుదూరముగను జేసి, యసురులును దేవతలును స్నేహమున నుండ
నంతకంటెను లోకకల్యాణ మింకఁ, గాఁదగిన దేది యున్నది కర్బురేంద్ర. 422

క. అనవుడు వృత్రాసురుఁ డి, ట్లనియెను మునులార నాకు నభిమతమ మహేం
ద్రునితోడ మైత్రి ద్రోహం, బొనరింపనిశపథ మాతఁ డొనరించిన చోన్.

క. అనుటయు నింద్రునికడకున్, జని ముని లెఱిఁగింప వృత్రసంభాషణమున్
విని పాకశాసనుం డి, ట్లనియెను వారలకు విస్మయము గలుగంగన్. 424

క. మునులార నేను ద్రోహము, నొనరించితినేని రాక్షసోత్తముఁ డగువృ
త్రునియెడల బ్రహ్మహత్యను, నొనరించినయట్టిపాప మొందుదు ననుడున్.

క. ఆసప్తర్షులు చని వృ, త్రాసురునకుఁ దెలిపి రింద్రునాశయమును వి
శ్వాసము గలుగుటచే వృ, త్రాసురుఁ డరుదెంచె నింద్రునంతికమునకున్.

ఉ. వచ్చినవృత్రునిం గని దివస్పతి లేచి సగౌరవంబుగా
వచ్చి కవుంగిలించికొని వచ్చితె తమ్ముఁడ ర మ్మటంచు వా
క్రుచ్చి స్వకీయహర్మ్యమునకున్ గొనిపోయి ఛలోపచారముల్
హెచ్చుగఁ జేసి వాని వసియింపఁగఁ జేసె నిజార్ధపీఠికన్. 427

చ. అటులు వసింపఁ జేసి యనుజా సురరాజ్యము నేలుకొంద మె
ప్పటికిని నేకమై మనము భద్రముగా నిటు లున్న విద్విష
త్పటలము తేఱిచూడఁ గలదా మనలన్ గనుఁగొ మ్మటంచు ను
త్కట మగుస్నేహ మప్పటికిఁ గన్పడ నింద్రుఁడు వల్కె వానితోన్. 428

క. ఆమాటలు విని దైత్య, గ్రామణి మదిలోన నమ్మకము హెచ్చఁగ సు
త్రామునితోఁ గలసి సుర, స్వామి యగుచు నేలుకొనఁగ సాగె దివంబున్.

క. అది యటులుండఁగ నింద్రుఁడు, వెదకి యుపాయం బొకండు వృత్రాసురునిన్
సదమద మొనర్ప రంభా, మదవతికిం జెప్పె నాత్మమంత్రార్థంబున్. 430

క. అంతట రంభ మరుత్వ, చ్చింతితకార్యంబు దలఁచి చేయంగను నే
కాంతముగ నందనవనా, భ్యంతరమునఁ జెలులతోడ నాడుచు నుండెన్. 431

వ. అప్పుడు వృత్రాసురుండు దానవకతిపయసమేతుండై నందనారామంబున కరిగి యచ్చట విహరించుచు నొక్కచోటఁ జందనద్రుమంబునీడ సఖులతోడ నాడుచుండు నమ్మచ్చెకంటిం గనుంగొని తద్విలాసాకృష్టమానసుండై తదంతికంబున కరిగి.

ఉ. ఎవ్వతె వీవు పంకజదళేక్షణ నిన్ గనుఁగొన్న మానసం
బువ్విళులూరుచున్నయది యోపఁగ నాకు వశంబు గాదు నా
నవ్వనజాక్షి యి ట్లనియె నాతనితోడను నేను రంభ నీ
వెవ్వఁడ విట్లు వల్కఁ దగునే మగవారల కాఁడువారలన్. 433

చ. అనవుడు వృత్రుఁ డిట్లనియె నంబుజలోచన నేను గశ్యపుం
డనియెడుబ్రహ్మకున్ సుతుఁడ నగ్నిభవుండను వజ్రికిన్ సఖుం
డను ద్రిదివార్ధ మేలుకొనునాయకుఁడన్ ద్రిజగంబులన్ వశం
బొనరుచుకొన్నశూరుఁడను నూర్జితవీర్యుఁడ వృత్రనాముఁడన్. 434

క. నను నీ వెఱుఁగవు గావున, వనజాయతనేత్ర యిట్లు వచియించితి వై
నను నిపు డేమాయెను నీ, పనుపున న న్నుంచికొనుము బద్ధుఁడ నైతిన్. 435

చ. అనుటయు రంభ యి ట్లనియె నాతనితోడ మహాత్మ నేను గో
రినపని నీవు చేయ నొనరించెద వేని ప్రతిజ్ఞ తీర్చెదా
నను భవదీప్సితార్థమును నావుడు దైవము సాక్షి గాఁగ నీ
పనిచినకార్య మేను సలుపంగలవాఁడను విశ్వసింపుమా. 436

క. అని వృత్రుఁ జూడుటయు న,వ్వనితామణి లాస్యగానవైశారద్యం
బున శృంగారవిలాసం,బున నాదానవుని డెందమును గరఁగించెన్. 437

గీ. అట్లు కరఁగించి డెందంబు నంబుజాక్షి, తనముఖాసవ మిచ్చె నాతనికి నతఁడు
దానిఁ దిలకించి తగునె మద్యంబు నీయ, వేదవేదాంగవిదుఁ డైనద్విజున కతివ.

క. జనియించితిఁ గశ్యపునకు, నొనరించితి ఘోరతపము నుఱ్ఱూతలు గాఁ
గను జగము లెల్ల నర్హమె, కనకాంగి యొనర్ప నీయకార్యము నాకున్. 439

క. సుర ద్రావిన బ్రాహ్మణునకు, నరకము ప్రాప్తించు దండనము చేకూరున్
ఘోరవలన నేల న న్నీ, దురితములోపలను గూలఁ ద్రోయుదు వబలా. 440

చ. అనుటయు రంభ యి ట్లనియె నాతని కింతకు మున్ను నీ వొన
ర్చినసుదృఢప్రతిజ్ఞను స్మరించినచో నొకసారి యిట్లు నీ
వన వని నొక్కి చెప్పఁగల నాయ్యెఁడ వీవె తలంచి చూడుమీ
యనృతమె మేలొ మద్యమును నానుటె మేలొ సురాసురేశ్వరా. 441

క. అనవుడుఁ జేసినప్రతినను, వినిహాత మొనరింప లేక వృత్రాసురుఁ డా
ననమునఁ జెఱున వ్వాలయుఁగ, వనజేక్షణ యిడినయాసవంబును ద్రావెన్.

క. త్రావిన వెంటనె యజ్ఞా, నావిష్టుం డయ్యె వృత్రుఁ డదె సమయముగా
భావించి యింద్రుఁ డాతనిఁ, గావించె నిక్కృత్తగళునిఁగా వజ్రమునన్. 443

గీ. ధర్మకంటకుఁ డైనయాదానవుండు, చచ్చుటయు లోక మంతయు సంతసించెఁ
గాని వజ్రికి మాత్రము మానదయ్యె, బ్రహ్మహత్య యొనర్చినపాతకంబు. 444

క. అంతట వృత్రునినిధనము, సంతాపము గొలుప నేఁగి చయ్యనఁ దద్వ్రు
త్తాంత మెఱిఁగించి నాథున, కంతయు దితి యేడ్చెఁ గనుల నశ్రువు లురలన్.

క. ఆయేడుపు విని కశ్యపుఁ, డాయమ నోదార్చి కేల నంటి తపంబున్
జేయుము వజ్రివధంబున్, జేయంగలకొడుకు పుట్టు శీఘ్రము నీకున్. 446

క. అని యాశీర్వాదంబుం, బొనరిచి మఱి యిట్టులనియెఁ బూఁబోఁడి కరం
బున నేను దాఁకఁగనె నీ, కొనగూడెను గర్భ మెట్టు లోమెదొ దీనిన్. 447

గీ. ఒకతపోవనమునయందె యుండవలయు, వత్సరశతంబు నిండెడివఱకు నీవు
తపము నొనరించుచుఁ బ్రమాదం బొకింత, చెందితివ యేని సర్వంబుఁ జెడును జూవె.

—: గర్భిణీధర్మకథనము :—

సీ. తగదు భుజింప సంధ్యాకాలములయందు, వృక్షమూలంబుల కేఁగ రాదు
కావింపరాదు జలావగాహము శూన్య, మందిరంబున వసింపంగ రాదు
వర్తింపఁగా రాదు వల్మీకభూముల, నుద్విగ్నచిత్తయై యుండ రాదు
విలిఖింపరాదు పృథ్విని నఖంబులచేతఁ, గాలు ద్రవ్వఁగ రాదు కలహమునకు

గీ. తగదు వ్యాయామ మొనరింపఁ దగదు విరియఁ
బోసికొనియుండ మూర్ధజంబులను దగదు
హాస్య మాడంగఁ దగ దుండ నశుచి యగుచు
గర్భమును దాల్చియున్నట్టికలువకంటి. 449

సీ. అస్థికపాలభస్మాంగారతుషయుక్త, మైనచోటను దగ దడుగు వెట్ట
గాత్రభంగ మొనర్పఁగా రా దమంగళం, బైనభాషణముల నాడ రాదు
ముసలంబులును ఱోళ్లు మొదలుగాఁ గలగట్టి,యురువులమీఁదఁ గూర్చుండఁదగదు
తగ దుండ నలసమై తగ దుండ నగ్నమై, తగవు లాడెడిచోటఁ దగదు నిలువ

గీ. తగదు పండుకొనంగ నధౌతపాద, యుగను నపరోత్తరశిరస్కయుగను దన్నుఁ
దెగడుకొన రాదు భర్తను దిట్ట రాదు, గర్భవతి యైనతొయ్యలి కంబుకంఠి.

క. వలయును బెద్దలఁ బూజం, జలుపంగను మంచినీట స్నానము వలయున్
జలుపఁగఁ బ్రసన్న లగుచును, వలయును నుండంగ గర్భవతు లగుకాంతల్.

గీ. వినవలయు మంచిమాటలు వీను లొగ్గి, పలుకవలయును మంచిపల్కులను నోట
నుండవలయును సంతృప్తి యొదవ మదికి, గర్భధారిణి యగుబోటి కమలవదన.

క. అనవుడు దితి మేరుతపో, వనమునకుం బోయి నియమవతియై తపమున్
బొనరింపఁ దొడఁగె నింద్రుని, హననము గావింపఁదగినయాత్మజునకునై. 453

సీ. ఆరహస్యమును బలారాతి గ్రహియించి, బ్రాహ్మణరూప మేర్పడఁగఁ దాల్చి
దితిసన్నిధికిఁ జేరి నతి సేసి తల్లి నే, క్షితిసురుండను భవత్సుతనిభుండఁ
దపము చేసెడివారిదరి నుండి పరిచర్య, లాచరించుటయె నా కభిమతంబు
కాన నీశుశ్రూష గావించుచుండుట, కనుమతింపుము చాలు నదియ నాకు

గీ. ననుచుఁ బ్రార్థించుటయు నామె యనుమతించె
నంత నాతఁడు నయవినయంబు లెసఁగఁ
బ్రతిదినంబును జాగరూకత వహించి
చేయవలసినసేవలు చేయుచుండె. 454

వ. అంత శతవర్షంబులు పూర్ణం బగుటయు నామె గర్భంబు గూడఁ బూర్ణం బయ్యె.
అప్పు డొక్కనాఁడు దితి పాదశౌచంబు గావించుకొనక ముక్తకేశ యగుచుఁ
బశ్చిమశీర్షంబుగా శయనంబుపై శయనించి నిదురించె. 455

క. అది యవకాశముగాఁ గొని, త్రిదశాధీశ్వరుఁడు చొచ్చి దితిగర్భంబున్
భిదురమున సప్తశకలము, లొదవఁగ గర్భస్థశిశువు నుచ్ఛేదించెన్. 456

సీ. ఖండించుటయును నాఖండంబు లేడును, నేకకంఠంబుగా నేడ్వఁ దొడఁగె
నారోదనధ్వని నాలించి 'మా రుద, మా రుద' యంచును మరల మరల

ఖండించె నొకొక్కఖండంబు నే డేడు, ఖండంబులుగను నాఖండలుండు
తత్ఖండములు సముద్దండగాంభీర్యప్ర, తాపవిక్రాంతియుక్తంబు లగుచుఁ
గీ, దనరి నలువదితొమ్మిది తనువులుగను, దాల్చి మరుదాఖ్యలను సమస్తప్రపంచ
ములను నడపెడిదివ్యశక్తులను బడసి, యాశ్రయించెను జంభాసురారి నపుడు.

—: జ్యేష్ఠపూర్ణిమావ్రతకథనము :—

క. అని చెప్పుటయును మానులు, మనమున విస్మయముఁ జెంది మహనీయ యెటుల్
మనిరి మరుత్తులు భిదురం, బున ఖండితు లయ్యుఁ జిత్రముగఁ గన్పడెడిన్.
క. అమరప్రియత్వ మేవిధి, సమకురె మరుదాఖ్య లెట్లు సంప్రాప్తించెన్
సుమనోద్వేషణు లగుదితి, కుమారులకుఁ జెపుమ వినఁగఁ గుతుకం బయ్యెన్.
క. అనవుడు సూతుం డి ట్లని, యెను దాపసులార కలదు హేతువు మును భీ
ష్మున కీవృత్తాంతంబును, వినిచెఁ బులస్త్యుండు దాని వినుఁడు వచింతున్. 460
సీ. పుత్రు లందఱుఁ గూడఁ బొలియుచుండఁగ దితి, యేడ్చుచుఁ గన్నీళు లేర్లు వాఱ
నరిగి వసిష్ఠునిదరి కొక్కనాఁడు త, చ్చరణపద్మములకుఁ జాఁగి మ్రొక్కి
మునివర పుత్రనాశనము గల్గనివ్రతం, బేదేని దయతోడ నెఱుఁగఁ జెపుమ
యని వేఁడుకొనుటయు నమ్మునీంద్రుఁడు కరు, ణార్ద్రదృష్టులను నాయమను జూచి
గీ. తల్లి చింతిల్లకుము నీకు నుల్లమందు, దృఢముగను నట్టితలఁపు సంధిల్లెనేని
యున్న యదిచూ వెయవిర తాయుష్యయోగ, వర్ధకము జ్యేష్ఠపూర్ణిమావ్రత మొకండు.
క. అని చెప్పుటయును దితి తన, మనమునఁ గలచింత కొంత మాని ధృతిన్ గై
కొని తాపసేంద్ర తద్వ్రత, మొనరించువిధాన మంతయును జెప్పు మనెన్. 462
వ. అంతట వసిష్ఠుం డాయమం జూచి సాధ్వీ జ్యేష్ఠమాసపూర్ణిమాదినంబున నొక్క వేదికపైని మండలం బేర్పఱిచి యందు శ్వేతతండులపూరితంబును శ్వేతచందనచర్చితంబును శ్వేతవస్త్రయుగచ్ఛన్నంబును నిక్షుదండఫలయుతంబును సగుడంబును సహిరణ్యంబును నగునొక్కనూతనతామ్రకలశంబు నుంచి దానిపైని స్వర్ణబ్రహ్మప్రతిమను దద్వామభాగంబున రజతసావిత్రీప్రతిమను నుంచి ప్రాణప్రతిష్ఠ గావించి శుక్లపుష్పాక్షతతిలలచే నర్చించి యాదినం బెల్ల నుపవసించి స్థండిలంబున శయనించి పరదినప్రభాతకాలంబున నాకలశంబు బ్రాహ్మణునకు సమర్పించి బ్రాహ్మణుల భుజింపం జేసి దక్షిణాతాంబూలము లొసంగి సర్వంబును బ్రహ్మార్పణము గావించి లవణవర్జితంబుగాఁ దాను భుజింప వలయు. ఈవిధంబునఁ బ్రతిమాసంబును వ్రతంబు గావించుచుఁ ద్రయోదశమాసంబున బ్రహ్మనామంబు లుచ్చరించుచు శుక్లతిలలచేతను గోఘృతపాయసంబులచేతను హోమంబు గావించి సపత్నీకుం డగుబ్రాహ్మణునకుఁ బూజాపూర్వకంబుగా స్వర్ణబ్రహ్మప్రతిమయును రజతసావిత్రీప్రతిమయును ఘృతధేనువును బరోపస్కర

సమేతం బగు శయ్యయు నిక్షుదండంబులును బుష్పమాల్యంబులును దక్షిణా
తాంబూలంబులును సమర్పించి బ్రాహ్మణుల భోజనసంతృప్తులం జేయవలయు.

క. ఈవిధమున నెవ రేనియు, గావించినయెడల వ్రతము గతపాతకు లై
జీవత్పుత్రులఁ బడసి శు, భావహ మైనట్టిపదము నందుదురు తుదిన్. 464

క. అని వచియించుటయును దితి, విని సంతోషమున వ్రతము విధియుక్తము గా
నొనరించె దాన మృత్యువు, గనరైరి మరుత్తు లెన్ని ఖండము లైనన్. 465

—: మరుత్తులవృత్తాంతము :—

గీ. గర్భగత మైనశిశువు లుత్కటముగాఁగ, రోదనము చేయుచుండ 'మా రుద' యటంచు
నమరపతి పల్కె వర్ణలోపాగమములఁ, గలిగె మరుదాహ్వయంబు వారలకు నాఁడె.

సీ. కావించినను నెన్ని ఖండంబులుగఁ దాను, బ్రాణముల్ గల్గి యావ్రక్క లుండఁ
బురుహూతుఁ డాశ్చర్యమును జెంది వీ రేదొ, యధికపుణ్య మొనర్చి రని తలంచి
దితికాళ్లపైఁ బడి దేవి ప్రాణాశఁ జేఁ, జేసితి ఘోరదుష్కృతము నేను
క్షమియింపు మని వేఁడి సైఁపంగ నాయమ, సంతోషమును జెంది స్వాంతమందు

గీ. నామరుత్తుల దేవతలందుఁ జేర్చి, వారలకు యజ్ఞభాగాధికార మొసఁగి
చనియె నావల వారలు సంభవించి, తిరుగఁ జొచ్చిరి ప్రియు లయి సురల కెల్ల.

క. అనుటయును ఋషులు సూతునిఁ, గనుగొని యి ట్లనిరి పృథునిగాథను మాకున్
వినిపింపు మతఁడు చేసిన, పను లెన్నియొ కల వటంచుఁ బలుకుదు రార్యుల్.

—: పృథుచరిత్రము :—

క. నావుడు సూతుఁడు వారల, కీవిధమునఁ జెప్పఁదొడఁగెఁ బృథుచరితంబున్
శ్రావకులకు శ్రోతలకును, బావనత ఘటిల్లు ననుచుఁ బ్రమదంపడుచున్. 469

సీ. అత్రివంశంబున నంగుఁ డంచుఁ బ్రసిద్ధిఁ, గన్న ప్రజాపతి మున్ను వెలసె
నతఁడు మృత్యువునకు నాత్మజ యగుసునీ, థను స్వీకరించెను ధర్మసతిగ
నామెకు జనియించె నంగునివలనను, వేనాహ్వయుం డైనసూనుఁ డొక్కఁ
డతఁడు ధర్మవిహీనుఁ డై రాజ్య మేలంగఁ, దొడఁగె మాతామహదోషమునను

గీ. దత్ప్రభుత్వంబునందు వేదములు పోయె, జన్నములు శాంతిలెను సదాచార ముడిగె
నాస్తికత్వము ప్రబలె దేవాలయములు, పాడువడియెను బ్రాహ్మణుల్ భ్రష్టు లైరి.

క. ననుఁ దప్ప నితరదైవము, లను గొలిచెడివారిశిరములను దీయుదు నే
నని శాసనమును గావిం, చెను వేనుం డెంతదుష్టశీలుఁడో తలఁపన్. 471

ఆ. అటులు దుష్కృతముల కాతఁడు పాల్పడి, ప్రజల నెల్లఁ గుందువఱచుచుండ
సైఁప లేక వానిచండశాసనమున, కఖిలసంయములును నాగ్రహించి. 472

ఆ. వానికడకు నేఁగి వేనమహారాజ, తలఁచినార మేము సలుపుటకును
ద్వాదశాబ్దమఖము దానికి భంగంబు, గలుగకుండఁ జేయవలయు నీవు. 473

ఆ. రాజు ధర్మములను రక్షించుచును రాజ్య, మేలుకొనుట భగవత్సేవ్యతంబు
కాన మానరానికార్యంబు ధర్మసంరక్షణంబు సేవ్య రాజ వగుట. 474

క. అనుటయును నగ్నికణములు, గనులను నురలంగఁ గ్రోధయుతాలునిచందం
బున మండిపడుచు వేనుఁడు, మునులను హింసించుటకును మొనయుచు నుండన్.

క. మును లాతనియుద్యమమును, గనుఁగొని యిఁక నీరికనున్నఁ గలుగు నపాయం
బని యెంచి నిలువు మని ప, ల్కినతోడనె వాఁడు నిలిచెఁ గీల్బొమ్మవలెన్.

వ. అంత నమ్మహర్షు లాతనిసవ్యోరువును మథింప నీలవర్ణుండును నతిహ్రస్వుండును దీర్ఘాస్యుండును వికృతాక్షుండును లంబోదరుండును విశాలకర్ణుండును బృథుభుజుండును నగునొక్కపురుషుండు ప్రభవించె. వాని జూచి యత్తపోధనులు 'నిషీద' యని గంభీరంబుగాఁ బలుక నాపురుషుండు భీతుండై గడగడ వడఁకుచుఁ గూర్చుండె. వానివంశంబ నిషాదులును గిరాతులును భిల్లులును భ్రమరులును బుళిందులును ననునవేకమ్లేచ్ఛజాతులచే వృద్ధి నొంది నానావిధపాపవ్యాకీర్ణం బయి పర్వతంబులందును నరణ్యంబులందును వ్యాపించె.

క. తరువాత మునులు మథియిం, చిరి తద్దక్షిణకరంబు స్వేదము దానన్
గురియుటను మరల మథియిం, చిరి దానినె బిగియఁ బట్టి చేతులతోడన్. 478

సీ. అంత నాతనిపాప మంతరించుటయును, బ్రాదుర్భవించెఁ దత్పాణినుండి
ఖడ్గధనుర్బాణకవచకుండలకిరీ, టాలంకృతుఁడు ద్వాదశార్కనిభుఁడు
రాజలక్షణపరిభ్రాజమానుఁడు జగ, త్పూజార్హుఁడును నగుపురుషుఁ డొకఁడు
సర్వభూతములును సంతోష మందెను, గురిసె వ్యోమమునుండి కుసుమవృష్టి

గీ. యట్టితఱిని జలోద్మఖుం డరుగుదెంచి, తన్మహాప్రభుశక్తికిఁ దగినయట్లు
పృథు వనెడిపేరు వెట్టి ధరిత్రి కెల్ల, నధిపతిగఁ జేసి దీవించి యరిగె నంత. 479

క. అది మొదలు పృథు వధర్మము, మొదలంటఁగ నణఁచి ధర్మమును నెలకొల్పన్
మొదలిడెను సజ్జనులకు, ముదమును దుష్టులకు ఖేదమును సమకూరన్. 480

ఆ. అంత వానికడకు నరుదెంచి ప్రజ లెల్ల, మ్రొక్కి తత్పదాబ్జములకు దేవ
చిత్తగింపు మనుచుఁ జేతులు జోడించి, పలికి రిట్లు దీనభావ మొదవ. 481

క. ఫలములు జలములు పత్త్రం, బులు మూలంబులును నెన్ని భుజియించిన నాఁ
కలి దీఱదాయె భూవర, నిలిపినఁ జంపినను దిక్కు నీవే మాకున్. 482

క. మును చల్లినట్టిబీజము, లను నెల్లను మ్రింగి యీ యిలాదేవి చలిం
పనునైనఁ జలింపదు మ, మ్మనఘా పాలింప నెట్టు లగునో నీకున్. 483

చ. అనవుడు నాప్రభుం డభయహస్తము వారి కొసంగి బాణముల్
ధనువునఁ గూర్చి కోపమున ధాత్రిని జూచుచు నుండ ధాత్రి వెం

టనె గ్రయించి యాతనికడంకను గుంజరరూప మూని పో
యెను గిరికాననంబులకు నెవ్వరికిన్ గనరాక యుండఁగన్. 484

క. కనుఁగొని యోగబలంబున, జననాయకుఁ డది చరించుజాడను నటకున్
జని యేసెఁ దచ్ఛరీరము, తునియలు తునియలుగఁ ద్రోఁచుతోడనె శరముల్.

గీ. అంత వసుమతి సాధ్వసాక్రాంత యగుచు, సింగ మయి పాఱిపోవుచుండంగ ఱేఁడు
తెలిసికొని వెంటఁబడి వాఁడిములుకు లేసి, వ్రయ్యలుగఁ జేసెఁ దచ్ఛరీరంబు నెల్ల.

క. ఆయెడ వసుమతి మహిషీ, కాయము ధరియింప నదియుఁ గనుఁగొని క్షోణీ
నాయకుఁడు దానిమేనను, సాయకములు నించె నడుగు సాగక యుండన్. 487

గీ. అపుడు గత్యంతరము లేమి నాధరిత్రి, తాల్చి గోరూపమును మింటిదారిఁ బట్టె
నది గ్రహించి మహీపాలుఁ డాగ్రహమునఁ, దగిలిచెను నూఱుకోలలు దానిమేన.

వ. అంత నాధేనువు దత్సాయకప్రచండాభిఘాతబాధావివశాంగి యయ్యును నాత్మ
రక్షణపరవశాంతరంగ యగుటం జేసి క్రమ్మఱక యొక్కపూఁపున వ్యోమమార్గం
బునం జని చని. 489

సీ. స్వర్గంబునకు నేఁగి శక్రున కెఱిఁగింప, నతఁ డబ్జజునిచెంత కరుగు మనియె
సత్యలోకమునకుఁ జని విరించికిఁ జెప్ప, నతఁడు రుద్రునికడ కరుగు మనియె
కైలాసమున కేఁగి శూలిని బ్రార్థింప, నతఁ డచ్యుతునిదరి కరుగు మనియె
వైకుంఠమున కేఁగి వనమాలిఁ బ్రార్థింప, నతఁడు పృథునియొద్ద కరుగు మనియె

ఆ. కడకుఁ బృథువె తనకు గతి గాఁగ భూదేవి, యరుగుదెంచి వాని శరణుచొచ్చి
నేను ధాత్రి నాఁడుదానిని వధియింప, రాదు నీకు రాజరాజ యనియె. 490

చ. అనుటయు నాతఁ డిట్లనియె నాయమతోడను ధాత్రి లోకనా
శనకర మైనపాతకము సల్పిన నొక్కదాని సంహరిం
చినయెడ సర్వలోకములు చెందు సుఖం బదె మేలో నిన్నుఁ గా
చిన నొకదాని నెల్లరు నశించెద రయ్యది మేలో చెప్పుమా. 491

క. పెక్కండ్రు సాధుజనులకు, నొక్కనివలనను బ్రమాద మొనగూడిన నా
యొక్కనిఁ గెడపుటె ప్రోచుట, తక్కిన పెక్కండ్ర నంద్రు తజ్జ్ఞులు వినవే. 492

చ. అనవుడు ధాత్రి యి ట్లనియె నాతనితోడను దేవ ధర్మమున్
జనులను గావ నీవు జననం బయినాఁడవు నే నెఱుంగుదున్
మనిచెదవేని నన్ను నణుమాత్రము గూడను దాఁటకుండ నీ
పనిచిన కార్యముం జలువుభారము దాల్చెద నాశిరంబునన్. 493

క. అనవుడుఁ బ్రజలకుఁ గావల, సినజీవన మిచ్చుచును వసించెద వేనిన్
నిను మనుచువాఁడ నెప్పుడును, నని పృథుభూపాలుఁ డిలకు నభయ మొసంగెన్.

క. అంతట మేదిని క్షోణీ, కాంతునితో నిట్టు లనియెఁ గాయం బెల్లన్
దంతురిత మయ్యెఁ ద్వచ్ఛర, కృంతనములచే నను గ్రహింపుము నన్నున్. 495
క. అనుటయు నాభూకాంతుఁడు, కనికర మొదవంగ దానికాయంబున నాఁ
టినయమ్ము లెల్ల లాగెను, మునుపటికంటెను సమత్వమును నది యొందన్.
వ. అప్పుడు తదీయానుగ్రహంబునం జేసి ప్రాక్తనమన్వంతరంబులనుండియు విష
మంబుగా నున్న భూప్రదేశంబు లన్నింటికిని సమత్వంబు గలిగి మర్యాదా
శూన్యంబులు గా నున్న దేశంబులకును బురంబులకును గ్రామంబులకును హద్దు
లేర్పడి నదీసాగరతీరంబులందును గిరికుంజంబులందును నరణ్యంబులందును
దీర్ఘంబులందును గర్తంబులందును నతికృచ్ఛ్రంబుగా నివసించుచు లోభంబును
నభిమానంబును మత్సరంబును నసత్యంబును బాపంబును నెఱుంగక ప్రవర్తిల్లు
చుండు ప్రజల కందఱకును నివాససౌఖ్యంబు సమకూరె. అంతటఁ బృథుమహీ
పాలుండు. 497
క. ఫలపుష్పపర్ణమధుజల,ములు జీవనములు గఁ గ్లేశముల నొందుచు నాఁ
కలి దీఱ కుండు ప్రజలను, దిలకింపఁగ లేక యామతిల్లినకృపతోన్. 498
వ. స్వాయంభువమనువును వత్సంబుగా నొనరించి తనహస్తంబు పాత్రంబుగాఁ
జేసికొని యశేషసస్యక్షీరంబుధారావర్షంబుగాఁగురియవసుంధరాధేనువునుబిదికె.
ఆ. అమృతకల్ప మైనయాయన్నమునఁ దృప్తి, పితరులకును సురల కతిథులకును
జలుపుచును నఖండసౌఖ్యంబులను గాంచు, చుండి రెల్లజనము లుర్విలోన.500
క. రేవాతీరమ్మునఁ బృథు,భూవరుఁ డొకకొన్ని నగరములు తనపేరన్
గావింపఁ జేసి ధాత్రీ, దేవుల నం దునిచె శాశ్వతికవృత్తులతోన్. 501
క. అనురంజన మొనరించుచు, జనులకు ననిశమును యుక్తశాసనుఁ డగుచున్
గొనియెను నలువురిలోఁ గో, రనిఫలముగఁ బృథువు రాజరా జనుయశమున్.
సీ. కావించుచుండిరి క్రతువులు బ్రాహ్మణుల్, వర్షించుచుండెను వారిదములు
చేయుచుండిరి దుష్టశిక్షలు క్షత్రియుల్, ఫలపూరితము లయ్యెఁ బాదపములు
నుర్వి దున్నక పండుచుండె నయ్యె నశేష, ధేనువులును గామధేనువులు గ
గిటిలోన నిలు చుండె గిరులు సముద్రముల్, ధర్మమార్గముఁ బ్రజల్ దాఁటరైరి
ఆ. లేదు వాయుభీతి లే దగ్నిభీతియు, లే వకాలమృతులు లేవు రుజలు
దుష్కృతంబు లేదు దుర్భిక్షమును లేదు, రాజ్య మేలుచుండ రాజరాజు. 503
వ. ఆసమయంబున మహర్షిప్రేరణంబునఁ జతుర్ముఖ యాగోద్భవు లగుసూతమా
గధవందిచారణు లరుదెంచి యమ్మహారాజుగుణంబులు మనోజ్ఞంబుగా స్తుతి
యించుటయుఁ బృథుండు సంతసించి వారలకు సూతమగధకళింగహైహయాది
దేశంబులు బహుమానంబుగా నొసంగె. 504

క. అది మొదలుగ సూతాదులు, పదుగురికిన్ ముదము స్తోత్రపాఠంబులచే
నొదవింపఁ బూనుకొని ర, య్యదియె తదన్వయములకును నాశ్రయ మయ్యెన్.

—: బృహస్పతి మున్నగువారు భూదేవిని బితుకుట :—

వ. మఱియును బృథుండునుంబోలె మున్ను దేవతాజీవనార్థంబు సోముని వత్సంబుగా నొనర్చి స్వర్ణపాత్రంబున నమృతరూపం బగుక్షీరంబు గురియునట్లు దేవగురుండును బితృదేవతాజీవనార్థంబు యముని వత్సంబుగా నొనర్చి రజతపాత్రంబున స్వధాక్షీరంబు గురియునట్లు లంతకుండును సర్పజీవనార్థంబు తక్షకుని వత్సంబుగా నొనర్చి యలాబూపాత్రంబున విషక్షీరంబు కురియునట్లు ధృతరాష్ట్రుండనుసర్పాధిపతియును దైత్యదానవజీవనార్థంబు విరోచనుని వత్సంబుగా నొనర్చి యాయసపాత్రంబున మాయామయక్షీరంబు కురియునట్లు మధుదైత్యాధినాథుండును యక్షజీవనార్థంబు వైశ్రవణుని వత్సంబుగా నొనర్చి యయస్పాత్రంబునందు నంతర్ధానమయక్షీరంబు కురియునట్లు మణిధరునితండ్రి యగు రజతనాభుండును రాక్షసపిశాచజీవనార్థంబు సుమాలిని వత్సంబుగా నొనర్చి శవకపాలపాత్రంబున శోణితక్షీరంబు కురియునట్లు మహాబలుం డగురజతనాభుండును గంధర్వాప్సరోజీవనార్థంబు చిత్రరథుని వత్సంబుగా నొనర్చి పద్మపాత్రంబున గాంధర్వక్షీరంబు గురియునట్లు సురుచి యనుగంధర్వపతియును బర్వతజీవనార్థంబు హిమవంతుని వత్సంబుగాఁ జేసి సానుపాత్రంబున నానావిధరత్నౌషధిక్షీరంబు గురియునట్లు మేరుపర్వతరాజంబును సకలపాదపజీవనార్థంబు ప్లక్షంబును వత్సంబుగా నొనర్చి పాలాశపాత్రంబున సలిలక్షీరంబు గురియునట్లు సాలవృక్షరాజంబును నావిధంబునన సిద్ధవిద్యాధరగుహ్యకచారణాదులును దత్తద్వత్సపాత్రవిశేషంబులచే స్వస్వవాంఛానుకూలం బగుక్షీరంబు వర్షించునట్లు సర్వకామదాయిని యగుమేదినీధేనువును బితికిరి. సర్వలోకశ్రేయోజనయిత్రి యగునీమహాలక్ష్మి క్రమంబుగా మధుకైటభమేదఃక్లప్త యగుటం జేసి మేదిని యనియును బృథువుచేఁ బాలింపఁబడుటం జేసి పృథివి యనియును బ్రసిద్ధిం బడసె.

క. కావున మువ్వుర మూర్తులు, దేవతలకు నెట్లొ యట్లె ధ్యేయుఁడు పృథుధా
త్రీవరుఁడు ప్రజల కెల్లను, బావనచరితులు ప్రణామపాత్రులు గారే. 507

ఆ. ఆదిరాజచరిత మత్యద్భుతము చది, వినను విన్న జాహ్నవీస్రవంతి
ననుదినమును దీర్థమాడినఫల మొంది, కడకు విష్ణుపదము గాంచు నరుఁడు. 508

క. అనుటయు నత్యానందం, బును జెంది యఖండపాపములు చేసినవే
మున నెట్లు శుద్ధి గలిగెను, వినిపింపుము సూత మాకు విశదము గాఁగన్. 509

వ. అని మహర్షు లడుగుటయు వారికి సూతుం డి ట్లనియె. 510

—: వేనునిచరిత్రము :—

ఆ. పాపములు తొలంగుఁ బాపాత్ములకుఁ దీర్థ, సంగమునను సుజనసంగమునను
నటులె పాతకములు ఘటియిల్లుఁ బాపుల, సంగమునను జేసి జంతువులకు. 511

ఆ. కాన వేనునకును గలిగెఁ బుణ్యాత్ముల, దర్శనంబు మఱియు స్పర్శనంబు
దానఁ జేసి యతఁడు ధర్మాత్ముఁ డయ్యెను, సకలపాపములును సమసిపోయి.

క. సత్పురుషులదర్శనమును, సత్పురుషులస్పర్శనంబు సంభాషణముల్
సత్పురుషులతోఁ గలిగిన, సత్పురుషులె యగుదు రెట్టిసంకరు లైనన్. 513

వ. అనుటయు నమ్మహర్షులు తీర్థసంగసంజాతపుణ్యంబునకు దృష్టాంతంబుగా నొక్క
గాథ వచియింపు మని యడుగ సూతుం డి ట్లనియె. 514

—: తీర్థసంగమునఁ గలుగుపుణ్యమును నిరూపించుట :—

క. కలఁడు మృగవ్యాధుం డొకఁ, డిలాతలంబునను నాతఁ డెప్పుడును మృగం
బులఁ జంపుచుఁ దన్మాంసా, దుల మెక్కుచు నుండు మిగుల దుష్టాత్ముండై.

క. అటు లుండఁగ నొకనాఁ డతఁ, డటవీస్థలి కేఁగి యచట నరిగెడిమృగి యొ
క్కటి గనఁబడ దానిని జం, పుటకై చాపమున బాణమును సంధించెన్. 516

గీ. అది కనుంగొని యాలేడి బెదరి బెదరి, పరువులెత్తుచు నొకకొండపైకిఁ బోయెఁ
దఱుముచును దానివెంటన తగిలి వాఁడు, కడకు నెటులేని యది యున్నకడకుఁ జేరె.

వ. అప్పుడు రేవాజలంబునందు మత్స్యములఁ బట్టుచున్నకైవర్తుఁ డొక్కఁ డాలేడిం
జూచి తన్మాంసగృధ్నుండై తత్ప్రాంతప్రదేశంబునకుం జని గుఱి చూచి దాని
మేన నొక్కసాయకంబు ప్రయోగించె. దైవికంబుగా నాసమయంబునంద
మృగవ్యాధుండును దానిపైని నారసంబు విడిచె. 518

క. ఆయమ్ములు రెండును జని, యాయమ్ములు నాఁటుకొనఁగ నప్పుడె రేవా
తోయమునఁ బడియె నామృగి, కాయము గిరినుండి యశనికాయము తొలఁగన్.

వ. అంత నాశబరమృగఘాతుకు లిరువురును 'నాలక్ష్యంబునీ వేల కొట్టితి. నాలక్ష్యంబు
నీ వేల కొట్టితి'వని యన్యోన్యంబు గలహించుకొని దురాగ్రహంబున బాహు
దండంబుల నెట్టుకొనుచు నటనుండి నర్మదాసలిలంబునం బడి ప్రాణంబులు విడిచిరి.

గీ. అమ్మహానదిలోనఁ బర్వమ్మునందుఁ, బడినకతమున మృగికి నాపాపులకును
నూర్ధ్వగతి గల్గెఁ దీర్థసంయోగశక్తి, యఘముల దహించు సమిధల నగ్నిపోలె.

క. అనుటయుఁ దపోధనులు సూ, తునితో ని ట్లనిరి మృత్యుదోషంబున వే
నున కొదవె దోష మంటివి, మునిపుంగవ చెపుము దానిమూలము మాకున్.

—: మృత్యుదోషనిరూపణము :—

చ. అనుటయు సూతుఁ డి ట్లనియె నమ్మహనీయులతోడ మృత్యు వ
న్నను యముఁ డన్న ధర్ముఁ డనినన్ సమవర్తి యొకండ వాఁడు చే

సినపని పాప మైనఁ దోడ శిక్ష యొనర్చును నెట్టివానికై
నను దగినట్లు పుణ్య మయినన్ సమకూరుచు స్వర్గసౌఖ్యమున్. 523

క. కామక్రోధాదులకతఁ, డేమాత్రము గూడ లొంగనీయక మనమున్
నేమంబున వర్తిల్లెడి, సామర్థ్యముతోడ లోకశాసకుఁ డయ్యెన్. 524

ఆ. సర్వసమతచేత సమవర్తి యనియును, ధర్మవర్తనమున ధర్ముఁ డనియు
నతఁడు చెందఁగలిగె నన్వర్థనామము, లతనిఘనతఁ జెప్ప నవియె చాలు. 525

—: సునీథాచరిత్రము :—

గీ. అతనికి సునీథ యనునొకయాత్మజాత, కలిగి వర్ధిల్లుచును జంద్రకళ యనంగ
నొకదినంబునఁ జనియెను సకులతోడఁ, గలిసి విహరింపఁగా నొకగహనమునకు.

వ. అట్లు చని యాయమ సఖులతోడం గూడి విహరించుచుండుసమయంబున.

క. ఆవనమున నొక్కెడ దీ, తావిధిని సుశంఖుఁ డనెడిగంధర్వుఁడు వా
గ్దేవినిగూర్చి తపంబున్, గావించుచు నుండి యామెకంటన్ బడియెన్. 528

ఉ. ఆతనిఁ జూచి యాయమ రయంబున నచ్చటి కేఁగి తజ్జటా
వ్రాతముఁ బట్టి లాగుటయు వాఁడు కనుంగవ విచ్చి చూచి య
మ్మా తగ దీయకార్య మన నంతటితోడను బోక కొట్టె నా
పాతకురాలు దండమునఁ బాపము తత్తను వెట్టువాఱఁగన్. 529

క. కొట్టుటయు నాతఁ డాయమ, కిట్టు లనియెఁ బుత్రి కోప మేటికి నాపైఁ
దిట్టినను దిట్ట రార్యులు, కొట్టరు కొట్టినను దెలిసికొని వర్తిలుమీ. 530

క. అనుటయు సునీథ తనజన, కునికడ కరుదెంచి కానకున్ జని యటఁ దా
నొనరిచినపాప మంతయు, వినిచిన నతఁ డూరకుండె విననివిధమునన్. 531

ఆ. అంత మరల నామె యరిగి కాననమున, కత్తపస్వి నాగ్రహమునఁ గొట్టెఁ
గశలతోడ మేను గాదలు గట్టంగ, నప్పు డతఁడు కనుల నిప్పు లురల. 532

గీ. ఓసి పాపాత్మురాల నీచేసినట్టి, పాపకర్మంబునకుఁ దగుఫలము గాఁగఁ
బ్రథమగర్భంబుననె మహాపాపి నీకుఁ, బుట్టఁగలఁ డంచు శాపమువెట్టి చనియె.

ఉ. అంతట నాసునీథ తనయావసథంబున కేఁగి యెల్లవృ
త్తాంతము తండ్రికిన్ వినుప నాతఁడు పుత్రిని జేర్చి కౌఁగిటన్
సంతతి లేక లేక కనినారము తల్లి నటంచు నాత్మలో
సంతస మొందుచుండఁ గనఁ జాలక పోయెను దైవ మక్కటా. 534

ఆ. అమ్మ యేల పోతివమ్మ ఘోరారణ్య, మునకు నచట నెటనో ముక్కుమూసి
కొని వసించియున్నముని నేల కొట్టితి; వమ్మ యెంత కెంత యయ్యె నకట.

క. అని కొంతతడవు చింతి, ల్లినవాఁ డయి దాన లబ్ధి లేశంబును లే
దని యెంచి వెదక సాగెను, ననుకూలుం డైనవరుని నాకన్నియకున్. 536

క. మునిశాపకారణంబున, ననిమిషులం దెవఁడును గూడ నాకన్యను గై
కొన నొప్పికొనమి లజ్జా, వనతాననుఁ డగుచు యముఁడు వగచుచు నుండన్.
ఆ. అనునీథ యతనియంతికమున కేఁగి, తండ్రి యెప్పుడుఁ గూడ దైన్య మొఱఁగ
నట్టినీకుఁ గానవయ్యె నాననమున, నింతదీనభావ మేల చెప్పుమ. 538
క. అని యడుగుటయును యముఁడి, ట్లనియెను మాతల్లి సురలయందొకఁ డైనన్
నినుఁ జేసికొనఁగ నొల్లఁడు, మునిశాపమె దీని కెల్ల మూలం బయ్యెన్. 539
క. సాధు వగువాని నెవ్వఁడు, బాధించునొ వాఁడు పాపపరిలిప్తుఁ డగున్
బాధించువాని మరలను, బాధించెడివాఁడు వానిపాపముఁ జెందున్. 540
క. కావున నెవ్వని కైనను, గావింపఁగ రాదు బాధ కావించితి వా
పావనున కీవు ద్రోహము, కావించెను నీకు నది యఘంబు కుమారీ. 541
ఆ. నీకతమున మాకు శోకంబు ప్రాప్తించెఁ, గన్నకడుపుగానఁ గన్నతల్లి
యేమి చేయువార మింకమీఁద నాకొల, తొలఁగునట్లు తపము సలుపుమమ్మ.
క. అనుటయు సునీథ జనకుని, యనుజ్ఞ గొని కాననమున కరిగి తపంబున్
బొనరింపఁ బోవునవసర, మున రంభాద్యప్సరస్సమూహము రాఁగన్. 543
గీ. వారి కెఱిఁగించె నిజతపఃకారణంబు, సర్వమును నామె యంత నాచంద్రముఖులు
కఠినతప మేడ నీమృదుకాయ మేడఁ, దగునె యీసాహసము నీకుఁ దన్వి చెప్పుమ.
క. మృదు వగుశిరీషసుమమును, బదను గలకుశాగ్రమునను బఱియలు సేయం
గదలెడునీయుద్యోగము, మదికి విషాదంబు గొలిపె మానిని మాకున్. 545
గీ. కాయశోషణకర మగుకార్య మీవు, విడిచిపెట్టుము మామాట వినుము తల్లి
బ్రహ్మవిష్ణుమహేశ్వరప్రభృతులకును, గలవు దోషంబు లిఁక నీకుఁ గలుగు టెంత.
సీ. ఖండించె విధిమస్తకంబు నీశానుండు, పలికె నసత్యంబు పద్మయోని
భార్గవశాపంబు పడసెను విష్ణుండు, పాకారి గావించె బ్రహ్మహత్య
చంద్రుండు గురుదారసాంగత్య మొనరించె, గుహ్యకాధీశుఁడు కుష్ఠి యయ్యె
నుద్భవించెను నగస్త్యుండు కుంభమునందు, భానుతనూజుండు పంగు వయ్యె
గీ. నట్టిమహనీయులచరిత్ర లిట్టు లుండ, నింక నన్యులచరితంబు లెన్న నేల
చంచలేక్షణ వా రొనరించినట్టి, దోషములలోన నీ కున్నదోష మెంత. 547

—: ఉత్తమస్త్రీగుణకథనము :—

వ. కన్యామణీ యుత్తమాంగనల కుండవలసినరూపంబును శీలంబును సత్యంబును నార్యత్వంబును ధర్మంబును సతీత్వంబును దార్ఢ్యంబును సాహసంబును గానంబును వ్యవసాయంబును గామంబును మధురవాక్యంబును నను ద్వాదశగుణంబులును నీయొద్దఁ గనంబడుచున్నయవి. 548

ఉ. నీవు భయంబు జెందకుము నీరజలోచన సర్వలోకసం
భావితకీర్తిశాలి యగుభర్త లభించెడియుక్కువిద్దియున్
గావలె నన్న నీకు నొసఁగంగలవారము మేము నావుడున్
భావమునందు నాయమ యపారకుతూహల ముద్భవిల్లఁగన్. 549

ఆ. అక్కలార మీకు ననుజపైని ననుగ్ర, హంబు గలిగెనేని యనినమాట
సార్థకంబు గాఁగ నామహావిద్యను, నొసఁగి సుకృతఫలము నొందరమ్మ. 550

క. అనుటయును బురుషసమ్మో, హనవిద్య నొసంగి వార లామెకుఁ దన్వీ
కనుఁగొనియెద వేతన్మహి, మను రమ్మిఁక బయలుదేఱి మాతో ననుచున్.

గీ. వారిపైఁ గల్గినట్టివిశ్వాసమునను, నావధూమణి వారల ననుసరించి
చనియె భాగీరథీతీరమునకు నందుఁ, గానఁబడియెను నామెకు మానియొకఁడు.

క. తిలకించి రూపరేఖా, దులవలన నవీనమన్మథుం డనుబుద్ధిం
గలిగించుచుండునాతని, నలివేణి వచించె నిట్టు లాచానలతోన్. 553

ఆ. సకియలార యీప్రసన్నమూర్తి యెవండో, తెలుపరమ్మ నాకుఁ దేటపడఁగఁ
గన్నుఁగవకు శీతకరునిచాయ నితండు, కలుగఁజేయు చుండెఁ గౌతుకంబు.

వ. అనుటయును నాయమకు రంభ యిట్లనియె. 555

సీ. అవ్యక్తసంభూతుఁ డైనబ్రహ్మకుఁ బుట్టె, నత్రిప్రజాపతి యనఘమూర్తి
యతని కంగుం డనునాత్మజుం డుదయించె, నాయంగుఁ డొకసమయంబునందు
నందనోద్యానంబునకుఁ బోయి కని మహా, విభవంబుతో నున్నవిబుధపతిని
నాహ్లాదమును జెంది యతనిఁ బోలినపుత్ర, రత్నంబుపై మనోరథము గలుగ

గీ. నదియె మొదలుగ దీక్షతో నాచరించెఁ,దపము నారాయణుండు ప్రత్యక్షమయ్యెఁ
గోరె నతఁ డింద్రనిభుఁడైనకొమరు నొకని, నట్లెయగు నని వర మిచ్చి యరిగె శార్ఙ్గి

గీ. యంతనంగుఁడుమంచికన్యనువరింప, నెంచుచున్నాఁడుమది రాక్షియితఁడెయతఁడు
నీవు గూడను మంచివానిని వరింప, నెంచు చున్నావు విధియోగ మెట్లు కలదొ.

క. అనుటయు సునీథ మనమున, జనియించినయాసతోడ సకియా యిపు డే
నొనరింపఁదగిన దేమియొ, వినిపింపఁగదమ్మ నీవు వేగమె నాకున్. 558

క. అని వేఁడుటయును రంభా, వనజేక్షణ యిట్టు లనియె వైవస్వతనం
దనతోడఁ గలికి గానం, బొనరింపుము వీనిహృదయ ముప్పొంగారన్. 559

గీ. అనుటయును నాసునీథ యత్యద్భుతముగ, గాన మొనరించుచును మేరుకందరమున
కరిగె నాభామినులతోడ నరుగుదేర, నంత నంగుఁడు తద్గాన మాలకించి. 560

గీ. పరవశీకృతుఁ డగుచు సత్వరమ లేచి, యరిగి గానంబు వినవచ్చునట్టికడకుఁ
గనియె నచ్చోట నప్సరఃకమలముఖుల, నడుమ రతివోలె రాజిల్లునాతి నొకతె.

క. కనుఁగొని యామెను దన్మో, హనవిన్యాసమోహితాత్ముఁడయి యంగుం డి
ట్లని యడిగెఁ దన్వి నీ వె, వ్వనిపుత్త్రివొ యేటికిటకు వచ్చితొ చెప్పుమా. 562

క. అనుటయు నాయమ లజ్జా, వనతానన యగుచు సఖులవంకను గ్రేఁగం
టను జూచుచుండ రంభా, వనజేక్షణ దొడఁగె నిట్లు వానికిఁ జెప్పన్. 563

క. అనఘా యీయమ ధర్ముని, తనయ సునీథాభిధాన తనకుఁ దగిన నా
థునికొఱ కన్వేషించుచుఁ, జనుదెంచిన దిటకు మాదుసాహాయ్యమునన్. 564

క. అనుటయుఁ దనవృత్తాంతం, బును నంగుఁడు వినిచి సర్వమును మానిని మీ
యనుఁగుంజెలి నను వరియిం, చిన యెడ నావిష్ణువరము సెందు ఫలంబున్. 565

చ. అనుటయు రంభ యిట్లనియె నాతనితోడ మహాత్మ నీవు కో
రినయటు లీవధూమణి వరించును గాని పరిత్యజింప నీ
వనితను నెట్టికష్టములు వచ్చినఁ గూడ నటంచు నీమెచే
తను జెయి యుంచి పల్కుము ముదం బగు మాకును నీకు నీమెకున్. 566

క. నావుడు నట్టులె యంగుఁడు, కావించి సునీథ నపుడె గాంధర్వవిధిన్
గావించుకొనియెఁ బత్నిగ, దేవాంగన లంతఁ జనిరి త్రిదివంబునకున్. 567

గీ. అంగునకు నంతట సునీథయందుఁ గలిగె, నమరపతిసన్నిభుం డైనయాత్మజుండు
వాని కొనరించె నంగుఁడు వేనుఁ డనెడి, నామకరణంబు సంతోష మాముతిల్ల.

క. వేనుం డుదయం బొందిన, భానుఁడువలెఁ బ్రభలతోడ భాసిల్లుచు వి
జ్ఞాని యయి సకలవిద్యల, లోనన్ దినదినము వర్ధిలుచు నలరారెన్. 569

క. అంతట వైవస్వతమ, న్వంతర మేతెంచుటయును నధిపతి లేమిన్
జింతించి ఋషులు ధరణీ, కాంతునిఁగ నొనర్చి రఖిలగణ్యుని నతనిన్. 570

ఆ. అంత నాధిపత్య మతఁ డొంది క్షత్త్రియ, సంప్రదాయమునను సర్వజనుల
నేలఁ దొడఁగె సురల నింద్రుఁడువలె ధర్మ, మార్గ మించుకేని మాయకుండ.

—: వేనుఁడు జైనమతప్రవిష్టుఁ డగుట :—

గీ. అట్టు లేలుచునుండ రాజ్యంబు నతఁడు, ధర్మసంరక్షణైకతాత్పర్యమునను
గానికాలంబు వచ్చినకరణి నొక్క, ముండి యరుదెంచె నా వేనుఁ డుండుకడకు.

గీ. కరమునను నారికేళవికార మైన, పానపాత్రంబు గక్షను బర్హిపింఛ
మార్జనియుఁ దాల్చినగ్నుఁడై మానివోలెఁ, గానఁబడువానిఁ గనుఁగొని వేనుఁ డంత.

క. స్వామీ యీవేషంబున, నేమి కతంబునను నిచటి కేతెంచితి నీ
నామస్వరూపమహిమము, లేమియొ తెలియంగ నాకు నిచ్చ జనించెన్. 574

చ. అనుటయు ముండి యిట్లనియె నాతనితోడను నాస్వరూప మే
మని వచియింతు నేను సకలాత్ముఁడ జ్ఞానమయుండ బ్రహ్మనం

దనుఁడను సత్యసంధుఁడ సనాతనుఁడన్ జినుఁ డంచు నన్నుఁ జే
ర్కొనెదరు నేను యోగులకు గోచరమయ్యెద ధ్యానవీథిలోన్. 575

చ. అనవుడు వేనుఁ డి ట్లనియె నాతనితోడను జైనధర్మముల్
వినిచెదేని నాకు విన వేడుక యయ్యెడు దేవ నావుడున్
జినుఁడు హసన్ముఖుం డగుచుఁ జెప్పఁగ నిట్లు దొడంగె భూవరా
వినుము యథార్థముల్ వినఁగ వేఁడుక నీ కొనగూడె నేనియున్. 576

క. ధర్మము ధర్మం బందురు, ధర్మంబు నెఱింగినట్టితత్త్వజ్ఞులె యీ
కర్మఠులు నిజము చెప్పెద, ధర్మ మనఁగ సర్వభూతదయ యొకటె సుమీ. 577

క. అర్హుఁ డగు దేవుఁ డన్నను, నర్హుంతుఁ డొకండె యని తదాఖ్యయె తెలుపున్
బర్హిర్ముఖు లగువారి క, నర్హంబులు దేవు లనెడియభిధానంబుల్. 578

క. పరమసుఖం బాసించెడి, పురుషుల కర్హుంతుఁ డొకఁడె పూజింపఁ దగున్
గురువులె గ్రంథాపేక్షులు, గురు వన నిర్గ్రంథుఁ డొకఁడె కువలయనాథా. 579

గీ. యజనమును యాజనమును సంధ్యయును నగ్ని
హోత్రమును స్వాహయును స్వధయును దపంబు
దానమును నధ్యయనమును దర్పణమును
నతిథిపూజయు వ్యర్థము లవనినాథ. 580

గీ. పంచభూతాత్మకము గళేబరము మారు, తాత్మకుం డాత్మ సంప్రాప్త మయ్యెనేని
యంతకాలంబు కనరాక యాత్మ పోవుఁ, దనువు చేరును బంచభూతములలోన.

గీ. భూతసంయోగ మవనీంద్ర బుద్బుదముల, కరణి నిమిషంబులోపలఁ గలుగుచుండు
మాటలోఁబోవుచుండునీమాత్రమునకె, మోహసంబద్ధు లగుదురుమూఢమతులు.

క. జననాథ యిది యి టుండఁగఁ, జనిపోయినజంతువులకు శ్రాద్ధాదులతోఁ
బని యేమి ఛాందసులు చె, ప్పినమాటలె చెఱచె జనులఁ బెద్దలె వారల్. 583

గీ. శ్రద్ధతోడను శ్రాద్ధంబు సలిపెనేని, తృప్తిపడుదురు పితరు లాతృప్తివలన
శ్రేయములు గల్గు నని చెప్పి చిత్రముగను, భూసురులు తిని పోదురు పొట్ట నిండ.

క. వేదంబులలోఁ గలయను, పాదేయంబులను విన్నపక్షంబునఁ జీ
కా దనుచుఁ దగులఁబెట్టవె, వేదంబుల నెల్ల నొక్కవ్రేల్మిడి నధిపా. 585

సీ. అశ్వంబుఁ జంపిన నశ్వమేధమునందు, దేవలోకంబు ప్రాప్తించునట్టె
నరమేధమునయందు నరునిఁ గాఁజేసినఁ, గడ లేనిపుణ్యంబు గలుగునట్టె
యజమును వాజపేయమున ముగించినఁ, బాపంబు లన్నియుఁ బాయునట్టె
గోమేధమునయందు గోహింస చేసిన, గోలోకసుఖము చేకూరునట్టె

గీ. మఱియు నానావిధము లైనమఖము లెన్నొ, నెలకొలిపి మీఁదవానికన్నిటికి నెన్నొ
ఫలములను జెప్పి లోభంబు గలుగఁ జేసె, వేదశాస్త్రార్థ మెంతని విశదపఱుతు.

గీ. దోషరహితము లైనజంతువులహింస, ధర్మ మెట్లగు ఫల మెట్లు దానఁ గలుగు
జీవహింసను ధర్మంబు చేసినట్టి, వేదములు వేదములె యెంత వెఱ్ఱితనమొ. 587
క. దయ లేనివాఁడు బ్రాహ్మణుఁ, డయినను శూద్రుండ సదయుఁ డగునెడ శూద్రుం
డయినను విప్రుఁడ ధర్మము, దయకంటెను లేదు మోక్షదాయక మధిపా. 588
గీ. అనుటయును వేనుఁ డాతనిఁ గని మహాత్మ, స్నానదానంబు లొనరించనేని పుణ్య
తీర్థములలోన ముక్తి ప్రాప్తించుననుచుఁ, బలుకుచుఁ దానితత్త్వంబు దెలుపుమనియె.
చ. అనుటయు వాని కిట్లనియె నాతఁడు భూప పయోదముల్ జలం
బును గురియించు నాజలమె భూమిధరంబులమీఁద భూమిమీఁ
దను బడి పాఱుతెంచుచు హ్రదంబులు గూపములుం దటాకముల్
వనధులు దీర్ఘముల్ నదులు వాఁకలు నాఁగను బేర్కొనం బడుం. 590
క. ఒకజలమె పుణ్యతీర్థం, బొకచోటను నైనఁ గాకయుండునె యొకచో
నొకచోటఁ గాకయుండిన, నొకచోటను నగునె యేల యుత్ప్రేక్షణముల్. 591
క. సలిలమున మునిఁగినంతనె, కలిగినయెడ ముక్తి యేల కలుగక యుండుం
జలమునన సంతతంబును, మెలఁగెడుకుంభీరకమఠమీనాదులకుం. 592
క. ఇప్పు డొసంగినదానికిఁ, దప్పక పదిరెట్లు గాఁగ దాత మృతుండై
నప్పుడు ఫలముం గొను నని, చెప్పెదు రామాట విశ్వసింపం దగునే. 593
క. జీవుం డుండినచోటనె, భూవర తీర్థమును ధర్మమును బుణ్యంబుం
దైవమును నుండు జీవుఁడు, వోవునెడల వానివెంటఁ బో దొక్కటియుం. 594
గీ. అనుటయును ముండి పాదంబు లంటి మ్రొక్కి, వేదధర్మంబు వేనుఁడు విడిచిపెట్టె
మృత్యువునకు స్వపుత్రిపై నెనసినట్టి, లోభమె నిదాన మయ్యె నీలోపమునకు.
క. అనుటయుఁ బృథువు జనించిన, యనంతరము వేనుఁ డేమి యయ్యెనొ మాకుం
వినిపింపు మనుచు వాంఛిం, చిన మునులకు సూతుఁ డిట్లు చెప్పఁ దొడంగెం.
క. సూనుం డుదయం బగుటయు, వేనుఁడు తనచెందినట్టివిషమస్థితికిం
మానసమున దురపిల్లుచుఁ, గాననమున కేఁగెఁ దపము గావింపంగం. 597
ఆ. అటులు కాననమున కరిగి వేనుఁడు మహా, ఘోరతపము హరినిగూర్చి చేయఁ
బద్మలోచనుండు ప్రత్యక్షమై యేమి, కోరుకొనెదొ వత్స కోరుకొనుము. 598
చ. అనుటయు వేనుఁ డిట్లనియె నంబుజనేత్రునకుం బ్రణామముం
బొనరిచి దేవ నాదురితముల్ హరియించి భవత్పదంబునం
దునుపుము నన్ను నం చనుటయుం శమియించెను వత్స నీతపం
బుననె సమస్తపాపములుఁ బొందినవాఁడవు పారిశుద్ధ్యముం. 599
క. ననుఁగూరిచి నీజనకుం, డొనరించి తపంబు వరము నొందెను నాచే
తనుదాన నీవు నాపద, మొనగూడును గోరు మింక నొక్కవరంబుం. 600

క. అని శార్ఙ్గి పలుకుటయు ని, ట్లనియెను వేనుఁడు దేవ యవ్యక్తంబై
యొనసిననీతత్త్వంబును, వినిపింపుము నాకు సరవిని వే శామిటికిన్. 601
వ. అని ప్రార్థించుటయు నారాయణుండు సానుగ్రహంబుగా వేనునితో నిట్లనియె.

—: విష్ణువు నిజస్వరూపము నిరూపించుట :—

సీ. విష్ణునామంబున వెలసితి నవ్యక్త, రూపంబునను జగద్వ్యాపి నగుట
భూతముల్ నాయందు భూతంబులందు నే, నుండుట వాసుదేవుండ నైతి
సంకర్షణుండ నైతి జనుల నందఱ నంత, మున నాకడకు లాగికొనుటఁ జేసి
ప్రద్యుమ్నుఁ డని పేరువడితి సర్వము నేన, యగుచు సంచెంచి యట్లగుటవలన
గీ. యోగబలమునఁ జేసి యొండొకని చేత, నెన్నఁడును నిరుద్ధుఁడను గాక యున్నకతన
నైతి ననిరుద్ధుఁడను హరి యనిన నేన, హరుఁ డనిన నేన పరమేష్ఠి యనిన నేన.
సీ. జాగ్రదవస్థలో జగదభిమానయు, క్తుండయి యుండువిశ్వుండు నేన
యింద్రియాకారంబు నెనసి స్వప్నమునందుఁ, జరియించుచుండు తైజసుఁడు నేన
యధిదైవరూపంబు నంది సుషుప్తిగ, తుండయి యుండు ప్రాజ్ఞుండు నేన
నిర్వికారుండును నిర్లిప్తుఁడును నిర్గు, ణుండును నగుతురీయుండు నేన
గీ. సచ్చిదానందరూపంబు సర్వసాక్షి, యక్షరంబును నైనబ్రహ్మంబు నేన
నాస్వరూపంబుఁ దెలిసికొనంగ లేఁడు, మత్పదాంభోజభక్తి యేమఱినవాఁడు.
క. అనుటయు వేనుం డిట్లని, యెను దేవ జినుం డనంగ నెవ్వఁడొ పాపం
బును నాకు నేల బోధిం, చెనొ చెప్పుము నాఁగ హరి వచింపఁ దొడంగెన్.
క. జననాథ మును సుశంఖుం, డనుముని బాల్యమునఁ దనకు నపచారంబుల్
బొనరించినకతమున నీ, జననికి దుష్టుఁడు జనింప శాపం బిచ్చెన్. 606
క. నీతండ్రి కఖిలసుగుణో, పేతుం డగుసుతుఁడు గలుగ నిచ్చితి వర మే
నాతఁ డతిఘోరనియమము, చేతను ననుఁగూర్చి తపము చేసినకతనన్. 607
గీ. ఈవరద్వితయమునకు నేరుపడిన, యట్టివైరుధ్యమును మాన్ప నాత్మ నెంచి
ధర్మమున రాజ్య మేలునీదరికి నేన, జినుఁడనై వచ్చి నీబుద్ధి చెఱచినాఁడ. 608
క. జినుఁ డన సునీథ గావిం, చినపాపము వాఁడె నేను జేసినకర్మం
బును ననుభవింపఁ జేసెడి, పని నాయది పుణ్యమైన బాపం బైనన్. 609
గీ. కాన విధియు నిషేధంబు నేన యనుచుఁ, దెలిసికొని యూర్ధ్వగతి నీకుఁ గలుగుటకును
గాలము నెఱింగి తీర్థంబు గని గ్రహించి, పాత్రమును దానముల నొనర్పంగవలయు.
క. చేయుము దశదానంబులు, చేయుము గృహదానములును జేయుము క్రతువుల్
చేయుము సురలకుఁ దృప్తిం, జేయుము భూదేవతలకుఁ జేతఃప్రీతిన్. 611

—: దానకాలపాత్రతీర్థస్వరూపనిరూపణము :—

వ. అనుటయు వేనుఁడు చేతులు జోడించి స్వామీ నాయం దనుగ్రహంబు గలిగ

నేని కాలలక్షణంబును పాత్రలక్షణంబును తీర్థలక్షణంబును దానవిధానంబును బోధింపు మని ప్రార్థించుటయు నారాయణుం డాతని కిట్లనియె. వత్సా దాన కాలంబు నిత్యం బనియును నైమిత్తికం బనియును గామ్యం బనియును నాభ్యుద యికం బనియును నంత్యం బనియును నైదువిధంబులుగాఁ జెప్పంబడియె. కాల ముంబట్టి దానంబుగూడఁ బూర్వోక్తప్రకారంబునఁ బంచవిధంబుగా నయ్యె. అందు నిత్యకాలంబు ప్రాతర్మధ్యాహ్నపరాహ్ణరూపంబునఁ ద్రివిధం బయ్యె. ఆ త్రివిధకాలంబులందును న న్నుద్దేశించి శ్రద్ధాభక్తిపురస్సరంబుగా స్నానంబు గావించి నాయంశంబున నుదయం బైనసూర్యునకు జలం బొసంగుటయు బ్రాహ్మ ణులకు నన్నోదకఫలపుష్పవస్త్రతాంబూలభూషణస్వర్ణరత్నాదిదానంబు గావిం చుటయును బితృదేవతలకుఁ దర్పణాదు లొసంగుటయును ననంతపుణ్యఫల ప్రదంబు. ప్రతిదినంబును ద్రికాలంబుఁ గావింపందగినదానంబులు గావించుచుం డుట ముఖ్యంబు. శక్తి చాలదేని యుక్తకాలంబులం దొక్కకాలంబునం దేని కావించినదానంబు సమస్తకిల్బిషంబుల హరియించి మహాప్రభావంబు గలిగించు. కావున హితార్థి యగువాఁడు నిత్యదానంబు విడువం దగదు. 612

క. దేవతలకు నతిథులకుం, గావింపక తృప్తి భుక్తి గావించెడిదు
ర్భావులకు వ్యాధు లశనా, భావమ్మును గలుగు స్వీయపాపముకతనన్. 613

వ. అమావాస్యయుఁ బౌర్ణమాసియు సంక్రాంతియు వ్యతీపాతంబును వైధృతియు నేకాదశియు నమాసోమవాసరసమాయోగమును గజచ్ఛాయయును బిత్రుక్షయ తిథియును మన్వాదులును యుగాదులును నైమిత్తికకాలంబుగాఁ జెప్పంబడియెడు నాకాలంబునందు. 614

క. ననుఁగూర్చి పాత్రులకు ని, చ్చినదానము స్వర్గమోక్షసిద్ధి నొసంగున్
గనుకను నైమిత్తికమున్, జనదు సుమీ విడువ నాత్మసౌఖ్యార్థులకున్. 615

వ. మఱియును గజరథాశ్వదానంబు చేయువాఁడు సర్వభూతంబులకును నజేయుం డును ధర్మాత్ముండును జ్ఞానవంతుండును నగుమహారాజుగా జన్మించు. భూ దానంబును గోదానంబును జేయువాఁడు సర్వభోగపతి యగు. గుప్తదానంబు గావించువాఁడు నిధిపతి యగు. చీనాంబరదానంబు గావించువాఁడు గుణవంతు లును నాయుష్మంతులును బ్రజావంతులును గీర్తిమంతులును యజ్వలును దత్త్వ జ్ఞానులును నధ్యయనసంపన్నులును నగుబహుపుత్రులచే సౌఖ్యంబు నొందు. సువర్ణభూషణంబులచే నలంకరించి కపిలను దానంబు చేయువాఁడు బ్రహ్మ యుండునంతవఱకును బ్రహ్మలోకంబునందు నివసించి మహాసౌఖ్యంబు వడయు. గోదానంబు గావించువాఁడు సర్వవిద్యాసంపన్నుండును నైశ్వర్యసమేతుండును విష్ణుభక్తుండును నై మేదిని యుండునంతవఱకును వైకుంఠంబునందు వసియించు.

భూషణదానంబు చేయువాఁడు స్వర్గంబునం దింద్రునితో సమానంబుగా దివ్య భోగంబు లనుభవించు. అన్నదానంబును సువర్ణదానంబును గావించువాఁడు నాకుఁ బ్రియుండై నాధామంబునందు నివసించు. వస్త్రహారాలంకృతంబును రౌప్యపిధానంబును బ్రహ్మసూత్రశోభితంబును ఘృతపూర్ణంబును నగుసువర్ణ కుంభమును వేదమంత్రంబులచేఁ బ్రతిష్ఠాపించి షోడశోపచారంబులచేఁ బూజించి పదియాఱుగోవులతోఁ గూడ సదక్షిణంబుగా దానంబు చేసినవాఁడు నశ్వరంబు గానిపుణ్యంబుం బడయు. 616

క. దేవతలఁగూర్చి వ్రతములు, గావించెడికాల మగును గామ్యము దానన్
గావించెడిదానము పు, ణ్యావహ మది సకలకామితార్థము లిచ్చున్. 617

వ. సుతునకు జాతకర్మనామకరణచౌలమౌంజీబంధవివాహాదికార్యంబు లొనరించు కాలంబును బ్రాసాదనిర్మాణకాలంబును ధ్వజదేవతాప్రతిష్ఠాకాలంబును వాపీ కూపతటాకగృహారామస్థాపనకాలంబును మాతాపితృపూజాకాలంబును యజ్ఞ కాలంబును నాభ్యుదయికం బని చెప్పంబడియె. అట్టితరుణంబునం జేయుదానంబు సర్వసిద్ధిప్రదాయకంబు. దానంజేసి ప్రజ్ఞావృద్ధియును ననేకభోగంబులును గలిగి దుఃఖలేశంబును లేక యిహంబున సుఖంబులు వడసి దివంబున మహేంద్రవిభ వంబుల ననుభవించుచుఁ గల్పసహస్రంబువఱకును దనవంశంబు నెల్లను స్వర్గంబు నందుఁ బ్రతిష్ఠాపించు. 618

గీ. మరణ మాసన్న మైనట్టితరుణ మంత్య, కాల మని చెప్పఁబడియె నాకాలమందుఁ
జేయుదానంబు గలుగంగఁ జేయు సర్వ, పాపములు మాపి పరలోకపథసుఖంబు.

గీ. భార్యయును బుత్రపౌత్రులు బాంధవులును, దనకు సద్గతి గలిగింతు రనుచు నెంచి
కొని యుపేక్షించి దానంబు చనినవాఁడు, నమ్మిచెడిపోయినట్టిమానవుఁ డెచూవె.

వ. ఇంకఁ దీర్థస్వరూపంబు నెఱింగించెద. గంగాసరస్వతీరేవాయమునాతాపీ చర్మణ్వతీసరయూఘర్ఘరావేణాకావేరీకపిలావిశాలాగోదావరీతుంగభద్రా భీమ రథీకృష్ణవేణీవేదికాదిమహానదులును సప్తసముద్రంబులును మానసాది సరస్సులును మేర్వాదిపర్వతంబులును యజ్ఞభూమియును శ్రాద్ధభూమియును దేవతామందిరంబును హోమశాలయును వేదాధ్యయనగృహంబును గోష్ఠంబును సోమయాజి నివసించుప్రదేశంబును నారామప్రదేశంబును నశ్వత్థబ్రహ్మవృక్షవట వృక్షాదిపుణ్యవృక్షంబులు గలచోటును దల్లిదండ్రులును గురువును బతివ్రతయగు భార్యయును సుపుత్రుండును బురాణపఠనప్రదేశంబును రాజభవనంబును దీర్థం బులు గాఁ జెప్పంబడియె. తీర్థంబులు గ్రామంబులం దుండినను నరణ్యంబులం దుండినను బావనంబు లగు. తీర్థనామం బజ్ఞాతం బయ్యేనేని విష్ణుతీర్థం బని సంక ల్పించి నన్ను స్మరించునెడలఁ దత్పుణ్యఫలంబు ప్రాప్తించు. 621

క. తీర్థములు నేన మఱియును, దీర్థములం దెల్ల నేన దేవుఁడఁ గానన్
దీర్థఫలం బొసంగెడి, తీర్థాటనపరుల కేనె దిక్కు నృపాలా. 622
వ. ఇంకఁ బాత్రలక్షణంబు నెఱింగించెద.
గీ. శాంతియును దాంతియును దయాశౌచములును
వేదమును జ్ఞానమును దపోవృత్తములును
బ్రజ్ఞయును ధర్మమును బాపభయము విష్ణు
భక్తియును గలవిప్రుఁడు పాత్రుఁ డధిప. 624
వ. కితవుండును గాణుండును నతికృష్ణుండును గపిలవర్ణుండును గర్కటాక్షుండును శ్యావదంతుండును నీలదంతుండును బీతదంతుండును గోదంతుండును బర్బరుండును వాతరోగియును హీనాంగుండును నధికాంగుండును గుష్ఠియును గునఖుండును దుశ్చర్ముండును స్త్రీజితుండును శోకార్తుండును ఖల్వాటుండును నధర్మరత భార్యుండును వ్యాధిగ్రస్తుండును మృతాన్నభోజియును జోరుండును నతిస్తబ్ధుండును శఠుండును సదాచారవర్జితుండును నగు బ్రాహ్మణుండు బ్రహ్మసముండైనను బాత్రుండు గాఁడు. 625
ఆ. పాత్రకాలతీర్థభాగ్యంబు సమకూరు, నొక్కశ్రద్ధవలన నుర్వరేంద్ర
శ్రద్ధతోడఁ బోలఁ జాలినతీర్థంబు, గాని పుణ్యయంబు గాని లేదు. 626
చ. అనుటయు వేనుఁ డి ట్లనియె నంబుజలోచన దేశికుండు నం
దనుఁడును దల్లిదండ్రులును దారయుఁ దీర్థము లెట్లు లైరొ నా
కనువుపడంగఁ జెప్పు మన నాతని కిట్లు వచింపఁజొచ్చె న
వ్వనరుహలోచనుండు జనవల్లభ చెప్పెద నాలకింపుమా. 627

—: భార్యాతీర్థమాహాత్మ్యము :—

సీ. కృకలుం డనెడివైశ్యుఁ డొకఁడు ధర్మాత్ముఁడు, కాశీపురంబునఁ గలిగియుండె
వానికి సుకలాభిధానంబు గలిగిన, భార్య యొక్కతె యుండెఁ బరమసాధ్వి
యొకనాఁడు తీర్థయాత్రకుఁ బోవఁ గృకలుండు,సమకట్టుకొనియున్నసమయమందు
సుకల యి ట్లనియె విశుద్ధాత్మ నీతోడఁ, జనుదెంతుఁ దోడ్కొని చనుము నన్ను
గీ. ననుటయునుగృకలుండుతన్వంగి యేమి,యంచు భావించితివొ తీర్థయాత్ర యనఁగఁ
గఠినభూములలోఁ దిరుగంగ వలయు, నైఁప వలయును క్షుత్పిపాసాశ్రమంబు.
క. కల వింక నెన్నొ కష్టం, బులు సైఁపఁగ లేవు నీవు పూఁబోఁడి మదిన్
నిలిపికొని నన్ను నింటనె, నిలువుము చని శీఘ్రముగ నె నే నరుదెంతున్. 629
గీ. అనుటయును బ్రాణనాథ యి ట్లాడఁ దగునె,ధర్మమునసాయ మొనరింపఁదగినసతిని
భర్తృసాన్నిధ్యమునకంటెఁ బద్మముఖికి, గలదె సౌఖ్యకరం బైన నెల వొకండు.

గీ. ధవునిసవ్యాపసవ్యపాదములు రెండు, వెలసెను బ్రయాగపుష్కరములుగ సతికిఁ
దజ్జలస్నానపానముల్ తప్ప వేఱె, సాధనము లేదు స్వర్గమోక్షములు వడయ.
ఆ. సర్వపుణ్యములును సర్వతీర్థములును, సర్వదేవతలును సతికిఁ బతియ
భర్తృసేవకంటెఁ బర మైనధర్మంబు, గానరాదు పుణ్యకాంతలకును. 632
క. కావున నీసేడను నే, నేవేళనుగూడ నాశ్రయించి భవన్మో
చావహ మగుశుశ్రూషను, గావించుచు నుండు నన్నుఁ గడఁ ద్రోయకుమీ. 633
క. అని సుకలాసతి పలుకుట, యును గృకలుఁడు సమ్మతించియును శాంపాశం
కను నొలుపుసతిస్నేహం, బునను జనియె నామె నిద్రవోయెడువేళన్. 634
క. అంతట నాయమ మేల్కని, కాంతుఁడు తనయొద్ద లేమిఁ గాంచి విషాదా
క్రాంత యయి భర్త విడిచిన, యింతి నయితి ననుచు మిగుల నేవంపడుచున్.
వ. దధిక్షీరఘృతతైలంబులును మధురలవణంబులును దాంబూలంబును వర్జించి యేకాహారయును నేకవేణియును నేకకంచుకయును నగుచు స్థండిలంబున శయనించుచుఁ గ్రమక్రమంబునఁ గృశించుచు సంతతపతినివిష్టమానస యగుచు రేఁబవలును విలపించుచుండఁ దత్సఖీజను లామె నూరడించుచు. 636
గీ. కలికి సంసారవిధమును దెలిసికూడ, నేల విలపింతు వీరీతి జేల వగుచుఁ
బతికి సతికిని నేమి సంబంధ మున్న,యొకనిమేషమె చిత్రనాటకము గాక. 637
క. అన్నము దినమిఁ గృశం బగు, చున్నది దేహంబు నిద్ర యుండనికతనన్
గన్నులలోఁ గలతేజము, సన్నగిలుచు నుండె నెంతసాహస మబలా. 638
క. అనుటయును సుకల యి ట్లని, యెను వారలతోడ సతికి నిహపరములు రెం
డను బలికె యనుట కొకగా, థను జెప్పెద వినుఁడు సావధానుల రగుచున్.

—: సు దే వా చ రి త్ర ము :—

సీ. కలఁడు మహారాష్ట్రకంబు మున్నిక్ష్వాకు, వనుమనుసుతుఁ డయోధ్యాపురమున
దేవరాజనెడు కాశీవిభునితనూజ, యగుసుదేవను బెండ్లియాడి యతఁడు
కావించి యామెతోఁ గలసి సద్గతిదాయ, కము లైనపుణ్యకార్యముల నెల్ల
నొకనాఁ డరణ్యమునకుఁ బ్రియాసహితుఁడై, యరిగి జంతువుల వేటాడు చుండ
గీ. నొక్కకుంజంబునను యూథయుక్తముగను
నున్న యొకసూకరము వాని తెన్ను గాంచి
భార్యతో నిట్టు లనియె నోపడఁతి జేఁడు
వచ్చుచున్నాఁడు నీ విందు వలదు నిలువ. 640
క. అరుగుము శీఘ్రుంబ వనాం, తరమునకున్ బుత్రపౌత్రతతితోఁ గూడన్
నరపతిచూడ్కిని బడినను, మరణము సంప్రాప్త మగును మన కెల్లరకున్. 641

క. అనుటయు సూకరి యి ట్లని, యెను నాథ పతిం ద్యజించి యేఁగుట సతికిన్
జన దెట్టికాలమున నై, నను నీవును రమ్ము వేగ నాతో ననుచున్. 642
ఉ. భామిని పుణ్యమూర్తి యగుపార్థివచంద్రునితోడ నేను సం
గ్రామము సేసి తుచ్ఛమగుకాయముఁ బాయఁ దలంచికొంటి నీ
వీమెయి నుండరా దిచట నేఁగుము వేగమ యంచు సూకర
స్వామి వచింప సూకరి విషాదకషాయితచిత్తవృత్తియై.
గీ. ఎంద ఱాత్మీయు లున్నను నిందుముఖికి, లేనియెడ నొక్కపతి శోభ లేకయుండు
నెన్ని నక్షత్రములు గల్గియున్న నొక్క, రాజు లేకున్న రాత్రికిఁ దేజు గలదె.
సీ. ఆచారహీనుఁ డైనట్టిమర్త్యునిభాతి, జ్ఞానశూన్యుం డైనమానిమాడ్కి
నాత్మజవర్జితం బైనవంశముచాయ, సేనాధిపతి లేనిసేనపోల్కి
దీపంబు లేనిమందిరముచందంబున, మంత్రిరిబు లేనిసామ్రాజ్యమట్లు
నావికుం డొదవనినావ తెఱంగున, వేదహీనుం డైనద్విజునిరీతి
గీ. నీవు లేనట్టియూథంబు నిష్ప్రకాశ, మేల సాహస మొనరింప నెచటి కైన
నందఱము గూడి పోవుద మంతె కాని, ప్రాణవల్లభ యితరమార్గంబు వలదు.
క. అనుటయు సూకర మి ట్లని, యెను భామిని యుద్ధమునకు నే తెంచినవీ
రునితోడఁ బోరకుండఁగఁ, జనినభటుఁడు నరకమునకె చను నాత్రోవన్. 646
గీ. అంబుజేక్షణ రెండుసింహములనడుమ, నిలువఁబడియుండి కోలము నీరు ద్రావుఁ
గోలములు రెంటినడుమను గ్రోల లేదు, జలము హర్యక్ష మనియెడిపలుకు వినవె.
క. చేకొని నీవాక్యంబును, వ్యాకులమతి నై తొలంగిన క్లైనయెడన్
సూకరజాతికి నంతకు, నాకతమునఁ గలుగుఁ గీర్తినాశన మబలా. 648
గీ. భయమువలనను గాని లోభమునఁ గాని, కామమునఁ గాని యుద్ధరంగమును విడిచి
పాఱిపోవుటకంటెఁ బాపంబు లేదు, పాపమున నన్ను సాధ్వి కూల్పంగఁ దగునె.
క. కనుఁగొని యుద్ధపరాఙ్ముఖు, లను శపియింతురు నభస్థ్సలంబున గుంపుల్
గొని యుండుసిద్ధచారణు, లును గంధర్వులును మానులును దేవతలున్. 650
క. మాతకుఁ గలదోషము ప్ర, ఖ్యాతం బొనరించుచును గ్రియాజాతుఁడు నా
నాతఁడు పేర్వడు సమర, క్ష్మాతలమును విడిచి యెవఁడు చనునో భీతిన్. 651
క. వీరుల కానందము చే, కూరుచు యుద్ధంబు సేయఁ గుతుకంపడునా
శూరుఁడు ప్రతిపదమును భా, గీరథిలోఁ గ్రుంకినట్లు కృతకృత్యుఁ డగున్. 652
ఆ. కలవు తీర్థములును గలవు యాగములును, గలవు మూఁడులోకములును నందె
కాన వీరలోకకాంక్షు లర్థింతురు, రమణి సతము సంగరస్థలంబ. 653
క. సమరమున నిజశిరోర, క్తము పానము చేసినట్టిధన్యుఁడు హయమే
ధము చేసినట్టిఫలమును, నిమిషములోపలను జెందు నీరజనేత్రా. 654

క. చనుదెమ్మని పిలుఁడు మూ, ర్కొనుచుండఁగ వాని కెదురుకొని యసువులు వో
సినప్రాణి దేవలోకం, బున నుండి యనేకవర్షములు దీపించున్. 655

క. కావున నానిర్ణయమును, దైవమునకు నైనఁ గాదు తప్పింపంగన్
నీ వేఁగు మింక యూథప, మావృతవై పంకజాక్షి యవిలంబముగన్. 656

క. అనవుడు సూకరి యిట్లని, యెను సూకరమునకు నాథ యేటికి నాకీ
తను వీవు లేనియెడలను, మన నేటికి నేను బనికిమాలినమేనన్. 657

క. నీ వేఁగెడిలోకమునకె, నే వచ్చెద నంతె కాని నిను విడఁజాలన్
నావుడు సూకరము స్వయూ, థావళి నీక్షించి యిట్టు లనియెన్ బ్రీతిన్. 658

ఆ. బిడ్డలార ప్రాణభీతి యేర్పడియె నేఁ, డెల్లరకును మీర లిచటు విడిచి
పొండు వేఱుగహనమునకు శీఘ్రముగను, బ్రతికి యున్న సుఖము పడయవచ్చు.

క. అనుటయు యూథం బిట్లని, యెను దలిదండ్రులను విడిచి యేఁగుట ధర్మం
బనఁబడునె విపత్సమయం, బున నెంతటిహీనజాతిపుత్రుల కైనన్. 660

క. కలదే మఱియొకనరకము, దలిదండ్రులు మరణ మొందుతరుణంబున వా
రల విడిచి చనుటకంటెను, గలిగినసంతతికిఁ జక్కఁగాఁ గనుఁగొన్నన్. 661

క: మిము విడిచి పోము మే మీ, సమయమునఁ గళేబరములు శాశ్వతములె యం
తమునందు ధర్మ మొక్కటె, తమవెంటను వచ్చు దేహధారుల కెల్లన్. 662

క. అనవుడు వానివినిశ్చయ,మునకున్ సూకరము ప్రమదమును జెంది నృపా
లునితోడఁ బోర గర్జన, మొనరించుచు నిల్చె యూథయుక్తం బగుచున్. 663

క. అంతట నిక్ష్వాకుమహీ, కాంతుం డాసూకరమును గనుఁగొని ధీర
స్వాంతు లగులుబ్ధకుల న, త్యంతరయంబునను బనిచె దానిని దునుమన్. 664

క. పనుచుటయు వాయువేగం, బున వనచరు లేఁగి శునకములతోడను న
వ్వనసూకరమును ముట్టిరి, సునిశితబాణములు గురియుచును సోనలుగాన్.

శా. అంతన్ భీషణఘోష మేర్పడఁగ రౌద్రాకారముం దాల్చి య
త్యంతావేశముతోడ నావనవరాహం బాభటశ్రేణిపై
గంతుల్ వైచుచు దూఁకి చీలిచి తదంగంబుల్ విభిన్నంబులై
కాంతారంబున నెల్లెడం బరవఁగా గగ్గోలు గావించుడున్. 666

ఉ. దానిపరాక్రమంబు వసుధాపతి కన్గొని విస్మయోచ్ఛల
న్మానసుఁడై గజాశ్వరథనాయకులన్ బనిచెన్ దదుద్ధతిన్
మానుప నంత వారు చని మార్కొన నక్కిటి రేఁగి కూల్చె నా
సేనల నన్నిటిన్ నిరవశేషముగా నసహాయశూరతన్. 667

క. అప్పుడు కన్నుల నిప్పుక, లుప్పతిలఁగ నాగ్రహమున నుగ్రుం డగుచున్
దెప్పతెరలంగ భూపతి, కుప్పించి హయంబు నెక్కి కోలము నేసెన్. 668

క. ఏసినబాణముతోడనె, డాసి వరాహము మహాకుఠారమువోలెన్
జేసె నిక్కృత్తపదంబుగ, నాసమయంబుననె నృపతిహయరత్నంబున్. 669
క. చరణంబులు తెగి తురగము, ధరపైఁ బడుటయును దుమికి ధరణీంద్రుఁడు స
త్వరముగను గదాదండము, గిరగిరఁ ద్రిప్పుచును వ్రేసెఁ గిటితలమీఁదన్. 670
క. దిమ్మరవోయి గదాఘా, తమ్మున సూకరము ధరణితలమునఁ బడి ప్రా
ణమ్ములు విడిచెను సుమన, స్సమ్ములు గురియంగ దేవసంఘం బంతన్. 671
గీ. దానిదేహంబునుండి గంధర్వుఁ డొకఁడు, భానుబింబంబు తెఱఁగున బయలువెడలి
యంతరిక్షంబునకుఁ బోయె నద్భుతముగ, దెసలు నిజదేహకాంతులఁ దేజరిల్ల.
క. అంతటఁ బతిశోకానల, సంతాపితహృదయ యగుచుఁ జయ్యన ధరణీ
కాంతునిమీఁదికి సూకర, కాంతామణి గవిసె దెసలు గజగజ వడఁకన్. 673
క. అప్పుడు దానికి నెదురుగ, గుప్పునఁ జని యొక్కలుబ్ధకుఁడు పొడువంగన్
ముప్పిడితోడను నది స్మృతి, దప్పి గభీలునను బడియె ధరణీస్థలిపై. 674
క. అంతట సుదేవ కరుణా, క్రాంతహృదయ యగుచు దానికడకుం జని యొ
క్కింతజలంబును దత్తను, సంతాపము శాంతి నొందఁ జల్లెను గేలన్. 675
క. ఆపావనోదకముచే, నాపాదిల్లినప్రబోధ మంది శుభంబుల్
చేపడును గాక నీ కని, యాపోత్రిలతాంగి పలికె నద్భుత మొదవన్. 676
వ. అది యొనర్చినమనుష్యభాషణంబునకు సుదేవ విస్మయము నొంది. 677
సీ. సూకరి నీవాగ్విశుద్ధి చూడఁగ నీవు, పుణ్యమూర్తి వటన్నబుద్ధి పుట్టె
బహుపరాక్రమమును బ్రకటించి దివి కేఁగి, నట్టిపోత్రి మహాత్ముఁ డనుచుఁ దోఁచె
మీచరిత్రములు సమీచీనములు గాన, నాలించుటకుఁ గాంక్ష యంకురించె
సావధానంబుగా నఖిలంబు దెలుపుము, పుణ్యగాథలు విన్నఁ బుణ్య మొదవు
గీ. ననుటయును బోత్రిసతి యిట్టు లనియె సాధ్వి, నీకరంబునఁ జల్లిననీటివలనఁ
బాతకము లెల్ల న న్నెడఁబాసిపోయి, పూర్వకాలప్రబోధము పొడమె నాకు.
క. ఆకారణమున మానవ, వాకును లభియించె నింక వారిజనయనా
సూకరనాథునిచరితము, నాకర్ణింపుము వచింతు నంతయు మొదటన్. 679

—: సూకరపూర్వజన్మవృత్తాంతము :—

సీ. వెలఁది పూర్వము రంగవిద్యాధరుండు నాఁ, గలఁ డొక్కగంధర్వగాయకుండు
మేరుశైలమునకుఁ జేరి యాతఁడు పాడు, చుండె శ్రావ్యంబుగా నొక్కనాఁట
వా దేవతాగాన మచ్చోటఁ దప మొన, ర్చెడిపులస్త్యమహర్షిచెవిని బడియెఁ
దానిచేతను దనధ్యానంబు చెడుటను, ఋషివరుం డాతని కిట్టు లనియె
గీ. గాయకోత్తమ నీదివ్యగానమునను, నిలువకున్నది మది తపోనిష్ఠలోనఁ
గావునను నీవు వే ఱొండుకడకుఁ బొమ్ము, తపమునకు సాయ మొనగింపఁ దలఁచితేని.

క. అనుటయు గంధర్వుం డి, ట్లనియెను సీమనము నిలువన ట్లైనయెడన్
జను మీపై వేఱుచోటికి, ననుఁ బొమ్మన నేల నీవు నా కధిపతివే. 681

గీ. అనుటయును మాఱుమాటాడ కమ్మహర్షి
విడిచి యచ్చోటు చని యొండువిపినమునకుఁ
దపము గావింపఁదొడఁగె శాంతముగ నచటఁ
గాలు ద్రవ్వెనె ప్రాజ్ఞుఁడు కలహమునకు. 682

గీ. అచటు విడనాడి యమ్ముని యరిగినంత, గాసము ననాదరించినవానితపము
చెఱుపఁగావలె ననియెడిచెడుతలంపు, గలిగె గంధర్వునకుఁ గాలగతిని జేసి. 683

గీ. అంతట నతండు వెదకుచు నరిగి యరిగి, కట్టకడ కెట్లొ యప్పారికాంక్షి యున్న
కాననముఁ జేరి సూకరాకారమునను, ద్రవ్వఁ దొడఁగెఁ దదాశ్రమస్థలము నెల్ల.

ఆ. అటులు త్రవ్వుచుండ ననుదినంబును బశు, వనెడిభావమునను నమ్మహర్షి
యోర్చుకొనుచు నుండె నోర్చినకొలఁదిని, భయము విడిచివాఁడు ప్రబలుఁడగుచు.

క. ఎదుటనె మలమూత్రంబులు, వదలుచు నమ్మౌనిమీఁద వాలముతోడన్
విదిలించుచు గోండ్రించుచుఁ, గదలక తోలినను గువ్వకరిగొను చుండెన్. 686

ఆ. అమ్మహర్షి చూచి యది యంతయును నిది, పంది గాదు తపము భంగపఱుప
నరుగుదెంచె నేదొ యని సంశయించుచుఁ, దెలిసికొనియె యోగదృష్టివలన. 687

క. తెలిసికొని యంత నాగ్రహ, మొలయఁగ నోతులువ యెంత యొనరించితిరా
సలిపినదుష్కర్మమునకు, ఫలముగఁ గిటి వగు మటంచు బాపఁడు తిట్టెన్. 688

క. అంతట నాగంధర్వుఁడు, సంతాపం బొదవ మౌనిచరణంబులపైఁ
జింతిలుచుఁ జేర్చి తల శా, పాంతంబు ననుగ్రహింపు మని ప్రార్థించెన్. 689

గీ. అపుడు హృదయంబు గరఁగి మహర్షి వానిఁ, గాంచి కరుణాకటాక్షవీక్షణముచేత
నీకు సమకూరు నిక్ష్వాకునృపతివలన, నంత మొదవినయపుడు శాపాంత మనియె.

గీ. అంత గంధర్వుఁ డొకవరాహాంగనకును, బుట్టి యీసూకరముగఁ జేపట్టి నన్ను
నిపుడు నీపతిచే వధియింపఁబడుటఁ, జనియె నిజరూప మొంది స్వస్థానమునకు. 691

—: సూకరీపూర్వజన్మవృత్తాంతము :—

వ. ఇంక నావృత్తాంతంబు చెప్పెద నవధరింపుము. 692

సీ. కలదు ధాత్రిని గళింగం బనునొక దేశ, మం దుండె శ్రీపురం బనెడిపురము
కాఁపురం బుండె నక్కడ వసుదత్త నా, మము గల్గినట్టి బ్రాహ్మణుఁ డొకండు
సుత నయి నేను బుట్టితి నాతనికిఁ బెట్టె, నతఁడు నాకు సుదేవ యనెడిపేరు
దినదినంబును బ్రవర్ధిలుచు నుంటిని శుక్ల, పక్షచంద్రునికళపగిది నేను

గీ. నన్నుఁ గనుఁగొని మోహసంపన్నులగుచు, నెందఱెందఱొ మహనీయు లేఁగుదెంచి
యడిగినను బెండ్లి చేయుట కనుమతింపఁ, డయ్యె నాతండ్రి నను వీడనాడ లేక.

క. నాపలెఁ యుక్తప్రాయము, చేకుఱ మాయమ్మ భర్తచెంతకుఁ జని నీ
వికరణి నున్న లోకులు, చీకొట్టుదు రనుచు బుద్ధి చెప్పఁ దొడంగెన్. 694

క. ఆయమమాటలు విని మా, నాయన యిట్లనియె ధాత నందనను బెడం
బాయఁగఁజాలని ప్రేమము, నాయెడఁదను బాదుకొలిపె నళినదళాక్షీ. 695

క. కావున నిల్లడ ముండెడి, పావనునకు నెవనికేని బాలిక నీయన్
భావమున నెంచికొంటిని, దైవము తా నేమి చేయఁ దలఁచెనొ యెఱుఁగన్. 696

క. అనుటయు నాయమ కేమియు, ననఁగను నోరాడకున్న నాసమయమునన్
జనుదెంచెను మాసదనం, బునకున్ భిక్షార్థ మొక్కభూసురుఁ డంతన్. 697

క. మాతండ్రి బ్రహ్మవర్చస, పూతం బగుతన్ముఖంబు పొడగని యంతః
ప్రీతి జనించుటయును సా, కూతంబుగ నడిగె నతనికులగోత్రాదుల్. 698

గీ. అడుగుటయు నాద్విజుం డిట్టు లనియె నేను, బ్రహ్మచర్యపరుండను బ్రాహ్మణుఁడను
గౌశికసగోత్రుఁడను లేరు కన్నవారు, పేరు శివశర్మ నిజకులాచారధనుఁడ. 699

క. అనుటయుఁ బరమానందం, బున మాజనకుండు మంచి ముహూర్తమునం దా
తని కిచ్చి నన్నుఁ బెండిలి, యొనరించెను విధివిధానయుక్తము గాఁగన్. 700

క. అది మొదలుగ మాయింటనె, కదలక యతఁ డున్నయట్టికారణమున నా
కొదవె ననాదర మాశ్రుత, విదునిపయిన్ దానిచే వివేకము పోయెన్. 701

క. అవివేకముచేఁ బాప, వ్యవసాయంబునను నేను వర్తిల్లుచు నా
ధవునకు నొకనాఁ డైనను, శివశివ యించుకయు సేవ సేయకపోతిన్. 702

సీ. అటులు నే నున్నను నామహాత్ముండు నా, జనకుఁ డేమని తలంచునొ యటంచు
నోరుచుకొనుచు నానేరంబులకు నెట్టి, వేళ నైనను నోరు విప్పఁడయ్యె
నాకారణంబున నంతకంతకు స్వేచ్ఛ, యధికమై చరియింపనయ్యె నాకుఁ
గ్రమముగా నాచర్య గలిగించెఁ జిత్తసం, తాపంబు నాతల్లిదండ్రులకును

గీ. జెప్పికొన సాగి రెచటఁ జూచినను జనులు
రచ్చలుగ గుంపుగూడి నాముచ్చటలనె
యప్పు డది యంతయును నసహ్యముగఁ దోఁచి
చెప్పకుండఁగఁ బోయె నాచెలువుఁ డెట్టకొ. 703

క. అంతట మాతండ్రి మహా, చింతాకులుఁ డగుచు నేమి చేయుటకును న
త్యంతరము లేమి రోగా, క్రాంతుఁడువలె దినదినంబు గాసిలఁ దొడఁగెన్. 704

గీ. అట్టు లుండంగ నొకసమయమున నిట్టు, లనియె మాతండ్రికడకు మాయమ్మ చేరి
ప్రాణవల్లభ నిన్నన రాదు గాని, యీయనర్థమునకు మూల మీవె కాదె.

గీ. కానిపని చేయుచున్నప్పు డైనఁ గాని, పలుకనీ వైతి పల్లెత్తి బాల యనుచు
లేఁతతనమున నె చికిత్స లేనివ్రణము, ముదిరిపోయినమీఁదటఁ గుదురఁ గలదె.

గీ. గజము నాధోరణుఁడు తురగమును సాది, ప్రభువు మంత్రిని భార్యను భర్త యత్త
కోడలిని శిష్యుని గురుండు కూఁతుఁ దల్లి, శిక్ష యొసరింప కుండినఁ జెడుట యరుదె.
గీ. పంచమాబ్దంబువఱకును బాలకులను, లాలనము చేయవలయు నాకాల మరుగ
గుణములును విద్యలును నేర్చికొనెడి శ్రద్ధ, పొడమ శిక్షింపవలయుఁ దత్ప్రపకుండు.
క. గుణము లనేకము లున్నను, గుణవంతుఁ డటంచుఁ దండ్రి కొమరుని నెపుడున్
గణియింపరాదు దానసె, గుణనిధియై సుతుఁడు పేరుకొనఁబడు జగతిన్. 709
గీ. అష్టమాబ్దంబువఱకుఁ గన్యకను నింట, నుంచుకొనుటయుఁ బిదప నర్పించి యెవని
కైన నాతనితోడనె యనుపుటయును, దల్లిదండ్రులు చేయఁగాఁ దగినవిధులు. 710
గీ. కన్య యెవ్వనియింట నకార్యములను, జలుపుచుండునో వాఁడుదత్ఫలము గుడుచుఁ
గాన ధర్మజ్ఞుఁ డగువాఁడు కన్య నింట, నుంచుకొన నొల్లఁ డెవ్వండు నుర్విలోన.
క. ఎవఁడు గ్రహించెనో కన్యను, దను నాతం డామెయొప్పుతప్పులఫలముల్
జవదాఁటకుండఁ గుడువఁగ, నవి మన కేమిటికొ చెప్పుమయ్యా నాకున్. 712
క. మనయింట భర్తృమతి యగు, తనయను మన ముంచికొనుట తగ దే మైనన్
విను మింకను నీవిషయము, నను నీ కితిహాస మొకఁడు నాథా వినుతున్. 713

—: పద్మావతీచరిత్రము :—

వ. కడచినపదునెనిమిదవద్వాపరయుగంబునందు మాధుర దేశంబున మధురాపురం
బునం దుగ్రసేనుం డనుయాదవప్రభుం డొకండు గలండు. 714
క. దాతయును సకలధర్మో, పేతుండును సుగుణగణసమేతుండును నై
నీతియు భూతియుఁ జెదరక, యాతఁడు పాలించుచుండె నచ్చటిప్రజలన్. 715
క. అతనికిఁ గలదు విదర్భ, క్షితిపాలుం డైనసత్యకేతునిసుత వి
శ్రుతచరిత సాధ్వి పద్మా, వతి యనియెడికాంత సుగుణవారిధి వింటే. 716
క. ఒకవేళ నైన నెడఁబా, యక వా రిరువురును సంతతానందముతో
సుకములను ననుభవించుచు, నొకక్షణముగ యుగము గడపుచుండిరి దినముల్.
గీ. అట్టు లుండంగ నొకసమయంబునందుఁ, గొమరితను జూడ వలె ననుకోర్కి గలిగి
సత్యకేతువసుంధరాజాని మధుర, కాయమను దోడుకొనిరాఁగ నంపె భటుల.
క. చని వార లుగ్రసేనున, కొనరించి ప్రణామములను నొయ్యనఁ దమవ
చ్చినకార్యము నెఱిఁగించుట, యును నాతఁడు సతిని విడిచి యుండఁగ లేమిన్.
ఆ. కొంతతడవు లోనఁ జింతిల్లి చింతిల్లి, మామమాట కడ్డుమాట సెప్పఁ
దగ దటంచు నెంచి తనప్రాణకాంతను, బనిచె నెట్లొ ప్రాణ మనిచినట్లు. 720
గీ. అంతఁ బద్మావతీదేవి యరిగి తొలుత, వందనము చేసి యానందవార్ధిఁ దేల్చెఁ
దల్లిదండ్రుల నటుమీఁదఁ దత్తదర్హ, విధులచే బంధువుల కెల్ల వేడ్క గొలిపె.
ఆ. అమ్మ వచ్చె ననుచు నానందమునఁ జూడ, వచ్చినట్టియూరివారి కెల్ల

నొసఁగె రాజపుత్రి యుత్సాహమునఁ బంక్తు, వస్త్రములును మంచివస్తువులును.
క. ఆమీఁద సఖులతోడను, నామానిని గూడి క్రీడ లాడుచు వివిధా
రామవిహారవిలాస, వ్యామోహములందుఁ జిక్కి వర్తిలఁ దొడఁగెన్. 723
ఆ. అట్లు కొంతకాల మరుగుటయును నామె, చెప్పికొనుచుఁ జిత్రచిత్రకథలు
సఖులతోడఁ గూడి సవిలాసముగఁ బోయె, నొక్కపుష్పవనికి నొక్కనాఁడు.
గీ. ఏఁగి యచ్చోటఁ బరిమళాన్వితము లైన, వృక్షములచాయలను విహరింపఁదొడఁగె
మలయమారుతపోతసంస్పర్శమునకుఁ, బారవశ్యంబు గొనుచు నాపద్మగంధి. 725
గీ. అట్లువిహరించుచును వనాభ్యంతరమునఁ, గాంచె నొకచోటనొకతటాకంబునామె
యందులోఁ గలయొకతోయబిందువునకు, దేవతలు ద్రావునమృతంబు దీటు గాదు.
క. కనుఁగొని తటాకమును నా, వనజాయతనేత్ర హర్షవశ యగుచు సఖీ
జనయుతముగఁ జని తజ్జల, మున దిగి క్రీడింపఁ దొడఁగె ముచ్చట దీరన్. 727
క. చెలులార పట్టుకొనుఁ డని, సలిలంబున మునిఁగి వెనుకజాడను జని క
న్నులు మూసి యామె వారలు, కలవరపాటొంది పడఁ బకాపక నవ్వున్.
క. ఆనళినగంధి తోయము, పైనిన్ శయనించి చాఁచి పదములు కరముల్
గానము గావించుచు శ్రవ, ణానందము గొలుపు సకియ లబ్బురపడఁగన్. 729
గీ. అంతమీఁదను సకియ లాయమయుఁ గూడి, చల్లుకొనుచు వసంతము చల్లుకొనిన
కరణి నానీరమును దటాకంబునందుఁ, గలయ నీఁదుచు నుండినకాలమందు. 730
క. ధనదునిభటుఁ డగుగోభిలుఁ, డనునొకదైత్యుఁడు విమానమం దెక్కి నభం
బున నేఁగుచు నాకామినుఁ, లను గనుఁగొని దిగఁ గుతూహలము గలుగంగన్.
క. దిగి కొంత దగ్గఱగ నా, మగువలలోపలను దివ్యమాణిక్యమొ నా
నగపడియెడువైదర్భిని, నగురా యనుకొనుచు ఱెప్ప లార్పక చూచెన్. 732
క. కనుఁగొని యతఁ డాశ్చర్యం, బును జెందుచు నామెరూపమున కీపద్మా
నన రతియొ శచియొ యెవతెయొ, యనుకొనుచును జూచె నాంతరంగికదృష్టిన్.

—: కాలనేమి కంసుఁడుగాఁ బుట్టుట :—

గీ. చూచినక్షణంబులోననె గోచరించె, నామెచరితంబు సర్వ మాయాశరునకు
నంత నాతఁడు కామాంధుఁ డగుచు నామె, నెట్టులైనను గవయఁగా నెంచి మదిని.
ఉ. తాలిచి యుగ్రసేనవసుధాపతివేషముఁ దద్వనస్థలీ
శైలముపై నశోకమహిజాతమునీడ శిలాతలంబునన్
దాళలయస్వరాదిసహితంబుగఁ బాడుచుఁ గూరుచుండె నా
గాలి విదర్భరాజసుతకర్ణపథంబును సోఁకునట్లుగన్. 735
గీ. అంత వైదర్భి యాగాన మాలకించి, విభ్రమాయత్తచిత్తయై విడిచిపెట్టె
సలిలసంక్రీడనము సఖీసహితముగను, నరిగె గానంబు గావించునట్టికడకు. 736

క. అరిగి కనుంగొని కాదని, మరలం గని సంశయించి మరలం గని లో
నోరయఁగ హర్షము లజ్జయు, నరగంటను జూచుచుండె నాయమ యంతన్.
గీ. గోభిలుఁడు పాఱఁ జూచి యాశోభనాంగి, నాత్మపత్నిని గాంచిన ట్లభినయించి
రాజముఖి నీవు లేకున్న రాజ్య మేల, యంచగఱిపాన్పు లేల వాహనము లేల.
క. తనువుపయి నోఁత గలిగి వి, జన దేశంబునకు వచ్చి చరమావస్థన్
గనఁబోవుచు బ్రహ్మైక్యం, జొనగూడఁగ దివ్యగాన మొనరుచు చుంటిన్. 739
గీ. ఇంతలోపల సాధ్వి నిన్నిటకుఁ దెచ్చె, దైవమాయావిధానంబు తరమె తెలియ
రమ్ము నా కొకసారి ముద్దిమ్ము చచ్చి, బ్రతికె ననుకొమ్ము నేఁడు నీప్రాణవిభుఁడు.
క. అనుటయును జెలులు వైద, ర్భిని గని సఖి హారములను బెట్టితిమి తటం
బున స్మృతికి వచ్చె నవి కొని, చనుదెంచెద మిపుడె యనుచుఁ జని రావలకున్.
క. అంతట వైదర్భి మనః, కాంతునియీప్సితము దీర్చుకౌతుకమును బ్రా
ణాంతక మగుపని చేసిన, చింతయు న ట్టట్టు లూఁప సిగ్గిలుచుండన్. 742
క. ఆదైత్యుఁడు లేచి మహా, హ్లాదంబున నేఁగి యామెయంతికమునకున్
వైదర్భి మనల నిచ్చటఁ, గా దనువా రెవ్వ రనుచుఁ గౌఁగిటఁ జేర్చెన్. 743
వ. ఆసమయంబున సుఖస్పర్శపారవశ్యంబునం జేసి యాకాంతామణికిఁ దత్సం
కేతంబు స్ఫురింప దయ్యె. 744
ఉ. అంతట వార లిర్వురును నాత్మమనోరథముల్ ఫలింపఁగా
నెంతయు వేడ్కతోడ రమియించిరి సౌఖ్యరసాబ్ధిమగ్నులై
వింతగ మేనులన్ మఱచి వీతవివేకములై ద్రవింపఁగన్
గంతునిపంచబాణములకాఁకలధాకకు వేఁగి చిత్తముల్. 745
ఆ. కొంతకాల మట్లు గూడి మనోరథ, పూర్తి యగుడు దైత్యపుంగవుండు
వదలిపెట్టుటయును మదిరాక్షి గ్రహియించె, నంతఁ జూచుకొని నిజాంశుకంబు.
క. గ్రహియించి యామె భీతిలి, కుహనాకారమున వంచకుం డెవ్వఁడొ న
న్నిహమునకును బరమునకును, బహిష్కృతను జేసె నేను బాడైపోతిన్. 747
క. అని లోలోపల నేడ్చుచు, నొనరింపఁగఁ దగిన దేమియును లేమిఁ గనుం
గొని వాని నాగ్రహంబునఁ, గనులను నిప్పుకలు రాలఁగా ని ట్లనియెన్. 748
క. పాపాత్మ నీ వెవండవు, నాపతివేషంబు దాల్చి నావ్రత మెల్లన్
నీపాలఁ బెట్టికొంటివి, శాపంబున నిన్నుఁ దగదె సమయింపంగన్. 749
క. అనుటయు నాదైత్యుం డి, ట్లనియెను నాపయిని నేల యాగ్రహ ముదయిం
చెనొ నీకుఁ గలికి చెప్పుము, ననుఁ బాపాత్మునిఁగ నెంచ న్యాయం బగునే. 750
క, ధనదునిభటుఁడను గోభిలుఁ, డనుపుణ్యజనుండ నేను హరిణాయతలో
చన వినుము దైత్యధర్మం, బును వినిచెద నీకు సర్వమును సూక్ష్మముగన్. 751

క. పరకాంతల భుజియించుట, పరధనమును గొనుట భంగపఱుచుట తప మ
ధ్వరములు చెఱచుట ధార్మిక, నరులను బీడించుటయును నాధర్మంబుల్. 752
క. పురుషోత్తమసంకీర్తన, పరుఁ డగువానికిని సప్రభావుం డగుభూ
సురునకును బతివ్రతకును, దరుణీ జంకుదురు యాతుధానులు వింటే. 753
గీ. చదివినాఁడను వేదశాస్త్రములు సర్వ; ధర్మము లెఱుంగుదును గాని దానవుండ
నగుట నాచరణంబు లేదయ్యె నాకు, ధాత సృజియించె నట్లు మాజాతి నెల్ల.
క. కలవాణి భాషణమునసె, కలదు సతీత్వంబు నీకుఁ గా దనఁ గ్రియలో
పలఁ గానరాదు సుంతయుఁ, బలుకుము ని న్నెటులు పిలువఁ బాడియొ మాకున్.
క. సతి యగుట కెన్నొ ధర్మము, లతివకు నుండంగ వలయు నన్యునితో సం
గతి లేక యున్నమాత్రనె, పతివ్రత నటంచు గర్వపడఁ దగదు సుమీ. 756
గీ. ధర్మచారిణి వైన భర్తను ద్యజించి, యుండవచ్చునె క్షణమేని యొక్కచోట
మానవతి నీపతివ్రతామహిమ మేమొ, చూపఁగలవేని నాయెద్దఁ జూపు మిపుడె.
క. కమలాక్షి నేను నాధ, ర్మముచొప్పున నిన్నుఁ గూడిమాడితి నేదో
షముచేసినాఁడ ననుచును, సమయింపఁగఁగలవు నన్ను శాపమువలనన్. 758
క. అనుటయు నాభామిని యి, ట్లనియెను దుష్టాత్మ సాధ్వి నగుననుఁ గవగూ
డినయట్టిపాతకముకం, టెను వే ఱొకదోష మేల నిను శపియింపన్. 759
వ. అనుటయు నాపద్మాపతికి గోభిలుం డి ట్లనియె. 760
సీ. వదలకుండఁగ నగ్నిసదనంబు హోమంబు, నాచరించెడివాఁడె యగ్నిహోత్రి
యాదేశమును మీఱ కనుపదంబును స్వామి, ననుసరించెడివాఁడె యనుచరుండు
తల్లిదండ్రుల సంతతమును బోషించుచు, నాదరించెడివాఁడె యాత్మజుండు
శుశ్రూష గావించుచును నన్వహము భర్త, యంతికంబున నుండునదియె సాధ్వి
గీ. యమ్మహాత్ములమహిమంబు లద్భుతములు, వారిశాపంబులకు జంకవలయుఁ గాక
నాథు నెడఁబాసి పుట్టినింటను వసించు, పుంశ్చలివి నీవు న న్నేమి పొడువఁ గలవు.
క. నీవు పతివ్రత వగునెడ, నీవిధమున భర్త లేనియెడను జలక్రీ
డావశ వగుదువె వత్తువె, కావరమున శైలములకు గానము వినఁగన్. 762
క. కయిసేసికొని హారంగుగ, భయమును భక్తియును లేక పతి లేనియెడన్
దయితక్కలాడుచుందురె, మయి మఱచి వనంబులందు మగువా సాధ్వుల్.
క. పతి నెడసి పృథక్ఛయ్యా, స్థిత యగుభామినికె చెడు సతీత్వం బనినన్
బతికి శతయోజనాంతర, గత వగునీ వెట్లు సతివి గాఁగల వబలా. 764
గీ. స్వామి గ్రామాంతరమునకుఁ జనినయపుడు, తన కలంకారమును జేసికొనినయట్టి
వనిత జారిణి యనఁబడు ననిన నింకఁ, దెలుపవలయునె నీకథ కులుకులాఁడి. 765
వ. ముగ్ధ వగునీకుం గొన్ని పతివ్రతాధర్మంబు లెఱింగించెద వినుము. 766

—: పతివ్రతా ధర్మకథనము :—

సీ॥ అంధుఁ డైనను ఖంజుఁ డైనను బధిరుఁ డై, నను మూకుఁ డైన నున్మత్తుఁ డైన
నిష్ప్రయోజనుఁ డైన నిర్ధనుం డైనను, నిర్గుణుం డైనను నింద్యుఁ డైనఁ
బాపి యైనను మద్యపాయి యైనను ద్యూత, కారుఁ డైనను నిరాకారుఁ డైనఁ
గ్రోధనుం డైనను గుప్రవర్తనుఁ డైన, వీతరాగుం డైన వృద్ధుఁ డైన

గీ॥ లోభి యైనను గామినీలోలుఁ డైన, సాధ్వసోపేతుఁ డైనను షండుఁ డైన
నెట్టివాఁ డైన సాధ్వి యైనట్టికాంత, పతిని సేవింపవలయు దేవతనుబోలె. 767

గీ॥ అమరుఁ డైనను గంధర్వుఁ డైన లోక, ధారకుం డైన మన్మథాకారుఁ డైన
నెట్టివాఁ డైన సాధ్వి యైనట్టిసతికి, నన్యపురుషుని సేవించు టనుచితంబు. 768

సీ. పరపురుషునిఁ జూచి భ్రమను జెందుటయును, దలపోయుచుంటయుఁ దద్గుణములు
వీక్షించునెడలను వీక్షించుటయును భా, షించినయెడల భాషించుటయును
నవ్వినయెడలను నవ్వుటయును ప్రేమ, పత్త్రికలను వ్రాసి పంపుటయును
భర్తపైని నలక్ష్యభావ మునుచుటయును, జడుపును సిగ్గును విడుచుటయును

గీ. నేర్చుటయుఁబెద్దపెట్టున నిల్లువిడిచి,యేఁగుటయుఁ దిట్టుటయు నన్యగృహమునందుఁ
దూఱుటయుబావిలోపలదూఁకుటయును,విషముఁదినుటయుఁగాదుసాధ్వీగుణంబు.

సీ. గృహకర్మములు నిర్వహించుటయును శిశు, సంరక్షణంబును జలుపుటయును
ధవునకు ననుకూల యవుటయు ధర్మకా, ర్యములందు నర్థకార్యంబులందు
మాన మూనుటయు గ్రామ్యక్రియలోపలఁ, బ్రాగల్భ్యమునుగానఁబఱచుటయును
నల్పికొంటయుఁ గాయశౌచంబు భర్తకు, జీవితవృద్ధి నాసించుటయును

గీ. నన్నతోయాదరంబుల నతిథితృప్తి, చేయుటయు భర్తృశుశ్రూష చేయుటయును
గురుజనంబుల భక్తితోఁ గొలుచుటయును, ధర్మములుగ వచించి రుత్తములు సతికి.

క. తిట్టినను భర్త దయితుఁడు, కొట్టినను రవంతయేని కోపము లోనం
బెట్టికొనమి వల్లభునకుఁ, జెట్ట యొనర్పంగ సాహసింపరు సాధ్వుల్. 771

సీ. దుఃఖించినను భర్త దుఃఖించుటయు సంత, సించినఁ బతి సంతసించుటయును
భుజియించిన ధవుండు భుజియించుటయును ని, ద్రించిన భర్త నిద్రించుటయును
మగఁడు మేల్కొనకముందుగ మేలుకొనుటయు,భర్తకు నాప్తయై వర్తిలుటయుఁ
బత్యాజ్ఞ లేక స్వబంధుజనంబున, కెట్టిద్రవ్యము గూడ నీయమియును

గీ. భుక్తి వెట్టుటయు సకాలమునను బతికి, ననుచరించుటయును భర్త కనుగుణముగ
మృతినిఁజెందిన ధవుఁడుతచ్చితినిమేను,వాయుటయు ధర్మములుచూవె భర్తృమతికి.

క. తినమియును భర్త భుజియిం, పనివస్తువు భర్తృగానభాషణసంద
ర్శనరక్తియుఁ గలహింపమి, యును దయితునితోడ సతికి నుత్తమగుణముల్.

వ. ప్రియవాక్యధనాభరణవస్త్రాదిప్రలోభిత యైనను సకామవీక్షిత యైనను జన సమ్మర్దసంస్పృష్ట యైనను దాత్యప్రార్థిత యైనను బలాత్కారగృహీత యైనను సాధ్వి యగుకాంత పరపురుషుని నంగీకరింపం జనదు. 774

సీ. నఖకేశసంస్కారణమును శుభ్రాంబర, ధారణంబును మాల్యధారణమును
దాంబూలచర్వణదంతమార్జనతిల, కాంజనధారణాభ్యంగములును
నాలస్యమును గలహాసక్తియును నట్ట, హాసంబు పరపురుషాశ్రయమును
నిశ్శంకతయు బహునిద్రయు స్వైరవి, హారంబు నేకవస్త్రాటనమును

గీ. బరునితోడను నర్మసంభాషణములు, చేయుటయుఁ గుట్టెనీమైత్రిఁ జేయుటయును
నర్హములు గావు సాధ్వికి నన్యదేశ, వాసియై యుండఁగను నిజవల్లభుండు. 775

క. పతి ప్రోషితుఁ డగునెడ సతి, పతి వచ్చెడునంతవఱకుఁ బతిదేవత యై
పతియంద నిలిపి చిత్తము, పతికల్పితవృత్తితోడ బ్రతుకఁగ నొప్పున్. 776

క. పతి కాహ్లాదము గొలిపిన, సతీమణికి నుభయలోకసౌఖ్యము లొదవున్
బతికి విషాదము గొలిపిన, యతివ కొదవు సర్వనాశ మందును నిందున్. 777

క. అనుటయుఁ బద్మావతి యి, ట్లనియెను బాపాత్మ భర్తయనుమతిచేతన్
జనకునియింటికి వచ్చిన, నను నిందించెదవు నీకు నాలుక పడదే. 778

గీ. కామమునఁ గాని లోభంబుకతనఁ గాని, మోహమదమత్సరక్రోధములను గాని
పతిని విడనాడి జనకునిపంచఁ జేరి, నట్టిహీనను గానురా యధమ నేను. 779

క. పతిరూపంబున వంచిం, చితి వసురుఁడ వగుట దానిచేతం జెడునే
సతి నగునామాహాత్మ్యము, దితిజాధమ దాని నిపుడె తెలిపెద నీకున్. 780

క. అనుటయును గోభిలుం డి, ట్లనియెను ధర్మప్రహీణ వగుటనె నన్నున్
గనుఁగొన లే వైతివి దై, త్యునిఁగను లేకున్న భంగ మొదవునె సతికిన్. 781

ఆ. సతికి భర్తకంటె స్వజనంబు లెవ్వరు, తల్లిదండ్రు లెవరు దైవ మెవఁడు
వెఱ్ఱిదాన నీవివేకంబు చెడిపోయె, ధవునిఁ బాసినట్టితరుణమంద. 782

క. అని పలికి మందహాసం, బును గావించుచును గడచిపోయినపని కే
మనుకొనిన నేమి లాభము, ననుఁ గూడి సుఖింపు మింక నళినదళాక్షీ. 783

క. అనవుడు నాయమ క్రోధం, బున నాతనిఁ జూచి నోటఁ బురుగులు పడవే
యనరానిమాట లాడెదు, దనుజాధమ సాధ్వి నింత దార్ష్ట్యమె నీకున్. 784

క. అని పలికి శపించుటకున్, మునుకొను చున్నట్టిసమయమున నోకలికీ
వినుము భవద్గర్భంబునఁ, దనయుఁడు గలఁ డనుచుఁ దెలిపి దైత్యుఁడు చనియెన్.

క. అంతట నాసుందరి వి, భ్రాంతిం గొని నేలమీఁదఁ బడి మూర్ఛిలి పైఁ
గొంతతడవునకు స్మృతి గొని, కొ్యంతగ రా నపుడు లేచి యేడ్చుచు నుండెన్.

క. ఆయేషువు విని నెచ్చెలు, లాయమదరి కేఁగుదెంచి యతిశీఘ్రముగన్
మాయమ్మ యేమి జరిగెనె, పోయెనె నిను విడిచి వల్లభుం డెట కేనిన్. 787
క. అని యడుగుటయును నాయమ, కనులను బాష్పములు జాఱి కాల్వలువాఱం
గనుఁగొని సఖులను జరిగిన, పని యంతయుఁ జెప్పి డిల్లపాటును జెందెన్. 788
క. అది విని చెలు లావేగము, గదురగ నెదలందు క్షణము గతచేష్టితలై
పదపడి యించుక ధైర్యం, బూదవఁగ ని ట్లనిరి భయము నొందకుము సఖీ. 789
ఉ. ఎంతటివారి కేని జనియింపక పోదు ప్రమాద మంతతో
నంతము నొందునే సలిపినట్టి వ్రతం బఖిలంబు దీని కీ
వింతగ నేడ్వ నేల సతి కెందును లోపము గల్గ నేర దా
వంతయు నింటి కేఁగి తదుపాయము చూడఁగవచ్చు ర మ్మికన్. 790
క. అని పలికి కొంత ధైర్యము, జనియింపఁగఁ జేసి మదికి సఖు లామెను దో
డ్కొని పోయి గృహమునకుఁ ద, జ్జననికి నెఱిఁగించి రచట జరిగినగాథన్. 791
క. విని తనయావృత్తాంతం, బును నాయమ మిగుల ఖేదమును జెంది మనం
బునఁ దనకు నేమి చేయుట, కును దోఁపక పతికిఁ దెలిపెఁ గొమరితచరితన్. 792
క. ఆలించి సత్యకేతువు, బాలాచరితమును సిగ్గుపడుచును శిరమున్
వ్రేలాడవై చికొని క్షణ, కాలము చిత్తరువుపోలెఁ గదలక యుండెన్. 793
ఆ. అట్లు కదలకుండి యామీఁద నాత్మలో, నడరుచున్న క్రోధ మడఁచికొనుచు
నోరు తెఱవకుండ నారాజు పుత్రిని, బంపె నాక్షణంబ భర్తకడకు. 794
క. పరివారముతో వచ్చిన, తరుణీమణి నుగ్రసేనధరణీంద్రుఁడు సా
దరముగను జేర్చికొని తన, పరిసరమున మునిఁగిపోయెఁ బ్రమదాంభోధిన్. 795
ఆ. అంత మున్నువోలె నతఁ డామెతోఁ గూడి, విషయసుఖము లనుభవించుచుండ
మీఱి పెరుఁగుచుండె మీనాక్షి కుదరంబు, భీతి గలుగునట్లు ప్రేక్షకులకు. 796
క. అనుదినమును దనగర్భముఁ, గనుఁగొనుచును నావధూటి కనలుచుఁ బిండం
బును నెట్టు లేనినాశన, మొనరింపఁ దలంచి బ్రమింగుచుండెను మందుల్. 797
ఆ. అటులు గర్భపాత మగుటకు నాతన్వి, చేయవలసినట్టి చేఁత లెల్లఁ
జేయుచుండ లోనిశిశు వొక్కదినమున, నెట్ట కేని యామె కిట్టు లనియె. 798
సీ. జనని నీలో నున్న ననుఁ జంపుటకు నేల, పడరానిపాటులు పడెదవమ్మ
పుణ్యంబుచే వృద్ధిఁ బొందు నాయుష్యంబు, క్షయము నొందును బాతకంబుచేత
నంతరించును గర్భమందె యొక్కఁడు పుట్టి, శమియించు నొక్కఁ డాక్షణమునందె
పోవునొక్కఁడు బాల్యమునఁజచ్చునొకఁడుయౌ, వనమున నొకఁ డేఁగు వార్ధకమునఁ
గీ. గర్మపాకంబునను జావు గలుగవలసి, నట్టికాలంబుననె ప్రాణి గిట్టుచుండు
మందులౌషధులునుమణిమంత్రములును, దైవములునునిమిత్తమాత్రములచూవె.

క. కావున నను నీ వేమియుఁ, గావింపఁగ లేవు పాపకార్యము లింకం
గావింప నేల చెప్పెద, నావృత్తాంతంబు వినుము నళినదళాక్షీ. 800

క. ననుఁ గాలనేమి యనియెడి, దనుజునిఁగా నెఱుఁగు మేను ద్వద్గర్భముఁ జొ
చ్చినవాఁడ నేఁడు మును హరి, పనివడి ననుఁ జంపినట్టిపగ దీర్చుకొనన్. 801

క. అని విరమించుటయును నా, వనితామణి గర్భపాతవాంఛ విడిచి చే
సినకర్మ మనుభవింపక, చన దని పొగులుచును గడపసాగెను దినముల్. 802

ఆ. అట్లు కొంతకాల మరుగుటయును బూర్ణ, మయ్యె గర్భ మాసుధాంశుముఖికి
నుద్భవించె నంత నొకదుర్దినంబున, నసురకాలమందు నసుడుఁ డొకఁడు. 803

క. జనియించి వాఁడు కంసుం, డనియెడినామంబు వడసి హతుఁ డయ్యెను గృ
ష్ణునిచేత మున్ను క్షోభం, బును గావించుటను లోకముల కన్నిటికిన్. 804

క. అని వింటి సకలధర్మము, లును దెలిసినయట్టిప్రాజ్ఞలోకమువలనన్
గనుకను బితృగృహమున నుం, డినకన్య నశించు నెంతనిర్మల యైనన్. 805

క. నీ కింకఁ జెప్ప నేటికిఁ, బ్రాకృతుఁడవు గావు బహుపురాణజ్ఞుఁడ వా
లోకించి మంచిచెడ్డలు, చేకొనఁ దగినట్టిపథము చేకొను మనఘా. 806

క. అనుటయుఁ బ్రాజ్ఞుం డగునా, జనకుఁడు ననుఁ బిలిచి క్రోధసంరక్తవిలో
చనుఁ డగుచు వంశనాశని, కనుఁగొన రా దింక నీముఖంబును మాకున్. 807

గీ. చనియె నల్లుఁడు తలయెత్తికొనఁగ లేక, పలువురును నవ్వుచుండ నే బ్రతికియుంటిఁ
జచ్చినట్టులె యుభయవంశములు గూడఁ, బాడు సేసితి వోసి నిర్భాగ్యురాల.

ఆ. ఎంతప్రీతితోడ నెత్తి పెంచితినో నాఁ, డంతగోఁత గలుగనయ్యె నేఁడు
కాలు పెట్ట వలదు గడపలో నైనను, నిపుడె లేచి వెడలు మెచటికేని. 809

క. అని తిట్టుచుండఁగను నా, జననియుఁ దనచేత నున్నసమ్మార్జనితో
డను గొట్టి కొట్టి క్రోధం, బెనయంగను నీడ్చి నన్ను నిలు వెడలించెన్. 810

సీ. అంతట నూహూరి కరుగుచుఁ బదిమంది, ఱంకుటా లనుచు దూఱంగ వినుచు
జారులు నాచుట్టుఁ జేరి గుంపులుగూడి, యగడు చేయుచునుండ బెగడుపడుచు
నుండఁ జోటును దినఁ దిండియు దొరకక, యతిదైన్యమునను నాయాసపడుచు
నొడలిలో జీర్ణించియున్నరోగము లెల్లఁ, బైకిఁ బొంగుచు నుండ బాధపడుచు

గీ. నెట్టు లెట్టులో చేరితిఁ దుట్టతుదకు, దివ్యతమ మైనగుర్జర దేశమందు
బహుళధనధాన్యసంపత్ప్రభావములను, నెగడుచున్న వనస్థలానగరమునకు.

గీ. అచ్చటికిఁ జేరి యాఁకలి కాఁగలేక, కర్పరంబును దాలిచి కరమునందుఁ
దిరుగఁ జొచ్చితి నిల్లిల్లు తిరిపమునకు, నొక్కతల్లియు భిక్ష నా కొసఁగదయ్యె.

క. అది నాపాపమె యనుకొని, యెదలోపల దుఃఖపడుచు నిఁక నెట్లును నే
బ్రదుక ననితలఁచికొనుచును, తుద కొకగృహమునకుఁ బోతిఁ దుదిప్రాణముతోన్.

క. అచ్చటి కరిగిసతోడనె, యచ్చెరియము దోఁపఁ జనిసయసువులు మరలన్
వచ్చి కళేబరమందున్, జొచ్చినక్రియ మదికిఁ గొంతసొమ్మ తొలంగెన్. 814
సీ. అప్పుడు గొం తెత్తి యమ్మా పిడికెఁ డన్న, మని కేక వైచితి నాక్షణంబ
బిచ్చకత్తెకుఁ దిండి పెట్టుము మంగళా, యనుమాట లోనుండి వినఁగనయ్యె
వినఁబడినంత నావీనుల కది తోఁచె, నాభర్త మధురకంఠస్వరముగ
నంతట లోనుండి యరుదెంచి యొకతల్లి, నాకుఁ దృప్తిగ భోజనంబు వెట్టె
గీ. భోజనము చేసి నా కిట్టిభుక్తి దైవ, మెంతకాలమ్మునకు లభియింపఁ జేసె
ననుచు సంతోషపడుచుండు నవసరమున, హర్మ్యమున నుండి నానాథుఁ డరుగుదెంచె.
గీ. వచ్చి ననుఁ బాఱఁజూచి యోపిచ్చిదాన, యెవ్వతెవు నీవు నీకథ యేమొ నాకుఁ
జెప్పు మనుటయు నేమియుఁ జెప్ప లేక, యోరగిలఁ బెట్టుకొని మోము నూరకుంటి.
గీ. అప్పు డామంగళాదేవి యతనిఁ జూచి, యీమె నినుఁ గాంచి సిగ్గిల నేల నాథ
చెప్పు మనుటయు ననుఁ దాను జెట్టవట్టి, నట్టికథ యెల్ల వినిచె నాయమ కతండు.
గీ. వినిచి నాగాథ యంతయు వెలఁది నీకుఁ, బూజ్యురాలైన యక్క యీపుణ్యచరిత
యీయమను నీవు సేవింపు మింట నునిచి, నాకు నాఅవప్రాణ మీనళినగంధి.
క. అనుటయు నాయమ పతియా, జ్ఞను శిరమునఁ దాల్చి నాకుఁ జలిపినసమ్మా
ననమునను జేసి విస్మయ, మును లజ్జయుఁ గలిసి చిత్తమున నోరయంగన్. 819
క. పలుకుచుఁ బలుకకయును నె, ట్టులొ వెడలించితిని బగలు డొంకుచు నంతన్
జలజాప్తుఁడు గ్రుంకెను నా, కొలసెడిసౌఖ్యంబు చూడ నోల్లనికరణిన్. 820
వ. అంత నాసాధ్వీమణి మహానందంబున స్వయముగాఁ బాకంబు చేసి భక్ష్య
భోజ్యంబులతోడ భోజనంబు వెట్టి తనభూషణాంబరములచే నలంకరించి భర్త
శయనించియున్న హంసతూలికాతల్పంబుకడకు నన్నుఁ బనిచె. అంత నాయంత
రంగంబున దుఃఖప్రవాహం బావరించుటయు. 821
సీ. ఒకవేళ నైన నీయోగ్యవర్తనునిపై, ననురక్తి గలదృష్టి నునుప నైతి
నొకక్షణం బేని యీయకలంకమూర్తితో, ననుకూలముగ మాటలాడ నైతి
నొకనాఁడు గూడ నీసుకుమారదేహుని, యడుగుఁదమ్ములు ముట్టి కడుగ నైతి
నొకరాత్రి యేని యీయుత్తమోత్తమునకు, నేకాంతసౌఖ్యంబు నీయ నైతి
గీ. భర్తయెడఁ జేసినట్టిపాపంబు లెల్లఁ, గట్టికుడిపినవిధమునఁ గట్టకడకు
భ్రష్టనై పాడుమేనితో బ్రతికియుంటి, నకట నావంటిపాపాత్మురాలు గలదె.
గీ. అనుచు వగచుచునుండ నా కంతకంత
కధికమై శోకనిర్ఝర మాఁపలేని
పగిది నుబుకంగ హృదయంబు పగిలిపోయెఁ
భగులుటయుఁ బ్రాణములు మేను వాసి పోయె. 823

గీ. అంతటను యమదూత లత్యంతభీష, ణాకృతులతోడ నాయుధహస్తు లగుచు
వచ్చి నను ద్రాళ్ళతోఁ గట్టి వనరుచుండ, నీడ్చికొనిపోయి శమనుని యెదుట నిలిపి.

వ. సాష్టాంగప్రణామంబులు గావించుటయు యముండు నాదిక్కు చూచి కటంబు లదరఁ బండ్లు పటపటం గొఱుకుచుఁ దటాలున లేచి పాపాత్మురాలా చేసిన దుష్కర్మంబులకుఁ దగినఫలంబు లనుభవింపు మని భయంకరంబుగాఁ బలికి యెఱ్ఱగాఁ గ్రాఁగుచున్న లోహపురుషపిండంబు నురంబునం బెట్టించియుఁ దప్త తైలద్రోణియందుఁ బడవైచియు నసిపత్త్రంబులచే గాత్త్రంబులు ఛేదించియు గ్రీష్మచండాంశుకరనికరసంతప్తవాలుకారాశిలోఁ బొరలించియు వహ్నికుండంబునందుఁ ద్రోసియు జలయంత్రంబునం ద్రిప్పియుఁ బూయశోణితవిష్ఠాకృమిసంకులం బగుకూపంబునందు ముంచియుఁ గరపత్త్రంబులచే బ్రద్దలు చేసియు శక్తిముద్గరంబులచేఁ గొట్టియు యోనివక్త్రంబునందు డించియు బహువిధంబు లగుబాధలం బెట్టి విడిచిపెట్టుటయు నే నాదుఃఖంబు లన్నియు ననుభవించి పిదప జంబుకశునకభుజంగకుక్కుటమార్జాలాదినానావిధపాపయోనులం బుట్టి నానావిధంబు లగుదారుణక్లేశంబు లనుభవించి తుదకు సూకరినై జన్మించితి.

గీ. తల్లి నీచేతఁ బుణ్యతీర్థంబు లెల్లఁ, గలవు న న్నుద్ధరింపఁగాఁ గలవు నీవు
కావున ననుగ్రహింపు మీకాలమంద, సైఁపలే నింక నీనీచజన్మములను. 826

క. అనుటయు సుదేవ యి ట్లని, యెను సూకరి ని న్ననుగ్రహింపంగను జా
లినయంతసుకృత మెయ్యది, యొనరిచితినొ నేను దెలిసియుండినఁ జెప్పుమా.

క. అనవుడు సూకరి యి ట్లని, యెను లక్ష్మివి నీవు విష్ణు వీజనపతి పా
వనచరిత నీమహత్త్వం, బనితరసాధ్యంబు చెప్ప నలవియె నాకున్. 828

సీ. పతియె దైవం బనుభావంబు చెడకుండ, ధవునిమాటకు జవదాఁటకుండ
నాథుఁడు వగచుచుండఁగ సంతసిలకుండ, మగఁడు పొంగుచునుండ వగవకుండఁ
బెనిమిటి కప్రతిష్ఠను జేకుఱుపకుండఁ, బ్రాణేశ్వరుని నెడఁబాయకుండఁ
గాంతునియుపచారకార్య మేమఱకుండ, భర్తడెందము కుందువఱుపకుండ

గీ. సతులు చనుమార్గమున నుండి జాఱకుండ, నాత్మనిగ్రహమును విడనాడకుండ
మంచియిల్లా లనుప్రశస్తి గాంచినావు, త్రిభువనములను నీవు సాధ్వీమతల్లి. 829

క. ఆనడవడిచేఁ గలిగెను, మానిని నీ కధిక మైనమాహాత్మ్యం బ
ద్దానికి సరిపడుమహిమము, కానంగా రాదు ముజ్జగంబులలోనన్. 830

క. సతి నాకు భవత్సంపా, దిత మంతయు నేల యొక్కదివసమునఁ ద్వదా
ర్జిత మగుపాతివ్రత్య, వ్రతసుకృతమె చాలుఁ బాపవార్ధులు దాఁటన్. 831

వ. అనుటయును సుదేవ భర్తను గనుంగొని నాథా యిందు నాకుఁ గర్తవ్యంబు బోధింపవలయు నని యర్థించుటయు సకలధర్మజ్ఞుం డగునిక్ష్వాకుమహీపాలుండు

దేవి దీనోద్ధరణం బనశ్యకర్తవ్యంబు గాన నీ నీగతిహీన నుద్ధరింపు మనియె. 832

క. అనుటయు సుదేవ యొకదివ, మునఁ దా నొనరించినట్టిపుణ్యము నెల్లన్
గొను మనుచు ధారవోసెను, గనికర మెదలోన నొదవఁగను సూకరికిన్. 833

గీ. ఆక్షణంబునఁ దుచ్ఛదేహంబు విడిచి, దివ్యరూపంబుతోడను దేజరిలుచుఁ
దల్లి నీపుణ్యమున నేను ధన్య నైతి, నని నుతించుచు సూకరి యరిగె దివికి. 834

క. చెలులార భర్త ననిశముఁ, గొలిచిన హేతువునఁ గాదె కొనియె సుదేవా
జలజాక్షి యట్టిమహిమం, బలవడునే భర్తృసేవ హతభాగ్యలకున్. 835

క. అని పలికి సుకల భర్తను, మనమున ధ్యానించుకొనుచు మఱియొకమార్గం
బునకుం దిరుగనిధైర్యం, బున దినసంబులను వెడలఁబుచ్చుచు నుండెన్. 836

—: సుకలా పాతివ్రత్య మాహాత్మ్యము :—

గీ. అప్పు డాయమతపము జంభారి చూచి, విఘ్న మొనరింపఁ దలఁచి రావించి మరుని
నతనితోడను జెప్పె వృత్తాంత మెల్ల, నాలకించి మరుం డిట్టు లతని కనియె. 837

గీ. పాకశాసన యీమూఁడులోకములను, నల్లకల్లోల మొనరించునట్టినాకు
వనిత లన నెంత తదవయవములలోన, వర్తిలెడునే నెఱుంగనె వారిశక్తి. 838

గీ. నాగృహము కాంత తదధరనయనఫాల, వదనదృక్కుచకుచపృష్ఠరదననాభి
జఘనకట్యూరుయోనికక్షులను జేరి, మారణము చేయుదును నేను బూరుషులను.

క. వనజాక్షి స్వభావముచే, తనె యబల మదీయబాణతాడిత యైనన్
వినుము పురందర ధైర్యం, బున నిలువంగలదె కలఁక పుట్టక మదిలోన్. 840

వ. కాని యొక్కసాహాయ్యంబు నీవలన నా కీకార్యంబునం గావలసియున్నయది. మున్ను నాయంగంబు మహేశ్వరునిచే దగ్ధం బగుటం జేసి నే ననంగుండనై యుంటిఁ గావున నీవు జగన్మోహనం బగురూపంబు దాల్చి నాతోడ వచ్చితివేని నేను నీశరీరంబునం బ్రవేశించి యామచ్చెకంటిం బ్రహరించి నీకు వశంబు గావించెద. 841

క. తరుణులను జేరి పురుషులఁ, బురుషులలోఁ జేరి పూవుఁబోఁడులను మదుల్
గరఁగఁ బ్రహరింతు దానను, బరస్పరము గూడ డిల్లపడుదురు వారల్. 842

క. అనవుడు వజ్రి జగన్మో, హన మగురూపంబు దాల్చి యాతనితోడం
జనియెను సుకలామహిమం, బును బరిశీలింపఁ గాంక్ష పుట్టినకతనన్. 843

వ. అంతటఁ బంచబాణుండు మహేంద్రసహితంబుగా నొకవనంబున విడిసి నిజసఖ యగుక్రీడను బిలిచి యాత్మోద్యమముం దెలిపి సఖీ నీచమత్కారప్రయోగంబుచే సుకల నెట్లేని యువ్వనంబునకుం దోడ్కొని ర మ్మని యాజ్ఞాపించుటయుఁ గ్రీడ స్వామియాజ్ఞాప్రకారంబునఁ బతివ్రతావేషంబు దాల్చి సుకలామందిరంబున కేఁగి తద్ద్వారంబున ఖిన్నవదనంబుతోడ నిలువంబడియుండె. 844

ఆ. అపుడు సుకల ద్వారమందు నున్నయామెను, జూచి యెవతె వీవు శోభనాంగి
నిన్నుఁ జూడ నాకు ఖిన్నవుగాఁ దోఁచె, నిట్టు లుండ నేమి హేతు వనియె.

చ. అనవుడుఁ గ్రీడ యి ట్లనియె నమ్మ యనాథను నాచరిత్రముల్
వినియెడివారికిం గలుగు వేదన యైనను జెప్పు మంటి వే
మని వచియింతు నే ననుచు నశ్రులు బోరునఁ గాఱ నేడ్చుచున్
జనియెను దన్వి నామగఁడు న న్నెడఁబాసి విదేశభూమికిన్.

గీ. ఎన్నఁ డైనను నపచార మింతయేని, నే నొనర్చి యెఱుంగఁ బ్రాణేశ్వరునకుఁ
బతియె యిహమును బరమును సతికి ననుచుఁ, జిత్త మలరంగ సేవ చేసితిని గాని.

క. ఐనను నాప్రారబ్ధము, చే నాతని కట్టిబుద్ధి చేకూరెను గా
దేని విడనాడి పోవునె, నానాథుఁడు తన్నె గతిగ నమ్మిననన్నున్. 848

క. అనుటయును సుకల తనకథ, యును నామెకుఁ జెప్పి సాధ్వి యొకతీరున నే
మనయిరువురనుదుటను బ్రా, సెను విధి మన మెవరిమేలు చెడఁగొట్టితిమో.

గీ. ఐనదానికి వగచి కార్యంబు లేదు, సాధ్వి నీజీవితేశునిచరణములను
నిత్యమును నెదలోన ధ్యానించుకొనుచు, శేషకాలంబు గడపుము చెప్ప నేల.

చ. అనుటయు సాధ్వి నీపలుకు లాత్మకు శాంతి నొసంగె నీవె నా
జననివి నీకు నేను దనుజాతను జ్ఞాన మనుగ్రహించి నా
మనమునఁ గల్గుదుఃఖమును మాన్పుము నీకడ నుందు లేరు నా
జను లనువార లెవ్వరును సత్యముగా నని క్రీడ పల్కెడున్. 851

క. ఆమాటలు విని సుకలా, సీమంతిని జాలి పొడమఁ జిత్తములో నా
లేమను దరిఁ జేరిచికొని, నేమములను బ్రతిదినంబు నేర్పుచు నుండెన్. 852

ఆ. అట్లు కొంతకాల మరుగుటయును గ్రీడ, యొక్కనాఁడు సుకలయొద్దఁ జేరి
తల్లి స్మృతికి వచ్చె దైవయోగంబున, దివ్య మైనపుణ్యతీర్థ మొకటి. 853

గీ. దానిమహిమంబు చెప్ప నాతరము గాదు, భర్తృవిరహంబు గల్గినపడఁతులకును
బాలఁతుకల నెడఁబాసినపురుషులకును, బ్రాణబంధువు దత్తీర్థరాజ మతివ. 854

ఆ. అందు మునిఁగి లేచినంతమాత్రముననె, భర్త వచ్చితీరు భార్యకడకు
భార్య వచ్చితీరు భర్తసన్నిధికిని, దూరముగను నున్నవార లేని. 855

క. అనుటయు సుకలాసతి యి, ట్లనియెను సతి భర్త వచ్చు ననుటను జిత్తం
బున నొదవెను దత్తీర్థం, బున కేఁగెదు కాంక్ష మనము పోదమె యటకున్.

క. అనుటయును నట్లె పోవుద, మని సుకలను దోడుకొని రయంబునఁ గ్రీడా
వనజాక్షి మదనుఁ డుండిన, వనమునకుం జనియె స్మేరవదనముతోడన్. 857

వ. అట్లు చని. 858

సీ. పుంస్కోకిలకదంబములు గంఠముల నెత్తి, పంచమస్వరమునఁ బాడుచుండ
సుమగుచ్ఛములు గుమగుమ గుబుల్కొనుసువా, సనల నల్గడ వెదచల్లుచుండ
చల్లనిదక్షిణశ్వాసనపోతంబులు, తిన్నతిన్నగను వీతెంచుచుండ
మకరందరసకుల్యలకు జుమ్ము జు మ్మని, మొకరితుమ్మెదపిండు మూఁగుచుండ
గీ. మనమునకు హాయి గొల్పు నవ్వనములోనఁ, గ్రీడ సుకలాసతీమణితోడఁ గూడి
యరుగుచును నామె కాశ్చర్యకరము లైన, గాథలను జెప్పుచుండినకాలమందు.
క. ఒకప్రక్కనుండి సురనా, యకుఁ డరుదెంచుటయు నదియె యద నని సుమసా
యకుఁ డేయఁ దొడఁగె సుకలా, వికచాంబుజనేత్రపైని వివిధాస్త్రములన్. 860
గీ. అప్పు డాసుకలాబ్జాక్షి యది యనంగ, వన మగునటంచు నూహించి మనమునందు
ధైర్య మించుక యేనియుఁ దప్పనీక, భర్తృపాదనివేశితభావ యగుచు. 861
క. ఆనందింపదు కోకిల, గానమునకు వాయువునకుఁ గలఁగదు గంధం
బానదు సుమములవంకం, గానదు కనుఁగొనదు మధువు కాంచదు తేంట్లన్.
ఆ. అపుడు మలయపవనుఁ డానతముఖుఁ డయ్యె, మాధవుండు లజ్జమానుఁ డయ్యెఁ
గోకిలస్వరంబు గాకస్వరం బయ్యె, మీనకేతనుండు దీనుఁ డయ్యె. 863
క. అంతట నాథున కొదవిన, సంతాపము నెఱిఁగి రతి వెసన్ జని సుకలా
కాంతాసమీపమున కా, యింతికి దీవనల నొసఁగి యి ట్లని పలికెన్. 864
ఆ. కలికి నిన్నుఁ జూడఁగాఁ దోఁచె మదిలోన, నెదియొ నీకుఁ జింత యొదవినట్లు
చింతిలంగ నేల సంతోషమున నుండఁ, దగినచోట నెట్టిదాన చెపుమ. 865
సీ. విను మెట్లు గండుఁగోవెలలు గానరసంబు, చిలికించుచున్నవో చెవులలోన
మూర్కొను మేచందమున వచ్చుచున్నవో, ప్రసవసంతతినుండి పరిమళములు
కనుఁగొను మేవిధంబున మూఁగుచున్నవో, మకరందఘుటలకు మొకరితేంట్లు
గ్రహియింపు మేప్రకారము వీచుచున్నవో, మలయశైలజమందమారుతంబు
ఆ. లాస్వాదింపు మెట్టియానంద మాత్మకుఁ, గొలుపుచున్న యదియొ ఫలరసంబు
కాంచు మెంతచక్కఁగా నొప్పుచున్నదో, భాసమానవనవిలాసలక్ష్మి. 866
క. అనుటయు సుకలాసతి యి, ట్లనియెను నాథునివెంట నరిగెను సతి నా
మనసు మనోవిరహిత మగు, తనువున నేమైనఁ జేయఁదగినది కలదే. 867
క. అనుటయు నిరాశ యగుచును, జని రతి పతికడకు నాథ సాహసమును నీ
వొనరింపవలవ దాసా, ధ్వని లోఁగొనఁ గాదు బ్రహ్మదేవున కైనన్. 868
క. అనుటయును నభినివేశం, బును వదలక పంచశరుఁడు పురుహూతుని నా
వనజాక్షికడకుఁ బొ మ్మని. యనిపి శరంబులను నేసె నతితీక్ష్ణముగన్. 869
క. సురనాయకుఁ డాసుకలా, తరుణీమణికడకుఁ బోయి దరహాసాలం
కరణావాప్తవిలాస, స్ఫురితాపాంగావలోకమునఁ గనుఁగొనుచున్. 870

క. హరిణాక్షీ నిస్సహాయవు, తరుణివి నీ వివసంబు దారుణము భవ
త్పరిరక్షణమునకై నీ, పరిసరమున నుంచుకొనుము భటునిఁగ నన్నున్. 871

క. అని పలుకుటయును సుకలా, వనజాయతనేత్ర వానివదనమును గనుం
గొనకుండఁ గ్రిందఁ జూచుచు, ననియెను ధైర్యమున నిట్టు లాయింద్రునితోన్.

చ. ఎవఁడవో నీవు భీతి యొకయింతయు లేక భటుండ నీకు నే
నవుదు నటంచుఁ బల్కెద వనన్యశరణ్యను గాను నేను నీ
వేవ రడఁపంగఁ జాలుభటపుంగవు లిప్పుడె యున్నవారు మ
త్సవిధమునందుఁ బొమ్ము త్వరితంబుగ జీవితతృష్ణ యుండినన్. 873

వ. అనుటయును మహేంద్రుం డించుక జంకి సగౌరవంబుగా ని ట్లనియె. 874

క. సతి యాభటు లెవ్వరో నా, హితమును గోరినను దెలుపుమీ యనవుడు నా
సుతులే వారలు నావుడు, నతివా తెలుపుము తదాహ్వయంబులు నాకున్.

వ. అనవుడు సుకలాసతి యాతని కి ట్లనియె.

సీ. చూడుము నాముందు శోభిల్లుచున్నాఁడు, శమదమాన్వితుఁ డైనసత్యమూర్తి
నాకుడిప్రక్క నున్నాఁడు వీక్షింపుము, సర్వాత్మకుం డైనజ్ఞానమూర్తి
కనుము నాయెడమప్రక్కను గ్రాలుచున్నాఁడు, ధైర్యధీయుతుఁ డైనధర్మమూర్తి
నావెన్క వెల్గుచున్నాఁడు దర్శింపుము, భువనపావనుఁ డైనపుణ్యమూర్తి

గీ. సకలశక్తులు గల్గి విశ్వముల నెల్ల, నడపఁజాలినధీరు లున్నారు నాకు
రక్షకులు గాఁగ నాలుగుప్రక్కలందుఁ, జూడఁగలశక్తి గలదేని చూచికొనుము.

గీ. చెప్పుచున్నాను వెడలుము శీఘ్రముగను, నుండకుము నాసమక్షమం దుంటివేని
భస్మమయ్యెద వాశచీభర్త వైన, దవశిఖిజ్వాల లంటినతరువువోలె. 878

గీ. స్మరుఁడు నామీఁదఁ గురియించుమార్గణములు
నన్ను స్పృశియింపఁజాల వెన్నఁడును గాని
చిచ్చునకుఁ జెద లంటునె చెప్ప నేల
వాఁడు తుద కేమి కా నున్నవాఁడొ యింక.

క. మును హరునిమీఁది కేఁగిన, యనయంబునఁ జేసి ప్రాప్త మైనయవస్థన్
గనుఁగొనక తనస్వభావం, బునె చూపుచునుండు మరుఁడు మూర్ఖుఁడువోలెన్.

వ. మాండవ్యశాపమృతుం డగుకౌండిమని బ్రదికింప నెంచి సూర్యోదయంబు నిరోధించినసైవ్యమాహాత్మ్యంబును బ్రహ్మవిష్ణుమహేశ్వరులను శిశువులను గావించినయనసూయప్రభావంబును మృత్యుగృహీతుఁ డగుసత్యవంతుని మరలఁ బ్రాణంబులతోడం దోడ్కొని వచ్చినసావిత్రిసామర్థ్యంబును వినినవాఁడు సతు లకు దూరంబుగా నుండు, 881

గీ. కంఠమునఁ గట్టికొని మోయఁగానిశిలను,గడలిలోపలఁ బడి యీఁదఁ గడఁగువాఁడ
యగ్నికుండంబునను దూఁకునట్టివాఁడ, యిలను సతులను గలఁగింప నెంచువాఁడు.
క. అనుటయు గజగజ వడఁకుచు, ననిమిషనాథుఁడును శంబరారాతియుఁ గ్ర
క్కునఁ జనిరి తమనివాసం, బునకున్ వెలవెలనవోవుమోములతోడన్. 883
క. అంతటను గ్రీడ గూడను, నంతర్హిత యగుడు విషయ మవగత మగుటన్
స్వాంతమున కపుడు సుకలా, కాంతామణి వచ్చెఁ దననికాయ్యంబునకున్.
ఆ. అంతఁ గొన్నిదినము లరుగుటయును దీర్థ,యాత్ర పూర్ణముగను నాచరించి
యరుగుదెంచెఁ గృకలుఁ డాత్మగేహమునకు,సంతసించుకొనుచు స్వాంతమందు.
వ. అప్పుడు ధర్ముండు తత్పితృపితామహప్రపితామహుల తెక్కలు విఱిచికట్టి తీసికొని వచ్చి ప్రత్యక్షంబుగా నాతనియెదుటం బెట్టుటయుఁ గృకలుండు విలోకించి,యయ్యా నీ వెవ్వండవు. నాయార్జించినతీర్థయాత్రాఫలంబున స్వర్గస్థాపితులై ననాపితరుల నేల బంధించితి వని యడుగుటయు ధర్ముం డాతని కి ట్లనియె.
గీ. ఏను ధర్ముఁడ నీయాత్ర కించుకేని, ఫలము లేదయ్యె నద్దానఁ గలుగదయ్యె
నూర్ధ్వలోకనివాసభాగ్యోదయంబు, దైవహతులై ననీపితృదేవతలకు. 887
క. అనుటయుఁ గృకలుఁడు నమ్రా, ననుఁ డై యి ట్లనియె స్వామి నాయాత్రకుఁ గ
ల్గినవై ఫల్యం బేమియొ, వినిపింపుము సకలధర్మవిదుఁడవు నాకున్. 888

—: భార్యను విడిచి కావించినతీర్థయాత్ర నిష్ఫల మని ధర్ముఁడు గృకలునకుఁ జెప్పుట :—

చ. అనుటయు ధర్ముఁ డి ట్లనియె నాతని కర్యకులీన ధర్మవ
ర్తనయు సుశీలయున్ బతిపరాయణచిత్తయు సన్నిధానవా
సినియును నైనభార్యను ద్యజించి యొనర్చినతీర్థయాత్రకున్
గనఁబడ దెందునున్ ఫలము గాయపరిశ్రమ మొండు దక్కఁగన్. 889
గీ. సాధ్వి యగుసతి యుండినసదనమందుఁ, దావుకొని యుండు నబ్ధులు దాపసులును
యజ్ఞములు పితరులును గంగాదినదులు, దేవతలు గోవులును సర్వతీర్థములును.
ఆ. అఖిలజీవులును గృహస్థాశ్రమము నాశ్ర, యించి బ్రదుకుచుండు నెపుడుఁ గూడ
నట్టియాశ్రమమున కాధార మైనది, సచ్చరిత్ర యైనసతియ చూవె. 891
గీ. అగ్నిహోత్రంబులును దేవతార్చనలును, దానధర్మంబులును సప్తతంతువులును
నాచరించును గాక భార్యాయుతుండు, కానియెడ నవి సిద్ధియుక్తములు గావు.
గీ. పుణ్యసంపాదనమునకుఁ బూనుకొనిన, దైవమును దృప్తిపఱుపఁగఁ దలఁచికొనిన
భువనములలోన గార్హస్థ్యమునకు సాటి, యైనధర్మంబు వేఱొండు గాన రాదు.
గీ. ఎప్పుడును దులఁదూఁగుచు నొప్పఁ గాక, సంపదలతోడఁ దామరతంపరగను
బంధువులు చేరుదురు గాక భార్య యొకతె, లేనియెడ నిల్లు గా దది కాన గాని.

ఆ. భార్య యొకతె యున్నపక్షంబునను గ్రామ, మైనఁ గాని గహన మైనఁ గాని
యదియె గృహము గేస్తుఁ డైనవానికి నదె, సకలధర్మములకు సాధనంబు. 895
గీ. అతివతో సమ మైనపుణ్యంబు లేదు, కాంతతో సాటి యైనసౌఖ్యంబు లేదు
దారతోఁ దుల్య మైనతీర్థంబు లేదు, ధర్మపరుఁ డైనగృహపరిత్రాయకునకు. 896
క. తనసతి యిచ్చినపిండం, బున శ్రాద్ధము పెట్టునెడ సుపుత్రుఁడు దానిన్
గొని పితరు లమృతముంబలెఁ, గని తృప్తినిఁ జనెద రూర్ధ్వగతులకు వింకే.
క. చోరుఁడవు నీవు సతి యగు, దారకుఁ దెలియకయె పిండదానం బిడుటన్
వీరలు నీకంటెను గడుఁ, జోరులు దత్పిండ మాసచొప్పునఁ గొనుటన్. 898
క. కావున వీరల కిట్టులు, గావింపఁగ వలసె శిక్ష గార్హస్థ్యవిధిన్
బోవిడిచి నీవు శ్రాద్ధము, గావించినకతన నిట్టిగతి యేర్పడియెన్. 899
క. అనుటయుఁ గృకలుఁడు స్వాంతం, బున ఖేదము నొంది కడచిపోయినకార్యం
బున కెంత వగచినను ఫల, మనునది లే దనుచు నెంచి యంతంబునకున్. 900
గీ. యమునితో నిట్టు లనియె మహాత్మ నేను, జ్ఞానహీనుండ నై చేయ రానిపనిని
జేసితిని దప్పు క్షమియించి చెప్పు మింకఁ,బితృవిమోచనమున కేది గతియొ నాకు.
గీ. అనుటయును ధర్మరా జిట్టు లనియె వత్స, తలఁచికొని పుణ్యతీర్థముల్ తలఁపులోన
నొనరుపుము సహధర్మిణి యొసఁగినట్టి, పిండమున శ్రాద్ధ మింట నీపితరులకును.
గీ. దానిచేతను సకలతీర్థములలోన, జాయతోఁ గూడి శ్రాద్ధము సలిపినట్టి
ఫలము చేకూరు నది పితరులకు నూర్ధ్వ,గతులు గలిగించు నని చెప్పి కాలుఁ డరిగె.
క. అంతటఁ గృకలుఁడు సుకలా, కాంతామణి కేల నీయఁగాఁ బిండంబున్
జెంతనె నివసించి మహా, సంతోషముతోడఁ జలిపె శ్రాద్ధము నింటన్. 904
వ. అప్పుడు నేనును బరమేష్ఠియును మహేశ్వరుండును దేవగంధర్వసిద్ధవిద్యాధరా
దులతోడం గూడి కృకలునకుఁ బ్రత్యక్షం బయి వర మిచ్చెదము కోరు మనుట
యును గృకలుండు సవినయంబుగాఁ బ్రణమిల్లి మహాత్ములారా యెవ్వరిపుణ్యం
బునం జేసి నాకు వర మీయ వచ్చితిరో యానతిం డని యడుగుటయు నంతట
మే మెల్లరమును నేకగ్రీవంబుగా సుకలావృత్తాంతంబు నాతని కెఱింగించి
వత్సా నీసహధర్మిణిపాతివ్రత్యమహిమంబునం జేసి నీకు వర మీయ వచ్చి యు
న్నార మని పలుకుటయు నాతండు మహానందపరవశుండై. 905
గీ. నాపితరు లూర్ధ్వలోకంబునను వసించు, నట్లు నాబుద్ధి ధర్మంబునందు నిలిచి
యుండునట్టు లనుగ్రహింపుం డటంచుఁ, బలుకుటయు నట్ల యగు నని పలికి మేము.
గీ. కుసుమవర్షంబు దివినుండి కురియుచుండ, నచ్చరలువ్యోమమున నాట్యమాడుచుండ
విస్మయావహ మైనయావెలఁదికతను, వాకొనుచు నేఁగితిమి స్వస్వలోకములకు.

క. ఈకథ నాకర్ణించిన, లోకుల కిహసౌఖ్య మూర్ధ్వలోకసుఖంబున్
జేకూరు ననిన నేటికి, వాకొన నింక నిదియు నదియు వచ్చు నటంచున్. 908

—: విష్ణువు వేనునకుఁ బితృతీర్థమాహాత్మ్యముం జెప్పుట :—

వ. ఇంకఁ బితృతీర్థమాహాత్మ్యంబు నెఱింగించెద. 909

క. ఇలను దశారణ్యము నాఁ, గల దొక్కయరణ్య మం దఖండతముగను బి
ప్పలుఁ డనెడిఋషి తపంబున్, జలుపంగాఁ బొడఁగె మున్ను శాంతాత్ముం డై.

గీ. ఆతపం బగ్నిశిఖవోలె నన్నిదెసల, వలగొనుచు లోకులకు భీతి గలుగఁజేయ
నపుడు సుర లెల్ల దయచేసి యతనికడకు, నీప్సితార్థంబు కోరుకో మ్మనిరి మునిని.

గీ. అంతఁ బిప్పలముని వారి కందఱకును, వందనము లొనరించి గీర్వాణులార
భువన మంతయు నావశంబుగను నుండ, వరము దయచేయుఁడీ పెక్కువాంఛ లేల.

క. అనుటయు నట్టులె యగు నని, యనిమిషు లెల్లరును బలికి యంతర్ధానం
బును జెంది రంతఁ బిప్పలుఁ, డనుకొనినది యెల్ల వశ్య మగు చుండంగన్. 913

గీ. పడయరానివిద్యాధరపదము వడసి, కామగమనంబునను ముజ్జగంబులందుఁ
దిరుగుచుననంకుశము లేనిద్విపమువోలె, సర్వమునునాదెయనుచునుగర్వపడుచు.

క. ఒకనాఁడు కుతూహలమున, నొకహ్రదమున కేఁగి చూచుచుండఁగ నచ్చో
నొకసారస మి ట్లనియెను, నకలంకస్వరముతోడ నాతఁడు వినఁగన్. 915

ఆ. ఏల గర్వపడెద వింతమాత్రమునకె, యెఱుఁగఁదగిన దేదొ యెఱుఁగ వైతి
మూఁడువేలయబ్దములు చేసినతపంబు, మూఢభావమునకు మూల మయ్యె. 916

క. అనుటయుఁ బిప్పలుఁడు మనం, బున విస్మయ మొంది పతగపుంగవ నాకున్
వినిపింపు మీ వెవండవొ, కనుఁగొనఁ దగినదియు నేదొ కారుణ్యమునన్. 917

గీ. అనుటయును సారసం బిట్టు లనియె నపుడు, మునివరేణ్య కురుక్షేత్రమునఁ గలండు
కుండలుం డనువిప్రుఁ డొకండు గలఁడు, వానికి సుకర్ముఁ డనియెడిసూనుఁ డొకఁడు.

గీ. ఆసుకర్మునికడకు నీ వరిగితేని, యే నెవండనొ నీ వేది యెఱుఁగవలెనొ
యంతయునునీకు బోధించునతఁడెయనుచు, మాటలాడుచునుండియేమాయమయ్యె.

క. చనుటయును సారసం బా, ముని నిజయోగప్రభావమున శీఘ్రముగన్
జని కుండలాత్మజుం డుం, డినచోటికి నతనియెదుట నిలువంబడియెన్. 920

చ. నిలుచుటయున్ సుకర్ముఁ డతనిం దిలకించి యొనర్చెఁదగ్గపూ
జల నొనరించి స్వామి నిను సారస మంపెనె మూఁడువేలయేఁ
డులు తపముం బొనర్చితె కఠోరముగన్ వర మిచ్చిరే సురల్
గలిగెనె లోకముల్ వశముగాఁ గొనుశక్తి యహంత పుట్టెనే. 921

ఆ. అజుఁడు సారసముగ నరుదెంచి నాకడ, కనిపె నిన్ను గర్వ మడఁపఁ దలఁచి
యెఱుఁగఁదగిన దేదొ యెఱింగింతు నాఘయి, నీమహాత్మ్య మెంతొ నీకె తెలియు.

వ. అర్వాచీనం బనియుఁ బరాచీనం బనియును రూపంబు ద్వివిధంబు. సచరాచరంబు లగుప్రపంచంబు లన్నియు నర్వాచీనరూపంబు. ఇయ్యది యసత్యంబును గల్పితంబును దుచ్ఛంబును నగురూపంబు. దీనిం దెలిసికొనుట గాని వశీకరించుకొనుట గాని విశేషంబు గాదు. పాదంబులు లేకుండియు నడచునదియును హస్తంబులు లేకుండియుఁ జేయునదియును ఘ్రాణంబు లేకుండియు నాఘ్రాణించునదియును శ్రోత్రంబులు లేకుండియు వినునదియును ముఖంబు లేకుండియు భాషించునదియును నేత్రంబులు లేకుండియుఁ జూచునదియును సర్వవ్యాపకంబును సర్వప్రవర్తకంబును నద్వితీయంబును జ్ఞానాకారంబును విశ్వాధారంబును విశ్వమూలంబును నగురూపంబు పరాచీనంబు. ఆరూపంబు సాధారణంబుగా గోచరించునది కాదు. అదియె యెఱుంగవలసినపరమార్థరూపంబు. మున్ను మహోదకంబునందు శేషపర్యంకంబు నధిష్ఠించి కోటిసూర్యప్రకాశమానంబై యోగనిద్రం జెంది యున్నతద్రూపంబు గాంచి స్థానంబు లభింపక తిరుగుచుండు మార్కండేయుండు విస్మయావిష్టమానసుండై వెలవెలఁబోవుచుండ నారూపంబు నుండి దంష్ట్రాకరాళవదనయును నంజనపర్వతాభయును నగునొక్కయింతి యావిర్భవించి తాపసేంద్రా భయపడకుము. శేషశయ్యాధిగతం బగునారూపంబు జనార్దనుండు. నన్నుఁ దచ్ఛక్తి యగుకాళరాత్రిఁ గా నెఱుంగుము. నేను జగన్మోహంబుకొఱ కావిర్భవించినమహామాయ నని చెప్పి పంచయోజనాయతం బగునొక్కపద్మపత్త్రంబు నాతనికిం జూపి నీ విందు నిర్భయుండవుగా వసింపు మని యంతర్హితం బయ్యె. 923

క. అప్పుడు మార్కండేయుఁ, డప్పురుషోత్తమునినాభియందుండు గాంచెక్
గొప్పసువర్ణాంభోజము, నప్పువ్వునె జనసమూలు వసజాసనుఁ డయ్యెక్. 924

క. ఆయజునివలన నుద్భవ, మాయెను లోకములు పాలకాన్వితములు గా
శ్రేయఃప్రదములు గా వవి, మాయారూపములు ముక్తిమార్గము నిజునే. 925

వ. అర్వాచీనపరాచీనంబులు రెండును నాకు వశంబులై యున్నయవి యనుటయుఁ బిప్పలుం డాతని కిట్లనియె. 926

క. అనఘా నీశక్తిని గ, న్గొన నా కుదయించె నొక్కకోరికి తీర్పం
జనునేని నాయభీష్టము, కనఁబఱుపుము దేవతానికాయము నిచటక్. 927

క. అనుటయును సుకర్ముఁడు తన, కనులను మూసికొని సురనికాయము నెల్లక్
మనమున స్మరియించుటయును, ననిమిషు లెల్లరును వచ్చి రాతనికడకుక్. 928

క. అరుదెంచినవారలకుక్, గరములు జోడించుకొని సుకర్ముఁడు పూజా
చరణంబు జరిపి యిమ్మని, వరునకు దర్శన మొసంగవలె నని కోరెక్. 929

క. కోరుటయుఁ బిప్పలుఁసకుఁ, వారిలు దర్పన మొసంగి నైనశ్యము చే
కూరిచి తద్గర్వపరీ, హారం బొదవంగ నేఁగి రాలయములకుఁ. 930
క. అటుపిమ్మటఁ బిప్పలుఁ డు, త్కటహర్షముతోడఁ గని సుకర్ముని స్వామీ
యిటువంటిశక్తి నీకుఁ, ఘటియిల్లుట కేది కారణంబో చెపుమా. 931
క. అని యడుగుటయు సుకర్ముం, డనియెను బిప్పలున కిట్టు లయ్యా నే నే
పనియు నెఱుంగను బితృపూ, జన మొక్కఁడు దక్క నిట్టిశక్తి ఘటిల్లన్. 932
క. అనుదినమును జలుపుదు నా, జననీజనకులకు నంగసంవాహనముం
బొనరించి తత్పదప్రా, శనమును దద్వారికణములను దాల్తు మెయిన్. 933
క. ఎం దుందురో మాతాపిత, లం దుండును దీర్ఘకోటు లాత్మజునకు నం
చందురు పెద్దలు గావున, నుందును సతతంబు వార లుండిన చోటన్. 934
క. ఎక్కడ కేఁగఁ దలంతురో, యక్కడ కేఁగుదును వారి ననుదినమును నే
నెక్కించుకొని భుజంబుల, నక్కార్యముకంటె నాకు నధికము లేమిన్. 935
క. ఒనరింపఁ జేసి స్నానము, జననీజనకులను మొదటఁ జలుపుదు నాపై
ననుదినము నేనుస్నానము, దనయుఁడు గావింపఁ దగినధర్మం బగుటన్. 936
క. మొదటను నాగురువుల నో, ప్పిదముగ భుజియింపఁ జేసి పిదప భుజింతున్
నిదురింపఁ జేసి వారిని, నిదురింతు ననంతరంబు నేను మునీంద్రా. 937
గీ. ఆచరింతుఁ ద్రికాలంబులందుఁ బూజ, దల్లిదండ్రుల కది పుత్రధర్మ మగుట
వారికంటెను నాకు దేవతలు లేరు, జపతపంబులు లేవు యజ్ఞములు లేవు. 938
ఆ. కాయశోషణంబు గావింపఁగా లేదు, చదువ లేదు వేదశాస్త్రములను
దానధర్మములను దలఁప నైనను లేదు, తిరుగ లేదు పుణ్యతీర్థములకు. 939
గీ. ఎట్టిధర్మంబులను జేసిమెఱుఁగకున్న, నఖిలమహిమంబులును బ్రాప్తమయ్యె నాకుఁ
గాన ఘన మైనధర్మంబు గాన రాదు, కొమరులకుఁ దల్లిదండ్రులకొలువుకంటె.
క. తలిదండ్రులశుశ్రూషను, జలుపనియాత్మజునివేదశాస్త్రములు తపం
బులు యజ్ఞంబులు దానం, బులు ధర్మంబులును వ్యర్థములు మౌనీంద్రా. 941
క. పితృకరుణకుఁ బాత్రుం డగు, సుతునకు నతులితము లైనసుఖములు గలుగున్
బితృకోపమునకు గురి యగు, సుతునకు నంతంబు లేనిశోకము గలుగున్.
వ. ఈవిషయంబునం దొక్కపుణ్యచరిత్రంబు వచియించెద నాకర్ణింపుము. 943

—: య యా తి చ రి త్ర ము :—

సీ. నహుషుండు నా నొక్కనరపతి జనియించె, వసుధపై మును సోమవంశమందు
జనియించి యతఁడు చేసెను నూఱు వాజపే, యములును నశ్వమేధములు నూఱు
చేసి కాలంబు సంసిద్ధంబు గా శరీ, రము వీడనాడి స్వర్గమున కరిగి
యరిగి తా నొనరించినట్టియుపారధ, ర్మంబుచే నింద్రపదంబు వడసె

గీ. సంతతి నాతిసితినుజన్ముఁ డగుచుయయాతి, తండ్రికంటెను మిన్నగా ధర్మములను
జలుపుచును ముజ్జగంబులు సన్నుతింప, నేలె రాజ్యంబు నెనుబది వేలయేండ్లు.
గీ. అంతనాతని కుదయించి రాత్మభవులు, తురుపు పురుడును గుదుపు యదువునునాఁగఁ
బుట్టి వారెల్ల నభివృద్ధి బొందుచుండి, రనుదినంబును ధర్మానుయాయులగుచు.
గీ. అట్టు లుండంగ నొక్కనాఁ డమరవిభుని, మార్గవశమున వజ్రిసమితిమునకు
నరుగుదెంచుటయును నాతఁ డమ్మహర్షి, నర్ఘ్యపాద్యాదివిధులచే నాదరించి.
క. ఎచ్చటనుండి మహాత్ములు, వచ్చుచు నున్నారొ తెలుపవలయును నాఁగన్
వచ్చితిమి ధాత్రినుండి వి, యచ్చరవల్లభ యటంచు నమ్మౌని పలికెన్. 947
ఉ. అంతట నింద్రుఁ డిట్లనియె నాతనితో మహాసియ భూమహీ
కాంతుఁడు నేఁడు రక్షకుఁడుగా వసుధాస్థలి కున్నవాఁడొ త
త్కాంతిపరాక్రమాదులప్రకారము లెట్టివొ నాకుఁ జెల్పు మ
త్యంతకుతూహలంబు హృదయంబునఁ గల్గెడి నాలకింపఁగన్. 948
క. నావుడుఁ గలహాశనుఁ డా, దేవేంద్రున కిట్టు లనియె దేవా దినముల్
నీ వేలునట్లు నహుష, క్ష్మావరసుతుఁ డేలుచుండు క్ష్మామండలముల్. 949
గీ. వాజపేయశతంబును వాజిమేధ, శతము నొనరించి ధర్మనిష్ఠాగరిష్ఠుఁ
డగుచు నహుషునికంటెను నధికుఁడనెడి, యశమును యయాతి నలుదెసలందు నిలిపె.
క. అని చెప్పి బ్రహ్మపుత్రుఁడు, చనుటయు నహుషుండు మున్ను స్వస్థానంబున్
గొనినట్లు తత్సుతుండును, గొను ననుభయ మమరనాయకున కుదయించెన్.
గీ. భీతి గలుగుట వజ్రి యయాతితోడ, మైత్రి నొనరింపఁగా నెంచి మానసమున
నతనిఁ దోడ్కొని దివికి రమ్మనుచు భువికి, మాతలిని బంచె బుష్పకోపేతముగను.
క. పనుచుటయును మాతలి యా, తనిసన్నిధి కరిగి భూతధాత్రీశ్వర నే
ననిమిషనాథుఁడు పంపఁగఁ, జనుదెంచినయట్టియింద్రసారథిని జుమీ. 953
క. నను మాతలి యని యందురు, జనవర మాస్వామి నీవు సలిపినధర్మం
బును విని యమితానందము, గొని నిను దివమునకుఁ దోడుకొని రమ్మనియెన్.
గీ. సగరుఁడును విప్రచిత్తియు శంతనుఁడును, మనువు శిబియును నిక్ష్వాకుపును నిలుండు
భరతుఁడు పురూరవుఁడును నిప్పటికిఁ గూడ, స్వర్గమున నున్నవారు నాశంబులేక.
గీ. ఇంకను ననేకనృపు లకలంకయశులు, కలరు త్రిదివంబునను మహీతలమునుండి
యరుగుదెంచినయట్టివా రాత్మసుకృత, మహిమమునఁ జేసి దివ్యవస్త్రములతోడ.
క. జనవల్లభ పార్థివ మగు, తనువును విడనాడి నీవు దయచేయుము నా
వెనువెంట దివ్యదేహం, బున నినుఁ బుష్పకవిమానమునఁ గొనిపోదున్. 957
క. అనుటయు యయాతి యిట్లని, యెను మాతలితోడ దేవ యేదేహముచే
నొనరింపఁబడెనో ధర్మా, ర్జన మాదేహమునఁ జనదె చన దివమునకున్. 958

గీ. అనుచు మాతలి వాని కిట్లనియె దేవ, ధర్మసాధన మైనది తనువు గాన
పంచభూతాత్మకము గాన భంగురంబు, తగదు పరలోకయాత్రావిధానమునకు

క. అనుటయు యయాతి యి ట్లని, యెను దేవ శరీరవిషయ మెట్టిదొ సర్వం
బును నాకు సవిస్తరముగ, వినిపింపుము కాంక్ష యుద్భవించెను వినఁగన్. 96

క. అని యడుగుటయును మాతలి, జననాథున కిట్టు లనియె స్వామీ దేహం
బును గూరిచి నీకును దెలి, యని దున్నదె యైన వినుతు నడిగితి కానన్. 96

—: శరీరవిచారము :—

వ. శరీరంబు త్రివిధంబు. అది కేవలపాపకర్మంబునం జేసి ప్రాప్తించుటవలనఁ బాపశరీరం బనియును గేవలపుణ్యకర్మంబునం జేసి లభించుటవలన దివ్యశరీరం బనియును మిశ్రకర్మంబునం జేసి యావిర్భవించుటవలన మిశ్రశరీరం బనియును జెప్పఁబడు. పాపశరీరంబు నరకగాములకును దివ్యశరీరంబు దేవతలకును మిశ్రశరీరంబు మనుష్యాదిప్రాణిసంతానంబునకును నేర్పడు. అందు మిశ్రశరీరంబు లుద్భిజ్జంబు లనియును స్వేదజంబు లనియును నండజంబు లనియును జరాయుజంబు లనియును నాలుగువిధంబులుగా నుండు. తృణగుల్మాదిరూపంబు లగుస్థావరశరీరంబు లుద్భిజ్జంబులు. కృమికీటమశకాదిశరీరంబులు స్వేదజంబులు. పక్షినక్రమత్స్యాదిశరీరంబు లండజంబులు. మానవపశుశరీరంబులు జరాయుజంబులు. జలసిక్తంబగు క్షేత్రంబునందు నిక్షిప్తం బగు బీజంబువలన నంకురంబును నంకురంబువలనఁ బర్ణంబును బర్ణంబువలన నాళంబును నాళంబువలనఁ గాండంబును గాండంబువలనఁ బ్రభవంబును ప్రభవంబువలన క్షీరంబును క్షీరంబువలనఁ దండులంబును బక్వం బైనతండులంబువలన నోషధులును నోషధులవలన నన్నంబును నన్నంబువలన శుక్రంబును శుక్రంబువలన దేహంబునుం బుట్టు. శుక్రవిసర్గకాలంబున జీవుండు స్వకర్మప్రేరితుండై శుక్రంబునం జేరి స్త్రీగర్భంబునఁ బ్రవేశించు. పురుషశుక్రంబును స్త్రీరక్తంబును నేకత్వముం జెంది యొక్కదినంబునం గలలం బగు. కలలం బైదుదినంబులకు బుద్బుదాకారముం బడయు. బుద్బుదం బొకమాసంబునకు శిరోగ్రీవాస్కంధపృష్ఠవంశోదరరూపంబున నైదువిధంబులుగాఁ బరిణమించు. మాసద్వయంబునకుఁ బాణిపాదపార్శ్వకటిగాత్రంబులును మూఁడుమాసంబుల కంకురంబులును నాలుగుమాసంబుల కంగుళ్యాదులును నైదుమాసంబులకు ముఖనాసికాకర్ణంబులును నాఱుమాసంబులకు దంతజిహ్వాకర్ణచ్ఛిద్రంబులును బాయూపస్థశిశ్నంబులును నేడుమాసంబులకు గాత్రసంధులును గలిగి యెనిమిదిమాసంబులకు నంగప్రత్యంగంబులు సంపూర్ణంబుగా నేర్పడి దేహంబు విభక్తావయవం బై పంచభూతాత్మకం బగుచు నాభిసూత్రనిబద్ధం బై తల్లి భుజియించుషడ్విధరసోపేతాహారంబున దినదినంబును వద్ధి నొందుచుండు

సీ. అప్పు డా దేహంబుసం దుండుజీవుండు, పూర్వజన్మస్మృతి పొడమఁ దనకుఁ
బరితపించుచుఁ జేయఁబడినపాపములకు, నీరీతి నాత్మలో నేడ్వఁ దొడఁగు
నెన్నిసారులొ చచ్చి యెన్నిసారులొ పుట్టి, పడితి గర్భనరకబాధ లెల్లఁ
గుక్కబుద్ధియె కాని యొక్కజన్మమునను, గలిగినజ్ఞానంబు నిలువదాయెఁ

గీ. గడచి యీగంఠ మెట్టులో పుడమిమీఁదఁ, బడినయెడలను నింక నెప్పటికిఁ గూడ
గర్భవాసంబు గలిగించుకార్యములను, జేయకుండఁగఁ గడపుదు జీవితంబు. 963

క. నిరతంబును హరినామము, స్మరణము సేయుచును గలితసంసారుఁడ నై
తరియింతు నింక మీఁదను, హరి హరి పడఁజాల నిట్టి గుణసంబుల్. 964

క. కలలో నైనను బరకాంత, తలఁ గోరను బరధనంబు దాఁకను జేయన్
ఖలజనసహవాసంబును, దొలఁగినయెడ నీదురంతదుఃఖము నాకున్. 965

వ. అని సంసారవిరక్తుండై మోక్షంబు నపేక్షించుచు దిక్కు గోరక నానాప్రకా
రంబుల విలపించుచుండు. 966

క. గిరిగుహలోపలఁ జిక్కిన, నరుని తెఱంగునను ఘోరనానావ్యథలన్
బరితాప మొందుచుండును, జరాయువునఁ జుట్టఁబడినజంతువు భూపా. 967

క. జలనిధిమధ్యంబున విధి, బలమునఁ బడిపోయినట్టిప్రాణిగతిని వ్యా
కులచిత్తుఁ డగుచుఁ గడుఁ జిం, తిలు గర్భోదకనిషిక్తదేహుం డధిపా. 968

ఆ. ఉనిచి లోహకుంభమున వహ్నిచేతను, బచ్యమానుఁ డైనప్రాణివోలె
గర్భకోశమధ్యగతుఁ డైనజీవుండు, తప్తుఁ డగును జఠరదహనమునను. 969

గీ. అగ్నిసూచీవిభిన్నాంగుఁ డైనదేహి, యెంత దుఃఖంబు నొందునో యంతకంటె
నధిప యష్టగుణాధికం బైనదుఃఖ, మనుభవించును గర్భస్థుఁ డైనవాఁడు. 970

క. పలునుడువులు నుడువఁగ నేం, దుల కింకను గర్భవాసదుఃఖముకంటెన్
బలవంత మైనదుఃఖం, బిలలోపల లేదు మానవేశ్వర వింటే. 971

గీ. గర్భవాసవిషాద మేకరణి నైన, జ్ఞాన ముదయించువఱకును మాన దధిప
యది చరాచరములకును నన్నిటికిని, దాపరించును గర్భానురూపముగను. 972

గీ. మఱియొకరహస్యమును విను మానవేంద్ర, తెలియ దండఱకును నిది తెల్లముగను
గర్భవాసవిషాదంబుకంటె జనన, మగువిషాదంబు కోటిగుణాధికంబు. 973

సీ. యంత్రనిష్పీడితం బయినట్టిచెఱకు, చందమున యోనిసమ్మర్దజనిత మైన
బాధచేఁ బిప్పిపిప్పియై పడు ధరిత్రిఁ, జివర కెట్టులో దేహంబు పవనహతిని. 974

వ. ఆదేహంబు మూఁడునూఱులయఱువదియెముకలును బేశీశతపంచకంబును స్థూల
సూక్ష్మంబులును దృశ్యాదృశ్యంబులును నగుమూఁడుకోటులయేఁబదిలక్షల
రోమంబులును నన్ని నాడులును ద్వాత్రింశద్దశనంబులును వింశతి నఖంబులును
బిత్తకుడపంబును సర్ధాఢకకఫంబును ముప్పదిపలములవసయును సర్బుదపలంబుల

వాతంబును బదిపలంబులమేదస్సును మహారక్తపలత్రయంబును రక్తచతుర్గుణమజ్జ యును శుక్రార్ధకుడపంబును దదర్ధబలంబును నూఱుపలములరక్తంబును మాంస పలసహస్రంబును బరిమాణంబు లేనివిణ్మూత్రంబులును గలిగి యుండు. 975

ఆ. అపరిశుద్ధ మైనయాశరీరము శుద్ధుఁ, డైనయాత్మ కాలయంబు గాఁగఁ
గర్మవశముచేత నిర్మితం బయ్యెను, గడవరాదు కర్మగతి నరేంద్ర. 976

ఆ. పావనంబు లైనపంచగవ్యాదుల, నశుచిభావ మొందునట్లు చేయు
మేనికంటె నశుచి యైనపదార్థంబు, గలదె యెచట నేని తెలిసికొనిన. 977

గీ. దేనినవరంధ్రములనుండి దినదినంబు, వచ్చుచుండును సకలదుర్వాసనలును
దానికి శుచిత్వ మేరీతి నైనఁ గాని, కలుగ నేరదు బొగ్గు గాఁగలదె తెలుపు. 978

గీ. కప్పురపుఁదావి గలమంచిగంధమునను, నగురుధూపాదులను నెంతబుగులుకొనఁగఁ
జేసినను మేను విడువదు స్వీయగుణము, శ్వానపుచ్ఛంబు వంచినఁ జక్కఁబడునె.

క. తనమేనిమలములను మూ, ర్కొనఁ జాలక ముక్కు మూసికొనుచును నెవ్వం
డును దేహమున విరక్తిని, నెనయఁడు నృప మోహమహిమ మే మని చెప్పన్.

గీ. తనువు జన్మంబునను యశుద్ధంబు గానఁ, దద్విశుద్ధికిఁ గడఁగరు తత్త్వవిదులు
సర్వకర్మంబులందును జంతువులకు, భావశుద్ధియె ముఖ్యము పార్థివేంద్ర. 981

ఆ. భావదుష్టుఁ డైనప్రాణి తీర్థములందు, మునిఁగినను దపంబు లొనరిచినను
సాహసమునఁ దుదకు జ్వలనప్రవేశంబు, చేసినను విశుద్ధి చెందలేఁడు. 982

ఆ. కౌఁగిలించుకొనును గాంతను బుత్రిని, బతిని సుతుని నందు భావభేద
మున్నకతనఁ గాదె యొదవదు పాపంబు, కాదు యొకటి యైనఁ గాని భూప.

గీ. అఖిలభోగంబులను దేల్చినట్టిభార్య, యైనఁ గాని పరిత్యక్త యయ్యెనేని
ధవుని మోమైనఁ జూడదు దాని కెల్లఁ, గారణము భావభేద మొక్కటియ కాదె.

క. ఒకసమయమున రుచించిన, వొకసమయంబున రుచింపకుంటకు భావం
బొకఁడె నిదానము గావున, సకలము సిద్ధించు భావశౌచం బున్నన్. 985

గీ. కానఁ జిత్తంబు శోధింపఁ గడఁగవలయుఁ, బనికిమాలినబాహ్యశోధనము లేల
భావశౌచంబు గలిగినపావనుండు, గాంచఁగలుగును స్వర్గమోక్షముల నధిప.

గీ. జ్ఞాన మనియెడినిర్మలసలిలమునను, దీవ్రవైరాగ్య మనెడిమృత్తికను గాక
తొలఁగునె యవిద్య యనియెడిమలవిలేప, మన్యశోధనములు వేయి యైనఁ గాని.

గీ. అట్లు దేహంబు భూతలమందుఁ బడిన, మాత్రమున బాహ్యవాయుసంస్పర్శ మొదవు
దానిచే జ్వర ముదయించు దానఁ గలుగు, విస్మృతి నశించు దాన వివేక మెల్ల.

గీ. ఆవివేకవినాశన మైనపిదపఁ, బూర్వకర్మానుగుణముగాఁ బుట్టుఁ గాంక్ష
కాంక్షచేఁ గల్గు స్తన్యంబు గైకొనంగఁ, గౌశలము గౌశలంబుచేఁ గలుగు వృద్ధి.

క. ఆవిధమున వర్తిల్లుచు, జీవుఁడు శైశవమున దుఃఖశిథిలుండై వా
పోవుచు నెట్టులొ కౌమా, రావస్థను జెంది దుఃఖ మందును జెందున్. 990
క. పిమ్మట యౌవనమునఁ గా, మమ్మువలనఁ గలబహుప్రమాదముల ననే
కమ్ము లగుదుఃఖములు వడు, సమ్మోదము గలదె తుచ్ఛసంసారమునన్. 991
క. ఆపైని వార్ధకమ్మున, నాపాదిల్లినజరామయంబున గళిత
వ్యాపారుఁ డగుచు ననిశము, వాపోవుచు నుండుఁ జిత్తవైకల్యమునన్. 992
గీ. మేన నాగంతువులు నూఱు మృత్యువులును
గాలమృత్యు వొకండును గలిగియుండుఁ
గలుగు జపహోమదానాదికర్మములను
శాంతి యాగంతువులకు విశ్వంభరేంద్ర. 993
ఆ. కలుగ దట్టిశాంతి కాలమృత్యువునకుఁ, బ్రాప్తకాలుఁ డైనప్రాణి నెంత
తారసిలినఁగాని ధన్వంతరియుఁ గూడ, నిమిషమాత్ర మేని నిలుపలేఁడు. 994
ఆ. అంతఁ గాలమృత్యు వాసన్న మగుటయుఁ, బాపరానిమరణబాధతోడ
మేను దొరఁగి పుట్టు యోనికోటులఁజుండుఁ, గర్మబద్ధుఁ డైనసకలదేహి. 995
క. దేహికి లేదు వినాశము, దేహమునకుఁ దక్క దాన దేహావిరహమే
దేహికి మరణం బనుచును, వ్యాహరించెద రభిజ్ఞు లగువా రెల్లన్. 996
గీ. దేహసంబంధమునఁ జేసి దేహి కొదవు, నెల్లదుఃఖంబులును దాని నెఱిఁగినట్టి
చేతనులు జన్మరాహిత్యసిద్ధికొఱకుఁ, జలుపుచుండెద రాత్మవిచార మధిప. 997
క. ధనసంపాదనమందున్, ధనసంరక్షణమునన్ ధనవ్యయమందున్
ధననాశమునను దుఃఖమె, ధనమున సౌఖ్యంబు గలదె తనుధారులకున్. 998
క. కలిమి గలయట్టి వారికి, సలిలాగ్నిస్వజనచోరజననాథులచేఁ
గలుగును భయంబు మృత్యువు, వలనను బ్రాణులకుఁబోలె వసుధాధీశా. 999
క. జను లెల్లరు భక్షింతురు, ధనవంతుని వ్యోమమునఁ బతంగములు జలం
బున మత్స్యంబులు భూతల, మున శ్వాపదములును మాంసమ్మును దినుభంగిన్.
ఆ. సంధివిగ్రహాదిసంధానచింతయుఁ, బుత్రభయము మఱియు శత్రుభయము
ర వులుకొనుచు నుండురాజ్యంబునను మాత్ర, మేమి సుఖము గలదు భూమిపాల.
గీ. క్ష్మాతలాధిప నహుషాదిజనవరేణ్యు, లెందఱందఱు స్వర్గము నొంది కుఁడఁ
బతితు లైరి ధనావలేపమునఁ జేసి, కాన ద్రవ్యంబువలన సౌఖ్యంబు లేదు. 1002
క. క్షితివర కుటుంబచింతా, హతుఁ డగునాతనిశ్రుతాదు లన్నియు దేహ
చ్యుతి గలుగ దానితోడనె, గతము లగు నపక్వకుంభగతజలమువలెన్. 1003
క. హిమవర్షాతపబాధలు, సముకొనుచుండంగ నెట్లు సముకూరును సౌ
ఖ్యము కాలమంధు మాత్రము, సమస్తమును దుఃఖహేతువు వర్ణించిరి వారల్.

వ. ప్రచండవాయుఘాతంబుచేఁ గలుగుపర్ణశాఖాఫలపతనంబువలనను గుఠారచ్ఛేదనంబువలనను గజాదిమత్తజంతువులచేఁ గావింపంబడుమూలనాశంబువలనను దావాగ్నిహిమపాతంబువలనను ననవరతంబును స్థావరంబులకు దుఃఖంబు సంభవించుచుండు. నాసావేధదండప్రతోదతాడననిగళబంధనాంకుశఘాతాదులవలనఁ గలుగుదుఃఖంబు పశువుల కేర్పడియె. వర్షశీతాతపంబులవలనను బంజరబంధంబువలనను గిరాతబాణపాతంబువలనను గలుగువిషాదంబు పక్షులకు సమకూరె. పరశురాముండు మహావీర్యుం డగుకార్తవీర్యార్జునునిబాహుసహస్రంబు ఖండించె. దశరథాత్మజుం డగురాముండు పరశురాముని నోడించె. జరాసంధుండు నిజప్రతాపంబుచే బలరామునికీర్తి భంగపఱిచె. జరాసంధుని భీముండు సమయించె. భీముని నాంజనేయుండు జయించె. నివాతకవచు లనుదానవులను నర్జునుండు రూపుమాపె. అర్జునుండు గోపాలకులచే జితుండయ్యె. లోకప్రకాశకుం డగుసూర్యుండు మేఘాచ్ఛాదితుం డగు. మేఘంబులు వాయువిధూతంబు లగు. వాయువు నగనిర్జితుం డగు. నగంబులు వహ్నిదగ్ధంబు లగు. వహ్ని జలంబుచే శమియించు. జలంబు సూర్యకిరణంబులచే శోషింపఁజేయంబడు. ఆదిత్యలోకాదిసకలలోకంబులును బ్రహ్మదేవునియొక్కదినంబునందు ప్రళయంబు నొందు. బ్రహ్మదేవుండు పరమాత్ముం డగుశివునిచేఁ బరార్ధద్వయకాలాంతంబునం దుపసంహరింపంబడు. ఇట్లు పరికింప సంసారంబున సర్వోత్తమపదం బెవ్వరికిని గానంబడదు. 1005

గీ. భిన్నమూలంబు లైనట్టిక్షితిరుహముల, పోల్కిఁ బడుదురు వివశులై పుడమిమీఁదఁ
గర్మఫలభోగ మైనతత్క్షణమునంద, లోకులకు నేమి సౌఖ్యంబు నాకమునను.

వ. మఱియును యజ్ఞపురుషునకు శిరోరోగంబును మార్తండునకుఁ గుష్ఠరోగంబును వరుణునకు జలోదరంబును సూర్యునకు దంతవైకల్యంబును సోమునకును క్షయరోగంబును నింద్రునకు భుజస్తంభనంబును దక్షప్రజాపతికి మహాజ్వరంబును వైశ్వానరునకు సర్వభక్షకత్వంబును గృష్ణునకుఁ బాండవ సారథ్యంబును స్కందునకు శరజన్మంబును సకలదేవతలకును బ్రతికల్పంబునందును సంక్షయంబును దప్పవయ్యె. బ్రహ్మదేవుండు దక్షపుత్రికను గామించె. రుద్రునకుఁ జండికను శపియించుటయును దక్షయజ్ఞధ్వంసంబు గావించుటయును జేకూరె. ఇట్లు బ్రహ్మాదిదేవతలకును గామక్రోధాదిదోషంబులు సంక్రమించి యుండె. కామక్రోధాదులు దుఃఖకారణంబులుగాఁ జెప్పంబడియె. 1007

క. జగదేకనాయకుం డగు, భగవంతుం డొకఁడుదప్పఁ బర మఖిలంబుల్
విగళిత మగునదె కావున, జగములలోఁ బ్రాజ్ఞుఁ డెవఁడొ జడుఁ డెవ్వండో.

క. ఏవిషయము నెనఁ డెఱుఁగునొ, యావిషయంబున నభిజ్ఞుఁ డతఁ డని చెప్పం
గా నలయుఁ గాని సర్వము, నేవాఁడును గూడ నెఱుఁగఁ డీప్రాణులలోన్. 1009

గీ. మానవాధిప తెలిసినదానిలోనఁ, గొంత యెఱుఁగకము తెలిసినజంతువునకుఁ
గలుగుచుండుఁ బ్రభావ మొక్కని కొకంట, దాన నతనికి నొందవు సమ్మానసంబు.
క. కాన విషాదాకులితం, బైన భవంబున విరక్తు లగుచును నాత్మ
జ్ఞానంబు వడసి దానను, గానందగు ముక్తి బుద్ధి గలవారలకున్. 1011
క. అనుటయు యయాతి సంతస, మును జెంది తదీయబోధమునకు మహాత్మా
మనుజులకర్మవిపాకం, బును జెప్పుము నాకు బుద్ధి పుట్టెను వినఁగన్. 1012
క. అని యడుగుటయును మాతలి, తనమదిలోపలను సతతిధర్మప్రశ్నం
బున కెంతయును బ్రమోదము, జనియింపఁగ నిట్లు లనియె క్ష్మాపాలునకున్.

—: కర్మవిపాకము :—

వ. బ్రహ్మఘ్నుండును స్వర్ణస్తేయియును గోఘ్నుండును గురుతల్పగుండును యోగ
నాశనుండును బంచమహాపాతకు లని చెప్పంబడుదురు. 1014
గీ. భయమువలనను గాని కోపమునఁ గాని, వైరమునఁ గాని లోభంబువలనఁ గాని
బ్రాహ్మణుని వధియించినపాపి చెప్పఁ, బడును బ్రహ్మఘ్నుఁ డనుచును బార్థివేంద్ర.
వ. మఱియును దారిద్ర్యభారంబున యాచించినబ్రాహ్మణునకు మొదట నాశ గొలిపి
పిదప విత యొనర్చువాఁడును నుదాసీను లగుబ్రాహ్మణులను సభామధ్యంబున
విద్యాగర్వంబుచే నిస్తేజస్కులం గావించువాఁడును మిథ్యాగుణంబులచేఁ దన
కుత్కర్షము నాపాదించుకొని గురువును విరోధించువాఁడును క్షుత్పిపాసాపీడితు
లగుప్రాణులు భుజించుటకు సిద్ధపఱుచుకొనినయన్నంబును బడఁగొట్టువాఁడును
సర్వజనరంధ్రాన్వేషణతత్పరుం డగువాఁడును బూర్వదత్తంబై కాలక్రమంబున
నశియించిన దేవబ్రాహ్మణభూమి నపహరించువాఁడును బ్రహ్మఘ్నుం డని చెప్పం
బడు. ద్విజవిత్తాపహరణంబును నగ్నిహోత్రపంచయజ్ఞమాతాపితృపూజాపరి
త్యాగంబును గూటసాక్ష్యంబును నభక్ష్యభక్షణంబును శివభక్తద్రోహంబును
నిరపరాధజంతుమారణంబును గోష్ఠదేవాలయపురగ్రామదహనంబును బ్రహ్మ
హత్యాసమపాతకంబులు. సువర్ణచౌర్యంబు స్వర్ణస్తేయం బనం బరగు. దీనజన
సర్వస్వహరణంబును బరన్యాసాపహరణంబును బరస్త్రీగజవాజిగోభూరజత
రత్నౌషధిరసచందనాగురుకర్పూరకస్తూరీపట్టవస్త్రాద్యపహరణంబును స్వర్ణస్తేయ
సమపాతకంబులు. గురుభార్యాగమనంబు గురుతల్పగమనం బనంబడు. వివాహ
యోగ్య యగుకన్యకను సదృశుం డగువరున కీయకుండుటయును బుత్రమిత్త్రుల
కళత్రంబులం బొందుటయును భగినీగమనంబును గుమారీగమనంబును జండాల
స్త్రీగమనంబును నగమ్యాగమనంబును గురుతల్పగమనసదృశంబులు. గోవధంబు
గోహత్య యని చెప్పంబడు. క్షుత్పిపాసారోగపీడితంబు లగుగోవులను రక్షింప
కుండుటయును మర్యాదావ్యతిక్రమంబును నతిమానంబును నతికోపంబును

దాంభికత్వంబును కృతఘ్నత్వంబును నత్యంతవిషయలౌల్యంబును గార్పణ్యం బును శాఠ్యంబును మాత్సర్యంబును బతివ్రతాదూషణంబును గన్యాదూషణం బును బరివిత్తిపరివేత్తలకుం గన్య నొసంగుటయును వారికి యాజకత్వంబు వహిం చుటయును బుత్రమిత్రులు లేనియప్పుడు వారికశ్రంబులం బోషింపకుండుట యును సద్భార్యాపరిత్యాగంబును సాధువులను దాపసులను బ్రాహ్మణులను గోవులను గొట్టుటయును దేవాలయవృక్షంబులను బుష్పారామంబులను నశింపం జేయుటయును నాశ్రమస్థు లగుద్విజుల బాధించుటయును యాచింపందగనివారిని యాచించుటయును యజ్ఞారామతటాకవిక్రయంబును దారాపత్యవిక్రయంబును దీర్ఘయాత్రోపవాసవ్రతాదిపుణ్యవిక్రయంబును స్త్రీధనోపజీవనంబును నధర్మ ప్రబోధంబును నధర్మవర్ణనంబునుబరదోషోద్ఘాటనంబునుబరద్రవ్యాభిలాషంబును బరదారాలోకనంబునుసాధుమార్గంబుననుండుచాననుబ్రహరించుటయునుసోమరి తనంబున నెప్పుడును నిద్రించుటయును దుర్బలంబు లగుజంతువులపై నతిభారంబు వైచి వానిని బాధించుటయును శక్తిలేనివారిని గార్యంబులందు బలాత్కారంబున నియోగించుటయును వ్రణాదిపీడితంబు లగుజంతువులచే బరువు మోయించుట యును వృషభంబులవృషణంబులు చితుకంగొట్టుటయును గోవధతుల్యంబులు. మహాపాతకిసాంగత్యంబు యోగనాశనంబు. మహాపాతకతుల్యంబు లని చెప్పం బడిన వన్నియును బాతకంబులు గా నెఱుంగునది. దిక్కు లేనివాఁడును వికలాంగుండును దీనుండును బాలుండును వృద్ధుండును క్షుధాతురుండును నగు వానిని గరుణింపకుండుటయును ద్విజుండు శూద్రాచారంబున నుండుటయును శూద్రుండు ద్విజాచారంబున నుండుటయును శిల్పవృత్తియును గాయవృత్తి యును వైద్యవృత్తియును దేవలకవృత్తియును భృతకవృత్తియును దూత్య వృత్తియును నదండ్యులను దండించుటయును దండ్యులను దండింపకుండుటయును బన్నులు హెచ్చుచేసి రాష్ట్రప్రజలను బీడించుటయును రాష్ట్రమునందు లంచ గొండు లగునధికారులును దస్కరులును లేకుండం జేయకుండుటయును నన్యాయ వర్తి యగుజేనివలనం బ్రతిగ్రహించుటయును ఘృతంబును దైలంబును మధు వును మాంసంబును నాసవంబును మూలంబులును ఫలంబులును గుడేక్షుక్షీర దధిశాకాదులును దృణకాష్ఠంబులును బుష్పపత్త్రంబులును నాతపత్రంబులును బాదరక్షలును శకటంబులును శిబికలును రజతతామ్రసీసత్రపుకాంస్యంబులును శంఖాదులును వాదిత్రవేణువంశాదులును గృహోపకరణంబులును నూర్ణా కార్పాసకౌశేయాదివస్త్రంబులును దొంగిలించుటయును వేదనిందయును బ్రాహ్మ ణాచారకుత్సనంబును సాధుజనపీడనంబును వంశాచారంబు విడిచి యన్యా చారంబు నాశ్రయించుటయును మాతాపితృభగినీస్వసృనిందాతాడనంబులును

దేవ కాలంబునం దరుదెంచిన బ్రాహ్మణులకుం గాదనక మాత్రము దాన మిచ్చి యితరుల కీయకుండుటయును సదాచారసంపన్నుండును నాశ్రితుండును నగు బ్రాహ్మణుని విడిచి యితర బ్రాహ్మణునకు దాన మిచ్చుటయును స్వగృహంబునకు వచ్చిన బ్రాహ్మణులను ద్యజించి వారు వెడలిపోయినపిదపం జేయుదానంబును నజ్ఞాతకులగోత్రుండును నపరీక్షితుండును నగు బ్రాహ్మణుని శ్రాద్ధమందును దానమందును నియమించుటయును ద్రిమూర్తులను ద్వేషించుటయును భగవద్భక్తులను నిందించుటయును బాద్మభాగవతమాత్స్యకూర్మహరివంశాది పురాణగ్రంథంబులను బూజింపకుండం బఠించుటయును వినుటయును లోభంబున నాగ్రంథములను విక్రయించుటయును నపరిశుద్ధప్రదేశంబులం దాపురాణంబులను జెప్పుటయును వినుటయును గురునమస్కారంబు గావింపక పురాణంబు పఠించుటయును వినుటయును బురాణజ్ఞానదాయకుండగు గురుదేవు నుపేక్షించుటయును భార్యాపుత్రమిత్రాదుల సన్మానించుటయును విప్రవర్జితంబుగా శ్రాద్ధంబు గావించుటయును మఱియును నితరపాపకర్మంబులును నుపపాతకంబులుగాం జెప్పంబడియె. మహాపాతకపాతకోపపాతకత్రివిధపాపంబులును జేయువారలకుం దత్తత్పాపానుగుణంబుగాం బ్రాయశ్చిత్తంబులును రాజశాసనంబులును యమదండనంబులును విధియింపంబడియె. ప్రమాదకృతంబు లగుపాపంబులకు గురువును గామక్రోధలోభాదులచేం జేయంబడుపాపంబులకు నృపతియును నకృతప్రాయశ్చిత్తరాజదండనంబులును బ్రచ్ఛన్నంబులును నగుపాపంబులకు యముండును శాసకులుగా నుందురు. 1016

గీ. మనసుచేతను గాని వాక్కునను గాని, కాయమునం గాని చేసినకల్మషములు
శాసనము లేనియెడలను జూసిపోవు, కల్పకోటులకైనను గాశ్యపీంద్ర. 1017

గీ. క్షమయు నిజ్యయు నింద్రియసంయమమును
శ్రద్ధయును సత్యమును నహింసయును ద్రపయుం
దపము ధ్యానము దానము ధర్మమునకు
సాధనంబులు పది చూవె జనవరేణ్య. 1018

గీ. వ్యస్తములుగను గాని సమస్తములుగం, గాని వానిని సేవించుమానవునకుం
గలుగు సుకృతైకఫలభోగనిలయ మైన, శివపురంబున వాసంబు క్షితితలేంద్ర.

క. కావున నాధర్మంబులు, సేవింపంగ నొప్పుం దనకు క్షేమము నెపుడుం
గావించుకొనం దలంచిన, జీవున కింక నీకు వేఱె చెప్పంగ నేలా. 1020

వ. మఱియును విష్ణుభక్తులకు వైకుంఠంబును బ్రహ్మోపాసకులకు బ్రహ్మలోకంబును శివభక్తులకుం గైలాసంబును యజ్వలకును యుద్ధనిహతు లగుక్షత్రియులకును బుణ్య

కార్యకరులకును స్వర్గంబును వాసస్థానంబగుత్రై యుండు. వారలందఱును దత్త
త్పుణ్యస్థానంబులందు దుఃఖరహితం బగుమహానందంబు ననుభవించుచుందురు.

గీ: సుకృతవంతులు గాని పాతకులు గాని, యందఱును గూడ యమపురి కరుగువార
కాని మార్గమునందు సౌఖ్యంబు గలుగు, సుకృతులకుఁ బాపులకుఁగల్గు శోకమధిప.

వ: అన్నోదకదానంబు చేయువారు మృష్టాన్నోదకసంతర్పితు లగుచును వస్త్రదానంబు చేయువారు దివ్యవస్త్రాలంకృతు లగుచును శిబికాదానంబు చేయువారు విమానాధిష్ఠితు లగుచును దివ్యాసనప్రదాతలు సుఖాసనస్థు లగుచును నారామస్థాపకులు మహావృక్షచ్ఛాయాశ్రితు లగుచును ఛత్రదానంబు చేయువారు ఛాయామార్గాశ్రితు లగుచును బుష్పప్రదాతలు పుష్పకయానాధిష్ఠితు లగుచును దేవాలయంబులును యతిమఠంబులును నాశ్రమంబులును వైద్యశాలలును ననాథశరణాలయంబులును బ్రాహ్మణవాసగృహంబులును నెలకొల్పువారలుత్తమగృహస్థితు లగుచును దేవాగ్నిగురువిప్రమాతాపితృసపర్య గావించువారలు మహాభోగంబు లనుభవించుచును నితరపుణ్యకార్యంబులు గావించువారలు తత్తత్కర్మానుగుణభోగంబు లనుభవించుచును సుఖంబుగా యమపురంబున కరిగి యచ్చటనుండి స్వకృతపుణ్యానుగుణంబు లగులోకంబులకు యమునిచే సాదరంబుగాఁ బంపంబడుదురు. పాపు లగువారలు యాతనాశరీరంబులు ధరియించి దారుణాకారు లగుయమభటులపాశంబులచేఁ గట్టంబడి మార్గమధ్యంబునఁ గ్రూరంబు లగుసింహవ్యాఘ్రవృకంబులచేతను దారుణంబు లగు దంశకీటమక్షికాజలూకాగణంబులచేతను మత్తమాతంగయూథంబుచేతను నిశితశృంగంబు లగుమహోక్షంబులచేతను మహాశృంగంబు లగుమహిషంబులచేతను విషోల్బణంబు లగువ్యాళంబులచేతను వికటాక్షు లగురాక్షసులచేతను భయంకరంబు లగుడాకినీగణంబులచేతను దుర్వారంబు లగువ్యాధులచేతను ప్రచండంబు లగుఝంఝామారుతంబులచేతను ఘోరంబు లగుపాషాణవర్షంబులచేతను హృదయనిర్భేదకంబు లగువజ్రనిర్ఘోషంబులచేతను బ్రదీప్తాంగారవర్షంబులచేతను భీకరోల్కాపాతంబులచేతను మహాపాంసువర్షంబులచేతను బీడింపంబడుచును క్షుత్పిపాసావివశు లగుచును హాహాకారంబులతో నేడ్చుచు నెట్టకేలకు మహాదుఃఖంబుతో యమపురంబున కేఁగి యచ్చటఁ జండశాసనుం డగుదండధరునిచేఁ దత్తత్పాపానురూపంబు లగునరకంబులలోఁ ద్రోయంబడుదురు. 1023

క. అనుటయు యయాతి యిట్లని, యెను మాతలి విడువ నొల్ల నే నీకాయం
బును దీనివలనఁ బుణ్యం, బును సంపాదించి మహిమమును బొందుటచేన్.

క. కలుగును జరాదిదోషం, బులు గార్శ్యంబులును బాపములు చేసినవా
రల కేను బాపరహితుఁడఁ, గలుగదు నా మేని కట్టిగతి యెన్నటికిన్. 1025

గీ. ఇప్పటికి నాకుఁ గడచిపోయినవి లక్ష, వర్షములు మేను నూత్నయౌవనవికాస
భాసమానం బగుచుఁ గానఁబడుచునుండె, నాఁడు మొనర్చినయట్టిపుణ్యమునఁ జేసి.

గీ. అమృతమయ మగుకృష్ణనామౌషధంబు, పాన మొనరించుటను జేసి పాతకములు
లేవు దానను మేనికి రోగహాని, యును గతంబున మరణంబు నాకు లేదు. 1027

గీ. కృష్ణనామరసాయనం బెల్లకడల
దొరకుచుండంగ భవమునఁ దగిలి దాని
మునుఁగుచుందురు సతతంబు మూఢమనుజులు
జననమరణప్రవాహనిర్మగ్నచయము నందు. 1028

క. హరికృపచే సౌఖ్యాభ్యా, సర శౌచంబునను సత్యధర్మాభిరతిన్
బరమపవిత్రం బగుచును, బరఁగెడి నా మేని కేల భంగం బొదవున్. 1029

గీ. పాపములచేత నామయప్రాప్తి గలుగు, నామయంబులచే మృత్యు వాటిల్లు
పాపములు లేని నా కళేబరమునందుఁ, గాంచ నేరదు మృత్యు వేకాలమునను.

గీ. కావున యయాతి స్వర్గముగా నొనర్చె, భూతలంబునె నిజధర్మహేతువునను
స్వర్గపురమున కేల రావలయు నింకఁ, జనుము మాతలి యామహేంద్రునకుఁ దెలుప.

క. అనుటయు మాతలి తనవ, చ్చినత్రోవనె స్వర్గమునకుఁ జేరి వినమ్రా
ననుఁ డగుచు మనవి గావిం, చెను వజ్రికి నహుషసుతుఁడు చెప్పినమాటల్.

క. ఆమాట లెల్ల విని సు, త్రాముఁడు చింతించుచుండె తరుణంబునఁ ద
త్స్వామిహృదయమునకు సాధ్వస, మానుగిలఁగ వచ్చి నిలిచి యముఁ డిట్లనియెన్.

క. సురలోకాధీశ వసుం, ధరలోన యయాతి యనెడు ధాత్రీశ్వరుఁ డ
క్రూరుఁ డున్నవాఁడు తద్గుణ, గరిమంబును విన్న భీతి గలిగెడి నెదలోన్. 1034

గీ. అతఁడు వ్యాధియు జరయును మృతియు లేక
సతతమును బంచవింశతిసముఁడు నాఁగ
వెలయుచుండెను వంశాభివృద్ధి గలిగి
హరికృపాసంహృతాఖిలదురితుఁ డగుట. 1035

క. ధరణీతలమున నుండిన, నరు లెల్లరు నతనిశాసనమువలన నిరం
తరమును హరిసంకీర్తన, పరు లగుచుండిరి సమస్తపాపము లుడుగన్. 1036

సీ. త్యజియింపకుందురు నిజధర్మములను ప్రా, ణములు గోల్పోవుసందర్భమునను
చలియింపకుందురు సత్యమార్గమునుండి, కంఠంబు తెగఁబోవుకాలమునను
విడనాడకుందురు విష్ణుభక్తిని స్మృతి, తప్పిపోవుచు నుండుతరుణమునను
తలపెట్టకుందురు కష్టకృత్యములను, సామ్రాజ్య మొసగూడుసమయమునను

కార్యకరులకును స్వర్గంబును వాసస్థానంబులై యుండు. వారలందఱును దత్తత్పుణ్యస్థానంబులందు దుఃఖరహితం బగుమహానందంబు ననుభవించుచుందురు.

గీ: సుకృతవంతులు గాని పాతకులు గాని, యందఱును గూడ యమపురి కరుగువార
కాని మార్గమునందు సౌఖ్యంబు గలుగు, సుకృతులకుఁ బాపులకుఁగల్గు శోకమధిప.

వ: అన్నోదకదానంబు చేయువారు మృష్టాన్నోదకసంతర్పితు లగుచును వస్త్రదానంబు చేయువారు దివ్యవస్త్రాలంకృతు లగుచును శిబికాదానంబు చేయువారు విమానాధిష్ఠితు లగుచును దివ్యాసనప్రదాతలు సుఖాసనస్థు లగుచును నారామస్థాపకులు మహావృక్షచ్ఛాయాశ్రితు లగుచును ఛత్త్రదానంబు చేయువారు ఛాయామార్గాశ్రితు లగుచును పుష్పప్రదాతలు పుష్పకయానాధిష్ఠితు లగుచును దేవాలయంబులును యతిమఠంబులును నాశ్రమంబులును వైద్యశాలలును ననాథశరణాలయంబులును బ్రాహ్మణవాసగృహంబులును నెలకొల్పువారలుత్తమగృహస్థితు లగుచును దేవాగ్నిగురువిప్రమాతాపితృసపర్య గావించువారలు మహాభోగంబు లనుభవించుచును నితరపుణ్యకార్యంబులు గావించువారలు తత్తత్కర్మానుగుణభోగంబు లనుభవించుచును సుఖంబుగా యమపురంబున కరిగి యచ్చటనుండి స్వకృతపుణ్యానుగుణంబు లగులోకంబులకు యమునిచే సాదరంబుగాఁ బంపంబడుదురు. పాపు లగువారలు యాతనాశరీరంబులు ధరియించి దారుణాకారు లగుయమభటులపాశంబులచేఁ గట్టంబడి మార్గమధ్యంబునఁ గ్రూరంబు లగుసింహవ్యాఘ్రవృకంబులచేతను దారుణంబు లగుదంశకీటమక్షికాజలూకాగణంబులచేతను మత్తమాతంగయూధంబుచేతను నిశితశృంగంబు లగుమహోక్షంబులచేతను మహాశృంగంబు లగుమహిషంబులచేతను విషోల్బణంబు లగువ్యాళంబులచేతను వికటాక్షు లగురాక్షసులచేతను భయంకరంబు లగుడాకినీగణంబులచేతను దుర్వారంబు లగువ్యాధులచేతను బ్రచండంబు లగుఝంఝామారుతంబులచేతను ఘోరంబు లగుపాషాణవర్షంబులచేతను హృదయనిర్భేదకంబు లగువజ్రనిర్ఘోషంబులచేతను బ్రదీప్తాంగారవర్షంబులచేతను భీకరోల్కాపాతంబులచేతను మహాపాంసువర్షంబులచేతను బీడింపంబడుచును క్షుత్పిపాసావివశు లగుచును హాహాకారంబులతో నేడ్చుచు నెట్టకేలకు మహాదుఃఖంబుతో యమపురంబున కేఁగి యచ్చటఁ జండశాసనుం డగుదండధరునిచేఁ దత్తత్పాపానురూపంబు లగునరకంబులలోఁ ద్రోయంబడుదురు. 1023

క. అనుటయు యమయాతి యిట్లని, యెను మాతలి విడువ నొల్ల నే నీకాయం
బును దీనివలనఁ బుణ్యం, బును సంపాదించి మహిమమును బొందుటచేఁ.

క. కలుగును జరాదిదోషం, బులు దుఃఖంబులును బాపములు చేసినవా
రల కేను బాపరహితుఁడఁ, గలుగదు నామేని కట్టిగతి యెన్నటికిన్. 1025

గీ. ఇప్పటికి నాకుఁ గడచిపోయినవి లక్ష, వర్షములు మేను నూత్నయౌవనవికాస
భాసమానం బగుచుఁ గానఁబడుచునుండె, నాఁడు యొసర్చినయట్టిపుణ్యమునఁ జేసి.

గీ. అమృతమయ మగుకృష్ణనామౌషధంబు, పాన మొనరించుటను జేసి పాతకములు
లేవు దానను మేనికి రోగ హాని, పాతకంబున మరణంబు నాకు లేదు. 1027

గీ. కృష్ణనామరసాయనం బెల్లకడల
దొరకుచుండంగ భవమునఁ దొరఁగి దాని
మునుఁగుచుందురు సతతంబు మూఢమతులు
జననమరణప్రవాహోర్మిచయమునందు. 1028

క. హరికృపచే బాహ్యాభ్యం, తరశౌచంబునను సత్యధర్మాభిరతిన్
బరమపవిత్రం బగుచును, బరగెడి నామేని కేల భంగం బొదవున్. 1029

గీ. పాపములచేత నామయప్రాప్తి గలుగు, నామయంబులచే మృత్యు వాటిల్లు
బాపములు లేని నాకు శరీరమునందుఁ, గాంచ నేరదు మృత్యు వేకాలమునను.

గీ. కావున యయాతి స్వర్గముగా నొనర్చె, భూతలంబును నిజధర్మహేతువునను
స్వర్గపురమున కేల రావలయు నింకఁ, జనుము మాతలి మామహేంద్రునకుఁ దెలుప.

క. అనుటయు మాతలి తనవ, చ్చినత్రోవనె స్వర్గమునకుఁ జేరి వినమ్రా
ననుఁ డగుచు మనవి గావిం, చెను వజ్రికి నహుషసుతుఁడు చెప్పినమాటల్.

క. ఆమాట లెల్ల విని సు, త్రాముఁడు చింతించుచుండు తరుణంబునఁ ద
త్సామీప్యమునకు సాధ్వస, మానుకొలఁగ వచ్చి నిలిచి యముఁ డిట్లనియెన్.

క. సురలోకాధీశ వసుం, ధరలోన యయాతి యనెడుధాత్రీశ్వరుఁ డొ
క్కరుఁ డున్నవాఁడు తద్గుణ, గరిమంబును విన్న భీతి గలిగెడి నెదలోన్. 1034

గీ. అతఁడు వ్యాధియు జరయును మృతియు లేక
సతతమును బంచవింశతిసముఁడు వోలె
వెలయుచుండును వంశాభివృద్ధి గలిగి
హరికృపాసంహృతాఖిలదురితుఁ డగుట. 1035

క. ధరణీతలమున నుండిన, నరు లెల్లరు నతనిశాసనమువలన నిరం
తరమును హరిసంకీర్తన, పరు లగుచుండిరి సమస్తపాపము లుడుగన్. 1036

సీ. త్యజియింపకుందురు నిజధర్మములను బ్రా, ణములు గోల్పోవుసందర్భమునను
చలియింపకుందురు సత్యమార్గమునుండి, కంఠంబు తెగఁబోవుకాలమునను
విడనాడకుందురు విష్ణుభక్తిని స్మృతి, తప్పిపోవుచు నుండుతరుణమునను
తలపెట్టకుందురు కలుషకృత్యములను, సామ్రాజ్య మొసఁగెదననుసమయమునను

గీ. నెనయుచుండెద రిరువదేనేండ్లవార, వీర లనుకొనునట్టు లనారతంబుఁ
బరగుచుందురు నిర్జరామరణు లగుచు, నహుషసుతుఁ డేలుజనులు బృందారకేంద్ర.

క. భూలోకముగా దది సుర, పాలక స్వర్గంబ యచటి ప్రజలను నే నే
వేళను నైనను నిజముగ, నాలోకించుటకుఁ గూడ నడలుచు నుందుర్. 1038

చ. నహుషసుతుండె యింద్రుఁడు జనంబులె దేవత లేమి చెప్ప నా
మహిమము వాగతీతము క్షమాప్రజ లెల్లరు నన్యలోకని
స్పృహు లయి యున్నవారలు పరిచ్యుతి వారికి లేదు కాన మీ
మహి యిలలోన నెన్నఁడును వాస్తవరీతిని దాఁప నేటికిన్. 1039

క. అనిమిషవల్లభ దీనికి, నను వైనచికిత్స చేయ నగు నతిశీఘ్రం
బున నీక నుపేక్ష చేసినఁ, బని లేక జగంబు లెల్లఁ బాడై పోవున్. 1040

క. అని తెలుపుటయును నింద్రుఁడు, మనమున స్మరియించె నపుడు మదనుని సంతన్
జనుదెంచి మన్మథుం డా, యన యెదుటను నిలిచె విరచితాంజలి యగుచున్.

క. నిలుచుటయు నతని కింద్రుఁడు, సలుపందగు గౌరవంబు సలిపి ధరిత్రీ
తలనాధునిమహిమంబునఁ, గలిగినలోకప్రమాదగతి నెఱిఁగించెన్. 1042

క. తెలుపుటయు మదనుఁ డాతని, పలుకులలోఁ గలిగినట్టిభావం బెల్లన్
దెలిసికొని లోకములకున్, గలుగునె నాశంబు నేను గలుగ సురేంద్రా. 1043

క. అని పలికి యతనియాజ్ఞను, గొని పరివారంబు నెల్లఁ గొని వెంటను నా
మనసిజుఁడు నటుఁడువోలెను, జనుదెంచె యయాతిరాజసవిధంబునకున్. 1044

క. చనుదెంచి ప్రణామంబుల, నొనరించి యయాతిభూవరోత్తమునకు ని
ట్లని పలికె స్వామిసంద, ర్శనభాగ్యమువలనఁ గలిగె సఫలత మాకున్. 1045

క. భూమీంద్ర నాటకములను, మేము ప్రదర్శింపఁగలము మే ల్మే లనఁగా
శ్రీమంతులు మీరలు మా, సామర్థ్యము చూచి మెచ్చఁ జాలును మాకున్.

మ. అని యర్థించుటయున్ నృపుం డఖిలవిద్యాపోషణాసక్తి గ
ల్గినవాఁ డైనకతంబునన్ సభకు నంగీకారమున్ దెల్పి యం
తన వాక్రుచ్చెను నేఁడు వామనచరిత్రంబున్ బ్రదర్శింపుఁడీ
యనుచుం జాతక మబ్దతోయమును గాక న్యంబు నాశించునే. 1047

వ. అంతట మన్మథుండు సూత్రధారవేషంబు దాల్చి నటీవేషధారిణి యగురతి
దేవితోడం గూడి పారిపార్శ్వకవేషధరుం డగుమాధవుండు వెంట రాఁ బండిత
మండలభూయిష్ఠం బగురాజసభామండపంబునం బ్రవేశించి. 1048

గీ. గాన మొనరింప రతి రాలు గరఁగునట్లు, హాస్యమును జూప మాధవుఁ డద్భుతముగఁ
దాను నిరుపమ మైననృత్యంబు సలిపి, మోహవార్ధిని సభ్యుల ముంచివైచె.

వ. తదనంతరంబ నేపథ్యంబు నలంకరింపంబడుటయు స్త్రీవేషధారిణియై జర ప్రవేశించి జగన్మోహనం బగుగానంబు గావించుచు లీలానాట్యంబు సలుపందొడంగె. ఆసమయంబునందు యయాతినృపాలుండు లఘుశంకం దీర్చికొని తద్గానపరవశీకృతమానసుం డగుటం జేసి పాదశౌచంబు మఱచి నిజాసనంబునం దుపవిష్టుం డయ్యె. 1050

క. ఎప్పు డశౌచుం డయ్యెనొ, యప్పుడె జర యావరించె నాతనిమేనం
దప్పునె ప్రమాదకృత మగు, తప్పున కేనియును శిక్ష నెసఁగుదురు లసఁగ. 1051

గీ. అదియె యద నని మదనుఁడు మది నెఱింగి, బద్ధు నొనరించె నాసన పాపనాశ్రి
నాత్మసమ్మోహనకళామహత్త్వమునను, బలిని నొగి వామనుఁడు బద్ధుఁజేసినట్లు.

ఉ. అంతట గార్యసిద్ధి యయినందున శ్లాఘ్యతమప్రయోగుఁడై
కంతుఁడు నాటకంబు లఘుకాలములోన ముగించి మేదినీ
కాంతునిచే బహూకృతులు గాంచి వెసన్ బరివారయుక్తుఁడై
సంతస మేర్పడంగఁ జని సర్వముఁ దెల్పె సమర్త్యభర్తకున్. 1053

వ. అంత యయాతిమహీపతి యొక్కనాఁ డొకయరణ్యంబున కేఁగి మృగయాపరవశుండై యున్నసమయంబున సత్వరదేవకార్యసిద్ధికొఱకు మహేంద్రకల్పనాచాతుర్యంబునం జేసి. 1054

గీ. కానఁబడియెను నెదుట మృగం బొకండు, కనకవర్ణతనూరుహకాంతియుతము
రత్నయుక్తచతుశ్శృంగరాజితంబు, సుందరాంగంబు లోచనానందకరము.

గీ. అమ్మృగంబును గని విస్మయమ్ము గదురఁ, బట్టుటకు నేఁగఁ గేఁ డది పట్టువడక
పరువువెట్టుటయును వెంటఁబడి విభుండు, చనియె నది పోవుమార్గము ననుసరించి.

ఆ. పరువులెత్తికొనుచుఁ బఱతెంచి పఱతెంచి, హరిణ మొక్కవనమునందుఁ జొచ్చి
మాయమయ్యె నంత మానవాధీశుఁడు, విపిన మెల్లఁ దిరిగి విసువు చెంది. 1057

ఆ. అచట నుండు నొక్కహ్రదము గనుంగొని, దాన జలము గ్రోలి దాహ మాఱఁ
దత్తటప్రరూఢతరుశీతలచ్ఛాయ, యందు విశ్రమించె హాయి గదుర. 1058

ఉ. ఆసమయంబునందు శ్రుతి కద్భుతమైనలయస్వరాదివి
న్యాసకళావిలాస మలరారెడిగీతరవంబు సోఁకుటం
జేసి శరీరమున్ మఱచి చిత్తరుబొమ్మయు నాఁగ నాసృపా
గ్రేసరుఁ డుండి యొక్కత్రుటిఁ గేవల మావల లబ్ధసంజ్ఞుఁడై. 1059

క. గీతప్రియుఁ డగుటను నా, గీతధ్వని వచ్చుదిక్కున్ జని సువర్లోఁ
కౌతుకము గలుగ వెడలెను, నాతరుణంబుననె విడిచి యాస్థానంబున్. 1060

గీ. వెడలి హ్రదమున కానలికడను నొక్క, కనకసువనంబునను జంద్రకాంతవేది
పైని గూర్చుండి వీణియపాటఁ బాడు, కమలపత్త్రాయతాక్షి నొక్కతను గనియె.

ఉ. కాంచినతోడనే కుసుమకాండుఁడు మేన శిలీముఖంబులన్
నించుటయున్ యయాతి మది నిల్పికొనంగలశక్తి లేమి నా
చంచలనేత్ర చెంతకు వెసన్ జన నాచెలి లేచి సిగ్గుచే
వంచికొనంగ మోము జనవల్లభుఁ డిట్టులు పల్కె నామెతోన్. 1062

ఉ. ఎవ్వరిదాన వీవు హరిణేక్షణ కారణ మేమి కానలో
నివ్విధి నుండఁగా ననుడు నింతి సఖిన్ గడగంటఁ జూడఁగా
నవ్వల గుర్తెఱింగి చెలియాశయ మాచెలికత్తె ఱేనితో
నవ్వనితాచరిత్రము రవంతయు దాఁపక చెప్పె నీవిధిన్. 1063

గీ. మనసిజుఁడు మున్ను విషమలోచనునిచేత
దగ్ధుఁ డగుటయు రతి యాహ్రదంబుదరిని
జేరి యేడువఁదొడఁగె నపారముగను
జక్షువులనుండి యశ్రువర్షంబు గురియ. 1064

వ. ఆరోదనాశ్రువులే తత్సరోవరంబునం బడుటయు వానివలన మహాశోకంబును వియోగంబును మూర్ఛయును గామజ్వరంబును విభ్రమంబును బ్రలాపంబును నున్మాదంబును మృత్యువును నావిర్భవించి యామెం జుట్టుకొని బాధించుచుండె.

ఆ. ఆయవస్థఁ జూచి యనుకంపతో గౌరి, మనసిజారిపార్శ్వమునకుఁ జేరి
ప్రాణనాథ రతికిఁ బతిభిక్ష దయచేయు, మనుచు వేఁడుటయును నమ్మృడుండు.

క. బ్రతికించెఁ బరమకరుణా, న్వితుఁ డగుచును మరుని వెంటనే సుర లెల్లన్
స్తుతియించుచు నాపని న, ద్భుతముగ దివినుండి గురియఁ బూవులవానల్.

గీ. అంతఁ గాముఁడు విచ్చేసె నద్భుతముగ
దివ్యదేహంబుతో రతిదేవికడకు
నదియె మొదలుగఁ గలిగె నీహ్రదమునకును
బ్రథితి జగమందుఁ గామసరస్సు నాఁగ. 1068

గీ. అపుడు రతిదేవి కత్యంతహర్ష మొదవి, దుఃఖసంతాప మంతయుఁ దొలఁగిపోవ
నామెకన్నులనుండియాహ్రదమునందుఁ, బడియెఁ బ్రమదాశ్రుబిందువులెడములేక

వ. ఆహర్షాశ్రుబిందువులనుండి ప్రీతియును ఖ్యాతియును లజ్జయును మహానందంబును శాంతియును లీలయును గ్రీడయును నావిర్భవించె. అటుమీఁద నాయమవామలోచనంబునుండి యానందబాష్పంబు లమితంబుగాఁ గురియుటయు నాయశ్రుబిందువులనుండి యొక్కపద్మం బుదయించె. ఆపద్మంబునందు మానసఖీరత్నంబు జనియించుటంజేసి మానసఖీమణి కశ్రుబిందుమతి యనునామం బేర్పడియె. 1070

క. ఈకన్యామణి భర్తను, జేకొనఁగా నిచటఁ దపము సేయుచు నుండెన్
లోకమున నీమెకరమును, గైకొనఁ దగుధన్యుఁ డెవఁడు గలఁడో యెఱుఁగన్.

క. నే నీయమకడ స్నేహము, చే నుంటిని సతముఁ గూర్మిచెలి నగుచు విశా
లానామము గలదానను, మానాయన వరుణుఁ డీల మాకథ లింకన్. 1072

క. అని విరమించుటయును నా, జననాథుం డిట్టు లనియె సఖితోడను మా
నిని నేను జంద్రవంశజుఁ, డను నహుషనృపాలపుత్రుఁడను భూవరుఁడన్. 1073

గీ. చంద్రవదన యయాతిరాజేంద్రుఁ డనుచు, నను వచింతురు జను లెల్లరును ధరిత్రి
త్రిదశలోకంబు గా నొనర్చినఘనుండఁ, జెప్పికొనరాదు సుమి నాప్రసిద్ధి నేను.

క. మీచెలిమీఁదను సోఁకెను, నాచిత్తం బర్హుఁ డెవఁడు నాకంటెను ధా
త్రీచక్రంబున నీఝష, లోచనను గ్రహించుటకు విలోకించినచోన్. 1075

క. అనుటయు విశాల యి ట్లని, యెను రాజవరేణ్య వింటి మిలలోపల నీ
కేన యైనమానవుఁడు లేఁ, డని దానిని గా దసంగ నగునే మాకున్. 1076

క. ఐనను నీదేహంబునఁ, గానంబడుచుంటె నిపు డొకానొకదోషం
బానైల్యమె లేకుండిన, తన్నాయక మాలతాంగి మానునె నిన్నున్. 1077

చ. అనుటయు విస్మయంపడి యయాతినృపాలుఁ డు తన్వి యేమి నా
తనువున దోష మున్నదియొ తప్పక చెప్పుము నాఁగ నామె యి
ట్లనియెను మేదినీంద్ర తెలియంబడకున్నదె నీకు నీమెయిం
గనఁబడుచున్నవార్ధకవికారము మేము వచింప నేటికిన్. 1078

క. అనుటయు నేమియుఁ దోఁపక, జననాథుం డేమి కతమొ జర నామేనం
గనఁబడుట కీ వెఱింగిన, వనజాయతనేత్ర తెలుపవలయును నాకున్. 1079

చ. అనుటయు నామె యి ట్లను జనాధిప నీ వొకనాఁడు నాటకం
బును గనువేళలో మఱచిపోయినవాఁడవు పాదశౌచముం
బొనరిచికొంట గానరసముగ్ధుఁడవై జర యావరించె నీ
తనువునఁ దద్విలోపజనితం బగుదోషముచేత నత్తఱిన్. 1080

ఉ. నావుడు ఱేఁడు తా నపు డొనర్చినదోషము సంస్మృతంబు గా
భావమునందుఁ గొంత వెతపాటును జెంది గతంబుఁ గూర్చి వా
పోవుట నిష్ఫలం బనుచు బుద్ధి నెఱింగి సహింపలేక తా
పావహ మైనమన్మథశరాహతి నాసఖితోడ ని ట్లనున్. 1081

చ. కలికి శిలీముఖంబులను గాఁడఁగ నేయుచు నుండె నాయెదన్
నిలువఁగఁ జాల మన్మథుఁడు నిర్దయుఁ డేమి యొనర్చువాఁడొ మీ
చెలి కరుణించెనేని ననుఁ జేసెద రాణిగ నీమె నీధరా
తలమున కెల్ల నేను బదదాసుఁడనై పరిచర్య సల్పుచున్. 1082

క. అనవుడు వరుణాత్మజ యి, ట్లనియెను రాజేంద్ర నీజరావస్థను నీ
తనయులకు నొసఁగి తద్యౌ, వనమును ధరియించి రమ్ము వాంఛ ఫలించున్.

చ. అనిన నృపు నాత్మజాలఁ డిట్లను నాకుంబునన్
జని నిజమందిరంబునకు నీ కడనుంటఁ గొనించి ముప్పురన్
దనకుఁ గలట్టిభావమును దండ్రికిఁ దెల్పుచు లుండఁదగ్గిన
ర్తనమును దానిచేఁ దనకుఁ గాఁగలలబ్ధియుఁ దెల్పి నేర్పునన్. 1084

గీ. అంతటఁ దుహుంసు నల్కోని నాయనను జూచి, పెద్దవాఁడవు నీ కిది బుద్ధి గాదు
తనయు లోనరింపఁ జనుఁగాక తండ్రిసేవ,కనమ్ముజనకునిముదుసలితనము గొనుట.

గీ. అఖిలసౌఖ్యంబులను గూడ ననుభవింపఁ,దగిన ప్రాయంబు విడిచి వార్ధకముగొనుట
హస్తమున నున్న స్వర్ణము నవల వైచి, మృత్తికను జేతఁ బట్టినరీతి గాదె. 1086

ఆ. తండ్రి యగును గాక దైవంబె యగుఁ గాక, చెప్పఁ దగనిమాట చెప్పెనేని
మంచిచెడ్డలను విమర్శింపకుండంగ, వినుట కీ తుడుంబు వెఱ్ఱివాఁడె. 1087

క. అనుటయు యయాతి వానిం, గనుగొని కన్నులను నగ్నికణములు రాలం
గను నిట్టు లనియె నాకున్, దనయుండవు గావు నీవు ధర్మవిహీనా. 1088

సీ. బ్రహ్మఘ్నుఁడవు సురాపాయివి కష్టివి, వైదికాచారవివర్జితుఁడవు
పరదారగామివి బ్రాహ్మణద్వేషివి, దోషివి దేవతాదూషకుఁడవు
వేదవేదాంగవివేకశూన్యుండవు, సత్యహీనుఁడ వప్రశస్తమతివి
క్రూరకర్ముఁడవు గోఘ్నుఁడ వమంగళుఁడవు, పాపాత్ముఁడవు సర్వభక్షకుఁడవు

గీ. కుత్సితుఁడవు సగోత్రాభికుఁడవు ముక్త, కచ్చుఁడవు గమ్ము మఱి నీకుఁ గలుగునట్టి
వారలకు వారలకుఁ గల్గువారలకును, సంఘటిలు నీగతియె యంచు శాపమిచ్చె.

గీ. పిదప యదు వి ట్లనియె నమ్రవదనుఁ డగుచు
దాఁపఁజీకె మేల సుతునకుఁ దండ్రియొద్దఁ
జెప్పెదను మదిలో నున్న చివరమాట
మోయఁజాలను దాత నీ ముదిమి నేను. 1090

క. అనుటయును గ్రోధతామ్రా, ననుఁ డగుచు యయాతి రాజ్యనాశయశోనా
శనములును క్షాత్త్రనాశన, మును గలుగ నొసంగె శాపమును యదువునకున్.

క. శాపము నొసంగుటయుఁ బరి, తాపంబును జెంది యదువు తండ్రీ తగునే
కోపింపఁగ నెఱుఁగను నే, నేపాపంబును ననుగ్రహింపుము నన్నున్. 1092

క. అని వేఁడికొనుటయును నా, జననాథుం డిట్టు లనియె సర్వవినాశం
బును గలిగి దుష్టసంతతి, జనియించును నీకుఁ బితృవిషాదమువలనన్. 1093

క. నినుఁ జూడరాదు నాయెదు, టను నిలకుము క్రోధ ముత్కటం బయ్యెడి నీ
జనకాజ్ఞాపాలనమున, కనుకూలం బగుననుగ్రహం బిదె చనుమా. 1094

క. అనుటయును యదువు కోపం, బున ని ట్లని పలికె నాకుఁ బుట్టినవా రె
ల్లను దుష్టులైనయెడ నీ, జనులను బాధించి కొనరె సర్వస్వంబున్. 1095

క. అనుటయు యయాతి వానిం, గనుఁగొని నీజనులు విగతకలుషుల శాధిం
చిన నారకలోకమునకుఁ, జనుచుంటెద రనుచు మరల శాపం బిచ్చెన్. 1096

క. తరువాతఁ బురువు జనకుని, చరణములకు ్రమొక్కి తండ్రి సంతాపంబుం
బొరయకుము నేను నీదగు, జర గైకొని నీకు నాదుజవ్వన మిత్తున్. 1097

క. అనుటయు నత్యానందం, బును జెంది యయాతి కాంచి పురుఁవును నత్సా
తనయుం డన నీవొకఁడవె, తనయుండవు తండ్రియాజ్ఞ దాఁటనికతనన్. 1098

గీ. పుట్టుదురు గాక పెక్కుఁరు పురుగులట్లు, వ్యర్థులై నకుపుత్రులవార్త లేల
దల్లిదండ్రులయాజ్ఞను దాఁటనట్టి, పుత్రుఁ డొక్కఁడె త్రైలోక్యపూజితుండు.

క. అని పలుకుచుండఁగనె తన, తనువున జవ్వనము పురునితనువున జరయున్
గనఁబడుటయును స్వారాజ్యం, బును బురున కొసంగి సర్వమును జేఁ డంతన్.

క. మదనవశుం డగుచును స, మ్మదమునఁ జని యశ్రుబిందుమతియొద్దకు నో
మదవతి తారుణ్యము నా, కొదవెను నిఁక నేమి కోర్కి యున్నదో చెప్పుమా.

క. అనుటయుఁ దత్సఖి యి ట్లని, యెను జందనవృక్ష మైన నేమి భుజగవే
ష్టన మున్నకతన సాధ్వస, మును గలుగంజేయుఁ గాదె ముట్టుట కధిపా. 1102

క. గిరిశిఖరపతన మైనను, వర మగ్నినివేశ మైన వరము సపత్నీ
గరళవిలిప్తాంగుం డగు, పురుషునిఁ గవగూడుకంటెఁ బొలఁతికి భూపా. 1103

చ. అనుటయు నానృపాలుఁడు తదాశయమున్ గమనించి రాజ్యముం
దనువును గూడ నర్పణమొనర్చితి మీచెలి కేమి చేసికొ
న్నను సరె యింక పీనిపయి నాకు స్వతంత్రత లేదు కేలఁ గే
లునిచెద విశ్వసించుటకు నుగ్మలి సాక్షులు పంచభూతముల్ 1104

చ. అనవుడు నశ్రుబిందుమతి హస్తము చాఁచుటయున్ యయాతి చ
య్యనఁ దనహస్త మామెకరమం దునిచెన్ దివి దేవదుందుభి
ధ్వనులు చెలంగ నంతటను వారలు ప్రేమరసాబ్ధిమగ్నులై
యనఁగిపెనంగి వింశతిసహస్రసమల్ విహరించి రిచ్ఛమై. 1105

వ. ఆసమయంబునందు తేని కామెపైఁ గలయనురాగముం జూచి సైఁపంజాలక దేవయానియును శర్మిష్ఠయును సాపత్న్యద్వేషంబు వహియించి యకార్యకరణంబునకుం గడంగుటయు నశ్రుబిందుమతి తదుద్యమంబును బ్రియున కెఱింగింప నమ్మహీపాలుండు యదుకుమారునిం బిలిచి వత్సా యకార్యకరణపరాయణచిత్తవృత్తు లగు దేవయానీశర్మిష్ఠలశిరంబులు ఖండింపు మని యాజ్ఞాపించె. 1106

క. అప్పుడు యదు వాతనిఁ గని, యప్పా జననుల వధింప ననుచిత మనుచుం
జెప్పుదురు పెద్ద లెల్లను, దప్పుఁబనిని నాకుఁ జెప్పఁ దగునే నీకున్. 1107

క. అని పలుకఁటయుసు భూపతి, కినులను నిష్ఫాకలు రాలఁ గని వానిని నో
తనయాధమ మాత్రాంశం, బున బ్రతుకు మటంచు శాపమును దగిలించెన్.

ఉ. అంతట నొక్కనాఁడు మదనాత్మజ యిట్లనియెన్ యయాతిభూ
కాంతునితోడ నాథ కనఁగా శివవిష్ణుమహేంద్రలోకముల్
స్వాంతమునరిదు నా కొదవె వాంఛ సమర్థుఁడ వీవు తీర్చి మ
చ్చింతితముల్ గృతార్థముగఁ జేయుము నాజననంబు నావుడున్. 1109

క. మనుజేశ్వరుఁ డాకాంతను, గనుఁగొని యిట్లనియె నేను గామిని లేకు
న్నను ధర్మహీను లగుదురు, జను లెల్లను దానఁ జేటు సంప్రాప్తించున్. 1100

గీ. దాని కెల్లను నీవె నిదాన మగుదు, వాకతంబున విడిచి యీయాశయంబు
కోరుకొను మన్య మేదేని కువలయాక్షి, తెగువతోడను నీకోర్కి దీర్చువాఁడ.

చ. అనవుడు నశ్రుబిందుమతి యాతనిఁ గన్గొని మానవేంద్ర యే
పనికయి నిన్ గ్రహించితినొ పల్కినపల్కును నమ్మి నాఁడు దా
నిని వితచేసి యన్యమును నీ విడినన్ ఫల మేమి చంద్రవం
శ్యునకు యయాతికిన్ నహుషసూనున కిట్లు వచింప నర్హమే. 1112

ఉ. నావుడుఁ దన్వి చెప్పఁదగున్యాయము చెప్పితి నంతె కాని నీ
వేవిధి నైనఁ గావలయు నీపని యన్నను రాజ్య మంతయున్
బోవునుగాక భూజనులు పోదురుగాక యొనర్చితీరెదన్
నావచనం బొకండె సుమి నాఁడును నేఁడును నుర్వి క్రుంగినన్. 1113

చ. అని నహుషాత్మజుం డనుడు నాలలితాంగి నరేంద్ర నామనం
బునఁ గలకోర్కి తీర్చుటయె ముఖ్యము నా కని పల్క నాయశో
ధనుఁడు నిరుత్తరుం డగుచుఁ దత్త్వవిదుం డయినట్టికారణం
బునఁ దనలోనఁ దానె తలపోయఁదొడంగెను నీవిధంబునన్. 1114

సీ. సలిలంబులోపల సంచరించుచునుండు,మీనంబు జాలంబులోనఁ జిక్కుఁ
బవనవేగముతోడఁ బరువులెత్తుచునుండు,మృగము బంధంబులోఁ దగులువడును
శతయోజనవిదూరగత మైనయామిషం, బండజంబులకు భక్ష్యముగ నుండుఁ
బాదలగ్నం బైనపాశంబు గూడను, భాగ్యహీనునకుఁ గన్పట్టకుండు

గీ. నంతయును గూడఁ గాలమాహాత్మ్యమున నె,సంభవించుచునుండు సంశయము లేదు
కాలమె సమస్తమునకును గారణంబు,కాలమును దాఁటు పురుషుఁడు గానరాఁడు.

గీ. తపములును దానములు మంత్రతంత్రములును
భేషజములును మణులును నోషధులును
బరిజనంబులు మిత్త్రులు బంధువులును
గాలకబళితుఁ డగువానిఁ గావలేరు. 1116

క. జననము మరణము పరిణయ, మును ననియెడిమూఁడు పాశములు కాలముచే
నొనరింపంబడుటను నె, వ్వానికిని శక్యంబు గాదు వానిని ద్రుంపన్. 1117
గీ. కాలమునఁ బ్రేరితం బయి కర్మ మెపుడు, ననుభవింపఁగఁజేయు శుభాశుభములఁ
గర్మబంధంబు నెంత దక్షత గలట్టి, దేహియును నిల్వఁజాలఁడు ద్రెంచికొనఁగ.
క. దేవత్వము మానుష్యము, స్థావరభావము పశుత్వశకునత్వాదుల్
జీవునకుఁ గలుగఁజేయును, గావున నెంతటిదొ కర్మగతి రా దెఱుఁగన్. 1119
గీ. ప్రాణినుదుటను వ్రాయంగఁబడియె నైదు
గర్భకోశంబులోఁ బద్ధకాలముననె
యాయువును సంపదయును విద్యయును మృతియుఁ
గర్మమును నెట్లు వ్రాసెనో కలుగు నట్లె. 1120
క. కుమ్మరి మర్దితమృత్పిం, డమ్మున వస్తువుల నెట్లొనర్చునొ యాచం
దమ్మున జీవుఁడు వ్యవహా, రమ్ములు గావించుచుండుఁ బ్రాక్కర్మమునన్. 1121
గీ. ధేనువులు వేయి యుండఁగా వాని విడిచి, తల్లియొద్దకుఁ జేరువత్సంబువోలెఁ
బొందుచుండును గర్తను బుణ్య మేని, పాప మేనియు సుఖదుఃఖరూపమునను.
ఆ. పరువులెత్తుచున్నఁ బరువులెత్తుచునుండు, నిలిచియున్నయెడల నిలిచియుండుఁ
గడకుఁ గర్మ మొక్కక్షణమేని కర్తను, వీడనాడి పోదు నీడవోలె. 1123
గీ. కలిసి ఛాయాతపంబులకరణి నుండుఁ, గర్మమును గర్తయును దానఁ గర్మఫలము
ననుభవింపఁగవలయు నిత్యమును గర్త, కానరాదు వినాశంబు కర్మమునకు.
గీ. నాయొనర్చినకర్మమునకు ఫలంబు, ప్రాప్తమయ్యె జరాస్వరూపమున నాఁడు
నేఁడు స్త్రీరూపమునను సంధిల్లె నెవఁడు, కర్మవేగంబునకు లోను గానివాఁడు.
ఆ. ఈలతాంగికోర్కి యీడేర్పకుండిన, నగుదు సత్యధర్మవిగళితుఁడను
దానివలన భ్రష్టదశ నొంది చివరకుఁ, గాకపోదు నుభయలోకములకు. 1126
చ. అని తలపోసి కొంతవడి కానరపాలకమౌళి యాత్మజ
న్మునిఁ బురునిం గనుంగొని తనూభవ ధర్మమునంద చిత్తవృ
త్తిని నెలకొల్పి కొంటివి ప్రతిష్ఠను నాసుఖవాంఛ లెల్ల దీ
రినవి భవన్నిమిత్తమునఁ బ్రీతుఁడ నైతిని నేను నీయెడన్. 1127
గీ. కామసౌఖ్యంబులకు లోను గాక యింకఁ, బోవఁ దలపెట్టితిని దేవభూములకును
నేను బాలించినట్టులె నీవు గూడఁ, బాలనము చేయుమయ్య భూప్రజల నెల్ల.
సీ. పాలించుచుండుము భగవదాశ్రితులను, శరణన్నవారిని సజ్జనులను
దండించుచుండుము ధర్మనాశకులను, హరిభక్తివిముఖుల నరిజనులను
నెలకొల్పుచుండుము నిగమధర్మములను, బరమార్థపరులను బ్రాహ్మణులను
గావించుచుండుము కవిపూజలను యజ్ఞ, కర్మంబులను దానధర్మములను

సీ. శీలవంతుల నొద్దకుఁ జేర్చికొనుము, భ్రష్టులను జేర్చికొనకు మభ్యాశమునకుఁ
జానలనుశత్రుపులనుగోశమును బలము, నమ్మకొనియుండకుము ప్రమాదమ్ముగలుగు.
సీ. పరదారపరధనపరుఁడవు గాకుము, కావింపకుము పాపకార్యములను
విడనాడకుండుము వేదశాస్త్రాసక్తి, త్యజియింపకుము స్వాశయ్యాతలంబు
సర్వకాలములందు సంతుష్టుఁడవు గమ్ము, తలఁపులోఁ గృష్ణుని నిలిపికొనుము
చారచక్షువులచే సకలంబు గనుఁగొను, మింద్రియంబుల నిగ్రహించుకొనుము
గీ. దినదినంబుఁ బ్రజాసౌఖ్యమునకుఁ గాను, జేయుచుండుము వలసిన చేఁత యెల్లఁ
దనివితీరక చెప్పితిఁ దండ్రి నగుట, నిఖిలధర్మజ్ఞుఁడవు నీకు నేర్ప నేల. 1130
క. అని చెప్పి తనజరాభర, మును గైకొని తా నొసంగి పురున కతనిజ
వ్వనమును నాశీర్వాదము, నొనరిచి కొమరునకు నేఁగ నుద్యోగింపన్. 1131
క. ప్రజ యెల్ల నానరేంద్రునిఁ, ద్యజియింపఁగలేక వెంటఁ దరలుటయును నా
ప్రజలను దోడ్కొని నహుషా, త్మజుఁ డరిగెను నగ్రుబిందుమతితో దివికిన్.
ఉ. అంతట లేఖనాథుఁ డఖిలామరులున్ దనవెంట రాఁగ న
త్యంతకుతూహలంబున యయాతిమహీంద్రుని చెంత కేఁగి నీ
యంతటివాఁడు నేఁ డతిథి యయ్యెడిభాగ్యము గల్గె మాకు నీ
యింతికతంబునన్ వసుమతీశ్వర రమ్మని వేఁడుకొంటయున్. 1133
క. ఆవేఁడికోలునకు ధా, త్రీవిభుఁ డంగీకరించి త్రిదివౌకస్సం
సేవితుఁ డగుచును దేవేం, ద్రావసథంబునకు నరిగె నాదర మొదవన్. 1134
క. అమరాధీశ్వరుఁ డాతని, నమృతాతిథ్యమునఁ దనుప నప్పుడు చేతః
ప్రమదము గదురఁగ ధాత్రీ, రమణుఁడు గీలించి తత్కరంబునఁ గరమున్.
గీ. సంతసం బయ్యె నాకు నీసలిపినట్టి, గారవంబున నమరేంద్ర కలుగుఁ గాక
మనకుఁ జ్యూతి లేనిసౌహార్ద మనుచుఁ బలికి, పరిజనోపేతముగ నేఁగి బ్రహ్మపురికి.
క. సాష్టాంగవందనములను, స్రష్టకుఁ గావించి తత్ప్రసారితకరసం
స్పృష్టోత్తమాంగుఁ డయి శిపి, విష్ణుపురంబునకుఁ జేరె విధియనుమతిచేన్. 1137
గీ. చేరి గౌరీసమేతుఁడై కూరుచుండి, వృషభరాజంబుపైఁ దేజరిల్ల దెసలు
నిజతనూదీప్తులను దర్శనీయమూర్తి, యగుచుఁ జెలువారు ప్రమథనాయకునిఁ గాంచి.
ఆ. పులకితాంగుఁ డగుచు నిలిచి కట్టెదుటను, గనులనుండి బాష్పకణము లురల
నుతు లొనర్చి నంత శితికంఠుఁ డాతని, భక్తిభావమునకుఁ బ్రమద మొంది.
క. భూవర నీహరిభక్తికి, భావంబున నేను దృప్తిపడినాఁడ నిఁకన్
నీ వుండు మిందె భేదం, బావంతయుఁ గూడ లేదు హరికిని నాకున్. 1140
ఆ. హరియెహరుఁడుహరుఁడెహరిసంశయము లేదు, కోవిదుం డెఱుంగు మావిధంబు
కాని మందమతులు కల్పించుచుండెద, రచ్యుతునకు నాకు నంతరంబు. 1141

చ. అనుటయు వేఁడు ధూర్జటికి నంజలిచేసి మహానుభావ నీ
వనినది యెల్ల సత్యము మురారికి నీకును వాస్తవంబులోఁ
గనఁబడ దించుకేనియును గాని విభేదము నీకడన్ వసిం
చినను మురారిచెంతను వసించిన నొక్కటె మమ్ముబోంట్లకున్. 1142
గీ. కాని వైకుంఠమును జూడఁ గాంక్ష వొడమె, నంతరంగంబునను బ్రముఖాధినాథ
సెలవొసంగుమటంచుఁగాంక్షించుటయును,నట్లెయగుఁగాక యనిశివుఁడనుమతించె.
క. అంతట యయాతిధరణీ, కాంతుఁడు వైకుంఠమునకుఁ గ్రక్కునఁ జని య
త్యంతకుతూహలమున దై, త్యాంతకునిమహావిభూతి నవలోకించెన్. 1144
మ. అవలోకించి మహావిభూతి నెదలో నాశ్చర్యముం జెంది భూ
ధవుఁ డానందముచే మురారిచరణద్వంద్వంబునన్ వ్రాలె నా
యవనీనాథునిఁ జూచి మాధవుఁడు వత్సా లెమ్ము నీభక్తికిన్
మివులన్ హర్షము గల్గెఁ గోరుకొనుమీ నీ వేవరం బేనియున్. 1145
క. అని పలుకుటయును భూపతి, మనమున సంతోషపడుచు మాధవ నాపైఁ
గనికర మొదవిన ననిశం, బును దావకపాదదాస్యమునె యాసింతున్. 1146
క. అని వేఁడుటయును నతనికి, జనార్దనుఁడు వర మొసంగె జనపతి యంతన్
వనజాక్షునిఁ గొలుచుచుఁ దన, జనములతోఁ గూడి విష్ణుసన్నిధి నుండెన్.
క. అంతటఁ బురుఁ డిల నేలుచు, సంతోషమునన్ బితృప్రసాదప్రాప్తా
భ్యంతరదర్శనుఁ డగుట న, నంతపదంబునకుఁ జేరె నంతంబునకున్. 1148
గీ. కానఁ బితృతీర్థమునకు నీ దైనతీర్థ, మెందునను గానఁగా రాదు నందనులకుఁ
గలుగు దానను జెడ్డవారలకుఁ జెడ్డ, మంచివారికి మంచియు మానివర్య. 1149
క. అని వాక్రుచ్చుటయును విని, తనమదిలోఁ బిప్పలుండు త్రప నొందుచు వ
చ్చినత్రోవఁ బట్టుకొని పో, యెను బితృతీర్థప్రభావ మే మందు నృపా. 1150

—: గు రు తీ ర్థ మా హా త్మ్య ము :—

వ. ఇంక గురుతీర్థప్రభావంబు నాకర్ణింపుము. 1151
క. గోచరము గానివస్తువు, గోచర మగునట్లు చేసికొనుటకుఁ బ్రజ్ఞా
లోచనముఁ బ్రసాదించెడి, యాచార్యునిఁ బోలుతీర్థ మన్యము గలదే. 1152
క. అంతర్గత మగుతమమును, నంతం బొందించు దేశికాగ్రణికి బహి
ర్ధ్వాంతనివారకు లగుభా, స్వంతుఁడును క్షపాకరుఁడును సరి గాదు సుమీ.
గీ. త్రిభువనంబులు గూడను దెలిసికొనెడి, జ్ఞానమును గీర్తియును ధర్మసంగ్రహమును
మోక్షమును గల్గఁ జేయుఁ బ్రత్యక్షముగను, దేవుఁ డన్నను గురు వన్న దేశికుండ.
గీ. దినమును దివాకరుండు రాత్రిని విధుండు,భవనమునదీపిక యుఁదమఃపటలమడఁచి
ప్రజ్వలింపంగఁ జేసెడిపగిది గురువు, ఛాత్రుని జ్వలింపఁ జేయు నజ్ఞాన ముడిపి,

క. కావునఁ ద్రికరణములచే, సేవింపఁగవలయు నెపుడు శిష్యుఁడు గురువుల్
భూవర చెప్పెద నొకకథ, యీవిషయమునందు నీకు దృష్టాంతముగన్. 1156

—: చ్య వ నుఁ డ ను వి ప్రు ని చ రి త్ర ము :—

సీ. భార్గవకులమందుఁ బ్రభవ మొందెను మున్ను, చ్యవనుండు నా నొక్క-తాపసవరుఁ
డతనికి నొక్కనాఁ డాకస్మికంబుగా, బుద్ధి పుట్టెను జ్ఞానమును గడింప
నపుడు సంసారంబు నాతఁడు విడనాడి, ధరణీతలం బెల్లఁ దిరిగి తిరిగి
సేవించి తీర్థముల్ క్షేత్రంబులును బెక్కు-, కొనకు రేవాతీరమునకుఁ జేరి
గీ. యచట నొక్క-వటమహీరుహంబు గాంచి, శీతవాతాంకురంబులు చిత్తమునకు
సౌఖ్య మొనరించుచుండఁ దచ్ఛాయయందు, విశ్రమించెను ద్రోలఁగ మార్గశ్రమంబు.
వ. ఆవటవృక్షంబుపైని వార్ధకావస్థ ననుభవించుచు బహుకాలంబునుండి చిరకాల
జీవి యగుకుంజలుం డనునొక్క-శుకం బుజ్జ్వలసముజ్జ్వలవిజ్వలకపింజలనామ
ధేయంబులు గలిగి పితృభక్తిపరాయణులై యుండుతననలువురుకొడుకులును
దెచ్చి యర్పించెడియాహారంబుచే జీవించుచు సకళత్రంబుగా నివసించియుండు
టయు నానాఁడు చ్యవనుండు విలోకించుచుండ నలుదెసలనుండి నలువురు పుత్రు
లును నచ్చటికి వచ్చి తాము దెచ్చినయమృతోపమానంబు లగుఫలంబులును
బుణ్యతోయంబులును జననీజనకులకు భక్తిపూర్వకంబుగా సమర్పించి తమ
తెక్కలచే విసరుచుండినంతఁ గుంజలుండు పత్నితోడం గూడి పుత్రప్రదత్తం
బగునాహారంబు నారగించి యానందించుచు నుజ్జ్వలుం డనుజ్యేష్ఠపుత్రునిం
జూచి యి ట్లనియె. 1158
క. ఈనాఁడు తండ్రి యుజ్జ్వల, యేనాటికిఁ బోతె నచట నేదేని వినం
గా నైనవిశేషము గల, దేని వచింపంగఁగలవె యించుక నాకున్. 1159

—: ది వ్యా దే వీ చ రి త్ర ము :—

గీ. అనుటయును నుజ్జ్వలుం డిట్టు లనియెఁ దండ్రి, చనినవాఁడఁ బ్లక్షద్వీపమునకు నేఁడు
చూడనల మునె కాని చక్షువులతోడ, దానివైభవ మెన్న నాతరము గాదు.
గీ. అచటఁ గలఁడు దివోదాసుఁ డనెడిఱేఁడు, ధర్మమార్గానుపాలనతత్పరుండు
వాని కుదయించె సౌందర్యవతుల కెల్ల, నాజ్ఞ యనఁగ దివ్యాదేవి యనెడికన్య.
వ. దివోదాసుం డాయమను రూపదేశాధిపతి యగుచిత్రసేనమహీపాలున కిచ్చి
వివాహంబు సేయఁ దలంచి యాతనికిఁ దనమనోరథం బెఱింగించుటయుఁ జిత్ర
సేనుండు బంధుమిత్త్రపరిజనంబులతోడం గూడి వచ్చి సుముహూర్తకాలంబునందు
వధూసమేతంబుగా భద్రపీఠంబు నలంకరించె. 1162
గీ. అప్పు డవె యేమి దైవమాయయొ సమస్త
జనములును జూచుచుండ నాశ్చర్యముగను

చిత్రసేనన రేంద్రుడు చేష్ట లుడిగి
క్షోణిపైఁ బడి విడిచెను బ్రాణములను. 1163

వ. అంతట దివోదాసుండు ఖిన్నవదనుండై ధర్మాత్ముఁ డగుటం జేసి యింకమీఁద నాకన్నియకుఁ గావలసినగతి యేమి యని సప్రశ్రయంబుగా బ్రాహ్మణుల నడుగ వార లెల్ల నాతనిం జూచి రాజా యిట్టిసమయంబునం దుద్దిష్టుం డైన భర్త మృతుం డైనను దేశాంతరగతుం డైనను మహారోగాభిభూతుం డైనను వధూత్యాగి యైనను క్లీబుం డైనను బతితుం డైనను గన్యను మఱియొకవరున కిచ్చి వివాహంబు గావింపవచ్చు నని ధర్మశాస్త్రప్రమాణంబు గలదు. కావున నీకన్నియను మఱియొక్కవరున కిచ్చి నిస్సంశయంబుగాఁ బరిణయంబు గావింపు మని వచియించుటయు దివోదాసుండు బ్రాహ్మణాదేశంబున రూపసేనుం డను రాజకుమారున కాయమ నీయ నిశ్చయించి తదుద్యమంబు గావించుటయు రూపసేనుండును జిత్రసేనుండువోలె లగ్నకాలంబునందు కాలధర్మంబు నొందె. పిదప నావిధంబునను యేకవింశతిసంఖ్యాకు లగువరులు మరణించుటయు దివోదాసుం డత్యంతచింతావ్యాకులమానసుం డై మంత్రులతోడ నాలోచించి స్వయంవరంబునకుఁ జాటింపం జేసె. 1164

క. అంతటఁ దద్రూపశ్రవణ, శాంతరితవివేకు లగుట నడరెంచి మహీ
కాంతు లనేకులు చెందిరి, యంతముఁ గలహించికొని స్వయంవరభూమిన్.

గీ. అప్పు డాకన్య చేయఁగా నైన దేది, యేనియును లేమి లోలోన నేడ్చికొనుచుఁ
గడపసాగెను దినములక్కరణి నగుట, కేమిహేతువొ తండ్రి నా కెఱుఁగఁ జెపుమ.

వ. అనుటయును గుంజలుండు పుత్రున కి ట్లనియె. 1167

సీ. మున్ను గాశీపురంబున సువీరుండు నా, నొకవైశ్యజనుఁ డుండె నుత్తముండు
వానికిఁ జిత్రాభిధానంబు గలిగిన, భార్య యొక్కరితె సంప్రాప్తమయ్యె
నాభార్య విడనాడి యాత్మధర్మము లెల్లఁ, జరియింపఁదొడఁగెను స్వైరముగను
నంతట నావైశ్యుఁ డామెను త్యజియించి, పెండ్లాడె వేఱొకబేలసుతను

గీ. నప్పు డాచిత్ర తెగియించి యవని నెల్లఁ, దిరుగుచును సాధువనితల దురితములకుఁ
జొనుపుచును జారులిచ్చెడిధనము గొనుచుఁ, బాడుచేసెనసంఖ్యాకభవనములను.

క. కలహములు పెట్టి పతిప, త్నులకును బితృపుత్రులకును దోషం బనుచుం
దలఁపక యనేకకంఠం, బులు బలివెట్టించె నాపె భూదేవతకున్. 1169

ఆ. అట్లు కొంతకాల మరుగుటయును నాపె, కర్మఫలముఁ గుడుపఁ గలిగినట్టి
కాల మరుగు దేరఁ గాలధర్మము నొందె, దిక్కు లేనిచోట నొక్కనాఁడు. 1170

క. అంతట యమభటు లాయమ, నంతకపురమునకుఁ జేర్చి రతిశీఘ్రముగన్
గుంతములతోడఁ బొడుచుచు, గొంతుకకు బిగించి త్రాళ్లు గొని యీడుచుచున్.

గీ. అపుడు యముఁ డగ్నికుండంబులందు నిలిపి, ఖండఖండంబులుగఁ గోసి కాలదండ
ఘాతములపాలుచేసి యాకలుషవతిని, ఘోరనరకాంబునిధిలోనఁ గూలఁద్రోసె.

క. చిరకాలం బాయమ యా, నరకంబుల ననుభవించి నానావ్యథలన్
ధరణి జనించెను గడకి, క్కరణి దివోదాసునకును గన్యక యగుచున్.

ఆ. ఆమె పూర్వజన్మమం దెన్నిగృహములు, గూల్చినదియొ పతులు గూలి రంత
మంది నేఁడు తనకు మాయనిదుఃఖంబు, గలుగఁ బూర్వకృతము గడవఁదరమె.

క. అనుటయు నుజ్జ్వలుఁ డిట్లని, యెను నాయన యట్టిదాఁగ యేసుకృతముచే
జననాథుఁ డగుదివోదా, సునకున్ జనియించినదియొ సుతయై చెపుమా. 1175

వ. అని యడుగుటయుఁ గుంజలుండు వానిం జూచి వత్సా మున్నొకసిద్ధపురుషుండు మహీమండలం బెల్లఁ గ్రుమ్మరుచు మార్గవశంబున నొక్కనాఁడు వారణాసీపురంబునకుం జేరి యాతపబాధాపనోదార్థంబు దైవికంబుగా శీతలచ్ఛాయావృతం బగుసువీరునిగృహద్వారంబునందు నిలువంబడుటయుఁ జిత్ర లోపలనుండి యరుదెంచి యమ్మహనీయుని భక్తిప్రణామపూర్వకంబుగా లోనికిం దోడ్కొని చని సముచితసపర్యం గావించి యన్నోదకంబు లర్పించె. సిద్ధుం డామెయుపచారంబులకు సంతుష్టమానసుండై యించుకకాల మచ్చట విశ్రమించి పిదప యథేచ్ఛం జనియె. 1176

క. ఆపుణ్యవిశేషముచే, నాపెకు సమకూరె జన్మ మన్నోదకసౌ
ఖ్యోపేత మైనచోటను, బాపంబులు సేయ బుద్ధి పాఱనిచోటన్. 1177

గీ. అనుటయును నుజ్జ్వలుం డిట్టు లనియెఁ దండ్రి, పాప మాకన్య కిపుడు సంప్రాప్తమైన
శోకము తొలంగి సద్గతి చేకుఱంగఁ, గలయుపాయంబు సెప్పుము తెలిసెనేని.

వ. అని యడుగుటయును గుంజలుండు క్షణకాలం బాలోచించి వత్సా పూర్వజన్మకృతపాపంబునం జేసి తిర్యక్త్వంబు ప్రాప్తించుటవలన నాజ్ఞానంబు నష్టంబయ్యెనైనను బావనం బగునీపాదపంబుసంసర్గంబువలనను రేవాప్రసాదంబువలనను నారాయణానుగ్రహంబువలనను నుపలబ్ధవిజ్ఞానుండ నగుటం జేసి నీయడిగిన ప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరంబు చెప్పంగలశక్తి యేర్పడియె. వినుము. 1179

క. మానును విష్ణుజ్ఞాన, ధ్యానవ్రతసంస్తవముల నఖిలాఘములున్
దానను గలుగును మోక్షము, కానంబడ దింతకంటె గతి తరియింపన్. 1180

వ. అని చెప్పుటయు నుజ్జ్వలుండు పరమాహ్లాదంబు నొంది తండ్రీ విష్ణుజ్ఞానధ్యానవ్రతస్తోత్రంబులస్వరూపంబు నిరూపింపు మని ప్రార్థించె. 1181

—: విష్ణుజ్ఞానధ్యానవ్రతస్తోత్రస్వరూపనిరూపణము :—

సీ. అంతటఁ గుంజలుం డానందమును జెంది, యతనిప్రశ్నమునకు నాత్మలోన
వత్స విష్ణుజ్ఞానవైభవంబునకు నీ, డైనవిజ్ఞాన మన్యంబు లేదు

దానిలో శోకంబు గాని హర్షము గాని, కామాదివికృతులు గాని లేవు
నిస్పృహత్వంబును నిశ్చలత్వంబును, నిరహంకృతియును సంధిల్లు దానఁ
గీ. దైలము హరించి ధూమసంతతిని విడుచు, దీపము తెఱంగునను నది పాపములను
నడఁచివిషయాభిలాషంబునవలఁద్రోయుఁ,దుదకువిష్ణుత్వమునునిచ్చునదియెచూవె.
క. హరియె సమస్తం బనియును, హరికంటెను లేదు చూడ నన్యం బనియుఁన్
హరి యనిన నేనె యనియును,నరసికొనుటె జ్ఞాన మదియె యుభయము నొసఁగున్.
వ. ఇంక ధ్యానంబు నిరాకారం బనియును సాకారం బనియును ద్వివిధంబు. 1184
సీ. హస్తవివర్జితుం డయ్యును గ్రహియించుఁ, బాదశూన్యుం డయ్యుఁ బరిచరించుఁ
గానంగఁబడు రూపు లేనివాఁ డయ్యును, నాస్యహీనుం డయ్యు నారగించు
నఘ్రాణుఁ డయ్యును నాఘ్రాణ మొనరించు,నయనముల్ లేక యుండియును జూచు
నాల్కలే లేకుండియుఁ బల్కుఁ గర్ణములు లే, నట్టివాఁ డయ్యును నాలకించు
ఆ. నగుణుఁ డయ్యు సగుణుఁ డగు నవశ్యుం డయ్యు,వశ్యుఁ డగును గోప్యవస్తు వయ్యు
సర్వ మగు నటంచు శార్ఙ్గి నెంచుటె నిరా, కార మైనధ్యాన మారయంగ.

సీ. పుండరీకంబులఁ బోలుకన్నులవాఁడు, రత్నసన్నిభదంతరాజివాఁడు
కరధృతశంఖచక్రగదాబ్జములవాఁడు, కంబుసమానకంఠంబువాఁడు
కేయూరకటకమౌక్తికహారములవాఁడు, బింబారుణాధరోష్ఠంబువాఁడు
శ్రీవత్సకౌస్తుభశ్రీవనమాలాప్ర,సాధితవిపులవక్షంబువాఁడు
గీ. కనకచేలుఁడు గరుడవాహనుఁడు దివ్య,కుండలకిరీటధరుఁడు మార్తండరుచియు
నైనహరిని భావించుటె యాత్మలోన, నగును సాకార మగుధ్యాన మాత్మజన్మ.
వ. ఇంక జయావ్రతంబును విజయావ్రతంబును జయంతీవ్రతంబును ద్రిస్పృశావ్ర
తంబును వంజులీవ్రతంబును నఖండావ్రతంబును ద్వాదశీవ్రతంబును మనోరథా
వ్రతంబును నశూన్యశయనవ్రతంబును జన్మాష్టమీ ఆవ్రతంబును దిలగంధా
వ్రతంబును మున్నగున నేకవిష్ణువ్రతంబులు సద్గతిదాయకంబులు గలవు. 1187
క. నామశతం బనెడిపరం, ధామునిస్తోత్రంబు వినిచెదను వినుము జగత్
క్షేమార్థ మది పఠించినఁ, గామితసిద్ధియును మోక్షగతియును గలుగున్. 1188
వ. నామశతస్తోత్రంబునకు బ్రహ్మ ఋషి. అనుష్టుప్పు ఛందస్సు. ప్రణవంబు దేవత.
సర్వకామసంసిద్ధియందును మోక్షప్రాప్తియందును వినియోగంబు. 1189
సీ. కేశవునకు హృషీకేశునకును మధు, సూదనునకు దైత్యసూదనునకు
నారాయణునకును నారసింహునకును, విశ్వేశ్వరునకును విష్ణునకు
మాధవునకు ననామయునకు విజయున, కనఘున కఘహర్త కచ్యుతునకు
శ్రీరామునకు సురార్చితునకు బ్రాహ్మణ, ప్రియునకు ధ్రువునకుఁ గృష్ణునకును

గీ. శ్రీపతికి శ్రీప్రియునకును శ్రీధరునకు, శ్రీనుతకు వామనునకు మహోదయునకు
హరికి యోగేశ్వరునకు జనార్దనునకు, యజ్ఞభోక్తకుఁ గలికి బ్రహ్మణ్యునకును.

సీ. విశ్వాత్మునకు సర్వవేత్త కనంతున, కేకరూపునకు మహేశ్వరునకు
సత్యంబునకు జ్ఞానసంపన్నునకు జ్ఞాన, దాయకునకు సర్వదాయకునకు
నానందమునకు విజ్ఞానంబునకుఁ బుణ్య, మునకు సాంఖ్యమునకు మోక్షమునకు
బ్రహ్మరూపునకు వ్యాప్తపరావరునకును, బుష్కరాక్షునకును బుష్కరునకుఁ

గీ. ప్రియునకు జయంతునకు మురారికిని బద్మ, హస్తునకుఁ జంద్రవక్త్రున కజితునకును
యోగరూపునకును బురుషోత్తమునకు, వాసుదేవునకును శ్రీనివాసునకును. 1191

సీ. సర్వసౌఖ్యునకు వ్యాసఖ్యాతునకు మహా, సౌఖ్యంబునకు మహాజ్ఞానమునకు
యజ్ఞంబునకును యజ్ఞాంగంబునకు యజ్ఞ, వర్ధనునకుఁ బుణ్యవాసునకును
వేదరూపునకును నాదిత్యునకు గుహా, వాసునకును సర్వవాసునకును
సర్వేశునకును శాశ్వతునకు సబలున, కసురారికిని మహాహంసమునకుఁ

గీ. బద్మనాభునకును బ్రజాపతికిఁ గామ, పాలునకు వేదవేదాంగపారగునకు
గోప్రియునకు ముకుందునకును గదాధ, రునకు గోవిందునకు క్షమారూపునకును.

సీ. వైకుంఠునకును ద్రిలోకనాథునకును, గోహితునకును వారాహునకును
ధరణీధరునకు విద్యావాసునకును సు, రేశ్వరునకును యోగీశునకును
శంఖపాణికి మహాజనునకుఁ బ్రత్యక్ష, దేవునకును మహాదేవునకును
బ్రద్యుమ్నునకును జగద్యోనికిని బురా, తనునకు మ్రొక్కుదు ననుపదంబు

గీ. ననుచుఁ ద్రికరణశుద్ధితో ననుదినంబు, నామశతమును జపియించినను సమస్త
పాపములు భస్మమైపోయి పరమపదము, సంఘటిల్లును దేహావసానమందు.

వ. మఱియును నామశతంబును సమాహితమనస్కుండై త్రికాలంబులందును జపియించెనేని యశ్వమేధఫలంబును నేకాదశియం దుపవాసంబు గావించి జాగరంబున విష్ణుసాన్నిధ్యంబున జపియించెనేని పౌండరీకక్రతుఫలంబును దులసీసన్నిధానంబునం దుండి మానసికంబుగా జపించెనేని రాజసూయఫలంబును సాలగ్రామశిలయును ద్వారవతీశిలయును గలచోట జపియించెనేని మహాసౌఖ్యంబును నేకోత్తరశతకులోత్తారణంబును గార్తికమాసంబున వాసుదేవునిఁ బూజించి తత్సన్నిధానంబునఁ బఠియించెనేని విష్ణుసాయుజ్యంబును మాఘమాసంబున మాఘస్నానంబు చేసి మాధవుని నర్చించి తత్సన్నిధానంబునఁ బఠించినను జపించినను వినినను సురాపానాదిసర్వపాపనివృత్తియును విష్ణులోకప్రాప్తియును శ్రాద్ధకాలంబునందు బ్రాహ్మణభోజనసమయంబున వినిచెనేని పితృదేవతాసంతృప్తియుం జేకూరు. 1194

గీ. భూసురుఁడు వేదవిదుఁ డగు భూవరుండు
విజయి యగు వైశ్యుఁ డైశ్వర్యవృద్ధిఁ గాంచు
నవరజుఁడు సుఖి యగుచు జన్మాంతరమున
విప్రుఁడై పుట్టు స్తోత్రంబు వినియెనేని. 1195
గీ. అనుటయునునుజ్జ్వలుఁడుతండ్రియడుగులకును, నెఱఁగివచ్చినత్రోవ నెయేఁగి మరల
సర్వతోభద్రపర్వతసానులందుఁ, గుతిలపడుచున్న యారాజసుతను గాంచి. 1196
గీ. అంబ జేకుణ నీకు సంప్రాప్త మైన, యాపదను విని గుంజె నీరయ్య నాకుఁ
గావలయునేని యొకయుపకార మేను, జేసెదను నీకు చింత వాసిపోవ. 1197
చ. అనుటయు నా మె విస్మయము నంది శుకం బిది గాదు నన్నుఁ గా
వను దయచేసినట్టిభగవంతుఁడె యంచుఁ దలంచి యాత్మ ని
ట్లనియెను బక్షిరాజ శరణాగత నైతిని దిక్కులేనిదా
నను నను నుద్ధరించిన ననాథను బ్రోచినపుణ్య మబ్బెడిన్. 1198
చ. అనవుడు నుజ్జ్వలుండు తనయయ్య వచించినసూక్తు లామెకున్
వినిచి యథాక్రమంబుగను విష్ణుసపర్య లొనర్ప మంతకం
బెను భవదార్తిభారమును డించునుపాయము లేదు నాఁగ నా
వనజదళాయతాక్షి శుకవాక్యము నమ్మి మనంబులోపలన్. 1199
క. హరిసంస్తవవ్రతాద్యుప, కరణంబులచేత సేవ గావించుటయున్
బురుషోత్తమునకు నాతఁడు, పరమానుగ్రహముతోడఁ బ్రత్యక్షము గాన్.
క. ధరణీంద్రపుత్రి విస్మయ, భరితాంతర యగుచు నిలువఁబడుటయు దామో
దరుఁ డామెను గని కోరుము, వర మిచ్చెద నేను భక్తివశ్యుఁడ ననియెన్.
ఉ. అంతట నావధూమణి జనార్దన నిన్ గనినంతలోన నా
స్వాంతమునందు నున్నభవవాంఛ సమస్తము దీఱె దాన నీ
చెంత వసించి త్వచ్చరణసేవ యొనర్చెడిభాగ్య మిమ్ము నా
కంతటికంటెఁ గోరఁ దగినట్టివరంబులు లేవు నావుడున్. 1202
గీ. అట్లె యగుఁ గాక యని పల్కి యచ్యుతుండు
పొందుటయును నంతర్ధానమును సమస్త
జనులు చూచుచునుండఁగాఁ దనువుతోడఁ
జనియె నాకన్యయును విష్ణుసదనమునకు. 1203
గీ. అరుగుటయును దివ్యాదేవి యద్భుతముగ, హరిపురంబున కుజ్జ్వలుఁ డరుగుదెంచి
యచట జరిగినయట్టివృత్తాంత మెల్ల, వినయమునఁ గుంజలునియొద్ద విన్నవించె.
వ. అంతఁ గుంజలుండు ద్వితీయపుత్రుండగుసముజ్జ్వలునిం గాంచి వత్సా నీ వేఁగిన
చోట నెచ్చటనేని యదృష్టచరంబును నశ్రుతచరంబును నగువిశేషంబు గోచ
రించెనేని వచియింపు మని పలుకుటయు సముజ్జ్వలుం డి ట్లనియె. 1205

—: హంసచరిత్రము :—

క. అరిగితిని దండ్రి హిమవ, ద్గిరికే నీనాఁడు దానిదివ్యాకార
స్ఫురణంబు చూడఁ జూడఁగఁ, బరమాశ్చర్యంబు గలిగె భావములోనన్.
క. కనఁబడియె నంను మానస, మనియెడిహ్రద మొకటి యచట నత్యద్భుతముగా
గనుఁగొంటి నేమి చెప్పుదుఁ, గనవలయును గాని తృప్తి గలుగదు వినినన్.
వ. అచ్చటి కరుపడినాలుగు కృష్ణహంసంబులతోడం గూడికొని నాలుగు మహా కృష్ణహంసంబులు సంభ్రమంబున నేతెంచి తత్సరోవరజలంబున మునుంగు చుండ రౌద్రాకారంబులును నూర్ధ్వకేశంబులును గృష్ణవర్ణంబులును నగు నాలుగు పెంటియంచలు వాని వెంటనంటి వచ్చి తత్తటంబునందు నిలిచి వానిం జూచి పరిహాసించుచుండె. అంతట నమ్మానసతీర్థంబులోనుండి ఖిన్నవదనంబు తోడ నొక్కకృష్ణహంసంబు పైకిం జనుదెంచుటయు దానివెంటన యాయష్ట షష్టిహంసంబులును జనుదెంచె.
ఆ. అప్పు డొక్కభిల్లుఁ డచటికిఁ జనుదెంచి, భానుబింబ మనెడిపగిది నొప్పు
దివ్యతనువుతోడఁ దేజరిల్లుచు నుండె, నంచ లెల్లఁ జూడ నద్భుతముగ. 1209
ఆ. అంత నతనిభార్య యన్నంబు గైకొని, వచ్చి చూచి వాని నచ్చెరువుగఁ
గాఁడు వీఁడు నామగం డెవ్వఁడో దివ్య, పురుషుఁ డనుచు నెంచి పోవుచుండ.
క. కనుఁగొని యామె నతం డి, ట్లనియెను సతి యేల పోయె దవలకు నీభ
ర్తను నేను నీనిమిత్తము, కనుచుంటిని రమ్ము క్షుధను గడవఁగఁ జాలన్. 1211
సీ. అనుటయు నాభిల్లి యతనియొద్దకు వచ్చి, యీవె నాపతి వైన నిట్టిరూపు
నీ కేరుపడుటకు నేకారణమొ చెప్పు, మని యడుగుటయు ని ట్లనియె నతఁడు
మానిని మృగయాశ్రమంబుచే నత్యంత, తాపంబు గలిగె నాతనువునకును
దానిచేతను నర్మదాసంగమమునందు, మునిఁగితి దైవికంబుగను నేను
గీ. దానిచే నాకురూపంబు మానిపోయి, ప్రాప్తమయ్యెను దివ్యరూపంబు నాకు
నమ్మహానదిసంగమమందు నింక, నెంతటిప్రభావ మున్నదో యెఱుఁగ రాదు.
చ. అనుటయు భిల్లి సాధ్వి యయినట్టికతంబున వానితోడ ని
ట్లనియెను నీప్రసంగము యథార్థమొ కాదో యెఱుంగ నాస్థలం
బున కరుదెమ్ము తోడుగను బోవుద మిప్పుడె తత్ప్రభావముం
గనుఁగొనుదాఁక నామదికిఁ గల్గదు నమ్మిక మెంత చెప్పినన్. 1213
గీ. అనుటయును మంచి దని భిల్లుఁ డామెతోడ
బయలుదేఱుటయును వెంట బయలుదేఱె
నంచ లెల్ల నాచిత్రము గాంచ నెంచి
యేఁగితిని వానితోడనె యేను గూడ. 1214

గీ. సత్వరముగను మే మెల్ల సాగుచుండఁ, బెంటియంచలు నాల్గును భీతితోడఁ
దడఁబడుచునుండఁ గాళులుదడలుపుట్ట, వడఁకుచును నెట్లొ మావెన్కవచ్చుచుండె.
ఆ. అంతఁ గొంత దూర మరుగుటయును గానఁ, బడియె రేవ నేత్రపర్వముగను
దక్షిణంబునంద తత్సంగమస్థలం, బునకు భిల్లుఁ జేరెఁ బాలఁతితోడ. 1216
ఆ. ఏఁగి యింతి మునుఁగు మీతీర్థమందు నా, చెప్పినట్టిమాట తప్పొ యొప్పొ
తెలియఁగల దటంచుఁ బలుకుటయును నామె, యీవుగూడ మునుఁగుమిచట ననియె.
గీ. అంత నాయిర్వురును గూడ నచట మునిఁగి, దివ్యతనువులతో లేచి దేవయాన
మును నధిష్ఠించి యాకాశమునకుఁ జనిరి, గనులుమిఱుమిట్లుగొన మేముగాంచుచుండ.
గీ. అప్పు డేకోనసప్తతిహంసములును, నందులో మున్గి దివ్యదేహములతోడ
నాల్గుదెసలకుఁ జనుటయు నీల్గి పడియె, నొక్కపరిఁ బెంటియంచ లాయొక్షణంబు.
గీ. తండ్రి హంసలపూర్వవృత్తముల నెల్ల, వినఁగ నామదిలోపల వేడ్క గలిగెఁ
దెలుపఁదగు నేని తెలుపుము తెలిసికొందు, ననుటయును గుంజలుం డిట్టులనియె నపుడు.
క. వినుమయ్య వత్స విదురుం, డనఁగను బాంచాలదేశమం దొకఁ డుం
డెను మున్ను ద్రవ్యలోభం, బున నాతఁడు సంహరించె భూసురు నొకనిన్.
సీ. సమయించి యాపాతకమును మాపికొనంగ, వర్జించి తిలకము వదనమందుఁ
ద్యజియించి శిఖయుసూత్రమును బ్రహ్మఘ్నుఁడ, నని చాటుకొనుచును ననుదినంబు
ప్రతిగృహంబున కేఁగి భైక్షంబు గొనుచును, దీర్థంబు లన్నియుఁ దిరిగి తిరిగి
విసు వొంది తుద కొకవృక్షంబుకడఁ జేరి, యేదిక్కుఁ గానక యేడ్చుచుండె
గీ. నచ్చటికి వచ్చె నొకవిప్రుఁ డాత్మచిహ్న, వర్జితుఁడు దగ్ధదేహుఁ డవ్వానిఁ గాంచి
విదురుఁ డిట్లని పలికె నీవిధముఁ జూడ, నెవ్వడవొ పాపి వని తోఁచె నెఱుఁగఁ జెపుమ.
గీ. అనుటయును నేను జంద్రశర్మాభిధుండ, బ్రాహ్మణుండను గురుఘాతపాతకమున
నిట్టిగతి పట్టె నాకు నే నేడ్చుచుంటి, నేల నీ వేడ్చుచుంటివో యెఱుఁగఁ జెపుమ.
క. అనవుడు విదురుఁడు తనగా, థను జెప్పుచు నేడ్చుచుండుతరుణంబున వ
చ్చెను వేఱొకపాపాత్ముఁడు, వనరుచు నచ్చటికిఁ బ్రేతవదనముతోడన్. 1224
క. ఆపాపు లిరువురును నపు, డాపాపిని జూచి యిట్టు లని రెవఁడవు నీ
వీపగిది వనరుచుంటకు, నేపాపము చేసినాఁడ వెఱుఁగం జెపుమా. 1225
ఆ. అనుడు నాతఁ డిట్టు లనియెను నను వేద, శర్మ యందు రగ్రజాతివాఁడఁ
గలిగె నిట్టిగతి యగమ్యాగమనమహా, పాతకమున నాకుఁ బాపులార. 1226
గీ. తిన్నచోటను దిననీయ దున్నచోట, నుండనీయదు నాపాప ముర్వి యెల్లఁ
దిరుగుచున్నాఁడ మతి లేక దేవుఁ డెఱుఁగు, నాయవస్థను జావైన నాకు రాదు.
ఆ. అనుచుఁ జెప్పుచుండ నరుదెంచె వేఱొక, పాపి యటకు ఖిన్నభావమునను
నతనిఁ జూచి వార లడిగిరి నీకథ, చెప్పు మేమి చేసి చెడితొ యనుచు. 1228

గీ. అంతటను నామహాపాపి యశ్రుధార, గాఱుచుండఁగ బోయసఁ గనులనుండి
నైశ్వ్యఁడను నేను నాపేరు వంజులుండు, చెప్పఁగూడనిపాపముల్ చేసినాఁడ.

క. త్రాపితిని సురను జంపితి, గోవుల నాపాతకములు గూడుకొని మహా
దావానలంబు గాల్చిన, కైవడి నిలువునను నన్నుఁ గాల్చుచు నుండెన్. 1230

గీ. ఏమిచేయుదు నే నింక నెటకుఁ బోదు, బాధ పడఁజాలఁ బ్రాణముల్ వాసిపోవు
కట్టి కుఱుపును చేసినకర్మ మనెడి, పలుకులోఁ గలయర్థ మిప్పటికిఁ దెలిసె.

క. అని పలికి యేడ్చుచుండుట, యును నామువ్వురను వాని నూరార్చిరి మే
మును బాతకులమె తీఱదు, మనదుఃఖం బేడ్చినంతమాత్రన యనుచున్. 1232

గీ. అంతటను నల్వురను గూడి యఘవిముక్తి
యగునుపాయంబు నరయుచు నడవులందుఁ
గొండలందును దిరుగుచుఁ గొట్టకొనకుఁ
జనిరి కాలంజరం బనుశైలమునకు. 1233

క. చని యచట నొక్కసిద్ధునిఁ, గనుఁగొని ప్రణమిల్లి పాతకంబులు తొలఁగం
గను గలమార్గము మాకున్, వినిపింపుము తండ్రి యనుచు వేఁడుకొనంగన్.

గీ. అతఁడు దయతోడ వారికి ట్లనియెఁ బుష్క, రము ప్రయాగము సర్వతీర్థంబు వార
ణాసి యనునాల్గు దక్క నన్యంబు లేదు, రూపుమాపంగ మీమహాపాపములను.

వ. మున్ను సహస్రాక్షుం డగమ్యాగమనబ్రహ్మహత్యామహాపాతకదూషితుండై తీర్థముల నెల్ల రావించి మత్పాపపరిహారంబు గావింపఁగలతీర్థం బెయ్యది యని యడుగుటయు నాతీర్థంబు లెల్ల నాతనిం జూచి దేవా బ్రహ్మహత్యాదిమహాపాతకంబులు రూపుమాప వారాణసీప్రయాగపుష్కరసర్వతీర్థంబులు దక్క మే మెవ్వరమును సమర్థులము గాము. భగవంతుం డుపపాతకవినాశనంబునంద సామర్థ్యంబు మా కొసంగె నని పలుకుటయు దేవేంద్రుం డానాలుగుతీర్థంబులందు విధియుక్తంబుగా స్నానంబు సలిపి మహాపాతకవిముక్తుండై యాతీర్థంబులకుఁ దీర్థరాజత్వంబుఁ బ్రసాదించె. 1236

గీ. కావునను మీర లేఁగి యక్కడను సోమ, వారసంయుక్త మగునమావాస్యనాఁడు
గంగలో స్నాన మొనరింపఁ గలిగెనేని, పాయు నాక్షణమంద మీపాతకములు.

గీ. అనుటయును వారు కొండంతయాసతోడ, నరిగి సిద్ధుఁడు చెప్పిన ట్లాచరింప
దుష్కృతములన్నియునుగూడఁదొలఁగివారి, కద్భుతముగనుదివ్యదేహములుగలిగె.

వ. అంతట బ్రహ్మహత్యాదిమహాపాపంబు లాతీర్థంబులకు సంక్రమించుటయు నాతీర్థంబులు నాలుగును దత్పాపవశంబున మహాకృష్ణహంసాకారంబులం బడసె. నీవు చూచిననాలుగుమహాకృష్ణహంసంబు లమ్మహాతీర్థంబులుగా నెఱుంగుము. అంతట నమ్మహాకృష్ణహంసంబులు దత్పాపభారంబు సైఁపం జాలక

పాపవిముక్తికై యఱువదినాలుగుతీర్థంబులలోఁ గ్రుంకుటయుఁ దత్పాతకసం క్రాంతివశంబున నాతీర్థంబులు నీవు చూచినయఱువదినాలుగుకృష్ణహంసంబులుగా నయ్యె నని యెఱుంగుము. ఆహంసంబు లన్నియును మానససరస్సునం గ్రుంకుటయు నందుండి ముందు ఖిన్నవదనంబుతోడం జనుదెంచినకృష్ణహంసంబు మానసతీర్థంబుగా నెఱుంగునది. నీవు కాంచినదివ్యరూపంబులు నర్మదోత్తర కూలంబునందు నర్మదాకుబ్జాసంగమంబునం గ్రుంకుటం జేసి కృష్ణహంసాకారంబులు తొలఁగి స్వస్వరూపంబులం దాల్చినతీర్థంబులుగా నెఱుంగునది. తీర్థంబులందు మునింగెడియంచలం జూచి యింతమాత్రమునకె మహాపాపంబులు తొలంగునా యని పరిహసించుచు వచ్చి వచ్చి తుదకు రేవాతీరంబునం బడి చచ్చిన కృష్ణహంసంబులు బ్రహ్మహత్యాదిమహాపాతకంబులుగా నెఱుంగునది. 1239

గీ. నర్మదాకూలములు రెంటినడుమ నెచట, నైన నొకసారి మునిఁగిన నదియె చాలు నఘములను నెల్ల మాయించి యశ్వమేధ, ఫలము నీయంగ నిఁక వేయిపలుకులేల.

ఆ. ఎంతవఱకు రేవ దృగ్గోచరము గాదొ, యంతవఱకె క్రాలు నన్నినదులు గౌరవంబు గలిగి గర్జించుచుండును, నన్నితీర్థములును నంతవఱకె. 1241

వ. అని తెలిపి కుంజలుండు తృతీయపుత్త్రుం డగువిజ్వలునిం గాంచి వత్సా నీ వేఁగిన దేశంబులందు నీకు గోచరించినయపూర్వం బేదియేని కలదేని వచియింపు మని పలుకుటయు విజ్వలుం డిట్లనియె. 1242

ఆ. తండ్రి మేరుపర్వతముమీఁద నానంద, వనము నాఁగ నొక్కవనము గలదు దానినడుమఁ జూడఁ దగినరూపముతోడ, నలరుచుండునొక్కహ్రదము గలదు.

క. రతిమదనులఁ బోలెడిదం, పతు లిరువురు చనుచు వ్యోమమార్గంబున నే కతముననొ దిగి విమానము, నతిశీఘ్రంబుగను వచ్చి రాహ్రదమునకున్. 1244

గీ. వచ్చి స్నానము చేసి తద్వారియందుఁ, దటమునకుఁ జేరి చూచి యచ్చటను దమకు సాటి యగురూపమున నున్నశవయుగంబు, దాల్చి ఖడ్గంబులను వానిదరికిఁ జేరి.

ఆ. ఆఁడుదానిశవము నాఁడుది పురుషుని, శవముఁ బురుషుఁడును నశంకముగను గోసి తినుచు నుండ నాసమయంబున, నరుగుదెంచి యిరువు రాఁడువాండ్రు.

క. వారలను జూచి నవ్వుచు, సారెకు నేమేమొ నుడువసాగిరి నడుమం జేరి మఱియొక్కయిరువురు, మారులువలెఁ దోడఁగి రఱవ మాకిదు మనుచున్.

గీ. అంత నాదంపతులు దిని యాశవంబుఁ, దృప్తిదీర విమానము నెక్కి మరల నేఁగి రొకనాఁడు మున్నట్లె యింతవఱకు, జరుగుచున్నది ప్రతిదివసమును దండ్రి.

ఆ. అచటి కేఁగుచుంట నాహారమున కేను, గనులఁ గాంచుచుంటి ననుదినంబు వార లాద్వు రెవరొ యారీతి వా రుంట, కేమి కారణంబొ యెఱుఁగఁ జెప్పుమ.

గీ. అనుటయును గుంజలుం జీట్లు లనియె వెన్ని, కర్మ మన్నిటికిని గూడఁ గారణంబు
పుణ్యకర్మంబునను దేహిపొందుసుఖము, గాంచును విషాదమును బాపకర్మమునను.

సీ. కనుఁగొని స్థూలసూక్ష్మము లైనధర్మముల్, శాస్త్రవిజ్ఞానలోచనముచేత
గర్మంబు నొనరింపఁగాఁ దగు జంతువు, సలుపఁగా రా దవిచారముగను
నెట్టివిత్తనమును జెట్టునొ భూమిలోఁ, గాంచు నట్టిఫలంబె కర్షకుండు
కావించునో యెట్టికర్మ మట్టిఫలంబె, యనుభవించును దేహి యైనవాఁడు

గీ. కాన బంధు వైనఁ గర్మమె కర్మమె, శత్రు వైన సకలజంతువులును
గర్మచోదనమునఁ గాంచుచుందురు సుఖ, మైనఁ గాని దుఃఖ మైనఁ గాని. 1251

గీ. కర్షకుఁడు కృషిఫలమును గాంచునట్లు, కర్త కర్మఫలంబును గాంచుచుండుఁ
దాను గల్పించుకొనినదె కాని దుఃఖ, మేని సుఖమేనియును నన్యకృతము గాదు.

గీ. కరువునను బద్ధ మగుకనకద్రవంబు, పగిదిఁ గర్మంబునను దేహి బద్ధుఁ డగును
గర్మవశులము మన మెల్లఁ గర్మముననె, కలుగుచుండునుసృష్టులు ప్రళయములును.

—: సు బా హు రా జ చ రి త్ర ము :—

గీ. క్ష్మాతలంబునఁ జోలదేశంబునందుఁ, బ్రభు వొకండు గలండు సుబాహు వనఁగ
నతఁడు హరిభక్తుఁ డమితధైర్యాన్వితుండు, ధర్మపరిపాలనక్రియాతత్పరుండు.

ఆ. అఖిలగుణసమేతుఁ డయ్యును నాతేఁడు, దానవిముఖుఁ డగుచు ధరణి నేలు
చుండఁ దత్పురోహితుం డగుజైమిని, యొక్కనాఁడు వానియొద్దఁ జేరి. 1255

క. మానవలోకాధీశ్వర, దానమునకు సాటి యైనధర్మము నెందుం
గానము గావునఁ జేయుము, దానములను బాత్రు లైనధరణిసురులకుఁ.

సీ. కొందఱు పఠియించుచుందురు విడిచి ని, ద్రాహారములను ద్రవ్యంబుకొఱకుఁ
గొందఱు సేవించుచుందు రల్పులనేని, యవమాన మనక ద్రవ్యంబుకొఱకుఁ
గొందఱు కృషి చేయుచుందురు శ్రమ మెంత, యైనను సైఁచి ద్రవ్యంబుకొఱకుఁ
గొందఱు కావించుచుందురు చేయరా, నట్టిపాపములు ద్రవ్యంబుకొఱకుఁ

గీ. గొంద అడవులలోఁ జొచ్చుచుందు రబ్ధు
లందుఁ గొందఱు పడుచుందు రర్థమునకుఁ
బ్రియము లగుప్రాణములు గూడఁ దృణములట్లు
విడుచుచుందురు కొందఱు విత్తమునకు. 1257

గీ. కాన బహుళశ్రమార్జిత మైనధనము, నంత మొందింపకుండ నిరర్థకముగ
నర్పణముచేసి సత్పాత్రమందు బుధులు, శ్రద్ధతో నిల్పికొందురు శాశ్వతముగ.

క. దానము లనేకములు గల, వైనను బ్రాహ్మణులకు నైహికాముష్మికసౌ
ఖ్యానువిధానచణం బగు, దానము లే దన్న మన్నదానముకంటెన్. 1259

క. ఒకకబళమేని బ్రాహ్మణు, నకు ననుదినమును నొసంగినను నవి శ్రీశం
పక యేనాఁటను దాతకు, నొకటికిఁ బదిరెట్లు ఫలము నొసఁగుచు నుండున్.
గీ. అన్న దానంబు చేయలేకున్న యెడలఁ, బ్రతిదినంబును నొక్కపర్వమున నైన
నన్నమును విప్రునకుఁబెట్టునతని కొదవు, ననుదినంబును భుక్తి జన్మాంతరమున.
గీ. జన్మమున నొక్కపరి యైనఁ జలిపెనేని, పాత్రునకు నన్నదానంబు భక్తితోడఁ
ద్రిదివమునఁ గ్రోలుచుండును దృప్తిదీరఁ, బ్రతిదినంబును నమృతధారల నతండు.
గీ. అన్నమునె ప్రాణ మనియెద రార్యు లెల్లఁ, బ్రాణమున కన్న మాధార మైనకతన
నన్న దానంబు గావింపు మవనినాథ, కలుగుఁ బ్రాణం బొసంగినఫలము నీకు.
గీ. అనుటయును జైమినికి నిట్టు లనియె నతఁడు
స్వామి నీ చెప్పినట్టులె సలుపువాఁడఁ
గాని యొక ప్రశ్న మడుగఁగఁ గాంక్ష గలిగె
ననుటయును జైమిని నరేంద్ర యడుగు మనియె. 1264
గీ. అంతట సుబాహు వతని కిట్లనియె స్వామి, స్వర్గ మొదవును దానంబువలన నంటి
వట్టిస్వర్గంబునను గలయట్టిగుణము, లేవొ దోషము లేవొ నా కీవె చెపుము.
గీ. అనుటయును బ్రాహ్మణుం డిట్టు లనియె భూప
క్రూరులు కృతఘ్నులును నాస్తికులును దురభి
మానులును జోరులును నసంభావితులును
లోభులును లేరు నిర్జరలోకమందు. 1266
క. అమరులకు క్షుత్పిపాసలు, శ్రమమును గ్లానియును శైత్యసంతాపవిషా
దములును వార్ధకమును రో, గములును శోకమును మృతియుఁ గలుగవు భూపా.
సీ. కామయానము లైనవ్యోమయానంబులు, సమకూర్చు లోకసంచారసుఖము
నానందమునఁ దేల్చు నతిలోకసౌందర్య, యుత మైనయప్సరోయువతిజనము
నీప్సితంబుల నెల్ల నీడేర్చు నఖిలార్థ, దము లైన దేవతాతరువు లైదు
భూరితేజంబునఁ బొలిచెడిదివ్యదే, హంబులు బహువిస్మయంబు గొలుపు
గీ. సర్వసంపత్సమృద్ధియు సత్యమార్గ
వర్తనంబును ధర్మసంవర్ధనమును
నమృతభోజనమును మహాహ్లాద మొసఁగుఁ
ద్రిదివమున నుండుగుణములు దెలుపఁ దరమె. 1268
గీ. ఎంతదోషమొ యమరుల కేమి చెప్ప, నిచట నార్జించుకొనినది యెల్ల నచట
ననుభవింపఁగఁ జేసి యనంతరంబ, నెట్టుదురు భూమిపైఁ బడునట్టు లధిప. 1269
గీ. పరులయాన్నత్యమును సహింపమని గొప్ప
కార్యముల కెన్నొ యెన్నొ విఘ్నములు సేయఁ

గడఁగుచుండెద రనుచు శాస్త్రంబును గూడ
లోటు గాదొకో యది స్వర్గలోకమునకు. 1270

చ. అనుటయు భూవరేణ్యుఁ డనఘా త్రిదివంబున కిట్లు దోషముల్
వినియెతి పెట్టిదోషములు లేనిపదం బెదియేని యున్న దో
వినెదవేని నాకు విన వేడుక యయ్యెడు నాఁగ నాతఁ డి
ట్లనియెను దేవ బ్రహ్మభువనాదులకుం గల విట్టిదోషముల్. 1271

గీ. కావునను కోరరు యథార్థభావవిదులు, ప్రాకృతులుపోలె స్వర్గాదిలోకములను
నొకటిమాత్రము కోరుదు రన్నవాని, కన్నిటికిఁ గూడ నూర్ధ్వమై యున్న పదము.

గీ. అదియె విష్ణుపదంబు బ్రహ్మంబు నాఁగ, నదియె జ్యోతి యనంగను నదియె భూప
జ్ఞానహీనులు దానిని గానలేరు, ధ్యానయోగనిరస్తపాతకులు దక్క. 1273

—: సుబాహుజైమినిసంవాదము :—

గీ. అనుటయును నాసుబాహుఁ డిట్లనియె స్వామి, కర్మ మొనరింపనేల యాకర్మమునకు
ఫలముగా నుండుస్వర్గము వడయ నేల, పడసి స్వర్గంబు కడ కధఃపతన మేల.

గీ. కానఁ బంకంబులోఁ బడి కడుగుకొనుట, కంటె దానిని స్పృశియింపకుంటె మేలు
దాన మొనరింప నుత్తమధ్యానయోగ, మునను విష్ణుపదంబు చేకొనుదు నేను.

సీ. అని పల్కుటయును జైమిని యిట్లు లనియె రా, జేంద్ర నీపల్కిన దెల్ల నిజమ
కాని దానంబును గావింపకున్న చోఁ, క్షుత్పిపాసాబాధ క్షోభపఱుచు
నాక్షోభమున జ్ఞాన మాచ్ఛాదితం బగు, దానిచేతను సిద్ధి కానరాదు
జ్ఞానయోగము గాని ధ్యానయోగము గాని, యార్జితం బగు దానయోగముననె

గీ. కావునను మున్ను జ్ఞానము గలిగినట్టి, భూధవులు యజ్ఞములు యాగములును దాన
ములును ధర్మంబులును బెక్కు సలిపి తుదకుఁ, బడసిరి సుఖంబుగను విష్ణుపదము నధిప.

గీ. మునులు సైతము భిక్షాన్నమునను బ్రాహ్మ
ణునకు నొకభాగమును ధేనువునకు నొక్క
భాగమును బార్శ్వవర్తికి భాగ మొకటి
యును నొసంగుదు రొందంగ నూర్ధ్వపదము. 1277

క. కావున నిష్కామంబుగఁ, గావింపుము దానములను గలుగును దానన్
గైవల్యంబు సుఖంబుగఁ, గావింపనియెడల సిద్ధి గలుగదు భూపా. 1278

గీ. అనుటయు సుబాహుఁ డతనికి ట్లనియె స్వామి, ధ్యానయోగంబుచేత ననారతంబు
వాసుదేవుని భజియించువాని కితర, సాధనము లేల సద్గతి సంఘటిల్ల. 1279

క. అని పలికి యాసుబాహుఁడు, మనమున ధ్యానించుకొనుచు మాధవుని సతం
బును దుదఁ గాలధర్మం, బును జెందుట నరిగి విష్ణుపురమున కంతన్. 1280

—: వైకుంఠగతుఁ డయ్యును సుబాహుఁడు దానము చేయమిని దుర్దశను జెందుట :—

సీ. తనముందు నాట్యంబు లొనరించుచున్నను, నప్సరోవనిత లత్యద్భుతముగఁ
దనకంఠమును బుష్పదామంబుల నలంక, రించుచున్నను గిన్నరీజనంబు
దనప్రక్కలను జేరికొని స్తోత్రపాఠముల్, గావించుచున్నను దేవసమితి
దనమందలను నిల్చికొని పాడుచున్నను, గంధర్వు లక్ష్మముల్ గరఁగునట్టు

ఆ. లోకకోటియును జూడకుండ నాఁకలిబాధ, వలన నెచటఁ గూడ నిలువలేమిఁ
దిరుగఁజొచ్చె భార్య తిరుగంగ వెనువెంట, వెఱ్ఱిపోలె నగరవీథులందు. 1281

ఆ. అట్లు తిరిగి తిఁగి యాకస్మికంబుగ, నరిగి యొక్కతాపసాశ్రమమున
కచట వామదేవుఁ డనుతపస్విని గాంచి, నమ్రుఁ డగుచు వందనం బొనర్చి.

క. హరి తనకుఁ గానరామియు, భరియింపఁగ లేనిక్షుత్పిపాసలవలనన్
బరితాప మొదవుటయు న, ప్పరమర్షికి విన్నవించె భయభక్తులతోన్. 1283

ఆ. విన్నవించుటయును విని వామదేవుఁడు, యోగదృష్టి నతని యోగ మెల్లఁ
గాంచి యిట్టు లనియె క్ష్మానాథ చేసిన, కర్మమునకుఁ దగినగతియె కలిగె.

ఆ. మానసంబునందు ధ్యానించితివి గాని, పరమపురుషు నెంతొ భక్తితోడ
నళినలోచనునకు నైవేద్య మొనరింప, వైతి వొక్కఫలము నైనఁ దుదకు.

గీ. దశములందును నేకభక్తములు చేసి, చేసి తేకాదశుల నుపవాసములను
గాని ద్వాదశులం దొక్కకబళమేని, యొక్కనాఁడును విప్రున కొసఁగ వైతి.

ఆ. అన్న మమృతరూప మమృతంబు బ్రాహ్మణ,హస్తమందు నుంచినట్టు లైనఁ
గలుగుఁ దృప్తి దేవతలకును గలుగును, బితరులకును దృప్తి క్షితితలేంద్ర. 1287

గీ. అతిథులు భుజింప శేషించినట్టియన్న, మమృతమని చెప్పఁబడియె నయ్యది భుజించి
నట్టివారికిఁ దృష్ణయు నాఁకలియును, గలుగనేరవు పుణ్యలోకంబులందు. 1288

గీ. ధర్మసుత సుమి శ్రద్ధ యద్దానివలనఁ, గాంచి రూర్ధ్వపదంబు నకించనులును
జేసినను గోటిదానముల్ చెందలేఁడు, శ్రద్ధ లేనట్టివాఁడు శాశ్వతసుఖంబు.

గీ. అవ్యయానంద మనెడునవర్ఘ ఫలము, ననుభవింపంగ వాంఛించునట్టివాఁడు
భూసురుం డనుసుక్షేత్రమునను నాఁట, వలయు దానము లనుబీజములను భూప.

గీ. ఫలముపై వాంఛ గలకృషీవలుఁడు భూమి
నొక్కక్షణమును నెడఁబాసి యుండనట్లు
పరమపదకాంక్షి యగువాఁడు పాత్రుఁ డైన
బ్రాహ్మణుని వీడి యుండఁ డెప్పటికిఁ గూడ. 1291

గీ. చెడ్డపని చేసి మేలును జెందఁబోఁడు, మంచిపని చేసి కీడును గాంచఁబోఁడు
నింబమును నాఁటి చూతఫలంబు గొనునె, నింబఫలమును గొనునె చూతంబు నాఁటి.

గీ. దాన మొనరింపకున్నఁ బాత్రం బెఱింగి, కలుగనేరదు తద్దానఫలము భూప
చేయకుండినయెడలను క్షేత్ర మెఱిఁగి, బీజవాపంబు గలుగునె బీజఫలము.

సీ. అమృతోపసన్నిభ మైనయన్నమున మేను, పెంచుకొంటివి కండలు పెరుఁగునట్లు
పట్టెఁడన్నంబు నైనను బెట్టవైతి, పాత్రుఁ డైనట్టివానికిఁ బార్థివేంద్ర. 1294
క. కలిగియును భూరిసంపద, గలిగియును హితంబు చెప్పఁగలిగినపెద్దల్
తెలిసికొను తెలివి గలిగియుఁ, జలుపక దానంబు చెడితి సర్వవిధములన్. 1295
గీ. దేవతలు పితరులును భూదేవతలును, క్షేత్రరూపంబు లనుచును జెప్పఁబడిరి
కాన వా రిచ్చుచుందురు కాల మెఱిఁగి, దత్త మైనట్టిదానికిఁ దగినఫలము.
ఆ. జననమరణములకు సౌఖ్యదుఃఖములకుఁ, గారణంబు స్వకృతకర్మ మొకఁడె
కాన నధిప నీవు గావించియుండిన, కర్మమునను యిట్టికర్మ మొదవె. 1297
క. నారాయణుని మనంబున, నారాధించితివిగాన నద్దానను నె
వ్వారికి దొరకనివైకుం, ఠారోహణఫలము ప్రాప్తమయ్యెను నీకున్. 1298
ఆ. పాపకర్మమునకుఁ బాపఫలంబును, బుణ్యకర్మమునకుఁ బుణ్యఫలము
గలిగె నీకుఁ బూర్వకర్మఫలంబుల, ననుభవింప కుండ నగునె యధిప. 1299
గీ. అనుటయును జేఁడు భయకంపితాంగుఁ డగుచు
క్షుత్పిపాసావిషాదంబు సోఁకకుండ
శాశ్వతపదంబునను నిల్పఁ జాలినట్టి
పుణ్యకార్యంబు లేవొ తెల్పుము మహాత్మ. 1300
క. అని వేఁడుకొనుటయును న, మ్మునివరుఁ డి ట్లనియె లోకమున కుపకారం
బొనరించెడినీప్రశ్నం, బునకున్ సంతోష మయ్యె భూతలనాథా. 1301
వ. అన్నదానంబును నుదకదానంబును నుదకపాత్రదానంబును భూదానంబును
గోదానంబును స్వర్ణదానంబును ఛత్త్రిదానంబును నుపానహద్దానంబును నను
నెనిమిదిదానంబులు క్షుత్తృష్ణానివర్తకంబు లగుచు దాతకుఁ బరలోకంబునను
జన్మాంతరంబునను ననేకసుఖంబులఁ జేకూర్చు. మృత్యుసమయంబునందుఁ
గావింపంబడుతిలదానంబును బూర్వోక్తఫలంబు నిచ్చుచు సర్వభోగపతిత్వంబు
ననుగ్రహించు.
గీ. అనుటయును జేఁడు ముని కిట్టు లనియె స్వామి
నేఁడు నీ వనినట్టులె నాఁడు నాకు
జైమిని వచించె దానముల్ సలుపు మనుచు
సత్యమునె చెప్పుదురు చూవె శాస్త్రవిదులు. 1303
క. అనుకొంటిఁ గాని ధ్యానము, నను ధన్యుఁడ నగుదు ననియు నా కితరంబుల్
పని లే దనియును నింతటి, పని యగు నని తలఁప నైతిఁ బా పైపోతిన్. 1304
వ. ఇంక దీనికిఁ బ్రాయశ్చిత్తం బేదియేని యున్న ననుగ్రహించి నన్ను బాధా
విముక్తునిఁ గావింపు మనుటయు వామదేవుం డతని కి ట్లనియె. 1305

క. ప్రాయశ్చిత్తము దీనికి, నేయుదియును లేదు కాని యేవపడక మీ
కాయంబులె తినుచుండుం, డేయెడ నవి పడెనో యచటి కేఁగుచు నింకన్.

గీ. ఎచటఁ బడియెనో మీమేను లచట నుండు, నక్షయములుగ మీకుఁ గర్మానుభవము
పూర్ణమగునంతవఱకును బొండు చేసి, నట్టికర్మంబునకు ఫల మనుభవింప.

ఆ. అనుటయును సుబాహుఁ డతిహేయ మగుపని, చేయవలసె ననుచుఁ జింత నొంది
స్వామి యెంతకాల మీమాడ్కి శవదేహములఁ భుజించుచుండవలెనొ చెప్పుము.

వ. అని సప్రశ్రయంబుగా నడుగుటయు వామదేవుండు రాజా వాసుదేవాభిధానంబు
గలస్తోత్రంబు మీరు వినంగలనాఁడు క్షుత్తృష్ణావిముక్తులై భవభయనివారకం
బగుధామంబు వడయంగల రని చెప్పి యంతర్హితుం డయ్యె. 1309

గీ. అంతటను వార లాస్తోత్ర మాలకింపఁ, జేసి యత్నంబు లెన్నియొ చేసినను
కాశ యుడుగంగ క్షుత్తృష్ణ లాఁగకునికి, నాత్మశవములఁ దినఁ బొచ్చి రనుదినంబు.

ఆ. వత్స నీవు గన్నవారలు వారల, వారు ప్రతిదినమును వచ్చి విష్ణు
పురమునుండి యట్లు భుజియించి శవముల, నేఁగుచుందు రెదల నేడ్చుకొనుచు.

సీ. ఇరువురు చెలులుగా నేతెంచి ప్రజ్ఞయు, శ్రద్ధయు వారలచర్యఁ జూచి
నవ్వుచుండిరి మమ్ము దవ్వుగాఁ జేసిన, కతన మీ కీగతి గలిగె ననుచు
మఱియొక యిరువురు తెఱవలు గాఁగను, జనుదెంచి క్షుధయుఁ దృష్ణయును గూడి
యతిదారుణంబుగా నఱవంగఁ జొచ్చిరి, పెట్టుఁ డింకను మాకుఁ బెట్టుఁ డనుచు

గీ. వారలాఱుగు రెవ్వరో వారిచరిత, మెట్టిదియొ సర్వమును వచియించినాఁడ
నింక నడుగంగవలసిన దేదియేని, మదిని గలిగిన నడుగు చెప్పెదను వత్స. 1313

గీ. అనుటయును విజ్వలుం డిట్లు లనియెఁ దండ్రి, భవపయోనిధిఁ గట్టుఁ జేర్పంగఁ దగిన
వాసుదేవాభిధాన స్తవంబు నాకుఁ, జెప్పు మనుటయు నతఁ డిట్లు చెప్పఁదొడఁగె.

—: వాసుదేవాభిధానస్తోత్రము :—

వ. శ్రీవాసుదేవాఖ్యస్తోత్రమహామంత్రంబున కనుష్టుప్పు ఛందస్సు. నారదుండు
ఋషి. ప్రణవంబు దేవత. సర్వపాపనాశనార్థంబును జతుర్వర్గసాధనార్థంబును
నగుజపంబు నందు వినియోగంబు. వాసుదేవద్వాదశాక్షరమంత్రంబు జప్యంబు.

సీ. గంధర్వగీతభోక్తయు నిరాకారంబు, సుప్రకాశంబు గీతప్రియంబుఁ
బరమంబు వేదరూపంబు వేదాఖ్యంబు, శుద్ధంబు సూక్ష్మంబు సూక్ష్మతరము
యజ్ఞవల్లభము విద్యాధారమును మఖా, ధారంబు విశ్వవేత్తయును శివము
గీతజ్ఞమును గుణాతీతంబు గుణనాయ, కంబుఁ గైవల్యధామంబు సుఖముఁ

గీ. బుణ్యమును వేదమందిరమును మహోద
యమును గుణకర్తయును నిర్గుణమును బావ
నమును వేదజ్ఞమును విచారమును మోహ
శమనమును నైన ప్రణవంబె శరణు నాకు. 1316

గీ. అంతటను నిండి భాసిల్లునదియు నేక, మైనను ననేక మైనట్లు కానవచ్చు నదియు భవవార్ధి దాటించునదియు సర్వ,శక్తియునునై న ప్రణవంబె శరణునాకు.
గీ. అఖిలలోకంబులకు మూల మనియు సకల, ధర్మములకును మేలైన ధర్మ మనియు జ్ఞాన మనియును వేదశాస్త్రములయందుఁ,దెలుపఁబడియున్న ప్రణవంబె దిక్కు నాకు.
క. ఏయది జన్మస్థానమొ, గాయత్రీసామగానకళ కేది మునిధ్యేయమొ యేయది మోక్షో,పాయమొ యాప్రణవమునకె ప్రణతు లొనర్తున్.
గీ. దేనినూయను బ్రహ్మాది దేవతలును, గడవఁజాలక ముక్తిమార్గంబుకొఱకు నెమకుచుందురో యాప్రణవమునె మదిని,వదలకుండఁగఁ బాదుకొల్పుదును నేను.
సీ. పరమపదంబుగా భాసిల్లువాఁడును, బ్రణవరూపంబునఁ బరగువాఁడు
నఖిలగుణంబుల కాధార మగువాఁడు, జగము లన్నియు సృష్టిసలుపువాఁడు
రవివహ్ని తేజోవిరాజితుం డగువాఁడు, వేదకోశంబుగా వెలయువాఁడు
దుఃఖంబు లన్నియుఁ దొలఁగఁద్రోసెడివాఁడు, శ్రేయంబులను దయచేయువాఁడు
గీ. గదయు ఖడ్గము శంఖచక్రములు నాల్గు, హస్తములలోన ధరియించినట్టివాఁడు కేవలుఁడు సర్వమయుఁడు పరాత్పరుండు,సాక్షియును నైన శౌరియె శరణు నాకు.
గీ. స్వప్రకాశంబుచేతనె సర్వలోక, ములను భాసిల్లఁజేయుచుఁ గొలువఁబడుచు సకలవిబుధులచేతను శాశ్వతముగఁ, దేజరిలువాసుదేవుఁడె దిక్కు నాకు.
గీ. అరుణరూపంబు దాల్చి కిరణములను, నుదకమును శోషిలంగఁజేయుచును మరల నొసఁగుచును లోకముల నెల్ల నోముచున్న, దేవకీసుతుఁ డొక్కఁడె దిక్కు నాకు.
గీ. అనిలరూపంబునను మేనులందుఁ జేరి, జీవులను బ్రాణయుతులను జేసి తెలియఁ బడనివాఁ డయి విశ్వంబు నడుపుచున్న, దేవకీసుతుఁ డొక్కఁడె దిక్కు నాకు.
గీ. ఎల్లలోకంబులను గూడఁ దల్లివోలె, నక్షయం బగుకరుణాకటాక్షమునను నుదరమం దుంచుకొని ప్రోచుచుండినట్టి, దేవకీసుతుఁ డొక్కఁడె దిక్కు నాకు.
గీ. ఇంద్రియంబులు లేకపోయినను గూడ, నింద్రియసమన్వితులకంటె నెక్కుడుగను నెల్లవిషయంబులను గ్రహియించుచుండు, దేవకీసుతుఁ డొక్కఁడె దిక్కు నాకు.
గీ. అమృతకరరూపమును దాల్చి యమృతమునను
ననిశమును బ్రదికించుచు ననిమిషులను
సర్వలోకోపకారంబు సలుపుచున్న
దేవకీసుతుఁ డొక్కఁడె దిక్కు నాకు. 1327
గీ. పద్మ కరపద్మములచేతఁ బాదపద్మ, ములను సంవాహనముసేయ జలధియందు శేషపర్యంకమును నధిష్ఠించియున్న, సరసిజేక్షణుఁ డొక్కఁడె శరణు నాకు.
గీ. పాపముల నన్నిటిని రూపుమాపునట్టి, సకలతీర్థంబులును బదాబ్జములసేవ సలుపుచుండంగఁ దీర్థరాజంబువోలెఁ, దేజరిలువాసుదేవుండె దిక్కు నాకు.

గీ. తన్ను ధ్యానించుచున్నమాత్రమున సకల, పాతకములను దహియించి పావనులను
జేసి ప్రాణులఁ దనదరిఁ జేర్చుకొనెడి, దేవకీసుతుఁ డొక్కఁడె దిక్కు నాకు.
క. ఆనంద మనంతము ప్ర, జ్ఞానము బ్రహ్మంబు పరము సత్యంబును నై
కానఁబడకుండ నుండియుఁ, గానంబడుచుండుహరియె గతి నా కింకన్. 1331
క. అనుసీపావనసంస్తవ, మును శఠునకు నాస్తికునకు మూర్ఖునకు నభ
క్తునకు నవిశ్వాసునకును, వినిపింపకు మనుచుఁ జెప్పి విరమించుటయున్. 1332
క. జనకునియాజ్ఞను గైకొని, చని యానందాటవికి వెసన్ విజ్వలుఁ డా
జనపతిరాకకు దెసలను, గనుఁగొనుచు వసించె నొక్కతన్వాజముమీఁదన్. 1333
గీ. అంతట విమాన మేతెంచె నాశుగతిని, గగనముననుండి కింకిణుల్ గల్లు మనుచు
మొరయుచుండంగ దీప్తులు ముసురుకొనఁగ, దిక్తటంబులఁ దరణిదీధితులువోలె.
క. అరుదెంచుటయు విమానము, ధరణికి దిగి దానినుండి ధాత్రీంద్రుఁడు ద
త్తరుణియుఁ గృశాంగములతో, సరోవరమునందుఁ జలిపి స్నానం బంతన్.
క. విధి తమనుదుటను వ్రాసిన, విధానమున కాత్మలందు విలపిల్లుచునున్
క్షుధ కాఁగ లేమి శవస, న్నిధికిం జని కోసి వాని నిస్త్రింశములన్. 1336
క. తినఁబోవుచున్నసమయం, బున విజ్వలుఁ డిట్టు లనియెఁ బుణ్యాత్ముల కీ
పని తగునె యెవరొ మీరలు, వినిపింపుఁడు యుష్మదీయవృత్తాంతంబున్.
క. అనవుడు నాభూపతి యి, ట్లనియెను శుకరాజ ప్రాక్కృతాఘఫలముగన్
దినుచుంటి మీశవంబుల, ననుదినమును నిప్పటికి శతాబ్దము లాయెన్. 1338
క. అని పలికి యశ్రుధారలు, గనుఁదమ్ములనుండి కాఱఁగను నేడ్చుచుఁ జె
ప్పెను జరిగినవృత్తాంతం, బును శుకమున కానుపూర్వ్యముగ నఖిలంబున్.
ఆ. ఆయుదంత మెల్ల నాలించి విజ్వలుఁ, డాత్మలోనఁ గరుణ యంకురింపఁ
దండ్రి చెప్పినట్టిస్తవమును బఠియించె, వీను లొగ్గి వారు వినుచు నుండ. 1340
ఉ. అంతట క్షుత్పిపాస లుడుగాఱఁగ వింతగ రాజదంపతుల్
సంతస మొందుచున్ హరిని స్వాంతములందు స్మరించుచుండ దై
త్యాంతకుఁ డేఁగుదెంచి సకలాశ్రితవర్గముతోడ నామహీ
కాంతున కాలతాంగికిని గట్టెదుట న్నిలిచెన్ స్వయంబుగన్. 1341
క. నిలుచుటయుఁ గోటిసూర్యుల, వెలుఁగులను నతిక్రమించి వెలిఁగెడివానిన్
దిలకించి లేచి భయభ, క్తులతో నారాజదంపతులు మ్రొక్కుటయున్. 1342
గీ. వారలకు నిట్టు లనియె దైత్యారి నేఁడు, నాస్తవంబును వినినదానను నశించెఁ
దొల్లి మీ రొనరించినదురిత మెల్ల, దాన నొనగూడె మీకు నాదర్శనంబు.

— : వా సు దే వ స్తో త్ర శ్ర వ ణ ప ఠ న ఫ ల క థ న ము : —

సీ. వేదపారగుఁ డయి విలసిల్లు విప్రుండు, జయమును గైకొను క్షత్రియుండు
వైశ్యుఁ డప్రతిహతైశ్వర్యయుక్తుఁ డగు, శూద్రుఁడు వడయును సుఖము లెల్లఁ

గ్రాహమృగంబులు దూరీకృతము లగు, స్తంభింపఁబడును దస్కరగణంబు
భస్మీకరింపఁగాఁ బడునట్టి వైరులు, సంహృతం బగును పిశాచబృంద
గీ. మంత్రరాయంబు లన్నియు నంతరించు, సర్వకామసమృద్ధులు సంఘటిల్లు
శ్రద్ధతోడను మామకసంస్తవంబు, వినిన వినిపించినను జదివినను గాని. 1344

క. రాజద్వారంబున స్తవ, రాజమును బఠించెనేని రాజు వశుండై
భోజనభాజనములు గజ, వాజిరథాదులు నొసంగి వాంఛలు దీర్చున్. 1345

సీ. శ్రాద్ధమున బ్రాహ్మణులు భుక్తి సలుపుచుండు
సమయమున 'స్తోత్రపఠనంబు సలిపెనేని
యమృతమును బోలె శ్రాద్ధాన్న మారగించి
తృప్తు లగుచును బితరు లొందెదరు నన్ను. 1346

సీ. పుత్రార్థి యగువాఁడు పుత్రవంతుం డగు, ద్రవ్యవంతుం డగు ద్రవ్యకాంక్షి
విద్యార్థి యగువాఁడు విద్యాచణుం డగుఁ, గీర్తిమంతుం డగుఁ గీర్తికాంక్షి
పుణ్యార్థి యగువాఁడు పుణ్యవంతుం డగు, భోగవంతుం డగు భోగకాంక్షి
స్వర్గార్థి యగువాఁడు స్వర్గంబు వడయును, మోక్షార్థి యగువాఁడు మోక్ష మొందు
గీ. నిదియు నదియు నటంచును నెన్న నేల, యిచ్ఛగించునో యెవఁ డెవఁ డేది యేది
యందుకొనుచుండు నది యది యతఁ డతండు, ప్రేమమున నాస్తవంబు జపించెనేని.

సీ. బ్రహ్మ మును లోకములు సృజింపంగ నెంచి
త్రోవ గానక నను గూర్చి స్తుతి యొనర్చి
దానిచే సృష్టి గావింప దక్షుఁ డయ్యె
శివుఁడు దానినె జపియించి సిద్ధుఁ డయ్యె. 1348

గీ. బ్రహ్మహత్యావిముక్తిని బడసె మున్ను, వృత్రసంహారకుండు నాస్తోత్రమున నె
దానినె జపించి దేవతామౌని సాధ్య, సిద్ధవిద్యాధరాదులు సిద్ధి గనిరి. 1349

క. అనుదినమును నాస్తోత్రం, బును నేకసంవత్సరంబు పూర్ణం బగుదాఁ
కను జపియించినధన్యున, కును నాకును భేద మొప్పికొన వాగమముల్. 1350

క. కావున మీకును నపవ, ర్గావహ మైనది స్తవంబె యగుఁ డెం డనుచున్
గోవిందుండు విమానము, పై వారల నుంచుకొని నభంబున కరిగెన్. 1351

ఉ. అంతట విజ్వలుండు సరయంబుగ వచ్చి వచించె సర్వవృ
త్తాంతముఁ దండ్రి కాతఁడు ప్రహర్షముఁ జెంది మనంబులోన నీ
వెంతటిపుణ్యమూర్తివో యుపేంద్రునిఁ గంటివి కన్నులార నా
ద్యంతవిహీనుఁ డైనపరమాత్ముఁడు వాఁడె సుమీ తనూభవా. 1352

క. అని పలికి పిదప నాల్గవ, తనయునిఁ గని వత్స నీవు దర్శించినచో
ట్లను నేయపూర్వ మైనను, వినఁదగిన ది యున్నఁ జెపుమ వినియెద ననుడున్.

వ. కపింజలుండు కుంజలునకుఁ బ్రణామంబు గావించి యి ట్లనియె. 1354

గీ. అరిగితిని నేఁడు కైలాసగిరికిఁ దండ్రి, దానిశిఖరంబుపై నద్భుతముగ నుండె
నొక్క-గంగాహ్రదము దశయోజనముల,విస్తృతియుదివ్యమైనతావియునుగలిగి.

గీ. తత్తటంబున నొకశిలాతలమునందుఁ
గుంతలంబులు దిగజారఁ గూరుచుండి
యెవ్వతెయొ యొక్క-మానిని యేడ్చుచుండె
రతియొ కాత్యాయనియొ సరస్వతియొ యామె. 1356

గీ. శోకసంతప్తయైన నానుదతిరూపు, చూచుచున్నకొలందియుఁ జూడవలయు
ననెడుకౌతూహలముగల్గునాత్మలోన,నేమి మాహాత్మ్యమున్నదో యామెయందు.

ఆ. అట్టు లేడ్చుచుండ నామెకన్నులనుండి, హ్రదమునందుఁ బడెడియశ్రుబిందు
తతులవలన నెన్నొ తామరసంబులు, గలుగుచుండెఁ గంటిఁ గన్నులార.

వ. ఆపద్మంబులు తత్ప్రవాహంబులోనం బడి దాని కనతిదూరంబునం దుండురత్న
గిరిపై యోజనద్వయవిస్తారంబున విలసిల్లుచుండునొక్క-హ్రదంబునం బడుచుండు
టయు నాపద్మంబుల నన్నింటిని సేకరించి వానిచే నిరాహారుండును ద్వగస్థి
మాత్రావశిష్టుండును భస్మోద్ధూళితావయవుండును జటిలుండును నగునొక్క-
ముని రత్నాద్రియం దుండురత్నేశ్వరునిఁ బూజించుచు నేడ్చుచు నుండె. 1359

గీ. ఆసతీమణి యెవతెయొ యతఁ డెవండొ, వార ల ట్లుండుటకు నేమి కారణంబొ
తెలుపుము సమస్తమును గూడఁ దెలిసినట్టి,ప్రాజ్ఞుఁడవు నీవు విన వేడ్క-పడెడినాకు.

గీ. అనుటయును గుంజలు డిట్టు లనియె వత్స
హుండుఁ డనియెడునొక్క-దైత్యుని వధించె
మున్ను త్రిదశులసాహాయ్యమునను జేసి
నహుషుఁ డనుతేఁడు త్రిభువనానందముగను. 1361

—: విహుండుని చరిత్రము :—

గీ. తండ్రిని వధించినట్టిక్రోధమునఁ జేసి, తత్సుతుండు విహుండుఁ డత్యంతఘోర
తపము నొనరించి నానావిధంబులైన,వరములను జెంది యమితగర్వమును బొంది.

క. బాధింపఁదొడఁగె సురలను, బాధింపఁదొడంగె ధర్మపరిపాలకులన్
బాధింపఁదొడఁగె మునులను, బాధింపఁదొడంగెఁ దుదకుఁ బ్రజలను నెల్లన్.

ఆ. అతనిదుండగంబు లంతంతకును హెచ్చఁ, జాలకున్కి దేవసంఘ మెల్లఁ
గూడి పోయి చెప్పె గోవిందునకు వాఁడు,చేయుచున్నదుష్టచేష్ట లెల్ల. 1364

క. విని వారినుడులు కృష్ణుఁడు, చనుఁ డింకను మీరు నేను శాసించెద నా
దనుజాధముఁ డింతటిపను, లొనరించునె జీవితేచ్ఛ యుండినయెడలన్. 1365

క. అని పలికి యాదితేయులఁ, బనిచి దివంబునకు వానిఁ బరిమార్పంగన్
గనుఁగొని యుపాయమును నే, ర్పునఁ దాలిచి మోహినీస్వరూపము నంతన్.

గీ. నందనారామమున కేఁగి యందుఁ దపము
సలుపుచున్నట్టు లోకశ్లాఘలకు నందుఁ
గూడుచుండంగ నాదైత్యకుంజరుండు
దివమునకుఁ బోవుచును నేఁగుదెంచి యచటకు. 1367

గీ. ఆమెరూపంబు గాంచి యత్యద్భుతమును
బొంది మదిలోనఁ దత్పూర్వమునకుఁ జేరి
కలికి నీ వెవ్వతెవో నిన్నుఁ గాంచినంత
నా కధీనంబు గాకుండె నామనంబు. 1368

క. హుండునికొమరుఁడ నేను వి, హుండుండను త్రిభువనముల నోడించిన శూ
రుండను రాక్షసమూర్థ, న్యుండను నాకేలు వట్టు ముత్పలనేత్రా. 1369

గీ. నీవు కోరిన దెల్లను నేన తీర్తు, నింకఁ దప మేల చేసెద విందువదన
యనుడుఁ గనులెత్తి విష్ణుమాయావధూటి, చూచి వానిని గౌరవసూచకముగ.

గీ. ఈవు ననుఁ గోరితేని దైత్యేంద్ర సప్త, కోటిసంఖ్యాక కామోదకుసుమములను
శూలి నర్చించి తత్పుష్పమాలఁ దెచ్చి, పొనరుపుము కంఠభూషణంబుగను నాకు.

క. అనుటయు విహుండుఁ డట్టులె, యొనరించెద నింతి యిటనె యుండు మటంచున్
జని తిరిగి దేశ మంతయుఁ, గని కని కామోదతరువు గానక తుదకున్. 1372

గీ. అరిగి శుక్రునికడకు మహానుభావ, కలదె కామోదవృక్ష మెక్కడను నైనఁ
జెప్పు మనుటయు శుక్రుఁడు శిష్యునందుఁ, గలుగువాత్సల్యమున నిట్లు పలికె నపుడు.

గీ. అసురవల్లభ యేదేశమందుఁ గూడ, లేదు కామోద మనియెడిపాదపంబు
కాని కామోద యనియెడిఖ్యాతి గనిన, కంబుకంఠి యొకర్తుక గలదు చూవె.

వ. ఆయమకు గంగాద్వారంబునందు విశ్వకర్మనిర్మితంబై కామోదం బనుప్రసిద్ధిం
బడసియుండినయొక్కపురంబు నివాసస్థానంబుగా నయ్యె. 1375

గీ. ఆమెకడ కేఁగి నవ్వించినట్టు లైన, నాప్రహాసంబునుండి యత్యద్భుతముగ
జల్లునను రాలుఁ బువ్వులు జల్లువోలె, వానికిని గల్గుఁ గామోదసూనసంజ్ఞ.

క. ఆకామోదసుమంబులు, శ్రీకంఠున కెంతయేని ప్రియములు వానిం
గైకొని శివు నర్చించినఁ, జేకూరు సమస్తకార్యసిద్ధులు వత్సా. 1377

క. అనుటయు నాపుష్పంబులె, వనజాయతనేత్ర తనకు వచియించిన వం
చును హర్షించుచును దదా, జ్ఞను గైకొని యచటి కతఁడు చనుచుండంగన్.

ఆ. త్రోవలోన నారదుండు గోవిందుని, ప్రేరణమున వాని కెదురు వచ్చి
యెచటి కేఁగుచుంటి వీ వని యడుగంగ, నతఁడు చెప్పె నున్నయంశ మెల్ల.

ఉ. అంతట నారదుండు దనుజాధిప యెవ్వఁడు చెప్పె నీకు దై
త్యాంతకుఁ డుండు నెప్పుడును నచ్చట నాతఁడు నిన్నుఁ జూచినన్

జింతితకార్యసిద్ధికిని జేటు ఘటిల్లునె గాక పైని న
త్యంతవిషాదహేతు వగునట్టియుపాయము గూడఁ గల్గెడిన్. 1380

క. కావున నీ వాదరికిన్, బోవల దామోహనాంగిపొందు దృఢముగాఁ
గావలయు నన్నుకోరికి, భావములో నున్న నేల బహుభాషణముల్. 1381

క. అనుటయు విహుండుఁ డాతనిఁ, గనుగొని యి ట్లనియె నట్లు కావింపని చో
మునినాథ యేయుపాయం, బున నా కాదివ్యపుష్పములు లభియించున్. 1382

గీ. అనుటయును నారదుం డిట్టులనియెఁ గొలఁది, కాల మిచ్చోట నున్న గంగాప్రవాహ
సలిలమునఁ బడి యాపుష్పసముదయంబె, వచ్చు నిచ్చోటి కవి కొనవచ్చు నీవు.

చ. అనుటయు దానవుండు సదుపాయము చెప్పె మహర్షి కార్యసా
ధనముగ నంచు నెంచి ప్రమదంబును జెందుచుఁ జూపినట్టిచో
టనె నివసించె నంతటఁ దటాలున నారదుఁ డేఁగెఁ బోయివ
త్తును దనుజేంద్ర సెందకుము తొందరపా టని చెప్పి వానితోన్. 1384

—: మత్స్యకూర్మవరాహావతారహేతుకథనము :—

గీ. అరిగి కామోదపురమున కచట నుండి, నట్టికామోదకడ కేఁగి యామెవలన
నర్ఘ్యపాద్యాదిసత్కార మంది యడిగె, సౌఖ్యమున నున్న దాన వె సాధ్వి యనుచు.

గీ. అడుగుటయు నామె వాని కి ట్లనియె స్వామి
యేమి మాయయొ కాని నా కీదినంబు
నిద్ర యుదయించె స్వప్నంబు నిద్రలోనఁ
గలిగె దారుణముగ నుషఃకాలమందు. 1386

క. అది యే మన నెవ్వఁడో నా, సదనమునకు వచ్చి హీనజన్మంబులలో
గుదివడును శౌరి యని యను, పదము చనియె దాని కేమి ఫలము మునీంద్రా.

గీ. అనుటయును నారదుం డిట్టు లనియె నపుడు, కమలలోచన విను ముషఃకాలమందు
మంచిస్వప్నంబు గలిగిన మంచి గలుగుఁ, జెడ్డస్వప్నంబు గలిగినఁ జెడ్డ గలుగు.

గీ. తెలిపినను దుఃఖపడెదవు కలికి నీవు, పరమపురుషుఁడు జన్మసంబంధమందుఁ
దగులువడియెడియోగంబు దాపరించె, నాకతన నట్టిస్వప్నంబు నీకుఁ గలిగె.

చ. అనుటయు విస్మయం బొదవ నాయమ యి ట్లనియెన్ మహాత్మ యె
వ్వనికిని గోచరింపనిప్రవర్తన గల్గినవాని కాత్మమా
యను సకలప్రపంచముల నట్టిటు లూఁపెడువాని కేల క
ల్గెనో జననంబులం దగులుక్లేశము నాకు వచింపు మియ్యెడన్. 1390

వ. అని యడుగుటయు నారదుం డాయమను జూచి. 1391

సీ. భృగు వనునొకమహాఋషి వచ్చి చనుదెమ్ము, యజ్ఞరక్షణమున కనుచుఁ గోర
నరుదెంతు నని చెప్పె హరియాతఁ డది నమ్మి, చని యధ్వరంబును జలుపఁ దొడఁగె

నంతఁగో నమరాలయము దానవులు ముట్టి, రనువార్త విని కృష్ణుం డటకుఁ జనియె
ననిచియె సం దని వచ్చి యసురులు చెఱఁగొట్టి, రవ్వాని చేసెడియధ్వరంబు

గీ. దానిచే నాగ్రహము గల్గి తాపసుండు, జలజలోచనునకు ఘోరశాప మొసఁగె
హేయ మగుమూఁడుజన్మంబు లెత్తునట్లు, గడన లేకెంతవాడును గర్మ మతివ.

క. అని చెప్పి బ్రహ్మలోకం, బున కాకలహాశనుండు పోవుటయును నా
వనజాక్షి యేడ్వఁదొడఁగెను, గనులను బాష్పములు రాల గంగాంబువునన్.

గీ. అంత నాశోకబాష్పము లబ్జములుగ, నగుచు నదఁదేరఁగను బ్రవాహంబునుండి
వాని నతిహర్షమునఁ గొని దానవుండు, చెలువకొఱకయి శివపూజ చేయఁదొడఁగె

గీ. ఆవిహంగుఁడె నీవు కన్నట్టివాని, హ్రదతటంబున నేడ్చుచున్నట్టిపద్మ
వదన కామోద యనియెడుసుదతి వత్స, సంశయం బున్న నడుగు మేయంశమేని.

క. అనుటయుఁ గపింజలుం డి, ట్లనియెను గామోద యనెడునామెచరిత మె
ల్లను దండ్రి సవిస్తరముగ, వినిపింపుము నాకు వినఁగ వేడుక గలిగెన్. 1396

వ. అని యడ్గించుటయుఁ గపింజలునకుఁ గుంజలుం డి ట్లనియె. 1397

—: కామోదాఖ్యానకథనము :—

గీ. వినుము దేవాసురులు మున్ను వనధిఁ ద్రచ్చు
నపుడు కన్యాచతుష్టయ మందుఁ బుట్టె
నొకతె వారుణి మఱియు నొకతె లక్ష్మి
యొకతె కామోద మఱి వేఱయొకతె శ్రేష్ఠ. 1398

గీ. అందులోపలఁ గామోద యచ్యుతునకుఁ, బరమసంతోషమును గొల్పుపద్మగంధి
యామె నవ్వినఁ గురియు నత్యద్భుతముగఁ, దావి వెదచల్లుపూలు వక్త్రంబునుండి.

గీ. అదియునుం గాక యెప్పుడైన నాలతాంగి, యేకతంబున నేనియు నేడ్చె నేని
కురియు నద్భుతముగ వాన గురిసినట్లు,పరిమళము లేనిపూలు బాష్పములనుండి.

గీ. నవ్వినపు డేర్పడినప్రసూనములచేత, శివునిఁ బూజింప సర్వార్థసిద్ధి గలుగు
నేడ్చినపు డేర్పడినపూల నిందుధరునిఁ, బూజసేయ సర్వానర్థములును గలుగు.

క. తులసీవృక్షంబుగఁ గాఁ, గల దాకామోద భావికాలంబునఁ ద
ద్దళ మొకఁ డిచ్చిన నే మీఁ, గలను ఫలం బనుచుఁ గుంయుఁ గమలాక్షుఁ డెదన్.

క. కామోదాఖ్యానం బిది, యేమఁడుగఁ దలంచికొంటి వింకను ననఁగా
నామోదమునఁ గపింజలుఁ, డామీఁదటికథను జెప్పు మని యడుగుటయున్.

గీ. అపుడు కుంజలుఁ డతని కి ట్లనియె వత్స, శూలిని విహుండుఁ డారీతి శోకపుష్ప
ములను బూజించుచును దానఁ గలిగినట్టి, పాపమున నేడ్చుచుండెను బ్రతిదినంబు.

గీ. అంతటను గొన్ని నాళుల కతనిపాప, మంతయును బండ వాఁడు శోకాంబుజములఁ
బ్రాణపతికి నొనర్చునర్చనకు మిగుల,నాగ్రహము నొంది యీశ్వరి యాత్మలోన.

గీ. బ్రాహ్మణాకృతి దాల్చి రాత్రిచరుని, చెంత కరుదెంచి పాపాత్మ చేయ నగునె
శోకపంకేరుహములను శూలిపూజ, చేసితివె నీవు శుక్రుఁడు చెప్పినట్లు. 1406
క. అనుటయు విహుండుదీర్ఘ ాగ్రహ, మును జెంది యెవండ వీవు భూసుర వేషం
బున వచ్చినచండాలుఁడ, వనఁగూడనిమాట లాడ నగునే నన్నున్. 1407
క. పాపాత్ముండనె నేను మ, హాపాపివి నీవు నాకు నధికారివె నా
లోపముల నెంచ నవలకుఁ, బో పో బలి యగుదు విచటఁ బో కుంఠితనా.
చ. అనుటయు బ్రాహ్మణుండు దనుజాధను చేసినతప్పు చెప్పినన్
గనలెద వేల నీకుఁ దుదికాలము దాపురమయ్యె దానిచేఁ
గనులను గప్పెఁ జీఁకటులు గర్మఫలంబును గాంచు మంచు హు
మ్మనఁగను దద్రవం బశనియట్లు విహుంఁడునిఁ దాఁకి కూలిచెన్. 1409
గీ. అంతటను దేవదుందుభు లాకసమున
మ్రోఁగె సకలప్రపంచవిద్రోహి యైన
యసురుఁడు నశించె ననువార్త యన్ని దెసల
ముసురుకొనఁగను దప్పెటల్ మ్రోఁగినట్లు. 1410
వ. అనుటయుఁ గపింజలుండు తండ్రి నహుషుండు హుండుని వధించినవిధంబు విన వేడ్క యయ్యె. వినిపింపు మని యడుగుటయుఁ గుంజలుం డతని కిట్లనియె.

— : న హు షో పా ఖ్యా న ము : —

క. ఒకనాఁడు మున్ను శంకరు, నకు మ్రొక్కి భవాని ప్రాణనాథా యేదే
నొకదివ్యవనము గనఁ గా, తుక మొదవెను దీర్పు మిాప్రతోషము నాకున్.
క. అనుటయును శంకరుం డా, మెను దోడ్కొని యెక్కి వృషభముమిాఁదను స్వర్గం
బున కేఁగి నందనవనం, బును జూపెను నేత్రపర్వముగ నాయమకున్. 1413
సీ. వినుచును వీనులవిందుగాఁ గంఠంబు, లెత్తి క్రోలిచెడికోయిలలపాట
కనులపండువుగను గాంచుచు ఫలపుష్ప, భరితంబు లగుదివ్యపాదపముల
ననుభవించుచు దేహమునకు సుఖంబుగా, మలయసమిారసంస్పర్శములను
ఘ్రాణతృప్తిగను నాఘ్రాణించుచును నలు, ప్రక్కల వ్యాపించుపరిమళముల
గీ. నచ్చరలు కిన్నరులును విద్యాధరులును, సురలు బ్రహ్మాదులును నుండుచోటు లెల్ల
హర్ష మొనగూర్చుచుండ నాహరునితోడ, నందనంబున విహరించె నగతనూజ.
గీ. అట్టికాలంబునను నామెకద్భుతముగఁ, దేజరిల్లుచు సౌవర్ణదీప్తితోడ
దర్శనీయంబుగా నుంపుతరు వొకండు, గనఁబడియె నొక్కచోట నవ్వనమునందు.
క. కనఁబడుటయుఁ గౌతుకమునఁ, గనుగొని యాపాదపమును గాత్యాయని య
ట్లని యడిగెఁ జెంత నుండిన, తనభర్తను నాథ యేమి తరు విది చెపుమా.
గీ. అనుటయును నీశ్వరుం డిట్టు లనియెఁ దన్వి, యేమి చెప్పుదు నిది కల్పవృక్ష మనెడి
పేరు గాంచినదేవతాభూరుహంబు, దీనిమహిమ మపారము దెలియరాదు,

సీ. నదులలోపలను జాహ్నవివోలె నాస్థలి, కరులలోపల సుధాకరుఁడువోలె
వారణంబులలోన నైరావతమువోలె, సృష్టికర్తలలోన స్రష్టవోలె
నాదితేయులలోన నంబుజాక్షుఁడువోలె, విద్యలలో నాత్మవిద్యవోలె
నరులలోపలను భూవరుఁడువోలె జలాశ, యంబులలో సముద్రంబువోలె
గీ. శైలములలోనఁ దుహినాద్రివోలె భూత, చయములో ధాత్రివోలె నోషధులలోన
నోదనౌషధివోలె నీపాదపంబు, దానశౌండులలోనఁ బ్రధాన మబల. 1417
గీ. అనుటయును నాథ యొకకోర్కి యాత్మలోనఁ, గలిగె నీకల్పతరువును గాంచినంత
ననుమతింపుము నాయాశయంబు దీరఁ, గోరుకొనియెద నని దేవి కోరుటయును.
ఆ. కోరుకొనుము తన్వి కోర్కి దీర్చెడిదాత, దొరకినపుడు గాక దోహదంబు
సఫల మగునె యన్యసమయంబునం దని, పలికె శర్వుఁ డమృత మొలుకునట్లు.
గీ. అంతట భవాని యతిలోక మైనరూపు, గలయొకానొకకన్య కావలయు ననుచుఁ
దలఁచికొనుటయు నాకల్పతరువునుండి, కలిగె నొకదివ్యకన్య తత్క్షణమునంద.
గీ. కలిగి యాకన్య శాంభవికడకు వచ్చి, మ్రొక్కి నిలువంగఁబడుటయు ముద్దు లొలుకఁ
గౌఁగిటను జేర్చి యాకన్యకను భవాని, యనుభవించి సుతాశ్లేషజనితసుఖము.
క. తనయారత్నమ నినుఁ జే, క్కొని గంటి నశోకసుందరీనామంబున్
గొని వర్ధిల్లుము శశికుల, జనితుం డగునహుషభూమిజానికి సతివై. 1422
క. అని యాశీర్వాదంబుం, బొనరిచి పతితోడఁ గూడి పోయెను గాత్యా
యని రజతగిరికి మెచ్చుచు, మనమునఁ దత్కల్పవృక్షమాహాత్మ్యంబున్. 1423

—: అశోకసుందరిని హుండాసురుఁడు మోహించుట :—

ఉ. అంత నశోకసుందరి ప్రహర్షముతోడను గూడి నందనా
భ్యంతరమందు నెచ్చెలుల నాడుచుఁ బాడుచు నుండ నామె న
త్యంతకుతూహలంబునను నభ్రపథంబుననుండి చూచి వి
భ్రాంతమనస్కుఁడై యటకు రాక్షసుఁ డొక్కఁడు వచ్చె గ్రక్కునన్. 1424
గీ. కలికి నీవంటికాంత నెక్కడను గూడఁ, గాన నైతిని మూఁడులోకములలోన
నెవరిదానవో నీవు నా కెఱుఁగఁజెపుము, హుండుఁ డనుదానవాధీశ్వరుండ నేను.
క. అనుటయు నాయమ వానిం, గనుఁగొని యిట్లనియె నేను గాత్యాయనికిన్
దనయను నీకల్పద్రుమ, నను సాఁకెడితల్లి యేల నాకథ నీకున్. 1426
చ. అనుటయు హుండుఁ డిట్లనియె నంబుజలోచన విప్రచిత్తినం
దనుఁడను నేను హుండుఁ డనునామముఁ గైకొని యింతవాఁడు లేఁ
డనియెడుఖ్యాతి నొందినమహాబలుఁడన్ ననుఁ జెట్టవట్టి నీ
వనుపమరాగభాగ్యముల నందుము పొందుము సర్వసౌఖ్యముల్. 1427

క. అనుటయు నశోకసుందరి, దనుజాధిప నాఁడె నాకు ధవుఁ డగు నహుషుం
డని చెప్పి చనియెఁ గాత్యాయని కా వాతల్లినుడువు లనృతము లెపుడున్.
క. కావున నహుషుం డనియెడి, భూవరుఁడె ధవుండు నాకుఁ బొ మ్మనుటయుఁ ద
ద్భావం బెఱింగియును గా, మావిష్టుం డగుచు నామె కతఁ డి ట్లనియెన్.
క. పుట్టఁగఁబోయెడినహుషునిఁ, గట్టుకొనఁగవలయు ననుచుఁ గాత్యాయని యాఁ
కట్టుటయును సుందరి నీ, వట్టులె యుండుటయు నెంతహాస్యమొ కంటే. 1430
క. కాంతలు తారుణ్యమున రు, చింతురు పురుషులకు నది నశించిన పిదపం
గాంతురె పురుషులు పొలఁతుల, నెంతటిసాహసము చేయ నెంచితి వబలా.
క. ఎప్పుడు పుట్టునొ నహుషుం, డప్పటివఱకును నమూల్య మగుజవ్వన మే
చొప్పున నిలుచునొ నీవే, చెప్పుము విత చేసికొనక సిద్ధాన్నంబున్. 1432
క. వనితలు పురుషులకంటెను, గనిష్ఠలై యుంట చెల్లుఁ గాని లతాంగీ
వనితలకంటెను బురుషులు, గనిష్ఠులై యుంట నీవు కంటివె చెపుమా. 1433
క. అనుటయు నశోకసుందరి, దనుజున కి ట్లనియె సూక్ష్మధర్మములు సనా
తనము లవి పెక్కువిధములు, గను నుండు నెఱుంగఁ దరము గా దండఱకున్.
వ. కృతయుగంబునందు జన్మించినరేవతి భవిష్యదష్టావింశద్వాపరయుగంబునం దవతరించినబలరామునకు భార్య యయ్యె. యుగత్రయప్రమాణంబుచే నాయమ బలరామునికంటె జ్యేష్ఠగా నుండె. పూర్వము దుదయించినమాయావతి యను గంధర్వకన్యను భవిష్యదష్టావింశద్వాపరయుగంబునందు గోవిందునకు జన్మించి శంబరాసురుని సంహరించి ప్రద్యుమ్నుండు భార్యగాఁ బరిగ్రహించె. జ్యేష్ఠకనిష్ఠ భావంబులు సామాన్యధర్మంబులుగాని విశేషధర్మంబులు గావు. 1435
క. నే నింక నహుషపత్నినె, కాని మ ఱొక్కనికిఁ జెందఁగలిగినదానం
గా ననుకొని విభ్రాంతిని, మాని చనుము లేనియెడఁ బ్రమాదము గలుగున్.
చ. అనుటయు హుండుఁ డామె నెటు లైనను జేకొన నెంచి యాత్మలోఁ
జని యటనుండి యప్పటికిఁ జయ్యన నాపయి నాత్మమాయచే
తను వనితాకృతిం బడసి తత్సవిధంబున కేఁగుదెంచి యా
ననమునఁ జింత దోఁపఁగఁ గనంబడుచున్ నిలుచుండె నంతటన్. 1437
క. కనుఁగొని యశోకసుందరి, కనికర మొదవంగఁ దన్ముఖంబును జంద్రా
నన యేల చింత నొందెద, వనుటయు నాకపటకాంత యతిదుఃఖమునన్.
గీ. అమ్మ నాదురవస్థ యే మని వచింతు, హుండుఁ డనునొక్కదుష్టదైత్యుండు నన్నుఁ
బడయఁగా నెంచి చంపె నాప్రాణవిభుని, నది మొదలుగను నన్నంబు వదలి నేను.
ఆ. తపము చేయుచున్నదాన నాదైత్యుని, నాశనంబుకొఱకు నళినగంధి
యుల్లమందు శ్రద్ధ యున్న నాయాశ్రమ, మునకు రమ్ము నియమములను జూడ.

ఆ. సాధ్వి నైనయట్టి జలజలోచన లొకఁ, డప్ప విట్టిముష్టి లెప్పటికిని
గాన నాత్మరక్ష గావించుకొనుటకై, నపకెం సాధనంబు దలిపుఁబోఁడి. 1441

క. అని పలుకుటయును గాకే, తనయ తపోనియమములవిధానమును గనుం
గొన నాశ గలిగి మాయా, వనితామణిపెంటఁ జనియె వాస్తవబుద్ధిన్. 1442

వ. అంతట నమ్మాయావధూటి యశోకసుందరిం దోడ్కొని చని మేరుశిఖరంబునం దుండు కాంచనపురంబునకుం జేరి మాణిక్యకుడ్యభాసమానంబును గనకప్రాసాదవిరాజమానంబును నానావిధరత్నఖచితహేమప్రాకారమండితంబును మనోజ్ఞంబును నగునిజమందిరంబునం బ్రవేశించి స్వస్వరూపంబు దాల్చి నిలువంబడి.

గీ. ఇంతి యిది నాగృహంబు వ న్నేలుకొనిన, ననుభవించెద వెల్లసౌఖ్యముల నిచట
సమ్మతింపుము వీరె యచ్చరలు వీరె, కిన్నరులు నిన్ను సేవింప నున్నవారు.

—: అశోకసుందరి హుండుని శపించుట :—

క. అనుటయు నశోకసుందరి, కనులను నిప్పుకలు రాలఁ గన్గొని వానిన్
దనుజాధమ యెంతటిపని, యొనరించితి బ్రదుక నాశ యున్నదె నీకున్. 1445

క. ననుఁ దెచ్చుట యిచ్చోటికి, ననలశిఖను దెచ్చికొనుటె యనుకొను మిది ని
న్నును నీజనమును నీకుల, మును సర్వము గూడ భస్మముగ నొనరించున్.

క. నను ధర్షింపఁ దలంచుట, దనుజాధమ తీక్ష్ణఖడ్గధారను ఘట్టిం
పను నంగుళ్యగ్రముచే, తను దొరఁకొనుటయ నిజంబు దాఁపఁగ నేలా. 1447

గీ. ప్రతిఘమున నుండు కృష్ణసర్పంబు మీఁది, రత్నము గ్రహించుటకును గర్జనము సేయు
కేసరిముఖంబునం దుండు మీసములను, లాగుటకును దొరంకొంటి బాగుపడెదె.

క. దనుజాధమ నీ వొనరిం, చినపాపంబునకుఁ దగినశిక్షను గావిం
పను నహుషుఁడు శీఘ్రంబుగ, జనియించును గాక యనుచు శాపం బిచ్చెన్.

గీ. అట్లు శపియించి క్రోధంబు నాఁపలేక
ఖండపరశుతనూభవ మండిపడుచు
దహనశిఖవోలె జాహ్నవీతటమునందుఁ
దపము సలుపంగఁ దొడఁగెఁ దద్వ్యధముకొఱకు. 1450

వ. అంతట హుండాసురుండు చింతాక్రాంతహృదయుండై తనమంత్రి యగుకంపనునకు జరిగినవృత్తాంతం బంతయు నెఱింగించుటయుఁ గంపనుండు దేవా యీయల్పకార్యంబున కింత చింతింప నేల. నహుషుండు జన్మించినతోడనె యసురమాయాశక్తిచే నతని నపహరించి వధించితివేని యాసుందరి నిరాశయై లోకైకవీరుండ వగునిన్నుఁ దనయంతఁ దాన శరణుచొచ్చు నని చెప్పె. 1451

క. అప్పుడు హుండుఁడు ధైర్యం, బుప్పతిలఁగ నహుషుఁ డుదయమొందెడికాలం
బెప్పుడు వచ్చునొ యాతని, నెప్పుడు చంపుదునొ యంచు నెంచుచు నుండెన్.

సీ. అది యట్టు లుండఁగా నైలపుప్రాంత మందు, నామము సభ్రాంత వైష్ణవత్రికతన
నంతంతకును జింత యతిశయిల్లుచునుండ, నోపఁగాఁ బాలకుఁ డొక్కనాఁడు
కాంతాసమేతంబుగా నేఁగి మహనీయుఁ, డైనదత్తాత్రేయమౌనికడకు
బహుభక్తితోడఁ దత్పరిచర్య సేయుచు, నచట నుండెను శతహాయనంబు
గీ. లట్టు లుండంగ నొక్కనాఁ డమ్మహర్షి, తద్వినిశ్చలభక్తి కెంతయును మెచ్చి
యతని కొకఫల మిచ్చి నీయతివ కిమ్ము, దీని నని చెప్పుచునె తిరోధాన మొందె.
గీ. ఆయు వాఫలమును దనయతివ యైన, యిందుమతి కీయ నామె యానంద మొదవ
దాని భుజియించి గర్భంబు దాల్చె సిద్ధ,పూరుషులసేవ యూరక పోదు సూవె.
గీ. అంత స్వర్భానుతనయ శతాబ్దములును,గర్భమువహించి యొకరాత్రికాలమందుఁ
గనియె నొకనాఁడు రవికోటికాంతితోడ,దిశలు వెలుఁగొందఁ జేసెడిశిశువు నొకని.
ఆ. అది గ్రహించి హుండుఁ డాసమయంబున, నొక్కదాసి మేన నొదిఁగి పోయి
సూతిసదనమునకుఁ జూచి యట్టట్టులు, బాలకుని స్పృశింప భయము నొంది.
గీ. అంతమున కెట్లొకొంత ధైర్యము వహించి,యెత్తికొని వానిఁ దనయింటి కేఁగి వేగ
భార్యచేతి కొసంగి యీపరమవైరి, పొలసు నేఁడు భుజింపఁగా వలయు ననియె.
క. అనుటయు నాయమ మేకల, యనియెడిసైరంధ్రి కిచ్చి యాబాలుని సూ
దునికడకుఁ బంప సూదుఁడు, కనుఁగొని బాలకునిఁ జంప ఖడ్గం బెత్తెన్. 1458
గీ. ఎత్తుటయు ఖడ్గమును గనులెత్తి చూచి, నరవరసుతుండు పకపక నవ్వఁదొడఁగె
నపుడు వధియించుటకుఁ జేతు లాడకునికి,ఖడ్గమును డించి సూదుఁ డక్కడనె నిలిచి.
క. అడవులను బట్టి చనినను, నడిసంద్రములందు మునిఁగినను ననలములోఁ
బడినను వధశిలను నిలం, బడినను జెడిపోవ రొరుల మనిచినవారల్. 1460
క. ఈ పాపఁ డెపుడొ పరులను, గాపాడినయట్టిపుణ్యకర్మమె వీనిం
గాపాడె నేఁడు దైవము, కాపాడెడివాఁడు వశుఁడె కదలింపంగన్. 1461
క. ఎప్పటి కెది కానున్నదొ, యప్పటి కది కాక తప్ప దజునకు నైనం
దప్పింప రాదు కావున, నిష్పాపునిఁ జంప నేల యెఱిఁగి యెఱిఁగియున్.
క. అని చింతించి మనంబునఁ, దనయాశయ మెల్లఁ దెలుప దాసికి నమ్మా
నిని సమ్మతించి బాలునిఁ, గొనిపోయి వసిష్ఠపర్ణకుటికడ నునిచెన్. 1463
ఆ. ఉంచి శీఘ్రముగను నొరు లెఱుంగకయుండ,నానిశీథసమయమంద వచ్చె
నంతలోన సూదుఁ డట నొక్కమృగమును, జంపి తత్పలంబు సంస్కరించె.
క. అంతట హుండుఁడు డాపల, మంతయు భుజియించి గట్టుమని త్రేఁచుచు నా
కంతము లే దిఁక ననుకొని, సంతోషముతోడఁ దిరుగసాగెను జగతిన్. 1465
వ. మఱునాఁడు ప్రాతఃకాలంబునందు వసిష్ఠుండు పర్ణకుటీరంబునుండి బహిర్గతుండై
తత్సమీపంబునందు కోటిసూర్యప్రభాభాసమానం బగు దేహకాంతితోడ వెలుఁ

గుచు నేలం బడియున్న బాలకునిం గాంచి తత్సన్యులకింకరులకు కచ్చెరువొంది తద్వృత్తాంతం బంతయు జ్ఞానదృష్టిచే విలోకించి సంతోషించుచు స్వహస్తం బులచే లేవనెత్తికొని యాకసంబునుండి పుష్పవర్షంబు గురియుచుండ స్వాశ్ర మంబులోనం బ్రవేశించి ఋషిగణంబుతోడం గూడి యక్కుమారునకు జాత కర్మంబును బాలభావంబులకు లోఁబడని కారణంబునం జేసి నహుషుం డనునామ కరణంబును నొనర్చె. అది యట్లుండ నింద్రప్రస్థపురంబునందు నాయువును నిందుమతియును బుత్రవియోగదుఃఖభారంబు సైఁపంజాలక హాహాకారంబులు గావించుచు.

సీ. అపహరించితిమేమొ యెపు డైన రత్నముల్, పుత్రరత్నమును గోల్పోతి మిపుడు
శిశువిరోధంబు చేసితిమేమొ యెపు డైన, శిశువియోగము తటస్థించె నిపుడు
పరిభవించితిమేమొ పాంథుల నెపు డైన, నడఁగనిదుఃఖ మేర్పడియె నిప్పు
డెపు డైనఁ జెఱచితిమేమొ నమ్మినవారిఁ, బ్రాప్త మైనఫలంబు వాసె నిప్పు
గీ. డనుచు శోకించుచుండ నయ్యవసరమున, నారదుం డేఁగుదెంచి యవ్వారికడకు
భద్రముగ నున్నవాఁడు మీపట్టి యుండఁ,దగినచోటనె మీ రింక వగవవలదు.
క. గడిదేఱి సర్వవిద్యల, నడఁగాఱిచి దానవులను నమరులవరముల్
వడసి చనుదెంచుఁ జుమి మీ, కొడుకు శివాత్మజను గూడుకొని మీకడకున్.
క. అని చెప్పి తిరోధానం, బును జెందుటయును విషాదమును విడిచి సుఖం
బున నుండి రాయువును ద, ద్వనితారత్నమును నిజనివాసమునందున్. 1469
వ. అది యట్లుండ వసిష్ఠుండు దినక్రమంబున నహుషున కుపనయనసంస్కారంబు
గావించి యథావిధిగ వేదవేదాంగంబులు నేర్పి ధనుర్వేదరహస్యంబు లెల్ల నుప
దేశించి రాజధర్మములను బోధించి నానావిధశస్త్రాస్త్రంబుల ననుగ్రహించి సర్వ
శక్తులను నేర్పడినపిదప నొక్కనాఁడు. 1470
క. వనమునకు నేఁగి వన్యము, లను గైకొని వత్స రావలయు నని చెప్పన్
బనివిని నహుషుఁడు చయ్యనఁ, జని యొకగహనమున నున్నసమయమునందున్.
క. అరుగుచు వ్యోమపథంబున, నిరువురు చారణులు నహుషుఁ డీతఁడె హుండా
సురుని వధింపఁగవలసిన, ధరణీశ్వరుఁ డనుచు సమ్మదంబునఁ గనుచున్. 1472
గీ. ఎప్పటికి చూపఁబునో హుండుఁడితని చేత, నెప్పటికిఁజూచెదరొ యాయువిందుమతియు
నితనిఁ గనులారఁ బార్వతీసుతతపంబు, ఫలము గను టెప్పటికొ యని పలికి రంత.
క. అది యాలకించి నహుషుం, డెదలోపల నెవరికథయొ యిది యనుకొనుచున్
బదపడి వన్యములను గొని, యదనున కరుదెంచి మరల నాశ్రమమునకున్.
గీ. మ్రొక్కి గురువరునకుఁ గందమూలములను
నర్పణము చేసి తనవిన్న యట్టిమాట

లన్నియును దెల్పి యిది యేమి యనుచు నడిగె
నడుగుటయుఁ జెప్పెఁ గథ యెల్ల నమ్మహర్షి.

—: న హు షుఁ డు హుం డు ని వ ధిం చు ట :—

ఆ. అపుడు విస్మయమును నాగ్రహమును గల్గ, నాత్మలోన నహుషుఁ డాఁగలేక
స్వామి యానతిమ్ము సమయింతు హుండుని, సకలలోకములకు శాంతి గలుగ.
క. అని పలుకుటయును దీవన, లొనరించి వసిష్ఠుఁ డాజ్ఞ యొసఁగెడిసమయం
బున దేవదుందుభులు మ్రో, సెను సుమవర్షంబు గురిసెఁ జిత్రము గాఁగన్.
సీ. చక్రపాణి యొసంగె శంఖచక్రములను, బ్రహ్మాస్త్ర మొసఁగెను బద్మయోని
శూలహస్తుం డిచ్చె శూలాయుధంబును, వజ్రశక్తుల నిచ్చె వజ్రపాణి
శ్వసనుం డొసంగెను సశరచాపంబు నా, గ్నేయాస్త్రము నొసంగెఁ గృష్ణవర్త్మ
పాశధరుం డిచ్చెఁ బాశాయుధంబును, దండంబు నొసఁగెను దండపాణి
గీ. యిచ్చిరి నిజాస్త్రముల సుర లితడు లెల్ల, భానుకోటిప్రభాభాసమానుఁ డగుచు
నింద్రదత్తరథంబుపై నెక్కి యున్న, నహుషునకు రాజమార్తండనందనునకు.
ఆ. అట్లు లొసఁగి విజయి వగు మని దీవించి, వార లెల్లఁ బనుప వాయువేగ
మునను దోల రథము ముం దుండి మాతలి, నహుషుఁ డరిగె వైరినగరమునకు.
గీ. అరిగి శంఖంబు పూరించె నతులగుండె, లదువ నంతట హుండామరారి వీర
భటుని నొక్కని వానిఁ జెంగటికిఁ బనిచెఁ, బొమ్ము తత్కథ కనుఁగొని రమ్మటంచు.
క. అంతట వీరభటుం డ, త్యంతాటోపమున వచ్చి యతనిం గని పూ
రింతువె రణశంఖము దై, వాంతకుఁడు వినంగ నెవఁడ వగుదువొ చెపుమా.
క. అనుటయు నాశూరుం డి, ట్లనియెను నే నాయుభూతలాధీశసుతుం
డను సోమవంశవర్ధనుఁ, డను శివకన్యాభిలషితుఁడను నహుషుండన్. 1482
క. వినుము మఱి యొకవిశేషము, నను హుండుం డపహరించె నాఁ డాదోషం
బున కిపుడు శిక్ష వానికి, నొనరింపఁగ నేఁగుదెంచియుండినవాఁడన్. 1483
చ. అనవుడు నాభటాగ్రణి రయంబున నేఁగి తదుక్తు లన్నియున్
వినిచిన నవ్విహుండుఁడు వివేకవిహీనుఁ డెవండొ వీఁడు వీ
నిని దెగటార్చెఁగా వలయు నేఁడె తదాయుతనూజుఁ డెన్నఁడో
చనియెను మామకోదరకృశానుశిఖాశలభాయమానుఁడై. 1484
క. అని పలికి ధనుర్ధరుఁడై, తనసైన్యముతోడ వచ్చి తాఁకుటయును వెం
టనె నహుషుఁడు మార్గణములు, ధనువున సంధించి దైత్యతతిపైఁ గురిసెన్.
క. కురియుటయును దీవ్రం బగు, శరవర్షంబునకు నిలువఁజాలక మరణిం
చిరి కొందఱు నలుదెసలకుఁ, బఱువెత్తిరి కొంద ఱసురబలములలోనన్. 1486
శా. అంతన్ గన్నుల నిప్పుకల్ గురియ రౌద్రాకారముం దాల్చి య
త్యంతావేగముతోడ హుండసుఁడు సురారాతిన్ నిలుఁ మీవేళ నీ

యంశంబుం గనుఁగొంచు నంచు నొకశక్తిన్ నాజిహ్వాగ్రం జేసి ది
గ్దంతుల్ తల్లడిలంగ నాస్త్ర నిజసత్త్వప్రోద్భవప్రౌఢిచేన్. 1487

సీ. అప్పుడు నహుషుఁ డయ్యసురశరాహతిఁ, గించుకేనియుఁ జలియింపఁ బోక
ప్రళయపావకసన్నిభం బైనయొకసాయ, కమును హుండునిమేనఁ గాఁడ నేసె
నాయేటునకు హుండుఁ డంబరంబున కేఁగి, బాణవర్షము వానిపైని గురిసె
మునిఁగి యాశరవర్షమున నాయువుపుత్రుండు, గ్రాలుచు నుదయభాస్కరునిపగిదిఁ

గీ. గాంచుటయు మాతలి నతండు గగనమునకు
నడపె రథమును నసురుఁడు నహుషునకును
జరిగె నచట మహాఘోరసంగరంబు
విస్మయంబునఁ గనుచుండ విబుధు లెల్ల. 1488

సీ. నహుషుఁ డప్పుడు సూచునారాచములచేతఁ, బడవైచి ధనువునుబుడమిమీఁదఁ
దురగంబులను నాల్గుశరములచేఁ గూల్చి, గొడుగుకామును నొక్కకోలఁ ద్రుంచి
పదిసాయకములను బరిమార్చి సారథి,భంజించి వక్ష మేనుబాణములను
కవచంబు రెండుమార్గణములచేఁ జించి, యమ్ము లాటిటఁ గిరీటమ్ము మాపి

గీ. త్రింశదాశుగములచేత దేహ మెల్ల, నుట్టిపడ రక్తధారలు గొట్టుటయును
గళితపరికరుఁ డయ్యు నాక్రవ్యభోజి, దుమికె నహుషునిపైకి ఖడ్గమును దాల్చి.

క. నహుషుఁ డపు డతనిఖడ్గము, సహసముగఁ ద్రుంచె నిశితశరముల నంతన్
సహియింపక ముద్గరమును, వహియించి నిశాచరుండు వచ్చుచు నుండన్. 1490

క. ధరియించినముద్గరమున్, శరదశకముచేత నడుమ నహుషుం డది స
త్వరమ దశఖండములు గా, ధరపైఁ బడుటయును జూచి దైత్యుం డంతన్.

చ. గదను ధరించి మారుతముకై వడి శీఘ్రాన వచ్చుచుండ నా
గద గలబాహువున్ నఱికె ఖడ్గముచే నహుషుండు హుండుఁ డ
య్యదనునఁ గూడ జంకక రయంబున మీఁదికి వచ్చుచుండఁ ద
ద్ధృదయమునందు నాయుసుతుఁ డేసెను శక్తిని దారుణంబుగన్. 1492

క. ఆహతిచేతను వజ్ర, వ్యాహత మగుపర్వతంబువలె దెస లద్రువన్
హాహారావము సేయుచు, నాహుండాసురుఁడు పడియె నవనీస్థలిపై. 1493

క. నిహతుం డగుటయు హుండుఁడు, ప్రహర్షమునఁ బుష్పవృష్టి బర్హిర్ముఖు లా
నహుషునిపైఁ గురియించిరి, విహాయసమునుండి పొగడ విశ్వము లెల్లన్. 1494

క. అంతట నశోకసుందరి, సంతోషముతోడ వచ్చి సఖియగు రంభా
కాంతామణితో నహుషుని, యంతికమున తాత్మవృత్త మంతయు వినిచెన్.

క. వినుచుటయును దానును మును, వినియుంటను నహుషుఁ డధికవిశ్వాసముతోఁ
దనరథముపైని వారల, నునిచికొని వసిష్ఠమౌనియొద్దకు వచ్చెన్. 1496

—: అశోకసుందరీనహుషుల వివాహము :—

ఉ. వచ్చుటయున్ వసిష్ఠుఁ డతివత్సలభావముతోడ నాతనిన్
గ్రుచ్చి కవుంగిలించుకొని కోరికి దీరెను నేఁటి కంచు వా
క్రుచ్చి సులగ్నమందుఁ గనుఁగొంచు నభంబున నిండ దేవతల్
వచ్చి యశోకసుందరికి వానికిఁ బెండ్లి యొనర్చె నచ్చటన్. 1497

క. ఒనరించి ముని యథావిధి, గను బెండిలి యాయుసుతునిఁ గనుఁగొని వత్సా
చను మింక భవజ్జననీ, జనకులకన్నీరు దుడువ సమయము వచ్చెన్. 1498

క. అనుటయుఁ బ్రణమిల్లి వసి, ష్ఠునకున్ నహుషుం డశోకసుందరితోడన్
జనియె మహేంద్రస్యందన, మున నెక్కి స్వకీయ మైనపురమున కెలమిన్. 1499

క. చని పుత్రుఁ డెపుడు వచ్చునొ, కనులకుఁ బండువుగ నెపుడు కాంతు మొ యనుచున్
దినదినమును వగ రెడుతన, జననీజనకులకు మ్రొక్కి సాష్టాంగముగన్. 1500

క. తనవృత్తాంతం బంతయు, వినుచుటయును వారు మిగుల విస్మయ మొదవన్
మును నారదుండు సెప్పిన, పని యద్యే నటంచు లోనఁ బ్రమదంపడుచున్.

గీ. మున్ను దమకు దత్తాత్రేయముని యొసంగి, నట్టిఫలమును దానికి ననుగుణముగఁ
గలిగినట్టిఫలంబును దెలిపి సుతునిఁ, గౌఁగిటను జేర్చికొని తృప్తి గాంచి రెదను.

వ. అంతట నహుషుండు మాతలిసారథికం బగునింద్రరథంబు నధిష్ఠించి ధనుర్బాణంబులం దాల్చి సప్తద్వీపముద్రితం బగుమహీమండలం బెల్ల జయించి వసుపూర్ణ యగువసుంధరను దండ్రి యగునాయుమహీపాలునకు సమర్పించి యాతనిచే రాజసూయాదిమహాయాగంబులం జేయించి తల్లి యగునిందుమతిచే ననేకదానధర్మంబులం జేయించి జననీజనకులను బ్రమోదభరితాంతరంగులం గావించె. 1503

గీ. అంతటను గొంతకాల మాయాయునృపతి
రాజ్యమును నేలి త్రైలోక్యపూజ్యముగను
దృప్తుఁ డయి భార్యతోఁ గూడ దివికి నరిగెఁ
బట్టమును గట్టి సుతునకుఁ బ్రజలు పొగడ. 1504

క. పితృతారకుఁ డగునహుషుని, కథ వినువారలకు నైహికం బగుసౌఖ్య
స్థితియును నాముష్మికస, ద్గతియును జేకూరు ననుట తథ్యము వత్సా. 1505

క. అని చెప్పి యూరకుండుట, యును సర్వము వినుచుఁ గ్రింద నున్నద్విజుం డి
ట్లనియెను శుకరాజ నినుం, గనుఁగొనఁగఁ బత్త్రిబుద్ధి గలుగదు నాకున్.

గీ. అమరుఁడవొ కిన్నరుఁడవొ విద్యాధరుఁడవొ, సిద్ధుఁడవొ శాపవశమునఁ జేసి కీర
తనువు దాల్చినయేమహాత్ముఁడవొ, చెప్పుము నీజ్ఞానమును జూడఁ జిత్రమయ్యె.

క. అని యడుగుటయును నాతని, గనుఁగొని కుంజలుఁడు ముందుగా నీచరితం
బును వినిచి కొంత యావల, వినిచెద నాచరిత మెల్ల వినుము ద్విజేంద్రా.

గీ. బ్రహ్మమూల మైనభార్గవకులమందు, జనన మంది చ్యవనుఁ డనెడిపేరఁ
బరఁగి విద్యకొఱకుఁ దిరుగుచు వచ్చితి, విటకు దైవికముగ నీవు వింటె. 1500

క. అనుటయు నత్యాశ్చర్యం, బును జ్యవనుఁడు చెంది చిత్తమున నే మే మిం
కను వినిపించునో వినియెద, ననుకొని చెవులొగ్గి యుండ నతఁ డి ట్లనియెన్.

—: కుంజలజన్మవృత్తాంతకథనము :—

ఆ. నేను నిర్జరుఁడను గాను సిద్ధుండను, గాను గిన్నరుఁడను గాను గాను
శాపనిహతుఁ డైనతాపసుండను మఱి, యెట్టిదేవజాతియేని కాను. 1511

వ. కశ్యపప్రజాపతివంశంబునందు విద్యాధరుం డనునొక్కబ్రాహ్మణుఁడు జనియించె. వేదవేదాంగపారగుం డైనయమ్మహానుభావునకు వసుశర్మ నామశర్మ ధర్మశర్మ యనుముగ్గురు పుత్రులు జన్మించిరి. అందు జ్యేష్ఠుం డగువసుశర్మ వేదశాస్త్రార్థకోవిదుం డయ్యె. మధ్యముఁ డగునామశర్మ సకలగుణోత్తరుండై జగద్విశ్రుతుం డాయెను. కనిష్ఠుండ నగునేను ధర్మశర్మ యనునిరర్థకనామంబు గలిగి సర్వవిధంబులం గనిష్ఠుండనై పెద్దలవాక్యంబులు వినక విద్యాబుద్ధులను నిరాకరించి డింభకులతోడం గూడి క్రీడావ్యసనంబునం దిరుగం జొచ్చితి. 1512

గీ. అపుడుమాతండ్రి నన్నుఁ జూచి యాత్మలోన, వగచుచును వత్స బ్రాహ్మణవంశజుఁడవు
తగునె నీ కిట్లు చదువు సంధ్యయును లేక, సకలజనపరిహాసభాజనమ వగుట.

గీ. కష్టముగ నున్న నారంభకాలమందుఁ, గలుగఁ జేయును సర్వసౌఖ్యములు పిదపఁ
గాన చదువుము తండ్రి యీకాలమందె, భ్రష్టుఁడయిపోవుఁ జదువని బ్రాహ్మణుండు.

గీ. ఘనత గాంచినవిద్యాధరునిసుతుండు, పరమనిర్భాగ్యులను గూడి తిరుగుచుండె
ననినఁ బరిమంది లోనికిఁ జనెడి నాకు, నెట్లు తల యెత్తుకొన నగు నీవె చెపుము.

క. అని చెప్పుచుండుటయు నా, మనమున కవి కంటకములమాదిరి గాఁగన్
జనకుం డుండినవేళను, జనక గృహంబునకుఁ గడపసాగితి దినముల్. 1516

ఆ. అట్లు కొంతకాల మరుగుటయును బ్రాయ, మధిక మయ్యె నాకు నంతలోన
నపహసింపఁదొడఁగి రందఱు నన్నుఁ జూచి, తండ్రిమాట లపుడు తలఁపుఁ బట్టె.

గీ. అంతట మనంబులోఁ జింత యంకురించి, ముదిరెఁ బ్రాయంబు నాకింకఁ జదువురాదు
చదువు రాకున్న స్వర్గమోక్షములు లేవు, తుదకు నరకంబె ధాత నా నుదుట వ్రాసె

గీ. ఏమి చేయుదు నే నిపు డెటకుఁ బోదు, నెవఁడు న న్నుద్ధరించు నా కేది దిక్కు
దారి దప్పితి ననుచు సంతాపపడుచు, నొక్కదేవాలయమునఁ గూర్చుంటి నేను.

క. అటు లున్నసమయమున న, చ్చటి కొకసిద్ధుండు వచ్చి సర్వము నెఱుం
గుటచేత జ్ఞానదృష్టిని, గటకటపడుచుండు నన్నుఁ గని యి ట్లనియెన్. 1520

ఆ. సత్స యోల నీవు పగసంగ నీవు స్వ, సత్యము నేని నేను సచ్చినాఁ డిఁ
జనువులకును నెల్ల సారభూతం బగు, నను చెప్పువాఁడఁ జనుఁబ్రకొనుము.

క. అనుటయుఁ బోయిన పెన్నిధి, కనఁబడిన తెఱంగునను నఖండానంద
బును జెంది పడితి నే నా, యనపదములమీఁద నంత నతఁ డి ట్లనియెన్. 1522

—: జ్ఞానస్వరూపనిరూపణము :—

ఆ. కాయమధ్యమందుఁ గలదు జ్ఞానం బను, దివ్యవస్తు వొకఁడు దీపమట్లు
దానిఁ దెలిసికొనినవానికి సర్వంబు, గోచరించు వాఁడె కోవిదుండు. 1523

ఆ. ఆత్మ యనియు బ్రహ్మ మనియుఁ బరంజ్యోతి
యనియు జ్ఞానమునకె యాఖ్య లెసఁగు
నదియె విష్ణు వదియె యాద్యంతములు దానిఁ
దెలిసికొనుటె యెల్లఁ దెలిసికొనుట. 1524

సీ. హస్తవివర్జితం బయ్యును గ్రహియించుఁ, బాదశూన్యం బయ్యుఁ బరిచరించుఁ
గానంగఁబడు రూపు లేనిది యయ్యును, నాస్యహీనం బయ్యు నారగించు
నఘ్రాణ మయ్యును నాఘ్రాణ మొనరించు, నయనముల్ లేక యుండియును జూచు
నాల్క లేకుండియుఁ బల్కుఁ గర్ణములు లే, నట్టిది యయ్యును నాలకించు

ఆ. నగుణ మయ్యు సగుణ మగు నవశ్యం బయ్యు, వశ్య మగును గోప్యవస్తు వయ్యు
సర్వ మగును జ్ఞానసామర్థ్య మెన్నంగ, నలవి గాదు హరిహరాదులకును.

క. దానిప్రకాశముచేతనె, భానుఁడు చంద్రుఁడును దీప్తి వడయుచును బ్రపం
చానందదాయకులుగాఁ, గానంబడుచుండు రెల్లకాలములందున్. 1526

క. దానికి గడగడ వడఁకుచు, భానుం డుదయించు వీఁచుఁ బవమానుఁడు వై
శ్వానరుఁడు మండు నఖిలము, దానికి లోఁబడియె సంతతంబును నడచున్.

క. జ్ఞానం బనుబ్రహ్మాస్త్రము, పూనినపురుషునకు వడఁకు భువనము లెల్లన్
గాన నది సెందుమార్గము, నే నుపదేశింతు నీకు నెఱుఁగుము వత్సా. 1528

సీ. నినుఁ జూచుకొనునట్లె కనుఁగొనుచుండుము, సమముగా మిత్త్రుల శత్రువులను
నింద్రియంబుల నిగ్రహింపుము వైరు లె, వ్వారు గూడను లేరు వానికంటె
మిత్త్రత్వమును గాని శత్రుత్వమును గాని, నెలకొననీకుము తలఁపులోన
విడిచి యుండకు మొక్కగడియ యైనను శాంతి, నది సర్వసుఖముల కాస్పదంబ

గీ. యాశ నడఁగింపు మేకాంత మాశ్రయింపు
మనియతాహారుఁడవు కాకు మనియమముగ
వర్తిలకు మప్రమాదప్రవర్తనుఁడవు
గమ్ము సర్వజ్ఞభావంబు గలుగు నీకు. 1529

గీ. అని ప్రబోధింపఁబడియును నేఁటినిమొదలు, నుంచి గురుభావమును బ్రబోధించినట్లు
యాచరించుచునుండ నా కబ్బె సకల, లోకవృత్తాంతవిజ్ఞానలోచనంబు. 1530

చ. అని వచియింపఁగాఁ జ్యవనుఁ డాతనిఁ గాంచి మహానుభావ నీ
యనితరసాధ్యశక్తి కతిహర్షము గల్గెను గాని యట్టినీ
కును శుకజన్మ మేర్పడుటకుం గలకారణ మేమొ నాపయిం
గనికర ముంచి చెప్పు మని గౌరవ మొప్పఁగ వేఁడుకొంటయున్. 1531

వ. కుంజలుం డాతని కిట్లనియె. 1532

సీ. ఒకనాఁ డొకకిరాతుఁ డొకశుకంబును మున్ను, విక్రయింపఁగనుండ వీథులందు
దానిని గొని తెచ్చి ధరణీసురుం డొక్కఁ, డర్పించె నాకు నత్యాదరమున
నది నన్ను వనలక యనుదినంబును వచ్చు, చును నేను బోషించి వోట్ల కెల్ల
ముద్దుపల్కులచేత మోహపెట్టుటయును, నేను దన్మోహంబులోనఁ జిక్కి

గీ. బిడ్డతీరున దానిని బెంచుకొనుచుఁ, గ్రమముగను నాఁటి జ్ఞానమార్గమును మఱచి
యుండ నొకనాఁడు నాచిల్క నొక్కపిల్లి, పట్టుకొని దానికడుపునఁ బెట్టుకొనియె.

క. అది మొదలుగఁ దద్దుఃఖం, బెదలోపలఁ బాదుకొని సహింపనితాపం
బొదవింప దానిమాటలె, మదిఁ దలఁచుచు నేడ్చుకొనుచు మ్రందితిఁ దుదకున్.

గీ. మరణకాలంబునందు సంప్రాప్త మైన, మతియె గతి యగు నని చెప్పు శ్రుతినిబట్టి
పడితి నే నొకచిలుకగర్భమున నపుడు, స్మృతికి వచ్చెను బ్రాక్కృతం బెల్ల నాకు.

క. ఆసమయంబున సిద్ధుఁడు, చేసినయుపదేశ మెల్లఁ జిత్తములోనన్
భాసిల్లి తదనుకంపను, జేసి స్థిరం బయ్యె నేను జెడిపోకుండన్. 1536

గీ. అంతటను బుట్టి కీరంబ నగుచు నేను, జ్ఞానవిచ్ఛిత్తి కలుగనిదానివలనఁ
దెలిసికొనుచుఁ ద్రికాలవార్తలను గర్మ, శేషమును దాఁటుటకు నిరీక్షించుచుంటి.

గీ. కాన గురుతీర్థమునకు సమాన మైన, తీర్థములు లేవు జ్ఞానోపదేశమునను
దుఃఖమయమైనసంసృతితొలఁగఁ ద్రోసి, కర్మరాహిత్యమొనరించుఁ గడకునదియె.

క. అని చెప్పి యూరకుండుట, యును జ్యవనుం డమితహర్షయుక్తుం డగుచుం
జని సకలవృత్తములు గనుఁ, గొనుచును జ్ఞానమున ముక్తిఁ గొనియెను దుదకున్.

చ. అని వచియించి కోరుకొనుమయ్య వరంబు నొసంగువాఁడ నీ
కనుటయు వేనుఁ డచ్చెరియ మంది జనార్దన చేర్చికొమ్ము నీ
తనువున నన్ను శీఘ్రముగ దాసుని నైనని నన్నుగ్రహంబు గ
ల్గినయెడ నీకు వేఱొకటి లేదు వరింపఁగ నాకు నావుడున్.

క. ఒనరింపు మశ్వమేధం, బొనరింపుము రాజసూయ మొనరింపుము భూ
ధనధాన్యగోహిరణ్యా, ద్యనుపమవస్తుప్రదాన మవనీనాథా. 1541

గీ. బ్రహ్మహత్యాది ఘోరపాపములు గూడఁ
దొలఁగిపోవుఁ జతుర్వర్గ ఫలము గలుగు
నెట్టియభిలాషమును లేక యెడఁదలోన
నన్నుఁగూర్చి యొనర్చుదానంబువలన. 1542

క. ననుఁగూరిచి యేభావం, బునఁ జేయునొ పాత్రదానమును నాభావం
బును సఫలం బొనరించెడి, పని నాయది నేను బద్ధపక్షమును దానన్. 1543

వ. సత్వరంబుగ మదాజ్ఞాపరిపాలనంబు గావించి నాలోన నేకీభవించెదవు గాక
యని పలికి జనార్దనుం డంతర్ధానంబు నొందె. 1544

క. అంతట వేనధరిత్రీ, కాంతుఁడు చనుదెంచి నిజనికాయ్యంబునకున్
సంతోషించుచుఁ బృథునకు, నంతయు వినిపించి యిట్టు లనియెన్ ముదమున్.

గీ. తనయ యస్మద్వసుంధరాతలమునందు, మనసుచేతను గాని వాక్కునను గాని
కాయమునఁ గాని పాపంబుఁ జేయువాని, శిరము ఖండింపు మది యభీప్సితము నాకు.

క. అనుటయుఁ బృథువు తదాజ్ఞను, గొని చేయందొడఁగె నజునిఁగూర్చి తపంబున్
వనజాసనుండు దత్తప, మునకున్ ముద మొంది శీఘ్రముగ దయచేసెన్. 1547

గీ. అట్లు దయచేయుటయుఁ బృథుం డజున కెఱఁగి
స్వామి మారాజ్యమునఁ గలజనులలోనఁ
గలుష మొనరించువారలతలలు శంఖ
పాదపఫలంబులట్టులు పడును గాక. 1548

క. అని ప్రార్థించుటయును విధి, యనుగ్రహించి వర మట్లె యంతర్ధానం
బును జెందె నంత నిజపుర, మునకుం జనుదెంచి పృథువు మోదముతోడన్.

గీ. వినిచి తండ్రికి జరిగినవిషయ మెల్ల, నశ్వమేధంబు మొదలగునధ్వరములు
ధేనుభూస్వర్ణరత్నాదిదానములును, నతనిచేతను జేయించె నద్భుతముగ.

గీ. అంత వేనునిరాజ్యమునందు నెవ్వఁ, డేని త్రికరణములను నెద్దాననేని
దురిత మొనరించునెడ వానిశిరముదునిఁగి, యవనిపైఁబడుచుండె నత్యద్భుతముగ.

క. అది బ్రహ్మవరఫలం బని, విదితం బగుటయును మిగుల వెఱ జనియింపన్
వదలి యధర్మపథంబును, బమగురును సధర్ము లగుచుఁ బరగిరి లోకుల్. 1552

గీ. ధర్మయుత మర్త్యలోక మంతయును నెనఁ, బరమహర్షంబునను వేనపార్థివుండు
పృథునిపై రాజ్యభారంబు పెట్టి చనియెఁ, దనువుతోడనె వైకుంఠధామమునకు.

—:భూమిఖండశ్రవణపఠనమాహాత్మ్యకథనము:—

క. ఇది భూమిఖండ మిందుం, జదివిన నొకపద్యమేని బ్రాహ్మణులకుఁ బ
ర్వదినంబునందు గోవులు, పదినూఱు లొసంగినట్టిభాగ్యము గలుగున్.

గీ. శత్రుసంహారమును రోగసంక్షయమును, శోకనాశనమును శాపశోషణమును
సంతరాయప్రశాంతియు నానతిల్లు, వినినయెడ భూమిఖండంబు ననుదినంబు.

క. సులభముగ విష్ణుధామము, గలుగవలయు ననెడికోర్కి గలిగినపుణ్యా
త్ములు భూమిఖండమును విన, వలయును వర్జించి యితరవాంఛల నెల్లన్.

క. అని చెప్పుటయును శౌనక, మునిముఖు లత్యంతహర్షమును జెందిరి యో
గనియాఢు లగుటఁ గన్గొని, మనములలో భూమిఖండమాహాత్మ్యంబున్. 1557

క. గౌరీప్రాణేశ్వర సం, సారపయోరాశిమగ్నజనసంతానో
ద్ధారక తారక దేశిక, వారితకామాదివైరివర్గా భర్గా. 1558

పృథ్వీవృత్తము.

తపోధనమనోనికేతనకృతస్వకీయస్థితీ
ప్రపంచపరికల్పనాదికృతిపాండితీధూర్వహా
కృపారససముజ్జ్వలన్మధురదృక్ప్రసారోద్ధృత
ప్రపన్నజనసంసృతిప్రబలభార విశ్వేశ్వరా. 1559

గ ద్య ము

శ్రీ చిదంబరకవీంద్రప్రణీతం బైనశ్రీమదాంధ్ర పద్మపురాణంబున

భూ మి ఖ ం డ ము

సమాప్తము.

---

శ్రీకాశీవిశ్వేశ్వరార్పణమస్తు.



# శ్రీ మదాంధ్ర పద్మపురాణము

## బ్రహ్మఖండము



మత్కైలాసాచల
ధామా తామసజనప్రతారణనిపుణా
వ్యామోహితవాచంయమ
రామాజన విశ్వనాథ ప్రకటితబోధా. 1

వ. అవధరింపుము. 2

క. మనుజులకు సుగతి యేవిధ, మునఁ గలుగునొ కలియుగమున మునివర మాకున్
వినిపింపు మనుచు శౌనక, ముని యడుగుడు సూతుఁ డపుడు మునికి ట్లనియెన్.

క. వినుము తపోధన యిప్పుడు, నను నీ వడిగినవిధంబుననె పూర్వము జై
మిని మాగురు వగుద్వైపా, యనముని నడుగంగ నతని కతఁ డిట్లనియెన్.

ఆ. సాధుసంగమమున శాస్త్రశ్రవణ మబ్బు, సంఘటించు దాన శార్ఙ్గిభక్తి
దానివలనఁ గలుగు జ్ఞానంబు సమకూరు, దానిచేత సుగతి మానవులకు. 5

ఆ. విష్ణుకథకు నెవఁడు విఘ్నంబు సేయునో, వాఁడు నరకలోకవాస మొందుఁ
గానరాదు చూవె వానికిఁ గోటిమ, న్వంతరముల కైన నాత్మశాంతి. 6

గీ. వినఁ దలంచినమాత్రన విష్ణుకథను, బ్రహ్మహత్యాదిసకలపాపములు గూడ
భస్మమైపోవుఁ జిచ్చులోఁ బడినయట్టి, శలభములువోలె నిఁక నెంతొ శ్రవణఫలము.

గీ. హరిచరిత్రంబు బోధించునట్టిగ్రంథ, మున్న యింటికిఁ జేరలే రెన్నటికిని
దన్మహత్త్వవిశోషితధైర్యు లగుచు, గజగజ వడంకుచుండెడి కాలభటులు. 8

గీ. అపహసించెడివాఁడు దైత్యారికథను, శ్రీపతిచరిత్రములను దూషించువాఁడు
హరిపురాణంబు రుచియింపనట్టివాఁడు, పరిగణితు లైరి మువ్వురు పాపులుగను.

క. అనృతం బని సచియించునొ, జనార్దనునిచరిత మెవఁడు జగమున నాపా
పిని దప్తాయఃపిండం, బున నిటు లటులును యముండు పొరలించుఁ జుమీ. 10

క. జరుగుచునుండునొ యెక్కడ, హరిసంకీర్తనము శౌరి యక్కడ నుండున్
దొరకును హరిభటులకుఁ ద, త్కరుణావీక్షణసుఖాధికారం బనఘా. 11

క. అనవుడు జైమిని హరిభటు, లన నెవ్వరు స్వామి చెప్పు మని యడుగుటయున్
మునిలోకవిభుఁడు ద్వైపా, యనుఁ డాతని కిట్టు లనియె నానందమునన్. 12

—: హరిభక్త నిరూపణము :—

సీ. హరినామకీర్తనపరులైనవారును, విడువనివారును విష్ణుభక్తి
సత్యభాషణులు మత్సరవివర్జితులును, బరిహృతపరదారపరధనులును
దయగలవారును దంభవర్జితులును, వేదశాస్త్రపురాణసాదరులును
బ్రాహ్మణద్వేషంబు వడయనివారును, బిత్రుత్సక్తికరులును నతిథిరతులు
గీ. విషమువలెఁ జూచువారును విప్రధనముఁ, దులసి నర్చించువారును జలుపువారు
కన్యకాదానమును నాస్తికప్రసక్తి, లేనివారును హరిభటుల్ మానివర్య. 13
వ. మఱియును హింస చేయనివారును గామక్రోధలోభమోహంబుల నడంచిన వారును దులసిని ధరియించువారును విష్ణునేత్రంబు గట్టించువారును విష్ణుకైంకర్యంబు గావించువారును విష్ణునైవేద్యంబు భుజియించువారును గృహంబునందు సాలగ్రామార్చనంబు గావించువారును విష్ణుచరిత్రంబులు వినువారును నేకాదశీరాధాష్టమీవ్రతపరాయణులును నచ్యుతాభిషేకజలనిషిక్తాంగులును విష్ణుదేవాలయంబు దుడుచువారును విష్ణుమందిరంబున దీపంబు వెట్టువారును విష్ణుభవనంబునకు లేపనంబు గావించువారును హరిభటులుగాఁ జెప్పంబడిరి.
గీ. అట్టిహరిభటుఁ డొక్కఁడు పుట్టె నేని, వాఁడు పావన మొనరించు వంశ మెల్ల
సమసిపోవును వానిసంసర్గమునను, బ్రహ్మహత్యాదిఘోర పాపములు గూడ.

—: చోరుని కు వైకుంఠప్రాప్తి గలుగుట :—

క. దీనికి దృష్టాంతముగను, నే నొకకథ వినుచువాఁడ నీ కది విన్నన్
గానంబడు హరిభటమహి, మానంత్యము చెప్ప నేల యధికం బింకన్. 16
వ. మున్ను ద్వాపరయుగంబునందు బ్రహ్మస్వాపహారకుండును మిత్రద్రోహియును నసత్యభాషణుండును బరదారలోలుండును గ్రూరుండును గోమాంసభక్షకుండును సురాపాయియుఁ బాషండజనసంగతుండును న్యాసాపహారకుండును శరణాగతహంతయు వేశ్యాలంపటుండును నగుదండకుం డనునొక్కచోరుం డొక్కనాఁడు భగవద్ద్రవ్యాపహరణాభిలాషంబున విష్ణుదేవాలయంబుం గర్దమవిలిప్తంబు లగుపాదంబులఁ బ్రవేశించి పాదకర్దమంబు దేవాలయభూమికిం దుడిచి రత్నకాంచనవిభూషణవిరాజమానుండును బీతాంబరధరుండును మనోహరపర్యంకశాయియును నగురాధాకృష్ణునిం జూచి ప్రణామంబు గావించి తద్భూషణంబు లన్నియు నొలిచి విష్ణుపీతాంబరంబునం గట్టికొని చంకంబెట్టుకొనుటయు నాభూషణంబులు ఘోరారావముం జేయందొడంగె. అంత నాచోరుండు భయప్రకంపితగాత్రుండై యామూట నచ్చటన పాఱవైచి వేగంబునం బోవుచు మార్గమధ్యంబున నొకకృష్ణసర్పంబు కఱవఁ దత్క్షణంబ యచ్చోటన పడి మృతుం డయ్యె.

సీ. అప్పుడు యమదూతలు తనిఁ దోడ్కొనిపోయి, శమనునిసన్నిధానమున నునుప
దండధరుండు క్రోధమునఁ దచ్చరిత మే, మని చిత్రగుప్తుని నడుగుటయును
నతఁ డంతకున కిట్టు లనియె స్వామి యితండు, కావింపనియఘంబు కానరాదు
కాని స్వకృతసర్వకలుషఘ్న మగునొక్క, శ్రేయంబు వీనిచేఁ జేయఁబడియె
గీ. ననుటయును విస్మయం బొంది యంతకుండు, చెప్పుమది యేదొ నావుడుఁ జిత్రగుప్తుఁ
డిట్లనియె దేవ యొక్కనాఁ డితఁడు దొంగ, తనము చేయంగఁ జని విష్ణుధామమునకు.
గీ. అచటఁ దపపాదముల నున్న యట్టిబురద, రాయఁగాఁ దత్ప్రదేశరంధ్రములు పోయె
దానివలనను సకలపాతకము లడఁచి, హరిపదమునకుఁ జేర్చుపుణ్యంబు గలిగె.
క. అనుటయు శమనుఁడు శీఘ్రం, బున లేచి తదంఘ్రియుగ్మమునకుఁ బ్రణామం
బొనరిచి వైకుంఠమునకుఁ, బనిచె నతని స్వర్ణరథముపైని మునీంద్రా. 20
క. అనుటయును విష్ణుమందిర, మున కింకను భక్తితోడఁ బొనరించిన లే
పనమున కెంతటిఫలితము, జనియించునొ యనుకొనుచును జైమిని చనియెన్.

—: అపుత్రతాదిహేతుతన్నివారణోపాయకథనము :—

గీ. అనుటయును శౌనకుం డిట్టు లనియె సూత, పుత్రులు గతించుటకును నపుత్రతకును
షండులుగఁ బుట్టుటకును స్త్రీసంతతికిని, గారణం బేమొ యెట్లొ తద్వారణంబు.
చ. అనుటయు సూతుఁ డిట్లనియె నార్య విరించిని మున్ను దేవతా
ముని యడుగంగ నిట్లు కడు మోదముతో వచియించె ధాత యా
తని కదె నీకు నే వినిచెదన్ విను బ్రాహ్మణవృత్తులన్ హరిం
చినను హరింపఁ జేసినను జెందు నపుత్రత జంతుకోటికిన్. 23
వ. తద్దోషపరిహారంబుగాఁ బద్మపురాణశ్రవణంబును భూదానంబును గోదానంబును
సువర్ణవిష్ణుప్రతిమాదానంబును గావించెనేని పుత్రజననం బగు.
క. ఒనరిచి యతిథి నిరాశునిఁ, గను క్రోధవశంబుచేతఁ గావించినదం
డనమునఁ జేసి యపుత్రత, యెనగూడక తప్ప దెంతయోగ్యుల కైనన్. 25
గీ. అట్టిదోషంబు శాంతింప నతిథు లైన, బ్రాహ్మణుల కన్నజలములు భక్తి నొసఁగి
యాదరింపంగ వలయు నయ్యాదరమున, నామతిల్లును బుత్రపౌత్రాభివృద్ధి. 26
క. మును పరశిశువుల హింసిం, చినకారణమునను బుట్టి శిశువులు మరణం
బును గాంతురు తద్దోషము, చన స్వర్ణప్రతిమ నీయఁ జను విప్రునకున్. 27
వ. మఱియును. 28
క. మృతసంతతు లగుచుందురు, క్షితిలో మును భ్రూణహత్య చేసినయువతుల్
పతితోడను హరిదివస, వ్రతమ్మును గావించి తొలఁగవచ్చును దానిన్. 29
వ. వెండియును, 30

—: హరిభటనిరూపణము :—

సీ. హరినామకీర్తనపరులైనవారును, విడువనివారును విష్ణుభక్తి
సత్యభాషణులు మాత్సరవివర్జితులును, బరిహృతపరదారపరధనులును
దయగలవారును దంభవర్జితులును, వేదశాస్త్రపురాణసాదరులును
బ్రాహ్మణద్వేషంబు వడయనివారును, బితృతుష్టికరులును నతిథిరతులు
గీ. విషముగలెఁ జూచువారును విప్రధనముఁ, దులసి నర్చించువారును జలుపువారు
కన్యకాదానమును నాస్తికప్రసక్తి, లేనివారును హరిభటుల్ మునివర్య. 13

వ. మఱియును హింస చేయనివారును గామక్రోధలోభమోహంబుల నడంచినవారును దులసిని ధరియించువారును విష్ణువేశ్మంబు గట్టించువారును విష్ణుకైంకర్యంబు గావించువారును విష్ణునైవేద్యంబు భుజియించువారును గృహంబునందు సాలగ్రామార్చనంబు గావించువారును విష్ణుచరిత్రంబులు వినువారును నేకాదశీరాధాష్టమీవ్రతపరాయణులును నచ్యుతాభిషేకజలసిక్తాంగులును విష్ణుదేవాలయంబు దుడుచువారును విష్ణుమందిరంబున దీపంబు వెట్టువారును విష్ణుభవనంబునకు లేపనంబు గావించువారును హరిభటులుగాఁ జెప్పంబడిరి.

గీ. అట్టిహరిభటుఁ డొక్కఁడు పుట్టెనేని, వాఁడు పావన మొనరించు వంశ మెల్ల
సమసిపోవును వానిసంసర్గమునను, బ్రహ్మహత్యాదిఘోరపాపములు గూడ.

—: చోరునకు వైకుంఠప్రాప్తి గలుగుట :—

క. దీనికి దృష్టాంతముగను, నే నొకకథ వినుచువాఁడ నీ కది విన్నన్
గానంబడు హరిభటమహి, మానంత్యము చెప్ప నేల యధికం బింకన్. 16

వ. మున్ను ద్వాపరయుగంబునందు బ్రహ్మస్వాపహారకుండును మిత్త్రద్రోహియును నసత్యభాషణుండును బరదారలోలుండును గ్రూరుండును గోమాంసభక్షకుండును సురాపాయియుఁ బాషండజనసంగతుండును న్యాసాపహారకుండును శరణాగతహంతయు వేశ్యాలంపటుండును నగుదండకుం డనునొక్కచోరుం డొక్కనాఁడు భగవద్ద్రవ్యాపహరణాభిలాషంబున విష్ణుదేవాలయంబుం గర్దమవిలిప్తంబు లగుపాదంబులఁ బ్రవేశించి పాదకర్దమంబు దేవాలయభూమికిం దుడిచి రత్నకాంచనవిభూషణవిరాజమానుండును బీతాంబరధరుండును మనోహరపర్యంకశాయియును నగురాధాకృష్ణునిం జూచి ప్రణామంబు గావించి తద్భూషణంబు లన్నియు నొలిచి విష్ణుపీతాంబరంబునం గట్టుకొని చంకంబెట్టుకొనుటయు నాభూషణంబులు ఘోరారావముం జేయఁదొడంగె. అంత నాచోరుండు భయప్రకంపితగాత్రుండై యామూట నచ్చటన పాఱవైచి వేగంబునం బోవుచు మార్గమధ్యంబున నొకకృష్ణసర్పంబు కఱవఁ దత్క్షణంబ యచ్చోటన పడి మృతుం డయ్యె.

సీ. అప్పుడు యమదూత లతనిఁ దోడ్కొనిపోయి, శమనునిసన్నిధానమున నునుప
దండధరుండు క్రోధమునఁ దచ్చరిత మే, మని చిత్రగుప్తుని నడుగుటయును
నతఁ డంతయున కిట్టు లనియె స్వామి యితండు, కావింపనియఘంబు కానరాదు
కాని స్వకృతసర్వకలుషఘ్న మగునొక్క, శ్రేయంబు వీనిచేఁ జేయఁబడియె
గీ. ననుటయును విస్మయం బొంది యంతకుండు, చెప్పుమది యేదొ నావుడుఁ జిత్రగుప్తుఁ
డిట్లనియె దేవ యొక్కనాఁ డితఁడు దొంగ, తనము చేయంగఁ జని విష్ణుధామమునకు.
గీ. అచటఁ దనపాదముల నున్న యట్టిబురద, రాయఁగాఁ దత్ప్రదేశరంధ్రములు పోయె
దానివలనను సకలపాతకము లడఁచి, హరిపదమునకుఁ జేర్చుపుణ్యంబు గలిగె.
క. అనుటయు శమనుఁడు శీఘ్రం, బున లేచి తదంఘ్రియుగ్మమునకుఁ బ్రణామం
బొనరిచి వైకుంఠమునకుఁ, బనిచె నతని స్వర్ణరథమునను మునీంద్రా. 20
క. అనుటయును విష్ణుమందిర, మున కింకను భక్తితోడఁ బొనరించిన లే
పనమున కెంతటిఫలితము, జనియించునొ యనుకొనుచును జైమిని చనియెన్.

— : అపుత్రతాదిహేతు తన్నివారణోపాయకథనము : —

గీ. అనుటయును శౌనకుం డిట్టు లనియె సూత, పుత్రులు గతించుటకును నపుత్రతకును
షండులుగఁ బుట్టుటకును స్త్రీసంతతికిని, గారణం బేమొ యెట్లొ తద్వారణంబు.
చ. అనుటయు సూతుఁ డి ట్లనియె నార్య విరించిని మున్ను దేవతా
ముని యడుగంగ నిట్లు కడు మోదముతో వచియించె ధాత యీ
తని కదె నీకు నే వినిచెదన్ విను బ్రాహ్మణవృత్తులన్ హరిం
చినను హరింపఁ జేసినను జెందు నపుత్రత జంతుకోటికిన్. 23
వ. తద్దోషపరిహారంబుగాఁ బద్మపురాణశ్రవణంబును భూదానంబును గోదానంబును
సువర్ణవిష్ణుప్రతిమాదానంబును గావించెనేని పుత్రజననం బగు.
క. ఒనరిచి యతిథి నిరాశునిఁ, గను క్రోధవశంబుచేతఁ గావించినదం
డనమునఁ జేసి యపుత్రత, యొనగూడక తప్ప దెంతయోగ్యుల కైనన్. 25
గీ. అట్టిదోషంబు శాంతింప నతిథు లైన, బ్రాహ్మణుల కన్నజలములు భక్తి నొసఁగి
యాదరింపంగ వలయు నయ్యాదరమున, నామతిల్లును బుత్రపౌత్రాభివృద్ధి. 26
క. మును పరశిశువుల హింసిం, చిన కారణముననను బుట్టి శిశువులు మరణం
బును గాంతురు తద్దోషము, చన స్వర్ణప్రతిమ నీయఁ జను విప్రునకున్. 27
వ. మఱియును. 28
క. మృతసంతతు లగుచుందురు, క్షితిలో మును భ్రూణహత్య చేసినయువతుల్
పతితోడను హరిదినస, వ్రతమును గావించి తొలఁగవచ్చును దానిన్. 29
వ. వెండియును. 30

క. జలమగ్నుఁ వైశ్య బాలునిఁ, దిలకించియు నుద్ధరింపఁ దెప్పరి నిపాపా
త్ములు పుత్రహీను లగుదురు, కలకాలము దోషశాంతి గావింపని-ధోక్ష. 31
వ. దీనికి దృష్టాంతంబుగా నొకగాథ వచియించెద.
సీ. త్రేతాయుగంబున శ్రీధరుం డనియెడి,భూధవుం డొక్కఁ డపుత్రుఁ డగుట
మనములోఁ దనకర్మమునకుఁ జింతిల్లుచు,నుర్వి నేలుచు నుండ నొక్కనాఁడు
దైవవశంబున ద్వైపాయనుఁడు తన, కడకు రా బహుభక్తి గడలుకొనఁగ
నతఁడు హేమప్రభావతి యనునిజకాంత, తోడ మౌనికిఁ బ్రణతుల నొనర్చి
గీ. స్వామి నాయనపత్యత కేమి హేతు, వగునొ వచియింపు మని వినయమున నడుగ
వ్యాసుఁ డిట్లని పలికె జనాధినాథ, వినఁ దగినయంశ మెల్లను వినుతు వినుము.
గీ. పూర్వజన్మంబునను నీవు భూమిపాల, చంద్రుఁ డనునామమునను నీచారుగాత్రి
శంకరీనామమునను బ్రశస్తి కెక్కి, పతియు సతియును నగుచు నొప్పితిరి వింటె.
గీ. అట్టు లుండంగ నొకసమయంబునందు, వనవిహారంబునకు మీరు చనినయపుడు
చూచియును నీటఁ బడినశిశువును నొకని, లేవఁదీయక వచ్చితి రేవపడుచు.
ఆ. అంత వాఁడు మునిఁగి యానీటిలోపలఁ, బ్రాణములను విడిచె నాయఘంబు
మిమ్ముఁ జుట్టుకొనియె మీకర్మమునఁ జేసి, కలిగె మీ కపుత్రకత్వ మిపుడు. 36
గీ. అనుటయును విని యాఱేఁడు మునివరేణ్య,యమ్మహాఘోరపాపంబు నడఁచివైచు
మార్గ మేదైన నున్నచో మాకు దానిఁ,దెలుపు మని చేతులొగ్గి ప్రార్థించుటయును
గీ. వ్యాసుఁ డారాజమౌళి కిట్లనియె నపుడు, గౌరి యైనట్టికన్యను గనకవసన
సంయుతము లై నవృషభకూశ్మాండములను,ధరణిసురునకుభక్తితోదానమిమ్ము.
గీ. వినుము పద్మపురాణము వినిచినట్టి, బ్రాహ్మణునకు నొసంగుము భక్తితోడ
ధనకనకవస్తువాహనార్థముల నెల్లఁ, దొలఁగిపోవు నపుత్రతాదోష మధిప.
గీ. అనుటయును ఱేఁడు వ్యాసమహర్షి చెప్పి, నట్టు లొనరించి వర్షమధ్యమున నఖిల
గుణగణాలంకృతుం డైనకొడుకు నొకనిఁ,గాంచె ననపత్యతాపాతకంబు దొలఁగి.
గీ. తాను మును చేసినట్టిగోదమనమునను, బ్రాహ్మణీసంగమమునను బాదజుండు
పుట్టును నపుంసకుండు గాఁ బుడమిలోన, నవలఁ గావించెనేని పుణ్యంబు నతఁడు.
గీ. ఎన్ని జన్మాంతరంబుల నెత్తి యపుడు,కన్యలనె కాంచుచును వారికతన ఘోర
దుఃఖములు చెందుచుండు నాదోషముడుగ,నగునుబూర్వోక్తదానములాచరింప.

—: వైకుంఠ ప్రాపక పుణ్య కథనము :—

గీ. అనుటయును శౌనకుం డప్పు డతనిఁ జూచి, సూత వైకుంఠలోకంబు చేతనులకు
నప్రతిహతంబుగాఁ గల్గు నట్టిపుణ్య, మేది యైనను నుండిన నెఱుఁగఁ జెపుమ.
క. అని యడుగుటయును సూతుఁడు, వినయంబున నిట్లు లనియె విప్రునకు నికే
తనమును వృత్తియు నొసఁగిన, జనులకు వైకుంఠపదము సంప్రాప్తించున్. 44

గీ. సౌధమును బ్రాహ్మణునకు నొసంగినట్టి, పుణ్యపురుషుండు వైకుంఠపురమునందు
స్వర్ణసౌధంబుపై నివాసంబు గలిగి, యనుభవించును దివ్యసౌఖ్యంబు లెల్ల. 45
గీ. పృథివి రేణువు లేనియు వృష్టితోయ, బిందుతతు లేనియును లెక్కపెట్ట వచ్చుఁ
గాని శక్యంబు గా దెంతవాని కైన, బ్రహ్మసంస్థాపనఫలంబు పరిగణింప. 46
గీ. కలుగు మఱియును విష్ణులోకంబు ధనము, నొసఁగి యైనను నసువుల నొసఁగి యైన
భూసురులఁ బ్రోచునట్టిసత్పురుషులకును, వినుము దీనికి నొకగాథ వినుతు నీకు.

—: నరమేధవృత్తాంతము :—

సీ. మున్ను ద్వాపరయుగంబున దీననాథుండు, నా నొక్కమేదినీనాయకుండు
పుత్రులు లేరని పొగులుచు నొకనాఁడు, కదలి గాలవఋషికడకు నేఁగి
తత్పాదములమీఁదఁ దల యుంచి తన కుప్పు, తెలిననంతాపంబు తెలుపుటయును
నతఁ డనుకంపాన్వితాత్ముఁడై యరమోడ్పుఁ, గనులతోడను నొకగడియ చూచి
గీ. యధిప చేయుము నరమేధయాగ మీవు, పుత్రులను గాంచుటకు బుద్ధి పుట్టెనేని
యనుటయునుదీననాథుఁడిట్లనియెఁజెపుము, స్వామినరమేధపురుషలక్షణమునాకు.
గీ. అనుడు గాలవుఁ డతని కి ట్లనియె రాజ, సుందరుఁ డకృష్ణవర్ణుఁడు శుద్ధవంశుఁ
డవికలాంగుఁడు యువయు నాహ్లాదకరుఁడు, శాస్త్రవిదుఁడునుగాఁదగు సవనపశువు
క. అనవుడు నట్టులె మఖముం, బొనరించెద ననుచు భూవిభుఁడు సంకల్పం
బును జేసి పంపె దూతల, ధనరాసు లొసంగి సప్తతంతునరునకై. 50
క. పనుచుటయు భటులు గ్రామము, లును బట్టనములును దిరిగి లోకుల నెల్లన్
గని కని నరమేధమునకు, నను వగునరుఁ డబ్బ కునికి నతిదుఃఖితులై. 51
ఆ. కడకు దైవికంబుగాఁ జని దశపుర, మనెడినగరమునకు నందులోనఁ
గృష్ణదేవుఁ డనెడిక్షితిసురునకు మంచి, కొడుకు లుండి రనెడినడి నెఱింగి. 52
సీ. ఆబ్రాహ్మణునికడ కరిగి విప్రోత్తమ, తెలియుము రాజదూతలము మేము
మారాజు నరమేధమఖము గావింపఁగాఁ, దలపెట్టి బలి యీయఁ దగిననరునిఁ
గొని రం డనుచు మమ్ముఁ బనిచెఁ గైకొని ద్రవ్య,మిమ్ము నీపుత్రులం దెవని నైన
నటు లీయకున్నచో నెటు లైనఁ గొనిపోదు,మవిలంఘ్య మగుట భూధవునియాజ్ఞ
గీ. యనుటయును విప్రదంపతు లార్తు లగుచుఁ,బుత్రకులఁ బాయఁజాలక పొగిలి పొగిలి
నేతృశాసన మవిలంఘనీయ మగుటఁ, జివర కిట్టు వచించి రాసేవకులకు.

ఉ. తల్లికిఁ జిన్నవానిపయిఁ దప్పదు మోహము పెద్దవానిపై
నుల్లము మెండు తండ్రి కిఁక నుండిన వాఁ డొకమధ్యముండు నా
నల్లన మధ్యముండు వినయంబున నొద్దకు వచ్చి తండ్రికిం
దల్లికి మ్రొక్కి నిల్చె వసుధాపతిదూతలమ్రోల నంతటన్. 54

గీ. భృత్యు లాతనిఁ దోడ్కొని పోవుచుండఁ
కౌశికుఁడు స్వాశ్రమముకడఁ గాంచి వారి
నెవరొ మీ రీకుమారకుఁ డెవఁడొ యెచటి
కరుగుచుంటిరొ చెప్పుఁ డం చడుగుటయును. 55
దూతలు తమవృత్తాంతం, బాతపసికిఁ జెప్ప నతఁడు యాగపశువుగా
క. నే తెంతు నేను విడువుం, డీతని నని వేఁడుకొనియె భృత్యుల నంతన్. 56
ఆవేఁడుకోలు విని భటు, లీవు తగవు యాగబలికి వృద్ధుఁడ వగుటన్
క. భూవరుఁడు వేచి యుండును, బోవలయును మే మటంచుఁ బోవుచు నుండన్.
గీ. బ్రాహ్మణప్రాణరక్షణఫలవిదుండు, గాన నమ్మౌని వారలతోన యేఁగి
యాగశాలాంతరంబునయందు నున్న, దీననాథున కొనరించి దీవనలను. 58
గీ. దేవ యీవిప్రునిఁ ద్యజించి నీవు నేఁడు
గొనుము నను యాగపశువుగాఁ గొడుకు పుట్టుఁ
గానిచో బలిరహితము గా నొనర్పు
మధ్వరము నీకు జనియించు నాత్మజుండు. 59
క. అనుటయును దీననాథుఁడు, ముని నుడివినయుభయపక్షములను ద్వితీయం
బును ననుసరించి యధ్వర, మును బలిరహితముగఁ జేసి పుత్రునిఁ బడసెన్.
సీ. అంతటఁ గౌశికుం డావిప్రసుతునిఁ దో, డ్కొని వేగ దశపురంబునకు వచ్చి
కనుఁగొని సుతవియోగవిషాదమున నంత, దశ నున్న బ్రాహ్మణదంపతులను
నెఱిఁగించి జరిగినవృత్తాంత మంతయుఁ, జూచికొనుండు మీసుతుని ననుచు
మునిసిద్ధవచనంబునను జేసి వార లాం, ధ్యంబు తొలంగి నందనునిఁ జూచి
గీ. హర్షవశమునఁ గౌఁగిట నదిమికొనుచు, వాని నమ్ముని కెఱఁగి సమ్మాన మొదవ
స్వామి జీవనదానంబు సలిపినట్టి, సుకృత మొనగూడె నీకు మాసుతుని నిడుట.
క. తరియించితి వైకుంఠము, కరగతమై యుండ నేమి కావలె నింకన్
ధరణిసురరక్షణార్థము, శరీరమును గూడ గణనసలుపని నీకున్. 62
క. అనవుడు నమ్మునివర్యుఁడు, చనియె నిజాశ్రమమునకు వెసన్ వైకుంఠం
బును నిజహస్తగతంబుగ, నొనరిచికొన్నట్టిసమధికోల్లాసమునన్. 63
గీ. శ్రద్ధతోడను నీకథ చదువుకొన్న, నట్లు కాదేని వినిన బ్రాహ్మణునివలనఁ
బ్రాప్త మగుఁ బునరావృత్తిరహిత మైన, విష్ణుధామంబు మాటలు వేయి యేల.
క. అట్టులె విష్ణ్వాలయమును, గట్టించి ప్రతిష్ఠ చేయఁ గలిగినవారున్
గట్టకడకు వైకుంఠపు, రాట్టాలికలందు నుందు రానందమునన్. 65
వ. దీనికి దృష్టాంతంబుగా మున్ను నారదునకుఁ బరమేష్ఠి చెప్పినయొక్కకథ వచి
యించెద నాలకింపుము. 66

—: పణ్యసుందరీకృత్తాంతము :—

సీ. మున్ను ద్వాపరయుగంబున నుండెఁ బణ్యసుం, దరి చంచలాపాంగ నాఁగ నొకతె
యాకాంత యొక్కనాఁ డధికధనాపేక్ష, నరుగుచు విటుఁడు ర మ్మనినకడకు
విష్ణ్వాలయమున దైవికముగా నిమిషమా, త్రంబు తాంబూలచర్వణము చేసి
తనహస్తమున కంటుకొనినసున్నము రాచి, తత్కుడ్యమునకు సత్వరము గాఁగ
గీ. వనమునకుఁ జేరి జారుఁడు వచ్చియుండు, ననుచు న ట్టిట్టు చూచుచున్నంతలోనఁ
జిలుపచిలుపని చీకటు లలముకొనఁగ, నప్పు డొకపులి వచ్చి యాయమను జంపె.
క. అంతట యమభృత్యులు త, త్కాంతామణి నొక్కచర్మదామముచే న
త్యంతదృఢంబుగఁ గట్టి కృ, తాంతునికడ కీడ్చికొనుచు నరుగుచు నుండన్. 68
గీ. శంఖచక్రగదాపద్మశాలు లైన, విష్ణుదూతలు చనుదెంచి వింటెనడుమ
నెదురుకొని వారలను మీర లెవ్వ రీమె,నీడ్చుకొనిపోవుటకు హేతు వేమి చెప్పుఁడు
క. అనుటయు యమభటులము మే, మనేకపాపములు చేసినట్టికతన నీ
చెనఁటిని యమపురమునకుం, గొనిపోవుచునుంటి మెదురుకొన నేమిటికిన్. 70
క. అని యమభృత్యులు పలుకుడు, విని వారల కిట్టు లనిరి విష్ణునియోజ్యుల్
గొనిపోవ నంత సులభ మె, వనజాక్షునిభక్తురాలు వదలుం డీమెన్. 71
చ. అనుటయు నింతమాత్రకె భయంపడువార మె చాలుఁ జాలు నీ
చెనఁటిని భక్తురా లనుచుఁ జెప్పినఁ జెల్లునె పాపవంతులన్
బొనరుపఁ బుణ్యవంతులను బుణ్యులఁ బాపులఁ జేయ బ్రహ్మకై
నను దర మౌనె పొండు గమనంబున కడ్డము పెట్టకుండఁగన్. 72
చ. అని యమదూత లాడుటయు నంబుజలోచనభృత్యు లాగ్రహం
బున గద లెత్తి పైనిఁ బడి మోఁదఁ దదాహతి కోర్వలేక యా
వనితను వీడనాడి సమవర్తిభటుల్ చని స్వామిచెంతకున్
వినిచిరి రోదనధ్వనులు విన్నగలింప నుదంత మంతయున్. 73
సీ. అది యంతయును విని యంతకుం డడఁగించు, కొని పొంగి పొరలెడిక్రోధ మెల్లఁ
జిత్రగుప్తునిఁ జూచి చెప్పు మావేశ్య చే, సినపుణ్య మేమిరొ యనుచు నడుగ
నతఁడు కై మోడ్చి యి ట్లనియె మహాస్వామి, విన్నవించెద నున్నవిషయ మెల్ల
నాధనకామిని యాచరింపనియట్టి, పాతకంబులు లేవు భూతలమునఁ
గీ. గాని యొకనాఁడు జారసంగమముకొఱకు,నరుగుచును విష్ణుదేవాలయమున నాఁగి
క్షణము గావించి తాంబూలచర్వణంబు, రాచెఁ దద్భిత్తికకుఁ గరాగ్రస్థసుధను.
క. ఆపుణ్యముచేతను దన, పాపము లన్నియును బోయి పరమపదంబున్
బ్రాపింపఁ దగినయోగ్యత, యాపడఁతికిఁ గలిగె ననుచు నంతకుఁ డంతన్. 75

సీ. అంతమాత్రకె యింతమహాత్మ్య మొదవు
నింక విష్ణ్వాలయము నిల నేర్పరించు
వారలమహాత్మ్య మే మనవచ్చు ననుచుఁ
బొగడుచును విమాననిజకృత్యమునకు డిగిరి. 76

ఆ. అచట విష్ణుదూత లాపఠించెని రాజ, హంసయుక్త మైనస్యందనమునఁ
గూరుచుండఁ బెట్టుకొని పోయి రంపిరి, క్షేమముగను విష్ణుధామమందు. 77

క. అంతట గోవిందుం డా, కాంతకు దర్శన మొసంగి గౌరవమున నీ
వింతి వసియింపు మిచటనె, సంతతమును ననుచు నాత్మసన్నిధి నునిచెన్. 78

సీ. అనుటయును శౌనకుం డిట్టులనియె సూత, తెలుపు మేపుణ్యకర్మంబువలనఁగలుగఁ
గలదొ గోలోకవాసభాగ్యంబు నాఁగ, నమ్మహర్షికి సూతుఁ డి ట్లనియె నపుడు.

— : గోలోకప్రాపకపుణ్యకథనము : —

క. మునినాథా విను మిప్పుడు, నను నీ వడిగినవిధంబుననె పూర్వము బ్ర
హ్మను నారదుఁ డడుగుటయును, వనజభవుం డిట్లు మునివరునకుఁ జెప్పెన్. 80

క. ఒకసమయంబున మర్జను, లొకకొందఱు సంఘములుగ నొనగూడి ధరన్
బెకలింపఁ దొడఁగ మేదిని, యొకగో వయి వచ్చి శరణమొందెను నన్నున్.

ఆ. అపుడు నేను శౌరియంతికమున కేఁగి, విన్నవించినాఁడ విషయ మెల్ల
నాలకించి కృష్ణుఁ డడుగు నిూ వమరుల, తోడ భువికి నేను గూడ వత్తు.

క. అని చెప్పి నాకుఁ దనకాం, తను రాధను బిలిచి దేవి ధరణీభారం
బును దీర్ప నేను బుడమికిఁ, జనుదెంచెద నీవు మొదటఁ జను మక్కడకున్.

గీ. అనుటయును రాధ ప్రియునియాజ్ఞను ధరించి, భాద్రపదశుక్లాష్టమీదినవాభాగమందుఁ
బొడమె వృషభానురాడ్యజ్ఞభూమిలోనఁ, గనుల మిఱుమిట్లుగొలిపెడికళలతోడ.

గీ. అపుడు వృషభానునరపాలుఁ డాపెమూర్తి, నెత్తుకొని వచ్చి సంతసం బెసఁగ లోత్తఁ
దనవధూమణి కీయ నాతన్వి పెనిచె, బాల నజుచేత నిడికొని ప్రాణముగను. 85

గీ. ఆమె యావిర్భవించినయట్టిదినము, కృష్ణునిమనంబునకు బహుప్రీతికరము
కాన రాధాష్టమీవ్రతకార్యమునను, గలుగు గోలోకవాసభాగ్యంబు వత్స.

సీ. వచ్చు రాధాష్టమీవ్రతముచే గంగాది, సకలతీర్థస్నానజనితఫలము
వచ్చు రాధాష్టమీవ్రతముచేఁ గన్యాస, హస్రప్రదానసంప్రాప్తఫలము
వచ్చు రాధాష్టమీవ్రతముచే మేరుస, మానసువర్ణప్రదానఫలము
వచ్చు రాధాష్టమీవ్రతముచే నేకాద, శీసహస్రవ్రతార్జితఫలంబు

గీ. కాన రాధాష్టమీవ్రత మేనికృష్ణు, లేని యొకసారి యొనరించిరేని చాలుఁ
గోటిజన్మార్జితాఘంబుఁ గూలఁద్రోసి, విష్ణుపురసౌధములలోన విహృతి సలుప.

సీ. పూర్వము గృతయుగంబునను లీలావతి, యను నొక్క వేశ్య నానాఘములను
గావించుచును నొక్క దేవాలయములోన, దైవికంబుగ నొకతరుణమందు
రాధాష్టమీ మహావ్రతము గావించెడి, బహుజనంబులసమీపమున కేఁగి
వారికిఁ బ్రణమిల్లి మీరు చేసెడికార్య, మెయ్యది దీనిచే నేమి కలుగు
గీ. ననుచు వినయంబుతోడను నడుగ వార, లిట్లు వచియించి రాదర మెసక మెసఁగ
మెలఁత యియ్యది రాధాష్టమీవ్రతంబు, వృజినవారాశిగట్టు చేరఁజేయుతరణి.
వ. ఈవ్రతంబు బ్రహ్మహత్యాపాపంబును గోహననపాపంబును స్త్రీవధపాపంబును
గురుతల్పగమనపాపంబును బరస్త్రీహరణపాపంబును స్వర్ణాపహరణపాపంబును
విశ్వాసఘాతజనితపాపంబును మున్నగు నశేషపాపంబులును రూపుమాపి గోలో
కంబను విష్ణుపురంబున వసియింపం జేయు. 89
గీ. భాద్రశుక్లాష్టమీదివాభాగమందు, రాధ యుదయించినట్టికారణముచేత
నాచరించుచునున్నార మీవ్రతంబు, నేఁడు పెద్దలు చెప్పిననియతితోడ. 90
క. అనుటయు లీలావతి తన, యొనరించిన పాతకముల కొనగూడెను నా
శనకాలం బనుకొనిచ, య్యన వారలతోడఁ జేసె నావ్రత మచటన్. 91
గీ. వ్రతము నొనరించి యింటికి వచ్చి కొంత, కాలమున కాధనాంగన కాలధర్మ
మొందుటయు యమదూతలు ముందు వచ్చి, పాశములచేతఁ గట్టి రాపడఁతి నంత.
గీ. విష్ణుదూతలు వచ్చి యావేశమునను, యమభటులఁ బాఱఁద్రోలి పాశములుద్రెంచి
యానెలంతను దివ్యవిమానమందు, నునిచికొని వేగ గోలోకమునకుఁ జనిరి. 93
క. అంతట రాధాకృష్ణుల, చెంతను వసియించి పణ్యసీమంతిని య
త్యంతప్రమోదమునఁ గ, ల్పాంతరములు గూడ క్షణము లట్టులు గడపెన్. 94
క. ఏతద్వ్రతమాహాత్మ్యము, శ్రోతల కిహపరములందు సుఖ మొనగూర్చున్
జేతనుల కింతకంటెను, బాతకశమమునకు లే దుపాయము వత్సా. 95
క. అనవుడు విని ముని హర్షిం, చెను నావుడు శౌనకుండు చెప్పుము సూతా
మును దేవాసుర లేకత, మునఁ జేసిరొ యబ్ధిమథనమును నని యడుగన్. 96

—: సముద్రమథనవృత్తాంతకథనము :—

వ. సూతుండు శౌనకున కిట్లనియె. 97
సీ. అత్రితనూభవుం డైనదుర్వాసుండు, సంచరించుచు ధరాచక్ర మెల్ల
నొకనాఁడు స్వర్గంబునకుఁ బోయి యొకచోట, నొక్కవిద్యాధరి యుండఁ జూచి
యట కేఁగి తత్కరంబం దద్భుతముగ వె, లైడిపారిజాతమాలికను గాంచి
యాదండ నా కీయు మని యామె నర్థింప, నాబోటి భక్తితో నతని కిచ్చె
గీ. నది గొని తపోధనుఁడు చెప్పనలవిగాని, హర్షమును జెందుచును నంతరంగమందుఁ
బిచ్చివాని కటాక్షంబున మెచ్చుకొనుచుఁ, ద్రిదశపురవీథులం దెల్లఁ దిరుగఁ జొచ్చె.

సీ. ఆపగదిని జాలసేపు మర్త్యాసుండు, చరియించి చరియించి శ్రమము నొంది
యతిలక్ష్మి నైరావతాహూతునకై వచ్చు, సంక్రందనునకు నొసంగె దాని
నాదామమును గొని యమరాధిపుండు తన, దంతావళంబుమూర్ధమున వైచె
నంత నామాల నాదంతి తొండముతోడఁ, ద్రెంచి గిజ్జునఁ ద్రిప్పి క్రిందఁ గొట్టె
గీ. నది కనుంగొని యమర్త్యుని యాగ్రహమున, శాపము నొసంగె నాపాకశాసనునకు
నీకుఁ గలలక్ష్మి తొలఁగును గాక యనుచు, నంత నమరాలయైశ్వర్య మంతరించె.
గీ. అపుడు సుర లెల్ల క్షుత్పిపాసార్త లగుట, నిలువఁజాలక విష్ణుసన్నిధికిఁ బోయి
విన్నవింపంగ జరిగినవిషయ మెల్లఁ, గృష్ణుఁ డాలించి కరుణార్ద్రహృదయుఁ డగుచు
గీ. అసురులును మీరలును గూడి యమరులార
మంథదండంబుగను జేసి మందరమును
భుజగరాజును దద్దామముగను జేసి
చిలుకుఁడు పయోంబురాశిని సిరి లభించు. 102
గీ. కదలిపోకుండ మందరక్ష్మాధరమును, బృష్ఠభాగంబుపైని నిల్పెదను నేను
గచ్ఛపాకారమునఁ జొచ్చి కడలిలోన, ననుడు ధైర్యంబుతోఁ బోయి యమరులెల్ల.
వ. దానవులతోడ సఖ్యంబు గలిగించుకొని తత్సాహాయ్యంబున మందరపర్వత
మును బెకలించి తెచ్చి మంథదండంబుగా క్షీరసాగరంబునం బడవైచి దానికి
నాగేంద్రునిఁ ద్రాడుగాఁ జుట్టి తన్ముఖదేశంబును దైత్యులును దత్పుచ్ఛదేశం
బును దామునుం బట్టికొని యేకాదశీపర్వంబునందు మథియింపఁ జొచ్చుటయు
నందు మొదటఁ గాలకూటం బుదయించె. 104
క. జ్వాలనమును గ్రక్కువిషమును, దిలకించినమాత్రముననె దేవాసురకో
టులు పరువులెత్త సాగిరి, జలనిధిమథనంబు మాని సంత్రాసమునన్. 105
గీ. అపుడు శంకరుఁ డేతెంచి యడల వలదు, రండు పో నేల యింతమాత్రమున కనుచు
నెదనునామత్రయుని జపియించుకొనుచు, గుటుకునను మ్రింగెనా కాలకూటవిషము.
క. నామత్రయవిద్యాజప, సామర్థ్యముచేత నావిషము విషకృత్యం
బేమియును జేయఁ జాలక, కామారిగళంబునందుఁ గదలక నిలిచెన్. 107
క. అప్పుడు విస్మయ మొందుచుఁ, జప్పునఁ జనుదెంచి సురనిశాచరవర్గం
బెప్పటియట్టులె నిలఁబడి, యప్పతిని మథింపఁదొడఁగె నాసమయమునన్. 108

—: వారుణీ దేవీ ప్రాదుర్భావము :—

గీ. స్ఖలితగతితోడ నెఱ్ఱనికనులతోడ, విరియఁబాఱినమూర్ధజవితతితోడ
నేకవస్త్రంబుతోడను నేఁగుదెంచె, వారుణీదేవి బిరబిర వార్ధినుండి. 109
గీ. అట్లు చనుదెంచి యామె దేవాసురులను, గాంచి యిట్లనియెను నన్నుఁ గైకొనియెడి
వారికిచ్చెద బలము నవ్వారి గాఁగ, ననుడుఁ గొనరైరి సుర లామె నశుచియగుట,

క. అంతట దైతేయులు ద, త్కాంతావచనములు తమకుఁ గలిగింపంగన్
సంతసమును గొని రామెను, గంతు లిడుచు నంత నాను కల్లుగ మాటన్.

చ. అపు డది ద్రావి కైపు తల కానఁగ నేత్రము లెఱ్ఱవాఱఁగాఁ
ద్రప విడనాడి ప్రేలుచును దర్పముఁ జూపుచుఁ దూలిపోవుచున్
శపథములన్ బొనర్చుచును జంకలు గొట్టుచుఁ దాఱుమాఱుగా
నపగతచిత్తులై పెనఁగులాడుచు వార్ధిని ద్రచ్చి రంతటన్. 112

—: జ్యేష్ఠాదేవీ ప్రాదుర్భావకథనము :—

సీ. రక్తలోచనయు జరద్దేహయును గళా, శూన్యాస్యయును మహాశోకయుతయు
జ్యేష్ఠయు నగునలక్ష్మిదేవి జనియించి, యనిమిషులను జూచి యమరులార
నేను గావింపఁగా నైనకార్యం బేమొ, తెలుపుఁడు శీఘ్రంబ సలుపుదాన
నని పల్కుటయును నావనితయమంగళ, విగ్రహంబును జూచి విబుధు లెల్ల

గీ. తల్లి నీకాలు పెట్టినతావు లెల్ల, నిప్పు లేకుండ మండుట నిశ్చయంబు
కాన నీ విచ్చటను జేయ నైనయట్టి, కార్య మెయ్యదియును మాకుఁ గానరాదు.

—: జ్యేష్ఠాదేవీనివాసస్థానకథనము :—

సీ. సంధ్యలయందు భోజనము సేసెడియింటఁ, గలహంబు లొనరించునిలయమునను
ననృతనిష్ఠురభాష లాడెడిగృహమునఁ, గితవులు నివసించుగేహమునను
బరదారపరధనపరు లుండుచోటను, దానధర్మంబులు లేనియెడను
బితరుల సంతోషపెట్టనినెలవున, వేదదూషకు లుండువేశ్మమునను

గీ. బొగ్గులు కపాలములు గేశములును దుషయు
ధూళియును నస్థులును గలయాలయమున
భూసురాతిథిదేవతాపూజ లేని
సదనమందును నుండుము శాశ్వతముగ. 114

గీ. గృంజనంబు ఛత్త్రాకము శ్రీఫలంబు, పూతికాదళమును గలంబువు పలాండు
వును నలాబువుఁ దిలపిష్టమును భుజించు, వారలగృహంబులను నుండవలయు నీవు.

క. ఒనరుతురొ యెవరు రదధా, వనమును నంగారలవణవాలుకలను నా
తనుధారులయిండ్లను నీ, వనిశముఁ బెద్దమ్మ యుండుమమ్మా పొమ్మా. 116

గీ. మఱియు వృద్ధజనంబుల మనుపకుండు, సదనమునఁ బాదశౌచంబు సలిపికొనక
భోజనము చేసెడిపుగారమునను నీవు, పాదుకొని యుండవలయును బాయకుండ.

వ. అని పలికి యథాపూర్వంబుగ సింధుమథనంబు గావించుచుండుటయు నందు
నైరావతంబును నుచ్చైశ్శ్రవంబును బారిజాతంబును గామధేనువును ధన్వంత
రియును నచ్చరలును నావిర్భవించిరి. 118

గీ. అంత ద్వాదశినాఁ డుదయంబునందు
లక్ష్మియును దులసియు మృగలాంఛనుఁడును
నమృతమును బుట్టుటయు మహోత్సవ మొదవఁ
దమమనోరథసిద్ధిని దలఁచికొనుచు. 119

క. నుతియించిరి లక్ష్మిని న, ద్భుతముగ సుర లెల్లఁ దన్నుతులు వీనులకున్
గుతుకంబు గొలుప భార్గవి, యతిముదమున వారి కభయహస్త మొసంగెన్.

ఉ. అంతట నచ్యుతుం డచటి కచ్చెరువంబుగ నేఁగుదేరఁగా
నెంతయు భక్తితోడ సుర లెల్లఁ బ్రణామము లాచరించి స
ర్వాంతరగామి వీ వెఱుఁగనట్టి దొకింతయు లేదు దేవ మే
మెంతటివార మన్నిటి కతీతుఁడ వైననినున్ నుతింపఁగన్. 121

గీ. ఆదినారాయణుండ వైనట్టినీకె, యుద్ధారాలు గ్రహింప నీయాదిలక్ష్మి
వనజదళనేత్ర శ్రీపతి యనెడికీర్తి, యిప్పటిది గాదు నీ కింక నేమి చెప్ప.

చ. అనుటయు లక్ష్మి వంచికొని యాననమున్ ద్రపచేత శౌరి కి
ట్లనియెను దేవ జ్యేష్ఠ యగునామెకుఁ బెండిలి చేసి పిమ్మటన్
నను గ్రహియించు టర్హము సనాతనధర్మము లెల్ల నుత్తమం
గినమహనీయమూర్తి కెఱిఁగించెడిదానవె నేను నాథుఁడున్. 123

క. హరి మదిలో హర్షించుచు, సరగున నుద్దాలకున కొసంగి యలక్ష్మిం
బరిణయ మొనర్చి ముందటఁ, దరువాతఁ బరిగ్రహించెఁ దా నాలక్ష్మిన్. 124

—: వి ష్ణు వు మో హి నీ రూ ప ము ం దా ల్చు ట:—

సీ. అంతట దైతేయు లాదితేయులు గూడ, నమృతంబు గ్రోలెడినాసతోడ
మేము ముందనుచును మేము ముం దనుచును, గలహించుకొనుచుండు కాలమునను
విష్ణువు మోహినీవేషంబు దాలిచి, వచ్చుటయును జూచి వార లెల్ల
సుందరి నీవు మా కందఱకును బోయు, మమృతంబు గ్రోలెద మనుచుఁ గోర

ఆ. మొదట దేవతలను బిదప దానవులను, గూరుచుండఁ బెట్టి బారులుగను
బోయఁ దొడఁగె నమృతమును గలశంబుతో, మోహినీలతాంగి మురువుఱయమె,

గీ. అప్పు డమృతంబు ద్రావుచున్నట్టిసురల
పంక్తిలోపల నమరరూపమునఁ గూరు
చున్నస్వర్భానునకుఁ బోసె నుత్పలాక్షి
యమృతమును నాతఁ డది మ్రింగునంతలోన. 126

గీ. అతఁడు రాక్షసుఁ డనుభావ మవగతముగ
సూచన మొనర్చుటయు రవిసోము లామె

యాక్షేపంబునఁ గ్రోధతామ్రాక్షుం డగుచుఁ
గలశధారను మునిమోఁ దత్కాలంబున. 127

ఆ. తెగినశిరము రాహువుగను గేతువుగను, గాయ మయ్యె నప్పు డాయిరువురు
ప్రాణశక్తిచేతఁ బరువెత్తుకొని పోయి, రంత నాగ్రహమున నసుర లెల్ల. 128

క. అమరులపైఁ బటుటయు న, య్యమరులకును నసురులకును నయ్యెను యుద్ధం
బమితమ్ముగ నపుడు సురలకు, సమకూరెను జయము శౌరిసాహాయ్యమునన్.

క. అంతట నమృతనిరాశ, స్వాంతు లగుచు నసుర లెల్ల నరుగుటయును దై
త్యాంతకుఁడు సుధాకలశము, సంతసమున సురల కిచ్చి చనియె నిజేచ్ఛన్.

వ. అది మొదలుకొని రాహుకేతువు లమర్షభావంబున సూర్యచంద్రుల నప్పు
డప్పుడు గ్రసించుచు మ్రింగంజాలక విడిచిపెట్టు చుండిరి. 131

క. మునివర యేతచ్చరితం, బును వినువారలకు మంత్రములు సిద్ధించున్
ధనమును విద్యయు సంతును, నొనగూడును దుదకు ముక్తియును బ్రాప్తించున్.

వ. అనుటయు శౌనకుం డి ట్లనియె. 133

గీ. అతివ దేనఁ బతిప్రియ యగునొ దేనఁ, గన్యలకు మంచివరుఁడు సంఘటితుఁడగునొ
దేనిచే లక్ష్మి కలుగునొ దేనిచేత, సిరి తొలంగునొ తెలియగాఁ జెపుము సూత.

—:లక్ష్మీవారవ్రతమాహాత్మ్యము:—

సీ. అనవుడు సూతుఁ డి ట్లనియె మౌనివరేణ్య, విను మొక్కగాథ యీవిషయమందు
మున్ను ద్వాపరయుగంబున నుండె సౌరాష్ట్ర, దేశంబునందుఁ బృథ్వీశుఁ డొకఁడు
భద్రశ్రవుం డనంబడుపేర నతనికి, సురతిచంద్రిక యనుసుదతి యుండెఁ
బుట్టిరి వారికిఁ బుత్రు లేడ్వురు శ్యామ, బాలాఖ్య యగునొక్కబాలికయును

గీ. నట్టు లుండంగ నొక్కనాఁ డాదిలక్ష్మి, బ్రాహ్మణీవేషమును దాల్చి బయలుదేఱి
వచ్చి భద్రశ్రవునిగృహద్వారమందు, నిలిచి దౌవారికిని జూచి పలికె నిట్లు.

గీ. ద్వారరక్షిణి లోనికి దారి నిమ్ము, సురతిచంద్రికకడకు నే నరుగవలయు
ననుటయునుఁ దల్లి నీవు మాయమ్మవలన, నేమి పని నీచరిత్రము నెఱుఁగఁ జెపుమ.

వ. అని దౌవారికి యడుగుటయును నమ్మహాలక్ష్మి యాపె కి ట్లనియె. 137

క. దయితుఁడు భువనేశుం డా, హ్వాయము కమల ద్వారవతి నివాసము నాకున్
బయి నేల పెక్కుమాటలు, స్వాయముగ నే వచ్చినట్టిసంగతి వినుమా. 138

సీ. ప్రాగ్జన్మమందు మీరాజ్ఞి వైశ్యాంగన, యై పుట్టి పతితోడ ననుదినంబుఁ
గలహించుచుండఁ దత్కాంతుఁ డామెనుగొట్టి, యీడ్చించె నొక్కనాఁడింటినుండి
యామె యేడ్చుచు వీథియందుఁ దుండఁగాఁ జూచి, పోయి తత్స్వామిహృదయమునకు నేను
గనికరంబునఁ దోడుకొని వచ్చి యాయింటి, కొనరింపఁ జేసితి నొక్కవ్రతము

సీ. తద్వ్రతమహత్త్వమునను నాతన్వి సర్వ, కష్టములు దాఁటియొకకొంత కాలమునకు
ధవునితోడను మరణించెఁ దత్క్షణంబ, క్రమ్ముకొని రామెచుట్టును గాలభటులు.
గీ. అట్టితఱిని లక్ష్మిదూత లరుగుదెంచి, తరిమి యమదూతలను భక్తి దార్కొనంగ
నునిచికొని యామెను నెక్కకనకరథము, నందు లక్ష్మీపురంబున కరిగి రంత.
ఆ. ఆమహావ్రతంబు నాయింతి చేసెనో, యెన్నిమార్లు భక్తి యినుమడింపఁ
గాఁపురముగ నన్ని కల్పసహస్రము, లచట నుండి సుఖము లనుభవించి. 141
ఆ. పుణ్యశేషభోగమునకు నేఁ డుదయించె, నామె సురతిచంద్రికాహ్వయమునఁ
గాని మఱచిపోయెఁ గావించినవ్రతంబు, నది యనర్థమూల మగును జూవె.
గీ. కాన నావ్రతమును నేఁడు కనికరమున, నామె కుపదేశ మొనరింప నాత్మ నెంచి
యేఁగుదెంచినదాన నే నిటకు ననుఁడు, నాపురంధ్రిని మరల నిట్లడిగె ద్వారస్థ.
గీ, అమ్మ యావ్రత మెపుడు చేయంగ వలెనో, దానిపే రేమొ దానికి దైవ మెవరొ
తెలుపు మన్నియుఁ గూడను దేటపడఁగ, ననుటయును జెప్పఁదొడఁగె నిట్లాపె కామె.

—: లక్ష్మివారవ్రతకథనము :—

క. విను లక్ష్మివారవ్రత, మనఁబడు నది యది యొనర్ప నగుఁ బ్రతివర్షం
బును మార్గశీర్షమాసం, బున గురువాసరమునందుఁ బూర్వాహ్ణమునన్. 145
క. దానికి దేవత భార్గవి, గానం బూజింపవలయుఁ గడుభక్తిని ల
క్ష్మీనారాయణులను నొక, స్థానంబున నిలిపి విధివిధానముతోడన్. 146
గీ. అట్లు పూజించి నైవేద్య మాచరించి, భూసురులు దాను బతియును బుత్రమిత్ర
బంధుభటవర్గమును భుజింపంగ వలయు, నానివేదితభక్ష్యభోజ్యాదు లెల్ల.
వ. ప్రథమవారంబునందుఁ బైనిఁ జెప్పంబడినవిధంబున నిర్వర్తించి ద్వితీయ
వారంబునఁ జిత్రధూళీప్రశస్తంబులును గోధూమనిర్మితంబులును నగుభ్రాష్ట్రంబు
లచేతను దృతీయవారంబునందు ఖండశర్కరామిశ్రితం బగుదధ్యోదనంబుచేతను
జతుర్థవారంబునందు శ్యామాకశాలికాసారంబులచేతను మహాలక్ష్మికిఁ దృప్తిం
గావించి యంతంబునఁ దత్ప్రీతికొఱకు బ్రాహ్మణులకు వస్త్రాలంకారభోజనభాజ
నంబులచేతను నానావిధఫలంబులచేతను దక్షిణాతాంబూలంబులచేతను సంతో
షంబు గలిగింపవలయు.

గీ. అనుటయును దల్లి నేవచ్చునంతదాఁక
నిచ్చటనె యుండు మని చెప్పి యేఁగి ద్వారస్థ
రాణి కెఱిఁగించుటయును నారాణి క్రోధ
మునను జనుదెంచి యాద్విజాంగనను గాంచి. 149
క. నా కుపదేశము చేయుమి, వేకవతివె నీవు కపటవేషవు నిన్నా
లోకింపరా దటంచును, జీకొట్టుచు నొక్కదెబ్బ చెంపను గొట్టెన్. 150

ఆ. అట్లు కొట్టి చనియె నార్యా యంతట, నచటు విడిచి యేడ్చుచును గమల
యరుగుచుండ నాట లాడుచుఁ గనుఁగొని, శ్యామబాల వచ్చి యామెకడకు.

—: లక్ష్మీవార వ్రత మాహాత్మ్యము :—

వ. తద్వృత్తాంతం బంతయు నెఱింగి తనతల్లి కావించినయపరాధంబునకు సంతాప
ముం జెంది స్వగృహంబునకుం గమలాదేవిం దోడ్కొని చని యర్ఘ్యపాద్యాదు
లచే గౌరవించి స్వర్ణపీఠంబున నధిష్ఠింపంజేసి సప్రశ్రయంబుగా నామెవలన
లక్ష్మీవారవ్రతోపదేశముం బడసి యథావిధిగ నావ్రతంబు మూఁడువారంబు
లాచరించుటయు నాల్గవవారంబులోపలన శ్యామబాలకు లక్ష్మీప్రసాదంబువలన
సిద్ధేశ్వరదేవమహారాజపుత్రుం డగుమాలాధరుండు భర్తగాఁ బ్రాప్తించి
యామెను మహావిభవంబుతో నిజమందిరంబునకుం దోడ్కొని చనియె. 152

గీ. అంత భద్రశ్రవునిరాజ్య మరులచేత
నపహృతం బగుటయు దీనుఁ డగుచు నతఁడు
కాంత నొకయింట నునిచి యేకాంతముగను
బోయి జామాత యుండినపురమునకును. 153

గీ. తనకుఁ గలిగినదీనదశను దలంచి, కొనుచు జామాతృమందిరంబునకుఁ బోవ
సిగ్గుపడి తత్పురతటాకసీమయందుఁ, గూరుచుండెను బడుగురు గూడి చూడ.

వ. ఆసమయంబున జలాహరణార్థంబు శ్యామబాలాదాసీజనంబు లాతటాకంబున
కరుదెంచి జీర్ణవస్త్రోపేతుండును శల్యావశిష్టుండును రాజలక్షణలక్షితుండును నగు
నాతనిం జూచి నీ వెవ్వండ వని యడుగుటయు. 155

క. జనకుఁడను శ్యామబాలకు, నని యతఁడు వచించుటయును నాశ్చర్యముఁ జెం
దినవార లగుచు వారలు, చని చెప్పిరి శ్యామబాలసాన్నిధ్యమునన్. 156

గీ. అంతటను శ్యామబాల గజాశ్వభృత్య, వర్గమును బంపి నృపగౌరవంబుతోడ
జనకపాదుల రావించి స్వగృహమునకుఁ, దెలిసి తదవస్థ నాత్మలోఁ గళవళించి.

గీ. షడ్రసోపేత మైనభోజనముచేత, రాజయోగ్యము లైనవస్త్రములచేతఁ
జాలు ననునంతద్రవిణసంచయముచేత, (శ్రీ)చ్యుతుం డైనజనకునిఁ దృప్తిపఱిచె.

సీ. అంత భద్రశ్రవుం డానందమును జెంది, తనయ కల్లునకు దీవన లొసంగి
రథముపైఁ గూర్చుండి రాజాధిరాజు నాఁ, జనుదెంచి వేడ్కతో స్వపురమునకుఁ
దనకుఁ దనూజాత యొనరించినట్టిస, త్కృతుల నెల్లను నిజసతికిఁ జెప్పి
విప్పించుటయును ద్రవిణసంచికల నంపు, నింపుగా బొగ్గులు నిండియుండె

గీ. నంత నాతండు కడుశోక మామతిల్లి, చేయునది యేదియును దనచిత్తమునకు
గోచరింపమిఁ జేసి సిగ్గును దొఱంగి, పంపెఁ దనకాంతను గుమారిభవనమునకు.

క. అంతటను సురతిచంద్రిక, సంతోషముతోడ గ్రామనగరంబున కే
కాంతముగ నరిగి తమన్న, కాంతం బంతయును దెలిపె నాత్మోద్భవకున్. 160

ఉ. అప్పుడు శ్యామబాల మనమందున విషాదముఁ జెంది యోటికిఁ
జొప్పునఁ దల్లిదండ్రులకు సోఁకెనో మద్దోష యంచు నంత నా
తప్పు గ్రహించి వెంటనె వ్రతం బొనరింపఁగఁ జేసి తల్లిచే
నొప్పుగ నాయమన్ బనిచె నూరికిఁ బౌరులు చూచి మెచ్చఁగన్. 161

గీ. సురతిచంద్రిక యూరికి నరుగుదెంచు
నంతలోపల గతియించినట్టిరాజ్య
మంతయును గూడఁ బ్రాప్తించె నద్భుతముగఁ
గలదె లోపంబు లక్ష్మ్యనుగ్రహము గలుగ. 162

క. ఈకథ వినువారల కిహ, లోకంబున సకలసుఖములును గలిగి తుదిన్
జేకూరితీఱు లక్ష్మీ, లోకము వ్రతపరుల కింక లోపము గలదే. 163

—: కృష్ణాష్టమీ వ్రత మాహాత్మ్యము :—

క. అని చెప్పుటయును శౌనక, మునివరుఁ డిట్లనియె సూత మోదం బయ్యెన్
వినఁ గృష్ణాష్టమిమహిమము, వినిపింపుము మాకు దానివిషయము నెల్లన్.

క. అనవుడు సూతుం డిట్లని, యెను మానివరేణ్య నన్ను నీ వడిగినయ
ట్లనిమిషముని మున్ను విరిం, చిని నడుగుడు ధాత యిట్లు చెప్పఁదొడంగెన్.

గీ. శ్రావణంబునఁ గృష్ణపక్షంబునందు, రోహిణీతారకాసమారూఢ మైన
యష్టమీతిథినాఁడు రాత్ర్యుపవాసమున, నసను గృష్ణాష్టమీవ్రతం బాచరింప.

గీ. కృష్ణజన్మాష్టమీవ్రత మెన్నఁ జేని, యొక్కపరిఁ జేయునెడ నది యొకటె చాలు
సకలపాపంబులను భస్మసాత్కరించి, తావృకోలుపంగ వైకుంఠధామమందు.

సీ. అనుదినంబును గోసహస్రంబు పాత్రుఁడై, నట్టివిప్రున కిచ్చునట్టిఫలము
తల్లిదండ్రులకు విద్యాదాతకును భక్తి, చేత శుశ్రూష చేసినఫలంబు
రేవాసరస్వతీత్రిపథగాతోయంబు, లందుఁ దీర్థం బాడినట్టిఫలము
శ్రద్ధతోడను నిండుసంతోషయంబున శ్రాద్ధ, మును బితరుల కొనర్చినఫలంబు

గీ. నాపదుద్ధారమునఁ గల్గినట్టిఫలము, యజ్ఞకోటిని గావించినట్టిఫలము
కన్యకాకోటిశతదానజన్యఫలము, వచ్చితీఱు జయంత్యుపవాసమునను. 168

గీ. చలుపునో జయంతి నెవఁడు నిచ్చలును వాని
దేహమున నుండుదురు సర్వదేవతలును
సకలతీర్థంబులును నెల్లసుకృతములును
నధివసించును వానిగేహంబునందు. 169

క. హరివాసరమునఁ బోలెను, నరకంబునఁ గూలు భోజనము చేసినచో
నరుఁడు జయంతీదినమున, దరి లేనివిషాద మొదవఁ దనవంశముతోన్. 170

వ. మున్ను స్కందుండును గౌతముండును గార్గ్యుండును జామదగ్న్యుండును వాల్మీ
కియుఁ గార్తవీర్యార్జునుండును గర్గుండును సగరుండును గాకుత్స్థుండును దిలీ
పుండును మున్నగువారలు జయంతీవ్రతంబు గావించి సిద్ధిం బడసిరి. 171

గీ. అనఘునిఁగఁ జేయుఁ బతితు నైనను గురుద్రోహి
జనితు నైనను గుమతి నైనను జయంతి
ధన్యుఁ డగుచును వైకుంఠధామమునకు
నరుగును జయంతి సలిపినయట్టివాఁడు. 172

ఆ. ధనసమేతుఁ డగును ధనకాంక్షి పుత్రులఁ, బడయుఁ బుత్రకాంక్షి వడయు ముక్తి
మోక్షకాంక్షి నేమమున జయంతీవ్రతం, బాచరించెనేని యనుపమంబు. 173

గీ. కోటినియమంబులేనియుఁ గోటివ్రతము, లేనియును గోటితీర్థములేని సాటి
గా వొకజయంతిషోడశకలకుఁ గూడ, దానిమహిమంబు వర్ణింపఁ దరము గాదు.

క. కలుగ దపత్యనిరోధము, కలుగదు వైధవ్యమార్తి గలుగదు కలహం
బులు గలుగవు దారిద్ర్యము, గలుగదు సలిపినను భక్తి గలిగి జయంతిన్.

క. సలిపెద జయంతి ననుచుం, దలఁచినమాత్రమున వానిదరి కేతేరన్
గలుగక ధైర్యము యమభృ, త్యులు గజగజ వడఁకుచుందు రుల్లములందున్.

వ. మున్ను దిలీపుండు నీవు నన్నడిగినయట్లు వసిష్ఠమహర్షి నడుగ నమ్మహర్షి
యాతని కిట్లనియె. 177

సీ. వినుము మహారాజ మును వసుంధర బాధ, పడ లేక కంసునిపాలనమునఁ
గన్నీళ్లు కాల్వలు గట్టఁగా నేడ్చుచుఁ, గైలాసమున కేఁగి కాంచి శివునిఁ
గావించి ప్రణతులు దేవ కంసునిబాధ, భరియింపలేక నీపాలఁ బడితిఁ
గావుము నన్నని కాళ్లపైఁ బడుటయు, సకరుణస్వాంతుఁడై శంకరుండు

గీ. కూడి బ్రహ్మాదిదేవతాకోటితోడ, క్షీరసాగరశయనునిచెంత కరిగి
నుతుల నొనరించి సుప్రసన్నుని నొనర్చి, యిట్లు వచియించెఁ బుండరీకేక్షణునకు.

క. గరుడధ్వజ నే నొసఁగిన, వరమునఁ గంసుఁడు మదించి వసుమతికి మహా
పరిభవ మొనర్చె మన మే, వరుసను నైనను వధింప వలయును వానిన్.

గీ. ఆతనికి భాగినేయునిచేతఁ దక్కఁ, బరునిచే లేదు మరణ మేపగిది నైనఁ
గాన నీ వేఁగి దేవకీగర్భమందుఁ, బుట్టవలయును దీర్పంగ భూభరంబు. 180

క. అనుటయు జనార్దనుం డి, ట్లనియె మహాదేవ తద్యథార్థము సాయం
బొనరింపఁగ శర్వాణిని, బనుపుము నావెంటఁ జాలుఁ బని సాధింపన్. 181

గీ. అనుటయు నట్లై యని శశాంకార్ధమౌళి, యరిగెఁ గైలాసమునకు బ్రహ్మాదులెల్లఁ
జనిరి స్వస్వస్థలంబుల కనుపదంబ, మధుర కేతెంచె నుమతోడ మాధవుండు.

—: శ్రీకృష్ణజననము :—

సీ. చేరి తనమాయ నోరలు వీక్షింపకుండ, శిశువు నున్నట్లె చేతులచేత నెత్తి
తొడలపైఁ బెట్టికొని తల్లితో యమునను, నిముడుచును మేను మెల్లగా నిదుర లేపి.
ఆ. చన్ను నోటఁ బెట్ట వెన్నుఁడుకన్నులు, తెఱచి చూచి నవ్వి దెసలు వెలుఁగ
సర్వ మెఱిఁగినట్టిసర్వేశుఁ డగుటను, బీల్చె స్తన్య మాపె ప్రేవు లురల. 194

వ. అప్పుడు పూతన రోదసీకుహరంబు ప్రతిధ్వనింప హాహాకారంబు చేయుచు నిజరాక్షసాకారంబుతోడ నేలపై వ్రాలి ప్రాణంబు లుజ్జగించి సద్గతిం బొందె. తరువాతఁ గృష్ణుండు శకటభంజనంబును దృణావర్తహననంబును గాళియ మర్దనంబును గావించి మధురాపురంబున కరిగి లోకకంటకుం డగుకంసుని సంహరించి లోకకళ్యాణంబు చేసూర్చె.

గీ. అట్టిమహనీయుఁ డగుకృష్ణుఁ డవతరించి, నట్టిదినముఁ గావించినట్టివ్రతము
పాపముల నన్నిటిని రూపుమాపి యెట్టి, ప్రాణినేనియు వైకుంఠపదముఁ జేర్చు.

వ. తృతీయయును షష్ఠియును నష్టమియును నేకాదశియును బూర్వవిద్ధ యయ్యె నేని పరిహరింపం దగు ననుశాస్త్రముంబట్టి యష్టమి సప్తమీయుక్త యయ్యె నేని గ్రాహ్యంబు గాదు. రోహిణీయుక్త యగునష్టమి సప్తమీవిద్ధ యైనను గ్రాహ్యంబ. రోహిణీనక్షత్రంబు లేకున్నను నవమీయుక్త యగునష్టమి ప్రశస్తంబు. ఉదయమున నించుక యష్టమి యుండి మిగిలిన దంతయును నవమి యును ముహూర్తమాత్రము రోహిణియును నుండెనేని యది సంపూర్ణాష్టమి గనె గ్రహియింపం దగు. అందును బుధసోమవారంబులతోఁ గూడెనేని కోటి గుణితం బగు. 197

గీ. సప్తమీవిద్ధ యైనయష్టమి నరేంద్ర, కాదు గ్రహియింపఁగను సురాకణముతోడఁ
గలిసికొనియున్న గంగాంబుకలశమట్టు, లనుచుఁ జాలించుటయు నిట్టు లనియె తేఁడు

గీ. ఈవ్రతంబును మానీంద్ర యెవ్వరేని, చేసి కృతకృత్యభావముఁ జెందినట్టి
వార లుండినఁ దెలుపుము వారిమహిమ, వినఁగఁ గౌతూహలం బుద్భవించె నాకు.

క. అని యడుగుటయు వసిష్ఠుఁడు, వినుము మహారాజ యొక్కవృత్తాంతంబున్
వినిచెదను జిత్రసేనుం, డనియెడుతేఁ డొకఁడు పూర్వమం దిల నుండెన్. 200

గీ. వాఁ డగమ్యాగమనమును స్వర్ణచౌర్య
మును సురాపానమును మాంసభోజనమును
బ్రాణివధమును జేయుచుఁ బ్రతిపదంబు
విడిచి భయభక్తులను నేస్తు గడపు చుండె 201

సీ. అటు లుండ నొక్కనాఁ డాచిత్రసేనుఁడు, కలిసి కిరాతవర్గంబుతోడ
వేటకై యొకమహావిపినంబునకు నేగి, తిలకించి యొక పెద్దపులిని నచట

దానివెంటఁ బడి తిరుగుచుఁ బదునేడు, యామయామములుఁ జేసి యలసి సొలసి
క్షుత్పిపాసార్తనై కొనకు సంధ్యాకాల, మున యమునాతీరమునకుఁ జేరి
గీ. యచటఁ గృష్ణాష్టమీవ్రతం బాచరించు, చున్న గోపాంగనలఁ జూచి యన్నలార
యాఁకలికి నోర్వఁజాల నీయన్న మింత, పెట్టి నాప్రాణములు నిల్వఁబెట్టుఁ డనియె.
వ. అంత నవ్వారాంగన లందఱును నాపెని నవలోకించి యేకగ్రీవంబుగా ని ట్లనిరి.
సీ. నేఁడు కృష్ణాష్టమి నియమంబుతో మేము, వ్రతము చేయుచు నున్నవార మిచట
నీదినంబున భుజియించిన నది గృధ్ర, ఖర కాక గోమాంసఖాదనంబ
ప్రాణముల్ దేహంబునం దుండ నేఁ డుప, వాసంబు చేయనివాఁడు పాతకుఁడు
సమవర్తి చేయు శాసనము నేఁడు భుజించు, నట్టివారలకు దేహాంతమునను
గీ. కృష్ణజన్మాష్టమిని భుజియించువాఁడు
పతితులను జేయువాఁడు స్వపితృగణంబుఁ
బితరులకు వాఁడు శ్రాద్ధంబు పెట్టుటయును
దర్పణము చేయుటయును వ్యర్థంబ చూవె. 204
చ. అనుటయుఁ బ్రీతి సేసుఁడు యథార్థము నారసి క్షుద్వ్యథాభరం
బును సహియించికొంచు వ్రతముం బొనరించి వ్రతప్రభావసా
ధననిహతాఖిలాఘుఁ డయి తత్పితృవర్గముతోడఁ గూడి పో
యెను దివిషద్విమానమును నెక్కి యుపేంద్రునిరాజధానికిన్. 205
వ. మఱియును నిం కొక్కయుపాఖ్యానముం జెప్పెద వినుము. 206
సీ. మును హరిశ్చంద్రుఁ డనుజననాథుఁ డొక్కఁడు, సర్వసర్వంసహాచక్రమునకు
నేతయై యేలుచు నిఖిలజనంబుల, ననుభవించుచును సౌఖ్యముల నెల్ల
నొకనాఁడు విస్మయం బొంది నిజౌన్నత్య, మునకు దివ్యవిమానమున వసించి
యరిగి సనత్కుమారాశ్రమంబున కమ్మ, హర్షికి మ్రొక్కి సాష్టాంగముగను
గీ. మునివరేణ్య మదౌన్నత్యమునకు నేమి
హేతు వైయుండు నయ్యది యెఱుఁగఁ జెపుమ
యనుడు నమ్మౌని యతనివృత్తాంత మెల్ల
దివ్యదృష్టిని విలకించి తేటపడఁగ. 207
సీ. భూతలాధిప నీవు పూర్వజన్మంబున, జన్మించి వైశ్యవంశంబునందు
స్వకులవృత్తిని విడి సత్యనిష్ఠను నుండ, నొనగూడె నిఱుపేదతనము నీకు
నంతట నీవార లందఱు నినుఁ జూచి, హసియింపఁదొడఁగిరి యనుపదంబు
దానిచే వారిలోఁ దలయెత్తికొని నీవు, నిలువంగలేమి నాస్థలము విడిచి
గీ. యొక్కయడవికిఁ బోయి యం దొక్కహ్రదము
గానఁబడుటయు నందలికమలములను

గాసి చెకొని యుప వారిణాసి కేఁగి
విక్రయింపంగఁ దిరిగితి వీథు లెల్ల. 208

సీ. ఆదినంబున నొకఁ డైన సజ్జనులను, గొనమిఁ జింతిల్లుచును నీవు చనుచు నుండ
దైవికంబుగ భద్రవాద్యస్వనంబు, వినఁబడియె నీకు నొకయింట వీను లలర. 209

వ. అప్పుడు నీ వాగృహంబుకడ కేఁగి కాశీరా జగు నింద్రద్యుమ్నుని పుత్రిక యగు చంద్రావతి కృష్ణాష్టమీవ్రతంబు చేయుచుండం జూచి యాపద్మంబు లన్నియును గృష్ణునకు సమర్పించి యాదినం బన్నం బెచ్చటను లభింపకుండుటచే నుపవాసంబు గావించితివి. తత్పుణ్యఫలంబుగా నీ కీయుత్తమజన్మంబును మహైశ్వర్యంబును సత్యనిష్ఠయును సత్యహరిశ్చంద్రుఁ డనుభూరిప్రశస్తియునుం జేకూరె.

క. అనుడు హరిశ్చంద్రుం డు త, దనుమతి గొని వచ్చి యింటి కనువత్సరముం
బొనరించుచుఁ దద్వ్రతమును, గని యిహసుఖములను దుదకుఁ గాంచెను ముక్తిన్.

గీ. అరిగి మధురకుఁ గృష్ణముఖాంబుజంబు, స్వయముగను గాంచినఫలంబు సంఘటిల్లుఁ
జేసి యుపవాసమును సవిశ్వాసముగను, గృష్ణజన్మాష్టమి నొనర్చి రేని వ్రతము.

క. ఈకృష్ణాష్టమిమహిమము, నాకర్ణించిన నభీప్సితార్థము లెల్లన్
జేకూరు ననిన నింకను, జేకూరని దేది వ్రతము చేసినయెడలన్. 213

క. అనవుడు దిలీపుఁ డెంతయు, మనమున సంతసము నొంది మౌనీంద్రునకున్
వినయమ్మున మ్రొక్కి తదా, జ్ఞను గొని నిజనగరమునకుఁ జనియె మునీంద్రా.

వ. అని చెప్పుటయు నారదుం డమితాహ్లాదంబుతోడఁ దదనుజ్ఞం గొని చనియె.

గీ. అనుటయును శౌనకుం డిట్టు లనియె సూత
బ్రాహ్మణుఁడు శ్రేష్ఠుఁ డన్నివర్ణములలోన
ననుచు వచియింతు రతనిమహత్త్వ మేమొ
చెప్పు మొకసారి నాకు శాస్త్రీయముగను. 216

—: బ్రాహ్మణ మాహాత్మ్య కథనము :—

చ. అనవుడు సూతుఁ డిట్లనియె నమ్మునికిన్ మహనీయ బ్రాహ్మణుం
డనఁగ సమస్తదేవతల కాశ్రయభూతుఁడు గాన విష్ణువే
యనఁ దగు వాని మానవుఁ డటంచుఁ దలంపఁగ రాదు బ్రాహ్మణా
ర్చన మఖిలార్థసిద్ధులకు సాధన మంచు వచించు శాస్త్రముల్. 217

క. మును నారదుఁ డీవిషయం, బును నడుగఁ బయోజభవుని మునివర్యున కి
ట్లనియెను విధాత దానినె, వినిపించెదివాఁడ మీకు విశదము గాఁగన్. 218

ఆ. విష్ణుబుద్ధిచేత విప్రున కెరఁగెడు, నట్టివాఁడు చెందు నభ్యుదయము
గర్వమునను ద్విజునిఁ గాంచియు వంగని, వానిమస్తకంబు వంచు శౌరి. 219

సీ. అపరాధి యొనరించిన ప్రత్యుపకారుని ద్వే, షించు మానవుని ద్వేషించుఁ జక్ర
ప్రాప్తించుటకు వచ్చి సత్పాత్రుని గనుం, గొనని మూఢుని గనుంగొనఁడు శార్ఙ్గి
ధరఁ జేసు పద్మునిఁ దర్శించు మూర్ఖునిఁ, దర్శించి భర్జించు దండధరుఁడు
బ్రాహ్మణుని జూచి కను లెల్ల చేసెడి, వాని గ్రుడ్డులు తీసి నైచు శమనుఁ
గీ. డారగించునో యెవని గేహంబు నందుఁ, బ్రాప్తసంతోషుఁ డగుచును బ్రాహ్మణుండు
స్వయముగను నేఁగుదెంచి దేవతలతోడ, వాసుదేవుఁడు భుజియించు వానియింట.
క. కణమాత్రమేనియును బ్రా, హ్మణపాదోదకము ద్రావ నఖిలాఘములున్
క్షణమాత్రలోన నిర్వ్రైత్రె, యణుమాత్రము గూడ మిగుల కంతము నొందున్.
క. కొనుగుకొనినయాతం డఘుఁ, గడ లేని స్వకీయకలుషకర్దమ మెల్లన్
గడలోన భక్తియుక్తిని, గడిగిన యెడలను ద్విజాంఘ్రికంజాతములన్. 222
క. మృతవత్స యగుచు నుండెడి, సతి జీవద్వత్స యగును సత్పుత్ర యగున్
సుతహీన యైన భామిని, క్షితిదేవునిపాదసేవ చేసిన యెడలన్. 223
గీ. ఉండు నుదధులలోన బ్రహ్మాండమందు, నున్న తీర్థంబు లన్నియు నుదధులందు
నున్న తీర్థంబు లన్నియు నుండు నొక్క, క్షితిసుపర్వునిపాదపంకేరుహమున.
గీ. ఎవని శీర్షంబు సంసిక్తమవునో విప్ర, పాదసలిలంబుచేత నప్పావనుండు
సకలతీర్థంబులందును స్నానమాడి, నట్టివాఁ డయి యఘరాశి నడఁగఁ ద్రొక్కు.
గీ. మఱియు నొకమాట చెప్పెద మౌనివర్య, బ్రాహ్మణునిపాదమందుఁ దీర్థంబు లెల్లఁ
గలవు గావున ద్విజపాదకమలసేవ, సకలతీర్థాటనముకంటె సమధికంబు. 226
గీ. జన్మజన్మంబులందును శాశ్వతముగఁ, బడయు నైశ్వర్యపశుపుత్రభద్రములను
నాయురారోగ్యవిజయసౌఖ్యములఁ దుదకు, దేవతాత్వంబు బ్రాహ్మణసేవకుండు.
క. అనుకూలుఁ డైనపతి నం, గనయును ననుకూల యైనకాంతను బురుషుం
డును జెందఁగలుగు ధర్మం, బును సంపాదించుకొనిన భూదేవార్చన్. 228
క. చలిపియు సాహసకృత్యం, బుల నార్జనచేసి పర్వములలో భూదే
వుల కర్చనచేఁ దృప్తిం, గలిగించెడివారు ముక్తి గాంతురు తుదకున్. 229
సీ. మొదట విప్రుఁడు వేదములు బ్రహ్మముఖమున, నుండి యావిర్భావ మొంద బ్రహ్మ
విప్రముఖంబున వేదంబు లుంచె లో, కంబుల కెల్ల క్షేమంబు గలుగ
దానను భూదేవతాత్వంబు నొంది బ్రా, హ్మణుఁడు పూజ్యుం డయ్యె నందఱకును
బ్రాహ్మణానుజ్ఞను బడయక చేసిన, నిఖిలకార్యములును నిష్ఫలములు
గీ. విప్రవర్జితముగను గావించినట్టి, యాగములు దానములు బలిత్యాగములును
స్నానజపహోమతపములు దానవులకుఁ, బ్రేతలకుఁ జెంది కర్తకు ప్రియము నొసగు
క. ధాత్రీసురపదరేణుప, విత్రము లగుమందిరములు విశ్రుతపుణ్య
క్షేత్రసమంబులు గావునఁ, బాత్రములై యుండు సకలభద్రంబులకున్. 231

ఆ. శాస్త్రశూన్యములును స్వాహాస్వధాస్వస్తి, వర్జితములు దానవర్జితములు
బ్రాహ్మణాంఘ్రిరేణురహితంబులును నైన, సదనములు శ్మశానసమము లనఘ.
గీ. సంభవము నొంది బ్రాహ్మణజాతియందుఁ
దగినసంస్కారములఁ ద్విజత్వంబు వడసి
విద్యచేతను విప్రుఁడై వెలయువాఁడు
శ్రోత్రియుఁడు పూజ్యుఁ డతఁడు భూసురులలోన. 233
వ. విద్యాపూతుండును వేదపూతుండును మంత్రపూతుండును దీక్షాపూతుండును
నగుశ్రోత్రియబ్రాహ్మణుండు పూజ్యతముండు. 234
సీ. తనుఁ గోరి తనగృహంబునకు వచ్చిన నన్య, యోషను స్పృశియింప కుండుటయును
నటవీస్థలంబునయం దున్న తృణమేని, యును హరియింపక యుండుటయును
గామాదిశత్రుషట్కమునకు వశముగా, కుండఁగా వర్తించు చుండుటయును
దలిదండ్రులకు గురుదైవతంబులకును, నుపచారమును జేయు చుండుటయును
గీ. ననృతవచనంబు కల నైన నాడమియును
జనులకుఁ బురాణధర్మముల్ వినుచుటయును
స్నానసంధ్యాదివిధులను జలుపుటయును
బ్రాహ్మణున కుండఁదగినలక్షణము లనఘ. 235
క. ధరణీసురుండు సాక్షా, త్పరమేశుఁడె యుద్ధరింప భవవారిధిలోఁ
బరిపతితు లైనవారికి, హరియించుటఁ జేసి యాశ్రితాఘము లెల్లన్. 236
గీ. భక్తియును శ్రద్ధయును గల్గి బ్రాహ్మణునకు
దానము లొనర్పఁగాఁ దగు మానవుండు
నాకలోకార్థి యగునేని యట్లు గాక
బ్రాహ్మణధనంబు గొనిన దుర్గతుల నొందు. 237
గీ. విష్ణుసమ మైనవస్తువు విప్రుఁ డొకఁడె, కాని మఱియొక్కఁ డెందును గానరాదు
కాన సుఖవాంచ గలిగినమానవులకు, విప్రపూజాసమం బైనవిధియె లేదు. 238
క. ధాత్రీసుపర్వునకు గా, యత్రీజప మపరిహార్య మన్నిటికంటెన్
బాత్రతను జెందె దానినె, గోత్రామరుఁ డఖిలకలుషకోటుల నడఁచున్. 239
క. అని చెప్పుటయును సురముని, విని సర్వంబును మహాత్మ విన వేడుక గ
ల్గెను గాయత్రీవిధమును, వినిపింపుము నేఁడు నాకు విశదము గాఁగన్. 240
వ. అని ప్రార్థించుటయు బ్రహ్మ నారదున కిట్లనియె. 241

—: గాయత్త్రీ ప్రకార కథనము :—

వ. గాయత్త్రి గాయత్త్రీఛందస్సును విశ్వామిత్త్రఋషియును సవితృదేవతయును నగ్ని
ముఖంబును బ్రహ్మశీర్షంబును విష్ణుహృదయంబును రుద్రశిఖయును పృథివీయోని

యును జతుర్వింశత్యక్షరంబులును శ్వేతవర్ణంబును త్రిపదంబులును షట్కుక్షు లును సాంఖ్యాయనసగోత్రంబును బంచముఖశిరఃప్రాణంబులును బంచశీర్షంబులుం గలిగి బ్రహ్మసాక్షాత్కారంబునకు వినియోగించు. తనదేహంబునందు గాయత్రీ వర్ణన్యాసంబు గావించుకొని గాయత్రీజపంబు చేయువాఁడు బ్రహ్మవిష్ణుశివాత్మ కుండును మహాయోగియును మహాజ్ఞానియును నై పునరావృత్తిరహితం బగు మోక్షపదముం జెందు. తత్కారంబు పాదాంగుష్ఠంబులందును సకారంబు గుల్ఫదేశంబులందును వికారంబు జంఘలయందును దుకారంబు జానుమధ్యంబు నందును ర్వకారం బూరుదేశంబునందును రేకారంబు గుహ్యదేశంబునందును ణ్యకారంబు వృషణంబులందును మకారంబు కటిదేశంబునందును భకారంబు నాభిమండలంబునందును ర్గోకారంబు జఠరంబునందును దేకారంబు స్తనంబు లందును వకారంబు హృదయంబునందును స్యకారంబు కరదేశంబునందును ధీకారంబు వదనంబునందును మకారంబు తాలుదేశంబునందును హికారంబు నాసికాగ్రంబునందును ధికారంబు నేత్రంబులందును యోకారంబు భ్రూమధ్యం బునందును యోకారంబు లలాటంబునందును నఃకారంబు ముఖపూర్వదేశంబు నందును ప్రకారంబు ముఖదక్షిణదేశంబునందును జోకారంబు ముఖపశ్చిమ దేశంబునందును దకారంబు ముఖోత్తరదేశంబు నందును యాత్కారంబు మూర్ధంబునందును న్యాసంబు గావించుకొనం దగు. సంధ్యాకాలంబునందుఁ గావింపందగున్యాసంబు వినుము. సప్రణవప్రథమవ్యాహృతి హృదయంబునందును సప్రణవద్వితీయవ్యాహృతి శిరస్సునందును సప్రణవతృతీయవ్యాహృతి శిఖ యందును సప్రణవగాయత్రీమంత్రప్రథమపాదంబు కళేబరంబునందును సప్రణవ గాయత్రీమంత్రద్వితీయపాదంబు నేత్రంబులందును సప్రణవగాయత్రీమంత్ర తృతీయపాదంబు కరంబులందును న్యాసంబు గావించుకొని యంతంబున గాయత్రీ శిరోమంత్రంబుచే నుదకస్పర్శంబు గావించెనేని సర్వపాపవిముక్తుండై విష్ణుత్వముం జెందు. సప్తవ్యాహృతులయాదులందు సప్తప్రణవంబులును మంత్రంబున కాది మధ్యావసానంబులందుఁ బ్రణవత్రయంబును శిరస్సున కాద్యంతంబులందుఁ బ్రణవద్వయంబునుం గలసి ద్వాదశప్రణవంబు లయ్యె. సప్తవ్యాహృతిశిరం బులునుం గలగాయత్రిని సంధ్యాకాలంబునఁ గుంభకంబుచే వారత్రయంబు జపించి సూర్యోపస్థానంబు గావించెనేని మహావిద్యాధిపతియై బ్రహ్మత్వముం జెందు. మఱియును గాయత్రీషట్కుక్షుల నెఱింగి గాయత్రిని జపించెనేని బ్రహ్మ [illegible] మఱియును గాయత్రీపంచశీర్షంబుల నెఱింగి గాయత్రిని [illegible] జెందు. [illegible] వ్యాహృతియుక్త [illegible] గావించు[illegible] [illegible]

విధానముం జెప్పెద. సప్రణవంబు లగుసప్తవ్యాహృతులు క్రమంబుగాఁ బాద జానుకటినాభిహృదయకరలలాటంబులందును గాయత్రిని శిఖయందును న్యాసంబు గావింప వలయును. మఱియును ప్రాణాయామగాయత్రిని జపించెనేని సకృదుచ్చారణమాత్రంబున మహాపాతకంబులును భస్మీభూతంబు లగు. తద్విధానంబు వినుము. గుదసమాకుంచనంబు గావించి గుదదేశస్థం బగునపానంబును హృద్దేశస్థం బగుప్రాణంబుతోడఁ బూరకంబుచేఁ గలిపి కుంభకంబు గావించి సప్రణవవ్యాహృతిశిరోయుక్తం బగుగాయత్రిని ద్రివారంబు జపించెనేని యొక్కప్రాణాయామం బగు. మఱియును ప్రతివర్ణస్వరంబును నెఱింగి దేహంబున గాయత్రీన్యాసంబు గావించుకొనియెనేని పరమేశ్వరభావముం జెందం గలుగు.

క. కావించిన గాయత్రీ, దేవీమనుజపము వర్ణదేవజ్ఞానం
బావహిల ద్విజుఁడు మరలన్, ద్రావఁడు జననీపయోధరక్షీరంబుల్. 243

వ. ప్రథమవర్ణం బగ్నిదేవతాకంబు. ద్వితీయవర్ణంబు వాయుదేవతాకంబు. తృతీయవర్ణంబు సూర్యదేవతాకంబు. చతుర్థవర్ణంబు వియద్దేవతాకంబు. పంచమవర్ణంబు యమదేవతాకంబు. షష్ఠవర్ణంబు వరుణదేవతాకంబు. సప్తమవర్ణంబు బృహస్పతిదేవతాకంబు. అష్టమవర్ణంబు పర్జన్యదేవతాకంబు. నవమవర్ణం బింద్రదేవతాకంబు. దశమవర్ణంబు గంధర్వదేవతాకంబు. ఏకాదశవర్ణంబు పూషదేవతాకంబు. ద్వాదశవర్ణంబు మిత్రదేవతాకంబు. త్రయోదశవర్ణంబు త్వష్టృదేవతాకంబు. చతుర్దశవర్ణంబు వసుదేవతాకంబు. పంచదశవర్ణంబు మరుద్దేవతాకంబు. షోడశవర్ణంబు సోమదేవతాకంబు. సప్తదశవర్ణం బంగిరోదేవతాకంబు. అష్టాదశవర్ణంబు విశ్వేదేవదేవతాకంబు. ఏకోనవింశవర్ణం బశ్విదేవతాకంబు. వింశవర్ణంబు ప్రజాపతిదేవతాకంబు. ఏకవింశవర్ణంబు సర్వదేవమయంబు. ద్వావింశవర్ణంబు రుద్రదేవతాకంబు. త్రయోవింశవర్ణంబు బ్రహ్మదేవతాకంబు. చతుర్వింశవర్ణంబు విష్ణుదేవతాకంబు. 244

క. ఈవిధమున గాయత్రిని, భావించుచు మనమునందుఁ బ్రత్యహమును ద
ద్దేవీమంత్రజపంబును, గావించెడిద్విజుఁడు సర్వకలుషము లడఁచున్. 245

గీ. ఈవిశేషము లెల్ల గ్రహించి వేద, మాతను జపించునట్టిబ్రాహ్మణుఁడె నాల్గు
వేదములును నెఱింగినవిబుధవరుఁడు, దానపాత్రుండు వాఁడె విజ్ఞాని వాఁడె.

క. ఒకప్రక్క నాల్గువేదము, లొకకడ గాయత్రి నుంచి యొకతులలో నే
నొకతఱిఁ దూఁపఁగ గాయ, త్రికి గౌరవ మొదవె నిర్వృతిప్రద యగుటన్.

సీ. ప్రకృతజన్మార్జితపాతకం బంతయు, దశసంఖ్యజపముచేతను నశించుఁ
[illegible]

ద్రియుగంబులం దొనర్చినయఘం బంతయు, శమియించును సహస్రజపముచేత
నన్వహంబును ద్రిసంధ్యమునఁ జేయుజపంబు, వలన జనుఃకోటికలుష మడఁగు
గీ. నక్షమాలికతోడ సాయంసమయము. నందుఁ బ్రాతస్సమయమునయందుఁ జేయు
జపముచేతఁ జతుర్వేదజపఫలంబు, ప్రాప్త మగు నేమి చెప్ప గాయత్రిమహిమ.

మ. అనవద్యస్ఫురణంబుచే నెసఁగుగాయత్రీస్వరూపం బెఱుం
గనిభూదేవునివిద్యయుఁ ధనము ప్రఖ్యాత్యన్వయాన్నత్యముల్
జనసంబుఁ బలముఁ జపంబుఁ దపముఁ సర్వంబు వ్యర్థంబ యగుం
చు నెఱుంగం దగుఁ జూవె శౌచరహితక్షోణస్థపుష్పంబులుల్. 249

వ. మఱియొకగాయత్రీమంత్రంబుం జెప్పెద నియ్యది సకలమంత్రగుప్తం బగుమహా
మంత్రంబు. "ఓం అగ్నే ర్వాక్పుంసి యజుర్వేదేన జుష్టం సోమం పిబ స్వాహా"
యనెడియష్టాదశాక్షరయజుర్గాయత్రీమహామంత్రంబు జలంబునం దుండి శతంబు
జపించిన మహాపాతకోపపాతకాతిపాతకవిముక్తుండై మద్ధామంబునకుఁ జేరం
గలుగు. 250

క. హరవిష్ణుగణాధిపభా, స్కరదేవీప్రముఖప్రాజ్యసభుజ్మంత్రో
త్కరజపములు గాయత్రీ, పరులకు నుత్తేజకప్రభావప్రదముల్. 251

క. నిగమాగమావగాహామె, యగు గంగాస్నాన మూర్వారామరునకుఁ ద
ద్విగళితుఁ డగువిప్రుఁడు తీ, ర్థగుఁ డైనను సతముఁ దగఁడు తత్ఫల మొందన్.

—: నానాస్నానస్వరూపకథనము :—

వ. బ్రాహ్మణున కాగ్నేయవారుణబ్రాహ్మవాయవ్యదివ్యంబు లనుపంచస్నానం
బులు విహితంబులు. భస్మస్నానం బాగ్నేయంబు. సలిలస్నానంబు వారుణంబు.
మంత్రస్నానంబు బ్రాహ్మంబు. గోరజస్స్నానంబు వాయవ్యంబు. ఆతపవర్షాం
బుస్నానంబు దివ్యంబు. మంత్రపూర్వకంబుగా నుక్తస్నానంబులలో నేదేని
శావించిన భూసురుండు సకలతీర్థస్నానఫలముం జెందు. తులసీపత్త్రలగ్నజలం
బును సాలగ్రామశిలాసలిలంబును గోశృంగోదకంబును విప్రపాదతోయంబును
బరమపవిత్రంబులు. తత్స్నానంబువలన యజ్ఞవ్రతహోమదానతీర్థస్నానాది
ఫలంబు లభించు. 252

క. పితరులకుఁ జేయఁ దగుని, త్యాతర్పణముఁ జేయనట్టియవనిసురుఁ డగున్
బితృహంత సంధ్యవార్వాని, క్షితిసురుఁ డగు విప్రహంత చెడుదు రిరువురున్.

వ. యజ్ఞార్థకుఁడు దేవలకుఁడు నాక్షత్రుఁడు గ్రామయాజకుఁడు పారదారికుఁడును
నగుబ్రాహ్మణు లేగురును బ్రాహ్మణాధములు. 253

గీ. స్నానసంధ్యావిహీనులు శౌ[illegible], వర్ణితా[illegible]నులును స్వైరవర్తనులును
[illegible] వేదవిచ్యుతులు [illegible]మాధములు జాతివిప్రు లగుట.

ఆ. దాన మిచ్చునెడల దాత యుత్తముఁడైన, బ్రాహ్మణున కొసంగి పడయు ముక్తి
యధము లైనభూసురాన్వయజాతుల, కిడినయావి బూది నిడినచ్చుతము. 257

సీ. యాజనాసత్ప్రతిగ్రహాధ్యాపనములఁ, బడయు రఘముల ద్విజులు తత్పాపములను
క్షణములోనఁ బ్రాణాయామజపమువలన, హత మొనర్చుచునుండువా రగుటఁ జేసి.

సీ. ఇనుఁడు కరములఁ జండాలగృహము ముట్టి
కొనిన నందుండినను వహ్ని కనదొ యెట్టు
లశుచిభావంబు నట్టులె యవనిసురుఁడు
పాపలేపంబునను గాఁడపావనుండు. 259

క. వాయువు ఘనములఁ ద్రోసెడి, చాయను బ్రాహ్మణుఁడు పాపజాలము నెల్లన్
బాయంగఁ ద్రోయు నవలకు, గాయత్రీజపబలాధికత్వముచేతన్. 260

గీ. ఉత్తమబ్రాహ్మణుఁడు కృపాయుక్తుఁ డగుచుఁ, జేయునెడ దీవనల సర్వసిద్ధు లొదవు
నట్లు గాకుండఁ దిట్టిన నాగ్రహమున, సర్వనాశము గల్గు సంశయము లేదు.

సీ. దర్శించునెడలఁ బ్రత్యహము భూదేవుని, సమకూరు హయమేధసవఫలంబు
దినదినంబును భూసురునకు మ్రొక్కిన యెడ, సకలపాపములును సమసిపోవుఁ
బ్రతిదివసమును సంభాషింప ద్విజునితో, భాగీరథీస్నానఫలము గలుగు
నొనరించునెడ నిత్యమును బ్రాహ్మణునిసేవ, సకలార్థసిద్ధులు సంఘటిల్లు

గీ. నెప్పుడును గూడ విప్రులు తృప్తి పడఁగ, నన్నము నొసంగుచుండిన నఖిలలోక
ములకుఁ గూడను బ్రహ్మభవంబును వహించు, జన్మమును జెందు దేహావసానమందు.

సీ. సకలజాత్యన్నభక్షకుఁడుగా నున్నను, బతితుఁ డైనను మహాపాపి యైనఁ
గలసియున్నను నంత్యజులలోనఁ గూడి యు, న్నను మ్లేచ్ఛజాతిసంతతులతోడ
సర్వజాతిస్త్రీలసంపర్కమును జెంది, యున్నను దుర్వృత్తి నొందియున్నఁ
బశుపక్షిమృగముల బాధించు చున్నను, ద్విజధర్మబాహ్యుఁడై తిరుగుచున్న

గీ. నెట్టిదుర్మార్గుఁ డైనను గట్టకడకు, బ్రాహ్మణాన్వయభవుఁ డైన బ్రాహ్మణుండు
తగఁడు చంపంగ నెట్టిదుర్దశలయందుఁ, గూడ నతని ద్విజత్వంబు వీడకుంట. 263

గీ. అట్టిఁడులఁ గూడ వధియించునట్టివాఁడు, బ్రహ్మహత్య యొనర్చినపాపి యగుటఁ
దప్ప దొందక నరకయాతనల వింటె, యెట్టిదియొ బ్రాహ్మణమహత్త్వ మేమిచెప్ప.

వ. దీని కొకదృష్టాంతముం జెప్పెద వినుము. 265

సీ. ఒకబ్రాహ్మణునకుమున్నొకపుత్రుఁడుండెనా, తండు యౌవనము ప్రాప్తంబుగాఁగఁ
బ్రాక్కర్మవశముచే నొక్కచండాలకా, మినిని మోహించి తన్మిళితుఁ డగుచు
దానియింటనె యుండి తనయుల దుహితలఁ, గని దానియందుఁ బెక్కండ్రఁ దమిని
నొకనాఁడు సుర నామె యొసఁగ సహ్యము గామి, నవలకుఁ ద్రోయుంగ నామె నవ్వి

ఆ. యతనిముఖముపైని నాసురచల్లుచుఁ, దన్ముఖంబునుండి దహనకీల
బయలువెడలి కాల్చి భస్మంబొనర్చె నా,యుగ్మలిని నపత్యాయుక్తముగను. 266
క. అంతట నాద్విజుఁ డెంతయు, సంతాపము నొందు చుండుసమయంబున న
త్యంతము విస్మయ మొదవ న, భ్యంతర దేశంబునుండి యతనిచెవులకున్. 267
గీ. బ్రాహ్మణాధమ తావకబ్రహ్మతేజ, మిప్పటికిఁ గూడ వదలక యిట్టు లుండె
నదియె దహియించె వీరల నాత్మహితముఁ,గోరి నీ తేజమును బెంచుకొనుము మరల.
క. అనుమాటలు వినఁబడుటయు, విని వాఁడు విరక్తి గలుగ విషయంబులపైఁ
దనబ్రహ్మతేజ మేవిధ, మున వృద్ధిని గనునో యనుచుఁ బొగులుచు మదిలోన్.
సీ. చని యొకకాననంబునకు నం దొకచోట, నాసీనులై యున్న యతులఁ గాంచి
వందనం బొనరించి వారికిఁ దనగాథ, వినిచి యాత్మహితంబు వేఁడుటయును
దివ్యదృష్టిని వారు తిలకించి ధర్మంబు, భ్రష్టుఁడై పోయిన బ్రాహ్మణుండు
కృచ్ఛ్రంబులను దప్తకృచ్ఛ్రంబులను దేవ, తారాధనాదుల నాచరించి
గీ. దాన సకలాఘములను దగ్ధంబు చేసి, పడయవచ్చును మరల స్వబ్రాహ్మశక్తి
నని వచింపంగ నతఁడు ధైర్యమునఁ జేసి,యుక్తవిధులను బ్రాహ్మణ్యయుక్తుఁ డయ్యె.
వ. ఈవిషయంబున మఱియొకగాథ వచియించెద వినుము. 271

—: సుపర్ణచరిత్రకథనము :—

సీ. మును వినతాగర్భముననుండి గరుడుండు, జనియించి క్షుద్బాధ సైఁప లేక
జనని భుక్తిని బెట్టుమని కోర నాతని, నని పెను వినత కశ్యపునికడకు
నతఁ డేఁగి వేగ కశ్యపునియొద్దకుఁ గోర, నన్నంబుఁ గశ్యపుఁ డతనిఁ గాంచి
తనయ సరిత్పతితటమునఁ బాపిష్ఠు, లైనమ్లేచ్ఛులు గల రమితముగను
గీ. దినుము వారల నాఁకలితీర నీవు, నావుడుఁ దదాజ్ఞ గైకొని నాగవైరి
యరిగి పాథోధితటమున కచట నున్న, యట్టిమ్లేచ్ఛులను దొడంగె నారగింప.
గీ. అట్లు ప్రారంభ మొనరించి యారగింప,నందఱును మ్రింగుచుండంగ నం దొకండు
తగులువడి పన్నగారికంధరములోన, వెలుపలికి రాక పోక లోపలికి నిలిచె.
ఆ. అంత గ్రుక్క మ్రింగ నలవి గామి సుపర్ణుఁ, డట్టిట్టు లగుచు నాఁగ లేక
తండ్రికడకు వచ్చి తత్క్షణంబ యెఱుంగఁ, జేసెఁ దనయవస్థ చేతు లొగ్గి. 274
వ. అంతటఁ గశ్యపుఁడు తద్గళాంతర్గతుం డగువాఁడు బ్రాహ్మణుం డని తనదివ్య
దృష్టిచే నెఱింగి యాతని నుద్దేశించి. 275
గీ. బ్రాహ్మణోత్తమ రమ్ము వెల్వలకు నీకు, హితము దెల్పెద ననుడు వాఁ డిట్టు లనియె
స్వామి యీకుక్షి నున్న నావారి నెల్ల, విడిచి నామన సొప్పదు వెడలి రాఁగ.
గీ. కలరు శ్వశురులు స్యాలకుల్ గలరు సుతులు
గలరు పెక్కండ్రు బాంధవుల్ గలరు నాకుఁ

చచ్చినను వీరితో నేను జావ నొందుదు
బ్రతికినను వీరితో నేను బ్రదుక వలయు. 277

సీ. అనవుడుఁ గశ్యపుం డాత్మలో విస్మయం, బెనయంగ నాతని కిట్టు లనియె
వత్స నీవు ద్విజాతివంశంబునను బుట్టి, కలిసి మ్లేచ్ఛులలోనఁ గామమునను
బతితుండ వైతి పాపాపంబునను నీకు, బ్రాహ్మణ్య మంతయు భ్రష్ట మయ్యెఁ
గాని జన్మంబున బ్రాహ్మణుండవు గాన, నావీర్యబలము నీయందు నిలిచె
గీ. దాన నిను మ్రింగలేఁ డయ్యె వైనతేయుఁ, డరుగుడె మ్రింకఁ బాతకు లైనవారి
తోడ సంబంధమును విడనాడి యిపుడె, నిన్నుఁ బావనునిఁగఁ జేయు చున్నవాఁడ.

గీ. పాపజాతుల కెల్లను బాపమందె, సక్త మగు బుద్ధి వారికి ముక్తి లేదు
సాగరము దాఁటఁ దరమె పాషాణనౌక, నెక్కియున్నట్టివారల కెన్నఁడేని. 279

మ. అని బోధింపఁగ విప్రుఁ డిట్లనియె దేవా నీవు నా కేమి చె
ప్పిన నావారిని బాసి రా నవలకున్ బ్రేమంబు విశ్వాసమున్
దనరన్ నాయెడ నున్న బాంధవుల నాత్మక్షేమవాంఛం ద్యజిం
చిన నో నిట్టివిపత్తునం బడనె నిస్సీమాఘవారాశిలోన్. 280

క. నాకింక బోధ చేయకు, మీకరణిని బ్రాణములను నిటనె త్యజింతున్
గాకుండిన నావారల, నేకైవడి నైన విడువఁ జేనును వత్తున్. 281

చ. అనవుడు బ్రహ్మహత్య యగు నంచు మనంబున నెంచి తార్క్ష్యునిం
గనుఁగొని కశ్యపుండు సుత క్రక్కుము మ్లేచ్ఛుల నెల్ల నావుడున్
జనకునియాజ్ఞఁ దాల్చి ఖగనాథుఁడు మ్లేచ్ఛుల నెల్లఁ గ్రక్కె నం
తను బడె నూడి బ్రాహ్మణుఁడు తద్గళమధ్యమునుండి భూమిపై. 282

గీ. అపుడు తార్క్ష్యముఖోజ్ఝితు లైనమ్లేచ్ఛు, లందఱును భీతులై చని యష్టదిశల
కచట నుండిరి ధర్మబాహ్యంబు లైన, వేషములతోడ నది యెల్ల వినుతు వినుము.

వ. పూర్వదిక్కునందు శ్మశ్రువర్జితులును నల్పశ్మశ్రుసమన్వితులును గేశశూన్యులును భోజనప్రియులును నాగ్నేయదిక్కునందు నగ్నులును మహాపాపులును దక్షిణదిక్కునం దవాచకులును బ్రాణివధకారకులును గవాశనులును గ్రూరులును నైరృతదిక్కునందు గోబ్రాహ్మణవధకారకులును గువాదులును బశ్చిమదిక్కునందు దొంగలును వంచకులును భయంకరులును వాయవ్యదిక్కునందు శ్మశ్రుపూర్ణులును గవాశనులును దురగపృష్ఠారూఢులును యుద్ధోద్ధతులును శస్త్రపాణులును నుత్తరదిక్కునందుఁ బర్వతవాసులును సర్వభక్షులును వధబంధనిరతులును దురాచారులును నైశాన్యదిక్కునందు వృక్షవాసులును బాపరతులును స్వైరసంచారులును మదోద్ధతులును నై నివసించి యవన చండాలతురుష్కనిషాదనామంబులతో నెల్లరును సురాపానపరదారగమనపరద్రవ్య

హరణపరప్రహరణాదికపాప్యకృత్యాంశములు గలిగి వర్తింపం గొడంగిరి.
తత్సంభాషణస్పర్శంబులు గావించిన సచేలస్నానంబు నొనరింపవలయు.

ఆ. గళితధర్మ మైన కలికాలమున విత్త, లోభమునను బుద్ధిలోపమునను
లిప్తపాపు లైన మ్లేచ్ఛులతోఁ గూడి, సంచరింతు రఖిలజనులు గూడ. 285

వ. అని చెప్పుటయు నారదునకుఁ దండ్రి క్షుధితుండ నైనసుపక్షుండ నావల నేమి చేసె
నని యడుగ నాతనికిఁ బద్మోద్భవుం డిట్లనియె. 286

సీ. అంతట ఖగనాథుఁ డాఁకలి తీరంగ, దగుమార్గ మే మని తండ్రి నడుగఁ
గశ్యపుఁ డాతనిఁ గని వత్స గజకచ్ఛ, పములు రెండు సముద్రభాగమందు
యుద్ధంబు గావించుచున్నవి యొకదాని, నొకటి ద్రుంగఁ దలంచి యుద్ధతముగ
నా రెంటిని భుజింపు మాహారముగ నీవు, శాంతించు క్షుద్బాధ సత్వరంబ

గీ. యని వచింపంగ గరుడుఁ డాతనికి మ్రొక్కి, చని రయంబున వార్ధిలో జగడమాడు
చున్న గజకచ్ఛపంబుల నొడిసి పట్టి, యాకసంబున కెగిరె నత్యద్భుతముగ. 287

వ. వానిం బెట్టుకొని భక్షింపం దగినచోటు గానంబడమి సాగరంబులును బర్వ
తంబులును వనంబులునుం గడచి యోజనలక్షద్వయంబు చని యొకచోట
బహువిశాలంబును బలిష్ఠంబును నగునొక్కజంబూశాఖ నుపలక్షించి యది
భారంబు మోయంగల దని తలంచి దానిపైని వ్రాలె. 288

గీ. అంత నాజంబుశాఖ యి ట్టట్టు లూఁగి, తన్మహాభారము వహింపఁ దరము గామి
విఱిగెఁ జెళపెళఁ బగులంగ విష్ణుపదము, ధరణి యదరంగ దిక్కుడుల్ దద్దరిల్ల.

గీ. అట్టు లాకొమ్మ విఱిగి భయంకరముగ, నిలను బడఁబోవుచుండ ఖగేశ్వరుండు
దానిఁ బడకుండ గోవిప్రహానిభీతిఁ, బట్టుకొని ముక్కునను మింటఁ బఱచుచుండె.

సీ. అప్పు డాతనిబలం బాశ్చర్యమును గొల్ప, వానిఁ గైకొన నెంచి వాహనముగ
నరరూపమును దాల్చి నారాయణుఁడు వాని, కెదురుగా నేతెంచి యిట్టు లనియెఁ
బతగేంద్ర యెచటికిఁ బఱచుచుంటివి నీవు, భరియింపఁగా రానిభరముఁ దాల్చి
యీ వెవండవు దీన నేమి కార్యము నీకు, వచియింపు మంతయు వాస్తవముగ

గీ. ననుటయునుఁ గశ్యపాత్మజుం డాత్మచరిత
మంతయును జెప్పి తా నిల్వ నాశ్రయంబు
దొరక లే దని సూచించెఁ దుట్టతుదకు
విని తదీయోక్తు లెల్లఁ ద్రివిక్రముండు. 291

గీ. అండజాధిప నాబాహుదండమందు, నీవు కూర్చుండి యీకొమ్మ నీమహీధ్ర
శిఖరములమీఁద విడిచి భక్షింపు మెదకుఁ, గలుగ సంతృప్తి యీగజకచ్ఛపముల.

క. అని భుజము సాఁచుటయు న, వ్వినతానందనుఁడు నవ్వి విపినములు గిరుల్
ఘనధులును మోయఁజాలని, నను నీవు వహింతు వన్న నగరె జనంబుల్.

ఆ. చాలుఁ జాలుఁ బొమ్ము సజ్జనుఁడవు నీవు, పలికితివి క్రమంబు వాయ నొక్క
మాట యైన నోట మాకియ్యదియె తృప్తి, గలుగఁజేసె ననుఁ గృతభారి.
ఆ. పక్షిరాజ నేను బహుభాషణుఁడఁ గాను, నెలవు లేని నీకు నెలవు చూపి
నిలువు మనిన నీవు నిలువకుండఁగఁ బోవఁ, దలఁచితేని పొమ్ము తప్పు నీదె. 295
క. అని దృఢముగఁ బలుకుటయును, విని వినతానందనుండు వీఁ డెవఁడొ కనుం
గొన వలయు ననుచు మదిలో, ననుకొని నీ వెవఁడ వనుచు నాతని నడిగెన్.
గీ. అడుగుటయుఁ దార్క్ష్యుఁ డావిధి నంబుజాక్షుఁ, డిట్టులనియె సుపర్ణ నే నెవఁడ నైన
నేమి నీపని తీర్చికొమ్మావు ముందు, విదిత మగు నీకు నవల నావిషయ మెల్ల.
క. అనవుడు గరుడుం డట్టులె, యొనరించెద నని వచించి యొక్కూఁకున నా
తని బాహుదండమును బ్రా, లిన బాహు వొకింతయును జలింపక యుండెన్.
సీ. అది చూచి తార్క్ష్యుఁ డత్యాశ్చర్య మొందుచు, శైలశృంగములందు శాఖ విడిచి
గజకచ్ఛపములను భుజియించి దానిచే, నాఁకలిదీఱమి నతనిఁ గాంచి
స్వామి నాక్షుద్వహ్ని చల్లార కున్నది, యేమి చేయఁగ నగు నింక నేను
నావుడుఁ బంకేజనయనుఁ డాతనిఁ గాంచి, పతగేంద్ర నాభుజపలము దినుము
గీ. నాఁగ నాగాంతకుఁడు మహానందమునను, దద్భుజామాంసమును మెక్కి తనివిదీఱ
స్వామి క్షుద్బాధ తీఱె నీవలన నాకుఁ, గోరుకొ మ్మేదియేని నీకోర్కి తీర్తు. 299
సీ. అనవుడు గోవిందుఁ డతనికిఁ బ్రత్యక్ష, మై తనదివ్యదేహంబుతోడఁ
గశ్యపనందన కలకాలమును నాకు, వాహనంబుగ నుండవలయు నీవు
నావుడుఁ దార్క్ష్యుఁడు నారాయణునిపాద, పంకేరుహంబులపైని వ్రాలి
తండ్రి భవత్ప్రసాదమున ధన్యుఁడ నైతి, నేమి కావలయు నా కింతకంటె
గీ. ననుడు నారాయణుఁడు వాని కప్రమేయ, గమనమును నజరామరత్వమును గలుగ
నొసఁగి వరము నదృశ్యత్వ మొందె నంత, గరుడుఁ డానందమునఁ దండ్రికడకు వచ్చి.
సీ. ప్రణమిల్లి తత్పాదపంకేరుహములకు, వినిచెను జరిగినవిషయ మెల్ల
నది విని కశ్యపుం డాశ్చర్యమును జెంది, వత్స నీవలన మావంశ మెల్లఁ
దరియించె విష్ణుసందర్శనభాగ్యంబు, కలుగునె యెంతవారలకు నేని
నినుఁ గాంచుటను జేసి నేను ధన్యుఁడ నైతి, ధన్యురా లయ్యె నీతల్లి వినత
గీ. జన్మకోటిసహస్రసంజనిత మైన, యట్టిబహుపుణ్యమునను సంప్రాప్త మయ్యె
నచ్యుతునిసేవ చేయుభాగ్యంబు నీకు, నని మహానందమున సుపర్ణుని నుతించి.
గీ. తండ్రి నీతల్లిచిత్తఖేదంబు దీర్చి, శీఘ్రముగఁ బొమ్ము మాధవుసేవ చేయ
ననుడుఁ దార్క్ష్యుఁడు జనకునియాజ్ఞ వడసి, వినతకడ కేఁగుదెంచి వందనము చేసి.
గీ. ఆయమకుఁ దెల్పి జరిగినయట్టిగాథ, యంతయును నోలలార్చి హర్షాబ్ధిలోన
జనని నీకు హితంబును జలుప నెంచి, యరుగుదెంచితి నీకోర్కి యానతిమ్ము.

సీ. అనవుడు నామె యిట్లనియెఁ గుమార నా, గాథ విన్నను నీకుఁ గలుగు బాధ
యైనను జెప్పెద నాత్మజుఁడవు గాన, నుపతాప మొకకొంత యుపశమింప
నొకనాఁడు కద్రువయును నేను జలకంబు, లాడుచుండఁగఁ జూచి యామె నన్ను
వినత రేపు దివాకరునితురంగము నల్ల, గా నుండు ననుడు నక్కజము దోఁప
గీ. నేను గా దంటి నవు డామె కానియెడల, నగుదు దాసిని నీకు నే నైనయెడలఁ
గావలయు నాకు దాసివి నీవు నాఁగ, నట్లె యగుఁగాక యంటి నే నకపటముగ.
గీ. అంతటను రాత్రి యగుటయు నరిగె నామె, యింటి కాఁపుమ నేను నాయింటి కేఁగు
దెంచితిని నుదయమున నేతెంచి యామె, నాకడకు రవివాహంబు నాకుఁ జూపి.
గీ. ఎట్టు లున్నదొ హరివాజి యీవె చెప్పుమ, యనుటయును నల్లగా నుండినందువలన
నల్లగా నున్న దంటి నంతటను నామె, సవతి నా కింకఁ బరిచర్య సలుపు మనియె.
వ. అది మొదలుకొని కద్రువకు నేను దాస్యంబు చేయుచుండ మాకు వాదంబు జరిగినరాత్రి యామె తనపుత్రు లగునాగులతోడఁ దనప్రతిజ్ఞ చెప్ప నాగులు శీఘ్రగమనంబునం జని హరిహయంబుం గఱచి రనియును దానిచే హరిద్వర్ణంబు గలసూర్యాశ్వంబు కృష్ణవర్ణోపేతం బయ్యె ననియును గర్ణాకర్ణికావశంబున నాకు శ్రవణగతం బయ్యె. 307
గీ. అనినమాటకు మాఱుమాటాడ నాకు, ననుచితంబుగఁ దోఁచుట నామెకడను
నేదియును ముచ్చటింపక యింతవఱకు, నట్లె చేయుచు నుంటి దాస్యంబు నేను.
వ. ఆమెయుం దేదోషం బున్నను బరిగణింపక యామెకోరినకోర్కె తీర్చి నన్ను దాస్యవిముక్తుం జేయవలయు. 309
సీ. అనవుడు ఖగనాథుఁ డతిరయంబున నేఁగి, కద్రువ యున్ననికాయ్యమునకు
నామెపాదములకు నభివాదనము చేసి, దీవన లొంది యాదేవివలన
నమ్మ మాతల్లిదాస్యమ్ము దీఱెడిమార్గ, మే మైన నున్న నా కెఱుఁగఁ జెప్పుమ
యని వేఁడుటయు వానిఁ గని యామె నాయన, తల్లిదాస్యము దీర్పఁ దలఁచితేని
గీ. యమృతమును నాకుఁ దెచ్చియి మ్మనియె నంతఁ
దార్క్ష్యుఁ డట్లె యొసంగెదఁ దల్లి యనుచు
నామెయాజ్ఞను గైకొని యాక్షణంబ
వచ్చి జనకునికడకుఁ దద్వార్తఁ దెలిపె. 310
గీ. అంతఁ గశ్యపముని యది యాలకించి, శీఘ్రముగ నాతనికిఁ గార్యసిద్ధి గాఁగఁ.
జలిపి దీవన లాజ్ఞ యొసంగ నెగిరి, యంతరిక్షంబునకుఁ దార్క్ష్యుఁ డరిగి యరిగి
చ. అమరపురంబుఁ జేరి త్రిదశాళిన ముండెడిచో జెఱింగి శీ
ఘ్రముగను బోయి యచ్చటికిఁ గావలి యున్నసుపర్వయోధబృం

దమును జయించి కైకొని సుధాకలశంబును వచ్చుచుండఁగా
నమరవిభుండు తారసిలి యాతనిపైఁ గురియించె బాణముల్. 312

క. ఆశరనివహము నెల్లను, నాశన మొనరించి తీక్ష్ణనఖములచే నా
గాశనుఁడు విసరె రెక్కల, నాశ లదర నమరు లెల్ల న ట్టి ట్టూఁగన్. 313

ఉ. అప్పుడు వజ్రపాణి ప్రళయాగ్ని తెఱంగున రేఁగి కన్నులన్
నిప్పులు రాలఁ జూచి ఖగ నీ కిదె యంత్యదినంబు కూల్తు ని
న్నిప్పుడె యంచుఁ గేల ధరియించినవజ్రము నేసి వానిపై
రొప్పుచు దూఁకె దాన నొకరోమమునుం దెగదాయె వానికిన్. 314

సీ. అది చూచి దేవేంద్రుఁ డడలు పుట్టఁగ లోన, నతఁడు మహాబలుం డని యెఱింగి
యాయుధంబులు విడనాడి నిర్జరబృంద, సహితుఁడై వచ్చి తత్సవిధమునకుఁ
బక్షీంద్ర యమరుల రక్షింపు మనిలోన, నీతోడ నెదిరించి నిలువలేము
కొనిపోయి యమృతంబు జననిదాస్యముఁ దీర్పు,మయ్యది మా కెల్ల నభిమతంబ

గీ. కాని యమృతంబు ఘనుల కధీనమైన, సృష్టి యెల్లను జెడు వారు దుష్టు లగుటఁ
గాన నీకార్య మైనతక్షణమ యమృత, మేను గొనిపోవఁగ ననుజ్ఞ యిమ్ము నాకు.

సీ. అని వేఁడుకొనుటయు వినతాతనూజుండు, శక్రునికోర్కికి సమ్మతించి
వాయువేగంబున వసుధకు విచ్చేసి, యమృతంబుకద్రువ కప్పగించి
తనజనయిత్రిని దాస్యముక్తను జేసె, నంతలో దేవేంద్రుఁ డరుగుదెంచి
యొరులకుఁ గనఁబడకుండ నయ్యమృతంబు, గొని యచ్చటను విషకుంభ మునిచి

గీ. చనియె స్వర్గంబునకు నంత సర్పమాత, హర్షమునఁ బిల్చి తనయపత్యముల నెల్ల
నమృతమును ద్రావుఁ డని పోసియావిషంబు,నమరు లైతిరిపొండు మీ రని వచించె.

గీ. అంత మృత్యువు తమకు లే దనెడిగర్వ
మునను గన్నులు గానక భోగు లెల్ల
జనుల బాధించుచుండ నాసర్పములను
గరుడుఁడు భుజింపఁదొడఁగె లోకముల మనుప. 317

ఆ. అపుడు భీతిచేత నాశీవిషంబులు, దాఁగికొనఁ దొడంగెఁ దరువులందుఁ
బర్వతంబులందుఁ బాతాళమునయందు, సలిలనిధులయందు బిలములందు. 318

క. అంతట లోకం బంతయు, శాంతం బగుటయును సంతసం బొదవంగన్
స్వాంతంబునఁ జనియె గరు, త్మంతుఁడు మాధవునిసన్నిధానంబునకున్. 319

గీ. ఈసుపర్ణచరిత్రంబు నెవ్వఁడేని, వినినఁ బఠియించినను వినిచినను నిలను
ననుభవించి సమస్తసౌఖ్యములఁ బిదప, స్వర్గలోకంబునం దుండు శాశ్వతముగ.

వ. అంతట మ్లేచ్ఛత్వముం జెందినబ్రాహ్మణుండు కశ్యపునిప్రబోధంబున శాస్త్ర
విహితంబు లగుగాయత్రీజపహోమతీర్థస్నానహరికీర్తనచాంద్రాయణాదివ్రతం

బుల నొనరించి మరల స్వబ్రాహ్మణ్యముం బడసి స్వధర్మంబున స్వర్గలోక
నివాసభాగ్యముం జెందె. 321

క. అని చెప్పుటయును నారదుఁ, డనవధికం బైనహర్ష మూమతిలంగన్
జనియెను మీ కీవిషయం, బున మఱియొకపూర్వచరితమును వచియింతున్.

—: భీమవృత్తాంత కథనము :—

క. వినుమెడ నీకథ మీఁకున్, జనియించును విస్మయంబు స్వాంతములందున్
మును భీముఁ డనెడినామము, గనినజఘన్యుఁ డొకండు గలఁ డిలలోనన్. 323

క. ఆతఁడు నిజకులధర్మా, పేతుం డయి పాతకము లనేకములు బహు
స్వాతంత్ర్యంబునఁ జేయుచుఁ, గాతర్య మొకింతయేని కానక తిరుగున్. 324

గీ. అట్టు లుండంగ వచ్చుద్రవ్యంబు చాల, కునికి నాపాపి తనవ్యయంబునకు నొక్క-
నాఁడు ద్రవిణంబు గలలోభి నాఁగఁ బేరు, వడినయొకభూసుపర్వునికడకుఁ జేరి.

క. ఆవిప్రునిద్రవిణంబును, నేవిధి నైనను హరింప నెంచి మదిని భూ
దేవ క్షుధార్తిని నసువులు, పోవుచు నున్నవి క్షణంబు బ్రోవుము నన్నున్. 326

క. అని తత్పదములపైఁ బడి, కనకన మనుచుండుకుక్షి గనఁబఱుచుచు నే
డ్చిన నాబాపఁడు కనికర, మెనయఁగ ని ట్లనియె మోస మెఱుఁగనికతనన్.

ఆ. తండ్రి నిర్గమించెఁ దల్లియు గతియించె, సతియుఁ బోయెఁ బోయె సంతతియును
నమ్మవంకవార లైనను నావంక, వార లైనఁ గాని లేరు నాకు. 328

క. హరి యొకఁడు దప్ప శరణము, పరుఁ డెవఁడును లేఁడు నాకుఁ బాకము సేయన్
దొరకొనఁగఁ జాలఁ గైకొని, యరుగుము తండులము లిత్తు నాఁకలిదీఱన్.

క. అని తండులములు గొని రాఁ, గను నాతం డిట్టు లనియె భూనిర్జర నీ
వును నేనును సంసారము, నను సములమె దిక్కు లేదు నాకును నెందున్. 330

క. నీపాదసేవ సేయుచుఁ, బాపంబులు దొలఁగిపోవ భవదంతికమం
దే పడియుండెద మరణము, చేపడియెడిదాఁకఁ గరుణసేసినయెడలన్. 331

చ. అనుటయు బ్రాహ్మణుండు మనమందుఁ బ్రహర్షము నొంది తత్క్షణం
బున నె యొనర్చి పాకమును భుక్తిని వానికిఁ బెట్టె నంత భో
జన మొనరించి వాఁడు ద్విజసద్మమునందె వసించి సేవ చే
యను సమకట్టె బ్రాహ్మణున కత్యధికం బగుభక్తి చూపుచున్. 332

గీ. ప్రతిదినంబును మొదటఁ దత్పాదములను, గడిగి పాదోదకము మస్తకమునఁ గొంత
చల్లుకొని శేషమును ద్రావి సలుపుఁ బిదపఁ, జలుప వలసినసేవను భూసురునకు.

ఆ. అట్లు కొంతకాల మరుగంగఁ గనిపట్టి, బాపఁ డర్థ ముంచుపట్టు నెల్ల
నొక్కనాఁటిరేయి నొడమి యంతయు వాఁడు, కొనిచనంగఁ దలఁచుకొనుచునుండ.

గీ. దైవికంబుగ నపు డొకతస్కరుండు, కన్నమును వైచి ద్విజునినికాయ్యమునకుఁ
జేరి లోనికి దెసలు వీక్షించుచుండఁ, గాంచి వానిని లేచి జఘన్యజుండు. 335

గీ. పట్టుకొనుటయు నాచోరుఁ డట్టు నిట్టుఁ, గదలలేమిని మొల నున్నకత్తి దూసి
పట్టునను వానిమెడ గోసి పాఱిపోయె,నంత నచటనె పడి శేముఁ డసువు లుడిగె.

ఉ. అంతట విష్ణుదూతలు రయంబున వచ్చి మహానుభావ నై
త్యాంతకుఁ డీవు చేసినధరామరసేవకు మెచ్చె నీయఘం
బంతయు నంతరించె రథ మయ్యదె యెక్కుము విష్ణుమందిరా
భ్యంతరమందు నీ కొకమహాసన మేర్పడె నంచుఁ బల్కుచున్. 337

గీ. అపుడు వృషలుఁడు సంతసం బంది యెంత
ఫలము గలుగునొ యిఁక శుద్ధభక్తితోడఁ
జేయుద్విజసేవ కని లోన సిగ్గుపడుచు
రథముపై నెక్కి విష్ణుపురమున కరిగె. 338

క. ఈవిప్రమహిమ వినునెడ, నేవాఁ డైనను దొలంగి యెల్లయఘంబుల్
పోవును వైకుంఠమునకు, దేవానీకంబు సంస్తుతించుచు నుండన్. 339

క. అనుటయును శౌనకుం డి, ట్లనియెను బ్రాహ్మణున కెట్టియపచారములం
బొనరింప నేమి కలుగునొ, వినిపింపుము మాకు సూత విశదము గాఁగన్. 340

క. అని యడుగుటయును సూతుఁడు, మునివర నీ వడిగినట్లె మున్నొకదివసం
బున బ్రహ్మ నడుగ నారద, మునివరుఁడు పితామహుండు మునికి ట్లనియెన్.

—: బ్రాహ్మణాపచారఫలకథనము :—

సీ. ఆఁకలిమై వచ్చినట్టిబ్రాహ్మణునకు, నన్నంబు పెట్టనియట్టివారు
యాచకుండై వచ్చినట్టిభూదేవుని, నాడఁగూడనిమాట లాడువారు
పాదరక్షాపాణిపాదదండాదుల, క్షోణీసురవ్రాని గొట్టువారు
చౌర్యంబునను గాని శౌర్యంబునను గాని, యిలవేల్పుసొమ్ము గ్రహించువాడు

గీ. ఘోరనరకంబులను జెంది కొట్టకొనకు, నుర్విలోఁ బుట్టుదురు హీనయోనులందుఁ
బేదలుగ మూఁగివారుగఁ బాదహీని, వర్జితులుగను వంశవివర్జితులుగ. 342

గీ. తల్లిదండ్రుల గోవును ధరణిసురుని, గురువును వధించునట్టిముష్కరులు కల్ప
శతమువఱకు నసహ్యదుర్గతులఁ జెంది, పుట్టుదురు తొట్టకొద కీలఁ బుడవులుగను.

గీ. బ్రాహ్మణునిపైనిఁ దన్నంగఁ బాద మెత్తు, నట్టివారలు శ్లీపదవ్యాధితులుగ
ఖంజులుగ ఖండపాదులుగను బ్రకంప, గాత్రులుగఁ బుట్టి పడుదురు కష్టములను.

గీ. పక్షపాతంబునను జేసి బ్రాహ్మణులను, దూషణము చేయుపాపు లాదోషమునను
బ్రభవమును జెంది యిలలోనఁ బక్షవాత, జాడ్యపీడితు లగుదురు జన్మశతము.

వ. సైఁప రానిదుర్భాషణంబులచే బ్రాహ్మణునకు క్షోభంబు గలిగించువారలు

జన్మాంతరంబున విచర్చికాపద్మమండలశుక్తిసిధ్మారుణకాలశుక్లంబులను సప్త
కుష్ఠవ్యాధులచేఁ బీడితు లగుదురు. అష్టకుష్ఠంబులయందును దరుణకాలశుక్ల
కుష్ఠంబులు మూఁడును మహాకుష్ఠంబులు. అయ్యవి యతిపాతకుల దేహంబులం
దుండు. తత్సంసర్గసంబంధంబువలన నారోగం బన్యులకును సంక్రమించుం గాన
వారలను దూరీకరింపం దగు. 346

క. ఒనరింపవలయు స్నానం, బును దాఁకిన యెడల శునకమును బతితునిఁ గు
ష్ఠిని స్త్రీధర్మిణిని గవా, శిని భిల్లునిఁ బుల్కసుని నిషిద్ధులు గానన్. 347

గీ. బ్రాహ్మణద్రవ్యమును దిన్నఁ బ్రణయమునను
సప్తకులముల దహియించు శౌర్యమునను
ననుభవించినయెడలఁ బూర్వాపరముల
దశకులంబులవఱకును దగులఁబెట్టు. 348

గీ. వ్యాప్త మగునది కావున నయ్యె విషము
విషముచేఁ జచ్చు నొక్కఁడె విప్రధనము
వలన వంశంబు సర్వంబు విలయ మొందు
విషము బ్రహ్మస్వమె విషంబె విషమె చెపుమ. 349

క. గురుపత్నిని జనయిత్రిని, ధరామరునిసతిని మోహదహనాక్రాంతాం
తరుఁ డయి కవసిన రౌరవ, నరకమునం గూలి వాఁడు నష్టాత్ముఁ డగున్.

గీ. ఎవనికతమున విడుచునో యవనిసురుఁడు
ప్రాణముల నాతఁ డొందును బ్రహ్మహత్య
చేసినయఘంబు దాన నాచెడుగు కూలుఁ
గాలసూత్రాదిఘోరదుర్గతులలోన. 351

గీ. అధికుఁ డగుటను జేసి బ్రాహ్మణులలోన, శ్రోత్రియుఁడు వానిఁ జంపిన క్షోణిసురుల
గోటిలకు సహస్రసంఖ్యలను గెడపి, నట్టిపాపమునకు గుఱి యగు నిహంత. 352

వ. అగ్నిదుండును గరదుండును ధనాపహారియును సుప్తఘ్నుండును క్షేత్రాపహారి
యును దారాపహారియును రాజవధోద్యతుండును పితృవధోద్యుక్తుండును
బ్రాహ్మణవధోద్యతుండును నాతతాయులుగాఁ జెప్పం బడిరి. 353

గీ. ధరణి నెవ రేనియును నాతతాయు లైన, యెడల వారిని దగు వధియింప దాన
నఘవిలిప్తుఁడు గాఁడు నిహంత వాని, కైహికాముష్మికములందు హాని లేదు.

గీ. అనుటయును నారదుఁడు హర్షమునను దండ్రి
పాప మొనరింపకుండంగ బ్రాహ్మణుండు
జీవనంబు నొనర్చెడిత్రోవ యేదొ
[illegible] జెప్పుము నా నజుం డిట్టు లనియె. 355

—: బ్రాహ్మణునికి కాప్రకార కథనము :—

గీ. అవనిసురున కయాచితమైనభిక్ష, యుత్తమం బది గానిచో నుంఛవృత్తి
శ్రేష్ఠ మావల యజ్ఞదక్షిణయు విద్య, చెప్పుటయు స్వాధ్యాయమును శ్రేయదములు.
క. ఆవలఁ బ్రతిగ్రహంబును, గావించుట సుప్రశస్తకార్యము ధాత్రీ
దేవునకు దాన నొదలను, బావనులను జేసి తాను భద్రము లొందున్. 357
సీ. అదియును బొసఁగకున్నట్లైన క్షత్రియు, వృత్తిచే ద్విజుఁడు జీవింప వచ్చు
చాపవేదము నేర్చి శస్త్రాస్త్రసంప్రయో, గంబుల గోప్యమార్గంబు లెఱిఁగి
ధరియించి వీరవ్రతంబు దేవతలు సం, తస మొంద ధర్మయుద్ధములు చేసి
పాలించుచును న్యాయబద్ధమార్గంబునఁ, బ్రజలను గొనఁ దగ్గపన్ను గొనుచు
గీ. దానఁ గ్రతువులు వ్రతములు దానములును, నతిథిపితృ దేవతాసపర్యలును నాచ
రించుచును జీవనంబు గావించునెడల, ధ్మాసురున కన్యవృత్తిదోషంబు లేదు.
క. మునిజనవనితాజనస, జ్జనగురుజనధర్మకర్మసంరక్షణముం
బొనరించుటచేఁ గల్గిన, యనుపమసుకృతమునఁ జెందు నతఁడు దివంబున్. 359
గీ. శత్రుసమ్ముఖమున న్యాయసమ్మతముగ, నిలిచి రణభూమిలోఁ దృణంబులను బోలె
ప్రాణముల వీడుశూరుఁడు బ్రహ్మవాదు, లేఁగుపరమపదంబున కేఁగువాఁడు.
సీ. భంగపాటును జెంది పరువెత్తువానిని, యుద్ధంబు చేయక యుండువాని
శరణు చొచ్చినవాని శస్త్రవిహీనునిఁ, బ్రహరింప వల దని పలుకువాని
భయము చెందినవానిఁ బ్రస్తుతించెడివానిఁ, బ్రతిభటుండై నిల్వఁబడనివాని
వధియింపకుండఁగావలయు యుద్ధము చేయ, నొప్పు నయ్యది ధర్మయుద్ధ మనఁగ
గీ. నట్లు యుద్ధంబు గావించునట్టివాఁడు
స్వర్గమున నొక్కకల్పంబువఱకు నుండి
యనుభవించి సమస్తసౌఖ్యములఁ బిదపఁ
బ్రభవమును జెందు నిల సార్వభౌముఁడుగను. 361
గీ. బ్రాహ్మణక్షత్రియులె కాక పరమపదముఁ, జెందుదురు ధర్మయుద్ధంబు చేసి రేని
యర్యులైన జఘన్యజులైన మ్లేచ్ఛు, లైనఁ జండాలురైన నేరైనఁ గాని.
గీ. అట్లు కాకుండఁ గపటజన్యములు చేసి, దేహములు దాఁచుకొన్నక్షత్రియుల కైన
బ్రాహ్మణుల కైనఁ దదితరభటుల కైన, ననుభవింపక తప్పదు యమునిశిక్ష.
సీ. అదియును గానిచో నగు వైశ్యవృత్తిచే, జీవింపఁగను మహీదేవుఁ డిలను
ధర్మదేవతయుండుధటమందుఁ గానమో, సముదూకమునయందుఁ జలుపమియును
నసృతంబునం దుండు నఖిలపాపములును, నఖిలవిపత్సంచయమును గాన
చులలోనఁ దూఁషఁగా వలను గాకుండు ద్రవ్యములలో నసృతంబు నాడమియును

గీ. వైశ్యవృత్తిని నెరింపఁ దగ్గినపుడు, గోరసము తైలమాంసముల్ ధర్మహాని
కరము లగుటను కొనరాని కదనములు, తెలిసికొని హానివృద్ధులు మెలఁగవలయు.

గీ. అట్టివృత్తిని గ్రయవిక్రయములలోన, వదలవలయును ద్విజుఁ డార్ద్రవస్తువులను
దధ్యన్నంబును భుజియింపఁ దగును దాను, దృష్టి పఱచుచుఁ బితరుల దేవతలను.

గీ. అట్లు కాదేని కృషికర్మ మాచరించి, బ్రదుకఁ దగు నిర్భయంబుగ బ్రాహ్మణుండు
తత్కృషిక్రియ ధర్మంబు దాఁటకుండఁ, జేయునేని స్వర్గలోకంబు చేత నుండు.

గీ. జంతువధపాప మర్ధాన సంభవింపఁ, దదుపశాంతికి నై నవధాన్యములను
దాన మిచ్చి మహీదేవతలకు శుద్ధిఁ, బడయఁగా వచ్చు నుత్తమబ్రాహ్మణుండు.

గీ. మఱియు నావృత్తివలన సంప్రాప్తమైన, వస్తువుల యజ్ఞములకును వ్రతములకును
ననిమిషులకును బితరుల కతిథులకును, నగ్నికిని నర్పణము చేయునతఁడు చెడఁడు.

గీ. కష్టముల నెల్ల సహియించి గడనసేసి, నట్టిద్రవ్యంబుఁ బితృదేవతాతిథులకు
బ్రాహ్మణులకును వినియోగపఱిచెనేని, కోటిగుణముగఁ బెంచినగుణి యతండె.

గీ. అన్యవృత్తులు జీవికకై గ్రహింప, వచ్చు ద్విజుఁడు స్వధర్మంబు వదలకుండ
విడిచెనేని స్వధర్మంబు విడుచు జన్మ, శతసహస్రార్జితబ్రాహ్మశక్తి యతని. 370

గీ. నాల్గువృషభంబులను గట్టి నడపవలయు, నర్ధదివసంబువఱకును నవల వాని
వ్యాఘ్రచోరాదిభయశూన్యమైనసతృణ, ధాత్రిలోపల విడువంగఁ దగు భుజింప.

క. కావలసినప్పు డెల్లను, గావలసినయంత గడ్డి గ్రాసముగా నా
గోవులకు నొసఁగుచుండం, గావలయును దన్మనోవికాసం బొదవన్. 372

క. దోమలు గ్రిములును సీఁగలు, గోమాదులు గోమయంబు గోమూత్రంబున్
జెమలును లేనిగోష్ఠము, ధామంబుగ గోవులకును దగు నొనరింపన్. 373

సీ. మోయించినను భారమును జతచేసి దు,ర్బలములతోడను బలయుతముల
బాధించినను నతిబాల్యాతివార్ధక, యుతముల నామయయుక్తములను
గట్టివైచినను నాఁకలిదప్పులును గొన్న, వానిని ఘాసాంబువర్జితముగఁ
గొట్టినను జలంబు గ్రోలుచుండినవానిఁ, దినుచున్నవానిని దృణచయంబు

గీ. సంభవించును గోహత్య సలిపినట్టి, పాతకం బందుచే నట్టిపనులు విడిచి
తనశరీరంబు గాపాడుకొనినయట్లు, కావనగు నాల నెద్దులఁ గర్షకుండు. 374

గీ. పూర్ణిమాదర్శసంక్రాంతిపుణ్యదినము,లందు వృషభంబు మెడపై నిహాలము మోపి
నట్టివారల కయుతగోహత్య లొక్క, సారిగ నొనర్చినయఘంబు సంభవించు.

క. పూవుల నలంకరించియుఁ, గావించియుఁ బత్త్రరచన కాయమునందున్
దేవతనుబోలె గోవును, సేవించెడివాఁడు సకలసిద్ధులు చెందున్. 376

క. ఒకఘాసముష్టి నొసఁగిన, నొకయావున కనుదినమును నొడఁగూడును దా
తత పుత్త్రైశ్వర్యములును, సకలామరపూజ్యతయును స్వర్గసుఖంబున్. 377

క. గోవును ద్విజులను దుల్యులు, గా వ్రుష నావస్తువులను గాపాడవలెన్
సేవకులువోలె నెల్లరు, దేవతలకుఁ గూడ సవియె దిక్కై యుంటన్. 378
గీ. అని వచించుటయును విని యమరవాని
జనక విప్రుఁడు గోవును సములటంచుఁ
జెప్పితివి తుల్యులెట్లైరో చెప్పు మింకఁ
బశు వయినయావు నడఁ బై నబ్రాహ్మణుఁడును. 379
వ. అని యడుగుటయుఁ బరమేష్ఠి యాతని కిట్లనియె. 380

—: గోమాహాత్మ్యకథనము :—

సీ. బ్రహ్మవక్త్రమునుండి ప్రభవించె మున్ను దే, జఃకూట మొకటి విస్మయము గలుగ
దానిలోనుండి వేదంబు వచ్చెను గోవు, విప్రుండుఁ బుట్టిరి వేఱువేఱ
దేవతాసంతృప్తి గావింప నానాల్గు, వస్తువు లయ్యె నావశ్యకములు
నిలువవు లోకముల్ నిర్జరసంతృప్తి, గలుగు కార్యంబులు సలుప కున్న
గీ. నొసఁగ మంత్రంబులను వేద మొసఁగ గోవు
ఘృతపయోయూపహవ్యము క్షితిసురుండు
మంత్రములచేత హవ్యహోమంబు చేయ
నగ్నిముఖమున భుజియింతు రమరు లెల్ల. 381
క. అనిమిషులు చెంది తృప్తిని, ననువుగ గురియింప వర్ష మద్దాన ఫలిం
చును మేదిని తత్ఫలమున, జనములు బ్రతుకుదురు దాన జగములు నిలుచున్.
క. ఆనాలుగువస్తువులును, లేనియెడల జగము లెల్ల లేనివ యగు న
ద్దాననె కలిగెను బూజ్యత, వానికి నధికముగఁ బ్రాజ్ఞవర్గములోనన్. 383
గీ. ఒక్కజన్మంబుననె మోక్ష మొదవ వరము, నిచ్చినాఁడను గోవున కేను మున్ను
దానఁ జేసియు గోవు పాత్రతను జెందె, సేవ చేయంగ విప్రులు దేవతలును.
సీ. కాయంబునను బాపకణ మేమియును లేమిఁ, బావనం బైయుండు గోవు సతము
దానిపేఁడయునుమూత్రమును నాజ్యంబును,పెరుఁగుఁ బాలును శుద్ధికరములయ్యె
నాపంచగవ్యముల్ ప్రాశనం బొనరింప, భస్మంబు లగు సర్వపాపములును
దనువు వీడినక్షణంబుననె నాసన్నిధి, కరుదెంచు నిష్పాప మగుట గోవు
ఆ. కాన గోవు సకలకలుషంబులును మాపు, నట్టి దగుట దాని కన్వహమును
సేవ చేయునెడలఁ జెందు స్వర్గపదంబుఁ, గలుషకోటిదళితకాయుఁ డేని. 385
క. గోవునకుఁ బ్రదక్షిణమును, గావించిన నొక్కసారి గతకలుషుం డై
యేవేళను నివసించును, దేవత లెల్లరును గొలువఁ ద్రిదివమునందున్. 386
క. అకలుషమతియై ధేనువు, నకు నేడుప్రదక్షిణము లొనర్చిన సురనా
యకపదము నొంది విబుధ, ప్రకరము గొలువఁగఁ ద్రివిష్టపంబున నుండున్.

వ. కల్యంబున నుత్థితుండై జలపాత్రంబు లేక గోముఖ్యమునకుం జని సలిలంబు గోశృంగంబుపయిం బోసి శృంగంబునుండి జాఱెడిపూజలంబు మస్తకంబునం దాల్చి యాదినం బుపవసించిన నెవ్వఁడు త్రిలోకవిఖ్యాతంబులును మహర్షిసేవితం బులును నగుసకలపుణ్యతీర్థంబులలో స్నానంబు గావించినఫలంబు నొందం గలుగు. ప్రాతఃకాలంబున గోగోఘృతమధుప్రియంగుసర్షపంబుల స్పృశించె నేని సకలపాపనిర్ముక్తుం డగు. 388

సీ. జనుఁ డెవ్వఁడేని యుషఃకాలమునను సా, యంకాలమందును నాచమించి
ఘృతయోనులును ఘృతక్షీరదంబులు ఘృతా, వర్తముల్ ఘృతసరస్వతులు నైన
గోవు లుండునుగాక యేవేళలను నాగృ, హమున నాసర్వగాత్రములయందు
నానాల్గుప్రక్కల నేను గోవులమధ్య, మందు నిత్యంబును నుండుఁగాక

గీ. యనుచు జపియించెనేని సర్వాఘములును, దొలఁగి దేవత లెల్లరుఁ గొలువఁ దాను
స్వర్గలోకంబునం దుండు శాశ్వతముగ, నఖిలసౌఖ్యంబు లిహమున ననుభవించి.

క. గోవువలె బ్రాహ్మణుఁడు భూ, దేవుని చందమున వాసుదేవుండును నా
గోవిందుఁడువలె గంగా, దేవియు సేవ్యులు సమానదేవత లగుటన్. 390

క. మనుజునకున్ గోవును గో, వునకున్ మనుజుఁడును బాంధవులు గావున గో
ధనశూన్యం బైయుండెడి, మనుజగృహము బంధురహితమందిరము సుమీ.

ఆ. తాల్చునో యెవండుగోఖురోత్థితపజంబు, మూర్ధమున వాఁడు భూతలంబునఁ గలట్టి
సకలతీర్థంబులందును స్నానమాడి, నట్టిఫల మొంది దాన ధన్యతను జెందు.

సీ. శ్వేతగోదానంబు చేసిన మేదినీ, కాంతుఁడై సకలభోగములఁ జెందు
సర్వపాపములును సమసి సంసార పా, థోధి దాఁటు నొసంగ ధూమ్రగోవు
నెట్టిశోకమ్మును నెఱుఁగక సుఖయించుఁ, గృష్ణగోవును సమర్పించెనేని
వర్ధిల్లఁ జేసినవాఁ డగు వంశవృ, క్షంబు నిచ్చినయెడ గౌరగోవు

గీ. భువనమోహనరూపంబు వొందఁ గలుగు, నిచ్చునెడ రక్తధేనువు నిచ్చునెడలఁ
గపిలగోవునుశతజన్మకలుషములను, భస్మమొనరించి త్రిదివంబుఁ బడయఁగలుగు.

ఆ. ఒక్కకపిలగోవు నొసఁగినఁ జాలును, సకలగోప్రదానసుకృత మొంద
దానఁ గపిలగోప్రదానంబు గావించు, వాఁడె ధన్యుఁ డఖిలవంద్యుఁ డతఁడె.

గీ. స్వర్ణశృంగయుఁ దామ్రపృష్ఠయును క్షౌమ
యుతయుఁ గాంస్యోపదోహనయును సరౌప్య
ఖురయు సుమగంధభూషణసురుచిరయును
నైనగోవును దాన మీయంగ వలయు. 395

గీ. పదయుగంబును ముఖము వెల్వలకు రాఁగ
గర్భమున దూడ సగ మున్న కాలమందు

నుభయముఖి యగు ధేనువు నొసఁగెనేని
తత్ఫలం బింత యం తనఁ దరము గాదు. 396
ఆ. భర్మసౌధములును బాయసకర్దమం, బు లగునదులుఁ గామఫలము లైన
వృక్షములును నెచట విలసిల్లు చుండునో, యేఁగు నటకు గోవు నిచ్చువాఁడు.
గీ. అఖిలలక్షణయుతయుఁ బయస్వినియును,దరుణయును నైనధేనువు ధాత్రియనుచుఁ
జెప్పఁబడియెను దానినిచ్చిన ధరిత్రి, యంతయు నొసంగినఫలంబు నతఁడు చెందు.
క. హరియించినయెడ గోవును, మరణించినపిదపఁ గోటిమన్వంతరముల్
పరిదేవన మొనరించుచుఁ, బురువులు గలనరకకూపమునఁ బడి యుండుర్. 399
క. ఒనరించినయెడ గోవధ, మును గుంభీపాకనరకమును నాకల్పం
బును ననుభవించి కడకుఁ, జనియించును భూతలంబునను సూకర మై. 400
వ. గోవునకు ముఖంబున షడంగపదక్రమయుతంబు లగువేదంబులును శీర్షంబునందు
బ్రహ్మయును శృంగంబులందు హరిహరులును శృంగాగ్రంబునందు మహేం
ద్రుండును లలాటంబునందు వృషధ్వజుండును గర్ణంబులం దాశ్వినులును నేత్రం
బులందు శశిభాస్కరులును దంతంబులందు గరుడుండును జిహ్వయందు సరస్వతి
యును నుదరంబునందు స్కందుండును రోమకూపంబులందు ఋషులును బూర్వ
భాగంబునందు యముండును బశ్చిమభాగంబునం దగ్నియును దక్షిణపార్శ్వంబు
నందు వరుణకుబేరులును వామపార్శ్వంబునందు యక్షులును ముఖమధ్యంబు
నందు గంధర్వులును నాసాగ్రంబునందుఁ బన్నగులును ఖురపశ్చిమపార్శ్వంబున
నప్సరసలును నపానంబున సర్వతీర్థంబులును బ్రస్రావంబున గంగయును
గోమయంబున లక్ష్మియును బాదాగ్రంబున ఖేచరులును హంభారవంబునఁ బ్రజా
పతియును స్తనంబులందుఁ జతుస్సాగరంబులును నుండు. 401
గీ. కాన నొకగోవును స్పృశించెనేని నరుఁడు, సకలతీర్థంబులందును స్నానమాడి
నట్టిఫలమును నమరుల కందఱకును, సేవ చేసినఫలమును జెందఁ గలుగు. 402
క. అని చెప్పుటయును నారద, మునివరుఁ డత్యంతహర్షమును జెంది దివం
బున కరిగెను నావుడు సూ, తునిఁ గనుఁగొని శౌనకుఁడు కుతూహల మొదవన్.
క. అనఘ ప్రమోదము జనియిం, చెను నా కెద నింక శౌరిచేతస్సంతృ
ప్తిని బాతకనాశనమును, నొనరించెడిసులభ కార్య ముండినఁ జెపుమా. 404

—: ఆశ్వినపూర్ణిమా మాహాత్మ్యకథనము :—

చ. అనవుడు సూతుఁ డిట్లనియె నాశ్వినపూర్ణిమనాఁడు నందనం
దనునకు నారగింపఁగ ఘృతప్లుతలాజలు గవ్య లాడ న
ప్పన మొనరించిన ట్లయినఁ బద్మదళాక్షుఁడు తృప్తి చెందు ధా
ఘను దురితంబు లన్నియును నాశన మొందుఁ దపోధనాగ్రణీ. 405

సీ. పూర్వము కరవీరపురమునం దొకశూద్రుఁ, డుండెను గాలద్విజుండు నాఁగఁ
గావించి వాఁ డసంఖ్యాకంబు లగుపాత, కము లొక్కనాఁ డొక్కకడను జచ్చె
నంతట యమదూత లతనిఁ గైకొనిపోయి, నిలిపి రంతకునిసాన్నిధ్యమందు
దండధరుండు తత్కర్మానుసారంబు, గను ద్రోసె ఘోరదుర్గతుల వాని
గీ. నంతటను వాఁడు నూఱుమన్వంతరములు, గడపి కఠినంబు లగునరకంబులందు
పిమ్మటను నొకభుజగగర్భమ్ముఁ జొచ్చి, తుదకు జన్మించె నొకశిలాసదనమందు.
గీ. పుట్టియచ్చోటఁ బెరుఁగుచు నెట్టొయొకరి, కంటఁబడకుండఁగుడుచుచుఁగష్టములను
నొక్కయాశ్వినపూర్ణిమ నొక్కలాజ,యొక్కగవ్వయు వెలికి లోనుండి ద్రోసె.
క. ఆగవ్వయు నాలాజయు, నాగట్టున వెలసియున్న హరికట్టెపుటకా
వేగముగఁ బోయి పడుటయు, నాగశయానుండు తదఘనాశ మొనర్చెన్. 408
ఉ. అంతటఁ గొంతకాలమున నాఫణి దేహవియోగ మొంద దై
త్యాంతకసేవకుండు సురయానము గైకొని వచ్చి దానియ
భ్యంతరమందు నుంచుకొని యాసుకృతాత్ముని నేఁగి విష్ణుగే
హాంతరసౌధమం దునిచె నంతకు నెంతఫలంబొ వింటివే. 409
క. ఈపూర్ణిమామహత్త్వము, పాపాత్ముం డైన వినినపక్షంబునఁ ద
త్పాపంబు లెల్లఁ దొలఁగును, శ్రీపతికరుణామృతాభిషేకమువలనన్. 410
గీ. మఱియు ద్వాదశినాఁడు రమాధవునకు, శర్కరాదుల స్నపనంబు తన్మనుదునకు
నన్నదానంబుఁ గావించినట్టులైన,హరికి సంతృప్తియును బాపహతియుఁ గలుగు.
గీ. అనుటయును శౌనకుం డిట్టు లనియె సూత, విన్నకొలఁదిని ధర్మముల్ వినుపు రాదు
చెప్పు మెట్టిదొ యేకాదశీమహత్త్వ, మది వినంగ మనోరథ మంకురించె. 412

—: ఏకాదశీ మాహాత్మ్య కథనము :—

వ. అని యడుగుటయు సూతుం డమ్మునివర్యున కిట్లనియె. 413
క. ఏకాదశి యనుశబ్దం, బాకర్ణించినను జాలు నత్యంతభయ
వ్యాకులమానసు లగుచును, నాకడకును రాక యుంట కంతకునిభటుల్. 414
గీ. ధన్య మారాజుజన్మము ధన్యు లతని, జనపదంబుల నుండెడిజనము లెల్ల
హరిదినంబున నెవనిరాజ్యంబునందు, జరుగుచుండునొ విష్ణుపూజామహంబు.415
క. వెలిఁగింతురొ ఘృతదీపము, జలజాక్షునియెదుట నెవరు శ్రద్ధాభక్తుల్
గలిగి హరివాసరంబున, వెలుఁగుదురు శతంబు వారు విష్ణుపురమునన్. 416
గీ. దినములం దెల్ల నుత్తమదినము నాఁగ, వాసి కెక్కెను వైకుంఠవాసరంబు
నాఁ డుపవసించి జాగరణం బొనర్చి, శార్ఙ్గి నర్చించుజన్మమె జన్మ మనఘ.

సీ. బ్రహ్మహత్యాదిపాపము లెల్ల నశియించు, వైకుంఠదివసోపవాసమునను
గానకుష్ఠాదిరోగము లన్నియును మాయు, వైకుంఠదివసోపవాసమునను
జిత్తమాలిన్య మశేషంబును దొలంగు, వైకుంఠదివసోపవాసమునను
నాగామ్యనర్థంబు లన్నియు నడఁగారు, వైకుంఠదివసోపవాసమునను
గీ. జంద్రసూర్యోపరాగముల్ సంఘటిల్లి, నపుడు గంగాదితీర్థంబులందు స్నాన
మాచరించుటచేఁ గల్గునట్టిఫలము, వచ్చు వైకుంఠదివసోపవాసమునను. 418
క. ఉందురో యుపవాసము గో, విందునిదినమందు నెవరు విష్ణుపురంబం
దుందురు శాశ్వతముగ వా, రందఱును విషాదవిరహితానందమునన్. 419
గీ. ఆరగింతురో హరిదినమందు నెన్ని, యన్నకణములు మానవు లన్నిబ్రహ్మ
హత్యలొనరించినయఘంబునందిశమన,లోకమునఁజెందుదురుఘోరశోకములను
గీ. చేసి యుపవాస మేకాదశీదినమున, శౌరి నర్చించి ద్వాదశీపారణంబు
విధివిధానంబు నెఱిఁగి కావించెనేని, గర్భనరకాభితప్తుఁడు గాఁడు మరల. 421
ఆ. అఖిలపాపములును హరివాసరంబున, నాశ్రయించి యుండు నన్నమంద
కాన నాదినమునఁ గావించునెడ భుక్తి, సలిపినట్ల సకలకలుషభుక్తి. 422
గీ. ఎన్నిపాపంబు లొనరించియున్నఁ గాని, యొక్కపరి నైన నిష్కృతి యొందవచ్చు
హరిదినంబునఁ గావించినట్టిభుక్తి, కెన్నఁటికిఁ గూడ నిష్కృతి యేరుపడదు.
గీ. నాతితోడ నమావాస్యనాఁడు గలసి, కొన్న యెడఁ గల్గుదోషంబు కొట్టికొఱు
హరిదినంబున నన్నంబు నారగించు, నట్టిమూఢాత్ములకు సంశయంబు లేదు.
సీ. హరివాసరంబున నన్నంబు తినునేని, కలుగుఁ గుష్ఠాదిరోగంబు లెల్ల
హరివాసరంబున నన్నంబు తినునేని, దారిద్ర్య మొనగూడుఁ దరతరంబ
హరివాసరంబున నన్నంబు తినునేని, సమకూరు నతినీచజన్మకోటి
హరివాసరంబున నన్నంబు తినునేని, బ్రహ్మహత్యాదిపాపంబు లొదవు
గీ. బాగుపడ నెంచువారలు బాగుపడఁగఁ, జెప్పినదె మాటిమాటికిఁ జెప్పుచుంటి
హరిదినంబునఁ దగ దన్న మారగింప, హరిదినంబునఁ దగ దన్న మారగింప.
క. వనజాక్షుఁడు శయనించెడి, దినమందును నొత్తగిలెడిదినమందును మే
ల్కాంను దినమునను నుపోషణ, మొనరించెడివార లెనుట నుండురు హరికిన్.
గీ. చిత్త మెవనికి నేకాదశీవ్రతంబు, నందు నుండునో లీనమై యతఁడు చెందు
హరిపదంబును సాధనాంతరము లేదు, గతులు గలుగంగ హరిదినవ్రతముకంటె.
క. పతితోడను హరిదివస, వ్రతమును గావించుతరుణి స్వామిప్రియ యై
సుతులను గని యిహమున స, ద్గతులను బరమందుఁ జెందుఁ దనపతితోడన్.
గీ. హరిదినంబున నేవస్తు వైనఁ గాని, భక్తితోడను శౌరి కర్పణముచేయు
నట్టివానికి నక్షయ మైనపుణ్య, మొదవి శాశ్వతముగ విష్ణుపదము గలుగు.

గీ. కాంస్యమును మాంసమును జణకములు మధుప్ర
సురతమును గోద్రవములు మసూరములును
శాకము పరాన్నమును బునర్జగ్ధి తగవు
దశమినాఁ డివి వదియును దాపసేంద్ర. 430

గీ. కూడదపద్యూతదినమునఁగూటసాక్ష్య హింస, యనృతమును నాగ్రహమును భోజనము దంత
ధావనమును బరాపవాదమును నిద్రయు, ద్యూతము సుదమ్ములంబును నొంగతనము.

గీ. అనఘ ద్వాదశినాఁడు వ్యాయామము కాంస్య, పతితభాషణ మధుసురాపానములును
రతిపునర్భుక్తి మాంసకోద్రవమసూర, తైలములును బ్రవాసముఁ దగవు చూవె.

గీ. తోయములలోన నుండు బుద్బుదములట్లు, దేహధారులలోని వృత్తికలు వోలె
జనన మొందుచు నుందురు చావుకొఱకె, హరిదినవ్రత మొనరింపనట్టిజనులు.

గీ. నల్లనగు ధేనువునకును దెల్లనైన, ధేనువునకును బా లొక్కటే ఫల గాఁగ
నుండునట్టి తెఫలముండు నొక్కఁడుగనె, యుభయపక్షముహరిదినయుగమునకును.

సీ. కాంచనం బనుపేరు గలపురంబున మున్ను, వల్లభుం డనునొక్క వైశ్యుఁ డుండె
నతనికిఁ గల చొక్కటయితివ హేమప్రభ, యనెడునామమునకు ననుగుణముగ
నాకాంత చెడిపయై యనుదినంబును గూడఁ, బరులగేహములకుఁ దిరుగఁ జొచ్చె
నది చూచి యొక్కనాఁ డాఁగఁ జాలక కొట్టె, నామెను వల్లభుం డాగ్రహమున

గీ. నంత నాయింతి గదిలోని కరిగి పండు, కొనియె భుజియింపకుండఁగాఁ గ్రోధమునను
నావినం బంతయును గూడ నాదినంబె, విష్ణువాసర మయ్యె దైవికము గాఁగ.

వ. అంతఁ బ్రభాతం బగుటయు హేమప్రభ హరివాసరోపవాసంబునం జేసి వినిర్మలాంతఃకరణయై భోజనంబు గావించి యాకస్మికంబుగా నారాత్రి మరణించె.

ఉ. అప్పుడు విష్ణుదూతలు రయంబున వచ్చి విమానమందు నా
కప్పురగంధి నుంచుకొని గౌరవ మొప్పఁగ నేఁగి శౌరికిం
జెప్పుటయుఁ జనార్దనుఁడు చిత్తములోపల నెంతొ సంతసం
బుప్పతిలంగ నుంచెఁ దనయొద్దనె యామెను శాశ్వతంబుగన్. 437

గీ. చేసియుపవాసమును హరివాసరమునఁ, దెలియక యెయూర్ధ్వపదమతిసులభముగను
జెందె హేమప్రభ యెఱింగి చేసెనేని, కలుగుఫల మింత యంతని తెలుపనగునె.

గీ. ఉభయపక్షంబులందును నుండువిష్ణు, వాసరములకు భేదంబు వీసమేని
లేదు రెండును మోక్షసంపాదకములు, కాన నేకాదశులు రెండు మాన రాదు. 439

వ. దశమినాఁ డేకభక్తంబు గావించి యేకాదశీదినంబున గృహస్నానం బధమం బనియును వాపీకూపస్నానంబు మధ్యమం బనియును బుష్కరస్నానం బుత్తమం బనియును నదీస్నానం బుత్తమోత్తమం బనియును జెప్పంబడియెం గాన యథావిధిఁ బ్రాతఃస్నానంబు చేసి వ్రతనియమంబు వహించి నిద్రా

మైథునవర్జితుండై క్రోధలోభమిథ్యావాదధర్మనిందాపరులసంగంబు నుజ్జగించి ధర్మవిచారపరాయణుండై మాధ్యాహ్నికస్నానంబు గావించి గంధపుష్ప ధూపదీపాదులచే మాధవుని నారాధించి రాత్రి జాగరంబున నాదినం బెల్ల నుపవసించి ద్వాదశినాఁడు పారణ గావింపవలయు. అయ్యది సాంగం బగు నేకాదశీవ్రతంబు. వారాణసియందు నఱువదివేలవత్సరంబు లుండిన ఫలంబును గురుక్షేత్రంబునందుఁ జంద్రసూర్యోపరాగకాలంబునఁ గావించిన దానంబునకుం గలఫలంబును వైధృతినాఁడు లక్షదానంబులు చేసినఫలంబును బ్రభాసక్షేత్రంబున సోమపర్వసహస్రంబులందు దానంబు గావించినఫలంబును బ్రతిదినంబును గృహంబునందు లక్షమందియతులు భుజియించినఫలంబును గేదారక్షేత్రంబునం దుదకపానంబు గావించినఫలంబును హరివాసరోపవాస షోడశకలకును సీడు గానేరవు. గోసహస్రదానపుణ్యంబుకంటె బ్రాహ్మణారాధన పుణ్యంబు శతగుణాధికంబు. బ్రాహ్మణసహస్రారాధనపుణ్యంబుకంటె బ్రహ్మ చార్యారాధనపుణ్యంబు దశగుణాధికంబు. బ్రహ్మచారిసహస్రారాధనపుణ్యంబు కంటె వానప్రస్థారాధనపుణ్యంబు దశగుణాధికంబు. వానప్రస్థసహస్రారాధన పుణ్యంబుకంటె భిక్షుకారాధనపుణ్యంబు దశగుణాధికంబు. భిక్షుకసహస్రారా ధనపుణ్యంబుకంటె భూదానపుణ్యంబు దశగుణాధికంబు. దానికంటెఁ గన్యా దానపుణ్యంబు దశగుణాధికంబు. దానికంటె విద్యాదానపుణ్యంబు దశగుణాధి కంబు. దానికంటె నన్నదానపుణ్యంబు దశగుణాధికంబు. దానికంటె గోమేధ పుణ్యంబు దశగుణాధికంబు. గోమేధసహస్రపుణ్యంబుకంటె నశ్వమేధపుణ్యంబు దశగుణాధికంబు. అశ్వమేధసహస్రపుణ్యంబుకంటె నరమేధపుణ్యంబు దశగుణాధి కంబు. నరమేధశతపుణ్యంబుకంటెఁ గేదారక్షేత్రోదకపానపుణ్యంబు దశ గుణాధికంబు. కేదారోదకపానంబువలన జన్మరాహిత్యంబు గలుగు. దానికంటె నేకాదశీపుణ్యం బధికంబుగాఁ జెప్పంబడియె. ఏకాదశీపుణ్యం బసంఖ్యంబు. ఏకాదశికంటెఁ బుణ్యాధికం బగునది మఱియొండు లేదు. 440

గీ. కానఁ బుష్కరమును బ్రయాగమును గయయుఁ
గాశియును గంగయును గూడఁ గావు సాటి
హరిదినంబున కొకదాని కవనిలోన
ననుటయును శౌనకుం డిట్టు లడిగె మరల. 441

గీ. అనఘ ప్రతిమాసమును వచ్చుహరిదినంబు
లెట్టివియొ వానిమాహాత్మ్య మెంతటిదియొ
చెప్పుము సవిస్తరంబుగాఁ జెప్పఁదగిన
యంశ మంతయు లోటు లేనట్లు నాకు. 442

వ. అనుటయు సూతుండు శౌనకున కిట్లనియె. 443
క. మునివర యాదరముం గాం, చను నీ వడిగినవిధంబులను నె పూర్వము కృ
ష్ణుని ధర్మజుఁ డడుగంగ ని, ట్లని చెప్పెను గృష్ణుఁ డానరనాథునకున్. 444
వ. మార్గశీర్షకృష్ణపక్షంబున మురాసురసంహారార్థము నా దేహంబునుండి యేకా
దశి మొదట సంభవించుటం జేసి మార్గశీర్షకృష్ణైకాదశి యుత్పన్నైకాదశి
యని చెప్పంబడియె. దానిమహిమంబు నిర్వచనీయంబు. 445

—: మార్గశీర్ష కృష్ణైకాదశీమాహాత్మ్యకథనము :—

క. అనుటయు ధర్మజుఁ డది యె, ట్లని యడుగంగఁ గృష్ణుఁ డిట్టులనియెను బూర్వం
బునఁ గృతయుగంబునను మురుఁ, డనియెడి రాక్షసుఁడు బలసమన్వితుఁ డగుచున్.
గీ. దైత్యసేనలతోఁ గూడి దండు వెడలి, సురల నోడించి స్వర్గంబు కరగతంబు
చేసికొని దుండగంబులు చేయఁ దొడఁగె, స్వైరవర్తనమునను ముజ్జగములకును.
గీ. అపుడు పురుహూతుఁ డుండుట కైనఁ దుదకు
నాస్పదము లేమిఁ జింతాకులాత్ముఁ డగుచు
నాదితేయులతోఁ గూడి యరుగుదెంచి
నాకడకు నిట్టు లనియె వినమ్రుఁ డగుచు. 448
గీ. స్వామి మును పుట్టె బ్రహ్మవంశంబునందుఁ
దాళజంఘాహ్వయుం డగుదైత్యుఁ డొకఁడు
వాని కుదయించె మురుఁ డనుసూనుఁ డొకఁడు
చంద్రవతి యనుపురము తత్స్థాన మయ్యె. 449
గీ. అతఁడు బ్రహ్మవరంబున నమితమైన, శక్తి నార్జించి మమ్మెల్లఁ జదియ మోఁది
యాక్రమించె దివంబు నయ్యదియె కాక, యెన్నొ సాహసములు చేసి యున్నవాఁడు
క. వేఱుగ నింద్రుని వహ్నిని, వేఱుగ రవిచంద్రభముల వేఱుగ సురలన్
వేఱుగ గ్రహముల వేఱుఁగ, వేఱుగ నొనరించె దివమె వే యేమిటికిన్. 451
చ. అనుటయు నేను జిత్తమున నాగ్రహ మంది దురాత్ముఁ డింత చే
సెనె తెగటార్తు వాని నని చేతను జక్రముఁ బూని నిర్జరుల్
వెనుకను రాఁగ నామురునిపీటికిఁ బోయి కఠోరశంఖని
స్వనమును జేసినాఁడను నిశాచరు లెల్లరుఁ బఱ్వ లెత్తఁగన్. 452
ఉ. అంతట నామురుండు ప్రళయాగ్ని తెఱంగునఁ బ్రజ్వరిల్లుచుం
గుంతముఁ దాల్చి కేల సురకోటిపయిం బడ వారు సాధ్వసా
క్రాంతమనస్కులై పఱవఁగా మురదైత్యునితోడ నేన య
త్యంతభయంకరంబుగను నాహవముం బొనరించితిన్ నృపా. 453

గీ. అట్టు లక్షిఘోరముగను సహస్రదివ్య, వర్షములు నేను ఘోరాక్షివానితోడఁ
దుదకు విసువొంది పదవెత్తి బదరికాశ్ర, మమున సింహావతీగుహాభ్యంతరమునకు.

గీ. అచట మార్గశ్రమంబు వాయంగ మేను
మఱచి నిదురించుచుండఁ గుక్షిఁగి మురుఁడు
వచ్చి యాగుహాలోపలఁ జొచ్చి చూచి
నన్ను లంఘించి పయిఁబడ నున్నవేళ. 455

క. జనియించె నొక్కకన్యక, జనవర నామేననుండి చయ్యన నాదై
త్యుని సంహరించి నిలిచెను, గనులకు మిఱుమిట్లు గొలుపఁగను నాయెదుటన్.

గీ. నిలుచుటయు మేలుకని నేను నిద్రనుండి, కన్నులను విచ్చి చూచి యాకన్య నెదుట
విస్మయముఁ జెంది బాల యీవిపినమునకు, నేల వచ్చితి వెవతెవే నెఱుఁగఁ జెప్పుమ.

క. అనుటయు నే నేకాదశి, యనుదానను దేవ నిన్ను యర్చింపఁ గదా
నను నేఁడు మురవినాశన, మొనరుప నీమేన జనన మొందితి నాకన్. 458

గీ. అనుటయును నేను బ్రక్కగా సనువు లుడిగి, నేలమీఁదను బడియున్న తాళజంఘ
సుతునిఁ గనుఁగొని నిశ్చలస్థితిని జెంది, నిమిషమాత్రంబు మిది లేని ప్రమదమునను.

ఆ. బాల నన్ను కాక బ్రతికించితి వశేష, భువనములను నమితపుణ్య వగుట
నిచ్చెదను వరంబు లెన్నేనియును నీకుఁ, గోర్కి తీరునట్లు కోరుకొనుము. 460

క. అనుటయు నాకన్యక యి, ట్లనియెను నీమాయ తెలియ నగునె ప్రపంచం-
బున కేది యెట్లు చేయం, జనునో యటులె చేయుచుందు సర్వము తండ్రీ.

గీ. కాన నీవిచ్చువరమును గాదనంగ, రాదు గావునఁ గోరెద నాదినంబు
నందు నుపవాస మొనరించునట్టివారి, కపునరావృత్తి యగుపదం బబ్బుఁ గాక.

గీ. నాదినంబునఁ జేసెడి నక్తమునకు, ఫలము సగ మీయు ముపవాసఫలములోన
నక్తఫలమున సగ మేకభక్తమునకు, నొసఁగు మఖిలజనంబుల నుద్ధరింప. 463

గీ. నాదినంబున నుపవాసనక్తములకు, నేకభక్తంబునకుఁ గూడ నెట్టిఫలమొ
యట్టిఫల మిమ్ము మదిని నీయందు నిలిపి, జాగరం బొనరించెడిజంతువులకు. 464

గీ. ప్రియము గావించుఁగాక యేదియును గూడ, నాదినమువోలె నీకు ననాదినిధన
యనుచుఁ బ్రార్థించుటయు నట్లె యగును గాక, యని వచించి యంతర్ధానమైతి నేను.

—: మార్గశీర్షశుక్లైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మార్గశీర్షశుక్లైకాదశి మోక్షైకాదశి యనునామంబు వడసె. తచ్ఛ్రవణ
మాత్రంబున వాజపేయఫలంబు ప్రాప్తించు. 466

గీ. సర్వపాపంబులను గూడ సమయఁ జేసి, మోక్ష మొసఁగును గావున మోక్ష యనెడి
నామమును జెందె నయ్యది భూమిపాల, వినుము దానిమహాత్త్వము వినుతు నీకు.

సీ. కలదు పూర్వము చంపకం బనుపుర మొకండు, సుజనసంతోషాతిశోభితంబు
వైఖానసుం డనువసుమతీంద్రుఁ డొకండు, పాలించుచుండె నాపత్తనంబు
నటు లుండ నొక్కనాఁ డతనికిఁ దత్పితృ, గణము స్వప్నమునందుఁ గానఁబడియెఁ
గనఁబడి కన్నీళ్లు గాల్వలు గట్టఁగా, నేడ్చుచు లో దుఃఖ మిముడ కునికిఁ
గీ. దండ్రి తరియింపఁ జేయు మిత్తఱిని మమ్ము, నిరయకష్టంబులకు నోర్వ నేర మింక
ననుచు మొఱవెట్టుచుండఁగా నంతలోన, వచ్చె మెలఁకువ మేదినీవల్లభునకు.

క. అంతట వైఖానసుఁ డ, త్యంతవిషాదాభిభూతుఁడై రయమున నే
కాంతముగను బర్వతముని, యంతికమున కేఁగి మ్రొక్కి యాపూజ్యునకున్.

క. తనస్వప్నగాథ యంతయు, వినిచి తపోనిలయ దీనివిషయము నాకున్
గనికరమున నెఱిఁగింపుము, మనఁ జాలను బితరు లట్లు మఱుఁగుచు నుండన్.

క. అని ప్రార్థించుటయును న, మ్ముని యొకనిమిషంబు యోగముద్రీకృతలో
చనుఁడగుచును దద్ధేతువుఁ, గనుఁగొని యిట్లనియెఁ దెలిచి కన్నులతనితోన్.

సీ. భూపాల నీతండ్రి పూర్వజన్మంబున, క్షత్త్రియకులమందు సంభవించి
రాజకార్యప్రవర్తనలౌల్యమునఁ జేసి, ఋతుకాలమున నున్నసతిని విడిచి
యన్యదేశంబున కరిగె నాకతమున, నిజపితృయుతముగా నిరయ మొందె
వారల కెల్ల నుద్ధారంబు గలిగింప, నను వైనయొకయుపాయంబు గలదు
ఆ. మార్గశీర్ష మనెడిమాసంబునను శుద్ధ, పక్షమందు వచ్చుమోక్ష యనెడి
హరిదినంబునందు నాచరించి వ్రతంబు, ధారపోయవలయుఁ దత్ఫలంబు. 472

క. అనుటయు వైఖానసుఁ డ, మ్మునియనుమతి నొంది శీఘ్రముగ నిజపురికిం
జనుదెంచి విధివిధానం, బునఁ జేసి వ్రతంబు ధారపోసెను ఫలమున్. 473

క. అంతటఁ దత్పితృవర్గము, సంతసమున దీవనలను జల్లుచు ధరణీ
కాంతునకు దర్శనం బే, కాంతంబున నొసఁగి యరిగె ననిమిషపురికిన్. 474

క. కావున మోక్షైకాదశి, కేవియు సరి గావు నాకు నెంతయుఁ బ్రీతిం
గావించు నది విముక్తిని, గావించుటఁ జేసి సకలకలుషాత్ములకున్. 475

—: పౌ ష కృ ష్ణై కా ద శీ మా హా త్మ్య క థ న ము :—

వ. మఱియును పౌషమాసకృష్ణపక్షంబున వచ్చునేకాదశి సఫలైకాదశి యని చెప్పంబడియె. సఫలైకాదశియందు నారికేళక్రముకబీజపూరకజంబీరదాడిమ ధాత్రీఫలలవంగబదరామ్రాదిఫలంబులచేతను ధూపదీపాదులచేతను నన్నారాధించి రాత్రి జాగరణంబు గావింపవలయు. తద్వ్రతంబునకుఁ దీర్థంబులు గాని యజ్ఞంబులు గాని వ్రతంబులు గాని తపంబులు గాని సరి గానేరవు. దీని కొక్క దృష్టాంతంబు చెప్పెద. వినుము. 476

క. క్షితినాథ కలదు చంపా, వతి యనుపుర మొండు మున్ను వసుమతిపైఁ ద
త్పతి యగుచు నుండె మాహి, ష్మతుఁ డనుజేఁ డొకఁడు ధర్మమార్గాశ్రితుఁడై.

క. అతనికిఁ బుట్టిరి యేగురు, సుతు లం దగ్రజుఁడు బుద్ధిశూన్యులతోడన్
జతగూడి సకలపాతక, రతుఁడై తిరుగంగఁ జొచ్చె రాత్రియుఁ బవలున్. 478

ఆ. అతనిదుండగంబు లంతంతకును హెచ్చి, బాధవెట్టుచుండఁ బ్రజల నెల్ల
నది యెఱింగి రాజు మది నాగ్రహము నొంది, యుంపఁ దగదు వీని నూరిలోన.

క. అని తలఁచి యపుడె లుంభకుఁ, డనునామము పెట్టి వాని కాత్మజుఁ డనుప్రీ
తిని విడిచి వెడలఁగొట్టెను, దనపురముననుండి రాజధర్మజ్ఞుండై. 480

గీ. అంతటను లుంభకుం డొకయడవి కేఁగి
వాస మొనరించుకొనియుండి వాసుదేవ
ధామ మనునొక్క యశ్వత్థతరువుక్రిందఁ
బ్రాణులను జంపుకొని తిని బ్రతుకఁ దొడఁగె. 481

గీ. అట్లు బహుకాల మరుగంగ నాఖలుండు, వృద్ధుఁ డగుటను నొకపౌషకృష్ణపక్ష
దశమినాఁ డెచ్చటికిఁ గూడఁ దరల లేమి, నచ్చటనె శయనించి క్షుధార్తుఁ డగుచు.

గీ. పరదినంబున సమ్మహాతరువుకడను, వఱలినఫలంబులను నేఱి వాసుదేవు
నకు సమర్పణ మొనరించి నాకుఁ గలిగి, నట్టిదురవస్థ మానుపు మనుచు నేడ్చె.

ఆ. అట్లు లేడ్చి రేడ్చి యాదినం బంతయు, నొదవ కునికిఁ దినఁగ నదియుఁ గూడ
నుపవసించి క్షుధను నొనగూడమిని నిద్ర, సలిపె లుంభకుండు జాగరంబు. 484

గీ. అప్పు డాకాశవాణి యి ట్లనియెఁ బుత్ర, వచ్చు సఫలాప్రసాదమువలన నీకు
నచిరకాలంబుననె రాజ్య మనుడు వాని, కఖిలశక్తులు ప్రాప్తించె నాక్షణంబ.

ఉ. అంతట లుంభకుండు హరియందె మనంబును జేర్చి భక్తితో
సంతతనృత్యగీతములు సల్పుచు దైవకృపావశంబుచే
సంతును రాజ్యముం బడసి సర్వసుఖంబులు చెంది ధాత్రిలో
నంతమునందు విష్ణుపద మందెను జన్మము సార్థకంబు గాన్. 486

—: పౌషశుక్లైకాదశీ మాహాత్మ్యకథనము :—

వ. మఱియును బౌషశుక్లపక్షంబునందు వచ్చునేకాదశి పుత్రదైకాదశి యని చెప్పం
బడియె. అమ్మహైకాదశియందు న న్నారాధించెనేని యఖిలపాతకంబులుం
దొలంగి పుత్రప్రాప్తి కలుగు. 487

సీ. వినుము దీనికి సిదర్శనముగా నొకగాథ, వచియించెదను నీకు వసుమతీంద్ర
ధాత్రిలోపలను భద్రావతి యనుపేర, నుండెను బూర్వమం దొకపురంబు
దానికి నధిపతిగా నుండెను సుకేతు, మంతుండు నా నొక్క మేధవుండు
చంపకాహ్వాయ యైనసతితోడ నాప్రభు, వఖిలభోగంబుల ననుభవించి

గీ. తనయుఁ బుత్రులు గలుగమి కెదను మిగుల, వగపు జనియింప సర్వంబు వదలిపెట్టి
యెవరికినిఁ జెప్పకుండంగ నేఁగె నొక్క, గహనదేశంబునకుఁ దురంగమము నెక్కి.

క. అటు లేఁగి గహనమున క, ర్చ్చటఁ దిరుగుచుఁ బిచ్చివానిచందంబున ను
త్కటముగను బరితపించుచు, నెటులో కనియె నొక హ్రదంబు నీశ్వరకృపచేఁ.

క. కనుఁగొని యచటం దత్తట, మునఁ దప మొనరించుచుండు మునులసమీపం
బునఁ జేరి మ్రొక్కి వారికి, వినయంబునఁ దెలిపి స్వీయవృత్తాంతంబున్. 490

క. కరుణింపఁగలమహాత్ముల, కరణిని గనఁబడిరి మీప్రకాశము మీ రె
వ్వారో స్వాములార మాకిక, పరితాపము దీర్పుఁ డనుచుఁ బ్రార్థించుటయున్.

క. ఆవసుకేతునిమాటలు, గావింపఁగ నెదను దయఁ గరుణను విశ్వే
దేవులము మేము జనవర, దైవం బనుకూల మయ్యెఁ ద్వత్ప్రార్థనకున్. 492

వ. నేఁడు పుత్రైకాదశి కావునఁ దద్వ్రతం బొనరించి సఫలమనోరథుండ వగు మని యనుగ్రహించుటయు సుకేతుమంతయుఁ దదనుగ్రహభాషితంబు శిరంబునం దాల్చి మునిజనోపదిష్టప్రకారంబునఁ బుత్రైకాదశీవ్రతంబు నచ్చటన యథావిధిఁ గావించి యమ్మహామునులయనుజ్ఞంబడసి నిజగృహంబున కరుదెంచె.

గీ. అంతటను గొన్నిదివసంబు లరుగుటయును
గర్భమును దాల్చి చంపకాకంబుకంఠి
కనియెఁ గులవర్ధనుం డైనతనయు నొకని
నొక్కదినమున నొకసుముహూర్తమందు. 494

గీ. అంతటను బుత్రకుఁడు రవికాంతితోడఁ, దేజరిల్లఁ దొడంగెను దినదినంబు
తత్ప్రభావంబుఁ జూచి భూధవుఁడు గట్టెఁ, బట్టమును నాతనికి మహీప్రజల నేల.

ఆ. అపుడు రాజ్యభరము నానృపతనయుఁడు, దాల్చి యేలఁ దొడఁగె ధాత్రి నెల్ల
ధర్మదేవతావతారంబె యితఁ డని, భూజనంబు లెల్లఁ బొగడుచుండ. 496

—: మాఘకృష్ణైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును మాఘకృష్ణపక్షంబున వచ్చునేకాదశి షట్తిలైకాదశి యని చెప్పంబడియె. అయ్యది బ్రహ్మహత్యాదిమహాపాతకంబుల నశియింపం జేయుమాఘమాసంబు ప్రాప్తించుటయుఁ గామక్రోధాదివివర్జితమానసంబున నేలపైఁ బడని గోమయంబు గ్రహియించి యందుఁ దిలలును గార్పాసపిండకంబులును నుంచి నన్ను స్మరియించికొనుచు నష్టోత్తరశతపిండంబులు గావించి యుంచికొని మాఘకృష్ణపక్షంబున వచ్చునేకాదశినాఁడు ప్రాతఃకాలంబున లేచి నానానామంబు స్మరియించుచుఁ దిలపిష్టోద్వర్తనంబు కావించుకొని తిలస్నానంబుచేసి తిలోదకంబు విడిచి తిలగోమయపిండంబులు హోమంబు గావించి నన్నారాధించుచు

నుపవాసంబుతోడ రాత్రి జాగరణంబు చేసి శతకూశ్మాండంబులచేఁ గాని శత నారికేళంబులచేఁ గాని శతబీజపూరకంబులచేఁ గాని తదభావపక్షంబున శత పూగీఫలంబులచేఁ గాని యథావిధి నాకర్ఘ్యంబు నొసంగి నాకు సంప్రీతి గలుగ వలయు నని భావించి తిలోదకపాత్రంబును ఛత్త్రోపానహంబులును వస్త్రంబులును గృష్ణధేనువును బ్రాహ్మణునకు దానంబు చేసి తిలపిష్టంబు భుజియించి పిదప ద్వాదశీపారణంబు గావింపవలయు. ఇయ్యది షట్తిలైకాదశీవిధానంబు. స్నానప్రస్థానకంబులయందుఁ గృష్ణతిలలు ప్రశస్తంబులు. తిలస్నానంబును దిలోద్వర్తనంబును దిలహోమంబును దిలోదకంబును దిలదానంబును దిలభోజనంబును గావించెడివ్రతంబు గావున నయ్యది షట్తిలైకాదశీవ్రతంబుగాఁ జెప్పం బడియె.

ఆ. అమ్మహావ్రతంబు నాచరించినయెడ, సకలపాపములును నమసి పోయి
యుండఁ గలుగు నమరు లుండెడిపదమున, వదలకుండ దివ్యవర్షశతము. 498

క. విను మేతద్వృత్తాంతము, గను నీ కొకగాథ వినుతు త్వావర పూర్వం
బున నొకబ్రాహ్మణి భూతల, మున నుండె వ్రతోపవాసముల నొనరుచుచున్.

క. దేవబ్రాహ్మణపూజలు, గావించుచు నాలయములు గట్టించి మహీ
దేవులకును దేవులకును, నావరవర్ణిని యొసంగు నతిభక్తిమెయిన్. 500

ఆ. కాని యామె యెట్టికాలంబునను గూడ, నొకరి కింతయన్న మొసఁగదాయె
దానివలనఁ దద్వ్రతప్రభావంబులు, కానరాక యుండె మానవేంద్ర. 501

ఆ. అని యొఱింగి కరుణ యావిర్భవింప నే, నామె నుద్ధరించునాసతోడ
నరిగి భిక్షుకుండ నై తద్గృహమునకు, ద్వారమందు నిలిచి తరుణ మరసి. 502

గీ. కేక వైచితిఁ బాత్రను గేలఁ బట్టి, యామె వినఁగను దేహి భిక్షా మటంచు
నంతటను నమ్మహీసురకాంత వచ్చి, తెఱచి దలుపును నామోము తేఱిచూచి.

గీ. బిరబిరను లోని కరిగి మృత్పిండ మొకటి, పట్టికొని వచ్చి వైచె నాపాత్రలోన
నపుడు నే నేఁగుదెంచితి నంత నామె, తనువుతోడనె వైకుంఠమునకుఁ జేరె.

గీ. చేరుటయు నాయమకు మహాగార మొకటి, వాసధామంబుగా దయచేసినాఁడఁ
గాని యది శూన్యముగ నున్న కారణమున, భూసురాంగన వచ్చి నావాసమునకు.

గీ. స్వామి నేఁ జేసినట్టికృచ్ఛ్రవ్రతములు, దాన మొనరించినట్టిసద్మములు నిలిపి
నట్టిదేవాలయము లసంఖ్యములు వాని,కన్నిటికిఁ గూడ శూన్యగృహంబె ఫలమె.

చ. అనుటయు నిట్టు లంటిని ద్విజాంగన కేను సతీమతల్లి నీ
వొనరిచినట్టికర్మములయోగ్యతకున్ దగునట్టులే ఫలం
బొనరెను గాని చేయనిది యొక్కటియున్ లభియింప దెందు నీ
మనమున ఖేద మొందకుము మా కుదయింపవు పక్షపాతముల్. 507

గీ. పెట్టితివి భిక్షుకునకు మృత్పిండ మొకటి, చేసితివి గృహదానవిశేషములును
వ్రతములును బూజలును నుపవాసములును, గాని యన్నము వెట్టితె వేని కైన.

శ. అన్నమె ప్రాణాధారం, బన్నమె దోహదము బుద్ధి కన్నమె దేహా
భ్యున్నతికి మూల మది లే, కున్నను విశ్వంబె శూన్య ముజ్జ్వలగాత్రీ. 509

క. అనుటయు బ్రాహ్మణి తనత, ప్పు నెఱింగి మహాత్మ బుద్ధిపొరపాటునఁ జే
సినదోషము సైఁచి ననుం, గనికరమునఁ బ్రోవు మెవరు గతి యిఁక నాకున్.

క. అని ప్రార్థించుటయును నా, మనమునఁ గనికరము వొడమి మానిని నిన్నున్
గనుఁగొనఁగ దేవపత్నులు, చనుదెంతురు వారు వచ్చుసమయమునందున్.

గీ. తలుపు తెఱవక యింటిలోపలనె యుండి, షట్తిలావ్రతఫలము నొసంగు నెడలఁ
దలుపు దీసెద ననుము తత్క్షణమ నీకుఁ, గలుగు నఖిలార్థసిద్ధులు కంబుకంఠి.

చ. అని వచియించి బ్రాహ్మణిని నంపితి నింటికి నంత నాయమన్
గనుఁగొన దేవపత్ను లతికౌతుక మొప్పఁగ రాఁగ నేను జె
ప్పినయటు లామె చేయుటయుఁ బ్రీతి నొసంగిరి షట్తిలావ్రతం
బునఫల మామె కాసతులు పోవఁగ లోపము లెల్ల నంతటన్. 513

గీ. ఆమహీసురసుందరి యనుభవించె, దివ్యవర్షశతంబు తద్దివ్యసుఖము
కావుననె యెట్టిపుణ్యంబు గాని భూప, షట్తిలాసుకృతమునకు సాటి గాదు.

—: మాఘశుక్లైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును మాఘశుక్లపక్షమందు వచ్చునేకాదశి జయైకాదశి యని చెప్పం
బడియె. తద్వ్రతంబువలన సర్వపాతకంబులును నశించి పిశాచత్వంబు తొలంగు.

క. విను దీనికి దృష్టాంతము, గను నీకు వచింతు నొక్కకథ సురలోకం
బునఁ జిత్రసేనుఁ డనుపే, రను నొకగంధర్వుఁ డుండె రాజవరేణ్యా.

క. అతనికి మాలిని యనియెడు, సతి యొక్కతె గలదు సుగుణశాలిని యాదం
పతుల కుదయించె నొకయా, యతలోచన పుష్పవంతి యనియెడుపేరన్. 517

క. ఆకోమలిరూపము నా, లోకింపఁగవలయుఁ గాని లోచనములచే
వాకులతో నిట్టిది యని, వాకొనఁగ నశక్య మెంతవానికి నైనన్. 518

క. నానాఁటికి నాచేడియ, గానమునను నాట్యమునను గౌశల మొదవం
గా నవనవలావణ్యము, గానంబడ మేన మిగులఁ గ్రాలుచు నుండెన్. 519

క. అటు లుండఁగ నొకనాఁ డా, చటులేక్షణ యింద్రసభకుఁ జని తనవిద్యా
పటిమము గనఁబడఁ బాడుచు, నటియింపఁ దొడంగె నమరనాథుఁడు మెచ్చన్.

వ. అప్పు డచ్చట గానవిద్యావిశారదుండును రూపవంతుడును బుష్పదంతుఁ డనెడి
గంధర్వసుతనూజుండును నగుమాల్యవంతుండు తదీయలావణ్యమోహితమాన

సుంద్రై కామవికారంబు సడంచుకొనఁ జాలక భావసూచకంబుగా నాకోమ
లాంగి నాలోకింపఁ దొడంగె. 521

ఉ. అంతటఁ బుష్పవంతియుఁ దదాకృతిమోహితచిత్తవృత్తియై
కంతునిబారిఁ జిక్కి కడగంటను గాంచుచు వాని లోపసం
క్రాంతి నెఱుంగకుండఁగను గానము సేయుచు నాడఁ జొచ్చె వృ
త్రాంతకుఁ డాయసభ్యతను దప్పెడ నారసి యాగ్రహంబునన్. 522

గీ. ఇచ్చె శాపంబు వారల కిరువురకును, బడయునట్లు పిశాచరూపంబు లంత
వార లరిగిరి దారుణాకారములను, దాలిచి విషాదమున హిమశైలమునకు. 523

క. అరిగి హిమాచలమున కా, యిరువురును సహింపరానిహిమదుజకు మహా
పరితాపభరితు లగుచును, జరియింపఁదొడంగి రద్రిసానువులందున్. 524

క. ఆహారము లభియింపమి, వ్యాహారింపఁగ నశక్తు లగుచును వా రా
నీహారశైలభూమిని, దేహంబులు మఱచి యెట్లొ తిరుగుచు నుండన్. 525

గీ. దైవయోగంబునను నొక్కతరుణమందు
వారు పడుబాధ చూడంగ వలను గామిఁ
గావ వచ్చినకారుణ్యదేవి నాఁగ
వచ్చెను జయాఖ్య గలహరివాసరంబు. 526

గీ. అమ్మహాదినమందు నాహారనిద్ర, లుడిగి గజగజ వడఁకుచు నొక్కచోటఁ
గదలఁగా లేక యుండినకారణమున, వారలకుఁ జేకుఱెను జయావ్రతఫలంబు.

గీ. అంతటఁ బిశాచరూపంబు లంతరించి, ప్రాప్తమైనట్టిపూర్వరూపములు దాల్చి
చనిరి వారు త్రివిష్టపంబునకు వ్యోమ, యానమున నెక్కి యమరుల కచ్చెరువుగ.

క. చని వారలు సంతోషం, బున నింద్రునిసభకుఁ బోయి మ్రొక్కిరి దేవేం
ద్రున కపుడు వారి నింద్రుఁడు, గనుఁగొని యాశ్చర్య మొదవఁగా ని ట్లనియెన్.

క. మీ కేసుకృతముచేతను, జేకూరెను శాపముక్తి చెప్పుఁడు నాఁగన్
వాకొనిరి వారు తమకథ, సాకల్యంబుగ వ్రతప్రసాదం బనుచున్. 530

క. అంతట వారలను మరు,త్వంతుం డత్యధికగౌరవంబున నిజసౌ
ధాంతరమున నునిచి నిర, త్యంతరముగ సేవచేయ నారంభించెన్. 531

క. కావున జయాప్రభావము, భూవర బ్రహ్మకు లేని పూర్తిగఁ దెలియం
గా వలఁతులు గా రని నా, భావము పలుపలుకు లింకఁ బలుకఁగ నేలా. 532

—: ఫాల్గునకృష్ణైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును ఫాల్గునకృష్ణైకాదశిం గూర్చి మున్ను బ్రహ్మను నారదుం డడు
గుటయు నామునివరునకు బ్రహ్మ యి ట్లనియె. 533

గీ. కనుము ఫాల్గునకృష్ణపక్షమున వచ్చు, నట్టిహరివాసరము విజయంబు నొసఁగుఁ
గాన విజయాభిధానంబు గలది యయ్యె, వినిచెదను దానికొకగాథ మునివరేణ్య.

సీ. మును రామచంద్రుండు వనమున వసియించె, జానకీసౌమిత్రిసహితుఁ డగుచు
నాసమయంబున హరియించె జానకీ, దేవినిఁ గామియై రావణుండు
భార్యావియోగతాపమున కష్టంబు లొంగి, దరి లేక రాముండు తిరుగఁ జొచ్చె
నత్తఱుణమున రఘూత్తమునకు సమ్ము, కూడె సుగ్రీవునితోడ మైత్రి

ఆ. యంత నాంజనేయుఁ డరిగి లంకాపురి, కవనిసుతను జూచి యరుగుదెంచి
వార్త దెలుపుటయును వానరసేనతో, బయలుదేఱి రామభద్రుఁ డటకు. 535

గీ. కడలి దాఁట నుపాయంబు గానరామిఁ
బరితపించుచు సాగరపరిసరమునఁ
గనఁబడెడియొక్క యాశ్రమంబునకు నేఁగి
కాంచి బకదాల్భ్యుఁ డనుపారికాంక్షి నొకని. 536

గీ. వినయమునఁ బ్రమొక్కి తనచరిత్రను వచించి, స్వామి తెలుపు ముపాయము సాగరమును
దాఁటుటకు నంచుఁ బ్రార్థింపఁ దాపసుండు, మూసికొని కన్నులను సర్వమును గ్రహించి.

వ. తరువాతఁ గన్నులు దెఱచి రామచంద్రు నవలోకించి రామా ఫాల్గునకృష్ణపక్షంబున వచ్చు నేకాదశి విజయాభిధానంబు గలయది. ఆపుణ్యదివసంబునందు హేమకుంభంబు గాని రజితకుంభంబు గాని తామ్రకుంభంబు గాని మృత్కుంభంబు గాని జలంబుచేఁ బూరించి పంచపల్లవంబులచే నలంకరించి యొక్క పవిత్రప్రదేశంబునందు స్థాపించి దానిపైని హేమమయం బగు నారాయణప్రతిమ నుంచి తత్సమీపంబున నఖండఘృతదీపంబు ప్రతిష్ఠించి షోడశోపచారంబులచేఁ బూజించి యథావిభవంబుగ నైవేద్యంబు సమర్పించి యారాత్రి జాగరంబు గావించి ద్వాదశీదినంబున సూర్యోదయం బైనపిమ్మట నాకుంభంబు సముద్రతీరంబునం గాని నదీతీరంబునం గాని తటాకతీరంబునం గాని స్థాపించి పూజ గావించి ప్రతిమాయుక్తంబుగా బ్రాహ్మణునకు సమర్పించి తదర్పణకాలంబున యథాశక్తి దానంబులఁ గావింపవలయు. 538

గీ. ఇట్లు లేకాదశీవ్రతం బీవు నాఁడు, సలిపి యంభోనిధిని దాఁటి సులభముగను
లంకలోఁ జొచ్చి రాక్షసులను వధించి, కొనుము సతితోడ విజయలక్ష్మిని నరేంద్ర.

చ. అనుటయు రాఘవుండు విజయావ్రతముం బొనరించి తద్బలం
బున సులభంబుగాఁ గపిసమూహముతోడఁ బయోధి దాఁటి లం
కను నరికట్టి రాక్షసనికాయయుతంబుగ రావణాసురుం
దునిమి జయంబు గాంచి సతితోడ నయోధ్యకుఁ జేరె నారదా. 540

క. అనుటయు నారదుఁ డావ్రత, మునఁ గలమహిమంబు లోకముల కన్నిటికిన్
జని తెలుపసాగెఁ దద్వ్రత, మును జేసి జయంబు మోక్షమును జను లొందన్.

—: ఫాల్గునశుక్లైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును ఫాల్గునశుక్లపక్షంబున వచ్చునేకాదశిం గూర్చి మాంధాత వసిష్ఠ మహర్షి నడుగ నమ్మహర్షి యమ్మహీంద్రున కిట్లనియె.
గీ. అధిప ఫాల్గునసితపక్షమందు వచ్చు, హరిదినం బొప్పు నామలక్యాహ్వయమునఁ
బలుపునెడఁ దద్వ్రతంబును సంఘటిల్లు, సకలపుణ్యంబులును జేసినట్టిఫలము.
సీ. సచరాచరము లైనజగము లన్నియు మున్ను, ప్రళయకాలమునందు విలయ మొంద
నాసమయంబున నఖిలజగంబుల, సృజియింప నెంచి సర్వేశ్వరుండు
నిష్ఠీవనము చేయ నిష్ఠీవనమునుండి, ప్రభవించె నొకమహాపాదపంబు
దానినుండి జనించి ధాత పూర్వమునట్లె, గావించె నఖిలలోకముల మరల
గీ. నంత దేవర్షిసంతాన మాద్రుమంబుఁ, గాంచి తన్నామ మెఱుఁగనికారణమున
నచ్చెరువు నొందుచుండంగ నాత్మలందు, నప్పు డశరీరవాణి యి ట్లనియె నధిప.
గీ. ఆమలకి యనువృక్ష మియ్యది స్మరించి, రేని దీని లభించు గోదానఫలము
దీని నంటినఁ గలుగుఁ దద్ద్విగుణఫలము, త్రిగుణఫల మబ్బు భక్షింప దీనిఫలము.
క. ఇది మాధవునకుఁ బ్రీతి, ప్రద మగుటను జేసి సర్వపాపహరం బై
నది గాన దీనిసేవను, వదలక చేయుదురు ముక్తి వలసినవారల్. 546
వ. దీనికిమూలంబునందు నారాయణుండును నూర్ధ్వంబునందుఁ బితామహుండును స్కంధంబునందు రుద్రుండును శాఖలయందు మునులును బ్రశాఖలందు దేవతలును బర్ణంబులందు వసువులును బుష్పంబులందు మరుత్తులును ఫలంబులందుఁ బ్రజాపతులును నివసించియుందురు. కావున నామలకీద్రుమంబు సర్వదేవతామయంబుగాఁ జెప్పంబడియె. ఫాల్గునశుక్లైకాదశినాఁడు నియమయుక్తంబుగాఁ గాల్యకృత్యంబులు నెఱవేర్చికొని ప్రాతస్స్నానంబు గావించి నేఁడు నిరాహారంబుగా నుండి జనార్దనప్రీతికరంబుగా మఱునాఁడు ద్వాదశీపారణ గావించెద నని సంకల్పించి యామలకీవృక్షంబుకడ కేఁగి తత్పురోదేశంబునఁ బంచపల్లవసమేతంబును సుగంధవాసితంబును బుష్పమాలాలంకృతంబును నూతనవస్త్రాదిభూషితంబును నగునొక్కకుంభంబు మంత్రపూర్వకంబుగా స్థాపించి దానిపైని లాజపూరితం బగునొకపాత్రంబు నుంచి దానిమీఁద విత్తానుసారంబుగాఁ జేయింపఁబడినసువర్ణజామదగ్న్యప్రతిమను బ్రతిష్ఠాపించి యథావిధిఁ బూజించి యామలకయుక్తం బగునర్ఘ్యం బొసంగి నృత్తగీతవాద్యంబులచేతను విష్ణుపురాణాఖ్యానాదిసత్కథాపఠనశ్రవణంబులచేతను నాదినం బంతయును నిరాహారంబుగా జాగరంబుతో వెడలించి మఱునాఁ డుదయంబున విష్ణునామంబులచే

జామదగ్న్య ప్రతిమాశోభితం బగు నామలకీవృక్షంబునకుం బ్రదక్షిణంబులుగావించి నీరాజనం బొసంగి పిదప బ్రాహ్మణుని నర్చించి జామదగ్న్యస్వరూపి యగు నారాయణుండు ప్రీతుం డగుం గాక యని భావించి యాబ్రాహ్మణునకుం బూజా ప్రతిమాదు లన్నియును సమర్పించి నమస్కరించి పిమ్మట నామలకీతరువును స్పృశించి ప్రదక్షిణంబు గావించి స్నానంబు చేసి ద్వాదశీపారణ గావింపవలయు.

గీ. ఈవ్రతంబును గావించెనేని యిట్లు, చెందు నఖిలాధ్వరములు చేసినఫలంబు
నఖిలతీర్థంబులను మున్గినట్టిఫలము, నఖిలదానంబులును జేసినట్టిఫలము. 548

క. అనవుడు దేవర్షులు తమ, మనములలోపలను మిగుల మ్రాన్పడి యమ్మొం
బొనరుప ధన్యుల నేతెం, చిన దేవ్వఁడ వెవఁడ వీవు చెప్పుము దేవా. 549

క. అని ప్రార్థించుటయును ని, ట్లనియె నభోవాణి జగము లన్నిటికిని క
ర్తను నేను మత్ప్రశాసన, మునను బ్రవర్తిల్లు చుండు భూతము లెల్లన్. 550

గీ. విష్ణు వనియెడిపేరను వెలసి నేను, సర్వలోకంబులకు నుందు సాక్షి నగుచుఁ
గాన రాఁడు మఱొక్కఁడు కర్త నాకు, నని పలికి మాయ మైపోయె నంతలోన.

క. అది విని దేవర్షులు స, మ్మదమునఁ దద్వ్రతముఁ జేసి మాహాత్మ్యం బిం
పొదవఁగఁ బ్రశస్తి కెక్కిరి, పదిమందియుఁ గూడి తమ్ము భావింపంగన్. 552

క. అనుటయు మాంధాత వసి, ష్ఠునకుఁ బ్రణామం బొనర్చి చొచ్చి నిజపురం
బున నామలకీవ్రతముం, బొనరిచి యిహపరములందుఁ బొందెఁ బ్రశస్తిన్.

—: చైత్ర కృష్ణై కా ద శీ మా హా త్మ్య క థ న ము :—

వ. మఱియును జైత్రకృష్ణైకాదశిం గూర్చి మాంధాత యొకనాఁడు లోమశమహర్షి నడుగ నమ్మహర్షి యన్నరేంద్రుని కిట్లనియె. 554

గీ. చైత్రమాసస్థకృష్ణపక్షమున నొప్పు, హరిదినము పాపమోచని యనెడిపేర
నడిగితివి గానఁ జెప్పెద నాలకింపు, మధిప దానిమహాత్త్వ మత్యద్భుతంబు.

సీ. మును చైత్రరథమునం దొనరించుచును దపం, బుండె మేధావి నా నొక్కద్విజుఁడు
చూచి యావిప్రునిసోయగంబును గామ, మార్గణవిద్ధయై మంజుఘోష
కొంతదూరంబునఁ గూర్చుండి గానము, మొదలుపెట్టెను జగన్మోహనముగ
నాపాట శ్రవణపేయంబుగా మేధావి, తెఱచి కన్నులు దెసల్ తేఱి చూచె

గీ. నంత నొకదిక్కునను రతికాంతవోలె, గోచరించుటయును మంజుఘోష మరుఁడు
తాపుకొని తద్వ్రధూమణితనువునందు, హృదయకవచంబు భేదిల్ల నేసె నతని.

ఉ. అప్పుడు మంజుఘోషయును నమ్మునియుఁన్ వివశీకృతాత్ములై
యెప్పుడు వోయెనో దినము లెప్పుడు వోయెనొ రేలు కన్నులన్
గప్పినయట్టు లేదియును గానక మన్మథకేళిఁ దేలుచున్
ముప్పిరిగొన్నమోహమున మున్గఁ దొడంగిరి నాఁడునాఁటికిన్. 557

గీ. అట్టు లేబదియేడేఁడు లరుగుటయును, మదిని గతకాలము నెఱింగి మంజుఘోష
భయవికంపిత యగుచుఁ దాపసున కెఱఁగి,స్వామి సెలవిమ్ము పోయెద స్వర్గమునకు.
క. అని ప్రార్థించుటయును న, మ్ముని యి ట్లనియెను లతాంగి ముగిసెనె కే యే
మనుకొంటివో యింతటిలోఁ, జన నెంచుట కేమి కతము చయ్యనఁ జెపుమా.
చ. అనవుడు మంజుఘోష వినయావనతాననయై మహాత్మ నీ
కును విదితంబు గానియది కొండొక యున్నదె యంచుఁ బల్క న
మ్ముని యొకమూర్త మత్తులను మూసి గణించిన కాల మంతయుక్
గనుఁగొని క్రోధతామ్రనయనంబులతోఁ దిలకించి యాచెలిక్. 560
ఆ. భ్రష్టురాల యెంతపని చేసితివి స్నాన, సంధ్య లడఁగిపోయె జపము కూలెఁ
దపము తగులఁబడియెఁ దత్స్వమాగమమునఁ, జేసి నాకు నిట్టిచేటు వచ్చె.
క. ఛీ ఛీ నినుఁ గనరాదు పి, శాచి తెఱంగునను నాప్రశాంతిని దొలఁగం
ద్రోచితివి గాన నీవు పి, శాచివి గ మ్మనుచు ఘోరశాపం బిచ్చెక్. 562
ఉ. అంతట మంజుఘోష వినయంబున మ్రొక్కి మహానుభావ నీ
చెంతను నెంతొ కాలము వసించినదాన నటంచు నైన నీ
స్వాంతమునం దలంపకయె శాప మొసంగితి వెందుఁ బోదు శా
పాంత మనుగ్రహింపుము క్షణాధికకోపులె బ్రాహ్మణోత్తముల్. 563
క. అనుటయును నమ్మునీంద్రుఁడు, కనికరమున నిట్టు లనియెఁ గంజాక్షి వ్రతం
బొనరుపుము పాపమోచని, యనుహరిదివసమున శాప మంతము నొందుక్.
ఉ. నావుడు మంజుఘోష తరుణంబు నెఱింగి వ్రతంబు చేయుటక్
బావనమూర్తి యయ్యె నిజపాతక మెల్లఁ దొలంగిపోయి మే
ధావియుఁ దండ్రియాజ్ఞను వ్రతంబు నొనర్చి విశుద్ధుఁ డయ్యె ధా
త్రీవర పాపమోచనికి దీ టగువాసర మేది చూడఁగక్. 565
క. అనుటయు మాంధాత మునీం, ద్రునకుం బ్రణమిల్లి భక్తితో నిజనగరం
బున కేఁగుదెంచి వ్రతముం, బొనరించి ప్రశస్తి కెక్కె ముజ్జగములలోక్. 566

—: చైత్రశుక్లైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును జైత్రశుక్లైకాదశిం గూర్చి మున్ను దిలీపుండు వసిష్ఠమహర్షి నడుగ
నమ్మహర్షి యమ్మహీంద్రున కి ట్లనియె. 567
సీ. వినుము మహారాజ మును నాగపురమునను, బుండరీకుం డనుభుజగరాజు
పాలించుచుండ నాప్రభునిసన్నిధిలోనఁ, దనపాండితిని జూపుతలఁపుతోడ
లలితాభిధానంబు గలయొక్కగంధర్వుఁ, డరుదెంచి తత్సభాంతరముఁ జొచ్చి
యొనరించుచును గానమును బ్రియాభినివిష్ట, మానసుం డయ్యెఁ దన్మధ్యమందుఁ

గీ. దానఁ బదబంధవిచ్యుతి నాపదించె
నది మెఱుంగి కర్కోటకుఁ డనెడిచక్రి
తెలుపుటయుఁ బుండరీకున కలిగి యతఁడు
గాయకునిఁ దిట్టె నగుము రాక్షసుఁడ వనుచు. 568

గీ. అంత గంధర్వుఁ డాశరుం డగుచు వికృత, రూపమునఁ బ్రియురాలిసమీపమునకు
వచ్చి కన్నీళ్ళు గాఱఁగా వరదలుగను, నేడ్చుచును దనవృత్తాంత మెల్లఁ జెప్పె.

గీ. అపుడు గుండె గుభిల్లన నతనికాంత, యేమి చేయుటకును జేతఁగామి వాని
వెంటఁబడియేడ్చుచునుఘోరవిపినభూము,లందుఁ దిరుగంగఁజొచ్చెనహర్నిశంబు.

క. అట్టులు దిరుగుచుఁ బతికిం, బట్టినకర్మంబు తనకుఁ బట్టినరీతిన్
జెట్టనకయు గుట్టనకయుఁ, గట్టకడకుఁ జేరె నొక్కగహనంబునకున్. 571

గీ. చేరి యక్కాననంబునఁ జింతతోడఁ
దిరుగుచును దైవకృప నొక్కతరువుక్రిందఁ
దపము గావించుకొనుచున్న తపసి నొకనిఁ
గాంచి యాయింతి యాతనికడకుఁ బోయి. 572

గీ. భక్తితోడను మ్రొక్కి తత్పాదములకు
నిలువఁబడి యుండుటయును గన్నులను దెఱచి
చూచి యమ్మౌని యెవతెవు సుదతి నీవు
కారణం బేమొ చెపుము నాకడకు రాఁగ. 573

క. అని యడుగుటయును వినయం, బున నాసతి యిట్లు లనియెఁ బుత్రికను దపో
ధన నేను వీరధన్వుం, డనుగంధర్వునకు లలిత యందురు నన్నున్. 574

క. నాపతికి స్వామి యొక్కరి, శాపంబునఁ గలిగె రాక్షసత్వము దానన్
వాపోవుచు నే నాతని, నోపక విసువంగఁ దిరుగు చుంటిని వెంటన్. 575

గీ. ఇప్పు డతఁ డీవనంబున కేఁగుదేఱ, వచ్చితిని నేను గూడను వానివెంట
దానివలనను దేవరదర్శనంబు, గలిగె నాకు శుభప్రాప్తి గలదొ యేమొ.

గీ. అనుటయును మౌని కనికరం బంకురింప, నిట్టు లనియెను సాధ్వి నీ వేడ్వ వలదు
చైత్రమాసస్థశుక్లపక్షమున వచ్చు, హరిదినమునకుఁ గామదాహ్వాయము గలదు.

క. కావున నాదివసంబునఁ, గావింపుము వ్రతము సర్వకామము లొందం
గావచ్చు నతివ యనుటయు, నా వెలఁదుక పట్టరానిహర్షముతోడన్. 577

గీ. అమ్మహర్షిసమక్షమునంద చేసి, కామదావ్రతమును దానఁ గలిగినట్టి
పుణ్యమును భర్తకై ధారవోసె నంత, లలితునకుఁ బూర్వరూపంబు లబ్ధమయ్యె.

క. అంతట లలితాలలితులు, సంతోషముతోడ నరిగి స్వర్గంబునకున్
వింతగను గామదావృ, త్తాంతము వచియించి రమధు లచ్చెరు వొందన్. 579

క. లోకోద్ధారంబునకై, నీకుం జెప్పితిని మేదినీవల్లభ నే
నీకథ తద్వ్రతమహిమము, సాకల్యంబుగను జెప్పఁజాలఁ డెవండున్. 580

క. అనుటయు దిలీపుఁ డమ్ముని, యనుమతి గొని యాచరించి యావ్రతమును భూ
జను లెల్లఁ బొగడఁ బాలిం, చెను నేకచ్ఛత్రముగను క్షితిమండలమున్. 581

—: వైశాఖకృష్ణైకాదశీ మాహాత్మ్యకథనము :—

వ. మఱియును-వైశాఖకృష్ణపక్షంబునందు వచ్చునేకాదశి వరూథినీనామంబునఁ
బ్రసిద్ధం బయ్యె. 582

క. ఆనాఁడు చేయువ్రతమున, భూనాయక కలుగుపుణ్యములమితి నెవ్వం
డేనియును దెలియఁ జాలఁడు, దాని కదియె సాటి నీకు దాఁపఁగ నేలా. 583

గీ. ఆదినంబున నుపవాస మాచరించి, నట్టులైనను సౌభాగ్య మందితీఱు
నెంతదౌర్భాగ్యవతి యైన నిగురుఁబోఁడి, కావున వరూథినికి సాటి గాన రాదు.

గీ. పుణ్యదివసంబు లొకకొన్ని భుక్తి నొసఁగు
నొసఁగు ముక్తిని మఱికొన్ని యుర్వరేంద్ర
భుక్తిముక్తుల నిచ్చెడిశక్తి గలది
యొకవరూథిని దప్ప వేఱొకటి లేదు. 585

సీ. అనుభవించి సుఖంబు లన్నియు నిలలోనఁ, జనియెను మాంధాత స్వర్గమునకు
విశ్వంబులో మహావిశ్రుతి గొని ధుంధు, మారుఁ డూర్ధ్వపదాధికారి యయ్యెఁ
గైలాసనాథుండు గడియలో బ్రహ్మకపాలవినిర్ముక్తపాణి యయ్యెఁ
బుడమి నేకచ్ఛత్రముగ నేలి ధర్మాంగ, దుండు వైకుంఠంబుఁ దుదకుఁ జేరె

గీ. నెంద ఱెందఱొ మహనీయు లిహమునందుఁ,బరమునందును నెట్టిలోపమును లేక
శ్రద్ధతోడ వరూథినీవ్రతము చేసి, చెంది రఖిలార్థసిద్ధులు క్షితితలేంద్ర. 586

వ. అశ్వదానంబుకంటె గజదానంబును దానికంటె భూదానంబును దానికంటెఁ
దిలదానంబును దానికంటె స్వర్ణదానంబును దానికంటె నన్నదానంబును
నధికంబుగాఁ జెప్పంబడియె. కన్యాదానం బన్నదానసమంబు. 587

గీ. కన్నియ నలంకరించి యొక్కనికి నిచ్చు,కంటె హెచ్చైనసుకృతంబు గాన రాదు
విక్రయము చేసి కన్య నావిత్తమునను, బ్రదుకుకంటెను హెచ్చుపాపంబు లేదు.

వ. ధేనుదానంబు కన్యాదానతుల్యంబుగాఁ జెప్పంబడియె. అన్నిదానంబులకంటెను
విద్యాదానం బధికంబు. విద్యాదానఫలంబు వరూథినీవ్యుపవాసంబున సులభం
బుగాఁ జేకూరు. 589

—: వైశాఖశుక్లైకాదశీ మాహాత్మ్యకథనము :—

వ. మఱియును వైశాఖశుక్లైకాదశింగూర్చి మున్ను రామచంద్రుండు వసిష్ఠమహర్షి
నడుగ నమ్మహర్షి రామచంద్రునకి ట్లనియె,

క. లోకానుగ్రహకాంక్షను, నీ కీర్తిమనోరథంబు నేఁ డుదయించెన్
గాకున్నను బరమాత్ముఁడ, వీకరణిని నన్ను నడుగ నేటికి రామా. 590

వ. మున్ను సరస్వతీతీరంబున భద్రావతి యనునగరంబునందు ధనపాలుం డను వైశ్యుండు గలఁడు. అతనికి సుమంతుండు ద్యుతిమంతుండు మేధావి సుకృతుండు ధృష్టబుద్ధి యనునేగురుపుత్రులు గలరు.

ఆ. అందు ధృష్టబుద్ధి యనుపంచముఁడు దుష్ట, కార్యనిరతుఁ డగుచు ఖలులఁ గూడి
స్వైరవర్తనమున సంచరించుచు నుండఁ, బ్రజల కెల్ల మిగుల బాధ గలిగె.

గీ. ఎఱిఁగి యది వెల్లఁ దత్పురాధీశుఁ డైన, యట్టిధృతిమంతుఁ డాతనిఁ దుష్టుఁ డనుచు
వెడలఁగొట్టెను బురినుండి వేఱుమార్గ, మెదియును లేమి వానికి హింతముగొలుప.

ఉ. అంతట ధృష్టబుద్ధి మనమందు వివేకము లేమి నాత్మవృ
త్తాంతము సంస్మరించుకొన కాగ్రహ మొప్పడ నేఁగి కానకున్
జంతువులన్ భుజించుచును సాఁకుచు మేను గిరాతవృత్తిచేఁ
గొంత వెడల్చి కాల మతిఘోరముగా నదితోఁపఁ బిమ్మటన్. 594

గీ. తాను జేసినఘోరపాతకములకును, జింత నొందుచు మదిలోన సిగ్గుపడుచు
మాని యాహారనిద్రలు కానలందుఁ, దెలివి దప్పినతెఱఁగునఁ దిరుగుచుండ.

గీ. దైవికంబుగ నొక్కకాంతారమందు, నగపడియెఁ దన కొకతాపసాశ్రమంబు
దానికడ కేఁగి యాతఁడు తత్క్షణంబ, కాంచి కౌండిన్యుఁ డనుపారికాంక్షి నొకని.

క. వినయమున మ్రొక్కి వానికిఁ, దనకథ నెఱిఁగించి నిజకృతము లగునఘముల్
చనుటకు నుపాయ మొక్కటి, కనికరమునఁ జెప్పు మనుచుఁ గాంక్షించుటయున్.

క. తాపసుఁడు వానిపశ్చా, త్తాపమునకు నెదను గలుగ దయ యిట్లనియెన్
వాపోవ వలదు వినుమీ, పాపంబులు తొలఁగ నొకయుపాయము వత్సా. 598

వ. వైశాఖశుక్లపక్షంబున వచ్చుహరివాసరంబు మోహినీనామంబునఁ బ్రసిద్ధం బయ్యె. ఆదివసంబున జనార్దనుని నారాధించుచు నుపవాసజాగరంబులు గావించితి వేని సర్వపాతకవిముక్తుండ వయ్యెదవు. 599

చ. అనవుడు ధృష్టబుద్ధి మునియాజ్ఞను గైకొని తత్సమక్షమం
దొనరిచి వైష్ణవవ్రతము నొందెను విష్ణుపదంబు మేనితో
డనె జను లెల్ల నబ్బురపడంగను నే మని చెప్పఁ బాపనా
శనమునఁ దద్వ్రతంబునకు సాటి మ ఱేదియు లేదు రాఘవా. 600

క. అనుటయు రాఘవుఁ డావ్రత, మును జేసెఁ బ్రజాసమక్షమునఁ జూచెడిభూ
జను లెల్లను దద్వ్రతముం, బొనరించి కృతార్థభావమును జెందంగన్. 601

—: జ్యేష్ఠకృష్ణైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును జ్యేష్ఠకృష్ణపక్షంబునవచ్చునేకాదశియపరైకాదశి యనిచెప్పంబడియె,

సీ. బ్రహ్మహత్యలు భ్రూణపాతకముల్ గోవధం, బులును గావించెడివారలైనఁ
బరధనహరణంబు పరదారగమనంబు, పరదూషణముఁ జేయుపాపులైన
స్వామిగురుద్రోహసాధుజనద్రోహ, ముల నొనరించెడిమూర్ఖులైన
నాత్మధర్మము మాని యన్యధర్మములోనఁ, జొఱఁబడియెడిదుష్టశూన్యులైనఁ
గీ. కూటసాక్ష్యము లిచ్చెడికుమతులైన, నవిహితార్థంబులను జెప్పునధములైన
సర్వపాపవిముక్తులై స్వర్గమంద, నిలుతు రపరావ్రతంబును జలిపిరేని.

సీ. గయలోనఁ బితృతృప్తి గలుగంగ నొనరించు, పిండదానమునఁ బ్రాప్తించుఫలము
శివరాత్రినాఁడు కాశీపురంబున నుప, వాసంబు చేసిన వచ్చుఫలము
సింహస్థితుండు గా జీవుండు గౌతమీ, జలమున మునిఁగినఁ గలుగుఫలము
రవిమాఘమున మకరస్థుండు గాఁ బ్రయా, గస్నాన మొనరింపఁ గలుగుఫలము
గీ. బదరికాశ్రమయాత్రచే నొదవుఫలము, కాంచఁ గేదారమును లక్షియించుఫలము
గజతురగహేమదక్షిణాక్రతుఫలంబు, గలుగు నపరావ్రతం బొంటఁ సలిపెనేని.

—: జ్యేష్ఠశుక్లైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును జ్యేష్ఠశుక్లపక్షంబున వచ్చునేకాదశి నిర్జలైకాదశి యని చెప్పం
బడియె. దానిమాహాత్మ్యముం గూర్చి సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞుండును వేదవేదాంగ
పారగుండును ధర్మాత్ముండును సత్యవతీసుతుండును నగుకృష్ణద్వైపాయన
మహర్షి నపుడు దలఁచి యుధిష్ఠిరుండు భీమసేనసమేతంబుగా నమ్మహర్షిసన్నిధి
కరిగి సవినయంబుగా నిర్జలైకాదశిం గూర్చి యడుగుటయు వ్యాసమహర్షి
ధర్మజున కిట్లనియె. 605

గీ. అధిప యల్పశ్రమంబున నధికఫలము, చేకుఱుచు నొక్కయేకాదశీదినంబ
యాదినంబున భుజియించునట్టివాఁడు, ఘోరనరకాగ్నిలోపలఁ గూలువాఁడ.

ఆ. అనుడు భీమసేనుఁ డశ్వత్థపత్త్రంబు, రీతిఁ గంపమొంది తాత నాకు
నేమి గతియొ యెఱుఁగ నేవేళ నైనను, దిండి లేకయున్న నుండఁ జాల. 607

క. మాయన్నయు మాతమ్ములు, మాయమ్మయు ద్రౌపదియును మాటికి నాకున్
శ్రేయమును గోరి బోధము, చేయుదు రేకాదశిని భుజింపకు మనుచున్. 608

క. వినను వృక మనియెడుజఠ, రానలము గలట్టివాఁడ నగుటను క్షుధకున్
నేను సహింపఁగ లేమిని, మానీంద్ర విరోధి నగుదు మావారలకున్. 609

క. నీ విప్పు డనినమాటకు, భావంబునఁ గలిగె మిగులఁ బరితాపము నా
కేవిధమునఁ దరియించెడి, త్రోవ గలదొ చెప్పు మనుచు దోసిలి యొగ్గెన్.

గీ. అంతటను వ్యాసుఁ డతని కిట్లనియె వత్స, వత్సరంబున కొకసారి వచ్చునట్టి
నిర్జలైకాదశిని బోల నేర వెట్టి, వ్రతము లైనను మఱి యెట్టిక్రతువు లైన.

గీ. జ్యేష్ఠమాసంబులోపల వృషభమందుఁ, గాని మిథునంబునను గాని భానుఁ డుండ
వచ్చుహరివాసరమునకు వచ్చెఁ బేరు, నిర్జలైకాదశి యటంచు నిత్యముగను.
గీ. ఆదినంబున నాచమనోదకంబు, దప్ప నన్యోదకంబును ద్రావకుండ
నుపవసించినయెడ నది యొకటి చాలు,సకలహరివాసరవ్రతసుకృత మొసఁగ.
ఆ. అట్టు లుపవసించి యానాఁడు మఱునాఁడు, బ్రాహ్మణులకు నుదకపాత్రములను
నొసఁగి యన్నదాన మొనరింప వలయును,హరికిఁ బ్రీతి గలుగ నాత్మ నెంచి.
క. ఆమీఁద ననుమతిం గొని, భూమిసురులవలనఁ దాను భుజియింపఁ దగున్
గామితము గలుగు నెడలను, భూమీశ్వరతనయ సులభముగను దరింపన్. 615
క. అనుటయును భీమసేనుఁడు, తన కనుగుణమైన యట్టి తద్వ్రత మొనరిం
చెను బిదప ధర్మతనయుఁడు, వినిచెను గృష్ణునకు నచటివృత్తాంతంబున్. 616
వ. అంతటఁ గృష్ణుండు నవ్వి యుధిష్ఠిరునిం జూచి రాజేంద్రా యింక నాషాఢ
కృష్ణైకాదశిం గూర్చి చెప్పెద. వినుము. 617

—: ఆషాఢకృష్ణైకాదశీమాహాత్మ్యకథనము :—

సీ. అలకాపురాధీశుఁ డగు కుబేరున కుండె, హేమమాలి యనంగ భృత్యుఁ డొకఁడు
వాని కుండెను భార్యగాను విశాలాక్షి, యనుపేరు గలయొక యందకత్తె
యటు లుండ నొకనాఁడు యక్షాధినాథుఁడు, పూలు దెమ్మని హేమమాలి ననిపెఁ
జని హేమమాలి యాపని మాని తనచాన,తోడ రతిక్రీడ లాడఁదొడఁగె
గీ. నంత శివపూజ కదనుగా యక్షరాజు, పూలు దేరంగఁ జని హేమమాలి రామి
కెఱిఁగి జక్కులవలనను హేతు వెల్ల, నాగ్రహముఁ జెంది తనయంతరంగమందు.
గీ. పాపి యగు హేమమాలి తత్పాపఫలము, ననుభవించునుగాక కుష్ఠామయంబు
వలన భార్యావియోగంబువలన ననుచు, ఘోరశాప మొసంగె దుర్వారముగను.
ఉ. అంతట హేమమాలి తనయాలిని బాసి కళేబరంబునం
దెంతయు నావరింపఁ బదునెన్మిదికుష్ఠములున్ మహావ్యథా
క్రాంతమనస్కుఁడై తెరువు గానక తిర్గుచు వెట్టివట్టి నా
నంతమునందు నెట్లొ కనకాద్రికిఁ జేరెను దైవికంబుగన్. 620
గీ. చేరి యం దొక్కచోటను శివుఁడువోలెఁ, గానఁబడెడిమార్కండేయమౌనిఁ గాంచి
యెదుటఁబడి మ్రొక్కి తనగాథ యెల్ల వినిచె, నంతఁ గరుణార్ద్రమానసుండగుచు మౌని.
ఆ. ఆచరించి వ్రతము నాషాఢమాసము, నందుఁ గృష్ణపక్షమందు వచ్చు
నట్టియోగినీమహావిష్ణుదినమున, భక్తితోడ శాపముక్తి గనుము. 622
క. అని యుపదేశించుటయును, మనమున ముద మొంది హేమమాలి వ్రతంబుం
బొనరించి కుష్ఠరోగం, బుననుండి విముక్తి నొంది పొలఁతిని జేరెన్. 623

గీ. తద్వ్రతమహాత్త్వమునఁ జేసి తనివిపేఱ, ననుభవించి యశేషసౌఖ్యముల నతఁడు
కడకు వైకుంఠమును జేరెఁ బడఁతితోడ, యోగినిప్రభావ మెంతని యుగ్గడింతు.
గీ. ఎనుబదెన్మిదివేలమహీసురులకు, భోజనంబు నొసంగినపుణ్య మొదవు
యోగినీవాసరమునందు నుపవసించి, ప్రీతితోడను నన్ను నర్చించెనేని. 625

—: ఆషాఢశుక్లైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును నాషాఢశుక్లైకాదశి శయన్యేకాదశి యని చెప్పంబడియె. తన్నామ
శ్రవణమాత్రంబున సర్వపాపంబులును నశియించు.
సీ. మున్ను త్రేతాయుగంబున నుండె బలి యను, దానవుం డొకఁడు మద్భక్తిఁ గలిగి
యొకకొంతకాలంబునకు వాఁడు ద్రోహంబు, గావింపఁదొడఁగెను దేవతలకు
నది నా కెఱింగింప నమరు లుపేక్షింప, ననుచితం బగుటచే నతనితప్పు
చని వామనాకారమున బలికడ కేను, వాని నొంపఁగ నెంచి వ్యాజమునను
గీ. నడిగితిని మూఁడుపదములయవనితలము, నెంతవారించినను శుక్రుఁ డీక మనుచు
దానవీరుఁడు గావున దానవుండు, ధరణి నేఁ గోరినది నాకు ధారవోసె. 627
వ. అప్పుడు నేను విశ్వరూపంబు దాల్చి రెండుపాదంబులచే భూమ్యాకాశంబుల
నాక్రమించి మూఁడవపాదంబును వానిపృష్ఠంబునం బెట్టి త్రొక్కితి.
గీ. అంతట రసాతలం బంటె యతఁడు నన్ను, వేఁడుకొనుటయుఁ గరుణ యావిర్భవింప
నుంచినాఁడను నామూర్తి యొకటి వాని,యందు మఱియొకమూర్తి క్షీరాబ్ధియందు.
గీ. అయ్యె నాషాఢశుక్లమునందు వచ్చు, హరిదినం బది శేషశయ్యాగతుండ
నగుటచేతను నాదినమందు నేను, శయని యనుపేరు దానికి సంఘటిల్లె. 630
గీ. శయనినాఁ డుపవాసంబు సలిపి నన్నుఁ, గొలుచునెడ నంత్యజున కైనఁ గలిగితీఱు
సకలపాపంబులును గూడ సమసిపోయి, కొలఁదికాలములోనె వైకుంఠపదము.
వ. శయనినాఁడు నేను శయనించి కార్తికశుక్లపక్షంబున వచ్చుహరివాసరంబు
నందు లేచునఱకును నుండునాలుగుమాసంబులును దీపదానంబును బలాశ
పత్త్రభోజనంబును హరివాసరవ్రతంబును గావించువారు నా కత్యంతప్రియము
గావించినవా రగుదురు. శ్రావణంబున శాకంబును భాద్రపదంబున దధియును
నాశ్వయుజంబున దుగ్ధంబును గార్తికంబున ద్విదళంబును బరిత్యజించి బ్రహ్మ
చర్యంబునం దుండెనేని మిగులఁ బ్రశస్తంబు. 632

—: శ్రావణకృష్ణైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును శ్రావణకృష్ణైకాదశీమాహాత్మ్యముం గూర్చి మున్ను పితామహుని
నారదుం డడుగ నమ్మహర్షికిఁ బితామహుం డి ట్లనియె. 633
గీ. అఖిలపాపంబులను నడఁగార్చి సకల, కామములు దీర్చుఁ గావునఁ గామికాఖ్య
గలిగి శ్రావణకృష్ణపక్షమున వచ్చు, హరిదినం బొప్పు దానికి నదియె సాటి.

సీ. పుష్కరంబున నైమిశంబునను దండ, కాటవిని గౌతమీనదియందుఁ గాశి
యందు జాహ్నవియందును బొందలేఁడు, కామికావ్రతమును జేసి కాంచుఫలము.
గీ. చతురకూపారముద్రితక్ష్మాతలంబు, పాత్రుఁ డగుబ్రాహ్మణునకు నర్పణముచేసి
నట్టిఁడును గామికావ్రత మాచరించి, నట్టివాఁడును సమఫల మందువారు.
గీ. అనఘ ప్రసవించుచుండుగోవును బవిత్రుఁ, డైనబ్రాహ్మణునకు నిచ్చునట్టివాఁడు
చెందుపుణ్యఫలంబును జెందుఁ జూవె, కామికావ్రతకరణదీక్షాపరుండు. 637
గీ. ఆత్మవిద్యావిచార పరాయణుండు, చెందుఫల మొక్కదినమంద చెందఁగలఁడు
శ్రద్ధతోడను గామికావ్రతము చేయు, నట్టిపుణ్యాత్ముఁడు బహూక్తు లాడనేల.
వ. అని చెప్పుటయు నారదుండు విని పరమహర్షంబునం జనియె.

—: శ్రావణశుక్లైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును శ్రావణశుక్లైకాదశి పుత్రదైకాదశి యని చెప్పంబడియె. 639
సీ. బ్రాహ్మణదేవతాద్రవ్యంబు స్వప్నమం, దైనను నాసింపనట్టివాఁడు
న్యాయార్జితం బైనయర్థంబు నిజకోశ, నిలయంబులోపల నిలుపువాఁడు
తప్పు చేసినయెడఁ దనవాని కైనను, జేయఁగాఁ దగుశిక్ష చేయువాఁడు
కంఠంబు తెగుచున్నకాలంబునను నాడి, నట్టిమాటను దప్పనట్టివాఁడు
గీ. నయవిదుండు మహీజిదాహ్వయమువాఁడు
తేజు గలవాఁడు నగునొక్కరాజు మున్ను
ద్వాపరాదిని మాహిష్మతీపురంబు
నేలుచుండెను బ్రజలకు హితము గాఁగ. 640
ఆ. అట్లు లేలుచుండ నబ్దంబు లెన్నియో, చనియెఁ గాని యొక్కతనయుఁ డేని
తనకుఁ గలుగఁ డాయె నను చింత యాతని, యెడఁదఁ గలఁతవెట్టఁదొడఁగె నంత.
ఆ. అమ్మహీజిదుర్వరాధీశ్వరుం డొక్క, నాఁడు తనపురంబునను గలట్టి
బ్రాహ్మణోత్తములను భక్తితోఁ బిలిపించి, వారి కెఱుఁగఁ జేసె వాంఛితంబు.
ఉ. అంతట విప్రు లెల్లను దదాశయముల్ గ్రహియించి రాజ య
త్నింతుము నీయభీష్టమును దీర్చుట కంచు వచించి జేనికిం
గొంతవిషాదశాంతి నొనగూర్చి పదంపడి యొక్కకాననా
భ్యంతరభూమికిం జని తపం బొనరింపఁదలంచు చుండఁగన్. 643
క. దైవికముగ నాధరణీ, దేవుల కగపడియె నొక్కదెస నచ్చోటన్
దేవుఁడువలె లోమశముని, కావించుచుఁ దపము లోకకల్యాణమతిన్. 644
క. అంతట బ్రాహ్మణు లమ్ముని, చెంతకుఁ జని మ్రొక్కి తెలిపి క్షితిపాలునివృ
త్తాంతమును వేఁడి రతనికి, సంతానము గలుగునట్టిసదుపాయంబున్. 645

గీ. అపుడు లోమశముని మీలితాక్షుఁ డగుచు, ధ్యానమున గుర్తెఱింగి భూధవునిగాథ
తెలిచి కన్నులు విప్రులఁ దేఱిచూచి, యేర్పడఁగ విస్మయము వారి కిట్టు లనియె.
సీ. పూర్వజన్మమున మీభూపతి వైశ్యుండు, గా నుండి దారిద్ర్యకారణమున
స్వల్పవాణిజ్యంబు సలుపుచు నూరూరు, తిరుగుచు నొకగ్రీష్మదివసమందు
దప్పి కోరువలేక దారిలోపలఁ జూచి, యొకతటాకము దానియొద్ద కేఁగి
రేవులో దిగి నీళ్ళు ద్రావుచుండెడిగోవు, నదలించి తాఁ గ్రోలె నాజలంబు
గీ. నాయఘంబునఁ జేసి సంప్రాప్తమయ్యె, నతని కనపత్యభావ మయ్యది తొలంగ
క్షోణిమీఁదను శ్రావణశుక్లపక్ష, హరిదినం బొండు దక్క నన్యంబు లేదు.
క. ఆవిష్ణువాసరంబునఁ, గావించి వ్రతంబు దానఁ గలిగెడిఫలముం
భూవరునకు ననపత్యత, పోవలయు న టంచు ధారవోయుఁడు మీరల్. 648
చ. అనుటయు బ్రాహ్మణుల్ మిగుల హర్షముఁ జెంది మహర్షియభ్యను
జ్ఞను గొని యందె తద్వ్రతము సల్పి తదాప్తఫలంబు సర్వముం
జనపతిపాతకంబునకు శాంతి ఘటిల్లఁగ ధారవోసి చ
య్యనఁ జని రాజధానికి సమస్తముఁ దెల్పిరి భూమిజానికిన్. 649
గీ. అపుడు భూమీంద్రుఁ డాశ్చర్యమంది యెదను
బహుమతులను నొసంగి యాబ్రాహ్మణులకుఁ
బనుచుటయు నొక్కయబ్దంబు చనెనొ లేదొ
యంతలో గర్భమయ్యెఁ దత్కాంత కధిప. 650
గీ. గర్భమై నవమాసముల్ గడచుటయును
నొక్కసుముహూర్తమునఁ బుత్రుఁ డుద్భవించె
బాలచంద్రుఁడుబోలె నాశీలవతికి
నాభ్యుదయికము లైనచిహ్నములతోడ.
గీ. అంతట మహీజిదుర్వీతలాధినేత, తనయభీష్టము తీరినదానఁ జేసి
చేయుచు వ్రతంబు జీవితశేష మెల్లఁ, గడపి వైకుంఠధామంబుఁ గడకుఁ జేరె.

—: భాద్రపదకృష్ణైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును భాద్రపదకృష్ణైకాదశి యజైకాదశి యని చెప్పం బడియె. 653
ఆ. అజకు సాటి గాన మఘములు హరియించి, కష్టవార్ధినుండి గట్టు చేర్ప
దీని కేను నీకు దృష్టాంతముగ నొక, గాథ వినుతు వినుము క్ష్మాతలేంద్ర. 654
సీ. మున్నుండె భూచక్రమును నేలుచును హరి, శ్చంద్రుండు నా నొకచక్రవర్తి
యతఁడు రాజ్యభ్రష్టుఁడై యమ్ముకొని తన్నుఁ, దనయుని సతిని సత్యంబుకొఱకుఁ
గాటికాపరి యయి కడకుఁ జండాలుని, దాస్యంబులోఁ జిక్కి దారి లేమి
నరుగుటయును బహుహాయనంబులు శోక, సాగరంబును దాఁటఁజాల కునికిఁ

గీ. పరితపించుచు నుండె నిట్లడవియందు, నతని క్లేశంబు మాన్ప సత్యంబె మేను
దాల్చి వచ్చినయట్టి గౌతమమహర్షి, పోవుచును వచ్చె నచటికి దైవికముగ.

క. అరుదెంచిన గౌతమునకు, నరపతి మ్రొక్కుటయు నాసనంబునఁ జింతా
పరవశత నొప్పు నమ్ముని, కరుణాదృష్టులను నతనిఁ గని యిట్లనియెన్. 656

గీ. భాద్రపదమాసమునఁ గృష్ణపక్షమందు
వచ్చునజ యనియెడుహరివాసరంబు
వ్రతము నానాఁడు చేయుము క్షితితలేంద్ర
సులభముగ నెల్లకష్టముల్ తొలఁగిపోవు. 657

గీ. అనుచు బోధించి గౌతముఁ డరుగుటయును
సమయమునఁ దద్వ్రతము హరిశ్చంద్రనృపతి
సలిపి విధియుక్తముగను రాజ్యమును సతిని
సుతునిఁ బడసి త్రిలోకవిశ్రుతిని గాంచె, 658

క. కావున నజావ్రతంబును, గావించెడివారి కెట్టికష్టము లైనన్
బోవుటయె కాక భూవర, కైవల్యపదంబు గలుగుఁ గాయాంతమునన్. 659

—: భాద్రపదశుక్లైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును భాద్రపదశుక్లైకాదశిం గూర్చి మున్ను బ్రహ్మను నారదుం డడుగ నమ్మహర్షికి బ్రహ్మ యిట్లనియె.

సీ. ఆశ్చర్యకర మైనయట్టిగాథ యొకండు, వినుము నారద నీకు వినుతు నేను
మహి నేలుచును మున్ను మాంధాత ధర్మము, నాల్గుపాదములచే నడపుచుండ
గగ్గోలుపడెను నాకస్మికంబుగ నచట, వృష్టిదోషము దేశ మెల్ల నపుడు
క్ష్మాపతి తనయపచార మే మైనను, గలదేమొ యనుచును గలఁత చెంది

గీ. యంగిరోమునియుండెడి యాశ్రమమున, కరిగి మౌనికి వందన మాచరించి
సవినయంబుగఁ దన కున్న సంశయంబు, తెలిపి యడిగె ననావృష్టి దొలఁగువిధము.

సీ. అంతట నమ్మౌని ధ్యానయోగంబున, నెఱిఁగి యాథార్థ్యంబు నిట్టు లనియె
జననాథ నీదేశమున గోప్యముగ నొక్క, వృషలుండు తపము గావించుచుండె
నాపాతకమున ననావృష్టి సమకూడెఁ, గాని లేదు మఱొక్క కారణంబు
తద్దోషశాంతికిఁ దగినకార్యం బొండు, గావింపఁదగినది కలదు వినుము

గీ. భాద్రపదమాసమున శుక్లపక్షమందుఁ, బద్మనాభాహ్వయంబునఁ బ్రథిత మైన
హరిదినంబున నొనరించునట్టివ్రతము, శాంతిలఁగఁజేయు నెట్టిదోషముల నైన.

క. అనుటయు మాంధాత తపో, ధనునియనుజ్ఞను గ్రహించి తనపురమునకున్
జనుదెంచి వ్రతము సలుపుడు, ననుపదము సువృష్టి గురిసె నవని ఫలింపన్,

క. జననాథుం డది మొదలుగ, ననువర్షముఁ బద్మనాభయుత వ్రతంబున్
బొనరించుచును బ్రశస్తిని, గని యిహమునఁ గడపఁ జెందెఁ గైవల్యంబున్.

—: ఆశ్వయుజకృష్ణైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును నాశ్వయుజకృష్ణపక్షంబున వచ్చునేకాదశి యింద్రైకాదశి యని
ప్రసిద్ధిం బడసె. 665

క. నిరయగతులైన పితరులఁ, దరియింపఁగఁ జేయుటకును దక్షం బగుసా
ధకము మఱొక్కఁడు లే దిం, దిరకంతుని దానిమహిమ తెలిపెద వినుమా.

సీ. పూర్వము కృతయుగంబునను మాహిష్మతి,నగరేశుఁ డింద్రసేనప్రభుండు
నాల్గుపాదములచే నడపుచు ధర్మంబు, ధర నేలుచుండెనాతరుణమందు
నరుగుచు నారదుం డాకాశపథమునఁ,జనుదెంచె నమ్మహీజానికడకు
వచ్చినయమ్మునివరునికి నర్ఘ్యపా, ద్యాసనంబు లొసంగి యావిభుండు

గీ. స్వామి దయచేయుటను మాకు క్షేమ మేదొ
కలుగు నని తోఁచుచున్నది తలఁపులోన
ననుటయును నారదుం డిట్టు లనియె రాజ
సజ్జనులయూహ కాదు నిష్ఫలము వినుము. 667

సీ. చనుదెంచుచును నేను సత్యలోకమునుండి, యరిగినాఁడను జూడ యమునిసభను
శమనుండు ననుఁ జూచి సభలోపలను లేచి,యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి
యెచటికేఁగుచు స్వాము లిచటికే తెంచిరో, సెలవీయుఁడనుచువాంఛించుటయును
భూలోకమున కేను బోవుచు నినుఁ జూడ, నే తెంచితిని దేవ యిచటి కంటి

గీ. నంతటను లేచి తత్సభాభ్యంతరమున, ననుఁ గనుంగొని మీతండ్రి కనులనుండి
యేఱులుగ నశ్రువులు పాఱ నేడ్చెఁ బాప, మెంత వేదన గలిగెనో యెడఁదలోన.

ఆ. అట్టు లేడ్చి యిట్టు లనియెను స్వామి నే, శమనలోకబాధ సైఁపఁజాలఁ
గొండలట్లు తఱుఁగ కుండఁగా నాచేసి, నట్టిపాప మెంతపట్టు గలదొ. 669

గీ. కాని నాపుత్రుఁ డగునింద్రసేననృపతి,కీవు దయతోడ మదవస్థ నెఱుఁగఁజేసి
యిందిరావ్రతపుణ్యము నిచ్చి నాకు,గతులు గలిగింపు మంచు శీఘ్రముగఁ జెపుమ.

క. అనవుడు నాడెందంబునఁ, గనికర ముదయింప నతనిగతి సీ కెఱిఁగిం
పను వచ్చినాఁడ నిచటికిఁ, బని యయ్యెను బోదు ననుడుఁ బార్థివుఁ డంతన్.

క. జనకున కొదవినదుఃఖం, బును విని మదిలోన మిగులఁ బొగులుచు మాసీం
ద్రున కెఱఁగి యిందిరావ్రత, మును జేయువిధాన మేమొ మునివర చెపుమా.

క. అని యడుగుటయును ముని యి, ట్లనియెను నాశ్వయుజకృష్ణహరిదినమందున్
బొనరింతు రిందిరావ్రత, మును వినిచెదఁ దద్విధానమును విను మధిపా. 673

వ. ఆశ్వయుజకృష్ణదశమీదివసంబునఁ బ్రాతఃకాలంబునందుఁ గాల్యకృత్యంబులం దీర్చికొని మధ్యాహ్నసమయంబున మాధ్యాహ్నికక్రియాకలాపంబు నెఱవేర్చికొని యేకభక్తంబు చేసి యారాత్రి స్థండిలంబున శయనించి యేకాదశినాఁడు ప్రాతఃకాలకృత్యంబులు నెఱవేర్చికొని నేఁడు విష్ణుప్రీతికై సర్వభోగవర్జితుండనై నిరాహారంబుగా నుండి ద్వాదశినాఁడు భుజియించెద నని సంకల్పించి మధ్యాహ్నసమయంబున సాలగ్రామశిలయెదుటఁ బితరులకుఁ బుణ్యలోకంబులు గలుగవలయు ననుసంకల్పంబుతో యవవ్రీహితిలమాషగోధూమచణకంబులలో దేనిచేనైనను శ్రాద్ధంబు గావించి తాను బిత్ర్యాన్నంబు నాఘ్రాణించి పితృశేషాన్నంబు గోవున కొసంగి పిదప విష్ణుపూజ గావించి యారాత్రి జాగరం బొనరించి మఱునాఁడు హరి నర్చించి బ్రాహ్మణులను భుజియింపఁజేసి పుత్రమిత్రబాంధవసహితంబుగా భుజియింపవలయు. 674

క. ఈవిధమున నావ్రతమును, గావించినయెడలఁ బుణ్యగతులకుఁ బితరుల్
పోవుదురు వ్రతవిధాతకు, దీవన లొసఁగుచును వంశదీప్తి ఘటిల్లన్. 675

క. అని చెప్పి నారదుఁడు చ, య్యన నంతర్ధాన మగుడు నావ్రత మొనరిం
చెను రేఁడు విధివిధానం, బున గగనమునుండి పుష్పములు గురియంగన్. 676

క. అంతట నాతనిజనకుఁడు, సంతోషముతోడ దివికిఁ జనియెను ధరణీ
కాంతునకు వ్యోమయానా, భ్యంతరముననుండి యిడుచు నాశీస్తుతులన్. 677

క. అది మొదలుగ నావ్రత మిం, పొదవఁగఁ బ్రతివత్సరమును నొనరించుచు న
భ్యుదయము నిహమున నచ్యుత, పదమును బరమునను జెందెఁ బార్థివుఁ డధిపా.

—: ఆశ్వయుజశుక్లైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును నాశ్వయుజశుక్లైకాదశి పాపాంకుశైకాదశి యని చెప్పంబడియె.

సీ. కలుగు మేదినిలోనఁ గలసర్వతీర్థంబు, లందు స్నాన మొనర్చినట్టిఫలము
సమకూరు శాస్త్రోదితము లైనదానంబు, లన్నియుఁ జేసినపున్నియంబు
కలుగును ధనధాన్యములును సంతానంబు, ధీరత్వమును రాజగౌరవమును
నొదవు నుద్ధారంబు పదితరంబులవారి, కాత్మమాతృసతీత్రయాన్వయముల

గీ. నాశ్వయుజశుక్లపక్షమునందు వచ్చు, నట్టిపాపాంకుశాహ్వయహరిదినమునఁ
బద్మనాభాహ్వయంబుచేఁ బరగునన్నుఁ, గొలిచి యుపవాసజాగరంబుల నొనర్ప.

గీ. అనఘ పాపాంకుశావ్రత మాచరింప, కుంకునంతటిదాఁక నె యుండు మేన
నఖిలపాపంబులును మాయమగును బిదపఁ, జల్లునెడ భస్మమునుబిశాచములువోలె

గీ. ఉర్వరేంద్ర పాపాంకుశ నుపవసింప, నట్టివారును నాభక్తు లగుచు శివునిఁ
దిట్టువారును శివునిఁ జేపట్టి నన్నుఁ, దిట్టువారును బుడుగులై పుట్టువార. 682

గీ. అనఘ పాపాంకుశావ్రతి మాచరించు, నట్టివాఁ డేఁగుపదమున కరుగ లేఁడు
సవనశతములు వ్రతసహస్రములు కోటి, మంత్రజపములు చేసినమహితుఁ డేని.
క. నరుఁ డెవ్వఁ డేని భూవర, ధరలోఁ బాపాంకుశావ్రతం బొనరించినన్
హరిమందిరమున కేఁగును, గరుడారూఢుఁ డయి నాల్గుకరములతోడన్. 684
క. నరవర పాపాంకుశ యను, హరిదినమును వ్యర్థపుచ్చునట్టిఁడు లోనన్
జరియించుచున్న నూర్పులు, పరాసుకుఁడ లోహకారభస్త్రికవోలెన్. 685
క. కలవారును దీర్ఘాయువు, గలవారును వంశశుద్ధి గలవారును వ్యా
ధులు లేనివారలును మును, సలిపినవారల యఘాంకుశావ్రత మధిపా. 686

—: కార్తికకృష్ణైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును గార్తికకృష్ణైకాదశి రమైకాదశి యని చెప్పంబడియె. తత్ప్రభావం
బున కొక్కయితిహాసంబు చెప్పెద వినుము. 687
సీ. మును విభీషణసఖుండును విష్ణుభక్తుండు, నగుముచుకుందధరాధిపతికిఁ
బ్రభవమొందెను జంద్రభాగాసరిద్వర, చిన్నారిపొన్నారికన్నియగను
నతఁ డిచ్చె నాకన్నియను జంద్రసేనకు, మాభర్తృసుతుఁ డైనశోభనునకు
నల్లుఁడు శ్వశురగృహంబునం దుండ ర, మాహరిదినము సంప్రాప్తమయ్యె
గీ. నపుడు ముచుకుందుఁ డెప్పటియట్ల పురిని, గలజనంబుల కెల్లను దెలియునట్లు
చాటఁబనిచెను హరిదివసంబునందు, నారగింపంగఁ దగ దెవ్వఁ డైన ననుచు.
గీ. అంతటను శోభనుఁడు తనయింతితోడ, నిట్టు లనియెను గలికి నే నెన్నఁడేని
జననమొందిన దాదిగాఁ జలిపి యెఱుఁగ, నొక్కయుపవాసమును నేమి దిక్కు నేఁడు.
చ. అనుటయుఁ జంద్రభాగ యిటు లాతనికిన్ వచియించె నాథ మా
జనకుఁడు చండశాసనుఁడు సైఁపఁడు విష్ణుదినంబునన్ దృణం
బును బశువుల్ భుజించినను భోజనముం బొనరింప నింక సైఁ
చునె జనులన్ బ్రజాఘములు క్షోణితలేంద్రునిఁ జెందఁగల్గుటన్. 690
గీ. ఎట్టు లైనను స్వామి నేఁ డీవు క్షుధకు, నోర్చుకొని యుండవలయు లేకున్న యెడల
మరణశిక్ష విధించు మామామ నీకు, నాకుఁ దీఱనిశోకంబు చేకుఱుంగ. 691
క. ప్రియ నగుట నేను నీకున్, దయితుఁ డ వీ వగుట నాకు దయతోడను నా
కుయి యాలకించి తైనను, గయికొను ముపవాసదీక్ష కా దనకుండన్. 692
చ. అనుటయు శోభనుండు కమలాక్షి త్వదుక్తి సమంజసంబుగాఁ
గనఁబడియెన్ మనంబునకుఁ గావున నేఁ డుపవాసదీక్ష గై
కొనియెద దైవ మెట్టు లొనగూర్చునొ య ట్లగుఁగాక సౌఖ్య మొం
దను మఱి దుఃఖ మొందను స్వతంత్రత యున్నదె దేహధారికిన్. 693

క. అని చెప్పి దీక్ష గైకొని, జననాథసుతుండు క్షుద్వశంబున నాఁడే
ల్లను బాధ చెంది మఱునాఁ,డెనుఁ బుదయము నొందుచుండ మృతుఁడయ్యె నృపా.
క. అంత ముచుకుందుఁ డల్లున, కెంతటివారికిని రానిమృతి వచ్చుట క
త్యంతము విస్మయపడుచు న, నంతరకృత్యంబు జరిపె నందఱుఁ జూడన్. 695
ఉ. అప్పుడు చంద్రభాగ హృదయంబున భర్తృపదారవిందముల్
ముప్పిరిగొన్నభక్తిమెయి మోపి తదర్చన చేసికొంచు నె
ల్లప్పుడు గూడ మాని విషయాంతరముల్ పతిదేవతాస్థితిన్
జెప్పక చెప్పుచున్ గ్రియలచే వెడలింపఁగఁజొచ్చెఁ గాలమున్. 696
గీ. అంతటను గొన్నినాళ్ళకు నప్పురంబు, నందు నివసించుచుండుమహాతపస్వి
సోమశర్మాహ్వయము గలభూమిసురుఁడు, తీర్థసేవాపరుం డయి తిరుగఁజొచ్చె.
గీ. తిరుగుచును దేశదేశముల్ తీర్థములను, గ్రుంకుచును బోయి మందరకుధరమునకు
వచ్చుటను నొకసానువునందుఁ గాంచె, దైవికముగను నొకదేవతాపురంబు.
సీ. కాంచి యందొకచోటఁ గనకమయస్తంభ, మును నవరత్నవిభూషితమును
దివ్యశోభాసముద్దీపితంబును నయి, జానొప్పునొకమహాసౌధమందుఁ
గావించుచుండంగ గానంబు గంధర్వు, లచ్చరల్ నాట్యంబు లాడుచుండ
ననిమిషుల్ స్తోత్రంబు లొనరించుచుండంగఁ, గురియుచు నుండంగఁ గుసుమవృష్టి
గీ. హారకుండలకటక కేయూరకాంతి, తేజరిలఁ జేయుచుండంగ దెసల నెల్ల
నొక్కసింహాసనమునఁ గూర్చుండి యున్న, దివ్యపురుషుని నొక్కనిఁ దేఱి చూచి.
క. ఈతఁడు ముచుకుందునిజా, మాతగఁ దోఁచెడిని నేమి మహిమముచే నీ
రీతిని మహాప్రభావుఁ, డేతుం డయ్యెనొ యటంచు నెంచుచు నెదలోన్. 700
గీ. అతనికడ కేఁగుటయును సింహాసనంబు, నుండి లేచి మహానంద మొదవ సోమ
శర్మకు నమస్కరించి యాధర్మమూర్తి, యేల దయచేసితిరి మీర లిచటి కనిరెను.
ఉ. అంతట సోమశర్మ మనమందు ముదంబును జెంది దేవ నీ
కింతమహాప్రభావ ముదయించుట కేమి కతంబొ సర్వవృ
త్తాంతము నాకుఁ జెప్పు మన నాతఁడు నవ్వి మహాత్మ మద్వివా
హాంతమునందు నేను శ్వశురాలయమందు వసించి యుండఁగన్. 702
గీ. కార్తికంబునఁ గృష్ణపక్షంబునందు, వచ్చుటయును రమాహరివాసరంబు
శ్వశురశాసనమున నుపవాస ముంటి, నాఁడు తప్పించుకొనుత్రోవ నాకు లేమి.
క. అంతటను నోర్వఁజాలని, సంతాపము గలిగి క్షుద్వశంబున నారే
యంతయును నేఁచి మఱునాఁ, డంతము నొందితిని నుదయ మగుచుండంగన్.
క. అది యెంతటియభ్యుదయ, ప్రద మగుహరివాసరంబొ ప్రాప్తంబయ్యెన్
దదనంతరంబ నాకీ, పద మయథార్థముల బుధులుపలికెడి పలుకుల్.

గీ. కాని యశ్రద్ధచేతను నేను వాఁడు, చేసినయుపాసమున జేసి స్థిరము గాక
యుండుటను నీపదము కుంచుచుంటి ననుచు, వేగ చని చెప్పుమా చంద్రభాగతోడ.

క. అనుటయు నాతనిమాటలు, విని కనికర మొదవ లోన విప్రుఁడు శీఘ్రం
బున వచ్చి చంద్రభాగకు, విని చెను దయితోవియ క్షేమవృత్తాంతంబుల్. 707

గీ. అంతటల్ జంద్రభాగ ప్రహర్షమునను, దనవనవ్రతశేషఫలమును ధారవోసె
స్వర్గపురవాసభాగ్యంబు శాశ్వతముగ, దయితుఁ డనుభవించునట్లు లోఁదలఁచికొనుచు.

గీ. ధారవోసి యట్లు తాను బాల్యమునుండి, చేసినట్టివిష్ణువాసరోప
వాసములఫలంబువలన దేహముతోడఁ, జనియె నామె భర్తృసవిధమునకు.

గీ. అంత నాచంద్రభాగయు నతనిఁగూడి, యనుభవించుచు స్వర్గసౌఖ్యముల నెల్లఁ
గల్పశతములు గడపిరి క్షణములట్లు, హరిదినవ్రతమహిమ నెంచ నరుగ నచ్చు.

—: కార్తికశుక్లైకాదశీవ్రతమాహాత్మ్యకథనము :—

వ. మఱియును గార్తికశుక్లైకాదశిం గూర్చి బ్రహ్మయు నారదునకు నిట్లని వమ్మహా
ర్షికిఁ బరమేష్ఠి యిట్లనియె.

క. నారద నీప్రశ్నం బుప, కారక మఖిలప్రజానికాయమునకు నా
కారణమున నెటులును నీ, కోరికి తీరపక పోవఁ గూడదు మాకున్.

గీ. కార్తికంబున శుక్లపక్షమున వచ్చు, హరిదినంబు ప్రబోధిని యనెడిపేర
విశ్రుతిం జెందె నానాఁడు విష్ణుమూర్తి, గాఢపాచ్ఛయ్యనుండి మేల్కొనుటఁ జేసి.

సీ. అఖిలమించినయెడ నాయువు దయఁ జేయు, నారోగ్య మొసఁగును గోరు నెడల
నర్థించు నెడలఁ బుణ్యము లెల్లఁ జేకూర్చు, నిచ్ఛగించినయెడ నిచ్చు సుఖము
ప్రార్థించు నెడల సామ్రాజ్యంబు నొడఁగూర్చు, విద్య లన్నియు నిచ్చు వేఁడు నెడలఁ
గాంక్షించు నెడ సర్వకలుషంబుల నడంచు, వాంఛించు నెడల నన్వయము నిలుపు

గీ. నివి యవి యటంచు వాక్రువ్వ నేల వేయి, త్రిభువనంబులలోన దుర్లభము లైన
యాప్తితార్థంబు లేవేని యిచ్చునట్టి, దీక్ష గలయది యొకప్రబోధినిరొ చూవె.

గీ. వాజిమేధసహస్రముల్ రాజసూయ, శతములును జేసిన ఫలంబు సంఘటిల్లుఁ
జేసెనేని ప్రబోధినీవాసరమున, నొక్కయుపవాసమును శ్రద్ధ యుంచి మదిని.

గీ. పూర్వజన్మసహస్రసంభూత మైన, పాతకం బెల్లఁ జిచ్చులోఁ బడినదూది
చందమున డిందు నొకరాత్రి జాగరంబు, చేసెనేని ప్రబోధినీవాసరమున. 716

గీ. శాస్త్రము విధించినట్టులు శ్రద్ధతోడఁ, జేసెనేని ప్రబోధినీవాసరమున
సుకృత మణుమాత్ర మేనియూసుకృతలవమె, మేరుసమమయి కర్తకు మేలుగూర్చు.

గీ. వాఁడె యతి వాఁడె సుఖభోగి వాఁడె యోగి
వాఁడె విజ్ఞాని వంశపావనుఁడు వాఁడె

యుక్తరీతిని జాగరోపోషణములఁ
జలుపునో ప్రబోధినీదివసమున నెవఁడు.
గీ. త్రిభువనంబులలో నున్నతీర్థవితతు, లన్నియుఁ బ్రబోధినీవ్రత మాచరించు
నట్టివానిగృహంబున నధివసించుఁ, గాన వేఱొకపుణ్యంబు వాని కేల. 719
గీ. స్నానదానతపోహోమజపములందు, దేని నైనఁ బ్రబోధినీదినమునందుఁ
జేయునెడఁ దత్ప్రభావముచేత నగుచు, నక్షయంబుగ నది యిచ్చు మోక్షసిద్ధి.
గీ. వ్రతము చేసి ప్రబోధినీవాసరమున, హరిని బూజించి ఫలయుతం బైనశంఖ
జలముచే శౌరి కర్ఘ్యం బొసంగెనేని, యఖిలతీర్థావగాహపుణ్యము లభించు.
గీ. శమదమంబులు గాని తీర్థములు గాని, దానములు గాని క్రతువులు గాని కావు
సమములు ప్రబోధినికి నొక్కశౌరి దక్క,నని వచించి యంతర్ధాన మయ్యె బ్రహ్మ.
క. అంతటఁ బ్రబోధినీవృ, త్తాంతము దెలుపుచును జనుల కమరర్షి మహా
సంతోషముతోడఁ బ్రజా, సంతరణార్థంబ తిరుగసాగెను జగతిన్. 723

—: అధికమాసకృష్ణైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియును బురుషోత్తమమాసం బనుప్రసిద్ధిం బడసినయధికమాసంబున వచ్చు
కృష్ణైకాదశి కమలానామంబునఁ బ్రసిద్ధంబయ్యె. తన్మహిమంబు వాగతీతంబు.
క. దీనికి దృష్టాంతంబుగ, నేనొకకథ వినుచువాఁడ నీ కద్దానన్
గానంబకుఁ గమలామహి, మానంత్యం బధిప యేల యధికోక్తు లికన్. 725
సీ. మున్నవంతీపురంబున నుండె శివశర్మ, యనుబ్రాహ్మణుం డొక్కఁ డవనిలోన
నతనికిఁ గల రేవు రాత్మజుల్ జయశర్మ, యనుకనిష్ఠుం డుండె నందులోన
నాకనిష్ఠుఁడు దుస్సహోవాసమునఁ జేసి, చేయఁదొడంగెను జెడ్డపనుల
నవి సహ్యములు గామి నతని గేహమునుండి, యడవికి శివశర్మ వెడలఁగొట్టె
గీ. నంతటను నాకనిష్ఠుఁడు కొంతకాల, మడవులం దుండి క్షుద్బాధ తాఁగలేక
యక్కడక్కడఁ దిరుగుచు నొక్కనాఁడు, దైవికముగఁ బ్రయాగతీర్థమున కరిగె.
చ. అరిగి త్రివేణిలో మునిఁగి యాతఁడు తత్సవిధంబునందు భూ
సురపరిమత్పరీతుఁ డగుచున్ హరిమిత్త్రమహర్షి యుండఁ ద
చ్చరణసరోరుహంబులకు సాఁగిలి మ్రొక్కి నిజస్థితిన్ సవి
స్తరముగ విన్నవించి నను ధన్యునిఁ జేయుఁ డటంచు వేఁడినన్. 727
క. హరిమిత్త్రుఁ డతనిపయిఁ గని, కర మునయుంపంగ నెదను గమలావ్రత మ
త్తరుణంబునఁ జేయించెను, బరిమన్మధ్యమున నాప్రపన్నునిచేతన్. 728
గీ. వ్రతము చేసినపిదప నారాత్రియందు, నరుగుదెంచి మహాలక్ష్మి కరుణతోడ
నిదురలో నున్నజయశర్మయెదుట నిలిచె, దేహకాంతులచే దెసల్ తేజరిల్ల.

సీ. అంతట జయశర్మ యామెను గనుఁగొని, యత్యంతవిస్మయం బాత్మ నొంది
తల్లి నీ వేదేవతామతల్లివో నాకుఁ, దెలుపు మటంచుఁ బ్రార్థించుటయును
వత్స వచ్చితి నేను వైకుంఠముననుండి, శౌరియానతిని నాపేరు కమల
సంతోషమయ్యె నీసలిపినకమలావ్రత, తమున కిచ్చెదను గోరుము వరంబు
గీ. నని రమాదేవి వచియింప నతఁడు మ్రొక్కి, భక్తితోడుతఁ దత్పాదపద్మములకుఁ
దల్లి చెప్పుము కమలావిధాన మనుడు. నిందిరాదేవి హర్షించి యిట్టు లనియె.
గీ. అధికమాసంబునను గృష్ణహరిదినమున
నుత్థితుం డయి బ్రాహ్మముహూర్తమందు
నెవను బురుషోత్తముని స్మరియించుకొనుచు
స్నాన మొనరించి శాస్త్రవిధానమునను. 731
వ. గృహంబున నేకగుణంబుగను నదీతీరంబున ద్విగుణంబుగను నగ్నిహోత్ర
గృహంబునను శివక్షేత్రంబులందును దీర్థంబులందును దేవతాసన్నిధియందును
శతగుణంబుగను గోష్ఠంబునందు సహస్రగుణంబుగను దులసీసాన్నిధ్యంబున
లక్షగుణంబుగను విష్ణుసన్నిధానంబున ననంతగుణంబుగను ఫలంబు చెప్పం
బడుటం జేసి ప్రాప్తస్నానంబునందుఁ గమలావ్రతం బొనరించెద నని సంకల్పించి
యాదినం బెల్ల నుపవాసజాగరంబులతోఁ బంచామృతస్నపనాదులచేఁ బురు
షోత్తమునిఁ బూజించి మఱునాఁడు ప్రాతఃకాలంబున స్నానంబు చేసి పయ
స్స్నపనాదులచే జనార్దనుని నారాధించి యంజలి గావించి. 732
గీ. స్వామి యజ్ఞానసంతమసమున గ్రుడ్డి, నైననాకు నొసంగుము జ్ఞానదృష్టి
ననుచుఁ బ్రార్థించి బ్రాహ్మణులను భుజింపఁ, జేసి చివరకుఁ దాను భుజింపవలయు.
గీ. ఆవ్రతంబున ధర్మకామార్థములను, బడసి వ్రతకర్త ముక్తిని గడకుఁ జెందు
నని వచించి యంతర్ధానమయ్యె లక్ష్మి, యంతటను మేలుకొనియె ధరామరుండు.
ఆ. అంతలోనె గజము లశ్వంబులును రథ, ములును బరిజనమును గలిమితోడఁ
బ్రాప్తమయ్యెఁ దత్ప్రభావంబునను జయ, శర్మ కచ్చెరియము సంఘటిల్ల. 735
క. ఆవిభవముతో నింద్రుని, కైవడి జయశర్మ పితృసకాశంబునకున్
బోవుటయును శివశర్మ మ, హావిస్మయ మొదవ నతని నాలోకించెన్. 736
క. అంతట జయశర్మ స్వవృ, త్తాంతం బంతయును దెలిపి యాత్మీయుల క
త్యంతానందము గలుగ న, నంతఫలం బొసఁగు వ్రతమహత్త్వము వినిచెన్. 737

—: అధికమాసశుక్లైకాదశీమాహాత్మ్యకథనము :—

వ. మఱియు నధికమాసశుక్లైకాదశి కామదైకాదశి యని చెప్పంబడు. 738
క. అరమఱ లేకుండఁగ నా, దరిఁ జేరినయెడలఁ గామదాదివసమునన్
బరిపాలింపఁగ భక్తులఁ, బురుషోత్తమనామధేయమున నే నుందున్. 739

సీ. భస్మీకృతము లగుఁ బాపంబు లన్నియు, రోగంబు లెల్లను రూపుమాయు
నాయుష్య మభివృద్ధి నందు నానాఁటికి, వ్యాపించుఁ గీర్తి దిగ్వలయమందుఁ
దనకుఁ దా నొసఁగూడు ధనధాన్యవైభవంబు, సంతానలాభంబు సంఘటిల్లు
శాత్రవుల్ నామశేషంబుగా నుందురు, పైశాచికగణంబు పాఱిపోవుఁ
గీ. గామితార్థంబులను దీర్పఁ గల్పతరువు, తెఱఁగునను నొప్పు కామదాదినమునందు
నన్నుఁ గూరిచి భక్తిసంపన్ను లగుచుఁ, సలిపి రేని యుపోషణజాగరములు. 740
క. భూవర వేయేటికి వసు,ధావలయమునందుఁ గామదాదివసమునన్
జీవన్ముక్తిని గాంతురు, కావించిన యెడల శ్రద్ధ గలిగి వ్రతంబున్. 741
క. ఈవిష్ణువాసరములవ్ర, భావము నెవఁడేని వినినఁ బఠియించిన ధా
త్రీవర సముద్రముద్రిత, భూవలయాశేషదానపుణ్యము నొందున్. 742
క. అనుటయు నజాతశత్రుఁడు, మనమున హర్షంబు నొందె మఱియును నే మై
నను నింక నడుగఁదలఁచిన, మునివర యడుగుము సమగ్రముగ నెఱిఁగింతున్.

—: చాతుర్మాస్యవిధికథనము :—

గీ. అనుటయును శౌనకుండు ప్రహర్ష మొంది,విదితధర్మ చాతుర్మాస్యవిధులు నాకు
నాలకింప మనోరథ మంకురించె, నని పలుక సూతుఁ డిట్టు లామునికి ననియె.
వ. నేఁడు నీవు న న్నడిగినట్ల మున్ను నారదుండు మహేశ్వరుని నడుగ. 745
గీ. హరుఁడు చెలునవ్వు నవ్వి యి ట్లనియె నడుగఁ,దగినయంశంబు నడిగితి తాపసేంద్ర
నవనవోన్మేషములు రమాధవునికథలు,వినుటకును జెప్పుటకును నువ్విళ్ళుగొలుపు.
వ. శయని యని చెప్పంబడు నాషాఢశుక్లైకాదశి మొదలు ప్రబోధిని యని చెప్పం
బడు కార్తికశుక్లైకాదశివఱకును నుండు నాలుగుమాసంబులును జాతుర్మాస్య
మని చెప్పంబడియె. శయనైకాదశినాఁడు ప్రాతఃకాలంబునఁ గాల్యకృత్యం
బుల నెఱవేర్చికొని విష్ణుప్రతిమను బంచామృతంబులచే నభిషేకించి శంఖచక్ర
గదల నలంకరించి పీతాంబరంబు గట్టి శ్వేతవస్త్రాచ్ఛాదితంబును సోపధానం
బును నగుపర్యంకంబునందు స్థాపించి చందనంబు నలంది మనోజ్ఞంబు లగు
పుష్పంబులచేఁ బూజించి ధూపదీపాదు లొసంగి సాంజలియై. 747
గీ. నీవు సుప్తుండవై యుండ నీరజాక్ష, తగులుకొనియుండు సుప్తిలో జగము లెల్ల
నీవు మేల్కాన మేల్కాను నిద్రనుండి, జగములకు నెల్ల భర్త వీ వగుటఁ జేసి.
వ. అని ప్రార్థించి తత్పురోదేశంబునందుఁ దాను స్వీకరించుచాతుర్మాస్యవ్రత
దీక్షానియమంబులు నివేదింపవలయు. అధికమాసంబు చాతుర్మాస్యపతితం
బయ్యేనేని సూర్యుండు మిథునరాశిగతుండై యుండ శయనోత్సవంబును
దులారాశిగతుండై యుండఁ బ్రబోధోత్సవంబును మాధవున కొనరింపవలయు.

దేవతాప్రతిష్ఠలును యజ్ఞాదిక్రియలును వివాహాదిమంగళకార్యంబులును దండ
యాత్రలును జాతుర్మాస్యదినంబులందు నిషిద్ధంబులు. చాతుర్మాస్యదినంబు
లందు హింసాత్యాగంబువలన దేవత్వంబును దైలవర్జనంబువలన సంతతియును
ఘృతవర్జనంబువలన లావణ్యంబును గటుతైలత్యాగంబువలన శత్రునాశం
బును సుగంధతైలత్యాగంబువలన సౌభాగ్యంబును బుష్పభోగపరిత్యాగంబు
వలన విద్యాధరత్వంబును షడ్రసత్యాగంబువలన సురూపంబును సౌగంధ్యంబును
దాంబూలవర్జనంబువలన భోగంబును మధురకంఠంబును ఫలత్యాగంబువలన
బహుపుత్రత్వంబును యోగాభ్యాసంబువలన బ్రహ్మపదంబును నభ్యంగ
త్యాగంబువలన దీప్తియు ద్రవ్యపతిత్వంబును దధిదుగ్ధపరిత్యాగంబువలన
గోలోకంబును. స్థాలీపాకవర్జనంబువలన నింద్రసింహాసనంబును స్థండిలస్థలభోజ
నంబువలనఁ బృథివీపతిత్వంబును విష్ణుపాదాభివందనంబువలన సర్వదానఫలం
బును విష్ణుపాదాంబుజస్పర్శంబువలనఁ గృతకృత్యత్వంబును విష్ణుదేవాలయోప
లేపనమార్జనంబులవలన వైకుంఠనిత్యనివాసంబును నష్టోత్తరశతవిష్ణుప్రదక్షిణం
బులవలన హంసయుక్తదివ్యవిమానగమనంబును విష్ణుసన్నిధియందు గీత
వాద్యంబు లొనరించుటవలన గంధర్వలోకంబును బంచగవ్యప్రాశనంబువలనఁ
జాంద్రాయణఫలంబును లోకంబునకు శాస్త్రంబు బోధించుటవలన వ్యాసత్వం
బును విష్ణుపదప్రాప్తియును మాధవునిఁ దులసీదళంబులచేఁ బూజించుటవలన
విష్ణుధామంబును విష్ణుపాదోదకప్రోక్షణంబువలన నప్సరస్థానంబును శీతోదక
స్నానంబువలన నిర్మలదేహంబును నుష్ణోదకవర్జనంబువలనఁ బుష్కరస్నాన
ఫలంబును బత్త్రిభోజనంబువలనఁ గురుక్షేత్రనివాసఫలంబును శిలాభోజనంబు
వలనఁ బ్రయాగనివాసఫలంబును దామ్రపాత్రభోజనంబువలన నైమిశవాస
ఫలంబును బాలాశపత్త్రిభోజనంబువలనసంవత్సరాగ్నిహోత్రోపాసనాఫలంబును
నారాయణాష్టాక్షరీజపంబువలన విద్యాధరపతిత్వంబును బుష్కరస్నానంబు
వలన గంగాస్నానఫలంబును బ్రహ్మపత్త్రిభోజనంబువలనఁ జాంద్రాయణవ్రత
ఫలంబును నేకాదశ్యుపవాసఫలంబును సర్వదానఫలంబును సర్వతీర్థస్నానఫలం
బును నరకనివృత్తియును విష్ణురూపుఁ డగుగురువునకు నాత్మార్పణంబు గావిం
చుటవలన ననంతఫలంబును స్థండిలశయనంబువలన దివ్యవిమానప్రాప్తియును
నక్తభోజనంబువలనఁ దీర్థయాత్రాఫలంబును నయాచితాన్నభోజనంబువలన
వాపీకూపాదిస్థాపనఫలంబును మధువర్జనంబువలన సర్వయజ్ఞఫలంబును దాడిమ
మాతులుంగనారికేళవర్జనంబువలన సంపన్నత్వంబును సుభగత్వంబును దేవ
త్వంబును వైకుంఠనివాసంబును నేకభక్తంబువలన శాశ్వతవిష్ణులోకనివాస
భాగ్యంబును యవవ్రీహిగోధూమవర్జనంబువలన నశ్వమేధయాగఫలంబును

ధనధాన్యసమృద్ధియును బహుపుత్రత్వంబును దిలదర్భతులసీదళంబులచేఁ జేయు తర్పణంబువలన సహస్రయుగంబులవఱకును విష్ణుసాన్నిధ్యనివాసంబును వేదంబున ఋక్కు గాని యర్ధర్చము గాని పదము గాని యర్ధపదంబు గాని విష్ణుసాన్నిధ్యమునందుఁ బఠించుటవలన వైకుంఠనివాసంబును మైథునవర్జనంబువలన నొక్క మన్వంతరంబువఱకును విష్ణులోకవాసంబును దక్రశాకవర్జనంబువలన మోక్షంబును నామలకస్నానంబువలన మహాపుణ్యంబును సంధ్యామౌనంబువలనను సత్యనిష్ఠవలనను ననంతసుకృతంబును నిత్యస్నానంబువలనఁ జతుర్మన్వంతరములవఱకును వైకుంఠనివాసంబును స్వయంపాకభోజనంబువలన నయుతవర్షంబులవఱకును స్వర్గలోకనివాసంబును మౌనవ్రతంబువలన వైకుంఠసత్యలోకనివాసంబును మౌనభోజనంబువలన నపునరావృత్తియును సమకూరు. మౌనభోజనంబువలన రాక్షసులకును స్వర్గప్రాప్తి కలిగె.

—: మౌనభోజనఫలకథనము :—

గీ. ఆడుచును జల్పనములను నారగించు, నన్న మగు నవిశుద్ధ మాయన్న మెవఁడు
తినునొ వాఁ డగుఁ బాపము దినినవాఁడ, కాన వలయు మౌనము భుక్తికాలమందు.

గీ. భోజనము చేయు నెడ మౌనమును వహించి, యుపవసించినపుణ్యము నొందువాఁడు
కొనకుఁ బ్రాణాహుతులకాలముననునైన, మౌనము వహించువాఁ డగు మౌనభోజి.

ఆ. భస్మ మగును జూవె పంచమహాపాత, కములు గూడ నొక్క గడియలోన
నితరపాతకముల నెన్నంగ నేటికి, మౌనభోజి యైనమానవునకు. 752

వ. చాతుర్మాస్యంబునందు నియతంబుగా వర్జించినపదార్థంబులు బ్రాహ్మణునకు మొదట దానము చేయవలయు. విప్రునకు దత్తమైనపదార్థంబు కోటిగుణితంబై తన కక్షయంబుగా వైకుంఠముం బ్రసాదించు. హరినామసంకీర్తనంబువలనను బురాణశ్రవణంబువలనను విష్ణుపూజవలనను భూసురార్చనమునను సర్వపాపవిముక్తియును విష్ణులోకప్రాప్తియును జేకూరు. ఇంకను నిట్టిధర్మంబు లనేకంబులు నిర్వర్తించుటవలన ననేకవిధపుణ్యలోకంబులు ప్రాప్తించు. 753

గీ. ఏవిధంబున నైనను దేవదేవుఁ, డగుజనార్దనునకుఁ బ్రీతి యావహిల్లఁ
జేయ నగు నియమాదులచేత శక్తి, ననుసరించి చాతుర్మాస్యదినములందు.

గీ. సమయయోగ్యంబు లగునియమములలోన, దేని నైనఁ జాతుర్మాస్యదినములందు
నాచరింపక కాలము వ్యర్థపఱచు, నట్టివారలజన్మము వ్యర్థ మనఘ. 755

గీ. అనుటయును నారదుం డిట్టు లనియె దేవ, వింటి నేఁడు చాతుర్మాస్యవిధుల నెల్లఁ
ద్వత్కృపావశమునను సంతసము గల్గె, నిఁకఁ దదుద్యాపనావిధం బెఱుఁగఁ జెపుమ.

## —: చాతుర్మాస్యోద్యాపనాదికథనము :—

క. అనుటయు మహేశ్వరుం డి, ట్లనియెను నారద వచింతు నవధానమునన్
విను చాతుర్మాస్యవ్రత, మున కుద్యాపనము మిగుల ముఖ్యము సూవే. 757

క. ఒనరింపకున్న నుద్యా, పనము వ్రతంబునకు వికలభావము గలుగున్
జనియించు దాన వ్రతముం, బొనరించినవాని కాంధ్యమును సుప్తంబున్. 758

వ. జగన్నాథుండు సుప్తోత్థితుం డైనదినంబునం దాను పాలించిననియమంబుల నెల్ల నివేదించి తైలంబు వర్జించినయెడల ఘృతంబును ఘృతంబు వర్జించిన యెడల క్షీరంబును మౌనంబు వహించినయెడల సహిరణ్యంబు లగుతిలపిండంబులును భోజననియమంబు వహించినయెడల హిరణ్యసహితంబును దధియుతంబును నగునన్నంబును బలాశపత్త్రభోజనంబు గావించినయెడల ఘృతపూర్ణంబగుభోజనంబును నక్తభోజనంబు గావించినయెడల షడ్రసభోజనంబును నయాచితభోజనంబు గావించినయెడల సహిరణ్యం బగువృషభంబును మాసంబు వర్జించినయెడల సవత్స యగుగోవును నామలకస్నానంబు గావించినయెడల మాషపరిమితం బగుసువర్ణంబును ఫలనియమంబు వహించినయెడల ఫలంబులును ధాన్యనియమంబు వహించినయెడల ధాన్యంబును స్థండిలశయనంబు గావించిన యెడల సతూలంబును సోపధానంబును నగుశయ్యయును నిత్యస్నానంబు గావించినయెడల సశాకంబును సదక్షిణంబును నగులవణంబును నిస్స్నేహభోజనంబు గావించినయెడల ఘృతసక్తువులును నఖకేశధారణంబు చేసినయెడల నాదర్శంబును పాదరక్షావర్జనంబు గావించినయెడలఁ బాదరక్షలును మాంసంబు వర్జించినయెడల సవత్స యగుకపిలగోవును దీపంబు వెలిఁగించినయెడల సువర్ణపాత్రంబున ఘృతంబున వెలిఁగించినదీపంబును శాకనియమంబు వహియించినయెడల శాకంబును మైథుననియమంబు వహించినయెడల రౌప్యంబును నాగవల్లీదళవర్జనంబు గావించినయెడల సహిరణ్యం బగుకర్పూరతాంబూలంబును బ్రాహ్మణునకు నొసంగవలయు. బ్రహ్మచర్యంబు వహించినయెడల బ్రాహ్మణదంపతుల కిరువురకు భోజనంబు పెట్టవలయు. మఱియును నితరనియమంబు లేవైనను వహించినయెడలఁ దత్తదర్హంబుగా శాస్త్రవిహితంబు లగుదానంబులు గావింపవలయు. 759

క. ఈయుద్యాపనవిధులను, జేయునెడల శ్రద్ధతోడ శ్రీపతి సకల
శ్రేయముల నొసఁగుఁ భక్తని, కాయమునకు జన్మసార్థకత్వము గలుగన్. 760

వ. అనుటయు నారదుండు మహేశ్వరునకు సవినయంబుగా వందనం బొనరించి త్రిస్పృశావ్రతముం గూర్చి యడుగ సదాశివుం డాతని కి ట్లనియె. 761

—: త్రిస్పృశా మాహాత్మ్య కథనము :—

గీ. త్రిస్పృశాద్వాదశీవ్రతాధిక్య మిట్టి, దనుచు వచియించుటకును నా కలవి గాదు
కలుగుఁబంచమహాపాతకులకుఁ గూడ, మోక్షసామ్రాజ్య మీవ్రతంబును నొసఁగు.

గీ. క్రతువులొనరించుఁగాక తీర్థములలోన, మునుఁగుఁగాక బహువ్రతంబులను జేయుఁ
గాక త్రిదశుల నర్చించుఁగాక ముక్తి, గలుగ నేరదు త్రిస్పృశ సలుపకేని.

క. కలికాలంబున విషయా, కులమానస దీనప్రాణికోటుల కెల్లన్
గలిగింప ముక్తి దయతో, జలజాక్షుఁడు చేసెఁ ద్రిస్పృశాతిథి నిలలోన్. 764

సీ. తొలఁగిపోయె శతాయుధునకుఁ గాననములోఁ, బాలునిఁ జంపినపాతకంబు
నశియించె శతమన్యునకు నముచిప్రాణ, హరణంబునను గల్గినట్టిపాప
ముడిగెను బాహులేయునకు హత్యాష్టక, కరణసంభవ మైనకల్మషంబు
వదలెను గంగాభవానికిఁ బాపనం, తతులు దగిల్చిన ఘోరదుష్కృతంబు

గీ. పడియె నాహస్తమున నుండి పుడమియందు, యుగములకొలంది వదలక యంటుకొన్న
యట్టిబ్రహ్మకపాల మత్యద్భుతముగ, నొనరుచుటఁ జేసి త్రిస్పృశోపోషణంబు.

గీ. అనఘ కాశీప్రయాగములందు మరణ, మొందినను గోమతీస్నాన మొనరిచినను
నొందఁ దగుముక్తి త్రిస్పృశోపోషణమున, సంభవించును గృహమందు జంతువులకు.

గీ. బ్రహ్మహత్యాద్యనేకపాపములు గలిగి, నట్టిప్రాణులు తనజలమందు మునుఁగఁ
దత్తదఘసంతతులు తన్నుఁ దగులుకొనుట, నిలువఁజాలక మున్ను చింతిలుచు గంగ.

సీ. సత్వరంబుగఁ బోయి శౌరిసన్నిధి కాత్మ, వృత్తాంత మంతయు విన్నవింప
హరి యిట్టు లనియె జాహ్నవి చింతిలకుము నీ, పాపంబు లన్నియుఁ బాసిపోవు
శ్యామవటంబు నాస్థానంబు నే నుందు, నావటంబునయందు యన్వహమును
బ్రవహించుచుండును బ్రాచీసరస్వతి, నాయగ్రభాగంబునను సతంబు

గీ. నీవు తత్తీర్థజలమందు నియతముగను, స్నాన మొనరింపు మొకసారి చాలు నదియె
బ్రహ్మహత్యాసురాపానభర్మహరణ, గోవధాద్యఘముల నెల్లఁ గూలఁద్రోయు.

గీ. అనుటయును గంగ వినయనమ్రాస్య యగుచు
స్వామి తత్తీర్థమునకేఁగఁజాల నేను
సులభముగఁ బాపములు వాయఁగలుగునట్టి
తెరవు మఱియొండు కరుణించి తెలుపు మనియె. 769

గీ. అనుటయును మాధవుం డిట్టు లనియెఁ బుత్రి, సకలపాపంబులను గూడ సంహరింప
సులభ మైనయుపాయంబు కలదు గాని, పరమగోప్యంబు దానిఁ జెప్పంగ రాదు.

క. వినను మత్పదజాతవు, గాన వచించెదను నీకుఁ గల దొకతిథి య
ద్దానికి సరి గా దేవ్రత, మేనియు నేతీర్థ మేని యేమఖ మేనిన్. 771

వ. ఏకాదశియును ద్వాదశియును రాత్రిశేషంబునఁ బ్రయోదశియును గలిగియుండు టం జేసి యది త్రిస్పృశ యను నామంబు గలది యయ్యె. 772

గీ. అట్టితిథియందు వ్రతమును నాచరించి, నట్టి లైనను నేకూడ సఫలపుణ్య కర్మములు చేసినఫలంబు గడియలోన, దానికి సమాన మదె యింక దాఁప నేల.

గీ. దశమి యేకాదశియును భద్రయును జేరి, నట్టిదినమును ద్రిస్పృశాఖ్యంబ కాని యది యసురులకుఁ బ్రియ మైన దగుట నంటు,దగదు పుష్పిణి మైనట్టిమగువవోలె.

క. దశమీయుత మగు నేకా, దశి నాకుఁ బ్రియంబు గాదు దశమీదోష ప్రశమితగుణ మగు నేకా, దశిని నుపోషణము చేయఁ దగ దెవ్వరికిన్. 775

క. అనుటయును దద్విధానము, వినిపింపుము దేవ నాకు విశదముగా నే నొనరించి తద్వ్రతంబును, గనియెద నఘశుద్ధి యనుచు గంగ యనంగన్. 777

వ. మాధవుండు గంగను గరుణాకటాక్షంబుల నిరీక్షించి దేవి పంచరత్నసమంచి తంబును బుష్పమాలావేష్టితంబును గర్పూరాదిసువాసనావాసితసలిలపూరితం బును నగు నొక్కఘటంబునందుఁ దిలపూర్ణం బగు తామ్రపాత్రంబు నుంచి పలంబు గాని పలార్ధంబు గాని తదర్ధంబు గాని పరిమాణంబు గలసువర్ణ ప్రతిమను నభిషేకపూర్వకంబుగా దానిపైనిఁ బ్రతిష్ఠించి తత్ప్రతిమకు గంధ పుష్పపరిధానఛత్త్రపాదుకావేణుదండయజ్ఞోపవీతఫలోపహారంబు లర్పించి దామోదరునిపాదంబులును మాధవునిజానువులును గామప్రదాయకునిగుహ్యం బును వామనునికటియును బద్మనాభునినాభియును విశ్వమూర్తి జఠరంబును జ్ఞాన గమ్యునిహృదయంబును వైకుంఠగామికంఠంబును సహస్రబాహునిబాహువులును యోగరూపునిచక్షువులును దులసీపత్త్రంబులచేఁ బూజించి శంఖోపరిస్థాపితంబును సూత్రవేష్టితంబును నగు నారికేళంబు హస్తంబులం దుంచుకొని. 777

గీ. అంబుజాక్ష మదీయము లైనయఘము,లన్నియును గూడ రూపుమాయంగఁ జేసి నన్ను రక్షింపు మీవేళ నాయొసంగు, నర్ఘ్యమును గొని వందన మాచరింతు.

వ. అని పలికి తన్నారికేళఫలోదకార్ఘ్యప్రదానపూర్వకంబుగాఁ బ్రణామంబు గావించి ధూపదీపనైవేద్యనీరాజనంబు లొసంగి పిదప గురువునకు నర్చనా పూర్వకంబుగా భోజనతాంబూలదక్షిణలును వస్త్రంబులును గంచుకోష్ణీషంబు లును ఛత్త్రోపానహంబులును ముద్రికాకమండలువులును సప్తధాన్యంబులును సమర్పించి రాత్రి జాగరంబు గావించి మఱునాఁడు ప్రాతఃకాలంబునందు స్నానాదిక్రియాకలాపంబు నొనర్చుకొని యర్ఘ్యప్రదానంబు గావించి పారణ యొనర్పవలయు. 779

క. చతురాననుఁడును సురలును, యతులును గావించి యిమ్మహావ్రతమును వాం ఛితసిద్ధి మున్ను వడసిరి, క్రతుశతఫల మొందు దీనిఁ గావించు నెడన్. 780

గీ. ఉభయవంశంబులను గూడ నుద్ధరించి, నట్టివాఁ డెగుఁ బ్రస్పృశ నాచరించి
నట్టివాఁ డాతనికి మీఁదుగట్టి యుంతు; సౌధములు గొన్ని నావీట సంతతమును.
క. అని చెప్పుటయును జాహ్నవి, మనమున సంతోషపడుచు మాఁకాడక తా
నొనరించి త్రిస్పృశావ్రత, మును జెందె నశేషపాపముక్తి మునీంద్రా. 782
క. అని చెప్పుడు నున్మీలని, యను నట్టిదొ దేవ చెప్పు మనుచును దివిష
న్మౌని వినయంబున నడుగుట, యును నతనికిఁ బార్వతీప్రియుం డిట్లనియెన్.

—: ఉన్మీలనీమాహాత్మ్యకథనము :—

వ. ఏకాదశి యహోరాత్రంబును బూర్ణంబుగా నుండి మఱునాఁడు ప్రభాతకాలం
బున ఘటికామాత్రంబు శేషించెనేని తచ్ఛేషయుక్తం బగుద్వాదశి యున్మీలని
యని చెప్పంబడు.
గీ. అదినంబు ప్రియం బైనయట్లు హరికిఁ, బ్రియము గానేర దింక నేదియునుగూడఁ
గాన నున్మీలనికిఁ గలగౌరవంబు, గానరా దేదినంబున కైనఁ గాని. 785
గీ. కాశియును గంగయును బ్రయాగమును గయయు
గోమతియుఁ గాంచనాద్రియు నైమిశమును
దపములును వేదములు సప్తతంతువులును
జాల వున్మీలనీశతాంశమున కేని. 786
గీ. మాటిమాటికి నీకుఁ బెక్కుమాట లేల, చెప్పఁదగినది యొక్కటె చివరమాట
కాన మున్మీలనికి సాటి యైనవ్రతము, వాసుదేవునిఁ బోలుదైవంబుఁ గనము.
వ. ఉన్మీలని ప్రాప్తించినమాసంబు పేర స్వర్ణమయం బగువిష్ణుప్రతిమను జేయించి
పంచరత్నసమంచితంబును గంధపుష్పాక్షతాదిశోభితంబును సలిలసమేతంబును
నగునొక్కకుంభంబునందు గోధూమపూరితం బగునొక్కతామ్రపాత్రంబు
నుంచి దానిపైని నాప్రతిమను బ్రతిష్ఠించి షోడశోపచారంబులచేఁ బూజించి
మాసనామునిచరణంబులును విష్ణురూపునిజానువులును భూతపతిగుహ్యంబును
బీతవాసునికటియును బ్రహ్మమూర్తినాభియును విశ్వయోనియుదరంబును జ్ఞాన
గమ్యునిహృదయంబును వైకుంఠమూర్తికంఠంబును నుదరగునిలలాటంబును
సురేశునియుత్తమాంగంబును సర్వమూర్తిసర్వాంగంబులును దదాయుధంబు
లును నర్చించి శంఖోపరిస్థితంబును సూత్రవేష్టితంబును నగునారికేళంబుం
బట్టికొని. 788
గీ. పుండరీకాక్ష పాపకర్ముండ నైన, నన్ను దరిఁ జేరుపుము భవార్ణవమునుండి
గతులు గలిగించి మొదట దుర్గతులఁ జిక్కి, వగచుచుండెడిమత్పితృవర్గమునకు.
వ. అని ప్రార్థించి యర్ఘ్యంబు నొసంగి యాదినం బెల్ల హరినామసంకీర్తనస్తోత్ర
నృత్యగీతాదులచేతను జాగరంబుచేతను గడపి మఱునాఁడు గోభూవస్త్ర

హిరణ్యాదిదానంబులచేతను షడ్రసోపేతభోజనంబుచేతను గురువును సంతోషపఱచి తాను భుజింపవలయు. 790

క. ఈవిధిచే నుస్మిలని, గావించినవాఁడు కోటికల్పశతంబుల్
గోవిందునిమందిరమునఁ, దావుకొని వసించు దేవతలు గొలువంగన్. 791

గీ. అనుటయును నారదుం డిట్టు లనియె దేవ, పక్షవర్ధినిమహిమ మపార మనుచుఁ
దెలుపుచుం పెద్ద లద్దానితీరు నాకు, వినఁ గలదు వేడ్క సెలవిమ్ము విశదముగను.

—: పక్షవర్ధినీమాహాత్మ్యకథనము :—

గీ. అనుటయు మహేశ్వరుం డిట్టు లనియెఁ బక్ష,వర్ధిని యటంచు ద్వాదశి వాసికెక్కెఁ
బూర్ణముగ నున్న యెడలను బౌర్ణమాసి, కాని లేక యమావాస్య గాని యనఘ.

వ. అమ్మహాతిథియందుఁ జేయువ్రతంబువలన నశ్వమేధాయుతఫలంబును జాగరంబువలనఁ బంచాగ్నిసాధనపుణ్యంబును దీర్ఘయాత్రాసుకృతంబును దశజన్మంబులవఱకును గృహమునందు నిత్యోత్సవంబులును నుపవాసంబువలన బ్రహ్మహత్యాదికోటిపాతకప్రశమనంబునుం జేకూరు. 794

క. వినిచెదను దద్వ్రతంబును, విను మయ్యాది సకలపాపవిచ్ఛేదంబున్
బొనరించి విష్ణుపదమున, నునుచు నపాయంబు లేక యుండెడిరీతిన్. 795

వ. అవ్రణపంచరత్నసమేతంబును జలపూర్ణంబును గంధమాల్యాలంకృతంబును నగునొక్కకుంభంబుమీఁద గోధూమపూరితం బగునొకతామ్రపాత్రంబు నునిచి దానిపైనిఁ బంచామృతాభిషిక్తంబును దన్మాసనామాభిహితంబును నగుసువర్ణవిష్ణుప్రతిమను స్థాపించి కుంకుమాగురుచందనాదు లలంది వస్త్రయుగ్మంబు కట్టి ఛత్త్రోపానహంబులు ధరియింపంజేసి పద్మనాభునిపాదంబులును విశ్వమూర్తిజానువులును జ్ఞానగమ్యునియూరువులును జ్ఞానప్రదునికటియును విశ్వనాథునియుదరంబును శ్రీధరునిహృదయంబును గౌస్తుభకంఠునికంఠంబును క్షత్త్రాంతకారిబాహువులును వ్యోమమస్తకునిలలాటంబును సర్వరూపిశిరంబును మాసనామునిశస్త్రంబులును దివ్యరూపునిసర్వాంగంబులును యథావిధిగఁ బూజించి ధూపదీపనైవేద్యతాంబూలాదు లర్పించి. 796

గీ. నిఖిలలోకైకకర్తవు నీవె నీవె, నిఖిలలోకైకభర్తవు నీరజాక్ష
యుద్ధరింపకయున్న నీ వొండు దిక్కు, కలదె భవవార్ధిలోఁ బడి కలఁగునాకు.

క. అని ప్రార్థించి యొసంగన్, జను శౌరికి నారికేళజలమున నర్ఘ్యం
బును వ్రతపరిపూర్ణత్వం, బెనయుటకై భక్తితోడ నెవ్వం డైనన్. 798

వ. అటుమీఁద జాగరోపవాసంబులచే నాదినం బెల్లఁ గడపి గురువునకు విష్ణుప్రతిమాసహితం బగుకుంభంబు నొసంగి వస్త్రాలంకారాదులచేఁ బూజ గావింపవలయు.

క. ఈరీతి నంబరీషుఁడు, భారద్వాజుఁడును ధ్రువుఁడుఁ బలుమంది సదా
చారులును జేసి వ్రతమును, గోరినధామముల నందుకొనిరి మునీంద్రా. 800
గీ. అనుటయును నారదుండు మహానుభావ, వినఁగ జాగరమహిమంబు వేడ్క గలిగెఁ
జెప్పు మొకసారి దయతోడ సేవకునకు, ననుచుఁ బ్రార్థించుటయు నిట్టులని యొశూలి.

—: జా గ ర మా హా త్మ్య క థ న ము :—

సీ. కృష్ణునినామముల్ కీర్తించుచును నోట, ధ్యానించుచును డానవారి నెదను
నాట్యంబు చేయుచు నారాయణునిముందు, నొనరించుచును మాధవునకు నతులు
కేశవునకుఁ బ్రదక్షిణములు సలుపుచు, నుతియించుచును నందసుతునికథలు
కాంచనాంబరుసిఁ బూజించుచుఁ బూలచే, విష్ణున కిడుచు నైవేద్యములను
గీ. స్వాప మనియెడిమాయకు వశులు గాక, హరిదినంబున జాగర మాచరించు
నట్టిపుణ్యాత్ము లుండుదు రభయ మైన, విష్ణుపదమున నపునరావృత్తు లగుచు.
ఆ. నిమిష మేని లేక నిమిషార్థ మేనియు, హరిని బేరుకొనుచు నాచరించు
జాగరంబువలన సమకూరుపుణ్యముఁ, బరిగణింపలేఁడు బ్రహ్మ యైన. 803
గీ. హరికి నారార్తికము యామయామమునను, జలుపుచును జాగరంబును జలిపెనేని
దాని కెన గావు వాజిమేధములు వేయి, యైనఁ బదివేలు వాజపేయంబు లైన.
గీ. వేదశాస్త్రపురాణాదివేత్త యైన, యజ్ఞములు వేయి చేసినయజ్వ యైన
విష్ణుదినజాగరంబు గావించువాని, నపహసించినఁ జండాలుఁ డయి జనించు.
గీ. విష్ణుదినజాగరంబు గావింపుఁ డనుచు, మానవులకుఁ బ్రబోధించుమానవుండు
చెందు వైకుంఠధామంబునందు నిత్య, వాసభాగ్యంబు స్వపితృదేవతలతోడ.
గీ. కోటిజన్మంబులను సమకూడినట్టి, పాతకము లెల్ల నొకరాత్రిభాగమంద
నాశమును జెందు విష్ణుదినంబునందు, శ్రద్ధతో జాగరంబును జలిపెనేని. 807
గీ. శాశ్వతము లైనలోకముల్ సంపదలును, బుత్రపౌత్రాదులును దివ్యభోగములును
ఖ్యాతియును నీతియును జెంద నాస యున్న, విష్ణుదినజాగరంబు గావింపవలయు.
గీ. హరిదినంబున జాగర మాచరింప, వలయు ననియెడిబుద్ధి యెవ్వనికి లేదొ
వాని కధికార మిసుమంతయేని లేదు, విష్ణుదేవునిపూజ గావించుటకును. 809
క. అరుగునో యెన్నిపదంబులు, హరిధామంబునకు జాగరార్థము చెందుక్
నరుఁ డన్నియశ్వమేధా, ధ్వరములు గావించినట్టిధర్మోదయముల్. 810
ఆ. వసునో ధాత్రి నెన్నిపదరేణువులు జాగ, రార్థ మచ్యుతాలయమున కరుగు
నవసరమున నన్నియబ్దసహస్రము, లుండు నరుఁడు త్రిదశు లుండుచోట. 811
వ. పరాపవాదసంయుతంబును మనఃప్రసాదవర్జితంబును శాస్త్రహీనంబును నగాంధ
ర్వంబును దీపవర్జితంబును నుపచారశూన్యంబును నుదాసీనంబును సనిందనం
బును గలియుక్తంబును నగునవవిధజాగరం బధమంబు. సశాస్త్రంబును నృత్య

యుక్తంబును గాంధర్వసమేతంబును వాద్యయుతంబును దాళసంయుక్తంబును దీపయుతంబును మధురయుక్తంబును భక్తిభావితోచ్చారణయుక్తంబును బ్రసన్నంబును దుష్టిజననంబును నమూఘంబును లోకరంజనంబును నగుద్వాదశవిధ జాగరంబు మాధవప్రియంబు. 812

గీ. ఉభయపక్షంబులందును నుక్తవిధిని, జాగరము చేయువాఁడు నాసన్నిహితుఁడు
విష్ణుదినజాగరంబు గావింపనట్టి, వాఁడు నాకును భక్తుఁడు గాఁడు చూవె. 813

ఆ. నాకుఁ బూజ్యుఁ డైననారాయణునిఁ గొల్వ, నట్టివాఁడు భక్తుఁ డగును నాకు
నాచరించుఁగాక యఖిలవ్రతంబులు, చేయుఁగాక తీర్థసేవ లెల్ల. 814

క. హరభక్తుఁడ నే ననియెడి, గరువంబున నెవఁడు గన్నుగానక హరివా
సరమున భుజియించునో యా, నరుఁ డొనరిచినట్టివాఁడ నాకప్రియముల్. 815

గీ. ఎన్నిదినంబులు శ్రీపతి, సన్నిధిలోఁ జేయుదురో ప్రజాగరమును దా
మన్నియుగంబులు నిలుతురు, పన్నగశయనునినివాసభవనమునందుల్. 816

క. హరిదివసజాగరమునకు, సరి గా వెన్నఁడును నదులు సాగరములు పు
ష్కరమును గాశియు గయయును, సరస్సులును దీర్థములును సంయమివర్యా.

ఆ. విద్ధ మైనయట్టివిష్ణువాసరమున, యందు వ్రతము చేయునట్టివాఁడు
స్వపితృదేవతలను సంహరించినవాఁడ, రాజ్య మిడినవాఁడ రక్కసులకు. 818

గీ. కాన హరివాసరంబున మానవుండు, జాగరోపోషణంబులు సలిపి పిదప
హరికిఁ బ్రీతికరంబుగా నాచరింప, వలయుఁ బారణ వ్రతపూర్తి గలుగునట్లు.

—: ద్వాదశీమాహాత్మ్యకథనము: —

గీ. అనుటయును నారదుం డిట్టు లనియె దేవ, ద్వాదశీమహిమంబును దద్విధియును
నాలకింపఁగఁ గౌతుకం బంకురించె, నానతీయుము దయ గలదేని నీకు. 820

చ. అనుటయుఁ జంద్రమౌళి యిటు లమ్మునికిన్ వచియించె ద్వాదశీ
దినమున నిత్యకర్మములు దీరిచి పూర్వదినవ్రతంబు న
ప్పన మొనరించి శ్రీపతికిఁ బారణముం జనుఁ జేయ దానిచే
తను సకలార్థసిద్ధులును దద్వ్రతకర్తకు సంఘటిల్లెడిన్. 821

గీ. లేశ మేనియు ద్వాదశి లేనినాఁడు, పారణ మొనర్పరా దట్టిపక్షమందుఁ
జేయనగుఁ బారణంబును రేయియంద, ద్వాదశి యొకించుకే నుండవలయుఁ గాన.

గీ. స్నానమును భోజనంబును జలుపఁగూడ, దనునిషేధము నడిరేయి కగును గాని
యంత్యమునునాద్యమును నైనయామములకుఁ, గాదుదినమట్లతగునవికర్మములకు.

గీ. పారణదినంబునందు స్వల్పముగ నుండె, నేని ద్వాదశి ప్రాతరాహ్నికము చేసి
యపుడె మాధ్యాహ్నికముగూడ నగును జేయ, నది నిషిద్ధంబుగా దట్టియవసరమున.

గీ. సాధకుం డగువానికి సంఘటిల్లు, సకలపురుషార్థములును నిస్సంశయముగ

సముఁడు కనరాఁడు ద్వాదశీసాధకునకు, ద్వాదశికి సాటి యైనవ్రతంబు లేదు.
గీ. కలుగనేరదు ధర్మార్థకామమోక్ష, వర్గమం దేదియును మహాధ్వరము లెన్ని
సలిపినను నొక్కద్వాదశీజాగరంబు, సలుప కుండినయెడలను సంయమీంద్ర.
క. ఒనరించినయెడ జాగర, మును సాలగ్రామశిలకు ముంగల వాఁ డొం
దును దీర్ఘకోటులందును, మునిఁగినపుణ్యంబు యామమును యామంబున్. 828
వ. ద్వాదశి జయ యనియు విజయ యనియు జయంతి యనియును బాపనాశని యనియును నాలుగు విధంబులుగా నుండె. పునర్వసునక్షత్రయుక్త మగు శుక్లపక్షద్వాదశి జయ యని చెప్పంబడియె. ఆపుణ్యదివసంబునఁ గావించునుపవాసంబు సకలపాపంబుల మాపుమాపు. శ్రవణనక్షత్రయుక్తం బగుశుక్లద్వాదశి విజయ యని చెప్పంబడియె. విజయయందుఁ గావించుదానంబు సహస్రగుణఫలప్రదంబు. మఱియును విప్రభోజనంబును హోమంబును నుపవాసంబును సహస్రగుణాధికఫలప్రదంబు. ప్రాజాపత్యనక్షత్రయుక్తం బగుశుక్లద్వాదశి జయంతి యని చెప్పంబడియె. 829
ఆ. ఆజయంతియందు నాచరించెనేయేని, కృష్ణునిపూజ సప్తజన్మపాప
కర్దమంబు నెల్లఁ గడుగును లవమేని, మిగులకుండ మరలఁ దగులకుండ. 830
వ. పుష్యనక్షత్రయుక్త మగుశుక్లద్వాదశి పాపనాశని యని చెప్పంబడియె. పాపనాశనియందుఁ జేయునుపవాసంబు సంవత్సరంబువఱకును బ్రతిదినంబును గావించుతిలప్రస్థదానంబుతోడ సమానంబుగావున దానివలన సర్వేశ్వరుం డగు జనార్దనుండు సంతసించి ప్రత్యక్షం బయి యనంతఫలంబు నొసంగు. 831
గీ. గాధిసూనుమకుత్సుసగరులు పాప, నాశనీదివసమున నొనర్చి వ్రతము
చెంది రఖిలార్థములు మున్ను చేసినట్టి, వ్రతముననుఁ దుష్టి నొందుటవలన శౌరి.
ఆ. ఉపవసించెనేని యొకపాపనాశని, నదియె చాలు వేయిహరిదినంబు
లందు నుపవసించి యార్జించుకొనినంత, ఫలము నొంద వేయి పలుకు లేల.
గీ. స్నానహోమంబులును దపోదానములును
జపము స్వాధ్యాయదేవతార్చనలు కొంచె
మేనియును బాపనాశనిలోనఁ జేయ
నక్షయఫలంబు గా నుండ నదియె చాలు. 834
క. అని చెప్పుటయును నారద, మునివరుఁ డత్యంతహర్షమును జెంది జగం
బునకుఁ దనవిన్నధర్మము, లను బోధించెడి కుతూహలమునన్ జనియెన్. 835

—: విష్ణుపాదోదకమాహాత్మ్యకథనము :—

గీ. అనుటయును శౌనకుం డిట్టు లనియె సూత, హర్ష మొదవెను నీచెప్పినట్టిపుణ్య
కథలచేఁ గాని మఱియొకకాంక్ష వొడమె, హరిపదాంబుమహాత్మ్యము నాలకింప.

చ. అనవుడు సూతుఁ డి ట్లనియె నచ్యుతపాదపయఃకణంబు ము
ట్టిన నఖిలాఘనాశము ఘటిల్లుటె కాక యకాలమృత్యువుల్
గనమియు నెట్టిజాడ్యమును గల్గమియుల్ సమకూడి గంగలో
మునుఁగుటచే లభించుఫలముల్ గొనుభాగ్యము ప్రాప్తమయ్యెడిన్. 837
గీ. దానవారిపదోదకపానమునను, బాయు నంతర్బహిస్థితపాప మెల్ల
నది గనుంగొని వరియించు నాక్షణంబ, ముక్తపాతకుఁ డగువాని ముక్తికాంత.
క. తులసీదళయుక్తం బగు, జలజాక్షపదోదకంబు చల్లుకొనినచోఁ
దలపైని నదియె చాలును, నిలుపఁగ హరిమందిరమున నిరపాయముగన్. 839
సీ. స్వర్ణాద్రితుల్యసువర్ణదానము చేయ, నద్దాన లభియించునట్టిఫలము
ధేనుకోటిసహస్రదానంబు గావింప, నద్దానఁ బ్రాప్తించునట్టిఫలము
సప్తతంతుసహస్రశతకోటు లొనరింప, నద్దానఁ జేకూరునట్టిఫలము
కన్యకాకోటిలక్షప్రదాన మొనర్ప, నద్దానఁ బ్రభవించునట్టిఫలము
గీ. నఖిలవిశ్వంభరాదాన మాచరింప, నమ్మహాకార్యమునఁ గల్గునట్టిఫలము
శార్ఙ్గిపాదోదకస్పర్శజనిత మైన, ఫలమునకుఁ గ్రిందె చూవె యెప్పటికిఁ గూడ.
సీ. మున్ను త్రేతాయుగంబున సుదర్శనుఁ డను, నొక్కబ్రాహ్మణుఁ డుండె నుర్విలోన
నతఁడు కుక్షింభరి యయి భుజించుచు విష్ణు, వాసరంబులలోన దోస మనక
వ్రతకర్త లగునట్టివారలఁ దిట్టుచు, నొకనాఁడు నిధనంబు నొందెఁ గడకు
నంతట యమదూత లరుదెంచి వానిని, గట్టి పాశములచేఁ గదలకుండ
గీ. యమునికడకీడ్చుకొనిపోయియతనియెదుట, నిలుపుటయువానినీక్షించినిర్దయముగఁ
బండ్లుపటపటఁగొఱుకుచుభయముపుట్ట, యముఁడుతనభృత్యులకునిట్టులానతిచ్చె.
గీ. విష్ణుదినమున భుజియించె వీఁడు వీని, కంటెఁ బాపాత్ముఁ డెవఁడును గానరాఁడు
గాన మన్వంతరశతంబు గడచుదాఁక, ఘోరనరకంబులను వీనిఁ గూల్పవలయు.
క. అనవుడు యమభటు లాతనిఁ, గొనిపోయి క్రిమిప్రపూర్ణకూపంబులలో
మునిఁగించుచుఁ గాలుచుచును, నలాయఃపిండములను హతమాఱుచుచున్.
క. యమనిర్ణీతం బగుకా, లము దాఁటెడివఱకు బాధలను బెట్టి కఠో
రముగను బిమ్మట విడిచిరి, తమయంతటఁ దామ యాసుదర్శనుఁ డంతన్. 844
గీ. ధరణి కేతెంచి గ్రామసూకరవధూటి
గర్భమునఁ బుట్టి తిన రానిగడ్డి యెల్లఁ
గుడుచుచును నెట్లొ జీవించి కొన్నియేండ్లు
కడకు మృతి నొంది జనియించెఁ గాకి యగుచు. 845
గీ. అట్లు జన్మించి కాకిగా నాద్విజుండు, కష్టముల నొందుచును నేండ్లు గడపి కొన్ని
దైవికంబుగ నొకనాఁడు దారివట్టి, పోవుచును నచ్యుతాలయంబునను నిలిచి.

గీ. దాహమగుటయు గోమసగాత్రంబునుండి, వెలికి వచ్చెడిహరిపాదజలము ద్రావి
యెగిరిపోయెమతజి నొకయెఱుకు కఱకుఁ, గోలచే దాని నిలమీఁదఁ గూల నేసె.
గీ. కూలి యాకాకి గిలగిలఁ గొట్టుకొనుచు, విడిచెఁ బ్రాణములను నంత విష్ణుభటులు
దాని నెక్కించుకొని వ్యోమయానమందుఁ, దరలిపోయిరి వైకుంఠధామమునకు.
క. కావున హరిపాదాంబుని, షేవణమహిమం బొకింత చెప్పితి నింకన్
భావించుకొనుము దానిప్ర, భావం బంతయును సాధ్యపడదు వచింపన్. 849
క. అనుటయును శౌనకుం డి, ట్లనియె నగమ్యాగమనమహాదోషము చే
సినవాని కెట్లు శుద్ధిం, గనఁ గలుగునొ చెపుము సూత కారుణ్యమునన్. 850
క. అనవుడు శౌనకునకు ని, ట్లనియెను సూతుండు మునిజనాగ్రణి లోకం
బును నుద్ధరింప నీచే, సినప్రశ్నంబునకు బదులు చెప్పెద వినుమా. 851

—: అగమ్యాగమన ప్రాయశ్చిత్త కథనము :—

వ. అజ్ఞానంబున నొక్కపరి చాండాలీగమనంబు చేసెనేని బ్రాహ్మణుండు సశిఖంబుగా వపనంబు చేయించుకొని ప్రాజాపత్యవ్రతంబును ద్రిదినోపవాసంబును నాచరించి బ్రాహ్మణునకు దక్షిణాసహితం బగుగోద్వయంబు నర్పించెనేని శుద్ధుం డగు. క్షత్త్రియుండు గాని వైశ్యుండు గాని కృచ్ఛ్రసమేతం బగుప్రాజాపత్యవ్రతం బొనరించి గోమిథునద్వయంబు బ్రాహ్మణున కొసంగెనేని శుద్ధుం డగు. శూద్రుండు ప్రాజాపత్యవ్రత మాచరించి గోమిథునచతుష్టయంబు విప్రున కొసంగెనేని శుద్ధుం డగు. తల్లిని గాని సోదరిని గాని పుత్రికను గాని కోడలిని గాని పొందెనేని కృచ్ఛ్రత్రయంబును జాంద్రాయణత్రయంబును గావించి గోమిథునత్రయంబు బ్రాహ్మణున కొసంగి సశిఖంబుగా వపనంబు గావించుకొని పంచగవ్యప్రాశనంబు చేసి యగ్నిదగ్ధుం డయ్యెనేని శుద్ధుం డగు. పితృదారను గాని మాతృభగినిని గాని గురుపత్నిని గాని మాతులానిని గాని భ్రాతృభార్యను గాని స్వగోత్రజను గాని పొందెనేని ప్రాజాపత్యద్వయంబును జాంద్రాయణత్రయంబును నాచరించి దక్షిణాయుతంబుగాఁ బంచగోమిథునంబులను బ్రాహ్మణుల కర్పించెనేని శుద్ధుం డగు. గోవును బొందెనేని యుపవాసత్రయంబు చేసి ధేనుదానంబును నన్నదానంబును జేసి శుద్ధుం డగు. వేశ్యాఖరీసూకరీవానరీమహిషులలో దేని నైనఁ బొందెనేని కంఠదఘ్నం బగుగోమయోదకకర్దమంబునందు నిరాహారంబుగాఁ ద్రిరాత్రంబు లుండి పిదప సశిఖంబుగా వపనంబు గావించుకొని మూఁడుదినంబు లుపవసించి యేకరాత్రంబు జలంబునం దుండెనేని శుద్ధుం డగు. బ్రాహ్మణిని బొందెనేని ప్రాజాపత్యత్రయంబును జాంద్రాయణత్రయంబును గావించి బ్రాహ్మణునకు గోత్రయంబు నొసంగెనేని శుద్ధుం డగు. బ్రాహ్మణి పంచరాత్రంబులు పంచగవ్యంబుం బుచ్చుకొని దక్షిణా

సహితంబుగా గోద్వయంబు బ్రాహ్మణున కొసంగెనేని శుద్ధురాలగు. పరాంగనను బొందెనేని సాంతపనకృచ్ఛ్రంబు నాచరించి శుద్ధుం డగు. మోహావశంబున స్వబంధువులను విడనాడి పరపురుషునితోడ గృహంబునుండి వెడలిపోయిన యింతి కులభ్రష్ట గావున మరలం దత్సమాగమంబు తగదు. మోహావశంబున సతివ పరపురుషునిం బొందెనేని ప్రాజాపత్యకృచ్ఛ్రంబు నాచరించి పంచగవ్య ప్రాశనంబు గావించి గోద్వయంబును బ్రాహ్మణున కిచ్చెనేని శుద్ధురా లగు. వర్ణబాహ్య యగునీచాంగనను బొందెనేని కృచ్ఛ్రప్రాజాపత్యంబువలన శుద్ధుం డగు. 852

గీ. పడఁతి జారునివలన గర్భమును దాల్చె, నేని దానిమొగంబును గాన రాదు
గాన విడనాడవలయును దానివలనఁ, గలుగ దేదోషమును ద్యాగకారకునకు.

—: అభక్ష్యభక్షణప్రాయశ్చిత్తకథనము :—

గీ. అనుటయును శౌనకుం డిట్టు లనియె సూత, సలిపెనేని యభక్ష్యభక్షణము దాని
వలనఁ గలిగెడిదోషంబు తొలఁగి శుద్ధి, యొదవుటకు మార్గమును జెప్పు ముండెనేని.

క. అనుటయు సూతుం డి ట్లని, యెను మానివరేణ్య వినుతు నెఱిఁగినయంశం
బును వినుము ధర్మమును విన, గను గోరికి వుట్టుఁ బుణ్యకర్ముల కెందుక్.

వ. అజ్ఞానంబువలన విణ్మూత్రప్రాశనంబును సురాస్పర్శంబును గావించెనేని తీర్థాభిగమనంబును నేకాదశవృషదానంబును గావించి సశిఖవపనంబు చేసికొని ప్రాజాపత్యవ్రతంబు నాచరించి గోద్వయదానంబు సలిపి పంచగవ్యప్రాశనంబు చేసి బ్రాహ్మణుల కన్నదానంబు గావించెనేని శుద్ధుం డగు. చండాలాన్న జలంబులు తెలిసి యాపద్ధర్మంబుగా నొక్కపరి స్వీకరించెనేని కృచ్ఛ్రచాంద్రాయణంబు గావించి సశిఖవపనంబు గావించికొని పంచగవ్యప్రాశనంబు చేసి నాలుగుగోవులను బ్రాహ్మణుల కొసంగవలయు. వృషలాన్నజలంబులు గాని సూతకాన్నజలంబులు గాని శూద్రోచ్ఛిష్టంబు గాని విపత్తియందుఁ దెలిసి యొక్కపరి స్వీకరించెనేని ప్రాజాపత్యద్వయంబును జాంద్రాయణత్రయంబును నాచరించి గోద్వయంబు నొసంగి పంచగవ్యంబుం ద్రావి యగ్నియందు హోమంబు గావించి బ్రాహ్మణులకు నన్నదానంబు చేసెనేని శుద్ధుం డగు. ఆఖు నకులమార్జాలంబులు భక్షించినయన్నంబు తిలదర్భోదకంబులచేఁ బ్రోక్షింపఁ బడెనేని శుద్ధం బగు. పలాండువును లశునంబును శిగ్రువును నలాబువును గృంజనంబును బలంబును భక్షించెనేని చాంద్రాయణవ్రతంబున శుద్ధుం డగు. 856

గీ. చేయుచును మద్యమాంసనిషేవణంబు, నీచకర్మానువర్తనులై చరించు
నట్టివారల నెల్ల నంత్యజులఁబోలెఁ, దగును దూరీకరింపంగ ధర్మవిదులు. 857

క. విడిచి మాంసంబు మద్యము ద్విజులసేవ
చేయుచును నిజధర్మానుశీలనంబు
గలిగి యుండెడిశూద్రుఁ డేకాలమునను
దగఁడు విడువ జఘన్యజోత్తముఁడు వాఁడు. 858

వ. తెలియక సూతకమృతకాన్నంబును భుజియించెనేని యయుతగాయత్రీజపంబున బ్రాహ్మణుఁడు త్రిసహస్రగాయత్రీజపంబున వైశ్యుండును బంచగవ్యప్రాశనంబున శూద్రుండును శుద్ధిం జెందు. నీచునిభాండంబునం దుండు దధ్యాజ్యసలిలంబులు తెలియక త్రావినను బ్రాజాపత్యవ్రతంబు నాచరించి బహుదానంబు గావించి సశిఖంబుగా వపనంబు గావించికొని యహోరాత్రోపవాసంబు చేసెనేని శుద్ధుం డగు. శూద్రునకు దానంబు దక్క నుపవాసంబు విహితంబు గాదు. నీచులచే దండాదితాడితుం డగునరుండు ప్రాజాపత్యవ్రతంబు గాని చాంద్రాయణవ్రతంబు గాని యాచరించి సశిఖంబుగా వపనంబు గావించికొని పంచగవ్యప్రాశనంబు చేసి యగ్నియం దన్నాదిహోమంబు గావించి గోద్వయంబు బ్రాహ్మణున కొసంగెనేని శుద్ధుం డగు. తెలిసి మద్యపానంబు గావించెనేని కులభ్రష్టుం డగు. గోబీజహంతయును దళచ్ఛేదకుండును స్వర్ణస్తేయియుఁ గృచ్ఛ్రప్రాజాపత్యత్రయంబు నాచరించి సశిఖంబుగా వపనంబు గావించుకొని పంచగవ్యప్రాశనంబు గావించి యథావిధిగా నగ్నియందు విహితహోమంబు చేసి ధేనుత్రయంబు బ్రాహ్మణున కొసంగెనేని శుద్ధిం జెంది పంక్తిగ్రాహ్యుం డగు. కూశ్మాండఘాతిని యగుపడంతి మూఁడుదినంబులు పంచగవ్యప్రాశనంబు గావించి సువర్ణవస్త్రసహితంబుగా గూశ్మాండపంచకంబు దానంబు చేసెనేని శుద్ధిం జెంది గ్రాహ్యురా లగు.

## —: ప్రాజాపత్యవ్రతలక్షణము :—

వ. మూఁడుదినంబులు ప్రాతఃకాలంబునను మూఁడుదినంబులు సాయంకాలంబునను నయాచితాన్నంబు భుజియించి మూఁడుదినంబు లుపవాస ముండెనేని యది ప్రాజాపత్యవ్రతంబుగాఁ జెప్పంబడియె.

## —: సాంతపనకృచ్ఛ్రలక్షణము :—

వ. గోమూత్రంబును గోమయంబును గోక్షీరంబును గోదధియును గోఘృతంబును గుశోదకంబును దినద్వయంబు ద్రావి యేకరాత్ర ముపవసించెనేని యది సాంతపనకృచ్ఛ్రంబుగాఁ జెప్పంబడియె.

—: అతికృచ్ఛ్రవ్రతలక్షణము :—

వ. ఒక్కొక్కయయాచితాన్నగ్రాసంబు ప్రాతస్సాయంకాలములయందు మూఁడు దినంబులు భుజియించి మూఁడు దినంబు లుపవసించెనేని యది యతికృచ్ఛ్రవ్రతంబుగాఁ జెప్పంబడియె.

—: తప్తకృచ్ఛ్రలక్షణము :—

వ. సకృత్స్నానంబు గావించుచు మూఁడు దినంబు లుష్ణోదకంబును మూఁడు దినంబులు గోక్షీరంబును మూఁడు దినంబులు గోఘృతంబును ద్రావి యుండెనేని యది తప్తకృచ్ఛ్రంబుగాఁ జెప్పంబడియె.

—: పరాకకృచ్ఛ్రలక్షణము :—

వ. పండ్రెండుదినంబు లభోజనంబుగా నుండెనేని యది పరాకకృచ్ఛ్రంబుగాఁ జెప్పంబడియె.

—: చాంద్రాయణవ్రతలక్షణము :—

వ. ప్రతిదినంబును నొక్కొక్కగ్రాసంబు శుక్లపక్షంబున హెచ్చించుచును గృష్ణపక్షంబునఁ దగ్గించుచును భుజియించి యమావాస్యనాఁ డుపవసించెనేని యది చాంద్రాయణవ్రతంబుగాఁ జెప్పంబడియె.

—: శిశుచాంద్రాయణవ్రతలక్షణము :—

వ. ప్రాతఃకాలంబున నాలుగుగ్రాసంబులును సాయంకాలంబున నాలుగుగ్రాసంబులును భుజియించియుండెనేని యది శిశుచాంద్రాయణవ్రతంబుగాఁ జెప్పంబడియె.

క. అనుటయు శౌనకుఁ డిట్లని, యెను దులసీమహిమ మేమొ యించుక మాకున్
మునివల్లభ యెఱిఁగింపుము, వినుటకు నభిలాష ముద్భవించెను మదిలోన్. 860

—: తులసీమాహాత్మ్యము :—

క. అనవుడు సూతుఁడు మునికి, ట్లనియెను మునినాథ తులసియంతికమున నుం
డినగృహము పుణ్యతీర్థం, బనఁబడు యమభటులు చేర రాగృహమునకున్.

క. మునివర తులసీరోపణ, మును దులసీపాలకత్వమును దులసీద
ర్శనమును దులసీస్పర్శనం, బును దులసీపూజనమును మోక్షము నొసఁగున్,

వ. ఈవిషయంబున మున్ను వ్యాసునిఁ దనశిష్యు లడుగ వారల కమ్మునీంద్రుం డిట్లనియె. 863

ఆ. ఛాత్రులార మున్ను స్కందుండు శర్వుని, నడుగ నన్ను మీర లడిగినట్లు
యష్టమూర్తి యిట్టు లనియెను బుత్రవా, త్సల్యమునను గ్రౌంచదారణునకు.

ఆ. పుత్ర సకలవృక్షములలోనఁ దులసి యొ, క్కటియె పూజ్య మైనదౌ మహంబు
దానిపత్త్రములును దానిపుష్పములును, బ్రాణసమము లగుట నచ్యుతునకు,

ఆ. మును సమస్తలోకముల నుద్ధరింపంగఁ, దలఁచి శౌరి యిలను దులసి నాఁటె
సర్వపుణ్యములును సంప్రతిష్ఠితము లై, వెలసి యుండె నొక్క తులసియంద.
గీ. దానవారికిఁ బ్రియపదార్థములు మూఁడు
లక్ష్మియును నేనుఁ దులసియు లాఁతి కాదు
విడిచి తులసీదళంబును వేయిపసిఁడి
పూలఁ బూజించినను దృప్తిఁ బొందఁ డతఁడు. 867
సీ. తులసీదళంబుచే జలజాక్షునకుఁ బూజ, సలిపినయెడ జన్మజన్మమునను
వేదశాస్త్రపురాణవిజ్ఞానమును శుద్ధ, వంశోదయమును సద్వర్తనమును
యజ్ఞదానవ్రతాద్యాచరణఫలంబు, దారసుఖంబు సంతానసుఖము
ధనధాన్యసంపత్తియును శరీరారోగ్య, మును గీర్తియును లోకపూజ్యతయును
గీ. గలుగుటయె కాక కలుగును గట్టకడకు, జన్మరాహిత్యము హరిప్రసాదమునను
నమరనది పుట్టిదియె స్వర్గమందుఁ దులసి,ధరణి నట్టిది పావనత్వమును గొలుప.
క. తులసీదళమిశ్రిత మగు, సలిలంబున సంతసించుచాయను గంగా
సలిలామృతాభిషేకం, బులవలనను శౌరి తుష్టి పొందఁడు వత్సా. 869
క. ఎవనికి విష్ణువు సమ్ముఖుఁ, డవునో యతని కొదవు శ్రద్ధ యర్చింపఁగ మా
ధవునిఁ దులసీదళంబుల, భవభవమున నతఁడె ముక్తిఁ బడయును దుదకున్.
క. ఇల నెవరు మంజరీయుత, తులసీదళములను నచ్యుతున కర్చనముల్
జలుపుదురో వారి శ్రేయః, ఫలముఁ దెలుప నలవి గాదు బ్రహ్మకు నైనన్.871
క. తులసీవన మెట నుండునో, జలజాక్షుం డుండు నచట జలజాలయతో
జలజాక్షుఁడు భార్గవియును, గలచోట వసించు సురనికాయం బెల్లన్. 872
క. తులసీసాన్నిధ్యంబునఁ, జలిపినవ్రతములును దపము జపమును జెందం
గలుగు ననంతఫలంబును, విలసిల్లుచునుంట నెల్ల వేలుపు లచటన్. 873
గీ. మస్తకంబున విష్ణునిర్మాల్యతులసిఁ, దాల్చువాఁడును శిఖయందుఁ దాల్చి తులసి
మరణ మొందినవాఁడును హరిపురంబు, నందు శాశ్వతముగ నుండునట్టివారు.
గీ. భువిని గేవలమాధవపూజకొఱకు, నాఁటునో యెవండు తులసీవనంబు నతఁడు
గర్భవాసవిషాదంబు గలుగకుండ, నుండు సతతంబు గోవిందుఁ డుండుచోట.
వ. తులసీపత్రపుష్పఫలశాఖాస్కంధత్వఙ్మూలంబులును దులసీమూలమృత్తికయును
బరమపావనంబులు. 876
క. తులసీకాష్ఠోపగత, జ్వలనంబున మృతులదేహసంస్కారంబుల్
జలిపెడివారును మృతులును, వెలయుచు నుందురు సతంబు విష్ణుపురమునన్.877
క. మరణసమయమున విష్ణు, స్మరణము శ్వాసానిలంబు చనఁగనె తులసీ
తరుకాష్ఠదహనమును నె, వ్వరికొదవునొ విష్ణునగరవాసులు వారల్. 878

క. దారువులలోనఁ దులసీ, దారు వొకండేని యుంచి దాన దహనసం
స్కారము చేసిన మృతు లగు, వారలపాతకము లెల్ల వారితము లగుచ్. 879

క. దారువు లేయవి తులసీ, దారువిమిశ్రితము లగునొ తగ నవి గంగా
నీరముతో మిశ్రిత మగు, నీరముచందమునఁ బుణ్యనిలయంబు లగుచ్. 880

గీ. ఎవని చితి తులసీకాష్ఠనివహమునను, బ్రజ్వరిల్లునొ యాతనిపాతకాద్రు
లన్నియును భస్మమై కూలు నాక్షణంబ,దహనమునఁ బడ్డశిలభసంతతులువోలె.

క. తులసీకాష్ఠజ్వలన, జ్వలితుం డగువానిఁ జూచి శమనభటులు భీ
తిలి పఱచుచుండ హరిభృ, త్యులు గైకొని వాని నడుగుదురు హరిపురికిన్.

క. తులసీకాష్ఠజ్వలనము, వలనను దహియింపఁబడినవానిపయి సుప
ర్వులు చల్లుదురు సుమంబులు, చలుపుదు రచ్చరలు వానిసన్నిధిని నృతిన్.

వ. అగ్న్యగారమం దేనియు శ్మశానంబునం దేనియుఁ దులసీకాష్ఠవహ్ని నాజ్య ప్రజ్వలితంబు గావించిన సకలపాపంబులును భస్మీభూతంబు లగు. తులసీకాష్ఠ వహ్నియందు హోమంబు గావించిన నగ్నిష్టోమఫలంబు చేకూరు. తులసీకాష్ఠ ధూపంబు గోవిందునకు సమర్పించిన శతక్రతువులు గావించినపుణ్యంబు ప్రాప్తించు. తులసీకాష్ఠాగ్నిపక్వపదార్థంబు హరికి నైవేద్యంబు గావించిన మేరు తుల్యాన్నదానఫలంబు చేకూరు. తులసీకాష్ఠదీపంబు మాధవున కర్పించిన దీపలక్షసహస్రప్రదానఫలంబు లభించు. తులసీకాష్ఠచందనంబు విష్ణువున కలందిన గోవిందసాన్నిధ్యనివాసంబు సమకూరు. తులసీకాష్ఠగంధలిప్తాంగుండై జనార్ద నునిఁ బూజించెనేని ప్రతిదినంబును గోశతదానంబు గావించినపుణ్యంబు వడయు. పితృపిండంబులయందుఁ దులసీదళంబులు సమర్పించెనేని పితరులు శతాబ్దపరిమిత సంతృప్తిం జెందుదురు. తులసీమూలమృత్తికాస్నానంబు గావించెనేని సకల తీర్థస్నానఫలంబు సంఘటిల్లు. నారాయణునకు నవీనతులసీమంజరులచేఁ బూజ గావించెనేని చంద్రాదిత్యు లుండునంతవఱకును నానాపుష్పములచేఁ బూజ చేసినఫలంబు చేకూరు. 884

క. తులసీవృక్షము లెవ్వని, నిలయంబున నుండు వానినిఖిలాఘములున్
విలయంబు నొందు నిత్యముఁ, గలుషఘ్నం బైనతులసిఁ గాంచఁ గలుగుటన్.

గీ. పితరులకుఁ జేయఁబడియెడిపిండదాన, మక్షయం బగుఁ దులసి యున్నట్టిచోటఁ
జలుపునెడఁ దులసీవనచ్ఛాయమందుఁ, దర్పణం బది పితృకులోద్ధారకంబు.

సీ. తులసీదళంబులతోడ మాధవునకు, నర్చన గావించునట్టివారు
తులసీదళంబులతోఁ గూడుకొని యంత, వేళను దేహంబు విడుచువారు
తులసిపూసలపేరు గళదేశమునయందు, నవిరతంబుగఁ దాల్చునట్టివారు
తులసీద్రుకాష్ఠంబువలనఁ దీసినగంధ, మును గాత్రములఁ బూసికొనెడివారు

గీ. తులసిమూలంబునం దుండుజలము దీసి, కొని శిరోభాగమునఁ జల్లుకొనెడివారు
తులసిననుమను శౌరిని గొలుచువారుఁ, గొనకు హరిసన్నిధికిఁ జేరుకొనెడివార.

క. తులసీద్రుమమాగతానిల, ములు సోఁకిన చోటు లెల్లఁ బూతంబు లగున్
దులసికిఁ గావించినయెడ, జలసేకము రూపుమాపు సకలాఘములన్. 888

క. తులసీద్రుమకాష్ఠమాలను, దిలకించినమాత్రముననె దెసలకు భీతిన్
గలఁగి పరువెత్తి పోవుదు, గళితాంతర్ధైర్యు లగుచుఁ గాలునిభృత్యుల్. 889

క. తనయ తులసీదళంబుల్, జనములకు ద్వాదశీదినంబునఁ గోయం
జన దటులు చేయుపక్షుసు, నను దప్పను కూల కుండ నరకములోనన్. 890

గీ. మూలమున బ్రహ్మయును మధ్యమునను హరియు
నేను మంజరియందును నిలిచియుందు
మెప్పునను గూడఁ దులసీమహీజమునకు
దానఁ దులసికిఁ బావనత్వంబు గలిగె. 891

వ. హరిహరాలయంబులందును బుణ్యక్షేత్రంబులందును దులసీవనంబు నాఁటినఁ
బునరావృత్తిరహితం బగువైకుంఠపదంబు ప్రాప్తించు. పార్వణావసరశ్రావణ
సంక్రాంతిదినంబులందుఁ దులసీరోపణంబు విశేషఫలప్రదంబు. 892

క. తులసీమూలగతం బగు, సలిలంబును ద్రావెనేని సకలాఘములున్
దొలఁగి హరిధామమునకున్, గలుగును బోవంగ నెట్టికలుషికి నైనన్. 893

సీ. మున్ను ద్వాపరయుగంబున నుండెమార్తాండుఁ, డనెడిపేరను నొక్కయవనిసురుఁడు
స్నాతుఁడై యొక్కనాఁ డాతండు తులసికి, సలిలంబు వోసి వేశ్మమున కరిగె
నంతట నొకకుక్క యట కేఁగి తృషనుద, ద్వారి యంతయుఁ ద్రావి వచ్చుచుండ
నసిమర్దనుం డనువ్యాధుఁ డొక్కఁడు దాని, కెదురుగాఁ జని పొట్టయుదుటు చూచి

గీ. తనగృహంబున నున్నయోదనము నెల్లఁ
దినియె ననుకొని యాగ్రహంబునను గొట్టెఁ
గట్టెచే దానితలమీఁదఁ గఠినముగను
నప్పు డది నేలపైఁ గూలి యసువు లుడిగె. 894

క. అంతన్ యమభటు లచటికిఁ, గంతులు వైచుచును వచ్చి కని యాకుక్కన్
స్వాంతంబులందుఁ గనికర, మింతయు లేకుండఁ గట్టి యీడ్చుచు నుండన్.

ఆ. అపుడు విష్ణుదూత లరుదెంచి యచటికిఁ, బాశములను ద్రెంచి బంధ ముడిపి
భషకమును రథంబుపై నుంచి కొనిపోవఁ, గడఁగుచుండ నట్టికాలమందు.

క. యమభటులు చూచి వారిని, సమముగఁ బోరాడి నిలుపఁజాలని కతనన్
శమము వహించి వినీత, క్రమమున ని ట్లనిరి భక్తి గడలుకొనంగన్. 897

గీ. శౌరిభటులార యీపుక్క సలిపినట్టి, పుణ్య మేమొ యొకింత చెప్పుండు మాకు
నేసుకృత మైన లేకున్న యెడల దీని, నాదరింతురె ప్రాజ్ఞు లైనట్టివారు. 898
సీ. అని యడుగుటయు నయ్యమదూతలకు విష్ణు, భృత్యులు నవ్వుచు నిట్టు లనిరి
యీపుక్క ము న్నొక్కపృథ్వీశ్వరుండుగా, నుండి చేసెను దాన ముత్కటముగఁ
గాని తా నొకపరాంగనను హరించిన, కారణంబున నూర్ధ్వగతులు లేక
యమలోకమున కేఁగి యచటఁ జెప్పఁగరాని,యమయాతనల నెల్ల ననుభవించి
గీ. నరకశేషంబుకొఱకు నానాకుయోను లందు జన్మించి పలుమాఱు లంతమునకు
శునకరూపంబుననుబుట్టి చనుచుఁజనుచుఁ, దులసికూలంబులోనున్న జలముఁద్రావె.
గీ. ఆకతంబున నీపుక్క కబ్బె విష్ణు, ధామమున కేఁగుభాగ్యంబు దానఁజేసి
వచ్చితిమి మేము విష్ణుసేవకుల మగుటఁ, దీనిఁ గొనిపోవ హరిసన్నిధానమునకు.
అనుటయును మాఱుమాటాడ కాక్షణంబ, చనిరి వచ్చినత్రోవనె శమనభటులు
[illegible]నభటు లేఁగినంతనె శార్ఙ్గిపురికిఁ, జనిరి దానిని గోడ్కొని శౌరిభటులు.
గీ. తులసి [illegible]యింటనుండవు దుర్మృతులును, భూతములు పాతకంబులు ప్రేతములును
నాపదలును [illegible]నలక్ష్మియు నశుభములును, జాడ్యములు రోదనంబులు జగడములును.
క. తులసీమహి[illegible]ములోడను, విలసిల్లెడి గ్రంథ మున్న వేశ్మంబున వ్యా
ధులు దారిద్ర్యమహా దుఃఖము, కలహములును నుండ వెట్టికాలమునందున్. 903
క. ఈతులసీమాహాత్మ్య[illegible]ఖఁ, బ్రాతఃకాలంబునందుఁ బఠియించినచో
శ్రోతకును వాచకునకును, బాతకము లడంగి విష్ణుపదము లభించున్. 904
గీ. కలుగు వానికగ్నిష్టోమఫల[illegible]ము దీని, నెవ్వఁ డొకసారి చదువునో యొవఁడు పెక్క
సార్లు చదువునో దీని నాసజ్జనునకు, రాజసూయ[illegible]ఫలప్రాప్తి గలుగు. 905
వ. అని వచియించుటయుఁ గా[illegible]కేయుం డమం[illegible]నందకందళితహృదయారవిం
దుండై దానిమహిమంబున కచ్చె[illegible]వడుచు నిజ[illegible]వాసంబున కరిగె. మఱియును
మున్ను దాశరథిప్రముఖులు తులసీవ[illegible]నంబులు[illegible]టి వానిం బాలించి సేవించి
యభీప్సితార్థసిద్ధిం బడసిరి. 906
క. తులసీమిశ్రితతోయము, తలపై నిం జల్లుకొనెడిధన్యుఁడు గంగా
సలిలస్నానము చేసిన, ఫలమును జెందంగలండు ప్రతిదివసంబున్. 907
క. తులసీనామము నోటం, బలికినయెడ సర్వవేదపారాయణమున్
జలిపినవానికిఁ గలిగెడి, ఫలమును వాఁ డొంది విష్ణుపదముం జెందున్. 908
క. కలుగ దధర్మంబున మతి, గలుగదు దుర్మరణ మూర్ధ్వగతివిచ్యుతియున్
గలుగదు దుఃఖము గలుగదు, తులసీమహిమంబు వినిన దుష్టున కైనన్. 909
సీ. అనివచించుటయును ధాత్రుి లమిత మైన, హర్షమును జెంది చనిరి నా నతనిఁ జూచి
శౌనకుం డిట్టు లనిరా మహానుభావ, తెలుపు మేదానమున నెట్టిఫలము గలదొ.

—: నానాదానమాహాత్మ్యకథనము :—

వ. అని యడుగుటయును సూతుండు శౌనకున కిట్లనియె. 911

గీ. ధాత్రి గోచర్మమాత్రము పాత్రుఁడైన
బ్రాహ్మణున కిచ్చునెడ సర్వపాపముక్తుఁ
డగుచు హరిమందిరమునకు నరుగువాఁడు
తగవు భూదానమున కెట్టిదానములును. 912

—: గోచర్మమాత్రభూలక్షణము :—

వ. నూఱుగోవులును నొక్కవృషభంబును యంత్రితంబులు గాకుండఁగా నుండు ప్రదేశంబు గోచర్మమాత్రం బగుధాత్రిగాఁ జెప్పంబడియె. 913

గీ. ఇలను సస్యంబుతో నిచ్చునేని విష్ణు, సదనమునఁ జెంది సుఖములు పిదప భువిని
సార్వభౌముండుగాఁ బుట్టి సకలభోగ,ముల ననుభవించి కడ కొందు ముక్తిపదము.

గీ. భూమి నిచ్చినవాఁడును భూమిఁ గొనిన, యట్టివాఁడును బోవుదు రమరపురికిఁ
గాన దానశతంబుల నైన మాని, భూమి గ్రహియింపఁగాఁ దగు భూసురునకు.

క. పుడమిని నజ్ఞానంబున, విడిచినధాత్రీసురుండు వివిధవ్యథలన్
గుడుచును దారిద్ర్యం బను, కడలిం బడి కొట్టుకొనుచుఁ గలకాలంబున్.

క. భూసురునకు భూదానము, చేసిన స్వాయముగను బరులచేతను జేయం
జేసినను విష్ణుపదము ని, వాసంబుగ నొందుఁ బాపవంతుఁడు గూడన్. 917

ఆ. ఆత్మదత్తమేని యన్యదత్తంబేని, యైనభూమి నెట్లొ యపహరించు
నట్టివాఁడు కూలు నతిదారుణం బగు, నట్టినరకమందు సాన్వయముగ.

గీ. దేవతాబ్రాహ్మణక్షేత్రదేశములను, నపహరించెడిఘోరపాపావిలునకుఁ
గానఁగా రాదు నిష్కృతి కల్పకోటి, శతసహస్రంబులకు నైన సంయమీంద్ర.

ఆ. అన్యుఁ డిచ్చినట్టియవనిని గాపాడు, నట్టివాఁడు చెందు నవనిదాత
కనినపుణ్యయంబుకంటెను గోటిరె, ట్లధిక మైనపుణ్య మమలచరిత. 919

వ. జలంబునందుఁ బడినతైలబిందువనుసరించినట్లు భూమిదానఫలము జన్మజన్మంబులందును బ్రాప్తించుచుండు. గోవు క్షీరము నొసంగి దూడను బోషించునట్లు భూమి యన్నంబు నొసంగి భూదాతను రక్షించుచుండు. భూదానంబు సర్వదేవతాసంతుష్టికరంబు. సరస్వతీగోపృథ్వీదానంబు లతిదానంబులుగాఁ జెప్పంబడియె. జపహోమనవాపనంబులవలన నతిదానకర్తలు నరకోద్ధారకు లగుదురు. భూమిదునికంటెఁ బుణ్యవంతుండును భూహర్తకంటెఁ బాపవంతుండును లేఁడు. ఆభూతసంప్లవంబును భూదాత స్వర్గంబునందును భూహర్త నరకంబునందును నివసించు. అగ్నియపత్య మగుకాంచనంబును విష్ణుసంతాన మగుపృథ్వియును సూర్యసంతతి యగుగోవును దాతలకనంతపుణ్యఫలంబు నొసంగు. అశ్వ

ధ్వమేధశతంబుఁ జేసినను వాపీకూపసహస్రంబులు త్రవ్వించినను గోకోటిదానంబు గావించినను భూహర్త శుద్ధి నొందంజాలఁడు. కన్యానృతంబు పంచపురుషాంతరంబులను గవానృతంబు దశపురుషాంతరంబులను నశ్వానృతంబు శతపురుషాంతరంబులను బురుషానృతంబుసహస్రపురుషాంతరంబులను హిరణ్యానృతంబు జాతాజాతులను భూమ్యనృతంబు సర్వంబును నశియింపంజేయు. బ్రహ్మస్వంబును బ్రహ్మహత్యయును దేవస్వంబును దరిద్రధనంబును గురుమిత్రధనంబును గులనాశాత్మనాశంబులం గావించు. అమపాత్రంబునం దుంచినక్షీరదధిఘృత మధువులు చెడున ట్లపాత్రున కిచ్చినదానంబు వ్యర్థం బగు. ధనమునకు దానంబును. జీవితంబునకు జీవరక్షణంబును యూపైశ్వర్యారోగ్యంబులకు నహింసయును ఫలంబు లని బృహస్పతిచేఁ జెప్పంబడియె. 920

సీ. ఉర్వీతలం బెల్ల నొసఁగినపుణ్యంబుఁ, జెందు గోదానంబు చేసెనేని
యఖిలపాపవిముక్తుఁ డగుచుఁ గైలాసంబు,నొందును వృషభంబు నొసఁగెనేని
వంశయుక్తంబుగా వైకుంఠమున కేఁగు, హేమంబు తిలమాత్ర మిచ్చెనేని
చంద్రలోకమునకుఁ జని యమృతము గ్రోలు,నొకయింత రజతంబు నొసఁగెనేని
గీ. యిచ్చెనేని ప్రవాళముల్ హీరకములు, మౌక్తికములును గొను స్వర్గమందిరంబు
పొందితీఱుఁ జతుర్దశభువనసంప్ర, దానఫలము సాలగ్రామదానమునను. 921
గీ. పొందఁ డొకఁడేనియును దులాపురుషదాన, మొసఁగెనేని పునర్జన్మ ముర్వి లోన
వస్త్రదానంబు గావించువాఁడు సతము,స్వర్గమున నుండు దివ్యవస్త్రములుదాల్చి.
సీ. కన్యాప్రదానంబు గావించువాఁ డుండు, శాశ్వతంబుగ బ్రహ్మసదనమందు
నాతపత్రోపానహములు నిచ్చినవాఁడు,శోకంబు లేకుండు నాకమందు
నమృతకల్పఫలంబు లారగించుచు నుండు, స్థిరముగా ఫలదాత త్రిదివమందు
దధిఘృతతక్రదుగ్ధము లొసంగినవాఁడు, నివసించు విష్ణుసాన్నిధ్యమందు
గీ. గంధపుష్పవిభూషితకాయుఁ డగుచుఁ, గ్రాలు సురలోకమునఁ బుష్పగంధదాత
స్రష్టృభవనంబునను బుష్పశయ్యయందు,హాయిగాఁ బవ్వళించు శయ్యాప్రదాత.
గీ. ముసలి దగుధేనువును జీర్ణవసనకమును, బుష్పవతి యైనకన్యను భూసురునకు
నిచ్చువాఁ డొందునరకంబు నెట్టిపాప, కర్ముఁడును జెందఁ డందురు ధర్మవిదులు.
గీ. కన్య నమ్మినవానిముఖంబు చూడఁ, గూడ దది యెప్పుడేని చేకూడెనేని
భానుబింబంబుఁ జూచి తత్పాతకంబు, తత్క్షణమ మాపికొనఁ దగు ధార్మికునకు.
గీ. నాకమునునుండి యాగమనంబు మరలఁ, గన్యకాదానకర్తకుఁ గాన రాదు
నరకమునునుండి యాగమనంబు మరలఁ, గన్య నమ్మినవానికిఁ గాన రాదు.
సీ. దీపకాంతులలోన దేదీప్యమానుఁడై, దివమున విలసిల్లు దీపదాత
శార్ఙ్గిసన్నిధి కేఁగి జ్ఞానంబు నార్జించి, యందు మోక్షంబు విద్యాప్రదాత

శివునిమందిరమునఁ జెలువారుచుండును, శోకంబు లేకుండ శాకదాత
యమరేంద్రుసింహాసనమునందుఁ గూర్చుండు, బృందారకులు గొల్వఁ బీఠదాత
గీ. యనని యెల్లసుఖంబుల ననుభవించి, స్వర్గమున దేవతాంగనాశయ్యయందుఁ
బవ్వళించును దాంబూలభక్షణంబు, సలిపికొనుచును దాంబూలసంప్రదాత.
క. గతి లేక పరితపించెడి. క్షితిదేవున కెవఁడు విద్య చెప్పునో వాఁ డ
చ్యుతునిని కేతనమున శా, శ్వతముగ నివసించు గళితసంసారుండై.
గీ. పుస్తకము నెవ్వఁ డిచ్చునో భూసురునకు, నాదరంబున వాఁడు ప్రత్యక్షరమును
గోటికపిలలనీయఁ జేకూడునట్టి, పుణ్యమును జెందు ననుచుఁ జెప్పుదురు బుధులు.
గీ. మధుగుడంబుల నొసఁగినమానవుండు, స్వవశ మొనరించుకొను నిక్షుసాగరంబు
లవణదానంబు చేయునో యెవఁడు వాఁడు, వరుణలోకంబునందు నివాసముండు.
సీ. అన్నిదానములలో నన్నోదకప్రదా, నము చెప్పఁబడియె నుత్తమము గాఁగ
నన్నోదకము లిచ్చినట్టివాఁ డిలలోన, నఖిలదానము లిచ్చినట్టివాఁడ
యన్నోదకంబు లన్యోన్యంబు సమముల, యొకదాని విడనాడి యొకటి లేమి
నన్నోదకములచే నాఱు క్షుత్తృష్ణలు, దానిచే నగుఁ బ్రాణధారణంబు
గీ. కాన నన్నోదకము లిచ్చుమానవుండు, ప్రాణదానంబు గావించునట్టివాఁడ
ప్రాణదానంబు చేసినపావనునకు, నంట నేరవు బ్రహ్మహత్యాదులేని. 931
గీ. అగునో జీర్ణంబులుగ నెన్ని యన్నతోయ, కణము లుర్వీసురస్వానిగర్భమందు
నన్ని కల్పంబు లన్నతోయప్రదాత, స్థిరముగా నుండు వైకుంఠపురమునందు.
గీ. అన్నదానంబు గావించునట్టివారి, పాతకము లెల్ల వారిని బాసి భోక్త
లైనవారినిఁ జెందు నద్దాన భోక్త, పాతకులయన్నమును దగుఁ బరిహరింప. 933
సీ. అన్నదానముకంటె నధిక మైనది జల, దానంబు తన్మహత్త్వంబు వినుము
త్రవ్వింపఁబడినఖాతములందు నుండెడి, తోయంబు ద్రావి జంతువులు బ్రతుకఁ
దత్తోయమునఁ బితృతర్పణం బగుఁ జేయ,నగు దేహదౌర్గంధ్య మపనయింపఁ
బాత్రశుద్ధియు వస్త్రపరిశోధనంబును, శౌచంబు శోభయు సంఘటిల్లు
ఆ. మఱియు నిర్వహింప మంచికార్యము లెల్ల, నంబు వగును సాధనంబు గాన
సుకృత మెల్లదాన సుప్రతిష్ఠిత మయ్యె, ధన్యుఁ డనిన సలిలఖాత యొకఁడె.
గీ. ఖాతమున నెన్ని తోయశీకరము లుండు, నన్ని వర్షసహస్రంబు లమరపురిని
దాత నివసించుఁ గావునఁ దగు నొనర్పఁ, గూపవాపీతటాకసంస్థాపనంబు. 935
సీ. ఒనరించి సర్వస్వవినియోగమును జేసి, యెల్లయత్నంబుల నెట్టులేని
స్థాపింపఁదగును ఖాతంబు మేదినిమీఁద, జన్మంబు నెత్తినజన్యు లెల్ల
జలశూన్య మైనదేశమున జలాశయం, బును నెలకొల్పినపుణ్యమూర్తి
కల్పశతంబు స్వర్గమునందు దేవతా, గణ్యుఁడై సకలసౌఖ్యముల నొంది

గీ. కడకు జన్మించి ప్రభు వయి పుడమి నెల్లఁ, బాలనము చేసి తుది బ్రహ్మపదమునొందు
నవనిసురుఁ డైన నృపుఁ డైన నర్యుఁ డైన, శూద్రుఁ డైనను స్త్రీ యైన క్షుద్రుఁ డైన.

వ. పరోపకారార్థంబు చతుర్హస్తప్రమాణకూపంబు త్రవ్వించువారు కల్పంబువఱకును దద్ద్విగుణప్రమాణకూపంబు త్రవ్వించువారు కల్పద్వయంబువఱకును జతుర్గుణప్రమాణకూపంబు త్రవ్వించువారు శతకల్పంబులవఱకును స్వర్గసౌఖ్యంబు ననుభవింతురు. వింశతికిష్కుప్రమాణపుష్కరిణిని త్రవ్వించువారు కల్పసహస్రంబు వైకుంఠంబునం దుందురు. సహస్రకిష్కుప్రమాణపుష్కరిణిని త్రవ్వించువారు శాశ్వతంబుగ దివంబునందు నివసింతురు. 937

గీ. అవనిసురులకుఁ దపసుల కగతికులకు, సఖుల కుపకారకులకును క్ష్మాతలంబు
నందుఁ ద్రవ్వించి సలిలాశయంబు లిచ్చు, వార లుందురు సతతంబు స్వర్గమందు.

సీ. ధనిసుతుం డొక్కఁడు మును జలాశయ మొండు, త్రవ్వించి నిర్జలస్థలమునందు
దానికై వెచ్చించి తనయొద్దనుండిన, యయుతదీనారము లంతమునకు
నిస్స్వుఁ డై యుండ వానిని జూచి యొక ఱేఁడు, స్వామి యి మ్మీజలాశయము నాకు
దీనికై వ్యయ మీవు గావించినధనంబు, నిచ్చెద ననుడు వాఁ డిట్టు లనియె

గీ. దీనిలోఁ బ్రతిదినమును స్నానపాన, కర్మములు చేయుచుంట లోకంబు లెల్ల
నయుతదీనారసమధిక మైనపుణ్య, మనుదినంబును గలుగు నీయంగఁ గలనె.

గీ. అనుడుఁ బకపక నగి విభుఁ డనియె వెఱ్ఱి, వాఁడ పుణ్యంబు లెక్కి పడసెనుపడనె
యనుడు వాఁ డిట్టు లనియె సత్యంబు నీవు, కాంచఁదలఁచిన దేఁడఁ బరీక్షింపఁ గనుము.

సీ. అనవుడు భూపాలుఁ డయుతదీనారముల్, కట్టి గట్టిగ నొక్కగ్రావమునకు
నాజలాశయమునం దుంచి మునిఁగిన, జయము తేలినఁ బరాజయము నాఁగ
నామూట సలిలంబునందు మునుంగక, తేలియాడుచు నుండెఁ దెప్పవోలె
నప్పుడు సువర్ణ మంతరిక్షమునుండి, కురిసె నత్యాశ్చర్యకరము గాఁగ

గీ. నంత భూపతి యొక్కజలాశయంబు, తగినచోటను త్రవ్వించి తత్ఫలంబు
ననుభవింపంగ దినమున కరిగె దివ్య, యానమున నెక్కి ధనితనయుఁ డా స్వర్లోకమునకు.

వ. మూఁడు చంపకవృక్షంబులును మూఁ డర్కవృక్షంబులును నెనిమిది బిల్వవృక్షంబులును నేడు న్యగ్రోధవృక్షంబులును బది నింబవృక్షంబులును వనంబుగా స్థాపించిన మహాఫలంబు ప్రాప్తించు. చూతసహస్రవనంబు నెలకొల్పినవాని వైకుంఠవాసంబు చేకూరు. 942

క. రాజ్యమును మంగళమును శౌర్యమును సకల
భోగములు రోగరాహిత్యమును యశంబు
పుత్రపౌత్రాభివృద్ధియుఁ బూజ్యతయును
స్వర్గమ్మును గల్గు నారామసాధకునకు. 943

వ. వృక్షారోపణంబును నారామస్థాపనంబును గావించువారు పక్షికీటాదులకు జీవన
ప్రదానంబును దేవతామనుష్యులకు ఫలప్రదానంబును నాశ్రితజంతుసంతానంబు
నకు ఛాయాప్రదానంబును గావించినమహాపుణ్యముం జెంది చిరకాలంబు స్వర్గ
సౌఖ్యంబు ననుభవించి మరల మహారాజులై భూతలంబున జన్మించి పూర్వ
వాసనంజేసి తిరుగ మహారామముల నెలకొల్పి శాశ్వతబ్రహ్మలోకవాస
భాగ్యముం బడయుదురు. భూతారామస్థాపనాశక్తు లగువారు నిర్జలమార్గంబు
నందుఁ బ్రపాస్థాపనంబు గావించి గ్రీష్మవర్షాశరత్కాలంబులందుఁ బాంథజనం
బులకు నుపవేశస్థలంబును బానీయంబును దాంబూలంబును నొసంగిరేని స్వర్గ
నివాసభాగ్యంబు చేకూరు. అట్లు వర్షత్రయంబు ప్రపాజలదానంబు గావించినఁ
బుష్కరిణీస్థాపనఫలంబు లభించు. గ్రీష్మకాలంబున నిర్జలప్రదేశంబునం దొక్క
మాసంబు ప్రపాసలిలదానంబు గావింప నొక్కకల్పంబువఱకును త్రివిష్టపావాస
భాగ్యంబు సమకూరు. ప్రపాస్థాపకులు పుష్కరిణీస్థాపకలోకముం బడసి మహా
భోగంబు లనుభవింతురు. ప్రపాస్థాపనాశక్తు లగువారు మాషచతుర్భాగస్వర్ణ
దక్షిణాసహితంబుగా ధర్మఘటదానంబు గావించిరేని సర్వపాపవిముక్తి చేకూరు.
అట్లు వర్షత్రయంబు ధర్మఘటప్రదానంబు గావించినఁ బ్రపాస్థాపనఫలంబు
ప్రాప్తించు. ధర్మఘటప్రదానాశక్తు లగువారు పిపాసార్తు లగువారలకు శక్తి
కొలందిని సలిలప్రదానంబు గావించిరేని స్వర్గలోకవాసముం బడయుదురు.
కాంతారంబున సలిలంబు నిలుచుటకు నాళిసంక్రమంబులను సేతువిశేషములను
నేర్పఱచినను గోశిరంబు నేర్పఱచినను దివ్యవర్షశతంబు స్వర్గభోగంబు లను
భవించి పిదప భూమిపై జన్మించి సార్వభౌమత్వముం జెందు.

సీ. చోరుఁ డొక్కఁడు మున్ను దారుల నరికట్టి,కొట్టి పాంథుల దోఁచుకొనుచు ధనము
ననుభవించుచుఁ దాను దనకుటుంబముతోడఁ, బాంథు లేఁగు నరణ్యపథమునందుఁ
ద్రవ్వె గోశిర మొండు దారి నేఁగెడివారు, దానిలోనిజలంబు త్రావి తనియ
నంతట నొక్కనాఁ డాకస్మికంబుగాఁ, దనువును విడిచె నాతస్కరుండు

గీ. యమభటులు వానిఁ గొనిపోయి యపుడు నిలుప
యమునిసాన్నిధ్యమునఁ జూచి యముఁడు వాని
నితఁడు చేసినపుణ్య మేమేని యున్న
నుడువు మని చిత్రగుప్తుని నడిగె నంత. 945

గీ. చిత్రగుప్తుఁడు వాఁడు చేసినయఘంబు, లన్నియును బూస గ్రుచ్చినయట్లు చెప్పి
కడకు వచియించె గోశిరఃకార్యజనిత, మైనపుణ్యంబు నది విని యంతకుండు.

క. కనుఁగొని ధర్మము ధ్యానం, బున వీఁ డొనరించినట్టిపుణ్యముచే ధా
త్రిని ద్వాదశాబ్దములు పా, లన మొనరింపంగఁ దగు నిలాపతి యగుచున్.

క. అని పలికి చోర భూతల, మునకుం బొమ్మింక ననుడు మ్రొక్కి యతం డి
ట్లనియెఁ బ్రభూత్తమ యీస్మృతి, ననుగ్రహింపుము విభుండ నగునెడ నాకున్.

క. అని వేఁడుటయును యముఁ డి, ట్లనియె నగుంగాక యట్లె యరుగుము శీఘ్రం
బున ననుడు వాఁడు భూతల, మున నొక్కదరిద్రగేహమున జనియించెన్.

గీ. అట్లు జనియించి వాఁడు పూర్వాఘమునను
నలయుచును నేకవింశతిహాయనములు
గడపి బహుదుఃఖములతోడఁ గట్టకడపఁ
దనువు విడనాడఁగను లోనఁ దలఁచుచుండ. 950

సీ. ఆపురం బేలెడిభూపాలుఁ డప్పుడు, మరణంబు నొందుట మంత్రులెల్ల
రాజచిహ్నములచే రాజిల్లుచోరునిఁ, దోడ్కొని యేగి సంతోషమునను
జేసిరి పట్టాభిషిక్తుని నంతట, వాఁడు పూర్వస్మృతివర్తి యగుట
వాపీతటాకాదికూపప్రపాగోష్ఠి, రస్నాక్రమాది కార్యములఁ జేసి

గీ. భూమిరుహముల నిల్పి యారామములను, బాదుకొల్పి సమస్తపాపక్షయంబు
గాఁగ నొనరించి బహుపుణ్యకార్యములను, గొనకొని సూర్యసాన్నిధ్యమునకుఁ జేరె.

వ. గోప్రచారంబునకు భూదానంబు గావించువాఁడును గోదానంబు గావించు
వాఁడును సమానసద్గతిం జెందుదురు. 952

గీ. పుణ్యపాదపముల ధర్మభూరుహముల, గోప్రచారక్షితిని జలకూపములను
బాడుచేసెడివాఁడు విభ్రష్టవంశుఁ, డగుచు రౌరవనరకమునందుఁ గూలు. 953

వ. హరిహరబ్రహ్మగణపతిదేవీభాస్కరాది దేవతాలయమండపములు కట్టించు
వారును దేవాలయసంరక్షణంబునకు భూప్రదవిణాదుల నొసంగువారును తత్త
ద్దేవతాలోకంబులందుఁ గల్పకోటిసహస్రంబులు సుఖంబుగా నివసింతురు.
దేవాలయమండపంబులు తృణంబుచే నేర్పఱిచిన నొక్కదివ్యహాయనంబును
శరకాండంబుచే నేర్పఱిచిన దివ్యశతహాయనంబులును నన్యకాష్ఠంబులచే
నేర్పఱిచిన దివ్యాయుతవర్షంబులును ఖాదిరదారువులచే నేర్పఱిచిన దివ్యలక్ష
వర్షంబులును బాషాణంబులచే నేర్పఱిచిన దివ్యకోటివర్షంబులును స్వర్గలోకం
బున నివసింతురు. దేవాలయమండపకారకుండు స్వర్గలోకంబునం దుండునంత
కాలము తద్భ్రంశకారకుండు నరకలోకంబునం దుండు. నదీనదతటాకకూపాది
సమీపంబునం దధ్వగులు విశ్రమింప సత్త్రంబులును మండపంబులును గట్టించు
వారలు దేవాలయమండపకారకు లొందుఫలంబుం జెందుదురు. బ్రాహ్మణులకు
గృహంబులం గట్టించి యిచ్చువారలు తద్ద్విగుణఫలంబుం గాంతురు. అనాథు
లకు శరణంబులు గట్టించి యిచ్చువారలు శాశ్వతస్వర్గమందిరావాసముం
బడయుదురు. తత్తద్దేవతాసన్నిధానంబులందు ఘృతదీపంబుఁ బెట్టువారు దివ్య

వర్షాయుతంబును దత్తద్దేవతలకు ఘృతాభిషేకంబు గావించువారు కల్పకోటి సహస్రంబును స్వర్గవాసముం జెందుదురు. తైలదీపతైలాభిషేకంబులవలనం దనర్థఫలంబు చేకూరు. దేవతలకు వస్త్రపుష్పగంధాగురుధూపాదుల నొసంగిరేని సామ్రాజ్యంబు లభించు. స్వర్ణరత్నంబుల దేవతల కొసంగిన భూమండలాధిపత్యంబు ప్రాప్తించు. సుగంధద్రవ్యదానంబుచే వాన దూకత్వంబును సౌందర్యంబునుం జేకూరు. పూగదానంబున రక్తాన్ముకకంఠంబు గలుగు. వరదాసీప్రదానంబునం గల్పపర్యంతంబు స్వర్గవాసంబును భృత్యదానంబున స్వర్గంబునందు బహుభృత్యపరివేష్టితత్వంబును దూర్వాప్రదానంబున సర్వగుణసంపన్నత్వంబును నృత్యగీతాదిప్రవర్తనంబున గంధర్వపతిత్వంబును గోప్రదానంబునను దుగ్ధప్రదానంబునను గల్పపర్యంతస్వర్గవాసంబును దధ్యభిషేకంబునం దచ్ఛతగుణాధికఫలంబును మధుపాన్నప్రదానంబున భూమండలాధిపత్యంబును బాయసప్రదానంబున మునిప్రవరత్వంబును హవిష్యాన్నదానంబున వేదశాస్త్రపారగత్వంబును మధుదానంబున సౌభాగ్యంబును గుడలవణశర్కరాదానంబున లావణ్యంబును జలపాత్రదానంబున స్వర్గవాసంబును శయ్యాదానంబున సర్వపాపవిముక్తియునుం బ్రాప్తించు. ప్రదక్షిణనమస్కారంబులవలన దివ్యవర్షశతంబు స్వర్గవాసంబును లోకవంద్యత్వంబునుం గలుగు. దేవతాద్రవ్యాపహరి రౌరవనరకంబు ననుభవించి కడకుం గీటమై పుట్టు.

క. శివనైవేద్యముఁ దిన్నను, శివసదనవస్తువులఁ గొన్న శివచేటికలన్
గవగూడిన దారుణరౌ, రవనరకమునుండి మరల రా దుర్వరకున్. 955

క. దేవలకు లెప్పుడు గూడకు, దేవద్రవ్యంబు విడుట దేహాంతమునన్
బోవుదురు నరకమునకున్, దేవుం జెప్పఁడును గావఁ దివురఁడు వారిన్. 956

క. ధనకాంతాసంగమమున్, బొనరించినవాఁడు పాపభూయిష్ఠతచే
ననుభూతనారకుండై, జనియించును మరలఁ గీటజాతులలోనన్. 957

క. నానాపుష్పస్రజముల, మే నంతయుఁ జెడినపర్యుషితనాక్షి నెవం
డైనను దాఁకిన వెంటనె, స్నానం బొనరింప కున్న నష్టాత్ముం డగున్. 958

క. ధనకాంతను మాతనుబలెఁ, గనుఁగొనియెడివాఁడు ముజ్జగంబులలోనన్
గొని పూజను వైకుంఠం, బున వాసము చేయు వదలి పునరావృత్తిన్. 959

గీ. దేవదాసీజనంబును దేవదాస, వర్గమును దేవతాత్మభావమున నెంచి
గౌరవించెడివారు నాకమున నుండు, రెప్పుడును గూడ నపునరావృత్తు లగుచు.

వ. దేవదాసదాసీవర్గంబులకు భూములును గృహంబులును నొసంగువారు శాశ్వత వైకుంఠవాసముం బడయుదురు. 961

గీ. ద్రవ్య మార్జింపవలయును దానమునకె, దాన మొసరించుటకు దరిద్రత్వ మొకవి
నేని కాఁ జాలఁడు దరిద్రుఁ డీశ్వరుండు, పెట్టకుండినఁ గలుగవు పుట్టు గతులు.
ఆ. దానరహిత మైనద్రవ్యంబు రక్షించు, కొనుచు నుండువాఁడు కోట్లకొలఁదిఁ
బుట్టు గతులు లేక పోవు నాద్రవ్యంబు, నెల్ల విడిచిపెట్టి యేక్షణంబొ. 963
క. ధన మున్నప్పుడు దానం, బొనరింపక తాను దినక యుండెడియజ్ఞా
నునికంటె లేఁ డధికుఁడు, డనియెడివాఁ డొకఁడు వసుధయందు మునీంద్రా.
గీ. తపముకంటెను శ్రేష్ఠంబు దాన మనుచుఁ
బలుకుదురు పెద్ద లెల్లఁ దద్భాషితంబు
సత్యదూరంబు గామిని జలుపవలయు
దానమునె సౌఖ్యమును గోరుమానవుండు. 965
గీ. ఇచ్చి స్మరియించువాఁడును బుచ్చుకొనియు
నడుగువాఁడును నరకాబ్ధియందు మునిఁగి
తేలుచుండెడివారల దిక్కు లేక
యోషధీశుండు రవియును నుండుదాఁక. 966
క. దానమున ఘోరపాపము, లైనను నశియించుఁ గాన నాత్మహితార్థుల్
మానక శక్తికొలందిని, దానం బొనరించు చుండఁ దగు నెల్లపుడున్. 967
క. ఈధర్మాఖ్యానంబును, బోధించిన నఖిలకార్యములు సిద్ధించున్
వ్యాధులు తొలంగు సంసృతి, బాధలు శమియించు మోక్షపదమును నొదవున్.
వ. అని చెప్పుటయు శౌనకుండు సూతున కిట్లనియె. 969

—: ప్రతిజ్ఞాపాలనాదిఫలకథనము :—

గీ. ప్రతినఁ బాలించుకొనుట కేఫలము గలదొ
ప్రతిన నెఱవేర్చుకొనమి కేఫలము గలదొ
సత్యశపథంబున కసత్యశపథమునకు
నేమి ఫలములు గలవొ నా కెఱుఁగఁ జెపుము. 970
సీ. అనుటయు సూతుఁ డి ట్లనియె శౌనకునకుఁ, బాలించుకొనునెడఁ బ్రతినఁ జేసి
కలుగు గోశతదానఫలముకంటెను హెచ్చు, గాఁ గోటిగుణములు గలఫలంబు
పొనరించియును బ్రతిజ్ఞను దప్పినట్లైనఁ, గఠినంబు లగునరకంబులందుఁ
బడరానిబాధలు పడుచు నిత్యమును నే, గతినొ మన్వంతరశతము గడపి
గీ. తుదకు నిలలోన నిరుపేదసదనమందు, బుట్టి తిన నన్నమును గట్ట బట్ట లేక
పరితపించుచుఁ గావింపఁబడినయట్టి, కర్మశేషంబు గుడుచుచుఁ గడకుఁ జచ్చు.
గీ. సత్య మైనను శపథంబు సలుప రాదు, సలుపునెడ దేవగురువహ్నిసవిధమందుఁ
జెందు హరిగాత్రమును గాలిచినయఘంబు,నింక మిథ్యాశపథపాప మేమి చెప్ప.

గీ. విష్ణుగాత్రంబు ముట్టి కావించెనేని, సత్యశపథంబు నరకవాసంబుఁ జెందు
వాఁడు మన్వంతరశతంబులదాఁక నింక, ననృతశపథఫలం బింత యరత యగునె.
గీ. ముట్టికొని విష్ణునిర్మాల్యమును నొనర్చె
నట్లయిన సత్యశపథంబు నతఁడు సప్త
పురుషయుతముగ నిరయంబుఁ బొంది పుట్టుఁ
గుష్ఠియయి కర్మశేషంబుకొఱకు భువిని. 974
గీ. సత్యశపథఫలం బిట్టిదాయె నుండ, నింక మిథ్యాశపథఫల మేమి చెప్ప
ననుటయును శౌనకుం డిట్టు లనియె సూతి, దక్షిణకరప్రదానవృత్తంబు చెపుము.

—: దక్షిణహస్తప్రదానఫలకథనము :—

వ. అని యడుగుటయును సూతుండు శౌనకున కిట్లనియె. 976
సీ. వినుము దక్షిణహస్తము నొసంగి వచనంబు, పాలించుకొనునట్టిపావనుండు
తనుపుత్రులోడనె విష్ణుధామంబునకు నేఁగు, బ్రహ్మాదిదేవతల్ ప్రస్తుతింపఁ
గావించి దక్షిణకరదానమును మాట, పాలించుకొననట్టిపామరుండు
కడచుదాఁకను గోటికల్పముల్ ఘోరంబు, లగుయమయాతన లనుభవించు
గీ. వచనపాలన మగుదాఁక వానిపితరు, లెల్లనును నారకాంబుధి నీఁద లేక
సొమ్మసిల్లుచు సోలుచు దిమ్మఁ దిరిగి, పడుచు లేచుచుఁ గాలంబు గడపుచుంద్రు.
వ. దీని కొక్కదృష్టాంతంబు చెప్పెద వినుము. 978
సీ. మున్ను కాంచీపురంబున నుండె శూద్రుండు, వీరవిక్రముఁ డనుపేర నొకఁడు
ప్రాణంబు పో నున్నఁ బ్రతిన దప్పనివాఁడు, దేవతాబ్రాహ్మణసేవకుండు
శ్రవణసముపలబ్ధసర్వధర్ముండును, దానవీరుండును ధైర్యయుతుఁడు
వసుధనధాన్యసంపత్సమేతుండును, బుత్రమిత్రకళత్రభూషితుఁడును
గీ. నట్టు లుండంగ నొకసమయమ్మునందు, శ్వపచుఁ డొక్కఁడు విప్రవేషంబుఁ దాల్చి
వానికడ కేఁగుదెంచి దీవన లొనర్చి, చిట్టచివరకు నయము మీర నిట్టు లనియె.
గీ. వీరవిక్రమ నీపేరు విశ్రుతంబు, కోర నినుఁ గాక విభులు లెవ్వార లేని
యరుగుదెంచితిఁ గొండంత యాశతోడఁ, బాత్రుఁడను నేను నిజమైన బ్రాహ్మణుఁడను.
క. ఇల్లు చెడియున్నవాఁడను, నిల్లాలు గతించె బ్రతుక నేమిటి కని నా
యుల్లమునఁ బొడమె వగ పా, పుల్లాంబురుహాయతాక్షి పోయినపిదపన్. 981
సీ. కలకంఠముక్కులకంటె రుచ్యంబుగా, మాటలాడుచు నుండుమంజువాక్కి
యొంటిసఁ గనుగందనయనంబులతోడఁ, జెలువారుచుండెడిచిగురుఁబోఁడి
ముద్దుగాఱుచు నుండుమురిపెంపునడలతో, సంతోషమును గొల్పు కాంతియాన
చిందులాడుచు నుండఁ జిఱునవ్వువెన్నెలల్, వింతగాఁ గనుపట్టువిద్రుమోష్ఠి

గీ. నామనోరాజ్ఞి నాసుగుణములబ్రాంతి, నానిధానంబు నాకళాన్యాసభూమి
నాప్రమోదపయోధి నానశీలసంధి, నాకుఁ గన్పట్టఁ గలదె యేనాఁటికైన. 982
గీ. విప్రసంరక్షణంబు గావింప నధిప, యభిమతంబైన మాఱుమాటాడకుండ
నాకొసంగుము నీసుకన్యకను గలుగు, శాశ్వతబ్రహ్మలోకవాసంబు నీకు. 983
గీ. చేసెనేని వివాహంబు భూసురునకు, నదియె చాలు సమస్తపుణ్యముల నొసఁగ
నేల దానంబులు వ్రతంబు లేల యేల, క్రతువులు తపంబు లేల తీర్థంబు లేల.
చ. అనుటయు వీరవిక్రముఁడు హర్షముతోడ మహాత్మ నీకు నా
తనయ నొసంగువాఁడ నని దక్షిణహస్తము నుంచి వానికే
లను బలికెన్ దృఢంబుగను లాభము గల్గె నటంచు సంతసం
బును వహియించె నంత్యజుఁడు మోసము గెల్చినకారణంబునన్. 985
ఆ. అట్లు హర్ష మొంది యంత్యజుఁ డతనితో, నిట్టులనియె విప్ర మేమి యగునొ
యాలసించునెడల నారగించి రయంబ, కన్య నిమ్ము మాట గడవకుండ. 986
చ. అనవుడు వీరవిక్రమునియాప్తులు గొందఱు చేరి బ్రాహ్మణుం
డనుటకు వీలు లేదితని నన్వయ మెట్టిదొ దేశ మేదొ యే
పని గలవాఁడొ యారయక భావ్యము గాదొసఁగంగ గన్యకా
జనము నటంచు ఘోషిలెడిశాస్త్రములన్ వలదే గణింపఁగన్. 987
క. తొందరపడఁగా నేటికి, నందఱకును హితము గానియట్టివివాహం
బెందులకుఁ జేయ వలయును, సందేహము గలుగుచోటు చను విడువంగన్.
క. కనుఁగొన నితనిమాటలు, నిను మోసము చేయ మేదినీసురవేషం
బున వచ్చినచండాలుం, డని తోఁచెను మాకు విడుచు టర్హము వీనిన్. 989
చ. అనవుడు వీరవిక్రముఁ డనాదరణీయము గాదు మీరు ప
ల్కినది హితంబ కాని పరికింపఁగ దక్షిణహస్త మునిచి చే
సినప్రతినన్ త్యజింపు మని చెప్పుటమాత్రె మపథ్య మంచుఁ దోఁ
చెను మది కేమి చెప్పినను చెప్పుఁడు ధర్మము మీఱకుండఁగన్. 990
చ. అనుటయు వార లందఱును నచ్చెరు వేర్పడఁ జూచు చుండఁగా
మనమున సందియంబు లవమాత్రము గూడను లేక వానికిన్
దనయను వీరవిక్రముఁడు దానము చేయఁగ నున్నవేళఁ జ
య్యనఁ జనుదెంచి నిల్చెను జనార్దనుఁ డాతనిమ్రోల నవ్వుచున్. 991
ఉ. అంతట వీరవిక్రముఁ డనన్యపరాయణచిత్తుఁడై రమా
కాంతునిఁ జూచి విస్మయము గల్గఁ గరంబులు మోడ్చి మ్రొక్కఁ దై
త్యాంతకుఁ డాతనిం గని కృతార్థుఁడ వైతివి నీవు నీకులం
బంతయు ధన్య మయ్యెఁ జరితార్థతఁ గాంచిరి నీసతీసుతుల్. 992

క. అక్షయఫల మర్యోను నీ, దక్షిణహస్తంబు ప్రతిన ధన్యతఁ గాంచెన్
మోక్షము నొసఁగితి నీ వన, పేక్షుఁడ వైనను ద్వదీయకృత్యాప్తముగన్
గీ. అధివసింపుము గరుడవాహనము నిపుడె, సపరివారంబుగా నని సత్వరంబ
వారి నెల్లను దనయిరువైపులందు, నునిచికొని తాను వైకుంఠమునకుఁ జనియెఁ
క. అంతట వైకుంఠంబునఁ, జింతాలవమేని లేక చిరకాలంబ
త్యంతసుఖ మనుభవించి య, నంతరము విముక్తి నొంది రందఱు గూడన్.
క. అని చెప్పుటయును శౌనక, మునితల్లజుఁ డిట్టు లనియె మునివర్య జనా
ర్దననామోచ్చారణమున, నెనసినమాహాత్మ్య మేమొ యెఱుఁగం జెపుమా.
వ. అని యడుగుటయు సూతుండు పరమహర్షసమేతుండై శౌనకున కిట్లనియె. 997

—: విష్ణునామమాహాత్మ్యకథనము :—

క. మునివర వినుము వచించెద, నను నీ విపు డడిగినట్ల నారదుఁ డడుగం
గను మును సనత్కుమారునిఁ, గనికరమున నాతఁ డతనిఁ గని యిట్లనియెన్.
క. గళితాచారులు పిశునులు, మలినులు వంచకులు దురభిమానులు సంసా
రులు పాపు లయ్యు నగుదురు, జలజాక్షపదారవిందశరణవిశుద్ధుల్. 999
క. హరి యనురెండక్షరములు, దురితంబుల నెల్లఁ బాఱఁద్రోలి క్షణములోఁ
బరమపదంబును జేరుచు, నరసినయెడ లేదె మోక్ష మరచేతులలోన్. 1000
క. హరినామ మొకటి కైకొని, తరియింపఁగవచ్చు దేహధారులు భవసా
గరము సులభముగ నూరక, పరిపరివిధములను నేల పరువెత్తంగన్. 1001
క. అంతయును గల్ల యని సి, ద్ధాంతము నొనరించుకొని నిజాత్మలలో ని
శ్చింతముగ విష్ణునామము, సంతతము స్మరించు చుండుచతురులె ముక్తుల్.
క. ఉపవాసంబులు క్రతువులు, తపములు జపములును స్నానదానములును గా
వుపకారకరణదక్షము, లుపేంద్రనామము స్మరింప కుండినయెడలన్. 1003
గీ. అపునరావృత్తిలక్షణం బైనవిష్ణు, నామకీర్తనమునకుఁ బునర్నివృత్తి
కారకం బైనస్వర్లోకగమనమునకు, హస్తిమశకాంతరము గాదె యరసి చూడ.
క. ఘోరము లగుపాపములను, మారణ మొనరించునట్టిమంత్రంబు నమో
నారాయణాయ యనియెడి, భారతి యొక్కటియె యేల బహుభాషణముల్.
గీ. సత్యమును జెప్పు చున్నాఁడఁ జాటి నేను, సకలపాపంబులను గూడ సమయఁ జేసి
నరకమునఁ బడనీయక నరుల విష్ణు, ధామమున నిల్పునది హరినామ మొకఁడె.
ఆ. రామ రామ యని విరామంబు లేకుండ, జపము చేసెనేని శ్వపచుఁడేని
పూతుఁ డగుచు దాను బూతంబు గావించు,వసుధ నెల్ల నిజనివాసమునను. 1007
గీ. కృష్ణ కృష్ణ యటంచుఁ గీర్తించు చుండు
వాఁడు నివసించుధామమే ద్వారకయును

గయయు వారాణసియుఁ బ్రయాగమును సకల
తీర్థములు గూడఁ జేళ్లైత్తి తెలుప నేల. 1008

గీ. అట్టి విష్ణుదశావతారాహ్వయములు, కీర్తితము లైనయెడ సర్వకిల్బిషములు
జ్వలనమం దుంపఁబడిన కాష్ఠములువోలె, భస్మమైపోయి చేకూరుఁ బరమపదము.

గీ. కృతయుగంబున ధ్యానంబు త్రేతయందు, యజ్ఞములు ద్వాపరంబున నర్చనంబు
గలుగఁజేయంగఁగలవో యేఫలమునదియె, కలుగుఁ హరికీర్తనంబు చేఁగలియుగమున.

గీ. ఎట్టియపరాధములు చేసినట్టివారి, నేని శరణన్న రక్షించువానియెడను
నపచరించెడివాఁడు నామాశ్రయమునఁ, బాలితుం డగు నామప్రభావ మేమొ.

గీ. అట్టినామంబునెడలను నపచరించు, నట్టివానికి లేదు వే ఱెట్టిగతియు
ననుటయును నారదుండిట్టులనియెస్వామి, యేవొనామాపచారములెఱుఁగఁజెపుడు.

వ. అని యడుగుటయు సనత్కుమారుం డిట్లనియె. 1013

—: నామాపచారకథనము :—

సీ. అచ్యుతనామమాహాత్మ్యంబు నాలకిం, చియును నామశ్రద్ధ చేయమియును
గ్రహియించి గురునిముఖంబున నామముల్, చివరకు గురుని దూషించుటయును
హరినామములు స్తుతు లనుటయు భేద మా, పాదించుటయు విష్ణుభర్గులకును
నిగమాగమపురాణనింద చేయుటయును, ద్యజియించుటయును స్వధర్మములను

గీ. గామలోభాదులకు లోఁగి కానికార్య
ములను గావించుటయు దుర్మతులను గూడి
యెడ లెఱుంగక చరియించు చుండుటయును
జేరకొనఁబడు నామాపచారములుగ. 1014

గీ. అట్టియపచారములు విడనాడి నామ
జపము గావించునెడ సర్వసౌఖ్యములును
జెంది యిహమందుఁ బరమందుఁ జెందు ముక్తి
యనుటయును నారదుం డిట్టు లనియె మరల. 1015

గీ. స్వామి ప్రియసాహసులు జ్ఞానవర్జితులును
గాయసంరక్షణైకపరాయణులును
సంసృతినిమగ్నులును నైనజనుల కెట్లు
కలుగు నొకో యపచారముల్ సలుపకునికి. 1016

గీ. అనుటయు సనత్కుమారుఁ డిట్లనియె నసఘ
యవిరతముగఁ బ్రయుక్తము లయ్యెనేని
సంహరించును నామాపచారములను
నామములె చాల వడఁప నన్యములు గాని. 1017

గీ. తనుధనసతీసుతాదులఁ దగులుకొనిన, మానసముతోడను బ్రయుక్త మైనయట్టి
నామ మవిలంబఫలదము గామి నెదను, నునిచి హరిపైని దగు నామమును జపింప.

గీ. ఈరహస్యంబు చెప్పె నా కీశ్వరుండు,మున్ను దయతోడ నపరాధములు తొలంగ
నామమాహాత్మ్యమును బురాణములవలనఁ, దెలిసికొనఁ దగు నింకను బలసెనేని.

క. అనవుడు నారదుఁ డెంతయు, మనమున సంతోష మొంది మహనీయ వినం
గను విష్ణునామముల నె, ల్లను నా కల్లంబునను దలం పునయించెన్. 1020

సీ. కలదేని నాకు యోగ్యత యవి యాలింపఁ,జెప్పుము దయతోడ శీఘ్రముగను
నావుడు లోన సనత్కుమారుఁడు విస్మ, యము నొంది కన్గొని యమరమునిని
నారదా శార్ఙ్గిసనాతనుం డఖిలభూ, తాంతరాత్ముండు విశ్వాత్ముఁడు
తన్నామముల నెల్లఁ దరము గా దెఱుఁగంగ, నస్మదాదుల కెట్టు లగు వచింపఁ

గీ. జెప్పఁ దద్దివ్యనామముల్ శివుఁ డొకండె, దక్షుఁ డరుగుము తత్సన్నిధానమునకు
నావుడుఁ దదాజ్ఞ గైకొని నారదుండు, చని రయంబునఁ గైలాసశైలమునకు.

గీ. అష్టమూర్తికి మ్రొక్కి సాష్టాంగముగను
వినిచెఁ దనవాంఛ నయ్యది విని పినాకి
విష్ణునామంబులను నేఁడు వినుచుభాగ్య
మొదవె నని సంతసించుచు హృదయమందు. 1022

సీ. నారదాముని నొకనాఁడు పార్వతి నాకు, సాష్టాంగవందనం బాచరించి
దేవ సర్వజ్ఞమూర్తివి నీవు బ్రహ్మాదు, లర్చించుచుండు రన్వహము నిన్ను
వినియుంటి నిన్ను మించినదైవము త్రిలోక, ములలోన లే దని బుధులు చెప్ప
గోప్యంబుగను నీవు గూడ దేనినో జపి, యించుచుండెద వది యేమొ చెపుము

గీ. యనుడు నే నిట్టు లంటిఁ దన్వంగి నీవు, భర్తురాలవు నీకుఁ జెప్పంగరాని
దేదియును లేదు కావున నెఱుకపఱుతుఁ,గానియిదిగోప్యమెఱుఁగఁజొక్కుఁడునుకీని.

సీ. అఖిలలోకములకు నాదినారాయణుం,డొకఁడె కారణముగా నున్నవాఁడు
భజియించుచుండిరి బ్రహ్మాదు లెల్ల స,త్యయుగంబునందు మున్నతని నొకని
నపుడు నే నొకకల్ప మాచరించితి ఘోర,తపము నాతనిప్రసాదంబుకొఱకు
నాతపంబున కాదినారాయణుఁడు మెచ్చి, ప్రత్యక్షముగ వచ్చి పరమకృపను

గీ. విష్ణునామసహస్రంబు విశదముగను, నాకు వచియించి వత్స యీనామములను
సంస్మరించుచు నుండుము సంతతమును, నగుదు నాకంటె నధికుఁడ వని వచించె.

గీ. అదియె మొదలుగ నామసహస్రజపము, సలుపఁ దొడఁగితి దానన సర్వశక్తు
లేర్పడియె నాకు దాన సర్వేశ్వరుండ, నైతి నేను జనార్దనుం డవదుఁ డయ్యె.

చ. అని వచియింపఁ బార్వతి ప్రహర్షము నొందుచు నాత్మలోన ని
ట్లనియెను బ్రాణనాథ మధురాన్నము నొక్కఁడె యారగింపఁగాఁ

జన దని పెద్దలంపు రది సర్వవిదుండవు నీవె సత్యముం
బొనరుపకున్న నెవ్వ రికఁ బూజనొనర్తురు వృష్ణవాక్యమున్. 1026

క. అనవుడు గ్రహించి తన్మన, మున నేను రమాధవుండు మును నాకు వచిం
చిననామసహస్రంబును, వినిచితిఁ బార్వతికి నదియు వినిచెద నెరుఁగన్. 1027

—: విష్ణుసహస్రనామకథనము :—

అస్య శ్రీవిష్ణునామసహస్రస్తోత్రస్య శ్రీమహాదేవ ఋషిః. అనుష్టుప్ ఛందః. పరమాత్మా దేవతా. హ్రీం బీజమ్. శ్రీం శక్తిః. క్లీం కీలకమ్. చతుర్వర్గఫలధర్మార్థకామమోక్షార్థే జపే వినియోగః.

ఓం వాసుదేవాయ విద్మహే మహాహంసాయ ధీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్.

ఓం నమో నారాయణాయ పురుషాయ మహాత్మనే విశుద్ధశుద్ధసత్త్వాయ మహాహంసాయ ధీమహి తన్నో దేవః ప్రచోదయాత్.

క్లీం కృష్ణాయ విద్మహే హ్రీం రామాయ ధీమహి తన్నో దేవః ప్రచోదయాత్.

శం నృసింహాయ విద్మహే శ్రీకంఠాయ ధీమహి తన్నో విష్ణుః ప్రచోదయాత్.

ఓం వాసుదేవాయ విద్మహే దేవకీసుతాయ ధీమహి తన్నః కృష్ణః ప్రచోదయాత్.

శ్రీవాసుదేవః పరం బ్రహ్మేతి అంగుష్ఠాభ్యాం నమః. మూలప్రకృతిరితి తర్జనీభ్యాం స్వాహా. మహావరాహ ఇతి మధ్యమాభ్యాం వషట్. సూర్యవంశధ్వజ ఇతి అనామికాభ్యాం హుమ్. బ్రహ్మాదికామ్యలాలిత్యజగదాశ్చర్యశైశవ ఇతి కనిష్ఠికాభ్యాం వౌషట్. పార్థార్థఖండితాశేష ఇతి కరతలకరపృష్ఠాభ్యాం ఫట్. శ్రీవాసుదేవః పరం బ్రహ్మేతి హృదయాయ నమః. మూలప్రకృతిరితి శిరసే స్వాహా. మహావరాహ ఇతి శిఖాయై వషట్. సూర్యవంశధ్వజ ఇతి కవచాయ హుమ్. బ్రహ్మాదికామ్యలాలిత్యజగదాశ్చర్యశైశవ ఇతి నేత్రత్రయాయ వౌషట్. పార్థార్థఖండితాశేష ఇత్యస్త్రాయ ఫట్. నమో నారాయణాయేతి దిగ్బంధః.

ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజనవల్లభాయ నమః స్వాహా.

శ్లో. ఇతి మంత్రం సముచ్చార్య యజేద్వా విష్ణుమవ్యయమ్ ।
శ్రీనివాసం జగన్నాథం తతస్తోత్రం పఠేత్సుధీః. ౧
ఓం వాసుదేవః పరం బ్రహ్మ పరమాత్మా పరాత్పరః ।
పరం ధామ పరం జ్యోతిః పరం తత్త్వం పరం పదమ్. ౨
పరశ్శివః పరో ధ్యేయః పరం జ్ఞానం పరా గతిః ।
పరమార్థః పరశ్శ్రేష్ఠః పరానందః పరోదయః. ౩

పరోఽవ్యక్తాత్పరం వ్యోమ పరమర్ధిః పరేశ్వరః ।
నిరామయో నిర్వికారో నిర్వికల్పో నిరాశ్రయః. ౪
నిరంజనో నిరాలంబో నిర్లేపో నిరవగ్రహః ।
నిర్గుణో నిష్కలోఽనంతోఽభయోఽచింత్యోఽచలోఽంచితః. ౫
అతీంద్రియోఽమితోఽపారో నిత్యోఽనీహోఽవ్యయోఽక్షయః ।
సర్వజ్ఞస్సర్వగస్సర్వస్సర్వదస్సర్వభావనః. ౬
సర్వశాస్తా సర్వసాక్షీ పూజ్యస్సర్వస్య సర్వదృక్ ।
సర్వశక్తిస్సర్వసారస్సర్వాత్మా సర్వతోముఖః. ౭
సర్వావాసస్సర్వరూపస్సర్వాదిస్సర్వదుఃఖహా ।
సర్వార్థస్సర్వతోభద్రస్సర్వకారణకారణమ్. ౮
సర్వాతిశయితస్సర్వాధ్యక్షస్సర్వేశ్వరేశ్వరః ।
షడ్వింశకో మహావిష్ణుర్మహాగుహ్యో మహావిభుః. ౯
నిత్యోదితో నిత్యయుక్తో నిత్యానందస్సనాతనః ।
మాయాపతిర్యోగపతిః కైవల్యపతిరాత్మభూః. ౧౦
జన్మమృత్యుజరాతీతః కాలాతీతో భవాతిగః ।
పూర్ణస్సత్యశ్శుద్ధబుద్ధస్వరూపో నిత్యచిన్మయః. ౧౧
యోగప్రియో యోగగమ్యో భవబంధైకమోచకః ।
పురాణపురుషః ప్రత్యక్చైతన్యః పురుషోత్తమః. ౧౨
వేదాంతవేద్యో దుర్జ్ఞేయస్తాపత్రయవివర్జితః ।
బ్రహ్మవిద్యాశ్రయోఽనఘః స్వప్రకాశస్స్వయంప్రభుః. ౧౩
సర్వోపాయ ఉదాసీనః ప్రణవః (౧౦౦) సర్వతస్సమః ।
సర్వానవద్యో దుష్ప్రాప్యస్తురీయస్తమసఃపరః. ౧౪
కూటస్థస్సర్వసంశ్లిష్టో వాఙ్మనోగోచరాతిగః ।
సంకర్షణస్సర్వహరః కాలస్సర్వభయంకరః. ౧౫
అనుల్లంఘ్యశ్చిత్రగతిర్మహారుద్రో దురాసదః ।
మూలప్రకృతిరానందః ప్రద్యుమ్నో విశ్వమోహనః. ౧౬
మహామాయో విశ్వబీజం పరశక్తిస్సుఖైకభూః ।
సర్వకామ్యోఽనంతలీలస్సర్వభూతవశంకరః. ౧౭
అనిరుద్ధస్సర్వజీవో హృషీకేశో మనఃపతిః ।
నిరుపాధిప్రియో హంసోఽక్షరస్సర్వనియోజకః. ౧౮
బ్రహ్మప్రాణేశ్వరస్సర్వభూతభృద్దేహనాయకః ।
క్షేత్రజ్ఞః ప్రకృతిస్వామీ పురుషో విశ్వసూత్రధృక్. ౧౯

అంతర్యామీ త్రిధామాఽంతస్సాక్షీ నిర్గుణ ఈశ్వరః।
యోగిగమ్యః పద్మనాభశ్శేషశాయీ శ్రియఃపతిః. ౨౦
శ్రీశివోపాస్యపాదాబ్జో నిత్యశ్రీః శ్రీనికేతనః।
నిత్యవక్షస్థలస్థశ్రీః శ్రీనిధిః శ్రీధరో హరిః. ౨౧
వశ్యశ్రీర్నిశ్చలశ్రీకో విష్ణుః క్షీరాబ్ధిమందిరః।
కౌస్తుభోద్భాసితోరస్కో మాధవో జగదార్తిహా. ౨౨
శ్రీవత్సవక్షా నిస్సీమకల్యాణగుణభాజనమ్।
పీతాంబరో జగన్నాథో జగత్త్రాతా జగత్పితా. ౨౩
జగద్బంధుర్జగత్స్రష్టా జగద్ధాతా జగన్నిధిః।
జగదేకస్ఫురద్వీర్యో నాహంవాదీ జగన్మయః. ౨౪
సర్వాశ్చర్యమయస్సర్వసిద్ధార్థస్సర్వరంజితః।
సర్వామోఘోద్యమో బ్రహ్మరుద్రాద్యుత్కృష్టచేతనః. ౨౫
శంభోః పితామహో బ్రహ్మపితా శక్రాద్యధీశ్వరః।
సర్వదేవప్రియస్సర్వదేవమూర్తిరనుత్తమః. ౨౬
సర్వదేవైకశరణం సర్వదేవైకదేవతా।
యజ్ఞభుగ్యజ్ఞఫలదో యజ్ఞేశో యజ్ఞభావనః. ౨౭
యజ్ఞత్రాతా యజ్ఞపుమాన్ వనమాలీ ద్విజప్రియః।
ద్విజైకమానదో(౨౦౦)విప్రకులదేవోఽసురాంతకః. ౨౮
సర్వదుష్టాంతకృత్సర్వసజ్జనానన్యపాలకః।
సప్తలోకైకజఠరస్సప్తలోకైకమండనః. ౨౯
సృష్టిస్థిత్యంతకృచ్చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః।
శంఖభృన్నందకీ పద్మపాణిర్గరుడవాహనః. ౩౦
అనిర్దేశ్యవపుస్సర్వపూజ్యస్త్రైలోక్యపావనః।
అనంతకీర్తిర్నిస్సీమపౌరుషస్సర్వమంగళః. ౩౧
సూర్యకోటిప్రతీకాశో యమకోటిదురాసదః।
కందర్పకోటిలావణ్యో దుర్గాకోట్యరిమర్దనః. ౩౨
సముద్రకోటిగంభీరస్తీర్థకోటిసమాహ్వయః।
బ్రహ్మకోటిజగత్స్రష్టా వాయుకోటిమహాబలః. ౩౩
కోటీందుజగదానందీ శంభుకోటిమహేశ్వరః।
కుబేరకోటిలక్ష్మీవాన్ శక్రకోటివిలాసవాన్. ౩౪
హిమవత్కోటినిష్కంపః కోటిబ్రహ్మాండవిగ్రహః।
కోట్యశ్వమేధపాపఘ్నో యజ్ఞకోటిసమార్చనః. ౩౫

సుధాకోటిస్వాస్థ్యహేతుః కామధుక్కోటికామదః।
బ్రహ్మవిద్యాకోటిరూపః శిపివిష్టః శుచిశ్రవాః. ౩౬
విశ్వంభర స్తీర్థపాదః పుణ్యశ్రవణకీర్తనః।
ఆదిదేవో జగజ్జైత్రో ముకుందః కాలనేమిహా. ౩౭

వైకుంఠో౽నంతమాహాత్మ్యో మహాయోగేశ్వరోత్సవః।
నిత్యతృప్తో లసద్భావో నిశ్శంకో నరకాంతకః. ౩౮
దీనానాథైకశరణం విశ్వైకవ్యసనాపహః।
జగత్కృపాక్షమో నిత్యం కృపాళుస్సజ్జనాశ్రయః. ౩౯
యోగేశ్వరస్సదోదీర్ణో వృద్ధిక్షయవివర్జితః।
అధోక్షజో విశ్వరేతాః ప్రజాపతిశతాధిపః. ౪౦
శక్రబ్రహ్మార్చితపదః శంభుబ్రహ్మోర్ధ్వధామగః।
సూర్యసోమేక్షణో విశ్వభోక్తా సర్వస్య పారగః. ౪౧
జగత్సేతుర్ధర్మసేతుధరో విశ్వధురంధరః।
నిర్మమో౽ఖిలలోకేశో నిస్సంగో౽ద్భుతభోగవాన్. ౪౨
వశ్యమాయో వశ్యవిశ్వో విష్వక్సేనః సురోత్తమః।
సర్వశ్రేయఃపతిర్దివ్యో౽నర్ఘ్యభూషణభూషితః. ౪౩
సర్వలక్షణలక్షణ్యః సర్వదైత్యేంద్రదర్పహా।
సమస్తదేవసర్వస్వం సర్వదైవతనాయకః. ౪౪
సమస్తదేవకవచం సర్వదేవశిరోమణిః।
సమస్తదేవతాదుర్గః ప్రపన్నాశనిపంజరః. ౪౫
సమస్తభయహృన్నామా భగవాన్ విష్టరశ్రవాః।
విభుస్సర్వహితోదర్కో హతారిః స్వర్గతిప్రదః (౩౦౦). ౪౬
సర్వదైవతజీవేశో బ్రాహ్మణాదినియోజకః।
బ్రహ్మశంభుపరార్ధాయుర్బ్రహ్మజ్యేష్ఠః శిశుస్వరాట్. ౪౭
విరాడ్భక్తపరాధీనః స్తుత్యః స్తోత్రార్థసాధకః।
పరార్థకర్తా కృత్యజ్ఞః స్వార్థకృత్యసదోజ్ఝితః. ౪౮
సదానందస్సదాభద్రస్సదాశాంతస్సదాశివః।
సదాప్రియస్సదాతుష్టస్సదాపుష్టస్సదార్చితః. ౪౯
సదాపూతః పావనాగ్ర్యో వేదగుహ్యో వృషాకపిః।
సహస్రనామా త్రియుగశ్చతుర్మూర్తిశ్చతుర్భుజః. ౫౦
భూతభవ్యభవన్నాథో మహాపురుషపూర్వజః।
నారాయణో మంజుకేశః సర్వయోగవినిస్సృతః. ౫౧

వేదసారో యజ్ఞసారః సామసారస్తపోనిధిః।
సాధుశ్రేష్ఠః పురాణర్షిర్నిష్ఠా శాంతిః పరాయణమ్. ౫౨
శివత్రిశూలవిధ్వంసీ శ్రీకంఠైకవరప్రదః।
నరః కృష్ణో హరిర్ధర్మనందనో ధర్మజీవనః. ౫౩
ఆదికర్తా సర్వసత్యః సర్వస్త్రీరత్నదర్పహా।
త్రికాలజితకందర్ప ఉర్వశీసృఙ్మునీశ్వరః. ౫౪
ఆద్యః కవిర్హయగ్రీవః సర్వవాగీశ్వరేశ్వరః।
సర్వదేవమయో బ్రహ్మగురుర్వాగీశ్వరీపతిః. ౫౫
అనంతవిద్యాప్రభవో మూలావిద్యావినాశకః।
సార్వజ్ఞ్యదో నమజ్జాడ్యనాశకో మధుసూదనః. ౫౬
అనేకమంత్రకోటీశః శబ్దబ్రహ్మైకపారగః।
ఆదివిద్వాన్ వేదకర్తా వేదాత్మా శ్రుతిసాగరః. ౫౭
బ్రహ్మార్థవేదాహరణః సర్వవిజ్ఞానజన్మభూః।
విద్యారాజో జ్ఞానమూర్తిర్జ్ఞానసింధురఖండధీః. ౫౮

మత్స్యదేవో మహాశృంగో జగద్బీజవహిత్రధృక్।
లీలావ్యాప్తాఖిలాంభోధిః ఋగ్వేదాదిప్రవర్తకః. ౫౯
ఆదికూర్మోఽఖిలాధారస్తృణీకృతజగద్భరః।
అమరీకృతదేవౌఘః పీయూషోత్పత్తికారణమ్. ౬౦
ఆత్మాధారో ధరాధారో యజ్ఞాంగో ధరణీధరః।
హిరణ్యాక్షహరః పృథ్వీపతిః శ్రాద్ధాదికల్పకః. ౬౧
సమస్తపితృభీతిఘ్నః సమస్తపితృజీవనమ్।
హవ్యకవ్యైకభుక్ (౪౦౦) హవ్యకవ్యైకఫలదాయకః. ౬౨
రోమాంతర్లీనజలధిః క్షోభితాశేషసాగరః।
మహావరాహో యజ్ఞఘ్నధ్వంసకో యాజ్ఞికాశ్రయః. ౬౩
శ్రీనృసింహో దివ్యసింహః సర్వానిష్టార్థదుఃఖహా।
ఏకవీరోఽద్భుతబలో యంత్రమంత్రైకభంజనః. ౬౪
బ్రహ్మాదిదుస్సహజ్యోతిర్యుగాంతాగ్న్యతిభీషణః।
కోటివజ్రాధికనఖో జగద్దుష్ప్రేక్ష్యమూర్తిధృక్. ౬౫
మాతృచక్రప్రమథనో మహామాతృగణేశ్వరః।
అచింత్యామోఘవీర్యాఢ్యః సమస్తాసురఘస్మరః. ౬౬
హిరణ్యకశిపుచ్ఛేదీ కాలస్సంకర్షణీపతిః।
కృతాంతవాహానస్సద్యః సమస్తభయనాశనః. ౬౭

సర్వవిఘ్నాంతకస్సర్వసిద్ధిస్సర్వప్రదాయకః ।
సమస్తపాతకధ్వంసీ సిద్ధమంత్రాధికాహ్వయః. ౧౮
భైరవేశో హరార్తిఘ్నః కాలకోటిదురాసదః ।
దైత్యగర్భస్రావినామా స్ఫుటద్బ్రహ్మాండగర్జితః. ౧౯
స్మృతమాత్రాఖిలత్రాతాఽద్భుతరూపో మహాహరిః ।
బ్రహ్మచర్యశిరఃపిండీ దిక్పాలోఽర్ధాంగభూషణః. ౨౦
ద్వాదశార్కశిరోదామా రుద్రశీర్షైకనూపురః ।
యోగినీగ్రస్తగిరిజాత్రాతా భైరవతర్జకః. ౨౧
వీరచక్రేశ్వరోఽత్యుగ్రో యమారిః కాలసంవరః ।
క్రోధేశ్వరో రుద్రచండీపరివారాదిదుష్టభుక్. ౨౨
సర్వాక్షోభ్యో మృత్యుమృత్యుః కాలమృత్యునివర్తకః ।
అసాధ్యసర్వరోగఘ్నః సర్వదుర్గ్రహసౌమ్యకృత్. ౨౩
గణేశకోటిదర్పఘ్నో దుస్సహాశేషగోత్రహా ।
దేవదానవదుర్దర్శో జగద్భయదభీషకః. ౨౪
సమస్తదుర్గతిత్రాతా జగద్భక్షకభక్షకః ।
ఉగ్రేశోఽంబరమార్జారః కాలమూషకభక్షకః. ౨౫
అనంతాయుధదోర్దండీ నృసింహో వీరభద్రజిత్ ।
యోగినీచక్రగుహ్యేశః శక్రారిపశుమాంసభుక్. ౨౬
రుద్రో నారాయణో మేషరూపశంకరవాహనః ।
మేషరూపశివత్రాతా దుష్టశక్తిసహస్రభుక్. ౨౭
తులసీవల్లభో వీరో వామాచారాఖిలేష్టదః ।
మహాశివశ్శివారూఢో భైరవైకకపాలధృక్. ౨౮
ఝిల్లీచక్రేశ్వరః శక్రదివ్యమోహనరూపదః ।
గౌరీసౌభాగ్యదో మాయానిధిర్మాయాభయాపహః. ౨౯
బ్రహ్మతేజోమయో బ్రహ్మశ్రీమయశ్చ త్రయీమయః ।
సుబ్రహ్మణ్యో బలిధ్వంసీ వామనోఽదితిదుఃఖహా. ౩౦
ఉపేంద్రో నృపతిర్విష్ణుః కశ్యపాన్వయమండనః ।
బలిస్వారాజ్యదః సర్వదేవవిప్రాన్నదోఽచ్యుతః. (౫౦౦) ౩౧
ఉరుక్రమస్తీర్థపాదస్త్రిపదస్త్రివిక్రమః ।
వ్యోమపాదః స్వపాదాంభఃపవిత్రితజగత్త్రయః. ౩౨
బ్రహ్మేశాద్యభివంద్యాంఘ్రిర్ద్రుతధర్మాఽహిధావనః ।
అచింత్యాద్భుతవిస్తారో విశ్వవృక్షో మహాబలః. ౩౩

రాహుమూర్ధాపరాంగచ్ఛిద్ భృగుపత్నీశిరోహరః ।
పాపత్రస్తః సదాపుణ్యో దైత్యాశానిత్యఖండకః. ౮౪
పూరితాఖిలదేవాశో విశ్వార్థైకావతారకృత్ ।
స్వమాయానిత్యగుప్తాత్మా భక్తచింతామణిస్సదా. ౮౫
వరదః కార్తవీర్యాదిరాజరాజ్యప్రదోఽనఘః ।
విశ్వశ్లాఘ్యోఽమితాచారో దత్తాత్రేయో మునీశ్వరః. ౮౬
పరాశక్తిసదాశ్లిష్టో యోగానందసదోన్మదః ।
సమస్తేంద్రారితేజోహృత్ పరమామృతపద్మపః. ౮౭
అనసూయాగర్భరత్నం భోగమోక్షసుఖప్రదః ।
జమదగ్నికులాదిత్యో రేణుకాద్భుతశక్తిధృక్. ౮౮
మాతృహత్యాదినిర్లేపః స్కందజిద్విప్రరాజ్యదః ।
సర్వక్షత్రాంతకృద్వీరదర్పహా కార్తవీర్యజిత్. ౮౯
సప్తద్వీపవతీదాతా శివార్చకయశఃప్రదః ।
భీమః పరశురామశ్చ శివాచార్యైకవిశ్వభూః. ౯౦
శివోఽఖిలజ్ఞానకోశో భీష్మాచార్యోఽగ్నిదైవతః ।
ద్రోణాచార్యగురుర్విశ్వజైత్రధన్వా కృతాంతజిత్. ౯౧
అద్వితీయతపోమూర్తిర్బ్రహ్మచర్యైకదక్షిణః ।
మనుశ్రేష్ఠః సతాం సేతుః మహీయాన్ వృషభో విరాట్. ౯౨
ఆదిరాజః క్షితిపితా సర్వరత్నైకదోహకృత్ ।
పృథుర్జన్మాద్యేకదక్షో గీశ్శ్రీకీర్తిస్వయంవృతః. ౯౩
జగద్వృత్తిప్రదశ్చక్రవర్తిశ్రేష్ఠోఽద్వయాస్త్రధృక్ ।
సనకాదిమునిప్రాప్యభగవద్భక్తివర్ధనః. ౯౪
వర్ణాశ్రమాదిధర్మాణాం కర్తా వక్తా ప్రవర్తకః ।
సూర్యవంశధ్వజో రామో రాఘవః సద్గుణార్ణవః. ౯౫
కాకుత్స్థో వీరరాజార్యో రాజధర్మధురంధరః।
నిత్యస్వస్థాశ్రయః సర్వభద్రగ్రాహీ శుభైకదృక్. ౯౬
నరరత్నం రత్నగర్భో ధర్మాధ్యక్షో మహానిధిః।
సర్వశ్రేష్ఠాశ్రయః సర్వశస్త్రాస్త్రగ్రామవీర్యవాన్. ౯౭
జగదీశో దాశరథిః సర్వరత్నాశ్రయో నృపః।
సమస్తధర్మసూః సర్వధర్మద్రష్టాఽఖిలార్తిహా. ౯౮
అతీంద్రో జ్ఞానవిజ్ఞానపారద్రష్టా క్షమాంబుధిః
సర్వప్రకృష్టః శిష్టేష్టో(౯౦౦)హర్షశోకాద్యనాకులః ౯౯

పిత్రాజ్ఞాత్యక్తసామ్రాజ్యః సపత్నోదయనిర్భయః ।
గుహాదేశార్పితైశ్వర్యః శివస్పర్ధాజటాధరః. ౧౦౦
చిత్రకూటాప్తరత్నాద్రిర్జగదీశో వనేచరః ।
యథేష్టామోఘసర్వాస్త్రో దేవేంద్రతనయాక్షిహా. ౧౦౧
బ్రహ్మేంద్రాదినతైషీకో మారీచఘ్నో విరాధహా ।
బ్రహ్మశాపహతాశేషదండకారణ్యపావనః. ౧౦౨
చతుర్దశసహస్రోగ్రరక్షోఘ్నైకశరైకధృక్ ।
ఖరారిస్త్రిశిరోహంతా దూషణఘ్నో జనార్దనః. ౧౦౩
జటాయుషోఽగ్నిగతిదోఽగస్త్యసర్వస్వపాత్రరాట్ ।
లీలాధనుష్కోట్యపాస్తదుందుభ్యస్థిమహాచలః. ౧౦౪
సప్తతాళవ్యధాకృష్టధ్వస్తపాతాళదానవః ।
సుగ్రీవరాజ్యదోఽహీనమనసైవాఽభయప్రదః. ౧౦౫
హనుమద్రుద్రముఖ్యేశః సమస్తకపిదేహభృత్ ।
సనాగదైత్యబాణైకవ్యాకులీకృతసాగరః. ౧౦౬
సమ్లేచ్ఛకోటిబాణైకశుష్కనిర్దగ్ధసాగరః ।
సముద్రాద్భుతపూర్వైకబద్ధసేతుర్యశోనిధిః. ౧౦౭
అసాధ్యసాధకో లంకాసమూలోత్సాదదక్షిణః ।
వరదృప్తజగచ్ఛల్యపౌలస్త్యకులకృంతనః. ౧౦౮
రావణిఘ్నః ప్రహస్తచ్ఛిత్ కుంభకర్ణభిదుగ్రహా ।
రావణైకశిరశ్ఛేత్తా నిశ్శంకేంద్రైకరాజ్యదః. ౧౦౯
స్వర్గాస్వర్గత్వవిచ్ఛేదీ దేవేంద్రారాతినిర్హరః ।
రక్షోదేవత్వహృద్ధర్మాధర్మత్వఘ్నః పురుష్టుతః. ౧౧౦
నతిమాత్రదశాస్యారిర్దత్తరాజ్యవిభీషణః ।
సుధావృష్టిమృతాశేషస్వసైన్యోజ్జీవనైకకృత్. ౧౧౧
దేవబ్రాహ్మణనామైకధాతా సర్వామరార్చితః ।
బ్రహ్మసూర్యేంద్రరుద్రాదివంధ్యాయితశతాప్రియః. ౧౧౨
అయోధ్యాఖిలరాజాగ్ర్యః సర్వభూతమనోహరః ।
స్వామ్యతుల్యకృపాదండో హీనోత్కృష్టైకసత్ప్రియః. ౧౧౩
శ్వపక్ష్యాదిన్యాయదర్శీ హీనార్థాధికసాధకః ।
వధవ్యాజానుచితకృత్తారకోఽఖిలతుల్యకృత్. ౧౧౪
పావిత్ర్యాధిక్యముక్తాత్మప్రియాత్యక్తః స్మరారిజిత్ ।
సాక్షాత్కుశలవచ్ఛద్మద్రావితో హ్యపరాజితః. ౧౧౫

కోసలేంద్రో వీరబాహుః సత్యార్థత్యక్తసోదరః।
శరసంధాననిర్ధూతధరణీమండలో జయః. ౧౧౬
బ్రహ్మాదికామసాన్నిధ్యసనాథీకృతదైవతః।
బ్రహ్మలోకాప్తచాండాలాద్యశేషప్రాణిసార్థకః. ౧౧౭
స్వర్ణీతగర్దభశ్వాదిశ్చిరాయోధ్యావనైకకృత్।
రామో ద్వితీయసౌమిత్రిర్లక్ష్మణః ప్రహతేంద్రజిత్. ౧౧౮
విష్ణుభక్తః సరామాంఘ్రిపాదుకారాజ్యనిర్వృతిః।
భరతోఽసహ్యగంధర్వకోటిఘ్నో లవణాంతకః. ౧౧౯
శత్రుఘ్నో వైద్యరాడాయుర్వేదగర్భౌషధీపతిః।
నిత్యామృతకరో ధన్వంతరిర్యజ్ఞో జగద్ధరః. ౧౨౦
సూర్యారిఘ్నః సురాజీవో దక్షిణేశో ద్విజప్రియః।
ఛిన్నమూర్ధాపదేశార్కః శేషాంగస్థాపితామరః. ౧౨౧
విశ్వార్థాశేషకృద్రాహుశిరశ్ఛేత్తాఽక్షతాకృతిః।
వాజపేయాదినామాగ్నిర్వేదధర్మపరాయణః (౭౦౦). ౧౨౨
శ్వేతద్వీపపతిః సాంఖ్యప్రణేతా సర్వసిద్ధిరాట్।
విశ్వప్రకాశితజ్ఞానయోగమోహతమిస్రహా. ౧౨౩
దేవహూత్యాత్మజస్సిద్ధః కపిలః కర్దమాత్మజః।
యోగస్వామీ ధ్యానభంగసగరాత్మజభస్మకృత్. ౧౨౪
ధర్మో వృషేంద్రః సురభీపతిః శుద్ధాత్మభావితః।
శంభుస్త్రిపురదాహైకస్థైర్యవిశ్వరథోద్వహః. ౧౨౫
భక్తశంభుజితో దైత్యామృతవాపీసమస్తపః।
మహాప్రళయవిశ్వైకనిలయోఽఖిలనాగరాట్. ౧౨౬
శేషదేవస్సహస్రాక్షః సహస్రాస్యశిరోభుజః।
ఫణామణికణాకారయోజితాచ్ఛాంబుదక్షితిః. ౧౨౭
కాలాగ్నిరుద్రజనకో ముసలాస్త్రో హలాయుధః।
నీలాంబరో వారుణీశో మనోవాక్కాయదోషహా. ౧౨౮
అసంతోషదృష్టిమాత్రపాతితైకదశాననః।
బలసంయమనో ఘోరో రౌహిణేయః ప్రలంబహా. ౧౨౯
ముష్టికఘ్నో ద్వివిదహా కాళిందీకర్షణో బలః।
రేవతీరమణః పూర్వభక్తిఖేదాచ్యుతాగ్రజః. ౧౩౦
దేవకీవసుదేవాహ్వకశ్యపాదితినందనః।
వార్ష్ణేయస్సాత్వతాం శ్రేష్ఠః శౌరిర్యదుకులేశ్వరః. ౧౩౧

నరాకృతిః పరంబ్రహ్మ సవ్యసాచివరప్రదః ।
బ్రహ్మాదికామ్యలాలిత్యజగదాశ్చర్యశైశవః. ౧౩౨
పూతనాఘ్నః శకటభిద్యమళార్జునభంజకః ।
వాతాసురారిః కేశిఘ్నో ధేనుకారిర్గవీశ్వరః. ౧౩౩
దామోదరో గోపదేవో యశోదానందదాయకః ।
కాళీయమర్దనః సర్వగోపగోపీజనప్రియః. ౧౩౪
లీలాగోవర్ధనధరో గోవిందో గోకులోత్సవః ।
అరిష్టమథనః కామోన్మత్తగోపీవిముక్తిదః. ౧౩౫
సద్యఃకువలయాపీడఘాతీ చాణూరమర్దనః ।
కంసారిరుగ్రసేనాదిరాజ్యవ్యాపారితామరః. ౧౩౬
సుధర్మాంకితభూర్లోకో జరాసంధబలాంతకః ।
త్యక్తభగ్నజరాసంధో భీమసేనయశఃప్రదః. ౧౩౭
సాందీపనిమృతాపత్యదాతా కాలాంతకాదిజిత్ ।
సమస్తనారకత్రాతా సర్వభూపతికోటిజిత్. ౧౩౮
రుక్మిణీరమణో రుక్మిశాసనో నరకాంతకః ।
సమస్తసుందరీకాంతో మురారిర్గరుడధ్వజః. ౧౩౯
ఏకాకిజితరుద్రార్కమరుదాద్యఖిలేశ్వరః ।
దేవేంద్రదర్పహా కల్పద్రుమాలంకృతభూతలః. ౧౪౦
బాణబాహుసహస్రచ్ఛిన్నంద్యాదిగణకోటిజిత్ ।
లీలాజితమహాదేవో మహాదేవైకపూజితః. ౧౪౧
ఇంద్రార్థార్జుననిర్భంగజయదః పాండవైకధృక్ ।
కాశిరాజశిరశ్ఛేత్తా రుద్రశక్త్యేకమర్దనః. ౧౪౨
విశ్వేశ్వరప్రసాదాఢ్యః కాశిరాజసుతార్దనః ।
శంభుప్రతిజ్ఞావిధ్వంసీ కాశీనిర్దగ్ధనాయకః (౮౦౦). ౧౪౩
కాశీశగణకోటిఘ్నో లోకశిక్షాద్విజార్చకః ।
శివతీవ్రతపోవశ్యః పురాశివవరప్రదః. ౧౪౪
శంకరైకప్రతిష్ఠాధృక్ స్వాంశశంకరపూజకః ।
శివకన్యావ్రతపతిః కృష్ణరూపశివారిహా. ౧౪౫
మహాలక్ష్మీవపుర్గౌరీత్రాతా వైదళవృత్రహా ।
స్వధామముచుకుందైకనిష్కాలయవనేష్టకృత్. ౧౪౬
యమునాపతిరానీతపరిలీనద్విజాత్మజః ।
శ్రీదామరంకభక్తార్థభూమ్యానీతేంద్రవైభవః. ౧౪౭

సర్వవృత్తిషు పాత్రైకముక్తో ద్వారకేశ్వరః ।
ఆచాండాలాదికప్రాప్యద్వారకానిధికోటికృత్. ౧౪౮
అక్రూరోద్ధవముఖ్యైకభక్తః స్వచ్ఛందముక్తిదః ।
సబాలస్త్రీజలక్రీడామృతవాపీకృతార్ణవః. ౧౪౯
బ్రహ్మాస్త్రదగ్ధగర్భస్థపరీక్షిజ్జీవనైకకృత్ ।
పరిలీనద్విజసుతానేతార్జునమదాపహః. ౧౫౦
గూఢముద్రాకృతిగ్రస్తభీష్మాద్యఖిలకౌరవః ।
పార్థార్థఖండితాశేషదివ్యాస్త్రః పార్థమోహహృత్. ౧౫౧
గర్భశాపచ్ఛలధ్వస్తయాదవోర్వీభరాపహః ।
జరావ్యాధారిగతిదః స్మృతమాత్రాఖిలేష్టకః. ౧౫౨
కామదేవో రతిపతిర్మన్మథః శంబరాంతకః ।
అనంగో జితగౌరీశో రతికాంతః సదేప్సితః. ౧౫౩
పుష్పేషుర్విశ్వవిజయీ స్మరః కామేశ్వరీప్రియః ।
ఉషాపతిర్విశ్వకేతుర్విశ్వతృప్తోఽధిపూరుషః. ౧౫౪
చతురాత్మా చతుర్వ్యూహశ్చతుర్యుగవిధాయకః ।
చతుర్వేదైకవిశ్వాత్మా సర్వోత్కృష్టాంశకోటిసూః. ౧౫౫
ఆశ్రమాత్మా పురాణర్షిర్వ్యాసః శాఖాసహస్రకృత్ ।
మహాభారతనిర్మాతా కవీంద్రో బాదరాయణః. ౧౫౬
కృష్ణద్వైపాయనః సర్వపురుషార్థైకబోధకః ।
వేదాంతకర్తా బ్రహ్మైకవ్యంజకః పురువంశకృత్. ౧౫౭
బుద్ధో ధ్యానజితాశేషదేవదేవీజగత్ప్రియః ।
నిరాయుధో జగజ్జైత్రః శ్రీధరో దుష్టమోహనః. ౧౫౮
దైత్యవేదబహిష్కర్తా వేదార్థశ్రుతిగోపకః ।
శౌద్ధోదనిర్దృష్టదిష్టః సుఖదః సదసస్పతిః. ౧౫౯
యథాయోగ్యాఖిలకృపః సర్వశూన్యోఽఖిలేష్టదః ।
చతుష్కోటిపృథక్తత్త్వప్రజ్ఞాపారమితేశ్వరః. ౧౬౦
పాషండవేదమార్గేశః పాషండశ్రుతిగోపకః ।
కల్కీ విష్ణుయశఃపుత్రః కలికాలవిలోపకః. ౧౬౧
సమస్తమ్లేచ్ఛదుష్టఘ్నః సర్వశిష్టద్విజాతికృత్ ।
సత్యప్రవర్తకో దేవద్విజదీర్ఘక్షుధాపహః.

అశ్వవారాదిరేవంతః పృశ్నిమర్గతినాశనః ।
సద్యఃస్నానంతలక్ష్మ్యకృన్నష్టనిశ్శేషధర్మవిత్. ౧౬౩
అనంతస్వర్ణయాగైకహేమపూర్ణాఖిలద్విజః ।
అసాధ్యైకజగచ్ఛాస్తా విశ్వబంధుర్జయధ్వజః. ౧౬౪
ఆత్మతత్త్వాధిపః కర్తృశ్రేష్ఠో విధిరుమాపతిః ।
భర్తృశ్రేష్ఠః(౯౦౦)ప్రజేశాగ్ర్యో మరీచిర్జనకాగ్రణీః. ౧౬౫
కశ్యపో దేవరాడింద్రః ప్రహ్లాదో దైత్యరాట్ శశీ ।
నక్షత్రేశో రవిస్తేజః శ్రేష్ఠః శుక్రః కవీశ్వరః. ౧౬౬
మహర్షిరాట్ భృగుర్విష్ణురాదిత్యేశో బలిస్వరాట్ ।
వాయుర్వహ్నిః శుచిశ్రేష్ఠః శంకరో రుద్రరాడ్గురుః. ౧౬౭
విద్వత్తమశ్చిత్రరథో గంధర్వాగ్ర్యోఽక్షరోత్తమః ।
వర్ణాదిరగ్ర్యస్త్రీ గౌరీ శక్త్యగ్ర్యా శ్రీశ్చ నారదః. ౧౬౮
దేవర్షిరాట్ పాండవాగ్ర్యోఽర్జునో వాదః ప్రవాదరాట్ ।
పావనః పావనేశానో వరుణో యాదసాంపతిః. ౧౬౯
గంగాతీర్థోత్తమో ద్యూతం ఛలకాగ్ర్యం వరౌషధమ్ ।
అన్నం సుదర్శనోఽస్త్రాగ్ర్యం వజ్రం ప్రహరణోత్తమమ్. ౧౭౦
ఉచ్చైశ్శ్రవా వాజిరాజ ఐరావత ఇభేశ్వరః ।
అరుంధత్యేకపత్నీశో హ్యశ్వత్థోఽశేషవృక్షరాట్. ౧౭౧
అధ్యాత్మవిద్యా విద్యాగ్ర్యః ప్రణవశ్ఛందసాం వరః ।
మేరుర్గిరిపతిర్మార్గో మాసాగ్ర్యః కాలసత్తమః. ౧౭౨
దినాద్యాత్మా పూర్వసిద్ధః కపిలస్సామవేదరాట్ ।
తార్క్ష్యః ఖగేంద్ర ఋత్వగ్ర్యో వసంతః కల్పపాదపః. ౧౭౩
దాతృశ్రేష్ఠః కామధేనురార్తిఘ్నాగ్ర్యః సుహృత్తమః ।
చింతామణిర్గురుశ్రేష్ఠో మాతా హితతమః పితా. ౧౭౪
సింహో మృగేంద్రో నాగేంద్రో వాసుకిర్నృవరో నృపః ।
వర్ణేశో బ్రాహ్మణశ్చేతః కరణాగ్ర్యం (౧౦౦౦) నమోనమః. ౧౭౫

ఇత్యేతద్వాసుదేవస్య విష్ణోర్నామసహస్రకమ్.

—: విష్ణుసహస్రనామ మాహాత్మ్య కథనము :—

సీ. సకలదుఃఖప్రణాశకము సమస్తసౌ, ఖ్యప్రదాయకము మోక్షప్రదంబు
బ్రహ్మవిష్ణ్వాదిదుర్లభలోకసోపాన, మార్గంబు రాజసమ్మానదంబు
జాడ్యహారంబు రాజ్యప్రదం బఖిలవి, ద్యాదాయకంబు పుత్రప్రదంబు
సర్వసిద్ధికరంబు సర్వపుణ్యక్రియా, ఫలదంబు సర్వసౌభాగ్యదంబు

గీ. వాంఛితార్థద మాయుష్యవర్ధకంబు, ప్రేతభూతాదిమర్దనీహాఫేతివంబు
సంసృతిక్లేశవిక్లబస్వాంతతిమిర, ఘస్ర మీవిష్ణునామసహస్ర మనఘ. 1028

క. ఈనామంబులు శ్రద్ధా, హీనునకును నాస్తికునకు స్వేచ్ఛావాదా
ధీనునకు బోధవిరహిత, మానసునకుఁ జెప్పఁ దగదు మంత్రమువోలెన్. 1029

క. హితకాంక్షికి సుతునకు నా, శ్రితునకు శిష్యునకు వీనిఁ జెప్పుము మోక్ష
స్థితి కర్హు లగుట ధర్మ, చ్యుతి లేకుండంగ నడచు చుందురు వారల్. 1030

క. అరుణోదయసమయంబున, హరినామసహస్రపఠన మనుదినమును నె
వ్వరు గావింతురొ వారలు, పరివర్ధితు లగుదు రఖిలభాగ్యంబులతోన్. 1031

క. నామంబె జపము తపమును, నామంబె సురార్చనంబు నామమె క్రతువుల్
నామంబె తీర్థయాత్రలు, నామంబె సమస్తవిధులు నామంబె సుమీ. 1032

క. నామసహస్రములో నొక, నామం బేనియు స్మరించినను బ్రతిదినమున్
నేమమున వారి కఖిల, క్షేమంబులు గల్గు నేల చెప్పఁగ నింకన్. 1033

క. స్మృతి నొందెడివేళ మనో, ధృతి చెడిపోకుండ నిలిచి యెదుటను నూర్ధ్వ
స్థితికిం గొనిపోయెడియు, చ్యుతనామముకంటె దేహి కొరు లెవరు హితుల్.

క. ఈనామసహస్రంబును, మానవుఁ డనుదినము నియమముగఁ జదివినన్
గాని స్మరించినఁ గాని య, మానుషమహిమమున లోకమాన్యత నొందున్.

గీ. విష్ణునామసహస్రంబు వెలయుచోటు
సర్వతీర్థాలయము గాన సదనమందు
నుంచికొని నామములు వ్రాసి యుండుపుస్త
కమును బూజించుచుండినఁ గలుగు మేలు. 1036

గీ. కోటియజ్ఞఫలంబు చేకూరుఁ దులసి, తోడఁ బూజించునెడ నచ్యుతుని సహస్ర
నామములు చెప్పుచును విష్ణునామమహిమ,మింత యంత యటంచు నే నెన్నఁజాల.

గీ. కార్య మేదేని యొనరింపఁ గడఁగునపుడు
మార్గమునఁ బోవునపుడును మానసమున
సంస్మరించిన నామముల్ జయము గలుగుఁ
గార్యమున నభయంబు మార్గమునఁ గలుగు. 1038

వ. విష్ణునామసహస్రపారాయణంబు శక్తికొలందియు ననుదినంబును నేకకాలంబు
నం గాని ద్వికాలంబులం గాని త్రికాలంబులంగాని కావించుచుండి రేని సకల
శ్రేయంబులుం జేకూరు. 1039

క. పరమపవిత్రము సర్వా, దరణీయము భుక్తిముక్తిదాయకము విప
ద్ధర మీనామసహస్రము, దొరకదు తలక్రిందు లైన దురితాత్ములకున్. 1040

—: పుండరీకోపాఖ్యానకథనము :—

సీ. భూతలంబున మున్ను పుండరీకుఁడు నాఁగ, నుండె భూసురుఁ డొక్కఁ డుత్తముండు
బ్రహ్మచర్యంబును బాలించుచు నతండు, వేదవేదాంగాదివిద్య లెల్ల
గురునియొద్దను నేర్చికొని యగ్నిహోత్రముల్, సలుపుచు నిత్యంబు శ్రద్ధతోడ
నిస్పృహుండై వీడి నిజబాంధవుల నిజ, గృహమును నిజధనక్షేత్రములను

గీ. మూలశాకఫలాశనంబునను దేహ, యాత్ర గడపుచు నిస్పృహుఁ డగుటఁ జేసి
యనుభవించుచునమితసౌఖ్యమునుబుణ్య, తీర్థములలోనఁ గ్రుంకుచుఁ దిరిగితుదకు.

సీ. అరిగి సాలగ్రామ మనుక్షేత్రమున కంతఁ, గాంచి చక్రాంకితగ్రావములను
బొందుచు విస్మయంబును సరస్వతిలోన, దేవప్రహ్లాదం బనుతీర్థమందుఁ
జక్రకుండంబున స్నానంబు గావించి, చిత్తప్రసాదంబుఁ జెంది మిగుల
నచ్చోటు విడనాడ నాత్మ యొప్పమి నందె, నివసించి యొపుడును నిష్ఠతోడ

గీ. విష్ణునామజపంబు గావింపఁ దొడఁగె, సంతఁ దన్నామసేవామహత్త్వమునను
శార్ఙ్గి ప్రత్యక్షమై నిజస్యందనమున, నునిచికొని వాని వైకుంఠమునకుఁ జనియె.

గీ. అని వచించుడు నిట్లనె నమరమౌని, హర్షమున స్వామి నామసహస్రతుల్య
మైనయొకనామ మేదేని యానతిమ్ము, కనికరముతోడ నెల్లవారును దరింప.

వ. అని ప్రార్థించుటయు మహేశ్వరుం డమ్మునికి ట్లనియె. 1044

క. నారద నీ విపు డడిగిన, తీరున ము న్నడుగఁ బార్వతీసతి నే నా
నారీమణి నంకంబునఁ, జేరిచికొని లోనిగుట్టు చెప్పితి నిట్టుల్. 1045

—: రామనామమాహాత్మ్యము :—

క. కామాక్షి రామ యనియెడి, నామ మ్మొక్కఁడె సహస్రనామసమము త
న్నామామృతపానము నా, కామోదము గొలుపుచుండు ననవరతంబున్.

గీ: పడఁతి యీరామనామంబు ప్రతిదినంబు, జపముచేయుచు నుండిన శక్తిఁ గొలఁది
భస్మమొనరించు నఖిలపాపముల నగ్ని, కణము తూలాద్రులనుబోలె క్షణములోన.

ఆ. మఱియు రామనామమంత్రంబును జపించు, నట్టివారి కెట్టియాపదలును
గలుగ నేర వాపదలకు మూలం బగు, పాప మెల్ల దాన భస్మ మగుట. 1048

గీ. రామనామము మోక్షసామ్రాజ్యపదముఁ
బడయఁ దలఁచినమానవప్రతతి కెల్ల
నాశ్రయింపంగఁ దగుమంత్ర మంతకంటె
సులభ మగుసాధనము లేదు కలియుగమున. 1049

వ. ఇంక రామరక్షాకవచముం జెప్పెద వినుము.

—: రామరక్షాకవచము :—

అస్య శ్రీరామరక్షాకవచమంత్రస్య విశ్వామిత్ర ఋషిః. శ్రీరామో దేవతా, అనుష్టుప్ ఛందః. విష్ణుప్రీత్యర్థే జపే వినియోగః.

శ్లో॥ శిఖాం మే పాతు విశ్వాత్మా కర్ణౌ మే పాతు కామదః।
చక్షుషీ పాతు మే దేవః సీతాపతిరనుత్తమః. ౧
జిహ్వాం మే పాతు పాపఘ్నో లోకశిక్షాప్రవర్తకః।
రాఘవః పాతు మే దంతాన్ శ్రీకంఠః కంఠమేవ చ. ౨
పాతు మే హృదయం రామః కేశాన్ రక్షతు కేశవః।
నాభిం పాతు మఖత్రాతా కటీ మే విశ్వరక్షకః. ౩
పార్శ్వయోస్తు సురత్రాతా కాలకోటిదురాసదః।
సక్థినీ పాతు మే దత్తవిజయో నామ విశ్వసృక్. ౪
కరౌ దాశరథిః పాతు పాదౌ మే విశ్వరూపధృత్।
అనంతస్సర్వతః పాతు శరీరం విశ్వనాయకః. ౫

గీ. వసుధ నీరామరక్షాకవచము నెవరు, పఠనమొనరించుచుందురో ప్రతిదినంబు
చెంది వారలు సర్వార్థసిద్ధు లిలను, గాంచెదరు మోక్షపదమును గట్టకడకు.

—: రామస్తవము :—

గీ. మానిని వచింతు వినుము రామస్తవంబు
బ్రహ్మహత్యాదిసకలపాపముల నడఁచి
మోక్ష మొనగూర్చు నిది స్వయంభువు వచించెఁ
బ్రమదమున దీని మును రహస్యముగ నాకు. 1052

సీ. రాఘవ నీ వక్షరబ్రహ్మరూపుఁడ, వబ్జనాభుఁడవు నారాయణుఁడవు
భూతభవ్యభవాత్మభూతుండవు పురాణ, పురుషుఁడ వాద్యంతవిరహితుఁడవు
చక్రాయుధుండవు శార్ఙ్గివి సచ్చిదా, నందమూర్తివి జగన్నాయకుఁడవు
శతజిహ్వుఁడవు ప్రజాపతివి సృష్టిస్థితి, ప్రళయకారకుఁడ వప్రాకృతుఁడవు
గీ. హరివి వైకుంఠుఁడవు ప్రణవాత్మకుఁడవు, వేదమూర్తివి ధర్మప్రచోదకుఁడవు
కృష్ణుఁడవు జిష్ణుఁడవు ధృతత్రిభువనుఁడవు, కారణవివర్జితుఁడ వాదికారణమవు.
సీ. రుద్రులం దష్టమరుద్రుఁడ నీవె వం, చమసాధ్యుఁడవు నీవె సాధ్యులందు
యజ్ఞంబు నీవె హవ్యము నీవె కావ్యదా, తయు నీవె హవ్యభోక్తయును నీవె
స్వాహావషట్కారవహ్నిరూపుఁడ నీవె, యజ్ఞఫలప్రదాయకుఁడ వీవె
గోచరింతువు నీవు గోబ్రాహ్మణులయందు, నాశాంతరక్షసుహృద్రులందు

గీ. నాశ్వినేయులు శ్రోత్రము లర్కవిధులు, కనులు రోమంబు లమరులు త్వొత్తలంబు
స్థైర్య మున్మేషము దినంబు కుపనిమేష, మేను హృదయంబు జగమెల్ల మేను నీకు
గీ. రామచంద్ర భవన్మనోరథమె సృష్టి,లయము నిస్సృహతయె పరాజయము లేదు
నీకు నిన్నాశ్రయించినలోకులకును,నప్రమేయప్రభావ నిన్నగునె తెలియ. 1055
గీ. విప్లవము ధర్మమున కుద్భవించు వేళ, లందు నెల్ల ధరిత్రిపై నవతరించి
బహువిధాకారముల ధర్మబాధకులను, నడఁచు దైవంబ వీవ మహానుభావ.
క. తావకపరాక్రమంబును, దావకసందర్శనమును దావకశరముల్
దావకగుణస్తవంబును, దేవ యమోఘంబు లనుచుఁ దెలుపుదు రార్యుల్.
క. అని చెప్పుటయును బార్వతి, విని హర్షము నొందె నాఁగ విబుధమునీంద్రుం
డనవధికానందం బెద, నెనయఁగఁ జనె వెల్లడింప నిది జగములలోన్. 1058
క. ఈ రామస్తవమును వినఁ, గోరెడివారలకు వినుచుగుణవంతుండున్
గోరి వినునట్టివారును, జేరుదు రవసానమందు శ్రీపతిపురికిన్. 1059
క. ప్రాతస్సాయంవేళల, నేతద్రామస్తవంబు నెవ్వరు శ్రద్ధో
పేతు లయి చదువుచుందురొ, చేతోహర్షమును వారు చెందుదు రెపుడున్.
క. అనవుడు విని శౌనకుఁ డి, ట్లనియె మహాభాగ చెపుమ హరిసేవను జే
యనివిజ్ఞానవిహీనుల, కొనగూడెడిబాధ లెట్టు లుడుగునొ నాకున్. 1061
క. అని యడుగుటయును సూతుఁడు, మునివర నీ వడిగినట్లమును లోకులపై
నొనరినకరుణను శ్రీకం, ఠునిఁ బార్వతి యడుగఁగా మృడుం డి ట్లనియెన్.

—: సర్వార్తి నివారకాపామార్జనవిధానకథనము :—

వ. శ్రీధరుని శిఖయందును శ్రీకరుని శిఖాధఃప్రదేశంబునందును హృషీకేశునిఁ గేశంబులందును నారాయణుని మూర్ధంబునందును విష్ణువు నూర్ధ్వశ్రోత్రంబునందును జలశాయిని లలాటంబునందును గృష్ణుని భ్రూయుగంబునందును హరిని భ్రూమధ్యంబునందును నరసింహుని నాసికాగ్రంబునందును నర్ణవేశయునిఁ గర్ణంబులందును బుండరీకాక్షునిఁ జక్షువులందును భూధరునిఁ జక్షురధోభాగంబునందును గల్కినాథునిఁ గపోలంబులందును వామనునిఁ గర్ణమూలంబులందును శంఖిని నోష్ఠంబులందును గోవిందుని వదనంబునందును ముకుందుని దంతపంక్తియందును వాక్పతిని జిహ్వాయందును రాముని హనువునందును వైకుంఠునిఁ గంఠంబునందును బలఘ్నుని బాహుమూలాధోభాగంబునందును గంసఘాతిని నంసంబులందును నజుని భుజద్వయంబునందును శార్ఙ్గపాణినిఁ గరద్వయంబునందును సంకర్షణునిఁ గరాంగుష్ఠంబులందును గోపుని నంగుళిపంక్తుల

యందును నధోక్షజుని వక్షంబునందును శ్రీవత్సుని వక్షోమధ్యభాగంబునందును ననిరుద్ధుని స్తనంబులందును దామోదరుని నుదరంబునందును బద్మనాభుని నాభియందును గేశవుని నాభ్యధోభాగంబునందును ధరాధరుని మేఢ్రంబునందును గదాగ్రజుని గుదంబునందును బీతాంబరధరునిఁ గటియందును మధుద్విషుని నూరుయుగ్మంబునందును మురద్విషునిఁ బిండకంబులందును జనార్దనుని జానుయుగ్మంబునందును ఫణీశుని గుల్ఫంబులందును త్రివిక్రముని గ్రమంబులందును శ్రీపతిని బాదాంగుష్ఠంబులందును ధరణీధరునిఁ బాదాధోభాగంబునందును విష్వక్సేనుని రోమకూపంబులందును మత్స్యరూపుని మాంసంబునందును గూర్మరూపుని మేదస్సునందును వారాహరూపుని వసామధ్యంబునందును నచ్యుతుని నస్థులయందును ద్విజప్రియుని మజ్జయందును శ్వేతపతిని శుక్రంబునందును యజ్ఞపురుషుని సర్వాంగంబునందును బరమాత్ము నాత్మయందును న్యాసంబు గావించి కొని సాష్టాన్నారాయణాత్మకుం డై సమూలాగ్రంబు లగుకుశలం గైకొని సుదర్శనచక్రంబును వారాహనారసింహవామనావతారంబులను విష్ణునామంబులను స్మరించుచు. 1063

నేను జక్రధరుండ నిఖిలపాపములను, నిఖిలవిషంబుల నిఖిలరుజల
సకలవిపత్తుల సకలాశుభంబుల, సకలగ్రహంబుల సకలరిపుల
నశియింపఁ జేయు చున్నాఁడను మద్దేహ, జము లై నకుశలచే క్షణములోన
నసి పల్కి వానిచే నొనరించునెడ నపా, మార్జనం బచ్యుతమంత్రపరుఁడు
సకలవిషములు సకలదోషములు సకల, పాపములును సమస్తసంతాపములును
సకలరిపులును నశియించి సకలవిధము,లై నసుఖములఁ బడయుదు రార్తజనులు.

ఈయపామార్జనం బనపేక్షు లైన, విష్ణుభక్తులచేతఁ గావింపఁబడిన
సిద్ధిదం బగు లేపన్న సిద్ధి నొంద, దఖిలజనులకు నిది గొప్పయాత్మరక్ష. 1065

సర్వభూతహితంబును జలుప నెంచి,మును బులస్త్యుండు దీని దాల్భ్యున కొసంగ
నమ్మహర్షి సమస్తలోకమ్ములందు, శిష్యముఖమున వ్యాపింపఁ జేసె నభల.
అసి వచియింప శర్వాణి యపరిమితానందభరితాంతరంగ యయ్యె.

ఇది పద్మపురాణకథా, విదితం బగుబ్రహ్మఖండవిషయము దీనిఁ
జదివినను వినిన వినిచినఁ, బదిలంబుగ నుండు విష్ణుభవనమునందుఁ. 1068

అని చెప్పుటయు శౌనకాదిమహర్షు లత్యానందముం జెందిరి. 1069

ఆరాధకజననివహా, ద్ధారక ఫాలాగ్నిదగ్ధదర్పక యాప
ద్వారక సృష్టిస్థితిలయ, కారక శ్రీవిశ్వనాధ కాశీనాధా, 1070

—: మేదినీవృత్తము :—

అనవరతాశ్రితావనపరాయణాంతరంగా
మునిజనమానసాంబురుహాముఖ్యవాసధామా
యనిమిషసన్నుతాత్మచరితామితప్రభావా
వినతసమస్తలోక శ్రుతివేద్య విశ్వనాథా. 1071

గద్యము

చిదంబరకవీంద్రప్రణీతం బైన శ్రీమదాంధ్రపద్మపురాణంబున
బ్రహ్మఖండము
సమాప్తము.

---

శ్రీ కాశీవిశ్వేశ్వరార్పణ మస్తు.



శ్రీమదాంధ్ర

# పద్మపురాణము

(పాతాళఖండము)

ద్వితీయసంపుటము

శ్రీమహీశూరమహారాజాస్థానమహావిద్వాన్
కావ్యకళానిధి ఆశుకవికేసరి విద్యాభూషణ శతావధాని

**పిసుపాటి చిదంబరశాస్త్రి ప్రణీతము**

ప్రకాశకుఁడు

విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి

ఆంధ్రాధ్యాపకుఁడు

**వేంకటగిరిరాజకళాశాల, నెల్లూరు.**

1955

శ్రీమాత్రే నమః

# విజ్ఞాపనము

శ్రీమదాంధ్రపద్మపురాణద్వితీయసంపుటము కృతిభర్త యగుశ్రీకాశీవిశ్వేశ్వర శ్రీమన్మహాదేవునికరుణావిశేషంబునను, గృతికర్త యగుశ్రీచిదంబరకవీంద్రునిసంకల్ప బలంబునను ముద్రితమై యాంధ్రమహోదయులదృష్టిపథము నలంకరింపఁగలిగినది.

ఇందు శ్రీమదాంధ్రపద్మపురాణచతుర్థఖండ మగుపాతాళఖండము మాత్రము కలదు. ఈసంపుటము ప్రథమసంపుటముకంటెఁ బరిమాణమునందుఁ జిన్నదైనను విశిష్టవిషయప్రతిపాదనమందు మిన్నయై యున్నది.

ఇందు "రామాశ్వమేధగాథ" విపులముగా వర్ణింపఁబడినది. మఱియు "రాధాకృష్ణతత్త్వము" "శివమహిమము" "భస్మోత్పత్తిమహిమములు" "శివపూజావిధానము" "సీతాపరిత్యాగప్రధానహేతువు" మున్నగు ననేకవిషయము లుపాఖ్యానములతో వివరింపఁబడియున్నవి. ఇందలివిషయములం దెల్ల నపూర్వవిషయము "పూర్వకల్పరామాయణగాథ". ఇది పురాణేతిహాసములు పరస్పరవిరుద్ధవిషయప్రతిపాదకము లని వివదించువారికి భగవానుఁడు వేదవ్యాసమహర్షి యొసఁగినయప్రతిహతసమాధానము.

ఏతాదృశానేకాపూర్వవిషయబోధకములు నార్షజ్ఞానవిజ్ఞానమూలకందములు నగుపురాణముల నెల్ల నాంధ్రమహాజను లామూలాగ్రముగాఁ జదివి సకలసంశయనివృత్తిం బడసి శ్రేయోమార్గము నధిగమింతురుగాక యని యాసించు చున్నాఁడను.

ద్వితీయసంపుటముద్రణమునకు సైతము శ్రీవేంకటగిరిరాజకళాశాలావిద్యార్థు లుదారభావముతో రెండువందలయెనుబదినాలుగురూప్యము లొసఁగియున్నారు. భాషాభిమానసమానితహృదయులు మార్గదర్శకులు నగునీవిద్యార్థులకుఁ గృతిపతి సకలశ్రేయఃప్రదాత యగుఁగాక యని యాశీర్వదించుచున్నాఁడను.

మఱియు విద్యార్థులలోఁ గొందఱు ప్రోత్సాహకులుగాఁ జేరి రు. 25-0-0 చొప్పన ద్రవ్యము నొసఁగి చేయూఁతయిచ్చియున్నారు మఱికొందఱు ప్రథమసంపుటమును గొని సాయపడియున్నారు

శ్రీమదాంధ్రపద్మపురాణముద్రణమునకుఁ దోడ్పడినదాతలనామధేయము లనుబంధమున ముద్రింపఁబడియున్నవి.

ఆంధ్రమహోదయు లీసత్కార్యమునకు విశేషముగా సహాయపడి యచిరకాలముననే తక్కినసంపుటములను సైతము ప్రకటించుటకుఁ దగినయవకాశమును గల్పింతురుగాక యని యభ్యర్థించుచున్నాఁడను.

ఇట్లు

విన్నవించుభాషాసేవకుఁడు

పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి

ఆంధ్రాధ్యాపకుఁడు, వేంకటగిరిరాజకళాశాల.

నెల్లూరు
1-1-1955

# విషయసూచిక

# శ్రీమదాంధ్ర పద్మపురాణము

## పాతాళ ఖండము



వాణీవైభవసా
ఖ్యానమహాకరుణాకటాక్ష యాశ్రితపక్షా
దేవాసురసంతతసం
సేవితపద విశ్వనాథ శిథిలితబాధా. 1

వ. అవధరింపుము శౌనకాదిమహర్షి లోకనాథుఁడు సభామధ్యగతుం డగు
సూతునిం గనుంగొని మునీంద్రా. 2

గీ. చెప్పితి వనేకగాథ లచ్చెరువు గాఁగ, వీనులకు సంతసం బయ్యెఁ గాని నేఁడు
వినఁగ రామాశ్వమేధంబు వేడ్క పుట్టె, నంతరంగములందు మా కందఱకును.

క. అనుటయు సూతుఁడు సంతస, మును జెందుచు నిట్లు లనియె మునులార పరా
త్మునికథ విన వేడుక మీ, కొనరుట యస నన్ను ధన్యు నొనరుచుటె సుఁడీ. 4

సీ. వినుఁడు వాత్స్యాయనుం డనుమునీశ్వరుఁడు ము, న్నొకనాఁ డనంతునియొద్ద కేఁగి
యహిరాజ నియనుగ్రహమున వినఁగల్గె, సృష్టిక్రమం బెల్లఁ జిత్రముగను
నందులోపల వింటి నతిమానుషము లైన, తరణివంశమహీంద్రచరిత లెల్ల
వానిలో భువనపావన మైన రామక, థామృతం బమితపేయముగ నుండె

గీ. నట్టిరామచరిత్రమునందు వినినఁ, దలఁచినను జెప్పికొనినను గలుష మెల్ల
నఱవఱలు చేయఁ జాలు రామాశ్వమేధ, గాథయొకకొంత వినెడిభాగ్యంబు గలిగె.

క. ఆకథ సవిస్తరముగా, నాకర్ణింపంగవలయు ననియెడివేడ్కన్
నీకడకు వచ్చినాఁడను, నాకోరికి దీర్పుమయ్య నాగాధీశా. 6

—: శేషుఁడు వాత్స్యాయనునకు రామాశ్వమేధముం జెప్పుట :—

సీ. అనుటయు శేషుఁ డి ట్లనియె విప్రోత్తమ, చరితార్థమయ్యె నీజన్మ మెల్లఁ
గలుగదు పుణ్యహీనులకు సంకల్పంబు, రామకథాసుధారసము గ్రోలఁ
బరమాత్ముని స్మరించుభాగధేయము నాకు, మరల నేఁ డబ్బె నీకరుణవలన
మశకకల్పుం డైనమాదృశుం డన నెంత, రామగాథాసాగరంబు నీఁద

గీ. నడిగితివి గానఁ జెప్పెద నంతొ యింతొ, యల్పమతి నైన నాశక్తి ననుసరించి
కానిచో మింటివలె మితి లేనిరామ, భద్రకథ యొడ నే నేడఁ బక్షిసముఁడ. 7

గీ. అగ్నిసంపర్కమున స్వర్ణ మమల మైన, పగిది నాబుద్ధి పరిశుద్ధి వడయ కున్నె
యఖిలఘోరమహాపాపహరణనిపుణ, రామభద్రకథాభిమర్శమునఁ జేసి. 8

క. అని పలికి నిమిషమాత్రము, వినిమీలితనేత్రుఁ డగుచు విజ్ఞానముచేఁ
గని లోకోత్తరకథ నిటు, వినిపింపఁ దొడంగె హర్షవివశుం డగుచున్. 9

—: రాముఁడు రావణవధానంతరము సపరివారంబుగా నయోధ్యకు బయలుదేఱుట :—

సీ. అఖిలజగద్వైరి యగురావణుని నాత్మ, శితసాయకాగ్ని కాహుతి యొనర్చి
గుణవంతుఁ డగువిభీషణుని లంకారాజ్య, మునకుఁ బట్టాభిషిక్తునిఁగఁ జేసి
యింద్రాదిదేవతాబృందంబు భక్తితోఁ, జేయుప్రణామముల్ స్వీకరించి
శమధను లాత్మలం దిముడనిప్రేమతోఁ, జలుపునాశీర్వాదములను బడసి

గీ. కార్య మంతయు దీరినకారణమున
రామభద్రుండు భువనాభిరాముఁ డగుచుఁ
బుష్పకము నెక్కెఁ దనపురంబునకుఁ బోవ
జానకియు లక్ష్మణుఁడును బార్శ్వముల నుండ. 10

ఆ. బయలుదేఱి రపుడు బ్రహ్మాదు లాతని, వెంట వారివెంట వెడలెఁ బ్లవగ
నేత వానివెంట వాతాత్మజుఁడు విభీ, షణుఁడు వానరులును సాగి రంత. 11

క. చనుటయుఁ బుష్పక మాకస, మునకున్ నిర్భగ్నసదనములు గలలంకన్
గనుఁగొనుచు రాముఁ డొకప్రక్కను గాంచి యశోకవనము గతచేష్టుం డై.

క. ఒకకొంతతడవునకు జా, నకియుపచారమునఁ జేతనను జెంది బహిః
ప్రకటితము గానిమానస, వికలతతో నచటు విడిచి వెడలుచు నడుమన్. 13

గీ. విరహవేదనచేఁ దాను దిరిగినట్టి, కాననములును గిరులును స్థానములును
దాను మునిఁగినతీర్థముల్ దాను గనిన, యాశ్రమములను జూపుచు నవనిసుతకు.

గీ. అచ్చటచ్చటఁ గలవింత లవిరతముగఁ, జెప్పుచును దేనెసోనలు చిందునట్లు
సంతసమున నందిగ్రామసవిధమునకుఁ, జేరె నొకతెప్పపాటులోఁ జేరినట్లు. 15

గీ. చేరి స్మరియించుకొని తనచిత్తమందుఁ, బాదుకారాధనైకతత్పరత నున్న
భరతుని విషాద మొదవంగఁ బలికె నిట్లు, దాసుఁ డగునాంజనేయుని దరికిఁ బిలిచి.

క. అనిలతనూభవ యిప్పుడె, చని నందిగ్రామమునకు జయమున నే వ
చ్చినవార్తను దెలుపుము నా, యనుజుం డగుభరతునకు మహానందము గాన్.

క. అనవుడు స్వామినియోగం, బును వాయుసుతుండు శీర్షమున సుమనోమా
లను బోలెఁ దాల్చి శీఘ్రం, బున నందిగ్రామమునకుఁ బోయె మునీంద్రా. 18

—: నందిగ్రామమున భరతుఁడు దుఃఖించుట :—

వ. అప్పుడు నందిగ్రామమునందు. 19

సీ. కడగంట నైనను గానక ద్రవిణంబు, గల నైనఁ గాంతను దలఁచికొనక
యుపకరణం బేనియును ద్రావ నొల్లక, యొద్దకు రానీక యోగిరంబు
జడలు గట్టినశిరోజంబులు వహియించి, వల్కలంబులు దాల్చి వసనములుగఁ
గావించుకొని శయ్యగా గర్తదేశంబు, క్షీణించు దేహయష్టిని భరించి

గీ. భ్రాతృవిరహవిషాదాగ్ని ప్రజ్వరిల్లి, యంత కంతకు మే నెల్ల నావరింప
భరతుఁ డేమియుఁ దోఁపక భావమందు, గడియయుగముగఁ గాలంబు గడపికొనుచు.

ఉ. రా యను రామచంద్ర యవురా యనుఁ గానలలోన నుండఁ దీ
రా యను నెంతధీరుఁడవురా యను నాపయి భార ముంప మే
రా యను నిర్దయుండ వఁటరా యను దీనుని నుద్ధరింప వే
రా యను నాలసింపకుమురా యను దర్శన మీయరా యనున్. 21

వ. మఱియును నాతం డాదిత్యాభిముఖుండుగాఁ జేతులు మోడించి నిలువంబడి. 22

గీ. లోకబాంధవ సకలలోకైకపూజ్య, నైనమహనీయుఁ డెవనికై యడవులందుఁ
దిరుగవలసెనో యాపాపి దురితమునకుఁ, దెన్నఁటికి నైన నిష్కృతి యేరుపడునె.

గీ. సంతతము రామపదసేవ సలిపికొనుచు
ధన్యుఁడై యుండె నట సుమిత్రాసుతుండు
క్షణమును లభింపమిని రామచరణసేవ
నేడుచుచు నుండె నిటఁ గైకయీసుతుండు. 24

వ. అని కొంతతడవు పరితాపంబు నొంది. 25

సీ. వెలలేనిరాజాన్నములు దినువైదేహి, వనుల నాకలమును దినఁగ వలసె
నెండకన్నెఱుఁగక యుండుపట్టపురాణి, నట్టడవులలోన నడువ వలసెఁ
బరపురుషులకంటఁ బడియెఱుంగనిసతి, భిల్లులదరిని వర్తిల్ల వలసెఁ
బట్టుపాన్పులమీఁదఁ బవ్వళించెడితల్లి, స్థండిలస్థలులపైఁ బండ వలసెఁ

గీ. జెలులముచ్చటలకు సంతసిలెడిసాధ్వి, మృగగణారావములు విని బెగడ వలసె
నక్కటక్కట నామాత యవనిజాత, నాకతంబున నెన్ని బన్నములు పడెనొ.

సీ. ఖరకరకిరణసంక్రాంతిచే మాయన్న, వదనబింబం బెంత వాడెనొక్కొ
వనకందఖననంబువలనను మాయన్న, కరపల్లవము లెంత కందెనొక్కొ
ఘనకంటకారణ్యగతులచే మాయన్న, పదపంకజము లెంత ప్రిదిలెనొక్కొ
యుచితపోషణము లేకునికిచే మాయన్న, తనులతాద్యుతి యెంత తఱిఁగెనొక్కొ

గీ. యనుచుఁ బేరెలుఁగునను నా వార్చినట్టు, లార్చు నొకమాఱు బ్రతుకుపై నాసవిడిచి
పులుకుపులుకునఁ గంట నీ రొలుకుచుండ, నేడ్చు నొకసారి మదిదుఃఖమిముడకునికి.

గీ. అట్లు దుఃఖార్తుఁడై యుండునతని నాత్మ, సచివవర్గం బనునయింప సాగెఁ గాని
వారియనునయ మెల్లఁ దదుర్భ్యారిశోక, పావకమునకు నింధనప్రాయ మయ్యె.
క. అతఁ డొకపరిఁ దద్విరహాము, హితమని తలపెట్టికొనుచు నెడనెడ నవ్వాఁ
బ్రతిపదము రామనామము, స్మృతి కెక్కెడిభాగ్య మందుఁ జేకుఱు చుంటన్.
ఆ. అటులు విషమదశను ననుభవించుచు మేను, దాల్చి వచ్చినట్టి ధర్మరాశి
పగిది వెలుఁగుచున్న భరతునిఁ బొడగాంచి, మారుతాత్మజుఁడు నమస్కరించి.
గీ. స్వామివచ్చుచునున్నాఁడు రామచంద్రుఁ, డవనిజాలక్ష్మణసమేతుఁ డగుచు ననుడు
నపుడు భరతుఁడు స్వాంతమునందుఁ జెంది, నట్టిహర్షంబు చెప్ప నా కలవి గాదు.
గీ. అట్లు హర్షామృతాబ్ధిలో నాతఁ డోలలాడుచును వాయుసుతున కిట్లనియెఁ దండ్రి
నన్నుఁ గొనిపొమ్ము మాయన్న యున్నకడకుఁ
జాల నిఁక నుండఁ బ్రదుటియు నిచ్చటను నేను. 32

—: భరతుఁడు రామున కెదురుగా వచ్చుట :—

క. అనుటయును బయలుదేఱెను, హనుమంతుఁడు మార్గదర్శి యగుచు నతనివెం
టనె బయలుదేఱె భరతుఁడు, తనవెంటను దరలిరాఁగఁ దనవా రెల్లన్. 33
ఆ. అట్లు బయలుదేఱి యాపన్నుఁ డేతెంచు, నట్లు వచ్చుచున్న యనుజవరునిఁ
గాంచి దూరముననె కన్నీరు జలజల, రాలుచుండఁ గంట రాఘవుండు. 34
సీ. మణికిరీటము దాల్చునమస్తకం బేభంగి, ధరియించినదియొ యీజిరుసుజడల
నాహ్లాదకర మైనయాననం బేచాయఁ, దాల్చినదియొ యీగ్లాని నఖిలగుణము
జిలుఁగువల్వలు ధరించెడికటిస్థల మెట్లు, వహియించినదియొ యీవల్కలములు
మృష్టాన్నములను వర్ధిలెడి మే నేగతిఁ, గందఁ గల్గినదొ యీకృశదశను
గీ. విశ్వవిశ్వంభరాచక్రవిపులభార, వహనమహనీయతాగుణోద్వహనుఁ డైన
భరతసమ్రాట్టునకు నిట్టిపడనిపాట్లు, గలుగవలసెనె మద్వియోగమున నకట.
క. తమ్మునకు మద్వియోగవ, శమ్మున సమకొనినయీవిషాదమున శతాం
శ మ్మయినఁ గాదు వనవా, సమ్మున నా కేర్పడినవిషాద మ్మకటా. 36
క. అని చింతిల్లుచుఁ బుష్పక, మునమండి యిలాప్రదేశమునకున్ డిగి చ
య్యన వచ్చుచుండునమజ, న్మున కెదురుగఁ జనియెఁ బరిజనులు రా వెంటన్.
గీ. అపుడు భరతుఁడు కనుల హర్షాశ్రుధార, గాఱుచుండంగ నలఘువేగమున వచ్చి
రాఘవునిపాదములపైని వ్రాలి యుండెఁ, జిత్తరువుబొమ్మవోలె నిశ్చేష్టుఁ డగుచు.
క. అంతట రాఘవుఁడును దన, స్వాంతము దుఃఖమునఁ బరవశం బగుటయు నొ
క్కింతతడ వూరకుండి య, నంతర మొకకొంతశాంతి యాపాదిల్లన్. 39

గీ. పాదములపైని బడియున్న భరతు నెత్తి, లేవ నెత్తుటయు నతండు భావమునకు
భ్రాతృశీతలపాణిసంస్పర్శమునను, దెలివి గలుగంగఁ గను లెత్తి తేఱి చూచి.

క. ఎన్నఁడును బడనియడుగుల, నన్నకుఁ గూర్చినఖలుండ నతిపాతకుఁడ౯
నన్ను స్పృశింపకు రాఘవ, మన్ననలును గలవె యిలను మాబోఁటులకు౯.

క. అని పలికి జానకికి వం, దన మొనరిచి తల్లి నీయెదకు వెత గల్గిం
చినమూఢుఁడ నాతప్పులు, గనికరమున సైఁపు మీవె గతి ననుఁ గావ౯.

గీ. కలశభవుని లోపాముద్రకరణి నత్రి, వగాని ననసూయవోలె నన్యూనభక్తిఁ
బతిని సేవించితివి కృతార్థత ఘటిల్ల, జనని యెంతతపంబు మున్నొనరిచితివొ.

వ. అని పలుకుటయు జానకీదేవి కరుణాకటాక్షవీక్షణంబుల భరతు నీక్షించి దీవించెను. పిమ్మటఁ గైకేయీనందనుండు సుమిత్రానందనుం గౌఁగిలించుకొని. 44

గీ. ధన్యుఁడవు నీవు నీతల్లి ధన్యురాలు, పావనం బయ్యెఁ గులము నీప్రభవముననె
వత్స లక్ష్మణ భాగ్యవివర్జితులకు, రామచంద్రునిసేవ సంప్రాప్త మగునె. 45

క. అని చింతిల్లుచు నుండం, గను భరతుని ననునయించి కౌసల్యానం
దనుఁ డితరజనుల నెల్లను, ననామయం బడిగి హర్ష మావహిలంగ౯. 46

గీ. స్వపరివారంబుతోఁ బుష్పకము నెక్కి, బయలుదేఱె నయోధ్యకుఁ బాదచారు
లగుచు దక్కినజను లెల్ల నరుగుదేర. సురసమన్వితుఁ డగుపురందరుఁడువోలె.

క. అప్పుడు భరతుఁడు హర్షం, బుప్పతిలఁగ నన్న వచ్చుచుండినవార్త౯
జెప్పు మయోధ్యాజనులకుఁ, జప్పున నని సుముఖుఁ డనెడిసచివునిఁ బనిచె౯.

గీ. సచివవరుఁడైన సుముఖుఁ డాక్షణమునంద
చని యయోధ్యకు మొదటఁ గౌసల్యకవలఁ
గలజనంబుల కెల్లను దెలియఁజేసె
రాముఁ డరుదెంచుచున్నవార్తను మునీంద్ర. 49

క. అంతట రామాగమవృ, త్తాంతశ్రవణాభిజాతహర్షోద్ఘాతకా
ర్యాంతర మగుచును బురజన, సంతానం బెల్ల వచ్చె స్వామి నెదురుగ౯. 50

—: అయోధ్యకుఁ జేరి శ్రీరాముఁడు తల్లులను దర్శించుట :—

క. చనుదెంచినపురజనులను, గనుఁగొని రాఘవుఁడు గరుణ గలదృష్టులతో
డను దత్పురస్సరంబుగఁ, దననగరంబునకుఁ జేరి తత్కాలమున౯. 51

గీ. పుష్పకమునుండి దిగి భూమిపుత్రితోడఁ, బల్లకిని నెక్కి వెంటనె బయలుదేఱెఁ
గుసుమవర్షంబు దివినుండి కురియుచుండ, సకలజనముల కానంద మావహిల్ల.

వ. అంత నాస్వామి కృతకౌతుకతోరణంబును స్వామిసందర్శనకుతూహలత్వరమాణ
ప్రజాసంచారసమంచితంబును నాహన్యమానపణవభేర్యాదినానావిధమంగళ
వాదిత్రనాదపూరితంబును ప్లవంగప్లవనచిత్రీకృతంబును చందనద్రవసంసేక

విపాంసుకంబును విచిత్రవర్ణధ్వజాలంకృతంబును నగురుధూమనిరీక్షణనృత్యన్మ
యూరమండలంబును నుచ్చైశ్శ్రవోగర్వనిర్వాపణ ధూర్వహతురంగమసందో
హంబును నాధోరణనియంత్రితై రావణస్పర్ధాకరణవిజృంభణోజ్జృంభితగైరికాది
ధాతురచనావిరాజమానదంతావళసంతానంబును గృహోపరిసమారూఢసర్వా
భరణభూషితకన్యాసహస్రవికీర్యమాణముక్తానికరంబును దూర్వాహరిద్రా
సంయుక్తపాత్రహస్తబ్రాహ్మణసువాసినీక్రియమాణనీరాజనంబును వందిమాగధ
సూతసంస్తుతిధ్వనిశోభమానంబును జయ రాఘవ జయ రామ జయ సూర్య
వంశోద్దీపక జయ దుష్టరాక్షససంహారక జయ లోకకల్యాణసంధాయక
జయ విశ్వనాయ కేత్యుచ్చార్యమాణపురప్రజాప్రహర్షభాషణభూషితంబు
ను సీతారామావలోకనకౌతూహలగవాక్షవలభిస్థితపౌరాంగనాజనమనోహర
దృష్టిమాలికాసంకులంబును నగునయోధ్యానగరరాజమార్గంబున సస్నేహావలోక
నంబు గావించుచుం జని చని. 53

క. వినయమునఁ బల్లకిని దిగి, జనములు గనుచుండ సతియు సహజన్ములు తో
డను రాఁగఁ గైకభవనం, బునకుం జని యామెపాదములకుం మ్రొక్కెన్. 54

క. మ్రొక్కిన రాముని జూడక, యక్కేకయరాజపుత్రి యవనతముఖియై
మిక్కుట మగుత్రపతోడను, నొక్కపలుకు గూడఁ బలుక కూరక యుండెన్.

ఆ. అట్టు లూరకున్న నామెయాశయమును, నెఱుఁగకుండఁ గార్య మేది యేని
చేయఁ దగ దటంచుఁ జిత్తంబులోపల, నెంచి రామచంద్రుఁ డిట్టు లనియె.

క. జనని పదునాలుగేడులు, వనవాస మొనర్చి నీవు వాంఛించినరీ
తిని వచ్చినాఁడ మరలను, జను మన్నను జనెద నేల సందేహింపన్. 57

క. అనుటయుఁ గైకేయి మనం, బునఁ గలత్రప విడిచి తండ్రి మొదటను మౌఢ్యం
బున నిన్ను నడవి కనిపితి, ననియెడిచింతాగ్ని లోన నాఱక యుండెన్. 58

క. చను మన్న మరలఁ జనియెద, నని నీ వనినట్టివచన మద్దానికి నిం
ధనరూప మయ్యె నాయన, యన వల దీ వింక నిట్టియశ్రావ్యంబుల్. 59

క. మనుము చిరకాల మెల్లరుఁ, గొనియాడఁగ రాజ్య మేలుకొనుచును సీతా
వనజాతనేత్రతోడను, ననుజన్ములతోడఁ గూడి యానందమునన్. 60

క. అనవుడు రాఘవుఁ డాయమ, యనుమతి గైకొని సుమిత్రయంతికమునకుం
జని తచ్చరణములకు వం, దన మొనరుప నాసతీమతల్లి ముదమునన్. 61

గీ. తండ్రి జగముల కెల్ల భద్రములు గలుగ, వర్ధిలుము చిరకాలము వసుధలోన
ననుచు దీవింప రాఘవుం డామె కిట్టు, లనియెఁ గన్నులఁ గ్రమ్మఁగా నశ్రుజలము.

గీ. అన్న నడవులలోన నొకప్పు డేని, విడువకుండఁగ వచ్చినయిడుమ లెల్లఁ
జవరదాఁక ననుభవించినతనూజ, రత్నమును గాంచితివి తల్లి రత్నగర్భ. 63

క. అని సన్నుతించి తదనుమ, తిని గైకొని సోదరులు సతీమణియును వెం
టనె రాఁగ విగతకళ మగు, జననీగృహమునకుఁ జని విషాదం బొదవన్. 64

క. కరపాదకర్ణకంఠా, భరణవివర్జితయు శోకపరితప్తహృదం
తరయుఁ గృశాంగియు మలినాం, బరయును నయి యున్నతల్లిపదముల కెఱఁగెన్.

గీ. అంతటను దండ్రి వచ్చితే యనుచు నామె, పలుకుచును లోనదుఃఖంబు నిలువకునికిఁ
గంట బోరనఁ గన్నీరు గాఱుచుండఁ, బడియె నిశ్చేష్ట యగుచును బుడమిమీఁద.

గీ. అపుడు రాఘవుఁ డుద్వేగ మావహిల్ల, నంతరంగంబునను దుఃఖ మాఁపికొనుచుఁ
జలుపుచుంటయు శిశిరోపచారములను, గొలఁది సేపటి కామెకుఁ దెలివి వచ్చి.

క. ఏఁడీ నానోములఫల, మేఁడీ నాకన్నతండ్రి యేఁడీ నావాఁ
డేఁడీ నాబంగరుగని, యేఁడీ నారాముఁ డనుచు నేడ్చుచు లేచెన్. 68

ఉ. లేచి చివాలునన్ గవుఁగిలించికొనంగను రాముఁ డాయమం
జూచి విషాదబాష్పములు సోనలు గట్టుచు జాఱ నేడ్చుచున్
నీచరణంబులన్ గొలువనేరనిమూర్ఖుఁడ భాగ్యహీనుఁడన్
నీచుఁడ నేను బుత్రుఁడన నీ కిటు లమ్మరో యేద్వ నేర్కిన్. 69

క. తలిదండ్రులశుశ్రూషను, జలుపనిపాతకులు హీనజన్మము లగుపు
ర్వ్యాలు గాక పుత్రు లగుదురె, కలుగదు వారలకు నూర్ధ్వగతి యెన్నటికిన్. 70

క. కావున నాయపరాధము. భావమునం దుంచుకొనక పావన మగునీ
సేవాభాగ్యము నా కిఁకఁ, గావింపుము గలుగ శాంతకలుషుఁడ నగుదున్. 71

క. అని పలికి తల్లి జనకా. జ్ఞను గొని చని కానకసురసంహారంబున్
బొనరించి జానకిని గై, కొని వచ్చితి మరలఁ జూడు కోడలి ననుచున్. 72

గీ. సీత కౌసల్యపదసరోజాతములకుఁ, బ్రణతి యొనరించుటయు నామె బాష్పజలము
కనుల జాఱుచునుండ నాజనకసుతను, గౌఁగిటను జేర్చికొని క్షణకాల ముండి.

క. జననీజనకుల బాంధవ, జనులను సౌఖ్యమును విడిచి చని పతితోఁ గా
ననములకుఁ దల్లి నీవలెఁ, గనరానియవస్థఁ గనినకాంతలు గలరే. 74

క. దైవసమంబుగ భర్తను, సేవించుటచేతఁ గీర్తి చెందితి విలలో
నీవలన నుభయకులములు, పావనతను గాంచె నేల బహుభాషణముల్. 75

గీ. అమ్మ జానకి నిత్యకల్యాణి వగుము, పడయు మఖిలసుఖంబులు భర్తతోడ
సుగుణగణశాలు లైనట్టిసుతులఁ గనుము, మేలుబంతిగ నుండుము మెలఁతలందు

క. అనవుడుఁ గౌసల్యకు వం, దన మొనరుప లక్ష్మణుండు నాతండ్రి కులం
బున కెల్ల వన్నె దెచ్చితి, వని కౌఁగిటఁ జేర్చి యామె యానందించెన్. 77

క. భరతుం డంతట నాయమ, చరణములకు మ్రొక్క నామె సంతోషమునన్
గరములచే నిమురుచుఁ ద, చ్ఛరీరమును గంట బాష్పజలములు జాఱన్. 78

గీ. తండ్రి భ్రాతృవియోగసంతాపమునను, నీకుఁ గలిగినదురవస్థ నేను జూచి
సైఁపఁజాలమి బ్రతికియుఁ జచ్చినట్లు, యున్నదానను గనులార నిన్నుఁ గనక.

—: భరతుఁడు రామునకు రాజ్యము సమర్పించుట :—

క. అని యూరకుండుటయు నో, య్యన భరతుఁడు జనకదత్త మగురాజ్యం బ
ప్పనమొనరిచె రాఘవునకు, జను లెల్లరుఁ జూచుచుండ సంతోషమునన్. 80

వ. అంతట నొక్కసుముహూర్తమందు సప్తద్వీపమండితం బగుపృథ్వీచక్రంబు నొక్కవ్యాఘ్రచర్మంబున వ్రాసి దానిపైని రామచంద్రునిఁ గూర్చుండఁ బెట్టి.

గీ. కురియుచుండగ దివినుండి కుసుమవృష్టి
దుందుభులు మ్రోఁగుచుండంగ ద్యోతలమున
నమ్మహాత్మున కభిషేక మాచరించి
రమరులసమక్షమందు మహర్షు లెల్ల. 82

వ. అప్పుడు మహానందంబున నిర్జరబృందం బెల్లఁ జేతులు గట్టుకొని నిలువంబడి రామచంద్రుని నిట్లు కీర్తింపఁ దొడంగె. 83

—: దేవతలు రాముని స్తుతించుట :—

క. జయము దశరథతనూభవ, జయము మహీజాకళత్ర జయము మహాత్మా
జయము విబుధార్తిభంజన, జయ మాశరశలభనిచయశమనజ్వలనా. 84

దండకము. రామా త్రిలోకాభిరామా సహస్రాంశువంశాబ్ధిసోమా త్వదీయప్రభావం బసామాన్య మాపన్నసంరక్షకా వేదసందోహచౌర్యంబు గావించి యంభోధిలోఁ దూఱియుండన్ హయగ్రీవరాత్రించరగ్రామణిం గూల్చి మత్స్యావతారంబునన్ వేదరాశిన్ బ్రసాదింపవే ధాతకున్ గూర్మరూపంబునన్ మందరగ్రావమున్ మోసి బర్హిర్ముఖశ్రేణి కెల్లన్ సుధాన్నంబు సంతృప్తిగాఁ బెట్టవే పోత్రివై లోకసంతాపకారిన్ హిరణ్యాక్షరాత్రించరాధీశ్వరున్ దున్మి విశ్వంభరామండలోద్ధారమున్ జేయవే నారసింహుండవై యుద్భవం బంది కంబంబునం దద్ధిరణ్యాక్షరక్షోనుజుం జీల్చి చెండాడి యాపద్గతుం జైనప్రహ్లాదునిం బ్రోవవే వామనాకారముం దాల్చి పాదత్రయక్ష్మాతలం బర్థివై కోరె లబ్ధాభిలాషుండవై సర్వలోకంబు వ్యాపించి రెం డడ్జలన్ శిష్టమై యున్నయేకాంఘ్రిచే దుష్టరక్షోధినాథున్ బలిన్ ద్రొక్కవే యంతఁ [illegible] భార్గవాకారముం జెంది గర్వాంధమైయున్నక్షాత్రంబుఁ గ్రోధాగ్నిలో వేల్చి ముయ్యేడుమాఱుల్ మహీభారమున్ దీర్పవే రామచంద్రుండవై తాటకన్ మాపి గాధేయయజ్ఞంబు రక్షించి చేపట్టి సీతాసతీరత్నమున్ రాజ్యమున్ వీడి ఘోరాటవుల్ సొచ్చి నానావిధక్లేశముల్ సైఁచి లోకాపకారిన్ మహాపాపకారిన్ సురారిన్ సమూలంబుగా రావణుం ద్రుంచి లోకంబులన్ నిల్పవే త్వత్కృతం బైనరక్షోవి

నాశంబు తత్కార్యసంజాతలోకైకకల్యాణము౯ వేయినోళ్ల౯ నుతింపంగ
సాధ్యంబె కృష్ణుండవై పుట్టి శాసించి కంసాదిహింసాపరస్వాంతుల౯ గావవే
ధర్మమార్గైకసంసక్తుల౯ భక్తుల౯ బుద్ధరూపంబున౯ బౌద్ధమార్గంబు బోధించి
సాధింపవే దేవతాకార్యము౯ కల్కివై నాశమొందింపవే పాపలోకంబు
నెల్ల౯ భవల్లీల లజ్ఞేయముల్ సృష్టి గావింప సంకల్ప ముత్పన్న మైన౯
సృజింపంబడు౯ సర్వలోకంబులు౯ స్వస్థత౯ జెంది యుండంగ నాకాంక్ష సంధి
ల్లిన౯ స్వస్థత౯ జెంది యుండు౯ హరింప౯ దలం పేర్పడంగ౯ లయం బొందు
లోకత్రయారాధ్య నీనామముల్ బ్రహ్మహత్యాదిపాపంబుల౯ రూపుమాప౯
సమర్థంబు లస్తోకమాహాత్మ్య నిన్నంట వేనాటికైన౯ జరామృత్యుజన్మాది
దుఃఖంబు లప్రాప్య నీతత్త్వ మెవ్వం డెఱుంగు౯ గుణాతీత నీభావ మెవ్వం
డెఱుంగు౯ నిరాకార నీరూప మెవ్వం డెఱుంగు౯ సదాకార నీ వెల్లెడ౯
నిండియున్నాఁడ వంతర్బహిర్భేదశూన్యుండవై త్వచ్చరిత్రంబు చిత్రంబు
వాఙ్మనసాగోచరా ధర్మభంగం బధర్మోదయంబు౯ దటస్థించుకాలంబునం
దాత్మతేజంబుచే వ్యక్తరూపుండవై యుద్ధరింపంగదే శిష్టుల౯ సంహరింపంగదే
దుష్టుల౯ సర్వశక్తుల్ త్వదాయత్తముల్ నీవు గాకున్న లోకంబు లెల్ల౯
బ్రవర్తింపఁజేయ౯ సమర్థుండు వే ఱొక్కఁ డెవ్వండు స్వామీ భవన్మాయకు౯
లోను గాకుండువా రెవ్వ రీమూఁడులోకంబుల౯ యజ్ఞముల్ పూర్తముల్
దానముల్ ధర్మముల్ దేవ నీప్రీతికై కాదె కావింతు రార్యుల్ తపస్వుల్
తపంబు౯ ద్వదర్థంబ కావింతు రెంతేల తత్త్వజ్ఞులైనట్టివా రెల్లకర్మంబులు౯
నీకె యర్పింతు రాద్యుండ వీ వప్రమేయుండ వీ వప్రకాశుండ వీ వాత్మ వీ వెల్ల
కాలంబు నీపాదయుగ్మంబు లోకత్రయస్తోత్రపాత్రంబు సర్వేప్సితార్థప్రదం బస్మదీ
యాంతరంగంబులం దుండుఁగా కెప్పుడు౯ నిన్ను దర్శించుచు౯ నిన్ను ధ్యానిం
చుచు౯ నిన్ను కీర్తించుచు౯ ధన్యతం జెందుభాగ్యంబు మాకు౯ బ్రసాదింపు
మీశా నమస్తే నమస్తే నమస్తే నమః. 85

క. అని స్తోత్రము గావించుట, యును విని రాఘవుఁడు హర్ష మొందుచు మదిలో
ననిమిషులార భయంపడఁ, జన దెపుడును మీరు ధర్మశరణుల రగుట౯. 86

గీ. ఎప్పు డెప్పు డధర్మాభివృద్ధి ధర్మ, విప్లవంబును గలుగునో విశ్వమందు
నవతరించుచు నుందు నే నప్పు డప్పు, డట్టివిషమపరిస్థితి నణఁగఁ ద్రొక్క. 87

వ. అని సానుగ్రహంబుగా నభయహస్తం బొసంగి మరల నిట్లనియె. 88

సీ. యుష్మత్కృతం బగునుత్తమస్తోత్రంబు, ప్రాతర్నిశలయందుఁ బ్రతిదినంబు
పఠియించునెడ నొక్కపరి శత్రువర్గంబు, నామశేషంబుగా నాశమొందు

సంక్రమింపకయుండు జాడ్యమేదియుఁ గూడ, దారిద్ర్యదుఃఖంబు తలఁగిపోవుఁ
గలుగు మామకపాదకంజాతములయందుఁ, జలనంబు లేకుండ నిలుచుభక్తి

గీ. యని పలికి యూరకుండెను హర్షమునను
నమరు లెల్లరు స్వస్వలోకముల కరిగి
రంతటను రాముఁ డావంతమైన నయము
దొలఁగ కుండంగఁ బాలింపఁ దొడఁగె నిలను. 89

—: రామరాజ్యవిధానకథనము :—

ఆ. లేదు శత్రుభయము లే దీతిబాధలు, లేదు రోగపీడ లే దకాల
మరణ మాత్మనుతియుఁ బరనిందయును లేవు, ప్రాజ్యమైన రామరాజ్యమందు. 90

క. పొలుపారుచుండు నెప్పుడును, ఫలములచేఁ బాదపములు బహుసస్యముచే
నొలయుచు నుండు సతమ్మును, నిల దశరథసుతుఁడు రాజ్య మేలుచు నుండన్.

సీ. అతివలమధ్యములంద దౌర్బల్యము, సలిలబిందువులంద జాడ్యవార్త
యాజ్ఞికబృందంబునంద విలాపంబు, వేధంబు మాణిక్యవితతియంద
నదులంద కుటిలయానంబు ప్రకంపంబు, సాత్త్వికభావప్రసక్తియంద
దండంబు ఛత్త్రికుద్దాలసంతతులంద, గుణవియోగంబు మార్గణములంద

గీ. కంటకములంద తీక్ష్ణత గజములంద, దానవిచ్యుతి భంగముల్ తటినులంద
కాని ప్రజలందు నెందును గాన రావు, రాజ్య మేలుచు నుండంగ రాఘవుండు.

గీ. మడుఁగులంద దశావిభ్రమములు తమము, బహుళపక్షక్షపలయంద బంధనోక్తి
గ్రంథములయంద ప్రజలందుఁ గానరాదు, దాశరథి రాజ్య మేలెడితరుణమందు.

గీ. వర్ణములలోన వర్ణముచలనఁ దప్పఁ, గలుగఁబోదు కుహీనత కలిమివలన
లేదు కలుషంబునకుఁ దక్క లేమి యెందు, రామభద్రుండు పాలించురాజ్యమందు.

ఆ. ఓషధులనె కుష్ఠయోగంబు పాశము, లాక్షికములకరములందె మూర్తి
హస్తములనె శూల మగపడు లే దొంట, రాజ్య మేలుచుండ రాఘవుండు. 95

గీ. అనయసందర్శనంబు స్యందనములంద, కఠినభావంబు తరుణులకదుపులంద
కాని వేఱొకచోటను గానరావు, దాశరథి శాసకత్వంబు దాల్చియుండ. 96

ఆ. రాముఁ డేలుచుండ రాజ్యంబు భోజన, మొకఁడు దక్క సంధ మొందు లేదు
జ్వరము లేదు కామజము దక్క మదము లే, దిభములందుఁ దక్క నెచట నేని.

క. దేవాలయసంతతులును, భావనగుణశాలులైన ప్రజలును గలపై
గావించుఁ గనులపండువు, నేవేళను నూళ్లు రాముఁ డేలుచు నుండన్. 98

గీ. తప్పకుండంగ నిజవర్ణధర్మములను, ధర్మవృద్ధులమాటను దాఁటకుండ
జనులు వర్తించుచుందురు సంతతమును, రాజ్యమొనరించుచుండంగ రాఘవుండు.

క. ఇష్టాపూర్తక్రియలును, శిష్టాచారమును ధర్మసేవయు సరిముక్తిన్
బుష్టి వహింపఁ దొడంగెను, భ్రష్టంబులు గాక రామరాజ్యమునందున్. 100
గీ. కరుణ లేకుండుమనుజుఁడు కానరాఁడు, మహిమ లేకుండ నుండెడువాఁడు లేఁడు
కలను నైనను వినరాదు కలహవార్త, రామరాజ్యమహాత్త్వము నేమి చెప్ప.
గీ. అట్లు ధర్మైకనిష్ఠాంతరంగుఁ డగుచు, వసుధ నేకాదశసహస్రవత్సరములు
రాఘవుం డేలె సుతులట్లు ప్రజలు గొలువ, జనకునిం బోలె ననుజన్ము లనుసరింప.
క. అపు డొకనాఁ డొకరజకుం, డపవాదము వలుక దానికై తనకాంతన్
విపినమున కనిపె రాముఁడు, సపరిజనుం డగుచు నున్నసమయమునందున్.

—: అగస్త్యమహర్షి రామునికడకు వచ్చుట :—

గీ. జలదములు లేక కురియువర్షంబు పగిదిఁ, బ్రసవములు లేక జనియించుఫలము వోలె
నచటి కాకస్మికంబుగా నరుగుదెంచె, గుంభసంభవుఁ డగస్త్యమునికుంజరుండు.
క. అరుదెంచినయమ్మౌనికిఁ, బరమానందమున నర్ఘ్యపాద్యాదివిధుల్
జరిపి యథాశాస్త్రముగను, ధరణీసుతావల్లభుండు తా ని ట్లనియెన్. 105
సీ. తాపసోత్తమ భవద్దర్శనంబున నేసి, చరితార్థమయ్యె నాజన్మ మెల్ల
భద్రంబె మీవేదపారసంతతులకుఁ, గుశలంబె మీశిష్యకోటులకును
గ్రూరజంతువులు చేకూర్ప కున్నవియె మీ, యాశ్రమంబులకు నేయాపదలును
నెట్టిప్రత్యూహంబు లేని లేకుండఁగా, నడుపుచునె మీయగ్నిహోత్రములకు
గీ. మీతపము సాగుచున్నదే యేమిబాధ, లేనియును గల్గకుండఁగ నెప్డుఁ గూడ
నాకుఁ దీర్చఁదగుకార్యమే దేనియున్నఁ, జేయుటకు భృత్యుఁడున్నాఁడు సిద్ధముగను.
క. అనుటయు నగస్త్యుఁ డిట్లని, యెను స్వామి పరాత్పరుండ వీ వేలికగా
నెనయుచు నుండఁగ లోపం, బనునది యొకఁ డున్నె యస్మదాదుల కెల్లన్.
క. రావణముఖ్యులఁ గూలిచి, దేవతలకు మర్త్యులకును దీఱనిబాధల్
పోవ నడంచినదేవుఁడ, వే పాకఁడవు గాక కలఁడె యెవ్వం డిచ్ఛన్. 108
గీ. ధన్యతను గల్గఁజేయునీదర్శనంబు, కోఱకు నరుదెంచినాఁడ నాకోర్కె దీరె
నింతె కాని మఱేకార్య మేని లేదు, నీవు గావింపఁదగినది నీరజాక్ష. 109
క. అని పలికి రామసందర్శనజనితాహ్లాదపరవశస్వాంతుండై
మునిధర్మంబును బ్రకటన, మొనరించినచందమునను నూరక యుండెన్. 110

—: అగస్త్యుఁడు రామునకు రావణాదులచరిత్రము చెప్పించుట :—

సీ. అటు లూరకుంటయు నమ్మహాత్మునికి, వినవంశవర్ధనుం డిట్టు లనియె
యతివర నాచేత హతులైన రావణ, కుంభకర్ణులగాథఁ గూర్చి నాకుఁ
దలఁపు గల్గె వినంగ సెలవిమ్ము దయతోడఁ, గాలత్రయజ్ఞానశాలి వీవు
నాపుడు నచ్చినవానికి ట్లనియె నగా, త్యాస్వయానుభోగ్యశాంక వినుము

గీ. బ్రహ్మ సృష్టికిఁ గర్త యాబ్రహ్మ కుదయ, మొందెను బులస్త్యుఁ డాతని కుద్భవించె
విశ్రవుఁడు సతు లిద్ద రావిశ్రవునకుఁ, గలరు మందాకిని యనఁ గైకసి యనంగ.
సీ. ఆకాంతలందు మందాకిని యనునామె, కావిర్భవించి ధనాధినేత
శివునిఁ గూర్చి తపంబు చేసి తత్కృపను లం, కారాజ్యమును బుష్పకమును బడసె
రావణకుంభకర్ణవిభీషణాఖ్యులు, గలిగిరి కైకసీకామినికిని
గాని రావణకుంభకర్ణు లైరి యధర్మ, చరులు సంధ్యాకాలజాతు లగుట
గీ. నట్లు లుండంగ నొకనాఁడు యక్షరాజు, స్వర్ణమణిదీప్త మైనపుష్పకము నెక్కి
సపరివారంబుగా వచ్చి సలిపి ప్రణతి, తల్లిదండ్రుల కుల్లము పల్లవింప. 112
క. జననీజనకులదర్శన, మొనగూడినదినమె సుదిన ముపలబ్ధం బ
య్యెను నేఁ డాభాగ్యము నా, కని నుతి యొనరించి నిజగృహంబున కరిగెన్.
సీ. అంతట రావణుం డది చూచి యాత్మలో, నత్యంతవిస్మయం బావహిల్లఁ
దనతల్లికడ కేఁగి జనని యిప్పుడు వచ్చి, నట్టివాఁ డెవఁ డని యడుగుటయును
కైకసి రోషంబు గలిగినచూడ్కితో, నీక్షించుచును వాని కిట్లు లనియె
మత్సపత్నీగర్భమాణిక్య మాతండు, వన్నె కెక్కెను వానిఁ గన్నతల్లి
గీ. పుట్టితిరి నాకు మీరలు పురుగులట్లు, శయనభోగాశనములె మీజన్మములకు
ఫలము లయ్యెను గార్దభంబులకుఁ గలదె, భారవహనంబు కంటెను ఫలము వేఱు.
గీ. తప మొనర్చి శివప్రసాదంబువలనఁ, బడసె లంకాధిపత్యంబు వడసె దివ్య
సంపదలును విమానరాజమును బడసె, సాటి గలుగునె వానితోఁ గీటములకు.
చ. అనుటయు రావణుండు విని నాయనుమాటలు సైఁపరామి ని
ట్లనియెను దల్లి నీకు లవ మైనను లోపము లేదు వానికం
టెను ఘన మైనశక్తిని గడింతుము మువ్వుర మేము నల్వురన్
వినఁగను రత్నగర్భ యనువిశ్రుతి నొందెద వీవె చూడుమా. 116
గీ. కీటకల్పుఁడు ధనదుఁడు కేవలంబు, వాఁడు చేసినతప మెంత వాని కుండు
నట్టిలంకాధిపత్య మత్యల్ప మతని, శక్తి మాయొద్దఁ బొగడుట సాహసంబ. 117
ఆ. వినుము నాప్రతిజ్ఞ విశదంబుగాఁ దల్లి, యనుజయుతుఁడ నగుచు నడవి కరిగి
సలిపి ఘోరతపము స్థాపించెదను సర్వ, జగములను మదేకశాసనమున. 118
గీ. ఆవిధంబునఁ గావింపనైతి నేని, కలుగుఁ బితృలోకఘాతంబువలనఁ గలుగు
నట్టిపాపంబు నాకని యాగ్రహమున, ననుజయుతుఁ డయి కాననంబునకుఁ జనియె.
క. చని దశసహస్రవర్షము, లొనరించె విరించిఁ గూర్చి యుగ్రతపం బా
దనుజాగ్రణి యొకకంటన్, గనుచు రవిన్ నిలిచి యొక్కకాలన్ నేలన్. 120
గీ. అంతటను వానియుగ్రతపోగ్ని కాఁగఁ, జాలక జగంబు లల్లకల్లోల మగుడు
నజుఁడు ప్రత్యక్ష మై యిచ్చె నతని కడిగి, నట్టివరముల నెల్ల ని ట్లట్లు నాఁగ.

క. వరములు గైకొని రావణుఁ, డరుదుగ ధనదుని జయించి యాతనిలంకా
పురరాజ్యవిమానములను, హరియించెను మొదట దుర్మదాటోపమునన్. 122

క. అది మొదలుగఁ ద్రిజగములను, సదమద మొనరించుచును సజయ్యుండై యా
త్రిదశారి తిరుగసాగెను, మదసింధురమట్లు గనక మన్నన్ మిన్నన్. 123

సీ. అంతట నిర్జరు లల్లాడుచును బోయి, మొఱవెట్టఁ బరమేష్ఠిముందు నిలిచి
యది విని ద్రుహిణుండు త్రిదశులతోఁ గూడి, కైలాసనాథునికడకు నేఁగి
విన్నవింపఁగ నెల్లవిషయంబు నాలించి, ధూర్జటి వారలతోడఁ గూడి
దైత్యాంతకునిసన్నిధానంబునకుఁ బోయి, వృత్తాంత మంతయు విశదపఱుప

గీ. మాధవుం డాలకించి తద్బాధ లెల్లఁ, జూచుచు దయారసం బొల్కుచూడ్కితోడ
వారితో నిట్టు లనియె గీర్వాణులార. చక్రధరుఁ డుండ మీ కేల సాధ్వసంబు.

సీ. అవనిమీఁద నయోధ్య యనియెడిప్రఖ్యాతి, గాంచిననగరంబు గల దొకండు
తత్పురంబున నుండు దశరథుం డనుపేర, శంస కెక్కినయొక్కచక్రవర్తి
యనపత్యుఁ డగుటచే నాతఁడు పుత్రార్థ, మొనరించుచున్నవాఁ డొకక్రతువు
నతనిపత్నీత్రయమందు రాముఁడు భర, తుఁడు లక్ష్మణుండు శత్రుఘ్నుఁ డనఁగ

గీ. నవతరించెద నే నాల్గువ్యక్తులుగను, రావణుని సంహరింప మీరలును ఋక్ష
వానరాకారములు గలవారలగుచు, స్వాంశములతోడఁ బ్రభవింపుఁడవనియందు.

క. అని బోధించుటయును న, య్యనిమిషులును ఋక్షవానరాకారములన్
జనియించిరి ధాత్రిని నా, జనార్దనుఁడ వీవ యేల సత్యము దాపన్. 126

క. ఇనవంశోద్ధారక నీ, యనుజులు మువ్వురును దావకాంశములె సుమీ
మును గలనైరమున దశా, ననుండు హరియించె నీపణాంతిని విం . 127

క. దురితాత్ముం డగునాబ్ర, హ్మరాక్షసునిఁ గూల్చి జగము లన్నిటికిని దు
ర్భర మగుబాధను మానిపి, పరగం జేసితివి ధర్మపథము మహాత్మా. 128

—: రాముడు తనబ్రహ్మహత్యాపాతకమునకు దుఃఖించుట :—

గీ. అనుటయును బాష్పజలపూరితాక్షుఁ డగుచు, రామభద్రుఁడు ధరపై నిద్రాలెనంత
సంభ్రమం బేర్పడఁగఁ గుంభసంభవుండు, నిమురుచును నంటి తచ్ఛరీరమును గేల.

ఆ. ఇట్టు లనియె రామ యేల మూర్ఛిల్లితి, వేల కలిగె శోక మింత నీకు
నఖిలలోకకర్త వగునీవె యీరీతి, భ్రాంతి నొంద నింకఁ బ్రాజ్ఞుఁ డెవఁడు. 130

చ. అనవుడు మూర్ఛఁ దేఱి వినతాననుఁడై త్రపతోడ లేచి యి
ట్లనియెను రామచంద్రుఁడు మహాత్మ హతాత్ముఁడ నైతి నాకతం
బునను గలంక మేర్పడియెఁ బూర్వమునుండియు సుప్రతిష్ఠతో
ననసినసూర్యవంశమున కెల్లను నేఁటికి నేను చెప్పఁగా . 131

క. అకటకట చేసినాఁడను, వికలవివేకుండ నగుచు విప్రద్రోహం
బాకయాఁడుదానికొఱకుఁ గీ, యకృత్యమున కింక శాంతి యనునది గలదే. 132

గీ. వేదములు మూలములు ధర్మవిధుల కెల్ల, విప్రవంశము మూలము వేదములకు
వేదమూలంబు నఱకిన వీని కింక, నెట్టిగతి పట్టనున్నదో యెఱుఁగ రాదు. 133

క. భూసురులకు ద్రోహంబును, జేసినవారలకు నరకసీమలలోనన్
వాసము ధ్రువ మని పెద్దలు, చేసినసిద్ధాంత మెట్లు చెఱుపఁగవచ్చున్. 134

గీ. దానమానసపర్యావిధానములకు, నర్హు లగువారు బ్రాహ్మణు లట్టివారి
నుపహతి యొనర్చుపాపుల నుద్ధరింపఁ, గలుగు నేదేని యొక్క నిష్కృత్య మనఘ.

క. అని వేఁడుటయు నగస్త్యుం, డినవంశోద్ధారకునకు నిట్లనియెను ని
వనవద్యుండవు మాయా, మనుష్యరూపుఁడవు సర్వమాన్యుఁడవు సుమీ. 136

క. నీనామము స్మరియించిన, ఘనపాపుల యఘంబు లెల్ల మాయుచు నుండం
గా నీ కెక్కడి యఘములు, భానుకులోద్భూత చెదలు పట్టునె శిఖికిన్. 137

గీ. నీవె కర్తవు భర్తవు నీవె నీవె హర్త, వీశ్వరుఁడవు నీవె యఖిలమునకు
నీవె నిర్గుణుఁడవు గుణి నీవె పరమ, పురుషుఁడవు నీవె ప్రకృతికిఁ బరుఁడ వీవె.

క. నీయతివ మహావిద్య సు, మా యామెను దలఁచికొన్నమాత్రముననె ని
శ్శ్రేయసము నొందు భాగ్యము, నాయాసంబుగను బ్రాప్తమయ్యెడి ననఘా. 139

సీ. కాఁడు రావణుఁడు రాక్షసుఁడు వైకుంఠుంబు నను నిన్ను సేవించుఘనుఁడు గాని
దైవికంబుగను బ్రాప్తంబైన ఋషిశాప, మున దానవత్వ మాతనికిఁ గలిగె
నసురదేహము విడనాడి నేఁడు కతంబు, త్వదనుగ్రహంబున ధన్యుఁ డయ్యె
బ్రాహ్మణద్రోహపాపంబు సంప్రాప్తించె, ననుచింత వలదు నీమనమునందుఁ

గీ. గావు హంత వనుగ్రహకర్త వీవు, కాన నేపాపమును నీకుఁ గలుగ దనుచు
గద్గదస్వర మేర్పడఁ గంత మెత్తి, ఋషివతంసంబునకు రాముఁ డిట్టు లనియె.

సీ. తాపసోత్తమ భవద్భాషణంబున శాంతి, చేకూరదయ్యె నాచిత్తమునకుఁ
గలుషంబు ద్వివిధంబుగా నుండు జ్ఞాతంబు, నాఁగ నజ్ఞాతంబు నాఁగ మఱియు
నజ్ఞానకృత మైన నజ్ఞాత మనియును, జ్ఞానకృతం బైన జ్ఞాత మనియు
ననుశయంబునఁ బోవు నజ్ఞాత మనియును, ననుభవింపక జ్ఞాత మడఁగ దనియుఁ

గీ. బలుకుదురు పెద్ద లావాక్యములనుబట్టి
యయ్యె నజ్ఞాత మేఁ జేసినట్టి యఘము
దానిని నశింపఁజేయఁ దీర్థంబొ క్రతువొ
దానమొ తపంబొ వ్రతమొ యేదేని చెపుమ. 141

క. అని ప్రార్థించుటయును ని, ట్లనియె నగస్త్యుండు రామ యఖిలజ్ఞుఁడ వ
య్యును నీ విట్లు లడుగుటకున్, గన లోకానుగ్రహంబు కారణము సుమీ. 142

సీ. అవధరింపుము చెప్పెద నశ్వమేధ. యాగమున బ్రహ్మహత్యాఘ మంతరించు
నది మహాబలు లైనమీ యట్టినృపులె, యాచరింపఁగ నర్హు లనర్హు లొరులు.

క. మనువు మరుత్తుండు పృథుండును సగరుండును దిలీపుఁడును మున్నుగ వా
రొనరించి యశ్వమేధము, మును గాంచిరి దివ్యధామములను నరేంద్రా. 144

క. శతమన్యుఁడు మున్నొనరిచి, శతాశ్వమేధములు త్రిదివసామ్రాజ్యశ్రీ
పతి యయ్యె వాజిమేధ, క్రతు వఖిలాభీష్టసిద్ధికరము మహీశా. 145

చ. అనుటయు రామచంద్రుఁ డెనయన్ మది ధైర్యము కొంత ప్రాపు యే
యనువున నుండఁగావలెనొ యశ్వము తద్విధి యెల్ల చెప్పి నా
మనమున నున్నఖేదమును మాన్పుము నావుడు నమ్మహర్షి యి
ట్లనియెను సూర్యవంశకలశాబ్ధిసుధాకర యాలకింపుమా. 146

---: అశ్వమేధవిధాన కథనము :---

సీ. శ్యామకర్ణము శ్వేతదేహమును రక్త, వదనమును పీతపుచ్ఛము వాయువేగ
సహితమును శుభలక్షణసంభృతమును, నగుహయం బశ్వమేధయాగార్హ మనఘ.

వ. అట్టిహయంబును చైత్రపూర్ణిమయందు యథావిధిగఁ బూజించి తత్ఫాల
దేశంబున స్వనామబలచిహ్నితం బగునొక్కస్వర్ణపత్రంబు గట్టి విడువవలయు.

క. తురగం బెచ్చటి కేచ్చటి, కరుగునొ తద్రక్షణార్థ మతిశౌర్యబల
స్ఫురితాన్వితు లగురక్షకు లరుగుచు నుండంగవలయు నచటికచటికిన్. 149

క. ఆవాజిమేధతురగము, నేవీరులు గాని పట్టి రేని భుజాద
ర్పావిష్టు లగుచు వారల, చేవ యడఁచి రక్షకులు విజేతృత్వమునన్. 150

క. విడిపింపవలయు హయమును. గడె బడకుండంగ నాపదంబున భువి నె
ల్లెడలను దిరుగఁగ వలయును, గడిమిం గాపుచును బురుషకారము మెఱయన్.

ఆ. కర్త యాగదీక్ష గైకొని మృగశృంగ, ధరుఁడు బ్రహ్మచర్యపరుఁడు ధర్మ
శీలనానుషక్తచిత్తుండు నగుచును, నుండి క్రతువు చేయ నున్నచోట. 152

సీ. ఓదనము గోరువారికి నోదనమును, వస్త్రములు గోరువారికి వస్త్రములును
ధనము ధనార్థులకు నిచ్చుచును సతంబుఁ, గడపవలయును నొకయబ్దకాలమధిప.

క. అనుటయు రాముఁడు హర్షం, బును బొందుచు సత్వరంబ మునినాథునితో
డను వాజిశాలకుం జని, కనుము మఖతురంగ మిందుఁ గలదె మహాత్మా. 154

గీ. అనుటయును మౌని సంఖ్య లేనట్టియాగ
హయములను జూచి మదిని విస్మయముఁ జెంది
రామ కల విందసంఖ్యాధ్వరములు సేయఁ
దగినయట్టితురంగరత్నములు కనుము. 155

ఉ. నావుడు రామచంద్రుఁడు మనంబునఁ జెప్పఁగ లేనిసంతసం
బావహిలన్ ఘటోద్భవసమన్వితుఁడై తనపార్శ్వసీమలన్
సేవకు లేఁగుదేరఁగను జేరి వెసన్ సరయూమహానదీ
పావనతీరభూమి కొకపట్టున నమ్మునిరాజునానతిన్. 156

గీ. స్వర్ణలాంగలములచేతఁ జదరముగను, నాల్గుయోజనములమితి గల్గినట్టి
నేల దున్నించి యధ్వరశాల నచట, నేరుపఱచెను లక్షణోపేతముగను. 157

గీ. యోనిమేఖలచే నొప్పు చుండునగ్ని, కుండమును రత్నములచేతఁ గూర్పఁబడిన
మండపములును గన్నులపండువుగను, గ్రాలఁదొడఁగెను హయమేధశాలయందు.

ఉ. అంతట మౌనిసత్తముల కందఱకున్ హయమేధయాగవృ
త్తాంతము విన్నవించుటకునై తనశిష్యులఁ బంచె జానకీ
కాంతునిప్రార్థనంబున నగస్త్యుఁడు వార్తను విన్నమాత్ర న
త్యంతకుతూహలంబు లెనయన్ జనుదెంచిరి మౌనిసత్తముల్. 159

ఆ. అరుగుదెంచినట్టివ్యాసాత్రిగౌతమ, యాజ్ఞవల్క్యనారదార్ష్టిషేణ
పర్వతాసితాదిపరమర్షులకు నెల్ల, నాచరించె రాముఁ డర్ఘ్యపూజ. 160

గీ. అంతట వచించె ఘటజన్ముఁ డధ్వరంబు, మొదలు వెట్టంగఁ దగినట్టిమూర్తమపుడు
కాలజిత్తనుసేనాని క్రతుహయంబు, నటకు రావించె సౌమిత్రి యాజ్ఞచేత. 161

గీ. ప్రభువుకై వడి సపరివారముగ వచ్చి, నట్టిహయరత్నమును జూచి యచట నుండి
నట్టివా రెల్లఁ జెందినహర్ష మింత, యంత యని చెప్పఁగను నాకు నలవి గాదు.

గీ. అపుడగస్త్యుఁడు చెప్పినయట్లు స్వర్ణ, దారయుతుఁడయి క్రతుదీక్ష దాల్చె రాముఁ
డాత్మకృతమైనబ్రహ్మహత్యాఘ ముడుగ, నందఱును విన సంకల్ప మాచరించి.

వ. అంతట రఘుకులంబునకుఁ బూర్వగురుం డగువసిష్ఠుని నాచార్యత్వంబునందును వాల్మీకి నాధ్వర్యవంబునందును దేవలాసితులను బూర్వద్వారంబునందును నత్రికశ్యపులను దక్షిణద్వారంబునందును జాజలిజాతూకర్ణ్యులను బశ్చిమద్వారంబునందును నేకతద్వితీకులను నుత్తరద్వారంబునందును నియమించి కణ్వునకు ద్వారాధిపత్యంబు నొసంగి యగస్త్యుండు బ్రహ్మత్వంబు వహించి యశ్వంబు నర్చించె. 164

గీ. ఆవల సువాసినులు సేసి రశ్వపూజ, గంధపుష్పాక్షతాద్యుపకరణములను
నవల వారాంగన లొనర్చి రమ్ముఖాశ్వ, రాజమున కర్చనమును వర్ధాపనమును.

వ. తదనంతరంబ కుంభసంభవుండు.

సీ. ఇనవంశభూషణంబును ధనుర్ధరమౌళి, యును నైనదశరథజనవరునకు
సతులయం దగ్రగణ్యతను గైకొనినట్టి, కౌసల్య యనురాజకన్యకకును

క. విడిచిన వెంటనె యశ్వము, కడువడి ప్రాగ్దిఙ్ముఖంబుగాఁ బఱచెను వెం
బడిఁ బరువులెత్తుకొనుచున్, నడతెంచుచు నుండ వీరనాయకబలముల్. 203

సీ. అట్టులు పఱచుచు నయ్యధ్వరాశ్వంబు, కురుదశార్ణోత్తరకురువులకును
పాంచాలములకును బర్బరంబులకును, నరుగుటయును దత్తదధిపు లెల్ల
భయభక్తు లెసఁగఁగఁ బ్రణతిపూర్వకముగా, శత్రుఘ్నునకు సమస్యలను జలిపి
కాము మే మొరులము రామభక్తులము నా, రాజ్యసంపద లెల్ల రాఘవునిది

గీ. యని వచించుటయును దనయాజ్ఞ నచటఁ, బాసుకొల్పి శత్రుఘ్నుఁడా ప్రభువులఁ గొని
బయలు దేఱంగ సంతి నా హయము చేరె, నరుగుచును నొక్కసురుచిరోద్యానవనిక.

సీ. అంతట శత్రుఘ్నుఁ డట కేఁగి బలముతో, నం దొక్క దేవాలయంబుఁ గాంచి
యనుపమం బగుదానియాకార మంతయుఁ, గమన కాశ్చర్యంబు గలుగఁ జేయఁ
దన కనుచరుఁడు రామునకు మంత్రియు నైన, సుమతి కిట్లనియె నోసూనృతోక్తి
తెలుపుము సర్వంబు దెలిసినవాఁడ వీ, దేవాలయముగాథ తేటపడఁగ

గీ. ననుటయును విని సుమతి యి ట్లనియె స్వామి, యాలకింపుము కామాక్షి యనెడి దేవి
యాలయం బిది యొక్కభూపాలమౌళి, తపముచేతను నిలిపె నాతల్లి నిచట. 205

క. అనుటయు విని శత్రుఘ్నుఁడు, మనమున హర్షంబుఁ జెంది మహితుం డగునా
జనపతివృత్తాంతంబును, విన వేడుక యయ్యె సుమతి వినిపింపు మనన్. 206

—: సుమదమహారాజవృత్తాంతకథనము :—

సీ. సుమతి యిట్లు వచింపఁ జొచ్చె నరికృతాంత, వినుము తద్వృత్తాంతమును సవిస్తరముగ
గనుమాపుమేరలోఁ గనుపట్టుఁ జూడుము, ల్లదిగో యహిచ్ఛత్ర యనుపురంబు
సుమదుండను నొక్కక్షోణీశ్వరుఁడు మున్ను, పాలించుచుండఁ దత్పురంబు
నొకసమయంబున నోడించి యతని శాత్రవులు గైకొనిరి తద్రాజ్య మెల్ల

ఆ. నపుడు దిక్కు లేక యల్లాడుచును తేఁడు, హేమకూటమునకు నేఁగి యచట
విమలతీర్థమందు విజితేంద్రియుం డయి, చేయఁదొడఁగెఁ దపము శివను గూర్చి.

వ. ఒక్కపాదంబున నిలువంబడి మూఁడువత్సరంబులును శుష్కపర్ణంబులు భక్షించుచు మూఁడువత్సరంబులును శీతకాలంబునందుఁ జలినీట మునుఁగుచు వర్షాకాలంబున జలదోన్ముఖుం డగుచు గ్రీష్మకాలంబునఁ బంచాగ్నిమధ్యంబున వసియించుచు మూఁడువత్సరంబులును వాయువును నిరోధించి బహిర్దృష్టివర్జితుం డగుచు మూఁడువత్సరంబులును గడపుటయు ద్వాదశవత్సరాంతంబునందు మహేంద్రుండు భయంబునఁ దత్తపోభంగంబు గావించుటకు మన్మథునిఁ దలంచె నంత. 208

ఆ. తలఁపులోనె వచ్చి దర్పకుం డచటికిఁ, బాకశాసనునకుఁ బ్రణతి సేసి
నిలుచుటయును నతని బలభేది కూర్చుండఁ, బెట్టుకొని నిజార్ధపీఠమందు. 209

యతఁ డొకనాఁడు సాయంకాలమున సమిధాహరణమునకై యడవి కరిగె
నత్తఱిఁ గ్రతుభంగ మాచరింపఁగ వచ్చి, దమనుం డనెడియొక దైత్యనేత

గీ. యెచట నున్నాఁడు మునిబంధు వెచట నుండె
నతనిసతి యంచుఁ గ్రుద్ధుఁడై యఱచుటయును
వహ్ని గజగజలాడుచు వాని కపుడు
గర్భవతి యైనతాపసాంగనను జూపె.

గీ. అంతటను యాతుధానుఁ డాయమను గొప్ప, పట్టి యీడ్చుచుకొని పోవునట్టివేళ
గడగడవడంకుచుండునా గరితగర్భ, కుహరమునుండి యొకయర్భకుండు పడియె.

మ. పడి యాబాలుఁడు తత్తనూద్గతబృహద్భానుండు నాఁ జెల్లుచున్
గడ లెల్లన్ వెలిఁగించుచున్ నిజవపుఃకాంతిచ్ఛటాక్రాంతిచేఁ
గడకన్ నిప్పులు రాలుచుండుకనులన్ గ్రవ్యాదునిం జూడ నా
చెడుగం డాక్షణమందె కాలె నిల భస్మీభూతకాయంబుతోన్. 242

ఉ. అంతట బిడ్డ నెత్తుకొని యామునికాంత పరాభవానలా
క్రాంతమనస్కయై కనులఁ గాఱుచు నుండఁగ నశ్రుధారల
త్యంతవిషాద మొందుచు నిజాశ్రమభూమికిఁ జేరె నంతఁ ద
త్కాంతుఁడు నంతఁ గూడె నాల్పు సమిధల్ గొని పూర్వమువోలె నింటికిన్. 243

క. అఱచుటయును నేడ్చుచుఁ, గునికిమేలంగునాను మానినీగజగమన సు
త్తరుణీమణి యెఱింగించెను, జరిగినవృత్తాంత మెల్ల సవిశేషమునన్.

క. మునివరుఁ డావృత్తాంతము, విని కోపం బ్రొక్కి సట్టివిషధరము క్రియన్
గుస మండిపడుచు శపియించె, నను వహ్నిని సర్వమును భుజింపు మటంచున్.

ఉ. అంతట వీతిహోత్రుఁడు మహర్షి పదంబులపై వ్రాలి నే
నెంతటివాఁడఁ గ్రోధమున నీవు గనుంగొనిసన్ మహాత్మ నా
స్వాంతమునందు ధైర్య మిసుమంతయు లేమిని బ్రాణభీతిచే
నింతలు పుట్టె నెట్లగుదు నేమి సదోషుఁడ నైతి నింతకున్. 246

క. కరుణామయుఁడవు నీవి, ద్దరుణంబున శాపము క్షమింపుము నే
శరణాగతుండ నైతిని, బరుఁడను గా ననుచు నగచి ప్రార్థించుటయున్.

గీ. అమ్మహర్షి కృపాన్వితుఁ డగుచు నిట్టు, లనియెఁ బావక నీవు భయంబు వలదు
శుచి వగుదుగాక సర్వభక్షుండవయ్యు, ననుచు సంతోషమును జెందె ననలుఁ డంత.

గీ. జాతకర్మాదివిధులను జరిపి భృగుఁడు, పారికాంక్షిమహాసభాభ్యంతరమున
చ్యవనుఁడను పేరు వెట్టె నయ్యాత్మజునకు, గర్భమునుండి చ్యుతుఁడైన కారణమున.

క. యతితనయుం డది మొదలుగ, నతిహర్షము గొల్పుచును మహాజనదృక్సం
తతులకుఁ గ్రమమున శుక్ల, ప్రతిపచ్చంద్రుండువోలెఁ బ్రబలం దొడఁగెన్.

గీ. అట్లు వర్ధిల్లు చుండంగ నర్హాకాల, మరుగుదెంచుటయును మాని యాత్మజునకుఁ
జలిపి యుపనయనముఁ జెప్పఁ జదువు లెల్ల, నంతఁ జ్యవనుఁడు సకలవిద్యలు గ్రహించి.

క. చని రేవాతీరతపో, వనమున కచ్చోట నియమవశుఁడై తపముం
బొనరించె విస్మయము ముని, జనములకును గలుగ నయుతసంవత్సరముల్. 252

గీ. లేశమేనియుఁ గదలిక లేక యతఁడు, నిర్వికల్పసమాధిలో నిలిచి యుండ
మేనఁ బుట్టలు వెట్టె నవ్వానిపైని, మొలిచి మోదుగు లున్నతంబుగను బెరిఁగె.

క. పెరిఁగినయ త్తరువులతో, నొరసికొనుచు దురద వోవ నొడళులు సతమున్
జరియించు చుండు నచ్చటఁ, గరికిరిశరభాదిమృగనికాయం బెల్లన్. 254

గీ. అట్టు లుండంగ శర్యాతి యనెడిమనువు, నర్మదాతీర్థమున కొక్కనాఁడు వచ్చి
సపరివారంబుగా నందు స్నానమాడి, చేయఁ దగినట్టివిధు లెల్లఁ జేసి యచట.

క. తరువాతఁ ద త్తపోవన, పరిసరమున విడిసె నాత్మపరివారముతో
నిరుపమ రేవాపాథః, పరమపవిత్రతకు సంబ్రపడుచును మదిలోన్. 256

గీ. అట్టితఱుణంబునందు శర్యాతిపుత్రి, యగుసుకన్య సఖీసహాయముగఁ జేరి
త త్తపోవనమునకు నందలివిశేష, ములను గనుచు విహారంబు సలుపు చుండ.

క. కనఁబడియె నాయమకు న, వ్వనమున నొకచోట నొక్కవల్మీకము లో
చనపేయముగను నిజదీ, ప్తిని వెలిఁగించుచును గహనదేశము నెల్లన్. 258

క. కనుఁగొని సుకన్య యాంపు, ట్టను విస్మయ మేర్పడఁగ నెడందను వేగం
బున దానియొద్దకుం జని, కని తన్మధ్యమున నొకయఖండజ్యోతిన్. 259

గీ. దాని నెఱుఁగంగఁ దలఁచి చి త్తమునఁ బుట్ట
బిలములోపల నొకపుల్ల వెట్టి పొడిచెఁ
బొడుచుటయు రంధ్రముననుండి విడువకుండ
కాఱఁ దొడఁగెను ర క్తంబు కనులు చెదర. 260

క. అది చూచి భయవిషాదము, లొదవఁగ నెదలోన నేదియును దోఁపమి నా
సుదతి వడి నేఁగి విడిదికిఁ, దదుదంతము తెలుప కుండెఁ దలిదండ్రులకున్. 261

గీ. అంతటను గల్గెఁ బరివేష మర్యమునకు, దెసలు ధూమ్రంబు లయ్యెను దివమునుండి
పడియె నుల్కలు చలియించెఁ బుడమి సకల, జనులకును నావహిల్లెను సాధ్వసంబు.

క. మనుభూధవునితురంగము, లును సామజములును సేనలును వినిపాతం
బును జెందె నొక్కసారిగ, ధన మెల్లను జోరజనహృతం బయి పోయెన్. 263

గీ. అప్పు డాకస్మికంబుగా నుప్పతిలిన, యట్టియుత్పాతములకు శర్యాతి మిగుల
వనరు చుండంగ నేతెంచి వానికడకు, భీతిలుచుఁ దనతప్పు దెల్పెను సుకన్య.

సీ. అంతట శర్యాతి యామెకృత్యంబె యు, త్పాతంబులకు నెల్ల హేతు వనుచుఁ
దలఁచి చి త్తంబులోపలఁ బుత్రితోఁ గూడఁ, జని త త్తపోవనంబునకు నచటఁ

గనుఁగొని వల్మీకమును దానిసన్నిధి, కఱిగి ప్రదక్షిణ మాచరించి
మహనీయ తెలియక మాబిడ్డ చేసిన, తప్పు సైఁపుము నాథ ముప్పతిల్లె

గీ. ననుచుఁ బ్రార్థించుటయుఁ బుట్టయందు నున్న
తాపసుం డిట్టు లనియె సంతాప మొదవ
భూప నీకన్య నానేత్రములను బొడిచె
దాన నుత్పాతములు గల్గె ధరణి కెల్ల. 265

క. కలిగినయుత్పాతంబులు, వలయును శమియింప ననెడివాంఛ యెడందన్
గలదేని నీకు వేఱుగఁ, దలఁపక నా కిమ్ము ధర్మదారగ నాపెన్. 266

క. అనుటయును మనుమహీంద్రుఁడు, తనయారత్నము నొసంగి తపసికిఁ జనుదెం
చినయంతలోనె శమియిం, చెను సకలోత్పాతములును శీఘ్రము గాఁగన్. 267

క. అంతటఁ జ్యవనమహాముని, సంతోషముతోడ వచ్చి చయ్యన వల్మీ
కాంతరమునుండి యాసతీ, మంతినితోడను నిజాశ్రమంబున కరిగెన్. 268

క. అది మొదలుగ నాసుందరి, ముదమున సేవింపఁదొడఁగె మునివర్యునిఁ ద
త్పదపంకేజయుగంబునె, మొదలో ధ్యానించుకొనుచు నెప్పుడుఁ గూడన్. 269

గీ. భయమదంబులు లోభదంభములు ద్వేష
కామములు లేక యాపతి కాంక్షి నెదను
నిలిపికొని కొల్వఁ దొడఁగెను నీరజాక్షి
వాంఛ లీడేర్చుస్వకులదేవతను బోలె. 270

గీ. రాజసుత యయ్యు సుందరీరత్న మయ్యు
సర్వలక్షణసందోహసహిత యయ్యు
సంధుఁ డని గాని ముసలి యనియుఁ గాని
యెన్నఁడుం గూడఁ బతి నామె యెంచ దయ్యె. 271

క. పతిశుశ్రూష యొనర్చుచు, సతతంబును నింద్రసేన సలిపె శచి నా
నతిహర్షముతోడను నా, సతి వెడలించెను సహస్రసంవత్సరముల్. 272

సీ. అంతట నొక్కనాఁ డాశ్వినేయులు రాఁగ, నచటికిఁ బతియాజ్ఞ నాసుకన్య
వారికిఁ దగినట్టిగౌరవం బొనరించి, సమకూరఁగాఁ జేసి సంతసంబు
వినయంబుతో నిట్టు లనియె నాశ్వినులార, కరుణ మాయెడ మీకుఁ గలిగె నేని
నావల్లభున కిందు నయనంబు లని వేఁడ, నాసాధ్విపలుకుల కలరి వార

ఆ. లమ్మ నీవు కోరినట్ల కావింతుము, కాని యొక్కకోర్కె కలదు మాకు
యజ్ఞభాగమునకు నర్హులఁ గా మమ్ముఁ, జేయవలయు సురలశ్రేణిలోన. 273

క. అనుటయు నట్టులె చేయుదు, నని చ్యవనమహర్షి పలుక నాశ్వినులు మనం
బున నిముడనిసంతోషం, బున నచ్యుతిహ్రదము నందు ముంచి మహర్షిన్.

చ. మునిఁగిరి తాము గూడ నట మున్గినమీఁదట లేచి మువ్వురున్
గనఁబడి రా హ్రదంబునను గానఁగరాక విభేద మేమియున్
మనసిజరూపమున్ గనకమాలికలున్ మణికుండలంబులున్
దనరఁగ జల్లువల్వలను దాలిచి వెల్గుచునుండు మేనులన్. 275

క. కనుఁగొని సుకన్య వారిని, దనపతి నం దెఱుఁగ లేక తహతహపడుచున్
వినయమున మొగిచి చేతులు, గనికర ముదయించునట్టి కంఠధ్వనితోన్. 276

క. సురవైద్యులార మీపద, సరసిజములు దక్క లేదు శరణము నాకు
న్గరుణంబున నాస్వామిని, నరయంగలశక్తి మీయఁ డని ప్రార్థించెన్. 277

క. ఆనాతిప్రార్థనము విని, నాసత్యులు సదయహృదయు లయి పతి నెఱుఁగం
జేసెడిశక్తిని గలుగం, జేసిరి యాయమకు యోగసిద్ధికతమునన్. 278

గీ. అంతట సుకన్య గుర్తించి యాత్మధవుని, సంతసము నొందుచుం జేసె సమయమందు
మఱచిపోకఁ జూపించినారటయనుచుఁ, బలికిచని రాశ్వినులు నిజభవనమునకు.

సీ. అంతటఁ జ్యవనమహర్షి స్వాశ్రమమున, కరుదెంచి యింతితో హర్ష మొదవ
బ్రతిచర్యచేఁ గన్పి దేహయష్టిరుచు, జాలిగాఁ ద్వైశితసతిని జూచి
నిమనస్సు ఖిన్నతాలము భక్తితో నాశ్రౌఁ, జలిపినసుశ్రూష కలరినాఁడఁ
ప్రియతమనుం గుత్వచ్ఛరీరంబు నైతిము, గటేయింప నైతి మత్కరణమునఁ

గీ. గిరిఁగొంచున్న మది నిన్నుఁ గనిసకొలఁదిఁ
గోరుకొను మింక నైన నేకోర్కె గలదొ
సకలసిద్ధులు మత్కరస్థంబు లగుచు
నున్నయవి యోగబలముచే నుత్పలాక్షి. 280

చ. అనుటయు నాసుకన్య స్మిత మాస్యమునన్ దొలఁకాడుచుండ సి
గ్గునఁ దలవంచి నాథ యొకకోరికి దక్కమ తేది యేని నా
మనమున లేదు యోగమహిమంబున సర్వము నాకళింపఁ జా
లినమహనీయమూర్తులకు లెక్కయె యయ్యది గుర్తెఱుంగఁ గన్. 281

క. అని పలికి యూరకుంటయు, మునివర్యుం డామెభావమును గనుఁగొని వెం
టనె యొకదివ్యవిమానం, బును నొకయద్భుతతటాకమును గల్పించెన్. 282

గీ. అపుడు విస్మితచిత్తయై యాసుకన్య, కన్ను లార్పక వానిని గాంచుచుండ
మునివరుం డిట్టు లనియెను వనజగంధి, యీతటాకంబునను మున్గు మీఁదఁ నంబ,

చ. అనుటయు నాలతాంగి పతియానతి నొందలఁ దాల్చి చయ్యనన్
మునిఁగెఁ దటాకమం దటులు మున్గఁగ నామెకు దానిలోపలన్
గనఁబడి రొక్కదివ్యభవనంబునఁ గన్యలు వేయిమంది లో
చనముల కందరానివిలసన్నవరూపవిలాస రేఖలన్. 284

క. వారలవిభూషణములును, వారలపరిధానములును వారలసొగసుల్
వారలశృంగారంబును, నారయుచును నామె విస్మయంపడు చుండన్.

గీ. అపుడు కనుఁగొని వార లాయమను లేచి, భక్తితోడను మ్రొక్కి తత్పాదములకుఁ
దల్లి నీసేవ చేయ మే మెల్లరమును, నాసపడి యున్నవారల మనుచుఁ బలికి.

సీ. మట్టి వట్టినమేనిమాలిన్యము తొలంగఁ, గలపంబులను రాచి జలకమార్చి
జడలు గట్టినమూర్ధజములను విడఁదీసి, కమనీయముగఁ గీలుగంటు వైచి
మాసినపుట్టముల్ తీసివైచి మనోహ, రము లైనచీనాంబరములు గట్టి
యనలంకృతము లైనయవయవంబులు గ్రాల, నానాంబు లగుభూషణములు దొడిగి

గీ. కందమూలాశనప్రాప్తకార్శ్య ముడుగఁ
దనివి గొల్పెడియమృతభోజనము పెట్టి
ముకురమును ముందు నిలుప నమ్మోహనాంగి
చూచుకొని యందుఁ దనరూపు చోద్య మొంది. 287

క. మనమున స్మరించుకొనియెను, తననాథుం డైనమానితల్లజునిఁ దలం
చినమాత్రముననె కన్యా, జనయుతముగ నామె తపసిసరసను నిలిచెన్.

గీ. అట్లు నిలుచుటయును జూచి యమ్మహర్షి, యెదను మురియుచుఁ బరిజనోపేత యైన
యామెతోడ విమానము నధివసించి, వెలిఁగెఁ దారావృతుం డైనవిధుఁడువోలె.

వ. అట్లు ప్రకాశమానుం డై యమ్మహాముని యాకాశమార్గంబునుండి చని చని
నందనపుష్పభద్రకమానసచైత్రరథాదులందును నష్టదిక్పాలకవిహారకులాచ
లేంద్రంబులందును నామహారాజపుత్రితోడం గ్రీడించుచు శతాబ్దంబులం గడపి
సుకన్యను బరిపూర్ణమనోరథను గావించి యథాపూర్వంబుగఁ బయోష్ణీతీర
సంస్థితం బగునిజాశ్రమంబునకుం జేరి సతితోడం గూడి గృహస్థాశ్రమోచిత
ధర్మంబు లాచరించు చుండ నాసమయంబున. 290

గీ. దేవతాబృందమున కెల్లఁ దృప్తిగొలుప
యాగ మొనరింపఁ దలఁచి శర్యాతిమనువు
చ్యవనునకు గౌరవముగ నాహ్వాన మంపె
బ్రాహ్మణముఖంబునను మహాభక్తితోడ. 291

క. అంతటఁ జ్యవనమహాముని, సంతోషముతోడ శిష్యసహితుం డగుచున్
గాంతను దోడ్కొని మనుభూ, కాంతునిభవనమున కరిగెఁ గ్రతుహేతువునన్.

గీ. అపుడు శర్యాతి చూచి యత్యద్భుతముగఁ, బ్రజ్వలించుచు నున్నతాపసుని నతని
చెంత నున్నస్వపుత్రిని స్వాంతమందు, నిముడనిక్రుధాభరంబున నిట్టు లనియె.

గీ. అంధుఁడును వృద్ధుఁడును నైనయాత్మధవుని, విడిచి కంటికి నింపైనవీని నొకనిఁ
దోడుకొని వచ్చితివె నేఁడు వ్రీడ లేక, పొమ్ము బిడ్డవు గా వీవు పోలఁతి నాకు.

క. కులమున కెల్ల నకీర్తిని, గొలిపెడియీపాడుచేతకుఁ నీ వెట్టుల్
తలపడితివో పతి నెడసిన, చెలువ కధోగతులు గాక చెందునె సుగతుల్. 295

క. మతి చెడెనో లేక చెనఁటుల, జత గలిగెనొ కాక సాహసమె యేర్పడెనో
పతికులమును బితృకులమును, వెత చేసితి వింతకును వివేకవిహీనా. 296

క. అనవుడు సుకన్య స్మిత మా, ననమున నుదయింపఁ దండ్రి నాఁ డెవ్వని కి
చ్చినవాఁడవో నను నీ వా, మునివరుఁడె యితండు తప్పు మోపకు నాపై.

క. ఇనకులమున నుదయించితి, మనువునకుఁ బుత్రి నైతి మహనీయున కం
గన నైతి నిట్టినాకుం, జనియించినఁ బాపబుద్ధి సమయదె జగముల్. 298

క. అని పలికి విషయ మంతయు, వినుచుటయును మనువు మిగుల విస్మితుఁడై బి
డ్డను గాఁగిలించుకొని యి, ట్లనియెను మాతల్లి ధన్య వన నీవె సుమా. 299

క. తెలియక నే ననఁ గూడని, పలుకులు పలికితిని జనకభావముతో నా
సలిపినయపచారంబును, దలఁపున నెన్నటికిఁ గూడఁ దలఁపకు మమ్మా. 300

క. అని పలికి సుకన్యామన, మునకుఁ గలిగించి మోదమును జ్యవనునకుఁ
బొనరించి తగినగౌరవ, మును బ్రారంభించె సవనమును దీక్షితుఁడై. 301

గీ. అమ్మఖంబున కాధ్వర్యవమ్ము దాల్చి, చ్యవనుఁ డిచ్చెను సోమగ్రహంబు నాశ్వి
నేయులకు నెల్లజేజేలనిండుసభను, జూచి యది కాలరుద్రుఁడై లేచి వజ్రి.

గీ. వజ్రమును దాల్చి తాపసవరుని వ్రేయ, నెత్తె హ స్తంబు నది గాంచి ఋషివరుండు
నిలువు మని హుంకరింపంగ నిలిచిపోయె, నత్తఱిన యెత్తినట్టిచే యెత్తినట్ల.

ఉ. అప్పుడు మంత్రరుద్ధ మయినట్టిభుజంగమువోలె నూర్పుచుఁ
నిప్పులు రాలఁ గన్నులను నిర్జరనాథుఁడు శక్తి చాలమిఁ
దప్పనియ ట్లడంచికొని తగ్గనిక్రోధము లోన స్వామి నా
తిప్పను సైఁచి కావు మని తాపసనాథుని వేఁడె వేఁడిసన్. 304

క. విప్రులహృదయము నవనీ, తప్రాయం బగుట మానితల్లజుఁడు తదీ
యప్రార్థనావశుం డయి, క్షిప్రముగ ననుగ్రహించెఁ గీడ్పడ కుండన్. 305

ఉ. అంతట గోత్రభేది వినయంబున మానికి మ్రొక్కి మేదినీ
కాంతునియజ్ఞభాగమును గైకొని ద్రసులతోడ నేఁగె న
త్యంతము విస్మయంపడుచు నార్షబలంబున కాత్మలోన ధీ
మంతులు సత్త్వవంతులసమర్థత మెచ్చుట న్యాయ్యమే కదా. 306

క. అటుపైని నొసఁగి ధన ము, త్కటముగ బ్రాహ్మణుల కవభృథస్నానము చే
యుటయును మనుభూవరుఁ డం, తటఁ జ్యవనుం డరుగుదెంచెఁ దననెలవునకున్.

క. అనవుడు శత్రుఘ్నుం డ, మ్మునికడకుఁ జని స్వనామమును జెప్పుచు వం
దన మాచరించుటయు ఋషి, యొనరిచె దీవనలు విజయ మొనగూడంగన్.

క. కామక్రోధాదిరిపు, స్తోమమునకు వశుఁడు గాక దురితంబులకున్
ధామము నొసఁగక లోక, క్షేమము గలుగంగ నతఁడు క్షితిఁ బాలించెన్.
క. ధనలోభము లేమిని నా, జననాథుఁడు ప్రజలవలన షష్ఠాంశకరం
బును గొనుచు నేలె ధాత్రిని, ననిమిషులకుఁ గూడ విస్మయం బొదవంగన్.
గీ. అట్లు బహువత్సరము లేలి యతఁడు భువిని, దానఁ బరమార్థ మేమియుఁ గానరామి
నంతరంగంబునను జింత యావహిల్లఁ, జిట్టచివరకుఁ దనసతి కిట్టు లనియె. 333
క. వినుము విశాలాక్షి జనిం, చినదాదిగ భోగములనె చెందితి నేము
న్నను నేమి ఫలము వార్ధక, మొనగూడెను నాకుఁ జింత యొదవెను దీనన్.
గీ. గర్భవాసవిషాదంబు గడపికొనెడి, తెరువు నెమకంగఁ దగునవసరము గలిగెఁ
గానఁ దీర్థాటనము సేయఁ గార్యసిద్ధి, కలుగు నను నాశ మదిలోనఁ గలుగుచుండె.
క. అనుటయు నమ్మానిని యి, ట్లనియెను బతితోడ నాథ యట్టులె యాత్రం
బొనరింపు మేను నీచా, యనె యుండెద ననుడు తేఁడు హర్షవశుం డై. 336
క. చనియెదను రేప యాత్రకు, నని మదిఁ జేసికొని నిశ్చయంబును గోవిం
దుని ధ్యానించుచు శయనిం, చెను రాత్రి యంత నిద్రఁ జెందెడివేళన్. 337
క. కనఁబడియె స్వప్నమున నా, జననాథున కొక్క తాపసప్రవరుఁడు చే
తను దండము జడలు శిరం, బునఁ గౌపీనంబు మొలను బూనినమేనన్. 338
క. అంతట మేలుఁకువ రాఁగ ని, శాంతం బగుటయును లేచి యధిపుఁడు కొలువై
సంతసముతోడఁ దనవృ, త్తాంతమును వచించుచుండ నాసమయమునన్. 339
ఆ. తనకు స్వప్నమందుఁ గనఁబడియున్నట్టి, యతివరుండు సభకు నరుగుదెంచి
నిలుచుటయును మేదినీపతి దిగ్గున, లేచి వందనంబు నాచరించి. 340
గీ. స్వామి మీదర్శనమున నాజన్మమునకు, నొదవె సాఫల్య మిపుడు ధన్యుండ నైతి
దీనులను బ్రోవ మహనీయు లైనవారు, వత్తు రవ్యాజకృపతోడ వారికడకు.
గీ. చేసితిని రాజ్యమును బ్రజాక్షేమమునకు, ధర్మమార్గంబు దాఁటక తాపసేంద్ర
యిపుడు వృద్ధుఁడ నైతి నా కేది గతియొ, గర్భవాసవిషాదంబు గడవఁ జెపుమ.
క. అని యడుగుటయును ద్విజుఁ డి, ట్లనియెను జనపాల న్యాయ్య మగునీభూపా
లనకార్యమె యీచందం, బునఁ గలుగం జేసె మంచిబుద్ధిని నీకున్. 343
క. తనచేసినసత్కార్యము, లొనగూర్పక పోవు శుభము లొకనాఁ డేనిన్
మనుజాధినాథ శోకం, బెనయింపకు మనమునందు నెనయును శుభముల్. 344
వ. నేను హరిద్వారంబును నయోధ్యయును నవంతియును విమలయును గాంచియును గోకర్ణంబును హాటకంబును సరయువును దాపియును రేవయును జూచితి. మఱియును మల్లికాచలం బనుమహాతీర్థంబుం దిలకించితి నయ్యది తనలో మునింగిన మహాపాపులశరీరంబులం గలశ్యామతోయంబు నిర్మలంబు గావించి సకలపాప

విముక్తులం జేసి మోక్షంబు ప్రసాదించు. మఱియును ద్వారవతీమహాక్షేత్రంబుం గాంచితి.అందు సంతతమును బ్రహ్మాజల యగుగోమతీమహానది ప్రవహించుచుండు నమ్మహాక్షేత్రంబున స్నానంబ లయంబు.మరణంబ మోక్షంబు.అచ్చట నివసించు మానవపశుపక్షికీటాదు లెల్లఁ జక్రాంకశరీరంబులతో నుండు. సర్వలోకపాలకుం డగుత్రివిక్రము డం దధివసించు. మఱియును గురుక్షేత్రంబుం జూచితి నందు మహాపాతకంబుల రూపుమాపెడిశమంతపంచకంబు మిగుల దర్శనీయంబు. మఱియును. 345

క. కనుఁగొంటి వారణాసిని, దనుధారుల కెల్ల బ్రహ్మతారకమంత్రం
బును నంతవేళఁ దనయం, తన యుపదేశించు విశ్వనాథుం డచటన్. 346

గీ. అచట మేనులు దొఱఁగిన నసుర లైనఁ,బశువు లైనను గ్రిము లైనఁ బక్షు లైన
స్వస్వకర్మఫలానుభవంబు విడిచి, చేరఁ గలుగును గైలాసశిఖరమునకు. 347

గీ. అచట నుత్తరవాహిని యైనగంగ, యొకఁడె చాలును భవబంధ ముత్తరింప
నింక మణికర్ణికాతీర్థ మేమి చెప్ప, దాని కీ డగుతీర్థంబు గానరాదు. 348

గీ. మఱియొకవిచిత్రమును విను మానవేంద్ర, సర్వభూషణులును గజచర్మవసన
ధరులును గపర్దులును దుఃఖవిరహితులును, నగుదు రచ్చట మరణించినట్టివారు.

ఆ. కాలభైరవుండు గావించు నట నుండు, జంతువులకు నెల్ల శాసనంబు
నంతె కాని యమున కధికార మిసుమంత, యేని లేదు వారిపైని భూప. 350

గీ. ఇట్టితీర్థంబు లెన్నియొ యేను జూచి, నట్టి వున్నవి కాని నీలాద్రియందుఁ
జూచినవిచిత్ర మెందును జూడ లేదు, వినుము చెప్పెద నీకుఁ దద్విషయ మెల్ల.

సీ. కావించుచును దీర్థసేవ నే నావిధి, నరిగితి నీలభూధరముకడకు
నరిగి చూచితి ధనుర్ధరులు చతుర్భుజు, లును నైనయట్టిభిల్లులను నచటఁ
జూచి చిత్తములోనఁ జోద్యంబు గలుగంగ, నేఁగితి వారిసమీపమునకు
నేఁగి మీ కీరూప మెట్లు సంప్రాప్తించి, నదియొ చెప్పుఁ డటంచు నడిగినాఁడ

గీ. నడుగుటయు నాకు వార లి ట్లనిరి స్వామి, మున్ను మాభిల్లజాతిలో నున్న బాలుఁ
డొక్కఁ డీశైలమున కెక్కి యొక్కనాఁడు, కనుఁగొనియె నొక్క దేవతాగార మచట.

క. కనుఁగొని యాదేవాలయ, మునకున్ జని చూచి విష్ణుమూర్తిని బ్రణతిం
బొనరిచి తన్నైవేద్యం, బును దినఁగనె కలిగె నాల్గు భుజము లతనికిన్. 353

గీ. దానితోడన తొలఁగి యజ్ఞాన మెల్ల, జ్ఞాన ముదయించెఁ గర్మపాశంబు వదల
నంతటను వాఁడు మాకడ కరుగుదెంచి, విశదముగఁ జెప్పె జరిగినవిషయ మెల్ల.

సీ. అది విని వేగ మే మందఱమును గూడ, నావిష్ణుదేవాలయమున కరిగి
భక్తిపూర్వకముగాఁ బ్రణమిల్లి పురుషోత్త, మునకుఁ దన్నైవేద్యమును భుజించి
యాక్షణంబ చతుర్భుజాకారములను దా, ల్చితిమి చిత్తముల కచ్చెరువు దోఁప
నంతట జ్ఞానోదయం బయ్యె మా కెల్ల, గర్భవాసవ్యథ గలుగకుండ

గీ. నని యెఱింగించుటయును నే నచటి కరిగి, యాలయంబునఁ బురుషోత్తమాఖ్యనున్న
రామునకుఁ జేసి భక్తిప్రణామములను, నాదరమునఁ దన్నైవేద్య మారగించి.
క. ఇతిఁ జతుర్భుజుఁడను నా, పాతకములు తొలఁగి కర్మపాశము వదలెన్
భూతలవల్లభ నీవును, నేతద్రీతిన యొనర్పు మేటికి వగవన్. 356
క. అనుటయు రత్నగ్రీవుఁడు, మనమున సంతసము నొంది మహనీయ యొన
ర్తును నీవు ప్రబోధించిన, యనువునఁ దెలుపఁగదె తీర్థయాత్రావిధులన్. 357
క. అని వేఁడుటయును ద్విజుఁ డి, ట్లనియె మహారాజ నిత్య మగుసౌఖ్యము గో
రినమానవులకు భవభం, జనుఁ డగుగోవిందుఁ డొకఁడె శరణము సుమ్మీ.
క. హరికీర్తనహరివందన, హరిచరితశ్రవణహరిసమర్చనలందున్
నిరతమును బుద్ధిఁ జొనిపెడి, నరులకు సులభంబు గర్భనరకము దాఁటన్.
గీ. అట్టిభాగ్యంబు సాధుసమాశ్రయమునఁ, గలుగుఁ గలుగదు మఱియొకకర్మమునను
సాధుసంసేవనమునకు సాధనంబు, తీర్థసేవయ వేఱొక తెరువు లేదు. 360
ఆ. చేసె నేని తీర్థసేవ యథావిధి, సకలపాపములును సమసిపోవుఁ
గానఁ దీర్థయాత్ర గావింపఁగాఁ దగు, విధిని వినుచువాఁడ వినుము భూప. 361

—: తీర్థయాత్రావిధికథనము :—

వ. తీర్థయాత్ర గావింప నెంచువాఁడు పూర్వదినంబున గృహంబునం దుపవాసంబు గావించి దేవతాబ్రాహ్మణపూజ లొనర్చి మఱునాఁడు కృతపారణుండై నియమంబుతోడ బయలుదేఱవలయు. పాదచారంబున నేఁగె నేని సంపూర్ణఫలంబును యానంబున నరిగె నేని సమభాగఫలంబును బాదరక్షలచేఁ జనియె నేని చతుర్థాంశఫలంబును వ్యవహార వశంబున వెడలె నేని తృతీయాంశఫలంబును సేవావశంబునం బోయె నేని యష్టమభాగఫలంబును ననిచ్ఛచే వెడలె నేని యర్ధభాగఫలంబునుం జెందు. గోయానంబున నరిగె నేని గోవధపాపంబు చేకూరు. తీర్థప్రవేశదినంబున ముండనంబు గావించుకొని తీర్థోపవాసంబు చేసి పరదినంబున శ్రాద్ధంబు వెట్టవలయు. 362

గీ. తగదు విప్రపరీక్ష తీర్థంబునందు, నన్నమును గోరునట్టిబ్రాహ్మణుల కెల్ల
నన్నము నొసంగఁ దగు నంతరంగమందు, వారలఁ దలంచియచ్యుతాకారులుగను.

వ. సక్తుసంయావపాయసపిణ్యాకగుడంబులచేఁ బిండంబులు గావించి యర్ఘ్యావాహనవర్జితంబుగాఁ దీర్థశ్రాద్ధంబు గావింపం దగు. దేహధర్మం బశాశ్వతం బగుటచేఁ గాలాకాలవిచారంబు గావింపక యవిలంబంబుగాఁ దీర్థమందు శ్రాద్ధతర్పణంబులు గావింప నొప్పు. కార్యాంతరవశంబునఁ దీర్థమునకు వచ్చినప్పుడు స్నానంబు గావించువాఁడు స్నానఫలముం జెందుఁ గాని తీర్థయాత్రాఫలంబు నొందం జాలఁడు. తీర్థస్నానంబు పాపులకుఁ బాపప్రణాశంబును శుద్ధాత్ములకు యథోక్తఫలంబును నొసంగు. పరార్థంబు తీర్థయాత్ర గావించువాఁడు షోడశాంశఫలంబు

నొందఁగలండు. మఱియు నుద్దిష్టునింగూర్చి కుశప్రతికృతిని ముందు దీర్థస్నానంబు గావింపంజేయ దాన నుద్దిష్టుం డష్టభాగఫలంబుం బడయంగలండు. తీర్థంబులందు వందనాదిసపర్యలచే సాధువులం బూజించె నేని దాన భగవద్భక్తి మనంబున స్థిరంబుగా నిలిచి స్వర్గమోక్షంబులం గలిగించు. తీర్థంబులందుఁ గావింపంబడు శ్రాద్ధతర్పణాదులు పితరుల కుద్ధారకంబు లగు. 364

క. తెలిసికొని విధుల నెల్లను, సలిపినయెడఁ దీర్థయాత్ర సమకూరును ద
త్ఫల మఱలు గాక యెట్టులొ, సలిపినయెడ యాత్ర హాని సంప్రాప్తించున్.

క. అని చెప్పి యూరకుంటయు, జనపతి దత్ఫలము దనప్రజలకును నొసఁగూ
ర్పను దలఁచి బయలుదేఱెను, జనసహితుం డగుచు నీలశైలంబునకున్. 366

ఆ. అట్లు బయలుదేఱి యవనీంద్రుఁడు తపస్వి, నుడువుచుండినట్ల నడచికొనుచుఁ
జనుచుఁ ద్రోవనడుమఁ గనుచుఁ దీర్థములను, వానిమహిమ వినుచు మౌనివలన.

గీ. అక్కడక్కడ స్నానదానాదివిధుల, నాచరించుచు శ్రద్ధతో నవలఁ జనుచు
నొక్కదిక్కునఁ జక్రాంకయుక్తశిలలు, గలిగి శోభిల్లు నొక్కశైవలిని గాంచి.

గీ. స్వామి యీపుణ్యనది సంతసమును మదికిఁ
గలుగఁజేయుచు నున్నది నుత్కటము గాఁగ
దీనివృత్తాంత మేమియో తెలుపు మనుచు
నడుగుటయు బ్రాహ్మణుం డిట్టు లతని కనియె. 369

—: గండకీనదీవృత్తాంతకథనము :—

క. జనవర యిది గండకి యను, ధుని దీనిం జూడఁ జిత్తదోషము దాఁకున్
దనుదోషము దీనిజలం, బును ద్రావఁగ వచనదోషమును శమియించున్. 370

క. పాపులపాపము లెల్లం, బాపఁగ నిజగండజలకణంబున నజుఁ డీ
యాపగను సృష్టిచేసెను, దాపసు లుండెదరు సంతతిం బిచ్చోటన్. 371

వ. మఱియును. 372

గీ. ఈమహానదిలో జనియించి చక్ర, చిహ్నితము లయి యుండెడిశిలలు విష్ణు
రూపముల గానఁ దత్పూజనాపరుండు, గర్భనరకనివాసదుఃఖమును గనఁడు. 373

—: సాలగ్రామనామకారణకథనము :—

గీ. గండకీనదిలో నొక్కకడను దీప్తి, నలరుచుండు సాలగ్రామ మనెడిచోటు
దానిలోఁ బుట్టినట్టిప్రస్తరమునకును, నందఁ గలిగె సాలగ్రామ మనెడిపేరు. 374

—: సాలగ్రామమాహాత్మ్యకథనము :—

గీ. గండకీనదిలోపల నుండు రాయి, ద్వారవతి నుండుఁ జక్ర మీద్వయము గూడ
గంగయును సాగరంబును గలిసినట్లు, గాన నది గొప్పతీర్థంబు మానవేంద్ర.

గీ. చక్రశిలలు సాలగ్రామసంజ్ఞచేత, భువనములలోనఁ బ్రఖ్యాతిఁ బొంది యుండెఁ
దచ్ఛిలావారిపానమాత్రమున మాయు, భవశతసహస్రసంచితపాతకములు.

గీ. ముట్టికొనిన సాలగ్రామమును నశించుఁ, గోటిజన్మార్జితం బైనకొలయు నింక
నందుఁ గావించుహరిపూజ కగుఫలంబు,నలవియె నచింప నదిధామమగుటహరికి.

క. ఒనగూడును శతలింగా, ర్చనమునఁ గలపుణ్య మేకసాలగ్రామా
ర్చనమున దానిశతాంశం, బును బోలవు తీర్థదానములు యజ్ఞములున్. 378

గీ. పొందఁగలుగును బహుజన్మపుణ్యములను, వానిలోఁ గృష్ణశిల దానిలోన దొరకె
నేని గోష్పదచిహ్నచిహ్నితము వాని, కపునరావృత్తి గలుగుఁ దదర్చనమున.

వ. స్నిగ్ధంబును మేచకంబును నగుశిల యుత్తమంబు. అకృష్ణంబు మధ్యమంబు.
మిశ్రంబు మిశ్రఫలప్రదంబు. 380

గీ. అర్చనమున సాలగ్రామమందు నుండు, నచ్యుతుండు ప్రకాశించు నరణి నున్న
వహ్ని మథనంబునను బైకి వచ్చునట్లు, గానఁ దత్పూజనము ముక్తికారణంబు.

గీ. మోక్షమును జెందువిప్రుఁడుమూర్తిపంచ,కమునునాలుగుమూర్తులక్షత్రియుండు
వైశ్యుఁడు త్రిమూర్తులఁ జతుర్థవర్ణుఁడేక,మూర్తినర్చించునెడ శిలామూర్తులందు.

గీ. అబ్దములనుండి శశి ముక్తుఁ డైనపగిది, నార్ద్రశుష్కలఘుస్థూల మైనపాప
సంచయమునుండి ముక్తుఁడై సర్వలోక, పూజ నొందు సాలగ్రామపూజకుండు.

క. ఏల మఖంబులు దీర్థము, లేల జపతపంబు లేల యేల వ్రతంబుల్
సాలగ్రామముఁ జూచిన, కాలముననె మాయు చుండఁ గలుషము లెల్లన్.

—: సాలగ్రామస్వరూపకథనము.—

వ. మఱియును నర్చనీయంబు లగుసాలగ్రామశిలావిశేషంబుల వివరించెద. కేశవాది మూర్తులచతుర్భుజంబులు దక్షిణోర్ధ్వకరక్రమంబున నెఱుంగ వలయు. శంఖచక్రగదాపద్మంబులు గలయది కేశవుండు. పద్మగదాచక్రశంఖంబులు గలయది నారాయణుండు. చక్రశంఖపద్మగదలు గలయది మాధవుండు. గదాపద్మశంఖచక్రంబులు గలయది గోవిందుండు. పద్మశంఖచక్రగదలు గలయది విష్ణువు. శంఖపద్మగదాచక్రంబులు గలయది మధుసూదనుండు. గదాచక్రశంఖపద్మంబులు గలయది త్రివిక్రముండు. చక్రగదాపద్మశంఖంబులు గలయది వామనుండు. చక్రపద్మశంఖగదలు గలయది శ్రీధరుండు. చక్రగదాశంఖపద్మంబులు గలయది హృషీకేశుండు. పద్మశంఖగదాచక్రంబులు గలయది పద్మనాభుండు. శంఖగదాచక్రపద్మంబులు గలయది దామోదరుండు. శంఖపద్మచక్రగదలు గలయది సంకర్షణుండు. చక్రశంఖగదాపద్మంబులు గలయది వాసుదేవుండు. శంఖగదాపద్మచక్రంబులు గలయది ప్రద్యుమ్నుండు. గదాశంఖపద్మచక్రంబులు గలయది యనిరుద్ధుండు. పద్మశంఖగదాచక్రంబులు గలయది పురుషోత్తముండు. గదాశంఖచక్రపద్మంబులు గలయది యధోక్షజుండు. పద్మగదాశంఖచక్రంబులు గలయది నృసింహుండు. పద్మచక్రశంఖగదలు గలయది యచ్యుతుండు. పద్మ

చక్రగదాశంఖంబులు గలయది జనార్దనుండు. గదాచక్రపద్మశంఖంబులు గలయది యుపేంద్రుండు. చక్రపద్మగదాశంఖంబులు గలయది హరి. గదాపద్మచక్రశంఖంబులు గలయది కృష్ణుండు. మఱియుం గొన్నివిశేషంబులం జెప్పెద. వినుము. ద్వారలగ్నద్విచక్రంబును శుక్లాభరేఖంబును శోభాఢ్యంబును నగునది గదాధరుండు. లగ్నద్విచక్రంబును రక్తాభంబును నగునది సంకర్షణుండు. దీనిపూర్వభాగం బతిశ్రేష్ఠంబు. పీతంబును సూక్ష్మచక్రంబును నగునది ప్రద్యుమ్నుండు. దీర్ఘసుషిరంబును వర్తులంబును నగునది యనిరుద్ధుండు. నీలద్వారంబును ద్విరేఖంబును నసితంబును నగునది నారాయణుండు. గదాకారరేఖాయుతమధ్యంబును మహోన్నతనాభిపద్మంబును బృథుచక్రంబును గపిలంబును ద్విబిందుకంబును నగునది నృసింహుండు. పంచబిందుకం బైనచో బ్రహ్మచారిపూజార్హంబు. విషమద్విచక్రంబును సత్రిలింగంబును నగునది వారాహంబు. త్రిరేఖనాళంబును స్థూలంబును సబిందుకంబును నగునది కూర్మంబు. వర్తులావర్తంబును బాండురంబును ధృతపృష్ఠకంబును నగునది కృష్ణుండు. పంచరేఖంబును వనమాలియును గదాంకితంబును నగునది శ్రీధరుండు. నీలంబును మధ్యచక్రంబును వర్తులంబును నగునది వామనుండు. నానావర్ణానేకమూర్తియును నాగభోగియును నగునది యనంతుండు. స్థూలంబును నీలంబును మధ్యచక్రంబును ససీలకంబును నగునది దామోదరుండు. సంకర్షణద్వారకంబును సులోహితంబును నగునది బ్రహ్మ. సదీర్ఘరేఖాసుషిరంబును నేకచక్రాంబుజంబును బృథువును బృథుచ్ఛిద్రంబును స్థూలచక్రంబును సబిందువును నగునది కృష్ణుండు. బిందుయుక్తంబును నంకుశాకారంబును నగునది హయగ్రీవుండు. పంచరేఖంబు కౌస్తుభంబు. ఏకచక్రమయంబును నసితంబును నగునది వైకుంఠుండు. దీర్ఘాంబుజాకారంబును హారరేఖంబును బాండురంబును నగునది మత్స్యంబు. ధనూరేఖంబు రామచంద్రుండు. శ్యామంబు త్రివిక్రముండు. ఏకచక్రంబు సుదర్శనంబు. ద్విచక్రంబు లక్ష్మీనారాయణుండు. త్రిచక్రంబు త్రివిక్రముండు. చతుశ్చక్రంబు చతుర్వ్యూహుండు. పంచచక్రంబు వాసుదేవుండు. షట్చక్రంబు ప్రద్యుమ్నుండు. సప్తచక్రంబు సంకర్షణుండు. అష్టచక్రంబు పురుషోత్తముండు. నవవ్యూహంబును నవచక్రంబును నగునది యచ్యుతుండు. దశావతారంబును దశచక్రంబును నగునది యనిరుద్ధుండు. ద్వాదశచక్రంబు ద్వాదశాత్ముండు. ద్వాదశాధికచక్రం బనంతుండు. చతుర్ముఖంబును దండకమండలుస్రగ్ధారియు నున్నతంబును నగునది బ్రహ్మ. పంచవక్త్రంబును దశబాహువును వృషధ్వజంబును నగునది మహేశ్వరుండు. మఱియును గౌరియుఁ జండికయు సరస్వతియు మహాలక్ష్మియు సప్తమాతృకలును బద్మహస్తుం డగు దివాకరుండును గజాస్యుండును షణ్ముఖుండును మున్నగు ననేకగణంబులును

యథాస్థానంబులం దుండినను ప్రాసాదాదులందు స్థాపింపఁబడినను ధర్మార్థకామమోక్షార్థి యగువాఁడు వానిం బూజించి స్వాభీష్టసిద్ధిం బడయంగలండు. సాలగ్రామంబునందుఁ గాని రత్నంబునందుఁ గాని యంత్రంబునందుఁ గాని మండలంబునందుఁ గాని ప్రతిమయందుఁ గాని నిత్యంబును విష్ణుపూజ గావింప వలయు. సాలగ్రామశిలాగహ్వరంబు వీక్షించువానిపితరులు తృప్తులై యాకల్పాంతంబు స్వర్గంబునందు వసియింతురు. సాలగ్రామంబునకు మూల్యంబు నుద్ఘాటించువాఁడును విక్రయించువాఁడును నంగీకరించువాఁడును బరీక్షానుమోదకుండును నాకల్పాంతంబు నరకంబునం దుండువారు. కానఁ జక్రక్రయవిక్రయంబులు చేయం జనదు. ద్వారకోద్భవసాలగ్రామోద్భవదేవతాద్వయసంగస్థలంబము క్తిస్థానంబు. బహూక్తు లేల. ద్వారకోద్భవచక్రాఢ్యంబును బహుచక్రచిహ్నితంబును జక్రాసనశిలాకారంబును నగుసాలగ్రామంబు నిరంజనుండును ప్రణవస్వరూపుండును సచ్చిదానందాత్ముండును భక్తానుగ్రహకారకుండును నగునారాయణుండ యనియును సాలగ్రామం బుండుప్రదేశంబు వైకుంఠమందిరం బనియును నెఱుంగవలయు. సాలగ్రామంబులు మనోజ్ఞరూపంబులును స్నిగ్ధంబులును నయ్యేనేని లక్ష్మీప్రదంబులును రూక్షంబు లయ్యేనేని యాయుశ్శ్రీకీర్తిక్షయకరంబులును నగు. 385

ఆ. పూజ సేయ సాలగ్రామములు సమంబు, లైన విషమంబు లైన సర్వములఁ గాని
మాన వలయు సమంబులలోన రెంటి, విషమములలోన మూఁటిని విడువవలయు.

గీ. అఖిలయాగంబులును జేసినట్టిఫలము, నిఖిలతీర్థంబులందు మునిఁగినఫలంబు
గలుగు నొక్కసాలగ్రామజలకణంబు, ద్రావు నెడ భక్తివిశ్వాసభావమునను.

—: పదామృతస్వరూపనిరూపణము :—

వ. తులసియును జందనంబును శంఖంబును జక్రంబును సాలగ్రామంబును జలంబును ఘంటయును దామ్రపాత్రంబును విష్ణునామంబును నను నీతొమ్మిదియును బదామృతంబుగాఁ జెప్పంబడియె. పదామృతంబు బ్రహ్మహత్యాదిసకలపాతకంబులను రూపుమాపు. 388

క. పరదారపరధనంబుల, హరియించెడితలఁపు లేక యర్చించిన స
త్వరముగ సాలగ్రామము, నరులకు నొనగూరిచెడి సనశ్వరఫలముల్. 389

సీ. విషపంకనిభ మగు వెలఁది సాలగ్రామ, మునకుఁ జందనమును బూసె నేని
వజ్రసమం బగు వనిత సాలగ్రామ, మునయందుఁ గుంకుమం బునిచె నేని
పాపపుంజం బగుఁ బడఁతి సాలగ్రామ, శిలపైని బువ్వులు చేర్చె నేని
కాలకూటం బగుఁ గలికి సాలగ్రామ, శిలకు నైవేద్యంబు చేసె నేని

గీ. వనజనేత్ర సాలగ్రామమును స్పృశించె, నేని పూర్వసమార్జితం బైనసుకృత
మంతయును బోవుట యె కాక యాక్షణంబ, తగులుకొను దుర్గతిప్రదంబగునఘంబు.

క. నరవర సాలగ్రామ, స్మరణము ప్రాణాంతకాలమునఁ గలిగినచోఁ
దరియింప భవపయోధిని, బరసాధన మేల కర్మపరతంత్రులకున్. 391

గీ. అంతకాలంబునను భాగ్యవంతు లైన, మానవుల కుండు విష్ణునామంబు నోట
హృదయమునఁ జక్రశిలయును నింతకంటెఁ, బలుక నేటికిఁ గొఱగానిభాషణములు.

గీ. స్నిగ్ధములగుసాలగ్రామశిలలుభూసు, రులునుసన్న్యాసులునుమత్స్వరూపమగుటఁ
దత్ప్రపూజన మఖిలపాతకము లార్చు, నని మును వచించె నంబరీషునకు శౌరి.

క. సాలగ్రామములను దు, శ్శీలుం డెవఁ డేని నింద చేసినయెడలన్
గాలుచును నరకవహ్ని, జ్వాల లతని భూతసంప్లవం బగుదనుకన్. 394

క. సాలగ్రామశిలార్చన, శీలుని వారించునట్టిచెడుగఁడు నరక
జ్వాలలలోఁ దాఁ గూలుచుఁ, గూలుచుఁ బితృమాతృబంధుకోటుల నెల్లన్.

క. ఒనరుప సాలగ్రామా, ర్చనమును మే లగు న టంచు జనులకు బోధిం
చినవాఁడు తాను ధన్యత, గని తనపూర్వులకుఁ బుణ్యగతి గలిగించున్. 396

వ. ఈవిషయంబున దృష్టాంతంబుగాఁ బురాతనం బగునొక్కయితిహాసంబు చెప్పెద.
వినుము. 397

సీ. మున్ను కీకటదేశమున శబరుం డను నాఁ, గను చేరువడినపుల్కసుఁ డొకండు
శరశరాసనములు ధరియించి తిరుగుచు, ననుదినంబును వరణ్యంబులందుఁ
దీర్థయాత్రల కేఁగు తెరువరులను జంపి, హరియించుచును వారియర్థ మెల్లఁ
జేయఁగూడనిపనుల్ చేయుచు నశుఁ డయి, కామాదిశత్రుసంఘాతమునకుఁ

గీ. దనకుఁ గాలంబు మూఁడినతఱి నెఱుంగ, కుండ వర్తించు చుండఁగా నొక్కనాఁడు
వ్యాళరూపంబునను వచ్చి వానికడకుఁ, గాలభటుఁ డొక్కరుఁడు కాలు కాటువైచె.

ఉ. అంతట నెత్తి కెక్కి విష మాతఁడు నేలను గూలె నంతలో
నంతకభృత్యు లుగ్ర మగునాగ్రహ మేర్పడ వచ్చి నిర్ఘృణా
స్వాంతుఁడు వీఁడు వీని విడనాడఁగ రా దని వానిఁ బొడ్చుచున్
గుంతములన్ మఱిన్ గదలఁ గొట్టుచుఁ ద్రాళ్లను గట్టు చుండఁగన్. 399

గీ. దారి నేఁగుచు వైష్ణవోత్తముఁ డొకండు, గాంచి వారలు పెట్టెడిగాత లెల్ల
సైఁపఁ జాలక యార్తరక్షణముకొఱకుఁ, గరుణ గలమానసమున నక్కడకుఁ జేరి.

గీ. పుల్కసునకు సాలగ్రామపూతజలముఁ
జల్లి ముఖమునఁ దులసి శీర్షమున నునిచి
రామనామంబు జపియించి శ్రవణమందు
హృదయమునఁ జక్రశిలఁ బెట్టి యిట్టు లనియె. 401

క. యమదూతలార పొం డిఁక, సమస్తపాపములుఁ దొలఁగె సాలగ్రామా
శ్మము సోఁకినంత నితనికి, క్షము లగుదురె మీరు వీనిసన్నిధి నిలువన్. 402

క. అనుటయు గజగజ వణఁకుచుఁ, జని రావల కతని విడిచి శమనునిభృత్యుల్
చనుదెంచి రతనిఁ దోడ్కొని, చన వెంటనె విష్ణుపురికి శౌరినియోజ్యుల్. 403
గీ. అపుడు వారికి వందనం బాచరించి, యమునిభటు లిట్టు లనిరి మహాత్ములార
మీర లీపాపికడ కేఁగుదేర నేమి, కారణమొ చెప్పుఁ డని యెఱుఁగంగ నడుగ.
గీ. హరిభటులు కాలభటుల కిట్లనిరి వీఁడు, కలుషి యనుమాట సత్యంబ కాని యితని
పాతకము లెల్ల దహియింపఁబడియె నంత, కాలమందు సాలగ్రామమూలమునను.
గీ. దానివలనను వైకుంఠధామ మబ్బె, నచటఁ గల్పశతము సౌఖ్య మనుభవించి
కాశిలోఁ బుట్టి పిదప విశ్వేశపూజ, సలిపి మోక్షంబుఁ జెందఁగాఁ గలఁ డితండు.
క. కనినను ముట్టినఁ బూజిం, చిన సాలగ్రామశిల నశేషాఘములున్
జను నాశనంబ యని ప, ల్కిన విస్మయ మొంది శమనకింకరు లంతన్. 407
క. అరిగిరి సత్వరముగఁ ద, చ్చరితము నెఱిఁగింప యమునిసన్నిధి కంతన్
హరిభటులు పుల్కసునితో, నరిగిరి సురయాన మెక్కి హరిసన్నిధికిన్. 408
గీ. అంత వైకుంఠమున నాతఁ డనుభవించి, సకలభోగంబులును గల్పశతము దాఁక
నవల జనియించి కాశిలో నవనిసురుని, సదనమున ముక్తిఁ జెందె నీశ్వరునిఁ గొలిచి.
వ. అని చెప్పుటయును రత్నగ్రీవుండు భక్తిశ్రద్ధాసమన్వితుండై బ్రాహ్మణాదేశంబున గండకీతీర్థమందు యథావిధి స్నానంబు గావించి పితృతర్పణం బొనరించి తత్తీర్థంబునుండి చతుర్వింశతిసాలగ్రామంబులం గైకొని తత్పూజ గావించి దానధర్మంబు లొనరించి యచ్చటనుండి బయలుదేఱి గంగాసాగరసంగమతీర్థంబునకుం జేరి తాపసుని నాలోకించి స్వామీ నీలాచలం బిచ్చటి కెంతదూరంబునం దుండె నని యడుగుటయు యోగీశ్వరుండు విస్మయావిష్టమానసుండై. 410
క. నరవర యిదె నీలమహీ, ధరము కనంబడదె నీకుఁ దరుణాదిత్య
స్ఫురణమున వెల్గుచున్నది, పరిసరమునయంద నేత్రపర్వము గాఁగన్. 411
క. అనుటయు రత్నగ్రీవుఁడు, మనమున ఖేదంబుఁ జెంది మహనీయ యెటుల్
కన నగునో నాకు శైలం, బును జూతునొ యెట్లు నేను బురుషోత్తమునిన్.
గీ. ధర్మ మతిసూక్ష్మ మగుట నేతప్పు నేను, జేసితినొ పాలనంబునఁ జేయ కున్న
గోచరింపక యుండునె కుధర మిట్లు, నేఁడు నిజమయ్యె రాజ్యాంతనిరయవార్త.
క. అని బహువిధములఁ దననిం, దను గావించుకొనుచున్నతఱుణంబున నా
జనవల్లభునకు ముని యి, ట్లనియెను భూపాల యేల యలమట మొందన్. 414
క. ఈగంగాసాగరసం, యోగతటంబునను జేయు ముపవాసము నీ
లాగము కనఁబడుదాఁకను, నాగారిధ్వజునికీర్తనం బొనరుచుచున్. 415
క. దానివలన నేదోషం, బైనను గలదేని తొలఁగు నది తొలఁగినచోఁ
గానంబడు భూమీధ్రము, భానుసహస్రప్రభావిభాసుర మగుచున్. 416

క. అనుటయును గొంత ధైర్యము, మనమునఁ గలుగంగ లేఁడు మా తాడక వెం
టనె గంగాంబుధిసంగమ, మున నొనరిచి స్నానదానముఖకృత్యములన్. 417

గీ. పూని నిరశనదీక్షను దానవారి, నెదను నెలకొల్పి విశ్వాస మినుమడింపఁ
దండ్రి శరణంబు త్వత్పాదతరణి దక్కఁ, బరము లేదు భవాబ్ధిలోఁ బడిననాకు.

సీ. బ్రాహ్మణశాపనిర్దగ్ధతేజుం డైన, యంబరీషునిఁ బ్రోచినట్టివాఁడ
పితృఘోరదండనపీడితుం డైనప్ర, హ్లాదుని రక్షించినట్టివాఁడ
గ్రాహకఠోరదంష్ట్రావాగురాబద్ధుఁ, డగుగజేంద్రునిఁ గాచినట్టివాఁడ
భ్రాతృదుర్దండనభయశరణాగతుం, డగువిభీషణు నోమినట్టివాఁడ

గీ. భక్తు లగువారి నుద్ధరింపంగఁ గేలఁ, గంకణము గట్టికొని సర్వకాలసర్వ
దేశములయందు వ్యాపించి తిరుగువాఁడ, నన్నుఁ బ్రోచుట బరువె మాయన్న నీకు.

క. అని యి ట్లనేకవిధములు, గను నుతియించుచును గొంతకాలము గడపున్
గనఁబడినయట్లు కనులకుఁ, గనుఁగొనుచును నేదొ కొంతకాలము గడపున్.

క. ఒకపరి నవ్వుచు నేడ్చుచు, నొకపరిఁ బలుపుచును గాన మొకపరి నాట్యం
బొకపరిఁ జేయుచు నాతఁడు, వికారిబలె నుండు భక్తివివశత్వమునన్. 421

ఆ. అట్టు లాతఁ డన్న మనక నీరము నాక, కడపె నేను నాళ్లు గట్టకడకు
నరుగుదెంచి భిక్షుకాకారమున శౌరి, సదయుఁ డగుచు తేనియెదుట నిలిచె.

గీ. అపుడు భూపాలుఁ డర్ఘ్యపాద్యాదివిధుల, నతనిఁ బూజించి స్వామిసమాగమమున
నాయఘం బెల్ల నశియించె నాతపంబు, సఫలతను జెందె నని నుతి సలుపుచుండ.

క. యతివర్యుఁ డిట్టు లనియెను, క్షితివల్లభ నీవ్రతంబు సిద్ధిం బడసెన్
గతమయ్యె నీయఘం బ, చ్యుతునకు సంప్రీతి గలిగియున్నది నీపై. 424

వ. కావున రేపు మధ్యాహ్నకాలంబున నీలాచలసందర్శనంబు నీకుఁ గానున్నయది. నీవు పతిదేవత యగునీసతీమణితోడను నీకు మార్గదర్శకుండును సకలతీర్థయాత్రాపరిపూతాత్ముండును నగుతాపసునితోడను ధర్మాత్ముం డగునీయమాత్యునితోడను దంతువాయకులంబునం బుట్టి నీపురంబునం దుండి యహర్నిశంబులును విష్ణుకథాగానంబు గావించుచుండుకరంబునితోడను నాయద్రి నధిరోహించి పురుషోత్తమునిసాన్నిధ్యంబునకుం జేరంగలవు. శుభంబు చేకూఱుఁ గాక యని పలికి యంతర్ధానంబుఁ జెందె. 425

క. అంతట ధాత్రీవరుఁ డ, త్యంతము విస్మయము నొంది తపసికి నావృ
త్తాంతమును జెప్పె నతఁ డది, యంతయు విని యిట్టు లనియె హర్షముతోడన్.

క. నరవల్లభ నీభక్తికిఁ, బురుషోత్తముఁ డంతరంగమున మెచ్చి యిటుల్
దరిసెనము నీ కొసంగెను, జరితార్థుఁడ వైతి వ్రతము సఫలం బయ్యెన్. 427

క. నీమూలంబున మాకును, క్షేమము ఘటియిల్లుమాట సిద్ధ మసత్యం
బేమియును లేదు దీనను, స్వామికిఁ గృప లేదె భక్తసంతతి నోమన్. 428

క. అని పలికి యూరకుంటయు, జనపతి సంతోషపడుచు శౌరికథాకీ
ర్తనములచే నాపగ లె, ల్లను గడపి పరుండె నిదుర లాగఁగ రేయిన్.
గీ. అట్లు శయనించి యావసుధాధినేత, నాలుగుభుజంబులును వనమాలికయును
శంఖచక్రగదాపద్మశార్ఙ్గములును, గలిగి తా నున్నయట్టులు కలను గాంచి. 430
క. మేలుకొని పిదపఁ బ్రాతః, కాలక్రియ లెల్లఁ దీర్చి కౌతూహల ము
ద్వేలము గఁ దాపసున కా, మూలాగ్రము స్వప్నవిషయమును వినిపించెన్.
క. అది విని ద్విజుఁ డానందం, బొదవఁగ ని ట్లనియె భూవరోత్తమ కలలో
నాదవినరూపము రా ను, న్నది వేగమ నీకు సంశయము వల దింకన్. 432
క. అనుటయు రత్నగ్రీవుం, డనవధికం బైనప్రమద మందుచు నెపు డ
ద్రిని గాంతునో యెపుడు కనుం, గొనుదునో హరి ననుచు వేచికొని యుండంగన్.
గీ. ఆదినంబున మట్టమధ్యాహ్నవేళ, గుసుమవర్షంబు దివినుండి కురియుచుండ
భానుకోటిప్రభాభాసమాన మగుచు, గోచరం బయ్యె నీలాద్రి క్షోణిపతికి. 434
గీ. అట్లు గోచర మైననీలాచలమును, గాంచుచుండంగ తేఁడు దిగ్భ్రాంతితోడఁ
గానఁబడియెను శైలంబు తేని కనుచు, నెంచి తాపసుఁ డాతని కిట్టు లనియె.
గీ. ఇదియె నీలాచలంబు పృథ్వీశ నీకుఁ, గానఁబడియెనె నావుడుఁ గానఁబడియె
జన్మసాఫల్య మొదవె నాసలిపినట్టి, పుణ్య మెట్టిదో యనుచు నాభూవిభుండు.
వ. శైలంబునకుఁ జాఁగిలి మ్రొక్కి లేచి దేవదుందుభు లాకసంబున మ్రోఁగుచుండఁ
దద్విజయముహూర్తంబున సతీమంత్రికరంబసమేతుండై తాపసపురస్సరంబుగా
నీలాచలంబు నెక్కి తదుపరితనశృంగంబుపైని హాటకమయం బగుదేవాలయం
బుం గాంచి యందుఁ బ్రవేశించి. 437
గీ. అచట మాణిక్యసందోహఖచిత మైన
స్వర్ణసింహాసనమునఁ బ్రచండచండ
జయవిజయముఖ్యభక్తోపచరితుఁ డగుచుఁ
గ్రాలుపురుషోత్తమస్వామిఁ గాంచి మ్రొక్కి. 438

—: పురుషోత్తమ స్తవము :—

సీ. ప్రకృతికిఁ బరుఁడవు భగవంతుఁడవు మహా, పురుషుఁడ వోకఁడవు పూర్వికుఁడవు
కార్యకారణములకంటె భిన్నుండవు, మహదాదితత్త్వసమ్మానితుండ
వాద్యంతశూన్యుఁడ వప్రమేయుండవు, పరిణతిక్షయవృద్ధివిరహితుఁడవు
ధర్మసంస్థాపనార్థము జన్మకర్మంబు, లను స్వీకరించువిలక్షణుఁడవు
గీ. సృష్టికారకుఁ డగుశతధృతిని నాభి, కమలముననుండి సంహారకారి యైన
శివుని నేత్రమునుండి సృజించినట్టి, దేవుఁడవు స్వామి నీశక్తి తెలియఁ దరమె.
గీ. ఎత్తఁగా రానిజన్మము లెత్తినాఁడఁ, బడసినాఁడను బడరానిపాటు లెల్ల
గర్భనరకనివాసదుఃఖంబు మరలఁ, గలుగకుండఁగఁ జేయవే కమలనాభ. 440

క. అని వేఁడుకొనుటయును న, వ్వనజాక్షుం డిట్లు లనియె వసుధాధిప నీ
వొనరించిన స్తవమున నా, కనవధికం బైనహర్ష మాపాదిల్లెన్. 441
గీ. నాకు మునుపోలెఁ బూజ యొనర్చి ధాత, యిచట నుంచెను నైవేద్య మిది భుజించి
ముక్తి నొందుము పరిజనయుక్తముగను, నని నిదేశించి మఱియు నిట్లనియె స్వామి.
క. జనవర ననుఁ గూరిచి నీ, వొనరించిన స్తవము చదువుచుండి ప్రమోదం
బున నాకుఁ గూర్చువారల, కును నొసఁగుదు దర్శనంబుఁ గోర్కెలు పండన్.
క. అని విరమించుటయును మన, మున విస్మయపడుచు భూవిభుఁడు నైవేద్యం
బును గొని చతుర్భుజుం డయి, చనియెను వైకుంఠమునకు సపరిజనముగన్. 444
గీ. రాముఁ డిటఁ బురుషోత్తమనామమునను, నవనిజాత మహాలక్ష్మి యనెడిపేర,
వెలసియున్నారు మోక్షంబుగలుగఁ జేయ, సంసృతినిమగ్నులై యుండుజంతువులకు.
వ. మఱియును నిం కొక్కవిశేషముం జెప్పెద వినుము.

—: కాళరాత్రివృత్తాంతకథనము.—

సీ. మును జగత్పాలనం బొనరించుటకు ఘోర, తపము సేయఁగ శివ తలఁచిలోనఁ
జనుదెంచి యిటకు నిచ్చటను బంచాగ్నిమ, ధ్యస్థయై కావింపఁ దపముఁ దొడఁగె
నప్పుడు రురు వనునసురుఁ డొక్కఁడు బ్రహ్మ, లబ్ధవరాప్తబలంబువలన
నసురసైన్యముతోడ నమరాలయముమీఁది, కరిగి త్రిలోకభయంకరముగ
గీ. ననిమిషుల నెల్లరను నదరంటఁ గొట్ట, వార లల్లాడుచును త్రిదివమును విడిచి
యరుగుదెంచి నీలాద్రికిఁ ద్వరితముగను, గిరితనూజను దర్శించి కేలు మోడ్చి.
సీ. తల్లి సముద్రమధ్యంబున నిర్మించు, కొని గూఢముగ రత్న మనుపురంబు
నందు దైతేయసైన్యంబుతో నివసించి, రురు వనురాత్రించరుం డొకండు
బాధించుచును జగత్ప్రజల నెల్లను విని, హోతము సేయుచుఁ దపోయాగములను
గావించె మమ్ము స్వర్గభ్రష్టులను నేఁడు, శరణుచొచ్చితిమి త్వచ్చరణములను
గీ. నని నివేదింపఁగను దేవి యాలకించి, యట్టహాసంబు చేయంగ నందులోన
భీకరాకారము లగున నేకశక్తు, లుద్భవించి నానాయుధయుక్తముగను. 447
గీ. భయముఁ జెందంగవలదు సుపర్వులార, యని నభోవధి యంటంగ నార్చుచుండ
నపు డటకుఁ జతురంగసైన్యంబుతోడ, రురువు సురలనుగూల్ప నార్చుచును వచ్చె.
క. వచ్చినవానిం గనుఁగొని, చెచ్చెర నాశక్తు లెల్లఁ జెలఁగి వధింపం
జొచ్చిరి తత్సైన్యంబును, నుచ్చైర్హాసప్రణాద ముప్పర మంటన్. 449
ఆ. అపుడు సైన్య మెల్ల నడఁగాఱిపోవంగఁ, గాంచి రురువు కినుక గదుర మదిని
సృష్టిచేసి మాయఁ జిత్రంబుగను దానఁ, దిమిరమయ మొనర్చె సమరభూమి.
ఆ. అంత శక్తు లెల్ల నంధకారంబున, నేమి చేయుటకును నెఱుఁగ కునికిఁ
జేష్ట లుడిగి యుండఁ జిత్తరువులుపోలెఁ, గాళరాత్రిరూపు కాళి దాల్చి. 451

క. ఆరురరత్నోనాథుని, ఘోరంబుగ శక్తితోడఁ గొట్టఁగ హాహా
కారముతోడను నాతఁడు, చేరె రసాతలమునకు విశీర్ణాంగుండై. 452

సీ. అంతట నాదేవి యఖిలదేశస్థిత, యప్పుటచేఁ బాతాళభువనమందు
నారాక్షసునితోడ నాయోధనము చేసి, నఖమునఁ ద్రుంచి తన్మస్తకంబు
తచ్చర్మరుండముల్ దాల్చి భీకరముగా, సకలామరులకు దర్శన మొసంగె
నపుడు తత్కాళరాత్ర్యాకారమును జూచి, విబుధు లెల్లరు భయావిష్టులగుచు

ఆ. నమ్మ సుప్రసన్న వగు మని ప్రార్థింప, సౌమ్యరూప యగుచు సంతసంబు
గలుగఁజేసి వారు కాంక్షించినవరంబు, లెల్ల నీయ శక్తు లెల్ల వచ్చి. 453

గీ. తల్లి క్షుద్బాధ మాకు నుత్పన్న మయ్యె
నొసఁగు మాహార మేదేని యుచితముగను
ననుడు శాంకరి యాశక్తు లారగింపఁ
దగినయన్నంబు గానక తలఁచె హరుని. 454

గీ. ఆమె తలఁచినవెంటనె హరుఁడు వచ్చి, యెదుట నిలువంగ మ్రొక్కి తా నీశ్వరునకు
దేవ యజగంధ ముంట నీదేహమందు, ఛాగరూపుఁడ వీవు నిస్సంశయముగ. 455

గీ. కాన నాశక్తులకు భవత్కాయసంస్థ, మైనమాంసంబు నీయు మాహారముగను
ననుటయును నీశ్వరుం డిట్టు లనియె దేవి, వినుము చెప్పెద నీ కొకవిషయ మిపుడు.

సీ. మును గంగాద్వారమున దక్షుమఖము మ, ద్భటులుధ్వంసము చేయుతరుణమందు
నజరూపమును దాల్చి యజ్ఞేశ్వరుఁడు పాఱి, పోవుచుండఁగ నొంగనొలె దివికి
నది గ్రహియించి నే నాశుగంబున వానిఁ, దాడింపఁ దద్రక్తధార లెగసి
నామీఁదఁ బడుటయు నా కజగంధంబు, గలుగంగ న న్నజగంధుఁ డనిరి

గీ. నీవు గోరినయప్పుడు నేను మాఱు, పలుక భావ్యంబు గాదు మద్భక్త వగుట
ననిపలికి శక్తులార నాయండములను, దినుఁడు భోజనముగ మీకుఁ దృప్తిగలుగు.

వ. మఱియును లోకంబునందు మీరు మాతృనామంబులం బరగి జనంబులచే నజ
వృషణయుక్తంబుగా సమర్పింపంబడుచణకపూరికాపూపాద్యాహారంబులం
గైకొని తృప్తిం జెందుదురుగాక యని చెప్పుటయు శక్తు లెల్లఁ దదాజ్ఞాప్రకా
రంబున వర్తించుచు సంతృప్తి నొందం దొడంగె. అంతటఁ గాళరాత్రి శివదూతి
యనియుం బ్రసిద్ధిం జెంది నీలగిరియందు నిత్యనివాసంబు గావించి దుష్టసంహార
శిష్టసంరక్షణంబులు సేయం దొడంగె. 458

క. ఈ నీలాచలమహిమము, నేనరుఁ డేనియును వినియె నేని వినిచినం
గాని యనాయాసంబుగఁ, దా నొందంగలుగు విష్ణుధామము ననఘా. 459

క. అనవుడు శత్రుఘ్నుం డది, విని సంతోషమున మునిఁగి వేగమ గంగాం
బునిధిసమాగమతీర్థం, బున నధిరోహించి నీలభూమీధ్రంబున్. 460

క. ఒనరిచి పురుషోత్తమద, ర్శనమును బ్రేమమిల్లి స్వామిచరణంబులకున్
దనజన్మమునకు సఫలత, యొనగూడెనటంచు మురియుచుండెడివేళన్. 461

—: క్రతుహయంబు చక్రాంకపురమున కరుగుట :—

క. క్రతుహయ మానీలగిరి, క్షితి విడిచి సుబాహురాజశేఖరసంర
క్షితచాతుర్వర్ణ్యమనుజ, తతి యగుచక్రాంకరాజధానికిఁ జేరెన్. 462

—: దమనుఁడు క్రతుహయముం బట్టుట .—

సీ. అపుడు సుబాహురాజాత్మజన్ముం డైన, దమనుండు హయవతంసమును జూచి
చదివి తత్ఫాలదేశమునఁ గట్టినపత్ర, మందు రాజిలుసువర్ణాక్షరములు
ధరణిలో లేఁడె యింతటివీరుఁ డే మెల్ల, నసమర్థు లగుక్షత్రియాధములమె
తురగంబుఁ గావ శత్రుఘ్నుఁ డేతెంచుచు, న్నాఁడఁట వాని కానామ మేమొ
గీ. కాంచెదము గాక సర్వంబు గడియలోన, ననుచులోనుండియుబికెడియాగ్రహమున
నాకసంబున కెగసి యాహయముఁ బట్టి, కట్టివైచెను దనవీటఁ గదల కుండ.
సీ. అప్పు డావృత్తాంత మంతయుఁ దీరుగా, దూతలవలన శత్రుఘ్నుఁ డెఱిఁగి
చక్రాంకపత్తనసవిధదేశమునకు, నఖిలసేనలతోడ నరిగి విడిసి
యానతీయఁగఁ బ్రతాపాగ్ర్యభూపాలుఁడు, బలములతోఁ గూడి బయలు దేఱి
సామంబుచేఁ గార్యసాధనం బొదవమిఁ, జాటించె యుద్ధంబు శాత్రవులకు
గీ. నంతదమనుఁడుశరచాపహస్తుఁడగుచుఁ, గవియుటయువైరిబలమునుగదనమయ్యె
నుభయపక్షంబులందుంపయోధులకును, గగనమునునుండిసురలెల్లఁగాంచుచుండ.

వ. అప్పుడు పదాతివ్యూహంబులు పదాతివ్యూహంబులతోడను నాశ్వికు లాశ్వి
కులతోడను గజారూఢులు గజారూఢులతోడను రథికులు రథికులతోడను బోరాడి
మడియుటం జేసి రణరంగంబున నెత్తురువెల్లువలు వెల్లివిరిసె. 465

సీ. అది గనుంగొని ప్రతాపాగ్ర్యుండు బహుకోప, మొనయంగ సారథి కిట్టు లనియె
రథమును సూత శీఘ్రముగఁ బోనీయుము, హయహర్తయగువాని కభిముఖముగ
ననవుడు సారథి యట్లె చేయుచు నుండ, నెదురుగా దమనుండె యేఁగుదెంచె
నరుదెంచుటయుఁ బ్రతాపాగ్ర్యుఁ డాతనిఁ జూచి, బాలక నీ వేడఁ బ్రథన మేడ
గీ. జాలి పుట్టెడి నినుఁ జూడ నేల యసువు, లర్పణముచేయఁ బూనితి వాలమందుఁ
బెద్ద లెవ్వారలును లేరె బుద్ధి చెప్పఁ, జాలు నీకనైన విడువుము సైంధవమును.

క. అనవుడు దమనుం డాసన, మునఁ జిఱున వ్రాలయుచుండ భూవర బాలుం
డనొ వీరుండనొ చూపెద, నని శరశత మతనిఱొమ్ము నాడఁగ నేసెన్. 467

క. అవి యెల్లఁ బ్రతాపాగ్ర్యుం, డవలీలను దునిమి వానియళికముమీఁదన్
దవులఁ బది శరము లేయఁగ, నవి శాఖికి శాఖలట్టు లట భాసిల్లెన్. 468

మ. దమనుం డప్పుడు స్వర్ణపుంఖముల చేతన్ గ్రాలుమున్నూఱు బా
ణములన్ నాటఁగ నేసె తేనియుర మానారాచముల్ దూఱి వ
క్షము భేదించి యధోగతిం బడసె వీఁకన్ రామభక్తిప్రహీ
ణమనస్కుల్ బలె నంతటన్ వసుమతీనాధుండు క్రోధంబునన్. 469

గీ. ధనువు నొక్కబాణంబున ధ్వజము రెండు
శరములను వాహముల నాల్గుసాయకముల
రథము నొకమార్గణమున సారథిశిరంబు
నొక్కకోలను దునిమి యత్యద్భుతముగ. 470

క. దమనుని నాలుగునారా, చములను నొప్పించె నంతఁ జయ్యన నాతం
డమరిచికొని నవపరికర, సముదాయము మండిపడుచు జ్వలనుఁడువోలెన్. 471

గీ. నాలుగమ్ముల హయముల నాల్గుమార్గ, ణముల రథమును నొక్కబాణంబుచేత
సారథిని గూల్చి తేనివక్షమున నొక్క, చటులసాయకమును నాఁటి శంఖ మొత్తె.

క. అపుడు ప్రతాపాగ్ర్యుఁడు నూ, త్నపరికరోపేతుఁ డగుచు దమనునిపై ని
ష్కృపముగఁ గురియించిన బా, ణపరంపర బ్రహ్మ మట్లు నల్గడ నిండెన్.

గీ. అపుడు దమనుండు క్రోధతామ్రాక్షుఁ డగుచుఁ, బ్రతిశరంబులఁ దద్బాణతతుల నెల్ల
నొక్కపెట్టునఁ ద్రుంచి వేఱొక్కశరముఁ, బట్టికొని కేల భూపతి కిట్టు లనియె.

ఆ. భూప యీశరంబు భూమిపై నినుఁ బడఁ; ద్రోయుఁగాక యట్లు చేయకున్న
నిగమములను దూఱునిర్భాగ్యుఁ డొందెడి, కల్మషంబు నాకుఁ గలుగుఁగాక.

క. అని శపథము చేసి శరం, బును విడువఁగ నది యమోఘముగను బ్రతాపా
గ్ర్యునిహృదయంబున నాఁటెను, గనగన మండుచును బ్రళయకాలుఁడువోలెన్.

క. ఆశరము నాఁటగనె పృ, థ్వీశుండు రథంబునుండి యిలపైఁ బడి చే
ష్టాశూన్యుఁ డయ్యె నంతట, నాశ లుడిగి చెదరిపోయె నాతనిసేనల్. 477

గీ. అపుడు రణరంగముననుండి నిపుణముగను, నతనిఁ గొనిపోయె సారథి యవలికడకు
నంత శత్రుఘ్నుఁ డది యెల్ల నాలకించి, దమనుని జయించువీరుని నెమకుచుండ.

క. అరుదెంచి పుష్కలుఁడు త, త్పరిసరమున కిట్టు లనియెఁ బరసూదన నేఁ
దురగంబును హరియించిన, యరిగర్వ మడంతుఁ బనుపు మాజికి నన్నున్.

గీ. ఆడినట్టులు నేఁ జేయనైతి నేని, రామపదభక్తి లేనివారలయఘంబు
మాతృవిద్వేషు లగువారిపాతకంబు, సంభవించును నాకు నిస్సంశయముగ. 480

క. అని శపథము చేయుటయును, విని శత్రుఘ్నుండు హర్షవివశుం డగుచున్
బనిచెను భరతతనూజుని, నని సేయఁగఁ బ్రధనభూమి కరివీరులతోన్. 481

—: దమనపుష్కలుల యుద్ధము :—

ఉ. అంతటఁ బుష్కలుండు సముదగ్రబలాన్వితుఁడై రణోత్సుక
స్వాంతమునన్ బయల్వెడలి చయ్యన వచ్చుటయున్ రణక్షమా

భ్యంతరసీమకున్ దమనుఁ డాతనిముంగల నిల్చి భీతి యొ
క్కింతయు లేక కేల ధరియించి శరాసనమున్ శరంబులున్. 482

ఉ. అప్పుడు పుష్కలుం డతని నారసి యిట్లనియెన్ గుమార నీ
వొప్పుగ నిచ్చి మాహయము నొగ్గుము కేలటు గాకయున్న ని
న్నిప్పుడె విం దొనర్పఁగలఁ డీరణభూమికిఁ బుష్కలుండు నీ
చొప్పులు సాగ వింక రఘుసూతిపదాబ్జమదాళిసన్నిధిన్. 483

క. అనవుడుఁ బుష్కలవాక్యం, బునకున్ బ్రత్యుత్తరముగ భూరిశరంబుల్
జననాథతనయుఁ డేసెను, మునుకొని రిపుసైన్య మెల్ల మునుఁగం గాఁగన్. 484

సీ. అంతటఁ బుష్కలుం డాగ్రహంబొదవనా, గ్నేయాస్త్రమును బ్రయోగించుటయును
నది మండుచును బోయి యరిసైన్యముల నెల్లఁ, దగులఁబెట్టఁ దొడంగె దారుణముగ
దమనుఁ డంతట రోషతామ్రాక్షుఁ డగుచును, వారుణాస్త్రము నేసె వహ్ని నడఁప
నది యేఁగి దహనంబు నార్చి వైరుల నెల్లఁ, జలువలు పుట్టించి చంపఁ దొడఁగె

గీ. నపుడు పుష్కలుఁడు సమీరణాస్త్ర మేయ, రాజపుత్రుఁడు పర్వతాస్త్రంబు వైచె
నంతటను బుష్కలుండు వజ్రాస్త్ర మేయ, నదిగిరులఁ గూల్చి దమనుని యెదను బడియె.

క. భిదురాస్త్రము పడినంతన, హృదయంబున సొరగి పడియె నిలపై దమనుం
డది గనుఁగొని తత్సారథి, కదనక్షమనుండి వానిఁ గైకొని చనియెన్. 486

గీ. అపుడు పుష్కలునకు విజయంబు గలుగఁ, జదలు ముట్టంగ దుందుభిస్వానములును
జయనినాదంబులును జర్వసాగె నాత్మ, బలము లుప్పొంగ శాత్రవబలము గ్రుంగ.

క. అంతట సుబాహుధరణీ, కాంతుం డాలించి సేవకముఖంబున వృ
త్తాంతం బంతయు రోషము, సంతాపముఁ గలుగ నెదను సంక్షుబ్ధుండై. 488

వ. సత్వరంబ శస్త్రాస్త్రధరుం డై రథంబు నధిష్ఠించి కాలబలం బను పేరం బ్రసిద్ధిం
బడసిన సేనావ్యూహంబు సలుప్రక్కల నడవ నిజసహోదరుం డగుసుకేతుండును
బుత్రు లగుచిత్రాంగవిచిత్రులును రథంబుల నెక్కి యంగరక్షకులుగాఁ దోడ్
రా సంగ్రామభూమికిఁ గ్రోశమాత్రదూరంబున రథంబునందు మూర్ఛితుండై
పడియున్న దమనునికడకుం జేరి శోకపరిప్లుతమానసుం డై తత్కళేబరంబు నిజ
పాణిపద్మంబులచే నిమురుచు శీతలోపచారంబులు గావించుటయుం గొంతతడ
వున కాతండు సంజ్ఞం బడసి. 489

ఉ. ఎక్కడఁ బుష్కలుండు ధను వెక్కడ మచ్ఛరపీడితాంగ మై
యెక్కడ కేఁగె వైరిబల మెల్ల నటంచును లేచి గ్రక్కునన్
బ్రక్కనె కుందుచుండెడి సుబాహునిఁ జూచి త్రపావనమ్రుఁడై
మ్రొక్కె శిరంబు తత్పదసరోజనిలీనమరాళమై తగన్. 490

గీ. సంతసముఁ జెంది మేదినీకాంతుఁ డెదను, దమనయుతముగ నెక్కి రథంబుఁ బ్రథన
భూమిలోనఁ గ్రౌంచవ్యూహమును రచింప, వాజ్ఞ యొసఁగె సేనాపతి కంత నతఁడు.

వ. ఆయోధనరంగంబునందు శత్రువులకు దుర్భేదం బగునట్లు క్రౌంచవ్యూహముం బన్ని దానికి ముఖంబున సుకేతుండును గంఠంబునఁ జిత్రాంగుండును బక్షంబులందు రాజపుత్రు లిరువురును బుచ్ఛంబునందు మహీపతియును మధ్యంబునఁ జతురంగబలంబును రక్షకంబుగా నుండున ట్లేర్పఱిచి తేనికి విన్నవింప సుబాహుండు చనుదెంచి క్రౌంచవ్యూహంబుం దిలకించి హర్షంబుతోడ నిజస్థానంబునం బ్రవేశించి శత్రుహృదయవిదారకంబుగా శంఖంబు పూరించె. 492

క. ఆనాదము విని రణవి, జ్ఞానచతురుఁ డగుటఁ జేసి శత్రుఘ్నుం డ
న్యూనపరాక్రమశోభితు, లైనమహాబలులఁ బనిచి యాహవమునకున్. 493

ఆ. తాను వారివెంటఁ దరలిపోయె రథంబు, నెక్కి విజయనాద మెల్లదెసల
మాఱుమ్రోఁగుచుండ మాఱు లేనిప్రతాప, మేపు చూపుచుండురూపుతోడ.

వ. అంతట లక్ష్మీనిధి చాపంబు నెక్కువెట్టి సుకేతున కభిముఖంబుగా నాతండు వానిపై శరవర్షముం గురియుటయు లక్ష్మీనిధి వానియురంబున నిశితాస్త్రంబుల నేయఁ బరస్పరశరఘాతంబులచే వారి కిరువురకును ఘోరయుద్ధం బయ్యె నప్పుడు.

గీ. వ్యాప్తరుధిరకళేబరు లగుటఁ జేసి, పుష్పితము లైనకింశుకభూజములు గ
నుగ్రశరవృష్టి గురియించుచుంటఁ జేసి, నవపయోదములుగను గన్పడిరి వారు.

వ. అత్తఱిని లక్ష్మీపతి నాల్గుశరంబులఁ దురగంబులను నొక్కమార్గణంబున ధ్వజంబును నొక్కసాయకంబున సారథిని నొక్కబాణంబునఁ జాపంబును నొక్కవిశిఖంబున రథంబును గూల్చి యొక్కపృషత్కంబు హృదయంబు గాఁడ నేయ సుకేతుండు క్రిందికుఱికి సత్వరంబుగా గదను దాల్చి లక్ష్మీనిధి కభిముఖముగా వచ్చుటయు నాతండు రథంబు డిగ్గి గదాధారి యై నిలిచె. 497

ఉ. అంతట వార లిద్వరును హస్తియుగంబు తెఱంగు గన్పడన్
వింతగఁ బోరి రాలమున వీరులు మెచ్చఁ గదాయుగంబుతో
నంతకు నంతకున్ మనములందుఁ జలం బధికంబు గాఁగ నొ
క్కింతయుఁ బౌరుషంబునకు నేమఱిపాటు జనింప కుండఁగన్. 498

వ. పోరాటంబున కంతంబు లేకుంట లక్ష్మీనిధి యాగ్రహంబున సుకేతునికరంబులు గుఱిచేసి గద నెత్తి వ్రేయుటయు సుకేతుం డతిలాఘవంబున హస్తంబులచే దానిం బట్టికొని విఱిచివైచె నంతట లక్ష్మీనిధి గదావర్జితుండై బాహుయుద్ధంబునకు సంసిద్ధుం డగుటయు సుకేతుండును గదను బరిత్యజించి బాహుయుద్ధంబున కుద్యుక్తుం డయ్యె నప్పుడు వా రిరువురును బాహూబాహవి ముష్టీముష్టి కచాకచి దంతాదంతి నఖానఖి యుద్ధంబు లత్యద్భుతంబుగాఁ గావించుచు నొక్కపరి నేలపయిం బడి మూర్ఛాక్రాంతు లైరి. 499

సీ. అంతటఁ జిత్రాంగుఁ డరిసైన్యములమీఁద, శరపరంపరలను గురియఁ దొడఁగె
నది చూచి పుష్కలుం డాగ్రహంబున నేసె, శరశతంబును వానియురమునందుఁ
జిత్రాంగుఁ డవి యెల్ల ఛేదించి వాఁడిమి, నుల్కలు గాఁడ నేసెఁ బుష్కలునిమేనఁ
బుష్కలుం డవి ఖండములు చేసి భ్రామకా, స్త్రమునఁ ద్రిప్పెను వైరిరథము దివిని

గీ. నంతఁజిత్రాంగుఁడుప్పరంబంటఁగొట్టె,నరథుఁడగుపుష్కలునినొక్కసాయకమున
నపుడుభరతాత్మజుండుధైర్యమున నొక్క,సాయకంబును సంధించి చాపమందు.

గీ. ఈశరంబునఁ జిత్రాంగ యేను నిన్ను, యమునిసదనంబునకుఁ బంప నైతి నేని
కలుగుఁగాక సతీనిందవలనఁ గలుగు, కల్మషము నాకు ననుచు మార్గణము విడిచె.

సీ. అంతటఁ జిత్రాంగుఁ డాత్మీయచాపము, నం దొక్కదివ్యసాయకము గూర్చి
వీరాగ్రణి త్వదీయవిశిఖంబు నీశరం, బున నేను దునుమక పోతి నేని
తీర్థయాత్రకుఁ బోనఁ దివిరెడివారల, ప్రస్థానమును మాన్చుపాతకంబు
వదలి యేకాదశీవ్రతము వ్రతాంతరం, బుల నాశ్రయించువారలయఘంబు

గీ. నాకు సంప్రాప్త మయ్యెడుఁగాక యనుచు, సాయకంబును విడిచె నాసాయకంబు
పుష్కలునిబాణమునుమధ్యమునకు దునుమ, శేషశరముచిత్రాంగునిశిరముఁదునిమె

గీ. అపుడు చిత్రాంగమస్తకం బవనిమీఁదఁ, బడి ప్రకాశించెఁ జంద్రబింబంబుకరణి
నది సుబాహుండుకనుఁగొని హా కుమార,హా తనూభవయనుచు దుఃఖార్తుఁడగుచు

వ. సంస్రవద్రుధిరంబును గుటిలభ్రూయుగంబును గుండలమండితంబును సందష్టాధర
పల్లవంబును నగుపుత్రునివక్త్రంబును ముద్దు వెట్టుకొని. 504

గీ. తండ్రి కలిగింప వేల సంతసము నాకు, నమృతకల్పంబు లగుభాషణములతోడఁ
గానఁబడ వేల నవ్వుమొగంబుతోడఁ,జూపులను విచ్చి నామోము చూడ వేల.

క. చతురంగబలము ధైర్య, చ్యుత మై నిను శరణుచొచ్చుచుండఁగ నీ వీ
గతి నూరకున్న నాయన, యితరుఁడు దిక్కెవఁడు దీని కెఱుఁగం జెపుమా. 506

క. ఘనుఁ డెవ్వఁడు నీకంటెను, సమరాంగణమందుఁ దండ్రి శత్రుఘ్నునిబా
ణములకు నిలువఁగ నీ వీ, క్రమమున విడనాడ నేది గతి యిఁక మాకున్.

క. అరె శాత్రవసందోహం, బిదె కార్ముక మదె మఖాశ్వ మిన్నిటిఁ గూడన్
వదలి సమరాంగణంబున, నిదురించుచు నుంటె వత్స నీ వేటు లనుచున్. 508

వ. కడుంగడుం బొక్కుచుండ నత్తరుణంబున విచిత్రదమను లరుదెంచి తండ్రికి
నమస్కరించి. 509

గీ. తండ్రి వీరులు గోరఁగాఁ దగినయట్టి, మరణము లభించె మాసహోదరున కేల
పరితపించెదు వానికై యరులతలలు, తఱిగి చెండాడవలసినతరుణమందు.

ఉ. తెమ్ము రథమ్ము నెక్కు మవలీలను రూపఱఁ జేసి శత్రువ
ర్గమ్మును నీమనంబునను గల్గినపుత్రవియోగదుఃఖభా

రమ్మును దీర్చివై వంగను భ్రాతకు వైరిశిరోధర కృతో
యమ్మునఁ జేయఁ దర్పణము హస్తము లొగ్గితి మేము నావుడున్. 511

క. వారలవాక్యములను విని, భూరమణుఁడు విడిచి శోకమును ధైర్యము చే
కూరఁగఁ గొంత మనంబున, నారూఢుం డయ్యె రథము నాజి నొనర్పన్. 512

వ. అంతట విచిత్రదమనులు పితృసహితంబుగా రణరంగంబునం బ్రవేశించి శాత్రవ
బలంబు నెదుర్కొనుటయుఁ బ్రావృట్కాలంబున వలాహకంబులకుం బోలె
రిపుతాపదమనులకును నీలరత్నవిచిత్రులకును ఘోరయుద్ధం బయ్యె. 513

క. అంతట సుబాహుధరణీ, కాంతుఁడు రిపుసైన్యములు వికావికలు గ వి
క్రాంతిని నెరపుచు శత్రు, ఘ్నాంతికమున కరుగుచుండ నతిదర్పమునన్.

గీ. అపుడు శత్రుఘ్నపరిసరమందు నున్న, యాంజనేయుఁడు వారివాహంబువోలెఁ
జేయుచు మహానినాదము చేర వచ్చి, యవనివిభునిపురోభాగమందు నిలిచె. 515

గీ. నిలుచుటయు రోషపూరితనేత్రుఁ డగుచు, నతనిఁ గాంచి సుబాహుఁ డిట్లనియెఁ గీశ
యెవఁడ వీ వేల వచ్చితి విటకు రాముఁ, డేడ శత్రుఘ్నపుష్కలు లేడఁ జెపుమ.

చ. అనుటయు నాంజనేయుఁ డిటు లాడె ధరాధిప నేను వాయునం
దనుఁడను నాంజనేయుఁ డనునామము గల్గినవాఁడ రామచం
ద్రునిభటుఁడన్ ననున్ గెలుచుదోర్బల ముండినఁ జూపి ముందు పైఁ
జనుము మదీయనాయకులసన్నిధి కేటికి సంభ్రమింపఁగన్. 517

క. అనవుడు సుబాహుఁ డతిరయ, మున నాఁటెను బాణదశకమును వానియురం
బున నపుడు హనుమ చూర్ణం, బొనరిచి తత్సాయకముల నుగ్రుం డగుచున్.

గీ. వాలమునఁ జుట్టగాఁ జుట్టి వానిరథము, గొనుచుఁ బోయి నభంబున గునియు చుండ
భూవరుఁడు తీవ్రమార్గణములను వేసి, వాలమును సంభ్రమంబున నేల కుతికె.

శా. అంతన్ వాయుసుతుండు తద్రథము నత్యాటోప మేపారఁగా
నింతింతల్ వొనరించి పాఱనయివన్ వీక్షించి ధాత్రీంద్రుఁ డ
త్యంతక్రోధమునన్ రథాంతరమునం దాసీనుఁడై యేసె దు
ర్దాంతావేగము లైనసాయకములన్ దద్గాత్రమర్మంబులన్. 520

క. అనిశితబాణఘాతము, చే నొడలు చుఱుక్కు మనఁగఁ జిడిముడిపడుచున్
వానరవీరుఁడు తదుర, స్థానము పగులంగ నెగసి తన్నెన్ గాలన్. 521

క. ఆపాదతాడనంబున, భూపాలుఁడు నోట రుధిరమును గ్రక్కుచు ను
త్కోపితనిశ్వాసుం డయి, చూపఱు విస్మయము నొంద క్షోణిం బడియెన్. 522

వ. అంతటఁ దత్సైన్యంబు లెల్లఁ జెల్లాచెద రగుటయు దమనుండు సేతువు వారిధిం
బోలె వానిని స్తంభింపం జేయ సుకేతుండును లక్ష్మీనిధియును ఘోరయుద్ధంబు
గావింపం దొడంగిరి. అప్పుడు సుబాహుండు. 523

సీ. బ్రహ్మాదిదేవతాబ్రహ్మాండకోటులు, తల లొగ్గి ప్రస్తుతుల్ సలుపుచుండ
రంభాదిదివ్యాప్సరఃకామినులు లోచ, నానందముగ నాట్య మాడుచుండ
నాకారయుతము లై యరుదెంచి భక్తితో, వేదంబు లెల్ల సేవించుచుండఁ
దుంబురునారదాదులు వీణలను గొని, హాయిగా గానంబు చేయుచుండ
గీ. యజ్ఞదీక్షాసమన్వితుఁ డగుచు నాత్మ, తేజమున వెలిఁగించుచు దిక్తటముల
నెల్ల సరయూతటంబున నుల్లసిలెడి, జానకీవల్లభునిఁ గాంచి స్వప్నమందు. 524
వ. తత్సందర్శనజనితం బగుబ్రహ్మానందంబు ననుభవించి ససంభ్రమంబుగా మూర్ఛ
దేఱి లేచి సుకేతువిచిత్రదమనుల రావించికొని వారితోడ ని ట్లనియె. 525

—: సుబాహుఁడు క్రతుహయమును నిజరాజ్యమును శత్రుఘ్నున కర్పించుట :—

క. అపచారము నొనరించితి, మపచారము చేయవలసియుండినచోటన్
నిపుణ మగుచూపు నేఁటికి, నుపలబ్ధం బయ్యె దైవయోగమువలనన్. 526
సీ. తత్త్వవివిత్సచేతను నేను దీర్ఘయా, త్రకుఁ బోయి ము న్నొక్కతరుణమందు
ధర్మజ్ఞ లగుతపోధను లనేకులు ప్రబో, ధించెడిమార్గముల్ తెలిసికొనుచు
నసితాంగుఁ డనెడిమహర్షి యొద్దకుఁ జేరి, ప్రణమిల్లి నామనోరథముఁ దెలుప
నమ్మహాత్ముఁడు కరుణానలోకనముల, చేత గాఢముగ వీక్షించి నన్ను
గీ. వత్స విని చెదఁద త్త్వంబు వాస్తవముగ,విను మయోధ్యాధిపతిరామవిభుఁడు బ్రహ్మ
శబ్దవాచ్యుఁడు సర్వసంసారహర్త, యతనిసతి సీత చిన్మయి యక్షలమాత.
గీ. అని ప్రబోధించుటయును నే నపుడు నవ్వి, మానివల్లభ మానవుఁ డైనరాముఁ
డగునె పరమార్థతత్త్వంబు హర్షశోక,వివశ యగుసీత చిన్మయి యవునె తలఁప.
గీ. జన్మశూన్యున కేరీతి జన్మ మొదవుఁ, గర్తృతాశూన్యునకు నేమి కార్య ముండు
జన్మదుఃఖజరాదిసంసర్గరహిత, మైనపరమార్థతత్త్వంబు నాన తీవె. 529
క. అని పలికినతోడనె య, మ్మునినాథుఁడు రామతత్త్వమును నెంచక దూ
ఱినవాఁడ వనెడికారణ, మున నను శపియించెఁ దత్త్వమూఢత గలుగన్. 530
గీ. అపుడు నేను వినీతుఁడ నగుచు నతని
చరణములు పట్టుకొని తప్పు సైఁపు మనుచుఁ
బ్రార్థనము సేయుటయును గృపాళుఁ డగుట
ఋషివరేణ్యుఁడు ననుఁ జూచి యిట్టు లనియె. 531
క. నరనాథ నీవు రామా, ధ్వరవిఘ్నము చేయఁ బూనుతతి మారుతి నీ
యురమును గాలన్ దన్నిన, తరుణంబునఁ దెలియఁ గలదు తత్త్వము నీకున్.
క. అనుటయు నే నతనికి వం, దన మొనరిచి వచ్చినాఁడ నాఁటికి నేఁ డా
ముని చెప్పినట్లు హనుమం, తునిత్రేటునఁ బడితి మూర్ఛితుఁడ నగుచు నిలన్.
గీ. అట్లు పడి స్వప్నమునఁ గంటి నద్భుతముగ
రామునినిజస్వరూప మాస్వామి యొకఁడె

బ్రహ్మతత్త్వంబు నా కున్న భ్రాంతి తొలఁగ
సవనహయమును గొని రండు సత్వరంబ. 534

క. మన కున్న రాజ్య మంతయు, ననువుగ నర్పించి యధ్వరాశ్వముతో రా
మునియాగమునకుఁ దద్ద, ర్శనభాగ్యమువలన నగుదుఁ జరితార్థుండన్. 535

క. అని యాజ్ఞాపించుటయును, ననుజుఁడు తనుజన్ములును దదాజ్ఞానప్రమా
నను లై సైన్యసమేతము, గను దోడ్కొని వచ్చి సవనగంధర్వంబున్. 536

క. నిలుపుటయు జేనియెదుటను, దిలకించి యతండు నిరవధికహర్షము సం
ధిల హయముం దోడ్కొని తన, బలగముతోఁ గదలి వెడలి పదచారమునన్.

వ. సితచ్ఛత్త్రశోభితుండును జామరవీజ్యమానుండును రామకథానకసుధాస్వాద
పరితృప్తమానసుండును నిర్భయుండును వానరసహస్రపరివృతుండును వీరకోటి
పరివేష్టితుండును సుఖోపవిష్టుండును నగుశత్రుఘ్నునిం గాంచి తచ్చరణసరో
జంబులకు సాష్టాంగవందనం బాచరించుటయు శత్రుఘ్నుం డాసనంబునుండి
యుత్థితుం డై సుబాహుమహీనాథుఁ బరిష్వంగంబు గావించుకొనియె. 538

క. అంతట సుబాహుధరణీ, కాంతుఁడు శత్రుఘ్నసమ్ముఖంబునఁ దనవృ
త్తాంతం బంతయుఁ దెలిపి య, నంతర మర్పించి యధ్వరాశ్వముఁ బిదపన్. 539

క. తనరాజ్యం బంతయు న, ప్పన మొనరించుటయు నతనిభక్తికి మోదం
బెనయఁగ శత్రుఘ్నుఁడు ద, త్తనయుఁడు దమనున కొసంగెఁ దద్రాజ్యంబున్.

వ. అప్పుడు సుబాహుండు పుష్కలనిహతుం డగు నిజతనూజునకు విధివిధానంబున
సంస్కారంబు గావించి తత్త్వజ్ఞుం డగుటం జేసి పుత్రశోకంబు జ్ఞానంబున శమి
యింపం జేసికొని రామనామామృతాస్వాదంబు గావించుచు మహారథికపుర
స్కృతుం డై యశ్వసంరక్షణార్థంబు ప్రస్థితుం డయ్యె.

గీ. అపుడు శత్రుఘ్నుఁడు సుబాహునృపునికడఁకఁ
గాంచి హర్షించి క్రతుతురంగమును విడిచె
విడుచుటయు నది మారుతవేగమునను
జని తిరుగఁ జొచ్చె బహుపూర్వజనపదముల. 542

చ. అచటఁ బరాక్రమోపహితు లైననరేంద్రు లనేకు లాదర
ప్రచితమనస్కు లై కనకరత్నదుకూలధనాద్యుపాయనా
పచితుల గౌరవంబు సలుపంగఁ దొడంగిరి వాజి కుగ్గడిం
చుచును నమస్కరించుచును జూపఱు విస్మయ మొంది చూడఁగన్. 543

—: క్రతుహయంబు తేజఃపురముం బ్రవేశించుట :—

వ. అంతట నధ్వరాశ్వంబు సార్వభౌముండువోలెఁ దత్తదుపాయనసంభావితం
బగుచుఁ గ్రమంబునఁ దేజఃపురంబునకుం జేరె. 544

గీ. యతిమఠంబులు దేవాలయములు విప్ర, మందిరస్థాగ్నిహోత్రధూమములు గాంగ
విమలసలిలప్రవాహముల్ విస్మయంబు, గొలుప శత్రుఘ్నుఁ డాపురిఁ గలయఁ జూచి.

ఆ. ఇట్టు లనియె సుమతి యేతత్పురాధీశుఁ, డెవఁడొ వానిచరిత మేమొ చెపుము
యనుడు సుమతి యిట్టు లనియె స్వామి ఋతంభ, రాహ్వయుం డదఃపురాధినేత.

క. అతఁడు బహుసతులు గలిగియు, సుతుఁ డుదయింపమికి వగచుచును మదిలో నా
కృతజని విధివశమున నా, గతుఁ డగుజాబాలి కెఱఁగి కడుభక్తి మెయిన్. 547

క. స్వామి యపుత్రకుఁడ నగునా, కేమి యొనర్చినఁ దనూజుఁ డేర్పడి వంశ
క్షేమము గలుగునొ చెప్పుము, నామనమునఁ గలుగువేదనాభర ముడుగన్.

వ. అని ప్రార్థించుటయు నమ్మునివరుం డి ట్లనియె. 549

గీ. క్ష్మాతలాధిప మూఁడు మార్గములు గలవు, సంతు కోరినవారికి సంతు గలుగ
వాసుదేవార్చనం బేని వామదేవ, సేవనం బేని ధేనుసంసేవ యేని. 550

క. కావున నీ వొనరింపుము, గోవునకుం బూజ యెల్లకోర్కులు దీరన్
గోవు ప్రమోదముఁ జెందిన, దేవత లుండెదరు ధేనుదేహమునందున్. 551

క. గోవునకుఁ బ్రణతిగ సంబును, గావించునొ తృప్తి నెవఁడు గ్రాసముచేతన్
దేవతలు పితరులును నా, పావనున కొసంగుదురు శుభంబుల నెల్లన్. 552

గీ. అధిప బుభూమతి యైనకన్యయు సతృష్ణ, యైనగోవు సనిర్మాల్య యైనయట్టి
దేవతయు నుండు నెవ్వనియూనసథము, నందు వానియశేషపుణ్యము నశించు.

గీ. కట్లచేతను గోవును గొట్లువాఁడు, ఖండితకరుం డగుచు నరకమున నుండు
గడ్డి తినియెడిధేనువు నడ్డగించు, వాఁడు పితరుల నేడ్పించువాఁడ చూవె. 554

గీ. ధేనువును బాదమునఁ దన్నినాఁ డుండు
యమునికేతనమున ఖండితాంఘ్రి యగుచు
ధేనుదంశసవానికిఁ బ్రసవవాఁడు
పితరులను నుద్ధరించినసక్కృతియ చూవె. 555

వ. ఈవిషయంబున నుదాహరణంబుగా నొక్కయితిహాసంబు చెప్పెద నాలకింపుము.

—: జనకయమసంవాదకథనము :—

సీ. యోగబలంబుచే నొకనాఁడు జనకవి, శ్వంభరాధీశుండు వదలి మేను
దివ్యవిమానమ్ము నధిష్ఠించి పితృపతి, పురమార్గమున నుండి యరుగుచుండఁ
దద్దేహవాయువు దవిలి సౌఖ్యము గల్గ, నరకనివాసు లానంద మొంది
భూప మానరకసంతాపంబు చల్లాఱెఁ, ద్వత్తనూపవనంబు తగులుకతనఁ

గీ. గాన దీనుల మైనమాపైని గరుణ, యెనయ నీ వుండు మిచ్చోట ననుచు వేఁడ
ధర్మశీలుఁడు గాన భూధవుఁడు నిలిచె, నచ్చటనె వారిప్రార్థన ననుసరించి. 557

వ. అప్పుడు కృతాంతుండు నరకద్వారంబునం దున్న జనకభూపాలుని నాలోకించి
మహాత్మా పరాపవాదపరాయణులును బరద్రవ్యాపహారకులును బరద్రోహ

కరులును మిత్త్రవంచకులును నిరపరాధయు ధర్మపరాయణయు సాధ్వియు నగు
భార్యను విడనాడినవారును నెన్నఁడును రామనామంబు స్మరియింపనివారును
మున్నగుపాతకులు మచ్ఛాసనంబునఁ బాపఫలంబు ననుభవించుచుండెడి
యిచ్చోటికి మీబోఁటిపుణ్యాత్ములు రాఁ దగదు. కావున దివ్యవిమానంబు నధి
ష్ఠించి పుణ్యలోకంబునకుం జని యథేచ్ఛంబుగా నశేషభోగంబు లనుభవింపు
మనుటయు జనకుండు దండధరున కిట్లనియె. 558

గీ. మత్కళేబరపవనసంస్పర్శముననను, బడయుచున్నారు సౌఖ్య మీప్రాణు లెల్లఁ
బరులసౌఖ్యంబుకంటెను బరమసుఖము, గలదె యెందేని పరహితకాముకులకు.

గీ. ఏను వైకుంఠపురమున కేఁగ వలయు, ననెడికోరిక గల దేని యాత్మ నీకు
విడిచిపెట్టుము సమవర్తి వీరి నెల్లఁ, బోయెద సుఖంబుగను విష్ణుపురికి నేను. 560

వ. అని పలుకుటయును గృతాంతుండు నరకనివాసు లగుజీవకోటులను బ్రత్యేకం
బుగాఁ జూపుచు నిట్లనియె. 561

గీ. విశ్వసించినమిత్త్రుని వెలఁది నితఁడు, గవిసె నాహేతువున వీనిఁ గట్టి లోహ
శంకువున నుంచి పదివేలసమలనుండి, నరకయాతనఁ గుడుపుచున్నార మధిప.

గీ. ఈమహాపాపి యిఁకమీఁద నిలను బంది, కడుపునను బుట్టి పడరానిగాసిఁ జెంది
యవల మానవయోనియం దవతరించి, షండరూపంబునను గొన్ని సమలు గడపు.

గీ. కనుఁగొనుము వానిరౌరవంబుననుజిక్కి, నలఁగుచున్నాఁడు శతహాయనములనుండి
బలముచేఁ బట్టికొని పరభామినులను, గాఁగిటను జేర్చికొనినట్టికారణమున. 564

క. పరధనమును హరియించిన, దురితాత్ముఁడు వీఁడు నఱికి దోర్యుగళంబుం
దొరలించి పూయశోణిత, నరకంబున ముంచుచుండినారము వీనిన్. 565

గీ. ఆఁకలిని జెంది వచ్చినయతిథి కితఁ, డాదరము చూపఁ డాయె వాక్యమున నైన
నందుచే నంధతామిస్రయాతనలను, నేఁచుచుందుము వీని నూఱేండ్లనఱకు. 566

గీ. పరుల దూషించినట్టినిర్భాగ్యుఁ డితఁడు, వీఁడు పరదూషణంబు గావించునపుడు
చెవులు నిక్కించుకొని విన్న చెనఁటి వీర, లుభయులును నంధకూపమందుండి రధిప.

క. ఈతఁడు మిత్త్రద్రోహము, చేసెను రౌరవమునందుఁ జేరినవాఁ డీ
రీతిని బహుపాపులు గల, రేతల్లోకమున విడువ నెట్లగు వీరిన్. 568

క. అని పలుకుడు జనకుం డి, ట్లనియెను మహనీయ వీర లందఱును విము
క్తిని నేఁడు చెందఁ గలిగిన, యను వే దేనియును నున్న నది తెలుపఁ గదే. 569

గీ. అనుటయును ధర్మరా జిట్టు లనియె భూప, వీరు విన రైరి యెపు డేని విష్ణుకథలు
సలుపరై రెన్నఁడును గూడ శౌరిపూజ, నరకనిర్ముక్తి వీరి కేకరణిఁ గలుగు.

వ. ఐనను నీపాపాత్ములను నీవు విముక్తులం గావింపఁ దలంచితి వేని యేతదుద్ధరణో
పాయం బొండు గలదు. నీ వొక్కనాఁడు ప్రాతఃకాలంబున లేచి శుద్ధభావంబు
తోడం గావించినరామస్మరణంబువలనం గలిగినపుణ్యంబు ధారవోసితివేని వీరు

నిరయనిర్ముక్తు లగుదు రని పలుకుటయు జనకుండు పరోపకారపరాయణమాన
సుం డగుటం జేసి మహోత్సాహంబునఁ దనపుణ్యంబు నాతనికి ధారవోసె.

గీ. అంత నాపాపు లెల్ల నత్యద్భుతముగ, దివ్యదేహంబులను దాల్చి దివికిఁ జనిరి
జనకభూపాల నీకటాక్షమున మాకు, నరకయాతన తప్పె నీనాఁటి కనుచు. 572

క. అనుటయుఁ దద్వాక్యంబును, విని కని తద్రూపములను విస్మితుఁ డగుచున్
జనకుఁడు వారలు దివి కేఁ, గినపిమ్మట నిట్టు లనియెఁ గీనాశునకున్. 573

గీ. ధర్మరాజ మదీయసంస్థానమునకు, సుకృతవంతులు రారు పాతకులు దక్క
నని వచించితి వేపాప మంటె నాకు, నిచ్చటికి నేఁను వచ్చుట కెఱుఁగఁ జెపుమ.

క. అనవుడు దండధరుం డి, ట్లనియెను నాతనికి భూతలాధిప నీచే
సినయంతపుణ్య మెవరును, బొనరించినవారు లేరు పుడమిని వింటే. 575

క. తావకనామస్మరణము, పావనులను జేయు నెట్టి పాపుల నైనన్
నీ వొక్కనాఁడు మేసెడి, గోవును దోలితివి దానఁ గొల నీ కొదవెన్. 576

క. ఆకొల నరకద్వారా, లోకన మొనగూర్చి నీకు లుప్తం బయ్యెన్
భూకాంత నేఁను నీవన, ఘాకారుఁడ నైతి వింక నరుగుము దివికిన్. 577

క. అనవుడుఁ గృతాంతునకు మే, దినీశ్వరుఁడు మ్రొక్కి యెక్కి దివ్యవిమానం
బును జనియె నూర్ధ్వలోకం, బునకున్ గొనియాడ సురసమూహం బెల్లన్. 578

క. కావునఁ బూజార్హంబులు, గోవు లనుచు నెంచి నీవు కొలువుము వానిన్
దావకమనోరథార్థము, క్ష్మావర సిద్ధించుఁ దత్ప్రసాదమువలనన్. 579

క. అనుటయు ఋతంభరుం డి, ట్లనియెను మౌనీంద్ర గోవు నర్చించెద నీ
వనినట్లు తద్విధానం, బును దయతోఁ జెప్పు మనుడు ముని యిట్లనియెన్. 580

—: జాబాలి ఋతంభరునకు గోసేవావిధానముం జెప్పుట :—

సీ. అరుగంగ వలయును నటవీస్థలంబున, కరుగుదెంచెడిగోవు ననుసరించి
భుజియింపవలయు గోభుక్తంబు లయి గోమ, యములోన వచ్చినయవలు గడిగి
యర్పింపవలయును యవసంబు స్వయముగ, గోవున కాదరభావమునను
నుచ్చస్థలంబున నుండినయెడ గోవు, నీచస్థలంబున నిలుపవలయు

గీ. గోవు త్రావెడివేళను గ్రోల వలయు, సలిలమును గోశరీరదంశములు వాప
వలయు నీరీతి గోసేవ సలుప వలయుఁ, బ్రతిదినంబును బుత్రార్థి పార్థివేంద్ర. 581

క. అనవుడు జాబాలి వచిం, చినయట్లు ఋతంభరుండు చేయఁదొడఁగెన్
దినదినమును గోసేవను, గనువారల కబ్బురంబు గాఁ గనుపట్టన్. 582

ఆ. అట్లు కొన్నిదినము లరుగంగ నొకనాఁడు, గోవువెనుక నేఁగి భూవిభుండు
వనవిలాసములను గనుచుండ నొకసింగ, మరుగుదెంచి గోవు నడచి చనియె. 583

క. అది గనుఁగొని కల్లోలిత, హృదయుం డై తేఁడు చేయ నేదియుఁగూడక
మదిఁ దోఁపమి దుఃఖించుచుఁ, దుదకుక జాబాలికడకుఁ ద్రుతముగ నరిగెన్.
గీ. అరిగి జాబాలికిఁ బ్రణామ మాచరించి, తెలిపి జరిగినవిషయంబు తేటపడఁగ
ననఘునా యెడలయథార్థమయ్యెఁబుణ్య. మునకుఁబోఁ బాపమెదుర య్యెన నెడిమాట
క. మునినాథ మత్ప్రమాదం, బునఁ బ్రాప్తం బైనపాపమున కేదే నుం
డిన నిష్కృతి వచియింపుము, కనికర మొదవంగ నీతకలుషుఁడ నగుదున్. 586
సీ. అనుటయు జాబాలి యతని కి ట్లనియెను, రాజేంద్ర పాతకరాశి తొలఁగఁ
గలవు ప్రాయశ్చిత్తము లనేకములు కాని, తెలిసి గోహత్యను జలిపె నేని
మెఱిఁగి నింద యొనర్చె నేని గోవిందుని, లేదు ప్రాయశ్చిత్తి మేని యేని
యట్టిపాపులు నరకాబ్ధిలో మునుఁగుచుఁ, దేలు చుందురు వేలు దిక్కు లేక
గీ. తెలియమిని వచ్చె గోహత్య నలిపినట్టి, పాతకము నీకుఁ దాని కై భయము వలదు
నేఁడె ఋతుపర్ణనృపతిసాన్నిధ్యమునకు, నేఁగు మర్త్యాం డతెంగు నిష్కృతి నచింప.
చ. అనుటయు తేఁడు ధైర్యమున నమ్మునికిన్ బ్రణమిల్లి సత్వరం
బున ఋతుపర్ణసన్నిధికిఁ బోయి నిజాగమనప్రయోజనం
బును నెఱిఁగించి పాతకవిముక్తి కుపాయము వేఁడె వేఁడినం
తన ఋతుపర్ణుఁ డి ట్లనియె దాశరథిన్ మదిలో స్మరించుచున్. 588
క. జనవర త్రికరణశుద్ధిగ, నొనరించుచు రామభజన మొండొకగోమా
తను సేవింపుము గోవధ, జనితం బగుపాప మెల్ల సమయును దానన్. 589
గీ. ఆవల నలంకరించి యాగోవు నొక్క, బ్రాహ్మణున కిమ్ము పుత్రసంప్రాప్తి యొదవు
ననుటయు నతండు చెప్పిన ట్లతఁ డొనర్చి, సుతుని శుభలక్షణ పలక్షితునిఁ బడసె.
ఆ. అట్లు సుతునిఁ బడసి యతివేలసంజాత, హర్ష భారపరవశాత్ముఁ డగుచు
సత్యవంతుఁ డనుప్రశస్తనామం బిడె, రాజమౌళి పుత్రరత్నమునకు. 591
వ. అంతఁ దత్తనూజునిసుగుణంబులు నానాఁటికిం బ్రమోదముం గొల్పుచుండ ఋతంభరుం డొక్కనాఁడు వృద్ధజనసమక్షంబున సత్యవంతునకు రాజ్యంబు నొసంగి వైరాగ్యంబుచే వనంబున కేఁగి వానప్రస్థవ్రతంబు నెఱవేర్చుకొనుచుఁ గొంత కాలంబునకుఁ దనువుతోడన విష్ణులోకంబునకుం జనియె. 592
ఉ. అంతట సత్యవంతుఁడు నయంబును మీఱక తండ్రివోలె న
త్యంతసమర్థతన్ ధరణి నాత్మభుజంబునఁ దాల్చి రామునిన్
స్వాంతమునన్ స్మరించుచును సంతతమున్ బ్రజ నేల సాగె ధీ
మంతుఁ డతండు తావకసమాగమమున్ విని సంతసిల్లెడిన్. 593
గీ. అతఁడు శిక్షించుచుండును యముఁడువోలె, రామనామంబు నుడువనిప్రజల నెల్ల
నందుచే వానిరాజ్యమునందు లేరు, రామభక్తులు గానివారలు మహాత్మ. 594

—: సత్యవంతుఁడు తనరాజ్య మంతయును శత్రుఘ్నున కర్పించుట :—

క. అని చెప్పుచుండఁగనె విని, తనభృత్యులవలన హయవతంసాగమనం
బును సత్యవంతుఁ డచటికిఁ, జనుదెంచి నమస్కరించి శత్రుఘ్నునకున్. 595

క. తనరాజ్య మంతయును స, ప్పనముం బొనరించె రామభద్రునియాగం
బునకై శత్రుఘ్నుం డా, తనిభక్తికి మిగుల సమ్మదం బొదవంగన్. 596

గీ. అతనిరాజ్యంబు మరలఁ దదాత్మజన్ముఁ, డైనరుక్మున కొసఁగి నిజాజ్ఞ నచటఁ
జాటుకొల్పి హయంబుతో బయలుదేఱె, సత్యవన్ముఖభూపాలసహితుఁ డగుచు.

గీ. అంతటను మార్గమధ్యమునందుఁ జిమ్మఁ, జీకటులు గ్రమ్మి యావరించెను రజంబు
వ్యోమమునుభూతలంబునునొకటిగాఁగఁ, గురియదొరఁగొనెజలదంబులరుణవృష్టి.

క. ఇది యే మిది యే మనిలో, నొదవినవ్యాకులతచేత నుచ్చైర్నాదం
బుదయించె సకలసైనిక, కదంబములలోన నట్టికాలమునందున్. 599

—: విద్యున్మాలి క్రతుహయంబును హరించుట :—

వ. మాయావి యగునొక్కరాక్షసుండు కామగమనంబు గలవిమానంబున నేతెంచి
యాకస్మికంబుగాఁ గ్రతుహయంబుం బట్టికొని చనియె. 600

క. అంతట నడఁగెను దిమిరము, శాంతించెను రక్తవృష్టి సమసెను రజముల్
స్వాంతంబుల హర్షభరా, క్రాంతంబుల నెసఁగె సుభటగణ మట్టితఱిన్. 601

గీ. కానఁబడదాయె మఖతురంగంబు దాన, నందఱును భీతచిత్తులై యటమటింపఁ
దొడఁగిరపుడభ్రముగఁగానఁబడియెఁదురగ, సహితుఁడై మింటనొక్కనిశాచరుండు.

గీ. అంత నాతనిఁ గాంచి హయాపహారి, వీఁడె దొరకినవాఁ డని వీరు లెల్లఁ
దెలుప శత్రుఘ్నున కతండు తేఱిచూచె, శూరులను నెల్ల యుద్ధసంసూచకముగ.

సీ. అంతటఁ బుష్కలుం డరుదెంచి మునుముందు, నిలిచి శత్రుఘ్నునినికటమందు
స్వామి నే నీనిశాచరు నిలఁ బడవైతు, శితసాయకముల మూర్ఛితునిఁ జేసి
యటు సేయనేని కన్యాస్వంబు భక్షించు, పాతకి కొనగూడుపాతకమును
వేదదూషణము గావించినవారికిఁ, గలుగుపాతకమును గలుగు నాకు

గీ. మఱియు రక్షోబలముల మన్మార్గణముల, నుర్విపైఁ గూల్పకుండిన నొదవు నాకు
హరిహరవిభేదమును జేసినట్టియఘము, శివుని శక్తిని వేఱు చేసినయఘంబు.

క. అని విరమించుటయును నాం, జనేయుఁ డిట్లనియె దేవ సత్వరమ యను
జ్ఞ నొసఁగు మే నొక్కండన, చని దైత్యుని నడిచి తెత్తు సవనహయంబున్.

గీ. వాలమునఁ జుట్టి యెత్తెద వజ్రితోడి, స్వర్ణభూధర మింకింతు జలధు లెల్ల
జానకీరామచంద్రప్రసాదమునను, నా కసాధ్యంబు లేదు ముల్లోకములను. 606

గీ. ఆడిన ట్లేను గావింపనైతి నేని, బ్రాహ్మణిని బొందుశూద్రునిపాతకమును
క్షీరమును ద్రావఁ గపిలఁ బోషించునట్టి, యవరజునికలుషమును నా కంటుఁగాక.

ఆ. మఱియు మూఁరుకొనినమాత్రంబునను స్పర్శ, మాత్రమునను గాలసూత్రమందుఁ
దగులుపఱచుసురను ద్రావెడివారికిఁ, గలుగుకీడు నాకుఁ గలుగుఁ గాక. 608

క. అనవుడు వీరాగ్రణు లె, ల్లను జేయుచు నుండుప్రతినలను విని హర్షం
బెనయఁగ శత్రుఘ్నుం డి, ట్లనియెను నే నొకఁడఁ ద్రుంతు నసురాగ్రసరుల్.

గీ. చేయకుండినచో నేను జెప్పినట్లు, కూటసాక్ష్యంబునను వచ్చుకొలయు విప్ర
దూషణంబునఁ గలిగెడిదుష్కృతమును, స్వర్ణచౌర్యాఘమును నాకు సంభవించు.

క. అనుటయు వారిప్రతిజ్ఞలు, విని రోషముతోడ గగనవీథి విమానం
బున నుండి రాక్షసుం డి, ట్లనియె సుభటులార యేల యదరిపడంగన్.

క. బాహువులతిమ రడంచెద, నాహవరంగమున నిలువఁ డటు గాకుండన్
దేహములమీఁద నుండిన, మోహము తల లొగ్గి పొందు ముం దావలకున్. 612

క. ఆలింపుఁడు నే విద్యు, న్మాలి యనెడిరాక్షసాధినాయకుఁడను పా
తాళనివాసుఁడ నాపే, రాలించిన యమునిగుండియలు తల్లడిలున్.

సీ. నాసఖుం డగురావణాసురుని వధించి, నట్టిరాఘవుఁ డేడ నడఁగినాఁడొ
యతనిసహోదరుం డైనశత్రుఘ్నుఁడు, నాపాలఁబడియె నీనాఁటి కిచటఁ
గడుపార వానిరక్తము ద్రావి కలిగింతు, హాతుఁ డైనమిత్త్రున కాత్మశాంతి
తలపెట్టఁబోకుఁడు కల నేనియును మీఁరు, హయమును విడిపింతు మనెడిమాట

గీ. యని విజృంభించి పలుకుడు నాలకించి, పుష్కలుం డిట్టు లనియెఁ గర్బురజఘన్య
దొంగిలించి మఖీయతురంగమమును, బందవై వ్యోమమున నుండి పదర నేల.

క. రావణునికథను వినియును, గావరమున నిట్టు రామకార్యోపహతిన్
గావింపఁ గడఁగినాఁడవు, పోవచ్చునె నీకుఁ బ్రాణములతో నింకన్. 615

—: పుష్కలవిద్యున్మాలియుద్ధము :—

క. అనుటయు రాక్షసుఁ డాగ్రహ, మున శక్తిని వైచె భరతపుత్రునిమీఁదన్
గనుఁగొని దానిని నడుమనె, తునిమెను బుష్కలుఁడు మూఁడుతూపులతోడన్.

క. ఆశక్తి భిన్న మగుటయు, నాశరుఁడు త్రిశూలమును రయంబునఁ గొని యా
వేశమున నేసెఁ బుష్కలుఁ, డాశ లదరఁ ద్రుంచి దాని నమ్ములచేతన్. 617

క. నిశితము లగుబాణములను, నిశాచరునియెదను నాఁటె నిష్ఠురముగ నా
విశిఖములు దాఁకి మండుచుఁ, గృశానురీతిని నిశాచరేంద్రుం డంతన్. 618

చ. కరమునఁ దాల్చి ముద్గరము గ్రక్కున వ్రేయఁగఁ బుష్కలుండు త
త్పరిపతనప్రభూతపరితాపవిమోహితచిత్తుఁడై క్షణం
బొరగి రథంబుమీఁదఁ దెలివొంది పదంపడి యొక్కయుజ్జ్వల
చ్ఛరమును గాఁడ నేసెను నిశాచరవీరునురస్స్థలంబునన్.

ఉ. అంతట రాక్షసేంద్రుఁడు దదాహతి కోర్వఁగ లేక విభ్రమా
క్రాంతమనస్కుఁడై పడియెఁ గామగయానమునుండి భూమిపై
నంతటిలోనె వచ్చి వెస నాతనిసోదరుఁ డుగ్రదంష్ట్రుఁ డే
కాంతముగా విమానమునయందు నిజాగ్రజు నుంచి పిమ్మటన్. 620

గీ. రోషమునఁ బుష్కలునిఁ జూచి భీషణముగ
నిట్టు లనియెను బుష్కల యెట్లు నీకు
దక్కు జయము విద్యున్మాలితమ్ముఁ డుండ
నిలువు మనిలోనఁ గదలిపోఁగలవె యింక. 621

క. అనవుడుఁ దత్ప్రత్యుత్తర, మనుసట్టులు దశశరంబు లాతనిహృదయం
బునఁ గాఁడ నేసెఁ బుష్కలుఁ, డనంతరము యుగ్రదంష్ట్రుఁ డత్యుగ్రుండై.

క. పొడిచెను బుష్కలునియెడన్, బిడికిట నొకపోటు దాన బెదరక నిలువం
బడి పుష్కలుండు గురిసెను, జడివానగ వానియెదను శరవిసరంబున్. 623

వ. అంతట నుగ్రదంష్ట్రుం డమర్షాతిరేకంబునఁ గాలాంతకుండుఁబోలె మండిపడి జ్వాలజ్వాలాపరీతం బగుత్రిశూలంబు నొక్కట్టెట్టునఁ బుష్కలునివక్షంబు గుఱిచూచి నైచుటయుఁ బుష్కలుండు తత్ప్రహారంబునకు సొమ్మసిల్లి రథంబుపై నొరగె.

క. అది చూచి పవనసూనుఁడు, కదనంబునకుం గడంగి క్రవ్యాదునితోఁ
జదలిక నెగయుచు దుముకుచు, సదమద మొనరింపసాగె శాత్రవబలమున్.

ఆ. అప్పు డుగ్రదంష్ట్రుఁ డత్యాగ్రహంబునఁ,గొని త్రిశూల మనిలతనయు నేసె
నది గ్రహించి నోట ననిలాత్మజుఁడు పండ్ల, చేతఁ గొఱికి పిండి చేసివైచె. 626

క. అది చూచి యుగ్రదంష్ట్రుఁడు, పదరుచు సుముకంగఁ బైకిఁ బవనతనూజుం
డదరక దైత్యుని చెంపలు, కదుములు గట్టంగ మోఁదెఁ గరయుగళమునన్.

ఉ. అంతట నుగ్రదంష్ట్రుఁడు రయంబున నావలి కేఁగి మాయచే
వింతగ నించి చీఁకటులు విశ్వభయంకరలీల దిక్కులం
దంతటఁ బూయశోణితశిలాదికముం గురియంగఁజొచ్చె న
త్యంతము భీతిచేఁ దలఁగి యార్చుచుఁ బాఱఁగ శత్రుసైన్యముల్. 628

—: శత్రుఘ్నుఁడు విద్యున్మాల్యుగ్రదంష్ట్రుల వధించి క్రతుహయంబును గొనుట :—

సీ. అప్పుడు శత్రుఘ్నుఁ డరుదెంచి యాత్మలో,స్మరియించుకొని రామచరణయుగము
సంధించి మోహనాస్త్రమును జాపమునందు, విడిచె దిక్కులకు నాగడియలోన
మాయమై దానవమాయ ప్రకాశంబు, గలిగి చీకటు లెల్లఁ దొలఁగిపోయె
నంతట నాకాశమందుఁ జరించుచుఁ, గామగయానంబు గానఁబడియె

గీ. నది గనుంగొని శత్రుఘ్నుఁ డాగ్రహమున, దానిపైఁ దీక్ష్ణబాణసంతతుల నేసె
నంత నది భగ్నమై కూలె నవనిమీఁద, శతసహస్రాధికాసురతతులతోడ.

వ. అంతటఁ దద్విమానంబునుండి విద్యున్మాలి యనుజసహితంబుగా గుహానిర్గతం
బగుసింగంబు తెఱంగున బహిర్గతుండై చాపంబునం గ్రూరసాయకంబులు
సంధించి యొక్కుమ్మడి శత్రుఘ్నునిపైఁ బ్రయోగించుటయు శత్రుఘ్నుండు
వాయవ్యాస్త్రంబునఁ దన్మార్గణంబుల నెల్ల నున్మూలించె.

సీ. అంతట రాక్షసుం డతిభీకరంబుగాఁ, బాశుపతాస్త్రంబుఁ బట్టి యేయ
నావిర్భవించి యాయస్త్రంబునుండి భూ, తములు ప్రేతములు బేతాళములును
నిజసైన్యమును గూల్చి నెత్తురుసోనలు, కుత్తుకబంటిగాఁ గ్రోలు చుండ
శత్రుఘ్నుఁ డాభూతచయమును నారాయ, ణాస్త్రంబుచే నడఁగార్చినెచె

గీ. నది గనుంగొని క్రోధతామ్రాక్షుఁ డగుచుఁ, గేలఁ దాల్చి త్రిశూల ముద్వేలవృత్తి
నసుర శత్రుఘ్నుపై కేఁగ నాతఁ డతని, హస్తములఁ ద్రుంచె నర్ధచంద్రాశుగమున.

ఆ. అపుడు ఛిన్నహస్తుఁ డగుచు విద్యున్మాలి, శిరముతోడఁ బొడువఁ జేరరాఁగ
వానిశిరము దునిమివైచె శత్రుఘ్నుఁ డా, క్షణమున నె క్షురప్రసాయకముల:

క. తనయన్నను జంపుటచే, తను రెచ్చఁగఁ గ్రోధ ముగ్రదంష్ట్రుఁడు శత్రు
ఘ్నునిఁ బొడువ రాఁగఁ బిడికిటఁ, దునిమెను శత్రుఘ్నుఁ డతనిదోశ్శీర్షములన్.

గీ. అప్పు డానందపరవశు లగుచు సురలు, పుష్పవర్షంబు గురిసి రద్భుతముగాఁగ
హయముఁగొనివచ్చిహతశేషులైనదైత్య, తతులుశత్రుఘ్నునకొసంగిబ్రతికిచనిరి.

—: క్రతుహయ ముత్తరదిశ కేఁగుట :—

క. అంతట హయ ముత్తరదిశ, కెంతయు నుత్సాహమునను నేఁగఁ దొడంగన్
జెంతను వీరాగ్రణుల, త్యంతబలపరాక్రమముల నరుదేరంగన్. 635

క. అటు లేఁగుచుండ రేవా, తటమున నొకయాశ్రమంబు తాపసజనసం
ఘటితముగఁ గానఁబడుటయు,నటు గని శత్రుఘ్నుఁ డిట్టు లనియె సుమతితోన్.

ఆ. అన్న సుమతి యిమ్మహాశ్రమం బత్యంత, పావనముగఁ దోఁచె భావమునకు
దీనిచరిత మేమొ తెలియంగఁ జెప్పుము, వివిధవిషయతత్త్వవిదుఁడ వీవు. 637

క. అనుటయు శత్రుఘ్నున కి, ట్లనియె సుమతి దేవ దీని కారణ్యకుఁ డన్
ముని యధినాథుఁడు తద్ద, ర్శనము మహాపాతకప్రణాశకము సుమీ. 638

—: శత్రుఘ్నుఁ డారణ్యకమహర్షిని దర్శించుట :—

క. అని చెప్పుటయును బరిమిత, జనయుక్తుం డగుచు నేఁగి శత్రుఘ్నుం డ
మ్మునివరునకు వందనముం, బొనరించె స్వనామగోత్రములను నొడువుచున్.

క. అంతట నారణ్యకుఁ డ, త్యంతాదర మొదవ నతని నర్ఘ్యాదులచే
సంతోషపఱిచి మీ రీ, ప్రాంతరమున కేమి కతమొ రా నని యడిగెన్. 640

గీ. అపుడు శత్రుఘ్నుఁ డతని కి ట్లనియె స్వామి
యశ్వమేధాధ్వరంబు మాయన్న రామ

చంద్రుఁ డొనరించుచును మఖాశ్వమును విడిచె
నది యిటకు రాఁగ వచ్చితి మందఱమును. 641

క. అనుటయు సత్యానందం, బున నారణ్యకుఁడు దేహమును మఱచి నిమీ
లనముం జెందఁగఁ గన్నులు, కనుపట్టెను మ్రోడువోలెఁ గదలిక లేమిన్. 642

గీ. అట్టు లొక్కక్షణం బుండి యవల సంజ్ఞ
నొంది బాష్పాంబువులు గాఱుచుండి నేత్ర
యుగళముననుండి గగురుపా టొదవ మేన
నెట్టకేలకు నపహ్మాని యిట్టు లనియె. 643

క. అనిశంబును నే నెవ్వని, మనమున ధ్యానించుకొనుచు మనుచుంటినొ యా
యనవద్యమూర్తిదర్శన, మొనరెడిభాగ్యంబు నేఁటి కొదవెను నాకున్. 644

గీ. అల్పపుణ్యప్రదంబు లైనట్టియాగ
ములును యోగంబులును వ్రతంబులును సరియె
తెగనిసంసారబంధంబు త్రెంచివైచి
క్షేమ మొనగూర్చు శ్రీరామనామమునకు. 645

క. స్మృతమాత్రంబున నఘసం, తతుల నడంగించురామనామం బుండన్
మతి లేనివారు పాప, క్షతికై చేయుదురు క్లేశసాధ్యక్రియలన్. 646

సీ. మును నేను దత్త్వంబు గనుఁగొనంగఁ దలంచి, తిరిగినాఁడను బహుతీర్థములకు
వానిలోపల నొక్కఁడైనను గానరాఁ, డాయెఁ దత్త్వము దెల్పునట్టిజ్ఞాని
యందుచేఁ జింతాకులాత్ముండ నగునాకు, మద్భాగ్యమున మార్గమధ్యమందు
దేవలోకమునుండి తీర్థముల్ సేవింపఁ, జనుదెంచులోమశుం డనుమహర్షి

గీ. యగపడిన నే నమస్కార మాచరించి, స్వామి భవవార్ధిలోఁ బడి వగచుచుండు
నట్టి మాబోంట్లు కడతేఱునట్టిమార్గ, మానతీయుము నా కంచు నడిగినాఁడ.

గీ. అడుగుటయు లోమశుండు న న్నాదరించి
యిట్టు లనియెఁ దపోధన యెన్నొ కలవు
యోగములును వ్రతంబులు యాగములును
దానములు తీర్థములు స్వర్గదాయకములు. 648

గీ. కాని సంసారవారిధిగట్టు చేర్పఁ, గలిగినది లేదు రామునికంటె వేఱు
వేదశాస్త్రపురాణాదివిద్యలందుఁ, గలిగినరహస్య మిదె నీకుఁ దెలిపినాఁడ. 649

గీ. రాఘవునికంటెఁ బర మైనవ్రతము లేదు, రాఘవునికంటె ఘన మైనక్రతువు లేదు
రాఘవుఁడె శ్రేష్ఠయోగంబు రాఘవుండె, పరమ దైవంబు సుమి బహుభాష లేల.

గీ. రాముఁ డొక్కఁడె దేవుఁడు రామనామ
మొకటె మంత్రంబు రామార్చ యొకటె వ్రతము

రామసంస్తవ మొకటె శాస్త్రము భవాబ్ధి
పారమును జెందఁ గోరెడివారి కెల్ల. 651

ఆ. సంస్మరించి రామచంద్రునిఁ జండాలుఁ, డైన ముక్తిఁ జెందు ననిన నింక
వేదశాస్త్రముఖ్యవిద్యావివేచన, పరులమాట వేఱ పలుక నేల. 652

వ. ఈపరమరహస్యంబు నాస్తికులకును శ్రద్ధాహీనులకును భక్తిరహితులకును గామక్రోధాదిదోషదూషితులకును భక్తదూషకులను శాంతివర్జితులకును శఠుల కను జెప్పం దగదు. 653

క. అనుటయు నే నుత్సాహం, బున నడిగితి మరల మౌనిపుంగవ దయతో
డను రామధ్యానాదుల, నొనరించెడివిధము సెప్ప మొప్పగ ననుచున్. 654

క. నే నడిగినదానికి న, మ్మౌనీంద్రుఁడు సంతసించి మానసమున జ్యో
త్స్నానిభము మందహాసం, బానసమున నొలయ నిట్టు లనియెను నాతో.

వ. అయోధ్యానగరంబునఁ జిత్రమండపశోభితం బగుకల్పవృక్షమూలంబునందు నవరత్నభూషితం బగుస్వర్ణసింహాసనంబు నధిష్ఠించి రాకాసుధాంశుబింబ సదృశం బగువదనంబుతోడను బద్మపత్త్రాయతంబు లగువిశాలనేత్రంబులతోడను దూర్వాదళశ్యామం బగుదేహంబుతోడను మణికిరీటంబుతోడను నీలకుంత లంబులతోడను మకరకుండలంబులతోడను విద్రుమప్రభాభాసమానంబు లగు రదనచ్ఛదంబులతోడను సుధాకరకిరణంబులుంబోనిదంతపంక్తితోడను జపా పుష్పనిభంబును సకలనిగమాగమావాసంబును నగుజిహ్వతోడను గంబు కంఠంబుతోడను సింహోన్నతంబు లగుమాంసలస్కంధంబులతోడను శుభలక్షణ లక్షితం బగునాసికతోడను గేయూరకటకాదివిభూషణభూషితంబు లగునాజాను లంబిదీర్ఘబాహువులతోడను లక్ష్మీవిలసితంబును శ్రీవత్సాంకితంబును నగు విపులవక్షంబుతోడను గంభీరనాభితోడను మహోదరంబుతోడను రత్నకాంచీ విరాజమానం బగుకటిప్రదేశంబుతోడను మనోహరంబు లగునూరుజానువుల తోడను వజ్రయవాంకుశరేఖాపరిష్కృతంబు లగుకోమలచరణంబులతోడను దేదీప్యమానుండై యుండురామచంద్రుని నిత్యంబును ధ్యానించుటయును స్మరించుటయును బూజించుటయును సంసారసాగరోత్తరణసాధనంబులు. మోక్షంబు వడయుట కింతకంటె వేఱుమార్గంబు లేదు. 656

క. అనుటయు నే నమ్మహాసీ, యునిమాటల నాలకించి యుత్సుకమతి నై
మునినాథ రామచరితము, వినిపింపుము నాకటంచు వేఁడితి మిగులన్. 657

సీ. అపుడు నాయందు దయ యుంచి యమ్మహర్షి
యిట్లు నచియింపఁదొడఁగె మౌనీంద్ర వినుము

ఘోరసంసారవార్ధిమగ్ను లగుజనుల
నుద్ధరించుటకయి పురుషోత్తముండు. 658

—: రామాయణ సంగ్రహము :—

సీ. మున్ను త్రేతాయుగంబున సూర్యకులమున, నవతరించి చతుర్విధాకృతులను
బూర్ణాంశమునఁ దాను బొలుచుచు జగదభి, రాముఁడై రాముఁడై నామమునను
తండ్రివాక్యంబును దలఁ దాల్చి లక్ష్మణ, యుతముగాఁ జని గాధిసుతుని వెంటఁ
దాటక యనుదుష్టదైత్యాంగనను జంపి, సాధుసంక్షోభంబు సమసిపోవ
గీ. భర్తృశాపంబుచే శిలాభావ మొంది, యడవిలోఁ బడియున్నయహల్య కొసఁగి
పదతలస్పర్శమున స్వరూపమును మరలఁ, గౌశికునియజ్ఞభూమికిఁ గడకుఁ జేరి.
క. మారీచసుబాహువు లను, క్రూరనిశాచరులఁ గూల్చి కుశికతనూజ
ప్రేరణమున మిథిలాపురిఁ, జేరి శివునిధనువు విఱిచి చిత్రము గాఁగన్. 660
గీ. పంచదశవత్సరంబునఁ బత్ని గాఁగఁ, గైకొని షడబ్ద యగుసీతఁ గౌతుకమున
ననుభవించెను సౌఖ్యంబు లామెతోడఁ, గూడి ద్వాదశవర్షముల్ కొదువ లేక.

వ. దశరథుండు సప్తవింశవత్సరమునందు రామునకు యౌవరాజ్యాభిషేకంబు గావింప సన్నద్ధుండై యుండియుఁ గైకేయీవరద్వయంబునం జేసి రామునిఁ జతుర్దశవర్షంబు లరణ్యావాసంబుఁ జేయుటకును భరతుని యౌవరాజ్యంబు ననుభవించుటకును నేర్పఱిచె. అంతట రామచంద్రుండు సీతాలక్ష్మణసమేతంబుగా బయలుదేఱి మూఁడునాళ్లు జలాహారంబున నాల్గవనాఁడు ఫలాహారంబునను గడపి పంచమదినసంబునం జిత్రకూటంబునకుం జేరి యందు నివాసంబు గల్పించుకొని ద్వాదశవర్షంబులు గడపి త్రయోదశవర్షంబునఁ బంచవటియందుఁ గామవివశ యగుశూర్పణఖను విరూపను గావించె. 662

సీ. అంతట రావణుం డరుదెంచి జ్యేష్ఠకృ,ష్ణాష్టమినాఁడు బృందాఖ్యవేళ
శ్యేనంబు వర్తికఁ జేకొని చనునట్లు, భూమిజాతను గొనిపోవుచుండ
రామ రామ యటంచు నామె యేడ్చెడియేడ్పు, విని జటాయువు వచ్చి వింటినుండి
కదనంబు గావించి క్రవ్యాదపతితోడఁ, బడిపోయె నిహతుఁడై పుడమిమీఁదఁ
గీ. జెప్పె సంపాతి యనుపక్షి సీత యున్న, చోటు వానరులకు మార్గశుక్లనవమి
నంత నేకాదశిని మహేంద్రాద్రినుండి, యెగిరి పవనాత్మజుఁడు దాఁటి యేర్లతేని.
క. ఆరాత్రియందు లంకను, జేరి నిశాశేషమందు సీతను గని సం
చార ముడిగి ద్వాదశినాఁ, డారూఢుం డయ్యె శింశుపావనిరుహమున్. 664
గీ. అట్టు లారూఢుఁడై శింశుపావనిజము, గాలికొమరుఁడు భక్తిచేఁ గేలు మోడ్చి
నాఁటిరాతిరి సీతకు నమ్మకమును, గలుగఁజేయంగఁ దగినట్టికథలు చెప్పి. 665

వ. త్రయోదశినాఁ డక్షాదిరాక్షసవీరులతోడ ఘోరం బగునాయోధనంబు గావించి చతుర్దశినాఁ డింద్రజిత్ప్రయుక్తం బగుబ్రహ్మాస్త్రంబున బద్ధుం డయ్యె. 666

గీ. అంత రాక్షసు లెల్లరు సంతసమున, వసనములు చుట్టి మారుతివాలమునకు
జ్వలన మంటింప నాతఁడు సంజ్ఞ వడసి, యెగిరి లంకాపురం బెల్లఁ దగులఁబెట్టి.

గీ. వచ్చి పూర్ణిమనాఁటికి వాయుజవము, తోడను మహేంద్రగిరికి సంతోష మొదవఁ
గదలియటనుండి మఱునాఁడు కపులతోడ, నైదుదినములు నడచియాఱవదినంబు.

గీ. మధువనంబును జొచ్చి తన్మధువు గ్రోలి, పాదపంబుల నెల్లను బాడుచేసి
కదలి యటనుండి రామునికడకుఁ జేరి, సప్తమదినంబునం దభిజ్ఞాన మొసఁగె.

వ. రామచంద్రుండు తదభిజ్ఞానంబు వడసి యుత్తరఫల్గునీనక్షత్రయుక్తం బగు నష్టమీదినంబున సూర్యుండు గగనమధ్యంబు నధిష్ఠించియుండ విజయముహూర్తంబునందుఁ బ్రస్థితుం డై సప్తదినంబులు సింధుతీరంబున స్కంధావారనివేశనంబు గావింపంజేసి పౌషశుక్లప్రతిపత్ప్రభృతితృతీయాపర్యంతము సేనాసమేతంబుగాఁ దాను సముద్రతీరంబుఁ జేరుటయుఁ జతుర్థినాఁడు విభీషణుండు రాముని శరణుచొచ్చుటయుఁ బంచమీదినంబున సముద్రతరణంబుకొఱకు నాలోచించుటయు రామభద్రుండు నాలుగుదినంబులు ప్రాయోపవేశంబు గావించి సముద్రునివలన వరంబు వడయుటయు దశమీదినంబున సేతుబంధంబు నారంభించి త్రయోదశీదినంబున సమాప్తి నొందించుటయుఁ జతుర్దశీదినంబున సైన్యంబును సువేలాద్రికిం జేర్చుటయుఁ బూర్ణిమ మొదలుకొని ద్వితీయాపర్యంతంబు మూఁడుదినంబులు లక్ష్మణునితోడ రామచంద్రుండు వానరసేనాసమేతంబుగా నంభోనిధిని దాఁటి తృతీయ మొదలు దశమివఱకును నెనిమిదిదినంబులు లంకాపురావరోధంబు గావించి యుండుటయు నేకాదశీదినంబున శుకసారణాగమనంబును బౌషకృష్ణద్వాదశీదినంబున సైన్యసంఖ్యానంబును రావణుండు శార్దూలునివలన వానరసేనాసంఖ్య నెఱింగి త్రయోదశి మొదలుకొని యమావాస్యవఱకును మూఁడు దినంబులు లంకాపురంబునం దుండునిజసైన్యమును బరిగణించి బలసంఖ్య నెఱింగి రణోత్సాహి యగుటయును మాఘశుక్లప్రతిపద్దివసంబున నంగదదౌత్యంబును సీతకు రామునిమాయామూర్ధాదులం జూపుటయు మాఘద్వితీయ మొద లష్టమివఱకును నేడుదినంబులు రాక్షసులకును వానరులకును సంకులయుద్ధం బగుటయు మాఘశుక్లనవమినాఁడు రాత్రియుద్ధమం దింద్రజిత్తు రామలక్ష్మణులను నాగపాశబద్ధులం జేయుటయు దశమీదినంబున నాగపాశవినాశంబునకై పవనుండు రామునికర్ణంబునందు స్వరూపంబు జపియించుటయుఁ బిదప గరుడాగమనంబును నేకాదశీద్వాదశీదినంబులందు ధూమ్రాక్షువధంబును త్రయోదశీదినంబునఁ గంపనవధంబును మాఘశుక్లచతుర్దశి మొదలుకొని కృష్ణప్రతిపత్తువఱకును మూఁడు దినంబులు నీలకృతం బగు ప్రహస్తవధంబును మాఘకృష్ణద్వితీయ మొదలు చతుర్థ్యంతపర్యంతంబును మూఁడు దినంబులు తుములయుద్ధంబున రాఘవుండు రావణుని రణభూమినుండి పాఱఁ

త్రోలుటయుఁ బంచమి మొదలుకొని యష్టమీపర్యంతము రావణుఁడు గుంభ
కర్ణుని మేలుకొలుపుటయు రామచంద్రుండు ప్రథసంబున నవమి మొదలు
చతుర్దశీపర్యంత మాఱుదినంబులలో బహువానరభక్షకుం డగుకుంభకర్ణుని వధిం
చుటయు నమావాస్యాదినంబున శోకంబువలన యుద్ధవిరామంబును ఫాల్గునశుక్ల
ప్రతిపత్ప్రభృతిచతుర్థీపర్యంతంబు నాల్గుదినంబులు బిసతంతుప్రభృతు లగు
నైదుగురురాక్షసుల వధించుటయుఁ బంచమి మొదలు సప్తమీపర్యంతం బతి
కాయవధంబును సప్తమి మొదలు ద్వాదశీపర్యంతంబు నికుంభకుంభసంహారంబును
బిదప మూఁడు దినంబులలో మకరాక్షునిబర్హణంబును ఫాల్గునకృష్ణప్రతిపద్ద్వితీ
యాదివసంబులం దింద్రజిత్తు జయించుటయుఁ దృతీయ మొదలు సప్తమీదినంబు
నఱకును శోకంబువలన యుద్ధవిరామంబును బిదప నొక్కదినంబున నోషధ్యా
నయనంబును బిదప నైదుదినంబులలో లక్ష్మణకృతం బగునింద్రజిద్వధంబును
జతుర్దశీదినంబున యుద్ధవిరతియు నమావాస్యాదినంబున రావణుండు యుద్ధంబు
నకు బయలుదేఱుటయుఁ జైత్రశుక్లప్రతిపత్తు మొదలు పంచమివఱకును రాక్షస
ప్రచురవధంబును జైత్రశుక్లషష్ఠి మొదలుకొని యష్టమివఱకును మహాపార్శ్వాది
మారణంబును జైత్రశుక్లనవమీదినంబున లక్ష్మణునిశక్తిభేదనంబును గోపా
విష్టుం డగురామునిబాణపరంపరచే దశకంధరపలాయనంబును నాంజనేయుండు
ద్రోణాద్రిని దీసికొని వచ్చుటయు దశమీదినంబున రామయుద్ధంబునందు రాక్షస
వినాశంబును నేకాదశీదినంబున వాసవప్రేరితుం డగుమాతలి దివ్యరథంబును
యుద్ధరంగంబున రామునకు సభక్తికంబుగా సమర్పించుటయును రాఘవుండు
శుక్లద్వాదశి మొదలు కృష్ణచతుర్దశీపర్యంతంబు ఘోరయుద్ధంబు గావించి రావ
ణుని వధియించి జయంబు గాంచుటయును జరిగె. మాఘశుక్లద్వితీయ మొదలు
చైత్రకృష్ణచతుర్దశీపర్యంతంబు సప్తాశీతిదినంబులలో యుద్ధావహారంబు పంచ
దశదినంబులు పోవ సంగ్రామంబు డెబ్బదిరెండు దినంబులు ప్రవర్తిల్లె. రావణా
దుల కమావాస్యాదినంబున సంస్కారంబు జరిగె. రామచంద్రుండు వైశాఖ
శుక్లప్రతిపద్దినంబున రణభూమియందు సకలసురజేగీయమానుం డయ్యె. వైశాఖ
శుక్లద్వితీయాదినంబున లంకారాజ్యంబునందు విభీషణుండు పట్టాభిషిక్తుం డయ్యె.
వైశాఖశుక్లతృతీయాదివసంబున సీతాశుద్ధియును దేవతావరలాభంబును వైశాఖ
శుక్లచతుర్థీదినంబున రాఘవుండు సీతాదేవితోడం గూడి పుష్పకవిమానంబు
నధిష్ఠించి నభోమార్గంబునుండి యయోధ్యాపురంబునకు బయలుదేఱుటయు
వైశాఖశుక్లపంచమీదినంబునఁ బదునాల్గవవర్షంబు పూర్ణంబు గాఁగ రామ
చంద్రుండు సపరివారంబుగా భారద్వాజాశ్రమంబు ప్రవేశించుటయు షష్ఠీదినం
బున నందిగ్రామంబునందు భరతసమావేశంబును సప్తమీదినంబున రామ

చంద్రుం డయోధ్యాపురంబున రాజ్యాభిషిక్తుం డగుటయు జరిగె. జానకి రామవియుక్తయై పదునొకండు నెలలపదునాలుగుదినంబులు రావణునినివేశనంబునందుండె. రాఘవుండు నలుబదిరెండవవత్సరంబున రాజ్యంబు చేయ నారంభించె. అప్పటికి సీతామహాదేవి ముప్పదిమూఁడువత్సరంబులవయస్సు గలది యయ్యె. 670

సీ. అట్లు భ్రాతృసమేతుఁడై రామచంద్రుండు, చెలువుగా రాజ్యంబు చేయుచుండ
సంయమి యగుకుంభసంభవుం డేతెంచుఁ, దద్దర్శన మొనర్చి తలఁపుతోడఁ
దపసివాక్యంబుచేతను రామభద్రుండు, హయమేధయాగంబు నాచరించు
వచ్చును హయమేధవాజి నీయాశ్రమం, బునకు రామనియోజ్య లనుసరింప
గీ. రామకథలను వచియించి రామభటుల, సన్నిధిని వారితోఁ గూడ సత్వరంబ
చని యయోధ్యకు రామదర్శన మొనర్చి, దాఁటెదవు నీవు భవవార్ధి దత్క్షణంబ.
క. అనవుడు నే నాలోమశ, మునికిం బ్రణమిల్లి యదియె మొదలుగ మదిలో
ననిశమును రామభజనం, బొనరించుచు నుంటి ముక్తి నొందెడియాశన్. 672
గీ. అమ్మహర్షి వచించినయట్లు రామ, తురగమేధాశ్వ మిచ్చటి కరుగుదెంచెఁ
గానఁగల నింక రాముని గన్నులార, సఫలత ఘటిల్లె నేఁడు నాజన్మమునకు.
గీ. అగ్నిహోత్రఫలంబు నేఁ డబ్బె నాకు, నామనోరథవృక్ష మీనాఁడు పండె
నేఁడు నిశ్శత్రురాజ్యంబు నేను గొంటి, నాకులం బెల్ల నిపుడు ధన్యతను గాంచె.
క. అని భక్తిపారవశ్యం, బున నొడువుచు నుండఁ జిత్తమున శత్రుఘ్నుం
డెనయుచు విస్మయము తపో, ధనుఁడు వచించినకథావిధానంబునకున్. 675
క. సరయూనంబున నమ్ముని, నరుని నధిష్ఠింపఁ జేసి వైళ మయోధ్యా
పురమునకుఁ బనిచి తురగం, బరిగెడిమార్గమును బట్టి యరిగె దళముతోన్.

—: ఆరణ్యకమునియాత్మ రామునిలో లీన మగుట :—

గీ. అంత నారణ్యకుం డయోధ్యాపురంబు, దూరముననుండఁగనె పాదచారి యగుచుఁ
జేరి పురమును సరయూప్రతీరమందు, సవనదీక్షితుఁడైన రాఘవునిఁ గాంచి.
ఆ. పులకితాంగుఁ డగుచు జలజలఁ గన్నీరు, గాఱుచుండఁ గంటఁ గనులు మూఁత
పడఁగ మేను మఱచి భక్తివశంబున, నున్నవానిఁ గని రఘూద్వహుండు. 678
సీ. ఒనరించి వేగ ప్రత్యుత్థానమును మ్రొక్కి, యుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి
పదములు గడిగి తత్పాదావనేజనో, దకమును దాల్చి మస్తకమునందు
నర్చించి గంధపుష్పాదివస్తువులచే, నర్పించి పాలిచ్చునట్టిగోవుఁ
గలిగినయట్టిమార్గశ్రమంబు దొలంగ, సర్వోపచారంబు లాచరించి
గీ. స్వామి నీదర్శనంబున సంఘటిల్లె, నెల్లశుభములు నాకు నేఁ డేను దలఁచి
నట్టిసవనంబు సంపూర్ణ మయ్యె నిపుడ, యనుచు నగ్గించుచుండ నాయవసరమున.

క. ఆరణ్యకుండు విస్మయ, పూరితచేతస్కుఁ డగుచుఁ బురుషోత్తమ నీ
చారిత్రం బతిమానుష, మారయఁగా నగునె యస్మదాదుల కెల్లన్. 680

క. చరితార్థుఁడ నైతిని నీ, దరిసెనమును జేసి నేఁడు తరియించితి సా
గరమును రాజ్యముఁ బడసితిఁ, బరిపూర్ణము లయ్యె నాకు భాగ్యము లెల్లన్.

క. అని యపరిమితానందం, బును జెందుచు నుండుసమయమునఁ బగిలి మునీం
ద్రుని బ్రహ్మాబిలము చని జె, వ్వ్యాస నొక తేజంబు రాఘవునిలోఁ జేరెన్. 682

గీ. అపుడు సాయుజ్యమోక్షంబు నమ్మహర్షి
చెందె నని చూచుమును లెల్లఁ జెప్పుచుండఁ
గురిసె నాకాశమునుండి కుసుమవృష్టి
దేవదుందుభినాదంబు దివిని జెలఁగె. 683

క. అనపుడు వాత్స్యాయనుఁ డి, ట్లనియెను నాగేంద్ర సనసహాయ మేస్థానం
బునకుం బోయెను మరలను, వినిపింపుము నాకు వినఁగ వేడుక యయ్యెన్. 684

—: రేవాహ్రదంబులో హయంబు మునిఁగిపోవుట :—

క. అనుటయు నాగేంద్రుం డి, ట్లనియెను మునివర్య యధ్వరాశ్వం బట్టుల్
చనుచును నొక రేవాహ్రద, మునను మునిఁగిపోయె యోధముఖ్యులు గాంచన్.

ఆ. అట్లు మునిఁగిపోయి యశ్వంబు మరల రా, కుంటఁ జేసి యోధుఁ లొక్కమొగిని
దల్లడిల్లసాగి రుల్లంబులను నేమి, చేయవలయు ననెడిచింత నొడవు. 686

—: హనుమత్పుష్కలులతో శత్రుఘ్నుఁడు పాతాళమున కేఁగుట :—

సీ. అంతట శత్రుఘ్నుఁ డాత్మలో నధికతా, పముఁ జెందుచుండంగ సుమతి చూచి
స్వామి నీ మిటికి విషాదంబుఁ జెందంగఁ, గంగతిం బైనట్టి కార్యమునకు
ననిలసూతికిఁ బుష్కలునకు నీకును శక్య, గలదు పాతాళలోకమున కరుగ
మునిఁగి మీ రీహ్రదంబున ముగ్గురును గోని, రంహ శీఘ్రముగఁ దురంగమంబు

గీ. నని యుపాయంబు చెప్పుటయును నొకింత
ధైర్యము వహించి లవణాసూదనుఁడు పవన
తనయపుష్కలసహితుఁడై తత్క్షణంబ
మునిఁగి హ్రదమున నొకపురంబునకుఁ జేరె.

గీ. అచట నొకచోట మాణిక్యఖచితమైన, కాంచనస్తంభమును దానఁ గట్టఁబడిన
క్రతుహయంబును దానిప్రక్కనె వసించు, చెలువలను వారుగోలి చెడి చెలినిఁ గాంచె.

ఆ. కాంచి వీర లెవరొ క్రతువాజి నిచటను, గట్టినైన నేమి కారణంబొ
తెలిసికొందుఁ గాక తేటతెల్లంబుగా, ననుచుఁ దలఁచు చుండునవసరమున.

గీ. రాణి యైనట్టిలేమ వారలను జూచి, యిట్టు లనియెను మీ రెవ్వ రిటకు రాఁగఁ
గారణం బేమొ చెప్పుఁడు కదలిపోవఁ, దరము గాదింక మీకు మాదరికిఁ జేరి.

క. అనవుడు హనుమంతుం డి, ట్లనియెను గంభీరముగను నబలామణి మే
మినకులవర్ధనుఁ డగు రా, మునిభటులము విజితరిపుసమూహులము సుమీ. 691

గీ. ఇతఁడు శత్రుఘ్నుఁ డనుపేర నితఁడు పుష్క, లాభిధానంబుచేత నే నాంజనేయ
నామమున నొప్పువారము నాతిమిన్న, వచ్చితిమి రామహయమేధవాజికొఱకు.

క. ఈ హయము నిచటఁ గట్టిన, సాహసు లుండినను రాఁగ సమయం బిదె త
ద్బాహుమద మడఁచి యధ్వర, వాహము గొనిపోవ నున్నవారము వింతే.

క. అనుటయు నారమణీమణి, హనుమంతునివచనమునకు హర్షముతో ని
ట్లనియెను మహాత్మ మఖహయ, మును బంధించితిని నేన మునుకొని యిచటన్.

క. నేను నిరంతరరామ, ధ్యానసమాధిస్థితాంతరంగంబున ని
చ్చో నుందు నెపుడు రాముఁడు, కానంబడుచుండు నాకుఁ గన్నులయెదుటన్.

గీ. రామకార్యంబునకు సాయ మేమి యైనఁ, జేయవలయు నటంచు నాచిత్తమందుఁ
గలిగె నొకకోర్కె దానిచేఁ జలుపవలసె, నిట్టికార్యంబు రావింప నిటకు మిమ్ము.

గీ. వీరమణి యనునొక్కపృథ్వీధవుండు, పట్టి యీయశ్వమును ముందు గట్టె నెచు
నతఁడు ధూర్జటిరక్షితుం డతని నొంపఁ, జాల రెంతటివిక్రమశాలు లేని. 697

క. ఏ నొకయస్త్రం బిచ్చెద, దానిని మంత్రించి వైవఁ దత్పతి సీతా
జానిస్వరూపము దెలిసి య, నూనం బగుభక్తి హయము నొసఁగు వశుం డై.

క. అని శత్రుఘ్నునిముఖమును, గనుటయు నాతం డుదఙ్ముఖముగఁ దదస్త్రం
బును గొని యోగినివలనను, గనఁబడియెను రవిశతప్రకాశముతోడన్. 699

గీ. అట్లు వెలుఁగుచు శత్రుఘ్నుఁ డామెపాద, పంకజములకుఁ బ్రణమిల్లి భక్తితోడ
హయపురస్సరముగ వచ్చె నాంజనేయ, పుష్కలసమేతుఁ డై చిత్రముగను వైక.

క. అంతట యోధాగ్రగణు ల, త్యంతముదంబునను హ్రదజలాంతర్గతవృ
త్తాంతము నాలించిరి హను, మంతుఁడు వచియింప మధురమధురఘనోక్తులన్.

—: అధ్వరాశ్వంబు దేవపురంబు చేరుట :—

వ. అప్పుడు మఖతురంగంబు వాయుజవంబునం జని దేవవినిర్మితం బగుదేవపురంబు
నకుం జేరె. 702

క. ఆపురమునఁ గలగృహములు, గోపురములు వనములును నికుంజంబులు హ
ర్షాపాదకంబు లగుచును, దీపించెడిఁ దరమె తన్నుతిం బొనరింపన్. 703

గీ. శివశిరశ్చంద్రచంద్రిక లవిరతంబుఁ, గ్రాలుచుఁ దమంబు నడఁగించుకారణమున
శుక్లకృష్ణవిభేదంబు చూపఱులకుఁ, గానరాకుండు నుభయపక్షముల నచట.

—: రుక్మాంగదుండు హయమ్ముం బట్టికొనుట :—

గీ. అంత నాహయమును దత్పురాధినాథుఁ, డైనవీరమణిక్ష్మాజానికొడుకు
పట్టి రుక్మాంగదుఁడు బాహుబలము కలిమిఁ, గట్టివైచెను నిజహయాగారమందు.

ఆ. అట్లు కట్టివైచి హయమును రుక్మాంగ, దుండు వచ్చి జనకుఁ డుండుకడకు
సవినయముగఁ దెల్పె సర్వంబు నంతట, వీరమణి విషాదవివశుఁ డగుచు. 706

సీ. స్వసహాయుఁ డైనయీశ్వరునిసన్నిధి కేఁగి, తనయుండు చేసినతప్పుఁ జేత
వినిపించి కర్తవ్యమును వేఁడుటయు సదా, శివుఁడు మానసమునఁ జింత నొంది
క్షితినాథ చేసేతఁ జేసె నీకొడు కప, రాధంబు నస్మదారాధ్యునెడలఁ
గాని చేసినపని కలిగించు స్వామిద, ర్శనలాభమును సంగరమున మనకుఁ

గీ. గాన మఖసైంధవంబును గాచుకొనఁగ, యత్న మొనరింపవలయు నె ట్లైన నింక
నండగా నుండ నేను వే ఱొం డనండు, కలఁ డెదుర్కొన యుద్ధరంగమున నీకు.

క. అనుటయు నుత్సాహంబున, జననాథుఁడు యుద్ధమునకు సన్నద్ధుండై
కనుపెట్టి యుండె శౌర్యా, జనములు చనుదెంచునట్టిసమయంబునకున్.

ఆ. అంత నాయుదంత మంతయు శత్రుఘ్నుఁ, డమరమౌనివలన నాలకించి
యాగ్రహమున యోధు లరుదేర వెనువెంట, నరిగి దేవపురము నాక్రమించె.

—: శత్రుఘ్నాదులకును రుక్మాంగదాదులకును ఘోరయుద్ధ మగుట :—

వ. అప్పుడు వీరమణి దివ్యరథంబు నధిష్ఠించి కుమారు లగురుక్మాంగదశుభాంగ
దులును భ్రాత యగువీరసింహుండును భాగినేయుం డగుబలమిత్రుండును
సేనాని యగురిపువారుండును దత్తచ్ఛత్రాస్త్రసమంచితులై యనుసరింపఁ జతు
రంగబలంబులతోడం గూడి ప్రధనభూమిఁ బ్రవేశించి శంఖంబు పూరించె. 710

గీ. అప్పు డుభయబలంబుల కన్యోన్యముగ, నాహనం బయ్యె నాయోధనాంగణమున
నేలలుగ రక్తధారలు పాఱ నందు, మునిఁగి తేలుచు శవశతంబులు చనఁగ.

క. అంతట శత్రుఘ్నుం డ, త్యంతానుగ్రమున నొసఁగ నాజ్ఞను బహువి
క్రాంతిమెయి విద్విషద్బల, సంతతులను బుష్కలుండు సమయం జేసెన్. 712

గీ. అపుడు రుక్మాంగదుండు పిత్రాజ్ఞ వడసి, భరతతనయున కెదురుగా నరుగుదెంచి
వత్స ధీరము గల్గినవాఁడ వైన, సములతోడను బ్రధనంబు సలుపు మనియె.

మ. అనుడున్ నవ్వుచు బుష్కలుం డతనివక్షోభ్యంతరం బాఁడ నే
సె నిశాతాశుగపంచకంబు నపు డక్షీణప్రతాపంబుచే
తను రుక్మాంగదుఁ డేసెఁ బుష్కలునిమీఁదన్ గోల లేనేను దా
న నసంఖ్యంబుగఁ బుష్కలుం డతనిమేనన్ నించె బాణంబులన్. 714

గీ. జరిగె నొకకొంతకాల మాకరణి స్కంద, తారకాసురులకుఁ బోలె వారి కాజి
యట్టితఱిఁ బుష్కలుండు దశాశుగముల, నొక్కపరి వింటఁ జేర్చియత్యుద్భటముగ.

గీ. కూలిచి చతుర్హయంబుల నాలుగింట, రెంట రథరక్షకులను నొక్కంట ధ్వజము
రెంట సూతుని నవల నొక్కంట రాజ, నందనునిహృదయంబును గుండఁ జేసె.

క. అంతట రుక్మాంగదుఁ డ, త్యంతావేశమున నవశతాంగాదులతో
వింతగను వచ్చి పుష్కలు, నంతము నొందింప బ్రామకాస్త్రము నేసెన్. 717
వ. తదస్త్రపాతంబున నిజరథంబు గిరగిరం దిరుగుచు యోజనదూరం బరుగఁ బర
మాస్త్రవిదుం డగుభరతాత్మజుండు ప్రత్యస్త్రంబున దానిని వారించి యొక్క
మహాస్త్రంబు నభిమంత్రించి రుక్మాంగదుని స్యందనంబుపైఁ బ్రయోగించె. 718
ఆ. అపుడు తచ్ఛతాంగ మస్త్రబలంబుచే, నభ్రవీథిఁ జనుచు నరుణదీప్తి
వలన దగ్ధ మగుడు నిలమీఁదఁ బడి వింట, నుండి రాజతనయుఁ డొందె మూర్ఛ.
క. హాహాకారంబులతో, నాహవరంగంబు నిండె నప్పుడు సుతస
మ్మోహమును విడిచి ప్రధనస, మీహితుఁడై వీరమణిమహీపతి వచ్చెన్. 720
గీ. వచ్చి వీరమణిక్షితివల్లభుండు, శంఖరావంబు సలిపె భీషణము గాఁగ
నంతఁ బుష్కలుఁ డాతని కభిముఖముగ, నిలిచె వింటను సాయకంబులను గూర్చి.
వ. అంతట వీరమణికుమానాథుండు పుష్కలుని నాలోకించి కృపావిష్టమాన
సుండై యి ట్లనియె. 722
క. బాలక నినుఁ జూడఁగఁ గడు, జాలి మనంబునను బొడమెఁ జను మావలకున్
బాలక్రీడాస్థానమె, యాలం బన నిలుతె యస్మదాదులయెదుటన్. 723
క. కను లెఱ్ఱచేసి సంగర, మున నుండఁగ నేను బ్రాణములపై స్పృహ గ
ల్గినవాఁడు నిలువఁ డెవ్వం, డును నాకట్టెదుట నిజము నుడివితి నీకున్. 724
చ. అనుటయుఁ బుష్కలుండు సకలాస్త్రవిదుం డగుటన్ జలింప కి
ట్లనియె నరేంద్ర క్షత్రియులయందు బలాఢ్యుఁడె వృద్ధు బాలుఁ
డైనను నబలుండె యర్భకుఁ డనన్ వినవొక్కొ నయోధికుండ నే
ననియెడిగర్వ మొందకుు మహంత నడంచెద నొక్కబ్రేటునన్. 725
క. అనవుడుఁ గోపోద్దీపిత, మనమున ని ట్లనియె వీరమణి పుష్కల ని
వనినట్లు చేయఁగలిగిన, ననిలోనన్ నిలువు మేల యతిభాషణముల్. 726
క. అని పలికి వింట మార్గణ, మును సంధించుటయు నంతఁ బుష్కలుఁ డవనీం
ద్రునిమీఁద నేసెఁ గ్రోధం, బున నిరువది నిశితబాణముల నొక్కమొగిన్. 727
సీ. అపుడు వీరమణిక్షమాధీశ్వరుండు త, త్సాయకంబులు నిజసాయకముల
ఖండఖండంబులు గావించుటయును న, త్యాగ్రహంబున భరతాత్మజుండు
నాఁట నేసెను మూఁడు నారాచములు మహీ, కాంతునిఫాలభాగంబునందు
నవి నాఁటుకొని బహుళార్తి గొల్పఁగ వీర, మణిమహీకాంతుండు మండిపడుచు
గీ. కఠినశరములు తొమ్మిది గాఁడ నేసె, భరతపుత్రునియెద నవి బాధవెట్ట
నురగములువోలెఁ బుష్కలుండుగ్రుఁడగుచు, త్మాధవునిమీఁదనూఱుమార్గణములేసె.
వ. తద్బాణఘాతంబుచే భిన్నకవచుండును శకలీకృతకిరీటుండును భిన్నశరాస
నుండును భగ్నరథుండును రుధిరపరిప్లుతాంగుండును నై వీరమణిక్షమాధీశ్వ

రుండు నూతనస్యందనంబు నధిష్ఠించి యభినవచాపంబునం దసంఖ్యాకంబు లగు
శిలీముఖంబులు సంధించి శాత్రవవ్యూహంబుపైఁ బ్రయోగించుటయుఁ బుష్క-
లుండు దానికిం బ్రతివిధానంబు చేయం దొడంగె. అప్పుడు విదారితంబు లగు
వారణంబులతోడను నికృత్తంబు లగు సైంధవంబులతోడను ఛిన్నాభిన్నంబు
లగురథంబులతోడను వినిపాతితం బగుభటకదంబంబుతోడను నాభీలం బగునా
యోధనాంగణంబునం గేశశైవాలోపలక్షితంబును బాహుభుజంగమసంకులం
బును శిరఃకచ్ఛపావృతంబును బిశితకర్దమమేదురంబును నై తామ్రపర్ణివోలె
రుధిరమహానది ప్రవహింపం దొడంగె. 729

గీ. అట్టిసమయంబునందు రణాంగణమున, నాడఁదొడఁగెఁ బిశాచము లద్భుతముగఁ
బాణులనుదాల్చిమృతులకపాలములను, జెలఁగివాయించుచునుదాళములనుబోలె.

క. నెత్తురు ద్రావుచు మాంసము, గుత్తుకబంటిగను దినుచు గోమాయుగణం
బత్తఱి భయంకరముగా, నొత్తిలి రణభూమియందు నూళలు వెట్టెన్. 731

క. ఉండిరి సంగ్రామక్షితి, మండలమునఁ గింశుకములమాడ్కిని యోధుల్
చండతరకాండఘాతో, ద్దండస్రవదస్రసిక్తతనువు లగుటచేన్. 732

శా. అంతన్ వీరమణిక్ష్మాధిపుఁడు క్రోధావేశ మేపార దు
ర్దాంతాభీలశిలీముఖప్రతతి సంధానించి చాపంబునం
దంతం బొందెద వీవు నేఁ డనుచు సింహం బార్చిన ట్లార్చి ది
గ్దంతుల్ దద్దరిలంగఁ బుష్కలునిమీఁదన్ నాఁటె నొక్కుమ్మడిన్. 733

ఆ. అపుడు భరతపుత్రుఁ డాసాయకంబుల, హతికి నోర్వలేక యాత్మలోన
సంస్మరించి రామచరణాంబుజములను, దత్స్మృతిప్రభూతధైర్యుఁ డగుచు. 734

ఆ. ధనువు కేలఁ బట్టికొని నారి నెక్కించి, శరము విడిచి శత్రుసాయకముల
నెల్లఁ దునిమి శంఖ ముల్లాసమున నూఁదె, వైరిలోకహృదయదారకముగ.

గీ. అట్లు పూరించి శంఖంబు నద్భుతముగఁ, దివిరి యొక్కశరంబు సంధించి వింట
వదనమునఁ గ్రోధపావకజ్వాల లొలయ, భరతతనయుండు భూపతిపైకి విడిచె.

క. విడుచుటయు శరము నది వడి, వడి నేఁగి నృపాలమౌళివక్షముమీఁదన్
బడుటయును దానివ్రేటున, నొడ లెఱుఁగక యతఁడు కూలె నుర్వీస్థలిపై. 737

క. పిదపఁ బవనాత్మజునితోఁ, గదనం బొనరించి పడిరి క్ష్మాస్థలిని శుభాం
గదరుక్మాంగదులు తదీ, యదురాసదవాలహతి గతాహంకృతులై. 738

క. బలవంతుఁ డైనసుమదుని, బలమున నోడించినట్టిబలమిత్రుఁడు పు
ష్కలునిశితబాణదారిత, కళేబరుం డగుచుఁ గూలెఁ గదనస్థలిలోన్. 739

—: శత్రుఘ్నుఁ డీశ్వరునితో యుద్ధము చేయుట :—

ఉత్సాహ. అట్టిసమయమందు శత్రుహర్షజన్యనాదముల్
పట్టరాని వగుచు దెసలఁ బర్వ నాలకించి యు

కట్టు నిజపదాశ్రితులకుఁ గల్గె నన్నతలఁపుతో
నుట్టిపడ్డరీతి వచ్చె నుగ్రుఁ డుగ్రరూపుఁడై. 740

క. అరుదెంచి త్ర్యంబకుఁడు సం, గరతలమునఁ బడినభక్తగణముం గని స
త్వరముగఁ దాల్చి పినాకముఁ, గరమున వీక్షించె నరినికాయము నెల్లన్. 741

ఆ. అపుడు సశరచాపుఁ డగుచు శత్రుఘ్నుఁడు, త్వరితముగను వచ్చి తనకు నెదుట
నిలుచుటయును జూచి నిటలాక్షుఁ డాతని, ధైర్యమునకు నద్భుతంబుఁ జెంది.

వ. వీరభద్రునిఁ బుష్కలునితోడను నందిని హనుమంతునితోడను ప్రచండుని
గుశధ్వజునితోడను భృంగిని సుబాహునితోడను జండుని సుమదునితోడను
సంగ్రామంబు గావింప నియోగించె. 743

ఉ. అంతట వీరభద్రుఁడు రయంబున వచ్చుచు నుండఁ బుష్కలుం
డెంతయు ధైర్య మేర్పడఁగ నేనుశరంబుల నేసి వానిమే
నంతయుఁ దూట్లు సేసె నపు డాతఁడు రక్తపరీతగాత్రుఁడై
వింతను జెంది పుష్కలుని వ్రేయఁగఁ గైకొనియెన్ ద్రిశూలమున్. 744

వ. అప్పుడు. 745

ఉ. దానిని జూచి పుష్కలుఁడు తత్క్షణ మొక్కశరంబు వింట సం
ధానము చేసి యేసె నది తాఁకి త్రిశూలము ముక్కముక్కలై
కానఁగ నెల్లరుం బడియెఁ గ్రక్కున హస్తమునుండి నేలపై
దానఁ బ్రతాపభరంబు దల దాఁటఁగ ధూర్జటిభృత్యుఁ డుగ్రుఁడై. 746

క. కరమున ఖట్వాంగంబును, ధరియించెను బుష్కలునిప్రతాపం బుడుపన్
భరతాత్మజుఁ డాకనిష్ఠుర, శరమున సద్దానిఁ దునిమె శకలంబులు గాన్.

క. అంతటను వీరభద్రుఁడు, దంతంబులు గొఱికికొనుచుఁ దద్రథమును గా
లాంతకుఁడువోలెఁ బదహతి, నింతింతలు గా నొసర్చి యిలపైఁ గూల్చెన్.

ఆ. అపుడు పుష్కలుండు వ్యపగతరథుఁ డయి, నిలిచి భూమిమీఁద నిటలనయన
భటునితోడఁ జేసె బాహుయుద్ధంబును, నాల్గునాళ్లు విరమణంబు లేక. 749

క. అది విస్మయంబుతోడను, త్రిదశులు గనుఁగొనుచు నుండ దివమందు మహీ
కదనము నైదవదినమున, వదలి నభోరణము సేయువాంఛను వారల్. 750

గీ. అంతరిక్షంబునకుఁ బోయి యచట నిలిచి, యొకరి కొకరును దీసిపోవక యె బాహు
ముష్టిజానుపదాఘాతములను జలిపి, రాహవంబు సురాసురమోహనముగ.

శా. ఆరీతిన్ బ్రవిదారణం బవధి లేకంతంతకున్ దారుణా
కారంబున్ వహియించుచుండఁగను గిన్కన్ వీరభద్రుండు శం
ఖారావం బొనరించి దిగ్గజము లల్లాడంగ ఖండించె దు
ర్వారాయోధనుఁ డైనపుష్కలునిశీర్షంబున్ గృపాణంబునన్. 752

గీ. అట్లు ఖండితమై విగ్రహంబుతోడ, నుహిని గూలుచుఁ బుష్కలుని మస్తకంబు
పూరితంబయ్యె సంగ్రామభూమి యెల్ల, మేదురము లై సహాహానినాదములను.
క. అది గనుఁగొని శత్రుఘ్నుఁడు, డదరిపడి విషణ్ణచిత్తుఁ డై రణభూమిన్
గదలిక లేకుండఁగఁ ద, ద్వదనము వీక్షించి యుండు ధరుఁ డై ట్రసియెన్. 754
క. శత్రుఘ్న వీరులకు రణ, ధాత్రీమరణంబు శ్లాఘ్యతమ మనియెడిది
క్షత్త్రియధర్మము నెఱుఁగవె, పాత్త్రమె చింతిల్ల నిట్లు ప్రధనక్షితిలోన్. 755
గీ. అసమబలు లైనత్రిపురరాక్షసుల మీఁదన, మానకరుఁ డైనదక్షుని మాపినట్టి
వీరభద్రునితోడఁ గావించె రణము, నేను నాళులు పుష్కలుఁ డెంతవాఁడు.
గీ. అట్టివీరాగ్రణి రణంబునందు మడిసి, యందులకుఁ జింత నొందుట యనుచితంబు
యోద్ధవయి నేను ముంగల నుండ నీకు, క్షాత్త్ర తేజంబుఁ జూపంగ సమయ మిదియె.
క. అనవుడు శత్రుఘ్నుండా, ఘనముగఁ గ్రోధాగ్ని గప్పుల నారాచములన్
ధనువున సంధించి కప, ట్రని నెఱకులు గాఁడ నేసె దృఢముష్టి నయున్. 758
ఉ. అంతటఁ జంద్రచూడుఁడు నదాశుగపంక్తి నడంపఁ గొన్ని దు
ర్దాంతశిలీముఖంబుల యథావిధిఁ గూరిచి వింట నేసె వి
క్రాంతి యెలర్ప నాయుభయకాండములున్ జని వ్యోమసీమ న
త్యంతభయానకంబుగను నాజి నొనర్పఁ గడంగె నచ్చటన్. 759
గీ. అట్టు లామార్గణములు పోరాడుచుండ
విశ్వసంహార మిపుడె కావింపఁబడునొ
యేమొ యనుభీతి గొలుపుచు నెల్లరకును
గడచెఁ బదకొండుదినము లుగ్రములు గాఁగ. 760
గీ. అంత విసువొంది శత్రుఘ్నుఁ డాత్మలోన, ద్వాదశదినంబునందు సర్వాసునిమీఁద
విడిచె బ్రహ్మాస్త్రము నడఁగె విశ్వ మెల్ల, సపునవప్లవమనద్రానిహరుఁడు ప్రయోగ. 761
క. అది గని శత్రుఘ్నుఁడు మది, నొదవఁగ నాశ్చర్య మేమియును గోపము స
మ్మద ముడిగి యుండ నాతని, యెద బ్రహ్మశిరోస్త్రమును మహేశ్వరుఁ డేసెన్. 762
క. ఆయస్త్రము దాఁకుటయును, గాయంబును మఱచి కూలెఁ గిరసక్షితిలో
నాయెడ రామానుజుఁడు ప, లాయనమును జెంద నిజబలంబులు భీతిన్. 763
క. ఆనల సుమదానిధరి, శ్రీనరు లెల్లరును రుద్రభృత్యులతోడన్
గావించి సంగరంబును, గానరము దొఱంగి పడిరి కదనస్థలిలోన్. 764

—: శివహనుమద్యుద్ధము :—

సీ. అంతట హనుమంతుఁ డాత్మలో రాముని, స్మరియించుకొనుచును సరుగుదెంచి
కైకొని యొకమహాగ్రావంబు వైచెను, శిథిల మైపోవంగ శివుని శ్రీమ
రథము చూర్ణము గాఁగ బ్రమథాధిపుఁడు నంది, నధిరోహణము చేయు నంతలోన
సాలంబు నెత్తి భుజాబలంబున వైచె, హరునివక్షంబున ననిలసూతి

గీ. యపుడు క్రోధారుణాక్షుఁడై యంధకారి, త్రిశిఖమును వహ్నికీలాప్రదీపితమును
సూదితారాతియును నైనశూల మెత్తి, సూటిగను వైచె మారుతసూతిమీఁద.
గీ. అంత నాశూలమును బవనాత్మజుండు, పట్టుకొని కేల భంజించి పాఱవైచె
నది గనుంగొని ధూర్జటి యాగ్రహమున, శక్తిఁ గైకొని యతనివక్షమున వైచె.
సీ. అంజనానందనుం డావ్రేటునకు సోలి, నిమిషంబు మరల బోధమును బడసి
యొకమహావృక్షంబు పెకలించి మృడునివ, క్షమునందు వైవంగఁ గనలి శూలి
ముసలాయుధంబుచే మొత్తంగఁ ద్రుంచి య, ద్దాని మారుతి పర్వతమును వైచెఁ
బర్వతంబును గూల్చ శర్వుండు గడఁగెను, నంతలో శిలలను హనుమ గురిసె
గీ. శిలలు భేదింప శివుఁడు లోఁ దలఁచుచుండు, నంతలో వాలమునఁ గొట్టె ననిలసూతి
తత్ప్రఘాతంబులను నంది త్రాస మొందె, శివశిరశ్చంద్రమోరేఖ శిథిల మయ్యె.
ఉ. అంతట నీశ్వరుండు పవనాత్మజుశక్తికి నాత్మలోపలన్
వింత జనింప నిట్లనియె వీరవరేణ్య భవద్బలంబు నా
కెంతయు సంతసంబు ఘటియించె వరం బెసువాఁడఁ గోరు మే
చింతిత మైనఁ దీర్చుటకు సిద్ధుఁడ నై వచియించితిం జుమీ. 768
గీ. అనుటయును నాంజనేయుఁ డిట్లనియె దేవ, రామచంద్రప్రసాదసంప్రాప్తినలన
నఖిలసిద్ధులు గలవు నాకైన నీవు, కోరు మంటివి గాన నేఁ గోరువాఁడ. 769
గీ. ఇచటఁ బడియున్నమావీరు లెల్ల బ్రతుక, నేఁగి సంజీవనౌషధి నేను దెత్తు
నంతదాఁకను వీరిదేహముల నోము,చుండు మనుడు హరుం డట్లె యుండు ననియె.

—: హనుమంతుఁడు సంజీవనౌషధిం దెచ్చుట :—

సీ. అంతట హనుమంతుఁ డతిశీఘ్రముగ బహు, ద్వీపంబులను దాఁటి వెడలి తుదకు
ద్రోణాద్రి వాలంబుతోఁ బట్టి లాగుడు, నది యూఁగె నట్టిట్టు లద్భుతముగ
నపు డందు నెలకొన్నయమరు లెల్లరు భయం, బొంది యే మిది యని క్రిందఁ జూచి
కపి గానఁబడుడు నక్కడఁ గురియించిరి, వానిపై మార్గణవర్షములను
గీ. నంత హనుమంతుఁ డాగ్రహం బంకురింప, వాలమును బెంచి కొట్టె నవ్వారి నెల్లఁ
గొందఱు విచేష్టులై భూమియందుఁ బడిరి, పాఱిపోయిరి కొందఱు భయమువలన.
క. అది యెల్ల నెఱిఁగి శక్రుం, డుదితామర్షమునఁ బనిచె యోధాగ్రణులన్
గుదిగట్టి వానరుని నా, పదములసన్నిధికిఁ దెండు పాయక యనుచున్. 772
క. పనుచుటయును ద్రోణాద్రికిఁ, జని వారలు శూలఖడ్గశక్త్యాదులచే
తను గపివీరునిఁ గొట్టిరి, కనులను నిప్పుకలు రాలఁగాఁ గనుఁగొనుచున్. 773
ఉ. అప్పుడు కాలరుద్రుఁ డన నార్చుచు దేహముఁ బెంచి వాలమున్
ద్రిప్పుచు నక్షసూదనుఁడు నిర్జరయోధులఁ గొట్టసాగె వా
రప్పటువాలఘాతముల కాఁగఁగఁ జాలక యేఁగి వజ్రికిం
జెప్పిరి తత్ప్రతాపమును జిత్తము తత్తఱపాటుఁ జెందఁగన్. 774

మ. అది విని శక్రుఁ డెంతయు భయం బొదవింపఁగ నెట్టకేలకున్
విదిత మొనర్చె గీర్పతికి విన్నఁదనంబున నున్నవార్త నె
య్యది యిఁక దీనికిం దెలుప నైనయుపాయ మటంచు వేఁడఁగా
మదిని నెఱింగి యాతఁడు సమస్తము యోగవిలోచనంబునన్. 775

క. వెనువెంటఁ బెట్టుకొని యిం, ద్రుని సురలను నరుగుదెంచి ద్రోణాద్రికి నం
దన మొనరిచి మారుతి కి, ట్లనియెను మహనీయ సైఁపు మపరాధంబున్. 776

క. ఇతఁ డింద్రుఁడు వీరలు దే, వత లేను గురుండఁ దీర్ప వచ్చితిమి త్వదీ
ప్సితమును జెప్పుము నావుడు, నతఁ డంతయుఁ జెప్పె శాంతి యావహిలంగన్. 777

గీ. అపుడు శక్రుఁడు ద్రోణాద్రియందు నుండు, నట్టిసంజీవనౌషధి నతని కిచ్చి
సంతసముగొల్పుటయుఁ బ్రభంజనసుతుండు, దానిఁ గొనివచ్చి సంగ్రామధామమునకు.

గీ. పతితులై యున్న పుష్కలప్రముఖవీర, తతుల బ్రతికించె సంజీవకరణివలన
నంతటను లేచి యవ్వీరు లాగ్రహమునఁ, దొడఁగి రాహవమునకు శత్రువులతోడ.

—: శత్రుఘ్నుఁడు మోహనాస్త్రముచే వీరమణిని మూర్ఛిల్లఁ జేయుట :—

వ. పుష్కలుండు వీరభద్రునితోడను కుశధ్వజుండు చంద్రునితోడను వాయునందనుండు నందితోడను దక్కిన వీరాగ్రణులు తక్కిన శూరాగ్రేసరులతోడను బోరాడుచుండ శత్రుఘ్నుండు మహేశ్వరుని నెదుర్కొన నరుగుచుండుసమయంబున వీరమణి మూర్ఛఁ దేఱి శత్రుఘ్నునిరథంబు చూర్ణీకరించుటయు శత్రుఘ్నుం డాగ్నేయాస్త్రంబుచేఁ దద్బలంబు నెల్ల దహియింపఁదొడంగె. తద్వారణార్థంబు వీరమణి వారుణాస్త్రంబు నేయుటయు శత్రుఘ్నుండు వాయవ్యాస్త్రంబు నేసె. వీరమణి పర్వతాస్త్రంబు నేయుటయు శత్రుఘ్నుండు వజ్రాస్త్రంబు నేసె. తుదకు వీరమణి బ్రహ్మాస్త్రంబు వింట సంధానించుటయు శత్రుఘ్నుండు యోగదత్తం బగు మోహనాస్త్రంబు ప్రయోగించె. మోహనాస్త్రంబు బ్రహ్మాస్త్రంబును ఖండించి వీరమణిహృదయంబుం దూఁచ్చుటయు సమ్మోహితుండు తద్బాణఘాతంబున మూర్ఛితుండై నేలం గూలె. 780

సీ. అంతట శత్రుఘ్నుఁ డాగ్రహంబున రుద్ర, సేనల నెల్ల మూర్ఛిల్లఁ గొట్టి
శివునితో యుద్ధంబు చేయ వచ్చుటయును, గ్రుద్ధుఁడై హరుఁ డెదుర్కొనియె నతని
నప్పు డాహవ మయ్యె నాయిద్దఱకుఁ గూడఁ, దాడనంబులఁ బ్రతితాడనముల
నస్త్రఘాతములఁ బ్రత్యస్త్రఘాతములను, దేవాసురులకును దిగులు పుట్ట
గీ. నంత శత్రుఘ్నుఁ డవిషహ్యమైన శూలి, మగఁటిమికిఁ దాళఁ జాలక మానసమునఁ
దలఁచె రాముని నార్తసంత్రాణపరుని, ధారణాధ్యానయోగవిధానమునను. 781

—: రామచంద్రుఁడు సాక్షాత్కరించుట :—

క. తలఁచినమాత్రముననె ముం, గల నిలిచెను యజ్ఞదీక్ష గలదేహముతో
వెలిఁగించుచు దశదిక్తట, ములు సీతావల్లభుండు ముదితాననుఁడై. 782

క. అది విస్మయ మొదవింపఁగ, మదిలో శత్రుఘ్నుఁ డాత్మమస్తకమును ద
త్పదములపైఁ జేర్చి యొ, ప్పిదముగను నమస్కరించె భృతధైర్యుండై. 783
క. హనుమంతుఁడు గనుఁగొని రాముని బ్రహ్మానందమునను మ్రొక్కి తదంఘ్రుల్
తనశిరముమీఁద జేర్చి, కొని యుబుకుచు నుండె మెయి గగుర్పాటొదవన్.

—: ఈశ్వరుఁడు రాముని నుతించుట. —

గీ. అట్టు లుండంగ యోగిహృద్ధ్యానగమ్యుఁ, డైన రాముని గని కన్నులార శూలి
తత్పదాంభోజములమీఁదఁ దలను వ్రాల్చి, యెఱిఁగి భక్తిప్రపత్తుల నిట్టు లనియె.
క. పురుషుఁడవు నీ వొక్కఁడవ, పరుఁడవు ప్రకృతికి న టంచుఁ బలుకుదు రార్యుల్
పరమాత్మ నీమహత్త్వము, సరయఁగ శక్యంబె యస్మదాదుల కెల్లన్. 786
గీ. రూపరహితుండ వయ్యు నిర్గుణుఁడ వయ్యు, జగము లెల్ల సృజింతువు స్రష్ట వగుచుఁ
బాలనము చేయుదువు విష్ణుభావమొంది, యీశుఁడయి హరింతు మాయతో నెనసి నీవ.
క. నీకంటెను బరదైవము, లోకములను లేదు యోగులును మునులును నీ
యాకృతి సంతతస్మరణా, లోకనములఁ జూచుచుందు రులోన వెలుపలన్. 788
క. నీవె సమస్తజగంబులు, నీవె జగంబులకు నెల్ల నిర్మాతవు నీ
త్రోవలు బహుచిత్రంబులు, భావింపఁగ నలవి గావు బ్రహ్మాదులకున్. 789
ఆ. పరమపురుష నీకు బ్రహ్మహత్యాఘంబు, గలిగె ననుచు దానిఁ గడపికొనఁగ
నశ్వమేధమఖము నాచరించుచు నుంట, న్యాయముగ విడంబనంబ కాదె. 790
ఆ. తలను దాల్చి యుండఁ ద్వత్పదోదకమును, శాప మెల్ల నేను బాపికొనఁగ
నీకుఁ బాప మేడ నిఖిలపావన లోక, సంగ్రహార్థ మైనచర్య గాక. 791
క. క్షమియింపుము నాయపరా, ధము భక్తావనసముత్కొఱకుఁ దారసిలితి నీ
సమరమున నేను దీనను, సమకూరెను మేలు భక్తజనులకు నాకున్. 792
క. సామాన్యమె నీదర్శన, మేమాడ్కి లభింపఁ గలుగు నీవు గానియెడన్
స్వామి కృతార్థుల మైతిమి, కామిత మే ముందు నింతకంటెను మాకున్. 793
క. అని పలికి మూర్ఛితుం డగు, జననాథుని మేలుకొలిపె స్వకరస్పర్శం
బున నంత లేచి యాతఁడు, కని రామునిదివ్యదేహకాంతుల నెదుటన్. 794
గీ. విస్మయము నొంది పులకలు వెలయ మేన, నపుడు సాష్టాంగవందన మాచరించె
నంత సీతామనోహరుం డతనిపైని, దృష్టి సారించుటయు శివుం డిట్టు లనియె.
సీ. స్వామి మున్నితఁ డుజ్జయినీపురంబున, కరిగి క్షిప్రానదియందు మునిఁగి
చలిపి సంధ్యాద్యనుష్ఠానంబు లచ్చోటఁ, జేరి మహాకాలశివునిగుడికి
నక్కడ ననుఁ గూర్చి యాచరించెఁ దపంబు, విస్మయంబును జెంద విబుధు లెల్ల
నపుడు నేఁ బ్రత్యక్షమై కోరుకొను మంటి, నేవరం బేనియు నిచ్ఛకొలఁద
గీ. ననుటయు నితండు గోరె రాజ్యంబు నొసఁగి
యోముచుండుము న న్నొద్ద నుండి యనుచు

నడుగుటయు నేను దేవపురాధిపత్య
మిచ్చి యితనికిఁ గాపుగా నిచట నుంటి. 796
క. కావున నీతనిరక్షణ, గావించితి నింతవఱకుఁ గడతేఱెను మా
భూవిభుఁడు నిన్నుఁ గాంచుటఁ, గావించినపనికి సార్థకత్వము గలిగెన్. 797
క. అని పలికి మూర్ఛ నొందిన, జననాథునిసుతుల నెల్ల సంజ్ఞాయుతులన్
బొనరించి తనప్రభావం, బున రామునిపాదములకు మ్రొక్కం జేసెన్. 798
క. అంతట వీరమణిక్షితి, కాంతుఁడు ధన్యతను జెందఁ గలిగె నటంచున్
స్వాంతమునఁ దలఁచి తసధన,-మంతయును హయంబుతోడ హరి కర్పించెన్.
వ. అప్పుడు రామచంద్రుండు మహేశ్వరునిం జూచి యి ట్లనియె. 800
గీ. భర్గ నీ వొనరించినపనికి మిగుల, సంతసం బయ్యె భక్తరక్షణము సకల
దేవతాధర్మ మగుటను దీనికొఱకు, నుల్లమునఁ బరితాపంబు నొంద వలదు.
క. నామదిలో నీ వుందువు, నీమదిలో నుందు నేను నిజముగ మనకున్
గామరులు భేద మెంతురు, ధీమంతులు గనరు భేదదృష్టిని మనలన్. 802
క. ఏకాకారుల మగుమన, కేకతమున నైన భేద మెనఁ గెంచునొ వాఁ
డాకల్పశతము కుంభీ, పాకంబునఁ గూలు శోకపరవశుఁ డగుచున్. 803
క. నీభక్తులైనవారలు, నాభక్తుల చూవె మఱియు నాభక్తజనుల్
నీభక్తుల చుమి వారిక, నే భేదము లేదు భేద మెంతురు మూఢుల్. 804
క. అని పలికి తిరోధానం, బును జెందెను నిమిషకాలమునఁ జిత్రముగన్
గనుఁగొనుచుండినవారికిఁ, గనఁబడు చున్నట్లు యుండి కన్నులయెదుటన్. 805
గీ. కాన మానవమాత్రునిఁ గాఁ దలంపఁ, దగదు రాముని భక్తసంత్రాణపరుని
నాత్మఁ డంతర్బహిస్స్థితుం డగుచు నుండు, సర్వవేళల సర్వదేశములయందు. 806
గీ. అంత నా వీరమణి తనుజాన్వితముగ, హయముతోడను బ్రస్థితుం డయ్యె హరుఁడు
తనవిధిని దాను గావించి చనియెఁ బ్రమథ, పరివృతుం డయి కైలాసభవనమునకు.
క. ఈచరితము శ్రోతలకును, వాచకులకు నిచ్చు సకలవాంఛాసిద్ధుల్
మోచనము చేసి యంత, ర్లోచనమాలిన్య మొక్కత్రుటికాలమునన్. 808

—: క్రతుహయము హేమకూటముం జేరుట :—

గీ. అంతట హయంబు వాయురయంబుతోడ, హేమకూటాచలంబున కేఁగి యచటఁ
గదలు మెదలించుకంతయుఁ గానరాక, నిలువఁబడిపోయె నొక వనీతలమునందు.
క. అది చూచి యోధు లెల్లరు,నిది యే మిటు లున్న దనుచు నెంతయుఁ బూన్కిన్
బెదరించియు నదలించియుఁ, గదలింపఁగఁ జాలరైరి క్రతుతురగంబున్. 810
క. అటుపిమ్మటఁ బుష్కలుఁడు, త్కటబలమున హయముకాళ్లు గైకొని పై కె
త్తుటకుఁ దొడంగియుఁ జాలక, కటకటఁబడి విడిచెఁ దనదుకడఁకన్ గడకున్.

గీ. అంతట సమీరనందనుం డశ్వమునకుఁ, జుట్టి వాలంబు గట్టిగాఁ బట్టి లాగి
యదిరవంతయుఁ జలనంబు నందకునికిఁ, దనబలంబును గర్హించుకొనుచు నిలిచె.

క. అప్పుడు శత్రుఘ్నుం డా, చొప్పంతయు సరసి చూచి సుమతిని ననఘా
ముప్పా ఘటిల్లె హయం బిట, నిప్పగిదిని నుంట కేమి హేతువొ చెపుమా. 813

క. అని యడుగ సుమతి యి ట్లని, యెను దేవ పరోక్షవిషయ మెఱుఁగఁగ శక్తుం
డను గాను నేను దీనికి, ననువగు హేతువును మునుల నడుగఁగ వలయున్. 814

క. అని తెలుపఁగ శత్రుఘ్నుఁడు, చని గౌతమమౌనికడకుఁ జలిపి ప్రణామం
బును వినిచి తనయుదంతం, బును గర్తవ్యంబు వేఁడె బోధింపంగన్. 815

గీ. వేఁడుటయు నమ్మహర్షి తద్విధము నెల్ల, ధ్యానదృష్టిని బరికించి తత్క్షణంబ
యిట్టు లనియెను శత్రుఘ్న యెల్లవిషయ,మద్భుతంబుగ నవగతం బయ్యె వినుము.

—: సాత్త్వికచరిత్రకథనము :—

వ. మున్ను గౌడదేశంబునందుఁ గావేరీతీరంబున సాత్త్వికుం డను నొక్కబ్రాహ్మణుం
డొక్కనాఁడు పయఃపానంబును నొక్కనాఁడు వాయుభక్షణంబును నొక్క-
నాఁడు నిరాహారంబునుం గా నియమంబు గావించికొని త్రైక్రమంబున బహు
కాలంబు ఘోరతపంబు గావించుచుఁ గాలవశంబుచే నొక్కదివసంబున
మృత్యువశుండై దేహంబు విడిచి తనపుణ్యపరిపాకంబున దివ్యవిమానంబు
నధిష్ఠించి మేరుశిఖరంబున కరిగి యచ్చోట మనోజ్ఞం బగు జంబూవృక్షంబు
నాశ్రయించి యుండె.. 817

గీ. అట్టు లుండంగ నొక్కనాఁ డచట నున్న, జాంబవతియనునదిలోన సంయమీంద్రు
లచ్చరలతోడ జలకంబు లాడఁ దొడఁగి,రది గనుంగొని సాత్త్వికం డద్భుతముగ.

గీ. తనమదిని రాగ ముదయింపఁ దాను గూడ, నప్సరఃకాంతలను గూడి యాచరించె
నందు స్వైరవిహార మానందముగను, నిజతపోగర్వమున నవినీతుఁ డగుచు.

గీ. దానవిద్యాతపోధను లైనమౌని, వర్యు లెల్లరుఁ దత్స్వైరవర్తనంబు
సైఁపఁజాలక కనలి రాక్షసుఁడ వగుదు, గాక యని శపియించిరి కడకు వాని.

క. అప్పుడు సాత్త్వికుఁ డాత్మను, నుప్పతిల విషాద మెమియును దోఁపక నా
తప్పు సయిరించి శాపముఁ, ద్రిప్పుం డని పడియె మునివరేణ్యులయెదుటన్. 821

గీ. అంతటను నమ్మహర్షు లి ట్లనిరి నీవు, హేమకూటంబునకు నేఁగి రామతురగ
మేధహయ మచ్చటికి రాఁగ మొదల నీక, నిలుపు మచ్చోట దాని నీబలమువలన.

క. అది కదల కుండుటయు న, య్యదనున రామునిచరిత్ర మంతయు నాలిం
చెద వీవు దాన శాపము, వదలి మరల హేమశైలవాసము గలుగున్. 823

క. అనవుడు వారికి నందన, మొనరించి యతండు చనియె నొయ్యనఁ గానన్
వినిపింపుఁడు రామునిచరి, తను నచ్చట హయము గదలుదాఁకను మీరల్. 824

క. అని చెప్పుటయును విస్మయ, మును శత్రుఘ్నుండు చెంది మునివల్లభ నే
మన వచ్చుఁ గర్మగతులను, దనుజత్వము నొందెఁ ద్రిదివధాముఁడు గూడన్.

గీ. కర్మగతు లెట్టివియొ వానికతనఁ గలుగు, నట్టినరకంబులును వాని ననుభవించి
నట్టివారల నెఱిఁగించునట్టిచిహ్న, ములును సంగ్రహముగను జెప్పుము మహాత్మ.

క. అని వేఁడుటయును గౌతమ, ముని హర్షము నొంది ప్రశ్నమున కాతనిఁ గ
న్గొని యిట్టు లనియె భూవర, వినఁ దగును విచిత్రకర్మవిషయము లెల్లన్. 827

—. కర్మవిపాకకథనము :—

వ. పరదారపరవిత్తపరాపత్యంబుల భోగబుద్ధిచే గ్రహియించువాఁడు కాలపాశబద్ధుండై తామిస్రనరకంబునం గూలఁద్రోయంబడి యచ్చట వర్షసహస్రంబు వఱకును యమయాతనల ననుభవించి పిదప సూకరంబై పుట్టి నానాదుఃఖంబులం గుడిచి తుదకు రోగభూయిష్ఠం బగుకళేబరంబుతో మనుష్యుండై జనియించు. కుటుంబపోషణంబునకై భూతద్రోహంబు గావించువాఁ డంధతామిస్రనరకంబునం బీడితుం డగు. జంతువులను వధియించువాఁడు రౌరవనరకంబునం గూలి రురుమృగంబులచేఁ జీల్పంబడు. పితృద్వేషంబును బ్రాహ్మణద్వేషంబును వహించువాఁడు యోజనాయుతవిస్తృతం బగుకాలసూత్రనరకంబునం గూలు. గోవులయెడ ద్వేషంబు వహియించువాఁడు తద్దేహరోమంబులయన్ని వర్షసహస్రంబులు మహారౌరవనరకంబునం బడు. దండార్హుం డగువానిని దండించునట్టియు బ్రాహ్మణునకు దేహదండనంబు విధించునట్టియు నరేంద్రుండు సూకరముఖు లగుయమకింకరులచే బహునరకంబులందు బహుకాలంబు బాధితుండై పిదపఁ గుయోనులందుఁ బుట్టు. గోబ్రాహ్మణద్రవ్యవృత్తుల బలాత్కారంబున గ్రహించువాఁ డంధకూపనరకంబున నర్దితుం డగు. మధురాన్నంబు దేవతలకు నైవేద్యంబు గావింపకయు సుహృజ్జనంబునకుం బెట్టకయుఁ గేవలంబు దాన భుజియించువాఁడు క్రిమిభోజనం బనుఘోరనరకంబునం బడు. పరులు తనయొద్ద న్యాసంబు గావించినహిరణ్యాదుల నపహరించువాఁడును బ్రహ్మస్వంబు నపహరించువాఁడును సందంశమహానరకంబునం గూలు. ఇతరులను గుర్తింపక స్వదేహంబుమాత్రము పోషించుకొనువాఁడు తప్తతైలం బనునరకంబునం బడు. అగమ్య యగుకాంతను మోహంబుచేఁగాని భార్యాభావంబుచేఁగాని కామించువాఁడు తత్కాంతారూపం బగుతప్తలోహప్రతిమం గౌఁగిలించికొని తప్తలోహం బనునరకంబునం బడు. బలాత్కారంబున వేదమర్యాద నుచ్ఛేదించువాఁడు మాంసశోణితభక్షణంబు గావించుచు వైతరణియందుం గూలు. వృషలిని భార్యఁ గాఁ గైకొని గార్హస్థ్యంబు నాచరించుద్విజుండు పూయోదం బనుమహానరకంబునం గూలు. దంభంబున లోకవంచనంబు గావించువాఁడు వైశ

సంబనుసరికంబునం గూలు. చౌర్యంబు గావించువారును గృహాదులం దగులఁ బెట్టువారును విషంబు పెట్టువారును గ్రామలుంఠకులును సారమేయాదనం బను ఘోరనరకంబునం గూలుదురు. కూటసాక్ష్యంబు పలుకువాఁడును బలాత్కారంబునఁ బరద్రవ్యంబు హరించువాఁడును నవీచి యనునరకంబునఁ దలక్రిందుగాఁ బడి యుండు. సురాపానంబు గావించువాఁడు తప్తలోహరసంబుం ద్రావలేక యేడ్చుచుఁ దప్తలోహరసనరకంబునం బడి యుండు. స్వవిద్యాచారదర్పితుండై గురువుల నవమానించువాఁడు క్షారనరకంబున నధోముఖుండై పడి యుండు. విశ్వాసఘాతంబు చేయువాఁడు శూలప్రోతం బనునరకంబునం గూలు. కొండెములు సెప్పి పరపీడ గావించువాఁడు దందశూకం బనునరకంబునం బడి దందశూకసందష్టుం డగుచుండు. సవర్ణాంగనను బొందువాఁడు రేతఃపానంబు చేయుచు రేతఃకుల్యానరకంబునం బడి యుండు. ఇంకను ననేకనరకంబుల ననేకపాపు లనుభవింతురు. రామకథాశ్రవణంబు గావింపనివారును పరోపకారంబు సలుపనివారును సకలనరకయాతనలం బడుదురు. ఇచ్చట సుఖంబు గా నుండువారు స్వర్గమునుండి వచ్చినవార లనియు నిచ్చట దుఃఖంబులును రోగంబులునుం గలిగి యుండువారు నరకంబు లనుభవించి వచ్చినవార లనియును దెలియం దగు. ఇంకఁ బాపచిహ్నంబులం జెప్పెద. వినుము. సురాపానంబు గావించినవారు శ్యామదంతులుగను నభక్ష్యభక్షణంబు గావించినవారు గుల్మోదరులుగను రజస్వలావీక్షితాన్నంబు భుజియించినవారు క్రిమిలోదరులుగను శునకమార్జాలాదిసంస్పృష్టాన్నంబుం దినినవారు దుర్గంధదేహులుగను దేవతాదులకు నివేదింపని యాహారంబు భుజించినవా రుదరరోగవంతులుగను బరులయన్నంబు పడఁగొట్టినవా రజీర్ణరోగులుగను ద్రవ్య ముండియును గదన్నంబు పెట్టినవారు మందాగ్నిరోగులుగను విషంబు పెట్టినవారు ఛర్దిరోగులుగను మార్గనాశనంబు చేసినవారు పాదరోగులుగను పిశునులు సశ్వాసరోగులుగను ధూర్తు లపస్మారరోగులుగను బరసంతాపకరులు శూలరోగులుగను దావాగ్నిదాయకులు రక్తాతిసారరోగులుగను. దేవాలయంబునందును జలంబునందును మలవిసర్జనంబు గావించువారు గుదరోగులుగను గర్భపాతంబు గావించువారు క్షయమేహజలోదరరోగులుగను బ్రతిమాభంగంబు గావించువా రప్రతిష్ఠులుగను దుష్టవాదులు ఖండితులుగను బరదూషకులు ఖల్వాటరోగులుగను సభయందుఁ బక్షపాతంబు వహించువారు పక్షవాతరోగులుగను బరవాక్యంబుల హాస్యంబు చేయువారు కాణులుగను హేమహర్తలు గునఖులుగను దామ్రచోరులు దుందిలులుగను గాంస్యహర్తలు తెల్లపొడలకుష్ఠరోగంబు గలవారుగను ద్రపుహర్తలు పింగకేశులుగను సీసహర్తలు శిరోరోగులుగను ఘృతహర్తలు నేత్రరోగులుగను జర్మహర్తలు మేదోవృతులుగను మధుచోరులు బస్తిగంధులుగను లోహహర్తలు బర్బరాం

గులుగను దైలహర్తలు గండమాలారోగులుగను నామాన్నహర్తలు దంతహీను లుగను బక్వాన్నహర్తలు జిహ్వారోగులుగను మాతృగమనంబు చేసినవారు లింగవర్జితులుగను గురుభార్యను బొందినవారు మూత్రకృచ్ఛ్రరోగులుగను స్వసుతాగమనంబు చేసినవారు రక్తకుష్ఠరోగులుగను భగినీగమనంబు గావించిన వారు పీతకుష్ఠరోగులుగను భ్రాతృభార్యను గూడినవారు గుల్మకుష్ఠరోగులు గను స్వామిభార్యం గనగూడినవారు దద్రుమండలరోగులుగను నమ్మినవాని భార్యను బొందినవారు గజచర్మరోగులుగను బితృష్వసృగాములు దక్షిణాంగ వ్రణులుగను మాతులానీగమనంబు చేసినవారు వామాంగవ్రణులుగను బితృవ్య పత్నిం గూడినవారు గటికుష్ఠరోగులుగను మిత్రభార్యాకాముకులు మృత భార్యులుగను సగోత్రస్త్రీగమనంబు చేసినవారు భగందరరోగులుగను దపస్వినీ గమనంబు గావించినవారు ప్రమేహరోగులుగను శ్రోత్రియభార్యాగమనంబు చేసినవారు నాసికావ్రణరోగులుగను దీక్షితస్త్రీగమనంబు చేసినవారు దుష్ట రక్తస్రుగ్రోగవంతులుగను స్వజాతిభార్యను గూడినవారు హృదయవ్రణరోగులు గను నున్నతజాతిస్త్రీసంగమంబు గావించినవారు మస్తకవ్రణరోగులుగను బశుయోనిగాములు మూత్రఘాతరోగులుగను నరకాంతంబున జనియింతురు. తత్తత్పురుషసంగమంబు గావించినకతన నింతులును దత్తద్రోగంబులు గలవారై యుందురు. నీకు సంగ్రహంబుగాఁ బాపులవృత్తాంతంబు చెప్పంబడియె. 828

క. వ్రతదానతపస్తీర్థ, క్రతువులు మొదలైనపుణ్యకర్మములును న
చ్యుతచరితశ్రవణంబును, హతమార్పఁగఁ బాపముల నుపాయములు సుమీ.

ఆ. కాని వానిలోన ఘనతరోపాయంబు, విష్ణుచరితములను వినుట యొకటి
సకలపాపపంకసంక్షాళనము చేయఁ, గలది హరికథాపగయె ధ్రువంబు. 830

ఆ. హరి నవజ్ఞ చేయునరుల నెన్నటికిని, బావనముగ నొనరుపంగ లేవు
జాహ్నవియును దీర్ఘశతసహస్రములును, నెట్టిపుణ్యకర్మ మేని తుదకు. 831

క. హరిగాథ నుడువుచుండఁగఁ, బరిహాసము చేయునట్టిపాపాత్ములకున్
దొరకదు విముక్తిమార్గము, నరకంబుననుండి యెన్నినాళులకైనన్. 832

క. అని విరమించుటయుఁ దపో, ధనునకు శత్రుఘ్నుఁ డెఱఁగి తత్క్షణము యను
జ్ఞను బడసి హేమకూటం, బునకు మరల నరుగుదెంచి మోదముతోడన్. 833

క. హనుమత్సమేతుఁ డగుచున్, వినిపించెను హయముచెంత నిలువంబడి రా
మునిచరిత మద్భుతంబుగ, ననిమిషులు వినంగ వ్యోమయానస్థితులై. 834

—: రామకథాశ్రవణమున సాత్త్వికుఁడు రాక్షసత్వవిముక్తుఁ డగుట :—

క. అంతట రామచరిత్రం, బంతయు విని శాపముక్తుఁడై సాత్త్వికుఁ డ
త్యంతానందం బెనయఁగ, స్వాంతంబునఁ బడసి నిర్జరాకారంబున్. 835

గీ. రాజ రామచరిత్రసంశ్రవణమునను, రాక్షసత్వము వదలి స్వర్గమున కేను
బోవుచున్నాఁడ మరల నీపున్నియమున, ననుచు వచియించి రథముపై నధివసించి.
క. చూపఱ కెల్లను విస్మయ, మాపాదిల్లంగ దివికి నరిగెను మింటన్
జూపట్టుచు రవితెఱఁగున, నాపై నటనుండి యధ్వరాశ్వము కదలెన్. 837
వ. అప్పటికిఁ దురగంబు బయలువెడలి సప్తమాసంబు లయ్యె. 838

—: క్రతుహయము కుండలపురముం జేరుట :—

గీ. అట్లు కదలి హయంబు రయంబు మీఱఁ, దిరిగి హిమవద్గిరిప్రాంతదేశములను
నంగవంగకళింగదేశాధిపతుల, పూజలను గొని కుండలపురముఁ జేరె. 839

—: సురథుఁడు క్రతుహయముం బట్టుట :—

గీ. అంతటను దత్పురాధీశుఁ డైన సురథుఁ, డాత్మ నుప్పొంగి పట్టె నాహయము రామ
దర్శనకుతూహలమునఁ దద్దాసుఁ డగుట, నఖిలజనులకు విస్మయ మావహిల్ల. 840
సీ. ఆసమయంబున నతనిధార్మికబుద్ధి, పరిశీలనము చేయుభావమునను
శమనుండు విప్రవేషంబున నాతని, కడ కేఁగుదెంచి యక్కడను నిలిచె
నపుడు దిగ్గన లేచి యాసనంబుననుండి, భూవరుం డాతనిఁ బూజచేసి
ధన్యుఁడ నైతి మీదర్శనంబున దేవ, చెపుము రామకథావిశేషములను
గీ. ననివిధేయతతోడఁ దానడుగుటయును, బ్రాహ్మణుఁడు నవ్వుచును నల్లపాఱఁజూచె
నంతటను మేదినీకాంతుఁ డతనిఁ జూచి, స్వామి హసియింపఁగారణం బేమి యనియె.
చ. అనవుడు విప్రుఁ డిట్లనియె నాతనిఁ గాంచి నరేంద్ర నీవు ప
ల్కినమాట నాకు నవ్వు గలిగించెను హేతువు వేఱె లేదు ప్రా
జ్ఞునకును బామరత్వమును జూచుచు నుంటిమి లోకమందు రా
మునికత లేడ నిస్తరణమున్ గలిగించుట యేడఁ జూడఁగన్. 842
గీ. కర్మవశు లైనవారికే కరణిఁ గలుగుఁ, గర్మఫలమును దప్పింపఁగలుగుశక్తి
కర్మమున స్వర్గమును నరకమును గలుగుఁ, గర్మమునఁ బుట్టు గిట్టును గర్మముననె.
గీ. శతమఖంబుల నొనరించి శతమఖుండు, పొందె నింద్రపదంబును జెందె బ్రహ్మ
సత్యలోకంబు కర్మంబు సలిపి కర్మ, ముననె పడసిరి మరుదాదులును సుఖంబు.
గీ. కర్మమునఁ జేసి వంశవృక్షంబుఁ బెరుఁగుఁ, గర్మమునఁ గల్గు గౌరవాగౌరవములు
కర్మవిరహిత మైనలోకంబె లేదు, కానఁ గర్మంబె త్రైలోక్యకారణంబు. 845
గీ. విహితకర్మంబునను బ్రభవించు మేలు, కలుగు నవిహితకర్మంబువలనఁ గీడు
కాన గమనించి కర్మమార్గంబు నెల్లఁ, గర్మ మొనరించువానికిఁ గలుగు సుగతి.
మ. అనుడున్ గోపవిఘూర్ణితాక్షులను గోత్రాధీశుఁ డీక్షించి వి
ప్రుని నీ వింక వచింపఁబోవకుము నాకున్ గర్మమార్గంబు నా
శనముం జెందుఫలంబు నిచ్చు నది శంసాపాత్ర మె ట్లయ్యె వే
చను మిచ్చోట వసింపఁగాఁ దగవు నిన్ శాసింతు నిం దుండినన్. 847

క. పడుదురు బ్రహ్మేంద్రాదులు, కడకుఁ రామాంఘ్రిభక్తి గలిగినవారల్
పడ రేనాఁటికి నెవరును, బడిరె విభీషణుఁడు ధ్రువుఁడు ప్రహ్లాదుండుఁ. 848

క. నరమాత్రునిఁగను రామునిఁ, బరిగణన మొనర్చునట్టిపాపాత్ముల ము
ద్గరములచేఁ బ్రహరింతురు, పరేతరాడ్భటులు కట్టి పాశంబులచేఁ. 849

క. ఒనరించినయపరాధం, బునకుఁ దగు దేహదండమును జేయఁగ నై
నను బ్రాహ్మణుండ వగుటను, నిను మన్నించితిని రాజనీతిజ్ఞతచేఁ. 850

క. చను మింక నిచట నుండం, జన దని యార్చుటయు భృత్యజను లతిశీఘ్రం
బున వచ్చి వానికరముల, నొనగూడఁగఁ బట్టి లాగ నుద్యుక్తులు గాఁ. 851

క. అతఁడు స్వరూపముఁ దాల్చి, క్షితినాథునియెదుట నిలిచి చిత్రముగను భూ
పతి నీభక్తికి హర్షిం, చితిఁ గోరుము వరము నీయ సిద్ధుఁడ నైతిఁ. 852

గీ. అనుటయును మ్రొక్కి సురథుఁ డాతనికి దేవ
నాకు రాముఁడు నిజదర్శనంబు నిచ్చు
వఱకు లేకుండ మిత్తి నీవలన భీతి
యెన్నటికిఁ గల్గకుండంగ నిమ్ము వరము. 853

గీ. అని వరించుటయును నట్లె యగును గాక
యని వచించి యంతర్ధాన మందె యముఁడు
పిదప సురథుండు ధైర్యంబు పెంపుఁ జెంద
యుద్ధసన్నాహయుక్తుఁడై యుండె నంత. 854

వ. శత్రుఘ్నుండు హయంబు సురథమహీపాలగృహీతం బయ్యె నని భటముఖం
బున నాలించి సుమతిం జూచి యిట్లనియె. 855

—: సుమతి శత్రుఘ్నునకు సురథునిచరిత్రముం జెప్పుట :—

గీ. సచివశేఖర సురథునిచరిత మేమొ
చెప్పు మొక్కింత యనుటయుఁ జేతు లొగ్గి
సుమతి శత్రుఘ్నునిమొగంబుఁ జూచి స్వామి
కుండలం బనుపుర మిల నొండు గలదు. 856

ఆ. అదితికుండలములు హర్షభయంబుల, చేత నచటఁ బడినహేతువునను
నేరుపడియె దాని కిలలోనఁ గుండల, మనెడినామధేయ మమలచరిత. 857

క. రామస్మరణము చేయుచుఁ, బ్రేమంబున నుందు రప్పురిఁ జను లెల్లఁ
క్షేమములు దప్ప వారికి, క్షామములు ఘటిల్ల వెట్టికాలమునందుఁ. 858

క. అనుదినమును దులసీపూ, జనమును నశ్వత్థవృక్షసంసేవనముఁ
బొనరించు చుందు రచ్చటి, జనములు గ్రోలుచును రామచరితామృతముఁ.

క. రామప్రతిమలతోడను, రామాలయశతము లచట రాజిలుచుండుఁ
గామితము లెల్ల దీర్చుచుఁ, బ్రేమమున భజించుచుండు ప్రియభక్తులకుఁ. 860

క. రామధ్యానము దక్కఁగఁ, గామఫలస్మరణ మెదను గన రాదు వచో
ధామమునఁ దక్క రాముని, నామము కలహోక్తి లేదు నరులకు నచటన్.

క. రామచరిత్రాకర్ణన, కామిత మొక్కండు దక్కఁ గలుగదు వ్యసన
వ్యామోహ మించు కేనియు, నామతిలదు నీతిభంగ మచటిజనులకున్. 862

క. పరదారపరధనంబుల, హరియించుట నిష్ఠురక్రియాలంపటులై
తిరుగుటయు నచటిజనులకుఁ, బరిచితములు గావు ధర్మపథములు గామిన్.863

క. ఆనగరమునకు సురథుడు, నా నొక్కమహీధవుండు నాథుండై రా
మానుజ ధర్మము లేశం, బేనియుఁ గొఱవడక ప్రజల నేలుచు నుండున్. 864

క. శిరమునఁ దులసియు వాక్కున, హరినామము గలిగియుండు ననవరతము నా
నరనాయకుండు ధర్మమె, ధరణిం గనఁబడునొ యేమొ తద్రూపమునన్. 865

ఆ. అతనిరాజ్యమందు నల్పపాతక మేని, లేనికారణమునఁ గానఁబడరు
మరణ మొందఁబోవుమర్త్యులకనులకు, నీలదేహు లైనకాలభటులు. 866

గీ. అతని కధికబలంబు సంప్రాప్త మయ్యె, నచ్యుతధ్యానమునఁ జేసి యందువలన
నశ్వమును బట్టె నేని పోరాడుఁ గాని, విడువఁ డొకమాత్రమున నని విన్నవించె.

క. అది విని శత్రుఘ్నుం డం, గదుని నతనికడకుఁ బనిచెఁ గ్రతుతురగంబున్
వదలు మటు గానియెడలను, వదలెదు ప్రాణముల ననుచు వాక్రుచ్చుటకై.868

క. పనుచుటయును నంగదుఁ డా, జననాథునికడకుఁ బోయి సరగున శత్రు
ఘ్నునివాక్యములను వినుచుట, యును సురథుం డిట్టు లనియె నుత్తమఫణితిన్.

క. మారామునిదర్శనమును, గోరి తురంగమును బట్టికొంటిని యది చే
కూరెడిదాఁకను విడువను, వీరాగ్రేసరులు వచ్చి వేఁడిన హయమున్. 870

గీ. అనుటయును నంగదుం డిట్టు లనియె రాజ, వృద్ధభావంబుకతన నీబుద్ధి చెడియెఁ
దురగసంరక్షకుండు శత్రుఘ్నుఁ డనుట, వినియు నీ విట్లు పలుకుట వెఱ్ఱి గాదె.

గీ. హత మొనర్చె విద్యున్మాలి యనెడిఘోర
దానవునిఁ బీఁచ మడఁచె మాంధాతృశత్రు
వై లవణాసురునిఁ జంపె నధికబలుల
నెందఱినొ వింటె శత్రుఘ్నుఁ డెంతవాఁడొ. 872

సీ. సురలు బెగ్గిల ద్రోణగిరిని వాలంబుచే, నుఱ్ఱూఁత లూఁపినయుగ్రమూర్తి
యక్షుం డనెడిరాక్షసాగ్రణి నవలీలఁ, జదిమివైచినమహాశౌర్యరాశి
సత్రికూటం బైనరాత్రించరపురంబు, దగ్ధంబు చేసినధైర్యశాలి
శతయోజనంబులసాగరంబును నొక్క, పెట్టున లంఘించినట్టిజెట్టి

గీ. యుద్ధమున రుద్రగణముల నోటుపఱచి, శివునిచే మెప్పు నొందినచేవకాఁడు
రామభక్తుఁడు దుష్టమర్దనచణుండు, శ్వసనతనయుండు వాజిరక్షకుఁడు వింటె.

గీ. జన్యమున వీరభద్రుని సంతసింపఁ, జేసినఘనుండు శత్రుసంత్రాసకరుఁడు
నిరుపమానప్రతాపుఁడు భరతసూతి, సత్తతంతుతురంగరక్షకుఁడు వింటె. 874
గీ. పృథివి యెల్లను నొక్కసారిగను ద్రిమ్మంగు, నట్టిశక్తులతో నిల నవతరించి
నట్టిసుగ్రీవముఖవానరాగ్రగణ్యు, లశ్వసంరక్షకులు వింటె యవనినాథ. 875
వ. కుశధ్వజనీలరత్నపరితాపాగ్ర్యరిపుతాపవీరమణిసుబాహుసుమదవిమలసత్యవదుగ్రాశ్వాదిరాజవీరాగ్రేసరులు సైంధవపాలకులుగా నున్నవారు. 876
గీ. అట్టివీరపయోధు లున్నట్టికడను, మశకకల్పుండ వీ వెంత మానవేంద్ర
వట్టిబింకంబు లేటికి వాహనంబు, నిచ్చి రామానుజునియండఁ జొచ్చి మనుము.
క. అనుటయుఁ గోపంబున ని, ట్లనియెను సురథుండు దూత వని నిన్ను క్షమిం
చినవాఁడ నేఁడు పొమ్మిఁక, వనచర చూచెదను గాక వారలశక్తుల్. 878
క. అనవుఁడు నంగదుఁ డాక్షణ, ముననె యరుగుదెంచి సురథభూపాలుం డా
డినమాట లెల్ల శత్రు, ఘ్నునకు నివేదించె దాత్యకోపిమఁ డగుటన్. 879

—: శత్రుఘ్నాదులకును సురథాదులకును ఘోరయుద్ధ మగుట :—

గీ. అంత శత్రుఘ్నుఁ డాగ్రహం బావహిల్ల, భూనభోంతర మంతయు బోరుబోరు
మనఁగఁ గొట్టించె రణభేరులను విరోధి, వర్గముల కెల్ల సంగరాహ్వానముగను.
వ. అంతట సురథమహీపాలుండు చతురంగబలోపేతుండై చంపకమోహకరిపుంజయదుర్వారప్రతాపిబలమోదకహర్యక్షసహదేవభూరిదేవాసుతాపను లనుదశతనూజులతోడ రథం బెక్కి సంగ్రామరంగంబునం బ్రవేశించి శంఖనాదంబు గావించె. 881
క. అపు డుభయపక్ష యోధులు, నిపుణముగ ననేకశస్త్రనివహంబులతో
నపరిమితాయోధనమును, నుపక్రమింపంగ నుండి రుద్యతు లగుచున్. 882
వ. అయ్యవసరంబునఁ జంపకునితోడఁ బుష్కలుండును మోహకునితోడఁ గుశధ్వజుండును రిపుంజయునితోడ విమలుండును దుర్వారునితోడ సుబాహుండును బ్రతాపితోడఁ బ్రతాపాగ్ర్యుండును బలమోదకునితోడ నంగదుండును హర్యక్షునితోడ నీలరత్నుండును సహదేవునితోడ సత్యవంతుండును భూరిదేవునితోడ వీరమణియును వసుతాపునితోడ నుగ్రాశ్వుండును మఱియు ననేకవీరాగ్రేసరులతోడ ననేకవీరాగ్రగణ్యులును మార్కొని ఘోరయుద్ధంబు గావింపం దొడంగిరి. 883
గీ. అపుడు పుష్కలచంపకాహ్వయుల కయ్యె, దారుణాకార మగుప్రవిదారణంబు
సమధికము లైనబాణవర్షములతోడ, సురలకును గూడ నాశ్చర్యకరము గాఁగ.
గీ. కడను బ్రహ్మాస్త్ర మేసెఁ బుష్కలుఁడు విసివి
చంపకునిమీఁద నత్యంతసాహసమునఁ

జంపకుండును దానితోఁ సరిగఁ బోరఁ
గెరలి బ్రహ్మాస్త్రమును బ్రయోగించె నంత. 885

క. ఆయుభయబ్రహ్మాస్త్రము, లాయెడ నేకీభవించి యన్యాస్త్రములన్
మాయ మొనరింపఁ దొడఁగెను, స్వీయమహఃపుంజములను జిత్రము గాఁగన్. 886

క. అది పుష్కలుండు గనుఁగొని, చెదరనిధైర్యంబుతోడ శితసాయకముల్
గదియించి వింట నేసెను, సదమద మొనరించుపూన్కిఁ జంపకునిపయిన్. 887

శా. అంతన్ జంపకుఁ డాశిలీముఖసమూహంబున్ నివారించి యే
కాంతం బైనమనంబుతో రఘుపతిన్ ధ్యానించుచున్ వింట న
త్యంతాశ్చర్యకరంబుగా నిలిపి రామాస్త్రంబు నేసెన్ రిపు
స్వాంతంబుల్ చెదరంగఁ బుష్కలునిపై నన్యాస్త్రముల్ చాలమిన్. 888

క. ఏయుటయును రామాస్త్రం, బాయెడ బంధించెఁ బుష్కలాంగంబును భ
క్తాయత్తుఁడు రాఘవుఁ డను, చాయ నెఱింగించునట్లు సకలజనులకున్. 889

వ. అంతటఁ బుష్కలుండు మంత్రబద్ధం బైనయురగంబువోలె రామాస్త్రబద్ధుండై వివశుం డగుటయుఁ జంపకుండు తత్క్షణంబ యాతనిఁ ద్రాళ్ళం గట్టి తనరథంబున నిడికొని పురంబునకుం బోవ నుంకించుచుండ నంజనానందనుండు తీవ్రవేగంబున వాని నడ్డగించె. 890

క. అవరోధింపఁగ నపుడ, య్యవనీశ్వరసుతుఁడు నిష్ఠురాశుగపంక్తిన్
దవిలించి వింట నేసెను, బవనతనూభవునిమేను పఱియలుగాఁగన్. 891

క. వ్రేటులు దిని పవనాత్మజుఁ, డోటు వడక యెత్తి సాల మొకఁ డాతనిపై
సూటిగ వైచుటయును నా, పోటరి ఖండించె బాణములచే దానిన్. 892

క. అది చూచి పవనసూనుఁడు, మదగజమును వైచె నతనిమస్తకముపయిన్
విదళించి చంపకుం డొక, ప్రదరంబున దాని భూమిపైఁ బడవైచెన్. 893

గీ. అపుడు మారుతి కురియించె నతనిపైని, నశనికల్పంబు లగుబృహదశ్మములను
నంతటను బాణయంత్రికనద్భుతముగఁ, జూర్ణ మొనరించె నవి యెల్ల సురథసూతి.

క. హనుమంతుఁ డపుడు వాలం, బును బెంపు వహింపఁ జేసి భూమీశ్వరనం
దనునిఁ బ్రహరించె దానను, దను వెల్లను బగిలి రక్తధారలు గాఱన్. 895

వ. అంతటఁ జంపకుండు తద్వాలంబు ఛిన్నభిన్నంబుగా నిష్ఠురమార్గణంబులచేఁ గొట్టుటయు నంజనానందనుం డాగ్రహంబున నుగ్రుండై చంపకునిఁ బాదంబుచే నేల కంటం గొట్టె చంపకుండు తత్ప్రహారంబున కోడక తోడన లేచి తల్లాంగూలంబుఁ గేలం బట్టికొని గిరగిరం ద్రిప్ప దిమ్మఁదిరిగి పవమానతనూభవుండు పదాఘాతంబులచే నెట్టకేలకు వాలంబు వదలించికొని బెబ్బులివోలె బిట్టార్చి తత్పదద్వయంబుం బట్టికొని యుప్పరంబున కెగసి నేలకుం గొట్టుటయుఁ జంపకుండు తత్ప్రహారంబు సైఁపం జాలక రణాంగణంబునం బడి మూర్ఛితుం డయ్యె.

గీ. అపుడు విడిపించె గంధవాహాత్మజుండు, చంపకరథంబునందుఁ బాశములచేతఁ
గట్టువడియున్నయట్టిపుష్కలుని స్వీయ, సైన్యజయనాదములు నిండ సకలదిశల.

—: సురథుఁడు హనుమదాదులను బంధించుట :—

సీ. అంతట సురథక్ష్మాధీశ్వరుఁడు వింట, సంధించి బహు వైనసాయకములు
కురియించెఁ గరువలికొడుకుపై ఘోరధా, రావర్షమట్లు విశ్రాంతి లేక
యంజనాతనయుఁ డయ్యది లెక్క సేయక, వాలంబుఁ ద్రిప్పుచు లీలతోడఁ
జనుదెంచి సురథునిసవిధంబునకు వాని, విలు లాగికొని కేల విఱిచివైచె
గీ. నంత సురథుఁడు విస్మయం బావహిల్లఁ, గైకొని మఱొక్కచాప మాతూణమునంద
శరము సంధించుటయుఁ జూచి శ్వసనసూతి, వేగమున లాగికొని దాని విఱిచివైచె.
గీ. అంత తేఁడు మఱొక్కశరాసనంబు, గొనుఁడు నదియును గాడుపుఁగొడుకు విఱిచె
గ్రహణమును భంజనమును నాకరణి జరుగ, నంతరించె నశీతిశరాసనములు. 899
గీ. అపుడు సురథుండు క్రోధతామ్రాక్షుఁ డగుచు
నుగ్రశక్తిని గొని వానియురము వ్రేయఁ
బవనసూనుండు పడి నేలపైని మరల
నపుడె యుత్థితుఁడై కోప మతిశయిల్ల. 900
గీ. ఎగసి తేనిరథంబు పై కెత్తి కేల, నంతరిక్షంబునకుఁ బోయి యచటనుండి
విడుచుటయునుశతాంగంబు పుడమిమీఁదఁ, బడితురంగయుతంబుగ బ్రద్దలయ్యె.
క. ఆరథము బ్రద్ద లగుటయు, భూరమణుఁడు నవశతాంగమును నెక్కంగన్
మారుతి పదఘాతమున వి, దారణ మొనరించి కూల్చె ధరపై దానిన్. 902
గీ. అపుడుసురథుండు వేఱొక్కయరద మెక్క, గాలికొమరుఁడుదానిముక్కలుగఁజేసె
నట్లు నలువదితొమ్మిది స్యందనములు, చక్కడఁగె వారొనర్చిన చర్యవలన. 903
గీ. అపుడు సురథుండు విస్మయం బంది వాయు,సుతునిశక్తికి నాతనిఁ జూచి వీర
చేసితివి దుష్కరం బైనచేఁత నీకు, సాటియగుజెట్టి లేఁడు ముజ్జగములందు. 904
క. కనుఁగొను మింకనాశక్తిని, గనఁబఱచెద ననుచుఁ బలికి కపివీరునిమీఁ
దను బాశుపతాస్త్రము నే, సెను దనవీర్యంబు సుప్రసిద్ధము గాఁగన్. 905
క. ఆయస్త్రము సోఁకుటయును, వాయుతనూభవుఁడు చెంది వైవశ్యంబున్
జేయునది లేక రాముని, సాయముగఁ దలంచికొనియె స్వాంతములోనన్. 906
క. తలఁచికొనినమాత్రముననె, తొలఁగెను బాశుపతశక్తి తొలఁగెను దానం
గలిగినబేతాళగణం, బులును బిశాచములు భూతములుఁ బ్రేతములున్. 907
గీ. అంత నాత్తబలుం డయి యనిలసూతి, యవనిపతితోడ మరలఁ బూర్వాధికముగ
సంగరము చేయసాగుడు తన్మవిభుండు, వదలె బ్రహ్మాస్త్రమును గపివరునిపైకి.
క. అది వచ్చుచుంటయును గని, వదనంబును దెఱచి ప్లవగవర్యుఁడు దానిన్
గదలంగ నీక మ్రింగెను, బదపడి సురథుండు సిగ్గుపాటొదవంగన్. 909

క. కాముని దలఁచుచు వింటను, రామాస్త్రముఁ గూర్చి యేసె రయమునఁ బ్లవగ
గ్రామణిపైఁ దద్బద్ధుం, డై మహిపై నొరగె మారుతాత్మజుఁ డంతన్. 910

క. అది గనుఁగొని పుష్కలుఁ డెద, నుదయింపఁ జలంబు వింట నుగ్రాస్త్రములన్
గదియించి వదలె విభుపైఁ, గదనమహీరంగ మెల్ల గజగజ వడఁకన్. 911

గీ. అపుడు సురథుఁడు వానివీర్యమున కెదను, మెచ్చికొనుచును ధనువున మేటికోల
యొకఁడు సంధింపఁ బుష్కలుం డుద్ధతముగ, నొక్కశరమున దానిని వ్రక్కలించె.

గీ. అంత సురథుండు వేఱొక్కయమ్ము గొనఁగ, మరల దానిని ఖండించె భరతసూతి
యపుడు సురథుండు విసివి తీక్ష్ణాగ్రమైన, నారసము వానియురమున నాఁట నేసె.

క. అది తాఁకి భరతసూనుఁడు, కదనక్షితియందుఁ బడియె గతచేష్టుండై
పదపడి శత్రుఘ్నుఁడు శర, కదంబమును వింటఁ గూర్చి కడు వేగమునన్. 914

క. అరుదెంచి సురథధాత్రీ, వరునిపయిం గురిసె బాణవర్షము నంతన్
సురథుఁడు శత్రుఘ్నునిమెయి, శరములచే నించె విదితశౌర్యం డగుచున్.

క. అంతట శత్రుఘ్నుం డ, త్యంతక్రోధమున నేసె నాగ్నేయాస్త్రం
బంతము నొందఁగఁ దచ్చర, సంతతి యంతయును నొక్కక్షణకాలమునన్.

క. దానిని వారించుటకై, భూనాథుఁడు వారుణాస్త్రమును నేయుడు రా
మానుజుఁడు మోహనాస్త్రము, సేనలు ప్రభువులును నిద్రచెందఁగ నేసెన్.

క. సురథుం డంతట రాముని, స్మరియించుచు లోన దాని శకలంబులు గా
ధరపైఁ బడఁ గూలిచె నొక, శరమున నొక్కింత యేని శ్రమపడకుండన్.

క. అది విస్మయ మొదవింపఁగ, మదిలో శత్రుఘ్నుఁ డధికమాత్సర్యమునన్
విదళితలవణాసుర మగు, ప్రదరంబున నేసె సురథపార్థివమౌళిన్. 919

క. ఆయమ్ము దాఁకుటయుఁ దన, యాయమ్మును క్షణము మూర్ఛ నంది రథమ్ముపై
నాయనల లేచి మఱియొక, సాయకమును సురథుఁ డేసె శత్రుఘ్నునిపై.

గీ. అపుడు శత్రుఘ్నుఁ డాతనియమ్ము విఱువ, ఖండములు రెండుగను నగ్రఖండ మేఁగు
దెంచి జవమున హృదయంబు చించుటయును, బడియెఁ దానురణక్షితి నొడలు మఱచి.

క. అంతట సుగ్రీవుం డ, త్యంతక్రోధమున నద్రు లవనీరుహముల్
దొంతులుగఁ దెచ్చి ధరణీ, కాంతునిపై వైచె దెసలు గడగడ వడఁకన్. 922

మ. అవి యెల్లన్ సురథుండు తూపులను ఛిన్నాభిన్నముల్ సేసి రా
ఘవపాదాబ్జములన్ స్మరించుచు నమోఘం బైనరామాస్త్రమున్
దవులం జేసి శరాసనంబున మహాధైర్యంబుతో నేసెఁ ద
త్ప్లవగాధీశునిమీఁద దిక్తటము లెల్లన్ దల్లడం బొందఁగన్. 923

గీ. అంతటను వానరేంద్రుఁ డయ్యస్త్రమునను, బద్ధుఁడై లోహశృంఖలాబద్ధమైన
సింధురముపోలె నేమియుఁ జేయ లేక, చింతిలఁ దొడంగె లోలోన సిగ్గువడుచు.

క. అటు లుండ సురథతనయులు, పాంచశరముల మిగిలినట్టిపరసులను
త్కటముగను గొట్టి కూల్చిరి, త్రుటితస్మృతు లగుచుఁ బ్రథనధూళిని బ్రుంగన్.

గీ. అపుడు సురథుండు రథములయందు వారి, నందఱను నుంచికొని మహానందమునను
స్వపురమున కేఁగి కనుఁగొని శ్వసనసుతుని, నీప్సితముదీర్చుకొనుకోర్కె నిట్టులనియె.

గీ. పవననందన జానకీపతిని నొక్క, సారి కనులారఁ గనుఁగొనఁ గోరి మిమ్ము
బద్ధుల నొనర్చితిని రామభద్రుఁ డొకఁడె, శరణ మిఁక మీకు నాకును దరికిఁ జేర.

—: రాముఁడు దర్శనము నిచ్చుట :—

క. అనుటయు వాయుసుతుం డా, తనిమాటలు గొలుప సమ్మదము స్మరియించెన్
మనమున రాముని భక్తా, వనశీలుని భక్తిపావనస్యముతోడన్. 928

క. స్మరియించిన మఱుక్షణమున, పరివారముతోడ రామభద్రుండు వేడ్కన్
దరిసెనము నొసఁగె విస్మయ, కరముగ నెల్లరకు నేకకాలమునందున్. 929

గీ. అపుడు సురథుండు రామునియడుగులందుఁ, బడియె భక్తివశంబున నొడలు మఱచి
సొమ్మసిల్లినవారలు సొమ్మఁ దేఱి, బంధములు వీగి బద్ధులు ప్రణతు లైరి. 930

క. అంతట వారల నెల్లను, సంతసమున లేవ నెత్తి జనకతనూజా
కాంతుఁడు గని సకరుణముగ, సంతర్ధానంబు నొందె నతిచిత్రముగన్. 931

వ. అంత సురథమహీపాలుండు రామచంద్రసందర్శనంబునఁ దనజన్మంబు చరితార్థం బయ్యె నని యానందించుచు శత్రుఘ్నునకు మఖహయసమేతంబుగా స్వరాజ్యంబు సమర్పించి పుత్రసహితంబుగా సైంధవంబు నెంటఁ జనుదెంచుట కుద్యుక్తుండై యుండ శత్రుఘ్నుండు తదుద్యమంబునకు సంతసించి తద్రాజ్యంబునఁ జంపకునిఁ బ్రతిష్ఠాపించి విజయభేరీశంఖనాదంబులతోడ నశ్వంబును విడిచె. 932

—: క్రతుహయంబు వాల్మీక్యాశ్రమంబుఁ జేరుట :—

ఆ. విడుచుటయు హయంబు వివిధదేశంబులు, తిరిగి తిరిగి గాంగతీరమందుఁ
గనులపండువుగను గ్రాలెడివాల్మీకి, యాశ్రమంబుఁ జేరి యచట నిలిచె. 933

—: లవుఁడు క్రతుహయముం బట్టి కట్టివైచుట :—

సీ. నిలిచిన హయమును దిలకించి లవుఁడు సో, త్సాహుఁడై మునిపుత్రసహితముగను
దానిచెంతకుఁ జని తత్కాలమున విరా, జిల్లుచుండినపత్ర మెల్లఁ జదివి
క్షాత్ర తేజము బహిర్గత మయ్యెనో యనంగఁ, గనులనుండి కృశానుకణము లురల
రాముఁ డెవ్వఁడో వానిభ్రాత యెవ్వఁడో వారి, గర్వంబు సర్వంబు గాంతుఁ గాక

గీ. యని వచించుచు సైదోడు లబ్రపడఁగ, నెగసి పంచాస్యపోతంబుపగిది వాజి
కేసరంబులు పట్టి లాగికొని వచ్చి, కదల కుండంగ నొకచోటఁ గట్టివైచె. 934

ఆ. అది యెఱింగి వేగ హయరక్షకులు వచ్చి, కట్టఁబడినహరిని గాంచి యెదుట
నెవఁడు కాలపురికి నేఁగఁ దలంచి యీ, హయము నిచటఁ గట్టె ననుచు నార్వ.

క. లవుఁ డిట్టు లనియె వారల, సవిధంబున కేఁగి సశరచాపధరుండై
యెవఁ డైన నేమి కట్టెను, బావ రుండినయెడల విడిచిపుచ్చుఁడు దీనిన్. 936

క. అనవుడు హయరక్షకు లా, తనిమాటలు బాలభాషితము లని లక్ష్యం
బొనరింపక హయసవిధం, బునకుం జనుచుండ విడిచిపుచ్చెడిపూన్కిన్. 937

క. అతఁడు వింటను గూర్చి సి, శాతశిలీముఖములను వెసన్ విడుచుటయున్
జేతులు దెగి వా రెల్లరుఁ, గాతరులై చనిరి స్వాధికారులకడకున్. 938

—: కుశలవజననవృత్తాంతకథనము :—

క. అని చెప్పుటయును వాత్స్యా, యనుఁ డబ్బుర మంది ఫణికులాధీశ లవుం
డనుపమవిక్రముఁ డని తోఁ, చెను వానిచరిత్ర మెమొ చెప్పుము నాకున్.

క. అని యడుగుటయును శేషుఁడు, మనమున సంతోష మొంది మౌనీంద్ర వచిం
తును విను మయోధ్యలో ము, న్నినవంశోత్తముఁడు రాజ్య మేలుచు నుండెన్.

గీ. అట్టు లుండంగ గర్భమై యైదునెలలు
గడచుటయు జానకికి నామెకళను జూచి
సంతసము నొందుచును రామచంద్రుఁ డిట్టు
లనియె నేకాంతమున నొక్కదినమునందు. 941

ఆ. కలికి నీకుఁ దీర్పవలసినదోహదం, బేమి గలదొ చెప్పు మేను దీర్తుఁ
గాల మిదియ చూవె కాంతలు గోరంగ, దయితు లైనవారు దానిఁ దీర్ప.

క. అనవుడు జానకి నమ్రా, ననయై యి ట్లనియె నాథ నాకు సమస్తం
బును గలదు మీకృపావశ, మునఁ గోరఁగ నేమి చిత్తమునఁ గల దింకన్.

క. మీవంటిభర్త దొరకిన, భావిని కేలోప ముండుఁ బ్రార్థించుటకున్
భావంబున నే దేనియుఁ, గావలసిన దున్నఁ గాక కలుగును వాంఛల్. 944

క. ఐనను మీ రడిగితి ర, ద్దానను జెప్పెదను నాథ తాపససతులన్
గాననములందుఁ గాంచితి, నానాఫలములలోన రిక్తహస్తంబులతోన్. 945

గీ. ఇపుడు దైవంబు భాగ్యము నిచ్చెఁ గాన, గాంచి వారిని మరల నీకాలమందుఁ
దనివిదీరంగఁ బూర్ణహస్తములతోడఁ, బూజ గావింపఁగా నాకు బుద్ధి వొడమె.

గీ. అనుటయును రామభద్రుఁ డి ట్లనియెఁ దన్వి సముచితం బైననీదోహదమున కేను
సంతసించితి నీవును సంతసింపు, మనిచెదను రేపు నీకోరినట్ల నిమ్మ. 947

క. అమటయు మైథిలి హర్షం, బును జెందుచు లోన నిదురవోయె సుఖముగన్
మునుపోలెఁ బ్రణిధు లారే, యిని గూడను దిరుగసాగి రెల్లపురంబున్. 948

—: గూఢచారులు పురవృత్తాంతములు తెలిసికొని రామున కెఱింగించుట :—

వ. అట్లు గూఢచారు లచ్చటచ్చటం దిరుగుచు మనుష్యభాషణంబులు వినంబడు
టం జేసి యొక్కగృహంబుకడ పీను లొగ్గి నిలువంబడి యుండ నంతఁ దద్గేహం
బునఁ బాలునకుఁ బా లిచ్చుచు నింతి యొక్కరిత యి ట్లనియె. 949

సీ. సంసారవార్ధినిస్తారకుం డగురాముఁ, డేతదయోధ్యాపురీశ్వరుండు
తత్స్మరణధ్యానదర్శనాదులచేత, జన్మాంతరము రాదు జంతువులకు
జన్మంబు రాకున్న సమకూరఁబోవదు, తల్లిదుగ్ధంబును ద్రావ వీలు
కానఁ ద్రావుము బిడ్డ కడుపు నిండఁగఁ బాలు, దొరకవు గ్రోలంగ మరల నీకు

గీ. ననుడుఁ జారులు కర్ణరసాయనముగ, విని తదీయోక్తులను హర్షమును వహించి
యచటనుండి మఱొక్కగేహంబుకడకు, నరిగి కూర్చుండి రచట రహస్యముగను.

సీ. ఆగృహంబున నొక్కయంబుజాయతనేత్ర, పర్యంకమున నున్నపతినిఁ జూచి
నాథ నీమదనసుందరవిగ్రహముఁ జూడఁ, గన్పట్టె రామవిగ్రహము నాఁగ
ననుటయు నాతఁ డి ట్లనియె సాధ్వి నిజంబ, సతులకు రాముఁడె స్వప్రియుండు
కాని కీటమువంటినే నేడ బ్రహ్మాది, భావితుం డగురామభద్రుఁ డేడ

గీ. నేడ ఖద్యోత మాదిత్యుఁ డేడ శశక, మేడ హరి యేడఁ గుల్యాంబు వేడ గంగ
యేడ గుంజాలతాగృహ మేడ మేరు, వేడ రామునిఁ బోల నే నెంతవాఁడ.

క. అనుటయు సత్యము వాక్రు, చ్చినకతమున నాలతాంగి చేరిచికొని యా
తనిఁ దనకౌఁగిట నలరిం, చెను సంతటఁ జనిరి సంతసించుచుఁ జారుల్. 952

వ. అట్లు చని గూఢచారులు మఱియొక్కభవనంబుకడ నిలువంబడి యుండఁ దద్భవ
నంబున నొక్కలతాంగి పతితోడ శయ్యాతలంబునం గూర్చుండి వీణాస్వానం
బునఁ దనకంఠస్వరంబు మేళగించి గీతరూపంబున శ్రవణపేయంబుగా రాముండు
గావించిన సేతుబంధరావణవధాద్యద్భుతకార్యంబులం గొనియాడి. 953

గీ. ప్రజలఁ బుత్రులఁ బోలెఁ గాపాడునట్టి
రామచంద్రుండు ప్రభువుగాఁ బ్రాప్త మగుట
మున్ను మన మాచరించినపున్నెమునకు
ఫలమె సుమి నాథ యని తుదిఁ బలుకుటయును. 954

ఆ. కాంతుఁ డిట్లు లనియెఁ గలికి సామాన్యప్ర, భుండు గాఁడు రాఘవుండు సృష్టి
కరుఁ డతండె వృద్ధికారకుఁ డాతండె, విలయకరుఁ డతండె విశ్వములకు. 955

క. దుష్టులసంహారంబును, శిష్టులపరిపాలనమును జేయఁగ వేడ్కన్
స్రష్టృప్రముఖులు హరి తద, భీష్టక్రియ కవతరించె నిల రాఘవుఁడై. 956

క. అమ్మహనీయునిముఖప, ద్మమ్మును గనుఁగొనుచు సతము ధన్యుల మగుభా
గ్యమ్ము సమకూరె నీనగ, రమ్మున నుంటను మనకు రాకేందుముఖీ, 957

క. అని చాలించుటయును దమ, మనముల సంతోష మొదవ మఱియొక గేహం
బును దరిసి గూఢచారులు, కనఁబడ కుండంగ నిలువఁగా నచ్చోటన్. 958

సీ. ఆగృహంబున నొక్కయజ్ఞాత్మ తనభర్త, తోడఁ బాచికలాడ ప్రోడ యగుట
నేను గెల్చితి నాకు నిమ్ము నీసర్వస్వ, మని సాగె నిర్బంధ మొనరుపంగ
నపుడు తద్వల్లభుం డతివ నీ వేదియొ, చేసితి మోసంబు చిత్రముగను
స్మరియించి రాముని జలిపితి ము న్నెన్న, కార్యంబు లం దెల్లఁ గలిగె విజయ

గీ. మిపుడు నాకుఁ బరాజయ మేల కలుగు, నాపదము గాక మరల నీయాట యనుచుఁ
దలఁపులోపల రాముని దలఁచికొనుచుఁ, బాచికలు వైచి విజయంబుఁబడసె నంత.

క. రామస్మరణమహత్త్వము, నామానిని మెచ్చికొనుచు నాతని జేర్చెన్
ప్రేమంబునఁ దనకౌఁగిట, నామతిలన్ ముదము దాన నరిగిరి చారుల్. 960

వ. అట్లు చని చని గూఢచారు లొక్కగుడిసెకడ నిలువంబడి చూచుచుండ. 961

సీ. ఆయగారంబునయం దొక్కరజకుండు, బహుళరోషాక్రాంతభావుఁ డగుచుఁ
దనపడంతిని గనుంగొని అంకులాఁడి నీ, వెచట నుంటివె నిన్న నిల్లు విడిచి
యేల వచ్చితి విప్పు డింటికి నీవోము, కాం దరా దేఁగు మక్కడకె మరల
నని తిట్టుచును బట్టికొని కొప్పు పడవైచి, తన్ను చుండంగఁ బాదములచేత

గీ. వచ్చి యాతనిజనయిత్రి వత్స యింటి, కరుగుదెంచినయిల్లాలి ననుపరాదు
తప్పు కావింపలే దిది తథ్యముగను, గొట్టవల దింక ననుచు వాఁ డిట్టు లనియె.

గీ. అమ్మ చెప్పకు నా కింక నన్యగృహము, లోన నివసించి వచ్చినదాన నోము
రాముఁడనె నేను రజకుండ రా జతండు, రాజు చేసిన కార్యంబు రక్తి కెక్కు. 963

క. అని పలుకుటయును చారులు, విని ఖడ్గము నెత్తి వాని వ్రేయఁగ నుంకిం
చినవార లయ్యు రాజా, జ్ఞను మీఱఁగ రామి శాంతిసంయుతు లగుచున్. 964

క. రాతిరి సమాప్తి నొందిన, హేతువున నిజాలయముల కేఁగి యటుపయిన్
బ్రాతఃకాలం బగుటయు, సీతాపతిసవిధమునకుఁ జేరి ప్రణతులై. 965

ఆ. రేయి వినినమంచివృత్తాంతముల నెల్లఁ, దెలిపి చివరవార్త తెలుప లేక
తెలిపి రెట్లొ కడకు దీనాననములతో, రాజునాజ్ఞ మీఱరాని దగుట. 966

—: రాముఁడు లోకాపవాదభీతిని దమ్ముల కెఱిఁగించుట :—

క. ఆమాట వినినతోడనె, రాముఁడు నిశ్చేష్టుఁ డగుచు రసపై వ్రాలెన్
దా మంతటఁ దహతహతో, స్వామిని బుట్టముల వీవసాగిరి చారుల్. 967

గీ. అంతటను గొంతతడవున కాప్తసంజ్ఞుఁ, డగుచు రాముఁడు చారుల ననిచి పుచ్చి
ద్వారపాలునిఁ బిలిచి మత్సవిధమునకుఁ, బనుపు మిప్పుడె భరతుని నని వచించె.

క. ఆవచన మతఁడు తలపైఁ, బూవుంబలెఁ దాల్చి శీఘ్రముగఁ జని తెలుపం
గా వచ్చి భరతుఁ డన్నకుఁ, గావించి ప్రణామ మెదురుగా నిలుచుటయున్.

క. అనవుడు భరతుఁడు దుఃఖం, బునఁ గన్నులనుండి బాష్పములు గాఱఁగ మే
నను గంప మొదవఁ బడియెను, దనువు మఱచి నేలమీఁద దారువుపోలెన్.

వ. అప్పుడు రామచంద్రుండు ద్విగుణీకృతవిషాదుండై సత్వరంబుగాఁ బ్రతీహారిం
బిలిచి శత్రుఘ్నుని నాకడకుం బనుపు మని యానతిచ్చుటయు ద్వారపాలుండు
తత్క్షణంబ చని రామాదేశంబు శత్రుఘ్నున కెఱింగించె. 986

క. అంతట శత్రుఘ్నుం డ, త్యంతరయంబునను వచ్చి యట జరిగినవృ
త్తాంతం బంతయు విని మదిఁ, జింతించుచు నిట్టు లనియె సీతాపతికిన్. 987

ఆ. అన్న నీకుఁ జెప్పునంతటివాఁడను, గాను నేను గాని మానసమున
నుద్భవించినట్టియుపతాపమునఁ జేసి, యూరకుండ బుద్ధి యొప్పదయ్యె. 988

సీ. కాకుండినను నులూకములకు నిష్టుండు, తపనుండు లోకబాంధవుఁడు గాఁడె
యంధకారమునకు నహితుఁ డైనను సుధా, కరుఁడు జనాహ్లాదకరుఁడు గాఁడె
సరిపడకున్నను సర్పంబులకు వైన, తేయుండు విశ్వవందితుఁడు గాఁడె
పాషండులకు ద్వేషభావ ముండినను నా, మ్నాయంబు సర్వసమ్మతము గాదె
గీ. నీచుఁ డగుచాకి యొక్కఁడు నిందసేసె, ననెడికారణమున విడనాడ నగునె
సకలజనమాన్య యైనజానకిని గాని, ధర్మరతస్వార్థ మైననీతనువుఁ గాని. 989

క. అనుటయు రాఘవుఁ డాతనిఁ, గనుఁగొని శత్రుఘ్న ధార్మికంబులె నీచె
ప్పినమాట లెల్ల నైనను, జననిందాభీతి నుడుపఁ జాలవు నాకున్. 990

క. అని పలికి భరతునకుఁ జె, ప్పినవిధమునఁ జెప్పుటయును బృథివీస్థలిమీఁ
దను వ్రాలెను శత్రుఘ్నుఁడు, తను నెఱుఁగక శోకవహ్నితప్తుం డగుచున్.

వ. అత్తఱి రామచంద్రుండు హృదయవిదారకం బగుదుఃఖభారంబు సహియింపం
జాలక ప్రతీహారిం బిలిచి లక్ష్మణుని నాదరికిం బంపు మని యాజ్ఞాపించుటయు
నాతండు సత్వరంబ చని సౌమిత్రికి రామునియాదేశంబు దెలిపె. 992

గీ. అంతటను లక్ష్మణుఁడు వచ్చి యున్నకడకు, మ్రొక్కి నిష్ప్రభ మైనతన్ముఖము జూచి
మూర్ఛలో నున్న యన్నదమ్ములనుజూచి, మ్రోడు నా నిల్చియుండె నో రాడకునికి
ఆ. అపుడు రామభద్రుఁ డాయుపద్రవమున, కొదవినట్టిహేతు వుగ్గడించి
నాకుఁ గలిగినట్టిలోకాపవాదంబు, తండ్రి తీర్ప నీకుఁ దప్ప దనియె. 994

చ. అనవుడు లక్ష్మణుండు కనులందు నిరుద్ధము చేసి దుఃఖసం
జనితము లైనబాష్పములు సంహననంబు వడంక గద్గద
స్వనమున నీవిధిం బలికె స్వామి యభిజ్ఞత లేనివాఁడ నే
మనఁ గలవాఁడ నేను సకలార్థవిదుండవు నీవె యిట్లనన్. 995

క. పిలిపించి చాకివానిని, దెలిసికొనఁగ వలదె వాఁడు తెలిపెడిమాటల్
తెలియనివానికి సత్యము, తెలుప వలదె తగునె యిట్లు తెంపు వహింపన్. 996

క. కల వైన నోరుపఁ దలఁపక, నెలకొల్పి మనంబు నొక్కసీపై సెపుడున్
దలమానికముగ సతులకు, వెలసినమావదినెఁ దగునె విడువఁగ నీకున్. 997

క. నిందింపఁ దగనిసాధ్విని, నిందించినఖలుఁడు దండనీయుఁడు వానిన్
బందెకొ కానకొ పనుపక, కం డెఱుఁగనిసతిని దగునె కడ కొత్తంగన్. 998

క. నామాటలలో దోషం, బేమేనియు నున్న సైఁపు మెదలోపల నా
కామతిలినసంక్షోభం, బేమిరొ పలికించె నోట నిక మాటాడన్. 999

క. అని యూరకుండుటయు ని, ట్లనియెను రాముండు తమ్ముఁడా యెఱుఁగనివాఁ
డను గాను జానకీగుణ, మును గాని జనాపవాదమున కీడు లైతిన్.                1000

గీ. కీరితినిమిత్తముగ నాశరీర మేని, విడుతుఁ బ్రియసోదరుని నిన్ను విడుతు నింక
గృహధనసతీసుతాదుల నెన్న నేల, విడుతు సర్వంబు నొకకీర్తి విడువఁ జాల.

క. ప్రియ మైనది నా కొకకీ, ర్తియె కాని మఱొండు గాదు త్రిభువనములఁ ద
త్ప్రియ మొదవ నింక నెయ్యది, ప్రియ మైనపదార్థ మేను బృథివిని బ్రదుకన్.

గీ. అడుగ నేటికి రజకుని నతఁడు బెగడఁ, గాలవశమున సర్వంబుఁ దేలఁగలదు
కాలపరిపాక వైద్యంబుకంటె వేఱు, రుక్ప్రతిక్రియ లే దామరోగమునకు. 1003

క. కావున నాలస్యం బిఁకఁ, గావింపక యిపుడె నన్ను ఖండింపుము తే
దా విడిచిపెట్టి సీతా, దేవిని వనభూమి నరుగుదెమ్ము మదాజ్ఞన్. 1004

—: లక్ష్మణుఁడు రామాజ్ఞాబద్ధుఁ డగుట :—

క. అనుటయును లక్ష్మణుం డీ, పని నాతలమీఁదఁ బడియెఁ బరమకిరాతుం
డను నేను జేతులారఁగ, వనములలో విడుతు గర్భవతి యగుసాధ్విన్. 1005

క. అని గొబ్బు క్షణము చింతిలి, మనమున సొఁగాక మున్ను మాతను బిత్రా
జ్ఞను నఱికె జామదగ్న్యుం, డనుచిత మైనను గ్రహింప నగు గుర్వాజ్ఞన్.

క. అని మదిలో నిశ్చయముం, బొనరిచికొని లక్ష్మణుండు పొడగని రామా
ననము నిటు లనియె నగ్రజ, వనమున జానకిని విడిచి వత్తుఁ ద్వదాజ్ఞన్. 1007

చ. అనుటయు రామచంద్రుఁ డపు డాతనిఁ గన్గొని వత్స నీవు ప
ల్కినపలు కాత్మశాంతి గలిగించెను నిన్నను నన్ను సీత కా
ననముల కేఁగి మౌనిలలనామణులం గనఁ గోరెఁ దన్మిషం
బున రథమందు నుంచికొని పొమ్ము రయంబున నంచుఁ బల్కుడున్. 1008

గీ. అపుడు తలవంచికొని రాఘవానుజుండు, కాఱుచుండంగ బాష్పముల్ కనులనుండి
శుష్యదాస్యంబుతోడ నచ్చోటును విడిచి, చనియె సీతామహాదేవిసదనమునకు.

—: లక్ష్మణుఁడు సీతాదేవి నడవిలో విడుచుట :—

క. చని యామెపాదముల కొ, య్యన వందన మాచరించి యంతశ్శ్రుతు
ర్వినిరుద్ధబాష్పుఁ డై యి, ట్లనియె సుమిత్రాతనూజుఁ డవనిజతోడన్. 1010

సీ. తల్లి మునిపత్నులను జూడఁ దలఁచి నీవు
కోరినమనోరథంబును దీరుచుటకుఁ
బనిచె మాయన్న సన్నింకఁ బయన మగుము
రథము సంసిద్ధముగను ద్వారమునఁ గలదు. 1011

చ. అనుటయు సీత సంతసము నంది తపోధనకాంతలన్ గనుం
గొనెడికుతూహలంబునను గుంకుమయుం బసుపుం జవాదియున్
బునుఁగును భూషణంబులును బట్టములుం మఱికొన్నివస్తువుల్
గొని పరిచారికాజనులు గూడను రా నరుదెంచె గ్రక్కునన్. 1012

ఆ. అరుగుదెంచుటయును నామెను సౌమిత్రి, రథమునందు సత్వరముగఁ జేర్చి
నడుపు మని సుమంత్రునకుఁ జెప్ప నాతండు, పట్టి సడల విడిచెఁ బగ్గములను.

క. పగ్గంబులు విడచుటయును, గ్రమ్మొగ్గతిలంబడిరి యశ్వములు దానను నే
నెుగ్గగునో యనుచు సూతుఁడు, దిగ్గున దిగి యిట్టు లనియె దీనాననుఁడై. 1014

ఆ. స్వామి హయములు నడువ వేమి హేతువో నాకుఁ, దెలియ దేమి చేయ వలయు నింక
ననుచు నిట్టు లనియె నంతర్విషాదము, నడఁచికొనుచు రాఘవానుజుండు. 1015

క. సారథి కొట్టుము కశచే, వారువములు లేచు ననుచు వాఁ డప్పుడును నా
తీరునఁ జేయక యున్నను, ఘోరముగను లేచుదనుకఁ గొట్టెఁ దదాజ్ఞన్. 1016

క. అపు డెట్లో లేచి హయములు, చపలచపలముగను బరువసాగుచు నంతన్
విపరీతసూచనముగను, విపులాత్మజదక్షిణాక్షి వెసవెస నదరెన్. 1017

సీ. అంతటను సీత మనమున భయంబు దోఁప, నిట్టు లనియెను లక్ష్మణా స్వామి కతమొ
యదరుచున్నది నాదక్షిణాక్షి యిపుడు, పడియె రథసైంధవంబులు ప్రథమగతిన.
భద్రములు గల్గుఁగాక నాప్రాణపతికి, మఱఁదులకు రాష్ట్రజనులకు మంత్రులకును
గలుగకుండునుగాక యెక్కడను గూడఁ, గ్లేశములు విఘ్నములును దేశమందు.

క. అనుటయును లక్ష్మణుఁడు మన, మున దుఃఖము పొంగి పొరల మూఢునిచందం
బున నూరకుండె నేమియు, ననఁ జాలక గ్రుక్కికొనుచు నశ్రుజలంబుల్. 1020

క. అతఁ డట్టు లూరకుంటకుఁ, గత మేమొ యటంచు లోనఁ గళవళపడుచున్
మతి లేనిచందమున న, మ్మతి లేకయు నూరకుండె మానిని యనుటన్. 1021

సీ. అట్టు లుండంగ రథ మేఁగునపుడు వామ, పార్శ్వపరివర్తిన మొనర్చెఁ బశుగణంబు
దానిఁ గనుఁగొని జానకి మానసమున, వనట మీఱఁగ సరి నూహించుకొనఁగ లేక.

క. సతులకు నుత్తమధర్మము, పతిచరణార్చనము దాని పాసి యితరవాం
ఛితమున నేఁగెడునాకే, గతిఁ గలుగును సుశకునములు గలుగ కితరముల్.

క. అని లోనఁ బరితపించుచుఁ, గనుఁగొను చుండఁగ నె వాయుగమనముతోడన్
జనియె రథ మొక్క కానకుఁ, గనఁబడియెను గంగ యచటఁ గనుపండువుగన్.

గీ. అప్పుడు సౌమిత్రి రథ మాఁప నానతీయ
నిల్పెను సుమంత్రుఁ డచ్చోట నిల్పుటయును
దిగి సుమిత్రాతనూజుఁడు దిగుము తల్లి
యనుచుఁ జేయూఁత నొసఁగి యాయమను దింపె. 1025

క. దిగి జానకి యచ్చటఁ గే, ల్మోగిచి మొదట విష్ణుపదికి మున్యాశ్రమ మిం
దగపడ దేదియు నేటికి, దిగు మని లక్ష్మణుఁడు నన్ను దింపెనొ యనుచున్.

మ. తనలోనన్ దలపోయుచుండఁగను నంతన్ లక్షణస్వామి నౌ
కను రావించి తదాశ్రయంబునను గంగన్ దాఁటి భూపుత్రితో
డను ఘోరాటవిలోనఁ జొచ్చి యటఁ గంటన్ బాష్పముల్ గాఱుచుం
డను నిల్వం గని సీత యి ట్లనియెఁ జింతావ్యాకులస్వాంతయై. 1027

క. సౌమిత్రి యేల యీవన, సీమను నిల్చితివి వ్యాఘ్రసింహాదిమృగ
స్తోమములఘోరరవముల, కామతిలన్ భీతి గుండె లదరెడి నాకున్. 1028

క. మునిసతు లేరీ యిచ్చటఁ, గనుఁగొన నాశ్రమము లెవి మొగంబున నీకున్
గనరా దేల వికాసము, గనులను బాష్పంబు లేల కాఱెడి మఱిఁదీ. 1029

క. కలిగినయపశకునములకుఁ, గలుగును గీ డేదొ యనుచుఁ గళవళపడునా
తలఁపునకున్ దగినట్టులె, తిలకింపంబడియె నిచటితీ రిది యెల్లన్. 1030

క. అనుటయుఁ దద్వచనంబులు, తనదుఃఖంబునకుఁ బెంపుదల గలిగింపన్
గనుఁగొనుచు నూరకుండెను, వినుపక లక్ష్మణుఁడు విషమవృత్తాంతంబున్.

క. అంతట జానకి నెగు ల, త్యంతము గాఁ గనులనుండి యశ్రువు లురలన్
సంతాపపడుచు లక్ష్మణ, యెంతటివాఁడవొ వచింప వేదియు నాకున్. 1032

క. నీ వేదియు వచియింపమి, నావహిలన్ దోఁడఁగె దుఃఖ మంతంతకు నా
భావమున నింక నన్నుం, గావుము వినిపించి సౌఖ్యకర మగువార్తన్. 1033

—: లక్ష్మణుఁడు సీతకు రామాజ్ఞ నెఱింగించుట :—

క. అని వేఁడుటయును నేడ్చుచుఁ, గనికర మింతయును లేనిగద్దఱివోలెన్
జనకజకు రాఘవాజ్ఞను, వినిపించెను లక్ష్మణుఁడు సవిస్తరరీతిన్. 1034

క. అది విని జానకి తోడనె, మది చెదరఁగఁ గూలె నొడలు మఱచి ధరిత్రిన్
బదపడి లక్ష్మణుఁ డామెకు, నొదవఁగ బోధంబు చేసె నుపచారములన్. 1035

—: సీతా లక్ష్మణ విషాదము :—

గీ. అంతటను లబ్ధసంజ్ఞయై యవనిపుత్రి
లక్ష్మణునిఁ జూచి తండ్రి కల్మషము లేని
నన్ను నాస్వామి విడనాడినాఁడె యకట
యనుచు విలపించుచును మూర్ఛ నందె మఱల. 1036

ఉ. అప్పుడు లక్ష్మణుండు వసనాగ్రముచేతను వీచెఁ గన్నులన్
జిప్పిలి రాలు బాష్పములు చింది పయింబడ సీత యంతటన్
దెప్పిరి లేచి చూచి నలుదిక్కులు మిన్నులు వడ్డచోట స
న్నిప్పగిదిన్ బడన్ వయిచెనే విధి యక్కట యేమి సేయుదున్. 1037

క. అని వెక్కి వెక్కి యేడ్చుచు, ననదగతిన్ గృత్తమూల మగుతీగె తెఱం
గున వ్రాఁలె నేలమీఁదను, గనునీళులు గాఱుచుండఁ గాల్వలు గాఁగన్.

ఆ. అపుడు పొంగి పొరలునశ్రుప్రవాహంబు, నడఁచికొని బహుప్రయాసమునను
లక్ష్మణుండు చివురులను బట్టికొని వీచెఁ, జల్లఁదనము సోఁక జనకసుతకు. 1039

గీ. అంత నుప లబ్ధసంజ్ఞయై యామె లేచి, నానిమిత్తము వారిధి కానకట్టఁ
గట్టి దైత్యులతోడ సంగరము చేసి, నట్టినాస్వామి విడుచునె యిట్టె నన్ను.

క. అనఘ నని గుర్తెఱింగియు, నను విడిచెను నీరుఁ డైనసనారాముఁడు నీ
చునిమాటవలన నింతకు, ననివార్యము కర్మ మెవరి నన నేమిటికిన్. 1041

మ. అని శోకించుచుఁ బెద్దపెట్టునను మూర్ఛాక్రాంతయై వ్రాలె నే
లను నేత్రంబులనుండి బాష్పములు జాల్వాఱంగ నంతన్ వహిం
చినవంతన్ వికృతస్వరంబునను నేర్చున్ లక్ష్మణస్వామి కా
నన మెల్లన్ విలపించుచున్నపగిదిన్ బర్వన్ బ్రతిధ్వానముల్. 1042

గీ. అంతటను గొంతసేపున కవనిజాత, పడసి చేతనమును లేచి పార్శ్వమందుఁ
గాంచి వందురు చున్నలక్ష్మణుని ధైర్య,మించుక వహించి మరిని దా నిట్టు లనియె.

గీ. తండ్రి యీకార్యమందు నీతప్పు లేదు, చింతిలఁగ నేల స్వామి శాసించినట్లు
చేసితివి ధర్మ మిదె చూపె సేవకునకు, నరుగు మింక శుభంబు నీకగును గాక.

ఆ. అరిగి ధర్మమూర్తి యైననాస్వామికిఁ, జెప్పు మేను మనవి చేసినట్లు
రామచంద్ర నిన్నె రాత్రిందివంబును, దలఁచికొనుచు నుండుఁ దలఁపునందు.

క. నీయుచ్ఛిష్టము దినుచును, నీయెడ ననురక్తి గలిగి నిత్యమును భవ
చ్ఛ్రేయమె కోరుచు నుండెడి, నాయెడ దయ దప్ప నిట్లు న్యాయమె నీకున్.

గీ. గర్భవతి యంచు నైనను గానకుండ, శుద్ధురా లంచు నైనను జూడకుండఁ
దన్నె దైవంబుగా నెంచుతరుణి నిట్లు, ఘోరవనమున విడిచెడిక్రూరుఁ డున్నె.

ఉ. నిన్నన నేల యింతకును నే మును చేసినపాపకర్మ మే
మున్నదొ దాన నిట్టిమతి యుద్భవమయ్యెను నీకుఁ గానిచో
నన్నెకు నెక్కినట్టియినవంశమునందు జనించి సర్వలో
కోన్నతి గన్న నీ వనఘ నోపుదె నన్నుఁ బరిత్యజింపఁగన్. 1048

క. స్మరియించికొనుచుఁ ద్రికరణ, పరిశుద్ధిగఁ దావకాంఘ్రిపద్మములను నే
భరియింతుఁ బ్రాణములు నా, శరీరమునయందు గర్భసంరక్షణకై. 1049

గీ. నీకు శుభములు చేకూరుఁ గాక సతతముఁ, బతి వగుదు గాక నా కీవె ప్రతిభవమున
నివిదె నాకోరికల ననుగ్రహింపు మేను, వనములం దుండు నీయాన ననుసరింప.
క. ఎపు డైనను నామీఁదను, కృప గలిగినయపుడు నను స్మరింపుము చాలున్
వ్యపగతజీవిత నైనను, దపనుఁడు సాక్షిగను నీవె ధవుఁడవు నాకున్. 1051
క. అని వచియించుచునె విచే, తనురాలై పడియె నిలను దక్షిణమ యొన
ర్చెను లక్ష్మణుండు వనటను, మునుఁగుచు శీతోపచారముల నాయమకున్.
ఉ. అంతట సేదదేఱి వసుధాత్మజ లేచి భయంబుచేత మే
నంతయుఁ గంప మొందఁగను నట్టిటు చూచుచు నుండ లక్ష్మణుఁ
డంతరమం దివిచ్చికొని యాఁగక పొంగెడిదుఃఖవారిధిన్
గొంత శమంబు గల్గఁగను గొంకుచు జంకుచుఁ గాంచి జానకిన్. 1053

—: లక్ష్మణుండు సీతను విడిచి యయోధ్యకు వచ్చుట :—

గీ. అమ్మ నిచెప్పినట్టి వాక్యముల నెల్ల, విస్మయింపెదఁ బోయి మాయన్నకడకు
నిమహారణ్యమునకు సమీపదేశ, మందె కలదు వాల్మీకిమున్యాశ్రమంబు.
క. అని చెప్పి మ్రొక్కి యాతఁడు, కనునీళులు కాల్వలుగను గాఱుచు నుండం
గను జనియెఁ దిరిగి చూచుచు, ననుపదమును దుఃఖవేగ మాఁగనికతనన్.
గీ. అంత నాతనిఁ గనఁబడునంతవఱకుఁ, గాంచుచు నిమేషములు లేనికనులతోడఁ
గడచిపోవుటయును నాశ లుడిగి కడకు, సీత యిలమీఁదఁబడియె నిశ్చేష్ట యగుచు.
సీ. నిలుచుండె మృగగణంబులు చేరి చుట్టును, గన్నీరు గార్చుచుఁ గాల్వలుగను
సలిలార్ద్రమైన ఱెక్కలతోడ విసరెను, హంసలు చలిమిరి యావహిల్ల
జలములు గొనివచ్చి నాగజంబులు తొండ, ములతోడ మేనను జిలుకరించెఁ
గమ్మనినెత్తావి ఘ్రాణంబులకు సోఁక, నల్లనల్లన వీచెఁ జల్లగాలి
గీ. పాదపంబులు పుష్పసంపదలతోడ, నలరె లేకుండఁగనె వసంతాగమంబు
జానకీదేవి చైతన్యహీన యగుచు, నేలమీఁదను బడియున్న కాలమందు. 1057
గీ. అంత నుపలబ్ధబోధ యై యవనిజాత, లేచి మృగపక్షిగణములఁ జూచి యడలి
రామ రఘురామ దీనశరణ్య యనుచు, నేడ్చె నెలుఁగెత్తి కన్నీళు లేర్లుగాఱ.

—: వాల్మీకిమహర్షి సీతాదేవిని దనయాశ్రమమునకుఁ దోడ్కొనిపోవుట :—

క. వినఁబడుటయు నాయార్త, ధ్వని శిష్యసమేతుఁ డగుచు వాల్మీకి రయం
బున వచ్చె నటకు వచ్చుట, యును మహానికి నెరఁగె సీత యుత్థిత యగుచున్.
క. ఎరఁగుటయును నమ్మౌని, శ్వరుఁ డీ ట్లాశీర్వదించె సతి పతితోడన్
జిరకాలము జీవింపుము, పరమగుణాకరుల సుతులఁ బడయు మిరువురన్.1060
గీ. అట్టు లాశీర్వదించి యాయమను జూచి, తాపసుం డిట్టు లనియెను దల్లి యెవతె
వీవు రా నేల యీకాన కేడ్వ నేల, యెఱుఁగఁ జెప్పుము నీగాథ యెల్ల నాకు.

చ. అనవుడు నిశ్వసించుచును నాయమ తండ్రికిఁబోలె మౌనికిన్,
వినిచి సవిస్తరంబుగను స్వీయచరిత్రము నేడ్చి బోరనన్
విని సకలంబు తాపసుఁడు విస్మయ మందుచు లోన నమ్మహీ
జను గని తల్లి యేడ్వకు మశాశ్వతముల్ సుఖదుఃఖసంతతుల్. 1062

మ. నను వాల్మీకి యటంచుఁ బిల్తురు గురుండన్ నేను నీతండ్రికిన్
జనసంచారము లేని దీయడవి యుండన్ జెల్ల దిచ్చోట నీ
జనకుం డొక్కఁడు నే నొకండ నని యెంచం బోక నాయాశ్రమం
బునకున్ రమ్ము తపోధనాంగనలు నిన్ బోషింతు రత్యాస్థతో. 1063

క. అనవుడు జానకి రాముని, మనమున స్మరియించుకొనుచు మౌనీంద్రుని వెం
టను జని తదాశ్రమమునకుఁ, గనుఁగొని యచ్చోట మౌనికాంతామణులన్.

గీ. కొంతధైర్యంబు గలుగంగ స్వాంతమందు, వారలకు మ్రొక్కి తగినసత్కారములను
జేయుటయుఁ దాపసాంగనల్ చేర్చికొనిరి, కౌఁగిళులలోన సీతను గౌతుకమున.

క. అంతట వాల్మీకి మన, స్సంతోషము గల్గి యుండ జనకాత్మజ కా
చెంత నొకపర్ణశాలన్, వింతగ నిర్మింపఁజేసె నిజశిష్యులచేన్. 1066

—: సీతాదేవికిఁ గుశలవులు జన్మించుట :—

గీ. అపుడు సీత మనశ్శాంతి యావహిల్ల, నందు నివసించి చేయుచు నాత్మలోన
రామనామజపం బహోరాత్రములును,సంయమీంద్రునిపరిచర్య సలుపఁదొడఁగె.

ఆ. అట్లు కొంతకాల మరుగుటయును బూర్ణ, గర్భ యగుచు నామె కనియె నొక్క
శుభముహూర్తమందు సుతుల నిర్వుర రామ, భద్రదేహకాంతిభాసురులను.

గీ. ఆదినము రేయి శత్రుఘ్నుఁ డటకు వచ్చె
మడిపి లవణాసురుని నంత మౌని వత్స
తెలుపకుము రామునకు సుతుల్ గలిగి రనుచు
ననుడుఁ దలఁ దాలిచి తదాజ్ఞ నాతఁ డరిగె. 1069

సీ. అంతట వాల్మీకి యాశ్వినేయులువోలె, భాసిల్లు చుండునాబాలకులకు
జాతకర్మాదిసంస్కారముల్ గావించె,గుశలను లవములఁ గూర్చి క్రియలఁ
గలిగె వారికి దానివలన నాహ్వయములు, భువనంబులోఁ గుశలవులు నాఁగ
నది మొదలుగ వార లనుదినంబును వృద్ధి, గనఁ దొడంగిరి దివ్యకళలతోడ

గీ. నట్టు లుండంగ వారల కమ్మహర్షి, యుక్తకాలంబునను జేసి యుపనయనము
వేదవేదాంగములు ధనుర్విద్య గఱపి, నేర్పి రామాయణంబును నేర్పు మీఱ.

గీ. వివిధమంత్రరహస్యముల్ విప్పి చెప్పి, శత్రుశిక్షకు నాత్మరక్షకును నొసఁగెఁ
జాపయుగళంబు నక్షయశరధియుగము,ఖడ్గయుగళంబును నభేద్యకవచయుగము.

చ. అవి ధరియించి యాశ్రమమునందుఁ జరించుచు నుండునాత్మసం
భవులను జూచుకొంచుఁ దనమానసమందుఁ గ్రమక్రమంబుగా

నవనీతనూజ సంతసము నందఁ దొడంగెను నాఁడునాఁటికిన్
ధవవిరహప్రభూతపరితాపము కార్శ్యము నొందు చుండఁగన్. 1072

క. అనవుడు వాత్స్యాయనుఁ డి, ట్లనియెను నాగేంద్ర రాముఁ డఖిలజ్ఞుఁడు వీ
డునె యంతమాత్రమునఁ బా, వనచరితను సీత నేల వదలెనొ చెపుమా. 1073

వ. అని యడుగుటయు శేషుం డమ్మునీంద్రున కి ట్లనియె. 1074

—: సీతాపరిత్యాగముఖ్యకథనము :—

సీ. జనకాహ్వయుం డగుజనపతి మిథిలను, బాలించుచును నొక్కకాలమందు
నాఁగేట దున్నుచుండంగ క్షేత్రంబును, బాలులో నుదయించె బాల యొకతె
యపుడు సీరధ్వజుం డానందమున సీత, యనుపేరు వెట్టి యాయమను గొనియె
నది మొదలుగ నామె యభివృద్ధి గనఁ జొచ్చె, విధుకళవోలె నావిభునియింట

గీ. నట్టు లుండంగ నొకసమయమున సీత, చెలులతోఁ గూడి యుద్యానసీమ కరిగి
యాడుకొనుచుండ నొకశుక మచటనొక్క, వృక్షమునఁ జేరితనచానకట్టు లనియె.

సీ. కలికి నే నొకపుణ్యకథ చెప్పెదను విను, మది విన్న నశియించు నఘము లెల్ల
భూమికిఁ బ్రభు వగు రాముఁడు నా నొక్క, క్షత్రియాన్వయవార్ధిశశధరుండు
సమకూరు నతనికి సతి సీత యనునామె, యామెతోఁ గూడి యారాముఁ డేలు
భువిని నేకచ్ఛత్త్రముగ సమస్తంబును, బదొకొండువే లేండ్లు ప్రథితి కెక్కి

గీ. ధర్మనిధి యైనరాముఁడు దయితుఁ డగుట, ధన్యురా లగు సీత యుత్తమచరిత్ర
యైనసీత లభించుట నాత్మసతిగ, రాముఁడు కృతార్థుఁ డగు నింక నేమి చెప్ప.

క. అనుటయు శుకి యెంతేనియు, మనమున సంతోష మొంది మనమును నాతీ
రున నుంద మనుచుఁ బలుకుచుఁ, దనకౌఁగిటఁ జేర్చె శుకవతంసము నంతన్.

గీ. అమ్మధురవాక్యములు విని హర్ష మొదవఁ
దనయుదంతమె యగు నని తలఁచి సీత
యాశుకంబులఁ దెచ్చి యిం డనుచుఁ గోరఁ
జిలుకలను దెచ్చి యిచ్చిరి చెలులు దనకు. 1078

ఆ. అపుడు పట్టికొని ధరాత్మజ వానిని
జిలుకలార భీతి చెంద వలదు
చెపుఁడు రాముఁ డెవఁడొ సీత యెవ్వతెయొ త
ద్విషయ మెట్లు మీకుఁ దెలియఁ బడెనొ. 1079

వ. అని యడుగుటయు ధైర్యంబుం దెచ్చికొని కీరం బి ట్లనియె. 1080

సీ. అమ్మ యీచిల్క నాకొమ్మ వాల్మీకియా, శ్రమమున మే ముండుదుము సతంబు
నామునీంద్రుఁడు భావిరామాయణము వ్రాసి, శిష్యవర్గమునకుఁ జెప్పు చుండ

వీనులవిందు గా విను చుండుటను మాకుఁ, దెలిసె నాకథ యెల్లఁ దేటపడఁగ
నదె నీకు వచియింతు నాలకింపుము విన్న, సకలపాపములును సమసిపోవు
గీ. ఋష్యశృంగమహర్షి చేయించునట్టి, యధ్వరంబున విష్ణువే యవతరించు
రాముఁ డనుపేర మిథిలాపురంబుఁ జేరి, విఱుచు శివచాపము నతండు విస్మయముగ.
క. అంతట జనకుఁడు తనకున్, సంతానంబుగను ధర బ్రసాదించిన శ్రీ
కాంతామణి యగుసీతను, నింతిని గా నొసఁగు నతని కెల్లరుఁ బొగడన్. 1082
ఆ. రాజ్య మేలఁ గలఁడు రాముఁడు సీతతోఁ, గూడి సజలజనులు గొలుచు చుండ
నింక విడిచిపెట్టు మే మేఁగెదము తన్వి, యనుచు దాని కట్టు లనియె సీత. 1083
క. కీరము మీకోరినస, త్కారము లొనరింతు నేల త్వరపడెదవు నే
నారాముఁ డెవనిపుత్రుఁడో, యూరేదియొ రూప మెట్టిదో చెప్పఁగదే. 1084
సీ. అనవుడుఁ గీర మి ట్లనియెను సతి ధాత్రి, నుండు నయోధ్య నా నొకపురంబు
దానికిఁ బ్రభు వగు దశరథుం డనుఱేఁడు, భానువంశాబ్ధిసుధాకరుండు
సతు లుండెదరు మువ్వు రతనికి జనియింతు, రాకొమ్మలకు నల్వు రాత్మభవులు
ప్రథముఁడు రాముఁడు భరతలక్ష్మణులును, శత్రుఘ్నుఁడును గ్రమజాతు లవల
గీ. రాముని మనోహరాకార మేమి చెప్ప
ముఖము చంద్రుఁడె గళము కంబువె భుజంబు
లర్గళంబులె నయనము లంబుజములె
నఖము లుడువులె పండ్లు కుందములె వింటె. 1085
క. రాముని సౌందర్యంబును, భామిని వర్ణింపరాదు బ్రహ్మకు నైనన్
మే మింక నెంతవారము, సీమంతినులందు ధన్య సీతయె సుమ్మీ. 1086
క. అడుగుచు నుంటివి సుందరి, కడు వైదగ్ధ్యమున రామకథ యేర్పడఁగన్
నుడువుము నీ పే రేమిరొ, యెడఁదను సందేహ మొదవె నించుక మాకున్.
క. అని యడుగుడు జానకి యి, ట్లనియెను గీరంబ విను యథార్థము నీకున్
వినిచెదను నేన సీతను, జనకమహారాజమౌళి జనకుఁడు నాకున్. 1088
క. అనుటయుఁ జిలుకలు రెండును, జనకజకు నమస్కరించి జలజాక్షి యికన్
జనియెదము మమ్ము విడువుము, కనికరమున ననుచుఁ బలికెఁ గమ్మనిఫణితిన్.
గీ. ఆచిలుకపల్కుఁ దేనియ లాత్మసుఖము, గొలుప ని ట్లనియెను సీత చిలుకలార
విడిచిపెట్టను మి మ్మెంత వేడికొనిన, నను గ్రహించెడిదాఁకను నాప్రియుండు.
ఆ. అనుడు భీతి నొంది యాశుకమిథున మి, ట్లనియెఁ దల్లి మేము వనములందుఁ
దిరుగుపతగములము తిరముగా నొకచోట, నుంట పంజరమున నుండె మాకు.
క. కావున మము విడువుము స్వే, చ్ఛావర్తనమునకు నడ్డుసలుపక యింకన్
నావుడు జానకి వినువక, పోవుటయును గీర మిట్లు పొగులుచు ననియెన్. 1092

గీ. బాల నాచార గర్భిణి బంధమునను, జిక్కువడి యుండఁ జాలదు నిక్కమముగ
వచ్చెదము మేము మరలఁ గానలసియున్న, నీకు నిప్పుడు శుభము చేకూరు నిక.
క. అనుటయు బాలిక గావున, జనకాత్మజ శుకము నీవు చను మే నిచి
ల్క నువిహవఁ బ్రసవ మయ్యెడి, దనుకను నని పలికి యొక్కదానిని విడిచెన్.
గీ. అంత జెప్పఁగఁ జని కీర మచట నుండు, వృక్షమున నిల్చి జానకి కిట్టు లనియె
నెలఁత విడువుము నాతోడునీడ యైన, సతిని విడనాడి జీవింపఁజాల నేను. 1095
గీ. చెప్పవల దేదియును నోరు విప్ప నేని, పడయు వాగ్దోషమున వక్త్ర బంధనంబు
ననెదు విబుధోక్తి వాస్తవ మయ్యె నేఁడు, పలుకులను గాదె మాకిట బంధ మొదవె.
క. అని యేడ్చుచుండ శుకి క, న్గొని దానిని గనుల నీరు గ్రుక్కుకొనుచు ని
ట్లనియెను జానకితోడను, వనజానన కనికరమున వదలుము నన్నున్. 1097
క. పతి బ్రతుక ననుచు నుండఁగ, సతి నగు నే నింక నీవు సంరక్షింపన్
బ్రతుకుదు నని నన్నుఁ బ్రోవఁగ, మతి గలిగిన విడువు మేను మనియెదఁ బతితోన్.
ఆ. ప్రసవ మైనపిదపఁ బతి తెంతుఁ బతితోడ, సీత నిన్నుఁ జూచుకౌతుకమున
నంతె కాని యిప్పు డరికట్టకుము నన్ను, బతిని బాసి నేను బ్రతుకఁ జాల. 1099

—: కీరాంగన సీతను శపించుట :—

క. అని మొఱవెట్టఁగ వినియును, వినన ట్టుల సీత యుండ విహగి విషాదం
బును గ్రోధమ్మును బెనఁగొన, మనమునఁ గడు వెచ్చ నూర్చి మలినాననయై.
ఆ. కఠినురాల నీవు గర్భిణి నగుచున్న, భర్తతోడ నెడలువాపినట్ల
నైన నింక గర్భధారిణి నగునిన్ను, భర్తతోడ నెడలువాపుఁ గాక. 1101
క. అని శాప మిచ్చి దేహం, బును వదలి విమానమునను బోయెను ద్రిదివం
బున కది గనుఁగొని దోస్సుచుఁ, జని కీరము తత్క్షణంబ జాహ్నవి కడకన్. 1102

—: కీరము చాకలియై యయోధ్యలోఁ బుట్టుట :—

ఆ. ఉద్భవించె నే నయోధ్యలో సీతను, భర్తతోడ నెడలువాప కున్నఁ
గీరజాతిలోనఁ జేరినదానను, గాన టంచుఁ గ్రోధకలుష మగుచు. 1103
గీ. అందులోఁ బడి మునిఁగి తా నసువు లుడిగి, యంత కాలక్రుధాబుద్ధి కనుగుణముగ
జనన మంది యయోధ్యలోఁ జాకి యగుచు, నవనిజాతను నెడఁబాపె ధవునితోడ.
క. ఇదె సుమి సీతను రాముఁడు, వదలుటకు నిదాన మింక వచియించెద నా
మొదటికత వినుము వీరులు, విదళితభుజు లగుచు నట్లు విచ్చేయంగన్. 1105
మ. కని శత్రుఘ్నుఁడు వారి నెల్లరను నాకర్షించి తద్బాహుకృం
తనబీజంబును దన్ముఖంబున నితాంతక్రోధసందీప్తలో
చనుఁడై సైన్యపతిం గనుంగొనుటయున్ సైన్యాధినాథుండు చ
య్యనఁ దద్భావ మెఱింగి సైన్యసహితుండై పోయి యచ్చోటికిన్. 1106

ఆ. లవునిఁ జూచి రామలక్షణంబులు వాని, యందుఁ గాంచి యిట్టు లనియె వత్స
యెవఁడ వీవు వంశ మెయ్యది పేరేమి, యేల పట్టికొంటి వీహయంబు. 1107

ఉ. రామునిలక్షణంబులు విరాజిలుచుండుటఁ జేసి నీమెయిన్
నామన సొప్పదాయె నిను నాశ మొనర్పఁగ నేను గాలజి
న్నాముఁడ రామభద్రదళనాథుఁడ నీవిషయంబు సర్వమున్
సామమునన్ వచించి క్రతుసైంధవమున్ ద్యజియింపు మిత్తఱిన్. 1108

—: లవుఁడు కాలజిత్తును వధించుట :—

క. అనుటయు నవ్వుచు లవుఁ డీ, ట్లనియెను నీ కేల యన్వయముమాట లవుం
డను నేను రిపులశీర్షము, లను ఖండించెదను నాజి లవములు గాఁగన్.

గీ. జనని వాత్సల్యమునఁ బెట్టికొనినపేరు, వడయుటనె యింతగర్వంబె పక్వబింబ
ఫలమునకు వర్ణమాత్రంబువలనఁ గాక, కలుగునె ప్రశస్తి వీర్యంబువలనఁ జెపుమ.

చ. అనుచిత మైనవాక్యముల నాడితి వైనను సేవకుండ వా
టను క్షమియించినాఁడను గటారికి నిన్ బలియీక పొమ్ము చ
య్యన నటు పోనిచో నిపుడె యంపెద నేనె పరేతరాణ్ణికే
తనమునకున్ బ్రియాతిథిగఁ దక్కినమాటలు వేయి యేటికిన్. 1111

చ. అనుటయుఁ గాలజిత్తు జ్వలదాననుఁడై లవ పెక్కుమాట లిం
కను బని లేదు నీవు పదగామివి నేను రథస్థితుండ నై
యని యొనరించి నిన్నుఁ దెగటార్చుట ధర్మము గా దటంచు నా
మనమున నాఁగుచున్నయది మండెడిక్రోధకృశాను విత్తఱిన్. 1112

మ. అని గర్జించుటయున్ లవుండు విని భృత్యా నిన్ను నేఁ బాదచా
రిని గావించి యధర్మసంచయము వారింతున్ నివారింపఁగాఁ
బనిలే దింక సమర్థవహ్ని నని చాపంబందు సంధించి భూ
రినిశాతాశుగసంతతుల్ విడిచె నుద్రేకంబుతో వానిపై. 1113

క. ఆశరవర్షంబున రథ, నాశం బగుటయును నెక్కి నాగము నతఁ డా
వేశమున లవునిమీఁదను, నాశీవిషనిభము లైనయమ్ముల నేసెన్. 1114

క. ఆయమ్ములు తాఁకుటయును, గాయమ్మునఁ గినిసి లవుఁడు కరవాలమునన్
వ్రేయఁ దెగి కరము వృక్షము, చాయను ధరమీఁదఁ బడియె సామజ మంతన్.

ఆ. కాలజిత్తు రోషకలుషీకృతంబులై, యెఱ్ఱఁబడఁగఁ గన్ను లిలకు నుఱికి
గదను ద్రిప్పి వ్రేయ బ్రదరంబులను దానిఁ, జలిపె లవుఁడు మూఁడు శకలములుగ.

ఉ. అంతటఁ గాలజిత్తు మది నాఁగనిక్రోధభరంబుచేత న
త్యంతభయావహం బయినయట్టినరాజిని గేలఁ బట్టి కా
లాంతకునట్లు మీఁదికి రయంబున వచ్చుచు నుండఁగా లవుం
డంతటిలోనఁ ద్రుంచె నొకయమ్మున నాతనిఖడ్గబాహువున్. 1117

క. త్రుంచుటయు భుజము నాతఁడ, చంచలధైర్యమున వామశయమున గదనం
కించుకొని లవునిమీఁదికిఁ, బంచాననమట్లు దుమికెఁ బాయనికడఁకన్. 1118
క. దుముకుటయు నట్టు లతఁడా, నిమిషముననె త్రుంచె నొక్కనిష్ఠురనారా
చముచేతఁ దత్కరంబును, సమరోత్సాహమున లవుఁడు సహామూలముగన్.
ఆ. అపుడు కాలజిత్తు వ్యపగతభుజుఁ డయ్యుఁ, దలఁక కించు కేని తత్క్షణంబ
పాదయుద్ధ మొనరుపఁగ రాఁగ ఖండించె, ఖడ్గమునను వానికాళ్లు లవుఁడు.
క. ఖండితపదుఁడై దళనా, థుండు ధరం గూలి శిరముతోఁ బొడువంగా
నుండుటయును దచ్ఛిరమును, ఖండించె లవుండు తీక్ష్ణకరవాలమునన్. 1121
క. అప్పుడు హాహాకారము, లుప్పతిలన్ దళములోన నోడక క్రోధం
బొప్పార యోధవీరులు, కుప్పలుగా లవునిమీఁద గుప్పిరి తూపుల్. 1122
క. లవుఁ డంతటఁ దచ్ఛరములు, లవములు గా నఱికి తూపులను వారలపైఁ
గవియుటయును నన్యోన్యము, బవరము గావించి రఖిలభయదము గాఁగన్. 1123

—: లవుఁడు యోధు నెల్ల వధించుట :—

ఆ. అపుడు లవునినిష్ఠురాశుగనిహతిచే, యోధు లెల్ల నిధన మొందఁ బాఱెఁ
బ్రధనభూమిలోన రక్తప్రవాహంబు, నదులు గాఁగ నే మనంగవచ్చు. 1124
గీ. అటులు యోధుల నెల్లను హత మొనర్చి, శరశరాసనములు దాల్చి కరములందు
నిలిచి రణమండలంబున నిర్భయముగ, లవుఁడు వీక్షించుచుండె శాత్రవులకొఱకు.
గీ. అపుడు శత్రుఘ్నుఁ డుగ్రుఁడై యాగ్రహమున
నిషుధిచాపంబులను ధరియించి సకల
బలములను దోడుకొని వీరభటులతోడ
నరుగుదెంచి రణక్షితి నాక్రమించె. 1126
వ. ఆసమయంబున సహస్రసంఖ్యాకం బగుప్రథమభ్రమియును నయుతసంఖ్యాకం
బగుద్వితీయభ్రమియును నయుతయుగ్మసంఖ్యాకం బగుతృతీయభ్రమియును బం
చాయుతసంఖ్యాకం బగుచతుర్థభ్రమియును లక్షసంఖ్యాకం బగుపంచమభ్రమి
యును నయుతాధికలక్షసంఖ్యాకం బగుషష్ఠభ్రమియును లక్షయుగ్మసంఖ్యాకం
బగుసప్తమభ్రమియును జుట్టును నావరించి శరఖడ్గప్రాసకుంతపట్టిసపరిఘాద్యా
యుధంబులతోడం గొట్టుచుండ లవుండు తన్మధ్యంబునం దద్వితీయపరాక్రమం
బున వీరవిహారంబు గావించుచు. 1127
క. మితి లేనిశిలీముఖసం, తతులను దద్భ్రమిదళప్రతానము నెల్లన్
హతమార్చి విగతమేఘా, వృతి యగుశరదమృతకరునివిధమునఁ బొలిచెన్. 1128

—: లవుఁడు పుష్కలుని జయించుట :—

ఉ. అప్పుడు పుష్కలుండు ప్రళయాగ్ని తెఱంగునఁ బ్రజ్వరిల్లుచున్
ముప్పిరి గొన్నకోపమున ముల్కులు వింటను గూర్చుచుండ నా

చొప్పు గ్రహించి నే లవుఁడు చూర్ణ మొనర్చె శిరోముఖంబులన్
గుప్పి తదీయచాపమును గోలలతోడను గూడ నంతటన్. 1129
క. భరతాత్మజుండు వేఱొక, శరాసనము గొని శరంబు సంధించెడున
త్తరుణమునఁ ద్రుంచె నాతని, యరదంబును లవుఁడు నిష్ఠురాశుగములచేన్.
క. అంతట నివ్వెఱఁ జెందుచు, స్వాంతంబునఁ బుష్కలుఁడు పదాతి యయి పరా
క్రాంతి మెయిఁ గురిసె సాయక, సంతతులను లవునిపై నసంఖ్యేయముగన్. 1131
చ. అపుడు లవుండు క్రోధకుటిలాననుఁడై తదజిహ్మగంబులన్
నిపుణతతోడఁ ద్రుంచి యొకనిష్ఠురబాణము వింటఁ గూర్చి ని
ష్కృపముగ నేసెఁ బుష్కలునిహృత్తటమం దది గాఁడ నాఁటుటన్
వ్యపగతచేష్టుఁడై పడియె నాతఁడు సంగరభూతిలంబునన్. 1132
క. అది గని మారుతి యాగ్రహ, మొదవఁగఁ బెకలించి పొదిగ నుర్వీరుహముల్
వదలుటయు విసరి మీఁదికి, విదళించె లవుండు వాని విశిఖంబులచేన్. 1133
ఉ. అంతట నాంజనేయుఁ డెద నచ్చెరు వొందుచు గండశైలముల్
వింతగ నెత్తి తెచ్చి యవలీలను వైవఁగ మీఁద వాని నా
నంతలు గాఁగఁ జేసె నొకయాశుగ మేసి లవుండు పిమ్మటన్
బంతము మీఱఁగా లవునిఁ బావని చుట్టి బిగించెఁ దోఁకతోన్. 1134
ఆ. అపుడు లవుఁడు చిత్తమందు వాల్మీకిని, జానకిని స్మరించి సత్వరముగ
ముష్టియుగముతోడ మోఁదంగ వాలంబు, దిట్టతనము పోయి పట్టు సడలె.
క. అంతటను లవుఁడు మార్గణ, సంతతులను జాపమందు సంధించి హనూ
మంతునిపైఁ గురియించె ని, రంతరముగఁ బ్రళయవర్ష మనుచందమునన్.
ఉ. ఆశరవృష్టిపాతమున కాఁగఁగ లేక సమీరనందనుం
డాశ లడంగి యుద్ధమునయందుఁ బలాయన మాటకున్ వదో
ధీశవరంబునన్ దనకు మృత్యువు మూర్ఛయు లేమిచే మదిన్
గ్లేశము నొందుచున్ దుదకు నేలను వ్రాలెను మూర్ఛితుండు నాన్. 1137

—: లవశత్రుఘ్నయుద్ధము :—

సీ. అంతట మూర్ఛితుం డయ్యె మారుతి యను, కోలాహలధ్వని నాలకించి
శత్రుఘ్నుఁ డెదలోన సంతాపమును జెంది, ధనువు బాణంబులుఁ దాల్చి కేలఁ
బ్రధనభూమిని జొచ్చి రామచంద్రసమాన, లక్షణయుతుఁడైనలవునిఁ గాంచి
యితఁడు విదేహజాసుతుఁ డగుఁ గాఁ డన్యుఁ, డని మనంబున నిశ్చయంబు చేసి
గీ. వత్స మెచ్చితి నిన్ను నెవ్వఁడవో నీవు
నీకుఁ దలిదండ్రు లెవ్వరో నీయభిఖ్య
యేమొ వచియించి విడువు మియ్యెడల హాయము
నేను క్షమియింతు నీతప్పు లెల్ల ననియె. 1138

క. అనవుడు శత్రుఘ్నునిఁ గనుఁ, గొని లవుఁ డిట్లనియె వీరకుంజర బలముం
డినఁ గొనిపొమ్ము హయమ్మును, బనిలేనిబహూక్తు లేల భాషింపంగన్. 1139

క. అనుటయు శత్రుఘ్నుఁడు నెమ్మనమునఁ గ్రోధంబు గదుర మార్గణములు విం
టను గూర్చుచుండ నావిలు, దునిమెను లవుఁ డొక్క వాఁడితూపునఁ గడిమిన్.

గీ. అంతశత్రుఘ్నుఁడన్యశరాసనంబు, గొని శరంబులు విడువ నూల్కొనుచు నుండు
నంతలోపల లవుఁ డొకయాశుగమునఁ, దునిమె నాతనిరథమును దునుకలుగను.

సీ. అంతట శత్రుఘ్నుఁ డపగతరథుఁ డయి, లవునితో సమముగా భువిని నిలిచి
కురియించె బాణముల్ కుంభినీతల మెల్ల, గజగజ వడఁక దిక్కరులు బెదర
లవుఁ డాశరంబుల నవలీలగాఁ ద్రుంచి, యశనికల్పము లైనయాశుగములఁ
బుంజంబులుగను దూపులు వింట సంధించి, నింగియు భువియును నిండ నేసె

గీ. నపుడుశత్రుఘ్నుఁడాయమ్ములంగములను, గ్రుచ్చుకొనిరక్తధారలుగురియుచుండ
నపరిమితకోపవిస్ఫూర్జితాస్యుఁడగుచు, లవునిపైఁ బది వాఁడికోలలను విడిచె.

క. ఆపత్త్రిదశకమును ద్రుంచి, లోపలఁ గావించి తునకలుగ లవుఁడు మహా
రోపంబు నొక్క దానిని, జాపంబునఁ గూర్చి యేసె శత్రుఘ్నునిపై.

—: శత్రుఘ్నాదులు మూర్ఛిల్లుట :—

క. ఆశరము నాటుటయు హృ, త్కోశంబున నదరి పడియె క్షోణిస్థలిపైఁ
గ్లేశంబున శత్రుఘ్నుం, డాశ లుడిగి చెదరి పఱవ నఖిలబలంబుల్.

వ. అంతట సురథవిమలవీరమణిసుమదరిపుతాపాదిమహావీరు లెల్లరును నొక్కపరిఁ
బరివేష్టించి క్షురప్రముసలప్రాసకుంతపరశుప్రముఖాయుధంబులచే నదయంబు
గాఁ బ్రహరించుటయుఁ దన్మధ్యగతుండై లవుండు నిశితాశుగంబులచేఁ దదా
యుధంబుల నెల్లం ద్రుంచి నిష్ఠురంబుగా వారలపై బాణవర్షంబు గురియించె.

క. వా రెల్లరుఁ దద్విశిఖా, సారంబునఁ దప్పిరిల్లఁ జాలక వివశా
కారు లయి పడిరి రణధా, త్రీరంగమునందు నదర దిక్తటు లెల్లన్. 1146

వ. అంతట శత్రుఘ్నుండు మూర్ఛఁ దేఱి విచేష్టులై పడియున్ననిజబలవీరులం జూచి
విస్మయంబుం జెంది. 1147

క. యమదంష్ట్రాసన్నిభమును, శమితలవణాదిదైత్యమును బ్రశంసార్హపరా
క్రమమును నగుశరమును జా, పమునను సంధించి లవునిపైకిన్ విడిచెన్. 1148

—: లవుఁడు మూర్ఛిల్లుట :—

చ. విడుచుటయున్ దదాశుగము వీర్యముతోడను బ్రజ్వరిల్లుచున్
గడువడి నేఁగి వక్షమునఁ గాఁడఁగ నాఁట లవుండు నేలపైఁ
బడియెను సొమ్మసిల్లి శరపాతజవేదన కోర్వ లేక య
ప్పుడు మునిబాలకుల్ బెదరి పోయి వచించిరి సీత కాకథన్. 1149

క. అంతట జానకి యావృ, త్తాంతం బంతయును విని మహాఖేదపరీ
తాంతరయై యేడ్చుచు వి, భ్రాంతిమెయిన్ జేష్ట లుడిగి పడియె ధరిత్రిన్. 1150
వ. అటులుండ నుజ్జయినీపురంబున మాఘకృష్ణచతుర్దశీదివసంబునందు మహాకాళే
శ్వరు నారాధించి తత్కృపావాప్తభూరివరుండై కుశుం డాసమయంబున నరు
దెంచి విచేష్టయై భూమిపయిం బడియున్నతల్లి నుపలక్షించి విషణ్ణహృదయుం
డగుచు మునిబాలకులవలనఁ దన్నిదానంబు నెఱింగి త్వరావిష్టమానసుండై.
క. అమ్మా యని పిలుచుటయును, నెమ్మది కామాట యమృతనిభ మై సోఁకన్
సొమ్మసిలినజానకి కనుఁ, దమ్ము లపుడు విచ్చి చూచెఁ దనయుని నెదుటన్.
ఆ. అంతఁ గుశుఁడు తల్లియాజ్ఞను గైకొని, ధనువు బాణములను దాల్చి కేల
వాయుజవముతోడ వచ్చి సంగరభూమి, యందుఁ జొచ్చి కాలయముఁడువోలె.
క. చేసె ధనుష్టంకారము, నాశ లదర సోఁకి చెవుల కది లవుఁడు మహో
ల్లాసమున లేచి వెంటనె, త్రాసము గలుగంగ శత్రుదళమున కెల్లన్. 1154
క. కురియింపఁజొచ్చె విశిఖో, త్కరంబులను గుశుఁడు తత్ప్రతాపము హెచ్చన్
గురియింపఁదొడఁగెఁ దోడుగ, శరతతులను భువియు నాకసముఁ గ్రమ్మంగన్.
క. ఆయిరువురుఁ బ్రహరించెడి, సాయకఘాతముల కోర్వఁ జాలక భీతిన్
బాయఁ దొడఁగె నరిబలములు, వాయుప్రహతంబులైనవారిదములు నాన్.
గీ. అపుడు శత్రుఘ్నుఁ డాశ్చర్య మావహిల్ల, మానసంబున రామసమానరూపుఁ
డైనకుశుని విలోకించి యాదరమున, నిట్టు లనియె మహావీర యెవఁడ వీవు.
క. లవునకు నీకును గలబాం, ధవ మేమియొ యేది వాసధామమొ నీకున్
భవదభిధానం బేమియొ, యెవరో భవజ్జన్మహేతు వెఱుఁగం జెపుమా. 1158
క. అని యడుగుటయును గుశుఁ డి, ట్లనియెను నే క్షత్త్రియుఁడఁ గుశాఖ్యుఁడ వాల్మీ
కిని గొలుచుచుండు వనమున, ననుజుండు లవుండు తల్లి యవనిజ నాకున్. 1159

—: కుశశత్రుఘ్నయుద్ధము :—

క. అనవుడు వారలు రాముని, తనయుల యని తెలిసికొనియుఁ దనమదిలోఁ జే
యున దేదియుఁ గనరామిని, గనలుచు శత్రుఘ్నుఁ డాత్తకార్ముకుఁ డయ్యెన్.
క. అది గనుఁగొని కుశుఁ డాగ్రహ, మొదవఁగ వర్షించె శరము లొక్కుమ్మడి న
య్యదనున శత్రుఘ్నుం డవి, విదళించుచుఁ గుశుని విశిఖవృష్టిని ముంచెన్.
వ. అపుడు కుశుం డాగ్నేయాస్త్రంబు ప్రయోగించి సర్వాశుగంబులను దహియింప
శత్రుఘ్నుండు పర్జన్యాస్త్రం బేసి తద్గర్వనిర్వాపణం బొనర్చె. కుశుండు వాయ
వ్యాస్త్రంబుచే దాని నివారింప శత్రుఘ్నుండు పర్వతాస్త్రం బేసి తచ్ఛక్తిని
నిర్మూలించెను. కుశుండు వజ్రాస్త్రంబునఁ దదస్త్రంబు ఛిన్నభిన్నంబు గావించి
నారాయణాస్త్రంబు ప్రయోగింప శత్రుఘ్నుండు రామస్మరణంబుచే దానినుండి
తప్పించుకొని తీక్ష్ణపుంఖంబు లగుశిలీముఖంబులం బ్రయోగించె. కుశుండు తదీ

శిఖంబుల నెల్ల నెట్టకేలకు రూపుమాపి విసివి కట్టకడకు శరాసనంబున నొక్క
నిష్ఠురాశుగంబు ననుసంధించి మాతృపాదంబులు స్మరియించికొని శత్రుఘ్నుని
నుపలక్షించి. 1162

గీ. ఈశరంబున నినుఁ గూల్ప నేని యిలను, బుణ్యమున మర్త్యతనువును బొంది దాని
నాదరింపనియజ్ఞనియఘమునాకుఁ, బ్రాప్తమగుఁగాక యని వానిపైని విడిచె. 1163

—: శత్రుఘ్నుఁడు మూర్ఛిల్లుట :—

క. విడుచుటయును నాబాణము, కడువడి నరుదెంచి యురము గాఁడఁగ నాఁటఁ
బుడమిపయిఁ శత్రుఘ్నుఁడు, పడియెను దత్క్షణమునంద పరవశుఁ డగుచున్.

—: కుశలవుల విజయము :—

గీ. అపుడు సురథాదిభూవరు లాప్తసంజ్ఞు, లగుచు లేచి రణాంగణమందు భీక
రాకృతిని నున్న కుశునిపై నాశుగముల, నొక్కమొగి నేసి రవకాశ మొసఁగకుండ.

క. అంతటను గుశుఁడు దచ్ఛర, సంతతులను భూరినిశితసాయకములచే
నింతింతలు చేసి మహీ, కాంతుల నెల్లరను గూల్చెఁ గదనస్థలిలోన్. 1166

గీ. అపుడు పవనాత్మజుఁడు లేచి యతనిఁ జూచి
రామసుతుఁ డని యెఱిఁగియు స్వామికార్య
మొనరుచుట ధర్మ మని యెంచి యొక్కపెద్ద
తరువుఁ గైకొని పఱతెంచుతరుణమంద. 1167

మ. కుశుఁ డాపావనిఁ ద్రిశ్శరప్రములచేఁ గొట్టంగ నుద్యద్రుషా
వశుఁడై మారుతసూనుఁ డాద్రుమముఁ దద్వక్షఃప్రదేశంబునం
దశనిప్రాయము గాఁగ వైచుడుఁ గుశుం డద్దాని భేదించి ది
వ్యశరం బొంటను వాయుసూతిపయి సంహారాస్త్ర మేసెన్ వెసన్. 1168

క. ఆసంహారాస్త్రమునకుఁ, గేసరిసుతుఁ డాఁగ లేక క్షితిపైఁ ద్రావలన్
ద్రేసెను లేచి ససంజ్ఞుం, డై సుగ్రీవుండు కుశుని నవనీజమునన్.

క. కుశుఁ డాక్షోణీజము నొ, క్కశరంబునఁ ద్రుంచి యేసెఁ గపినాథునిపై
నిశితశిలీముఖతతులను, దిశ లెల్లను మండఁ దత్సుతీక్ష్ణద్యుతికిన్. 1170

క. అంతట సుగ్రీవుం డ, త్యంతామర్షమున గిరుల ధాత్రీజములన్
వింతగ వర్షింపఁగఁ గుశుఁ, డింతింతలు చేసి వాని నిషువులచేతన్. 1171

గీ. ఘోరముగ వారుణాస్త్రంబు గూర్చి వింట, నేయఁ దద్బద్ధుఁడై కపినాయకుండు
పడియె నాయోధనక్షితిపైని మేను, సత్త్వహైన్యంబునను నిల్వఁ జాల కునికి.

గీ. అప్పు డంగదపుష్కలాద్యఖిలవీర, వరులఁ గూలిచి సంగరావని లవుండు
వచ్చుటయు జయలక్ష్మితో వానిఁ గుశుఁడు, కౌఁగిటను జేర్చికొని యెనుగౌతుకమున.

ఆ. అంత లవుఁడు కుశున కభివాదన మొనర్చి, యన్న నీకృపాకటాక్షమునను
నిస్తరింప నయ్యె నిరవధికం బైన, ప్రధనవార్ధి యనుచుఁ బ్రస్తుతించె. 1174

గీ. అపుడు వారిద్దరును గూడి యాజిభూమి, బడలి పడియున్న శత్రుఘ్న భరతసుతుల
మణికిరీటాంగదములు సమ్మదముతోడఁ, గైకొని ధరించి శౌర్యంబు గణన కెక్క.
క. ఆవలఁ జని హనుమత్సు, గ్రీవులయొద్దకుఁ దదీయరీతులు గని హా
సావృతముఖులై తల్లికి, నావానరములను జూపు నౌత్సుక్యమునన్. 1176
క. పట్టుకొని వారితోఁకలు, గట్టిగ నటనుండి కదలి కడువేగమునన్
జుట్టును మునిబాలురు గుమి, గట్టి పరువులెత్తి వచ్చి క్ష్మాసుతకడకున్. 1177
ఆ. తల్లి నీవు చూచి యుల్లంబునను మోద, మందఁగల వటన్న యాసతోడ
నిటకుఁ దెచ్చినార మీకోఁతులను బట్టి, కనుఁగొనంగదమ్మ కౌతుకమున. 1178
క. అనవుడు నావానరులను, గని జానకి విస్మయంబు గదురఁగ నెద నం
దనులార యెచట వీరిని, గొని తెచ్చితి రెట్లు వీరు గూడిరి మీకున్. 1179
క. అని యడుగుటయును నామెకు, వినయంబున జరిగినట్టివృత్తాంతం బె
ల్లను వచియించె లవుం డది, విని జనకతనూజ శోకవిహ్వల యగుచున్. 1180

—: కుశలవులు సీతాదేశంబున నశ్వమును శత్రుఘ్నున కర్పించుట :—

క. సుతులార రాముఁ డనఁగను, బతిదేవత నైననాకుఁ బతి సుమి మీకున్
బిత సుమి యపచారము చే, సితిరి తదధ్వరహయంబుఁ జేకొని మీరల్. 1181
క. ఈకపివీరులు మును నను, రాకాసులబారినుండి రక్షించినసు
శ్లోకులు వీరిని విడువుఁడు, మీకుఁ ద్రిలోకంబులందు మే లొనగూడున్. 1182
క. క్షమతోడను మాతప్పులు, క్షమియింపు మటంచు వేఁడి శత్రుఘ్నున క
శ్వము నర్పింపుం డతఁ డప, రిమితబలపరాక్రముఁడు పితృవ్యుఁడు మీకున్.
క. అని చెప్పుటయును వారలు, కనుఁగొని జానకిని దల్లి క్షత్త్రియధర్మం
బునఁ బట్టుకొంటి మశ్వం, బును మాయెడఁ దగునె తప్పు మోపఁగ నీకున్.
క. మును కణ్వాశ్రమమునకుం, జనుదెంచినమఖహయంబు శౌర్యంబునఁ బ
ట్టినవాఁ డయి భరతుఁడు తన, జనకునితోడను రణంబు సలిపినకతనన్. 1185
క. తనయుండు తండ్రితోడను, ననుజన్ముం డన్నతోడ నాచార్యునితో
డను శిష్యుం డని చేయుట, యనయము గాదనిరి క్షత్త్రియాన్వయజులకున్.
క. ఐనను నవిలంఘ్యము నీ, యానతి మా కనుచు మ్రొక్కి యామెకుఁ బ్రథన
స్థానమునకు నరుదెంచిరి, మానిసుతులు వెంట రాఁగ మఖతురగముతోన్.
గీ. అపుడు రామునిఁ దలఁచుచు నవనిజాత, కర్మసాక్షినిఁ దిలకించి కదనభూమి
యందుఁ బడియున్నవా రెల్లఁ బ్రాణధారు, లగుచు లేవంగ భావించె నాత్మలోన.
గీ. ఆమె భావించినట్ల రణాంగణంబు, నందుఁ బడియున్నవా రెల్ల నాక్షణంబ
లేచి రసుధారు లగుచు నాలీలఁ గాంచి, సంతసముఁ జెంది కుశలవుల్ స్వాంతములను.
క. వినయమ్మున శత్రుఘ్నున, కొనరిచి వందనము క్రతుహయోత్తంసము న
ప్పనచేసి తా మొనర్చిన, యనయము సైరింపు మనుచు నభ్యర్థింపన్.

—: అశ్వమేధాశ్వము విజయముతోడ నయోధ్యకుఁ జేరుట :—

గీ. మదిని శత్రుఘ్నుఁ డంతేని ముదము నొంది
కౌఁగిటను జేర్చికొని వారి గాఢముగను
నాదరము చూపి విస్మయం బంది నిహత
మైనబల మెల్ల నుత్థితం బై సకతన. 1190

ఆ. బయలు దేఱి సకలబలములతోడను, దాఁటి మధ్యజనపదంబు లెల్ల
శీఘ్రగమనమునను జేరె నయోధ్యకు, సమయ మెఱిఁగినట్టిచతురుఁ డగుట.

సీ. దశదిక్కులను బ్రతిధ్వను లీన బ్రాహ్మణుల్, వేదపాఠములు గావించు చుండ
బహువిధభక్ష్యాన్నపానంబులను విప్ర, సంతర్పణంబులు సాగుచుండ
బ్రహ్మతత్త్వము ననుభవనిదర్శనముచే, బ్రహ్మవేత్తలు బోధపఱుచు చుండఁ
దెఱపి లేకుండ రాత్రిందివంబులు గూడ, హరినామకీర్తనల్ జరుగు చుండ

గీ. సవనమండపమందు భాస్కరుఁడువోలె, ఋత్విజులమధ్యమునఁ దేజరిల్లుచుండు
రామచంద్రున కెఱఁగి తురంగమమును, భక్తిపూర్వకముగ సమర్పణము చేసె.

ఆ. అపుడు రామభద్రుఁ డానందమును జెంది, మురువు మీఱ సుమతి మోముఁ జూచి
సచివవర్య యశ్వసంచారమున నేమి, యేమి జరిగినదియొ యెఱుఁగఁ జెపుమ.

క. అనవుడు సుమతి తదాజ్ఞను, వినయంబునఁ దలను దాల్చి విషయము లెల్లన్
వినిపింప సవిస్తరముగ, విని రాఘవుఁ డాత్మలోన విస్మయ మొదవన్. 1195

గీ. ఋషులమధ్యంబునను దేజరిల్లుచున్న, యట్టివాల్మీకి నీక్షించి యమలచరిత
యెవరు కుశలవు లను వారి కెట్లు గలిగె, నట్టిసామర్థ్యము వచింపు మనుచు నడిగె.

క. అడుగుటయుఁ బుట్టుపుట్టువు, జడదారి తదీయజన్మచరితాదుల నే
ర్పడ నుడివి యెల్లవారికిఁ, గడువిస్మయ మొదవఁ గట్టకడ కిట్లనియెన్. 1197

ఆ. రామచంద్ర భావిరామాయణంబును, వ్రాసి దివ్యదృష్టివలన నేను
జెప్పినాఁడ వారి కొప్పుగా నది గాన, ఘణితితోడ వారు పాడుచుండ. 1198

క. కాననములలో మృగసం, తానములును నండజప్రతానంబులునున్
మేనులను మఱచి వారల, గానంబును వినుచు నుండుఁ గడుఁ జిత్రముగన్.

ఆ. దైవికముగ దివిని బోవుచు నొకనాఁడు, వరుణుఁ డాలకించి వారిపాట
యద్భుతంబు నొంది యంతరంగంబునఁ, బారితోషికములు వారి కొసఁగె.

ఆ. అట్లె లోకపాలు రందఱుఁ గూడను, వారిగానమునకు వశ్యు లగుచు
దివ్యభూషణములు దివ్యాంబరంబులు, కానుకలుగ నిడిరి గౌరవమున. 1201

క. ఆశిశువులగానకళా, కౌశల్యంబునకుఁ బారికాంక్షులు హర్షా
వేశం బొదవంగ ననే, కాశీర్వాదములు చేసి రభివర్ధిల్లన్. 1202

గీ. ఒక్కొటొక్కటిగను నేను లెక్క పెట్టి, చెప్పఁ దలకొన్న నెన్నని చెప్పఁగలను
మోహితము లయ్యె ముల్లోకములును వారి, గానరూపవయోగుణగరిమమునకు.

క. జగ మెల్ల నేకరామం, బుగ భాసిలె ననిరి మునులు మున్ను శ్రీరామం
బుగ నుండె ననిరి నేఁ డా, సుగుణాఢ్యులరూపములను జూచినవారల్. 1204
ఆ. పూతచరిత యైనసీతామహాదేవి, యోగ్యతను నుతించు చుందు రెపుడు
నాకుమారయుగము నవలోకనముచేయు, నట్టివార లెల్ల నద్భుతముగ, 1205
క. క్షితిసుత యన సాధారణ, సతి గా దాలోకమాత సంకల్పముచేఁ
జతురాననాదిసురసం, తతులను గూడను సృజించు దశరథతనయా. 1206
క. సిద్ధులలోపల నుత్తమ, సిద్ధి మహీజాత యామెసేవనమున సం
సిద్ధిని బొంది రనేకులు, బద్ధులు గాకుండఁ గ్లేశపాశంబులచేన్. 1207
గీ. ధరణిజాత్యాగ మొక్కటి తక్క రామ, కృతము లైనట్టికార్యంబు లెల్ల స్తోత్ర
పాత్రముల యనులోకులభాషణములు, ప్రతిపదంబును విన నయ్యెఁ బార్థివేంద్ర.
క. ప్రవిదారణనిహతం బగు, భవదీయబలంబు నెల్ల బ్రతికించినయా
యవనిసుత సంస్తుతింపం, దవినమహాసాధ్వి చూవె ధరణీనాథా. 1209
ఆ. అచ్యుతుఁడు లక్ష్మియును యుష్మదాకృతులను
నవతరించిరి భూభార మపనయింప
జనకుఁడవు నీవు జానికి జనని చూవె
సకలలోకంబులకుఁ గూడ సత్య మిదియ. 1210
క. ఎఱుఁగుదురు దేవతలు మే, మెఱుఁగుదు మీా వెఱుఁగుదువు మహీసుతశుద్ధిన్
జెఱవార లేల నీకున్, గఱపఁగఁ జేయంగఁ దగినకార్యము ననఘా. 1211
క. అని చెప్పి యూరకుండుట, యును నచ్చట నున్నతాపసోత్తము లెల్లన్
మునివరుఁడు చెప్పె సత్యము, నని రంతట గగనవాణి యట్టులె పలికెన్. 1212

—: రాముఁడు సీతాదేవిని దోడ్కొని రా లక్ష్మణున కాజ్ఞాపించుట :—

ఆ. అపుడు రాముఁ డిట్టు లనియె లక్ష్మణునకు, ననుజ శీఘ్రముగను నరిగి నీవు
జనకసుతను బుత్రసహితంబుగాఁ గొని, రమ్ము రాజవైభవమ్ముతోడ. 1213
క. అనవుడు లక్ష్మణుఁడు తదా, జ్ఞను శిరమునఁ దాల్చి సంతసమునఁ బరికరం
బును గొని వాల్మీకిమహా, మునియాశ్రమమునకుఁ బోయి మ్రొక్కి వదినెకున్.
క. మ్రొక్కుటయును జానకి కడు, నక్కజమును జెంది వత్స యరుదేరఁగ నీ
విక్కడకు నేమి కార్యమొ, చక్కఁగ వచియింపు ముడిగి సందేహంబున్.
సీ. కుశలియె నాస్వామి కుశలమె నీకు మీా, యన్నదమ్ములకు మాయత్తలకును
నను వీడనాడిననాఁటనుండి ధరిత్రి, నమల మై యున్నె మీాయన్నయశము
నాప్రాణధవునకు నామీాఁద నున్నకో, పము శమించినదె యిప్పటికి నైన
ననుఁ జూడకున్నను నావాఁడు నే ధ్యాన, మందు నిత్యముఁ జూచు చుందు నతని
గీ. విడిచినను భర్త పతిని నే విడువ కుంటఁ, జచ్చినను నేను బోదును స్వామికడకె
సాధనమునకు ఫలము వశంబు గాని, సాధనము ఫలమునకు వశంబు గాదు. 1216

ఆ. నన్ను వీడినట్లు నిన్నుఁ గూడను వీడె, నా వచింపు మామహాప్రభుండు
మిగిలి కీర్తికాంతఁ మేను సైతము వీడు, వాని కింక వీడరాని దేది. 1217
క. అనుటయు రామానుజుఁ డి, ట్లనియెను మనవారు కుశలు లందఱు వేగన్
జనయిత్రి నిన్నుఁ దోడ్కొ,ని, చనుదె మ్మని పనిచె రామచంద్రుఁడు నన్నున్.
క. పనుచుచు నను నీకడ కి, ట్లనియెను మాయన్న తల్లి యామాటలె నే
విని చెదను నీకు దయతో, విను మని ప్రార్థించి విన్నవింపఁ దొడంగెన్. 1219
గీ. ఎల్లవారును దేవి సర్వేశ్వరునిఁ గఁ, బలుకుచుందురు నన్నె ప్రపంచమందు
నన్నిటికిఁ గూడను స్వతంత్ర మైన హేతు, వొకయదృష్టమ యంచు నే నుగ్గడింతు.
ఆ. అనుసరించుచుండు నజ్జాక్షి సర్వేశ్వ, రుండు గూడఁ జేయుచుండునట్టి
పనులలో నదృష్టము నె తప్పకుంటను, బరులమాట యింకఁ బలుక నేల. 1221
క. సృష్టిస్థితిలయములకును, గష్టములును సౌఖ్యములును గలుగుటకును సం
తుష్టి కసంతుష్టికిని న, దృష్టమె కారణము చూవె యెందును గూడన్. 1222
సీ. హరధనుర్భంగంబునందును గై కేయి, మతిభంగమునఁ బితృమరణమునను
నటవీనివాసమునందు దైత్యుఁడు నిన్ను, హరియించుటను వార్ధితరణమునను
ఋక్షవానరు లొనర్చినసాయమునయందు, రావణాసురునిమారణమునందుఁ
ద్వత్ప్రాప్తియందు బాంధవదర్శనమునందు, రాజ్యసంపత్తిసంప్రాప్తియందుఁ
గీ. దావకపునర్వియోగవిధానమందు, నేది యయ్యెనొ తప్పనిహేతు వదియె
కారణం బగుచున్నది వారిజాక్షి, మనసమాగమమునకును మరల నేఁడు.
క. గతవిషయకఖేదంబును, సతి మనమున నుంచికొనక చనుదెమ్ము సుతా
న్వితముగ నీనగరమునకు, నతులితవైభవముతోడ నందఱుఁ బొగడన్. 1224
క. అని పలికె ననుటయును ని, ట్లనియెను భూపుత్రి వత్స యపయశమును గొ
ల్పిన నేను స్వామికడకున్, జనుదేరఁగ మరల నవ్వ సాగరె లోకుల్. 1225
క. పెండిలి మొదలుగ మదిలో, నుండినరూపంబు పాయ కున్నది నేఁడున్
నిండుగ నాహృదయమున నె, యుండిన నిట నచట నున్న నొక్కటె నాకున్.
క. స్వామినె యారాధించుచు, నీమేను దొఱంగుదాన నిచటనె నా కిం
కేమి గలదు కావలసిన, కామితము మఱొండు స్వామికడ కేతేరన్. 1227

—: కుశలవులు రామునికడకు వచ్చుట :—

గీ. స్వామితేజోంశభవులును వంశమునకు, నంకురములును నైనయీయాత్మజులను
స్వామి కర్పింపుము మదీయవందనముల, తోడఁ గూడను మదికి సంతుష్టి గలుగ.
క. తెలుపుము లక్ష్మణ వేఱుగఁ, బలుకక నామాట కీవు ప్రతివచనము పె
ద్దలకుఁ బ్రణామంబులు పి, న్నలకున్ దీవనలు నే నొనర్చితి ననుచున్. 1229
క. అని యానతిచ్చి తనయుల, ననుపుటయును మాఱుమాట యాడక ప్రణతిం
బొనరిచి లక్ష్మణుఁ డామెకుఁ, జనుదెంచెను వెంటఁ గవలు చనుదేరంగన్.

క. చనుదెంచి సుమిత్త్రానం, దనుఁ డన్నకు మ్రొక్కి తెలిపె ధరణీసుత ప
ల్కినపల్కు లెల్ల వినయం, బున నది విని రాఘవుండు మూర్ఛితుఁ డయ్యెన్.
గీ. అట్లు మూర్ఛితుఁడై రాముఁ డవలఁగొంత, సేపునకు నెట్లొ తెల్వి తెచ్చికొని చూచి
వత్స లక్ష్మణ పోయి మీవదినె కడకు, మరల వచియింపు మిట్లు నామాటలు గను.
క. పతికంటె సతికి వేఱొక, గతి లే దని చెప్పుచుండఁగా శ్రుతు లెల్లన్
బతి నెడసి చేయుతప మే, వితమున ఫలియింపఁగలదు వెలఁదుక నీకున్.
ఆ. అడవి కేఁగ నీవె యాశించుటను జేసి, పంపినాఁడ నేను బంకజాక్షి
యంతమాత్రమునకె యలిగి నాయెడ దోష, మున్నయట్లు రాక యుండఁ దగునె.
క. వనమునఁ గలమునికాంతా, జనమును జూచితివి వాంఛ సఫలం బయ్యెన్
జనుదె మ్మింఁక నాయెడఁ ద, ప్పును మోపక యుందు వేని పూర్ణేందుముఖీ.
క. కులసతులు చేయుదురు చేఁ, తలు పతులకు ముదము గలుగ దాన నిపుడు నీ
సలిపినకర్జము మిగులన్, గలిగించెను సంతసంబు నాకు లతాంగీ. 1236
క. పతి సంతోషించినయెడ, సతి చేసెడిచేఁత లెల్ల సఫలంబు లగున్
బతి సంతోషింపనియెడ, సతి చేసెడిచేఁత లెల్లఁ జను వ్యర్థము లై. 1237
క. వ్రతములు జపములు తపములు, క్రతువులు తీర్థములు పుణ్యకార్యము లెల్లన్
బతిసేవకంటెఁ దక్కువ, యతివల కని యెఱుక పడదె యవనిజ నీకున్. 1238
క. అని విరమించుటయును రా, మునియానతి దాల్చి శీర్షమునను సుమిత్త్రా
తనయుం డన్నకు నభివా, దనముం బొనరించి చనియె ధరణిజకడకున్. 1239
సీ. అంతట వాల్మీకియాదేశమునఁ గుశ, లవులు తాళస్వరలయయుతముగఁ
బాడఁ దొడంగిరి పలికించుచును వీణ, రామాయణము నబ్బురంబు దోఁప
నపగతచేష్టు లై రాగానమును విని, సాలభంజికలు నా సభ్యు లెల్ల
నపుడు రాముఁడు మహాహ్లాదంబుతోడను, లేచి పుత్రులఁ గౌఁగిలించికొనియె
గీ. ననుడు వాత్స్యాయనుం డిట్లు లనియె దేవ
యెపుడు రామాయణము రచియింపఁబడెనొ
యది రచింపఁగ హేతు వెయ్యదియొ యందుఁ
గలవిశేషంబు లేవియొ తెలియఁ జెపుమ. 1240

—: రామాయణరచనాదికథనము :—

క. అనవుడు నాగాధిపుఁ డి, ట్లనియెను మౌనీంద్ర పూర్వమం దొకదివసం
బున వాల్మీకిమహాముని, చనియె నొకయరణ్యమునకు ఛాత్త్రులతోడన్. 1241
ఆ. అచట నొక్కచోట హర్షాతిరేకంబు, వెలయఁ గామసౌఖ్యములను దేలు
చున్నయట్టిక్రౌంచయుగమందు మగదానిఁ, గఱకుఁగోల నొక్కయెఱుకు గూల్చె.
వ. అప్పు డమ్మునీంద్రుం డాఘోరకృత్యముం జూచి యాగ్రహంబున జలోప
స్పర్శంబు గావించి కిరాతు నుద్దేశించి. 1243

శ్లో. మా నిషాద ప్రతిష్ఠాం త్వ, మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిథునా దేక, మవధీః కామమోహితమ్. 1244

క. అని శపియించుటయుఁ దపో, ధనువాక్యము శ్లోక మగుచుఁ దనరుటను గనుం
గొని శిష్యు లెల్ల విస్మయ, మునఁ దొడఁగిరి సన్నుతింప మునివల్లభునిన్. 1245

సీ. అంతటఁ బరమేష్ఠి యరుదెంచి యచటికి, సమ్మునీంద్రునిఁ గాంచి సమ్మదమునఁ
దాపసోత్తమ నీవు ధన్యుండ వైతివి, చరితార్థ మయ్యె నీజన్మ మెల్ల
భారతి శ్లోకరూపమున నీముఖమందుఁ, బుట్టె లోకముల కభ్యుదయ మొదవ
భవదాననమునుండి బయలు దేఱినవాక్కు, శక్రాదులకును విస్మయము గొలిపెఁ

గీ. గాన నఖిలాఘవిధ్వంసకారి యైన, రామచరితంబు రచియించి రమ్యతుగను
విశ్వమున నిల్పికొనుము నీ విమలకీర్తి, నని వచించి యంతర్ధాన మందె నంత.

గీ. అమ్మహర్షి నదీతీరమందుఁ గూరు, చుండి రామాయణంబు వ్రాయుటకుఁ జింత
సేయుచును ధ్యాననిష్ఠను జెంది యుండ, నపుడు రాముఁడు ప్రత్యక్ష మయ్యె నంత.

క. రామునిఁ గనుఁగొని యానం, దామృతవీచికల నోలలాడుచు నుండం
గా మౌనికిఁ ద్రైకాలిక, రామచరిత్రంబు గోచరం బయ్యెఁ జుమీ. 1248

గీ. అంత వాల్మీకి యత్యంతహర్షమునను, నాఱుకాండంబులుగను రామాయణంబు
వ్రాసెనమృతాభిషేకంబుఁ జేసెననఁగఁ, బలుకుపలుకునమాధుర్యమొలుకుచుండ.

వ. అందు మొదటి దగు బాలకాండంబున దశరథపుత్రకామేష్టియును రామభరతలక్ష్మణశత్రుఘ్నజననంబును విశ్వామిత్రయజ్ఞరక్షణంబును సీతాపాణిగ్రహణంబును భార్గవవిజయంబును నయోధ్యాపురప్రవేశంబును నరణ్యాగమనంబును జిత్రకూటనివాసంబును భరతదీక్షయును వర్ణింపంబడియె. రెండవది యగునరణ్యకాండంబునఁ దపోధనాశ్రమవిలోకనంబును శూర్పణఖానాసాచ్ఛేదంబును ఖరదూషణవధంబును మాయామారీచహననంబును సీతాపహరణంబును విరహాభ్రమణంబును గబంధప్రేక్షణంబును బంపాగమనంబును హనుమత్సమాగమంబును వర్ణింపంబడియె. మూఁడవది యగుకిష్కింధాకాండంబునందు సప్తతాళభేదనంబును వాలిమారణంబును సుగ్రీవరాజ్యదానంబును సీతాన్వేషణంబును సంపాతిప్రేక్షణంబును వార్ధిలంఘనంబును వర్ణింపంబడియె. నాల్గవది యగుసుందరకాండంబునందు లంకాగృహాన్వేషణంబును సీతాసందర్శనభాషణంబులును వనభంగంబును బ్రహ్మాస్త్రబంధనంబును లంకాదహనంబును వానరసమాగమంబును సీతాభిజ్ఞానప్రదానంబును సైన్యప్రస్థానంబును సేతుబంధనంబును శుకసారణసమాగమంబును వర్ణింపంబడియె. అయిదవది యగుయుద్ధకాండంబునందు రావణాదివధంబును సీతాసమాగమంబును వర్ణింపంబడియె. ఆఱవది యగునుత్తరకాండంబునందు ఋషిసంవాదంబును యజ్ఞవిధానంబును వర్ణింపంబడియె.

గీ. శ్రవణ మొనరించినంతమాత్రంబుచేత, బ్రహ్మహత్యాదిసకలపాపక్షయంబు
గలుగఁజేయురామాయణకథను నీకు, సంగ్రహంబుగఁ జెప్పితి సంయమీంద్ర.

—: సీతాదేవి రామునికడకు వచ్చుట :—

గీ. అవలికథ చెప్పెదను విను మట్టు లరిగి, జానకిసమక్షమునకు లక్ష్మణుఁడు మ్రొక్కి
వినయమున నాయమకు విన్నవించె రామ, భద్రుఁ డెటేఁగింపు మన్నట్టిపలుకు లెల్ల.

క. అంతట జానకి భర్తకు, సంతాపము గలుగఁజేయఁ జన దని రోషం
బంతయును నడఁచికొని తన, స్వాంతంబునఁ దలను దాల్చి వల్లభునాజ్ఞన్.

క. మునులకు మునిసతులకు వం, దనములు గావించి వారు దయచేసినదీ
వనలను గొని మఱఁదియుఁ బరి, జనులును గొలువంగ వచ్చె స్వపురంబునకున్.

క. చనుదెంచి యట్లు జానకి, కనుఁదమ్ములనుండి బాష్పకణములు రాలన్
దనప్రాణవల్లభునిపద, వనజంబులమీఁద వ్రాలె వైవశ్యమునన్. 1255

ఉ. అప్పుడు రామభూమిపతి యశ్రులు గన్నులనిండఁ గ్రమ్మఁగా
నప్పతిదేవతన్ దనకరాబ్జములన్ స్పృశియించుచున్ సతీ
యిప్పగిదిన్ మదిన్ బొగుల నేల యెఱుంగమె త్వత్పవిత్రతన్
దప్పవు గాక ప్రాగ్జనికృతంబులు గర్మము లెంతవారికిన్. 1256

ఆ. అనుభవింపఁబడియె నాకర్మఫల మెల్ల, నింతదనుక వలదు చింత యింక
ననుచు ననునయింప నాసాధ్వి మదిలోన, ధైర్యమును వహించి తత్క్షణంబ.

గీ. మొదట వాల్మీకిమౌనికిఁ బిదప ఋషుల, కందఱకు నావలను దనయత్తలకును
వందనంబులు గావించి వారివలన, దీవనల నొంది నాథునిదెసను నిలిచె. 1258

సీ. అపుడు కుంభోద్భవుం డత్యంతముదమునఁ, గనకసీతాప్రతీకమును విడిచి
యాస్థానమున నిల్పి యామెను సర్వస, మక్షంబునను యజ్ఞదీక్ష నొసఁగె
రోహిణీసహితచంద్రుఁడు నాఁగ జానకీ, యుతుఁ డైనరాఘవుం డుల్లసిల్లెఁ
గని జానకీరాములను యజ్ఞవేదిపై, నభినుతింపఁ దొడంగి రఖిలజనము

గీ. లంతటను గుంభసంభవుం డాచరింపఁ
దగినకార్యకలాప మంతయును నడపి
రామ యిఁకఁ జేయవలయును బ్రాహ్మణులకుఁ
బ్రథమపూజను గ్రతువు సాఫల్య మొంద. 1259

గీ. తొల్లి హయమేధమును మరుత్తుండు సలిపి
యపరిమిత మైనధనము బ్రాహ్మణుల కొసఁగ
వార లది మోయఁ జాలక వైచి తుహిన
శైలమునఁ గొంత గైకొని చనిరి చూవె. 1260

క. కావున నీవును నట్టులె, కావింపుము దానములను గాలం బిదె భూ
దేవులను సత్కరింపఁగ, నీ వెఱుఁగనిధర్మ మున్నె యెందును దేవా. 1261

—: రాముఁడు సత్కారములు చేయుట :—

క. అనవుడు రాముఁడు హర్షం, బును జెందుచు ముందు బ్రహ్మపుత్రుం డగున
మ్మునికొసఁగె భూరిదేశము, లను రత్నసువర్ణరాసులను ధేనువులన్. 1262

క. క్రమముగ వ్యాసాదిమహా, శమధనులకు నెల్ల నట్లె సముచితసత్కా
రము చేసి ద్విజుల కెల్లను, బ్రముదం బొదవంగ నిచ్చె బహుమానములన్.

గీ. అవల దీనాంధకృపణు లైనట్టిజనుల, కెల్లరకుఁ గూడ సర్వసమృద్ధి గలుగ
నిడియె నాకాంక్షితార్థంబు లెల్ల రామ, వితరణమునకు సరి రామవితరణంబ.

ఆ. అట్టు లిచ్చుచుండ హస్తయుగ్మమునను, నవిరతముగ రాముఁ డర్థములను
నవలఁ జలుపఁ దగినయట్టికార్యంబును, జలుపఁ బూని కుంభసంభవుండు. 1265

—: రామచంద్రాదు లశ్వాభిషేకతీర్థముం జెప్పుట :—

వ. చతుష్షష్టిరాజదంపతిసమేతుండై మంగళవాద్యంబులతోడ సరయూతరంగిణి
కరిగి తత్సలిలంబు కరంబున స్పృశియించుచు నభిమంత్రించి. 1266

క. సలిలంబ రామచంద్రుఁడు, సలిపెడిహయమేధమఖము సఫలము గాఁగన్
జలుపుము క్రతుహయశుద్ధిని, సులభంబుగ నీవు మేన సోఁకినమాత్రన్. 1267

వ. అని యాదేశించి తజ్జలంబుం గొని రం డని యానతిచ్చుటయు నభిమంత్రితం
బైనయాసలిలంబు స్వర్ణకుంభంబులతోడం గైకొని సీతామహాదేవితోడ రామ
చంద్రుండును మాండవితోడ భరతుండును నూర్మిళతోడ లక్ష్మణుండును శ్రుత
కీర్తితోడ శత్రుఘ్నుండును గాంతిమతితోడఁ బుష్కలుండును సత్యవతితోడ
సుబాహుండును వీరభూషతోడ సత్యవంతుండును సత్కీర్తితోడ సుమదుండును
రాజ్ఞితోడ విమలుండును శ్రుతవతితోడ వీరమణియును గోమలతోడ లక్ష్మినిధి
యును నంగసేనతోడ రిపుతాపుండును మహామూర్తితోడ విభీషణుండును బ్రతీ
తతోడఁ బ్రతాపాగ్ర్యుండును గామగమనతోడ నుగ్రాశ్వుండును నధికరమ్య
తోడ నీలరత్నుండును సుమనోహారితోడ సురథుండును మోహనతోడఁ గపి
యును దదన్యరాజ్ఞీబృందంబుతోడఁ దదితరరాజబృందంబునుం గూడి రా నగ
స్త్యుం డాజలంబుచే నశ్వంబున కభిషేకంబు చేయించి రామచంద్రునికర్ణం
బునం జెప్పుటయు రాముండు. 1268

—: రామభద్రుం డశ్వవిశసనంబునకుం గడంగుట :—

క. నను యజ్ఞతురంగమ పా, వనునిఁ గ నొనరింపు మీవు త్వన్మేధంబుం
బొనరించువాఁడ నిప్పుడె, యనిమిషులకు నెల్లఁ దృప్తి యామతిలంగన్. 1269

వ. అని ప్రార్థించి కుంభజన్ముం డభిమంత్రించి యొసంగిన కరవాలంబు గేలం బట్టికొని
సైంధవంబును హస్తంబున స్పృశియించె. 1270

—: రామకరస్పర్శమున నశ్వము శాపవిముక్తిం జెంది స్వచరిత్రముం జెప్పుట :—

క. అపు డాయధ్వరసైంధవ, మపగతనిజకాయ మగుచు నమరాకృతితో
నుపలక్షించెడివారల, కపరిమితాశ్చర్య మొదవ నచ్చట నిలిచెన్. 1271
వ. అంత నాదివ్యపురుషునిం గని రామచంద్రుం డి ట్లనియె. 1272
క. ఎవఁడవు నీ వేకతమున, నవనాశ్వం బైతి వెట్లు నమకుతె నీకున్
దివిషద్రూపం బిప్పుడు, శ్రవణార్హం బైనఁ జెపుమ సకలము మాకున్. 1273
క. అని యడుగుడు రామున కి, ట్లనియెను నాదివ్యపురుషుఁ డఖిలాత్మ యెఱుం
గని దున్నె నీకు నయినను, విని చెద భవదాజ్ఞ కేను వినతుఁడ నగుచున్. 1274
సీ. మును నేను ద్విజుఁడ నై జనియించి పుడమిపైఁ, జరియించుచును ధర్మసరణియందు
నొకదినంబున సరయూమహానది కేఁగి, స్నానసంధ్యాదులు సలిపి యందుఁ
దావకధ్యానంబు గావించుచును నదీ, తీరదేశంబునఁ గూరుచుండి
స్నానార్థ మచటికిఁ జనుదెంచునట్టివా, రల నెల్ల వంచింపఁ దలఁపు గలిగి
గీ. దేహ మెల్లెడఁ దిలకముల్ దీర్చి దర్భ, పాణి నై చేర్చి యజ్ఞసంభారములను
నగ్గి దగిలించి కుండములందు నుంటిఁ, దనువు దాలిచి వచ్చినదంభ మనఁగ.
క. ననుఁ జూచి యప్పు డచ్చటి, జను లెల్లరుఁ గూడ నితఁడె సాక్షాద్దేవుం
డని పొగడుచుఁ బైఁ బైఁ బడి, యొసరించుచుఁ బ్రణతు లొసఁగుచుండిరి కాన్కల్.
గీ. అట్టు లుండంగ నాయభాగ్యంబువలన, నచటి కేతెంచి దుర్వాసుఁ డపుడు నన్నుఁ
జూచి నే మౌనమును దాల్చి చూచుచుండఁ, గన్ను లెఱ్ఱవడంగ నాగ్రహము చెంది.
క. ఓరి దురాత్ముఁడ మును లను, గౌరవమును లేదె యింత గర్వమె యనుచున్
ఘోరముగఁ దిట్టి పశ్వా, కారంబును జెందు మనుచుఁ గడకు శపించెన్. 1278
క. ఆశాపవచనమును విని, నాశం బొనగూడె నేఁడు నా కని బహుశః
క్లేశమును జెంది యమ్మౌ, నీశుని కాళ్ల పయిఁ బడితి నే వేఁడుచుచున్. 1279
క. నాయేడుపు వినఁ జాలక, యాయమివర్యుండు రాముఁ డధ్వరభూమిన్
జే యిడు నీపైఁ బరమ, శ్రేయం బద్దాన నీకుఁ జేకుఱు ననియెన్.
గీ. అమ్మహాత్ముండు దయచేసినట్టిశాప, మరయఁగను నా కనుగ్రహం బయ్యె నిపుడు
కానియెడ నబ్బునె సమస్తకలుషములను, బాఱఁ ద్రోలెడినీకరస్పర్శ మనఘ.
ఆ. నీయనుగ్రహమున నే నేఁగు చున్నాఁడ, జన్మమృత్యుశోకజరలు లేని
దివ్యధామమునకు దేవర సెలవీయు, మని విమాన మెక్కి యతఁడు చనియె.

—: రాముఁ డశ్వమేధయాగపూర్తిం గావించుట :—

వ. అంతట రామచంద్రుండు మహర్షులం జూచి మహనీయు లెల్లరును నింద యున్నవారు. పురఃకర్తవ్యవిధానంబుం బ్రబోధింప వలయు నని సప్రశ్రయంబుగాఁ బ్రార్థించుటయుఁ దన్మహాజనానుమతిం గైకొని కుంభసంభవుండు కర్పూరంబు దేవతాసంతృప్తికరం బగుంగాన నద్ధోమంబు గావించి యజ్ఞసమాప్తి నొందింప

ఇలయు నని సభామధ్యంబునం జెప్పుటయు రామభద్రుండు సర్వాంగీకారంబు
నెఱింగి కర్పూరరాశిం దెప్పించి సిద్ధపఱిచె. 1283

గీ. అంతటను గుంభజన్ముఁడు హర్షమునను, వేల్చుచును గప్పురంబును విధియుతముగ
దేవతాహ్వాన మొనరింప దివిజు లెల్ల, నరుగుదెంచి గ్రహించి హవ్యమును జనిరి.

క. అది చూచి రామచంద్రుఁడు, ముద మొందుచు హోతృముఖ్యమునివరులకు నిం
పొదవఁ జతుర్దిగ్రాజ్యం, బు దక్షిణగ నిచ్చె నెల్లబుధు లగ్గింపన్. 1285

గీ. అంతఁ గుంభోద్భవమహర్షి యద్భుతముగఁ
జలిపి పూర్ణాహుతిని మహోత్సాహమునను
నవల వర్ధాసనంబును నవభృథమును
విధివిధానానుస్మృతిని గావింపఁ జేసె. 1286

క. ఆపిదప యజ్ఞయూపము, స్థాపించి రఘూద్వహుండు సరయూతటిపై
భూపతులు మెచ్చ మరలను, నాపై నొనరించె మూఁడు హయమేధంబుల్.

గీ. బ్రహ్మహత్యాదిసకలపాపముల రూపు, మాపఁ గలరామహయమేధమఖచరిత్ర
మాలకించినఁ జదివిన నదియె చాలు, నశ్వమేధాధ్వరఫలసంప్రాప్తి గలుగ.

ఆ. రోగముక్తుఁ డగును రోగార్తుఁడు ధనంబు, పొందు నిర్ధనుండు పొందు సుతులఁ
బుత్రకాంక్షి ముక్తిఁ బొందును బద్ధుండు, శ్రవణపతిత మైన రామగాథ. 1289

ఆ. ఎట్టిపాపు లైన నిట్టె తరింతురు, సంస్మరించి రామచంద్రమూర్తి
నేమి చెప్ప నింక రామచరిత్రంబు, భక్తితోడ విన్నఁ బడయు ఫలము. 1290

క. ఈరామకథను వినిచిన, వారలకు నొసంగవలయు స్వర్ణరచితసీ
తారామప్రతిమ లలరఁ, గారాహుల పరమపదము గలుగును దానన్. 1291

క. నీ వడిగినట్టి త్రిభువన, పావనచరితమును దెలియఁ బఱిచితి నింకన్
గావలసినట్టిచరితము, లే వేనియు నున్న నడుగు మేర్పడ ననఘా. 1292

క. అని చెప్పుటయును వాత్స్య, యనుఁ డానందంబు నొంది యహినాథునకున్
బొనరించి వందనంబును, జనియెను హరిమహిమ యెల్లజనులకుఁ దెలుపన్.

చ. అనుటయు శౌనకాదిమును లాతనిఁ గాంచి మహానుభావ రా
మునిహయమేధగాథను బ్రమోదము గల్గ వచించినాఁడ వై
నను మఱియొక్కకోరికి మనంబులలో నుదయించె మాకుఁ గృ
ష్ణునికథ నాలకింపఁ బొడచూపునె మేలునఁ దృప్తి యేరికిన్. 1294

—: కృష్ణచరిత్రకథనము :—

క. అనవుడు సత్యానందం, బున సూతుం డిట్టు లనియె మునివర్యులకున్
నను మీర లిప్పు డడిగిన, యనువున మును గౌరి యడుగ హరుఁ డిట్లనియెన్.

ఆ. వినుము గౌరి కృష్ణుఁ డనఁ బరబ్రహ్మంబు, కాని వేఱు గాదు వానిచరిత
మతినిగూఢ మమిత మాశ్చర్యజనకము, పాపహరము దుర్లభంబు చూవె.

క. ఆనాయకునకు ముఖ్య, స్థానము బృందావనంబు తన్మహిమంబుల్
నేను వచింపంజాలను, మానిని యది సకలభాగ్యమందిరము సుమీ. 1297

క. వైకుంఠలోకమును గో, లోకంబును గూడ దానిలోనిశతాంశ
శ్రీకిని సమములు గా వన, నేకరణిని బోలు దాని కితరజగంబుల్. 1298

క. అది పురుషోత్తమునకు నా, స్పద మై యిల నుండుటను బ్రపంచంబులలో
నొదవెను దేనికి నేనియు, నొదవని శ్రేష్ఠత్వ మొక్క యుర్వికి వింటే. 1299

గీ. ఉత్తమంబులలోపల నుత్తమంబు, దుర్లభంబులలోపల దుర్లభంబు
గోప్యములలోన గోప్యంబు కోమలాంగి, దేవతాసేవ్య మైనబృందావనంబు.

క. మానిజనధ్యేయంబును, నానందవిధాయకమును నవ్యయమును న
న్యూనగుణాశ్రయమును నగు, దానికిఁ బోల్పంగఁ జక్రధరుఁ డొకఁ డెతగుల్.

సీ. మత్తకోకిలపంచమస్వరంబులతోడ, నహిభుగ్విలాసనృత్యములతోడ
పరవశీకరణకృత్పరిమళంబులతోడ, నానావిధప్రసూనములతోడఁ
జంచరీకమనోజ్ఞసంగీతములతోడఁ, గలహంసరమణీయగతులతోడ
సంతతప్రస్ఫురచ్చంద్రహాసముతోడఁ, దరణిమందాంశుసంతతులతోడ

గీ. దివ్యమాణిక్యరుచిరధితులతోడ, నయనపేయతరుప్రకాండములతోడ
నుల్లసిల్లుచు నుండు లోకోన్నతముగ, దైవతాకార మైనబృందావనంబు.

క. పూర్ణప్రేమానందర, సార్ణవము విషాదరహిత మచ్యుతలీలా
కీర్ణం బజరామరణము, వర్ణింపగ లేము దానివైశిష్ట్యంబుల్. 1303

క. నిరతము హరిపాదాంబుజ, పరాగసంస్పర్శమునను బావన మగుటల్
నరులను నిజనామసకృ, త్స్మరణంబున నావనంబు ధన్యులఁ జేయుల్. 1304

వ. తత్కర్ణికకు దక్షిణభాగంబున నుండుప్రథమదళంబునందు నిగమాగమదుర్గ
మంబును యోగీంద్రులకును దుష్ప్రాపంబును నగుమహాపీఠంబు గలదు. ఆగ్నే
యభాగంబున నుండురెండవదళంబునందు సంకేతంబును ద్విపదంబును గుటీద్వం
ద్వంబును విరాజిల్లుచుండు. పూర్వభాగంబున నుండుమూఁడవదళంబు స్పర్శమా
త్రంబున గంగాదిసర్వతీర్థంబులకంటెను శతగుణాధికపావనత్వంబు గలిగించు.
ఈశానభాగమున నుండునాల్గవదళంబున సిద్ధపీఠంబు గలదు. అందు గోపికలు
గృష్ణుని నాథునిఁగాఁ బడయం గోరి కాత్యాయనీపూజ గావించుటయుఁ
గృష్ణుండు తద్వస్త్రాలంకారంబుల హరియించుటయుం గలదు. ఉత్తరభాగంబున
నుండునైదవదళంబు ద్వాదశాదిత్యస్థానం బై వెలుంగుచుండు. వాయవ్యభా
గంబున నుండునాఱవదళంబునఁ గాళీహ్రదంబు గలదు. పశ్చిమభాగంబున
నుండునేడవదళంబు బ్రహ్మహ్రదం బను పేరఁ బ్రసిద్ధిం బడసె. అందు యజ్ఞపత్నీ
గణవాంఛితవరప్రదానంబును నసురనిర్వాణంబును బ్రహ్మమోహనంబును జరిగె.
నైరృతభాగంబున నుండునెనిమిదవదళంబునందు శంఖచూడవధంబును నానా కే

శిరసాస్వాదంబును గావింపంబడియె.తత్కర్ణికామధ్యంబున స్వర్ణసింహాసనంబు గలదు. అయ్యది కృష్ణపరబ్రహ్మలీలావిహారప్రధానమందిరంబు. మఱియును బృందావనంబున గోపీశ్వరం బనునొక్కశివలింగంబు గలదు. తద్బహిర్భాగంబున నొక్కలీలావనంబు గలదు.తత్కర్ణికకుఁ బ్రదక్షిణక్రమంబున షోడశదళంబులు గలవు. అందుఁ బ్రథమదళంబున గోవర్ధనగిరి గలదు. ద్వితీయదళంబునఁ గృష్ణుండు గోవిందత్వముం బడసి విరాజిల్లె. తృతీయదళంబు పూర్ణబ్రహ్మానందరసాశ్రయం బై యుండె.చతుర్థదళంబున నందీశ్వరవనంబును నందాలయంబును గలవు. పంచమదళంబునఁ గృష్ణుండు గోవులం గాచుచు గోపాలుఁ డై యుండె. షష్ఠదళంబున నందవనంబు గలదు. సప్తమదళంబున వకుళారణ్యంబు గలదు.అష్టమదళంబునఁ దాళవనంబు గలదు.అందు ధేనుకాసురవధంబు గావింపంబడియె. నవమదళంబునఁ గుముదారణ్యంబు గలదు.దశమదళంబునఁ గామారణ్యంబు గలదు. అందు బ్రహ్మప్రసాదనంబును విష్ణుచ్ఛద్మప్రదర్శనంబును జరిగె. ఏకాదశదళంబునందు సేతుబంధనిర్మాణంబు గావింపంబడియె. ద్వాదశదళంబున భాండీరవనంబు గలదు.అందుఁ గృష్ణుండు శ్రీదామాదులతోడం గూడి క్రీడారతుం డయ్యె.త్రయోదశదళంబునందు సకలక్షేమవిధాయకం బగుభద్రవనంబు గలదు.చతుర్దశదళంబునందు సర్వైశ్వర్యప్రదం బగుశ్రీవనంబు గలదు. పంచదశదళంబున సకలలోహస్థానం బగులోహవనంబు గలదు.షోడశదళంబున మహావనంబు గలదు.అందుఁ గృష్ణుండు ప్రేమానందరసస్వరూపుం డై పంచాబ్దంబులు గలిగి దామోదరనామంబున విలసిల్లుచు వత్సపాలపరివేష్టితుం డై బాలక్రీడలు గావించుచు యమళార్జునభంజనంబును బూతనాసంహారంబును గావించె.మఱియును నాబృందావనంబునందు విష్ణుచక్రపరిణామంబును సహస్రపత్త్రకమలాకారంబును ననేకమనోజ్ఞస్థానశోభితంబును గర్ణికాపర్ణవిస్తారంబును గృష్ణమనఃప్రియంబును నిగూఢంబును నగుమాథురమండలము గలదు.అందు గోకులం బనునొక్క క్రీడాకాననంబు గలదు. 1305

క. అది గోలోకాధికసం, పద గలిగి సహస్రపత్త్రపద్మాకారం
బాదవి మురారిక్రీడా, స్పద మై విలసిల్లు భువనపావనకళలన్. 1306

క. బృందావనకర్ణిక కా, నందం బొదవఁగఁ బ్రదక్షిణము గాఁగను గా
ళింది విలసిల్లుచుండును, నందసుతక్రీడనాభినందిత మగుచున్. 1307

వ. త్రైలోక్యగోపితంబును బ్రహ్మాదివాంఛితంబును బ్రహ్మాండోపరిసంస్థితంబును సురసిద్ధాదిసేవితంబును యోగీశ్వరధ్యాతంబును గంధర్వాప్సరోగీతనృత్యానిరంతరంబును గృష్ణదేహాభిన్నంబును బూర్ణబ్రహ్మసుఖాశ్రయంబును నగుబృందావనంబుమధ్యంబున నొక్కమంజులభవనంబున నష్టకోణమండితం బగుయోగ

పీఠంబున విలసిల్లెడిరత్నసింహాసనంబున దివ్యమానాష్టదళపద్మకర్ణికపై రాధా
దేవి తోడం గూడి కృష్ణుండు సుఖోపవిష్టుండై యుండు. 1308

క. గోవిందునిమాహాత్మ్యము, భావింపఁగ నలవి గాదు బ్రహ్మాదులకున్
భావిని కన నాధారము, గోవిందుఁ డొకండె జంతుకోటుల కెల్లన్. 1309

సీ. కుటిలాసితస్నిగ్ధకుంతలంబులవాఁడు, నీలకంఠశిఖండమాళివాఁడు
త్రిభువనాకర్షణోర్జితహసితమువాఁడు, సోముబింబము నోము మోమువాఁడు
నీరేజదళదీర్ఘనేత్రయుగ్మమువాఁడు, కమ్మఁగస్తురితిలకంబువాఁడు
నవమౌక్తికాంచితనాసికాగ్రమువాఁడు, బింబారుణాధరోష్ఠంబువాఁడు

గీ. రత్నకుండలదీప్తకర్ణములవాఁడు, కౌస్తుభశ్రీవిరాజివక్షంబువాఁడు
కామశతకోటిచారువిగ్రహమువాఁడు, మహితగుణజాలములవాఁడు మాధవుండు.

ఆ. కరములందు స్వర్ణకటకంబులు భుజంబు, లందు దివ్యమణిమయాంగదములు
కాళ్లయందు నవలగజ్జియలును గల్గి, విశ్వమోహనముగ నెన్నఁ డుండు. 1311

క. ఒకవేళఁ జలుపు నృత్యము, నొకవేళను వేణుగాన మొనరుచు నాబా
లకచక్రవర్తి విస్మయ, వికలము లయి చూచుచుండ విశ్వము లెల్లన్. 1312

క. ఆతనిత్రిభంగములు గనఁ, జైతన్యము దప్పి సకలజంతువులును లో
కాతీతపరానందో, పేతముగను నుండు నవధి యేర్పడ కుండన్. 1313

గీ. కృష్ణమహిమజ్ఞు లగుకొందఱిలను జూడ, నతనియంశంబ చిద్రూప మైనబ్రహ్మ
మనియుఁ దద్దశమాంశంబ యాద్యుఁ డైన, శ్రీమహావిష్ణు వనియు వచింతు రబల.

క. పరిపూర్ణప్రేమరసా, కర మగుతత్త్వంబు గోపికాజనహృదయాం
తరవర్తికంబె వే ఱొకఁ, డరయంగా లేదు జగములందును నెందున్. 1315

క. సాపాంగము వామాంస, ప్రాపితగండంబు కుంచితాధరబింబ
స్థాపితవంశము తిర్య, గ్వ్యాపృతకంఠమును నయి తదాకృతి వెలుఁగున్. 1316

క. లీలామానుషరూపము, నాలోకింపంగ నమరు లమరాధిపుఁడున్
నాళీకభవుఁడు నేనును, వేళలు వేచికొనియుంట వినవె లతాంగీ. 1317

గీ. ఆమహాస్వామిపాదనఖామృతాంశు, రశ్మిమహిమంబు చెప్పఁ దరంబు గాదు
తత్కళాకోటికోట్యంశతౌల్య మొందఁ, జాలము త్రిమూర్తులము గూడ నీలవేణి.

గీ. అతివ తద్రూపకోటికోట్యంశకళల, చూవె కందర్పవిగ్రహశోభ లెల్లఁ
దత్ప్రభాకోటికోట్యంశతతుల చూవె, చండభానుమయూఖసంచయము లెల్ల.

గీ. తరుణి నానావిధసుగంధభరిత మైన, వాతపోతంబు లెల్లఁ దద్వర్ష్మగంధ
కోటికోట్యంశముల చూవె మాట లేల, యఖిలలోకంబులును దద్దశాంశకళల.

గీ. ఇంతి యాద్యప్రకృతి రాధ కృష్ణదయిత, తత్కళాకోటికోట్యంశతతుల చూవె
త్రిగుణరూపంబులను దాల్చి తేజరిల్లు, చండదుర్గాదిదేవతామండలములు. 1321

గీ. ఆమెపాదరజస్స్పర్శ మయ్యె నేని, కలుగుచుందురు కోటివిష్ణువుల్ కలువకంటి
రాధ కీడైనవస్తువు రాధ యొకతె, కృష్ణునకు సాటియగువ్యక్తి కృష్ణుఁ డొకఁడె.

గీ. రాధాకృష్ణవిలాసము, బోధానందైకరూపముగ నుండుఁ దదా
రాధనయోగోత్తరు లగు, సాధువులకె దానిలోనిసారము దెలియున్. 1323

క. అని చెప్పుటయును హర్షం, బెనయఁగ నిట్లనియె గౌరి మృత్యుంజయ కృ
ష్ణునిపరివారగణంబును, వినిపింపుము నాకు వినఁగ వేడుక యయ్యెన్. 1324

వ. అని వేఁడుటయు నీశ్వరుండు పార్వతి కిట్లనియె. 1325

—: శివుండు పార్వతికిఁ గృష్ణపరివారవర్గంబు నెఱింగించుట :—

ఆ. అట్లు రాధతోడ నానందమున నుండ, మణిమయాసనమున మాధవుండు
పడఁతి రాధికాంశభవ లైనషోడశ, ప్రకృతు లుందు రతనిప్రక్కలందు. 1326

వ. సమ్ముఖంబున లలితయును వాయుకోణంబున శ్యామలయును నుత్తరకోణంబున శ్రీమతియును నీశానకోణంబున హరిప్రియయును బూర్వకోణంబున విశాఖయును నాగ్నేయకోణంబున శైబ్యయును దక్షిణకోణంబునఁ బద్మయును నైరృతికోణంబునఁ జంద్రావతియును ననునష్టప్రకృతులును నగ్రద్వారంబునఁ జంద్రావళి చిత్రరేఖ చంద్ర మదనసుందరి ప్రియ మధుమతి చంద్రరేఖ హరిప్రియ యనునష్టప్రకృతులును గిశోరవయోభాసురాంగులును నభిన్నగుణలావణ్యసమేతలును గృష్ణాలింగనసముత్సుకలును గోపకన్యాసహస్రసంయుతలును గృష్ణవల్లభలును నై యోగపీఠంబులందు స్వర్ణసింహాసనంబులపై విరాజిల్లుచుందురు. దక్షిణద్వారంబున శ్రుతికన్యకలు సహస్రాయుతగోపకన్యాసమేతలును గృష్ణనివిష్టమానసలును బహువిధస్వరాలాపముగ్ధీకృతజగత్త్రయలును నై జగన్మోహనరూపంబులతోడఁ గృష్ణరహస్యచరిత్రంబులు గానంబు సేయుచుందురు. సవ్యద్వారంబున దేవకన్యకలు దివ్యవేషరసోజ్జ్వలాంగులును గృష్ణాంగస్పర్శనోత్సుక్యవిగళితలజ్జాభరలును స్మితసాచినిరీక్షణావికసితాననలును నై విలసిల్లుచుందురు. బాహ్యద్వారంబున సమానవేషవయోబలపౌరుషులును సమానగుణక్రియలును సమానాభరణలును సమానస్వరసంగీతవేణువాదనలును నగుకృష్ణవల్లభలు విరాజిల్లుచుందురు. మఱియును బశ్చిమద్వారంబున శ్రీదాముండును నుత్తరద్వారంబున వసుదాముండును బూర్వద్వారంబున సుదాముండును దక్షిణద్వారంబునఁ గింకిణియును దద్బహిర్ద్వారంబునందు స్వర్ణాభరణభూషితంబును సువర్ణమందిరస్థంబును సువర్ణవేదీమధ్యస్థితంబును నగుస్వర్ణపీఠంబున సమానశృంగవీణావేణువేత్రవయోవేషాకృతిస్వరులును జిత్రరూపులును నయుతాయుతసంఖ్యాకులును గృష్ణగుణధ్యానగానరసపారవశ్యంబున నానందాశ్రువులు వర్షించుచుఁ బులకాంకితసర్వాంగులై చిత్రార్పితమూర్తులునై విచేష్టులును నయి యుందు

గోపాలురును క్షురత్పయోధారాప్రసారంబు లగునసంఖ్యాకగోబృందంబులును విరాజిల్లుచుండు. కోటిసూర్యప్రభాజాజ్వల్యమానం బగుతద్బహిర్ద్వారంబునందుఁ బశ్చిమభాగంబున మహోద్యానంబును దానినడుమఁ బారిజాతద్రుమంబును దానిక్రింద స్వర్ణమందిరమండితం బగుసువర్ణపీఠంబును దన్మధ్యంబున మాణిక్యఖచితసింహాసనంబును దానిపై నింద్రనీలశ్యామవర్ణుండును బద్మపత్త్రవిశాలలోచనుండును మకరకుండలమండితకర్ణుండును జతుర్భుజుండును వనమాలాధరుండును శంఖచక్రగదాసికరుండును ద్రిగుణాతీతచిద్రూపుండును సర్వకారణకారణంబును జ్యోతిస్స్వరూపుండును నాద్యంతరహితుండును బీతాంబరధరుండును దివ్యభూషణభూషితుండును దివ్యానులేపనుండును సనాతనుండును నగువాసుదేవుండును దద్దయిత లగురుక్మిణి సత్యభామ నాగ్నజితి సులక్షణ మిత్త్రవింద సునంద జాంబవతి సుశీల యనెడియష్టవల్లభలును వసియించియుందురు. ఉత్తరభాగంబున మహోద్యానంబును దానినడుమ హరిచందనద్రుమంబును దానిక్రింద మణిమండపంబును దన్మధ్యంబున స్వర్ణపీఠంబును దానిపైని రత్నసింహాసనంబును దానిమీఁద శుద్ధస్ఫటికాకారుండును రక్తాంబుజదళలోచనుండును నీలాంబరధరుండును మధుపానరతుండును దివ్యమాలాభూషణభూషితుండును నగుసంకర్షణహలాయుధుండు రేవతితోడం గూడి యుండు. దక్షిణభాగంబునందు మహోద్యానంబును దానినడుమ సంతానద్రుమంబును దన్మూలంబున మణిమందిరంబును దన్మధ్యంబున దివ్యమాణిక్యసింహాసనంబును దానిపైని జగన్మోహనవిగ్రహుం డగుప్రద్యుమ్నుండు రతితోడం గూడి యుండు. పూర్వభాగంబున మహోద్యానంబును దానినడుమఁ గల్పవృక్షంబును దానిక్రింద హేమమండపంబును దన్మధ్యంబున స్వర్ణపీఠంబును దానిపై దివ్యసింహాసనంబును దానిమీఁదఁ గిరీటియును దివ్యాభరణభూషితుండును నతిలోకసుందరుండును బ్రియభృత్యగణారాధ్యుండును నగు ననిరుద్ధుం డుషతోడం గూడి యుండు. మఱియును దద్భవనంబున నూర్ధ్వంబునందు సర్వేశ్వరేశ్వరుండును ననాదియును నవ్యక్తుండును జిద్రూపుండును నవ్యయుండును ద్రిగుణాతీతుండును మేఘశ్యామసుందరవిగ్రహుండును గిరీటకుండలమండితుండును నగుమహావిష్ణువు శుద్ధసత్త్వాత్ములును జిద్రూపులును నాసాగ్రన్యస్తలోచనులును నగునాత్మారాములచే ధ్యానింపంబడు చుండు. తత్సవ్యభాగంబున సిద్ధగంధర్వాప్సరోయక్షవిద్యాధరాదులు కృష్ణపరబ్రహ్మనివేశితమానసులై నృత్యగీతంబులు గావించుచును బ్రహ్లాదనారదకుమారశుకజనకాదులు సర్వమంత్రైకకారణంబును మంత్రచూడామణియును నర్ధయుగ్మాక్షరంబును నగుకృష్ణమంత్రంబు తదేకాగ్రచిత్తంబుల జపియించుచుఁ గృష్ణపదాంభోజనిశ్చలధ్యానరసనిమగ్నులగుచును నుందురు. తద్బాహ్యభాగంబునఁ బశ్చిమద్వారంబు

నందు శుక్లవర్ణుండును జతుర్భుజుండును శంఖచక్రగదాపద్మహస్తుండును రత్న
కిరీటవిరాజమానుండును నగువిష్ణువును నుత్తరద్వారంబున శంఖచక్రాదిభూషి
తుండును జతుర్భుజుండును రక్తవర్ణుండును నగువిష్ణువును బూర్వద్వారంబున
శంఖచక్రాదిభూషితుండును జతుర్భుజుండును గౌరవర్ణుండును నగువిష్ణువును
దక్షిణద్వారంబున శంఖచక్రాదిభూషితుండును జతుర్భుజుండును గృష్ణవర్ణుండును
నగువిష్ణువును ద్వారపాలకులు గా నుందురు. 1327

క. వ్రతతీర్థతపోదాన, క్రతువులు సాంగములు గావు కలిలో గంగా
ప్లుతియును నచ్యుతనామ, స్మృతియును నివి రెండె గతి తరింపఁగ నెందున్. 1328

ఆ. కృష్ణ కృష్ణ యనుచుఁ గీర్తించువారల, కడకుఁ జేర లేక కలి వడంకుఁ
గాన నెట్టిపాపకర్ముల కేనియు, దిక్కు కృష్ణనామధేయ మొకఁడె. 1329

గీ. ఎట్టియపరాధి యైనను నెట్టిహీన, జాతి యైనను నెట్టిపాపండుఁ డైన
నశుచి యైనను శుచి యైన నార్తుఁ డైన, ధన్యుఁ డగు విష్ణునామంబు దలఁచె నేని.

గీ. బ్రహ్మహత్యాదికోటిపాపములు గూడ, నాశమును బొందు గోవిందనామమునను
భస్మ మైపోదె యగ్నిసంపర్కమునను, గ్రావసన్నిభ మగుతూలరాశి యైన.

క. స్మరియించినంతమాత్రనె, హరినామము నెట్టిమందుఁ డైనను బొందున్
బరిశుద్ధిని బాహ్యాభ్యం, తరములయందును ననారతంబు వింటే. 1332

వ. పాదాంగుష్ఠమూలంబున సంసారగుల్మచ్ఛేదకం బగుచక్రంబును మధ్యమాంగు
ళిమూలంబున ధ్యాతృచిత్తద్విరేఫలోభనం బగుపద్మంబును పద్మంబున కధోభా
గంబున సర్వానర్థజయధ్వజం బగుధ్వజంబును గనిష్ఠామూలంబున భక్తపాపా
ద్రిభేదనం బగువజ్రంబును బార్ష్ణిమధ్యంబున నాశ్రితచిత్తేభదమనదక్షం బగు
నంకుశంబును నంగుష్ఠపర్వంబున భోగసంపత్ప్రదాయకం బగుయవరేఖయును
బర్వమూలంబునఁ బాపభూభృద్భేదనం బగుగదయును నారాయణునిపాదంబు
లందు విలసిల్లుచుండు. అట్టివిష్ణుపాదంబులు సువర్ణంబుతోడం గాని రజతంబుతో
డం గాని పిష్టంబుతోడం గాని యేర్పఱిచికొని తత్పూజ గావించి రేని సంసార
బంధవిముక్తిం బొందం గలుగు. ఇంకఁ గృష్ణప్రీతికరం బగుమాసకృత్యముం
జెప్పెద. వినుము. జ్యేష్ఠమాసంబునఁ బూర్ణిమయందుఁ బవమానఋక్కులును
బురుషసూక్తంబునుం జెప్పుచు గోవిందునకు గంధోదకపుష్పోదకరత్నోదకనా
రికేళఫలోదకంబులచే నభిషేకంబు గావించె నేని జ్ఞానాజ్ఞానకృతంబు లగుబ్ర
హ్మహత్యాసహస్రంబులును స్వర్ణస్తేయసురాపానగురుతల్పగమనాయుతంబు
లును గోటికోటిసహస్రోపపాతకంబులును దత్క్షణంబ నశియించు. ఆషాఢశుక్లైకా
దశియందు స్వాపమహోత్సవంబును శ్రావణంబున శ్రవణావిధియును బవిత్రారో
పణంబును భాద్రపదంబునఁ బరివర్తనోత్సవంబును జేయం దగు. ఆశ్వయుజమా

సంబున సువర్ణమయముగాని రజతమయముగాని యగువిష్ణురూపమహామాయను హింసాద్వేషవర్జితంబుగాఁ బూజింపవలయు.తన్మాసాంతదినంబునదీపావళిమహోత్సవంబు చేయం దగు.కార్తికమాసంబున నుత్థానోత్సవంబు గావింపం దగు.మఱియును జతురంగుళప్రమాణంబు లగుసప్తవర్తులచేఁ బ్రాంశుస్థానంబున దామోదరు నుద్దేశించి దీపంబు వెలిఁగింప నగు.మార్గశీర్షమాసంబున సితపక్షషష్ఠీదినంబున శ్వేతాంబరంబులచేఁ గోవిందునిఁ బూజింప నగు.పౌషమాసంబునఁ బుష్పాభిషేకంబును శ్లక్ష్ణచందనవర్జనోత్సవంబును గావింప నగు.మాఘమాసంబున సంక్రాంతినాఁడు నారాయణునకు సాధివాసితతండులనైవేద్యంబు గావించి బ్రాహ్మణభోజనంబు చేయింప వలయు. 1333

గీ. వ్యంగ మైనను గర్మంబు సాంగ మగును, భూదివౌకసులకుఁ బెట్టుభోజనముఁ
నొక్కబ్రాహ్మణునకు నన్న మొసఁగె నేని, కోటిమందికి భుక్తి చేకూర్చినట్లు.

వ. ఫాల్గునమాసంబునఁ జతుర్దశినాఁ డష్టమయామంబునం గాని పూర్ణిమనాఁటి ప్రతిపత్సంధియందుఁ గాని రంగరూపంబు లగుచతుర్విధఫల్గుచూర్ణంబులచే మాధవునకు సంప్రీతిం గావింప వలయు.మఱియును గృష్ణునకు దినపంచకంబు గాని దినత్రయంబు గాని డోలోత్సవంబు గావింప వలయు. 1335

గీ. దక్షిణాశాభిముఖ్యంబు దనరుచుండ, డోలలో నూఁగుచుండుగోపాలమూర్తిఁ
గన్నులారంగ నొకసారి గాంచె నేని, సమసిపోవు నశేషాపచారములును. 1336

వ. చైత్రమాసంబునందు స్వర్ణపాత్రంబునం గాని రజతపాత్రంబునం గాని తామ్రపాత్రంబునం గాని మృత్పాత్రంబునం గాని సలిలంబు నుంచి తన్మధ్యంబున విష్ణుసాలగ్రామంబుం గాని విష్ణుప్రతిమం గాని యర్చించె నేని తత్పుణ్యం బగణ్యంబగు.వైశాఖమాసంబునఁ దృతీయాదివసంబున జలమధ్యంబునం గాని ప్రతిదినంబును మండలంబునం గాని మండపంబునం గాని వనంబునం గాని చందనాగురుహ్రీబేరకృష్ణకుంకుమరోచనాజటామాంసీమురాఖ్యంబులును విష్ణుప్రీతికరంబులును నగునష్టగంధంబులచేఁ గాని కర్పూరాగురుమిళితం బగుతులసీకాష్ఠగంధంబుచేఁ గాని హరిచందనంబుచేఁ గాని మాధవున కంగలేపనంబు గావింప వలయు.పుష్పమధ్యంబున స్థాపించి పూజించుటయు సుగంధమిశ్రితం బగుతోయంబుచే నభిషేకించుటయు విష్ణుప్రీతికరంబులు. 1337

క. ఫలములు దధ్యోదనమును, గలకండంబులును జవులు గలుగుపదార్థం
బుల నెల్ల సమర్పింపఁగ, వలయు హరికి భక్తిపారవశ్యముచేతన్. 1338

క. తన కిం పైనపదార్థం, బును నెల్లను హరికి భక్తిపూర్వకముగ న
ప్పన మొనరించెడివానికి, ననవాప్యము లేదు జగములం దెం దైనన్. 1339

గీ. తిరిగి బృందావనంబునఁ దీర్ఘమాడి, యమునలోఁ గృష్ణపాదతోయజరజంబు
తనువున నలందికొనినట్లు తలఁచ నేని, లేమ యేటికిఁ జందనలేపనంబు. 1340

క. హరిరూపగుణస్తవత, త్పరు లగువారలకు నేల పాత్రాంతరముల్
హరిభక్తిప్రేమవిలా, సరసావిష్టులకు నేల సారసగంధుల్. 1341
క. శ్రీకృష్ణకథాతత్త్వము, నీకు నెఱింగించినాఁడ నీరేజాక్షీ
లోకులకు నెల్లఁ దెలియఁగ, నీకును సంరక్షణీయ మిది గోప్యము గన్. 1342
క. అనవుడుఁ బార్వతి యి ట్లని, యెను వల్లభ వినినకొలఁదిఁ గృష్ణచరిత్రం
బును వినఁగ వేడ్క యయ్యెడి, వినిపింపుము తద్విశేషవృత్తాంతంబుల్. 1343
వ. అని యడుగుటయు నమందానందంబున నీశ్వరుండు పార్వతి కిట్లనియె. 1344

—: కృష్ణచరితవిశేషవృత్తాంతకథనము. :—

సీ. దేవర్షి యొకనాఁడు గోవిందుఁ డిలలోన, నవతరించినవార్త నాలకించి
యంతరంగమున నత్యానందమును జెంది, వాయించుచును వీణ వచ్చి భువికి
గోకులంబును జేరి గోపాలకుం డైన, నందునిభవనంబునందుఁ జొచ్చి
కలయఁగఁ జూచి యక్కడ దివ్యతేజంబు, నలుగడలను గూడ వెలుఁగుచుండ
గీ. నక్కజము నొంది యచ్చట నొక్కచోటఁ
జోద్యముగ గోపకన్యలు చూచుచుండ
సస్మితాననుఁ డై రమ్యశయనమందుఁ
బవ్వళించి యున్నశిశువు నేర్పడఁగఁ గాంచి. 1345
క. మునిమునిఁ బ్రహ్మానందం, బెనయఁగఁ దర్శనమున నితఁడె కృష్ణుం
డని నిశ్చయించుకొని కన్యఁ, గొని నందుని నిట్టు లనియెఁ గుతుకం బొదవన్.
సీ. నంద నీపూర్వపుణ్యము లెల్ల ఫలియించె, ధన్యాత్ముఁడ వింతకును నీవు
నీగృహంబున జొచ్చె నిఖిలదేవతలును, నాసించుచుండునారాయణుండు
బాలమాత్రుఁడు గాఁడు పరికింప నితఁడు, ధ్యానైకగమ్యుండు మానులకును
దైవభావమున నితనిఁ గొల్చువారికిఁ, బ్రాప్తించు మోక్షసామ్రాజ్యలక్ష్మి
గీ. యని వచించి తదీయపూజనము వడసి
యిందె జనియించు గోపి యై యిందిరయును
ననుచు నూహించి యామెదర్శనము చేయ
భావ ముదయింప నటనుండి బయలుదేఱి. 1347
వ. గోపసదనంబుల నెల్లం జొచ్చుచు విష్ణుభావంబున వారలు చేయుసత్కారంబు
లం గొనుచు నందతనూజునిపై వారికిం గలప్రేమాతిశయంబున కానందించుచుఁ
గట్టకడకు నందుమిత్త్రుండును భానునామధేయుండును నగునొక్కగోపపుంగవుని
గృహముం జొచ్చి యందు శ్వేతరూపంబుచే దేదీప్యమానయై భూతలంబునం
బ్రాఁకుచుండునొక్కబాలికామణిం జూచి ముహూర్తద్వయంబు విచేష్టుం డై
తుదకు సంజ్ఞ నొంది యీయమ లక్ష్మి యై యుండు నని నిశ్చయించికొని తద్ద

ర్శనభాగ్యలాభంబునకు లోలోన నపరిమితప్రమోదముం జెందుచుండ నారదున కుచితోపచారంబు లాచరించి దృష్టుం డగుతనపుత్రుని నాతనిపాదంబులపైం బడవైవ నారదుండు యోగదృష్టిం దిలకించి సర్వావయవసుందరుం డగు నాబాలునిం గౌంగిటం జేర్చుకొని యానందించుచు. 1348

గీ. గోపకులవార్ధిచంద్ర నీకొడుకు రామ, కృష్ణులకు మిత్త్రుం డై యుండి యెల్లవేళ
లందు బ్రహ్మాదులకుం గూడం జెందరాని, పదము నొందంగలండు వీనిభాగ్య మేమొ.

చ. అనుటయు భానుం డెంతయును హర్షము నొంది రయంబునన్ స్వపు
త్త్రిని గొనివచ్చి తాపసవరేణ్య మదాత్మజ యీమె విశ్వమో
హనతనుకాంతి యయ్యు బధిరాంధజడాకృతి నుండె నేకతం
బుననో యెఱుంగ మేదియును బ్రోవవె నీకరుణార్ద్రదృష్టిచేన్. 1350

క. అని వేఁడుటయును నిర్జర, మునివర్యుం డామెభువనమోహనరూపం
బును గాంచి మరలం జక్కంగ, ననవధికం బైనహర్ష మందుచు మదిలోన్.

క. వినిమీలితాక్షుం డగుచును, గనం జాలక యామెతాత్త్వికస్థితి చిత్తం
బునకు నగోచర మగుటను, వినుతింపం దొడంగె నిట్లు వినతాస్యుం డై. 1352

సీ. అమ్మ నేం దిరిగితి నఖిలలోకములును, జూచితి జగదేకసుందరులను
గానంగరా దెందు నేని త్వద్రూపశ, తాంశంబునకును నీ వైనరూపు
నీవు జగన్మోహినివి నీస్వరూపంబు, తెలియంగ రాదు యోగులకుం గూడ
బ్రహ్మరుద్రాదులప్రాభవంబుల కెల్ల, జన్మస్థలంబు నీశక్తిలవము

గీ. యప్రమేయంబు లైనమాయావిభూతు, లన్నియును దావకీనకళాంశజములు
చూడ సర్వాత గల దేని చూపు మొక్క, సాగి నీదివ్యరూపంబు జనని నాకు.

మ. అని ప్రార్థించుటయున్ గనంబడియె నత్యంతాద్భుతాశేషమో
హనసౌందర్యముతోడ నమ్ముని కనన్యాలోకనీయంబు గాం
గను కృష్ణప్రియ గోపకన్యకలు వేడ్కన్ గొల్చుచుండంగ నం
తను నిశ్చేష్టత నొందె నారదుఁడు దత్కాయంబు నీక్షించుచున్. 1354

ఆ. అపుడు గోపకన్యలామహేశ్వరిపాద, జలజములను గడిగి తత్క్షాళనాంబు
కణములను సురర్షికాయంబునను జల్ల, నతఁడు మేలుకొనినయట్లు లేచి. 1355

ఆ. హర్ష వేగములను సాష్టాంగవందన, మాచరించుచుండ నంతలోన
నావరాంగి చెందె నంతర్హితత్వంబు, కలహభోజనుండు గళవళింప. 1356

వ. అంతట గోపకన్యకామణులు వ్యాకులచిత్తుం డగునారదునిం జూచి స్వామి మాస్వామినిం గృష్ణవల్లభంగా నెఱుంగుము. బృందావనంబునందు గోవర్ధనగిరిసమీపంబున కుసుమసరస్తటంబున సర్వకాలంబులందును బుష్పసుగంధభరిత మగునశోకలతిక క్రింద నర్ధరాత్రసమయంబున మే ముందుము. మాదర్శనంబు నపేక్షించితివేని నీ వచ్చటికి ర మ్మని చెప్పి యంతర్ధానంబుం జెందిరి.

ఆ. అంతఁ గనులు విచ్చి యమరర్షి భానునిఁ, జూచి యిట్టు లనియె సుకృతమూర్తి
యీకుమారి త్వత్పురాకృతభాగ్యంబు, కతనఁ గలిగె నీయగారమందు. 1358

ఆ. ఈమె యుండుచోట నింద్రాదిసకలని, ర్జరసమేతుఁ డగుచుఁ జక్రధరుఁడు
సర్వసిద్ధివృద్ధిసహిత యై లక్ష్మియు, నుందు రెల్లవేళలందుఁ గూడ. 1359

క. కావున నీబాలను బర, దేవతఁగా నెంచి భక్తి దీపింపంగాఁ
బ్రోవుము శుభములు నీ కగుఁ, గావుత మని పలికి యుత్సుకత్వముతోడన్.

వ. అటనుండి సత్వరంబ వెడలి గోపకన్యానిరూపితప్రదేశంబునకుం జేరి వినతుండై చేతులు జోడించుకొని తదాగమనంబునకు నిరీక్షించుచుండ దివ్యాభరణభూషితాంగి యగు నొకసుందరీమణి మనోజ్ఞరూప లగుగోపికామణులతోడం గూడి చనుదెంచి యెదుట నిలువంబడియె నంత నారదుండు రక్తాంబరమాల్యానులేపనయు రక్తోత్పలావతంసయు రక్తమాణిక్యకేయూరముకుటాదిభూషితయు నగు నామోహనాంగి నీక్షించి ప్రణమిల్లుటయు నాయమ యాతనిం జూచి మునీంద్రా నే నశోకమాలిని యనుపేరం బరగునశోకవనదేవతను. నా కీయశోకకలిక యావాసస్థానంబు. మున్నొక్కనాఁడు వసంతోత్సవంబున రమారూపధారిణులగు గోపికామణులు సేవించుచుండఁ బ్రియాసమేతుం డై గోపవేషంబున విహరించు మాధవుని నే నశోకమాలికలచే నర్చించి యది మొదలు హరికరుణాకటాక్షంబులకుఁ బాత్రురాల నై యీగోపికామణులలోన మెలంగుచుంటి. త్రైకాలికవిషయంబులు నాకు గోచరంబు లై యుండు. నీవు బ్రహ్మానందదాయిని యగుకృష్ణప్రియను జూడ నెంచితి వని నే నెఱుంగుదును. కావునఁ దద్వృత్తాంతం బొకింత నీ కెఱింగించెద. వినుము. మానససరస్తీరంబునఁ దద్రూపసందర్శనకాంక్షు లై యేకసప్తతిసహస్రసంఖ్యాకు లగుమహామునులు తీవ్రతపం బాచరించుచుండిరి. అం దుగ్రతపుం డగు నొక్క మునీంద్రుం డగ్నిభక్షుండై కామమంత్రసంపుటితంబును బంచదశాక్షరంబును నగుకృష్ణమంత్రంబు జపియించుచు నీలమేఘశ్యామవిగ్రహుండును రాసక్రీడారసపరవశుండును నై యొక్కకరంబునం బ్రియ నాకర్షించుచు మఱియొండుకరంబున వదనంబున వేణువుం బెట్టికొని యుండుకృష్ణుని ధ్యానించుచుఁ బంచాగ్నిమధ్యంబున నుగ్రతపంబు గావించి కల్పశతాంతంబున దేహంబు విడిచి సునందుం డనుగోపునకు సునంద యను కన్యయై పుట్టె. చూడుము. వీణాపాణి యైనయీయమయే సునంద. సత్యతపుం డను నొక్కమహర్షి శుష్కపర్ణంబులు భుజియించుచుఁ గామబీజసంపుటితంబును రత్యంతంబును దశాక్షరంబును నగుకృష్ణమంత్రంబు తోయంబునం దుండి జపించుచుఁ జిత్రవేషధరుం డై ప్రియాదోర్వల్లులం బట్టికొని స్మితవదనంబున నృత్యంబు గావించుచుండుకృష్ణుని ధ్యానించుచుఁ దపంబు గావించి దేహంబు విడిచి దశకల్పాంతంబున సుభద్రుం డనుగోపునకు భద్ర యనుకన్యక యై పుట్టె.

వ్యజనధారిణి యగుసీయమయె భద్ర. కనుంగొనుము. హరిధాముం డనునొక్కతపోధనుండు నిరశనవ్రతంబున వింశతివర్ణంబులు గలకృష్ణమంత్రంబు జపించుచు బృందావనంబున మాధవీమండపంబునందుఁ బల్లవాస్తరణంబుపై నొక్కపరి యుత్తానశాయి యగుచును నొక్కపరి ప్రియావక్షోరుహశాయి యగుచును యౌవనోద్భిన్నకైశోరరూపంబున నుండుకృష్ణుని ధ్యానించుచు మహాతపంబు గావించుచు బహుదేహంబులు విడిచి కల్పత్రయాంతంబున సారంగుం డను గోపునకు రంగవేణి యనుకన్యకయై పుట్టి చిత్రకర్మనైపుణ్యంబు వహియించి యుండె. చూడు మీయమదంతంబులందు శోణబిందువులు చిత్రితంబులై కానంబడుచున్నయవి. జాబాలి యనునొక్కమహర్షి తపోరతుండై పృథివి యంతయుం దిరుగుచు నొక్కమహారణ్యముం జొచ్చి యం దొక్కదివ్యవాపియును దానికిఁ బశ్చిమభాగంబున నొక్కవటపాదపంబునుం జూచి తన్మూలంబునందుఁ దరుణవయస్కయు మనోహరాంగియుఁ గటితటన్యస్తవామపాణియు దక్షిణహస్తధృతజ్ఞానముద్రయు ననిమేషలోచనయు సుస్థిరమానసయు నిరాకృతాహారవిహారయును నయి ఘోరతపంబు గావించుచుండునొక్కతాపసిని గాంచి యచ్చట శతసంవత్సరంబు లుండి యొక్కనాఁ డామె చలింప నాసమయంబున సప్రశ్రయంబుగ మ్రొక్కి తల్లీ నీ వెవ్వ రవు. నీకృత్యం బేమి. చెప్పఁదగియున్న యెడ దయతోఁ జెప్పు మని యడుగుటయుఁ దపఃకర్శిత యగుటవలన నాయమ మెల్లఁగా ని ట్లనియె. 1361

ఆ. ఏను బ్రహ్మవిద్య నెట్టివారలకును, గానఁబడెడిదానఁ గాను గాని
చేయుచున్నదానఁ జిరకాలముననుండి, శౌరి నెనయఁ గోరి ఘోరతపము. 1362

క. ఆనందపూర్ణ నగుచును, నే నుండుదు నెపుడుఁ గూడ నేమి ఫలం బి
ద్దానను గృష్ణప్రీతికిఁ, గా నైతిని బాత్ర మింతకాలము దనుకన్. 1363

గీ. కృష్ణసంప్రీతిపాత్రత నెనయఁ జాల, నట్టిశూన్యాత్మతో నుండ నభిమతంబు
గామి నీపుణ్యవాపిలోఁ గాయ ముడుగ, నుంటి ననవుడు నాశ్చర్య మొంది మౌని.

క. జననీ కృష్ణోపాసన, మొనరించెడివిధము చెప్పు మొనరించెద నే
ననవుడు నాయమ కనికర, మెనయంగను గృష్ణమంత్ర మిచ్చెను మునికిన్.

సీ. అంతట జాబాలి యతిహర్షమున నామె, యాజ్ఞను గొని యొకయడవి కేఁగి
యక్కడ నొకచోట నొక్కపాదంబున, నిలిచి యున్మీలితనేత్రుఁ డగుచు
నీక్షించుచును రవి నేకాగ్రదృష్టితో, నాహారవర్జన మాచరించి
పంచవింశతివర్ణభాసమానం బగు, కృష్ణమంత్రము జపియించుకొనుచుఁ

గీ. చిత్రకందర్పలీలావిశేషములను, గోపికాగేహములలోనఁ జూపుచున్న
వనరుహాక్షుని ధ్యానించుచును ననేక, కాయముల నవకల్పముల్ గడచుటయును.

వ. కడకు గోకులంబునఁ బ్రచండుం డనునొక్కగోపాలునకుఁ జిత్రగంధ యను కన్యకయై జనియించె. నిజాంగసౌరభంబు దశదిక్తటంబులకును వెదచల్లుచుండునీయమయె చిత్రగంధ. మఱికొందఱు మానీంద్రులు వాయుభక్షు లగుచుఁ బంచదశాక్షరం బగుకృష్ణమంత్రంబును జపించుచు దివ్యదుకూలశోభితంబును బర్హిబర్హావతంసంబును నుజ్జ్వలకుండలంబును విచిత్రనాట్యవేణుగానసమాకృష్టగోపకాజనమనోనయనంబును గోపీవికీర్యమాణప్రసూనవ్యాకీర్ణంబును నగు కృష్ణవిగ్రహంబును ధ్యానించుచు ఘోరతపంబు గావించి కల్పాంతంబున దేహంబు లుజ్జగించి గోపికలై ప్రాదుర్భవించిరి. రత్నతాటంకభూషితకర్ణలును రత్నమాల్యాలంకృతకంధరలును రత్నపుష్పకరంబితవేణులును నగునీగోపికలామునివర్యు లని తెలియం దగు. బ్రహ్మర్షి యగుకుశధ్వజునిపుత్రు లగుశుచిశ్రవుండును సువర్ణుండును నూర్ధ్వపాదులై త్ర్యక్షరకృష్ణమంత్రంబు జపించుచు దశవార్షికబాలకుండై కందర్పకోటిలావణ్యరూపంబునగోపికామణుల మోహింపం జేయుచుండుకృష్ణుని ధ్యానించుచుఁ దపంబు గావించి కల్పాంతంబున శరీరంబులు వదలి గోకులంబున సువీరుం డనుగోపాలకునకుఁ గన్యలై పుట్టిరి. చూడుము. శారికా హస్త లగువీరల యవ్వారలు. జటిలుండును జంఘుపూతుండును ఘృతాశియును గర్బ్బవును ననునలువురు తపోధను లిహపరనిస్స్పృహులై యేకాగ్రభావంబుచే రమాత్రయసంపుటితంబును నాద్యంతగతకామబీజంబును దశాక్షరంబును నగుకృష్ణమంత్రంబు జపించుచు వల్లవీజనంబులతోడం గూడి వనవిహారంబు గావించుమాధవుని ధ్యానించుచు ఘోరతపంబు గావించి కల్పత్రయాంతంబున గోకులంబునందు గోపికలై యుదయించిరి. రత్నమౌక్తికఖచితస్వర్ణవలయాలంకృతప్రకోష్ఠలై యున్నయీగోపికామణుల వారలు. వ్యాసమహర్షిపుత్రుం డగుశుకుండు బాల్యంబునంద పితృమాత్రాదుల విసర్జించి వనంబునకరిగి యనశనవ్రతంబు నవలంబించి రమాసంపుటితంబును నష్టాదశాక్షరంబును నగుకృష్ణమంత్రంబు జపించుచు స్వర్ణతరువుక్రింద స్వర్ణమండపమున స్వర్ణసింహాసనంబున నాసీనుండై వామహస్తాంగుళులచే స్వర్ణవేణువుం దాల్చి దక్షిణహస్తంబున స్వర్ణపద్మంబుం ద్రిప్పుచుఁ బ్రియావిరచితస్వర్ణద్రవాంగవిలేపనుం డగుచు నవ్వుచు బెళుకుఁజూపులం జూచు చున్నగోవిందుని ధ్యానించుచు హర్షాశ్రువులు జాఱఁ బులకలు మొలకలెత్త నాథా నాథా యని యుచ్చైస్స్వరంబునం బిలుచుచు దండప్రణామంబు గావింపఁ దలంచి విచేష్టుండై భూమిపయిం బడుటయు భక్తవత్సలుం డగుపుండరీకాక్షుండు తత్క్షణంబ ప్రత్యక్షుండై తద్భుజంబులం బట్టికొని లేవనెత్తి స్మేరావలోకనంబులం జూచి భద్రా నీవు నాకుఁ

ప్రియతమ వై నాయంతికంబునందె యుండెదవు గాక యని పలికి యంతర్ధా
నంబు నొందె. 1367

గీ. అంత నమ్మునివరుఁడు కల్పాంతమందుఁ, దనువు త్యజియించి గోకులంబున జనించె
సకలజను లెన్న నుపనందునకుఁ దనూజ, యగుచు రతికోటిరూపరేఖాదు లమర.

వ. స్వర్ణకుండలమండితగండస్థలయు స్వర్ణపద్మమాలాధారిణియు మాధవార్పితచర్వ
ణీయవిరాజమానహస్తయు నగునీగోపికామణియ యామహామునీంద్రుండు.

క. ఈవెలఁది వేణుగానము, గావింపఁగ నాలకించి కానుకగను గుం
జావళి నొసఁగెను గృష్ణుఁడు, దేవర కను మామె మెడను దీపిలు దానిన్. 1370

వ. వేదవేదాంగపారగుం డగు శ్వేతకేతుతనూభవుండు సర్వసంగపరిత్యాగంబు
గావించి యరణ్యంబున కేఁగి యేకాదశాక్షరమంత్రంబు జపించుచు బ్రహ్మ
రుద్రాదిదుర్లభయును గోవిందదయితయును నగుమహాశక్తిని ధ్యానించుచుఁ
దపంబుం జేసి కల్పద్వయాంతంబున గోకులంబునందు గోపిక యై యుదయించె.
ముక్తావళిలసత్కంధరయు శుద్ధకౌశేయాంబరయు మంజీరకంకణాంగదకుండలా
భరణయు నగునీగోపికామణియ యమ్మహానీయుండు. చంద్రప్రభుం డనునొక
రాజర్షికిఁ గృష్ణప్రసాదంబునఁ జిత్రధ్వజుం డనునొక్కకుమారరత్నం బుదయించె.
చిత్రధ్వజుండు ద్వాదశాబ్దవయస్కుం డై యష్టాదశాక్షరమంత్రదీక్ష బ్రాహ్మణ
ముఖంబునం గైకొని మంత్రపురశ్చరణంబు గావింప విష్ణుదేవాలయంబున కరిగి
యచ్చట నొక్కచోటఁ ద్రిభంగలలితాకారంబును శిఖండిపింఛభూషణంబును
నధరార్పితకాంచనవేణువిరాజమానంబును సవ్యాపసవ్యపార్శ్వగతసుందరీచుంబ
నాశ్లేషణకరంబును సుందరంబును నగుకృష్ణశిలావిగ్రహముం జూచి సిగ్గుచేఁ
దలవంచికొని నిలువంబడియె. అంతఁ గృష్ణుండు నవ్వుచు దక్షపార్శ్వగత యగు
నిజప్రేయసిం జూచి. 1371

క. కలకంఠకంఠి మనలీ, లలు చూచి యితండు దాల్చె లజ్జాభరమున్
దెలియం జాలక యుస్మ, ద్విలసితవేషములు నిర్వివేకుం డగుటన్. 1372

క. మృగలోచన నీతో సమ, మగురూపము వీని కొదవునట్టు లొనర్పం
దగు నిపుడు దాన వీనికి, విగళిత యై లజ్జ మది వివేకము గలుగున్. 1373

గీ. ధ్యాన మొనరింపు మాతని మేను నాదు, కాయమునకు సమం బగుఁ గాక యనుచు
దాన నీదేహదీప్తులు దగిలి వీఁడు, పొందఁగలఁడు భవద్రూపమును లతాంగి.

క. అని చెప్పుటయును నాయమ, కనుఁగొనుచును వాని నాత్మకాయముతో నా
తనికాయమున కభేదం, బొనరఁగ వలయు నని ధ్యాన మొనరుచు చుండన్.

గీ. అఘహరుతేజ మాతనియంగ మెల్ల, నావరించుటయును నప్పు డతని కొదవె
నాలతాంగికిఁ గలరూప మచ్చముగను, గనులు మిఱుమిట్లు గొలిపెడికళలతోడ.

క. దీపంబువలనఁ గలిగెడి, దీపంబును బోలె నాత్మదివ్యకళలతో
నేపారుచుండుకన్యను, గోపాలవధూటి చూచి కుతుకం బొదవన్. 1377

వ. తత్కారంబుం బట్టి తోడ్కొని వచ్చి కృష్ణవామపార్శ్వస్థ యగునిజసఖ కొప్ప
గించుటయు నాయమ యాకన్యకకుఁ జిత్రకళ యనుపేరు వెట్టి గోవిందునికడ
వీణాగానంబు చేయ నియోగించె. 1378

ఉ. అంతట నామృగేక్షణ యొయార మెలర్పఁగఁ గూరుచుండి యా
వంతయు భేద మేర్పడనియట్టులు వీణియపాటలోపలన్
గాంతుసారం బిమిడ్చి యతికోమలరీతిని బాడె దాన న
త్యంతముదంబు గల్గి జలజాక్షుఁడు కౌఁగిటఁ జేర్చె నాయమన్. 1379

గీ. అపుడు తత్పాణిసంస్పర్శ మైనకతన, ననుభవించి మహానంద మాలతాంగి
పిదపఁ బూర్వకళేబరం బొదవ సౌఖ్య, మెడసె నని యేడుచుచు నొక్కయడవి కేఁగి.

గీ. అచట దుష్కర మగుతపం బాచరించి, విడిచి కల్పాంతమున మేను వీరగుప్తుఁ
డనెడిగోపున కాత్మజ యై జనించెఁ, జిత్రకళ యనుపేర విచిత్రముగను. 1381

వ. స్కంధధృతవిపంచికయు వామహస్తధృతరత్నభృంగారయు దక్షిణహస్త
ధృతరత్నపతద్గ్రహయు నగునీగోపికామణియ యాద్విజోత్తముండు. కళ్యాపుం
డనునొక్కబ్రాహ్మణుండు మున్ను ప్రతిదినంబును బుత్రకామార్థి యై శతరు
ద్రీయమంత్రంబులచే నీశ్వరుని నారాధించుచుండ భక్తవత్సలుం డగువిశ్వేశ్వ
రుండు పార్వతితోడ నతనికిఁ జతుర్దశినాఁ డర్ధరాత్రంబునఁ బ్రత్యక్షంబై భూసు
రోత్తమా నీపుత్రునకు నే నిచ్చెడిమంత్రంబు నుపదేశింపుము. దాన నాతండు
వాక్సిద్ధియును విష్ణుభక్తియుం గలిగి దశపూర్వాపరవంశంబుల నుద్ధరించువాఁ
డగు నని పలికి యేకవింశతివర్ణం బగువిద్యాగోపాలమంత్రంబు నుపదేశించి
పూర్ణసుధాసాగరమధ్యంబునఁ గాళిందీవేష్టితం బగుజ్యోతిర్మయద్వీపంబును
దన్మధ్యంబున బృందావనంబును దన్మధ్యంబున శతయోజనోచ్ఛ్రితం బగుపారి
జాతద్రుమంబును దన్మూలంబున ధేనుమండలంబును దన్మధ్యంబున గోపబాలకు
లును దన్మధ్యంబున వివిధోపాయనపాణు లగువ్రజసుందరీమణులను శుక్లాంబర
ధారిణులును శుక్లాభరణభూషితలును గృతాంజలులును నగుశ్రుతికన్యకలను
దన్మధ్యంబున రత్నవేదికయును దానిపై రాధయూరువున శయనించి తద్వదన
చంద్రబింబంబుఁ గ్రేఁగంటం జూచుచు వేణుయుక్తం బగువామహస్తంబున దయి
తాలింగనంబును దక్షిణహస్తంబునఁ బ్రియాచుబుకస్పర్శంబును గావించుచు.

సీ. మాయూరపింఛంబు మస్తకంబునయందుఁ, గస్తురిబొట్టు వక్త్రంబునందుఁ
గర్ణంబులందు మకరకుండలములును, నధరోష్ఠతలమునయందు మురళి
కంఠంబునందు ముక్తాహారమును నురో, మధ్యంబునను వనమాలికయును
భుజములం దంగదంబులుకంకణములుహ, స్తములయందును నుంగరములు వ్రేళ్లఁ

సీ. కటితటంబునఁ గాంచియుఁ గాళ్లయందు, గజ్జెలును గలశాదిరేఖలును నడుగు
లందుఁ గలిగి ప్రకాశించునందసుతుని, ధ్యాన మొనరించుకొనుచును మానసమున.

వ. దశాక్షరమంత్రవిధానంబునం బూజయును మంత్రపురశ్చరణంబునుం జేయఁ
వలయు నని చెప్పి యంతర్ధానంబు నొందె. కశ్యపుండు భగవదాజ్ఞానుసారం
బుగాఁ దనపుత్రుం డగుపుణ్యశ్రవునకు యథావిధి మంత్రోపదేశంబు గావింపఁ
బుణ్యశ్రవుండు స్వగృహంబునుండి బయలువెడలి యొక్కకాననంబున కేఁగి
వాయుభక్షుండై తండ్రి చెప్పినట్ల తపంబు గావించి ముప్పదివేలకల్పంబులు
చనినపిదప దేహంబు నుజ్జగించి గోకులంబున నందభ్రాతృగృహంబున లవంగ
యనుగోపిక యై పుట్టె. చూడుము. కృష్ణముఖమార్జనయంత్రముం బట్టికొని
యున్నయీగోపికామణియ యామహనీయుండు. 1384

ఆ. కష్ణవల్లభలచరిత్రంబు వచియింప, నలవి గాదు చూవె యజున కైన
నించుకంత నీకు నెఱిఁగించితిని ముఖ్య, లైనవారిగాథ లందులోన. 1385

క. అని చెప్పుటయును విస్మయ, మును జెందుచు నారదుండు పోయెను త్రిదివం
బునకు హరిధ్యానంబుం, బొనరించుచుఁ దానుఁ బుట్ట భువి గోపిక యై.

వ. మఱియు నొక్కవృత్తాంతముం జెప్పెద నాకర్ణింపుము. మున్ను విష్ణుభక్తుం డగు
నంబరీషుండు బదర్యాశ్రమమునందు మునిసభామధ్యంబున నాసీనుం డై యున్న
వేదవ్యాసునికడకుం బోయి తత్పదంబులకు సవినయంబుగాఁ బ్రణమిల్లి. 1387

సీ. స్వామి దుస్తర మైనసంసారవార్ధి, గట్టుఁ జేరంగఁగలుగుమార్గంబు నాకు
నానతి మ్మెట్టివారికి నైనఁ దుదకు, నదియ కాదె సమస్తదుఃఖాపహంబు.

వ. అని యడుగుటయు వేదవ్యాసుం డమ్మహీపాలునిం జూచి నరేంద్రా నీయడిగిన
యంశం బతిగోప్యంబు. నాకుమారుం డగుశుకునకుం గూడ నే నెఱింగింప నైతి.
విష్ణుభక్తుండ వగుట నీకుం దెలిపెద. వినుము. నేను మున్ను బహుసహస్రవర్షం
బులు ఫలమూలపలాశంబువాయుభక్షుండ నై తీవ్రతపంబు గావింప నొక్క
నాఁడు నారాయణుండు ప్రత్యక్షుం బై వత్సా నీతపంబునకు సంతసించితి. వరముం
గోరు మనుటయు నేను సవినయంబుగా నమస్కరించి దేవా మునిధ్యేయంబును
సంసారోత్తారకంబును సర్వలోకకారణంబును నప్రమేయంబును నగునీరూపంబు
లోచనగోచరంబు గా ననుగ్రహింపు మని ప్రార్థింప భగవానుండు ప్రసన్న
వదనుం డై కుమారా నేఁడు నీ వడిగినట్ల మున్ను పరమేష్ఠి నన్నడుగ నే
నాతనికిం జూపినపరమార్థరూపంబ నీకుం జూపెద నని పలికినతోడన తద్దివ్య
రూపంబు నాకుఁ బ్రత్యక్షం బయ్యె. 1389

క. కనుఁగొంటి నిష్టదయితా, స్తనశాయిని నీలమేఘతనుకాంతిని గాం
చనచేలుని జగదభిరా, ముని నొకబాలునిఁ గదంబమూలమునందున్.

క. కనుఁగొంటిని బృందావన, మును శుకపికనీలకంఠముఖపతగమనో
జ్ఞనినాదబంధురంబును, ననిమిషసేవితము మునిజనాధ్యాసితముఁన్. 1391

క. నీలోత్పలదళకాంతులఁ, గాళిందిని గంటిఁ గృష్ణకరకమలమునన్
గ్రాలెడిగోవర్ధన మను, శైలంబును గంటిఁ గనులు సఫలంబులు గాన్. 1392

క. తిలకించితి గోపాలక, కలితంబును గోపికాప్రకరలీలాఢ్య
గ్వాలసనభూషితమును ని, ర్మలరుచిదీప్తమును నైనమధురాపురమున్. 1393

క. అవి యెల్లఁ జూచి చిత్తము, వివశం బగు చుండ వల్లవీనాథుఁడు న
న్నవలోకించి యనుగ్రహ,మివ్వరొత్తెడిదృష్టితోడ నిట్లు వచించెన్. 1394

సీ. మునినాథ నీవు చూచునదియె నారూప, మిదియె వెలుంగుల కెల్ల వెలుఁగు
నిష్క్రియం బిదె యిదె నిష్కళం బిదె శాంత,మిదె సచ్చిదానంద మిదియె ఋతము
నిఖలవేదాంతవినిశ్చితం బిదె యిదె, ఘన మిదె కారణకారణంబు
సూక్ష్మసూక్ష్మం బిదె సుస్థిరం బిదె సనా, తన మిదె సంపూర్ణతత్త్వ మిదియె

గీ. నేనె సర్వేశ్వరుండను నేనె సర్వ, శక్తియుతుఁడను నాయంద సకలలోక
ములునుమాయావిజృంభణముననుజేసి, కానఁబడుచుండుబహువిధాకారములను.

వ. నన్నుఁ గొందఱు ప్రకృతి యనియును గొందఱు పురుషుం డనియును గొంద
ఱీశ్వరుం డనియును గొందఱు ధర్మం బనియును గొందఱు ధనం బనియును
గొందఱు శూన్యం బనియును గొందఱు భావం బనియును గొందఱు శివుం డని
యును గొందఱు సదాశివుం డనియును గొంద ఱకుతోభయం బగుమోక్షం
బనియును గొందఱు వేదశిరోగతంబును సనాతనంబును నేకంబును నిర్వికారం
బును సచ్చిదానందరూపంబును నగుబ్రహ్మం బనియును బహువిధంబులం బలుకు
చుందురు. 1396

క. అనపాయిని యగుప్రేయసి, యన రాధయె నాకు మొదట నావల గోపీ
జనమును మధురయు బృందా, వనమును గోవులును ప్రేమవసతులు చూవే.

వ. మత్పరికరం బంతయుం గూడ నాతోడ నిత్యంబుగా నుండునదియ యనుటయు
నే నమందానందముం జెంది లోకేశ్వరా త్వత్ప్రేమపాత్రంబు లై నిన్ను నిత్యం
బును సేవించెడిమహాభాగ్యంబు వడసినయీగోపగోపీదేవకన్యాగోకదంబ
బృందావనశుకపికాదిపతత్త్రినదీగిరివేణువులయథార్థరూపంబులు నా కెఱింగింపు
మని ప్రార్థింప సంతసించి భగవానుం డి ట్లనియె. వత్సా 1398

గీ. శ్రుతులు గోపాంగనలు ముముక్షువులు దేవ,కన్యలు కదంబవృక్షంబు కల్పతరువు
గోపకన్యలు ఋక్కులు క్షోణిధరము, విశ్వవిదితుం డగునాదివిష్ణుభటుఁడు.

గీ. జమున సురధుని కోకిలశారికాళు, శాదిపక్షులు సిద్ధసాధ్యాదిసురులు
ద్వారికాంతులు గోపగోపాలసుతులు,నందనవనంబు బృందావనంబు కంటె.

సీ. ఇఁక వేణుతత్త్వంబు నెఱిఁగింతు దేవవ్ర, తుండు నా నొకబ్రాహ్మణుండు మున్ను
కర్మఠుం డయి విష్ణుధర్మంబు లెఱుఁగక, కావించుచుండఁగాఁ గర్మములను
మద్భక్తుఁ డైనబ్రాహ్మణుఁ డొక్కఁడొకతఱి,నరిగి తద్గృహమున కతిథి యగుచు
నొవరించి విష్ణుపూజను దులసీతీర్థ, మాతని కీయంగ నాదరమున
గీ. నతఁడు నవ్వుచు నశ్రద్ధ యావహిల్లఁ, బుచ్చుకొనియెను నెట్లొ తత్పూతజలము
వంశరూపంబు నవ్వుటవలనఁ దీర్థ, పానమున మత్ప్రియత్వంబు వాని కొదవె.
క. జననమునను వారాంజీవ్రత, మునను మరణమునను దహనమునను విముక్తిన్
జనులకు నాల్గువిధంబుల, నొనరించెడిపురము మధుర యొక్కఁడె యిలలోన్.
క. మానసమున నన్నెపుడును, ధ్యానించుచు నుండుపుణ్యధనులకుఁ దక్కన్
గానఁబడదు సాధారణ, మానవులకుఁ దరమె మధురమహిమము దెలియన్.
ఆ. మధుర యనుచు నొక్కమాఱు స్మరించిన, సకలపాపములును సమసిపోవుఁ
బూని దీక్ష నచట భూతేశ్వరుం డుండుఁ, బాపులకును మోక్షపదము నీయ.
క. నామధురను గనఁజాలఁడు, భూమిని నేమనుజుఁ డేని భూతేశునకున్
బ్రేమపురస్సరముగను బ్ర, ణామము గావించి యర్చనను జేయనిచోన్. 1405
క. నామధురాపురమును సు,త్రామాదులు సన్నుతించెదరు నిత్యంబున్
గామితము లెల్లఁ దీర్చెడి, ధామం బగుటను మదిష్టధామం బగుటన్. 1406
క. బాలుం డైనను ధ్రువుఁడు సు, శీల మెలర్పంగ నను భజించుట నిచటన్
ఘాలాత్ముఁ డైనఁ జెందం, జాలనిమత్పరమపదము సంపాదించెన్. 1407
క. నానగరంబున నెంతటి, హీనుం డైనను ద్యజించె నేని యసువులన్
వానికి జన్మజరాదులు, లేనిపదం బబ్బుఁ గర్మలిప్తుఁడు గామిన్. 1408
గీ. ఏను జెప్పినవిషయంబు లెల్ల వేద, సార మని నమ్ము మిందు సంశయము లేదు
తెలిపితిని దత్త్వమును నీకుఁ దేటపడఁగ,నని వచించి యంతర్ధాన మయ్యె నబల.
వ. మఱియొకవృత్తాంతంబుఁ దెలిపెద. వినుము. మున్నొక్కనాఁ డేకాంతంబుగ నున్నసమయంబున నుద్ధవుండు సనత్కుమారునికడ కేఁగి ప్రణమిల్లి స్వామీ గోపికావృత్తాంతంబు సవిశేషంబుగా నా కెఱింగింపు మని యడుగుటయు సనత్కుమారుం డాహ్లాదంబున నతని కిట్లనియె. 1410

—: అర్జునవృత్తాంతకథనము :—

సీ. అర్జునుం డొకనాఁడు హరిసన్నిధికిఁ బోయి, సాష్టాంగవందనం బాచరించి
స్వామి గోపికలు నీవల్లభ లంటివి, తద్విషయం బెల్ల దాఁపకుండ
హితుఁడ నై నట్టినా కెఱిఁగింపు మనుటయుఁ, గృష్ణుఁడు నగుచు వీక్షించి యతని
వత్స తచ్చరితంబు వచియించునెడ నీకు, వారిని జూడంగ వాంఛ వొడము
గీ. బ్రహ్మరుద్రాదులకుఁ గూడఁ బడయరాని, తద్విలోకనభాగ్యంబు తదితరులకు
నెట్లు సమకూడఁగలుగు నీవిట్టియాశ, విడిచి వేఱొకవిషయంబు నడుగు మనిన.

ఆ. అంత నతఁడు మిగుల సంతాప మొందుచుఁ, బడియె స్వామికాళ్లపయిని నపుడు
లేవ నెత్తి వాని గోవిందుఁ డిరుగేల, నెదను గృప దలిర్ప నిట్టు లనియె. 1412

క. చెప్పఁగ నే మగుఁ దత్కథ, లప్పరమానందధామ మవలోకింపన్
జొప్పడెడిమార్గమును నేఁ, జెప్పెద నొనరింపు మట్లు శ్రేయం బొదవున్. 1413

వ. సృష్టిస్థితిలయకారిణి యగుత్రిపురసుందరీపరదేవత తక్క నితరదేవత లెవ్వరును
నాదివ్యధామముం జూప సమర్థులు కానేరరు. కావున నాపరదేవతను నీ వారా
ధించితి వేని మద్దివ్యధామసందర్శనానందలాభంబు నీకు సిద్ధించు నని యనుగ్ర
హించుటయుఁ బార్థుండు మహానందభరితాంతరంగుఁడై శ్రీమత్త్రిపురసుందరీ
శ్రీపాదుకాతలంబుం దరిసి యచ్చట నానారత్నఖచితసోపానశోభితం బగుచింతా
మణివేదికయును దానిపై సర్వర్తుశోభాభరితంబును నానాపుష్పవిరాజితంబును
స్రవన్మాధ్వీకశీకరంబును శుకపికశారికాషట్పదకపోతచకోరాదిపతత్త్రినినాదమే
దురంబును నగుకల్పవృక్షంబును దన్మూలంబున దేదీప్యమానం బగురత్న
మందిరంబును దన్మధ్యంబునఁ గోటిసూర్యప్రకాశమానం బగురత్నసింహాస
నంబును దానిపై బాలార్కశోభావిభాసురాంగియును నానాలంకారభూషిత
యును నవయౌవనసంపన్నయును సృణిపాశధనుశ్శరవిభ్రాజమానచతుర్భుజ
యును బ్రహ్మవిష్ణుమహేశ్వరకిరీటమణిరశ్మిప్రభాలంకృతపాదపద్మయును నణి
మాదిపరివేష్టితయును సకలామరసంసేవితయును సుప్రసన్నవదనయును భక్త
వత్సలయును నగుత్రిపురసుందరిం దిలకించి పులకితదేహుండై నిజనామముం
జెప్పుచు నమస్కరించి కృతాంజలియై కట్టెదుట నిలువంబడి యుండుటయు
నామహాదేవి కరుణార్ద్రకటాక్షంబుల నాతనిం జూచి. 1414

గీ. ఎట్టిక్రతు వొనరించితో యెట్టిదాన, మిచ్చితివొ పాత్రుఁ డగువాని కెట్టితపము
చేసితివొ యెట్టివ్రతము చేసితివొ శౌరి, కిట్టియనుకంప గలుగ నీయెడల వత్స.

ఆ. హరవిరించిముఖులయందును సురలందు, మునులయందు భక్తజనులయందు
నెవరియందుఁ గూడ నెపుడును గలుగని, కరుణ నీయెడలను గలిగె హరికి.

క. కాకుండిన నెవ్వరికిని, నేకాలంబునను గాననీయనిపదమున్
నీకున్ జూపఁ దలంచునె, వైకుంఠుం డెంతపుణ్యవంతుఁడవో సుతా. 1417

వ. నీకుఁ గలమనోరథార్థంబు నా కవగతం బయ్యె. మదీయకులకుండసరోవరంబున
స్నానం బొనరించి శీఘ్రంబ రమ్మని యానతిచ్చుటయు నర్జునుండు తదాజ్ఞా
ప్రకారంబున స్నాతుండై వచ్చి సప్రశ్రయంబుగా నిలువంబడి యుండ నప్పర
దేవత తద్దక్షిణకర్ణంబున బాలామంత్రంబు నుపదేశించి తదనుష్ఠానవిధానం
బంతయుం జెప్పి జపింపు మనుటయు నాతండు తదుక్తవిధివిధానంబున దీక్షితుం
డై తన్మంత్రానుష్ఠానంబు నిర్వర్తించి నివేదింప నాజగదీశ్వరి సంతసించి వత్సా
నీ కిప్పుడు కృష్ణలీలాధామసందర్శనాధికారంబు గలిగె నని పలికి నిజవయస్య

యగుసర్వకామదాదేవి నాలోకించుచునంత నామె కిరీటిని గోలోకంబునకుం బై నున్నబృందావనంబునకుం దోడ్కొని పోవుటయు నాతండు పూర్ణప్రేమరసాత్మకంబును నిత్యరాసమహోత్సవంబును బరమరహస్యంబును వాయుధృతంబును దివ్యకళాదేదీప్యమానంబును నగుబృందావనంబును దివ్యచక్షువులచేఁ దిలకించి పారవశ్యంబున మేను మఱచి పడి కొంతసేపునకు లబ్ధసంజ్ఞుం డై యామెకరావలంబంబున లేచి యించుక స్థైర్యంబు వహియించి తల్లి నాకింకఁ గర్తవ్యం బేమి యని యడుగుటయు సర్వకామదాదేవి యాతనిం దోడ్కొని చని బృందావనదక్షిణభాగంబున నొక్కదివ్యసరోవరముం జూపి వత్సా నీ వీహ్రదంబున మునింగితి వేని సకలవిశేషంబులును నీకు గోచరించు నని వచియింపఁ బార్థుండత్యౌత్సుక్యంబున నాహ్రదంబున మునుంగ నామె యంతర్ధానంబు నొందె. అంతట నర్జునుండు. 1418

సీ. కుటిలంబు లగునీలకుంతలంబులతోడ, ముదువు సూపెడిముద్దుమోముతోడఁ
గొమరారుమాణిక్యకుండలంబులతోడ, భ్రమము గొల్పెడునురోజములతోడ
స్మరచాపమును గెలిసలుపుభ్రూలతతోడ, ఖంజనంబుల నేలుకనులతోడఁ
గనకకాంచీలసత్కటిమండలముతోడ, రమణీయకరపద్మాబ్జములతోడ

గీ. మనములను దోఁచుకొనుచక్కఁదనముతోడఁ
జెలువు మీఱెడిశృంగారకళలతోడఁ
బ్రియతమం బగుకైశోరవయసుతోడఁ
గలికి యై వచ్చెఁ దత్సరోజలమునుండి. 1419

ఆ. వచ్చి కృష్ణమాయవలన విస్మృతపూర్వ, దేహుఁ డై కిరీటి దిగ్భ్రమంబు
గలిగి చూచుచుండఁగా నిట్లు వినవచ్చె, నుప్పరంబునుండి యొక్కఫణితి. 1420

గీ. కలికి యీమార్గమున నె శీఘ్రముగ నేఁగి, చేరి పూర్వహ్రదంబు స్పృశింపు మందుఁ
గలజలంబును గలుగును గార్యసిద్ధి, చింతిలకు మందె కలరు నెచ్చెలులు నీకు.

క. అని విరమించుటయును నా, యనద యుదితధైర్య యగుచు నాహ్రదమునకుం
జని తత్సలిలోపస్పర్శన మొనరిచి నిలిచె నొక్కక్షణ మచ్చోటన్. 1422

గీ. అంతటను గొంద అచ్చటి కరుగుదెంచి, మధురమధురాకృతులు గలమందగమన
లాలతాంగిని వీక్షించి యబ్రపడుచు, స్వాంతములలోన నుండ నాసమయమందు.

వ. ఆవిలాసినులలో నుండి ప్రియముద యనునొక్కకంబుకంఠి యాకాంతామణిం దరిసి యి ట్లనియె. 1424

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ నీజనకుం డెవండు నీ
కెవ్వఁడు భర్త యెందు వసియించెద విచ్చటి కేఁగుదేరఁగా

నెవ్విధిఁ గల్గెఁ జెప్పు మన ని ట్లనియెన్ మొగ మోర సేసి యా
పువ్విలుకానికోల పువుఁబోఁడిరొ యే మనవచ్చు నాకథన్. 1425

చ. ఎవ తెనొ నేను నాజనకుఁ డెవ్వఁడొ యెవ్వఁడొ నాథవుండు నా
నివసతి యేదొ నే నెఱుఁగ నిక్కముఁ జెప్పితి వ్యోమవాణి మీ
సవిధముఁ జేర్చె న న్నొకప్రశస్తసరస్తటినుండి నేఁడు నా
కవగత మైన దియ్యదె సుమా యిఁక మీవిషయంబు సెప్పఁడీ.

క. అనవుడుఁ బ్రియముద యి ట్లని, యెను మే మెల్లరము గూడ బృందావననా
థునకు విహారవధూటీ, జనులము వనజాక్షి ప్రాణసఖులము నీకున్. 1427

వ. వీరలు శ్రుతిగణంబులు. వీరలు మునిగణంబులు. వీరలు నిత్యలును నిత్యవిహారిణులును నిత్యకేళీధామంబులును నై బృందావననాథునకు ముఖ్యకాంత లై యున్నవారు. వీరలలోఁ గొందఱనామంబులం జెప్పెద. ఈమె పూర్ణరస. ఈమె రసమంథర. ఈమె రసాలయ. ఈమె రసపల్లరి. ఈమె రసపీయూషధార. ఈమె రసతరంగిణి. ఈమె రసకల్లోలిని. ఈమె రసవాపిక. ఈమె యనంగసేన. ఈమె యనంగమాలిని. ఈమె మదయంతి. ఈమె రసవిహ్వల. ఈమె లలిత. ఈమె లలితయావన. ఈమె యనంగకుసుమ. ఈమె మదనమంజరి. ఈమె కలావతి. ఈమె రతికళ. ఈమె కామకళ. ఈమె కామదాయిని. ఈమె రతలోల. ఈమె రతోత్సుక. ఈమె రతిసర్వస్వ. ఈమె రతిచింతామణి. ఈమె నిత్యానంద. ఈమె నిత్యప్రేమరసప్రద. ఇంక శ్రుతిగణంబులలోఁ గొందఱనామంబులం జెప్పెద. ఈమె యుద్గీత. ఈమె సుగీత. ఈమె కలగీత. ఈమె కలసురాఖ్యాత. ఈమె కలకంఠిక. ఈమె విపంచి. ఈమె క్రమపద. ఈమె బహుహుత. ఈమె బహుప్రయోగ. ఈమె బహుకల. ఈమె కలావతి. ఈమె క్రియావతి. ఇంక మునిగణంబులలోఁ గొందఱనామములం జెప్పెద. ఈమె యుగ్రతప. ఈమె బహుగుణ. ఈమె ప్రియవ్రత. ఈమె సువ్రత. ఈమె సురేఖ. ఈమె సుపర్వ. ఈమె బహుప్రద. ఈమె రత్నరేఖ. ఈమె మణిగ్రీవ. ఈమె సుపర్ణ. ఈమె యాకల్ప. ఈమె సుకల్ప. ఈమె రత్నమాలిక. ఈమె సౌదామిని. ఈమె కామదాయిని. ఈమె భోగద. ఈమె విశ్వమత. ఈమె ధారిణి. ఈమె ధాత్రి. ఈమె సుమేధ. ఈమె కాంతి. ఈమె యపర్ణ. ఈమె సులక్షణ. ఈమె సుదతి. ఈమె గుణవతి. ఈమె సౌకలిని. ఈమె సులోచన. ఈమె సుమన. ఈమె యశ్రుత. ఈమె సుశీల. ఈమె రతిసుఖప్రదాయిని. ఇంక గోపకన్యల మగుమాలోఁ గొందఱనామములం జెప్పెద. ఈమె చంద్రావళి. ఈమె చంద్రిక, ఈమె శుభ. ఈమె చంద్రరేఖ. ఈమె చంద్రమాల. ఈమె చంద్రప్రభ. ఈమె చంద్రకల. ఈమె వర్ణావళి. ఈమె వర్ణమాల. ఈమె మణిమాలిక. ఈమె మంత్రి. ఈమె నవమంత్రి. ఈమె శేఫాలిక. ఈమె వర్ణప్రభ, ఈమె సుప్రభ,

ఈమె మణిప్రభ. ఈమె హారావళి. ఈమె తారామాలిని. ఈమె మాలతి. ఈమె యూథి. ఈమె వాసంతి. ఈమె నవమల్లిక. ఈమె సౌగంధిక. ఈమె కస్తూరి. ఈమె పద్మిని. ఈమె కుముద్వతి. ఈమె రసోల్లాస. ఈమె చిత్రబృందాసమ. ఈమె రంభ. ఈమె యూర్వశి. ఈమె సురేఖ. ఈమె స్వర్ణరేఖిక. ఈమె కాంచనమాల. ఈమె సతసంతతిక. 1428

క. మాతోడఁ గూడి నీవును, జేతోమోదంబు గలుగఁ జేయుము కృష్ణ
ప్రీతికర మయినవిధులనె, యేతాదృశ మయినమహిమ మెనయుదు వబలా. 1429

వ. అని చెప్పి పూర్వసరోవరంబున స్నానంబు చేయించి దీక్షావిధిపురస్సరంబుగా నాయమకు బృందావనకలానాథప్రేయసీమంత్రంబు నుపదేశించి తత్పురశ్చరణవిధానంబు నెల్లం దెలుపుటయు నాకన్యామణి వరుణబీజపరంబును వహ్నిబీజపురస్కృతంబును జతుర్థస్వరసంయుతంబును నాదబిందువిభూషితంబును బ్రణవసంపుటితంబును సర్వసిద్ధిప్రదంబును నగునమ్మంత్రంబు జపియించి పూజాహావనాదిక్రియాకలాపంబు యథావిధి నిర్వర్తించి నుతియించుచుండఁ గృష్ణప్రేయసి సంతుష్టమానస యై. 1430

క. వెలిఁగించుచు నిజతనుదీ, ప్తులచేతను దెసల నెల్లఁ దొలుకారుమెఱుం
గులప్రోవు నాఁగ వెలుఁగుచుఁ, గలుగఁగ విభ్రమము నిలిచెఁ గన్నులయెదుటన్.

క. నిలుచుటయు దేవి యెదుటను, దిలకించి తదీయరూపధేయము నత్తొ
య్యలి విగతచేష్ట యగుచున్, గలుగఁగ విస్మయము బొమ్మకై వడి నుండెన్.

వ. అంత రాధాదేవి యాకన్యామణిం జూచి బాలా నీవు నాకుఁ బ్రియసఖివి. నీకు మేలు గూర్చెద నని పలుక నాయమ యెట్టకేలకు స్మృతిం దెచ్చుకొని యాదేవిపాదంబులపైఁ బడుటయు నాస్వామిని యామెను దేవీసంగం బను నిజోత్తరసరస్తీర్థంబున స్నానంబు చేయించి సర్వతంత్రగోపితంబును స్మరణమాత్రసిద్ధిప్రదంబును నగుగోకులనాథమంత్రంబు నుపదేశించి యేతన్మంత్రపురశ్చరణంబు యథావిధిఁ జేయింపు మని తత్ప్రియసఖ యగుప్రియంవదతోడం జెప్పి యంతర్ధానం బయ్యె. అంతఁ బ్రియంవద చెప్పినట్టు లాకన్యామణి గోరోచనచందనకుంకుమాదిసుగంధద్రవ్యంబులచే నష్టదళపద్మంబు నిర్మించి దానిమీఁద యంత్రరాజమును దానిపయిని మంత్రరాజంబును లిఖయించి దానికిఁ బ్రాణప్రతిష్ఠయు షోడశోపచారంబులును గావించి నీలోత్పలదళశ్యామవిగ్రహుండును నానాలంకారభూషితుండును గందర్పకోటిసుందరాకారుండును రాసక్రీడారసలోలుండును నగునందనందనుని ధ్యానించుచుఁ దన్మంత్రరాజజపంబు గావించుచుండ భక్తివశుం డగుయశోదానందనుం డాకన్యామణిని రావింపు మని రాధాదేవికిం జెప్ప నాయమ శారద యనునిజసఖిం బంచి యాకన్యకను రావించె. అంత నాకన్యామణి యరుదెంచి. 1433

సీ. సర్వర్తుకుసుమభాస్వరమును మలయానిలా, సేవితము గంధవాసితమును
మకరందకణవృష్టిమంజులంబును మహా, నందరూపంబును సుందరమును
మాయూరనృత్యసమంచితంబును దివ్య, పత్త్రికాంతానాదచిత్రితమును
జారుప్రకాశజాజ్వల్యమానంబును, బ్రహ్మాదిదేవతాభావితమును

గీ. సత్త్వభరితంబును బ్రభావసంయుతమును, భువనమోహనమును సర్వపూజితమును
నిత్యమును గుప్తమును ముక్తినిలయనమును, నైన నందనవనము గన్నారఁ గాంచి.

వ. తన్మధ్యంబున నత్యద్భుతం బగు సువర్ణభూప్రదేశంబును నచ్చట లసన్మరకతచ్ఛదంబును బ్రవాళపల్లవశోభితంబును హేమదండంబును స్ఫటికప్రవాళమూలంబును నర్థిజనాభీష్టఫలప్రదంబును నగు కల్పవృక్షంబును దానిక్రింద రత్నమందిరంబును దానియందు సవ్యాపసవ్యసంస్థితంబు లగు శంఖపద్మనిధులను దానికిఁ జతుర్దిక్కటంబులందు నాల్గు కామధేనువులను దన్మధ్యంబున రత్నసింహాసనంబును దానిపై నష్టదళపద్మంబును గనుంగొని తత్పద్మమధ్యంబునందు. 1435

సీ. ఆజానులంబిబాహార్గళంబులవాని, బింబఫలాధరోష్ఠంబువానిఁ
గౌస్తుభశ్రీవత్సకలితవక్షమువానిఁ, గస్తూరికాతిలకంబువానిఁ
గందర్పశతకోటిసుందరాకృతివాని, హర్యక్షమధ్యమధ్యంబువాని
సజలధారాధరశ్యామదేహమువాని, దరహాసకలితవక్త్రంబువాని

గీ. రత్నకంకణభాస్వత్కరములవాని, మంజుమంజీరపాదపద్మములవాని
వేణుగానవిమోహితవిశ్వుఁ డైన, వాని రాసరసాలసుఁ డైనవాని. 1436

గీ. వామభాగస్థరాధికావనజగంధ, దత్తతాంబూలుఁ డగువాని నార్తగోప
కన్యకాలోకమాలికాకల్పుఁ డైన, వానిఁ గృష్ణునిఁ గాంచి వైవశ్య మొందె.

సీ. అంతట నచ్యుతుం డా కాంతయింగితం, బారసి సర్వజ్ఞుఁ డగుటఁ జేసి
తత్కరాంబుజమును దనకరంబునఁ బట్టి, తోడ్కొనిపోయి సంతోష మొదవఁ
గ్రీడావనంబునఁ గ్రీడించి సవిలాస, ముగ సౌఖ్యవార్ధిని ముంచి తేల్చి
చనుదెంచి మరల స్వస్థానంబునకు నైఁగ, గావింప శారదాదేవి కామె

గీ. యావధూటిని బశ్చిమహ్రదమునందు, ముంచుటయు శ్రాంతిపోవ నామోహనాంగి
మునిఁగి యర్జునుఁ డై లేచి ముందు నిలిచె, సౌఖ్యవిచ్యుతిజాతవిషాద మొదవ.

ఆ. అంత గృష్ణుఁ డతని నాత్మహస్తంబునఁ, దాఁకి తొలఁగిపోవఁ దద్విషాద
మనఘ నీవె మద్రహస్యవిదుండవు, నాకుఁ బ్రియసఖుండ వనంగ నీవె. 1439

గీ. అడిగితివి గాన నారహస్యంబు నీకుఁ
దెలిపితి ననుభవించితి తేటపడఁగ
నొరులకు వచింపకుము దీని నొట్టు సూవె
యనుటయుఁ దదాజ్ఞ తలఁ దాల్చి యతఁడు చనియె. 1440

క. అది యెంతయుఁ గూడను నా, హృదయమునకు గోచరించె నెఱిఁగింపకు మీ
విది యితరుల కని చెప్పఁగ, నుదయత్కౌతుకమున నేఁగి యుద్ధవుఁ డంతన్.

వ. కృష్ణునినిత్యలీలావిహారముం గాంచుచు నిప్పటికిని బృందావనంబునందె నివసించి
యుండు. మున్ను నారదుం డడిగినను దత్పరమరహస్యంబు నాతని కే నెఱిం
గింపనైతి నైనను దైవికంబుగా నారదుండు ప్రకృతిరూపంబు వడసె. 1442

క. అని చెప్పుటయును పార్వతి, విని సకలంబును మహేశ విన వేడుక గ
ల్గెను నారదుఁ డేచందం, బునఁ జెందెనొ ప్రకృతిరూపమును దెలుపఁ గదే.

వ. అని యడుగుటయు మహేశ్వరుం డద్రితనయ కిట్లనియె. 1444

—: నారదవృత్తాంతకథనము :—

సీ. నారదముని యొక్కనాఁ డరుదెంచి గో, లోకంబునుండి భూలోకమునకు
నైమిశారణ్యంబునకుఁ బోవ నందుండు, మును లందఱును దదర్చన మొనర్చి
నారద బృందావనరహస్యమును మాకు, వినిపింపు ముదయించె వినఁగ వేడ్క
యనుటయు సత్తపోధనుఁ డాత్మ నానంద, మిగురొత్తఁగను వారి కిట్టు లనియె

గీ. సాధుజనులార నే నొకసమయమందు
ధాతకడ కేఁగి ప్రణమిల్లి తండ్రి తెలుపు
మెఱుఁగ బృందావనరహస్య మేమొ నాకు
ననుచుఁ బ్రార్థించుటయును నవ్వనజభవుఁడు. 1445

సీ. నన్నుఁ దోడ్కొని శౌరిసాన్నిధ్యమున కేఁగి, సాష్టాంగవందనం బాచరించి
నామనోరథము నాస్వామికిఁ దెలుపంగఁ, గనికరంబున నన్నుఁ గాంచి శౌక స్గ
యమరమునీంద్ర యీ యమృతహ్రదంబున, స్నానంబు శీఘ్రంబ సలుపు మనియె
నపుడు మునింగి నే నాహ్రదంబునయందు, విస్మయం బొదవంగ వెలఁది నగుచుఁ

గీ. దత్సరఃపారమున నుంటిఁ దత్క్షణంబ,యంత ననుఁ జూచి యట నున్నయబ్జముఖులు
కలికి నీ వెవ్వతవొ యేమి కారణమున,నిటకు వచ్చితొ నీగాథ యెఱుఁగఁ జెపుమ.

క. అని యడుగుటయును నే నా, వనితలఁ గని చానలార స్వప్నమువోలెన్
గనఁబడియెడు నాకథ యే, మని చెప్పంగలుగుదును యథార్థము నంటిన్.

గీ. అంతటను వారిలో నున్నయబ్జవదన, యొక్కతె చతుర్దశాక్షరయుక్త మైన
కృష్ణమంత్రంబు సెప్పె నా కేకతముగ, నపుడు నేను దదాకృతి నందినాఁడ.

వ. అంత నన్నామహాదేవి కేలువట్టికొని సఖీమణి నాతోడ రమ్ము. నేను దుర్గా
తీతయు నిష్కళయు నగులలితాదేవి నని చెప్పుచు సచ్చిదానందవిగ్రహుండును
సనాతనుండును నగుకృష్ణునిసాన్నిధ్యమునకుం దోడ్కొని పోయె. 1449

గీ. అంత ననుఁ జూచి కృష్ణుఁ డాహ్లాదమొదవఁ,జెలియ రమ్మని పిలిచి నేఁ జెంత కరుగఁ
గౌఁగిటను జేర్చికొని నన్ను గాఢముగను, నోలలాడించి సౌఖ్యపయోధిలోన.

క. మదవతి యిదె బృందావన, మిదె ద్వాత్రింశద్వనం బిదే సురరూపం
బిదె పంచయోజనం బిదె, మదుపాశ్రయసముపలబ్ధమహిమము కంటే. 1451

గీ. ఇందుఁ గలపశువృక్షాదు లెల్లఁ గూడి, యంతకాలంబునందు నాయంద చేరు
నెచట నున్నను గూడ నే నిచోటు విడువ, నొక్కక్షణ మేని చెప్పితి నున్నమాట.

గీ. నానికేతన మైనబృందావనమునఁ, గలవ్రజాంగన లెల్ల నిక్కముగఁ జూడ
యోగినులచూవె యిచ్చట నున్నయమున, సుధను గురియించునట్టిసుషుమ్న చూవె.

గీ. దేవతలు భూతములును బృందావనమున
నుంద్రు సూక్ష్మాకృతులతోడ యుగయుగమున
జరుగు సృష్టిలయంబు లిచ్చట నె చర్మ
చక్షురవిలోక్య మగురహస్థాన మిదియ. 1454

క. ఇది తేజోమయ మగునా, స్పద మిది యెంతటిమహానుభావుల కైనన్
విదితము గానిది ముక్తి, ప్రదాయకం బైననిత్యపద మిదె చూవే. 1455

గీ. నేనె కామకళాత్మకుఁ డైనవాసు, దేవుఁడను నేనె రాధ రాధికయె నేను
యోషిదాకారుఁడను నేను యోషమాంసు, కాకృతియ లేదు చూవె మాకంతరంబు.

క. నామంత్రము నాతత్త్వము, నామాహాత్మ్యంబు నెఱుఁగునరు లెల్లరు నా
ప్రేమమునకుఁ బాత్రము లై, క్షేమము నొందుదురు రాధ చెలువున నబలా.

క. వనజేక్షణ నాబృందా, వనపరమరహస్య మెల్లవారికిఁ జెప్పం
జన దతిగోప్యము పామర, జనములు నాలీల లెఱుఁగఁ జాలరు వింటే. 1458

క. అని పలికె రాధికానన, మును గనుటయు నామె నన్ను ముం దిడుకొని చ
య్యన వచ్చి తత్సరోవర, మున మునుఁగు మ టంచుఁ జెప్ప మునిఁగితి నంతన్.

క. కరమున వీణను దాలిచి, సురముని నై లేచి నేను జోద్యముగ సరో
వరమున నుండి కనుంగొన, హరివల్లభ గోచరింపదాయెను నాకున్. 1460

క. అని వచియించుటయుఁ దపో, ధను లెల్లరు నతనిధన్యతను సంతోషం
బునఁ గొనియాడుచు నుండఁగ, ననిమిషముని చనియె దివికి నానందమునన్.

క. అని చెప్పుటయును బార్వతి, మనమున నాశ్చర్యపడుచు మహనీయ యుపేం
ద్రునిచరితలు సంగ్రహముగ, వినిపింపుము నాకు వినఁగ వేడుక యయ్యెన్.

క. అని యడుగుటయును హరుఁ డి, ట్లనియెను నే నెంతవాఁడ నచలాత్మజ కృ
ష్ణునిచరితంబులు చెప్పఁగ, విను మైనను శక్తికొలఁది వినిచెద నీకున్. 1463

వ. కృష్ణుండు శిశుపాలుని వధించినవార్త నాలించి దంతవక్త్రుండు గృష్ణుని నెదు
ర్కొన మధురాపురంబునకు వచ్చుటయు మాధవుండు బృందావనంబునుండి
మధురాపురంబున కరుదెంచి దంతవక్త్రుని సంగరంబున వధించి యమునను
దాఁటి నందవ్రజంబుం జేరి యశోదానందులకు వందనం బొనరించి యం దుండు
గోపజనంబుల కెల్ల సమగ్రవస్త్రాభరణాద్యుపాయనంబులచే సంతృప్తి గలిగించి

పుణ్యవృక్షసమాకీర్ణం బగు కాళిందీపులినంబున గోపికల నెల్లఁ గ్రీడాసుఖాంభోధి నోలలాడించి యందుండు నందాదిసకలగోపజనంబులను నఖిలపశుపక్షిమృగాదులను దివ్యరూపంబులతోడ విమానంబుల నెక్కించి వైకుంఠధామంబునకుం బనిచి బ్రహ్మాదిసుపర్వకోటులు నుతింప ద్వారవతిం బ్రవేశించి యందు వసుదేవోగ్రసేనసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధాక్రూరాదులు ప్రత్యహంబునుం బూజింప విశ్వరూపధరుండై దివ్యరత్నమయలతాగృహాంతరంబుల సురతరుకుసుమపర్యంకంబులం జేర్చి యష్టాధికషోడశసహస్రమహిషీజనంబుల ననవధికక్రీడాపరానందపరవశలం గావించి యందుండుస్థావరజంగమంబులకుం గూడ భవబంధవిముక్తి చేకూరఁ బునరావృత్తిరహితం బగు మోక్షసామ్రాజ్యంబుం బ్రసాదించె. 1464

ఆ. అవతరించి యట్లు యదువంశమునఁ గృష్ణుఁ, డఖిలదేవతాహితార్థ మవని
భార ముడుగఁ జేసెఁ బరిమార్చి రాక్షస, గణము నెల్ల ముజ్జగములు మెచ్చ.

ఆ. అచ్యుతుం డనంగ నవ్యాకృతబ్రహ్మ, మతఁడు ప్రకృతిసంస్థుఁ డగుట గుణము
లనుభవించినట్లు కనఁబడుటయె కాని, కాఁడు భోక్త కర్త గానికతన. 1466

గీ. ప్రకృతివలననె పుట్టును వికృత మెల్లఁ
బుట్టునది యంతయు లయంబుఁ బొందు చుండుఁ
బ్రకృతిపరుఁ డైనకృష్ణుఁడు ప్రభవ మొందు
వాఁడు లయ మొందువాఁడును గాఁడు చూవె. 1467

క. అని చెప్పుటయును బార్వతి, యనవధికం బైనమోద మందఁ దొడంగెన్
మనమున ననవుడు సూతునిఁ, గనుఁగొని శౌనకుఁడు మెల్లఁగా ని ట్లనియెన్.

గీ. సూత చెప్పితి వెంతేని చేత మలర, సంసృతిచ్ఛేదకం బైన శౌరిగాథ
సకలజనతారకం బైనశార్ఙ్గిమంత్ర, మింకఁ జెప్పుము జపియింప నేది యేని.

చ. అనవుడు సూతుఁ డి ట్లనియె హర్ష మెసంగ మునీంద్ర చెప్పెదన్
వినుము సుపర్వమౌని యొకవేళను యామునతీరమందు ద
ద్మునిఁ బొడగాంచి తత్పదసరోజయుగంబునకున్ బ్రణామముల్
బొనరిచి శిష్యభావమును బొందుచు ని ట్లడిగెన్ వినమ్రుఁడై. 1470

సీ. సర్వజ్ఞ మంత్రరాజము మున్నుగాఁ గల, మంత్రముల్ మున్ను సమగ్రముగను
నీయనుగ్రహమున నేను సంపాదించి, పర్ణాంబుఫలవాయుభక్షి నగుచు
నియమితేంద్రియుఁడ నై నేలపై శయనించి, వశుఁడను గాక షడ్వర్గమునకు
శతసహస్రాబ్దముల్ జపియించి జపియించి, కడ కాత్మసంతుష్టి గాన నైతిఁ

గీ. గాన నిప్పుడు సంసారకలుష మెల్ల, నడఁచి త్రుటిలోనఁ గడ తేర్చునట్టిమంత్ర
మేది యేనియు దయచేయు మెపుడుఁ గూడ, ననియమంబుగ జపియించునట్లు నాకు.

క. అని వేఁడుటయును హరుఁ డి, ట్లనియెను మౌనీంద్ర గోప్య మైనను నీకున్
విని చెదను గృష్ణమంత్రం, బును లోకహితాభిలాషమున విను మింకన్. 1472

—: రాధాకృష్ణమంత్రకథనము :—

వ. అని పలికి "గోపీజనవల్లభచరణాౕ శరణం ప్రపద్యే" యనుషోడశార్ణ మంత్రంబు నుపదేశించి వత్సా యీమంత్రంబు యుగళం బనియును మంత్ర చింతామణి యనియును ద్వయ మనియును బంచపది యనియును బ్రసిద్ధిం బడసినరాధాకృష్ణమంత్రంబు. 1473

గీ. శ్రద్ధవలనను గాని యశ్రద్ధవలనఁ, గాని యీమంత్రము జపించె నేని కృష్ణ
సఖులసాన్నిధ్యమును జెందఁజాలునతఁడు, శ్రమ మొకింతయు లేక నిస్సంశయముగ.

వ. ఈమంత్రంబున కరిమిత్త్రాదిశోధనంబును న్యాసవిధానంబును బురశ్చరణంబును దేశకాలనియమంబును లేవు. విష్ణుభక్తి గలిగె నేని బ్రాహ్మణాదిచండాల పర్యంతంబును స్త్రీపురుషవిభేదంబు లేక యెల్లవారును నేతన్మంత్రాధి కారంబు గలవారలు. 1475

ఆ. సకలవేదశాస్త్రసారజ్ఞుఁ డైనను, దాత యైన విశ్వనేత యైనఁ
గృష్ణభక్తి లేనియెడలఁ గాఁ డధికారి, యుగళమంత్రజపము నొనరుపంగ.

ఆ. కాన విష్ణుభక్తి లేనివానికిఁ గృత, ఘ్నునకు నాస్తికునకుఁ గ్రోధనునకు
నపరిశోధితునకు విపరీతబుద్ధికిఁ, జనదు యుగళమంత్రమును వచింప. 1477

వ. న్యాసపూర్వకవిధానంబు హరి కత్యంతసంతుష్టిం గలిగించు నని యేతన్మంత్రం బునకుఁ గొందఱు న్యాసాదివిశేషంబులం జెప్పుదురు. అట్టిపట్ల దీనికి ఋషిని నేను. గాయత్త్రి ఛందంబు. వల్లవీకాంతుండు దేవత. "గం" అనునది బీజంబు. "నమః" అనునది శక్తి. సప్రియుం డగుకృష్ణునిదాస్యంబున వినియోగంబు. ఆచక్రాదిమంత్రంబులచేఁ గాని మంత్రబీజం బగు "గం"కారంబుచేఁ గాని కరాంగన్యాసంబులఁ గావింపవలయు.

—: రాధాకృష్ణధ్యానకథనము :—

పిమ్మటఁ బీతాంబరధరుండును ఘనశ్యాముండును ద్విభుజుండును వనమాలి యును బర్హిబర్హాపీడుండును శశికోటినిభాననుండును ఘూర్ణాయమాననయనుం డును గర్ణికారకర్ణావతంసుండును నభితశ్చందనజుష్టమండలాకారకుంకుమబిందు తిలకవిరాజమానఫాలమధ్యభాగుండును గుండలమండితుండును దరుణాదిత్య సన్నిభుండును ఘర్మాంబుకణలసత్కపోలదర్పణుండును బ్రియాస్యన్యస్తలోచ నుండును విలాసోన్నతభ్రూవిరాజమానుండును నాసాగ్రవిస్ఫురన్మౌక్తిక భూషణుండును దశనద్యుతిజ్యోత్స్నావిరాజత్పక్వబింబఫలాధరుండును కేయూ రాంగదవిభూషితుండును రత్నకంకణముద్రికావిలసత్కరుండును వామపాణిధృత మురళీసరోరుహుండును గాంచీదామస్ఫురన్మధ్యుండును నూపురాలంకృతపాదుం డును రతికేళీరసావేశచపలుండును జపలేక్షణుండును హసన్ముఖుండును సస్మిత ప్రియాసమేతుండును బృందావనమధ్యస్థితకల్పతరుమూలరత్నసింహాసననిషణ్ణుం

డును నగు శ్రీకృష్ణుని దద్వామపార్శ్వస్థయును నీలచోళకసంవీతయును దప్త
హేమసమప్రభయును బట్టాంచలావృతార్ధస్మేరాననయును గాంతాననవిన్యస్త
లోచనయును జకోరీచలేక్షణయును సంగుష్ఠతర్జనీద్వంద్వనిజప్రియముఖాంబు
జార్ప్యమాణతాంబూలవీటికయును ముక్తాహారస్ఫురచ్చారుపీనోన్నతపయో
ధరయును గృశమధ్యయును బృథుశ్రోణియును గింకిణీజాలమండితయును రత్న
తాటంకకేయూరముద్రావలయమంజీరధారిణియును లావణ్యసారముగ్ధాంగియును
సర్వావయవసుందరియును నానందరసమగ్నయును నవయావనయును బ్రసన్న
యును నగు రాధను దత్సమానవయోగుణలును జామరవ్యజనహస్తలును సేవా
పరాయణలును నగు సఖీమణులను ధ్యానింప వలయు. ఇంక మంత్రార్థముం
జెప్పెద. వినుము. 1478

—: రాధాకృష్ణమంత్రార్థకథనము :—

సీ. అంతరంగవిభూతు లగు చిదాదుల బహి, రంగాంశము లగు మాయాదికముల
విశ్వగోపనము గావించుటచే గోపి, యనఁబడు రాధ నా నదియ చూవె
యామహాశక్తి కృష్ణాహ్లాదకారిణి, యగుటచే హ్లాదిని యనఁగఁబడియె
హ్లాదిని యన లక్ష్మి యన నొక్కటియె కృష్ణుఁ, డనఁగ నారాయణుం డనఁగ నొకఁడె
గీ. యాయమయె దుర్గ ధూర్జటి యతఁడె యతఁడె
వజ్రి యామెయె శచి చతుర్వదనుఁ డతఁడె
యాయమయె వాణి వే యేల యాద్వయంబె
చిదచిదాత్మక మగు జగచ్ఛ్రేణి యెల్ల. 1479

సీ. త్రిభువనంబులలోనఁ బృథివీతలము మాన్య, మందు జంబూద్వీప మధికతమము
భరతవర్షం బందుఁ బ్రాశస్త్యపాత్రంబు, మధురాపురం బుత్తమంబు దాని
యందులో శ్లాఘనీయంబు బృందావనం, బందు గోపీసమూహంబు వరము
దానిలో మేటి రాధాసఖీవర్గంబు, దానిలో శ్రేష్ఠ రాధావధూటి
గీ. యావధూమణిసన్నిధానాతిశయము, వలనను యథోత్తరముగను గలుగు ఘనత
యన్నిటికిఁ గూడ నిదియె సత్యంబు దీని, కంటె నాధిక్యము మఱొండు గానరాదు.

వ. ఆరాధయే గోపి యనంబడు. నాయమ సఖీగణంబు గోపీజనంబు నాఁబడు. తన్నా
యకు లగు రాధాకృష్ణులు గోపీజనవల్లభు లనంబడుదురు. తచ్చరణంబులు గోపీ
జనవల్లభచరణంబులు నాఁబడు. అట్టిచరణంబులను జీవుఁడ నగు నేను శరణు
పొందుచున్నాఁడను. 1481

గీ. శరణు చొచ్చిన నేను నిస్సంశయముగ, వారివాఁడన వేఱొండువాఁడఁ గాను
నాకు నే దేని యున్న నంతయును గూడ, వారిదియ కాని కాదు గవ్వయును నాది.

—: రాధాకృష్ణమంత్రజపఫలకథనము :—

క. అని యెఱుఁగుము తన్మంత్రం, బున కర్థము దీని నెల్లపుడు భావింపం
గను సర్వపాతకక్షయ, మును రాధాకృష్ణదాస్యమును జేకూరుఁ. 1483

వ. యుగళార్థము న్యాసము ప్రపత్తి శరణాగతి యాత్మార్పణ మనునవి యైదును బర్యాయంబులుగాఁ దెలియం దగు. మఱియును దత్తుల్యం బగు "నమో గోపీజనవల్లభాభ్యాం" మనుమఱియొక రాధాకృష్ణమంత్రంబు పదద్వయంబుచేతను దశార్ణంబులచేతను విరాజిల్లుచున్నయది. యుగళమంత్రజపఫలంబు దీనికింగలుగు.

గీ. ఇంక దీక్షావిధిని వచియింతు నీకు; వినుము తచ్ఛ్రవణంబు గావించినంత
మాత్రమునఁ గల్గు సంసారమగ్నులైన, మానవుల కెల్ల ముక్తి తన్మహిమ మేమొ.

—: రాధాకృష్ణమంత్రదీక్షావిధికథనము :—

సీ. గ్రహియించి సర్వజగంబులును నశించు, నవియె యంచు నిజానుభవమువలన
సుఖములు గాఁగఁ దోఁచుచునుండునవి యెల్ల, దుఃఖంబుల యటంచుఁ దుదకు నెఱిఁగి
సంసారమున రోసి సద్గురువును డాసి, యతనికి వందనం బాచరించి
తనపరితాప మంతయును నివేదించి, కడతేఱుమార్గంబు నడుగవలయు

గీ. నంతటను దేశికోత్తముఁ డర్హుఁడైన, ఛాత్రునకు మృత్తుచేఁ గాని చందనమునఁ
గాని లిఖియించి శంఖచక్రములు వామ, దక్షిణభుజంబులందు యథాక్రమముగ.

వ. ఫాలము మున్నగుచోట్ల నూర్ధ్వపుండ్రంబులు దిద్ది దక్షిణకర్ణంబునందు మంత్రద్వయంబు నుపదేశించి మంత్రార్థంబు నెఱింగించి దాసుం డనుపేరు పెట్టవలయు.

గీ. అంతటను శిష్యుఁ డధికభక్త్యాదరముల, గురుని నర్చించి తనశక్తికొలఁది వైష్ణ
వులకు మృష్టాన్నమును బెట్టవలయు దాన, సంస్కృతుండగుఁ బంచసంస్కారములను.

వ. అంకనంబును నూర్ధ్వపుండ్రంబును మంత్రంబును నామంబును యాగంబును బంచసంస్కారంబులు గాఁ జెప్పం బడియె. అందు నంకనం బన సచ్ఛిద్రపుండ్రంబు. మంత్రం బన యుగళంబు. నామం బన దాసనామంబు. యాగం బన గురువైష్ణవపూజ యని యెఱుంగునది. ఇంక వైకుంఠప్రాప్తిసాధనంబు లగు ప్రపన్నధర్మంబుల నెఱింగించెద. వినుము. 1489

—: ప్రపన్నధర్మకథనము :—

క. తనయిష్టదేవతయె యను, మనమున గురువైష్ణవులకు మఱి మఱి మోదం
బును గొలుపవలయు గౌరవ, మును భక్తియు నయము వినయమును వెలయంగన్.

క. తనవలచినయింతులభ, ర్త్సనతాడనములను గామి సైఁచెడిరీతిన్
జను సైఁపగ గురువైష్ణవ, జను లొనరుచుచేఁత లెల్ల ఛాత్రుం డెపుడున్. 1491

సీ. కలుగఁగల దైహికంబు ప్రాక్కర్మమునను, తానెయాముష్మికమునిచ్చు దానవారి
యనెడునిశ్చయమున నుండ నగును లేక, యత్నమాముష్మికమునను నైహికమున.

గీ. ప్రాణనాథుండు ప్రోషితుండైనవేళఁ, బతినె తలఁచుచు వినుచును బతిగుణములె
పతినె కీర్తించుచును నుండుభార్యవోలె, భక్తుఁడుండంగఁ దగుఁ గృష్ణభక్తుఁడగుచు.
గీ. ప్రాణనాథుండు దేశాంతరంబునుండి, యరుగుదేరంగ సతి మైనయతివ ప్రేమ
పారవశ్యంబునను జేయుపనులు చేయఁ, దగును భక్తుఁడు రాధికాధవునిఁ గాంచి.
గీ. అన్యసాధన మన్యకార్యమును నన్య, శరణమును నన్యసాధనేచ్ఛయును లేక
యనవరతమునుగృష్ణునియందెమనముఁ, దగులుకొలుపంగఁదగుభక్తుఁడగుజనుండు.
క. చన దన్యుని స్మరియించుట, యును గీర్తించుటయుఁ బూజ యొనరించుటయున్
గనుఁగొనుటయు మ్రొక్కుటయును, జనార్దనునిఁ దక్క భక్తజనముల కెందున్.
క. తినరా దన్యోచ్ఛిష్టం, బును దాల్పఁగ నన్యశేషమును గూడదు కృ
ష్ణుని యెడల భక్తి యొదవని, జనములతోఁ జేయఁ దగదు సంభాషణమున్.
క. వినరా దెపుడును హరిహరు, లను గూర్చిననింద వీనులను మూసికొనం
జను నట్టితఱిని దూషకు, లను దండింపంగ వలయు లావరి యైనన్. 1498
క. యుగళార్థము భావించుచుఁ, దగు నుండఁగ మేను పడెడిదాఁకను భక్తుం
డగువాఁడు చాతకముగతి, నగళితలక్ష్యైకభావుఁ డై ధరలోనన్. 1499
క. న న్నుద్ధరించితీరును, వెన్నుఁడు రాధికయు ననెడివిశ్వాసముతో
నున్న యెడ వారిదాస్యము, గ్రన్ననఁ జేకూరు ముక్తి గలుగును దానన్.
గీ. చెప్పితిని బాహ్యధర్మంబు లిప్పు డింక, వినుతు నాంతరధర్మంబు విశదముగను
వినుము రాధాసఖీభావమునను వలయు, సేవ సేయ రాధాకృష్ణదేవతలకు. 1501
క. తెలిపితిఁ బ్రపన్నధర్మం, బుల నెల్లను నీకు ముఖ్యముగ రాధాకృ
ష్ణులఁ గొలువుము నీవును ద, త్ఫలముగఁ బడయంగఁగలవు తద్దాస్యంబున్.
క. నీవాఁడను నే ననియెడి, భావంబున నొక్కపరిఁ బ్రపన్నుం డైనన్
గావఁగలఁ డచ్యుతుఁడు నిజ, సేవకసంరక్షణైకశీలుం డగుటన్. 1503
వ. ఈధర్మంబులలో నెల్ల నాంతరధర్మంబు పరమరహస్యంబు. దాని నెల్లరకుం
బ్రకటింపం దగదు. 1504
సీ. అంతరంగమునందు హరిని ధ్యానించుచు, నుచ్చరించుచు నోట యుగళమనువు
మును నేను గైలాసమూర్ధంబునం దుండ, సంతోషమును జెంది చక్రపాణి
గరుడాధిరూఢుఁడై యరుదెంచి లక్ష్మితో, నా ముంగలను నిల్చి నన్నుఁ జూచి
భూతేశ నీతపంబునకు మెచ్చి వరంబు, నీయ వచ్చితిఁ గోరు మేది యేని
గీ. యనుటయును నేను బ్రణమిల్లి యచ్యుతునకు, నభవనిర్గుణమునునిష్క్రియమునునైన
నీస్వరూపంబుఁ జూడ జనించె వాంఛ, యదియె నాకోరుకొనువర మంటి నంత.
గీ. శౌరి నా కిట్టు లనియె నీశ్వర తలంచి, తేని మద్రూపమును జూడ నేఁగుదెమ్ము
యమునపశ్చిమకూలమునందుఁ బొలుచు, చున్న బృందావనంబు నాయునికిపట్టు.

వ. అని పలికి యంతర్ధానంబు నొందుటయు నేను దద్రూపసందర్శనకుతూహలంబున నాశ్రమంబ బయలుదేఱి బృందావనంబునకుం జేరి గోపవేషధరుండును గిశోరవయస్కుండును బ్రియాస్కంధవిన్యస్తవామహస్తుండును మేఘశ్యామవిగ్రహుండును గోటిసూర్యప్రభాభాసమానుండును సకలకల్యాణగుణసమేతుండును గోబృందగోపికామధ్యవిరాజమానుండును నప్రమేయప్రభావుండును నగు నందనందనునిం గాంచి విస్మయావిష్టమానసుండ నై యుండ నమ్మాధవుండు నన్నాలోకించి నవ్వుచు ని ట్లనియె. 1507

గీ. ఈశ గ్రహియించి నేను నీయీప్సితంబు, నీయఁ దగినట్టిదర్శనం బిచ్చినాఁడ
నిదె యతౌకికరూప మియ్యదియె ప్రేమ, రసఘనీభూతమూర్తి నిర్వాణ మిదియె.

గీ. నిత్యమును వ్యాపకంబును నిర్గుణమును, నామరూపక్రియావిహీనమును ననుచు
నుపనిషత్సంఘములు పల్కు చుండుతత్త్వ,మిదియె బ్రహ్మంబునాఁగనునిదియెచూవె.

సీ. చర్మలోచననిరీక్ష్యం బైనరూపంబు, పొందియుండమి నరూపుండ నైతి
వాఙ్మనసంబులు వర్ణింప వీ లైన, గుణములు లేమి నిర్గుణుఁడ నైతి
కర్తృత్వమును బూని కార్యసంఘాతంబు, సృష్టి సేయమిని నిష్క్రియుఁడ నైతి
నఖిలలోకములఁ జిదంశంబుచేతను, వ్యాపించి యుంట బ్రహ్మంబ నైతి

గీ. నీమె రాధావధూటి నాయిష్టకాంత,యీమెతోఁ గూడి విహరింతు నెపుడుఁ గూడ
నీమెసకియలు గోపిక లెల్లవారు, శతసహస్రంబులు గను నిచ్చటను గలరు. 1510

గీ. గోవులును గోపికలును బృందావనమును, రాధయును నేను నిత్యవిరాజితులమ
భువనజాలంబు లన్నియుఁ బోవుఁ గాక, నాశ మనునది మాకు నెన్నటికి లేదు.

వ. నాయంశంబులు మాయాగుణంబులచే సృష్టిస్థితిసంహారంబుల నొనర్చు. నేను గ్రియాంతరం బెఱుంగక రాధాప్రేమవశీకృతుండ నై యుందు. 1512

ఆ. ప్రకటలీలలలోఁ బురాణప్రసిద్ధుల, మగుచు నుండినట్టు లవనియందు
నిత్యలీలలోన నెలకొని బృందావ, నమున నుందు మందఱమును మేము. 1513

క. ఆనందకంద మనుప్రథ, నూనినబృందావనంబు నొకసారి యెవం
డేనియుఁ జొచ్చినఁ గలుగదు, వానికి నెన్నఁడును గర్భవాసము మఱలన్. 1514

క. అని చెప్పి మఱియు నే దై, నను నను నీ వడుగఁ దలఁచినను నడుగు మ టం
చన దేవ యిట్టినీ వే, యనువున లభ్యుఁడవొ చెప్పు మని నే నంటిన్. 1515

చ. అనవుడుఁ గృష్ణుఁ డి ట్లనియెఁ ద్ర్యంబక రాధను గొల్చి తత్కృపన్
గనునెడ నేను లభ్యుఁడను గాని మదేకనిషేవణంబుచే
తను ననుఁ జెందఁజాల రిది తథ్యము దీని నెఱుంగ కజ్ఞులో
క్కని నను సంస్మరించుచును గాలముఁ బుత్తురు నిష్ఫలంబుగన్. 1516

క. ఇది పరమరహస్యము నీ, మదిలోపల నుంచికొని యుమాధవ భజియిం
చెద వేని మత్ప్రియను జెం, దెదు సులభంబుగను నన్ను దివ్యాకృతితోన్.

వ. అని చెప్పి యంతర్ధానంబు నొందె. 1518
క. అది మొదలుగఁ దన్మంత్రం, బెదలో జపియించుకొనుచు నెపుడును రాధా
పదములు గొలుచుచు నుంటిని, ముద మొదవఁగ ననుచు దేవముని కుతుకమునన్.
వ. సదాశివునిపాదారవిందంబులకు నమస్కరించి బ్రహ్మలోకంబునకుం జనియె.
గీ. యుగళమంత్రంబు కృష్ణునియొద్దనుండి
హరుఁడు గ్రహియించె గ్రహియించె హరునివలన
నారదుఁడు నారదునివదనంబునుండి
నేను గ్రహియించినాఁడను మానివర్య. 1521
క. హరముఖనిర్గత మగునీ, హరిచరితామృతముఁ గ్రోలునట్టిమహాత్ముల్
జరయును మృతియును జనియును, బొరయక తిరుగుదురు విష్ణుపురవీథులలోన్.
క. అని చెప్పుటయును శౌనక, మునిప్రభృతు లమితహర్షమును జెందుచు ని
ట్లనిరి మహనీయ మా కిఁక, వినిపింపుము విష్ణుభక్తవృత్తాంతంబున్. 1523
వ. అనవుడు సూతుండు వారల కి ట్లనియె. 1524

—:అంబరీష నారద సంవాద కథనము:—

సీ. తిరుగుచు లోకముల్ సురమౌని యొకనాఁడు, మార్గవశంబున మధురఁ జేరి
యంబరీషునిఁ జూడ నరుగుటయును నాతఁ, డతనికి నర్ఘ్యపాద్యాదు లొసఁగి
స్వామి యెల్లరకును శౌరి యొక్కఁడె గతి, యని విందు భవదుఃఖ మడఁచివైవ
నతఁడు యోగులకును నప్రాప్యుఁ డని వేద, శాస్త్రపురాణముల్ చాటుచుండు
గీ. నట్టిహరిఁగూర్చిధ్యానపూజాదికంబు, లెట్లుచేయంగవలయునో యెఱుఁగఁ జెపుమ
యనుటయును నారదుం డిట్టులనియె భూప, పరమసంతోషమయ్యె నీప్రశ్నమునకు.
గీ. సర్వదుఁడు శ్రీపతియె తత్ప్రసాదమున నె
రాజ్యమును నాయువును గళత్రములు సుతులు
స్వర్గమోక్షంబులును గల్గు సంతతమును
ననెడుభావంబు నార్జింప నగును మొదట. 1526
క. అది దృఢమై మానసమున, నొదవినవారలకు వ్రతము లొకకొన్ని వచిం
చెద వినుము వానివలనను, జెదరనిహరిభక్తి పిదపఁ జెందం గలుగున్. 1527
గీ. బ్రహ్మచర్యంబు పాపవర్తనము లేమి, సత్యమస్తేయమును నహింసయును మాన
సవ్రతం బనుపేర నెసంగు నదియె, పారిశుద్ధ్యంబు నొనగూర్చు భావమునకు.
క. అనృతంబును భాషింపమి, యును బైశున్యంబు లేమియును నధ్యయనం
బును విష్ణుకీర్తనంబును, దనరారును వాచికవ్రతం బనుపేరన్. 1529
క. విను ముపవాస మయాచిత, మును నక్తము నేకభక్తమును గాయవిశు
ద్ధిని జేయుఁ గాయికవ్రత, మనుపేరను బరగి లోకమందు నృపాలా. 1530

క. వనమాలినామకీర్తన, మనిశంబును శుద్ధి చేయునది యగుకతనన్
బని లేదు తత్ప్రవర్తన, మున నాశౌచాదిదోషములను గణింపన్.
ఆ. వాఁడు విష్ణుభటుఁడు వర్ణాశ్రమాచార,ములను విడువకుండఁ దలఁపులోనఁ
బాదుకొల్పి శౌరిపాదాంబుజములను, నిలువఁగలఁడొ యెవఁడు నేర్పుతోడ.
క. ధ్యానము గావింపం దగు, మానసవాక్కాయసంయమవ్రతములచేఁ
జానలు పతిరూపునిఁ గను, శ్రీనాథునిఁ దమకు నిష్టసిద్ధులు గలుగన్. 1533
ఆ. మొదటి మూఁడువర్ణములవారు శ్రుత్యుక్త, వాక్యములను గొలువవలయు హరిని
వనితలును జతుర్థవర్ణంబువారును, నాగమమునఁ గొలువ నగును హరిని. 1534
క. నిజధర్మస్థితుఁ డగుచున్, భజియించిన హరిని విష్ణుపదమున్ జెందున్
నిజధర్మచ్యుతుఁ డగుచున్, భజియించిన హరిని నరకపతనము నొందున్. 1535
క. జలమందుఁ బుష్పములచే, జ్వలనమున హవిస్సుచేత జపమున రవిమం
డలమందు ధ్యానమున హృ, త్తలమందు భజించెదరు గదాధరుని బుధుల్.
వ. అహింస యనుప్రథమపుష్పంబుతోడను నింద్రియనిగ్రహం బనుద్వితీయపుష్పంబుతోడను భూతదయ యనుతృతీయపుష్పంబుతోడను క్షాంతి యనుచతుర్థపుష్పంబుతోడను శమం బనుపంచమపుష్పంబుతోడను దమం బనుషష్ఠపుష్పంబుతోడను ధ్యానం బనుసప్తమపుష్పంబుతోడను సత్యం బనునష్టమపుష్పంబుతోడను నర్చించి రేని మాధవుండు మిగుల సంప్రీతుం డగు. అట్లు గావింపం జాలక బాహ్యపుష్పంబులచే నర్చించినను బురుషోత్తముండు భక్తిప్రియుం డగుటం జేసి దానికిని సంతుష్టిం జెందు. సలిలరూపం బగువారుణపుష్పంబునను ఘృతపయోదధిరూపం బగుసౌమ్యపుష్పంబునను నన్నాదిరూపం బగుప్రాజాపత్యపుష్పంబునను ధూపదీపరూపం బగునాగ్నేయపుష్పంబునను ఫలపుష్పాదిరూపం బగువానస్పత్యపుష్పంబునను గుశమూలాదిరూపం బగుపార్థివపుష్పంబునను జందనరూపం బగువాయవ్యపుష్పంబునను శ్రద్ధారూపం బగువిష్ణుపుష్పంబునను వాద్యరూపం బగువిష్ణుపదపుష్పంబునను బూజితుం డయ్యె నేని నారాయణుండు తత్క్షణంబ సుప్రసన్నుం డగు. 1537

—: విష్ణుపూజాస్థలకథనము :—

క. అనలము రవి విప్రుఁడు గో, వును గగనము జలము వైష్ణవుఁడు వాయువు మే
దినియును నాత్మయు భూతము, లును హరి నర్చించుచోటులుగ నెఱుఁగఁ దగున్.
వ. అనలంబునందు హవ్యంబుచేతను నాదిత్యునియందుఁ ద్రయీవిద్యచేతను బ్రాహ్మణునియం దాతిథ్యంబుచేతను గోవునందు గ్రాసరసాదులచేతను హృదయాకాశంబునందు ధ్యాననిష్ఠచేతను సలిలంబునందుఁ దోయాదికద్రవ్యంబులచేతను వైష్ణవునియందు బంధుసత్కారంబుచేతను వాయువునందు ముఖ్యభావంబుచేతను భూమియందు మంత్రహృదయంబులచేతను నాత్మయందు భోగంబుల

చేతను సర్వభూతంబులయందు సమత్వంబుచేతను శంఖచక్రగదాంబుజధరుం డును జతుర్భుజుండును క్షేత్రజ్ఞుండును బరమాత్మయును నగునారాయణుని నారాధింపం దగు. 1539

గీ. భూసురున కర్చనంబును జేసె నేని, యచ్యుతున కర్చనముఁ జేసినట్టివాఁడ
విప్రునకు దండనంబు గావించె నేని, హరికి దండన మొనరించినట్టివాఁడ. 1540

గీ. కలుగు ధర్మంబునను జగంబులకు శుభము
ధర్మశాస్త్రంబువలన వేదంబువలన
నిలుచు నాధర్మ మారెండు నిలుపువాఁడు
బ్రాహ్మణుఁడ దానఁ బూజ్యుండు బ్రాహ్మణుండు. 1541

క. క్షితిసురులఁ దృప్తిపఱచెడి, కతమున సమకూరుతుష్టి గలుగదు హరికిన్
వ్రతదానతపోయోగ, క్రతుపూజాధ్యానముఖ్యకైంకర్యములన్. 1542

క. బ్రహ్మప్రవర్తకుండును, బ్రహ్మణ్యుఁడు బ్రహ్మవిదుఁడు బ్రహ్మము నగునా
బ్రహ్మండనాయకునకున్, బ్రాహ్మణపరితోషణంబె పరితోష మగున్. 1543

క. నరకగతు లైనపితరులఁ, దరియింపం జేసి విష్ణుధామముఁ జేర్చున్
హరిపదపూజాప్రవణుం, డరంగుఁ డయినట్టియొక్కతనయుం డున్నన్. 1544

క. సంతాపహరుం డగుహరి, నంతఃకరణమునఁ జేర్చునట్టితెఱం గొ
క్కింతయు నెఱుఁగనిమానవ, సంతతులను బశువు లనియె చాటఁగ నొప్పున్.

—: ధ్యానవిధానకథనము :—

గీ. ఇంక ధ్యానవిధానంబు నెఱుకపఱుతు,వినుము దీపంబు జ్వలియించుచునుదమంబు
నెట్లు నశియింపఁ జేయునో యట్లెచిత్త,మలములనునెల్లధ్యానంబుమాయఁజేయు.

క. ఒనరించును గర్మక్షయ, మును ధ్యానము దీపతైలమును జ్వాల హరిం
చినతెఱఁగునఁ దన్మహిమము, వనజోద్భవునకును దరమె వాక్రువ్వంగన్.1547

వ. ఆధ్యానంబు నిర్గుణం బనియును సగుణం బనియును ద్వివిధంబుగాఁ జెప్పంబడియె నందు మొదట నిర్గుణధ్యానప్రకారంబుఁ జెప్పెద. వినుము. 1548

—: నిర్గుణధ్యానస్వరూపకథనము :—

సీ. హస్తవివర్జితుం డయ్యును గ్రహియించుఁ, జరణహీనుం డయ్యు సంచరించు
వచియించు జిహ్వావివర్జితుం డయ్యును, నాస్యవర్జితుఁ డయ్యు నారగించుఁ
బ్రత్యక్ష మగును రూపవివర్జితుం డయ్యు, నీక్షించు నేత్రవిహీనుఁ డయ్యు
వినుఁ గర్ణహీనుఁ డయ్యును నాసికాశూన్యుఁ, డయ్యును నాఘ్రాణ మాచరించు

గీ. సర్వభూతాంతరస్థుఁడు సర్వమయుఁడు, నిర్గుణుం డద్వితీయుఁడు నిత్యుఁ డజుఁడు
బ్రహ్మమును నైనహరి యనుభావమునను, నలరుచుండుటె నిర్గుణధ్యాన మధిప.

క. అమృతోపమానమును ని, త్యమును నమూర్తమును నిర్భయంబును నగుధా
మము గల్గు నిర్గుణధ్యా, నము చే నది దుఃఖనాశనము నొనరించున్. 1550
క. జ్ఞానైకదృష్టి చేతను, ధ్యానపరాయణులు గాంతు రాత్మగను రమా
జానిని వారలె బ్రహ్మ, జ్ఞానులు వారలకు లేవు జననమరణముల్. 1551
వ. ఇంక సగుణధ్యానప్రకారముం జెప్పెద. వినుము. 1552

—: స గు ణ ధ్యా న స్వ రూ ప క థ న ము :—

సీ. శరణాగతత్రాణబిరుదాంకితం బైన, పాదద్వయంబుచేఁ బరగువాని
శ్రీవత్సకౌస్తుభశ్రీవనమాలికా, యుత మైనయురముచే నొప్పువాని
శంఖచక్రగదాంబుజభ్రాజితం బైన, భుజచతుష్టయముచేఁ బొలుచువాని
స్మితచంద్రికావిమోహితవిశ్వ మైనము, ఖేందుబింబంబుచే నెసఁగువాని
గీ. వనజలోచనములవానిఁ గనకవసన, ధారి యగువాని దానవవైరి నెదను
నిలిపి భావించుచుండుటె యలరు సగుణ, మైనధ్యానంబు నాఁగను మానవేంద్ర.
క. ఈసగుణధ్యానంబును, జేసిన నమకూరు నిష్టసిద్ధులు మాయున్
జేసినపాతకము లనా, యాసంబుగ విష్ణుపదము నందం గలుగున్. 1554
క. అని వచియించుటయును విని, వినయంబున నంబరీషవిభుఁ డిట్లనియెన్
మునినాథ భక్తిలక్షణ, మును జెప్పుము వినఁగ వేడ్క పుట్టెను నాకున్.

—: భ క్తి స్వ రూ ప క థ న ము :—

వ. అనవుడు నారదుండు రాజేంద్రా లౌకిక వైదికాధ్యాత్మికమానసికవాచికకాయిక
భేదంబులచే భక్తి వివిధప్రకారంబుగాఁ జెప్పంబడియె. 1556
క. బలులను జాగరములఁ బూ, జలఁ బాద్యార్ఘ్యాదికోపచారములను గీ
తుల నాట్యవాద్యముల సం, కలితం బగుభక్తి లౌకికం బనఁ బరగున్. 1557
గీ. సంహితాధ్యయనాదిప్రశస్తపాఠ, ముల యజుస్సామఋగ్జప్యములను హవ్య
హోమకర్మంబులను నొప్పు చుండునట్టి, భక్తి పరగును వైదికభక్తి నాఁగ.
వ. ప్రధానాది చతుర్వింశతితత్త్వంబు లచేతనంబు లనియుఁ బంచవింశకుం డగుపురు
షుండు చేతనుం డై కర్తృత్వభోక్తృత్వములు గలిగియున్నవాఁ డనియు నాత్మ
నిత్యుండును నసక్తుండును నధిష్ఠాతయును జేతనుండును సర్వకారణకారణం
బును ననియును గుణాత్మకం బగుప్రధానంబునకు నానాత్వంబు వైధర్మ్యం
బనియును బ్రహ్మంబు తత్త్వాతీతం బనియును నెఱుంగుటయె యాధ్యాత్మిక
భక్తి యని సాంఖ్యులచేఁ జెప్పంబడియె. ప్రాణాయామపరుండును నియతేంద్రియుం
డును భైక్షవ్రతియును విషయనివృత్తుండును నగుచు శ్వేతవర్ణుండును జతుర్బా
హుండును వరదాభయహస్తుండును బీతాంబరుండును నగుజనార్దనుని నిజహృద
యంబున నిత్యంబును భావించుచుండుట యాధ్యాత్మికయోగికభక్తి యనం బరగు.

ఆ. ధ్యానధారణలను నామ్నాయసంస్మృతి, చేత మాధవునకుఁ బ్రీతి గలుగఁ
జేయునదియె మానసికభక్తి నాఁగను, బరగు జగములందుఁ బార్థివేంద్ర. 1560

క. ఆరణ్యకజపనైగమ, పారాయణవిధుల హరికిఁ బరితోషము చే
కూరుచుటయె వాచిక మను, పేరన్ దనరారుభక్తి పృథివీపాలా. 1561

క. నియమవ్రతోపవాసేం, ద్రియనిగ్రహములను బుండరీకాక్షునకున్
దయివాఱఁ బ్రీతి వర్తిలు, టయె కాయికభక్తి పేరిటన్ దనరారున్. 1562

క. ఈభక్తిపరంపరలో, నేభక్తిం గాని హరిని దృప్తిసలిపినన్
లాభించు విష్ణుభక్తి, ప్రాభవ మందఱకు దుర్లభం బది యధిపా. 1563

వ. ఏతద్భక్తిసముదాయంబు సాత్త్వికరాజసతామసభేదంబులచేన నేకప్రకారంబయ్యె.

క. జ్వలియించునగ్ని కాష్ఠం, బుల నెల్ల దహించుచందమున దగ్ధముగాఁ
జలుపు హరిభక్తి పాతక, ముల నెల్లను మరల మొలక మొలవక యుండన్.

ఆ. వినఁడొ యెంతవఱకు విష్ణుభక్తిమహత్త్వ, మంతవఱకు మర్త్యుఁ డంతు లేసి
యోనులందుఁ బుట్టి యొందుచుండును జరా, జననమరణదుఃఖసంతతులను.

గీ. అధిప దేవార్చనస్నానయజ్ఞదాన, తపములను నంతరాత్మ చెందదు విశుద్ధి
హృదయమున నున్న దేవుని నెఱిఁగి సేవ, యాచరించుటను విశుద్ధి నందినట్లు.

క. ఆరాధింపక శౌరిని, నేరీతిని నైనఁ గలుగ విహపరములలోఁ
బూరుషులకు శ్రేయంబులు, నారాయణుఁ డొకఁడె గతి జనంబుల కెల్లన్.

క. క్షితిసురుఁడు సురభి సత్యము, క్రతువును దీక్షయును దపము శ్రద్ధయు దయయున్
శ్రుతియును సంతోషంబును, స్మృతియును నారాయణునిశరీరములు సుమీ.

గీ. వాయు వన్నను జల మన్న వహ్ని యన్న, నంబరం బన్న రవి యన్న నబ్జుఁ డన్న
నుర్వి యన్న నజుం డన్న శర్వుఁ డన్న, నఖిలవిశ్వమయుం డైనహరియ సూవె.

గీ. అవనిసురరూపమున నన్న మారగించు, వాసుదేవుండు దానను జేసి ద్విజుల
నన్నసంతృప్తులను జేయునట్టివారు, విష్ణువునకు సంతృప్తి గావించువార.

ఆ. విష్ణుబుద్ధిచేత విప్రుల నర్చించు, వాఁడ నిక్క మైనవైష్ణవుండు
స్వీయధర్మ మెఱిఁగి చేయంగఁ దగినకా, ర్యమును జేసినట్టియాతఁ డగుట.

క. అని చెప్పి యూరకుంటయు, వినయంబున నంబరీషవిభుఁ డిట్లనియెన్
మునివర యమూల్యవిషయము, వినిచితి వాశ్చర్య ముద్భవింపఁగ మదిలోన్.

గీ. అనఘ మాధవమాసమాహాత్మ్య మింక, నెఱుఁగఁ జేయుము దయ గల దేని నీకు
విష్ణుభక్తుఁడ నగుటను వేడ్క పొడమె, మాధవప్రియమాసంబుమహిమ వినఁగ.

క. అనవుడు మందస్మిత మా, ననమున నుదయింప నిట్లు నారదుఁ డనియెన్
జనవర మును మాజనకుఁడు, వినిచినవిషయంబు వినుము వినిచెద నీకున్. 1575

—: వైశాఖమాసమాహాత్మ్యకథనము :—

సీ. ప్రభవించుటయె దుర్లభంబు భారతవర్ష, మం దది సంప్రాప్త మయ్యె నేని
మర్త్యజన్మంబు సంప్రాప్తించుయోగంబు, దుర్లభం బయ్యది దొరకె నేని
తనధర్మమునయందుఁ దా నుంట దుర్లభం, బది యదృష్టంబుచే నబ్బె నేని
పద్మనాభునిపాదభక్తి దుర్లభ మది, భూరిపుణ్యమునఁ జేకూరె నేని
గీ. మాధవప్రీతికర మైనమాస మెంతొ, దుర్లభం బది యెట్టులొ దొరకె నేని
స్నానదానజపాదివిధానములను, నేర్పరులు ధన్యు లగుదురు నిక్కువముగ.
క. అమ్మహితులదర్శనమా, త్రమ్మున నిష్పాపు లయ్యెదరు దుర్భరపా
పమ్ము లొనర్చినజనులును, నమ్మాసమహత్త్వ మెన్న నలవియె నాకున్. 1577
గీ. చెప్పెదను నిశ్చితం బైనచివరమాట, మాధవప్రియ మైనట్టిమాసమందు
స్నాతము హుతంబు దత్తంబు జప్త మెల్ల, నక్షయం బైనపుణ్యంబ యవనినాథ.
సీ. విద్యలలోపల వేదంబు దేవత, లందు విష్ణువు మర్త్యులందు ద్విజుఁడు
తపియించువానిలోఁ దపనుండు తటినుల, యందు జాహ్నవి సతులందు గౌరి
ప్రణవాక్షరంబు మంత్రములందు గాయత్రి, జప్యంబులందు శౌచంబులందు
నాత్మశుద్ధి గుణంబులందు నలోభగు, ణంబు సత్యంబు తపంబులందు
గీ. లాభములలోన నారోగ్యలాభ మాత్మ, భావనము ధ్యానములలోన ఈవులందు
నభయముపరోపకృతిపున్నియములలోన, మాసములలోన మాధవమాసమురువు.
వ. కార్తికమాసంబున సూర్యుండు తులాగతుం డై యుండఁ గావించుస్నాన
దానాదికర్మంబులు పరార్ధగుణంబులుగను మాఘమాసంబునందు సూర్యుండు
మకరగతుం డై యుండఁ గావించుస్నానదానాదికర్మంబులు తత్సహస్రాధికగు
ణంబులుగను వైశాఖమాసంబున సూర్యుండు మేషగతుం డై యుండఁ
గావించుస్నానదానాదికర్మంబులు తచ్ఛతగుణాధికంబులుగను జెప్పంబడియె.
క. దానము యజ్ఞము వ్రాత, స్స్నాన ముపోషణము బ్రహ్మచర్యజపాను
ష్ఠానములు హవిష్యంబును, మానుచు వైశాఖమున సమస్తాఘములన్. 1581
వ. మఱియొకవిశేషంబు గలదు. వైశాఖశుక్లసప్తమీదినసంబునఁ గ్రోధవశంబున
జహ్నుమహర్షి గంగం ద్రావి దక్షిణకర్ణంబునుండి విడిచిపెట్టుటంజేసి తత్పుణ్య
దినంబున జాహ్నవియందుఁ గావించుస్నానదానతర్పణాదికర్మంబు లనంతపుణ్య
ఫలప్రదంబులు. 1582
క. హరిభక్తి లేనివారికి, దొరక దొకప్పుడును సకలదుర్దోషములన్
హరియింపఁగలుగుగంగా, సరిదంభస్స్నాన మట్టిసమయమునందున్. 1583
గీ. ఏఁగుదేరదొ వైశాఖ మెంతదాఁక, నంతదాఁక నె పీడించు నఘము లెల్ల
నేఁగుదేరఁడొ భాస్కరుం డెంతదాఁక, నంతదాఁక నె చీఁకటు లావరించు. 1584

గీ. అంబుధిసమాన మైనజలాశయంబు, మఱియొకం డున్న మాధవమాసమునకు
సాటి సేయంగఁ దగినమాసము మఱొక్కఁ, డుండు నని చెప్పవచ్చుబహూక్తులేల.

గీ. అశ్వమేధమఖంబున నబ్బుఫలము, కలియుగంబునఁ జేకూరఁగలుగు నెల్ల
మానవులకును వైశాఖమాసమందుఁ, జేసి స్నానంబు హరిని బూజించి రేని.

క. మాధవమాసమునందున్, మాధవుని భజించునట్టిమానవుఁడు నిజా
రాధనమునకు ఫలంబుగ, సాధించినవాఁడ జన్మసార్థక్యంబున్. 1587

గీ. ధనము గలవార లెల్లరుఁ దగు నొనర్ప, దానములు దేశకాలపాత్రముల నెఱిఁగి
యట్లు చేయక చచ్చిన నాధనంబు, పరులపా లయి చెడిపోవు ఫలము లేక.

గీ. తగినకాలంబునను జేయుదానమునను
గలుగుఁ బ్రఖ్యాతి యిహమందుఁ గలుగుఁ బరము
నందు స్వర్గసుఖంబు జన్మాంతరమున
సకలవిధసౌఖ్యములు గూడ సంఘటిల్లు. 1589

వ. అదియునుం గాక వైశాఖమాసంబున నేకాదశి మొదలుపూర్ణిమాపర్యంతంబు గలదినపంచకంబు విష్ణుప్రీతికరంబుగాఁ బ్రాతస్స్నానంబు గావించె నేని బహుజన్మార్జితంబు లగుమహాపాతకంబు లెల్ల నిర్దగ్ధంబు లై యిహంబునఁ బుత్రపౌత్రధనధాన్యాదిసమృద్ధియును బరంబున వైకుంఠధామంబును జెందంగలుగు. అట్లు చేయుటకును సమర్థత లేనియెడలఁ ద్రయోదశీచతుర్దశీపూర్ణిమాతిథులందుఁ గావించుస్నానదానాదులవలనను నట్టిఫలంబ చేకూరు. అదియునుం గానియెడ నొక్కపూర్ణిమాదినంబునం జేయుస్నానంబున నంతటిఫలంబ ప్రాప్తించు. 1590

గీ. అనుటయును నంబరీషుఁ డిట్లనియె స్వామి, యల్ప మైనశ్రమంబున నధికఫలము
సంభవించుటఁ జూడ విస్మయము దోఁచె, హేతు వేమియొ దానికి నెఱుఁగఁ జెపుమ.

చ. అనవుఁడు నారదుం డను వసుధాధిప ధర్మము లన్న సూక్ష్మముల్
గనుటకుఁ దన్మహత్త్వమును గారు సమర్థులు ప్రాజ్ఞు లైనవా
రును నీకుఁ జెప్ప నేటికిఁ బరుల్ గనలే రనుమాట నే నిద
ర్శనములు కొన్ని చెప్పెదను సంగ్రహరూపము గాఁగ దానికిన్. 1592

వ. రాజన్యుం డగువిశ్వామిత్త్రుండు ధర్మాధిక్యంబుచే దుర్లభం బైనబ్రాహ్మణ్యంబు నొందె. అజామిళుండు ధర్మపత్నిని విడనాడి దాసీలోలుఁ డై బహువిధపాతకంబులం జేసియు నంతకాలంబునం బుత్రుని నారాయణా యని పిలుచుటచే నక్షయం బగువిష్ణులోకవాసముం బడసె. 1593

సీ. ఇచ్ఛ లేకుండినను స్పృశియించె నేని, పావకజ్వాల దహియించుపగిదిఁ గాల్చు
శౌరినామంబు పాపసంచయము నెల్ల, వ్యాజమున నైన వ్యాహృతం బయ్యె నేని,

వ. భ్రాతృజాయాగామి యగు కానీనమునిపౌత్రులును గోళకుం డగుపాండుమహీపా లునిపుత్రులును స్వయముగాఁ గుండులును నేకభార్యారతులును నగుషంచ పాండవులు పుణ్యశ్లోకు లైరి. 1595

గీ. కర్మశక్తులు చిత్రముల్ కర్మములును, జిత్రములు భూతభావనల్ చిత్రములు వి చిత్రములు భూతములు తద్విచిత్రమహిమ, మెంతవారికిఁ గూడను నెఱుఁగరాదు.

వ. కర్మఫలవైపరీత్యంబు గానంబడుచుండుటం జేసి యధికకర్మంబున కధిక ఫలంబును నల్పకర్మంబున కల్పఫలంబును గలుగు నని నిశ్చయింప నవకాశంబు లేదు.

గీ. అద్రిసమ మైనతృణరాశి నల్ప మైన, విస్ఫులింగంబు దహియించు విష్ణుభక్తి కొంచె మైనను జాలును గూలఁద్రోయ, బ్రహ్మహత్యాదిఘోరపాపముల నెల్ల.

వ. చేయంబడినకర్మం బేజన్మంబున నైనను దత్ఫలంబు ననుభవింపంజేయు. ఒక జన్మంబునఁ గావింపంబడుకర్మంబు వేఱొకజన్మంబునఁ దత్ఫలంబు నొసంగు. ఒక్కొక్కయెడఁ బుణ్యకర్మునకు క్షైణ్యంబును బాపకర్మున కభివృద్ధియును గానంబడు. మఱియును గావింపంబడుకర్మంబు భావహీనం బయ్యె నేని సామా న్యంబుగా నిష్ఫలం బగు. 1599

ఆ. చేయుఁ గాక గాంగతోయంబునను స్నాన, మాచరించుఁ గాక యమితజపము భావహీనుఁ డైనఁ బడయంగఁ జాలఁడు, దత్ఫలంబు శ్రమము తత్ఫలంబు. 1600

వ. గంగాదిపుణ్యతీర్థంబులందు నసియించుజంతువులును దేవాలయంబులయందు నిత్యనివాసంబు గావించుపక్షిగణంబులును బస్తుండి మరణించినను భావశుద్ధి లేమిం జేసి తత్కర్మఫలంబు నొందం జాలవు. ఘృతతైలసిక్తం బగుదీపంబును బ్రదక్షిణానర్తశిఖంబుగా స్వకాలంబున వెలిఁగించినను భావవర్జితునకు స్వర్గంబు గాని మఱియొకతత్ఫలంబు గాని లభియింప నేరదు. 1601

క. కావున వైశాఖంబున, భావంబును నిలిపి విష్ణుపదములయందుం గావించి రేని స్నానము, శ్రీవైకుంఠంబు నధివసింతురు వారల్. 1602

గీ. చాలు వైశాఖమునఁ జేయుస్నానమొకఁడె, పాపసముదాయముల నెల్లరూపుమాప నల్ప మైనను శుభకర్మ మడఁచివైచు, నశుభకర్మసహస్రంబు నైన నధిప.

వ. దీనికి నిదర్శనంబుగా నొక్కయితిహాసంబుఁ జెప్పెద. వినుము. 1604

సీ. మునిశర్మ యనుపేరఁ దనరెడుభూసురుం, డొకఁడు వైశాఖమం దొక్కనాఁడు నర్మదాస్నానంబునకు వచ్చె మును తన, బ్రహ్మతేజము రవిపగిది వెలుఁగ నది చూచి తత్ప్రాంతమం దుండుపాపాత్ము, లేఁగురు భక్తితో నేఁగుదెంచి సాష్టాంగముగ మ్రొక్కి యతనిపాదములకు, నేడుచుచును లేచి యెదుట నిలువ

గీ. వారలను గాంచి యావిప్రవర్యుఁ డిట్టు, లనియె మీ రెవ్వరయ్య మీయాకృతులను గాంచ నఘరూపములుగను గానఁబడెడి, నేమి హేతువు నాకడ కేఁగుదేర.

గీ. అనుటయును వారిలో నొక్కఁ డార్తితోడ, నిట్లు లనియెను స్వామి నాహీనదశను
చెప్ప సిగ్గయ్యెడిని గాని చెప్ప కున్న, నిమ్మహాదుఃఖమును సహియింపఁ జాల.
సీ. పాంచాలదేశాధిపతి నేను క్షత్రియుం, డను నరవాహనుం డనెడివాఁడ
ధనమదాంధ్యంబునఁ దను వెఱుంగనిచేష్ట,లొనరించు చుండుట నొక్కనాఁడు
మార్గమం దేఁగుబ్రాహ్మణుని నొక్కనిఁ జంపి, నాఁడ సాయకమును గాఁడ నేసి
యమ్మహాపాతక మంటి శిఖాసూత్ర, తిలకవర్జితుఁడ నై తిరుగుచుంటి
గీ. హితులువిడిచిరిరాజ్యంబుమతియుఁబోయె, బ్రహ్మహత్య యొనర్చినపాపి ననుచుఁ
జాటుకొను చుంటి నింటింటఁ గూటికొఱకుఁ,జాగునకు మందు దిన్నను జావనైతి.
క. ఏసాధువు లైనను నా, దోసంబును బాపువారు దొరకరు రనుపే
రాసను రా నిచటికి నా, చేసినపున్నెమున నీవు చేకుఱితి విటన్. 1608
క. అని విరమించుటయును ని, ట్లనియె ద్వితీయుండు నమ్రుఁడై నేను ఖలుం
డను చంద్రశర్మ యనువాఁ, డను మాగధదేశవాసుఁడను బ్రాహ్మణుఁడన్.
క. ఒడ లెఱుఁగనిక్రోధంబున, నుడుకుచు గురుహింస చేసి యుంటిని మును నే
నుడుగక యాపాపము ననుఁ, గుడుపుచు నున్నది ఫలంబు ఘోరము గాఁగన్.
క. నకనకలాడెడుకుక్షికి, నొకనాఁడును నిండ భిక్ష యొదవదు ధిషణా
వికలుఁడ నై జందెంబును, సికయును లేకుండ నుంటి జీవంబులతోన్.
క. ఉండిన చోటను నుండక, పండుకొనిన చోట మరలఁ బండుకొనక ఖి
న్నుండ నయి తిరుగుచుండుదు, నెండ యనక వాన యనక యెప్పుడుఁ గూడన్.
క. అది యేమిపాతకమొ నా, యెద నొకత్రుటి యైన నుండనీ దొక చోటన్
బదరుదు నొక కాలంబున, నదిరిపడుదు నొక్కవేళ నతిచిత్రముగన్. 1613
గీ. దైవయోగంబువలన నీదర్శనంబు, ప్రాప్తమయ్యెను నాకు ధరామరేంద్ర
పాపముల నెల్ల రూపుమాపంగఁ జాలు, సంశయము లేక బ్రహ్మవర్చస మొకండె.
క. అని చాలించుటయును ని, ట్లనియెఁ దృతీయుండు స్వామి యవనిసురుఁడ నై
నను నేను జేయఁగూడని, పనులను జేసితిని మద్యపానముకతనన్. 1615
క. చేరిచికొంటిని వేశ్యను, దారసుతుల నిల్లు వెడలఁ దఱిమితి నూరన్
బేరును మాయఁగఁ దిరిగితి, స్వైరవిహారమున దేవశర్మాహ్వయుఁడన్. 1616
క. ఆపాప మంటుకొని న, న్నాపిరి వోకుండఁ జంపుచున్నది తత్సం
తాపమున కోర్వఁ జాలక, యీపగిదిని వచ్చినాఁడ నిచ్చటి కనఘా. 1617
క. ఒనగూడుట నీదర్శన, మును జేసెడిభాగ్య మిపుడు పోయినప్రాణం
బున కాశ యొదవె మరలను, గనికరమున దీనరక్ష గావింపఁ గదే. 1618
క. అని యూరకుండుటయు ని, ట్లనియెఁ జతుర్థుండు విధురుఁ డనియెడువైశ్యుం
డను నేను వేశ్య యగుసమా, తను బొందితి మూఁడునెలలదాఁకను నంతన్.

క. తెలియక చేయంబడినను, బలువయి గురుతల్పగమనపాపము ననుఁ జీఁ
కులఁ బెట్ట సాగె దానను, విలపించుచుఁ దిరుగుచుంటి విశ్వం బెల్లన్. 1620

క. దైవికముగఁ బ్రాప్తించెను, దావకదర్శనము నేను ధన్యుఁడ నైతిన్
బోవక యుండునె సాధుకృ, పావీక్షణమునను బాపపంకం బెల్లన్. 1621

క. అని మిన్న కుండుటయు ని, ట్లనియెను బంచముఁడు నే మహాపాపములన్
బొనరించినాఁడఁ బాతకి, జనసంసర్గమున వైశ్యజాతిభవుండన్. 1622

క. నందాహ్వయుండ నయ్యు న, నందపథంబునఁ జరించినాఁడను దానన్
గుందింపఁ దొడఁగె నాయఘ, బృందం బంతయును నన్ను రేయుం బవలున్.

క. దానికి నోర్వం జాలక, నానాక్షేత్రములు తిరిగినను ఫల మొందన్
గానక వచ్చితిఁ దుదకీ, స్థానమునకు నెపుడొ మేలు సలిపినకతనన్. 1624

క. అరుదెంచినతోడనె య, చ్చెరువుగ నీదర్శనంబు చేకుఱె దానన్
బరితుష్టి గలిగె నాత్మకుఁ, జరితార్థుఁడ నైతి నీవె శరణము నాకున్. 1625

క. అని ప్రార్థించుటయును న, మ్మునిశర్మ తదీయవృత్తముల నెల్లఁ గనుం
గొని దివ్యదృష్టిచే ని, ట్లనియెను మీ కెల్ల శ్రేయ మయ్యెడుఁ గాతన్. 1626

క. ఒనరించుట నజ్ఞానం, బునఁ బాపంబులను సత్యమును జెప్పుటచే
ననుతాపంబును జెందుట, ననుగ్రహంబునకుఁ బాత్రు లైతిరి మీరల్. 1627

వ. అశనసమం బగుతృప్తియును జనకసముఁ డగుగురుండును విప్రసముఁ డగుపాత్రుండును విష్ణుసముఁ డగుదేవుండును గంగాసమం బగుతీర్థంబును గోదానసమం బగుదానంబును గాయత్రీసమం బగుమంత్రంబును నేకాదశీసమం బగువ్రతంబును భార్యాసమం బగుమిత్రంబును దయాసమం బగుధర్మంబును స్వాతంత్ర్యసమం బగుసౌఖ్యంబును గార్హస్థ్యసమం బగునాశ్రమంబును సత్యసమం బగునాచారంబును సంతోషసమం బగుబలంబును వైశాఖసమం బగుమాసంబును లేమిం జేసి యీ వైశాఖమాసంబున గంగాస్నానంబు లభించె నేవి సుగంధభరితం బగుసువర్ణంబు ప్రాప్తించినట్లు. 1628

గీ. నర్మదయు గంగయును యమునయును బాప
హరణమునఁ దుల్యముల కాన నాచరింపుఁ
డిమ్మహానదిలోన స్నానమ్ము నిపుడె
పాపముక్తియు దివ్యరూపమును గలుగు. 1629

చ. అనవుడు వార లెల్లరును హర్షముతోడను నర్మదాజలం
బునను మునింగి లేచుటయుఁ బోయెను గాన సమస్తపాపముల్
గనులను హర్షబాష్పములు గాయములందును దివ్యతేజముల్
దనరఁగ నుల్లసిల్లిరి సుధామయమూర్తులు నాఁగ నయ్యెడన్. 1630

గీ. అనుటయును నంబరీషుఁ డి ట్లనియె స్వామి, పండితులు చెప్ప వింటిఁ బాపప్రశమన
మనెడిస్తోత్రంబుననుమాయునఘములనుచుఁ, దెలుపఁగదవయ్యనాకుఁదద్విధమునెల్ల.
క. అని ప్రార్థించుటయును ని, ట్లనియెను నారదుఁడు రాజ యది సత్యమ నే
వినిచెదఁ బాపప్రశమన, మును వినుము సమస్తపాపములు భస్మ మగున్. 1632

—: పాపప్రశమనస్తోత్రకథనము :—

దండకము:— నారాయణా నీకు జోహారు లాపద్ఘనధ్వాంతమార్తాండ నీకున్
ప్రణామంబు లవ్యక్త నీ కేటికోట్లాశ్రితోద్ధారకా నీకు సాష్టాంగముల్ నీకు
సర్వేశ్వరా వందనంబుల్ నమస్కారముల్ నీకు గోవింద కృష్ణా భవత్పాద
కైంకర్యముం జేయ నాయాత్మ నర్పించితిన్ శ్రీపతీ నేను నీవాఁడఁ బాపాపహా
యెట్టిపాపంబులున్ నీకటాక్షంబుచేతన్ బటాపంచలై పోవ విశ్వాత్మ నిద్రించు
చున్నప్పుడున్ మేలుకొన్నప్పుడున్ గూరుచున్నప్పుడున్ లేచుచున్నప్పుడున్
బోవుచున్నప్పుడున్ గాల్యకృత్యంబులన్ జేయుచున్నప్పుడున్ క్షుత్పిపాసావిధుల్
దీర్చుచున్నప్పుడున్ బుండరీకాక్ష వే యేల యేకృత్యమున్ జేయుచున్నప్పు
డైనన్ మఱేకాలమం దేని యేదేశమం దేని విజ్ఞానినై కాని యజ్ఞానినై కాని
కామార్థినై కాని యర్థార్థినై కాని వాక్చిత్తకాయంబులన్ దేనిచేఁ గాని యె
ట్లేని యిం తేని యం తేని నేఁ జేసియున్నట్టిపాపంబు సర్వంబు దగ్ధంబు గావింపవే
మాధవా నన్ను సంసారపాథోధిపారంబునం జేర్పవే తండ్రి నాదుఃఖముం దీర్పవే
స్వామి నీకంటె దిక్కేదియున్ లేదు నా కెందునుం బోవ దేవా యచింత్యప్ర
భావా నమస్తే నమస్తే నమః. 1633

క. అని పాపప్రశమనమును, వినిచి మహారాజ దీని విన్నను బఠియిం
చినను నశేషాఘవినా, శన మగు నద్దాన విష్ణుసన్నిధి దొరకున్. 1634
గీ. మఱియు వైశాఖమున దీనిమహిమ మింత, యంత యని నిర్వచింప నా కలవి గాదు
మాధవప్రీతికర మైనమాస మగుట, దురితముల నెల్ల నడఁగార్చుస్తోత్ర మగుట.
వ. అనుటయు నంబరీషుం డమ్మునీంద్రున కి ట్లనియె. 1636
గీ. మానివల్లభ వైశాఖమాసమందు, స్నానదానాదు లేవిధిఁ జలుప వలెనొ
విష్ణుపూజన మెట్లు గావింపవలెనొ, యానతీయుము వినఁ గోర్కె యయ్యె నాకు.

—: స్నానదానవిష్ణుపూజావిధానకథనము :—

క. అనవుడు నారదుఁడు ముదం, బునఁ జెలువ వ్వొలయ వదనమున ని ట్లనియెన్
జననాథ వినుము సెప్పెద, వనజభవునివలన విన్నవడువున నీకున్. 1638
వ. వైశాఖమాసంబున సూర్యుఁడు మేషరాశిగతుం డై యున్నతఱుణంబునఁ బ్రాహ్మ
ణానుజ్ఞం బడసి స్నానఫలంబు సిద్ధించునట్లు హరిం బ్రార్థించి మహానదియందుఁ
గాని నదియందుఁ గాని నదమందుఁ గాని సరస్సునఁ గాని నిర్ఝరంబునం గాని
దీర్ఘికయందుఁ గాని కూపోదకంబునం గాని నియమయుక్తంబుగా నారాయణా

ష్టాక్షరమంత్రంబుచేఁ దీర్థకల్పనంబు గావించి స్నానంబు చేసి పవిత్రపాణి యై విధివిధానంబునఁ దత్తీరంబునందు గంగ నావాహనంబు చేసి నందిని నళిని దక్ష పృథ్వి వియద్గంగ విశ్వకాయ శివ యమృత విద్యాధరి మహాదేవి లోకప్రసాదిని క్షేమంకరి జాహ్నవి శాంత శాంతిప్రదాయిని యనుపుణ్యనామంబులం గీర్తించి నాలుగు గాని యాఱు గాని యేడు గాని మృత్తికాస్నానంబులు గావించి ధౌతవస్త్రంబులు ధరియించి పిమ్మట బ్రహ్మవిష్ణురుద్రప్రజాపతిదేవయక్షనాగగంధర్వాప్సరోవిద్యాధరజలధరక్రూరసర్పసుపర్ణతరుపక్షిపాతకినిరాధారజీవతర్పణంబును దేవర్షిపితృతర్పణంబును స్వపితృతర్పణంబునుం జేసి యటుమీఁద ముందుభాగంబునఁ బద్మంబును లిఖించి మార్తండనామంబు లుచ్చరించుచు సపుష్పాక్షతసలిలారుణచందనంబులతోడ నాదిత్యున కర్ఘ్యంబు నొసంగి నమస్కారంబు లర్పించి ప్రదక్షిణంబులు గావించి బ్రాహ్మణగోకాంచనస్పర్శంబు గావించి స్వగృహంబునకుం జేరి విష్ణుప్రతిమను బూజించి మాధవప్రీతికరంబు గా యథాశక్తి సువర్ణరజతతామ్రసలిలాన్నశర్కరాంబరపాదత్రాతపత్రమధుతిలకుంభకన్యాగోభూధాన్యాద్యనేకదానంబులు పాత్రుల కొసంగి హవిష్యంబు భుజియించి బ్రహ్మచర్యంబు నవలంబించి స్థండిలంబున శయనింపవలయు. వైశాఖమాసంబంతయును నీవిధంబున నిత్యస్నానంబు గావించి యంతంబున బ్రాహ్మణసంతర్పణంబు చేయువారల కీప్సితార్థసిద్ధియును విష్ణులోకప్రాప్తియునుం గలుగు. 1639

గీ. వ్రతము దానంబు నియమంబు బ్రహ్మచర్య
జపహవిష్యంబు లచ్యుతార్చనము భూమి
శయ్యయును హోమమును గోటిజన్మపాప
సంతతుల రూపుమాపు వైశాఖమందు. 1640

వ. ఇదియునుం గాక వ్రతాచరణసమర్థత యుండెనేని. 1641

గీ. వ్రతము నీరీతి ద్వాదశవత్సరములు, గడచుదాఁకను జేయుచుఁ గడ కొనర్ప
వలయు నుద్యాపనము దానఁ గలుగు విష్ణుమందిరావాసభాగ్యంబు మానవులకు.

క. వైశాఖస్నానంబునఁ, గ్లేశంబులు వాయుఁ దొలఁగు లేవడియును ర
జ్ఞాశంబగు నందఱలోఁ, బ్రాశస్త్యము గలుగు ముక్తి వాటిలుఁ దుదకున్.

క. విత్తంబు లేనియెడలను, జిత్తము హరిమీఁద నిలిపి చేసినస్నానం
బుత్తమగతిసాధన మగుఁ, జిత్తంబె ప్రధాన మగుటఁ జేతల కెల్లన్. 1644

వ. ఇంక నర్చనవిధానంబుఁ జెప్పెద. భగవదర్చనంబు వైదికతాంత్రికమిశ్రభేదంబులచేఁ ద్రివిధంబుగాఁ జెప్పంబడియె. వైదికార్చనం బేనియు మిశ్రార్చనం బేనియు ద్విజులు గావింపం దగు. తాంత్రికార్చనంబు స్త్రీశూద్రులకు విహితంబు. వేదోక్తంబు వైదికంబు. తంత్రోక్తంబు తాంత్రికంబు. వైదికతాంత్రికోభయ

రూపంబు మిశ్రంబు. ద్విజుం డగువాఁడు వైదికమంత్రంబులచేఁ గాని వైదిక తాంత్రికమంత్రంబులచేఁ గాని స్నానసంధ్యాదికర్మంబులు నిర్వర్తించి స్థండిలంబునం గాని యగ్నియందుం గాని సూర్యునియందుం గాని బ్రాహ్మణుని యందుం గాని స్వహృదయంబునం గాని పరమేశ్వరుని నారాధింపం దగు. ప్రతిమ శైలి ధాతుమయి లౌహి లేప్య లేఖ్య సైకతి మణిమయి మనోమయి యనెడియష్టవిధభేదంబులచే నొప్పు. అయ్యది చరాచరభేదంబులచే ద్వివిధం బయ్యె. స్థిరప్రతిమ కావాహనోద్వాసనంబులు లేవు. చరప్రతిమకు వికల్పంబుగా నుండు. స్థండిలప్రతిమకు రెండునుం గలవు. అర్చాప్రతిమకు సమ్ముఖంబుగా నుండి యథావిధి నర్చింపం దగు. పూజానంతరంబు విధివిహితం బగు కుండంబు సేర్పఱచి యందు నగ్నిం బ్రతిష్ఠించి వాసుదేవుని ధ్యానించుచు హవిర్హోమంబు గావించి పార్షదులకు బలి నర్పించి పురాణకథాపఠనశ్రవణంబుల చేతను నానావిధస్తోత్రంబులచేతను నారాయణునకు సంప్రీతిం గొలిపి దండప్రణామంబుం గావింపం దగు. ఉద్వాసనంబు చేయవలసినయెడఁ బ్రతిమాజ్యోతి నాత్మజ్యోతియంద యుద్వాసనంబు గావింపవలయు. ఆవాహనీయం బయ్యె నేని యాత్మజ్యోతినుండి యావాహింప వలయు. 1645

గీ. అఖిలభూతంబులందును నాత్మయందు, నమరువానిఁగ నెఱిఁగి సర్వాత్ముఁ డైన
హరినిఁ బూజింపఁగాఁ దగు నర్చకుండు, శ్రద్ధ దనకు ఘటిల్లినప్రతిమయందు.

వ. ప్రతిమాప్రతిష్ఠాపనంబునఁ ద్రిభువనాధిపత్యంబును దేవాలయస్థాపనంబున సార్వభౌమత్వంబును బూజాదినిర్వహణంబున బ్రహ్మలోకంబును బడయంగలుగు.

గీ. అశ్వమేధాదియాగంబు లాచరించుఁ, గాక దానను భక్తియోగమునఁ గాంచు
సంతశ్రేయంబు గన నలభ్యంబు భక్తి, నశ్యుఁ డైనట్లు హరి కర్మనశుఁడు గాఁడు.

గీ. అంబుజాక్షుని దర్శించునవియె కనులు
హరిపయిని బాదుకొని యుండునదియె బుద్ధి
యచ్యుతునిస్తోత్ర మొనరించునదియె జిహ్వ
హాటకాంబరునకు మ్రొక్కునదియె తనువు. 1649

క. భూవర నీ వచ్యుతపద, సేవకుఁడవు గానఁ దెలియఁజేసితి నీకున్
శ్రీవైశాఖమహత్త్వముఁ, బోవలయును నింక స్నానమున కని పోయెన్.

గీ. అంత వైశాఖవిధు లెల్ల నాచరించి, యంబరీషుండు గృతకృత్యుఁ డయ్యె దాన
నతనికి లభించెఁ ద్రిజగంబులందుఁ గూడ, విష్ణుభక్తుం డనెడిమేటివిశ్రుతంబు.

—: ఆదివరాహ మేదినీసంవాద కథనము :—

సీ. మఱియు నొక్కవిశేష మెఱిఁగింతు మును విష్ణు, వాదివరాహమై యవతరించి
దంష్ట్రయందు ధరించి ధరణి నుండ సహస్ర, దివ్యవర్షంబు లాదేవి యపుడు

మాధవ దినపక్షమాసవత్సరయుగ, కల్పాదికం బైనకాలమందు
శ్రేష్ఠత్వమును వహించినది యెయ్యదియో నా, కానతి మ్మని వినయమున నడుగ
గీ. నచ్యుతుం డిట్టు లనియెం గాళ్యపి వచింతు, నన్నిటను గూడ వైశాఖ మధికతమము
నేనె యది యని యూహింప జ్ఞాను లెల్ల, మాధవాఖ్యను దాల్చినమాస మగుట.
వ. తన్మాసశుక్లతృతీయాదివసంబున మధుహిరణ్యాక్షు లనుఘోరరాక్షసులు నాచే
నిహతు లగుటం జేసి యాతృతీయ యక్షయ్యతృతీయ యనియును త్రేతాయుగాది
యనియును బ్రసిద్ధిం జెందినపుణ్యదినం బయ్యె. 1653
గీ. అట్టిదివసంబు గల్గిన దగుట నాకుఁ, బ్రియతమం బయ్యె దాన నాపేరు వడసె
దాన నఖిలజగత్పూజ్యతను వహించు, మహిమ మేర్పడె మాధవమాసమునకు.
శా. ఆమాసంబునఁ జేయుస్నానజపదానార్చావ్రతాదిక్రియా
స్తోమం బంతయుఁ బుణ్యరాశి యయి సంతోషంబు నైశ్వర్యముఁ
క్షేమంబుం యశముం సతీసుతహితశ్రేణిం గల్గానై పుణిం
సామర్థ్యంబు నొసంగి చేడుచుఁ దుదిం వైకుంఠధామంబునన్. 1655
క. అని చెప్పుటయును మేదిని, మనమున సంతోష మొందె మఱియొక గాథన్
వినిచెదను వినుఁడు మాధవ, మునఁ గలమహిమంబు స్పష్టముగఁ దెలియంగన్.

—: యమబ్రాహ్మణసంవాదకథనము :—

వ. మున్ను మధ్యదేశమునందు గంగాయమునలనడుమ నొకయగ్రహారంబు గలదు.
గీ. దానిలోపల విద్వాంసు లైనద్విజులు, కల రనేకులు వారిలోపలను యజ్ఞ
దత్తుఁడనుబ్రాహ్మణునిఁ దేరదండధరుఁడు, భృత్యులనుబంపఁగనువార లేఁగుదెంచి.
ఆ. యజ్ఞదత్తతుల్యుఁ డైనమఱొక్కబ్రా, హ్మణునిఁ దోడుకొని ప్రమాదమునను
నరిగి దండధరునియంతికమున నిల్ప, శమనుఁ డతనిఁ జూచి సత్కరించి. 1659
క. భటులార యజ్ఞదత్తుని, నిటకుం గొనిరం డటంచు నే నంపఁగ మీ
రటు చేయక యీవిప్రునిఁ, దటుకునఁ గొనివచ్చితిరి వృథా క్రియ యయ్యెన్.
క. అనుడుఁ బ్రమాదంబున నీ, పని యయ్యె క్షమింపు మనుచు భృత్యు లర్థింపన్
గొనిపొండు మరల నీవి, ప్రుని నని శమనుండు పలికెఁ గ్రోధముతోడన్. 1661
గీ. అపుడు విప్రుఁడు యమున కిట్లనియె దేవ, యిచట సుఖముగ నుండ్రె నా కేఁగ నొప
నేల రావింపఁ బంపఁగా నేల మరల, నిటుగఁ జెప్పుము కారణ మేమొ నాకు.
వ. అని యడుగుటయు నంతకుం డాతని కిట్లనియె. 1663
సీ. భూసుర వినుము నీపుణ్యంబునను జేసి, సుఖముగా నుండె నిచ్చోటు నీకుఁ
బుణ్యంబు చేసినపురుషుల కియ్యది, సౌఖ్యంబు నొసఁగెడిస్వర్గభూమి
పాపంబు లొనర్చినపాపాత్ములకు నిది, భరియింపఁజాలనినరకభూమి
పాపపుణ్యానురూపంబుగా దుఃఖంబు, సౌఖ్యంబు నొసఁగెడుస్వామి నేను

గీ. హాయనము లింకఁ బది నిండునంతవఱకు
నాయు వుండుటఁ జేసి నీ వవనిలోన
నుండఁ దగువాఁడ వగుట నిం దుండఁ దగదు
చనుము శీఘ్రంబ యనుడు ని ట్లనియె ద్విజుఁడు. 1664

గీ. ధర్మమూర్తివి నీవు నీదర్శనంబు
చేకుఱుట దుర్లభంబు నాచేసినట్టి
పుణ్యమునఁ బ్రాప్తమైతి విప్పుడు మహాత్మ
యడుగఁ దలఁచితి నినుఁ గొన్నియంశములను. 1665

గీ. అనుటయును ధర్మరా జట్టు లనియె విప్ర
యడుగు మవి యేవొ శీఘ్రంబ యనుచు నంత
బ్రాహ్మణుఁడు దేవ భూరిధర్మంబు గలుగ
సులభ మైనయుపాయంబు దెలుపు మనియె. 1666

—: ముఖ్యధర్మకథనము :—

చ. అనవుడు ధర్మరాజు ముద మంది మహీసుర యొక్కమాటలో
వినిచెద శాస్త్రసారమును విష్ణు వొకండె భవాంబురాశిలో
మునిఁగినజంతుకోటుల సముద్ధరణం బొనరించుదేవుఁ డా
యనను భజించుచో నిహపరార్థము లాత్మకరస్థితార్థముల్. 1667

క. మాధవునకుఁ బ్రియ మైనది, మాధవమాసంబు దాన మాధవసంప్రీ
త్యాధాయకముగ స్నానా, రాధనముఖవిధు లొనర్చు ప్రాజ్ఞులె ధన్యుల్. 1668

వ. వైశాఖమాసంబునఁ బ్రాతఃకాలంబునం దొందు స్నానంబు గావించినను భాగీరథి నర్మద యమున సరస్వతి విశోక వితస్త యనునాఱువింధ్యోత్తర పుణ్యనదులందును గోదావరి భీమరథ తుంగభద్ర వేదిక తాపి పయోష్ణి యను నాఱువింధ్యదక్షిణపుణ్యనదులయందును నిత్యస్నానంబు గావించినఫలంబును సర్వపుణ్యాయతనంబుల సేవించినఫలంబును సకలపుణ్యాశ్రమంబుల దర్శించిన ఫలంబును జేకూరు. 1669

క. ఆయువు శ్రీయును వర్ధిలుఁ, బాయు మహాపాతకోపపాతకములు శ్రే
యసము గల్గు స్నానము, చేయు నెడల మాధవమునఁ జేతనములకున్.

గీ. కల్పకోటిశతంబులుఁ గల్పకోటి, శతసహస్రంబులును విష్ణుసదనమందు
వాస మొనరించు వైశాఖమాసమందుఁ, జేసి స్నానంబు హరిని బూజించె నేని.

క. పాతకము లెల్ల మాయును, బ్రేతత్వము పోవు నావరించినభూత
వ్రాతములు తొలఁగు రాధ, ప్రాతస్స్నానమున కెంత ఫల మనవచ్చున్. 1672

వ. దీనికి దృష్టాంతంబుగా నొక్కయితిహాసంబు చెప్పెద. వినుము. 1673

సీ. ధనశర్మ యనునొక్కధరణీసురవ్రజుఁడు, దని యొక్కకానసంబునకు మున్ను
కోయుచు నుండంగఁ గుశల నచ్చోటికి, వచ్చి పిశాచముల్ వానిఁ జూచి
భక్తితోఁ గావించి ప్రణతి విప్రోత్తమ, త్వత్పుణ్యదర్శనావాప్తివలన
నస్మదీయక్రౌర్య మంతయు నడఁగారె, నిది యేమి చిత్రంబొ యెఱుఁగ నైతి
గీ. మనుటయును ధనశర్మ యిట్లనియె మీర, లెవరొ నాకడ కిపుడు రా హేతు వేమొ
తెలియఁజేయుఁడు సర్వంబు తేటపడఁగఁ, గలిగెడిని జాలి మిమ్ములఁ గాంచినంత.
వ. అని యడుగుటయు నాపిశాచంబులలోనియొకపిశాచం బిట్లనియె. 1675
క. చేసినయుపకృతి మఱచిన, దోసమె నా కమితఘోరదుష్కృతి గలుగం
జేసెను దానను జెడితి సు, దాసుం డను వైశ్యుఁడను గృతఘ్నుఁడను జుమీ.
క. అతిపాపుల కైనను ని, ష్కృతి యున్నది గాని లే దొకించుకయును దు
ర్గతివారక మగుమార్గము, కృతఘ్నునకు ననుచుఁ జెప్ప నే మును వింటిన్.
గీ. కట్టికుడుపదె చేసినకర్మ మిలను, నెట్టివారల నైనను నేమి చెప్పఁ
బరమనిర్భాగ్యుఁడను మహాపాతకుఁడను, నాకు దిక్కెది యైన నున్న దె మహాత్మ.
వ. అని పలికి యూరకుండుటయు ద్వితీయపిశాచం బిట్లనియె. 1679
గీ. బ్రాహ్మణోత్తమ పదివేలగ్రామములకు, నధిపతిని నేను హరివీరుఁ డనెడివాఁడ
గురువు దైవంబు నాక ముష్కరుఁడ నగుచు, వర్తిలిన హేతువున విదైనయుఁడనైతి
క. ప్రేతత్వ మొదవె నా కా, పాతకకర్మంబువలనఁ బా పై పోదిన్
జైతన్యం బుండియును న, చైతన్యుఁడ నైతి బాధ నైఁపఁగ లేమిన్. 1681
క. న న్నుద్ధరింపఁగదె యా, పన్నుఁడను ననాథుఁడను గృపాపాత్రుఁడ నీ
పున్నమునఁ జేసి బ్రదుకుదు, నన్నమన స్తృష్ణ ప్రబల మయ్యెను నాకున్. 1682
వ. అని ప్రార్థించి విరమించుటయుఁ దృతీయపిశాచం బిట్లనియె. 1683
సీ. బ్రాహ్మణోత్తమ నేను బ్రాహ్మణుండను మున్ను, వాసంబు చేసితి వాసపురిని
గౌతమగోత్రసంభూతియు గౌతమా, హ్వాయమును గలిగినవాఁడ నైతి
శ్రౌతమార్గమె ముక్తిసాధనం బని యెంచి, యాచరించితి భూరియజ్ఞములను
వాసుదేవునిఁ గూర్చి వైశాఖమునఁ జేయ, నైతిని స్నానదానాదివిధులఁ
గీ. గడను నొకపూర్ణిమను నైనఁ గడప నైతి, శౌరిసంప్రీతికర మైనస్నానమునను
దాన నేఁ జేసినట్టియధ్వరము లెల్ల, ఫలవిహీనంబు లై నన్నుఁ బాడుచేసె.
క. దాన నవైశాఖాఖ్యను, బూని పిశాచంబ నగుచు భూతల మెల్లన్
దీనత్వముచేఁ దిరుగుచు, నానాకష్టములలోన నవయుచు నుంటిన్. 1685
గీ. తీర్థములకంటె నధికులు ద్విజులు దాన, నుత్తమబ్రాహ్మణుఁడవు న న్నుద్ధరింపు
మట్లు కా దేని ధనశర్మ యనుమదాత్మ, భవున కెట్టిగింపు మయ్య నాపడెడిపాట్లు.
క. అని ప్రార్థించుటయును నా, ధనశర్మ మహావిషాదతప్తుం డై యి
ట్లనియెను దండ్రి భవత్సుతుఁ, డను నేన పనిందక్యజన్ముఁడను నేన సుమీ.

గీ. జనన మరయంగ నుత్తమజాతియందుఁ
జేయఁబడినవి చూడ నామ్నాయవిధులు
చెందినది గాంచ దుర్గతి చిత్ర మయ్యె
ధర్మ మతిసూక్ష్మ మెఱుఁగంగఁ దరము గాదు. 1688

క. జనకుఁడ వగుని వివిధ, మున నుండఁగఁ జూచుపాపమును నాకు విధిం
చెను ధాత యేమి చేయుదుఁ, గన నైతిని నీకు సుగతి గలిగెడిత్రోవన్. 1689

క. అని చింతిల్లుచు నుండం, గను భూతం బిట్టు లనియెఁ గలిగినయెడ నా
యన నీకుఁ గరుణ నాపై, నొనరింపుము మాకు నొక్కయుపకారంబున్.

వ. వైశాఖమాసంబున విష్ణుప్రీతికరంబుగా స్నానదానాదివిధులు యథావిధిం జేసి వైశాఖశుక్లత్రయోదశీ చతుర్దశీ పూర్ణిమాస్నానఫలంబు మామువ్వురకును యథాక్రమంబుగా నర్పించితి వేని ప్రేతరూపంబులు తొలంగి మేము దివ్యరూపంబులతోడ వైకుంఠధామంబుఁ జెందంగలవార మగుదుము. పరోపకారపుణ్యంబు నీకును నుద్ధారకం బగు నని చెప్పుటయును ధనశర్మ మహానందముం జెంది యట్లకావించె. 1691

గీ. అంతటను నాపిశాచము లబ్బురముగ, దివ్యదేహంబులను దాల్చి తేజరిలుచు
నెక్కి దివ్యవిమానంబు నేఁగె నతఁడు, గాంచుచుండంగ గగనమార్గమును దాఁటి.

క. ధనశర్మ యాపరోపకృ, తిని జేసి యిహంబునను ప్రతిష్ఠయు సౌఖ్యం
బును ననుభవించి పిమ్మటఁ, జనియెను వైకుంఠమునకు సంతోషమునన్. 1693

సీ. మఱియొకగాథ నీ కెఱిఁగింతు వినుము మ, హీధరుం డనెడిభూమీంద్రుఁ డొకఁడు
పూర్వకాలమునందుఁ బూఁబోఁడులను గూడి, తద్రక్తిచే రాజధర్మ ముడిగి
స్వైరవిహారి యై సంచరించుచు నుండఁ, గడచిపోయెను గొంతకాల మటులె
యంతట నొక్కనాఁ డతనిపురోహితుం, డైనకశ్యపుఁ డట కరుగుదెంచి

గీ. భామినీమధ్యగతుఁ డైనప్రభునిఁ జూచి, యధికవాత్సల్యమున నిట్టు లనియె భూప
శిష్యునకు బోధ చేయక చెడు గురుండు, చెడును శిష్యుఁడు గురునిభాషితము వినక.

క. కావున నేను వచింపం, గా వలయును గురుఁడ నైనకతమున నీకున్
నీవును శిష్యుఁడ వగుటను, నావచనం బంతయును వినంగా వలయున్. 1695

సీ. అచ్యుతారాధనం బాచరింపక పోతి, బ్రాహ్మణులకు దృప్తి పఱుప వైతి
జపియింప వైతివి జప్యమంత్రములను, దిరుగక పోతివి తీర్థములకుఁ
దలపెట్ట వైతివి దానధర్మములను, సాధింప వైతివి సత్ఫలంబు
భాషింప వైతివి ప్రాజ్ఞులతోడను, జేయఁగాఁ దగుపని చేయ వైతి

గీ. మరణమును జెంది యిట్లుండి తరలిపోవు, నపుడు ధర్మంబు లొకఁడె సహాయ మగుచు
నరుగుదెంచును వెను వెంట నంతె కాని, యెవ్వరును రారు తదితరు లెంచి చూడ.

గీ. త్యాగహారిపూజ లనువలయములు సత్య, ధర్మము లనెడికుండలద్వయము వినయ
మనియెడికిరీటమును గలజనుల కేల, భూరిభారంబు లగుజడభూషణములు.

గీ. ధర్మ మార్జించుచుందురు తత్త్వవిదులు, సర్వకాలంబులందును శక్తికొలఁది
మధువును బతంగికలు చేర్చుమాడ్కి నదియె, సకలదుర్గతులను మాపుసాధనంబు.

గీ. మరణమును జెంది చితి నున్ననరుని విడిచి, లోష్టకాష్ఠంబులను బోలె నిష్టు లెల్ల
విముఖులై వత్తు రింటికి వెంట నుండు, నుచితబాంధవుఁ డన ధర్మ మొకఁడ చూవె.

గీ. తాను జేసినపుణ్యంబె తన్నుఁ గాచుఁ, దాను జేసినపాపంబె తన్నుఁ గూల్చుఁ
బ్రాణధారుల కెల్లను బంధురిపులు, సుకృతదుష్కృతములు రెండె క్షోణినాథ.

క. ధనమును దనువును సుతులును, వనితలు భోగమును నధ్రువంబుల యనుచున్
మనమునను నిశ్చయంబున్, బొనరిచికొని బుధుఁడు ధర్మమునె సేవించున్.

క. క్షణికం బగుజన్మనమును, క్షణికం బగుజీవితమును శాశ్వతములు గా
గణియించి తిరిగి తుదకున్, గుణహీనుఁడు గూలు నరకకూపములందున్.

గీ. అర్థకామంబు లఖిలసౌఖ్యముల నొసఁగు, ధర్మయుక్తంబు లగునేని ధరణిపాల
యయ్యవియె ధర్మహీనంబు లయ్యెనేని, విషసమంబులు వాని సేవింపరాదు.

క. మృతికంటెను దుర్వ్యసనం, బతికష్టము దానివలన నగు నధమగతుల్
మృతివలనఁ గలుగు స్వర్గ, స్థితి దుర్వ్యసనంబు లేనిచేతనములకున్. 1704

క. వృద్ధు లగువారివలనను, బుద్ధులు నేర్చికొని చిత్తమును నయగుణసం
బద్ధముగఁ జేయువాఁడు ప్ర, సిద్ధుం డయి సకలకార్యసిద్ధులు వడయున్. 1705

క. అనిశంబును నింద్రియజయ, మనుయోగమునందు నుండునధిపుఁడె ప్రజలన్
మనుప సమర్థుఁడు తదితర, జననాథుఁడు నామమాత్రజనపతియ సుమీ.

క. అనఘుం డై పోవలయును, నవసానంబునకు విడిచి యంతయు నని క్షే
మవిమఁ దెలిసి నిజరక్షక, మవుధర్మమునందె సక్తుఁ డవు నెల్లపుడున్. 1707

క. లలనాకటాక్షచపలం, బులు సంపద లవి తొలంగిపోకుండంగన్
జలుపుదురు ధర్మబద్ధం, బులు గా మతిమంతు లైనభూమీశానుల్. 1708

క. ధరణీతలేంద్ర వైశ్వా, నరసంసర్గమున నింధనంబులువోలెన్
దురితసహావాసంబున, సిరు లెల్ల నశించు ననుచుఁ జెప్పుదు రార్యుల్. 1709

క. క్షేమమును రూపుమాపును, గామక్రోధములు రెండు గావున వాసిన్
భూమీంద్ర నిగ్రహింతురు, క్షేమార్థులు వాని దరికిఁ జేర్తురు మూఢుల్. 1710

గీ. చపల మైనది శ్వాసంబు క్షణములోనఁ, జలుపుచుండు గతాగతశతము లట్టి
దానికి వశం బయినజీవితమును నమ్మి, యిలను ధర్మవిలంబంబు నెవఁడు చేయు.

క. నడుచును దుష్పథమందున్, నడిపించిన సుపథమందు నడిపించినచో
నడుచును జిత్తము బాలుని, వడువున నది యెఱిఁగి జ్ఞానవంతుఁడు నడుపున్.

ఆ. కుపథమందుఁ బోవు నెపుడును దుష్టాశ్వ, మట్టు లంతరంగ మది యెఱింగి
తదనుగామి గాక తత్త్వజ్ఞుఁ డగువాఁడు, దాని నడుపు సత్పథంబునందు. 1713

క. గతియించుచుండె నాయువు, గతియించుచునుండె వయసు కామక్లేశ
వ్యతికరమునఁ బడి ధర్మ,చ్యుతుఁడవు గాఁ దగునె బుద్ధియుక్తుఁడ వధిపా.1714

గీ. అడుగకుండిన నెఱిఁగియు నుడువఁ గూడ, దందురు నయజ్ఞు లైనను నాత్మజులకు
శిష్యులకుఁ బండితులకును జెప్ప ధర్మ, మగుట నీకు వచించితి నడుగకున్న.

క. అని వాక్రుచ్చుటయును నా, మనుజాధీశ్వరుఁడు బుద్ధిమంతుం డగుటన్
మనమున లజ్జయు ఖేదం, బును బెనఁగొన గురునిపాదములకుఁ బ్రణతుఁ డై.

క. స్వామి వివేకవిహీనతఁ, గామంబునఁ జిక్కి కన్నుగానక చెడితిన్
క్షేమము గోలెడిమార్గం, బే మైనను నున్న నాకు నెఱుఁగం జెపుమా.1717

క. అని ప్రార్థించుటయును నా, యనఘుం డి ట్లనియె భూప యఘసంతతి నె
ల్లను రూపుమాపి సేమం, బును మాధవమాస మిచ్చు భువి నెల్లరకున్. 1718

క. ఆమాసంబునఁ జేయుము, భూమీశ్వర స్నానదానములను సమస్త
క్షేమములు గలుగు నీకున్, గామకృతం బయినపాతకంబును దొలఁగున్.

వ. తండులమునకుఁ జర్మంబుఁబోలె నుండుసహజమలంబును దామ్రంబునకుఁ జిలు
ముకై వడి నుండునాగంతుకమలంబును దేహధారికిఁ దొలంగం ద్రోయునది
యొక్కమాధవమాసంబ. 1720

క. అని చెప్పుటయు మహీధర, జననాథుఁడు కామలాలసత్వ ముడిగి చే
సెను మాధవమాసంబున, నొనరింపఁగఁ దగినవిధుల నుత్సాహముతోన్.

ఆ. అట్లు చేసి వ్రతము నబ్దత్రయం బాతఁ, డొందెఁ గాలధర్మ మొక్కనాఁడు
తెలిసికొని తదీయదేహపాతంబును, నానియోజ్యు లరిగి వానికడకు. 1722

గీ. కాలపాశంబులను గట్టి కదలకుండ, నీడ్చుకొని వచ్చుచుండ మహీధవుండు
తా నొనర్చినపాపంబు తలఁచికొనుచు, నేడ్చె గొల్లున బాధ సహింపలేక.1723

క. ఆరోదనారవము విని, నారాయణభటులు వచ్చి నాసేవకులన్
వారించి గౌరవం బే, పారఁగఁ గొని వాని దివికి నరుగుచు నుండన్. 1724

ఆ. అతఁడు మార్గమధ్యమందు నారకవాసు, లైనవారియేడ్పు లాలకించి
యడుగ నేమి యిది య టంచును హరిభటు, లేర్పడంగ నతని కిట్టు లనిరి.1725

వ. యమభటాకృష్యమాణులును నంధకారనిపాతితులును నతిఘోరశునకసృగాల
కాకకంకబకవృకవ్యాఘ్రాదిక్రూరక్రవ్యాదభక్ష్యమాణులును భుజగవృశ్చికాది
దశ్యమానులును వహ్నిదహ్యమానులును గంటకతుద్యమానులును గ్రకచ
పాట్యమానులును దృష్ణాపీడ్యమానులును క్షుధాబాధ్యమానులును బూయ
శోణితగంధమూర్ఛితులును దప్తతైలక్వాథ్యమానులును దప్తాయసపిండసంతప్య

మానులును ముసలతాడ్యమానులును వాంతాశనులును మలాశనులును మూత్రరుధిరపాయులును మాంసవసాకేశాస్థిభక్షకులును గాలపాశబద్ధకంఠులును కూటాగారభ్రామ్యమాణులును నగుచు నసిపత్త్రరౌరవకుంభీపాకాదినానావిధ మహాఘోరనరకపతితు లగుమహాపాపులు దారుణరోదనధ్వనులు గావించు చున్నవారు. చేయరానిమహాపాపంబులం జేసి తత్కర్మఫలంబు ననుభవించు చున్నయీదుష్టులరోదనధ్వనులు మనము వినరాదు. సత్వరంబ రమ్ము. 1726

చ. అనవుడు ఱేడు మానసమునందు విషాదముఁ జెంది వారి కి
ట్లనియె మహాత్ములార యిపు డానరకస్థుల నుద్ధరింప నే
నొనరుపఁ దగ్గమేలు చెపుఁ డుండినఁ జేసెద నార్తశోకనా
శనకరు లైనచేతనులజన్మమె జన్మము ముజ్జగంబులన్.

వ. శిబి కపోతరక్షణార్థంబు స్వమాంసపిండంబులు ఖండించి యిచ్చె. దధీచి పరోప కారార్థంబు తనయస్థి నొసంగె. సహస్రజిత్తు బ్రాహ్మణప్రాణరక్షణార్థంబు నిజ ప్రాణంబుల నర్పించె. 1728

క. అమ్మహితులు విశ్రుతికా, యమ్ములచేతను ధరిత్రియం దనిమిషరూ
పమ్ములచే స్వర్గమున ధ్రు, వమ్ముగ వెలుఁగొందు చున్నవారల కాదే. 1729

గీ. అనుటయును విష్ణుభటు లిట్టు లనిరి భూప, పాపముల నెల్ల రూపుమాపంగఁ జాలు
మాధవస్నాన మద్దానిమహిమమున నె,పాపి వగునీకుఁ బ్రాప్తించెఁ బరమపదము.

క. ఆకారణమున వైశా, ఖైకదినస్నానఫలము నిచ్చితి వేనిన్
జేకూరు వీరి కెల్లను, నాకపదము తొలఁగి నరకయాతన లెల్లన్. 1731

చ. అని వచియించుచున్ క్షితితలాధిపుఁ డెంతయు సంతసించుచున్
మనమున దారవోసెను రమాపతి సాక్షిగ నాత్మపుణ్యమున్
వనజదళాక్షకింకరజనంబు వచించినరీతి దుర్గతిన్
గనినసమస్తదేహులును గాంచఁగ స్వర్గనివాససౌఖ్యమున్. 1732

గీ. అంత నరకనివాసు లత్యద్భుతముగ, దివ్యతనువులతోడ దేదీప్యమాను
లగుచు దివ్యవిమానంబు నధివసించి, చనిరి దివికి నుతించుచు మనుజవిభుని.

క. అంతట హరిభృత్యులు భూ, కాంతునిఁ దోడ్కొని యఖండగౌరవమున దై
త్యాంతకపురమున కేఁగుడు, సంతోషము నొందె హరి ప్రసన్నుం డగుచున్

క. ఈకథను వినిన వినిచినఁ, జేకూరును వాంఛితార్థసిద్ధులు గానన్
నీ కెఱిఁగించితి నీవును, నాకర్ణించితివి సేమ మయ్యెడు మనకున్. 1735

గీ. ఇంక సత్వరముగను నీ వేగవలయు
నొడలు చితిలోన దహియింపఁబడక మునుపె

యనుడుఁ బ్రణమిల్లి యమునకు నవనిసురుఁడు
చని స్వదేహంబులోఁ జొచ్చి కనులు దెఱచె. 1736

గీ. అపుడు బాంధవు లెల్లరు హర్షమునను, గాంచుచుండంగఁ దనకును గాలునకును
జరిగినప్రసంగమును దెల్పి తన్మాసురుండు, వారి నెల్లను విస్మయవార్ధిఁ దేల్చె.

గీ. అంత వారలు దానును హర్షభరితు, లగుచు వైశాఖమాసములందుఁ జేయఁ
దగినవిధుల నొనర్చి యబ్దములు గొన్ని, చివరఁ జేఁగిరి వైకుంఠభవనమునకు.

క. ఈమాధవమాహాత్మ్యము, నేమానవుఁ డేని వినిన నిహమున నఖిల
క్షేమములు వడసి వైష్ణవ, ధామంబున నుండు శాశ్వతంబుగఁ దుదకున్. 1739

క. అని వచియించుటయును ని, ట్లనిరి మునీశ్వరులు సూత హర్షం బయ్యెన్
వినుటను మాధవమహిమం, బును నింక విభూతిమహిమమును దెల్పఁగదే. 1740

వ. అని యడుగుటయు సూతుండు వారల కి ట్లనియె. 1741

—: విభూతిమాహాత్మ్యకథనము :—

సీ. మునులార శర్వుండు మును విప్రవేషంబు, ధరియించి తా నొక్కతరుణమందు
రామునికడకుఁ జేరఁగ వచ్చుటయు రాముఁ, డర్ఘ్యపాద్యాదుల నతని గొనఁగి
స్వామి మీనామదేశము లేవియొ వచింపు, మని సగౌరవముగా నడుగుటయును
హరుఁ డిట్టు లనియె భూవర పేరు శంభుండు, వాసదేశంబు కైలాసశిఖరి

గీ. యనుటయును రాముఁ డత్యంతహర్ష మొంది
బ్రాహ్మణోత్తమ కైలాసపతికిఁ బ్రీతి
హేతు వగుభూతిమాహాత్మ్య మెఱుఁగఁ జెపుమ
వేడ్క జనియించె నద్దాని వినఁగ నాకు. 1742

ఆ. అనుడు శంభుఁ డిట్టు లనియె రామునితోడ, నానసమున మందహాస మొలయ
భస్మమహిమ మెన్న బ్రహ్మాదులకుఁ గూడ, ధరణిజాకళత్ర తరము గాదు.

గీ. పటగతం బైనరేఖను పావకంబు, దగ్ధ మొనరించునట్లు దగ్ధం బొనర్చు
ఫాలగతపాపలిపి నెల్ల భస్మ మొకఁడె, యగ్నివీర్యప్రధారక మగుటఁ జేసి.

సీ. ముఖధారణంబున ముఖపాతకంబును, గంఠపాతకమును గంఠధృతిని
బాహుధారణమున బాహుపాతకము హృ, త్పాతకంబును నురోధారణమున
నాభిస్థలీధారణమున శిశ్నాఘంబు, పాయుపాపము పృష్ఠభాగధృతినిఁ
బార్శ్వదేశద్వంద్వభాగధారణమునఁ, బరపురంధ్ర్యాశ్లేషపాతకమును

గీ. దగ్ధ మొనరించు భస్మంబు దారువులను, నగ్నిబలె దాని కొదవె భస్మాహ్వయంబు
భర్త్సనము సేయుటను సర్వపాపములను, స్మరణమాత్రదూరీకృతదురిత మగుట.

క. భస్మమునఁ బండుకొనినను, భస్మంబు నలందికొనిన భస్మముఁ దినినన్
భస్మస్నానము చేసిన, భస్మీభూతంబు లగును బాపము లెల్లన్. 1746

గీ. భూతిని ధరించునో త్రిపుండ్రములుగ నెవఁడు
వాఁడు నిజముగఁ దాల్చినవాఁడ చూవె
హరిహరబ్రహ్మమూర్తిత్రయమును మూఁడు
వీతిహోత్రంబులను మూఁడువిశ్వములను. 1747

క. పావనులు కానివారును, బావను లై కర్మమునకుఁ బాత్రు లగుదు రు
ర్వీవర భస్మముచేతన్, గావించినయెడల స్నానకర్మము మర్త్యుల్. 1748

వ. మఱియును భస్మంబు సుఖప్రసవజనకంబును భూతావేశనివారకంబును సర్ప
వృశ్చికాదినానావిషప్రశమనంబును నాయుష్యాభివర్ధకంబును నై యుండు. 1749

సీ. మును వసిష్ఠాన్వయంబున ధనంజయుఁడు నాఁ, గలఁ డొక్కవిప్రుఁడు క్ష్మాతలమున
నతనికి నూర్వురు సతు లుండి రవ్వారి, కంకురించిరి నూర్వు రాత్మభవులు
తనతనూభవుల కిచ్చెను నిజద్రవిణ మం, తయు సమానముగ ధనంజయుండు
వారల కన్యోన్యవైరముల్ సమకూరె, నొకనిధనంబు వేఱొకఁడు మ్రింగ

గీ. నంత నొకనాఁడు కరుణాఖ్యుఁ డైనపుత్రుఁ, డొకఁడు భవనాశినీతటియొద్ద కరిగె
శత్రునాశమునకు నృకేసరిని గూర్చి, తప మొనర్చెడితలఁపు స్వాంతమునఁ గలుగ.

గీ. అరిగి యట నున్నమునుల నెల్లరను జూచి
విస్మయం బొందు చుండంగ విప్రుఁ డొకఁడు
నారసింహార్థ మొక్కజంబీరఫలము
దెచ్చి యది యుంచెను దటాకతీరమందు. 1751

క. ఆపండు బహుమనోహర, రూపచ్ఛవిసౌరభాభిరూపం బగుచున్
జూపట్టినను నది కరుణుఁడు, చేపడఁ గొని మూరుకొనియెఁ జేతఃప్రీతిన్. 1752

సీ. అది గాంచి యచటిమహర్షు లెల్లరు వాఁడు, సలిపినదేవాపచారమునకు
సైరింపఁ జాలక శపియించిరి శతాబ్ద, ములు మక్షికాత్వంబుఁ బొందునట్లు
లంతట మక్షిక యై భ్రమించుచు వాఁడు, చేరి శీఘ్రము నిజాగారమునకు
జరిగినవిషయంబు సర్వంబు తనభార్య, కెఱిఁగించి గీపెట్టి యేడ్వఁ దొడఁగె

గీ. నంతఁ దత్కాంత నిశ్చేష్ట యగుచుఁ గూలఁ, బడి ధరిత్రిని లేచి వెంబడిన యెట్లొ
తనయభాగ్యత నిందించుకొనుచు మిన్నుల, నేడ్చె బోరునఁ గన్నీళు లేర్లువాఱ.

క. అది యాలకించి జ్ఞాతులు, ముద మొందుచు నొక్కసమయమున నాయీఁగన్
జదుపఁ దలఁచి తైలమునం, దదయంబుగ వైచి రెట్టియరులో జ్ఞాతుల్. 1754

వ. అంతట మృతం బగునామక్షికను గైకొని దుఃఖించుచుఁ దత్కాంత యగుశుచి
స్మిత యరుంధతికడ కరుగ నాయమ కరుణించి మృత్యుంజయమంత్రాభి
మంత్రితం బగుభస్మంబు నామక్షికపయిం జల్లుడు నాయీఁగ తటాలున లేచి
తిరుగం జొచ్చె. 1755

ఆ. అంతఁ గొంతకాల మరుగంగ నొకనాఁడు, జ్ఞాతి యొకఁ డీసు సైఁప లేక
మక్షికను వధించి సాక్షాత్తుగను దద్వ్యఘూటికడను దానిఁ ద్రోసి చనియె.
క. అంతట నాయింతి శుగా, క్రాంతాంతర యగుచు మక్షికను గొని విపినా
భ్యంతరములందుఁ దిరుగుచు, సంతాపముతోడఁ గడపసాగెను దినముల్.
గీ. అపుడు దైవికముగ నట కరుగుదెంచి, చూచి యాశోకవతిని దధీచమౌని
తన్వి నీ వెవ్వతవు వనాంతరములందు, నేల తిరుగుచు నుంటివో యెఱుఁగఁ జెపుమ.
క. అని యడుగుటయును నాసతి, వినయంబున నతని కాత్మవృత్తాంతం బె
ల్లను దెలిపి యేడ్వ నమ్ముని, కని యాంతరదృష్టిఁ దత్ప్రకారం బెల్లన్. 1759
క. మును నిర్గళితాయువు లగు, ననిమిషజమదగ్నికశ్యపాదుల మరణిం
చినసన్ను జీవయుక్తుల, నొనరింపఁగఁ గల్గె భస్మ మొక్కఁడె యుర్విన్. 1760
క. కావున నాభస్మముననె, జీవింపఁగఁ జేయువాఁడ శీఘ్రంబుగ ని
ర్జీవుం డగునీతని నని, భావించుచు నీఁగపైని భస్మముఁ జల్లెన్. 1761
గీ. అప్పు డాయీఁగ శాపాంత మగుటఁ జేసి, స్వస్వరూపంబు వడసి విస్మయము దోఁప
నమ్మహర్షికి వందనం బాచరించి, యందె దీర్ఘాయు వగు మనునాశిషంబు. 1762
సీ. అంత శుచిస్మిత యతిహర్షమున మౌని, చరణాంబుజములకు సాఁగి మ్రొక్కి
తనయింట నాతిథ్యమును స్వీకరింపంగఁ, బ్రార్థించుటయును నాపారికాంక్షి
యామెశుద్ధి నెఱింగినట్టివాఁ డగుటను, నంగీకరించెఁ దత్ప్రార్థనమును
నంగీకరించుడు నాక్షణంబున నామె, భర్తతోఁ జని తనభవనమునకుఁ
గీ. బాక మొనరించి యమ్మౌనిరాక కెదురు, చూచు చుండంగ వచ్చి దధీచమౌని
షడ్రసోపేత మైనయాసాధ్వి చేతి, యన్నమును దృప్తికరముగా నారగించె.
గీ. అంతటను భస్మలిప్తాంగు లగుచు నచటి, కమరు లెల్లరు చనుదెంచి యమికి మ్రొక్కి
స్వామి నీవలనను భస్మశక్తి వినెడి, తలఁపుతో వచ్చినార మిందఱము గూడ.
సీ. మును మేము గౌతమమునిభార్య నొకనాఁడు, మోహించి తత్పాపముననుజేసి
శమితపూర్వజ్ఞానశక్తుల మయి చిత్త, ములలోన ధైర్యంబు తొలఁగిపోవ
నరిగి దుర్వాసునియంతికమునకు మా, వృత్తాంత మంతయు విన్నవింప
నమ్మహర్షి కృపాకటాక్షంబులను మమ్ము, వీక్షించి సురలార వెఱవ వలదు
గీ. మున్ను నే బ్రహ్మహత్యాఘమునఁ దపించు, చుండఁగ ననుగ్రహించె శివుండె నాకు
భస్మమును దానఁ బోయె మత్పాప మెల్ల, నిపుడు మీకును నేనదె యిచ్చువాఁడ.
క. అని శతరుద్రీయక్రమ, మున మంత్రిత మైనభస్మమును మాపైఁ జ
ల్లెను దాన నఖిలపాపము, లును దొలఁగి సమస్తశక్తులును మా కొదవెన్.
వ. అని చెప్పి విరమించుటయును దధీచమహర్షి వారల కిట్లనియె. 1767
ఆ. విబుధులార భస్మవిషయకమహిమంబు, తెలుపువాఁడఁ గొంత తేటపడఁగ
నంతె గాని తెలుప నఖిలంబు కల్పస, హస్రములకు నైన నలవి గాదు. 1768

సీ. ప్రళయకాలంబు సంప్రాప్తించుటయును ము, న్నేకార్ణవము గాఁగ లోక మెల్ల
శయనించి యుండెఁ దజ్జలమధ్యమున మహా, విష్ణు వొక్కండె నిర్విషయముగను
నతనిశిరోఽంతరమం దిర్వదియును ని, ర్వదియును బాదపార్శ్వంబులందు
ఘ్రాణాగ్రమందు నొక్కటియును రెండుశ, తంబులు రెండుపార్శ్వంబులందు
గీ. వెలయుచుండెను బ్రహ్మాండములు పురాణ, మానులెల్లరుఁ దన్నాభిమండలమునఁ
జేరికొని యీశ్వరోపాస్తి చేయు చుండి,రపుడు గోవిందుఁ డున్మీలితాక్షుఁ డయ్యె.
ఆ. అటులు కనులు దెఱచి యాశ్చర్యమును జెంది, శ్రీధరుండు మరల సృష్టి సేయ
వలయు ననుచు మదినిఁ దలపెట్టి ధ్యానయో, గమునఁ జూచి యెదియుఁ గానరామి.
గీ. అంతరంగంబునను దుఃఖ మావరింపఁ, బెద్దగా నేడ్చె దెస లెల్ల దద్దరిల్ల
నపుడు లోకవిలక్షణ మైనమెఱుపు, మెఱసె నెదుటఁ గనుల్ మిఱుమిట్లుగొనఁగ.
గీ. అమ్మహాదీప్తిఁ గన లేక యచ్యుతుండు, మూసికొనియెను గనులు. సంత్రాసమునను
సత్తటినిగోటివిధ్యండహారయుగము, కరములనుదాల్చియొకమూర్తి కానఁబడియె.
గీ. అమ్మహామూర్తి నీక్షింప నలవిగామిఁ, జక్రి సాష్టాంగముగ మ్రొక్కి స్వామి నిన్నుఁ
జూడలేకున్నవాఁడ నీచూపుచేతఁ, గనికరింపుము నానమస్కారమున నె.
సీ. అనవుడు నవ్వుచు నామహాదేవుఁ డ, ధోక్షజునకు దివ్యచక్షు వొసఁగి
జ్ఞానోపదేశంబు సలిపెద నాహూపు, దెలిసికొనెడిశక్తి గలుగ నీకు
సలుపుము వారుణస్నానంబు ముందుగా, నచ్యుత యనుడు నారాయణుండు
స్నానంబు నెచ్చోటఁ జలుపంగ నేఁగునో, యచట నెల్లను దోయ మల్ప మగుట
గీ. మునుఁగకయె తిర్గి వచ్చుటయును గ్రహించి
యమ్మహాత్ముండు తనయంకమందె యొక్క
హ్రదముఁ గల్పించి మునుఁగు మిం దనుడు శౌరి
దానిలోఁ జొచ్చుమార్గంబు గాన లేక. 1774
ఆ. పరితపించుచుండఁ బరమేశ్వరుం డది, యెఱిఁగి మార్గ మీయఁ గృష్ణుఁ డందు
దిగి మునింగిపోయి తెప్పిలి యెట్టులో, లేచి పట్టుకొఱకుఁ జూచుచుండ. 1775
ఆ. అది గ్రహించి యీశుఁ డచట వేదముల సో, పానములుగ నేఱుపఱచుటయును
నవి గ్రహించి విష్ణు వవలంబనంబుగాఁ, బ్రాణభయము లేక పైకి వచ్చి. 1776
గీ. ఎదుట నిలువంగఁబడుటయు నీశ్వరుండు, కృష్ణధ్యానించిహృదయమం దేమికలదొ
చెప్పు మనుటయు ధ్యానంబు చేసిశౌరి, యేమియునుగానరాదయ్యెస్వామియనియె.
గీ. అంత నీశుఁడు తనయురోఽభ్యంతరమునఁ
దేజరిలుభస్మమును గోటఁ దీసి శౌరి
గాత్రమునఁ జల్లి యిపు డేమి కలదొ హృదయ
మందు ధ్యానించి వచియింపు మనుడు శార్ఙ్గి. 1778

క. వినిమీలితాక్షుఁ డగుచుం, గనుఁగొని హృదయమున దీపకాంతిని దద్వా
ర్తను నీశ్వరునకుఁ జెప్పుట, యును నీశుఁడు చూచి శాంతి యొలికెడిదృష్టిన్.
క. హరినోట వైచి భస్మము, మరలను వచియింపు మేమి మదిని గలదొ నా
హరి మ్రింగి తద్విభూతిని, గర మచ్చెరియముగ శుక్లకాంతియుతుండై. 1780
వ. హృదయంబునం బ్రబ్బరిల్లుదీపంబునడుమ శుద్ధస్ఫటికసంకాశుండును ద్రినే
త్రుండును ద్విభుజుండును వరదదక్షిణహస్తుండును నభయదవామహస్తుండును
బంచవర్షీయశరీరుండును వేదకల్పితనూపురుండును మందస్మితాస్యుండును
వామాంగుళీయమధ్యస్థమణిప్రణవుండును నగునొక్కదివ్యపురుషునిం గాంచి
యమందానందంబు నొందుచుఁ బులకితగాత్రుండై తద్వార్త నీశ్వరున కెఱింగించి.
గీ. భస్మమహిమంబు నెఱుఁగనిపామరునకుఁ, ద్వత్ప్రభావంబుఁ దెలియంగఁ దరమె దేవ
యనుచుఁ బాదాంబుజంబులయందుఁ బడుచు, భావజాంతకుఁ డాతని లేవ నెత్తి.
గీ. వత్స ధన్యుఁడ వైతివి వరము నిత్తుఁ, గోరుకొను మని పలుకంగ శౌరి దేవ
త్వత్పదాంభోజభక్తి సంతతము నాకుఁ, గలుగఁ గరుణింపు మదె సర్వకామదంబు.
మ. అనిప్రార్థించుటయున్ శివుండు తనదివ్యాకారముం జూపి యి
ట్లనియెన్ మాధవ తాల్చుచుండుము త్వదీయాంగంబులన్ శైవభూ
తిని నిత్యంబును దాన మచ్చరణభక్తిం జెంది యాధిక్యమున్
గనఁగాఁ జాలుదు వెల్లదేవతలలోనన్ మెచ్చ ముల్లోకముల్. 1784
చ. అనవుడు వాసుదేవుఁడు నతాననుఁడై ప్రణమిల్లి శూలి కి
ట్లనియెను దేవదేవ భవదాజ్ఞను దాల్చి చరింతు సంతతం
బును నని శైవభస్మమును బూసికొనంగఁ దొడంగె దానిచే
తనె సకలాధికత్వమును దాల్చె మురారి జగత్త్రయంబునన్. 1785
క. అని చెప్పుటయు దధీచున, కనిమిషులు నమస్కరించి యరిగిరి స్వర్గం
బున కంత శుచిస్మిత యు, మ్మునివర్యునిఁ జూచి వినయమున ని ట్లనియెన్.
గీ. స్వామి భస్మంబు పరలోకసాధనంబు, కాఁగలదె దానికే దైనఁ గలదె గాథ
కనికరంబున వచియింపు మనుడు మౌని, యిట్లు చెప్పఁదొడంగె నాయిందుముఖికి.
సీ. ఇంతి మున్నొక్కమహీసురుం డొకనాఁడు, రాజకార్యప్రవర్తనమువలన
నరిగి ప్రాత్తలికానగరమున కారేయి, శయనించె నొకవిప్రసదనమందు
నపుడు దైవికముగా నరుదెంచి యచటికి, గతనాథ క్షత్త్రియాంగన యొకర్తు
వాతనిరూపరేఖాదులఁ జూచి యే, కాంతంబుగను జేరి యతనిదరికి
గీ. స్వామి యేదేశము నివాసభూమి నీకు
నెచటి కేఁగెద విటనుండి యెఱుఁగఁ జెపుమ
యనుటయును బ్రాహ్మణుం డిట్టు లనియెఁ దన్వి
యెవతె వీ వేల నాగాథ యిపుడు నీకు. 1788

క. అనవుడుఁ బురుషులగాథలు, వనితల కేమిటికొ తెలుప వలయునె నీకుఁ
మనసిజసుందర యని యా, వనజాయతనేత్ర పలుకి వాఁ డి ట్లనియెన్. 1789

ఆ. చాన చాలుఁ జాలు సరసప్రసంగము, లెవ్వఁ డెట్టివాఁడొ యెఱుఁగ వలదె
పొమ్ము పలుకకుండ సమ్మతింతురె ప్రాజ్ఞు, లైనవార లిట్టియాశయములు.

చ. అనవుడు నామె యి ట్లనియె నంసమునం గలపైఁట జార్చుకొం
చును మెలమెల్లఁగా బెళుకుఁజూపులఁ జూచుచు సుందరాంగ నీ
వనినది యెట్లు ధర్మ్యమొ మదాశయ మట్టులె ధర్మ్య మెంచి చూ
చినయెడ ధర్మశాస్త్రములు చేసినవారికి లేవె యీకథల్. 1791

క. అనుటయు బ్రాహ్మణుఁ డి ట్లని, యెను గామిని చాలుఁ జాలు నిఁక నీమాటల్
మన మిట్లు రహోవాదము, లొనరించుచు నుండ నూర కుందురె లోకుల్.

చ. అనుటయు నాపడంతి వసుధామర లోకులు కాకు లేల వా
రిని గణుతింపఁగా వలయుఁ బ్రేమపురస్సర మైనకార్యమం
దని దరి కేఁగుదేరుటయు నాతఁడు ధైర్యము లేనిచూపులన్
గనుఁగొను చుండె నూరకయె కామవశీకృతచిత్తవృత్తి యై. 1793

క. అదె సమయం బనుచును న, మ్మదవతి పైఁ బడుడు విగతమర్యాదుం డై
మదనకళాపాండిత్యము, సుదతికిఁ జూపించె ద్విజుఁడు చోద్యము గాఁగన్. 1794

గీ. అంత వారిద్వరును స్నేహ మతిశయిల్లఁ, గడపిరి శతాబ్దములు సౌఖ్యకరముగాఁగ
నటు పిదప నొక్కనాఁడు గోత్రామరుండు, కాలధర్మంబు నొందె నాకస్మికముగ.

సీ. అప్పుడు యమదూత లరుదెంచి సరగున, ధరణీసురునిఁ గట్టి త్రాళ్లతోడ
శమనునిసన్నిధానమునకుఁ దోడ్కొని, పోవంగఁ గాంచి విప్రుని నతండు
క్షితిసురాధమ నీవు చేసినపాపంబు, లనుభవించెడికాల మరుగుదెంచె
నబ్దకోటిద్వితయంబు కుంభీపాక, నరకదుర్భరయాతనలను గుడిచి

గీ. పిమ్మటను శతశునకజన్మమ్ము లెత్తి, పడయరానట్టిబాధలు పడెద వనియె
నంతటను భూసురుఁడు విని యతనిమాట, పడియె నచటను భీతిచే నొడలు మఱచి.

ఆ. అంత నతనిభార్య యగునవ్యయాదేవి, భర్త చచ్చె ననెడివార్త నెఱిఁగి
యమరవానివలన నపగతచేష్ట యై, పడియె నాక్షణంబ పుడమిమీఁద. 1797

గీ. అట్లు పడి కొంతసేపున కాత్తసంజ్ఞ, యగుచు నెట్టులొ లేచి యయ్యమరమునిని
గాంచి జలజలఁ గన్నీరు గాఱుచుండ, నేడ్వఁ దొడఁగుడుఁ జూచి మునీశ్వరుండు.

సీ. అమ్మ నీపాపకర్మ మ్మిట్టు లుండంగ, నెవ రేమి చేయుదు రేడ్వ నేల
త్వత్పతిదేహంబు దగ్ధంబు గాదాయె, నింతదాఁకను జూడ నెంచి తేని
మద్విపంచీనాళమధ్యసంస్థవు గమ్ము, క్షణములోఁ గొనిపోదు శవముకడకు
ననవుడు భర్తతోడను సహగమనంబు, నొనరించుటకు వాంఛ యొదవ నామె

ఆ. యమ్మహర్షి చెప్పినట్లు చేయుటయును, శీఘ్రముగ నతండు చేర్చె భర్తృ
శవముకడకు సాధ్వి యవ్వంత నాయకు, సహగమనము చేయ సాహసించి.

వ. మంగళసూత్రంబులును హారిద్రయును నక్షతలును గుసుమంబులును వసనంబులును గస్తూరీచందనంబులును స్వర్ణకంకతికలును భూషణంబులును ఫలంబులును దక్షిణాతాంబూలంబులును బార్వతీప్రీతికరంబుగాఁ బురంధ్రీజనంబుల కొసంగి దహనాధికారంబు నారదున కిచ్చె. 1800

గీ. అంతటను నారదుండు బ్రాహ్మణుని ముందు,దహన మొనరించి తచ్చితిస్థానమంద
తరుణిని దహింపఁ జూచెడితటి నెఱింగి, యవ్వయాదేవి బహుభక్తి నామతిల్ల.

సీ. దహనంబునకుఁ ద్రిప్రదక్షిణంబు లొనర్చి, ప్రాంజలి యై తదగ్రమున నిలిచి
సకలదేవతలార త్రికరణశుద్ధి గాఁ, బతిని దైవముగ నెంచితిన యేని
నావల్లభునితోడ నను సద్గతికిఁ జేర్పుఁ, డని ప్రార్థన యొనర్చి యగ్నిఁ జొచ్చెఁ
జొచ్చుటయు దివౌకసులు దేవయానంబుఁ, గొనివచ్చి యం దెక్క మని వచింప

గీ. నవ్వయాదేవి యానంబు నధివసించి, యంతకునిసన్నిధికి నేఁగి యాత్మధవుని
విడువు మని పల్క శమనుఁ డా వెలఁది నధిక,భక్తితో గౌరవించియిప్పగిది ననియె.

వ. సాధ్వీమణీ నీవు కావించినసహగమనధర్మంబువలనఁ బాపాత్ముం డైనను నీదయితునకుం గూడ స్వర్గప్రాప్తి గలుగవలసియున్నది. కాని యీతండు మున్నొక్కనాఁడు శివాలయంబులోనియఖండదీపపాత్రంబునం దుండుఘృతంబుం గైకొని యారగించె. తన్మహాపాతకంబు స్వర్గప్రతిబంధకం బయ్యె.పుణ్యకార్యంబులవలన నఖిలపాతకంబులును నశియించుం గాని శివద్రవ్యాపహరణపాపంబు మాత్ర మనుభవింపక తప్ప దని మహేశ్వరుండు వచియించె. 1803

క. కావున నరకావాసం, బేవిధమున నైనఁ దప్ప దితనికి నింకన్
బోవుము నీవు దివంబున, కేవారును దాఁటఁ జాల రీశ్వరునాజ్ఞన్. 1804

గీ. అనుటయును నవ్వయాదేవి యాశ లుడుగి,శీఘ్రముగ భర్తకు దివంబు చేకుఱంగ
నాత్మలో నెంచుచును నమరాలయమున, కరిగె నిజధర్మ మాత్మసహాయముగను.

సీ. అంతట శమనుఁ డాయతివధర్మంబున, విగతాఘుఁ డైనయాద్విజుని విడిచి
చనుము మానవలోకమున కని పనుపంగ, నతఁ డేఁగుదెంచి ధైర్యమున నిలకుఁ
ద్ర్యంబకద్రవ్యాపహరణపాపఫలంబు, ననుభవింపఁగఁ బుట్టి శునకముగను
బడరానియిడుమలు పడుచు నింటింటికిఁ, దిరుగుచు నాఁకలి దీఱ కునికిఁ

గీ. గడపి తొల్లొ శతాబ్దముల్ గట్టకడకు, మద్గృహంబున నొక్కధామమున నునిచి
నట్టిశైవవిభూతియం దసువు లుడిగె, దాన వానికిఁ గైలాసధామ మొదవె.

గీ. ఒదవుటయు కాక కైలాస మొదవెఁ బ్రమథ, గణపదంబులలో నెల్ల గణ్య మైన
శ్వానముఖగణపదము భస్మప్రభావ, మల్పమతి నగునా కెన్న నలవి యగునె.

క. అనుటయును శుచిస్మిత యి, ట్లనియెను మౌనీంద్ర కశ్యపాదుల సురలన్
నిను మనిచె భస్మ మంటివి, విన వేడుక యయ్యె దానివిధముం జెపుమా. 1808
వ. అని యడుగుటయు దధీచమహామౌని యాసతీమణి కి ట్లనియె. 1809
గీ. పూర్వమునఁ గశ్యపాదితపోధనులును, నమరులును నేనును మురారియర్చనమును
జేయఁగా నెంచి యొకనాఁడు చేరి శౌక, రాచలంబున కరిగితి మందఱమును.
సీ. అప్పు డచ్చట నొక్కయగ్నిమహాజ్వాల, విస్మయంబుగను నావిర్భవించి
నలుదెసల్ గ్రమ్మి క్రన్నన వచ్చి మ మ్మెల్ల, నిర్దగ్ధ మొనరించె నీఱు గాఁగ
నాకస్మికంబుగా నది చూచి వీరభ, ద్రుం డచ్చటికి వచ్చి రోషమునను
గను లెఱ్ఱచేయుటయును నది శమియించె, సలిలంబుచేఁ దృణానలమువోలె
గీ. నంత మఱియొక్క వెల్గు కాలాగ్నిపగిదిఁ, బ్రజ్వరిల్లుచు రా వీరభద్రుఁ డార్చి
దాని మ్రింగఁ గడంగెడితఱిణమందు, హితునిమాడ్కి నభోవాణి యిట్టు లనియె.
సీ. వీరభద్రుఁడ నీవు వీరుండ వైనను, సమయంబు గా దిది సాహసింప
నీమహాగ్నిజ్వాల యెంతమందినొ భస్మ, మొనరించె మునులను ననిమిషులను
జూడు మాభస్మరాసుల నెల్ల నీకంటఁ, దిలకించితివ యేని తెలియు నీకె
దచ్చె నగస్త్యుండు సమసెను జమదగ్ని, కశ్యపుండు నశించెఁ గావ్యుఁ డడఁసె
గీ. నింద్రుఁ డడఁగారె నంతకుఁ డీల్గె వరుణుఁ, డస్తమించెను బవమానుఁ డసువు లుడిగె
నంతరించెను బావకుఁ డెంతమంది, కాలవశు లైరొ చెప్ప శక్యంబు గాదు.
చ. అనవుడు వీరభద్రుఁడు మహాగ్రహ మేర్పడ శైవభస్మసం
జనితమహాప్రభావుఁడను శంభుసుతుండను నేనె యిమ్మహా
గ్నిని శమియింపఁ జేసి బ్రదికింపక యుండిన వీరి నెల్ల నిం
కను భువనంబు లుండునె జగత్పతు లుందురె యంచు నార్చుచున్. 1813
గీ. అద్భుతంబుగఁ దెఱచి యాస్యంబు మ్రింగె, నమ్మహాజ్వాల నొకకబళమ్ముఁ బోలెఁ
గురియు చుండంగ దేవతల్ కుసుమవృష్టి, యంతరిక్షంబునుండి ప్రహర్షమునను.
ఆ. అంత వీరభద్రుఁ డాకృశానుజ్వాల, యాఱిపోవుటయును నచట నున్న
భస్మరాసు లెల్లఁ బరికించి వానిపైఁ, జల్లె మేన నున్న శైవభూతి. 1815
గీ. అప్పు డాభస్మరాసు లత్యద్భుతముగ, దేవతలు మౌనులును నయి తేజరిలుచు
లేచి పూర్వాకృతులతోడఁ జూచి యెదుటఁ, గానఁబడువీరభద్రునిఁ గౌతుకమున.
క. దీవించి యడుగుటయు నా, గ్రావమున మఱొక్కచోటఁ గదలక యుండన్
గావించి మమ్ము నెల్ల మ, హావేశంబునను నొక్కవ్యాళము మ్రింగెన్. 1817
ఆ. అపుడు వీరభద్రుఁ డది యోగదృష్టిచే, నెఱిఁగి వచ్చి యటకు నేకవర్ష
మమ్మహాహితోడ నాయోధనము చేసి, విసివి తుదకుఁ గ్రోధవివశుఁ డగుచు.
గీ. కరములను దానియోష్ఠయుగంబుఁ బట్టి, రెండు చీలికలు గఁ దచ్ఛరీర మెల్లఁ
జీల్చి తద్గర్భమున మృతి చెంది యున్న, మమ్ము బ్రదికించె శైవభస్మమ్ముఁ జల్లి.

గీ. అంత మే మెల్లరమును శివాత్మజునకు, దీవన లొసర్చి సంతోష మావహిల్ల
శోకరాద్రీశ్వరునిఁ గొల్వఁ జనుచు నుండ, మాపురాకృతపాపకర్మమునఁ జేసి.

వ. మహాకాయుండును దశబాహుండును బంచపాదుండును నష్టశీర్షుండును బంచ
శేఫుండును మహాభయంకరుండును నగునొక్కరాక్షసుండు మహావరాహావ
తారంబున మహావిష్ణువునకుం గలబలంబుకంటె ద్విగుణీకృతం బగుబలంబున
నొప్పువాలిని దదనుజుం డగుసుగ్రీవుని నేకకబళంబుగా మ్రింగుచుఁ దద్భ
యంబునఁ బలాయమానుల మగుమ మ్మెల్లరను దనదీర్ఘహస్తంబులచేఁ జుట్టి
చుట్టి యొక్కముద్దగాఁ గబళించె. 1821

సీ. అది యెఱింగి మహేశ్వరాత్మజుం డతిశీఘ్ర, గమనంబుతోడ నక్కడకు వచ్చి
వానితోడను మూఁడువత్సరంబులు ఘోర, కదనంబు గావించి కట్టకడకుఁ
దచ్ఛీర్షముల నెల్లఁ దఱిగి మహాసిచే, గాత్రంబుఁ జీలిచి కరరుహముల
మరణించి తత్కుక్షిమధ్యంబునం దున్న, మము వానరులను భస్మమున మనిచె

గీ. నని వచింప శుచిస్మిత యబ్రపడుచు, స్వామి యారాక్షసునిగాథ యేమొ తెలుపు
మించుక య టంచు వేఁడఁగా నిట్టులనియె, నమ్మునీంద్రుండు శాంతభావమ్ముతోడ.

గీ. చెలువ వాఁడు హిరణ్యకశిపునిరాజ్య, మందు నున్ననిశాచరుఁ డమితబలుఁడు
దేవదానవరణమున దేవతలను, గబళములు గాఁగ మ్రింగినకాలయముఁడు.

సీ. ఒకనాఁడు వాఁడు మదోద్ధతిచేత నే, కాకిగాఁ జని యమలోకమునకు
సంగరం బొనరించి శమనునితోఁ గొంత, కాల మాతని మ్రింగెఁ గట్టకడకు
నపుడు కృతాంతుఁ డయ్యమరారియుదరంబు, చీల్చి బ్రద్దలుగ విచ్చేసె వెలికి
నంతట మృతుఁ డయ్యె నారాక్షసుఁడు శుక్రుఁ, డావార్త విని వేగ యచటి కరిగి

గీ. వాని బ్రతికించెఁ దనశక్తివలన నంత, నతఁడు తలవంచికొని లజ్జకతన నింటి
కరుగక యెశీఘ్రముగ నొక్కయడవి కేఁగి, యెపుడు నెవరును జేయనితపము చేసె.

ఆ. అట్లు తప మొనర్చి యంతంబునను దేవుఁ, డెవఁడు గూడ వరము నీయరామెమి
నలిగి తనశిరంబు లగ్ని కాహుతిచేయఁ, దలఁచి వ్రేల్చి నాల్గుతలలు గోసి.

క. మిగిలినమైదవశిరమును, దెగఁ గోయఁగఁ బూని యుండఁ దెగువను నీశుం
డగజాసమేతుఁ డగుచుఁ, దిగి కైలాసంబునుండి దిగ్గున వచ్చెన్. 1826

ఆ. వచ్చి సాహసంబు వలదు రక్షోవీర, కోరుకొనుము వరము కోరినట్టు
లిచ్చువాఁడ ననుచు నీశ్వరుండు వచింప, మ్రొక్కి శంకరునకు రక్కసుండు.

సీ. చంద్రశేఖర నీకు సంతుష్టి గలిగి నా, యీప్సితంబును దీర్ప నెంచి తేని
యేను మ్రింగెడిజీవు లెల్ల నాయుదరంబు, నందె జీర్ణం బయి మ్రందునట్లు
ఖండింపఁబడినను వెండియు నాతల, లుద్భవంబును జెందు చుండునట్లు
నీవు రోషము లేక యేవేళలను గూడ, నొప్పుగా నాకడ నుండునట్లు

గీ. మఱియు నాదివరాహ మూర్తతఱిని కూరికిఁ, గలబలముకంటె నాల్గురెట్టులబలంబు
త్వజ్జటోత్పాటనోద్భవువలన మృతియుఁ, గలుగునట్టులు వర మీయవలయు నాకు.
క. అని వాంఛించుటయును ద్రిణ, యనుఁ డట్టులె వర మొసంగి యంతర్ధానం
బును జెందె దానఁ గలిగెను, దనుజునకుఁ మృతి కపర్దితనయునివలనన్. 1829
గీ. ఈ విభూతిమహాత్త్వము నెవ్వ రేని, వినినఁ బఠియించినను స్మరించినను సకల
బాధలు నశించి శివపదప్రాప్తి గలుగు, నని వచించి నిజాశ్రమంబునకుఁ జనియె.
క. అని చెప్పుటయును రాముఁడు, మనమున నాశ్చర్య మొంది మహనీయ విభూ
తిని జేయువిధానంబును, వినిపింపుము నాకు వినఁగ వేడుక యయ్యెన్.
క. అని యడుగుటయును నిట్లని, యెను శంభుఁడు రామచంద్ర యే నెఱిఁగింతున్
వినుము స్మరించినమాత్రం, బున నఖిలాఘముల మాపుభూత్యుత్పత్తిన్.

—: భస్మోత్పత్తివిధానకథనము :—

వ. శాశ్వతుండును సద్వితీయుండును గుణాతీతుండును గుణాధారుండును నగుసదా శివుండు సృష్టి చేయం దలంచి దక్షిణాంగంబునుండి బ్రహ్మను వామాంగంబు నుండి విష్ణునిఁ బృష్ఠదేశంబునుండి యీశ్వరుని సృజియించి యాత్మసంస్థం బగు వేదత్రయాత్మకసత్త్వరజస్తమోగుణత్రయంబు వారల కొసంగి యేతత్సారం బగుభస్మంబు ధరియించితి రేని మీకు సృష్టిస్థితిసంహారశక్తు లావిర్భవించు. దానంజేసి మీకృత్యంబులు నెఱవేర్పుం డని యాదేశించె. 1833
ఆ. అంత బ్రహ్మవిష్ణుహరు లాతనికి మ్రొక్కి, స్వామి భూతి త్రిగుణసార మెట్లు
లయ్యె నెట్లు పుట్టె నది తెల్పు మని వేఁడు, టయు సదాశివుండు దయ దలిర్ప.
వ. గుణత్రయంబ గో వనియును విద్యయ గోమయం బనియును నుపనిషత్తుల గోమూత్రం బనియును స్మృతుల వత్సంబు లనియును దత్సారంబ భస్మం బని యును నెఱుంగవలయు. భస్మంబు తత్సారం బగుట తదుత్పత్తివిధానంబునం దెలియుం గాన భస్మోత్పత్తివిధానముం జెప్పెద. వినుండు. శుక్లపక్షంబునం గాని కృష్ణపక్షంబునం గాని చతుర్దశినాఁ డుపవాసంబు గావించి "యాగావ" యను మంత్రంబుచే గోవు నభిమంత్రించి "గావో భగో గావ" యనుమంత్రంబుచేఁ దృణ జలంబు లాగోవున కొసంగి మఱునాఁడు ప్రాతఃకాలంబున లేచి కృతస్నానుం డై ధౌతవస్త్రంబులం దాల్చి శుచి యగుచు శయనించి యున్న ధేనువును లేపి గాయత్రీమంత్రంబుచేఁ దన్మూత్రంబు సువర్ణపాత్రంబునం గాని రజతపాత్రంబునం గాని తామ్రపాత్రంబునం గాని మృత్పాత్రంబునం గాని పుష్కరపలాశపత్త్రంబు లందుం గాని గోశృంగంబునందుం గాని పట్టి "గంధద్వారా" మనుమంత్రంబుచే భూపతితంబు గాకుండ గోమయంబుం బూర్వోక్తపాత్రంబులలో దేనియం దైనం బట్టి "శ్రీర్మే భజ" తనుమంత్రంబుచే గోమయంబు శోధించి "యలక్ష్మీర్మయి" యనుమంత్రంబుచే గోమయంబును మార్జించి "సంత్వా సించామి" యనుమంత్రం

బుచే గోమయంబునందు గోమూత్రంబు గలిపి "పంచానాం త్వా"యనుమంత్రంబుచేఁ బదునాల్గుముద్దలు గావించి వాని నెండలో నెండించి పూర్వోక్తపాత్రంబునం దెం దేనిం బెట్టి స్వగృహ్యోక్తవిధానంబున నగ్నిప్రతిష్ఠ గావించి యం. డాపిండంబుల నుంచి యాఘారాజ్యభాగహోమంబుం జేసి పిదప "నిధనపతయే" యనుమంత్రంబుచేతను ద్రయోదశజయాదులచేతను బంచబ్రహ్మమంత్రంబుల చేతను "నమోహిరణ్యబాహవే" యనుమంత్రంబుచేతను సర్వాహుతిహోమంబు గావించి "ఋత సర్వః,కద్రుద్రాయ,యస్య వైకంకతి" యనుమంత్రంబులచేతను ననాజ్ఞాతమంత్రంబులచేతను హోమంబు గావించి పిమ్మట వ్యాహృతిహోమంబును స్విష్టకృద్ధోమంబునుం జేసి యిధ్మశేషంబు నిర్వర్తించి పూర్ణపాత్రోదకంబు పూర్ణమాసాంతయజుస్సుచే నన్యజలమిశ్రితం బొనర్చి "బ్రాహ్మణే ష్వమృత" మనుమంత్రంబుచే శిరంబునం జల్లుకొని "ప్రాచ్యా" మనుమంత్రంబులచే శిష్టోదకంబు దిక్కులం దుంచి బ్రహ్మకు దక్షిణ నొసంగి యంతంబున "నాహరిష్యామి దేవానాం సర్వేషాం కర్మగుప్తయే జాతవేదస మేనం త్వాం పులకైశ్ఛాదయా మ్యహ" మ్మనుమంత్రంబుచే నావహ్నిని దినత్రయంబునఱకును నిలుచునట్లు పులకాచ్ఛాదితంబు గావించి యటుపైని బ్రాహ్మణసంతర్పణంబు చేసి తాను భుజియింపవలయు. అధికభస్మంబు నపేక్షించిన నధికగోమయంబు నార్జింపం దగు. దినత్రయానంతరంబు ప్రాతస్స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించుకొని యగ్ని నావాహనాదిషోడశోపచారంబులచే నారాధించి యుద్వాసనంబు గావింపవలయు. తరువాత "నగ్నిరితి భస్మ" యనుమంత్రంబుచే నుత్పన్నం బైనభస్మంబుం గైకొని "యగ్ని రస్మి" యనుమంత్రంబుచేఁ దుడిచి పిమ్మట గంగాజలంబుచేఁ గాని కపిలాక్షీరంబుచేఁ గాని మిశ్రితం బొనర్చి కర్పూర కుంకుమ చందనోశీరాగురుద్వితయచూర్ణంబు "నో" మ్మనుబ్రహ్మమంత్రంబు తోడఁ దద్భస్మంబునం దుంచి "యమృతం దేవి తే క్షీరం పవిత్ర మిహ బుద్ధిదం తవ ప్రసాదా న్ముచ్యంతే మనుజా స్సర్వపాప్మన" యనుకపిలామంత్రంబుచేఁ బయస్సేకంబు గావించి ప్రణవంబుచేఁ గలిపి యీశానమంత్రంబుచే శిరోదేశంబునను దత్పురుషమంత్రంబుచే ముఖంబునను నఘోరమంత్రంబుచే వక్షఃస్థలంబునను వామదేవమంత్రంబుచే గుహ్యప్రదేశంబునను సద్యోజాతమంత్రంబుచేఁ బాదంబులందును బ్రణవంబుచే సర్వాంగంబులందును భస్మంబు త్రిపుండ్రంబుగా ధరియించి పిదప నాచమించి ధౌతంబు లగు శ్వేతవసంబులు ధరియించి మరల నాచమనంబు గావించి కర్తవ్యకర్మార్హత నొందం గలుగు. అట్లు గానిచోఁ బూర్వోక్తభస్మంబుం గైకొని ప్రణవంబుచేఁ దన్మార్జనంబు గావించి నన్ను స్మరించుచు "నమ శ్శివాయ" యని లలాటంబునందును "నమశ్శివాభ్యా" మని

బాహువులందును "ఘోరాయనమ" యని ప్రకోష్ఠంబులందును "భీమాయనమ" యని పృష్ఠదేశంబునందును "నీలకంఠాయ నమ" యని కంఠపశ్చిమభాగంబునందును "సర్వాత్మనే నమ" యని శిరంబునందును త్రిపుండ్రభస్మంబు ధరియించి పిదపహస్తప్రక్షాళనంబు గావించుకొని స్వకర్మంబు ననుష్ఠింపం దగు. 1835

క. అని చెప్పి తేటపడఁ జ, య్యన నంతర్ధాన మొందె నంతఁ ద్రిమూర్తుల్
జనకుఁడు చెప్పినవిధమున, నొనరించి విభూతిఁ దాల్చి రుత్సాహమునన్. 1836

వ. అంతట రజోగుణధరుం డగుబ్రహ్మకు సృష్టిశక్తియును సత్త్వగుణధరుం డగు విష్ణువునకు రక్షణశక్తియునుదమోగుణధరుం డగునీశ్వరునకు సంహారశక్తియును నావిర్భవించె.

క. అని చెప్పుడు రాఘవుఁ డి, ట్లనియెను ద్విజవర్య వినఁగ నాకాంక్ష జనిం
చెను శివపూజాకాలం, బును జెప్పుము నాఁగఁ బాడబుం డి ట్లనియెన్. 1838

—: శివపూజాకాలకథనము :—

ఆ. రామచంద్ర నీవు రాజ్యప్రసక్తుఁడ, వయ్యు నిట్టిపారమార్థికాశ
యంబు గలిగియుంట నఖలపూజ్యుఁడ వైతి, వనుచుఁ దోఁచె నిశ్చయముగ నాకు.

సీ. అర్పితం బగునొ యెయ్యది మహేశ్వరునకు, హృదయంబు నాఁగను నదియె చూవె
కాంచునొ యెయ్యవి గంగాధరునిరూప, మత్తు లనంగను నవియె చూవె
యాలకించునొ చంద్రమౌళిమాహాత్మ్య మె,య్యవి వీను లనఁగనయ్యవియెచూవె
సలుపునొ శివనామసంకీర్తనంబు నె, య్యది రసజ్ఞ యనంగ నదియె చూవె

గీ. యేయవి యొనర్చునొ యుమామహేశ్వరునకు
నపచితిని హస్తము లనంగ నవియ చూవె
హరుని నుతియించునపు డేది యగునొ రోమ
హర్షణయుతంబు మే నన నదియ చూవె. 1840

వ. శివార్చనంబు సూర్యుం డుదయింప నున్నసమయంబునఁ గావించె నేని సూర్య సమానుండును సూర్యోదయ మైనపిదపఁ బ్రథమఘటికయందుఁ గావించిన రుద్రసమానుండును ద్వితీయఘటికయందుఁ గావించిన వాయుసమానుండును దృతీయఘటికయందుఁ గావించినఁ గుబేరసమానుండును జతుర్థపంచమషష్ఠసప్తమఘటికలయందుఁ గావించె నేని దేవతాసమానుండును దిన మెల్లం గావించిన రుద్రుండును నై శివలోకావాసముం జెందు. 1841

క. అని వచియించుటయును ని, ట్లనియెను రాఘవుఁడు త్ర్యంబకార్చన మెచటన్
బొనరింపఁ దగునొ చెప్పుము, విన వేడుక యయ్యె నాకు విప్రవరేణ్యా. 1842

—: శివలింగార్చనావిధానకథనము :—

గీ. అనుటయును శంభుఁ డి ట్లనియెను శివార్చ, నంబు గావింపవలయు లింగంబునందు
నచల మైనను జల మైన నగును గాక, యది ప్రధానంబు శివసపర్యకు నరేంద్ర.

ఆ. అది యలభ్య మైన దగు నొనర్పఁగఁ బ్రతి, మాదులందు నీశ్వరార్చనంబు
గాని లింగమందుఁ గావించుపూజకు, దాని సాటి చేయఁ దగదు చూవె. 1844

వ. లింగంబు చలం బనియు నచలం బనియు ద్వివిధంబుగా నుండు. అం దచలలింగం
బున కావాహనోద్వాసనంబులు లేవు. ఇంకఁ జలలింగంబుం గూర్చి చెప్పెద.
వినుము. 1845

గీ. చలిపి యావాహనము హృదబ్జంబునుండి, చేసి పూజ నొనర్చి యుద్వాసనంబు
నందె లింగంబు స్థాపింతు రార్యు లదియె,రామ సాత్త్వికలింగధారణము వింటె.

గీ. శివుఁడెలింగంబులింగంబె శివుఁ డటన్న,తలఁపుతో లింగమునుదాల్పఁ దగు నె కాని
భిన్నభావంబుతోడను నెన్నటికిని, దగదు ధరియింప లింగంబుఁ దత్త్వవిదుఁడు.

వ. స్వర్ణరజతవేణుదారువస్త్రలతాసూత్రమృత్తికలయం దెద్దానిచే నైనను గావిం
పంబడినసజ్జకయందుఁ గాని దేవతావేదికయందుఁ గాని భిత్తిమూలంబునం గాని
సురక్షితప్రదేశంబునం గాని ధౌతవసనవేష్టితం బగులింగంబు నుంచి నిత్యం
బును విహితకాలంబులం దావాహనోద్వాసనస్థాపనంబులు గావించుచుఁ
బ్రాణావిశేషంబుగాఁ దల్లింగంబును రక్షించుచుండుట రాజసలింగధారణం
బనం బరగు.ఇంకఁ దామసలింగధారణముం గూర్చి చెప్పెద.వినుము.గాత్రసం
స్పర్శంబుగాఁ గాని దేహగోపితంబుగాఁ గాని లింగంబు ధరియించుట తామస
లింగధారణంబు. 1848

గీ. బ్రహ్మ మస్తకమందు భార్గవి లలాట
మందు హరికర్ణముని కర్ణమందు బాణుఁ
డురమునను దాల్చి లింగంబు నొంది రమిత
మైనమహిమంబు త్రిజగంబులందుఁ గూడ. 1849

వ. నీవీబంధాదిధారణం బధమాధమంబుగాఁ జెప్పంబడియె. 1850

గీ. దేహమును గోసికొని తత్ప్రదేశమంద, తాల్చి లింగంబు తన్మహత్త్వంబునలన
నపరిమితశక్తి గలిగి యస్రపులు గొంద, ఱాక్రమించిరి త్రిజగంబు లద్భుతముగ.

ఆ. కాన నేవిధమున నైనను లింగంబు, దాల్చి రేని శమనదండనంబు
లేక ప్రమథనాథలోకంబునకుఁ బోదు, రెట్టిపాపు లైనఁ దుట్టతుదకు. 1852

సీ. అని చెప్పుటయును నత్యాశ్చర్యమును జెంది, ధరణిజాకాంతుండు తనువుమఱచి
నాసాగ్రవిన్యస్తనయనుఁడై యూరక, కాంచుచు స్థాణువుకరణి నుండ
నట్టికాలంబున హరునియాకృతియుఁ ద, ద్వక్షస్స్థితియును నాతనికిఁ గల్గె
నంతట మును లెల్ల నాతనిఁ బొడగాంచి, స్వాంతంబులందు విస్మయము నొంది

గీ. చేష్ట లుడిగి యామార్గంబు చిత్తరువుల, కరణి నుండిరి పిదప రాఘవుఁడు సంజ్ఞఁ
బొంది కనుఁగొని శంభునిభూసురేంద్ర,శివసపర్యామహత్త్వంబుఁ జెప్పు మనియె.

—: శివపూజామాహాత్మ్యకథనము :—

వ. అని యడుగుటయు శంభుండు రాజేంద్రా నీప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరంబుగా నొక్కయితిహాసంబుఁ జెప్పెద.వినుము. 1854

సీ. మును ధాత్రి నిక్ష్వాకు వనువిప్రుఁడొక్కఁడు,ధనవంతుఁడయ్యు శాస్త్రజ్ఞుఁ డయ్యుఁ
జెప్పక పాఠముల్ శిష్యుల కతిథుల, కన్నంబు వెట్టక యజ్వ గాక
సలుపక దేవపూజను ధర్మరతి లేక, యాచకులకు గవ్వ యైన నిడక
నిజదేహపోషణనిష్ఠాగరిష్ఠుఁ డై, కడపి స్వజీవితకాల మెల్లఁ

గీ. గడకు నొకనాఁడు వశుఁ డయి కాలమునకు
విడునఁగా లేక ప్రాణముల్ విడిచిపెట్టె
నంత యమదూత లేతెంచి యతనిఁ ద్రాళ్లఁ
గట్టి కొనిపోయి యుంచిరి కాలుమ్రోల. 1855

ఆ. అప్పు డతనిఁ జూచి యంతకుఁడు విమూఢ, జనన మొంది యగ్రజాతియందుఁ
జదువుకొనియు విద్య తుద కంతయును బాడు, చేసికొంటి వకట చేతులార.

క. తెలియనివాఁ డయినయెడఁ, దెలియం డనవచ్చుఁ గాక తెలిసియు నీకుఁ
ఫల మేమి కలిగె నింతకుఁ, దల వ్రాసినవ్రాఁత నెవఁడు తలఁగఁ ద్రోయుఁ.

ఆ. ఏల వేయి మాట లిఁకఁ జెప్పెదను విను, నీవు చేసినట్టినేరములకు
ననుభవింపవలయు యమయాతనలు కోటి, వత్సరములు నాఁగ వాఁడు జడిసి.

గీ. స్వామి తెలిసియు ధర్మముల్ సలుప నైతి,నమ్మకము లేమి వేదశాస్త్రమ్ములందు
నిప్పు డవి చెప్పినది యెల్లఁ దప్ప దనుచుఁ, జిత్తమున కెక్కె నమ్మక చెడితి నేను.

ఆ. నిష్ఠురంబు లైననిరయయాతనలను, ననుభవింపఁ జాల నక్కటకట
ధర్మరాజ నీవు ధర్మాత్ముఁడవు చెప్పు, గతియె లేదె యింతకంటె నాకు. 1860

క. అని గొల్లున నేడ్చుటయును, గని యముఁ డిఁక నాయు వల్పకాలము నీ కుం
డెను గాన నిలకు శీఘ్రమ, చని చేయుము శివసపర్య సద్గతి గలుగుఁ. 1861

చ. అనవుడు బ్రాహ్మణుండు మనమం దొకయించుక ధైర్య మేర్పడం
గను బ్రణమిల్లి కాలునకుఁ గ్రచ్చఱ వ్యాఘ్రముఖంబునుండి వ
చ్చినపగిదిఁ ధరాస్థలికిఁ జేరి స్వదేహమునందుఁ జొచ్చి వెం
టనె చని శైవభక్తులకు తా వగుమందరశైలభూమికిఁ. 1862

గీ. అచట జాబాలి యనెడిమహర్షివర్యుఁ, గాంచి ప్రణమిల్లి తత్పాదకమలములకు
నాత్మవృత్తాంతమునుజెప్పనతఁడుయోగ, దృష్టిచేఁజూచిసర్వంబుఁదెలిసికొనియె.

క. తెలిసికొని మౌని వానిం, దిలకించి మహీసుపర్వ దినదశకము నీ
విలలోన నుండు వంతియ, కల దాయువు నీకు నేమి కల దిఁకఁ జెప్పు. 1864

గీ. క్రతువులను గాని దానధర్మములఁ గాని, తత్త్వపరిశీలనముఁ గాని తపముఁ గాని
తీర్థసంసేవనముఁ గాని దేనిఁ గాని, సలుపఁగను నీకుఁ గాలంబు చాల దయ్యె.

గీ. దగ్ధ మగుచుండ గేహంబు దాని నార్ప, జలమునకుఁ గూపమును ద్రవ్వ సాగినట్లు
చచ్చిపోవుచునుండినసమయమందుఁ, బుణ్య మార్జింపఁ దలఁచితి భూసురేంద్ర.

క. నీపాపంబులు తొలఁగఁగ, నీపరిమితకాలమందు నేమార్గంబుల్
జూపట్టదాయెఁ గావునఁ, గాపురుషులు చెందుగతియె గతి నీ కింకన్. 1867

క. అనుటయు నావిప్రుఁడు లో, చనయుగళమునుండి బాష్పసలిలము గురియం
గను నేడ్చుచు నమ్మునిపద, వనజంబులమీఁద వ్రాలె వైవశ్యమునన్. 1868

గీ. అంతటఁ గృపార్ద్రహృదయుఁడై యమ్మహర్షి, వానికరములఁ బట్టి లేవంగ నెత్తి
భయము వల దింక బ్రాహ్మణప్రవర వినుము, గోప్య మైనను నీకు వాక్రుత్తు నేను.

క. ఒనరించిన శివలింగా, ర్చనమును నొకగడియ యైనఁ జాలును దృణరా
శిని నగ్నికణము దహియిం, చినవిధమునఁ గాల్చు నది యశేషాఘములన్.

వ. నీపజపాపున్నాగకరవీరపాటలతులసీరవిదళాపరాజితాపామార్గదళబిల్వపత్త్రి
ద్రోణశిరీషదూర్వానంద్యావర్తకర్ణికారప్రసూనంబులును దిలమిశ్రితాక్షతంబు
లును కేవలాక్షతంబులును లింగార్చనమునకుఁ బ్రశస్తంబులు. మూలఫలశాకం
బులును దైలపక్వంబు లగునపూపాదులును జలప్రోక్షితంబు లయ్యె నేని పర్యు
షితంబులు కానేరవు. కాన నవి శివనైవేద్యార్హంబులు. గంగాతోయంబును
మహానదీజలంబును గేదారజలంబును దటాకవాపీసరఃకూపజలంబులును బర్యు
షితంబులు గానేరవు. కావునఁ దత్తీర్థం బెల్ల శివాభిషేకాదివినియోగార్హంబు.
పగటం దప్ప రాత్రి సేకరించినజలం బే దేనియు వినియోగార్హంబు కానేరదు.

క. అని చెప్పుటయును విప్రుఁడు, మునిపాదాంభోజములకు మ్రొక్కి తదాజ్ఞన్
గొని యచటనె శివలింగా, ర్చనము తదేకాగ్రదృష్టిఁ జలుపఁ దొడంగెన్.

ఆ. అట్లు దీక్షతోడ నాచరించి శివార్చ, నంబు దశమదినమునను శివోప
హారముగ నొసంగెఁ బ్రాణంబులను నంత, నటకుఁ గాలదూత లరుగుదెంచి.

గీ. అతనిఁ గైకొని యమపురి కరుగుచుండ, నవసరంబున శివదూత లరుగుదెంచి
వారి నిర్జించి యావిప్రవరుని దివ్య, యానమున నుంచికొని పోయి హరునికడకు.

ఆ. విన్నవింప నఖిలవృత్తాంతమును విని, హరుఁడు సంతసించి యతనిఁ బ్రమథ
గణములందు నొక్కగణములోఁ జేర్పంగ, నానతిచ్చెఁ దన్మహత్త్వ మెంతొ.

క. ఈకథ చెప్పి యధీర, క్ష్మాకాంతుఁడు మున్ను దాను సలిపినపాపా
నీకంబు లెల్ల దుల్లఁగ, నాకంబున కరిగె సురగణంబులు పొగడన్. 1876

క. అని చెప్పుటయును దశరథ, తనయుం డిట్లనియె ద్విజవతంసము చెపుమా
విన శివనామోచ్చారణ, మునఁ గలమహిమంబు బుద్ధిపుట్టెను నాకున్. 1877

వ. అని యడుగుటయు శంభుండు రామున కిట్లనియె. 1878

—: శివనామోచ్చారణమాహాత్మ్యకథనము :—

గీ. అర్కవంశాబ్ధిచంద్ర నీ వడిగినట్టి
ప్రశ్నమున కేను బ్రత్యుత్తరంబు గాఁగ
వినుతు నొకగాథ విను మున్ను విధృతుఁ డనెడి
ధరణిధవు డొక్కఁ డుండెఁ ద్రేతాయుగమున. 1879

అ. అతఁడు కోడెప్రాయమం దుండుటంజేసి, సమవయస్కులైనసఖులతోడఁ
గూడి కూయరానికూఁతలు కూయుచుఁ, జేయరానిపనులు చేయఁదొడఁగె.

క. చోరులును మద్యపాయులు, జారులు జూదరులు నటులు సరసను నెపుడున్
జేరి కొలువంగ విధృత,తన్నారమణుం డేల సాగె తన్మామండలమున్ 1881

ఆ. శిష్టు లన్న విసువుఁ జెందు మాటాడంగ, భ్రష్టు లనిన నోరు పాఱఁజాచు
భార్య యన్న హేయభావంబునను జూచుఁ, జెవులు గోసికొనును జెడిప యనిన.

సీ. ఒకనాఁటిపశుకకు నొసఁగును నొక్కొక్క, రోవెలందికి లక్షరూప్యములను
బరకాంతలను దనపరము గావించెడి, కుట్టెని కర్పించుఁ గోటిధనము
తెలిపియీయక చెవుల్ గోయుకుచుండెడికొండె, గాండ్రకిచ్చును మహాగారములను
జూదంబు లాడించుచును మెచ్చుకొనుద్యూత, కారుల కిడు రత్నహారములను

గీ. మద్యపానంబు మరపినమద్యపులకు, బహుమతులు చేయు సౌవర్ణభాజనములు
పండితులు దర్శనము గోరుచుండి రనిన, వెడలఁగొట్టించు వారి నాపుడమిఱేఁడు.

ఆ. అట్లు కొంతకాల మరుగంగ రాజ్యంబు, రాజనీతిహీనరాజ్య మయ్యెఁ
బోయె సామజములు పోయె ఘోటకములు, కోశగృహము లెల్లఁ గూలిపోయె.

క. ఒకవస్తువైనఁ గనఁబడ, దొకమిత్త్రుం డైన నొద్ద నుండం డొకసే
వకుఁ డైన గోచరింపఁడు, కకవిక లైపోయె వానిగౌరవ మెల్లన్. 1885

ఆ. అదియె మంచిసమయ మని యన్యభూమీంద్రు,లరుగుదెంచి రాజ్య మాక్రమింప
నతఁడు బలము మఱియు నపగతం బగుటను, నరిగెఁ గాననముల కాశ లుడిగి.

ఆ. అట్లు కాననముల కరిగి యల్లాడుచుఁ, దిరిగి తిరిగి యొక్కగిరికిఁ జేరి
యచట నుండి త్రోవ నరిగెడిజనములఁ, గొట్టి ధనముఁ దెచ్చి కూడఁ బెట్టి.

క. దారుణకృత్యము లొనరుచు, క్రూరులఁ గొందఱను జేర్చికొని తనయొద్దన్
వారలు తెచ్చెడిమాంసా,హారము భుజియించుచును దయారహితుం డై. 1888

క. అనుదినమును ''ప్రహరాహర'',యని యాజ్ఞాపించుచుండు నటుపై వారల్
గొని తెచ్చుచుందు రనిశముఁ, దనివిగ జంతువులఁ జంపి తన్మాంసములన్.

గీ. అట్లు వర్షసహస్రంబు నతఁడు గడపి, చివర కొకనాఁడు మృత్యువు సిద్ధమగుడు
మరణబాధను జెందుచు మాట రాక, పరితపించుచు నుండ నత్తఱుణమందు. 1890

గీ. చేరి చుట్టును దత్పరివారవర్గ
మేమి కావలె సామి నీ కిప్పు డనుచు

నడుగ నన లేక యన లేక యంతమునకు
నతఁడు ''ప్రహరాహర'' యటంచు నసువు లుడిగె. 1891

సీ. అంతట యమదూత లరుదెంచి కట్టంగఁ, ద్రాళ్లతో వాని నాత్రాళ్లు తెగియె
నపుడు వారలు వాని నాగ్రహంబునఁ గొట్ట, దండంబులను నవి దగ్ధ మయ్యె
నంత వారలు రేఁగి యతనిపైఁ గ్రువ్వంగ, శూలంబులను నవి చూర్ణ మయ్యె
నటుపైని వారు తద్ధృదయంబునను వ్రేయ, ఖడ్గంబులను నవి గళిత మయ్యెఁ

గీ. గాంచి యది యెల్ల నాశ్చర్యకరము గాఁగ, వారు చని దండధరున కావార్త చెప్ప
మృత్యువును బంపె నాతఁ డామృత్యువనిల, వేగమున వచ్చి విధృతభూవిభునికడకు.

గీ. ఓరి పాపాత్మ కాలభృత్యులకుఁ గూడ, మాఱుమసలెదునంతటిమానవుఁడవె
చూపెదనుగాక నాశక్తి చూడు మిదిగొ, యనుచు బంధించెఁ బాశంబున నతని మెడకు.

గీ. అంతటను మృత్యుపాశ మత్యద్భుతముగఁ, దెగి పడియె వేయిముక్కలై త్రెంచినట్లు
దానిఁ గనుఁగొని మృత్యువు తత్తఱమునఁ, బరువులెత్తుచునుండ నత్తరుణమున నె.

క. జ్వాలావక్త్రుం డనియెడి, శూలిభటుం డేఁగుదెంచి చోరునిగతిఁ బో
నేల యని మృత్యువును దన, కేలం బట్టికొని యొత్తి గిజగిజ లాడన్. 1895

క. శూలమునఁ గ్రుచ్చి విధృతనృ, పాలవరుని దివ్యరథముపై నిడికొని యు
ద్వేలగతి నేఁగి శర్వుని, మ్రోలను నిలుపంగఁ గని హరుం డిట్లనియెన్. 1896

సీ. మృత్యుదేవత విను మే నొక్క విషయంబు, తెలియఁ జేసెద నీకుఁ దేటపడఁగ
నధికాక్షరోపేత మైన నల్పాక్షర, యుత మైన నన్యార్థయుక్త మైన
మరణకాలమున నేనరుఁ డేని వాక్రుచ్చె, నేని మన్నామంబు నెట్టు లేని
వాఁడు నావాఁడు మీవాఁ డెన్నఁడును గాఁడు, వాని దండింప మీవలనఁ గాదు

గీ. తెలిసికొనకుండ శిక్షను జలుప నెంచి, యరుగుదెంచుట నాశిక్ష యయ్యె నీకె
కాన నిఁకనుండి శివభక్తులైనవారి, కడకు రాకుము బ్రదుకుపైఁ గాంక్ష యున్న.

వ. మఱియును మదీయస్తవదాస్యపూజానమస్కారంబులు గావించువారును బంచాక్షరీజపశతరుద్రీయపారాయణంబులు గావించువారును విభూతిరుద్రాక్షధారులును మల్లింగధారులును నాయెదుటఁ బురాణంబు పఠించువారును వారాణసీమృతులును శ్రీశైలవాసులును మత్సాన్నిధ్యంబుఁ జెందంగలవారు. వారలను శాసింప యమున కధికారంబు లేదు. వారాణసీమృతంబు లగుమృగయూకదంశమత్కుణసూకరసర్పవృశ్చికకీటపిపీలికాదులకుం గూడ మత్పదంబు ప్రాప్తించు. 1898

క. నామాటలన్నియును మీ, స్వామికి నెఱిఁగింపు మేఁగి చయ్యన ననుడున్
గామారి కెఱఁగి మృత్యువు, తామస మంతయును నుడుగఁ దా నిట్లనియెన్.

గీ. చంద్రశేఖర యీతఁడు సలుపనట్టి, పాపములె లేవు నీ కెట్లు భక్తుఁ డయ్యె
నేమి పుణ్యంబు గావించె నితఁడు చెప్పు, మంతయును గూడ నాసంశయంబు దీఱ.

గీ. అనుటయును నవ్వి హరుఁ డిట్టు లనియె వినుము
చెప్పెదను వీఁడు మరణంబు చెందునపుడు
పలికెఁ "బ్రహరాహర" య టంచు భావ మన్య
మైన నం దుంట నానామ మనఘుఁ డయ్యె. 1901

క. అనవుడు మృత్యువు సంశయ, మును విడిచి మహేశ నేను బోయెద నింకన్
వినిచెద నీయాన కృతాం, తున కెవ రేనియును మీఱుదురె భవదాజ్ఞన్.

క. అనుటయు నట్టులె చేయుము, చను మని యీశ్వరుఁడు పనిచి శమనుని నగరం
బునకున్ మృత్యువు విధృతునిఁ, దనప్రమథగణంబులందుఁ దాఁ జేర్చికొనెన్.

క. ఈ విధృతోపాఖ్యానము, నేవా రైనను బఠించి రేని యఘంబుల్
పోవుటయె కాక వారికిఁ, గైవల్యపదంబు హస్తగత మగు నధిపా. 1904

క. అనవుడు రాఘవుఁడు మనం, బున సంతస మంది విప్రపుంగవ నాకున్
వినిపింపుము జ్వాలావ, క్త్రునిచరితము నాఁగ ద్విజవరుం డి ట్లనియెన్. 1905

—: జ్వాలావక్త్రవృత్తాంతకథనము :—

సీ. మును గ్రోధనుం డనుజననాథుఁ డొక్కఁడు, సుతసతీరాజ్యవిచ్యుతి ఘటిల్ల
వైరాగ్యమును జెంది వారాణసికిఁ బోయి, వినయంబునను వసిష్ఠునకు మ్రొక్కి
స్వామి భార్య గతించె శత్రువుల్ రాజ్యంబు, నపహరించిరి పోయి రాత్మభవులు
పారంబు లేనిసంసారదుఃఖంబుల, ననుభవించితి రోఁత యయ్యెఁ దుదకు

గీ. నేదియును దోఁపకుండుట నిచటి కేను, బిచ్చివాని తెఱంగున వచ్చినాఁడఁ
గాని యిదియును నా కుపకార మయ్యె, దొరకుటను బుణ్యపురుషులదరిసెనంబు.

గీ. చేకుఱెను ధైర్య మొకకొంత చిత్తమునకు, నింకఁ గడతేఱుమార్గ మే దేని నాకుఁ
జెప్పు మార్తుని నుద్ధరించినఫలంబు, ప్రాప్తమగు నీకు ధన్యుఁడ నగుదు నేను.

క. అని వేఁడుటయు వసిష్ఠుఁడు, కనుఁగొని యానృపుని భూప కాశీపురికిన్
జనుదెంచినంతమాత్రము, ననె నీపాపంబు లెల్ల నాశము నొందెన్. 1908

వ. విధ్యుక్తవిధానంబున గంగాస్నానంబు గావించి విశ్వేశ్వరలింగంబు నర్చింపుము. విశ్వేశ్వరారాధనంబునం జేసి రక్షోభక్షితుం డైనను నరుంధతీసుతుం డగుశక్తి బ్రహ్మలోకంబునందును విష్ణులోకంబునందును శివలోకంబునందును విహరించుచున్నవాఁడు. తదేకనిష్ఠాగరిష్ఠభావంబున నరణ్యకుసుమంబులచే విశ్వేశ్వరారాధనంబు చేయునీలుబ్ధకునిఁ జూడుము. వీని కింక నర్ధయామంబులో పల మరణ మాసన్న మై యున్నయది. 1909

క. అని చెప్పుచుండఁగనె చ, య్యన నట కున్మత్తుఁ డొక్కఁ డరుదెంచి తద
ర్చనసుమము లన్నియును దివి,కనుఁగొను చుండఁగనె చనియెక్షణకాలములోన్,

గీ. అపుడు లుబ్ధకుఁడు శివార్చ కంతరాయ, మొదవె ననుచింత చేఁ దనయొడలు చీల్చి
చర్మమును ముక్కలుగఁ జేసి సలిపె వాని, చేత శివపూజ పూలచేఁ జేసినట్లు.
ఆ. అట్లు చేసి పూజ యంతంబునను శివా, ర్పణము సేయఁ దనశిరంబు గోయ
సాహసించుచున్నసమయంబునను వచ్చి, యెదుట నిలిచి వాని కీశ్వరుండు.
ఆ. వలదు సాహసంబు వత్స వచ్చితిని నీ, కోర్కి దీర్పఁ గోరుకొనుము వరము
నని వచింప నాతఁ డర్థించె బంధుయు, క్తముగ నుండ శివపదంబునందు.
గీ. అంతటను నట్లయగుఁగాక యనిహరుండు, కనుమఱుంగగుటయును వెంట నెవిమాన
మునకతనినుంచికొనిబంధుజనయుతముగఁ, జనిరిరజతాచలమునకు శైవభటులు.
చ. అది గని క్రోధనక్షితితలాధిపుఁ డచ్చెరియంబుఁ జెందుచుం
మదిని విచేష్టుఁడై నిలువ మానివరుం డది గుర్తెఱింగి స
మ్మదమున తేని కిట్లనియె క్ష్మావర చూచితె శంభుపూజకుం
గదిరినసత్ఫలం బిపుడె కట్టెదుటం బలుమాట లేటికిం. 1915
వ. మఱియును రాజ్యంబు నభిలషించితి వేని ప్రతిదినంబును శివాలయప్రదేశంబు తుడిచి గోమయోదకముం జల్లుచుండుము. దానిచే నీవు జన్మాంతరంబునందు సామ్రాజ్యాధిపత్యముం బడసి సకలసౌఖ్యంబుల ననుభవించి శివపూజాఫలంబుగా దేహావసానంబునఁ గైలాసంబు చెందంగలవు. 1916
క. అనుడు వసిష్ఠోక్తవిధం, బున నతఁ డొనరించి శంభుపూజాదికముం
జననాంతరమున రాజయి, జనియించి వహించె ధరణిసామ్రాజ్యంబుం.
గీ. అట్లు వహియించి రాజ్యంబు నతఁడు శంక
రాలయంబున కొక్కనాఁ డరుగు దేర
నచట నున్నదీపం బొక్కఁ డపుడు పడియెఁ
దవిలి జనహస్తములు మహీధవునిమీఁద. 1918
క. అంతటఁ గ్రోధావేశా, క్రాంతుం డై యధిపుఁ డచటఁ గలజను లెల్లం
సంతప్తులు గా నాలయ, మంతయునుం గాల్చె దీపికాంతరములచేం. 1919
ఆ. కాల్చి యట్లు పిదపఁ గలిగి పశ్చాత్తాప, మతఁడు మరల దేవతాలయంబు
ఖ్యాతికరము గాఁగఁ గట్టించె మునుపటి, యాలయంబుకంటె నధికముగను.
క. కట్టించి దేవతాలయ, మట్టులు భూవరుఁడు మృడుని నర్చించుచు లో
నుట్టిపడ భక్తి యనిశముఁ, గట్టకడకు నొక్కనాఁడు కాయం బుడిగెం. 1921
గీ. అంత శివభటు లేతెంచి యతని దివ్య, యానమున నుంచికొని రజతాద్రి కరుగ
వీరభద్రుఁడు తనపరిచారకునిఁ గఁ, జేసికొని వాని నిట్లు వచించె నధిప. 1922
క. అనుచర తల లేకుండం, గను జ్వాలావక్త్రుఁడ వయి క్రాలుచు మరణిం
చినశివభక్తుల నిటకుం, గొనివచ్చుచు నుండు మేను గొనిర మ్మన్నం. 1923

క. అనవుడు మహాత్మ నేఁ జే, సినపాపం బేమి విగతశీర్షుఁడ నై యుం
డను జ్వాలావక్త్రుఁడ నై, యెనయంగను జెప్పు మేది యేనియు నున్నన్. 1924
వ. అని భూవరుం డడుగుటయు వీరభద్రుం డిట్లనియె. 1925
సీ. పూర్వకాలంబున భూప కారాంకికుం, డనుప్రభుండ వయి నీ వవనిఁ బుట్టి
యొకనాఁడు పోయి మృత్యుంజయాలయమున, కచ్చట శివపూజ యాచరించి
యరుదెంచుచును నందె పరిచర్య యొనరించు, చును నున్న యొకధనాంగనను జూచి
యబల కారాంకికుం డనుప్రభుండను నేను, నినుఁ జూచినంత నామనసు చెదరె
గీ. నని వచించుటయును గాంచి యావెలంది, యధిప నీ విట్టు లాడంగ ననుచితంబు
నన్ను గ్రహియించె నొకమహీనాథుఁడతని, దాసనై యుంటి నేనింకఁ దరలిపొమ్ము.
క. అని యీసడించుటయు నీ, మనమున నాగ్రహము పొడమి మానిని కె ల్లై
నను నపకారము చేయం, గను నెంచి త్వదీయబుద్ధికౌశల్యమునన్. 1927
క. ఆయమను గ్రహించినభూ, నాయకునకుఁ జెప్పి వంచనావాక్యములన్
గోయించితి తచ్ఛిరమును, న్యాయాన్యాయాభిమర్శనము లేకుండన్. 1928
క. ఆపాతకములు రెండును, నీపాలంబడియె దాన నీ వైతి విటుల్
చేపడినను గైలాస ము, మాపతిసేవోపలబ్ధమాహాత్మ్యమునన్. 1929
క. అని చెప్పుటయును జ్వాలా, ననుఁ డూరకయుండెఁ దా నొనర్చినపనికిన్
మనమున విషాద మొందుచుఁ, గనుఁగొంటివె రామచంద్ర కర్మబలంబున్.
వ. ఈవిషయంబున మఱియొకయుపాఖ్యానముం జెప్పెద. వినుము. 1931
గీ. తాపసోత్తముఁ డైనగౌతముఁడు మున్ను, స్వాశ్రయంబున నెపుడును నాచరించు
చాయ నొకనాఁడు శివపూజ చేయ నెంచి, స్నానసంధ్యాదివిధులను జలిపి పిదప.
వ. దేవమందిరముం బ్రవేశించి భూశుద్ధిభూతశుద్ధ్యాదుల యథావిధిం గావించి
శుద్ధుం డై క్రియార్హత్వముం బడసి. 1933
గీ. వ్యాఘ్రచర్మంబునం బద్మాసనమున, నధివసించి చతుర్దిశలందు నునిచి
కప్పురపుముద్దలను దావి గుప్పు మనఁగ, నాచమన మొనరించి యనంతరంబ.
వ. త్రింశద్రుద్రాక్షమాలిక యుపవీతంబుగాఁ దాల్చి యష్టరుద్రాక్షమాలిక యొక్కటి
శిరంబునను నొక్కటి కంఠంబునను రెండు ప్రగండంబులందును రెండు ప్రకో
ష్ఠంబులందును ధరియించి. 1935
సీ. చందనపీఠంబునందు స్థాపితముగాఁ, జేసి కర్పూరసింహాసనంబు
శంభులింగము ప్రతిష్ఠాపించి దానిపై, స్థాపించి పత్త్రిక దానియెదుటఁ
దత్పత్త్రికాష్టపత్త్రములందుఁ గర్పూర, కాశ్మీరమృగనాభిగంధములును
నక్షతలును సతిలాక్షతలును బంచ, గంధకమును నష్టగంధకమును
గీ. నునిచి యొక్కొక్కదానిలో నొక్కఁడొకఁడు, తలఁచికొని గురుపాదపద్మద్వయంబు
ధ్యాన మొనరించి సర్వభూతాంతరాత్ముఁ, డైనపరమేశ్వరుని నంతరంగమందు.

సీ. నడుమను లింగంబునకు సదాశివుని నా, వాహించి యూపంచవదనునకును
శక్తిని శక్తికి సరసీరుహాక్షుని, నంబుజోద్భవుని నారాయణునకు
నజునకుఁ జంద్రుని నమృతాంశునకు రవి, నిగమ మర్యమునకు నిగమమునకు
దిగ్దేవతల దెసల్ దిగ్దేవతలకు శం, భుని దెసలకు గణంబుల శివునకు
గీ. నొనరిచిదశావరణములుగను నొనర్పఁ, దగినవిధమునఁ బూజ యంతయును జేసెఁ
జూచు చుండఁగ మును లెల్లఁ జోద్యముగను, శివసపర్యాకరులలోన శ్రేష్ఠుఁ డగుట.

వ. అట్లు పూజ గావించి గౌతముండు కర్పూరాగురుకస్తూరీసర్జాచందనాదిసుగంధద్రవ్యధూపంబును షోడశకర్పూరవర్తిదీపంబులును బంచభక్ష్యసంయుతంబును నానావిధమనోజ్ఞశాకాఢ్యంబును సూపాష్టకసమేతంబును ద్రాక్షారంభాసహకారనాగరంగాదివివిధమధురఫలాన్వితంబును బహువిధలేహ్యచోష్యయుక్తంబును వింశతిపేయపదార్థలలితంబును శర్కరాగుడమధురంబును దధిక్షీరాజ్యపాత్రసమంచితంబును సువర్ణపాత్రవిన్యస్తంబును సగ్రపుష్పసహితంబును నగు సుపక్వశాల్యన్ననైవేద్యంబును నీరాజనసహస్రంబును ఘనసారపూగఖండచూర్ణాదిపరిమళద్రవ్యభరితంబును స్వర్ణపాత్రవిన్యస్తంబును సపృష్ఠాగ్రసుశ్వేతసంక్షాళితనాగవల్లీపత్త్రత్రయవిరాజమానంబును నగు తాంబూలంబును సమర్పించి ప్రదక్షిణనమస్కారంబు లొనరించి క్షుద్రతాళయుగంబు చేతం బట్టికొని వాయించుచు మధురంబుగాఁ బాడుచు స్వరంబులు మూర్తిమంతంబులై తత్తత్స్థానంబులం దాడుచుండ నెనిమిదిదిక్కులందును నెనమండ్రు యోషామణులు తదనుగుణంబుగా వేణువీణాదివిచిత్రవాద్యంబులు వాయించుచుండ జగన్మోహనంబుగా నృత్యంబు గావింపం దొడంగె. 1938

సీ. ఆసమయంబున నక్షౌహిణులు రెండు,పదులు వెంటను రాఁగ భద్రగజము
నెక్కి బాణుండును నెక్కి సామజమును, గవియును నరదయుగ్మంబు నెక్కి
ప్రహ్లాదుఁడును వృషపర్వుండును దురంగ,మము నెక్కి బలియును గ్రమముగాఁగఁ
బాతాళముననుండి పయనమై చనుదెంచి, రమ్మహర్షిని జూచునాసతోడ
గీ. నంతటను గౌతముఁడు వారి కర్హవిధులఁ,బూజ గావింప వారు తత్పూజనొంది
యుచ్చటనె స్వస్వశివపూజ లాచరించి, నృత్యగీతాదులను నొనరించు చుండ.
క. చనుదెంచి శంకరాత్ముం, డనుగౌతమశిష్యుఁ డొక్కఁ డచటికి నాచ్ఛా
దనహీనగాత్రుఁ డయి కే, లను దాల్చి యుపానహంబులను హేయముగన్.
క. శైవజ్ఞానపరానం, దావిర్భావమున మఱచి యాత్మశరీరం
బావృత్తచక్షు వగుటను, భావాభావప్రహీణభావుం డగుచున్. 1941
క. కనఁబడుచును జండాలుఁడు, గను నొకతఱి నవరజుండుగను నొక్కతఱిన్
మునిగను నొకతఱి విప్రుఁడు, గను నొకతఱి వెఱ్ఱివాఁడుగను నొక్కతఱిన్.

క. ఒకతఱి నవ్వుచు నేడ్చుచు, నొకతఱి నెగురుచును బైకి నొకసమయమునం
దొకవేళఁ బడుచు లేచుచు, నొకప్పు డుమియుచును దినుచు నొకతఱి దానిన్.
క. భక్షించుచుఁ గంటకములు, భక్షించుచు లోష్టములను భక్ష్యములబలెన్
వీక్షించుచు నలుదెసలను, బ్రక్షాళనరహితదేహపంకుం డగుచున్. 1944
వ. బిరబిర నరిగి వృషపర్వునకును దదీయశివలింగంబునకును నడుమ నిలువంబడియె.
సీ. అప్పుడు వృషపర్వుఁ డాగ్రహంబును జెంది, నఱికెఁ దక్షిణమ తన్మస్తకంబు
నంతట గౌతముం డది చూచి యేడ్చుచుఁ, గన్నీరు కాల్వలు గట్టి పాఱఁ
బ్రాణంబులను వీడనాడె యోగంబుచే, నది గనుంగొని శుక్రుఁ డసువు లుడిగె
గురువియోగమునకుఁ బరితపించుచుఁ జచ్చి, రసురు లందఱును నత్యద్భుతముగ
గీ. నంతఁ గలుషీకృతం బయ్యె నఖిలజగము, త్యక్తజీవితు లగుటను భక్తు లెల్లఁ
దెలిసికొని యది యెల్ల నేతెంచె నటకు, హరివిధిసమేతముగఁ ద్రిపురాంతకుండు.
గీ. అట్లు వచ్చి కనుంగొని యంధకారి, చచ్చి పడియున్న నిజభక్తజనుల నెల్ల
మొదట బ్రదికించె గౌతమముని నతండు, లేచి కను లెత్తి శర్వునిఁ జూచి యెదుట.
క. ఆనందపులకములు తన, మేనను నిండంగ మ్రొక్కి మృడునకు నిలువం
గా నతనిశైవభక్తికి, మానసమున మెచ్చికొని యుమాధవుఁ డంతన్. 1948
ఆ. వత్స కోరుకొనుము వర మేది యేనియు, నిచ్చువాఁడ సంశయింపకుండ
ననుడు మాని కోరె నటఁ జచ్చి పడియున్న, భక్తజనము లెల్ల బ్రతుకునట్లు.
క. అంతట హరుఁ డట్టులె యను, నంతనె యెల్లరును లేచి యగజాపతికిన్
సంతోషంబున మ్రొక్కిరి, యింతం తనరానిభక్తి యిగురొత్తంగన్. 1950
ఆ. అపుడు శివుఁడు శంకరాత్మున కితరుల,వలన హింస యెపుడుఁ గలుగకుండఁ
బరులకు నిజదేహపాత మైనంతనె, పరమపదము గలుగ వరము లొసఁగె.
వ. అంతట గౌతముండు చేతులు జోడించికొని మహేశ్వరున కిట్లనియె. 1952
గీ. అర్థి దోషంబు కనుఁగొనఁ డన్నమాట,నిజముగను దేవ ప్రార్థింతు నే నయోగ్య
మైన నొక్కటి నిన్ను బ్రహ్మాదులకును,నేది సాధ్యంబు గాదో నా కిమ్ము దాని.
క. అనవుడు నవ్వుచు హరుఁ డి, ట్లనియెను మునివర్య తావకాభ్యర్థనకున్
వనజాక్షునిభాషణమునఁ, గన నగుఁ బ్రత్యుత్తరంబు గనుపెట్టినచోన్. 1954
క. అని చెప్పి తటాకమునకుఁ, జని సపరిజనముగ నచట సలిలక్రీడన్
బొనరించి శౌరితోడను, ననంతరము జపము చేయ నారంభించెన్. 1955
సీ. అది చూచి శార్ఙ్గి యి ట్లనియె మహాదేవ, యడిగెద ని న్నొక్కయంశ మేను
నిన్నె ముఖ్యంబుగా జన్నంబులందు నా, హ్వానించు చుందురు యజ్వ లెల్ల
నేవేళలను నీకె కావించు చుందును, బ్రణతుల సర్వప్రపంచములును
జపములు తపములు సలుపు చుందురు నిన్నుఁ, గాంచఁ గోరియె పారికాంక్షు లెల్ల

గీ. నిచ్చు చుండువు ఫలముల నీనె వారి, కందఱకుఁ గూడఁ దగినట్టు లట్టినీకుఁ
గూడ నెవఁడైన ఫలదాయకుండు గలఁడె, చెపుము లేకున్న జపమిాపు చేయ నేల.
వ. అని యడుగుటయు నాననంబున మందహాసంబు మొలకలెత్త జనార్దనునకు
మహాదేవుం డిట్లనియె. 1957
సీ. అచ్యుత నీకు సత్యంబు సెప్పెద విను, మర్త్యుండ వగుటను నాలకింపఁ
గావించువాఁడను గా నేదియును నేను, లేదు కార్యంబు నా కేది యేని
కావింప కుండియుఁ గావించు చుందును, మంచిమార్గంబు బోధించుకొఱకుఁ
గాని చోఁ బామరుల్ జ్ఞానంబు లేమిని, గావించెదరు పాపకర్మములను
గీ. దాన నిహపరసౌఖ్యవిహీను లగుచు, నరకమునఁ గూలిపోదురు శరణు లేక
కాన నీవును లోకోపకారమునకుఁ, జలుపు చుండుము విధ్యుక్తసత్క్రియలను.
క. అని చెప్పుటయును విష్ణువు, మనమున హర్షించుచును నమస్కారంబుం
బొనరించి యిందుమౌళికి, నొనరింపఁ దొడంగె జపము నుత్సాహమునన్.
ఆ. హరిహరులను గాంచి యట నున్నవారెల్ల, శ్రద్ధతోడ జపము సలుపఁ దొడఁగి
రట్టితఱిని బాట హాయిగాఁ బాడుచు, నరుగుదెంచె నచటి కమరమౌని. 1960
ఆ. అట్లు లేఁగుదెంచు యమరర్షి ముందుగ, మ్రొక్కి హరున కవల మ్రొక్కి హరికిఁ
బిదప మ్రొక్కి విధికిఁ దదనుజ్ఞ గైకొని, వారిచెంతఁ దానుఁ గూరుచుండె. 1961
ఆ. అంత శివుఁడు పాడ నారంభ మొనరించె, మందమందగతుల మధురముగను
దాని కనుగుణముగ దైత్యారివాయింపఁ, దొడఁగె మర్దళంబు నడుమ నడుమ.
గీ. నాట్య మొనరింపఁ దొడఁగెను నారదుండు
తొడఁగెను ముఖశ్రుతిని బట్టఁ దుంబురుండు
తానము నొనర్పఁ దొడఁగిరి మౌను లెల్ల
నజుఁడు దొడఁగెను వాయింప నావజంబు. 1963
క. అది యంతయు నుత్సాహము, గదిరింపఁగ శివునియాజ్ఞ గైకొని పాడన్
మొదలిడిరి దేవదానవు, లొదవఁగ విస్మయము వినుచు నుండఁగ లోకుల్.
సీ. అపుడు దైవికముగా నంజనానందనుం, డచటి కేతెంచి దేహంబు మఱచి
యందఱలోఁ జేరి యానందవశమునఁ, బాడంగఁ దొడఁగెను బ్రౌఢి మెఱయ
నాగానసుధ సోఁకినంతనె నిలువునఁ, జిగిరించె ప్రోడులు శిలలు గరఁగె
నది చూచి యాశ్చర్య మంది యెల్లరు గూడ, మానిరి తమతమగానములను
గీ. నమ్మహాగానమును విని త్ర్యంబకుండు, పరవశీకృతచిత్తుఁడై పవనసుతునిఁ
గౌఁగిటను జేర్చికొని క్షణకాల ముండి, యవల మున్యాశ్రమమునకు నరుగ నెంచి.
వ. వృషభవాహనంబు నెక్కి గానశ్రవణాభిలాషంబున మారుతిం గూడ దానిపై
నెక్క మనుటయు నాతండు శివభక్తాగ్రగణ్యుం డగుటం జేసి వినమితకంధరుండై
శర్వాని చరణంబులకు మ్రొక్కి. 1966

గీ. స్వామి నే నెంతవాఁడ నీసరసఁ గూరు,చుండఁగను నీకనుగ్రహం బొదవె నేని
నాపయిని గూరుచుండి గానంబు వినుచు,సత్వరమ చేరు మభిమతస్థానమునకు.

సీ. అని వేఁడుకొనుటయు నమృతాంశుశేఖరుం, డతనిస్కంధములపై నధివసించి
వినుచుఁ దద్గానంబు వీనులవిందుగా, నానంద మొందుచు మానసమునఁ
బరివారవర్గంబు లరుదెంచుచుండంగఁ, బార్శ్వంబులను బృష్ఠభాగమునను
దనజగదేకనాథత్వంబుఁ బ్రకటించు, చందంబునను శివి చౌకళింప

గీ. గౌతమాశ్రమమునకుఁ జక్కంగ నేఁగి, తనపదంబులు వాయుసూనునిముఖంబు-
స్కంధమును గంతమును నురస్స్థలము సోఁక,దిగియె గౌతముఁ డేతెంచి దింపఁగేల.

గీ. అంతటను బట్టికొని యీశ్వరాంఘ్రియుగము
కరములను నద్దికొనుచుండఁ గపివరుండు
నవ్వుచు హరుండు వానికంఠమున నునిచె
నందఱును జూచుచుండ ముత్యాలదండ. 1969

వ. అప్పుడు పుండరీకాక్షుండు మహేశ్వరున కిట్లనియె. 1970

సీ. ఎద్దానిరూపంబు నీక్షింప మామేఁలు, తపియించుచుందురో విపినములను
నెద్దానిమహిమంబు నెఱుఁగ మంత్రజ్ఞులు, నిరతంబు పలుపుచుందురో జపంబు
నెద్దాని నొందఁగా నెపుడును బండితుల్, చేయుచుందురో శాస్త్రచింతనముల
నెద్దానిఁ జేరంగ నెంచి ధార్మికులు గా, వించుచు నుందురో మంచిపనులు

గీ. దేనిసందర్శనముఁ గోరి నేను నీకు, సరసిజసహస్రమున వేయి సమలు పూజ
యొనరిచియుఁ జెందఁజాల నైతినో ఫలంబు, నట్టినీపద మొకకపి కిట్టె చిక్కె.

ఆ. ఎంతతపము చేసి యీవానరుడు జని, యించినాఁడొ లేనియెడల వీఁడు
పట్టుకొనఁగలండె బ్రహ్మాదులకును న, ప్రాప్యమైనతావకాంఘ్రియుగము.

క. హరి హరునకుఁ బ్రియుఁ డనియును
హరికిఁ బ్రియుఁడు హరుఁ డనియును నందురు లోకుల్
పరికింప నట్టిభాగ్యము
పరమేశ్వర యేది నాకుఁ బరమార్థముగన్. 1973

క. అని సన్నుతింప గౌతము, ముని విని హరిభాషితంబు ముమ వే నర్థిం
చినదాని కిదియె యుత్తర, మనుకొని కడిగెను బినాకియంఘ్రియుగంబున్.

గీ. అట్లు కడిగి హరాంఘ్రిద్వయంబు మాని, యేను జేసినశివపూజ కిదియ పడయఁ
దగినఫల మనుకొనుచు సంతసముతోడ, శివుని మణిమయపీఠసంస్థితునిఁ జేసి.

గీ. హరునిపార్శ్వయుగంబున హరిని విధిని, యుక్తపీఠంబులందుఁ గూర్చుండఁ బెట్టి
యాచరించి తదావాహనాదివిధులఁ, బూజచేసెను బంగరుపూలతోడ. 1976

సీ. అట్లు పూజ యొనర్చి యర్ఘ్యాస్థలంబుల, నమరుల మునులను నాశరులను
నధివసింపఁగఁ జేసి యందఱకును దత్త, దర్ఘ్యంబుగను బూజ లాచరించి
సౌవర్ణభాజనాసాదనం బొనరించి, వడ్డింపఁగాఁ జేసి వానిలోన
శతకందశాకముల్ శతపత్త్రశాకముల్, శతలేహ్యములును జూషకశతంబు
గీ. శతయుగవిధాన్నములును ద్రింశత్ప్రభేద, భక్ష్యములును జతుర్విధపాయసములు
పంచవింశతిభేదసూపము లనేక, విధఫలంబులు పరిమళాన్వితఘృతంబు. 1977
గీ. అమృత మ స్తని పరమేశ్వరార్పణముగ
హరునికరమున నుంచి గంగామృతంబు
నవల హరివిధులకును దదన్యులకును
నెఱులె క్రమముగఁ బోసి యాపోశనంబు. 1978
గీ. ఆరగింపుఁడు మహనీయులార యనుచుఁ
బ్రార్థనము చేయ నారగింపంగఁ దొడఁగి
రందఱును గూడ నానంద మతిశయిల్ల
నమ్మహామునిభాగ్య మే మనఁగ వచ్చు. 1979
సీ. అప్పుడు హరితోడ హాస్యంబు లాడుచు, భుజియించుచును దాను బురహరుండు
తనముందుబంతిలోఁ దినుచుండుకపినోటఁ, బడ వైచె స్వోచ్ఛిష్టభక్ష్య మొండు
పవనాత్మజుఁడు దాని భక్షింపకుండఁ జూ, చుచు నుండె నూరక శూలిమోము
నది గాంచి శివుఁడు వాతాత్మజ తినకుండ, నేల చూచుచు నుంటి నెఱుగఁ జెపుమ
గీ. యనుటయును వాయుపుత్త్రుఁ డి ట్లనియె స్వామి, నానివేదితవస్తు వే దైనఁ గూప
మంచుఁ దగు నుంపఁ దగ దొరు లనుభవింప, నంటి మునునీ వెనీమాటయగు నెదాఁట
వ. అనుటయు నీశ్వరుండు పవమాననందనున కి ట్లనియె. 1981
గీ. అనిలతనయ స్వయంభూత మైనబాణ, లింగ ముండినయెడ హృదయాంగణమున
శంభునై వేద్యభు క్తి దోషప్రదంబు, గాదు చాంద్రాయణవ్రతకల్ప మగుట.
క. అనుటయు విని పవనాత్మజుఁ, డనవధికం బైనహర్ష మామతిలంగా
దినియెను శివనైవేద్యం, బును నచ్చటివార లెల్లఁ బొగడుచు నుండన్. 1983
గీ. అంత సంతృప్తికరముగా నారగించి, యెల్లవారును లేచి మహేశ్వరుండు
గంధపుష్పఫలాదిసత్కారయుక్త, ముగ నొసంగెడితాంబూలములు గ్రహించి.
గీ. గోచరించుచు నుండియె లోచనముల, కద్భుతముగ నంతర్ధాన మైరి హరుఁడు
హరియును విరించియును నంత నరిగి రెల్ల, వారు గూడను స్వస్వనివాసములకు.
చ. అనుటయు రాఘవుండు మనమందు ముదంబును జెంది స్వామి మా
యనిలసుతుండు చేసినశివార్చనముల్ గుఱియించి వేడ్క యు

య్యెను విన నాకుఁ గొంత వచియింపుము నాఁగను శంభుఁ డానసం
బునఁ జిఱునవ్వు కప్పురపుఁబూఁత తెఱంగునఁ బర్వ నిట్లనున్. 1986

—: హనుమత్కృతశివలింగపూజావిధానకథనము :—

సీ. ఒకనాఁడు హనుమంతుఁ డొకహ్రదంబున కేఁగి, కావించి కరపదక్షాళనంబు
చేసి యాచమనంబు చేసి భస్మస్నాన, మాచరించి మరల నాచమనము
సలిలంబు గొని కమండలువునఁ దత్తీర, మందుఁ గూర్చుండి పద్మాసనమునఁ
గరమున శంభులింగము నుంచికొని పూజ, గావింపఁగా నెంచి కాంచి దానిఁ
గీ. బానవట్టంబు లేమిని దానిక్రింద, గజగజ వడంకుచును భీతి గదుర నకట
యెట్లు శివపూజ గావింతు నింకఁ బీఠ, హీన మగులింగమునకు నే నెందుఁ బోదు.
గీ. లేదు శివపూజ పీఠంబు లేక యున్నఁ, బూజ లేకున్న యెడలను బొంది విడువ
వలయు శివభక్తుఁ డైనట్టివాఁడు కడకు, నదియె గతి నాకు నని యేడ్చి యవనిఁ బడియె.
గీ. అట్లు లిలమీఁదఁ బడి లేచి యనలఁ గొంత, సేపునకు నచ్చట నె పేర్చి చితిని సందు
ననలమును బెట్టి మండించి యందులోనఁ, గూల నుద్యుక్తుఁ డై యున్న కాలమందు.
సీ. ఆకస్మికంబుగా నరుదెంచి యచటికి, వీరభద్రుండు తద్విషయ మెఱిఁగి
యాగ్రహంబును జెంది యనిలతనూభవ, యేఁగుము వలదు సాహసము చేయ
రావింతుఁ బీఠంబు నేవిధంబున నైనఁ, జూడుము నాశక్తిఁ జూపువాఁడ
నని నఖంబునఁ దీసికొని లలాటాగ్నిని, విశ్వంబులను గాల్ప విడిచిపెట్టె
గీ. నంత నావహ్ని ప్రళయకాలాగ్నివోలె, జ్వాలలను గ్రక్కుచును బ్రపంచముల నెల్ల
దగ్ధ మొనరింపఁ దొడఁగ నత్తఱిని సురలు, భయవికంపితులై పోయి భవునికడకు.
క. మొఱ వెట్టుటయును రుద్రుఁడు, వెఱవవలదు విబుధులార వెడలుఁగ నే ని
త్తఱి నఖిలంబును జక్కం, బఱచెద నని చెప్పి వీరభద్రునిఁ దలఁచెన్. 1991
క. స్మరియించినమాత్రముననె, యరుదెంచి నమస్కరించి త్ర్యంబకునకు ముం
దర నిలువ వీరభద్రుఁడు, హరుఁ డాతనిఁ జూచి మందహాసం బెలయన్. 1992
ఆ. తనయ నేనె పవనతనయునిశివభక్తి, నెఱుఁగఁజేయ నెంచి యెల్లరకును
జేసినాఁడ నిట్టిచిత్రంబు దాన నీ, శక్తి గూడఁ దెలిసె సర్వులకును. 1993
క. అది చెప్పి యథాపూర్వము, గను లోకము లెల్ల నుండఁగను హనుమకరం
బున నుండ లింగపీఠం, బనుగ్రహించెను సుపర్వు లరిగిరి పిదపన్. 1994
ఆ. అంత నబ్బురీయుఁ డయి హనుమంతుఁడు, హర్షపరవశీకృతాత్ముఁ డగుచుఁ
దోడఁ దగినరీతి శివలింగపూజను, జేసి పిదప వీణ చేతఁ బూని. 1995
క. ఆనందబాష్పములు గనుఁ, గోనలబడి జాలువాఱి కురియుచు నుండన్
గానము సేసెను నినినిని, మానములం దుండి సురలు ప్రమోదపడి చూడన్, 1996

గీ. అపుడు తద్ధ్యానవివశీకృతాత్ముఁ డగుచు, హరుఁడు ప్రత్యక్షమై వరం బతని కిచ్చె
నాయువాకల్పమును నుండునట్లు శక్తి, కలుగునట్లు సముద్రలంఘనమునందు.

క. అని చెప్పుటయును రాముఁడు, విని సర్వము నెఱుఁగఁ దగినవిషయము లే వై
నను లింగార్చనవిధి నుం, డినయెడలను జెపుము భూమినిర్జర నాకున్. 1998

వ. అని యడుగుటయు శంభుండు రామచంద్రా గోశృంగంబునం గాని గవయవిషాణంబునం గాని దక్షిణావర్తశంఖంబునం గాని రత్నస్వర్ణరజతతామ్రకాంస్యప్రాంతబులం దెద్దానం గాని మృన్మయపాత్రంబునం గాని పద్మపలాశజంబూచూతాదిపత్త్రిబులం గాని యభిషేకంబు గావించుట యుచితంబు. సకలాభిషేకంబులందును ధారాభిషేకం బుత్తమంబు. సదాశివునకు గౌరియును గౌరికి విష్ణువును విష్ణువునకు బ్రహ్మయును బ్రహ్మకుఁ జంద్రుండును జంద్రునకు సూర్యుండును సూర్యున కీశ్వరుండును షడావరణంబు లనికొందఱును, సదాశివునకు గౌరియును గౌరికి విష్ణువును విష్ణువునకుఁ జంద్రుండును జంద్రునకు సూర్యుండును సూర్యునకు నీశ్వరుండును బంచావరణంబు లని కొందఱును, సదాశివునకుఁ జంద్రుండును జంద్రునకు విష్ణువును విష్ణువునకు శక్తియు నావరణత్రయం బని కొందఱును, సదాశివునకు నంబికావరణ మొక్కండ యని కొందఱును, లోకపాలావరణాష్టకం బని కొందఱును జెప్పుదురు. కాని సదాశివపూజ యావరణరహితం బైనను బ్రశస్తంబ. స్వర్ణంబుచేఁ గాని రజతంబుచేఁ గాని తామ్రంబుచేఁ గాని యస్థూలమధ్యంబుగను బద్మపత్త్రాకారంబుగను బలమాత్రప్రమాణంబుగను నిర్మితం బయి శుక్తిసన్నిభంబు లగునష్టదళంబులు గలిగి యుండునది పత్త్రిక యనం బరగు. తత్పత్త్రికాష్టదళద్రవ్యంబులు శివపూజకు ముఖ్యంబులు. పత్త్రిక తత్తన్మతానుసారంబున షట్పత్త్రంబుగను బంచపత్త్రంబుగను ద్రిపత్త్రంబుగను నేకపత్త్రంబుగను నష్టపత్త్రంబుగను నుండందగు. రుద్రాక్షమాలిక యష్టోత్తరశతరుద్రాక్షోపేతంబు జపంబునకు ముఖ్యంబు. ధారణమాలిక స్ఫటికరత్నరుద్రాక్షకల్పితం బైనను నుత్తమంబ. సాయకాలంబున లింగార్చకుండు శిరస్స్నానంబు గావింపం జనదు. భస్మంబును బంచాక్షరమంత్రంబుచేఁ గాని శివనామంబులలో నేనామంబునం గాని సప్తవారం బభిమంత్రించి యీశానాదిమంత్రంబులచేఁ బూర్వోక్తవిధంబునఁ దత్తదంగంబులందు ధరియించి పిదపఁ బ్రణవంబుచే సర్వాంగోద్ధూళనంబు గావింపం దగు. ఇయ్యది త్రైవర్ణికాచరణీయవిధానంబు. స్త్రీశూద్రాదులు శివశబ్దోచ్చారణంబుచే భస్మంబు నేడుమారు లభిమంత్రించి 'శివాయ' యని శిరంబునందును 'శంకరాయ' యని ముఖంబునందును 'సర్వజ్ఞాయ' యని వక్షస్స్థలంబునందును 'స్థాణవే' యని గుహ్యంబునందును 'స్వయంభువే' యని పాదంబులందును

ధరియించి 'నమశ్శివాయ' యని సర్వాంగోద్ధూళనంబు గావింపందగు. పూజాకాలంబునందు దర్భపవిత్రంబు గాని తదభావంబున సువర్ణపవిత్రంబు గాని తదభావంబున గవాలకపవిత్రంబు గాని తదభావంబున దూర్వాపవిత్రంబుగాని తదభావంబున రాజతపవిత్రంబు గాని ధరియింపం దగు. శివపూజాస్థలంబునందు మృన్మయంబగు వేదిక గాని స్థండిలంబు గాని నిర్మించి యందుఁ జాతుర్వర్ణకరంగచూర్ణంబులచేఁ గాని శ్వేతచూర్ణంబుచేఁ గాని స్వస్తికపద్మోత్పలగదాశంఖత్రిశూలడమరు కల్పవృక్షకులకకోలకవృక్షంబులను షట్కోణత్రికోణయంత్రంబులం గాని నవకోణయంత్రంబుం గాని ద్వాదశకోణంబులను బాదుకావ్యజనచామరచ్ఛత్రంబులను విష్ణుబ్రహ్మాది దేవతలను లిఖయింపవలయు. స్వహస్తలిఖితం బుత్తమంబు. క్రీతంబు మధ్యమంబు. యాచితంబు కనిష్ఠంబు. బలాత్కారకారితం బధమంబు. కుశాసనంబును జర్మాసనంబును జేలాసనంబును దార్వాసనంబును దాళపత్రాసనంబును గంబళాసనంబును గాంచనాసనంబును రజతాసనంబును దామ్రాసనంబునుభస్మాసనంబును నర్కజాసనంబును బంధుకాసనంబును నుపవేశార్హంబులు. చర్మాసనంబు వైయాఘ్రంబుగను రౌరవంబుగను హారిణంబుగను మార్గంబుగను జతుర్విధం బై యుండు. తదాసనంబులం దెం దేని బద్మాసనంబునం గాని స్వస్తికాసనంబునం గాని ప్రాగుత్తరముఖంబుగాఁ గాని ప్రాఙ్ముఖంబుగాఁ గాని కూర్చుండి ప్రాణాయామం బొనర్చి దేవతారూపుం డై మానంబు వహించి ద్వాదశాంతసరసీరుహస్థితుండును సూక్ష్మదేహుండును సర్వభూతహృదయాంతర్వర్తియును నణిమాదిగుణాన్వితుండును నగుసదాశివుని ధ్యానపూర్వకంబుగా జిత్తంబునం బాదుకొల్పి నిజశరీరం బెల్లఁ దద్దీప్తిపూరితం బొనర్చి యాదీప్తిచే దేహస్థం బగుపాపంబు నెల్ల దహియించి వేదికామధ్యంబున శుద్ధాసనంబు గల్పించి యందుఁ బీఠయుక్తం బగులింగంబు నుంచి తల్లింగంబునందుఁ దద్దీప్తి నారోపించి దీప్తిమధ్యంబున హృదయస్థితుం డగుపరమేశ్వరుని స్థాపించి యచ్చటఁ గలశంబు నునిచి యందుఁ దోయంబును గంధపుష్పంబులును నుంచి ప్రణవంబుచే నభిమంత్రింపవలయు. ప్రాణాయామంబును బ్రణవంబును స్త్రీశూద్రుల కనర్హంబులు గావునఁ బ్రాణాయామస్థానంబున ధ్యానంబును బ్రణవస్థానంబున శివశబ్దంబును గ్రహియింపం దగు. లింగపీఠంబు సౌవర్ణంబు గాని రాజతంబు గాని యౌదుంబరంబు గాని శ్రేష్ఠంబు. సర్వపీఠంబులును వస్త్రాచ్ఛాదితంబులు గావలయు. పిదప శివసంతుష్టికొఱకు శివపూజ గావింతు నని సంకల్పించి యావాహనాదు లొనర్చి యభిషేకంబు గావింపవలయు. అవిచ్ఛిన్నసలిలధార ముక్తిధార యని చెప్పంబడు. ముక్తిధార లింగంబుపైఁ బడునట్లు ప్రతిదినంబును రుద్రజపంబు గావించుచు నేకవారంబు గాని త్రివారంబులు

గాని పంచవారంబులు గాని సప్తవారంబులు గాని నవవారంబులు గాని యేకాదశవారంబులు గాని మాసపర్యంతంబు గావించునభిషేకంబు ముక్తిస్నానం బని చెప్పంబడు. ముక్తిస్నానంబు మోక్షప్రదాయకంబు. శైవవిద్యచేతను బ్రణవంబుచేతనుం గూడ ముక్తిస్నానంబు గావింప నొప్పు. మృన్మయపాత్రంబులును నారికేళశకలంబులును గాంస్యపాత్రంబులును ముక్తాశుక్తులను బుష్పాదిసరంబులునుం గూడ శివాభిషేకార్హంబులుగాఁ జెప్పంబడియె. గవయశృంగంబు గాని నాగదండంబు గాని నాగాకారంబుగాఁ జేసి నడుమ దానినుంచి తద్రంధ్రద్వారంబున వచ్చునూర్ధ్వయంత్రఘటరంధ్రస్థాపితకుశాగతసలిలంబుచే ముక్తిస్నానంబు గావింప నగు. అయ్యది మహాపాతకనాశకంబు. మఱియును బంచగవ్యంబులచేతను బంచామృతంబులచేతను మధురత్రితయంబుచేతను స్నానంబు గావింపం దగు. స్నానానంతరం బాచమనీయవస్త్రోపవీతంబు లర్పించి కర్పూరమిశ్రితచందనంబుచేఁ గాని కేవలచందనంబుచేఁ గాని విలేపనంబు గావించి పీఠముం గూడ విభవానుసారంబుగా గంధపూర్ణం బొనరించి లింగంబును వివిధపూజాద్రవ్యంబులచేఁ బూజింపం దగు. కపిలాఘృతసంయుక్తం బగుగుగ్గులుధూపంబు ప్రశస్తంబు. కపిలాఘృతదీపంబులు గాని కేవలగోఘృతదీపంబులు గాని వినియోగింపం దగు. పుష్పసమేతం బగునైవేద్యంబును దాంబూలప్రదక్షిణనమస్కారంబులును గావించి గీతి వాద్యంబు పురాణంబు నృత్యంబు హాస్యోక్తి యనుగీత్యంగపంచకంబుచేతను నీరాజనంబు పుష్పాంజలి యఖిలార్పణంబు క్షమ యుద్వాసనం బనుకీర్తిపంచకంబుచేతను భూషణంబు ఛత్త్రంబు చామరంబు వ్యజనంబు శివోపవీతంబు గైంకర్యం బను నీశానోపచారషట్కంబుచేతను లింగోపచారంబు గావింపవలయు. చెప్పంబడిన ద్వాత్రింశదుపచారంబులచేఁ గావించుశివారాధనం బుత్తమోత్తమంబు. 1999

అట్టియుత్తమోత్తమార్చనం బొకనాఁడు, చేసి రేని చాలుఁ జేసినట్టి
పాతకంబు లెల్ల భస్మమైపోవంగ, నింకఁ బ్రతిదినార్చ కెంత ఫలమొ. 2000

క. అని చెప్పుటయును రాముఁడు, విని యి ట్లనియెను మహాత్మ విన వేడుక య
య్యెను యుగవిశిష్టధర్మము, లను జెప్పుము నాకుఁ బుణ్యలాభం బొదవన్.

—: యుగవిశిష్టధర్మకథనము :—

సీ. అనుటయును శంభుఁ డి ట్లనియెను నరేంద్ర
కృతయుగంబున ధ్యానంబు హితకరంబు
వరము త్రేతాయుగమున నధ్వరము పూజ
ద్వాపరయుగంబునందు నుత్తమము చూవె. 2002

క. చలచిత్తు లగుటచేతను, గలియుగమానవులు దీర్ఘకాలికకర్మం
బులు చేయలేరు కావునఁ, గలుగదు వారలకు సుగతి కర్మంబులచేన్. 2003

గీ. జపతపంబులు దీర్థముల్ శ్రాద్ధములును
వేదవిజ్ఞానమును ధర్మవేదనమును
ధ్యానమును సద్వ్రతములును నర్చనలును
సులభములు గావు జనులకుఁ గలియుగమున. 2004

క. కాన హరికీర్తనంబును, దానంబును రెండె గతులు దరియింపంగన్
మానవులకుఁ గలియుగమునఁ, గానక యవి చెరుచు రితరకర్మముల జనుల్.

గీ. అనుచు హర్షించుచును రాముఁ డాత్మలోన
శంభునకు గోద్వయంబు నచ్చటను నున్న
మునుల కెల్ల నొక్కొక్కగోవును నొసంగి
తగినసత్కారము లొనర్చెఁ దక్షణంబ. 2006

—: విభీషణుఁడు శృంఖలాబద్ధుఁ డగుట :—

వ. ఆసమయంబున విభీషణుండు శృంఖలాబద్ధుండై యున్నవాఁ డని యాకాశం
బుననుండి యొక్కశబ్దంబు వినంబడియె. 2007

సీ. అప్పుడు రాఘవుం డాత్మలో నాశ్చర్య, మెనయ శంభునిఁ జూచి యిట్టు లనియె
భూసురోత్తమ వచింపుము విభీషణునకు, బంధవిముక్తి యేర్పడునో లేదొ
యనవుడు శంభుఁ డి ట్లనియె రాఘవ భవ, త్ప్రశ్నకుఁ బ్రత్యుత్తరం బొసంగ
శకునగ్రంథవీక్షణమున నగుఁ గాని, కాదు సామాన్యవాక్యములవలన

ఆ. ననుడు రాముఁ డిట్టు లనియెఁ దద్గ్రంథంబు, లేవొ తద్విధాన మేమొ నాకు
స్వామి తెలుపు మనుడు శంభుఁ డి ట్లనియెను, వినుము రామచంద్ర విశదముగను.

—: శకునగ్రంథ నిరూపణము :—

వ. అష్టాదశమహాపురాణంబులును నష్టాదశోపపురాణంబులును రామాయణభార
తంబులును శకునమునకుఁ బ్రశస్తగ్రంథంబులు. తదన్యగ్రంథంబులు వర్జనీయం
బులు. తాళపత్త్రిలిఖితంబును దేవలిపిశోభితంబును నగుగ్రంథం బత్యుత్తమంబు.
శతరుద్రీయజప్తయును సాగ్నియును సువాచకుండును శివనిష్టమానసుండును
శుచియును శ్రోత్రియుండును సత్యవచనుండును యజుర్వేదియును నగుబ్రాహ్మణ
కుండు గ్రంథపూజార్హుండు. పూజకుండు స్నానంబు గావించి ధౌతవస్త్రధరుండై
పురాణగ్రంథంబు పీఠంబుపై నునిచి సంకల్పంబు చేసి వాణిని మహేశ్వరుని
ధ్యానించి కలశంబు స్థాపించి యభిమంత్రితం బగుతజ్జలంబు ప్రోక్షించుకొని
"ఓంనమో భగవతే (అముక)పురాణాయ" యని నమస్కరించి గాయత్త్రీ
మంత్రంబుచేఁ బురాణంబు నర్చించి "కాండాత్కాండా" త్తనుమంత్రంబుచే

దూర్వను గ్రహించి "ఓంనమో భగవత్యై దూర్వాయై" యని దూర్వార్చనంబు గావించి యతిక్రాంతపంచవర్షయు ననతిక్రాంతదశవర్షయు నగుకన్యకను గాని ఋతుమతి కానికన్యను గాని గంధపుష్పాక్షతాదులచేఁ బూజించి యాకన్యచే "సత్యం బ్రూహి ప్రియం బ్రూహి భగవతి సరస్వతి నమస్తే నమస్తే" అనుమంత్రంబు చెప్పించి యామెచేతికి దూర్వాపట్టంబు నొసంగవలయు. పిదప నాకన్యక దూర్వాపట్టంబును గ్రంథంబునందు మూఁడుచోట్ల నొక్కొక్కయుగ్మంబు చొప్పున నుంపవలయు. పిమ్మటఁ బౌరాణికుండు త్రిస్థలంబులం దుండుశ్లోకంబులం జదివి నిజప్రతిభాబలంబున శుభాశుభనిర్ణయంబు గావింపవలయు. అబుద్ధార్థపదవిపర్యాసపత్త్రిభంగలిపిభంగాదిప్రతిబంధంబు లున్నచో నాస్థలంబు విడిచి నిర్ణీతస్థలాంతరవిషయంబుం జదివి కార్యాకార్యనిర్ణయంబు గావింపవలయు. అన్నియును బ్రతిబంధంబుల యగుచోఁ గార్యనాశంబ యని నిర్ణయింపవలయు. అధ్యాయాదియును నధ్యాయసమాప్తియును వ్యర్థపత్త్రంబును వ్యర్థలిపియును నుక్తానువచనంబును నుపస్తుతంబును దగ్ధపత్త్రంబును నష్టలిపియును సందిగ్ధాక్షరంబును వర్జనీయంబులు. క్షుతంబును గ్రంథపాతంబును మస్తకాదిఘాతంబును గార్యవినాశసూచకంబులు. ఉపమానము చెప్పఁబడినప్పుడు కార్యసిద్ధ్యాభాసంబును యథార్థస్తుతి కాదేని కార్యనాశంబునుం గలుగు. యథార్థస్తుతియును వివాహంబును నౌషధదానంబును గృషియును రాజ్యనిర్వాహంబును మున్నగుసులక్షణంబులు కార్యసిద్ధిసూచకంబులు. పలాయనంబును వ్యాధియును జోరాద్యభిభవంబును మరణంబును దహనంబును గలహంబును మున్నగుదుర్లక్షణంబులు కార్యనాశసూచకంబులు. ఇంకను శకునవిషయంబునఁ జెప్పందగినయంశంబు లనేకంబులు గలవు. ప్రతిదినంబును బురాణశకునంబు చూడం దగు. భుజించియును లేచియును బురాణశకునంబు దర్శింపం దగదు. పూర్వదినరాత్రియందుఁ బుస్తకపూజ గావించి ద్వితీయదినప్రాతఃకాలంబున శకునంబు చూచుట యుత్తమంబు. అత్యావశ్యక కార్యంబులందుఁ దాత్కాలికంబుగను శకునంబు చూడ నొప్పు. పురాణశకునవిషయంబునఁ దాత్పర్యంబు ప్రధానంబు గాని పదాన్వయంబు ప్రధానంబు గాదు.

క. ఆచారవర్జితుండును, నీచైఃకులజుఁడును విబుధనింద్యుఁడు నగుదు
ర్వాచకుఁడు గాఁడు పాత్రుఁడు, చూచుటకుఁ బురాణశకునసూచ్యార్థములన్.

క. అనవుడు రాఘవుఁ డిట్లని, యను భూసురవర్య చెప్పు మీవె వచింపం
జనువిధమునం బురాణము, గనుఁగొని శకునమును బృష్టకార్యమునందున్.

వ. అని యభ్యర్థించుటయు శంభుండు విధివిధానంబున స్కాందపురాణంబు నర్చించి ప్రథమస్థలంబునందు "శ్లో. బద్ధ్వా సముద్రం స తు రాఘవేంద్రో, రురోధ

పుర్యాం క్షణదాచరేంద్రాన్ యోద్ధుం సమాగత్యసమాయయుస్తే, లంకా పురస్థా స్త్వతికాయముఖ్యాః'' అనుశ్లోకముం జదివి తాత్పర్యంబు విశదీకరించి విభీషణుండు బద్ధుం డగుట నిశ్చయంబ యని చెప్పి ద్వితీయస్థలంబున ''శ్లో. అట్టశూలా జనపదా శ్శివశూలా ద్విజా స్తథా ప్రమదాః కేశశూలిన్యో భవిష్యంతి కలౌ యుగే'' అనుశ్లోకముం జదివి యర్థముం జెప్పి తద్బంధనంబు బ్రాహ్మణకృతం బై యుండు నని వచియించి తృతీయస్థలంబున ''శ్లో. ఏవం స్తుతో మహేశస్తు దేవతాః ప్రాహ వై శివః మోచయిష్యే భవత్పత్నీ ర్మల్లాసురనిరోధితాః'' అనుశ్లోకముం జదివి తాత్పర్యంబు నుగ్గడించి విభీషణ బంధవిముక్తి శీఘ్రంబ యగు నని చెప్పె. 2012

సీ. అంతటఁ బ్రస్థితుం డై జానకీజాని, శంభుండు మార్గదర్శకుఁడు గాఁగఁ
జని విప్రఘోషసంజ్ఞను బ్రసిద్ధిని గన్న, యగ్రహారమునకు నతిరయమున
నాచరించి ప్రణామ మచటివిప్రుల కెల్ల, విధివిధానంబున విజ్ఞుఁ డగుట
ద్విజులార తెలుపుఁడు తెలిసినయెడ విభీ, షణుఁ డెందు నుండెనో సకరుణముగ

గీ. ననుటయును వార లెం తేని యాదరమున, రామచంద్రున కర్ఘ్యాగౌరవము చేసి
చూపి రొకగేహమున శృంఖలాపినద్ధ, చరణుఁ డై ఘోషిలెడివిభీషణుని నంత.

క. కనుఁగొని యాతని దశరథ, తనయుఁడు చింతిల్లి కొంతతడ వావల ని
ట్లనియె ద్విజులార యితఁ డే, యనయంబున నిట్లు బద్ధుఁ డయ్యెనో చెపుఁడీ.

క. అని యడుగుటయును ద్విజు లి, ట్లనిరి మహారాజ యీతఁ డజ్ఞానముచే
తను జంపె నిచట నొకవి, ప్రుని దాననె యిట్లు బంధమును బొందెఁ జుమీ.

క. అనవుడు రాముఁడు శివ శివ, యని చెవులను మూసికొని మహాపాపుని నేఁ
గనఁజాల ననుచు దూరము, గను నేఁగి వసించి నిమిషకాలం బచటన్. 2016

వ. శంభుప్రభృతు లగుబ్రాహ్మణోత్తములం గనుంగొని. 2017

ఆ. ద్విజవరేణ్యులార తెలియక కావించి, నట్టిబ్రహ్మహత్యయఘము దాఁట
నేది యైన నుండె నేని ప్రాయశ్చిత్త, మరసి చెప్పుఁ డనుచు నడిగె నంత. 2018

వ. తత్రత్యభూసురానుమతిం బడసి శంభుండు రాఘవునిం గాంచి. 2019

—: విభీషణుఁడు ప్రాయశ్చిత్తంబుచే బ్రహ్మహత్యావిముక్తుఁ డగుట :—

ఆ. అనఘ మూఁడునూర్లయరువదిగోవుల, బ్రాహ్మణులకు నీయఁ బడయఁ గలుగు
నఘనివృత్తి బ్రహ్మహత్యను దెలియక, సలిపె నేని యనుచుఁ జాటి చెప్పె. 2020

క. చెప్పుటయు శంభుఁ డావిధి, నొప్పికొనిరి యచటిభూసురోత్తము లెల్లన్
దప్పునకుఁ దగినశిక్షను, జెప్పుటచే శాస్త్ర మెఱిఁగి సిద్ధాంతముగన్. 2021

వ. అంతట రామాదేశంబున విభీషణుండు యథావిధి ప్రాయశ్చిత్తంబుఁ జేసికొని శుద్ధుం డై వచ్చి రామునిచరణంబులపైఁ బడుటయు రాఘవుం డాతని నీక్షించి.

క. పౌలస్త్య కార్య మేదియు, నాలోచింపక యొనర్చు టనుచిత మని యీ

వేళ నెఱుంగుము దృఢముగ, బాలిశుఁడవె నీవు బోధపఱుపఁగ నన్నున్. 2023
క. అనవుడు విభీషణుఁడు రా, మునియాజ్ఞను దాల్చి శీర్షమునఁ దెలియక తా
నొనరిచినపనికిఁ దొడఁగెను, మనమున వగవంగ బుద్ధిమంతుం డగుటన్. 2024
వ. అంతట రామభద్రుండు పరివారసమేతంబుగా నయోధ్య కరుదెంచి యథా
పూర్వంబుగ సుఖాసనోపవిష్టుం డై శంభునిం గనుంగొని. 2025
ఆ. స్వామి త్వన్ముఖమున రామాయణము వినఁ, గాంక్ష గలిగె నాకుఁ గానఁ జెపుము
లేదు తెలియరాని దే దేనియును నీకు, ముజ్జగముల శంభుమూర్తి నగుట. 2026
క. అని వేఁడుటయును శంభుఁడు, వినిచెను రామాయణమును విశదము గాఁగన్
విని యది యంతయు రాముఁడు, కను లెట్టవడంగ నతనిఁ గని యి ట్లనియెన్.
ఆ. తగునె యిట్లు కల్పితం బైనకథ నాకుఁ, జెప్ప ద్విజుఁడ నీవు తప్పు గాదె
యని వచించి సభ్యులను జూచి కర్తవ్య, మిప్పు డేదొ నాకుఁ జెప్పుఁ డనియె.
వ. అనుటయును జాంబవంతుండు లేచి విరచితాంజలి యై. 2029
ఆ. రామ పూర్వకల్పరామాయణం బిది, విధి వచింప మున్ను వింటి నేను
కల్పితంబు గాదు కథ బ్రాహ్మణుఁడు దోషి, కాఁడు లేదు క్రోధకారణంబు.
వ. అని విన్నవించుటయు రాఘవుండు వృద్ధభల్లూకముం గనుంగొని యట్లైనఁ
దత్కథావిధానం బంతయుం దేటపడం జెప్పు మని యానతీయ జాంబవంతుండు
హరిహరహిరణ్యగర్భులకు నమస్కరించి యి ట్లనియె. 2031

—: పూర్వకల్పరామాయణకథనము :—

గీ. శ్రవణమాత్రంబుననె సర్వజన్మసంచి, తాఘముల నెల్ల రూపుమాయంగఁ జేయు
నట్టిప్రాచీనకల్పరామాయణంబు, వినుమెఁ ప్రభువర మును నేను వినినయట్లు.
సీ. దశరథుం డనుపేర ధార్మికుం డగుఱేఁడు, కలఁ డొక్కరుఁడు పూర్వకల్పమందు
నతఁ డొక్కనాఁడు శతాక్షౌహిణీబల, సహితంబుగను సితాశ్వంబు నెక్కి
దండయాత్ర నొనర్పఁ దలఁచి ప్రస్థితుఁ డయి, సుమనసం బనునగరమున కరిగి
తదధీశుఁ డగుసాధ్యధరణీశ్వరునితోడఁ, ఘోరతరంబుగాఁ బోరి పోరి
గీ. యొక్కమాసంబునకు వాని నుక్కడంచి, పట్టుకొని తనవశములోఁ బెట్టుకొనియె
నంత భూషణుఁ డనెడితదాత్మభవుఁడు, ప్రధనభూమిని నిలిచెను రణ మొనర్ప.
వ. అప్పుడు దశరథుం డక్కుమారుని వీక్షించి తత్సమానవయోరూపుండును భల్లూ
కనిహంతుండును నగుపరమప్రీతివర్ధనుం డనునిజపుత్రుండు తలంపునకు రాఁ
గొంతతడవు వగచి కట్టకడకుఁ దనయాయోధనకౌశల్యంబుచే నాబాలుని
నొప్పి గలిగింపకుండఁ బరాజితుం జేసి తనవశంబు గావించుకొనియె. 2034
గీ. అపుడు సాధ్యుఁడు పుత్రసమన్వితముగ, నుండఁగను దనయాజ్ఞలో నొక్కతఱిని
దశరథుఁడు వాని రాపించి ధరణిపతుల, కర్హ మగుగౌరవంబుచే నాదరించి.

సీ. క్షోణీంద్ర సీతనూజుని బోలుపుత్రుండు, కలుగంగ నే మేమి సలుపవలెనొ
తెలిసియుండిన నీకుఁ దెలుపుము నావుడు, సాధ్యుఁ డిట్లనియె నాక్ష్మావరునకు
నధిప వచింతు యథార్థంబుగను నీకు, ననుభవించినవాఁడ నగుటఁ జేసి
యేకాదసులయందు నెల్లను నుపవాస, మాచరించుచు శ్రద్ధ యామతిల్ల
గీ. ద్వాదసులయందు విప్రసంతర్పణంబు, నొనరుచుచు న్యాయసంచితధనమువలన
హరినిఁ బూజించుచున్న నద్గాంతమందు,యోగ్యుఁ డైనతనూభవుం డుద్భవించు.
క. అని చెప్పుటయును దశరథ, జనపతి సాధ్యునిఁ దదాత్మజన్మునిఁ బ్రమదం
బెనయఁగఁ దద్రాజ్యంబున, నునిచి మరలఁ దాను దనయయోధ్యకు వచ్చెన్.
ఆ. అరుగుదెంచి యట్లు ధరణీశ్వరుఁడు వసి, ష్ఠాదిసన్నిధానమందు సాధ్య
గదిత మైనయట్ల కావించి సర్వంబు, నబ్దపూర్తి యగుడు నంతమందు. 2038
గీ. చేసెఁ బూర్ణాహుతిని మునుల్ చెప్పినట్లు, కర్మలోపంబు సుంతయుఁ గలుగకుండ
నంతటను వహ్నికుండమధ్యంబునుండి, జ్యోతివోలెఁ జతుర్భుజుం డుద్భవించి.
ఆ. వరము కోరుకొనుము ధరణీంద్ర యని పల్క, దశరథుండు భక్తి దార్కొనంగ
నతి యొనర్చి కోరెఁ జతురాత్మజుల నంతేఁ,జరువునందుఁ జొచ్చెఁ జక్రపాణి.2040
వ. అంతట దశరథుండు వసిష్ఠాదేశంబునఁ గౌసల్య సుమిత్ర సురూప సువేష యను
తనభార్యలు నలువురకును జరువును నాలుగుభాగంబులు గాఁ జేసి యొసంగె.
సీ. అప్పుడు కౌసల్య కావిర్భవించె రా, ముఁడు సుమిత్రికు లక్ష్మణుఁడు జనించె
భరతుం డొదవె సురూపకు సువేషకుఁ బుట్టె, శత్రుఘ్నుఁ డాశుభసమయమందు
గుసుమవర్షంబును గురిసిరి దేవతల్, దీప్తిమంతము లయ్యె దిక్కు లెల్లఁ
జతురాస్యుఁ డేతెంచి జాతకర్మము నామ, కరణంబు నొనరించెఁ గ్రమము గాఁగ
గీ. రాముఁ డయ్యెను భువనాభిరాముఁ డగుట
లక్ష్మణుం డయ్యె శౌర్యాదిలక్ష్మికతన
భరముఁ దీర్చెడివాఁ డౌట భరతుఁ డయ్యెఁ
దునుమువాఁ డౌట రిపుల శత్రుఘ్నుఁ డయ్యె. 2042
గీ. అట్లు లన్వర్థనామధేయములఁ దాల్చి, సకలజనలోచనానందజనకు లగుచు
నాఁడునాఁటికి వృద్ధి నొందంగఁ దొడఁగి, రాకుమారులు బాలసుధాంశు లనఁగ.
క. వారలచిఱునగుమోములు, వారలప్రస్ఖలితగతులు వారలయాటల్
వారలమురిపెపుఁబలుకులు, కూరుపఁగాఁ దొడఁగె జనులకున్ బ్రమదంబున్.
గీ. అందఱును గూడ సమధికాహ్లాదజనకు, లగుచు నొప్పారుచున్నను నందులోనఁ
గ్రాలుచు విశిష్టరీతితో రాఘవుండు,హారమునఁ గొల్కిపూస యున్నట్లు లుండె,
సీ. కంబుకంఠమువాని బింబాధరమువాని, ఘననీలకుటిలాలకములవాని
నమృతభానునిభాననమువాని రత్నకుం, డలసముల్లసితకర్ణములవాని

ఫుల్లాబ్జలోచనంబులవాని సౌవర్ణ, దామశోభితకటితటమువాని
నంకుశచక్రపద్మాంకితాంఘ్రులవానిఁ, గరికరాభోరుయుగ్మంబువాని

గీ. ధూళిధవళితగాత్రునిఁ గేళిరతునిఁ, గాంచుచును రామచంద్రునిఁ గన్నులార
దశరథుఁడు కోసలాత్మజాతయును జెంది, నట్టియానందము వచింప నలవి గాదు.

వ. రామభద్రుం డొక్కనాఁడు బాలురతోడం గూడి క్రీడించుచున్న సమయంబున
నాకస్మికంబుగా వివశుం డై నేలపయిం బడి విలపింపం దొడంగె. 2047

సీ. అది చూచి బాలకు లందఱు భయపడి, చని చెప్ప దశరథక్ష్మావరునకు
నాతఁ డేతెంచి యత్యావేగమునఁ గాంచి, రామచంద్రుని భయగ్రస్తుఁ డగుచు
నేమియుఁ దోఁపక యెత్తి చేతులమధ్య, మున నుంచుకొని శీఘ్రముగను నేఁగి
తనగురుం డగువసిష్ఠునికడ నునుపంగ, నమ్మహాతాపసుం డది యెఱింగి

గీ. భూతి మంత్రించి చల్లుడు భూత మొక్కఁ, డప్పు డావిష్ట మై రాఘవాంగమందుఁ
బట్టుకొని మునివర్యునిపాదములను, నేడ్చుచును బెద్దపెట్టున నిట్టు లనియె. 2048

గీ. స్వామి నే వేదముల నెల్లఁ జదివినట్టి, బ్రాహ్మణుండను గర్వకారణమువలన
నమితసంతాపదాయక మైనబ్రహ్మ, రాక్షసత్వము నాకు సంప్రాప్త మయ్యె.

గీ. నన్ను నీ వుద్ధరించెద వన్నయాశ, వుట్టి యీరామభద్రునిఁ బట్టికొంటి
నంతె కాని మ ఱొండుదురాశ లేదు, ముంచినను దేల్చినను నీవె మునివరేణ్య.

చ. అనవుడు మౌని యి ట్లనియె నగ్రకులోద్భవ మున్ని గంగలోఁ
బొనరిచి బిల్వపత్త్రశతపూజను శూలికి నంతమందుఁ జే
సినయెడ స్నానముల్ మరలఁ జేసినదుష్కృత మెల్లఁ దత్క్షణం
బున నశియించి దైత్యతనుముక్తి ఘటిల్లు నసంశయంబుగన్. 2051

క. అని చెప్పుటయును నాతం, డొనరించి తదుక్తవిధుల నొప్పుగ రక్ష
స్తను వుడిగి దివ్యదేహం, బును దాలిచి దివికి నేఁగె భూప్రజ చూడన్. 2052

గీ. అంతటను ముక్తుఁ డై రాముఁ డసురవలనఁ
దోడిబాలురతోఁ గూడి యాడుకొనుచుఁ
గొంతకాలంబు గడపెను సంతసమునఁ
దల్లిదండ్రులయుల్లముల్ పల్లవింప. 2053

వ. అంతట యుక్తకాలంబు ప్రాప్తించుటయు వసిష్ఠుండు రామలక్ష్మణభరతశత్రు
ఘ్నులకు విధివిధానంబున నుపనయనసంస్కారంబు గావించి వేదవేదాంగ
మీమాంసాద్వయధనుర్వేదాయుర్వేదనీతిశాస్త్రభరతగాంధర్వవాస్తుశాకునవివి
ధయుద్ధశాస్త్రంబులు నేర్పె. 2054

క. అంతట దశరథధాత్రీ, కాంతుఁడు రామునకుఁ బెండ్లి గావింపంగా
స్వాంతమున నెంచి తద్వృ, త్తాంతంబును దెలియఁ జేసె నఖిలనృపులకున్. 2055

వ. అప్పుడు విదర్భదేశాధీశ్వరుండును మిథిలాపురాధిపతియును నాత్మవిదుండును నగువిదేహుండు హోమలబ్ధ యగునిజపుత్రికామణిని రామచంద్రున కిచ్చి వివాహంబు గావింప నెంచి తత్కార్యసంఘటనార్థంబు దశరథునికడకుం గుశలు లగు బ్రాహ్మణోత్తములం బనిచె. 2056

సీ. ఆబ్రాహ్మణోత్తము లరిగి యయోధ్యకుఁ, గార్యసిద్ధికిఁ దగుకాలమందు
దశరథక్ష్మాపతిదర్శనం బొనరించి, విషయ మంతయుఁ గూడ విశదపఱుప
వసుమతీంద్రుఁడు వారివచనంబులం దుంచు, పరమార్థబోధకభావ మెఱిఁగి
సంతుష్టుఁ డై కార్యసమ్మతి సూచింప, గ్రహియించి భూసురాగ్రణులు దాని

గీ. సకలవిధశుభలక్షణసహిత మైన, లగ్నమును నిర్ణయించి యుల్లాసమునను
బార్థివోత్తముఁ డిచ్చినబహుమతులను, నందుకొని వేగ మిథిలకు నరుగుదెంచి.

క. శుభవార్త దెలుప మిథిలా, విభునకు నాతండు మిగుల వేడ్క నయోధ్యా
ప్రభువునకు ద్విజముఖంబున, శుభలేఖను బనిచి యెదురుచూచుచు నుండెన్.

వ. అంతట దశరథుండు బ్రాహ్మణాశీర్వాదముం బడసి పుత్రమిత్రకళత్రబాంధవామాత్యసామంతభూపాలకపురంధ్రీజనపరివారవర్గచతురంగబలసమేతుండై గురుపురస్సరంబుగా మంగళవాద్యంబులతోడ బయలుదేఱి మిథిలాపురసీమకుం జేరుటయు విదేహుండు సపరివారంబుగా నెదు రేఁగుదెంచి యర్ఘ్యవిధిని సత్కరించి తన్నివాసయోగ్యం బగుమందిరంబునం బ్రవేశింపంజేసె. 2059

క. ఆవేశ్మమందు దశరథ, భూవిభుఁడు వసించి సౌఖ్యముగ రామునకున్
గావింపఁ దొడఁగె ముందుగఁ, గావింపం దగినకౌతుకక్రియ లెల్లన్. 2060

సీ. అపుడు దైవికముగా నరుదెంచి కలహభో, జనుఁడు విదేహభూజానికడకు
నతనిచే సత్కృతుం డయి తన్ముఖంబున, నెఱిఁగి సర్వమును దా నిట్టు లనియె
భూప నీ వొనరింపఁ బూనినకార్యంబు, సర్వసమ్మతము నిస్సంశయముగఁ
గాని స్వయంవరకార్యంబు నడపుట, ధర్మంబు క్షత్రియోత్తముల కెల్ల

గీ. ననుటయు విదేహభూపాలుఁ డమ్మహర్షి, వచనమున కడ్డు చెప్పంగ వలను గామి
దశరథునికడ కేఁగి తత్కాలమంద, వినిచె మునిభాషితంబును వినయమునను.

క. అంతట దశరథుఁ డది విని, సంతోషముతోడ నట్లె సలుపుము నాయ
భ్యంతర మేమియు లే దని, యింతేనియు మదిని సంశయింపక పలికెన్. 2062

వ. అప్పుడు విదేహభూపాలుం డెల్లదేశంబులకును వైదేహీస్వయంవరంబు చాటం బనిచె. 2063

సీ. ఆస్వయంవరవార్త యాలించినంతన, క్ష్మాతలాధిపులు వాచంయములును
బృందారకులును రాత్రించరులును నేగు, దెంచిరి తమతమ తేజుతోడ

నపుడు వారల నెల్ల నర్హరీతిని గౌర, వించి విదేహపృథ్వీధవుండు
తనకోర్కి సాఫల్యమును జెందునో లేదొ, యనుభీతి యాత్మలో నంకురింప
గీ. శరణు చొచ్చినవారి కెల్లరకుఁ గూడ, నభయము నొసంగి రక్షించునట్టివాని
నఖిలశక్తిసమన్వితుఁ డైనవాని, హరుని ధ్యానమొనర్చె నేకాంతముగను.

వ. పృథివ్యప్తేజోవాయ్వాకాశరవిశశియజమానమూర్తే విశ్వమూర్తే వేదమూర్తే పురాణమూర్తే యజ్ఞమూర్తే శాస్త్రమూర్తే స్వధామూర్తే నారాయణమూర్తే సర్వదేవతామూర్తే త్రయీమయ త్రయీప్రమాణ త్రయీనేత్ర సామప్రియ వసుధారాప్రియ భక్తిప్రియ భక్తసులభ భక్తేతరవిదూర స్తుతిప్రియ ధూపప్రియ దీపప్రియ ఘృతక్షీరప్రియ ద్రోణకరవీరప్రియ శ్రీపత్త్రప్రియ కమలకహ్లారప్రియ నంద్యావర్తప్రియ వకుళప్రియ యూథికాప్రియ కోకనదప్రియ గ్రీష్మజలావాసప్రియ యమనియమప్రియ నియతేంద్రియప్రియ జపప్రియ శ్రాద్ధప్రియ గానప్రియ గాయత్త్రీప్రియ పంచబ్రహ్మప్రియ సదాచారప్రియ నారాయణహిరణ్యగర్భపురందరాదిబృందారకబృందనయనకమలార్చితపాదయుగళ శితిగళ చక్రప్రదానసంతోషితపుండరీకాక్ష విరూపాక్ష గోక్షీరమయాకార నిరాకార నిర్వికార నిర్భవ భవ సదాశివ మా మభయం కురు మమ వాంఛితార్థసిద్ధిం కురు నమస్తే నమస్తే యని నుతియించె. 2065

గీ. అప్పు డాభూమిజానియేకాంతభక్తి, కాత్మ సంతుష్టి గలుగ సుధాంశుమౌళి
వచ్చి ప్రత్యక్షముగ నిల్చి వసుమతీంద్ర, యేల భీతిల్లఁగా నీకు శూలి యుండ.
గీ. సీతకు రాముఁడె పతి యగు, నేతద్విషయమున సంశయింపకు మెపుడున్
భూతలభారము దీర్పఁగ, సీతారాములు గ హరియు సిరియును బుట్టన్ 2067
క. కొను మియ్యది నాయజగవ, మనుధను విది యెక్కువెట్టునట్టిఁడె వైదే
హిని గైకొన నర్హుం డని, యొనరింపుము ప్రతిన వినుచు నుండఁగ సభ్యుల్.
క. అని చెప్పి తిరోధానం, బును జెందెను సపరివారముగ నంతట నా
జనవల్లభుఁ డట్లె ప్రతి, జ్ఞ నొనర్చెను వినుచు నుండ సభవా రెల్లన్. 2069
వ. అంత. 2070

సీ. ఇది యెంతపని యంచు నేతెంచి భానుఁడు, కదలింపఁ జాలక కడకుఁ బోయె
సవిలాసగతులతోఁ జనుదెంచి వరుణుండు, పట్టి యుంచుక యెత్తి పడియెఁ గ్రింద
దురభిమానంబుచే నరుదెంచి యింద్రుండు, చేతఁగామిని వంప సిగ్గువడియె
వికవికలాడుచు వీతిహోత్రుఁడు వచ్చి, ముట్టి చేతులతోడ మోము వంచె
గీ. నతిబలుండు రయంబున నరుగుదెంచి, యూఁచి యిట్టట్టు లుబ్బూఁత లూఁగి తాన
పడియె నిలమీఁదఁ దనపైనిఁ బడఁగ ధనువు, చప్పటలు గొట్టి నవ్విరి సభ్యులెల్ల.

క. అంతటఁ బ్రహ్లాదుం డ, త్యంతాటోపంబు మీఱ నరుదెంచి మహా
సంతుష్టి నంటె ధనువు త, దంతస్సారంబు నెఱిఁగి యవలకుఁ బోయెన్. 2072
గీ. ఆశరశ్రేష్ఠుఁ డైన బాణాసురుండు, వచ్చి రెండంగుళములు లేవంగ నెత్తి
ధనువు నావల నది పట్టుకొనఁగ లేక, కూలఁబడిపోయె గుప్పున నేలమీఁద. 2073
చ. బలి చనుదెంచి చాపమును బాఱఁగఁ జూచి కదల్చి యిట్టటుల్
తలకొని యెత్తఁగన్ విఫలతన్ గని మెల్లన జాఱె రాక్షసుల్
కలఁకువఁ జెందు చుండఁగను గాంచి దశాననుఁ డేఁగుదెంచి దో
ర్బల మఖిలంబు సూపి తెలవాఱిన మోములతోడ నుండఁగన్.
క. ఆశరు లెల్లరుఁ దమతమ, యాశలు విడనాడి చేయునది లేమి నుపే
క్షాశరణు లగుచుఁ జూచుచు, నాశలు చలియింప కున్న నాసమయమునన్.
ఆ. అరుగుదెంచి విశ్వామిత్త్రుఁ డాశుగతిని, నొక్కయంగుళ మెత్తి వి ల్లుద్భటముగ
నవల నున్నమనము చేయ నలవి గామి, విరతుఁ డై యుండ నుడిగిరి విప్రులెల్ల.
క. అంతట రాజవరేణ్యులు, నింతగ నేతెంచి చూచి విల్లెక్కిడ న
త్యంతప్రయత్న మొనరిచి, యంతమునకుఁ జనిరి వినమితాసను లగుచున్.
ఆ. అపుడు రాజకుమారు లరుదేర వెనువెంటఁ, దనకరమున లక్ష్మణునికరంబుఁ
బట్టికొని స్మితప్రభలు నల్గడలఁ బర్వ, నింపుమీఱ రాముఁ డేఁగుదెంచి. 2078
చ. కనుఁగొని చాపమున్ మివులఁ గౌతుక మొప్పఁగఁ బట్టి యెత్తె గ్ర
క్కున నది చూచి యెల్లరును గొట్టుచుఁ జప్పటలన్ మహారథుల్
గనిరి పరాజయం బనుచుఁ గట్టిగ నార్చుచు నుండ నంతలో
గొనయము నెక్కువెట్టెను రఘుప్రవరుండు శరాసనంబునన్. 2079
చ. అది గని యెల్లవారలును నచ్చెరియంబును జెందుచుండ న
య్యదనున రాఘవుండు గొనయంబు దృఢంబుగ లాగి పూన్కిమై
వదలెఁ దదుద్గతం బగురవంబున దిక్కులు మాఱుమ్రోఁగఁగన్
బెదరఁగ వీరు లెల్లరును బిట్టదరంగ ధరిత్రి యంతయున్. 2080
క. అంతట విదేహధరణీ, కాంతాత్మజ పుష్పమాల గైకొని కేలన్
నింతగఁ దనవెంట సఖుల్, సంతసమున నేఁగుదేరఁ జనుదెంచి వెసన్. 2081
క. మంగళవాద్యధ్వనులు చె, లంగుచు నుండంగఁ గడువిలాసం బొదవం
గం గుసుమమాల నునిచె న, పాంగంబులఁ గనుచు రామభద్రునిమెడలోన్.
ఉ. అంతట వీరు లెల్లరు నహంకృతి మీఱఁగ నెవ్వఁ డీతఁ డీ
కాంతను గొంచుఁబోవ నని కాఱులు ప్రేలుచుఁ బైకొనంగ నొ
క్కింతయు భీతి లేమిఁ జలియింపక రాముఁడు వారి నెల్ల వి
క్రాంతిమెయిన్ బరాజితులఁ గా నొనరించి రణాంగణంబునన్. 2083

క. నానావిధజయభేరీ, ధ్వానము లెసఁగఁగ విదేహతనయాయుతుఁడై
తా నేతెంచె నయోధ్యకు, సానందముతోడ వెంట సాధువులు రాఁగన్. 2084

సీ. అంతట దశరథుం డానందభరితుఁడై, రామచంద్రుని యౌవరాజ్యమందు
నభిషిక్తుని నొనర్చి యఖిలజనంబులు, శ్లాఘింపఁగను సంతసమున నుండ
నపుడు కేకయవసుధాధినాథకుమారి, దైవనసు వేఁడ తా నరుగుదెంచి
సాహాయ్య మగుచు నిట్లనియెను నాథ నా, వరముల కిపు డవసరము గలిగె

గీ. ననుటయును నేఁడు కోరుకొమ్మనల యనియె
ననుడు నామె చతుర్దశహాయనములు
గహనమున వసియింప రాఘవుఁడు భరతుఁ
డవని నేలంగను వరద్వయంబుఁ గోరె. 2085

క. అంతట దశరథుఁ డది విని, చింతాకులచిత్తుఁ డగుచుఁ జేయంగల దొ
క్కింతయు లేమి వసిష్ఠున, కంతయు నెఱిఁగించి యేమి యానతి యనినన్. 2086

సీ. అపుడు వసిష్ఠుఁ డిట్లనియె మహారాజ, చింతింపవలదు నీచిత్తమందు
రాముఁ డనంగను భూమిభారము దీర్ప, నవతరించినవిష్ణు వని యెఱుంగు
మతఁడు కాననముల కరిగి యచ్చట నుండు, క్రూరదానవులను రూపుమాపి
యటుమీఁద ప్లవగసైన్యంబుతోడను సము, ద్రము దాఁటి లంకాపురంబుఁ జేరి

గీ. ముప్పుత్రిప్పులు పెట్టుచు ముజ్జగముల
నోడ లెఱుంగక చరియించుచుండు నొక్క
రక్కసుల తేని సపరివారముగఁ గూల్చి
యరుగుదెంచి యయోధ్యకు హర్ష మొదవ. 2087

గీ. రాజ్య మొనరించి బహువత్సరంబు లిలను, బ్రఖ్యాతి దశదిక్తటంబులఁ బాదుకొల్పి
పుత్రులను గాంచి త్రిభువనంబులును బొగడఁ, దేజరిల్లఁ గలండు సందియము లేదు.

క. అనవుడు వసిష్ఠవచనం, బును విని దశరథుఁడు మిగులఁ బొగులుచు నెదలోఁ
దనయునివియోగమునకున్, గొన కెట్టులొ సమ్మతించెఁ గొడుకున్ బంపన్.

వ. అంత రామచంద్రుండు మాతాపితలకును వసిష్ఠునకును నమస్కరించి సీతాలక్ష్మణులతోడం బయనంబై యుపవనంబున నొక్కదినం బుండి వల్కలంబులం దాల్చి జటాబంధనంబు గావించుకొని భస్మోద్ధూళితసర్వాంగుం డయి వనాంతరంబున కరిగె. 2090

ఆ. అంత నీవువోలె నచటి రాక్షసులను, రూపుమాపి రాముఁ డేపుమీఱ
సీతఁ గోలుపోయి చేరి లక్ష్మణునితో, ఋష్యమూకమునకు నెట్లొ తుదకు. 2091

సీ. అచట నుండెడి యొక యాశ్రమవృక్షంబు నా, శ్రయముగాఁ గొని దానిశాఖయందుఁ
జాపంబు నుంచి తచ్ఛాయలోఁ బులుగడ, గా నొనర్చికొని లక్ష్మణునితోడను

శయనించి మృగచర్మశయ్యాతలంబునఁ, దిలకించుచును జూతఫలము లచట
నొకకొమ్మపై నున్నయొకకపి నీక్షించి, తద్రూపమున కద్భుతంబు గదురఁ

ఆ. బ్లవగవర్య యెవరిబంటవో నీవు నీ, నామ మేమొ తెలుపు నాఁగ నిట్టు
లనియెఁ గ్రోఁతి హనుమ యనువాఁడ సుగ్రీవ, వానరేంద్రభటుఁడ నేను దేవ.

ప. అనుటయు రామచంద్రుం డి ట్లనియె. 2092

గీ. హనుమ నినుఁ జూడ నానంద మయ్యె నాకుఁ
గాని నీప్రభుఁ గనుఁగొనఁ గాంక్ష వొడమె
ననుచు విరమించుటయును నాహనుమ వృక్ష
విటపముననుండి డిగ్గి సవినయముగను. 2093

క. రామపదాంభోజంబుల, పై మస్తక ముంచి మ్రొక్కి పయనం బై స్వ
స్వామికడ కేఁగి చేసి ప్ర, ణామం బి ట్లనియెఁ బ్లవగనాయక వినుమీ. 2094

సీ. కనుఁగొంటి నీనాఁడు క్రతురసాలము క్రిందఁ, బురుషోత్తముఁడునాఁగఁ బొలుచువాని
నాజానులంబిబాహార్గళంబులవాని, నాదిత్యసమతేజఁ డైనవాని
నంబుదశ్యామకాయంబు గల్గినవాని, జడలు గట్టినశిరోజములవాని
రాజన్యలక్షణరాజితుం డగువాని, నవయౌవనస్ఫురణంబువానిఁ

గీ. దేజు గలిగినవేఱొకరాజసుతుఁడు, తనకుఁ బ్రాణసఖుండుగాఁ దనరువానిఁ
గరుణ చిలుకుచు నుండెడికనులవాని, నాశ్రితశరణ్యుఁ డన నొప్పునట్టివాని.

ఆ. అట్లు నేను జూచి యాశ్చర్యపడు చుండ, నన్నుఁ జూచి యాగుణోన్నతుండు
నవ్వుమొగముతోడ నాప్రభునిసమాహ్వ, యమునుమామకాహ్వయమును నడిగె.

ఆ. అడిగి మన్ముఖమున నట్లో త్తరంబును, బడసి హనుమ నాకుఁ గడు ముదంబు
గలిగె నిన్నుఁ జూడఁ గాని నీప్రభునిఁ గ, న్గొనఁగఁ గోర్కి యయ్యె నని వచించె.

ఆ. అంత నేను డిగ్గి యామ్రపాదపశాఖ, నుండి యతనిపదపయోజములకు
నాచరించి ప్రణతి యరుదెంచితిని నీకు, విదిత మొనరుపంగఁ దదుదితంబు. 2098

క. అని విన్నవించుటయుఁ జ, య్యన సుగ్రీవుండు వానరాన్వితుఁ డగుచున్
జనుదెంచి వినయమున రా, మునికడ కీక్షించి తద్విమోహనమూర్తిన్. 2099

ఆ. అంతరంగమందు నాశ్చర్య మొందుచుఁ, దత్పదములమీఁదఁ దలను మోపి
మ్రొక్కి లేచి యతనిమ్రోల నిల్వంబడి, స్వామి మీచరిత్ర మేమొ చెపుఁడి.

మ. అని ప్రార్థించుటయున్ రఘూత్తముఁడు తద్వ్యాహార మాలించి త
మ్మునిమోమ్మున్ దిలకింప లక్ష్మణుఁడు సంపూర్ణంబు గా వానరేం
ద్రున కిచ్చెన్ దమగాథ చెప్పి తుదకున్ దుష్టాత్ములన్ గీటడం
పను శిష్టాత్ములఁ గావ వచ్చితి మనెన్ బ్రాగల్భ్య మేపారఁగన్. 2101

వ. అంత సుగ్రీవుండు రామచంద్రునిమోమ్మున్ దిలకించి యి ట్లనియె. 2102

గీ. అనఘ నామందిరమ్మున కరుగుదెమ్ము, భూషణంబులు కొన్ని చూపుదును నీకు
నవి త్వదీయసతీమణి వైనయెడలఁ, బట్టుకొనువాఁడ దొంగ నెప్పగిది నైన. 2103
క. అనుటయు నతిశీఘ్రంబుగ, ననుజునితోఁ గూడి రాముఁ డాతని వెంటన్
జని భూషణంబులం గని, కొని కరముల నెదను బెట్టికొని ఖేదమునన్. 2104
గీ. భూషణములార విడనాడి పోయె నొక్క
మీమహాదేవి ననుఁ బోలె మిమ్ము నైత
మనుచు విలపించె జలజలఁ గనులనుండి
రాలఁ గన్నీరు ముత్యాలజాలువోలె. 2105
వ. అట్లు కొంతతడవు విలపించి రామచంద్రుండు సుగ్రీవునిం జూచి కపీంద్రా యీభూషణంబులు నీ కెట్లు ప్రాప్తంబు లయ్యె నని యడుగుటయు సుగ్రీవుం డిట్లనియె. 2106
సీ. దేవ రావణుఁ డను త్రిదశారి యొక్కండు, గొనిపోవు చుండంగ వనిత నొర్థ
రామ రామ య టంచు నామె యేడ్చుచు మూట, గట్టియీనగలుమాకడను వైచె
నివి నీకు దుఃఖహేతువు లగుటను జేసి, యామెయె నీయింతి యనుచుఁ దోఁచె
వనట నొందకుము నావానరసైన్యంబు, నీదె నీవాఁడనె నేను గూడఁ
గీ. గట్టెదము సంద్రమున నానకట్ట వార్ధి, దాఁటెదము చొచ్చెదము లంకదైత్యవిభునిఁ
గూల్చెదము నీసతిని నొసంగుదుము నీకు, నిలిచితివ యేని యండగా నీవు మాకు.
చ. అనుటయు రామచంద్రుఁడు ప్రహర్షము నొంది తదీయభాషణం
బునకుఁ గపీంద్ర నాహృదయపూర్వకమైత్రికి నైతి వీవు భా
జనమవు కార్యసిద్ధి యగుచాయ మము న్నడిపింపు మింక నే
నొనరుపఁ దగ్గ దే దయిన నుండిన సాయము నీ కొసర్చెదన్. 2108
సీ. అనవుడు సుగ్రీవుఁ డవనతాననుఁ డయి, యెలయంగ దీనత్వ మిట్లు లనియె
స్వామి నీ కొక్కవిజ్ఞాపనం బొనరింతు, వినుము సి గ్గయ్యెడి విన్నవింప
నాయన్న యగువాలి నాసతీరాజ్యంబు, లను హరించి భుజాబలంబువలన
నను వెడలం గొట్టి నారాజధానిఁ గి, ష్కింధాపురము నధిష్ఠించి యుండె
గీ. దుష్టశిక్షాక్రియాదీక్షితుండ వంచు, నీ కెఱింగించినాఁడ నాశోకవార్త
నని వచించుటయును రాముఁ డాలకించి, స్వాంతమునయందుదీనవాత్సల్యమొదవ.
ఆ: వానరేంద్ర వింటి వాలిదౌర్జన్యంబు, సైఁపఁదగినతప్పు సలుప కునికి
వధ్యుఁ డతఁడు నిక్కువంబుగా వధియింతు, వాని నెట్టు లేని వగపు వలదు.
క. నీ వేఁగి జన్యభూమికి, రావింపుము వాని నంత రణమును మీరల్
గావించు చుండ నప్పుడు, కావించెద నే నొనర్పఁగాఁ దగినపనిన్. 2111
క. నావుడు ధైర్యంబున సు, గ్రీవుఁడు చని పిల్వఁ బ్రధనకేళి కపు డహం
భావమున వచ్చి వాలి భు, జావీర్యముఁ జూప నోపఁ జాలనికతనన్. 2112

వ. సుగ్రీవుం డెట్టకేలకుఁ బలాయితుం డై రామునికడ కేతెంచి ఖిన్నవదనంబుతో నుండ రామచంద్రుం డతని నాలోకించి యి ట్లనియె. 2113

ఆ. వానరేంద్ర నీవు వాలియు నొకరీతి, నుంట గుర్తు లేక యున్నకతన
నూరకుండవలసె నారాచమును నాఁపి, యంతె కాని రాముఁ డన్నృతి గాఁడు.

క. అని చెప్పి యథార్థము నా, తనికిఁ ధైర్యంబు గొలిపి తత్కంధరమం
దునిచి సుమధామచిహ్నము, ననిచె ననికి మరల వాలి నాహ్వానింపన్. 2115

సీ. అంతట సుగ్రీవుఁ డరిగి యుత్సాహంబు, తోడ వాలినిఁ బిల్చె దుర మొనర్ప
నాధ్వని విని వాలి యతిరోషమున రేఁగి, వాయువేగంబున వచ్చుచుండ
నది గాంచి తార యి ట్లనియెఁ బ్రాణేశ్వర, వలదు సాహసము పోవలదు నీవు
సుగ్రీవునకు మధుసూదనాంశభవుండు, రాముఁడు సాయంబు రాఁగలండు

గీ. కాదు జయకాల మిది నీకు నాదుమాట, విను మనుడు వాలి నవ్వి యి ట్లనియె నింతి
రాముఁ డన నీతివిదుఁడు దుర్బలునికడకుఁ, జేరు నె యతండు బలి యైన జేత నుడిగి.

ఆ. అట్లు గాక సదయుఁ డై రాముఁ డనదను, బ్రోవ నెంచి యనికిఁ బూనె నేని
యతనిచేతిలోన మృతి చెంది మోక్షంబు, నొందువాఁడ భీతిఁ జెంద నేల. 2117

క. అని చాపము క్తశరమో, యన నతివేగముగ నేఁగి యాతఁడు సుగ్రీ
వునితోడఁ బోరి నొంపఁగఁ, గని శ్రీరాముండు ఘోరకాండము విడిచెన్. 2118

క. విడుచుటయు రామబాణము, కడువడి నేతెంచి వాలికాయముమీఁదన్
బిడుగువలెఁ బడిన నాతఁడు, పుడమిపయిం బడియెఁ బ్రాణములు పోకుండన్.

క. అది గనుఁగొని తారయు నం, గదుఁడును నేతెంచి శీఘ్రగతి నచటికి లో
నొదవఁగ దుఃఖం బేడ్చిరి, ప్రదరక్షతుఁ డైనవాలిపైఁ బడి యంతన్. 2120

ఆ. ధనువు కేలఁ దాల్చి దరి నున్నరామునిఁ, గాంచి తార వగపు గదుర నిట్లు
లనియె రామ రఘుకులావనినాథులు, ధర్మరతులు శాస్త్రమర్మవిదులు. 2121

సీ. క్షత్త్రియధర్మంబు సమయంగఁ జేసిరె, యీరీతి మీపూర్వు లెవ్వ రేని
దుర మొనర్చుచు నుండ నిరువురు వారిలో,నొకనిఁగూల్చఁగ ధర్మ మొకో పరుండు
వైరంబు గలదె నావల్లభునకు నీకు, నేకాలమం దైన నెంచి చూడ
వానరమాంసంబు మానవుల కభోజ్య, మగుటను మాంసార్థి వనఁగ రాదు

గీ. నన్నుఁ గొన వాంఛ జనియించె నన్న యెడల, నేకపత్నీవ్రతస్థున కెగ్గు గాదె
యెన్నివిధములఁ జూచిన నీ వొనర్చి, నట్టిపని దూష్యముగఁ గనుపట్టుచుండె.

వ. రావణాపహృత యగుసీతామహాదేవి నొక్కదినంబునం దెచ్చి నీ కర్పింప సమర్థుండును మహాబలశాలియును బంచాశత్పరార్ధవానరభల్లూక సేనాధిపతియును శరణాగతరావణుండును నగువాలిని వధించి యల్పవీర్యుండును సప్త పరార్ధసేనాధిపతియును నగుసుగ్రీవునివలనఁ గార్యంబు సాధించుకొన నెంచిన నీరాజనీతియు నయుక్తంబుగాఁ దోఁచె. 2128

క. అని వచియించుటయును ని, ట్లనియెను రాఘవుఁడు తార యవినీతులఁదం
డనమును సుజనులరక్షణ, మును జేయందగినవిధులు భూమీంద్రులకున్. 2124
క. వాలి హరియించె ననుజుని, యాలిని రాజ్యమును దాన నస్మద్బాణ
జ్వాలల కాహుతి యయ్యెను, నేలాగున దోషి నైతి నెఱుఁగం జెపుమా. 2125
సీ. అనుటయుఁ దార యి ట్లనియె భూమీశ్వర, వినుము నే నొకమాట విన్నవింతు
మున్ను దుందుభితోడ మన్నాథుఁడు రణంబు, సలుపుచుండఁగ నొక్క బిలములోన
నొకయేఁడు గడచుటయును రామి నాతండు, సుగ్రీవుఁ డప్పు డాసుషిని మూసి
హరియించె నన్ను రాజ్యమును నాకతమున, దండింపఁ దగఁ డయ్యాతండు మొదటఁ
గీ. జెప్పు మనుటయు రాముండు చెలువ యెంత, కాల మయ్యెనో యాదుండగంబు జరిగి
తెలుపఁ గలవొకో యనుటయుఁ దేఱి చూచి, తార యారీతి ననియెఁ గంభీరముగను
వ. అఱువదివేలవత్సరంబులకుఁ బూర్వ మశీతితమవర్షంబున సుగ్రీవుండు రాజ్యంబును నన్నును నపహరించె నటుపయిని నొక్కవత్సరంబునకు నీతండ్రి దశరథుండు పట్టాభిషిక్తుం డగుచుండుదినంబున వాలి మరల రాజ్యంబును సుగ్రీవునిభార్య యగురుమను హరించి యపరాధి యగుసుగ్రీవుని వెడలంగొట్టె. 2127
గీ. అనుటయును రాముఁ డి ట్లనియెను లతాంగి, నీవు చెప్పినయది యెల్ల నిశ్చయంబ
కాని నాఁటివసుంధరాజాని చేయఁ, దగిన దది నేఁడు చేయంగఁ దగదు నాకు.
ఆ. అదియుఁ గాక వినుము ముదిత క్షత్రియునకు, మృగయ ధర్మ మగుట మృగము నేను
గొట్టినాఁడ నేల కొట్టితి వని నన్ను, నింద సేయఁ దగునె నీతివిదులు. 2129
క. అనుటయుఁ దారాసతి యా, తనిమాటకు నుత్తరంబుఁ దా నీయం జా
లనికతనఁ దత్పదములకు, నొనరిచి దండప్రణామ మూరక నిలిచెన్. 2130
సీ. అంతట వాలి యి ట్లనియె నంజలిఁ జేర్చి, కొని మస్తకమునందు వినయ మెసఁగ
రాఘవ నీవె నారాయణుండవు శంఖ, చక్రగదాపద్మశయుఁడ వీవ
నిన్నె తాపసులు ధ్యానింతు రొనర్తు ర, ధ్వరములు నీనిమిత్తంబ ద్విజులు
హవ్యకవ్యంబుల నారగింతువు నీవ, యాశ్రితముక్తిదాయకుఁడ వీవ
గీ. యట్టినీదర్శనంబు నా కంతకాల, మందుఁ బ్రాప్తించె నేఁ జేసినట్టియఘము
లన్నియును బోయె ధన్యుఁడ నైతి నేఁడు, బాధ పడఁజాలఁ దీయుమీ బాణ మింక.
చ. అనవుడు రామచంద్రుఁడు రయంబున బాణము లాగి వాలి కి
ట్లనియెఁ గపీంద్ర నీయభిమతార్థ మొసంగెదఁ గోరుకొమ్ము నాఁ
గను గపినాథుఁ డి ట్లనియెఁ గంజదళాయతనేత్ర నాపయిన్
గనికర మున్న నూర్ధ్వగతి గల్గఁగ నాకు ననుగ్రహింపవే. 2132
క. అని వేఁడుటయును నిచ్చితి, నని రాముఁడు పలుక విని మహానందమునన్
గనుఁగొనుచు రామచంద్రునిఁ, దనువు దొఱఁగి వాలి త్రిదశధామముఁ జేరెన్.

వ. అంతట రామచంద్రుండు సుగ్రీవుని రాజ్యాభిషిక్తుం గావించి సీతావృత్తాంతంబు నెఱుంగవలయు నని యాజ్ఞాపించుటయు సుగ్రీవుండు తదాజ్ఞను శిరంబునం దాల్చి పేరుం డగుసాంజనేయుని లంకాపురంబునకుం బనిచె. 2134

గీ. అంతహనుమంతుఁడుత్సాహమతిశయిల్ల, నంబుధినిదాఁటి తా నొక్కయంగలోనఁ జొచ్చి లంకాపురంబు నచ్చోట వెదకి, వెదకి తగుధామముల నెల్ల విసివి తుదకు.

క. స్మరియించుచు రాముని నెద, నరిగి యశోకవని కచట నసురవధూటీ పరిభర్త్స్యమాన యగుచుఁ, దురపిల్లుచు నున్న యొక్కతొయ్యలిఁ గాంచెన్.

క. కని యట్లు వాయుసుతుఁ డ, త్తనుగాత్రియె సీత యని యథావిధిగ మనం బున నిశ్చయించుకొని త, ద్దనుజాంగన లేఁగువఱకుఁ దా నుండె యటన్. 2137

గీ. అవల మెలమెల్లగను నామె సవిధమునకుఁ, జేరి నందన మొనరించి స్వీయగాథ యంతయును జెప్పి రామనామామృతంబుఁ, గుమ్మరించెఁ దదీయకర్ణమ్ములందు.

గీ. అంత నాసాధ్వి కపి చెప్పినట్టిమాట, లన్నియును విని విశ్వాస మంకురింపఁ దనమనోనిశ్చయముఁ దెల్పి తత్క్షణంబ, యరుగు మని దీవన లొసంగి యనిపె నతని.

గీ. అపుడుహనుమానుఁడుప్పొంగిహర్ష మునను, వెతికియావనమంతయుఁబిలుకుమార్చి యెదురుకొనినట్టియసురుల నెల్లలంక, యంతయును గాల్చి మరలఁ దా నబ్ధి దాఁటి.

క. అరుదెంచి రామభద్రుని, చరణంబుల కెఱఁగి యచటిసంగతులు సవి స్తరముగను వినిచె విస్మయ, శరణంబులు గాఁగ శ్రోతృజనహృదయంబుల్.

సీ. అంతట రాఘవుం డబ్ధితీరముఁ జేరి, వెనువెంట రాఁ గపివీరు లెల్ల నిరశనవ్రతమున నిష్ఠాగరిష్ఠుఁడై, నీలలోహితుని ధ్యానింపఁ దొడఁగెఁ దద్ధ్యానమునకు నెంతయు సంతసము నొంది, యంతకాంతకుఁడు ప్రత్యక్ష మయ్యె నపుడు రాఘవుఁడు తదద్భుతాకారంబు, వీక్షింపఁ జాలక వెఱపుఁ జెందె

గీ. నది గ్రహించి యుమాపతి యతని కొసఁగె, దివ్యచక్షువు దానిచేఁ దేఱి చూచి రామచంద్రుఁడు కోటిసూర్యప్రకాశ, మాన మగుశూలిరూపంబు మదిని బొంగి.

దండకము:- మహాదేవ దేవాదిదేవా మహారుద్ర పంచాననా వేదవేద్యా మహానాగ యజ్ఞోపవీతా విరూపాక్ష విశ్వేశ్వరా శంకరా నాగచర్మాంబరా భస్మలిప్తాంగ గౌరీమనోవల్లభా నందివాహా పినాకీ గిరీశా చిదానందరూపా శుభాకార బ్రహ్మాది బృందారకశ్రేణిసంసేవ్యమానాంఘ్రిపాథోజ నానాయుధా దక్షిణామూర్తి గంగాధరా వారణాసీపతీ శర్వ చక్రప్రదానాద్యనేకక్రియాతోషితోపేంద్ర శ్రీశైలవాసా శివా చంద్రమౌళీ మహాదైత్యసంహారకా దివ్యతేజోమయా సర్వశక్తీ యశేషజ్ఞ సర్వాత్మ భక్తేప్సితార్థప్రదా శూలపాణీ నమస్తే నమస్తే నమః. 2143

క. అని నుతియించుటయును సం, జనితమహాహ్లాదుఁ డగుచు శంకరుఁడు గనుం గొని రాముని రాఘవ నీ, యొనరించిననుతికిఁ దృప్తి నొదవెను నాకున్.

గీ. ఇచ్చెద వరమ్ము గోరుకొ మ్మేది యేని, యనుడు దేవ ప్రసన్నుఁడ వైతి వేని
వారిధిని దాఁటఁగను మేము వానరులును, గనికరింపు మటంచు రాఘవుఁడు వేఁడె.

క. అంతటఁ బినాకి సీతా, కాంతున కాత్మీయకార్ముకము నిడి రామా
చింతింపకు మిది నీపని, యంతయుఁ దీరుచును వైవ నంబుధిలోనన్. 2147

గీ. అని వచించి యంతర్ధాన మయ్యె నంత, రాముఁ డజగవమును సముద్రమున వైచె
నానకట్టగ నది నిల్చె నబ్ధినడుమఁ, గాంచువారల కెల్ల నక్కజము గాఁగ.

ఉ. అంతట దానిమీఁదఁ గపు లందఱతోడను నెక్కి మైథిలీ
కాంతుఁడు లక్ష్మణుండును సుఖంబుగ లంకకుఁ జేరి యాత్మవి
క్రాంతి బయల్పడంగ నగరం బరికట్టిరి దైత్యు లెల్ల వి
భ్రాంతిని జెంది దిక్కులకుఁ బాఱుచు నుండఁగఁ బ్రాణభీతిచేన్. 2148

చ. అది గని రావణాసురుఁ డహంకృతి మీఱఁగ నెల్లదైత్యులన్
జెదరక నిల్వఁగా ముదల చేసి బలోద్ధతు లైనదైత్యులన్
గదనము సేయఁ బంచుటయుఁ గార్ముకబాణకృపాణపాణు లై
సదమదముం బొనర్పఁగను సాగిరి వానరులన్ నిశాచరుల్. 2149.

క. ఆరాక్షసకృత్యములకు, భీరువు లై పోక నిలిచి పృథ్వీధరముల్
భూరుహములుఁ బెఱికి నిశా, చారులపైఁ గపులు కురియసాగిరి పెలుచన్.

ఆ. అట్లు ఘోరయుద్ధ మగుచుండఁ గపులకు, నసురులకును రావణాసురుండు
పనిచె నింద్రజితుని బవరంబు సేయంగ, నంత నతఁడు వచ్చి యాగ్రహమున.

క. బాణంబులు గురియుచును గృ, పాణంబులచేతఁ బ్లవగబలముల నెల్లన్
శ్రేణులుగ నఱికి వైచుచు, శోణితపానం బొనర్చుచున్ విహరించెన్. 2152

క. ఆతనివీరవిహారము, చేతఁ బ్లవగసేన లెల్లఁ జెల్లాచెద రై
భీతిల్లి పఱచెఁ గగనము, దైతేయబలజయనాదదారిత మయ్యెన్. 2153

శా. అంతన్ లక్ష్మణుఁ డుగ్రుడై ప్రళయకాలాకారంబుం దాల్చి ది
గ్దంతుల్ దిగ్గన బెగ్గడిల్లఁగను టంకారంబు గావించి య
త్యంతప్రౌఢిని గార్ముకంబునను సంధానించి నారాచముల్
దొంతుల్ దొంతులు గాఁగ నింద్రజిపయిన్ దూఁకించె నొక్కుమ్మడిన్. 2154

క. ఆలక్ష్మణనిశితాశుగ, జాలంబునఁ జిక్కి కదలఁ జాలక నేలన్
గూలి తటాలున నింద్రజి, కాలవశుం డయ్యె విధిని గడవం దరమే. 2155

క. ఆయింద్రజి మడియఁగ నతి, కాయమహాకాయు లనెడిక్రవ్యాదులు నా
గాయుతబలు లరుదెంచి వి, హాయస మగలంగ నార్చి యత్యుద్ధతిచేన్. 2156

క. భక్షించుచు వానరులను, వీక్షించుచు దెసలు వికృతదృష్టులతోడన్
లక్షించి లక్ష్మణునిఁ బ్రథ, నక్షోణితలంబునం దొనర్చిరి విహృతిన్. 2157

ఆ. అట్లు విహృతి సేయునన్నిశాచరులను, మాప లక్ష్మణుండు మదిఁ దలంచి
చాపమందు నిశితసాయకంబులఁ గూర్చి, యేసె వారిమెడలు చేసి గుఱిగ. 2158

క. ఏయుటయును నాబాణము, లాయసురులకంఠసీమలందుం బడి యా
రాయిడికిం బొడి పొడి యై, పోయెను వైరులకు దిగులు పుట్టఁగ నెదలన్. 2159

మ. అపు డాదైత్యులు నవ్వుచున్ గపుల నాహారించుచున్ లక్ష్మణుం
డిపు డెం దేఁగునొ చూచువార మని యుద్వీక్షించుచున్ స్వేచ్ఛమై
నపలాపంబులు వల్కుచున్ భయము లే కావంతయున్ దుర్మద
ద్విపముల్వోలె నిరంకుశం బగుగతిన్ విచ్చేయుచుండన్ నడిన్. 2160

మ. హనుమంతుండును జాంబవంతుఁడును నడ్డై వారికిన్ నిల్వ నా
దనుజుల్ వారలఁ బట్టి మ్రింగఁ గడఁగన్ దా మేచి మి న్నంటఁగా
వినిబద్ధాంగులఁ జేసి వాలములచే విక్రాంతి దీపింప వా
రిని గొంపోయి రఘుప్రవీరపదనీరేజంబులన్ వైచినన్. 2161

గీ. దాశరథి వారలం గాంచి దైత్యులార, రణము సేయంగ మాతోడ రావణుండు
తలఁచు చున్నాఁడొ లేక సీతనొసంగి, శరణుచొచ్చునొ చెప్పుఁడుసంశయములేక

క. అని యడుగుటయును వా రి, ట్లనిరి నరాధిప వచింతు మాలింపుము మా
మనుజాశనాధినాథుం, డనుపమబలుఁ డఖిలజగము లతనికి వశముల్. 2163

సీ. తిరుగుదు రతనిమందిరముచుట్టును దివా, కరవిధుల్ కావలికాండ్రువోలె
నుదకలోపంబు లేకుండ నాతనియింటఁ, బరిచర్య యొనరించుఁ బాశపాణి
యతఁడు పరుండుశయ్యాతలంబును జక్క, దిద్దుచు నుండును దేవభర్త
యత్యుష్ణమును గాక యతిశీతమును గాక, తాఁకుచుండును వానితనువు గాలి

గీ. పరులమాటలు వేర్వేరఁ బలుక నేల, యమరు లెల్లను బడియుందు రాసురారి
వాకిటను బడిగాపు లై వానిశక్తి, యిట్టి దని చెప్ప శక్యంబె యెవరి కేని.

వ. ఇంక నీప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరముం జెప్పెదము. వినుము. మహాబలశాలి యును దర్శనాదర్శనాయోధనప్రవీణుండును యోధాగ్రేసరుండును నగువిద్యున్మాలి వానరసైన్యంబు నెల్ల సంహరించుటకును నతికాయమహాకాయుల మగుమే మిరువురమును మీయిరువురతోడఁ బ్రధనంబు గావించుటకును దాను బుష్పకంబు నెక్కి కుంభకర్ణాదిమహావీరులతోడం గూడి వచ్చి నిన్నుం బట్టి కొని కట్టివైచి సీతాసాన్నిధ్యంబునకుం గొనిపోయి యామెకట్టెదుట వధియించుటకును మాప్రభుండు నిర్ణయించుకొని యున్నవాఁడు. 2165

గీ. పట్టువడితిమి నేఁడు మాప్రభునినిర్ణ, యంబు నీకు నెఱింగింప నంతె కాని
లేనియెడఁ బట్టువడుదుమె వానరులకు, జగము లన్నియుఁ గబళింపఁ జాలుమేము.

క. అని పలుకుటయును గ్రోధం, బున సుగ్రీవుండు లేచి భూమీశ్వర యీ
దనుజాధములను సైఁపం, జన దాజ్ఞ యొసంగు మిపుడె సమయింపంగన్.

క. అని విన్నప మొనరించుట, యును రాఘుఁడు నవ్వి వారి కొసఁగి వసనముల్
కనకాభరణములును బొం, దని పలుకుడుఁ గపులు విడిచి రాదానవులన్.

సీ. అంతట నాదైత్యు లాహ్లాదమును జెంది, ప్రణమిల్లి రామునిపాదములకు
నధిప లంకాద్వారమం దుండెఁ బంచవ, క్త్రంబులు గలిగినదారు వొండు
దాని నేకప్రయత్నమున నొక్కమ్ముచేఁ, బంచఖండములు గావించువాఁడు
వధియింపఁగలఁడు రావణుని నంచు లిఖింపఁ, బడియె నచ్చట శుక్రభాషితంబు

గీ. కాన నీ వట్లు ఖండించి తేని దానిఁ, జావఁగఁగలండు నీచేత రావణుండు
నాఁగ రాముఁడు వింట బాణంబు గూర్చి, క్షణములో దాని నేనుముక్కలుగఁగొట్టె

గీ. అంత నాదానవులు రావణాంతకుండు, రాఘవుఁడె యంచు నెదల నిర్ధారణంబు
చేసికొని రామచంద్ర రక్షింపవలయు, నస్మదర్భకులను నీవె యనుచు వేఁడి.

క. కొని యభయహస్తమును రా, మునివలనను దిరిగివచ్చి మునుపటిచందం
బున నె తొడంగిరి యాయో, ధనమునకుం బ్రభునియాన దాఁటఁగ రామిన్. 2171

గీ. అంత వానరు లుత్సాహ మతిశయిల్ల
నఖములును వాలములును దంతములు గిరులు
భూరుహములును నాయుధంబులుగఁ జేసి
దారుణరణంబుఁ దెగటార్చి దానవులను.

గీ. నేలమట్టంబుగను జేసి సాలములను, మేడలను గూల్చి మిద్దెలు పాడుచేసి
గోపురంబులు పడఁగొట్టి కూలఁద్రోసి, చప్పరములను నిండ్లకు నిప్పు వెట్టి. 2173

క. ఏపారఁగ భుజబల ము, ద్దీపింపఁగఁ గ్రోధవహ్ని తిరుగఁ దొడఁగి రా
టోపంబున నెల్లెడ లం, కాపుర మంయుతను నల్లకల్లోలము గాన్. 2174

ఉ. అంతట రావణాసురుఁడు హస్తములందు ధరించి చాపముల్
కుంతములున్ శరంబులును గొల్లలు గా వడి నేఁగుదెంచి వి
క్రాంతి బయల్పడంగఁ బ్లవగంబుల రూపఱఁ జేసి వానరా
భ్యంతరశూన్యుఁ డై కదలి యచ్చటనుండి జవంబు మీఱఁగన్. 2175

క. అరుదెంచి కొంతదూరము, పరసేనలఁ జూచి డీలుపడనిధృతిన్ దా
శరథిని గుఱిచేసి మహో, శరపంచక మేసె దెసలు జ్వాలల వెలుఁగన్. 2176

క. ఆశరములఁ దునిమి వడిన్, దాశరథి నిజైకశరమునను బావకసం
కాశము లగుపదితూఁపుల, నాశరపతిమీఁద నేసె నాగ్రహ మెసఁగన్. 2177

క. ఆశరదశకము వీరా, వేశంబునఁ ద్రుంచి మూఁడు విశిఖంబులచే
నాశరనాథుం డిరువది, యాశుగముల నేసె దశరథాత్మజుమీఁదన్. 2178

క. ఆయమ్ములు రాఘవుఁ డోక, సాయకమునఁ దునిమి తీక్ష్ణశర మొక్కఁడు పై
నేయంగ రావణుఁడు త, త్సాయకఘాతమున కోర్వఁ జాలక పఱచెన్.

ఆ. అట్లు పఱచి దానవాధీశ్వరుఁడు తన, భవనమునకుఁ జేరి పొవులు చుండ
నట్టితఱి విభీషణాభిధానుం డగు, ననుజుఁ డేఁగుదెంచి యతనిదరికి. 2180

ఆ. ప్రణతిఁ జేసి నిలువఁబడి యుండ రావణుఁ, డతని నెదుటఁ జూచి యనుజ యింక
నాజి యెట్లు జరుగననునొ యాలోచించి, చెప్పఁ దగినత్రోవ చెప్పు మనియె.

క. అనవుడు విభీషణుం డి, ట్లనియె నధిప నీ వెఱుంగనట్టిది యెవ్వం
డును జెప్పఁ జాలఁ డైనను, విని చెద నీయాజ్ఞ కేను వినిబద్ధుఁడ నై. 2182

క. తనబలమును బరునిబలం, బును నెఱిఁగి నిజాధికత్వమున నిర్ణయముం
బొనరించుకొని యొనర్పం, జను రణ మటు గానియెడ వినాశం బొదవున్.

ఆ. కాన నిద్ది సంధికాలంబు విను సమ, యంబు గాదు నీకు నని యొనర్పఁ
బరునిబలము చూడఁ బ్రబలంబు సోదర్య, నీబలంబు చూడ నిర్బలంబు. 2184

క. హతుఁ డయ్యె నింద్రజిత్తుఁడు, హతమాయెను లంక శూరు లగుక్రవ్యాదుల్
హతు లైరి యేకబాణా, హతి కోడి పలాయితుండ వైతివి నీవున్. 2185

గీ. ఎఱుఁగుదువు వాలిసామర్థ్య మీవు మున్నె, యట్టివాలిని నొకకోల నిట్టె చంపె
మనపురద్వారదారువు తునుఁగఁ గొట్టె, రాముఁ డన నెట్టిఁడో యెఱుంగ రాదె నీకు.

గీ. నాశ మొందిరి నీకారణమునఁ బెక్కు, మంది రక్కసు లింకను మ్రందఁగలరు
లంకలో నున్నవా రెల్ల నింక నైన, మాధ్యమును వీడి మనుము నామాట వినుము.

క. సీతారూపముఁ దాలిచి, యేతెంచెను నిన్ను డంప మృత్యువు తద్వి
జ్ఞాత నయి యిప్పు డైనను, నాతల్లిని విడువు మసువు లాసించినచోన్. 2188

ఆ. బ్రదుకు మీవు మమ్ము బ్రదికింపు మెల్లర, రాజ్య మేలుకొనుము పూజ్యముగను
శరణు వొచ్చినట్టిశత్రువు నైనను, రక్షణం బొనర్చు రాఘవుండు. 2189

క. ఒకమాట వినుము ధర్మమె, సుకమును గలిగించు నెందుఁ జూచిన సార్వ
త్రికసిద్ధాంతం బిది యది, యొకఁ డెడసిన దుఃఖదముల యున్నవి యెల్లన్.

క. పరనారీకామనయును, బరధనహరణమును జెప్పఁబడియెను ధర్మే
తరములుగ నవి విషాదము, నరకమును ఘటించి సర్వనాశము చేయున్. 2191

గీ. అన్న దుర్గంధదూషితం బైనమేని, పయి విరక్తి ఘటిల్లినపక్షమందు
నీవు చేసినపని యెల్ల నిష్ఫలంబ, కాక రక్తి ఘటిల్లినఁ గలుగు హాని. 2192

క. నీ వొనరించినపని దుః, ఖావహ మైనది యధర్మ మగుహేతువునన్
గావున నేగతిఁ జూచిన, రావణ దైవంబు నీకుఁ బ్రతికూల మగున్. 2193

ఆ. ఇవియ కాక మఱియు నెన్నేని క్లేశముల్, సంభవించు నీవు సలిపినట్టి
కార్యమునను గాన గమనించి సర్వంబు, మొదటఁ బ్రధనవాంఛ వదలికొనుము.

గీ. పిదప మన మెల్లరముఁ గూడి కదలిపోయి, రామునకు మైథిలిని సమర్పణముచేసి
శరణుచొచ్చినఁ బ్రోచు నిస్సంశయముగ, దాశరథి ప్రాణమానముల్ దక్కు మనకు.
క. అని చెప్పి యూరకుంటయు, విని సర్వము రావణుండు వీరావేశం
బున నిట్లు లనియె దుర్మతి, యనఁ గూడనిమాట లాడ నర్హమె నీకున్. 2196
గీ. పుట్టితివె కాని యేపుణ్యముననొ పుణ్య, జనకులంబునఁ గావు రాక్షసుఁడ వీవు
శరణుచొత్తువె హీనుఁడ చావరాదె, యెఱుఁగుదువె శూరధర్మంబు లెప్పు డేని.
క. పరధనమును బరసతులను, బరరాజ్యములను హరించుపని శూరాగ్రే
సరు లగువారికి ధర్మము, శరణనుటయె తగవు త్వాదృశక్లీబులకున్. 2198
క. నీ వింక నుండఁ దగ వీ, తావున నని యెగసి కాలఁ దన్నుడుఁ జనియెన్
గేవలసత్త్వగుణాశ్రిత, భావుండై యతఁడు రామభద్రునికడకున్. 2199
శా. అంతన్ రావణుఁ డస్త్రశస్త్రము లసంఖ్యాకంబుగాఁ బూని ని
ర్జింతున్ మానవులన్ వధింతుఁ గపులన్ శిక్షింతు నాదిత్యులన్
బంతంబుం గొని నేఁడె ముజ్జగములన్ భస్మంబు గావింతు నా
చెంతన్ నిల్చెడివాఁ డెవం డనుచు విచ్చేసెన్ స్వసైన్యంబుతోన్. 2200
ఆ. వచ్చి యట్లు శస్త్రవర్షంబు గురియించి, వానరులను నేల వ్రాలఁ జేయ
నపుడు లక్ష్మణుండు యాతుధానబలంబు, నెల్లఁ గోల లేసి డిల్లపఱిచె. 2201
క. అప్పుడు రావణుఁ డార్చుచు, ముప్పిరిగొనుకోపమునను మునుఁగ శరంబుల్
గుప్పించె లక్ష్మణునిపై, నొప్పి గలిగి దాన లక్ష్మణుఁడు మూర్ఛిల్లెన్. 2202
క. రావణుఁ డదె సమయం బని, కావరమున రేఁగి సాయకములను రామ
క్ష్మావరునిపైనిఁ గురిసెను, దేవతలకుఁ గూడ గుండె దిగ్గురనంగన్. 2203
ఆ. అపుడు రామచంద్రుఁ డాహవభీముఁడై, వానిమీఁద బాణవర్షములను
గురిసి కురిసి రుధిరకూలంకషలు వాఱఁ, జావ కునికి వాఁడు సంశయించి. 2204
క. తన కేమియుఁ దోఁపమిచేఁ, గనుఁగొనియె విభీషణుని మొగంబును నతఁ డా
యనభావ మెఱిఁగి సూచిం, చెను రావణుఁ డంత మొందుచిహ్నపదంబున్.
చ. అది గ్రహియించి రాముఁడు శితాశుగ మొక్కఁడు గూర్చి వింటఁ ద
త్పదమును గొట్టె వెంటనె పదంపడి నేలను గూలి ప్రాణముల్
వదలెను రావణుండు త్రిదివంబుననుండి సురల్ ప్రసూనముల్
వదలిరి దుందుభుల్ మొరసె లాస్యము లాడఁ దొడంగి రచ్చరల్. 2206
గీ. అంత హతశేషులైనట్టియసురు లెల్ల, జని రయంబునఁ గుంభకర్ణునకుఁ దెలుప
నఖిలవృత్తాంతమును నాతఁ డపుడు లేచి, నిదురకన్నులతోడను గదను బట్టి.
క. తూలుచు వ్రాలుచుఁ బ్రేలుచు, నాలంబున దొరకినట్టిప్రాణుల నెల్లన్
గూలుచుచు రామచంద్రుని, పాలంబడి కట్టకడకుఁ బ్రాణము లుడిగెన్. 2208

గీ. అపుడు భూభారము తొలంగె ననుచు సాధు,బృంద మెల్లను నానంద మొందుచుండ
సకలనిర్జరసందోహసహితుఁ డగుచు, దాశరథి కీశ్వరుండు ప్రత్యక్ష మయ్యె.

ఉ. రాముఁడు చూచి కట్టెదుట రాజకిరీటుని భక్తి చిత్తముం
దామతిలంగ మ్రొక్కి చరితార్థుఁడ నైతిని గాంచఁ గల్గుటన్
స్వామిని నేఁడు నాశ్రమము సర్వము సార్థక మయ్యె నింక నా
కేమి కొఱంత యంచు నుతియించుచు నుండ శివుండు హృష్టుఁడై. 2210

గీ. రామ యీఘోరరణమందుఁ బ్రాణములను
విడిచియును మూర్ఛ చెందియు వివిధబాధ
లొందియును నున్నవారి కందఱకును
నాయురారోగ్యసంపద లలరుఁగాత. 2211

క. అని మఱుఁగుపడుటయును రా, మునిబలఁగము నిద్రనుండి ముక్తం బయి మే
ల్కొనినట్లు లేచి వందన, మొనరించెను రామపదపయోజంబులకున్. 2212

ఆ. అంత నగ్నిశుద్ధ యైన సీత యరుదెంచి, పులక లంగములను బొడమ చుండ
నావరింపఁ గనుల హర్షబాష్పంబులు, పడియె నాత్మధవునిపదములందు. 2213

గీ. జడలుగట్టినతలయును సన్నగిలిన, యంగమును మాసిపోయినయంశుకమును
దనమది కపారమగువిషాదమునుగొలుప, నపుడు రాముఁడు నిశ్చేష్టుఁడగుచు నిలిచె.

క. అటు లుండి కొంత సేపున, కెటులో తెలివి రాఁగ నామె నెత్తి కరములన్
గటకటఁబడునాసతియా, రట ముడుగఁగ ననునయించి రాఘవుఁ డంతన్. 2215

వ. రావణకుంభకర్ణాదిరాక్షసుల కెల్ల యథావిధి విభీషణునిచే శ్రాద్ధక్రియలు నిర్వర్తింపంజేసి యచ్చట రావణునిపేర నీశ్వరాలయంబుం బ్రతిష్ఠించి విభీషణుని లంకారాజ్యంబునకుఁ బట్టభద్రునిం గావించి పుష్పకవిమానంబు నధిష్ఠించి సపరివారంబుగా జలనిధిం దాఁటి తత్తటంబున శివప్రతిష్ఠ గావించి బ్రహ్మాదిదేవతాబృందంబులు గొనియాడ మునిజనాశీర్వాదంబులం బడసి యయోధ్యాపురంబునం బ్రవేశించె. 2216

గీ. అట్లు చేరి యయోధ్యకు నఖిలజనులు, హర్షమును జెంద రాఘవుఁ డందఱకును
దగినరీతి నొనర్చి సత్కారములను, ముక్తజటుఁ డయి రాజ్యాభిషిక్తుఁ డయ్యె.

సీ. ఆసమయంబున నమరు లెల్లరు లేచి, బాహువు లెత్తి యుత్సాహ మొదవ
రాఘవ భవదనుగ్రహమున స్థాపింపఁ, బడితిమి మేము మాపదవులందు
శిష్టరక్షణదుష్టశిక్షణంబులు సేయ, నవతరించినరమాధవుఁడ వీవు
సకలసంక్షోభకారకుఁ డైనరావణుం, జెడయుట భువనంబు లెల్ల నిలిచె

గీ. నాదిలక్ష్మి భవత్పత్ని యైనసీత, యీమెతోఁ గూడి రాజ్యంబు నేలుకొనుము
కురియు వానలు ముక్కారు ధరణి పండ, ధర్మదేవత నాల్గుపాదముల నడవ.

క. అని వచియించి ప్రమోదం, బెనయఁగఁ ద్రిదశాలయమున కేఁగిరి యంతన్
మును లెల్ల స్వాశ్రమములకుఁ, జన నెంచి వచింప రామచంద్రునియెద్దన్.
ఆ. రాముఁ డిట్లు లనియె బ్రాహ్మణులు ప్రసన్ను, లైన సుప్రసన్నుఁ డగు శివుండు
దాన శ్రేయ మొదవుఁ గాన నాతిథ్యము, స్వీకరించి చనుఁడు విప్రులార. 2220
క. అనవుడుఁ దత్ప్రార్థనమును, మునివరు లంగీకరించి ముద మొదవఁగఁ గై
కొని రామునియాతిథ్యము, చనిరి నిజాశ్రమములకుఁ బ్రసన్నహృదయు లై.
ఆ. అంత రామచంద్రుఁ డఖిలవర్ణాశ్రమా, చారధర్మములను శాశ్వతముగ
నడుపుచును నశేషనరలోకమును దన్నుఁ, బొగడ నేలఁదొడఁగెఁ బుడమి నెల్ల.
గీ. ఈయుపాఖ్యానమును నెవ్వఁ డేని వినినఁ,దలఁచినను బాతకము లెల్లఁ దొలఁగిపోయి
యెన్నఁటికిఁ గూడ దౌర్గత్య మొనయకుండఁ,బడయఁగల్గును శాశ్వతబ్రహ్మపదము.
క. అని చెప్పి యూరకుంటయు, విని సర్వము రాఘవుండు విస్మయ మొదవం
గను మదిని గాంచి శంభుని, వనయము నాయదియ సైఁపు మని ప్రార్థించెన్.
ఆ. అపుడు శంభుఁ డేమి యపరాధ మున్నది, యిందు నీది సర్వ మెఱిఁగినట్టి
వాఁ డెవండు గలఁడు వసుధలోనఁ బ్రమాద, మందఁజకును నుండు నవిదితమున.
క. అని యనునయింప రాముఁడు, మనమున సంశయము నుడిగి మహనీయ గతిం
చినకల్పము లెన్నియొ పో, యినరాములసంఖ్య యెంతొ యెఱుఁగం జెపుమా.
గీ. అనుటయును రామచంద్ర బ్రహ్మాదులకును, నలవి గా దది చెప్పంగ నడుగ రాదు
కల్పము లసంఖ్యములు తత్ప్రకారముననె, రాములునుగూడనని చెప్పెబ్రాహ్మణుండు.
గీ. అంతఁ దద్వాక్యమునఁ గలయర్థ మెల్లఁ, దెలిసికొని రాఘవుండు ధాత్రీసుపర్వ
చెప్పు మిఁక నన్నదానంబుచేతఁ గలుగు,నట్టిఫల మేమొ నా శంభుఁ డిట్లు లనియె.

—: అన్నదానమాహాత్మ్యకథనము :—

గీ. కలఁడు ధాత్రిని మున్ను మంకణుఁడు నాఁగ, నొక్క బ్రహ్మర్షి సకలగుణోత్తరుండు
వాని కొకపుత్త్రుఁడు గలండు మాననీయ,కార్యనిష్ఠాగరిష్ఠుఁ డాకథుఁడు నాఁగ.
క. ఆయనకు సుశోభన యను, జాయ గల దొకర్తు వారు సంసారంబున్
జేయఁ దొడంగిరి తృప్తి, న్యాయంబులు రెండె సాధనంబులు గాఁగన్. 2230
క. న్యాయేతరమార్గంబున, నాయాతం బైనమేరు వైనను వారల్
చే మెత్తి ముట్ట రెట్టియు, పాయము చేకూరనున్న నర్థము లేమిన్. 2231
ఆ. ప్రాప్త మైనదానఁ బరితుష్టి నొందుదు, రంతె కాని వార లల్ప మనుచుఁ
గంటకించుకొనరు కల సైనను గపోత, వృత్తి మనుచు తమ కభీష్ట మగుట.
ఆ. అట్టు లుండ వా రొకప్పుడు న్యాయాగ, తాన్న మొదవ కునికి నైదునాళ్లు
లనశనముగఁ గడపి యాఱవదినమున, నించుకంత యన్న మెట్లొ దొరక.

క. పోయెడియసువులు నిలుపుట, న్యాయం బని తలఁచి మనకు నళినభవుఁడు నేఁ
డీయన్న మిచ్చె బ్రతికితి, మీయెడరు తొలంగె ననుచు నేకటపడుచుఁ౼.

వ. పురఃకృత్యంబు సత్వరంబుగాఁ జేయం దలంచికొని. 2235

సీ. ఒనరించి దేవతార్చన మాకథుఁడు తద, న్నము చేసె రెండుభాగములు గాఁగ
నంతటఁ బాత్రంబు నాసాదనము చేసి, తత్కాంత వడ్డించి దాన సగము
నారగింపుము నాథ యను చుండ వాకిట, వినవచ్చె నాతిథ్య మనెడికేక
యపు డాకథుఁడు లేచి యరిగి ద్వారముకడ, నారటపడునొక్కయతినిఁ జూచి

గీ. వందనము చేసి తోడ్కొనివచ్చి కూరు,చుండఁగాఁ బెట్టి తనపాత్ర యున్న చోట
నమృత మ స్తని పోసె నాపోశనంబు, నమ్మహాత్మునిహ స్తపద్మమ్ములోన. 2236

గీ. అప్పు డది పుచ్చుకొని మాని హర్ష మొదవ, నారగించి తదన్నంబు నాకథునకుఁ
జలిపి యాశీర్వచనమును జనియె నంత, దంపతులు సంతసము నొందుతరుణమంద.

ఆ. అంగవికలుఁ డయ్యు నత్యంత తేజంబు, గ్రాలుచుండునొక్కబ్రాహ్మణుండు
వచ్చి యటకు విప్రవరుఁడను నాఁకలి, గొన్నవాఁడ ననుచు నన్న మడిగె. 2238

సీ. అది విని యాకథుం డాతఁణంబున నేఁగి, యింటిలోనికిఁ దనయింతిఁ జూచి
సాధ్వి నేఁడు మ త్తొక్కత్మాసురుం డేతెంచె, హరివోలె మనయింటి కతిథి గాఁగ
నతనికిఁ బెట్టి నీయన్నంబులో సగం, బర్ధ మీవు భుజింపు మసువు లుండ
ననుటయు నాసుశోభన యాకథునిఁ జూచి, ప్రాణవల్లభ యిట్లు పలుక నగునె

గీ. ప్రాణములు శాశ్వతంబులె పరమబంధు, వైనయతిథిని నిజదైవ మైనపతిని
విడిచి మెసవుట ధర్మమె వెలఁది కీవు, నతిథియును నారగింపుఁ డీయన్న మిపుడె.

గీ. ప్రాణములు నిల్చు నాయు వున్నంతవఱకుఁ
బ్రాణములు పోవు ననియెడిభయము వలదు
ప్రాణములు పోవు నని యధర్మంబు సేయఁ
బాలుపడుదురె యెంతనిర్భాగ్యులైన. 2240

క. అన్నమె ప్రాణికిఁ బ్రాణము, లన్నప్రదులైనవారు ప్రాణప్రదు లా
యన్నమువలననె భూతము, లన్నియుఁ బుట్టుటయు వృద్ధి నందుటయు నగుఁ౼.

గీ. క్షణిక మగుజీవితమున నార్జనము సేయఁ,దగినయది యొక్కయన్నప్రదానఫలమె
యట్టిఫలమును నార్జింపనట్టివారి, జన్మ మంతయుఁ గూడ నిష్ఫలమ చూవె.

గీ. కావుననె యన్నదానంబుకంటె నధిక, మైనదానంబు లే దందు రార్యు లెల్ల
నట్టియన్నంబుఁ బెట్టుభాగ్యంబు నాకు, నీవు గాకున్న నాథ వే ఱెవ్వఁ డిచ్చు.

క. సతులును సుతులును హితులును, బతులును గల రెంతమందొ బంధువులందుఁ౼
మృతులైనవారలకు స, ద్గతి నిచ్చెడిబంధు వెవఁడు తర్కింపంగఁ౼. 2244

గీ. తాను జేసినధర్మంబె తన్నుఁ గావ, వలయుఁ గాని మ ఱొక్కఁ డెవ్వఁడును రాఁడు
కంఠమునఁ జుట్టి పాశంబుఁ గాలభటులు, కనికరము లేక లాగెడికాలమందు.

క. అనుటయును నాకథుం డి, ట్లనియెను సతి నీవు పలికినట్టిపలుకు లొ
ప్పనివారు గలరె యన్నము, చన దేను భుజింప నతిథి సాపడుదాఁక౯. 2246

గీ. అన్న మంతయు వడ్డింపు మతిథి కదియె, మనకు ధర్మము నాఁగ నవ్వనరుహాక్షి
యట్ల కావింతు రావింపు మతిథి ననుడు, నతఁడు రావించె లోని కయ్యతిథి నంత.

ఆ. ఆమె పీఁట వైచి యందుఁ గూర్చుండఁ బ్రా, ర్థించుటయును నతిథి తేటి చూచి
యతిథి కన్నమిడెడిహర్షంబు తులకించు, నామె మోముఁ బ్రముదితాత్మఁ డగుచు.

గీ. అందుఁ గూర్చుండుటయు నామె యతని ముందుఁ, బాత్రయాసాదనము సేసి పాత్రలోన
నన్న మంతయు వడ్డించి యారగింపఁ, బ్రార్థన యొనర్చె నంత నాబ్రాహ్మణుండు.

క. ఆవిప్రదంపతులన, ద్భావంబున కెంత యేని ప్రమదం బొదవ౯
గైవల్యము గరబదరం, బై వారికి నెలయఁ జేయ హరుఁ డై నిలిచె౯. 2250

ఆ. అపుడు వారు చూచి యహిభూషణములను, వృషభవాహనమును నిందుకళను
నర్ధదేహకాంత నమరస్రవంతిని, మృడుఁడె యనుచు నిశ్చయించి యెదల.

శా. సాష్టాంగంబుగ మ్రొక్కి ధూర్జటికి దేవా మాయ శేషాఘముల్
నష్టిం జెందెను మాయభీష్టములు చెందం గల్గె సాఫల్యము౯
దుష్టిం బొందెను మామనంబులు సముద్ద్యోతించె మాపుణ్యము
త్కృష్టం బయ్యెను మాకులంబులును నిన్నీక్షింపఁగాఁ గల్గుట౯. 2252

క. అని నుతియించుచు నిలుచుట, యును వినయంబునను జేతు లొగ్గి శివుం డి
ట్లనియెను మీధర్మంబున, కెనసితి సంతుష్టి కోరుఁ డిచ్చెద వరము౯. 2253

క. అనవుడు దేవ భవత్పద, వనజంబులమీఁద భక్తి వదలక యుండం
గను మా కనుగ్రహింపుము, కనికరమున ననుచు వారు కాంక్షించుటయు౯.

వ. మహేశ్వరుండు వారి కభీష్టార్థసిద్ధి యగునట్లు వరం బొసంగి యంతర్ధానంబు నొందె. 2255

—: పురాణశ్రవణాదిమాహాత్మ్య కథనము :—

సీ. అని వచించుటయును నినకులాంబుధిసోముఁ, డాశ్చర్య మొందుచు నాత్మలోనఁ
గనుఁగొనుచుండ నాకాశంబు నచ్చోట, నొకకొంద ఱతితేజ ముట్టిపడఁగ
దివ్యవిమానసంస్థితు లయి కనఁబడి, రది తన కద్భుతం బొదవఁ జేయ
బ్రాహ్మణోత్తమ నభోభాగంబునం దుండు, వా రెవ్వరో వచింప వలయు ననె

గీ. ననుటయును గాంచి వారల నవనిసురుఁడు
తెలిసికొని యోగదృష్టిఁ దద్విషయ మెల్ల.

నధిప వీ రెల్లరును గృహస్థాశ్రమస్థు
లైన బ్రాహ్మణు లిల నుండినట్టివార. 2256

సీ. వీరికి ము న్నగ్రహారంబు లొకకొన్ని, దయచేసె మీతండ్రి దశరథుండు
దానిచే నొదవఁ జిత్తములకు విశ్రాంతి, యాచరించిరి తపం బధికముగను
దత్తపోబలమహత్త్వంబున ననితర, ప్రాప్య మైనట్టిపుణ్యంబు గలిగె
దాన నసామాన్య మైన తేజం బొందు, మెఱయంగఁ దొడఁగెను మేనులందు

గీ. దానివలనను దమపుణ్యదర్శనంబు, నొసఁగుచును సర్వజనముల నుద్ధరింప
వలయు ననియెడిభావంబు గలిగి వీర, లందఱును గూడ నొకదినమందుఁ గూడి.

గీ. చని వసిష్ఠమహామునిసవిధమునకుఁ, దెలిపిరి నిజాశయంబులు దేటపడఁగ
నంతట వసిష్ఠుఁ డది యెల్ల నాలకించి, యంగిరోమునికడకు మీ రరుగుఁ డనియె.

ఉ. అంతట వీర లెల్లరుఁ దదాజ్ఞను గైకొని యంగిరోమునీం
ద్రాంతికసీమకుం జని నిజాశయముల్ వచియింప నాతఁ డ
త్యంతముదంబు నొంది ద్విజులార పురాణము నాలకించినన్
జింతితకార్యసిద్ధి యగు శీఘ్రముగన్ బహుళోక్తు లేటికిన్. 2259

గీ. వినఁగను బురాణములను నెవ్వనికి మదిని, శ్రద్ధ గలుగునొ సకలతీర్థములలోన
స్నానమొనరించినట్టిపుణ్యంబుకంటె, ద్విగుణ మగుపుణ్యమును జెందితీఱు వాఁడు.

క. హత మగును గోటిజన్మా, ర్జిత మగుపాపము పురాణసేవాపుణ్యా
ర్జితమాహాత్మ్యమున సదా, గతితాడిత మైనవృక్షకాండము వోలెన్. 2261

గీ. ధనము గోరినవారికి ధనము గలుగు, విద్య గోరినవారికి విద్య గలుగు
ముక్తి గోరినవారికి ముక్తి గలుగు, సర్వము పురాణసేవచే సంఘటిల్లు. 2262

గీ. అనుటయును విప్రవర్యు లి ట్లనిరి దేవ
యేపురాణంబొ యయ్యది యెఱుఁగఁ జెపుమ
యని యడుగుటయు నంగిరోమునివరుండు
హర్షబాష్పంబు లక్షుల నావరింప. 2263

గీ. భుక్తిముక్తిప్రదంబు సంపూర్ణశక్తి, దాయకము సర్వపాపవిదారకంబు
హరిహరాభేదబుద్ధిదాయకము సకల, సిద్ధిదము పాద్మము సమస్తసేవితంబు.

సీ. మును ధరాపాలుఁ డన్ జనపాలుఁ డొకఁడు నా, కాలయంబును నిల్పి యందులోనఁ
బద్మపురాణంబుఁ బఠియించి చెప్పంగ, నావర్ష మొక్కబ్రాహ్మణుని నిలిపి
యతనిజీవికకు నై యంతదాఁకను దగు, వృత్తి నొసంగి సంతృప్తిదముగ
స్వర్ణనిష్కశతం బొసంగుదు బహుమతి, గను బురాణాంతమం దని వచించు

గీ. విని పురాణంబు నొకకొన్నిదినము లొక్క, నాఁడు దైవికముగ మరణంబు నొందె
నంతఁ దత్కృతపుణ్యకార్యంబువలన, వాని కొనగూడె మత్సన్నిధానవసతి.

సీ. భూరిదానము లిచ్చువారికంటెను మహా, ధ్వరములు గావించు వారికంటె
నానావ్రతంబు లొనర్చువారలకంటె, వరతీర్థముల కేఁగువారికంటె
వేదపాఠములఁ గావించువారలకంటెఁ, గీరితి నార్జించువారికంటె
శ్రాద్ధతర్పణములు సలుపువారలకంటె, వనములఁ దపియించువారికంటె
గీ. నధికులు పురాణగాథల నాలకించు, నట్టివారును వచియించునట్టివారు
వారిపైఁ గలప్రీతి యెవ్వారిమీఁద, నేనియును లేదు నా కని కృష్ణుఁ డనియె.
క. మున్ను దిలీపుం డడుగఁగ, నెన్నో పురాణంబు లున్న నిదియె వినిచె లో
కోన్నతిఁ గన్నవసిష్ఠుం, డన్నరనాథునకుఁ బాగడ నలవియె దీనిన్. 2267
వ. అని చెప్పుటయు నీబ్రాహ్మణోత్తములు పద్మపురాణంబు విన నిశ్చయించుకొని
తచ్ఛ్రవణవిధిప్రకారంబు చెప్పు మని యభ్యర్థింప నంగిరుం డి ట్లనియె. 2268
సీ. బ్రాహ్మణోత్తముఁ డైనపౌరాణికునికడ, కరిగి నమస్కార మాచరించి
తమశక్తికొలఁది సదక్షిణతాంబూల, మర్పించి గురుభక్తి యామతిల్ల
ధర్మజ్ఞ చెప్పుము ధర్మార్థకామమో, క్షద మైనయొకపుణ్యకథను మాకు
నని వేఁడి కూర్చుండ నగును నీచైస్థ్సాన, మందుఁ దదుక్తుల నాలకింప
గీ. నంతఁ బౌరాణికుం డైన హరిహరులను, గణపతిని వాణినిఁ దలంచి ప్రణతి చేసి
యిష్టదైవంబునకు వచియింప నొప్పు, ననుదినంబుఁ బురాణంబు నాసమాప్తి.
గీ. శ్రవణమననంబులను శ్రోత సలుపుచుండఁ, దగును నంతియ కానిమధ్యమున మాట
లాడఁ దగ దేవియును నట్టు లాడె నేని, మూకుఁ డగు భారతీక్రుధాలోకసమున.
గీ. నడుమ నడుమను ఘట్టముల్ నుడువునపుడు
ధనకనకధాన్యవసనాదులను నొసంగి
ప్రమద మొనగూర్ప నగును బౌరాణికునకు
దానఁ దులఁదూఁగు బహుసంపదలను శ్రోత. 2271
గీ. అట్లు వినుచుఁ బురాణంబు నంతమందు, నిచ్చి గోభూహిరణ్యాదు లెచ్చు గాఁగ
వక్త కొనరింప నగు గౌరవంబు దానఁ, జేకుఱును శ్రోత కిష్టార్థసిద్ధు లెల్ల. 2272
క. అని చెప్పుటయును వీరలు, విని పద్మపురాణమును సవిస్తరముగ న
మ్మునివలన నె పడసిరి చ, య్యనఁ దత్ఫలము గను దేవయానము లంతన్.
గీ. ఆవిమానంబులను నెక్కి యంబరమున, సంచరించుచు స్వీయదర్శనమువలన
జనుల నెల్లను ధన్యులఁ జలుపుచుండి, రీవిధంబున నీమహీదేవు లధిప. 2274
క. అని చెప్పుటయును రాముఁడు, మనమున నాశ్చర్యపడుచు మరల నభమునన్
గని యొక్కదివ్యపురుషుని, దినమణిశతదీప్యమానతేజశ్శాలిన్. 2275
గీ. స్వామి యీదివ్యపురుషుఁ డెవ్వండొ నభము
నందు రాజిల్లుచున్నవాఁ డద్భుతముగ

వీనిచరితంబుఁ జెప్పుము వినఁగ నాకు
నిచ్ఛ వొడమెను నా శంభుఁ డిట్టు లనియె. 2276

సీ. ఇనకులాంబుధిచంద్ర వినుము చెప్పెద మున్ను, గౌతముం డనునొక్క తాపసుఁ డుండు
చదువక వేదశాస్త్రములు గావింపక, పంచయజ్ఞములు సల్పక జపంబు
కడకు సంధ్యను గూడ విడనాడి కృషికర్మ, మున బహువత్సరంబులను గడపి
యొకదివసమున దైవికముగ నొక్కచో, నిని పురాణము కొంత విషయ మెఱిఁగి

గీ. తత్పురాధీశుఁ డగుతేనిదరికి నేఁగి, మానవాధిప నేను బ్రాహ్మణుఁడ బ్రదుకఁ
జాలక స్వధర్మమునఁ గృషి సలిపి కొనుచుఁ, గడపితిని బహువర్షముల్ కాన కునికి.

గీ. కడకు నొకనాఁడు కృషి శూద్రకర్మ మనియుఁ
బ్రాణములు పోవ నున్నను బ్రాహ్మణుండు
చనదు దాని నొనర్పంగ ననియు వింటిఁ
జెప్పఁ బౌరాణికుఁడు దాన సిగ్గు చెంది. 2278

క. నీకడకు వచ్చినాఁడను, నా కొకగ్రామంబు నిచ్చినను భూపతి నై
లోకద్వయమున గర్హ్యుఁడఁ, గాకుండఁగ జీవయాత్ర గడపుదు నధిపా. 2279

క. అనవుడు భూనాయకుఁ డి, ట్లనియెను వేదోక్తకర్మ మవనిసురులకుఁ
జనుఁ గాక భూపతిత్వము, చనునె యది ద్విజత్వహానిజనకము గాదే. 2280

వ. అనుటయును గౌతముండు మహీపాలున కిట్లనియె. 2281

గీ. వసుమతీశ్వర భూపతిత్వంబు రాజ, ధర్మ మగుటను విప్రుఁడు దాని నాశ్ర
యించినను దోషి గాఁ డర్హావృత్తి లేని, తఱిని నని వింటి శాస్త్రవేత్తలు వచింప.

క. అనవుడు భూపాలుఁడు వి, ప్రున కిచ్చెను గోర్కి కధికముగ గ్రామములన్
మనమున నత్యానందం, బెనయఁగ గౌతముఁడు చనియె నింటికి నంతన్. 2283

క. గౌతముఁడు గ్రామములకున్, నేతృత్వము వడసి దాన నివ్వటిలంగన్
స్వాతంత్ర్య మది యహంతా, హేతువు గా నంతకంత కిచ్ఛావశుఁ డై.

క. త్రాగఁ దొడంగెను మద్యము, రాగ ముడిగి భార్యయందు రాబడి నెల్లన్
ద్యాగ మొనర్పఁ దొడంగెను, భోగముచేడెల కతండు భోగార్థముగన్. 2285

క. పరదారపరధనంబుల, హరియించుచుఁ దినుచు మాంస మధములతోడన్
దిరుగుచు నాతఁడు కాలము, జరుపఁ దొడంగెను నిరంకుశస్థితి మీఱన్. 2286

క. వేదంబుల దూషించుచు, వాదించు నతండు విబుధవర్గముతోడన్
గా దన నౌ నని యౌ నన, గా దని ధనమదము విషముగను దల కెక్కన్.

ఆ. అట్లు కొంతకాల మరుగంగ గౌతముఁ, డర్థ మెల్ల నాశ మగుడుఁ దుదకుఁ
దినఁగఁ దిండి కట్టుకొన గుడ్డయును లేక, దుస్స్థితిని వహించి దుఃఖపడుచు.

క. ఒకనాఁడు పూర్వపౌరా, ణికునికడకుఁ బోయి తనదునిచస్థితి వా
నికిఁ జెప్పి స్వామి నాకై, హికసుఖములమీఁదఁ గాంక్ష యెల్లఁ దొలంగెన్.

గీ. అనుభవించితి సర్వసౌఖ్యములు వాని
వలన లాభంబు లే దని తెలిసికొంటి
నింక దయతోడఁ జెప్పు మే దేని నాకు
నొకయుపాయంబు తొలఁగఁ బాతకము లెల్ల. 2290

వ. అని ప్రార్థించుటయుఁ బౌరాణికుం డాతని కిట్లనియె. 2291

గీ. సకలపాపంబులను గూడ సమయఁ జేయు, నట్టివి పురాణములు వాని నాలకించి
ధన్యుఁడవు గమ్ము లేకున్న దారి లేదు, త్వత్కృతాసంఖ్యపాతకోత్తరణమునకు.

క. విన నెంచి పురాణంబును, వినునెడ నొకపద్య మేని వినువారికిఁ ద
ద్దినకృతపాతక మంతయు, ననుపదము నశించి శుద్ధి యుపాదిల్లున్. 2293

క. అని చెప్పుటయును గౌతముఁ, డనవధికంబైన హర్ష మందుచు స్వాంతం
బున సాష్టాంగనమస్కృతి, నొనరించి పురాణవక్త కుద్యద్భక్తిన్. 2194

గీ. స్వామి దీనునిపైని వాత్సల్యముననుు, నీవె వచియింపుము పురాణ మేది యేని
త్వత్ప్రసాదంబునను గృతార్థతను జెందఁ, గలుగుభాగ్యంబు నేఁటికిఁ గలిగె నేమొ.

వ. అని ప్రార్థించుటయు నప్పౌరాణికుండు కృపాకటాక్షంబులం గనుంగొనుచు నాబ్రాహ్మణునకు విధివిధానంబునఁ గూర్మపురాణంబును లింగపురాణంబును విష్ణుపురాణంబును వామనపురాణంబును బద్మపురాణంబును గరుడపురాణంబును సౌరపురాణంబును బ్రహ్మపురాణంబును రామాయణంబును వినిచె.

గీ. అంతటను గౌతముఁడు శ్రద్ధ యతిశయిల్ల, మనన మొనరించుకొనుచుఁ జెప్పినది యెల్ల
జ్ఞానదృగ్గోత్రమైన యాసద్గురునకు, శక్తిలోపంబు చేయక సత్కరించి. 2297

క. అది మొదలుగ దుస్సంగము, వదలి విరక్తుఁడయి లోకవాసనయందున్
దుద కొకనాఁడు స్మరించుచు, మదిలోపల హరిహరులను మరణము నొందెన్.

గీ. అంత నాకసమునుండి యరుగుదేరఁ, గామగవిమాన మచటికి గౌతముండు
దానిపైఁ గూరుచుండి సంతసముతోడ, నేఁగి యూర్ధ్వప్రపంచంబు లెల్లఁ దిరిగి.

క. హరిచేతను హరుచేతను, పరమేష్ఠిసంభవునిచేత శక్రునిచేతన్
బరిపూజితుఁడై యిప్పుడు, స్వర్గమున నేఁగుచును గానఁబడియెడి మనకున్.

క. అనవుడు రాఘవుఁడు సభం, బునఁ బ్రత్యక్షముగ నున్నభూసురునకు వం
దన మొనరిచె లేచి నిలిచి, వినయంబునఁ జేతు లొగ్గి వినతాననుఁడై.

వ. అట్లు వందనంబు గావించి రామచంద్రుండు మరల సుఖాసనంబునం గూరుచుండి మహాత్మా పౌరాణికునిమాహాత్మ్యంబును దల్లక్షణంబును దద్విధియును శ్రోతృవిధియును శ్రవణఫలంబును గ్రాహ్యపురాణసంఖ్యయును దెలుపు మని యర్థింప శంభుండు రామచంద్రున కిట్లనియె. 2302

—: పౌరాణికమాహాత్మ్యాదికథనము :—

సీ. అధ్యయనంబున నధ్యాపనంబునఁ, బాతకిపాప మబ్బుటఁబట్టి
సంక్రమించును గాన శ్రమములు గా రక్షిత, యధ్యాపకుఁడును దశభుమ గాఁటఁ
బౌరాణికుఁడు సర్వపాపసంహారంబు, గావింపఁగలశక్తి గలిగి యుంట
శ్రోతృపాపము దన్ను సోఁక కుండుటె కాక, తత్పాపముల నెల్లఁ దాను మాపు
గీ. మాంత్రికుఁడు లేక స్వీయకర్మంబు నెట్లు, మాపికొనలేఁడొ యాత్మఁ దాపహర్తఁ గాక
పరులసాయంబు లేకయె మాపికొనఁగఁ, గలుగుఁ బౌరాణికుఁడు తనకలుషములను.

గీ. అంటఁ జాలవు పాపము లఖిలవేత్త, యైనపౌరాణికుని నద్ది నంటినట్లు
శలభములు దీప మార్పెడిచాయ ముట్టి, నంతనె దహించుఁబాపకు నార్పఁగలవె.

గీ. బ్రాహ్మణుఁడు గురు వగుట వర్ణముల కెల్ల, జ్ఞానబోధాధికారంబు వాని కొదవె
దానఁ బౌరాణికత్వంబుఁ దాల్ప నొక్క, బ్రాహ్మణుఁడు దప్ప నన్యుఁడు గాఁ దొరకఁడు.

గీ. ఆత్మగురువుగ బ్రహ్మవిద్యాప్రదాత, యైనపౌరాణికుని నెంచి యాత్మలోన
విశ్వసించి పురాణముల్ వినినఁ బోవుఁ, బాతకము లన్నియును బటాపంచలుగను.

గీ. ఒసఁగి గోభూధనాగారవసనములను, స్వర్ణకటిసూత్రముద్రికాకర్ణకుండ
లాదిభూషణములను గజాశ్వవితతిఁ, జలుపవలయుఁ బురాణవాచకునిపూజ. 2307

గీ. చలిపి పూజ పురాణవాచకున కట్లు, భక్తితోడను గ్రంథ మర్పణము చేయు
మానవుం డుండు వైకుంఠమందిరమునఁ, గల్పకోటిసహస్రంబు గడచువఱకు.

క. అనఘాత్ముఁ డగుపురాణ, జ్ఞునకు నఖిలశక్తు లుండుఁ జుమి దీనికి నే
వినిచెద నొకవృత్తాంతం, బును దృష్టాంతముగ వినుము భూతలనాథా. 2309

సీ. మును నీవు కానసంబుల కేఁగుకాలంబు, నన్ను వసిష్ఠుం డయోధ్యను వసించి
యఖిలపురాణజ్ఞుఁ డగుటను నీక్షేమ, మెల్లవిధంబుల నెఱిఁగికొనుచు
నొకనాఁడు శుక్రునియుపదేశమున రాక్ష, సఘ్నుండ వగునిన్నుఁ జంప నెంచి
రక్కసుం డొక్కఁడు రాఁగ నీవడవిలో, హరిణంబునకుఁ బోయినట్టితఱిని
గీ. దెలిసికొని సర్వమును యోగదృష్టివలన, బ్రహ్మవరదృప్తుఁ డైన యారాక్షసుండు
నీకు సాధ్యుఁడు కాఁ డని నిశ్చయించి, తనకు నినుఁ గాచుటయె ధర్మ మని తలంచి.

ఆ. ఆనిశాచరేంద్రుఁ డంత మొందెడివిధం, బరసి తాను నైత మనుజరూపుఁ
డగుచు నేఁగి వాని నదలింప బెదరక, యెదుట నిలిచి వాఁడు పదరెఁ దొడఁగె.

క. అంతట మానీంద్రుఁడు వి, క్రాంతిమెయిన్ దన్నె నెడమకాలన్ వానిన్
సంతాప మొదవ దైత్యుఁడు, వింతగఁ బఱవంగసాగె విపినములోనన్. 2312

ఆ. అట్లు పఱచు చుండ నాతనిఁ దఱుముచు, వెంటఁబడి తపస్వి విపిన మెల్లఁ
ద్రిప్ప వాఁడు తిరిగి తిరిగి వేసరి కట్ట,కడకుఁ బోయి చొచ్చెఁ గడలిలోన. 2313

క. చొచ్చుటయు వాఁడు కడలిని, గ్రచ్చుఱఁ దత్తనువు కండకండలు గాఁగన్
ప్రచ్చి యొక మొసలి మ్రింగుడు, వచ్చి మరల మౌని నిజనివాసముఁ జేరెన్. 2314

వ. పురాణప్రారంభమునకుఁ బ్రాతఃకాలం బుత్తమంబు. ప్రారంభదినంబున మూఁడు గాని యైదు గాని పది గాని పద్యంబులు చదువం దగు. ద్వితీయదినంబున ద్విగుణంబుగను దృతీయదినంబునుండి యధికంబుగను జదువ నొప్పు. విచ్ఛేదంబు లేకుండఁ బ్రతిదినంబును బురాణపఠనశ్రవణంబులు గావించుట యుత్తమంబు. వ్రతరూపంబుగాఁ బురాణశ్రవణంబు గావించువారికిఁ దత్పురాణదేవతాలోకంబు ప్రాప్తించు. 2315

గీ. కలియుగంబున నెట్టివారలకుఁ గూడఁ, గాదు సులభంబు మూలార్థవేదనంబు
కాన ఫలదంబ దానంబుకరణి విగుణ, మైనను బురాణవక్తృవ్యాఖ్యాన మధిప.

గీ. వ్యాసుఁడును బ్రహ్మయును బురాణాశయంబు
నెఱుఁగుదురు వారికంటెను హెచ్చు గాఁగ
హరుఁ డెఱుఁగు వీరికంటెను నన్యుఁ డెవ్వఁ
డేనియును లేఁడు తద్భావ మెఱుఁగువాఁడు. 2317

క. సవనములు దీర్థయాత్రలు, హవనంబులు జపతపంబు లాచారము లె
య్యవి యేనియును బురాణ, శ్రవణమటులు ఫలము నీయఁ జాలవు కలిలోన్.

క. ఋతము వచించెద భూవర, కుతలమునఁ బురాణబోధకునికంటెను లేఁ
డితరుం డెవఁ డేనియు స, ద్గతిదాయకుఁ డైనగురువు కలికాలమునన్. 2319

గీ. మంత్రదాతలు నిగమాగమప్రదాత, లందఱును గూడ గురువులె యైన నేమి
సర్వవిజ్ఞానవితరణశక్తి లేమి, వారు పౌరాణికునివంటివారు గారు. 2320

గీ. వేదపాఠకు లెందఱో విశ్వమందు, బ్రహ్మరాక్షసు లగుచుఁ గన్పట్టుచుందు
రట్టి పౌరాణికుండు చూపట్టఁ డెచట, నైన విజ్ఞాననిహతాఖిలాఘుఁ డగుట.

చ. వినని యెడన్ బురాణములు విశ్వములోనివిశేష మేదియున్
గనుఁగొనఁ జాల కుంటయు నఘక్షతి గల్గక యుంటయున్ దుదిన్
గన నగుముక్తిమార్గమును గాంచఁగ లేమియు సంభవించెడిన్
గనుకఁ బురాణముల్ చను వినన్ జను లెల్లరు జాగరూకులై. 2322

గీ. వేదవేదాంగములను సవిస్తరముగఁ, జదివి పారంబు గన్నధీశాలి యైన
శ్రవణ మొనరింప కున్నఁ బురాణములను, గానఁజాలఁడు సత్యమార్గంబు నధిప.

గీ. దానములలోన విజ్ఞానదాన మధిక, దాన మని చెప్పఁబడుటఁ దద్దాత యైన
యట్టిపౌరాణికున కిచ్చునట్టిద్రవ్య, మెంతఫల మిచ్చునో ప్రదాత కెఱుఁగ రాదు.

గీ. ఒనరిచిన నొక్కపౌరాణికునకుఁ బూజ, నఖిలపూజను గావించినట్టివాఁడ
యొనరిచిన నొక్కపౌరాణికునకు ద్రోహ, మఖిలవిద్రోహమును జేసినట్టివాఁడ.

సీ. అంగహీనుండును నధికాంగుఁడును గుల, హీనుఁ డాచారంబు లేనివాఁడు
శౌచహీనుఁడు మహాజాడ్యయుక్తుఁడు మహా, పాపి నిరాకృతి ప్రాణిహంత
యనృతభాషణుఁడు పరాంగనాలోలుండు, ద్రవిణార్జనైకపరాయణుండు
స్తేనుఁ డాస్తిక్యవిహీనుఁడు మతి లేని, వాఁడు శ్రుతిస్మృతివర్జితుండు
గీ. కాఁడు పాత్రుఁడు పౌరాణికత్వమునకు, నట్టివానిని బూజించునట్టివారు
బాలతృణములచేఁ గప్పఁబడినకూప, మందుఁ దెలియక పడిపోయినట్టివార.
క. వ్యాసాదిమునివరేణ్యులు, చేసినవియు శివుఁడు హరియుఁ జేసినవియు వి
శ్వాసార్హపురాణము లవె, దోసముల నడంచు వినినతోడనె భూపా. 2327

—: దేశభాషావిరచితపురాణగ్రంథప్రాశస్త్యకథనము.—

గీ. తత్పురాణార్థములు విదితములు గాఁగ
దేశభాషలలోపలఁ దెలియఁజేయు
వ్యాఖ్యలును గ్రంథములును బుణ్యావహంబు
లగుట నవివోలె గౌరవార్హములు చూవె. 2328

గీ. అట్లు గాకుండ స్వాతంత్ర్య ముట్టిపడఁగ, దేశభాషల నైనను దేవభాష
నైనను రచింపఁబడుగ్రంథ మప్రమాణ, మగుటఁ జదివిన వినినఁ బుణ్యంబు లేదు.
వ. మహాభారతవ్యాఖ్యానకాలంబునఁ బర్వసమాప్తి యగునప్పు డెల్లను రామా
యణ వ్యాఖ్యానసమయంబునఁ గాండసమాప్తి యగునప్పు డెల్లను హరివంశ
సమాప్తియందును యథాశక్తిఁ బౌరాణికుని నర్చించుచు నంతంబునందుఁ బౌరా
ణికునకు నుత్తమక్షేత్రంబు లొసంగవలయు. 2330

గీ. అనుదినంబును జీవికకై పురాణ, వక్త కావశ్యకము లైనవస్తువులను
జాగరూకతతోడ నొసంగుచుండ, వలయు శ్రోతలు లోపంబు గలుగకుండ.

—: అష్టాదశమహాపురాణోపపురాణనిరూపణము :—

వ. బ్రాహ్మంబును బాద్మంబును వైష్ణవంబును శైవంబును భాగవతంబును భవి
ష్యంబును నారదీయంబును మార్కండేయంబును నాగ్నేయంబును బ్రహ్మవై
వర్తంబును లైంగంబును వామనంబును స్కాందంబును మాత్స్యంబును గౌర్మం
బును వారాహంబును గారుడంబును బ్రహ్మాండంబును ననష్టాదశమహాపురా
ణంబులును సనత్కుమారంబును నారసింహంబును నాండంబును దౌర్వాస
సంబును నారదీయంబును గాపిలంబును మానవంబును నౌశనసంబును బ్రహ్మాం
డంబును వారుణంబును గాలికాపురాణంబును మాహేశంబును సాంబంబును
సౌరంబును బారాశరంబును మారీచంబును భార్గవంబును గౌమారంబును నను
నష్టాదశోపపురాణంబులును మహాపుణ్యప్రదంబులు గాఁ జెప్పంబడియె. 2332

ఆ. ఈపురాణములను నెల్లను వినినను, సంశయంబు లెల్ల సమసిపోయి
పడయఁ దగినయట్టిబ్రహ్మపదంబును, బడయఁగలుగు వేయి పలుకు లేల. 2333

గీ. అనృతమాయావికత్థనాద్యఖిలదుర్గుణముల విడనాడి సద్వినింద్యములు గాని
వస్తువులు భుజియించుచు వలయు వినఁగ, శ్రద్ధతోడఁ బురాణముల్ సౌఖ్యకాంక్షి.

—: శ్రీ రా మ చం ద్ర కృ త మా తృ శ్రా ద్ధ వి ధా న క థ న ము :—

వ. అని చెప్పి యూరకుండుటయు రామచంద్రుం డపరిమితానందముం జెంది పర దినంబునఁ గౌసల్యామాసికశ్రాద్ధంబు గావింపవలసియుండుటం జేసి తత్పూర్వ దినంబునందు రోమశనారదశంభుభృగువిశ్వామిత్రులను నిమంత్రించి తా నేక భక్తంబు గావించి స్థండిలస్థలంబున నేకాకిగా శయనించి పరదినంబున నుత్థితుం డై ప్రాతఃకృత్యంబు లెల్ల నిర్వర్తించి సలక్షణంబుగాఁ బాకంబు సేయించి మధ్యాహ్నకాలం బగుటయు భ్రాతృపురోహితసహితంబుగా సరయూ మహానదికిఁ బోయి తత్తీర్థంబున యథావిధి మాధ్యాహ్నికస్నానంబు గావించి వచ్చి బ్రాహ్మణులకు స్వాగతంబు నొసంగి ప్రాణాయామపూర్వకంబుగా సంకల్పం బొనర్చి విశ్వేదేవస్థానంబునందు రోమశనారదమహర్షులను మాతృస్థానంబునందు శంభుభృగువిశ్వామిత్రమహర్షులను క్షణప్రదానపురస్సరంబుగా నిమంత్రించి. 2335

గీ. మండలంబు లొనర్చి గోమయముచేత, నర్చనము చేసి యందు బ్రాహ్మణులచరణ
తామరసములు గడిగె సీతానవధూటి, జలము వోయుచు నుండంగ సరస నుండి.

ఆ. అట్లు కడిగి బ్రాహ్మణాంఘ్రుల రాముఁడు, తనశిరంబుమీఁదఁ దజ్జలంబుఁ
జల్లుకొని కడంగఁ జలుప నావలివిధి, నప్పు డొక్కయతిథి యటకు వచ్చి.

ఆ. రామచంద్ర నేను బ్రాహ్మణుండను వార్ధకమున నున్నవాఁడఁ గదలఁ జాల
నెట్లొ వచ్చినాఁడ నిటకు నీయాతిథ్య, మొందఁ గోరి యేమి యందు వీవు.

చ. అనుటయు రామభద్రుఁడు ప్రహర్షముఁ జెంది మహానుభావ నేఁ
డనుకొనకుండఁ బ్రాప్త మయినట్టిరమాపతి వీవు రమ్ము నాఁ
గను ద్విజుఁ డేఁగుదేర సరగన్ గడిగెన్ సతి నీళ్లు వోయఁగా
నినకులవార్ధిచంద్రుఁడు మహీసురవర్యునిపాదపద్మముల్. 2339

వ. అట్లు రాఘవుం డాబ్రాహ్మణునిపాదంబులం గడిగి విష్టరంబు లుంచి యందు విశ్వేదేవాతిథులను బూర్వాభిముఖంబుగను బితరుల నుత్తరాభిముఖంబుగను గూరుచుండం బెట్టి ప్రాణాయామంబు చేసి శ్రాద్ధకర్మంబు గావింప బ్రాహ్మణానుజ్ఞం బడసి శ్రాద్ధదేశంబును గయాక్షేత్రంబుగను విశ్వేదేవులను జనార్దనుండుగను బితరులను వసురుద్రాదిత్యులుగను నతిథిని మహావిష్ణువుగను

ధ్యానించి యథావిధి నర్చనంబు గావించి పాత్రాసాదనంబు చేసి యన్నంబును
భక్ష్యభోజ్యశాకలేహ్యసూపాదులును వడ్డించి యభిఘారంబు గావించె. 2340

ఆ. అంత నతిథి యిట్టు నట్టును జూచుచు, రామ శీఘ్రముగను బ్రణతి సేయు
మాఁగఁజాల నింక నాఁకలి మెం డయ్యె, నాజ్ఞ యైన నిపుడె యారగింతు.

క. అనుటయు రాముఁడు వినయం, బున మ్రొక్కి మహాత్మ శీఘ్రముగఁ బై కార్యం
బును నడపెదఁ ద్వరపడకుము, కనికరమున ననుచు వేఁడి గ్రక్కున నంతన్.

వ. కర్మకలాపం బంతయు యథాక్రమంబుగా జరిపి యాపోశనంబు నర్పించె.
అంతట బ్రాహ్మణులు యథాసుఖంబుగా భుజించుచుండ ఋత్విజులు రక్షోఘ్న
మంత్రపఠనంబు గావింపం దొడంగిరి. 2343

ఆ. అప్పు డతిథి యైనయవనిబృందారకుఁ, డాత్మపాత్రగతపదార్థ మెల్లఁ
గలిపి యొక్కముద్దగా గుటుక్కున మ్రింగి, యందఱకును గూడ నచ్చెరువుగ.

ఆ. రామ నాకు నొక్కప్రాణాహుతికిఁ గూడఁ, జాల దీవు నేఁడు సలిపినట్టి
శ్రాద్ధయత్న మెల్ల శక్తి లేకుండిన, శ్రాద్ధవిస్తరంబు సలుప నేల. 2345

మ. అని గంభీరముగా వచించుటయుఁ దద్వ్యాహార మాలించి యే
మనఁగన్ దోఁపమి నప్డు రాఘవుఁడు చింతాక్రాంతుఁడై శంభునిన్
గన నాతండు నిజాంగనన్ గనుడు నాకంజాక్షి యేతెంచె గ్ర
క్కనఁ జేతం బరమాన్నభాజనముఁ జిక్కంబట్టి వడ్డింపఁగన్. 2346

క. అరుదెంచినయామెను గని, పరమానందమున నతిథి పాణిని జాఁపన్
దరుణీమణి వడ్డించెను, బరమాన్నము నక్షయముగ భావించి మదిన్. 2347

గీ. అట్లు వడ్డింపఁ బరమాన్న మావధూటి
బ్రాహ్మణుఁడు జుట్టి జుట్టునఁ బైనిఁ గనుచు
శిరము ద్రిప్పుచు మెచ్చుచు మరలఁ జాఁచె
హస్తమును నది చూచి యి ట్లనియె నామె.

గీ. స్వామి పాయస మెల్ల హస్తంబునందు, పొరలిపోవుచు నున్నది మరల నేల
చాఁచితివి కేలు త్రాగుము సత్వరంబ, తృప్తి గలుగంగ వడ్డింతు నెంత యేని.

క. అనవుడు విప్రుఁడు దనకర, మున నుండినపాయసాన్నమును ద్రావి కనుం
గొని మరల నుంట నది కర, మునను మరలఁ ద్రావ మరలఁ బూర్తిగ నుండెన్.

క. అది యంతయు నాశ్చర్యం, బొదవింపఁగ మదికి బ్రాహ్మణోత్తముఁ డిఁక ని
య్యది గాదు మార్గ మనుకొని, యద నేఁగక యుండ వామహస్తముఁ జాఁచెన్.

గీ. అప్పు డది చూచి యాసాధ్వి యాత్మలోనఁ
బూర్వ మట్టులె భావించి పోసె నతని

హస్తమునఁ బాయసము నది యారగించి
తఱుఁగ కుండుటఁ గాంచి యాధరణిసురుఁడు. 2352

గీ. సృష్టి గావించుకొని యొకచేయి మరలఁ, జాఁచుటయుఁ బోసె మునువోలెసారసాక్షి
యదియువదలకయుండుట హస్తమందు,మఱియొకకరంబుఁ జాఁచి క్షమాసురుండు.

గీ. ఇంతి యర్పింపు మిందులో ఘృతము ననుడు
నామె మునువోలెఁ దలఁచి యాజ్యంబు వోసె
నదియు నక్షయ మగుటయు నవనిసురుఁడు
పాణి మఱియొండు చాఁచి సూపంబు నడిగె. 2354

గీ. అంత నాసాధ్వి మునువోలె నక్షయముగఁ
దలఁచి సూపంబు నతనిహస్తమున నుంచె
నదియుఁ దఱుఁగక యుండుట హస్తమందుఁ
గ్రమముగ నతండు కరసహస్రంబుఁ జాఁచి. 2355

గీ. తుదకు విఫలప్రయత్నుఁడై తోయజాక్షి, వలదు నా కింక నేమియుఁ గలిగెఁ దృప్తి
సీతచేఁ గాదు రామునిచేతఁ గాదు, తర్పితుఁడ నైతి నీచేతఁ దథ్యముగను. 2356

గీ. అని వచించుటయును శంభుఁ డతనిఁ జూచి
యింతకును దృప్తి గలిగెనె యెఱుఁగఁ జెపుమ
అతివ యొకతయ కాదు సీతమయు నేను
రాముఁడును నిచ్చినట్టివారలమ చూవె. 2357

క. అని యడుగుటయును ద్విజుఁ డి, ట్లనియెను దృప్తుండ నైతి నధికంబుగ నా
కొనగూడి యీ పదార్థము, పెనుబూతమువోలె విడిచిపెట్టదు నన్నున్. 2358

చ. అనయము భోజనంబుకొఱ కయ్యెను నాకరజాల మెల్ల నే
నొనరుప వీలులేదు మఱియొక్కక్రియన్ బని లేనిపాటు గాఁ
గను నిట కేఁగుదెంచి యొకకర్మ మిటుల్ గొనితెచ్చుకొంటి నా
మనమున నెట్లు తోఁచినదొ మానక యట్టులె యయ్యె నంతయున్. 2359

క. అప్పుఁ గాక యేమి చేయఁగ, నవు నిప్పుడు మీఁదికర్జ మతిశీఘ్రముగన్
సవరింపుఁడు భుక్తాయా, సవశుఁడ నై నేను నిలువఁజాలక యుంటిన్. 2360

వ. అని పలికి చేతులలోనిపదార్థంబు మే నంతయుం బట్టించి రుద్దుకొనుచుండ
రామచంద్రుండు బ్రాహ్మణులకు నుత్తరాపోశనం బొసంగె. 2361

గీ. అంత నాపోశనజలంబు నారగించి, యవల నుచ్ఛిష్టపాత్రములందు నర్హ
విధిని గండూష మొనరించి విప్రు లెల్ల, లేచి పోయిరి యతిథి తా లేవఁడయ్యె.

సీ. అది చూచి రాముఁ డిట్లనియెను స్వామి లే, వక యుంటి వేమి కావలెనొ నీకు
సెలవిమ్ము నావుడు క్షితిసురవర్యుఁడు రాము, యేమియు వలదు సంతృప్తి యయ్యె

నీవు పెట్టినభుక్తి యెక్కువ యగుటను, లేవఁదీయక యున్న లేవఁ జాల
ననుటయు రాఘవుం డతనిచేతులు చిక్కఁ, బట్టి లేపఁగ లేక యట్టె నిలిచె
గీ. నంతటను వాయునందనుం డరుగుదెంచి, లేవ నెత్తంగ యత్నించి లేవ కునికి
వాలమును జుట్టి లాగంగ వసుధ యెల్ల, వణఁకుచున్నను విప్రుఁడు తొణఁకఁడయ్యె.
గీ. అంతటను బాదముల ధాత్రి నణఁగఁ ద్రొక్కి, పండ్లు బిగఁ బట్టి లాగె నా పవనసూతి
తొలఁక బలిమిని బీఠంబుతోడఁ గూడఁ, గదలి వెలుపలఁ బడియె నాత్మసురుండు.
ఆ. అపుడు జాంబవంతుఁ డతనిఁ బీఠంబునఁ, గూరుచుండఁ బెట్టి నీరు వోయ
నొడలు గడిగి సీతయును లక్ష్మణుండును, నాచమింపఁ జేసి రధికభక్తి. 2365
ఆ. అంత నాచమించి యాతఁడు లేవంగఁ, జాల కునికి నెఱిఁగి జాంబవంతుఁ
డతనిఁ దనభుజంబులం దుంచుకొని పోయి, దించె దివిరి శ్రాద్ధదేశమందు.
వ. అంతట రామచంద్రుండు బ్రాహ్మణులకుఁ బ్రదక్షిణంబు గావించి తదాశీర్వా
దంబులం బడసి భుక్తాయాసంబు నొందుచుండు నతిథిసన్నిధికి సతీభ్రాతృసహి
తంబుగాఁ జేరి. 2367

—: హరిహరాదులు రామచంద్రాగులకుఁ బ్రత్యక్షమగుట :— ।

సీ. సీతను దత్పాదసేవకై నియమించి, యాచరించుచు నుండ నామె యట్లు
ముదువఁ దన్మూర్ధజంబుల లక్ష్మణున కాజ్ఞ, చేసి యాతం డట్లు చేయుచుండ
వీవన నతనికి విసరంగ భరతు నా, జ్ఞాపించి యతఁ డట్లు సలుపుచుండ
సెలవిచ్చి తుడువఁ దచ్ఛ్లేష్మంబు శత్రుఘ్ను, నకు నతం డట్లు యొనర్చుచుండఁ
గీ. దత్కరంబుల నొత్తుచుఁ దాను నిలువ
నప్పు డతిథి రాజీవదళాక్షుఁ డగుచు
శంభుఁ డీశ్వరుఁ డగుచుఁ దత్సతి మృడాని
యగుచు నిలిచిరి యెదుట నత్యద్భుతముగ.
గీ. అంత రాముఁడు పులకాంకితాంగుఁ డగుచు
మ్రొక్కి సాష్టాంగముగ వారిముందు నిలిచె
నంత నిలిచిరి వందనం బాచరించి
తత్సతియుఁ దత్సహజులు నాతండువోలె. 2369
గీ. అప్పుడు ప్రసన్నులై హరిహరులు శివయుఁ, గరుణ వెలయంగ వారి నెల్లరను గాంచి
కోరుకొనుఁ డిచ్చువారము కోరినట్లు, వరము లెన్నియును మీకు వాంఛ దీర.
క. అనుటయు రాముఁడు హర్షం, బెనయఁగఁ దత్పాదభక్తి యెపుడును మదిలోఁ
దనరారఁ గోరె వరమును, ననుజన్ములు సతియుఁ గోరి రట్టులె వెంటన్. 2371
క. అంతట నాముగ్వురును ద, దంతశ్శుద్ధికిఁ బ్రమోద మందుచును నిర
భ్యంతరముగ నిచ్చి వరం, బంతర్ధానంబు నొంది రతిశీఘ్రముగన్. 2372

గీ. అపుడు రాముఁడు బంధుమిత్త్రాదిసహితుఁ
డగుచు భుజియించి యవల దీనాంధకృపణ
జనులకు నొసంగి మృష్టాన్నమును సమస్త
జనులు గీర్తింప రాజ్యంబు చలుపఁ దొడఁగె. 2373

—: పాతాళఖండపఠనశ్రవణఫలకథనము :—

క. పాతాళఖండ మియ్యది, చేతోహరముగను దీనిఁ జెప్పెడివారల్
శ్రోతలును విగళితాఖిల, పాతకు లయి హరిపదంబుఁ బడయుదురు తుదిన్.

వ. అని చెప్పుటయును శౌనకాదిమహర్షిబృందం బమందానందభరితం బయ్యె.

క. సృష్టిస్థితిసంహారా, స్పష్టీకృతనిజమహేశభావ సదాసం
తుష్టాంతరంగ భక్తా, భీష్టప్రద విశ్వనాథ యిష్టసనాథా. 2376

నా రా చ వృ త్త ము

నారాయణప్రియా శర
ద్ధారాధరాభవిగ్రహా
గౌరీసతీమనోహరా
వారాణసీపురాధిపా. 2277

గ ద్య ము

శ్రీ చిదంబరకవీంద్రప్రణీతం బైన శ్రీమదాంధ్రపద్మపురాణంబునఁ
పా తా ళ ఖ ం డ ము
సమాప్తము.

—•—

శ్రీ కాశీవిశ్వేశ్వరార్పణ మస్తు.



# భూమిక

శ్రీపరమేశ్వరకరుణాకటాక్షవీక్షణమున నేఁటికి శ్రీమదాంధ్రపద్మపురాణము నందుఁ గడపటి దగుచతుర్థసంపుటమును సైతము ముద్రించి ప్రకటింపఁగలభాగ్యము చేకూరినది. కృతికర్త యేతత్పురాణముద్రణకార్యభారమును సోదరుల మైనమామీఁద మోపుటయు నేనును నాసోదరుఁడు చిరంజీవి విశ్వేశ్వరశాస్త్రియు నాంధ్రమహోదయుల తోడ్పాటుతోఁ గ్రమముగా నాదిభూమిబ్రహ్మఖండములను బ్రథమసంపుటముగను పాతాళఖండమును ద్వితీయసంపుటముగను సృష్టిఖండమును దృతీయసంపుటముగను ముద్రించి ప్రకటించుట పాఠకులకు విదితచరము.

ప్రకృతము చతుర్థసంపుటముగా వెలువడినయీయుత్తరఖండమున సకలవిధమానవులిహపరసౌఖ్యములు చూఱకొనుట కనువగుమార్గము లనేకములు గలవు.

౧. నానాభక్తిస్వరూపకథనమున నెనుబదిమూఁడుపద్యము లున్నవి. కవి దాదాపు ప్రతిపద్యము ననేకోపమాదృష్టాంతములతో నలంకరించి భక్తిసౌందర్యమును బుట్టించి పాఠకహృదయములు పరవశము లగునట్లు చేసియున్నాఁడు. ఒకచిన్నిపద్యము.

గీ. నడుచుచున్నను గనుచున్న నుడువుచున్న, సలిలమును గొనిపోయెడిజనునిమనము
ఘటముననె నిల్చుగతి నుండుఁ గదలకుండ, శ్రీధరునియంద భక్తునిచిత్తవృత్తి.

౨. మార్కండేయయమసంవాదమునందు యమునిధృష్టవచనములలో సకలమానవులు ననుసరింపఁదగినముఖ్యధర్మము లెన్నియో యున్నవి. భక్తిపరవశుఁడైన మార్కండేయునిధీరసమాధానములు చదువునపుడు శరీరమున గగుర్పాటు గలుగకమానదు. మత్తకోకిలవృత్తములతోఁ బ్రవర్తిల్లినమార్కండేయునిమృత్యుంజయస్తోత్రము వక్తృశ్రోతల నుత్సాహడోలికలలో నూఁగించి శివభక్తిపరాకాష్ఠ నందుకొనునట్లు చేయుచున్నది.

మత్తకోకిలము. బాలచంద్రకళావిభూషణభాసమానకపర్దునిన్
వ్యాళరాజగుణోపపన్నసువర్ణశైలశరాసనున్
నాళికేక్షణబాణునిన్ గణనాథునిన్ ద్రిపురఘ్నునిన్
గాలకాలునిఁ జొచ్చితిన్ ననుఁ గాలుఁ డేమి యొనర్చెడిన్.

3. జాలంధరోపాఖ్యానములోఁ జిత్రవిచిత్రము లైనరాక్షసులమాయోపాయములు యుద్ధనైపుణ్యము లోకాతీతజాలంధరపరాక్రమాదులు వర్ణితము లైనవి. బలాసురదేహఖండములనుండి నానావిధమణు లావిర్భవించుటయు గతప్రాణుఁ డైనబలునిచే శుక్రాచార్యుఁడు మాటలాడించుటయు మొదలగుచోద్యములు గలవు.

౪. భగవద్గీతయందలియష్టాదశాధ్యాయములకుఁ గూడ మాహాత్మ్యములు మనోహరములైనకథలతో నిరూపింపఁబడియున్నవి. దీనిని జదివినను వినినను నెట్టివానికైనను నిత్యము భగవద్గీతాపారాయణము చేసికొనవలయు ననునభినివేశము కలుగును.

౫. భాగవతమహిమ సప్తాహమహిమ మాఘమాసమాహాత్మ్యము వీనియం దద్భుతము లగుకథలు చక్కని వర్ణనములు ననంతములైనధర్మములు మానసతీర్థములు భౌమతీర్థములు వానిలక్షణములు తారతమ్యములు వానికారణములు వివరింపఁబడియున్నవి.

౬. శ్రీప్రకుమారగంధర్వకన్యావర్ణనములు వారిధర్మప్రేమవాదములు గంధర్వకన్యలవిరహవర్ణనము మనోరంజకములైనభావములతో ముద్దులుగులికెడిపద్దెములతో సహృదయహృదయంగమములై యలరారు చున్నవి. మచ్చున కొకపద్యము.

సీ. నీమానసమునకు నిలుకడయే లేదొ, మామీఁద నీకు నమ్మకము లేదొ
చిత్తంబులోనికిఁ జేర నేర్చితి వేమొ, చేరి యీవలను రానేర వేమొ
యపరాధములు లేనియబలామణుల నేఁచ, నెఱిఁగియుఁ బరదుఃఖ మెఱుఁగ వేమొ
క్రూరాత్ముఁడవొ సుందరులమానధనమును, దస్కరించెడిమేటితస్కరుఁడవొ
గీ. మాయ లెఱిఁగినవాఁడవొ మాంత్రికుఁడవొ, మమత లేనట్టివాఁడవొ మముఁ బరీక్ష
సలుపఁ దలపెట్టితివొ కార్యసాధకుఁడవొ, పలుకు మొకమాట నాథ నీపైఁడినోట.

౭. అదత్తదానుఁడగువసుబ్రాహ్మణునివిలాపము సువ్రతునివిచారము నెన్నిమార్లు చదివినను దనివితీఱదు పైపెచ్చెంతటిపాషాణహృదయము నైనను ధర్మప్రవణముగా నొనర్చితీఱును.

౮. శ్రీకుండలవికుండలులవృత్తాంతమునందలిసుగతిదుర్గతిహేతుకర్మకథనమున వచియించిన యమలోకవిశేషము లెల్లరును దెలిసికొనఁదగినవి. దేవద్యుతి చేసినయోగసారస్తవములో సాంఖ్యచార్వాకాదిమతములసిద్ధాంతములు వాని కన్నింటికిని శ్రీమహావిష్ణువునందే వినియోగ మనుసమన్వయము సాకారనిరాకారసమన్వయవర్ణనములు నత్యద్భుతశైలిలో నడిచి పాఠకుల విజ్ఞానామృతప్రవాహములో నోలలాడించు చున్నవి. ఒకపద్యము.

సీ. కొలుచు చుండెదరు సాంఖ్యులు ప్రధానమునకుఁ, బరుఁడై ప్రకాశించుపురుషునిఁగను
శ్లాఘించు చుందురు సౌగతుల్ బుద్ధిఁగాఁ, దర్కోపతర్కవితర్కములను
ధ్యానించు చుందురు జైనశాస్త్రజ్ఞులు, దేహప్రమాణప్రదీపితునిఁగ
వచియించు చుంద్రు చార్వాకులు యోగవి, ద్యాప్రౌఢభూతచైతన్యముగను
గీ. సచ్చిదానందరూపుని జన్మమృత్యు, వర్జితుని భేదశూన్యుని వాస్తవికుని
నౌపనిషదవచోలక్ష్యు మైనవాని, నద్వితీయునిఁ బరుని నవ్యయుని నిన్ను.

౯. త్రిపాద్విభూతి వైకుంఠవ్యూహము క్షీరసాగరవ్యూహము న్యాసమంత్ర మంత్రార్థము మొదలైన వెన్నియో ఘట్టము లపూర్వాద్భుతవిషయబోధకములు జన్మతారకములు శాంతిదాయకములు చిత్తమలాపహారకములు నై యలరారు చున్నవి.

ఈచతుర్థసంపుట మాంధ్రదేశమున కలంకారభూత మైనగోదావరీమండలములో జగదుద్ధరణార్థ మై యవతరించి రత్నాద్రియం దధివసించిన శ్రీవీరవేంకటసత్యనారాయణస్వామివారిద్రవ్యసాహాయ్యముతో ముద్రింపఁబడినది. ఈ యుత్తరఖండము శ్రీమహావిష్ణువును బరదైవముగా నిర్ణయించుటయు దీనిని శ్రీమదన్నవరరత్నాద్రీశ్వర శ్రీవీరవేంకటసత్యనారాయణస్వామి యుద్ధరించుటయుం జూడ శ్రీమన్నారాయణమూర్తి తనమహిమను దానే లోకోద్ధరణార్థ మై యీపురాణముఖమున వెల్లడించికొనినట్లు తోఁచుచున్నది. ఈయన్నవరదేవస్థానము గలపర్వతము రత్నాద్రి యనియు దేవాలయమునఁ గలయంత్రము త్రిపాద్విభూతిమహానారాయణయంత్ర మనియుఁ బండితులు పలుకుచుందురు. ఈయంత్రము త్రిపాద్విభూతిమహానారాయణోపనిషత్తులో విశదముగా వివరింపఁబడియున్నది. ఈయుపనిష త్తష్టోత్తరశతోపనిషత్తులలో నొకటి. ఇది యద్వితీయబ్రహ్మమును బోధించుమహోపనిషత్తు. అథర్వవేదమున దేవదర్శి యనుశాఖయం దియ్యది గలదు. ఈయుపనిషత్తునం దెనిమిదియధ్యాయములు గలవు. ఈయంత్రము సప్తమాధ్యాయము నందు వివరింపఁబడియున్నది. దీనికిఁ బందొమ్మిదియావరణము లున్నవి. ఆయాయావరణములలో సకలదేవతలును గలరు. ఇట్లు సకలదేవతాసాన్నిధ్యము గలయీయంత్రరాజమునకు శిరోభాగ మగుబిందుస్థానమునం దావరణదేవతాసమష్టిరూపుఁ డగు త్రిపాద్విభూతిమహానారాయణమూర్తి నివసించియుండు నని పైయుపనిషత్తు నుడువుచున్నది. ఏతదుపనిషన్నిరూపితయంత్రమే యన్నవరదేవస్థానములోఁ గలయంత్రము. ఆయంత్రమందుఁ బ్రతిష్ఠితుఁ డైన శ్రీవీరవేంకటసత్యనారాయణస్వామియే త్రిపాద్విభూతిమహానారాయణమూర్తి.

ఇట్టి శ్రీవీరవేంకటసత్యనారాయణస్వామి వారిప్రసాదమున నీయాంధ్రపద్మపురాణ చతుర్థసంపుటము ముద్రింపఁబడుట కృతికర్తతపఃఫలము. ఈపవిత్రకార్యమున మేము నిమిత్తమాత్రులముగా నుండుటచే మాజన్మములు ధన్యములు.

మా కీచతుర్థసంపుటముద్రణకార్యమునందు సమగ్రముగా సహాయపడి ద్రవ్యమిప్పించినదయార్ద్రహృదయులు దైవభక్తిసమన్వితులు దేవస్థానములడిప్యూటికమీషనరు నగు కీ. శే. శ్రీ సి. వి.యల్. వరప్రసాదరావు. B. A. B. L. గారియెడ మేము సర్వదా కృతజ్ఞులము. వారికి భగవంతుఁడు శాశ్వతవైకుంఠనివాసభాగ్యము ననుగ్రహించుఁగాక.

ఈగ్రంథగుణమును బవిత్రతను గ్రహించి మావినతిపత్త్రము నంగీకరించి ద్రవ్యసాహాయ్యము చేసి స్వీయవంశక్రమాగత మైనయుదారభావమును గనఁబఱచిన దేవస్థానధర్మకర్తలగు శ్రీరాజా యినుగంటిరాజగోపాలరాయణింగారికి మాకృతజ్ఞతాపూర్వకాభినందనము లర్పించుచున్నారము.

ఇట్లు
ప్రకాశకుఁడు
పినుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి

నెల్లూరు
4—5—1956

# విషయసూచి

# శ్రీమదాంధ్రపద్మపురాణము

## ఉత్తరఖండము



కాళహస్తివరదా
కాకోదరభూష నిత్యకళ్యాణగుణా
నీక చిదంబరరచిత
శ్లోకప్రియ విశ్వనాథ సురుచిరగాథా. 1

వ. నైమిషారణ్యంబున శౌనకుండు మహర్షిబృందసమేతుండై పద్మపురాణశేషముం
దెల్పు మని యడుగుటయు నత్తపోధనునకు సూతుం డి ట్లనియె. 2

ఆ. మునివరేణ్య వినుము మును నారదుఁడు రజ, తాచలమున కేఁగి హరున కెఱఁగి
బదరికాశ్రమప్రభావంబు నడుగంగ, నమ్మహర్షి కిట్టు లనియె శివుఁడు. 3

—: బదరికాశ్రమవృత్తాంతకథనము :—

ఆ. ఉర్విలోన నద్రు లొకలక్షయును నిర్వ, దేనువేలు గలవు వానిలోన
నధికపుణ్య మైనయది యొకబదరికా, శ్రమమహీధరంబ సంయమీంద్ర. 4

క. నరనారాయణు లనియెడి, పరమపురుషు లుండి రచటఁ బాండురవర్ణో
త్తరుఁ డొకఁడు కృష్ణవర్ణో, త్తరుఁ డొక్కఁడు వారు లోకధారణదక్షుల్. 5

సీ. అచ్చటఁ గలవు ఋష్యాశ్రమంబులు పెక్కు, వసియింతు రచట దేవతలు సతము
వినఁబడు నిరతంబు వేదఘోషము లందు, నగ్నిహోత్రము లుండు నచట నెపుడు
నుత్తరాయణమున నొనరింపఁబడు మర్త్య, పూజ యాదేవతాపుంగవులకు
నలవిగా దొరులకు నరుగ నచ్చోటు దక్షి, ణాయనంబున హిమవ్యాప్త మగుట

గీ. నమ్మహాదేవతలదర్శనమ్మువలన, జన్మశతకోటిపాతకసంఘ మెల్ల
భస్మ మైపోవు క్షణములోపలనె తరమె, బదరికాశ్రమతీర్థప్రభావ మెన్న. 6

ఆ. అచట నలకనంద యనుగంగలోపల, స్నాన మాచరించినను నశేష
విశ్వసేవ్యుఁ డైనవిశ్వేశ్వరుని నటఁ, జూచినను సమస్తశుభము లొదవు. 7

క. చలిపితి నే నొకపరి నా, స్థలమున నొకవత్సరంబు తపమును దానన్
సులభంబుగ నామెదుటను, నిలిచెను నారాయణుండు నిజరూపముతోన్. 8

సీ. అపుడు నేను బ్రసన్నుఁడైన గోవిందునిఁ, దిలకించి హర్షంబు మొలకలెత్త
సాష్టాంగవందనం బాచరించితి దాని, కచ్యుతుం డెడఁద నాహ్లాద మొంది
యీశ కోరుము వరం బిచ్చెద నావుడు, వాంఛించితిని నేను వరయుగంబు
విష్ణుభక్తుండనై వెలయునట్లును ముక్తి, దాతృత్వమును నేను దాల్చునట్లు
ఆ. నామనోరథంబునకు సంతసము నొంది, వాసుదేవుఁ డట్లె వరము లొసఁగె
నదియె మొదలు గాఁగ హరిభక్తిపరుఁడనై, యేను ముక్తి శ్రితుల కిచ్చుచుంటి.
వ. అని నుడువుటయు నారదుండు సంతోషించుచుఁ దదనుమతిం గొని పాండవులం
జూచువేడ్కతోడఁ గామ్యవనంబునకుం జనియె. 10
సీ. అపుడు పాండవు లెల్ల నమరతపస్వికి, సముచితపూజలు సలుపుటయును
వారిభక్తికి మెచ్చి నారదుం డాశీర్వ, దించెఁ దద్దుఃఖంబు దీఱునట్లు
ధర్మజుం డప్పు డాతనిఁ జూచి మహనీయ, తెలుపు మేకర్మంబువలన మాకుఁ
గాననవాసదుఃఖము సంభవించెనో, నాఁగ ని ట్లనియెను నారదుండు
గీ. ధర్మజ యెవండు సుఖి భవోదధిని గూలి, పరితపించెడివారిలో నరసిచూడఁ
గానరాఁ డొక్కఁడును సుఖి కడకు నాకు, దేహములను ధరించిన దేహులందు. 11
సీ. ప్రత్యక్షదైవమై పరగుసూర్యుఁడె సుఖి, యన్న రాహుగ్రస్తుఁ డయ్యె నతఁడు
రవిబింబము గ్రసించురాహువె సుఖి యన్న, హరి చక్రమునఁ ద్రుంచె నతనిశిరము
చక్రధరుండైన శౌరియె సుఖి యన్న, నునిచె జాలంధరుం డుదధి నతనిఁ
జక్రి నోడించిన జాలంధరుఁడె సుఖి, యన్న నీశ్వరహతుం డయ్యె నతఁడు
గీ. నావుడు యుధిష్ఠిరుండు మానసమునందు, విస్మయము నొంది మునివర్య వేడ్క గలిగె
వినఁగ జాలంధరునిచరిత్రను వచింపు, మనుటయును నిట్టు లనియె నయ్యమరపతాని. 12

—: జాలంధరాఖ్యానకథనము :—

సీ. వినుము ధర్మజ తెల్పెదను మున్నొకప్పుడు, సపరివారముగను శతమఖుండు
కైలాసమున కేఁగి నీలకంఠునియొద్ద, నద్భుతంబుగను నాట్యంబు సేసె
దానికి శంకరుం డానందభరితుఁడై, వాసవ కోరుము వరము ననియె
నంతట వాసవుం డతిగర్వమును బొంది, హరసన్నిభునితోడ నాజి గోరెఁ
గీ. గాలకంధరుఁ డాతనిగర్వమునకు, నాత్మలోఁ గ్రోధ ముదయింప నణఁచి దాని
నప్పటికిఁ బైకి నవ్వుచు నమరనాథ, వరము నిచ్చితి నట్లె నీ వరుగు మనియె. 13
వ. అంతట మహేంద్రుండు సంతోషించుచు సపరివారంబుగాఁ ద్రిదివంబునకుం జనియె.
క. ఆతఁడు పోయినవెంటనె, చేతంబునఁ గ్రోధ మెచ్చి శితికంఠునకున్
భూతములు బెగడ మూర్తీ, భూతం బయి నిలిచె హరుఁడు పొడగని దానిన్. 15
సీ. క్రోధంబ సింధువార్ధులకు వేగమె యాత్మ, జాతుండవై నీవు జనన మంది
యమరనాథునిగర్వ మణఁగింపు మని యాజ్ఞ, యీయంగ నాక్రోధ మేఁగి యపుడ

యబ్ధిసింధునదీసమాగమవేళను, బొడమెను వారికిఁ బుత్రుఁడుగను
నాకుమారుఁడు పుట్టినప్పు డేడ్చినయేడ్పు, వలనఁ గంపించె భూవలయ మెల్ల
గీ. నిండె జగముల నెల్లఁ దన్నినద మపుడు, చెడుటను సమాధిముద్ర నిశ్చేష్టుఁ డగుచుఁ
గొంతసే పుండి యావలఁ గుతలమునకు, హంసయానంబుతో బ్రహ్మ యరుగుదెంచి.
గీ. అది పయోనిధిగర్జన మని తలంచి, యబ్ధికడ కేఁగి యతనిచే నర్చ నొంది
జలధి నీ వేల గర్జింపవలసివచ్చె, నెల్లలోకంబులును దల్లడిల్లఁ జెపుమ. 17
సీ. అనవుడు వార్ధి యి ట్లనియె లోకేశ నీ, యాజ్ఞలో వర్తించునట్టినేను
గంపింప లోకముల్ గర్జింతునె మదాత్మ, భవుఁ డేడ్చె నిపుడె యుద్భవము నొంది
యేమి యేడుపొ యిదె యెఱుఁగంగరాదాయె, రక్షింపుము లోకరక్షకుఁడవు
నా విని తత్పుత్త్రి నందనుసిం గొని, వచ్చె సింధువు ప్రమొక్కి వనజజునకుఁ
గీ. గూరుచుండంగఁ బెట్టె నాకొడుకుఁగుఱ్ఱ, నజునితొడమీఁద నంత నాయర్భకుండు
బ్రహ్మగడ్డము గట్టిగాఁ బట్టుకొనఁగ, నజుఁడు విడిపించుకొన లేక యఱవ సాగె. 18
గీ. అంత నుద్వేగమున లేచి యబ్ధి యాత్మ, బలము నెల్లను వినియోగపఱిచి యెట్లొ
కడకు విడువంగఁజేసె నక్కొడుకుకేలు, స్రష్ట యప్పుడు మిగుల విస్మయము నొంది.
వ. ఆయర్భకునకు జాలంధరుం డనునామకరణంబు గావించి సంతోషంబున ననేకవరంబు
లొసంగి హంసయానారూఢుం డై నిజనివాసంబునకుం జనియె. 20
సీ. అంతటఁ గ్రమముగా నాయర్భకుఁడు వృద్ధి, నొందుచు బలవృద్ధిఁ బొందు చుండ
నాటలాడుచును హర్యక్షవారణవరా, హాదులతోడ నత్యద్భుతముగఁ
బడఁగొట్టుచును వ్యోమపథమున కెగిరి ఖే, చరవిమానములను ధరణిమీఁదఁ
గంధి యెల్లను నల్లకల్లోలముగ నీఁదు, లాడుచు సత్త్వంబు లంత మొందఁ
గీ. గడపి బాల్యంబు యావనాక్రాంతకాయుఁ, డై విరాజిల్లుచుండంగ నపుడు శుక్రుఁ
డరుగుదెంచి పయోధియభ్యాశమునకుఁ, దత్సపర్యాప్రతుష్టచేతస్కుఁ డగుచు. 21
సీ. అనఘ జంబుద్వీపమున నుండె నొకమహా, పీఠంబు యోగినీప్రీతిదంబు
మును నీవు దానిని ముంచితి వది నేఁడు, జాలంధరునకు రాష్ట్రముగ నిమ్ము
దానిలో నుండి యీతం డభేద్యుండు గా, నెల్లజగంబుల నేలఁగలఁడు
నావుడు వారిధి నందనప్రేమంబు, వలన నాదేశంబు వదలిపెట్టె
గీ. నంతటఁ ద్రిశతయోజనాయతియును శత, యోజనవిశాలతయుఁ గలిగియుండినట్టి
యాస్థలంబున వసియించి యచట నేరు, పఱచుకొనియెను నొకదివ్యపత్తనంబు. 22
వ. ఆస్థలంబు జాలంధరదేశం బనియును నాపురంబు జాలంధరపురం బనియును నమ్మహా
పీఠంబు జాలంధరపీఠం బనియును దన్నామంబున విశ్రుతంబు లయ్యె. సాగరుం
డాత్మోదరోద్భవం బగుమహాపద్మసహస్రసైన్యంబును శుక్రుండు సమస్తశస్త్రాస్త్ర
విద్యలును జాలంధరునకుఁ బ్రీతిపూర్వకంబుగా నొసంగిరి. 23

గీ. అపుడు శుక్రోపదేశంబు ననుసరించి, వర్తిలుచు వాఁడు పాతాళవాసు లైన
దానవుల నెల్ల రావించి తనసమక్షు, మందు నుంచికొనియె బలం బగ్గలింప. 24

గీ. అట్లు సైన్యంబు సమకూడినంత శుంభుఁ, డనునిశాచరవరుని సైన్యాధిపతిగఁ
జేసి జాలంధరుఁడు తనసీమ నెల్ల, నేలఁ దొడఁగెను నిజధాటి కెదురు లేక. 25

ఆ. అట్లు కొంతకాల మరుగంగఁ గ్రౌంచప్ర, పాదమునను జేసి స్వర్ణ యనెడి
యప్సరసకుఁ బుట్టినట్టిబృందను బెండ్లి, యాడె శుక్రునాజ్ఞ నధిపుఁ డతఁడు. 26

ఆ. అట్లు పెండ్లియాడి యఖిలజగన్మోహ, నాంగి యైనబృంద నధిపుఁ డనుఁ
డామెతోడఁ గూడి యఖిలసౌఖ్యములను, ననుభవించు చుండునట్టితఱిని. 27

సీ. దైత్యగురుండు తత్సవిధంబునకు వచ్చి, యతనియదృష్టంబు నభినుతింప
నది విని సోత్సాహుఁ డగుచు నధిపుఁ డుండు, కావ్యుని నెం తేని గౌరవించి
యాచార్య యమరుల కాధిక్య మేర్పడ, నేమి కారణమొ నా కెఱుఁగఁ జెపుమ
యని యడుగుటయు శుక్రాచార్యుఁ డసురకా, ర్యంబు సాధింపంగ నద నెఱింగి

గీ. వినిచి క్షీరాబ్ధిమథనగాథను సుపర్వు, లందులోఁ బుట్టినమహాపదార్థములను
నపహరించినకతమున నధికు లైరి, యని నుడివి యూర కుంటయు నతఁడు విని. 28

సీ. దుర్వారణుం డనుదూతను రావించి, యెల్లరు వినఁగఁ దా నిట్టు లనియె
దూత దుర్వారణ తూర్ణంబుగను నీవు, చని దివంబునకు వాసవునిఁ గాంచి
తెలుపుము నావాక్యములుగ వానికి నిట్లు, జాలంధరుఁడ నేను శక్ర వింటె
నాపితృవ్యుఁడు పయోరాశి వమము వానిని మీఱు, దచ్చి తద్గతపదార్థముల నెల్ల

గీ. నపహరించితి రనుమాట యిపుడు నాకుఁ, దెలిసె నవి యన్నియును నేఁడు తెచ్చి యిచ్చి
స్వర్గమును వీడి పొమ్ము నిర్జరులతోడ, నాశ గల దేని బ్రతుకుపై నాత్మలోన. 29

క. అనవుడు దుర్వారణుఁ డా, తనియాజ్ఞను శిరమునందుఁ దాల్చి రయమునన్
జని దివమున కింద్రునిఁ గనుఁ, గొని వార్ధిసుతోక్తు లెల్లఁ గొంకక తెలిపెన్. 30

సీ. అపుడు నవ్వి మహేంద్రుఁ డతని కి ట్లనియె దు, ర్వారణ మామకవాక్యములను
వినిపింపు మధిపునకు నిట్లు సాగర, నందన క్రోధంబు నొంద నేల
నాశత్రు వైనమైనాకుండు దాఁగంగఁ, దనకుక్షిలోపలఁ దాఁ వొసంగె
జగముల దగ్ధంబు సలిపినబడబాగ్ని, దాఁగంగఁ దనలోనఁ దావు నిచ్చె

గీ. ధర్మవిద్వేషు లైనట్టిదానవులకు, నాశ్రయం బయి క్షీరదధ్యాజ్యములను
గోరికయె యీయఁ దొడఁగె నాకారణముల, క్షీరపాథోనిధిని మథించితిమి మేము.

గీ. హీనగుణములు గలిగినహేతువుననె, సింధునాథుని మున్ను శోషిల్లఁ జేసెఁ
గుంభజన్ముఁడు గూడ దుర్గుణుల పైఁబడు, క్షణములో భస్మ మైపోవె జగములెల్ల.

క. కావున వ్యర్థంబుగ మా, తో వైరముఁ బూని నీవు దుర మొనరింపం
గా వచ్చుపక్షమున సప, రివారంబుగను నంతరించెదవు సుమీ, 31

క. అని చాలించుటయును గ్ర, క్కున దుర్వారణుఁడు వచ్చి క్షోణీపతికిన్
వినిపించెఁ బూస గ్రుచ్చిన, యనువున జాలంధరునకు హరిభాషణముల్. 34

గీ. ఆమహేంద్రునివచనంబు లాలకించి, మండిపడి లయకాలరుద్రుండువోలె
నబ్జశతకోటిదైత్యసైన్యంబుతోడ, హంసకోటియుతవ్యోమయాన మెక్కి. 35

సీ. ప్రస్థితుండై మందరంబునకుం జేరి, ప్రథమదినమున నాపర్వతమును
ఖండించి ముక్కముక్కలుగ రెండవనాఁడు, మేరుభూధరమును జేరి దానిఁ
జెండాడి కూల్చి తచ్ఛిఖరంబులను దాని, పై నున్నవనములు పాడుచేసి
యచ్చట నుండుసిద్ధాంగనాజనముల, వ్రతభంగములు గాఁగఁ గుతిలపఱచి

గీ. పిమ్మట సుమేరుమేదినీధ్రమ్ము నాల్గు, దెసలు చెల్లాచెదరు చేసి దిక్పతులను
దుప్పదూలంగఁ గొట్టి ఖద్యోతవిధుల, త్రోవ లరికట్టి చెఱఁబట్టె దేవతలను. 36

క. అంతట దేవత లెల్లరుఁ, జింతాకులహృదయు లగుచుఁ జిత్తంబుల దై
త్యాంతకుని శరణు వేఁడఁగ, నంతరమున నెఱిఁగి శార్ఙ్గి యమరావనర్థ్. 37

ఉ. తాలిచి చేతఁ జక్రమును దార్క్ష్యుని నెక్కి సుపర్వకోటికిన్
మేలొనగూర్ప నెంచి గమనింపఁ గడంగుచు నుండ నంతలో
శ్రీలలితాంగి శార్ఙ్గిదరిఁ జేరి మనోహర నాసహోదరుం
డాలమునన్ భవన్నిహతుఁ డౌ నని భీతి జనించె నెమ్మదిన్. 38

క. అనవుడు మాధవుఁడు వరా, నన భీతిల వలదు పొమ్ము నావుడు హర్షం
బునఁ జనియె లక్ష్మి యంతటఁ, జనుదెంచె మురాంతకుండు స్వర్గంబునకున్. 39

ఆ. అపుడు వజ్రపాణి యుపగతధైర్యుఁడై, యబ్ధిసుతునితోడ నాహవంబు
సలుప నిశ్చయించి స్వబలంబుతోఁ గూడి, నిలిచెఁ జక్రధరునినికటమందు. 40

వ. అంతట గోవిందుండు సకలామరసైన్యంబుతోడం గూడి జాలంధరునిపై దాడివెడలుటయు జాలంధరుండు సకలదైత్యసైన్యసమేతుండై మాధవునితోడ యుద్ధంబునకు సిద్ధంబయ్యె.

ఆ. అపుడు మేరుమందరావనిధరమధ్య, భూమి యయ్యె యుద్ధభూమి యుభయ
పక్షసైన్యములకుఁ బ్రారంభ మొనరించి, రని నొనర్ప దితిజు లదితిజులును. 42

క. వారలవీరధ్వనులను, వారలశరవర్షములను వ్యాప్తం బగుటన్
బోరుకొనఁదొడఁగె ధర ది, గ్వారణములు గీఁకపెట్టఁ గడఁగెన్ భీతిన్. 43

క. ప్రదరాసిముఖాయుధముల, విదళితులై యుభయపక్షవీరులు గూలన్
నదు లయి రక్తము పాఱెన్, గదనక్షితి యరుణజలధిగాఁ గనఁబడియెన్. 44

గీ. అధిపుఁ డగుటను రాజయక్ష్మామయంబు, సకలరోగంబులకును దానికి యముండు
ప్రభు వగుట సర్వరోగముల్ ప్రబలి ఘోర, యుద్ధ మసురులతోఁ జేసి యోడి పాఱె.

—: బలాసురవధవృత్తాంతకథనము :—

క. అంతట బలాసురుండు ది, గంతము లదరంగ నార్చి యనిమిషబలముల్
వింతగను జయించి శచీ, కాంతునిపై కుఱికెఁ బ్రళయకాలుఁడుపోలెన్. 46

సీ. అపు డింద్రుఁ డతనిపై నఖిలాస్త్రముల నేయ, నవి విశీర్ణము లయ్యె నతనిఁ దాఁకి
యంతట నతిబలుం డగుబలుం డమరేంద్రు, నురమును మోఁదె ముద్గరముతోడ
దానికి సురపతి తాళఁ జాలక యార్చె, నది గని పకపక నసుర నవ్వె
నానవ్వుతోఁ దదాస్యమునుండి విస్మయ, కరము గాఁగను మౌక్తికములు రాలె

గీ. నది విలోకించి వాసవుఁ డడలి వాని, విక్రమమునకు యుద్ధాశ విడిచి యతని
నుతి యొనర్పంగఁ దొడఁగె నద్భుతము గాఁగ, దానికి బలాసురుండు సంతసము నొంది.

గీ. ఇంద్ర నీవాంఛితార్థంబు నిచ్చువాఁడఁ, గోరుకొను మన జంభాసురారి దైత్య
నాథ నీమే నొసంగుము నాకు ననుడు, నాతఁ డిచ్చితిఁ బుచ్చుకొ మ్మనియె నంత.

వ. పురందరుండు వజ్రంబుచే నయ్యసురుని దేహంబు వ్రక్కలొనరింపఁ బ్రథమఖండంబు కనకాచలంబునందును ద్వితీయఖండంబు హిమాచలంబునందును దృతీయఖండంబు గోనగంబునందును జతుర్థఖండంబు దేవనదియందును బంచమఖండంబు మందరపర్వతంబునందునుం బడియె. తచ్ఛరీరావయవంబు లన్నియు రత్నబీజత్వముం జెందె. తదస్థికణంబులు షట్కోణాకారమణు లయ్యె. లోచనంబులవలన నింద్రనీలంబులును శ్రోత్రంబులవలన మాణిక్యంబులును రక్తంబువలనఁ బద్మరాగంబులును మేదస్సువలన మరకతంబులును స్ఫటికంబులును జిహ్వావలనను మాంసంబువలనను బ్రవాళంబులును దంతంబులవలన మౌక్తికంబులును నాదంబువలన వైడూర్యంబులును జనియించె. ద్విపేంద్రజీమూతవరాహభేకమత్స్యాహిశుక్త్యంబుధివేణుజాతంబు లగురత్నంబుల కన్నింటికిని నివియె జన్మస్థానంబులు. సితవృత్తగురుస్నిగ్ధకోమలనిర్మలరూపషడ్గుణయుక్తం బగునది మౌక్తికంబు. దానిని హాటకఖచితంబు గావించి ధరించె నేని సర్వగ్రహదారిద్ర్యాదిభయంబు కలుగనేరదు. పురీషంబువలనఁ గాంస్యంబును వీర్యంబువలన రజతంబును మూత్రంబువలనఁ దామ్రంబును సంగోద్వర్తనంబువలనఁ బిత్తలంబును నఖంబులవలనఁ గనకంబును నుత్పన్నంబు లయ్యె. 49

క. బలదైత్యునిసాహసమును, వలదె ప్రశంసింప సహజవైరుల కైనన్
గలదె యదేయం బనునది, తిలకింపఁగ నెందు నేని ధీరాత్ములకున్. 50

గీ. అంధునకుఁ బద్మపత్త్రాయతాక్షిపగిది, మధురసంభాషణమువోలె బధిరునకును
శవమునకుఁ బుష్పమాలికచందమునను, వ్యర్థము కదర్యునకుఁ గలయర్థ మెల్ల. 51

గీ. నఱకు చున్నను గత్తి కంఠమునఁ బెట్టి, దుర్హృదులను ననుగ్రహింతురు మహాత్ము
లంబుధిని జేర్పవె సపత్ను లైనఁ గూడ, శైలతటినుల గంగాది శైవలినులు. 52

క. పరహితతత్పరు లగుస, త్పురుషులు స్వవినాశకాలమునను వికృతి నొం
దరు ఛిన్నం బగు చున్నన్, బరశువునకు నీదె చందనద్రువు తావిన్. 53

గీ. అనుపకారుల కుపకార మాచరించు, నట్టివారలె సాధువు లాత్మకార్య
వశమునను జేయుదురు దుష్టవర్తనులును, బరుల కుపకారముల నది పాటి యగునె.

సీ. అంతట వజ్రిచే హతుఁ డయ్యె బలదాన, వాగ్రణి యనుపలుకు లాలకించి
విలపించుచును వానివెలఁది ప్రభావతి, శీఘ్రంబుగను రణక్షితికి వచ్చి
యటఁ బడియున్న బలాసురకాయంబు, వీక్షించి యేడ్చుచు వెక్కివెక్కి
నాథ నీనోటను నా కొకమాట చె, ప్పక యున్న విడుతు నాప్రాణములను

గీ. నని కృతాత్మతనూపరిత్యాగబుద్ధి, యగుచు నుండంగ నీక్షించి యబ్ధిసుతుఁడు
దానవాచార్యుని మహాత్మ వీని నెట్టు, లేని బ్రతికింపు మన శుక్రుఁ డిట్టు లనియె. 55

క. కోరి మరణంబు నొందిన, వారిని బ్రతికింప నాకు వలనుపడదు నీ
కోరికనిజేసి యబ్ధికు, మారక యొకసారి వీని మాటాడింతున్. 56

క. అనవుడు జాలంధరుఁ డి, ట్లనియెను గురువర్య చేయు మట్టులె నాఁగన్
దనుజాచార్యుండు విలో, చనములు మూసికొని ధ్యానసంస్థితుఁ డయ్యెన్. 57

గీ. అట్లు ధ్యానించు చుండ నిశాటగురుఁడు, బలముఖోద్గత మై యొక్కపలుకు సాధ్వి
లీన మొనరింపు మింక నీమేను మామ, కావయవములలోపల నని శమించె. 58

వ. అంతట నామాట యాదేశంబుగం గైకొని ప్రభావతి తత్క్షణంబ నదీరూపముం బడసి
బలాంగవిలీన యగుచు సుమేరువునకుఁ బూర్వవాహిని యై ప్రవహింపందొడంగె.
దానంజేసి తత్తోయంబున రత్నంబుల కెల్ల నుత్తమకాంతి యేర్పడియె. 59

క. అంతట జాలంధరుఁ డ, త్యంతక్రోధమున రేఁగి యనిమిషులను వి
క్రాంతిమెయిం గూల్చి శచీ, కాంతునిపై నిశితసాయకంబుల నించెన్. 60

క. అపు డాశరముల నెల్లను, నిపుణంబుగఁ ద్రుంచి యమరనేత స్వనారా
చపరంపర నంబుధిసుతు, నిపయిన్ గురియించె భూరినిశితాశుగముల్. 61

సీ. ఆబాణముల నెల్ల నబ్ధిసూనుఁడు హస్త, ములఁ బట్టి ముక్కముక్కలుగఁ జేసి
యింద్రునిపైఁ గురియించె నత్యద్భుత, శక్తియుక్తము లై నసాయకముల
నవి తాఁకి వాసవుం డట్టిట్టు లయి చేష్ట, లుడిగి రథంబుపై నొఱగి వ్రాలె
నది చూచి యాకసం బంట నార్చెఁ బయోధి, నందనుం డాసింహనాదమునకు

గీ. వాసవుఁడు లేచి దిగ్గన వాని నపుడె, యంతమొందింపఁ దలఁచి వజ్రాయుధమును
వైచుటయుఁ బట్టుకొని దాని వార్ధిసుతుఁడు, వజ్రిని వధింప బిరబిర వచ్చు చుండ.

గీ. అపుడు గడగడలాడుచు నమరనేత, స్యందనమునుండి దిగ్గనఁ గ్రింది కుఱికి
యొక్కపరువున దైత్యారియొద్ద కరిగి, పట్టుకొనియెను దత్పాదపద్మములను. 63

వ. అంతట జాలంధరుండు పురందరునిరథంబు నధిష్ఠించి మాతలిని సారథిగాఁ జేసికొని నిరంకుశంబుగాఁ దిరుగుచు నమరసైన్యంబు నెల్లఁ జెండాడఁదొడంగె. 64

సీ. అప్పుడు జనార్దనుం డాగ్రహంబును జెంది, గరుడాధిరూఢుఁడై సురలతోడ
నాజిభూమిని జొచ్చి యసురవాహిని నెల్లఁ, బరిమార్పఁ దొడఁగె నుద్భటముగాఁగ
నచ్యుతహత మైనయసురసైన్యంబు నె, ల్లను దిలకించి జాలంధరుండు
ప్రళయాగ్నివలె మండిపడి దైత్యయోధుల, కంబుజాక్షునిఁ గూల్ప నాజ్ఞ యొసఁగె

గీ. నంతటను జెలరేఁగి యోధాగ్రగణ్యు, లందఱును నొక్కమూఁక యై యాశుగములఁ
గ్రుమ్మరించిరి హరిపైనిఁ గుతల మెల్ల, నతలకుతలము గాఁగఁ దదారభటుల. 65

గీ. ఆశరంబులు చని శౌరి నావరింప, హరి కనంబడఁడాయె మేఘావృతాద్రి
కైవడిని ధూమసంఛన్నగగనమట్లు, షట్పదాకీర్ణ తామరసంబువోలె. 66

గీ. అట్లు క్షణకాల ముండి దైత్యాంతకుండు, తపనుఁడు హిమంబుఁబోలెఁ దద్బాణతతిని
క్షణములో రూపుమాపి రాక్షసుల శుష్క, పర్ణముల నాశుగమువోలెఁ బాఱఁగొట్టె.

ఉ. అప్పుడు శైలరోముఁ డనునాశరవీరుఁడు పైకి దూఁకి రా
నిప్పులు రాలుకోలలను నీరజనాభుఁడు వానిమేనిపై
గుప్పెను గాని తద్విశిఖకోటులు తాఁకి తదీయదేహమున్
గుప్పునఁ గూలె ముక్కలయి క్షోణిపయిన్ దనుజుల్ హసింపఁగన్. 68

చ. అది గని మాధవుండు హృదయంబున నాగ్రహ మగ్గలింపఁగాఁ
గదనధరాతలంబునకు గ్రక్కున దూఁకి నిశాటసైన్యమున్
జిదురుప లై పడంగ గదచేతను మోఁదుచు శైలరోమునిన్
గదిసి తదీయశీర్షమును ఖడ్గమునన్ నఱకెన్ గఱుక్కునన్. 69

క. ఖండితశిరుఁ డయ్యును నా, తండు భుజాదండములను దార్క్ష్యునిఁ బట్టన్
ఖండించెఁ జక్రి తద్భుజ, దండంబుల నంత వాఁడు ధరణిం గూలెన్. 70

వ. అప్పుడు జాలంధరుండు ఖడ్గరోమానీతం బగురథంబు నెక్కి నిర్జరసైన్యంబు ఛిన్న భిన్నంబుగాఁ గొట్టుచు వాసుదేవునిసమీపంబునకుం జేరి. 71

క. గోవింద నిన్నుఁ గూల్చెడి, భావంబున వచ్చినాఁడఁ బ్రథమమున ననున్
నీవు ప్రహరింపు మావలఁ, గావించెద నేను జేయఁగలకార్యంబున్. 72

చ. అనవుడు వాసుదేవుఁడు క్రుధారుణలోచనుఁడై శరాసనం
బున విశిఖంబులం దొడిగి ముందుగ నేసెఁ బయోధిసూతిమే
నను దరువాత నంబునిధినందనుఁ డయ్యవి యొక్కకోలచేఁ
దునిమి మ ఱొక్కబాణమునఁ దుప్పలుదూలఁగ నేసెఁ దార్క్ష్యునిన్ 73

క. ఆశరఘాతంబున నా, గాశనుఁడు విచేష్టుఁ డగుచు నవనిం గూలన్
దాశార్హుఁ డతని విగత, క్లేశునిఁ గావించి తాఁకి కేలను లేపెన్. 74

వ. అంతట గరుడుండు ప్రబుద్ధుం డై లేవ నాతని నధిష్ఠించి వాసుదేవుండు ,తనపయిం
బడుదానవసైన్యంబుతోడ యుద్ధంబు గావింపం దొడంగె. 75

ఆ. అపుడు వీతిహోత్రుఁ డనిలసహాయుఁ డై, తగులఁబెట్టు చుండ దానవులను
బ్రతుకఁజేయు చుండె భార్గవుఁ డాత్మవి, ద్యాప్రభావమున గతాసువులను. 76

సీ. అంత జాలంధరుం డపగతమరణ మై, చెలరేఁగుదానవసేనఁ గూడి
ఛిన్నభిన్నంబుగాఁ జేయ నిర్జరులను, క్షతగాత్రమై దేవసైన్య మెల్ల
నమరత్వమునఁ జేసి ప్రాణావశేష మై, తద్రణస్థలిఁ బతితంబు గాఁగ
గురుఁడు ద్రోణాద్రికి సరిగి శీఘ్రముగ నా, శైలంబునుండి యోషధులఁ దెచ్చి

గీ. తన్మహత్త్వంబుచే దేవతలను స్వస్థ, దేహులను జేయ వారలు తేజరిలుచు
లేచి రణభూమినుండి నిశాచరులను, జక్క గావింపఁ దొడఁగిరి మిక్కటముగ.

ఆ. అపుడు దైత్యసైన్య మంత కంతకుఁ దగ్గి, పోవు చుండ నబ్ధిపుత్రుఁ డడలి
యసురగురుని నడిగె నాశరబల మెల్ల, క్షైణ్య మొందుటకును గారణంబు. 78

గీ. అంత భార్గవుఁ డతనికి నమరగురుని, చేష్టితం బెల్లఁ దెలుపంగ సింధుసుతుఁడు
సరభసంబుగఁ జని క్షీరజలధికడకుఁ, దండ్రి ముంపుము ద్రోణభూధరము నిపుడె. 79

చ. అనవుడు క్షీరవార్ధి వినయంబున నిట్లనియెన్ గుమార నే
నొనరుపఁజాల నట్టిపని యొక్కపుడున్ శరణార్థులన్ వధిం
చిన నిహమున్ బరంబును నశింపవె నావుడు ద్రోణశైలమున్
వనధిసుతుండు క్రోధమున వామపదంబునఁ దన్నె నుగ్గు గాన్. 80

గీ. ఆపదాఘాతమునకు ద్రోణాచలంబు, మేను చూర్ణంబు గా నాఁగలేనికతన
వేఁడికొని వార్ధితనయుని విడిచి క్షీర, జలధిని రసాతలమునకుఁ జనియె నంత. 81

సీ. జాలంధరుఁడు వాయుజవమున మరల నే, తెంచి యాయోధనదేశమునకు
దైతేయయోధసమేతుఁ డై దేవసై, న్యము నెల్లఁ జీల్చి చెండాడఁ దొడఁగె
నంతట నమరసైన్యం బంతయును బడి, పోవ నాయోధనభూమియందు
ధిషణుండు మునుపటితీరున క్షీరాబ్ధి, కరిగి ద్రోణాచలం బందు లేమిఁ

గీ. జింత నొందుచుఁ దిరిగి విచ్చేసి యమరు, లార ద్రోణాద్రి క్షీణించె నాశ లుడిగి
పాఱిపొం డింక నన నపాంపతిసుతుండు, గురునిజందెంబు సిగయును గోసి విడిచె.

క. అంతట బ్రతికితి ననుకొని, సంతసమున నమరగురుఁడు చనియెను సురలున్
వింతగఁ దారిరి యపు డసు, రాంతకజాలంధరులకు నాహవ మయ్యెన్. 83

సీ. అపుడు జాలంధరుం డతితీవ్రసాయక, వ్యూహంబులోన నచ్యుతునిఁ ద్రోసె
నాసాయకవ్యూహ మడఁగార్చి గోవిందుఁ, డాశుగాగ్నినిఁ గూల్చె నబ్ధిసుతుని
నాయాశుగాగ్నిఁ జల్లార్చి వార్ధిసుతుండు, బంధించె హరి నిషుపంజరమున
నాయిషుపంజరం బబ్జాక్షుఁ డగలించి, శరవర్షమున ముంచె జలధిసుతుని

సీ. నంతట రథంబు డిగి సాగరాత్మజుండు, వచ్చి బిరబిరఁ గదలంగ వసుధ యెల్లఁ
బక్షిరాజును నొకకేలఁ బట్టి గగన, మందుఁ ద్రిప్పి క్రౌంచద్వీపమందు వైచె. 84

క. విరథుం డై మాధవుఁ డపు, డరిమండలభయద మైనయాకృతితోడన్
ధరమీఁద నిలిచి జాలం, ధరునిరథము నొక్కకోల ధరపైఁ గూల్చెన్. 85

ఉ. అంతట వారి కిర్వురకు నద్భుత మైనసమీక మయ్యె ది
గ్దంతులు బెగ్గడిల్ల వసుధాస్థలి కంపము నొంద భూనభో
భ్యంతరసీమ బోరుకొన నాశరకోటులు దేవకోటులున్
భ్రాంతిని జెంది నిల్వబడఁ బట్టినశస్త్రము లట్టె యుండఁగన్. 86

క. పురుషోత్తముఁ డపు డాసం, గరమున కంఠంబు కానగారామిఁ గ్రుధా
భరమునఁ జేకొని శక్తిఁ ద, దురస్థలముఁ గాఁడి పాఱ నురవడి వైచెన్. 87

క. ఆశక్తిఘాతమునఁ జే, ష్టాశూన్యుం డగుచు నిలఁ దటాలునఁ బడి తా
నాశరధిజుఁ డొకత్రుటిలో, నాశరబల మెల్ల హర్ష మందఁగ లేచెన్. 88

ఆ. అట్లు లేచి సాగరాత్మజుఁ డాగ్రహ, మగ్గలింప శౌరి నాశుగముల
నేయ శార్ఙ్గి లక్ష్మియిష్టముఁ దీర్పంగ, నెదిరి నేయ మాని పృథివిఁ బడియె. 89

సీ. అప్పు డేడ్చుచు లక్ష్మి యచ్చటి కరుదెంచి, యనుజ బావను గూల్ప నర్హ మగునె
జితుఁ డయ్యె నీచేత శ్రీపతి మానుము, వైర మింక మదీయవాంఛ జేసి
యని వేఁడ వార్ధిసూనుని వాఁడు భక్తితో, భగినికి బావకుఁ బ్రణతిఁ జేసి
నిలువంగఁబడుటయు నీరజాక్షుఁడు లేచి, యాతనిశౌర్యంబు నభినుతించి

గీ. వత్స నీవాంఛ దీరంగ వరము నిత్తుఁ, గోరుకొను మన దేవ నాకోర్కి తీర్ప
నిచ్చ గలదేని లక్ష్మితో నీవు క్షీర, వార్ధిని వసింపు మని వేఁడె వార్ధిసుతుఁడు. 90

గీ. అప్పు డాతనికోర్కికి నచ్యుతుండు, సంతసము నొంది గరుడుని సంస్మరించి
యాతఁ డరుదేర వానిపై నధివసించి, కమలతో నేఁగి పాలసంద్రమున నుండె. 91

క. అది మొదలుగ నేర్పడియెం, బదముగ వసియింప శ్వశురమందిరము రమా
సుదతీమనోహరునకున్, గదనంబు సమాప్త మయ్యె నాయకుఁ డేఁగన్. 92

సీ. జాలంధరుం డంత శాత్రవశూన్యుఁ డై, స్వర్గంబునకు నేఁగి స్వైరముగను
స్థాపించి స్వర్గరాజ్యమున శుంభుని నిశుం, భుని యువరాట్పదంబునను నిల్పి
ధరణికి వచ్చి తా మరల వసించి జా, లంధరపీఠస్థలంబునంద
యబ్ధార్బుదద్వయం బఖిలరాజ్యము నేలె, నప్రతిభటుఁడుగా నమితశక్తి

గీ. వనధిసంభవురాజ్యపాలనము నందు, వంధ్యలు దరిద్రులును విధవలును నరక
గాములు కురూపులును బ్రతిగ్రహణపరులు, రోగులును దస్కరులును జారులును లేరు.

గీ. సస్యసంపూర్ణ యై ధాత్రి సంతతమును, గనులపండువు గావించుఁ గలను గూడ
నశుభవార్తలు వినఁబడ వర్థు లైన, ప్రజలె కనరారు వార్ధిజురాజ్యమందు. 94

వ. అంతట నింద్రాదిదేవత లెల్లరును స్వర్గభ్రష్టు లై యమృతప్రాప్తియును యజ్ఞహవిః ప్రాప్తియును లేక కానలం దిరుగుచు నెంతకాలంబునకును దమదురవస్థలు దీఱమికి వగచుచు నొక్కనాఁడు బ్రహ్మలోకంబున కరిగి ప్రాణాయామంబుచే బరమాత్మ యందు మనోలయంబు గావించి సమాధినిష్ఠాగరిష్ఠుం డై యుండుచతుర్ముఖుని దర్శించి మొఱవెట్టుటయుఁ బితామహుండు సమాధివిరతుం డై వారల నవలోకించి తద్దీన దశకు దురపిల్లుచు వారలతోడం గూడి కైలాసంబున కేఁగి పార్వతీపతిని స్తుతింప నీశ్వరుండు ప్రసన్నుం డై మహేంద్రునిం దిలకించి నవ్వుటయు నింద్రుండు లజ్జావనత వదనుం డై యూరకుండె. 95

సీ. అంతట నీశ్వరుం డబ్జోద్భవునిఁ జూచి, జాలంధరుఁడు మహాశక్తియుతుఁడు
విష్ణుశస్త్రము గాని జిష్ణుశస్త్రము గాని, వధియింపఁజాలవు వార్ధిసుతుని
నింత యేటికిఁ బూర్వసృష్టాయుధంబు లే, వైనను వ్యర్థముల్ వానియెడల
నాసత్త్వమున గాఁగునవ్యాయుధమును మీ, రెవ రైన సృష్టించి యిచ్చునెడల
గీ. వాని నిప్పుడె వధియించువాఁడ నేను, నావుడుఁ బితామహుండు పినాకపాణి
యెఱుఁగఁజాలము నీశక్తి నెవ్వరమును, నీవె దక్షుఁడ వాపని నిర్వహింప. 96

వ. అని ప్రార్థించుటయు శంకరుండు ధ్యానశక్తిచే నచ్యుతుని నాహ్వానింపఁ దత్క్షణంబ వాసుదేవుం డరుదెంచి యెదుట నిలిచె. 97

సీ. అంతట శంభుఁ డి ట్లనియె గోవింద జా, లంధరనాశకాలంబు వచ్చె
వదలు మిచ్చోట భవత్క్రోధతేజంబు, ననవుడు మాధవుం డట్లె విడిచె
నవల ధాతకు శంభుఁ డట్లె చెప్పఁగ ధాత, యగజాధవుఁడు కోరినట్ల చేసె
నటుమీఁదఁ ద్ర్యంబకుం డనిమిషులకు నట్లె, చెప్పంగ సురలును జేసి రట్లె
గీ. యంతటను దన్మహాతేజ మఖిలలోక, ములను గ్రసియించుశక్తితో వెలుఁగుచుండఁ
దాండవం బాడె వామపాదంబుతోడ, దానిమీఁద మహేశుఁ డందఱును బెగడ. 98

వ. అంత నమ్మహాతేజఃకూటంబు మహేశ్వరతాండవమర్దనంబున నరలక్షత్రయోపేతం బును నస్థికోటివ్యాకీర్ణంబును నగుచక్రంబుగా నేర్పడియె. దాని నుంచుటకు లోహ తేజఃపృథ్వీకాఠిన్యంబుం గై కొని విశ్వకర్మ నిర్మించిన కోశంబు తత్స్పర్శమాత్రంబున నిరగ్ధం బయ్యె. 99

సీ. తద్దర్శనమున సంత్రస్తులై సుర లెల్లఁ, బరువు లెత్తుచు నుండ స్మరహరుండు
వలదు భయం బని వారిని రావించి, తచ్చక్రమును గొని తాను గేల
దానికిఁ బెట్టె సుదర్శనం బనుపేరు, ధాతచేతికి నిచ్చెఁ బ్రీతితోడ
బ్రహ్మ చేకొని దానిఁ బరికించు చుండఁ ద, జ్జ్వాలల నజునికూర్చంబు గాలె
గీ. నంతటను సత్వరంబుగ హరుఁడు దానిఁ, గై కొని విధాతృహస్తపంకజమునుండి
కానఁబడకుండ నొరులకు గర్భమందు, దాఁచికొనియెఁ గదర్యుఁడు ధనమువోలె. 100

గీ. అప్పు డసి యెల్లఁ జూచి నే నబ్ధిసుతుని, కడకు శీఘ్రంబు చని నిన్నుఁ గెడప నెంచి
యత్న మొనరించు చున్నవాఁ డంధకారి, యని వచింప మదుక్తి వాఁ డాలకించి.

క. మునివర నిరామిషం బగు, నని కూడదుగాన శంకరాలయమున నుం
డిన శ్రేష్ఠవస్తు వే దై, నను దెల్పుము కలహకారణంబుగ నుంచన్. 102

వ. అని యడుగుటయు నే నాలోచించి జాలంధరునితో ని ట్లంటి.

క. కరమున భిక్షాపాత్రము, కరిచర్మము మొలను మేనఁ గాకోదరముల్
గరళము గళమునఁ దాలిచి, హరుఁ డుండు గజముఖషణ్ముఖాత్మజయుతుఁ డై.

గీ. వాహనము జీర్ణవృషభంబు వాసభూమి, వల్లకాఁ డింక నాతని వైభవంబు
తెలిసికొను మీవె యూహించి తెలుప నేల, కాని యొక్క విశేషంబు కలదు వినుము.

క. కామహరుం డగువానికి, భామామణి యొకతె కలదు పార్వతి యన నా
సోమానన సౌందర్యము, నేమానినియందుఁ గాన మిప్పటివఱకున్. 106

క. కాంచితి రంభను దారను, గాంచితిఁ గాంచితిని బుంజికస్థలి బృందన్
గాంచితి నింకను జెలువలఁ, గాంచితి నెందఱనో యేల గణుతింపంగన్. 107

క. ఆరామామణు లందఱు, గౌరీపదనఖమునకును గారు సమానల్
కోరితివి గానఁ జెప్పితి, వారాంనిధితనయ పోయివచ్చెద నింకన్. 108

క. అని యాతనియనుమతిఁ గొని, చనుదెంచితి నేను సింధుజన్ముం డంతన్
బనిచెను దౌత్యము నడుపం, గను స్వర్భానువును నీలకంఠునికడకున్. 109

సీ. సైంహికేయుం డంత శంభుసన్నిధి కేఁగి, హరునకు వందనం బాచరించి
రుద్ర నే జాలంధరునిదూత నతఁడు పం, పంగ వచ్చితిని నీచెంగటికిని
నీవు విరాగివి నిర్గుణుండవు పితృ, వననివాసివి శౌర్యవర్జితుఁడవు
జాలంధరుఁడు మహాశౌర్యరాశి త్రిలోక, సామ్రాజ్యభోక్త ప్రశస్తిశాలి

గీ. భువనమోహిని యైననీపూవుఁబోఁడి, నతఁ డపేక్షించు చున్నవాఁ డతని కిచ్చి
బ్రతుకుము సుఖంబుగను భైక్ష్యపరుఁడ వగుచు, నట్లు గాకున్నఁ దప్పదు హాని నీకు.

సీ. అని పల్కుటయు వినాయకబాహులేయులు, తలలు వంచిరి భూతతతి వడంకెఁ
వాసుకి నేలపైఁ బ్రాలె హేరంబవా, హనపుచ్ఛమును బట్టుకొనియె నంతఁ
గేక వైచెను గేకి కేకేకారవం, బున వాసుకి త్యజించి మూషికమును
గట్టిగా ధూర్జటికంధరంబును బట్టి, విడువక యార్పులు విడువఁ దొడఁగె

గీ. హరలలాటాగ్ని తత్పవనారభటిని, బ్రజ్వలింపంగఁ దచ్ఛిఖాస్పర్శమునను
గరఁగి మృడశీర్షశశికళ కాఱె యమృత, మీశగళకకపాలము లెల్లఁ దడిసె.

క. అమృతాప్లావిత మగుటను, గమలజరుండములు జీవకళ గల వై వే
దములఁ బఠింపం దొడఁగెను, భ్రమ మొదవఁగ నెల్లరకును బహుచిత్రముగన్. 112

వ. అంత భూతనాథునిజటాజూటంబునుండి త్రివదనుండును ద్రిచరణుండును ద్రిపుచ్ఛం
డును సప్తహస్తుండును బింగళాకారుండును జటిలుండును నగుకీర్తిముఖుం డనురుద్ర
గణాధీశ్వరుం డుదయించి మహేశ్వరునకు సాష్టాంగప్రణామంబు గావించి. 113

సీ. తండ్రి యాఁకలికి నేఁ దాళఁజాలక యుంటి, నాజ్ఞ యిచ్చితి వేని యారగింతు
నొక్కగ్రాసముగ జేసికొని లోకమ్ముల, నెల్ల నిప్పుడె నాఁగ నీశ్వరుండు
గణనాథ సంగరాంగణహతు లగువారి, భక్షించి క్షుద్బాధఁ బాపికొనుము
నావుడు నపుడు రణం బేదియును లేమి, నారగించెను స్వదేహమునె యతఁడు

గీ. వానిభక్తికి మెచ్చి యీశ్వరుఁడు వీర, నీవు నాయాలయముననె నిలువు మెవరు
నన్నుఁ గనవచ్చి తలఁపరో నిన్ను వారు, చెడుదు రనఁ గీర్తిముఖుఁ డుండె శివునికడనె.

గీ. అప్పు డేమియు ననకుండ నష్టమూర్తి, సలుప భ్రూసంజ్ఞ నంది తత్సంజ్ఞ నెఱిఁగి
రాహువును గౌరవించి శీఘ్రముగఁ బనిచె, నంతరాహువు విస్మితుఁ డగుచు నేఁగి.

క. హరునిసమక్షమునందున్, జరిగినవిషయమును దెలుప సర్వము జాలం
ధరుఁడు విని శివుఁడు తనకున్, బరిభవ మొనరించె ననుచు భావించి మదిన్. 116

వ. సముచితోక్తులచే జాలంధరపీఠంబునందుఁ దనసతీమణి యగుబృందను నెలకొల్పి
స్వర్గమర్త్యపాతాళరసాతలసప్తసాగరగర్భసమాయాతదైత్య దానవకోటిచతురంగ బల
సమేతుం డై ఖడ్గరోమానీతం బగుమహారథంబు నధిష్ఠించి యుద్ధయాత్రాదుందుభి
ధ్వానంబు గావించె. 117

ఆ. ఆనినాదమునకు నవనిచక్రం బెల్లఁ, గంప మొందెఁ బడియె క్ష్మాధరములు
గతులు దప్పిపోయె గ్రహముల కష్టది, జ్మండలములు బెరసి మాఱుమ్రోఁగె. 118

వ. అట్లు యుద్ధయాత్రాభేరీనాదంబు గావించి జాలంధరుండు కైలాసంబునకుం బ్రస్థితుం
డయ్యె. 119

గీ. అప్పుడు దానవసైన్యంబు లరుగు చుండ, నయ్యె గజహయరథమయ మవని యెల్లఁ
జామరాత్మక మయ్యె దిక్చక్ర మెల్ల, గగన మెల్ల ఛత్త్రధ్వజాకార మయ్యె. 120

వ. అట్లు చనిచని జాలంధరుం డొక్కదినంబులోఁ గైలాసంబునకుం జేరి యచ్చటఁ గృత్తి
వాసుండు లేమింజేసి తనభయంబున నాతండు పాఱిపోయె నని తలంచి యోగదృష్టిచే
భార్గవుండు చెప్పినమార్గముంబట్టి షష్టిసహస్రయోజనసముచ్ఛ్రితం బగుమానసోత్తర
మహాశైలంబున కరిగి తదారోహణంబు గావించి ధూర్జటిమందిరంబు ముట్టడించె.

గీ. అపుడు మృత్యుంజయుండు తదద్రిశృంగ, మందు నునిచి సఖీయుత యైనయుమను
బ్రమథపతి యైననందినిఁ బ్రధనమునకుఁ, బనుప నంది హరాజ్ఞానిబద్ధుఁ డగుచు. 122

వ. ద్వాత్రింశదశ్వయుక్తంబును షోడశచక్రమండితంబును షష్టిధ్వజసంయుతంబును ద్వాత్రిం
శద్యోజనాయతంబును సర్వశస్త్రసమేతంబును గాకతుండసారథిసమానీతంబును నగు
సాంగ్రామికరథంబు నధిష్ఠించి వినాయకస్కందులు చక్రరక్షకులుగా నుండ గణాగ్రే
సరులతోడం బ్రస్థితుం డై దైత్యవీరులతో ఘోరయుద్ధంబు గావింప దైత్యసైన్యం

బంతియు ఛిన్నభిన్నం బై రుద్రగణశరప్రహారంబుల కోర్వంగ జాలక శైలంబును విడిచి భూతలంబునం బడి పఱవం దొడంగుటయు రుద్రగణంబు దాని వెంటబడి తఱుమం జొచ్చె. 123

గీ. శంభుగణపాతితనిశాటసైన్యరవము, ప్రళయకాలంబునందు నర్ణవము లేదంగ
జలుపుఘోషంబుకై వడి సకలలోక, భీకరం బయి ప్రజలం జీకాకుపఱిచె. 124

వ. అట్టిసమయంబున భీరువులై పాఱిపోక నిలువంబడి శుంభుండు నందితోడను నిశుంభుండు మహాకాలునితోడను గాలుండు లోకేశ్వరునితోడను శైలరోముండు పుష్పవంతునితోడను మహాబలుండు మాల్యవంతునితోడను గోలాహలుండు మాయాబలునితోడను భయానకుండు చండితోడను రాహువు స్కందునితోడను సప్తరోముండు కూష్మాండునితోడను ఘుర్ఘురుండు మదనునితోడను గేతుముఖుండు శుభ్రునితోడను జంభుండు వినాయకునితోడను బాతాళకేతుండు హాసునితోడను రోమకంటకుండు భృంగీశునితోడను మఱియుం గొందఱు దైత్యమహావీరులు మిగిలినరుద్రగణంబులతోడను ఘోరంబుగాం బోరాడి రుద్రగణంబులదేహంబులు పఱియలు గాం గొట్ట రుద్రగణంబులు దైత్యప్రహారంబులకు గాత్రంబులనుండి రుధిరప్రవాహంబులు ప్రవహింప నిలువం జాలక శైలంబుమీందికిం బఱచి మహేశ్వరుని పాదంబులపయిం బడిరి. 125

సీ. అంతట ధూర్జటి యానతీయంగ వీర, భద్రుండు సుసిద్ధపఱిచి వృషము
నగజకుం జెప్ప నాయమ శీఘ్రముగ వచ్చి, తిలకంబుం బెట్టి తద్వృషభమునకు
వృషభేంద్ర యొకక్షణం బేనియు విడువక, స్వామిని రణమందు జయము వడసి
సత్వరంబుగ రమ్ము స్వామితో నని పల్కం, దలయూంచె వృషభంబు తత్క్షణంబ

గీ. యప్పుడు గౌరిని దిలకించి యష్టమూర్తి, దేవి మాయావు లసురులు నీవె నిన్ను
రక్షణము చేసికొనుము జాగ్రత్తతోడ, నేను గణసంవృతుండనై యేగుచుంటి.

వ. అని చెప్పి వృషభంబు నారోహించి త్రింశన్మహాపద్మసహస్రప్రమథగణపరివేష్టితుండై వీరభద్రుండు హర్యక్షయుక్తస్యందనంబు నధిష్ఠించి వామపార్శ్వంబునను మణిభద్రుండు తురంగసమేతరథంబు నారోహించి దక్షిణపార్శ్వంబునను నంగరక్షకులుగా నుండ శైలంబునుండి క్రిందికిం దిగియె. 127

గీ. అంత దానవబలము దిగ్దంతు లడల, సింహగర్జనములు చేసి శివగణంబు
పైనిం బడుటయు దానవబలమునకును, బ్రమథగణములకును మహాప్రధన మయ్యె.

క. ఆరణమున రాత్రించర, వీరులు చెలరేగి ప్రమథవీరుల నెల్లన్
ఘోరాస్త్రశస్త్రదళితశ, రీరుల నొనరించి యావరించిరి శూలిన్. 129

ఉ. అప్పుడు శూలి రేంగి ప్రళయాగ్ని తెఱంగునం బ్రజ్వరిల్లుచున్
దుష్టులు దూలంగ గొట్టి రణధూర్వహులై ననిశాటవీరులన్

బిప్పి యొసర్చెఁ గ్రవ్యభుగనీకము నెల్లను సంతఁ గన్నులన్
నిప్పులురాల మండుచును నీరధిసూనుఁడు శస్త్రపాణి యై. 130

వ. సదాశివునిపై కేతెంచుచుండ వీరభద్రమణిభద్రులు శరవర్షంబుచే వాని నిరోధించి బాధింప జాలంధరుండు వారితోడ దారుణప్రవిదారణంబు గావించి వారల జయించి శంకరునితోడ ఘోరయుద్ధంబు గావించి విజయంబు నొందం జాలక ఖిన్నుండై పార్వతీపాతివ్రత్యభంగంబు గావించినం గాని హరుండు సమయఁ డని తెలిసికొని మాయావి యగుటంజేసి తనరూపంబు దాల్చి తానుబోలె రుద్రగణంబుతోడ సంగ్రామంబు గావింప శుంభుని నియోగించి దుర్వారణసహితుండై సంగ్రామరంగంబు విడిచి యెవ్వరికినిం దెలియకుండ మానసోత్తరశైలంబు నారోహించి తాను హర రూపంబు ధరించి నందిరూపధరుం డగుదుర్వారణునిస్కంధముం బట్టికొని బడలు వడుచు రక్తసిక్తగాత్రాంబరంబులతోడఁ బార్వతీమందిరసామీప్యంబునకుం జనియె.

సీ. అపుడు ససంభ్రమ లై మృడానీసఖు, లరుదెంచి తమవెంట నగజ రాఁగ
స్వామి యే మయ్యెను సంగ్రామ మిట్లు నీ, వేతెంచుటకుఁ గలహేతు వేమి
సామాన్యసంచారిచందంబునను సదా, శివుఁడును దపియింపఁ జిత్ర మయ్యె
నని పల్కుటయు నంది యటఁ బడవైచె దాఁ, గట్టినయంబరగ్రంధి విప్పి

గీ. మృతఫణిశరీరములను ఖండితగణేశ, శక్తిధరమస్తకముల నాశ్చర్యముగను
నవి గనుంగొని పార్వతి హాగణేశ, హాకుమార యటంచు బిట్టార్చి యేడ్చె. 132

గీ. అంతటను గొల్లు మని యేడ్చి రామెచెలులు, కాలువలుగను గన్నీరు జాలువాఱ
నపుడు మాయాశివుం డిట్టు లనియె దేవి, యేడ్వకుము నేను బ్రతికితి నింతె చాలు.

సీ. అనుటయు గౌరి యి ట్లనియెను దేవ యె, క్కడ కేఁగె వృషభంబు కాన నైతి
ననవుడు నాతఁ డి ట్లనియె జాలంధరుం, డొక్కదెబ్బనె దానిఁ జక్కడంచె
నావుడు స్వామి నానయనంబులకు నీవు, గోచరించితి విదె కోటి నాకు
శరజాలఘాతజర్జరవిగ్రహుఁడ వైన, నీకుఁ బ్రియం బేమి నే నొనర్తు

గీ. నని విషాదంబునను బల్క నతఁడు దేవి, యొక్కపరి కౌఁగిలించి న న్నాదరింపు
మదియె నీ విట్టిసమయమునందు నాకుఁ, జేయవలసినప్రియ మేల చెప్ప నీకు. 134

వ. అని పల్కుటయు నించుక సంశయంబు గలిగి యా తనికిఁ బార్వతి యి ట్లనియె.

సీ. దేవ సర్వంబును దెలిసిననీ విట్టి, యసమయంబున నిట్లు లాడఁ దగునె
పుత్రశోకంబునఁ బొగిలెడినే నేడ, లీలార్థ మైనయాశ్లేష మేడ
ననవుడు నాతఁ డి ట్లనియె భామిని యేల, ప్రతివచనంబును బలికె దీవు
పతివాంఛ దీర్పనిసతికి దుర్గతి గల్గు, నని పల్కుబుధులవాక్యంబు వినవె

గీ. లేరు ప్రమథులు పుత్రులు లేరు మఱియు, లేదు సతి యుండియును గూడ లేని దాయె
సర్వశూన్యుండ నైతి నేఁ జావకుండ, బ్రతుకుటయె తప్పు నేఁటి కీపాట్లు వచ్చె.

క. పోవుదము నంది రమ్మని శు, భావహ మగుచోట విడువఁ బ్రాణములను నేఁ
గావించితి సంకల్పము, నావుడు సంక్షోభ మొదవె నగజాత కెదన్. 137
క. ఏయమచే క్షోభింపం, జేయఁబడునో జగము లెల్ల సింధుసుతునిచే
నాయంబయు క్షోభింపం, జేయఁబడియె నేమి చెప్ప సృష్టిమహిమమున్. 138
సీ. ఆపార్వతీక్షోభ మావిర్భవింపంగఁ, జేయ సంక్షోభంబు శ్రీధవునకు
వనజాక్షుఁ డదరిపాటునఁ జివ్వుకున లేచి, శేషతల్పమునుండి శీఘ్రముగను
గమనించి సంక్షోభకారణంబును నెంచి, జాలంధరుని వినాశము నొనర్పఁ
దద్వినాశనము బృందావ్రతభంగంబు, నొనరింప కున్నఁ గాదని యెఱింగి
గీ. తాపసాకృతి ధరియించి తాను దనకుఁ, జేసికొని యాదిశేషుని శిష్యునిఁగను
నరిగి యొకకాననంబున కచట నుండి, మంత్రశక్తిని బృందను మరులుకొలిపె. 139
ఉ. అంతట బృంద భర్తృవిరహానలతప్తమనశ్శరీర యై
కాంతుని సంస్మరించుచును గాఁకకు నోరువలేక దేవతా
కాంతలు దైత్యభామలును గాంచి తదార్తిని జేయునేవ లో
కైంతయుఁ దాప మార్పమిని నేమియుఁ దోఁపక వంత నొందుచున్
ఉ. కంటికి నిద్ర పట్టమిని గాములుగాఁ గనుపట్టుటన్ జనుల్
వంటక మింపు గామి నొకవత్సర మై క్షణకాల ముంటచే
నింట వసింపలేక వసియించుచు నెట్టులొ శయ్యపైనిఁ దా
నొంటిగఁ బండి యూయఁ గను లొక్కచతుర్దశినాఁటివేఁకువన్. 141
సీ. ఛిన్నకర్ణంబును ఛిన్ననాసికమును, రూక్షపాండురభస్మరూషితమును
రక్తసిక్తమును గృధ్రవికృష్టలోచనం, బును నైనజాలంధరునిశిరంబు
కృష్ణవర్ణయు ముక్తకేశియు నరుణవ, స్త్రయు నగుకాళి హస్తమునఁ బట్టి
మురియుచుఁ దద్రక్తమును ద్రావు చున్నట్లు, స్వప్నంబు రాఁ గుండె జల్లు మనఁగ
గీ. శయనముననుండి లేచి దుస్స్వప్నఫలము, నడిగి బ్రాహ్మణులను వార లశుభ మనుచుఁ
జెప్పి తచ్ఛాంతిదానముల్ చేయు మనుడు, నట్లె కావించియును దుఃఖ మాఁగ కునికి.
గీ. ఇంట నుండంగఁ జాలక యెదకు శాంతి, యొదవు నని యెడ భ్రాంతిచే నొక్కనాఁడు
ప్రాణసఖి స్మరదూతితో రథము నెక్కి, యరిగి సౌభాగ్యవనమున కచటఁ దిరిగి. 143
క. అప్పటికిఁగూడ దుఃఖం, బెప్పటివలె నుంట నేఁగె నిం కొకవనికిన్
దప్పించుకొనఁగ శక్యమె, యెప్పగిదిని విష్ణుమాయ యెవ్వరి కేనిన్. 144
సీ. అతిభీకరం బైనయాకాననంబును, బృంద విలోకించి భీత యగుచు
సఖి త్రిప్పుము రథంబు చయ్యన నింటికి, ననవుడు సఖి భ్రాంతి యావహిల్ల
దేవి కానఁగరాదు త్రోవ యేదియు నిందు, నెటు పోవవలయునో యెఱుఁగ నైతి
విడిచెదఁ బగ్గముల్ విధి యెట్టు లుండునో, యట్టులె యగుఁగాక యనుచు విడిచె

గీ. నంతటను నశ్వతరులు స్వేచ్ఛానుగతిని, నరుగుచు న శోకకాననమందుఁ జొచ్చి
నిలిచెఁ గదలక యచట మేనులు వడంక, నది కనుంగొని స్మరదూతి యడలి లోన.
గీ. ఏది యేనియు భయహేతు విచట నుండ, వచ్చు నని బృందతోడ వాక్రుచ్చు చుండఁ
బిడుగుపడినట్లు చెవులలోఁ బడియె నొక్క, దారుణధ్వని గుండెలు తల్లడిల్ల. 146
సీ. ఆధ్వనివెంటనె యతిభయంకరుఁడు త్రి, పాదసమేతుండు పంచకరుఁడు
సప్తనేత్రుఁడు హరిస్కంధాననుఁడు వ్యాఘ్రు, కర్ణుఁడు పింగళకాంతియుతుఁడు
ప్రస్తదీర్ఘారుణజటిలకేశుండును, నై నరాక్షసుఁ డొక్కఁ డరుగుదెంచె
వాని నాలోకించి వా రిర్వురును రథ, మందు వ్రాలిరి వివశాంగు లగుచు
గీ. నంతటను వాఁడు రథ మెత్తి హస్తమునను, ద్రిప్పి గిఱ్ఱునఁ గొట్టి ధరిత్రిమీఁద
నశ్వతరులను రథమును నాహరించి, బృంద నొకకేలఁ గొని యెత్తి మ్రింగ నుండ.
సీ. ఆసమయంబున నరుదెంచి మునివేష, ధరుఁ డైనదైత్యారి త్వరితముగను
గనియె నారాత్రించరునిఁ దీక్ష్ణదృష్టిచే, భస్మ మై కూలె నాపాపి దాన
నప్పుడు బృంద వ్యాఘ్రాస్యమధ్యచ్యుతి, నొందినమృగివోలె నూర్పు విడిచి
యత్తపోధనునిపాదాంబుజంబులమీఁద, వ్రాలి యి ట్లనియెను ప్రాణదాత
గీ. కాచితివి నన్ను రక్షార్హకాలమందు, నార్తరక్షకుఁ డైననారాయణుడవు
కాని కేవలమానివి గావు నీవు, నావుడుఁ దపస్వి సంప్రత్తభావుఁ డగుచు. 148
క. సతి నేను దేవశర్మను, సుతుఁడ భరద్వాజమునికి సుఖముల నెల్లన్
వితత యని రోసి యరణ్యస్థితి నొంది తపించు చుంటి శిష్యునితోడన్. 149
గీ. తెలిసికొందుఁ ద్రికాలవార్తలను నేను, సిద్ధు లన్నియు నుండు నాచేతిలోన
నిట్టిదురవస్థలో నీకు నేమి చెప్ప, వే శోకవిషాదవార్త సాధ్వీలలామ. 150
క. అని యూరకుండుటయు న, వ్వనధితనూభవునిరాణి వగచుచుఁ జిత్తం
బున దుస్స్వప్నఫలంబును, వినఁగల్గునో యేమొ యనెడివెఱ బాధింపన్. 151
గీ. తాపసోత్తమ చెప్పుము దాఁపకుండ, విధివిధానంబు తప్పునె వెఱచి పలువ
ననుచు వేఁడికొనంగ ని ట్లనియె మౌని, యుస్సు రని నోట వేడినిట్టూర్పు విడిచి.
సీ. అమలాంగి నీనాథుఁ డైనజాలంధరుం, డాజి గావించుచు హరునితోడ
హరచక్రవిచ్ఛిన్నశిరుఁ డయి పడిపోయె, ననుడు బృంద విచేష్ట యగుచుఁ బడియె
నంతట నూరార్చి యమి యాయమను దేర్చి, వెలఁది పై జరిగినవిధము వినుము
త్వత్సతీత్వప్రభావమున నత్తల వచ్చి, పడియె మాయాశ్రమభవనమందు
గీ. దాని నే దాఁచి యుంచితిఁ దద్విశేష, మంతయును యోగదృష్టిచే నరసికొనుట
నింతలో నీవె వచ్చితి విటకు శుభము, గలుగవలసినవిధి యున్న కారణమున. 153
గీ. అని వచింపంగ బృంద యి ట్లనియె స్వామి, తాపసులనోటిమాటలు తప్ప వనెడి
ధైర్యమునఁ గోరు చుంటిని దానివలనఁ, గలుగుశుభ మేదొ తెలుపుము కరుణతోడ.

క. అని ప్రార్థింపఁగ ముని యి, ట్లనియెను సతి యిది మహారహస్యము దీనిన్
వినఁ గూడ దొరులు చెప్పం, జన దేనును గాని నీకు సర్వము వినుతున్. 155

క. విను మామ స్తకము భవ, త్తనుసంపర్కమున సాంగతను జెంది సచే
తన మగు నద్దానను నీ, మనమునఁ గలదుఃఖ మెల్ల మాయంగలుగున్. 156

వ. అని నుడువుటయు బృంద సాభిలాషముగా ని ట్లనియె. 157

ఆ. అనఘ ప్రాణదానమునెకాక భర్తృదా, నమును జేయఁ దలఁచినాఁడ వీవు
నీఋణంబుఁ దీర్ప నేర్చునె నాబోఁటి, యల్పురాలు నాఁగ న త్తపస్వి. 158

ఆ. చాన యిట్లు మమ్ము శ్లాఘింపవల దేను, జేసినట్టిహెచ్చుచేత యేమి
సతతమును బరోపకృతిని గావించుట, సహజగుణము చూవె సాధువులకు. 159

గీ. అనుటయును బృంద సఖితోడ నతనివెంటఁ, జని తదాశ్రమమును జొచ్చి స్వామి యెచట
నుండె నావల్లభునిశిరం బొక్కసారి, చూచి కనులార విడిచెద శోకజలము. 160

చ. అనవుడు న త్తపస్వి విమలాంగి తపస్సమయం బతీత మై
చనియెడు మాకు నీవు చని చయ్యన నాకుటజంబులోపలన్
గనుఁగొను మొక్కశయ్యపయిఁ గన్పడు నీపతిమ స్తకంబు నా
ననుచరితోడ బృంద చని యక్కడనున్ గని శయ్య నచ్చటన్. 161

ఆ. దానిమీఁద నున్నతనపతిశీర్షంబు, గాంచి దేహ మెల్లఁ గంప మొంద
నెడఁదలోన మిగుల దడ పుట్ట నేడ్చుచుఁ, గన్నునీరు పాఱఁ గాల్వలుగను. 162

సీ. హ స్తంబునను గొని యాశిరంబును నాథ, కనుఁగొను మొకసారి కన్ను లెత్తి
నేను నీబృందను నీప్రాణకాంతను, దైవంబుగను నిన్నె తలఁచుదాన
ననుఁ బాసి యొక్కక్షణంబును నెచటను, నిద్రింప విం డెట్లు నిద్రపట్టె
నాకర్మ మి ట్లుండ నీ కెట్లు హరునితో, యుద్ధంబు తగ దనుబుద్ధి పుట్టు

గీ. నని పలికి కన్నులకు నద్దుకొని యురంబు, నందుఁ జేరిచికొని యాస్యమందుఁ బెట్టి
కొని యిముడ కున్కి దుఃఖంబు కొట్టుకొనకు, గట్టిగను గౌఁగిలించి బిగ్గఱగ నేడ్చె.

గీ. అప్పు డామ స్తకం బఖిలాంగపూర్ణ, మగుచు జాలంధరాకృతి నంది నిలిచె
నది కనుంగొని మౌనివాక్యము యథార్థ, మని తలఁచి బృంద యాహ్లాద మంకురింప.

క. పరవశ యగుచును నాతని, చరణంబులపైని వ్రాలె సఖియుఁ బ్రమోద
స్ఫురితాంతరంగ యగుచున్, గరములు జోడించి మ్రొక్కి కడగా నిలిచెన్. 165

సీ. అపుడు జాలంధరుం డవలి కేఁగఁగఁ గంట, సైఁగ గావింపంగ సఖి గ్రహించి
చనియె నవ్వలకుఁ దత్క్షణమంద యతఁ డంత, బృందాంగనను లేవనెత్తి కేల
ననునయించుచును బర్యంకంబునందుఁ గూ, ర్చుండఁగఁ బెట్టి కూర్చుండి తాను
దనశీర్ష మామెస్కంధమున వ్రాల్చి స్వవామ, కరమున నామెను గౌఁగిలించి

గీ. యింతి నీమాట వినకుండ నేను నాఁడు, సాహసంబున నేఁగి యీశ్వరునితోడ
దురము ఘోరంబుగ నొనర్చి తుదిఁ దదీయ, చక్రధారానికృత్తమస్తకుఁడ నైతి.

వ. అంతట నామస్తకంబు త్వదీయపాతివ్రత్యప్రభావంబునంజేసి యిచ్చోటం బడి భవత్తనుసంసర్గంబువలన నేఁటికి సాంగత్వంబు నొందె. 167

గీ. చచ్చి బ్రతికితి మరల నీసరణి నింకఁ, బ్రాక్తనవిషాద మంతయుఁ బాసి నన్ను
హర్షవారిధిలో నోలలార్పు మీవు, గననిధర్మంబు లెం దేని కలవె సాధ్వి. 168

క. అని పలుకుటయును నాయమ, తనభర్తయె యతఁ డటంచుఁ దాపసవచనం
బునను దదీయోక్తులవల, నను నాకృతిసామ్యమునను నమ్మి మొదందర్. 169

క. ఆతనిపాదము లొత్తుచుఁ, బ్రీతిఁ గనఁబఱుప నతఁడు ప్రియ మెసలారన్
జేతోజాతశిలీముఖ, ఘాతవివశుఁ డగుచుఁ జేర్చి కౌఁగిట నామెన్.

ఆ. చిబుక మెత్తి కేలఁ జిఱునవ్వు నవ్వుచుఁ, జలిపె నధరపాన మలవు మెఱయ
నంత బృంద పులకితాంగి యై యెదురొత్తు, లీయఁదొడఁగె నతఁడు హాయి చెంద.

ఉ. అంతట వార లిర్వురము నంగజసంగరముం బొనర్చిరే
కాంతమనస్కులై చిలువ లట్లు లనంగి పెనంగుచున్ గడున్
సంతస మొప్పఁ గొన్నిదివసంబు లటుల్ సన నొక్కనాఁడు ర
త్యంతమునన్ గనంబడియె నంసగతుం డయి మాని బృందకున్.

సీ. అప్పుడు బృంద క్రోధారుణనేత్ర యై, స్వభుజబంధమునుండి వాని విడిచి
యుత్థిత యై శయ్యనుండి చివ్వున్నఁ, దాపస నీ విట్లు తగునె చేయ
నెవఁడవో నీవు నా కెఱిఁగింపుము నిజంబు, ననుడు మురారి యై యతఁడు నిల్చి
తన్వంగి నేను మాధవుఁడను నీమీఁదఁ, గలరక్తిచే నిన్నుఁ గలిసినాఁడ

గీ. నీమనోనాథుఁ డగుజలనిధిసుతుండు, హరునితో యుద్ధ మొనరించి యతనిచేత
నిహతుఁ డయ్యెను దాన నిందీవరాక్షి, నన్నుఁ జేపట్టి లోకమాన్యతను గొనుము.

క. నినుఁ గనుఁగొనినది మొదలుగ, వనజేక్షణ నామనంబు వారిధితనయన్
గన నొల్లదు కల్గెను నీ, తనుసంసర్గమునఁజేసి ధన్యత నాకున్. 174

సీ. అనవుడు బృంద యి ట్లనుఁ జక్రి నామనో, హరుఁడు నీ కొనరించినట్టిమేలు
భస్మంబులోఁ బోయఁబడినయాజ్యహవిస్సు, చాయను నిష్ప్రయోజనత నొందెఁ
బరసతీదేహసంపర్కంబు నొనరింప, నగునె ధర్మత్రాత వై నసీకుఁ
గావించితివి మహాఘంబుఁ జేసినకర్మ, మనుభవింపక తీఱ దజున కైన

ఆ. మాయచేసి నన్ను మాయాతపస్వి వై, కొనినచందముననె కొని త్వదీయ
మహిళ నేఁగుఁగాక మాయాతపోధనుఁ, డొకఁ డటంచు శాప మొసఁగె నంత. 175

క. కమలానాథుఁ డదృశ్యుఁ, త్వము నొందె నతండు చనినతత్క్షణమ కుటీ
రము శయ్యనమ్మును దదుపకర, ణములును నాశ్చర్యముగఁ గనంబడ వాయెన్.

సీ. అప్పుడేను సర్వశూన్యం బై నయకా్కనఁ, దిలకించి బృంద లోఁ గలుగ భీతి
స్మరదూతికను గని సఖి విలోకించితే, దైత్యారిమాయావిధాన మెల్ల
విడిచితిఁ బురమును విడిచితి రాజ్యంబు, పడితి శూన్యం బై నయడవిలోనఁ
గాంతుఁడు సంశయగ్రస్తజీవితుఁ డయ్యె, నెచటికిఁ బోదు నే నెచట నుందు
గీ. నిచ్చటనె మరణించెద నింకఁ గడచి, యీవనము నెట్టు లేని నీ వేఁగు మనియె
నంత నిట్లనియెను సఖి యమ్మ నాకుఁ, బ్రాణమవు నీవు నిన్ను నేఁ బాయఁజాల.
చ. అనవుడు బృంద యేమియును నాడఁగలేక సఖీసమేత యై
చనుచును నవ్వనంబుననె సాహస మేర్పడ నొక్కచోటఁ గ
న్గొని యొకయుజ్జ్వలహ్రదము గ్రుంకి యటన్ దరి కేఁగుదెంచి చ
య్యన నటఁ గూరుచుండి విషయంబులనుండి మరల్చి చిత్తమున్.
గీ. అన్యసంపర్కదూషితం బైనమేను, దగ్ధ మొనరింప నెంచి చిత్తమున ఘోర
తపము గావింపఁ దొడఁగెఁ దత్తీక్ష్ణమునకుఁ, దాళఁజాలక లోకముల్ తల్లడిల్ల. 179
సీ. అప్పు డచ్చర లెల్ల నరుదెంచి కళ్యాణి. యీఘోరతపము నీ కేల చేయ
స్వర్గంబునందు శాశ్వతముగా మాతోడఁ, గలిసి వసింపుము కాంక్షదీర
ననవుడు బృంద యి ట్లనియె నచ్చరలార, నా కేల మీస్వర్గలోకవసతి
మత్పతిజిత మైనమఖభుగాలయమున, నెఱుఁగనె మీ రెల్ల నెనయుసుఖము
గీ. తనవు పావన మొనరించుకొనఁ దలంచి, తపము గావించు చుండినదానఁ గాని
క్షుద్రనాకసుఖంబుపైఁ గోర్కి లేదు, పొండు మీమీనికేతనంబులకు మీరు. 180
చ. అనవుడు వార లందఱును నామెమనోదృఢవృత్తికిన్ ముదం
బెనయఁగ సన్నుతించుచును నేఁగిరి వచ్చినత్రోవ నంతటన్
వనధిజకాంత జ్ఞానదహనంబునఁ గాల్చి గుణప్రతానమున్
దనువు నొనర్చి యోగశిఖిదగ్ధము గాఁగను బొందె మోక్షమున్.
ఆ. అప్పు డామెదేహ మందుండు వహ్నిని, రవులుకొల్పి సఖి విరక్తితోడ
నందు నిజశరీర మాహుతి గాఁ జేసి, పడయ రానిపరమపదము నొందె. 182
గీ. ఎచట దేహంబు విడిచెనో బృంద యచటె, యెనసె బృందావనంబు నాఁగను బ్రసిద్ధి
శౌరి బృందావియోగార్తి సైఁప లేక, మరల నరుదెంచి యటనె భ్రమ్మరఁ దొడంగె.
సీ. అపుడు గోవిందునివ్యామోహమును మాన్ప, నుతియింప మూలప్రకృతిని సురలు
వ్యోమాంతరస్థ యై యామహామాయ యి, ట్లనియె బృందారకులార నేనె
గౌరీతనువున ధాత్రీరూపమునను ల, క్ష్మీరూపమున నుల్లసిల్లు చుందు
సృష్టిస్థితిలయముల్ చేయుదానను నేనె, యుండెదఁ ద్రిగుణంబు లొంది నేనె
గీ. యని పలికి యూర కుంటయు నమరు లెల్ల, ధాత్రి లక్ష్మిని గౌరిని దలఁచికొనఁగ
వార్తు ముగ్గురు గూడ బృందారకులకుఁ, దనరఁగను సంతసంబు దర్శన మొసంగె.

సీ. అనిమిషులార మీరాయాకాంక్షితార్థంబు, శీఘ్రకాలంబున సిద్ధి నొందు
విరహార్తుఁ డై శౌరి తిరుగుచోటను జల్లుఁ, డని చెప్పి మూఁడువిత్తనము లిచ్చి
యంతర్హితలు గాఁగ నమరు లాబీజంబు, లను గొని మిగుల నాహ్లాద మొదవ
బృందాచితాభూమి కేతెంచి యచ్చోటు, నవి చల్లి యేఁగిరి యమరపురికి
గీ. నంత గౌరీప్రదత్త మైనట్టిబీజ, మయ్యెఁ దులసీ రమాదత్త మైనబీజ
మాయె మాలతి ధాత్రిచే నీయఁబడిన, బీజ మాయెను ధాత్రీమహీజ మధిప. 185
క. ఆవృక్షములను గని హరి, భావంబునఁ జెప్పలేనిప్రమదంబును బృం
దావిరహార్తిక్షతియును, నావహిలఁగఁ దత్ప్రసక్తుఁ డై వర్తించెన్. 186
వ. అది మొదలుగా నమ్మహీజంబులు విష్ణుసంప్రీతిదాయకంబు లయ్యె. ఇది యి ట్లుండ నచ్చటఁ బార్వతి సంక్షుబ్ధమానస యై యేమియుం బలుకక తపంబుచే హరమనఃప్రీతి గావింప నెంచి యచ్చటనుండి బయలుదేఱి బ్రహ్మవదనగళితం బగుశ్రుతిపూరధార వోలె మనోజ్ఞాకారంబునం బొలుచుగంగానదిని విలోకించి తత్తీరంబునం గూరుచుండి తనప్రియసఖి యగుజయతోడ ని ట్లనియె. 187
సీ. జయ సత్వరంబుగఁ జని నీవు మద్వేష, ధారిణి వై యిందుధరునికడకు
నతఁడు మాయాశివుం డగునొ మత్స్వామియె, యగునొ పరీక్షించి యరుగుదెమ్ము
నావుడు జయ తదాజ్ఞావశబద్ధ యై, పార్వతీదేవిరూపమును దాల్చి
శీఘ్రంబుగను వానిచెంతకుఁ జని నిల్వ, నతఁడు గౌరియె వచ్చె నని తలంచి
గీ. మదనబాణనిపీడితహృదయుఁ డగుట, శంక లేకుండ నామెహస్తములు వట్టి
గాఢముగఁ గౌఁగిటను జేర్చి గళితవీర్యుఁ, డయ్యె నది కాంచి జయ యిట్టు లనియె నవ్వి.
క. శివుఁడవె నీ వల్పేంద్రియుఁ, డవు వంచిత యగునె మామృడాని భవాదృ
గ్భవపాదరేణువులచే, భవదపచారంబె నిన్నుఁ బ్రహత మొనర్చెన్. 189
క. నేను భవానీభృత్యను, గాని యుమను గాను నన్నుఁ గను మని యెదుటన్
గానంబఱచి స్వరూపముఁ, దా నుమకడ కేఁగి చెప్పెఁ దదుదంతంబున్. 190
గీ. అంతట భవాని గడగడలాడి వార్ధి, తనయుఁ డేమి యొనర్చునో యనెడిభీతి
భ్రమరి యై చొచ్చెఁ బద్మమధ్యమున నండె, తిరుగఁజొచ్చిరి తత్సఖుల్ తేఁటు లగుచు.
వ. తత్కారణంబునంజేసి పార్వతి భ్రమరాంబిక యనం బరగె. 192
సీ. అంతలోపల శుంభుఁ డాలించి బృందను, హరియించెను మురారి యనెడివార్త
చండముండులఁ బంచె సత్వరంబుగ సింధు, తనయునికడకుఁ దద్వార్తఁ దెలుప
నంతట వా రేఁగి యబ్ధిసూనునిఁ గాంచి, విన్నవించిరి విన్నవిషయ మెల్ల
నపుడు జాలంధరుం డాగ్రహావిష్టుఁ డై, భవరూపమును వీడి బయలుదేఱి
గీ. యరుగుదెంచుచు మార్గమధ్యంబునందుఁ, గాంచి దుర్వారణునిఁ దాత కంసవైరి
యెంతపని చేసె జామాత నింట నుంచు, కొన్నుటకంటెను వెంగలితనము లేదు. 193

సీ. అని వచించుటయు ని ట్లనియె దుర్వారణుం, డధిప చేసినకర్మ మట్టిపోదు
హరునిభార్యను నీవు హరియింప నెంచిన, హరియించె నీభార్య నచ్యుతుండు
దీనికై నీవు చింతించిన ఫల మేమి, కడఁగుము కర్తవ్యకార్యమునకు
నావృషఁ బాథోధినందనుండు క్షణంబు, మౌని యై పరికించి మానసమున
గీ. ననఘ వచియింపు మొదటను హరిని గెడప, నరుగు టుచితమొ లేకున్నహరునిఁ గూల్ప
నేఁగు టుచితంబొ నాఁగ వాఁ డిట్టు లనియె, స్వామి చేసెడియుద్ధంబు చనదు నిలుప.
క. అరి యై నిల్వఁబడి సం, గరము సలుపుచుండువానిఁ గడతేర్పక వే
ఱొరునిఁ గొని తెచ్చుకొనునెడ, నిరువురునుం గలిసి నిన్ను హింసింపరొకో. 195
క. అని పలుకుటయును వారిధి, తనయుఁడు దుర్వారణునిహితంబును విని శం
భునితోడనె సంగ్రామము, నొనరింపఁగ నెంచి మొదట నుత్సాహమునన్. 196
క. చనుదెంచి యుద్ధభూమికిఁ, గనుఁగొని వృషభస్థుఁ డైనకందర్పారిన్
గనులను నిప్పులు రాలఁగఁ, గినియుచుఁ జేఁ బూని కాలకేదారంబున్. 197
శా. దానన్ దీక్ష్ణశిలీముఖంబులను సంధానించి యేసెన్ బటు
జ్యానాదంబున మాఱుమ్రోఁగఁగను దిక్చక్రంబు కామారిపై
నానారాచసమూహముల్ దునిమి భూతాధీశుఁ డొక్కమ్మునన్
గ్లానిం జెందఁగ నేసె వేఱ యొకకోలన్ సింధుసంజాతుపై. 198
సీ. ఆబాణహతిచేత నట్టిట్టులై వార్ధి, తనయుండు మరల స్వాస్థ్యంబు నొంది
సంధించి శతసహస్రశరంబులను వింట, నుగ్రునిపై నేసె నొక్కపెట్టఁ
దద్బాణపూరితతను వయి భాసిల్లెఁ, బార్వతీహృదయాబ్జబంభరంబు
ఖగగణవ్యాకీర్ణగగనదేశమువోలెఁ, దరుచయచ్ఛన్నభూధరమువోలె
గీ. నట్లు భాసిల్లుచుఁ బినాకి యంతకాల, వహ్నివోలె విజృంభించి వార్ధిసుతుని
కవచమును నొక్కకోలను బవులఁ గొట్ట, నతఁడు వెలుగొందె మేఘముక్తాద్రివోలె
సీ. అట్లు వెలుంగుచు నబ్ధిసూనుఁడు బాణ, వర్షంబుఁ గురిసె నీశ్వరునిమీఁద
నాబాణవర్షంబునందు మునింగియు, హరుఁ డేసె నతనిపై శరశతంబు
తద్బాణహతి నబ్ధితనయునిదేహంబు, బ్రద్దలై ప్రవహించె రక్తతటిని
యారక్తనదిఁ జూచి యాజిరంగము వీడి, బలము లన్నియు భీతిఁ బఱవఁ దొడఁగె
గీ. నంతజాలంధరుండు రక్తావృతాంగుఁ, డగుచు సాహసమున నేయ నర్ధచంద్ర
మార్గణసహస్రమును జంద్రమౌళిమీఁద, నవి చని విభూషణము లయ్యెఁ ద్ర్యంబకునకు.
వ. అంతట వీరభద్రమణిభద్రులు జాలంధరునితోడ నెదుర్కొని ముష్టీముష్టి బాహాబాహి కచాకచి యుద్ధంబులం గావించి తత్ప్రతాపంబునకు నిలువం జాలక యోడి రణభూమిం బడిరి.

చ. అది గని నందికేశ్వరుఁ డుదగ్రగతిన్ గణసైన్యయుక్తుఁ డై
గద గొని కేల వచ్చి రణకౌశలముం బ్రకటింప నుండఁగా
నెదురుగ నేఁగుదెంచి చలియింపక శుంభనిశుంభు లిద్దఱున్
గదనముఁ జేయఁ జొచ్చిరి యఖండపరాక్రమ మొప్ప నందితోన్.

గీ. అపుడు రుద్రగణంబుల కసురులకును, ఘోర మగునాహవం బయ్యెఁ గోణపులకు
జయము చేకూరుటను నందు శంకరుండు, క్రుద్ధుఁ డై దానవుల నెల్లఁ గూల్పఁ దొడఁగె.

సీ. అపుడు దానవసైన్య మల్పశేషము గాఁగఁ, గనుఁగొని శుక్రుని వనధిసుతుఁడు
స్వామి క్షీణం బయ్యె సైన్య మంతయు నీవు, సమయంబున నుపేక్ష సలుపఁ దగునె
యనవుడు భార్గవుం డభిమంత్రణ మొనర్చి, బ్రతికించెఁ జచ్చినబలము నెల్ల
హత మైనదైత్యసైన్యం బెల్ల మరల వ, చ్చుచు నుండ గ్రహియించి శూలపాణి

గీ. శీఘ్రముగ వచ్చి శుక్రునిసిగను బట్టి, శూల మెత్తంగఁ బొడువగా శుక్రుఁ డడలి
భర్గ వధియింపకుము నేను బ్రాహ్మణుఁడను, బ్రాహ్మణవధంబునను గల్గు బ్రహ్మహత్య.

వ. అని పలుకుటయు మృత్యుంజయుండు తాను మున్ను బ్రహ్మహత్యవలనఁ బడిన
పాటును స్మరించుకొని ప్రాణహరుం డైనను బ్రాహ్మణుం డగువానిని వధింపం దగ
దని నిశ్చయించి శూలంబును విసర్జించి యుద్ధసమాప్తి యగునంతవఱకును శుక్రుని
స్త్రీయోనిగతునిం జేయ సంకల్పింప నంతలోన హరునితృతీయలోచనంబునుండి యత్యు
గ్రాకారయును వివస్త్రయును మహోదరయును ముక్తకేశియును స్థూలలంబస్త
నియును నగుకృత్య ప్రాదుర్భవించి భార్గవునిం బట్టికొని స్వయోనిస్థాపితునిం జేసి
జాలంధరుండు తనపై కరుదెంచునంతలోన నదృశ్యత్వముం జెందె. 205

ఉ. అంతట సాగరాత్మజుఁ డనంతనిశాచరసైన్యయుక్తుఁ డై
పంతముపట్టి ధూర్జటిని భండనమందు వధింతు నంచుఁ గా
లాంతకుఁడా యితం డనఁగ నార్చి యుమాపతిపై కి దూఁకె ది
గ్దంతులు గీఁకవెట్టఁగను దన్నినదంబునకున్ వడంకుచున్. 206

ఉ. అప్పుడు చంద్రమౌళి కరమందుఁ బినాకముఁ బట్టి యాగ్రహం
బుప్పతిలన్ శిలీముఖము లొక్కమొగిన్ జడివానకై వడిన్
గుప్పెఁ బయోధిసూతిపయి గ్రుక్కను ద్రిప్పికొనంగ లేక వాఁ
డప్పటుబాణఘాతమున కవ్వలకుం జని యార్చి క్రమ్మఱన్. 207

క. అతినిష్ఠురసాయకసం, తతులను సంధించి ధనువునను రుద్రగణ
ప్రతతిపయిఁ గురిసె నవ్వల, శితికంఠుఁడు దైత్యబలముఁ జెండఁదొడంగెన్. 208

క. అంతట దానవసైన్యం, బంతయు క్షీణించు చుండ హరశరనిహతిన్
స్వాంతమున సింధుసూనుఁడు, చింతించుచు మాయచేత శివుని జయింపన్. 209

సీ. ఒసరించి మాయా—జయుఁడు జయ నీ వేఁగి, మోహింపఁజేయుము మొదట శివుని
ననవుడు జయ వానియాజ్ఞ నౌఁదలఁ దాల్చి, యేఁద్చుచుఁ జని వేగ మృడునికడకు
స్వామి పాపాత్ముఁడు జాలంధరుఁడు వచ్చి, కొనిపోయె గౌరిని గొంప మునిఁగె
నని పలుక—టయు శర్వుఁ డపలు వుట్టఁగ లోన, జయ హరింతురు నిశాచరులు నిన్ను
గీ. సత్వరంబుగ రమ్మని నాసవిధమునకు, ననుడు నాయమ స్వామి మాయమ్మ నుడిగి
నేను జీవింపఁజాలను నిమిష మేని, యామెయుండినకడకె నే నరుగుదాన. 210
క. అని చెప్పి సత్వరంబుగఁ, గనఁబడకుండంగఁ జనుడు గంగాధరుఁ డా
త్మను వగచుచు మతి పోయిన, యనువున నిలఁబడియె సంగరావనియందున్. 211
సీ. అపుడు సింధుజుఁడు మాయాగౌరిని సృజించి, రమణీయ మగునిజరథమునందుఁ
గూరుచుండఁగఁ బెట్టుకొని తనచెంతను, నాయోధనక్షితి కరుగుదెంచె
నది చూచి విభ్రాంతుఁ డై సదాశివుఁ డుండ, నశ్రువుల్ దొరఁగ మాయాభవాని
హా మహాదేవ హా ప్రాణనాథ యటంచు, నెలుగెత్తి గోల్లున నేడ్వఁ దొడఁగె
గీ. నంత నీశుఁడు దైత్యమాయావిమోహి, తాత్ముఁడై చింతిలుచు నుండ నతివకొఱకు
నబ్ధిసూనుఁడు కనుఁగొని యతని రుద్ర, యేల యేడ్చెదు నీసతి నిత్తుఁ గొనుము.
క. అని పలికి విసరివై వఁగఁ, గొనఁ జేతులు చాప హరుఁడు గొనకొని నడుమన్
గొనిపోయి శుంభుఁ డామెను, బొనరింపఁ దొడంగె గగనమున నృత్యంబున్. 213
క. అది గనుఁగొని మృత్యుంజయుఁ, డెద నాగ్రహ మొదవ శూల మెత్తి యతనిపైఁ
గదియంగ వ్రేయ నామెను, వదలి యతఁ డదృశ్యుఁ డయ్యె వైశమ యంతన్.
క. ఆశూలముపైఁ బడి యా, కాశంబుననుండి ఛిన్నగాత్ర యగుచు మా
యాశాంభవి విలపించుచు, నీశానునిమ్రోలఁ గూలి యెడసె నసువులన్. 215
సీ. అంత గతప్రాణ యైనశర్వాణిని, గనులారఁ జంద్రశేఖరుఁడు చూచి
హా ప్రియ హాదేవి హా చంద్రముఖి యని, కన్నీరు కాల్వలు గట్ట నేడ్చి
నిశ్చేష్టుఁ డై పడి నేలపైఁ గొంతసే, పటికి నెట్టులో సంజ్ఞఁ బడసి లేచి
సపరివారముగ నాశంబును గోరిచే, బడయ శుంభునకు శాపము నొసంగె
గీ. నాకతంబునఁ బూర్వమన్వంతరమున, నార్యచే హతు లైరి శుంభాదు లెల్ల
నట్లు శపియించి హరుఁడు ప్రియావియోగ, శోకమును నాఁపికొన లేక స్రుక్కుచుండ.
సీ. అమరబృందముతోడ నరుదెంచి పరమేష్ఠి, ప్రమథాధిపతికి దర్శన మొసంగి
శంకర నీవు సంసారవర్జితుఁడవు, సర్వేశ్వరుండవు శాశ్వతుఁడవు
బంధశూన్యుండవు బ్రహ్మణ్యుఁడవు సము, ద్రతరంగగతుఁ డైన తరణివోలెఁ
గన్పట్టు చుంటి వొక్కండ వయ్యును ననే, కాకారములతోడ లోకమందు
గీ. నీపదంబును జెంద ధ్యానించు చుందు, రనిశమును యోగనిష్ఠు లైనట్టివారు
నీయథార్థస్వరూపంబు నేను హరియు, నిర్జరులును నెఱుంగము నిక్కముగను. 217

ఆ. నీకుఁ గూడ నిట్లు శోకమోహంబులు, చేకుఱుటను జూడఁ జిత్రమయ్యె
నని నుతించి చెప్పి యాథార్థ్య మంతయు, నరిగె నంత నుగ్రుఁ డాగ్రహమున. 218

క. ధరియించి పినాకంబును, గరమున సంధించి నిశితకాండము లంధుక్
శరధికుమారునిమీఁదక్, గురిసెఁ బయోదంబు వాన కురిసినభంగిక్. 219

సీ. అంత జాలంధరుం డాకాశభూమధ్య, మున మాయచే ధరిత్రిని సృజించి
యచట జగన్మోహనాకార లగుదివ్య, వేశ్యామణుల నుద్భవింపఁజేసి
తాను గంధర్వుఁ డై తాండవించుచు వారి, చేతను బాడించె శిలలు గరఁగ
నాపాట విని మోహితాత్ముఁ డై శర్వుఁడు, విస్మరించె రణంబు విడిచి ధనువు

గీ. నెక్కి వృషభంబు నచ్చటి కేఁగి వివశుఁ, డగుచుఁ దత్సంప్రయోగంబు నరయు చుండఁ
బ్రమథగణములపైఁ బడి రాత్రిచరులు, కొట్టి కూల్పఁ దొడంగిరి గుట్టలుగను. 220

వ. అంత మాధవుండు మహేశ్వరునికడకుం జని జాలంధరమాయామోహితుం డై కదల కుండుస్థాణుని నుపలక్షించి. 221

సీ. సర్వజ్ఞ యిది యెల్ల జాలంధరునిమాయ, తెలియంగరానిది కలదె నీకు
నిట్లు మోహితుఁడ వై యీ వృంద దైత్యులు, చెలరేఁగి నీబలంబులను నెల్ల
బలియిచ్చు చుండిరి ప్రధనధరిత్రికిఁ, గై కొమ్ము శీఘ్రమ కార్ముకమ్ము
నని పల్కుటయు రుద్రుఁ డపగతమోహుఁ డై, చూచెఁ గ్రోధారుణాలోచనముల

గీ. నప్పు డది యెల్ల శూన్య మై యాకసముగఁ, గానఁబడుటయు ధూర్జటి మానసమున
విస్మయము నొంది వెంటనె వృషము మీఁదఁ, బ్రధనరంగంబునకు వచ్చి పట్టె ధనువు.

చ. అసురబలంబు నెల్లఁ గదనావనికిక్ బలియిచ్చు చుండ సా
ధ్వసమునఁ బాఱిపోయి బలిధామముఁ జొచ్చిరి శుంభముఖ్యరా
క్షసభటవీరు లెల్ల నది గాంచియు ధైర్యముతోడ నొక్కవా
రిధిసుతుఁడు నిల్చె సంగరధరిత్రిని యుద్ధ మొనర్ప శూలితోక్. 223

సీ. అపుడు భర్గుఁడు త్రిశూలాయుధంబును ద్రిప్పి, కంధిసూనునిఁ జిమ్ము గాఁడ వ్రేసె
నావ్రేటునకుఁ బుట్టి యతనివక్త్రమునుండి, నరరూపసింహాననములతోడ
జంభజ్వరంబు ధూర్జటిపైకి దూఁకంగ, హుంకరించెఁ బినాకి యుగ్రుఁ డగుచు
జనియించి యాహుంకృతిని శరభంబు జం, భజ్వరంబును జీల్చి పాఱువై చె

గీ. నంత జాలంధరుండు సహస్రబాహుఁ, డగుచు బిరబిర నేతెంచి యష్టమూర్తి
వృషభమును బట్టి గిరగిరఁ ద్రిప్పి కేలఁ, బాఱవై చెను నీహారపర్వతమున. 224

గీ. అంత నపగతవాహనుఁ డై శివుండు, ధరణిపై నిల్చి సాగరాత్మజునిరథము
సారథినిఁ గార్ముకంబును శస్త్రములను, భస్మ మొనరించెఁ గాలాగ్ని బాణమునను.

క. వారిధిసుతుఁ డప్పుడు గత, సారథిరథకార్ముకాస్త్రశస్త్రుం డయ్యుక్
ధీరత్వంబును విడువక, ఘోరాకారముగఁ దాల్చి కోటికరములక్. 226

క. పరుసవిధమునఁ బోయి శూలిని, గరముల బంధించె నపుడు కరవాలముచే
స్మరహరుఁడు వెడలఁ జూతని, కరకోటిని గాచికొనియెఁ గాయము నంతన్. 227

వ. జాలంధరభుజాబంధనంబునం జేసి రుద్రుండు నీలలోహితుం డయ్యె. 228

క. వనధిసుతుఁ డంత శిరమున, వని చేయఁ బోడంగె నపుడు హరుఁ డంబుధినం
దన మెచ్చితి నీధృతికిన్, గొను మిచ్చెద నేను నీకుఁ గోరినవరమున్. 229

గీ. అనుటయును సింధుసూనుఁ డి ట్లనియె శర్వ, సంతసించితి వేని నాశక్తి కీవు
సత్వరము గానిపదమును నా కొసంగు, మీయకుండిన నిను వధియింతు నిపుడె.

క. అని పలికె కోటిభుజముల, మునువోలెను దాల్చి నిలిచె మున్గల నది గ
న్గొని విస్మయముం జెందుచుఁ, బినాకి శూలమునఁ బొడిచె బిద్దఁగ వానిన్. 231

క. ఆశూలఘాతమునకున్, లేశంబును లెక్కగొనక నీరధిసుతుఁ డా
వేశమున గ్రుద్దెఁ బిడికిట, నీశానునియురము ప్రమథు లెల్ల వడంకన్. 232

క. ఆపిడికిటిపోటునకు ను, మాపతి యుస్సు రని యార్చి మాపఁగ నతనిన్
జేపట్టఁగను బినాకముఁ, గోపంబున వాఁడు లాగికొనియెను దానిన్. 233

ఆ. అపుడు ధూర్జటికిని నబ్ధిసూనునకును, ద్వంద్వయుద్ధ మయ్యె దారుణముగ
నంత మొంద కునికె నబ్ధిజుం డందును, జంత నొందఁ దొడఁగె శితిగళుండు. 234

ఉ. అప్పుడు మాధవుండు సరయంబుగ వచ్చి మహేశ నీకు నేఁ
జెప్పఁగ నేల చక్రమును జేకొను మింక నుపేక్ష సేయఁగా
నొప్పదు నాఁగ ధూర్జటి విజోదరమధ్యగ మైనచక్రమున్
జప్పున లాగి పై కుదధిజన్మునిశీర్షముఁ ద్రుంచె దానిచేన్. 235

సీ. ఆమస్తకము ప్రవదస్రధారంబుగాఁ, జలువుచు ఘోరనిస్వనము నెగిరి
గమియింప బ్రహ్మలోకమునకు దానిమెం, బడిఁ బడి ధూర్జటి పరువు లిడుచు
వటునుండి పడుచుండ నది వాయుజవమునఁ, దత్పృష్ఠమున వచ్చి తాను గూడఁ
జక్రంబుచే రెండుశకలంబులు గ దాని, నటుక నారెండుఖండములనుండి

గీ. ప్రబల మగుతేజ మొక్కటి బయలువెడలి, హరునిలోపలఁ జొచ్చె నత్యద్భుతముగ
నంత నాశీర్షఖండద్వయంబు గపున, శక్తివిరహిత మగుచు నచ్చటనె పడియె. 236

సీ. అంత నాఖండద్వయమునుండి రక్తంబు, కాలంగఁ దొడఁగెను గాల్వలు గను
నారక్తమునునుండి యావిర్భవింపంగ, సాగిరి దైత్యు లసంఖ్యముగను
శర్వుఁ డప్పుడు చతుష్షష్టియోగినుల ని, య్యోగించి తద్రక్త మూడ్చి త్రావఁ
జా నుద్భవించెడి దైత్యకోటుల నెల్ల, సంహరింపఁ దొడంగెఁ జక్రమునను

గీ. ద్రావి నిశ్శేషముగను తద్రక్తనదుల, యోగినులు పిప్పి యొనరించి యుజ్జగించి
యాశిరఖండముల నిల్వ హరునియెదుట, శంకరుండు దానవుల నెల్ల సంహరించి. 237

క. కని యోగినీగణంబును, జనియింపఁగ సంతసంబు స్వాంతంబున యో
గినులార మెచ్చితిని మీ, పనికిం గోరుండు కోరుఫలము నొసఁగెదన్. 238

సీ. అనవుడు మ్రొక్కి యోగినులు మహేశ్వర, మముఁ గొల్చుచుండెడిమానవులకుఁ
గలుగంగ భోగమోక్షములు ప్రసాదింపు, మని వేఁడుటయును ని ట్లనియె శూలి
యోగినులార మీయు త్తమప్రార్థన, నెఱవేర్చుటయె కాక నేను మఱియు
నెవరు ద్వేషింతురో యిల మిమ్ము వారిపు, ణ్యమ్ము భైరవుఁడ నై యపహరింతు

గీ. ననుటయును సంతసించి యోగినులు చనఁగ, శితిగళుండు స్మరించె బార్వతిని వృషము
నంత గౌరియు వృషమును నరుగుదేర, హర్షపరవశుఁ డయ్యె నయ్యుగ్రమూర్తి. 239

ఆ. అపుడు పుష్పవర్ష మాకసముననుండి, కురిసె దుందుభులును మొరసె దివిని
హరివిరించిమఘవదాదిబృందారకు, లేగుదెంచి పొగడి రీశమహిమ. 240

క. అంత నుమాప్రాణేశుఁడు, సంతోషించుచును త్రిదశసన్నిధిలో దై
త్యాంతకున కిచ్చెఁ జక్రము, నంతర్హితుఁడగుట శార్ఙి యది గైకొనియెన్. 241

ఆ. అపుడు విగతవైరు లగుట హర్షించుచు, నమరపురికి నేఁగి రమరు లెల్లఁ
జనియె బ్రహ్మలోకమునకు స్వయంభువు, క్షీరవారినిధికిఁ జేరె శౌరి. 242

ఆ. అధిప యిప్పటికిని నబ్ధివాసము తప్ప, దాయె మాధవునకు నందువలన
స్వకృతకర్మఫలము సర్వేశ్వరుం డైన, ననుభవింపవలయు ననుట ధ్రువము. 243

గీ. దేహ మున్నంతవఱకును దేహి కర్మ, మొనరుపక తప్ప దాకర్మముననుజేసి
కలుగకుండఁగఁ బోదు దుఃఖంబొ సుఖమొ, యనుభవింపక యది తప్ప దవశుఁ డగుచు.

గీ. ప్రాప్తమయ్యెను దేహసంబంధముననను, సుఖము దుఃఖంబు కృష్ణాదులకును నింక
నితరులకు నేమి చెప్ప నీ వెఱిఁగి కర్మ, గతిబలీయ స్త్వమును దొలంగకుము ధృతిని.

క. జ్ఞానము వైరాగ్యంబును, లేనినరుల్ తప్పిఁకొనఁగలే రతిచిత్రం
బై నట్టికర్మగతికిం, గాన క్షమను దాల్చి కొంతకాలం బున్నన్. 246

క. అరుల జయింతువు రాజ్యము, భరియింతువు దీనజనులఁ బాలింతువు భూ
సురులను దాపసులను ని, ర్జరులను బూజింతు కాంతు సౌఖ్యము లెల్లన్. 247

సీ. ఇపుడు నేఁ జెప్పినయితిహాసమును విన్న, జ్ఞానంబుఁ బడయును జ్ఞానసురుండు
క్షత్రియుం డొందు రాజ్యమును రాజ్యభ్రష్టుఁ, డగుఁవాఁడు మరల రాజ్యంబుఁ బడయు
నూరుజుం డొందు నపారధనంబును, నవరవర్ణుఁడు చెందు నధికసుఖము
కలుగవు మోహశోకము లాపదలు రావు, పాపంబు లెల్లను రూపుమాయు

గీ. సర్వకార్యంబులందును జయము గలుగు, సంఘటిల్లును స్వర్గమోక్షములు తుదకు
వాచకున కాలకించినవారికంటె, నధికఫల ముండుటను బూజ్యుఁ డగు నతండు. 248

వ. అని మధువ్రతయు యుధిష్ఠిరుండు చిత్తభేదం బుడిగి మహాత్మా యింక శ్రీశైలప్ర
త్యాంతముం జెప్పు మని యర్థింప నారదుం డాతని కి ట్లనియె. 249

—: శ్రీశైలవృత్తాంతకథనము :—

సీ. వినుము మహారాజ వినిపింత శ్రీశైల, వృత్తాంతమును నీకు విశదముగను
శ్రీశైల మనెడి మహాభూధ్రవరం బొక్కటి, దక్షిణదిశయందుఁ దనరుచుండు
దానిపై సకలపాదపశోభితం బైన, కాననం బొక్కటి గ్రాలుచుండు
మఱియును నచ్చోట మల్లికార్జునుఁ డను, పేర శ్రీకంఠుఁ డొప్పారుచుండు
గీ. నచటఁ బాతాళగంగయు నాశ్రమములు, నదులును దటాకములును బుణ్యాదము లెన్నొ
కలవియె కాక యెందఱో కలరు మోక్ష, మార్గమును గోరి తపియించుమానవు లచట.
గీ. కనిన శ్రీశైలశిఖరముఁ గాశిలోనఁ, జెందినను మృతి కేదారమందు జలము
త్రావినను దేహి మాతృగర్భమును మరలఁ, జేరఁ డని మున్ను మాతండ్రి చెప్పె నాకు.
క. పాతాళగంగలోపల, స్నాతుం డయినంతలోనె సకలవిధమహా
పాతకపరిహీతుఁ డగు నా, హేతువున లభించు జ్ఞానదృష్టి యతనికిన్. 252
క. శ్రీశైలమె కైలాసము, శ్రీశైలమె విష్ణుపురము శ్రీశైలమె లో
కేశభవనంబు సర్వము, శ్రీశైలమె ముక్తి గలుగఁజేసెడికతనన్. 253
గీ. అనఘ శ్రీశైలమల్లికార్జునుఁ డొకండె, కాంచె విజ్ఞానదేవవిఖ్యాతి దాన
నాశ్రయింతురు మోక్షార్థు లైనవారు, సంతతంబును మహాఢ్యనాశకుని నతని. 254
వ. అని చెప్పుటయు యుధిష్ఠిరుం డత్యానందముం జెంది హరిద్వారమాహాత్మ్యంబు విన
వేడుటయు నాతనికి నారదుం డి ట్లనియె. 255
క. మనుజాధిప నీ విప్పుడు, నన్నుఁ గోరినయట్లె యొకదినంబున గౌరీ
శుని నేను గోర శర్వుఁడు, గనుఁగొని నన్నుఁ గరుణ యొదవఁగా ని ట్లనియెన్. 256

—: హరిద్వారమాహాత్మ్యకథనము :—

సీ. మును భువి రవివంశమున నుండె నొకరేఁడు, సత్యసంధుఁడు హరిశ్చంద్రుఁ డనఁగ
నతనికిఁ గల్గె రోహితుఁడు నా నొకపుత్రుఁ, డచ్యుతభక్తిపరాయణుండు
వానికి వృకుఁ డనుసూనుఁ డొక్కఁడు పుట్టె, ధర్మసంరక్షణాతత్పరుండు
జనియించె నతనికిఁ దనయుఁ డొక్కండు వం, శోద్ధారకుఁడు సుబాహుండు నాఁగ
గీ. నతని కుదయించె గరుఁ డనుసుతుఁ డొకండు, పరమనిర్భాగ్యుఁ డన్యాయపాంసనుండు
వాఁడు దుష్టప్రవర్తనవలన రాజ, దండితుం డయి స్వపురమం దుండ లేక. 257
సీ. చని భార్గవాశ్రమంబునకుఁ గుటుంబస, మేతంబుగను దనహీనదశను
మనవి చేయఁగ భార్గవునకుఁ గృపాళు వై, యతఁ డుంచె గరుని నిజాశ్రమమున
నటు లుండఁగను భార్గవాశ్రమంబున గరుం, డతనికి సగరుఁ డన్ సుతుఁడు పుట్టె
క్షత్రియోచిత మైనసంస్కారముల నెల్ల, గరతనూజునకు భార్గవుఁడు చేసి
గీ. వేదశాస్త్రంబులను జెప్పి విధియుతముగఁ, బావకాస్త్రంబు నొసఁగె నప్పావకాస్త్ర
మునను సగరుండు హైహయులనుజయించి, స్వవశ మొనరించుకొని స్వరాజ్యమును మరల.

వ. స్వరాజ్యాపహారు లగుహైహయులకుం దోడ్పడినశకయవనకాంభోజపారదపహ్లవులను వధియింపఁ బ్రతినవట్టి వారిపై నాగ్నేయాస్త్రంబు ప్రయోగించుటయు వారలు తత్ప్రదాహంబునకుఁ దాళం జాలక వసిష్ఠమహామునిపాదంబులపైఁ బడ వసిష్ఠుండు కరుణార్ద్రహృదయుం డై వారల కభయంబు నొసంగి పరాభవంబు మరణతుల్యంబ యగుం గాన వీరిని బరాభవం బొనరించి విడువు మని యాదేశింప సగరుండు వసిష్ఠాదేశంబు నౌఁదలం దాల్చి యాగ్నేయాస్త్రంబు నుపసంహరించి శకుల కర్ధశిరోముండనంబును యవనులకును గాంభోజులకును సర్వశిరోముండనంబును గావించి పారదులను ముండకేశులుగను బహ్లవులను శ్మశ్రుమాత్రావశేషులుగనుం జేసి యెల్లరను విడిచిపుచ్చె.

గీ. అట్లు సగరుఁడు రిపులను హతులఁ జేసి, ప్రభు వయి సమస్తవసుమతీరాజ్యమునకు
నశ్వమేధాధ్వరంబుఁ జేయం దలంచి, విడిచె నశ్వంబు జగదేకవీరుఁ డగుట. 260

ఆ. అశ్వరక్షకులుగ నరిగిరి షష్టిస, హస్రసంఖ్య గలనిజాత్మభవులు
హయము సంచరించి యవని నెల్లను బూర్వ, దక్షిణాబ్ధివేల దరిసి నిలిచె. 261

ఆ. అట్లు నిలిచి తురగ మంతర్హితం బయ్యె, నందఱకును విస్మయంబు గలుగ
నంత సగరపుత్రు లద్దానిఁ గొనిపోయె, నెవఁడో యని ధరిత్రి నెల్ల వెదకి. 262

క. కనఁబడమిని నది ధరపయి, వననిధివేలానుబద్ధవసుమతి యెల్లన్
ఖనన మొనర్చి యపారము, గను లోపలఁ జొచ్చి యచటఁ గని యొకతపసిన్. 263

అ. అతనిచెంత నున్నయశ్వంబు నీక్షించి, యశ్వచోరుఁ డతఁడె యని తలంచి
కొట్టవానిఁ దత్ప్రకోపాగ్నికీలల, భస్మరాసు లగుచుఁ బడిరి యచట. 264

వ. అంతట సగరుండు తనద్వితీయపత్నియందు జనించినపంచజనహృషీకేతుసుకేతుధర్మరథు లనునలువురు పుత్రులం బనుచుటయు వార లాప్రదేశంబునకుం జని యచ్చటఁ దపోనిష్ఠాగరిష్ఠుండును నాదిపురుషుండును నగుకపిలునిం జూచి సవినయంబుగా నమస్కరించి నిజాగమనప్రయోజనంబు నెఱింగింప నమ్మహాముని సుప్రసన్నుం డై జరిగిన విషయముం జెప్పి యశ్వంబుం గొనిపొం డని యనుగ్రహించుటయు వార లశ్వముం గొనివచ్చి తండ్రి కొప్పగించిరి. 265

సీ. అంతట సగరభూకాంతుండు హయమేధ, శతమును గావించె సక్రమముగ
నతనిధర్మోత్తరమతికి జనార్దనుం, డంతరంగంబున హర్ష మొంది
వంశకీర్తితనూజవార్ధిమోక్షములను, వరపంచకంబుగా వాని కిచ్చె
నతనినల్వురుపుత్రు లన్వయకరు లై రి, ప్రభు వయ్యె వారిలోఁ బంచజనుఁడు
గీ. పంచజనునకు జన్మించె బహుళశౌర్య, శాలి యగునంశుమంతుఁడు జనన మయ్యె
నంశుమంతునకు దిలీపుఁ డనుసుతుండు, వానికి భగీరథుం డనుసూనుఁ డొదవె. 266

వ. భగీరథుండు తనపూర్వికుల నుద్ధరించుటకు గంగను ధరిత్రికి రావింపం దలంచి హిమ

వత్సరవ్రాతంబునఁ బదివేలయేండ్లు ఘోరతపంబు గావింప మహావిష్ణువు తత్తపంబునకు
మెచ్చి గంగను విడిచె. 267

సీ. అప్పుడా గంగ మహావేగమున వచ్చుచుండఁగ నద్దానియుదుటు చూచి
తద్వేగమున కుర్వి తాళలే దని యెంచి, దానిని నాకపర్దంబునందు
నిలిపితి నయుతాబ్దములవఱకును భగీ, రథుఁ డది ధ్యానమార్గమున నెఱిఁగి
చనుదెంచి కైలాసమునకు నన్నుఁగుఱించి, పారణంబుగఁ జేసెఁ దపము నంత
గీ. నాకజటాజూటకేశమునుండి నేను, వదలఁగను గంగ దిగి మొట్టమొదట బదరి
కాశ్రమంబున కలకనందాఖ్య నచటఁ, బొందె పిదప హరిద్వారమునకుఁ జేరి. 268

ఆ. పరసి యచట విష్ణుపాదోదకి య టన్న, దాఖ్య సురలకును దురాప మైన
తీర్థరాజ మయ్యెఁ దెలుపంగ నాకును, దరము గాదు చూవె దానిమహిమ. 269

ఆ. దానిలోన నెవఁడు స్నానంబు గావింపఁ, దలఁచి తత్తటమున నిలువఁబడునొ
యతనియఘము లెల్ల నప్పుడె దగ్ధము లగు, నింక స్నానఫలము నేమి చెప్ప. 270

గీ. దైవికంబుగ నే నొకతరుణమందుఁ, జని హరిద్వారమునకు నచ్చటను గాంగ
జలములో స్నాన మొనరింపఁ దలఁచుచుండ, నంతలో మాధవుఁడ నై తి నద్భుతముగ.

క. అరిగి హరిద్వారమునకు, సురనిమ్నగలోన మునిఁగి శుద్ధాత్ముం డై
హరిదర్శన మొనరించిన, నరుడె చతుర్వర్గసిద్ధి యతనికిఁ గలుగన్.

గీ. నదులలో నెల్ల నుత్తమనది యనంగ, గంగ యొక్కఁడె దేవతాగణములందు
నుత్తమం బగు దైవత మొక్క-హరియె, వేడుకకుఁ జెప్పుమాటలు వేయి యేల.

గీ. సకలతీర్థంబులందును స్నాన మాడి, నట్టిఫల మొక్క-గంగలో నాచరించు
స్నానమునఁ బ్రాప్తమగు దాన సంతతమును, నధివసింతురు తత్తీరమందె బుధులు. 274

క. కావ హరిద్వారనివా, సానందము నాకు రాజతాచలమందున్
గానఁబడ దాకతంబున, నేను హరిద్వారమందు నెలకొని యుందున్. 275

క. అని వచియించుటయును నే, ననవధికం బైన హర్ష మావహిలంగన్
జనుదెంచితి నని చెప్పి త, దనుమతిఁ గొని దేవహాని యరిగెను దివికిన్. 276

—: నానాధర్మకథనము :—

సీ. ఒకనాఁడు పార్వతి యుత్సుకత్వము గల్గ, ధర్మంబులను వినఁ దలఁపునందు
భర్తనిఁ గనుఁగొని ప్రాణేశ ధర్మంబు, లే వని నీవు నా కెఱుఁగఁ జెపుమ
యని వేఁడుటయును ని ట్లనియె నీశుఁడు దేవి, లోకకళ్యాణంబు చేకుఱంగ
వినుము ధర్మము ధర్మమునవె యర్థంబును, గామంబు మోక్షంబు గల్గుచుండు
గీ. దానఁ బ్రాజ్ఞులు నిరతంబు ధర్మమందె, సక్తు లై యుందు రది తపశ్చర్యవలన
జ్ఞానమున నియమమున వ్రతంబువలనఁ, బ్రాప్త మగు వేఱొకంటఁ బ్రాప్తంబు గాదు.

వ. తపంబు సాత్త్వికరాజసతామసరూపంబులఁ ద్రిప్రకారంబుగా నుండు. 278

గీ. సాత్త్వికతపంబుచేతను స్వర్గ మొదవు, నది యనుభవించి తుది నిల కరుగుదెంచి
యేలి రాజ్యంబు సద్గుణోపేతుఁ డగుచు, మోక్షపదము జన్మాంతరమునను చెందు.

వ. రాజసతపంబుచే రాజసగుణయుక్తుం డై జన్మాంతరంబున రాజ్యముం బడయు. తామసతపంబుచేఁ గ్రూరకర్ముం డై భుక్తిలాభముం బొందు. తామసతపంబున రాక్షసులు మహాబలశాలు లైరి. రాజసతామసతపంబులకంటె సాత్త్వికతపం బత్యుత్తమంబు.

సీ. గృహమునం దుండి నివృత్తదురాశుఁ డై, కామింపకుండఁ గుకర్మములను
నెఱవేర్చికొనుచును నిజధర్మములను వర్తిలుగృహస్థుండు సాత్త్వికతపస్వి
దేవతాబ్రాహ్మణాతిథులఁ బూజించుట, నన్నంబు నిడుట క్షుధార్తులకును
శరణం బగుటఁ బాంధజనులకు సంతృప్తి, గలిగించుటను జంతువులకు నెల్ల

గీ. మహిత మైనది సర్వాశ్రమములకంటె, నొకగృహస్థాశ్రమంబ దానికి సమాన
మైనయాశ్రమ మొండు లే దందువలన, నది సమస్తాశ్రమముల జ్యైష్ఠ్యంబు వడసె.

వ. గృహస్థాశ్రమంబునం జేయంబడుసాత్త్వికతపోదానవ్రతనియమంబులచే ధర్మంబు సాధితం బగు. తద్ధర్మంబున నర్థకామమోక్షంబులు సిద్ధించు. 282

గీ. దేవతలకును మేదినీదేవతలకు, నతిథులకును నశేషపుణ్యంబులకును
నాశ్రయీభూత మగుగృహస్థాశ్రమంబు, తీర్థములలోన నుత్తమతీర్థ మబల.

వ. దేశకాలపాత్రంబుల నెఱింగి చేయుదానంబు సర్వోత్తమంబు. శతానీకుండు దానంబు వలన స్వపుత్రులచే నరకంబునుండి యుద్ధరింపంబడియె. 284

క. కావించుఁ గాయశుద్ధిని, గావించు నఘక్షయంబుఁ గావించును బు
ణ్యావిర్భావము దానము, దేవి తదీయోపకృతులు తెలుపంజాలక. 285

వ. మాతృహత్యారాజహత్యామహాపాపదూషితుండగుపరశురాముండు పితామహబోధిత తులావృషభదానంబు గావించి పాపనిర్ముక్తుం డయ్యె. అభక్ష్యభక్షణభ్రూణహత్యా గురుతల్పగమనానృతభాషణాయాజ్యయాజననిందితధనప్రతిగ్రహసాధుపీడనధర్మ నిందా కృతఘ్నతావిశ్వాసఘాతుకత్వాదినానాపాపదూషితులును దానంబునఁ బావనత్వముం జెందుదురు. 286

ఆ. అన్యధనముచేత నైనను సురలను, బ్రాహ్మణులను దృప్తిపఱచువాఁడు
నరకలోకదర్శనముమాత్ర మొనరించి, తిరిగివచ్చి పొందుఁ బరమపదము. 287

గీ. దానమున నెందఱెందఱో దగ్ధపాపు, లగుచు వైకుంఠమునను నాయంతికమున
బ్రహ్మలోకంబునందు స్వర్గంబునందు, నున్నతస్థానముల గొని యున్నవారు. 288

—: గల్లికామహానదీమాహాత్మ్యము :—

సీ. కలదు పార్వతి గల్లికాఖ్యమహానది యొకండు, స్థిరవది యుత్తరదిక్ప్రభూత
తద్దర్శనమున స్వేదజము లుద్భిజ్జము, లండజంబులును జరాయుజములు

పుణ్యోదయాపుంబులఁ బొందు దాని స్మరించి, నంతనె యమునగారు నఘము లెల్లఁ
గలవు సాలగ్రామశిల లందు విష్ణువ, తారావతారస్వరూపాంకితములు
గీ. మఱియు నిరువదినాల్గునామముల నొప్పు, విష్ణుశిలలును శ్రీమహావిష్ణుశిలయు
నందు సంభూతి నొందె నారాయణుండు, నిత్యమును దత్తటంబున నిలిచియుండు.
వ. మఱియును నందు ననేకసాలగ్రామదివ్యమూర్తు లావిర్భావంబు నొందె. 290
క. అది గంగావేణీసమ, నది దానిమహత్త్వ మజుఁడు నా కెఱిగించెన్
సుదతీమణి యే మని చె, ప్పుదు నొసఁగును స్పర్శమాత్రమున నది ముక్తిన్.
సీ. నే నచ్చటికిఁ బోయి నియతంబుగను బ్రతి, సంవత్సరమును నాషాఢమందు
గల్లికానదిలోనఁ గాహించి స్నానంబు, దామోదరునిసన్నిధానమందుఁ
దారకంబును నిరంతరమును జపియించు, చుండుటచే వైష్ణవుండ నైతి
నచ్చోట మరణించినట్టివారికిఁ గల్గు, శంఖచక్రములు భుజంబులందు
గీ. గల్లికాసమతీర్థంబు గానరాదు, ద్వాదశీవ్రతతుల్యవ్రతంబు లేదు
కానఁగా రాఁడు విష్ణుసమానుఁ డైన, దేవుఁ డెందును నిందు సందియము లేదు.
క. ఏతన్నదీమహత్త్వము, చేతోమోదంబు గదురఁ జెప్పెడివారల్
శ్రోతలును విగళితాఘలు, పాతకు లయి విష్ణుపదముఁ బడయుదురు తుదిన్. 293
వ. మఱియును నిం కొక్కముఖ్యవిషయంబు చెప్పెద వినుము. 294

—: ఋషిపంచమీవ్రతమాహాత్మ్యము :—

గీ. ఒక్కనాఁ డే నుపేంద్రునియొద్ద కరిగి, యచ్యుత వచింపు మొక్కపుణ్యవ్రతంబు
ఘోరపాతకవిధ్వంసకారకంబు, నావుడు జనార్దనుం, డిట్లు నాకుఁ దెల్పె. 295
సీ. శర్వ పూర్వము దేవశర్మ నా నొక్కబ్రా, హ్మణుఁ డుండె మేదినీమండలమున
హారత్నగర్భావసుధాశనుం డొకదివ, సంబున నిజపితృశ్రాద్ధ మగుట
సాంగవేదాధ్యేత లగువిప్రవర్యులఁ, బూర్వదినంబున భోక్తలు గను
నియమించి మఱునాఁడు నిజపత్ని పాకంబు, చేయ శ్రాద్ధక్రియ చేసి పిదప
గీ. జ్ఞాతులకు బాంధవులకు భోజనము పెట్టి, తాను భుజియించి కూర్చున్నతఱిని వచ్చి
యొక్కశుని తద్గృహంబున నున్నవృషభ, మును గనుంగొని దానితో ననియె నిట్లు.
గీ. నాథ నీతండ్రిశ్రాద్ధదినమున మున్ను, నేను ఋతుమతి నై జ్ఞానహీన నగుటఁ
బాక మొనరించుటనుజేసి ప్రాప్తమయ్యె, నీశునీరూప మిది నాకు నెట్లు తొలఁగు.
క. నే నేనాఁటికి నింకన్, మానవజాతిని జనింతు మత్కర్మంబుల్
బోవడఁచువాఁ డెవండును, గానంబడఁ డంచు నేడ్చెఁ గన్నీ రొలుకన్. 298
సీ. అంతట దానియే డ్చాలించి వృషభంబు, ప్రేయసి నే నేమి చేయువాఁడ
నజ్ఞానవశను నీ వాచరించినపని, కవివేకమునను నే ననుమతింప

సమకూరె నాకీవృషభజన్మ మీనాఁడు, కఱచినపం డ్లుండెఁ గఱచినట్లు
బంధింపఁబడి నేను బడియుంటిఁ జండాత, పంబులోఁ జొంగలువాఱ నోట
గీ. నాతనూజుఁడు బంధుసంతతుల నెల్లఁ, దృప్తిపఱచియు నాకింత తృణము నైన
జలము నైన నను నిడఁడాయెఁ జలిపినట్టి, పాపము సహింపలే నన్నుఁ బాసి చనునె.
క. అని దీనంబుగఁ బల్కుట, యును విని యాదేవశర్మ యుభయవచనముల్
తనజననీజనకులె యవి, యనుకొని తదవస్థ కాత్మయందు వగచుచున్. 300
సీ. చని వసిష్ఠాశ్రమమునకు శీఘ్రంబుగాఁ, బ్రణమిల్లి యమ్మునిపాదములకుఁ
దనకుఁ గల్గినదుఃఖమును జెప్పి పితృతార, ణోపాయమును వేఁడ నొక్కమొగిని
గని యోగదృష్టి నమ్ముని యంతయును మహీ,సుర నిక్కము వచించె శునియు వృషము
తలిదండ్రులను నీవు తరియింపఁజేయంగఁ, దలఁపు గల్గిన నొక్కపలుకు వినుము
గీ. భాద్రపదశుక్లపంచమీపర్వకాల, మందు ఋషిపంచమీవ్రతం బాచరించి
ధారవోయుము వారికిఁ దత్ఫలంబు, నడిగి దాన రజోదోష మొదవు ముక్తి. 301
వ. అని చెప్పుటయు దేవశర్మ సంతుష్టమానసుం డై తనగృహంబునకుం జనుదెంచి సతీయుతుం డై నిజమందిరంబున గోమయంబుచే మండలంబు గావించి యందుఁ గుంభంబు స్థాపించి దానిపైఁ బాత్రంబు నుంచి యందు ఋషిధాన్యంబు సంపూర్ణంబుగాఁ బోసి యందు యజ్ఞోపవీతంబును హిరణ్యఫలంబులను నునిచి కల్పోక్తవిధానంబున నచ్చట సప్తర్షులను స్థాపించి యావాహనాదివిధులచేఁ బూజించి ఋషిధాన్యంబు నైవేద్యం బొనరించి కథాశ్రవణంబు గావించి. 302
క. సప్తర్షులార మీరలు, తృప్తులయి మదర్చనమున నే నిచ్చెడియీ
సపార్ఘ్యంబులఁ గైకొని, ప్రాప్తరజోదోష ముడుపుఁ డవ్యాజకృపన్. 303
వ. అని ప్రార్థించి సప్తర్షులకును సపార్ఘ్యంబు లొసంగి తత్పూజాద్రవ్యం బంతయును సప్తర్షిప్రీతి గలుగ భావించి ఘృతపాత్రదక్షిణాసహితంబుగా బ్రాహ్మణులకు సమర్పించి యాదినంబు ఋషిధాన్యంబుచే నేకభక్తంబు గావించి స్వకృతఋషిపంచమీవ్రతఫలంబుఁ దనజననీజనకులకు ధారవోసె. 304
క. అంతట వృషభము శునియును, నంతర్ధానంబు నొంది యతిమానుషదే
హాంతరములతోఁ జనియె న, నంతపథంబునను దివికి నందఱుఁ జూడన్. 305
ఆ. చాన లీవ్రతంబు సలిపినయెడ రజో, దోష మెడలి గళితదురిత లగుచు
ననుభవించి యిహమునందు సౌఖ్యము లెల్లఁ, జనుదు రంతమందు స్వర్గమునకు. 306
క. అని తెల్పుటయును బార్వతి, విని సంతోషమును బొంది విశ్వేశ్వరునా
జ్ఞను గొని చనియెను మఱియును, వినిపించెదఁ గొన్నిధర్మవిషయము లింకన్. 307
సీ. నారదుఁ డొకనాఁడు ద్వారకాపురమున, కరుదెంచి కృష్ణుని నాదరమున
దర్శించి పారిజాతప్రసూనంబును, నర్పించి యతనికి నరిగె దివికి

నంతట మఱచి సత్యను కృష్ణుఁ డాపుష్ప, ములు తెచ్చి నిజవధూటులకొసంగె
నది విని సత్రాజిదాత్మజ యసహన, వదన యై లోలోన వగచుచుండ
గీ. నప్పుడు కృష్ణుఁడు చనుదెంచి యామె కడకు, దన్ముఖంబును వీక్షించి తలిరుఁబోఁడి
నిన్నుఁ గన నేఁడొ చింతించుచున్నదానవి, గాఁబడుచుంటి వేమి తత్కారణంబు.
చ. అనవుడు సత్యభామ కనకాంబరధారి భవన్మనఃప్రియం
గన ననుఁగొంచు నింతదనుకన్ ముద మొందుచు నుంటి నేను నా
మనమునఁ బారిజాతకుసుమంబుల నిచ్చెడివేళ నీవు నీ
వనితల కంతయున్ దెలిసె వాస్తవ మంచు వచించి యేడిచెన్. 309
ఉ. అంతటఁ గృష్ణుఁ డామెహృదయంబు గ్రహించి వరాంగి దీనికై
చింతిల నేల సాహసముచేసెదఁ జూడుము నీనికేతనా
భ్యంతరమందు నీసవతు లందఱకున్ దలవంపు లేర్పడన్
వింతగఁ గల్పవృక్షమునె వేయుక మాటలు గావు నావుడున్. 310
ఆ. ప్రమద మొదవ సత్యభామ యికస్వర, వదనపద్మ యగుచు వంచికొనిన
శిరము నెత్తి చూచెఁ బురుషోత్తమునివంక, హరి ప్రసన్నహృదయుఁ డగుచు నంత.
క. స్మరియించె నెదను దార్క్ష్యుని, స్మరియించినమాత్రముననె చనుదెంచి ఖగే
శ్వరుఁ డెదుట నిలిచె శౌరికిఁ, బరమానందమున భక్తిపరవశుఁ డగుచున్. 312

—: కృష్ణుఁడు కల్పవృక్షంబుం దెచ్చుట :—

సీ. అంతటఁ బుండరీకాక్షుఁ డధిష్ఠించి, పతగనాథుని సత్యభామతోడ
సత్వరంబుగ నేఁగి స్వర్గంబునకుఁ గల్ప, వృక్షంబుఁ బెకలించి వేళ్లతోడ
దానిని దార్క్ష్యునిపై నుంచికొని యరు, దెంచుచుండఁగ నాదితేయు లెల్ల
శౌరితో యుద్ధంబు సలుపఁ జాలక భయం, పడు చుండఁగను వజ్రపాణి కినిసి
గీ. వైనతేయునిపై వైచె వజ్ర మెత్తి, గరుడుఁ డద్దాని వ్రేటును సరకుగొనక
భిదురమునకు నగౌరవం బొదవు ననెడి, తలఁపుచే వీడి యొకయీఁక తరలిపోయె.
వ. తద్వజ్రప్రహారంబువలన మయూరకుక్కుటచాషము లనుమూఁడుపక్షులు జనియించె.
గీ. అల్లు కృష్ణుఁడు ద్వారక కరుగుదెంచి, సత్యభామ వసించెడిసదనమందు
ఘనముగను బాదుకొల్పె నాకల్పతరువు, సమధికానందమును జెంద సత్యభామ. 315

—: సత్యభామ తులాపురుషదానమొసంగుట :—

సీ. అంతట నొక్కనాఁ డరుదెంచి సురముని, సత్యభామ వసించుసదనమునకు
నామెపై భవమును నభినుతింపఁ దొడంగ, నెద నమితామోద మొదవ సత్య
సంయమీశ్వర జన్మజన్మంబునకు నాకు, నిట్టికల్పద్రుమం బిట్టిపతియుఁ
బ్రాప్తింపఁగలుగునుపాయ మే దేనియు, నానతి మ్మనుడు ని ట్లనియె మౌని

గీ. బుద్ధిమతి యిచ్చునెడఁ దులాపురుషదాన, మామతిల్లు భవద్వాంఛితార్థసిద్ధి
యనుడు నాయమ నారదముని కొసంగెఁ, గల్పతరుకృష్ణులకుఁ దూఁగుకాంచనంబు.

క. అది గైకొని నిర్జరముని, త్రిదివంబున కరిగె నంత రెక్కొన హర్షం
బెదలోన సత్య యాత్మా, భ్యుదయమునకు మురిసికొనుచు నుత్సాహమునన్. 317

క. హరిని గనుఁగొని ప్రాణే, శ్వర నిన్నొకమాట యడుగ వాంఛ జనించెన్
గరుణించి చెప్పెదవె నా, కరమర యిసుమంత లేక యడిగినదానిన్. 318

చ. అనవుడుఁ గృష్ణుఁ డి ట్లనియె నంబుజలోచన నానితంబినీ
జనములలోన నీవు గడుఁ జక్కనిదానవు ప్రాణమెత్తుగాఁ
గనుఁగొను చుందు ని న్నెపుడుఁ గాంక్ష జనించిన నీకు దేని నై
నను నుడువంగ నీయఁగ నొనర్పఁగ నేను నిరాకరింతునే. 319

గీ. అడుగుము లతాంగి సంశయం బుడిగి నీవు, చెప్పఁదగనిది యనుచును జేయరాని
దనుచు నీయంగఁ గూడని దనుచు నొకటి, నీయెడల లేదు సుమి నాకు నిక్కమముగ.

—: సత్యభామాపూర్వజన్మ వృత్తాంతకథనము :—

సీ. అనుటయు సత్య యి ట్లనియె జనార్దన, మానవజాతిజ నై ననాకు
దేవతలకును బ్రాప్తింపనిభాగ్యంబు, ప్రాప్తింప నేమి కారణమొ చెపుమ
సకలలోకారాధ్య చరణారవిందుఁడ, వీ వెఱుంగనిది యే దేనిఁ గలదె
నావుడుఁ జెలునవ్వు నవ్వి గోవిందుఁడు, ప్రేయసి యట్లె చెప్పెదను వినుము

ఆ. మున్ను కృతయుగాంతమున నుండె మాయాపు, రంబునందు నొక్కబ్రాహ్మణుండు
దేవశర్మనామధేయుఁ డాత్రేయగో, త్రాన్వితుండు రవ్యుపాసకుండు. 321

క. అతనికి గుణవతి నాఁగను, సుత యొక్కతె యుండె సకలసుగుణగణాలం
కృత యగునాకన్యక నా, క్షితిదేవుఁడు చంద్రుఁ డనెడిశిష్యున కొసఁగెన్. 322

ఆ. అట్లు కన్య నొసఁగి యాబ్రాహ్మణుఁడు పుత్ర, రహితుఁ డగుట నాత్మగృహమునందె
కుతుకమునను నుంచికొనియె నల్లుని నాతఁ, డుండె మామయింట యోగ్యముగను.

సీ. అంతట నొక్కనాఁ డాయిర్వురును నిధ్మ, ములకు నై యొకవనంబునకు నేఁగి
చరియించు చుండ నచ్చట నొక్కరాక్షసుం, డరుదెంచి వారల నాహరించె
నపుడు వారికిఁ బ్రాప్తమయ్యె వైకుంఠంబు, భాస్కరోపాసనాఫలము గాఁగ
నన్ని పొందుదురు వైష్ణవశైవగాణప, శాక్తేయసౌరులు శాశ్వతముగ

గీ. శక్తిశివవిష్ణుగణపభాస్కరులు నాఁగ, నేనుపేళ్లను బరగుదు నే నొకండ
వారు నాకంటె భిన్నులు గారు దేవ, దత్తుఁ డొకఁడె పుత్రాదిశబ్దములఁ గొనఁడె.

సీ. తరువాత గుణవతి తనతండ్రియును దన, భర్తయుఁ జచ్చినవార్త యెఱిఁగి
కన్నీరు గాల్వలు గట్ట నేడ్చుచు నేల, వ్రాలి వాతాహతరంభవోలె

మహాశాంతి మహాభ్రాంతి మహామోహ మహాఘమువలనఁ, గలిగెడిలాభంబు కానఁబడమిఁ
దెలిసి త్వన్మూర్తి నాకిలఁ దలఁచుచుఁ, దగినట్టికర్మ మంతయును జరిపి
గీ. నాపశుంబులపై నెమ్మనంబు నిల్పి, కాయ ముడిగెడివాఁకను గార్తికవ్ర
తంబు సేయుచు వృద్ధనై తానవహాను, వేఁగ నొకనాఁడు గంగలో విడిచె మేను.
ఆ. అట్లు మేను విడిచి యూకె నా-కడనుండ, కార్తికవ్రతాధికత్వమునను
దేవ-న నొక్క దివ్యవై భవముతో, నేఁగుదెంచె మత్సనిధానమునకు. 326
క. చనుదెంచిన యాకాంతను, గనుఁగొనినక్షణంబునందె కలిగెను నాకుఁ
మనమున నమితప్రేమము, గని మాయిందిరయు నొందఁగను విస్మయముఁ.
సీ. అంతట బ్రహ్మాదు లరుదెంచి నను భూమి, నవతరింపఁగఁగోర నట్టితఱిని
నే నేఁగుదెంచితి నిలకు నాపరివార, వర్గంబు నాతోడ వచ్చె నిటకె
త్వత్పిత యైనసత్రాజన్నసుంధరా, ధీశ్వరమాన్యయె దేవశర్మ
యాదవగణమె నాయతిముఖ్యసహచర, సంఘ మక్రూరుండె చంద్రశర్మ
గీ. గుణవతివి నీవె త్వద్గృహాంగణమునందు, నిప్పు డుండినకల్పమహీరుహంబె
మున్ను నాయాలయద్వారమునను నీవు, మొలక లెత్తంగ నాఁటినతులసి చూవె.
సీ. మఱియును గార్తికమాసంబునను నీవొ, నర్చినదీపదానంబువలనఁ
జేకుఱె నీ కిటిసిరలక్ష్మి పతిరూప, మున నన్ను భావించి మనములోన
నర్పించుటను గార్తికాచరితవ్రత, ఫలము నా కైతివి భార్య వీవు
కార్తికవ్రతమును గావించుటను మేను, విడుచుదాఁకను దీక్ష విడువకుండఁ
గీ. కలుగ దింక నెప్పటికిని నిక్కముగ నీకు, మద్వియోగంబు కార్తికమాసమందు
నాచరించెడివ్రతమున కధ్వరములు, స్నానదానంబు లేవియు సాటి గావు. 329
క. అని తెల్పుటయును సత్యా, వనజేక్షణ యిట్టు లనియె వల్లభ నాకుఁ
వినిపింపుము విశదంబుగ, వినఁ గార్తికమాసమహిమ వేడ్క జనించెన్. 330

—: కార్తికమాసమాహాత్మ్యకథనము :—

వ. అని యడుగుటయు వికసితవదనుండై కృష్ణుండు సత్యభామ కి ట్లనియె. 331
సీ. శంఖాసురుం డనుజలధిసూనుఁ డొకండు, కలఁడు మున్నిలలోన ఘనబలుండు
వాఁడు జయించి దేవతల నెల్లను దత్త, దధికారపదముల నాక్రమింపఁ
దద్భయంబున దేవతలు స్వర్గమును వీడి, సరగునఁ జని మేరుశైలమునకుఁ
దద్గుహాభ్యంతరస్థలములందు వసించి, యారగించుచు నుండ హవ్యములను
గీ. శంఖుఁ డపుడు సుపర్వులశక్తి యుడుగ, ధ్వంస మొనరింపవలయు వేదముల ననుచు
నెంచి మదిలోనఁ జక్రి నిద్రించుతఱిని, నజుని దండించి వేదంబు లపహరించె. 332
క. అప్పుడు వేదము లన్నియు, నప్పలలాశనునిఁ జూచి యడలుచు జలధిన్
గుప్పునను దూఱి ప్రాణము, లప్పటికిం గాచుకొనుచు నచ్చట నుండెన్. 333

గీ. అంత శంఖుఁడు వేదంబు లబ్ధిలోనఁ, బడుట గమనించి వానిని బట్టికొనఁగ
నాత్మలో నెంచి వారిధియందుఁ జొచ్చి, తొడఁగె వెదకంగఁ గడలినల్లడలయందు.
సీ. అప్పుడు వానియుద్యమము ధర్మమునకు, హాని గల్గించెడునట్టి దగుట
భయపడి బ్రహ్మసుపర్వులతోఁ గూడి, కైకొని పూజోపకరణములను
గార్తికశుక్లపక్షమున నేకాదశి, నాఁ డేఁగి దానవాంతకునికడకు
నర్చించి తచ్చరణాంబుజంబుల యథా, విధిగ స్తోత్రంబు గావించుచుండ
ఆ. జలధిలోన శేషశయ్యాతలంబునఁ, బండి నిద్ర నొంది యుండుశౌరి
కనులు విచ్చి చూచి వనజాసనాదుల, నిట్టు లనియె హర్ష మెసకమెసఁగ. 335
సీ. అజముఖ్యులార మీ రాచరించినపూజ, కపరిమితానంద మయ్యె నాకుఁ
గార్తికశుక్లపక్షసమాగతై కాద, శీనిశాతుర్యాంశ శేషమందు
మీరు మేల్కొల్పినతీరున నెవ రేని, నను మేలుకొల్పిన నాకు వారె
పరమాప్తులై నట్టిభక్తులు సతతంబు, నుందురు వారు నే నుండుచోట
గీ. శ్రుతిహరుండైనశంఖుని హతము చేసి, యిచ్చెదను మీకు వేదము లిదియుఁగాక
కార్తికేమాసమున నుదకంబునందు, విశ్రమింతుము నేనును వేదములును. 336
క. కావునఁ బ్రాతస్స్నానము, గావించినయెడలఁ గార్తికమున నఖిలయ
జ్ఞావభృథస్నానంబును, గావించినఫలముఁ జెందఁగలుగును వారల్. 337
సీ. కార్తికవ్రతమును గావించువారిని, నాకడఁ జేర్పు మంతమున శక్ర
కార్తికవ్రతమును గావించువారికిఁ, గలుగనీయకుము విఘ్నములు శమన
కార్తికవ్రతమును గావించువారికి, వర్ధిల్లఁజేయు మన్వయము వరుణ
కార్తికవ్రతమును గావించువారికి, నెన లేనియైశ్వర్య మిమ్ము ధనద
గీ. కార్తికస్నానదానాదికరులు మత్స, మాను లగుట జీవన్ముక్తులైనవార
ప్రతిదినంబును వారిదర్శనము చేయు, నట్టివారును ననుఁ జేరునట్టివార. 338
క. అని చెప్పి మత్స్యరూపం, బును దాలిచి యంతరిక్షముననుండి రయం
బునఁబడియె వింధ్యకానన, మున నర్ఘ్యము నొసఁగుకశ్యపునియంజలిలోన్. 339
సీ. అంతటఁ గశ్యపుం డామత్స్యమును గొని, తనకమండలుజలంబునను విడిచి
యాజలంబును మించి యది యుండుటను జూచి, యొక్కహ్రదంబున నుంచి దాని
హ్రదజలంబును గూడ నది మీఱుటను జూచి, కడలిలోపల దాని విడిచిపెట్టె
నంత వృద్ధిని జెంది యామీనము పయోధి, యంతయుం గూడను నాక్రమించి
గీ. జలధిలో నున్న శంఖుని సంహరించి, తిరిగి నిజరూపమును దాల్చి సురలు వెంట
నరుగుదేరఁ బ్రయాగమునందుఁ జేరి, దర్శనం బిచ్చి బ్రహ్మర్షితల్లజులకు. 340
సీ. మునులార మీ రెల్లఁ జని శీఘ్రముగ సము, ద్రములోనఁ బడినవేదముల నెల్ల
వెదకి కైకొని రండు కొదువ లేకుండ మీ, రరుగుదెంచెడిదాఁక సురలతోడ

నుండఁగ నే క్షీరజలముం దరి చేనలే, యుఁగ మూను లెల్లఁ దదాజ్ఞ వడసి
చని నిజబ్రహ్మవర్చసబలంబునఁ జొచ్చి, యుదధిలో వేదముల్ వెదకి తెచ్చి

గీ. యొసఁగి రతని కిప్పుడముచేసి రని మొదలుగ, నెవ్వ రెవ్వరు తెచ్చిరో యెంత యెంత
యంత యంతకు వారు వానైరి ఋషులు, దాన సంతుష్టహృదయుఁడై దానవారి.

గీ. వేదముల నిచ్చె బ్రహ్మకు విధి గ్రహించి, హర్షమున వాని నెల్లను నశ్వమేధ
యాగసంకల్ప మొనరించి యాచరించె, సలిపె హయమేధమును జగచ్ఛ్లాఘ్యముగను.

సీ. హయమేధసవనాంతమందు దేవతలును, బ్రహ్మర్షులును మురారాతి కెరఁగి
స్వామి నిత్య భవత్ప్రసాదంబుచేత వే, దములును దత్ప్రోక్తధర్మములును
గావించె బ్రహ్మ యాగంబు నిచ్చట వేద, విహితంబుగను లోకవిశ్రుతముగఁ
గావున నీప్రయాగము భుక్తిముక్తిప్ర, దం బగుతీర్థరాజంబు గాఁగ

గీ. వరము దయచేయు మని వేఁడ వాసుదేవుఁ, డమితసంతోషమున నట్లె యగుటకాక
ప్రాప్త మగును బ్రహ్మక్షేత్ర మనెడిప్రథయు, నీప్రయాగంబునకు నని యిచ్చి వరము.

సీ. రవివంశజుఁడు భగీరథుఁ డిచ్చటికిఁ దెచ్చె, గంగను దానితోఁ గలియు యమున
నివసించు బ్రహ్మతో నే నిచ్చటనె సుర, లందఱు మాతోడ నుందు రిటనె
యిచటఁ జేసెడిధర్మ మే దేనియును గోటి, గుణిత మై చేర్చు వైకుంఠమునకు
నిట శరీరత్యాగ మెవరు గావింతురో, వారు నాతనువులోఁ జేరువార

గీ. మాఘమున సూర్యుఁ డుండఁగ మకరమందుఁ, గార్తికంబున రవి తులాగతుఁడు గాఁగ
నిచటఁ జేయఁ బ్రాతస్స్నాన మెవ్వ రేని, గర్భనరకనివాసంబు గనరు వారు.

గీ. అన్యతీర్థంబులందు దశాబ్దములను, సిద్ధి నొందెడితప మిందు సిద్ధి నొందు
నొక్కదివసంబుననె దీనియుత్తమత్వ, మింతకంటెను మీకు నే నేమిచెప్ప. 345

క. ఈతీర్థము గనినంతనె, పాతక మంతయు రవిప్రభాస్పృష్టతమో
వ్రాతముకై వడి భస్మీ, భూతం బగు నింక నేల భూరివచనముల్. 346

క. అని చెప్పి యదృశ్యత్వం, బును బొందె లతాంగి వినుము పూర్ణంబుగ నే
వినిపించువాఁడఁ గార్తిక, మున నున్నమహత్త్వ మెల్లఁ బూజ్యం బగుటన్. 347

గీ. మాధవునిఁగూర్చి కార్తికమాసమందు, నాజ్యదీపంబు వెలిఁగించునట్టివారు
పడయుచుందురు సులువు గాఁ బ్రతిదినంబు, నశ్వమేధంబు గావించినట్టిఫలము. 348

సీ. మున్ను త్రేతాయుగంబున నుండె వైకుంఠుఁ, డనెడిబ్రాహ్మణుఁ డొక్కఁ డవనియందు
నతఁడు కార్తికమాసమందు గోవిందుని, యెదుట దీపము వెట్టి యింటి కరిగె
నటుమీఁద నొకయెలుక వరుదెంచి తద్దీప, వర్తిని ద్రోసి యావలకు మొదటఁ
బ్రావఁదొడంగఁ దత్పాత్రస్థితఘృతంబు, వెలుఁగఁజొచ్చెను వర్తి వెగ్గలముగ

గీ. నప్పు డాజ్వాల కాయెలుక వాఁగలేక, పఱవ నొక్కబిలంబులోపలికి దానిఁ
గఱచె నం దున్నయొకభుజంగంబు విడిచె, నంతఁ బ్రాణంబులను నాఖు వాఁటణంబ.

సీ. అంతట యమదూత లరుదెంచి దానిని, బంధించి గట్టిగాఁ బాశములను
గొనిపోవఁగను సంతకనిసన్నిధికిఁ బ్రయ, త్నము సేయుచుండ నత్తరుణమందుఁ
జనుదెంచి శీఘ్రంబుగను విష్ణుభటులు త, త్పాశంబులను ద్రెంచి పాఱవైచి
దాని నుంచికొని విమానంబునను బోవఁ, గడఁగుచు నుండ నక్కాలభటులు
గీ. దూరముగ నిల్చి భయమున దోసిలొగ్గి, శౌరిభటులార యీపాపి సలిపినట్టి
పుణ్య మేమియొ విన మాకు బుద్ధి గలిగెఁ, జెప్పుఁ డని వేఁడ వారలు చిత్తగించి.
ఆ. కాలభృత్యులార యాలకింపుఁడు కార్తి, కమున విష్ణుమందిరమునఁ బెట్టి
నట్టిదీపవర్తి నాజ్యాశ నెగఁద్రోయ, దాన విష్ణుపదము దీని కొదవె. 351
గీ. ఇచ్ఛ లేకుండినను విష్ణుగృహమునందు, దీపము జ్వలింపఁజేసినఁ బాపరాశి
యంతయు నశించి వైకుంఠ మబ్బు నింకఁ, దెలుపఁదరమె యిచ్ఛాకృతదీపఫలము.
క. ఘృతదీపముఁ బెట్టిన న, చ్యుతాలయంబునను జాలు నూర్జంబున స
ద్గతి గలుగ నేల వ్రతములు, క్రతువులు తీర్థాటనములు శ్రమదాయకముల్. 353
గీ. మాధవునిఁగూర్చి కార్తికమాసమందుఁ, బెట్టునెడ దీపమును వారు కట్టకడకు
నరుగుదురు విష్ణుపురమున కధ్వరములు, సలుపువారలు పోదురు స్వర్గమునకు. 354
క. అని చెప్పి యాఖువుం గొని, చని రచ్యుతధామమునకుఁ జయ్యన నంతన్
మనుశతము గడచుదాఁకను, ననువుగ నాయాఖు వుండి యచటనె పిదపన్. 355
క. జనియించి మేదినీతల, మున రాజేంద్రునినిశాంతమునఁ గన్యక యై
కని నానాసౌఖ్యంబులు, గొన కొందెను విష్ణుకృపను గోలోకంబున్. 356
క. ధరణిని రాధాదామో, దరులను బూజించుచును వ్రతం బూర్జమునన్
దురితాత్ము లేని చేసినఁ, బరిశుద్ధిని జెంది ముక్తిఁ బడయుదురు తుదిన్. 357
క. భూమిసురున కూర్జంబున, నేమాత్రం బేని దాన మిచ్చిన రాధా
దామోదరసంప్రీతిగ, నామతిలెడిపుణ్య మక్షయము దాతలకున్. 358
గీ. ధాత్రిలోపల మున్ను త్రేతాయుగంబు, నందు సౌరాష్ట్రదేశమునందు శంక
రుం డనుజఘన్యజుం డొకఁ డుండె నుండె, నతని కొక గేహిని కలిప్రియాభిధాన. 359
సీ. ఆయింతి కాముకి యై యొక్కజారునిఁ, జేపట్టి వానితోఁ జేరి సతము
సరససల్లాపముల్ సలుపుచు నెవ రైనఁ, జూతు రేమొ యటన్న భీతి విడిచి
చరియించు చుండ స్వేచ్ఛావిహారంబు గా, నది చూచి తద్భర్త యాగ్రహింపఁ
గలహించుచును బ్రతిక్షణమును వానితో, నతనిపోరు మఱింత యధిక మగుట
గీ. మగని నెట్లైన వధియింప మనసులోన, నాపె చింతించి యొకరేయి నతనియొద్దఁ
బండుకొని వాఁడు నిద్రించు చుండుతఱిని, గత్తిచేఁ దచ్ఛిరంబును గత్తరించె. 360
క. అంతట నది యంతయు విని, సంతోషముతోడ వచ్చి జారుఁడు చెలి య
భ్యంతరము తొలఁగె మన మిఁకఁ, గంతువిలాసములఁ దేలుకాలము వచ్చెన్. 361

క. అని పలికి జారవాక్యము, లను ధైర్యముఁగొల్పి మహావిలాసినిత్రోడన్
జననింద నరకమనేయక, యనుదినము సుఖాబ్ధి నోలలాడం బొడఁగెన్. 362

ఆ. అట్లు కొంతకాల మరుగంగ నొకనాఁడు, చనుచు జారుఁ డొక్కవనమునందుఁ
జనయఘంబు పండె నన నొక్కపులినోటఁ, బడి తపించి విడిచెఁ బ్రాణములను. 363

క. ఆవార్త విని కలిప్రియ, భావమున విషాదవహ్ని భగ్గున మండన్
గావించి రోదనంబును, జీవితమున రోఁత పుట్టఁ జిట్టచివరకున్. 364

ఉ. పావనుఁ డైన భర్తకు సపర్య నొనర్పమి యట్లు లుండ నా
జీవిత మెల్లఁ గిల్బిషముగాఁ జేసితి హింసను జేతులార నా
కేవిధిఁ గల్గు నింక గతు లెక్కడ కేఁగుదు నేమిదిక్కు చీ
త్రావు లభించునే నిలువ దాఁకిని దప్పిన భ్రష్టురాలికిన్. 365

క. దైవము నా కేమని తాఁ, గావించును మేలు వేయికన్నులవాఁ డా
దేవుఁ డెఱుంగఁడె నే నీ, జీవితమునఁ జేసినట్టిచేఁతల నెల్లన్. 366

క. నలువురిలోఁ దలవంపులు, గలుగఁగ నే నిలను బ్రదుకుకంటెను బ్రాణం
బులు విడనాడుట మే లని, తలఁచి సమీపస్థనర్మదానది కరిగెన్. 367

గీ. అరిగి యట్లు కలిప్రియ యందు స్నాన, దానహరిపూజలను జేయుమానినులను
గాంచి వినయంబునను వారికడకుఁ జేరి,యడిగె మీచేయునది యేమొ నుడువుఁ డనుచు.

క. అంతట వారలు గని యా, కాంతను ని ట్లనిరి కార్తికవ్రత మిది జ
న్మాంతరకోటికృతాఘం, బంతయు నశియించు నేతదాచరణమునన్. 369

క. సోదరి యిట రాధాదా, మోదరులకుఁ బూజ సేయు చుంటిమి దీనన్
ఖేదవివర్జిత మగుదా, మోదరధామము లభించు నొప్పుగఁ దుదకున్. 370

క. అని పల్కుటయుఁ గలిప్రియ, విని మరణోద్యమము నుడిగి విహితవిధానం
బునఁ గార్తికమాసవ్రత, మును జేయుచు వ్రమందె నొక్కపున్నమనాఁటన్. 371

గీ. అపుడు యమదూత లరుదెంచి యామెకడకు, వేచికొని యుండఁ గొనిపోవ విష్ణుభటులు
శీఘ్రముగ వచ్చి వారలఁ జెదరఁగొట్టి, యాయమను నుంచికొని వ్యోమయానమందు.

క. గోలోకమునకుఁ జని గో, పాలునిసన్నిధిని నిలుపఁ బద్మాక్షుం డా
శీలవతిని గరుణాద్యు, జ్వాలికల నలంకరించి మన్ననచేసెన్. 373

సీ. ఆశ్వయుపూర్ణిమ నాదిగాంభ మొనరించి, కార్తికపూర్ణిమ గడచువఱకుఁ
గావింపఁగాఁదగుఁ గార్తికవ్రతమును, విను తద్విధానంబు విశదముగను
వ్రతపూర్తిదాఁకను బ్రతిదినంబును శాస్త్ర, విహితంబు లగుకాల్యవిధు లొనర్చి
దామోదరప్రీతిదాయకంబుగను సం, కల్పించి ప్రాప్తోదకంబునందు

గీ. స్నాన మొనరించి ధౌతవస్త్రములు దాల్చి, తిలకము ధరించి శార్ఙ్గిని దులసిఁ గొలిచి
కార్తికపురాణకథ విని కట్టకడకు, నాచరింపంగఁదగు వ్రతోద్యాపనంబు. 374

కం. చను వర్జింపఁ బరాసన, మును బరశయ్యాయుఁ బరాన్నమును బరకాంతన్
మనుజుం డెప్పుడును సంధ్యను, జను నవి ముఖ్యముగ విడువ సతి యూర్జమునన్.

వ. కార్తికవ్రతస్థునకు తైలాద్రసౌవీరకశ్రీఫలకళింగరాజమాషధాత్రీఫలబదరీఫలనారికేళజంబీర పర్యుషితాన్నభూమిజలవణద్విజవిక్రీతరసద్రవ్యపల్వలసలిలతామ్రపాత్రస్థగవ్యఛత్రాకనాళికహింగుపలాండుతిలతైలలశునగృంజనశిగ్రుశ్లేష్మాతకాలాబుకపిత్థపతితరజస్వలామ్లేచ్ఛకాకాదిస్పృష్టాన్నదూషితాన్నదగ్ధాన్నద్విపాచితాన్నసూతకాన్నద్వికాలాన్నంబులును శయ్యాస్త్రీసంగకాంస్యభోజనమధ్యమపత్రభోజనంబులును బ్రతిగ్రహంబును వర్జనీయంబులు. బ్రహ్మచర్యంబును దుర్యకాలభోజనంబును బత్త్రభోజనంబును స్థండిలశయనంబును గర్తవ్యంబులు. కూశ్మాండంబున ధనహానియును బటోలంబున శైత్యంబును మూలకంబున బలహానియును బిల్వంబునఁ గలంకంబును నింబకంబునఁ దిర్యగ్యోని జన్మంబును దాళంబున శరీరనాశంబును బృహతీఫలంబున హరిస్మరణాభావంబును నారికేళంబున మౌర్ఖ్యంబును వృంతాకంబున సుతనాశనంబును మాషంబున దీర్ఘరోగంబును మాంసంబున బహుపాపంబును సంభవించుఁగాన నయ్యవి వర్జనీయంబులు. గోమాంసతుల్యం బగుటచేఁ దుంబియును గోవధతుల్యం బగుటచేఁ గళిందకంబును బాపకరం బగుటచే శింబియును బ్రహ్మఘాతిక యగుటచేఁ బరాతికయును నిషిద్ధంబు లయ్యె.

గీ. విష్ణుసంప్రీతికొఱకు నై విడువఁబడిన, యట్టిద్రవ్యంబును వ్రతాంతమందు సంగి
యవనిసురునకు భుజియింపనగును బిదపఁ గార్తికవ్రతి కద్దానఁ గలుగు మేలు. 377

కం. కనుఁగొనినఁ గార్తికవ్రత, మును విధ్యుక్తముగఁ జేయుపుణ్యాత్ములఁ గా
లునిభటులు పాఱిపోదురు, కనునెడఁ బంచాననమును గజములువోలెన్. 378

కం. త్రికరణకృతంబు లగుపా, తకములు విలయంబు నొందుఁ దత్క్షణమునఁ గా
ర్తికమాసమహావ్రతకా, రకులను దర్శించునెడఁ బరాకున నైనన్. 379

వ. కార్తికమాసంబున నేకాదశి మొదలుకొని పూర్ణిమవఱకుం గలదినపంచకంబు విష్ణుపంచ
కంబు నాఁబడు. 380

కం. ఆవిష్ణుపంచకంబునఁ, గావించినపుణ్యమునకుఁ గావు సమంబుల్
భూవలయదాన మిచ్చినఁ, గావించినఁ గ్రతుశతంబుఁ గలుగుఫలంబుల్. 381

కం. రాధామాధవసేవా, రాధనము లొనర్చి జాగరము చేసినచో
మాధవపంచకమున ని, ర్బాధకముగ వాఁడు విష్ణుపదమున నుండున్. 382

ఆ. విష్ణుపంచకంబు వివిధపాపంబుల, నడఁచు తీర్థరాజ మగుట నందుఁ
జేయుస్నానమునను జేకుఱు సర్వతీ, ర్థావగాహజనిత మైనఫలము. 383

వ. విష్ణుపంచకంబులో విధివిధానంబున నేకాదశినాఁడు గోమయంబును ద్వాదశినాఁడు గోమూత్రంబును త్రయోదశినాఁడు గోక్షీరంబును జతుర్దశినాఁడు గోదధియును బ్రాశనంబు గావించి పూర్ణిమనాఁడు బ్రాహ్మణసమారాధనంబు చేసి నక్తంబునఁ బంచగవ్యప్రాశనంబు గావింపవలయు. 384

క. పలుకంగ నేమిఫలంబునఁ, గలుగఁగనియెడ శక్తి పంచకవ్రతకారుల్
ఫలమూలహవిష్యాన్నం, బులలో నే దేని నొకటి భుజియింప నగున్. 385
క. తులసీదళములచేతను, జలుపుచు హరిపూజ వ్రతము సలిపినయెడలన్
జలజాక్షుపంచకంబునఁ, గలుగును హరిరూప మాపెకలుషాత్ములకున్. 386
సీ. మున్ను త్రేతాయుగంబున దండకరుఁ డను, శూద్రుఁ డొక్కండుండె క్షోణియందు
వాఁడు దుష్టాత్ముఁడై వచియింపఁగారాని, కలుషంబు లన్నియుఁ జలుపుచుండ
నవి సహింపఁగలేక యాతనిబంధువుల్, వెడలఁగొట్టిరి వాని విపినమునకు
నంతట వాఁ డుండి యడవిలోఁ బాంథులఁ, గొట్టి తద్ద్రవ్యంబు గొనుచు నుండె
గీ. నపుడు పాంథులు భయపడి యాపథంబు, విడిచి వేఱొకత్రోవను నడువఁదొడఁగి
రంత దండకరుండు క్షుధార్తుఁ డగుచుఁ, దిరుగుచును జేరె నొకనదీతీరమునకు. 387
ఆ. అట్లు చేరి వాఁడు హరిపూజ నచ్చటఁ, జేయుచున్న జనులచెంత కరిగి
మ్రొక్కి వారి కెల్ల నొక్కముద్దయొసంగుఁ, డయ్యలార నాకు ననుచు వేఁడె. 388
సీ. అంతట వా రెల్ల నాతని వీక్షించి, పాపి యియ్యది విష్ణుపంచకంబు
తినఁగూడ దీయేనుదినములలోపల, నన్నంబు నది నరకావహంబు
నినుఁ జూడఁ బాతకి వని తోఁచెడిని మాకు, నిట నుండఁదగదు నీ వేఁగు మింక
ననవుడు నాత్మలో ననుతాప ముదయింపఁ, దనగాథ వారికి వినిచి వాఁడు
గీ. శరణువొచ్చినవాఁడ మీచరణములనె, యుద్ధరింపుఁడు నన్ను లేకున్న నిటనె
సలిపి యుపవాసములు ప్రాణములను విడుతు, నేను జేసినకొలలకు నిష్కృతిగను.
క. అని పలుకుటయును వా రా, తనియనుతాపమును జూచి తత్పాతకముల్
సన విష్ణుపంచకవ్రత, మును జేయించిరి యథోక్తముగ నాతనిచేన్. 390
ఉ. అంతట వాని కాక్షణమునందె విచిత్రము గాఁగ వచ్చె దై
త్యాంతకరూపధేయ మపు డాతఁడు వ్యోమవిమాన మెక్కి య
త్యంతముదంబునన్ జనియె నభ్రపథంబున కెల్ల వారలున్
వింతగఁ జూచుచుండ దివి నిండ దృగుత్పలమాలికావళుల్. 391
క. గురుదేవవిప్రగోవ్రతి, తరుణీనృపసాధునింద తగ దొనరింపన్
హరిపంచకవ్రతంబును, బరితోషంబున నొనర్చుభక్తాగ్రణికిన్. 392
వ. నరకచతుర్దశీదినంబునం దప్ప నితరదినంబులందుఁ దైలాభ్యంగస్నానంబు గావింపందగదు.
గీ. తగదు భాషింప విప్రనిందకునితోడ, వేదబాహ్యునితోడఁ గువాదితోడ
ఋతుమతీమ్లేచ్ఛపతితదుర్మతులతోడఁ, గార్తికవ్రతదీక్షాధికారయుతులు. 394
గీ. భుక్తిముక్తిప్రదంబులై భూతలమున, నున్నక్షేత్రంబు లన్నియు నుండు నొక్క
కార్తికవ్రతకారునికాయమందుఁ, గాన దద్దర్శనము సర్వకలుషహరము. 395
గీ. ప్రభువునాఁ గింకరులువోలెఁ బాకశాస, నాదినిర్జరు లెల్లరు ననుపదంబుఁ
గార్తికవ్రతి కంగరక్షకులు గాఁగ, నుందు రాతఁడు విష్ణ్వంశయుక్తుఁ డగుట. 396

క. కనుఁగొన నూర్జవ్రతముం, బొనరించెడివాఁడు ప్రేతభూతాదులు భ
గ్గున మంట మండ మేనుల, వనరుచు శతయోజనములవలకుఁ బఱచుఁన్. 397

క. కలుగవు దుస్స్వప్నంబులు, నిలువవు రోగములు మేన నిఖిలాఘములున్
దొలఁగి చను నూర్జవిధులను, జలిపెడిపరమార్థవిదుల సందర్శింపన్. 398

వ. కార్తికమాసంబున ధాత్రీపత్త్రిచ్ఛేదంబు గావించె నేని నానానిరయవాసంబు చెందం గలుగు. కార్తికంబున ధాత్రీఛాయయందు భుజించె నేని యావత్సరంబును గావించిన యన్నసంసర్గపాపంబు నశించు. కార్తికంబున ధాత్రీమూలంబున శౌరి నర్చించె నేని సకలక్షేత్రంబులందును మాధవుని నర్చించినఫలంబు చేకూరు. 399

గీ. అర్కమందు తులాగతుఁ డై నతఁడని, సర్వతీర్థంబులును సర్వసవనములును
నిఖిలతాపసులును సర్వనిర్జరులును, ననిశమును నుండెదరు ధాత్రి నాశ్రయించి. 400

గీ. తులసియును నామలకతరుఫలము ద్వార, కోద్భవం బై నమృత్తికయును నెవండు
తాల్చు చుండునో మేన సంతతము వాఁడె, యవనియందు జీవన్ముక్తుఁ డనఁగఁ బరగు.

క. తులసీధాత్రీపాదప, ములనీడను బిండదానమును నొనరిచినన్
జలిపినను దర్పణంబును, గలుగున్ బితరులకు నూర్ధ్వగతులు సతంబున్. 402

వ. ఇంకఁ గార్తికవ్రతోద్యాపనవిధానముం జెప్పెద వినుము. కార్తికశుక్లచతుర్దశినాఁడు తులస్యుపరిభాగంబునఁ జతుర్ద్వారంబును బుష్పచామరశోభితంబును సుతోరణంబును నగుమండపంబు నేర్పఱిచి ద్వారంబులందుఁ బుణ్యశీలసుశీలజయవిజయు లనుమృణ్మయ ద్వారపాలకులం బూజించి తులసీమూలదేశంబున సర్వతోభద్రమండలంబు చతుర్వర్ణ చూర్ణంబులచేఁ గావించి దానిమీఁదఁ బంచరత్నఫలసహితం బగుకలశంబు నుంచి దానిమీఁద సువర్ణలక్ష్మీనారాయణులను లోకపాలురను స్థాపించి పూజించి యాదినం బెల్ల నుపవసించి రాత్రి జాగరంబు గావింపవలయు. 403

గీ. జాగరంబు నొనర్చెడిసమయమందు, నొనరిచిన నృత్యమును గాన మొనరిచినను
జలిపినను వాద్యఘోషంబు శార్ఙ్గి కథలు, చదివిన ననంతపుణ్యంబు సంఘటిల్లు. 404

వ. అట్లు జాగరంబు గావించి పూర్ణిమయందు దామోదరప్రీతికరంబుగా వ్రతోపదేష్ట యగుగురువును దత్కళత్రంబును సపత్నీకు లగుత్రింశద్బ్రాహ్మణులను గాని శక్తి లేని యెడ సపత్నీకుం డగునొక్కబ్రాహ్మణునిఁ గాని వస్త్రాలంకారాదులచే నర్చించి "యతో దేవా" యనుమంత్రద్వయంబుచేఁ దిలపాయసహోమంబు గావించి కపిలగోవును బూజా పురస్సరంబుగా గురువున కొసంగి యెల్లరకును సంతృప్తికరంబుగా భోజనంబు పెట్టి యావాహితసకలదేవతలకును దులసికిని బునఃపూజ గావించి గురువున కర్చాప్రతిమా దుల నెల్ల నొసంగి.

సీ. బ్రాహ్మణవంశవర్ధనులార నేను గా, వించినవ్రతము ఫలించునట్లు
శౌరి నాయెడ సుప్రసన్నుండు గాఁగను, నాపాప మెల్లను నాశ మొంద

నను స్తుతించిన యీ స్తోత్రంబులను విని వారికి, కార్తికస్థితియును నిత్యమును నాకు
సంప్రీతిఁబు దేహావసానంబునను నేను, నివసింప విష్ణుసాన్నిధ్యమందు
గీ. నను బ్రసాదింపఁ జనుచుఁ బ్రార్థన మొనర్చి, పంపి వారల నెల్లను భక్తితోడఁ
జాను భుజియించె వలయు బాంధవసమేతుఁ, డనుచు యూర్జవ్రతము చేసినట్టివాఁడు.
ఆ. సర్వతీర్థఫలము సర్వవ్రతఫలంబు, సర్వదానఫలము సంఘటిల్లుఁ
గార్తికవ్రతంబు గావించువారికి, సకలలోకస్తుతులుంట నావ్రతమున. 407
క. ఈకార్తికమాహాత్మ్యము, వాకొనినను వినిన నట్టివారికి నైనన్
జేకుఱు నూర్జవ్రతఫల, మాకలమునఁ బాతకంబు లన్నియుఁ దొలఁగున్. 408
సీ. మును సహ్యశైలసీమను నుండెఁ గరవీర, మనుపేర నెసఁగు పత్తన మొకండు
తత్పురంబున నుండె ధర్మదత్తుఁడు నాఁగ, విష్ణుభక్తుండైన విప్రుఁ డొకఁడు
కైకొని పూజోపకరణంబు లొకరేయి, హరిగృహంబున కతఁ డరుగుచుండ
నడిత్రోవలో నిల్చె నగ్నయై సాధ్వసం, బొదవఁజేసెడిమేన నొకపిశాచి
గీ. ధర్మదత్తుఁడు వీక్షించి దాని నపుడు, త్రాసమును జెంది హరి నెదఁ దలఁచికొనుచుఁ
జల్లెఁ దులసీవిమిశ్రితజలము దాని, పైని నది దాన విగళితపాప యయ్యె. 409
గీ. అట్లు విగళితపాపయై యాపిశాచి, పొంది పూర్వజనుస్స్మృతి భూమిసురుని
పాదములమీఁదఁ బడి మ్రొక్కి భక్తితోడ, స్వీయవృత్తాంత మిట్లు వచింపఁదొడఁగె.
సీ. ద్విజవర్య సౌరాష్ట్రదేశంబునను భిక్షు, వనువిప్రుఁ డొకఁడు మున్నవని నుండె
నతనికి నే భార్యనై యుంటి నాపేరు, కలహ నాదుర్బుద్ధికారణమున
నొకనాఁడు గూడ నే నొనరింపనైతిని, భాషణంబున నైనఁ బతికి మేలు
కలహించుచుండినకతన నే ననిశంబు, నాబాధ పడలేక నాథవుండు
గీ. వేఱొకర్తను బెండ్లి గావించుకొనఁగ, యత్న మొనరించుచుండ నే నది యెఱింగి
త్రావి విషమును విడిచితిఁ బ్రాణములను, నంతటను గాలకింకరు లరుగుదెంచి.
క. ననుఁ గట్టి పాశములచేఁ, గొనిపోవ యమాంతికమునకుం గాలుఁడు నే
నొనరించినపాపములకు, ననువుగ శిక్షింప భటుల కాజ్ఞాపించెన్. 412
వ. అంతట యమభటులు నన్ను నానాదుర్భరనరకయాతనలం గుడిపి విడిచిపెట్టుటయు నేను మత్కర్మశేషంబునంజేసి వల్గులీయోనియందు జన్మించి స్వవిష్ఠాద నగుచుఁ గొంతకాలంబును సూకరీయోనియందు జన్మించి విష్ఠాద నగుచుఁ గొంతకాలంబును బిడాలీయోనియందు జన్మించి స్వజాతాపత్యభక్షిణి నగుచుఁ గొంతకాలంబును గడపి పంచశతాబ్దంబులనుండి పిశాచదేహంబుతోడ క్షుత్పిపాసాపీడిత నై తిరుగుచు నొక్కనాఁ డొక వైశ్యునిదేహంబునం బ్రవేశించి దక్షిణదేశంబున కేతెంచి కృష్ణావేణీసంగమతీరంబునందు శివవిష్ణుభృత్యగణంబులచేఁ దచ్ఛరీరంబునుండి నిష్కాసిత నై దురపిల్లుచు నిచ్చోటి కై వవశంబున నిన్నుం గాంచి త్వత్కరక్షిప్తతులసీజలసేకంబున విగళితపాప నై పూర్వజన్మస్మృతిం బడసి నావృత్తాంతం బంతయు విన్నవించితి.

యిన్నిపిశాచదేహంబునుండి యుద్ధరింపు మని ప్రార్థింప ధర్మదత్తుండు కరుణార్ద్ర
హృదయుం డై. 413

గీ. స్నానతీర్థవ్రతాదికృత్యములచేత, నఘములు నశించు నట్టికార్యములు చేయ
నీపిశాచశరీరమం దెంచి చూడ, లేదు నీ కధికారంబు లేశ మేని. 414

గీ. కాన నీదుర్దశను నేను గాంచజాల, కనికి నూర్జవ్రతఫలంబు నొసఁగువాఁడ
నెడసి నీచేసినయఘంబు లెల్ల దీనఁ, గలుగుఁ బ్రేతత్వముక్తి నిక్కముగ నీకు. 415

సీ. అని చెప్పి తాను జేసినకార్తికవ్రత, మునను బ్రాప్తించినపుణ్యమందు
నర్ధంబు తదుపకారార్థంబు దానికి, శౌరి సాక్షికముగ ధార వోసె
నంతట నది పైశాచాకారముక్త యై, దివ్యరూపంబుతోఁ దేజరిలుచు
ధర్మదత్తునిపదద్వంద్వంబుపై వ్రాలి, ధర్మాత్మ నీదయ ధన్య నైతి

గీ. పాపపాథోధిమగ్న నై పార మొంద, లేక యుల్లాడు నాకీవు నౌక వైతి
వని నుతించుచు నుండంగ నంతలోన, వచ్చె విష్ణువిమానంబు వారికడకు. 416

వ. అంతట నావిమానంబునుండి దిగి వైకుంఠద్వారపాలకు లిరువు రాపుణ్యవతిని విమానంబుపై నధిష్ఠింపం జేసి యరుగ నుద్యమించుచుండ ధర్మదత్తుండు వారలకు సాష్టాంగ ప్రణామంబు గావించుటయు వారలు సంతసించి బ్రాహ్మణోత్తమా నీవు గావించిన కార్తికవ్రతపుణ్యార్ధభాగదానంబుచే నీకు ద్విగుణపుణ్యంబు ప్రాప్తించుటయె కాక యీయంగనకుఁ బూర్వజన్మాంతరశతోద్భూతపాతకప్రణాశంబును విష్ణువిమానప్రాప్తియును దేజోరూపప్రాప్తియునుం గలిగె. దానంజేసి యీయమ వైకుంఠమందిరనివాసభాగ్యంబునకుం బాత్రం బయ్యె. నీవును దేహావసానంబున నీయిరువురుభార్యలతోడం గూడి విష్ణుసాన్నిధ్యంబునకుఁ జేరంగలవు. 417

క. ఆరాధింతురొ యెవరు ము, రారిని నిర్వ్యాజభక్తి యామతిలంగన్
వారు కృతార్థులు తప్పద, పారసములఁ గొల్చువారు సన్నుతిపాత్రుల్. 418

వ. విష్ణుభక్తిచే ధ్రువుండు ధ్రువపదంబు నొందంగలిగె. విష్ణునామస్మరణంబుచే జయ
విజయులకు విష్ణుమందిరద్వారపాలకత్వముం బడయంగలిగె. 419

సీ. హరిభక్తినిరతుండ వగునీవు బహువత్స, రంబులు హరిమందిరమున నుండి
త్వద్వ్రతపుణ్యంబు తఱుగంగ నిలలోన, జనియించి సూర్యవంశంబునందు
దశరథుం డనియెడిధరణీధవుండ వై, భార్యాద్వయంబును బడసి మరలఁ
ద్వత్పుణ్యభాగపాత్రం బైనయీపద్మ, పత్త్రాక్షి మూఁడవభార్య గాఁగఁ

గీ. దనరుచును విష్ణునిఁ దనూభవునిగఁ బడయుఁ, గలిగెదవు దేవకార్యసంఘటనమునకుఁ
బ్రాప్త మగుటకు నట్టిభాగ్యంబు నీకుఁ, గార్తికవ్రతపుణ్యంబె కారణంబు. 420

—: చోళభూపాలవిష్ణుదాసవృత్తాంతకథనము :—

వ. ఇంక మావృత్తాంతములు వినుము. 421

సీ. మున్ను కాంచీపురంబునఁ జోళుఁ డనియెడి, రాష్ట్రపాలుఁ డొక్కఁడు గలఁడు భువిని
దక్షిణాపథంబులోన నాదేశంబు, చోళదేశం బనుస్తుతికి నెక్కె
నాతఁడు కాంచి యధికదానంబులు, సలిపి సంఖ్యాతిగసవనములను
తామ్రపర్ణీనదీతటయుగ్మమునఁ జేసి, స్థాపించెను సువర్ణయూపములను

గీ. నొక్కదినమున నాభూపవరోత్తముండు, చని యనంతశయనమున కెనయ భక్తి
యోగనిద్రాప్రసక్తుఁడై యున్నపద్మ, నాభునకు దివ్యరత్నార్చనం బొనర్చి. 422

సీ. ఆదివ్యశోభ నాస్వాదంబుతోడను, గనులారఁ గనుచున్నకాలమందు
విష్ణుదాసుం డనువిప్రుఁ డొక్కఁడు వచ్చి, సంస్తవం బొనరించి శార్ఙ్గధరునిఁ
దులసీదళంబులతోడఁ బూజింపంగ, నారత్నములదీప్తి యడఁగిపోయె
నంతట భూపాలుఁ డాగ్రహంబును బొంది, భూసురాధమ నీకు బుద్ధి లేదె

గీ. రాజమానంబు లగుదివ్యరత్నములను, దులసిచేఁ గప్పివైచితి తొలఁగ శోభ
యనుచుఁ గ్రోధంబు నొంది బ్రాహ్మణుఁడు రాజ, భక్తి నెఱుఁగనిమాటలు పలుకరాదు.

చ. అనవుడుఁ జోళుఁ డిట్లనియె నగ్రకులస్థుఁడ నన్నగర్వమొం
దినఫల మేమి నిన్నుఁడవు నీవు ప్రతిష్ఠ జనింప శౌరికే
యొనరుపఁగాఁ సమర్థుఁడవు యోగ్యత దేనికిఁ గూడ లేనినీ
వనఁదగనట్టిభాషణము లాడిన సైతురె భక్తపుంగవుల్. 424

క. కనఁబఱచెద నాభక్తిని, గనుఁగొను మని పల్కి నిజనికాయంబునకున్
జనుదెంచి ముద్గలాజ్ఞను, బొనరింపఁగ దీర్ఘసత్త్రమును దలఁచి మదిన్. 425

సీ. నియమించి యాచార్యునిగ ముద్గలుని వరి, యించి ఋత్విజులుగ ఋషిగణంబు
నారంభ మొనరించె నధ్వరంబును గయా, క్షేత్రంబునను స్తోత్రపాత్రముగను
విష్ణ్వాలయమునందె విష్ణుదాసుం డుండి, సలుపుచు ద్వాదశాక్షరజపంబు
చేయుచు నేకాదశీమాఘకార్తిక, వ్రతతులసీవనరక్షణములు

గీ. సలుపుచును విష్ణుపూజను సర్వవేళ, లందును స్మరించుచును హరి నాత్మలోనఁ
గడపఁదొడఁగెను గాల మాకరణి వార, లిరువురును విష్ణుకైంకర్యపరత నుండ. 426

వ. ఒకనాఁడు విష్ణుదాసుండు విష్ణునైవేద్యంబు గావింపఁ బాకంబు గావించి తత్పాకపాత్రంబు నొకచోట నుంప నది యదృశ్యంబయ్యె. దాన నతఁ డాదినం బెల్ల నుపవసించి మఱు నాఁడుపాకంబు గావింప నయ్యదియు గతదినంబునంబోలెఁ గానంబడ దాయె. 427

ఆ. ఇట్లు సప్తదినము లంతరించుటయును, బాకభాండ మతఁడు పద్మనాభు
నకు నివేదనం బొనర్పక భుజియింప, నట్టివాఁడు గాన నట్లె యుండి. 428

ఆ. ఎనిమిదవదినంబునను దానిమర్మంబుఁ, దెలిసికొనఁ దలంచి తేటపడఁగ
మున్నువోలెఁ బాకమును జేసి తత్పాత్ర, మునిచి పాకవహ్ని యున్నకడనె. 429

క. దానిం గొనిపోవఁగ నెవ, డైనను నేతెంచు నేమొ యని కనిపట్టం
గా నెంచి పొంచియుండెను, గానంబడకుండ నొక్కకడ గోప్యముగన్. 430

సీ. అట్లు గోప్యంబుగా నతఁ డుండఁ బాకశా, లకు నేఁగుదెంచి పుల్కసుఁ డొకండు
తత్పాకభాండంబుఁ దా నెత్తుకొని శీఘ్ర, ముగఁ బోవుచుండంగ మున్ను వోలెఁ
జూచి శల్యావశిష్టుం డైనవాని నా, విష్ణుదాసుఁడు కృప వెలయ మదిని
నుండు ముండు మటంచు నొకకేక వైచి యా, జ్యము గొనివచ్చుచున్నంతలోన

గీ. నంత్యజుఁడు పరువెత్తి వృద్ధగుట నొక్క, చోటఁ బడుటయు విష్ణుదాసుండు వచ్చి
వానిశ్రమ దీర విసరుచు వసనమునను, నొత్తుచును దత్పదంబుల నున్నతఱిని. 431

ఆ. అంత్యజుండు లేచి యట్టిట్టు లిలకించి, వణఁకుచుండ విప్రవరుఁడు తాత
వలదు భీతి తినుము వడ్డింతు నాజ్యము, నని ఘృతంబు వోసె నన్నమందు. 432

సీ. అంతట నంత్యజుం డతనిముందుఁ జతుర్భు, జంబులతో నిల్చి శార్ఙ్గి యగుచు
వత్స సంతసమయ్యెఁ ద్వద్భక్తి కెంతేని, యిచ్చితి నారూప మిపుడె నీకు
రమ్ము వైకుంఠలోకమ్మున కనుచు నా, విష్ణుదాసుఁడు చెంది విష్ణుకళను
నధివసించి విమానమం దెల్లరును జూడ, నద్భుతంబుగ దివి కరుగుచుండ

గీ. నతనిఁ గనుఁగొని దీక్షితుం డైనచోళ, భూవరుం డాత్మలోపలఁ బొడమఁ జింత
స్వగురు వగుముద్గలునిఁ జూచి తొమ్మసుపర్వ, నీవు చేసినపని యెల్ల నిష్ఫలంబ. 433

సీ. నీయాజ్ఞ చొప్పున నేనుఁ జేయుచునుంటి, నవధిశూన్యం బైనయధ్వరంబు
కావించుచుంటి నఖండాన్నదానంబు, హెచ్చుగా దక్షిణ లిచ్చుచుంటిఁ
గోరినవారికిఁ గోరినద్రవ్యంబు, వెదచల్లుచుంటిని గొదువ లేక
సలుపుచు నుంటిని సంఖ్యాతిగంబు గా, గౌరవార్హులకు సత్కారములను

గీ. శౌరి కాఁడాయె నాకుఁ బ్రసన్నుఁ డింత, వఱకును గనుంగొనుము భక్తివలన విష్ణు
దాసుఁ డేఁగెడి వైకుంఠధామమునకు, సవము లెన్నని భక్తికి సాటి గావు. 434

క. అని వచియించి స్వభగినీ, తనయుని నిజరాజ్యమందు స్థాపించి ప్రజా
వన మొనరింపఁగ మరలన్, జనుదెంచి మఖాగ్నిహోత్రసవిధంబునకున్. 435

—: ముద్గలవంశ్యవిశిఖత్వహేతుకథనము :—

సీ. అగ్నిప్రదక్షిణం బాచరించి తదగ్ర, భాగంబునను నిల్చి భక్తితోడ
దేవ జనార్దన స్థిరముగా నామదిఁ, బాదుకొల్పుము భవత్పాదభక్తి
యని పల్కి మూఁడుమా ర్లాశుశుక్షణిమధ్య, మున దూఁకె నది చూచి ముద్గలుండు
క్రుద్ధుఁ డై తనసిగ కోసి పాఱఁగవైచె, శిఖిలోనఁ దనమాట చెల్లకునికి

గీ. నప్పు డాయగ్నికుండంబునందు శౌరి, పొడమి చోలుని స్వవిమానమునను నుంచి
కొని ముదంబున నేఁగి వైకుంఠమునకు, నాత్మసారూప్యమును వాని కపుడె యొసఁగె.

గీ. ఆదియె మొదలుగఁ జోళదేశాధిపతులు, రాజభగినీసుతులుగ నేర్పడిరి ముద్గ
లాన్వయులు విశేషులుగను నైరి విష్ణు, దాసచోళవసుంధరాధవుల మేము. 437

ఆ. విష్ణుభక్తివలన విష్ణుధామంబును, జెంది తాల్చితిమి సుశీలపుణ్య
శీలనామములను శ్రీపతిమందిర, ద్వారపాలకప్రవరుల మేము. 438

ఆ. అని వచించుటయును విని ధర్మదత్తుఁ డి, ట్లనియెఁ బుణ్యవంతులార వినఁగ
జయవిజయులగాథ సర్వంబు జనియించె, వేడ్క నాకుఁ జెప్పుఁడు విశదముగను. 439

వ. అని యడుగుటయు ధర్మదత్తునకుఁ సుశీలపుణ్యశీలు లి ట్లనిరి. 440

—: జయవిజయవృత్తాంతకథనము :—

సీ. తృణబిందుసుత యైనదేవహూతికిఁ గర్ద, మునిదృష్టిసంపర్కమునను మున్ను
గలిగిరి జయుఁడు నాఁగను విజయుండు నాఁ, గను గపిలుండు నాఁ దనయు లిలను
నందులో జయవిజయాహ్వయు లిరువురు, హరిని గొల్వఁ దొడంగి రద్భుతముగ
నటు లుండ నొక్కనాఁ డధ్వరం బొనరింపఁ, దలఁచి మరుత్తభూధవుఁడు పిలువ

గీ. వార లిరువురుఁ జని తత్సవమున కందు, జయుఁడు బ్రహ్మపదంబు యాజకపదంబు
విజయుఁడును బొంది మఖమును విధియుతముగఁ, బూర్తి గావించి రంతట భూవరుండు.

ఆ. తత్తదర్హ మైనదక్షిణ లర్పించి, గౌరవమునఁ బనుప వారు మరల
వచ్చి స్వాశ్రమమున కచ్చోట వేర్వేఱ, సలుప నెంచి విష్ణుసవనములను. 442

వ. అమ్మరుత్తుం డర్పించినద్రవ్యంబును బంచికొనఁ దలంచుటయు నందు జ్యేష్ఠుం డగు జయుండు తద్ద్రవిణంబు రెండు సమానభాగంబులు చేసి యొక్కభాగంబు దానును మఱియొక్కభాగంబు విజయుండును గ్రహియించునట్లు నిర్ణయింప విజయుం డందుల కియ్యకొనక తన కుపలబ్ధం బయినధనంబు దానును జయున కుపలబ్ధం బయినధనంబు జయుండును గ్రహించునట్లు నిర్ణయించె. 443

ఆ. అంత జయుఁడు వాని కడ్డుమాటాడంగ, నాడె విజయుఁ డతని కడ్డుమాట
యొకనిమాట పొసఁగకుండుట నొకనికి, వారి కిరువురకు వివాద మయ్యె. 444

ఆ. ఆవివాద మంతకంతకు హెచ్చఁగా, నపుడు జయుఁడు క్రుద్ధుఁ డై శపించె
గ్రాహరూప మొందఁగా విజయుని నంత, జయునిఁ దిట్టె వాఁడు సామజముగ. 445

సీ. పిమ్మట వారు ఖేదమ్ము నొంది యమర్ష, సముపలబ్ధము లైనశాపములకుఁ
బ్రార్థింపఁ దమస్వామి యగుహృషీకేశుని, నపుడు ప్రత్యక్ష మై యచ్యుతుండు
మీరు నాభక్తులు మీమాటలు ఋతంబు, లవి త్రిప్ప నాకును నలవి గాదు
ప్రహ్లాదవాక్యంబుఁ బట్టి స్తంభంబున, నావిర్భవింపంగ నయ్యె నాకు

గీ. నంబరీషునివాక్యంబు ననుసరించి, గర్భవాసశ్రమంబు నేఁ గాంచవలసెఁ
గనుక మీకర్మఫలముల ననుభవించి, రండు నాసన్నిధానమం దుండ మరల. 446

క. అని కరుణించి నిమేషం, బున నొందె నదృశ్యభావమును వా రంతన్
జనుదెంచి యిలకు నక్రము, గను సామజముగను బుట్టి క్ష్మాతలమందున్. 447

వ. గండకీనదీతీరంబునం జొచ్చి జాతిస్మృతి గలుగుటంజేసి శీఘ్రంబుగా విష్ణుసన్నిధికిం జేరం
బరితపించుచు నారాయణపాదపద్మనిష్ఠాగరిష్ఠభావంబుతోడం దిరుగుచుండ. 448

క. ఒకనాఁడు సామజము కా, ర్తికంబునను దీర్థమాడుస్పృహతోడను గం
డకిలోనం జొరంగ నచటనె, మకరంబును జొచ్చి పట్టె మాతంగాంఘ్రుల్. 449

క. జలజాక్షుని స్మరియించుచు, సలిలములోపలికి లాగసాగంగ నంతన్
వెలుపలికి లాగసాగెను, దలంచుచు వారణము హరిపదంబుల నెదలోన్. 450

ఆ. అట్లు లాగికొనుచు నన్యోన్యమును గ్రాహ, వారణములు రెండు దారుణముగఁ
బోరు చుండఁ గడచిపోయెఁ గొన్నిదినంబు, లంత నేన్గు డస్సి యాఁగలేక. 451

ఉ. పోయె శరీరమందుఁ గలభూరిబలం బఖిలంబు చిత్తమం
దేయెడ నేని ధైర్య మొకయింతయుఁ గన్పడదాయెఁ బ్రాణముల్
పోయెడివేళ వచ్చె స్మృతి పోవుచునుండె దయాసముద్ర నా
రాయణ నీవె తప్ప నితరంబు శరణ్యము లేదు నా కికన్. 452

క. అని మొఱపెట్టుటయును విని, వనజాక్షుం డేగుదెంచి వైళమ మకరం
బును దునిమి చక్రధారను, గనికర మొదవంగఁ గేలఁ గరిని స్పృశించెన్. 453

క. అంతట గజనక్రంబులు, వింతగ జయవిజయు లగుచు విష్ణుపురికి న
త్యంతానందం బొదవంగ, నంతరములయందుఁ జనియె నమరులు పొగడన్. 454

వ. అది మొదలుగా గజనక్రంబులు విముక్తిం గాంచినస్థలంబు హరిక్షేత్రం బనువిశ్రుతింజెందె

గీ. చక్రసంఘర్షమునఁ జేసి చక్రచిహ్ని, తంబులుగ నుండె నచటిప్రస్తరము లెల్లఁ
దన్మహాక్షేత్రమహిమంబు తరము గాదు, ప్రస్ఫుటంబుగ వాక్రువ్వ బ్రహ్మకైన.

క. అని నుడివి కలహతోడను, జనిరి విమానంబు నెక్కి సత్వరరీతిన్
వనజాక్షునిసన్నిధికిన్, మనమున నాశ్చర్య మొదవ ధర్మదేవునకున్. 457

గీ. అంతటను గొంతకాల మయ్యవనిసురుఁడు, మాధవధ్యాననిష్ఠానిమగ్నుఁ డగుచు
నుండి ధరలోన నిజసతీయుగములోడఁ, జనియె నంతంబునను విష్ణుసదనమునకు. 458

—: కృష్ణావేణ్యాదినదీజన్మచరిత్రకథనము :—

సీ. మానిని చాక్షుషమన్వంతరమునఁ బూ, ర్వము సహ్యగిరిశిఖరమున బ్రహ్మ
సంకల్ప మొనరించి జన్నంబు సేయ నూ, ర్జమున రావించి నిర్జరుల నెల్ల
స్వజ్యేష్ఠసతి యైనస్వర రామి సుముహూ, ర్త, సమయంబునకు సర్వసమ్మతముగ
నారంభ మొనరించె నాత్మకనిష్ఠభా, ర్య యగుగాయత్రితో నధ్వరంబు

గీ. నంతటను స్వర యేతెంచి యజ్ఞదీక్ష, గొన్నగాయత్రి నచ్చోట నున్నసకల
దేవతలఁ జూచి క్రోధసందీప్త యగుచు, నెఱ్ఱవాఱంగ నేత్రము లిట్టు లనియె. 459

—: స్వరదేవతల నెల్ల నదులుగ శపించుట :—

గీ. పూజ్యపూజావ్యతిక్రమంబును నపూజ్య, పూజయును గలచోటను బుట్టు భీతి
మరణదుర్భిక్షములు మూఁడు మత్పదమున, నిలుపఁగను మీర లెల్లఁ గనిష్ఠ నగునె.

క. అనుఖ్యాత్యము గాకుండఁగఁ, జన దేనాటికిని గూడఁ జలిపినకర్మం
బని పల్కి నిమ్నగలు గాఁ, గను శాపం బిచ్చె నచటఁ గలవారలకున్. 461

ఆ. ఆపుడు గాయత్రి రోషతామ్రాక్షి యగుచు, నోసి దుర్బుద్ధి శపియింప నుచిత మగునె
నీకె భర్తయె పరమేష్ఠి నాకుఁ గాఁడె, యగుము నీవును నిమ్నగ వని శపించె. 462

సీ. అంతట హరిహరాద్యఖిలదేవతలును, హాహానినాదంబు లామతిల్ల
దేవి మే మెల్ల నదీరూపములు దాల్ప, లుప్త మైపోవె ముల్లోకములును
శాపం బుడుపు మని స్వరను బ్రార్థింపంగ, నెదను బశ్చాత్తాప మొదవ నామె
యనిమిషులార యజ్ఞారంభమున వినా, యకునిఁ బూజింపమి నయ్యె నిట్లు

గీ. కాని నావాక్కు తిరుగదు గాన మీరు, స్వాంశములచేత నిమ్నగ లగుఁడు పొందు
స్వాంశముల నేను గాయత్రి యాపగాత్వ, మొంది సావిత్రి యనుఖ్యాతి నొందఁగలము.

వ. అని వచియించి యూరకుండుటయు నంత స్వస్వాంశంబులచే విష్ణువు కృష్ణానదీత్వంబును మహేశ్వరుండు వేణ్యానదీత్వంబును బ్రహ్మ కకుద్మతీనదీత్వంబును నిర్జరు లెల్లరును బహువిధనదీరూపంబులనుం బడసి సహ్యాద్రిశిఖరంబునుండి ప్రాక్ప్రవాహినులుగను దత్పత్నులు స్వాంశంబులచేఁ బశ్చిమవాహినులుగను బ్రవహింపం దొడంగిరి. 464

గీ. అందుఁ జేసెడిస్నానదానాదు లెల్లఁ, గార్తికంబున సంతృప్తి గలుగఁ జేసి
త్రిదశసంతతులకు నుద్ధరించు నరుల, నమితపుణ్యఫలప్రదాయకము లగుట. 465

గీ. భూరుహములందుఁ దులసియు ద్వారకాపు, రంబు క్షేత్రంబులందు మాసంబులందుఁ
గార్తికము తిథులందు నేకాదశియును, మత్ప్రియంబులు తత్సేవి మత్ప్రియుండు.

గీ. మత్ప్రసాదంబు గలుగుట మత్ప్రియుండు, బ్రహ్మహత్యాదిఘోరపాపముల కేని
యంతకున కేని భీతిల్ల నట్టివాఁడు, వాస్తవముఁ జెప్పితిని నీకు వారిజాక్షి. 467

చ. అనవుడు సత్యభామ మనమందు జనింపఁగ సంప్రమోద మి
ట్లనియెను బ్రాణనాథ కలహాంగనున్ బరదత్తపుణ్యముల్
గొనుటను విష్ణుధామ మొడఁగూడెను దత్తము గానిపుణ్య మే
యనువున నైన రాఁగలదె యావిషయంబు వచింపు మంతయున్. 468

—: అదత్తపుణ్యపాపప్రాప్తికథనము :—

క. అని యడుగుటయును గృష్ణుం, డనయఁగఁ బ్రమదంబు మదిని నిట్లనియెను భా
మిని దత్తంబులు గాకు, న్నను బుణ్యము పాతకమును నరులకు వచ్చున్.

వ. కృతత్రేతాద్వాపరయుగంబులందుఁ బుణ్యపాపభాగంబులను దేశగ్రామకులంబు లొందు. కలియుగంబున సంసర్గంబు లేనియెడలఁ గర్తమాత్రంబ పుణ్యపాపఫలంబులం జెందు. సంసర్గాగతంబు లగుపుణ్యపాపంబులవిధంబు వినుము. మైథునంబువలనను నేకపాత్రభోజనంబువలనను బుణ్యపాపఫలార్థంబును నధ్యాపనయాజనైకపంక్త్యశనంబులవలనఁ బుణ్యపాపతుర్యాంశంబును నేకాసనైకయానవిశ్వాసాంగస్పర్శంబులవలనఁ బుణ్యపాప

షష్ఠాంశంబును భాషణ స్తవంబులవలనఁ బుణ్యపాపదశమాంశంబును దర్శనశ్రవణధ్యానంబులవలనఁ బుణ్యపాపశతాంశంబునుం బ్రాప్తించు. పరనిందాధికార్యపై శూన్యంబులవలనఁ బరకృతపాతకంబు దనకుఁ బ్రాప్తించుటయెకాక స్వపుణ్యంబు పరున కర్పితం బగు. పుణ్యకర్మకారికిఁ బత్నీభృత్యకశిష్యులు గాక పరుం డెవఁ డేని యప్రతిఫలంబుగా సేవ గావించినఁ దత్సేవానురూపంబుగాఁ దత్పుణ్యంబు నాతం డొందు. ఏకపంక్తియందుఁ బలువురు భుజించుచుండఁ బరివేషణాలంఘనంబు గావించినవానిపుణ్యషష్ఠాంశంబు లంఘితునకుఁ బ్రాప్తించు. 470

గీ. స్నానసంధ్యాదు లొనరించుసమయమందుఁ, బరుని స్పృశియించునెడలను బరునితోడ భాషణము చేయునెడలను బడయు వాని, నాత్మకృతపుణ్యషష్ఠాంశ మంబుజాక్షి.

గీ. ధర్మ మార్జించుకొనియెడితలపుతోడఁ, బరుల యాచించి ధనమును బడసి దానఁ జేయునెడఁ బుణ్యకార్యంబుఁ జెందు ద్రవ్య, దాత తత్పుణ్యకర్మవిధానఫలము. 472

గీ. అపహరించి పరద్రవ్య మాచరించె, నేని పుణ్యక్రియలు దాన నించు కేని కర్మఫలమును బొందఁడు కర్త గాన, నపహృతద్రవ్యునకె కల్గు నాఫలంబు 473

గీ. పరునిఋణమును దీర్పక మరణ మొందె, నేని ఋణమును గైకొన్నమానవుండు పడయు నాత్మధనానురూపంబు గాఁగ, వానిపుణ్యఫలంబు ద్రవ్యప్రదాత. 474

వ. బుద్ధిదుండును ననుమంతయును నుపకరణప్రదుండును బలకరుండును బుణ్యపాపంబులందు షష్ఠాంశంబు నొందంగలరు. 475

గీ. ప్రజలవలనను బ్రభువును భార్యవలనఁ, బతియుఁ బుత్రునివలనను బితయు శిష్యజనమువలనను దేశికుండును గ్రహించుఁ, బాపపుణ్యక్రియాషష్ఠభాగములను.

క. పతి చిత్తానుగుణంబుగ, సతతము వర్తించుచును బ్రశాంతిమెయి నను వ్రతయయి యుండుకళత్రము, పతిపుణ్యమునందు నర్ధభాగము నొందున్. 477

గీ. ఎవఁడు చేయించు చుండునో యితరహస్తమునను బుణ్యంబులను వాఁడుపొందుసుకృతఫలములోపల నాఱవభాగ మొందుఁ, గర్త శిష్యుఁడు భృత్యుఁడు గానియెడల. 478

గీ. వృత్తిభోక్త యొనర్చుసుకృతమునందు, వృత్తిదుఁడు షష్ఠభాగంబు నెనయుఁ దాను వానిచేతను బరునకు నేని తనకు, నేని చేయింపకుండినయెడల సేవ. 479

వ. ఈయర్థంబున నొక్కయితిహాసముం జెప్పెద వినుము. 480

సీ. మును ధరిత్రీతలంబున నుండె నొక్కబ్రా, హ్మణుఁ డవంతీపురమం దతండు
బ్రాహ్మణధర్మవిభ్రష్టుఁ డై ధనము సం, పాదించి నీచకర్మములవలనఁ
గ్రయవిక్రయమ్ములు గావించుచును నొక్క, నాఁడు మాహిష్మతీనగరి కరిగి
నర్మదాతీరంబునను గార్తికవ్రత, మాచరించుచు నుండునట్టిజనులఁ

గీ. గాంచి యచ్చోట వారికిఁ గావలసిన, వస్తువుల నెల్ల నమ్ముచు వారివలనఁ బొందుచును లబ్ధి తత్కార్యములను గనుచుఁ, గడపి యొకకొంతకాలంబు కార్తికమున.

గీ. ప్రాణ్ణిమాదివసంబు గోభూసువర్ణ, సమును నుద్యాపనమును ధర్మములు దాన
ములును సూర్యాస్తమయకాలమున నొనర్చి, నట్టిదీపోత్సవముఁ గనులారఁ గాంచె.
గీ. త్రిపురదహనంబు హరుఁ డొనరించినట్టి, తిథి యగుట నది యందుఁ దత్ప్రీతికొఱకు
నొనరుతురు భక్తు లెల్ల దీపోత్సవంబు, వానికిని నాకు భేదంబు లేనికతన. 483
క. హరునకు నాకును భేదముఁ, బరికల్పనము బొనర్చుపాపులచే నా
చరితము లగుపుణ్యములకు, నరయంగ ఫలంబు లేమి నవి వ్యర్థంబుల్. 484
క. ఆవిధమున నవ్వోటను, గావించెడిపనుల నెల్లఁ గాంచుచు నాభూ
దేవుఁడు తిరుగుచు నుండం, గా విషధర మొండు వానిఁ గఱచి యెటో చనెన్.
గీ. అంతటను నేలపైఁ బడి యతఁడు విడిచెఁ, బ్రాణముల నప్డు డేతెంచి యమునిభటులు
కట్టి పాశంబులను వానిఁ గదలకుండ, నీడ్చి కొనిపోయి కాలునియెదుట నిలుప. 486
ఆ. శమనుఁ డెఱిఁగివాఁడు సల్పినపాపము, లెల్లఁ జిత్రగుప్తుఁ డెఱుఁగఁజేయ
నానతిచ్చె భటుల కతనిదారుణనర, కాగ్నిలోనఁ గూల్ప నంత వారు. 487
క. ఆకలుషాత్మునిఁ గొని చని, యాకాశం బంట మంట లడరెడికుంభీ
పాకమునఁ ద్రోయ నయ్యది, జేకొట్ట సుపర్వు లెల్ల శీతలమయ్యెన్. 488
చ. అది కని ప్రేతనేత హృదయంబున భీతియు విస్మయంబునున్
గదురఁగ నేగుదెంచి క్షణకాలములో సమవర్తియొద్దకున్
విదితము సేయ సర్వమును విస్మయ మొంది కృతాంతుఁ డేదియున్
మదికి స్ఫురింపకుంటయు నొనర్పఁగ ఖేదము నొందు చుండఁగన్. 489
సీ. ఆకాశముననుండి యరుదేర నారదుం, డర్చించి యమ్ముని నంతకుండు
తనకుఁ గల్గినఖేదమును నివేదింపంగ, నవ్వి యి ట్లనియెను నారదుండు
సమవర్తి యేల విషాదంబు నొందెదు, కార్తికవ్రతపుణ్యగరిమ వినవె
కార్తికవ్రతమును గావించువారిద, ర్శనభాషణముల నాబ్రాహ్మణుండు
గీ. గతసకలకల్మషుఁడును నకామలబ్ధ, పుణ్యుఁడును నై నకారణంబుననుజేసి
గాసిపెట్టంగ నతని దక్షులు గావు, నరకములు వాస్తవముఁ జెప్పినాఁడ నీకు.
గీ. ఆర్ద్రశుష్కాఘముల నిరయమ్ములందు, యాతనలు పొందు కై వడి నార్ద్రశుష్క-
పుణ్యములచేత సురలోకమున సుఖంబు, లనుభవించు నరుం డెవఁ డైన గాని. 491
వ. కామకృతపుణ్యపాపంబు లార్ద్రంబు లనియును నకామలబ్ధపుణ్యపాపంబులు శుష్కంబు
లనియుం జెప్పంబడియె. అకామలబ్ధపుణ్యు లగువారలకు నిరయదర్శనమాత్రంబ
పాపభోగం బగు. 492
క. అని చెప్పి తదనుమతి గొని, చనుటయు దివమునకు నంత శమనుం డావి
ప్రునియొద్ద కరిగి తనతప్పును సైపఁగ వేడి త్రిదివమున కరుగు మనన్. 493
ఆ. అతఁ డిట్టు లనియె నంతక నరకధా, మములఁ జూడ నాకు మది జనించెఁ
జూపు మవలఁ బోదు సురలోకమున కన, యముఁడు వాని కాస్థలములఁ జూపి. 494

—: చతురశీతినరకకథనము :—

వ. ఇది తప్తవాలుకానరకము. దీనిభేదంబు లాఱు. గురుదేవతాగోబ్రాహ్మణాగ్నులను బాదములచేఁ దన్నువారలపాదము లిందు దహింపఁబడు. మఱియు నతిథుల కన్న మొసంగనివారును నిందు నిరగ్ధు లగుదురు. ఇది యంధతామిస్రనరకము. దీనిభేదంబు లాఱు. ఇందుఁ గామమోహితు లగువారు బాధింపఁబడుదురు. ఇది క్రకచనరకము. దీనిభేదంబు లాఱు. ఇందుఁ బత్నీపుత్రాదులకు వియోగము గలిగించువారు ఛేదింపంబడు దురు. ఇది యర్గళనరకము. దీనిభేదంబు లాఱు. ఇందు మహాపాపులు ముద్గరగదా ద్యాయుధనిహతు లగుదురు. ఇది కూటశాల్మలినరకము. దీనిభేదంబు లాఱు. ఇందుఁ బరధనదారాపహారులును బరవంచకులును మథియింపఁబడుదురు. ఇది రక్తపూయ నరకము. దీనిభేదంబు లాఱు. ఇందు నభక్ష్యభక్షకులును బరనిందకులును బిశునులును బాధింపఁబడుదురు. ఇది కుంభీపాకనరకము. దీనిభేదంబు లాఱు. ఇందుఁ బాపాత్ము లెల్లరును దప్తతైలాదులచే నుడికింపంబడుదురు. ఈనలువదిరెండునరకంబులును నకామకృతం బగుశుష్కపాపంబుచేతను గామకృతం బగునార్ద్రపాపంబుచేతను ద్విగు ణంబులై చతురశీతిసంఖ్యాకంబు లయ్యె. ద్వివిధ మగుపాపంబు ప్రకీర్ణం బనియు నపాంక్తేయం బనియు మలినీకరణం బనియు జాతిభ్రంశకరం బనియు నుపపాతకం బనియు నతిపాతకం బనియు మహాపాతకం బనియు సప్తవిధం బయ్యె. 495

గీ. కార్తికవ్రతిసంసర్గకారణమున, విగతపాపుఁడవై తివి విప్ర నీకుఁ
గాంక్షితం బగునూర్ధ్వలోకమున కింక, నేఁగు మన యాప్యయానంబు నెక్కి యతఁడు.

క. చని యక్షలోకమునకుఁ, గని యక్షత్వమును విబుధగణ్యుం డగుచుఁ
ధనయక్షుం డనునామం, బును బొంది కుబేరభృత్యముఖ్యుం డయ్యెన్. 497

వ. గాధిజుం డాతనిపేర నయోధ్యయందు మహాతీర్థంబు నెలకొల్పె. హరిజాగరంబును బ్రాతస్స్నానంబును దులసీసేవనంబును నుద్యాపనంబును దీపదానంబును ననుపంచాం గంబులచేఁ గార్తికవ్రతంబు పూర్తిం జెందు. 498

సీ. అని పల్కుటయు సప్రహర్షంబుగను సత్య, భామ యిట్లనియెను బ్రాణనాథ
కార్తికవ్రతి యేమి కావింపవలయునో, సంకటంబున నున్నసమయమందు
వచియింపు మది విన వాంఛ గల్గెను నాకు, ననవుడుఁ గృష్ణుఁ డిట్లనియెఁ దన్వి
కార్తికవ్రతమును గావింపవలయును, బ్రతివత్సరము మహాఫలద మగుట

గీ. సక్రమంబుగఁ జేయంగ శక్తి లేని, పక్షమున వీలు గాకుండుపక్షమునను
మదభిధానంబుచే నపమార్జనమును, జేసికొని విప్రసంతృప్తి చేయవలయు. 499

గీ. బ్రాహ్మణులు మత్స్వరూపులు బ్రాహ్మణులకుఁ, దుష్టి గలిగిన నాకు సంతుష్టి గలుగు
నేను సంతుష్టి నొందితి నేని వ్రతము, సఫల మగు నంగహైన్యసంశయము లేక.

వ. పరదీపప్రబోధనపరిరక్షణంబులవలనను దీపదానఫలంబు చేకూర్చు. 501

గీ. ఎండిలను వీలు లేకున్నయెడల విప్ర, గోవటాశ్వత్థవృక్షసంసేవనంబు
చేయవలయును దానను జెందు వ్రతము, సాంగతను లేనిచో వ్రతభంగ మొదవు.
గీ. అనుటయును సత్యభామ యి ట్లనియె నాథ, బోధివటవృక్షములను గోభూసురులకు
సమము సేసితి వంతటిశక్తి వాని, లోన నుంటకుఁ జెపుము నిదాన మేమొ. 503

—: పార్వతి దేవతలను వృక్షములుగా శపించుట :—

సీ. అనవుడుఁ గృష్ణుఁ డి ట్లనియె నంగన మున్ను, క్రీడించుచుండ గౌరియును హరుఁడు
సహియింపఁ జాలక సమయమిలంబంబు, నమరు లెల్లరుఁ గూడి యగ్ని ననుప
నతఁ డేగుదెంచి క్రీడాంతరాయము సేయ, నద్దాని కీశ్వరుం డనుమతింప
నాగ్రహం బొంది కాత్యాయని శపియించె, నమరుల నెల్ల వృక్షములు గాఁగ
గీ. నంత బ్రహ్మాదు లేతెంచి యామెకడకుఁ, బ్రార్థన మొనర్ప వా రెల్ల స్వాంశములను
దరువు లగునట్లు కరుణించె గిరిజ యదియె, మొదలుగను భూరుహము లైరి త్రిదశు లెల్ల.
గీ. ఏను బోధిద్రుమంబుగ నీశ్వరుండం, వటముగఁ బలాశముగఁ జతుర్వదనుఁ డితర
విబుధు లెల్లరు బహువిధవృక్షములుగ, భూమినీరోదను వెలసితి మేమి చెప్ప. 505
క. కావుననె వృక్షములకును, సేవింపం దగినమహిమ చేకూరెను మ
ద్భావమునఁ జలదళంబును, సేవించిన సకలకార్యసిద్ధులు గలుగుఁ. 506
క. శనివాసరమున మాత్రమె, చను నశ్వత్థమును ముట్ట సతి యీవిషయం
బును విస్మరింపకుము నాఁ, గను సత్రాజిత్తనూజ కౌతుక మొదవఁ. 507
గీ. దేన యేకారణమున బోధిద్రుమంబు, ముట్టఁ గూడదో ప్రతిదినంబును వచింపు
మాలకింపంగ నఖిలాష మయ్యె ననుడు, నెలయఁ జఱునవ్వు మాధవుం డిట్టు లనియె.

—: అశ్వత్థస్పర్శయోగ్యవారకథనము :—

సీ. మానిని క్షీరాబ్ధి మథియించు చుండంగ, దేవాసురులు గూడి దీక్షతోడ
జనియించె మొదట జ్యేష్ఠాదేవి వికృతరూ, పముతోడ నావలఁ గమల పుట్టెఁ
గై కొనంగను నేను గమలను యత్నింప, వీక్షించి న న్నిమె యిట్టు లనియె
నొనరించి పరిణయంబును ముందు నాయక్క, కవల నన్ను గ్రహింపు మంబుజాక్ష
గీ. యనుడు నుద్దాలకుం డనునవనిసురున, కిచ్చి జ్యేష్ఠను నేను గ్రహించినాఁడ
నవల లక్ష్మిని నంతట నాద్విజుండు, జ్యేష్ఠతోఁ గూడి స్వాశ్రమమునకుఁ బోయె. 509
సీ. అప్పు డచ్చట శిష్యులందఱు వేదాధ్య, యనము చేయుచు నుండ నాస్వనంబు
కర్ణకఠోరంబుగా నుండుటను జ్యేష్ఠ, యచ్చట క్షణ మేని యాఁగలేక
వల్లభ నే నిందు వసియింప నిది నాకు, సమ్మతం బైనస్థలమ్ము గాదు
నావుడు నాబ్రాహ్మణప్రవరుఁ డామె, నీక్షించి యింతి నీ వెచట నుండు
గీ. వని యడుగ జ్యేష్ఠ యతని కి ట్లనియె నాథ, వేదఘోషంబు యజ్ఞదానాదివిధులు
దేవతాతిథిగురుపిత్రుసేవనమును, జరుగుచోటులు నాకు నసమ్మతములు. 510

సీ. పరదారపరధనపరు లుండుభూములుఁ, గలహంబు జరిగెడినిలయములును
బ్రహ్మహత్యాదిపాపములు చేసెడిచోట్లు, మద్యశాలలు ద్యూతమందిరములు
విప్రుల సుజనుల వృద్ధుల నవమాన, పఱుచుతావులు పాపుపడ్డయిండ్లు
నీతివిహీనులు నివసించునెలవులుఁ, బారిశుద్ధ్యము లేనిభవనములును
గీ. గోవధము చేయుచోటులు కుజను లుండు, నాలయములును దుర్భాష లాడుపట్లు
ధర్మ మనుమాట నైనను దలఁప కుండు,జనులు గలధామములు నాకు సమ్మతములు.
క. అనవుడు నుద్దాలకుఁ డా, త్మను మిగులవిషాద మొంది తనకున్ నా మీఁ
దను నెనసినగౌరవమున, ననఁజాలక నోరు విప్పి యాయమ నెదియున్. 512
ఆ. ఆక్షణంబునందె యామెను దోడ్కొని, చనివనప్రదేశమునకు నొక్క
బోధివృక్షమూలమున నుండ నియమించి, మరల వత్తు ననుచు నరిగె నెటకొ. 513
ఉ. అంతటఁ గొంతకాల మట నామె వసించి ధవుండు రామిచే
నెంతటిదాఁకనున్ జడిసి యేడిచె గొల్లున మిన్నుముట్ట న
త్యంతకఠోరకంఠమున నయ్యది భార్గవి యాలకించి నా
చెంతకు వచ్చి చెప్పఁగనె చెచ్చెర నేను రమాయుతుండ నై. 514
సీ. అరుదెంచి యాయమదరికి జ్యేష్ఠాదేవి, శోకింపవల దీవు సుంత యేని
యశ్వత్థతరువు మదంశసంభూతంబు, గౌరవార్హం బెల్లవారలకును
దీనిక్రిందను నీవు స్థిరముగా నుండుము, శనివారమున భవత్సవిధమునకు
నియతంబుగను వచ్చు నీచెల్లె లగులక్ష్మి, స్పర్శార్హ మగు నాఁడు చలదళంబు
గీ. దాన నీకును నధికసమ్మాన మొదవు, నని ప్రసాదించి యేఁగితి నాక్షణంబ
కాన శనివారముననె తాకంగఁ జెల్లుఁ, జలదళము లక్ష్మి నాసించుజనుల కెల్ల.
క. ఈకథ నొరులకుఁ జెప్పిన, నాకర్ణించినను నిహమునందు విషాద
వ్యాకులులు గాక కడకున్, వైకుంఠము నొందఁగలుగువారల వారల్. 516
వ. అనుటయును సత్యభామ యమందానందముం జెంది కృష్ణానుమతినిఁ గార్తికవ్రతదీక్షం
గైకొనియె. 517
సీ. మునివర యింకను విను మూర్జమాహాత్మ్య, మునుగూర్చియడుగంగమును గుహుండు
హరుఁడు షణ్ముఖున కిట్లనియెఁ గుమార యూ, ర్జవ్రతంబున కిల సాటి లేదు
సర్వతీర్థంబులు సర్వదానములు స, ర్వమఖంబులును నొక్కప్రక్క నుంచి
యొక్కవైపున నుంచి యూర్జమాసంబును, దులఁ దూఁచితిని నేను బలముఁ దెలియ
గీ. నపుడు కార్తికమాస మున్నట్టికడకు, వంగె ములు దాన నేను దద్వ్రతసమంబు
లేవియును గా వనుచు నిశ్చయించుకొంటి, స్కంద తెలిపితి నీరహస్యంబు నీకు.
వ. కృతయుగంబు బ్రాహ్మయుగంబు త్రేతాయుగంబు క్షత్త్రియయుగంబు ద్వాపరయుగంబు
వైశ్యయుగంబు కలియుగంబు శూద్రయుగంబు. 519

ఆ. కాన్నఁ గలియుగమున స్నానంబు గావింప, జంకుచుందు రఖిలజనులు దాని
గు ర్తెఱింగి సద్గతిఁ గోరువారు కార్తికమునఁ దైన, స్నాన మాచరించు జడియకుండ. 520

వ. కార్తికమాసంబునఁ బ్రాతస్స్నాన మవశ్యకార్యంబు. దాన నుత్తమలోకప్రాప్తి చేకూరు. స్నానంబు వాయవ్యం బనియు వారుణం బనియు బ్రాహ్మం బనియు దివ్యం బనియుఁ జతుర్విధంబుగాఁ జెప్పంబడియె. గోరజస్స్నానంబు వాయవ్యంబు. సాగరాదిస్నానంబు వారుణంబు. మంత్రస్నానంబు బ్రాహ్మంబు. మేఘాంబుభాస్కర స్నానంబు దివ్యంబు. 521

గీ. స్నానములలోన నుత్తమస్నాన మొక్క, వారుణమ చూవె ద్విజులైనవారు మంత్ర
విహితముగ స్త్రీజఘన్యజవృద్ధబాల, షండులు విమంత్రముగఁ జేయ స్నాన మొప్పు.

గీ. ప్రథితియుఁ దపంబు విద్యయుఁ బాణిపాద, వాఙ్మనససంయమము గలవారె తీర్థ
ఫలము నొందుదు రన్యులు పడయలేరు, సలిపినను బుణ్యకర్మసంచయము నెల్ల.

ఆ. పడయలేరు తీర్థఫలము నీయేఁగురు, హేతునిష్ఠితుండును బాతకియును
సంశయాత్మకుండును శ్రద్ధావిహీనుఁడు, నాస్తికుఁడును బుత్ర వాస్తవముగ. 524

గీ. ఊర్జమాసంబు సర్వమాసోత్తమంబు, వైష్ణవము గాన సకలదేవతలు గూడ
నందు నివసింతు రత్తఱి నాచరించు, దానము లనంతసత్ఫలదాయకములు. 425

సీ. సోమకాలంబున సోముం డనుభవించుఁ బొందును గుచకాలమందు వహ్ని
ఋతుకాలమున గ్రహియింతురు గంధర్వు, లద్దాన ఋతుమతి యైనకన్య
నిచ్చిన నది కీడుదెచ్చు గ్రహీతకు, దాతకుఁ దత్పితృవ్రాతమునకు
నష్టవర్షీయ కన్యను శ్రోత్రియున కిచ్చి, నందునఁ గలఫలం బెందు లేమ

గీ. కాన శాస్త్రంబు గమనించి కార్తికమునఁ, గన్యకాదాన మొనరింపఁగలిగి రేని
యుభయవంశంబులను వార లుద్ధరించి, పడయుదురు తాము శాశ్వత బ్రహ్మపదము.

గీ. ధేనువు సరస్వతియును ధాత్రియును మూఁడు, సమఫలంబు గలట్టిదానములు గానఁ
గార్తికంబున వాని సక్రమము గాఁగ, నిచ్చువారలపుణ్యంబు నెన్నఁ జాల. 527

వ. శతవృషభదానంబు గోసహస్రదానసమంబు. ఏకయానదానంబు దశవృషభదానసమంబు. ఏకహయదానంబు దశయానదానసమంబు. ఏకగజదానంబు సహస్రహయదానసమంబు. ఏకస్వర్ణదానంబు సహస్రగజదానసమంబు. ఏకవిద్యాదానంబు స్వర్ణసహస్రదానసమంబు. ఏకభూదానంబు కోటివిద్యాదానసమంబు. ఏకాన్నదానంబు సహస్రభూదానాధికంబు. 528

క. అన్నమె యాధారం బై, యున్నది విశ్వముల కెల్ల నూర్జదినములం
దన్నప్రదానమున నగు, పున్నెమునకు సాటి గావు పుణ్యము లేవియుఁ. 529

వ. కార్తికమాసంబునఁ దిలధేనురజతవస్త్రరత్నకంబళతూలికాపాదరక్షాఛత్త్రప్రచ్ఛాదనపటుఫలాదిదానంబులును సద్గతిదాయకంబు లగు. కార్తికంబునఁ బరాన్నంబు వర్జించె నేని ప్రతిదినకృచ్ఛ్రఫలంబును జాంద్రాయణఫలంబునుం బ్రాప్తించు. కార్తికంబునఁ

దైలమధుసేవనకాంస్యభోజనమైథునమాంసభక్షణసురాపానంబులు గావించె నేని రాక్షసయోనిం బొంది షష్టిసహస్రవర్షంబులు విష్ఠానరకంబు ననుభవించి పిదప గ్రామసూకరంబుగా జన్మించు. 530

గీ. ఇందుసూర్యగ్రహణవేళలందు బ్రాహ్మ, ణులకు భూదాన మిచ్చినఫలము నొందు
నూర్జమాసంబునను స్థండిలోర్వియందు, నియమసహితంబుగను శయనించునరుఁడు.

గీ. వేదసమ మైనశాస్త్రంబు లేదు లేఁడు, ధర్మసన్నిభుఁ డైనబాంధవుఁడు లేదు
దైత్యరిపుతుల్య మగు దైవతంబు కార్తి, కమున కీ డైనమాసంబు గానరాదు. 532

గీ. మాధవప్రియ మగు నూర్జమాస మెల్ల, వ్రతవివర్జితముగను నెవ్వండు గడపుఁ
గర్మవిభ్రష్టుఁ డై వాఁడు గట్టకడకు, నుద్భవము నొందు గర్హితయోనులందు. 533

సీ. అబ్ధిని జేరుపుణ్యనది దుర్లభ దుర్ల, భుండు ధార్మికుఁ డైనపుత్రకుండు
తల్లి దుర్లభురాలు తండ్రి దుర్లభుఁడు సా, ధుజనసాంగత్యంబు దుర్లభంబు
కులము సౌశీల్యంబుఁ గలకన్య దుర్లభ, దురితవైముఖ్యంబు దుర్లభంబు
గోమతీనది నొనగూడుస్నానము దుర్ల, భంబు దుర్లభము పాపక్షయంబు

గీ. దుర్లభము దంపతిత్వంబు దుర్లభంబు, పరమపురుషార్థసాధననిరతబుద్ధి
ద్వారకావాసకృష్ణసందర్శనములు, దుర్లభము లూర్జసంసేవ దుర్లభంబు. 534

గీ. రాజసూయాశ్వమేధాధ్వరము లొనర్చి, నట్టిఫల మబ్బుఁ గార్తికమందు విష్ణు
భక్తసేవను నన్యదీపప్రబోధ, మునను బద్మపురాణంబు వినుటవలన. 535

వ. పితృపక్షంబున నన్నదానంబువలనను జ్యేష్ఠాషాఢంబులందు జలదానంబువలనను గలుగు పుణ్యంబు కార్తికంబునఁ బరదీపప్రబోధంబునం జేకూరు. కార్తికంబున నరుణోదయకాలంబునం జేయుజాగరంబును దిలదానంబును నదీస్నానంబును సాధుసంసేవనంబును దులసీరోపణపాలనపూజనంబులును బ్రహ్మపత్త్రిభోజనంబును మౌనంబును క్షమయును క్షితిశయనంబును యుగార్జితపాపక్షయకరంబులు. మాఘమాసంబునఁ బ్రయాగస్మరణంబును వైశాఖమాసంబున నవంతీస్మరణంబును గార్తికమాసంబునఁ బుష్కరస్మరణంబును మోక్షదాయకంబులు.

గీ. కమలములచేత నెవ్వఁడు కార్తికమున, హరిని బూజింప కుండునో యతనియింటఁ
గమల యుండదు కోటిజన్మముల కైన, వాఁడు కలివంచితుం డైనవాఁడ సూవె.

క. కమలామనోహరుని నొక, కమలంబున నైనఁ బూజ గావించినచో
శమియించుఁ గోటిజన్మా, ఘములును నొకక్షణములోనఁ గార్తికమందున్. 538

క. తరియింపఁజేయుఁ బితరులఁ, గరుణను దలపెట్టి కార్తికంబున దామో
దరుని భజించినవాఁ డు, ద్ధరించి పితరులను దాను ధన్యత నొందున్. 539

క. పితృకారణమునఁ బంచా, మృతాభిషేకంబుఁ జేయునెడ నూర్జమునన్
దితిజారికి శతకల్పము, లతఁ డుండును దివిని బితృసమన్వితుఁ డగుచున్. 540

క. తులసీలకుదళంబులఁ, జలిపినయెడఁ గార్తికమున శౌరికిఁ బూజన్
దళదళమునందు నొసఁగును, జలజాక్షుఁడు ముక్తిఫలము సంతోషమునన్. 541
క. తనువున శ్రుతులను శీర్షం, బున హరినిర్మాల్యతులసి భువి నెవఁడు ధరిం
చునొ కార్తికమాసంబునఁ, గనుఁగొని కలిపురుషుఁ డతని గడగడవడఁకున్. 542
క. తులసీగంధము శార్ఙ్గికి, నలఁదినయెడఁ గార్తికమున హరి శతకల్పం
బులవఱకుఁ బొందుఁ దృప్తిని, నలవియె వచియింప దాన నబ్బుఫలంబున్. 543
క. తనుపరిమార్జన మొనరిం, చిన హరినిర్మాల్యతులసిచే నూర్జమునన్
గను సంక్షయమును దక్షిణ, మున నిశ్శేషముగఁ బాపములు జాడ్యములున్. 544
గీ. విష్ణునిర్మాల్యతులసియు విష్ణుశంఖ, జలము హరిచందనంబును శార్ఙ్గిపాద
సలిలమును హరిధూపశేషమును జేయు, భస్మముగ బ్రహ్మహత్యాదిపాపములను.

—: మాసోపవాసవ్రతవిధానకథనము :—

గీ. చలుపునెడలను నూర్జమాసంబునందుఁ, దనయ మాసోపవాసవ్రతంబు సర్వ
దానతీర్థక్రతువ్రతధర్మములను, జలిపినఫలంబు ప్రాప్తించు సులభముగను. 546
వ. అతికృచ్ఛ్రపరాకచాంద్రాయణంబులం గావించి గుర్వాజ్ఞం బడసి గృహంబు విడిచి విష్ణుదేవాలయంబునకుం జని యాశ్వినశుక్లపక్షైకాదశినాఁ డుపవసించి యదిమొదలుకొని త్రింశద్దినపరిమితమాసోపవాసవ్రతదీక్షం గైకొని ప్రతిదినంబును నుపవాసంబు గావించుచు మిథ్యాలాపంబులం బరిత్యజించి యహర్నిశంబును విష్ణునామసంకీర్తనంబును విష్ణుకథాస్తవంబును విష్ణుగుణవర్ణనంబునుం గావించుచు శౌరికిఁ ద్రికాలార్చనంబు సేయుచు శాంతిని వహించి సర్వభూతంబులందును దయ గలిగి కూర్చున్నను నిలిచియున్నను మేలుకొన్నను నిద్రించినను వాసుదేవుని స్మరించుచు గాత్రాభ్యంగశిరోభ్యంగతాంబూలవిలేపనాదుల వర్జించి వ్రతనియమంబులం బాటించుచు వ్రతసంపూర్తి చేసి యంతంబునఁ ద్రయోదశసంఖ్యాకు లగుబ్రాహ్మణులను బూజించి భోజనతాంబూలదక్షిణావస్త్రయుగ్మయోగపట్టసూత్రబ్రహ్మసూత్రంబుల నొసంగి నమస్కరించి పిదప సోపధానాచ్ఛాదనంబును సాలంకారంబును నగునూతనశయ్యయందు స్వర్ణరచితం బగు నాత్మప్రతికృతిని స్థాపించి యర్చించి తత్సన్నిధిం బాదుకాసనఛత్రవస్త్రయుగ్మంబు లర్పించి. 547
క. ధరణీసురులార యీయుఁడు, హరిపదమున కేను జేర ననుమతి యుష్మ
త్కరుణాకటాక్షములచే, సరిగెద నని వేఁడి వార లనుమోదింపన్. 548
వ. ప్రతికృతియుక్తంబును సోపస్కరంబును నగుశయ్యను వారల కర్పించె నేని స్వాభీష్టఫలసిద్ధి యగు. 549
క. ఒనరించి చేని స్వస్తిక, మును సాల్గ్రామమునకు ముంగల నూర్జం
బునఁ గల్పకోటిదనుకను, ననిమిషలోకమున నుందు రాపుణ్యాత్ముల్. 550

క. వనమాలవలనఁ బ్రీతిం, గనినట్టులు కౌస్తుభమునఁ గనినట్లు ముదం
బును వాసుదేవుఁ డూర్జం, బునఁ దులసీదళముచేఁ బ్రమోదము నొందున్. 557

గీ. చలుపునెడఁ బూజ నూర్జమాసమున హరికి, మాలతీమాలికలచేత మాధవునిదు
పూజకులలాటమున స్వయంభువు లిఖించి, నట్టిదుర్వర్ణమాలల నిట్టె తుడుచు. 552

గీ. మాలతీమాలికల నూర్జమాసమందుఁ, బుండరీకాక్షునకుఁ బుష్పమండపంబు
నేర్పఱించెడివా రందఱెల్లసురలు, సలుపుచుండంగఁ బరిచర్య స్వర్గమందు. 553

క. మునిపుష్పంబును మాలతి, యును బంకేజమును దులసియును గేతకియున్
వనజాక్షునకు సమర్పిం, చినయెడ నూర్జమున నఖిలసిద్ధులు గలుగున్. 554

క. ఒనరించిన మునిపుష్పము, లను నర్చన నితరసుమములను విడిచి జనా
ర్దనునకుఁ గార్తికమాసం, బున శతహయమేధఫలముఁ బూజకుఁ డొందున్. 555

క. మునిపుష్పమాల నూర్జం, బున హరికంఠమున వైచుపుణ్యాత్మునకున్
బొనరించు స్వార్థసింహా, సనము మహేంద్రుం డొసంగి సమ్మానంబున్. 556

గీ. ఒక్కమునిపుష్పమునఁ గల్గు నూర్జమందు, నయుతగోదానమునఁ గల్గునట్టిఫలము
దానిమహిమంబుఁ దెలుప నాతరము గాదు, మురనిషూదనునకు నది ముఖ్య మగుట.

గీ. ఊర్జమున దీపదానంబు నొసఁగి హరికిఁ, దృప్తి గలిగించుసుతుఁ డొక్కఁ డేని తుదకు
వలయు జన్మింప నస్మదన్వయములందు, ననుచుఁ బితరులు వాంఛింతు రనుపదంబు.

గీ. మాధవునిముందుఁ గార్తికమాసమందుఁ, దైలమున నేనియును గోఘృతమున నేని
దీపమును వెలిఁగించినఁ బాపి యేని, చెందు హయమేధశత మొనర్చినఫలంబు. 559

సీ. ప్రజ్వలింపఁగఁ జేసి పరదత్తదీపంబు, మోక్షంబుఁ బ్రాపించె మూషికంబు
పరదత్త మైనదీపమును విలోకించి, పతనెను స్వర్గంబుఁ బణ్యకాంత
హరిముందుఁ గావించినట్టిపూజను జూచి, గోపుఁడు చేరె వైకుంఠమునకుఁ
బరులప్రేరణమున హరిపూజ యొనరించి, పరమపదంబు లుబ్ధకుఁడు పొందెఁ

గీ. గానఁ గార్తికమందు నేకతన నైన, నెవ్వ రేనియు విష్ణుసంతృప్తిహేతు
వైనకార్యంబు లొనరించి రేని గళిత, పాపులై చేరుదురు విష్ణుభవనమునకు. 560

ఆ. కార్తికేయ కార్తికమునఁ బ్రబోధిని, యెంతవఱకు రాదొ యంతవఱకె
గర్వ మొందు గంగ గర్జించుఁ దీర్థముల్, విజ్రుభీఁగు క్షేత్రవితతు లెల్ల. 561

గీ. వాజిమేధసహస్రంబు రాజసూయ, శతము గావించినఫలంబు సంఘటిల్లు
నవని నూర్జప్రబోధినియందుఁ జేయు, నొక్కయుపవాసమునఁజేసి యక్కజముగ.

గీ. జ్ఞానమును సంతతియును రాజ్యమును సకల, సౌఖ్యములును ఘటిల్లు నూర్జమున హేల
వలన నైనఁ బ్రబోధినీవాసరమునఁ, జేయునెడ నుపవాస మేజీవి యేని. 563

క. ఒనరించినయెడలఁ బ్రబో, ధినియం దుపవాస మొకటి త్రిజగంబులలో
నొనగూడని దే దేనియు, నొనగూడుఁ దలంచికొన్న నూర్జవ్రతికిన్.

గీ. మేరుమందరసమ మైనఘోరపాత, కముల నేసియు క్షణములోఁ గాల్చివైచు
నేధముల వహ్నిఁబోలెఁ బ్రబోధినీది, నోపవాసం బొకండె బహూక్తు లేల. 565

—: జాగరలక్షణకథనము :—

గీ. పూర్వజన్మసహస్రసంభూతపాప, సముదయంబును నగ్ని తూలమునుఁబోలెఁ
బూది యొనరించు నూర్జప్రబోధినీది, నంబున నొనర్పఁబడుజాగరంబు వత్స. 566

వ. గీతవాద్యనృత్యపురాణపఠనపుష్పగంధానులేపనఫలార్ఘ్యధూపదీపనైవేద్యశ్రద్ధాదానేంద్రియసంయమసత్యప్రమోదక్రియాశ్చర్యోత్సాహప్రదక్షిణనమస్కారహూమయామనీరాజనసహితంబును వినిద్రంబును నాలస్యాదివర్జితంబును నగునది జాగరంబుగాఁ జెప్పంబడియె. 567

గీ. అట్టిజాగర మూర్జమునం దెవండు, సలుపునో ప్రబోధినీదివసమున వాఁడు
మరల జన్మంబు నెత్తక ధరణిలోన, నైక్యమును జెందు విష్ణుదేహంబునందు. 568

గీ. కార్తికంబునఁ బురుషసూక్తమున నెవఁడు, హరికి నిత్యంబుఁ జేయునో యర్చనంబు
నబ్దకోటిసహస్రంబు లచ్యుతునకు, నర్చనము చేసినఫలంబు నాతఁ డొందు. 569

వ. కార్తికమాసంబున "నమోనారాయణాయ" యనుమంత్రంబుచే విష్ణుపూజయును విష్ణుసహస్రనామపారాయణంబునుం గావించువాఁడు పునరావృత్తిరహితం బగుపదంబు నొందు. 570

గీ. ద్వాదశీదినమందు నెవ్వండు జాగ, రంబు సలుపునో యూర్జమాసంబునందు
నుండు మన్వంతరశతంబు యుగసహస్ర, కోటియును స్వర్గమున వాఁడు కొలువ సురలు.

క. సలిపినసంస్తవగానం, బులు పశ్చిమరాత్రియామమున నూర్జమునన్
గలుగఁగ హరికిఁ బ్రమోదము, కలకాలము వార లుండఁగలరు దివమునన్. 572

ఆ. బాహులేయ భీష్మపంచకవ్రత మొప్పు, నూర్జమాసమందు నొనరుపంగఁ
దన్మహత్త్వ మెన్న దైత్యారి యొక్కండు, దప్ప నన్యు లెవరుఁ దగరు చూడ. 573

వ. కృతయుగాదులందు వసిష్ఠభృగుగర్గాదిమహర్షులచేతను ద్రేతాయుగాదులందు నంబరీషభోగాదిక్షత్రియులచేతను సత్యశౌచపరాయణు లగువైశ్యులచేతను భీష్మపంచకవ్రతం బాచరింపంబడియె. భీష్మాగతం బగుటంజేసి యీవ్రతంబు భీష్మపంచకవ్రతనామముం బడసె. 574

గీ. కార్తికంబున నీపంచకవ్రతంబు, చేయునెడలను సర్వంబు చేసినట్ల
కాన నొనరింపవలయు నెట్లైన దీని, నఖిలపాపక్షయాకాంక్షు లైనవారు. 575

వ. ప్రథమదినంబున గోమయంబును ద్వితీయదినంబున గోమూత్రంబును తృతీయదినంబున గోక్షీరంబును జతుర్థదినంబున గోదధియును గాయశుద్ధికొఱకుఁ బ్రాశనంబు గావించి పంచమదినంబున బ్రాహ్మణసంతర్పణం బొనర్చి నక్తంబునఁ బంచగవ్యంబు గ్రహించి భుజియింపవలయు. 576

గీ. వహ్నిసంభవ భీష్మపంచకవ్రతము పుత్ర, కాంక్షులకుఁ బుత్రులను ధనకాంక్షులకును
ధనము మోక్షార్థులకు మోక్షమును నొసంగు, నఖిలకామప్రదానసమర్థ మగుట. 577

గీ. జాగరము చేయునప్పు డూర్జమునఁ దొందు, వాజిమేధఫలంబును వాద్యకర్త
సర్వతీర్థావగాహసంజనిత మైన, పుణ్యమును నర్తకుండును బొందుఁ జూవె.

ఆ. కార్తికవ్రతంబు గావించువారికి, ద్రవ్య మిచ్చువాఁడు తద్వ్రతంబు
వలనఁ గలుగునట్టిఫల మంతయును బొందుఁ, బడయు ద్రష్ట షష్ఠభాగఫలము. 579

క. చలుపునెడ శ్రాద్ధతర్పణ, ములు పితరుల కూర్జమాసమున నెవఁడైనన్
దులసీచ్ఛాయను వానికిఁ, గలుగు దివము పితరు లొందుకతమునఁ దృప్తిన్.

గీ. ఆమలకవృక్షమూలమునందు హరికిఁ, గొలిపి సంతృప్తి చిత్రాన్నములను నూర్జ
మునను భుజియింపఁజేసి విప్రులను దాను, బంధుయుక్తంబుగను భుజింపంగవలయు. 581

క. ఒనరించిన ధాత్రీచ్ఛా, యను బితరుల కూర్జమాసమందున్ శ్రాద్ధం
బును దర్పణమును బొందుదు, రనవధికం బైనతృప్తి నాతనిపితరుల్. 582

క. ఆమలకపత్త్రఫలముల, దామోదరపూజ సేయఁదగు నూర్జమునన్
క్షేమముల నొంద నిహపర, ధామములందును మనోరథము గలవారల్. 583

క. ఒనరించినయెడ శ్రాద్ధం, బునను బురాణప్రవక్త భోజన మూర్జం
బున శ్రాద్ధపితృగణంబున, కొనగూడును దృప్తి నాల్గుయుగములవఱకున్. 584

క. ఒనరించిన ధాత్రీపూ, జను గార్తికమాసమందు సంప్రాప్తించున్
మనుజులకు సర్వయాగము, లను గావించినమహాఫలము సులభముగన్. 585

గీ. చలుపునెడలను బార్వణశ్రాద్ధ మూర్జ, మాసమున దర్శమందు సంవత్సరంబు
వఱకుఁ బితరులు తర్పితస్వాంతు లగుచు, వరము లిడుచుండెదరు నిజవంశజులకు. 586

గీ. కార్తికేయ ప్రబుద్ధుఁడు గాకమున్నె, యచ్యుతుఁడు మేలుకొల్పి క్షీరాబ్ధిసుతను
గార్తికంబునఁ బూజించుఘనునియింట, నుండు నావత్సరముఁ బాయకుండ లక్ష్మి.

క. గోవర్ధనార్చనంబును, గావించినయెడలఁ గార్తికంబున నిచ్చున్
గోవిందుఁడు రాజ్యంబును, గోవులఁ బుత్రులను బంధుకోటుల నెల్లన్. 588

సీ. కార్తికశుక్లపక్షంబునఁ బ్రతిపద్ది, నంబున రాత్రికాలంబునందు
జూదమాడవలయు జూదంబున జయంబు, గలవారి కాయేఁడు గలుగు జయము
సలుపుచుండఁగ నేను శర్వాణియును ద్యూత, కార్యంబు నొకకార్తికంబునందుఁ
గొలిచి గోరూపంబుఁ గొన్నలక్ష్మిని నాకుఁ, దెలియకుండఁగ నాఁడు గెలిచె గౌరి

గీ. యదిమొదలుకొని నాకు జయంబు గలుగ, దాయె నెందును గూడ నాయబ్దమెల్ల
నప్పుడె కపాలమును దాల్చి యవని నెల్లఁ, దిరుగ నే నేఁగ సుఖముండె గిరిజ యింట.

క. బలిపూజాదీపోత్సవ, ములు నీరాజనవిధానమును నూర్జమునన్
జలిపెడివారలయిండ్లను, నెలకొని యొకయేఁడు పద్మనిలయ వసించున్. 590

గీ. కార్తికంబునయందు నక్తవ్రతంబు, నాచరించెడిపుణ్యాత్ముఁ డధివసించుఁ
గల్పకోటిసహస్రంబు గడచువఱకు, సంతసంబున వైకుంఠసదనమందు. 591

క. బలిచక్రవర్తికొఱకై, సలిపెడిదానములు హరికి సంతోషంబుగఁ
గొలుపునవి గాన నక్షయ, ఫలమును గర్తల కొసంగుఁ బరలోకమునన్. 592

క. హరి బలివలనను గైకొని, ధర యెల్లను మరల నతనిదానగరిమ క
చ్చెరు వొంది యిచ్చె నవ, త్సరమున కొకదివస మేల ధర నాతనికిన్. 593

క. ఆదివసము కౌముది యని, మేదినిలో ఖ్యాతి నొందె మిగులం గుతలా
హ్లాదకర మగుట సకలజ, నాదరపాత్రతను బొందె నానామమునన్. 594

క. జను లెల్లరు నాదినమున, నొనరింపఁగవలయు బలిమహోత్సవమును న
ట్లొనరింపకున్న భ్రంశం, బును బొందుఁ దదీయకర్మములు సకలములున్. 595

గీ. కౌముదీదినమందు దుఃఖమున నున్న, వర్షమంతయు దుఃఖంబు వాఁడు చెందుఁ
గౌముదీదినమునఁ దుష్టి గలిగి యున్న, వర్షమంతయు సంతుష్టి వాఁడు పొందు. 596

వ. కౌముదీతిథి విష్ణుప్రీతికరం బగుటచే వైష్ణవి యనియును దానవపరిపాలితం బగుటచే
దానవి యనియును బ్రసిద్ధిం బడసె.

గీ. కాశకుశమయముగఁ జేసి కార్తికమున, మార్గపాలిని గట్టి స్తంభమునఁగాని
తరువునఁగాని పూజించి దాఁటునెడలఁ, బ్రజలకును బశువులకును రావు రుజలు. 598

గీ. వృత్రుని వధించుటను జనియించినట్టి, బ్రహ్మహత్యను వజ్రి వజ్రమున నఱకె
నాఱుఖండంబులుగను మహోగ్రహమునఁ, బూర్వ మాఖండషట్క మద్భుతము గాఁగ.

వ. శ్రావణభాద్రపదాశ్వయుజకార్తికశుక్లద్వితీయాదినంబులందు నదీవృక్షనారీభూవహ్ని
భ్రూణహంతలందుం జొచ్చె. దానంజేసి నదులకుఁ బ్రావృణ్మలంబును వృక్షంబులకు
నిర్యాసమలంబును స్త్రీలకు రజోమలంబును భూమి కష్టాంగుళపర్యంతాపవిత్రతా
మలంబును వహ్నికి మషీమలంబును భ్రూణహంతలకు సంగమలంబును నేర్పడియె.
శ్రావణశుక్లద్వితీయకుఁ గలుష యనియును భాద్రపదశుక్లద్వితీయకు నిర్మల యని
యును నాశ్వయుజశుక్లద్వితీయకుఁ బ్రేతసంచార యనియును గార్తికశుక్లద్వితీయకు
యామ్య యనియును నామంబులు గలిగె. కార్తికద్వితీయ యమప్రియ యగుటచే
యామ్య యయ్యె. దానంజేసి దీనికి యమద్వితీయ యనువిఖ్యాతియుం గలిగె. యమ
ద్వితీయయందుఁ బూర్వాహ్ణంబున నర్మదాస్నానంబు గావించి యమునిఁ బూజించు
వారలు యమలోకంబును దర్శింపకుందురు. యమప్రసాదంబున నరకగతం బగుస్వపితృ
గణంబునకు విముక్తియుం జేకూరు. 600

గీ. యమునచే నాత్మగృహమున యామ్యనాఁడు, యముఁడు భోజితుఁడై మహాహ్లాద మొదవ
నాయమకు వస్త్రఫలభూషణాదు లొసఁగి, సకలసుఖముల నొందె వత్సరమువఱకు.

గీ. ఆకతన నిజసోదరీహస్తదత్త, మైనయన్నంబు భుజియించి యామ్యనాఁడు
సత్కరించిన నామెను సకలజనులు, పొందుదురు సౌఖ్యముల నబ్దపూర్తివఱకు. 602

క. కలుగవు గ్రహకలహంబులు, గలుగదు రిపుభయము సకలకళ్యాణములున్
గలుగును [illegible]మ్యాదినంబునఁ, జలిపిన భగినీప్రశస్తశయభోజనమున్. 603

ఆ. కార్తికేయ కార్తికము వత్సరవ్రత, ములు సమాప్తి నొందుముఖ్యపదము
గాన క్షేమకాంక్షగలవార లెవరును, గడనజనదు కార్తికవ్రతంబు. 604

క. ఇది మోక్షద మగుశాస్త్రము, విదితం బొనరించినాఁడ విశదంబుగ నీ
మది నుంచుకొనుము నాస్తిక, వదనములకు నెక్కనీయవల దెపు డేనిన్. 605

క. ఏని కార్తికమాహాత్మ్యం, బును విప్రునివలన నూర్జమున వాచకునిన్
దనిపినయెడ సత్కారం, బున నఖిలామరులుఁ దృప్తి పొందుదు రెదలన్. 606

ఆ. వాచకార్చనంబె వాసుదేవార్చన, మతఁడు తృప్తి నొంద నచ్యుతుండు
తృప్తి నొందు వాసుదేవునకును వాచ, కునకు భేదలవము గూడ లేదు. 607

వ. కృష్ణవస్త్రపరివేష్టితంబును ఖడ్గహస్తంబును రక్తపుష్పకృతాపీడంబును స్వర్ణకుండల
మండితంబును లోహదంష్ట్రంబును భీషణంబును నగుసువర్ణపాత్రప్రతిమను దిలప్రస్థం
బునం దుంచి ధర్మరాజనామంబులచేఁ బూజించి గృహీతకుసుమాంజలి యై ధర్మ
ప్రీతికరంబుగా బ్రాహ్మణున కొసంగి వ్రతపూర్తి గావింపవలయు. 608

క. అని నుడువుటయును షణ్ముఖుఁ, డనవధికానంద మొదవ నాంతరమందున్
బొనరించి నమస్కారం, బును హరునకుఁ జనియె సురసమూహముతోడన్. 609

ఆ. ఒక్కనాఁడు గౌరి ముక్కంటి దరిఁ జేరి, ప్రాణనాథ శ్రేష్ఠభక్తి యేదొ
చెపుము నాకు నాఁగ శివుఁ డాత్మలోపల, నెనయ సంప్రహర్ష మిట్టు లనియె. 610

—: నానాభక్తిస్వరూపకథనము :—

సీ. కలికి చెప్పెద విను ఫలమూలజలహవి, రశనుఁ డై కాలత్రయంబునందుఁ
గావించుటయు వాసుదేవునిపూజను, హరికిఁ జేయుటయు నాత్మార్పణంబు
తల్లీనచిత్తుఁ డై యుల్లసిల్లుటయును, బరగును సాత్త్వికభక్తి నాఁగ
సేవింప నిష్టార్థసిద్ధి కై హరి నది, పరఁగును రాజసభక్తి యనఁగ
గీ. పరులహింసింపఁ గాని దంభమునఁ గాని, జలరుహాక్షునిపూజను జలిపె నేని
పరగు నయ్యది తామసభక్తి నాఁగ, భక్తిసాధ్యంబు గాని దేహియు లేదు. 611

వ. సాత్త్వికభక్తి యుత్తమంబు. రాజసభక్తి మధ్యమంబు. తామసభక్తి కనిష్ఠంబు. 612

ఆ. భక్తి లేనివాఁడు పఠితాఖిలామ్నాయుఁ, డయ్యుఁ గర్మనిష్ఠుఁ డయ్యు వేద
బాహ్యుఁడుగను గర్మబాహ్యుండుగను జెప్పఁ, బడియె సూక్ష్మధర్మపరులచేత. 613

క. అమరులు క్షేమము నిత్తురు, శమధను లొసఁగుదురు శుభము శాంతిని బితరుల్
సమకూర్తురు సంతతమును, గమలాక్షునియందు భక్తిగలవారలకున్. 614

క. నళినాక్షుపాదభక్తుల, నిలయంబులయందు లక్ష్మి నిలుచు స్థిరముగన్
నిలుచును గ్రహంబులును శుభ, ఫలప్రదాయకము లగుచుఁ బ్రతిపదమందున్. 615

ఆ. శతసహస్రకోటిసంఖ్యాకు లగువారు, విష్ణుభక్తిఁ గూర్చి వినిన నందు
భక్తిఁ జొక్కఁడే తేలుఁ బద్మాక్షి, శతజన్మ, పక్వభక్తిపూర్ణభావుఁ డగుట. 629

క. పరులకు బుద్ధిం జెప్పెడి, నరులుందు రనేకు లట్టినరకోటులలోఁ
బరులకుఁ జెప్పినయట్లా, చరించువాఁ డొకఁడ యుండు తన్మాచక్రమునన్.

గీ. నడచుచున్నను గనుచున్న నుడువుచున్న, సలిలమును గొనిపోయెడిజనునిమనము
ఘటమునవె నిల్చుగతి నుండుఁ గదలకుండ, శ్రీధరునియంద భక్తునిచిత్తవృత్తి. 631

గీ. ఇంచుకించుక హరిభక్తి నెక్కఁజేయు, చున్న బోధకుఁ డాశించుచుండు శ్రోత
బెల్లమును గొంచెముగఁ దల్లి పెట్టుచున్న, మరగి కాంక్షించు బాలుఁడు మరల మరల.

గీ. కర్మబద్ధుఁడు గాఁడు భాస్కరుఁడువోలె, సర్వగతుఁ డయ్యు హరినామసాధనుండు
నుడివి నారాయణపదంబు కొడుకుపేరఁ, బడయఁడే యజామిళుఁడు ముక్తిఁ బాపియైన.

గీ. తోయమున నివసించు దర్దురము గాన, నమునఁ దిరిగెడిచంచరీకమును ఘ్రాణ
శక్తిచే గంధము గ్రహించుచందమునను, భక్తుఁడు గ్రహించు శార్ఙ్గిని భక్తిచేత.

గీ. మోయుచున్నను నిజపృష్ఠమునవె యుష్ట్ర, మగురుకర్పూరభారంబు నందులోని
గంధమును మూరుకొనలేనికరణి నాత్మ, గతుని శౌరి నభక్తుఁడు గానలేఁడు. 635

గీ. తెలియక యభక్తు లాత్మసంస్థితుని హరిని, గొలుచుచుందురు జాలుజప్పలును వితగ
నెఱుఁగక స్వనాభిగత మైనమృగమదంబుఁ, దరువులను మూరుకొనుమృగతతులువోలె.

గీ. చలుపునెడ మూర్ఖజనులకు సదుపదేశ, మెట్లు వైయర్థ్య మొందునో యట్లె వ్యర్థ
మగుఁ బ్రబోధంబు చేసిన నన్యభక్త, జనములకు విష్ణుభక్తిప్రశస్తమహిమ. 637

గీ. పాలు వోసినయెడలను వ్యాళములకుఁ, బరిణమించునో యేరీతి గరళముగను
నట్లె నాస్తికులకుఁ జేయునట్టివిష్ణు, భక్తిబోధంబు విమతిగాఁ బరిణమించు. 638

గీ. కానలేరు బహిర్ముఖు లైనవార, లాత్మదేహస్థితుం డైనహరిని నేత్ర
హీను లగువారు దీపము నేవిధమున, నేరరో కనుంగొనంగ నుండినను నెదుట. 639

గీ. మలముచే దర్పణంబు ధూమంబుచేత, నగ్ని యుల్బంబుచే గర్భ మావృతంబు
లైనవడువున నుండెడి దేహంబునంద, మాయచే నావృతుం డయి మాధవుండు. 640

క. ఆమాయ నుడిపి హరిఁ గను, సామర్థ్యము విష్ణుపాదసరసిజభక్త
గ్రామణికిఁ దప్ప నన్యున, కేమాత్రము గూడఁ గలుగ దెట్టిం డైనన్. 641

గీ. జంగమస్థావరాత్మకజగములందు, నంతటను నిండి యుండెడి నారాయణుండు
పాలలో నుండునాజ్యంబుపగిదిఁ దిలల, యందు నుండెడితైలంబుచందమునను. 642

క. వనజజముఖసురగణ మె, ల్లను బ్రోతం బగుచు నుండు లక్ష్మీపతిమే
నను సతతంబును సూత్రము, నను గ్రువ్వంబడినమణిగణంబులువోలెన్. 643

క. వనజదళేక్షణ కాష్ఠం, బున నుండినవహ్ని మథనమునఁ గనఁబడుచా
యను ధ్యానంబునఁ గనఁబడుఁ, దనుమధ్యగుఁ డైనశౌరి తనుధారులకున్. 644

గీ. ఒక్క-విష్ణువె యాదిలో నుండి వాని, వలనఁ బ్రాదుర్భవించె విశ్వంబు లెల్ల
నొక్క-దీపంబె యాదిలో నుండి దాని, వలన దీపసహస్రముల్ గలిగినట్లు. 645

క. నానారూపంబులచేఁ, గానంబడు హరియె ముజ్జగంబులయందున్
భానుఁ డనేకాకృతులను, గానంబడునట్లు సలిలఘటములలోనన్. 646

క. జలసంయోగవశంబునఁ, గలిగించెడునట్లు వృక్షగణమును ధాత్రీ
తలము జనింపఁజేయున్, జలజాక్షుండు ప్రకృతిగుణవశమున జగములన్. 647

ఆ. మశకగర్భమందు మాతంగగర్భము, నందు మనుజగర్భమందు దేవ
గర్భమందు నుండుఁ గమలాక్షుఁ డాధిక్య, మల్పతయును లేనియాత్మ యగుట. 648

ఆ. అతఁడె యాత్మ యనిన నాతఁడె పరమాత్మ, యనిన బ్రహ్మ మనిన నతఁడె జీవుఁ
డనిన నతఁడె సచ్చిదానందములు నాఁగ, నతఁడె నేను గూడ నతఁడె చూవె. 649

క. హరి తప్ప నితర మేమియుఁ, జరాచరములందు లేదు చర్చింపఁగ నా
పరమాత్మయె చిత్రంబుగ, హరియించు సృజించుఁ బెంచు నఖిలజగములన్. 650

గీ. నామరూపవిభేదసందర్శనమున, బహువిధంబుల నజ్ఞులు పలుకుచుంద
రంతె కాని విమర్శించి యరసికొనిన, దృశ్యమానప్రపంచంబు లెల్ల హరియె. 651

ఆ. బుట్టబొమ్మలోనఁ బురుషుండు లేకున్న, నెట్లు పడునొ యట్లె యీశరీర
మాత్మ లేనియెడల నప్పుడె పడిపోవు, దాన నతఁడువాఁడు తాన చూవె. 652

గీ. ఘటములందు నభం బుండుకరణి నుండు, సకలదేహంబులందును శార్ఙ్గి భగ్న
మైనను ఘటంబులు నభంబు పోనిపగిదిఁ, బోయినను విగ్రహంబులు పోఁడు శార్ఙ్గి.

క. కనకవికారం బెల్లను, గనలంబునఁ బూర్వరూప మందినచందం
బున భక్తిచేత జీవుఁడు, తనప్రాక్తనరూప మొంది తాను వెలుంగున్. 654

క. హరిభిన్నుని గను జీవుని, నరసెడిమూఢులు వలాహకావృత మగుభా
స్కరబింబంబును దేజో, విరహితముగ నెంచుదుర్వివేకుల చూవే. 655

ఆ. ఆత్మ నిర్వికల్పుఁ డాకారవర్జితుఁ, డతనివలనఁ బుట్టె నాకసంబు
దానఁ గల్గె మారుతము దాన వీతిహో, త్రంబు వుట్టెఁ గలిగె దాన జలము. 656

ఆ. ఆజలంబునందు నావిర్భవించె హి, రణ్యగర్భుఁ డగువిరాట్టొకండు
పాదమె వానినాభిపుష్కరంబునను బ్ర, హ్మాండకోటు లద్భుతావహముగ. 657

క. కావున సర్వంబునకున్, గోవిందుఁడె మూల మని కనుంగొనుటె యగున్.
గోవిందభక్తి దాననె, జీవునకు స్వరూపసిద్ధిఁ జెందఁగలుగున్. 658

ఆ. అట్టిభక్తి గలుగ నగు సాధనంబు సా, కారుఁ డైనదానవారిసేవ
పట్టు లేకయున్నఁ బై కేఁగ సాధ్యంబు, గాదు చూవె యెట్టిఘనున కేని. 659

గీ. కర్మబీజానుగుణముగఁ గలిగె నిట్టి, బ్రహ్మసర్గంబు దానసె బయలువెడలె
సర్వలోకంబులును గర్మశక్తి నుడుప, సాధనము భక్తియె సమస్తజంతువులకు. 660

గీ. కర్మపాశంబుచేతను గట్టువడిన, జంతువు లవిద్యచేతను స్వస్వరూప
మెఱుఁగఁజాలక పడియుండు నెపుడు గూడ, జన్మమృత్యుపరంపరాసంకటమున. 661

క. వర్ణోచితకర్మములు భ, వార్ణవతారకము లగుట నవియు నవిద్యో
త్తీర్ణతకు సాధనములుగ, నిర్ణీతము లయ్యె సర్వనిగమములందున్. 662

ఆ. మనసె కారణంబు మంచికిఁ జెడ్డకు, మోక్షమునకు బంధమునకుఁ గూడ
దాన దేహి యైనవాని కెల్ల మనంబె, శత్రు వైన మఱియు మిత్రుఁ డైన. 663

క. మనముననె చెడిరి కొందఱు, మనముననే బాగుపడిరి మఱికొందఱు గా
వున మనము నెట్టిమార్గం, బున నడిపిన నట్టిమార్గమున నది నడచున్. 664

ఆ. మనము భక్తినిష్ఠ మొనరించి యాకల్ప, మొనరిచినను గర్మమును నరుండు
కర్మలేపభాగి గాఁ డంబులిప్తంబు, గాక యుండునట్లు కమలదళము. 665

గీ. అగ్నియం దుంపఁబడినట్టి యగ్నివోలె, జలమునం దుంపఁబడినట్టిజలమువోలె
నాత్మవిజ్ఞానమున జీవుఁ డాత్మలోన, నైక్యమును జెందు నెడ శూన్య మగు జగంబు.

క. కనఁగలుగునొ జన్మాంతర, మునయం దష్టాంగయోగములచే నెవనిం
గనఁజాలు నొక్కజన్మము, ననె భక్తుఁడు భక్తినైపుణంబున నతనిన్. 667

క. తనకేల నున్నకంకణ, మును జూచికొనంగ ముకురమును వెదకెడి మూ
ఢునిచాయ జడుఁడు దిరుగున్, దనలోఁ గలహరిని గాంచ ధాత్రిని నెల్లన్. 668

క. ఆకృతిశూన్యుం డెవ్వఁడొ, సాకారుండతఁడె కాన సాకారుని నా
లోకించినపక్షమున ని, రాకారుఁడు గోచరించు నప్పుడె స్వయముగన్. 669

గీ. హరిని స్మరియించు చుండెడితరుణమందుఁ, గనుల హర్షాంబుకణమును దనువునందుఁ
బులకలును గ్రమ్మ భక్తుఁడు పొందు ముక్తి, విష్ణుకరుణోదితాత్మవివేకుఁ డగుచు.

గీ. హరిని స్మరియించుటను మానసాఘములును, హరిని గీర్తించుటను వాచికాఘములును
హరిని బూజించుటను గాయికాఘములును, క్షీణ మగుటను భక్తుఁడు చెందు ముక్తి.

క. వర్ణములును నాశ్రమములు, వర్ణాశ్రమధర్మములును వనజభవునిచే
నిర్ణీతము లగుటను నా, నిర్ణయమును దగదు భక్తినిష్ఠుఁడు దాఁటన్. 672

క. నిజధర్మము విడనాడక, భజియింపక యన్యధర్మపథమును భక్తుల్
భజియింప నొప్పు శార్ఙ్గిని, నిజధర్మమునందె మేలు నిధనం బైనన్. 673

వ. స్వధర్మాగతం బగుద్రవ్యంబు శుక్లద్రవ్యం బని చెప్పంబడియె. శుక్లద్రవ్యంబుచేఁ
జేయంబడుదానంబు స్వల్పం బైనను మహాపుణ్యంబు నొసంగు. అధర్మాగతం బగు
ద్రవ్యంబు మలినద్రవ్యంబు. దానం జేయంబడుదానంబు నరకప్రదంబు. 674

క. ఒనరించిన నిహలోకం, బునఁ గర్మము నన్యలోకమునఁ గర్మఫలం
బును ననుభవింపవలయును, దనుధారులు దానిఁ గడవఁదప్పునికతనన్. .675

గీ. పుణ్యకర్మముచేతను బొందుసుఖము, దురితకర్మంబుచేతను దుఃఖ మొదవు
లేదు పాపాత్ములకు సుఖలేశ మేని, దుఃఖలవ మేని పుణ్యవంతులకు లేదు. 676
సీ. బంధించి త్రాళ్లచేఁ బ్లవగంబులను ద్రిప్పు, చుండెడిసూత్రధారుండువోలెఁ
గర్మపాశంబులఁ గట్టి ప్రాణుల నెల్ల, సర్వేశ్వరుఁడు ద్రిప్పు సంతతమును
బ్రహ్మాదులును గర్మబద్ధు లై తా మొన, రించుచుండిరి స్వస్వకృత్యములను
వీ రని వా రని వివరింపఁగా నేల, కర్మబద్ధములు లోకంబు లెల్లఁ
గీ. గడకు నీ కొక్కమాట నే నుడువువాఁడ, నిది రహస్యంబు చెప్పకు మెవ్వరికిని
నట్టికర్మంబు మాపు చేయంగఁగలది, విష్ణునామంబుకంటెను వేఱు లేదు. 677
సీ. కొందఱు దేవతాబృందంబుఁ గొందఱు, మణులను గొందఱు మంత్రములను
గొందఱు గ్రహములఁ గొంద ఱోషధులఁ గొం, దఱు సాహసమును గొందఱు బలంబుఁ
గొంద ఱుద్యమమును గొందఱు ధృతిని గొం, దఱు పరాక్రమముఁ గొందఱు నయంబుఁ
గొందఱు బుద్ధిని గొందఱు సిద్ధిని, నుతిచేయు చుందు రద్భుతము గాఁగ
గీ. నేనుమాత్రము కర్మమునే నుతింతు, నన్నిటికిఁ గూడ మూల మై యున్నకతన
మశక మగుఁ గర్మముననె సామజము గూడఁ, గరి యగును మశకంబును గర్మముననె.
గీ. బాహ్యమందు సమస్తంబుఁ బరిహరించి, మనసులోపల వాంఛలు మానకున్న
వాఁడు పాపంబు చేసినవాఁడె కాన, వ్యర్థములు వాఁడు చేయుకార్యంబు లెల్ల. 679
గీ. చలుపుచును బాహ్యమందుఁ గర్మముల నెల్ల, మనసులోపల వాంఛలు మానె నేని
యతనిత్యాగంబు మధ్యమత్యాగ మగుటఁ, బడయఁజాలఁడు తత్పుణ్యఫలము వాఁడు.
గీ. బాహ్యమునఁ గర్మములును నాభ్యంతరమున, వాంఛలును ద్యజియించినవానిత్యాగ
ముత్తమము దుర్లభం బది యోగులకును, వాఁడె భక్తుఁడు ముక్తుఁడు వాఁడె చూవె.
గీ. కష్టములచేతఁగాని యాగ్రహముచేతఁ, గాని కావింపఁబడినత్యాగంబు మధ్య
మంబు దానను ద్యాగఫలంబు లేదు, రాగి యగుఁగాని యాతఁడు త్యాగి గాఁడు.
గీ. అభ్యసించుచు యోగంబు నంతరాయ, నిహతుఁ డగునేని మరల జన్మించి యోగి
కులమునం గాని సిరిగలనిలయమందుఁ, గాని యాతఁడు తత్సిద్ధిఁ గాంచఁగల్గు. 683
గీ. కర్మమయ మగుయజ్ఞంబు కర్మనాశ, కరము గానేర దెపుడును గడుగఁగలదె
కర్దమము కర్దమమును రక్తమును రక్త, మెంత తలక్రిందు లైనను నెన్నఁ డేని.
గీ. సార్వభౌమసుఖంబుతో స్వర్గసుఖము, సాటి చేయంగవచ్చు నశాశ్వతంబు
గాన నాసౌఖ్యమును గోర నేను నిత్య, మైనమాధవభక్తిసౌఖ్యమును దప్ప. 685
గీ. గర్భ మనియెడినరకలోకమున నుండ, గడగడవడంకు చుందు నెప్పుడును నేను
మద్భయంబును దీర్ప సమర్థ మైన, దొక్కహరిభక్తి దప్ప వే ఱొండు లేదు. 686
గీ. భూరికామయుతం బైనబుద్ధి విష్ణు, భక్తిని జయింపలే దెంతశక్తి యున్న
రాలు లోహంబుచేతను బ్రద్ద లగును, గాని రత్నంబు భిన్నంబు గాదు చూవె. 687

ఆ. విష్ణుసేవకులను విడనాడి శమనుండు, సకలజంతువులను సంహరించు
బకము దర్దురాదిపాథశ్చరంబుల, విడిచి మ్రింగునట్లు వివిధకృములు. 688
గీ. వ్యాధునకుఁ ముక్తి నొసఁగినవాఁడు కుబ్జ, నుద్ధరించినవాఁడు నన్నుద్ధరించు
బద్ధకంకణుఁ డగుచును భక్తజనుల, నోముటకు దీక్షితోడఁ దా నున్నకతన. 689
క. అని పలుకుచు రోమాంచము, లెనయంగను మేన లోన నేకాగ్రత్వం
బొనరఁగ నిశ్చేష్టత్వం, బున నుంటయుఁ జూచి గౌరి ముద మొదవంగన్. 690
వ. మహేశ్వరుండు బహిర్ముఖుం డగునంతవఱకును నిరీక్షించి యుండి యనంతరం బాతని
కి ట్లనియె. 691
గీ. అచ్యుతుండు జంబూద్వీపమందు నెన్ని, తీర్థములుగ వసించె నేతీర్థ మందు
నుత్తమమొ తెల్పుము వినంగ నుద్భవించె, నిచ్ఛ యన నీశ్వరుం డామె కిట్టు లనియె.
క. జలజాక్షి సప్తలోకం, బులు గూడ హరిస్వరూపముల యైనను నేఁ
దెలిపెదను గొన్నితీర్థం, బుల నడుగుట నీవు లోకమును గరుణింపన్. 693

—: విష్ణుతీర్థనామకథనము :—

వ. పుష్కరతీర్థంబును వారాణసీక్షేత్రంబును నైమిశక్షేత్రంబును బ్రయాగతీర్థంబును మానసతీర్థంబును విశ్వకాయతీర్థంబును సోమేశ్వరతీర్థంబును మదోత్కటతీర్థంబును రథచైత్రకతీర్థంబును గాన్యకుబ్జతీర్థంబును గపాలమోచనతీర్థంబును మలయజతీర్థంబును గుబ్జామ్రకతీర్థంబును గేదారతీర్థంబును హిమవత్పృష్ఠంబున బాహ్యాతీర్థంబును గోకర్ణంబున గోపకతీర్థంబును హిమాద్రియందు స్థానేశ్వరతీర్థంబును బిల్వకంబున బిల్వపత్రకతీర్థంబును శ్రీశైలంబున మాధవతీర్థంబును భద్రేశ్వరంబున భద్రతీర్థంబును వారాహంబున విజయతీర్థంబును వైష్ణవగిరియందు వైష్ణవతీర్థంబును రుద్రకోటిగిరియందు రౌద్రతీర్థంబును గాలంజరగిరియందుఁ జైత్ర్యతీర్థంబును గంపిలంబునఁ గాంపిలతీర్థంబును ముకుటంబునఁ గోటకతీర్థంబును గల్లికయందు సాలగ్రామతీర్థంబును నర్మదయందు శివతీర్థంబును మాయయందు విశ్వరూపతీర్థంబును నుత్పలాక్షంబున సహస్రాక్షతీర్థంబును రైవతకగిరియందు జాతతీర్థంబును గయయందుఁ బితృతీర్థవిష్ణుపాదతీర్థంబులును విపాశయందు విపాపతీర్థంబును బుండ్రవర్ధనమందుఁ బాటలతీర్థంబును సుపార్శ్వంబునందు నారాయణతీర్థంబును త్రికూటంబునందు విష్ణుమందిరతీర్థంబును విపులంబున విపులతీర్థంబును మలయాచలంబునఁ గళ్యాణతీర్థంబును గోటితీర్థంబునఁ గౌరవతీర్థంబును గుబ్జాంకకంబునఁ ద్రిసంధ్యతీర్థంబును గంగాద్వారంబున హరిప్రియతీర్థంబును వింధ్యప్రదేశంబున శైలతీర్థంబును బదరియందు సారస్వతతీర్థంబును గాళిందియందుఁ గాలరూపతీర్థంబును సహ్యాద్రియందు సాహ్యకతీర్థంబును జంద్రక్షేత్రంబునఁ జాంద్రతీర్థంబును యమునయందు మృగతీర్థంబును గరవీరంబునందుఁ గురుతీర్థంబును వినాయకపర్వతంబున నమాతీర్థంబును భాస్కరక్షేత్రంబున నారోగ్యతీర్థంబును మహాకాలంబున మహేశ్వరతీర్థంబును వింధ్యకంద

రంబున నమృతతీర్థంబును మండపంబున విశ్వరూపతీర్థంబును నీశ్వరపురంబున స్వాహాతీర్థంబును బ్రచండయందు వైనగలేయతీర్థంబును నమరకంటకంబునఁ జాండతీర్థంబును బ్రభాసతీర్థంబునఁ బుష్కరతీర్థంబును సరస్వతియందు దేవమాతృతీర్థంబును మహాపద్మంబున మహాలయతీర్థంబును బయోష్ణియందుఁ బింగళేశ్వరతీర్థంబును సింహికయందు సింహికాతీర్థంబును సౌరవంబున రవితీర్థంబును గృత్తికాక్షేత్రంబునఁ గార్తికతీర్థంబును శంకరగిరియందు శాంకరతీర్థంబును సుభద్రాసింధుసంగమంబున నుత్పలతీర్థంబును విష్ణుపర్వతంబునఁ గాణపత్యతీర్థంబును జాలంధరంబున విశ్వముఖతీర్థంబును దారంబునఁ దారకతీర్థంబును దేవదారువనంబునఁ బౌండ్రతీర్థంబును గాశ్మీరమండలంబునఁ బౌష్కతీర్థంబును హిమాద్రియందు భౌమహిమతుష్టికపౌష్టికతీర్థంబులును శంఖోద్ధారంబున శంఖధారకతీర్థంబును బిండంబునందుఁ బిండనతీర్థంబును సిద్ధంబునందు వైఖానసతీర్థంబును నచ్ఛోదంబునందు విష్ణుకామతీర్థంబును నుత్తరకూలంబున నౌషధ్యతీర్థంబును గుశద్వీపంబునఁ గుశోదకతీర్థంబును హేమకూటంబున మన్మథతీర్థంబును గుముదంబున సత్యవాద్యతీర్థంబును వందతియందు నాశ్వకతీర్థంబును వింధ్యంబునందు వైమాతృకతీర్థంబును మాయాపురంబున జాతతీర్థంబును మందరంబున గౌతమతీర్థంబును గంధమాదనంబున సుగంధకార్ముకతీర్థంబులును గిరికర్ణంబున విశ్వేశ్వరతీర్థంబును జిత్తంబున బ్రహ్మమయతీర్థంబును జంబూద్వీపంబునందు సుప్రశస్తతీర్థంబులుగాఁ జెప్పంబడియె. 694

క. ఈతీర్థంబులలోపల, స్నాతుండై నరుఁడు విష్ణుసందర్శనముఁ
బ్రీతిమెయిం జేసినఁ ద, త్పాతకవర్గంబు లెల్ల దగ్ధంబు లగుఁన్. 695

క. అనుదినమును నేతత్తీ, ర్థనామములఁ దలఁచు చున్నఁ బ్రాతస్సాయం
తనవేళలందు నరునకుఁ, గనఁగలుగును విష్ణుపదము కాయాంతమునన్. 696

గీ. కాని యీతీర్థములు సాటిగావు విష్ణు, నామసంకీర్తనమునకు నళినగంధి
మాపు హరినామ ముత్పత్తిమరణములను, బాపముల నెల్లఁ దీర్థముల్ పాటఁద్రోలు.

—: వేత్రవతీమాహాత్మ్యకథనము :—

సీ. వినుము వచించెద వేత్రవతీనదీ, మాహాత్మ్యమును నీకు మంజువాణి
వృత్రునిచేతఁ గావింపఁగాఁబడినకూ, పమునుండి యానది బయలుదేఱెఁ
దద్దర్శనమునఁ బాతకము లెల్ల నశించు, దానఁ జేసినస్నానపానములను
సర్వరోగములును శమియించు నందొన, ర్చినదానమునఁజేసి త్రిదివ మొదవు

గీ. ఘనశిలో నుండుసర్వతీర్థములు దివము, నందు నివసించునట్టిసర్వామరులును
హరియు బ్రహ్మయు నేను మాయనుచరులును, వేత్రవతియందు నుందుము విడువకుండ.

గీ. అందులో మున్గునప్పుడు రాజ్యమును గోర, రాజ్యము లభించుఁ గోర స్వర్గమును గలుగు
స్వర్గమును ముక్తి గోర మోక్షమును దొరకు, వేత్రవతివంటినది లేదు ధాత్రియందు.

సీ. మహిఁ నుండె మున్ను చంపకపురంబునను వి, దారుణుం డనెడిభూధవుఁ డొకండు
వాఁడు కష్టవ్యాధివలనఁ బీడింపంగఁ, బడుచు దుస్సాంగత్యబలముచేతఁ
గావించుచును దుష్టకార్యంబు లెల్ల భం, గము సేయుచును ధర్మకార్యములకుఁ
బెద్దలతోడను బుద్ది లేకుండంగ, వాదించుచు వితండవాదములను
గీ. వేఁట యాడంగ నొకనాఁడు విపినమునకు, నరిగి యొకలేడి పై నేనె నాశుగమును
దానిఁ దప్పించుకొని యది దైవికముగఁ, బఱచుచుండంగ నమ్మహీపాలకుండు.
వ. దానివెంటంబడి బహుదూరంబు పరువెత్తుచుం జని చని తృషార్తుం డగుట వేత్రవతీ
నదీజలపానంబు గావించి యామృగంబు కానంబడమి నిరాశుం డై తిరిగి స్వగృహంబున
కరుదెంచె. 701
సీ. అంతట నాత్మకుష్ఠామయంబు నశింప, నతఁడు పొందుచు విస్మయంబు మదినిఁ
దన్నదీజలమును ద్రావుటయే తన, వ్యాధి పోవఁగ హేతు వని గ్రహించి
యదిమొదలుగ భక్తి యామతిల్లఁగ నండె, యాచరించుచు స్నాన మనుదినంబుఁ
దత్స్నానమునఁజేసి తనదుష్టభావ మం, తయు నంతరించి సద్భావ మొదవ
గీ. ధర్మమార్గంబునం జొచ్చి దానములను, జలుపుచును విష్ణునామసంస్మరణమునను
గడపి జీవిత మెల్లను గట్టకడకు, ముదముతోడను వైకుంఠమునకుఁ జేరె. 702
గీ. సంగ మెచ్చోటఁ గలుగునో సాభ్రమతికి, వేత్రవతికిని నచ్చోట వెలయ భక్తి
స్నానదానాదివిధులను జలిపె నేని, జన్మరాహిత్యమును జెందు జనుఁడు దాన. 703
క. అని నుడువుటయును పార్వతి, విని సంతస మొదవ నాథ వేడుక గలిగెన్
విన సాభ్రమతీమహిమం, బును దెల్పుము నాఁగఁ బురరిపుం డి ట్లనియెన్. 704

—: సా భ్ర మ తీ మా హా త్మ్య క థ న ము :—

సీ. మును కశ్యపుఁడు తపోధనులను దర్శింప, నైమిషాటవి కొకనాఁడు చనఁగ
నట నున్నఋషు లెల్ల నతనికిఁ దగినస, త్కారంబు గావించి తాపసేంద్ర
నీవు దక్షుండవు రావింపు మిలకు గం, గను నది నీనామమున వెలుంగు
నని పల్కుటయును గశ్యపుఁ డర్బుదాద్రియం, దయుతాబ్దములు తపం బాచరించె
గీ. నపుడు ప్రత్యక్ష మై యమ్మహర్షి కేను, వరము నిచ్చెద ననఁగ నప్పరమమౌని
గంగ ని మ్మని కోర నేఁ గనికరించి, విడిచితిని నొక్కజటనుండి విబుధనదిని. 705
క. అంతట దానిం గై కొని, సంతసమునఁ గశ్యపుఁడును జనుదేరఁగ నా
శాంతిధను లెల్ల నమ్ముని, కాంతునిమహిమంబుఁ బొగడి కడుకొని యంతన్.
వ. ఆగంగకుఁ గాశ్యపి యని నామకరణంబు గావించిరి. 707
ఆ. మును భగీరథుండు ననుఁ గోర గంగను, నతని కిచ్చినాఁడ నాదియందుఁ
గశ్యపుఁడును బిదపఁ గాక్షింప నతనికి, నిచ్చినాఁడ వాని కిచ్చినట్లు. 708
వ. కాశ్యపి కృతయుగంబునఁ గృతవతి యనియును త్రేతాయుగంబున గిరికర్ణిక యనియును

ద్వాపరయుగంబునఁ జందన యనియును గలియుగంబున సాభ్రమతి యనియును నామంబులం బడసి జగద్విఖ్యాతిం గాంచె. 709

గీ. సాభ్రమతియందు స్నానంబు సలిపె నేని, సకలపాపంబులును వినాశంబు నొందు
దానఁ గలుగు హరిప్రసాదంబు దాన, విష్ణుధామంబు ప్రాప్తించు వేని కేని. 710

వ. మాఘమాసంబునఁ బ్రయాగతీర్థంబునఁ బ్రాతఃకాలంబునం జేయుస్నానంబువలనను గార్తికమాసంబున గలకార్తికపూర్ణిమాదినంబునం గావించుగంగాస్నానంబువలననుం జేకూరుఫలంబు సాభ్రమత్యవగాహంబునం బ్రాప్తించు. 711

ఆ. సకలరోగములను సకలాశుభములను, సాభ్రమతిజలంబు సమయఁజేయు
జగతిలోన నుండుసకలతీర్థములును, దానిలోన మిశ్రితంబు లగుట. 712

వ. సాభ్రమతికిఁ బూర్వతటంబునందు యవక్రీతుండును రైభ్యుండును గక్షీవంతుండును నుశిజుండును భృగువును నంగిరుండును గణ్వుండును మేధావియును బునర్వసువును వందియును నుత్తరతటంబునందు సుమధువును దత్తాత్రేయుండును దీర్ఘతముండును గాలముండును గశ్యపుండును శ్వేతకేతువును గహోడుండును బులహుండును దేవలుండును విశ్వామిత్రుండును భరద్వాజుండును జమదగ్నియును గర్గుండును నుద్దాలకుండును దేవశర్మయును ధౌమ్యుండును నాస్తికుండును లోమశుండును నాభికేతువును లోమహర్షణుండును సుశ్రవుండును భార్గవుండును జ్యవనుండును వాలఖిల్యాదులును దపోనిష్ఠాగరిష్ఠులై నిత్యనివాసంబు గావింతురు. నీలకంఠతీర్థంబును నందహ్రదతీర్థంబును రుద్రహ్రదతీర్థంబును రుద్రమహాలయతీర్థంబును మందాకినియును నచ్ఛోదయును సాభ్రమతియందు గూఢంబుగాఁ బ్రవహించుచుండు. 713

క. అచటఁ దర్పణంబు నాచరించిన విధి, యుతము గాఁగ శ్రాద్ధ మొనరిచినను
నుద్ధరింపఁబడుదు రొకకల్పముననుండి, గతులు లేకయుండు పితరు లెల్ల. 714

## —: బ్రహ్మచారితీర్థ మాహాత్మ్యము :—

వ. సాభ్రమతియందు బ్రహ్మచర్యంబున బ్రహ్మచారులు ముక్తి నొందుటంజేసి తన్నామంబున బ్రహ్మచారితీర్థం బేర్పడియె. అది నాకుఁ బ్రియం బగుట నే నందు బ్రహ్మచారీశనామంబుతోడ లోకహితార్థం బుండి నన్ను సేవించువారలకు రాత్రివేళ యోగిరూపంబున దర్శనం బిచ్చి సర్వాభీష్టంబుల నెఱవేర్చు చుంటి. మదర్శనమాత్రంబున సకలవ్యాధులును సర్వపాతకంబులును నశియించు. బ్రహ్మచారితీర్థస్నానంబు నాకత్యంతప్రీతిదాయకంబు. తీర్థరూపంబునం దప్ప నే నచ్చట లింగరూపంబున నుండెడివాఁడం గాను. 715

సీ. మును సూర్యవంశసంభూతుండు బ్రహ్మద, త్తుం డనుమేదినీశుం డొకండు
తత్తటంబున ఘోరతపము గావింపఁగ, నతనికిఁ బ్రత్యక్ష మైతి నేను

నేనుఁ గోరె నప్పు డానరనాథుఁ డాగంగ, తనపేరఁ దీర్థమై తనరునట్లు
వర మిచ్చితిని నేను వాఁడు కోరినయట్లు, యది దాన బ్రహ్మదత్తాఖ్య వడసె
గీ. నంత నాతఁడు సంతోష మావహిల్ల, నటఁ బ్రతిష్ఠించి గంగాధరాఖ్య నన్నుఁ
జనియెఁ దనరాష్ట్రమునకు నాస్థాన మయ్యె, నదియును దదాదిగను నుంట నందు నేను.
వ. బ్రహ్మచారీశగంగాధరులను ధ్యానించువాఁడు శివలోకముం బడయు. మఱియును.
సీ. పూర్వము రవికులోద్భూతుండఁ రాజఖ, డ్గుండు నా నొకనృపాలుండు గలఁడు
వాఁడు మహాత్ముఁడై వర్తించుచుండిన, కారణంబునఁ గొంతకాలమునకు
జనియించెఁ దద్దేహమునఁ గుష్ఠరోగంబు, దానిచే నతఁడు సంతప్తుఁ డగుచు
నొకదినంబున దేహ మజ్జగింపఁగ నెంచి, చనుదెంచి శ్రీమమ సాభ్రమతికి
గీ. నందులో మున్గి యుత్థితుండై కనంగఁ, గానఁబడదాయెఁ గుష్ఠంబు మేనిమీఁద
నంత నాతఁడు విస్మయం బంది యచటఁ, దపము గావించి మోక్షపదంబు నొందె.
వ. అది మొదలుగ దానికి రాజఖడ్గతీర్థం బనుప్రఖ్యాతియుం గలిగె. 719
సీ. మును భగీరథవంశమున సుదాసుం డను, భూధవుం డొకఁ డుండె భూరిబలుఁడు
జనియించె నతనికి సౌదాసుఁ డనియెడి, తనయుఁ డొక్కఁడు వాఁడు దైవికముగ
నొకనాఁడు శాపంబు నొంది వసిష్ఠము, హర్షిచే దైత్యదేహంబు వడసి
స్నానంబు గావించి సాభ్రమతీతోయ, మున దాన శాపవిముక్తి నొందె
గీ. సాభ్రమతివంటితీర్థంబు జగమునందుఁ, గనఁబడదు దక్షిణోదధిగామినిగను
నది వికీర్ణవనంబునయందుఁ జొచ్చి, దాని నొనరించి పుణ్యతీర్థముగ నంత. 720

—: వికీర్ణతీర్థమాహాత్మ్యము :—

వ. అచ్చట శ్వేత వసుశ హిరణ్మయి హస్తిమయి వేత్రవతి సుభద్ర సాభ్రమతి యను సప్తనదులు గా నయ్యె. 721
ఆ. ఆవికీర్ణతీర్థమందు శ్రాద్ధంబును, జలిపె నేని కల్పశతముదాఁక
గలుగుఁ బితరులకు నఖండంబుగాఁ దృప్తి, గాణపత్యపదము కర్త కొదవు. 722
ఆ. సర్వరోగములును శమియించు నొదవును,సర్వసంపదలును సంఘటిల్లు
సర్వసౌఖ్యములును జలిపినయెడ స్నాన, మును వికీర్ణతీర్థమున నరుండు. 723

—: శ్వేతతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును శ్వేతానదివలన శ్వేతతీర్థం బేర్పడియె.
క. ఒనరించి శ్వేతతీర్థం, బున స్నానం బచటనుండి మూఁడుదినంబుల్
కనిన మహాకాళేశ్వరు, ననఘుం డయి రుద్రలోక మాతం డొందున్. 725
క. శ్వేతాసంగమమందున్, స్నాతుం డయి పూజ చేసినను బిల్వముచే
భూతేశ్వరునకు నిర్గత, పాతకుఁ డై వాఁడు పొందుఁ బతిమపదంబున్. 726

—: గణతీర్థ మాహాత్మ్యము :—

వ. మఱియును వకుళానదివలనఁ జందనాచలంబున గణతీర్థం బేర్పడియె. అయ్యది గణాధిపతిస్థానంబు. 727

క. వకుళాసంగమమున నుత్సుకతను స్నానంబు చేసి చూచినయెడలన్
వకుళేశ్వరు నతని గొలువఁ, గక తప్పదు నేను మామకస్థానంబున్ 728

ఆ. విశ్వసత్త్వుఁ డనెడివిభుఁ డిందువంశజుం, డొక్కఁ డచటఁ జేసి యుగ్రతపము
గాణపత్య మొందె గణపతికృపచేత, దానిమహిమ మెన్నఁ దరము గాదు. 729

వ. గణతీర్థంబునందు వసిష్ఠుండును వామదేవుండును గహోడుండును గౌశికుండును భరద్వాజుండును నంగిరుండును విశ్వామిత్రుండును వామనుండును గణపతిని సేవించి తపస్సిద్ధిం బడసిరి. 730

గీ. చలిపి వకుళాజలంబున స్నానమచట, గణపతిని బూజ చేసినఁ గలుగు నాయు
వర్థమును సంతతియును విద్యయును దేహసౌఖ్యమును విశ్రుతియును మోక్షమును దుదకు.

—: అగ్నితీర్థ మాహాత్మ్యము :—

వ. మఱియును స్వాభ్రమత్యుత్తరకూలంబున నగ్నితీర్థంబును దత్సమీపంబునఁ బాలేశ్వరతీర్థంబును నేర్పడియె. అందు మాతృగణపరివేష్టితం బగుచండీపీఠంబును జండికేశ్వరుండును బాలేశ్వరుండును నుండె. 732

గీ. అగ్నితీర్థంబునను స్నానమాచరించి, కాంచునెడలను జాముండికను బిశాచ
రూపములు తత్ప్రయుక్తసంతాపములును, దొలఁగి పరమపదంబు నొందుదురు తుదకు.

క. అక్కడఁ దిలచూర్ణంబునఁ, జక్కఁగఁ బిండములఁ జేసి శ్రాద్ధము వెట్టన్
మిక్కుటముగఁ దృప్తిం గని, చొక్కుచు సోలుచును దివముఁ జొత్తురు పితరుల్.

సీ. మును కుకర్దముఁ డనుజననాథుఁ డొక్కఁడు, పిండారపురమున నుండి జనుల
బాధ వెట్టుచు నిజపరిపాలనంబునఁ, గావించుచును బాతకముల నెల్ల
నొకనాఁడు మరణంబు నొంది స్వకృతదుష్కృ, తంబునఁ బ్రేతరూపంబు వడసి
క్షుత్పిపాసలచేత క్షోభంబు నొందుచుఁ, దిరుగుచు నిల నెల్ల దిక్కు లేక

గీ. యొక్కదినమునఁ బ్రారబ్ధయోగమునను, నగ్నితీర్థంబునకు వచ్చి యటఁ గహోడ
మౌని వీక్షించి క్రమ్మఱ యాత్మప్రవృత్తి, యంతయును దెల్పి యేడ్వంగ నమ్మహర్షి.

గీ. వద్దకుము రాజ నీపాప మెల్లఁ దొలఁగె, నభయముగ నిల్వు మని పల్కి యగ్నితీర్థ
జలము గైకొని వానిపైఁ జల్లె నంత, నాతనికి వచ్చె నిజరూప మద్భుతముగ. 736

గీ. అప్పుడు కహోడుఁ డతనిచే నగ్నితీర్థ, మందు శ్రాద్ధంబు చేయింప నతఁడు చేసి
శ్రాద్ధమును ధన్యతను జెంది చనియె దివ్య, యానమందు నధిష్ఠించి యమరపురికి.

క. అని పల్కుటయును నమ యి, ట్లనియెఁ గుకర్దముఁడు నేసె నంటివి పుణ్యం
బును దానిస్వరూపంబును, వినిపింపుము నాకు నాథ విశదము గాఁగన్. 738

చ. అనవుడు శంభుఁ డిట్లని యె నంబుజనేత్ర కుకర్దముండు ప్రా
గననమునందు భూసురుఁడు గా నుదయించి స్వధర్మనిష్ఠుఁ డై
నను భజయించుచుం బ్రతిదినంబును బ్రాహ్మణులన్ సపర్యలన్
దనుపుచు భోగవాంఛ నిధనంబును బొందుటఁ బుట్టె భూపుఁ డై. 739

గీ. అట్లు భూపాలుఁడుగఁ బుట్టి యతఁడు పూర్వ, పుణ్యఫలముగను నశేషభోగములను
ననుభవించుచు దుష్టుఁ డై యప్పు డాచ, రించుటను పాపముల నెల్లఁ బ్రేత యయ్యె.

—: హిరణ్యాసంగమతీర్థమాహాత్మ్యము :—

క. పిదప హిరణ్యాసంగమ, మొదవెను సాభ్రమతి కందు నొనరించినచో
నుదయమున స్నానమును సం, పద లిహమున బ్రహ్మపదము పరమున నొదవున్.

—: అప్సరస్తీర్థమాహాత్మ్యము :—

వ. హిరణ్యాసంగమతీర్థంబున ము న్నూర్వశి జనియించుటంజేసి యప్సరస్తీర్థం బేర్పడియె. నరనారాయణు లచ్చటఁ దపంబు గావించుటంజేసి యయ్యది పరమపవిత్రస్థలం బయ్యె.

గీ. అచటఁ దపమును గావించునట్టివారి, కేర్పడు హిరణ్మయాకార మేమిచెప్ప
నందు మున్ను హిరణ్యాక్షుఁ డాచరించి, తపమును హిరణ్మయం బై నతనువుఁ బడసె.

గీ. అచట జనమేజయుఁడు స్నాన మాచరించి, బ్రహ్మహత్యావిముక్తిని బడసె మున్ను
సలిపి గాధేయుఁ డచ్చోట స్నాన మొక్క, దినముననె మున్ను కైలాసమునకుఁ జేరె.

—: ధర్మతీర్థమధురాతీర్థమాహాత్మ్యము :—

గీ. పిదప ధర్మావతీసంగ మొదవె సాభ్ర, మతికి నచ్చోట ధర్ముఁ డద్భుతము గాఁగఁ
దపము సేయుట ధర్మతీర్థంబు గలిగె, దానిమహిమంబు వర్ణింపఁ దరముగాదు. 745

వ. మఱియును గృష్ణుండు కంసాసురవధంబు గావింపఁ గుశస్థలికి నేఁగ నుద్యమించి ధర్మావతీసంగమంబున సప్తరాత్రంబులు నివసించి మధురార్కుని నచటఁ బ్రతిష్ఠాపించి యం దష్టాదశసహస్రసంఖ్యాకు లగుయజ్వలను నిలిపి యేఁగుటంజేసి యచ్చోట మధురాతీర్థం బనుపుణ్యతీర్థం బేర్పడియె. అచ్చట మాఘశుక్లసప్తమీదినంబున స్నానంబు గావించి మధురార్కునిఁ బూజించి కపిలాదానంబు గావించె నేని యాదిత్యలోకంబు నొందంగలుగు. 746

క. మును మాండవ్యుం డనియెడి, మునివరుఁ డొక్కండు తీవ్రముగను దపంబున్
బొనరుచుచు హరిద్వారం, బున నుండె దినంబు నక్తమును బహునిష్ఠన్. 747

సీ. ఆదేశమున కెల్ల నధిపుఁ డై యపు డుండె, విశ్వమోహనుఁ డనువిభుఁ డొకండు
సోమచంద్రుం డనుసూనుఁ డొక్కం డుండె, వానికి బహుజనమానితుండు
వాఁ డొక్కనాఁ డొకవనములోపల వేఁట, లాడుచు నారేయి యందె యుండె
నపు డొక్కతస్కరుం డపహరించెను వాని, ఘోటక మబ్బురపాటు దోఁప

గీ. సంతఁ గానరామిని హయమువ్వు డచటఁ, దహతహము బొంది భూపాలతనయుఁ డశ్వ
హారుని వెదకుట కనుపంగ నాత్మభటుల, దేశ మెల్లను వారలు తిరిగి తిరిగి. 748

గీ. కానరామిని గుఱ్ఱ మెక్కడను గూడఁ, గొనకు విసిగి హరిద్వారమునకు వచ్చి
యచట నొకవృక్షమూలమునందుఁ దపము, సేయు చున్నమాండవ్యునిచెంత కరిగి.

క. ముని యేమియు మాటాడమిఁ, గనుఁగొని గనులెత్తి వీఁడె గంధర్వహరుం
డని యెంచి వానిఁ గైకొని, చనుదెంచి నిజక్షితీంద్రసన్నిధంబునకున్. 750

క. జననాథ వీఁడె హయమున్, గొనిపోయినదొంగ పట్టుకొని వచ్చితి మీ
తని నావుడు నృపుఁ డీవో, రుని శీఘ్రము శూలమందుఁ ద్రోయుం డనియెన్. 751

క. ఆతనియాజ్ఞను శూల, ప్రోతునిఁ గావించి మునివరుని వా రంతన్
బ్రీతిం గైకొని ధాత్రీ, నేతృబహూకృతులఁ జనిరి నిజగృహములకున్. 752

గీ. అంతట సమాధినిష్ఠుఁ డై నట్టికతన, నొడ లెఱుంగక మాండవ్యుఁ డుండె యందె
కొంతకాలంబు పిదపఁ జేకూర సంజ్ఞ, సర్వము నెఱింగి నిజయోగశక్తివలన. 753

సీ. శమనునిసన్నిధానమునకుఁ జని వేగ, కాల యేటికి నాకు శూలశిక్ష
గావించితివో విన గాంక్ష గల్గె వచింపు, మనవుడుఁ గాలుఁ డి ట్లనియె విప్ర
మును నీవు బాల్యంబునను గ్రుచ్చుటను శల, భమును శూలమున నీపగిది నేఁడు
చెందినాఁడవు శూలశిక్ష చేసినకర్మ, మనుభవింపక తప్ప దజున కైన

గీ. ననుడు మాండవ్యుఁ డాగ్రహం బావహిల్లఁ, గాల శిశుకృత్యమున కిట్టికఠినశిక్ష
యొనరిచినహేతువున శూద్రయోనియందు, జనన మొందుము క్షితిమీఁద ననిశపించె.

సీ. అంతట భయముచే నంతకుం డాతని, పదపంకజములను బట్టి వేఁడ
నమ్మౌని కరుణ లో నంకురింపఁగ నిట్టు, లనియె వైవస్వత యవనియందు
వృషలుఁడ వై జనియించి యచ్యుతభక్తి, తనరార విదురాభిధాన మొంది
కొంతకాలం బుండి క్షోణిపైఁ దీర్థయా, త్రావ్యాజమున నొక్కతఱిని నేఁగి

గీ. సాభ్రమతికి ధర్మావతీసంగమందు, స్నాన మొనరింపఁ గల్గుపుణ్యమునఁ దొలఁగు
నవరణ్ణత్వ మద్దాన నామతిల్లుఁ, దక్షిణంబున నీదివ్యతనువు నీకు. 755

క. అని పలికె యథేచ్ఛంబుగఁ, జనుటయు విదురుఁడుగఁ బుట్టి సమవర్తి ధరి
త్రిని ధర్మావతిసంగం, బున స్నానము చేసి శాపముక్తిం బడసెన్. 756

క. కావునఁ దత్తీర్థంబునఁ, గావించిన స్నాన మెట్టికలుషం బైనన్
బోవుటను దక్షిణంబునఁ, బావనతం గాంచి ముక్తిఁ బడయుదురు జనుల్. 757

—: కంబుతీర్థమాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమతివలనఁ గంబుతీర్థం బేర్పడియె. అందుఁ జేయుస్నానదానాదు లనంత ఫలంబులు. 758

గీ. అచట మున్ను విశ్వామిత్రుఁ డాచరించి, తపమును బ్రజార్థి యై కాంచెఁ దక్షిణంబ
కార్యసిద్ధిని సంతానకాంక్ష యున్న, వారలును గంబుతీర్థంబు వాంఛ దీర్చు. 759

—: కపి తీర్థ మాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమతివలనఁ గపితీర్థం బేర్పడియె. అందు స్నానంబు గావించి కపీశ్వరాదిత్య దర్శనంబు సేసె నేని బ్రహ్మహత్యామహాపాపంబు భస్మీభూతం బగు. దానరి జేయు పుణ్యకర్మంబు లాయుర్ధనరూపభోగబలపుత్రధర్మప్రదంబు లగు. 760

గీ. చైత్రశుక్లాష్టమిని నందు స్నానదాన, తర్పణాదులు సేసినఁ దత్ఫలంబు
తరము గాదు వచింప విధాత కేని, కట్టె నచ్చోట సేతువుఁ గపిగణంబు. 761

—: ఏకధారతీర్థ మాహాత్మ్యము :—

వ. పిమ్మట సాభ్రమతివలన నేకధారం బనుతీర్థం బేర్పడియె. 762

గీ. ఏకధారంబున మునింగి యేకరాత్ర, ముపవసించి యెవం డేని యుర్విలోన
స్వామిదేవేశపూజను జలిపె నేని, కులశతము నుద్ధరించినఫలము నొందు. 763

—: సప్తధారతీర్థ మాహాత్మ్యము :—

వ. పిమ్మట సాభ్రమతివలన సప్తధారతీర్థం బేర్పడియె. అందుఁ గావించుస్నానదాన శ్రాద్ధాదు లపరిమితఫలప్రదంబులు. 764

గీ. సప్తలోకంబులందును సప్తరూప, ములను బ్రవహించుగంగానదులును సప్త
ధారమున నుండుటను శ్రేష్ఠతను వహించె, సప్తధారంబు తీర్థసంచయములోన. 765

—: మంకితీర్థ మాహాత్మ్యము :—

సీ. కాశీతకుండు నాఁగను గలం డిలలోనఁ, దాపసుం డొకఁడు త్రేతాయుగమున
వానికి మంకి నా సూనుఁ డొక్కం డుండె, ధర్మసంరక్షణతత్పరుండు
మంకి కిద్దఱు సతీమణు లేరుపడిరి సు, రూప నాఁగను విశ్వరూప నాఁగ
నాయిర్వురకును లేదయ్యె సంతానంబు, దానిచే మంకి సంతప్తుఁ డగుచు

గీ. గురునికడ కేఁగి మ్రొక్కి తచ్చరణములకు, స్వామి పుత్రులు లేనట్టివారి కూర్ధ్వ
గతులు లే వందు రార్యు లాకతనఁ జింత, యంకురించె నపుత్రుఁడ నైననాకు. 766

క. నాదుఃఖంబు దొలంగఁగ, నేదైన నుపాయ మున్న నెఱిఁగింపుము నీ
పాదములఁ బట్టినాఁడను, గా దనకు మటంచు నేడ్చెఁ గన్నీ రొలుకన్.

గీ. అతనిదుఃఖంబునకు మది నామతిల్లఁ, గనికరము దేశికుం డిట్టు లనియె వాని
కలుగుదురు నీకు సుతులు శీఘ్రముగ సప్త, ధారమున కేఁగి సలుపుము తపము నచట.

చ. అనవుడు మంకి యాత్మహృదయంబున హర్షము పొంగి పొర్లఁగాఁ
గొనకొని సప్తధారమునకుం జని వర్షచతుష్టయం బటన్
బొనరిచి ఘోర మైనతపమున్ గని పుత్రులఁ బౌత్రులం గనుం
గొని యవసానమందుఁ దనకోరికి దీరఁగఁ జేరె నాకమున్. 769

వ. మంకిమహర్షి తపస్సిద్ధిం బొందుటం జేసి యచ్చట మంకితీర్థం బేర్పడియె. అందు స్నానంబు గావించిన వంధ్యలకును బుత్రప్రాప్తి యగు. పిదప సాభ్రమతి బ్రహ్మవల్లీ నదితోడం గూడుటవలన బ్రహ్మవల్లీతీర్థంబేర్పడియె. 770

—: బ్రహ్మవల్లీతీర్థమాహాత్మ్యము :—

ఆ. అది ప్రయాగతుల్య మచట శ్రాద్ధంబును, దర్పణమును జేయ ద్వాదశాబ్ద
తృప్తి పితరు లొంది దీవింతు రన్వయ, వృక్ష మనుదినంబు వృద్ధి నొంద. 771

ఆ. బ్రహ్మవల్లిలోనఁ బర్వకాలములందు, స్నానదానవిధులఁ జలిపె నేని
సకలతీర్థసేవ సలిపినఫల మొంది, యేఁగు విష్ణుపురికి నెవ్వఁ డేని. 772

—: వృషతీర్థమాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమతివలన వృషతీర్థం బేర్పడియె.

సీ. పూర్వము గోలోకమునను గ్రీడించుచు, వృషము గోవులతోడ వేడ్కఁ మీఱ
మూత్రంబు విసవ నమ్మూత్రంబు నామీఁదఁ, బడుటయు నేను గోపంబు నొంది
శాపం బొసంగితి సంజ్ఞాచ్యుతంబులై, క్షోణి నొందఁగ వృషగోవులకును
సంతట నవి యెల్ల సరుదెంచి నాసమ, క్షమునకు శాపమోచనము వేఁడ

గీ. సాభ్రమతిలోన మునిఁగిన శాపముక్తి, గలుగు నని నేను జెప్పంగఁ జలిపి యల్లె
చనియె నవి యెల్ల గోలోకమునకు శాప, తీర్ణ మయి దాన నట వృషతీర్థ మొదవె.

గీ. స్నాన మొనరించి వృషతీర జలమునందుఁ, జలుప గోదానమును వృషోత్సర్జనమును
గలుగును జతుర్దశేంద్రులు గడచువఱకు, వారలకు స్వర్గలోకనివాససుఖము. 775

గీ. వృషభగోపూజలను జేసి రేని యచటఁ, గలుగు గోలోకవాసభాగ్యంబు బోధి
వృక్షరోపణ మచటఁ గావించి రేని, కలుగుఁ బితృలోకవాసభాగ్యంబు వింటె. 776

క. ఆమలకపంచకము నా, ధామంబున నాఁటునట్టి ధన్యాత్ములకుఁ
దామోదరుం డొసంగు ని, హాముత్రసుఖంబు లెల్ల ననవరతంబుఁ. 777

—: సంగమేశ్వరతీర్థమాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమతీతటంబున సంగమేశ్వరతీర్థం బేర్పడియె. 778

సీ. హస్తిమతీతటమందుఁ గౌండిన్యుండు, నారాయణునిఁగూర్చి ఘోరతపము
గావించుచుండంగఁ గడచెను బహుకాల, ముచితంబుగను నంత నొక్కనాఁడు
ప్రవహింపఁ దొడఁగె వర్షాకాల మగుటను, హస్తిమతీనది యతఁడు మునుఁగ
నప్పుడు కౌండిన్యుఁ డంతరాయము గల్గఁ, దనతపంబునకుఁ గ్రోధమును బొంది

గీ. కలియుగంబున నపగతసలిల గాఁగ, హస్తిమతిని శపించి యనంతరంబ
తాను జనియెను వైకుంఠధామమునకు, హస్తిమతి నిర్జలాకార మవల నొందె. 779

గీ. సాభ్రమతీ హస్తిమతితోడ సక్తమగుట, సంగమేశ్వరతీర్థమై శ్లాఘ కెక్కె-
నాస్థలంబందుఁ జేయుస్నానాదివిధులు, బ్రహ్మహత్యాదిసకలపాపముల నడఁచు. 780

—: రుద్రమహాలయతీర్థమాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమతీతటంబున రుద్రమహాలయతీర్థం బేర్పడియె.
గీ. ముక్తి చేకూరుఁ గేదారమున జలంబుఁ, ద్రావ రుద్రమహాలయస్థానమందు
స్నానమాత్రంబుననె ముక్తి సంఘటిల్లు, దానికిని దీనికినిఁ దారతమ్య మిదియె. 782
వ. కార్తికపూర్ణిమయందుఁగాని వైశాఖపూర్ణిమయందుఁగాని రుద్రమహాలయతీర్థంబున
వృషోత్సర్గంబుఁ గావించె నేని కైలాసవాస భాగ్యంబు చేకూరు. 783
గీ. ఒక్కపరి నేను కైలాస ముజ్జగించి, యచ్చటికిఁ బోయి మునుఁగుచు ననుదినంబుఁ
గ్రోలుచు జలంబు నటఁ గొంతకాల ముంట, నయ్యె నయ్యది రుద్రమహాలయంబు.
క. ఇచ్చటఁ బెట్టెడిశ్రాద్ధము, గ్రచ్చఱ నరకాబ్ధినుండి గట్టెక్కంగన్
వచ్చి మదావసథమునకు, నుచ్చైస్స్థానంబులందు నుందురు పితరుల్. 785

—: ఖడ్గతీర్థమాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమతివలన ఖడ్గతీర్థం బేర్పడియె.
గీ. అచటఁ గార్తికపూర్ణిమయందు మునిఁగి, ఖడ్గతీర్థేశ్వరునిఁ గాంచఁగలిగె నేని
ధనముధాన్యంబుబలముసంతతియుసుఖముఁ, జెందియిహమునఁదిదివంబునొందుఁదుదకు.
క. వైశాఖంబునఁ దత్తీ, ర్థేశుని రాజ్యాశతోడ నీక్షించినచో
నీశ్వరప్రసాదమున ధా, త్రీశుం డై వాఁడు సుఖము లెల్లం బడయున్. 788

—: చిత్రాంగవదనతీర్థమాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమతివలన మాలార్కక్షేత్రంబునఁ జిత్రాంగవదనతీర్థం బేర్పడియె.
గీ. అచట స్నానంబు చేసి మాలార్కదేవ, పూజ గావించునెడలను బోవు నఖిల
కుష్ఠరోగంబు లొనగూడుఁ గోరుకొనిన, యర్థసంతతు లెల్ల మాలార్కకృపను. 790
గీ. విధివిధానంబునను నర్కవిగ్రహమున, కచట నభిషేక మొనరించినట్టులైన
నాయురారోగ్యవిద్యాధనాఢ్యులైన, వరకుమారులఁ గను నెట్టివంధ్య యేని. 791
వ. మాలార్కక్షేత్రంబున స్నానసంధ్యాజపహోమస్వాధ్యాయదేవతార్చనంబులు భాను
వారంబునం గావించినఁ దత్పుణ్యం బక్షయంబు.
క. భానువ్రతముం జేసిన, మానవుఁ డచ్చోట భువనమాన్యుం డగుచున్
నానాసుఖములు గని ధర, లోనన్ దుది నేఁగు భానులోకంబునకున్. 793
క. మృతవత్సుం డగునొకభూ, పతి మును గావించి యటఁ దపంబును నియతిన్
శతవర్షాయుర్భాగ్యా, న్వితు లగుపుత్రులను బడసె విస్మయ మొదవన్. 794

—: చందనతీర్థమాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమతివలన నామోదీక్షేత్రంబునఁ జందనతీర్థం బేర్పడియె.

సీ. మును ద్వాపరమున భీముఁడు దుశ్శాసనుని, గాత్రంబు చీల్చి రక్తంబు ద్రావి
తద్రక్తసిక్తహస్తయుగంబుచేతను, ద్రౌపదీకేశబంధన మొనర్చి
తనప్రతిజ్ఞను బూర్తి యొనరించుకొని తీర్థ, యాత్ర గావింపంగ నాత్మ నెంచి
స్వర్గలోకమునుండి చందనద్రుమమును, గొనివచ్చి జను లెల్ల వినుతి సేయ

గీ. భ్రాతృయుతముగ మొదట సాభ్రమతి కేఁగి, తత్తటంబునఁ జందనతరువు నాఁటె
దానఁ జందనతీర్థాఖ్య దానికొదవెఁ, దన్మహత్త్వంబు నెన్న నాతరము గాదు. 796

వ. తత్పుణ్యతీర్థప్రభావంబునఁ జందనపాదపంబు లింగరూపముం బొంది చందనేశ్వరుం డను
విఖ్యాతిఁ బడసె. 797

క. కైవర్తకుఁ డనునొకఁడా, శ్రీవరుఁ డొనరుచుచుఁ దన్నదీస్నానంబుల్
గావించి చందనేశ్వర, సేవను గైలాసమునకుఁ జేరంగలిగెన్. 798

గీ. స్నాన మొనరించి తత్తీర్థజలమునందుఁ, జేసి పితృతర్పణంబును జేసె నేని
చందనేశ్వరపూజను సకలపాప, ముక్తుఁడై నాకడకు వచ్చి ముక్తి నొందు. 799

—: జంబుతీర్థమాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమతివలన జంబుతీర్థం బేర్పడియె. 800

సీ. మును వధియింప రాముఁడు రావణుని జాంబ, వంతుఁ డాహ్లాదవైవశ్యమునను
జగమునం దెల్లను జాటించుచును రావ, ణునినాశనమును రామునిజయంబు
నొకహ్రదంబున స్నాన మొనరించి లింగంబు, స్థాపించి తత్తటసలిలని జనియె
సాభ్రమతీనదీసంగంబుచే నాహ్ర, దం బొందె జంబుతీర్థప్రశస్తి

గీ. తత్తటస్థితలింగంబు ధరణియందుఁ, గొనియె జాంబవదీశ్వరుం డనెడిపేరు
జంబుతీర్థంబులో మున్గి సంస్మరించె, నేని రాముని వాఁడు నాహితుఁడు సూవె.

గీ. నేనె రాముఁడ రాముఁడె నేను నాకు, రామునకు లేదు భేదంబు రామనామ
మెవరు స్మరియించు చుందురో యెప్పుడు గూడ, ఘోరభవవారిధిని దాటువారు వారె.

గీ. జంబుతీర్థంబునం జేయుస్నానదాన, తర్పణాదులు నాకు సంతసము గొలుపు
దానఁ దత్పుణ్యకార్యవిధాత లెల్ల, నాపదంబున నుందు రానంద మొదవ. 803

—: ఇంద్రగ్రామతీర్థమాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమత్యుత్తరతటంబున నింద్రగ్రామతీర్థం బేర్పడియె. 804

గీ. మును సురాధీశుఁడై నయింద్రునకు రాక్ష, సాధిపతి యైననముచికి నాజి యయ్యె
నందు వారు పరస్పర మస్త్రములను, బట్టకుండఁగ నని సేయఁ బ్రతిన వట్టె. 805

క. పంగరమును గావింపఁ దొ, డంగిరి ఘోరముగ నుత్కటం బగుకోర్కెన్
సింగములుఁబోలె నార్చుచు, నింగియు భూమియును నిండ నినదంబులచేన్. 806

సీ. అప్పుడు నభోవాణియాదేశమునఁ జంపె, నముచి నింద్రుండు ఫేనంబుచేత
దానిచే బ్రహ్మహత్యాపాతకము చుట్టు; కొనఁగ నింద్రుని దుఃఖమునను వజ్రి
ధిషణునికడ కేఁగి దేవోత్తమ బ్రహ్మ, హత్యాఘశమన మె ట్లగునొ చెప్పుమ
యని వేఁడుటయును బృహస్పతి దేవేంద్ర, సాభ్రమతీనదీజలమునందు
గీ. స్నాన మొనరింపు మీవేగ సత్వరంబ, సర్వపాపంబులును గూడ సమసిపోవు
నని వచించుటయు మహేంద్రుఁ డట్లు చేసి, బ్రహ్మహత్యాఘముననుండి పడసి ముక్తి.
గీ. ధవళతను వయి తన్నదీతటమునందు, స్థాపనము సేసి లింగంబుఁ జనియె నంతఁ
గామగవి వచ్చి యింద్రలింగమున కచట, స్తన్యమున నభిషేకంబు సలిపి చనియె. 808
వ. దాన నాలింగంబు ధవళాకారముం బడసి ధవళేశ్వరుం డనువిశ్రుతి కెక్కె. ఆస్థలం బింద్రగ్రామం బనుపుణ్యతీర్థం బయ్యె. ఆపుణ్యతీర్థంబునందుఁ బూర్ణిమాదర్శసంక్రాంతి గ్రహణాదిపర్వకాలంబులందు శ్రాద్ధంబు గావించి రేని తత్పితృవర్గంబు ద్వాదశవార్షిక సంతృప్తిం జెందు. 809
గీ. అచట నన్నంబు నొక్కబ్రాహ్మణున కిడిన, శ్రోత్రియున కిచ్చిన సవత్సశుక్లగోవు
సలిపినను రుద్రజపమును స్వల్పముగను, గోటిగుణితఫలంబు చేకూరుఁ జూవె. 810
వ. అర్కపుష్ప శ్వేతార్కపుష్పకహ్లారదూర్వాబిల్వపత్రంబులచే భానువారంబున నేనియు సోమవారంబున నేనియు ధవళేశ్వరార్చనంబు గావించిన సర్వరోగనివారణంబును సకల దోషక్షయంబును గైలాసవాసంబునుం గలుగు. 811
క. ఒనరించిన నుపవాసం, బును నింద్రగ్రామతీర్థమున నెవ్వం డై
నను నాచంద్రార్కంబును, ననిమిషలోకంబునందు నతఁడు వసించున్. 812
ఆ. నేను కృతయుగమున నీలకంఠుఁడను ద్రే, తాయుగమున హరుఁడ ద్వాపరంబు
లోన శర్వుఁడఁ గలిలోపల ధవళేశ్వ, రుండ వింటె నాస్వరూప మబల. 813
సీ. పూర్వ మింద్రగ్రామమున నంది యనువైశ్యుఁ, డొకఁ డుండె మద్భక్తుఁ డుత్తముండు
ప్రతిదివసమును బ్రభాతకాలమున వాఁ, డొనరించి ధవళేశ్వరునకుఁ బూజ
నరుదెంచుచుండు గృహంబున కటు లుండ, నొకదివసమున దైవికము గాఁగ
నరిగి మహాకాలుఁ డనుకిరాతుఁడు చూచి, యచటిలింగమును మధ్యాహ్నవేళఁ
గీ. గలుగ నెదలోన నాకస్మికముగ భక్తి, లింగమున నున్నపూలు తొలంగ వైచి
సాభ్రమతి కేఁగి కొని నోట జలము నొక్క, చేత బిల్వముఁ బల మొకచేత వచ్చి.
సీ. గండూషజలముచేఁ గడిగి యాలింగంబు, దానిపై బిల్వపత్రంబు వెట్టి
యర్పించి మాంసంబు నాహారముగ మ్రొక్కి, స్వామి నీపూజ నేఁ జలుపు చుందు
నన్వహంబును నిది యాదిగా నని చేసి, శపథంబు నింటికిఁ జనియెఁ దాను
మఱునాఁడు నంది సమాగతుం డయి ప్రభా, తమ్మున నటకుఁ బూర్వమ్మువోలెఁ
గీ. జూచి యుచ్ఛిష్ట మైనయచ్చోటు దుష్టుఁ, డెవఁడొ కావించె నిది యని యెంచి మదినిఁ
దత్స్థలం బంతయును క్షాళితం బొనర్చి, పూజ యొనరించి శివలింగమునకుఁ జనియె.

గీ. అంత నాఁడును మరల మధ్యాహ్నవేళ, యంతఁ జనుదెంచి లుబ్ధకుం డటకుఁ బూర్వ
మట్లె యొనరించి శివపూజ యరిగె నంది, యంత మఱునాఁడు మునుపోలె నరుగుదెంచి.

సీ. పూర్వదినంబునఁబోలె నుచ్ఛిష్ట మై, కనుపించు నచ్చోటు గాంచి వగచి
బ్రాహ్మణోత్తములను రావించి జరిగిన, విషయంబు నెల్లను విశదపఱుప
వార లెల్లరును దత్కారణంబు నెఱుంగ, నెంచి యచ్చోటన పొంచి యుండ
నరుగుదెంచి కిరాతుఁ డతిభీకరాకార, మున నాస్థలమునకు మున్నుపోలెఁ

గీ. గడిగి లింగంబు వక్త్రోదకమున బిల్వ, పత్రముల నుంచి లింగంబుపైనిఁ బెట్టి
మాంసనైవేద్యమును బ్రణామంబు సేసి, చనియె నది చూచి వా రెల్ల స్పష్టముగను.

సీ. క్రూరాత్ముఁ డగులుబ్ధకునితోడ వైరంబు, తగ దని యెంచి చిత్తంబులందు
నంది యాలింగంబు నిం దుండనీయక, కొనిపొమ్ము నీగృహంబునకు నిపుడె
యనవుడు నావైశ్యుఁ డాలింగమును బీకి, కొనిపోయి తనయింటఁ గుదురుపఱిచి
పూజింపఁ దొడఁగెను బూర్వమట్టులె యంతఁ, బరదినంబున బోయ యరుగుదెంచి

గీ. లింగము శివాలయంబున లేమిఁ జూచి, పరితపించుచు మదిలోనఁ బ్రమథనాథ
యొకటి కేఁగితి వింతలో నిల్లు విడిచి, తెలుపు మీ విచ్చటికి వచ్చి తెలుప వేని. 818

క. నాతనువును విడనాడెద, నేతత్క్షణమందె యేల యీమేను భవ
ప్రీతికర మైననేమను, జేతస్స్థైర్యంబుతోడఁ జేయక యున్నన్. 819

చ. అని వచియించి తత్క్షణమునందె కరాచురిచే స్వదేహ మె
ల్లను దెగఁగోసి తద్గతపలం బఖిలంబును లింగగర్తమం
దనువుపడంగ నుంచి శివ యాత్మసమర్పణముం బొనర్చితిన్
గొను మని పల్కి కంఠమును గోసికొనన్ గమకించుచుండఁగన్. 820

సీ. ప్రత్యక్ష మై నేను బరివారయుతముగ, నతనికి లుబ్ధక యాఁగు మింకఁ
గోరినవర మిత్తుఁ గోరుకొ మ్మనవుడుఁ, బ్రణమిల్లి వాఁడు మత్పాదములకుఁ
దండ్రి నీదాస్యంబు దప్ప నా కన్యంబు, వల దేదియును నని పలుకుటయును
దోడనె నేను సంతోషించి వానికి, పార్షదాగ్రేసరపదము నొసఁగి

గీ. డమరునాదంబు గావించుటయును నంది, దాని విని వచ్చి వేగ యాస్థానమునకు
నాశివ వెలుంగులుబ్ధకనాథుఁ జూచి, కలుగ విస్మయ మాతనికడకుఁ జేరి. 821

సీ. లుబ్ధక నీమదిలోఁ గలభక్తిని, గమనింపఁజాలనికారణమున
నీ వొనర్చెడిపూజ నేను హేయంబుగా, దలపెట్టి లబ్ధపాతకుఁడ నైతి
క్షమియించి నాయపచారంబుఁ దావక, భక్తునిగా నన్నుఁ బరిగణించి
శివకృపాపాత్రునిఁ జేయుము నా నట్టు, త్సవిధంబుఁ జెప్ప లుబ్ధకుఁడు వాని

గీ. నంత నేను [illegible] నంది నంది, భక్తిభావంబునకు వాని బార్షదునిఁ
జేసి [illegible] కైలాసమునకు, వచ్చినాఁడను నిర్జరవరులు పొగడ. 822

వ. అంతట నామహాకాలనందు లిరువురును మద్ద్వారపాలకు లై మధ్యాహ్నకాలంబున
నాదర్శనంబు గావించువార లైరి.

క. కావున ధవళేశ్వరునకుఁ, గావించినయెడల భక్తిగలిగినవా రై
యేవార లేని సేవను, నావారలె వారు వింటె నళినదళాక్షీ. 824

క. ధవళేశ్వరసన్నిధిలో, నెవ రేనియుఁ గాంచి రేని మృతి నవ్వారల్
రవిచంద్రు లుండువఱకును, నివసింతురు మామకీననిలయమునందున్.

—: బాలాపతీర్థమాహాత్మ్యము :—

వ. పిదప సాభ్రమతీతీరంబున బాలాప మనుతీర్థరాజం బేర్పడియె. 826

సీ. కణ్వమహామునికన్య బాలావతి, సాభ్రమతీతటస్థలిని మున్ను
గావించు చుండ నుత్కట మైనతపమును, భానుని భర్తగాఁ బడయఁగోరి
యామెమనస్స్థైర్య మరయంగ నొకనాఁడు, సవిత బ్రహ్మర్షి వేషంబుఁ దాల్చి
తత్సమక్షమునకు దయచేయుటయు నామె, పూజించె విధ్యుక్తముగను వాని

గీ. నంతటను భాస్కరుం డిట్టు లనియెఁ దన్వి, బ్రహ్మచర్యంబునం దున్నబ్రాహ్మణుండ
నగుటచే నాకుఁ గన్యక వై ననిన్ను, గై కొనఁగ ధర్మపత్నిగాఁ గాంక్ష యొదవె. 827

క. అనవుడు బాలావతి యి, ట్లనియెను భూసురవరేణ్య యర్కున కర్పిం
చినమేను దప్ప నే నై, నను గోరు మొసంగుదాన నాకడ నున్నన్. 828

సీ. అనవుడు భాస్కరుం డామెమాటలు విని, పావనశీల యీబదరములను
వండి యెట్టుము నేను వచ్చెద స్నానంబు, నొనరించి భక్షింప ననె వచించి
బదరపంచకము నాపంకజాక్షి కొసంగి, చనియె నింద్రగ్రామమునకు నంత
నామె యగ్ని రగిల్చి యాపండ్లు వండుచు, నుండంగ నయ్యావి యుడుక వయ్యె

గీ. నంతటను నున్నకాష్ఠచయంబు నెల్ల, నామె వినియోగ మొనరించి యప్పటికిని
బదరములు పక్వములు గామిఁ బాదములను, బ్రొయ్యిలోఁ బెట్టి జ్వాలలు పుట్ట నూఁదె.

గీ. అంటుకొని పాదముల కంత నగ్ని మండు, చుండుటయు నామె హర్షంబు నొందుచుండె
నప్పు డది చూచి మార్తండుఁ డామెయెదుట, స్వస్వరూపంబుతో నిల్చి సత్వరముగ.

సీ. బాల నీభక్తికిఁ బరమహర్షం బయ్యె, నీడేరుఁగాక నీయీప్సితంబు
దీపించుఁగాక యీతీర్థంబు నీనామ, మున విశ్రుతికి నెక్కి ముజ్జగముల
స్నాతుఁ డై యెవఁ డేని నీతీర్థమునయందు, మూన్నాళ్లు సనియమంబుగ వసించి
యనుదివసమును రక్తాదిత్యముఖమును, గనిన మల్లోకంబు గాంచఁగలుగు

గీ. భానువారంబునందును బర్వదినము, లందు బాలాపతీర్థమునందు మునిఁగి
దేవఋషిపితృవర్గసంతృప్తి గలుగఁ, దర్పణము సేయువాఁడు మద్ధామ మొందు. 831

గీ. అబల బాలాపతీర్థమునందు రక్త, ధేనుదానంబు చేసినమానవుండు
గాంచు యజ్ఞఫలంబును జెలికిలోన, వాని కక్షయ స్వర్గనివాస మొదవు. 832

క. అని పల్కి నిజనికేతన, మునకుం గొనిపోయి కణ్వమునినాథకుమా
రిని దనకుఁ గళత్రంబుగ, నొనరించికొని సౌఖ్యజలధి నోలాడించెన్. 833

సీ. మఱియును దత్తీర్థమహిమ మిం కొక్కటి, వినిపించెదను నీకు వినుము గౌరి
మును వృద్ధమహిషంబు చనుదెంచి యట కొండు, దప్పి దీర జలమ్ముఁ ద్రావ నెంచి
దిగి దానిలో లేవఁ దగుశక్తి లేమిని, మునిఁగి నీటను బ్రాణములను విడిచి
తత్తీర్థమహిమచేతను గాన్యకుబ్జేశ, తనయుఁడై లేచి తద్వనమునుండి
గీ. యాత్మపూర్వజనుస్స్మృతి నంది విస్మ, యంబు గలుగంగఁ దీర్థమాహాత్మ్యమునకు
నచట నొనరించి దానంబు లమితముగను, జలిపి లింగప్రతిష్ఠను జనియె నంత. 834

వ. ఆలింగంబు మహిషేశ్వరుం డనుప్రసిద్ధిం బడసె.

గీ. స్నాన మొనరించి తత్తీర్థజలమునందు, నొనరించినయెడ మహిషేశ్వరునకుఁ బూజ
భస్మమై పోవు సర్వపాపములు దానఁ, జేకుఱు నభీప్సితార్థసంసిద్ధు లెల్ల. 836

గీ. పూర్వముననుండి పశ్చిమంబునకుఁ బోవు, సాభ్రమత్యుదకంబు ప్రశస్తతమము
కానరా దెట్టితీర్థోదకంబు గూడ, దానితో సాటి చేయంగఁదగిన దిలను. 837

—: కావ్యతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతీరంబునఁ గావ్యతీర్థం బేర్పడియె. 838

సీ. సాభ్రమతీనదీజలమందు శుక్రుఁడు, స్నాతుఁడై పూర్వము శ్రద్ధతోడఁ
దత్తీర్థగతుని దుర్ధర్షేశ్వరుని గొల్చి, తదనుగ్రహంబుచేతను గ్రహించె
సంభావ్య మగుమృతసంజీవనీవిద్య, నాకారణంబున నాస్థలంబు
కావ్యతీర్థం బనుఖ్యాతిఁ గైకొనె నందుఁ, జేసెడిస్నానంబు సిద్ధిదంబు
గీ. తత్క్షణంబున నభిమతార్థంబు లెల్లఁ, బ్రాప్త మగును దుర్ధర్షేశ్వరార్చనమున
వినుము దీనికి నొకనిదర్శనము నీకు, వినుతు నిప్పుడె శర్వాణి విశదముగను. 839

సీ. మును సురాసురయుద్ధమున వృత్రజితుఁ డయి, యరిగి మహేంద్రుఁడు గురునికడకు
నాచార్య విజితుఁడ నైతి వృత్రునిచేత, దిక్కు నా కిఁక నేదియును లేదు
తల్లియుఁ దండ్రియు దైవతంబును నీవె, శరణుచొచ్చితిని త్వచ్చరణములనె
సంగ్రామమున నాకు జయము సంప్రాప్తించు, విధముఁ దెల్పుము కృపాన్వితుఁడ వగుచు
గీ. నని నయంబున వేఁడంగ నమరగురుఁడు, కరుణ వెలయంగ నాతనిఁ గాంచి యింద్ర
సాభ్రమతిలోన స్నానంబు సలిపి చేయు, మాశువుగను దుర్ధర్షేశ్వరార్చనంబు. 840
క. అని నుడువుటయు మహేంద్రుం, డొనరించి గురూక్తరీతి నొగి దుర్ధర్షే
శునిచేఁ బాశుపతాస్త్రము, గొని దాన వధించె వృత్రకోణపనేతన్. 841

—: ఖడ్గధారతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతటంబున ఖడ్గధారం బనుగుప్తతీర్థం బేర్పడియె. 842

గీ. కలదు శ్రీవృక్ష మచ్చటఁ గలఁడు తన్మ, హీరుహముక్రింద ఖడ్గధారేశ్వరుండు
వాని కేవిధి నైన నెవ్వార లేని, సలుపునెడఁ బూజ వారికిఁ గలుగు ముక్తి. 843

సీ. చండుం డనెడిలుబ్ధకుం డొక్కరుఁడు మున్ను, సలుపుచు ననిశంబు జంతుహింస
శివరాత్రినాఁడు జంతువొకండు గూడను, దొరకమిఁ దనకు క్షుద్భరముతోడఁ
దిరుగుచు సాభ్రమతీతీరమున దైవి, కంబుగ నొక్కకోలంబుఁ జూచి
దానిని వధియించుతలఁపుతో శ్రీవృక్ష, మెక్కి వింటను బాణ మెక్కువెట్టి

గీ. యంతలోఁ బోత్రి కనరామి నందె యుండి, కాంచుచును వృక్షపర్ణముల్ కాలఁద్రోయ
తన్మొజమూలస్థమైనలింగంబుమీఁదఁ, బడియె నవి దాన వాఁడు నిష్పాపుఁ డయ్యె.

గీ. అంత వేకువ యగుటయు నతఁడు డిగ్గి, భూజమునునుండి సాభ్రమతీజలమున
స్నాన మొనరించి యుపవాసజాగరేశ్వ, రార్చనాపుణ్యమును బొందినట్టికతన. 845

వ. శుద్ధాంతఃకరణుం డై నింద్యవర్తనంబునం బెరిగిననిజకళేబరంబు విడువ నెంచి ఖడ్గధారచేఁ దనకంఠంబు ఖండించుకొన నుద్యమించు చుండ. 846

గీ. నేను నాపార్షదులఁ బంప వానికడకు, వారు చని తత్ప్రయత్నవివారణంబు
చేయుటయు వారి నెల్ల వీక్షించి వాఁడు, పుట్ట విస్మయ మెదలోన నిట్టు లనియె.

సీ. ఎవ్వరు మీ రిట్టు లేతేరఁ గత లేమి, మిముఁ జూడఁ గల్గె విభ్రమము నాకు
నాబోటిపాపాత్మునకుఁ గానవచ్చునె, వెలుఁగొందుమీదివ్యవిగ్రహములు
నావుడు వార లాపావనాత్మునిఁ జూచి, చండ యీశ్వరుని పార్షదుల మేము
తనసన్నిధికి శూలి నినుఁ దోడుకొని రాఁగఁ, జేయంగ నాజ్ఞ వచ్చితిమి నేఁడు

గీ. రమ్ము మాతోడ నీవిమానమ్ము నెక్కి, శీఘ్రముగ నిన్నుఁ జూడంగ శితిగళుండు
వేడ్కపడుచున్న వాఁడు నా విని యతండు, వారలకుఁ జేసి సాష్టాంగవందనంబు. 848

క. కలుషాత్ముఁడ నగునాపైఁ, గలిగెనొ యేకతనఁ గరుణ గౌరీశునకుఁ
దెలుపుఁడు నా కని ప్రార్థన, సలుపుటయును వారు సుప్రసన్నహృదయు లై. 849

సీ. పుల్కస యుపవాసమును జాగరంబును, దైవికంబుగను బ్రాప్తంబు లగుటఁ
బాదంబుచేఁ ద్రోయఁబడినట్టిశ్రీవృక్ష, పత్రముల్ లింగంబుపైనిఁ బడుట
నీకు సంకల్పంబు లేకుండినను శివ, రాత్రివ్రతఫలంబు ప్రాప్తమయ్యె
దానిచే గళితపాతకుఁడ వై శివకృపా, దృష్టిపాత్రతను జెందితివి నీవు

గీ. నావుఁడు నతండు సమధికానంద మొదవ, నెక్కి దివ్యవిమానంబు నేఁగుదెంచి
శాశ్వతంబుగ నుండె మత్సవిధమందు, నింక జ్ఞానకృతవ్రతం బేమిచెప్ప. 850

వ. అది మొదలుగ నాతీర్థంబు ఖడ్గధారతీర్థం బనియును నాలింగంబు ఖడ్గధారేశ్వరుం డనియును బ్రఖ్యాతిం బడసె.

ఆ. అచట మాఘమాసమందును వైశాఖ, మాసమందు నూర్జమాసమందు
స్నానమును బొనర్చి నేని ముక్తుం డగు, నెట్టి హీనజాతి యైని గౌరి. 852

గీ. నేమమునను భరద్వాజవామదేవ, గౌతమవసిష్ఠముఖపారికాంక్షు లెల్ల
నచటి కరుదెంచుచుందురు రనుదినంబు, స్నాన మొనరించి నాదుదర్శన మొనర్ప. 853

సీ. అప్పటి కొకసమయమున విశ్వామిత్రుఁ, డరుదెంచి తత్తీర్థమందు మునిఁగి
పొనరించుచుండ మత్పూజ నిత్యంబును, నొకనాఁడు హాని లేకున్నతఱిని
నరుదెంచి యొకభిల్లుఁ డటకు నామూర్ధము, నందు మాంసము రుద్ది యరిగె నంతఁ
గౌశికుం డరుదెంచి కాంచి యామాంసంబు, నెవఁడో దుష్టుఁడు చేయ నిట్టిచేత

గీ. వాని దండింప కుంటివి గాన శర్వ, కలియుగంబున గుప్తంబు గాఁగ నుండు
మని శపించి చనంగఁ దదాది లింగ, తనువు విడనాడి నేను గుప్తముగ నుంటి. 854

గీ. మృత్స్నచేఁ జేసి మన్మూర్తి నెవరు పూజ, సలుపుచుందురో నిత్యంబుఁ గలియుగమున
వారలును ఖడ్గధారనివాసులైన, వారలును నాకుఁ బ్రియులైనవారు చూవె.

వ. కృతయుగంబున మందిరేశ్వరుం డనియుఁ ద్రేతాయుగంబున గౌరవేశ్వరుం డనియు ద్వాపరయుగంబున విశ్వవిఖ్యాతేశ్వరుం డనియును గలియుగంబున ఖడ్గధారేశ్వరుం డనియును విఖ్యాతిం జెంది తత్తీర్థంబునం దే నున్నవాఁడ. మన్మూర్తిపూజ గావించువారల కఖిలవాంఛితార్థసిద్ధు లొందంగలుగు. 856

—: దుగ్ధేశ్వరతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతటంబున ఖడ్గధారంబునకు దక్షిణభాగంబున దుగ్ధేశ్వరతీర్థంబు గలదు. 857

గీ. సాభ్రమతితోడ నచ్చటఁ జంద్రభాగ, సంగతం బయి యుంట నాస్థలమునందుఁ
జలువస్నానంబు దానంబు జపము దపము, సకలమును గూడ నక్షయసుకృత మొసఁగు.

వ. పూర్వము దధీచిమహర్షి యచ్చట ఘోరతపంబు గావించె. 859

సీ. మును సురాసురయుద్ధమునఁ బరాజయ మొంది, యమరు లెల్లరు దధీచ్యాశ్రమమునఁ
దమయాయుధములను ద్యజియించి దెసలకుఁ, బాఱిపోవ దధీచిపారికాంక్షి
యాప్లావితము నేసి యాయస్త్రముల మంత్ర, జలముచేఁ ద్రావె దత్క్షణమునంద
యంతటఁ గొన్నియేం డ్లరుగంగ మరల ని, ర్జరు లేగుదెంచి తత్సవిధమునకు

గీ. నస్మదాయుధముల నీయు మని దధీచి, మునివరేణ్యుని సవినయంబుగను వేడ
నమ్మహర్షి కనుంగొని యనిమిషులకు, నెనయఁ గారుణ్య మొదలోవ నిట్టు లనియె.

ఆ. త్రిదశులార మంత్రతీర్థోదకాప్లావి, తం బొనర్చి యాయుధముల నెల్లఁ
గ్రవ్యభుజులపాలు గాకుండఁ ద్రావితి, నాఁడె యెట్టు లిచ్చువాఁడ నేఁడు. 861

చ. అనవుడు ఖేద మొంది సుర లందఱు మౌనివరేణ్యు మాపయిన్
గనికర మున్న నీతనువునం గలయస్థుల నిమ్ము వానిఁ గై
కొని మదుగ్రధాయుధంబులుగఁ గూల్తుము దైత్యుల నెల్ల నాఁగ న
మ్ముని విడిచెన్ స్వదేహముఁ బ్రమోదముతోడను యోగశక్తిచేన్. 862

గీ. అంత దేవత లెల్లరు నతనిమేను, చీల్చి యస్థులఁ గైకొనఁ జేతు లాడ
కునికి సురభిని నాహ్వాన మొనరుపంగఁ, గామధేనువు వచ్చి శీఘ్రముగ నటకు. 863
క. మునిదేహము నాకుచుఁ ద, త్తనువును నిర్మాంసముగను దా నొనరింపన్
గొని వానియస్థు లెల్లనుఁ, ననిమిషు లరిగిరి జయింప నసురబలంబున్. 864
గీ. అంతట దధీచిమునిపత్ని యగుసువర్చ, దేవతాకృత్యము నెఱింగి దివ్యదృష్టి
నపరిమితకోప మెదలోన నావహిల్లఁ, దిట్టె యనపత్యు లగునట్లు దేవతలను. 865
సీ. సాభ్రమతీతటస్థం బైనపిప్పల, క్షోణీరుహముక్రిందఁ గూరుచుండి
ఛేదించుకొనుడుఁ గుక్షిని గర్భముననుండి, దివ్యతేజముతోడఁ దేజరిల్లుచుఁ
బృథ్విపైఁ బడుటయుఁ బిప్పలాదుం డను, దారకుండు శివావతారమూర్తి
యపుడు సువర్చ యయ్యనఘుని వీక్షించి, తనయ యీపిప్పలతరువుక్రింద
గీ. నీవు వసియించి శుభముల నెల్లరకును, నిచ్చుచుండు మటంచు వాక్రుచ్చి యోగ
శక్తిచే మేను విడనాడి స్వపతి యున్న, సత్యలోకంబునకు నేఁగె సాధ్వి యగుట. 866
ఆ. అంతఁ గామధేను వచ్చటి కేతెంచి, మార్గమునను లోన నాఁగకుండ
వచ్చుదుగ్ధధార వర్షింప నాదుగ్ధ, మయ్యె లింగరూప మందువలన. 867
వ. ఆలింగంబు దుగ్ధేశ్వరుం డనియును నాస్థానంబు దుగ్ధేశ్వరతీర్థం బనియును లోక విఖ్యాతిం బడసె. 868

—: చంద్రతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును దుగ్ధేశ్వరతీర్థంబునకుఁ బూర్వభాగంబునందుఁ జంద్రతీర్థం బేర్పడియె.
గీ. సాభ్రమతితోడ నచ్చటఁ జంద్రభాగ, సంగతం బయి యుండె నాస్థలమునందుఁ
జేసి తపమును జంద్రుఁడు శీఘ్రసిద్ధి, నందుటను జంద్రతీర్థ మై యది యెసంగె. 870
వ. తత్తీరంబునం జంద్రునిచే స్థాపింపంబడినలింగంబు చంద్రేశ్వరుం డనువిశ్రుతిం బడసె.
గీ. చంద్రభాగాసమీపదేశమున శుక్రుఁ, డాచరించుటఁ దప మది యధికమహిమ
కలది యై పొల్చె నచ్చటఁ జలుపుపుణ్య, కర్మము లనంతఫలములు కంబుకంఠి. 872
గీ. కావ్యుఁ డక్కడ హేమలింగము ప్రతిష్ఠ, సలిపె నది గుప్తముగ నుండుఁ గలియుగమున
నచటఁ జేసినస్నానదానాదివిధుల, వలనఁ గలుగుఫలం బెన్న వశము గాదు. 873
క. తిలపిండంబున శ్రాద్ధము, సలిపినయెడ నచట విష్ణుసాన్నిధ్యమునన్
గలకాలము వసియింపం, గలుగుం గర్తలకుఁ బితృనికాయముతోడన్.
ఆ. అచట రుద్రజపము నాచరించినయెడ, భస్మ మగుట సర్వపాపములును
మామకీనరూపమాహాత్మ్యసహితులై, యుందు రేను బాయ కుంటచోట. 875

—: పిప్పలాదతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతటంబున దుగ్ధేశ్వరసమీపమందుఁ బిప్పలాదతీర్థం బేర్పడియె.
సీ. అచ్చట మున్ను మాతృత్రాజ్ఞచే జనకుండ్రి, కాన్పణ్య మొందవించుడునావతోడ
గావించు చొరడంగ తపసోపవంబును చెప్ప, లాయుందు తద్విపత్ను వహించెద

కోలాసురుఁడు వచ్చి కోలాహలము సేయఁ, గృత్యను బుట్టించి ఋషివరుండు
దానిచేఁ జంపించె దైత్యుని సద్దాన, నప్పోటఁ బిప్పలాదాఖ్యచేత
గీ. వెలసెఁ దీర్థంబుగా నదిఁ జలిపి కేని, స్నానమును బ్రహ్మహత్యాదిసకలపాప
ముక్తులై కర్మబంధవిముక్తి నొందఁ, గలుగు నది గుప్తతీర్థంబు కలియుగమున. 877
ఆ. అచటఁ జేయుపిప్పలావోషణంబునఁ, దొలఁగిపోయి సకలకలుషములును
గలుగు జన్మమృత్యువులు లేనిధామంబు, నందు నుండుభాగ్య మంబుజాక్షి. 878

—: నింబార్కతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతీరంబున నింబార్కతీర్థం బేర్పడియె. 879
గీ. అచట స్నానం బొనర్చిన నామయంబు, లన్నియును నాశమును నొందు నాక్షణంబ
యచటఁ గలనింబవృక్షంబు నర్కబుద్ధి, చేతఁ బూజింప సర్వార్థసిద్ధి గలుగు. 880
క. మును కోలాహలసంగర, మున జితులై యమరు లసురులచేఁ బ్రాణా
శను జొచ్చి వృక్షములలోఁ, దనువుల రక్షించుకొనిరి తన్మయు లగుచున్.
గీ. పాదపంబులు దేవతాభావ మొంది, నట్టికతమున ఛేదనార్హములు గావు
పాదపచ్ఛేది దేవతాచ్ఛేదకుండు, వాని కిహపరసౌఖ్యంబు గానరాదు. 832
వ. కోలాహలుండు కాలధర్మంబు నొందువఱకును మాధవున కశ్వత్థంబును నాకు బిల్వం
బును మహేంద్రునకు శిరీషంబును సూర్యునకు నింబంబును నితరదేవతలకు దత్తదర్హ
ద్రుమంబులును నాశ్రయంబు లయ్యె. నింబార్కతీర్థంబున నింబార్కపూజ గావించి
యాదిత్యభాస్కరభాను రవివిశ్వప్రకాశకతీక్ష్ణాంశుమార్తండ సూర్యప్రభాకరవిభావసు
సహస్రాంశుపూషద్వాదశనామంబులు పఠించిన ధనధాన్యపుత్రపౌత్రాదిసకలభాగ్యములం
బడయంగలుగు. 883
క. ద్వాదశనామంబులచే, నాదిత్యునిపూజ సేయ నఖిలక్షేమా
పాదకుఁ డగు నాదిత్యుఁడు, భూదేవాద్యఖిలవర్ణములవారలకున్. 884

—: సిద్ధతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతటంబున సిద్ధతీర్థం బేర్పడియె. 885
గీ. అచటఁ గృష్ణుఁడు మును కోటరాక్షి యనెడు, శక్తి నొకదాని నిల్పె వైష్ణవిని నొక్క
యబ్ద మాతీర్థమున స్నానమాడి యామె, యాస్య మీక్షింప వరియించు నాదిలక్ష్మి.
సీ. మును చిత్రలేఖ చేసినయుపాయంబున, ననిరుద్ధుఁ డుషకు సంప్రాప్త మగుడు
నతని బాణాసురుం డాత్మమందిరమునఁ, గట్టివైవంగ నక్కాలమందు
ననిరుద్ధుఁ డేమియు నొనరింపఁ జాలక, కోటరాక్షిని బాదుకొల్పి మదిని
స్మరియించుటయుఁ దత్ప్రసాదంబునను గృష్ణుఁ, డరుదెంచి యుద్ధధరాంగణమున
గీ. బాణుని జయించి ద్వారకాపత్తనమున, కరిగెను నుషానిరుద్ధసమన్వితముగ
నంత ననిరుద్ధుఁ డక్కోటరాక్షి నంత, రంగమున నిల్పివిశ్వాస మావహిల్ల. 887

వ. కోటరాక్షి విశ్వరూప మహామాయ బలాధిక త్రిపుర త్రిపురఘ్ని శివ శివరూపిణి కన్య సారస్వతి దుర్గ దుర్గతిహారిణి భైరవి భైరవాక్షి లక్ష్మీదేవి జనప్రియ యను షోడశనామంబులం బఠించుచు సిద్ధార్థసిద్ధిం బొందె. 888

తే. ఎవరు తన్నామములఁ బఠియించువారొ, ప్రతిదినంబును వారి కాపదలు దొలఁగు
సిద్ధతీర్థంబు నెవరు వీక్షించువారొ, చేకుఱును వారలకు నిష్టచింత యెని. 889

—: తీర్థరాజమాహాత్మ్యము. :—

వ. మఱియును సాభ్రమతీతటంబునఁ దీర్థరాజం బేర్పడియె. 890

గీ. అచటఁ బ్రవహించు చుండు నహర్నిశంబు, చందనోదకయుతము లై సప్తనదులు
దానిలో నొనరించెడిస్నానమునకుఁ, గలుగు ఫలము వచింప నా కలవి గాదు. 891

క. వామనుఁ డచ్చట నుండెక్, గామితముల నెల్లఁ దీర్పఁగలదేవుం డా
స్వామిని గొలిచిన వైష్ణవ, ధామంబున నుండఁగలుగుఁ దనుధారులకున్. 892

వ. అచ్చట మాఘశుక్లద్వాదశీదినంబునఁ దిలధేనుదానంబు గావించె నేని సర్వపాప విముక్తి నొంది కులశతోద్ధారకుం డగు. 893

ఆ. చలిపె నేని యచటఁ దిలతర్పణము పిత, లెనయఁ దృప్తి వేయియేండ్లవఱకుఁ
శ్రాద్ధ మొనరుపంగ సమకూరుఫల మబ్బు, నిది రహస్య మెఱుఁగ రెవరుఁ గూడ.

క. గుడపాయసములచే నే, ర్పడఁగను సంతృప్తి యొక్కబ్రాహ్మణునకు న
య్యెడ భోజనంబు వెట్టినఁ, బడయును ద్విజకోటిఁ దృప్తిపఱిచినఫలమున్. 895

—: సోమతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతీరంబున సోమతీర్థం బేర్పడియె. 896

సీ. కాశ్యపకుం డనుఖ్యాతి కెక్కినతపో, ధనుఁ డొక్కఁ డాస్థానమునను మున్న
కావించుచుండ నుత్కటతపం బొకనాఁడు, ప్రత్యక్షమై యాతపస్వి కేను
వరము గోరు మనంగ వాంఛించె నతఁడు సో, మేశ్వరలింగ మం దేర్పడంగ
నట్టులె యగుఁగాక యనుఁడు నే నట లింగ, మావిర్భవించె నత్యద్భుతముగ

గీ. నచట స్నానాదిపుణ్యకార్యములు సేసి, కనినయెడలను సోమేశ్వరుని సమస్త
వాంఛితార్థంబు లీడేరి వచ్చు సోమ, పానజన్యమహాపుణ్యఫలము వింటె. 897

క. ఉదయించె నాస్థలంబున, కది మొదలుగ సోమతీర్థ మనునామము త
త్పదమున స్నానము చేసెడి, యదనునఁ గలకోర్కె లెల్ల నపుడె ఫలించున్. 898

ఆ. సోమతీర్థమందు సోమవారంబున, స్నానముం బొనర్చి శ్రద్ధతోడ
నెవ్వఁ డేని చేసె నేని సోమేశ్వర, దర్శనంబు వాఁడె తత్త్వదర్శి. 899

—: కాపోతతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతీరంబునం గాపోతతీర్థం బేర్పడియె. 900

సీ. అట పవిత్రాత్మకం బై నవటవృక్ష మొకఁ డుండె, బలగగోలాహలాన్వీతము గాఁగ
దానిపై నొకకపోతము గట్టుకొని గూడు, నివసించుచుండఁగ నెలఁతతోడ
నొకవ్యాధశేఖరుఁ డొకపేఁగ యేతెంచి, యాకపోతం బుండునట్టికడకుఁ
జాలావతంబ క్షుద్బాధచే వచ్చితి, నతిథి నై తావకాభ్యాశమునకు
గీ. త్వత్కళేబరమాంస మిత్తరుణమందు, నా కొసంగితి వేని ప్రాణములు నిలుచు
నావుడుఁ గపోత మపుడె శ్యేనమున కిచ్చి, యాత్మతనువును వై కుంఠమందుఁ జేరె.
వ. అది మొదలుగా నాస్థానంబు కాపోతతీర్థం బనెడిప్రఖ్యాతిం జెందె. 902
గీ. పర్వవేళల నచటఁ దర్పణము సేసి, సుమఫలంబులతోడఁ బిండము నొసంగు
వారు కాకాదిబలి నిచ్చువారు దాఁటఁ, గలరు యమలోకమార్గంబు సులభముగను.
గీ. అచట నై శాఖపూర్ణిమయందు గౌర, సర్షపములను స్నానంబు సలిపి పిదపఁ
గనినయెడలఁ బ్రాచీనేశ్వరునిఁ దరింపఁ, దాను దరియింపఁజేసి పితరుల నెల్ల. 904

—: గోతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతీరంబునందు గోతీర్థం బేర్పడియె. 905
గీ. పూర్వకృతఘోరపాతకంబునను గృష్ణ, కాయములఁ గొన్నగోవు లక్కడను మునిఁగి
యఘములు నశింప శుక్లదేహముల నొందె, దాన గోతీర్థ మయ్యె నాతావు గౌరి.
గీ. చలిపి స్నానంబు నచట గోవులకు గ్రాస, మొసఁగినను నిచ్చినను శ్రోత్రియునకు గోవు
బ్రహ్మహత్యాదిసకలపాపములు గూడ, భస్మ మై పొందఁగలుగును బ్రహ్మపదము.

—: కాశ్యపతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతీరంబునఁ గాశ్యపతీర్థం బేర్పడియె. 908
గీ. అచటఁ గావించి తపముఁ గశ్యపుఁడు మున్ను, మజటాజూటగంగను మహికిఁ దెచ్చె
దానఁ గాశ్యపతీర్థ మాస్థాన మయ్యెఁ, జలుపునెడ స్నాన మచ్చోటఁ గలుగు ముక్తి.
వ. అందుఁ గశ్యపనిర్మితం బై నకాశ్యపకుండంబున స్నాతుం డై తద్ధామాధీశ్వరుం డగు
కశ్యేశ్వరుని దర్శించె నేని నిరయంబు దర్శింపకుండు. 910
గీ. అచటఁ గశ్యపనిర్మితం బై ననగరి, కాశ్యప యటన్న పేరను గ్రాలుచుండె
నది ప్రభావంబుచేఁ గాశియట్లు సకల, జనులఁ బావనులను జేయు సంతతమును. 911

—: భూతాలయతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతటంబున భూతాలయతీర్థం బేర్పడియె. 912
క. భూతాలయతీర్థంబున, భూతాలయ మనువటంబుఁ బొడగనునెడలన్
భూతేశ్వరకృపచేతను, భూతంబులవలన భయముఁ బొందరు మనుజుల్. 913
వ. అచ్చటఁ బ్రాచి యగుచందనానది సాభ్రమతీసంగత యై సకలపాతకనివారణధురీణత

—: ఘటేశ్వరతీర్థమాహాత్మ్యము :—

బడసి యుండె. మఱియును సాభ్రమతీతీరంబున ఘటేశ్వరతీర్థం బేర్పడియె. 914

క. అటనుండుటచే లింగము, ఘటముగను ఘటేశ్వరాఖ్య కలదై యది యు
త్కటముగ నిజపూజాలం, పటులకు నొడఁగూర్చుచుండు భద్రము లెల్లన్. 915

గీ. స్నాన మొనరించి యట ఘటేశ్వరునిపూజ, సలుపునెడ లక్షబిల్వసంచయముచేత
నభిమతార్థంబు లెల్లను నంది భువిని, బరమపదమును బ్రాపించుఁ బరమునందు. 916

—: వైద్యనాథేశ్వరతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతీరంబున వైద్యనాథేశ్వరతీర్థం బేర్పడియె. 917

గీ. అచ్చటను స్నానపితృతర్పణాదివిధులఁ, జేయు[illegible]త్ర[illegible]వ్యయజ్ఞముల్ చేసినట్టి
సుకృతమును నొందఁగలుగును జూచె నేని, వై[illegible]నాథేశ్వరునిఁ దీరు వాంఛ లెల్ల.

—: దేవతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతీరంబున దేవతీర్థం బేర్పడియె. 919

సీ. మును ధర్మనందనుం డొనరించి దిగ్జయం, బును విభీషణునిచేఁ గొని కరంబు
రాజసూయము సేసి భ్రాతృయుక్తంబుగా, సాభ్రమతీతటస్థలమునందుఁ
బాండురార్యాంబను బాదుకొల్పుట నది, దేవతీర్థంబునాఁ దేజరిల్లె
నచట స్నానము సేసి యాపాండురార్యను, దిలకింప నష్టసిద్ధులును గలుగు

గీ. నందు మున్నంజనాపుత్రుఁ డాచరించి, తపమును సముద్రలంఘనాదక్షుఁ డయ్యె
మరణమును బొందునెడ నందు మత్పదంబు, నొంది చండేశ్వరగణత్వ మొందు వాఁడు.

—: చండేశతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతీరంబునఁ జండేశతీర్థం బేర్పడియె. 921

గీ. అచటఁ జండేశ్వరుండు నిత్యము వసించి, తన్ను దర్శించువారిపాతకము లడఁచు
నందుఁ జెండేశ మనుపురి నమరు లెల్లఁ, గలిసి నిర్మించి రది ముక్తి గలుగఁజేయు. 922

—: గాణపత్యతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతీతటంబున గాణపత్యతీర్థం బేర్పడియె. 923

గీ. చలిపి స్నానంబు నట గణేశ్వరునిపూజ, సేయునెడ మోక్షసామ్రాజ్యసిద్ధి గలుగు
నచట శ్రాద్ధంబు సలిపిన నాచరించి, నను వృషభదానమును వాఁడు నన్నుఁ జేరు. 924

—: వార్త్రఘ్నసంగమతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సాభ్రమతితోడ వార్త్రఘ్నినది గలియుటంజేసి వార్త్రఘ్నిసంగమతీర్థం
బేర్పడియె. 925

సీ. మును వృత్రునకు మహేంద్రునకును బదికొండు, వేలవర్షము లయ్యె నాల మంత
నమరేంద్రుఁడు పరాజయము నొంది దిక్కు లే, కునికి సంగమతీర్థమునకుఁ జేది

స్నానమప్పుడు చేసి నను సన్నుతింప నా, తనమీఁద నాకు వాత్సల్య మొదవె
నంత నేఁ బ్రత్యక్ష మగుడు నింద్రున కిటుఁ, బలిత మై మద్దేహభసితలవము
గీ. లింగరూపంబు నొంది వెలింగె భస్మ, గాత్ర మనుపేరఁ బరగుచు గోత్రభేది
దానిఁ బూజించి మత్ప్రసాదంబు వడసి, క్షణములోపల వృత్రుని సంహరించె. 926
సీ. అంతట వృత్రదేహమునుండి లోకభ, యంకరం బగుబ్రహ్మహత్య వెడలి
యనిమిషేంద్రునికంఠమును బట్టుకొనుటయు, నాతఁ డాబాధకు నాఁగలేక
బిసమధ్యమునఁ జొచ్చి పెక్కేండ్లు సూక్ష్మరూ, పమున నోడ నుండ నప్పటికిఁ గూడ
నది విడనాడమి నతఁడు మేషాకార, మున విరించిసమీపమునకుఁ బోయి
గీ. చేష్ట లేకుండఁ బడుటయు స్రష్ట [illegible]గి, యెవరొ వచ్చినవారు నా కెఱుఁగఁజేయుఁ
డనుటయును బ్రహ్మహత్య య[illegible] దేవ, వచ్చితిని బ్రహ్మహత్యను వాస్తవముగ.
క. అనవుడుఁ బితామహుం డి, ట్ల[illegible] జగత్క్షేమమునకు నై విడువుము శ
క్రుని నాఁగ నాకుఁ జూపుము, వనజాసన యుండ వసతి వదలెద వీనిన్. 928
సీ. అని పల్కుటయు బ్రహ్మహత్య లోకేశుండు, నిని దానివాక్యము వీను లొగ్గి
యగ్నినిఁ బిలిచి హుతాశన బ్రహ్మహ, త్యాచతుర్థాంశంబుఁ దాల్పు మీవు
నావుడు ననలుండు దేవ తన్ముక్తి నా, కెపు డగుఁ జెపు మది యేను దాల్తు
ననవుడు బ్రహ్మ యి ట్లనియెఁ బావక నీవు, జ్వలియించుచుండెడిసమయమందు
గీ. హవ్య మొంపఁడొ యెవఁడు నీయందు వానిఁ, బట్టుకొను బ్రహ్మహత్య నిన్ బాసి యనుడుఁ
గమలజునివాక్యమున నందుగౌరవమున, బ్రహ్మహత్యాంశమును దాల్చెఁ బావకుండు.
సీ. అంతటఁ బరమేష్ఠి యవనిమహౌషధి, తృణముల కగ్నికిఁ దెలిపినట్లు
తెలుపఁగ నవియు నర్థించెఁ గృశానువు, వలె నంతట విరించి వానిఁ జూచి
యుచితకారణము లేకుండఁగ మిమ్ముల, ఛేదించునప్పు డాఛేదకులను
బట్టి వేధించును బ్రహ్మహత్య త్యజించి, మిమ్ము నా వనజునివాక్యమ్ము నమ్మి
ఆ. యవి గ్రహించె బ్రహ్మహత్యాంశమును నంత, నచ్చరలకుఁ జెప్ప నజుఁడు వార
లడుగఁ దద్విముక్తి యగుసాధనము వారి, కిట్టు లనియె ధాత హితవిధాత. 930
క. ఒనరించునొ యెవ్వఁడు మై, థునమును దోయ్యాలులు ఋతుమతు లయినసమయం
బున బ్రహ్మహత్య వానిం, గొని మిము విడనాడు వలదు కొంకఁగ మీకున్. 931
సీ. అనవుడు నప్సరోంగనలు గ్రహింపంగ, బ్రహ్మహత్యాంశంబుఁ బద్మభవుఁడు
పిలిచి తోయంబులఁ దెలుపంగ మునుపోలె, నర్థించె బ్రహ్మ తన్ముక్తి యవియు
నంతట బ్రహ్మ తోయములార మీయందు, మలమూత్రములను శ్లేష్మమును నెవరు
విడుతురొ వారిని విడుచుకాలమునన్నె, పట్టి మిమ్ముఁ ద్యజించు బ్రహ్మహత్య
గీ. యనుటయును బహ్మహత్యాంశమును గ్రహించెఁ
దోయములు దాన నింద్రునిఁ దొఱఁగి పోయె

బ్రహ్మహత్య పదంపడి పాకవైరి
తపము నతీర్థమునఁ జేసి ధన్యుఁ డయ్యె. 932

—: భద్రాసంగమతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును స్వాభ్రమతికి భద్రానదితోడ సంగమం బేర్పడినస్థలంబు భద్రాసంగమతీర్థం
బయ్యె. 933

క. స్నానముఁ బితృతర్పణమును, దానంబును నచటఁ జేయుతనుధారులకున్
మానులకుఁ గూడ దుర్లభ, మైనపదం బబ్బు నేల యధికోక్తు లికన్ 934

—: వారాహతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును దత్సమీపంబున వారాహతీర్థం బేర్పడియె. 935

సీ. మును వరాహశరీరమును దాల్చి విష్ణువు, తత్సంగమాఖ్యతీర్థంబునుండి
రత్నాకరముఁ జొచ్చి రాత్రించరుల నెల్లఁ, బరిమార్చి సంతోషపఱిచి సురల
నెచ్చోటనుండి పై కేతెంచె నచ్చోటు, వారాహతీర్థ మన పేరఁ బరగె
నచ్చట స్నానంబు నాచరించినను శ్రా, ద్ధము వెట్టినను బితృతరణమునకు

గీ. నుభయవంశంబులనుగూడ నుద్ధరించి, తాను నివసించు వైకుంఠధామమందు
నది మహావిష్ణునిర్మితం బైనకతన, దాని కీడైనతీర్థంబు కానరాదు. 936

—: సాగరసంగమతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును స్వాభ్రమతి సాగరంబుతోడఁ గలిసినధామంబు సాగర సంగమతీర్థం బయ్యె.

గీ. అచట స్నానంబు గావించినంతమాత్ర, మునను పంచమహాపాపములును దొలఁగు
దానజపహోమతర్పణాధ్యానములను, నేరుపడియెడిఫల మింక నేమిచెప్ప. 938

—: ఆదిత్యతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును సంగమతీర్థసమీపంబున నాదిత్యతీర్థం బేర్పడియె. 939

గీ. దాని దర్శించినను నందు స్నాన మాచ, రించినను దర్పణం బొనర్చినను నర్క-
సుమములను గరవీరపుష్పములఁ బూజ, సలిపినను సర్వపాతకంబులును మాయు. 940

—: నీలకంఠతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును దత్సమీపంబున నీలకంఠతీర్థం బేర్పడియె. 941

ఆ. దానిలోనఁ జేసి స్నానంబు నీలకం, ఠార్చనంబు చేయునట్టివారు
సకలవాంఛితార్థసంసిద్ధులను బొందు, నట్టివార సంశయంబు లేదు. 942

—: దుర్గాసంగమతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును నచ్చట దుర్గాసంగమతీర్థం బేర్పడియె. 943

గీ. స్వాభ్రమతి దుర్గతోడను సంగమించి, నట్టిచోటు మహాతీర్థ మయ్యె నందుఁ
జేయుస్నానంబు గోమహిషీప్రదాన, మునసురభూజనములును ఫలాధికములు. 944

## —: నృసింహతీర్థమాహాత్మ్యము :—

వ. మఱియును దత్సమీపంబున నృసింహతీర్థం బేర్పడియె. 945
గీ. అచ్చట న్నృసింహుఁ డుండంగ హతహిరణ్య, కశిపుఁ డై శాంతముగ నట్టికాలమందు
నధికభక్తిని బ్రహ్లాదుఁ డతనిచెంత, నిలువఁబడి యి ట్లనియె మేనఁ బులక లొలయ.
గీ. తండ్రి నీవు మహాగుణోత్తరుఁడ వేను, మందబుద్ధిని నాకు నీయందు భక్తి
గలుగఁగను నీకు నాయందుఁ గరుణ గలుగ, హేతు వేమియొ వినఁగ నా కిచ్ఛ పొడమె.
వ. అని ప్రార్థించుటయు నృసింహుం డాతని కి ట్లనియె. 948
సీ. ప్రహ్లాద యిది మున్ను పరగె మాళిస్థాన, మనెడిక్షేత్రంబుగా నవనియందు
హారీతుఁ డనెడిబ్రాహ్మణుఁడు లీలావతి, యనుపత్నితోడ నిం దధివసించి
పలుపంగ నేకవింశతియుగంబులు తపం, బేను ప్రత్యక్షమై వాని కపుడు
వర మీయనుండంగ వాంఛించె నాతండు, తనయుండు గాఁగను దనకు నేను
గీ. దాని కామోదమును జెంది నేను విప్ర, ప్రాక్తనుండను గాన గర్భమునఁ జేరఁ
గాని యీక్షేత్రమందు నీసూనుఁడుగనె, నిత్యమును నుండి కలిగింతు నీకుఁ దుష్టి.
క. అనవుడు నావాక్యము నా, యనఘుం డంగీకరింప నది మొదలుగఁ ద
త్తనయుం డనియెడిశ్రుతిఁ, గని నే నీక్షేత్రమందె కదలక యుంటిన్. 950
సీ. మును నీవు ద్విజన కొక్కనికి బుత్రుండ వై, జనియించి వసుదేవుఁ డనెడిపేరఁ
జదువు సంధ్యయు లేక సద్గుణంబును లేక, దుర్మార్గవర్తులు తోడు గాఁగ
వేశ్యారతుండ వై విహరించుచును దైవి, కంబుగా నొక్కదినంబునందుఁ
జనుదెంచి యీక్షేత్రమునకు మద్వ్రతమును, దిలకించి భక్తులు సలుపుచుండఁ
గీ. గౌతుకం బామతిల్ల నాగణికతోడఁ, జలిపితివి మద్వ్రతంబు నిచ్చటనె దాన
నాథనాంగన నాలోన నైక్య మొందె, జేరెదవు నన్ను నీవును శీఘ్రముగనె. 951
క. అనవుడుఁ బ్రహ్లాదుఁడు దన, మనమున సంతసము నొంది మాధవ నాకున్
వినిపింపుము త్వద్వ్రతమును, నని వేఁడ నృసింహుఁ డిట్టు లనియె నతనికిన్. 952
వ. స్వాతీనక్షత్రముతోడంగాని సిద్ధియోగంబుతోడంగాని వణిజకరణంబుతోడంగాని శనివారంబుతోడంగాని యన్నిటితోడంగాని కొన్నిటితోడంగాని కూడినవైశాఖశుక్లచతుర్దశి నే నావిర్భవించినదినం బగుట నాదినంబున గృహంబునంగాని దేవఖాతతటాకంబులం దెం దేని మృత్తికాగోమయధాత్రీఫలరసతైలంబులతోడ స్నానంబు గావించి శుద్ధుం డై ధౌతవస్త్రంబులం దాల్చి నిత్యకర్మంబు ననుష్ఠించి గృహంబునంగాని మత్క్షేత్రంబునంగాని మండపంబు నేర్పఱిచి యం దష్టదళపద్మంబు లిఖించి దానిపైని రత్నసమన్వితతామ్రకలశంబును స్థాపించి దానిమీఁదఁ దండులపూరితం బగుపాత్రంబు నుంచి దానిపై స్వర్ణమయం బగులక్ష్మీనృసింహమూర్తి నుంచి ధ్యానించి యథావిధిగఁ బంచామృతస్నానంబును నర్చనంబును గావించి ధూపదీపనైవేద్యాదు లొసంగి యా

దినం బెల్ల నుపవాసం బొనర్చి రాత్రి జాగరణంబు చేసి మఱునాఁడు ప్రభాతకాలం
బున స్నానంబు గావించి పూర్వవిధానంబున న న్నర్చించి నాయెదుట మత్ప్రీతికరం
బుగా వైష్ణవశ్రాద్ధంబు గావించి యథాశక్తి దానంబులు బ్రాహ్మణుల కొసంగి భోజన
దక్షిణాతాంబూలంబులచే సంతృప్తి గలిగించి. 953

ఆ. కావు ముద్ధరించి దేవ మద్వంశజు, లైనవారలను భవాబ్ధినుండి
పాపవార్ధిలోనఁ బడియున్న నాకుఁ గ, రావలంబ మిమ్ము నీవె దిక్కు. 954

క. అని వేఁడి మహద్వాసన, మొనరించి మదీయమూర్తి నొసఁగిన నాచా
ర్యున కర్థసిద్ధు లెల్లను, ననువుగఁ బ్రాప్తించు నెవరి కైనను ధరణిన్. 955

క. ధనహీనుఁ డైన నియతము, గను నుపవాసంబు చేయఁగలిగినయెడ మ
జ్జననదినంబునఁ జాలున్, గనఁగను మద్వ్రతమువలనఁ గలుగుఫలంబున్. 956

ఆ. ధాత సృష్టి చేయ దక్షత్వమును బొందె, శివుఁడు త్రిపురవధము చేయఁగలిగె
మునులు సురలు ప్రభువులును సిద్ధి నొందిరి, మద్వ్రతోపలబ్ధమహిమ వలన. 957

వ. అని చెప్పి యంతర్ధానంబు నొందుటయుఁ బ్రహ్లాదుం డపరిమితానందముం జెందె. 958

గీ. కలియుగమ్మున బహుకామఫలము లొసఁగ, బ్రాభవము గలగంగ సాభ్రమతి యొకఁడె
దానిమహిమంబు వర్ణింపఁదరము గాదు, నిక్కముగ శతజిహ్వ లుండినను నాకు. 959

ఆ. ఏచటఁ దీర్థనామ మెఱుఁగకుందురో లోకు, లచట నామకావ్యయమునఁ దీర్థ
మేరుపఱుపవలయు నిది సూక్ష్మధర్మంబు, తెలుపఁదగిన దగుటఁ దెలిపినాఁడ. 960

వ. అని పలుకుటయుఁ గాత్యాయని యపరిమితానందముం బొందె. 961

క. మునివర్య వినుము భార్గవి, మును విన గీతామహత్త్వమును వాంఛింపం
గను నొకతఱి శౌరిని ముద, మొనయఁగ మాధవుఁడు లక్ష్మి కిట్లు వచించెన్. 962

—: గీతామాహాత్మ్యకథనము :—

సీ. అతివ నాయాత్మ పరాపరభేదంబు, లను ద్వివిధంబుగాఁ దనరుచుండు
నందుఁ బరాత్మ నిరాకారముగ నిర్గు, ణముగ సాక్షిగ నిష్కళముగ వెలసె
నపరాత్మ త్రిపురాంతకాకార మదియె మ, దాస్యవినిర్గత మైనగీత
యధ్యాయపంచకం బాస్యపంచకముగ, దశబాహులుగ దశాధ్యాయములును

గీ. నావలఁ బిచండముగను నధ్యాయ మొకటి, యంఘ్రియుగ్మకముగను నధ్యాయయుగము
తనరి యుండెను దాన మత్తత్త్వ మెల్లఁ, దెలుపఁబడియుండె నది నీకుఁ దెలియనిదియె.

ఆ. అందులోన నొక్క యధ్యాయ మేనియుఁ, గాకయున్న నొక్కశ్లోక మేని
యర్ధ మేని తుదకు నర్ధార్ధ మేనియు, ననుదినమును జదువ నెనయు ముక్తి. 964

వ. అష్టాదశాధ్యాయాత్మకంబును గీతానామకంబును వాఙ్మయంబును నీశ్వరాకారంబును
నగుమదీయాపరాత్మమూర్తిని సేవించె నేని ద్వైతాద్వైతవివర్జితంబును భావాభావ
వినిర్ముక్తంబును నాద్యంతరహితంబును శుద్ధసంవిత్ప్రభానందమయంబును నిర్గుణంబును

నిష్కళంబును నిరాకారంబును నగుమత్పరాత్మస్వరూపంబు విదితం బగు. దాన నాత్మైక్యభాగ్యంబు చేకూరు. 965

—: గీతాప్రథమాధ్యాయ మాహాత్మ్యము :—

సీ. మును ధరిత్రీతలంబున నుండెను సుశర్మ, యనునామమున నొక్కయవనిసురుఁడు
స్నానసంధ్యాదివిహీనుఁడై కృషిచేత, జీవించుచును జిట్టచివర కతఁడు
మృగపక్షులను వధియింపంగ నొకనాఁడు, దుస్సహావాసులతోడఁ గూడి
యటవీస్థలికిఁ బోయి యాసన్న మగుటచేఁ, దనకుఁ గాలము సర్పదష్టుఁ డయ్యె
గీ. నంతటను యమకింకరు లరుగుదెంచి, వానిఁ గొనిపోయి యమసన్నిధానమునకు
నిలుపఁ దత్కృతపాతకంబులకు శమనుఁ, డర్హశిక్షను జలుప వాఁడనుభవించి. 966
గీ. అవనిఁ గడ కెద్దుగను బుట్టె నావృషంబు, హాలము లాగుచు మోయుచు నలవిగాని
భారమును బహుకాల మప్పగిదిఁ గడపి, కొనకు నొకపంగువును మోయుపనికిఁ జిక్కె.
గీ. నడువఁజాలక రోజుచు నడుమనడుమ, నిలుచుచుండంగఁ బంగువు నిలువనీక
దండమునఁ గొట్టుటయు నది తాళలేక, పడియె మునలిది యగుటచేఁ బుడమిమీఁద.
క. దారిం బోవుచునుండెడి, వారాంగన యొకతె దానివ్యథ గని లోనం
గారుణ్య మొదవ దానికిఁ, దారకముగ ధారవోసెఁ దనసుకృతంబుల్. 969
గీ. అంత నాయెద్దు లేవలే కసువు లుడిగె, నచ్చటనె యమకింకరు లపుడు వచ్చి
దానిఁ గొనిపోవ యమునియొద్దకుఁ ద్యజించె, యముఁడు వేశ్యాప్రదత్తపుణ్యమున దాని.
సీ. అంతట నావృష మరుదెంచి భూలోక, మునకు భూసురకులంబున జనించె
జాతిస్మరణశక్తి సంభవించుటను నా, క్షితిసురుం డావేశ్య చెంత కరిగి
తన కామెవలనఁ గల్గినయుపకారంబుఁ, దెలిపి నీపుణ్యంబుఁ దెలుపు మనియె
నపు డామె యతని కి ట్లనియె విప్రోత్తమ, యొకశుకంబు పఠించుచున్నగీత
గీ. యాలకించుటఁ బూతాంతరాత్మ నగుచు, నిన్నుఁ దరియింపఁజేయుపుణ్యమును జెందఁ
గలిగితి వటంచుఁ జెప్ప నాచిలుకకడకు, నామెతోఁగూడ నేఁగి యాభూమిసురుఁడు.
సీ. చిలుక నీగాథను దెలుపుము దయతోడ, నాలకింపంగ నా కాశ పొడమె
నావుడుఁ బూర్వజన్మస్మృతి గలదియై, యాశుకం బీక్షించి యతనితోను
భూసురోత్తమ నేను బూర్వము బ్రాహ్మణ, కులమునఁ బుట్టి విద్యలను జదివి
వైదుష్యగర్వంబువలన దుర్వాదముల్, సలుపుచుఁ దిరుగుచు స్వైరముగను
గీ. నొక్కలేటికి గాలధర్మంబు నొంది నరక, యాతనలఁ జెంది తుద కిట్లు యవనిలోనఁ
జిలుక నై పుట్టి యొకమునిచేతఁ జిక్కి, పట్టువడితిని బంజరబంధమందు. 972
సీ. అంతట నమ్మునియాశ్రమంబున ముని, చ్ఛాత్రు లెల్లరుఁగూడి పంతతమును
బఠియింపుచుండంగఁ బావనం బైరగీ, తాదిమాధ్యాయంబు నాలకించి

పఠియించుచుంటిని ప్రతిదినంబును నేను, శ్రవణంచేయుము గాంగ జనుల కెల్ల
నటు లుండ నొకనాఁడు శరుకెంచి యొకనాఁడు, ననుఁ గొనివచ్చి యీవనిత కమ్మె

గీ. నేను గీతాదిమాధ్యాయ మెప్పుడుఁ గూడఁ, జదువుచుండుట నీవేశ్య శ్రద్ధతోడ
వినుటచేఁ బుణ్యవతి యయ్యె నని వచింప, నంతలో నిర్జరవిమాన మరుగుదెంచెఁ. 973

వ. ఆముప్పురును దివ్యరూపంబులతోడ నావిమానంబుపై నధిష్ఠించి వైకుంఠంబునకుం
జనిరి. 974

గీ. కాన గీతాదిమాధ్యాయ మెవరుండు, వినులారంగ వినునో యేమానవుండు
శ్రద్ధతోడను జదువునో శాశ్వతముగ, వార లుందురు వైకుంఠవాసమందు. 975

—: గీతాద్వితీయాధ్యాయమాహాత్మ్యము :—

సీ. ధాత్రిలో నొకఁ డుండె దక్షిణదిగ్భాగ, మందుఁ బురందరం బనుపురంబు
దానిలో నొకఁ డుండె ధరణిదేవుఁడు దేవ, శర్మ నాఁగను బుధశ్లాఘ్యగుణుఁడు
నిజధర్మముల నెల్ల నెఱవేర్చుకొనుచుండి, యును మనశ్శాంతి లేనినికి నతఁడు
పరితపించుచునుండ భావంబులోపల, దైవికంబుగ నొక్కతాపసుండు

గీ. వచ్చుటయు నొక్కతఱిఁ దదావసథమునకు, నమ్మహీసురుఁ డతనికి నతిథిపూజ
సలిపి తనకు మనశ్శాంతి గలుగువిధము, నభిలషింపంగ వాని కి ట్లనియె నతఁడు.

ఆ. ఆర్య మిత్రవంతుఁ డనుపేర నొకయజా, పాలుఁ డుండెఁ బుణ్యపట్టనమున
నతఁడు నీకుఁ దెల్పు నాత్మశాంతిఘటిల్లు, నట్టిమార్గ మరుగు మతనికడకు. 977

గీ. అనుటయును దేవశర్మ తదాజ్ఞ వడసి, పుణ్యనగరాంతికారణ్యమున నదీత
టమున శిలమీఁదఁ గూర్చుండి ప్రమద మొదవఁ, గనుఁగొనెడిమిత్రవంతునికడకుఁ జేరి.

గీ. ఆర్య నీయంతికమున కే నాత్మశాంతి, గలుగుమార్గంబు నెఱుఁగంగఁ దలఁచి యరుగు
దెంచినాఁడను నావాంఛ దీర్పు మనుడు, నతనిఁ గని మిత్రవంతుఁ డత్యాదరమున.

సీ. భూసురోత్తమ విను పూర్వగాథ యొకండు, వినిచెద నీకు సవిస్తరముగ
ధరను గోదావరీతటినిఁ బ్రతిష్ఠాన, మనుపురం బొకఁ డుండె నచట నుండె
విక్రముఁ డనెడిపృథ్వీపతి యొక్కఁడు, తత్సమక్షంబున దానములను
గొనుచు దుర్దముఁ డనుక్షోణీసురుం డొక్కఁ, డొనరించు చుండె జీవనము నెటులో

గీ. యట్టు లుండంగ నొక్కనాఁ డాద్విజుండు, కాలధర్మంబు నొందుడుఁ గాలభటులు
వానిఁ దోడ్కొని పోయి యనూననరక, యాతనలఁ బెట్టి విడువంగ నంతమునకు.

సీ. ఆదుర్దముఁడు పుట్టె నవనిలోన దరిద్రుఁ, డై యుండునొక్కబ్రాహ్మణునియింటఁ
దత్పూర్వపాపవర్తనవాసననుజేసి, యొక్కకామిని వాని కదిద యయ్యె
నాయింతి జారిణి యై చరించుచు నొక్క, చండాలకులజునిసంగమమున
గర్భంబుఁ దాలిచి కని కన్యకను జచ్చి, డాకినీరూపంబు దేకుఱంగ

గీ. శ్వానమునిం బట్టి చంపి నాశ్వానము డంతె, పరకపాత్మఁ బొంది యంతమునఁ బుట్టె
వ్యాఘ్రము నై శాకినియు స్వదేహాంతమందు, ననుభవించి యమాలయయాతనలను.
క. జనియించెను నాగేహం, బున నజ యై దాని నేను బోషించుచుఁ గా
ననమందుఁ ద్రిప్పుచుండం, గను నాశార్దూల మటకు గ్రక్కున వచ్చెన్. 982
క. దానిం గనుఁగొని శాంతుండ, నై నే నుండంగ వ్యాఘ్ర మజను గ్రసింపం
గా నొగ్గుచుండ నజయును, దానికడకు నరిగి నిలిచె ధైర్యముతోడన్. 983
సీ. అంతట నావ్యాఘ్ర మపగతక్రోధ మై, నిలువంగఁబడుటయు నిశ్చలముగ
నజ దాని వీక్షించి వ్యాఘ్రమ సిద్ధాన్న, మును నుపేక్షింపఁగఁ జనునె నీకు
ననవుడు వ్యాఘ్ర మి ట్లనియె నామదిలోనఁ, గలక్రోధ మెల్లను దొలఁగిపోయె
శాంతించె క్షుత్పిపాసలును నిచ్చోటను, గలమహాత్వం బేమొ తెలియరాదు
గీ. నావ్రతము మృగాదనంబ నిన్ గనిన నాకు, భీతి జనియింపకుంటకు హేతు వేమొ
తెలిసిన వచింపు మని మేఁక పలుకుటయును, దెలియదాయెను నా కని ద్వీపి పలికె.
వ. అంతట నయ్యజావ్యాఘ్రంబులు నాకడ కరుదెంచి తమసంశయంబు లడుగ నేనును
నమియునుం గలసి యొకవృక్షంబునం దుండువానరంబు నడిగితిమి. 985
సీ. ఆవానరం బిట్టు లనియె నజాపాల, విను మొక్కవిషయంబు వినుతు నీకుఁ
గను మీవనంబునఁ గనఁబడుచుండె దే, వాలయం బొక్కటి యందులోన
నుండెఁ ద్ర్యంబకలింగ మొక్కటి యున్నది, సంస్థాపితం బయ్యె స్రష్టచేత
ననుదినంబు సుకర్ముఁ డనువిప్రుఁ డొకఁడు చే, యఁగఁ దొడంగెఁ దల్లింగపూజ
గీ. యావిధంబున బహుకాల మరుగ నొక్క, తఱిని నొకతాపసుండు తత్సవిధమునకు
నరుగుదెంచి సుకర్మువిహారసపర్యఁ, గాంచి యాతనియెడలోనఁ గరుణ యొదవ. 986
గీ. అనఘసుర యేమి కోరి శివార్చనంబు, చేయుచుండినవాఁడవో చెప్పు మనుడు
నాతఁ డి ట్లనియె మహాత్మ యన్నకాంక్ష, చేత లింగార్చనంబు నేఁ జేయుచుంటి. 987
సీ. అనవుడు నాబ్రాహ్మణునిసత్యవాక్యంబు, నకు నాతపస్వి యానంద మొంది
తత్సముద్ధరణేచ్ఛ దనచి త్తమునఁ గలు, గంగ నిచ్చట నొక్కగ్రావమందుఁ
దగ లిఖియించి గీతాద్వితీయాధ్యాయ, మును బఠింపుము దీని నని వచించి
కనఁబడకుండంగఁ జనియె సుకర్ముండు, చూచుచుండంగనె చోద్యముగను
గీ. నంతట సుకర్ముఁ డాశిలయందు వ్రాసి, నట్టివ్రాఁతను గట్టిగా నభ్యసించి
చదువుచును నిత్యమును మనశ్శాంతితోడ, నీయరణ్యంబునను జరియింపఁ దొడఁగె.
క. దానిమహత్త్వముచే నీ, కానను నాకలియు దప్పికయును భయంబున్
గ్లానియు విద్వేషంబును, వేనికినిం గలుగ వనుడు విని నే నంతన్. 989
వ. అజావ్యాఘ్రంబులతోడం గూడి తచ్ఛిలాప్రదేశంబున కరిగి శిలపైని వ్రాయంబడి
యున్నగీతాద్వితీయాధ్యాయమును బఠించి మననంబు గావించుకొనుచుఁ దత్ప్రభా

వంబున నపగతసంసారక్లేశుండ నై బ్రహ్మానందంబున నోలలాడుచుంటి.తచ్ఛ్రవణ
ప్రభావంబుచే నజావ్యాఘ్రంబులు వీతకలుషంబు లై విముక్తిం బొందె. 990

క. అని పలుకఁగ నామాటలు, విని భక్తిని దేవశర్మ విశ్రాంతి మనం
బున కొదవఁ దదుపదేశము, గొని యాతనివలనఁ జేరుకొని నిజపురికిన్. 991

తే. అనుదినముఁ దదధ్యాయం, బును బఠియించుచును దానఁ బొడమినజ్ఞానం
బునఁ దొలఁగి వాంఛ లెల్లను, జననమరణశూన్య మైనసద్గతి నొందెన్. 992

—: గీతాతృతీయాధ్యాయమాహాత్మ్యము :—

సీ. మును జనస్థానంబునను జడుం డనుపేర, నుండెఁ గౌశికగోత్రుఁ డొకద్విజుండు
విడనాడి నిజకులవృత్తి నాతఁడు వణి, గ్వృత్తిలో నుండి యార్జించి ధనము
ధనమదాంధ్యంబునఁ గనులు గానక ప్రవ, ర్తించుచు లోకగర్హితము గాఁగ
నొకనాఁడు వచ్చుచు నొకపురంబుననుండి, చోరహతుం డయి దారిలోన

గీ. నొకతరువుక్రిందఁ బడి మృతి నొంది స్వకృత, పాతకమునఁ బిశాచరూపంబుఁ బడసె
నంత నాతఁడు మరణించె ననెడివార్త, తెలిసికొని తత్సుతుండు చింతిల్లి మదిని.

సీ. కావింపఁ బరలోకకర్మంబుఁ దండ్రికి, నెంచి తచ్ఛవ మున్నయెడకు నేఁగి
యచట గీతాతృతీయాధ్యాయముఁ బఠించెఁ, బ్రతిదినంబుఁ బఠించుపగిదిఁ దాను
దానిని విన్నమాత్రనె పిశాచం బొందు, పడియె వ్యోమమునుండి పుడమిమీఁద
నవల దివ్యవిమానమందు దివ్యాకార, మునఁ గానఁబడియెఁ దజ్జనకుఁ డంత

గీ. జడునకు సుతుండు మ్రొక్కి నీచరిత మేమొ, తెల్పు మన నాతఁ డంతయుఁ దెలిపి వత్స
త్వత్పఠితగీత వినుటచేతను బిశాచ, రూపము దొలంగి దేవతారూపి నైతి. 994

గీ. నీకు భద్రంబు గలిగెడుఁగాక తండ్రి, నాసహోదరుఁ డొకఁడు నేఁ జేసినట్లె
యఘము లొనరించి నరకస్థుఁ డయ్యె మఱియు, నస్మదన్వయజులు గొంద ఱట్లె యైరి.

క. నరకములనుండి వారినిఁ, దరియింపఁగఁ జేయు మీవు తత్క్షణమ ననున్
దరియింపఁజేసినట్టులె, యరిగెద నే నింక నిలువ నని దివి కరిగెన్. 996

సీ. అంతట జడపుత్రుఁ డానంద మొదవంగఁ, జనుదెంచి నిజజనస్థానమునకు
నిరయసంస్థితు లైననిజపూర్వికుల నెల్లఁ, దరియింపఁజేసెడితలఁపుతోడఁ
దగునియమమున గీతాతృతీయాధ్యాయ, మును బఠింపంగఁ దత్పుణ్యమునను
యమసన్నిధికిఁ బోయి హరిభృత్యులు కృతాంత, వదలిపెట్టుము జడవంశజులను

గీ. నని వచింపంగ నంతకుం డచటనున్న, జడకులస్తుల నెల్లను విడిచిపెట్టె
నంత మాధవకింకరు లరుగుచుండ, వేడ్కతో వారిఁ దోడ్కొని విష్ణుపురికి. 997

ఆ. వారితోడఁ గూడి వైవస్వతుండును, బోయి విష్ణుధామమునకు హరికిఁ
బ్రణతి సేసి నిలువఁబడి దేవ పాపుల, నెల్ల విడువు మనఁగ హేతు వేమి. 998

వ. అని యిట్లు వినయంబున సవినయుండగు నారాయణుండు వికసితవదనుండై గీతాతృతీయాధ్యాయప్రభావ మెల్ల పరమేశ్వరున కెఱింగించి తత్పఠనఫలంబు ప్రాప్తించుటం జేసి యీపాపాత్ముల కెల్ల నరకవిముక్తి చేకూరి నాకపదంబుం బడయంగలిగె నని నుడువ నట్టియుం గాలుండు తదధ్యాయమహిమంబున కాశ్చర్య మొంది తదనుజ్ఞం బడసి స్వధామంబున కరుదెంచె. 999

—: గీతాచతుర్థాధ్యాయమాహాత్మ్యము :—

సీ. గంగాతటంబునఁ గలదు వారాణసి, యనుపురం బొక్కటి యవనియందు
నాపురంబున నుండె నఖిలసిద్ధిప్రదా, యకమైనవిశ్వేశ్వరాలయంబు
దానిలో భరతుండు నా నొప్పునొకవిప్రుఁ, డనుదినంబును శ్రద్ధ యామతిల్లఁ
దప్పకుండఁగను గీతాచతుర్థాధ్యాయ, మును జపించుచు నుండె మోదమునను
గీ. జరుగఁగను నట్లు కొన్నివత్సరము లొక్క, తఱిని భరతుండు తత్పురోద్యానభూమి
కరిగి బదరీద్రుమయుగ్మంబు నచటఁ జూచి, కాల నొకటియుఁ గేల నొక్కటియుఁ దాఁకి.
గీ. కొంతసే పుండి యక్కడఁ గుతుకమునను, నవలఁ జనుదెంచె విశ్వేశ్వరాలయమున
కంతటను నమ్మహీజద్వయంబు శుష్క, మయ్యె నిలువునఁ జూపఱ కచ్చెరువుగ.
ఆ. అట్టు లెండిపోయి యాద్రుమంబులు రెండు, పుట్టి కన్యకలుగఁ బురమునందె
యొక్కద్విజునియింట నొందుచుండఁగ వృద్ధి, భరతుఁ డొక్కతఱిని నరిగె నటకు.
సీ. అతనిఁ గన్గొని కన్య లానంద మొదవంగఁ, దత్పాదములకు వందన మొనర్చి
దేవ నీకృపను బొందితిమి మానుష్యంబు, ననుడు నాతఁడు విస్మయంబు నొంది
కన్యకలార మీగాథ యేమియొ నాకుఁ, దెలుపుఁ డాలింపంగఁ గలిగె వేడ్క
యనవుడు వార లి ట్లనిరి మహాభాగ, వినుము చెప్పెదము మావిషయ మెల్లఁ
గీ. గలదు గోదావరీతటసలిలి ఛిన్న, పాప మనుతీర్థ మొకటి తత్పరిసరమున
సత్యతపుఁ డనియెడిఋషిరాదిత్యుఁ డొకఁడు, తపము నొనరించు చుండె నత్యద్భుతముగ.
సీ. అప్పు డచ్చరలలో నందకత్తెల మగు, మముఁ బిల్చి తనయొద్ద కమరవిభుడు
తత్తపోభంగంబు నెత్తెఱంగున నైన, నొనరింపఁగను మాకు నొసఁగె నాజ్ఞ
యంతట మేము తదాజ్ఞ నౌదలఁ దాల్చి, చనుదెంచి యమ్మునిసన్నిధమునకుఁ
జేసితి మెన్నొ నొన్నశృంగారచేష్టలు, వానిచిత్తము కామవశము గాఁగ
గీ. నపుడు సత్యతపుం డాగ్రహమున మమ్ముఁ, దిట్టె గంగాతటంబునఁ బుట్ట రేగుఁ
జెట్లుగను నంతటను మేము చేరి వాని, దరికి నేడ్చుచు నుండ న త్తరుణమందు. 1004
గీ. భరతసంస్పర్శమునను శాపంబు దొలఁగి, పూర్వజన్మస్మృతి ఘటిల్లఁ బుట్టఁగలరు
మర్త్యకన్యలుగను మీరు మహి నటంచు, నతఁడు కరుణింప నిలకు మే మరుగు దెంచి.
గీ. జాహ్నవీతటవనములో జనన మొందఁ, గలిగితిమి బదరీద్రుమంబులుగ నాఁడు
తాఁకుటను నీవు మమ్ముఁ దద్వనమునందుఁ, గాంచితిమి జన్మ మిట మర్త్యకన్యలముగ.

క. కావున సద్గానంబును, గావింపఁగ మాకు నీవె గతి యింక మహీ
దేవోత్తమ యని వేఁడఁగ, నావిప్రుఁడు లోనఁ గరుణ యామతిలంగన్. 1007

క. గీతాతుర్యాధ్యాయము, చేతోమోదంబు గలుగఁ జెప్పఁగ వారల్
ప్రీతిమెయి నది జపించుచుఁ, బాతకములు తొలఁగిపోవఁ బడసిరి ముక్తిన్. 1008

—: గీతాపంచమాధ్యాయమాహాత్మ్యము :—

సీ. కలఁడు పింగళుఁ డనుభూసురుం డొక్కఁడు, పురుకుత్సపురమున భువిని మున్ను
బ్రాహ్మణధర్మంబు పరిహరించి యతండు, తౌర్యత్రికప్రసక్తతను జెంది
పరదారలోలుఁడై తిరుగుచుండఁగ వాని, దౌర్త్యంబుఁ జూచి తద్భార్య యరుణ
తా నొక్కజారునిఁ దవిలి వర్తించుచు, భర్తృనిర్బంధంబుఁ బాపికొనఁగ

గీ. నొంది పల్లవసాహాయ్య మొక్కరేయిఁ, గత్తిచేఁ బింగళునితల గత్తరించె
నంతటను బింగళుఁడు యమయాతనలను, గుడిచి గృధ్రంబుగాఁ బుట్టెఁ గడకు నిలను.

క. అరుణయుఁ బతిహింసాగత, దురితమున భగందరంబు దొరకొన దానన్
మరణించి కుడిచి దారుణ, నిరయంబులు తుదకు నిల జనించెను శుకియై. 1010

సీ. చేర నాగృధ్ర మాచిలుకయుఁ బూర్వవా, సనచేత నొక్కకాననమునందె
కడచుటయును గొంతకాల మచ్చట వాని, కొకనాఁడు దివి నేఁగుచుండఁ జిలుక
ప్రాక్తనవైరానుబంధంబుచే గృధ్ర, మాశుకి వెంబడి నరిగి కొట్టె
నంతట నాశుకి యవనిస్థనృకపాల, జలములోఁ బడి ప్రాణములను విడిచె

గీ. దానిఁ గొన వచ్చుచుండ గృధ్రంబు దాని, పైని నొక్కకిరాతుఁడు బాణ మేసె
నంత నాడేగ శుకి పడినట్టికడనె, పతితమై వీడె శుకివోలెఁ బ్రాణములను. 1011

సీ. అంతట యమదూత లరుదెంచి వానిని, గాలపాశములచేఁ గట్టివైచి
కొనిపోయి వైవస్వతునికడ నిలుపంగఁ, దత్పుణ్యపాపముల్ దండధరుఁడు
ధ్యానయోగంబుచే దర్శించి పొండు మీ, యిష్టలోకములకు నిపుడె యనియె
నంతట విస్మయం బంది శుకీగృధ్ర, ములు సమవర్తికిఁ జలిపి ప్రణతి

గీ. స్వామి పాపాత్ములకు మాకు సంఘటిల్ల, నిష్టలోకంబులు నిదాన మేమొ చెపుమ
నావుడుఁ గృతాంతుఁ డధికసన్మానబుద్ధి, యేర్పడఁగ వానియెడలఁ దా నిట్టు లనియె.

సీ. మున్ను గంగాతటంబున నుండె వటు వను, బ్రాహ్మణుం డొక్కఁడు బ్రహ్మవేత్త
యతఁడు గీతాపంచమాధ్యాయపఠనంబు, గావించుచును సర్వకాలమందు
నొకనాఁడు కాయంబు నుడిగి కాలవశంబు, నను సనాతనధామమునకుఁ జేరె
నంతట నొకచోట నతని కపాలంబు, పడియుండఁ దద్గతాంభస్సునందుఁ

గీ. బడి యసుత్యాగ మొనరించుభాగ్య మొదవి, నందునను మీకుఁ దత్పుణ్య మొందఁగలిగె
ననుచు నాయండజంబులు చనియె దివ్య, యానముల నెక్కి హరిసన్నిధానమునకు.

ఆ. కాన గీతలోనఁ గలపంచమాధ్యాయ, మునఁ గలట్టిమహిమమును వచింప
వలని గాదు బ్రహ్మకైనను శ్రీకంఠ, నింతకంటె నధిక మేమిచెప్ప. 1014

—: గీతాషష్ఠాధ్యాయమాహాత్మ్యము :—

సీ. గోదావరీతీరమునఁ గలదు ప్రతిష్ఠాన, మనుపురం బొక్కటి యవనియందుఁ
బిప్పలేశుం డనుపేర నీశ్వరలింగ, మొక్కటి యచ్చోట నుద్భవించె
నచట జానశ్రుతి యనుఱేఁ డొకం డుండె, ధర్మానుపాలనతత్పరుండు
తత్కీర్తి వ్యాపించ దశదిక్కులను నొక్క, దినమున హంసలు దివినిఁ జనుచుఁ
గీ. బ్రహ్మకెల్లజానశ్రుతిప్రాభవంబు, చూచి కొన్ని నుతింపఁగ జోద్యముగను
నందొకండును హేయమ్ముగా నభినుతింపఁ, బోడఁగె మఱికొన్ని రైక్వునిదొడ్డతనము.
సీ. అప్పుడు జానశ్రుతి యామాటలను సౌధ, మున నుండి విని శీఘ్రముగను డిగ్గి
రైక్వునిఁ దోడ్కొని రమ్మని సారథి, కాన తియ్యఁగ నాతఁ డాజ్ఞ వడసి
కాశీగయాప్రయాగములు కేదారంబు, కొల్లాపురంబును గోమతియును
ద్వారావతియును నోంకార మవంతియు, గోదావరీనర్మదాదినదులఁ
గీ. గ్రమముగను దాఁటి దివ్యరత్నములచేతఁ, గ్రాలుచుండుమాణిక్యేశ్వరాలయంబు
శేఖరంబుగ నున్నకాశ్మీరపురికిఁ, జేరి తత్పురశోభ కచ్చెరువుఁ నొంది. 1016
సీ. అమల మాణిక్యేశ్వరాలయద్వారంబు, నందుఁ గూర్చుండి నిజాంగములను
గోఁకికొనుచును దిక్కులను జూచుచు మహా, నందంబు నొందుచు డెందమందుఁ
గానంగఁబడునొక్కకౌపీనధారిని, వీక్షించి యెఱిఁగి తల్లక్షణముల
నతఁడె రైక్వుఁ డని యాత్మలో నిర్ణయం, బొనరించికొని వానియొద్ద కరిగి
గీ. ప్రణతిఁ గావించి తత్పాదపద్మములకు, స్వామి నీనామ మేమి నీ వేమి చేయఁ
దలఁచి యిచ్చోట నుంటివో తెలుపు మనుడు, నవ్వి రైక్వుఁడు వానియాననముఁ జూచి.
సీ. నను రైక్వుఁ డందురు జనులు నేఁ బరిపూర్ణ, కాముఁడ నెట్టికాంక్షయును లేదు
తెలిసి నాచిత్తవృత్తిని నాకుఁ బరిచర్య, సలిపినవాఁడు తత్ఫలము నొందు
నని యూరకుంటయు నాతనిభావంబు,సారథి గ్రహియించి సత్వరముగఁ
దనరేనియొద్దకుఁ జనుదెంచి రైక్వుని, వృత్తాంత మంతయు విన్నవించె
గీ. నంత జానశ్రుతివసుంధరాధినేత, హర్షమున గోవులను రత్నహారములను
గనకవసనంబులను నుపాయనములుగను, గైకొని రయంబ రైక్వునికడకు నేఁగి.
గీ. ఆమ్మహాత్మున కెరఁగి సాష్టాంగముగను, దాను దెచ్చినవస్తుసంతతుల నెల్ల
నతనికడ నుంప నవి రైక్వుఁ డంటకుండ, నిట్లనియె శూద్ర నాచిత్త మెఱుఁగవైతి.
క. కొని యివి యన్నియు శీఘ్రము, చను మని కోపమునఁ బలుక జానశ్రుతి రై
క్వునిపదములపైఁ బడి ప్రా, ర్థన చేసె క్షమింప స్వాపరాధము నంతన్. 1020
వ. రైక్వుండు సుప్రసన్నవదనుం డగుటయు జానశ్రుతి తదాననంబు నుపలక్షించి సవిన
యంబుగా ని ట్లనియె. 1021

గీ. స్వామి నీ కియలోభభావంబు దేని, గలిగినదియొ వచింపుము కరుణతోడ
నని యడుగ రైక్వుఁ డతని కిట్లనియె రాజ, యడిగితివి గాన వినుము నే నుడువువాఁడ.
క. గీతాషష్ఠాధ్యాయము, ప్రీతిమెయిన్ సతతమును జపించుచు నుంటన్
జేతస్స్మృప్తి ఘటిల్లి ని, రాతంకుఁడ నైతి ననుడు నతఁ డిట్లనియెన్. 1023
క. అనఘ తదధ్యాయము గృప, యొనయంగను నాకుఁ జెప్పు మీవు డని వేఁడం
గను రైక్వుఁ డుపదేశిం, చెను దానిని శిష్యబుద్ధిచే నాతనికిన్. 1024
క. అంతట జానశ్రుతిభూ, కాంతుఁడు తత్ప్రకటనగళితకామక్రోధా
ద్యంతశ్శాత్రవుఁ డై కడు, సంతసమున నొందె మోక్షసామ్రాజ్యంబున్. 1025
సీ. అంత రైక్వుఁడు తదధ్యాయంబు జపియించు, చుండంగ మునువోలె నొక్కనాఁడు
చనుదెంచి హంసవేషములతో నమరులు, వరదానకాంక్షచే వానికడకు
నిష్కాముఁ డైనవానిని జూచి విస్మితా, తరు లయి చనిరి స్వధామమునకుఁ
గొంతకాలంబు రైక్వుం డావిధంబునఁ, గడపి విజ్ఞానయోగంబుచేత
గీ. నొడలు విడనాడి స్వేచ్ఛచే నొక్కనాఁడు, లీన మయ్యె మహేశుని మేనిలోనఁ
గాన నేను దదధ్యాయఘనత యిట్టి, దని వచింపంగఁ జాల యథార్థముగను. 1026

—: గీతా సప్తమాధ్యాయ మాహాత్మ్యము :—

సీ. మున్ను పాటలిపుత్రమున నుండె శంకుక, ర్ణుండు నా నొకభూసురుండు ధరను
నాతఁడు విడిచి బ్రాహ్మణధర్మమును వణి, గ్వృత్తిచే మిగుల నార్జించి ధనము
కావించుకొనఁగ నాల్గవపెండ్లి యొకనాఁడు, బంధుసంతతితోడ బయలుదేఱి
యరుగుచు మార్గమధ్యంబున నొకయూర, శయనించి రేయి జా మయినకతనఁ
గీ. గాలవశమున నొకపాము కాటు వైవ, నచటఁ బడి చచ్చి యాత్మకృతాఘమునను
వ్యాళ మై తాను నిధి నుంచినట్టికడను, బుట్ట నిర్మించుకొని చేరె పుట్టలోన. 1027
సీ. ఒకనాఁటిరాతిరి స్వకుమారులకు స్వప్న, మందుఁ గానఁబడి వ్యాళముగనె
తనకుఁ గల్గినయవస్థయును దా నుండిన, తావును దెలిపి నాతండ్రులార
న న్నుద్ధరింపుఁడు నాకు మీకంటెను, దిక్కు లే దని యేఁగఁ దెల్లవాఱె
నంత వారలు లేచి యన్యోన్యమును స్వప్న, కథ చెప్పికొనుచుండుకాలమందు
గీ. జ్యేష్ఠుఁడు తరింపఁజేయుద మితని ననియె, మధ్యముఁడు చంపి ఫణిని హేమంబుఁ గొంద
మనియెను గనిష్ఠుఁ డహా వైతె యయ్యొ యనుచుఁ, గాలువలు గట్టె కన్నీరు గాఱ నేత్ర.
సీ. అంతట నాదినం బరుగంగ నారేయి, మధ్యయామంబున మధ్యముండు
తెలియకుండఁగ సోదరుల కుత్సితుం డయి, పడఁతితోడను బుట్టకడకుఁ బోయి
త్రవ్వుచుండఁగఁ బుట్ట ద్రవ్యాశచేఁ దన, పూఁబోఁడి మన్నెత్తిపోయఁ దొడఁగె
నప్పుడు లోనుండియాశీవిషంబు కో, పంబుచే బుసతోడఁ బైకి వచ్చి
గీ. యుద్ధత యెవండ వీవు నే నుండుపుట్ట, త్రవ్వఁ బనియేమి చెపు మనఁ దండ్రి నేను
నీసుతుండను శివుఁడను నిధినిఁ గొనఁగఁ, ద్రవ్వుచున్నాఁడఁ బుట్టను దప్పికొనుము.

గీ. అనుటయు నా పలికి నిట్లనియె వత్స, నిక్కముగ నాత్మజుండ వైన నీవు నాకు
నన్నుఁ గావఁ గీతాశ్లోకజప్యంబునుండి, కొనుము నేఁ గష్టపడి గడించినధనంబు. 1030

చ. అనుడు నిప్పుడు చిత్తమునయం గొడవక గృహ దంపశూకముల్
గొనుఁగొని చంద్రికి నీకుఁ దరణంబు ఘటిల్లెడికార్య మేది యై
నను గిల దేని తప్పక యొనర్చెదఁ ద్వచ్చరణంబులాన పే
ర్కొనుము మని వేఁడ ని ట్లనియె గూఢపదంబు ప్రహర్ష మొందుచున్. 1031

గీ. తనయ గీతలోఁ దసరారుస ప్తమా, ధ్యాయమును జపించునట్టిద్విజుని
శ్రాద్ధభో క్తఁ జేసి శ్రాద్ధంబు వెట్టుండు, కలుగు ము క్తి దానివలన నాకు. 1032

క. అని సుతువుటయును నాతని, తనయులు తత్ప్రోక్తరీతిఁ దచ్ఛ్రాద్ధంబున్
బొనరింప శంకుకర్ణుం, డనిమిషతను నొందె నుడిగి యహిరూపంబున్. 1033

గీ. అంత నాతనిసుతులు పిత్రార్జితార్థ, మంతయును గూడ ధర్మకార్యములకొఱకు
వ్యయము గావించి తుదిఁ దదధ్యాయజపము, వలనఁ జెందిరి పరమకైవల్యపదము.

—: గీతాష్టమాధ్యాయ మాహాత్మ్యము :—

సీ. అమర్దకం బనుపట్టపురం బుండె, దక్షిణాపథమున ధాత్రి నొకటి
యం దుండె భావశర్మాభిధానుం డైన, బ్రాహ్మణుం డొకఁడు ధర్మచ్యుతుండు
తాళాసవంబు నాతఁడు ద్రావి యొకనాఁడు, కంఠపర్యంతము కాయ ముడిగి
స్వకృతకర్మంబున జన్మించి తాళ మై, యొందుచుండఁగ వృద్ధి నొక్కచోట

గీ. నచ్చటికి వచ్చిరి కుశీబలాఖ్యుఁ డైన, బ్రాహ్మణుండును గుమతి నాఁబడుతదీయ
భార్యయును విశ్రమింపంగ బ్రహ్మరాక్ష, సాకృతులతోడఁ దిరుగుచు నవని నెల్ల.

సీ. అట్లు వచ్చి వసించి రాచెట్టుక్రింద వా, రాఁకలి దప్పియు నార్తిగొలుప
నప్పుడు కుమతి యి ట్లనియె దుర్దానముల్, పట్టి సంపాదించినట్టిధనము
పాత్రదత్తము గామి బ్రహ్మరాక్షసజన్మ, ముభయులకును గూడ నొదవె మనకు
నీనిందితజన్మ మేనాఁటి కై నను, దొలఁగెడిమార్గంబు గలదె నాథ

గీ. యనుటయుఁ గుశీబలుం డిట్టు లనియెఁ దన్వి, యీశరీరంబు ఘోరదుష్కృతమువలనఁ
బ్రాప్త మగుటను బ్రహ్మకర్మములఁగూర్చి, చేసెడివిచారమునఁ దప్పఁ బాసిపోదు.

వ. అని పలుకుటయు "కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ" యను
గీతాష్టమాధ్యాయార్ధశ్లోకంబు కుమతినోట దైవికంబుగా నిస్సృతం బయ్యె. 1037

గీ. తచ్ఛ్రవణమాత్రమునఁ బడి తాళవృక్ష, మవనిపైఁ బూర్వదేహంబు నధిగమించె
నవల నాదంపతులు రాక్షసాకృతులను, బాసి నిలిచిరి దివ్యరూపములతోడ. 1038

గీ. అప్పు డాకాశమునుండి యరుగుదెంచి, తద్గణము దివ్యయాన మాదంపతులను
దోడుకొని పోయి నిలుప నింద్రునకు నెదుట, వారలను నిల్చె దివమున వాసవుండు.

వ. అది యట్లుండ భావశర్మ తదర్ధశ్లోకంబు వ్రాసికొని వారాణసికి నేఁగి భాగీరథీతీరం
బున నుపవిష్టుం డై దానిని జపియింపందొడంగె. 1040

గీ. ఆజపంబున కే నంతరంగమందుఁ, బరమసంతోషమును బొంది భావశర్మ
కప్రనరాష్ట్రైక ర మయినట్టిపదము, నిచ్చినాఁడను నింక నీ కేమిచెప్ప. 1041

—: గీతానవమాధ్యాయమాహాత్మ్యము :—

ఆ. రమణి సర్వదాతలమున మాహిష్మతి, యనెడినగరి యుండె నందుఁ గలఁడు
మాధవుండను నాఁగ మహిదేవుఁ డొక్కఁడు, క్రతువిధానబద్ధకంకణుండు. 1042

సీ. ఆవిప్రు డొకతఱి నధ్వరం బొనరింప, సంకల్ప మొనరించి సమితిలోన
యూపంబునకుఁ గట్టి యొక్కఛాగమును ద, ద్విశసనంబునకు యత్నించుచుండ
నట్టహాస మొనర్చి యాఛాగ మిట్లనె, మనుజవాక్కునను విస్మయము గలుగ
బ్రాహ్మణోత్తమ నశ్వరఫలంబునకును నీ, వాసించి హింస చేయంగ నగునె
గీ. జన్మమృత్యుజరాదుఃఖసంక్షయంబు, గలుగఁజేయఁగఁజాలనిక్రతువు లేల
తెలివితక్కువచే నేను సలిపి యిట్లు, మును సవంబుల హీనజన్ముండ నైతి. 1043

క. అనవుడుఁ దద్వాక్యములను, విని యజ్వ మనంబు నందు విస్మయ మొదవం
గను దానిఁ జూచి ఛాగమ, వినిపింపుము నీచరిత్ర విశదము గాఁగన్. 1044

సీ. అనవుడు ఛాగ మి ట్లనియెఁ బూర్వము నేను, బుట్టి బ్రాహ్మణుఁడుగాఁ బుడమియందుఁ
జదివి వేదములను శ్రద్ధాయుతుండ నై, సలుపుచు వేదోక్తసత్క్రియలను
నక్షీణఫల మేవొ ప్రక్షీణఫల మేదొ, యనువిమర్శంబు లేనట్టికతన
నొకతఱి యజ్ఞంబు నొనరించుచును నందు, ఛాగవిశసనము సలుపు చుండఁ
గీ. గాంచి యది దానిజనయిత్రి కన్నునీరు, గార్చుచును బ్రాహ్మణాధమ తాత్మతలమున
నీచయోనులలోన జన్మింపు మనుచుఁ, దిట్టె నను నేను జేయుచున్నట్టిపనికి. 1045

సీ. అంతటఁ గపియోనియందు నే జన్మించి, యొకనాఁడు మత్పాపయోగమునను
నాహితుండికునిచే నాకస్మికంబుగా, బంధింపఁబడి వీడి బాంధవులను
జని వానివెంట నాతనిశిక్షచేత నా, ట్యము సేయువిధమును నభ్యసించి
తిరుగుచుంటిని వాఁడు త్రిప్పువోటుల కెల్లఁ, జేయుచు నాట్యంబు చిత్రముగను
గీ. నట్టు లుండంగ నొకదినమందు నేను, దరువులం దుండి చూచునాతరుణిసుతులఁ
గాంచుచును నాట్యమును దప్పుగా నొనర్పఁ, గఱ్ఱచేఁ గొట్టె వాఁడు నాపుఱ్ఱె పగుల.

ఆ. చేష్ట లుడిగి యపుడు క్షితిమీఁదఁ బడి ప్రాణ, ములను విడిచి నేను బుట్టి శునక
గర్భమందు నన్నకణ మేని దొరకమి, క్షుద్భరంబు నాఁపికొనఁగలేక. 1047

ఆ. తిరిగి తిరిగి దిమ్మదిరుగంగఁ గొంపకొం, పకును గొట్లు గొట్ట బాధపడుచు
నంతమునకు నాగృహంబులోనికిఁ బోయి, దూఱి వంటయింట దొంగవోలె. 1048

క. పాత్రస్థ మైనయన్నము, నాత్రముతోఁ దినుచునుండ నాధ్వని విని నా
పుత్రులు నాభార్యయు మ, న్గాత్రము విఱుగంగఁ గొట్ట దండంబులచేన్. 1049

గీ. ...ఁ బడి నేను మృతిఁ బొంది యవలనొక్క, కౌశికునియింట హాయముగా సంభవించి
చేయఁగాలయాపకాలము చేసి పనులు, వార్ధకము నొంది నేఁ డింక వ్యర్థ మనుచు.
క. నను కౌండిన్యుఁడు విక్రయ, మొనరింపఁగ రథ్యలోన నుసుప మదీయాం
గన యల్పద్రవ్యమునకుఁ, గొని యింటికి నన్నుఁ దోలుకొనిపోయి వెసన్. 1051
గీ. ఆత్మజులతోడ ద్వారకాయాత్ర కేఁగ, దలఁచి నావీఁపుఁ గూర్చుండి తాను సుతులుఁ
దోలఁగను నన్ను బడలికతోడ నేను, వారలను మోచికొని కొంతవఱకుఁ బోయి.
గీ. హాహా మగుటను మార్గమధ్యమున జలముఁ, ద్రావఁగా నెంచి యొక్క హ్రదంబుఁ జొచ్చి
త్రాఁపి సలిలంబు దానికర్దమములోనఁ, గాళ్లు దిగఁబడ నిలుచుంటిఁ గదలలేక. 1053
ఆ. అపుడు నన్నుఁ గొట్టి రదయంబుగను సతీ, సుతులు దాన నేను సొలసి యందె
పడి పరిత్యజించి ప్రాణంబులను ఖాగ, యోనియందు జన్మ మొందినాఁడ. 1054
సీ. మఱియొక కథను నీ కెఱిఁగించెదను విను, మాశ్చర్యకర మగునట్టిదాని
మున్ను కురుక్షేత్రమున నుండె సూర్యవం, శ్యుఁడు చంద్రవర్మ నా నొకనృపుండు
ప్రాప్తింప నొకదినమందు సూర్యోపరా, గంబు తత్పుణ్యకాలంబునందుఁ
గావింపఁగా నెంచి కాలపురుషదాన, మాతఁడు పిలిపించి యనునిసురుల
గీ. దానమును బుచ్చుకొనియెడిధైర్యశాలు, లెవ్వ రైనను గలరేని యిందుఁ దెలుపుఁ
డనుడు నొకబ్రాహ్మణుండు ధరాధినాథ, యెట్టిదానంబు నైనను నాకీయు మనియె.
గీ. అంతటను ఱేఁడు బంధుసమన్వితముగ, స్నాన మొనరింపఁగాఁ బుణ్యనదికిఁ జనియె
నప్పు డాకాలపురుషుఁ డిట్లనియె నట్ల, పోన మొనరించి ద్విజు లెల్ల నాలకింప.
ఆ. వెఱ్ఱిబ్రాహ్మణుండ విప్రుఁ డెవ్వం డైనఁ, బూనుకొనునె యిట్టిదానమునకు
ద్రవ్యలోభమునను దనువును జేసేత, యమున కొప్పగించునట్టిఁ డున్నె. 1057
క. అనవుడుఁ దద్వాక్యంబులు, విని బ్రాహ్మణుఁ డిట్టు లనియె విప్రుఁ డశేషా
ఘనివారణదక్షుఁడు వా, నిని జెనకం దరమె ఫాలనేత్రున కైనన్. 1058
వ. అని ధైర్యంబునం బలుకుటయుఁ గాలపురుషుం డూరకుండె. 1059
సీ. అంతట స్నాతుఁ డై యవనీశ్వరుఁడు వచ్చి, ఋత్విజులకు సమస్కరించి
దానంబు గైకొనుధరణీసురుని నుప, విష్టునిఁ గావించి విస్తరమునఁ
గల్పోక్తరీతిని గాలపురుషదాన, మొసరింప దానిఁ గైకొనియె ద్విజుఁడు
కైకొన్నవెంటనె కడువిస్మయంబుగాఁ, గాలపురుషమూర్తి గర్భ మగలి
గీ. దానిలోనుండి యొక్కమాతంగుఁ డొక్క, శ్వపచతరుణియుఁ బ్రభవించి సంహరింప
దానమును గొన్నవిప్రుని దరియ నతఁడు, గజగజవడంకుస్వప్రతీకములఁ జూచి. 1060
క. గీతానవమాధ్యాయముఁ, జేతమున జపింపఁదొడఁగె శీఘ్రము యంతన్
మాతంగీమాతంగులు, భీతిన్ బరువిడిరి పరితపించుచు నెదలన్. 1061
గీ. అప్పు డదియెల్లఁ జూచి ప్రత్యక్షముగను, నచ్చెరువు నొంది ప్రభువు బ్రాహ్మణునిఁ గాంచి
స్వామి యెటు దాటితివి విపత్సాగరంబుఁ, జరుపులిడుపీర లెవరో యేర్పడఁగఁ జెపుమ.

సీ. అని వేఁడుటయును ని ట్లనియె నావిప్రుండు, జననాథ నీయొనర్చినయఘంబు
చండాలుఁడగుచు నీచలిపినపరనింద, చండాలి యగుచు నక్ సంహరింప
నరుదేర దరికి నే నపుడు గీతానవ, మాధ్యాయజపము చేయంగఁదొడఁగ
వార లిచ్చట నిలువంగఁజాలక పరు, విడిరి తాపము వృట్ట నొడళులందు
గీ. నని నుడువ భూవరుఁడు తదధ్యాయమహిమ,మునకు నాశ్చర్యమునుజెందిమనమునందుఁ
దదుపదేశంబు నొంది యాతనినమక్షు, మందు జపియించుచును దాని నొందె ముక్తి.
గీ. విప్రతనువున నేను గావించినట్టి, శ్రేయమున జాతిసంస్కృతి చేకఁజుటను
తెలుపఁగలిగితి నిట్లు లాక్ష్మీయచరిత, మనుడు మాధవుఁడు వివేక మామతిల్ల.
వ. అప్పురంబు నుజ్జగించి గీతానవమాధ్యాయపఠనంబు గావించుచు మోక్షసామ్రాజ్యముం బడసె. భాగంబును దదధ్యాయశ్రవణంబున జన్మరాహిత్యముం బొందె. 1065

—: గీ తా ద శ మా ధ్యా య మా హా త్మ్య ము :—

సీ. మున్ను కాశీపురంబున విప్రుఁ డొకఁ డుండెఁ, దత్త్వానుచింతనతత్పరుండు
నానాగ్రహిన్యస్తనయనుఁ డధోస్మీలి, తాత్ముఁడు సంతతాహ్లాదయుతుఁడు
త్రిపురాంతకద్వారదేహళీసంస్థుఁ డా, తనికి నిత్యమును సదాశివుండు
హస్తావలంబంబు నతిగౌరవంబునఁ, గరుణించు చుండ భృంగిరిటి చూచి
గీ. దేవ యీతం డెవఁడు నీదివ్యకృపకు, నుత్కటంబుగఁ బాత్రుఁ డై యున్నవాఁడు
వీనిమహిమంబు విన నాకు వేడ్క యయ్యెఁ, జెప్పు మని వేఁడ హరుఁ డిట్లు చెప్పదొడఁగె.
సీ. గణనాథ వినుము నేఁ గైలాసపార్శ్వంబు, నను నుండుపున్నాగవనమునందు
మాణిక్యవేదికామధ్యంబునం దుప, విష్టుండ నై యున్నవేళయందు
వీవంగ నొకచండవిషమవాయువు దాని, వెంబడి నొక్కఘోషంబు గలిగె
దానివెంటన తమోధరణీధరమువోలె, ఛిన్నపక్షం బై నశిఖరివోలె
గీ. నాకసమునుండి పడి యొకయండజంబు, పొరలుచును భూమిమీఁద నాదరికి వచ్చి
ప్రణతి యొనరించి యమ్లానపద్మ మొకటి, నాపదంబులపై నుంచి నను నుతించె.
ఆ. అపుడు నేను జూచి యాఖగంబును బత్త్రి, యెవరు నీవు కార్య మేమి యిటకు
రాఁగ నీకు ననుడుఁ బ్రశ్రయానతగళ, మగుచు నిట్లు లనియె నాఖగంబు. 1068
సీ. చంద్రశేఖర నేను జతురాననునిహంస, నధికపాండుచ్ఛాయ నలరుదాన
నరుదెంచి మానసహ్రదమున కొక్కఁడి, నమున నందలిబిసనాళములను
భక్షించి తృప్తిగా బ్రహ్మయొద్దకుఁ బోవ, నెగిరి వ్యోమమున క దేమొ కాని
వెంటనె పడి పృథివీస్థలంబునఁ జేష్ట, దప్పి శీతలమారుతంబువలనఁ
గీ. బడసి సంజ్ఞను నెట్లొ తత్పతనమునకు, హేతు వేమియొ యని మది నెంచు చుండఁ
గాళిమం బేరుపడియెను గాయమందు, దీనిఁ గనుఁగొని మిగుల జింతించు చుండ.
గీ. అప్పుడు ప్రాంతంబులోనుండి హంస చింత, పడఁగ నేటికిఁ దావకపతనకాల్య
ములకు నుండెడిహేతువు దెలుపుదాన, ననెడుమాట వినంబడె నద్భుతముగ. 1070

గీ. అంతఁ గనఁబడె నాకసమునఁ గనక, వసనులు చతుర్భుజులు వారివాహనీల
కాయులు గదాబ్జశంఖచక్రాయుధులును, నై షష్టిసహస్రసంఖ్యాకసురలు. 1071
గీ. అప్పుడు ప్రణామమును వారి కాచరించి, నేను మత్పాతనైల్యనిదాన మరయఁ
జింతిలుచు నుండఁ దత్స్వరస్థితిని జెంది, నట్టిపద్మిని ననుఁగూర్చి యిట్టు లనియె. 1072
సీ. కలహంస మస్వోలంఘనము సేసి నభంబు, నకు నీవు చనినపాతకమువలనఁ
బాతనైల్యములు సంప్రాప్తించె నీకుఁ ద్వ, త్పతనంబు గాంచినతత్క్షణంబ
మూర్ఛిని నాగంధమును విష్ణుపదమున, కరిగెను భ్రమరంబు లమరు లగుచు
నీకు వ్యోమమునఁ గాన్పించినపురుషు లా, తేఁటులె యని నీవు తెలిసికొనుము
గీ. వార లుదయించి మానికుమారులుగను, జనినసప్తమజన్మంబునను దపంబు
సలిపి యీహ్రదతీరదేశమున నొక్క, యప్సరోంగనగానంబు నాలకించి. 1073
క. దానను మనములు చెదరుట, నీనెలఁతను గొందు నేనె యేనె యటంచున్
మానుగ నన్యోన్యము గను, గానక కొట్టుకొని చచ్చి కని దుర్గతులన్. 1074
ఆ. పుట్టి కడకు శరభములుగ శ్వాపదములఁ జంపుచును నిరంకుశముగ దావ
దహనమునను జచ్చి దంతు లై జనియించి, పాంథజనుల నెల్ల బాధపెట్టి. 1075
గీ. విపినమునఁ ద్రావి చివరకు విషజలంబు, మరణమును బొంది క్రమముగా ఖరమహాంగ
వృకబిడాలంబు లై జనియించి తుదకు, షట్పదము లయి చేరి రీస్థానమునకు. 1076
వ. యింక నావృత్తాంతముం జెప్పెద వినుము. 1077
సీ. ఈజన్మమునకు మున్నేను ద్వితీయజ, న్మమునఁ గన్యక నయి తామ్రాసురునకు
నుదయ మొంది సరోజవదనాహ్వయముతోడఁ, బరగి పాతివ్రత్యనిరత నగుచు
నొకతఱి నొక్క సారికకు మాటలు నేర్పు, చుండంగ నావల్లభుండు చూచి
సారిక వగు మని శపియింప సారిక, నై మదాచరితపుణ్యంబువలనఁ
గీ. బుట్టి యొకమునియింటఁ దత్పుత్రి పెంపఁ, జెందుచును వృద్ధి గీతలోఁ జెప్పఁబడిన
పదనయధ్యాయ మమ్మునిప్రతిదినంబుఁ, జదువుచుండంగ విను నదృష్టమును గంటి.
వ. తచ్ఛ్రవణమహిమంబుచేఁ గొలఁదికాలంబులోన సారికాశరీరంబు విడిచి పద్మావతి
యనునచ్చర నై పద్మాసఖీత్వంబు నొంది వైకుంఠంబు నధివసించి యనవధికసుఖంబు
లనుభవించి యొకనాఁడు విమానంబు నెక్కి నభోమార్గంబున నేగుచు మనోజ్ఞం
బగునీసరోవరముం జూచి దిగి యిందు జలక్రీడ గావించు చుండ దైవికంబుగా
దుర్వాసుం డరుదెంచి వివస్త్ర నగునన్ను వీక్షింప నేను భయగ్రస్త నై పాదద్వ
యంబు పద్మద్వయంబు గాహస్తద్వయంబు పద్మద్వయంబు గా ముఖంబేకపద్మంబు గాఁ
బంచపద్మ యగుపద్మిని నై యొదిగి యుంటి. 1079
గీ. అపుడు దుర్వాసుఁ డాగ్రహం బామతిల్లఁ, బద్మినీరూపమున శతాబ్దములవఱకు
నిందె యుండంగ నను శపియించి చనియె, నదియె మొదలుగ నుంటి నీహ్రదమునందు.

వ. గీతావిభూత్యధ్యాయశ్రవణప్రభావంబునంజేసి పూర్వజన్మస్మృతియును మహత్త్వం
బును నన్నెడఁబాయ వయ్యె. మద్విలంఘనంబున నీకుఁ బతనంబును శరీరనైల్యంబును
నేర్పడియె. తదధ్యాయమాహాత్మ్యంబు నేఁడు నీకు వినిపించుటచే నాకు శాపవిముక్తి
కాలంబు ప్రాప్తించె. నీ పితామరసంబు నీశ్వరున కుపాయనంబుగా సమర్పించి తద
ధ్యాయమాహాత్మ్యశ్రవణఫలంబుగా మోక్షార్హజన్మంబు నొంది యీశ్వరానుగ్రహ
పాత్రం బగుదువుగాక యని వాక్రుచ్చి నా కీపద్మంబు నొసంగి. 1081

క. అచ్చర యై తాఁ జనియె వి, యచ్చరమార్గమున దివికి నాపద్మము నీ
కిచ్చితి ననుచు స్వదేహము, నచ్చెరువుగ విడిచె నాసమక్షమునందున్. 1082

గీ. అనుటయును భృంగిరిటి విస్మయమున దేవ, బ్రహ్మహంస మెవండొ ప్రాగ్భవమునందుఁ
దచ్చరిత్రంబు విన నాకు నిచ్చ పొడమెఁ, నాన తి మ్మన నతని కిట్లనియె హరుఁడు.

సీ. వినిచెద గణనాథ విను మామరాళంబు, ప్రాక్తనభవమున బ్రాహ్మణునకు
సుతపుం డనెడిపేర సుతుఁ డయి జన్మించి, చరియించుచును బ్రహ్మచర్యమునను
శయనించి యుండంగ శయ్యమీఁద గురుండు, తాను నిద్రాదశాధీనుఁ డగుటఁ
దచ్ఛయ్యను స్పృశించెఁ దనపాదమున దానఁ, బ్రాప్త మయ్యెను మహాపాతకంబు

గీ. దానఁ దిర్యక్త్వమును నొంది తాను వినుట, నబ్జినీముఖమునఁ దదధ్యాయమహిమ
విడిచి నాకడ దేహంబు పుడమిలోన, సంభవము నొందె విప్రవంశంబునందు. 1084

సీ. అతఁడె యీతఁడు పూర్వమందు గీతాదశ, మాధ్యాయమును వినినందువలనఁ
దద్వాసనను జేసి తనువును మఱచి త, చ్చింతనాసక్తుఁ డై సంతతమును
భువనపరాఙ్ముఖభూతుఁ డై చూచుచు, హరిని నంతర్యామి యైనవాని
నానందమున నోలలాడు చుండంగ నా, వీఁటికి వీని రావించుకొంటి

గీ. నెవరిపైఁ బ్రసరించునో యితనిదృష్టి, వారు మోక్షంబు నొందెడివార దాన
వీనిమహిమంబు నెఱుఁగుట నేను వీని, కెపుడును గరావలంబన మిచ్చుచుందు. 1085

వ. అని చెప్పుటయును భృంగిరిటి విస్మయంబు నొంది యది మొదలుగ విభూత్య
ధ్యాయంబు పఠింపం దొడంగె. 1086

క. కాన విభూత్యధ్యాయము, నానాపాతకవినాశనము చేసి యశే
షానందమూల మగు బ్ర, హ్మానందము గలుగఁజేయు నధ్యేతలకున్. 1087

—: గీతైకాదశాధ్యాయమాహాత్మ్యము :—

సీ. మును ప్రణీతాతటంబునను మేఘంకరం, బనియెడినగర మొం డవని నుండె
నచట సునందాఖ్యుఁ డగువిప్రుఁ డొకఁ డుండె, నతఁడు నిష్కాముఁ డై యనుదినంబు
సలిపి స్నానంబు మేఖల యనుతీర్థంబు, నను నారసింహదర్శనము సేసి
పఠియించు చుండుటఁ బారాయణము గ గీ, తైకాదశాధ్యాయ మేకభక్తి

గీ. సకలదుఃఖవిముక్తుఁ డై యొకదినంబు, నందు గోదావరీతీర్థయాత్ర సేయఁ
బ్రస్థితుం డయి విరజతీర్థమును జేరి, చేసి స్నానంబు నచటఁ బూజించి రమను. 1088

వ. అంతట కపిలాసంగమంబుం జేరి తా రాతీర్థంబున స్నానం బొనరించి పిదప నష్టతీర్థంబునఁ బిత్రుతర్పణంబు సేసి కపిలాద్వారమునఁ కరిగి యచ్చట స్నాతుం డై మధుసూదనుని దర్శించి యా రేయి నందుండి ప్రాతఃకాలంబున నరసింహవనతీర్థంబున రామదీర్ఘిక యందు మునింగి ప్రహ్లాదపూజితుం డగు నృసింహుని దర్శించి యచ్చటనుండి యంబికాపురి కరిగి వాంఛితార్థప్రదాయిని యగు నంబిక నర్చించి యవలఁ గరస్థానపురంబునకుం జేరి యచ్చట సద్వయరూపిణియు ననాహతమహానాదమయియును యోగిరాజహృదంభోజరాజహంసియును నగు మహాలక్ష్మిని బూజించి పిదప వివాహమండపపురముం జేరి యందు శయనించుటకు నేగృహంబునందును స్థానంబు లభింపక తిరుగుచుండ గ్రామపాలునిచే నొక్క విశాలమందిరంబు చూపింపంబడియె. 1089

గీ. అంత నా బ్రాహ్మణుం డా గృహంబునందుఁ, బండుకొని రాత్రి యెల్ల నిర్భయము గాఁగ
నుదయమున లేచి పోవుచు నున్న యతని, గ్రామపాలుఁడు చూచి యాభూమిసురుని.

చ. అనఘ నినుం గనుంగొనఁగ నప్రతిమానుఁడ వంచుఁ దోఁచె నా
మనమునకుం భవాదృశులు మాపు లభించుట యన్న మాపురా
తనసుకృతప్రభావమె హితంబును మా కొనరింపు మీపురం
బున నివసించి కొన్ని దినముల్ దయతోడ నటంచు వేఁడఁగన్. 1091

క. ఆ వేఁడికోలునకు భూ, దేవుం డంగీకరింప దినదినమును ద
త్సేవను గ్రామాధీశుఁడు, గావించుచు నొక్క నాఁడు కనుగొని యతనిన్. 1092

గీ. స్వామి యాలింపు మొక్క విజ్ఞాపనంబు, నీపురంబున కొక్కదైత్యుఁ డేగుదెంచి
మున్ను భక్షించుచుండ నిం దున్న జనుల, నపుడు పూర్వికు లాతని నాశ్రయించి.

వ. ప్రతిదినంబును రాత్రికాలంబునఁ బురమందిరంబునం దతనికి నరగ్రాసంబు నొసంగునట్లును నాతండు నగరప్రజల భక్షింపకుండునట్లును సమయంబు గావించిరి. 1094

సీ. అది మొదలుగఁ బాంథు లగువారలను గ్రామ, పాలకుం డగువాఁడు ప్రతిదినంబు
శయనించుటకు రాత్రిసమయంబునందును, బంపుచుండఁగఁ బురభవనమునకు
నా రాక్షసుఁడు వారి నారగించుచు నుండె, నరిగె నట్టులె కొన్ని హాయనములు
దైవికంబుగను మత్తనయమిత్రుఁ డొకండు, చనుదేర నిట నొక్క దినమునందు

గీ. వాని నారాత్రి పనిచితి నేను నగర, భవనమున కయ్యది మదాత్మభవుఁ డెఱింగి
వానిఁ గొని రాఁగఁ జని పురావసథమునకు, భక్షితుం డయ్యె నా క్రవ్యభక్షిచేత.

ఆ. అంత నే నెఱింగి యావార్త దైత్యుని, దరికిఁ బోయి యెడ్చి దానవేంద్ర
న్యాయ మగునె నీకు నా కుమారుని మ్రింగ, మఱచిపోతి వేమొ మదుపకృతిని. 1096

వ. అని పలుకుటయు నా రాత్రించరుం డి ట్లనియె. 1097

సీ. అకట నే నెఱుంగక యారగించితి భవ, త్తనయునిఁ బాంథసంతతులతోడ
నుపకారి కుపకార మొనరింపకున్నను, నపకార మొనరించునతఁడు హతుఁడు

నేను గృతఘ్నుఁడఁగా నొక్క విషయంబు, వినుము చెప్పెద నీకు విశదముగను
బఠియించుచుండునో బ్రాహ్మణుం డెవఁడు గీ, తైకాదశాధ్యాయ మెప్పుడుం గూడ
గీ. సతతుఁడు మహాసేయుఁ డతని నే నంటఁజాల, నమ్మహాత్ముఁడు మంత్రించినట్టి జలముఁ
జల్ల నాపైని నాకగు శాపముక్తి, యబ్బు మద్భుక్తజనులకు హరిపదంబు. 1098
గీ. అనుడు నే నిట్టు లంటి నిశాట నీకు, శాపమేకారణంబున సంభవించె
నట్టిమాహాత్మ్యమును దదధ్యాయమునకు, నెట్లు చేకూరె ననఁగ వాఁ డిట్టు లనియె.
ఆ. వినుము గ్రామపాల వినిచెద నీవిట, నుండె నొక్క బ్రాహ్మణుండు మున్ను
వాఁడు స్వకులవృత్తివలన జీవింపఁగఁ, బాలకునికిఁ గృషిని జలుపఁదొడఁగె. 1100
సీ. ఆవిధిఁ గృషివృత్తి నాశ్రయించి యతండు, శాలిసంరక్షణాసక్తుఁ డగుచు
నొకనాఁడు పొలములో నుండఁ దన్మార్గంబు, నను యొక్క పాంథుఁడు చనుచునుండ
నాతని నొకగృధ్ర మారగింపఁగ నెంచి, చంపుచుండంగ దత్సమయమందుఁ
గాంచుచుండియు నన్యకార్యలౌల్యంబున, నాలస్య మొనరింప నవనిసురుఁడు
గీ. చూచి యూహించ నొకతాపసుండు దూర, ధరణి నుండుటఁ బరువెత్తి యరుగుదెంచు
నంతలో గృధ్ర మాతని నాహరించి, చనియె నప్పుడు మౌని యచ్చటికి వచ్చి. 1101
సీ. కనుఁగొని శాలిరక్షకుఁ డైనవిప్రుని, నోరి దుర్బ్రాహ్మణ యోరి పాపి
చోరసర్పాగ్నిశస్త్రానుగృధ్రవిషాంబు, యాతుధానార్దితు లైనజనులఁ
గావ శక్తుం డయ్యుఁ గావకుండినవాఁడు, తద్వధపాపంబుఁ దాను జెందు
దాన దుర్గతులను దా నొంది చివరకు, వృకముగా జనియించుఁ బృథివియందు
గీ. శక్తి లేకున్న నార్తరక్షణమునందు, విడువు మని గట్టిగా నోట నుడివె నేని
యతఁడు వైకుంఠమును బొందు నార్తరక్ష, కేసుకృతకార్యములు గూడ నీడు గావు.
గీ. ఆర్తసంరక్షణమునకై యాత్మతనువు, లెందఱెందఱో విడిచి యోగీంద్రులకును
బొందఁగారానిపదమును బొంది రేల, యబ్బు నీబోటిపాపుల కట్టిపదము. 1103
క. వారణశక్తుఁడ వయ్యును, వారింపక యూరకున్న వాఁడవు నీవా
క్రూరపతత్రినిఁ గరుణా, దూరుఁడ నీ కాఫలంబు తోడనె కలుగున్. 1104
క. అని పలికి రాక్షసుఁడ వై, జనియించెదుగాక యనుచు శాపం బీయం
గనె యాద్విజుఁ డెద నొదవఁగ, ననుతాపము ప్రాలి తాపసాంఘ్రులమీఁదన్. 1105
క. తెలియనికతమున దోషము, సలిపితి మన్నించి మదపచారము నాకున్
దొలఁగింపుము శాపము నని, పలవింపఁగఁ దాపసుఁడు కృపాయుక్తుం డై. 1106
వ. గీతైకాదశాధ్యాయంబు నిత్యంబును బఠియించు బ్రాహ్మణుం డభిమంత్రించి జలంబు
నీపయినిం జల్లిన నీకు శాపవిముక్తియును ద్వద్భక్షితప్రాణివర్గంబునకు వైకుంఠ
మందిరావాసంబునుం జేకూరు నని ప్రసాదించి యంతర్ధానంబు నొందె. 1107

గీ. అంత నాబ్రాహ్మణుండు నిశాటుఁ డయ్యె, నానిశాటుండె నేను నీ వార్తతోడ
నుండుటకు నున్నసందర్భ మున్నయట్లు, చెప్పినాఁడను నీ కేమిచెప్ప నింక. 1108
ఆ. విను మొకంత మఱియు విశ్వరూపాధ్యాయ, మునఁ గలట్టిమహిమమును వచింతు
మును న్గృధ్ర మొకటి ముక్కునఁ గొని యస్థిఖండ మొకటి పోవుచుండ మింట.
గీ. పడియె నాయస్థిఖండంబు పుడమిమీఁద, నొక్కపల్వలమున ముక్కునుండి జాఱి
దానిఁ గన్గొని యొక్కవిజ్ఞాని వచ్చి, యటకు నది తీర్థ మని యెంచి యందు మునిఁగి.
గీ. చేయఁదగుతీర్థవిధులను జేయుచుండ, నచ్చటికి యాత్రికులు కొంద ఱరుగుదెంచి
పూర్వ మీగుంట తీర్థమె ట్లయ్యెఁ దెల్పు, మనుడు నాబ్రాహ్మణుం డిట్టు లానతిచ్చె.
సీ. వినుఁడు యాత్రికులార విశదంబుగను మీకు, వినిచెద నీతీర్థవిషయ మెల్ల
విత్తవంతుం డనువిప్రశ్రుతిగై కొన్న, భూసురుం డొకఁ డుండెఁ బూర్వ మిలను
నతఁడు గీతైకాదశాధ్యాయమును ద్రిసం, ధ్యమును బఠించెడునట్టివాఁడు
దైవికంబుగ నొక్కతఱి నాతఁ డేఁగుచు, నటవీస్థలమున దేహంబు విడిచె
గీ. నప్పు డొకగృధ్ర మాతనియస్థిఖండ, మొకటి కొని యేఁగుచుండంగ నుప్పరమునఁ
బడియె నాముక్కు జాఱి యీపల్వలమున, దాన నిది పుణ్యతీర్థమై తనరె భువిని.
గీ. ఇందు స్నానం బొనర్చిన నెవ్వరేని, పడయుదురు ముక్తి ననుడు నాభక్తులెల్ల
దానిలో స్నాన మొనరించి తత్క్షణంబ, దివ్యరూపంబులను దాల్చి దివికిఁ జనిరి. 1113
ఆ. పంప నీవు నగరభవనంబునకు నేను, ముట్టఁజాలకునికి ముక్తుఁడైన
విప్రుఁ డొక్కఁ డుండె విశ్వరూపాధ్యాయ, పాఠి యతఁడు మనకు భద్రదాత.
క. అని చెప్పె నాకు దానను, నిను శరణొందితిని మేదిసుర నాపైఁ
గనికరము నుంచి నాకో, ర్కిని దీర్పుము నాఁగ నతఁడు కృప దనరారన్. 1115
సీ. త్వరితంబుగను నిశాచరునియంతికమున, కరుదెంచి నగరనాయకునితోడఁ
బిలిచె దైతేయునిఁ బిలుపువెంటనె వాఁడు, వలికి విప్రునియొద్ద నిలిచె నంత
బ్రాహ్మణుం డాతనిపైని గీతైకాద, శాధ్యాయమంత్రతోయమును జల్లె
నంతట వాఁడు దైత్యాకారమును వీడి, ద్విజరూపమున నిల్చె ద్విజునియెదుట
గీ. నపుడు రాక్షసభక్షితులైనవార, లందఱును శంఖచక్రగదాబ్జములను
దాల్చి నాల్గుభుజంబులఁ దత్క్షణంబ, కానఁబడిరి విమానవర్గంబునందు. 1116
ఆ. అపుడు గ్రామపాలుఁ డానందమును జెంది, యందు నాకుమారుఁ డెవ్వఁడో తెల్పు
మనుడు శాపముక్తుఁడైనవిప్రుం డిట్టు, లనియెఁ జూపుచును దదాత్మభవుని. 1117
ఆ. ఇతఁడె నీకుమారుఁ డిందీవరాక్షుఁడు, కనకచేలుఁ డబ్జకరుఁడు రత్న
కుండలుండు ముకుటమండనుండు చతుర్భు, జుండు శంఖచక్రశోభితుండు. 1118
క. దేవత్వ మొంది యీతఁడు, దేవవిమానంబు నెక్కి త్రిదివంబునకున్
బోవంగ నున్నవాఁ డన, నావిహాల విషాద మాపురాధిపుఁ డంతన్. 1119

సీ. తండ్రి న న్నడబాసి తగునే పోవఁగ నీకు, బ్రతుకఁజాలను నిన్నుఁ బాసి నేను
రమ్మి నాకడకు శీఘ్రమ్ముగా ననవ్రుము, నతనిఁ గనుంగొని సుతుఁడు నవ్వి
యెన్నిమారులు జనియించినాఁడవో నీవు, నా కుద్భవిలితినో నీకు నేను
దండ్రీ యెవ్వండు పుత్రకుఁ డెవ్వఁడు వివేక, దృష్టితోఁ జూచిన నింత యేల
గీ. యీసునందునికృపచేత నేను దివికి, నేఁగుచున్నాఁడ నీవును నితనివలనఁ
జెంది యుపదేశమును రమ్మి శీఘ్రముగను, దత్ప్రభావంబునను స్వర్గధామమునకు.
క. అని నుడివి వారితోడను, జనియె దివికి వానివెంటఁ జనియె విమానం
బున నెక్కి శాపము క్తిం, గనినఘరామరుఁడు దివ్యకాయముతోడన్. 1121
వ. అంతట గ్రామపాలుండు సునందునివలన గీతైకాదశాధ్యాయోపదేశముం బడసి తత్ప
రనజపంబులచే విగళితపాతకుం డై సునందునితోడం గూడి యమరాలయంబునకుం
జనియె. **1122**

—: గీతా ద్వాదశాధ్యాయ మాహాత్మ్యము :—

గీ. పృథివిలోపల దక్షిణాపథమునందు, నుండెఁ గోల్హాపురం బనునొక్కపురము
కలదు పరశక్తిపీఠ మక్కడ సమస్త, దేవతాబృందనిత్యనిషేవితంబు. 1123
ఆ. కలవు కోటితీర్థములు కోటిశంభులిం, గములు రుద్రగయయుఁ గనకకేతు
భాసురంబు లైనప్రాసాదతతులును, ననుపమాన మైనయాపురమున. 1124
సీ. అచ్చోటి కొక్కధరాధిపనందనుం, డరుదెంచి యొకనాఁడు పురము నెల్లఁ
దిలకించి మణికుండతీర్థంబున మునింగి, కావించి కర్తవ్యకర్మములను
బరశక్తిపీఠికేశ్వరి యైనశ్రీమహా, లక్ష్మిని దర్శించి హ్లాద మొదవ
నిలఁబడి యామెముంగల నేత్రములు మూఁత, వడఁగఁ జిత్తము భక్తిపరవశముగ
గీ. సన్నుతింప మహాలక్ష్మి సత్వరముగ, నతనియెదుటను నిల్చి ప్రత్యక్షముగను
వత్స కోరుము శీఘ్రంబ వరము నిత్తు, ననుడుఁ గన్నులు తెఱచి యి ట్లనియె నతఁడు.
సీ. అమ్మ నాతండ్రి బృహద్రథుం డనుతఁడు, హయమేధయాగంబు నాచరింప
సంకల్ప మొనరించి సవనసైంధవమును, విడిచి దైవికముగా విడిచెఁ దనువు
తద్దేహమును బక్వతైలంబునం దుంచి, సలుపనుండఁగ నేను సవనపూర్తి
యంతలో నెవ్వరో హరియించిరి హయంబు, నధ్వరం బద్దాన నాఁగిపోయె
గీ. తండ్రిసంకల్ప మీడేర్పఁదలఁపుతోడ, ఋత్విజులయాజ్ఞ గైకొని యేను నిన్ను
శరణుచొచ్చితి నాపైనిఁ గరుణ నీకుఁ, గలుగునేడ నిమ్ము క్రతుతురంగంబు ననియె.
గీ. అంత నాతనివాక్యమ్ము లాలకించి, యిట్టు లనియె మహాలక్ష్మి నృపకుమార
మద్భటుం డగుసిద్ధసమాధికడకుఁ, బొమ్ము నెఱవేర్చు భవదభీష్టమ్ము నతఁడు. 1127
క. అనవుడు నానృపసూనుఁడు, చనిసిద్ధసమాధికడకుఁ జయ్యనఁ బ్రణతిన్
బొనరించి నిలువ నాతఁడు, కనుఁగొని తద్విషయ మెల్ల క్షణకాలములోన్. 1128

క. తలపఁగ నింద్రుని మదిలోఁ, బల వణఁకుచు వచ్చి వజ్రపాణి మునీంద్రాం
ఘ్రులకు నమస్కారంబుల్, జలిపి మఖాశ్వము నొసంగి చనియెన్ దివికిన్. 1129

గీ. అంత నది యెల్లఁ గాంచి నృపాత్మజుండు, విస్మయము నొంది మౌనీంద్ర విదిత మయ్యె
నీప్రభావంబు దానను నీకు నలవి, గాని పని యుండ దని నాకుఁ గానఁబడియె. 1130

క. కనికరము నుంచి నామీఁ, దను గ్రతుఫలమునకుఁ బాత్రతను జెందఁగ నా
జనకుని బ్రదికింపుము నీ, యనుగ్రహమువలన నేఁ గృతార్థుఁడ నగుదున్. 1131

సీ. అని వేఁడుకొనుటయు నాత్మలోఁ గారుణ్య, ముదయింప వానిపై నుత్కటముగ
నరిగి సిద్ధసమాధి యతనితోఁ దత్పిత్రు, శవ మున్నచోటికి సత్వరముగఁ
గరమున సలిలంబు గైకొని మంత్రించి, చల్లెఁ దత్పిత్రుమస్తకమునందు
నపుడు చిత్రంబుగా నుపగతప్రాణుఁడై, యట్టిట్టు కదలి బృహద్రథుండు

గీ. తెఱచి లోచనములను నల్దెసలఁ జూచి, యాత్మజనివేదితాత్మవృత్తాంతుఁ డగుచు
నెనయ నాశ్చర్య మాత్మలో నెదుట నున్న, మౌనివర్యునిపదములపైని వ్రాలి. 1132

సీ. పాదచారముగ నీపదములయొద్దకు, రావించినాఁడవు దేవవిభుని
సహస్రాతవాజిమేధాధ్వరతురగంబు, నిప్పించినాఁడ వొక్కింతలోనఁ
గాంచువారలకు నక్కజము చేకూరంగ, బ్రతికించినాఁడవు మృతుని నన్ను
కొల్హాపురిని నెలకొన్నమహాలక్ష్మి, నలరించినాఁడవు సులభముగను

గీ. స్వామి నీ కిట్టిమహిమంబు సంఘటిల్ల, నేది కారణ మగునొ నా కెఱుఁగఁ జెపుమ
యనుడు సిద్ధసమాధి యి ట్లనియె రాజ, తెలుపువాఁడను వినుము నా కల తెఱంగు.

క. ఏయెడ జపించు చుందును, ధ్యాయక నే గీతలోనిపంద్రెండవయ
ధ్యాయమును దాన నొదవె న, మేయమహత్త్వంబు నాకు మితి యేమిటికిన్. 1134

క. అని తెలుపఁ దదధ్యాయం, బును సిద్ధసమాధివలన భూపతియును ద
త్తనయుఁడును గొని జపించుచు, ననిమిషలోకమున కేఁగి రంతమునందున్. 1135

—: గీతాత్రయోదశాధ్యాయమాహాత్మ్యము :—

సీ. భువిని దక్షిణభాగమునఁ దుంగభద్రామ, హానదీతీరమునందుఁ గలదు
హరిహరం బనునొక్కపుర మం దొకం డుండె, హరిదీక్షితుం డనునవనిసురుఁడు
కల దాతనికి నొక్కకాంత దురాచార, యనుపేర నామధేయార్హశీల
యాచాన యొక్కనాఁ డరుగుచుండఁగ రేయి, నధికసంగమకాంక్ష నడవిలోన

గీ. దైవికంబుగ మార్గమధ్యమున వచ్చి, వ్యాఘ్ర మొక్కటి తన్మాంస మారగింప
నామెచుట్టును దిరుగుచు నార్చుచుండ, నాదురాచార కని దాని నడలువుట్ట. 1136

ఆ. దిక్కు లేనిదాన దీనురాలను నాఁడు, దాన నన్నుఁ జంప ధర్మ మగునె
లేవె నీకు మృగము లే వేనియును ద్వీపి, క్షుత్ప్రశాంతి చేసికొనఁగ నిచట. 1137

వ. అని పలుకుటయు నామెతో శార్దూలం బి ట్లనియె. 1138

గీ. ఓసి పాపాత్మురాల నీచేసినట్టి, పాపములు పండి నేఁడు నాపాలఁబడితి
వంతెయును నే నెఱుంగుదు ననుచు నామె,యెదను నాశ్చర్యమును నొంది యిట్టు లనియె.
క. నినుఁ జూడఁగ శార్దూలమ, వని తోఁపదు నాకు భవమదంతము నెల్లన్
వినిపించి కరుణతోడను, ననుఁ జంపుము పిదప నీకు నతు లొనరింతున్. 1140
వ. అని వేఁడుకొనుటయు వ్యాఘ్రంబాదురాచారకిట్లనియె. 1141
సీ. వినుము దక్షిణదేశమున మలాపహా యను, తటిని యుండెఁ దదీయతటమునందు
మునిపర్ణ యనుపేరఁ గొనినపురం బుండె, నచట విప్రుం డుండె నధనుఁ డొకఁడు
పుత్రుఁడనై నేను బుట్టినానికి ద్రవి, ణాశచేత నయాజ్యయాజనములు
దుష్ప్రతిగ్రహములు దురితాన్నభోజనం, బులు మంత్రవిక్రయంబులును జలిపి
గీ. వార్ధకమునందు నొకయమావాస్యనాఁడు, తర్పణంబులు చేయించుతలఁపుతోడ
దర్భలను గొనిపోవుచు దారిలోనఁ, గాలు వైచితిఁ గుక్కపైఁ గానరామి. 1142
క. అది యంతటఁ జెడఁగఱవఁగఁ, బడ మేనియుఁ గదలలేక పడి యచ్చోటన్
వదలి శరీరంబును శ్వా, పదమై పుట్టితిని స్వకృతపాపమువలనన్. 1143
సీ. ఎపుడో నేఁ జేసినతపముచే నీజన్మ, మునఁ బూర్వసంస్మృతి యొనరె నాకు
దానిచేతఁ బతివ్రతలను సజ్జనులను, యతులను ధర్మనిష్ఠితుల విడిచి
భక్షించుచుంటి క్షుద్బాధానివృత్తికై, పాపంబు చేసినప్రాణితతులఁ
బ్రాప్తించితివి నేఁడు గ్రాసంబుగను నాకు, నసతివి గానఁ బాపాత్మురాల
గీ. యని పలికి ఘీంకరించి నఖాగ్రములనుఁ, జీల్చి తద్దేహమును రెండుచీలికలుగఁ
ద్రావి తద్రక్తమును మెక్కి తత్పలంబు, నరిగె నంతఁ గృతాంతకింకరులు వచ్చి. 1144
గీ. ఆయమను దోడుకొని చని యమునికడకు, నతనియెదుటను నిలుపంగ నంతకుండు
దారుణము లగునరకయాతనలలోన, దానిఁ బడవైచి యేర్చి యంతమున విడిచె.
ఆ. అంత నాపె నరకయాతనలను నెల్ల, ననుభవించి కడకు నంత్యయోని
యందుఁ బుట్టి హేయ మగుకార్యములను జే, యుచును దైవికముగ నొక్కనాఁడు.
సీ. వాసుదేవుం డనుభూసురుం డొకఁ డొక్క, దినమున జృంభకాదేవికడను
జేతఃప్రియంబుగా గీతాత్రయోదశా, ధ్యాయంబు నందఱు నాలకింపఁ
జదువుచు నర్థంబు సవిమర్శముగఁ జెప్పు, చుండంగఁ ద్రోవలో నొదిగి నిలిచి
యాలించి శ్రద్ధతో నంతెయుఁ దనయింటి, కరుగంగఁ దలఁచుచున్నంతలోన
గీ. నద్భుతంబుగ దివ్యదేహంబు రాఁగ, ననిమిషానీత మగుదివ్యయానమందు
నధివసించి సవిస్మయ లగుచు నెల్ల, వారలును జూడఁ దా నేఁగె స్వర్గమునకు. 1147

—: గీతాచతుర్దశాధ్యాయమాహాత్మ్యము :—

సీ. కలదు మేదినియందుఁ గాశ్మీర మనియెడి, నగర మొక్కటి మహానందదంబు
తనరాజధానిగా నొనర్చుకొని దాని, భారతి నిత్యంబు బ్రహ్మకడకు

హంసయానము నెక్కి యటనుండి చనుచును, నరుగుదెంచుచు నుండు నద్భుతముగఁ
గరతలామలకంబుగా నుండు నం దుండు, వారి కెల్లరకు గీర్వాణవాణి

గీ. స్వామి యగుచును దానికి శౌర్యవర్మ, యనునృపుం డేలుచుండెను జనుల నెల్లఁ
దనపరాక్రమమున గోడి ధరణినేత, లెల్లవారును గానుక లిచ్చుచుండ. 1148

వ. అట్లుండ నావిశ్వంభరాధీశ్వరునకు సింహళద్వీపప్రభుండును నిర్వక్రపరాక్రమశాలి
యును నగువిక్రమబేతాళునితోడ సౌహార్దం బేర్పడియె. 1149

గీ. అంత నొకనాఁడు శౌర్యవర్మాధిపుఁడును, బంపె విక్రమబేతాళపార్థివునకు
హార్దసూచకముగ మృగయాప్రవీణ, మైనశుని నొకదాని నత్యాదరమున. 1150

ఆ. అంతటను గ్రహించి యాసారమేయిని, హర్ష మొదవ సింహళాధినేత
శౌర్యవర్మ కనిపె సంతోషసూచకం, బుగను గజతురంగభూషణముల. 1151

సీ. అంతట నొకదినమందు రాజకుమార, సహితుఁడై సింహళక్ష్మాధవుండు
వేఁటకుక్కను దనవెంటఁ బెట్టుకొని స, కౌతుకంబుగ నొక్కకాన కరిగి
బహుధనంబును బెట్టి పందెంబుగను నొక్క, క్షితిపసూనునిఁ బిల్వ నతఁడు వచ్చె
నప్పుడు సింహళవసుధాధీశుఁడును రాజ, సుతుఁడును శశముపై శునుల విడువ

గీ. శశము పరువిడుచుండంగ శశమువెంట, శునలు త్రివ్వన నరిగె నాశుగములట్లు
పఱచి పఱచి శశంబుపైఁ బఱవలేక, పడియె నొకయాశ్రమంబునఁ బంకమందు. 1152

గీ. అప్పుడు నృపాలశుని వచ్చి యతిజవమున, శశముపైఁ బడి కఱవ నాశశము చచ్చెఁ
దత్క్షణంబున శునియును దనువు దొఱఁగె, నంత దివ్యవిమానంబు లరుగుదెంచె.

సీ. దివ్యదేహములతోఁ దేజరిల్లుచు నప్డు, డాశునీశశము లత్యద్భుతముగ
నావిమానములయం దధివసింపఁగ నంత, లోన సింహళనృపాలుండు వచ్చి
యది చూచి యాశ్చర్య మెదను జెందుచు నుండ, హాసియించె మునిశిష్యుఁ డచట నొకడు
కని వాని సింహళక్ష్మాపాలుఁడు మహాత్మ, హేతు వేమి హసింప నెఱుఁగ జెపుమ

గీ. యనుటయును మునిశిష్యుఁ డి ట్లనియె రాజ, వత్సుఁ డనియెడియొకవిప్రవర్యుఁ డిచట
నున్నవాఁడు తదీయశిష్యుండ నేను, బిలుతురు స్వకంధరుం డనుపేర నన్ను. 1154

గీ. అతఁడు గీతాచతుర్దశాధ్యాయపఠన, నిరతుఁడై యుంట నాకును నేర్పె దాని
గురువునకుఁబోలె నా కొడఁగూడె దానిఁ, జదువు చుండుటచే దివ్యశక్తు లెల్ల. 1155

గీ. శశము శునియును మత్పదక్షాళనాంబు, పంకసంస్పర్శమునఁ జేసి పడసి దివ్య
దేహముల నేఁగనున్నవి త్రిదివమునకు, నీశునీశశములగాథ యింక వినుము. 1156

సీ. ప్రత్యుదకంబు నాఁబడుపురం బొకఁ డుండె, క్షితిపై మహారాష్ట్రసీమయందు
నందె నచ్చటఁ గేశవుం డనుపేరను, బాపాత్ముఁ డగునొక్కబ్రాహ్మణుండు
వానికిఁ గల దొక్కస్వైరసంచారిణి, యైనచాన విలోభనాభిధాన
కేశవుం డొకనాఁడు కినిసి తద్వృత్తికి, ఖండించె ముక్కముక్కలుగ దాని

గీ. నంత నాకాంత స్వకృతపాపానుగుణము, లై నయమయాతనల నొంది యంతమునఁ దాఁ
బుట్టె శుని యయి శశ మయి పుట్టె వాఁడు, స్త్రీవధాఘంబుననుజేసి క్షితితలమున.
గీ. పూర్వజన్మానుగతవై రమునను జేసి, యిపుడు శశమును శుని వధియించె వీని
జన్మవిషయంబు నాదివ్యచక్షువునకు, విదిత మగుటనుజేసి నవ్వితిని నేను. 1158
క. అని నుడువుటయును సత్యము, మునిశిష్యుఁడు పలికె ననుచు ముదమున శశముం
శునియును వచించి తత్క్షణ, మున నేఁగెను దివమునకు నభోమార్గమునన్. 1159
గీ. అంత విక్రమబేతాళుఁ డాత్మలోనఁ, జెంది విస్మయమును మునిశిష్యునొద్ద
నపుడె గీతాచతుర్దశాధ్యాయమంత్ర, మును గ్రహించి జపించుచు ముక్తి నొందె.

—: గీతాపంచదశాధ్యాయమాహాత్మ్యము :—

సీ. గౌడదేశంబునఁ గలఁడు కృపాణనృ, సింహుండు నా నొక్కక్షితివరుండు
తనకృపాణమున నతండు దిగ్జయమును, గావించి దశదిగంగణములందు
వ్యాపింపఁగను గీర్తి యచ్చట నచ్చట, స్థాపించి బహుజయస్తంభములను
క్షోణి నేలుచు నుండఁ గొంతకాలమునకు, నతనికి వార్ధకం బంకురించె
గీ. నపుడు తత్సైన్యనాయకుం డై నయట్టి, శరభభేరుండుఁ డాత్మీయసఖులతోడ
మంత్ర మొనరించి భూపుని గ్రుంగఁజేసి, తాను రాజ్యంబు గైకొనుతలఁపుతోడ.
గీ. తత్ప్రయత్న మొనర్చుచు దైవికముగ, గ్రుంగి యొకనాఁడు స్ఫోటకామయమువలన
నాత్మదుష్కృతబుద్ధిచే నశ్వముగను, జననమును బొందె సింధుదేశంబునందు. 1162
సీ. అంతట నొకవణిగాత్మజుం డాయశ్వ, మును గొని బహుమూల్యమునకు నచట
దానిపై లాభంబుఁ దాను సంపాదించు, నాశతోడను గౌడదేశమునకు
నరుగుదెంచి కృపాణనరసింహభూపతి, కిచ్చి దానిం గొని హెచ్చుధనము
సంతోషమున నిజసదనంబునకుఁ బోయె, నప్పుడు గౌడదేశాధినేత
గీ. వేట గావింపఁగను నొక్కవిపినమునకు, నాహయంబు నధిష్ఠించి యరిగి యచట
విపినసూకరవధము గావించి యలసి, దాహ మగుటను డిగ్గి సైంధవమునుండి. 1163
వ. ఆఘోటకంబు నొక్కపాదపశాఖకు బంధించి యచ్చటఁ దాను విశ్రమింప నెంచుచుండ నంతలోపలఁ దనకడ శ్లోకపత్రంబు కొట్టుకొని రా దానిం గైకొని యానరేంద్రుం డందు లిఖింపంబడియున్న గీతాపంచదశాధ్యాయశ్లోకార్ధముం జదివె. 1164
సీ. అది విన్నవెంటనె యశ్వంబు పడిపోయె, క్షితిమీఁద నిర్గతచేష్ట మగుచు
దానిఁ జూచుచునుండ ధరణీంద్రుఁ డంతలో, నశ్వంబు దివ్యదేహమును దాల్చి
యధివసించి విమానమందు నభోమార్గ, మున నేఁగుచుండంగఁ గని నృపుండు
విస్మయం బొంది తద్విషయంబు నెఱుఁగంగ, నాత్మలో నభిలాష మామతిల్లఁ
గీ. దత్సమీపస్థ మగు నొక్కతాపసాశ్ర, మమున కరిగి తపోధనోత్తమున కెరఁగి
స్వామి మద్వాజివృత్తాంత మేమొ తెల్పు, మని యడుగ నాతనికి నిట్టు లనియె మౌని.

ఆ. రాజ తెలిసికొంటి వాజివృత్తాంతంబు, దివ్యదృష్టివలనఁ దేటపడఁగఁ
దా నొకండు దలఁప దైవ మొండు దలంచు, వినుము నుడువువాఁడ విశదముగను.
సీ. భవదీయసైన్యాధిపతి యైనశరభభే, రుండుండు మున్ను నీ కుండఁయశము
సైఁపఁజాలక నిన్నుఁ జంపి నీరాజ్యంబు, గొన దురాలోచనమును నొనర్చి
యంతలో స్ఫోటకవ్యాధిచే మరణించి, తనపాపబుద్ధిచే ధాత్రిలోన
సింధుదేశంబున సైంధవమై పుట్టి, కొనకు నీయంతికంబునకుఁ జేరి
గీ. దైవవశమున నేఁడు కాంతారమందు, నీకు దొరకినపత్త్రంబు నీవు చదువు
చుండఁగను విని స్వకృతపాపౌఘ మెల్ల, క్షయము గా ముక్తకాయుఁడై చనియె దివికి.
వ. అని పలుకుటయుఁ గృపాణనృసింహుం డా విష్ణుశర్మవలన గీతాపంచదశాధ్యాయోపదే
శముం బడసి నిజపురంబున కరుదెంచి తదధ్యాయనిత్యపఠనప్రశాంతచేతస్కుండై నిజ
కుమారునకుఁ బట్టంబు గట్టి తాను బరమపదంబుం బొందె. 1168

—: గీతాషోడశాధ్యాయమాహాత్మ్యము :—

సీ. మహి నుండె గుర్జరమండలంబునను సౌ, రాష్ట్రికం బనెడిపురం బొకండు
ఖడ్గబాహుం డనుక్ష్మాపాలుఁ డొకఁ డుండె, నాపత్తనమునఁ బ్రతాపమూర్తి
యరిమర్దనం బనుహస్తి యాతని కొక్కఁ, డుండె నాసామజ మొక్కనాఁడు
శృంఖలాబంధంబుఁ ద్రెంచి వీథులఁ బడి, పరువెత్తఁదొడఁగెను బ్రజలు బెగడ
గీ. హస్తిపకు లేమియును జేయ నలవి గామి, దాఁగి యుండంగ నందందు ధైర్య ముడిగి
సౌధమున నిల్చి పరివారసహితముగను, డగ్గఱగ లేమిఁ జూచుచుండంగ ఱేఁడు.
గీ. ఒకరు గూడను ద్రోవలో నుండకునికి, మాటుమణఁగినయట్లుండె మార్గ మెల్ల
నప్పు డొకబ్రాహ్మణుఁడు స్నాన మాచరించి, పోవుచుండంగ నింటి కాత్రోవనుండి.
ఉ. వచ్చెను బ్రాహ్మణుం డనుచు సర్వజనంబులు గోలవెట్టఁగా
హెచ్చుగ ధైర్య మేర్పడ మహీసురుఁ డాఁగక యేఁగుచుండఁగన్
వచ్చి తదంతికంబునకు వారణ మల్లన మేన భీతిచే
ముచ్చెమటల్ స్రవింపఁగను మ్రొక్కి నిలంబడియెన్ వణంకుచున్.
సీ. అప్పు డత్యాశ్చర్య మాముతిల్లఁగ ఱేఁడు, చనుదెంచి సౌధదేశంబునుండి
యాబ్రాహ్మణునకు సాష్టాంగంబుగను మ్రొక్కి, బ్రాహ్మణోత్తమ యేప్రభావమునను
మదసామజంబును గదలకుండఁగఁ జేయఁ, గలిగినాఁడవొ నాకుఁ దెలుపు మనియె
నంత నాద్విజుఁ డిట్టు లనియె గీతాషోడ, శాధ్యాయపఠనమాహాత్మ్యమునను
గీ. జేకుఱె సమస్తసిద్ధులు నాకు భూప, దీని కాశ్చర్యపడ నేల దేవుఁ డైన
ర మ్మనిన వచ్చి నిల్చు నాసమ్ముఖమున, ననుడు నాశ్చర్యమును బొంది యాప్రభుండు.
వ. అమ్మహాత్మునివలన గీతాషోడశాధ్యాయోపదేశముం బడసి యది మొదలుకొని
యనుదినంబును నియతంబుగా దానిం బఠించుచు నొకనాఁడు తన్మంత్రప్రభావముం
బరీక్షింప నెంచి యామత్తగజంబును విశృంఖలంబుగా విడిచిపుచ్చె. 1173

గీ. అప్పుడు చెలరేఁగి వారణం బదర దెసలు, ఘీంకరించుచు వెడలి నిరంకుశముగఁ
బఱవఁదొడఁగెను వీథులఁబడి భయంబు, వలన జను లెల్ల నిండ్లలోపలను దూఱ.
ఆ. అప్పుడు జేఁడు మంత్రమం దుండువిశ్వాస, మునను నిర్భయముగఁ బోయి దాని
కరికి నిలువఁబడఁగ దంతి కంపించుచు, మంత్రరుద్ధభోగిమాడ్కి నిలిచె. 1175
గీ. అంతటను బట్టికొని దాని హస్తమునను, ఖడ్గబాహుండు గజశాలకడకు వచ్చి
విడిచి యచ్చోట సంతసంపడుచు మంత్ర, మహిమమున కెంత యేనియు మానసమున.
క. తనసుతుని నాత్మరాజ్యం, బున కధిపునిఁ జేసి నిత్యమును నేకాంతం
బున నుండి తదధ్యాయం, బును జపియించుచును దుదకు మోక్షము నొందెన్.

—: గీతాసప్తదశాధ్యాయమాహాత్మ్యము :—

సీ. మును ఖడ్గబాహుపుత్రునకు దుశ్శాసనుఁ, డనుభృత్యుఁ డొకఁ డుండె నధికబలుఁడు
బలగర్వమున వాఁడు పలుకుచు దంభవా, క్యముల నెల్లరు విస్మయంబు నొంద
నరిమర్దనముమీఁద నధివసించి పదంబు, చేతఁ గొట్టంగ నాసింధురంబు
క్రోధంబునను వానిఁ గూల్చి ధరిత్రిపైఁ, ద్రొక్కి పాదంబులతోడఁ జంపె
గీ. నంత దుశ్శాసనుఁడు స్వకృతాఘమునను, బుట్టి యచటనె గజముగాఁ బూర్వజన్మ
సంస్మృతిని జెంది నిజబంధుజనులఁ జూచి, కార్చుచుండెను గన్నీరు కాల్వలుగను.
ఆ. అట్లు కొంతకాల మరుగంగ నొకనాఁడు, ఖడ్గబాహుసుతుఁడు కవులఁ బిలిచి
యీయఁగను సమస్య లింపుగా నొకకవి, పూర్తి చేయ నతఁడు పొంది ముదము.
క. కానుకగా నాకవి కా, యేనుంగు నొసంగె నంత నెంతయుఁ బ్రీతిన్
దానిం గొని చని మాలవ, భూనాథున కమ్మె నతఁడు ప్రోవఁగలేమిన్. 1180
సీ. అంత నాకుంజరం బనుదినంబును దన, వెలఁదిని సుతులను దలఁచికొనుచు
నాదుఃఖమునను నిద్రాహారములు మాని, కన్నీరు జాలుగాఁ గార్చుచుండ
నది వ్యాధి యని యెంచి యాధోరణులు చేసి, వివిధచికిత్సలు విసివి తుదకు
మనవి గావింపంగ మాలవనేతకు, న్నాప్రభు వచ్చోటి కరుగుదెంచి
గీ. కాంచు చుండంగ గజము నాగజము మనుజ, వాక్కుతో నిట్టు లనియె భూవర యొనర్ప
వలదు వైద్యంబు లేనియు ఫలము లేదు, నీకు నామీఁదఁ గరుణ జనించె నేని.
వ. గీతాసప్తదశాధ్యాయజపపరాయణుం డగువిప్రునిం బిలిపించి తన్మూలంబున నారో
గంబు శమింపంజేయుము. 1182
గీ. అనవుడు నృపాలుఁడు గజోక్తి ననుసరించి, యనుదినంబుఁ దదధ్యాయమును జపించు
నట్టివిప్రుని రావింప నతఁడు వచ్చి, జలము మంత్రించి గజముపైఁ జల్లె నంత.
సీ. ఆసామజము స్వదేహంబును విడనాడి, వెంటనె తాల్చి ప్రాగ్విగ్రహమును
దివ్యరూపంబుతోఁ దేజరిల్లుచు నుండ, దివ్యయానంబుపై దివమునందు

మాలవాధిపుఁడు విస్మయముతో నాతని, నీక్షించి మహనీయ యెవఁడ వీవు
దంతిజన్మంబు నొందఁగఁ గారణం బేమి, యిపుడు తన్ముక్తి నీ కెట్లు గలిగె
గీ. నంతయు వచింపు మనుటయు నాత్మగాథ, యెల్ల దుశ్శాసనుఁడు తేటతెల్లముగను
దెలిపి తత్క్షణకాలమున నందు నిలువకుండ, నరిగెఁ ద్రిదివంబునకు మహాహ్లాదమునను.
వ. అంతట మాలవాధీశ్వరుం డా బ్రాహ్మణునికడ గీతాసప్తదశాధ్యాయోపదేశముం బడసి తజ్జపంబు గావించుచు ననేకసిద్ధులం బొంది దేహావసానంబున ముక్తుం డయ్యె.

—: గీతాష్టాదశాధ్యాయమాహాత్మ్యము :—

సీ. కనకమహీధ్రశృంగమునందుఁ గల దమ, రావతి యనెడిపురం బొకండు
ప్రమథాధిపతివినోదమున కై మును విశ్వ, కర్మచే నది యయ్యె నిర్మితంబు
దాని కీడై నపత్తన మేదియును లేదు, విశ్వంబులం దెందు వెదకి చూడ
దాని కింద్రుండు శతక్రతు వగుటచేఁ, బ్రభువుగా నుండె నిర్జరులు గొలువ
గీ. నట్లు లుండంగ నొకనాఁడు హరినియోజ్య, లోకపురుషునిఁ గొనిపోవుచుండ విష్ణు
సన్నిధికి వాని తేజఃప్రసారమునను, నడలి సింహాసనమునుండి పడియె వజ్రి. 1186
సీ. సింహాసనచ్యుతిఁ జెందినయింద్రుఁడు, తగఁడు స్వర్గాధిపత్యమున కనుచు
భావించి వైకుంఠభవనంబునకుఁ దాము, గొనిపోవుపురుషుని ననిమిషులకు
నధినాథుఁడుగను బట్టాభిషిక్తునిఁ జేయ, నతఁ డధిష్ఠింప సింహాసనమును
గుసుమవర్షంబును గురిసిరి నిర్జరుల్, నభమున దేవదుందుభులు మ్రోఁగెఁ
గీ. బాడ గంధర్వు లాడ నప్సరస లొసఁగ, నమరకాంతలు నీరాజనములు ఋషులు
దీవన లొసర్పఁ బౌలోమి సేవ సేయ, భాసిలె సుధర్మ నభినవవాసవుండు. 1187
సీ. ఆవిధంబున వెల్గునభినవేంద్రునిఁ జూచి, యింద్రుండు విస్మయం బేర్పడంగఁ
జలుపఁ డాయెను గ్రతుశతమును నెలకొల్పఁ, డాయె విశ్రాంతికై యవనిజములఁ
ద్రవ్వింపఁ డాయెను ధర్మకూపాదులఁ, బెట్టఁ డాయెను భిక్ష భిక్షుకులకు
స్థాపింపఁ డాయె సత్రముఁ బాంథజనులకుఁ, జేయఁడాయెను దీర్థసేవనంబు
గీ. కవులఁ బూజింపఁ డాయెను గంగలోన, స్నాన మొనరింపఁ డాయెను జలుపఁ డాయెఁ
బాత్రదానంబు వీని కేపగిది నిట్టి, దివ్యభోగంబు కలిగెనో తెలియరాదు. 1188
క. అని వ్యాకులమానసుఁడై, చని సత్వరముగను క్షీరసాగరమునకుఁ
దనుజాంతకునిదర్శనముం, బొనరించి నుతించి వినయమున ని ట్లనియెన్. 1189
ఆ. స్వామి క్రతుశతంబు సలుపక చేయక, యెట్టిపుణ్యకర్మ మేని నేఁడు
చిత్రముగను స్వర్గసింహాసనారూఢుఁ, డయ్యె నెవఁడొ తెలుపు మతనిగాథ. 1190
వ. అని ప్రార్థించుటయు గోవిందుం డాతని కి ట్లనియె. 1191
సీ. పాకశాసన యల్పఫలదాయకము లైన, క్రతుశతంబును బుణ్యకర్మములును
సంతృప్తి గలిగింపఁజాలవు నాకు గీ, తాష్టాదశాధ్యాయ మట్లు గాన

నాపురుషుండు తదధ్యాయమున శ్లోక, పంచకంబుఁ బఠించుఁ బ్రతిదినంబు
దాన నాతనిసుకృతమునకుఁ బోలవు, క్రతుశతంబును బుణ్యకర్మములును
గీ. దన్మహాత్మ్యంబువలన స్వర్గధామమునకు, నాధిపత్యంబు వహియించె నాద్విజుండు
చేరఁగలఁ డింక ముందు నాచెంత కతఁడు, మన్మనఃప్రీతికరుఁ డై నమహితుఁ డగుట.
క. అని చెప్పి యమృత్యత్వం, బును బొందుటయును సురర్షభుఁడు స్వారాజ్యం
బున కేఁగ వృట్ట స్వర్గం, బున కేఁగక విప్రవేషమును దాల్చి వెసన్. 1193
సీ. ధరణికి వచ్చి గోదావరీతటమునఁ, గ్రాలెడి కాళికాగ్రామమునకు
నరిగి యచ్చటను గీతాష్టాదశాధ్యాయ, పరుఁ డై నయొక్క భూసురునిఁ గాంచి
ప్రణమిల్లి తత్పాదపద్మంబులకు నొక్క, వర్షంబు గావించి వానిసేవ
యాతనివలన గీతాష్టాదశాధ్యాయ, మును గొని యుపదేశపూర్వకముగ
గీ. దాని జపియించుచును సంతతమును నేక, దీక్షతోడను జాహ్నవీతీరమందు
నపునరావృత్తికరమును నక్షయమును, మహితమును నై నమోక్షధామమును జెందె.
క. ఏతద్గీతామహిమము, శ్రోతలకును వాచకులకు సుఖము నొసంగున్.
భూతలమున స్వర్గమునను, జేతస్సంతుష్టి గలుగఁజేసెడికతనన్. 1195
ఆ. సర్వయజ్ఞఫలము సర్వతీర్థఫలంబు, సర్వపుణ్యకర్మజన్యఫలము
సంఘటిల్లు దీనిఁ జదివిన వినినను, దానివలన మత్పదంబు దొరకు. 1196
క. అని వచియించుటయును మన, మున గీతామహిమమునకుఁ బొంది ప్రమోదం
బును విస్మయమును గీతను, గొనియాడెను లోకమాత కుతుకం బొదవన్. 1197

—: భా గ వ త మా హా త్మ్య ము :—

ఆ. మునివరేణ్య వినుము వినిచెద నిలలోన, గలదు భాగవతము కలుషహరము
దాని వినిన సకలధర్మంబులను విన్న, ఫలము గలుగు నెట్టిపాపి కేని. 1198
క. భువనంబున భాగవత, శ్రవణము లభియించు టరుదు జన్మాంతరసం
భవపుణ్యహీను లగుమూ, నవులకు వాస్తవముఁ దెల్పెనాఁడను నీకున్. 1199
ఆ. చిత్తశుద్ధి గలుగఁజేసి శాశ్వత మగు, బ్రహ్మపదము నీయ భాగవతము
కంటె లేదు వే ఱొకండు దేహికి ముక్తి, సాధనంబు లై నచదువులందు. 1200
సీ. భాగవతంబుఁ జెప్పఁగఁ బరీక్షితునకు, సభలోన శుకుఁ డున్న సమయమందు
నిజకార్యపరు లై ననిర్జరు లమృతంబు, గొనివచ్చి శుకునకు వినతిచేసి
దేవ పరీక్షిన్మహీవరునకు మేము, తెచ్చినయమృతంబు నిచ్చి మాకు
నిమ్ము భాగవతామృతమ్ముఁ గ్రోలుదు మన, సుర లభక్తు లటంచు శుకుఁ డెఱింగి
గీ. నవ్వి కృష్ణకథామృతానంద మేడ, ననిమిషామృతముద మేడ నమరులార
మణికిఁ గాచంబునకును సమత్వ మున్నె, మీయమృతమును గొని పొందు మీరు దివికి.
క. అనవుడు నాశాచ్యుతు లై, యనిమిషు లేఁగుటయు దివికి నతఁడు పరీక్షి
జ్జనపతికిఁ జెప్పెఁ దత్కథ, యనుక్షణము తేఁడు నొంతె నమృతపదంబున్. 1202

సీ. అది చూచి విస్మయం బొదవంగ మదిలోన, లోకేశుఁడు స్వసత్యలోకమందు
వేదవేదాంగాదివిద్యల నొకప్రక్క, భాగవతము నొక్కప్రక్కనుంచి
తులఁదూఁపఁగను వంగె ములు భాగవత మున్న, కడకు నం దుండుట గౌరవంబు
దానఁ దాపసు లద్భుతము నొంది విష్ణురూ, పంబుగ భాగవతంబు నెంచి
గీ. తచ్ఛ్రవణమున నైనఁ దత్పఠనమునను, నైన మోక్షంబు ప్రాప్తించు నని వచించి
రాకతంబునఁ గృష్ణకథామృతంబు, గ్రోలువా రెల్లరును ముక్తిఁ గొనెడివార. 1203
గీ. భాగవతమును నొక్కయబ్దంబు వినిన, సౌఖ్య మొనగూడు నొక్కమాసంబు వినిన
నామతిల్లును భక్తి సప్తాహ మాల, కించునెడఁ గల్గు మోక్షలక్ష్మిని భజింప. 1204
క. మును శుకుఁడు నాకు వినిపిం, చెనొ దేనిని శిష్యబుద్ధిచే గోప్యముగన్
వినిచెద నే నది నీకును, వినుము తపోధనవరేణ్య విశదము గాఁగన్. 1205
సీ. ఒకనాఁడు నారదుం డుండ విశాలాఖ్య, రంబున సాధుదర్శనము చేయ
నరుదెంచి యటకు నల్వురు కుమారులు ఖిన్న, వదనుఁ డై యున్ననారదునిఁ జూచి
మునివరేణ్య వినష్టధనునికై వడిఁ గానఁ, బడుచుంటివి విషణ్ణభావమునను
యుక్తంబు గా దిట్లు ముక్తసంగుల కుండ, హేతు వేమియొ దీని కెఱుఁగఁ జెపుమ
గీ. యనుడు దేవమునీంద్రుఁ డి ట్లనియె నేను, ధాత్రి కేతెంచి సకలతీర్థములఁ జూచి
యెందును ప్రశాంతి గలుగమి హృదయమునకు, ఖిన్నభావంబు నొందుచు నున్నవాఁడ.
సీ. ధాత్రి నెల్ల నధర్మమైత్రిచేఁ బ్రబలిన, కలి యాక్రమించినకారణమున
సత్యంబు పోయె నష్టం బయ్యె శౌచంబు, దానంబు క్షీణించెఁ దపము సెడియె
దయ యంతరించెను దాక్షిణ్య ముడిపోయెఁ, దరుణీస్వతంత్రత దాపరించె
శ్యాలకుల్ బుద్ధిదాయకు లైరి యాచార, హీను లైరి సమస్తమానవులును
గీ. నాశ్రమంబులు చెడిపోయె నాపగలును, దేవతాయతనములును దీర్థములును
బాలకిజనావృతము లయ్యె భ్రష్ట మయ్యె, జ్ఞానము నశించె యోగంబు సమసె సిద్ధి.
గీ. జనపదము లన్నవిక్రయాస్పదము లయ్యె, భూసురులు వేదవిక్రయకారు లైరి
కోమలులు యోనివిక్రయకుశల లైరి, ఘోరకలిసంవృతము గాఁగ గుతల మెల్ల.
వ. అట్లు నేను కలివిజృంభణముం గాంచుచుఁ బుడమి యెల్లం దిరిగి కడకు యమునాతటం
బునకుం జేరి యచ్చట విచేష్టులై పడియున్న యిరువురువృద్ధుల కుపచారముం జేయుచు
ఖిన్నమానస యై రక్షకునికొఱకు దెస లెల్ల విలోకించుచు శతస్త్రీపరివేష్టితయై యున్న
యొక్కతరుణి నాలోకించి యాయమకడ కేఁగితి. 1209
గీ. అంతటను లేచి మ్రొక్కి నా కాలతాంగి, స్వామి నాచింత మాన్పుము సాధుజనులు
దీనుల నుద్ధరింపంగఁ దిరుగు చుందు, రాత్మజనువె పరోపకారార్థ మగుట. 1210
సీ. అని వేఁడుటయును నేనాయమ కిట్లంటి, వింతి నీచరితంబు నెఱుఁగఁ జెపుమ
యనవుడు నామె యి ట్లనియెఁ దపోధన, భక్తినామమున నేఁ బరగుదాన

వీ రిద్దరును జ్ఞానవైరాగ్యనామధే, యాన్వితు లైననాయాత్మభవులు
గంగాదిదివ్యతరంగిణుల్ వీరలు, నన్ను సేవించుచు నున్నవారు
గీ. కాని నాయాత్మ కించుక యేని శాంతి, యేరుపడదాయె నే మున్న నేమి ఫలము
ద్రవిడమునఁ బుట్టి వృద్ధిఁ గర్ణాటకమునఁ, జెంది గుర్జరమున జీర్ణజీర్ణ నైతి. 1211
గీ. ఘోరపాషండజనులచే గుర్జరమున, ససుతముగ ఖండితాంగి నై చావు దప్పి
యెట్లొ బృందావనమునకు నేఁగుదెంచి, బ్రదికితిని బూర్వరూప మేర్పడఁగ మేన.
క. నాకొడుకు లిట్లు వృద్ధతఁ, గైకొనఁగను నేను దరుణిఁగా నుండంగా
నేకారణంబొ తెలుపుము, సాకల్యంబునను నాకు సంయమివర్యా. 1213
ఆ. తల్లి వృద్ధురాలు తరుణులు సుతు లన్న, మాట లోకమున సమంజసంబు
తరుణి యగుట జనని తనుసంభవులు వృద్ధు, లగుట కలదె యెచట నైనఁ జెపుమ.
క. అనవుడు నే నొకనిమిషం, బున నెఱిఁగి సమస్తవిషయమును ధ్యానముచే
తను భక్తి కిట్టు లంటిని, జనని వచించెదను వినుము సర్వము నీకున్. 1215
సీ. కలియుగం బిది మహాకలుషాత్మకం బిందు, నధము లుందురు ప్రహర్షాన్వితులుగ
నుత్తముల్ చింతిల్లుచుందు రధర్మంబు, నాల్గుపాదంబుల నడచు చుంట
నస్పృశ్యలను దాల్చి యవని యేడ్చుచు నుండె, సార మెల్లను నదృశ్యతను బొందె
నిను నీకుమారులఁ గనువాఁ డొకండును, గానంగరాఁ డెందు నేని యిచట
గీ. దైవికంబుగ నీవు బృందావనంబుఁ, జేరుటను నిందు నినుఁ జూచువార లుంటఁ
దరుణి వైతివి మరల వార్ధకమునందె, యుండిరి భవత్సుతులు వారి కండ లేమి.
వ. అని పలుకుటయు భక్తి యి ట్లనియె. 1217
క. శిష్టార్యుఁ డైనకలిని బ, రీక్షిన్నృపుఁ డేల యుంచెఁ బృథ్విస్థలిపై
దక్షుఁ డగుహరియు నేల యు, పేక్షించెనొ సార మెట్టు లేఁగెనొ చెపుమా. 1218
సీ. అనవుడు నే నిట్టు లంటిఁ దల్లి వచింతు, వినుము సత్యము నీకు విశదముగను
భువిని ముకుందుఁ డెప్పుడు వీడి యరిగెనొ, తనపదంబునకు నాదినమునందె
కలి ప్రవిష్టుం డయి యిలను దిగ్విజయంబు, సలుపుభూపాలుని శరణుచొచ్చె
నపుడు పరీక్షిద్ధరాధిపుఁ డాతని, స్థాపించెఁ గలిజనసౌఖ్యమునకె
గీ. కలివశంబునఁ గలిగెడికలుష మెల్ల, క్షీణ మగు నొక్కవిష్ణుసంకీర్తనమున
దానయజ్ఞతపోయోగదానములను, గలుగుఫలము సంప్రాప్తించు సులభముగను.
క. కలివలనఁ గలుగుక్లేశం, బులు హరినామమున నాశమును బొందుటచే
సులభముగ నుపేక్షించెను, జలజాక్షుఁడు కలిని గార్యసాధకుఁ డగుటన్. 1220
సీ. హరికథల్ నడుపుట నర్థాశ ననుచిత, స్థలములలోఁ గథాసార ముడిగె
దాంభికుల్ ఘోరపాతకులును దీర్థవా, సంబు సేయుటఁ దీర్థసార ముడిగె

నొనరించుటను జపంబును గామలోభాది, సక్తచిత్తులు తపస్సార ముడిగె
సలుపుట యోగంబు శాస్త్రాభ్యసనమనో, జయశూన్యముగ యోగసార ముడిగె

గీ. నిల్లె వస్తువు లన్నియు నెల్లయెడలఁ, దండులవివర్జితం బైనధాన్యమట్లు
సారరహితంబుగా నుండె క్ష్మాతలంబు, కలిమహామాయచేత నాక్రాంత మగుట.

గీ. మహిషములువోలెఁ బండితమ్మన్యులాత్మ, యోషలనుగూడిరమియించుచుందు రెపుడు
నంతె కాని విముక్తిపై నాస గలుగు, వాఁ డొకండును గానఁగరాఁడు కలిని. 1222

క. తనయుల నుత్పాదించెడి, పనిలో నుండెడిసమర్థభావము లే దొ
క్కనికిని వైకుంఠపదం, బును సంపాదించుకార్యమునఁ గలిలోనన్. 1223

గీ. సారవర్జితకలిలోన సారభూత, మైన దొకకృష్ణనామంబె యని యెఱింగి
యాశ్రయింపుము కృష్ణుని నఖిలదుఃఖ, ములు శమించును నీకు నీపుత్రులకును.

గీ. ద్రౌపదీప్రాణమానసంరక్షకుండు, గోపకాంతాంతరంగసంతాపహారుఁడు
త్వన్మనోవల్లభుండు గావండె నిన్ను, ద్వారకావాస యని యొక్కసారి పిలువ.

క. నీ వెచ్చట వసియింతువొ, గోవిందుం డచట నుండుఁ గుతుకం బొదవన్
దావకరూపమె దైవము, నీవు తదాకృతియె యేల నిక్కము దాఁపన్. 1226

గీ. జ్ఞానవైరాగ్యములు ముక్తిసాధనంబు, లనియు సత్యాదియుగములయందు మూఁటఁ
గలియుగంబున భక్తి యొక్కటియె ముక్తి, దం బనియుఁ బల్కుచుందురు తత్త్వవిదులు.

గీ. కలియుగము జ్ఞానవైరాగ్యములకుఁ దావు, గామి నీపుత్రకులు వార్ధకంబు నొంది
రీయుగంబున నైనను నించు కేని, చింత వహియింపవలదు నీచిత్తమందు. 1228

సీ. అన్యధర్మంబుల నడఁగఁద్రొక్కి భవత్ప్రి, భావంబు నింటింటఁ బాదుకొల్పి
హరిదాసుఁ డనెడివిఖ్యాతిని శాశ్వతం, బుగ నిల్పికొని నేను జగములందు
భక్తియోగంబునఁ బాపాత్ములను నేని, పొందింతు వైకుంఠమందిరంబు
భక్తియుక్తుఁడు గానఁబడినమాత్రముననె, వణఁకుచుండును భూతగణము లెల్ల

గీ. సాధ్యుఁ డైనట్లు భక్తిచేఁ జక్రపాణి, కాఁడు సాధ్యుఁడు తపమునఁ గాని జ్ఞాన
కర్మములచేతఁ గాని నిక్కముగ గోప, జలజముఖు లిందులకు నిదర్శనము గాదె.

గీ. ప్రాప్త మగుఁ బ్రీతి నరులకు భక్తిపైనిఁ, గడచు నెడ వేయిజన్మముల్ కట్టకడకుఁ
గలియుగంబున భక్తి యొక్కండె శరణు, జలరుహాక్షుఁడు భక్తిచే నిలుచు నెదుట.

గీ. మూఁడులోకంబులందును ముప్పు నొందు, దేహి యెవఁ డేని భక్తిపై ద్రోహబుద్ధిఁ
జేసినట్టైన మున్ను దుర్వాసుఁ డిలను, దుఃఖమును బొందె భక్తివిద్రోహి యగుట.

గీ. ఏల యోగంబు తీర్థము లేల యేల, జ్ఞాన మేల విరాగంబు ధ్యాన మేల
క్రతువు లేల తపం బేల కలియుగమున, ముక్తిదాయక మై యుండ భక్తి యొకఁడె.

క. అనవుడు భక్తి ప్రమోదం, బును బొంది మహాత్మ నీప్రబోధముచేఁ గ
ల్గెను దేహపుష్టి యైనను, మనఁజాలను సుతులయందుమ మాన్పక యున్నన్.

సీ. అని వచించుటయును విని నారదుఁడు తన, యాత్మలోఁ గారుణ్య మంకురింప
భక్తిపుత్త్రులకళేబరముల నిమురుచుఁ, గరములచే సౌఖ్యకరము గాఁగఁ
వత్కర్ణములయొద్దఁ దనముఖం బుంచి గీ, తయు వేదములును బెద్దఁగఁ బఠింప
నావులించుచు వార లట్టిట్టు చూచియుఁ, గదలంగజాలమిఁ గదల రైరి
గీ. నారదుం డంతఁ దోఁపమి వారియెడలఁ, జేయఁదగినచికిత్స స్వచిత్తమునకుఁ
బరితపించుచు నుండ నుప్పరమునుండి, వినఁబడియెఁ జేయుము సుకర్మ మనెడిమాట.
గీ. అంత నారదముని విస్మయంబు నొంది, యాసుకర్మంబు నెఱుఁగంగ నాత్మ నెంచి
తీర్థముల కేఁగి యచటి కేతెంచినట్టి, మునులకడ నాత్మసంశయమును వచించె. 1235
ఆ. అంత వార లెల్ల నాసుకర్మం బేదొ, యెఱుఁగకునికి నిర్ణయింప రైరి
వనజయోనిసుతునకును గోచరింపని, దన్యులకు నెఱుంగ నలవి యగునె. 1236
క. అంతటఁ జింతాక్రాంత, స్వాంతుం డై నారదుండు చయ్యన బదరీ
కాంతారముఁ జేరి తద, భ్యంతరమునఁ దపముఁ జేయ నరయుచు నుండన్. 1237
క. సనకాదిమునులు నలువురు, కనంబడిరి యెదుటఁ జండకరకోటిద్యో
తనమూర్తులు కృష్ణకథా, మననానందప్రపూర్ణమానసు లంతన్. 1238
గీ. నారదుఁడు వారలకు మ్రొక్కి గౌరవమున, మానివరులార మీమహామహిమ నెన్న
నలవి యగునది గాదు బ్రహ్మాదులకును, నల్పుఁడను దాని నెఱుఁగ నే ననఁగ నెంత.
సీ. పూర్వికులకుఁ గూడఁ బూర్వు లై నను నిత్య, మును బంచహాయనంబులను బరగి
కృష్ణనామామృతం బెపుడును గ్రోలుట, జర వహింపక కళేబరములందు
నిగ్రహంబునను ననుగ్రహంబునను సా, మాన్యంబుగాని సామర్థ్య మొంది
దైవాఱుచుండు మీదర్శనం బప్రాప్య, మది నాకు నేఁడు పుణ్యమున నబ్బె
గీ. నర్థి నగునాయెడఁ గృపాకటాక్ష ముంచి, యానతిండు నభోవాణి యానతిచ్చి
నట్టిసత్కర్మ మేదొ నా కనుడు వారు, దివ్యదృష్టి నెఱింగి తద్విషయ మెల్ల. 1240
సీ. నారద మము నీవు కోరినవిషయంబు, సర్వంబు మాకు విజ్ఞాత మయ్యెఁ
జింతింపకుము నీకుఁ జెప్పెద మంతయుఁ, దగినకార్యము నీవు తలఁచికొంటి
ఋషు లనేకులు వచియించి రనేకమా, ర్గములను సద్గతిప్రదములుగను
నవి యెల్ల స్వర్గదాయకములు శ్రమసాధ్య, ములును నై యుంట నిష్ఫలము లయ్యెఁ
గీ. గలదు వైకుంఠధామంబు గలుగఁజేయు, నట్టిసత్కర్మ మొకటి రహస్యముగను
నదియె యాకాశవాణి నీ కానతిచ్చె, భక్తిబోధవిరాగముల్ బ్రతుకుటకును.
వ. ద్రవ్యయజ్ఞతపోయజ్ఞయోగయజ్ఞస్వాధ్యాయయజ్ఞజ్ఞానయజ్ఞంబు లను పంచయజ్ఞంబు
లలోన మొదటినాల్గుయజ్ఞంబులు కర్మసూచకంబులుగను జ్ఞానయజ్ఞంబు సత్కర్మ
సూచకంబుగను సిద్ధాంతీకరింపంబడియె. 1242
క. అదె భాగవతాలాపం, బదె సత్కర్మాభిధాన మక్షయధామ
ప్రద మదియె లేదు మోక్ష, ప్రద మగుమార్గంబు తదితరంబు ధరిత్రిన్. 1243

గీ. సింహరావంబు నాలకించిన వృకంబు, లెట్లు పరువెత్తిపోవునో యట్లె పఱచు
భాగవతశబ్దనాదంబు పతిత మైన, శ్రవణములలోనఁ గలిదోషజాల మెల్ల. 1244
క. భక్తిజ్ఞానవిరక్తులు, శక్తములై యపుడు మోక్షసామ్రాజ్యంబున్
భక్తులకు నొసఁగు భాగవ, తోక్తులసాయమునఁ బుష్టి యొదవఁగఁ దమకున్. 1245
క. అనవుడు బ్రహ్మసుతుం డి, ట్లనియెను మహనీయులార యామ్నాయాదుల్
వినిచినను శక్తి యొదవని, యనదలు భాగవతగాథ నగుదురె శక్తుల్. 1246
క. అని యడుగుటయును వేదో, పనిషత్సారమునఁ బుట్టి సార్థక్యంబున్
గొనుటను సత్యోత్తమతను, గనియెను భాగవతకథ జగత్త్రయమందున్. 1247
గీ. ఆమ్రఫలమున రస మున్న నధికముగను, నగునె యాస్వాద్యము పృథక్త్వ మంద కున్న.
నిక్షువున నున్నశర్కర యెల్లయెడలఁ, జేయఁబడకున్న వేఱుగాఁ బేయ మగునె. 1248
గీ. అంతటను నుండినను క్షీరమందు నేయి, చెందకున్నఁ బృథక్త్వముఁ జేయఁగలదె
యాయురభివృద్ధియును నింద్రియముల కెల్ల, బలవివర్ధనమును నెట్టిపట్ల నేని. 1249
గీ. వ్యాసుఁ డొకతఱిఁ బుత్రమోహమున శోక, మొందుచుండఁ జతుశ్శ్లోకయుక్త మైన
భాగవతమును జెప్పి తద్భావమునకు, శాంతిగొలుపవె మును నీవు సంయమీంద్ర.
గీ. అట్టినీవును సంశయం బంది యిట్లు, ప్రశ్న మొనరింపవచ్చునె భాగవతము
నాలకించినఁ గలుగుశ్రేయములపట్ల, సంశయింతురుగాక యజ్ఞాను లిలను. 1251
క. అని సనకాదులు పలుకుట, యును సంశయ ముడిగి పద్మజోద్భవుఁడు తపో
ధనులార జ్ఞానయజ్ఞము, నొనరింపఁగఁ దెల్పుఁ డొక్కయుచితస్థలమున్. 1252
వ. అని యడుగుటయు నత్తపోధనులు నారదున కిట్లనిరి. 1253
క. నారద గంగాద్వారము, ధారుణిలోపలఁ బవిత్రతను గన్నయసా
ధారణతీర్థము నాఁగను, జేరుకొనంబడియె మౌనిబృందముచేతన్. 1254
గీ. సహజవిద్వేష మొదవినజంతువులును, మైత్రితో నుండు నచ్చటఁ జిత్రముగను
సమ్మహాక్షేత్రమునఁ జేయనగును నీకు, జ్ఞానయజ్ఞంబు నది శమస్థాన మగుట. 1255
సీ. జ్ఞానయజ్ఞంబు నచ్చట నీవు చేయ సం, కల్పం బొనర్పు మాక్షణములోన
భక్తియుఁ దత్తనూభవు లిద్దఱును వత్తు, రాస్థలంబునకు నాహ్లాద మొదవ
వచ్చినవెంటనె వారికిఁ దారుణ్య, మొనగూడు భాగవతోక్తి వినుట
వని పల్కి బ్రహ్మపుత్రునితోడఁ గూడి గం, గాద్వారమునకు శీఘ్రముగ రాఁగ
గీ. నది గ్రహించి తపోధను లనిమిషులును, వేదశాస్త్రపురాణాదివివిధకలలు
నదులుఁ దీర్థంబులును నరణ్యములు గిరులు, నందఱును వచ్చి రచ్చటి కద్భుతముగ.
సీ. అప్పుడు దీక్షితుండై నారదుఁడు శ్రోత, గను నుండ నగ్రభాగంబునందు
నొకప్రక్క ఋషులును నొకప్రక్క సురలును, నుపనిషద్వేదంబు లొక్కప్రక్కఁ
దీర్థంబు లొకప్రక్క స్త్రీజనం బొకప్రక్కఁ, గులగిరు లొకప్రక్కఁ గూరుచుండ
ముఖభాగమున బాలమునివరేణ్యులు నార, దాసీతపీఠంబు నధివసించి

గీ. భాగవతపురాణంబును బలుకఁ దొడఁగఁ, గురిసె నుప్పరమునునుండి కుసుమవృష్టి
శంఖనాదంబులును జయశబ్దములును, బయలుదేఱెను దత్సభాభవనమందు. 1257

వ. అంత సనకాదికుమారమునులు సోత్సాహంబుగ నిట్లనిరి. 1258

సీ. నిత్యంబు సేవ్యంబు నిత్యంబు సేవ్యంబు, ప్రాణధారులకెల్ల భాగవతము
ద్వాదశస్కంధ మష్టాదశసాహస్ర, పరిమిత మది దానిఁ బలికె మున్ను
శుకుఁడు పరీక్షిత్తునకు దానిశ్రవణంబు, గావించినంతనె కలుగు ముక్తి
శుకశాస్త్రకథ చెవిఁ జొరకుండుదాఁకనె, సంసారచక్రంబు సంచరించు

గీ. గర్జనము చేయుచుండ భాగవతగాథ, ముక్తిదానంబునను దీర్థములకు వేద
శాస్త్రపాఠంబులకును యజ్ఞంబులకును, బరువులెత్తుచు నుందురు భ్రాంతమతులు.

క. ఏగేహము నిత్యంబును, భాగవతకథానినాదపరమపవిత్రం
బై గౌరవంబు గాంచునొ, యాగేహమె పుణ్యతీర్థ మందురు ప్రాజ్ఞుల్. 1260

గీ. గంగయును గాశియును బ్రయాగమును గయయు, వాజిమేధసహస్రముల్ వాజపేయ
శతములును భాగవతశతాంశమున కేని, సాటి గానేర విఁకఁ బలుమాట లేల. 1261

గీ. అంతదాఁకనె దేహమునందుఁ బాప, సంతతులు మూఁగికొని యుండు సంతతమును
నెక్కుడుండునొ చెవులకు నెంతదాఁక, భాగవతదివ్యగాథికాపఠనరవము. 1262

వ. ప్రణవంబునకును గాయత్రికిని బురుషసూక్తంబునకును త్రయికిని భాగవతంబునకును
ద్వాదశాక్షరమంత్రంబునకును ద్వాదశాత్మునకును సంవత్సరాత్మకకాలంబునకును
బ్రాహ్మణునకును నగ్నిహోత్రంబునకును సురభికిని ద్వాదశికిని దులసికిని వసంతునకును
బురుషోత్తమునకును బృథగ్భావంబు లేదు. 1263

గీ. అర్థయుతముగఁ బఠియించినట్టులైన, భాగవతము జనుఃకోటిపాతకములు
పాఱిపోవు జనార్దనభటులఁ జూచి, శమనభృత్యులు పఱచెడిచందమునను. 1264

గీ. ప్రతిదినంబును జదివిన భాగవతము, నందు నొకశ్లోక మేని శ్లోకార్ధ మేని
శ్లోకపాదంబు నేనియు శోకరహిత, మైనపద మొందుఁ బాతకుఁడైనవాఁడు. 1265

వ. విష్ణుచింతనంబును దులసీపోషణంబును గోసేవయును భాగవతపఠనంబును సమానంబు
లుగాఁ జెప్పంబడియె. 1266

క. ఆలించిన భాగవతక, థాలాపం బంతకాలమం దింతైనన్
జాలు నది విష్ణుకింకర, జాలములోఁ జేర్చి నిత్యసౌఖ్యము నీయన్. 1267

వ. భాద్రపదపూర్ణిమాతిథియందు హేమసింహయుతభాగవతగ్రంథదానంబు గావించె నేని
విష్ణుసాయుజ్యంబు చేకూరు. 1268

గీ. జన్మమున నెప్పుడేని యేస్వల్ప మేని, భాగవతకథ విననినిర్భాగ్యుఁ డిలను
నాత్మజన్మంబు వితథ చేసినట్టిఁ డగుట, నతఁడు నిజముగ మాతృగర్భార్తికరుఁడు.

క. ఎవఁ డేనియు భాగవత, శ్రవణము నిలఁ జేయకున్న స్వల్పంబైనన్
దివిషదులు వాని జీవ, చ్ఛవముగఁ బశువుగను గణన సలుపుదురు దివిన్. 1270

గీ. జన్మశతకోటిపుణ్యసంచయము లేని, మానవులకు లభింప దేమాత్ర మేని
భాగవతమును వినియెడిభాగ్య మిలను, దానిమహిమంబు నెన్న మాత్రము గాదు.
క. దిననియమము లేకుండఁగ, ననిశంబును భాగవతకథాలాపంబుల్
బొనరింపనలయు దానను, ననవాప్యం బైనధామ మందంగలుగున్. 1272
సీ. సత్యంబునను బ్రహ్మచర్యంబునను సర్వ, కాలంబులందును గలియుగమున
శ్రవణంబు గావింప శక్యంబు గామిని, దుర్లభం బగుటఁ జేతోజయంబు
జనుల కాయుష్యంబు సంక్షీణ మగుటను, సాగకుంటను సదాచారసరణి
యధికదీక్ష వహింప నలవి గాకుండుటఁ, గలి దోషబాహుళ్యకలిత మగుట
గీ. నిత్యమును శ్రద్ధతోడను నియమయుతము, గాఁగ శ్రవణంబు గావింపఁ గలుగు ఫలము
సంఘటిలునట్లు సప్తాహసంశ్రవణము, చేతఁ గలియం దనుగ్రహించెను శుకుండు.
గీ. ఇలను యోగతపస్సమాధులకుఁ గూడ, నందరానిఫలంబు సప్తాహమునను
భాగవతమును వినుటచేఁ బడయఁగలుగుఁ, దన్మహత్త్వంబుఁ దెలుప మాత్రముగాదు.
క. జ్ఞానంబును యోగంబును, ధ్యానంబును యజ్ఞములును దపమును జపముల్
దానంబును దీర్థములును, గానిచి సప్తాహ మడలఁగను గర్జించున్. 1275
సీ. విడిచి కృష్ణుఁడు మున్ను పుడమిని స్వపదంబు, నకుఁ బోవ నున్నసందర్భమందుఁ
గని యుద్ధవుం డిట్టు లనియె నచ్యుత కలి, యుగము వచ్చుచు నుండె నుద్ధతముగ
దుష్టు లం దుద్భవింతురు వారివలనఁ గ్లే, శములు సంప్రాప్తించు సాధువులకు
నపుడు భారంబు మోయఁగలేక విలపించు, ధర నోమ నీకంటె దక్షుఁ డెవఁడు
గీ. కాన సాధుజనంబులపైనిఁ గరుణ, యుంచి పోవంగవలదు నీ వుర్వి విడిచి
యవతరించితికాదె భక్తార్థ మిలను, రూపరహితుండ వయ్యును రూపమునను. 1276
గీ. భక్తు లెల్లరు నిర్గుణోపాసనంబు, కష్ట మగుటను ద్వైవియోగంబుతోడ
నుండఁజాలరు ధరలోన నున్నమాట, మనవి చేసితి నీ వెఱుంగనిది కలదె. 1277
క. అనవుడుఁ గృష్ణుం డాలో, చన చేసి మనంబులోన సవిశేషముగన్
దనతేజము భాగవతం, బున నుంచెను సాధుజనసముద్ధరణమతిన్. 1278
గీ. కానఁ బ్రత్యక్షముగను భాగవత మంబు, జాక్షమూర్తియె యని తెలియంగవలయుఁ
దచ్ఛ్రవణపాఠసేవనదర్శనముల, భస్మమై పోవు ఘోరపాపములు గూడ. 1279
గీ. కలవు బహుసాధనములు మోక్షమును బొంద, నిలను నవ్వానికంటెను గలియుగమున
నధిక మగుసాధనంబు సప్తాహ మందుఁ, జలుపఁబడుభాగవతకథాశ్రవణ మొకఁడె.
గీ. కలియుగంబున దారిద్ర్యకలుషదుఃఖ, కామలోభాదిశత్రువర్గముల నడఁపఁ
జాలుధర్మము సప్తాహసంశ్రవణము, కంటె నెందును వేఱొండు గానరాదు.
క. అని నుడివి భాగవతకథ, ననువుగ వచియించుటకును నారంభింపం
గనె భక్తియుఁ దత్సుతులును, జనుదెంచిరి యావనోల్లసద్గాత్రములన్. 1282

క. తారుణ్యోద్దీపితు లగు, వారిం గని యప్పుర భాగవతమహిమకు నే
పారఁగ విస్మయ మెడలో, నారదుఁ డానందరసమునను నోలార్చెన్. 1283

గీ. అంతటను బారికాంక్షుల కెందఱకును, భక్తి ముక్తి తపోధనప్రవరులార
యెచట నే నుండవలయునో యెఱుకపఱుపుఁ, డనుచు బాలమునీంద్రు లాయమను జూచి.

ఆ. అమ్మ నీవు వైష్ణవాంతరంగగృహంబు, లందు ధైర్యమునను నధివసింపు
మాత్మజోపపన్న నగుచు సంతతమును, గలిభయంబు నీకుఁ గలుగ దందు. 1285

క. అని బోధింపఁగ వైష్ణవ, జనచిత్తగృహంబులందు సత్వరమ వసిం
చెను భక్తి సుతులతోడను, దనయులకును దనకు సమ్మదం బుప్పొంగన్. 1286

గీ. అంతఁ దద్భక్తివల్లభుఁ డగుట శార్ఙ్గి, స్వీయధామప్రయాణంబు విడిచి భక్తి
యున్నచోటనె నివసించె నుండి రెల్ల, విష్ణుభక్తులు సభలోన వినుచుఁ గథను. 1287

సీ. అపుడు నారదుఁ డిట్టు లనియెఁ దాపసులార, సప్తాహమహిమ మాశ్చర్యకరము
పశుపక్షులును గూడఁ బరమపావనము లై, కనుపట్టుచున్నవి కథను వినుటఁ
బరిశుద్ధి నొందెడినరు లెవ్వ రెవ్వరో, సప్తాహహరికథాశ్రవణమునను
దెలియఁబల్కుఁడు నాకుఁ దేటపడంగను, నని కోరుటయును ని ట్లనిరి వారు

గీ. వినుము సప్తాహయజ్ఞంబునను విశుద్ధిఁ, బడయుదురు బ్రహ్మహత్యాదిపాతకులును
నన్నృతవాదులు శఠులు దుర్వ్యసనపరులు, ఖలులు క్రూరులు కుటిలులు కాముకులును.

సీ. ఈవిషయంబున నెఱిఁగింతు మొకయితి, హాసంబు పూర్వమం దవనిలోనఁ
దుంగభద్రాసరిత్కూలంబునం దుండె, నుత్తమం బగునొకపత్తనంబు
దానిలో నుండె నుత్తమగుణుం డై నభూ, దేవుఁ డొక్కం డాత్మదేవుఁ డనఁగ
వానికిఁ గల దొక్కచాన ధుంధులి నాఁగ, స్వమతానుకూలసంచారశీల

గీ. యట్టు లుండంగ వారు కామార్థసహితు, లయ్యు సంతానవర్జితు లగుటఁ జేసి
తన్నిమిత్తము ధర్మంబు లెన్నొ చేసి, తుదకు విసివిరి సంతతి యొదవ కునికి. 1289

సీ. అంతతో నుండక యాత్మదేవుఁడు పుత్ర, తృష్ణచే నొకనాఁడు గృహము విడిచి
చని యొక్కకాననంబున కట నేకాంత, ముగ వసించెడియొకమునిని జూచి
పోయి తదంతికంబునకు సాష్టాంగవం, దన మాచరించి తత్పాదములకు
నిలువంగఁబడియెఁ గన్నీరు కాఱుచు నుండ, దీనాననంబుతో వానియెదుట

గీ. నపుడు యతి చూచి యతనియాస్యంబు విప్ర, చింతిలఁగ నేమి హేతువో చెప్పుము నాఁగ
నాత్మదేవుఁడు మౌని కి ట్లనియె స్వామి, యేను జేసినపాపంబు నేమి చెప్ప. 1290

సీ. నే నిచ్చుసలిలంబు నిజపరితాపని, శ్శ్వాసంబులను గవోష్ణంబు గాఁగఁ
ద్రావు చుండిరి నాపితరులు మదత్తంబుఁ, గొనరు ప్రీతిని విప్రు లనిమిషులును
బ్రజ లేనిభవనంబు ప్రజ లేనిద్రవ్యంబు, ప్రజ లేనిబ్రతుకు నిరర్థకములు
నేను బోషించెడిధేనువు గొడ్డెఱు, నేను బెట్టినచెట్టు నిష్ఫలంబు

గీ. మద్గృహంబున కేతెంచుమంచిఫలము, శుష్క మైపోవు నెంటనె చోద్యముగను
నుండియును నేను బుత్రశూన్యుండ నగుట, లేనివాఁడనె యిహపరస్థానములను. 1291
క. అని పల్కి యేడ్చె బోరున, విని యతి తద్వాక్యములను విశదంబుగఁ గ
న్గొని యోగదృష్టిచే ని, ట్లనియెను భూసుర వచింతు నంతయు నీకున్. 1292
సీ. చూచితి నీకర్మసూత్రంబు లే దప, త్యము నీకు స ప్తజన్మములవఱకుఁ
గర్మంబు తప్పింపఁ గా దెవ్వరికిఁ గూడ, సంతతి లే దనుభ్రాంతి వలదు
సంసారవాసనాక్షయమును గావించు, జ్ఞానంబు నార్జించి మాని వగుము
దాన శాశ్వత మైనయానంద మొడఁగూడు, సంసారమునను విషాద మొదవు
గీ. సగరుఁ డొందెను దుఃఖంబు సంతువలన, దానిపై నాసపడెద వజ్ఞానమునను
బ్రాహ్మణుఁడ వందులోపలఁ బండితుఁడవు, నీకుఁ దెలియని దున్న దె నేను జెప్ప.
గీ. అని ప్రబోధించుటయుఁ గర్మ మపరిహార్య, మగుటచే నాత్మదేవుఁ డి ట్లనియె స్వామి
యెంత బోధించినను నా క దేమొ కాని, సుతులు లేనట్టిజన్మంబు వితగఁ దోఁచు.
గీ. ఏవిధంబున నేని నా కేరుపడఁగ, నేకసుతుఁ డేనియు ననుగ్రహింపు మట్లు
కానియెడ నుజ్జగింతు నాకాయ మిందె, యనుచు నాభిక్షుకుం డిట్టు లనియె మరల.
గీ. చిత్రకేతువు దుఃఖంబుఁ జెందె మున్ను, బ్రహ్మలిఖితాక్షరప్రమార్జనమువలన
నట్లె దై వోపహతుఁ డగు నాగ్రహమునఁ, గార్యసాధకుఁ డై నను గట్టకడకు. 1296
క. అని చెప్పి యొక్కఫల మా, తని కిచ్చి భుజించు నెడలఁ ద్వద్గేహిని దీ
నిని జనియించు సుపుత్రుం, డని పలికి యదృశ్యుఁ డయ్యె నాత్రుటిలోనన్. 1297
గీ. అంతటను నాత్మదేవుఁడు హర్ష మునను, గృహమునకు వచ్చి ఫలము గేహినికొసంగి
దీని భక్షింపు ముదయించు సూనుఁ డనియె, నంత ధుంధుళి గై కొని యాఫలంబు.
గీ. ఎన్నియెన్నియొ చేసితి మింతవఱకు, ధర్మకార్యంబులను సుతార్థంబు దాన
ఫలము లేదాయెఁ దినిన నీపండు నేఁడు, ఫలము కల దని నమ్ముట తెలివి యగునె.
గీ. కానసంబున నేమాయకాఁడొ యొసఁగె, నీఫలంబును దినఁ గీ డేమి యగునొ
యింత తలఁపక యీయమాయికుఁడు తెచ్చి, యిచ్చినంతన వెఱ్ఱినె యేను దినఁగ.
క. అని యాలోచించి మదిన్, దినియెద స్నానంబు చేసి దీనిని బొమ్మా
వని పలుక నాత్మదేవుఁడు, తనపనికిం బోయె నమ్మి తద్వాక్యంబున్. 1301
సీ. అంతట ధుంధుళి యాఫలంబు భుజింప, కుండ గోప్యంబుగా నుంచి యింట
నపుడు దైవికముగా నామెచెల్లెలు రాఁగ, దనయింటి కామె కంతయును జెప్పె
నది యెల్ల విని యామె యక్క చింతిలకుము, ప్రసవించి నేను నాపట్టి నిత్తు
గర్భిణి వై నట్లు కనఁబడు మంతదాఁ, కను నల్లరికును నీకౌశలమున
గీ. నాకుఁ బుట్టినబిడ్డ వినష్ట మయ్యె, ననుప్రవాదంబుఁ బుట్టింతు నపుడు నేను
ఫలపరీక్షను గావింపవలయుఁ గాన, దీనిఁ జెట్టుకు నీయింటిధేనువునకు. 1302

క. అని బోధింపఁగ ధుంధుళి, తనచెల్లెలివాక్యములకుఁ దాను బ్రహర్షం
బును గని వెంటనె ఫలమును, దినిపించెను నిజగృహస్థధేనువుచేతన్. 1303
ఆ. అంతఁ గొంతకాల మరుగఁగఁ గని యొక, కొడుకు నామెభగిని గోప్యముగను
జేర్చి యక్కయింట స్వీయగర్భము నణఁచి, యిుంచినట్లు వెల్లడించె వార్త. 1304
క. అప్పుడు ధుంధుళి భర్తకుఁ, జెప్పెను నా కుద్భవించె శిశు వని మదిలో
నుప్పతిల నాత్మదేవుం, డప్పలుకునకుం బ్రమోద మాసమయమునన్. 1305
గీ. భూరిదానంబుల నొసంగి భూసురులకు, జాతకర్మంబు గావించి శాస్త్రవిధిని
ధుంధుళియభీష్టమునుబట్టి ధుంధుకారి, యనెడినామంబు వెట్టె నయ్యాత్మజునకు.
సీ. అంతట ధుంధుళి యాత్మదేవునిఁ జూచి, బాలునిఁ బెంపఁగఁ బాలు లేవు
జనియించి సుతుఁడు నాస్వసకు నిన్ననె బ్రమండె, నని యింటఁ బిలిపింపు మామె నిటకుఁ
బోషింపఁగల దామె పుత్రునిఁ బాలిచ్చి, స్తన్యంబు విడుచునందాఁక నుండి
యని పల్కుటయును వెంటనె యాత్మదేవుఁడు, పిలిపించె నామెచెల్లెలిని నటకు
గీ. నంతటను ధుంధుళిస్వస యర్భకునకు, స్తన్య మిచ్చుచు నుండెఁ దత్సదనమంద
యట్టు లుండంగ నొకదినమందుఁ బుట్టె, సూనుఁ డొక్కఁడు తద్గృహధేనువునకు.
క. ఆతనికనకప్రభయును, నాతనిసర్వాంగసుందరాకారంబున్
జేతమునకు విస్మయమున్, బ్రీతియుఁ గలిగింప మేదినీసురుఁ డంతన్. 1308
క. తనభాగ్యముచేఁ దనయుం, టను దేవుఁడె పుట్టె గోవునకుఁ బుత్రుఁడు గా
ననుకొని ద్విజసంస్కారము, లను వానికిఁ జేసి బహుకళావిదుఁ డగుటన్. 1309
వ. ఆకుమారునకు గోవునకుంబోలెఁ గర్ణంబు లుండుటంజేసి గోకర్ణుం డనునామకరణంబు
గావించె. 1310
గీ. ఆకుమారునిఁ జూచెడియాశతోడ, నెడతెఱపి లేక వచ్చుచు నేఁగుచుండ
నవనిలోఁ గలజనులు నిత్యమును నాత్మ, దేవునికేతనము పుణ్యతీర్థ మయ్యె. 1311
గీ. అట్టు లుండంగ గోకర్ణుఁ డఖిలవిద్య, లందు నుత్తీర్ణుఁడై జ్ఞాని యయ్యె ధుంధు
కారి దుర్జనసాంగత్యకలుషితాత్మ, వర్తనుం డయి ఖలచక్రవర్తి యయ్యె. 1312
ఆ. అట్లు ధుంధుకారి యపమార్గమునఁ బడి, తగులబెట్టె యున్నధనము నెల్ల
నడ్డుచెప్పుచుండ నప్పు డప్పుడు తండ్రి, వాని నడిచి వీథిలోనఁ ద్రోసె. 1313
సీ. అంతట బలహీనుఁడై యాత్మదేవుఁడు, పదుగురిలో నగుబాటు గాఁగ
నెక్కడ నుండు నే నెచ్చోటి కేఁగుదు, నిక్కడ నున్న నా కెవరు దిక్కు
కనుటకంటెను గుపుత్రుని వంధ్యతయె మేలు, కాకున్న నటు మృతి గనుట మేలు
షష్టిహాయనములు జరిగిపోయిన ని, ప్పటికి నా కీబాము ప్రాప్తమయ్యె
గీ. నని విలాపం బొనర్చుచుఁ బ్రాణములను, నుజ్జగింపఁగ యత్నించు చుండ నప్పు
డతనియొద్దకు గోకర్ణుఁ డరుగుదెంచి, దెల్పెడఁగ భక్తివినయంబు లిట్లు లనియె. 1314

సీ. స్వామి సంసార మసారంబు దుఃఖమో, హములకు నాస్పదం బైనకతన
సుతుఁ డంచుఁ బిత యంచు శోకించు చుందురు, స్నేహబంధంబున జీవు లెల్లఁ
జక్రవర్తులకును శక్రునకును గూడ, సౌఖ్యంబు లేదు సంసారమందు
నజ్ఞానమును విడనాడి వైరాగ్యంబు, నాశ్రయించి సుఖింపు మడవిలోనఁ
గీ. గలుగు నేకాంతజీవికి సులభముగను, జిత్తశాంతియు మోక్షంబుఁ జీకు దొలఁగు
మోహమునఁ జచ్చిపోయెడిమూఢజనులు, ఘోరనరకంబులోపలఁ గూలువార.
గీ. అని ప్రబోధించుటయు విని యాత్మదేవుఁ, డాత్మలోఁ గొంతవిజ్ఞాన మంకురింప
విడిచి నిజసాహసమును వివేకమూర్తి, యైనగోకర్ణునిపదంబులందు వ్రాలి. 1316
ఆ. తండ్రి స్నేహవహ్నిదగ్ధుండ నైననా, కేది దిక్కు యడవి కేఁగి యేమి
చేయవలెనొ నేను జెప్పుము నీవ న, న్నుద్ధరించుబుద్ధి యొదవ నేని. 1317
వ. అని దీనుండై వేఁడుటయు వైరాగ్యపరినిష్ఠితమానసుం డగుగోకర్ణుండు వాని కిట్లనియె.
సీ. అస్థిమాంసాస్రమయం బైనమేనిపై, నుండినయభిమాన ముజ్జగించి
జాయాసుతాదిస్వసంబంధిజనులందు, నెనసినమమకారమును ద్యజించి
క్షణభంగురంబుగా జగమును జూచుచుఁ, బోనీకవ్యవహారములకు మనసు
వైరాగ్యమును బొంది వస్తుసంతతులందు, విష్ణువె గతి యని విశ్వసించి
గీ. భాగవతదశమస్కంధపఠనమునను, గాలమును బుచ్చు చుండుము కాయ ముడుగు
నంతదాఁకను దేహాంతమందు నీకుఁ, బ్రాప్తమయ్యెడి మోక్షసామ్రాజ్యలక్ష్మి.
ఆ. అని వచించుటయును నాత్మదేవుఁడు ధైర్య, మును వహించి చిత్తమునను నపుడె
పోయి యొక్కవిపినమునకు గోకర్ణుఁడు, చెప్పినట్లు చేసి చెందె ముక్తి. 1320
సీ. ఆత్మదేవుఁడు కాన కరిగినపిమ్మటఁ, దోషితస్వాంతుఁడై ధుంధుకారి
ధనము మాతండ్రి యుంచినతావు చెపు మని, యడిగి తల్లి నెఱుంగ ననుడు నామె,
చెప్పకుండిన నిన్నుఁ జీల్చివైచెద నని, బాదంగ బఱ్ఱెను బాదినట్లు
తద్బాధపడలేక తనలోన నేడ్చుచు, ధుంధులి బావిలోఁ దూఁకి చచ్చె
గీ. నంతటను ధుంధుకారి నిరంకుశముగఁ, దిరుగుచును భోగినులను నేగురను నింటఁ
జేర్చికొని వారి కెంత యిచ్చినను ధనము, చాలమిని దొంగతనమును జలుపఁదొడఁగె.
వ. అతని దురాకృతంబు లెల్లం జూచుచు నింట నుండంజాలక గోకర్ణుండు తీర్థయాత్ర
గావింపఁ బరదేశంబునకుం జనియె. 1322
గీ. అట్లు చౌర్యంబు చేసి ద్రవ్యమును భూషణములు వస్త్రంబులును దెచ్చియమితముగను
ధుంధుకారి యొసంగ నత్తొయ్యలులకు, వారు గైకొని తెచ్చినవాని నెల్ల.
సీ. ఒకరేయి యన్యోన్య ముత్సాహమున నొక్క, స్థానంబునను రహస్యముగఁ జేరి
కావించి వీఁడు దొంగతనంబు నీపీటఁ, దెచ్చినదంతయు నిచ్చె మనకు
నిది పురపాలకుం డెఱిఁగినచో మన, ప్రాణంబులకుఁ గూడ హాని గలుగుఁ
గావున నీరాత్రికాలంబునను నిద్ర, లో నున్నవీని నెట్లైనఁ జంపి

గీ. ప్రాక్చిపెట్టె నికేతనంబున నె మనము, గుప్తముగఁ బోద మిది యెల్లఁ గొని యటంచుఁ
జేసి యాలోచనము నట్లె చేసి రెంత, సాహసము నైన నతివలు సలుపువార. 1324

క. తరుణులవచనము లమృతము, క్షురధార మనంబు దానిఁ జూడక చెలులన్
నరు లెవరు విశ్వసింతురొ, పరిభవములు పొంది దుఃఖపడుదురు వారల్. 1325

గీ. అంత నాధుంధుకారి నిజాఘమునను, బ్రేత యై వాత్యారూపంబుచేత నచట
నచటఁ దిరుగుచు శీతాతపాదిబాధ, కాఁకలికి నోర్వలేక యల్లాడఁదొడఁగె. 1326

సీ. ఆవిధి బహుకాల మరుగంగ నొకనాఁడు, గయ కేఁగుదెంచి గోకర్ణుఁ డుండ
నరుదెంచి యొకపాంథుఁ డతనియొద్దకు ధుంధు, కారి నశించినకథను జెప్పె
నంతట గోకర్ణుఁ డాధుంధుకారికి, నచ్చట శ్రాద్ధంబు నాచరించి
స్వపురంబునకు వచ్చి స్వగృహంబునను రేయి, నిదురించుచుండ నానిద్రలోనఁ

గీ. గనఁబడియె నాతనికి ధుంధుకారి యొక్క, సారి మేషంబుగను నొక్కసారి మహిష
ముగను నొకసారి సామజంబుగను నొక్క, పరిఁ బిసాచిగ నొకపరిఁ బురుషుఁడుగను.

సీ. అంతట గోకర్ణుఁ డారూపముల నెల్లఁ, గని మేలుకొని చివాలునను లేచి
యెవ్వఁడ వీ వేల యీవేషములు నీకు, నీకథ యేమియొ నాకుఁ జెపుమ
యనవుడుఁ బ్రేత నోరాడమిఁ జెప్పంగ, సారెసారెకు నేడ్వసాగె నంత
గ్రహియించి దాని గోకర్ణుండు మంత్రోద, కము పైనిఁ జల్లి వాగ్బంధ ముడిపె

ఆ. నంత ధుంధుకారి యాత్మవృత్తాంత మం, తయును జెప్పి యేడ్చి తండ్రి నేను
బ్రేతరూపమును భరింపలే నిఁక నెట్టు, లేని యుద్ధరింపు మీవె దిక్కు. 1328

క. అనవుడు గోకర్ణుం డి, ట్లనియెను సోదర్య నే గయాశ్రాద్ధంబున్
బొనరించితి నీకొఱ కది, వినిహత మై పోవ నింక వేఱె ముందున్. 1329

గీ. ప్రేతరూపంబు దొలఁగింప భూతలమునఁ, జాలునది చూడఁగను గయాశ్రాద్ధ మొకఁడె
యంతకంటె నుపాయ మన్యంబు నీకుఁ, దెలిసిన వచింపు మది నేను సలుపువాఁడ.

గీ. అనుటయును ధుంధుకారి యి ట్లనియెఁ దండ్రి, సలిపినను నీవు శతగయాశ్రాద్ధములను
గలుగనేరదు ముక్తి నాకలుషమునకుఁ, గాన గమనింపు మన్యమార్గమును నీవె.

క. అనవుడు గోకర్ణుఁడు తన, మనమున విస్మయము నొంది మార్గాంతరమున్
గనుఁగొనియెద నట్లైనను, జనుము భవత్స్థానమునకుఁ జయ్యన ననియెన్. 1332

గీ. అంత నాధుంధుకారి తదాజ్ఞ వడసి, చనియెఁ దా నుండునట్టిశ్మశానమునకు
నవల గోకర్ణుఁ డతని కెట్లైన ముక్తిఁ, గలుగఁజేయంగ దృఢముగాఁ దలఁచి లోన.

గీ. జ్ఞానులును యోగనిష్ఠులు ధ్యానపరులు, బ్రహ్మవాదులు విద్వదగ్రణులు గలుగు
స్థానమున కేఁగి జరిగినచరిత మెల్లఁ, దెలిపి తన్ముక్తిమార్గంబుఁ దెలుపుఁ డనఁగ.

వ. వార లెల్లరును శాస్త్రంబుల నన్వేషించి తన్ముక్తిసాధనంబుం గానక యేతద్విషయం బునఁ గర్మసాక్షివచనంబు ప్రమాణం బని యేకగ్రీవంబుగా నిర్ణయింప గోకర్ణుండు సౌరమంత్రంబుచే నాదిత్యుని నిలిపి నమస్కరించి తనసంశయంబు నడుగ భాస్కరుండు

ప్రసన్నుండై గయాశ్రాద్ధంబువలనను విముక్తి లేని ప్రేతకు సప్తాహభాగవతశ్రవణంబు
వలన విముక్తి చేకూరు నని నిర్గమించె. 1335

సీ. అంతట ద్విజు లెల్ల నాశ్చర్యమును బొంది, ధ్వనిరూప మగురవివాక్యములకు
సప్తాహ మిచటనె సలుపుము గోకర్ణ, యనుటయు నాతఁ డాహ్లాద మొదవ
సంకల్ప మొనరించె సప్తాహయజ్ఞంబు, నాచరింపఁగ బ్రాహ్మణానుమతిని
నపుడు వచ్చిరి జను లట కసంఖ్యాంబు గా, భక్తితో నాలింప భాగవతము

గీ. నంతఁ గూర్చుండి గోకర్ణుఁ డాసనమునఁ, జదువ భాగవతంబును మొదలువెట్ట
నత్తఱినె ధుంధుకారియు నరుగుదెంచి, శ్రవణ మొనరింపఁగను బహుశ్రద్ధతోడ. 1336

వ. తత్సమీపంబునంద సప్తగ్రంథియుక్తం బగునొక్క వంశంబు నుపలక్షించి తాను ప్రేత
యగుట వాయురూపంబునఁ దన్మూలరంధ్రంబునం బ్రవేశించె. 1337

సీ. అంతట గోకర్ణుఁ డాదినాంతము పఠి, యించి నాఁటికి విరమించుటయును
నపుడు గల్గఁగ విస్మయము పెద్దరొదతోడ, వంశాదిమగ్రంథి వ్రక్క లయ్యెఁ
బ్రథమదినంబునంబలె మఱునాఁడును, జదివి యాఁపుటయు నాసమయమునకు
నయ్యె వంశద్వితీయగ్రంథిభేద మా, తీరున నొగి నేడుదివసములును

గీ. బ్రద్దలయ్యెను గీచకగ్రంథు లేడుఁ, దత్క్షణమ ధుంధుకారి ప్రేతత్వ ముడిగి
దివ్యరూపంబుతోడను దేజరిలుచుఁ, జలిపి గోకర్ణునకు నమస్కారములను. 1338

గీ. తండ్రి ప్రేతత్వ ముడిగె నీదయను నాకు, నన్నుఁ దరియింపఁజేసినపున్నమునను
ధన్యతను బొందితివి నీవు ధన్యతమము, భాగవతము సప్తాహంబు పావనంబు. 1339

గీ. వినినమాత్రనె సప్తాహ మసదీమాట, కంపమును బొందుఁ బాపసంఘంబు లెల్ల
భరతవర్షంబులోపల భాగవతము, వినినివారలజన్మంబు వితయ చూవె. 1340

ఆ. సర్వకర్మములును సంక్షయంబును జెందు, సంశయంబు లెల్ల సమసిపోవు
భిన్నభిన్నమై నశించు మనోగ్రంథి, వినిన భాగవతము వీనులార. 1341

క. అని పలుకుచుండ హరిభట, జనులు విమానంబు నెక్కి చనుదెంచి రయం
బున నందు ధుంధుకారిని, నునిచి కొని చనంగ దివికి నుద్యుక్తులు గాఁ. 1342

సీ. వారిని గని నమస్కారంబు గావించి, గోకర్ణుఁ డత్యంతకుతుక మొదవ
విష్ణుకింకరులార వీనితో సాటిగ, భాగవతము విన్న భక్తజనులు
కల రసంఖ్యాకు లిక్కడ వీరి నెల్లరఁ, గొనిపోవ రేల వైకుంఠమునకు
ననవుడు వార లిట్లనిరి సప్తదినంబు, లుపవాస మొనరించి యుక్తముగను

గీ. శ్రవణ మొనరించి దిన మెల్ల రాత్రివేళఁ, జలిపె మననంబు నీతఁడు శ్రద్ధతోడఁ
గాన వీనికి వీరికిఁ గలిగె శ్రవణ, భేద మాహేతువున ఫలభేద మొదవె. 1343

సీ. హతము దార్ఢ్యవిహీన మైనజ్ఞానము ప్రమా, దప్రాప్త మైనశ్రుతంబు హతము
హతము సందిగ్ధ మైనట్టిమంత్రంబు వై, ష్ణవహీన మైనదేశంబు హతము

హతము పాత్రవిహీన మైనశ్రాద్ధము సదా, చారంబు లేనివంశము హతంబు
హతము పాత్రున కీయనట్టిదానము నిశ్చ, లముగఁ జేయనిశ్రవణము హతంబు
గీ. సత్స్వరంబుగఁ జేసెడిజపము హతము, మంత్రవిశ్వాసవిరహితమతి హతంబు
కాన వీ రెల్లశాస్త్రయుక్తముగ మరల, శ్రవణ మొనరింప వైకుంఠసదన మొదవు.
క. అని తెల్పి విష్ణులోకం, బున కేఁగిరి విష్ణునామములఁ గీర్తనముల్
బొనరించుచు నట నుండిన, జను లెల్లరుఁ జూచు చుండ సంతోషమునన్. 1345
సీ. అంతట గోకర్ణుఁ డచటనె మరల శ్రా, వణమాసమున భాగవతము భక్తిఁ
జదువంగ మొదలిడి సప్తాహమునయందు, ముగియించె జగ మెల్ల ముదము నొంద
నంతిమదినమున నచ్యుతుం డేతెంచి, సపరివారముగ దర్శన మొసంగి
యెక్కించి శ్రోతల నెల్ల దివ్యవిమాన, ములయందు వైకుంఠమునకుఁ బనిచి
గీ. తనవిమానంబునం దుంచికొని ప్రహర్ష, మెనయ గోకర్ణుని నుపర్వు లెల్లఁ బొగడ
నరిగె గోలోకమునకు నత్యద్భుతముగ, భాగవతసేవచేఁ గల్గుఫలమె ఫలము. 1346
వ. ఆషాఢశ్రావణభాద్రపదాశ్వయుజకార్తికమార్గశీర్షమాసంబులు భాగవతశ్రోతలకు మోక్షదాయకంబులు. శ్రవణారంభమునకు సూతసూతకసంభవంబునంజేసి ద్వాదశి వర్జనీయంబు. భౌమశనివారంబులును ధ్రువమృదునక్షత్రంబులును త్యాజ్యంబులు. సప్తాహశ్రవణంబునకు భక్తాహ్వానం బవశ్యకర్తవ్యంబు. తీర్థవనగృహంబులు శ్రవణార్హస్థానంబులు. పాషండవాదులును నాస్తికులును శ్రవణానర్హులు. సప్తాహమధ్యంబున క్షౌరమైథునాదికార్యంబు లప్రశస్తంబులు. మండపంబున విష్ణుప్రతిష్ఠ గావించి విష్ణుపూజయును భాగవతగ్రంథపూజయును నిత్యంబును సంగ్రహంబుగాఁ గావించి భాగవతంబు పఠింపందగు. శ్రవణారంభంబున ద్వాదశాక్షరవిష్ణుమంత్రజపంబును వక్తృపూజయును నియమగ్రహణంబును శ్రోతలకు ముఖ్యంబులు. 1347
గీ. విష్ణుసంకీర్తనంబు గావించునట్టి, భాగవతులయనుజ్ఞను బడసి యున్న
తాసనంబునఁ గూర్చుండ నగును వక్త, యతని శుకదేవునిఁగ నెంచ నగును శ్రోత.
వ. సూర్యోదయంబు మొదలుకొని సార్ధత్రిప్రహరాంతంబువఱకును బఠనంబు కార్యంబు. మధ్యాహ్నంబున ఘటికాద్వయంబు విరామంబు గొనందగు. సప్తరాత్రంబును నుపవాసంబు గావించి శ్రవణంబు గావింపందగు. శక్తి లేనియెడల ఘృతపాయసంబునంగాని పయఃపానంబునంగాని ఫలాహారంబునంగాని యేకవారభుక్తింగాని శ్రవణంబు గావింపనగు. సప్తాహవ్రతస్థులు వ్రతనియమంబులం గైకొనందగు. 1349
క. వినవలయు భాగవతమును, ననపత్యులు మోక్షకాము లర్థవిహీనుల్
జనవశకాంక్షులు రుగ్ణులు, వనజాక్షుని కేతనాధివాసాపేక్షుల్. 1350
క. శుకశాస్త్రశ్రవణంబున, సకలప్రతిబంధములును క్షయమున్ జెందున్
సకలాఘములును దొలఁగును, సుకరంబుగ నొందఁగలుగు శోకజయంబున్. 1351

వ. ఫలకాంక్షులు జన్మాష్టమీవ్రతంబునకుంబోలె సప్తాహశ్రవణంబున కుద్యాపనంబు గావింపవలయు. నిష్కాము లగుభక్తుల కుద్యాపనావశ్యకత లేదు. సప్తాహయజ్ఞపరిసమాప్తియందు గ్రంథపూజయును వక్తృసమ్మానంబును గోభూహిరణ్యాదిదానంబులును గావింపందగు. గృహస్థుం డైనచో దశమస్కంధంబునందలి ప్రతిశ్లోకంబునకును మధుపాయసఘృతతిలాన్నహవిర్ద్రవ్యంబులచేఁ గర్మశాంతికొఱకు హోమంబు గావింపంజను. హోమాశక్తుం డైనఁ దత్ఫలప్రాప్తికై హోమద్రవ్యదానంబు గావించి సర్వలోపనివారణార్థంబు విష్ణునామసహస్రపారాయణంబు చేసి ద్వాదశబ్రాహ్మణులకు భోజనముం బెట్టవలయు. శక్తుం డైనయెడల పలత్రయపరిమితం బగుసువర్ణసింహంబును లిఖితభాగవతగ్రంథంబును బూజించి యాచార్యున కర్పింపవలయు. విరక్తుం డైనచో సప్తాహపరదినంబున గీతాపఠనంబు గావింపవలయు. కలియుగంబునఁ ద్రింశద్వర్షకాలంబు గడచినపిదప భాద్రపదశుద్ధనవమినాఁడు శుకుఁడు పరీక్షిత్తునకును ద్విశతవర్షకాలంబు గడచినపిమ్మట నాషాఢశ్రావణశుక్లనవమీదినంబులందు గోకర్ణుండు బ్రాహ్మణులకును షడుత్తరత్రిశతవర్షకాలంబు గడచినతరువాత కార్తికశుక్లనవమినాఁడు సనకాదులు నారదునకును సప్తాహవిధానంబున భాగవతకథ వినిచి కృతార్థులం గావించిరి. 1352

క. శుకశాస్త్రముకంటెను వే, ఱొకమార్గము లేదు భవపయోధినిమగ్నుల్
సుకరముగఁ బార మొందఁగఁ, బ్రకటింపఁగ నేటి కింక బహుభాషణముల్. 1353

—: కాళిందీమాహాత్మ్యము :—

క. అని పలుకుటయును శౌనక, మునివర్యుఁడు పొందె హర్షమును సూత వినం
గను యమునామాహాత్మ్యము, జనియించెను వేడ్క చెప్పుమ సవిశేషముగన్.
వ. అని కోరుటయు సూతుం డాతని కిట్లనియె. 1355
సీ. తాపసోత్తమ మున్ను ధర్మజుం డొకనాఁడు, సౌరభికడ కేఁగి సవినయముగ
నొనరించి వందనంబును స్వామి విన నాకు, యమునామహత్త్వము నాశ గలిగె
ననవుడు సౌరభిమునివరుండు ప్రమోద, మొనయంగ నాతని కిట్టు లనియె
ధర్మజ విను మొకతఱిని బర్వతనార, దులు పోవుచును నభస్స్థలమునందుఁ
గీ. గాంచి ఖాండవవనము నక్కడను డిగ్గి, స్నాన మొనరించు చుండంగ జమునలోన
వేటకై శిబి వచ్చి యావిపినమునకు, నామునీంద్రులఁ గనుఁగొని యమునలోన. 1356
గీ. చలిపి స్నానంబు ధౌతవస్త్రములు వారు, కట్టుకొని వచ్చునంతాఁక నట్టె నిలిచి
వారు తత్తీరమునకు నేతేర నంతఁ, దత్పదాంబుజములకు వందన మొనర్చి.
సీ. శమధనులార యీయమునాతటంబున, స్వర్ణయూపంబు లసంఖ్యముగను
గనఁబడుచుండె నిక్కడ యజ్ఞములు నృప, కొనరించి నిల్పె రీయూపములను

నీచట నున్నవిశేష మేమియొ దయతోడఁ, దెలుపుఁడు మీర నాకుఁ గలిగె వేడ్క-
యని వేఁడుటయు నిట్లు లనియె నారదుఁడు భూ, వర వచించెదను సర్వమును వినుము
ఆ. మును హిరణ్యకశిపుఁ డనుదైత్యనాథుఁడు, త్రిదశులను జయించి దివముఁ గొనఁగ
నపుడు హరి నృసింహుఁడై వాని వధియించి, యిచ్చె మరల దివము వృత్రహునకు.
సీ. అంతట వజ్రి బృహస్పతికడ కేఁగి, సాష్టాంగవందన మాచరించి
యాచార్య తలఁచితి నధ్వరంబులు సేయ, నావహిల్లఁగఁ దృప్తి యచ్యుతునకుఁ
దత్త్రిదశార్హం బగుధామంబు నెఱిఁగింపు, మని వేఁడుటయు నిట్లు లనియె గురువు
కలదు పావన మైనఖాండవవన మిల, నట నుండె యమున పుణ్యస్రవంతి
గీ. తలఁచునెడ దాని స్వర్గంబు గలుగు నచటఁ, దనువు విడిచిన బ్రహ్మపదంబు గలుగుఁ
దత్తటంబునఁ జేయు మధ్వరము లెందవు, హరికి సంతృప్తి నీకును నగు శుభంబు.
సీ. అని వచింపఁగ నింద్రుఁ డాహ్లాద మొదవంగ, నచటికి సురలతో నేఁగుదెంచి
ఋత్విజులుగ వరియించి బ్రహ్మర్షుల, నారంభ మొనరించె నధ్వరంబు
నపుడు విష్ణువు బ్రహ్మహరులతోడను గూడి, యరుదేర వారికి హరిహయుండు
కావింపఁదగినట్టిగౌరవం బొనరించి, దితితనూభవవైరిదిక్కు- చూచి
గీ. జలజలోచన మూఁడుమూర్తులును నీవె, విధియు హరుఁడును నీకంటె వేఱు గారు
స్ఫటికమునకు బహుత్వ మేర్పడినయట్లు, గలిగె నీకు నుపాధులవలన బహుత. 1360
గీ. కాష్ఠములలోన గూఢంబు గాఁగ నుండు, నగ్ని ఘర్షణమున వచ్చునట్లు పైకి
నఖిలభూతాంతరాత్ముఁడ వైననీవు, ప్రాప్తమగుదువు కేవలభక్తిచేత. 1361
క. వారు తరింపంగలిగిన, వా రీజగమంతయును నవాస్తవ మని ని
ర్ధారణము సేసికొని యె, వ్వారలు భజియించెదరొ భవత్పాదములన్. 1362
వ. అని సన్నుతించుటయు నమందానందంబు నొంది పుండరీకాక్షుం డిట్లనియె. 1363

—: ఇంద్రప్రస్థమాహాత్మ్యము :—

సీ. శక్ర కోరికతోడఁ జలుపుటచే మున్ను, క్రతుశతంబును స్వర్గరాజ్య మొదవెఁ
గడఁగితి నేఁడు నిష్కామంబుగను జేయఁ, గ్రతువుల సంతృప్తి గలుగ నాకు
నచ్చెరియము నొంద నక్కఱలే దిందు, గురువగుటను జేసి గురువు నీకు
నలుపుచు బహుయజ్ఞముల నిట్టి యందు ర, త్నప్రస్థముల నిమ్ము దక్షిణలుగ
ఆ. దాన నీస్థలంబు దాల్చు నింద్రప్రస్థ, మనెడిపేరు తావకాఖ్య వెలయ
సర్వయజ్ఞములను జలిపినపిమ్మటఁ, బ్రాప్తమగు మదీయపదము నీకు. 1364
సీ. స్రష్ట ప్రయాగతీర్థము నిల్పు మిచ్చోట, గంగాసరస్వతీసంగతము గ
గౌరీశ శివకాంచిఁ గాశి నిచ్చట నుంచి, యుమతోడ నీవును నుండు మిందె
బ్రహ్మాత్మభవులార భవదీయమహిమచేఁ, జలుపుఁ డిచ్చటఁ దీర్థసప్తకంబు
సమతదేశిక సృజింపుము నిగమోద్బోధ, కం బనుపుణ్యతీర్థంబు నిచట

గీ. మునిఁగినంతనె త్వత్తీర్థమున లభించుఁ, జదువ కున్నను వేదముల్ శాస్త్రములును
బూర్వజన్మస్మృతియు నబ్బుఁ బూర్ణముగను, నేను ద్వారక నిచ్చోట నిలుపువాఁడ.
వ. నా ద్వారకాపురంబున గోమతీసముద్రసంగమంబు గలుగు. మఱియును నే నిచ్చటఁ
గోసలయును మధువనంబును బ్రతిష్ఠించి వానిలో రామకృష్ణనామంబులతోడ నవత
రింతు. మఱియును నరనారాయణాస్పదం బగుబదర్యాశ్రమంబును హరిద్వారంబును
బుష్కరంబును నైమిశారణ్యకాలంజరాద్రిసరస్వతీమహానదీతటంబులం దుండుతీర్థంబు
లన్నియును నిచ్చట నెలకొల్పువాఁడ. 1366
సీ. అని పల్కుటయును వెంటనె యుక్తకార్యంబు, లన్నియు జరిగె నత్యద్భుతముగ
శక్రుఁ డిచ్చోట నసంఖ్యాకమఖములఁ, జేసి వైకుంఠుండు చెప్పినట్లు
స్వర్ణయూపంబుల స్థాపించె నిచ్చోటు త, దాది యింద్రప్రస్థ మనఁగఁ బరగె
నధ్వరాంతమున బ్రాహ్మణులు వాసవదత్త, సత్కారములకు హర్షమును బొంది
గీ. యింద్రున కనుగ్రహించిరి యిలను బుట్టి, యవనిసురుఁడుగఁ దుదిఁ దురీయాశ్రమంబుఁ
బడసి నిజతీర్థమును జొచ్చి పడసి పూర్వ, జననసంస్మృతి మోక్షంబు నెనయునట్లు.
సీ. అంతట వాసవుం డరిగి స్వర్గమునకు, హరిచింతనాసక్తుఁ డగుచు నచటఁ
బాలించి యొకకొంతకాలంబు సురలను, దత్పుణ్య ముడుగంగఁ దత్క్షణంబ
ధరణిలో హస్తినపురమందు శివశర్మ, యనెడిబ్రాహ్మణునకు నాత్మజుఁడుగ
జనియించె సుముహూర్తమున నంత శివశర్మ, దైవజ్ఞుఁ డగుటఁ దద్భావ్య మెఱిఁగి
గీ. యాతనికి విష్ణుశర్మాహ్వయంబుఁ బెట్టి, యుక్తకాలంబున నొనర్చి యుపనయనము
ద్వాదశాబ్దంబులవఱకు వేదములఁ జెప్పి, సాంగముగఁ బిమ్మటను వివాహంబు సేసె.
గీ. అంతటను విష్ణుశర్మ గృహస్థవిధుల, నాచరించుచుఁ దనసతియందు నొక్క
యాత్మజునిఁ గాంచి సంసారమందు విరతి, గల్గుటను దనజనకునికడకుఁ జేరి. 1369
సీ. తండ్రి స్వాధ్యాయసంతతుల చేత ఋణద్వ, యంబు దీర్చెడిభాగ్య మబ్బె నాకు
సంసారసుఖములు జలబుద్బుదాభముల్, సక్తుఁడు గాఁ డండె సతము బుధుఁడు
హరితృప్తికై తీర్థయాత్ర గావించి స, న్న్యాసంబు గైకొని యంతమందుఁ
బ్రారబ్ధ ముండెడునంతదాఁకను నుండుఁ, దెలచుచు హరి నొకతీర్థమందు
గీ. నాజ్ఞ యొసఁగుము పోయెద నని వచింప, విబుధుఁ డగుటను శివశర్మ విని తదుక్తు
లెనయఁగను సంతసం బుంచి గృహాభరంబు, స్వద్వితీయాత్మజుఁ డగుసుశర్మ మీఁద
ఆ. విష్ణుశర్మతోడ వెడలిపోయి యొనర్చి, తీర్థయాత్ర జన్మసార్థకతకు
నేఁగుదెంచెఁ గడకు నీతీర్థమున కాత్మ, పుణ్యవశముచేత బుద్ధిపుట్ట. 1371
ఆ. అపుడు విష్ణుశర్మ యది చూచి పూర్వజ, న్మస్మరణము గలుగ విస్మయముగ
జూచె నేను మున్న శక్రుండ నై యిటఁ, జలిపినాఁడ భూరిసవనములను. 1372
సీ. యమునాతటంబునయందుఁ గానంబడు, స్వర్ణయూపములు మత్స్థాపితముల
స్రష్ట గంగాసరస్వతులతో నీస్థాన, మం దేర్పఱిచెఁ బ్రయాగ మదియె

భర్గుఁడు తత్పూర్వభాగంబునందు మో, క్షదము గా నుంచినకాశి యదియె
తత్పశ్చిమమునను ధనుశ్శతపంచశతి, క్షమ ననుగ్రకృతశివకాంచి యదియె
గీ. దానికి ధనుర్ద్వయీమితధాత్రియందుఁ, ద్రిపురహరకృతగోకర్ణతీర్థ మదియె
దానికి శరాసనసప్తతిమానధరను, గృష్ణుఁ డుంచినద్వారకాక్షేత్ర మదియె. 1373
గీ. ద్వారకాక్షేత్రచాపసప్తతిమితోర్వి, యందు మ్రందఁ జతుర్భుజుం డగుఁ నరుండు
కాశిలోన ద్విపంచాశదాశుగాన, మహిని జచ్చిన మరల జన్మంబు లేదు. 1374

వ. ద్వారకకుఁ బూర్వదిగ్భాగంబునం దష్టాదశధనుర్మితప్రదేశంబునందుఁ గోసలయును గోసలాపశ్చిమభాగంబున దశచాపప్రమాణదేశంబున మధువనంబును దాని కుత్తరభాగంబున నేకాదశధనుఃప్రదేశంబున బదర్యాశ్రమంబును దానికి దక్షిణంబుగాఁ ద్రింశద్ధనుఃప్రదేశంబున హరిద్వారంబును దానికి ద్వాదశవ్యాసమాత్రభూభాగంబునఁ బుష్కరతీర్థంబును బ్రయాగంబునకుఁ బూర్వంబుగా నేకగవ్యూతిమాత్రప్రదేశంబున సప్తర్షుల సప్తతీర్థంబులును గలవు. కాశీతీర్థసప్తకంబులం దనేకపుణ్యతీర్థంబులు గలవు. ప్రయాగంబునకుఁ బశ్చిమంబుగా నేకగవ్యూతిమాత్రప్రదేశంబున బృహస్పతిస్థాపితం బగు నిగమోద్బోధకతీర్థంబు గలదు. కాళిందికిఁ బూర్వపశ్చిమభాగంబులం దేకయోజనవిస్తృతియును దక్షిణభాగంబున యోజనచతుష్టయవిస్తృతియును నింద్రప్రస్థంబునకు మర్యాదగా మహర్షులచే నేర్పఱుపంబడియె. మత్కృతయజ్ఞంబులందు నేను బ్రాహ్మణోత్తములకు రత్నప్రస్థంబు లొసంగుటచే నీస్థానం బింద్రప్రస్థనామముం బడసి పుణ్యతీర్థం బయ్యె. అమ్మహాత్ములు నాకిచ్చోటఁ బూర్వజన్మస్మృతి చేకూరునట్లును దనుత్యాగం బగునట్లును హరిపదంబు చెందంగలుగునట్లును ననుగ్రహించుటం జేసి నేను నాపూర్వవృత్తాంతంబు నెఱుంగంగలిగితి. నిగమోద్బోధకంబునందు స్నానంబు గావించితి నేని సర్వంబును విదితం బగు నని చెప్పుటయును శివశర్మ కౌతుకంబునఁ దత్తీర్థంబునందు మునుంగ నుద్యమించుచుండ భీతుండై పరువెత్తుకొనివచ్చునొక భిల్లుండును వానివెంటంబడి గర్జించుచు నరుదెంచునొక్కసింహంబునుం గానంబడియె.

సీ. అప్పుడు వడఁకుచు నాశివశర్మయు, నావిష్ణుశర్మయు నాశ లుడిగి
యెట్లొ తటుక్కున నెక్కిరి తత్తట, సంస్థితం బగునొకశాఖిమీఁద
నంతట నాభిల్లుఁ డటకు వచ్చెడునంత, లోన సింహము దూఁకి వానిఁ బట్టె
నపుడు వాఁ డుడిగి ప్రాణాశ నెట్టులొ దానిఁ, బొడిచి కుంతమునఁ దాఁ బడియె భువిని
గీ. కుంతఘాతంబునకు వ్రీల గుండె సింహ, ముడిగె నసువుల వాఁడును మడిసె నంత
భిల్లునకు సింహమునకుఁ బ్రాప్తించె దివ్య, దేహములు పూర్వజన్మస్మృతియును గలిగె.

వ. ఆసమయంబున విష్ణుభటులు దివ్యవిమానంబులతోడఁ దదంతికంబునకు విచ్చేసి విమానంబుల నెక్కుం డని వేఁడుటయు నాభిల్లసింహంబులు వారలం జూచి. 1377

సీ. హరిభటులార పాపాత్ముల మగుమాకు, నీదివ్యదేహంబు లేల కలిగెఁ
బూర్వజన్మజ్ఞానమును. నెట్లు చేకూరె, వినిపింపుఁ డని వేఁడ విష్ణుభటులు

కని వారికి నీతీర్థమునఁ జచ్చుటనుజేసి, ప్రాప్తించె మీ కీమహత్త్వ మెల్ల
నిందు మ్రందినవారి కెల్ల నీమహిమంబు, సమకూరఁ గరుణించె శౌరి మున్ను
గీ. శీఘ్రముగ రండు మాధవసేవఁజేయు, సమయ మయ్యెడి నన వారు ప్రమద మొదవ
నెక్కి దివ్యవిమానంబు లేఁగి విష్ణు, పురమునకుఁ జేరి రాశ్చర్యకరము గాఁగ. 1378
గీ. అది కనుంగొని విస్మయ మావహిల్లఁ, దండ్రియు సుతుండు దిగిరి పాదపమునుండి
యంత శివశర్మ తత్తీర్థమందు మునిఁగి, సలిపి సంధ్యాదివిధులను సక్రమముగ. 1379
వ. తత్తీర్థస్నానంబునఁ బూర్వజన్మస్మృతి కలుగుటంజేసి యచ్చెరువుపాటొందుచుఁ దత్తీ
రంబునం దుపవిష్టుండై విష్ణుశర్మం గాంచి యి ట్లనియె. 1380
గీ. తనయ నీమాట తథ్యంబు మునిఁగినంత, మాత్రమున నిందుఁ బూర్వజన్మప్రవృత్తి
యంతయును గోచరం బయ్యె నద్భుతముగ, వినుము సర్వంబు వినిచెద విశదముగను.
సీ. పూర్వము భూతలంబున నుండెఁ గాన్యకు, బ్జంబు నాఁగను నొక్కపట్టనంబు
దానిలో శరభాభిధానంబునను నొక్క, యూరవ్యుఁ డుండె నత్యుత్తముండు
వానికం బొదవ నావైశ్యుండు చింతింపఁ, దొడఁగెఁ బుత్రులు లేమి కెడఁదలోన
నటు లుండ నొక్కనాఁ డతనియింటికి వచ్చె, దేవలుం డనుయోగి దైవికముగ
గీ. నపుడు శరభుండు యోగి కత్యాదరమునఁ, బూజ గావించి తనచిత్తమునఁ గలట్టి
చింత యెఱిఁగింప నమ్మౌని కొంతతడవు, ధ్యాన మొనరించి సర్వంబుఁ దా గ్రహించి.
సీ. ఆర్య చెప్పెద విను మంతయు నొకనాఁడు, త్వత్పత్ని సుతవాంఛ దనర మదినిఁ
జని చండికాలయంబునకుఁ బార్వతి భవ, త్కరుణచేతను నాకు గర్భ మైన
నుత్సవంబును నీకు నొనరింతు నధికమై, భవముతోడను భవద్భవనమందు
నని మ్రొక్కి యింటికిఁ జనుదేర నామాస, మందె యామెకు గర్భమయ్యె నంత
గీ. నామె నీకడ కేతెంచి ప్రాణనాథ, గౌరికారుణ్యమున నాకు గర్భమయ్యెఁ
గాన నామెకు నుత్సవం బేను జరుప, వలయును దదాలయంబున నలర దేవి. 1383
సీ. అని తెల్పుటయును సత్యానందమును బొంది, నీ వాయమను గాంచి నీరజాక్షి
పరికరంబుల నెల్లఁ బనిచి నీసఖులచే, జరిగింపు మంబికోత్సవము నచట
ననవుడు నాయింతి తనసఖులను బంప, వా రేఁగి చండికాగారమునకు
జరిపి శర్వాణి కుత్సవమును జనుదెంచి, తెలిపి రావార్త నీచెలికి నీకు
గీ. వారు వచ్చినతరువాత వారిసేవ, కాత్మలో గౌరి సంతృప్తి నంద కునికి
నేఁగి తద్భృత్య విజయ తా నిట్టు లనియెఁ, దల్లి సంతృప్తిఁ గొలిపెనె తత్సపర్య.
వ. అని సవినయంబుగా నడుగుటయు శర్వాణి యామె కి ట్లనియె. 1385
సీ. విజయ చెప్పెద నీకు వినుము వైశ్యాంగన, నిజసఖీముఖమున నేఁడు నాకు
జరిగించినట్టియుత్సవ మెల్ల వ్యర్థంబు, దానఁ దద్గర్భపాతంబు గలుగుఁ
బరహస్తకృత మైనబలి గాదు మాదృగు, త్తమదేవతాతృప్తిదాయకంబు
నావుడు విజయ విస్మితాంత యై దేవి, యటులైన నామె కె ట్లగు శుభంబు

గీ. కనికరముతోడ నచియించు మనుజుఁ జేటి, యామె యైనను దద్భర్త యైన లేక
తన్నియుక్తద్విజుం డైనఁ దగుసపర్య, చేయునెడ సేమమగు నని చెప్పె గౌరి.
గీ. ఆమెశాపంబుఁ దెలియమి నయ్యె నింత, కాల మీరీతిఁ జింతింపఁ గారణంబు
కాన నిప్డు వేఁగి మీరలు గౌరికడకు, సేవ గావింపుఁ డగు నిష్టసిద్ధి మీకు. 1387
గీ. మును వసిష్ఠప్రబోధంబునను దిలీపుఁ, డర్చన యొనర్చి నందిని కతివతోడఁ
బడసెఁ బుత్రుని నట్టులె పడయఁగలవు, సుతుని నర్చించి యుమను నీసుదతితోడ.
క. అని వినుచుటయును శరభుఁడు, మనమున సంతోష మొంది మౌనీంద్ర వినం
గను వేఁడుక గల్గె దిలీ, పునిచరితము చెప్పుము సాంతముగ నా కనియెన్. 1389

—: దిలీపచరిత్రకథనము :—

సీ. అనుడు దేవలుఁ డిట్టు లనియె వణిగ్వర, మహిని వైవస్వతమనుకులమున
జనియించెను దిలీపుఁ డనుతేఁడు స్వాయంభు, వ మనువంశంబున వజ్రివోలె
వజ్రికి శచివోలె వానికి మగధేశ, తనయ సుదక్షిణ దారయయ్యెఁ
గోసలాధీశుఁడై కువలయం బెల్లను, రక్షింపఁ దొడఁగె ధర్మమున నతఁడు
గీ. చనఁగ బహుకాల మావిధంబుననె యొక్క, తనయుఁ డేనియు జన్మింప కునికి మదిని
జింత యేర్పడ నొకనాఁడు కాంతతోడఁ, జని వసిష్ఠాశ్రమమున కాజనవిభుండు. 1390
సీ. ఒనరించి వందనంబును వసిష్ఠునకుఁ ద, త్సంభావితుం డయి సముచితముగ
గురువర యేలితి ధరణి నేకాతప, త్రముగఁ జేసితి సప్తతంతువులను
సంతృప్తిపఱచితి భూసురులను నన్న, దానగోభూస్వర్ణదానములను
దీనులఁ బోషించితిని గోశమును బెంచి, తిని ధర్మసంభృతధనముచేతఁ
గీ. ప్రచురముగ సత్త్రములను నారామములను, జెఱువులను బావులను బ్రతిష్ఠించినాఁడ
సర్వలోకసుఖంబె మత్సౌఖ్యముగను, దలఁచి లోపంబు లేకుండ మెలఁగినాఁడ. 1391
ఆ. కాని నాకు సుతుఁడు లేనిలోపముమాత్ర, మఖిలసౌఖ్యములను నడఁగఁద్రొక్కె
దాన జీవితంబుపై నాశయును దగ్గె, నేమి చేయఁదగునొ యింకఁ జెపుమ. 1392
క. అనుడు వసిష్ఠుఁడు కనికర, మెనయఁగ మదిలోన దివ్యదృష్టిని సర్వం
బును గనుఁగొని యాతని కి, ట్లనియెను రాజేంద్ర విషయ మంతయుఁ దెలిసెన్.
సీ. మును నీవుపాకశాసనునియొద్దకుఁ బోయి, సల్లాప మొనరించుసమయమందు
జ్ఞప్తికి రా ఋతుస్నాత యైనత్వదీయ, పత్ని శీఘ్రంబుగా బయలుదేఱి
వచ్చుచుండఁగ నిజావసథంబునకు మార్గ, మునఁ గల్పపాదపమూలమందు
శయనించి యుండంగ స్వర్గధేనువు దాని, కాచరింపక ప్రణామాదివిధుల
గీ. నరుగుదెంచితి వద్దాన నది మదీయ, సంతతిని నీవు సేవింపనంతవఱకు
నుండెదవుగాక పుత్రహీనుండ వగుచు, నని శపించె జనింప లో నాగ్రహంబు. 1394

గీ. కాన నిప్పుడు తత్పుత్రికాతనూజ, యైన నందినికి సపర్య యాచరించి
శాపముక్తుండ వై కీర్తిశాలి వైన, సుతునిఁ బడయుము వంశవిస్తృతి ఘటిల్ల.
క. అని పలుకుచుండఁగనె నం, దిని వచ్చె వనంబునుండి దిగ్గున శుభసూ
చనముగ వత్సస్నేహం, బునఁ బొదుగుననుండి పాలు పొటపొటఁ గురియన్. 1396
సీ. అప్పుడు వసిష్ఠుఁ డి ట్లనియె రాజ స్మరించి, నంతనె నందిని యరుగుదెంచె
దీనిచేఁ గార్యసిద్ధిని శీఘ్రముగ నీవు, చెందెదు లే దిందుసందియంబు
సేవింపు మిద్దానిచెంతనె యుండి యె, ప్పుడును బ్రమాదంబుఁ బొందకుండ
ననుడు దిలీపుఁ డమ్మునియానతిని దదా, శ్రమమునందె వసించి చానతోడ
గీ. నవలినాఁట నుషఃకాలమందు లేచి, జాయయును దాను వత్సద్వితీయ యైన
నందినీధేనువునకు నానంద మొదవఁ, బూజఁ గావించిరి సువర్ణపుష్పములను. 1397
సీ. అంతట నందిని యడవికిఁ బోవంగ, బయలుదేఱఁగఁ జాపబాణములను
గేల దిలీపుఁడు దాల్చి తత్పృష్ఠ, భాగంబునను ఛాయపగిది నుండి
యది చనఁ దా నేఁగు నది మేయుచుండ ఘా, సముఁ దినుఁ గందమూలములఁ దాను
శయనింప నది తరుచ్ఛాయఁ దాఁ గూర్చుండుఁ, ద్రావఁ దోయము నీరు ద్రాగుఁ దాను
గీ. సమయము నెఱింగి పెట్టు ఘాసమును గోకుఁ, బోవఁ గండూతి దంశముల్ పోవఁద్రోలుఁ
దుడుచుఁ జెమ్మట వలువచేఁ గడుగు మేను, సేవకుఁడు వోలెఁ బరిచర్య చేసె నతఁడు.
ఆ. అట్లు ప్రొద్దు గ్రుంకు నందాఁక నట నుండి, ధేను వంత బయలుదేఱ నతఁడు
దానివెంట వచ్చెఁ దక్షురోద్ధితరజః, కణపవిత్రితాత్మకాయుఁ డగుచు. 1399
గీ. అంత నా నందిని తదాశ్రమాంతికమున, కేఁగుదేర సుదక్షిణ యెదురు వచ్చి
ప్రణతి గావించి సలిపి యర్చనము దాని, కెదుట నిలువంగఁ గేలుదోయిని మొగిడ్చి.
గీ. అప్పుడు నందిని సంతోష మామతిల్ల, నాశ్రమంబుఁ బ్రవేశించె నంత దాని
వెంట నాదంపతులు వచ్చి వివిధగతులఁ, జలిపి రాగోవునకుఁ బరిచర్య రేయి. 1401
వ. ఈవిధంబున నేకవింశతిదినంబులు గడవ ద్వావింశదినంబున నందిని వనంబున యథాపూర్వంబుగాఁ దిరుగుచు భూపాలుభావంబు నెఱుంగం దలంచి హిమవద్గుహాంతికంబునకుం జనియె. 1402
సీ. అంతటఁ దద్గుహాభ్యంతరమువనుండి, యొకసింహ మేతెంచి యుద్భటముగ
నందినిపైఁ బడ నరనాథుఁ డది చూచి, సంభ్రమంబును బొంది స్వాంతమందు
దానిఁ గూల్పఁదలంచి తనదక్షిణకరంబు, నిషుధిలోపలఁ జొన్పి యిషువు లాగి
చాపంబునను దాని సంధించి జ్యాకర్ష, ణము చేయుచుండెడిసమయమందు
గీ. స్తంభితం బయ్యె హస్త మద్దాన రేఁడు, విడువ శరము నశక్తుఁడై విస్మయంబుఁ
జెందుచుండంగ నతని వీక్షించి క్రూర, దృష్టితోడను నాసింహ మిట్టు లనియె. 1403
సీ. వీర దిలీప నీవీర్యంబు నెఱుఁగుదు, రవివంశజుం డైన ప్రభుఁడ వీవు
కుంభోదరుం డనుశంభుదాసుఁడ నేను, దరి నున్నయీదేవదారుతరువు

పాలింపఁబడుచుండఁ బార్వతిచేతఁ బు, త్రప్రేమమున నొక్క తరుణమందు
నిట కొక్క సామజం బేతెంచి కటమున, రాయంగ దీని చర్మంబు వాసె
గీ. నది కనుంగొని పార్వతి యపుడు నన్ను, సింహముగఁ జేసి దీని రక్షించు చుండు
మిటకు వచ్చినజంతువు నెరగఁ గొనుచు, నని యొసంగెఁగ నాజ్ఞ నే నట్ల యుంటి.
ఉ. కావున నన్నుఁ గూల్పఁగను గావ సమర్థుఁడ వీవు దైవ మీ
గోవును నేఁడు నాకు నొసఁగూర్చెను భక్ష్యము గాఁగఁ బొమ్ము నీ
త్రోవను నీవు ప్రాణములతోడను మృత్యుముఖచ్యుతుండ వై
నావుడు నానరేంద్రుఁడు వినమ్రతతోడను దాని కిట్లనున్. 1405
సీ. మృగరాజ సర్వజ్ఞభృత్యుండ వగునీకుఁ, దెలియనిధర్మ మెందులను లేదు
గోబ్రాహ్మణుల కొఱఁగూడనప్పుడు ప్రాణ, హాని యుపేక్షింప నగునె దాని
వాత్సల్యమున దీని వదలి భుజింపుము, మద్దేహమున నున్నమాంస మెల్ల
నపకీర్తిమలిన మైనట్టియీమేనితో, బ్రదుకంగఁజాల భూభారముగను
గీ. చేకుఱదు దీన ధర్మవిచ్ఛిత్తి నీకుఁ, బ్రాప్త మగు భోజనంబును దృప్తిదీర
నాకును లభించు నుత్తమలోకవసతి, పాయుటను గోనిమిత్తంబు ప్రాణములను.
క. అని వేఁడుటయును సింహము, విని యూరక యుండ ఱేఁడు వెంటనె హర్షం
బున దానియొద్దకుం జని, తనశీర్షము నుంచె సరగఁ దద్వక్త్రమునన్. 1407
ఆ. అపుడు పుష్పవర్ష మంతరిక్షమునుండి, కురిసె దుందుభులును మొరసె దివిని
జెవినిఁ బడియెఁ బుత్ర జీవింపు మనుమాట, యంత నృపుఁడు చూచి యట్టు లిట్లు.
క. కనఁబడక యుండుటను నెం, దును హర్యక్షంబు విస్మితుం డగుచుండం
గను మదిని మనుజభాషణ, మున నందిని యిట్టు లనియె ముద మొదవంగన్.
క. జనవర నీభావంబున్, గనుఁగొన నే నిట్లు మాయ కల్పించి భవ
న్మనమునఁ గలధర్మాగ్రహ, మునకుం బొందితిఁ బ్రమోదమును బూర్ణముగన్.
క. వర మిచ్చెదఁ గోరుము స, త్వరముగ ననుటయు దిలీపధాత్రీంద్రుఁడు త
చ్చరణముల కెరఁగి యన్వయ, కరుఁ డగుపుత్రుని వరంబుగా నిమ్మనియెన్. 1411
సీ. అంత నందిని యట్లె యగుఁగాక యని పల్కె, యూరకుండుటయును నుల్ల మలర
జనవల్లభుం డిట్లు లనియెఁ దల్లి త్వదీయ, వాక్యసుధారసాస్వాదమునను
సంతర్పితుఁడ నైతి సర్వంబు సమకూరె, నీదయాదృష్టిచే నేఁడు నాకు
ధన్యుండ నైతిని ద్వత్సపర్యను విశ్వ, జనపూజ్యవిద్యచే జడుఁడువోలె
గీ. నమరధేనుప్రదత్తశాపమును నాకు, వరముగా నయ్యె లేకున్నఁ బరమపూజ్యు
రాల వగునిన్నుఁ గొల్చుభాగ్యమును బుత్రలాభమును బొందుయోగంబు లబ్ధ మగునె.
క. అనవుడుఁ దదుక్తులకు నా, నన ముత్పుల్లంబు గాఁగ నందిని శీఘ్రం
బున వచ్చె నాశ్రమమునకు, జననాథుఁడు దాని వెంటఁ జనుదెంచంగన్. 1413

క. అపుడు సుదక్షిణ దానికి, నపచితిఁ గావించెఁ బూర్వమట్టులె యంతన్
స్మృపుఁడు గతవిషయమును వి, న్నప మొనరింపఁగ వసిష్ఠునకు నెంచి మదిన్. 1421

సీ. తనపత్నితోడను జని వసిష్ఠునిపాద, పద్మంబులకు మ్రొక్కి భక్తితోడ
నిలువంగఁబకాటయుఁ దిలకించి వారల, ముఖవికాసంబు నమ్మునివరుండు
గ్రహియించి సర్వంబు క్ష్మాతలాధిప కార్య, సిద్ధి యయ్యెనె నాఁగ క్షితివరుండు
జరిగినదంతయు సక్రమంబుగఁ జెప్పి, యిది యంతయును భవత్కృపయె యనియె

గీ. నంతట వసిష్ఠుఁ డతనిధన్యతను బొగడి, యానతిచ్చెఁ బురంబున కరుగ నపుడు
ప్రణతి యొనరించి గురుపాదపద్మములకుఁ, జనియెను దిలీపుఁ డంగనాసహితుఁ డగుచు.

వ. అంత నమ్మాసంబునందు సుదక్షిణాదేవి యంతర్వత్నియై దశమమాసంబున నొక్క సుముహూర్తంబున వంశవర్ధనుం డగురఘువును గనియె నని చెప్పి చనియె.

సీ. అంతట శరభుఁ డత్యంతహర్షము నొంది, కైకొని పూజోపకరణములను
జని చండికాలయంబునకు నఁగనతోడ, నంబకు దయగల్గునంతవఱకు
సంకల్ప మొనరించి సలుపంగఁ దత్సేవ, నొనరింపఁ దొడఁగె దదుత్సవముల
నట్లు సప్తదినంబు లరుగంగ నారాత్రి, ప్రత్యక్షమై దేవి ప్రమద మొదవ

గీ. వత్స భువిలోన ఖాండవవనమునందు, నలరెడిని నిగమోద్భోధకాఖ్యతీర్థ
మందు సుతవాంఛతో స్నాన మాచరింపు, మీవు సతితోడఁ గల్గు మీ కిష్టసిద్ధి.

క. మును నేను బుత్రవాంఛను, మునుఁగంగను సప్తదివసములు నియమముతో
డను నిగమోద్భోధకమున, జనియించెను శీఘ్రముగనె స్కంధుఁడు నాకున్.

క. అని చెప్పి యదృశ్యత్వం, బును జెందఁగ శరభుఁ డిటకు మోదముతోడన్
జనుదెంచి సతీయుతముగ, మునిఁగి యిచట సప్తదివసములు నియమముతోన్.

గీ. చనియె నింటికి సుతలాభసమ్మదమున, నంతటను నెలలోపల నతనిసతికి
గర్భమై నవమాసముల్ గడచుటయును, జనన మైతిని దశమమాసమున నేను.

వ. ఈవృత్తాంతం బంతయును దశాబ్దవయస్కుండ నగునాకు నాతండ్రి వచియించె.

ఆ. అవలఁ గొంతకాల మరుగంగ మాతండ్రి, నన్నుఁ బిలిచి యొక్కనాఁడు వత్స
విరతి గల్గె నాకు విషయంబులం దింక, నిలువజాల నింట నిమిష మేని. 1422

క. హరిచరణంబులఁ గొలిచెడి, పురుషుఁడు విడనాడి కామముల నెల్ల నిరం
తరమును సంతుష్టుండై, తిరుగుచుఁ దీర్థములలోన దేహము విడుచున్. 1423

ఆ. పూర్వకృతము లైనపుణ్యపాపములచే, సంభవించుసుఖవిషాదములను
ననుభవించుచును నిరభిలాషముగ జ్ఞాని, కొలుచు హరిని మేను దొలఁగువఱకు.

గీ. చేకుఱదొ యెంతదాఁకను జిత్సుఖంబు, వృద్ధి గను నంతదాఁక నె విషయవాంఛ
సమకుఱదొ యెంతదాఁకను నమృతలబ్ధి, యభిరుచి జనించుఁ దక్రమం దంతవఱకె.

వ. ఇహలోకకర్మంబులు ఫలకాంక్షచేఁ గావించుట ప్రవృత్తి యనియు విహితకర్మంబు లాచరించుచుఁ దత్ఫలంబు నీశ్వరున కర్పించుట నివృత్తి యనియు శాస్త్రంబులందుఁ

జెప్పంబడియె. ఈశ్వరార్పణంబుగాఁ గావింపఁబడినకర్మంబులు నిర్దగ్ధబీజంబులువోలె సంసరింపకుండు. కర్మలయంబె మోక్షంబు. కర్మోత్పత్తియె బంధంబు. 1426

గీ. కాన నే నీశ్వరప్రీతికరము గాఁగఁ, జలుపుచును గర్మములను నిష్కామముగను
జలిపి తీర్థాటనంబు సత్సంగ మహౌష, ధము గొనఁదలంచితి భవామయము శమింప.

వ. అని నుడువుటయు నాజనకునకు నే నిట్లంటి. 1428

సీ. తండ్రి స్మరించినంతనె సర్వపాపముల్, శమియింపఁజేయఁగాఁ జాలినదియు
స్పర్శంబుననె త్రివిష్టపము షష్టిసహస్ర, సగరపుత్రులకు నొసంగినదియు
స్నానమాత్రముననె సర్వకర్మక్షయం, బొనరించి మోక్షంబు నొసఁగునదియు
ముక్తికాములచేత భుక్తికాములచేత, విడువక సేవింపఁబడునదియును

గీ. త్రిభువనములఁ బవిత్రీకరించునదియు, నస్మదావాసభూమిస్థ మైనదియును
నైనభాగీరథిని విడనాడి యితర, పుణ్యతీర్థంబులకు నీవు పోవ నేల. 1429

గీ. ఎవనియస్థులు గంగలో నెంతవఱకు, నుండఁగలుగునో దివమున నుండఁగలుగు
నంతవఱకును వాఁడు పాపాత్ముఁ డైన, నరకలోకంబులను నెల్లఁ బరిహరించి. 1430

గీ. కాయము దొఱంగునెడల గంగాజలంబు, నందు నేనియుఁ దత్తటమందు నేని
ప్రాప్త మగు బ్రహ్మపదము తిర్యక్కులకును, నట్టిగంగను విడనాడ నగునె నీకు. 1431

సీ. అనవుడు నాతండ్రి విని మదీయోక్తుల, నెల్లను గడకుఁ దా నిట్టు లనియె
వినుము వత్స వచింతు విశదంబుగను నీకు, ధరణిసర్వతీర్థములకంటె
ఘన మైనతీర్థంబు కాళింది యని సూతుఁ, డెన్నిమాఱులు వచియింప వింటి
ననవుడుఁ దండ్రివాక్యము నొఁదలను దాల్చి, గౌరవంబునను నే నూరకుంటి

గీ. నంత మాతండ్రి సర్వతీర్థాటనంబు, చేసి యరుదెంచి తుదకు నీక్షేత్రమునకుఁ
జలుపుచును ననుదినమును స్నానమిందుఁ, దలఁచుచును మాధవునిఁ గొన్నినెలలు గడపి.

వ. ఒకనాఁడు దైవికంబుగా దారుణజ్వరాభిభూతుండై తద్బాధచేఁ జేష్టలుడిగి కొంత కాలంబునకుఁ దెలివి రా నిట్లు తనలోఁ జింతింపం దొడంగె. 1433

ఉ. అక్కట దిక్కు లేనిగతి యయ్యెను నా కిపు డేమి చేయుదున్
జిక్కు ఘటిల్లె నాసుతుఁడు చెప్పినమాటలు త్రోసిపుచ్చి నే
నిక్కడ కేఁగుదెంచితిని నీ యవివేకముచేత నింతకున్
నక్కలపాలు గా విధి యొనర్చెనొ యేమొ మదీయదేహమున్. 1434

క. ఈ సమయంబున మఱగ, మ్యాసంగమపాపమునకుఁ బ్రాయశ్చిత్తం
బాసమెయిం జేయింపఁడె, నాసుతునిసమక్షమందు నాతను వున్నన్. 1435

క. అని బహువిధములఁ జిత్తం, బున వగచుచు లోచనములు మూఁతపడఁగ నుం
డినపటిని నొక్కపాంథుఁడు, చనుదెంచి తదుటజమునకు సత్వరరీతిన్. 1436

క. కనుఁగొని మాతండ్రిని వం, దనముం గావించి మునివతంసము సాయం
తనవేళను నిద్రింపఁగఁ, జనునె భవాదృశుల కని ప్రసంగింపంగన్. 1437

సీ. అది విని మాతండ్రి యతియత్నమునఁ గనుల్, దెఱచి పాంథునిమోము తేఱి చూచి
తనగాథ యెల్ల నాతనికి నెఱింగించి, తండ్రి నీ కిత్తు న్ద్రవిణ మెల్లఁ
గొనిపొమ్ము నాగృహంబున కని ప్రార్థించి, మునుముందుగాఁ గొంత ధనము నొసఁగెఁ
గొని పాంథుఁ డాధనంబును దానిలోఁ గొంత, హరియించి మిగిలినయర్థమునను
గీ. యాప్యయానంబు మోచెడియట్టివారిఁ, దోడుకొని వచ్చి నాతండ్రిఁ దోడుపట్టి
పండుకొనఁబెట్టి శిబికలోపలను దాల్చి, కరమునందు నద స్తీర్థకమలఘటము. 1438
క. దాహ మగునపుడు శిబికా, వాహకులకు మత్పితకును స్వకలశవారిన్
దాహము దీర్చుచుఁ దానున్, దాహము గాఁ దజ్జలంబుఁ ద్రావుచు నడుమన్. 1339
వ. ఈతీర్థంబునుండి కాన్యకుబ్జదేశంబునకుఁ బయనమై శిబికావాహకులు తనవెంట నడువఁ
దాను ముందు నడుచుచు నొకకాననమార్గంబున నేగు చుండ. 1440
క. వికటుం డనియెడిరాక్షసుఁ, డొకఁ డపు డేతెంచి మిగుల నుగ్రుండై శి
బికులను బాంథునిఁ గూల్చి, తెకతేరఁగఁ ద్రావి తద్రుధిర మెల్లఁ దుదిన్. 1441
సీ. ఆమయగ్రస్తుఁ డై నట్టినాతండ్రిని, భక్షింప నెంచి తత్పార్శ్వమందుఁ
దిలకించి తీర్థాంబుకలశంబు నది కొని, దానిలోనిజలంబుఁ ద్రావి కొంత
తత్క్షణంబునయందు తనకు నచ్చెరియంబు, సంతోషమును గల్గ స్వాంతమందు
స్వప్రాగ్జనిస్మృతి సంఘటిల్లుటయును, ద్యజియించి యాత్మీయదౌష్ట్య మెల్లఁ
గీ. గాంచి నాతండ్రిని మహాత్మ కరుణతోడఁ, జెప్పు మెవఁడవో నీవు నాచేతఁ గూల్పఁ,
బడినవీ రెల్ల నెవరో యీపాత్రమందు, నేరుపడియున్న పానీయ మెక్కడిదియొ. 1442
సీ. అనుడు నాతండ్రి యి ట్లనియె రాత్రించర, ప్రవర వైశ్యాన్వయభవుఁడ నేను
శరభుం డనెడివాఁడ జ్వరబాధచేత నేఁ, గుచు నుంటి నాకాన్యకుబ్జమునకు
నితఁడు పాంథుఁడు నాకు హితుఁడు వీరు మదీయ, శిబికాధరులు విధిచేత నీకు
నర్పింపఁబడిరి భోజ్యంబుగా నీనాఁడు, తెలిపెద విను మింక సలిలవార్త
గీ. యీజలము ఖాండవంబునఁ దేజరిల్లు, యమునదరిని హరిప్రస్థ మనెడిపుణ్య
తీర్థమున నుండగిప్పుతీర్థజలము, ప్రాగ్జనిస్మృతి జనియించుఁ ద్రావ దీని. 1443
క. త్రావితివి నీవు దీనిం, గావున నేకారణమునఁ గ్రవ్యాదుఁడ వై
యావిర్భవించినాఁడవో, కావింపుము శ్రుతము నాకుఁ గల దిచ్ఛ వినన్. 1444
వ. అని యడుగుటయు నారాక్షసుండు సవినయంబుగా మాజనకున కి ట్లనియె. 1445
సీ. పుణ్యాత్మ వినుము నాపూర్వవృత్తాంతంబు, తెలియఁజేసెద నీకుఁ దేటపడఁగ
భూతలంబున మున్ను పుణ్యాలభ్యం బైన, భూసురాన్వయమునఁ బుట్టి నేను
శ్రుతిసురధర్మవర్జితుండ నై తిరుగుచు, స్వాచ్ఛందముగను దుర్జనులతోడఁ
విత్తపితామహార్జిత వైభవ మెల్ల, వ్యయము సేయుచు నుండ వ్యర్థముగను
గీ. నపుడు నాతండ్రి మద్దుర్వర్తనంబు నెల్ల, ధాత్రిపతికిఁ దెల్పి నన్ను గ్రామంబునుండి
వెడలఁగొట్టింప నొయ్యారి విడచిపెట్టి, యెట్లొ గ్రామాంతరమ్మునకు నేగి నేను. 1446

సీ. అది విని మాతండ్రి యతియత్నమునఁ గనుల్, దెఱచి పాంథునిమోము దేఱి చూచి
తనగాథ యెల్ల నాతనికి నెఱింగించి, తండ్రి నీ కిత్తు నాద్రవిణ మెల్లఁ
గొనిపొమ్ము నాగృహంబున కని ప్రార్థించి, మునుముందుగాఁ గొంత ధనము నొసఁగెఁ
గొని పాంథుఁ డాధనంబును దానిలోఁ గొంత, హరియించి మిగిలినయర్థమునను
గీ. యాప్యయానంబు మోచెడియట్టివారిఁ, దోడుకొని వచ్చి నాతండ్రిఁ దోడుపట్టి
పండుకొనఁజెట్టి శిబికలోపలను దాల్చి, కరమునందు నద స్తీరకమలఘటము. 1438
క. దాహ మగునపుడు శిబికా, వాహకులకు మత్పితకును స్వకలశవారిన్
దాహము దీర్చుచుఁ దానున్, దాహము గాఁ దజ్జలంబుఁ ద్రావుచు నడుమన్. 1339
వ. ఆతీర్థంబునుండి కాన్యకుబ్జదేశంబునకుఁ బయనమై శిబికావాహకులు తనవెంట నడువఁ
దాను ముందు నడుచుచు నొకకాననమార్గంబున నేగుచుండ. 1440
క. వికటుం డనియెడిరాక్షసుఁ, డొకఁ డపు డేతెంచి మిగుల నుగ్రుండై శి
బికులను బాంథునిఁ గూలిచి, తెకతేరఁగఁ ద్రావి తద్రుధిర మెల్లఁ దుదిన్. 1441
సీ. ఆమయగ్రస్తుఁ డై నట్టినాతండ్రిని, భక్షింప నెంచి తత్పార్శ్వమందుఁ
దిలకించి తీర్థాంబుకలశంబు నది కొని, దానిలోనిజలంబుఁ ద్రావి కొంత
తత్క్షణంబునయంద తనకు నచ్చెరియంబు, సంతోషమును గల్గ స్వాంతమందు
స్వప్రాగ్జనిస్మృతి సంఘటిల్లుటయును, దృజియించి యాత్మీయదౌష్ట్య మెల్లఁ
గీ. గాంచి నాతండ్రిని మహాత్మ కరుణతోడఁ, జెప్పు మెవఁడవో నీవు నాచేతఁ గూల్పఁ,
బడినవా రెల్ల నెవరో యీపాత్రమందు, నేరుపడియున్న పానీయ మెక్కడిదియొ. 1442
సీ. అనుడు నాతండ్రి యి ట్లనియె రాత్రించర, ప్రవర వైశ్యాన్వయభవుఁడ నేను
శరభుం డనెడివాఁడ జ్వరబాధచేత నేఁ, గుచు నుంటి నాకాన్యకుబ్జమునకు
నితఁడు పాంథుఁడు నాకు హితుఁడు వీరు మదీయ, శిబికాధరులు విధిచేత నీకు
నర్పింపఁబడిరి భోజ్యంబుగా నీనాఁడు, తెలిపెద విను మింక సలిలవార్త
గీ. యీజలము ఖాండవంబునఁ దేజరిల్లు, యమునదరిని హరిప్రస్థ మనెడిపుణ్య
తీర్థమున నుండుగీష్పతితీర్థజలము, ప్రాగ్జనిస్మృతి జనియించుఁ ద్రావ దీని. 1443
క. త్రావితివి నీవు దీనిం, గావున నేకారణమునఁ గ్రవ్యాదుఁడ వై
యావిర్భవించినాఁడవొ, కావింపుము శ్రుతము నాకుఁ గల దిచ్ఛ వినన్. 1444
వ. అని యడుగుటయు నారాక్షసుండు సవినయంబుగా మాజనకున కి ట్లనియె. 1445
సీ. పుణ్యాత్మ వినుము నాపూర్వవృత్తాంతంబు, తెలియఁజేసెద నీకుఁ దేటపడఁగ
భూతలంబున మున్ను పుణ్యాలభ్యం బైన, భూసురాన్వయమునఁ బుట్టి నేను
తీక్ష్ణమురభర్మవర్జితుండ నై తిరుగుచు, స్వచ్ఛందముగను దుర్జనులతోడఁ
బిత్రుపితామహానమార్జిత మైనధన మెల్ల, వ్యయము సేయుచు నుండ వ్యర్థముగను
గీ. నపుడు నాతండ్రి మద్దుశ్చరితంబు లెల్ల, భూమిపతికిఁ దెల్పి నన్ను గ్రామంబునుండి
వెడలఁగొట్టింప నొయ్యారఁ దిడిచిపెట్టి, యట్లు గ్రామాంతరమునకు నేగి నేను. 1446

స్నానంబు చేయుచుండంగ నీపుణ్యతీ, ర్థమునఁ దండ్రిని జూచుతలఁపుతోడ
నీతీర్థమునకు నే నేతెంచి వ్యాఘ్రబాధ, లో నున్నతండ్రికిఁ గానఁబడితి
గీ. నపుడు నాతండ్రి ననుఁ జూచి హర్షమునను, విడిచి కన్నీరు వత్స మేనుడుగుకాల
మేఁగుదెంచెను నీ విపు డేఁగుదెంచు, టెంతయును నాకు సంతోషహేతు వయ్యె.
ఆ. అరుగుదెంచు నొక్కయసురుఁడు నామిత్రుఁ, డిటకు నిపుడె వాని నీవు చూచి
యడలు చెందకుండ నభివాదనము సేయు, మతనివలన క్షేమ మబ్బు నీకు. 1456
సీ. అని పల్కుచుండంగ నంతలో వికటుండు, చనుదేర వానికి వినయ మొదవఁ
గావించితిని నమస్కారంబు నే నంత, నారాక్షసుండు న న్నాదరించి
వత్స ధన్యత నొందవలసినయోగ ముఁ, డుటచేత వచ్చితి విటకు నేఁడు
మునుఁగు మీతీర్థంబునను మొట్టమొదటను, బూర్వజన్మస్మృతి పొడము నీకు
గీ. ననుడు నీతీర్థమున నేను మునిఁగి పూర్వ, జన్మసంస్మృతి వడసి యాశ్చర్యముగను
వచ్చి నాతండ్రికడకుఁ దద్వాదనమునను, విని యద స్తీర్థమహిమంబు విశదముగను.
సీ. కావించుచును బితృసేవ సంతతమును, నిక్కడ నుండి నే నొక్కనాఁడు
స్నానార్థి యైనమజ్జనకుని నీతీర్థ, సలిలంబునను ముంచుసమయమందుఁ
దత్ప్రాణములు పోయె దైవికంబుగ నంత, నరుదెంచి యాదినారాయణుండు
తనరూప మొసఁగి నాజనకున కేను సం, దర్శించు చుండ న త్తరుణమంద
గీ. తనగరుడవాహనమున నాతండ్రి నుంచు, కొని రయంబునఁ జనియె వైకుంఠమునకు
బ్రహ్మరుద్రేంద్రముఖ్యనిర్జరగణంబు, లెల్ల నుతియించుచును వెంట నేఁగుదేర. 1458
సీ. అపుడు నే నీతీర్థమం దుండుమహిమకు, నద్భుతానందము లామతిల్ల
నాతండ్రి కిచట నొనర్పఁగావలసిన, యంత్యక్రియల నెల్ల నాచరించి
గృహమునం దుండెడిప్రీతిని విడిచి నా, జనకుఁ డుండినపర్ణశాలయంద
యసురునితోఁ గూడ వసియించి యీతీర్థ, మందుఁ జేయుచు స్నాన మనుదినంబు
గీ. కాలమును బుచ్చు చుండ నాకస్మికముగ, నొక్కగో విచ్చటికి వచ్చి యొక్కనాఁడు
పడుడు నీతీర్థమున దానిఁ బట్టి లేవఁ, దీయఁగా నెంచి మదిని రాత్రించరుండు. 1459
సీ. ఈతీర్థమున దూఁకి యె ట్లేని గోవును, లేవఁదీయంగ నాగోవు లేచె
నంతలో నొక్కగ్రాహము దైత్యునిపదంబుఁ, బట్టి లోనికి లాగ బలముకొలఁది
నారాక్షసుండు నిరాధారుఁ డగుటను, జోయి లోనికిఁ బ్రాణములను విడిచి
దేవతాకృతితోడ దివి కేఁగు చుండంగఁ, గని నేను వాని రాక్షసవర్ణ్య
గీ. మోక్షదాయక మగుతీర్థమునను జచ్చి, త్రిదివమున కేల పోయెదు తెలుపు మనుడు
వైశ్యనందన వాంఛించి స్వర్గసుఖము, నరుగుచుంటి నటంచు వాఁ డరిగె దివికి.
సీ. అది యాదిగను నే నహర్నిశంబును హరి, ధ్యానంబు సేయుచు ననుదినంబు
పలుమారు నీతీర్థజలమున స్నానంబు, నిర్వాహయంబు గా నిలిపి మదిని

నొకనాఁడు హరిపూజ యొనరించు చుండ నే, తెంచి దుర్వాసుఁ డీక్షించి నన్నుఁ
దనకు సత్కారంబు నొనరింపలే దను, భావంబునను గిన్క పట్టలేక
గీ. శాపము నొసంగె నాకు నాజన్మమందు, ముక్తి లేకుండునట్లు తదుక్తి నేను
వినుట వెంటనె హరిపూజ విడిచి లేచి, వానిచరణాంబుజంబులపైని వ్రాలి. 1461
గీ. స్వామి నాయపరాధంబు సైఁచి శాప, ముక్తిని ననుగ్రహింపుము భక్తజనుల
భావ మెఱుఁగనివాఁడవు కావు నీవు, నాఁగ నమ్మునిశాంతమనస్కుఁ డగుచు. 1462
క. జనియించి భూసురాన్వయ, మున భూతలమందు ధర్మమున నిల్పి మనం
బును దుద కీతీర్థంబునఁ, గని మరణము మోక్ష మొందఁగల వని పలికెన్. 1463
వ. అంతట మునివాక్యంబు మిథ్య కానేర దని నిశ్చయించుకొని స్వగృహంబున కరుదెంచి విష్ణుధ్యానపరాయణుండ నై కాలముం బుచ్చుచు నొక్కతరుణంబున గంగాస్నానంబు గావించి తత్తీరంబున హరినామస్మరణంబు చేయుచుఁ బ్రాణంబు లుజ్జగించి దుర్వాసుఁ డనుగ్రహించిన ట్లొక్కబ్రాహ్మణగృహంబున బ్రాహ్మణుండనై జన్మించి నేఁటి కీతీర్థంబునకు రాఁగలిగితి. 1464
గీ. అనుభవించుచు దేహ మున్నంతవఱకు, సుఖమొ దుఃఖంబొ యుండి యిచ్చోట నేను
మరణమును బొంది మోక్షసామ్రాజ్యలక్ష్మి, నేలుకొనువాఁడ నని వచియించె నంత.
క. విని విష్ణుశర్మ జనకుఁడు, వినిచినవిషయంబు నెల్ల విశ్వాసము లో
నొనరఁగ నిగమోద్బోధక, మనుతీర్థంబున వసించె నాతనితోడన్. 1466
ఆ. అట్లు కొంతకాల మాయిర్వురును నందె, యుండి హరిపదంబు నొంది రొక్క
దినమునందె వారిదివ్యచరిత్రంబు, త్రిభువనంబులందుఁ దేజరిల్ల. 1467
క. ఈతీర్థమహత్త్వంబును, జేతం బలరంగ నెవరు చెప్పుదురో మనః
ప్రీతిమెయి నెవరు వింద్రురో, కాతర్యము లేనిపదము గాంతురు వారల్.
క. అని నుడువుటయును విని శిబి, మనమున సంతోష మొంది మానీంద్ర వినం
గను ద్వారకామహత్త్వము, జనియించెను వేడ్క చెపుము సవిశేషముగన్. 1469

—: ఇంద్రప్రస్థద్వారకామాహాత్మ్యము :—

సీ. అనుడు నారదుఁ డిట్టు లనియె భూమీంద్ర యిం, ద్రప్రస్థపుణ్యతీర్థంబునందు
ద్వారక యనెడియుత్తమతీర్థ మొకఁ డుండె, నం దుండుబ్రాహ్మణులం దొకండు
కాంపిల్యదేశంబుఁ గన నేఁగి యొకనాఁడు, సలుపుచు గానంబు శ్రావ్యముగను
సంచరింపఁదొడంగెఁ బంచబాణుఁడు నాఁగఁ, బ్రతివీథియందును బ్రౌఢి మెఱయ
ఆ. నతనిభువనమోహనాకారగానముల్, పరవశంబు సేయ భావములను
భవనములను విడిచి పౌరభామిను లెల్ల, విస్మయముగ వానివెంటఁబడిరి. 1470
సీ. అప్పుడు తద్భర్త లతనిఁ దత్పురినుండి, వెడలఁగొట్టింపంగ నెడల నెంచి
తత్పురపాలునిదరి కేఁగి భూపాల, మనపురి కొక్కబ్రాహ్మణుఁడు వచ్చె

నాతనిభువనమోహనరూపగానంబు, లెడఁదలఁ గలఁప మాయింతు లెల్ల
నతనివెంబడిఁబడి యరుగఁ దొడంగిరి, వాఁ డింక నీయూరు వదల కున్న
గీ. భ్రష్ట లగుదురు మాధర్మపత్ను లెల్ల, మేము వసియింపఁజాల మీగ్రామమందు
ధర్మరక్షకుఁడవు గాన దాఁపకుండఁ, దెలిపితిమి నీకు నంతయుఁ దేటపడఁగ. 1471
క. అని చెప్పఁగఁ గాంపిల్యుఁడు, విని వారలనుడువు లెల్ల విశదంబుగ వి
ప్రుని రావించి నిజాంతిక, మునకుఁ దద్రూపధేయమోహితమతి యై. 1472
సీ. భూసుర నీవు మాపురమున నుండిన, భ్రష్ట లై పోదురు పడఁతు లెల్లఁ
జనుము శీఘ్రముగ నీజనపదంబున కీవు, చన కున్నయెడ శిక్ష సలుపువాఁడ
ననవుడు విప్రుఁ డి ట్లనియె మహారాజ, లేదు నాయెడ దోషలేశ మేని
యజితేంద్రియలు త్వత్పురాంగన లగుటయె, యీయనర్థమునకు హేతువయ్యె
గీ. నని వచించుచు నుండెడునంతలోనఁ, బురవధూమణు లెల్ల గుంపులుగఁ గూడి
యరుగుదెంచి మనోహర యగునె నీకు, విరహాకాతరలను మమ్ము విడిచి పోవ. 1473
క. అని పరివేష్టింపఁగ ని, ట్లనియె మహీసురుఁడు సవినయంబుగ మీకుఁ
దనయుఁడను నేను నాకుఁ, జననులు మీ రతివలార సత్యము గాఁగన్. 1474
సీ. పతికంటె దైవంబు పడఁతికి లే దని, వివరించు శాస్త్రంబు విశ్వసించి
పరిచర్య సేయుచు భర్తల కిహపరం, బులలోన లోపంబు గలుగకుండ
వర్తింపుఁ డద్దాన వాసుదేవప్రీతి, ఘటియిల్లు శుభములు గలుగు దాన
భర్తను విడనాడి పరపూరుషునిఁ బొందు, నతివ యుర్వరను గర్హ్యతను బొంది
గీ. కాయ ముడిగినపిదప దుర్గతులలోనఁ, జిక్కి పరరానిబాధలు చెంది యవల
నిలను వృక్షంబులుగఁ బశువులుగఁ బుట్టి, వ్యంగ యై మర్త్యయోనియం దవల నొందవు.
ఆ. అంధుఁ డైన బధిరుఁ డైన రుగ్ణుం డైన, రూపహీనుఁ డైన రూపి యైన
నధనుఁ డైన నెట్టిఁ డైనను భర్తను, సుగతి గోరుసుదతి తగదు విడువ. 1476
క. కావున మీకుం గలిగిన, భావంబుల నుడిగి పొందు భర్తలకడకుఁ
బావనము లై నయుష్మ, జ్జీవితముల నేల పాడుచేసికొనంగన్. 1477
క. అనవుడు వారలు లజ్జా, వనతాస్య లై తదీయవాగ్జలపూరం
బున నిజకామాగ్నిశమం, బును జెందఁగఁ జనిరి స్వగృహముల కేకమతిన్. 1478
వ. అంతటఁ గాంపిల్యుండు ద్వారకానివాసి యగునాబ్రాహ్మణునియోగ్యతను బ్రశంసించి వస్త్రభూషణాదులచే సమ్మానించి గౌరవపూర్వకంబుగాఁ దత్పురంబున కాతనిం బనిచె.
ఆ. అవలఁ గొంతకాల మరుగఁగఁ గారూష, జనవరేణ్యుఁ డొక్కసమయమందు
దాడివెడలి సేనతోడఁ గాంపిల్యుని, మారి ముట్టడించెఁ బగతుఁ డగుట. 1480
క. అంతటఁ గాంపిల్యధరా, కాంతుఁడు కారూషభూమికాంతునితోడన్
వింతగను జేసి యుద్ధము, నంతంబున నొంచె నాజి నాఁగఁగ లేమిన్. 1481

క. అరివలన మానభంగము, జరుగుననెడిభీతి మానసములఁ గలంపన్
గరళమును ద్రావి వెంటనె, మరణించిరి నగరిలోనిమానిను లెల్లన్. 1482
సీ. మరణించి వార లామాడ్కి నిజపురు, షాభిలాషప్రభూతాఘమునను
లంకలో దానవలలనలుగ జనించి, మారుతిచే మున్ను మరణ మొంది
పై శాపరూపంబుఁ బడసి పిమ్మట నుండఁ, దావు చిక్కమిని సంతాపపడుచుఁ
జని యొకమరుదేశమునను క్షుత్తృష్ణల, కాఁగంగలేక యల్లాడుచుండఁ
గీ. జేకుఱె విముక్తి ద్వారకాక్షేత్రపుణ్య, సలిలసంస్పర్శమాత్రంబువలన వారి
కనుచు శిబి విస్మయము నొంది మునివరేణ్య, చెపుము తన్ముక్తిగాథ యశేషముగను.
సీ. అనుడు నారదుఁ డిట్టు లనియె మహారాజ, వినుము తెల్పెద నీకు విశదముగను
విమలుండు నా నొక్కవిప్రోత్తముఁడు మున్ను, తుహినశైలోచ్చయద్రోణియందు
వసియించు చుండంగ వానికి వార్ధకం, బున జనియించెను బుత్త్రుఁ డొకఁడు
విష్ణుభక్తుఁడు గాన విమలుఁ డాత్మజునకు, హరిదత్తుఁ డనెడియాహ్వయముఁ బెట్టె
గీ. వేదవేదాంగములు నేర్పి విద్య లెల్లఁ, జదివి యాతండు తద్గతసార మెఱిఁగి
బ్రహ్మచర్యంబునందె వైరాగ్యమునను, గొని తురీయాశ్రమము నేఁగెఁ గోఁప విడిచి.
గీ. అంతఁ దన్మాత పుత్త్రమోహమున నేడ్చు, చుండ విమలుండు తద్దుఃఖ ముడుపలేక
కలికి మఱియొకపుత్త్రుఁడు గలుగునట్టు, లాచరింతుఁ దపం బని యనునయించి. 1485
గీ. అరిగి కాశీప్రయాగగయాద్యనేక, పుణ్యతీర్థంబులకు స్నానముల నొనర్చి
యందు నందుహరిప్రస్థ మనెడితీర్థ, మునకు నంతంబునను జేరి మునిఁగి యందు. 1486
క. యమునాతటి నారేయి ని, యమమున శయనించి యుండ ననిమిషయుతుఁడై
కమలజుఁడు వచ్చి యాతని, సముఖమున నిలిచి యిట్లు సంభాషించెన్. 1487
సీ. బ్రాహ్మణోత్తమ భవద్భావంబునం దుండు, వాంఛ దీర్పఁగ మాకు వశము గాదు
వినుము కారణము నే వినిచెద మున్నొక్క, తరుణంబునను దేవతలును నేను
మేరుశృంగంబున నారాయణునిఁగూర్చి, తపము గావింప మాధవుఁడు మెచ్చి
వరము లిచ్చెద మీకు వాంఛింపుఁ డన సురల్, స్వస్వేష్టములు గొని చనిరి దివికి
ఆ. నపుడు కోరితిని బ్రయాగ మింద్రప్రస్థ, మును మదీయతీర్థములుగ నుండ
నంబుజాక్షుఁ డట్లె యగుఁగాక యని నాకు, నిచ్చి వరము మఱియు నిట్టు లనియె.
క. కమలోద్భవ యింద్రప్ర, స్థమున మహాతీర్థముగను ద్వారక నాచే
సమకూర్పఁబడియె నచ్చట, సమస్తవాంఛలును దీరు స్నానము చేయన్. 1489
క. చలిపి తదుల్లంఘనమును, జలిపినయెడ స్నాన మెట్టిసమధికతీర్థం
బులలోన నైన స్నాతకుఁ, గలుగదు తత్స్నానఫలము కణికం బైనన్. 1490
క. అని చెప్పి తిరోధానము, గనియెను గావునను ద్వారకాతీర్థమునన్
బొనరించినయెడ స్నానము, తనయుఁడు జనియించు నీకుఁ దథ్యము గాఁగన్. 1491
వ. అని ప్రబోధించి యంతర్ధానముం జెందె. 1492

సీ. అంతట విమలుఁ డాహ్లాదంబునను జని, ద్వారకాపుణ్యతీర్థంబునందు
స్నానంబు గావించి స్మరియించు చుండంగ, నంబుజాక్షుని హృదయంబులోన
విప్ర యింటికిఁ బొమ్ము వేగ మే లగు నీకు, నని వినంబడఁ జెవి కమరవాణి
కలశంబునను ద్వారకాతీర్థతోయంబు, గైకొని విమలుఁడు కదలి యపుడె
గీ. యరుగుదెంచుచు నుండంగ నాత్మసదన, మునకు సృతిమధ్యమరుదేశమునఁ బిశాచు
లడ్డుపడి పైకి రాలేక యాఁగి యెదుట, స్వామి తెల్పుము నీగాథ యేమొ మాకు.
వ. అని సవినయంబుగా నడుగుటయు విమలుండు తద్భీకరాకారంబులం జూచి పిశాచులుగా నిశ్చయించుకొని వారి కిట్లనియె. 1494
గీ. భూసురుండను నేను మద్వాసభూమి, హిమగిరిద్రోణి పరగుదు విమలుఁ డనఁగఁ
జలిపి బహుపుణ్యతీర్థయాత్రలను దిరిగి, పోవు చున్నాఁడ నాగృహంబునకు నేఁడు.
క. అనవుడు నతనికి వందన, మొనరించి పిశాచు లెల్ల నుర్వీసుర నీ
వనఘుఁడవు తీర్థయాత్రల, నొనరించుట మాకు ముక్తి నొసఁగుము దయతోన్. 1496
క. అని దైన్యంబున నడుగుట, యును విమలుఁడు నిజకమండలూదకమును జ
ల్లెను వారిమీఁదఁ గనికర, మొనయంగను వంత వార లెల్ల క్షణములోన్. 1497
గీ. అప్సరోరూపములఁ దాల్చి యద్భుతముగ, నధివసించి మరుద్వ్యాప్యయానములను
దెలచుచును ద్వారకాపుణ్యతీర్థమహిమ, చనిరి దివి కాద్విజన్ముఁడు కనుచు నుండ.
గీ. అపుడు విమలుఁడు విస్మయం బావహిల్ల, ద్వారకాతీర్థజలమహత్త్వమున కెదను
సత్వరంబుగ నేఁగి స్వస్థానమునకుఁ, దనవధూమణి కిచ్చి తత్కలశజలము. 1499
గీ. పోలంతి యిది ద్వారకాతీర్థపుణ్యజలము, గ్రోలు మిద్దాని నీకుఁ బుత్రుఁడు జనించు
ననుడుఁ దత్కాంత వెంటనె యాజలంబు, ద్రావి గర్భంబుఁ దాల్చి యర్భకునిఁ గనియె.
వ. ఏతద్ద్వారకాతీర్థమాహాత్మ్యంబు పఠించినను వినినను వేదవిదు లగునూర్గురు బ్రాహ్మణులకు భోజనము పెట్టినఫలంబును సూర్యేందుగ్రహణకాలంబున వింశతిపలసువర్ణదానంబు గావించినఫలంబునుం జేకూరు. 1501
క. అని తెలుపుటయును శిబి యి, ట్లనియెను నారద వినంగ నభిలాషను గ
ల్గెను నాకుఁ గోసలామహి, మను జెప్పుము నాఁగ నిట్లు మౌని వచించెన్. 1502

—: ఇంద్రప్రస్థకోసలాతీర్థమాహాత్మ్యము :—

సీ. కలదు కోసల యనంగను నొక్కనగరంబు, చంద్రభాగాతటస్థలమునందు
నది పుణ్యతీర్థమై యలరారె నచటఁ జం, డకుఁ డనియెడునొక్కనాపితుండు
బ్రతుకుచుఁ జౌర్యవర్తనముచే నొకనాఁడు, జను లెల్ల నిద్రించుసమయమందుఁ
బురవీథిలోపలఁ దిరుగుచును ముకుందుఁ, డనెడి వైష్ణవునిసంస్థాయమునకుఁ
గీ. గన్నమును ద్రవ్వి చొచ్చి యగారమందు, నొక్కగదిలోన శయ్యపై నువిదతోడఁ
బండుకొని యుండఁగను ముకుందుండు వాని, కడకుఁ జని నిద్రవోవుటెఱిక నెఱింగి.

క. ధ్వని కాకుండఁగ ముకుం, దునిసతిహస్తముల నున్నతోడవులఁ గొనుచుం
డినతఱిని ముకుందుఁడు మే, ల్కని దైవికముగను వానిఁ గని క్రేఁగంటన్. 1504

సీ. కదలక యుండి తత్కరభూషణములను గొని వాఁడు మెల్లఁగాఁ జనుచు నుండ
శయ్యాతలమునుండి యొయ్యన లేచి త, త్పృష్ఠదేశంబున నేఁగి వానిఁ
గరయుగ్మమునఁ బట్ట గట్టిగా నాతఁడు, తనమొల నున్నశస్త్రమును లాగి
ఖండించి దానఁ దత్కరంబు బిరబిరఁ, జనియె వచ్చినత్రోవ స్వగృహమునకు

గీ. నంతట ముకుందునిపడంతి యడలి లేచి, క్షితిని బడియున్నపతిని వీక్షించి యేడ్చి
సాధ్వి యగుటను భర్తతో సహగమనము, చేయ దృఢముగ నిశ్చయించికొని యుండ.

సీ. అపుడు వేదాయనుం డనునొకసన్యాసి, తనశిష్యుఁ డగుముకుందునిఁ గనంగ
నాకస్మికంబుగ నచటికి విచ్చేసి, కాంచి తచ్ఛవమును గన్నులారఁ
బరితాప ముదయింప భావంబునను గొంత, శమియింపఁజేసి జ్ఞానమున దాని
సహగమనము సేయ సంసిద్ధురాలైన, తద్వధూటినిఁ గాంచి తత్క్షణంబ

గీ. యతివ దేహము కర్మజన్యంబు జడము, జ్ఞానరూపుఁడు జీవుఁ డజ్ఞానమునను
దేహమం దాత్మబుద్ధి సంధిలుటఁజేసి, జీవునకు శోకమోహంబు లావహిల్లె. 1506

క. శమియించు నెడల నజ్ఞా, నము జీవుఁడు బ్రహ్మ మగుట నశియింపఁడు దే
హము జడ మగుట నశించును, సమయజ్ఞులు దీని కేల సంతాపింపన్. 1507

క. జీవునకు లేదు చావును, నావిర్భావమును దత్త్వ మరసినయెడలన్
జీవుఁడె దేవుం డగుటను, దేవున కుదయమును సంస్థితియు లేకుంటన్. 1508

వ. అని బహుప్రకారంబులం బ్రబోధించి యంతర్వత్ని యగునాయమను సహగమనంబు
నుండి తొలంగించి ముకుందునకుఁ దదనుజునిచే దహనాదిసంస్కారంబులు గావింపం
జేసి తచ్ఛల్యంబు లొకశరావంబునం దుంచి యది వస్త్రంబునం గట్టి ముకుందాను
జునిచేతి కిచ్చి యతనితోడం గూడి తాను బయనంబై యింద్రప్రస్థంబున కేతెంచి
యిం దుండుకోసలాతీరంబుం జేరి యారాత్రి యమునాతటంబున శయనించి యుభ
యులనడుమ నాయస్థిశరావగ్రంథి నుంచికొని నిద్రించుచుండ. 1509

సీ. సారమేయం బొండు చనుదెంచి యచటికి, గట్టిగా నోట నాగ్రంథిఁ బట్టి
కొనిపోయి యొకచోట నునిచి చీలిచి దాని, పైనిఁ గట్టినగుడ్డ పండ్లతోడఁ
దచ్ఛరావాంతస్స్థితము లైనయస్థిసం, తతులను నోటను నమలి నమలి
విడిచిపెట్టుటయును బడియె నయ్యవి కోస, లాతీర్థపుణ్యజలంబునందు

గీ. దానను ముకుందుఁ డమరవిమాన మెక్కి, దివ్యదేహంబుతోడను దేజరిల్లుచు
దేశికుఁడు సోదరుఁడును నిద్రించుచున్న, చోటి కేతెంచి వారలఁ జూచి లేపి. 1510

సీ. ప్రణమిల్లి గురుపాదపద్మంబులకు నను, జన్మన కాశీర్వచన మొసర్చి
మహనీయులార యుష్మదనుగ్రహమున నా, కల్యంబు లీనికాసమయమందుఁ

జేసియెను గోసంబాసిరమహాపాసతోర్థి, వారిలోపలను దత్కారణమున
సపమృత్యువాతండ నై యతిఘోరనరకంబు, లనుభవించుచు నుండినట్టినాకు

గీ. దివ్యదేహంబు ప్రాప్తించి త్రిదివమునకు, నరుగుభాగ్యంబు లభియించె నానతిండు
చనియెద దివంబునకు మీరు సలిపినట్టి, యుపకృతిని విస్మరింప నే నుండువఱకు. 1511

క. అనవుడు వేదాయనుఁ డి, ట్లనియెను నీ కట్టినరకయాతన లొదవం
గను హేతు వేమొ నాకుఁ, వినిపింపుము దెలిసియున్న విశదము గాఁగన్. 1512

వ. అని యడుగుటయు ముకుందుం డాతని కి ట్లనియె. 1513

సీ. దేశికోత్తమ యద స్తీర్థప్రభావంబు, వలనఁ బూర్వస్మృతి గలిగె నాకు
దాన సర్వముఁ దెల్పెదను నీకుఁ జండక, హతుండ నై చచ్చినయవల నేను
యాతనాదేహంబునందుఁ బ్రవేశించి, యమపురంబున కేఁగుసమయమందు
శమనభృత్యులు శిక్ష సలుపుచుండఁగను ద, ద్బాధకు సైఁతయుఁ దాళలేక

గీ. కాలభటులార యేపాతకమును నేను, జేయఁ గల్గెనొ యీబాధ చెప్పుఁ డనుచు
వేఁడ వారు గురుద్రోహి వేటె నీకు, జ్ఞాత మొనరింపవలెనె త్వత్పాతకంబు. 1514

సీ. నీకుఁ బుత్రుండు జన్మించినప్పుడు త్వత్కు, లాచారమార్గంబు ననుసరించి
యీయవ్వై తివి పురోహితునకు గోవును, సంప్రదాయాచారసరణి యిడుగఁ
దద్గురుద్రోహపాతకము ని న్నంటుట, నీమహాబాధ నీ కేరుపడియె
నని నన్నుఁ దోడ్కొని చని కృతాంతునిమ్రోల, నిలుపంగ వడఁకుచు నిలువ నేను

గీ. గాలుఁడు మహాభయంకరాకారమునను, గానఁబడి నాకు గురులోపకరుఁడు తల్లి
దండ్రులను నోమకుండునాతఁడును భూరి, పాపు లని పల్కి ననుఁ జూచి పండ్లు కొఱికి.

సీ. ఈమహాత్ముఁడు గురుద్రోహపాతకమున, నపమృత్యువును బొందినట్టివాఁడు
వర్షాయుతము రౌరవంబునఁ బడవైచి, యవలఁ గుంభీపాకమందుఁ ద్రోసి
క్రమముగా సకలదుర్గతులలోఁ గూలిచి, ఖండింపుఁ డవల ముక్కలుగ వీని
నని యానతీయంగ యమకింకరులు నన్నుఁ, గొనిపోయి ఘోరయాతనలు వెట్టఁ

గీ. గడచెఁ ద్రింశద్దినమ్ములు క్షణము యుగము, గాఁగ నే మనువాఁడ నాకష్టదశను
బడియె నామఱునాఁడె మద్భాగ్యమున మ, దీయశల్యంబు లీపుణ్యతీర్థమందు. 1516

గీ. అపుడు యమభృత్యు లెల్ల దివ్యాకృతులను, గాలుచుఁ బ్రసన్నముగ నాకుఁ గానఁబడిరి
యంతటను దుర్గతివిముక్తి యగుటె కాక, యమరయానంబునాకొఱ కరుగుదెంచె.

క. అనవుడు వేదాయనుఁ డి, ట్లనియె నద స్తీర్థమునఁ ద్వాదస్థులు పడ నీ
వొనరిచినపుణ్య మేమియొ, వినిపింపుము వినఁగ నాకు వేడ్క జనించెన్. 1518

సీ. అనుడు ముకుందుఁ డి ట్లనియె గురూత్తమ, నాగృహంబున కొక్కనాఁడు మున్ను
క్షితిసురుం డొకఁడు విచ్చేయ సాయంవేళ, నతని కారాత్రి నే నన్న మొసఁగి
శయనింప నిచ్చితి శయ్య దాని కతండు, ప్రముదితాత్ముం డయి పవ్వళించె
నంతట నది యేమొ యాకస్మికంబుగా, వానికి దారుణజ్వరము తగిలె

గీ. బాధపడుచుండ దాన నాబ్రాహ్మణుండు, సలిపితిని నేను బహుళోపచారములను
గాని యాసన్న మగుటను గాల మతఁడు, విడిచె నసువులను బ్రభాతవేళలోన. 1519
గీ. అంతటను నేను వానికి నాచరించి, దహనకర్మంబు మంత్రయుక్తముగ నతని
యస్థు లుంచితి గంగలో నందువలనఁ, బడియె నాయస్థు లీతీర్థపాథమందు. 1520
క. అని చెప్పి తదనుమతిఁ గొని, చనియె దివంబునకు నమరసంఘం బెల్లన్
గొనియాడుచు నుండఁగఁ దా, మును సేసినయట్టిపుణ్యమును వేనోళ్లన్. 1521
సీ. ఇఁకఁ జండకునిగాథ యెఱిగించెదను విను, మస్తమింప ముకుందుఁ డప్పు డట్లు
జను లెల్లఁ జండకుం డోసరించె నీపని, యని తత్పురాధీశ్వరునకుఁ దెలుప
నతఁడు విచారించి యఖిలంబు భటులను, రావించి నిజసభారంగమునకు
భటులార విశసనపాత్రుఁ డీచండకుం, డయ్యెను స్వకృతకృత్యంబువలనఁ
గీ. చంద్రభాగకు నైదుక్రోశములలోన, మరణమును బొందువాఁ డొందు సురపురంబుఁ
గాన నీసీమలోపలఁ గాక వీని, నన్యదేశంబున వధింపు డని వచించె. 1522
సీ. అంతట భటులు నృపాజ్ఞ నౌదలఁ దాల్చి, యాతనిఁ గొనిపోయి యాక్షణంబ
చంద్రభాగకు ద్వియోజనదూరమున నున్న, యొకయరణ్యంబులో నొక్కచోట
ఖండించి ముక్కముక్కలుగను జని రంత, శమనబాధలఁ జెంది చండకుండు
భుజగమై యావనంబునఁ జరించుచు నుండఁ, దైర్థికు లట కొక్కతఱిని వచ్చి
గీ. పంపుకొనియుండ నొకపాదపంబుకడను, నాఫణి నిశీథకాలమునందు వారి
దరి కరుగుదెంచి యొక్కభూసురునిచెంత, నుండునొకపెట్టెలోఁ దూఱి పంపుకొనియె.
మ. అంతఁ గొంతసేపునకుఁ బ్రభాతం బగుటయుఁ దైర్థికు లెల్లరును నుతిథులై బదరీ
నారాయణక్షేత్రంబునకు నడచుచుండ నాబ్రాహ్మణుండు నిజపిత్రస్థిపేటికకుఁ గంబ
ళంబుం జుట్టి స్కంధంబుమీఁదం బెట్టికొని జాహ్నవికిఁ బయనంబై వారివెంట నరు
గుచు నారాత్రి కోసలాతీర్థంబునకుం జేరి శీతబాధ కోర్వంజాలక కప్పికొనుటకై
మంజూషకుం జుట్టినకంబలంబు నూడఁదీయ దానిలోనుండి భుజగంబు చివుక్కున
నచటం బడియె. 1524
సీ. అంతట వా రెల్ల నాసర్పమును గొట్టె, చంపంగ నది మహాశ్చర్యముగను
దివ్యవిమాన మధిష్ఠించి దేవతా, దేహంబుతోడఁ దైర్థికులఁ జూచి
సాధువులార నేఁ జండకుం డనెడిత, స్కరుఁడ బ్రాహ్మణవధకారణమున
నపమృత్యువును బొంది యతిఘోరనరకంబు, లనుభవించి భుజంగమై జనించి
గీ. విపినమున నిన్న మీరు దైవికము గాఁగఁ, బండుకొనియున్నతఱిని మద్భాగ్యమునను
నీద్విజునిపెట్టెలోఁ దూఱి యేఁగుదెంచి, మీరు వధియింప నేఁడు నామేను విడిచి. 1525
గీ. దివ్యదేహంబుఁ దాల్చి యీతీర్థమహిమ, మునను ద్రిదశాలయమునకుఁ బోవుచుంటి
నని వచించి దివంబున కరిగె నపుడె, చోద్యముగ నెల్లవారును జూచు చుండ. 1526
వ. అంతటఁ గోసలాతీర్థమహిమంబునకు సంతృప్తుండై యాబ్రాహ్మణుండు గంగా

ప్రయాణంబు నజ్జగించి తత్తీర్థతోయంబునందు స్వపితృశల్యంబుల నిక్షేపించె. 1527
. అప్పు డాతనితలిదండ్రు లమరదేహ, ములను దాల్చి కుమారుఁడు సలిపినట్టి
పనికి సంతోష మొంది దీవన లొసంగి, స్వర్గమున కేగి రది గాంచి వార లెల్ల. 1528
వ. బదరీనారాయణక్షేత్రప్రయాణంబు మాని కోసలాతీర్థంబునందు కృతావాసు లై గోవిందనామధ్యానంబు గావించు చుండ నం దొక్కబ్రాహ్మణుండు మాహాత్మ్యంబునఁ దత్తీర్థంబు ననాదరించి నారాయణక్షేత్రంబున కరుగుచుండ మార్గమధ్యంబున నారాయణుండు వృద్ధబ్రాహ్మణరూపముం దాల్చి యాతని కెదురుగా వచ్చి యి ట్లనియె.
సీ. భూసుర యిడనాడి కోసలాతీర్థంబు, నెట కేగుచుంటివో యెఱుఁగఁ జెపుమ
యనవుడు నాతఁ డి ట్లనియెను బదరికా, శ్రమతీర్థమున నుండఁ జనుచు నుంటి
ననుటయు వృద్ధుఁ డి ట్లనియెను ముక్తి నీ, కొదవ దీతీర్థంబు వదలి చనిన
నమృతవార్ధిని యిడనాడి తృషార్తుండు, చనునె కర్దమమయసలిలమునకుఁ
గీ. పాణి నున్న చింతామణిఁ బరిహరించి, తిరిపమున కేగుచుంటివి హరిని విడిచి
క్షుద్ర మగునింద్రియసుఖంబుఁ గోరుచుంటి, నీమతిప్రాభవము నిఁక నేమిచెప్ప. 1530
క. అనవుడు నా బ్రాహ్మణుఁ డి, ట్లనియెను బొగడకుము స్వల్ప మగుతీర్థంబున్
విని యెఱుఁగ దీనినామం, బును నే నెన్నఁడును బుద్ధిపోయెనె నీకున్. 1531
క. అనుటయు నావృద్ధుం డి, ట్లనియెను జూచియును గన్నులార సురత్వం
బును జెందినచక్రిని ద్విజ, జననీజనకులను నిట్లు చనునె వచింపన్. 1532
సీ. అని స్వరూపమునఁ బ్రత్యక్షమై మోక్షసా, మ్రాజ్యాశ నున్నయాబ్రాహ్మణునకు
క్షితిసుర తీర్థసంతతిలోన నుత్తమ, తీర్థ మింద్రప్రస్థతీర్థ మొకఁడె
బ్రహ్మజ్ఞులందు ధూర్జటివోలె మదవతా, రముల రామావతారంబువోలె
భూదేవవర్ణంబువోలె వర్ణములందు, నద్రులలోఁ దుషారాద్రివోలె
గీ. ననిమిషులలోన పాకశాసనుఁడువోలె, నండజములందు వైనతేయుండువోలె
నదులలో గంగవోలె నారదుఁడువోలె, వైష్ణవులలోన క్షములలో వసుధవోలె. 1533
సీ. అట్టియింద్రప్రస్థమందు మాణిక్యంబు, బలెఁ గోసలాతీర్థ మలరు చుండు
దాని విసర్జించి తదితరతీర్థకో, టులను సేవించిన ఫలము లేదు
ఫలకాంక్ష గల్గియు ఫలకాంక్ష లేకయుఁ, దీర్థసేవ యొనర్చు తైర్థికులకు
సకలతీర్థములలో సముచితంబుగ ఫలం, బొసఁగుచుండెడివాఁడ నొకఁడ నేనె
గీ. యనుటయును విష్ణువాక్యంబు లాలకించి, మౌఢ్యము తొలంగ హరికి నమస్కరించి
తిరిగి యరుదెంచి కోసలాతీర్థమునకు, సాధుబృందంబుతోడ నచ్చటనె యుండి. 1534
వ. దేహావసానంబువఱకును దత్తీర్థస్నానంబును విష్ణుధ్యానంబునుం గావించుచు నంతంబున నాశస్త్రఫలంబుచే నాతైర్థికులుపోలెఁ దానును బ్రాకృతదేహంబు విడిచె. 1535
సీ. అప్పుడు గోవిందుఁ డరుదెంచి స్వయముగా, వైకుంఠముననుండి వారికడకు
స్వచరణదాసభావమును స్వసాయుజ్య, మును వారి కందఱకును నొసంగి

గరుడాధిరూఢులఁ గావించి నిజధామ, మునకుఁ దోడ్కొని పోయి యునిచె నచట
నది యాదిగను జెందె నచ్చోటు దక్షిణ, కోసలాతీర్థాఖ్యఁ గుతలమందు

గీ. నవల నుత్తరకోసలాఖ్యను వహించె, దాశరథి యయి రాముఁ డుద్భవము నొంది
నట్టిచో టీస్థలద్వయమందు నెచటఁ, బాసినను మేను వైకుంఠవాస మొదవు. 1536

వ. దక్షిణకోసలలోనఁ దనువు వొఱంగినవారలను బుండరీకాక్షుండును నుత్తరకోసలలోనఁ గాలధర్మంబు నొందినవారలను విష్ణుభటులును వైకుంఠంబునకుం గొనిపోవుదురు.

గీ. కాన నుత్తరకోసలకంటె దశగు, ణాధికంబుగ వచియింతు రార్యు లెల్ల
నిలను దక్షిణకోసల నిదె విశేష, ముభయకోసలలకు ఫల మొకటె యగుట. 1538

క. అని పలుకుటయును గ్రీబి తన, మనమున సంతోష మొంది మానీంద్ర వినం
గను మధువనమహిమంబును, జనియించెను గోర్కి చెపుము సవిశేషముగన్. 1539

వ. అని యడుగుటయు నారదుం డాతని కిట్లనియె. 1540

—: ఇంద్రప్రస్థమధువనమాహాత్మ్యము :—

సీ. మానవాధిప యిట మధువనం బనుపేరఁ, బరమపావన మైనపుర మొకండు
స్థాపింపఁబడియె మాధవునిచే మును మహేం, ద్రప్రీతికొఱకుఁ దత్సవిధమందు
విశ్రాంతి యనుపేర వెలసెఁ దీర్థం బొండు, దానిమహాత్త్వ మత్యద్భుతంబు
దొరక దచ్చోటను మరణంబు బహుజన్మ, ములు విష్ణుసంసేవ సలుపకున్నఁ

గీ. గలదు విశ్రాంతి యనుపేరు గలమఱొక్క, తీర్థరాజంబు కాళిందితీరమందు
శౌరి యచ్చోటఁ గంసుని సంహరించె, నాయుభయతీర్థములు మోక్షదాయకములు.

సీ. కలదు కిరాతనగర మనుపురము హి, మాచలోపత్యకయం దొకండు
కుద్దాలుఁ డనునొక్కక్షోణీసురుం డందుఁ, గలఁడు దరిద్రుఁడు కష్టజీవి
యతనికిఁ గల దొక్కయతివ సుందరి యామె, పతిని గణింపక భావమందు
జారులతోఁ గూడి సంచరించుచుఁ బ్రసూ, తూన్యంబుగను నొక్కసుతునిఁ గాంచె

గీ. నంతఁ గుద్దాలుఁ డఖిలజనాపహాస, పాత్రుఁ డై రోఁత గలుగుట బ్రదుకుపైని
మంతఁ ద్రావి విషం బొకరాత్రివేళ, లోన సంతస మొందుచు దాని కాపె. 1542

వ. మఱునాఁడు భర్తకు దహనాదిసంస్కారంబులు గావింపంజేసి కొలఁదికాలంబులోన జారార్పితధనంబుచే సుతున కుపనయనంబు నొనరించి యథేచ్ఛంబుగాఁ బల్లవులతోడ విహారింపం దొడంగె. 1543

సీ. అపుడు తదాత్మజుం డామెదుశ్చర్యకుఁ, దల యెత్తుకొని యూర నిలువలేక
యొకనాఁడు వైరాగ్య మొదవఁ దీవ్రంబుగా, నామెతోఁ జెప్పక యడవి కరిగి
సాధుసాంగత్యంబు సమకూర నచ్చోట, దానిచే నుదయింప జ్ఞాన మెదను
హరిని స్మరించుచు నాత్మలో శుద్ధజ, న్మంబు ప్రాప్తింపఁ గాయంబు విడిచెఁ

గీ. దత్పుత్రవియోగదుఃఖ మించుకయును లేక, సంచరించుచు నల్లె యాచంచలాక్షి
కొంతకాలంబునకు జరాక్రాంత యగుట, వార్ధకముఁ గుట్టనీత్వంబువలనఁ గడపి.

గీ. కుష్ఠరోగంబు ప్రబల మై కొఱికివైవ, ఘ్రాణమును బాదయుగమును గరయుగమును
దీన యై దిక్కు లేమిని దిండికొఱకు, నేడ్చుచుండఁగఁ గని త్రోవ నేఁగుజనుల. 1545

సీ. చూచి యాయమ నొక్కక్షోణీసురుం డాసి, పాపిని చేసినపాతకంబు
దుఃఖంబు నీయక తొలఁగిపో దిహపరం, బులలోన నెట్టివారలకు నేని
నీకర్మమునఁజేసి నీకు సాయము సేయ, నుద్భవింపదు బుద్ధి యొక్కరికిని
నిదియె కాకుండ నీ కింతకంటెను ఘోర, నరకబాధలు గల్గుఁ బరమునందు

గీ. సులభముగఁ జేయుదురు పాపములను మూఢు, లనుభవించెడితఱిని దదఘఫలంబు
నేడ్తు రద్దాన ఫల మేమి యెగిరిపడినఁ, గలుగుగాయంబు మానునె పలవరింప. 1546

క. అని పలికి తదవలోకన, మున జేసినకతన నర్యమునిఁ జూచి మనం
బునఁ గృష్ణ కృష్ణ యనుకొని, చనియెను దనత్రోవఁ దాను జయ్యన నంతన్. 1547

ఆ. అట్టు లేడ్చియేడ్చి యాదుష్టురాలు ప్రా, ణములు శోషిలంగ నాఁటిరేయిఁ
దనువుఁ దొఱఁగె నంతఁ జనుదెంచి శ్వపచులు, దానిపాదములకుఁ ద్రాళ్లు గట్టి. 1548

క. శునకంబు నీడ్చికొని పో, యినగతి నీడ్చికొనిపోయి యెల్లరుఁ జూడం
గను నగరబహిర్దేశం, బునఁ బాఱఁగవైచి తిట్టి పోయిరి కడకున్. 1549

గీ. అగ్నిసంస్కార మొనరింపఁడయ్యె నొక్కఁ, డైన నాపాపురాలికి నంత శమన
భటులు చనుదెంచి బంధించి పాశములను, నాయమను గొనిపోయిరి యమునికడకు.

క. అంతటఁ గృతాంతుఁ డొకమ, న్వంతర మాయమను ఘోర మగునరకములో
నెంతయును వేఁచి విడువఁగ, నంతమునకు భువిని బుట్టె నాయమ యుడు మై. 1551

ఆ. అట్లు పుట్టి గోధ యై యామె యొక్కశ్మ, శానమందుఁ జేరి శవపలంబు
నారగింపఁ దొడఁగె ననుదినంబును వల్లె, తినుచు నుండ నొక్కదినమునందు. 1552

సీ. ఒకమహామునియింట నుదయంబు నొందిన, తత్పుత్రుఁ డచటికి దైవికముగఁ
జనుదెంచి యాగోధికను జూచి తద్గాథ, యెఱిఁగి సర్వము ధ్యానదృష్టిచేతఁ
దనతల్లి యగునాయమను నెట్టు లేనియు, నుద్ధరించెడిబుద్ధి యుద్భవిల్లఁ
దనతండ్రి యగుతపోధనునియొద్దకుఁ జని, తనతల్లివిషయ మంతయును దెలిపి

గీ. యామెయుద్ధారమునకు నుపాయ మేది, యైన నెఱిఁగింపు మని వేఁడ నమ్మహర్షి
సంతసము నొంది తద్బుద్ధి కెంత యేని, వత్స తెలిపెద విను మున్న వాస్తవంబు. 1553

వ. పుణ్యతీర్థంబునందుఁ బుత్త్రునివలనఁ బిండోదకంబులం గొనినపితృవర్గంబు నరకహీనజన్మోద్ధృతం బై స్వర్గంబును స్వర్గంబునుండి వైకుంఠంబునుం జెందంగలుగు. దానంజేసి స్వపితృవర్గంబును బుత్త్రుం డుద్ధరింపకున్న నరకముం జెందు. కావున నీవు శీఘ్రంబుగా లెమ్ము. సూర్యుం డిప్పుడు కన్యారాశిగతుం డై యున్నవాఁడు. పితృవర్గంబు నుద్ధరింప నియ్యది ముఖ్యకాలంబు. 1554

గీ. కలదు భూమిలోన ఖాండవకాననంబు, కలదు కాళింది దానిలోఁ గలదు దాని
తీరమందు నింద్రప్రస్థతీర్థ మదియుఁ, గలదు మధువనతీర్థంబు కలుషహరము. 1555
సీ. దానిలో నోసరించి స్నానసంధ్యలను శ్రా, ద్ధంబు గావింపుము తత్తటమున
దాన నీతల్లి గోధారూపమును వీడి, చను విష్ణుమందిరంబునకు వేగ
మధుకాననశ్రాద్ధ మధికంబు సుమి గయా, శ్రాద్ధంబుకంటెను శతగుణములఁ
జలుప కుండిన నట శ్రాద్ధ మామెకు లేదు, ముక్తి యర్బుదకల్పములకుఁ గూడ
గీ. యని వచించుటయును మునితనయుఁ డతని, కెఱఁగి తన్మధువనమున కేగి పూర్వ
జన్మపితృవర్గముక్తి కై శ్రాద్ధ మచటఁ, జలిపి షట్పిండవిధిని ప్రశాంతుఁ డగుచు. 1556
గీ. అరుగుదెంచుచునుండఁగ స్వాశ్రమమున, కభ్రమధ్యంబునను దేవతాకృతులను
నమరుచును నెక్కి షడ్విమానముల నేఁగు, దెంచి దర్శన మిచ్చి తత్పితృగణంబు.
గీ. వత్స కోరుము వరమును త్వత్ప్రసాద, మునను నరకవిముక్తిని బొంది మేము
పోవుచున్నాము వైకుంఠమునకు దివ్య, దేహములతోడ ముద మామతిల్ల నెదల.
సీ. అని పల్కుటయును నమ్మునిపుత్రుఁ డాశ్చర్య, మెలయంగ నాదేవతలను జూచి
మహనీయులార యుష్మచ్చరిత్రములను, దెలుపుఁడు నాపైని వెలయఁ గరుణ
యనుడు నం దొక్కఁ డిట్లనియె నాయన నేను, జనకుండఁ బ్రాగ్జన్మమునను నీకుఁ
ద్వన్మాత వ్యభిచారవర్తనంబున నిన్ను, గనుటను నా కది గామి హితము
గీ. త్రావి విషమును జచ్చి తత్పాతకమున, రాక్షసుఁడ నయి మన్వంతరమును బంచ
దశశతాబ్దంబులును హీనదశను నెట్లొ, కడపి యీషోడశశతాబ్దకాలమందు. 1559
ఆ. నీవు మధువనమునఁ గావించినట్టి శ్రా, ద్ధమునఁ దొలఁగి దైత్యతనువు దివ్య
దేహ మేరుపడియెఁ దెలిపితి నాగాథ, యనుడు మునికుమారుఁ డతని కెఱఁగి. 1560
గీ. దేవ హరిభక్తి మామకభావమందు, స్థిరముగను బాదుకొనియుండ వర మొసంగు
మని యడుగ నాతఁ డట్టులె యగుఁగాక, యని వరం బిచ్చి వైకుంఠమునకుఁ జనియె.
గీ. అంతఁ దత్ప్రాగ్జననమాత యతనిఁ జూచి, తండ్రి నాయొనరించినతప్పువలనఁ
గడపి యొకకల్పమును నరకములలోనఁ, గొనకు నిలలోన గోధ నై జనన మొంది. 1562
గీ. తినుచు శవమాంసమును ననుదినము నొక్క, కాటిలో శతవర్షము లడపి నేఁడు
దివ్యతను వొందితి నికృష్టదేహ ముడిగి, సలుపుటను నీవు మధువనశ్రాద్ధవిధిని. 1563
క. అని పలుకుటయును నామెకు, నొనరించి ప్రణామ మూరకుండుటయును నా
మునిసుతుఁడు తదనుమతిఁ గొని, చనియెను నాకాంత విష్ణుసదనంబునకున్. 1564
వ. అంతటఁ దత్పూర్వజన్మపితామహుండు పత్నీసమేతంబుగా నాతనిం గని. 1565
సీ. నాయన మేము సనాతనాచారంబు, వదలి యధర్మవివాదములను
గావించుచును నంతకాలంబువఱకును, జీవించితిమి దానఁజేసి మాకు
దేహాంతమునఁ దటస్థించె రౌరవదుర్గ, తిని బడి దుఃఖ మొందెడియవస్థ
గడచె సహస్రయుగంబు లిప్పటి కింక, నెంతకాలం బిట్టు లేడ్వవలెనొ

గీ. యని వగచు చుండ మేము నిరంతరంబు, సలిపితివి నేడు మధువనశ్రాద్ధమునను
మాకు నుచ్చైఃపదస్థితి చేకుఱంగ, నీవు చేసినయుపకృతి యేమిచెప్ప. 1566

క. అనవుడు వారల కాతం, డొనరించి ప్రణామ మూరకుండుటయును దీ
వన లిచ్చి వార లతనికిఁ, జని రతిహర్షమున విష్ణుసదనంబునకున్. 1567

వ. అంతట నాతనిపూర్వజన్మప్రపితామహుం డి ట్లనియె. 1568

సీ. తండ్రి భవత్ప్రపితామహుండను నేను, బూర్వజన్మంబున భ్రూణహత్య
కావించి తత్పాతకంబున ఘోరదు, ర్గతులందుఁ గూలి దుఃఖములు చెంది
కడ కిలలోన సూకరగర్భమునఁ బుట్టి, మలభక్షణంబును జలిపి చలిపి
శునకగర్భంబున జనియించి తరువాతఁ, బడి పడి పడరానిబాధ లెల్ల

గీ. నవల వృక్షంబుగను బుట్టి యమితదుఃఖ, మనుభవించి వచింప నోరాడ కునికిఁ
గడపి మన్వంతరశతంబు కడకు నేఁడు, దురితముక్తుండ నైతి నీకరుణచేత. 1569

క. అనవుడు మునితనయుం డి, ట్లనియెను నీ వెట్లు భ్రూణహత్యను గావిం
చినవాఁడవొ వచియింపుము, కనికరమున నాకు వినఁగఁ గాంక్ష జనించెన్. 1570

వ. అని యడుగుటయు నాతనికిఁ దత్ప్రపితామహుం డి ట్లనియె. 1571

సీ. మున్ను బ్రాహ్మణవంశమున నేను జనియించి, ధనలోభమున మంత్రతంత్రవిధుల
నేర్చి యౌషధముల నెలఁతల కిచ్చుచు, నార్జించు చుంటి ద్రవ్యంబు దాన
నధనునిజ్ఞానంబు హరియించు లోభంబు, కల్యాంబువును రవి కొనినయట్లు
జ్ఞానంబు నశియింపఁ జలుపు పాపము దాన, నరకంబు హీనజన్మమును బొందు

గీ. నట్టు లుండంగ నొకదిన మందు నొక్క, గర్భవతి యరుదెంచి నాకడకు స్వామి
కంటి నిప్పటి కార్గురు కన్యకలను, జెప్పు మీగర్భమున నెట్టిశిశువు కలదొ. 1572

క. అని ప్రశ్నించుటయును నేఁ, గనులను మూసికొని బకముకైవడి ధ్యానం
బును జేసినట్టు లభినయ, మొనరించి క్షణంబు పిదప నూఁపుచు శిరమున్. 1573

గీ. తెఱచి కన్నుల మెల్లఁగాఁ దెలిప నీకు, నిప్పుడును గన్యకయె పుట్టుఁ దప్ప దంటి
నంతటను నామె పడి మదీయాంఘ్రులందు, నేఱులుగఁ బాఱఁ గన్నునీ రేడ్వఁ దొడఁగె.

సీ. ఆసమయమున నే నాయమ నోదార్చి, యింతి నీ వేడ్వంగ హేతు వేమి
చెపుము నావుడు నామె క్షితిసురోత్తమ నాకుఁ, బ్రభవించె నేని సప్తమకుమారి
చావు సిద్ధం బని జాతకంబున నుండె, నేఁ జేయవలసిన దేమి యింక
ననవుడు నీడె సమయంబు ద్రవ్యము లాగ, నని యెంచి మది నిట్టు లంటి నేను

గీ. కలికి భయపడవలదు నీగర్భకన్య, పురుషుఁ డగునట్టు లౌషధంబును నొసంగు
వాఁడ నని చెప్పుటయును నవ్వనిత నిధిని, గన్న పేద తెఱంగునఁ గని ముదంబు. 1575

క. తనచెఱఁగులోనఁ గట్టిన, కనకపలం బొసఁగి నాకుఁ గరుణించుము న
న్ననుటయును శీఘ్రకాలం, బున నిచ్చెద నౌషధంబుఁ బురుషుఁడె పుట్టన్. 1576

క. అని చెప్పి యుపాయమును నే, ననిపి గృహంబునకుఁ బిదప నాలోచనముం
బొనరించి మానసమునను, గని యొక్కయుపాయమును సకౌతుకమతి నై. 1577

ఆ. పనిచినాఁడ గర్భపాతంబు గావించు, నౌషధంబు నపుడె యామెదాసి
చేతి కిచ్చి దాని నాతన్వి భుజియించెఁ, గొడుకు పుట్టునని కుతుకమునను. 1578

ఆ. అంత నాఁటిరేయి నయ్యె గర్భస్రావ, మాపడంతి కామె యపుడు తృతీయ
మాస మగుట శిశువు మగవాఁడొ యాఁడువో, యెఱుఁగరాదయెఁ జిహ్న మేర్పడమి.

సీ. అంతట మఱునాఁడు చింతతో నాయింతి, యేతెంచి నాయింటి కేడ్చి యచట
నొకటి చేయఁగఁబోవ నొకటి యయ్యె మదీయ, పాపకర్మమున నిర్భాగ్య నగుట
నని పల్కి నాద్రవ్యమును నా కొసంగుము, చనియెద నెచటను నాచాన కపుడె
మును నేను జేసి యుంచిననిశాభస్మాన్వి, తేష్టికాచూర్ణంబు నిట్టె చూపి
గీ. తల్లి యీయౌషధంబును ద్వన్నిమిత్త, మొనరిచితి దీనిలోన నీ వొసఁగినట్టి
ధనముకంటెను నిబ్బడిధనము పడియె, నడుగరా దని యిపుడు నిన్నడుగ నైతి.

క. అనవుడు నాయమ యేమియు, ననకుండఁగఁ బోయె నింటి కానతముఖి యై
వినిచితిని నేను గావిం, చినపాపము దాఁపకుండఁ జివరకు నీకున్. 1581

క. మధువనతీర్థశ్రాద్ధం, బధికాధికఫలద మగుట నతిఘోరాఘో
దధినుండి గట్టుఁ జేరిచె, నఘోగతులలోనఁ జిక్కి యల్లాడుననున్. 1582

క. అని చెప్పుటయును వందన, మొనరిచి మునిపుత్రుఁ డూరకుంటయు నేఁగెన్
దనప్రపితామహుఁడు రయం, బున వైకుంఠంబునకుఁ బ్రమోదముతోడన్. 1583

వ. అంతటఁ దత్పూర్వజన్మప్రపితామహి యి ట్లనియె. 1584

గీ. తండ్రి నరకాగ్నిలోఁ గ్రాఁగి తల్లడిల్లు, చున్నన న్నిపు డమృతాబ్ధి నోలలార్చి
సౌఖ్యపఱిచితి మధువనశ్రాద్ధమునను, నీకతంబున ధన్యత నాకుఁ గలిగె. 1585

క. అని చెప్పి తత్ప్రణామం, బును గొని వైకుంఠమునకుఁ బోయె సుపర్వుల్
తన వెంట నరుగుదేరఁగ, వినుతించుచు విష్ణునగరవీథులలోనన్. 1586

సీ. అంతట మునిపుత్రుఁ డరుదెంచి మరలను, జనకాశ్రమమునకు సత్వరముగ
నెఱిఁగింప జరిగినవృత్తాంత మఖిలంబు, నమ్మహాముని ప్రమోదమ్ము నొంది
యాశ్రమభారంబు నాత్మజన్మునిపై ని, నునిచి తా మధువనంబునకు నేఁగి
యచ్చట స్నానంబు నాచరించుచును వి, శ్రాంతితీర్థాంబుపూరంబునందుఁ
గీ. గొంతకాలంబు గడపి నిశ్చింతముగను, స్నాన మొనరించుచును నొక్కనాఁడు విష్ణు
దర్శనము గోర శార్ఙ్గి తత్క్షణమునంద, యతనిముంగల నిల్చి ప్రత్యక్షముగను. 1587

క. తనగరుడవాహనముపై, నునిచికొని తపోధనుని మహోత్సాహమునన్
జనియెను వైకుంఠమునకు, ననిమిషులును మునులు విస్మయంపడుచుండన్. 1588

సీ. అని చెప్పుటయు శిబి విని సర్వమును నొక్క, సంశయం బుదయింప స్వాంతమందు
నారద పితృగణోద్ధారకం డగుమహా, త్ముం డేకతంబునఁ గుండఁ డయ్యె
వినోదంబుగను నాకు వినిపింపుము తదీయ, వృత్తాంతమును విన వేడ్క గల్గె
ననుడు నారదుఁ డిట్టు లనియె నాతనిఁ జూచి, విశ్వంభరాధీశ వినుము వినుతుఁ
గీ. జేరి మును లెల్లరును హరిద్వారమందు, జ్యేష్ఠసితదశమీతిథి నేకతమున
నుండ నచ్చటి కపుడు బుధుండు రాఁగ, నందఱును లేచి కూర్చుండి రతఁడు మ్రొక్క.
సీ. అం దొక్కమునిపుత్త్రుఁ డది యెల్ల వీక్షించి, యాశ్చర్య మొదవంగ నాత్మలోనఁ
దనజనకునిఁ గనుంగొని యి ట్లనియెఁ దండ్రి, యీచిన్నవాఁ డెవ్వఁ డితఁడు రాఁగ
మునులెల్ల గౌరవంబున లేచి రనవుడు, వాని కి ట్లనియెను వానితండ్రి
తనయ యీతఁడు గురుతనయుండు బుధుఁ డను, వాఁడు చంద్రాన్వయవర్ధనుండు
గీ. నావుడుఁ దదుక్తు లెల్లఁ దన్నందనుండు, విని మరల నిట్టు లనియెను జనక నీవు
చెప్పినది సంగతము గాదు జీవసుతుఁడు, హిమకరాన్వయవర్ధనుం డెట్టు లయ్యె. 1590
సీ. అనవుడు వానికి నమ్మౌని బుధజన్మ, వృత్తాంత మంతయు నెఱుఁగఁజేయ
మునికుమారుండు పక్కున నవ్వి యీతఁడు, కుండుఁడా యని యూరకుండె నంత
సర్వభూతాంతరజ్ఞాత యైనబుధుండు, గ్రహియించి తద్ధాసకారణంబు
మునిసభలోన నమ్మునిపుత్త్రునకు శాప, మిచ్చెఁ గుండుండుగా నిలను బుట్ట
గీ. నంతఁ దజ్జనకుండు బుధాంఘ్రులందు, నిజతనూజునిఁ బడవైచి నిర్మలాత్మ
తగదు బాలుని శపియింపఁ ద్వాదృశులకు, నగునె పిచ్చుకపైని బ్రహ్మాస్త్ర మేయ.
సీ. రాదు సాధువుల కాగ్రహ మెప్పుడును గూడ, నేకతంబున నైన నెన్నఁ డేని
నచ్చినఁ గ్రోధంబు వహ్నితప్తం బైన, యుదకంబు శైత్యంబు నొందినట్లు
క్షమచేత శమియించుఁ గాన క్షమాసారు, లని చెప్పుదురు సాధుజనుల బుధులు
జ్ఞానవివర్జితుం డైనబాలకుని న, నుగ్రహింపుము వీడి యాగ్రహంబు
గీ. నని వచించుటయును బుధుం డాగ్రహంబు, నుడిగి తాపస నీపుత్త్రుఁ డుర్విలోనఁ
బుట్టినను గుండుఁ డై జ్ఞానమునను మేను, విడిచి జన్మాంతరంబునఁ బడయు ముక్తి.
ఆ. అని యనుగ్రహించి చనియె నాతాపస, సుతుఁడె కుండుఁడుగను క్షితిని బుట్టి
ప్రమంది మరలఁ బుట్టి మానిసూతిగఁ బితృ, గణము నుద్ధరించి కాంచె ముక్తి. 1593
క. ఈమధువనమాహాత్మ్యము, నేమానవుఁడేని వినిన నిహలోకమునన్
క్షేమమును బొంది పరమున, దామోదరసన్నిధానదాస్యముఁ బడయున్. 1594
క. అని చెప్పుటయును శిబి యి, ట్లనియెను మహనీయ బదరికాశ్రమమహిమం
బును వినఁగ నాకు వేడుక, జనియించెను మదిని జెపుము సవిశేషముగన్. 1595
వ. అని యడుగుటయు నారదుం డాతని కి ట్లనియె. 1596

—: ఇంద్రప్రస్థబదరికాశ్రమమాహాత్మ్యము :—

సీ. జననాథ మధువనంబునకు నేకాదశ, కార్ముకపరిమితక్రోశతలమునఁ
బరమపావన మైనబదరికాశ్రమ ముండె, దానిమాహాత్మ్య మత్యద్భుతంబు
వినుము దృష్టాంతంబుగను నీకు నే నొక్క, వృత్తాంతమును వచియించువాఁడ
మున్ను మగధదేశమున నొక్కధాత్రీసు, రుం డుండె దేవదాసుండు నాఁగ
గీ. నాతనికి నుండె నుత్తమ యనెడిపత్ని, నామధేయార్హశీల యానళినముఖికిఁ
బుట్టి రంగదుఁ డనియెడిపుత్త్రుఁ డొకఁడు, వలయ యనుకన్య యొకతెయు వర్ణ్యగుణులు.
క. వారికి విద్యాబుద్ధులు, నేరిపె సుగుణముల కెల్ల నిధు లని లోకుల్
పేరుకొనుయోగ్యతను జే, కూరిచి తలిదండ్రు లొదవఁ గుతుకం బెదలన్. 1598
గీ. యుక్తకాలములందు శాస్త్రోక్తవిధిని, బరిణయంబులు నేసిరి ప్రజలు పొగడ
నవల భర్తృగృహంబున కరిగె వలయ, యంగదుఁడు గృహకార్యధుర్యత వహించె.
గీ. అంతటను దేవదాసుఁ డాహ్లాద మొదవఁ, దనవధూటిని బిలిచి యిట్లనియెఁ దన్వి
చేయవలసినకార్యముల్ చేయఁబడియెఁ, గొడుకు గృహకార్యనిర్వాహకుశలుఁ డయ్యె.
సీ. శమియింప నున్నది జవ్వనం బోసన్న, మైనది జర యది యంటె నేని
శాంతింపఁజేయు సచంద్రనక్షత్రకాం, తిని బ్రభాతమువోలె నేత్రశక్తి
గమనమాంద్యంబును గలుగంగఁ జేయును, బంధశృంఖలవోలెఁ బాదములకుఁ
గంపింపఁజేయు నంగములను మేదినీ, రుహదళంబులను మారుతమువోలెఁ
గీ. గాన జర రాకముందె శీఘ్రముగ నేఁగి, పుణ్యతీర్థంబులకు స్నానములను గాయ
శుద్ధి గావించుకొని చిత్తశుద్ధి దానఁ, దనరఁ దరియించుగతి చూచుకొనఁగవలయు.
గీ. చచ్చువఱకును మోహపాశమునఁ జిక్కి
విడువఁ జాలక సుతదారవిత్తములను
నేడ్చు చుండును మూఢుఁడు గృహమునందె
బుధుఁడు వైరాగ్యమున సర్వమును ద్యజించు.
ఆ. ఆత్మ నాత్మ తప్ప నన్యులు తరియింపఁ, జేయఁజాల రనుట చివరమాట
దాని నెఱిఁగి ప్రాజ్ఞు లైనవారలు భవ, రక్తి విడుతు రాత్మముక్తికొఱకు. 1603
క. కావునను తీర్థయాత్రను, గావింపఁగ నేఁడు వాంఛ గలిగెను నాకున్
నావుడు నుత్తమ యుత్తమ, భావ యగుట నిట్టు లనియె బహుభక్తిమెయిన్. 1604
ఆ. పతిని విడిచి యుండ భావ్యంబె సాధ్వికి, నరుని వెంట నీడ యరుగ కున్నె
యనుడు దేవదాసుఁ డామెభావమునకు, సంతసంబు నొంది స్వాంతమందు. 1605
గీ. ఆమెతోడను బయన మై యాత్మజుండు, కొంతదూరంబు తమవెంటఁ గూడిరాఁగ
నతని సామోక్తులను నింటి కనిపి పైని, నరుగు చుండంగ మార్గమధ్యంబునందు.
క. కనఁబడుటయు నొకసిద్ధుం, డొనరించి ప్రణామ మాగుణోత్తరునకు ని
ట్లనియె మహాత్మ వచింపుము, వినఁగ భవద్గాథ నాకు వేడుక గలిగెన్. 1607

వ. అని వేఁడుటయు నాసిద్ధుండు దేవదాసున కిట్లనియె. 1608
సీ. క్షితిసుర నే నొకసిద్ధుండ సాంఖ్య మిం, ద్రప్రస్థపుణ్యతీర్థంబునందు
విష్ణుతుల్యుండు గా వెలసినకపిలుని, యొద్దఁ బఠించుచు నుండుతఱిని
నొకనాఁడు మాగురుం డొనరింప స్నానంబు, యమునలో శిష్యసమన్వితముగఁ
జని బదరీక్షేత్రమునకుఁ దత్పుణ్యాత, రంగిణిలోన మునుంగ నుండ
గీ. నప్పు డొకకాసరము వచ్చి యందు మునిఁగి, లేచి యట నున్నకపిలునిఁ జూచి మర్త్య
వాక్యతతి నిట్టు లనియెను స్వామి యిపుడె, సంస్మృతం బయ్యె నాపూర్వజన్మగాథ.
గీ. ఈమహాపుణ్యతీర్థ మేనామమునను, వెలసి యున్నదో చెప్పుము వినఁగ నాకు
ననుడు మాదేశికుం డిట్టు లనియె నప్పు, డేమొ నీపూర్వవృత్తాంత మెఱుఁగఁజెపుమ.
సీ. అనుడు నామహిష మిట్లనియె స్వామి వచింతు, వినుము నాకథ యెల్ల విశదముగను
మున్ను నేను గళింగమునకుఁ బ్రభుండనై, ధనమదాంధ్యంబు నేత్రములఁ గప్పఁ
గామంబు తల కెక్కఁ గనఁబడ్డసతి నెల్ల, గ్రహియించుచును బలాత్కారమునను
వనసామజముపోలె వర్తించుచుండంగ, నన్యులవలన భయంబు లేక
గీ. ప్రజలు నాదౌష్ట్యమును సహింపంగలేమిఁ, జనఁగఁ బరదేశమునకు రాష్ట్రమును విడిచి
యుద్యమించుచు నుండంగ నొక్కదినము, నందు దుర్వాసుఁ డచ్చటి కరుగుదెంచె.
క. అరుదేరఁగ దుర్వాసుం, డరిగి యతనికడకుఁ బౌరు లందఱు నాదు
శ్చరితమును జెప్పి యమ్మునిఁ, చరణంబుల మీఁద వ్రాలి సంక్షోభింపన్. 1612
సీ. అంతట దుర్వాసుఁ డాగ్రహావిష్టుఁ డై, సఖులతో నే నున్నసమయమందుఁ
జనుదెంచుచుండ మత్సదనంబులోనికి, నతని నెట్టంగ నే ననుప భటుల
వారల నతఁడు హుంకారమాత్రంబుచే, క్షణకాలముననె భస్మం బొనర్చి
నన్నుఁ జూచి మహిష మై వనములోఁ జరియింపు, మని తిట్టి స్వాశ్రమంబునకుఁ బోయె
గీ. నంతటను నాకు రాజదేహంబు పోయి, కాసరశరీరము జనింపఁ గాననలందుఁ
దిరిగి బహుకాల మిచటి కేతెంచినాఁడ, నాయొనర్చినపూర్వపుణ్యమున నేఁడు. 1613
సీ. అని వచించుటయు ని ట్లనియెను గపిలుఁడు, వసుధాధినాథ పూర్వంబు నీవు
పోనరించితివో యేమి పుణ్యంబు నుడువుము, నాఁగ ని ట్లనియె నానరవరుండు
నెలకొల్పితిని గూపములఁ దటాకముల వృ, క్షములను లోకోపకారకముగ
దాన నీపుణ్యతీర్థమున మున్గుటయుఁ బ్రా, గ్జన్మసంస్మృతియును సంఘటిల్లె
గీ. నింక నీకాసరశరీర మెట్లు నాకుఁ, దొలఁగి వెంటనె త్రిదివంబు కలుగఁగలదొ
చెపుము దయతోడ మఱవ నీచేయునట్టి, యుపకృతిని నెన్నటికిఁ గూడ నల్లమందు.
వ. అని వేఁడుటయుఁ గపిలుం డాతని కిట్లనియె. 1615
సీ. ఇది బదరీతీర్థ మిందు స్నానము చేయు, నప్పు డేసంకల్ప ముప్పతిలునొ
తత్సిద్ధి గలుగు నేతత్తీర్థమునఁ దీర్థ, మాడినవెంటనె యద్భుతముగఁ

గావున నీక్షుద్రకాయంబు దొలఁగంగ, స్వర్గంబు గలుగంగ స్వాంతమందుఁ
దలఁచి యీనీటను జలుప్రము స్నానంబు, శీఘ్రంబ నీకుఁ దత్సిద్ధి గలుగు
గీ. ననుచు నమ్మునివచియించినట్లు లోనఁ, దలఁచికొని యానృపాలుఁడు సలిపె నందు
స్నానమును వెంటనె తొలంగి సైరిభాంగ, మమరతను వాతనికిఁ గల్గె నద్భుతముగ.
గీ. అంతటను శక్రుఁ డచ్చటి కరుగుదెంచి, యతని నెక్కించుకొని దివ్యయానమందు
నరిగెఁ ద్రిదివంబునకు మును లనిమిషులును, జేయు చుండంగ నుతులను వేయినోళ్ళ.
క. కావున విూ రాత్రిభువన, పావనతీర్థమున కరిగి పడయుఁడు ముక్తిన్
గావించి యందు స్నానము, భావంబున మోక్షవాంఛ పరుగుచు నుండన్. 1618
చ. అని వచియింపఁగన్ బదరికాశ్రమభూమికి నేఁగి దానిలో
నొనరెడిపుణ్యతీర్థమున నుత్తము లైనతపోధనాగ్రణుల్
మునుఁగుచు నుండఁ జూచి కడుమోదము సంఘటిలంగ స్నానముం
బొనరిచి మోక్షకామమున ముక్తిని బొందిరి విప్రదంపతుల్. 1619
గీ. భక్తితో విన్నయెడ హరిప్రస్థసంస్థ, బదరికాశ్రమతీర్థప్రభావ మెవ్వఁ
డేని తత్తీర్థమున మున్గుమానవునకుఁ, గలుగుపుణ్యంబు నార్జించు సులభముగను.

—: ఇంద్రప్రస్థహరిద్వారమాహాత్మ్యము :—

సీ. మఱియు నీ కొకగాథ యెఱిఁగించెదను విను, కాళింగుఁ డనెడితస్కరుఁ డొకండు
చండాలకులభవుం డుండె హరిద్వార, మందు వాఁ డెపుడును నర్థవాంఛఁ
గావింపరానిదుష్కార్యముల్ చేయుచు, నొకనాఁడు రవిపర్వ మొదవుటయును
నచటికి స్నానార్థ మరుగుదెంచినయొక, యర్యునిద్రవ్యంబు నపహరించె
గీ. నంతటను వైశ్యసేవకు లతనిఁ బట్టు, కొనఁగఁ బరువెత్త నందర్యురను వధించి
వాఁడు మరణించె మూఁడనవానిచేత, నపుడు మూఁడువిమానంబు లటకు వచ్చె.
ఆ. అరుగుదెంచినట్టియావిమానములపై, దివ్యదేహములను దేజరిలుచు
నధివసించి చచ్చినట్టియామువ్వురు, గగనవీథియందుఁ గానఁబడుచు. 1622
సీ. కని యారుజుని నిట్టు లనిరి పుణ్యాత్మ మా, తుచ్ఛశరీరముల్ తొలఁగిపోయి
దివ్యదేహములు ప్రాప్తించె నీపుణ్యతీ, ర్థమునందు విడుచుటఁ బ్రాణములను
నమరలోకమునకు నరుగుచుంటి మటంచుఁ, దెలిపి యాక్షణమందె దివికిఁ జనిరి
యంతట నావైశ్యుఁ డాత్మసేవకులకుఁ, జలిపి విధ్యుక్తసంస్కారములను
గీ. వారిశల్యంబులను హరిద్వారతీర్థ, గంగలోఁ బడవైవ నాక్షణమునంద
త్రిదివముననుండి వార లేతెంచి యిట్టు, లనిరి వైశ్యునిఁ జూచి యాహ్లాద మొదవ.
గీ. స్వామి మృతు లైనవారలశల్యములను, నిమ్మహాపుణ్యతీర్థతోయమ్ములోనఁ
గలుప మృతులకు బ్రహ్మలోకంబు గలుగు, స్థలముననె యున్న నస్థులు గలుగు దివము.
ఆ. కాన నీవు మాకుఁ గావించినమహోప, కారమునను దివము గడచి మేము
చనుచు బ్రహ్మలోకమునకు నీవిషయంబు, తెలుప నీకు వచ్చితిమి మహాత్మ. 1625

క. అని చెప్పి కన్నులారఁగఁ, గనుచుండఁగ నారుజుండు గగనవిమానం
బున బ్రహ్మలోకమునకుఀ, జనిరి హరిద్వారమహిమ శక్యమె పొగడఀ. 1626
గీ. అంత్యజుఁడు నారుజుండు ప్రత్యక్షముగను, గాంచుటను దన్మహత్త్వ మక్కడనె యుండి
మునుఁగుచును గంగలోపల ననుదినంబుఁ, బొందె దేహావసానమునందు ముక్తి. 1627
గీ. అనుడు శిబి యిట్టు లనియె మహానుభావ, వింటి శ్రావ్యంబుగ ననేకవిషయములను
నింకఁ బుష్కరతీర్థమహిమ వచింపు, మని యడుగ నారదుం డిట్టు లతని కనియె.

—: ఇంద్రప్రస్థపుష్కరతీర్థమాహాత్మ్యము :—

సీ. కలఁడు విదర్భనగరమున మాలవుం, డనియెడియొక్క బ్రాహ్మణుఁడు మున్ను
తత్త్వజ్ఞుఁ డగుట నాతఁడు సంసృతిని రోసి, సన్న్యసింపఁ దలంచి స్వాంతమందుఁ
జని గౌతమికి బృహస్పతి సింహగతుఁ డైన, తఱి స్నాన మొనరించి దానిలోన
నాత్మస్వసృతనూజుఁ డగుపుండరీకుండు, సకలపావనగుణశాలి యగుట
గీ. నాతని కొసంగి స్వసమార్జితార్థమందు, సగము సగ మిచ్చి తదితరభూసురులకు
సన్న్యసింపఁగ నంతఁ దత్స్వసృసుతుండు, స్వధనమున నాలుగవపాలు బుధుల కిచ్చి.
క. కొని మిగిలినధనభాగముఁ, గొని మాతులునాజ్ఞ విడిచి గోదావరి న
ల్లన నీపుష్కరతీర్థం, బునకుం జనుదెంచి స్నానమును గావింపఀ. 1630
ఆ. పుష్కరమున నొక్కభూప్రదేశమునందు, నోడలినుండి రక్త మురలుచుండ
నగతికముగఁ బతితుఁ డై యున్నభరతునిఁ, గాంచి కళవళంబు గదుర మదిని. 1631
క. అక్కట యనుజున కీగతి, యిక్కడఁ గలుగంగ నేమిహేతువొ యనుచుఀ
బొక్కుచు నుండఁగ మదిలోఁ, గ్రక్కి రుధిర మతఁడు నోటఁ బ్రాణము విడిచెఀ.
సీ. అంత దివ్యవిమాన మటకు రా భరతుండు, దివ్యదేహంబుతోఁ దేజరిలుచు
నం దధిష్ఠించి యి ట్లనియెను బుండరీ, కునిఁ జూచి యగ్రజ వనరవలదు
భవదనుజుఁడ నేను భరతాభిధానుండ, వినుము నాచరితంబు వినుతు నీకు
ద్యూత మాడుటయుఁ జేయుటయుఁ జౌర్యము ప్రభా, వతి యనువేశ్యతో వర్తిలుటయు
ఆ. మదిర ద్రావుటయును మద్భాగధన మెల్ల, నార్చుటయును దెలిసినదియ నీకుఁ
గాని తెలియనట్టికార్యంబు గల దొండు, తెలుపువాఁడ దానిఁ దేటపడఁగ. 1633
వ. మాతులుండు దానపాత్రుండ వగునీకుఁ దనధనం బెల్ల నొసంగి తాను సన్న్యాసంబుఁ
గై కొనం దలంచి నిన్నుఁ దోడ్కొని గోదావరి కేఁగె ననువార్త యొకపక్షంబు గడచిన
పిదప నాచెవింబడ నేను గామాంధుండ నగుటచే యుక్తాయుక్తంబు లెఱుంగక నీవు
ధనముం దీసికొని పుష్కరతీర్థంబునకు వత్తు వనియు నచ్చట నిన్ను వధించి యాధన
ముం గొనివచ్చి ప్రభావతికి సంతోషముం గలిగింపవలయు ననియు నాలోచించి వచ్చి
పుష్కరతీర్థంబున నీకొఱకు వేచికొనియుంటి. 1634
సీ. అంతలోపలఁ గొంద ఱార్యులు వాణిజ్య, మున గడించి ధనంబు పూర్ణముగను
బోవుచు నిజగృహంబులకు నిచ్చోటికి, విచ్చేయఁగను రాత్రివేళ యగుట

నిచటనె శయనించి నేను గూడను బండు, గొంటె వారలుపండుకొన్నచోట
నర్ధరాత్రంబు నా నపహరింపంగఁ ద, ద్ధనమును నే లోనఁ దలఁచుచుండ

గీ. నెవఁడో తస్కరుఁ డప్పు డిట కేఁగుదెంచి, తద్ధనము గొనిపోయెడి తఱిని దాని
నపహరింపంగ నే నెంచి యాత్మలోన, వాయువేగంబునను బోతి వానివెంట. 1635

ఆ. అప్పుడు తిరిగి వెనుక కాతఁడు నన్నుఁ జూచి, యీటెతోడఁ బొడిచె నెడఁద యగల
నంత నేను ఖడ్గహస్తుండ నయ్యును, బోర శక్తి లేమి భువిని బడితి. 1636

సీ. అంతట వాఁ డేఁగె నతిరయంబున గుండె, చెదరుటచే నేను స్మృతి తొలంగఁ
బ్రాణావశిష్టుండ నై యిట నుండంగ, నీ వేఁగుదెంచితి వింతలోన
నిను గనుంగొనినవెంటనె ప్రాణములు పోయెఁ, బోవుటఁ బ్రాణముల్ పుష్కరమునఁ
బాపినై నను నాకుఁ బ్రాప్తించె స్వర్గంబు, పూతుండ నై నేను బోవుచుంటి

ఆ. ననుడుఁ బుండరీకుఁ డాశ్చర్యమును జెంది, యనుజ నీకు నిచట ననుపముక్తి
గలుగ నేమి పుణ్యకర్మంబు చేసితో, తెలిసె నేని నాకుఁ దెలుపు మయ్య. 1637

వ అని యడుగుటయుఁ బుండరీకునకు భరతుం డిట్లనియె. 1638

సీ. ద్యూతంబులో జయ మొంది నే నొకనాఁడుఁ గొని ధనం బింటికిఁ జనుచునుండ
మార్గమధ్యంబున మాణవకుఁ డొకండు, మృతుఁ డయి పడియుండ నేను వాని
నిడికొని తలపైని నేఁగి గంగకు దాని, తటమున శవమును దగులఁబెట్టి
కలిపి తదస్థులు గంగలోఁ దత్కార్య, మునకు ద్యూతార్జితధనము నెల్ల

గీ. వ్యయ మొనర్చితిఁ దత్పుణ్యవశముచేత, నేఁడు పుష్కరమున నాకు నిధన మబ్బె
నిచట మద్దేహమును దహియించి నీవు, చెందుము కృతార్థతను నేను జెందినట్లు.

క. అని చెప్పి త్రిదివమునకుఁ, జనుటయుఁ దత్కాయమునకు సంస్కారంబుఁ
బొనరించి పుండరీకుఁడు, మనమునఁ దలఁచుచును దీర్థమాహాత్మ్యంబుఁ. 1640

గీ. మాఘమాసంబునం దెల్ల మాధవుండు, నా నికేతనమందు నుండంగవలయు
ననెడిసంకల్పమున స్నాన మచటఁ జేసి, స్వగృహమున కేఁగి భరతునివార్తఁ దెలిపె.

గీ. అపుడు తనబాంధవులలోన నజ్ఞులైన, వారు శోకంబు నొందిరి వానిమృతికిఁ
బ్రాజ్ఞు లగువారు సంతోషపడిరి వాఁడు, పడసినత్రివిష్టపావాసభాగ్యమునకు. 1642

ఆ. అంతఁ గొంతకాల మరుగంగ మాఘమా, సంబు వచ్చుటయును జక్రపాణి
ప్రీతితోడఁ బుండరీకునిగృహమున, కరుగుదెంచె గరుడి నధివసించి. 1643

ఆ. అపుడు పుండరీకుఁ డానంద మొదవంగ, ననుదినంబు శౌరి కర్చనంబు
సలుపుచును నొనర్చి జాహ్నవీస్నానంబు, గడపె మాఘమాసకాల మెల్ల. 1644

సీ. అంత నాతనిభక్తి కానందమును బొంది, హరి యిట్టు లనియె భక్తాగ్రగణ్య
యొకదినంబునను ము న్నొనరించుటను నీవు, పుష్కరస్నాన మాపుణ్యమునను
బ్రీతుండ నై యుంటి నీతపోమాస మం, తయును దావకనిశాంతమున నేను
పుష్కరైకస్నానమునఁ జేసి జాహ్నవీ, పూర్ణమాసస్నానపుణ్య మొదవు

గీ. ననిప్రబోధించి తార్క్ష్యవాహనముపైని, నతని నెక్కించుకొని యిట కరుగుదెంచి
ముక్తికై పుష్కరంబున మునుఁగఁజేసి, చనియె వైకుంఠమునకుఁ దత్సహితముగను.

క. అని చెప్పుటయును శిబి యి, ట్లనియెఁ దపోధన యిఁకఁ బ్రయాగమహాత్మ్యం
బును జెపుము వినఁగ నాకున్, జనియించెను గోర్కి నాఁగ నారదుఁ డంతన్. 1646

—: ఇంద్రప్రస్థప్రయాగమాహాత్మ్యము :—

సీ. శిబిచక్రవర్తి నీక్షించి యి ట్లనియెఁ బృ, థ్వీపాల నర్మదాతీరమందు
మాహిష్మతి యనునామమున విశ్రుతి గన్న, నగర మొం డుండె నానగరమందుఁ
గలదు మోహిని యనువెలయింతి యొక్కతె, యాపె రూపమునను యౌవనమున
నృత్యగీతములను నిశ్శేష్టుల నొనర్చి, పురుషుల బహుధనంబును గడించి

గీ. క్రమముగను జవ్వనమును రూపమును బోయి, వార్ధకము రాఁగ వైరాగ్యవశముచేత
దానధర్మంబులకుఁ దనధనము నెల్ల, వ్యయము గావించి గృహమును వదలిపెట్టి.

క. చనుచుండఁగ వనమార్గం, బునఁ దస్కరు లడ్డగించి మోదఁగ నాయం
గన చేష్ట దక్కి పడ నా, వనభూమిని జనిరి విడిచి వా రావనితన్. 1648

సీ. ఆసమయమునఁ బ్రయాగతీర్థమునుండి, చనుదెంచుచును నొక్కతాపసురుండు
కొనప్రాణమునఁ గొట్టుకొనుచుండునామెను, గాంచి తాఁ దెచ్చినగాంగజలము
కొంచె మాయమనోట నుంచి చూచుచు నుండ, నది త్రావుకాలమునందు నామె
మహిషిగా నుండంగ మది నెంచుచును వీడు, టను మేను కేరళేశునకుఁ బుట్టి

గీ. సార్థకంబుగ హేమాంగి యనెడిపేరు, వడసి ద్రావిడవసుమతీపాలకునకు
మహిషి యై తనభాగ్యంబు మహిళ లెల్ల, సన్నుతించుచు నుండంగ సంతసిలుచు.

సీ. ఒకనాఁడు మంత్రిపుత్రికయును నిజవయ, స్యయు నై సకలయింటి కరిగి తాను
గావింప నామె సత్కారంబు గైకొని, సలుపుచుఁ దాంబూలచర్వణంబు
చెలి నీగృహంబునఁ జిత్రవస్తువు చూపు, మే దేని కల దేని యిపుడు నాకు
ననవుడుఁ గల తెచ్చి తనహేమమంజూష, నుంచి యాహేమాంగియొద్దఁ దెఱచె

గీ. నప్పు డారాజమహిషి తదంతరస్థ, మైనపుస్తకమును గొని హస్తమునను
నదులను ద్వీపములను సముద్రములను, ఖండములను స్రవంతులఁ గాంచి యందు.

సీ. కొనకు యమస్వర్గనూలస మైనయిం, ద్రప్రస్థమును గాంచి దానిలోనఁ
దీర్థరాజాఖ్యచేఁ దేజరిల్లెడిప్రయా, గముఁ జూచి తదవలోకనమువలనఁ
బూర్వజన్మస్మృతి పొడమంగ లజ్జచే, వినమితవదన యై వేగ లేచి
చని నిజమందిరంబునకు భర్తను జూచి, తనపూర్వజన్మగాథను వచించి

గీ. నాథ మన మేఁగవలయు నీనాఁడె తీర్థ, రాజమున స్నాన మొనరింప రమ్ము నాఁగఁ
గలుగమిని నమ్మకం బామెపలుకులందు, సంశయించుచు నుండంగ తాపసుండు.

గీ. మానవాధిప హేమాంగిమాట లెల్ల, సత్యములు సంశయింపక చనుము సర్వ
కామదాయక మగుప్రయాగమున కనెడి, పలుకులు వినంబడియె వ్యోమపథమునుండి.

గీ. విస్మయము నొంది దానికి వీరవర్మ, సంశయము లెల్ల విడిచి తత్క్షణమునంద
రాజ్యమున నిల్పి మంత్రిని రథము నెక్కి, యాత్మసతితోడ వచ్చి ప్రయాగమునకు.
గీ. కలుగఁగను విష్ణుసంప్రీతి తలఁచికొనుచుఁ, దనవధూమణితోడ నుత్సాహమునను
స్నాన మొనరించెఁ దీర్థరాజమున నంత, నచటి కేతెంచి మాధవుఁ డజునితోడ. 1654
గీ. వారి నెక్కించుకొని నిజవైనతేయ, వాహనమునందుఁ బరమేష్ఠివాంఛవలన
సత్యలోకంబునకుఁ బోయి క్షణము నిలిచి, వచ్చి వైకుంఠమున కందు వారి నునిచె.
వ. ఇంకఁ గాశీగోకర్ణశివకాంచీతీర్థంబులమాహాత్మ్యముం జెప్పెద వినుము. 1656

—: ఇంద్రప్రస్థకాశీమాహాత్మ్యము :—

సీ. పార్థివోత్తమ హరిప్రస్థతీరమునఁ బ్ర, కాశించు చుండెడికాశిలోనఁ
బూర్వము కృతయుగంబున శింశుపాహ్వయ, ధరణిజం బొకఁ డుండె దానిమీఁద
వాయసం బొకటి కులాయంబు నిర్మించు, కొని యుండె నద్దానికోటరమున
వ్యాళ మొక్కటి యుండె వాత్యచే నొకనాఁడు, పడిపోవ శింశుపాపాదపంబు
గీ. తత్ప్రమాదంబునను విషధరము చచ్చెఁ, గాకియును జ్రమందె నంతలోఁ గలిగె వ్యాళ
శింశుపాకాకములకు విచిత్రముగను, దివ్యదేహంబు లమితప్రదీప్తితోడ. 1657
ఆ. అప్పు డేఁగుదెంచె నమరవిమానము, లాకసంబునుండి యద్భుతముగ
నందుఁ గూరుచుండి యాదివ్యమూర్తులు, చనిరి వేగ విష్ణుసదనమునకు. 1658
క. అనవుడు శిబి యి ట్లనియెను, మునివర వా రెవరొ పూర్వమున నేపుణ్యం
బున విష్ణుపురికిఁ బోయిరొ, వినిపింపుము నాకు వినఁగ వేడుక గలిగెన్. 1659
వ. అని వేఁడుటయు నారదుండు శిబి కి ట్లనియె. 1660
సీ. మును కురుజాంగలంబున శ్రవణుండు నా, నొకబ్రాహ్మణుం డుండె నుర్విలోన
నతని కుండిరి కుంత యనుభార్య యొక్కతె, యును గురంటకుఁ డనునను జుఁ డొకఁడు
శ్రవణుండు విప్రధర్మము మానుటను గోప్య, ముగఁ జేయుటను మిష్టభోజనంబు
పొందె వాయసజన్మమును గురంటకుఁడు దూ, షించుచు దేవతాతిథిసురులను
గీ. నలుపుచును వేదశాస్త్రదూషణము నిర్వి, శంకముగ సంచరించుట సర్ప మయ్యెఁ
గుంత తదుభయపాపానుకూలవృత్తి, నుండుటను వృక్ష మై వారి కండ యయ్యె.
సీ. ఇంకఁ దత్పుణ్యంబు నెఱిఁగింతు వినుము వా, రలు ముచ్చురును నొక్కగ్రామమునకు
నరిగి యొక్కదినంబునందు వచ్చుచునుండ, రాత్రికాలమున స్వగ్రామమునకుఁ
బథమధ్యమున నొక్కపాంథుఁడు నిల్చి యీ, కూపంబునందు నాగోవు పడియెఁ
జావకపూర్వమె లేవఁదీయుం డని, యడుగ వారినిఁ గుంత యనుమతించె
గీ. శ్రవణుఁడు గురంటకుండును సాహసమున, బావిలో దూఁకి గోవును లేవఁదీసి
దరికిఁ జేర్చిరి యాసుకృతమున వారు, ముచ్చురును గాశిలోఁ జచ్చి ముక్తులైరి. 1662
గీ. అవనినాథ హరిప్రస్థమందు నున్న, కాశియును శివనగరియె కాని యిందు
జ్రమందువారికి వైకుంఠమందిరంబు, నందు వసతియు విష్ణుసఖ్యమును దొరకు. 1663

—: ఇంద్రప్రస్థగోకర్ణతీర్థమాహాత్మ్యము :—

సీ. గోకర్ణతీర్థమం దాకాశమున నేని, స్థలజలంబులను నెచ్చటను నేని
చచ్చినజంతువు శంకరుం డై ప్రకా, శించుచుఁ గైలాసశిఖరమందు
శివునితోఁ గూడను జెందు ముక్తిని నంతె, కాని పునర్జని కాంచఁ డిలను
మును నాకు బ్రహ్మ చెప్పినగాథ యొక్కటి, దృష్టాంతముగ నీకుఁ దెలుపువాఁడ
గీ. నొక్కగవ్యూతిమాత్రమం దున్న యది ప్ర, యాగమునకు మర్యాదాద్రి యందుఁ గర్క
టాఖ్యుఁ డగునొక్కవనచరుం డధివసించు, నాతనికి జర యనునొకనాతి యుండె. 1664
గీ. అప్పటికె నాపె భర్తల నైదుగురిని, విసముచేఁ జంపె నని తనస్వస వచింపఁ
దన్నుఁ గూడను నది చంపు నన్నబుద్ధి, దానిఁ జంపంగ ఖడ్గముఁ దాల్చి వాఁడు.
క. అరుదెంచుచుండఁగను దన, దరి కాపె గ్రహించి యడవిదారిం బడి వే
పరువెత్తఁ దొడఁగె నాతఁడు, పరువెత్తుచు నుండ వెంటఁబడి పట్టుకొనన్. 1666
ఆ. అట్లు పఱచి పఱచి యాజర గోకర్ణ, తీర్థభూమి కేఁగుదెంచి యవలఁ
బఱవలేక పట్టుపడి వానిచేతను, ఖడ్గనిహత యగుచుఁ గాయ ముడిగె. 1667
ఆ. అంత భిల్లుఁ డపగతాసువుఁ డగుచును, దననివాసమునకుఁ జనియె నామె
పుణ్యతీర్థమందుఁ బొలియుటచే దివ్య, కాయ మొంది గౌరికడకు జనియె. 1668

—: ఇంద్రప్రస్థశివకాంచీమాహాత్మ్యము :—

సీ. అధిప యింద్రప్రస్థమం దుండుశివకాంచి, మహిమంబుఁ దెలుపంగ మాదృశులకు
శక్యంబు గా దిందు శర్వుఁ డారాధించి, హరిని దత్త్వజ్ఞాన మతనివలనఁ
బడయుట మే మెల్లఁ బరమేశ్వరునిఁ గొల్చి, చుందుము శివకాంచియందు సతము
హాయనశతము బాణాసురుం డిచ్చటఁ, గావించి తపము శంకరునికృపను
గీ. శివగణంబులలోపలఁ జేరె శివుని, స్వీయపురరక్షకునిగఁ గావించుకొనియె
నిచ్చటను మున్ను శివునకు మెచ్చి శౌరి, వెలసె శివకాంచి యనుపేర విష్ణుకాంచి.
సీ. మఱియొకగాథ నీ కెఱిఁగింతు వినుము హే, రంబాహ్వయుం డొక్కబ్రాహ్మణుండు
శివభక్తుఁడై మున్ను శివతీర్థముల నెల్ల, సేవించి శివకాంచిఁ జేరి తుదకు
నటనె వసించుచు నంతకాలమునకుఁ, దత్తీర్థమున మున్గి తనువు విడిచె
నప్పుడు శివభటు లరుదెంచి కైలాస, మునకు నాతనిఁ గొనిపోవుచుండఁ
గీ. ద్రోవలో నడ్డుపడి విష్ణుదూత లతనిఁ, గొని చనంగను వైకుంఠమునకు రుద్ర
భటులతో డీకొనఁగ రుద్రభటులు గూడ, వారితోఁ బోరఁదొడఁగిరి ఘోరముగను.
ఉ. అంతట విష్ణురుద్రభటు లాహవముం బొనరించు చుండ ది
గ్దంతులు బెగ్గడిల్లఁగను గంపము నొంద వసుంధరాతలం
బంతయు దేవతల్ బెగడి యార్చుచు నుండఁగ వచ్చి శంభుదై
త్యాంతకు లిర్వురున్ నగుచు నాఁపిరి వారలఘోరయుద్ధమున్. 1671

గీ. అట్టు లాఁగఁగ సంగ్రామ మచ్యుతుండు, గరుడిపైని హేరంబుని గౌరవంబు
వెలయ నెక్కించికొని తనవెంట రాఁగ, హరముఖాఖిలసురులు రావ్యాద్రి కేఁగి.

ఆ. అచట దించి వాని హరుఁడు సత్కారంబు, సేయఁ దనకు దాని స్వీకరించి
స్వభటయుక్తముగను స్వపదంబునకుఁ బోయె, విస్మయంబు నొంద విబుధు లెల్ల.

—: ఇంద్రప్రస్థ సప్తర్షితీర్థ మాహాత్మ్యము :—

గీ. కలదు సప్తర్షితీర్థాఖ్య గలిగినట్టి, తీర్థ మొక్కటి యాపుణ్యతీర్థమందు
సప్తఋషులకు సిద్ధి నొసంగినట్టి, దగుట సప్తర్షితీర్థాఖ్య నది వహించె. 1674

గీ. అది చతుర్వర్గము నొసంగు ధ్యానమునను, స్మరణమున దర్శనంబున స్పర్శమునను
నందుఁ గల రెండతో మహాత్ము లనశనముగ, నద్భుతతపంబు గావించునట్టివారు.

వ. సృష్టి గావింపం దలంచి తత్తీరంబున ఘోరతపం బొనర్చి తీర్థప్రసాదంబున మరీచి కశ్యపుం డనుపుత్రుని నత్రి సోముఁడు దుర్వాసుఁడు దత్తాత్రేయుఁ డనుపుత్ర త్రయంబును నంగిరుం డాంగిరసు లనుపుత్రులను బులహుండు దంభోళి యను పుత్రుని బులస్త్యుండు కుబేరుం డనుపుత్రుని గ్రతువు వాలఖిల్యు లనుపుత్రులను వసిష్ఠుండు రజఃప్రభృతు లగుపుత్రులనుం గాంచిరి. దానిచేతన యయ్యాది యన్వర్థనామం బయ్యె. 1676

గీ. రాజ యింకను నీహరిప్రస్థమందుఁ, గలవు బహుతీర్థములు వాని గణనసేయ
శేషుఁ డైనను జాలఁ డశేషముగను, నింక నస్మాదృశులమాట యేమిచెప్ప. 1677

ఆ. అని వచించుటయును నాశీనరుం డగు, శిబిమహీధవుండు చెంది ముదము
తనకుఁ గల్గినట్టిధన్యత కెంతేని, స్నాన మాచరించి దానిలోన. 1678

క. మునివరులయాజ్ఞఁ గైకొని, చనియెను నిజనగరమునకు సంయమివరులున్
జనిరి నిజాశ్రమములకున్, గనుచు హరిప్రస్థతీరగతతీర్థములన్. 1679

గీ. ఈహరిప్రస్థమహిమంబు నెవ్వ రేని, వినినఁ జెప్పినఁ బఠియించినను సమస్త
పాతకంబులు నశియించి పడయఁగలుగు, నపునరావృత్తిదాయక మైనపదము. 1680

సీ. అని వచించుటయును విని యుధిష్ఠిరుఁడు మ, హానందమును బొంది యాత్మలోనఁ
బోయి యింద్రప్రస్థమునకు సమస్తబాం, ధవసమేతముగ నాస్థానమందు
రాజసూయమహాధ్వరము చేసి కృతకృత్యుఁ, డయ్యె నాతీర్థంబునందు శౌరి
శిశుపాలుని వధించెఁ జేకూర్చ మోక్ష మా, తని కంతరంగంబునను దలంచి

గీ. భీముఁ డచ్చట గదచేతఁ బ్రిదులఁగొట్టి, నట్టిదేశంబు భీమకుండాఖ్యఁ బడసె
నందు మునిఁగిన సర్వతీర్థావగాహ, మాచరించినసుకృతంబు నందు నరుఁడు. 1681

సీ. అనుదినంబును జేయనగుఁ బ్రదక్షిణమును, క్షేత్రంబునకు నెల్ల క్షేత్రవాసి
చెందఁజాలడు క్షేత్రసిద్ధి నొనర్పక, యున్నఁ బ్రదక్షిణం బెన్నఁ డేని
చేయునప్పుడు ప్రదక్షిణమును గోవింద, నామకీర్తనము నొనర్చె నేని
పదపదంబునను సంప్రాప్తించుఁ గపిలాప్ర, దానపుణ్యము ముక్తి దానఁ గలుగుఁ

గీ. ఇట్టిమాఘమాస మాహాత్మ్యమునకుఁ, జైత్రకృష్ణచతుర్దశిం జలపె నేని
నొక్కనాటి ప్రదక్షిణ మొందఁగలుగు, నవహతాఖిలపాపుఁడై పోవఁడంబు. 1682
వ. ఇంక మాఘమాసమాహాత్మ్యంబు వినుము. 1683

—: మా ఘ మా స మా హా త్మ్య ము :—

క. మునివర్య ధర్మమార్గం, బుననుండి తొలంగకుండ మున్ను దిలీపుం
డనుఱేఁ డయోధ్య నేలుచు, నొనరఁగ మృగయేచ్ఛ తనకు నొకనాఁడు మదిన్. 1684
సీ. కవచంబు ధరియించి కాయంబునను మూర్ధ, మునను నీలోష్ణీషమును వహించి
బంధించి గోధను బాహ్యాంగుళులకు ను, పానహంబులఁ దొడ్గి పాదములకుఁ
గై కొని కోదండకాండంబులను గేల, మృగయాతురంగముమీఁద నెక్కి
యాఖేటకవ్యూహ మరుదేరఁగను నిరు, ప్రక్కలందును బృష్ఠభాగమునను
గీ. నరిగి యొకకాననంబున కందులోన, నుండుకంఠీరవద్వీపిగండకాది
మృగముల వధించి తుద కొకమృగము పరువు, వెట్టుచుండంగ నద్దానిఁ గొట్ట నెంచి.
ఆ. దానివెంటఁబడి ప్రతాపంబు మెఱయంగ, విశిఖ మెక్కువెట్టి విడువఁబోవు
నంతలోనఁ గనుల కది కానఁబడకుండ, నెక్కడింప మరల నేఁగుచుండె. 1686
గీ. అప్పు డద్దానిఁ గొట్టంగ నభినివేశ, మెసయఁగను తేడు శ్రమ మని యెంచకుండ
దానివెంటనె పఱచుచుఁ గాన యెల్లఁ, దిరిగె నది త్రిప్పఁగను ముప్పుతిప్పలుగను.1687
క. తిరిగి తిరిగి విసు వేర్పడ, నరపతి యాఁగుటకు మనమునను నెంచఁగఁ ద
త్తఱగత మైనతెఱంగున, హరిణము కనఁబడుచు మరల నాసం గొలుపున్. 1688
గీ. దాన నాతండు తత్ప్రయత్నంబు విడువ, మానసం బొప్ప కునికి నద్దానివెంటఁ
బడి పఱచుచుండ నది కనంబడుచు నొక్క, తఱినిఁ గనఁబడకయు నొక్కతఱినిఁ జనుచు.
క. ఒకవిషమారణ్యములో, నికిఁ బోయి యదృశ్య మగుడు నివ్వెఱ యొదవన్
గకవిక యై భూనాథుం, డొకదారియు నొక్కడొంకయును నట లేమిన్. 1690
క. తపనుఁడు వ్యోమాంతరమునఁ, దపియించుచు నుండ మిగుల దాహము గాన
వ్విపినమున నెందుఁ జూచినఁ, గృపీట మించుకయు లేమి ఖేదం బొదవన్. 1691
క. దైవమె శరణం బనుచున్, నేవకయు క్రమముగ గహనసీమంబడి తాఁ
బోవుచు నుండంగను నొక, తావునఁ గనఁబడియె నొకహ్రదం బాతనికిన్. 1692
సీ. సాధుచిత్తమువోలె స్వచ్ఛంబు కృపణగే, హమువోలె శైవాలకావృతంబు
తృష్ణానివారణసంభృతదీక్ష మఖలస్వ, దానంబుచేతను దాతవోలె
శశివోలెఁ దాపప్రశమన మంతర్గ్రాహి, భరితంబు దుర్జనాంతరమువోలె
మరకతేఁబులువోని సురుచిరపద్మినీ, చ్ఛదములచేత నాచ్ఛాదితంబు
గీ. మధురసాస్వాదమత్తబంధురమనోజ్ఞ, నినదమేదురితము హంసనిచయరమ్య
గమనశోభితము ప్రఫుల్లకమలభాసు, రమును నగునాహ్రదంబు నారాజు గాంచి. 1693

క. ధారాధరముం గాంచిన, సారంగమువోలె లబ్ధసంతోషుం డై
చేరి తదంతర్గతజల, పూరంబునఁ జేసి స్నానమును గ్లమ మాఱన్. 1694

సీ. కావించి మాధ్యాహ్నికక్రియలను మృగ, యాప్రాప్తభోజ్యంబు నారగించి
మృగయులతోడ నా రేయి నందె వసించి, హింస్రమృగంబుల నెల్లఁ జంపి
యతితుష్టుం డై యరుణోదయంబునకుఁ బూ, ర్వమె పరివారవర్గంబుతోడ
స్వపురంబునకుఁ బోవ సమకట్టి పోవుచు, నెదురుగా ముని యొకం డేగుదేర
గీ. వదలి మార్గంబు నతనికి వందనంబు, నాచరించి తదీయవృత్తాంత మడుగ
నాతఁడు గ్రహించి రాజేంద్ర యతిని నేను, వృద్ధహారీతుఁ డనుపేర నెసఁగువాఁడ.

సీ. అమితఫలప్రదాయక మైనమాఘమా, సస్నానమును వీడి చనుట దగదు
రమ్ము నాతోడ శీఘ్రమ్ముగా సూర్యోద, యము కాకమును పె యీ హ్రదములోనఁ
జలుపఁగావలయును స్నానంబు నావుడు, నవనిపాలుఁడు హర్ష మామతిల్ల
ననఘ మాఘస్నానమునఁ గల్గుఫల మేమొ, కృప యుద్భవిల్లంగఁ జెపుము నాకు
గీ. ననుడు భూమీంద్ర యిది సమయంబు గాదు, శ్రావకప్రశ్నమునకు నుత్తరము సెప్ప
మీకులాచార్యుఁ డఖిలజ్ఞుఁ డేకతమున, నడుగునెడ నీవు సర్వంబు నతఁడు నుడువు.

క. అని చెప్పి యమ్మునీంద్రుఁడు, చనుచుండఁగ నతనివెంటఁ జని స్నానంబున్
బొనరించి హ్రదములోపల, జనవరుఁ డరుదెంచి వేగ స్వపురంబునకున్. 1697

సీ. చని వసిష్ఠాశ్రమంబున కేకతంబుగా, నెరఁగి వసిష్ఠునిచరణములకు
నాచార్య వర్ణాశ్రమాచారవిధులును, దండనీతియు రాజధర్మములును
గ్రతువిధానములును వ్రతవిధానములును, భగవదారాధనాపద్ధతులును
జెప్పినాఁడవు నాకు శ్రేయంబు గా నస్మ, దన్వయాచార్యుఁడ వగుటఁ జేసి
ఆ. యిపుడు కరుణతోడఁ జెపుము మాఘస్నాన, విధియుఁ దత్ఫలమును విశదముగను
ననుడు నిట్టు లనియె నాతనివాంఛకుఁ, జెంది హర్షమును వసిష్ఠమౌని. 1698

సీ. విడిచి యిష్టాపూర్తవిధులను వహ్న్యుపా, స్తిని నూర్ధ్వలోక మర్థించువారు
స్వర్ణగోభూధాన్యవస్త్రాన్నదానముల్, చేయక దివము వాంఛించువారు
కాయంబు శోషిల్లఁ జేయక తపముచే, విష్ణుసాన్నిధ్యంబు వేఁడువారు
కృచ్ఛ్రాతికృచ్ఛ్రాదికృత్యంబులను గాసిఁ, జెందక సుగతి నాశించువారు
గీ. మకరమును బొంది రవి యుండ మాఘమాస, మునను నిత్యము విధ్యుక్తముగను స్నాన
మాచరించిన బాహ్యజలాశయమునఁ, గలుగు స్వాభీష్టసంసిద్ధి సులభముఁగను. 1699

వ. వైశాఖమాసంబున సలిలాన్నంబును గార్తికమాసంబునఁ దపఃపూజలును మాఘమాసం
బున జపహోమదానంబులును విశేషవిధులుగాఁ జెప్పంబడియె. 1700

గీ. చలిపి ద్వాదశమాఘమాసంబు లదితి, స్నాన మనశనముగ మానసహ్రదమునఁ
బడసె నమితప్రభావసంపన్ను లైన, ద్వాదశాదిత్యులను నిజతనయులుగను. 1701

క. ఒనరించుటచే మాఘం, బున స్నానము శచి త్రిలోకమోహనరూపం
బును కోహితశ్రీ సౌభాగ్యముఁ, గనికరము నరుంధతియును గాంచఁగలిగెన్. 1702
ఆ. దానశీలురకును మానులకును భిక్ష, దేవతాతిథులను దృప్తిపఱచు
నట్టివారలకును బ్రాప్తించులోకముల్, మునిఁగె నేని మాఘమున లభించు. 1703
ఆ. అన్యపుణ్యములను నమరాలయమునకుఁ, జేరువారు భువికిఁ జేరువార
మరల రారు భువికి మాఘమాసస్నాన, పుణ్యమునను దివికిఁ బోవువారు. 1704
క. మాఘస్నాన మొకండె య, మోఘం బగునాయుధంబు ముసురుకొనినపా
పౌఘక్రూరమృగంబుల, నాఘాతింపంగ నేల యధికోక్తు లికన్. 1705
క. దురితక్షయమును గోరెడి, నరులకు మాఘావగాహనముకంటెను లే
దరయంగ నిజమనోరథ, పరిపూర్తి యొనర్పఁగలయుపాయాంతరముల్. 1706
గీ. మాఘమున స్నాన మొనరించుమానవుండు, నరకయాతనలను జిక్కి పరితపించు
నుభయకులసప్తపురుషుల నుద్ధరించి, దివ్యదేహంబుతోఁ దాను దివికి నేఁగు. 1707
గీ. పుష్కరమున బ్రహ్మావర్తమునఁ బ్రయాగ, మునఁ గురుక్షేత్రమున నవిముక్తమునను
స్నాన మొనరింపఁ గల్గుపుణ్యంబు మాఘ, మున దినత్రితయస్నానమున లభించు.
వ. ఈవిషయంబున మున్ను భృగుమహర్షికిని విద్యాధరునకును జరిగినసంవాదంబు నీకుం
జెప్పెద వినుము. 1709
సీ. మున్ను ద్వాదశవర్షములు వృష్టి లేమిని, హిమశైలసహ్యశైలములనడుమ
నున్నదేశము లెల్ల నుపప్లవంబులై, స్వాహాస్వధావివర్జితము గ
క్షీణించు చుండంగ శిష్యులతోఁ గూడి, హిమశైలమును జేరి భృగుమహర్షి
యచ్చోట మణికూట మనుశైలమును గాంచి, దానివైభవసమృద్ధతకు మెచ్చి
గీ. యచట వసియించి వాసార్హ మగుటఁ జేసి, తపముఁ గావింపఁ దొడఁగె నంతటను నొక్క
నాఁడు తద్గిరిశృంగకందరమునుండి, యొక్కవిద్యాధరుఁడు డిగ్గి యువిదతోడ. 1710
ఆ. భృగుమహర్షియొద్ద కేతెంచి తత్పాద, వనజములకుఁ జేసి వందనంబు
నిలువఁబడుడు ఖేద మొలయంగ మొగమునఁ, గనులు దెఱచి వారిఁ గాంచి మౌని.
క. ఒనరించి యుచితగౌరవ, మును వారికి దేవయోనిపుంగవ మీయా
ననములయందు విషాదము, గనఁబడియెడి నాకుఁ జెపుము కలకారణమున్. 1712

—: విద్యాధరవృత్తాంతకథనము :—

వ. అని యడుగుటయు విద్యాధరుం డమ్మహర్షి కిట్లనియె. 1713
సీ. వినుము మునీంద్ర మావిషయంబు వినిచెదఁ, బ్రాక్కృతపుణ్యకర్మంబువలన
విద్యాధరుండనై వెలసి దివ్యసుఖంబు, లనుభవించుచుఁ గూడ ననుదినంబుఁ
గలుగుట వ్యాఘ్రముఖుం బేమహాపాప, కృత్యంబునఁబో దుఃఖ మేరుపడియె
నీదుఃఖ మిట్లుండ నీజగన్మోహిని, వ్యాఘ్రముఖుండనై నట్టినాకు

ఆ. వెలఁది యయ్యె ననెడి వేఱొకదుఃఖంబు, సంభవించె నావిషాదమునను
యీయమకును జింత యేర్పడె మాచింత, యెట్లు తీఱఁగలదొ యెఱుఁగఁ జెప్పుమ.
సీ. అని వేఁడుటయు భృగుమునివల్లభుఁడు దివ్య, దృష్టిచే నెఱిఁగి తద్విషయ మెల్ల
విద్యాధర వచింతు వినుము నీప్రాగ్జన్మ, వృత్తాంత మంతయు విశదముగను
రోసరించి యుపవాసమును నీవు మును మాఘ, మునను నేకాదశీదినమునందు
స్వల్పంబు గా నుంక త్రావక మఱునాఁడు, పారణ సలిపి యాపర్వవేళ
గీ. నాఁడె విడపఁ ద్రయోదశీనాఁడు లెదుఁ, జలిపికొంటి వభ్యంగము శాస్త్రతత్త్వ
మును గ్రహింపక స్వకుతర్కమునను నిర్ణ, యంబు గావించుకొని ధర్మ మాత్మలోన.
గీ. ఆకతంబున నీకు సంప్రాప్తమయ్యె, వ్యాఘ్రవక్త్రంబు ద్వాదశియందె యట్టి
కార్య మొనరించి యున్న వ్యాఘ్రము మయి యుందు, వపుడె తద్ఘోరపాతకం బట్టి దగుట.

—: పురూరవో వృత్తాంత కథనము :—

సీ. మున్ను తైలాభ్యంగమును జేసికొని పురూ, రవుఁ డొకద్వాదశీదివసమందుఁ
బ్రాప్తింపఁగను గురూపంబు మేసికె దాన, బహుకాల మాత్మలోఁ బరితపించి
కొనకు హిమాహార్యమున కేఁగి యం దుండు, దేవికాహ్రదతీరదేశమందుఁ
జిరకాలము తపంబు సేయంగఁ దత్తప, స్సంతోషితాత్ముఁ డై చక్రపాణి
గీ. యాతనికి దర్శనం బిచ్చి యాత్మశంఖ, జలముచేతను స్నాతునిఁ జలిపె నతని
మకరరాశిగతుం డయి మాఘశుక్ల, మునను రవి యుండ ద్వాదశీదినమునందు. 1717
గీ. అంతటఁ ద్రిలోకమోహనం బైనరూపు, ప్రాప్తమయ్యెఁ బురూరవఃపార్థివునకు
దానిఁ జూచియె కామించె వాని స్వర్గ, యోషిదవతంస మైనట్టియూర్వశియును.
గీ. కాన నెంతటివారికి నైనఁ గర్మ, గతిని దాఁటంగ శక్యంబు గాదు నీకుఁ
గలిగె నేని కురూపంబు దొలఁగ వాంఛ, సాధన మొకండు వినుతు విద్యాధరుండ.
వ. పౌషమాసశుక్లపక్షైకాదశీదినంబు మొదలుకొని మాఘమాసశుక్లపక్షైకాదశీపర్యంతం బొకమాసంబు వ్రతనియమంబుల ననుసరించి త్రికాలస్నానంబును ద్రికాలమాధవార్చనంబును స్థండిలశయనంబును గావించుచుఁ ద్యక్తభోగుండ వై ప్రతిదినంబును బదరీఫలంబులును గదళీఫలంబులును నామలకీఫలంబులును ఘృతప్రస్థంబును దిలప్రస్థంబును దండులాఢకంబును గూశ్మాండంబును గృసరంబును దాంబూలంబును ననునీనవపదార్థంబులును బక్వాన్నభక్ష్యంబులును శీతార్తినివారణార్థంబు శుష్కేంధనంబులును గంచుకంబులును మాంజిష్ఠంబును రక్తవస్త్రంబులును శయనంబులును జాతీఫలలవంగకర్పూరాదిసువాసనాద్రవ్యంబులును జిత్రకంబళంబులును నిర్వాతగృహంబులును బాదరక్షలును సుగంధ్యుద్వర్తనద్రవ్యంబులును బ్రాహ్మణుల కర్పింపవలయు. దానంజేసి నీకు వ్యాఘ్రముఖంబు తొలఁగి సువదనంబు ప్రాప్తించు. 1720
గీ. అని ప్రబోధించుటయును విద్యాధరుండు, చేసి స్నానంబు మణికూటశిఖరితీర్థ
మందు సతితోడ మాఘమునందుఁ దొలఁగి, వ్యాఘ్రవదనంబు సురుచిరాస్యంబుఁ బడసె.

క. గర్జించు యోగములఁ గని, గర్జించును యోగములను గాంచి వ్రతములన్
దర్జించును దీక్షములను, దర్జించును మాఘ మాత్మఫలార్థాధికతన్. 1722
సీ. ఆయురారోగ్యంబు లర్థించువారికిఁ, గాంక్షించువారికిఁ గామసుఖము
దారపుత్రాదులఁ గోరెడివారికి, వాంఛించువారికి వాగ్విభూతి
యాశించువారి కష్టైశ్వర్యసిద్ధుల, నభిలషించెడివారి కమరపదము
వేఁడెడివారికి విద్యావివేకముల్, ప్రార్థించువారి కాపద్విముక్తి
ఆ. మంచిగుణములను సమంచితరూపంబు, నిచ్ఛగించువారి కిచ్ఛగించి
నట్లు కాంక్ష దీర్చునది మాఘ మొక్కండె, దాని కీడు వేఱె కానరాదు. 1723
గీ. ఇది యది యటంచు లెక్కింప నేల కామ, ధేనుచింతామణులవోలె మానవులకు
సకలవాంఛార్థసిద్ధు లొసంగ మాఘ, మేయెడల నండె నై చినచేయి చూపె. 1724
గీ. మొదటఁ జేసి నిత్యస్నానమును విచేయ, తారకం బగువేళను దగు నొనర్ప
నవల మరల మాఘస్నాన మనుదినంబుఁ, దరణి యర్థోదితుండైన తరుణమందు.
గీ. కృతయుగంబునఁ దపమును త్రేతయందు, జ్ఞానమును ద్వాపరమున యజ్ఞమును గలిని
దానము ప్రశస్తములు ప్రశస్తములు మాఘ,మాసమున నన్నియును గూడ మానవేంద్ర.
ఆ. సర్వవర్ణములకు సర్వాశ్రమములకు, మాఘమాస మనెడిమేఘమాల
ధర్మ మనెడియమృతధారను వర్షించు, భాగ్యవంతు లెల్లఁ బట్టుకొనఁగ. 1727
గీ. కామమున నైన లేక యకామమునను, నైన మునిఁగిన మాఘమునందు నెచట
నేనియు బహిర్జలంబున నిహపరంబు, లందు నెం దేని దుఃఖము నొందఁ డతఁడు.
వ. అంతట భృగుమహర్షి యచ్చోటు విడిచి లోకోపకారార్థంబు శిష్యసమేతంబుగా వింధ్య
పర్వతంబునకుం జేరి రేవానదీతటంబున నాశ్రమంబు నెలకొల్పికొని యుండుండి తన్నదీ
తోయంబున విధ్యుక్తప్రకారంబుగా మాఘస్నానంబు గావించుచుఁ దపంబు సేయం
దొడంగె. 1729

—: మృగశృంగమహర్షివృత్తాంతకథనము :—

సీ. వినుము వే ఱొకగాథ వినిచెదఁ గృతయుగం, బున రథంతరకల్పమునను మున్ను
కలఁడు కుత్సుండు నాఁగను బేరువడినభూ, సురుఁ డొక్కరుఁడు భోజపురమునందుఁ
నై కొని కర్దమకన్యక నాతండు, ధర్మపత్నిగను నత్తరుణియందుఁ
దనయుని వత్సాభిధుని నొకరునిఁ గని, యతనికి జాతకర్మాదివిధులఁ
గీ. జలిపి యుపనయనము సేసె సక్రమముగ, నంత వత్సుఁడు బ్రహ్మచర్యాశ్రమార్హ
ధర్మముల నాచరించుచు దైవికముగ, వచ్చి కావేరికడ కొకవాసరమున. 1730
సీ. ఉదధి కేఁగెడిమహానదులందుఁ బశ్చిమ, వాహినులును నుదగ్వాహినులును
గలధామములు ప్రయాగముకంటె నధికంబు, లనెడి శాస్త్ర మెఱింగినట్టికతనఁ
బశ్చిమముఖము గాఁ బ్రవహించునచ్చోట, నివసించి తన్నదీనీరమందు
నొనరించి శాస్త్రవిధ్యుక్తమార్గంబున, స్నానముల్ మాఘమాసత్రయంబు

గీ. తదవగాహనపుణ్యసంతానజనిత, తత్త్వవిజ్ఞానుఁడై మమత్వమును విడిచి
సహ్యజోత్తరతటసమక్షస్థమైన, యట్టినారాయణాద్రిపై నధివసించి. 1731

సీ. ఆవ్వోటనున్నకళ్యాణతీర్థంబునఁ, జేసి స్నానము మాఘమాస మెల్లఁ
దత్సరఃపశ్చిమతటమునఁ గూర్చుండి, తపము సేయఁ దొడంగె దారుణముగ
దాన నంతయు నిండి నేనె యుంటి న టన్న, జ్ఞానంబు జనియింప దానివలనఁ
గదలకుండఁగ మేను కాష్ఠంబువలె నుండ, నేతెంచి యచటికి మృగము లెల్ల

గీ. నాశ్రమదంబునఁ ద్రావి తోయంబు వాని, కాయమును శృంగములచేత తాయుచుండ
నాతనికిఁ గల్గె మృగశృంగుఁ డనెడిపేరు, యుగశతం బట్లు కడవంగ నొక్కనాఁడు.

గీ. తత్తపఃప్రీతుఁడై జనార్దనుఁడు వచ్చి, హస్తమునఁ దత్సహస్రార మంటె నంతఁ
దెలిచి కన్నుల నతఁడు ముందఱ వెలుంగు, చున్ననారాయణునిఁ జూచి కన్నులార.

క. అనవధికమైనహర్షం, బున లేచి నమస్కరించి పులకలు మేనన్
జనియింప బాష్పములు లో, చనములఁ గ్రమ్మంగ భక్తి సమకూర నెదన్. 1734

సీ. ధర్మసంస్థాపనార్థము భూతలంబున, నవతరించుచు నుండునాదిపురుష
చేయుచు విశ్వసృష్టిస్థితిలయములఁ, దేజరిల్లుచు నుండుదివ్యమూర్తి
యెక్కటి వయ్యు ననేకరూపములతోఁ, జెలువారు చుండెడిచిత్స్వరూప
యణువుకంటెను నణు వగుచు మహత్తుకం, టెను మహత్తగుచు నుండెడియమేయ

గీ. నిర్వికారుండ వయ్యును నిర్గుణుండ, వయ్యును వికారగుణశాలి వగుచు నుందు
వెవ్వఁ డెఱుఁగు భవత్తత్త్వ మిట్టి దనుచు, నెన్నఁగను నిన్ను దేవ నే నెంతవాఁడ.

క. శరణాగతరక్షకుఁడవు, పరమపురుష నీవు నేను బరిపాల్యుఁడఁ ద్వ
చ్చరణముల శరణుచొచ్చితిఁ, గరుణాదృష్టులను నన్నుఁ గాంచుము చాలున్. 1736

సీ. అని నుతింపఁగ శార్ఙ్గి యాననంబున హర్ష, హాసంబు చెలువార నతనిఁ గాంచి
మృగశృంగ నీ వొనర్చినమాఘమాసాన, గాహనంబునఁ దృప్తి గలిగె నాకు
దాననె ని ట్టితపము చేసెడిశక్తి, యును నాదుదర్శనంబును లభించె
భావిజన్మంబునఁ బ్రభవించెదవు ఋభు, వనుపేర మానివై యపుడు నీకుఁ

గీ. బ్రాప్తమగు ముక్తి బ్రహ్మచర్యమున నేఁడు, ఋషుల సంతృప్తిపఱచినరీతి సురల
జన్నములచేతఁ బితరుల సంతుచేత, నగు నొనర్పఁ బ్రతుష్టుల నంతవఱకు. 1737

గీ. అని ప్రసాదించుటయు వత్సమునివరుండు, దేవ నీ వుండవలయు నీతీర్థరాజ
మందు నని వేఁడ నీకోరినట్లు యుందు, నిచట నని చెప్పి శౌరి యదృశ్యుఁ డయ్యె.

సీ. అంతట మృగశృంగుఁ డరుదెంచి యింటికిఁ, దలిదండ్రులపదాబ్జములకు మ్రొక్కి
తెలియంగఁజేసి తాఁ జలిపినమాఘమ, జ్జనమున కామతిల్లినఫలంబు
వారిని సంతోషవార్ధిలో నోలార్చి, తత్సపర్యాపరత్వమున నుండ
నొకదినంబున నుచథ్యునికడఁ గుత్సుఁడు, తనకుమారునిచరిత్రమును జెప్ప

గీ. సతఁడు సంతోషమును జెంది యాత్మపుత్రి, యగుసువృత్త యొనర్చిన దగుట మాఘ
మజ్జనంబును మూఁడు సంవత్సరంబు, లామె నీయంగ వత్సున కాత్మ నెంచి. 1739
క. తనపుత్రికిసుగుణంబులు, వినిచెన్ గుత్సున కతఁడు విని సర్వంబున్
దనతనయున కాయమ ని, మ్మని కోర నుచథ్యుఁ డిత్తు నని వాక్రుచ్చెన్. 1740
వ. అంతటఁ గుత్సుండు మహానందభరితుం డై స్వగృహంబునకుం జని తద్వార్త వత్సున
కెఱింగించె. 1741
సీ. ఒకనాఁడు నిజసఖీయుక్తంబుగను మాఘ, మునను గావేరికిఁ జని సువృత్త
యరుణోదయంబున నందు స్నాన మొనర్చి, వచ్చు చుండఁగ నొక్కవారణంబు
పరువెత్తుచును రాఁగఁ బైకి భయంబునఁ, బడి యందఱును నొక్కపాడునూత
విడిచిరి యసువు లావృత్తాంతమును విని, యరుదెంచి యటకుఁ దదాప్తు లెల్ల
గీ. నేడ్చు చుండంగ వచ్చి యయ్యెడకు దైవి, కముగ వత్సుఁడు చూచి యాకన్యకలను
బ్రతుకఁజేయుదు వీరి నెప్పగిది నైన, మీరు గాపాడుఁ డేతచ్ఛరీరములను. 1742
చ. అని వచియించి వారికి రయంబున సహ్యజ కేఁగుదెంచి దా
నను గళదఘ్నజీవనమునన్ నిలువంబడి యూర్ధ్వబాహుఁ డై
కనుచుఁ దదేకదృష్టిని వికర్తనబింబము మృత్యుసంస్తవం
బొనరుచు చుండ నాకరి మహోత్సుకతన్ జని వానియొద్దకున్. 1743
క. కనఁబఱచుచు సంతోషం, బును దొండము చాఁచి పట్టి మూర్ధమునం దా
తని నిడుకొనుటయు వత్సుఁడు, కనుఁగొని తద్భావ మెడఁద కరుణార్ద్రము గాన్.
క. కొని హస్తంబునఁ దోయం, బును నిజమాఘాప్లుదివసపుణ్యంబును వెం
టనె ధారవోసె ధన్యత, యొనగూడఁగ దాని కెంచి యుల్లమునందున్. 1745
ఉ. అంతట నాగజంబు ద్విరదాకృతి పోవఁగ దివ్యరూప మ
త్యంతముదావహంబుగను బ్రాప్తము గాఁగ నభంబునన్ విమా
నాంతరమందు నిల్చి వినయంబున మ్రొక్కి మునీంద్రసూతికిన్
వింతగఁ బ్రాగ్జనిస్మృతి జనింపఁగఁ జిత్తమునందు నిట్లనున్. 1746

—: ధర్మగుప్తవృత్తాంతకథనము :—

సీ. స్వామి నీకృపచేతఁ జరితార్థతను జెందఁ, గలిగితి నేఁడు నాగాథ వినుము
మున్ను నైషధపురంబున ధాత్రి నొక్క వై, శ్యుం డుండె విశ్వగుప్తుండు నాఁగ
నతనికిఁ బుత్రుండ నై పుట్టి ధర్మగు, ప్తాఖ్యను జెంది నామార్హముగను
దాఁటక న్యాయపథంబు వాణిజ్యంబు, గావించి కోటినిష్కముల నేను
గీ. గడన యొనరించి నా కొకకొడుకు గలుగ, వానికి నొసంగి యర్థంబు దానిలోన
ధర్మకార్యంబులకు మదర్థంబు కొంత, వ్యయము సేసితి శ్లాఘింప నఖిలజనులు. 1747
సీ. మరుభూములందును మార్గంబులందును, స్థాపించితిని బ్రపాకూపములను
నెలకొల్పితిని వృక్షములు పెక్కుచోట్లను, విశ్రమింపఁగఁ బ్రాణివితతి యొల్లఁ

గట్టించితిని శివాగారంబులును విష్ణు, సదనంబులును శక్తిసదనములును
బేదసాదుల కెల్లఁ బెట్టించితిని నన్న, సత్త్రంబులను బహుస్థలములందు
గీ. సలిపినాఁడను గోదానములును భూమి, దానములు స్వర్ణకన్యాప్రదానములును
నేమి యొనరించినను ఫల మేమి యెవియు, దక్షములు గావు తుదుప ఫాలాక్షరముల.
గీ. ద్విరదభుక్తకపిత్థంబుకరణిఁ బోవఁ, దగిన దెల్లను బోవు రాఁదగిన దెల్ల
నారికేళాంబువుతెఱంగునను ఘటిల్లు, నిదియె సిద్ధాంతము బహూక్తు లేల యింక.
సీ. అప్పుడు రసవాది యైనకాపాలికుం, డొకఁడు నాగృహమున కొక్కనాఁడు
చనుదెంచి మాయచేతను నాకుఁ దనయెడఁ, బ్రభవింపఁగాఁజేసి ప్రత్యయంబు
నాయొద్ద నున్నధనం బెల్ల హరియించి, నను దరిద్రునిఁ జేసి చనియె నంత
దారిద్ర్యమునకు వార్ధకము తోడై నన్ను, వేధింపఁ దొడఁగె నవ్వేళయందు
గీ. నమ్మితిని మున్ను నేఁ జేసినట్టిధర్మ, చయము నెల్లఁ గుటుంబరక్షణముకొఱకు
నవల మాఘంబునందు సంప్రాప్తమయ్యె, దశదినస్నానములు నాకు దైవికముగ.
ఆ. అంతఁ గొలఁదిదినములందె నా కొనగూడె, మరణ మపుడు నేను మాఘమాస
మం దొనర్చినట్టియవగాహనమునకు, ఫలముగాఁ ద్రివిష్టపంబుఁ జెంది. 1751
గీ. ఆచట స్వర్గసుఖంబుల ననుభవించి, యపరిమితముగ నొక్కమన్వంతరంబు
పిదపఁ దత్పుణ్యము నశింప నుదయ మైతి, గజముగను నిల ధర్మవిక్రయముకతన.
ఆ. ఇపుడు నీవు నాకు నిచ్చినమాఘావ, గాహపుణ్యమునను గాంచఁ బోవు
చున్నవాఁడ సుఖము నూర్ధ్వలోకంబున, నని వచించి చనియె నమరపురికి. 1753
వ. అంతట మృగశృంగుండు యథాపూర్వంబుగఁ గంఠదఘ్నం బగుకావేరీజలంబున నిలువంబడి. 1754
సీ. సంజ్ఞాతనూభవ సదసత్క్రియాసాక్షి, ధర్మస్వరూప యధర్మశాస్త
శరశక్తిముసలపాశత్రిశూలాసిగ, దాంకుశవిస్ఫురదష్టహస్త
వైవస్వత కరాళవదన ప్రలంబోష్ఠ, దక్షిణాశానాథ దండధారి
మహిషవాహన దీప్తదహనసన్నిభనేత్ర, సాధులోకైకప్రసన్నరూప
గీ. యంజనాద్రిసమచ్ఛాయ యప్రమేయ, సత్యధర్మదమాచారశాంతిసహిత
నిత్యసంతోష సంయమనీపురీశ, శమన యమునాసహోదర శరణు శరణు. 1755
క. అని నుతియించుచు నుండఁగఁ, జనుదెంచి కృతాంతుఁ డధికసంతోషముతో
డను నిలిచి యతనిముంగలఁ, గనులను లేనగవు దొలుకఁగా నిట్లనియెన్. 1756
ఆ. వత్స తావకస్తవంబున కెంతేని, సంతసంబు గలిగె స్వాంతమందు
వరము గోరు మనుడు వత్సుఁ డత్యానంద, మొలయ యమునిపాదములకు మ్రొక్కి.
సీ. అంతక మృతసువృత్తాదికన్యాచతు, ష్టయమును బ్రతికించి దయ యొలర్ప
నన్ను సఫలప్రతిజ్ఞునిఁ జేయు మని కోర, యముఁ డట్లె యగుఁగాక యని వచించి

యంత్రితాత్ముం డయ్యె నంతట వత్సుండు, కన్యాశవము లున్నకడకు వచ్చె
నపుడు కన్యలు సుప్తలై మేలుకాంచిన, కరణిని జూచిరి కన్ను లెత్తి

గీ. కనుఁగొనఁగ నట్లు కన్యలు గాంచి వారి, విస్మయంబునఁ దద్బంధువితతు లెల్ల
నమ్మ బ్రదికితె బ్రదికితె యమ్మ యనుచు, నేడిచిరి హర్షబాష్పము లేర్లువాఱ. 1758

ఆ. అవనిశయ్యనుండి యప్పుడా కన్యలు, లేచి కూరుచుండి చూచి వారి
నెల్ల విశదముగను నిట్లు వచించిరి, హర్షవిస్మయంబు లామతిల్ల. 1759

ఆ. అమ్మలార మేము యమలోకమున కేఁగి, కాంచి యచట నున్నకఠినకఠిన
నరకములను వచ్చినారము శమనాజ్ఞ, యగుటఁజేసి పృథివి కద్భుతముగ. 1760

చ. అనుటయు వార లిట్లనిరి యమ్మకచెల్ల కృతాంతలోకముఁ
గని ధరణీతలంబునకుఁ గ్రమ్మఱ వచ్చుట యెన్నఁడుఁ గనుం
గొనినది లేదు విస్మయముగొల్పెడు మీపలుకుల్ వచింపుఁ డో
య్యన నచటం గనుంగొనినయట్టివిశేషము లెల్ల మాకడన్. 1761

వ. అని యడుగుటయు వారల కాకన్యక లిట్లనిరి. 1762

—: యమలోకవృత్తాంతకథనము :—

సీ. పోక తప్పదు యమలోకంబునకుఁ జతు, ర్విధజంతువులు గూడ వివశు లగుచు
నీలోకమం దొక్కఁ డేనియుఁ గనరాదు, యమలోకమున కేఁగనట్టిప్రాణి
పోదురు సుఖమార్గమున నచ్చటికి మాఘ, మందు నుషఃకాలమందు మునిఁగి
బదరీఫలంబులు గదళీఫలంబు లా, మలకంబులును గోధుమలును దిలలుఁ

గీ. పాదుకాదర్శకబికాతపత్రములును, నిలయశయ్యాసనాన్నపానీయములును
స్వర్ణధనధాన్యగోభూమివస్త్రములును, ఘృతము గూశ్మాండమును దాన మిచ్చువారు.

వ. మఱియును మాఘమాసంబునందుఁ బ్రయాగస్నాతులును హరిహరపూజాపరాయణులును గజతురగవృషభశకటతండులాఢకాద్యర్థవస్తుప్రదాతలును దేవాగ్నిగురువిప్రమాతాపితృసేవకులును నారామకూపవాపీతటాకదేవాలయయతిమఠదీనానాథవిశ్రాంతినిలయస్థాపకులును విప్రపాదశౌచపాదాభ్యంగశిరోఽభ్యంగకర్తలును దదితరవివిధప్రశస్తదానకర్తలును నానావ్రతకర్తలును దదితరానేకపుణ్యకర్తలును యమలోకంబునకు సుఖంబుగా నేగుదురు. 1764

క. ఆనానావిధపుణ్యాగ, ణానీకముతోఁ దదీయయానంబులతో
భానుజపురంబు నిండి మ, హానందముగొల్పు చుండు ననుదినసంబున్. 1765

సీ. అనుదినంబును బుణ్యు లరుదెంచి రనువార్త, విని దండధరుఁడు సోద్వేగముగను
నుత్థితుండై భటయుతముగాఁ జని దివ్య, వాహనస్థితులైనవారికడకు
సవినయంబుగ మ్రొక్కి సలిపి యర్ఘ్యసపర్య, శ్లోకించి తత్కృతసుకృతములను
వారలలో నసాధారణపుణ్యముల్, సలిపినవారిని స్వర్గమునకు

గీ. శంభుభక్తులఁ గైలాసశైలమునకు, హరిశరణ్యుల వైకుంఠపురమునకును
ప్రాప్తమాఘప్రయాగతీర్థావగాహ, సుకృతులను బ్రహ్మలోకంబునకును బనుచు.

క. ఎఱుఁగము వా రెవ్వారలొ, మఱికొందఱు పావనులు విమానంబులలోఁ
దఱచుగఁ దిరుగుచు నుందురు, గఱువతనంబున సతంబుఁ గాలునిపీటన్. 1767

గీ. మాతపోమాసమజ్జనమహిమమునను, యమపురంబున రంభావనాంతరమున
నుండి సుఖముగఁ జూచి పుణ్యోత్తరులను, బడసితిమి జన్మనేత్రసాఫల్యములను.

సీ. ఇంకఁ బాపులగాథ యెఱిఁగింతుము వినుండు, ధైర్యంబు నూని చిత్తంబులందు
స్నానదానాదివిహీనులు ఘోరమా, ర్గమునుండి తీవ్రదుఃఖములు పడుచు
దక్షిణదిగ్గతాంతకపురంబును బ్రవే, శింతురు ప్రాణావశేషముగను
నది షడశీతిసహస్రయోజనముల, కంటె నిచ్చటి కధికముగ నుండు

గీ. యమపురము పుణ్యవంతుల కతిసమీప
ముండు నున్నట్లు పాపుల కధికదూర
మందు నున్నట్లు తోఁచు సౌమ్యముగఁ బుణ్య
మార్గము కఠోరముగఁ బాపమార్గ ముంట. 1769

సీ. ఒకచోట సర్పంబు లొక్కచోటను వృశ్చి, కములును నొకచోటఁ గంటకములు
గ్రావంబు లొకచోట గర్తంబు నొకచోట, నొకచోటఁ గిరు లేఱు లొక్కచోట
నొకచోట వ్యాఘ్రంబు లొకచోట సింహంబు, లొక్కచోట వరాహయూథములును
నొకచోటఁ జీకటి యొకచోట దావాగ్ని, యొకచోట రుజ లార్పు లొక్కచోట

గీ. రక్తపాషాణపాంసువర్షములు పిడుగు, లుఱుములు పిశాచములు చలి యుడుకు సకల
విధములను బీడవెట్టంగ వెతలుపడుచు, నేడుతురు పాతకులు త్రోవ నేఁగునపుడు.

సీ. అల్లాడుచుండ దాహంబున లభియింప, దొక్కచోటను నీటిచుక్క యేని
కాఱుచుండంగ రక్తము కాయములనుండి, కంటికైనను మందు కానరాదు
గుదెలచే యమభటుల్ క్రుళ్ళఁ గ్రుమ్ముచు నుండ, హరి శివ యనఁ డొక్కప్రాణి యేని
యాఁకలిచేఁ బ్రాణ మసురుసు రగుచుండఁ, బ్రాప్తింప దొకపట్టెఁ డన్న మేని

గీ. తాముచేసిన పాపముల్ తలఁచికొనుచు, నేడ్చుచుండంగ నాలింపఁ డెవఁడు గూడ
నార్తులై భీతితోడఁ గృతాంతపురికిఁ, గలుషు లేఁగెడిఘోరమార్గంబునందు. 1771

వ. ఏకాకులును బరాధీనులును బంధుమిత్త్రాదిపరిత్యక్తులును నగ్నులును గృశాంగులును శుష్కకంఠోష్ఠతాలువులును క్షుదగ్నిదహ్యమానులును శృంఖలాబద్ధులును గాలపాశాకృష్యమాణులును బృష్ఠభాగవినిబద్ధభుజులును రజ్జుబంధాకృష్టనాసికాజిహ్వాకంఠశిశ్నవృషణకరపాదకటిప్రదేశులును ఛిన్నసర్వాంగసంధులును నానాశస్త్రప్రహతులును గృత్తకరపాదులును సరఘాదంశక్రిమిదష్టులును సవ్రణులును స్రవద్రక్తధారానిషిక్తగాత్రులును నిరాశ్రయులును బాథేయవర్జితులును నగుపాపులను భీషణాకారు లగుయమ

భటులు సంయమనీపురంబునకుఁ దోడ్కొనిపోయి మహాశ్మశ్రువును నిశాతనానావిధా
యుధభయంకరాష్టాదశకరుండును నగుకృతాంతునియెదుట నిలువంబెట్ట వారెల్లరును,

సీ. ప్రళయాగ్నిరీతిని బ్రజ్వరిల్లెడివాని, జీమూతమట్లు గర్జించువాని
వార్ధిని ద్రావునై వడి జ్వలించెడివాని, దంష్ట్రాకరాళవక్త్రంబువాని
ననలంబు నుమియుచాయను దీపిలెడువాని, నంజనచ్ఛాయచే నమరువాని
జగములఁ గబళించుపగిదిఁ గ్రాలెడివాని, మేరుశైలోన్నతి మీఱువాని
గీ. నూర్ధ్వకేశుని మహిషవాహుని నమర్ష, తామ్రనేత్రుని నుగ్రుని దండధరుని
వానికడ నున్నమృత్యుదేవతను నతని, పరిజనంబును జూచి కంపంబు నొంది. 1773

క. విలపించు చుండ లోచన, ములనుండి విషాదబాష్పములు గురియంగన్
దిలకించి వారిమోముల, నెలయఁగఁ గృప చిత్రగుప్తుఁ డిట్లు వచించున్. 1774

క. కలుషాత్ములార మీరలు, సలిపినపాపంబు లెల్ల సమయఁగ నరకం
బుల ననుభవింపఁ డావలఁ, గలుషంబులు దొలఁగు దానఁ గలుగు శుభంబుల్.

సీ. అల్పకాలం బుండునట్టిభోగములకై, కావించితిరి నీచకార్యములను
ధారవోసితిరి శరీర మంతయును నా, పత్కాలమున రానిబాంధవులకు
నార్జించితిరి పాతకాద్రుల వేదశా, స్త్రపురాణవాక్యముల్ సరకుగొనక
తలఁచికొంటిరి గృహధనదారసుతుల నె, సుఖహేతువులుగ నశుద్ధమతిని
గీ. మీరు చేసినకర్మముల్ మీతలంపు, లన్నియును గూడి యుష్మదనర్థమునకుఁ
గారణము లయ్యెఁ దుద కంతె కాని మాకు, నించుకయు లేదు హేతుత్వ మిందులోన.

గీ. ఒకనిసుఖదుఃఖములకు వే ఱొకఁడు గాఁడు, కారణం బెన్నఁటికిని స్వకర్మముననె
కలుగు దుఃఖంబు గాని సుఖంబు గాని, పరులపైఁ బడి యేడ్తురు పాపమతులు.

గీ. పాపములు మీరు చేయుటఁ బాపఫలము, గుడువవలయును మీరలె కుడువ రొరులు
పతితుఁ డగునెడ నొకఁడు తత్పతనబాధ, యనుభవించుట యన్యుఁ డెం దైనఁ గలడె.

క. ఒనరించి చేతులారఁగ, నొనరింపగరానియఘము లుత్సాహముతో
డను దత్ఫలానుభవవే, ళను నేడ్తురె బుద్ధిశాలులరు మీ రెల్లన్. 1779

చ. అనవుడుఁ గాలుఁ డిట్లను మహాగ్రహ మేర్పడ భృత్యులార వీ
రిని గొనిపోయి కట్టి తలక్రిందుగఁ గంబములందుఁ గ్రింద వ
హ్నిని జ్వలియింపఁజేసి దహియింపుఁడు గొంతవిశుద్ధి యేర్పడం
గను మునుముందు ఘోరనరకంబులలోపలఁ గూల్పుఁ డావలన్. 1780

క. అని యాజ్ఞాపించుడుఁ జ, య్యన వారలఁ బట్టికొని కృతాంతభటులు ఘో
రనినాదంబులు సేయుచుఁ, జని చేయుదు రంతకుండు శాసించినటుల్. 1781

ఆ. ఇంక నరకవిషయ మెఱిఁగించువారము, వినుఁడు సృష్టిచేసె విధి యనేక
నరకములను మున్ను నానాఘశుద్ధికై, పడుదు రందు దానఁ బాపు లెల్ల.

—: అష్టావింశతికోటినరకకథనము :—

వ. సప్తమతలాంతంబున ఘోరతమస్సునం దష్టావింశతికోటినరకంబులు గలవు. అందుఁ బ్రథమకోటి ఘోర యనియు ద్వితీయకోటి సుఘోర యనియుఁ దృతీయకోటి యతిఘోర యనియుఁ జతుర్థకోటి మహాఘోర యనియుఁ బంచమకోటి ఘోరరూప యనియు షష్ఠకోటి తరళతార యనియు సప్తమకోటి భయానక యనియు నష్టమకోటి కాళరాత్రి యనియు నవమకోటి భయోత్కట యనియు దశమకోటి చండ యనియు నేకాదశకోటి మహాచండ యనియు ద్వాదశకోటి చండకోలాహల యనియుఁ ద్రయోదశకోటి ప్రచండ యనియుఁ జతుర్దశకోటి కరాళ యనియుఁ బంచదశకోటి వికరాళ యనియు షోడశకోటి వజ్ర యనియు సప్తదశకోటి క్రూర యనియు నష్టాదశకోటి మహాభయ యనియు నేకోనవింశకోటి యతిక్రూర యనియు వింశకోటి మహాక్రూర యనియు నేకవింశకోటి త్రికోణ యనియు ద్వావింశకోటి పంచకోణ యనియుఁ ద్రయోవింశకోటి సుదీర్ఘ యనియుఁ జతుర్వింశకోటి పరివర్తుల యనియుఁ బంచవింశకోటి సప్తభౌమ యనియు షడ్వింశకోటి యష్టభౌమ యనియు సప్తవింశకోటి దీప్త యనియు నష్టావింశకోటి మాయ యనియుం జెప్పంబడియె.

క. భూవలయంబున నఘములు, గావించినవారి కెల్లఁ గలుషవిముక్తిం
గావింపఁ గాల్చి యీయ, ష్టావింశతికోటినరకసంస్థానంబుల్. 1784

వ. అష్టావింశతికోటినరకంబులలో నొక్కొక్కకోటికై యైదు నాయకనరకంబులు గలవు. అయ్యవి ప్రథమకోటికి రౌరవము మహారౌరవము తమస్సు శీతము నుష్ణము ననియును ద్వితీయకోటికి సుఘోరము సుతమస్సు తీక్ష్ణము పద్మము సంజీవనము ననియును దృతీయకోటికి శతము మహామాయము నతిలోమము సుభీమము కటంకటముననియును జతుర్థకోటికిఁ దీవ్రవేగము కరాళము వికరాళము ప్రకంపనము మహాపద్మము ననియును బంచమకోటికి సుచక్రము కాలసూత్రము ప్రతర్జనము సూచీముఖము సునేమి యనియును షష్ఠకోటికి ఖాదకము సుప్రదీపకము కుంభీపాకము సుపాకము కూపము ననియును సప్తమకోటికి నంగారరాశి భవనము నసృక్పూయహ్రదము విరామము తుండశకుని యనియును నష్టమకోటికి మహాసంవర్తకము క్రతువు తప్తజతువు పంకలేపము పూతిమాంసము ననియును నవమకోటికి ద్రవము త్రపుపు నుచ్ఛ్వాసము నిరుచ్ఛ్వాసము సుదీర్ఘము ననియును దశమకోటికిఁ గూటశాల్మలి దురిష్టము సుమహానాదము ప్రభావము సుప్రభావము ననియును నేకాదశకోటికి ఋక్షము మేషము వృషము శల్యము సింహాననము ననియును ద్వాదశకోటికి వ్యాఘ్రాననము మృగాననము సూకరాననము శ్వానాననము మహిషాననము ననియును ద్రయోదశకోటికి వృకాననము మేషవరాననము గ్రాహము కుంభీరము నక్రము ననియును జతుర్దశకోటికి సర్పము కూర్మము వాయసము గృధ్రము నులూకము ననియును బంచదశకోటికి జలూకశార్దూలము కపి కర్కటము గండము ననియును షోడశకోటికిఁ బూతివక్త్రము రక్తా

క్షము ప్రాతిమృత్తికము కణధూమము తుషాగ్ని యనియును సప్తదశకోటికిఁ గ్రిమి నిచయము నమేయము నప్రతిష్ఠము రుధిరాన్నము శ్వభోజనము ననియును నష్టాదశకోటికి లాలాభక్షము నాత్మభక్షము సర్వభక్షము వికటము సువిలాపము ననియును నేకోనవింశకోటికి సుకటము సంకటము కటము పురీషము కటాహము ననియును వింశకోటికి వైతరణీనది సుతప్తలోహాశంకువు నయశ్శంకువు ప్రపూరణము ననితాలవనము ననియును నేకవింశకోటికి ఘోరము నస్థిభంగము ప్రపీడకము నీలయంత్రము నతసీయంత్రము ననియును ద్వావింశకోటికి నిక్షుయంత్రము కూటము నంశ ప్రమర్దనము మహాచూర్ణి సుచూర్ణి యనియును త్రయోవింశకోటికిఁ దప్తలోహమయి శిల పర్వతము క్షురధారాదము మలపర్వతము ననియును జతుర్వింశకోటికి మూత్ర కూపము విష్టాకూపము నంధకూపము పూయకూపము శాతనము ననియును బంచ వింశకోటికి ముసలోలూఖలము యంత్రశిలాశకటలాంగలము తాళపత్రాసిగహనము మహామశకమండపము సమ్మోహనము ననియును షడ్వింశకోటికి నతిభంగము తప్త శూలమయము గుడము బహుదుఃఖము మహాదుఃఖము ననియును సప్తవింశకోటికిఁ గశ్మలము శమలము హాలాహలము విరూపము భీమరూపము ననియును నష్టావింశ కోటికి భీమగము నేకపాదము ద్విపాదము తీవ్రము నవీచి యనియును జత్వారింశ దధికశతనాయకనరకంబు లయ్యె. రౌరవాద్యవీచ్యంతంబు లగు నాయకనరకంబు లన్నియును మహానరకమండలం బనుపేరం బరగు. 1785

సీ. వీతిహోత్రంబున ధాతువులను మల, క్షయ మగువఱకును గాల్చుపగిదిఁ
బాపులఁ గర్మానురూపంబుగను నమ్మ, హానరకాగ్నులయందుఁ గూల్చి
కర్మక్షయంబుదాఁకను గాల్చి విడుతురు, కర్మశేషం బుండుకాలమందుఁ
దత్కర్మశేష మాధారంబుగాఁ గొని, భువిలోన స్థానరంబులుగ మొదటఁ

గీ. బురుగులుగఁ బిమ్మట విహంగములుగఁ బిదప, నవల మృగములుగను దదనంతరంబ
పశువులుగ గోవులుగను నాపైనిఁ బుట్టి, యవశమ్ముగ వారు బహుదుఃఖ మనుభవించి.

క. తరువాతను జనియింతురు, మరల మనుష్యులుగ నింతమాత్రమె మాకుఁ
బరిచిత మయ్యెను విషయము, పరేశరాట్పురమునందుఁ బరికింపంగన్. 1787

గీ. కల వదృష్టంబు లశ్రుతంబులును నైన, నరకవిషయంబు లట నగణ్యంబులుగను
వాని నెల్లను జూచుట గాని లేక, తెలిసికొనుటయుఁ గాని మా కలవి గాదు.

సీ. అని చెప్పుటయును నాయతివ లెల్లరు మహా, భయమును బొంది విభ్రాంత లగుచు
గాత్రంబు లెల్లను గంప మొందుచు నుండ, క్షితిపైనిఁ బడిరి నిశ్చేష్టముగను
నంతట నాకన్య లతిధైర్యమునను నా, సీమంతినుల నెల్ల నేదఁ దేర్చి
చేడెలార భయంబుఁ జెంద నర్హమె మీకు, భరతవర్షంబునఁ బ్రభవ మొంది

గీ. భస్మమైపోవె సకలపాపములు గూడ, మాఘమాసంబున నొనర్చుమజ్జనమున
దగ్ధపాతక లగుమిమ్ముఁ దాఁక వశమె, యమనియోజ్యుల కైనను యమున కైన.

ఆ. జన్మశతసహస్రసంపాదితం బైన, పుణ్యముననె కర్మభూమియందు
జననమొందఁగల్గు మనుజులుగను నూర్ధ్వ, గతికి మార్గ మిచటఁ గలిగియుంట. 1790
క. అందును బ్రాహ్మణజన్మము, నొందెడిభాగ్యంబుకంటె నొండొకభాగ్యం
బెందును లేదు మహీసురుఁ, డొందె ననుభవింప నర్హుఁ డిహాపరసుఖముల్. 1791
గీ. తపములు జపంబులును దానధర్మములును
యాగములు యోగములును సురార్చనలును
ధ్యానములును మహానదీస్నానములును
గల విచటఁ బెక్కుసాధనంబులు తరింప. 1792
క. మాఘస్నానం బొకఁడె య, మోఘం బగుపిదుగు ముక్కముక్కలుగాఁ బా
పౌఘశిలోచ్చయపంక్తుల, నాఘాతింపంగ నేల యవి యివి యెల్లన్. 1793
క. అమరత్వము నమరేంద్ర, త్వము బ్రహ్మత్వమును జెందెదరు నరు లిటఁ బు
ణ్యముఁ జేయునెడలఁ గర్మ, క్షమ యొక్కఁడె స్వర్గమోక్షసాధన ముర్విన్. 1794
ఆ. భోగభూము లన్యభూములు గావున, నూర్ధ్వగతుల నచట నొంద వీలు
పడమిఁ గర్మభూమిపైని జనింపంగ, నభిలషించు చుందు రనిమిషులును. 1795
ఉ. కావున సర్వదేశములకంటెను భారతవర్షమున్ గడున్
బావన మైనదేశముగ బ్రాజ్ఞులు సెప్పుదు రిట్టిభూమిపై
దైవవశంబునన్ మనుజతన్ వహియించి జనించియున్ స్వజ
న్మావితథత్వమున్ బడయనట్టివివేకవిహీను లాహతుల్. 1796
గీ. ఊర్ధ్వలోకసుఖస్థితి నొందఁజేయు, పరికరము లెల్లఁ గలిగినభరతవర్ష
మునను యాత్మోద్ధృతిని జేసికొననివాఁడు, పరికరవిహీన మగుచోట బాగుపడునె.
ఆ. పరిగృహీతదానపాథేయ లై సుఖం, బుగను ధర్మరాజనగరమునకు
నేఁగఁగలరు మీర లిఁక లెండు పుణ్యంబు, లాలసింపకుండ నాచరింప. 1798
క. క్షణికము చిత్తము విత్తము, క్షణికము ప్రాణానిలములు క్షణికంబులు గా
రుణికుఁడు గాఁడు కృతాంతుఁడు, క్షణమును ధర్మమునఁ దగదు సలుప నుపేక్షన్.
క. అని చెప్పుటయును వారలు, విని కన్యావచనములను విగళితభయ లై
యొనరింపఁ దొడఁగి రాప్లవ, మును గావేరీకృపీటమున మాఘమునన్. 1800
క. అనవుడు దిలీపుఁ డబ్బుర, మును జెంది మదిన్ గృతాంతపురవృత్తాంతం
బున కాపైని వసిష్ఠునిఁ, గనుఁగొని యి ట్లనియెఁ గౌతుకం బొదవంగన్. 1801
సీ. మునివర బహుదూరమున నున్నయమపురం, బునకు నాకన్యలు పోవ రాఁగ
నెంతకాలము పట్టె నెంతకాలము వారి, యొడళులు చెడిపోవకుండ నిలిచె
నానతి మ్మనుడు ని ట్లనియె వసిష్ఠుండు, నరనాథ యొక్కమండలమువఱకుఁ
గృతయుగం బందును త్రేతాయుగంబులో, పలను బాదోనమండలముదాఁక
గీ. నర్ధమండల మయ్యెడునంతవఱకు, ద్వాపరంబునఁ గలియుగావసరమందుఁ

బాడమండల మగుదాఁక భద్రముగను, బ్రాణవిరహితమనుజదేహంబు లుండు. 1802
గీ. బుద్ధి యుండును గృతయుగంబునఁ జతుర్థ, ణంబు గాఁగను ద్రేతాయుగంబునందుఁ
ద్రిగుణముగ ద్వాపరంబున ద్విగుణముగను, నేకగుణముగఁ గలిని నృలోకమునకు.
సీ. ద్వాదశాహమునకుఁ దరువాత యమపురం, బునకుఁ బోదురు మర్త్యు లనెడిమాట
యగు నన్వయింపఁ బాపాత్ములవిషయంబు, నందుఁ బుణ్య మొనర్చినట్టివారు
కాయంబు నుడిగినక్షణమందె పోదురు, సౌమ్యమార్గంబున శమనపురికి
మాఘమాసస్నానమహిమంబుచేత నా, కన్యలు క్షణములో గాలివోలె
గీ. శమనపురి కేఁగి శమనప్రసాదమునను, నరకకోటులఁ దద్యాతనలను నెల్లఁ
గని మరల వచ్చి రొకమాసమునకు నంత, వఱకుఁ దద్దేహముల బంధువర్గ మోమె.
వ. ప్రేతశరీరంబులకు శవాలంకారంబు గావింపకమున్న స్పర్శదోషంబు లేదు. 1805
గీ. కృతయుగం బౌట నది తచ్ఛరీరములకు, వికృతి యేమాత్రమును సంభవింపదామె
నట్లె పుణ్యాత్ము లెందఱో యరిగి శమన, పురమునకు వచ్చు చుందురు మరల నిటకు.
క. అనుడు దిలీపుఁడు గురువర, మును పోయి కృతాంతలోకమునకుఁ మరలన్
జనుదెంచినవా రెవ రై, నను నింకను గలరె యున్న నాకుం జెపుమా. 1807
వ. అని యడుగుటయు వసిష్ఠుం డాతని కి ట్లనియె. 1808

—: పుష్కరబ్రాహ్మణవృత్తాంతకథనము :—

సీ. మున్ను నందిగ్రామమున నుండెఁ బుష్కరుం, డనియెడిపేర బ్రాహ్మణుఁ డొకండు
హరిభక్తినిరతుఁ డై యతఁడు మాఘస్నాన, ములు చేయుచును విధిపూర్వకముగఁ
గడపు చుండంగను గాలంబుఁ దన్నామ, మున నొప్పుమఱియొకభూసురుండు
చనిపోయె నొకదివసమున నాయూరనె, యంతటఁ గని యముం డాత్మభటులఁ
గీ. బుష్కరునిఁ దోడుకొని రండు పోయి శీఘ్ర, ముగను మీరు నందిగ్రామమునకు నాఁగ
వార లట కేఁగి తోడ్కొని వచ్చి విష్ణు, భక్తుఁ డగుపుష్కరుని నిలుపంగ నెదుట.
సీ. యముఁ డాతనిం గాంచి యాసనంబుననుండి, డిగ్గి దిగ్గున గుండె దిగ్గు రనఁగ
వందనం బొనరించి వానికిఁ బుణ్యాత్మ, సైఁపుము నాయపచారములను
నొకటి చెప్పంగ నే నొకటి చేసిరి ప్రమా, దమున నాభృత్యులు తప్పు జరిగెఁ
జనుము శీఘ్రముగ నీసదనంబునకు విష్ణు, పురి కేఁగఁ దగినభూసురుఁడ వీవు
గీ. నావుడుఁ గృతాంత నరకమానవులఁ జూచి, యేఁగెదను జూడఁగ ననుగ్రహింపు మనుచుఁ
బలుకుటయుఁ బుష్కరుఁడు పితృపతి తదీయ, కాంక్ష దీర్పంగ మది నెంచి గౌరవమున.
వ. కౌరవమహాకారవప్వాభోజనవిశసనతూలకర్దమాసిపత్రవనతప్తకుంభక్రిమిశక్రిమిభక్షవైత
రణీశరంభవాలుకలాలాభక్షసూకరరోధనతప్తవాలుకావీచిప్రముఖనరకపీడ్యమానులగు
పాపులం జూచుచుఁ బుష్కరుండు సర్వభూతదయాపరుం డగుటం జేసి తద్బాధలు
మాడంజాలక యంతరంగంబునఁ జింతిల్లుచు వారలం గాంచి. 1811

క. కలుషాత్మలార మీరలు, సలిపినపాపంబు లేవొ సంగ్రహరీతిన్
దెలుపుఁడు మిమ్ముల నెల్లన్, దిలకింపఁగ నాకు గుండె నీ రై పోయెన్. 1812
సీ. అని యడుగుటయు నాతనిదయావాక్యముల్, స్వామిపాదమును గొంత శాంతిపొడమ
నమ్మహాపాపు లి ట్లనిరి మహాత్మ మా, వంటినిర్భాగ్యు లెవ్వరును లేరు
సర్వభూతములకుఁ జలిపినారము హింస, హరియించినారము న్యాసములను
గూటసాక్ష్యములచేఁ గొంపలు గూల్చితి, మపకృతి నేసితి మాప్తులకును
గీ. బ్రొద్దు పొడవకపూర్వమె పెద్ద లెల్లఁ, జలుపు చుండంగ మాఘమాసంబునందు
స్నానములు వారలను జూచి యైనఁ జేయ, మైతి మొకనాఁడు గూడను నాప్లవంబు.
సీ. చలిపినారము ధనార్జననిమిత్తంబుగా, నధ్యయనమును నధ్యాపనమును
నన్నంబు లేక యల్లాడు చుండఁగ జనుల్, భుజియించినారము పొట్ట లగల
ధార్మికు లొసరించుదానంబులకును గా, వించినారము బహువిఘ్నములను
గోగ్రాస మొసఁగక గోక్షీరమును ద్రావి, పెరిఁగినారము చెట్లు పెరిఁగినట్లు
గీ. సలిపితిమి భోజనంబు స్నాతులము గాక, యపహరించితి మన్యదారార్థములను
జౌర్య మొనరించితిమి నిర్విశంకముగను, జేసితిమి బ్రహ్మహత్యలు చేతులార. 1814
సీ. దోషశూన్యులమీఁద దోషంబులను మోపి, నిందించినారము నిర్దయముగ
నిచ్ఛిద మని వచియించి బ్రాహ్మణులకు, నీయ మైతిమి లోభహేతువునను
బర్వంబులందును బడఁతులతోఁ గూడి, క్రీడించినారము క్రీడ యుడిగి
సంచరించితిమి స్వచ్ఛందంబుగను నంకు, శము లేనిమదసామజములభంగి
గీ. శీలవతు లైనసతులఁ ద్యజించి పణ్య, తరుణులకు నర్థ మంతయు ధారవోసి
ధర్మ మనుమాట యెఱుఁగక దారి దప్పి, నడిచి భ్రష్టుల మైతిమి కడకు మేము.
ఆ. స్వామి నీశరీరవాయువు సోఁకుట, వలన మాకు నరకవహ్నితాప
మాఱెఁ గొంత కావ నాపన్నులను నొక్క, క్షణము నిల్వు మిచటఁ జాలు నదియె.
క. అని వేఁడుటయును యముఁ డి, ట్లనియెను బుక్కరునిఁ జూచి యనఘాత్మ యిటన్
జన దీవు నిలువఁ ద్రుటియును, జనుము నిజావసథమునకుఁ జయ్యన నింకన్. 1817
గీ. అనుటయును బుక్కరుం డిట్టు లనియె దేవ, యార్తులను విడనాడి నే నరుగఁజాల
నాఁగు మించుకసేపు నాయందు నీకు, నున్నచోఁ గృప యన యముఁ డూరకుండె.
సీ. అంతటఁ బుక్కరుం డంతరంగంబును, బద్మనాభునియందుఁ బాదుకొల్పి
సరసిజనాభుండు సర్వగతుం డయ్యె, ననుమాట వాస్తవం బయ్యె నేని
సర్వంబు హరియందు సంప్రతిష్ఠిత మయ్యె, ననుమాట నిక్కవ మయ్యె నేని
సర్వాత్మునిఁగ నెంచి శార్ఙ్గిని నేఁ జేయు, నారాధనము సాధు వయ్యె నేని
గీ. ద్వారకావాస గోవింద వాసుదేవ, కేశవ జనార్దన ముకుంద కృష్ణ శౌరి
చక్రపాణి జగన్నాథ స్వామి కావు, మీమహాపాతకుల నెల్ల నీక్షణంబ. 1819

సీ. అని వచించుటయును నావిష్ణునామముల్, కర్ణగతంబులు గాఁగ నంత
విష్ణురూపములతో పిలపిల్లుచును విమా, నారూఢు లై యెల్ల నారకులును
నిలిచి వ్యోమమున నర్ణించి పుష్కరభక్తి, ఘనతను వైకుంఠమునకుఁ జనిరి
యపుడు కృతాంతుఁ డాయాశ్చర్యమును జూచి, పుష్కరమాహాత్మ్యమును నుతించి
గీ. యతనికిని దత్సుహృద్బాంధవాదులకును, దచ్చరిత్రంబును స్మరించుధన్యులకును
బాటిలకయుండ నపమృత్యుభయము వరము, నిచ్చి చనె నంతఁ బుష్కరుం డిలకు వచ్చె.

—: శంబూకవధవృత్తాంతకథనము :—

సీ. మఱియొకగాథ నీ కెఱిఁగించెద నయోధ్య, యందు రాముఁడు పూర్వ మధివసించి
నాల్గుపాదములతో నడపుచు ధర్మంబు, భూమండలంబును బ్రోచు చుండ
వృద్ధభూసురుఁ డొకఁ డేతెంచి తద్ద్వార, మునఁ బెట్టి నిజమృతపుత్రశవము
వత్స వచ్చెనె పంచవర్షంబులకె మృతి, యీవు చేసినపాప మేమి కలదు
గీ. నాయఘం బనుకొన్నను నాయెఱింగి, నంతలోన నసత్యంబు నాడనైతిఁ
జేయనైతిని హింస నేజీవి కేని, యెట్లు ప్రాప్తించె నీదుఃఖ మెఱుఁగనైతి. 1821
ఆ. ఎఱుఁగ కేమి రాజకృతదోషమున నిట్టి, యాపదలు తటస్థ మగును బ్రజకు
నేను గూడఁ జత్తు నిటనె చిరాయువై, బ్రదుకుఁగాక రామభద్రుఁ డిలను. 1822
క. అని పలికి పుత్రశోకం, బున నేడ్చుచు నుండ దుఃఖమూలం బెల్లన్
విని రాముఁ డాత్మదోషం, బును దెలిసికొనంగలేమిఁ బొగులుచు నెదలోన్. 1823
క. నాపూర్వికు లెల్లను క్ష్మో, ణీపాలనమునఁ బ్రతిష్ఠ నెలకొల్పినటుల్
చూపట్టెడి నే నొకఁడనె, పాపాత్ముఁడఁ బుట్టి కీడుపఱిచితిఁ గులమున్. 1824
క. ఆహుతి యొనరింతునొ యీ, దేహము ననలంబులోన దిగ్గున శైలా
రోహణము సేసి పడుదునొ, దేహత్యాగంబు గాఁగఁ దెగువరి నగుచున్. 1825
వ. అని బహువిధంబుల నాత్మగర్హణంబు గావించికొని యించుక యాలోచించి మార్కండేయమౌద్గల్యవామదేవకశ్యపకాత్యాయనజాబాలిగౌతమనారదులనునన్నును రావించి నమస్కరించి యుచితాసనంబులందుఁ గూర్చుండంబెట్టి యీయుగంబున బ్రాహ్మణపుత్రుం డకాలమరణంబు నొందఁ గారణం బే మని ప్రశ్నించుటయు నస్మదభ్యనుజ్ఞాతుండై నారదుం డిట్లనియె. 1826
సీ. ఇనకులాంబుధిచంద్ర వినుము పూర్వము కృత, యుగమున బ్రాహ్మణుం డొకఁడె తపము
గావించు చుండె నాకతమున నప్పుడు, మృత్యువు లేదయ్యె నెవ్వరికిని
త్రేతాయుగంబు ప్రాప్తింపఁగఁ దొడఁగెను, క్షత్త్రియుండును దపఃకార్యమునకు
దాన నిప్పుడు యుక్తమైనమృత్యువు గల్గి, చరియించు చుండిరి సకలజనులు
గీ. ప్రాప్త మగునెడ నింక ద్వాపరయుగంబు, సలుపు వైశ్యుండును దపంబు సకలజనులు
దానివలన యుక్తాయుక్తమైనమృతిని, గాంచుచుఁ జరించు చుందు, రకాలమందు,

క. కలియుగమున శూద్రుండును, జలుపుఁ దపము దాన నపుడు జనముల కెల్లన్
గలుగు నకాలప్రళయం, బులు దుర్మరణములు గలహములు దుఃఖములున్. 1828
గీ. దశరథాత్మజ యుగవిరుద్ధముగ నిపుడు, త్వద్ధరాచక్రమున ఘోరతపము నొక్క-
యవరవర్ణుఁ డొనర్చు చున్నందువలనఁ, దండ్రి యుండఁగఁ బుత్రుఁ డత్యయము నొందె.
గీ. భూమిపతి యుండ నెవఁడు తత్పురమునందుఁ, గాని తద్దేశమునఁ గాని కానికార్య
మాచరించునొ దుర్గతి నందు వాఁడు, ప్రభువు తత్పాతకచతుర్థభాగ మొందు. 1830
క. కావున నధర్మనాశము, గావింపుము నీకుఁ బాతకము లేకుండున్
జీవించు విప్రతనయుఁడు, దేవతలకు నెల్ల దానఁ దృప్తి ఘటిల్లున్. 1831
సీ. అనవుడు రాముఁ డత్యాశ్చర్య మొందినవాడై, లద్రోణియందు బాలకునిశవము
పెట్టించి కావలిపెట్టి లక్ష్మణునిఁ ద, త్సంరక్షణము సేయఁ దత్క్షణంబ
కార్ముకతూణమార్గణఖడ్గములు గొని, కామగం బగుపుష్పకంబు నెక్కి-
ప్రస్థాన మొనరించి పశ్చిమోత్తరపూర్వ, దిగ్దేశముల నెల్లఁ దిరిగి వెదకి
గీ. యందు లేకుంట నొకఁడును నవగుణుండు, పోయి దక్షిణదిగ్దేశమునకు వింధ్య
శైలదక్షిణపార్శ్వదేశమున నొక్క-, హ్రదము నీక్షించి యట నొక్క-యతిని గాంచి.
గీ. పుష్పకమునుండి దిగి వానిపొంత కరిగి, చూచి తల్లక్షణములను శుద్ధుఁడుగను
గనఁబడమి నిట్లనియెఁ బారికాంక్షి నేను, రాముఁడ నశేషవిశ్వంభరాధవుండ.
క. నీ వేవర్ణమువాఁడవొ, కావింపఁగ నిట్లు తపము కత మేమియొ నా
కావిర్భవించె వినఁగను, భావంబునఁ గోర్కి- తెలియఁబలుకుము బుతమున్. 1834
సీ. అనవుడు నాతఁ డిట్లనియె మహారాజ, ప్రాప్తించుఁగాక భద్రంబు నీకుఁ
బిత వీవు మా కెల్ల క్షితిపతి వగుటఁ బు, త్రకులము నీ కేము ప్రజల మగుట
స్వర్గంబుఁ గోరి నేఁ జలుపు చుంటిఁ దపంబు, దీనిచే సిద్ధి నొందెదవు నీవు
వేవిరాజ్యమునఁ గావింతురొ తాపసుల్, తపమును సుకృతి యాధరణిభర్త
గీ. శూద్రజాతిని బొడమితిఁ జూవె నైనఁ, గర్మమున బ్రాహ్మణత్వంబు గలిగె నాకుఁ
బేరు శంబూకుఁ డనవుడుఁ బెటికి కత్తి, రాముఁ డొరనుండి వానిశిరంబు నఱికె.
గీ. అంతటను మ్రోఁగె దుందుభు లాకసమునఁ, గురిసె రామునిమీఁదను గుసుమవృష్టి
యమరబృందంబుతో నింద్రుఁ డరుగుదెంచి, యచ్చటికి రామభద్రుని నభినుతించి.
క. ఇనకులవర్ధన యియ్యది, యనిమిషకార్యంబు నీకటాక్షముచే నేఁ
డొనరింపఁబడియె జగముల, కొనగూడె శుభంబు కోరు మొసఁగెద వరమున్. 1837
వ. అని నుడువుటయు రామభద్రుండు బద్ధాంజలి యై నిలువంబడి. 1838
క. అనిమిషవల్లభ నాపయి, ననుగ్రహము గల్గె నేని యమరుల కెల్లన్
నిను నేఁ గోరెద బ్రాహ్మణ, తనయుఁడు జీవింప వరముఁ దదితర మొల్లన్. 1839
క. అనవుడు రామునిఁ గని సుర, లనఘా శంబూకహనన మైనముహూర్తం
బునయందె బ్రదికె బ్రాహ్మణ, తనయుఁడు త్వత్కృతగరిష్ఠకర్మమువలనన్. 1840

క. అని చెప్పి యదృశ్యత్వం, బును గాంచఁగ రాఘవుండు భూరిప్రమదం
బున మరల నయోధ్యాపుర, మునకుం జనుదెంచి కాంచి భూసురసుతునిన్. 1841

చ. ముదమునఁ జెందు చుండఁగ సమందముదంబును విప్రసూనుఁ డా
తనికడ కేఁగుదెంచి నృపతల్లజ యంతకలోకభాగ్యమున్
గని చనుదేరఁగల్గితిని గ్రమ్మఱఁ దావకధర్మపాలనం
బున నని పల్కి నందఱము పొందితి మంతము లేనిహర్షమున్. 1842

—: సాందీపనివృత్తాంతకథనము :—

సీ. మఱియొకగాథ నీ కెఱిఁగించెదను విను, మీవిషయముననె భూవరేణ్య
యవని నుండె నవంతి యనుపురం బొకఁడు యో, జనమితాయామవిస్తారయుతము
దానిలోఁ గలరు వేదజ్ఞులు శాస్త్రజ్ఞు, లఖిలపురాణజ్ఞు లవనిసురులు
వారిలోఁ గలఁ డొకవసుధామరుండు సాం, దీపని యనునామధేయమునను

గీ. నాతఁడు సమస్తవేదరహస్యవిదుఁడు, సత్యవాది దయాశాలి సాత్త్వికుండు
విష్ణుపూజారతుండు వివేకధనుఁడు, వాని కొక్కసుతుం డుండె వరగుణుండు. 1843

గీ. ఆకుమారుఁడు వేదవేదాంగవిద్య, లన్నియును నభ్యసించి బాల్యంబునంద
మతిమదగ్రణి యనెడికీరితి గడించి, హర్షవారాశిఁ బితల నోలార్పఁ దొడఁగె. 1844

ఆ. అట్లు గొంతకాల మరుగంగ నొకమాఘ, మాసమందుఁ బూర్ణిమాదినంబు
నందు సఖులతోడ సాందీపనిసుతుండు, చని ప్రభాసతీర్థమునకు వేగ. 1845

క. వనజాక్ష కృష్ణ యచ్యుత, మునుఁగుచు నుంటిని ప్రభాసమున మాఘమునన్
గనికరముతోడ భవవా, ర్ధినిఁ బడిపోకుండ నుద్ధరింపుము నన్నున్. 1846

క. అని వేఁడి ప్రభాసంబున, మునిఁగి మరలఁ బైకి రామి మును తనతోడన్
జనుదెంచినసఖు లెల్లరుఁ, జని తెలిపిరి దుఃఖవార్త సాందీపనికిన్. 1847

వ. అంతట సాందీపని తనపుత్రుండు ప్రభాసతీర్థస్నానకాలంబునం గావించినకృష్ణప్రార్థనంబు స్మరించుకొని కృష్ణానుగ్రహంబున స్వసూనునకు క్షేమంబు గలుగు నని నిశ్చయించికొని ధైర్యంబు వహియించి పుత్రమరణవార్తాశ్రవణంబున విలపించు చున్నస్వపత్నికి ధైర్యంబు బోధించి దుఃఖవిముక్తం జేసి బ్రహ్మానుసంధాననిష్ఠాగరిష్ఠుం డై సుఖం బుండె. అప్పుడు గోకులంబుననుండి నందుండు రామకృష్ణులను జగత్ప్రసిద్ధుం డగు సాందీపనియొద్దకుఁ జదువం బనిచె. 1848

ఆ. అపుడు రామకృష్ణు లరిగి సాందీపని, సవిధమునకు వేదశాస్త్రములను
నభ్యసించి పూర్వ మభ్యసించిరో నాఁగ, నల్పకాలముననె యద్భుతముగ. 1849

గీ. తుష్టిపడ దేశికుఁడు చతుష్షష్టికళలఁ, దెలిసికొనిరి చతుష్షష్టిదివసములకుఁ
బ్రకటితము గాఁగ నిజదేవభావ మిలను, గలసమస్తమనుష్యసంఘాతమునకు. 1850

గీ. అట్లు గ్రహియించి సకలవిద్యలను రామ, కృష్ణులాచార్య నీకు దక్షిణ యొసంగ
నెంచినారము కోరు మేదేని యనుడు, నతఁడు తచ్ఛక్తివిజ్ఞాత యగుటఁ జేసి. 1851

క. మరణించిననిజపుత్రుని, గురుదక్షిణ గాఁగ నొసఁగఁ గోరుటయును వా
రిరువురును నపాంపతికడ, కరిగి ధనువు లెక్కునెట్ట నాసమయమునన్. 1852

సీ. వరుణుఁడు దిగ్గున వచ్చి ప్రత్యక్షమై, నిలఁబడి రామకృష్ణులకు నెదుట
మహనీయులార యుష్మద్గురుపుత్రుని, శంఖాసురుఁడు మ్రింగి జలధిలోనఁ
జరియించుచున్నాఁడు చంపి వానిఁ దదీయ, కుక్షి చీల్చిన వచ్చు గురుసుతుండు
నావుడుఁ గృష్ణుఁ డర్ణవములోఁ జొచ్చి త, త్క్షణమంద శంఖుని సంహరించి

గీ. చీల్చి తత్కుక్షి నందు దేశికసుతుండు, కనఁబడక యొక్క శంఖంబు గానఁబడుట
దానిఁ గొని వచ్చి శంఖనాదం బొనర్చి, యమునికడ కేఁగె భాతృసహాయముగను.

గీ. అప్పుడు యముండు వారల కర్హ్వముగను, బూజ గావించి తద్భావమును గ్రహించి
యాత్మకృతపుణ్యభోగంబు లనుభవించు, చున్నసాందీపనితనూజు నొప్పగించె. 1854

గీ. అంతటను రామకృష్ణు లత్యద్భుతముగ, గురుకుమారునిఁ గొనివచ్చి గురున కొసఁగి
శ్లాఘ్యతను గాంచిరి సమస్తజగములందు, నిట్టిప్రాక్తనగాథ లెన్నేని కలవు. 1855

చ. అనుడు దిలీపుఁ డెంతయును నచ్చెరియంబును జెంది మానసం
బున గురువర్య చెప్పితివి పూర్వచరిత్రము లద్భుతంబుగన్
విని ముదితుండనైతిఁ గరుణించి యిఁకన్ మృగశృంగమానిగా
థను వచియింపు ముల్లమునఁ దచ్ఛ్రవణస్పృహ పల్లవించెడిన్. 1856

వ. అని యడుగుటయు దిలీపునకు వసిష్ఠుం డి ట్లనియె. 1857

—: మృగశృంగవివాహకథాకథనము :—

సీ. అంతటసంతోష మామతిల్లనుచథ్యుఁ, డాహ్వాన మొనరించి యఖిలమునులఁ
దత్సమక్షంబునఁ దనపుత్రి యగుసువృ, త్తను గుత్సమానినందనున కొసఁగ
సంసిద్ధుఁడై యుండుసమయంబునందుఁ ద, త్తనయామణీసఖీత్రయము వచ్చి
భావించితిమి నిన్నె భర్తఁగ మృగశృంగ, మముఁ గొమ్ము నీకు క్షేమంబు గలుగు

గీ. నట్లు గాకున్న విడుతుము ప్రాణములను, ననుడుఁ గుత్సాత్మజుఁడు సంశయంబు నొందు
చుండఁ దద్భావ మెఱిఁగి వ్యాసుండు నత్స, కన్యకల నెల్లఁ గొను మేకకాలమంద.

సీ. దోషంబు లే దిందుఁ దొల్లి సౌభరిముని, గ్రహియించె నిజకళత్రములు గాఁగ
మాంధాతృభూపకుమారికామణులను, నేఁబదిమందిని నేకవేళ
గ్రహియించె నట్లె దక్షప్రజాపతితనూ, జలను బల్వురను నిశాకరుండు
నావుడు వత్సుఁ డానల్వురుకన్నెలఁ, బ్రీతితో నప్పుడె పెండ్లియాడె

గీ. ననవుడు దిలీపుఁడు తపోధనాగ్రగణ్య, యేల సౌభరి మాంధాతృబాలికలను
బరిణయంబయ్యెఁ జెప్పు మాచరిత మెల్ల, ననుడు ని ట్లనియె వసిష్ఠుఁ డతనిఁ గాంచి.

—: సౌభరివృత్తాంతకథనము :—

సీ. పూర్వము కాంపిల్యపురమున సౌభరి, యనువిప్రుఁ డొకఁ డుండె నఖిలవిదుఁడు
సల్పి యాతం డాదిఁ జాంద్రాయణముల నా, వలఁ జేసి మాసోపవాసములను
నవలఁ బర్ణాశనుఁ డై పిమ్మటను నిర, శనముగా మాఘమాసంబులందు
జలములోపల నుండి సలుపు చుండఁగ ఘోర, తపముఁ దత్సలిలమధ్యంబునందు
గీ. సామమద మనునొక్కమత్స్యము స్వకీయ, పుత్రపౌత్రప్రపౌత్రకళత్రమిత్ర
బంధుపరివేష్టితం బయి ప్రభువువోలె, సంచరింపఁగ సాగె స్వచ్ఛందముగను. 1860
సీ. అపుడు సౌభరి చూచి యామత్స్యమును వాంఛ, వొడమంగ సంసారమునను దనకు
సలిలనిర్గతుఁ డయి సత్వరంబుగ నేఁగి, మాంధాతృనృపతిసమక్షమునకుఁ
దత్పూజితుం డయి ధరణీంద్ర సంసార, వాంఛచే నిటకు నే వచ్చినాఁడ
నీకన్యకలలోన నా కొక్కకన్యక, నిమ్ము చేకూరు భద్రమ్ము నీకు
గీ. ననుడు విభుఁడు జరాజీర్ణాంగుఁ డైన, మునికిఁ దారుణ్యసౌందర్యములకు నిలయ
మైనతనపుత్రి నీయలే కతఁడు శాప, మిచ్చు నని జంకి మెలమెల్ల నిట్టు లనియె.
సీ. శమధన క్షత్రియసంప్రదాయము దాఁటఁ, జన దందు రార్యులు క్షత్రియునకుఁ
గావునఁ గన్యక కాంచి వరించిన, వరున కాయమ నీయవలయు మేము
కులధర్మములు మీరు నిలుపంగవలసిన, విజ్ఞాత లగుటచే వినిచినాఁడ
నని యూరకుంటయు నమ్మునీంద్రుఁడు రాజ, నీవు పల్కినపల్కు నిక్కువంబ
గీ. కానిపింపుము నన్ను నీకన్నియలకు, వారిలో నెవ్వరును గూడఁ గోరకున్న
వదలుకొని పిచ్చియాసను వాస్తవముగ, నరిగెద మదాశ్రమంబున కపుడె నేను.
సీ. అనవుడు జేఁ డట్లె యొనరింతు నని వర్ష, వరుని రావించి సత్వరను గాఁగఁ
గంచుకి నాపుత్రికలకడ కీపారి, కాంక్షఁ దోడ్కొనిపోయి కన్యలార
యెవతె వరించునో యితని మీలో నామె, నితనికి మీతండ్రి యిచ్చు ననుము
నావుడుఁ గంచుకి దేవరయాన నోఁ, దలఁ దాల్చి యాతపోధనునితోడఁ
గీ. బ్రభుకుమారిక లుండినభవనమునకు, నరిగి వారికిఁ దెలిపె నృపాజ్ఞ నంత
వారలకుఁ గానఁబడియె నవ్వారికాంక్షి, కామశతకోటిసుందరాకారమునను. 1863
ఆ. అపుడు వార లెల్ల నాతపస్విని గాంచి, మోహవివశ లగుచు దేహములను
విస్మరించి వాని వేష్టించి రాతని, భర్తగను గ్రహించుభావమునను. 1864
సీ. అది విని మాంధాత యాశ్చర్యమును బొంది, యంతరంగమునఁ గన్యకల నెల్ల
నమ్మునీంద్రున కిచ్చె నంత నేఁబదిమంది, మాంధాతృకన్యల మౌనివరుఁడు
గ్రహియించి పత్నులు గా యథావిధి నిజా, శ్రమమున కేఁగి యాసతులతోడ
రావించి విశ్వకర్మను దపోబలమునఁ, గట్టించి నిరుపమాగారములను
గీ. ననిచి యొక్కొక్కయింట నొక్కొక్కసతిని, నఖిలభోగంబులను నోలలార్చు చుండ
ననుభవించుచు సకలసౌఖ్యముల నమర, రామ లన నొప్పు చుండి రారాజసుతలు.

సీ. అట్లు లుండ నొక్కనాఁ డాత్మలో నుదయింపఁ, దనకుమారికలను గనెడివేడ్క
చనుదెంచి మాంధాత సౌభరిసాశ్రమం, బునకుఁ దద్వైభవంబునకు నెదను
విస్మయం బొదవంగ వీక్షించి వీక్షించి, యపరిమితం బైనహర్ష మొంది
తనపెద్దకూఁతు రుండినసౌధమున కేఁగ, నామె తండ్రికి మ్రొక్కె నాదరమున
గీ. నపుడు మాంధాత పుత్రి ని ట్లడిగెఁ దల్లి, నిన్ను నీభర్త ప్రేమించు చున్నవాఁడె
కలరె పరిచారికలు సేవ సలుప నీకుఁ, గలదె నీమానసమున నెక్కుడ సుఖంబు. 1866
వ. అని యడుగుటయు నామె మాంధాత కి ట్లనియె. 1867
సీ. జనక నా కిచట నెందును లేదు లోపంబు, నవరత్నగుంఫితభవనములును
దివ్యవస్త్రములును దివ్యభూషణములు, మేర మీఱనిపరిచారికలును
షడ్రసోపేతభోజనమును మృదులశ, య్యాతలంబులు మహోద్యానములును
నత్యద్భుతము లైనయానంబులును సర్వ, సౌఖ్యప్రదము లైనసంపదలును
గీ. గలిగియున్నవి గాని నాకాంతుఁ డెపుడు, మామకీనసహోదరీమణుల నెల్ల
ననిశమును నాకడనె యుండు ననెడిచింత, మాత్ర మొక్కటి కలదు నామానసమున.
గీ. అనుచు డోలాయితము గాఁగ నంతరంగ, మపుడె మాంధాత తనద్వితీయాత్మజాత
గృహమునకుఁ బోయి జ్యేష్ఠపుత్రికనుబోలె, నామె నడిగిన జనకున కామె మ్రొక్కి.
గీ. తనకు నెందును లోటు లే దనియు నాత్మ, వల్లభుఁడు తనసహజల వదలి సతముఁ
దనకడనె యుండు ననువిషాదం బొకండు, మాత్ర మెద నున్న దనియును మనవిచేసె.
సీ. అంతట మాంధాత యాశ్చర్యమును జెంది, యెదలోన నాపుత్రియిల్లు విడిచి
మిగిలినకూఁతులమేడల కన్నింటికి, నేఁగి పోయి యాత్మనందనలఁ జూచి
వెనుకఁ దా నడిగినవిధమున నడుగ వా, రలు చెప్పినట్లె వీరలును జెప్ప
నపరిమితం బైనయానంద ముదయింప, సౌభరి యున్నకుంజమున కరిగి
గీ. బహువిధంబుల నాతనిమహిమఁ బొగడి, తనకుఁ గల్గినధన్యతఁ దలఁచికొనుచుఁ
దనపురంబున కరిగె నంతటను గొంత, కాలమున కామహారాజకన్య లెల్ల. 1871
ఆ. కనిరి ముగురుముగురుతనయులఁ బ్రత్యేక, ముగఁ దనూనపాత్సముజ్జ్వలులను
సౌభరిప్రభావసహితుల వారికిఁ, గలిగి రాత్మజులును గన్యకలును. 1872
క. వారలకుం బ్రభవించి ర, పారముగను సుతులు సుతలుఁ బ్రభవించిరి వి
స్తారముగ సుతులు సుతలును, వారలకును నేమి చెప్ప వారలవృద్ధిన్. 1873
వ. అట్లు సౌభరి ద్వాదశవర్షమాఘస్నానసలిలమధ్యతపఃఫలంబుగాఁ బుత్రపౌత్రదౌహి
త్రాదిబహుసంతానపరివేష్టితుం డై చిరకాల మిహసుఖంబుల నెల్ల ననుభవించి
తుదకు సకలపత్నీసమేతంబుగా నక్షయం బైనపరమపదమున్ బడసె. 1874
క. ఈసౌభర్యాఖ్యానము, నాసక్తిని వినిన జనుల కాకర్ణింపం
జేసినను వంశవృద్ధియు, వాసియు నుత్తమపదంబు వారల కొదవున్. 1875

వ. ఇట్లు మృగశృంగుండు భార్యాచతుష్టయంబుం బెండ్లాడి పతివ్రతామణు లగువారల తోడం గూడి ధర్మయుక్తంబుగ గార్హస్థ్యంబు నిర్వహించుచుఁ గొంతకాలంబునకు సువృత్తయందు సకలసుగుణగణసమేతుం డగునొక్కకుమారునిం గని తాను త్రికాలజ్ఞుం డగుటంజేసి భవిష్యత్కాలంబున మృగంబులు కండూతి వాయఁ దపోనిష్ఠాగరిష్ఠుం డగునాతనిదేహంబును దమదేహంబులతో రాచికొను ననెడియర్థంబు సూచితంబు గా నాపుత్రునకు మృకండుఁ డనునామకరణంబు గావించి క్రమంబుగా నుపనయనంబు చేసి సాంగంబుగాఁ జతుర్వేదంబులం జెప్పి గృహస్థాశ్రమంబున కభ్యనుజ్ఞ యొసంగ మృకండుండు ముద్గలకుమారిక యగుమరుద్వతినిఁ బెండ్లాడె. పిదపఁ గ్రమంబుగాఁ గమలయు విమలయు సురసయు నొక్కొక్కపుత్రునిం గాంచిరి. మృగశృంగుండు కమలాపుత్రునకు నుత్తముఁ డనియును విమలాతనూభవునకు సుమతి యనియును సురసాసూనునకు సువ్రతుం డనియును నన్వర్థనామంబులం బెట్టి సకలవిద్యలం జెప్పి గృహస్థాశ్రమంబున కభ్యనుజ్ఞ యొసంగ నుత్తముఁడు కణ్వపుత్రి యగుకుశను సుమతి సుమతితనూజ యగుసత్యను సువ్రతుండు పృథుపుత్రిక యగు ప్రియంవదను ధర్మపత్నులు గా గ్రహించి వారలయందు వేదపారగు లగుబహుపుత్రులం గాంచిరి. 1876

సీ. అంతట మృగశృంగుఁ డాత్మసతీతనూ, జస్నుషాపౌత్రాదిసహితుఁ డగుచు
సతతంబు మాఘమాసములం దుషఃకాల, మునను చేయుచు స్నానములను భక్తి
ననుభవించి సుఖంబు లన్నియు గార్హస్థ్య, మున విరక్తి జనింపఁ గొనను మదికిఁ
దనకుటుంబభరంబు నునిచి పుత్రులయందుఁ, బోయి తపోవనంబునకు నచట

గీ. సర్వభూతంబులను నాత్మసామ్యమునను, గాంచుచు మృగవ్రజంబుతోఁ గలిసి నిర్భ
యంబుగఁ జరించుచును శాంతి యావహిల్లఁ, గడపె నొకకొంతకాలంబు గౌతుకమున.

క. తనువుఁ దొఱంగెడికాలము, చనుదేరఁగ నశ్రమముగ స్వశరీరము న
ల్లన విడిచి బ్రహ్మపదముం, గని ప్రళయమువఱకు సుఖముగా నుండి యటన్. 1878

గీ. ప్రళయకాలావసానంబు ప్రాప్త మగుడు, రసను జనియించి శ్వేతవరాహకల్ప
మందు నజపుత్రుఁడుగ ఋభు వనెడిపేర, నుద్ధరించి నిదాఘుని నొందె ముక్తి. 1879

—: మృకండువృత్తాంతకథనము :—

వ. అంతట మృకండుండు తన కనపత్యత సంభవించినందులకుఁ జింతిల్లుచు మాతృభార్యాసమేతుం డై తద్దేశభూపాలుం డగురాష్ట్రవివర్ధనుండు సైన్యంబుతోడఁ బ్రసిద్ధుండు గా నాతనిసాహాయ్యంబున విశ్వేశ్వరరాజధాని యగుకాశీపురంబునకుం జేరి గంగాస్నానాదికార్యంబులు యథావిధిని నిర్వర్తించి డుంఢివిఘ్నేశ్వరపురోదేశంబునఁ దనపేర లింగంబు ప్రతిష్ఠాపించె. పిదపఁ దల్లింగపురోభాగంబున సువృత్త సువృత్తేశ్వరలింగంబును దత్ప్రాగ్భాగంబునఁ గమల కమలేశ్వరలింగంబును విమల దేహాళీవిఘ్నరాజసన్నిధియందు విమలేశ్వరలింగంబును సురస తదీశానదిగ్భాగంబున సురసేశ్వరలింగం

బును మరుద్వతి మణికర్ణికాపశ్చిమభాగంబున మరుద్వతీశ్వరలింగంబును బ్రతిష్ఠాపించిరి. మృకండేశ్వరసందర్శనంబున సర్వకార్యసిద్ధియును గాశీవాసంబును సువృత్తేశ్వరదర్శనంబున సద్వృత్తియును నిర్విఘ్నతయును గమలేశ్వరదర్శనంబున సర్వకామసిద్ధియును విమలేశ్వరదర్శనంబున విమలజ్ఞానప్రాప్తియును సురసేశ్వరదర్శనంబున సురసామ్రాజ్యలాభంబును గాశీమరణంబును మరుద్వతీశ్వరదర్శనంబునఁ బునర్జన్మరాహిత్యంబునుం గలుగు. 1880

గీ. అట్లు వారాణసీక్షేత్రమందు వార, లందఱును లింగములను నిజాహ్వాయముల
నిలిపి యుండిరి కాశిలోపలనె యొక్క, హాయనము చేయుచుఁ దదీయయాత్ర లెల్ల.

సీ. అంతట నొకదినమందు మృకండుమా, తలు నల్వురును వృద్ధదశను నుంటఁ
గాంచి మణికర్ణికాతీర్థమందు నమా, ధ్యాహ్నికస్నానంబు నల్లనల్ల
నరిగి శ్రీవిశ్వేశ్వరాలయంబునకు నొ, నర్చుచును బ్రదక్షిణముల నచట
శక్తి చాలమిని లోచనములు దిరుగంగఁ, బడి శిలపైని విభ్రమముతోడ

గీ. నంత విశ్వేశ్వరుండు స్వహస్తములను, బట్టికొని వారిమూర్ధముల్ ప్రణవమంత్ర
మును జపింపంగ దత్కర్ణములను వారు, తనువులను వీడి కైలాసమునకుఁ జనిరి.

సీ. అప్పుడు మృకండుమహర్షి మాతల కెల్ల, నౌర్ధ్వదైహికకర్మ మాచరించి
తనభార్య యగుమరుద్వతితోడ నివసించి, యాక్షేత్రమునయందె యనుదినంబు
గంగలో స్నానంబు గావించుచును విశ్వ, నాథుని సేవ యొనర్చు చుండ
నతనిభక్తికి మెచ్చి యాత్మలో నొకనాఁడు, విశ్వేశ్వరుం డామునీశ్వరునకు

గీ. దర్శనం బిచ్చి వాంఛితార్థంబు కోరు, మిచ్చెదను నాఁగ నతఁడు మహేశ్వరునకు
బ్రొక్కి సాష్టాంగముగ శర్వ యొక్కసుతుని, నా కొసంగు మపుత్రతాశోక ముడుగ.

వ. అని వేఁడుటయు మృకండునకు సర్వజ్ఞుం డి ట్లనియె. 1884

సీ. గుణవంతుఁ డై నట్టికొడుకు గావలె నన్న, బ్రదుకు షోడశవత్సరములు వాఁడు
చిరకాలజీవి యజ్ఞానిశువు గావలె నన్న, నగువాఁడు గుణహీనుఁ డై నవాఁడు
వీరిలో నెవ్వనిఁ గోరుకొందువొ నీవు, కోరుకొ మ్మతనిఁ జేకూర్తు నీకు
నావుడు నమ్ముని భావంబులోఁ గొంత, కలఁక గల్గఁగ దానిఁ దొలఁగఁ ద్రోచి

గీ. స్వామి యల్పాయు వైనను సగుణుఁ డైన, యాత్మజుని నిమ్ము నిర్గుణుఁ డైనసుతుఁడు
కల్పకోటులు జీవించుఁగాక వాఁడు, కాఁడు పితృమాతృసంతోషకారకుండు. 1885

ఆ. అనుడు విశ్వనాథుఁ డామృకండునకుఁ గో, రినవరంబు నిడి యదృశ్యుఁ డయ్యె
నంత లబ్ధవాంఛితార్థుఁ డై సతితోడ, శమధనుండు స్వాశ్రమమును జేరె. 1886

## —: మార్కండేయవృత్తాంతకథనము :—

ఆ. అంతఁ గొంతకాల మరుగ మరుద్వతి, గర్భమును ధరించి కాలమిగులు
స్తుతి యొనర్పఁ దగినసుముహూర్తమునఁ గాంచె, సుగుణభరితుఁ డైనసుతుని నొకని.

గీ. కుసుమవర్షంబు గురిసె నాకసమునుండి, నభమునను మ్రోఁగె దేవదుందుభులు దెసలు
నమరుచుఁ బ్రసాదమును జెందె నుదయతరణి, కరణి నావిర్భవింప మృకండుసూతి.

సీ. అప్పుడా వ్యాసమహర్షి యరుదెంచి యచ్చటికి, కాత్మీయశిష్యసమన్వితముగ
జయజయనాదంబులు సలుపుచుండఁగ నిమ్మా, నాహూతులై దివి నమరు లెల్ల
జాతకర్మంబును జలిపి మార్కండేయుఁ, డను పేరు వెట్టి యన్వర్థముగను
జనియె నిజాశ్రమంబునకు మృకండుకృ, తాదరంబున మహాహ్లాద మొదవ

గీ. నవలఁ గడవంగఁ గొంత బాల్యంబు పంచ, మాబ్దమందు మృకండుఁ డాయర్భకునకుఁ
జేసి యుపనయనంబును జెప్పె సాంగ, ముగఁ బదక్రమయుతవేదములను నెల్ల. 1889

క. అంతట మార్కండేయుఁడు, వింత జనింపంగ నఖిలవిప్రులకును జ
న్మాంతరసంచితవిద్యా, సంతతులంబోలె నేర్చె సకలాగమముల్. 1890

వ. అప్పటికి మార్కండేయునకుఁ బంచదశాబ్దంబులు గడచి షోడశాబ్దంబు ప్రాప్తించె.

సీ. అపుడాత్మజునిఁ జూచి యాత్మలో నిముడక, శోకప్రవాహంబు పైకిఁ బొంగ
నాఁపికొనంగ శక్యము గామిని మృకండు, తాపసోత్తముఁడును దత్సతియును
విలపింపఁ దొడఁగిరి వీక్షించి తద్విషా, దమును మార్కండేయశమధనుండు
తండ్రి మీరలు విషాదము నొందఁ గత మేమొ, వినిపింపు మని వేఁడ వినయమునను

గీ. జెప్పలేక మృకండుఁడు చెడ్డమాట, కొంతవడి కాత్మలోపలఁ జింత నొంది
కడకుఁ జెప్పక తప్పనికతనఁ జెప్పె, విజ్ఞుఁ డగుటను జరిగినవిషయ మెల్ల. 1892

క. అది విని మార్కండేయుం, డెదలోఁ గలుగమి నధైర్య మించుక యేనిన్
వదనంబున లేనగవ, భ్యుదితము గా నిట్టు లనియె నుత్సాహమునన్. 1893

చ. వలదు భయంబు దండ్రి శ్రితవత్సలుఁ డై నలలాటనేత్రునిన్
గొలిచి జయించి మృత్యువును గొందు నమర్త్యత నాఁగ నాత్మలోఁ
గలుగఁ బ్రమోద మెంతయు మృకండుఁడు వానిని గ్రుచ్చి కౌఁగిటన్
జలుపుము వత్స యట్టులె యొసంగు మహేశుఁడు నీకు భద్రముల్. 1894

సీ. కాలపాశంబుచేఁ గట్టఁగాఁ బడియున్న, శ్వేతకేతువును రక్షించినాఁడు
ప్రళయాగ్నివలెఁ బ్రజ్వరిలుకాలకూటంబుఁ, గ్రోలి ముజ్జగములఁ బ్రోచినాఁడు
ఘట్టించి యరకాలఁ దన్ని మిత్తిని శిలా, దునితనూజాతుని మనిచినాఁడు
బాలకారకుఁ డై నజాలంధరుని నుక్కు, డంచి దేవతలఁ బాలించినాఁడు

గీ. త్రిపురదైత్యుల భస్మీకరించి విష్ణు, బాణమున సాధువులను గాపాడినాఁడు
దర్పితాంధకగర్వవిధ్వంసకుండు, శిక్షితమనోభవుం డిందుశేఖరుండు. 1895

క. కావున శరణాగతర, క్షావిధినిర్వహణదీక్షుఁ డై కొనినమహా
దేవుఁడె శరణము నీ కిఁక, నావుడుఁ బితృమాతృచరణనళినంబులకున్. 1896

వ. మార్కండేయుండు సాష్టాంగనమనంబు గావించి తదనుజ్ఞం బడసి దక్షిణార్ణవకూలం,

బునందుఁ దనపేర లింగంబుఁ బ్రతిష్ఠాపించి యచ్చట మాఘస్నానంబు గావించి యమ్మార్కండేయలింగంబునకుఁ ద్రికాలపూజ చేసి పూజావసానంబున నానందపులకాంకితగాత్రుం డై నాట్యం బొనర్చి శివస్తోత్రంబు గావించుచుండఁ దదాయుష్యావసానకాలంబు ప్రాప్తించుటయు. 1897

—: మార్కండేయయమసంవాదము :—

సీ. దంష్ట్రాకరాళవక్త్రంబుతోడను నంజ, నాచలతుల్యకాయంబుతోడఁ
గర్కశాయుధయుక్తకరములతోడను, సర్పవృశ్చికరోమచయముతోడఁ
బ్రజ్వలద్రక్తనేత్రంబులతోడను, దీక్ష్ణాంచలక్రూరదృష్టితోడఁ
బ్రళయకాలానలోపమదీప్తితోడను, దారుణం బైనక్రోధంబుతోడ
గీ. మృత్యుదేవతతోడను భృత్యగణము, తోడ నంతకుఁ డేతెంచి ధూర్తముగను
గాలపాశంబు దగిలించి కంఠమునకు, లాగఁ దొడఁగె మృకండుబాలకుని బలిమి.
సీ. అపుడు మార్కండేయుఁ డాలింగమును దృఢం, బుగఁ బట్టికొని బాహుయుగముతోడ
యముని వీక్షించి కృతాంత శివస్తోత్ర, మును బూర్తి గావించుదనుక నాకు
గమనభోజనశయనములు వర్జించెడి, వ్రత ముండుటను నంతవఱకు నీవు
తాళుము వచ్చెదఁ దరువాత నీవెంట, ధర్మంబు గాదు వ్రతంబు చెఱుప
గీ. ననుడు దండధరుం డిట్టు లనియె మూఢ, చేయవలసినకృత్యంబు చేసికొనక
యేల యాలస్య మొనరించి తింతవఱకు, యముఁడు నీకృత్యములకొఱ కాఁగువాఁడె.
సీ. పూర్వవయస్సునం బొనరించుకొనక ధ, ర్మమును మూఢుండు వార్ధకమునందుఁ
దపియించు చుండు సార్థభ్రష్టుఁ డై నయ, ధ్వగునిచందంబున దారి దప్పి
చేసినఁ గర్మంబు మాసాష్టకముదాఁక, నొకవత్సరము సుఖంబుండఁగలుగుఁ
గావించునెడలను గార్యంబు దిన మెల్ల, నొకరేయి సుఖముగా నుండవచ్చు
గీ. వార్ధకంబున సుఖము కావలయు నేని, వలయుఁ జేయంగఁ బని పూర్వవయసునంద
కలుగునెడ వాంఛ చచ్చియుఁ గాంచ సుఖము,వలయు ధర్మము నొనరింపఁబొలియువఱకు.
సీ. సలుపఁగా వలయును శ్వఃకార్య మీనాఁడె, యపరాహ్ణసిద్ధినిఁ బూర్వాహ్ణమంద
కృత మిది కర్తవ్య మిది యని చింతనఁ, గావించువారలు కాలహతుల
పక్షికోటిసహస్రసిద్ధుఁ డైనను జావఁ, డప్రాప్తకాలుఁ డై నట్టివాఁడు
ప్రాప్తకాలుఁడు కుశాగ్రస్పర్శ మొదవిన, యంతమాత్రముననె యంతరించుఁ
గీ. జక్రవర్తిసహస్రముల్ శక్రశతము, లప్రతిహతంబుగ నధీను లై రి నాకు
బాలుఁడవు నీ వసఁగ నెంత పట్టువడఁగ, వదలిపెట్టుము లింగంబుఁ బదర నేల.
వ. అని తర్జించుటయు మార్కండేయుండు వైవస్వతున కిట్లనియె. 1902
సీ. సమవర్తి శంకరస్తవమున కంతరా, య మొనర్చువారి కసర్థ మొదవుఁ
గలవా స్తవంబును దెలిపినాఁడను నీకు, మఱియు నిం కొకమాట యెఱుఁగవలయు

రాజభృత్యుల కెట్లు రాజు శాస్తయొ యట్లె, శివభక్తులకు నెల్ల శివుఁడె శాస్త
వారిపై లే దధికారంబు నీ కేని, ధాత కేనియు వానితాత కేని

గీ. శైలములఁ బెల్లగింతురు సాగరములఁ, ద్రావుదురు రోదసులను వ్యత్యస్తముగను
జేయుదురు శివభక్తులు చేయలేని, కార్యములు లేవు కోరికి గలిగె నేని. 1903

గీ. ఆపదలు రావు శివభక్తు లైనవారి, కనుచు వచియించుబుధులవాక్యంబు వినవె
యాగ్రహావిష్టు లైన బ్రహ్మాదులకును, శంకరునికింకరులఁ దాఁక శక్తి లేదు. 1904

క. అనవుడు దండధరుం డి, ట్లనియెఁ ద్రిభువనముల మ్రింగునంతటిక్రోధం
బున మండిపడుచు దుర్మతి, తను వెఱుఁగక మాటలాడెదవె నామ్రోలన్. 1905

క. గంగాసికతాకణముల, భంగిని గణియింపరానిబ్రహ్మలు నాచే
భంగింపఁబడిరి పెక్కుఱ్ఱ, సంగము లేమిటికిఁ గనుము సామర్థ్యంబున్. 1906

క. అని పలికి తెఱచి వక్త్రము, గనులను మిఱుమిట్లుగొలుపఁగా మార్కండే
యుని మ్రింగఁ గడఁగు చుండం, గను రాహుగ్రహము శీతకరునింబోలెన్. 1907

గీ. అప్పు డాలింగముననుండి యష్టమూర్తి, తోయదధ్వనితోడఁ బ్రాదుర్భవించి
హుంకరించి యురంబున నొక్కతన్ను, దన్నె వామపదంబున దండధరుని. 1908

గీ. ఆప్రహారంబుతోడనె యంతకుండు, పడియె దూరంబుగను నేలపైని దండ
తాడితం బైనఫణివోలెఁ దాళ లేక, యంతట మృకండుతనయుఁడు హరునిఁ జూచి.

—: మృత్యుంజయస్తోత్రము :—

మత్తకోకిలము. బాలచంద్రకళావిభూషణభాసమానకపర్దునిన్
వ్యాళరాజగుణోపపన్నసువర్ణశైలశరాసనున్
నాళికేక్షణబాణునిన్ గణనాథునిన్ త్రిపురఘ్నునిన్
గాలకాలునిఁ జొచ్చితిన్ ననుఁ గాలుఁ డేమి యొనర్చెడిన్. 1910

మత్తకోకిలము. శైలరాజసుతాపరిష్కృతచారువామకళేబరున్
హేళిలోచనహారి నీక్షణనిర్మితాఖిలలోకునిన్
బాలితావనపాత్రునిన్ మునిభావనీయచరిత్రునిన్
గాలకాలునిఁ జొచ్చితిన్ ననుఁ గాలుఁ డేమి యొనర్చెడిన్. 1911

మత్తకోకిలము. వ్యాళభూషణభూషితాంగుని నార్తలోకశరణ్యునిన్
ఫాలలోచనదగ్ధకాముని భస్మదిగ్ధశరీరునిన్
శూలపాణి నశేషదుష్టనిషూదనవ్రతదీక్షితున్
గాలకాలునిఁ జొచ్చితిన్ ననుఁ గాలుఁ డేమి యొనర్చెడిన్. 1912

మత్తకోకిలము. నాళికాసనవిష్ణునిర్జరనాయకాద్యఖిలద్యుస
త్పాళినమితపాదపద్ముని దక్షయజ్ఞవిభంజనున్
తూళితప్రణతాఘుపంకుని సర్వలోకమహేశునిన్
గాలకాలునిఁ జొచ్చితిన్ ననుఁ గాలుఁ డేమి యొనర్చెడిన్. 1913

మత్తకోకిలము. నీలలోహితమూర్తి నుగ్రుని నిత్యునిం బ్రళయానలా
ఖీలరూపవినాశితాబ్జజవేదకోటిసహస్రు ను
ద్వేలశక్తి ననశ్వరోర్ధ్వగతిప్రదాత నమేయునిన్
గాలకాలునిఁ జొచ్చితిన్ ననుఁ గాలుఁ డేమి యొనర్చెడిన్. 1914

మత్తకోకిలము. బాలిశావిదితప్రభావునిఁ బంచవక్త్రుని రౌప్యగో
త్రాలయస్థితిసౌఖ్యవేది ననాది నవ్యయునిన్ విప
జ్జాలతూలసమీరునిన్ గజచర్మధారి నలభ్యునిన్
గాలకాలునిఁ జొచ్చితిన్ ననుఁ గాలుఁ డేమి యొనర్చెడిన్. 1915

మత్తకోకిలము. శ్వేళపాయిని మృత్యుజేతను సిద్ధిదాత నశేషరు
క్కాలదాహదవాగ్ని నాశ్రితకల్పశాఖి నజున్ దిశా
చేలునిన్ భగవంతునిన్ గుణసింధువున్ బరమాత్మునిన్
గాలకాలునిఁ జొచ్చితిన్ ననుఁ గాలుఁ డేమి యొనర్చెడిన్. 1916

మత్తకోకిలము. కాళికాహృదయాబ్జభానునిఁ గామితార్థదునిన్ మహా
కాలునిన్ భవరోగవైద్యునిఁ గర్మపాదపమూలని
ర్మూలనక్షమునిన్ గుణత్రయరూపునిన్ గరుణానిధిన్
గాలకాలునిఁ జొచ్చితిన్ ననుఁ గాలుఁ డేమి యొనర్చెడిన్. 1917

ఆ. కాళ్లు పట్టుకొంటిఁ గాలకంఠునిఁ గలా, మూర్తి నఖిలగురుని మోక్షకరునిఁ
త్రిభువనాధిపతిని దేవాదిదేవుని, మృత్యు వేమి చేయు నింక నన్ను. 1918

ఆ. కాళ్లు పట్టుకొంటిఁ గాలాగ్నిరుద్రుని, వృషభవాహనుని గిరీశు నజునిఁ
జండికాంతరంగసరసీరుహార్కుని, మృత్యు వేమి చేయు నింక నన్ను. 1919

ఆ. కాళ్లు పట్టుకొంటి గంగాధరుని మహా, నటుని శివుని దుష్టనాశకరుని
భక్తరక్షకునిఁ గపాలిని శూలిని, మృత్యు వేమి చేయు నింక నన్ను. 1920

ఆ. కాళ్లు పట్టుకొంటిఁ గైలాసనాథుని, సృష్టిరక్షణప్రణష్టికరుని
సర్వభూతపతిని సర్వేష్టదాతను, మృత్యు వేమి చేయు నింక నన్ను. 1921

ఆ. కాళ్లు పట్టుకొంటి ఖండేందుమౌళిని, బంచబాణహరునిఁ బాపహరునిఁ
త్రిపురదైత్యహరుని దివ్యప్రభావుని, మృత్యు వేమి చేయు నింక నన్ను. 1922

సీ. అని నుతించుటయు మహాకాలుఁ డతనికి, నపరిమితంబుగా నాయు విచ్చె
నంత లేచి కృతాంతుఁ డష్టమూర్తిని స్వాప, చారవిముక్తికై సన్నుతించి
తదనుజ్ఞఁ గొని నిజధామంబునకు నేఁగె, నంత నీశ్వరుఁ డదృశ్యతను జెందె
నావల సంతోష మావహిల్ల మృకండు, పుత్రుఁడు స్వాశ్రమంబునకు వచ్చి

గీ. తల్లిదండ్రుల కెఱిఁగించెఁ దద్విశేష, మంతయును వార లది యెల్ల నాలకించి
యద్భుతానందభరితాత్ము లైరి యంతఁ, జెంది యమృతత్వము మృకండునందనుఁడు.

క. కనియె బహుప్రళయములను, గనియెను బహుసర్గములను గలిగెను మాఘం
బున మును మృగశృంగుఁ డొన, ర్చినస్నానంబునకు నిట్టిశ్రేయము తుదకున్. 1924

క. చలుపుచు మాఘస్నానం, బుల మార్కండేయుఁడును త్రిభువనంబులలో
పలఁ దిరుగఁజొచ్చె నాయువు, కలకాలము ప్రాప్త మైనకతమునఁ దనకున్. 1925

ఆ. మృత్యుభయము లేదు మృత్యుంజయస్తోత్ర, మును బఠించుచున్న ననుదినంబుఁ
జదువలేనియెడలఁ జాలును విన్నను, బాతకులకుఁ గలుగుఫలము నొంద. 1926

క. అని నుడువుటయు దిలీపుఁడు, మునిపుంగవ ముఖ్యతీర్థములు స్నానంబుల్
బొనరింప మాఘమాసం, బున నేవియొ చెపుము నాఁగ ముని యిట్లనియెన్. 1927

—: మాఘస్నానార్హతీర్థకథనము :—

సీ. వినుము మహారాజ మును మహర్షులు బహు, ర్జలమును మాఘమాసంబునందు
గంగాసమానంబుగాఁ జెప్పి రెట నున్న, నది పవిత్రము స్నాన మాచరింప
నదె కాక మఱియు ముఖ్యము లైన తీర్థంబు, లోకకొన్ని కల వవియును వచింతు
నాదితీర్థంబు ప్రయాగంబు ధర్మార్థ, కామమోక్షంబులు గలుగు దాన

గీ. నాకతంబునఁ దీర్థరాజాహ్వయంబు, దాని కొడఁగూడెఁ బిమ్మట ద్వారకయును
సప్తగోదావరము నైమిషమును బదరి, కాశ్రమంబును భూరిపుణ్యావహముల.

వ. మఱియును గురుక్షేత్రంబును గంగాద్వారంబును నవంతికయును సరయువును యమునయును నమరావతియును సరస్వతీసింధుసంగమంబును గంగాసాగరసంగమంబును గాంచియును త్రైయంబకంబును గాలంజరంబును ప్రభాసంబును మహాలయంబును నోంకారక్షేత్రంబును బురుషోత్తమంబును గోకర్ణంబును భృగుకర్ణంబును భృగుతుంగంబును బుష్కరంబును దుంగభద్రయును గావేరియును గృష్ణయును వేణియును నర్మదయును సువర్ణముఖరియును వేగవతియును మాఘస్నానముఖ్యతీర్థంబులుగాఁ జెప్పంబడియె. గయాతీర్థంబు పితృతృప్తిదాయకంబు. పూర్వోక్త తీర్థంబు లన్నియును భౌమతీర్థంబులు. 1929

—: మానసతీర్థకథనము :—

క. తెలిపెద మానసతీర్థం, బుల నింకను వినుము మోక్షమును జేకూర్పం
గల వవి దాననె ప్రాజ్ఞులు, సలుపుదు రవ్వానిలోన స్నానము నెపుడున్. 1930

వ. సత్యంబును క్షమయును నింద్రియనిగ్రహంబును భూతదయయును నార్జవంబును దానంబును దమమును సంతోషంబును బ్రహ్మచర్యంబును నియమంబును జపంబును నిజ్యయును శౌచంబును దపంబును వక్తృత్వంబును శ్రుతంబును జ్ఞానంబును ధృతియును నహింసయును ధ్యానంబును శివస్మరణంబును నాత్మశుద్ధియును మానసతీర్థంబులుగాఁ జెప్పంబడియె. 1931

గీ. తీర్థములలోన నుత్తమతీర్థ మాత్మ, శుద్ధితీర్థంబు దానిలోఁ జొచ్చి సంత
తమును స్నానంబు సేయు నుత్తముల కొదవు, నపునరావృత్తికర మైనయమృతపదము.

సీ. మునిఁగినమాత్రంబుననె జలంబున శుద్ధి, గలుగదు స్నాతుఁడు గాఁడు వాఁడు
స్నాతుండు నా దమస్నాతుండె యఖిలాత్మ, దస్నాతుఁ డైనఁ బాతకి మలినుఁడె
తనుమలత్యాగమాత్రమునఁ గాఁ డమలుండు, కలుగ కుండఁగఁ జిత్తమలవిముక్తి
కలుగదు జలజంతువులకు మోక్షము జని, స్థిత్యంతములు నీటఁ జెందు చున్నఁ
గీ. జిత్తమల మనుపేరను జెప్పఁబడియె, విషయరాగంబు విషయనివృత్తి భావ
శుద్ధి యనుపేర నొప్పఁ దచ్ఛుద్ధి యుండు, దేహి గలచోటులె సమస్తతీర్థములును.
గీ. జ్ఞానపావిత్ర్యమును ధ్యానజలము ద్వేష, రాగమలనాశకమును నై రహి వహించు
నట్టిమానసతీర్థమునందు మునుఁగు, భాగ్యవంతుఁడు ప్రాపించుఁ బరమపదము. 1934
గీ. దేహమున నెట్లు కొన్ని ప్రదేశములకుఁ, గలదొ పూతత్వ మట్టులె కలదు కొన్ని
ధామములకుఁ బవిత్రత భూమియందు, నవియె సుమి ధామతీర్థంబు లవనినాథ. 1935
గీ. ధామతీర్థంబులును జగత్పావనంబు, లయ్యె జలతేజమునను భూమ్యాగతప్ర
భావమునను దపోధనప్రవరసంప్ర, తిగ్రహమునను జగమునఁ ద్రివిధగతుల. 1936
ఆ. కాన నొప్పు ధామమానసోభయతీర్థ, సేవ సేయ మోక్షసిద్ధికొఱకు
నెట్టిపుణ్యకర్మ మేనియు నిలలోనఁ, దీర్థసేవతోడ దీటు గాదు. 1937
ఆ. చేయ కున్నఁ దీర్థసేవ త్రిరాత్రంబు, లుపవసింప కున్న నొసఁగ కున్న
శక్తి యున్నకొలఁది స్వర్ణంబు గోవును, నవనిలో దరిద్రుఁ డై జనించు. 1938
గీ. విద్యయుఁ దపంబుఁ గీర్తియు వెలయఁ దీర్థ, ఫలము నొందంగలరు హస్తపాదచిత్త
సంయమము సేయువారును సంప్రహర్ష, భరితమానసులును గర్వవిరహితులును.
సీ. కావించునెడఁ దీర్థసేవను శ్రద్ధతో, డను గృతఘ్నుం డైనజనుఁడు గూడఁ
బరిశుద్ధుఁ డగు నింకఁ బరిశుద్ధచరితుఁడు, చెందెడిభాగ్యంబుఁ జెప్పఁ దరమె
యరుగ నెంచిన నేగు నమరాలయమునకుఁ, దలఁచిన నరుగు గంధర్వపురికిఁ
గాంక్షించునెడలను గైలాసమున కేఁగు, మోక్షార్థి యగు నేని ముక్తి నొందు
గీ. నేది గోరిన నది గల్గు నిన్ని యేల, చెందఁడు విషాద మేలోకమందుఁ గూడ
వానికి సమాన మగువాఁడు వాఁడె కాని, తగఁ డెవండును బరుఁడు దత్సామ్యమునకు.
ఆ. శ్రద్ధ లేనివాఁడు సంశయగ్రస్తుఁడు, హేతునిష్ఠితుఁడును బాతకియును
నాస్తికుఁడును వీర లైదుగురును గూడఁ, బడయలేరు తీర్థఫలము నధిప. 1941

—: సువ్రతబ్రాహ్మణవృత్తాంతకథనము :—

సీ. కల దగ్రహార మొక్కటి నర్మదాతీర, మందు ము న్నకలంక మనెడిపేరఁ
గల రందు బహుపండితులు వారిలో సువ్ర, తుం డనునొకబ్రాహ్మణుండు గలఁడు
వేదవేదాంగాదివిద్య లెల్లను నేర్చి, యతఁడు లోభాక్రాంతుఁ డగుటఁ జేసి
గోవిక్రయము గన్యకావిక్రయము భృత, కాధ్యాపనము మొద లైనపనులు

గీ. చేసి యార్జించి ధనమును జల్లిగన్న, యేని దక్షిణ గురువున కీక కూడఁ
బెట్టి యొకలక్ష నిష్కముల్ తుట్టతుదకు, వార్ధకం బేర్పడ గడింప వశము గామి.
గీ. చింత నొందుచు నుండంగ స్వాంతమందు, నెంత చెడినను బాండిత్యవంతుఁ డగుట
నొక్కదివసంబున వివేక ముదయ మొంద, మనములో నిట్లు తలపోసికొనఁ దొడంగె.

—: సువ్రతుని విచారము :—

సీ. ధన మెంత గడియించినను నిప్పటికిఁ గూడ, శాంతి యేర్పడదాయె స్వాంతమునకు
నతిదుస్సహం బయ్యె నాశాప్రవేగంబు, చాల కున్నది మేరుశైల మేని
స్వస్వశక్తులు పోయి సర్వేంద్రియంబులు, ప్రిదులు చున్నను దృష్ణ పెరుఁగు చుండెఁ
దను వెంతజీర్ణత్వమును వహించెనొ యాశ, యంతతారుణ్యంబు నధిగమించె
ఆ. నాశలోనఁ బడి వినాశంబు నొందె నా, విద్య లెల్ల జడుఁడె విబుధుఁ డేని
బుద్ధిమంతుఁ డేని బుద్ధివిహీనుండ, యాశచేత బద్ధుఁ డయ్యె నేని. 1944
ఆ. ఆశ వహ్నితుల్య మైనది గావునఁ, జేర్పఁ దగదు దానిఁ జేరువకును
బ్రతుకఁ దలఁచువాఁడు శ్రుతమానబలయశో, జ్ఞానధీరతాభిజాత్యములను. 1945
ఆ. స్వల్పదాత యైనఁ జండాలుఁ డేనియు, నాశ గలుగువాని కధికుఁడుగను
గానుపించు నింతకంటె నాశాగ్రస్తుఁ, డైనవాని కపచయంబు గలదె. 1946
గీ. అవని నాశాభిహతులు మోహాసమగ్ర, మత్తులై యుండుటను లవమాత్ర మేని
పరిగణింపక పరకృతపరిభవోత్థ, బాధను జరించు చుందురు ప్రజలలోన. 1947
గీ. ఇట్టి క్లేశంబు లెన్నెన్నో యేను బొంది, యార్జనము చేసినధనంబు సార్థకముగ
ధర్మకార్యంబు లొనరింపఁ దరుణ మిదియె,యని తలఁచి సత్క్రియోన్ముఖుఁ డయ్యె నంత.
ఆ. ఆదినంబునంద యర్ధరాత్రంబునఁ, జొచ్చి తద్గృహంబు చోరు లతని
ధనము నెల్ల దోఁచికొని పోయి రొకగవ్వ, యేని మిగుల కుండ నింటిలోన. 1949
వ. అంతట సువ్రతుండు దుఃఖాక్రాంతచిత్తుం డై యిట్లు విలపింపం దొడంగె. 1950
సీ. చన దొక్కగోవు నైనను గ్రహింపఁగ నది, కొనక తప్పనియెడఁ గొనిన: గాని
రెండవదాని నెన్నండును గొనరాదు, కూడ దమ్మంగఁ గైకొనినదాని
నట్లు చేసినయెడ నాపాతకము సప్త, పురుషాంతరములను బూదిచేయు
ననుశాస్త్రము నెఱింగియును లోభమునఁ గొని, యెన్నొ గోవుల విక్రయించినాఁడ
గీ. ధనము నార్జించుపనిలోనఁ దవిలి యొక్క, వాసరం బేనియును సంధ్య వార్వ నైతి
విడిచినను బ్రాహ్మణోచితవిధుల నెల్లఁ, జివర కాచమనం బైనఁ జేయ నైతి. 1951
సీ. ఒకపుష్పమునొ లేక యొకపత్రమునొ మంత్ర, సహితంబుగనొ మంత్రరహితముగనొ
శివలింగమందు నుంచిన నుద్ధృతం బగుఁ, గులకోటి యదియును జలుప నైతి
స్మరణమాత్రముననె సకలపాపములను, దహియించుహరి నైనఁ దలఁప నైతిఁ
బ్రణతిమాత్రమున సర్వవ్యాధు లడఁచుసూ, ర్యున కైనఁ జే యెత్తి మ్రొక్క నైతి

గీ. ఘనసప్రాజకు మెచ్చి విఘ్నముల నెల్లఁ, జెందుగణపతి నైనఁ బూజింప నైతిఁ
జలుపు నెడ సేవ యించుక సర్వకామ, సిద్ధి లిడుశక్తి నైన భజింప నైతి. 1952
గీ. చలుప నైతిని బంచయజ్ఞములు చేయ, నైతిఁ బంచాయతనదేవతార్చనంబు
బ్రహ్మచారికి హంతకారము నొసంగ, నైతి భిక్షుకునకు నీయ నైతి భిక్ష. 1953
వ. బ్రహ్మచారియును భిక్షుకుండును బక్వాన్నస్వాము లగుటం జేసి వారలకు భోజనంబు
నొసంగక భుజించువారలు చాంద్రాయణంబునం గాని శుద్ధిం జెందంజాలరు. 1954
క. ఘృతసిక్తము లగుతిలలను, హుతాశనునియందు మంత్రయుక్తము గాఁగన్
హోత మొనరించినఁ జను నా, ర్జితపాపము లెల్ల నదియుఁ జేయకపోతిన్. 1955
సీ. చలుపకపోతిని స్వర్గదాయకుఁ డైన, యతిథికి సంతృప్తి నన్న మొసఁగి
శ్రోత్రియుం డైన విప్రునకు నీయకపోతి, వస్త్రవృద్ధిగ నొక్క-వసన మేని
పాదుకొల్పకపోతిఁ బాదపం బొకఁ డేని, యమలోకమార్గతాపము శమింప
స్థాపింప నైతిని గూప మొక్కం డేని, పరలోకమార్గపిపాస యుడుగ
గీ. నొక్కగోవును నైతము నుద్ధరింప, నైతిఁ గర్దమమగ్న మైనట్టిదాని
నరకమునుండి యుద్ధరణంబు గలుగఁ, దనుధనబలంబు లుండినతరుణమందు. 1956
వ. శయ్యాజాశ్వమహిషీదాసీశ్వేతకృష్ణాజినతిలకరంభతోయకుంభాసనపాదుకాపాదా
భ్యంగదీపప్రపావ్యజనచ్ఛత్రతాంబూలనిత్యశ్రాద్ధభూతబల్యతిథిభోజనంబు లనువింశతి
దానంబులు యమలోకయాతనానివారకంబులుగాఁ జెప్పంబడినను వానిలో నొక్కటి
యును నాచే నిర్వర్తింపంబడ దయ్యె. 1957
ఆ. చలుప నైతిఁ గృచ్ఛ్రచాంద్రాయణాదులఁ, గాయమునకు శుద్ధి గలుగునట్లు
ధేనువునకు గ్రాస మేనాఁడు గూడను, నొసఁగ నైతిఁ బాప ముడిగిపోవ. 1958
క. సాలగ్రామశిలాంబువుఁ గ్రోలినఁ దలపైని జల్లుకొనినను వహ్ని
జ్వాలలు గాష్ఠములం బలెఁ, గాలుచు నంతర్బహిష్ఠకాలుష్యములన్. 1959
క. అని మొఱఁగియు నాపనులును, నొనరింపకపోతిఁ దుదకు నొద్దకు రా గో
వును నైన గోఁక నైతిని, ననువ్రగ గోలోకవాస మామతిలంగన్. 1960
గీ. ఒక్కకా సైనియును నర్థి కొసఁగ నైతిఁ, గలిమి జన్మాంతరంబునఁ గలుగ క్షుధితుఁ
డైనవానికి నొకపట్టెఁ డన్న మేని, పెట్ట నైతిని గలుగంగఁ బుట్టగతులు. 1961
ఆ. ఉపవసింప నైతి నొకశివరాత్రియు, నైక్య మొంద శివునియందు విష్ణు
తృప్తిదముగ నొక్కయేకాదశియు నుండ, నైతి ననశనముగ నక్కటకట. 1962
గీ. కష్టపడి నేను జీవితకాల మెల్లఁ, జేయరానియకృత్యముల్ చేసి గడన
సలిపినట్టిధనం బెల్ల క్షణములోనఁ, బోయె నిలువునఁ బ్రాణముల్ పోయినట్లు. 1963
సీ. ఆత్మానుసంధాన మాచరింపకపోతి, గర్భవాసక్లేశగతి తొలంగ
దానపాత్రులకును దాన మీయకపోతిఁ, గలుగ కుండఁగ నూర్ధ్వగతికి హాని
యనుభవింపకపోతి నాత్మకు సుఖము గా, భోగి యీతం డని పొగడ జనులు

సాధింప నైతి మోక్షము నేని లేక ధ, ర్మము నేని కడకుఁ గామంబు నేని
గీ. వేమి యొనరించిన ట్లాయె నిలను బుట్టి, పెరిఁగి బహువిద్యలను నేర్చి ప్రేతవోలెఁ
దిరిగి రేఁబవలును సైఁచి పరిభవముల, నార్జనము సేసినందుల కమితధనము. 1964
ఆ. నన్ను నేనె వంచనము చేసికొని జీవి, తంబు నెల్ల వితగఁ దగులఁబెట్టి
కొంటి నుద్ధరించుకొనఁగ నీదశలోన, నేర్పడినను బుద్ధి యేమి ఫలము. 1965
ఆ. కాటిలోన విడిచి కాయంబుఁ బరలోక, వర్త్మమునను బోవువాని వెంట
రాదు విద్య ధనము రాదు భూములు రావు, రారు దారసుతులు రారు హితులు.
ఆ. దారిబత్తె మొక్క-ధర్మంబె యది నాకుఁ, గాదు సులభ మిట్టికాలమందు
వశము గాకయుండె వార్ధకంబున మేను, దాన మాచరింప ధనము లేదు. 1967
గీ. ఏమి చేయుదు నే నిట్టిహీనదశను, నాఁడునాఁటికి వచ్చు చున్నది సమీప
మునకు వైవస్వతపురంబు కనికరింపఁ, డంతకుఁడు ఘోరపాతకి నై ననన్ను. 1968
ఆ. దండధరునిపేరు దలఁచికొన్నంతనె, చేష్ట తప్పి చుండెఁ జిత్తమునకు
మేనఁ బ్రాణ మున్న నేను మృతుండనె, యనుచు నేడ్చు చుండ నాత్మలోన. 1969
సీ. మును దాను గాశ్మీరమునకు భూరిధనార్జ, నమునకై పోయినసమయమందు
గంగాతటమున మాఘస్నాతు లెల్లరుఁ, గూర్చుండఁ బౌరాణికుం డొకండు
చదివినమాఘమాసస్నానఫలబోధ, కార్థపద్యము స్మృతి కపుడు రాఁగ
ధైర్యంబు వహియించి తత్క్షణంబున నర్మ, దామహానది కేఁగి దానిలోన
గీ. స్నాన మొనరించి దశదివసములు దశమ, దినమునను శైత్యబాధకు దేహ మెల్ల
గజగజ వడంకు చుండంగఁ గదల లేక, హరి హరి య టంచుఁ దత్తీరమంద మ్రందె.
సీ. అంతటఁ బాపాత్ముఁడై నసువ్రతుఁడు మా, ఘస్నానమాహాత్మ్యకారణమున
దివ్యరూపంబు ప్రాప్తింపంగ దేవయా, నను నెక్కి స్వర్గలోకమున కరిగి
యచట భోగము లెల్ల ననుభవించుచు స్వేచ్ఛ, నొక్క-మన్వంతరం బుండి పిదప
భూసురుం డై పుట్టి భువిని మాఘస్నాన, మును బ్రయాగక్షేత్రమున నొనర్చి
గీ. బ్రహ్మలోకంబు నొంది తత్ఫలము గాఁగఁ, గడపి సుఖముగ నొకకల్పకాల మచట
నవల జన్మించి విప్రుఁడై యవనిలోనఁ, గాశిలో మరణించి మోక్షమును బడసె.
సీ. అధ్వరంబులలోన నశ్వమేధమువోలె, నద్రులలోఁ దుషారాద్రివోలెఁ
ప్రణవంబువోలె మంత్రములలోపలను దా, నములలో నభయదానంబువోలెఁ
జానలలోపల సర్వమంగళవోలె, విద్యలలో నాత్మవిద్యవోలె
శంభుభక్తులలోన సరసిజాక్షుఁడువోలె, వ్రతములలో ఋతవ్రతమువోలెఁ
గీ. దపములందుఁ బ్రాణాయామతపముకరణి, ధర్మములలో నహింసచందమున నాహి
తాగ్నికై తడెఁ బాత్రులయందు సర్వ, మాసములలోన శ్రేష్ఠంబు మాఘ మధిప.
క. గరుడాగమనంబున విష, ధరములు నిర్విషము లగువిధంబునను దివా
కరుఁడు మకరమును జొచ్చిన, తరుణమునఁ గళావివర్జితమ్ము లగు నఘములున్. 1973

క. ధనవర్జితుండు పాతకి, యును వ్యసనియు నైననరున కుర్వీస్థలిలోఁ
గనరాదు గతి మ ఱొక్కటి, మనుపఁగ నరకంబునుండి మాఘముకంటెన్. 1974

క. అనయం బగు నైశ్వర్యం, బును బుష్పవిహీనభూజమును శశధరశూ
న్యనిశయు మాఘస్నానం, బును జేయని ప్రాణివర్గమును దుల్యంబుల్. 1975

గీ. ఔర యెంత ప్రమాదంబొ యౌర యెంత, గాఢమోహంబొ నరులకుఁ గాంచకుండ
మాఘమాసాప్లవఫలంబు మోఘముగను, బరవిధులలోనఁ జెందుచుందురు శ్రమంబు.

ఆ. మాఘమజ్జనంబె మాంగల్య మర్థసం, పాదనంబు మాఘమజ్జనంబె
మాఘమజ్జనంబె మనుఁగడ సర్వంబు, మాఘమజ్జనంబె మానవులకు. 1977

ఆ. ధరను లేవు వేఱె ధర్మార్థకామమో, క్షములు మాఘమందుఁ జలుపునట్టి
మజ్జనంబుకంటె మానవకోటికిఁ, దెలిసినాఁడ నిజముఁ దేటపడఁగ. 1978

క. అదియె యభాగ్య ముపద్రవ, మదియె సమస్తాశుభంబు లదియె నరులకున్
ముదమునను మాఘమం దిం, పొదవఁగ నొకస్నాన మేని యొనరుపకున్నన్. 1979

ఆ. మంచిభార్య నిచ్చు మంచిబిడ్డల నిచ్చు, మంచిభర్త నిచ్చు మహిమ నిచ్చు
స్వర్గ మిచ్చు మోక్షసామ్రాజ్యపద మిచ్చు, మాఘమాసమకరమజ్జనంబు. 1980

గీ. సలుపఁడో యెవండు సామర్థ్యశాలి యయ్యు, మాఘమాసంబునందు నిమజ్జనంబు
వాఁడె దృష్టివిహీనుఁడు వాఁడె పాద, వర్జితుఁడు వాఁడె ప్రాణవివర్జితుండు. 1981

ఆ. సర్వదేశములును సర్వకాలములును, సుకృతదాయకముల సకలజనులు
దానమునకుఁ బాత్రు లైనవారల రవి, మకరమున వసించుమాసమందు. 1982

వ. మాఘమాసంబున నిర్ఝరిణీసలిలస్నానం బుత్తమంబు. వాపీకూపతటాకస్నానంబు
మధ్యమంబు. 1983

గీ. శ్రేయమును గోరువాఁ డొనరింపఁ దగదు, స్నానమును గేహమున నుష్ణసలిలమునను
గష్టపడినకొలందిని గలిగినట్లు, సంభవింపదు పుణ్యంబు సౌఖ్యమునను. 1984

క. శీతార్తుఁ డయ్యు మాఘు, స్నాతుఁడు సేవింపఁ దగదు జ్వలనము నెపుడున్
శీతవ్యథ యుడుగంగను, స్నాతుఁడు చెందండు దాన స్నానఫలంబున్. 1985

వ. రాత్రియందు వాయుతాడితంబుగా నుంపఁబడిననవకుంభజలంబు గంగాతోయకల్పంబుగాఁ జెప్పంబడుటం జేసి నద్యాద్యభావంబునఁ దజ్జలస్నానంబు గావించుట ప్రశస్తంబు. దేవతలు ప్రతిమాఘమాసంబునను నీటఁ దేజంబు నుంచుచుండుటం జేసి బుధులు మాఘస్నానంబు నగ్నిప్రవేశంబుకంటె నధికంబుగా నుడివిరి. 1986

క. ఏనియమంబులచేతను, బోనియఘంబులును మాఘమున నశియించున్
స్నానమునఁ జేసి మాఘు, స్నానం బాహేతువునను శ్లాఘ్యం బయ్యెన్. 1987

క. అనుదినము వలయు నీయం, గను శర్కరతోడఁ దిలలు తొమ్మ దేవునకున్
గన వృద్ధి నిజకులంబులు, మనములలోఁ గోర్కి యున్న మాఘస్నాతుల్. 1988

వ. మాఘావసానంబున వ్రతపరిపూర్తికై యథాశక్తి బ్రాహ్మణసమారాధనంబు గావిం
పందగు. అభ్యంగవర్జనంబుగా మాఘస్నానంబు గావించినవారు బ్రాహ్మణదంపతు
లకుం మూర్తంచప్రీతికరంబుగా వస్త్రంబులును సప్తధాన్యంబులును శర్కరైకభాగ
తిలభాగత్రయైలానారికేళజీరకమరిచంబులం జేర్చి కావింపంబడినత్రింశన్మోదకంబులును
సమర్పించి రేని సూర్యబింబంబును భేదించుకొని తన్మధ్యంబునుండి చని విష్ణుపదంబుం
బ్రాపింపంగలరు. 1989

—: భీమసేనవృత్తాంతకథనము :—

సీ. తమపురోహితుండైన ధౌమ్యునికడ కేఁగి, మున్నొకనాఁడు భీముండు మ్రొక్కి-
స్వామి నే నోనరింపఁజాలక యుపవాస, మారగించుచు నుండ హరిదినముల
ననుఁ జూచి నింద యొనర్చు చుండెద రుప, వాసంబు లొనరించువార లెల్ల
నది నాకు నవిషహ్య మయ్యెడి నే నేమి, చేయంగవలయునో చెప్పు మింక
గీ. ననుడు ధౌమ్యుఁడు వాని కి ట్లనియె భీమ, సలుపు మొకమాఘశుక్లపక్షమున వచ్చు
హరిదినంబున నుపవాస మది యొసఁగు, సర్వహరివాసరోపవాసములఫలము. 1990
క. దానను జననిందయు నీ, మానసదుఃఖమును దొలఁగ మహితాత్ముఁడ వై
యానందించెద విహాపర, నానాభోగములఁ బొగడ నరులును సురలున్. 1991
సీ. రాష్ట్రంబువోలెఁ గుప్రభువుచే ధనసంచ, యంబు చేతను ననర్థంబువోలె
దానంబువోలెఁ గీర్తనమున ద్రవిణంబు, వోలె నవర్ధనంబుననుజేసి
శ్రాద్ధంబువోలె నాగ్రహమున శిక్ష లే, కుండుటచేత బాలుండువోలె
ననలసంయోగంబునను మంచువోలె న, బ్రంబుఁ బెండుటను దపంబువోలె
గీ. ధేనువులువోలె దూరప్రదేశగతిని, విగళితామ్నాయతనుజేసి విద్యవోలెఁ
బాపతతు లెల్ల హరివాసరోపవాస, మునను నాశంబు నొందు సమూలముగను.
గీ. గయయు వారాణసియుఁ బ్రయాగమును గంగ, యును సరస్వతియును రేవయును ద్రిపుష్క
రములు మున్నగుపుణ్యతీర్థములు సాటి, గావు హరిదినషోడశకళకు నేని. 1993
గీ. ధరణిదానంబు నొకప్రక్క హరిదినంబు, నొకప్రక్కను దులలోన నునిచి తూఁప
సమము గాదాయె హరిదివసంబుతోడ, ధరణిదానం బని వచించె ధాత మున్ను.
వ. దశమియం దేకభక్తంబు గావించి బ్రహ్మచర్యంబు వహించి యేకాదశియం దుషః
కాలంబున స్నానంబు సేసి యగ్నిహోత్రంబు నుపాసించి బ్రహ్మయజ్ఞంబు గావించి
యుపవాసంబునకు సంకల్పించి. 1995
గీ. పుండరీకాక్ష యనశనంబుగను నియమ, సహితముగ నుండి యీదివసమున రేపు
పలిపెదను భుక్తి విఘ్నంబు గలుగకుండ, మద్వ్రతమున కనుగ్రహింపంగవలయు.
వ. అని ప్రార్థించి గోమయోపలిప్తం బగుశుచిప్రదేశంబున ధాన్యపీఠంబునందు నానావిధ
రత్నపూరితంబును శ్వేతవస్త్రాలంకృతంబును నగుపూర్ణకుంభంబును స్థాపించి దాని
మీఁదఁ జతురస్రవస్త్రంబు నునిచి తద్వస్త్రపీఠంబున స్వర్ణమయం బగువరాహరూప

మహావిష్ణుప్రతికృతిని బ్రతిష్ఠాపించి యర్చించి వరాహునిపాదంబులును గ్రోడుని
కటియును హిరణ్యగర్భునినాభియును శ్రీవత్సధారికుక్షియును సహస్రశిరస్కుని బాహు
వులును సర్వేశ్వరునిగ్రీవయును సర్వాత్మునిముఖంబును సుప్రభునిలలాటంబును జక్ర
ధరునికేశంబులును బూజించి విష్ణుమాహాత్మ్యప్రతిపాదకం బగుపురాణంబు వినుచు
నారాత్రి జాగరంబు గావించి మఱునాఁడు ప్రభాతకృత్యంబులు నిర్వర్తించికొని పునః
పూజ గావించి మనోరథసిద్ధి యగునట్లు ప్రార్థించి కుంభంబును విష్ణుబింబంబును
వస్త్రంబులును ధాన్యపాత్రంబులును బూజితద్రవ్య మంతయును దక్షిణాసహితంబుగా
నాచార్యునకు సమర్పించి బంధుయుక్తుం డై ద్వాదశీపారణంబు గావింపవలయు.

గీ. చేయు మీవిధి నేకాదశీవ్రతంబు, మాఘమాసంబునను నీకు మరల గర్భ
వాసదుఃఖంబు గలుగదు వాస్తవముగ, ననుచు భీముఁడు సంతోష మాత్మ దిల్ల.

వ. మాఘశుక్లైకాదశీదినంబున సకలఫలసమృద్ధం బగుహస్తినాపురోద్యానంబున కరిగి
యచ్చట సహస్రనారికేళంబులును నయుతకదళీఫలంబులును శతపనసఫలంబులును ద్రిశ
తపుండ్రేక్షువులును నారగించి బహుప్రయత్నంబున నుపవాసంబు గావించి యథో
క్తంబుగా వ్రతంబు నాచరించె. దానంజేసి యది మొదలు మాఘశుక్లైకాదశి
భీమైకాదశి యనుపేరం బరగె. 1999

గీ. లోకములలోన నుత్తమలోక మనెడి, గౌరవము బ్రహ్మలోకంబు గాంచినట్లు
మాసములలోన నుత్తమమాస మనెడి, వాసి గైకొనియెను మాఘమాస మధిప.

గీ. కలదు శివరాత్రి యనఁగ మాఘంబునందుఁ, బుణ్యతిథి యొండు దానిని బోలఁ జాల
వెట్టితిథులును మున్నది యిచ్చె విస్మ, యముగఁ గైలాసపదమును వ్యాధునకును.

క. అనుడు దిలీపుఁడు విస్మయ, మును జెంది మనంబులోన మునివర నాకున్
వినిపింపుము విశదముగను, వినఁగను శివరాత్రిమహిమ వేడ్క జనించెన్. 2002

వ. అని వేఁడుటయు వసిష్ఠుం డామహీవల్లభున కిట్లనియె. 2003

—: శివరాత్రిమాహాత్మ్యము :—

సీ. వినుము మహారాజ విశదంబుగను నీకు, శివరాత్రిమహిమంబుఁ జెప్పువాఁడఁ
గైలాసశైలశృంగమున నాసీనుఁ డై, యున్నశంభునిఁ జూచి యొక్కనాఁడు
మున్న పార్వతి నేఁడు నన్ను నీ వడిగిన, ట్లడుగంగ నామె కి ట్లనియె శివుఁడు
వనజాక్షి శివరాత్రి యనఁబడు మాఘకృ, ష్ణచతుర్దశీరాత్రి శైవి యగుట

గీ. దానికోట్యంశమునకును దానయజ్ఞ, తీర్థహోమవ్రతాదులు దీటుగావు
దాన నుపవాస మొనరించుమానవులకు, శమనఘోరస్వరూపదర్శనము లేదు. 2004

వ. శివరాత్రిదినంబునందుఁ బ్రభాతకాలంబునఁ బ్రబుద్ధుం డై కాల్యకృత్యంబులు నిర్వ
ర్తించికొని శివరాత్రివ్రతాచరణంబునకు బ్రాహ్మణానుజ్ఞం బడసి సంకల్పం బొనర్చి
యాదినం బెల్ల నుపవసించి రాత్రి శివలింగంబును బంచామృతంబులచే నభిషేకించి
వస్త్రభూషణాదులచే నలంకరించి జాతీచంపకపున్నాగనీలోత్పలాదిపుష్పంబులచేఁ బూ

జించి ధూపదీపనైవేద్యతాంబూలాదు లర్పించి తూర్యఘోషవీణావేణుగానవేదఘోష స్తోత్రపాఠపురాణపఠనన్మృత్యగీతాదులచే జాగరంబు గావించి మఱునాఁడు ప్రభాతంబున యథాశక్తి మత్ప్రీతికరంబుగా సకలదానంబులునుం జేసి గురుపూజ గావించి శివలింగంబున కెదుటఁ గృతాంజలిబంధుం డై నిలువంబడి. 2005

క. శితికంధర శివరాత్రి, వ్రతమును జేసితిని నేను ద్వత్ప్రీతికై
హిత మేదియొ యదియె దయా, మతి నొనరింపుము విమూఢమతి నగునాకున్.

వ. అని ప్రార్థించి బ్రాహ్మణసంతర్పణంబును బీదల కన్నవస్త్రదానంబును గావింపందగు. ఏతద్వ్రతంబునందు స్త్రీపురుషవిభేదంబును వర్ణవిభేదంబును లేకుండ సర్వజనంబులకును నధికారంబు గలదు. ప్రాజాపత్యచాంద్రాయణమాసోపవాసాదిపుణ్యంబులకంటెఁ గోటిగుణాధికం బగుపుణ్యంబును జన్మకోటిసహస్రసంపాదితపుణ్యసంతానత్రిగుణఫలంబును శివరాత్రివ్రతంబునం జేకూరు. శివరాత్రిజాగరంబున దేవబ్రహ్మస్వహారులును బంచమహాపాతకులును బరదారహారులును గృతఘ్నులును నతిథికన్నంబు పెట్టనివారును వృషలీరక్తులును శివరాత్రిప్రభావంబు నితరులకు బోధింపనివారును విననివారును శివలింగంబు నర్చింపనివారును వేదంబులను వైదికాచారంబును శివభక్తులను దూషించువారును లలాటంబున భస్మంబు ధరింపనివారును శివక్షేత్రంబుల కేఁగనివారును బర్వమైథునకర్తలును బ్రహ్మాదిదేవతలతోడ నన్నును దివ్యశక్తులతోడ నిన్నును బోల్చువారును సర్వపాపవిముక్తిం జెందంగలరు. 2007

గీ. దేవి యేజన్మమందైనఁ ద్రికరణముల, చేతఁ గావింపఁబడినట్టిపాతకంబు
లన్నియు నశించు శివరాత్రియందుఁ జలుపు,నెడల జాగరము బహూక్తు లేల యింక.

వ. అబుద్ధిపూర్వంబుగా శివరాత్రివ్రతంబు గావింపంబడినను బూర్ణఫలంబు చేకూరు.

క. దీనికి నిదర్శనంబుగ, నే నొక్కపురాణగాథ నీ కెఱిఁగింతున్
మానిని వినునెడ నాకథ, నానాపాతకవితాననాశం బొదవున్. 2010

సీ. కలఁడు నిషాదుఁ డొక్కఁడు మున్ను ధరలోనఁ, జేయుచు నాతండు జీవహింస
వనములలో నిత్యమును సంచరించుచు, స్వకుటుంబరక్షను జలిపికొనుచు
నొకదివసమున దైవికముగా నొకయరణ్యంబున కేఁగి జాలంబు నొడ్డి
యొకపొదలోఁ బొంచియుండి చూచుచు నుండఁ, బడదాయె నం దొక్కపక్షి యేని

గీ. యంతటను రవి గ్రుంకుడు నతఁడు పట్టు, విడువకుండఁగ నారాత్రివేళ నొక్క
హ్రదముదరిఁ జేరి జాలంబు నచట నొడ్డెఁ, దోయమున కేఁగుదెంచుజంతువులఁ బట్ట.

ఆ. అట్లు జాల మొడ్డి వ్యాధుఁడు తత్సమీ, పమున నున్నబిల్వపాదపమును
జేరి దానిచుట్టు సెలగి శాఖల వీలు, చేసికొని వసించి చెట్టుక్రింద. 2012

క. కనుఱెప్ప వైపకుండఁగఁ, గను చుండఁగ జాలమున మృగం బెయ్యది యై
సను బడునో యేమొ యని మది, నను కొనుచును డెల్లపాటె సంతటిలోనన్. 2013

వ. అంతటఁ బుళిందుఁడు నిరాశుండై రిక్తహస్తంబులతోడ గృహంబున కేతేరఁ దజ్జన
కుండు వానిం జూచి. 2014

క. నాయన నిన్నటినుండియు, నేయెడలను నీవు భుక్తి యించుకయును లే
దాయెను నకనకలాడెడి, నీయుదరముఁ జూడఁ గలిగె నెవ్వగ నాకున్. 2015

క. అనవుడు నావ్యాధుం డి, ట్లనియెను బడదాయె జాలమం దేకమృగ మై
నను బక్షి యైన నిన్నటి, దిన మెల్లను లేదు కనుకఁ దిండియు నాకున్. 2016

ఆ. తెలియరానిబాధ కలుగు చున్నది యేదో, బెడిదముగను నాకుఁ గడుపులోన
నిలువఁజాల నింక నే నని పలుకుచు, వ్రాలి భువిని విడిచెఁ బ్రాణములను. 2017

సీ. అంతట యమదూత లరుదెంచి శీఘ్రంబు, గను బాశములతోడఁ గట్టి వానిఁ
గొనిపోవు చుండఁగఁ జని మదాజ్ఞాకరు, లెదురుగా వారినిఁ జెదరఁ గొట్టి
యాకిరాతుని దివ్యయానంబుపై నుంచి, కొని నాదుసాన్నిధ్యమునకు వచ్చి
జరిగిన విషయంబు సర్వంబుఁ దెలుపంగ, నాకిరాతకుని నే నాదరించి

గీ. తన్మనోగత మైనసాశ్వసము నెల్ల
దీర్చి నాగణములలోనఁ జేర్చికొంటి
నది య టుండఁగ యమభృత్యు లరిగి యముని
కడకుఁ దెలిపిరి జరిగినగాథ యెల్ల. 2018

సీ. అపు డంతకుండు క్రోధారుణనేత్రుఁ డై, చిత్రగుప్తునిఁ బిల్చి శీఘ్రముగను
నాపుళిందునిగాథ యడిగివాఁ డతికలు, షుం డని చిత్రగుప్తుండు చెప్పఁ
దత్క్షణంబున లేచి దండముద్రను గొని, చనుదెంచి కైలాసమునకు నాకుఁ
బ్రణమిల్లి మత్పదాబ్జములపై దండము, ద్రను సమర్పించ నే దానిఁ జూచి

గీ. దండధర కారణం బేమొ దండముద్ర, నివ్విధంబున విడనాడ నెఱుఁగఁ జెపుమ
నావుడు యముండు సర్వజ్ఞ నీ వెఱుంగ, నట్టివిషయంబు గలదె న న్నడుగ నేల.

సీ. దురితాత్ముఁ డైనవ్యాధునిఁ దోడుకొని రాఁగ, మత్సేవకులను బంపంగ నేను
నీభృత్యు లరుదెంచి నాభృత్యులను గొట్టి, కొనివచ్చి నీయొద్ద నునుప వాని
నఖిలధర్మజ్ఞుఁడ వైననీవును వాని, కేలకొయును విధియింపవైతి
తలవంపు గలదె యింతటికంటె నా కింక, నీదండముద్రను నీవె కొనుము

గీ. తపము గావించుకొందుఁ గాంతారమునకు, నేఁగి సుఖముగ నా కేల యీశ్రమంబు
నాఁగ నే నవ్వి యంతక నయవిదుండ, వై ననీ విట్లు పలుకంగ న్యాయ మగునె.

సీ. సృష్టించినాఁడను శివరాత్రి మును మహా, పాపుల నుద్ధరింపంగ నేను
దానిప్రభావ మెంతటివారి కేనియు, గ్రహియించుటకును శక్యంబు గాదు
నా కాదినంబు ప్రాణముకంటెఁ బ్రియ మైన, యది గాన శివరాత్రి యనఁగఁ బరగెఁ
జేసిన నాఁ డుపవాసజాగరముల, నేవిధంబున నైన నెవ్వఁ డేని

గీ. వాఁడు నాధామమున నుండువాఁడ కాని, కాఁడు యమలోకమున కేఁగువాఁడు వింటె
యనుఁడు శివరాత్రి యట్టిద యనియె యముఁడు, దానిపై నిట్టు లంటి నంతకున కేను.
వ. ఈపుళిందుండు శివరాత్రినాఁడు వనంబున కరిగి జంతువు లేమియును దొరకమిని నాది
నం బెల్ల నిరాహారుం డై యుండ నయ్యది యుపవాసంబుగను జంతువులకొఱకు
నక్తందివంబును మేల్కాంచియుండుటంజేసి యయ్యది జాగరంబుగను మాలూరవృక్ష
శాఖలను సెలగి పాఱవైవఁ దత్పత్త్రంబులు తత్రత్యప్రాచీనశివలింగంబునం బడుట
వలన నయ్యది శివపూజగను నగుటంజేసి శివరాత్రివ్రతఫలంబు వీనికిఁ బ్రాప్తించె.
గీ. ఆకతంబున నీభిల్లుఁ డయ్యె నాకు, భక్తుఁ డద్దానఁ గైలాసపదము నొందె
ననుచు యముఁడు మదుక్తుల నాలకించి, శాంతి యొదవంగ మది నేఁగె స్వపదమునకు.
క. శివరాత్రిమహాత్త్వంబును, జెవులకు నింపుగను వినినఁ జెప్పినను బున
ర్భవరహితు లగుచు వారలు, నివసింతురు మామకీననిలయమునందున్. 2024
క. అని చెప్పుటయును బార్వతి, విని శివరాత్రిమహిమంబు విస్మయ మొదవం
గను జెప్పఁ దొడఁగె స్వసఖి, జనమునకును విబుధు లెల్ల శ్లాఘింపంగన్. 2025
సీ. వినుము దిలీప యింకను మాఘమాహాత్మ్య, మును వచించెద ముఖ్యముగను నీకు
మును సహ్యభూధరంబునను దత్తాత్రేయుఁ, డాచరించుచుఁ దపం బధివసింపఁ
గార్తవీర్యుఁడు తత్సకాశంబునకు నేఁగి, ప్రణమిల్లి తత్పాదపద్మములకు
మాఘమాసస్నానమాహాత్మ్యమును దెల్పు, మని వేఁడుటయు నిట్టు లనియె నతఁడు
గీ. రాజపుంగవ తావకప్రశ్నమునకు, హర్ష మయ్యెను నీవు న న్నడిగినట్లె
యడుగఁగను మున్ను నారదుం డబ్జభవుని, నబ్జభవుఁ డిట్టు లనియె నయ్యమరమునికి.
క. మోఘం బగుఁ దజ్జన్మము, మాఘస్నానంబు నొక్కమాఱైనను న
ద్యోఘమునఁ జేయకున్న న, ఘౌఘపరీతాత్ము లైనయుర్వీజనముల్. 2027
క. ఇనవిరహితదినము తెఱం, గునఁ జంద్రుఁడు లేనిరేయికొమరున దీప్తిం
గన వెట్టిపుణ్యకర్మము, లును మాఘస్నానవిముఖలోకకృతంబుల్. 2028
క. పూతికలువోలె జంతు, వ్రాతంబున బుద్బుదములవలె జలమున సం
జాతు లగుచుండ్రు మాఘ, స్నాతులు గానట్టివారు చచ్చుటకె ధరన్. 2029
సీ. విష్ణుభక్తుఁడు గాని విప్రుండు హతుఁడు క్రో, ధమునఁ గావించెడితపము హతము
దంభకృతం బైనదానంబు హత మనా, చారంబువలన వంశంబు హతము
దారిద్ర్యమునను హతం బిహలోకంబు, దక్షిణ లేనిశ్రాద్ధంబు హతము
హతము లోభిధనంబు హత మసాక్షికభోజ, నంబు సందిగ్ధమంత్రంబు హతము
గీ. హత మదీప్తాగ్నినిహితహవ్యంబు హతము, వృషలభిక్షును గొని యొనర్చినమఖంబు
శ్రద్ధతోడను మకరమాసంబునందు, స్నాన మొనరింపకున్న జన్మము హతంబు. 2030
క. వచ్చె ననంగనె మాఘం, బెచ్చటనుండినను నఘము లెల్లను మనకున్
జిచ్చుఱపిడుగు తెఱంగున, వచ్చెను లయకాల మనుచు వడఁకుచు నుండున్. 2031

గీ. బ్రహ్మహత్యాదిఘోరపాపములు సేసి, నట్టివారల నేని మే మిట్టె పరమ
పావనులఁ జేయఁగల మని ప్రబలముగను, జలము ఘోషించు మాఘమాసంబునందు.

గీ. జలదములనుండి శశివోలె సర్వపాప, వర్గములనుండి ముక్తుఁ డై వహ్నివోలెఁ
బ్రజ్వరిల్లును రవి మకరస్థుఁ డైన, మాసమున స్నాన మొనరించుమానవుండు. 2033

వ. జ్ఞానకృతంబులును నజ్ఞానకృతంబులును బ్రమాదకృతంబులును వాఙ్మనసకాయకృతం
బులును నైనమహార్ద్రశుష్కలఘుస్థూలపాపంబు లన్నియును మాఘస్నానంబున నన
లంబుచేఁ గాష్ఠంబులుబోలె దగ్ధంబు లగు. 2034

క. నిలుపును మాఘస్నానము, కలుషంబుల నెల్ల నడఁచి కలకాలంబున్
విలయచ్యుతపదమున ని, శ్చలముగ హరిభక్తివోలె సకలజనములన్. 2035

క. మాఘస్నానమె యజ్ఞము, మాఘస్నానంబె తపము మంత్రము లెల్లన్

గీ. మాఘస్నానమె పుణ్యము, మాఘస్నానంబుకంటె మఱి లేదు సుమీ. 2036

ఒనరు జన్మాంతరాభ్యాసముననె మాఘ, మాసమున స్నాన మాచరింపంగ బుద్ధి
యాత్మతత్త్వవిచారమునందుఁ బోలెఁ, మహిని బ్రాదుర్భవించినమానవులకు. 2037

క. జనులకు సంసృతిపంకం, బును గడిసికొనంగ లోకమున నెందుఁ గనుం
గొనినను మాఘస్నానం, బునకంటెను నన్యమార్గములు లేవు సుమీ. 2038

—: ఋషీకావృత్తాంతకథనము :—

సీ. కలదు ఋషీక నాఁగను గన్య యొక్కతె, భృగువంశమున మున్ను పృథ్వి లోనఁ
బ్రాప్తించుటనుజేసి బాల్యంబునంద వై, ధవ్యంబు తన కామె ధైర్యమునను
నిగృహీతచిత్త యై నియమంబులోడను, నాచరించుచును గృచ్ఛ్రాదివిధుల
నుంఛవృత్తిని భుక్తి నొనరించుచును షష్ఠ, కాలంబునను బారికాంక్షివోలె

గీ. నలిపి స్నానంబు షష్టివర్షములదాఁక, మాఘమాసంబులందుఁ బ్రమాదరహిత
ముగను రేవాకపిలసంగమునను నొక్క, దినమునను నర్మదాతటంబునను బ్రమందె.

సీ. అంతట వారిభృత్యు లరుదెంచి యామెను, గొనిపోవ వై కుంఠమునకు నచట
నుండి నాలుగువేలయుగములవఱ కామె, యఖిలభోగంబుల ననుభవించి
సత్యలోకమునకుఁ జనుదెంచి పిమ్మట, నుండి నాలుగువేలయుగములిచట
నఖిలభోగంబుల ననుభవించుచు నుండ, స్వకృతమాఘస్నానసుకృతమునను

గీ. నపుడు సుందోపసుందాఖ్యు లైనదైత్యు, లమరులను బాధపెట్టంగ నమరు లెల్ల
నాకడకు వచ్చి వారిమర్మయముఁ దెలుప, దైత్యనాశన మొనరింపఁ దలఁచి నేను.

వ. మాఘస్నానపుణ్యశేషంబునంజేసి సంకల్పమాత్రంబున నాసతీమణినిఁ ద్రిలోకమో
హినిఁ గా నొనరించి యామెకుఁ దిలోత్తమ యనుపేరు వెట్టి సుందోపసుందనాశంబు
గావింప నానతీయ నానారీమణి నాయాజ్ఞ నాదలం దాల్చి వీణాపాణి యై నాలో
కంబునుండి బయలుదేఱి సుందోపసుందు లుండుపురంబునకుం జేరి తత్సమీపంబునం

దుండునశోకవనంబునం బ్రవేశించి యందొక్క విటపిక్రిందఁ జంద్రకాంతశిలావేదిపైఁ
గూర్చుండి జగన్మోహనంబుగా వీణాగానముం జేయుచుండ. 2041

సీ. ఆశానమునకును నాహూపమునకును, వనపాలు రాశ్చర్యమును వహించి
కేళీకూళిని జలక్రీడ గావించుచుం, దోపసుమలకడ కొయ్య నేఁగి
విన్నవించంగ నావెలఁదిలావణ్యంబు, సుందోపసుందులు చోద్య మొంది
విడిచి జలక్రీడ విడిచి కేళీకూళి, యమరాంగనాసహస్రమును విడిచి

గీ. కాలదండంబు లన నొప్పుగదలఁ దాల్చి, వనమునను దమ్ముఁ జంపఁగా నచ్చినట్టి
మృత్యుదేవత నాఁ దేజరిల్లుచున్న, యావధూమణికడ కేఁగి ధుర్షణంబ, 2042

క. కనుఁగొని తద్రూపంబును, గనువేదుఱు గదుర నీజగన్మోహిని నేఁ
గొనియెద నేఁ గొనియెద నేఁ, గొనియెద నని కలిసి కొట్టుకొని చచ్చి రటన్. 2043

సీ. అంతట నాకాంత యమరకార్యంబును, నెఱవేర్చి యత్యంతనిపుణముగను
దిరుగ మామకసన్నిధికి నేఁగుదెంచి వం, దనము గావింప మత్పాదములకుఁ
జెంది నే ననుపమానంద మామెకు నిచ్చి, స్థానంబు సూర్యరథంబునందు
నాదిత్యుఁ డుండెడునంతదాఁకను నందె, వసియింపఁగను వర మొసఁగినాఁడ

గీ. నాఋషీక తిలోత్తమ యై సమస్త, సౌఖ్యము లనుభవించుచు సౌరలోక
మందు నిప్పటికిని నుండు నలవి గాదు, తెలియఁజేయ మాఘస్నానఫలము ననఘ.

క. అనవుడు నారదుఁ డెంతయు, మనమున విస్మయము గదుర మాఘస్నానం
బున నొదవుఫలమునకుఁ ద, ద్ఘనతను దొడఁగెను నుతింపఁగను జగములలోన్. 2045

—: శ్రీకుండలవికుండలవృత్తాంతకథనము :—

వ. పూర్వము కృతయుగంబున నిషధపట్టనంబునందుఁ గులీనుండును దేవబ్రాహ్మణసేవాపరుండును సత్కర్మపరాయణుండును నగు హేమకుండలుం డనునొక్క వైశ్యుండు గలండు. 2046

గీ. శాకములు తైలములును గాష్ఠములు ధాన్య
ములును క్షీరాజ్యదధితక్రములును వస్త్ర
ములు ఫలంబులు మొదలుగాఁ గలపదార్థ
ములను గొని యమ్ము నావైశ్యపుంగవుండు. 2047

క. చలుపును బశుపోషణమును, జలుపున్ గృషి వర్తకంబు సలుపును దేనం
గలుగునొ లాభము దానిన్, జలుపును వైశ్యుండు లోకసమ్మతి గాఁగన్. 2048

క. మెలఁగుచుఁ దలలో నాలుక, వలె లోకుల కాతఁ డట్లు వ్యాపారములన్
జలుపుచును బలుతెఱంగుల, యలవుల నార్జించె నష్టహాటకకోటుల్. 2049

క. అంతట నాతఁడు బహుధన, వంతుం డని తలఁచి వలచివచ్చు నన జరా
కాంత యరుదెంచి తను వా, ద్యంతంబును నాక్రమించె నతిచిత్రమ్ముగన్. 2050

గీ. అపుడు సంసారవైచిత్ర్య మాత్మలోన, నతఁడు తలపోసి తలపోసి యార్జితార్థ
మందు షష్ఠాంశమును బరమార్థకార్య, ములకు వినియోగపఱిచెడితలఁపు గలిగి.
సీ. హరిహరదేవాలయములు గట్టించి త, త్ప్రాజకఁ జాలినభూమి లోనఁగ
నశ్వత్థజంబూవటామ్రకంకేళినిం, బాదపుణ్యానోకహములు నిలిపెఁ
బుష్కరిణులును వాపులు దటాకంబులుఁ, ద్రవ్వించె సలిలంబు తఱుగకుండ
నన్నపానము లవిచ్ఛిన్నంబులుగ నీయ, స్థాపించె శాశ్వతసత్త్రములను
గీ. నాల్గుదెసలను బెట్టించె నగరమునకు, బహుళపానీయశాల లేర్పఱిచెఁ బుష్ప
వనములు పురాణములలోన వినినయట్టి, దానములు సేసె బ్రాహ్మణోత్తముల కధిప.
క. జననము మొదలుగఁ గాపిం, చినపాపము లెల్ల ద్రుల్లఁ జేసికొనియెఁ బె
త్తనమునఁ బ్రాయశ్చిత్తము, వినయముతోడను నతండు విప్రులయెదుటన్. 2053
గీ. అటులు చేయంగఁదగినకార్యముల నెల్లఁ, జేసి యాతండు పిదప శేషించినట్టి
ధనము సర్వంబు నర్పించెఁ దనతనూజు, లైన శ్రీకుండలవికుండలాహ్వయులకు. 2054
ఆ. అవల వారిపైని నాత్మీయభార మం, తయును మోపి విగతతాపుఁ డగుచుఁ
జొచ్చి వనము తనువు శోషిల్లఁ దపము గా, వించి చేరె నతఁడు విష్ణుపదము. 2055
వ. అంతటఁ గొలఁదికాలంబునకు నవయౌవనంబు ప్రాప్తించుటయు శ్రీకుండలవికుండలులు
ధనమదంబునఁ గన్నుగానక. 2056
సీ. విహరింపఁ దొడఁగిరి వీథులలోఁ బణ్య, భామలతోఁ గూడి పాడుకొనుచు
నార్జింపఁ దొడఁగిరి యతిసులభంబుగాఁ, బరవధూసంసర్గపాతకంబుఁ
జేర్పంగఁ దొడఁగిరి తార్పుకత్తియలను, జాటుకారులఁ దమసవిధమునకుఁ
జరియింపఁ దొడఁగిరి సర్వకాలములందు, ద్విపహయస్యందనాదికము నెక్కి
గీ. తల్లి చెప్పెడిబుద్ధులు పొల్లుచేసి, పెద్దలు వచించుమాటలు బెండువఱచి
యంకుశము లేనికలభములట్లు బలిసి, తిరుగఁ దొడఁగిరి భయము భక్తియును లేక.
క. ఒకక్షణమునఁ గలవేషం, బొకక్షణమునఁ బనికిరామి నొకటి విడిచి పై
నొకటి ధరించుచు నుందురు, వికలమతులుపోలె నెల్లవేళల వారల్. 2058
క. ఘనసారము చందనముం, బునుఁగును గస్తురియుఁ జాదు మొదలై ననువా
సనవస్తువుల ననారత, మును దాల్తురు వారు జనులు మోహము చెందన్. 2059
క. చలిపి యెఱుఁగరు వారలు, జలజాక్షునిపూజ యెట్టిసమయమునందున్
బలికి యెఱుఁగరు హరి యను, పలుకును గలనైన నెట్టిపాపులొ వారల్. 2060
గీ. కితవులను గూడి కైతవక్రీడనములు, సేయుచును జేయుచును మద్యసేవనములు
ద్రవిణమును నీతిబాహ్యకార్యముల కెల్ల, వ్యయముచేయఁ దొడంగి రావైశ్యసుతులు.
గీ. ఊషరక్షేత్రమున బీజ మంచినట్లు, తండ్రికష్టార్జితము నపాత్రములయందు
ధారపోసెదరే కాని వారు కడకు, దర్శనం బైన నీరు విద్వాంసుఁ డనిన. 2062

గీ. ఆవిధంబునఁ గొన్నినాళ్లరుగ నచిర, కాలముననె గతించెను గలధనంబు
సర్వమును దోయనిధులును సమసిపోనె, యెడతెగక తోయ మేతములెత్తి తోడ.

క. ఎప్పుడు లక్ష్మి తొలంగెనొ, యప్పుడె పరివార మెల్ల నవలకుఁ దొలఁగెన్
గుప్పలుగ మూఁగునీఁగలు, తప్పికొనుంగాదె గుడము తఱిగినవెనుకన్. 2064

క. అంతట వారలు చింతా, క్రాంతహృదయు లగుచుఁ జేత గవ్వయు లేమిన్
జెంతకు నెవరును జేరమి, నంతంతకు హెచ్చుక్షుధకు నాఁగఁగ లేమిన్. 2065

క. ప్రారంభించిరి చౌర్యము, పౌరులగేహంబులందుఁ బ్రభు వాక్కృత్యం
బారసి దేశమునుండియె, వారిని వెడలంగఁ గొట్టె వనభూములకున్. 2066

చ. వనమును జొచ్చి వారచట వర్తిలు చుండు కిరాతకోటితో
నొనరిచి చెల్మి వేట కుపయుక్తము లైన విధానముల్ గనుం
గొని మృగపక్షిసంతతులఁ గొట్టి తదామిషమున్ భుజించుచున్
దినములు గొన్ని యావిపినదేశమునన్ వెడలించి రావిధిన్. 2067

క. అంతటను నొక్కనాఁ డా, కాంతారమునందు నొకమృగంబును లేమిన్
జింతిలి యొకఁ డొక్కయర, ణ్యాంతరమున కొక్కఁ డొక్కయద్రికిఁ బోయెన్.

గీ. అరిగి యట మెకములను వేటాడుచుండ, విధివిధానంబుచే నొక్కవేళయంద
పెద్దపులినోటఁ బడి చచ్చెఁ బెద్దవాఁడు, పన్నగముకాటునను జచ్చెఁ బిన్నవాఁడు.

ఆ. శమనదూత లంతఁ జనుదెంచి వెంటనె, కాలపాశములను గట్టివారి
ననిలజవముతోడఁ గొనిపోయి యుంచిరి, దండధరునిసన్నిధానమందు. 2070

చ. కనుఁగొని వారి నంతకుఁడు గన్గొని తద్విషయంబు చిత్రగు
ప్తునివలనన్ సమస్తమును దూతల కాజ్ఞ నొసంగి వారిలో
ననుజుని నాకలోకమున కంపఁగ నన్నను రౌరవంబునం
దునుపఁగ నేఁగె నొక్కత్రుటియున్ నివసింపక యాస్థలంబునన్. 2071

క. శమనుం డాజ్ఞాపించిన, నిమిషముననె భటుఁ డొకండు నిలిపె ననలకుం
డమునం దన్నను నొకభటుఁ, డమరపురికి బయలుదేఱె ననుజునితోడన్. 2072

వ. అప్పుడు వికుండలుండు దివ్యవిమానంబు నధిష్ఠించి దేవదూతతోడ సుఖంబుగాఁ ద్రివిష్టపంబున కేఁగుచు మనంబునం దొక్కసందేహంబు గలుగ నాతనితో ని ట్లనియె.

క. దేవా దేవభటుండవు, నీ వెఱుఁగనిధర్మ ముండనేర దొకండున్
గావున నామదిలోపల, నావహిలినయొక్కసంశయము దీర్పఁగదే. 2074

చ. కలిగితి మన్నదమ్ములము గా నొకగర్భమునందె పాపముల్
సలిపితి మొక్కతీరుననె చావును దుల్యమె యిందులోన నేఁ
జలిపినపుణ్య మేమి సహజన్ముఁడు సల్పినపాప మేమి నా
కొలయఁగ నేల యూర్ధ్వగతి యొందఁగ నేల యతం డధోగతిన్. 2075

చ. అనవుడు దేవదూత యతఁ డాడినమాటకు నుత్తరంబు గాఁ
గను నిటు పల్కెఁ బ్రాణులు జగంబునఁ దండ్రి య టంచుఁ దల్లి యం
చును సుతుఁ డంచు జాయ యనుచున్ స్వస యంచును భ్రాత యంచు సం
జ్ఞను వహియించి పుట్టుచును జచ్చుచు నుందురు కర్మభుక్తికై. 2076

క. ఒకపాదపమున నానా, శకునంబులు చేరినట్లు జంతుతతులు స్వ
స్వకృతముల ననుభవించుట, కొకసంసారమునఁ జేరు చుండు ధరిత్రిన్. 2077

గీ. వెనుకటిభవంబులందుఁ గావించినట్టి, కర్మములు పుణ్యములొ పాతకములొ యేవొ
ప్రాణి తత్ఫలంబుల ననుభవించు, చుండు ఋణమును నెడ తెగకుండ ననఘ. 2078

క. ఒక్కఁడె చేయుం గర్మము, నొక్కఁడె తత్కర్మఫలము నొందును వత్సా
యొక్కఁడు చేసినకర్మం, బొక్కపు డేనియును నంట దొం డొక్కనికిన్. 2079

క. కావున నీసహజన్ముఁడు, గావించినయశుభ మశుభగతి నాతనికిన్
గావించెను గావించెను, నీ వొనరించినశుభంబు నీకు శుభంబున్. 2080

క. అనవుడు వికుండలుం డి, ట్లనియెను నే నాదినుండి యఘములు దక్కన్
బొనరించి యెఱుఁగ ధర్మము, లను నాకె ట్లొదవె సుకృతలాభము చెప్పుమా. 2081

క. అనుటయు నమరభటుం డి, ట్లనియె వికుండలునితోడ నయ్యా నీచే
సినపుణ్య మిా వెఱుఁగవు, విను మేను వచింతు నీకు విశదము గాఁగన్. 2082

సీ. కాళిందిదక్షిణకూలంబునం దుండె, ననవద్య మగు నొకయాశ్రమంబు
హరిమిత్రుఁ డనెడిబ్రాహ్మణునిపుత్రుం డొక్కఁ, డాయాశ్రమంబున నధివసించె
నామ్నాయనిధి యైనయాభూసురునితోడఁ, గలిగె స్నేహము దైవికముగ నీకు
దానిచేతన రెండుస్నానముల్ నీకు సం, ప్రాప్తించె యమునలో మాఘమందు

గీ. మొదటిస్నానంబువలన నిర్మలముగను, సకలపాతకములు గూడ సమసిపోయె
హస్తగత మయ్యె ననితరప్రాప్య మైన, స్వర్గలోకంబు రెండవస్నానమునను. 2083

గీ. కాన సుఖియింపు మింక స్వర్గమున నీవు, శాశ్వతంబుగ దేవతల్ సన్నుతింప
ననుభవించునఁగాక వీఁ డాయన్న తీవ్ర, యాతనలు ఘోరనరకములందుఁ గూలి.

చ. అనుటయు భ్రాతృదుఃఖమును నాఁపికొనంగ వశంబు గామిచేఁ
గనుఁగవనుండి బాష్పములు గాల్వలు గట్టఁగ నాతఁ డేడ్చె నా
ననమున దీనభావమును నాలుకయందును శుష్కభావమున్.
మనమున స్నేహభావమును మాటికి మాటికిఁ బ్రస్ఫురింపఁగన్. 2085

ఆ. అట్టు లేడ్చి యేడ్చి యాతండు పులకాంకు, రాంకితాఖిలాంగుఁ డగుచు నపుడు
పలికె నిట్లు దేవభటునితోఁ దనయన్న, నుద్ధరించుటకును బుద్ధి గలిగి. 2086

క. తెలిసినవాఁడవు సర్వముఁ, దెలిపితివి ప్రమోద మయ్యె దేవా నాకున్
దెలుపఁగవలసినవిషయము, కలదు మ ఱొక్కండు నీవు కరుణించినచోన్. 2087

క. చేకూరునో దుర్గతి యే, యేకర్మంబులను సుగతి యేరుపడునో యే
యేకర్మములను నా కా, యాకర్మంబులను జెప్పుమయ్యా మహాత్మా. 2088

చ. అనవుడు నావిరించిసుతుఁ డిటుల్ వచియించె నయ్యా నీ
వనఘుఁడ వైతి ధర్మముల నారయుబుద్ధి విశుద్ధమానసం
బునను జనించు లేనియెడఁ బుట్టదు గావున నీకు శ్రేయముల్
వినిచెద ముందు నాకు నెఱవేర్పఁగఁ గార్యము లెన్ని యుండినన్. 2089

—: సుగతిదుర్గతిహేతుకర్మకథనము :—

క. మనమున వాక్కునఁ గాయం, బున నెవనికి నెట్టికాలమున నైనను హిం
సను గావింపక యుండెడి, జనములు యమలోకమునకుఁ జనరు కుమారా. 2090

క. ఉత్తమధర్మ మహింసయె, యుత్తమదానంబు హింస యొనరింపమియే
యుత్తమతపం బహింసయె, యుత్తమగుణ మన నహింస యొకటియె వత్సా. 2091

క. క్రిములను మశకములను స, ర్పములను బక్షులను నరులఁ బ్రాణులసందో
హము నెల్లను నాత్మౌప, మ్యమునం గనువారు గనరు యమలోకంబున్. 2092

క. పితృపతిపుటభేదనమున, నతఁ డొందెడు మాద్యమును నయస్కీలము వ్రే
తతరంగిణి మొదలగుదు, ర్గతులను జేయండొ యెవఁడు ప్రాణికి హింసన్. 2093

సీ. స్థలజలచరజంతువులను జీవికకునై, హననంబు గావించునట్టివారు
కాలసూత్రంబునఁ గూలి భక్షించుచు, శునకమాంసము పూయశోణితములు
పానంబు సేయుచుఁ బడి వసాపంకంబు, నను మునుంగుచుఁ గనుంగొనఁగలేక
యన్యోన్యతాడనాన్యోన్య ఖాదనములు, గావించుకొనుచుఁ జీకాకుపడుచుఁ

గీ. బొడుచు చుండ నధోముఖంబు లగుక్రిములు
మూర్ఛిలుచుఁ దెప్పిఁజిల్లుచు మొత్తుకొనుచుఁ
గల్పము లనేకములు పుచ్చి కట్టకడను
బుట్టుదురు స్థావరములుగాఁ బుడమిలోన. 2094

ఉ. అట్టులు స్థావరంబులుగ నై బహుకాలము మున్ను చేసియు
న్నట్టియధర్మకర్మమున కైనఫలంబు భుజించి యంతమం
దెట్టులొ తిర్యగాకృతి వహించి విగర్హ్యము లైనయోనులం
బుట్టి పురాకృతాఘఫలముల్ భుజియింతు రనేకవర్షముల్. 2095

గీ. అటులు కర్మఫలంబువా రనుభవించి, యుదయ మొందుదురు మనుష్యయోనులందుఁ
దుదకు జాత్యంధులుగ దరిద్రులుగ బుద్ధి, హీనులుగ హీనులుగ నంగహీనులుగను.

క. కావున లోకద్వయమును, గావలయు న టన్నకోర్కి గలిగినవారల్
జీవులకు హింస నెపుడున్, గావింపఁగరాదు త్రికరణములను వత్సా. 2097

గీ. తలఁప కుందురో యెవరు ప్రాణులకుఁ హింస, కలుగదు భయంబు వారి కెక్కడను గూడఁ
దలఁచు చుందురో యెవరు ప్రాణులకు హింస, గలుగ దభయంబు వారి కెక్కడనుగూడ.

గీ. అఖిలనదులును సాగరమందుఁ జేరు, తీరున సమస్తధర్మముల్ చేరు నిఖిల
వృజినహారిణి యైనయహింసయందు, దానితో సాటి యైనతీర్థంబు లేదు. 2099

గీ. అభయమును భూతముల కిచ్చునట్టివాఁడె, యఖిలయజ్ఞంబులును జేసినట్టివాఁడు
ప్రాణులను ద్వేషముసఁ జూడనట్టివాఁడె, యఖిలతీర్థంబులను మునిగినట్టివాఁడు. 2100

గీ. చేయరా నిది యియ్యది చేయవలయు, ననుచు శాస్త్రంబు విధియించినట్టివిధుల
దాఁటకుండఁగఁ బాలించుధార్మికులకుఁ, గలుగనేరదు శమనలోకప్రసక్తి. 2101

క. కానంబడుదురు త్రిదివ, స్థానంబునయందు బ్రహ్మచారియు గృహియున్
వానప్రస్థుఁడు యతియును, మానక నిజధర్మములను మసలిర యేనిన్. 2102

సీ. అధ్యయనము సంధ్యోపాసనయును జేసి, మరణంబు నొందినధరణిసురులు
శత్రువుల్ ముట్టిన సంగ్రామమున వెన్ను, చూపక చచ్చినశూరభటులు
శరణన్నవారిరక్షణమునకై తమ, తనువు లర్పించినధార్మికులును
స్వస్వవర్ణాశ్రమాచారధర్మము లను, ష్ఠించి గతించినచేతనులును

గీ. నాపదను బొందియున్నబ్రాహ్మణుని బరదఁ, గూరుకొనిపోయి లేవనిగోవు నుద్ధ
రించినట్టిమహాత్ములుఁ ద్రిదివమందు, ననుభవింతురు దివ్యసౌఖ్యముల నెల్ల. 2103

గీ. రోగుల ననాథులను దరిద్రులను గ్రుడ్డి, వారలను గుంటివారల వార్ధకమున
నున్నవారల నోమినయుత్తములకు, నాకముననుండి విచ్యుతి లేకయుండు. 2104

క. గోవుల నధిరోహింపక, గోవులకున్ గ్రాస మిడుచు గోశుశ్రూషన్
గావించుచు జీవించెడి, పావనులకు దివము కొంగుపసిడియె వత్సా. 2105

క. గోవులు జలపానంబుం, గావించుటకొఱకు నొక్కగర్తం బైనన్
గావించుపుణ్యపురుషుల, వైవస్వతభటులు చూడ వణఁకుదు రనఘా. 2106

క. సురలను గురులను ధరణీ, సురులను బూజించునట్టిశుద్ధాత్ములకున్
సురలోకవాసభాగ్యము, కరబదరసమాన మనుచుఁ గాంచుము వత్సా. 2107

క. జలమందును స్థలమందును, గలప్రాణులు జలముఁ ద్రావఁగాఁ దగుకూపం
బులు గాలువలు తటాకం, బులు నిలిపినఁ గలుగుఁ ద్రిదివమున నిలువంగన్. 2108

క. ప్రాతస్స్నానమునందుం, బాతకముల నెల్ల రూపుమాపెడిపరమ
జ్యోతి వెలయుటను బ్రాత, స్స్నాతుల కెన్నఁడును లేదు నరకము వత్సా. 2109

క. స్నానము సేయక తినియెడి, మానవుఁడు మలంబు దినెడిమానవుఁడె సుమీ
కానఁబడఁ డపరిశుద్ధుఁడు, కానఁబడఁడు పాపి వానికంటెఁ గుమారా. 2110

క. పితృదేవత లస్నాయికిఁ, బ్రతికూలురు వాఁడు నరకపతితుం డగుచున్
మితి లేనిదుఃఖములు గని, క్షితిలోనఁ బురీషమందుఁ గ్రిమి యై పుట్టున్. 2111

క. కానరు యమలోకమును న్ఱ, యోనులలోఁ బుట్టి యార్తి నొందరు స్రోత
స్స్నానము పర్వదినంబుల, లోనం గావించునట్టిలోకులు వత్సా. 2112

క. తిలలు తిలప్రస్థంబును, దిలపాత్రంబును యథావిధిగ దానంబుల్
జలిపినపుణ్యాత్ములకుఁ, గలుగదు యమలోకదర్శనంబు కుమారా. 2113

క. కానరు యమలోకము గో, దానంబును స్వర్ణరజతదానంబును భూ
దానము మొదలగు బహువిధ, దానంబులు చేసినట్టిధార్మికు లనఘా. 2114

క. వెలలేనిపుణ్యదినములు, సలుపక వంధ్యముగ నందు స్నానము దానం
బులును దమశక్తికొలఁదిని, జలిపినవారలకు సుగతి సంప్రాప్తించున్. 2115

క. దాత లగువారు రౌరవ, యాతనలకుఁ బోక దివికి నరిగి మరలఁ దా
మేతెంచి రేని పుట్టరు, క్ష్మాతలమున నిర్ధనావసథములలోనన్. 2116

సీ. పరుషవాక్యంబులు పలుకనివాఁడును, నాచారసంపన్నుఁ డైనవాఁడు
పరదోషములను గోపనము సేసెడివాఁడు, పరగుణంబులు బయల్పఱచువాఁడు
ననసూయకుఁడు మనంబం దైనఁ బరధనం, బపహరింపఁ దలంపనట్టివాఁడు
నఖిలభూతములయం దనుకంప గలవాఁడు, దాక్షిణ్యగుణముచేఁ దనరువాఁడు

గీ. మాని యగువాఁడు దుర్బుద్ధి లేనివాఁడు, ఋతము పలికెడివాఁడును బ్రియము నుడువు
నట్టివాఁడును యమలోకయాతనలను, గడకు స్వప్నమునం దైనఁ గనరు వింటె.

క. దురితాత్ములలో నధికులు, పరాపవాదియును మఱియుఁ బాషండుండున్
నరకములె గతులు వారికి, వరుసగ నాభూతసంప్లవంబును వత్సా. 2118

క. పరుషముగ మాటలాడెడి, నరులకు యమలోకమందు నరకము మీఁదన్
నరకమె తప్ప మఱొక్కటి, దొరకదు చేయూఁత యెంతదుఃఖంపడినన్. 2119

క. పితృపతిదండప్రహరణ, గతి దప్పఁ గృతఘ్నునకు జగంబులలో ని
ష్కృతి లేదు తీర్థములచేఁ, గ్రతువులచే నఖిలపుణ్యకర్మంబులచేన్. 2120

క. నియతాహారుం డయి యిం,
ద్రియముల నియమించి పుణ్యతీర్థములందున్
మెయి ముంచినట్టిమానవుఁ,
డెయిదఁడు యమభటులచేతియీఁటెలపోటుల్. 2121

గీ. చేయఁగూడదు తీర్థోపజీవనంబు, తీర్థమునఁ బాతకమును బ్రతిగ్రహమును
ధర్మవిక్రయమును జేయఁ దగదు చేసె, నేని తప్పదు నరకంబు వేని కైన. 2122

క. సరిగావు జపతపంబులు, సరిగావు మఖంబు లెట్టిసత్కర్ములున్
సరిగావు జహ్నుతనయా, సరిదంబుకణాభిషేకసంసిక్తునితోన్. 2123

మ. హరిపాదాగత మైనధర్మరస మై యబ్జజ మై మాయకున్
బర మై నిర్గుణ మై వినిర్మలము నై బ్రహ్మాత్మకం బై నిరం

తరముగ భాసిల్లుచుండు గాంగజల మాహాత్మ్యంబు గుర్తించుటకుఁ
ధరియించెఁ బరమేశ్వరుండు తనమూర్ధంబందు భాగీరథిన్. 2124

క. తీర్థములలోన నుత్తమ, తీర్థం బగుగంగ సర్వతీర్థసమముగా
నర్థమెఱుంగక పలికెడి, వ్యర్థుఁ డిహాపరములందు వ్యర్థుఁడు వత్సా. 2125

క. తనయునికి యోజనంబులు, గను నున్నను నోట గంగ గంగ యని వచిం
చినమాత్ర నఖిలపాపము, లును జెంది నరుండు విష్ణులోకము నొందున్. 2126

గీ. శతసహస్రజన్మాంతరసంచితంబు, లైనపాతకరాసుల నగ్నికణము
తూలరాసులఁ బోలె నిర్మూలముగను, జేయునది యొక్క గంగాంబుశీకరంబు. 2127

క. కావున గంగానదిలో, నేవిధమున నైన స్నాన మేనాఁ జేసిం
గావింపవలయు శ్రేయము, కావలయు నటన్న కోర్కి గలిగినవారల్. 2128

క. జీవనము జలము ప్రాణికిఁ, గావున జలదానమునను గలుగు నరులకున్
జీవనదానఫలం బది, దేవత్వము నొసఁగు దానిఁ దెలియరు మూఢుల్. 2129

క. కలిగియును బత్రిగృహమును, జలుపఁగ సామర్థ్య మట్లు సలుపనివిప్రుల్
విలసిల్లుదు రాకసమునఁ, గళకళలాడంచును దారకారూపములన్. 2130

గీ. ఉరిని జిక్కినపక్షుల నుద్ధరించి, నట్టివారును గోష్ఠమునందుఁ బ్రాణ
ములను విడిచినయట్టివారలును గూడఁ, దార లై యుండెదరు నభస్థలమునందు.

గీ. ప్రతిదినంబును బదునాలు ప్రాణసంయ, మములఁ గావించు చుండెడిమహిమ యొకఁడె
బ్రహ్మహత్యను జేసినపాపి నైనఁ, బావనునిఁ జేసి వైకుంఠపదముఁ జేర్చు. 2132

క. అనుదివసమును గుశాగ్రం, బున నబ్బిందువు శతాబ్దములవఱకును ద్రా
వినవారి కొదవుఫలమును, గనుఁ బ్రాణాయామకరుఁడు కడు సులభముగన్. 2133

క. ఒకమాట వినుము తీర్థ, ప్రకరములును వ్రతశతములు క్రతుసంతతులున్
సుకృతవిధానము లన్నియు, నొకయెత్తును బ్రాణరోధ మొకయెత్తు సుమీ. 2134

క. మనమున నైనను బరకాం, తను వలవనివాఁడు త్రిభువనములును ధరియిం
చినవాఁడు వానివలననె, యునికి జగంబులకు నెల్ల నొదవెను ననఘా. 2135

క. దొరలించు నేకవింశతి, నరకములందును బరాంగనాసంగమ మా
తెరువునకుఁ జనరు పోవఁగ, నరకములకు భయముఁ జెందునరులు కుమారా. 2136

క. పరసతుల నభిలషింపని, పురుషులు నెలకొల్పి యశము భూస్థలి నాపై
సురలోకమందు వసియిం, తురు దివ్యకళాప్రదీప్తితోడ సుఖముగన్. 2137

గీ. సారెకును సారెకును గ్రోధకారణంబు, లెన్ని సమకూరినను వాని నెన్నకుండఁ
గ్రోధము జయించినట్టియక్రోధనుండె, స్వర్గలోకంబును జయించు సత్త్వశాలి. 2138

క. తలిదండ్రుల దేవతలును, బలె నారాధించినట్టిపావనమూర్తుల్
తిలకింపరు వైవస్వత, నిలయద్వారమును గృతాఖిలాఘునిగ్రహు లగుటన్. 2139

క. తమదండ్రులకంటెను నధి, కముగా గురువులను బూజగావించునరో
త్తము లేగుదు రతిథులుగాఁ, గమలాసనునింటి కుచితగౌరవు లగుటన్. 2140

క. శీలపరిరక్షణంబున, స్త్రీలకు నిహమందె సకలసిద్ధులు గలుగున్
గాలునిపోటులు తప్పవు, శీలము చెడె నేని యెట్టిచెలువల కైనన్. 2141

క. ప్రతిషిద్ధకర్మకరణము, కతంబునను శాకయజ్ఞకరణమునను దు
ర్గతి గలుగు శూద్రునకు స, ద్గతి గలుగును విహితకర్మకరణముచేతన్. 2142

సీ. ఆమ్నాయ మంతయు నధ్యయనము చేసి, శాస్త్రంబులోఁ గలసార మెఱిఁగి
స్మృతిధర్మములను గుర్తించి పురాణముల్, చదివి సంహితలను సంగ్రహించి
పోఁగొట్టుకొని పాపముల నెల్లఁ దత్తద, భ్యాసమాహాత్మ్యసంప్రాప్తివలన
నొనరించుకొని జన్మమును సార్థకంబుగా, వేదాంతనిష్ఠావినోదమునను

గీ. బూజనీయంబు లగుధర్మబీజములను
జనులసుఖమునకై వెదచల్లునట్టి
బ్రాహ్మణులు బ్రహ్మలోకంబు వడయువారు
వారె జగములు ధరియించువారు వింటె. 2143

క. నిగమాగమసింధూద్గత, మగుజ్ఞానామృతము నజ్ఞు లాస్వాదింపన్
దగునట్లొసంగువిప్రుని, నిగమాగమములును దేవునిఁగఁ బూజించున్. 2144

క. అమితరహస్యం బగువిష, యము నీకు వచింతు వినుము హరిపదభక్తుల్
యమభటుల నైన యమలో, కము నైనను యముని నైనఁ గాంచరు వత్సా. 2145

వ. అది యెట్టు లంటి వేని. 2146

క. ఆచారహీను లైన న, నాచారహతాత్ము లైన హరిభక్తులు మ
ద్గోచరులు గారు గావున, నాచరితారులను మీర లంటకుఁ డెపుడున్. 2147

క. మనుజులలో నెవఁ డేనియు, వనరుహనాభునిఁ బ్రసంగవశమున నైనన్
మనమున నొకపరిఁ దలఁచిన, ననఘుం డయి విష్ణుపదము నాసాదించున్. 2148

క. హరిభక్తులసాంగత్యము, దురితంబుల నెల్లఁ బాఱఁదోలును గానన్
హరిభక్తులతో నుండెడి, పరమపవిత్రులకుఁ దొలఁగి పాఱుఁడు మీరల్. 2149

క. అని యముఁడు భటుల కనుదిన, మును నాజ్ఞాపించు చుండు మొదటను గానన్
జనులకు సులభోపాయం, బనఁ దగు హరిభక్తి యమభయంబును గడవన్. 2150

క. నరకాంబుధిలోపలఁ బడి, పరిదేవనముల నొనర్చుపాపిష్ఠులకున్
హరినామస్మరణం బను, తరణి యొకటె యుద్ధరింపఁ దగినది వత్సా. 2151

చ. కనుఁగొనరాదు నీచునిఁగఁ గంసవిరోధిపదాంబుజంబులన్
దనమనమందు నిల్పికొని ధ్యానము సేయుచు నుండుమాలవా
నిని నయినన్ సరోజదళనేత్రునిభక్తులు వర్ణబాహ్యు లై
నను భువనత్రయంబును నొనర్తురు పూతముగన్ గుమారకా. 2152

క. తమదండ్రులకంటెను నధి, కముగా గురువులను బూజగావించునరో
త్తము లేఁగుదు రతిథులుగాఁ, గమలాసనునింటి కుచితగౌరవు లగుచున్. 2140
క. శీలపరిరక్షణంబున, స్త్రీలకు నిహమందె సకలసిద్ధులు గలుగున్
గాలునిపోటులు తప్పవు, శీలము చెడె నేని యెట్టిచెలువల కైనన్. 2141
క. ప్రతిషిద్ధకర్మకరణము, కతంబునను బాకయజ్ఞకరణమునను దు
ర్గతి గలుగు శూద్రునకు స, ద్గతి గలుగును విహితకర్మకరణముచేతన్. 2142
సీ. ఆమ్నాయ మంతయు నధ్యయనము చేసి, శాస్త్రంబులోఁ గలసార మెఱిఁగి
స్మృతిధర్మములను గుర్తించి పురాణముల్, చదివి సంహితలను సంగ్రహించి
పోఁగొట్టుకొని పాపముల నెల్లఁ దత్తద, భ్యాసమాహాత్మ్యసంప్రాప్తివలన
నొనరించుకొని జన్మమును సార్థకంబుగా, వేదాంతనిష్ఠావినోదమునను
గీ. బూజనీయంబు లగుధర్మబీజములను
జనులసుఖమునకై వెదచల్లునట్టి
బ్రాహ్మణులు బ్రహ్మలోకంబు వడయువారు
వారె జగములు ధరియించువారు వింటె. 2143
క. నిగమాగమసింధూద్గత, మగుజ్ఞానామృతము నజ్ఞు లాస్వాదింపన్
దగున ట్లొసంగుమిత్రుని, నిగమాగమములును దేవునిఁగఁ బూజించున్. 2144
క. అమితరహస్యం బగుచిమ, యము నీకు వచింతు వినుము హరిపదభక్తుల్
యమభటుల నైన యమలో, కము నైనను యముని నైనఁ గాంచరు వత్సా. 2145
వ. అది యెట్లు లంటి వేని. 2146
క. ఆచారహీను లైన న, నాచారహతాత్ము లైన హరిభక్తులు మ
ద్గోచరులు గారు గావున, నాచరితార్థులను మీర లంటకుఁ డెపుడున్. 2147
క. మనుజులలో నెవఁ డేనియు, వనరుహనాభునిఁ బ్రసంగవశమున నైనన్
మనమున నొకపరిఁ దలఁచిన, ననఘుం డయి విష్ణుపదము నాసాదించున్. 2148
క. హరిభక్తులసాంగత్యము, దురితంబుల నెల్లఁ బాఱఁదోలును గానన్
హరిభక్తులతో నుండెడి, పరమపవిత్రులకుఁ దొలఁగి పాఱుఁడు మీరల్. 2149
క. అని యముఁడు భటుల కనుదిన, మును నాజ్ఞాపించు చుండు మొదటను గానన్
జనులకు సులభోపాయం, బనఁ దగు హరిభక్తి యమభయంబును గడవన్. 2150
క. నరకాంబుధిలోపలఁ బడి, పరిదేవనముల నొనర్చుపాపిష్ఠులకున్
హరినామస్మరణం బను, తరణి యొకటె యుద్ధరింపఁ దగినది వత్సా. 2151
చ. కనుఁగొనరాదు నీచునిఁగఁ గంసవిరోధిపదాంబుజంబులన్
దనమనమందు నిల్పికొని ధ్యానము సేయుచు నుండుమాలవా
నిని నయినన్ సరోజదళనేత్రునిభక్తులు వర్ణబాహ్యులై
నను భువనత్రయంబును నొనర్తురు పూతముగన్ గుమారకా. 2152

గీ. చక్రధరుని సాలగ్రామచక్రమందుఁ, బూజగావించు చుండెడిపుణ్యపురుషు
లగ్నిహోత్రంబు లొనరించినట్టివారె, యఖిలభూదానమును జేసినట్టివారె. 2166

గీ. చక్రపాణి సాలగ్రామచక్రమందు, నుండినట్టులు ప్రీతితో నుండఁ డెపుడు
నాత్మవక్షస్థ యగులక్ష్మియందుఁ గాని, స్వాశ్రయం బగువైకుంఠమందుఁ గాని.

గీ. ఉపనిషత్తులు బ్రహ్మమై యుండినట్టి, యచ్యుతుని నన్వహముఁ గొనియాడుచుండు
నచ్యుతుండు సాలగ్రామమందు నుండుఁ, గానఁ దత్పూజకులు ముక్తిగనుట యరుదె.

క. పనివడి సాలగ్రామా, ర్చనమును బ్రతిదినముఁ జేయుసత్పురుషుఁడు పొం
దును వేయి రాజసూయము, లనుదినమును జేయుచుండునట్టిఫలంబుల్. 2169

క. అనవధికపాపయుతుఁడై, నను గర్మాచరణవిధమునను నధికారం
బొనరనివాఁడైనను గె, ల్చును సాలగ్రామపూజచొప్పున యమునిన్. 2170

వ. ఒక్కదినంబునందు ద్వాదశసాలగ్రామంబులు యథావిధిగ నర్చించుపుణ్యపురుషుండు ద్వాదశకోటిలింగంబులు ద్వాదశకాలంబులందును సువర్ణపద్మంబులచే నర్చించిన ఫలంబు వడయు. సాలగ్రామశతంబు నర్చించినమహాత్ముఁ డనేకకల్పంబులు విష్ణులోకంబునం దుండి కడకు భూలోకంబునఁ జక్రవర్తిగా నవతరించు. 2171

క. కామక్రోధాదిరిపు, స్తోమార్దితుఁడై నయపరిశుద్ధుం డేనిన్
క్షేమమున నుండు సాల, గ్రామార్చనవలన హరిసకాశమునందున్. 2172

క. క్రిమిజన్మంబును దిర్య, క్త్వమును శమనలోకనరకవాసవ్యథయున్
సమకూరవు సాలగ్రా, మము నర్చనచేయు చుండుమహాత్ములకున్. 2173

క. ఒకపరి సాలగ్రామము, నకు నభిషేకంబు సేసినను సమకూరున్
సకలాఘనాశనంబును, సుకృతావాప్తియును జిత్తశుద్ధియు ననఘా. 2174

క. సాలగ్రామశిలాకృతిఁ, దాలిచి హరి యున్నచోటఁ దపసులు యతుల్
వేలుపులు సిద్ధులును బదు, నాలుగుజగములును నుండు నైయత్యమునన్. 2175

గీ. శ్రద్ధతోడ సాలగ్రామచక్రమందుఁ, బితరులను గూర్చి పిండంబుపెట్టెనేని
పితరు లతితృప్తులై కల్పశతముదాఁక, దీవన లొసంగుచుందురు త్రిదివమందు.

క. రేవయు జాహ్నవియును గో, దావరియును మఱియు ముక్తిదములైన నదుల్
ప్రోవయి సాలగ్రామ, గ్రావాంబుకణంబులందుఁ గలవడి యుండున్. 2177

క. సాలగ్రామశిలాంబువుఁ, బోలినతీర్థంబు లేదు పుడమిని దానిన్
గ్రోలు నెడఁ బంచగవ్యము, లేల బహుతీర్థయాత్ర లేల వత్సా. 2178

క. సాలగ్రామజలంబును, గ్రోలినమానవుఁడు మరలఁ గ్రోలఁడు తా నే
వేళను మాతృస్తన్యము, వాలాయము విష్ణులోకవాసి యగుటచేన్. 2179

గీ. పురుగు లేని సాలగ్రామమునకుఁ గ్రోశ, మాత్రదూరంబులోపల నుండెనేని
దివ్యరూపంబుతోడ వర్తిల్లు విష్ణు, భక్తులను గూడి వైకుంఠభవనమందు. 2180

గీ. ఎచట నుండు సాలగ్రామ మహోటః తీర్థ, మనఁబడును యోజనత్రితయంబువఱకు
నందుఁ జేసెడిదానంబు లందుఁ జేయు, హోమములు గోటిగుణము లై యొప్పుచుండు.

గీ. త్మ్మాసురునకు సాలగ్రామచక్ర మొకటి, దాన మొసఁగినయుత్తమమానవుండు
శైలవనయుక్తముగను భూచక్ర మెల్ల, ధారవోసినఫలమును దాను జెందు. 2182

గీ. గంధపుష్పాదులను నుతిగానములను, జలిపె నేని సాలగ్రామచక్రపూజ
కల్పకోటిసహస్రంబు గడచువఱకు, మానవుం డుండు వైకుంఠమందిరమున. 2183

గీ. భూతలమున సాలగ్రామమును బరీక్ష, సేసినను వెల నిర్ణయించినను విక్ర
యించినను గొన్న వారల కెల్లరకును, గలుగు యమలోకవాస మాకల్పముగను.

క. ఏకాదశి గోవిందున, కాకాంక్షిత మైనదివస మాదివసమునన్
జేకూరినయుపవాసము, వైకుంఠంబునకు మెట్లు నరునకుఁ గట్టన్. 2185

క. లేదు త్రిలోకములను నే, కాదశితోఁ బోలునది యొకండును నఘసం
భేదనమునఁ బావనతా, పాదనమున నరకభయవిపాటనమందున్. 2186

క. ఒక యేకాదశి నైనను, నొకసెక్కెంబునకు నేని యెవఁ డుపవాసం
బొకతఱిఁ జేయునొ వానికిఁ, దకపికలాడరు దండధరునినియోజ్యుల్ 2187

క. ఎంతవఱకుఁ జేయరో దై, త్యాంతకశుభవాసరంబునం దుపవాసం
బంతవఱకు దేహమునం, దంతటనున్ నిండి యుండు నంహోరాసుల్. 2188

గీ. వాజిమేధసహస్రముల్ రాజసూయ, శతములును గూడ హరిదివసమునఁ జలుపు
నట్టియుపవాసమున షోడశాంశమునకు, నైన సామ్యంబు వడయ సర్వములు గావు.

క. ఏకాదశ్యుపవాసం, బేకాదశవిషయిసమితి నేర్పడినయఘా
నీకమును జండభానుఁడు, చీకట్లనుబోలెఁ జీల్చిచెండాడుఁ జుమీ. 2190

క. హరివాసరోపవాసము, కరుణించును సాధ్వి యైనకాంతకు నాయుః
పరిపూర్ణు లైనసుతులను, నరోగమును దివముఁ దుదకు నపవర్గంబున్. 2191

క. హరివాసరంబునకుఁ బు, ష్కరమును గంగయును గయయుఁ గాశియు మఱియున్
దురితాపహారకము లగు, సరిత్తులును క్షేత్రములును సరిగావు సుమీ. 2192

గీ. హరిదినంబున నుపవాస మాచరించి, రేయి జాగరణము నొనరించె నేని
యతఁడు పితృమాతృదారాన్వయములలోన, నోజలుపదితరములవారి నుద్ధరించు.

గీ. వార్ధకంబునఁ గాని యౌవనమునందుఁ, గాని శైశవమునయందుఁ గాని విష్ణు
వాసరంబునయం దుపవాస మున్న, వారు చూడరు యమపురద్వారములను.

గీ. హరిదినమున నుపవసించినట్టివారు, ద్వంద్వసంగంబు విడనాడి తార్క్ష్యకేత
నములు మాలలు పీతవస్త్రములుఁ దాల్చి, తరలిపోదురు వైకుంఠధామమునకు.

గీ. తీర్థమజ్జనమును గాని త్రిదివసంబు, లనశనము గాని కావించి హైమతిలలు
గోవులును దానమిచ్చినపావనులకు, శాశ్వతస్వర్గలోకవాసంబు గలుగు. 2196

క. స్నానము దపమును గాంచన, దానంబును దీర్థమున యథాశక్తిగ నే
మానవుఁడు సేయకుండునొ, వానికిఁ జెడు నిహము పరము వైశ్యతనూజా. 2197

క. కావించినదానంబును, గావించినతపముఁ దెలుపఁగారాదు సుమీ
యేవేళ నైన స్వర్గము, కావలయు న టన్నవాంఛ గలిగినవారల్. 2198

గీ. పాదుకలొ వస్త్రములొ యాతపత్త్రకములొ
పత్త్రమో మూలమో లేక ఫలమొ జలమొ
యిచ్చుచుండంగవలెఁ గాని యెన్నఁ డేని
వంధ్యము గఁ జేయఁగూడదు వాసరంబు. 2199

గీ. శక్తి కొలఁదిని దానంబు సలుపవలయు, ననుదినము నెంత లేనివాఁ డైనఁ గాని
యిహపరంబులలోపల నెచట నేని, పెట్టినను బుట్టుఁ బుట్టదు పెట్టకున్న. 2200

వ. ఒక్కయశ్వత్థవృక్షంబును నొక్కనింబవృక్షంబును నొక్కవటవృక్షంబును నొక్కకపిత్థ
వృక్షంబును నొక్కబిల్వవృక్షంబును నొక్కయామలకవృక్షంబును నైదు చూతవృక్షం
బులును బది తింత్రిణీవృక్షంబులును నొక్కకూపంబును నారామంబుగా స్థాపించినవారు
శాశ్వతస్వర్గలోకనివాసంబు వడయుదురు. 2201

క. ఫలములచేతను బత్త్రం, బులచేఁ బుష్పములచేత మూలంబులచేఁ
జలుపుదురు సురలకును బి త, రులకును నతిథులకు భూసురులకును దృప్తిన్. 2202

క. కావున నలువురు నడిచెడి, త్రోవలచెంతలను భూమిరుహారోపణముం
గావించెడిపుణ్యాత్ములు, గావించినవారె పుణ్యకర్మము లెల్లన్. 2203

గీ. ఆతపక్లాంతు లైనట్టిచేతనులకు, నాశ్రయము లేక తిరుగువిహంగములకు
నాశ్రయములును బుష్పఫలాఢ్యములును, నగుకుజంబుల నఱకుదు రల్పమతులు.

క. వారలకును నవ్వారిని, బ్రేరేచెడువారలకును బితృపతి సేయున్
గౌరవము ఘోరనరకా, గారంబునఁ గాలదండఘాతంబులచేన్. 2205

క. తులసీవృక్షం బుండిన, నిలయము కనఁబడిన నచట నిలువక భీతిన్
గలఁగుచును బాఱిపోదురు, పులిఁ గాంచినహరిణగణమువోలె యమభటుల్. 2206

క. తులసీవనరోపణమున్, జలిపినఁ దత్పత్త్రబీజసంతతిసంఖ్యం
బొలిచెడివర్షసహస్రం, బులు వసియించెదరు స్వర్గభువనమునందున్. 2207

క. తులసీగంధము ఘ్రాణం, బులకున్ సోఁకినను హర్షపూరితచిత్తం
బులతోడఁ దార్క్ష్యవాహన, ములపై వైకుంఠమునకుఁ బోదురు పితరుల్. 2208

క. పలుకుదురు సమంబులుగా, నిలలో మూఁటిని మహాత్ము లెల్లరు గంగా
సలిలస్నానము తులసీ, దళసంస్పర్శమును నర్మదాదర్శనమున్. 2209

గీ. త్రికరణములను బ్రాణు లార్జించికొన్న, పాపముల నెల్లఁ గావించు భస్మముగను
స్థాపనమునను సేకసంస్పర్శములను, బోషణమునను దర్శనంబునను దులసి. 2210

వ. ప్రతిపక్షంబునను ద్వాదశినాఁడు బ్రహ్మాదిదేవత లెల్లరును దులసీపూజ గావించు
చుందురు. కావున నానాఁడు తులసీదళచ్ఛేదంబు గావింపం జనదు. 2211

క. కలధౌతరత్నముక్తా, ఫలముఖదానములు పేరువడినను దులసీ
దళదానంబునషోడశ, కళకును సరిగావు చక్కఁగాఁ గనుఁగొన్నన్. 2212

సీ. పుష్కరాదిమహాతీర్థములును బ్రపఘ, గాదిపుణ్యనదీసమూహమును వాసు
దేవుఁ డాదిగఁ గలముఖ్యదేవతలును, సన్నివసింతురు తులసీదళాంతరమున. 2213

క. హరిహరులను దులసీమం, జరులను బూజించునట్టిజనులు నిజకళే
బరములు విడిచినపిమ్మట, మరలఁ జనరు మాతృగర్భమందిరములకున్. 2214

ఆ. అశ్వమేధసహస్ర మశ్వత్థశతమును, నిలిపినట్టిఘోరిఫలము గలుగు
నిలిపె నేని యొక్కతులసీవనమంబును, దానిమహిమ మేమొ దైవ మెఱుఁగు.

క. శివపంచాక్షరిజపమును, శివలింగస్థాపనమును శివపూజయు ను
ద్భవముఁ దొలఁగించి ప్రాణుల, శివలోకమునందు నిల్పుఁ జెడ కుండంగన్. 2216

గీ. సత్యమును ద్యాగమును రూపసంపదయును
శూరతయును సౌభాగ్యంబుఁ గీర్తియును
వక్తృతయు నను నేడును వసుధలోన
ఫలములుగ శివపూజ కేర్పఱుపఁబడియె. 2217

సీ. మాధవునకు దైత్యమర్దనంబును సృష్టి, కర్తృత్వము హిరణ్యగర్భునకును
బలికర్ణులకు దానపరవశత్వంబును, శౌర్యసంపద కార్తవీర్యునకును
ధనసమృద్ధియుఁ గుబేరునకు నర్జునునకు, జయమును ధ్రువున కుచ్చైఃపదంబు
మరుదాత్మజున కబ్ధితరణసామర్థ్యంబు, వాచస్పతికి మహావాగ్మితయును

గీ. ద్రౌపదికి సుపతిత్వంబు బ్రహ్మవర్చ, సము వసిష్ఠున కబ్ధిపానమును గుంభ
భవునకును రామునకు సేతుబంధనంబు, సంఘటిల్లుట శంభుపూజాఫలంబు. 2218

క. సకలాఘములును దొలఁగఁగ, సకలైశ్వర్యములు గలుగ శాంభవలింగా
ర్చకు సమ మగుపుణ్యము లే, దొకటియు ముల్లోకములను నూరుజతనయా. 2219

గీ. భక్తితోడను గాని దంభమునఁ గాని, కామమునఁ గాని మఱి యేప్రకారముననుగాని శివపూజ గావించుమానవుండు, కనఁడు యమలోకమును గడకంట నైన.

గీ. మంత్రసహితంబుగను నేని మంత్రరహిత, ముగను నేనియు శివలింగమునను బుష్ప
మైనఁ బత్త్రంబు నైనఁ దోయంబు నైన, నుంచునాతండు కులకోటి నుద్ధరించు.

క. శివపూజలు సేయుచుఁ గే, శవునిపయిన్ ద్వేష మూనుజనుఁ డెవఁ డైనన్
దవులువడి రౌరవంబున, నివలకుఁ జేరఁడు చతుర్దశేంద్రులవఱకున్. 2222

క. శివుఁడును హరియును బ్రహ్మయు, నివసింపఁగ నాలయములు నెలకొల్పినమా
నవులు వసింతురు తత్త, ద్భువనంబులయందుఁ గల్పములుగల్పములున్. 2223

గీ. దంశపదమాత్ర మైనను దాఁకరాదు, శివధనము దానిచేతను జీవయాత్ర
గడపికొనుమానవులు కల్పకల్పములును, సొమ్మసిలు చుండెదరు కాలసూత్రమందు.
గీ. మార్గములయందు విశ్రాంతిమందిరములు, ధర్మశాలలు నెలకొల్పుధార్మికులకు
నెలవు గోబ్రాహ్మణులకును నెలవుకొలుపు, మాన్యులకు వాసగృహ మింద్రమందిరంబ.
గీ. జీర్ణదేవాలయంబులు జీర్ణవిప్ర, మందిరంబులు జీర్ణగోమందిరములు
జీర్ణధర్మగృహంబులు సేసె నేని, యుద్ధృతములుగ వాఁ డొందు నూర్ధ్వపదము.
క. యతిమఠములు నెలకొలిపిన, మతిమంతులు మరల గర్భమందిరమునవ
స్థితిపొలఁ బడరు వారలు, మృతు లైనను నున్నవారె మేదినిలోనన్. 2227
క. యతు లుండెడిమఠముల కధి, పతి యగువాఁ డఖిలకర్మబాహ్యుం డగు నా
పతితున కేనాఁటికినిన్, గృతకృత్యత లేదు స్వకృతకృత్యమువలనన్. 2228
క. ఫల మైనఁ బుష్ప మైనను, జల మైనను బత్ర మైన సంప్రాప్తింపన్
గలిగినను జాలు యతిధన, మలమట గుడుపంగ నరకయాతనలందున్. 2229
క. మతి గలిగెనేని రౌరవ, పతితునిఁగాఁ జేయఁ బుత్రపశుబాంధవసం
యుతముగ గోబ్రాహ్మణసుర, యతికార్యములందుఁ జేయ నగు నధిపతిగాన్. 2230
క. హరిహరవిరించిపూజా, పరికరముగఁ బుష్పవనము పాదుకొలుపున
త్పురుషులు విహరింతురు ని, ర్జరలోకమునందుఁ బారిజాతచ్ఛాయన్. 2231
క. పితృదేవాతిథితృప్తిని, సతతముఁ గావించు చుండుసాధువులు ప్రజా
పతిలోకంబునకును నధి, పతు లగుదురు స్వకృతపుణ్యపరిపాకమునన్. 2232
క. వేనిగృహంబున భోజన, పానంబులచేతఁ దృప్తిపడుదురొ యతిథుల్
వానికి నమృతాన్నము స్వ, స్థానంబున దొరకుఁ ద్రిదశసముపంక్తులలోన్. 2233
క. అతిథి యగువాఁడు పూజ్యుఁడు, పతితుఁ డయిన మూర్ఖుఁ డైనఁ బండితుఁ డైనన్
యతి యైన నెవ్వఁ డైనను, నతిథిసమాదరణ మధిక మన్నిటికంటెన్. 2234
గీ. అతిథి తృప్తుఁ డగుచు నరిగినగృహమేధి, యరుగు బ్రహ్మయింటి కతిథి యగుచు
నతిథి విముఖుఁ డగుచు నరిగినగృహమేధి, యరుగు యమునియింటి కతిథి యగుచు.
ఆ. అతిథి వచ్చి యన్న మడిగినప్పుడు లేదు, పొమ్మ టన్న నతఁడు పోవునపుడు
కొనుచుఁ బోవు గేస్తు జననంబు మొదలుగాఁ, బొదుపుచేసికొన్నపుణ్య మెల్ల 2236
క. అతిథిసమం బగుధర్మం, బతిథిసమం బైనబంధు వతిథిసమం బా
హిత మతిథిసమం బగుస్వా, పతేయమును లేదు నిజము పరికింపంగన్. 2237
వ. ఆతిథ్యప్రభావంబునం జేసి ఋషులును రాజులును బ్రహ్మలోకంబునం దిప్పటికిని భం
గంబు లేకున్నవారు. 2238
గీ. దంభమున నేనియును బ్రమాదమున నేని, జన్మమధ్యంబునం దొక్కసారి యైన
నతిథి కన్నంబు వెట్టినయట్టివాఁడు, కాలభటులకుఁ గల నైనఁ గానరాఁడు. 2239

గీ. అన్నదానంబు గావించినట్టివాఁడు, స్వర్గమువనుండి చ్యుతుఁ డైన వసుధలోనఁ
బుట్టి యుత్తరకురుదేశములను జక్ర, వర్తి యగు సర్వభారతవర్షమునకు. 2240

గీ. సజలజలచరంబు లగునెల్లజంతువులకు, నన్నగతములు ప్రాణము లగుటఁజేసి
యన్నదానంబు గావించినట్టివాఁడె, ప్రాణదానంబు గావించినట్టివాఁడు. 2241

సీ. పుణ్యంబు క్షీణించిపోవ స్వర్గమునుండి, ధరణిపైఁ బడఁచుండుతరుణమందుఁ
గేసరిధ్వజుఁ డనుక్షితివరేణ్యునిఁ జూచి, వాత్సల్యమునను వైవస్వతుండు
రాజేంద్ర మరల స్వర్గమునకు నేఁగంగఁ, గలదేని మదిలోనఁ గాంక్ష నీకు
నన్నదానము చేయు మన్నదానము చేయు, మన్నదానము చేయు మనుచుఁ బలికె

గీ. యముడిముఖమువనుండి ప్రత్యక్షముగను, వీనులారంగ నామాట వింటి నేను
గాన లేదు జగంబులలోన నన్న, దానమునకు సమం బైనదాన మొండు. 2242

గీ. కాలపురి కేఁగుటకు భీతి గలిగె నేని, సలిలదానంబు వలయు గ్రీష్మమునఁ జేయఁ
దగును హేమంతమున సమిద్దాన మొసఁగ, సతతమును నన్నదానంబు సలుపవలయు.

వ. జ్ఞానంబువలనను నజ్ఞానంబువలనను జేయంబడు చుండుమహాపాతకంబులకును క్షుద్ర
పాతకంబులకును మాసషట్కంబున కొకపరి విధ్యుక్తం బగుప్రాయశ్చిత్తముం జేసి
కొనువాఁడు నిర్ధూతపాపుఁ డగుటంజేసి దేవగంధర్వాదిసేవితంబు లగుపుణ్యలోకంబు
లం జెందువాఁడు. ప్రాయశ్చిత్తవిహీనుండు యమలోకముం జెందువాఁడు. 2244

క. గాయత్రీజప మెప్పుడును, జేయుచు నుండెడిద్విజుండు చెందును గడకున్
ధ్యేయైక్య మితరమనువులు, గాయత్రీమంత్రమునకుఁ గావు సమంబుల్. 2245

క. వైదికమంత్రజపంబును, వేదాధ్యయనమును సకలవిఘనరకములన్
భేదించు భిదుర మద్రుల, భేదించినకరణిఁ గలుషభేదక మగుటన్. 2246

క. సాయంప్రాతర్హవనము, గాయికమానసికవాచికము లగువ్రతముల్
చేయుచు నుండెడివారికిఁ, జేయెత్తిన నందు దివము సిద్ధులు వారల్. 2247

క. తెలిపెదను వినుము తుదకుం, గలమాటను సర్వదేశకాలములందున్
గలుగును నరక మధర్మము, వలనను ధర్మంబువలన స్వర్గము గలుగున్. 2248

క. కావున బాల్యము మొదలుగఁ, గావింపగవలయు ధర్మకార్యము లెపుడున్
గావింపరా దుపేక్షను, నేవేళకు నేమి యగునొ యెవ్వఁ డెఱుంగున్. 2249

గీ. చెప్పినాఁడను నీకు సంక్షేపముగను, సుగతియును దుర్గతియుఁ గల్గుసుకృతదురిత
కర్మములు గొన్ని వినఁ గాంక్ష గలిగె నేని, యింకను వచింతు నన నాతఁ డిట్టు లనియె.

క. దేవా నీవు వచించిన, పావనధర్మములు చిత్తపరితాపంబుల్
బోవెలుచు నఘహారంబులు, గావే సాధువులనుడులు గంగాంబువులున్. 2251

గీ. ఉచిత మగుమాట చెప్పుట యుపకృతులను, జలుపుటయు సాధువులకు నైసర్గికంబ
యమృతకరుఁ డైనవిధుఁడు శైత్యంగఁబడెనె, శీతలుండుగ నెవ్వనిచేతనైన. 2252

గీ. స్వామి నామీఁద నోలయువాత్సల్యమునను, దెలిపితివి మంచిమాటలు తేటపడఁగ
నరకమునుండి నాసహోదరున కింక, నెట్టు లుద్ధృతి గలుగునో యెఱుఁగఁ జెపుమ.

—: ఆతిథ్య మహిమము :—

చ. అనవుడు దేవదూత క్షణ మాత్మను ధ్యాన మొనర్చి సర్వముం
గనుఁగొని యిట్లు వల్కె ననఘా భవదష్టమజన్మపుణ్యముం
గనుకను ధారవోయునెడ నారకలోకమునుండి తత్క్షణం
బుననె భవత్సహోదరుఁడు ముక్తతఁ జెంది దివంబు నొందెడిన్. 2254

గీ. అనుటయును నావికుండలుం డతనిఁ జూచి, స్వామి నాదగునష్టమజన్మ మేదొ
యపుడు నే నొనరించినయట్టిపుణ్య, మెట్టిదియొ నాకు దయతోడ నెఱుఁగఁ జెపుమ.

వ. అని యడుగుటయు దేవదూత వికుండలున కిట్లనియె. 2256

క. మును మధువనంబునను శా, కుని యనుబ్రహ్మర్షి గలఁ డొకొం డతఁడు నిజాం
గన యగు రేవతియందున్, గనియెను నవపుత్రకులను గ్రహములఁబోలెన్. 2257

క. వారలలో జ్యోతిష్మ, త్తారధ్రువశాలిబుధులు దారలతోడన్
జేరుకొని యుండి రగ్నుల, నారాధించుచును శ్రితగృహస్థాశ్రము లై. 2258

వ. నిర్మోహాజితకామధ్యానకాష్ఠగుణాధికు లనుమిగిలినవల్వురును వైరాగ్యంబు నవలం
బించి సర్వసంగపరిత్యాగంబు గావించి తురీయాశ్రమంబు నాసాదించి బ్రహ్మజ్ఞాన
సంపన్ను లై క్రియారహితు లై యసంశయు లై నిరాశు లై నిష్పరిగ్రహు లై
లోష్టాశ్మకాంచనంబుల సమానంబుగాఁ దిలకించుచు నప్రయత్నప్రాప్తం బగుదానం
బరితుష్టిం జెందుచు జితనిద్రాహారు లై శీతవాతాతపములను సహించుచు ననవరతం
బును నాత్మనిష్ఠాగరిష్ఠు లై చరాచరం బగుజగం బంతయును విష్ణుమయంబుగాఁ
జూచుచు మౌనంబు వహించి గ్రామైకరాత్రంబుగా భూతలం బంతయుం ద్రిమ్మ
రుచు మధ్యాహ్నకాలం బగుట క్షుత్పిపాసోపశాంతికొఱకుఁ బూర్వ మష్టమజన్మం
బున విప్రుండ వై సతీసుతసమేతంబుగా మార్గమధ్యంబునం దొక్కగ్రామంబునం
దుండునీగృహంబునకు వచ్చుటయు నీవు భక్తిభావంబున లేచి యెదురుగా నేఁగి. 2259

గీ. వారలకుఁ జేసి సాష్టాంగవందనంబు, మానసంబున హర్షసంభ్రమము లొదవ
నయనములనుండి యశ్రుసంతతులు దొరలఁ, గంఠకుహరంబులోన గాద్గద్య మెనయ.

సీ. చరితార్థ మయ్యె నాజపతపంబులు నేఁడు, మహిమంబు గాంచె నాగృహము నేఁడు
లోకోత్తరం బయ్యె నాకుటుంబము నేఁడు, పావనం బయ్యె నాభవము నేఁడు
గతు లేరుపడియె నాపితరులకును నేఁడు, కృతకృత్య మయ్యె నాశ్రుతము నేఁడు
శౌరి నాయెడలఁ బ్రసన్నుఁ డయ్యెను నేఁడు, స్తవనీయ మయ్యె నాధనము నేఁడు

గీ. ధన్య మయ్యెను నాచరిత్రంబు నేఁడు, భువనమునఁ గల్గె నాకు గౌరవము నేఁడు
పాపముల నన్నిటిని రూపుమాపునట్టి, యుష్మదీయాఙ్ఘ్రిలోకభాగ్యోదయమున. 2261

గీ. అనుచు నుతియించి వారిపాదాంబుజములు, కడిగి తత్తీర్థమును మస్తకమునఁ దాల్చి
పీఠములమీఁదఁ గూర్చుండఁబెట్టి పూజ, సలిపి వారికి సకలోపచారములను. 2262

గీ. షడ్రసోపేత మైనభోజనము వెట్టి, తృప్తి గావించుటనుజేసి తృప్తి నొంది
బ్రహ్మరసమగ్ను లగుచు నారాత్రి నీదు, సదనమునయందు వారు విశ్రాంతు లైరి.

సీ. ప్రాణులు భూతంబులందు శ్రేష్ఠము లందు, శ్రేష్ఠముల్ మతి గలచేతనములు
వానిలో శ్రేష్ఠులు మానవుల్ మానవు, లగువారిలో శ్రేష్ఠు లవనిసురులు
వారలలోన విద్వాంసులు శ్రేష్ఠులు, కృతబుద్ధు లగువారు శ్రేష్ఠు లందు
శ్రేష్ఠులు కర్తలు కృతబుద్ధులందుఁ గ, ర్తలలోన శ్రేష్ఠులు బ్రహ్మవిదులు

గీ. వారలకు నీవు భక్తిభావమున నాఁడు, చేసినట్టియాతిథ్యంబుచేతఁ బ్రాప్త
మైనపుణ్యంబు గణియింప నలవి గాదు, వదనములు వేయి కలిగినవాని కేని. 2264

క. గృహమేధి యైనయాతని, గృహమం దొకరాత్రి యుండె నేని యతి గృహిన్
దహియించెడిపాపములను, దహియించును గాష్ఠములను దహనము పోలెన్. 2265

గీ. బ్రహ్మవిదుఁ డేగృహస్థునిభవనమందు, హర్షమున నుండు నొకరాత్రి యాగృహస్థుఁ
డపునరావృత్తిగను నుండు నెప్పుడుఁ గూడ, శాశ్వతం బైనవైకుంఠసదనమందు.

క. కావున భవదష్టమజ, న్మావాప్తం బైనపుణ్య మయ్యెనె తెలియన్
నావుడు వికుండలుఁడు ముద, మావహిలఁగ ధారవోసె నాసుకృతంబున్. 2267

క. అంతట శ్రీకుండలుఁ డ, త్యంతరయంబునను వచ్చె నంతకలోకా
భ్యంతరమునుండి విధుఁడు వి, ధుంతుదవక్త్రమునుండి తోఁతెంచినటుల్. 2268

ఆ. అప్పు డన్నదమ్ము లన్యోన్యమును నశ్రు, కణము లొలుకు చుండఁ గౌఁగిలించు
కొని క్షణంబు చేష్టలను దక్కి యుండిరె, ప్రేమబంధ మెంతప్రియములనిదియొ. 2269

ఆ. అంతఁ బుష్పవర్ష మాకసముననుండి, కురియ వారు మిగులఁగుతుకమునను
దేవభటుఁడు దమకుఁ గావించినప్రియంబు, చాటుకొనుచుఁ జనిరి స్వర్గమునకు. 2270

క. ఈయితిహాసము మానవ, నాయక వినినను బఠించినను ధేనువులన్
వేయిటిని దాన మొసఁగిన, శ్రేయము సులభముగఁ బడయు క్షితి నెవఁ డేనిన్.

గీ. మాఘమాసవిశేషంబు మఱియుఁ గొంత, వినిచెదను నీకు వినుము పృథ్వీవరేణ్య
మాసములలోన శ్రేష్ఠంబు మాఘమాస, మఖిలకర్మంబులకుఁగూడ నర్హ మగుట.

సీ. సర్వదేశములందు సలిలంబు సంప్రోక్త, మగుటను నారాయణాత్మకముగ
మకరస్థుఁ డై రవి మాఘమం దుండ గో, ష్పద మంతమేఘపుష్పమున నేని
యొదవనియెడ శక్తి త్రిదినంబు లేనియు, స్నానంబు సేసిన స్వర్గ మొదవు
ఫలవిశేషంబుపైఁ గలిగినయెడఁ గోర్కి, సలుపంగ నగు బహుస్నానములను

గీ. సతిలఘృతహోమమును నన్నసలిలవసన, ధరణిగోస్వర్ణగృహధనధాన్యముఖ్య
దానము లఖండదీపసంస్థాపనమును, మాధవునకుఁ ద్రికాలసమర్చనమును. 2273

గీ. అగు నొనర్పంగ మాఘమాసాంతమందు, హరిదినంబునఁబోలె నుద్యాపనంబు
విప్రసంతర్పణంబును విష్ణుపురము, నందు శాశ్వతముగ నుండఁ జూన యున్న. 2274

వ. మాఘమాసంబునఁ గూపస్నానంబు ద్వాదశాబ్దఫలప్రదంబుగను దటాకస్నానంబు తద్ద్విగుణఫలప్రదంబుగను నదీస్నానంబు తచ్చతుర్గుణఫలప్రదంబుగను దేవఖాతస్నానంబు తద్దశగుణఫలప్రదంబుగను మహానదీస్నానంబు తచ్ఛతగుణఫలప్రదంబుగను మహానదీ సంగమస్నానంబు ద్విశతగుణఫలప్రదంబుగను గంగాస్నానంబు సహస్రగుణఫలప్రదంబు గను గంగాయమునాసరస్వతీసంగమస్నానంబు లక్షగుణఫలప్రదంబుగను జెప్పంబడియె.

గీ. ప్రతిదినంబును వృషసహస్రము సహస్ర, హైమనిష్కములును గపిలాయుతమును
భూసురున కిచ్చినఫలంబుఁ బొందు మాఘ, మున సితాసితజలమున మునిఁగి నరుఁడు.

ఆ. ప్రజలఘోరపాపరాసుల దహియింప, సృష్టిచేసె బ్రహ్మ యిలఁ బ్రయాగ
మనెడితీర్థరాజమును దాని సేవించి, మాఘమందు ముక్తి మనుజుఁ డొందు. 2277

ఆ. పంకజాసనుండు బ్రహ్మలోకమునకు, మార్గముగ సృజించె మహిని మున్ను
దివ్య మగుసరస్వతీగర్భితసితాసి, తాంబుధార సురల కచ్చెరువు గ. 2278

గీ. గాంగసలిలంబునను బ్రయాగంబునందు, స్నాతు లగువారు మాఘమాసంబులోన
నాకముననుండి ధరణికి నాల్గువేల, యుగము లగునంతవఱకును దిగరు సూవె. 2279

సీ. అశ్వమేధంబు నే నాచరించినవాఁడ, నని గర్వ మొందకు మశ్వమేధి
బ్రహ్మహత్యామహాపాప మేర్పడె నని, భయపడఁబోకుము బ్రహ్మహంత
మాఘమాసమునందు మకరస్థుఁ డై ప్రభా, కరుఁ డుండఁగను బ్రయాగంబునందు
స్నానంబు సేసితి రేని సితాసితాం, భస్సులో మీామదభయము లుడుగు

గీ. నని వచించె విధాత ప్రయాగతీర్థ, మహిమమును బ్రకటింపఁగా మదిఁ దలంచి
యచట మునిఁగినఁ బ్రాప్తించు నమరపురము, తనువు దొఱఁగిన నట నమృతత్వ మొదవు.

సీ. అనశనంబుగ శతహాయనంబులు తపం, బాచరించినవారి కగుఫలంబు
రాజసూయమహాధ్వరసహస్ర మొనరించి, నట్టివారికిఁ గల్గునట్టిఫలము
నభ్యసించిన యోగ మబ్దశతత్రయం, బవికలంబుగఁ బ్రాప్త మగుఫలంబు
కనకభారసహస్రమును రవిగ్రహణావే, ళను బాత్రునకు నొసంగినఫలంబు

గీ. సంఘటిల్లును మాఘమాసంబునందు, స్నానము త్రివేణిలోన దినత్రయంబు
సలుపునెడలను మానవజాతి కెల్ల, మాసమహిమంబునను దీర్థమహిమమునను.

గీ. సర్వతీర్థంబులును బాపసంగమమున, మలినతను జెందుటను మాఘమాసమందు
ననుసమంబును వచ్చి ప్రయాగమునకు, గంగలో మున్గి పరిశుద్ధిఁ గాంచి యేఁగు.

గీ. సప్తపురములు దమకు సంప్రాప్త మైన, పాపిజనసంగదోషంబుఁ బాపికొనఁగ
ననుసమంబును వచ్చి ప్రయాగమునకు, గంగలో మున్గు చుండు మాఘంబునందు.

గీ. అమరులకును నజయ్య మైనట్టివిష్ణు, మాయయు సితాసితాంబునిమజ్జనంబు
మాఘమాసంబునను జేయుమానవాళి, నంటఁ జాలదు సుకృతుల యమ్ముఁడుపోలె.

గీ. స్నానమును మాఘమాసంబునను బ్రయాగ, మందుఁ జేసిననరుఁడు దేహావసాన
మందుఁ దేజోమయజగంబులందు నొంది, సౌఖ్యముల నెల్లఁ దుదిఁ జేరు శార్ఙ్గిలోన.

ఆ. మకరగతుఁడు గాఁగ మార్తండుఁడు ప్రయాగ, మున సితాసితాంబువును స్పృశించి
రేని వారిపుణ్య మింతింత యని వ్రాసి, కొనఁగలేఁడు చిత్రగుప్తుఁ డేని. 2286

క. త్రికరణకృత మగుపాపము, సకలంబు నశించు నొక్కసారి ప్రయాగో
దకమున మునిఁగిన సూర్యుఁడు, మకరమునం దుండ మాఘమాసమునందున్. 2287

ఆ. మునిఁగె నేని త్రిదినములు ప్రయాగంబున, మాఘమాసమున నిజాఘ మెల్ల
నదలి నదలినట్లు వ్యాళంబు గుబుసము, నేఁగు ద్రిదివమునకు నెవ్వఁ డేని.  2288

గీ. జహ్నుతనయాయమస్వసృసంగమమున
శ్లాఘ్యతమ మైనమాఘమాసంబునందు
నఖిలఋషులును నరువదిమూఁడువేల
తీర్థములుఁ జేరుటయుఁ దటస్థించు భూప.

ఆ. జన్మజన్మమునను సర్గాదినుండియు, గడన సేసినట్టికలుష మెల్లఁ
బాసిపోవు మాఘమాసంబునఁ బ్రయాగ, మందుఁ జేయుత్రిదివసాప్లవమున. 2290

వ. గంగ యెచ్చట నున్నను బావనత్వంబునఁ గురుక్షేత్రతుల్యంబు. దానికంటెను వింధ్య సంగత యగుగంగ దశగుణాధికంబు. దానికంటెను గాశిలో నుత్తరవాహిని యగు గంగ శతగుణాధికంబు. దానికంటెను యమునాసంగత యగుగంగ శతగుణాధికంబు. దానికంటెను బ్రయాగంబునందుఁ బశ్చిమవాహిని యై కాళిందీ సరస్వతులతోడం గూడిన గంగ సహస్రగుణాధికంబు. అయ్యది త్రివేణి యనుపేరం బరగు. 2291

సీ. అది మాఘమాసమం దమృత మైయుండుట, స్రష్టయు విష్ణువు శంకరుఁడును
రుద్రు లాదిత్యులు రుద్రగణంబులు, దిక్పాలురు సమస్తదేవతలును
బ్రహ్మాణియును సపర్ణయును లక్ష్మియు దేవ, తాంగనామణులును నచ్చరలును
యక్షగంధర్వవిద్యాధరాదిసమస్త, దేవయోనులు పితృదేవతలును

గీ. నందులోపల మునుఁగుదు రన్వహమును, గృతయుగంబునఁ బ్రకటశరీరులు గను
గలియుగంబునఁ బ్రచ్ఛన్నకాయులుగను, దానిమహిమంబు నెన్న నాతరము గాదు.

గీ. అశ్వమేధసహస్రంబు నాచరింప, నేర్పడినసుకృతంబును నీడు గాదు
త్రిదినములు మాఘమునయందుఁ దీర్థరాజ, మునను స్నానం బొనర్చినపుణ్యమునకు.

క. దీనికి దృష్టాంతంబుగ, నే నొకయితిహాస మిపుడు నీకు వచింతున్
భూనాథ దాని వినుటనె, నానాపాపౌఘములు వినాశము నొందున్. 2294

—: కాంచనమాలినీచరిత్రకథనము :—

సీ. ఒక్కదినంబున నొకయప్సరఃకాంత, యభ్రమార్గంబున నరుగుచుండ
రక్కసుం డొక్కఁ డారాజాస్య నొడిసిప, ట్టఁగ నెంచి హిమగిరి డాఁగియుండఁ

బడిమె నాదైత్యునిమొదలిపైనిఁ దదార్ద్ర, వస్త్రతోయకణంబు వాయుహతిని
నంతట రాక్షసుం డత్యద్భుతంబుగా, నాత్మమనశ్శాంతి నావహిల్ల

గీ. వినయమునఁ బిల్చి యాహవధూటిని లతాంగి, యెవ్వతెవు నీవు నీయాఖ్య యేమి యెటకు
నేఁగుచుండితి వెటనుండి హేతు వేమి, యార్ద్రముగ నుండ నీకబర్యంబరములు.

క. నీయొద్దనుండి వచ్చిన, తోయకణంబున మదాత్మదోషం బెల్లన్
మాయ మయి పోయె నీ క, త్తోయకణం బెట్టిచోట దొరకెనొ చెపుమా. 2296

క. తావకరూపము గనుఁగొనఁ, బావనశీలవుగఁ గానఁబడితివి నాకున్
దేవవధూమణి సకరుణ, భావంబునఁ జెపుము నీప్రభావము నెల్లన్. 2297

సీ. అని వేఁడుటయును ని ట్లనియె నయ్యప్సరః, కాంతాలలామంబు కరుణతోడ
రాక్షస నే నప్సరసను బిల్తురు నన్నుఁ, గాంచనమాలిని యంచు సురలు
చనుచుంటిఁ గైలాసమునకుఁ బ్రయాగము, నందు మాఘస్నాన మాచరించి
తద్గాంగజలముచేతను మామకాంబర, ధమ్మిల్లములును నార్ద్రంబు లయ్యెఁ

గీ. దజ్జలకణంబు పటపట నీతనువునందు, నమసి రాక్షసగుణములు శాంతి యొదవె
నింక వినిచెద నాగాథ యెల్ల వినుము, తత్ప్రభావంబు దెలియు నద్దాన నీవు. 2298

సీ. పూర్వమందుఁ గళింగభూపతి కుంపుడు, కత్తె నై నేను భోగముల నెల్ల
ననుభవించుచు ధనయౌవనసౌందర్య, మదములచే నన్యమానినులను
బరిభవించుచు నన్యపురుషసాంగత్యంబు, సలుపుచుఁ బన్నుచు జాలములను
నార్జించి మితి లేనియర్థంబు తుదకు వా, ర్ధకము ప్రాప్తించినతరుణమందుఁ

గీ. జేసి పాపము లెల్ల నార్జించినట్టి, ధనమునకు సార్థకత రవంతయును గాన
రామిఁ జింతించి చింతించి రాజగురుని, కడకు నొకనాఁడు పోయి నాకథను వినిచి.

ఆ. కన్నునీరు గాఱఁ గాల్వలుగను నేడ్చి, పాపపంకమందుఁ బడిననన్ను
గట్టుఁజేర్చ నీవె గతి యని యిరుగేలఁ, బట్టికొంటి నతనిపాదములను. 2300

ఉ. అంతట నమ్మహాత్ముఁడు కృపాన్వితమానసుఁ డై వరాకి నీ
కింతట నైన బుద్ధి జనియించెను బాపవిశుద్ధి నొందఁగా
సంతస మయ్యె నీదురితసంచయముం దొలఁగింప లేదు పు
ణ్యాంతర మేది యేనియుఁ బ్రయాగనిమజ్జన మొండు దక్కఁగన్. 2301

ఆ. ఆనిమజ్జనంబు ప్రాప్తించునెడ మాఘ, మాసమందు రూపుమాపి సకల
దురితములను నిలుపు నిరపాయముగ నమ, రాలయమున స్నాతు లైనజనుల.

—: ఇంద్రశాపమోక్షవృత్తాంతకథనము :—

సీ. మున్ను శక్రుఁడు గౌతమునిభార్య యగునహ, ల్యను బొంది మోహాంధ్య మావరింప
గౌతమశప్తుఁ డై కాయ మెల్ల సహస్ర, భగచిహ్నితము గాఁగఁ బరితపించి

తల యెత్తికొన లేక సలువురిలోపలఁ, జేసినకార్యంబు సిగ్గుపఱుప
మేరుమహీధ్రకాసారసితాంభోజ, కుట్మలంబునఁ జొచ్చి గోప్యముగను
గీ. దనకుఁ గల్గినయవివేకమును మనోజ, దౌష్ట్యమును స్వకృతాపరాధమును సారె
సారె గర్హించుకొనుచును జావకయును, జచ్చినట్టులె కాలముఁ బుచ్చుచుండె. 2303
సీ. అంతట దేవత లందఱు శక్రుండు, కానరామిని భీతి గడలుకొనఁగ
నాంగిరసునికడ కరిగి సురాచార్య, శక్రుఁడు లేఁడాయె స్వర్గమందుఁ
గొమరుఁడు లేనివంశమువోలె శోభిల్ల, దాయె నింద్రుఁడు లేనియమరపురము
కాపింపవలసినకార్య మేదియొ యింక, నతిశీఘ్రముగఁ దగు నాచరింప
గీ. నని నివేదించుటయు విని యాంగిరసుఁడు, తెలిసికొని సర్వమును దివ్యదృష్టిచేత
నకట యెంతటిదురవస్థ యామతిల్లె, నింద్రునకుఁ గామమున నొడ లెఱుఁగ కునికి.
క. గౌతమునిభార్య యంట పురు, హూతుండఁట యెంతమాట యెరు లిది విన్నన్
ఖ్యాతికి నీతికి భూతికి, నైతిహ్యంబునకుఁ గూడ హానియె కాదే. 2305
ఆ. ఏమి చేయవచ్చు నింతకుఁ గర్మంబు, గడవరాని దగుట మునుకుపడియె
నింద్రుఁ డనఁగ బుద్ధిహీనుఁడె యవివేకు, లాచరించుపనుల కగ్గపడఁగ. 2306
క. అని కొంతతడవు విధికృత, మునకు విచారించి చిత్తమున గురు వగుటన్
జని యింద్రుఁ డున్నచోటికి, ననిమిషు లెల్లరును వెంట నరుదేరంగన్. 2307
ఆ. దేవరాజ బయలుదేఱుము శీఘ్రంబ, నీవు లేనిదివము నిష్ప్రభంబు
భాసిలునె దినంబు భానుఁడు లేకున్న, విధుఁడు లేక రాత్రి వెలుఁగఁగలదె. 2308
క. అని పెక్కుతెఱఁగులను నుతి, యొనరింపఁగఁ బద్మకుట్మలోదరభాగం
బుననుండి వికృతరూపం, బున నింద్రుఁడు వచ్చి వెలికి ముకుళితముఖుఁ డై. 2309
క. అమరాచార్యునిపదయు, గ్మముపైఁ బడి స్వామి నేను గావించినపా
పమునకు నిష్కృతి యున్నదె, సమకూరునె యింకఁ జిత్తసౌఖ్యము నాకున్. 2310
క. అని విలపించుటయును నపు, డనిమిషగురుఁ డిట్టు లనియె నమరాధిప నీ
యొనరించినఘోరాఘం, బును బాపఁగ నొకయుపాయమును వచియింతున్. 2311
ఆ. నీయదృష్టమునను నేఁడె మాఘము వచ్చె, నరిగి శీఘ్రముగఁ బ్రయాగమునకు
నటఁ ద్రివేణిలోన నాచరింపుము స్నాన, మఘవిముక్తి యొదవు నాక్షణంబ. 2312
సీ. అని వచింపఁగ నింద్రుఁ డనిమిషాచార్యుని, తోడను గూడి సంతోషమునను
జనుదెంచి శీఘ్రంబుగను బ్రయాగమున క, చ్చటఁ ద్రివేణీపుణ్యసలిలమందు
మునిఁగి ఘోరాఘవిముక్తుఁ డై భాసిల్లె, ఘనముక్తుఁ డై నభాస్కరుఁడువోలె
నపుడు బృహస్పతి యధికదీప్తిని వెల్గు, నమరనాథునిఁ జూచి హర్షమునను
గీ. గాయమున నాతనికి నున్నవేయియోను, లీక్షణసహస్ర మగునట్లు లిచ్చె వరము
నంతటను వేయికనులతో నలరె వజ్రి, యబ్జములతోడ మానసహ్రదమువోలె. 2313

క. సురలును మునులును సన్నుతు, పరివేష్టింపంగ వజ్రపాణి గురుపుర
స్సరముగఁ ద్రివిష్టపమునకుఁ, నరిగి స్వసింహాసనమున నధ్యాసించెన్. 2314
సీ. కావున నీవు శీఘ్రంబుగ మాఘమా, సమునఁ బ్రయాగతీర్థమున కరిగి
యచ్చట శ్రద్ధతో నాచరింపుము స్నాన, మును సితాసితతోయపూరమందు
దాన నీ కఖిలపాతకనాశనంబును, స్వర్గలాభంబును సంఘటిల్లు
నని వచించుటయు నే నమ్మహాత్మునివచ, నము నమ్మికొని ప్రయాగమున కరిగి
గీ. భూసురుఁడు చెప్పినట్టులె మాస మెల్లఁ, జేసితిని స్నానమును దానిసిద్ధి వినుము
త్రిదినములకు నఘక్షయం బొదవెఁ గల్గె, దేవతాత్వంబు మిగిలినదివసములకు. 2315
సీ. అటుమీఁద నే రజతాచలంబున కేఁగి, నివసించి శర్వాణినికటమందు
మత్ప్రాక్తనస్నానమహిమంబునను బూర్వ, జన్మవృత్తాంతసంస్మరణ మొదవ
నరుదెంచుచును బ్రతిహాయనంబును బ్రయా, గమునకు మాఘమాఘంబునందు
స్నానంబు గావించి చనుచుండు మరల రా, జతశైలమునకు నాచరిత మిదియె
ఆ. యింక నీచరిత్ర మెఱిఁగింపు మనవుడు, దైత్యుఁ డిట్టు లనియెఁ దల్లి నీవు
నాచరిత్రమును వినంగఁ గోరుట నార్త, జనుల నోముదాన వనుచుఁ దోఁచె. 2316
గీ. కానిచోఁ బాపి నైననాగాథ పుణ్య, కాంత వగునీకు విన నేల కలుగుఁ గోర్కి
యింతకును నేను ధన్యుఁడ నీశ్వరునకుఁ, గరుణ నామీఁద నేఁటికిఁ గలిగె నేమొ.
గీ. అన్యవృత్తాంత మడుగుదు రాత్మగాథ, చెప్పుదురు చేయుదురు పరక్షేమములను
నెనయుదురు పుణ్యమును సాధుజనులు గానఁ, బడెడి నాలక్షణములు నీయెడల సాధ్వి.
క. తనదుఃఖముఁ దెలిపిన స, జ్జనులకు సుఖ మొందు దుఃఖసంతప్తుఁడు గా
వున నాపాపచరిత్రము, వినుము వచించెదను నీకు విశదము గాఁగన్. 2319

—: కాశీబ్రాహ్మణవృత్తాంతకథనము :—

సీ. మును బ్రాహ్మణకులంబునను వారణాసిలోఁ, బ్రభవించితిని నేను బహ్వృచుఁడను
జదివితి వేదశాస్త్రము లన్నియును గాని, మత్పూర్వపాపకర్మమునఁ జేసి
కలిగె ధనాశ తత్కారణంబున క్షేత్ర, మనుశంక యించుకయైన లేక
దుర్దానములు పట్టఁ దొడఁగితిఁ దగ దని, పెద్ద లెల్లరును జెప్పినను వినక
ఆ. యట్లు గొంతకాల మార్జించి యార్జించి, ధనము భూమిలోన దాఁచిపెట్టి
తెలుపకుండఁగనె సతీసుతాదులకును, నుసురు విడిచినాఁడ నొక్కనాఁడు. 2320
ఆ. వారణాసిలోన వసియించువారలు, సలిపినను నశేషకలుషములను
నరకలోకమునకు నరుగరు గాని త, త్ఫలము గుడువకుండఁ దప్పి పోదు. 2321
గీ. సకలదేశంబులందును జలిపినట్టి, కలుషము నశించుఁ గాశిలోఁ గాశిలోన
నొనరిచినకొల వజ్రలేపోపమంబు, నాకు దావనె క్షుద్రజన్మములు గలిగె. 2322
గీ. గ్రద్దగను రెండుమార్లు వ్యాఘ్రముగమూఁడు,మార్లుసర్పంబుగను రెండుమాఱులొక్క
మాఱు ఉలూకంబుగను నొక్కమాఱు విడ్వ,రాహముగఁ బుట్టి కడ కైతి రాక్షసుఁడను.

క. ఈరాక్షసజన్మంబున, ఘోరక్షుద్బాధ నార్చుకొనఁ జాలక కాం
తారములం దల్లాడుచుఁ, జేరితిఁ గ్రమముగఁ దుషారశిఖరికిఁ దుదకున్. 2324

వ. ఈదురవస్థతోడ నిప్పటికి నాకు నెబ్బదియేనువేలవత్సరంబులు గడచె. 2325

గీ. ఎంతగా నీవు చున్నను నింతవఱకుఁ, గానఁబడదాయె నించుక యేని గట్టు
మామకవిషాదవార్ధికి నేఁడు చెప్పు, నమ్ముము యథార్థముగఁ దెల్పినాఁడ నీకు. 2326

గీ. దైవయోగంబువలన నీదర్శనంబు, ప్రాప్త మగుటను నేఁడు నాపాప మెల్ల
దగ్ధ మైపోవు ననియెడిధైర్య మొదవె, నెల్ల కానున్నదియు తుద కీశ్వరాజ్ఞ. 2327

క. అతిచిత్రంబుగఁ బూర్వ, స్మృతి యిప్పుడె కలుగఁ దెలియఁజేసితి నాదు
స్థితి యెల్ల దీనికిని నీ, హితదృష్టియె కారణముగ నే నూహింతున్. 2328

గీ. కాలమునఁ దీర్థము ఫలంబుఁ గలుగఁజేయు, సాధుసంగము ఫలము దత్క్షణమ యిచ్చుఁ
గావునను తీర్థసంసేవకంటె సాధు, సంగమును జెప్పుదురు ప్రశస్తముగ బుధులు. 2329

గీ. సాధువులు గరుణింతురు సర్వజనుల
హెచ్చుతగ్గులు మది గణియింపకుండ
క్షీరవారిధి తనలోనిక్షీరధార
నిచ్చు హంసకు బకమున కీయకున్నె. 2330

సీ. అని పల్కి వందన మొనరించి కన్నీరు, స్రవియించు చుండ నేత్రములనుండి
తల యెత్తి చూచుచు నిలిచియుండుటయుఁ గని, కాంచనమాలిని కరుణతోడ
దానవోత్తమ విషాదము నొందకుము నేఁడు, మంచికాలంబు ప్రాప్తించె నీకు
నని వచియించి నిజాంశుకంబున నున్న, సలిలంబు వామహస్తమునఁ బిండి

గీ. దక్షిణకరంబునం గొని దానవునకు, దానవత్వవిముక్తికై ధారవోసె
నొకతపోమాసమందుఁ దా నొందినట్టి, స్నానఫలమునఁ ద్రిదినసస్నానఫలము. 2331

ఉ. అంత సురారి యాత్మవికృతాకృతి మాయఁగ దివ్యరూపమున్
వింతగఁ దాల్చి భానుఁ డన వెల్గుచు నాల్గుదెసల్ స్వదీప్తిచేఁ
గాంతి వహింపఁ గే ల్మొగిచి కాంచనమాలినికిన్ మదంబ నే
సంతతమున్ సుఖించుటకుఁ జక్కనిమార్గ మనుగ్రహింపుమీ. 2332

వ. అని ప్రార్థించుటయుఁ గాంచనమాలిని సానుగ్రహంబుగా నాతని కిట్లనియె. 2333

సీ. ధర్మమార్గంబును దప్పివర్తిలకుము, విడువు మహంబుద్ధి నొడలిపైని
క్షణభంగురంబుగా జగమును జూడుము, వైరాగ్యసౌధవిహారి వగుము
పరకీయదోషముల్ ప్రకటింపకుము పర, స్తవము చేయకుము సత్యమును జెపుము
తలపెట్టకుము భూతములకు హింస నొనర్పఁ, జేయుము సాధుసంసేవనంబు

గీ. దారపుత్రాదిబంధుసంతతులయందుఁ, బరిహరింపుము మమతను హరిపదంబు
లాశ్రయింపుము మాఘములందు స్నాన, మాచరింపుము సకలసౌఖ్యములఁ గొనుము.

క. అని యుపదేశించుటయును, ననవధికంబై నహర్ష మామతిలంగన్
మనమున నాతం డాయమ, యనుమతిఁ గొని చనియె దివికి నమరులు గొలువన్.
గీ. అప్పు డరుదెంచి దేవకన్యకలు గూర్మి, మెఱయఁ గాంచనమాలినివిూఁదఁ బుష్ప
వృష్టి గురియించి యామె కాపెంచినట్టి, కార్యమును సన్నుతించి రఖండముగను.
క. అంతటఁ గాంచనమాలిని, సంతసమున మాఘమాసమజ్జనవృ
త్తాంతముఁ జెప్పుచు వారికి, స్వాంతము లలరంగ గౌరిసన్నిధి కరిగెన్. 2337
క. ఈకథ నాలించిన నిహ, లోకంబున నఖిలసుఖములును బొంది తుదిన్
నాకమున దేవతాత్వముఁ, గైకొని వసియింతు రొక్క-కల్పమువఱకున్. 2338
క. అని చెప్పుటయును నంతయు, విని సవినయముగను గార్తవీర్యుఁడు స్నానం
బొనరించుచు మాఘములం, దొనరించి తపంబు చెందె నుచ్చైఃపదమున్. 2339
ఆ. సర్వదానఫలము సర్వవ్రతఫలంబు, సర్వయజ్ఞఫలము సంఘటిల్లు
మాఘమాసమందు మకరార్కుఁ డుండంగ, స్నాన మాచరించుమానవులకు. 2340
గీ. సత్యహీనులు పితృమాతృశాసకులును, బ్రహ్మహత్యాదిదుర్భరపాతకులును
బతితులును జెందుదురు పావనతను మాఘ, మాసమజ్జనసంప్రాప్తమహిమవలన.
సీ. అన్నదానము చేయునట్టివా రమృతపా, నంబు చేయుదురు స్వర్గంబునందు
స్వర్ణదానము చేయువారలు కూర్చుందు, రమరాధిపార్ధసింహాసనమున
వస్త్రదానము చేయువార లుందురు ప్రభా, మయు లయి మార్తండమండలమున
గృహదాత లగువారు విహరింతురు పురంద, రామూల్యమణిసౌధసీమలందు
గీ. భూమిదానంబు గోదానమును నొనర్చు, వార లుందురు గోలోకవాసులుగను
సర్వదానఫలంబు లొసంగఁ జాలు, మాఘమును గోల్పడెడివాఁడు మానవుండె. 2342
క. దానంబులు యజ్ఞంబులు, ధ్యానంబులు వ్రతములును సమాధులు మాఘ
స్నానసహస్రాంశంబున, కైనను బోలంగఁ జాల వారసి చూడన్. 2343
క. మానవుఁ డెంతటిధీరుం, డైనను సకలాఘశుద్ధి నచ్చుగ మాఘ
స్నానమునఁ బొందినట్టులు, కానఁగ లేఁ డితరపుణ్యకర్మంబులచేన్. 2344
క. నానాఘౌఘములు మాఘ, స్నానమున సమూలముగ వినాశము నొందున్
నానాకాష్ఠంబులు దీ, ప్తానలమునఁ జొచ్చి భస్మ మయ్యెడిభంగిన్. 2345
గీ. మాఘమున స్నాతు లగువారు మరల భువికి
దిగరు దివినుండి యెపు డేని దిగినయెడల
వెలయు చుందురు సత్యసంధులు ప్రభూత
భాగ్యయుతులును నగుమహాప్రభువు లగుచు. 2346
క. త్రికరణకృతంబు లగుపా, తకంబు లన్నియును బాయుఁ దత్క్షణమున మ్మా
ఘకృతస్నానంబున నా, రకయాతన లచ్యుతస్మరణమునఁ బోలెన్. 2347

క. జ్ఞానముచే నైనను న, జ్ఞానముచే నైన నరులు సలిపినయఘసం
తానము సర్వము మాఘ, స్నానముచే దగ్ధమగు ససందేహముగన్. 2348

—: గంధర్వకన్యావిప్రశాపకథాకథనము :—

ఆ. వినుము మానవేంద్ర విశదంబుగా ధర్మ, గర్భ యగుమతొక్క-గాథ వినుతు
నది యశేషపాపహరణం బొనర్చెడి, నగ్నిగర్భ యైనయరణివోలె. 2349

వ. సుఖసంగీతుండును సుశీలుండును స్వరవేదియును జంద్రకాంతుండును సుప్రభుండును ననునేగురు గంధర్వులకు యథాక్రమంబుగాఁ బ్రమోహిని సుశీల సుస్వర సుతార చంద్రిక యనునేగురు పుత్రికలు గలరు. 2350

క. ఆకన్యలు పిలసిల్లుదు, రాకారమునందు వయసునందును జనులన్
వాకులను నెపుడు చూచిన, నేకోదరలట్లు భేద మేర్పడ కుండన్. 2351

గీ. చంద్రికలువోలె నాహ్లాదజనిక లగుచుఁ, దారకలువోలె నుజ్జ్వలాకార లగుచుఁ
బద్మినులువోలె సౌగంధ్యభరిత లగుచు, నొప్పు చుండిరి యాకన్య లుర్వరేంద్ర.

క. తనరారఁగ నుదయద్యౌ, వనములు నవపల్లవములవలె నాసుదతుల్
జనలోచనపారణముం, బొనరించిరి మిగుల లతలువోలె నృపాలా. 2353

క. హేమపరిధానములచే, హేమాభరణములచేత హేమాభలచే
హేమసుమమాలికలచే, నామానిను లొప్పు చుండి రాశ్చర్యము గన్. 2354

క. ఆనళినముఖులు వీణా, గానంబునయందు వేణుగానమునందున్
దానమునందును స్వరసం, ధానమునందును విశారదలు భూపాలా. 2355

క. చెలువలకంఠస్వరములు
గలిగించును గోకిలప్రకాండంబులకున్
దలనంపులు గిలిగింతలు
గలిగించును నమృతమందుఁ గలమధురిమకున్. 2356

క. నృత్యమునఁ జిత్రలేఖన, కృత్యంబునఁ దాళవాద్యఖేలనమున నై
యాత్యము గలిగి దివౌక, స్త్రైత్యలుగా నుండి రావఘామణు లధిపా. 2357

క. జనకులు లాలింపఁగ నా, వనితలు ధనదాలయమున వర్తించిరి క్రీ
డనలాలస లగుచు సురాం, గనలకు మేల్బంతు లనెడిఖ్యాతి చెలంగన్. 2358

సీ. అటు లుండ నై శాఖమం దొక్క-నాఁ డావ, ధూమణుల్ గుతుకంబుతోడఁ గూడి
యచ్ఛోద మనియెడిహ్రదమునకుం బోయి, యాహ్రదంబున స్నాన మాచరించి
ధరియించికొని క్షౌమపరిధానముల నాస్య, ములఁ గమ్మకస్తురిబొట్లు దాల్చి
మృత్తికచేత గౌరీదేవి నొనరించి, యాభరణముల నాయమకుఁ బెట్టి

గీ. స్ఫటికవై డూర్యమాణిక్యఘటిత మైన, తత్తటంబున నిలిపి యథావిధిగను
బత్తి చిత్తంబులం దిగుకొత్తు చుండఁ, బూజ సేసిరి బంగరుపూలతోడ. 2359

క. కలకండములును దాడిమ, ఫలములు ద్రాక్షయు రసాలఫలములుఁ గదళీ
ఫలములును నివేదించిరి, కలకంఠులు హర్ష మొదవఁ గాత్యాయనికిన్. 2360

క. నృత్తంబులు సలిపిరి నిజ, చిత్తంబులు దేవతావశీకృతములు గా
న తరుణీతిలకంబులు, తత్తాతకతక్కతక్కతై తక యనుచున్. 2361

క. పాటలు పాడిరి వీణలు, మీటుచు గాంధర్వవిద్య మేనులతోన
చ్చోటికి వచ్చెనొ యనియెడి, సూటిగ నాచెలులు తేనెసోనలు గురియన్. 2362

క. అటు లాచెలు లగజకు ను, త్కటహర్షముతోడఁ జేసి కైంకర్యము నం
తట నచ్ఛోదసరోవర, తటమునఁ గూర్చుండి రట్టితరుణమునందున్. 2363

సీ. ఆజానులంబిబాహార్గళంబులవాఁడు, డంబైనవక్షస్స్థలంబువాఁడు
ముచ్చట్లు చుట్టినముంజి దాల్చినవాఁడు, హరిణాజినోత్తరీయంబువాఁడు
మీనుమీసమునుద్దియైనజందెమువాఁడు, శిఖయు దండంబును జెలఁగువాఁడు
తెలిదమ్మిఱేకులఁ దెగడుకన్నులవాఁడు, సోముబింబము నోముమోమువాఁడు

గీ. కుసుమశరుఁ డనుభ్రాంతిని గొలుపువాఁడు, బ్రహ్మచర్యవ్రతంబునఁ బరగువాఁడు
తరుణతాభరుఁ డొకధరామరుఁడు వచ్చె, నటకు మాధ్యాహ్నికస్నాన మాచరింప.

క. అరుదెంచినయాబ్రాహ్మణ, వరునకు దృక్కువలయముల వారలు గావిం
చిరి యతిథిపూజ యదియే, తరుణం బని మరుఁడు శరముఁ దాలిచి వింటన్.

క. ప్రహరించె నాలతాంగులఁ, గహాతహా నవ్వుచును వేఁటకాఁడు హరిణులన్
బ్రహరించినట్టు లెదలను, దహాతహా వోడమంగ నానితంబిను లంతన్. 2366

క. నవమన్మథవిగ్రహుఁ డితఁ, డెవఁడోకో యెపు డేని చూచి యెఱుఁగము మన మీ
భువనములలోన వీనికి, సవతుగ నిలువంగఁ దగినసౌందర్యనిధిన్. 2367

సీ. భావింతమా పంచబాణునిఁగా వీని, రతిఁ బాసియుండఁగా నతని కేల
యనుకొందమా దస్రులం దొక్కనిఁగ వీని, యుగచారు లొకఁడుగా నుండు టెట్లు
కనుఁగొందుమా పారికాంక్షిసూతిగ వీనిఁ, దాపసు లేడ నీరూప మేడఁ
దలఁతుమా భూమీంద్రతనుజన్మునిఁగ వీని, రాజుల కీబ్రహ్మతేజ మేడఁ

గీ. గాఁడు యక్షుఁడు సిద్ధుఁడు గాఁడు కామ, రూపుఁడును గాఁడు విద్యాధరుండు గాఁడు
కాఁడు గంధర్వుఁడును నిట్టికాంతి వసయుఁ, గలుగుదురె వారు శతజన్మములకు నైన.

క. చతురాననుండు మనకోఱ, కితనిన్ సృజియించి పంపెనేమొ కాదేన్
క్షితిభృత్కన్యక యస్మ, త్కృతసేవకు మెచ్చి పతిగ నిచ్చెనొ వీనిన్. 2369

క. నేను వరించెద వీనిని, నేను వరించెదను వీని నేను వరింతున్
వీని ననుచు నాయెంగురు, చానలు గావించు చుండ సంభాషణముల్. 2370

శా. ఆకన్యల్ త్రప వీడి వాకొనెడివ్యాహారంబు లాబ్రాహ్మణుం
డాకర్ణించి కృతాహ్నికుండయి మనంబుం దిట్లు తర్కించె ము

ల్లోకంబుల్ తరుణీకటాక్షములచేఁ లోనయ్యె నా స్రబమే
లోకేశుండు జనార్దనుండు హరుఁడున్ లోనై ప్రవర్తింపఁగన్. 2371

ఉ. ఏమి ప్రయోజనంబు గల దెంతటిసత్త్వము గల్గియుండినన్
గామినిస్రభ్రూలతాధనువు గైకొని తద్దృగమోఘసాయక
స్తోమముచేత మన్మథుఁడు సొమ్మసిలన్ బ్రహరింప వేనిచే
తోమృగశాబకంబు హతిత్రోడన కూలక నిల్చియుండెడిన్. 2372

ఉ. అంతటిదాఁకనే జనభయంబు నయంబును నంతదాఁకనే
యంతటిదాఁకనే ధృతియు నన్వయగౌరవ మంతదాఁకనే
యంతటిదాఁకనే జపము లాత్మవిచారము లంతదాఁకనే
యెంతటిదాఁకఁ గామినులయీక్షణసీధువు మత్తుకొల్పదో. 2373

ఉ. అన్యులజోలి లేక ప్రథమాశ్రమధర్మపరాయణుండ నై
వన్యములన్ భుజించుచును వర్తిలుచుండెడినన్ను నిట్టు లీ
కన్యలవన్నెచిన్నెలు వికల్పములోఁ బడద్రోయు చుండ సా
మాన్యుల నెల్ల నింక గృహమార్జనదాసులఁ జేయకుండునే. 2374

క. మలమూత్రమాంసరక్తా, దులచేతను నిండి వివిధదుర్వాసనలున్
గలిగినపడఁతులమేనులు, వలపులు గల వనుచుఁ దలఁచి వలతురు మూఢుల్ 2375

క. క్రూరము లగుసర్పంబులు, నారీమణు లంచు బుధు లనఁగను వింటిన్
వీరలు నాచెంగటికిన్, జేరక మునుపే గృహంబు చేరఁగ వలయున్. 2376

క. అని యెంచి యావఘూటులు, తనచెంతకు రాకమునుపె ధరణీసురనం
దనుఁడు మనోజవమునఁ బో, యెను గనఁబడకుండ నమ్మృగేక్షణ లంతన్. 2377

క. ఎక్కడ నాప్రాణేశ్వరుఁ, డెక్కడ నాహృదయచోరుఁ డెక్కడ నావాఁ
డెక్కడ నానిధి యని తా, మక్కడనక్కడను జూచి హాతవాంఛిత లై. 2378

క. కాననములు దారుణదా, వానలమున భగ్గుభగ్గు మనుచందమునన్
మానసములు ఘోరవియో, గానలసందీపితంబు లగు చుండంగన్. 2379

క. హరిణులచందంబునఁ గా, తరలోచన లగుచుఁ జూడ దశదిశలును నా
తరుణులకు శూన్యములుగాఁ, బరగుటయును దోడఁగి రిట్లు పరితాపింపన్. 2380

క. కనులకుఁ గనఁబడు చుండియుఁ, గనఁబడ వీ వెంతమాయకాఁడవో నాథా
నిను వలచియున్నకన్యల, ననాథలను జేయ నీకు న్యాయం బగునే. 2381

గీ. ఏల మామీఁద నీయింద్రజాలబలము, చూపెదవు ముగ్ధలము మేము సుందరాంగ
కానఁబడు మొక్కసారి మాకనులయెదుటఁ, బ్రథమకబళము మక్షికాపాత మౌర.

గీ. ఏల రావింప మ మ్మిట కేల ప్రియునిఁ, గానఁబఱుపంగ నడుమ విఘ్నంబు సలుప
నేల ధాతకుఁ గ్రీడ మార్జాలమునకు, మూషికములకుఁ బ్రాణసంశోషణంబు. 2383

సీ. నీమానసమునకు నిలుకడయే లేదొ, మామీఁద నీకు నమ్మకము లేదొ
చిత్తంబులోనికిఁ జేర నేర్చితి వేమొ, చేరి యీవలకు రానేర వేమొ
యపరాధములు లేనియబలామణుల నేఁచ, నెఱిఁగియుఁ బరదుఃఖ మెఱుఁగ వేమొ
క్రూరాత్ముఁడవొ సుందరులమానధనమును, దస్కరించెడిమేటితస్కరుఁడవొ
గీ. మాయ లెఱిఁగినవాఁడవొ మాంత్రికుఁడవొ
మమత లేనట్టివాఁడవొ మముఁ బరీక్ష
సలుపఁ దలపెట్టితివొ కార్యసాధకుఁడవొ
పలుకు మొకమాట నాథ నీ పైఁడినోట. 2384
క. మాకడకు నీవు రామికి, నేకారణ మైన నుండె నేని మహాత్మా
నీకడకు మేమె వత్తుము, కైకొనిపొమ్మేల మమ్ముఁ గాఱియవెట్టన్. 2385
క. నీవు గనంబడ కుండిన, జీవింపము మేము నిన్నుఁ జేకొనునాసన్
జీవింతుము జీవించిన, నీవె కదా మాకు జీవితేశుఁడ వింకన్. 2386
క. విని మామొఱ కృపతో ద, ర్శన మీయుము మరల నొక్కసారి మహాత్మా
కనుఁగొనరు గాదె యుత్తము, లనఁ దగియెడువార లొకరియారాటములన్. 2387
క. అని యీవిధమున నాయం, గనలు పరితపించి యతఁడు గనఁబడునేమో
యని కొంతకాల మచటనె, కను చుండిరి దెసలు కనులు కాయలు గాయన్. 2388
వ. అటు లెంతకాలంబు నిరీక్షించినను బ్రియుండు రామిం జేసి మిగుల విషాదంబు నొంది పితృభయం బుత్తలపాటుగొలుప నెట్టకేలకు నించుక ధైర్యం బవలంబించి యాకన్యామణులు నిజగృహంబులకుం జనిరి. 2389
క. చనుదెంచినయాకన్యలఁ, గనుఁగొని తజ్జనను లేల కాలాత్యయ మా
యెనొ బిడ్డలార తెలుపుఁడు, చనుదేరఁగ మీరు నేఁడు సదనంబులకున్. 2390
క. మఱియును మేనులు వాడిన, తెఱఁగునఁ గనఁబడుట కేమి తెఱఁగో మాతో
నెఱిఁగింపుఁడు తల్లులకడ, మఱుఁ గేటికి బిడ్డలకుఁ గుమారికలారా. 2391
క. అనవుడు ముగ్ధలు గావునఁ, బెనఁగొనినత్రపాభరంబు పెంపున లోగు
ట్టును బయలువెట్టఁ జాలక, జననుల కిట్లనిరి పూర్ణచంద్రనిభాస్యల్. 2392
ఆ. అతికుతూహలమున నచ్ఛోదసరసునఁ, గిన్నరులును మేముఁ గ్రీడలాడు
కొనుచు నుండఁ బ్రొద్దు కనఁబడ కుండంగఁ, జనియె నేమి చెప్ప జననులార. 2393
ఆ. ఇటనె ప్రొద్దు గ్రుంకె నిఁక మన మొకత్రుటి, నిల్లు చేరఁగలుగు టెట్లు లనుచు
నలసి సొలసి రాఁగ నాయాస మొదవెను, దనువులకును గ్లాని దానఁ గలిగె. 2394
క. మ్లానతచేఁ గాఁబోలును, మేనులకుం దాప మొదవె మే మోరువ మి
ద్దాని కనుచుఁ దొడఁగిరి హిమ, భానుప్రస్తరధరిత్రిఁ బండుకొనంగన్. 2395
క. చిలుకలకుఁ జదువు చెప్పరు, పలికింపరు శారికలను బర్హిణముల కా
టలు నేర్పరు పావురములఁ, దిలకింపరు సారసముల దిద్దరు వారల్. 2396

క. ఆరామామణులకు మం, దారసుమాసవము గరళతుల్యంబున నే
పారుటయె కాక కల్ప, ద్రుమారుహసూనచయంబులు వహ్నికల్పము లాయెన్. 2397
క. పిలిచినను నావసూతంబులు, పలుకరు బందుగులతోడఁ బలికింపరు వీ
ణలను వినోదింపరు తమ, బలగములోఁ జేరి కోలాటపాటలతోడన్. 2398
క. పాలించిరి మోనము లన నా, వెలఁదులు నాసాగ్రదేశవిస్ఫూర్జితదృ
ష్టులును వలక్ష్యధ్యానప, రలుఁ బురుషోత్తమగతాంతరలును నగుటచేన్. 2399
వ. మఱియును నాలతాంగులు. 2400
సీ. క్షణకాల ముండరు చంద్రోపలంబులు, జాలువాఱెడిరత్నసదనమందు
క్షణకాల ముండరు చల్లఁగా మలయానిలంబు వీచెడిగవాక్షంబులందు
క్షణకాల ముండరు సంతాపశాంతి నా, పాదించు జలయంత్రభవనమందు
క్షణకాల ముండరు చంద్రికాసారంబు, ప్రసరించుసౌధోర్ధ్వభాగమందు
గీ. క్షణము శయనింతు రతివిశంకటపయోజ, పత్త్రసంఘటితం బైనపాన్పునందు
శీతలాంభోజదళములచేతఁ జెలులు, ముసరుకొని తాప మాఱంగ విసరుచుండ.
క. ఆరీతిని యుగసమముగ, నారాత్రి యెల్లఁ గడపి యరుణుండు ప్రాక్శై
లాగ్రముఁ దగుడు బ్రదికిన, వారల మని తలఁచికొనుచు వారలు వేడ్కన్. 2402
క. జననీజనకులయొద్దను, ననుమతిగొని పూర్వమట్టు లచ్ఛోదసర
స్సునకుం జని గౌరీపూ, జనముం బొనరించు చుండుసమయమునందున్. 2403
క. మునుపటివలె స్నానంబును, నొనరింపఁగ విప్రసూతియును నచ్ఛోదం
బునకుఁ జనుదేర నాతనిఁ, గనుఁగొని యాకన్య లమితకౌతుక మొదవన్. 2404
క. ఇనదర్శనంబునను బ, ద్మినులు ప్రకాశించినట్లు దీపించిరి నె
మ్మనముల కిం పొలయఁగఁ బో, యినయర్థము మరల దొరకె నే మని చెప్పన్.
గీ. అట్టు లాకన్యకామణు లలరి మరలఁ, బోవునో యేమొ యతఁ డనుబుద్ధి వొడమఁ
దత్క్షణమ యేఁగి తత్సన్నిధానమునకు, నతనిచుట్టును బరివేషమట్లు నిలిచి. 2406
ఆ. హావభావములు బయల్పడుచుచు నాథ, నిను వరించినట్టివనజముఖుల
వదలిపోదు వనుచు మది నెంచ మైతిమి, యబల లన్న నంత యలుచె నీకు. 2407
ఆ. నిన్న నిచట నిన్నుఁ గన్నది మొదలుగా, విషమశరుఁడు మమ్ము వెతలఁ గుడుపు
చున్నవాఁడు బ్రతికి యున్నవారము నేఁడు, నిన్ను మరలఁ గాంతు మన్నయాస.
గీ. ఇచ్చటికి నేఁడు రాకున్న యెడల నీవు, కన్యకాసంహననపాతకంబు చుట్టు
ముట్టుకొని ముప్పుతిప్పలుపెట్టి యుండు, నిప్పటికె నిన్నుఁ బలుమాట లేటి కింక.
క. తీఁగెలవలెఁ గౌగిళ్లను,
నూఁగించెడిచిగురుఁబోఁడు లుండఁగఁ జెంతన్
గ్రేఁగంట నైనఁ జూడక,
యేఁగునొకో యెంతకఠినహృదయుం డైనన్. 2410

క. నిన్నుఁ జనినట్లు చనుటకు, నెన్నటికిం గాదు నీకు నిఁక గన్యల మై
యున్నారము నీవే పతి, వన్నారము మము గ్రహింపుమా దయతోడన్. 2411

చ. అనుటయు నాద్విజుండు మరియాదమెయిం దిలకించి వారలన్
వనజదళాక్షులార ప్రియవాక్యము లంటిరి మీరు కాని వి
ద్యను గ్రహియించుకొంచుఁ బ్రథమాశ్రమధర్మపరుండ నై వ్రతం
బునఁ జరియించునే నెటులు పూనుదుఁ జేయఁగ ధర్మభంగమున్. 2412

వ. ఏయాశ్రమంబున కేధర్మంబు విహితం బగు నయ్యది పండితుం డగువాఁడు రక్షింప వలయుఁ గాన నీవివాహంబు నాకనుచితం బనుటయు నాతనిభాషణంబులు విని యా వధూమణులు సోత్కంఠ లగుచు మధుమాసకలకంఠకలధ్వనితో ని ట్లనిరి. 2413

గీ. ధర్మమునఁ జేసి యర్థ మర్థమునఁ జేసి, కామమును గామమునఁ జేసి కలుగు సౌఖ్య
మని వచింతురు పండితు లట్టికామ, మిపుడె నీభాగ్యమున నబ్బె నేమి చెప్ప. 2414

క. ఆకామ మనుభవింపుము, సాకల్యంబుగను మంచిసమయం బిది భూ
నాకం బనఁ దగు నిచ్చో, నేకాంతసుఖంబు గలుగునే యన్యులకున్. 2415

వ. అనుటయు నాకన్యామణులకు బ్రహ్మచారి యి ట్లనియె. 2416

గీ. అబలలార చతుర్వర్గ మందు మొదటి, దైనధర్మంబు విడువ కున్నంతవఱకె
కామ మర్థంబు మోక్షంబు గలుగఁజేయు, స్వస్వఫలముల లేకున్న సమయఁజేయు.

గీ. అసమయంబున నుద్వాహమాడ నెట్లు, లనుమతింపంగఁ దగు వ్రతి నైననాకుఁ
గార్యకాలం బెఱుంగనికర్త కార్య, ఫలము నొందుట యెపు డేని కలుగఁగలదె.

క. అని వచియించుటయును న, వ్వనజాక్షులు పలికి రిట్లు వానికి ద్విజనం
దనుఁడవు సకలజ్ఞుండవు, చనునే నీ కిట్టిమూర్ఖసంభాషణముల్. 2419

క. వనితారత్నంబును నిధి, యును సిద్ధౌషధము సిద్ధియును సిద్ధరసం
బును మంత్రమును రసాయన, మును నబ్బిన సేవనీయములు ప్రాజ్ఞులకున్. 2420

ఆ. దైవవశముచేతఁ దాను గావించిన, చేత సిద్ధివడసి శీఘ్రముగనె
ఫలము నీయనున్నపట్టున దానికి, విముఖభావ మొందు వెఱ్ఱి గలఁడె. 2421

క. ఏల యుపేక్ష యొనర్చెద, వాలస్యమువలన నమృత మైనను విష మౌఁ
జాలును నిఁక నీనయపరి, శీలన మేగురువు చదువు చెప్పెనో నీకున్. 2422

క. కోనఁదగు స్వర్ణమును మలం, బున నైనను సుధను గరళమున నైనను నీ
చునివలన నైన సద్వి, ద్యను దుష్కులమునను నైన నబలామణులన్. 2423

క. అనురాగము రూపము యౌ, వనమును గులజన్మశుద్ధి వాఙ్మాధుర్యం
బును గలిగి స్వీయముగ వరిం, చినకన్యారత్నములఁ ద్యజింతురె ప్రాజ్ఞుల్. 2424

గీ. ఏడ సురసుందరులము మే మేడ నీవు, తాపసుండవు మనకు సంధాన మేడ
దుర్ఘటంబుల ఘటియించు ద్రుహిణుఁ డౌఁ గదా, పండితుఁడు గాక యితరుండు పండితుండె

క. కావున నీ విష్ణుడె మముఁ, గైవశ మొనరించుకొనుము గాంధర్వవిధిన్
జీవింతు మిట్టు లైనను, నావుడు నాప్రియుఁ డంగనల కిట్లనియెన్. 2426

క. ధర్మధను లైనపురుషులు, ధర్మంబుఁ బరిత్యజింపఁ దలఁపరు సుమ్మీ
ధర్మేతర మగునుపయము, కర్మము నా కేల చాలుఁ గదలుం డింకన్. 2427

క. అని కోపంబునఁ బలుకఁట, యును సుస్వరయును సుశీలయును బాహాయుగం
బును బాదములు ప్రమోహిని, యును బట్టి రతండు గదల కుండెడుభంగిన్. 2428

క. చుంబించెను జంద్రిక వ, క్త్రంబును గట్టిగ సుతార గౌఁగిటఁ జేర్చెన్
శంబరరిపుండు సుమబా, ణంబుల నెడతెగక యెదల నాటుచునుండెన్. 2429

ఉ. అప్పుడు కాలరుద్రు క్రియ నావసుధామరసూతి కన్నులన్
నిప్పులు రాలఁ జూచుచును నిత్రపలార పిశాచులట్లు న
న్నిప్పగిదిం గలంచుటను నేర్పడఁగాక పిశాచరూపముల్
తప్పక మీకు నావుడు పితాకన వారలు వీడి యాలనిన్. 2430

క. అకటకట యెంతపాపము, నకు నొడిగట్టితివొ విప్రనందన నిర్మా
యికులైన దేవతాక, న్యకలయిం బిడఁగు నైచినాఁడవు తగునే. 2431

క. కైకొని నిను భర్తగఁ ద్రిది, వౌకఃపతిభోగములను నొందింపఁగ లో
నాకాంక్షించినమాకున్, జేకూర్చితి విట్టిచేటు శ్రేయమె నీకున్. 2432

క. ఇంతటిరసికుఁడ వని మా, స్వాంతములఁ దలంచియున్నఁ జనుదెంతుమె నీ
చెంతకు వలచినకాంతల, నెంతటిధర్మజ్ఞుఁ డైన నిటు చేయు నొకో. 2433

క. ధర్మకృతాంతుండవు నీ, ధర్మజ్ఞత దెలిసె నేమి తప్పని మాకీ
కర్మము మెడఁ గట్టితి నీ, కర్మము నినుఁ గట్టికుడుపక యె పోవు నొకో. 2434

క. అనురాగముతో నుండెడి, జనులయెడను భక్తులైనజనులయెడ సుహృ
జ్జనులయెడన్ ద్రోహము చే, సిననరులకు నిహము పరముఁ జెడు నండ్రు బుధుల్.

ఆ. కాన నీవు గూడఁ గమ్ము పిశాచమ, వంచు శాప మిచ్చి రతని కంత
నాలుగురకుఁ గూడ నపుడె పైశాచరూ, పములు ప్రాప్తమయ్యెఁ బార్థివేంద్ర.

ఉ. అంతట వార లాలుగురు నాఁకలి కేడ్చుచుఁ దత్సరోవర
ప్రాంతములం జరించుచును రాత్రియుం బవలున్ మనంబులన్
జింతిలుచుండి రేమనుచుఁ జెప్పుదు దేవత లేని తప్పుగా
వింతు మనంగరా దనుభవింపక తప్పవు పూర్వకర్మముల్. 2437

క. ఏకాలమునకు నేస్థితి, చేకూరఁగ వలెనొ తాము చేసినపనికిన్
జేకూరితీఱు నాస్థితి, యాకాలంబునకు నెల్లయసుధారులకున్. 2438

క. తమచేసినపుణ్యాపు, ణ్యము లనివార్యములు గాఁగ నాత్మచ్ఛాయా
క్రమమునను నంటి నరులకు, సమ్యక్ఫూరఁగఁజేయు మోదసంతాపములన్. 2439

వ. ఇది యిట్లుండ నాకన్యామణులు యథాపూర్వంబుగా సదనంబులకు రామింజేసి
తజ్జననీజనకులు శోకానలదహ్యమానమానసులై. 2440

క. పురములు వనములు గిరులును, సరస్సులును వెదకికొనుచు సకలాశలునుం
దిరుగంజొచ్చిరి దైవము, దురతిక్రమ మెంతయార్యులకున్ భూపా. 2441

క. అటులు బహుకాలము గతిం, చుటయును నొకనాఁడు లోమశుఁడు స్నానము సే
యుట కాయచ్ఛోదసర, స్తటమున కేతేర నప్పిశాచనిచయమున్. 2442

ఆ. ఆపురాపు రనుచు నాఁకలిఁ బెల్లున, నతని నారగింప నరుగుదెంచి
యును దదీయతేజమునకు భయంపడి, దూరమంద యుండి గౌరవమున. 2443

క. మును చేసినసుకృతముచే, తను నాతనియెడల భక్తి దార్కొనఁ గాపిం
చెను సాష్టాంగములను నే, మనవచ్చును బూర్వకృతశుభాశుభబలమున్. 2444

వ. ఆసమయంబున వేదనిధి యనునొక్కభూసురోత్తముండు పుత్రవియోగసంతప్త
మానసుండై బహుదేశంబులు తిరిగి తిరిగి సుతవృత్తాంతం బేమియుం దెలియమికి విచా
రించుచుఁ దుదకు దైవికంబుగా నచ్ఛోదహ్రదంబున కరుదెంచి యచ్చోట లోమ
శమహామునిం గాంచి నమస్కరించి తదనుజ్ఞం బడసి యాత్మదుఃఖంబు నివేదింపఁ
దత్సమీపంబున నుపవిష్టుం డయ్యె. 2445

ఆ. అపుడు ద్విజపిశాచ మాననంబున దైన్య, మావహిల్లఁ గంప మడర నొడలఁ
గరము లొగ్గి మౌనిపురుహూతునకు నిట్టు, లనియె గద్గదికను నల్లనల్ల. 2446

క. ఏదియొ మాకు మహాభా, గ్యోదయము లభించె నంచు నూహింతు నిటుల్
కా దేని సంఘటిల్లునె, సాదు లయినమిమ్ముఁ బోంట్లసందర్శనముల్. 2447

గీ. సతము గంగాదితీర్థరాజములయందు, స్నానములు సేయు చుండెడిదానికంటె
క్షణము సమకూరినను సాధుసంగమంబు, శ్రేష్ఠ మంచును బెద్దలు చెప్ప వింటి.

గీ. స్వామి మహనీయు లగువారిసంగమంబు, కలుగఁజేయు దృష్టాదృష్టఫలము నంద్రు
సకలజాడ్యాపహారియు స్వర్గదమును, నాంతరతమోఽపహారియు నగుటఁజేసి. 2449

క. మునివర నే విప్రుఁడ వే, దనిధిసుతుఁడ నగ్నిపాభిధానుఁడ వీరల్
తనయలు గంధర్వులకున్, మును మే మన్యోన్యశాపముల నైతి మిటుల్. 2450

క. అది మొదలు నేటివఱ కీ, హ్రదముదరిన్ దిక్కులేక యల్లాడుచు లో
నొదవినయాఁకటిఁ బెల్లున, నదవద లై యున్నవార మతినీచదశన్. 2451

గీ. ఇంతలో మీరు కన్నులయెదుట మాకుఁ, గానఁబడితిరి దైవయోగంబువలన
నేఁటితో మాయాపత్తు లన్నియును దీఱె, భానుఁ డుదయింపఁ జీఁకట్లు కానఁబడునె.

క. అనవుడుఁ గటకటఁబడి వే, దనిధి విషాదాశ్రుధార తననయనయుగం
బుననుండి కాఱుచుండఁగఁ, గనుఁగొని లోమశుని మెల్లఁగా నిట్లనియెన్. 2453

చ. మునివర వీఁడు నాసుతుండు ము న్నిటకున్ జనుదెంచి స్నానముం
బొనరుతు నంచు నంతటనె పోయెఁ గనంబడకుండ దానిచే

వనరుచు నేను వీనికయి వాడలువాడలు దేశదేశముల్
వనములు శైలములుల్ తిరిగి వచ్చి యిటకు దుదిఁ గంటి నీగతిన్. 2454

క. వీనికి నుద్ధృతి యేవిధి, నైనను గలిగించి పెట్టు మాత్మజభిక్షన్
భూనిర్జరుండ నందును, నానానిగమాగమోపనతవర్తనుఁడన్. 2455

క. అని వేఁడంటయును లోమశ, మునివరుఁడు కృపార్ద్రచిత్తమున నాద్విజునిన్
గని విప్రోత్తమ శాపం, బనలసమానం బసాధ్య మది శమియింపన్. 2456

క. ఐనను దానికి మాఘు, స్నానమె దివ్యౌషధము వినాశం బొదవన్
దానంబులు యాగంబులు, ధ్యానంబులు గావు శాపదహనఘ్నంబుల్. 2457

క. పాపఫల మైనశాపము, పాపంబు దొలంగ కున్నఁ బాయదు దానిన్
బాపఁగ మాఘస్నానమ్మొ, నైపుణిఁ గల దితరసాధనంబులకంటెన్. 2458

గీ. పాపములఁ బుణ్యతీర్థముల్ వాపఁగలవు, గాని ప్రబలంబులై నట్టికలుషములను
మాఘసాహాయ్యమునఁ దప్ప మాపఁ జాల, వని పయోరుహసంభవుం డనియె మున్ను.

వ. మాఘమాసంబునందు మానసహ్రదంబు జ్ఞానంబును హిమవత్ప్లక్షతీర్థంబులు సర్వ పాపప్రణాశంబును నవోద్భేదం బింద్రలోకప్రాప్తియు బదరీవనంబు సర్వపుణ్యసర్వకామ ఫలంబును నర్మదానది రుద్రలోకప్రాప్తియును యమునానది సూర్యలోకప్రాప్తియును సరస్వతీనది బ్రహ్మలోకప్రాప్తియును విశాలానది సర్వోత్తమఫలంబును నైమిశంబు విష్ణుసారూప్యంబును బుష్కరంబు బ్రహ్మసాన్నిధ్యంబును గురుక్షేత్రంబు మహేంద్ర లోకంబును దేవహ్రదంబు యోగసిద్ధియును బ్రభాసంబు రుద్రగణత్వంబును దేవకీనది దేవతాదేహంబును గోమతి యపునర్భవంబును హేమకూటంబును మహాకాలంబును నోంకారంబును నమరేశ్వరంబును నీలకంఠహ్రదంబును రుద్రలోకావాప్తియును సర యువును గండకియును సింధువును జంద్రభాగయును గౌశికియును దాపియును గోదా వరియును భీమయును బయోష్ణియును గృష్ణవేణియును గావేరియును దుంగభద్రయును దదితరసముద్రయాయినదులును నానాకల్మషనాశంబును స్వర్గవాసంబును సర్వనదీ సంగమంబులు సర్వకామావాప్తియును బ్రయాగత్రివేణీతోయంబు సర్వపాపశాప విమోచనంబును సర్వపుణ్యఫలంబునుం బ్రసాదించు. 2460

గీ. కావునఁ బ్రయాగమందు మాఘమున నెపుడు, మాకు నవగాహనంబు సంప్రాప్త మగునొ
యని సురలు కోరుచుందు రన్వహము దివిని, నది సకలఫలదానసమర్థ మగుట.

గీ. బ్రహ్మహత్యాదిఘోరపాపములు గూడ, దగ్ధ మగును బ్రయాగతీర్థంబునందు
స్నాన మొనరించి రేని దినత్రయంబు, మాఘమాసంబునను వేయి మాటలేల. 2462

గీ. క్రతువులను దానములను దీర్థముల నొక్క-, ప్రక్కను బ్రయాగమాఘము నొక్క-ప్రక్క-
నుంచి తులఁ దూఁప మున్ను విరించి ముల్లు, వంగెను బ్రయాగమాఘమువైపునంద.

క. వాతాంబుపర్ణభుక్తుల, చేత నరణ్యమునఁ దపముచేసెడివారి
వ్రాతము ప్రయాగమాఘు, స్నాతులకుం గలుగుసుగతి చాలదు చెందన్ 2464

గీ. రాజసూయాశ్వమేధాధ్వరములకంటె, నధిక మగుఫల మిచ్చుప్రయాగమాఘ
మాసమజ్జనమును వీడు మానవుండు, స్వకరగతనిధి విడనాడువాఁడ చూవె. 2465

—: వీరసేనభద్రకవృత్తాంతకథనము :—

సీ. విను మొకయితిహాసమును వచించెద నీకుఁ, బూర్వము కృతయుగంబున నొకండు
వీరసేనుం డనువిభుఁ డుండె మాలవ, వసుధాధినాథుఁ డవంతిలోన
నాతఁడు షోడశహయమేధయాగముల్, రాజసూయమహాధ్వరమును జేసి
ధనరాసులను గోవులను సువర్ణంబును, బుష్కలంబుగ నిచ్చి భూసురులకు
ఆ. స్వర్ణయూపములను స్థాపించి నర్మదా, తీరమందు మిగులఁ బేరు వడసె
నాపురంబునందె యతినీచుఁ డొకఁ డుండె, నవనిసురుఁడు భద్రకాహ్వయుండు.
సీ. ఆబ్రాహ్మణుండు బ్రాహ్మణధర్మములు వీడి, సంచరించుచును స్వచ్ఛందముగను
జలుపరానియకార్యములు చేయు చుండంగ, జనులు తద్దుష్టచేష్టలకు రోసి
వీరసేనునకుఁ దద్విషయంబు నెఱిఁగింప, ధర్మజ్ఞుఁ డై నయాధరణివిభుఁడు
వెడలఁగొట్టించె నావిప్రునిఁ బురినుండి, యనుచితం బగుట బ్రాహ్మణవధంబు
గీ. భద్రకుం డంతటను బరిభ్రష్టుఁ డగుచుఁ, దిరిగి బహుదేశములను దైర్థికులతోడఁ
గలసి యెట్లొ ప్రయాగముఁ గడకుఁ జేరి, త్రిదినములు మాఘమున నందుఁ దీర్థమాడి.
గీ. స్నానమాత్రంబుచేతనె సకలపాత, కములు మాయుట మరల స్వగ్రామమునకు
వచ్చి మఱునాఁడె మరణించె స్వగృహమందు, నాదినమె మ్రందె వీరసేనాధిపుఁడును.
సీ. ఒకనాఁడు నేను దైవికముగా స్వర్గంబు, నకుఁ బోయి యమరనాయకునితోడ
భాషించు చుండంగ భద్రకుండును వీర, సేనుండు దివ్యవిమానములను
నధివసించి నవామరాధీశ్వరులొ నాఁగ, దివ్యదేహములతోఁ దేజరిలుచు
నరుగుదెంచి సుధర్మయందుఁ గూర్చుండంగ, నాశ్చర్య మొంది నే నాత్మలోన
గీ. ధ్యానదృష్టిని జూడంగఁ గానఁబడియె, వీరసేనకృతాపారభూరిపుణ్య
కార్యములకుఁ బ్రయాగమాఘకృతభద్ర, కాప్లవంబునకును సమ మైనఫలము.
గీ. క్షిప్ర త్రింశద్ధనుర్విస్తృతప్రయాగ, గాంగయామునసలిలసంగమున మాఘ
మాసమజ్జన మొనరించుమనుజుఁ డొకఁడె, పడఁడు దివినుండి పరు లెల్లఁ బడెడివార.
గీ. ఎవరు మాఘంబునను స్పృశియింపఁగలరొ, యసితసితతోయమును ధన్యు లనఁగ వారె
బ్రహ్మహత్యాదఘోరపాపఘ్ను లనఁగ, వారలను స్పృశియిండెడివారె చూవె.
గీ. వినుఁడు మీ రెల్లవారును విశదముగను, వినిచెదఁ బిశాచమోక్షణ మనెడిపూర్వ
చరితమును దీని విన్నఁ బిశాచములకు, నచిరకాలంబుననె కల్గు నాత్మముక్తి. 2472

—: దేవద్యుతివృత్తాంతకథనము :—

గీ. వసుధలోన లక్షప్రస్రవణవనంబు, నందు సారస్వతతటంబునందు నొక్క
యాశ్రమమున దేవద్యుతి యనఁగ నొక్క, బ్రాహ్మణుం డుండె మును వేదపారగుండు.

క. అతఁడు సుమిత్రునకు రమా, పతి యిచ్చినవరమువలనఁ బ్రభవించినస
త్సుతుఁ డగుటఁ దపోనిష్ఠను, సతతంబును వెడలఁబుచ్చె సాగె దినంబుల్. 2474
గీ. అట్లు తప మాచరించుచు నతఁడు గడపి, హాయనసహస్రమును నొక్కహరిదినంబు
నందు వైశాఖమునఁ జేసి హరిసపర్య, సలుపఁ దొడఁగెను విష్ణుసంస్తవము నిట్లు.

—: యోగసారస్తవము :—

సీ. స్తుతియును స్తుత్యంబు స్తోతయు సకలంబు, నీవె కావున శౌరి నిన్ను నేను
బ్రస్తుతించుట యన్నఁ బరిహాసపాత్రంబ, యైనను హర్షదం బగుట భక్తి
నుతియింపఁ దొడఁగితి శ్రుతు లన్నియును భవ, న్నిశ్శ్వాస మగుటను నీకు దీన
సంతృప్తి గలుగునె సర్వేశ్వర శుకోక్తు, లనుకొని యాలింపు మట్టు లేల
గీ. వాఙ్మనసగోచరము గానివాని వేద, వాగతీతుని నిన్ను నావంటివాఁడు
సన్నుతించుట యుక్తమె శంక యున్నె, పంకజాక్షభక్త్యున్మాదపరవశులకు. 2476
సీ. విశ్వంభరుఁడ వీవె విశ్వేశ్వరుఁడ వీవె, సర్వకారణ మీవె స్రష్ట వీవె
ధర్మంబు నీవె శుద్ధబ్రహ్మమును నీవె, సత్యంబు నీవె ప్రజ్ఞాన మీవె
ప్రకృతివర్గము నీవె వికృతివర్గము నీవె, సౌఖ్యసంచయమనీషయును నీవె
నిజాత్మలోపల నిద్రించెదవు నీవె, తనుభావమున మేలుకొనెద వీవె
గీ. పురుషుఁ డొక్కఁడె పుత్రాదిభూరినామ, ధేయములచేతఁ బొల్చెడిచాయ నీవె
హరిహరవిరించిశైలవృక్షాద్యనంత, నామముల వెల్గుచుందువు నళిననాభ.
గీ. సచ్చిదానందమయముగా జగములందు, భాసిలుచు నుండునట్టిరూపంబు నీవె
యత్పరిజ్ఞానమున సంశయములు గర్మ, ములును బాయునో యాదివ్యమూర్తి నీవె.
క. కానంగరాదు లేశం, బేనియు నీకంటె భిన్న మీశ్వర యెందుక్
గానిచిన నీవె సర్వము, నానాత్వము మూఢకల్పనయె యంద్రు బుధుల్. 2479
గీ. ఖగము ఖసమము ఖంబు హృత్ఖగము ఖాది
ఖాధికము ఖక్రియమును నై ఖాది నెల్ల
ననుభవించి తదంతంబునను ఖమూర్తి
యగుచుఁ దేజరిల్లెడిపరమాత్మ వీవె. 2480
గీ. ఆదిమధ్యాంతవిరహిత మప్రమేయ, మణువుకంటెను నణు వధికాధికంబు
నిర్గుణము నిర్వికారము నిర్వికల్ప, మఖిలమయమును నైనబ్రహ్మంబు నీవె. 2481
సీ. సర్వభూతములందు సద్రూపముగ నుండు, నట్టివానిఁగ యోగులైనవారు
ధ్యానించుచుందురో వేని నెవ్వాని నహం, బ్రహ్మాస్మి యనుచును బ్రహ్మవిదులు
భావించుచుందురో పగతత్త్వముగ నెంచి, యెవనిస్వరూపంబు నెఱిఁగికొనిన
జనుల కహంకారమును మమత్వంబును, మాయయు మోహంబు మాయమగునో
గీ. యత్ప్రబోధంబునను ధన్యు లఖిలవిషయ, వాంఛలను విడనాడి నిశ్వాసనముగ
దృశ్య మంతయు నాత్మగా నెంచికొనుచు, సంచరింతురో వాని నే శరణుచొత్తు 2482

గీ. మోహవహ్నిజ్వలజ్జనవ్యూహమందు, నున్నను యదీయనామపయోధరంబు
నంజఁగొనుమానవుండు దగ్ధుండు గాఁడొ, దేవదేవోత్తముఁడు వాఁడె దిక్కు నాకు.
సీ. ఎవనినామము స్మరియించిన నెపు డేని, పాపంబు లెల్లను భస్మ మగునొ
యెవనినామము స్మరియించిన నెపు డేని, దారిద్ర్య మది దరిద్రతను గొనునొ
యెవనినామము స్మరియించిన నెపు డేని, జాడ్యంబు లెల్ల ధ్వస్తంబు లగునొ
యెవనినామము స్మరియించిన నెపు డేని, దుఃఖంబు లన్నియుఁ దొలఁగిచనునొ
గీ. యెవనినామంబుఁ దలఁచిన నిహపరంబు, లందు విజయంబు గలుగునొ యామహాత్ముఁ
డాయనాదినిధనుఁ డాయనంతశక్తి, యాసమస్తజగద్యోని యండ నాకు. 2484
ఆ. సకలవేదగదితసరణి జగద్వ్యాపి, హరియ యగున యేని యస్మదీయ
విష్ణుభక్తి సుంతవిఘ్న మైనను లేక, క్రమముగను బ్రవృద్ధిఁ గాంచుఁగాక. 2485
గీ. అంబుజాక్షునికంటె శబ్దార్థసంవి, దర్థములు వేఱు గావి సత్యంబ యేని
యాగమోక్తి నిజేసి న న్నంట కుండుఁ, గాక యెపుడును సంసారకర్దమంబు. 2486
గీ. బీజమును యోనియును లేనిబీజమందు, జీవసంజ్ఞను భాసిల్లుదేవదేవుఁ
డాత్మభవబీజమును స్వవిద్యాసిచేత, శీఘ్రముగ ముక్క-ముక్కలు చేయుఁగాక.
క. త్రితనువులఁ దాల్చి సృష్టి, స్థితిలయములు త్రిగుణములను జేసెడిపరమా
ద్భుతనటుఁడు ప్రసన్నుం డై, సతతంబును దర్శనం బొసంగుత నాకున్. 2488
క. సురవర్గము ప్రార్థింపఁగఁ, బరిపాలింపంగ ధర్మపథమును విశ్వం
భరపై దశవిధముల నవ, తరించినమహాత్ముఁ డొకఁడె దైవము నాకున్. 2489
గీ. ఒక్కరుండనె నేను బహుత్వ మొందు, వాఁడ నని యెంచికొని లో నెవండు సకల
సృష్టి గావించి యందులోఁ జేరి క్రీడ, లాడు చుండెనొ వాని నే నాశ్రయింతు.
ఆ. జగము లెల్ల నెవనిసత్తచే నిలుచునొ, తేజరిలునొ యెవనిదీప్తిచేత
సంతసిలునొ యెవనిసంతోషమున లేని, వయ్యుఁ జిత్రముగను నతనిఁ గొలుతు.
సీ. కొలుచు చుండెదరు సాంఖ్యులు ప్రధానమునకుఁ, బరుఁ డై ప్రకాశించుపురుషునిఁగను
శ్లాఘించు చుందురు సౌగతుల్ బుద్ధిఁగాఁ, దర్కపతర్కవితర్కములను
ధ్యానించు చుందురు జైనశాస్త్రజ్ఞులు, దేహప్రమాణప్రదీపితునిఁగ
వచియించు చుంద్రు చార్వాకులు యోగవి, ద్యాప్రౌఢభూతచైతన్యముగను
గీ. సచ్చిదానందరూపుని జన్మమృత్యు, వర్జితుని భేదశూన్యుని వాస్తవికుని
నౌపనిషదవచోలక్ష్య మైనవాని, నద్వితీయునిఁ బరుని నవ్యయుని నిన్ను. 2492
క. కొందఱు శబ్దం బందురు, కొందఱు చిచ్ఛక్తి యంద్రు కొందఱు ప్రాణం
బందురు కొందఱు దేహం, బందురు గోవింద యవిదితాత్ములు నిన్నున్. 2493
గీ. ఖాదిభూతంబులును నింద్రియములు విద్య, యును నవిద్యయును శరీరమును స్రుగాది
కరణహోతృహవిఃపాకములు మఖము, ఫలము తత్ఫలదాతృభోక్తలును నీవె. 2494

క. యువతులయెడ యువతిచిత్తము, యువతీజనమానసములు యువయెడ నెట్లుల్
తవులువడు నట్లె నీయందుఁ, దవులుననుసుంగాక నాహృదయము ముకుందా. 2495

క. వనజాక్ష యెన్నిపాపము, లను జేసిన నీపదాంబుజములను బట్టినవా
నిని గాలకింకరులు నినుఁ, గానఁ జాలరు నిని గనక్షగూబలువోలెన్. 2496

ఆ. అంతవడుకె బాధ లన్నియుఁ జెడించు, నంతవడుకె యఘము లడిచివైచు
నంతవడుకు నాశ్రయింపఁడే మానవుఁ, డంబుజాక్ష నీపదాంబుజముల. 2497

క. తమ్ముగఁ దమకొండెను భ, క్తి మ్మిగఁ సకలమును మునిజనమ్ములు యవ్వో
ధమ్మున గాంతురో సన్మా, ర్గమ్ముగ నాసర్వగతుని దలఁచెద నిన్నున్. 2498

క. జాతిక్రియాగుణంబులు, చేతోవాక్సిద్ధులును స్పృశింపవో యెవనిన్
స్వాతంత్ర్యోపేతుని స, ద్వ్యాప్తుని జేలుకొను నంతరాత్మను వానిన్. 2499

గీ. అనఘు లగువార లెవ్వని ధ్యానమునను, వశము గావించుకొని యపవర్గమను
గొనిటను గ్రచ్చి యాత్మసుఖంబు ననుభ, వించు చుందురో వాని భావింతు నేను.

గీ. పరిభవంబును గనుదె తాపత్రయంబు, కామలోభాదిశత్రుషట్కము షడూర్మి
వారమును నాఱుభావవికారములును, దరియఁజాలక యెవని నాతని భజింతు. 2501

గీ. కార్యవర్గంబు నెల్లఁ దత్కారణముల, లోన లయ మొనరించుప్రజ్ఞానఘనులు
కార్యకారణవర్జితాకారుఁ డైన, వేనిలోఁ జేరుదురో నేను వాని నెంతు. 2502

సీ. ఎవనిధ్యానం బనియెడిగండగొడ్డలి, ఖండించునో విషాదకాననంబు
నెవనిధ్యానం బనియెడిమహాగ్నిష్మాత, పం బాఱుచునో సంశయాంబునిధిని
గాల్చునో సకలలోకముల నెవ్వనిధ్యాన, మనియెడిప్రళయకాలానలంబు
హరియించునో యవిద్య యనుతమిస్రంబు నె, వ్వనిధ్యాన మనెడిభాస్వత్ప్రదీప్తి

గీ. యాయనాథశరణ్యుని నాప్రసన్ను, మూర్తి నాస్వామి నాప్రపన్నార్తిహరుని
నాదయాసాగరుని నాసమస్తవస్తు, భాసమానస్వరూపునిఁ బ్రస్తుతింతు. 2503

సీ. వేదంబు లెల్లను విష్ణునిశ్వాసంబు, లనియెడిమాట యథార్థ మేని
యఖిలభూతంబులు హరియుదరంబులో, నివసించు ననుమాట నిక్క మేని
జంగమస్థావరజగము లన్నియుఁ గూడ, శార్ఙ్గియె యనుమాట సత్య మేని
కర్తయు భర్తయు హర్తయు నిందిరా, దయితుండె యనుమాట తథ్య మేని

గీ. యచ్యుతునిపైని నా కుండినట్టిభక్తి, నిజగురునిమీఁద నుండుట నిజమ యేని
గురువె హరి యనుమాట నిక్కమ యేని, నాకు దర్శనము నొసంగుఁగాక శౌరి.

—: మహావిష్ణువు దేవద్యుతికిఁ బ్రత్యక్షమగుట :—

క. అని శపథంబులు పల్కుట, యును దన్నిర్వ్యాజభక్తియోగమునకు వ్యా
ప్తిని జెంది సపరివారము, గను దేవద్యుతికి శార్ఙ్గి కానంబడియెన్. 2505

సీ. మందహాసప్రభామధురాననమువానిఁ, గస్తూరికాతిలకంబువాని
సంభోరుహచ్ఛదాయతనేత్రములవానిఁ, గరుణాకటాక్షవీక్షణమువాని
వైజయంతీలసద్వక్షస్స్థలమువానిఁ, గటిధృతకనకాంశుకంబు వాని
సమధిష్ఠితోరగాశనవాహనమువాని, జలదసన్నిభతనుచ్ఛాయవాని
గీ. భుజచతుష్టయధృతగదాంభోజశంఖ, చక్రములవాని శ్రీసముజ్జ్వలుని నమర
బృందపరివేష్టితునిఁ జిదానందమూర్తి, నచ్యుతునిఁ గాంచి యంత నాయవనిసురుఁడు.
క. పులకాంకితగాత్రుం డై, జలజల నశ్రువులు రాల సంతసమునఁ గ
న్నులనుండి నేలపైఁ బడి, సలిపెను సాష్టాంగవినతి జలజాక్షునకున్. 2507
గీ. అప్పు డాబ్రాహ్మణుఁడు నిజహర్ష మంత, కంతకును బొంగి పొరలంగ నబ్ధివోలె
బ్రహ్మభావంబు నొందినపగిది నొడలు, చిత్తమును విస్మరించి నిశ్చేష్టుఁ డయ్యె.
సీ. అంతట గోవిందుఁ డతనిమేను స్పృశించి, కరముచే సంజ్ఞను గలుగఁజేసి
భక్తాగ్రగణ్య మద్భావంబునను నీవు, సర్వకర్మంబుల సన్యసించి
శరణుచొచ్చితివి నాచరణంబులనె దానఁ, ద్వద్భక్తి నన్నుఁ ద్వద్వశునిఁ జేసెఁ
ద్వత్కృతస్తోత్రంబువలనఁ బ్రత్యక్షంబు, కాక తప్పమిని నేఁ గానఁబడితి
గీ. మత్సగుణరూప మిది దీని మానసమున
ధ్యాన మొనరింప విజ్ఞాత మగు మదీయ
నిర్గుణాకార మద్దాన నిజము నెఱిఁగి
ధ్యాత యగువాఁడు నాలోన నైక్య మొందు. 2509
క. మద్దర్శనం బమోఘం, బద్దాన వరంబు నిత్తు నభిలాషము నీ
కెద్దానఁ గలదొ కోరుము, విద్దెయొ యాయువొ ధనంబొ వే తే దేనిన్. 2510
క. అనవుడు దేవద్యుతి యి, ట్లనియె విలోకించుచును దదాకారంబున్
గనులార దేవ నీద, ర్శనలాభమె సకలవిధవరంబులు నాకున్. 2511
సీ. అభిలషించుచు నుందు రనవరతంబును, భవదీయదర్శనభాగ్య మొంద
జలజాసనాదినిర్జరకోటులును గపి, లాదిసిద్ధులు సనకాదిమునులు
నీమంగళాకృతి నిమిషమాత్రము నేత్ర, పర్వంబుగాఁ గానఁబడియె నేని
దగ్ధంబు లగు నహంతామమతోపల, బ్ధంబు లైనశుభాశుభంబు లెల్లఁ
గీ. గలిగె నాజన్మకర్మబుద్ధులకు ఫలము, కాంచుటను నిన్ను నేఁ డింతకంటె నాకుఁ
బ్రార్థనోచిత మైనవరంబు లేదు, కాన భవదంఘ్రిభక్తిభాగ్యమునె యిమ్ము. 2512

—: యోగసారస్తవమాహాత్మ్యకథనము :—

సీ. అని పల్కుటయును నారాయణుం డెంతేని, సంతోషమును జెంది స్వాంతమందు
బ్రాహ్మణోత్తమ నీవు ప్రార్థించినట్టులె, నీభక్తి స్థిరముగా నిలుచుఁగాక
మఱియుఁ ద్వత్కృత మైనమామకస్తోత్రంబుఁ, బఠియించువారు మద్భక్తిచేతఁ
బరమపావను లయి పడయుదు రైక్యంబుఁ, దుదకు నాలో జన్మదుఃఖ ముడుగ

గీ. నని వచించి యంతర్ధాన మయ్యె నంత, నాఁడునాఁటికి భక్తి లోనినె నిమగ్నుఁ
డగుచు దేవద్యుతి వసించె నచటియందు, గలుగమిని వాంఛ లోకసంగంబునందు.

సీ. అధ్యాత్మయోగతత్త్వాలంకృతము మహా, దయకరం బఖిలపాతకహరంబు
స్వాత్మబోధప్రదాయకము మోక్షార్థిశ, రణ్య మీయోగసార స్తవంబు
వైనతేయుండు దేవద్యుతివలనఁ గై, కొని మున్ను బఠియించుకొనుచు దీని
సకలకార్యములందు జయ మొందుచును నొక్క నాఁడు ప్రార్థింపఁగ నాకుఁ జెప్పె

గీ. దీనిలోఁ గలమహిమంబు నేను గాంచి, పఠన మొనరించు చుంటిని బ్రతిదినంబు
నిది పఠించుచు నుండిన నెడఁదలోనఁ, బాపబుద్ధి జనింప దెప్పటికిఁ గూడ. 2514

సీ. ఇంద్రియంబులకు దుష్ప్రవృత్తి గల్గదు మాన, సంబు దురాశావశంబు గాదు
కలుగు దీర్ఘాయువు గలుగు నారోగ్యంబు, గలుగు నైశ్వర్యంబు గలుగు బలము
బహుపుత్రపౌత్రప్రపౌత్రాదిశాఖాభి, భూషితం బగువంశభూరుహంబు
సకలపాపములు భస్మం బగు ధర్మార్థ, కామమోక్షము లగుఁ గరగతములు

గీ. ప్రేతభూతపిశాచరాత్రించరాది, బాధలును నగ్నిచోరాద్యపాయములును
నఖిలపీడలును దొలంగి సుఖము లొదవు, యోగసారంబు చదివిన నొక్కమాఱు.

గీ. యోగసారంబుఁ జదివిన నొక్కమాఱు, మూఁడుమార్లు చతుర్వేదములను సాంగ
ముగను బారాయణ మొనర్చి పొందుఫలముఁ, బడయఁగావచ్చు నెంతటిపాపి యేని.

క. ఒనగూడు విష్ణుదర్శన, మును జేసెడిభాగ్య మెట్టిమూఢాత్మునకై
నను యోగసారమును జది, విన వినినను సర్వ మెఱిఁగి విస్పష్టముగన్. 2517

గీ. శ్రద్ధతోడను గంగాదిసకలపుణ్య, తీర్థములలోనఁ బలుమార్లు తీర్థమాడి
నట్టిపుణ్యంబు చేకూరు సార్థముగను, యోగసారంబు వినినను నొక్కమాఱు. 2518

సీ. అట్లు దేవద్యుతి హరిభక్తివశుఁ డై, యుండ నవ్వనములో నొక్కనాఁడు
వచ్చి యొకపిశాచ మచ్చటి కొకవిభీ, తకవృక్షమును జేరి దానిక్రిందఁ
గూర్చుండి యాఁకలిపేర్చిచ్చు దగ్ధంబు, గావించు చుండఁగఁ గాయ మెల్ల
నేడ్చి గొల్లున వన మెల్ల మాఱ్మ్రోఁగ నా, యార్పు దేవద్యుతి యాలకించి

గీ. యఖిలభూతదయాశాలి యగుటఁ జేసి, యేడ్పు వినవచ్చు చుండెడియెడకు వచ్చి
సత్వరంబుగ నాపిశాచమును జూచి, యెవ్వఁడవో నీవు విలపింప నేల చెపుమ. 2519

వ. అని ప్రశ్నించుటయు నాపిశాచంబు తత్తేజముం గాంచి యాతని మహానుభావునిం
గాఁ దలంచి దూరంబున నిలువంబడి సవినయంబుగాఁ జేతులు జోడించికొని యిట్లనియె.

—: చిత్రమహారాజవృత్తాంతకథనము :—

సీ. అమలాత్మ నాచరిత్రము నాలకింపుము, విన్నవించెద నీకు విశదముగను
ద్రవిడదేశపుమాధవ్యుఁడను నేను సో, మాన్వయంబునఁ బుట్టినట్టివాఁడ

ననుఁ జిత్రముఁ డందురు జను లెల్ల ధనమదాంధ్యంబునఁ గన్ను గానంగరాక
సతతంబు శ్రీజనాన్వితుండ నై విష్ణునా, మము కర్ణమునఁ బట్ట మాడిపడుచు

గీ. విష్ణుమహిమంబుఁ దెలిపెడివేదములను, వేదములను బఠించుపృథ్వీసురులను
బరిభవించుచు నాయొద్దఁ బరుసిఘునత్వే, చెప్పువారల నెల్ల శిక్షించు చుంటి. 2521

గీ. అప్పు డప్పుడు నామంత్రు లరుగుదెంచి, ధర్మములు చెప్పు చుండ నాదరిని వారి
నాలుకలు చీల్చి కత్తిచేఁ జీలికలుగఁ, బనుపసాగితి ననుఁ గొల్చి బ్రతుకరఁ డనుచు.

ఆ. అట్లు కొంతకాల మరుగంగ నొకనాఁడు, కాలవశము నొందఁగలుగువేళ
దాపరిలుట దాని దాటఁగాఁ గలశక్తి, లేమి నుడిగితిని గళేబరంబు. 2523

వ. అంతట వేదబాహ్యుండ నైననాకు వేదోక్తస్థానంబున నౌర్ధ్వదైహికకర్మంబు నిర్వర్తింపంబడదయ్యె. 2524

సీ. అప్పుడు యమదూత లరుదెంచి కాలపా, శములచేఁ గట్టి గాఢముగ నన్నుఁ
బడవైచి కంటకపావకజ్వాలాశ్మ, ఫణివృశ్చికక్రూరపథములందు
నీడిచికొనిపోయి యేడ్చు చుండఁగ నేను, బ్రద్దలై మే నెల్ల రక్త మురల
నంతకునిసమక్షమందు నిల్పఁగ నాతఁ, డతిదారుణం బైనయాజ్ఞ నొసఁగె

గీ. నంతటఁ గృతాంతభటులు నన్నచటనుండి, లాగి కొనిపోయి దండకోలాహలాది
ఘోరనరకంబులం దెల్లఁ గూల్చి కాల్చి, చీల్చి వ్రేల్చి త్యజించిరి చివర కంత.

వ. కర్మశేషానుభవంబునకై హిమవత్పర్వతంబునఁ బిశాచజన్మముం బడసి క్షుత్పిపాసాపీడితుండ నై తినఁ దిండియు నుండఁ జోటును లేక పరిభ్రమించుచుఁ దుద కీయరణ్యమునకుం జేరి యాఁకలిచిచ్చు పెచ్చుపెరిఁగి కాల్చు చుండ నేడ్చు చుంటి. విష్ణుద్వేషదోషంబునంజేసి యేకసప్తతియుగంబులు నానాఘోరనరకయాతన లనుభవించి కడ కీపిశాచజన్మంబు సంపాదించుకొంటి. 2526

సీ. ఎవనినామము స్మరియించినంతనె సర్వ, పాతకంబులు గూడ భస్మ మగునొ
యెవఁడు లోకంబుల నెల్లఁ బాలించుచుఁ, జలుపునొ ధర్మసంస్థాపనంబు
నెవఁడు కర్మంబుల కెల్ల ఫలం బిచ్చు, దేవుండు గాఁగఁ గీర్తింపఁబడునొ
యెవని నిత్యము భజియించు చుందురొ బ్రహ్మ, భవమహేంద్రాదిసుపర్వు లెల్ల

గీ. నెవని దర్శింపఁ దాపసు లేండ్లకొలఁది, నవయు చుందురొ ఘోరకాననములందు
నఖిలలోకసమారాధ్యుఁ డైనవాని, పైని ద్వేషంబు గలిగె నాపాపమునను. 2527

గీ. ప్రాగ్భవసహస్రలబ్ధపుణ్యాంబువలన, సంభవించినమర్త్యభుజన్మ మెల్లఁ
దగులఁబడిపోయె నక్కట దైవహతుఁడ, నైననా కింకఁ గలుగునె యాత్మశాంతి.

గీ. అనవధికదుఃఖవీచిమాలాకులాఘ, ఘోరసాగరమునఁ బడి కొట్టుకొనెడి
నాకు నేపుణ్యమూర్తి యైనను గరావ, లంబనం బిచ్చువాఁడు గలండొ లేఁడొ.

క. నే నీయాపత్సింధువు, నేనాఁటికి నైన దాటి యీవలఁ బడినన్

దానవవైరిపదాబ్జ, ధ్యానసపర్యల కొనర్తు నాత్మార్పణముల్. 2530
క. అని పలికె యేశ్వ గొల్లున, విని దేవద్యుతి విమూఢ విష్ణుద్వేషం
బనఁగను నాత్మద్వేషమె, యనుకొను మఖిలాంతరాత్ముఁ డాతఁడె యగుటన్. 2531
గీ. ఎవని కర్పింపఁబడినవె యెల్లకర్మ, ములును గాంచునో సాఫల్యమును సమస్త
కర్మఫలదాత యైనయాఘనుని విడుచు, బుద్ధిహీనుఁడు దుర్గతిఁ బొంద కున్నె.
సీ. కుజనులు కొందఱు నిజబుద్ధిబలముచే, నిగమాగమాచారనియమములకు
విపరీతముగఁ జేసి వివిధకువాదముల్, వానిచే బాలిశులైనజనుల
నమ్మించి విష్ణునిందయు వేదనిందయు, భూసురనిందయు బోధపఱుపఁ
బ్రాచీనమార్గముల్ పరిహరించి నవీన, పథములం జిక్కి విభ్రాంతు లగుచుఁ
గీ. దదసదుక్తుల వేదశాస్త్రములకంటె, నధికముగ నెంచికొని యట్లె యాచరించి
ధనమదాంధులు మూర్ఖులు దగ్ధమతులు, కడకుఁ జెడుదురు నీవలె గతులు లేక.
ఆ. నీకు సుగతి గల్గనేరదు కోటిజ, న్మముల కైనఁ గాని మనసులోనఁ
జలిపినట్టిపనికిఁ గలిగెఁ బశ్చాత్తాప, మందువలన శుద్ధి నొందఁగలవు. 2534
సీ. చని ప్రయాగక్షేత్రమునకుఁ దపోమాస, మున సితాసితతోయమున మునింగి
కర్మదోషవిముక్తిఁ గాంచు ముపాయాంత, రము లేదు నీకు శ్రేయము ఘటిల్లఁ
గావించె ధరణి నపావృతస్వర్గమో, తద్ద్వారముగఁ బ్రయాగమును ధాత
పాతకశృంఖలాబంధంబు ఛేదింపఁ, గలకుఠారము ప్రయాగం బొకండ
గీ. జాహ్నవీయమునాజలజ్వాలన మేడఁ, దుచ్ఛపాతకఘాససందోహ మేడఁ
దత్పయస్స్పర్శమాత్రపతత్పిశాచ, కాయుఁడై వసు వమరలోకమున కరిగె. 2535
క. అని నుడువుటయుఁ బిశాచము, వినయంబునఁ జేతు లొగ్గి విప్రోత్తమ నా
మనమునఁ దద్వసుచారి, త్రను వినఁగ జనించెఁ గోర్కి దయతోఁ జెపుమా. 2536

—: వసుబ్రాహ్మణవృత్తాంతకథనము :—

సీ. అని వేఁడుటయును నిట్లనియె దేవద్యుతి, వినుము కేరళదేశమునను మున్ను
వేదపారగుఁడై నవిప్రుఁ డొక్కఁ డుండె, వసునామధేయుఁడు వసుఘనుండు
తద్ధనంబును జూచి దాయాదు లోర్వక, బహువిధంబుల వాని బాధపెట్టి
యపహరింపఁగ ద్రవ్య మంతయు నాతండు, నిర్ధనుండై యూర నిల్వలేక
గీ. పరితపించుచు దేశముల్ తిరిగి తిరిగి, చిట్టచివరకు వింధ్యాద్రిఁ జేరి యచటఁ
దిరుగుచును గాలవశమున మరణ మొంది, యచ్చటనె ప్రేత యగుచు నల్లాడఁ దొడఁగె.
ఆ. అతఁ డదత్తదానుఁ డగుటను దత్కర్మ, ఫలము గాఁగఁ బ్రేతభావ మొదవె
దాన నగ్నతయు క్షుధాతృష్ణలును వాయు, కాయమును వికారగతియుఁ గలిగె.
సీ. ఆత్మవిద్యను జెప్పనట్టివారలు హరి, కాత్మార్పణము సేయనట్టివారు
చకితగోవిప్రరక్షణము సేయనివారు, పుణ్యతీర్థములకుఁ బోనివారు

వీతిహోత్రమున హవిస్సు నుంపనివారు, భిక్ష నీయనివారు భిక్షుకులకు
స్వర్ణగోభూఫలవస్త్రతాంబూలజ, లాన్నదానము సేయనట్టివారు
గీ. తెలుపఁబడుట నవత్తదానులుగ వేద, శాస్త్రములలోన వారలు చచ్చి రేని
ప్రేతరక్షఃపిశాచశరీరములను, నొంది పుట్టుదు రవలఁ గుయోనులందు. 2539

వ. మఱియును బ్రహ్మస్వహర్తలును స్త్రీధనహర్తలును బరద్రవ్యహర్తలును బరవంచకులును ధూర్తులును దాంభికులును గపటచిత్తులును బకవృత్తులును జోరులును సత్యవర్జితులును బాలవృద్ధాతురస్త్రీజనులయందు దయ లేనివారును నగ్నిదులును గరదులును గూటసాక్షులును నగమ్యాగాములును గ్రామయాజకులును బితృమాతృస్నుషాపత్న్యకళత్రత్యాగులును లుబ్ధులును నాస్తికులును ధర్మదూషకులును యుద్ధమునందుఁ బ్రభువును విడిచి పఱచువారును శరణాగతత్యాగులును గోభూహర్తలును రత్నదూషకులును దీర్ఘక్షేత్రములందుఁ బ్రతిగ్రహము సేయువారును బరద్రోహరతులును బ్రాణిహింసకులును బరాపవాదులును దేవతాగురునిందకులును దుర్దానప్రతిగ్రాహులును నవత్తదానతుల్యులు గాఁ బరిగణింపఁబడిరి. 2540

క. ఆపాపుల కెల్లరకును, నేపగిదిని నైనఁగాని యిహపరములలోఁ
జూపట్టదు సుఖలవమును, దాపత్రయవీతిహోత్రదాహము దక్కన్. 2541

ఆ. కానఁ గర్మగతిని గమనించి బుద్ధిమం, తులు నిషిద్ధకర్మములను విడిచి
స్వర్గమోక్షములకు సాధనం బగుధర్మ, మాచరించుచుందు రన్వహమును. 2542

క. కొందఱు దానము యజ్ఞముఁ, గొందఱు గురుదేవతలను గొందఱు తపమున్
గొందఱు మంత్రముఁ గొందఱు, కొందఱు దీర్ఘమును గొలిచి కొందురు సుఖమున్.

వ. ఆవిధంబున వసువు ప్రేత యై వింధ్యపర్వతంబునం దల్లాడుచు. 2544

సీ. ఒకదివసమున దైవికముగా మార్గము, నందుఁ బోయెడియొక్కయవనిసురునిఁ
గనుఁగొని తత్కరంబున నున్నకుంభంబుఁ, గాంచి పిపాసచే గాసిలుటను
జని వానిదరికిఁ బ్రాంజలి యయి ప్రార్థించె, జలముచేఁ బ్రాణంబు నిలుపు మనుచు
నంతటఁ బాంథుఁ డిట్లనియె భీకరముగాఁ, గానఁగఁబడియెడివానిఁ జూచి
గీ. యెవ్వఁడవు నీవు నీకాయ మిట్లు మాంస
విరహితము గాఁగ నెట్లు జీవించు చుంటి
త్వత్పదంబులు ధరణినిఁ దాఁక వేల
యేల నగ్నుఁడ వైతి నా కెఱుఁగఁ జెపుము. 2545

వ. అని యడుగుటయు నాతనికిఁ బ్రేత యి ట్లనియె. 2546

సీ. స్వామి చెప్పెదను మచ్చరితంబు సర్వంబు, నాలకింపుము దయాశాలి వగుచు
వసుధామరుఁడ నేను వసు వనియెడివాఁడఁ, గేరళము మద్వాసభూమి
నాశరీరము పరాన్నమునఁ బుష్టంబయ్యె, భుజియింపనైతిని భుక్తి యింట
నీఁగ కేనియు నిలి యిడనైతి భిక్షుకుల్, పీడించినను భిక్ష పెట్టనైతిఁ

గీ. పెట్టనైతి బహిర్బలి పితరులకును, శ్రాద్ధమును దర్పణంబును జలుపనైతిఁ
దప్పిగొనిన కంఠపానీయతోయ మొసఁగి, తృషితులకు బాహా మైనను దీర్పనైతి. 2547

సీ. భ్రమయించు చుండెడియు బ్రవ్యాళచేతను, ధర యెల్ల నొక్కతీర్థమున నేని
మునుఁగనైతిని పిత్రుముక్తికాంక్షను నొక్క, దేవత నైనఁ బ్రార్థింపనైతి
నాశ్చర్య విహాయమి యట్లుండ నతిథికి, వడియింపఁ జోకైన నొసఁగనైతి
సంధస్పృహాకించనానాథజనులను, గడగంట నైనను గాంచనైతి

గీ. వ్యాధిపీడితులకు నింత యౌషధంబు, నైన నిప్పింపనైతి వస్త్రాతపముల
బాధపడువారలకు ఛత్త్రపాదుకలను, నైన నర్పింపనైతిఁ బాపనైతిఁ దుదకు. 2548

సీ. పిడికెడు గ్రాసంబు పెట్టనైతిని గోవు, నకుఁ దిలహోమదానంబు లేని
సలుపనైతిని వ్యర్థములుగఁ జేసితిని సం, క్రాంతిచంద్రార్కోపరాగములను
మఘులు యుగాదులు మన్వాదు లష్టకా, వ్యతీపాతపర్వములును నఖిలతిథులు
సర్వపుణ్యంబులు సమకూర్చుమాఘమా, సంబున స్నానంబు సలుపనైతి

గీ. స్నాన మొనరించి యూర్జమాసమునఁ దైల, దీపమును వెలిఁగింపనైతిని జ్వలింపఁ
జేసి యగ్నిని స్నాతులశీతబాధ, తీర్పనైతిని మాఘకార్తికములందు. 2549

ఆ. మాఘవాదిపుణ్యమాసంబులందు శీ, తోదకంబు ద్విజుల కొసంగనైతి
బందిలోనఁ బడినప్రాణుల విడిపింప, నైతిఁ బ్రోవనైతి నార్తజనుల. 2550

సీ. రోపింపనైతి న్యగ్రోధపాదపమును, స్థాపింపనైతి నశ్వత్థతరువు
నొకపూరెడన మేని యుపవాస మొనరించి, శౌరికి సంప్రీతి సలుపనైతిఁ
గాపించుకొననైతిఁ గాయశుద్ధిని దప్త, కృచ్ఛ్రపారాకాదికృచ్ఛ్రములను
నెట్టిపుణ్యవ్రత మేనియు నొనరించి, పాపవిముక్తిని బడయనైతి

గీ. సేవధంబునఁ బ్రాగ్భవం బెల్ల వంధ్య, మగుటను నదత్తదానుఁడ నైతి దాన
నరకనిభ మైనప్రేతజన్మంబు వచ్చెఁ, బూర్వభవకర్మజవిపాకభోగమునకు. 2551

క. కల వీశైలంబున మధు, ఫలకుసుమమూలములు మధురపానీయనదీ
జలములు వృకాదిహతమృగ, పలలములుం ద్రావఁ దిన నపారము గాఁగన్. 2552

ఆ. ఐన నేమి నాకు నగపడ దేదియుఁ, బూర్వజన్మపాపమునను జేసి
దాన బ్రతుకు చుంటి దర్వీకరముపోలె, గాలి పీల్చుకొనుచుఁ గడుపు మండ. 2553

గీ. బలము ప్రజ్ఞయు నీతియుఁ బౌరుషమును, ద్రవిణమును విక్రమమును మంత్రమును నిఖిల
జనసహాయతయు నొసంగఁజాల వెన్నఁ, డేనియును నరున కలభ్య మైనదాని. 2554

గీ. భోగమున రోగమునను వియోగమునను
మరణమున జననంబునఁ బరిణయమున
లాభమున దుఃఖమునను నలాభమునను
సుఖమునను గారణము కర్మసూత్ర మొకఁడె. 2555

సీ. క్షుద్రజాతులును మూర్ఖులు కుహూపులు శౌర్య, విక్రమహీనులు విగతమతులు
కాణులు షండులు ఖంజులు నీతిహీ, నులు దురాచారులు ఖలులు శఠులు
నీచస్వభావులు నిర్గుణులును రాజ్య, మనుభవించుచు నుందు రధము లయ్యు
దానికి నంతకుఁ జా మొనర్చినపూర్వ, జన్మదానంబులె సాధనములు
గీ. గ్రామమం దుండినను నగరమున నున్న, నడవిలో నున్నఁ బర్వతమందు నున్న
దాత లనువారలకుఁ బూర్వద త్తదాన, ఫలములుగ భోగములు ముందు నిలిచియుండు.
క. తిలలను గోభూస్వర్ణం, బులఁ గన్యల భక్ష్యభోజ్యముల నాసనశ
య్యల మందిరముల వసనం, బుల నింకను నిత్తు రధికముగఁ బుణ్యాత్ముల్. 2557
సీ. ఈపర్వతంబున నింకను బ్రేతరా, క్షసపిశాచము లసంఖ్యముగఁ గలవు
ప్రాణులఁ జంపు నయ్యవి యెల్ల నతినృశం, సము వానిలోనఁ బిశాచగణము
వాసుదేవపదాబ్జదాసుఁడ వగునిన్నుఁ, గనుఁగొన్న నవి యన్నియును వడంకు
హరిభ క్తి కవనుల నంటఁజాలవు క్రూర, పూతనాబేతాళభూతములును
గీ. గ్రహములును దేవతలును నక్షత్రములును, బుణ్యవంతులఁ బ్రోతురు పుణ్యమూ ర్తి
వీవు వేదంబు సర్వంబు హృదయమునను, విష్ణునామంబు జిహ్వపై వెలయు చుంట.
క. నీ వకుతోభయుఁడవు ని, న్నేవియుఁ జేయంగఁజాల వేమియు నెందుక్
గావున భీతిం జెందం, బోవకు మించుకయు నిట్లు పొడగని నన్నుక్. 2559

—: వింధ్యాధిపతితత్పురోహిత వృత్తాంతకథనము :—

సీ. వినుము వే ఱొకమాట విన్నవించెద నేను, గర్మాగతప్రేతకాయమునను
దిరుగుచు వింధ్యభూధరకాననం బెల్ల, నొక్కదినంబున నొక్కచోటఁ
గనుఁగొని ధూసర యనునది నొకదానిఁ, జేరితిఁ దన్నదీతీరమునకు
నపు డొకసారసు బరుదెంచి యచటికి, సవిలాసముగఁ దనచానతోడఁ
గీ. దజ్జలంబును గడుపారఁ ద్రావి తనిసి, పులుఁగుగమి చేరియున్న తత్పులినమందు
వరటతోఁ గూడి యలసి స్వవామపక్ష, నిహితశీర్షం బయి బిరాన నిదురవోయె.
గీ. అపుడు త త్తీరగతభూరుహంబునుండి, యొక్కకపి డిగ్గి నిదురించు చున్నదాని
కాళ్లు చేతులతోఁ బట్టఁ గదలకుండ, నెగిరెఁ గలకలఁ గూయుచు ఖగము లెల్ల.
గీ. అంతటను సారసము భయ మావహిల్ల, మేలుకొని కాలమృత్యువుఁబోలె నెదుటఁ
గానఁబడు చున్నక్రోతినిఁ గాంచి ధైర్య, మేర్పడఁగ నాత్మలోపల నిట్టు లనియె.
సీ. వానరంబ పరాపవాదశూన్యులను బ, రప్రాణివృత్తిపరాఙ్ముఖులను
ననపకారులను ననూచకులను మాదృ, శులను హింసించుట తెలివి యగునె
శిక్షింపు మపరాధశీలుర దుష్టుల, దండనార్హులను భూధవుఁడుబోలెఁ
మామకపూర్వజన్మమున మాఘస్నాన, మొనగూడుటను నాకు నొక్కనాఁడు
గీ. భూతభవ్యవివేక ముద్భూత మగుట, జ్ఞాతమయ్యె భవత్పూర్వజన్మగాథ
యంతయును నాకు నీకు నే నాశ్రితుఁడను, విడువు మింక నన్ను నామాట విశ్వసించి.

క. అనవుడు నత్యాశ్చర్యం, బున వానరి మొుచి పక్షిపుంగవ నాప్రా
జ్ఞనచరిత్రం బేమిటొ, యనుచు నూహించక వచింపు మటుపై విడుతున్. 2564

వ. అని పలుకుటయు సారసం బానరిముఖంబునకు నిట్లనియె. 2565

సీ. శాఖామృగరాజ ప్రాప్తంబు నను నీవు, సంక్షేపంబుగ ననుపృచ్ఛ నడుపు నప్పు
బహుకాలమునుండి భవవిహ్వలయాంబున, మహానష్టపురోహితుండ నేను
దానిచే నెఱుంగుమా దావదహితి మా, తేయును జక్క్రంగను దాని వినుము
మును నీవు భూతలంబున నెలుగన్నుడు, తెలియు నాత్మింపంగఁ దలఁచి మదిని

గీ. బహువిధంబుల నేఁచితి ప్రజల నెల్లఁ, దత్త్వహాసీదనానలదాహమునను
మరణమును బొంది బహువిధనరకవహ్ని, కీలలను గాలి ముప్పదివేలయేండ్లు. 2566

వ. పదంపడి కిర్మశేషంబు ననుభవింప భూమిపై వానరంబుగా జన్మించితివి. 2567

గీ. ఒక్కనాక్ష్రనివసనమునం దుండినపుడు, పండ్లగెల గాంచి తదనుజ్ఞ వడయకుండ
బలమునంబునఁ గొంటివి ప్రాజ్ఞనమునఁ, గపిగ జనియించుటకు నది కారణంబు.

ఆ. పూర్వకృతము లైనపుణ్యపాపంబుల, యందు లవము గూడ వ్యర్థముగను
బోదు సురల కైన భోగింపకుండంగ, నింక నరులమాట యెుత్తనేల. 2569

గీ. ప్రాప్త మైనను బక్షిదేహంబు నాకు, భూతభవ్యపరిజ్ఞానమునను జేసి
దుఃఖపడకుండఁ బ్రాక్కృతదోషఫలము, ననుభవించుచు నుంటి నహార్య మగుట.

చ. అనవుడు వానరంబు విని యంతయు సారసపక్షిరాజ నీ
కొనరినజ్ఞాన మచ్చెరియ ముప్పతిలంగను జేసె నీచరి
త్రను వచియింపు మింక వివరంబుగ నావుడు సారసంబు సి
గ్గునఁ దలవంచి యి ట్లనియెఁ గొంకుచుఁ జెప్పఁగ నాత్మదోషమున్. 2571

సీ. నరవర మును నీవు నర్మదానదిలోన, స్నానంబు గావించి శ్రద్ధతోడ
ధాన్యఖారికశతంబు ధారవోసితి రవి, గ్రహణవేళను బహుబ్రాహ్మణులకు
నాధాన్య మిప్పించునధికారము పురోహి, తుండ నైననాకుఁ జెందుటను జేసి
యించుకించుక వారి కిప్పించి మిగిలిన, దంతయు నేఁ గొంటి నాశచేత

గీ. నమ్మహాపాపమునఁ జెప్ప నలవిగాని, కాలసూత్రాదిఘోరదుర్గతులలోనఁ
ద్రయ్యయుతవత్సరములు యమయాతనలను, ననుభవించితి నది వైరి కైన వలదు.

క. పౌరోహిత్యంబు మహా, ఘోరంబు స్వభావముననె క్షోణీసురుల కా
పౌరోహిత్యము గతి గా, గూరిచె విధి దాన ద్విజులు కొందు రఘుంబున్. 2573

క. అంచును నృపప్రతిగ్రహ, మించుకనకును నంచునకును నెగ్గుగ ద్విజులన్
గుందువడఁ జేయు దానను, గొందరు బ్రాహ్మణులు ఘోరఘోరాఘములన్. 2574

గీ. దారుణాఘౌఘవహ్నిని దగ్ధమూర్తు, లై నసామాన్యసర్వాంసహరనిమిషుల
ద్రవ్యము హరించుటను బురోధసుఁడు తదఘు, ధారి యై కూలు నరకగర్తములలోన.

వ. మఱియును నృపపాతకంబు నెల్ల శరీరంబున ముందుగా ధరించువాఁ డగుటం జేసి
పుక్కోశ యయ్యె నని ప్రాజ్ఞులు వచియింతురు. 2576

గీ. కడకు నే నెట్లొ దైవయోగమున ఘోర, నరకవారాశిలోనుండి దరికిఁ జేరి
క్షితిని సారసముగను బుట్టితిని గాంస్య, పాత్రమును దొంగిలించుట భగినియింట.

వ. నాకొఱకుఁ బులినదేశంబున విలపించుచుండెడియీయావరట పూర్వజన్మంబున నొకబ్రాహ్మ
ణియై యుండి కాంస్యచౌర్యంబునం జేసి సారసి యై పుట్టి నాకు సతి యయ్యె. రాఁబో
వుజన్మంబున మన మిరువురమును హంసలముగను నీసారసి హంసిగను బుట్టి కామ
రూపం బనుదేశంబునఁ గొంతకాలంబు గడపి యనంతరంబు గోయోనిసంభూతుల మై
పిమ్మట మనుష్యజన్మంబు నొందంగలము. 2578

ఆ. ఇట్లు మనమె కాక యింకను నెందఱొ, కలరు స్వకృతపాపఫలము ననుభ
వించుచుండువారు విశ్వంబునం దని, చెందవలయుఁ జూవె చిత్తశాంతి. 2579

క. రాఁగలదు మంచికాలము
పోఁగల వీతుచ్ఛదేహములు మన కింకన్
లోఁగక విషాదములకున్
వేఁగక ధృతినుండి వలయు విధిఁ గడవంగన్. 2580

చ. అనుటయు వానరంబు ప్రమదాతిశయంబున మ్రొక్కి సారసం
బునకు మహాత్మ నీవు మునుపొలెఁ బ్రబోధము సేసి యిప్పుడున్
మనమునకున్ ధృతిన్ గొలిపినాఁడవు నీకు శుభంబు గల్గుఁ బో
మ్మని విడనాడి పోయెఁ దనయాత్మను జన్మవిముక్తి గోరుచున్. 2581

మ. విని యాసారసవానరోక్తులను నే విజ్ఞాని నై సంతతం
బును జింతిల్లక ప్రేతభావమునకున్ మోదంబుతో వింధ్యకా
ననమం దుంటిఁ జరించుచున్ వ్యథల నెన్నం డైన నేప్రాణి కై
నను గల్గింపక జన్మముక్తి కయి ధ్యానం బాత్మలోఁ జేయుచున్. 2582

క. నమ్ముము నావచనము తో, యమ్ముఁ బ్రసాదించి దాహ మార్పుము వెసఁ బ్రా
ణమ్ములు రక్షించినపు, ణ్యమ్మును గొను మేల చేసె దాలస్యంబున్. 2583

సీ. అదియును గాక ప్రయాగంబునుండి నీ, వరుగుదెంచుచు నుంటి వనుచుఁ దోఁచెఁ
దత్కారణమునఁ ద్వత్పాత్రస్థ మైనతో, యంబు గంగాతీర్థ మని స్ఫురించె
నది నాకు ముక్తిదం బగు సంశయము లేదు, వచియింతుఁ దత్ప్రభావంబు వినుము
గ్రామయాజకుఁ డైనబ్రాహ్మణుం డొక్కఁ డ, యాజ్యయాజనసంభృతాఘమునను

గీ. బ్రహ్మరాక్షసుఁ డై వింధ్యపర్వతమున, నుండి వర్షాష్టకము తత్సుతుండు తెచ్చి
కలుపఁగఁ దదస్థు లొకనాఁడు గంగలోనఁ, దత్క్షణమ యేఁగె దివికి నత్యద్భుతముగ.

క. కనులారఁగ నది యంతయుఁ, గనుఁగొనుటను మున్ను నేను గంగాసలిలం
బునఁ గలమహిమముఁ గంటిని, గనికర మిప్పటికి నైనఁ గలిగెన నీకున్. 2585

గీ. ఇప్పటికి మూఁడువేలయేం డ్లెఁగె వింధ్య, శైలమున నాకు నీప్రేతజన్మమునను
జెప్పితి సమస్తమును నీకు సిగ్గు విడిచి, కరుణతోడను నిమ్ము గంగాజలంబు. 2586

సీ. అని పల్కుటయును సత్యాశ్చర్య మొదవంగఁ, బాంధవుఁడు విని ప్రేతభాషణములఁ
దనమదిలో నిట్లు తలపోయఁ దొడఁగెఁ బు, ణ్యాపుణ్యఫలము ప్రత్యక్షముగను
గనఁబడు చుండె లోకమున దేవమనుష్య, దైత్యతిర్యక్కీటతతులవలన
వివిధజన్మంబులవివిధరోగములవి, ద్వన్మూర్ఖధనిదరిద్రతలవలన

గీ. నిట్లు కానున్న సంగత మగుచె జగము, లందు నుండెడిరీతుల నవ్వయింపఁ
గానఁ బ్రాజ్ఞులు బహువిధదానములను, జేయు చుందురు హైన్యంబు చేకుఱమికి.

గీ. కలుగుచెడలను నుభయలోకంబులందు, సౌఖ్య మొందెడికోరికి సలుపవలయు
శక్తికొలఁదిని జను లెల్ల సకలదాన, ములను సౌఖ్యంబు లెల్లఁ దత్ఫలము యగుట.

గీ. ప్రాప్త మగు చుండు దత్త మైనదియె దివిని, బ్రాప్తమగు చుండు దత్త మైనదియె భువిని
గాదు ప్రాప్యంబు దత్తము గాని దెందు, కేనియును నిహాపరములం దెందు నేని.

గీ. ఆయువును విద్యయు ననామయమును యశము
ధనమును బ్రభుత్వమును భోగమును సుఖంబు
దాతృతయు ధర్మబుద్ధియు దక్షతయును
ధైర్యమును మంచి యెల్లను దానఫలము. 2590

సీ. అని తలంచి మనంబునందుఁ బ్రేతను గాంచి, కృప యొ మతిల్లఁ దా నిట్టు లనియెఁ
గావించి నేను మాఘస్నానమును బ్రయా, గమునఁ దెచ్చుచు నుంటి గాంగజలము
భృగుకచ్ఛమున వసియించునాతల్లిదం, డ్రుల కభిషేకంబు సలుప నెంచి
యార్తుఁడ వై నవీ వాసించితివి మార్గ, మధ్యమం దిదియును మానఁ దగదు

గీ. ప్రాణరక్షణ మఖిలధర్మములకంటె, నుత్తమం బని శ్రుతులయం దుక్త మగుట
మొదట రక్షించి నీప్రాణములను మరల, సలిలమును దెచ్చి పితృపూజ సలుపువాఁడ.

క. అని పలికి గాంగతీర్థం, బును బ్రేతకుఁ బోసె హస్తపుటమునఁ దత్స్ప
ర్శనమాత్రముననె ప్రేతకు, ననిమిషదేహము లభించె నాశ్చర్యముగన్. 2592

సీ. ఇట్లు సంప్రాప్తదివ్యాకారుఁడై వసు, వాహ్లాద మొందుచు నాత్మలోనఁ
బాంధున కొనరించి ప్రణతి దివ్యవిమాన, మెక్కి శీఘ్రంబుగ నేఁగె దివికి
నంతటఁ బాంధుఁ డత్యాశ్చర్యభరితుఁ డై, యప్పుడె మరలఁ బ్రయాగమునకుఁ
జని యథాపూర్వంబుగనె త్రివేణీతీర్థ, మును గొని భృగుకచ్ఛమునకుఁ జనియె

గీ. నని వచించుటయును జైత్రుఁ డతనిపంపు, గైకొని ప్రయాగమునకు మాఘమున నేఁగి
యటఁ ద్రివేణీజలంబున నాచరించి, స్నానమును దివ్యదేహుఁ డై చనియె దివికి.

సీ. అని చెప్పి మాఘమునందు స్నానము సేయ, నరుగదు నేను బ్రయాగమునకు
నాతోడ మీర లందఱును రం డనుటయు, నాపిశాచములును నాద్విజుండు

సామోదముగను నాలోమశమునివెంటఁ, జని చేరెఁ బ్రయాగమునకు నంత
లోమశమౌని యాలోకించి వారల, నెల్లరఁ బ్రీతితో నిట్టు లనియె

ఆ. నిదియె తీర్థరాజ మీక్షింపుఁ డిచ్చోట, నాచరించి యజ్ఞ మబ్జభవుఁడు
సృష్టికామమునను సృజియించె జగముల, విశ్వసృజనియజ్ఞవేది యిదియె. 2594

గీ. సంతతమును జ్వలించెడిన త్రేతాగ్ను, లగ్నికుండత్రయం బిదె వహ్ని యిచటఁ
జెందినట్టులు సంతృప్తిఁ జెందఁ జేచట, నేనియును నిండె ప్రభవించె నీశ్వరుండు.

సీ. ఆరసాతలజట మైనయక్షయవట, మ్మోరుహం బియ్యది జగము లెల్లఁ
బ్రళయకాలములందు జలమయంబులు గాఁగ, బద్మనాభుండు దీనిపత్రమందు
దీనిశాఖాముఖస్థానంబున మృకండు, సుతుండును నుండు రద్భుతము గాఁగ
నీమె శ్రీకంఠునియిల్లాలు లలిత స, మస్తామరస్తూయమానచరిత

ఆ. స్వర్గదాత్రి యైనజాహ్నవి యిది యిది, యరుణలోకదాత్రి యైనయమున
యేతదుభయసంగ మిది దీనిలో స్నాతు, లైనవారు ముక్తు లైనవార. 2596

సీ. నారాయణుం డిట దారకాంక్షను స్నాన, మొనరించి పత్నిగా నొందె రమను
దనుజసంహారవాంఛను నీశ్వరుం డిందు, మునిఁగి త్రైపురదైత్యులను వధించెఁ
బడసె యయాతినిఁ గొడుకుగా నహుషుండు, నందనార్థము నేసి స్నాన మిచటఁ
ద్రిదివేంద్రశాపపాతిత యైనయూర్వశి, మునిఁగి యిచ్చట స్వర్గమునకుఁ బోయె

గీ. ధననిమిత్తము శక్రుఁడు మునిఁగి యిచట, నపరిమిత మైనయైశ్వర్య మందఁగలిగె
స్నాన మొనరించి సనకాదిమౌను లిచట, యోగలిప్సను జెందిరి యోగసిద్ధి. 2597

సీ. నారాయణుండును నరుఁడును నిటఁ దపం, బాచరించిరి హాయనాయుతంబు
కశ్యపుఁ డిచ్చటఁ గావించి తపమును, బ్రమథాధిపతికృపాపాత్రుఁ డయ్యె
నణిమాదిసిద్ధుల నందె జైగీషవ్యుఁ, డిచట సత్కర్మంబు లెల్లఁ జేసి
తపము నిచ్చట భరద్వాజుండు గావించి, సప్తర్షులం దయ్యె సప్తమర్షి

గీ. యీస్థలంబు ఫలం బిచ్చు నెల్ల కర్మ, ములకుఁ గాని తపోమాసమున నొనర్చు
స్నానమున కిచ్చుఫలము నెన్నంగఁ జాల, స్నాతజనపూరితం బయ్యె స్వర్గ మెల్ల.

గీ. ముక్తి నాసించువారికి ముక్తి నొసఁగుఁ, గామకాముల కొడఁగూర్చుఁ గామములను
సిద్ధులను గోరువారికి సిద్ధు లిచ్చుఁ, దీర్థరాజంబుఁ బోలినతీర్థ మున్నె. 2599

ఆ. మును ఋచీకశాపమున నొక్కగంధర్వుఁ, డొంది కాకరూప ముర్విపైనిఁ
బడి ప్రయాగమునను బడసె శాపవిముక్తి, మాఘమాసకృతనిమజ్జనమున. 2600

—: గంధర్వకన్యావిప్రశాపమోక్షకథనము :—

క. జ్ఞానాజ్ఞానసమార్జిత, నానాపాతకవినాశనం బగు మాఘ
స్నానమునఁ బ్రయాగంబున, నానతి యిచ్చితి మునుఁగుఁ డందఱు దీనన్. 2601

గీ. అనుటయును నాపిశాచము లర్కుఁ గుండు, నందవజకును మకరమునందు స్నాన
మాచరించి వేణీజలమందుఁ దొలఁగి, శాపములు తొలిచి స్వస్వరూపములను. 2602

ఆ. ఇప్పుడు వేదనిధి మహానందమును బొంది, లోమశుని నుతించి స్వామి వీరి
కందఱకును క్షేమ మయ్యెడిమార్గంబు, నానతిమ్ము నాకు నమ్మహర్షి. 2603

గీ. బ్రాహ్మణోత్తమ నీతనూభవుఁ డక్షత, వేమఁడు సనూ ప్రనియమునఁడు వీరు దేవ
కన్యకలు మోహ్యశీలలు కారు మర్త్య, లభ్యులైనను బ్రాహ్మణ్యాలభ్యులైరి. 2604

ఆ. కాన వీరి నెల్లఁ గైకొని విధివిధా, నమున భార్యలుగను నడిపికొనుచు
నాశ్రమోచితంబులైన ధర్మంబుల, నీకుమారుఁ డొందుఁగాక శుభము. 2605

క. అని పలికినమాటయును వే, దనిధి తనపుత్త్రులను నిగమధర్మంబులఁ గై
కొని తనకుమారునకు న, వ్వనితలకును ధర్మ్యమగు వివాహ మొనర్చెన్. 2606

ఆ. అప్పు డాకుమారుఁ డాకన్యలును వేద, నిధియు లోమశునకు నిరుపమాన
హర్షవార్ధి నోలలాడిరి యోగ్యసం, ఘటన మఖిలహర్షకరము గాదె. 2607

గీ. అంతటను లోమశుఁడు స్వపదాంబుజంబు, లందు బ్రాలినవారల నందఱకును
జలికి యాశీస్సులను మెరుగైలసంస్థ, మైనస్వాశ్రమమున కేఁగె నాక్షణంబ. 2608

ఆ. అంత వేదనిధియు నాత్మపుత్త్రస్నుషా, సహితముగను నేఁగి స్వపురమునకు
మేను పడుచునంతకు స్నానముల్ చేసి మా, ఘంబులందుఁ జనియెఁ గడకు దివికి.

వ. మఱియుం గొన్నివిశేషవిధులం జెప్పెద వినుము. మాఘామావాస్యనాఁడు ప్రాతఃకాలంబునం జేయుస్నానంబును పిత్రుతర్పణంబును గోదానతిలదానంబులును మాఘశుద్ధసప్తమీపర్యంతరంబునందుఁ గావింపంబడుస్నానదానాదులును ననంతఫలప్రదంబులు. మాఘశుక్లసప్తమి సూర్యగ్రహణతుల్యంబు. నాఁడు యవలును నర్కపత్త్రంబులును బుష్పములును బదరీఫలంబులును దండులంబులును సింధూరంబును యజ్ఞోపవీతంబును దామ్రపాత్రమునం దుంచి సూర్యనారాయణప్రీత్యర్థంబుగా బ్రాహ్మణునకర్పించి యుపవాసము గావించిన సప్తజన్మార్జితపాపక్షయం బగు. దానం జేసి కోటిదివ్యవర్షంబులు సూర్యలోకంబున మహాభోగంబు లనుభవించి పిదప భూమిపై మహారాజుగా జన్మించి యారోగ్యవంతుండై పూర్వాభ్యాసవశంబున సౌరవ్రతంబు నాచరించి తుదకుఁ బరమపదముం జెందు. మాఘశుక్లపక్షరవివారసప్తమి మహాజయ యనియు మాఘకృష్ణపక్షభానువారసప్తమి విజయ యనియుం జెప్పంబడు. విజయ కోటిలక్షఫలప్రద. మహాజయ యనంతఫలప్రద. అందుఁ గావింపంబడు హయరత్నసువర్ణరక్తవస్త్రధాన్యదానసౌరవ్రతంబులు మహాఫలప్రదంబులు. హయదాత సప్తసముద్రముద్రితభూమండలాధిపతి యగు. రత్నప్రదాత మహేంద్రుం డగు. స్వర్ణప్రదాత కుబేరుండగు. రక్తవస్త్రధాన్యప్రదాత సకలామరసేవ్యుం డగు. సౌరవ్రతకర్త జన్మరాహిత్యంబు నొందు. ఉత్తరాయణశుక్లపక్షభానువారంబునఁ బుణ్యక్షేత్రమం దర్కసప్తమీవ్రతముం జేయువాఁడు శాశ్వతభానులోకనివాసభాగ్యంబు

నొందు. పంచమినాఁ డేకభుక్తమును షష్ఠినాఁడు నక్తమును గావించి సప్తమినాఁ డుపవాస మొనరించి సూర్యుని నారాధించి యష్టమినాఁడు పారణయు బ్రాహ్మణ సంతర్పణంబును గావింపవలయు. ప్రతిమాసంబును భానువారంబులందు సౌరవ్రతంబు గావించువాఁడు సూర్యప్రసాదంబున నారోగ్యైశ్వర్యంబులం బొంది కడకు సూర్య లోకంబునఁ గల్పకోటిపర్యంతంబు నివసించి పిదపఁ బరమపదము నొందంగలుగు. 2610

—: మాఘమాహాత్మ్యపఠనశ్రవణఫలకథనము :—

క. ఈమాఘమాసమహిమము, వేమరు వచియించువారు వినియెడివారున్
క్షేమములఁ గాంతు రిహపర, ధామంబులలోనఁ గష్టదశ లేకుండన్. 2611

క. ఇని యేతద్ధర్మంబులు, వినిచినపౌరాణికునకు వేడ్క జనింపన్
గనకాభరణాంబరభూ, ధనగోధాన్యాదు లొసఁగుదాతలు ధన్యుల్. 2612

క. ఆరాధితుఁడో యెవ్వరు, పౌరాణికుఁ డైనద్విజుని బద్మాక్షుని వా
రారాధించినవారల, వారికి హరి యిచ్చు నఖిలవాంఛితసిద్ధుల్. 2613

క. పౌరాణికుండు సాక్షా, న్నారాయణుఁ డని యెఱింగి నరుఁ డతని సేవం
దారాధించునొ వానికి, నారాయణమూర్తి ముందు నడచుచు నుండున్. 2614

వ. అని వచించుటయు దిలీపుండు మహానందముం జెంది దివ్యభూషణాంబరంబులచే వసి ష్ఠుని సత్కరించి తదనుమతిం గొని చనియె. 2615

సీ. అని వచించుటయు ని ట్లనియె శౌనకమహా, ముని సూత నీవు చెప్పినది యెల్ల
నమృతవర్షంబ భవాగ్నిలోఁ బడి తాప, మునఁ దహతహ నొందుజనుల కెల్లఁ
గాని యిం కొకమాట కలదు ని న్నడుగంగ, నఖిలధర్మజ్ఞుఁడ వగుటఁ జేసి
సకలమానవులకు సంసారదుఃఖంబు, తొలఁగించి మోక్షంబు గలుగఁజేయ

గీ. సులభ మగుమంత్ర మే దైనఁ గలిగియున్నఁ, దెలుపు ముపకారము సమస్తదేహులకును
జలిపినఫలంబు నొందెదు సత్యముగను, ననుడు ని ట్లను సూతుఁ డామునివరునకు.

చ. అడిగితి వీవు మంచివిషయంబు మునీంద్ర దిలీపుఁ డిట్లె ము
న్నడుగ వసిష్ఠమౌని నతఁ డాతని కి ట్లనియెన్ నృపాల నీ
వడిగినయట్లు మున్ను సనకాదులు బ్రహ్మను గోరఁగా నజుం
డడిగె మురారి నప్పుడు మురారి విరించికిఁ జెప్పె నీగతిన్. 2617

—: లక్ష్మీనారాయణమంత్రకథనము :—

క. వనజభవ కలదు సర్వుల, కును మోక్షము గల్గఁజేయుగొప్పతనముతోఁ
దనరారుమంత్ర మొక్కటి, యనవధికము దానిమహిమ మభివర్ణింపన్. 2618

క. పెకలించు నఖిలపాతక, నికరము నామంత్ర మొకఁడె నిర్మూలముగన్
సకృదుచ్చారణమాత్రన, ప్రకటపవనం బవనిజాతపంక్తులఁ బోలెన్. 2619

క. నామంత్రం బఠించి దానిన్, బ్రేమం బలరార సంస్మరించెడివారల్
నాముఖ్యబంధుమిత్రులు, క్షేమంబును వారి కేను జేయుచు నుందున్. 2620

క. ఈమనుజుం డర్హుం డనియును, నీమనుజుం డనర్హుం డనియు నేను వచింపన్
నామంత్రము జపియింపఁగ, నామీఁదను భక్తి యున్ననరు లధికారుల్. 2621

సీ. మంచివంశమున జన్మించినవాఁ డైన, వేదశాస్త్రాదిప్రవీణుఁ డైన
వివిధతీర్థములు సేవించినవాఁ డైన, నియతతపఃపరినిష్ఠుఁ డైన
సర్వసంగత్యాగనిర్వాహకుం డైన, నానావ్రతానుసంధానుఁ డైనఁ
గల డైన సత్యంబు తొలఁగనివాఁ డైనఁ, గ్రతుసహస్రములకుఁ గర్త యైనఁ
గీ. బుణ్యనిధి యైనఁ ద్రైలోక్యపూజ్యుఁ డైన, జ్ఞాని యైనను గుణగణాస్థాని యైన
మానసంబున మద్భక్తి లేనియెడలఁ, గాఁడు మంత్రాధికారంబు గలుగువాఁడు. 2622

గీ. ఉచ్చరించినవారిం జాలు నొక్కసారి, యార్తులకుఁ దీఱుచుఁ దదార్తి యాతుఁడంబ
తృప్తు లగుభక్తులకుఁ బ్రసాదించు ముక్తి, నమ్మహామంత్రమహిమ మత్యద్భుతంబు.

వ. ఈమ్మంత్రంబునకు మంత్రరత్నం బనియును ద్వయ మనియును బ్రపత్తి యనియును శరణాగతి యనియును లక్ష్మీనారాయణమంత్రం బనియును నామాంతరంబులు గలవు. 2624

క. పరికింపఁగోలుపఁజాలవు, శరణాగతిమంత్రజపముచాయను నా క
ధ్వరములు దీర్థాటనములు, ధరణీగోతిలహిరణ్యధనదానములున్. 2625

వ. "శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే శ్రీమతే నారాయణాయ నమః" యనుమన్మంత్రరత్నంబునకు గాయత్రి ఛందస్సు. ఋషియును దేవతయును నేన. వర్ణంబు లిరువదియేను. పదంబు లాఱు. తత్పదషట్కంబుచేతన షడంగన్యాసంబు గావింపంజను.

క. కోరికె గలిగి జపించెడి, వారికి న్యాసాదికంబు వలయు నొనర్పన్
గోరికె లేక జపించెడి, వారికి న్యాసాదికంబు వల దొనరింపన్. 2627

క. కోరి ఫలంబును మంత్ర ము, వారిగ జపియించునట్టివారలకంటెన్
గోరక ఫలమును సకృదు, చ్చారణ మొనరించువాఁడు సమధికుఁడు సుమీ. 2628

చ. ప్రకటము సేయఁగూడదు పరాకున నేని మదీయమంత్ర మా
స్తికమతి లేనివానికి నదీక్షునకున్ గురుభక్తి లేనివా
నికి నభిమానవంతునకు నీతివిహీనున కాస్థ లేనివా
నికి గుఱి లేనివానికి వినిర్మలచిత్తము లేనివానికిన్. 2629

—: ప్రపన్నస్వరూపకథనము :—

వ. మఱియును మచ్చక్రాంకితత్వంబును మదీయారాధనంబును నాయందు సర్వకర్మఫలార్పణంబును నన్నుఁ దప్ప నన్యుని నాశ్రయింపమియును నాయందు మహావిశ్వాసంబును నన్యసాధనప్రయత్నాభావంబును నాత్మీయ మేమియును లే దనునిశ్చయంబును నవై

ష్ణవసంభాషణావందనాదివర్జనంబును మదన్యదేవతాపూజాస్మరణాదిత్యాగంబును సర్వ
కాలంబులందును నన్నే స్మరించుటయుఁ దమసర్వస్వంబును నన్నుంగూర్చి వినియో
గించుటయు ననునీమహాగుణంబులు గలవారలు ప్రపన్ను లనం బరగుదురు. వారు
మత్ప్రియు లగుటం జేసి వైష్ణవు లని చెప్పంబడుదురు. ప్రపన్నులు శంఖచక్రగదాపద్మ
హస్తంబును వామాంకస్థితరమావిరాజమానంబును విశ్వరూపంబును నగుమద్దివ్య
మంగళవిగ్రహంబును ధ్యానించి నన్నుఁ బూజించి మంత్రరత్నంబును జపించు చుందురు.

ఆ. తత్ప్రకారంబు లైనధ్యానపూజామంత్ర, జపములకును నేను సంతసింతు
నేను హర్ష మొందిన నఖిలలోకములును, హర్ష మొందు నన్మయంబు లగుట. 2631

సీ. అని తెల్పుటయును నిట్లనియె నంబుజయోని, స్వామి నామీఁదివాత్సల్యమునను
మంత్రప్రధాననామంబులఁ జెప్పితి, ధన్యుండ నైతి నీదయనుజేసి
నీవె తండ్రివి తల్లి నీవె స్వామివి నీవె, గురుఁడవు నీవె సఖుండ వీవె
నేను నీదాసుఁడ నేను నీసుతుఁడ నీ, భ్రాతుండ నేను నీసఖుఁడ నేను

గీ. శరణువొచ్చితి నే భవచ్చరణములను, దెలిపి నియమంబు లన్నియుఁ దేటపడఁగఁ
జేసి మంత్రోపదేశంబు శీఘ్రముగను, నుద్ధరింపంగ నను గతి యొకఁడ వీవ. 2632

వ. అని వేఁడుటయుఁ జతుర్భుజుండు చతురాస్యున కి ట్లనియె. 2633

క. వనజాసన మన్మంత్రముఁ, గొన నెంచిన మొదట దీక్షఁగొని యావలఁ గై
కొనవలయు మంత్ర మాచా, ర్యునివలనను నెవ్వఁ డేనియును దరియింపన్. 2634

సీ. బ్రహ్మవిద్యావిశారదుఁ డైనవాఁడును, శమదమాదిగుణంబు లమరువాఁడు
బ్రాహ్మణాన్వయమందుఁ బ్రభవ మొందినవాఁడు, పరమార్థచింత యేర్పడినవాఁడు
వేదశాస్త్రములమర్యాద మీఱనివాఁడు, కామాదులకు లోను గానివాఁడు
నన్యప్రయోజనం బభిలషింపనివాఁడు, విష్ణుభక్తుం డయి వెలయువాఁడు

గీ. సంప్రదాయజ్ఞుఁడును మంత్రసారవిదుఁడు, ధర్మపరుఁడును శుచియు సత్కర్మరతుఁడు
వందనీయుఁడు నగునట్టివైష్ణవుండె, యర్హుఁ డాచార్యపదమున కబ్జజన్మ. 2635

క. ఆచారవంతుఁ డయి తా, నాచారమునందుఁ బ్రజల నందఱ నిలుపం
జూచునతనిఁ గా కన్యుని, నాచార్యుం డనుట హాస్య మనుటయె బకమున్. 2636

గీ. శ్రేష్ఠ ద్వాదశి యేనియు శ్రవణ మేని, విష్ణుభక్తుండు చెప్పినవేళ యేని
తగినయాచార్యుఁ డొదవినతఱుణ మేని, సముచితము సూవె మంత్రదీక్షను గొనంగ.

—: వైష్ణవమంత్రదీక్షావిధానకథనము :—

వ. సువర్ణంబునం గాని రజతంబునం గాని తామ్రంబునం గాని కాంస్యంబునం గాని నిర్మిం
పంబడినసుదర్శనపాంచజన్యంబులకు నాచార్యుండు పంచామృతశుద్ధోదకంబుల నభిషే
కంబు గావించి మన్మూర్తియెదుట మన్మంత్రంబుచే విధివిధానంబున వాని నర్చించి
స్వగృహ్యోక్తవిధానంబున నగ్నిని బ్రతిష్ఠించి యయ్యగ్నిహోత్రంబున మంత్రరత్నం

బుచే నాజ్యహోమంబులును బురుషసూక్తాదిమంత్రంబులచే ఘృతపాయసహోమంబులును నష్టోత్తరసహస్రంబు గాని యష్టోత్తరశతంబు గాని కావించి పిదప మదీయషడక్షరమహామంత్రంబున నిరువదియాజ్యహోమంబులు గావించి యావహ్నియందు శంఖచక్రంబులు తప్తంబు లొనర్చి వానిం గైకొని శరణాగతిమంత్రంబున శిష్యునకు దక్షిణభుజంబునందుఁ జక్రంబుచేతను వామభుజంబునందు శంఖంబుచేతను నంకనంబు గావించి హోమశేషంబు పరిసమాప్తి నొందించి పునఃపూజ నొనరించి మంత్రపూతం బగుకలశోదకంబున ద్వయమంత్రంబుచే శిష్యునిశిరంబున నభిషేకంబు గావించి తద్దక్షిణకర్ణంబున మంత్రరత్నోపదేశంబు చేసి మంత్రార్థంబును వృత్తియును నియమంబులును బోధింపవలయు. ఇంక శిష్యుండు వైష్ణవుం డై కృతార్థుండ నైతి నని భావించికొని యాచార్యుని శక్తికొలందియు గోభూహిరణ్యవస్త్రభూషణాదులచే బహూకరించి సంతుష్టాంతరంగునిం జేయవలయు. ఇది వైష్ణవమంత్రదీక్షావిధానంబు. దీనం దప్ప మఱియొకంట వైష్ణవత్వంబు సిద్ధింప నేర దని మంత్రదీక్షావిధానంబు విశదీకరించి ప్రసన్నుండై నచతుర్ముఖునకు యథావిధిని బ్రపత్తిమంత్రంబు నుపదేశించె. చతుర్ముఖుం డమ్మంత్రంబు నాకును నారదునకును నారదుండు నైమిషారణ్యవాసు లగుమహామునులకును నుపదేశించె. అమ్మహర్షులు మంత్రోపదేశంబు వడసి విష్ణుభక్తిచేఁ బరమపదంబు నొందిరి. నే నమ్మహామంత్రంబు శక్తిపుత్రుం డగుపరాశరున కుపదేశించితి. 2638

క. ఆమంత్రరాజమునకును, నేమంత్రం బేని యస్య మెన గాదు సుమీ
శ్రీమద్వైకుంఠపరం, ధాముున కీ డైన దైవతము లేదు సుమీ.

క. కావున నమ్మంత్రంబును, ధీమవర గ్రహియించి విష్ణుసారూప్యంబుం 2639
గైవసము చేసికొనుమీ, నీవును బహుభాష లేల నీకు వచింపన్. 2640

క. అనుటయు దిలీపవిభుఁ డి, ట్లనియె వసిష్ఠునకు స్వామి హరిమహిమంబున్
వినినకొలందిని మఱిమఱి, వినుటకు నుత్సాహ ముద్భవించెడి నాకున్. 2641

గీ. భవసమాహ్వయకాననాభ్యంతరంబు
నందుఁ దాపత్రయాగ్నికీలాభితప్తు
లైనవారికి హరిభక్తి యనెడియమృత
సాగరము దప్ప మఱి యొండు శరణు లేదు. 2642

క. జలజాక్షునిసేవ యెటుల్, సలుపఁగవలయునొ సమస్తసంతాపములున్
దొలఁగి సుఖింపఁగ నాకున్, దెలుపు మన వసిష్ఠుఁ డిట్లు తెలుపఁ దొడంగెన్. 2643

క. మనుజాధిప విను మిప్పుడు, నను నీ వడిగినవిధంబుననె కైలాసం
బున మున్ను శివుని గిరిసం, దన యడుగుడు నామె కపు డతం డి ట్లనియెన్. 2644

సీ. విష్ణు వనంగను వేదాంతవేద్యుండు, నిత్యుండు సగుణుండు నిర్గుణుండు
సర్వలోకకరుండు సర్వలోకధరుండు, సర్వలోకహరుండు సర్వశక్తి

సర్వాత్మకుండును సర్వేశ్వరుండును, సర్వతోముఖుండును సర్వసాక్షి
సవితయుఁ బరమాత్మ శంఖచక్రధరుండు, క్రతుపతియును బ్రజాపతియు శివుఁడు
గీ. వానిమహిమఁ బశేషంబు వాకొనంగ, నేన కాదు బ్రహ్మాదు లేనియును దగరు
శైలనందన యొకమాట చాలకింపు, మడిగితివి గాన నుడివెద నంతొ యింతొ.
క. నాకును బ్రహ్మాదులకును, నీకును సర్వంబునకును నిశ్శంకముగన్
వైకుంఠుఁ డొకఁడె సేవ్యుఁడు, చేకూర్చు నతండె సకలసిద్ధులు మనకున్. 2646
గీ. దేవి చెప్పెద వినుము సందేహ ముడిగి, ప్రేతరక్షఃపిశాచాదిభూతములును
నఖిలవిషములు నానావిధామయములు, హరిని భజియించువారలదరికి రావు.
క. గరుడధ్వజసంకీర్తన, పరులకు రాకుండ నేయుపద్రవ మేనిన్
హరిచక్రగదాద్యాయుధ, పరికరములు గాచుచుండుఁ బ్రతినిమిషంబున్. 2648
ఆ. హరినిగూర్చి తీర్థయాత్ర యేనియు వ్రతం, బేని పూజ యేని దాన మేని
యెట్టిపుణ్యకార్య మేనియుఁ జేయని, పామరులకుఁ గలుగు బాధ లెల్ల. 2649
క. ఆపదలు సంభవించును, బాపంబులవలన నట్టిపాపము లెల్లన్
రూపఱు హరికీర్తనమున, నాపద లేక నెట్లు గలుగు హరిదాసులకున్. 2650
క. హరికృపకుఁ జెంది పాత్రత, లరియింపఁగ నాశ యున్నతనుధారులకున్
హరిసేవ తప్ప నన్యము, శరణము లే దున్నమాట చాటితి నీకున్. 2651

—: వైష్ణవధర్మకథనము :—

ఆ. కల వనేకమార్గములు దాని నొనరింప, నచ్యుతుండు చెప్పినవియె యందు
వైష్ణవంబు నాఁగ వఱలెడినొకమార్గ, మది వచింతు ముఖ్య మైన దగుట. 2652
సీ. వినుము కాత్యాయని ద్వివిధంబు వైష్ణవం, బాభ్యంతరంబు బాహ్యంబు నాఁగ
శంఖచక్రాదిలక్షణము బాహ్యము ధన, సదనదారసుతాద్యసంగతయును
సర్వభూతదయయు శాంతియు క్షమయును, ధర్మబుద్ధియు స్వాత్మదర్శనమును
యోగరక్తియుఁ బురుషోత్తమభక్తియు, స్వాంతశుద్ధియును నాభ్యంతరంబు
గీ. బాహ్యవర్జిత మైనయాభ్యంతరమును
నపగతాభ్యంతర మగుబాహ్యమును వితయ
కాన వైష్ణవ ముభయాత్మకంబ లెస్స
దాన వైష్ణవుఁడు తరించుఁ దప్పకుండ. 2653

—: వైష్ణవభక్తిస్వరూపనిరూపణము :—

వ. శంఖచక్రాంకనంబును నూర్ధ్వపుండ్రధారణంబును మంత్రపరిగ్రహంబును నర్చనంబును జపంబును ధ్యానంబును నామస్మరణంబును గీర్తనంబును శ్రవణంబును వందనంబును పాదసేవయును పాదోదకపరిగ్రహంబును నివేదితాన్నభోజనంబును భక్తసేవయును ద్వాదశీవ్రతనిష్ఠయును దులస్యారోపణంబును ననుషోడశవిధంబుల విష్ణుభక్తి యల రారు చుండు.

—: ద్వాదశశుద్ధిస్వరూపనిరూపణము :—

హరిగృహోపలేపనంబును హరియనుగమనంబును హరిప్రదక్షిణంబును పాదశుద్ధులుగను విష్ణుపూజార్థంబు పత్రపుష్పోచ్చయనం బొనరించుట కరశుద్ధిగను శౌరినామకీర్తనంబును శౌరిగుణకీర్తనంబును వాక్శుద్ధులుగను కృష్ణకథాశ్రవణంబు శ్రోత్రశుద్ధిగను గోవిందోత్సవనిరీక్షణంబు నేత్రశుద్ధిగను మాధవపాదోదకనిర్మాల్యమాలాధారణంబు శిరశ్శుద్ధిగను వాసుదేవనిర్మాల్యపుష్పాద్యాఘ్రాణంబు ఘ్రాణశుద్ధిగను పుండరీకాక్షస్వరూపధ్యానంబు మనశ్శుద్ధిగను జలపుష్పాదులు వైకుంఠచరణార్పణంబు గావించుట సర్వశుద్ధిగను జెప్పంబడియె. ఈద్వాదశశుద్ధులును వైష్ణవధర్మంబులుగా నెఱుంగందగు.

—: పంచవిధవిష్ణుపూజాస్వరూపనిరూపణము :—

మఱియును విష్ణుపూజ యభిగమనం బనియు నుపాదానం బనియు యోగం బనియు స్వాధ్యాయం బనియు నిజ్య యనియుఁ బంచవిధంబులుగాఁ జెప్పఁబడియె. దేవతాస్థానమార్జనం బభిగమనంబు. గంధపుష్పాదిచయనం బుపాదానంబు. దేవతాత్మైక్యభావంబు యోగంబు. అర్థానుసంధానపూర్వకమంత్రజపంబును హరిసంకీర్తనంబును సూక్తస్తోత్రాదిపాఠంబును దత్త్వాదిశాస్త్రాభ్యాసంబును స్వాధ్యాయంబు. దేవతాపూజ యిజ్య యని యెఱుంగవలయు.

—: విష్ణుపూజాఫలకథనము :—

పూజాపంచకంబునకుఁ గ్రమంబు గా సార్ష్టిసామీప్యసాలోక్యసాయుజ్యసారూప్యముక్తులు ఫలంబులుగాఁ జెప్పంబడియె. 2654

క. అవగణనము వైష్ణవునకు, నెవఁడును గావింపఁగూడ దెన్నండును వై
ష్ణవుఁడు భువనత్రయంబును, బవిత్ర మొనరించు వర్ణబాహ్యుం డైనన్. 2655

క. ఏయాశ్రమమున నున్నను, బాయక వైష్ణవుఁడు చక్రపరిధారణముం
జేయంగవలయు నది యా, మ్నాయవిహిత మగుటఁజేసి మానఁగ రామిన్. 2656

—: విష్ణుచక్రనామనిరూపణము :—

వ. విష్ణుచక్రంబునకుఁ బవిత్రం బనియును జరణం బనియును నేమి యనియును సుదర్శనం బనియును సహస్రారం బనియును బ్రహ్మకృతఘ్నం బనియును లోకోద్ధారం బనియును సహస్రధారం బనియును నామంబులు గలవు. తన్నామంబులును దద్ధారణప్రాశస్త్యంబును శ్రుతిస్మృతిపురాణేతిహాసంబులందుఁ జెప్పంబడియె. 2657

—: వైష్ణవచక్రాంకనప్రాశస్త్యకథనము :—

క. హరిచిహ్నంబులు దాలిచి, హరినిఁ గొలిచి రేని భక్తు లనేకముగన్
హరిపదము నొందుదురు స, త్వరముగ హర్యుక్తమైనధర్మం బగుటన్. 2658

వ. వైష్ణవుండు తాపసీయవిధానంబునం జక్రంబు నేనియు శంఖచక్రంబుల నేనియు విష్ణు పంచాయుధంబుల నేనియుం దప్తంబు గావించి తచ్చిహ్నంబుల భుజమూలంబులం దాల్చి విహితకర్మంబు లాచరింపందగు. శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గంబులు దప్ప నితర వస్తువులు సమాశ్రయణంబున కర్హంబులు గావు. సమాశ్రయణంబు వైష్ణవునకు శ్రుతి స్మృతిసమ్మతం బగుటంజేసి యవశ్యగ్రాహ్యంబు. తత్కళత్రాపత్యభృత్యపశ్వాదుల కును శంఖచక్రాంకనంబు విహితంబు. చక్రాంకితుండు గానివైష్ణవుండు సర్వకర్మబహి ష్కృతుండును నుపదేశానర్హుండునుం గాన సమాశ్రయణంబు నొసంగ నధికారి కానేరండు. స్త్రీశూద్రులకుం జందనంబుచేతం జక్రాంకనంబు గావింపనలయు. బ్రాహ్మ ణునకుం దప్తచక్రాంకనంబునం దప్ప వైష్ణవత్వంబు సిద్ధింపంజాలదు. బ్రాహ్మణుండు గానివైష్ణవుండు చక్రాంకనంబు గావింప ననర్హుండు. 2659

గీ. భవనిమగ్నుల నెల్ల వైష్ణవుఁడు తాప, నీయవిధిచేతఁ జక్రచిహ్నితులఁ జేసి పంచకర్మాధికార మేర్పఱిచి యుద్ధ, రింపవలయు జనార్దనప్రీతికొఱకు. 2660

ఆ. చక్రచిహ్నితున కొసంగినదానంబు, లుభయవంశములను నుద్ధరించుఁ జక్రహీనునకు నొసంగినదానంబు, లసురునకు నొసంగినవియ చూవె. 2661

గీ. ఎవనిభుజములు చక్రచిహ్నితము లగునొ, యతనిదేహంబునం దుండునఖిలతీర్థ ములును సర్వాధ్వరక్రియాపుణ్యములును, భువనపావనుఁ డైనవైష్ణవుఁడు వాఁడె.

గీ. చక్రచిహ్నితు లైనవైష్ణవులు విష్ణు, పురమున సుఖించు చుందు రధ్వరశతంబు నేసినను విద్య లెల్ల నేర్చినను జక్ర, చిహ్నరహితు లధోగతిఁ జెందువార. 2663

గీ. శంఖచక్రాంకనముల భుజంబులందుఁ, దనువునను నూర్ధ్వపుండ్రముల్ దాల్పకుండు వైష్ణవుని వెడలింపఁగావలయు గార్ద, భమున నెక్కించి పురినుండి పార్థివుండు.

గీ. తనుగతము లైనపాపసంతతుల నెల్ల, దగ్ధ మొనరించుకొనియును దప్తచక్ర చిహ్నములచేత మరలను జేయరాని, యఘములను జేయువైష్ణవు లధమగతుల.

గీ. చక్రచిహ్నంబు లేనివైష్ణవునియింటఁ, దగదు భుజియింప వైష్ణవోత్తముఁడు శంఖ చక్రవర్జితుఁ డైనవైష్ణవుని శ్రుతులు, చాటు చుండుటఁ జండాలసన్నిభునిగ. 2666

గీ. శ్రాద్ధమందు నిమంత్రింపఁజనదు చక్ర, వర్జితుని వైష్ణవుం డగువాఁడు శంఖ చక్రహీనున కొసఁగినశ్రాద్ధభోజ, నంబు గావించుఁ బితరుల నరకగతుల. 2667

గీ. చక్రవర్జిత మైనవైష్ణవునిమేను, పితృవనసమాన మగుటచే నతనిఁ జనదు ముట్టఁగను గాంచఁగను గూడఁ దుట్టతుదకుఁ,దనకు క్షేమంబు వాంఛించుకొనెడివాఁడు.

క. గళమునఁ దులసీమాలయు, లలాటమున నూర్ధ్వపుండ్రలాంఛనము భుజం బుల శంఖచక్రచిహ్నం, బులు గలిగినవైష్ణవోత్తములు సంసేవ్యుల్. 2669

క. ఉపనిషదర్థం బగుహరి, నెపుడును ధ్యానించుకొనుచు హృదయస్థుల్గా న్వ్యపగతకిల్బిషు లగువా, రపవిత్రుల నుద్ధరింతు రంబుజవదనా. 2670

క. అని వచియింపఁగ హర్షం, బున ని ట్లను గౌరి యూర్ధ్వపుండ్రమహిమముల్
వినవేడ్క గలిగె దానిని, వినిపింపుము దేవ నాకు విశదము గాఁగన్. 2671

—: ఊర్ధ్వపుండ్ర మాహాత్మ్య కథనము :—

సీ. అనవుడు శర్వుఁ డి ట్లనియెఁ బార్వతి విను, మూర్ధ్వపుండ్రమహాత్త్వ ముగ్గడింతుఁ
బురుషోత్తముం డూర్ధ్వపుండ్రమధ్యంబున, నధివసించు రమాసమన్వితముగ
నద్దానఁ బుండరీకాక్షమందిర మగు, నూర్ధ్వపుండ్రములతో నొప్పుమేను
దానిచే వైష్ణవోత్తమునకుఁ గావించి, నను వందనము నొనర్చినను బూజ
గీ. సర్వతీర్థఫలంబును సర్వదాన, ఫలము సర్వాధ్వరఫలంబుఁ బడయఁగలుగు
దాన సకలాఘములును దగ్ధములు గాఁగ, నక్షయం బైనసౌఖ్యంబు నందఁగలుగు.
ఆ. సర్వతీర్థమయుఁడు సర్వయజ్ఞమయుండు, సర్వదానమయుఁడు సర్వపుణ్య
కర్మమయుఁడు విష్ణుకరుణావలోకన, పూర్ణకాముఁ డూర్ధ్వపుండ్రధారి. 2673
గీ. యజ్ఞదానతప స్తర్పణాదివిధుల, నూర్ధ్వపుండ్రంబులను దాల్పకుండఁ జేయు
నట్టివైష్ణవుఁ డధమాధమాధముండు, వ్యర్థములు వాఁడు చేయుకార్యంబు లెల్ల.
క. ఒనరించె నేని శ్రాద్ధం, బును వైష్ణవుఁ డూర్ధ్వపుండ్రములఁ దాల్చి క్రమం
బునను గయాశ్రాద్ధఫలం, బును గోటిసహస్రకల్పములవఱ కొందున్. 2675
గీ. శ్రాద్ధమున నూర్ధ్వపుండ్రధారణము సేసి, నట్టివైష్ణవునకు భుక్తి వెట్టె నేని
వైష్ణవుఁడు కల్పశతకోటివఱకుఁ దృప్తిఁ, జెందుదురు వానిపితరు లానంద మొదవ.
గీ. వైష్ణవుం డూర్ధ్వపుండ్రవివర్జితునకు, శ్రాద్ధభోజన మొసఁగిన శాశ్వతముగఁ
బితరులను ఘోరరౌరవస్థితులఁ జేసి, నట్టివాఁ డయి తా నగు నట్టివాఁడ. 2677
గీ. ఊర్ధ్వపుండ్రవిహీన మై యుండునట్టి, వైష్ణవకళేబరం బొకవల్లకాడ
కావఁ దగ దది పరిశుద్ధు లైనవారు, ముట్టఁగను జూడఁగను గూడఁ దుట్టతుదకు.
క. ధరియించినను త్రిపుండ్రము, శరీరమున వైష్ణవుండు సరగున వానిన్
బరివర్జింపఁగవలయున్, గరుణింపక బుధులు మద్యఘటముంబోలెన్. 2679
వ. బ్రాహ్మణుండు శుభ్రమృత్తికచే నూర్ధ్వపుండ్రంబును క్షత్రియుండు కస్తూరిచే దిలకంబును వైశ్యుండు గంధంబుచేఁ బట్టాకారపుండ్రంబును దాల్పందగు ననువిశేషధర్మంబు లున్నను సామాన్యధర్మం బగునూర్ధ్వపుండ్రధారణం బెవ్వరికిని నిషిద్ధంబు గాదు.
గీ. ప్రోక్త మైనట్టిచక్రాంకనోర్ధ్వపుండ్ర, ధారణములు తిర్యక్పుండ్రధారు లైన
విప్రులకుఁ గావు విహితముల్ విహిత మగుట, వలన శాస్త్రంబులోపల వైష్ణవులకు.

—: ఊర్ధ్వపుండ్ర ధారణ విధానకథనము :—

క. విను మింకఁ దిలకధారణ, మునుగూర్చి దాని శ్రవణమును గావింపం
గను హరిసారూప్యంబును, గనఁగలుగును జూవె పాపకర్ములకేనిన్. 2682

వ. వైష్ణవుం డగువాఁడు త్రిసంధ్యంబును నూర్ధ్వపుండ్రంబులు ధరియించి యుండవలయు. విష్ణుపాదాకారంబు గలిగి సాంతరాళం బగుపుండ్రంబునందు నారాయణుండు లక్ష్మీసహితంబుగా నుండుంగావున నట్టిపుండ్రం బవశ్యధార్యంబు. అంతరాళశూన్యం బగుపుండ్రంబు నిషిద్ధంబు. కృష్ణతులసీమూలంబునుండికాని గంగాతీరంబునుండికాని ద్వారవతియం దుండువాసుదేవహ్రదమునుండికాని పర్వతాగ్రంబును బిల్వమూలంబును జలాశయంబును సింధుతీరంబును వల్మీకంబును వేంకటాచలంబును శ్రీకూర్మంబును బ్రయాగంబును నృసింహాద్రియు మున్నగువిష్ణుక్షేత్రంబులనుండికాని విష్ణ్వభిషేకజలంబు ప్రవహించెడిస్థలంబునుండికాని మహానుభావు లగువిష్ణుభక్తు లుండెడి ప్రదేశంబునుండికాని గ్రహింపంబడినశుభ్రమృత్తికను విష్ణుపాదోదకంబుచేఁ దడిపి యూర్ధ్వపుండ్రంబులు దీర్చికొనుట యుత్తమంబు. చందనంబున నేని పసపున నేని యగ్నిహోత్రభస్మంబున నేని కావించుకొనఁబడునూర్ధ్వపుండ్రంబు సర్వజనవశీకరంబు. శ్యామమృత్తిక శాంతికరంబు. రక్తమృత్తిక వశ్యకరంబు. పీతమృత్తిక సంపత్కరంబు. శ్వేతమృత్తిక మోక్షకరంబు. వర్తులంబును దిర్యగ్రూపంబును నచ్ఛిద్రంబును హ్రస్వంబును దీర్ఘంబును విస్తృతంబును సూక్ష్మంబును వక్రంబును విరూపంబును వక్రాగ్రంబును ఛిన్నమూలంబును బదచ్యుతంబును నశుభంబును రూక్షంబును నారక్తంబును నంగుళ్యకల్పితంబును విగంధంబును నసహ్యంబును నగుపుండ్రం బనర్థకరంబు. నాసికామూలంబు మొదలుకొని లలాటంబున ఋజువుగా నూర్ధ్వపుండ్రం బేర్పఱుపందగు. భ్రూమధ్యంబు మొదలుకొని యంతరాళంబు కల్పింపందగు. అంతరాళం బంగుళద్వయప్రమాణంబుగ నుండందగు. పార్శ్వంబు లంగుళమాత్రంబుగా నుండందగు. లలాటంబునఁ గేశవుని నుదరంబున నారాయణుని వక్షంబున మాధవునిఁ గంఠకూబరంబున గోవిందుని దక్షిణకుక్షిపార్శ్వంబున విష్ణుని దక్షిణబాహువున మధుసూదనునిఁ గంధరంబునఁ ద్రివిక్రముని వామకుక్షిపార్శ్వంబున వామనుని వామబాహువున శ్రీధరుని శ్రోత్రంబుల హృషీకేశునిఁ బృష్ఠంబునఁ బద్మనాభునిఁ ద్రికంబున దామోదరుని ధ్యానించుచు ద్వాదశోర్ధ్వపుండ్రంబులు ధరియింపంజను. కుక్షియందును దత్పార్శ్వంబులందును దశాంగుళాయతంబుగను లలాటంబునందును శ్రోత్రయుగ్మంబునందును బృష్ఠమందును ద్రికంబునందును గంఠకూబరంబునందును జతురంగుళప్రమాణంబుగను బాహువులందును వక్షస్స్థలంబునందును నష్టాంగుళపరిమాణంబుగను బుండ్రం బుండవలయు. పుండ్రంబులయంతరాళంబులయందు హారిద్రను లక్ష్మినిగా భావించుచు నుంపవలయు. ఆదర్శంబునంగాని సలిలంబునంగాని చూచుచు నూర్ధ్వపుండ్రంబులు ధరించుట యుక్తంబు. విప్రులకు దక్షిణకర్ణంబున జలంబును వేదంబులును జంద్రాదిత్యులును వాయువును గంగయును నాసికయందు హుతాశనుండును నుండుం గావునఁ దదుభస్పర్శంబువలనఁ బారిశుద్ధ్యకాంక్షి యగుబ్రాహ్మణుండు శుద్ధిం జెందు. ద్వాదశపుండ్రంబులు బ్రాహ్మణునకు విహితంబులు. క్షత్రియుండు వాసు

దేవుని ధ్యానించుచు లలాటంబున నొక్కపుండ్రంబును బ్రద్యుమ్నుని ధ్యానించుచు వక్షంబున నొక్కపుండ్రంబును ననిరుద్ధునిం బురుషోత్తముని ధ్యానించుచు బాహువులందు రెండుపుండ్రంబులును వైశ్యుండు గోవిందుని ధ్యానించుచు లలాటంబున నొక్కపుండ్రంబును గృష్ణుని ధ్యానించుచు వక్షంబున నొక్కపుండ్రంబును స్త్రీశూద్రాదులు నారాయణుని ధ్యానించుచు లలాటంబునం దొక్కపుండ్రంబు ధరింపవలయు. ఎల్లవారును లలాటంబు మొదలుకొనియే పుండ్రధారణంబు గావింపవలయు నందుఱకును లలాటంబునం దూర్ధ్వపుండ్రంబు మొదటిదిగాఁ జెప్పంబడియె. అశ్వత్థపత్త్రాకారంబును వేణుపత్త్రాకారంబును బద్మకుట్మలాకారంబునుం గలపుండ్రత్రయంబు మోక్షదాయకంబు. విష్ణుపాదాకారంబుగాని దండాకారంబుగాని కలయూర్ధ్వపుండ్రంబు భాగవతులకు విహితంబు.

—: గోపీచందనమాహాత్మ్యధారణవిధికథనము :—

మఱియును గోపీపుష్కరజన్యమృత్తిక గోపీచందనంబు. తదుద్వర్తనంబున సకలవ్యాధులును బాధలును నశియించు. గోపీచందన మున్నగృహంబు తీర్థభూత మనియు నచ్చట నశుభంబులును శోకమోహంబులును నుండ వని విష్ణువు భాషించె. సర్వకామప్రదంబును మోక్షప్రదంబును నగుగోపీచందనంబు వైష్ణవు లగుభాగవతులకు సంతతధార్యంబు. తత్స్పర్శమాత్రంబుచే నరుండు పవిత్రుండగు. తులసీకాష్ఠగంధంబును దులసీమూలమృత్తికయును హరిచందనంబును గోపీచందనంబునుం గలిపి లేపనంబు గావించిన గోవిందుండు సంతుష్టుండగు. గోపీచందనధారి యగువైష్ణవుండు పితరులకు గయాశ్రాద్ధంబు గావించినఫలముం జెందు. లలాటంబున దండాకారంబును వక్షంబునఁ బద్మాకారంబును బాహుమూలంబున వేణుపత్త్రాకారంబును నన్యప్రదేశంబులందు దీపాకారంబునుంగా గోపీచందనం బుండందగు. దక్షిణబాహుమూలంబున మీఁదనాలుగుచక్రంబులును గ్రిందనామముద్రాద్వయంబును వానినడుమ శంఖంబును పార్శ్వంబులందు రెండురెండుపద్మంబులును వామభుజంబునఁ బూర్వమట్లు నాలుగు శంఖంబులును నామముద్రాద్వయంబును ధరింపందగు. పార్శ్వంబులందుఁ జక్రంబును రెండురెండుగదలును ధరియింపందగు. లలాటంబున గదయును హృదయంబున నామముద్రయును మూఁడుమూఁడుచక్రంబులును మధ్యమున రెండురెండుశంఖములును ధార్యంబులు. హృదయంబునను పార్శ్వమునను స్తనోర్ధ్వప్రదేశమునను బాహువులందుంబలె గదాపద్మంబులు ధార్యంబులు. కర్ణమూలద్వయంబున మూఁడుమూఁడు చక్రంబులును దదన్యతిలకంబులం దొక్కొక్కచక్రంబును ధార్యంబులు. తిలకధారణంబున బ్రాహ్మణాదిచండాలపర్యంతంబును సర్వవైష్ణవులకును బాహ్యశుద్ధి యగు. శిష్టసంప్రదాయంబు ననుసరించి తిలకంబు ధరింపందగు. అన్నియును ధరింపలేనియెడల వీనిలో నిచ్ఛానుసారంబుగా నేయొకటి యైనను ధరింపందగు. నియమంబు లేదు. గోపీచందనం

బున శంఖచక్రగదాపద్మనామముద్రల ధరించుభాగవతుండు సాక్షాన్నారాయణుం డుగాఁ జెప్పంబడియె. మఱియును హరినిర్మాల్యచందనంబు విష్ణునామంబులచే లలాట మ్మందు గదారూపంబుగను మూర్ధమందు శరచాపరూపంబుగను హృదయమధ్యం బున నందకరూపంబుగను భుజద్వయంబున శంఖచక్రరూపంబుగను ధరియించువాఁడు భాగవతోత్తముండుగాఁ జెప్పంబడియె. గోపీచందనతిలకంబు ధరించువారలకు దుర్గతి కలుగనేరదు. శంఖచక్రంబులు బాహువులందు ధరించువారలదర్శనంబు మోక్షసంధా యకంబు. గోపీచందనతిలకధారియై పంచత్వముం జెందువైష్ణవుండు దివ్యవిమానాధి రూఢుండై వైకుంఠంబునకుం జను. శంఖచక్రగదాపద్మనామముద్రాతులసీకాష్ఠమా లాధారులును ద్వాదశతిలకధారులును ముక్తులుగాఁ జెప్పంబడిరి. 2683

క. ఒనరఁగఁ దాల్చిన నీవిధ, మున వైష్ణవు లూర్ధ్వపుండ్రములు గోపీచం
దనమున నొనరిచి ధరఁ బా, వనముగఁ బొందుదురు కడకు వైష్ణవపదముల్. 2684

వ. తులసీమిశ్రితంబును శంఖస్థితంబును నగుసలిలంబుం ద్రావినను దేహంబునం బ్రోక్షించి నను నమస్కరించినను గోటిజన్మపాతకంబులు నశియించు. తద్బిందువు భూపతితం బయ్యెనేని యష్టకోటిపాతకంబులు సంభవించు. జలశంఖంబు కరంబునం దాల్చి ప్రదక్షిణంబు గావించి నిత్యంబును దదుదకంబు శిరంబునం బ్రోక్షించుకొనువానిజ న్మంబు సఫలంబు. గృహమందు శంఖంబును గరుడాన్వితం బగుఘంటయును వాసు దేవునిపురోభాగంబున నుంపనివాఁడు భాగవతుండు కానేరఁడు.

—: ద్వాత్రింశదపరాధస్వరూపకథనము :—

యానపాదుకలచే భగవన్మందిరమున కేఁగుటయు దేవోత్సవముల సేవింపకుండుటయు భగవంతుని యెదుట నమస్కరింపకుండుటయు నుచ్ఛిష్టసమయంబున వందనాదు లొనర్చుటయు నాశౌచకాలంబునఁ బ్రణామంబు గావించుటయు నేకహస్తప్రణామంబును భగవత్పురోభాగంబునఁ బ్రదక్షిణంబు గావించుటయు భగవంతునియెదుటఁ బాద ప్రసారంబును బర్యంకసేవనంబును శయనంబును భక్షణంబును మిథ్యాభాషణంబును నుచ్చైర్భాషణంబును మిథోజల్పంబును రోదనంబును విగ్రహంబును నిగ్రహంబును ననుగ్రహంబును గ్రూరభాషణంబును గంబలావరణంబును బరనిందయును బర స్తుతియును నశ్లీలభాషణంబును నపానవాయువిమోచనంబును శక్తి యున్నను గౌణో పచారంబు గావించుటయును ననివేదితభక్షణంబును దత్తత్కాలోద్భవఫలాద్యనర్ప ణంబును వినియుక్తావశిష్టప్రదానంబును పృష్ఠీకరించి భుజించుటయును గురుస్తోత్రంబున మౌనంబును నిజస్తోత్రప్రవృత్తియును దేవతానిందయును నను నీముప్పదిరెండును భగ వద్విషయకాపరాధంబులుగాఁ జెప్పంబడియె. 2685

క. అపరాధసహస్రము లెవ్వ, ల్లపుడును గావించు చుంటి నవి యన్నియు న
ప్రపదమున సైఁచి నను నీ, కృపకుం బాత్రునిగఁ జేయు మే నీవాఁడన్. 2686

వ. అని ప్రార్థించి దండప్రణామంబు గావించె నేని సర్వాపరాధంబులను క్షమించి నారా
యణుండు భక్తునకు హస్తావలంబనంబు నొసంగు. 2687

క. ననుఁ బేర్కొనుచును గణుతిం, బునఁ గణంబులకును భుజియించెడిన
జనను లన్నదోషలేపం, బును బొంద రటంచు మధురిపుండు వచించెన్. 2688

వ. వర్తులం బగునలాబువును సవల్కలం బగులశునంబును దాక్షిలంబును శుక్లవ్రాతా
కంబును వైష్ణవుండు భక్షింపరాదు. వటాశ్వత్థార్కపత్రంబులందును గుంభీతిందుక
పత్రంబులందును గదంబకోవిదారపత్రంబులందును వైష్ణవుండు భుజియింపందగదు.
శ్రావణమాసంబున శాకంబును భాద్రపదమాసంబున దధియును నాశ్వినమాసంబున
దుగ్ధంబును గార్తికమాసంబున నామిషంబును వైష్ణవుండు పరిత్యజింపవలయు. గోధ్ర
తిలయవకలాయకంగునీవారధాన్యంబులును హిలమోచికావాస్తూకమూలకకాలశాకం
బులును వైష్ణవుండు వర్జింపవలయు. వైష్ణవుండు హవిష్యాన్నంబు భుజింపందగు.
అత్తైలపక్వం బగునది హవిష్యాన్నంబుగాఁ జెప్పంబడియె. పుష్కరమాలికయును
దులసీమాలికయును నామలకమాలికయును వైష్ణవునకు ధార్యంబులు. తులసికాష్ఠ
మాలికాధరుండై చేయుపితృదేవతాకార్యంబులు కోటిగుణఫలోపేతంబు లగు. 2689

క. శిరమునఁ దులసీపత్రము, ధరియించి యొనర్చుకర్మతతులకుఁ బొందున్
నరుఁ డక్షయ మగుఫలమును, బురుషోత్తమసంప్రసాదమునకున్ గుఱియై. 2690

—: న్యాసమంత్రమంత్రార్థకథనము :—

వ. న్యాసంబునందును నర్చనంబునందును నేకమంత్రం బాశ్రయింపందగదు. ద్వయం బని
న్యాసమంత్రం బని వైష్ణవగురునివలనఁ గైకొనందగు. 2691

గీ. గురుని సేవించి యొక్కవత్సరమువఱకుఁ, బొంది తద్దయ సంస్కారములను బొంది
కైకొనందగు మంత్రయుగ్మమును నితర, విష్ణుమంత్రంబులను గూడ వైష్ణవుండు.

క. మొదట ద్వయంబును గైకొని, పదపడి మంత్రాంతరములఁ బడయంగ నొప్పున్
మొదటఁ గొనకున్న ద్వయమును, దదితరమంత్రాంతరములఁ దగదు గ్రహింపన్.

క. న్యాసము ముఖ్యము వైష్ణవ, దాసుల కద్దాన శ్రేష్ఠతను వహియించున్
న్యాసపరుం డందఱిలో, న్యాసమనువు దాన నగు వినంగను నీకున్. 2694

గీ. న్యాసమంత్ర మష్టాక్షర మగుట దాని, విషయ మంతయు వినిచెద విశదముగను
బ్రణవ ముండుట మొదట స్వభావమునను, యమ్మహామంత్రమునకు శ్రైష్ఠ్యవహంబు.

ఆ. బ్రహ్మరూప మైనప్రణవంబు సర్వమం, త్రములలోన మొదటఁ దగును గూర్ప
మంత్రసిద్ధి గలుగ మంత్రంబుననె యది, యున్నఁ దత్ప్రభావ మెన్నఁదరమె. 2696

గీ. సర్వమంత్రంబులకును నైసర్గికముగఁ, బ్రణవ మొదవమి నష్టాక్షరమునఁ బోలె
వాని కన్నింటికిని గూడ దీని కున్న, తేజు లే దనియెడిమాట తేటపడియె. 2697

సీ. ఆది నో మను ప్రణవాక్షరం బొకటియు, నవల నమో యనుద్వ్యక్షరములు
నటుపిరువాత నారాయణాయ యటన్న, పంచాక్షరములును భాసిలంగ
నష్టాక్షరోపేత మైనమంత్రం బయ్యె, నామంత్రము పదత్రయాత్మకంబు
నారాయణుండ తన్మంత్రరాజమునకు, దీపించు ఋషిగను దేవతగను
గీ. దనరు గాయత్రి ఛందస్సుగను నెలర్చు, బీజముగఁ బ్రణవంబు శ్రీ తేజరిల్లు
శక్తిగను దానిన్యాసంబు సలిపికొనిన, వాఁడు నారాయణుం డగువాఁడ చూవె.

వ. అకారోకారమకారాత్మకం బగుప్రణవంబు వేదత్రయాత్మకంబును బ్రహ్మపురంబునుం గాఁ జెప్పంబడియె. అకారంబుచే లక్ష్మీశుండును జగద్బీజంబును బరమపురుషుండును నిర్గుణుండును సగుణుండును జగత్కర్తయును జగద్భర్తయును జగదీశ్వరుండును నగు మహావిష్ణువును నుకారంబుచే జగదీశ్వరియును విష్ణునకు నిత్యానపాయినియును జగదాధారభూతయును జగన్మాతయును విష్ణుపత్నియును నగుమహాలక్ష్మియును మకారంబుచే క్షేత్రజ్ఞుండును దేహేంద్రియమనఃప్రాణాదివ్యతిరిక్తుండును నన్యసాధనుండును భగవచ్ఛేషభూతుండును సచేతనుండును బంచవింశుండును నిత్యుండును నగుజీవుండును జెప్పంబడియె. ఇయ్యది ప్రణవార్థంబు. ఇంక నమశ్శబ్దార్థంబు వివరించెద. మకారం బహంకారార్థకంబు. నకారంబు నిషేధార్థకంబు. నమఃపదంబు విపర్యాసంబుచే మనఃపదం బయ్యె. కావున నహంకారయుక్తం బగుమనస్సును విడువవలయు నని భావంబు. అహంకారవిమూఢాత్ముం డగుజీవుం డంధతమసంబునం బడు. ఇంక నారాయణపదార్థంబు వివరించెద. నారశబ్దంబునకు నరసమూహం బని యర్థంబు. నరసమూహం బన జీవసంఘంబు. అయన మన స్థాన మని యర్థంబు. జీవసంఘంబునకు నివాసస్థాన మగుటచేతను జీవసంఘంబు నివాసస్థానంబుగాఁగలవాఁ డగుటచేతను నుభయవిధంబులను నారాయణుం డని చెప్పంబడియె. మఱియును నారశబ్దంబునకు నరసమూహం బనియు నయనశబ్దంబునకు గతి యనియు నర్థంబు. జీవసంఘంబున కెల్ల దిక్కగుటంజేసి నారాయణుం డయ్యె. 2699

సీ. అఖిలలోకేశ్వరుం డఖిలలోకవ్యాపి, యఖిలలోకాతీతుఁ డవ్యయుండు
భూతభవ్యాత్ముఁడు పురుషుఁ డచ్యుతుఁడు స, హస్రలోచనుఁడు సహస్రపదుఁడు
హరి మహేశ్వరుఁడు సహస్రశీర్షుఁడు విరా, ట్రూపుఁడు వేదనిరూపితుండు
పరమాత్ముఁడు శివుండు ప్రణవస్వరూపుఁడు, సవిత యనంతుఁడు శాశ్వతుండు
గీ. ప్రకృతిపరుఁ డీశ్వరుండు హిరణ్మయుండు, యజ్ఞపురుషుఁడు యజ్ఞంబు యజ్ఞకర్త
యజ్ఞపతి యజ్ఞఫలదాత యజ్ఞభోక్త, యద్వితీయుఁడు సాక్షి నారాయణుండు.
గీ. మొదట నొక్కనారాయణమూర్తి దక్క, నీకనంబడులోకంబు లెవియు లేవు
లేఁడు విధి పంచభూతముల్ లేవు సురలు, లేరు లేరు మహర్షులు లేను నేను. 2701
గీ. తంతువుల నూర్ణనాభిచందమున లోక, ములను వెడలించుచును వెలుపలికి మరలఁ
గొనుచు నుండుట లోనికిఁ గుతుక మొదవ, హరి యనెడి పేరు వొందె నారాయణుండు.

వ. నారాయణశబ్దంబున నుండుచతుర్థికి దాస్యం బని యర్థంబు. 2703

ఆ. వారికి దాసభూతుఁ డగుట స్వాతంత్ర్యంబు, లేమి జీవుఁ డెడను లేశ మేని
చన దహంతఁ దాల్పఁగను నిజబుద్ధిచేఁ, గార్యముల నొనర్పఁగఁడగుటయును. 2704

వ. దీనిచే లక్ష్మీనారాయణు లనపాయు లనియు వారికి శరీరప్రకారుండు జీవుండు నిత్యసన్ని
హితుం డనియును జీవుని కహంకారంబు విడిచి సర్వకాలంబులందును లక్ష్మీనారాయణ
కైంకర్యంబు గావించు చుండుటయే మోక్షం బనియును ఫలితార్థంబు. 2705

గీ. ఇట్లు మంత్రార్థమును గ్రహియించి ద్విజుఁడు
మంత్రవినియోగ మొనరింప మహిమ మొదవు
నర్థ మెఱుఁగక చేయుజపాదులెల్ల
వ్యర్థములు గాన సిద్ధి సేయంగలేవు. 2706

వ. అట్టినారాయణునకు భోగార్థంబు పరమవ్యోమమును లీలార్థంబు సర్వజగంబులును
నేర్పడియె. పరమవ్యోమంబు త్రిపాద్విభూతి యనియు సర్వజగంబులును నేకపాద్వి
భూతి యనియుం బరగె. త్రిపాద్విభూతి త్రిపాదమాత్రంబు నిత్యంబు. ఏకపాద్విభూతి
యేకపాదమాత్రంబు నిత్యంబు. నారాయణుండు భోగవిభూతియందు విహరించునప్పుడు
లీలావిభూతిని దనగర్భంబునం దాల్చు. 2707

సీ. నారాయణుఁడుపోలె నారాయణియు సర్వ, తోముఖీకరాంఘ్రిశీర్షాస్య యగుచు
సచరాచరం బగుసర్వజగంబున, కాశ్రయం బగుచుఁ దదాది యగుచు
సృష్టిలయంబులఁ జేయుచు నున్మీల, నంబుచేత నిమీలనంబుచేతఁ
బోషించుచును సర్వభువనంబులను నాత్మ, కరుణాకటాక్షవీక్షణముచేతఁ

గీ. త్రిభువనవ్యాప్త యగుచును త్రిగుణ యగుచు, దీపిలుచును లక్ష్మ్యలక్ష్మ్యరూపమునను
బరగు చుండుఁ దదీయరూపంబ సకల, భామినీజనరూపసౌభాగ్య మెల్ల. 2708

క. ఆమెకటాక్షముచేతనె, సామర్థ్యము నొంది రవియు శశియును నమర
స్తోమమును నేను బ్రహ్మయు, నోముచు నుంటిమి జగత్సమూహము నెల్లన్.

సీ. నిత్య భూతేశ్వరి సత్య విష్ణుప్రియ, క్షీరోదతనయ శ్రీ సీత లక్ష్మి
పద్మ సుందరి సతి పద్మాక్షి రుక్మిణి, విష్ణ్వనపాయిని విష్ణుపత్ని
గౌరి సరస్వతి కమల పద్మాలయ, సర్వసుఖప్రద స్వాహా శాంతి
సర్వవేదవతి భూ స్వధ లీల శుభ విద్య, రతి మహాదేవి సర్వగత మాత

గీ. పద్మహస్త హిరణ్మయి భద్రమూర్తి, శోకసంహారిణి యనంత లోకనాభి
రమ దురాధర్ష చంద్ర హిరణ్యవర్ణ, భువనేత్రి నారాయణభోగదాత్రి. 2710

క. అనియెడిలక్ష్మీనామము, లను బ్రాతఃకాలమునఁ దలంచెడివారల్
ధనధాన్యభోగభాగ్యము, లను జెందుదు రవిరతముగ లక్ష్మీకృపచేన్. 2711

గీ. ఆమహాలక్ష్మి ప్రభవోలె నగ్నియందు, రాజిలుచు నుండు నెవనియురంబునందు
నట్టినారాయణునకు దాస్యంబు సేయు, భాగ్యమునకంటె లే దొండు పరమపదము.

వ. నారాయణుండు నిర్గుణుం డనఁ బ్రాకృతహేయగుణరహితుం డనియుఁ బ్రపంచంబు మిథ్యాభూతం బన దృశ్యమానం బగునేకపాద్విభూతి యనిత్యం బనియు నెఱుంగ వలయు. నారాయణుండు ప్రకృతి యగుమహాలక్ష్మియందు సృష్టిస్థితిలయంబులం గావించు చుండుటంజేసి తాను జగత్పితయును మహాలక్ష్మి జగన్మాతయు నయ్యె. స్వభోగార్థంబు నారాయణునిచే మహాలక్ష్మి సృజింపంబడియె. అవిద్య ప్రకృతి మాయ మహావిద్య జగన్మయి యోగనిద్ర మహామాయ త్రిగుణ యవ్యక్తము ప్రధానము ననునామంబులచేఁ బరగి మహాలక్ష్మి సర్గస్థితిలయహేతుభూత యయ్యె.

—: ఏ క పా ద్వి భూ తి స్వ రూ ప క థ న ము :—

ప్రకృతినిర్మితం బగుబ్రహ్మాండం బంతయును నేకపాద్విభూతి గాఁ జెప్పంబడియె.

—: త్రి పా ద్వి భూ తి స్వ రూ ప క థ న ము :—

ప్రధానంబునకును బరమవ్యోమంబునకును నడుమ విరజానది కలదు. అయ్యది వేదాంగ స్వేదజనితతోయప్రస్రావిత యై యుండు. దానిపరపారంబునఁ ద్రిపాద్విభూతి కలదు.

—: వై కుం ఠ వ్యూ హ క థ న ము :—

సీ. అదియె నారాయణపదము బ్రహ్మపదం బ, సంఖ్యంబు శుద్ధంబు సత్త్వమయము
ప్రళయవర్జితము హిరణ్మయం బజరంబు, శాశ్వతం బమృత మక్షరము శుభము
సర్వవేదమయంబు సతతవై శ్వానర, శతకోటిసమధికచ్ఛవియుతంబు
జ్ఞానదృశ్యంబు బ్రహ్మానందసుఖనామ, ధేయం బనంతంబు దివ్యతమము
ఆ. పరమపదము మోక్షపదము జాగ్రత్స్వప్న, వర్జితము సుషుప్తివర్జితంబు
వేదగోపితం బనాది వైకుంఠంబు, మహిమసంభృతము తమఃపరంబు. 2714
క. ఆవిష్ణుపదము నొందిన, పావనులకు లేదు మరలఁ బ్రభవము వారల్
సేవించు చుందు రచట మ, హావిష్ణుని నిత్యమును మహానందమునన్. 2715
ఆ. అమ్మహాపదంబునందుఁ బ్రవేశింపఁ, గాదు సాధ్య మబ్జజాదులకును
సర్వమును నెఱుంగఁజాలిననాకును, దానిమహిమ మెఱుఁగఁ దరము గాదు. 2716
గీ. శాస్త్రమార్గోపలబ్ధవిజ్ఞానమునను, గాంతు రద్దాని యోగిపుంగవులు రవియు
శశియు నగ్నియు నెట్టితేజంబు గూడఁ, దత్ప్రభాసన్నిధిని బ్రదీప్తములు గావు. 2717
ఆ. అత్రిపాద్విభూతియందు హిరణ్మయం, బులును నిర్వికారములును నిత్య
ములును శుద్ధసత్త్వములు వేదమయములు, గల వనేకలోకములు భవాని. 2718
సీ. కానరా వచ్చుటఁ గామంబు క్రోధంబు, మదలోభములు మోహమత్సరములు
విలసిల్లు చుండును వేదరసాంబుపూ, రమనోహరము లై నప్రహాదము లచటఁ
బొలుపారు చుందురు పురుషులు స్త్రీలును, నతులితశ్రుతిమయాకృతుల నచటఁ
గావించు చుండును గలకాల మచ్చోట, సామగానరవంబు శ్రవణసుఖము

గీ. కనఁబడుచు నుండు భువనపావనము లైన
గోవు లచ్చట జనియును జావు జరయు
దుఃఖమును నీతిబాధలు దురితములును
నామయములును భయమును నచట లేవు. 2719

క. హరినామామృతపానము, నిరతంబును జేయుచుండునిష్కలుషుల కా
పరమపద మబ్బు దొరకదు, పరుల కొనర్చినను నెట్టిబహుపుణ్యములన్. 2720

వ. అవ్యక్తబ్రహ్మోపాసకులకుఁ బరమపదవిరజామధ్యప్రదేశంబు గమ్యస్థానంబు. 2721

సీ. అనుపమజనపదవ్యాకీర్ణమును మణి, ప్రాకారతోరణరాజితమును
గాంచనప్రాసాదకమనీయమును నవ, రత్నవిమానవిభ్రాజితమును
నిశ్శ్రేయసంబును నిర్వాణమును నైన, మహితవైకుంఠధామంబునడుమఁ
గలదు దివ్యపురం బొకం డయోధ్య యనంగ, మణిగోపురద్వారమండితంబు

గీ. భానుకోటిసహస్రప్రభావిభాస
మానమును నిత్యకల్యాణమంజులమును
ననితరప్రాప్యమును మహాహ్లాదదమును
సకలసురగణమునిజనసంస్తుతమును. 2722

వ. పంచపంచాశద్యోజనవిస్తారాయామంబును సహస్రయోజనతుంగప్రాసాదకోటివిభూషితంబును నారూఢనిత్యయౌవనదివ్యస్త్రీపురుషశోభితంబును నై యుండు నప్పురంబునకుఁ బ్రాగ్ద్వారంబునఁ జండప్రచండులును దక్షిణద్వారంబున భద్రసుభద్రులును బశ్చిమద్వారంబున జయవిజయులును నుత్తరద్వారంబున ధాతృవిధాతలును ద్వారపాలకులుగను గుముదకుముదాక్షపుండరీకవామనశంకుకర్ణసర్వనేత్రసుముఖసుప్రతిష్ఠితు లష్టదిక్పాలకులుగను నుండి రక్షించు చుందురు. తత్పురమధ్యంబున జగన్మోహనం బగు దివ్యాంతఃపురంబు గలదు. తన్మధ్యంబున మాణిక్యస్తంభసహస్రవిరాజమానంబును రత్నమయంబును నిత్యముక్తసమాకీర్ణంబును సామగానోపశోభితంబును నగు నొక్క దివ్యమండపంబు గలదు. తన్మధ్యంబునఁ బాదవిగ్రహములును ఋగ్యజుస్సామాథర్వరూపులును నిత్యులును నగుధర్మజ్ఞానైశ్వర్యవైరాగ్యదేవతలచేతను శక్తి యాధారశక్తి చిచ్ఛక్తి సదాశివ యనుధర్మాదిదేవతాశక్తులచేతను బరివేష్టితంబును నగు నొక్క దివ్యసింహాసనంబు గలదు. తన్మధ్యంబున సర్వాక్షరమయం బగుయోగపీఠంబు గలదు. రవియును జంద్రుఁడును వైనతేయుండును వహ్నియును గూర్మంబును నాగేంద్రుండును సర్వమంత్రంబులును సకలచ్ఛందస్సులును దద్యోగపీఠత్వముం జెంది యుండె. తన్మధ్యంబున నుదయార్కసమప్రభం బగు నొకయష్టదళపద్మంబు గలదు. తన్మధ్యంబున సావిత్రి యనుకర్ణికయందుఁ గోటిసూర్యప్రకాశమానుం డగు నారాయణుండు హిరణ్యవర్ణయును సువర్ణరజతస్రగలంకృతయును సర్వలక్షణసంపన్నయును జతుర్భుజయును గరద్వయగృహీతపద్మయుగ్మయును నితరకరద్వయగృహీతమాతులుంగ

జాంబూనదపాత్రయును నిత్యానపాయినియును నగుమహాలక్ష్మితోడ నాసీనుఁడై మహాలక్ష్మిరూపాంతరంబులుగా స్వపార్శ్వభాగంబులందు సమాసీన లై భూలీలలును నష్టదిగ్దళాగ్రంబులయందుఁ జామరగ్రాహిణు లయి విమల యుత్కర్షిణి జ్ఞాన క్రియ యోగ ప్రహ్వీ సత్యా యీశాన యనునష్టశక్తులును నంతఃపురనివాసినులును బంచ శతసంఖ్యాకలును నగుదివ్యాప్సరస్త్రీలును ననంతవిహగాధిపముఖపరిజనులును నిత్య ముక్తు లగునితరభక్తులును బరివేష్టించి కొలుచు చుండ సతతంబును నానందవార్ధిం దేలు చుండు. వైకుంఠలోకంబునను బ్రాగ్దిక్కునందు వాసుదేవలోకంబును నాగ్నేయ దిక్కునందు లక్ష్మిలోకంబును దక్షిణదిక్కునందు సంకర్షణలోకంబును నైరృతదిక్కు నందు సారస్వతలోకంబును బశ్చిమదిక్కునందుఁ బ్రద్యుమ్నలోకంబును వాయుదిక్కు నందు రతిలోకంబును నుత్తరదిక్కునం దనిరుద్ధలోకంబును నీశానదిక్కునందు శాంతి లోకంబును బ్రథమావరణంబుగను బ్రహ్లాదాదిమహాభక్తలోకంబులు ద్వితీయావర ణంబుగను మత్స్యకూర్మాదిలోకంబులు తృతీయావరణంబుగను సత్యాచ్యుతానంత దుర్గావిష్వక్సేనగజాననశంఖపద్మనిధిలోకంబులు చతుర్థావరణంబుగను సర్వవాఙ్మయ స్వరూపంబు లగుఋగ్యజుస్సామాథర్వసావిత్రీవిహగేశధర్మముఖలోకంబులు పంచమా వరణంబుగను సకలశస్త్రాస్త్రయంత్రసంయుతంబు లగుశంఖచక్రగదాపద్మఖడ్గశార్ఙ్గహల ముసలలోకంబులు షష్ఠావరణంబుగను నింద్రాగ్నియమనిరృతివరుణవాయుకుబేరే శానలోకంబులు సప్తమావరణంబుగను నుండె. మఱియును వైకుంఠంబునందు విశ్వే దేవసాధ్యమరుద్గణాదినిర్జరు లసంఖ్యాకంబుగా నిత్యులై యున్నవారు. ప్రాకృతస్వర్గ లోకంబునం దుండుమహేంద్రాదినిర్జరు లెల్లరును ననిత్యు లని తెలియందగు. 2723

ఆ. అట్లు నిత్యముక్తు లగుదివ్యభామినీ, దివ్యపురుషు లెల్లఁ దేజరిలుచు
నుండ మోక్షధామ మొప్పారు నుక్తికి, మదికి నందరానిమహిమతోడ. 2724

సీ. అనివచించుటయు ని ట్లనియెఁ బార్వతి నాథ, యకలుషుం డైననారాయణుండు
పరమపదంబున భాసిల్లువాఁ డేక, పాద్విభూతిని వేరుపఱుప నేల
యతనికి ఫల మేమి యద్దానఁ దెలుపుము, నావుడు శర్వుఁడు దేవి వినుము
పరమేశ్వరుండు త్రిపాద్విభూతిపదంబు, నం దుండఁగను మహానందమునను

గీ. ప్రకృతి నుతియించి యాతనిఁ బ్రబలముగను, దేవ జ్ఞానవిహీనులు దిక్కు లేని
వారు హీనశరీరులు ఘోరదుఃఖ, పతితు లగుజీవు లుండి రపారముగను. 2725

గీ. సర్వశక్తివి సర్వవిజ్ఞాననిధివి, సర్వసంరక్షకుండవు సర్వభూత
హితుఁడవు కృపాంబునిధివి సర్వేశ్వరుఁడవు, వారలను నుద్ధరింపంగవలదె నీకు. 2726

సీ. అని నివేదించుటయును వాసుదేవుండు, ప్రకృతిసంస్థుం డయి ప్రకృతియంద
పంచభూతముల సృజించి యాదిని గాల్కి మును దర్భవాత్త సర్జన మొనర్చి

సర్వజగత్సృష్టిసంకల్పమున యోగ, నిద్రతో శయనించె నీట నంత
ముకుళితస్వీయనాభికమలంబు వికాస, మును జెందఁ గాలసంయోగమునను

గీ. దానిలోనుండి పుట్టి విధాత హరినిఁ, బ్రస్తుతింపంగ లేచి నారాయణుండు
నైజనాభిపయోజమునఁ దె హిరణ్మ, యాండమును సృజియించి తా నందుఁ జేరి.

క. ఒనరించు చుండ ధ్యానం, బును బుట్టి తదీయఫాలమున స్వేదము భూ
మిని బడియె దానిలోపల, జనియించితి నేను శూలసహితము గాఁగన్. 2728

గీ. అట్లు జనియించి నేను భయంకరముగ, వినయమున మ్రొక్కి దేవదేవునకు స్వామి
యానతి మ్మేమి చేయంగ నగునొ నాకు, ననుచు ని ట్లానతిచ్చె నారాయణుండు.

గీ. మామకీనసంకర్షణాంశమున రుద్ర, నిన్నుఁ బుట్టించితిని గాన నీవు సేయు
మఖిలలోకసంహారంబు ననుచు నేను, దాల్చినాఁడఁ దదాజ్ఞ నౌఁదలను నంత. 2730

వ. నేత్రంబులనుండి చంద్రసూర్యులను శ్రోత్రంబులనుండి వాయువును దిక్కులను ముఖంబునుండి యింద్రాగ్నులను బ్రాహ్మణులను నాసికారంధ్రంబులనుండి మిత్రావరుణులను బాహువులనుండి యఖిలదేవతలను క్షత్రియులను రోమకూపంబులనుండి యోషధివనంబులను త్వచమునుండి శైలసముద్రంబులను దిర్యగ్జాతులను నూరువులనుండి వైశ్యులను పాదంబులనుండి శూద్రులను సృజియించి జగం బంతయును నచేతనంబుగా నుండుటంజేసి విశ్వరూపంబునం దాను దదంతర్యామి యై ప్రవర్తింపఁ జేయం దొడంగె. మఱియు నచ్యుతుండు దాను త్రిగుణాభావంబు వహియించి

—: నారాయణాంతర్యామ్యవస్థాకథనము :—

ప్రద్యుమ్నాంశంబున విధిప్రజాపతికాలజనాంతర్యామి యై బ్రహ్మకుఁ బురాణేతిహాససహితసాంగవేదంబులం బ్రసాదించి తన్ముఖంబున జగత్సర్గంబును ననిరుద్ధాంశంబున మనుపార్థివకాలజనాంతర్యామి యై మనుముఖంబున జగత్స్థితియును సంకర్షణాంశంబున రుద్రకాలయమసర్వభూతాంతర్యామి యై రుద్రముఖంబున జగత్సంహారంబును గావింపం దొడంగె. పరమాత్మున కివి యన్నియు నంతర్యామ్యవస్థలుగను

—: నారాయణవిభవావస్థాకథనము :—

మత్స్యకూర్మవరాహనృసింహవామనపరశురామరామకృష్ణబుద్ధకల్కిరూపంబులు విభవావస్థలుగను జెప్పంబడియె.

—: నారాయణపరావస్థాకథనము :—

ఇంక నారాయణునిపరావస్థం దెలిపెద వినుము. అయ్యది దీపోత్పన్నదీపంబువంటిది. అందు వైకుంఠలోకంబు విష్ణులోకంబు శ్వేతద్వీపంబు క్షీరసాగరంబు ననునాలుగు వ్యూహంబులు గలవు. పూర్వోక్తం బయినవైకుంఠలోకవ్యూహంబు ప్రథమవ్యూ

హాంబు. అచ్చట నుండువా రెల్లరును విష్ణుసమరూపులును దత్సమానసుఖభోగులును
బునరావృత్తిరహితులును గర్మబంధవిముక్తులును నై యుందురు. వారలు తమ కిచ్ఛ
గలిగినప్పుడు సౌమిత్రి భరతసంకర్షణాదులువోలె భూమియందుఁ బుట్టి మరల నిచ్ఛ
చేతన నై కంతంబునకుఁ జేరుచుందురు. వారలకు విష్ణుదాస్యంబ మోక్షంబు. బ్రహ్మ
లోకాదిసకలలోకంబులును బునరావృత్తిలక్షణంబులును గర్మబంధమయంబులును
దుఃఖమిశ్రసుఖంబులును భయప్రదంబులును బహ్వాయాససాధ్యంబులును నై యుండు.
అచ్చట నుండు సుఖభోగంబు విషమిశ్రాశనతుల్యంబు. 2731

సీ. పుణ్యంబు క్షీణత్వమును బొందినంతనె, స్వర్గసంస్థితు లైనవారి కెల్లఁ
దప్పదు కర్మబంధంబున సంసార, పతనం బనిత్య మాకతన దివము
దానికై యాసించి తపియింపక మహాత్ము, లగువారు హరిభక్తి నాశ్రయించి
పరమపదంబును బడసి శాశ్వతముగా, ననుభవించుచు నుందు రభయసుఖము

గీ. నిత్యముక్తు లనంగను నిర్విషాదు
లనఁగ సంసారవర్జితు లనఁగ విష్ణు
సేవకు లనంగ నిర్మలభావు లనఁగ
వైష్ణవోత్తము లనఁగను వార చూవె. 2732

—: విష్ణులోకవ్యూహకథనము :—

వ. ఇంక ద్వితీయవ్యూహముం జెప్పెద వినుము. 2733

సీ. విష్ణులోకంబు నా వెలయు చుండును మహా, లోకంబు నిత్యభోగైకభూమి
సలిలమధ్యప్రదేశమ్మునఁ దన్మధ్య, మున దేవవతి యనుపురము గలదు
తన్మధ్యమందు నంతఃపురం బొక టుండు, దివ్యాప్సరస్త్రీప్రదీపితంబు
తన్మధ్యమునఁ గల్పతరు వుండు సర్వేష్ట, సంధాయకంబు తచ్ఛాయయందుఁ

గీ. దనరుఁ బద్మాసనం బొండు దానియందు, రాజిలుచు నుండుఁ బుష్పపర్యంక మొండు
దానిపై లక్ష్మితోడ నాసీనుఁ డగుచు, దేవదేవుఁడు సతతంబుఁ దేజరిల్లు. 2734

గీ. కౌఁగిటను జేర్చి బాహుయుగ్మమున లక్ష్మి
నితరభుజయుగ్మమున ధరియించి పాంచ
జన్యచక్రంబులను శౌరి సొరుమీఱు
హ్రాదినీయుతనీలనీరదమువోలె. 2735

వ. అచ్చట రమ రుక్మిణి సీత పద్మ పద్మాలయ శివ సులక్షణ సుశీల యనునష్టశక్తులు
మహాలక్ష్మిరూపాంతరంబులుగా లక్ష్మీనారాయణులం బరివేష్టించి యుందురు. 2736

గీ. శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గముఖ్య, హేతిజాలంబు పౌరుషాకృతులఁ దాల్చి
సంతతంబును నంగరక్షకులువోలె, నొక్కమొగి విష్ణులోకంబు నోము చుండు. 2737

క. ఆలోకమునకు నేఁగన్, జాలుదు రతిసులభముగను నారాయణమూ
ర్త్యాలంబను లగుధీరుల, నాలోకింపఁగను జాల రన్యులు దానిన్. 2738

—: శ్వేతద్వీపవ్యూహకథనము :—

వ. ఇంకఁ దృతీయవ్యూహముం జెప్పెద వినుము. క్షీరసాగరోత్తరకూలంబు శ్వేతద్వీపంబుగాఁ జెప్పంబడియె. బ్రహ్మపుత్రు లగుసనకసనందన సనాతన సనత్కుమార జాతవేదోఢు పంచశిఖు లను సత్తయోగీంద్రులు సర్వభోగవిరక్తిం బొంది భగవన్నిత్యసందర్శనాకాంక్షులై నరనారాయణులతోడ శ్వేతదీపంబునందు నివసించుచుండ విష్ణుభక్తాగ్రేసరు లగువారలకు నిత్యదర్శనం బొసంగ వాసుదేవుండు శ్వేతదీపంబునం బ్రవేశించె.

సీ. రాజిల్లుచుండు నైరావతి యనుమహా, పురము శ్వేతద్వీపమున నొకండు
తన్మధ్యమందు నంతఃపురం బొకఁ డుండు, రమణీయసౌధవిరాజితంబు
దివ్యమంటప మొండు దీపించుచుండుఁ ద, న్మధ్యంబునందుఁ దన్మధ్యమునను
నొక్కసింహాసనం బుండుఁ దన్మధ్యంబు, నం దుండు నష్టదళాబ్జ మొండు

ఆ. కలదు దానినడుమఁ గర్ణిక యొకండు త, త్కర్ణికాసనమునఁ గ్రాలుచుండు
నఖిలగుణసమేత యగులక్ష్మితోడను, నప్రమేయుఁ డగుజనార్దనుండు. 2740

క. ఒకకేలను వసుపాత్రము, నొకకేలను దర్పణంబు నొకకేలను హే
మకమలము మాతులుంగము,నొకకేలను దాల్చి లక్ష్మి యొప్పుచు నుండున్. 2741

వ. అచ్చట నీశావాస్య మహాదేవి జాహ్నవి కమలాలయ సావిత్రి సర్వగ పద్మ యను శక్తులును శ్రద్ధ మేధ ధృతి ప్రజ్ఞ ధారణ శాంతి శ్రుతి స్మృతి మతి వన్య వృద్ధి వృష్టి మనీషిణి యనుపరిచారికలును లక్ష్మిని సేవించుచుందురు. మఱియును సనంత వైనతేయమరుద్గణాదినిత్యదేవత లందఱును విష్ణునిత్యకింకరులై యుందురు. 2742

క. హరినామకీర్తనంబును, హరిమంత్రజపంబుఁ జేయునట్టినరుల కా
హరిపదము దొరకు దొరకదు, పరులకుఁ జేసినను నెట్టిబహుపుణ్యములన్. 2743

—: క్షీరసాగరవ్యూహకథనము :—

వ. ఇంకఁ జతుర్థవ్యూహముం దెలిపెద వినుము. 2744

ఆ. క్షీరసాగరమున శేషపర్యంకంబు, నందుఁ బద్మనాభుఁ డధివసించి
యుండు లక్ష్మితోడ నుత్సాహమున దాన, వులను గూల్చి నిర్జరులను బ్రోవ. 2745

గీ. కరయుగంబున హేమపంకజయుగంబుఁ, దాల్చి శౌరి నితరకరద్వయముచేత
గాఢముగ గ్రుచ్చి కౌఁగిటఁ గాంచుచుండు, నమరులను లక్ష్మి సకరుణాపాంగములను.

క. తమ కసురబాధగల్గిన, సమయంబున నెల్ల సురలు శరణార్థులు గాఁ
గమలాక్షుఁ డవతరించుచు, తమపై వధియించు చుండుఁ గ్రవ్యాశనులన్. 2747

క. శరణాగతిమంత్రంబును, నిరతంబు జపించుచును వినిర్మలభక్తిన్
హరిని భజించుచు నుండెడి, నరులకుఁ దత్పదము దొరకు నళినదళాక్షీ! 2748

వ. ఈవ్యూహంబు లన్నియు వైకుంఠసమంబు లగుటంజేసి తద్విశేషంబు లన్నియును
వీనియందునుం గలవు. 2749

ఉ. ఇంకను నేదియైన విన నిచ్చ జనించినఁ గోరు మేను ని
శ్శంకముగా వచించెదను సర్వము నీకు లతాంగి నావుడున్
శాంకరి సమ్మదం బెసఁగ నాథ వచింపుము వేడ్క లోన నా
కంకురిలెన్ వినంగ నసురార్యవతారకథావిధానమున్. 2750

—: దశావతారచరిత్రకథనము :—

సీ. అనవుడు శర్వుఁ డి ట్లనియెఁ గాత్యాయని, హరినాభికమలజుం డై యజుండు
సలిపె ముందు నవప్రజాపతిసర్గంబు, నందు మరీచి కశ్యపునిఁ గనియెఁ
గలరు కశ్యపునకు నలువు రదితిదితి, కద్రూవినత లనుకాంత లందు
నదితికి దేవత లావిర్భవించిరి, సంభవించిరి నిశాచరులు దితికి
గీ. నందు మకరాఖ్యుఁ డొక్కమహాసురుండు, బ్రహ్మలోకంబునకుఁ బోయి పద్మభవుని
నంచితునిఁ జేసి నిజమాయవలన సర్వ, నిగమములఁ గొని మ్రింగి వార్నిధినిఁ జొచ్చె.
గీ. అంతటను లోక మెల్ల మహాధ్వాంధకార, బంధురం బయ్యె వర్ణనిబంధనంబు
భ్రష్ట మైపోయె నరులకుఁ బశువులకును, గానఁబడదాయె భేదంబు దానివలన. 2752
వ. అది యంతయు సర్వలోకవినాశహేతు వగుటంజేసి చతుర్ముఖుండు సకలదేవతలతోడం
గూడి క్షీరసాగరంబున కరుదెంచి యందు మహాలక్ష్మితోడ ననంతపర్యంకంబునం
బవళించియుండుపుండరీకాక్షునిం గాంచి చేతులు జోడించుకొని నిలువంబడి. 2753
సీ. సర్వవేదాత్మక సర్వేశ యచ్యుత, విశ్వసృష్టిస్థితివిలయకారి
సర్వలోకముల కాశ్రయభూతుఁడవు నీవె, పరమేశ్వరుఁడ వీవె భవుఁడ వీవె
త్రిగుణాత్ముఁడవు నీవె భగవంతుఁడవు నీవె, పంచభూతస్వరూపంబు నీవె
త్వత్ప్రేరణమునఁ బ్రవర్తించు సర్వంబు, త్వత్త్యక్త మైన నంతయు నశించు
గీ. దేవ శ్రుతు లెల్ల హరియించి దితిజుఁ డొకఁడు, చొచ్చెఁ గడలిని జగ మెల్ల శూన్యమయ్యె
హవ్యకవ్యంబు లొదవమి నమరు లెల్లఁ, బస్తుపడియున్నవారు నీపాదమాన. 2754
గీ. జంగమస్థావరాత్మకజగము లెల్ల, నడఁగొని వేదముల నిల్చియుండె నట్టి
వేదముల కొడఁగూడె నుచ్ఛేద మిపుడు, విన్నవించితి జరిగినవిషయ మెల్ల. 2755
సీ. అని యూరకుండుటయును హృషీకేశుండు, బ్రహ్మాదివిబుధవర్గమున కెల్ల
నభయం బొసంగి చయ్యన మత్స్యరూపంబు, ధరియించి చొచ్చి సాగరములోన
మకరాసురునిఁ బరిమార్చి చీలిచి వాని, యుదరంబు దానిలో నున్నశ్రుతులఁ,
గైకొనివచ్చి పంకజసంభవున కిచ్చి, జగదార్తిఁ దీర్చి స్వస్థలముఁ జేర

గీ. నంత నన్యోన్యమిశ్రంబు లై సవేద, సంతతుల నెల్ల వ్యాసుండు చక్కఁబఱచి
లోకమునకుఁ బ్రసాదింప లోక మెల్ల, నిలిచి ప్రార్థ్యస్థితిని బ్రవర్తిలఁ దొడంగె. 2756
వ. ఇంకఁ గూర్మావతారవృత్తాంతంబు నెఱింగించెద వినుము. 2757
సీ. అత్రితనూభవుం డై నదుర్వాసుండు, చనుదెంచి యొకదివసమున దివికిఁ
దనకుఁ గిన్నరు లొసంగినపారిజాతమాలికను గానుకగ వ్రీతి నొసంగె
నది మహేంద్రుఁడు గొని యైరావతముమీఁద, వైవఁగ దాని నావారణంబు
తొండంబుతో లాగి త్రొక్కి కాలను ద్రెంచి, విసరివై చెను నలుదెసలఁ బడఁగ
గీ. నది కనుంగొని దుర్వాసుఁ డాగ్రహమున, శాపము నొసంగి నశియింప స్వర్గలక్ష్మి
చనియె శీఘ్రంబుగను వనంబునకు నంత, నుడిగి దివము నంతర్ధాన మొందె లక్ష్మి.
ఆ. అపుడు క్షుత్పిపాస లతిశయిల్లఁగ దేవ, తాగణంబు లెల్లఁ దల్లడిల్లి
స్రష్టకడకుఁ బోయి శరణాగతులు గాఁగ, వారితోడఁ గూడి వనజభవుఁడు. 2759
క. అరుదెంచి క్షీరవార్ధి, తీరతటమున కచట విష్ణుదర్శనకాంక్షా
పరుఁడయి సలుపుచు నష్టా, క్షరమంత్రజపంబు ధ్యానపరతని నుండెన్. 2760
సీ. అపుడు ప్రసన్నుఁడై హరి దర్శనం బిచ్చి, బృందారకుల కెల్ల నిట్టు లనియె
ననిమిషులార మీ కామతిల్లినదుఃఖ, మంతయు విజ్ఞాతమయ్యె నాకు
నత్రిసూనుం డిచ్చినట్టిశాపంబున, సంపూర్ణముగఁ బోయె స్వర్గలక్ష్మి
యామె లేకుండిన నమరలోకమె కాదు, లుప్తంబులగు సర్వలోకములును
గీ. గానఁ బుట్టింపవలయు నె ట్లైన మరల, నాయమను దాని కొక్కయుపాయ మేను
జెప్పెదను మీకు మందరక్షితిధరంబు, కవ్వముగఁ జేసి వలయుఁ బాల్కడలిఁ దరువ.
క. దానిం దాల్చెదఁ గూర్మం, బై నేను బయోబ్ధిఁ జొచ్చి యటు నిటుఁ గొలఁగం
గానీక పృష్ఠదేశము, పై నిం దరువుండు మీరు భయపడకుండన్. 2762
క. అని చెప్పి యదృశ్యత్వం, బును జెందఁగ వార లెల్లఁ బోయి రయమునన్
గొనితెచ్చి మందరాద్రిని, నునిచిరి క్షీరాబ్ధిలోన నుత్సాహముతోన్. 2763
గీ. అంతటను గూర్మ మై విష్ణు నబ్ధిఁ జొచ్చి, మునిఁగిపోకుండ మందరాద్రిని ధరింప
మందరమునకు శేషదామమును జుట్టి, తరువఁదొడఁగిరి పాలసంద్రమును సురలు.
ఆ. అట్లు త్రచ్చు చుండ హరివాసరంబున, నమరు లెల్లఁ గూడి యంబురాశి
నందుఁ బుట్టె మొదట హాలాహలము వుట్టె, నవల జ్యేష్ఠ పిదప నమృత మొదవె.
వ. అటుతరువాత నైరావతోచ్చైశ్శ్రవోధన్వంతరికామధేనుపారిజాతాదిబహుశ్రేష్ఠ
వస్తువు లావిర్భవించె. 2766
గీ. అంతటను ద్వాదశీదినమందు సూర్యుఁ
డుదయ మగు చుండఁగను లక్ష్మి యుద్భవించెఁ
గరయుగంబునఁ బద్మయుగ్మమును గరయు
గమున వసుపాత్రమాతులుంగములు వెలయ. 2767

క. ఆయమ నెంటనె యుద్ధవ, మాయెను దులసీద్రుమంబు హరిపూజార్థం
బై యంతఁ దొడఁగి రమరులు, సేయఁగ లక్ష్మీస్తవంబు శ్రీసూక్తమునన్. 2768

సీ. అప్పుడు మహాలక్ష్మి యనిమిషస్తోత్రంబు, నకుఁ జిత్తమున మహానంద మొంది
సురలార వరమును వరియింపుఁ డిచ్చెద, ననవుడు నమరు లాయమకు మ్రొక్కి-
యమ్మ యస్మద్రక్షణార్థంబు హరివక్ష, మం దుండు మీ వనపాయముగను
నని వేఁడుటయు నట్లె యగుఁగాక యన లక్ష్మి, వెంటనె విష్ణువు వెడలివచ్చి

గీ. స్వస్వరూపంబుతోడ దర్శన మొసంగఁ, గురిసె నాకసముననుండి కుసుమవృష్టి
మొరసె దుందుభు లుప్పరంబునను నంత, నమరు లత్యంతసంతోష మావహిల్ల.

క. తులసీదళములచేతను, జలజాక్షున కర్చనంబు సలిపి తదిచ్ఛన్
దెలిసికొని లక్ష్మి నొసఁగిరి, కలకాలముఁ బ్రోవఁగను జగంబుల నెల్లన్. 2770

ఉ. అంతట శార్ఙ్గి వక్షమున నామెను దాల్చి సుపర్వకోటికి
స్వాంతములందు ధైర్య మొదవంగఁ గరం బభయం బొసంగి లో
నెంతయుఁ గౌతుకంబు జనియింప నదృశ్యత నొందె నంత ని
శ్చింతముగా దివంబునకుఁ జేరిరి నిర్జరు లాప్తకాములై. 2771

వ. ఇంక వరాహావతారవృత్తాంతముం జెప్పెద వినుము. 2772

సీ. మున్ను శ్వేతద్వీపమునఁ జేయుచును విష్ణు, మందిరద్వారసంరక్షణంబు
నుండిరి జయవిజయులు నాఁగ నిరువురు, విష్ణుభక్తులు మహావీర్యయుతులు
హరిదర్శనము సేయ నరుదెంచుసనకాది, మునులను వా రొక్క-దినమునందు
వారించి రద్దానఁ బారికాంక్షులు శపి, యించిరి వారల నిలను బుట్ట

గీ. నంతటను జయవిజయు లత్యంతశోక, మావహిల్లఁగ నది యెల్ల హరికిఁ జెప్ప
నంబుజాక్షుఁడు వారి కిట్లనియె భృత్యు, లార చేసితి రనివార్య మైనతప్పు. 2773

గీ. తత్ఫలంబు భుజింపక తప్ప దేఁగు, డనుటయును వార లేడ్చుచు నచ్యుతాంఘ్రి
పద్మములపైనిఁ బడఁ జక్రపాణి కరుణ, నెడఁదలోఁ గల్గ వారల కిట్టు లనియె.

సీ. సప్తజన్మములు దాస్యము సేయుచును నాకు, నవనిలోపలనుండి యవల మరల
నన్నుఁ జేరుదురొ లేకున్న మద్వైరులై, జన్మత్రయంబును క్షమను గడపి
యరుగుదెంతురొ మత్సమక్షంబునకుఁ జెప్పుఁ, డేది యిష్టమొ మీకు నేర్పడంగ
ననవుడు వార లి ట్లనిరి మాధవ చిర, కాలంబు త్వద్వియోగమున నిలను

గీ. నుండఁజాలము రిపులమై యుండి మూఁడు, జన్మముల నెట్టులేని భూసలిని గడపి
త్వరితముగను భవత్సన్నిధానమునకు, వచ్చునట్లు కటాక్షింపవలయు మమ్ము. 2775

సీ. అని వేఁడుటయు నట్లె యగుఁగాక పొం డని, యంబుజాక్షుం డదృశ్యత్వమున్ జెంద
వారలు దితిగర్భవాసంబునం జేరి, జనియించి రిలను రాక్షసులు గాఁగ

వారిలోపలఁ బెద్దవాఁడు హిరణ్యక, శిపునామధేయంబుచేత నొప్పఁ
దనరె హిరణ్యాక్షుఁ డనుపేరఁ జిన్నవాఁ, డాయిర్వురును నైరి యధికబలులు
గీ. వారిలో నప్రమాణశరీరుఁ డగుట, నమితగర్వంబునను హిరణ్యాక్షుఁ డవని
యొక్కదినమునఁ జాపగా నుర్విఁ జుట్టి, తలపయిం బెట్టికొని రసాతలముఁ జొచ్చె.
సీ. అంతట ననిమిషు లతిభయంబున క్షీర, సాగరంబును జేరి సత్వరముగ
విష్ణుసన్నిధిలోన విన్నపం బొనరింప, నాలించి సర్వంబు నచ్యుతుండు
తాల్చి వరాహావతారంబుఁ బాతాళ, మును జొచ్చి రాత్రించరుని వధించి
ధరను లేవఁగ నెత్తి దంష్ట్రిచే నిలిపె య, థాపూర్వముగ నద్భుతంబు దోఁప
గీ. నపుడు బ్రహ్మాదిదేవత లరుగుదెంచి, ప్రస్తుతింపంగ శౌరిని బహువిధముల
వారలకు నెల్ల విష్ణువు వరము లొసఁగి, యెల్లరును జూచు చుండ నదృశ్యుఁ డయ్యె.
వ. ఇంక నృసింహావతారవృత్తాంతముం జెప్పెద వినుము. 2778
సీ. తమ్ముఁడు ద్రుంచినపిమ్మటను హిరణ్య, కశిపుఁడు శౌరినిగ్రహ మొనర్ప
సంకల్ప మొనరించి సత్వరంబుగ మేరు, శిఖరిపార్శ్వంబును జేరి యచట
దివ్యవర్ష సహస్రదీక్షుఁ గై కొని వాయు, భక్షుఁ డై శైవపంచాక్షరంబు
జపియించుచును ఘోరతపముఁ గావింపఁ ద, త్తపమునకు జగంబు తల్లడిల్లె
గీ. నపుడు దర్శన మొసఁగి నే నాశరునకుఁ, గోర్కి దీర వరం బిత్తుఁ గోరుమంటి
నంతట హిరణ్యకశిపుఁ డాహ్లాద మొదవ, మత్పదాంభోజములకు నమస్కరించి.
వ. దేవాసురమనుష్యదేవయోనిఫణిపక్షిక్రిమిపశుమృగరోగాయుధంబులలో దేనివలనను నలజలంబులలో నెచ్చటనుం దనకు మరణంబు లేకుండ వరంబు గోర నే నట్లె వరం బిచ్చి యంతర్ధానంబు నొందితి. 2780
సీ. వాఁ డంతట మదీయవరలబ్ధధైర్యుఁ డై, సులువుగా ముజ్జగంబుల జయించి
త్రైలోక్యనాథుఁ డై తన కీడు లేకుండ, సంచరించుచు నిర్విశంకముగను
నుత్తానపాదున కుద్భవం బై నక, ల్యాణినిఁ గై కొని యాత్మసతి గఁ
బ్రహ్లాదుఁ డనెడిపుత్రకుని నొక్కనిఁ గని, యామెయందు జగత్ప్రహర్ష కరుని
గీ. జాతకర్మాదివిధులను సక్రమముగఁ, జేసి యుపనయనంబును జేసి యుక్త
కాలమున వేదశాస్త్రాదికళల నెల్ల, నభ్యసింపంగఁ జేర్చె గుర్వంతికమున. 2781
ఆ. అంతఁ గొంతకాల మరుగంగ నొకనాఁడు, దనుజనాథుఁ డాత్మతనయుఁ డఖిల
విద్యలను గ్రహించి విద్వాంసుఁ డై యుండు, నని తలంచి పిలువనంపె నతని. 2782
సీ. అప్పుడు ప్రహ్లాదుఁ డరుదేరఁ దనయొద్ద, కసురాధిపతి మహాహ్లాద మొదవఁ
గొడుకుఁగుఱ్ఱను జేర్చికొని కౌఁగిటను ముద్దు, గొని యంకమున నుంచుకొని కుమార
గురుసన్నిధికిఁ బోయి చిరకాల మాయె నీ, వే మేమి చదివితో యెఱుఁగఁ జెపుమ
యని యడుగుటయు ని ట్లనియెఁ బ్రహ్లాదుండు, విష్ణుభక్త్యావేశవివశుఁ డగుటఁ

గీ. జదివితిని దండ్రి సకలశాస్త్రములు గురువు, చెప్పఁగను సక్రమంబుగాఁ జిట్టచివర
కందులోఁ దేలినట్టిసారాంశ మిదియె, విష్ణు వొక్కఁడె దైవంబు వేఱు లేదు. 2783

చ. అనవుడు వానిమాటలకు నాగ్రహ మేర్పడ మానసంబునన్
దనుజవిభుండు పుత్ర మనదాయ యుపేంద్రుఁడు దేశికుండు నీ
కనుచితబోధముం జలిపె నాతని కిప్పుడె శిక్ష సేసెదన్
గను మని విప్రునిం గనియెఁ గన్నుల నిప్పులు రాలు చుండఁగన్. 2784

గీ. అపుడు జనకునిఁ జూచి ప్రహ్లాదుఁ డిట్టు, లనియెఁ దండ్రి నివారింపు మాగ్రహంబు
గురునిదోషంబు గా దిది హరియె నాకుఁ, బ్రేరకుం డయ్యె నాపదుద్ధారకుండు.

క. హరికంటె నాకు దేవుఁడు, గురువును లేఁ డన్యుఁ డిదియె కొనమాట నిరం
తరమును నతఁడె మదీయాం, తరమ్మునను వెలుఁగు చుండుఁ దపనుఁడువోలెన్.

క. అనుటయు రోషావేశం, బున నంకమునుండి త్రోసి భూమికిఁ బ్రహ్లా
దుని దైత్యవల్లభుం డి, ట్లనియెను నాకంటె దేవుఁ డన్యుఁడు గలఁడే. 2787

గీ. నన్నుఁ బూజింపు మన్యునినామ ముడిగి, నీకు సర్వంబు నిచ్చెద నేనె యనుడు
నట్లె చేయుము ప్రహ్లాద యదియె మనకు, నెల్లరకు హిత మని పురోహితులు పల్క.

మ. కని ప్రహ్లాదుఁడు వారి నెల్లరను దుష్కాలంబు ప్రాప్తించె నే
మనువాఁడన్ సకలంబు గుర్తెఱిఁగి ధర్మాధర్మముల్ చెప్పఁగ
ల్గినవిద్వాంసులె యిట్లు లోభమునకున్ గేలొగ్గి భాషింప నై
నను గోవిందుఁడు తాఁడె సర్వగతుఁ డన్యాయంబు శిక్షింపఁగన్. 2789

సీ. నారాయణుండె సనాతనుం డనియును, బద్మనాభుఁడె పరబ్రహ్మ మనియు
వాసుదేవుండె విశ్వము లెల్ల ననియును, దామోదరుఁడె జగత్కర్త యనియు
నచ్యుతుండె యథార్థ మగువస్తు వనియును, జక్రహస్తుఁడె సర్వసాక్షి యనియుఁ
బురుషోత్తముఁడె సర్వభూతేశుఁ డనియును, హరియె విరించిహరాత్ముఁ డనియుఁ

గీ. బరమపదము జనార్దనాస్పదమె యనియు
నభయహేతువు విష్ణుదాస్యంబె యనియు
భావనీయంబు శార్ఙ్గిరూపంబె యనియుఁ
జాటు చుండవె వేదముల్ శాస్త్రములును. 2790

క. సనకాదిమహామునులును, ననిశంబును నెవనిఁ గాంచ నాత్మధ్యానం
బున మునిఁగి తేలు చుందురొ, కనుఁగొన నాతండు దైత్యఘాతియ కాఁడే. 2791

గీ. ఎవనిభయమున భూమియు నినుఁడు శశియు
వరుణుఁ డగ్నియు వాయువు వాసవుండు
మృత్యువు హరుండు బ్రహ్మయు స్వేచ్ఛ నుండ
వణఁకు చుందురో యతఁడు శ్రీవరుఁడ కాఁడె. 2792

ఆ. ఎవఁడు రక్షకుండొ యీజగంబుల కెల్ల, నెవని నాశ్రయింప భవపయోధి
గట్టుఁ జేరఁగలరొ యెట్టివా రైనను, నమ్మహాత్ముఁ డొక్కహరియ కాఁడె. 2793
క. అనుఁడు బురోహితు లేమియు, ననఁజాలక యూరకున్న నంతటఁ గ్రోధా
గ్నిని నుడుకు చుండ నొడ లె, ల్లను దనుజేంద్రుండు భృత్యులను జూచి వెసన్.
ఉ. కింకరులార వీఁడు రిపుకింకరుఁ డింక నుపేక్షసేయరా
దంకురకాలమందె తెగటార్పఁగ నొప్పు విషద్రుమంబు ని
శ్శంకము గాఁగ నాయెదుటఁ జంపుఁడు వీని నరాతికీర్తనా
పంకమలీమసాకృతి నభాగ్యుని మత్కులకీర్తి కర్తనున్. 2795
క. హరి గాచునొ గిరి గాచునొ
దరిసించెదఁగాక వీనిధౌర్త్యము నెల్లన్
ద్వరితంబుగఁ దఱుగుఁడు మీ
కరవాలంబులను వీనిఁ గడికండలు గాన్. 2796
క. అని యాజ్ఞాపించుటయును, దనుజాధిపభటులు శస్త్రధరు లై పరివే
ష్టన మొనరించిరి ప్రహ్లా, దుని భయదాకృతుల శమనదూతలువోలెన్. 2797
క. అపు డష్టాక్షరమంత్రము, జపియించుచుఁ జిత్తమందు శైలమువోలెన్
వ్యపగతచలనుం డై య, ప్రపవిభునందనుఁడు నిలిచె సంతోషముతోన్. 2798
ఉ. అంతట దానవేంద్రభటు లాగ్రహ మేర్పడ నొక్కసారి వి
క్రాంతి యెలర్ప శస్త్రనికరంబున వ్రేయఁగ వానిమేన నొ
క్కింతయుఁ గల్గదాయె క్షతి శ్రీశకటాక్షమునన్ శరీర మా
ద్యంతము వజ్రతుల్య మయి యస్త్రము లెల్లను మొక్కవోవుటన్. 2799
ఉ. అప్పుడు యోధు లెల్లరు ద్రపావనతానను లై నిలంబడన్
నిప్పులు రాలఁ గన్నులను నిర్జరవైరివిభుండు చూచుచున్
సప్పములన్ ఫణీశముఖసర్పము లెల్లఁ దదాత్మసూతిపై
గుప్పున దూఁకి కాటు లిడి కోరలు డుల్లఁగ నిర్విషంబు లై. 2800
క. గ్రక్కున గ్రిందంబడియెను, జొక్కుచు సోలుచును నోటఁ జొంగలువాఱన్
గ్రక్కుచు రుధిరము నది గని, రక్కసిఱేఁ డొడుగఱచి రక్కొనుకినుకన్. 2801
శా. ఆదేశింపఁగ దిగ్గజంబులను నత్యౌద్ధత్య మేపారఁగా
రోదస్యంతర మెల్ల నిండఁగ మహారోషంబునన్ జేయుచున్
నాదంబుల్ ప్రళయాంబుదంబు లన దిఙ్నాగంబు లేతెంచి ప్ర
హ్లాదున్ ద్రొక్కి మరుద్ధతద్రువులచాయన్ గూలి నేలం బడెన్. 2802
గీ. అంతట హిరణ్యకశిపుఁ డంతరంత కాత్మ, రోషవహ్ని జ్వలింప రుద్రుండువోలె
మండిపడుచుఁ బ్రహ్లాదుని మంటలోనఁ, ద్రాళ్ళతోఁ గట్టిత్రోయించె దారుణముగ.

ఆ. అంత వీతిహోత్రుఁ డసురారిభక్తుని, గాత్రమును స్పృశించుమాత్రముననె
చల్లఁబడియె దైవసాహాయ్య ముండిన, వాని కెందు నేని హాని గలదె. 2804

చ. అపుడు నిశాటనాథుఁ డెటులైనను వానిని సంహరింపఁగన్
శపథము సేసి ప్రాణహరణక్షమ మైనవిషంబు పెట్టని
ష్కృపముగ నాకుమారుఁ డది మ్రింగి గుటుక్కునఁ ద్రేంచె గట్టునన్
ద్రప గలుగంగ రాత్రిచరరాజవరేణ్యునకున్ మనంబునన్. 2805

చ. అది గని దైత్యనాథుఁ డెద నచ్చెరియంబును నాగ్రహంబునున్
బొదలఁగఁ జూచి పుత్రునిఁ గుబుద్ధి యుపేంద్రుఁడె దేవుఁ డంచు నీ
వదరెడిపల్కె యైనయెడ వాస్తవ మిప్పుడు చూపె దేని నా
యెదుటను వాని నోర్తు వధియించెద ని న్నటుగాక తక్కినన్. 2806

వ. అని తర్జించుటయుఁ బ్రహ్లాదుం డాతని కి ట్లనియె. 2807

సీ. వాసుదేవుం డయ్యె వసియించుటనుజేసి, సర్వభూతములందుఁ జక్రపాణి
జంగమస్థావరజగములం దెల్లెడ, వ్యాపించుటను విష్ణు వయ్యె శౌరి
హరి కయ్యె నేకాంఘ్రి యఖిలజగంబులు, చరణత్రయం బయ్యెఁ బరమపదము
శ్రీనాథుఁడె సమస్తచిదచిత్పదార్థముల్, తద్భిన్న మగుపదార్థంబె లేదు
గీ. కానఁబడు నెందు నేనియు దానవారి, నీయెదుట నన నేటికి నిక్కముగఁ
జూడఁగలిగినఁ జూడు మిచ్చోట నుండె, నిచట లేఁ డని చెప్ప నే నెంతవాఁడ.

చ. అనవుడు దానవాధిపుఁ డహంకృతి మీఱఁగ నోరి వంశపాం
సన బహుళోక్తు లేమిటికి శార్ఙ్గధరుం డఖిలస్థలంబులన్
గనఁబడు నంచుఁ బేలితి కనంబడునే యిట నంచుఁ బ్రోజ్ఝితా
సనుఁ డయి దూఁకె గ్రుద్దెఁ బరిషద్ధరణిం గలయుక్కుకంబమున్. 2809

క. గ్రుద్దినవెంటనె దిక్కులు, దద్దరిలెన్ ధరణి వడఁకెఁ దారలు రాలెన్
బెద్దరొద వుట్టె గుండెలు, బ్రద్దలుగా నసురులకు సభాస్తంభమునన్. 2810

క. ఆనాదము వినఁబడఁగనె, దానవు లెల్లరును సడల ధైర్యము చేష్టా
హీనముగఁ బడిరి సమితి, స్థానంబున ఛిన్నమూలతరువులువోలెన్. 2811

సీ. ఆవల నాస్తంభమందు నృసింహుండు, ప్రాదుర్భవించె నాస్యంబునందు
హరిరూపమును మేన నరరూపమును దాల్చి, సవితృకోటిప్రకాశంబుతోడ
నతిఘోర మైనతదాకారముం గాంచి, దడదడ వుట్టంగ నెడఁదలోన
నిశ్చేష్టుఁ డై రజనీచరాధీశుండు, క్షితిపైనిఁ బడియెఁ బర్వతమువోలె
గీ. నంతఁ బ్రహ్లాదుఁ డుద్గతహర్షబాష్ప, పూరితవిలోచనుం డయి నారసింహ
మూర్తికి నమస్కరించి తన్మూర్తియందు, నఖిలభువనంబులను గాంచి యద్భుతముగ.

క. పురుషోత్తమసందర్శన, పరవశభావమున మేను పరిగతపులకాం
కురమై వెలయఁ బోడంగెన్, నరహరి సంస్తవముసేయ నానాగతులన్. 2813

ఆ. అపుడు దైత్యయోధు లపగతమూర్ఛులై, లేచి చూచి ప్రజ్వలించుచున్న
నరమృగాధిపతిని హరి వీఁడె కొట్టుఁడు, కొట్టుఁ డని వడంకఁ గుతల మార్చి. 2814

ఉ. సాయుధపాణులై మిడుత లగ్నిపయిం బడి చచ్చునట్లు నా
రాయణమూర్తిమీఁదను దురాగ్రహ మేర్పడ దూఁకి భస్మమై
పోయిరి తత్సటాపటలభూహుతభుక్స్ఫులింగకీలలన్
జే యని మ్రోగు చుండఁగను నిర్జరదుందుభు లాకసంబునన్. 2815

గీ. అట్టితఱి నస్రపాధీశుఁ డాప్తసంజ్ఞుఁ, డై తటాలున లేచి బిట్టార్చి కేల
ఖడ్గమును బట్టి యెదుట లెఱుంగనిసివంబు, తోడ నరసింహమూర్తిపై దూఁకె నంత.

క. హరి గజము నొడిసి పట్టిన, కరణి నృసింహుఁడు హిరణ్యకశిపునిఁ గేలన్
బొరిఁ బట్టి లాగి యూర్వం, తరమునఁ బడవైచికొని ప్రతాప మెలర్పన్. 2817

క. చీలిచి తదురస్స్థలమున్, వాలమ్ములఁ బోలుకరజవర్గముచే నా
భీలముగ వానిప్రేవులు, దాలిచి ప్రళయాంతకునివిధంబున నొప్పెన్. 2818

సీ. అంతటఁ దద్రూప మాలోకనముసేయఁ, దరము గామిని దేవతావ్రజంబు
వినుతింప లోకమాతను లక్ష్మి యేతెంచి, నరసింహమూర్తిముందఱను నిలిచె
నిలుచుటయును లక్ష్మి తిలకించి యామెను, జెంది శాంతిని నారసింహమూర్తి
తనయంకమునఁ జేర్చికొని వినోదించుచు, నుండంగ ననిమిషు లొక్కమొగిని

గీ. జయనినాదంబు లొనరించి జగదధీశ, భయద మగుతావకీనరూపమును జూడఁ
జాలకున్నార మిటమీఁద శాంతరూప, మును వహించి భవద్భక్తజనులఁ గనుము.

మ. అని ప్రార్థించుటయున్ నృసింహుఁడు ప్రసన్నాకారముం దాల్చి చ
య్యన వీక్షింపఁ గృపాకటాక్షముల దేవానీకమున్ నిర్జరుల్
గని సంతోషముఁ దత్ప్రభావమును సంశ్లాఘింప వేనోళ్ల వా
రిని గావించి నృసింహుఁ డిష్టవరసంతృప్తాత్ములన్ బిమ్మటన్. 2820

క. ఒనరించి దైత్యరాజ్యం, బున కధినాథునిఁగ సురలు పొగడఁగఁ బ్రహ్లా
దునిఁ బొందె నవృశ్యత్వం, బును దానవబాధ దొలఁగె ముజ్జగములకున్. 2821

సీ. అంతటఁ బ్రహ్లాదుఁ డాత్మలోపల విష్ణు, భక్తి వర్ధిలఁగ నపారముగను
విష్ణుప్రసాదాప్తవైష్ణవరాజ్యంబు, ధర్మమార్గంబును దప్పకుండఁ
బాలించుచును బహుకాలంబు భగవద, ర్పణముగా వివిధాధ్వరములు సేసి
కని విరోచనుఁ డనుతనయుని స్వసతియం, దంతంబునను జెందె హరిపదంబు

గీ. నీనృసింహమహత్త్వంబు నెవ్వ రేని, వినినఁ బఠియించినను గతవివిధపాప
పంకలేపను లై తుదిఁ బరమపదముఁ, జెందుదురు లేదు దీనిలో సందియంబు. 2822

వ. ఇంక వామనావతారవృత్తాంతముం జెప్పెద వినుము. 2823

క. కలిగెను విరోచనునకున్, బలి యనెడికుమారుఁ డాతఁడు బహుధర్మములన్
దెలిసినహరిభక్తుఁడు నై, త్ర్యులకున్ ఱేఁ డయ్యె నతఁడు దోర్బలముమెయిన్.
సీ. ఆతఁడు బలశాలి యగుటను జైత్రయా, త్రను జేసి త్రైలోక్యమును జయించి
తనకుఁ గింకరులుగా నొనరించుకొని మహేం, ద్రాదిసమస్తసుధాశనులను
బాలించు చుండంగఁ ద్రైలోక్యమును నప్పు, డఖిలసస్యసమృద్ధి యలర ధాత్రి
దున్నకయె ఫలింపఁ దొడఁగె గోవులు బహు, క్షీరప్రదానంబు సేయఁ దొడఁగెఁ
గీ. బాదపము లెల్ల ఫలపుష్పభారమునను, వఱలఁ దొడఁగెను బ్రజ లెల్ల స్వస్వధర్మ
వర్తులై చేయఁ దొడఁగిరి వాసుదేవ, నామసంకీర్తనాభ్యర్చనలు సతంబు. 2825
సీ. అట్టు లుండంగఁ గశ్యపుఁ డాత్మసుతుఁ డైన, బలవైరిరాజ్యవిభ్రంశమునకు
నమరుల కొదవినహైన్యంబునకును లోఁ, జింతించి వారికి క్షేమ మొదవఁ
దపముఁ గావింపఁగఁ దలఁచి కానను బయో, వ్రతమున వేయిసంవత్సరములు
విష్ణురూపధ్యానవివశుఁ డై కడపంగ, నతనిదీక్షకు మెచ్చి యచ్యుతుండు
గీ. వైనతేయాధిరూఢుఁ డై వచ్చి యొక్క-, నాఁడు కశ్యపునకు దర్శనం బొసంగఁ
గశ్యపుఁడు హర్షపులకితగాత్రుఁ డగుచు, జలజనేత్రుని మనసార సన్నుతించె. 2826
ఉ. ఆనుతికిన్ జతుర్భుజుఁడు హర్షము నొంది మునీంద్ర కోరు మే
దేని వరంబు నీ కిపుడె యిచ్చెద నాపుడుఁ గశ్యపర్షి స్మే
రాననుఁ డై జనార్దన మదంతరసంభవ మైనదుఃఖమున్
మానుపు మీవు నాయదితిమానినియందు జనించి పట్టి వై. 2827
సీ. అని వేఁడుటయును జనార్దనుం డట్టులె, యగుఁగాక యని వరం బతని కిచ్చి
పొంది యదృశ్యత్వమును జేరి యదితిగ, ర్భమున సహస్రవర్షంబు లందు
నివసించి యొకశుభదివసంబునను వామ, నాకృతితోడను నవతరించి
యింద్రానుజుండుగా నెసఁగుటను నుపేంద్రుఁ, డనియెడినామధేయంబు వడసి
ఆ. దీర్ఘసత్రయాగదీక్షలో నుండిన, బలిసమక్షమునకు బ్రహ్మచారి
వేషమునను బోవ విష్ణుభావమున న, భ్యాగతునకుఁ బూజ బలి యొనర్చె. 2828
గీ. బ్రాహ్మణోత్తమ తావకార్చనమువలన, ధన్యతను జెందె నాజీవితంబు నీవు
దేనికై వచ్చినాఁడవో తెలుపు మిత్తు, దాని నవిశంకముగను నేతత్క్షణంబ. 2829
చ. అనవుడు వామనుండు స్మిత మాస్యమునన్ దొలుకాడ నాబలిం
గనుఁగొని యి ట్లనున్ మధురకంఠముతో దనుజేంద్ర నేను ని
ర్ధనుఁడను దానపాత్రుఁడను బ్రాహ్మణవర్యుఁడ నగ్నికుండముం
బొనరిచికొంటకై ధరణి మూఁ డడుగుల్ నిను వేఁడ వచ్చితిన్. 2830
గీ. దానములలోన నెల్ల భూదాన ముత్త, మం బగుట దాని నంగుష్ఠమాత్ర మేని
యిచ్చినను బుచ్చుకొన్నను నిరువురకును, శాశ్వతబ్రహ్మలోకవాసంబు గలుగు. 2831

గీ. మఱియును నకించనుం డైనట్టిభూసురునకు, ధాత్రి యేమాత్ర మేనియు దానమిచ్చు
నాతనికి సంఘటిల్లు జన్మాంతరమున, నుర్వి యెల్లను నేలెడియోగ మధిప. 2832
ఆ. ఇంతస్వల్పభూమి నె ట్లిత్తు నని నీవు, సంశయింప వలదు స్వాంతమందుఁ
గలుగు నీకు దీనివలన జగత్త్రయం, బును నొసంగి నట్టిభూరియశము. 2833
క. అని వచియించుటయును బలి, యనవధికం బైనహర్ష మామతిలంగన్
మనమున నట్టులె యిచ్చెద, నని పల్కఁ గడంగు చుండ నవని నొసంగన్. 2834
సీ. ఏ తెంచి తత్పురోహితుఁ డైనశుక్రుఁ డి, ట్లనియె నాతనిఁ జూచి దనుజనాథ
దేవత లెల్లఁ బ్రార్థింపంగ నిన్ను వం, చించి నీమహి యెల్లఁ జేకొనంగ
నరుదెంచినట్టినారాయణుం డీతండు, విప్రమాత్రుఁడు గాఁడు వేగపడకు
త్రిపదభూమి నొసంగఁ ద్రిజగంబుల నితండు, హరియించి నినుఁ గ్రింది కడఁగఁ ద్రొక్కు
గీ. నీయవల దొక్కయడు గైన నితని కుర్వి, యిచ్చెదవుగాక మఱి యింక నేమి యైనఁ
జెప్పితిని శిష్యుఁడవు గానఁ జెప్పవలసి, నట్టిసమయంబునందు క్షేమార్థి నగుట. 2835
మ. అని బోధింపఁగ నాలకించి బలి శుక్రాచార్య ప్రహ్లాదపౌ
త్రున కీబోధము సేయ నొప్పునె భవత్ప్రోక్తప్రకారంబునన్
వనజాక్షుం డగునేని యీద్విజుఁడు సర్వస్వంబుతోఁ బ్రాణ మి
మ్మనినన్ నే నిపు డిచ్చువాఁడ హరి మత్ప్రాణాధికుం డౌటచేన్. 2836
క. అని పల్కుటయును శుక్రుఁడు, విని యూరకయుండె నంత విప్రుని దర్భా
సనమున బలి యుపవిష్టుని, నొనరిచి హరిబుద్ధి నతని కొనరిచి పూజన్. 2837
ఆ. ధారవోసి కలశవారిచే విప్రుని, హస్తమునఁ బదత్రయప్రమాణ
మైనభూమి దక్షిణాన్వితంబుగ మ్రొక్కి, హర్ష మామతిల్ల నాత్మలోన. 2838
ఉ. భూసురవర్య ధన్యతను బొందెను నాజననంబు నీకు నేఁ
జేసినభూమిదానమునఁ జేకొను మింక నభీష్టసిద్ధి గా
నీసకలప్రపంచముల నెం దయినన్ ధర నాఁగ మోమునన్
హాసము గుల్క శౌరి దనుజాధిప చూడుము భూమి గొల్చెదన్. 2839
సీ. అని వచించి త్రివిక్రమాకారమునను మి, న్నంటంగఁ బెరిఁగి యత్యద్భుతముగ
ససముద్రకాననశైలసప్తద్వీప, మును బహువిధజంతుపూరితమును
నతివిశాలమును నత్యాయామయుతమును, నగుధర నెల్ల నేకాంఘ్రిచేత
నాక్రమించి యుదగ్రహోమరబ్రహ్మలో, కాద్యూర్ధ్వపదము నంఘ్ర్యంతరమున
గీ. నాక్రమింపఁగఁ జక్రపద్మాదిచిహ్న, భరిత మగువిష్ణుపదమును బ్రహ్మ చూచి
హర్షమున స్వకమండలుస్థాంబువునను, గడుగ నప్పాదతీర్థ మర్ఘ్య మగుచు.
వ. మేరుశిఖరంబునం బడి జగత్పావనతీర్థంబు నాల్గుదిక్కులకును బ్రవహించి సీత యలక
నంద చక్షువు భద్ర యని యథాక్రమంబుగా నామంబులం దాల్చి మేరువునకు దక్షిణా

భాగంబున నలకనంద యనియును నూర్ధ్వభాగంబున మందాకిని యనియును నధో
భాగంబున భోగవతి యనియును మధ్యభాగంబున వేగవతి యనియును బ్రసిద్ధిం గాంచె.
గీ. అమ్మహాగంగ మేరుమధ్యంబునుండి, ప్రస్రవించుచునుండ మూర్ధమున నేను
దాల్చి దానిని దివ్యవత్సరసహస్ర, మంది పూతత్వము శివుండ నైతి దాన. 2842
సీ. అంతట గౌతముఁ డనుమహర్షియు భగీ, రథుఁ డనెడివసుంధరాధవుండు
గంగానిమిత్తంబు గావింపఁగఁ దపంబు, దానికి నేను సంతసము నొంది
సర్వలోకములకు సమకూర భద్రంబు, విడిచితి గంగను జడలనుండి
యది తదుభయనీత యగుటచే గౌతమి, యనియు భాగీరథి యనియుఁ బరగెఁ
గీ. జెప్పితిఁ బ్రసంగవశమునఁ జెప్పవలసి, వచ్చుటను గాంగసంభవవార్త నీకు
నట్లు విష్ణువు లోకము లాక్రమించి, యంఘ్రియుగ్మముచేత నత్యద్భుతముగ. 2843
క. బలి నంటఁగఁ ద్రొక్కి రసా, తలమునకుఁ దృతీయపాదతలమున శ్రితవ
త్సలుఁ డగుటను యాదఃఫణి, పలలాదసమూహములకుఁ బ్రభువుగఁ జేసెన్. 2844
క. అంతట సుర లెల్లరు బహు, సంతోషముతోడఁ బొగడ స్వారాజ్యశ్రీ
కాంతునిఁగఁ జేసి యింద్రుని, నంతర్ధానంబు నొందె హరి చిత్రముగన్. 2845
వ. ఇంకఁ బరశురామావతారవృత్తాంతముం జెప్పెద వినుము. 2846
సీ. కలఁడు విశ్వంభరాతలమున జమదగ్ని, యనియెడిభృగుమానితనయుఁ డొకఁడు
తపము గావింప నాధర్మాత్ముఁ డింద్రునిఁ, గూర్చి గంగానదీకూలమందు
నబ్దసహస్రపర్యంత మచ్చెరువుగా, నమ్మని కొకదినమందు వజ్రి
ప్రత్యక్షుఁ డై ద్విజప్రవర కోరుము వరం, బిచ్చెద ననుడు నాఋషివరుండు
గీ. పాకశాసన కరుణ నాపై నీకు, నెసఁగునేడఁ గామధేనువు నిమ్ము నాకు
ననవుడుఁ బురందరుఁడుఁ బ్రీతి యావహిల్ల, నిచ్చి సురభిని మాని కదృశ్యుఁ డయ్యె.
సీ. అంతట జమదగ్ని యమరధేనువుతోడ, నాత్మాశ్రమంబున కరుగుదెంచి
తత్కామధేనుప్రదత్తమహైశ్వర్యుఁ, డై సుఖించుచు హరిహయుఁడువోలె
రేణుకసుత యైనరేణుకాదేవినిఁ, గైకొని పత్నిగాఁ గాంక్షదీరఁ
బౌలోమితో దివస్పతివోలె నామెతో, నతులభోగంబుల ననుభవించి
గీ. పుత్రకామేష్టి గావించి పుత్రకాంక్షఁ, గనియె రేణుకయందు శక్రప్రసాద
మునను విష్ణ్వంశమున నొప్పుపుత్రు నొకని, నమితవిక్రమవీర్యబలాభ్యధికుని. 2848
గీ. అంతటను దత్పితామహుఁ డైనభృగువు, రాముఁ డనుపేరు వెట్టె నారాయణాంశ
భవున కతనికి సకలతాపసవరేణ్య, సంసదంగణమున జగచ్ఛ్లాఘ్యముగను. 2849
గీ. అతఁడు జమదగ్నినందనుం డగుట జామ, దగ్న్యసంజ్ఞయు నతనికిఁ దనరె నతఁడు
శ్రద్ధతో విద్దియల నెల్లఁ జదివి తపము, సేయువాంఛ సాలగ్రామశిఖరి కరిగి. 2850
సీ. అచ్చటఁ గశ్యపుం డనెడిబ్రహ్మర్షినిఁ, గని వందనము సేయఁగను నతండు
విష్ణుషడక్షరాన్వితమహామంత్రంబు, నుపదేశ మొనరింప యుక్తముగను

జామదగ్న్యుఁడు దాని జపియించుచును సర్వ, కాలంబులందు నక్కడనె యుండె
నటు లుండఁగను హైహయాధీశ్వరుం డగు, కార్తవీర్యుఁడు గొంతకాలమునకు
గీ. సర్వరాష్ట్రంబుల జయించి సైన్యయుక్త, ముగను జమదగ్ని యాశ్రమంబునకు వచ్చి
ప్రణతి గావింప మౌనికిఁ బార్థివునకుఁ, దగినగౌరవమును జమదగ్ని సేసి. 2851
సీ. ప్రార్థించి సురభి నయ్యాది షడ్రసోపేత, మృష్టాన్న పేయముల్ సృష్టిచేయ
హర్షంబునను హైహయాధీశ్వరునకుఁ ద, చ్చతురంగసేనకుఁ జలిపె విందు
కార్తవీర్యుం డది గాంచి విస్మయ మొంది, జమదగ్నికడ నిల్చి సవినయముగ
మౌనీంద్ర నాకు నీధేనువుపైఁ గాంక్ష, యుద్భవించెను దాని నొసఁగె దేని
గీ. యీయావు కోరినగోవుల నిచ్చువాఁడ, నెన్నిటిని నేని నాయొద్ద నున్నవానిఁ
గోరుకొ మ్మన జమదగ్ని కువలయేంద్ర, తగదు కోరంగ దేవతాధనము నీకు. 2852
క. అనుటయును గార్తవీర్యా, ర్జునుఁ డాగ్రహ మొదవ నొక్కక్రుద్ధున జమద
గ్నిని జంపి పట్టుకొనుటకుఁ, జనియెను దద్గోవు నాత్మసైన్యముతోడన్, 2853
క. అప్పుడు సురధేనువు మది, నప్పతిలఁగఁ గ్రోధ మెంతయును దత్సేనన్
జిప్పలుగఁ గ్రుమ్మి కొమ్ములఁ, గుప్పలుగాఁ గూల్చి చనియె గొబ్బున దివికిన్. 2854
గీ. అంతటను హైహయాధిపుఁ డపగతాత్మ, సైన్యుఁడై చేరె వెంటనె స్వపురమునకు
నది య టుండఁగ నపుడు నారాయణుండు, రామునకు స్వస్వరూపదర్శనము నొసఁగి.
సీ. రామ చెందితిఁ బ్రహర్షమును నీచేసిన, తపమున కేను స్వాంతంబునందుఁ
గావింప హితమును దేవతలకు ధరి, త్రీభార మెల్లను దీర్చుటకును
నిచ్చితి మచ్ఛక్తి నిపుడె నీ కేతదా, విష్టుండవై సర్వదుష్టనృపుల
వధియించి యేలి భూవలయ మంతయు ధర్మ, సంస్థాపనము చేసి జగమునందు
గీ. సర్వు లెన్నటివారిపై నవనిభరము, నునిచి చివరకు మత్పదంబునకుఁ జేరు
మని పలికి పరశువు వైష్ణవాస్త్రములను, నిచ్చి జమదగ్నిసుతున కదృశ్యుఁ డయ్యె.
సీ. అంతట రాముఁడు హర్షంబుతోడను, స్వాశ్రమభూమికి నరుగుదెంచి
యాలించి తనతండ్రి హైహయాధిపునిచే, హతుఁ డయ్యె ననెడిదురంతవార్త
ప్రళయాగ్నికై వడిఁ బ్రజ్వరిల్లుచు రేఁగి, విష్ణుశక్త్యావేశవివశుఁ డగుట
నొకకేలఁ బరశువు నొకకేల వైష్ణవా, స్త్రములను దాల్చి యత్యద్భుతముగఁ
గీ. జలుప నెంచి ధరిత్రి నిఃక్షత్త్రియముగఁ, బయనమై పోయి హైహయపతిపురంబుఁ
జేరి నిలుచుండెఁ దత్పురద్వారమందుఁ, బండ్లు పటపటఁ గొఱుకుచు భయదముగను.
ఉ. ఆతనిఁ జూచి పౌరులు భయాకులులై వడి నేఁగి హైహయ
క్ష్మాతలనేతకున్ దెలుపఁగా నతఁ డాగ్రహదుర్నిరీక్షుఁడై
యాతనిఁ బట్టి తేరఁగ మహాబలశాలులఁ బంప యోధులున్
గాతుక మొప్ప వారు ధృతఖడ్గగదాశరచాపహస్తులై. 2858

క. చని రాముఁ డున్నచోటికి, ననలునివలెఁ బ్రజ్వరిల్లునమ్మహితునిమీఁ
దను గవిసి శలభములచా, యను భస్మం బైరి తద్భయానకదృష్టిన్. 2859

క. అది యెఱిఁగి కార్తవీర్యుఁడు, మదమున నొడ లెఱుఁగ కునికి మండెడుచూడ్కిన్
రదములు పటపటఁ గొఱుకుచు, నుదుటున జనుదెంచె రాముఁ డుండెడుకడకున్.

క. అరుదెంచిన వానిం గని
హరి గజముఁబోలె రాముఁ డతిరోషమునన్
ధరణిధవాధమ క్షత్త్రియ
నరపశుబలి వలయు మద్రణక్రతువునకున్. 2861

సీ. జమదగ్నిమునికిఁ గొమరుండ భృగుమహా, మునికిఁ బౌత్రుఁడను రాముఁడను నేను
నాజనకునకు నొనర్పంగ మొదటను, ద్వద్రక్తధారచేఁ దర్పణంబు
త్వచ్ఛిరఃకమలంబువలనఁ బిండప్రదా, నంబును నేతెంచినాఁడ నిటకు
నిలువుము నావుడుఁ దిలకించి రామునిఁ, గార్తవీర్యుఁడు మహాధూర్తదృష్టి

గీ. బ్రాహ్మణాధమ నీతండ్రిఁ బగిది నీవు
నాశ మొందంగ నేతెంచినాఁడ విటకుఁ
గాల మాసన్న మగుటను గాక యున్నఁ
బ్రేలుదువె కార్తవీర్యునిమ్రోల నిట్లు. 2862

క. అని పలికి నిశితబాణము, లను చాపమునందు సంధిలఁగఁజేసి తటా
లున నేసె జామదగ్న్యునిఁ, దనపాపము ఫలము నిచ్చుతరుణం బగుటన్. 2863

ఉ. అంతట జామదగ్న్యుఁడు లయాంతకుఁ డేమొ యితం డటన్నవి
భ్రాంతిని గల్గఁజేయుచును బ్రాణుల కెల్లఁ గుఠారధారచే
నింతగఁ గూల్చి రాజభటవీరుల నెల్లను గార్తవీర్యభూ
కాంతునివేయిచేతులను గంఠమునన్ దునిమెన్ గఱుక్కునన్. 2864

ఆ. అట్లు దునిమి హైహయాధీశ్వరుని రాముఁ, డాగ్రహంబు లోన నాఁగ కునికి
క్షత్త్రియులను నెల్ల సంహార మొనరింప, నరుగు చుండెఁ బ్రళయహరుఁడువోలె.

గీ. అపుడు రేణుక మార్గమధ్యమున వచ్చి, తండ్రి యిక్ష్వాకువంశ్యులఁ దగదు చంప
వారు నీకు మాతామహవంశ్యు లగుట, ననుచు నర్థింపఁగను రాముఁ డభయ మొసఁగి

గీ. సమధికాటోపమున నేఁగి సకలధరణి, పాలకుల నూఁచముట్టుగాఁ బరశువునను
నఱికి యిక్ష్వాకువంశభూనాయకులను, భ్రష్టరాజ్యులఁ జేసి చంపకయె విడిచి. 2867

గీ. ఉడిగి యావేశమును శాంతి నొంది సర్వ, వసుమతీచక్రనాథుఁ డై వాజిమేధ
యాగము నొనర్చి దానిలో నవనిసురుల, కందఱకు దక్షిణగ నిచ్చి యఖిలధరణి.

క. చని బదరికాశ్రమమునకు, నొనరింపఁ దొడంగెఁ దపము నుగ్రంబుగ రా
మునిమహిమము సంపూర్ణము, గను బ్రహ్మకు నైన నలవి గాదు వచింపన్. 2869

వ. విష్ణుశక్త్యావేశావతారం బగుటం జేసి పరశురామావతారం బుపాసనార్హంబు గాదు. విష్ణుపూర్ణావతారంబు లగు రామకృష్ణావతారంబు లుపాసనార్హంబులు గాఁ జెప్పం బడియె. 2870

క. అంతట బ్రాహ్మణు లెల్లరు, సంతసమున రఘుకులాభిజాతు లగు మహీ
కాంతుల కిచ్చిరి మేదిని, యంతయు ధర్మమున నేల సానుగ్రహులై. 2371

వ. ఇంక శ్రీరామావతారవృత్తాంతముం జెప్పెద వినుము. 2372

సీ. పూర్వము భూతలంబునను స్వాయంభువుం, డను పేర మను వొకండవతరించె
నైమిషారణ్యంబునను గౌతమీతట, స్థలిని సహస్రవత్సరము లతఁడు
తపము గావింపఁ దత్తపమున కాహ్లాద, మొదవంగ నచ్యుతుం డొక్కనాఁడు
స్వస్వరూపంబున స్వాయంభువునకుఁ బ్ర, త్యక్షమై కోరుకొ మ్మనఁగ వరము
గీ. సంతసము నొంది యాతఁడు చక్రపాణి, నాకుఁ బుత్రుండ వగుము జన్మత్రయంబు
వఱకు నినుఁ బుత్రునిఁగఁ బొందువాంఛతోడఁ, జలిపితి సహస్రవత్సరంబులు తపంబు.

సీ. అనవుడు శౌరి యి ట్లనియె స్వాయంభువ, త్వద్వాంఛ నాకు సంతసముఁ గొల్పె
శిష్టరక్షణమును దుష్టశిక్షణమును, గావింపవలసినకాలమందు
నీవు కోరినయట్ల నీకు నే జన్మించి, సలుపుదు ధర్మసంస్థాపనంబు
నని వచించి యదృశ్యుఁ డగుటయు మనువు మ, హానందమును బొందె నాత్మలోన
ఆ. నవలఁ గొంతకాల మరుగంగ రఘువంశ, మునను దశరథుఁడుగ మనువు వుట్టె
నచ్యుతుండు వుట్టె నతనికి మున్నుదా, ననినయట్ల రాముఁ డనెడి పేర. 2874

సీ. ఆరామునిచరిత్ర మాలింపుము వచింతు, నఖిలపాతకహారం బగుటఁ జేసి
ధరను మున్ను పులస్త్యతనయుఁ డొక్కరుం డుండె, విశ్రవుం డను పేర విదితయశుఁడు
నెలఁత యయ్యెను నాతనికిఁ గేకశి యనుసు, మాలిదైతేయకుమారి యొకతె
యామె సంధ్యాకాలమందుఁ గామాంధ్యంబు, నను నిజధవునితోడను రమించి
గీ. కాంచి రావణుఁ డనఁ గుంభకర్ణుఁ డనఁగ, శూర్పణఖ యనఁగను రక్కసులను బిదపఁ
గనియెను విభీషణుని శీలధనుని నొక్క, మంచిమూర్తంబునను దనమగనిఁ గూడి.

వ. అంతట రావణకుంభకర్ణులు నన్నుం గూర్చి హిమవత్పర్వతంబున ఘోరతపంబు గావించిరి. 2876

సీ. అందు రావణుఁడు సాహసమున మత్పూజ, గావింప నిజశిరఃకమలములను
దానికి నే నద్భుతం బొంది వానికిఁ, బ్రత్యక్షమై స్వరూపంబుతోడ
వరము గోరు మనంగ వాఁడు గోరెను దన, కవధంబు దేవదానవులవలన
వాఁడు గోరినయట్లె వానికి వరము నొ, సంగి చెందితి నదృశ్యతను నేను
గీ. రావణుం డంతటను మద్వరప్రభావ, గర్వితుం డయి మూఁడులోకముల బాధ
పెట్టుచుండంగ సుర లెల్ల భీతితోడ, శరణు చొచ్చిరి హరిని నిశ్శరణు లగుట. 2877

సీ. అపుడు జనార్దనుం డతని వధింపంగఁ, దగినయుపాయంబుఁ దా నెఱింగి
సురలార దశరథనరపతికి నరుండ, నై నేను రఘువంశమందుఁ బుట్టి
వధియించువాఁడ రావణుని సమూలంబు, గను బ్రహ్మశాపంబుకతన మీరు
ధరణిపైఁ బుట్టి వానరులుగా సాయంబు, గావింపవలయు మత్కార్యమునకు
గీ. నని వచించి యంతర్ధాన మగుడు నమరు, లందఱును గ్రోతులుగఁ బుట్టి రవనియందు
నపుడు పుత్త్రార్థి యై యజ్ఞ మాచరింపఁ, దొడఁగె దశరథుఁ డనియెడుపుడమిఱేఁడు.
ఆ. అట్లు దశరథుండు యజ్ఞంబు గావించు, చుండ శౌరి యజ్ఞకుండమందు
దెసలు పదియు వెలుఁగ దివ్యతేజంబుతో, నుదయమంది కరుణ యుట్టిపడఁగ. 2879
సీ. వసుమతీంద్ర వరంబు వాంఛింపు మిచ్చెద, నని పల్క దశరథజనవరుండు
ప్రాంజలి యై మ్రొక్కి యచ్యుత పుత్త్రుండ, వగుము నా కిదియె మత్ప్రార్థనంబు
నావుడు సస్మితాననుఁ డయి దైత్యారి, పాయసాన్వితహేమభాజనంబు
దశరథున కొసంగి ధరణీంద్ర యీపాయ, సము విభజించి నీసతుల కిమ్ము
గీ. పుత్త్రరూపంబునను నేను బుట్టువాఁడ, నని వచించి యంతర్ధాన మయ్యె నంత
దశరథుఁడు హర్ష మొంది తత్క్షణమునంద, దరిని నుండినసతుల నిర్వురను జూచి.
గీ. రెండుభాగంబులుగ నొనరించి పాయ, సంబుఁ గౌసల్య కొక్కభాగంబు నొసఁగి
యొక్కభాగంబు కైకేయి కొసఁగి చనియె, నంతలో వచ్చి మధ్యమ యగుసుమిత్ర.
గీ. కోరఁగను బాయసంబును వార లామె, కాత్మభాగంబులం దర్ధ మర్ధ మీయ
నామె భాగద్వయంబును నారగించె, నారగింపఁగ భాగద్వయంబు వారు. 2882
క. అంతట ముగ్వురు గూడను, నంతర్వత్ను లయి నూత్న మగుతేజముతో
నెంతయును వెలుఁగఁ జొచ్చిరి, సంతస మెదలందుఁ బొదల సకల జనులకున్. 2883
సీ. అట్లు కాలము కొంత యరుగంగఁ జైత్రమా, సంబున శుక్లపక్షంబునందు
దితిదైవతర్క్ష సంయుత మైననవమీది, నమున మధ్యాహ్నకాలమునయందు
సర్వశుభగ్రహసహితలగ్నమునందు, జగదేకపతినిఁ గౌసల్య కనియె
నపుడు చల్లఁగ వీచె ననిలముల్ దెసలును, నదులును సుప్రసన్నంబు లయ్యె
గీ. మ్రోఁగె సురదుందుభులు వ్యోమమున నటించి, రచ్చరలు పాడ గంధర్వు లాకసమున
మునులు బ్రహ్మాదులును నభంబున విమాన, గాము లై యుండి పొగడి రక్కైటభారి.
సీ. అపుడు కౌసల్య దీపావిర్భవద్దీప, మట్లు విష్ణ్వాద్భుతుం డైనవాని
శంఖచక్రగదాంబుజధ్వజవజ్రల, క్షణలక్షితాంఘ్రిహస్తములవాని
శ్రీవత్సకౌస్తుభశ్రీవనమాలికా, లంకృతవక్షస్స్థలంబువాని
రవికోటిదీప్తివిరాజితుం డగువాని, బ్రహ్మాండపూర్ణోదరంబువాని
గీ. వేదనిశ్వాసములవాని ద్వీపశైల, వార్ధిజఘనంబువాని వివస్వదగ్ని
నయనములవాని మారుతనాసవాని, బ్రహ్మశివకర్ణములవానిఁ బట్టిఁ గాంచి. 2885

గీ. భీత వై యుట్టు లనియోఁ గంజాతనేత్ర, ధన్యతను జెందలిని నిన్నుఁ దనయునిఁగను
గనుటచే నింక నీరూపు గాంచఁజాల, భయముఁ బాపుము పుత్రరూపమున నాకు.

క. అని వేఁడుటయును దత్క్షణ, మున మాయామానుషత్వమును నొంది జనా
ర్దనుఁడు శిశురూపమున రో, దనముం గావించె ముదము దల్లికిఁ గలుగన్. 2887

గీ. అంతట నొనర్చి జాతకర్మాదివిధుల, నఖిలవిదుఁడు వసిష్ఠుఁ డనంతరంబ
యక్కుమారునకు శ్రీరాముఁ డనెడిపేరు, వెట్టె శ్రీరమణుం డయినట్టికతన. 2888

క. అంతట దశరథుఁ డెంతయు, సంతోషముతోడ నిచ్చె ధర్మసురులకు దై
త్యాంతకసంప్రీతిగ భూ, దంతికనకగోధనాదిదానము లెల్లన్. 2889

గీ. ఆదినంబునఁ బురజను లాదరమునఁ, జేసిరి మహోత్సవంబులు చిత్రముగను
దశరథున కంబుజాక్షుఁడు తనయుఁడుగను, బుట్టె నని యెడిసంతోష ముట్టిపడఁగ.

వ. అటుపిమ్మటఁ గైకేయికిఁ బాంచజన్యాంశంబున భరతుండును సుమిత్రకు ననంతాంశంబున
లక్ష్మణుండును సుదర్శనాంశంబున శత్రుఘ్నుండును బ్రాదుర్భవించిరి. 2891

సీ. వార లెల్లరును వైవస్వతమనుకులం, బునకు నలంకారభూతులుగను
వృద్ధిని బొందుచు వేదశాస్త్రపురాణ, చాపవిద్యాదుల సానఁదీరి
నాఁడునాఁటికి మహానందంబుగొలుపంగ, సాగిరి చూచెడిజనుల కెల్ల
నటు లుండఁగ నయోధ్య కరుదెంచి కౌశికుం, డనుమునీంద్రుం డొకదినమునందు

గీ. దశరథుఁడు సేసినట్టిసత్కారమునకు, మిగుల సంతోషమును బొంది మేదినీంద్ర
క్రతువు నొనరించుచుండ గంగాతటంబు, నందు సిద్ధాశ్రమంబునయందు నేను. 2892

క. దనుజులు మాంసము రక్తం, బును వైచుచు నగ్నికుండములలో యజ్ఞం
బును బాడుచేయఁ దొడఁగిరి, కనలి శపింపంగఁ దగనికాలం బగుటన్. 2893

క. ఆయసురబాధ తొలఁగం, జేయఁగఁ బంపంగవలయు శ్రీరాముని నా
సాయంబున మీ కెల్లను, శ్రేయంబులు గలుగు నేల చెప్ప బహూక్తుల్. 2894

క. అని వచియింపఁగ దశరథ, మనుజాధీశ్వరుఁడు మాఱుమాటాడక య
మ్మునివెంటఁ బనిచె శ్రీరా, ముని లక్ష్మణసహితముగఁ బ్రమోదముతోడన్. 2895

సీ. అంతటఁ గౌశికుం డానంద మొదవ ను, ల్లమునఁ దోడ్కొని రామలక్ష్మణులను
దనయాశ్రమమునకుఁ జనుచుండ మార్గమ, ధ్యంబునఁ బుష్పవర్షంబు గురిసె
నేతెంచి తార్క్ష్యుఁ డదృశ్యరూపమున ది, వ్యాస్త్రంబులను దివ్యశస్త్రములను
నక్షయతూణసాయకముల దివ్యకా, ర్ముకమును నిచ్చి రామునకు నేఁగె

గీ. దాశరథి వానిఁ గైకొని తపసివెంట, నరుగుచును నొక్కవిపినమునందు మాని
యానతిని జంపెఁ దాటక యనెడిక్రూర, రాక్షసిని నొక్కనిశితనారాచమునను. 2896

క. ఆతాటక శ్రీరాముని, చేత నిహత యగుట విడిచి స్వీయతనువు లో
కాతీతదివ్యరూపస, మేతముగను దివికి నేఁగె నెల్లరుఁ జూడన్. 2897

వ. అంతట విశ్వామిత్రుండు రామలక్ష్మణులతోడ నిజాశ్రమంబునకుం జేరి దీక్షితుం డై లోకకల్యాణార్థంబు యజ్ఞంబు నారంభించె. 2898

సీ. జరుగు చుండఁగ యజ్ఞంబు వైభవముతో, వీతిహోత్రంబులు వెలుఁగు చుండ
నరుదెంచి మారీచుఁ డనురాక్షసుండు సు, బాహుండు నాఁబడుభ్రాతతోడ
సవనవిధ్వంసంబు సలుప శిలావర్ష, మును ముందుఁ గురియంగ మున్నువోలె
నాజాడ రాఘవుం డరసి సుబాహుని, నొక్కమార్గణముచే నుర్విఁ గూల్చి

ఆ. మారుతాస్త్రమునను మారీచుని సముద్ర, మందుఁ బాఱవైచె నద్భుతముగ
స్పర్శనంబు శుష్కపర్ణంబునుం బోలె, రామభద్రుశక్తి యేమి చెప్ప. 2899

గీ. అబ్ధిలోఁ బడి మారీచుఁ డట్లు కదల, మెదలఁ జాలక యెట్టులో బ్రదికి తుదకు
నెవరికిని గానఁబడకుండ నేఁగి తపముఁ, గడఁగె నొనరింప నొక్కకాఱడవిలోన. 2900

గీ. అంతటను గౌశికుఁడు చేసి యాగపూర్తి, హర్షమున రాఘవునిశక్తి నభినుతించె
రాముఁ డనఁగను నాదినారాయణుండె, యని గ్రహింపఁగ నట నుండుమనుజు లెల్ల.

సీ. అది య టుండఁగ మిథిలాధీశ్వరుఁడు వాజ, పేయయాగంబును జేయ నెంచి
యాహ్వాన మంప బ్రాహ్మణులకు రామల, క్ష్మణసమేతంబుగాఁ గౌశికుండు
పయన మై మిథిలకు రయమునఁ జను చుండఁ, గను నడుమను నొక్కవనములోన
నశ్మ మైయున్నయహల్య చిత్రంబుగా, రామపాదము సోఁకి రమణి యయ్యె

గీ. నవల మిథిలాపురంబున కరుగుటయును, గౌశికమహర్షి రామలక్ష్మణులతోడ
జనకుఁడు యథావిధిని గౌశికునకుఁ బూజ, సలిపి రామునివదనాంబుజమును జూచి.

క. తనహృదయంబున సతతం, బును ధ్యానంబునను జూచుపురుషోత్తమునిన్
గనినట్టులు ప్రత్యక్షము, గను దనియుచు విని తదీయకథ మునివలనన్. 2903

ఆ. లక్ష్మివోలెఁ దనకు లాంగలముఖమున, నవనిలోనఁ బ్రాప్త యైనసీతఁ
బత్నిగా నొసంగ భావంబునఁ దలంచి, యతని కుచితపూజ లాచరించి. 2904

క. శివచాపంబును జూపఁగ, నవనిజను గ్రహించునట్టి యర్హత గన రా
ఘవుఁ డొక్కత్రుటిలో దానిని, జివుక్కనను విఱిచి కొనియె సీతను సతిగాన్. 2905

వ. అంతట జనకుఁ డత్యానందముం జెంది యయోధ్యానగరంబునకు విప్రోత్తములం బనిచి సపరివారంబుగా దశరథుని రావించి తత్పుత్రు లగులక్ష్మణభరతశత్రుఘ్నులకు యథాక్రమంబుగాఁ దనపుత్రిక యగునూర్మిళను దనతమ్మునితనూజ లగుమాండవీశ్రుతకీర్తులను నొసంగి వివాహమహోత్సవంబు గావించి యథార్హంబుగా మహర్షులకును మహీపతులకును సకలజనంబులకును సత్కారంబు లొనర్చె. 2906

సీ. ఆవల దశరథభూవరుండు గ్రహించి, పరిబర్హమును బహుప్రమద మొదవఁ
దనయస్నుషాబంధుజనపురోహితమంత్రి, పరిజనయుతముగా బయలుదేఱి
చనుదెంచు చుండఁగ స్వపురంబునకు జామ, దగ్న్యుండు మార్గమధ్యంబునందు
సామర్ష మైనసింహమువోలె నెదురుగా, నరుదెంచి నిలిచి భీకరము గాఁగ

గీ. రాఘవ ధరాపతుల నెల్లరను వధించి, ధరణి నెల్లను భూసురతతి కొసంగి
వనమునను నేను గావించుచును దపంబు, త్వన్మహావీర్యమును విని వచ్చినాఁడ. 2907

గీ. వీర్యవత్తరుఁ డైనపృథ్వీధవుండు, గలఁడు ధర ననుమాట నాకర్ణములకు
సైఁపరా కున్నయది శివచాపభంగ, మొనరిచినమాత్రమున గర్వ మొందవలదు.

గీ. ఈధనువు నెక్కు వెట్టితి వేని చాలు, నిర్జితుఁడ నయిపోవుదు నేను నీవు
దీని నెక్కిడలే వైతి వేని నన్ను, శరణుచొచ్చి త్యజింపుము శస్త్రములను. 2909

సీ. అని పల్కి తనహస్తమున నున్నవైష్ణవ, చాపంబు నొసఁగ దాశరథి దానిఁ
గైకొని దానితోఁ గైకొని తద్విష్ణు, శక్తియుఁ దచ్ఛరాసనము వంచి
యవలీలగను బాణ మందు సంధానించి, స్మిత మాననంబునఁ జిందులాడ
విగతకర్ముం డైనవిప్రునివలె గళ, త్కాంతి యై యున్నభార్గవునిఁ జూచి

గీ. బ్రాహ్మణోత్తమ రామమార్గణ మమోఘ
మేమి లక్ష్యంబు చూపెదో యెఱుఁగఁ జెప్పుమ
యనుడు భార్గవుఁ డతివిస్మయంబు నొంది
యతనిఁ బరమాత్మునిఁగఁ గాంచి యాత్మలోన. 2910

సీ. రాఘవ నిన్ను నారాయణమూర్తిగాఁ, దెలిసికొంటిని భవద్వీర్యమునను
నీ వాదిపురుషుఁడ వీ వచ్యుతుండవు, నీ వనంతుండవు నీవు హరివి
నీ వచింత్యుండవు నిర్గుణుండవు నీవు, సగుణుండ వీవు శాశ్వతుఁడ వీవు
స్రష్టవు నీవు పరాత్పరుండవు నీవు, కర్తవు నీవు సంహర్త వీవు

గీ. ప్రణవమును వేదమును నధ్వరమును గాల
మును బరబ్రహ్మమును నజుండును హరుండు
సకలభువనంబులును దదీశ్వరులు నీవ
యెఱుఁగ నీదివ్యశక్తి నే నెంతవాఁడ. 2911

క. క్షమియింపుము నాయపచా, రము నని ప్రార్థించి తచ్ఛరమునకు స్వస్వ
ర్గముఁ జూపి లక్ష్యముగ స్వా, స్త్రము లెల్ల నొసంగి తపము సలుపఁగ నేఁగెన్. 2912

సీ. అంతట దశరథుం డానందమున నయో, ధ్యకుఁ జేరి సకలబాంధవులతోడ
స్వతనూజులకు రత్నసౌధంబుల నొసంగి, నివసింప స్వస్వపత్నీయుతముగ
బహుమానము లొనర్చి బాంధవప్రతతికిఁ, బనుపంగ వా రెల్లఁ జనిరి వేడ్క
నది మొదలుగ ద్వాదశాబ్దముల్ దశరథ, తనయులు స్వస్వకాంతలను గూడి

గీ. యనుభవించిరి సకలసౌఖ్యముల నంత, దశరథుం డొక్కదినమునఁ దలఁచి రామ
చంద్రునకు యౌవరాజ్య మొసంగఁ జాటఁ, బనిచె భటులను నిజరాష్ట్రజనుల కెల్ల.

సీ. అది విని కైకేయి యతిశీఘ్రముగ వచ్చి, దశరథమేదినీధవునికడకు
దేవ పూర్వము నాకు నీ విచ్చెద న టన్న, వరముల కిప్పుడు తరుణ మొదవె

నాఁడె తప్పనివాఁడ మాఁటచే నిచ్చెద, వన్నధైర్యమున నిన్నడుగు చుంటి
రాఘవునకుఁ జతుర్దశవర్షములదాఁక, నడవిలో నివసింప నాజ్ఞ యిచ్చి
గీ. యౌవరాజ్యంబునను నిల్పు మంతవఱకు, భరతుని నటంచుఁ గోర విభ్రాంతి నొంది
దశరథుఁడు సత్యబద్ధుఁ డై తప్పకునికి, నానతిచ్చెను రామున కడవి కేఁగ. 2914
గీ. అంతటను రాఘవుఁడు రావణాదిదైత్య, వధనిమిత్తము పితృవచోవ్యాజమునను
బయలుదేఱుచు నడవికి బయలుదేఱె, రవనిజయు లక్ష్మణుండును నతనివెంట. 2915
సీ. అపుడు సీతాలక్ష్మణాన్వితంబుగ దాశ, రథి చని యొక్కయరణ్యమునకు
నచ్చటఁ జిత్రకూటాద్రిపై నివసించి, యుండంగ నంత నయోధ్యలోన
రామవియోగదుఃఖామయగ్రస్తుఁ డై, తనువును విడువంగ దశరథుండు
భరతుండు రాజ్యంబుఁ బాలింప నొల్లక, భ్రాతృవియోగార్త్యుపేతుఁ డగుచు
గీ. నడవి కేతెంచి రామునియడుగులందు, వ్రాలి కన్నీటఁ దత్పాదవనజములను
గడిగి రాజ్యంబు నర్పింపఁ గైకొనంగ, సమ్మతింపక రాముఁ డాసమయమందు. 2916
క. భరతునకు స్వపాదుకలను, గరుణించి యొసంగ నతఁడు గైకొని వానిన్
మరల నయోధ్యాపురమున, కరుదెంచి నిజాగ్రజాజ్ఞ యవిలంఘ్యము గాన్. 2917
గీ. రామపాదుకలం దుంచి రాజ్యభరము, దాల్చి మునివేషమును భక్తి దార్కొనంగ
ననుదినముఁ జేయుచును బాదుకార్చనంబు, ప్రజల నేలంగఁ దొడఁగెను భటుఁడువోలె.
వ. అది మొదలుకొని పౌరజనులును భరతునితెఱంగున నియతవ్రతముం బూని రామా
గమనముం గోరుచు రామనామసంకీర్తనంబులు గావింపం దొడంగిరి. 2919
సీ. అది యటుండ నరణ్యమందు రాఘవుఁ డొక్క, తఱిని మందాకినీతటమునందు
శయనించి యుండంగ జనకజాంకంబునఁ, గని యింద్రసుతుఁ డైన దనుజుఁ డొకఁడు
జానకీసౌందర్యసమ్మోహితాత్ముఁ డై, కాకరూపమున నక్కడకుఁ బోయి
సంచరించుచును దత్సవిధమం దెగసి ఱె, వ్వనఁ జీల్చె మైథిలీస్తనము గోళ్ళ
గీ. నది గనుంగొని రాఘవుం డాగ్రహమునఁ, గుశను మంత్రించి విడువ నాకుశ భయంక
రముగ బ్రహ్మాస్త్ర మై కడుఁ బ్రజ్వరిలుచుఁ, గాకివెంటను బడఁగ నక్కాకి యడలి.
ఆ. తిరిగి తిరిగి సర్వదేశంబులును సర్వ, భువనములును దన్నుఁ బ్రోవఁగలుగు
నట్టివారు లేమి నం దెందునుం గూడ, రామపదములందె వ్రాలెఁ దుదకు. 2921
సీ. అపుడు జానకి కరుణాయత్తచిత్త యై, కావుము నాథ యీకాకి ననుచుఁ
బ్రార్థింపఁగఁ గృపార్ద్రభావుఁ డై రాముఁడు, బ్రదుకుము పొమ్మని వదలె దాని
నవల నావాయసం బవనిజాశ్రీరామ, చరణంబులకు మ్రొక్కి చనియె దివికి
రాఘవుం డంత భరద్వాజముఖతపో, ధనజనకృతసమర్చనల నొంది
గీ. యరిగి యత్ర్యాశ్రమమునకు నచట నొక్క, దినము వసియించి యత్రిపూజను గ్రహించి
తదనుమతి గొని పిమ్మటఁ దాపసౌఘ, పూర్ణ మగు దండకారణ్యమునకుఁ జేరె. 2922

గీ. పారికాంక్షుల కచట నుపద్రవంబు, సలిపెడివిరాధుడై త్ముని సంహరించి
క్రమముగను శరభంగాశ్రమమును జేరి, దర్శనం బీయ శరభంగతాపసునకు. 2923
క. శరభంగమౌని రాముని, దరిసెన మొనరించి దాన ధన్యుం డై స
త్వరముగ బ్రహ్మపురంబున, కరిగె మునులు చూచు చుండ నాశ్చర్యముగన్. 2924
వ. అంతట రామచంద్రుండు సుతీక్ష్ణాశ్రమంబునకును నగస్త్యాశ్రమంబునకును నగస్త్యభ్రా
త్రాశ్రమంబునకును నరిగి తత్తన్మహర్షి పూజితుం డై పంచవటికిం జేరి యందు దుష్ట
రాక్షసశిక్షణంబును మునిజనపరిరక్షణంబును గావించుచు సీతాలక్ష్మణులతోడం
ద్రయోదశాబ్దంబులు సుఖంబుగాం గడపె. 2925
గీ. అప్పు డచటికి లోకభయంకరముగ, రావణస్వస యైనశూర్పణఖ వచ్చి
మారశతకోటిసుందరాకారుం డైన, రాఘవునిం జూచి సంజాతరాగ యగుచు. 2926
ఉ. ఎవ్వం డవీవు భీతహరిణేక్షణ యెవ్వతె యీపె ధన్వి వీం
డెవ్వఁడు మీరు వచ్చుటకు నిచ్చటి కేమి కతంబు చెప్పుమా
యుర్విళులూడు చున్నయది యుల్లము నాకు వినంగ నావుడున్
నవ్వుచు రాముం డుత్తరము న్యాయ్యముగా వచియించి యాంపెకున్. 2927
గీ. అతివ నీ వెవ్వతెవొ యిట కరుగుదేర, నేమి హేతువొ యిపుడు నీ వేమి చేయ
నున్నదానవొ వచియింపు మున్నయట్టి, వాస్తవంబును విన నాకు వాంఛ గలిగె.
చ. అనవుడు నాపె యి ట్లనియె నాస్యమునన్ జిఱునవ్వు గుల్కఁగన్
మనసిజరూప శూర్పణఖ నాయభిధానము నేను విశ్రవ
స్తనయను రావణాసురవతంసముచెల్లెల దండకాననం
బున కధినేత్రి నామది విమోహిత మయ్యెను నిన్నుం గాంచుటన్. 2929
ఉ. ఈతనుగాత్రి నీకుం దగ దింతిగ నుండఁగ దీని మ్రింగి నీ
చేతము పారవశ్యమును జెందఁగం జిత్తజకేళిం దేల్చెదన్
జూతువుగాక యిప్పు డని క్షోణిజపైం బడఁబోవ రాముం డా
ఘాతుకురాలిఘ్రాణమును గర్ణములున్ దెగఁగోసెం గత్తిచేన్. 2930
క. అంతటను శూర్పణఖ ది, గ్దంతులు కంపంబు నొందఁగను నేడ్చుచు న
త్యంతజవంబునం జని తదు, దంతము నెఱిఁగించె ఖరనిశాటాగ్రణికిన్. 2931
సీ. అది విని ఖరుఁడు మహోగ్రహోదగ్రుఁడై, సకలదానవసైన్యసహితముగను
దూషణత్రిశిరులు తోడుగాం బయన మై, రామునికడకు శీఘ్రముగ వచ్చి
నాల్గుదిక్కులను సైన్యముం బన్ని రాముని, భూరిసాయకవర్ష మునను ముంచె
నంత రాఘవుఁడు కాలాగ్నితుల్యము లైన, శరములు సంధించి చాపమందు
గీ. సులభముగ రాక్షసుల నెల్లం బిలుకుమార్చి, దండకారణ్యమును నిరాతంకముగను
జలిపి నిర్విఘ్నముగం దాపసులతపంబు, లొప్పుచు సుఖంబుగా నట నుండె నంత.

సీ. రావణాసురుఁడు శూర్పణఖాపరాభవం, బును ఖరాద్యసురనిర్మూలనమును
నాలించి క్రోధతామ్రాక్షుఁడై మారీచ, సహితంబుగను జనస్థానమునకుఁ
జనుదెంచి రామలక్ష్మణుల మారీచుఁడు, మృగరూపమునను దూరీకరింప
నదె సమయం బని యవనిజాతను గొని, పోవుచు నుండంగఁ ద్రోవలోన
గీ. రామసౌహార్దమున సంగరంబు సేయఁ, జొచ్చిన జటాయువును దుష్టదూలఁ గొట్టి
యరిగి లంక నశోకవనాంతరమున, నునిచి జనకాత్మజను గృహంబునకుఁ జేరె. 2933
సీ. అంతట మృగరూపుఁడై నమారీచునిఁ, జంపి రాఘవుఁడు స్వస్థానమునకుఁ
జనుదెంచి జానకి కనఁబడమిని నందు, పిలపించుచును దిక్కు దెలియనట్లు
వెదకుచు సీతను విపినంబునం దెల్ల, సౌమిత్రితోడనుఁ జనుచుఁ జనుచు
నొక్కచోటను గొనయూపిరితో జటా, యువు నేలపైఁ బడియుండఁ జూచి
గీ. కనికరంబునఁ దత్సమక్షమున కరిగి
యడుగ నాతనిగాథను నతఁడు సుగ్ర
హముగఁ దనగాథ యెఱిఁగించి యవనిజాత
గాథయు వచించి బాధచేఁ గాయ ముడిగె. 2934
సీ. అంతట రాఘవుం డాగృధ్రమున కంత్య, సంస్కార మొనరించి శాస్త్రవిధిని
బరమపదంబును బ్రాపింపఁగాఁజేసి, తరువాత మాల్యవద్గిరికిఁ జేరి
తచ్ఛైలమందు మాతంగాశ్రమంబున, ఫలము లీయఁగ మహాభక్తి శబరి
యవి భుజించి యొసంగి యామెకు మోక్షంబుఁ, బదపడి చేరి పంపాసరస్సు
గీ. క్రూరతమునిఁ గబంధునిఁ గూల్చి యచట, నవల గోదావరికిఁ జేరి యమ్మ గంగ
యవనిజను జూచితివె యని యడిగి యామె, తమముచే నూరకున్నఁ గ్రోధవశుఁ డగుచు
గీ. శాపము నొసంగుటయు రక్తసలిల గాఁగ, గంగ వడఁకుచుఁ జనుదెంచి కాళ్ల మీఁదఁ
బడుటయును రాముఁడు కృపార్ద్రభావుఁడగుచు, నాయమనుఁ లేవ నెత్తి స్వహస్తములను
వ. శార్ఙ్గకోటిచే గోదావరియందు శబరీస్నానస్థలంబున గంగాగయాసమంబును భాగవత తీర్థోదరంబును నగుశబరీతీర్థంబు నేర్పఱిచి యేతత్పుణ్యతీర్థతోయసంగంబున నీకు మచ్ఛాపవిముక్తి యగు నని యనుగ్రహించి యటనుండి ఋశ్యమూకపర్వతంబునకుం జని యచటఁ బంపాసరస్తీరంబున హనూమత్సందేశంబుచే సుగ్రీవస్నేహంబు గావించి తత్ప్రార్థనంబున వానరేశ్వరుం డగువాలిని వధించి కిష్కింధాపురరాజ్యంబునకు సుగ్రీవునిఁ బట్టాభిషిక్తునిం జేసె. 2937
సీ. అంతట సుగ్రీవుఁ డవనిజాక్షేమంబు, నరయంగ నెంచి వానరుల నెల్లఁ
బనుపంగ వారిలోఁ బవమానసూనుఁడు, వాయువేగంబున వార్ధిఁ దాఁటి
లంకిణి నుఱుమాడి లంకాపురముఁ జొచ్చి, భూమిజ కెఱిఁగించి రామవార్త
వనమును భంజించి వనపాలురను బంచ, సైన్యనేతల సప్తసచివసుతుల

గీ. రావణతనూజు నొకని మారణ మొనర్చి, తోరణస్తంభమును గూల్చి తోయజోద్భ
వాస్త్రమున బద్ధుఁడై రావణాంతికమున, కరిగి బోధించి సుఖమార్గ మసురపతికి.

గీ. కాల్చి నిజవాలవహ్ని లంకాపురంబు, జానకీదత్త మగునభిజ్ఞాన మొంది
మరల వార్ధిని దాఁటి దాశరథికడకు, వచ్చి జనకాత్మజాక్షేమవార్తఁ దెలిపి. 2939

క. ఇచ్చుటయు నభిజ్ఞానముఁ, జెచ్చెర రాఘవుఁడు ప్లవగసేనాయుతుఁడై
వచ్చి మహోదధితటమున, కచ్చట సైన్యమును నిలిపె నంబుధి దాఁటన్. 2)40

సీ. అప్పుడు హరిభక్తుఁ డగువిభీషణుఁడు ని, జాగ్రజుం డగురావణాసురునకు
నిర్భయంబుగఁ జెప్పి నీతివాక్యంబుల, నవమానితుం డయి యతనిచేతఁ
ద్యజియించి భార్యాసుతాదుల రాఘవ, చరణాంబుజంబుల శరణువేఁడ
శరణుచొచ్చినయెడ నరినైనఁ బ్రోచువాఁ, డగుట రాముఁడు వాని కభయ మొసఁగి

గీ. యసురరాజ్యాభిషేకంబు నపుడె చేసి, పదపడి పయోనిధిని నొక్కబాణమునను
శోషిలఁగఁజేసి శరణుచొచ్చుటయు జలధి, జలము పూరించి వారుణాస్త్రమున మరల.

సీ. నలునిచే సేతువు జలధికిఁ గట్టించి, యవలీలగను దాఁటి యంబునిధిని
గపిసేనతోడ లంకను జొచ్చి రాక్షస, వ్యూహంబు నెల్లను నుక్కడంచె
నింద్రజి యపుడు విజృంభించి రామల, క్ష్మణులను నాగపాశములచేత
బంధింప నేతెంచి పతగనాథుఁడు వాని, ఛిన్నభిన్నము చేసి చెదరఁగొట్టె

గీ. నంతటను వానరులకును నసురులకును, ఘోరసంగ్రామ మగుటయుఁ గుంభకర్ణుఁ
డరుగుదెంచి మహాబలుఁ డగుట రామ, లక్ష్మణులమీఁద వాఁడికోలలను వైచె.

ఉ. అప్పుడు రాముఁ డెంతయును నాగ్రహ మేర్పడఁ గుంభకర్ణునిన్
నిప్పులఁ జిమ్ముబాణముల నిర్గతవీర్యునిఁ జేయ నేలపై
గుప్పునఁ గూలె వాఁడు గిరి కూలినయట్లది గాంచి యింద్రజి
త్తుప్పర మంటఁగాఁ బెరిగి యుగ్రుఁడువోలె భయంకరాకృతిన్. 2943

క. విడువఁగ బ్రహ్మాస్త్రంబును, గడగడ వడఁకుచును గూలెఁ గపిబల మెల్లన్
బుడమిపయి నంత నీఁదర, కొడుకు వెడలి ద్రోణగిరిని గొనితెచ్చి వడిన్. 2944

గీ. ప్రధనభూమిని నిలుప నప్పర్వతమునఁ, గ్రాలు చుండినసంజీవకరణిగాలి
సోఁక నిశ్చేష్టముగ రణక్షోణిపైనిఁ, బడినకపు లెల్ల మేల్కాంన్నపగిది లేచి. 2945

చ. దనుజబలంబుతోడఁ బ్రవిదారణముం బొనరించు చుండఁగాఁ
గనుఁగొని రావణాత్మజుఁడు గాల్ప దొడంగె నిశాతబాణవ
హ్నిని గపిసేనఁ గాంచి యది యెల్లను లక్ష్మణుఁ డంతకాలరు
ద్రునిపగిదిన్ జెలంగి యొకరోపమునన్ దెగటార్చె నింద్రజిన్. 2946

సీ. అంతట రావణుం డాత్మజనిధనంబు, నాలించి రోషతామ్రాక్షుఁ డగుచుఁ
జతురంగసైన్యసంయుతముగా యుద్ధరం, గమున కేతెంచి లక్ష్మణునిమీఁద

శక్తి నై చుటయు లక్ష్మణుఁడు తదాహతి, కోర్వకే మూర్ఛిల్లి యుర్విఁ గూలె
నపుడు రాఘవుఁడు కోపారుణనయనుఁ డై, కాలదండోపమకాండములను
గీ. నాశ మొనరించి దైత్యసైన్యంబు నెల్ల, రావణుని ముంప విశిఖవర్షమున వాఁడు
విదళితశరీరుఁ డై రామవిశిఖహతిని, బఱచె నిజమందిరమునకుఁ బిఱికివోలె. 2947
గీ. అపుడు వాయుసుతుండు ద్రోణాచలమును, మరలఁ గొనివచ్చి సంగరమహిని నిలుపఁ
దద్గతౌషధివాయువు దాఁకి లబ్ధ, సంజ్ఞుఁ డై లక్ష్మణుండు తత్క్షణమ లేచె. 2948
క. అది చూచి రామచంద్రుఁడు, ముద మొందుచునుండఁ గపిసమూహం బెల్లన్
గదనక్షితి మార్మ్రోఁగఁగఁ, జద లంటఁగఁ జలుపఁ దొడఁగె జయనాదములన్.
సీ. అంత దశగ్రీవుఁ డరిమారణంబున, కై రహస్యస్థలమందుఁ జేరి
యాభిచారికహోమ మాచరించుచు నుండ, నది వానరు లెఱింగి యచటి కేఁగి
కావింప హోమభంగంబును బౌలస్త్యుఁ, డపరిమితక్రోధ మావహిల్ల
దివ్యరథంబు నధిష్ఠించి బహుదైత్య, సేనతోడను రణక్షితికి వచ్చె
గీ. నపుడు త్రిదివంబునుండి హర్యశ్వయుక్త, దివ్యరథమును మాతలి దెచ్చి యొసఁగ
రాఘవుఁడు దానిపై నెక్కి రణ మొనర్పఁ, జొచ్చె డీకొని రావణాసురునితోడ.
ఆ. రామరావణులకు రణ మయ్యె నప్పుడు, విస్మయంబుఁ జెంద విశ్వ మెల్ల
నేమి చెప్ప నింక రామరావణయుద్ధ, మొకఁడె సాటి దాని కొండు లేదు. 2951
సీ. ఖండించు చుండ రాఘవుఁ డద్భుతంబుగా, వాఁడి కోలలను రావణునితలలు
మొటనె మరల నావిర్భవించుచు నుండఁ, దన్మస్తకంబు లత్యద్భుతముగ
నెల్లలోకంబులు తల్లడిల్లుచు నుండ, నే డహోరాత్రంబు లేఁగుటయును
రాముఁ డుపేక్షింపరా దింక నీపాపి, నని యెంచి మదిని నత్యాగ్రహమున
గీ. నేసె బ్రహ్మాస్త్రమును గుఱిచేసి వాని, వక్షమును నది చివ్వున నాక్షణంబ
యరిగి తద్వక్షమును జీల్చి నాశ లదర, నవనిపైఁ గూలి రావణుం డసువు లుడిగె.
సీ. అంతట బ్రహ్మాస్త్ర మవనిని భేదించు, కొని పోయి పాతాళమునకు నచట
భుజగాధిపతిచేతఁ బూజితం బయి వచ్చి, జవమునఁ జేరె రాఘవుని కేల
నాకాశముననుండి యపు డద్భుతంబుగాఁ, గురిసె రామునిపైనిఁ గుసుమవృష్టి
సలిపిరి వానరుల్ జయనినాదములను, దిక్కు లన్నియుఁ గూడఁ బిక్కటిల్ల
గీ. సంగరశ్రమ మెడలంగ సౌరభమును, జల్లుచును వీవఁ దొడఁగెను జల్లగాలి
యంతట విభీషణునకు లంకాధిపత్య, మిచ్చి రాఘవుఁ డతనితో నిట్టు లనియె. 2953
చ. దనుజవరేణ్య నాకథయు ధాత్రియు భాస్కరుఁడున్ హిమాంశుఁడున్
దనరెడునంతకాలమును ధర్మము దాఁటక రాజ్య మేలుచున్
దనయులఁ బౌత్రులం బడసి తత్కుల మభ్యుదితంబు గాఁ దుదిన్
గొనెదవుగాక యోగులకుఁ గూడ లభింపనివిష్ణుధామమున్. 2954

ఆ. అని యనుగ్రహించి యవనిజను గ్రహింప, సంశయించు చున్నసమయమందు
నజముఖాదితేయు లరుదెంచి రాముని, యెదుట మ్రొక్కి నిలిచి యిట్టు లనిరి.

సీ. రాఘవ నీవు నారాయణుండవు పర, బ్రహ్మమూర్తివి జగత్పాలకుండవు
భువనహితార్థంబు పుడమిపై నవతరిం, చినమహాలక్ష్మి యీజనకజాత
రావణ కుంభకర్ణనిశాచరేంద్రులు, త్వద్ద్వారపాలకుల్ ధాత్రిమీఁద
సనకాదిమునిశాపమున జనించిరి వారి, నుద్ధరింపఁగ నీమె బద్ధ యయ్యె

గీ. నాకతంబున నీ వానిశాటవిభులఁ, జంపుటయుఁ జచ్చి వారలు స్వర్గమునకుఁ
బోవుటయును దటస్థించె దేవదేవ, జానకిని గైకొనుము నిర్విశంకముగను. 2956

గీ. అని వచించుచు నుండంగ ననలశుద్ధ, యైనసీతను గొనివచ్చి హవ్యవహుఁడు
రామ పూతచరిత్ర యీభూమిజాత, కైకొనుము నాఁగ నామె రాఘవుఁడు గొనియె.

సీ. అంతట సంగ్రామహతు లైనకపు లెల్ల, బ్రహ్మవరంబున బ్రదికి లేవఁ
గపిసేన నెల్లను గనుఁగొని రాముఁ డ, త్యంతహర్షము నొంది యాత్మలోనఁ
బుష్పకంబున నెక్కి భూమిజతోడ ల, క్ష్మణునితోడను విభీషణునితోడఁ
బ్లవగభల్లూకదానవబలంబులతోడఁ, బయన మై సుర లెల్లఁ బ్రస్తుతింప

గీ. మరల వచ్చి భరద్వాజమౌనియాశ్ర, మంబునకుఁ దత్కృతోపచారంబుఁ బడసి
హనుమవలనను భరతవర్తనము నెఱిఁగి, మొదటఁ జేరె నందిగ్రామమునకు నంత.

సీ. అరుదెంచి యెదురుగా భరతుండు పురజన, సచివపురోహితసహితముగను
రామచంద్రునకుఁ బ్రణామంబు గావించి, తోడ్కొనివచ్చి సంతోషమునను
నర్పించె రాజ్యంబు నఖిలలోకంబును, మునులును సురలును వినుతిసేయ
నంతట భద్రవాద్యములు మ్రోఁగుచు నుండ, రాముఁడు సపరివారంబు గాఁగ

గీ. వచ్చి సాకేతపురమును జొచ్చె నంత, దాసదాసీజనంబు లుత్సాహమునను
మంగళస్నానముల నొనర్పంగఁజేసి, వారలకుఁ గట్టఁబెట్టిరి వస్త్రములను. 2959

సీ. అపు డొకశుభలగ్నమందు నానారత్న, మండితమాణిక్యమండపమున
హేమభద్రాసనమం దుపవిష్టునిఁ, జేసి దాశరథిని సీతతోడ
వామదేవుండు పర్వతుఁడు నారదుఁడు మా, ర్కండేయమౌద్గల్యకశ్యపులును
జాబాలియు వసిష్ఠసంయమియును నను, నష్టమహర్షు లత్యద్భుతముగఁ

ఆ. బుణ్యతీర్థతోయపూర్ణసువర్ణకుం, భములతోడ వేదమంత్రఘోష
మావరింప దెసల నభిషేక మొనరించి, రఖిలజనులుఁ జూచి హర్ష మొంద. 2960

సీ. ఛత్రచామరములు సౌమిత్రి వహియింప, భరతశత్రుఘ్నులు పార్శ్వములను
దాళవృంతంబులఁ దాల్చి వీచుచు నుండఁ, బవనసుతుండు దీపమును బట్టఁ
గపినాయకుఁడు పూర్ణకలశంబుఁ దాల్పఁ జూ, పింప దర్పణము విభీషణుండు
పుష్పమాలను గంఠమున జాంబవంతుఁడు, వైవ సుషేణుండు ధ్వజము నూనఁ

గీ. దమ్ము్రలంబును వాలినందనుఁ డొసంగ, నఖిలభూపతులును నుపాయనము లీయఁ
బ్లవగదానవబలములు బలిసికొలువ, రాజిలెఁ బురందరుఁడువోలె రాఘవుండు.

గీ. అఖిలమునిజనవేష్టితుఁ డై వెలింగె
రామచంద్రుఁ డయోధ్యాపురంబునందు
నక్షయసనాతనపదంబునందు నిత్య
ముక్తపరివృతుఁ డగువిష్ణుమూర్తివోలె. 2962

ఆ. సమితిలో జయంతసౌరాష్ట్రిరాష్ట్రివ, ర్ధనసుమంత్రవిజయధర్మపాల
సృష్ట్యకోపు లనెడియెనమండ్రు మంత్రులు, గొలువ రాఘవుండు కొమరుమిగిలె.

సీ. అప్పుడు నేను లో నాఁగక పొరలెడి, హర్షంబు ప్రేరేప నవశముగను
విశ్వరూపంబున వెలిఁగెడిరాముని, ముంగలఁ జేతులు మోడ్చి నిలిచి
సృష్టిస్థితిక్షయహేతవే నిర్గతో, పాధిరూపాయ నారాయణాయ
విశ్వస్వరూపాయ విష్ణవే సచ్చిదా, నందాత్మనే జగన్నాయకాయ

గీ. బ్రహ్మణే శాశ్వతాయ రుద్రాయ సర్వ
సాక్షిణే వేదవేద్యాయ సాత్త్వికాయ
సాధురక్షణదుష్టశిక్షణపరాయ
భానుకులభూషణాయ తుభ్యం నమోఽస్తు. 2964

ఆ. అని నమస్కరించి హర్షమంతంతకు, హెచ్చు గాఁగఁ బులక లెసఁగ మేన
నిట్టు లంటి రామ యీవు పంకేరుహా, లోచనుఁడవు సీత లోకమాత. 2965

సీ. సావిత్రి జానకి నీవు విధాతవు, శ్రీకంఠుఁడవు నీవు సీత గౌరి
శతమన్యుఁడవు నీవు జనకజ పౌలోమి, వైశ్వానరుఁడ వీవు స్వాహా సీత
యముఁడవు నీవు సంహారదేవత సీత, రోహిణి సీత చంద్రుఁడవు నీవు
వైదేహి సంజ్ఞ దివాకరుండవు నీవు, పవలు నీవు త్రియామ యవనిజాత

గీ. యింక బహుళోక్తులు వచింప నేల దేవ, ముజ్జగంబులలోన స్త్రీమూర్తి యెల్ల
ధరణిజయె పుంస్వరూప మంతయును నీవె, యెంతవారము మీతత్త్వ మెఱుఁగ మేము.

క. ఎపుడును నీతారకమును, జపియించుచు నుందు నేను శర్వాణియు నె
ల్లపుడును నీనామంబును, జపియించుచు నుండు మోక్షసాధన మగుటన్. 2967

క. అందుననె లోకపూజ్యతఁ. జెందంగలిగితిమి మేము చేసితె యుష్మ
త్సందర్శనలబ్ధమహా, నందంబును నాకు నేఁడు నళినదళాక్షా. 2968

క. వారాణసిలో బ్రమండెడి, వారలకున్ బ్రాణములను వదలెడితఱి నీ
తారకమంత్రమును భవో, ద్ధారకముగ నుడువుయోగ్యతయు నా కొదవెన్. 2969

క. అని నేను బహువిధంబుల, వినుతించుచు నుండఁ జూచి విశ్వాత్ముం డై
కనఁబడురాముని భయమున, వనజాసనముఖ్యు లెల్ల వణఁకుచు నుండన్. 1970

సీ. అపుడు రాఘవుఁడు మాయామానుషాకార, మును దాల్చి మరలను బూర్వమట్ల
కానంగఁబడుచు నేత్రానందకరముగా, బ్రహ్మాదిదేవవర్గంబునకును
మునులకుఁ గపులకు జనపతులకు దాన, వులకును నర్హ్వపూజల నొనర్ప
వారు సంతుష్టులై స్వస్వధామంబుల, కరిగిరి పడసి రామానుమతిని
గీ. నంతటను రాముఁ డవనిజాకాంతతోడ, ననుభవించుచు భోగంబు లవని నెల్ల
నేలుకొను చుండఁ గడచె వే యేండ్లు సీత, గర్భవతియును నయ్యె నాకాలమందు.
సీ. దనుజునియింట నుండినజానకిని రామ, చంద్రుఁడు గొనివచ్చి సాహసమునఁ
దనయింటిలో నుంచికొనె నన్నయపవాద, ముద్భవింపంగ నయోధ్యలోన
మానుషధర్మంబు గానంగఁబడ రాముఁ, డవనిపుత్రిక నరణ్యమున కనిచె
నంతట వాల్మీకియాశ్రమంబున సీత, కుశలవు లనుకొడుకులను గాంచె
గీ. రఘుకులేశుండు బ్రహ్మచర్యవ్రతంబుఁ, బూని విశ్వంభరాచక్రమును సమస్త
జనులు గీర్తింపఁగా నేలసాగె రాజ, ధానియైనయయోధ్యలోఁ దా వసించి. 2972
వ. అంతట శత్రుఘ్నుండు లవణాసురసంహారంబు గావించి యిరువురుపుత్రులం బడసి దేవనిర్మితం బగుమధురాపురంబుం బాలింపం దొడంగె. భరతుండు గంధర్వులను వధించి సింధూభయపార్శ్వంబులందుఁ దనకుమారుల నిరువురను బ్రభువులుగా స్థాపించె. లక్ష్మణుండు మద్రులను వధించి మద్రదేశంబునకుఁ దనపుత్రుల నిరువురను నధిపతులం గావించి తాను సాకేతంబున రామపాదారవిందసన్నిధానంబున నివసించె.
సీ. అపుడు రాఘవుఁడు ధర్మాతిక్రమంబుచే, తను దపియించుశూద్రుని వధించి
మరణించినట్టిబ్రాహ్మణతనూభవుని జీ, వింపఁజేసి యశేషవిబుధు లెన్న
నైమిషారణ్యంబునను గౌతమీతీర, మందు మహర్షిసమక్షమందుఁ
గావించికొని స్వర్ణకల్పితం బైనసీ, తామహాదేవిని ధర్మసతిగ
గీ. నయుతహయమేధవాజపేయాయుతముల, విశ్వజిద్యాగగోమేధవివిధసప్త
తంతువులఁ జేసి సంపూర్ణదక్షిణలను, సర్వజనుల సమ్మానించుసమయమందు.
సీ. వాల్మీకి తోడ్కొనివచ్చి సీతను గుశ, లవులను రామునిసవిధమునకు
రామచంద్ర వసుంధరాపుత్రి శ్రీదేవి, భవదేకమానస పరమసాధ్వి
కైకొను మీజగత్కల్యాణదాత్రినిఁ, బూతచరిత్రను బుత్రవతిని
ననవుడు రాముఁ డిట్లనియె మహాభాగ, నీవు చెప్పినమాట నిక్కవంబ
గీ. కాని లోకాపవాద మీఁగంగ నేఁడు, పృథ్వీసుత ప్రత్యయము చూపె నేని సకల
జనయుతం బగునీమహాసమితిలోన, గ్రాహ్య యగు లేనియెడలను గ్రాహ్య గాదు.
క. అని పల్కుటయును జానకి, విని రామునివాక్యములను విశదముగ మహా
జను లెల్లఁ జూచు చుండఁగ, వినమితముఖి యగుచు నిట్లు వేఁడె ధరిత్రిన్. 2976
గీ. తల్లి భూదేవి రామునిఁ దక్క నొరునిఁ, దలఁపులో నేని యెపు డేని తలఁప నేని
సర్వసాక్షిణి వగునీ వఖర్వమహిమ, నిమ్ముగా నిడ్డె వివరమ్ము నిమ్ము నాకు. 2977

సీ. అని సభాసదు లెల్ల వినఁ బల్కుటయు ఖగే, శ్వరునితోఁ జనుదెంచి ధరణిదేవి
సీతను గరములచే నెత్తి తార్క్ష్యవా, హనముపై నెక్కింప నద్భుతముగఁ
గను చుండ నట నున్న జను లెల్ల దివినుండి, కురియుచు నుండంగఁ గుసుమవృష్టి
గరుడి ఱివ్వున నేఁగె గగనమార్గమునుండి, క్షోణిజతోడ వైకుంఠమునకు
గీ. నంత రాముఁడు దుఃఖితస్వాంతుఁ డగుచుఁ, దనయులను గొని సాకేతమునకుఁ జేరి
యేలు చుండంగ నిలఁ గొంతకాలమునకుఁ, జనిరి దశరథపత్నులు స్వర్గమునకు.
ఆ. అవలఁ గొంతకాల మరుగంగఁ దాపసా, కారమునను వచ్చి కాలుఁ డొక్క-
దినమునందు రాఘవునిఁ గాంచి దీవించి, యిట్టు లనియె స్నేహ ముట్టిపడఁగ. 2979
సీ. రాఘవ ననుఁ బంప బ్రహ్మ నీయొద్దకు, వచ్చితి నొకగోప్యవార్తఁ దెలుప
నెవఁడును రాఁగూడ దిటకు నే నున్నంత, వఱకు వచ్చినఁ జంపవలయు వాని
ననుడు రాఘవుఁ డట్లె యని నియోగించి ల, క్ష్మణుని ద్వారాభిరక్షణము సేయ
నావార్త నాలింప నభిముఖుం డై యుండ, గాలుఁ డి ట్లనియె రాఘవునిఁ గాంచి
గీ. రామ పదొకొండువేలేండ్లు రాజ్య మేల, నసురసంహార మొనరింప నవనియందు
నవతరించితి వాకార్య మయ్యె నింక, బయలుదేఱుము వైకుంఠభవనమునకు. 2980
ఆ. అని వచించు చుండ నంతలో దుర్వాసుఁ, డరుగుదెంచి ద్వారమందు నిలిచి
ద్వాస్థ రామచంద్రదర్శన మొనరించు, వాంఛతోడ నేను వచ్చినాఁడ. 2981
క. అని పల్కుటయును దుర్వా, సున కప్పుడు రాఘవానుజుఁడు మ్రొక్కి భయం
బెనయ మది రామదర్శన, మున కిది సమయంబు గాదు మునివర యనియెన్.
సీ. అంతట దుర్వాసుఁ డాగ్రహావిష్టుఁ డై, దర్శింప నీకున్న దాశరథిని
శపియించువాఁడ ని న్నిపుడె నా లక్ష్మణుం, డరిగి యన్నకుఁ దెల్పె నతనిరాక
వీక్షించి వాని నదృశ్యుఁ డయ్యెఁ గృతాంతుఁ, డపుడు రాముఁడు మౌని నాదరింప
నానందభరితుఁ డై యరిగె దుర్వాసుండు, సౌమిత్రి రామునిశపథ మెఱిఁగి
ఆ. సత్వరముగ నరిగి సరయూమహానదీ, తీర్థమందు మనుజదేహ ముడిగి
తాల్చి నిజఫణీంద్రతనువు విమానంబు, నెక్కి స్వపదమునకు నేఁగె నంత. 2983
సీ. తమ్ముఁడు చనినయుదంతంబు నిజకర్ణ, తాడితం బగుటయుఁ దత్క్షణంబ
స్వపదంబునకు రామచంద్రుఁ డేఁగఁ దలంచి, కుశవతీపురమును గుశున కొసఁగి
లవున కొసంగి ద్వారవతీపురంబును, రాజధానులు గాఁగ రాజ్య మేల
నభిషేక మొనరించి యఖిలజనంబులు, సమ్మతింపఁగ నిచ్చె స్వధన మెల్ల
గీ. నపుడు తద్భావము నెఱింగి యఖిలజనులు, వచ్చి రాఘవ నీతోడ వచ్చువార
మందఱము గూడ మేము నీయట్టిప్రభుని, విడిచి బ్రతుకంగఁజాలము పుడమిలోన.
వ. అని వేడుటయు రామచంద్రుండు తదభ్యర్థనంబు నంగీకరించి విభీషణునకు శార్ఙ్గం
బును నిక్ష్వాకుకులదైవతం బగు శ్రీరంగశాయిమూర్తిని నొసంగి హనుమంతునకు

రామాయణగాథ లోకమం దుండునంతవఱకును భూమండలంబున వసించి యంతం
బున నిజపరమపదముం జెందునట్లు వరంబుఁ బ్రసాదించి ద్వాపరయుగంబున భూభార
నివారణార్థంబు యాదవవంశంబునఁ దుదయించి నీతోడ సంగ్రామంబు గావించి
నిన్ను ధన్యుని జేయుదు నని జాంబవంతునకుం జెప్పి తాను శుక్లాంబరధరుం డై
కుశలు హస్తంబులందు ధరించి రమాధరణీసమేతంబుగా బయలుదేఱె నంత. 2985

సీ. ప్రణవంబు వేదశాస్త్రములు పురాణేతి, హాసాదిసకలవిద్యాగణంబు
సావిత్రియును నస్త్రశస్త్రకార్ముకమార్గ, ణములును బురుషదేహములతోడ
భరతశత్రుఘ్నులు పురజనులును మంత్రి, వర్గంబులును భృత్యవర్గములును
ఋక్షవానరపశుపక్షిగణంబులు, జంగమస్థావరసంఘ మెల్ల

గీ. బయలుదేఱంగఁ దనవెంటఁ బాయలేక, రాముఁ డఖిలసమేతుఁ డై ప్రేమమునను
నరిగి మూఁడామడలు పశ్చిమాస్య యైన, సరయువును జొచ్చె సోదరసహితముగను.

క. వనజభవుం డపుడు నభం, బుననుండి సుపర్వసహితముగ రాఘవ ధా
త్రిని విడిచి రమ్ము నీపద, మునకుం గృపతోడ శీఘ్రముగ నని వేఁడన్. 2987

సీ. రాముఁడు విడిచి మర్త్యశరీరమును స్వకీ, యం బైనవిష్ణుదేహమును దాల్చి
భరతశత్రుఘ్నులు ప్రాపింపఁగను దన్ను, నాత్మీయశంఖచక్రాకృతులను
దేవీయుగంబుతోఁ దేజరిల్లుచు దివ్య, యాప్యయానంబున నధివసించి
సరయూనదీజలస్పర్శోపగతదివ్య, కాయు లైననిజానుగతుల నెల్లఁ

గీ. దనవిమానంబు నెక్కించుకొని విముక్త, జనయుతం బైననిజధామమునకుఁ జేరె
దేవతాబృంద మెల్ల నుతించు చుండఁ, గురియుచుండంగ దివినుండి కుసుమవృష్టి.

క. ఏతద్రామచరిత్రము, శ్రోతలకును బాఠకులకు సుతధనదార
ఖ్యాతిసుఖారోగ్యములను, బాతకనాశమును బరమపదమును నొసఁగున్. 2989

వ. ఇంకఁ గృష్ణావతారచరిత్రముం జెప్పెద వినుము. 2990

సీ. దేవమీఢుం డనుభూవరుం డొకఁ డుండె, వసుధలో మును యదువంశమందు
నతనికి వసుదేవుఁ డనుసుతుం డొకఁ డుండె, హరిపదాంబుజపరాయణుఁ డతండు
వరగుణ యైనదేవకి నుగ్రసేనపు, త్రినిఁ బెండ్లియాడి యాదేవితోడ
నుగ్రసేనునితనయుం డగుకంసుండు, రథచోదకుండుగా రథము నెక్కి

గీ. రమ్యముగ మధురాపురరాజమార్గ, మందుఁ జను చుండఁ బార్శ్వములందు బంధు
వర్గ మేతేరఁ దద్రాజవైభవంబు, చూచు చుండంగఁ బ్రజ లెల్లఁ జోద్యముగను.

గీ. కంస దేవకియష్టమగర్భమునను, నీకు మరణంబు ప్రాప్తించు నిక్కముగను
ననెడిమాటలు దివినుండి వినఁబడంగఁ, గంసుఁ డది విని వెంటనె ఖడ్గ మెత్తి. 2992

సీ తనచెల్లె లగుదేవకిని నఱకంగ రా, నప్పుడు వసుదేవుఁ డడ్డగించి
స్యాలక నిలువుము చన దాఁడుదానిని, జంపంగ నీభోఁటిశౌర్యనిధికి

నదిగాక నీ కీమె యనుజాత యవిచార, ముగ నిట్టికార్యంబు తగునె చేయ
భయము నీ కాకాశభాషణంబున నేరు, పడినచో నీమెగర్భముల నెల్ల
గీ. సంహరింపుము పుట్టినసమయమంద, యనుచు బతిమాలఁగను గంసుఁ డాగ్రహంబు
నుడిగి చెఱసాలలో నప్పు డుంచి వారి, నిరువురను గూడ భోగ్యంబు లెల్ల నొసఁగి.
క. మునులను దేవతలను స, జ్జనులను బాధించుచును నిశాచరకోటుల్
తన కనుచరు లై యుండఁగ, ననుచితముగ నడువసాగె నతిబలుఁ డగుటన్. 2994
సీ. అంతట నొక్కనాఁ డరిగి మేదిని బ్రహ్మ, సన్నిధానమునకు సాఁగి మ్రొక్కి
పరమేష్ఠి రాక్షసబాధ నానాఁటికిఁ, బ్రబలంబు గాఁజొచ్చెఁ బ్రజల కెల్ల
సత్యశౌచంబులు సమసె లోకములోన, భరియింపఁజాలను భార మింక
నని తెల్పి యరుగుటయును సురజ్యేష్ఠుండు, సకలనిర్జరగణసహితముగను
గీ. జేరి క్షీరాబ్ధియుత్తరతీరమునకు, బహువిధంబుల శార్ఙ్గిని బ్రస్తుతింప
నంబుజాక్షుండు ప్రత్యక్ష మై విరించి, యిచ్చటికి మీర లెల్ల రా నేల చెప్పుమ.
క. అని యడుగుటయును నజుఁ డి, ట్లనియెను వనజాక్ష ధరణి యాఁగఁగ లేమిన్
దనుజులు పెట్టెడిబాధకు, వనరుచు నున్నయది నీవె వలయును బ్రోవన్. 2996
గీ. అని నివేదించుటయును జనార్దనుండు, వనజసంభవ మీ రేగవచ్చు నింక
నేను యదువంశమందు జన్మించి భార, మపనయించెద నని పల్కి యనిపి వారి.
సీ. కని నిజమాయ ని ట్లనియె మాయాదేవి, యవనితలంబున కరిగి నీవు
సరగ హిరణ్యాక్షపట్తనూభవులను, గ్రమముగా దేవకీగర్భమందుఁ
జొనిపి యనంతాంశమునఁ గల్గుదేవకీ, సప్తమగర్భంబు సమయకుండ
నసమయంబున లాగి యామెసపత్ని యై, నట్టిరోహిణిగర్భమందు నునిచి
గీ. నందగోపసతీగర్భమందుఁ జేరి, కంసభగినికి నష్టమగర్భమందు
నేను జనియించువేళను నీవు గూడ, జనన మొందుము నందునిసదనమందు. 2998
క. అటుమీఁదఁ గంసునకు ను, త్కట మగుభయ ముప్పతిల్లగాఁ జేసి మహో
ర్కటి నేఁగి వింధ్య మనియెడి, యటవికి వధియింపు మచటియసురుల నెల్లన్. 2999
వ. అని యాజ్ఞాపించుటయు మాయాదేవి తత్క్షణంబ ధరణి కరుదెంచి హిరణ్యాక్షసుత షట్కంబును గ్రమంబుగా దేవకీగర్భంబునందుఁ బ్రవేశింపంజేసి తజ్జననకాలంబునంద వారల నెల్లరను యథాక్రమంబుగఁ గంసుండు సంహరింపఁ బిదప ననంతాంశసంభూతం బగు దేవకీసప్తమగర్భంబును బలాత్కారంబున లాగి రోహిణీగర్భంబునం దుంచి తద్గర్భశిశువు పెరిఁగి భాద్రపదకృష్ణషష్ఠమీదినంబున జన్మించి మాయాసంకర్షితుం డగుటవలన సంకర్షణనామమ్ముం బడసి వర్ధిల్లుచుండఁ దాను నందగోపపత్ని యగు యశోదాదేవి గర్భముం జొచ్చె. 3000

సీ. అంతటఁ బుండరీకాక్షుండు సుముహూర్త, మందు దేవకీగర్భమందుఁ జొచ్చి
నిండంగఁ దొమ్మిదినెల లందు వసియించి, పదియవమాసంబు ప్రాప్త మగుడుఁ
బ్రభవించె నర్ధరాత్రమునందు శ్రావణ, మాసకృష్ణాష్టమీవాసరమున
వసుదేవుఁ డపుడు భాస్వత్కోటిదేదీప్య, మానవిగ్రహు మధుమథనుఁ జూచి
గీ. చేతు లొగ్గి ప్రణామంబు చేసి పులకి, తాంగుఁడై కృష్ణ ధన్యుండ నైతి నిన్నుఁ
బట్టిగను గాంచుభాగ్యంబు ప్రాప్తమగుటఁ, గన్నులారంగ నీవిష్ణుకళను గనుట. 3001
క. అని బహువిధముల సంస్తవ, మొనరించుచు నుండఁ గృష్ణుఁ డుడిగి స్వరూపం
బును మానవరూపంబునఁ, గనఁబడ వసుదేవుఁ డపుడు కని బాలకునిన్. 3002
ఆ. కంసుబారినుండి కాపాడుమార్గంబు, తోఁప కునికి నెడఁదఁ ద్రొక్కటపడ
విష్ణుమాయవలన విడిపోయెఁ దలుపులు, భటులకనులు మూఁతవడియెఁ నంత. 3003
సీ. ఆనకదుందుభి హస్తంబులం దుంచు, కొని బాలకుని గుండె కొట్టుకొనఁగ
నటు నిటుఁ జూచుచు నాఁగుచు నూర్పుల, నల్లనల్లనఁ గ్రింద నడుగు లిడుచుఁ
జోరుని తెఱఁగునఁ గారాగృహద్వార, ములను మెల్లఁగ దాఁటి వెలికి వచ్చి
కడచె నిప్పటి కొక్కగండం బని తలంచి, పురవీథిలోఁ బడి యరిగియరిగి
గీ. చేరె శీఘ్రంబుగను బురద్వారమునకుఁ
దత్కవాటంబు బాలుపదంబు తాఁకి
వివృతముగఁ దద్భటులు తమోవివశులుగను
నదియునుం దాఁటి సుఖముగా నరుగుచుండ. 3004
వ. మార్గమధ్యంబున వర్షంబు ధారాపాతంబుగాఁ గురియంజొచ్చుటయు నాగేంద్రుండు నిజఫణాసహస్రంబుచే వర్షబిందువునుం బయిం బడకుండ దేవకీనందనుని నాచ్ఛాదించి తత్కృపాపాత్రుం డయ్యె. 3005
సీ. అంతట వసుదేవుఁ డధికంబుగాఁ బాఱు, యమునలోపలఁ జొచ్చి యరుగు చుండ
నమ్మహానది ప్రవాహం బంతయును దగ్గి, తత్క్షణంబున జానుదఘ్న మయ్యె
నది చూచి వసుదేవుఁ డాశ్చర్య మొందుచు, దాఁటి కాళింది నుత్సాహమునను
యమునాతటస్థిత మైనవ్రజంబున, కరిగి నందునినికాయ్యమును జొచ్చి
గీ. మాయచేఁ దద్గృహస్థితమనుజు లెల్ల, మోహమును జెంది నిద్రలో మునిఁగియుండ
బాలుని యశోదప్రక్కలోఁ బవ్వళింపఁ, జేసి తత్కన్యకను గొని శీఘ్రముగను.
గీ. తెల్లవాఱకమున్నె యేతెంచి మధుర, కరుకమారిని దేవకీప్రక్కలోనఁ
బండుకొనఁ బెట్ట నప్పు డబ్బాల యేడ్చె, నేడ్పు విని మేలుకొని లేచి యెల్లభటులు.
గీ. చని రయంబునఁ గంసునిసవిధమునకు, దేవ నీళ్ళాడె దేవకీదేవి యనుచుఁ
దత్తఱమున నివేదింపఁ దత్క్షణంబ, కంసుఁ డేతెంచి కేల ఖడ్గమును బట్టి. 3008
సీ. దేవకీప్రక్కలోఁ దేజరిల్లుచుఁ బండు, కొనియున్న బాలను గ్రూరముగను
నొకకేలఁ గొనిపోయి యారెల్ల వడఁకంగఁ, బెట్టె మారణశిలాపృష్ఠమందు

ఖండింపఁగా నెత్తి ఖడ్గంబు నంతలో, నాబాల లేచి యత్యద్భుతముగఁ
దనకాలితో వానితలఁ దన్ని పై కేఁగి, యష్టబాహువులతో నచట నిలిచి
గీ. పండ్లు పటపటఁ గొఱుకుచుఁ బ్రళయకాల
పావకజ్వాలవలె మండిపడుచు నోరి
రాక్షసాధమ కంస నారాయణుండు
పుట్టియున్నాఁడు నినుఁ జంపఁ బుడమిలోన. 3009
క. అని చెప్పి మాయమయ్యెను, గనుఁగొనియెడివార లెల్లఁ గడు నాశ్చర్యం
బును జెంద నంతఁ గంసుఁడు, మనమున నుదయింప భయము మాత్సర్యంబుల్.
సీ. తనయాజ్ఞలో నున్నదనుజవీరుల నెల్ల, రావించి దానవప్రవరులార
క్షీరసాగరమును జేరి దేవత లెల్ల, నస్మత్ప్రభావంబు హరికిఁ జెప్ప
నతఁడు ధాత్రిని మానవాకారమునఁ బుట్టె, మనకు హాని యొనర్ప మదిని నెంచి
మీ రందఱును నింక మేదినిలో బలో, త్తరులుగా నున్నబాలురను నెల్ల
గీ. సంహరింపంగఁ బొండు స్వచ్ఛందముగను, నని నిదేశించి కారాగృహంబునుండి
దేవకీవసుదేవులఁ బోవ విడిచి, చేరెఁ దనమందిరమునకుఁ జింతతోడ. 3011
వ. అంతట వసుదేవుండు రోహిణీగర్భసంభూతుం డగుసంకర్షణునిం గైకొని వ్రజంబునకుం
జని నందగృహంబునం దున్ననిజనందనునిం గాంచి యపరిమితానందభరితమానసుం
డై యశోదం జూచి. 3012
సీ. కల్యాణి వీఁడు సంకర్షణుం డనుపేరు, గలవాఁడు నాపట్టి కంసభీతి
నిచటికిఁ గైకొని యేతెంచినాఁడ నీ, బిడ్డతోడను వీనిఁ బెంపవలయు
నని పల్కుటయు నామె యట్లె పెంచెద నని, సంకర్షణునిఁ గొనె సంతసమున
నంతట వసుదేవుఁ డాత్మశాంతి ఘటిల్లఁ, జనుదెంచి మధుర కచ్చటనె యుండి
గీ. యాత్మసుతులకు జాతకర్మాదివిధుల, నాచరింపంగ గర్గుని ననుప నాతఁ
డేఁగి ఘోషంబునకు నందునింట నున్న, రాజసుతులకు జాతకర్మంబు నేసి. 3013
వ. జ్యేష్ఠపుత్త్రునకు రౌహిణేయుం డనియు బలభద్రుం డనియు రాముఁ డనియుఁ గనిష్ఠ
సూనునకు శ్రీధరుం డనియు వాసుదేవుం డనియుఁ గృష్ణుం డనియు నామకరణంబులం
గావించి యీకుమారులు లోకంబునందు రామకృష్ణు లనుఖ్యాతిం బడయంగల రని
దీవించి నందయశోదాపూజితుం డై తిరిగి మధురాపురంబునకుం జేరె. 3014
గీ. అంతటను గొన్నినాళ్లకు నతిబలిష్ఠుఁ, డైనబాలుఁడు ఘోషమునందు నున్న
వాఁ డని యెఱింగి కంసుఁడు వానిఁ జంపఁ, బనిచెఁ బూతన యనునొకబాలహంత్రి.
క. చని యాపూతన ఘోషం, బున కొక్కనిశీథకాలమున మానవిరూ
పునఁ దనవిషలిప్తస్తన, మును బెట్టెను నోటఁ గృష్ణమూర్తికిఁ గుడువన్. 3016
ఆ. అప్పు డెఱింగి కృష్ణుఁ డాపె నాసురిగను, నవ్వి పట్టికొని స్తనంబు నోటఁ
బాలతోడఁ బీల్చెఁ బ్రాణంబులను సైత, మంత నాపె యార్చి యవనిఁ గూలె.

సీ. ఆఘోరనాదంబు నాలించి బిరబిర, వ్రజవాసు లెల్లరు వచ్చి యటకు
వీక్షించి యాక్రూరరాక్షసిఁ దదురంబు, నందు నాడుచు నున్ననందసుతుని
నాశ్చర్యపడు చుండ నపుడు తద్దృష్టిదో, షంబును భూతభయంబుఁ బాయ
మూర్ధంబు గోమయంబున మోము గోవాల, మునను యశోద మార్జనము సేసి
గీ. యెత్తికొనఁగను శౌరి నుపేంద్రనామ, ములను మార్జించె నందుఁడు మొలకనవ్వు
లొలయ ముఖమున వీక్షించు చుండ శార్ఙ్గి, యంత నొకనాఁడు కృష్ణుఁ డత్యద్భుతముగ.
క. చనుఁ డెంచి శకటరూపం, బున మీఁదం బడినయస్రపుని నొక్కనిఁ బె
ళ్లున విఱుగఁ గాలఁ దన్నిన, దనుజుఁడు బి ట్టార్చి కూలి ధరపై మడిసెన్. 3019
గీ. ఒకదినంబున దోఁగాడు చుండ రామ, కృష్ణు లిరువురుఁ గుక్కుటాకృతిని దాల్చి
చంపరా నొక్కరక్కసి శౌరి కేల, నీడ్చికొట్టంగ వాఁ డార్చి యిలను గూలె. 3020
సీ. నడువంగ నేర్చి కొన్నాళ్ళకు రామకృ, ష్ణులు చరించుచు నుండఁ గులుకునడలఁ
గృష్ణుఁడు గోపికాగృహములలోఁ జొచ్చి, పాలు మీఁగడ వెన్న గ్రోలఁ దొడఁగె
నది యెల్లఁ దెలుప గోపాంగనలు యశోద, కామె కృష్ణునిఁ బిల్చి యనునయమున
గట్టిగా ఱోటికిఁ గట్టె దామంబుతో, దధి యమ్ముకొనుటకుఁ దాను బోయెఁ
ఆ. గృష్ణుఁ డంత ఱోటి నీడిచికొని యమ, ళార్జునములమధ్యమందుఁ బోవఁ
దత్ప్రఘాతమునను ధరణీరుహంబులు, పెళ్ళు మనుచు విఱిగి ద్రెళ్లె నిలను.
ఆ. అపుడు గోపు లెల్ల నాశ్చర్యమును జెంది. కాంచు చుండఁ దరుయుగంబు గిన్న
రాకృతులను దాల్చి యభివాదనము కృష్ణు, నకు నొనర్చి చనియె నాకమునకు.
క. దామనిబద్ధుం డగుటను, దామోదరుఁ డనెడిపేరు దాలిచెఁ గృష్ణ
స్వామి మహోత్పాతంబుల, నామూఁడిఁని నచటఁ గని భయంపడి గోపుల్. 3023
సీ. యమునాతటంబున రమణీయముగ నున్న, బృందావనంబున కేఁగి యచట
వసియించి యుండంగ వత్సపాలయుతంబు, గను రామకృష్ణులు కాన కేఁగి
కాచుచు గోవత్సకంబులఁ దన్మధ్య, దేశంబునం జేరి తిరుగు చుండ
బకరూపమును దాల్చి యొకరాక్షసుఁడు వచ్చి, కృష్ణునిఁ గెడప నుంకించు చుండ
గీ. వాసుదేవుఁ డెఱింగి తద్వర్తనమును, వాని పై నొక్కలోష్టంబు వైచె నగుచు
నంత నాబకదానవుం డార్చి దెసలు, దద్దఱిల నేలపైఁ బడి తనువు విడిచె. 3024
సీ. అంతఁ గొన్ని దినంబు లరుగంగ నొకదినం, బున రామకృష్ణులు వనమునందు
గోపబాలురతోడఁ గూడి మేపుచును గో, వత్సంబులను నెండవలన నలసి
శయనించి యజ్ఞవృక్షచ్ఛాయ నిదురింప, వనజోద్భవుఁడు వచ్చి వారిఁ జూచి
తలఁచి తన్మహిమంబుఁ దెలుప లోకుల కెల్ల, గోవత్సయుతముగా గోపసుతుల
గీ. నపహరించి దివంబున కరిగె నవల, మేలుకొని రామకృష్ణులు బాలకులును
ధేనువత్సంబులును నందుఁ గానఁబడమిఁ, గళవళముఁ జెంది రొకక్షణకాల మంత.

ఆ. అది యెఱింగి కృష్ణుఁ డజునికృత్యంబుగా, మరలఁ బూర్వ మున్నకరణి నుండ
గోపబాలకులను గోవత్సములఁ సృష్టి, చేసె మానసమునఁ జిత్రముగను. 3026

సీ. అంతట సాయాహ్న మగుటయు మునుపోలె, గోవత్సగోపార్భకులను గూడి
రామకృష్ణులు జయారావముల్ చేయుచు, బృందావనంబున కేఁగుదెంచి
కలిగింప సాగిరి కౌతుకాశ్చర్యముల్, నిజబాల్యచేష్టలఁ బ్రజల కెల్ల
జరుగుటయును నొక్కసంవత్సరము బ్రహ్మ, చనుదెంచి కృష్ణునిసవిధమునకు

గీ. విరచితాంజలి యై ప్రమ్రొక్కి విశ్వరూప, తరమె నాకు భవన్మహత్త్వంబుఁ దెలియఁ
ద్వద్విభూతుల భూజలవహ్నివాయు, గగనములును సమస్తలోకములు గూడ.

క. పురుషోత్తమ నీవె మహా, పురుషుండవు నీవె శుద్ధపురుషుఁడవు వపుః
పురుషుఁడవు నీవె నైగమ, పురుషుండవు నీవె నీవె భువనము లెల్లన్. 3028

సీ. త్వద్ఘ్రాణమునఁ బుట్టె వాయ్వంతరిక్షముల్, త్వద్వాక్కుచేత భూవహ్ను లొదవె
శశియును దెసలు నీశ్రవణంబున జనించెఁ, బ్రభవించె నీకంట రవియు దివముఁ
ద్వన్మానసంబున వరుణుఁ డుద్భవ మొందె, నివి యవి యన నేల నెల్లజగము
ప్రాదుర్భవించె నీయవయవములనుండి, యఖిలంబుఁ జేరు నీయంద తుదకు

గీ. నాకసంబున నోషధులందు గ్రహము
లందు నక్షత్రములయందు నఖిలవిబుధ
నివహములయందు నాయందు భవునియందుఁ
దేజరిల్లుచు నుండెడితేజు నీవ. 3029

గీ. అఖిలవస్తువులందును నన్నియెడల, నిండి యుండెడిబ్రహ్మంబు నీవ జ్ఞాన
మీవ సర్వోపనిషదర్థ మీవ యమృత, శబ్దవాచ్యుఁడ వీవ శాశ్వతుఁడ వీవ. 3030

గీ. నీవ చక్షుర్మయుండవు నీవ వాఙ్మ, యుండవును నీవ ఛందోమయుఁడవు నీవ
శ్రోత్రమయుఁడవు హంసవాచ్యుఁడవు నీవ, పంచకోశస్థుఁడవు నీవ పరమపురుష.

క. క్షమియింపుము నాయపరా, ధము నని ప్రార్థించి బహువిధంబుల గోవ
త్సములను గోపార్భకులను, సమర్పణముచేసి చనియె స్వపదంబునకున్. 3032

చ. అమరులు పంకజాసనసమర్పితగోశిశుగోపబాలసం
ఘమునకు బాలకృష్ణపరికల్పితగోశిశుగోపబాలసం
ఘమునకు భేద మించుకయుఁ గానఁగరామిని నెందుఁ గూడఁ జో
ద్యము గలుగంగ నాత్మలకుఁ దన్మహిమంబుఁ దొడంగి రెన్నఁగన్. 3033

సీ. అవలఁ గొన్నిదినంబు లరుగంగ నొకనాఁడు, గోపబాలకులతోఁ గూడి శౌరి
లీలమై నరిగి కాళిందీహ్రదమునకు, బాలురు వల దని గోలవెట్ట
నందులోపల దూఁకి యచటఁ గాళియ మను, కాలసర్పంబును గాల నడిచి
సవిషు నిర్విషముగ శరణుపొందఁగ నది, యాత్మీయపుత్రదారాన్వితముగ

గీ. దానిమూర్ధసహస్రంబుపైని స్వపద, చిహ్నములు గానఁబడ నొత్తి చెదరఁగొట్టి
నది రసాతలమున కేఁగె హ్రదము విడిచి, తొలఁగి తద్బాధ ప్రజలు సంతోషపడఁగ.
గీ. అంతఁ గృష్ణుఁడు విచ్చేసి హ్రదమునుండి, చూడ నల్లడఁ జల్లనిచూపుతోడ
యామునతటస్థవిషదగ్ధభూమిజంబు, లన్నియును బల్లవించె నత్యద్భుతముగ. 3035
సీ. అటుపైనిఁ గొన్నినాళ్లరుగంగ నొకనాఁడు, గోపబాలురతోడఁ గూడిమాడి
యాడుచు శైశవక్రీడల నన్నతో, దనుజారి యొకతాళవనికి నేఁగి
యందు ధేనుకుఁ డనునమరారి యొక్కఁడు, ఖరరూపమును దాల్చి తిరుగు చుండఁ
బట్టి తత్పదములు గట్టిగా గిరగిరఁ, ద్రిప్పి కొట్టఁగఁ దాళవృక్షమునకు
గీ. నాప్రఘాతంబుచేత వాఁ డార్చి మిన్ను
బ్రద్ద లగునట్లు దైత్యరూపమునఁ గొండ
కూలినట్టులు నేలపైఁ గూలి మడిసెఁ
గృష్ణుమహిమంబు నిర్జరు లెల్లఁ బొగడ. 3036
వ. అంత నచ్చటనుండి రామకృష్ణులు గోపబాలురతోడం గూడి భాండీరవటంబునకుం
జని యాచెట్టుక్రింద నాడుకొను చుండ. 3037
సీ. అరుగుదెంచి ప్రలంబుఁ డనుదైత్యుఁ డొక్కఁ డ, చ్చటికి నాభీరవేషంబుతోడ
నాడుచు వారితోఁ గూడి హలాయుధు, నెక్కించుకొని తనపృష్ఠమందు
నెగిరి యాకసమున కేఁగు చుండఁగ వాని, రాముఁడు గ్రహియించి రాక్షసునిఁగ
ముష్టిచే దన్మూర్ధమున గాఢముగ నొక్క, గ్రుద్దు గ్రుద్దఁగ వాఁడు గుండె చెదరి
గీ. భైరవంబుగఁ జేయుచు నారవంబు, దైత్యరూపంబుతోఁ గూలి ధరణిమీఁద
విడిచెఁ బ్రాణంబులను నభోవీథియందుఁ, జేరి సురలు జయధ్వనుల్ చేయు చుండ.
సీ. ఏతెంచి యంతట బృందావనమునకు, రామకృష్ణులు బహుప్రమదమునను
గోపకన్యలతోడఁ గూడియాడుచు గోవ్ర, జమున నుండఁ బ్రదోషసమయమందు
నరుగుదెంచి యరిష్టుఁ డనురాక్షసుఁ డొకండు, కృష్ణునిఁ గెడపంగ వృషభ మగుచు
అంకెవేయఁగ దెసల్ అంపిల్ల నాధ్వని, కెల్లగోపాలురుఁ దల్లడిల్లఁ
గీ. కృష్ణుఁ డొకతాళమును బెల్లగించి దాన, నడువఁ దచ్ఛృంగమధ్యమునందు వాఁడు
బ్రద్దలయి తల దైత్యరూపమున నార్చి, భూతలంబునఁ బడి ప్రాణములను విడిచె.
సీ. అంతటఁ గొన్నినాళ్ళరుగంగ నొకనాఁడు, కేశి నాఁబడునొక్కయాశరుండు
గోవ్రజంబున నాడుకొనుచున్నకృష్ణునిఁ, గెడపంగ ఘోటకాకృతిని వచ్చి
హేషారవంబున నిలయు నాకసమును, బూరింపఁగఁ ద్రిలోకములును బెగడ
గొల్ల లెల్లరును భీతిల్లు చుండఁగ వారి, కందఱికిను గృష్ణుఁ డభయ మొసఁగి
గీ. పెటికి యొక్కమహాశిల పెళ్లు మనఁగ, హయముపైవైవ నది చూర్ణితాంగ మగుచు
దానవాకారమున నార్చి ధరను బడియె, నమరజయనాదపూరితం బయ్యె నభము.

క. ఈకరణిని బహుదైత్యా, నీకంబును బిలుకుమార్చి నిర్భయతను ము
ల్లోకములకుఁ గరుణించెను, శ్రీకృష్ణుఁడు బాల్యముననె చిత్రము గాఁగన్. 3041

వ. అటుపైని రామకృష్ణులు గర్గమహర్షిచే నుపనీతులై సాందీపనియొద్ద సకలవిద్యలను గ్రహించి గురువాంఛానుసారంబుగాఁ దన్మృతపుత్రుని లోకాంతరమునుండి సజీవునిగాఁ దోడ్కొని వచ్చి గురుదక్షిణగా సమర్పించిరి. అంతఁ గొంతకాలంబునకు బృందావనంబునం దొక్కనాఁటినిశీథకాలంబున. 3042

సీ. శిరమున నెమలిపింఛెము గ్రాల మోమునఁ, గస్తూరికాతిలకం బెలర్పఁ
గర్ణంబులందు మకరకుండలము లొప్ప, గళమున గ్రైవేయకములు వెలయ
వక్షస్థలమున శ్రీవత్సంబు గౌస్తుభం, బును వనమాలికయును జెలంగ
భుజములఁ గేయూరములు విలసిల్లంగఁ, గరముల భాసిల్లఁ గంకణములు

గీ. భర్మచేలంబు గటియందుఁ బదములందు
నూపురంబులు మేనను నూత్నశోభ
మొనయఁ జెలువొందుచును జగన్మోహనముగ
వేణుగానంబు శౌరి గావింపఁదొడఁగె. 3043

సీ. అంతట నాగాన మాలించి వల్లవాం, గన లెల్ల నారాత్రికాలమంద
వ్యాకీర్ణమూర్ధజవస్త్రలై లేచి శ, య్యలనుండి లజ్జాభయంబు లుడిగి
పతిసుతబంధుసంతతులను విడనాడి, గణనసేయక కులగౌరవంబు
దర్పకశరపీడితస్వాంతలై వచ్చి, జవమున వెన్నునిసవిధమునకు

గీ. నతని గ్రుచ్చి కవుంగిళులందు నదిమి, కొని యురోజములందును గ్రోలి తదధ
రామృతంబు నతండును నట్లె చేసి, సురతసుఖమునఁ దేల్పంగ సొక్కి సోలి. 3044

క. అనుదినమును నాతీరున, నొనరించుచు సౌఖ్యవార్ధి నోలాడుచుఁ గృ
ష్ణునిఁ బాయలేమి నొకత్రుటి, యును నాతనికడనె యుండి రుడిగి గృహములన్.

క. అని చెప్పుటయును బార్వతి, విని సర్వము నాథ తగునె విశ్వోద్ధారం
బొనరింప నవతరించిన, జనార్దనున కన్యదారసంగము చెపుమా. 3046

చ. అనవుడు నవ్వి శంకరుఁ డగాత్మజపై కది క్రీడకై వడిన్
గనఁబడుఁగాని మూఢులకుఁ గన్గొన వాస్తవముల్ జగచ్ఛరీ
రునకుఁ బరాత్మభేదము నిరూపిత మెట్లగు నీవె చెప్పు మే
ననుటయె కాదు వాని జగదాత్మునిగా శ్రుతు లుగ్గడించెడిన్. 3047

క. అని నుడువుటయును శాంభవి, తనసంశయ ముడుగ సమ్మదము నొందుచు నా
త్మను నాథ యవలిగాథను, వినిపింపుము నాఁగ భూతవిభుఁ డిట్లనియెన్. 3048

వ. అంతట శరత్కాలంబు సంప్రాప్తమగుటయు నందాదిగోపాలకు లందఱునుం గూడి గోకులంబున మహేంద్రున కుత్సవంబు గావింప నుద్యమింప గోవిందుఁడు తదుద్యమంబు మాన్పి గోవర్ధనాద్రిరాజంబునకు నుత్సవంబు నారంభింపఁజేసె. 3049

సీ. అపుడు సహస్రాక్షుఁ డాగ్రహోదగ్రుఁడై, తన్మహోత్సవము ధ్వస్తంబు సేయ
సంకల్ప మొనరించి సంతతధారగా, సప్తరాత్రములు వర్షంబు కురిసె
నాయుత్సవము కృష్ణుఁ డాఁగిపోకుండఁగా, గోవర్ధనాద్రిని గోట నెత్తి
యాసప్తరాత్రంబు లట్టులె నిలఁబెట్టి, దానిక్రిందను దదుత్సవము జరిపె
గీ. నంతటను భీతుఁడై యింద్రుఁ డాఁపి వర్ష, మవని కరుదెంచి నుతియించి హరిని జనియె
నిలిపి యాయద్రి నపుడు స్వస్థలమునందు, వల్లవులతోడఁ గృష్ణుఁడు వ్రజముఁ జేరె.
సీ. అప్పుడు నారదుం డమరకార్యంబును, నెఱవేర్పఁగా నెంచి నిపుణముగను
గ్రన్నన మధురాపురంబున కేతెంచి, యరిగి కంసునికడ కతనిచేత
నర్చితుండయి కృష్ణుఁ డావిర్భవించిన, దాదిగా జరిగినయట్టిగాథ
యాప్తుండువోలె గోప్యముగ సర్వంబును, వినిచి బ్రహ్మసమక్షమునకుఁ జనియె
గీ. నంతఁ గంసుఁడు వసుదేవుఁ డాచరించి, నట్టివంచనమును గృష్ణుఁ డాదినుండి
సలిపినయమానుషక్రియల్ తలఁచి తలఁచి, దిటముచెడి గుండెలోపల దిగులువుట్ట.
సీ. రావించి మంత్రివర్గము నెల్ల వినిపించి, వారికి నారదవాక్యములను
గృష్ణవధంబున కేది యుపాయంబొ, వచియింపుఁ డనఁగను వార లెల్ల
మంత్రం బొనర్చి యేమాడ్కి నైనను గోప, కులతోడ రామకృష్ణులను నిటకు
రావించి మత్తవారణమల్లనిహతులఁ, జలుపంగవలె నని తెలియఁజేయ
గీ. నపుడు తాను ధనుర్యాగ మాచరింపఁ, దలఁచి ప్రకటించి రామకృష్ణులను గోప
సహితముగఁ దోడుకొని రాఁగ సవనమునకుఁ, బ్రాజ్ఞుఁ డైనయక్రూరున కాజ్ఞ యొసఁగె.
సీ. అంతట భాగవతాగ్రేసరుం డైన, యక్రూరుఁ డామోద మావహిల్ల
దివ్యభూషణముల దివ్యాంబరంబులఁ, గైకొని వారికిఁ గానుకలుగ
నధివసించి రథంబునందు గోకులమున, కరిగి శతాంగంబు నచట డిగ్గి
పుండరీకంబులుబోనికన్నులవాని, మొలకనవ్వులు గుల్కుమోమువాని
గీ. గోపభామలతోఁ గూడుకొనినవాని, ధేనుసందోహమధ్యస్థుఁ డైనవాని
సుజనులను బ్రోచుచల్లనిచూపువానిఁ, గాంచి కృష్ణుని హర్షాశ్రుకణము లురల.
గీ. అరిగి యొద్దకు వజ్రచక్రాబ్జరేఖ, లలరుతత్పాదముల మూర్ధమందుఁ దాల్చి
కన్నులకు నద్దుకొని మ్రొక్కి గాత్రమందుఁ, బులక లొలయంగ మఱిమఱిఁ జలిపి ప్రణతి.
క. బలరామునకుఁ బ్రణామము, సలిపి నిలంబడఁగ వారిసన్నిధిలో వా
రలు వానిఁ దోడుకొని తమ, నిలయమునకు వచ్చి నందునికిఁ జూపింపన్. 3055
సీ. నందగోపుఁడు మహానందంబునను యదూ, త్తమునకు నర్ఘ్యపాద్యము లొసంగి
ప్రణమిల్లి తత్పాదపంకేరుహములకు, నుచితాసనమునఁ గూర్చుండఁబెట్టి
పూజించి వస్త్రముల్ భూషణంబులును స, మర్పింప నక్రూరుఁ డవి గ్రహించి
తాను దెచ్చినపరిధానభూషణమ్ములు, ప్రేమతోడను రామకృష్ణులకును

గీ. నందునకును యశోదకు డెందమలర, నొసఁగి క్షేమంబు నడిగి కృష్ణోదయంబు
మొదలుకొని సర్వవృత్తాంతమును వచించి, సక్రమంబుగ వారు విస్మయము నొంద.

సీ. కృష్ణుఁడు సేసినకృత్యంబు లెల్లను, నారదుండు వచింప నాఁటినుండి
యతిభీతుఁడై కంసుఁ డాచరింపఁగ ధను, ర్యాగంబుఁ దలపెట్టి యందులోన
మల్లులచేతను మాతంగములచేత, నీల్గింపఁ గృష్ణుని నిశ్చయించి
ననుఁ బంపె మి మ్మెల్లరను దోడుకొనిరాఁగ, నతిశీఘ్రముగ ధనుర్యాగమునకు

గీ. రండు మీ రెల్లరును మధురకు భయంబు, నొందవలదు మహీభార ముడుప నిలను
నవతరించినయాదినారాయణుండ, కృష్ణుఁ డనఁగను గంసుని నితఁడు గెడపు. 3057

క. దానను భూభారము జన, మానసదుఃఖమును దీఱు మంచికి వచ్చెన్
గాని యిది కాదు చెడ్డకుఁ, దా నొందు దలంప నొందు దైవము దలఁచున్.

క. అని చెప్పియూరకుంటయు, విని సర్వము నెల్లగోపవృద్ధులు దుఃఖం
బును జెందు చుండఁ గృష్ణుఁడు, కని వారల నెల్ల మోము కళకళలాడన్. 3059

ఆ. గోపులార మీరు కొందలపా టొంద, వలదు దుష్టుఁ డైనవానిఁ గెడపి
భూభరంబుఁ దీర్పఁ బోదము రం డింక, నిదియె కాదె కార్య మిలను నాకు. 3060

చ. అనవుడు గోపు లెల్లరును నాతనిమాటలు యాదవుండు చె
ప్పినవచనంబులున్ దమకు భీతిని బాఱఁగఁదోలి ధైర్యమున్
జొనుపఁగ మానసంబులను శోకము మాని నృపాజ్ఞ తప్పమిన్
జనుటకు నిశ్చయించుకొని స్వస్వగృహంబుల కేగి రత్తఱిన్. 3061

సీ. యాదవోత్తముఁ డైనయక్రూరునకు యశో, దాదేవి సమధికాదరముతోడ
షడ్రసోపేతభోజనము వెట్టఁగ రామ. కృష్ణులపంక్తిలోఁ బ్రీతి యలర
నతఁ డారగించి మహాభాగ్యము లభించె, నని సంతసించుచు నాత్మలోన
హరిభక్తుఁ డగుటచే నా రేయి రామకృ, ష్ణులు పవళించెడినిలయమందుఁ

గీ. బండుకొని యొక్కశయ్యపైఁ బరవశుండు, గాక తామసనిద్రకుఁ గాంచు చుండఁ
గనఁబడక రామకృష్ణులు కానఁబడియె, శేషతల్పగతుం డైన శ్రీధరుండు. 3062

ఆ. అపుడు పులకరింప నంగంబు లక్రూరుఁ, డమితహర్షమునను నవశుఁ డగుచు
సెజ్జనుండి లేచి శీఘ్రంబుగను శేష, శాయిదరికిఁ జేరి సంభ్రమమున. 3063

సీ. కమలనాభునిపాదకమలంబులను బట్టి, యొత్తుచు నిరుగేల నొత్తకుండ
నిదియె ధర్మము నాకు నిదియె సామ్రాజ్యభో, గము నాకు నిదియె మోక్షంబు నాకు
బ్రహ్మాదులకుఁ గూడ, బడయశక్యముగాని, హరిపదాబ్జములు సంప్రాప్తమయ్యె
సాఫల్య మొదవె నాజన్మంబునకు నేఁడు, నాపూర్వజన్మపుణ్యము ఫలించె

గీ, నని తలంచుచు నెద నవాఙ్మనసగమ్య, మైనయానందవార్ధి నోలాడు చుండఁ
గడచె రే యంత ముందుగ్గోల్తె గానఁబడిరి, రామకృష్ణులు తూలపర్యంకమందు.

సీ. అది చూచి యక్రూరుఁ డంతరంగంబున, నాశ్చర్యపడు చుండ నంతలోన
నమరులు భద్రవాద్యములు మ్రోఁగింపంగ, నాకాశముననుండి యద్భుతముగ
శయ్యాతలమునుండి చయ్యన రామకృ, ష్ణులు లేచి స్నానసంధ్యల నొనర్చి
యక్రూరసహితులై యరిగి తల్లికి మ్రొక్కి, యాజ్ఞ యి మ్మనఁగఁ బ్రయాణమునకుఁ
గీ. గనులలోఁ గ్రుక్కికొనుచుండఁ గన్నునీరు, క్రిందఁబడకుండఁగ యశోద ఖేదమునను
జూచి యక్రూరుఁ డామెను సుదతి భీతి, వలదు కృష్ణుఁ డనంగఁ గేవలుఁడు గాఁడు.
క. జనపీడాకరుఁ డగుకం, సుని నిర్మూలించి మునులు సురలును ద్రిజగ
జ్జనులును ముద మొందఁగ నీ, తనయుం డేలంగలఁడు ధాత్రిని నెల్లన్. 3066
క. అని యనునయించి యాయమ, యనుమతి గొని శీఘ్రముగను నధిరోహింపం
గనుజేసి రామకృష్ణులఁ, దనరథమున నేఁగనున్నతరుణమునందున్. 3067
ఆ. గోపకాంత లెల్ల గుంపులుగా వచ్చి, కృష్ణ నిన్ను విడిచి యిచట మేము
నిలువఁజాల మొక్కనిమిష మేనియు నని, స్యందనంబు నడ్డి ముందు నిలువ. 3068
చ. కనుఁగొని కృష్ణుఁ డెల్ల వ్రజకాంతల భామినులార దుష్టవ
ర్తనుఁ డగుకంసునిన్ గెడపి తప్పక వచ్చెద రేపె మీరు రాఁ
జనదు భయంకరం బయినసంగరభూమికి నాఁడువార లా
టను నని చెప్పి వారలకడంకను మాన్చి కాంచె సూతునిన్. 3069
క. సారథి యంతట రథమును, మారుతవేగమున నిమిషమాత్రములోనన్
జేరిచి కాళింద్యుత్తర, తీరమునకు నిలిపె నచటఁ దీర్పఁగఁ విధులన్. 3070
వ. అప్పు డక్రూరుండు రథంబు డిగ్గి యమునాజలంబున స్నానంబు గావించి విష్ణుమంత్ర జపంబు సేయుచుఁ దజ్జలంబునందు బలరామకృష్ణులం దిలకించి సంశయించి స్యందనం బుం జూడ నందును వారలు గానంబడుటంజేసి యాశ్చర్యానందభరితుండై మరలఁ దత్తోయంబున మునింగి లేచి చూచుటయు నందు శేషపర్యంకశాయి యగురమాపతి కానంబడియె. 3071
సీ. అక్రూరుఁ డప్పు డత్యానందముం జెంది, కాంచుచు నుండంగఁ గన్నులారఁ
జక్రధరుం డదృశ్యత నొందె నంత న, క్రూరుండు చనుదెంచి తీరమునకు
రథమునం దుండినరామకృష్ణులకుఁ జే, యఁగ వందనముఁ గృష్ణుఁ డతనిఁ జూచి
విష్ణుభక్తాగ్రణి వీక్షించితివె యేది, యైనవిశేషంబు యమునలోన
గీ. నని యడుగ యాదవోత్తముఁ డంబుజాక్షు, సర్వగతుఁడవు నీవ విశ్వములు నీవ
త్వత్పరం బేదియును లేదు వాస్తవముగ, యమునలోనివిశేష మియ్యదియ చూవె.
ఆ. అని వచింపఁ గృష్ణుఁ డాలించి తద్వాక్య, మొప్పిదముగ నవ్వి యూరకుండె
నంత రథము నెక్కి యాదవాగ్రణి తత్స, మేతముగను మధుర కేఁగుదెంచి. 3073
వ. రామకృష్ణులను బురద్వారభవనంబునం బ్రవేశింపంజేసి తాను రాజభవనంబున కరిగి కంసునకు రామకృష్ణాగమనవార్త నెఱింగించి తత్పూజితుండై నిజగృహంబునకుం జేరె.

సీ. అంతట గోపాలు రందఱుఁ బెరుఁగుకొ, వళ్లితోఁ బాలకావళ్లతోడ
బృందావనమునుండి యేతెంచి రచటికి, రాజాజ్ఞ లంఘింపరాని దగుట
రామకృష్ణులు రాజరథ్యలో నేఁగుచు, నాదివసమున సాయాహ్నమందుఁ
గొని దివ్యవస్త్రంబులను రాజగృహమున, కొకరజకుఁడు పోవుచుండఁ జూచి
గీ. వస్త్రముల నీయు మని కోర వాఁడు పొగరుఁ, దనమునను మాటలాడె న త్తఱిని వానిఁ
బట్టుకొని కృష్ణుఁ డొకచెంపపెట్టు పెట్టఁ, గ్రక్కి రక్తంబు నటఁ బడి గ్రుండె వాఁడు.
ఆ. అంత రామకృష్ణు లావస్త్రములఁ దాము, కొన్ని దాల్చి మిగిలియున్నవాని
నెల్లగోపకులకుఁ గొల్లలుగా నిచ్చి, యవల బయలుదేఱి యచటనుండి. 3076
క. ఒకమాలాకారునియిం, టికిఁ జని వాఁ డెదను భక్తి డెక్కొన సుమమా
లిక లొసఁగఁ దాల్చి యవి వా, నికి మోక్షము గలుగ నొసఁగి నెనరున వరముల్.
సీ. మరల నేఁగుచు రాజమార్గంబునను నిర్వు, రంకంబుగను బరస్పరము నగుచు
ధృతగంధపాత్రయై యెదురుగాఁ జనుదెంచు, చున్నకుబ్జను జూచి యొక్కరితను
గోరి చందనము నాకుబ్జ వినమ్రమై, భక్తితోఁ జందనపాత్ర మీయ
నందులోఁ గలగంధ మంతయు మేనుల, యం దలందికొని యానందమునను
గీ. నావిరూపకు దివ్యదేహంబు నొసఁగి, యందఱును విస్మయము నొంద నచటనుండి
చనుచుఁ జనుచును నృపయజ్ఞశాలలోనఁ, గాంచి రద్భుత మగునొకకార్ముకంబు.
గీ. అంతటను గృష్ణుఁ డవలీల నాధనుస్సు, నెత్తి యొకకేలఁ జూపఱు లెల్లవారు
విస్మయం బొందు చుండంగ విఱిచివైవ, నిఘువునుబోలెఁ దద్ధ్వని యిలను నిండె.
సీ. అది విని కంసుండు బెదరి చాణూరాది, మల్లాగ్రణుల స్వసమక్షమునకు
రావించి యెల్లి మీరలు రామకృష్ణుల, నడఁగార్పవలె నని యాజ్ఞ నొసఁగి
యనుజమంత్రిసమేతుఁడై మహాప్రాసాద, మూర్ధసితాగారమునను జేరి
తన్నికేతనచతుర్ద్వారంబులం దుంచె, వీరమల్లుల మత్తవారణముల
గీ. నది యెఱింగియు నారేయి యజ్ఞశాల
యంద వసుదేవనందను లధివసించి
యుదయ మగుటయు నాగీము వదలి గుహను
బాసి వెడలెడిహరులట్లు బయలుదేఱి. 3080
సీ. రాజగృహద్వారరక్షకంబుగ నున్న, దాని మహోన్నత మైనదాని
హిమశైలశిఖరసామ్యమున శోభిలుదాని, నమితమదోత్కట మైనదాని
నైరావతమదంబు నడఁగాఱిచినదాని, నారితేఱినదాని నాజులందుఁ
గువలయాపీడాఖ్య గొన్నదానిని ద్రిలో, కములందు విఖ్యాతి గన్నదాని
గీ. గజవతంసము నొకదానిఁ గాంచి రాముఁ, డెదను విస్మయపడు చుండఁ గృష్ణుఁ డెగసి
కేలఁ గొని దానితొండంబు గీఁకపెట్ట, గిరగిరం ద్రిప్పి పడఁగొట్టి ధరను గెడపె. 3081

సీ. అంతట నాదంతిదంతంబులను బీకి, రామకృష్ణులు పరాక్రమము మెఱయ
నవి యిర్వురును గొని యాయుధంబులుగ మ, ల్లులతోడ యుద్ధంబు సలుపఁబూని
సింహగర్జనములు సేయ మల్లులు గుండె, లవిసిపోవఁగఁ దదారవము వినుటఁ
బరువిడి నృపశస్త్రభవనంబులోఁ జొచ్చి, బంధించికొని తత్కవాటములను
గీ. వడఁకుచును డాఁగి యుండ నావమువు నెఱిఁగి, సత్వరమ రామకృష్ణులు శస్త్రశాల
కడకుఁ జని తత్కవాటముల్ ఖండములుగఁ, దన్ని పదములచేతను ధరను గూల్చి.
క. తలుపులు కూలుటయును లోఁ, పల నుండినదైత్యయోధబలమును బాదం
బులచేత నాగదంతం, బులచేతను బొడిచిపొడిచి పొడిపొడి గాఁగన్. 3083
ఉ. అచ్చటనుండి త్రిప్పుచును హస్తిరదంబులఁ గంససద్మమున్
జొచ్చి భయంకరాకృతుల నుగ్గులు సేయుచు నడ్డగింపఁగా
వచ్చినవీరమల్లులను వారణరాజములన్ గవాటముల్
ద్రచ్చుచుఁ బోయిపోయి పదిలంబుగఁ గంసునిమేడలోనికిన్. 3084
ఆ. కానఁబడఁగఁ బ్రళయకాలాంతకులువోలెఁ, గాంచి కంసుఁ డడలి కంపిలుచును
శక్తిశాలులైనచాణూరముష్టిక, మల్లవరులఁ జూచి యుల్లమలర. 3085
ఉ. ఇప్పుడె మల్లులార వధియించిన మీరలు రామకృష్ణులన్
దప్పక మీకు నే నొసఁగెదన్ రవిసాక్షిగ నర్ధరాజ్యమున్
జప్పునఁ బట్టుకొండు మనసన్నిధికే రిపు లేగుదెంచి యు
న్నప్పుడు పోవనీయఁదగ దంచు సధైర్యముగన్ వచింపఁగన్. 3086
సీ. సన్నద్ధు లగుటయుఁ జాణూరముష్టికుల్, వాసుదేవులఁ బట్టి వధ యొనర్పఁ
గనిపించెఁ గృష్ణుఁ డాకాలంబునను మహా, మేరువుకైవడి వారలకును
గాలాగ్ని తెఱఁగునఁ గంసునకును బంచ, బాణునివిధమునఁ బడఁతులకును
దలిదండ్రులకు బిడ్డవలె గోపులకుఁ జెలి, తీరున హరివోలెఁ ద్రిదశులకును
గీ. నంతటను గంసుఁ డడలుచు నతనుతాప, మతివ లొందుచుఁ దలిదండ్రు లశ్రుపూర్ణ
నయను లగుచును గోపులు భయముపమచు,నమరు లానందభరితాత్ము లగుచు నుండ.
గీ. అమ్మహామేరురూపంబు నవగణించి, రాజ్యలోభంబుననుజేసి రాజమల్లు
లిరువురును హుంకరించుచు నెదిరిపోర, నిలువఁబడుటయు రామకృష్ణులు చెలంగి.
గీ. చేసి యాయోధనంబు విచిత్రముగను, దమకుఁ గలమల్లరణకౌశలము వెలార్ప
శౌరి చాణూరుని వధించె సీరపాణి, ముష్టికుని సంహరించె నక్లిష్టముగను. 3089
క. అంతటఁ గంసుఁడు ధైర్యం, బంతయును దొలంగ భీతి నటు నిటుఁ బోవన్
గంతు లిడుచుండఁగను గా, లాంతకుఁ డనవచ్చి కృష్ణుఁ డతిరభసమునన్. 3090
క. కాలం దన్నఁగ వాని గు, బేలున సౌధంబునుండి పృథ్వీస్థలిపైఁ
గూలి సమీరోన్మూలిత, సాలము తెఱఁగునను వాఁడు సంక్షయ మొందెన్. 3091

గీ. అప్పుడు సునాముఁ డనెడికంసానుజుండు, ప్రబలరోషంబునను సంగరం బొనర్ప
వారిపైఁ గేఁగుదేరంగ సీరపాణి, యొక్కగ్రుద్దున నాపాపి నుక్కడంచె. 3092

ఆ. అటులు గెడపి రాక్షసాగ్రేసరుల రామ, కృష్ణు లాఁగకుండ నేచటఁగూడఁ
దీవరముగ దేవకీవసుదేవుల, సవిధమునకు వచ్చి సాఁగిమ్రొక్క. 3093

క. తనయప్రేమమువలనను, దనకుచములనుండి క్షీరధారలు గురియం
గను వారిపైని దేవకి, కనియెఁ గనులార సుతులఁ గన్నీ రొలుకన్. 3094

క. కనుఁగొని వసుదేవుండును, గనుగవ నశ్రువులు గ్రమ్మఁగను జేరిచె వా
రినిఁ గౌఁగిట నపుడు నభం, బున మ్రోఁగెను దేవదుందుభులు దెస లలమన్. 3095

ఆ. అప్పు డమరు లెల్ల నరుదెంచి రామకృ, ష్ణుల నుతించి వారివలనఁ బూజఁ
బొంది స్వర్గలోకమున కేఁగి రంతట, రామకృష్ణు లొక్కరథము నెక్కి. 3096

వ. కారాగృహంబునకుం జని యచ్చట నిబద్ధుం డై యున్న నిజమాతామహుం డగునుగ్ర
సేనుని బంధవిముక్తునిం జేసి బహూకరించి వ్యపగతవ్యథునిం గావించి తద్రాజ్యంబున
కభిషిక్తునిం జేసి యక్రూరప్రముఖయదుశ్రేష్ఠుల మంత్రివర్గంబుగా స్థాపించి నందాది
గోపబృందంబున కెల్ల దివ్యాంబరభూషణంబుల నొసంగి గోకులంబునకుం బనిచి ద్విజు
లచేఁ గంసున కౌర్ధ్వదైహికకృత్యంబులు నిర్వర్తింపంజేసి తద్రాజ్యంబున ధర్మంబు
నెలకొల్పి మథురాపురంబునందు నివసించి యుండఁ గంసశ్వశురుం డగుజరాసంధుండు
కంసవధంబు నాలించి యాగ్రహోదగ్రుం డై రామకృష్ణులఁ బరిమార్ప నెంచి యక్షౌ
హిణీసహస్రసేనాపరివృతంబుగాఁ జనుదెంచి మథురాపురంబు ముట్టడించె. 3097

సీ. కృష్ణుఁ డప్పుడు స్మరియింపంగ దారుకుం, డనునిజపూర్వసూతుని నతండు
స్మరణమాత్రంబునఁ జనుదెంచి ధరణికిఁ, బ్రణమిల్లి కృష్ణునిపాదములకు
దివ్యపుష్పాద్యశ్వదేదీప్యమానంబు, పతగేశ్వరధ్వజభ్రాజితంబు
సురపూజితము నై నసుగ్రీవపుష్పక, స్యందనంబును గదాద్యాయుధములు

గీ. నప్పన మొనర్చుటయును గదాసిశంఖ, చక్రశోభితభుజచతుష్టయసమేత
ముగను గృష్ణుఁడు రాముఁడు ముసలలాంగ,లాయుధయుతంబుగను నెక్కె స్యందనంబు.

క. ద్రుమగుల్మలతాద్యాక్రాం, త మగువనంబునను నగ్ని దార్కొలిపినచం
దమున జరాసంధునిపై, న్యమునఁ జొనుప దారుకుఁడు శతాంగము నంతన్. 3099

క. చెలరేఁగి జరాసంధుని, బలమును సర్వమును నొక్కప్రహారార్థమునన్
బలివెట్టి యుద్ధభూమికి, నలువుగఁ గృష్ణుండు శంఖనాదము సేయన్. 3100

క. అతికోపంబున బాణ, ప్రతతులఁ గురియించుచును జరాసంధుం డు
ద్ధతితోడం బైకొన న, చ్యుతాగ్రజుఁడు సేసి ఘోరయుద్ధ మతనితోన్. 3101

ఆ. కడకు లాంగలమునఁ బడఁగొట్టి సారథి, తురగయుక్తముగను నరద మిలను
బట్టి వానిఁ గేల బలిమిచేఁ దెగటార్ప, నెంచి మదిని ముసల మెత్తుచుండ. 3102

ఉ. ఆసమయంబునందు విదితార్థుఁడు గావునఁ గృష్ణుఁ డన్న యీ
దోసము సైచి ప్రాణములతోఁ ద్యజియింపుము వీని నీపయిన్
జేసిన నిట్టిదోషమును జీలిచివై చెదుగాక నావృషన్
బాసి యమర్షమున్ విడిచె నవ్వుచు రాముఁడు వాని సంతటన్. 3103

సీ. అరిగి జరాసంధుఁ డతిబలుం డగుకాల, యవనునిసన్నిధి కాక్షణంబ
రామకృష్ణులపరాక్రమమును గఁసాది, వధమును స్వపరాభవమును దెలుప
వాఁడు క్రుద్ధుండయి స్వమ్లేచ్ఛకోటిస, హస్రసైన్యముతోడ నద్భుతముగఁ
బ్రస్థితుండై మధురాపురం బరికట్టఁ, దలఁచి కృష్ణుండు పౌరులను గావ
గీ. నబ్ధిమధ్యమును ద్వారక యనెడిపత్త, నమును గట్టి త్రింశద్యోజనములవిరివి
గలప్రదేశంబునందు సంకల్పమాత్ర, మునను యటఁ జేర్చి కేయి సుప్తులను నెల్ల.

సీ. అంతటను బ్రభాత మగుటయుఁ గొంతసే, పునకు మేల్కాని పురజనము లెల్లఁ
గనుఁగొని రత్నకాంచనగృహప్రాసాద, గోపురప్రాకారకుడ్యములను
ధనధాన్యవైభవంబును గామధేనువు, లనఁ దేజరిలు చుండునాలకదుపు
స్వస్వధర్మములందుఁ జరియించుబ్రాహ్మణ, క్షత్రియోరవ్యజఘన్యజులను
గీ. జెంది యాశ్చర్యమును మహానందమునను
ద్రిదివమున దేవతలువోలె దివ్యసుఖము
లనుభవింపఁదొడంగి రెందును గొఱంత
యనెడిమాటయె యా పురమందు లేమి. 3105

గీ. అంతటను రామకృష్ణు లత్యద్భుతముగఁ, గాలయవనునిబల మెల్ల గడియలోన
నాశ మొనరించి రమరు లాకాశమందు, నిలిచి విజయనినాదముల్ సలుపు చుండ.

క. అది చూచి కాలయవనుఁడు, హృదయంబున వేడిపుట్టఁ గృష్ణునిమీఁదన్
గదిసి యొనరింపఁదొడఁగెను, గదారణము దేవతలును గంపము నొందన్. 3107

సీ. అతనితో బహుకాల మని కృష్ణుఁ డొనరించి, యుద్ధవైముఖ్యంబు నొంది కడకుఁ
బ్రధనరంగమునుండి పఱచు చుండఁగఁ గాల, యవనుఁడు గద నెత్తి హస్తమునను
నాఁగుమాఁగు మటంచు నార్చుచుఁ బరువెత్తు, చుండ వెంబడిఁబడి యుగ్రుఁ డగుచుఁ
బరువువాఱుచుఁ బట్టుపడకుండఁ జని తటా, లునఁ గృష్ణుఁ డొకగుహాలోనఁ దూఱె
గీ. నప్పు డాతనివెంటనె యరిగి కాల, యవనుఁడును దూఱి గుహలోన నచట యోగ
నిద్రలో నున్నముచుకుందనృపతివరునిఁ, గృష్ణుఁ డనుభ్రాంతిచేఁ గాల నెగసి తన్నె.

గీ. తత్పదాఘాతమున నవాప్తప్రబోధుఁ, డగుచు ముచుకుందుఁ డాగ్రహం బావహిల్ల
హుంకరించి కనుంగొన నుగ్రముగను, గాలయవనుఁడు భస్మమై నేలఁ గూలె. 3109

వ. అప్పుడు కృష్ణుఁడు విష్ణురూపముం దాల్చి ముచుకుందునకుఁ బ్రత్యక్షంబై తత్ప్రా
ర్థితం బగుమోక్షముం బ్రసాదింప నారాజర్షి తత్క్షణంబ మానుషదేహముం బరిత్య

జించి విష్ణుసమానరూపంబుతోడఁ దార్క్ష్యవాహనంబు నధిష్ఠించి పునరావృత్తిరహితం బగుపరమపదముం జెందె. 3110

గీ. కృష్ణుఁ డంతట నగ్రజాన్వితము గాఁగ, విడిచి మధురాపురంబును విబుధు లెల్లఁ
జలుపు చుండఁగ జయనాదములను హర్ష, భరితుఁ డగుచును ద్వారకాపురికిఁ జేరె.

గీ. అప్పు డింద్రుఁడు కాన్కగా నంపె వాయు,ముఖమునను గృష్ణునకు వజ్రములును మణులు
ఛత్త్రములు చామరములును సంఘటిల్ల, విశ్వకర్మరచించిన విబుధసభను. 3112

క. అసమాన మైనయాదే, వసభను గృష్ణుఁడు గ్రహించి వాయు వొసఁగ ధ
ర్మసభగ ద్వారకలోను, గ్రసేనముఖు లెల్ల నబ్బురంపడ నిలిపెన్. 3113

గీ. అంత నిక్ష్వాకువంశభూకాంతుఁ డైన, రైవతుఁడు సర్వలక్షణరాజమాన
యైనరేవతి నిజపుత్త్రి నచ్యుతాగ్ర, జున కొసఁగి పెండ్లిగావించె సురలు పొగడ. 3114

క. ఆమెను గొని పత్నిగ బల, రాముఁడు ద్వారవతిలోన రాజిల్లెను బా
లోమిని గొని దారగ సు, త్రాముఁడు త్రిదివంబునను విరాజిలుపగిదిన్. 3115

వ. జయ విజయులు ద్వాపరయుగంబునఁ జైద్యాన్వయమందు శిశుపాలదంతవక్త్రులుగాఁ బ్రభవించి మహాబలపరాక్రమములతోఁ బ్రవర్తిల్లు చుండ విదర్భదేశాధిపతి యగు భీష్మకునకు రమాంశంబున జన్మించి విష్ణ్వవతారం బగుకృష్ణునకు భార్య గానున్న రుక్మిణీదేవిని భీష్మకమహారాజపుత్త్రుం డగురుక్మి శిశుపాలున కొసంగఁ దలంచి జనకానుమతిం బడసి సుముహూర్తంబు నిర్ణయించి వివాహప్రయత్నంబు గావించుచుండ. 3116

సీ. బాల్యంబుమొదలుగా బహుళానురాగంబు, తోడఁ గృష్ణునిఁ బెండ్లియాడ నెంచి
కాపించు చుండుట దేవతాపూజలు, దానముల్ వ్రతములు ధర్మములును
శిశుపాలు నొల్లమిఁ జిత్తంబు భర్తగాఁ, జేకొన రుక్మిణి చింతపడుచుఁ
దమపురోహితునిపుత్త్రకుఁ డైనవిప్రునిఁ, బనిచె ద్వారకకుఁ గృష్ణునకుఁ దెలుప

గీ. నంత నతఁ డేఁగి ద్వారక కామెచింత, యంతయును దెల్పఁ గృష్ణున కాలకించి
సర్వమును గృష్ణుఁ డగ్రజసహితముగను, దారుకానీత మైనరథంబు నెక్కి. 3117

క. చనుదెంచి విదర్భాపుర, మునకు రయంబునను సకలభూపతులును బెం
డ్లిని జూడవచ్చి మూఁగఁగఁ, గనుచును నెల్లరను నుండి కాలజ్ఞుండై. 3118

ఆ. సాంధ్యకాలమందుఁ జనుచుండ రుక్మిణి, రథము నెక్కి రాజపథమునందు
దుఃఖదుఃఖముగను దుర్గాలయమునకు, నాచరింపఁ బరిణయాదిపూజ. 3119

ఆ. అపుడు శీఘ్రగతిని నరుదెంచి యామెను, గూరుచుండఁబెట్టుకొని రథంబు
నందుఁ బోవుచుండ నాత్మపురంబున, కచటినృపతు లెల్ల నడ్డగించి. 3120

చ. నిలునిలు వాసుదేవ ధరణీధవు లెల్లరుఁ జూచు చుండఁగాఁ
జలుపఁగ నీయకార్యమును సైతురె నావుడు సీరపాణి లాం

గలముసలాయుధంబులను గై కొని డిగ్గి రథంబునుండి రా
ట్కులభవులార శక్తిగలట్లోలిపిభుల్ కొనిపొండు రుక్మిణిన్. 3121

చ. అనవుడు రాజు లెల్లరును నాహవముం బొనరింపఁబూనుటన్
గనుఁగొని రేవతీధవుఁడు కన్నులనిప్పులురాల లాంగలం
బున ముసలంబునన్ బ్రధనభూమిని నిల్చినశత్రువర్గమున్
దునుముచు నుండ రుక్మి ధృతితోడను వింటను గూర్చి బాణముల్. 3122

సీ. కృష్ణునిపైఁ బ్రయోగింపంగఁ గృష్ణుఁడు, నవ్వుచు నొకమార్గణమున వాని
ఖండించి మఱియొక కాండఁబునను రుక్మి, తురగసారథిరథాదులను గూల్ప
విరథుఁడై రుక్మి సోద్వేగంబుగను నొక్క, కరవాలమును గొని కపిసిరాఁగ
దిగ్గున రథమును డిగ్గి కృష్ణుండు త, త్ఖడ్గంబు నొకసాయకమునఁ దునిమె
గీ. నంతటను రుక్మి యార్చుచు నరుగుదెంచి, కృష్ణునియురంబుపైఁ బిడికిటను గ్రుద్దఁ
బట్టుకొని వానిఁ గృష్ణుఁడు బావ యగుట, క్షురముచేఁ దచ్ఛిరము గొంత గొఱిగి విడిచె.

క. కొందఱు చచ్చిరి పాఱిరి, కొందఱు దిక్కులకు మఱియుఁ గొందఱు శరణం
బొందిరి బలదేవాయుధ, సందళితాంగులయి ఘోరసంగ్రామమునన్. 3124

గీ. అంతటను రుక్మి కృష్ణకృతావమానుఁ, డగుటఁ దలయెత్తికొని యింటి కరుగలేక
యుండె నరగంబువోలె నిట్టూర్పు లిడుచుఁ, గదలకుండంగ నారణాంగణమునందు.

ఆ. అపుడు వాసుదేవుఁ డచ్యుతాగ్రజుడును, స్యందనంబు నెక్కి సంతసమున
రుక్మభూప మైనరుక్మిణితోడను, జనిరి ద్వారవతికి క్షణములోన. 3126

వ. అంతటఁ గృష్ణుండు బృందావనంబునుండి నందగోపయశోదాదిసకలగోపగోపికాబృం
దంబును ద్వారకకు రావించి వసుదేవబలభద్రోగ్రసేనాక్రూరాదియదుపుంగవులును
దేవకీరేవతీరోహిణీప్రముఖయోషిద్బృందంబును నందయశోదాదిగోపబృందంబును సకల
రాజబంధువర్గంబునుం గలవివాహమండపంబున నొక్కశుభలగ్నంబునందు. 3127

సీ. అమరు లెల్లరు మహాహ్లాదంబుతోడను, గురియించు చుండఁగఁ గుసుమవృష్టి
దివమున మంగళదేవతాదుందుభుల్, మ్రోఁగు చుండఁగ మారుమ్రోఁగ దెసలు
భూసురాశీర్వాదములు గొల్పు చుండ మ, హానందమును నంతరంగములకుఁ
గావించు చుండంగఁ గర్ణసుఖంబును, వందిమాగధసంస్తవస్వనంబు
గీ. నాడు చుండంగ నచ్చర లందముగను, బాడుచుండ గంధర్వులపారముగను
నందఱును జూచు చుండ నత్యద్భుతముగ, భీష్మకనృపాలపుత్రినిఁ బెండ్లియాడె. 3128

ఆ. అవల బ్రాహ్మణులకు నవనీశ్వరులకును, గోపబృందమునకుఁ గొల్లలుగను
దివ్యభూషణముల దివ్యాంబరంబుల, నుల్లములు చిగుర్ప నొసఁగి పనిచి. 3129

క. ప్రణుతింప నెల్లప్రజలును, గణుతింపఁగ నమరు లెల్లఁ గౌతుక మొదవన్
మణిమయహర్మ్యంబున రు, క్మిణితోడను గూడుకొని సుఖించుచు నంతన్. 3130

వ. దుర్దమవీర్యంబులును ననితరసాధ్యంబులును నగుసప్తవృషభంబుల నొక్కపాశంబునం గట్టి తచ్ఛుల్కప్రాప్యయును పృథివ్యంశసంభూతయును సత్రాజిన్మహీపాలతనూజయును నగు సత్యభామను లీలాంశసంభూతయును వివస్వత్తనూజయును నగుకాళిందిని విందానువిందునికుమారియును స్వయంవరసముపలబ్ధయును నగుమిత్రవిందనుం బెండ్లియాడి వారలతోడనుం గూడి సుఖంబుండె. 3131

సీ. సత్రాజితుం డొకసమయంబునందు స్య, మంతకం బనునొక్కమానికంబు
తనతమ్ముఁ డగుప్రసేనున కీయ నతఁ డది, దాల్చి భాసిలు చుండఁ దరణివోలె
నది గని కృష్ణుఁ డత్యాశ్చర్యమును జెంది, తన కది యిమ్మని తాను గోర
నతఁ డిట్టు లనియె నియ్యది యొసంగుచు నుండు, నష్టభారసువర్ణ మనుదినంబుఁ
గీ. గాన నెవనికిఁ గూడ నిద్దాని నీయ, ననుచు గోవిందుఁ డేమియు ననక చనియె
నావలను గొన్నిదివసంబు లరుగఁ గృష్ణుఁ, డడవి కేఁగంగ మృగయార్థ మాత్మ నెంచి.

వ. మృగయాప్రవీణు లగుప్రసేనాది వీరాగ్రేసరులతోడం గూడి యొక్కమహారణ్యముం బ్రవేశించి మృగంబుల వేఁటాడందొడంగె. 3133

సీ. అపుడు ప్రసేనుఁ డత్యంతసాహసమున, నతిదూరముగ నేఁగి యడవిలోన
నొక్కండ వధియించు చుండ మెకంబుల, నాకస్మికముగ హర్యక్ష మొండు
చనుదెంచి యివ్వనిఁ జంపి ప్రసేనునిఁ, దద్రక్తమును ద్రావి తనివిదీర
నతనియురస్స్థలమందు వెల్గెడిరత్న, మును గొని యడవిలోఁ జనుచు నుండ
గీ. జాంబవంతుఁడు దానిని సంహరించి, మానికము గొని తనగుహాలోనఁ జొచ్చె
నంతటను నస్తమింపంగ నర్యముండు, బయలుదేఱెఁ జతుర్థీసుధాకరుండు. 3134

ఉ. అప్పుడు వాసుదేవుఁ డనుయాయులతోడను గూడి వేడ్కతో
నుప్పరమందు భాసిలుచునున్న హిమాంశునిఁ గాంచుచుఁ జనన్
జప్పున వేటలోని శ్రమ సర్వము వచ్చి పురంబుఁ జేరి తా
నెప్పటియట్ల సౌఖ్యమున నింతులతోడను గూడియుండఁగన్. 3135

క. వనముననుండి ప్రసేనుఁడు, చనుదేఱమిఁ గృష్ణుఁ డతనిఁ జంపి స్యమంతం
బును గొనె ననునపవాదము, జనియించెను ద్వారకాప్రజావర్గములోన్. 3136

చ. అది విని కృష్ణుఁ డజ్ఞజను లాడెడిమాటలకున్ విభీతుఁడై
యదువులతోడఁ గూడి గహనాంతరభూమికి నేఁగి యచ్చటన్
వెదకి వధింప సింహ మవనిం బడియున్నప్రసేనదేహమున్
బదుగురికిన్ గనంబఱచి ప్రాప్తమనఃపరితాపశాంతి యై. 3137

సీ. అంతటఁ బోక స్యమంతకరత్నంబు, వెదకంగ నెంచి యవ్విపినమందుఁ
జను చుండ నొకగుహ కనఁబడుటయు నందుఁ, జొచ్చి నిర్భయముగాఁ జూచు చుండ
ధాత్రి డోలను స్యమంతకమణిఁ గట్టి జాం, బవదాత్మజుని నందుఁ బండఁబెట్టి
యూఁచుచు మెల్లఁగా నోయికుమార యే, డ్వకు మేడ్వకుము స్యమంతకము నీదె

గీ. కొనియెఁ బంచాననము ప్రసేనుని వధించి, జాంబవంతుఁడు కొనె దాని సంహరించి
యాఁడుకొనుమయ్య యింక నని పాడుచున్న, పాట వినఁబడెఁ జెవులకుఁ బ్రమద మొదవ.

గీ. అంతటను వాసుదేవుఁ డత్యద్భుతముగ, శంఖనాదంబు గావించెఁ జదలుముట్ట
దాని విని జాంబవంతుఁడు తత్క్షణంబ, యాగ్రహంబున గుహనుండి యరుగుదెంచె.

ఆ. అపుడు వారి కయ్యె నాయోధనము పది, దినము లొక్క-మొగిని దెఱపిలేక
యవల జాంబవంతుఁ డడలి తచ్ఛక్తికి, సతని నచ్యుతునిగ నాత్మ నెంచి. 3140

సీ. చాలించి యుద్ధంబు స్వామి నీ వెవ్వండ, వేమికార్యంబు నీ కిటకు రాఁగ
నానతి మ్మని వినయంబున వేఁడి త, త్ప్రత్యుత్తరము విని పరమపురుష
ధన్యుండ నైతి నీదర్శనంబున నేఁడు, రామభద్రావతారమున మున్ను
నాతోడఁ జెప్పిన ట్లేతెంచితివి రణ, స్పృహ తీర్చి మోక్షంబు నీయ నాకు

గీ. నని వచించి తదీయపదాబ్జములను, క్షాళన మొనర్చి తనపుత్రి జాంబవతిని
నొసఁగె సతిగ స్యమంతకయుక్తముగను, దానికిఁ బ్రమోదమును బొంది దానవారి.

క. ఆకన్యారత్నంబులఁ, గైకొని వర మిచ్చి ముక్తి గలుగఁగ నాభ
ల్లూకపతి కరుగుదెంచి వి, లోకించుచు నుండ బంధులోకం బెల్లన్. 3142

వ. స్యమంతకమణి సత్రాజిత్తున కొసంగి జనాపవాదవిముక్తుం డయ్యె. సత్రాజితుం డామాణిక్యంబు తనతనూజ యగుసత్యభామకుఁ బుత్రికాప్రేమంబున నొసంగె. కావున భాద్రపదశుక్లచతుర్థీదినంబునఁ జంద్రదర్శనంబు మిథ్యాప్రవాదకారణం బగు టంజేసి వర్జనీయంబయ్యె. 3143

క. ఆనాఁడు చంద్రదర్శన, మైనయెడల నెవని కేని యతఁడు స్యమంతా
ఖ్యానము విననగు దానను, వానికిఁ గలుగదు జనాపవాదం బెపుడున్. 3144

వ. అటుమీఁద నొక్క-నాఁడు సులక్షణ నాగ్నజితి సుశీల యనుమద్రరాజకన్యకలు ముగ్గురు స్వయంవరంబున వరింపఁ గృష్ణుండు వారలం బత్నులుగాఁ గైకొని యష్టమహిషీజనంబులతోడం గూడి నానాభోగంబు లనుభవింపం దొడంగె. 3145

సీ. అటు లుండ భూపుత్రుఁ డగునరకాసురుం, డమితపరాక్రముఁ డగుటఁజేసి
యోడించి యమరుల యుద్ధంబునను దేవ, పతిని సింహాసనచ్యుతునిఁ జేసి
యదితికుండలములు హరియించి ధనదుని, నిధుల నెల్లను గొని నిర్భయముగ
మయవినిర్మిత మైనమాయాపురంబునం, దధివసించుచు గగనాంగణమున

గీ. బాధవెట్టుచు నుండంగఁ బ్రజల నెల్ల, సురలు విచ్చేసి కృష్ణునిదరికి నరక
బాధ లెఱిఁగింప శౌరి సుపర్వకోటి, కభయము నొసంగి తార్క్ష్యుని నాత్మఁ దలఁచె.

సీ. తలఁచినవెంటనె తార్క్ష్యుఁడు చివ్వునఁ, జనుదెంచి మ్రొక్కి- కృష్ణునకు నిలువ
వాసుదేవుఁడు తార్క్ష్యవాహనంబును సత్య, తోడ నధిష్ఠించి తూర్ణముగను
రవిమండలమువోలె దివిని వెల్గుచునున్న, రాక్షసపురము చేరంగ నేఁగి
యజముఖామరులకు నైన భేద్యముగాని, తత్పురావరణసంతతుల నెల్లఁ

గీ. దరణి నిజదీప్తిచేఁ దమస్తతులఁ బోలెఁ, జక్రధారను ఛేదించె విక్రమించి
యంతటఁ దదంతరస్థితులైన దైత్య, భటులు సంఖ్యాధికంబుగా బయలుదేఱె. 3147
క. బొనరించి శౌరితోడను, నని ఘోరంబుగను జక్రహతిచేతను దు
త్తునియలయి కూలి రిలమీఁ, దను వజ్రచ్ఛిన్నభూమిధరములువోలెన్. 3148
సీ. అంతటఁ బాంచజన్యంబుఁ బూరింపంగఁ, గృష్ణుండు దిక్కరుల్ గీఁకవెట్ట
నది విని నరకుఁ డత్యాటోపమునను గై, కొని శరాసనము స్యందనము నెక్కి
రణభూమి కేతెంచి గణనాతిగములైన, శరములఁ గురియింప శౌరిమీఁదఁ
జక్రధరుం డర్ధచంద్రబాణముచేతఁ, ద్రుంచి తచ్చాపంబుఁ దునియలుగను
గీ. నతనియురమున నొక్కదివ్యాస్త్ర మేయఁ, దత్ప్రఘాతంబునను వాఁడు ధరను గూలె
నపుడు ప్రార్థింప భూదేవి యచ్యుతుండు, కనికరంబున వానిదగ్గఱకుఁ బోయి. 3149
సీ. రాత్రించరేంద్ర వరంబు గోరుము నాఁగ, నరకుఁ డాతనిఁ జూచి పరమపురుష
నీచేతిలో మరణించుటె ముక్తిదా, యక మన్యవర మేల యంతకంటెఁ
గోరెదనైనను గోరు మంటివి గాన, సర్వలోకహితంబు సలుప నెంచి
నామృతదివసంబునను మంగళస్నాన, మాచరించెడిజను లందఱకును
గీ. నిరయసంప్రాప్తిలేకుండ వరము నీయు, మనుడు నట్టులె యగుఁగాక యనియె శౌరి
యంత నరకుఁడు చూచుచు హరిపదములఁ, బ్రాణములు వీడి వైకుంఠపదముఁ బడసె.
వ. అప్పుడు వాసుదేవుండు నరకాలయముం జొచ్చి తదపహృతపదార్థంబుల నెల్లం గైకొని తత్తత్స్వాముల కొసంగి నరకాసురుండు పార్థివుల నెల్ల జయించి సర్వరాష్ట్రంబుల నుండి కైకొనివచ్చి తనయంతఃపురంబున నిరోధించి యునిచినషోడశసహస్రరాజకన్యకలను దన్నిరోధవిముక్తులం గావించి. 3151
గీ. అప్పు డాకన్య లెల్ల ననంగతాప, తప్తలై తన్ను వరియింప దారలుగను
నేకలగ్నంబుననె వారి నెల్లఁ గొనియెఁ, దాల్చి బహుదేహములను నత్యద్భుతముగ.
సీ. అయ్యెడ నరకాసురాత్మజుఁ డేతెంచి, శరణుచొచ్చుటయును శార్ఙ్గపాణి
భూదేవిప్రార్థనంబున వారి నెల్లను, స్థాపించి జనకరాజ్యంబునందు
నింద్రవిమానంబు నెక్కించి యారాజ, సుతల నెల్లను ద్వారవతికిఁ బనిచి
తా నెక్కి సత్యతోఁ దార్క్ష్యవాహనమును, దేవమాతను జూడ దివికి నేఁగి
గీ. యదితిసందర్శనము సేసి యామె కీయఁ, గుండలములను నామె యఖండముగను
సంతసించుచుఁ బుత్రవాత్సల్యమునను, నమృతభోజనము నొసంగి యాదరించె. 3153
గీ. అంత నాదిత్యులును మహేంద్రాదిసురులు, వసువులును రుద్రులును గౌరవం బెలర్ప
స్వర్ణపుష్పంబులను బూజ సలిపి హరికిఁ, దన్మహత్త్వంబుఁ బొగడి రత్యద్భుతముగ.
సీ. శచినిఁ జూడఁదలంచి సత్య యంతటఁ దదీ, యావసథంబున కరుగ నామె
సత్యభామను మహాసంతోషమున గౌర, వించుచు నుండ నవ్వేళ యంద

పౌలోమి కల్పద్రుమంబు పారిజాతసుమంబు, లనుపంగఁ దనభృత్యజనులవలనఁ
జేకొని వాని శచీదేవి తొడుపుముప్పై; మురియుచుఁ జక్కఁగాఁ జెరివికొనియెఁ
గీ. దాని కొసంగిన యింద్రసుతయె ప్పొల్పుకతన, సూనముల నెల్లఁ ద న్నవమానపఱిచె
ననెడికనుకను సత్య చిప్పనను లేచి, వచ్చి యటనుండి శౌరి కావార్తఁ దెలిపె.
సీ. ఆమాటలు విని నెల్ల నాలించి కృష్ణుండు, తలయూఁచి మదిలోనఁ గంటగఁ గినుక
గరుడవాహనము నాకాంతతోడను నెక్కి, చని నందనోద్యానమునకు వేగ
పారిజాతంబు నుత్పాటించి తార్క్ష్యుని, పై నుంచికొని కడుభద్రముగను
నరుదెంచి ద్వారకాపురికి స్థాపించె నా, పాదపంబును సత్యభామయింట
గీ. నది యెఱిఁగి పురందరుఁ డధివసించి, యభ్రమాతంగమును గేల నశనిఁ దాల్చి
యమరయూథంబుతోడను నరుగుదెంచి, ముట్టడించెను ద్వారకాపట్టనమును. 3156
గీ. అంతటను బురుహూతున కచ్యుతునకు, నద్భుతం బైన సంగ్రామ మయ్యె నంత
శౌరి కోటమి గలుగమి శక్రుఁ డడరి, విడిచె వజ్రంబు రుక్మిణీవిభునిమీఁద. 3157
క. ఆవజ్రము నొక కేలను, గోవిందుఁడు పట్టి సురలగుండియ లవియన్
గావించు చుండ హాసము, దేవేంద్రుఁడు గజమునుండి దిగి సవ్రముండై. 3158
క. చనుదెంచి పాదచారం, బునఁ గృష్ణునిసన్నిధానమునకుఁ బ్రణామం
బొనరించి నిలిచి సంస్తవ, మును జేసి బహుప్రకారముల వినయమునన్. 3159
క. గోవింద పారిజాతము, దేవతలకు నీవె యిచ్చితివి మును దానిన్
భూవలయస్థాపితముం, గావింపఁగనగునె నేఁడు క్రతుభుజు లోఁటలన్. 3160
చ. అని పలుకంగఁ గృష్ణుఁడు సురాధిప భూమికిఁ బారిజాతమున్
గొని చనుదెంచినాఁడను మనుష్యహితార్థను నేఁడు నేను భూ
మినిగలయంతదాఁక నిది మేదినిలో నగు నుండ నావలన్
గొని చనవచ్చు స్వర్గమునకున్ జనుఁ డిప్పుడు రిక్తహస్తు లై. 3161
క. అని చెప్పి యొసఁగ వజ్రం, బును బురుహూతుఁడు ప్రమోదమునఁ గొని దానిన్
జనియెను గృష్ణునిమహిమను, వినుతించుచు సురలతోఁ ద్రివిష్టపమునకున్. 3162
గీ. అంతఁ గృష్ణుఁ డనేకదేహములతోడ, నఖిలభార్యాగృహంబులయందు రేల
వర్తిలుచు సర్వగతుఁ డయి వారి నెల్ల, నంగజసుఖాబ్ధిలో నోలలార్పఁదొడఁగె.
వ. అట్లు కొంతకాల మరుగుటయుఁ గృష్ణునకు రుక్మిణీదేవియందు మదనాంశంబునఁ బ్రద్యుమ్నుఁ డుదయించి శంబరాసురుని సంహరించె. ప్రద్యుమ్నునకు రుక్మితనూజయం దనిరుద్ధుండు ప్రభవించె. 3164
సీ. బాణాసురునితనూభవ యగునుష యొక, నాఁటిరాతిరిని స్వప్నంబునందు
సుందరుం డగుపురుషుని నొక్కరుని మహా, బాహుని షోడశాబ్దములవానిఁ
గని వానితోడను గామసౌఖ్యాబ్ధిలో, నోలాడి యోలాడి మేలుకాంచి
స్వప్నలబ్ధుం డైనవాఁడు గానఁగరామిఁ, గంధర్వశరవిద్ధగాత్ర యగుచుఁ

గీ. పలికెలుచు నుండె నప్సఖి చిత్రలేఖ, తత్ప్రసాదనిదాన మంతయును నామె
వలనని యెఱింగి సౌందర్యవంతులైన, వారలను నెల్లఁ బటమున వ్రాసి చూపె.

క. కని వారల నెల్లర నుష, యనిరుద్ధునిఁ జూచి యితఁడె యతఁ డని చెప్పం
గనె చిత్రలేఖ మాయా, తనువున ద్వారకకు నేఁగి దానవి యగుటన్. 3166

వ. నిశీథకాలంబున నొక్కయంతఃపురముం జొచ్చి యందు మనోజ్ఞపర్యంకంబునం బవ
ళించి నిద్రించు చున్నయనిరుద్ధుని నిజమాయాప్రభావంబునం గైకొనివచ్చి బాణాం
తఃపురచైత్యప్రాసాదంబున నుషాశయ్యాతలంబునం బవళింపంజేసి చనియె. 3167

సీ. అవల మేల్కని యనిరుద్ధుఁ డతిమనోజ్ఞంబైనశయ్యాతలంబునందుఁ
దనపార్శ్వమునఁ బండుకొని యున్నదాని వి, భ్రాజితహేమవర్ణంబుదాని
నీలోత్పలంబుల నేలుకన్నులదాని, సోమునిగో మోముమోముదాని
బింబాధరముదాని శంబరారిశరాస, నమును శాసించుకన్బొమలదానిఁ

గీ. గఠినవక్షోజములదానిఁ గౌను గలదొ, లేదొ యనుసంశయంబు గల్గించుదాని
బిసమృదులబాహువులదానిఁ బిన్నదాని, నుచితలక్షణములదాని నుషను గాంచి.

గీ. కామశరతాడితాంగుఁడై గాఢముగను, గౌఁగిటను జేర్చికొని కామకళల నొత్తి
తమిని గ్రోలుచు నధరామృతమును మదన, కేళిసౌఖ్యపయోధిలో నోలలార్చె.

గీ. అట్లు లోకమాసము నిరంతరాయముగను
గడవఁగను గోప్యముగ నేమి యిడుమ గలుగఁ
గలదొ యీవార్త స్వామికిఁ దెలుప కున్న
నని యడలి యొక్కదాసి బాణునకుఁ దెలిపె. 3170

సీ. అంతట బాణుఁ డత్యంతరోషంబున, నంతఃపురద్రోహి యైనవానిఁ
గొనిరండు శీఘ్రంబుగను నుషాప్రాసాద, మున కేఁగి యని చెప్పి యనుప భటులఁ
జని వార లెల్లరు స్వామి చెప్పినయట్లు, సత్వరంబుగ నుషాసౌధమునకు
ననిరుద్ధుని నిబద్ధు నొనరించుకొని పోవఁ, దగినసామగ్రితో దరికి రాఁగ

గీ. నప్పు డనిరుద్ధుఁ డవలీల నచట నున్న, స్తంభమును బెల్లగించి యాదైత్యభటుల
నెల్లరను దాన నధియింప నెఱిఁగి బాణుఁ, డాతనిపరాక్రమముఁ దానె యద్భుతుఁ డెంచి.

క. అనిరుద్ధుని బంధింపం, గను జూచుచు నుండ నతఁడు గ్రక్కునఁ బరిఘం
బును లాగి త్రిప్పి గిరగిర, దనుజేంద్రునిమీఁద వైచె ధరణి చలింపన్. 3172

వ. అయ్యెడ బాణుం డాపరిఘంబు నొక్కనిశితాశుగంబునం దునిమి యురగాస్త్రంబుచే
ననిరుద్ధుని నిరుద్ధునిం జేసి నిజాంతఃపురంబునం దుంచె. 3173

సీ. నారదుం డంతట ద్వారకాపురి కేఁగి, యనిరుద్ధువార్తఁ గృష్ణునకుఁ దెలుప
వైనతేయుని నెక్కి వాసుదేవుఁడు హలి, ప్రద్యుమ్నసహితుఁడై బలముతోడ
నరుదెంచి బాణునిపురికిఁ దద్ద్వారంబు, నను గావలిగ నున్నన శ్శైదిర్చి
కాఁపఁ బోడఁగ సంగ్రామంబు ఘోరంబు, గను సీరపాణికి గజముఖునకు

ఆ. బాహులేయునకును బ్రద్యుమ్నునకును యా, దవబలంబునకును భవగణంబు
లకును యుద్ధ మయ్యె సకలలోకములును, దల్లడిల్లఁ దత్ప్రతాపములకు. 3174

సీ. అయ్యెడ విఘ్నేశుఁ డచ్యుతాగ్రజునిపై, క్షమున గాటముగ దంతమునఁ బొడువఁ
దాళధ్వజుండు తద్వదనంబుపైఁ గొట్టె, ముసలాయుధంబున వసుధ యదర
నాప్రేటునను భగ్నమగుటను దంతంబు, దంతిముఖుం డేకదంతుఁ డయ్యె
నావల బలరాముఁ డెదిరి రుద్రగణంబు, లను బాఱఁగొట్టెఁగ లాంగలమున

గీ. యాదవబలంబు చెలఁగి చెల్లాడఁ దొడఁగె, నంత నది యెల్లఁ గాంచి నేనాగ్రహమునఁ
బ్రభవ మొందింపఁ దాపజ్వరంబు దానిఁ, గెడప శీతజ్వరంబుఁ గల్పించె శౌరి. 3175

వ. అంత నాజ్వరంబులు రెండునుం గొట్టుకొని యస్మదాజ్ఞచే మర్త్యలోకంబునం బ్రవేశించె.

సీ. అవలఁ గృష్ణుఁడు మోహనాస్త్రంబు నేయంగ, నాపైకి నది దారుణముగ వచ్చి
నను మూర్ఛితునిఁ జేయఁగను షణ్ముఖుండు ప్ర, ద్యుమ్నునితోఁ జేయుదురము నాఁపి
కైకొని శక్తి నాగ్రహమున శౌరిపై, కేతేరఁగను బంకజేక్షణుండు
వారించి యొక్క-హుంకారంబునను దానిఁ, జదలు ముట్టఁగఁ బాంచజన్య మూఁదె

గీ. శ్రవణములఁ దాఁక నాశంఖరవము కఠిన, కఠినముగ బాణుఁడు సహస్రకరములందుఁ
దాల్చి బహుళాయుధముల స్యందనము నెక్కి, కదనభూమికి సైన్యయుక్తముగ వచ్చి.

క. కురియింప శౌరిమీఁదను, శరవర్షము నచ్యుతుండు చక్రముచేఁ ద
చ్ఛరములనె కాక యాతని, కరములనుం దునిమె ఖండఖండంబులు గాన్. 3178

వ. అట్టియెడ నీ వరుగుదెంచి కృష్ణునకు మ్రొక్కి దేవా పూర్వజన్మంబున నేను నీకు దాసినై కౌశలపర్వతంబున నుండుతరుణంబున సుప్రసన్నహృదయంబుతోడ నాకు శాశ్వతసౌభాగ్యసిద్ధి యగునట్లు నీవు వరం బొసంగుటంజేసి నీనామసహస్రంబులో గౌరీసౌభాగ్యదాత యనునొక్క-ముఖ్యనామంబు మహర్షులచేఁ బేర్కొనంబడియె.

క. ఆవరము సార్థకంబుగఁ, గావింపఁగ నిదియె తగినకాలం బని వా
పోవఁగను మోహనాస్త్రము, గోవిందుఁడు త్రిప్పి మేలుకొని నే నంతన్. 3180

సీ. ప్రాంజలి నై కృష్ణపరమాత్మయెదుటను, నిలువంగఁబడి సంస్తుతుల నొనర్చి
యచ్యుత బలిసుతుం డై నయీబాణుఁడు, నన్నుఁ గూరిచి ము న్నొనర్చి తపము
సమరణత్వంబును బ్రార్థింపఁగను నట్లె, యితనికి వరము నిచ్చితిని నేను
క్షమియించి మాయపచారంబులను నెల్ల, వదలుము వీని జీవములతోడ

గీ. నని వచింప మదీయవాక్యమునఁ జేసి, వాసుదేవుఁడు బాణుని వదలె నై చే
నెఱుకలేదే సతీ యంత వృషభ మెక్కి, యరుగుదెంచితి మీరౌప్యగిరికి నాఁడు.

వ. అప్పుడు బాణాసురుండు సప్రశ్రయంబుగా రామకృష్ణప్రద్యుమ్నుల నిజభవనంబునకుం దోడ్కొనిపోయి స్వర్ణసింహాసనంబులం దుపవిష్టులంజేసి పూజించి సుప్రసన్నులం గావించికొని తదనుమతిం బడసి తనపుత్త్రి యగు నుష ననిరుద్ధున కొసంగి సర్వజనశ్లాఘ్యంబుగా వివాహంబు గావించె. 3182

గీ. అంతఁ గృష్ణుఁ డుషానిరుద్ధాన్వితముగ, స్యందనము నెక్కి యన్నయు నందనుఁడును
పార్శ్వమున నుండ యాదవబలముతోడ, ద్వారకకుఁ జేరె సురలతో వజ్రివోలె.

వ. పిదపఁ బౌండ్రకవాసుదేవుం డనుకాశీరా జొకండు వారాణసీపురంబున ద్వాదశవర్షంబులు నిరాహారుం డై పంచాక్షరజపంబు గావించుచు నన్ను నిజనేత్రపద్మంబుచేఁ బూజింప నేను సుప్రసన్నుండ నై వానికి దర్శనం బొసంగి వరంబుం గోరు మన వాఁడు తనకు వాసుదేవసమానరూపంబు నర్థింప నే నాతనికిఁ దద్రూపంబు ననుగ్రహించి యదృశ్యుండ నైతి. 3184

సీ. అంతట వాఁడు గర్వాంధుఁ డై నాకంటె, వాసుదేవుం డనువాఁడు లేఁడు
వలయు నాకె సపర్య సలుపఁగా నెల్లరు, లేకున్నఁ గూల్తు ముల్లోకములను
నని బలాత్కారంబునను లోకులను నెల్ల, బాధించి ప్రజలఁ బడయు చుండ
నారదుం డొక్కదినంబునఁ దద్గర్వ, మడఁపంగ నేతెంచి యతనికడకు

గీ. భూతలాధిప ద్వారకాపురిని వాసు, దేవనామంబునను వసుదేవపుత్రుఁ
డున్నవాఁ డొక్కరుఁడు వాని నుక్కడంప, కున్న నీపేరు జగమున నుండ దనియె.

సీ. అమ్మహామునిపలుకు లాలించి పౌండ్రక, వాసుదేవుఁడు క్రోధవశతచేతఁ
దార్క్ష్యపతాకాన్వితస్యందనారూఢుఁ, డై చతురంగసైన్యంబుతోడ
ద్వారకాపురముపై దండెత్తి శంఖంబు, పూరింప నవ్వుచు శౌరి వచ్చి
సంధించి బాణపంచకము శార్ఙ్గంబున, బలము నెల్లను నేలపాలు చేసి

గీ. యొక్కశరమున శార్ఙ్గంబు నొక్కకోల, గరుడకేతనమును నొక్కకాండమునను
శంఖచక్రాదులను జతుస్సాయకముల, నాల్గుభుజముల ఖండఖండములు సేసి. 3186

సీ. వదలంగఁ జక్రంబు వానిపై నది యేఁగి, తచ్ఛిరంబును ద్రుంచి దాని నప్పుడె
పడవైచి కాశిలోఁ బౌండ్రకవాసుదే, వాంతఃపురంబున నరుగుదెంచె
నాశీర్షమును జూచి కాశీశ్వరునిపత్ని, యైనమృత్యువు క్రోధ మానహిల్లఁ
దనతనూజుం డై నదండపాణికిఁ జెప్ప, వాసుదేవునిఁ జంపవలయు ననుచు

గీ. నతఁడు నన్నుఁ గూర్చి మాహేశ్వరాధ్వరంబు, సలుపఁ గృష్ణునివధియించుతలఁపుతోడఁ
దన్మఖంబున కేను సంతసము నొంది, కృత్య నొకదాని నాతని కిచ్చినాఁడ. 3187

వ. అంతట దండపాణి జ్వాలామాలాపరీతయును సందీప్తసటాకలాపయును బింగళలోచనయును జ్వలత్కరాళవదనయును ద్రిశూలహస్తయును భస్మభూషితయును నరశిరోమాలాలంకృతయును సర్వలోకభయంకరాకారయును నగుమాహేశ్వరకృత్యను గ్రహించి సపుత్రకళత్రబాంధవుం డగువాసుదేవుని దహింపు మని యభిమంత్రించి విడిచె. 3188

సీ. అంతట నాకృత్య యాత్మతేజంబుచే, దహియించుచును మహీతలము నెల్లఁ
బ్రళయకాలాశనిపగిదిఁ గఠోరనా, దంబు సేయుచును రోదసులు నిండ

వాయుజవంబున ద్వారకాపురి కేఁగి, చొచ్చు చుండంగఁ గృష్ణునిగృహంబు
శౌరి తత్క్షణమంద చక్రంబు దానిపై, విడువంగఁ గృత్య యవ్వేలుఁగు చూచి
గీ. గజగజ వడంకుచును భీతికతన మరలి, పఱచి కాశికిఁ జని దండపాణిగృహముఁ
జొచ్చుటయు దానివెంబడిఁ జొచ్చి విష్ణు, చక్రము లయానలజ్వాలజ్వాల లోలయ.
క. దహియించి దండపాణిన్, సహపరివారముగ వారణాసీపురమున్
సహనరపశుఖగపాదప, గృహహర్మ్యసమేతముగ దహించి సకలమున్. 3190
క. అరుదెంచి వాయుజవమున, హరికరముం జొచ్చె నంత నబ్జాక్షుండు సో
దరపుత్రపౌత్ర భార్యా, పరివారసమేతముగను భాసిలు చుండన్. 3191
సీ. మగధదేశాధీశుఁ డగుజరాసంధుఁడుఁ, యుద్ధంబునను క్షత్రియులను నెల్ల
నోడించి కారాగృహోపబద్ధులఁ జేసి, వారి నెల్లను బలాత్కారమునను
బ్రతిమాసమును గృష్ణపక్షచతుర్దశి, నాఁ డొక్కొకనిఁ జంపి నాఁటిరేయిఁ
దద్రక్తమును నివేదనము చేయుచు భైరవ, పునరుఁ బూర్వద్వేషమునను జేసి
గీ. యాదవుల నెల్లఁ బట్టిపాలార్చు చుండ, వానిదుర్వర్తనము విని వాసుదేవుఁ
డవనిభారంబుఁ దీర్పంగ నవతరించి, నట్టినారాయణుం డాట నాగ్రహించి. 3192
వ. జరాసంధుండు మద్వారంబున శస్త్రావధ్యుం డగుటంజేసి మల్లయుద్ధంబునందక్క నత
నిం గెడప సాధ్యంబు గాదని నిశ్చయించి భీమార్జునులతోడం గూడి విప్రవేషంబునఁ
దత్పురంబుం బ్రవేశించి యాతనికి దర్శనం బీయ జరాసంధుండు వారలకు భక్తి
ప్రణామంబు గావించి. 3193
గీ. బ్రాహ్మణోత్తములార యుష్మత్పదాబ్జ, రేణుసంస్పర్శమునను మద్గృహము పరమ
పావనం బయ్యె ధన్యతఁ బడసె మిమ్ముఁ, గాంచుటనుజేసి నాజన్మకర్మములును.
క. కోరుండు మీర లెయ్యది, కోరిన నది యిచ్చువాఁడఁ గొంకక యనుడున్
స్మేరాననంబుతోడను, వారిజనాభుండు చూచి వానిమొగంబున్. 3195
గీ. ఇతఁడు భీముఁడు ఫల్గునుఁ డితఁడు నేను, గృష్ణుఁడను ద్వంద్వయుద్ధార్థ మేఁగుదెంచి
యున్నవారము నీతోడ నొసఁగు మదియె, యిచ్చుకోలదిని మాలోన నెవని కేని.
క. అనుడు జరాసంధుఁడు భీ, మునితోడను మల్లయుద్ధమును ఘోరముగా
నొనరించెఁ బంచవింశతి, దినములు సురలకును గుండె దిగ్గురనంగన్. 3197
గీ. అంతటను గృష్ణచోదితుఁ డై సమీర, సూనుఁ డమ్మగధేశునిమేను రెండు
చీలికలు గాఁగఁ జీల్చి నేలమీఁద, విసరివై చినఁ బ్రాణముల్ విడిచె వాఁడు. 3198
వ. అటుమీఁదఁ గృష్ణుండు జరాసంధనిరుద్ధు లగుపార్థివుల నెల్ల బంధనిర్ముక్తులం జేసి
భీమార్జునుల తోడం గూడి యింద్రప్రస్థంబున కరుదెంచి యుధిష్ఠిరునిచే రాజసూయ
మహాక్రతువుఁ జేయించె. 3199
సీ. ఆయధ్వరంబు సమాప్తి నొందినమీఁద, సకలధాత్రీనాథసమితిలోన
శ్రీకృష్ణునకు యుధిష్ఠిరుఁ డగ్రపూజ గాం, గేయానుమతమునఁ జేయు చుండ

నగ్రపూజకుఁ గృష్ణుఁ డర్హుండుగాఁ డని, శిశుపాలుఁ డనుచితశీలమునను
దూషించు చుండంగ రోషంబునను జక్ర, ధరుఁడు చక్రమునఁ దచ్ఛిరముఁ ద్రుంచె

గీ. నంతటను శిశుపాలుఁడు హరిపదంబుఁ, జెందె జన్మత్రయాంత మైనందువలన
నవలఁ గృష్ణుఁడు ద్వారకి కరిగెఁ జనిరి, సకలపార్థివులును స్వస్వసదనములకు. 3200

గీ. అవల మధురాపురంబున నని యొనర్చి, దంతవక్త్రుఁడు శౌరితోఁ దద్గదాప్ర
హారణమున దేహముఁద్యజించి పరమపదముఁ,జెందె జన్మత్రయాంత మైనందువలన.

వ. ఇట్లు జయవిజయులు సనకాదిమహామునిశాపవ్యాజంబున భగవల్లీలార్థంబు మర్త్య లోకంబున హిరణ్యాకశిపుహిరణ్యాక్షులుగను రావణకుంభకర్ణులుగను శిశుపాలదంతవక్త్రులుగను నవతరించి భగవానునిచేతన నిహతులై జన్మత్రయావసానంబునఁ బరమపదముం జెందిరి. 3202

సీ. అటుమీఁదఁ గృష్ణుఁడు యమునానదిని దాటి, ప్రమదంబునను గోకులమున కేఁగి
నందనం బొనరించి నందునకు యశోద, కును మిగిలినవృద్ధగోపులకును
దివ్యభూషణముల దివ్యవస్త్రంబుల, నర్పించి వ్రజవాసు లందఱకును
యమునానదీపులినమునఁ క్షేమక్రీడ, గావించుచును వ్రజాంగనలఁ గూడి

గీ. యొక్కమాసద్వయం బట నుండి యచటి, నిఖిలజీవుల వైకుంఠనిలయమునకుఁ
బనిచి దేవవిమానంబుపైని నమర, వర్గము నుతింపఁగను ద్వారవతికిఁ జేరె. 3203

వ.- అట్లు శ్రీకృష్ణుండు ద్వారకాపురంబునకుం జేరి వసుదేవోగ్రసేనసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధాక్రూరాదులచేఁ బ్రతిదినంబునుం బూజింపంబడుచు విశ్వరూపధరుండై యష్టమహిషీజనంబులను షోడశసహస్రకళత్రంబులను దివ్యరత్నమయనానాగృహాంతరంబులందు సురతరుకుసుమసమంచితమృదులపర్యంకంబులందుఁ గుసుమశరకేళీసుఖాంభోధి నోలలార్చుచు మహానందంబున నుండ. 3204

సీ. ఒకనాఁడు బ్రాహ్మణుం డొకఁడు కుచేలాఖ్యుఁ, డతిదరిద్రుఁడు ద్వారవతికి వచ్చి
తనసతీర్థ్యుం డైనదైత్యారి దర్శింపఁ, దలఁచి భైష్మీగృహద్వారమందు
నిలువంగఁబడుటయు జలజాక్షుఁడు గ్రహించి, చనుదెంచి యటకుఁ దత్క్షణమునంద
కొనిపోయి యాతనిఁ దనచంద్రశాలకు, నుచ్చాసనమునఁ గూర్చుండఁబెట్టి

గీ. కలశమున రుక్మిణీదేవి జలము వోయఁ, దత్పదంబులు గడిగి మూర్ధమునఁ జల్లు
కొని తదంబుకణంబులు కుశలవార్త, లడిగి యాతని సంతసంపడ నొనర్చె. 3205

వ. తన కర్పింప యాచించి తెచ్చినపృథుకంబు లాతనిజీర్ణవసనంబునం దుండ స్నేహభావంబున మందహాసంబుఁ జేయుచు నవి స్వయముగాఁ గైకొని భుజించి కుచేలున కరుగ నాజ్ఞ యొసంగె. 3226

సీ. అపుడు కృష్ణుం డీయఁడాయె నేమియు నని, చింత నొందుచును గుచేలుఁ డేదను
స్వపురంబునకు వచ్చి స్వగృహంబులోఁ గల,ధనధాన్యవస్తుసంతతులఁ జూచి

యైశ్వర్యమును జెంది యవి యెల్ల శౌరికి, యాగసమాగతములె యని యెంచి
విష్ణుసంప్రీతికై వివిధయాగములను, గావించి మోక్షంబు గాంచెఁ దుదకు
గీ. నవల ధృతరాష్ట్రనందనుం డగుసుయోధ, నుండు పాండునృపాలసూనులను మాయ
జూదమున గెల్చి గళితరాజ్యుల నొనర్చి, వెడలఁగొట్టంగ వా రెల్ల నడవి కరిగి. 3207
వ. ద్వాదశాబ్దంబు లరణ్యవాసంబును నొక్కహాయనంబు మత్స్యదేశాధిపతి యగు విరా
టునిపురంబున నజ్ఞాతవాసంబును గావించి కృష్ణసాహాయ్యంబున ధార్తరాష్ట్రులతోడ
సంగ్రామంబునకుం దొడంగిరి. 3208
సీ. అప్పుడు కురుక్షేత్రమందుఁ బాండవులకు, ధార్తరాష్ట్రులకు యుద్ధంబు జరుగఁ
బార్థసారథి యయి భగవానుఁ డతనిలో, స్వీయశక్తిని బ్రవేశింపఁజేసి
యడఁగార్చి యేకాదశాక్షౌహిణీయుతం, బుగను దుర్యోధనముఖుల నెల్ల
స్థాపించి పాండునందనుల రాజ్యమునందు, క్షితిభార ముడిపి నిశ్శేషముగను
గీ. గురియుచుండంగ సుర లెల్లఁ గుసుమవృష్టి, యాకసమునుండి తనమీఁద హర్షమునను
ద్వారకకుఁ జేరి బంధుసంతతుల కెల్ల, సంతసము గొల్పుచుండ నాసమయమందు. 3209
వ. ఒక్కబ్రాహ్మణుండు మృతుం డైనపంచవార్షికబాలకుని నొక్కనిం గొనివచ్చి కృష్ణ
భవనద్వారంబునం దుంచి కృష్ణుండు నాపుత్రుని బ్రదికింపకున్న నే నిచ్చోటన ప్రాణం
బుల నుజ్జగించెద నని యేడ్చుచుండ. 3210
సీ. ఆసమయంబున నర్జునుం డేతెంచి, వాసుదేవునిఁ జూచువాంఛతోడ
నావిప్రునివిలాప మాలించి నీయర్భ, కుని బ్రతికింతు నే నని వచించి
సకలసంజీవనాస్త్రములఁ బ్రయోగించి, యవి యెల్ల వ్యర్థంబు లగుటఁజేసి
తనప్రతిజ్ఞకు భంగ మొనగూడుటను జూచి, మేను వాయుట కుద్యమించుచుండ
గీ. నప్పుడు భవనంబులోనుండి యరుగుదెంచి, శౌరి దర్శన మీయ నాభూసురుండు
కృష్ణ నాపుత్రు లార్వురు మృతిని జెంది, రింక నేనును మరణింతు నిటనె యనియె.
క. అనవుడుఁ గృష్ణుఁడు కనికర, మొనయఁగ భూసురవరేణ్య యేడ్వకుము భవ
త్తనయుల నెల్ల నొసంగెద, నని యభయము నిచ్చి యతని కతిశీఘ్రముగన్. 3212
గీ. అర్జునునితోడఁ దార్క్ష్యవాహనము నెక్కి, విష్ణులోకంబునకు నేఁగి విప్రసుతుల
మాధవానుజ్ఞచేఁ గొని మహికి వచ్చి, భూసురున కిచ్చెఁ బ్రజల కాశ్చర్య మొదవ.
క. అంతట నాబ్రాహ్మణుఁ డ, త్యంతామోదమున సుతుల నార్వురఁ గొని దై
త్యాంతకునకు బహుళాశీ, స్సంతతు లొసరించి చనియె స్వగృహంబునకున్. 3214
వ. కృష్ణుండు తనభార్యలయందుఁ బదివేలమందిపుత్రులం గాంచి తత్పుత్రపౌత్రపరంపరచే
మరల భూభారం బగు నని తలంచి యాదవుల నెల్ల ఋషిశాపవ్యాజంబున సంహా
రింప సంకల్పించె. 3215
సీ. అప్పుడు కృష్ణకుమారు లందఱు నర్మదా, తటమున విహరింపఁ దలఁచి యేఁగి
యచటఁ దపంబు సేయుచు నున్నకణ్వునిఁ, గాంచి తచ్ఛక్తిని గాంచ నెంచి

జాంబవతీతనూజుఁడై నట్టిసాంబునకు స్త్రీవేషంబుఁ దనరఁ జేసి
యాయసముసలంబు నతిగుప్తముగఁ బెట్టి, తత్కుక్షిసంస్థవస్త్రంబులోన

గీ. వానిఁ గొనిపోయి యాకణ్వమౌనికడకు, స్వామి యీగర్భిణికి మగవాఁడు పుట్టఁ
గలఁడొ యాఁడుది పుట్టునో తెలుపు మనుడుఁ, దెలిసికొని సర్వమును దివ్యదృష్టివలనఁ

సీ. మాహాత్ములార యీముసలంబె యాదవా, న్వయనాశకర మగు నని శపింప
వారలు ఖిన్నులై ద్వారక కేతెంచి, కృష్ణున కావార్త నెఱుఁగఁజేయ
నాముసలము నొక్కహ్రదములోఁ గలిపెఁ జూ, ర్ణీకరింపఁగఁజేసి కృష్ణుఁ డంత
నమ్ముసలము కనిష్ఠాంగుళిమాత్రశే, షముతోడ నుండఁ దజ్జలములోన

గీ. దాని నొకచేప మ్రింగ నద్దాని నొక్క, వ్యాధుఁడు వధించి తద్గర్భమందుఁ జొచ్చి
నట్టిముసలావశేషంబు స్వాశుగాగ్ర, ఫలకముగఁ జేసికొని సంతసిలుచు నుండె. 3217

సీ. అటుమీఁద నొకనాఁడు యాదవు లెల్లరు, వాసవసంప్రేషితాసవమును
ద్రావి తన్ముసలచూర్ణప్రభూతము వజ్ర, సమమును నగువీరణమును జొచ్చి
యొండొరు లెఱుంగక యుద్ధ మన్యోన్యంబు, సలిపి యచ్చట ద్రుంది చనిరి దివికి
శౌరి యాహవపరిశ్రాంతుఁడై శయనించి, యొకచెట్టునీడ నిట్టూర్పు లొలయ

గీ. నుంచికొని జానువునఁ బాద ముల్లమందుఁ
దలఁచు చుండంగ నిజమర్త్యతనువు నుడుగ
నప్పు డావ్యాధుఁ డటకు వేటాడ వచ్చి
దూరమునఁ గాంచి తత్పదాంభోరుహంబు. 3218

గీ. దాని మృగముగ నెంచి తత్క్షణమునందు, చాపమునఁ గూర్చి ముసలశేషఫలకాంచి
తాశుగము దానిపై నేసి యశనిఁబోలె, శీఘ్రముగ నేఁగుదెంచి యాచెట్టుకడకు.

క. కనుఁగొని కృష్ణుని మానస, మున నుద్భవిలఁగ భీతి పురుషోత్తమ నా
యొనరించినయపరాధం, బును సైఁపు మటంచు మ్రొక్కి ముంగల నిలిచెన్. 3220

గీ. అట్టియెడ శౌరి వ్యాధుని నాదరించి, కాల మొనగూడుటను నిట్టిఘటన యొదవెఁ
జింతిలకు మని పలుకుచుఁ జేత నిమిరి, వానిమేను వైకుంఠంబు వానిఁ గొనఁగ. 3221

గీ. అవల శౌరి మనుష్యదేహంబు విడిచి, యాత్మవిష్ణుస్వరూపంబు నధిగమించి
యష్టమహిషీయుతంబుగా నధివసించి, గరుడిపై నిజవిష్ణులోకమున కరిగె. 3222

సీ. మును దండకారణ్యమున రామచంద్రునిఁ, గామించిన ఋషిప్రకాండు లెల్ల
గోపిక లై పుట్టి గోకులంబున శౌరి, గా నుద్భవిలినరాఘవునితోడఁ
దమి దీరఁ గూడి కామముచేత మోక్షంబుఁ, జెంది రస్రపులు ద్వేషించి హరిని
నొనసిరి ముక్తి నాతనిచేత హతు లయి, కలిగె ద్వేషమున దైత్యులకు ముక్తి

గీ. కామమును ద్వేషమును నరకమునఁ గూల్చు, నట్టి వయ్యును భగవదుపాశ్రితంబు
లగుటచే మోక్షసాధన మయ్యె నింక, భక్తియోగంబునను ముక్తిఁ బడయు టరుదె.

వ. అంత బలరామదేహంబుతోడ రేవతియును బ్రద్యుమ్నశరీరంబుతోడ రుక్మిపుత్రి
యును ననిరుద్ధకళేబరంబుతోడ నుషయును వసుదేవకాయంబుతోడ దేవకియును
స్వస్వభర్తృదేహంబులతోడ దత్తద్యాదవాంగనలును ద్వారకాపురసర్వజనంబులును
నగ్నిప్రవేశంబు గావించి కృష్ణసాన్నిధ్యముం బడసిరి. 3224

గీ. అంతటను వారలకు నెల్ల నాచరించె, నౌర్ధ్వదైహికకర్మంబు నర్జునుండు
దారుకుండు వచ్చి దివ్యరథంబుమీఁద, నునిచికొని పారిజాతంబుఁ జనియె దివికి.

సీ. అప్పుడు కళాహీన మై ద్వారకాపురం, బుండంగ నందులో నుండలేక
శౌరిషోడశసహస్రకళత్రములతోడఁ, బార్థుఁ డచ్చటనుండి బయలుదేఱె
నంతట ద్వారక యంబుధిలో మున్గె, శౌరివియోగార్తి సైఁపలేమిఁ
బ్రస్థితుం డై హస్తిప్రస్థంబునకుఁ బార్థుఁ, డరుగు చుండంగ మార్గాంతరమునఁ

గీ. జోరు లేతెంచి కొంద ఱర్జునునిఁ గొట్టి, శౌరికాంతలఁ గొనిపోవ సవ్యసాచి
యేమియును జేయఁజాలక యేఁగె శౌరి, తోడనె మదీయబల మని దుఃఖపడుచు.

వ. సాయంసమయమార్తండుండువోలె వినష్టతేజుం డై యింద్రప్రస్థంబునకుం జేరె.

సీ. మును దేవగంధర్వవనిత లష్టావక్ర, పారికాంక్షినిఁ జూచి పరిహసించి
యతఁడు శపింప వేశ్యలు గాఁగ భయపడి, వానిపాదంబులపైని వ్రాలి
యపరాధమును సైఁపు మని వేఁడి తత్ప్రసా, దమున మాధవునిభర్తగను బడసి
తచ్ఛాపవశమున దస్యులపా లైరి, కలుగదె కీడు పెద్దలను నవ్వ

గీ. శాపఫలమును వార లాచందమునను
ననుభవింపంగ వలసియుంటనె కిరీటి
శక్తియును జాలదయ్యెఁ దస్కరుల గెలువ
నగజ మునులప్రభావ మే మనఁగవచ్చు. 3228

సీ. వేదోక్తవిధులఁ గావించుచుఁ దద్బలం, బునను మహోన్నత్యమును వహించి
గర్వంబునను గన్ను గానక రాక్షసుల్, బాధించు చుండఁ బ్రపంచములను
బుండరీకాక్షుఁడు బుద్ధరూపంబున, నవనితలంబునం దవతరించి
రచియించి బౌద్ధశాస్త్రమును దానను వారి, కభిరుచి గల్గించి యధికముగను

గీ. ధర్మవిముఖులఁ జేయంగఁ దగ్గిపోయె
స్వల్పకాలంబుననె దైత్యశక్తి యెల్ల
నదియె తఱి యని నారాయణాస్త్రమునను
బిలుకుమార్చితి నాదురాత్ములను నేను. 3229

ఉ. జలజలోచనుండు గలియుగాంతంబున, నవతరించి కల్కి యనెడిపేర
క్షితిసురాన్వయమునఁ జెండాడి మ్లేచ్ఛుల, నుర్వరాభరంబు నుడుపఁగలఁడు. 3230
భగవదవతారచరితము, లగరాజతనూజ సంగ్రహంబుగ నీకుఁ
మిగులంగనీక చెప్పితి, విగళితమగు నఘము లెల్ల వినుటను వీనిన్. 3231

ఉ. ఇంకను నేమి యైన విన నిచ్చ జనించిన నీకు నాత్మలో
శాంకరి కోరు మేర్పడఁగ సర్వముఁ జెల్పెద నాఁగ గౌరి యే
ణాంకకిరీట నాపయి దయామతి గల్గినచో వచింపుమీ
పంకజపత్రనేత్రునిసపర్యకు వైష్ణవమార్గ మంతయున్. 3232

—: వైష్ణవసపర్యామార్గకథనము :—

క. అని యడుగుటయును హరుఁ డి, ట్లనియెను శర్వాణి విను స్వయంవ్యక్తము స్థా
పన మనియు రెండుతెఱఁగులఁ, దనరారుచు నుండు విష్ణుధామము ధరణిన్. 3233

వ. శిలామృద్దారులోహాదులచే విష్ణుప్రతికృతిం గావించి దానిని శ్రౌతస్మార్తాగమక్రియా
కలాపంబుచే స్థాపించిన నయ్యది స్థాపనంబు. పాషాణదారువులలో దేనియందు నారా
యణుండు స్వయముగనే సన్నిహితుం డై యుండు నయ్యది స్వయంవ్యక్తంబు. 3234

క. ఆరెండుధామములు దై, త్యారిని బూజింప నయ్యె నర్హంబులు చే
కూరని దేదియు లేదు త, దారాధనమునను భక్తు లగువారలకున్. 3235

గీ. శౌరి యావిర్భవించె నిక్ష్వాకువంశ, భూవరేణ్యులతపముచే భూతలంబు
నందు శ్రీరంగశాయి యై యతనిఁ గొల్చు, వారలకు ముక్తి కొంగుబంగారు చూవె.

ఆ. అవతరించెఁ గాశియందు మాధవుఁ డను, పేర నచ్యుతుండు నీరజాక్షి
యతనిఁ గొలువ నచటి కనుదినంబును నేను, సురసమేతముగను నరుగు చుందు. 3237

గీ. ఉందు నేను స్వయంవ్యక్త ముండుచోట, నచ్యుతార్చన సేయుచు నచ్యుతుండు
తదపచితి సేయువారికి దర్శనంబు, నొసఁగుటయె కాక యిష్టార్థ మొసఁగు నపుడె.

క. కావున నర్చామూర్తిని, సేవింపఁగవలయు నెల్లజీవులుఁ దమకున్
గోవిందునిసాన్నిధ్యము, గావలయు న టన్నవాంఛ గలిగినయెడలన్. 3239

క. వనజాక్షి భరతవర్షం, బున నర్చామూర్తులందుఁ బురుషోత్తముఁ డుం
డినపగిది నితరధామం, బున నుండఁడు తత్ప్రభావమును నేమందున్. 3240

వ. ఇంద్రద్యుమ్నంబును గౌర్మంబును సింహాద్రియును గరవీరకంబును గాశీప్రయాగ
సాలగ్రామంబులును ద్వారవతియును నైమిషంబును బదరికాశ్రమంబును గృతశౌ
చంబును బౌండరీకంబును దండకారణ్యంబును మాధురంబును వేంకటాద్రియును
శ్వేతాద్రియును గరుడాచలంబును గాంచియును ననంతశయనంబును శ్రీరంగంబును
భైరవాచలంబును నారాయణాచలంబును సౌమ్యంబును వారాహంబును వామనా
శ్రమంబును మున్నగుమహాస్థలంబులు స్వయంవ్యక్తస్థానంబులుగాఁ జెప్పంబడియె.
సాలగ్రామశిలార్చనంబు గృహంబులందును విహితంబు. అర్చనంబును మంత్రపఠనం
బును యాగంబును యోగంబును నామసంకీర్తనంబును వందనంబును సేవయును భగ
వచ్ఛిహ్నాంకనంబును దదీయారాధనంబును ననునవవిధకర్మంబులు వైష్ణవునకు విహి
తంబులు. తాపాదిపంచసంస్కారియును నవేజ్యాకర్మకారకుండును నర్థపంచకవిదుండును

బ్రాహ్మణుండును నగు వైష్ణవుండు మహాభాగవతుండుగాఁ జెప్పంబడియె. అతండు భగవంతుండువోలె సర్వలోకపూజ్యుం డగుట గురుశబ్దవాచ్యుం డయ్యె. నవకర్మ విధానయాగంబు క్షత్రియునకును భగవచ్ఛిహ్నాంకనంబును సేవయుఁ దదీయారాధనంబును మంత్రరత్నజపంబును నామసంకీర్తనంబును వందనంబును ననుషట్కర్మయాగంబు వైశ్యునకును నామసంకీర్తనంబును సేవయుఁ బూజయు వందనంబును దదీయారాధనంబును ననుపంచకర్మయాగంబు శూద్రునకును విధియింపంబడియె. మానసయాగం బందఱకును సమానంబు. వర్ణాశ్రమానురూపంబుగా శ్రుతిస్మృత్యుక్త కర్మంబు లాచరించుచు వైష్ణవుండు విష్ణుయాగంబు గావింపం దగు. శ్రుతిస్మృతి పురాణోక్తాచారంబుల నుల్లంఘించినవైష్ణవుండు పంచపాషండత్వముం జెంది రౌరవ నరకంబునం గూలు. 3241

క. శమమును నస్తేయము శౌ, చమును నహింసయును నామిషత్యాగంబుఁ
దమమును సత్యముఁ దపమును, సమస్తజనులకును ధర్మసాధనము లగుఁ. 3242

వ. నిశాంతంబున నుత్థితుం డై వైష్ణవుండు గురునమస్కారంబును హరిస్మరణంబును గావించి కాల్యకృత్యంబులు నిర్వర్తించికొని తులసీమూలమృత్తికను దత్పత్త్రయుతంబుగాఁ గైకొని మంత్రరత్నంబుచేతను గాయత్త్రిచేతను నభిమంత్రించి మృత్తికామంత్రంబుచే మేన నలందికొని గంగాజలంబున నఘమర్షణసూక్తంబులచే స్నానంబు గావించి పురుషసూక్తంబున మార్జనంబు చేసికొని మరల మునింగి మూలమంత్రంబు నష్టావింశతివారంబులు గాని యష్టోత్తరశతవారంబులు గాని జపించి మంత్రాభిమంత్రిత సలిలప్రాశనం బొనర్చి యాచమించి దేవర్షిపితృతర్పణంబు గావించి ధౌతవస్త్రధరుండై విహితమృత్తికను మూలమంత్రంబుచే నభిమంత్రించి దాన నూర్ధ్వపుండ్రంబులం దాల్చి సంధ్యోపాసనంబు సేసి గృహమునకు వచ్చి విష్ణుమండపముం జొచ్చి ప్రసూనాలంకృతం బగుపీఠంబునందు స్థాపనంబునం గాని స్వయంవ్యక్తంబునం గాని లక్ష్మీనారాయణుని గురూపదిష్టశ్రౌతస్మార్తాగమవిధానంబునఁ గ్రియాలోపంబు లేకుండ యథాశక్తి నారాధింపం దగు. వైఖానసంబు శ్రౌతంబు. వాసిష్ఠంబు స్మార్తంబు. పాంచరాత్రం బాగమంబు. ఆరాధనానంతరంబు వైదికాగ్నియందుఁ బురుషసూక్త శ్రీసూక్తమంత్రంబులచే నాజ్యమిశ్రితనైవేద్యశేషహవిస్సు నష్టోత్తరశతవారంబులు గాని యష్టావింశతివారంబులు గాని హోమంబు గావించి విష్ణునామంబులచేఁ బిదప నొక్కొక్కయాహుతి నుంపవలయు. పిమ్మట భూనీలావిమలాదిశక్తులను ననంత విహగేంద్రాదులను వాసుదేవాదులను కేశవాదిమూర్తులను సంకర్షణాదిమూర్తులను మత్స్యకూర్మాదులను జక్రాద్యాయుధంబులను గుముదాదులను జంద్రాదిదేవతలను నింద్రాదిలోకపాలురను ధర్మాదిదేవతలను నుద్దేశించి హోమంబును నర్చనంబునుం గావింపవలయు. ఇట్లు నిత్యార్చనంబు గావించువాఁడు భాగవతోత్తముండు. గృహార్చనమునందు గృహద్వారంబునఁ బంచయజ్ఞవిధానంబుచే బలి నొసంగి పిదప నాచ

మించి కృష్ణాజినకుశోత్తరం బగునాసనంబు నధిష్ఠించి పద్మాసనాసీనుం డై భూతశుద్ధిం గావించి మూలమంత్రంబుచేఁ బ్రాణాయామత్రయంబు చేసి హృత్పద్మంబు నూర్ధ్వ ముఖంబు గావించి విజ్ఞానభానునిచే వికసింపం జేసి తత్కర్ణికయందు వహ్న్యర్కశశి బింబంబులను వానిపైని నానారత్నమయపీఠంబును దానిపైని బాలార్కసదృశ ప్రభంబును మంత్రాక్షరమయంబును నగునష్టదళపద్మంబును దానిపైని సర్వలక్షణ లక్షితం బగులక్ష్మీనారాయణమూర్తిని ధ్యానించి మూలమంత్రంబు సహస్రవారం బులు గాని శతవారంబులు గాని జపించి మానసికార్చనంబు గావించి తత్కాలా గతు లగువైష్ణవాతిథుల నర్చించి యన్నపానాదులచేఁ దృప్తి నొందించి తాను బుత్రకళత్రాదులతో భుజింపం దగు. బ్రహ్మరాక్షసబేతాళయక్షభూతార్చనంబును మద్యమాంసభుగ్దేవతార్చనంబును గుంభీపాకమహానరకపతనకారకం బగుటంజేసి తద ర్చనంబు గావింపం జనదు. తామసదేవతలకును బిశాచాదులకును నివేదించినయన్నంబు దినువాఁడు పూయశోణితంబుల భుజియించినవాఁ డగు. యజ్ఞదానాదులవలనఁ గోటి జన్మంబులనుండియు వాఁడు సంపాదించినపుణ్యాం బంతయును దత్క్షణంబ నశియించి చండాలత్వంబుం జెందు. విష్ణుభుక్తావశేషాన్నంబున నితరదేవతలకు హోమద్వారంబు నను బలిద్వారంబునను బ్రాహ్మణద్వారంబునను సంతృప్తి గావింపం జను. విష్ణుని వేదితాన్నంబు పితృదేవతలకును సంతృప్తిదాయకంబు. అవైష్ణవాన్నంబును బతితా న్నంబును హరికి నివేదింపనియన్నంబును శ్వమాంససదృశంబులు. యక్షరాక్షసాది నివేదితాన్నంబును మద్యంబును లశునంబును మూలకంబును గృంజనంబును దిలపిష్టం బును శిగ్రువును బిల్వంబును గోశాతకియును నలాబువును శ్వేతవృంతాకంబును నభక్ష్యంబు లగుటంజేసి వానిం దినువారును వారిసంసర్గంబు గావించువారును ఘోరనరకముం జెందువారు. పతితపాషండవికర్మస్థసంసర్గంబును దత్సంసర్గిసంసర్గం బును నిరయహేతువులుగాఁ జెప్పంబడియె. అభక్ష్యభక్షణాగమ్యాగమనహింసాపర ద్రవ్యాపహరణంబులు నిరయదాయకంబులు.

—: వైష్ణవభక్తదాసైకాంతిపరమైకాంతిస్వరూపనిరూపణము :—

వేదవేదాంగపారగుండును బ్రహ్మక్రియారతుండును శంఖచక్రాంకితుండును సత్యశౌచ క్షాంతియుక్తుండును రాగద్వేషవర్జితుండును నగ్నిహోత్రియును నతిథిపూజకుండును బాపపరాఙ్ముఖుండును దయాధర్మశీలుండును దులసీమాలాధరుండును విహితతిలక ధారియును విష్ణువిగ్రహారాధకుండును శివనిందావిముఖుండును నగుబ్రాహ్మణుండు వైష్ణవుండు. బాల్యంబు మొదలుకొనియును విష్ణుభక్తి గలవాఁడు భక్తుండు. విప్ర సేవారతుండును విష్ణుపూజకుండును వేదసమ్మితపురాణశ్రోతయును నగుశూద్రుండు దాసుండు. నారదాదులు వైష్ణవులుగను బ్రహ్లాదధ్రువాంబరీషాదులు భక్తులుగను విదురాదులు దాసులుగను జెప్పంబడిరి. శాస్త్రదూషణభాషణంబులం బరిత్యజించి

భగవత్కైంకర్యలోలుండై యుండువాఁ డేకాంతి. సమస్తలోకంబును హేయబుద్ధిచేఁ బరిత్యజించి కేవలనారాయణధ్యానవశుం డై యుండువాఁడు పరమైకాంతి. పాపయుక్తం బయ్యె నేని వైష్ణవుండు తత్కాలంబును నేకాంతి తద్గ్రామంబును బరమైకాంతి తద్దేశంబును విడువవలయు. కృత్యాకృత్యవివేకంబును బరలోకచింతనంబును దత్ప్రాప్తిసాధనంబును విష్ణుస్వరూపజ్ఞానంబును వైష్ణవునకు నత్యావశ్యకంబులు. చక్రాంకనోర్ధ్వపుండ్రధారణంబును విష్ణుమంత్రజపంబును విష్ణ్వర్చనంబును విష్ణుస్మరణంబును విష్ణుకీర్తనంబును విష్ణుసేవయు విష్ణువందనంబును వైష్ణవారాధనంబును విష్ణుప్రసాదతీర్థసేవయు ననునవవిధభక్తి వైష్ణవునకు ముఖ్యంబు. వైష్ణవుండు నారాయణునిఁ బ్రపత్తిచే శరణుపొందం దగు. ప్రపత్తి సాత్త్వికరాజసతామసరూపంబునఁ ద్రివిధంబు. తత్సిద్ధియుఁ ద్రివిధంబ. వైష్ణవునకు నిత్యనైమిత్తికకామ్యరూపంబునఁ గృత్యంబు త్రివిధంబు. గోవిందుని భక్తిచేఁ ద్రికాలంబులందును బ్రతిదినంబును నర్చించుట నిత్యంబు. విశేషమాసదినంబులందుఁ జేయువిశేషార్చనంబు నైమిత్తికంబు. కోర్కెచేఁ గావించువిష్ణుకైంకర్యంబు కామ్యంబు. ధనుర్మాసంబునఁ బ్రతిదినంబును నుషఃకాలంబున నుత్పలకరవీరకుసుమంబులచే హరి నర్చించి మాసాంతంబున బ్రాహ్మణసంతర్పణంబు చేయుఁవాఁ డశ్వమేధసహస్రపుణ్యముం బడయు. మాఘమాసంబున భానూదయకాలంబున స్నానంబు గావించి ప్రతిదినంబును నుత్పలాదిపుష్పంబులచే మాధవుని నర్చించుచు మాసాంతంబున బ్రాహ్మణసంతర్పణంబు గావించువాఁడు విష్ణులోకముం జెందు. మధుమాసంబున వకుళచంపకంబులచే మాధవుని నిత్యంబును బూజించి గుడాన్నంబు నివేదించుచు మాసాంతంబున విప్రసంతర్పణంబు గావించువాఁడు సహస్రవార్షికపూజాఫలంబుం జెందు. మాధవమాసంబున శతపత్త్రంబులచే హరిని బూజించి దధ్యన్నంబును ఫలంబులును గుడోదకంబును బ్రతిదినంబును నివేదించుచు మాసాంతంబున భాగవతసంతర్పణంబు గావించువానిసదనంబున నారాయణుండు లక్ష్మీసమేతంబుగాఁ బ్రీతుం డై నివసించు. జ్యేష్ఠమాసంబున శుక్లకమలపాటలకుముదంబులచే హృషీకేశుని నర్చించి ప్రతిదినంబును జూతఫలయుతాన్నంబు నివేదించి మాసాంతంబున బ్రాహ్మణసంతర్పణంబు గావించువాఁడు కోటిగోదానంబులు గావించినఫలముం జెందు. ఆషాఢమాసంబున ననుదినంబును శౌరిని శ్రీపుష్పంబులచే నర్చించి పాయసాన్నంబు నివేదించుచు మాసాంతంబున భూసురసంతర్పణంబు చేయువాఁడు షష్టివర్షసహస్రపూజాఫలముం జెందు. శ్రావణమాసంబునఁ గేశవునిఁ బున్నాగకేతకీదళంబులచేఁ బూజించి నిత్యంబును ఘృతశర్కరామిశ్రితాపూపనివేదనంబు గావించుచు మాసాంతంబున బ్రాహ్మణసంతర్పణం బొనర్చువాఁడు జన్మరాహిత్యముం బడయు. భాద్రపదమాసంబునఁ గుందకరవీరంబులచేఁ బుండరీకాక్షునిం బూజించి నిత్యంబును గుడమిశ్రితక్షీరాన్నంబు నివేదించుచు మాసాంతం

బున ద్విజసంతర్పణంబు గావించువాఁడు ప్రతిదినంబును గోటిగోదానంబులు చేసిన ఫలముం జెందు. ఆశ్వయుజమాసంబునఁ బురుషోత్తముని నీలోత్పలంబులచేఁ బూజించి నిత్యంబును నపూపమిశ్రితక్షీరనివేదనంబు గావించుచు మాసాంతంబున విప్రసంతర్పణంబు గావించువాఁడు నిజజనావృతుం డై కల్పకోటిసహస్రంబు వైకుంఠంబునందు నివసించు. కార్తికమాసంబున నఖండదీపంబు నుంచి జాతీపుష్పకోమలతులసీదళంబులచే నచ్యుతునిఁ బూజించి క్షీరాజ్యశర్కరోపేతమిష్టాన్నపాయసాపూపనివేదనంబు నిత్యంబును గావించుచు మాసాంతంబున బ్రాహ్మణసంతర్పణంబు చేయువాఁడు విష్ణుసాయుజ్యముం జెందు. అమావాస్యామందవారవైష్ణవర్క్ష రవిసంక్రమణవ్యతీపాతచంద్రసూర్యగ్రహణంబులందు విశేషనైమిత్తికార్చనంబు గావింపం జనుఁ. గురూత్క్రాంతిదివసంబునను జన్మనక్షత్రదినంబునందును వైష్ణవేష్టి గావించి వైష్ణవసంతర్పణంబుం జేసె నేని కులకోటి నుద్ధరించి విష్ణుసాయుజ్యంబు నొందం గలుగు. మంత్రరత్నంబుచే సప్తరాత్రంబు లష్టోత్తరసహస్రహవిర్హోమంబులు గావించి యంతంబున వైష్ణవానువాకంబుచే నవభృథంబు చేసి మహాభాగవతార్చనసంతర్పణంబులు గావించె నేని వైష్ణవలోకంబున శాశ్వతంబుగా నివసించు. ఈవిధంబున యావజ్జీవితంబును వైష్ణవుండు విష్ణుకైంకర్యంబు యథాశక్తిని గావింపవలయు. విష్ణ్వారాధనంబు కంటె విష్ణుభక్తారాధనంబు పరతరంబుగాఁ జెప్పంబడియె. హరిని బూజించి వైష్ణవార్చనంబు గావింపఁ డేని వాఁడు భాగవతుండు గాక దాంభికశబ్దవాచ్యుం డగు. 3243

క. కావున వైష్ణవపూజను, గావింపఁగ వలయు విష్ణుకైంకర్యంబుల్
గావించువాఁడు సతతము, గోవిందున కదియె తృప్తిఁ గొలుపున్ మదికిన్. 3244

వ. సర్వజగదీశ్వరుం డగునారాయణునికంటె నన్యదేవత నుత్కృష్టంబుగాఁ జెప్పువారును కపాలభస్మాస్థిధారులును నవైదికలింగధారులును వానప్రస్థాశ్రమస్థులు గాక జటావల్కలంబుల ధరియించువారును నవైదికకర్మకారులును శ్రుతిస్మృతిపురాణోక్తాచారవర్జితులును భగవత్ప్రీతిశూన్యులును వేదోక్తకర్మంబులు స్వచ్ఛందంబుగా నాచరించువారును సమస్తయజ్ఞభోక్తయును బ్రహ్మాద్యదైవతంబును నగువిష్ణుని విడిచి యన్యదేవతల నుద్దేశించి హోమంబులును దానంబులును జేయువారును నారాయణుని బ్రహ్మాద్యన్యదేవతాసమానునిఁగా దర్శించువారును జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందును మనోవాక్కాయకర్మంబులచేతను నారాయణుని నెఱుంగనివారును బాషండులుగాఁ జెప్పంబడిరి. పాషండవికర్మస్థపతితశ్వపచదర్శనసంభాషణస్పర్శంబులు వైష్ణవునకు నింద్యంబులు. విష్ణుభక్తి లేనివిప్రుండు పాషండుండు. శిఖోపవీతత్యాగి వికర్మస్థుండు. మహాపాతకోపపాతకయుక్తుండు పతితుండు. అంత్యజుండు శ్వపచుండు.

గీ. అని వచించుటయును నిట్టు లనియె గౌరి, స్వామి క్షమియింపు మొకప్రశ్నంబు నడుగఁ
దలఁచితిని స్త్రీస్వభావంబువలన నిన్ను, నీవు పాషండుఁడవో కావో నిజము చెపుమ.

—: ఈశ్వరపాషండవేషహేతుకథనము :—

సీ. అనవుడు శంభుఁ డి ట్లనియెఁ గాత్యాయని, నీసంశయము దీర్తు నిజముఁ దెలిపి
యీరహస్యంబు నీ వెవ్వరికినిఁ దెల్పఁ, దగదు సుమీ యెట్టితరుణమునను
నముచిప్రముఖు లై నదనుజపుంగవులు స్వా, యంభువాంతరమునయందు మున్ను
శ్రుత్యుక్తవిధులను నిత్యంబుఁ జేయుచు, ధర్మమార్గంబును దప్పకుండ

గీ. సంచరించుచు నుంట నసాధ్య మైన, బలమును బరాక్రమంబును గలుగ వాని
వలన గర్వితు లై దేవతల జయించి, యాక్రమించిరి స్వర్గరాజ్యంబు నంత. 3247

సీ. ఇంద్రాదిదేవత లెల్ల భయంబుచే, దైత్యారికడ కేఁగి దనుజబాధ
నెఱిఁగింపఁగను హృషీకేశుఁ డాలోచించి, తత్క్షణంబునయందు దలఁచె నన్నుఁ
దలఁచినంతనె నేను దైత్యారికడ కేఁగ, హరి నన్నుఁ దిలకించి యాదరించి
చంద్రశేఖర నిశాచరులు ధర్మబలంబు, వలన నేఁచుచు నున్నవారు సురల

గీ. వారలను ధర్మబల ముండువఱకు నేను
సంహరింపఁగఁ జాల నేసరణి నైనఁ
గానఁ దద్ధర్మమునకు సంక్షయము గలుగు
నట్టిపని చేయవలయును మొట్టమొదట. 3248

వ. కావున నీవు దేవతాహితార్థంబు పాషండవేషముం దాల్చి వేదబాహ్యమతంబు నవలంబించి సంకాళశైవపాషండమహాశైవాదిభేదంబులతోడఁ బాశుపతశాస్త్రంబు స్వయముగా నిర్మించి తామసబుద్ధు లగుకణాదగౌతమశక్త్యుపమన్యుజైమినికపిలదుర్వాసోమృకండుబృహస్పతిభార్గవులయందును దదితరతామసమహర్షులయందును భవచ్ఛక్తి నావేశింపంజేసి తామసపురాణంబులును దామసశాస్త్రంబులును దామసస్మృతులును రచియింపంజేసి తద్ధర్మంబులు దానవుల కెల్ల బోధింపుము. తన్మోహంబున వార లెల్లరును దామసు లై నిన్నుఁ బరదైవముగా భావించి వేదధర్మచ్యుతు లగుదు రని వచియించె. 3249

సీ. ఆభాషణములు నే నాలించి తాదృశ, పాపకృత్యమునకుఁ బాలుపడఁగ
నంగీకరింపమి నంతరంగము దాఁట, ననుచితం బగుటను నచ్యుతాజ్ఞ
యెటు సేయుటకుఁ గూడ నేమియుఁ దోఁపక, చింతించు చుండంగ శ్రీధరుండు
గ్రహియించి సర్వంబు కైలాసనాథ నీ, వీకార్యమున సంశయింప వలదు

గీ. దేవతాకార్య మగుటను దీన నీకు, స్వార్థ మేమియుఁ లేకుంట నస్మదాజ్ఞ
దాఁటఁ దగమిని నెట్టిపాతకము గూడ, సంఘటిల్లదు నీ కిందు సత్యముగను. 3250

గీ. కలుష మే దైన దీనిలోఁ గలుగు ననెడి, సంశయం బున్న యెడ నీకు సర్వపాప
మథనధృతకంకణం బైనమత్సహస్ర, నామములను జపింపుము క్షేమ మొదవు.

వ. సహస్రనామజపంబు క్లేశసాధ్యంబుగాఁ దోఁచె నేని "శ్రీరామాయ నమః" యను మామకషడక్షరమహామంత్రంబు జపింపుము. సర్వదుఃఖంబులును నశేషపాతకంబు

బును దానం దొలంగు నని యాజ్ఞాపింప నేను దదాజ్ఞ నొదలం దాల్చి కపాలచర్మ భస్మాస్థిధారణంబుం జేసి పాషండవేషముం దాల్చి పాషండ శైవశాస్త్రంబులను స్వయముగా రచియించి గౌతమాదిమహర్షులయందు మచ్ఛక్తి నావేశింపంజేసి వేదబాహ్య శాస్త్రస్మృతిపురాణంబులను రచియింపంజేసి తద్బోధంబు గావింపం దొడంగితి. సర్వ రాక్షసులును నావేషంబును నామతంబునుం దిలకించి మద్బోధమోహితు లై వేద ధర్మచ్యుతిం జెంది నావలన వరంబులం గొని మదమత్తు లై సత్త్వహీనులును నిర్వీర్యులును సర్వధర్మభ్రష్టులును నై దేవతలచే సులభంబుగా జయింపంబడి యధోగతిం జెందిరి. నేను భగవదాజ్ఞచే దేవహితార్థంబు రాక్షసుల మోహింపంజేయ వేదగర్హితవేషంబుం దాల్చినను హృదయమధ్యంబునం బరమేశ్వరుం డగునారాయణుని ధ్యానించుచు విష్ణుసహస్రనామరామతారకమంత్రజపంబులం గావించుచు ననవరతంబును బ్రహ్మానందంబు ననుభవించుచుందు. కావున నన్ను బహిర్వేషంబుచేఁ బాషండునిఁగను నంతర్వృత్తిచే వైష్ణవునిఁగను నెఱుంగుము. రాక్షసమోహనార్థంబు నేనును గౌతమాదులును రచించినతామసపురాణశాస్త్రస్మృతులను విశ్వసించువారు దానవులువోలె నధోగతిం జెందువార. 3252

క. అని చెప్పుటయును పార్వతి, విని సర్వముఁ బ్రాణనాథ వినిపింపుము నీ
వును గౌతమాదిమునులును, బొనరిచినపురాణశాస్త్రములనామములన్. 3253

—: తామసశాస్త్రస్మృతిపురాణనిరూపణము :—

వ. అని యడుగుటయు సదాశివుండు పార్వతి కిట్లనియె. మొదట నేను పాశుపతాది శైవశాస్త్రంబుల రచియించితి. పిదపఁ గణాదుండు వైశేషికశాస్త్రంబును గౌతముండు న్యాయశాస్త్రంబును గపిలుండు సాంఖ్యశాస్త్రంబును బృహస్పతి చార్వాకశాస్త్రంబును జైమిని నిరీశ్వరవాదంబును రచియించిరి. మఱియును నష్టాదశమహాపురాణములలో మాత్స్యము కౌర్మము లైంగము శైవము స్కాందము నాగ్నేయము నను నాఱుపురాణంబులు తామసంబులు. బ్రహ్మాండము బ్రహ్మవైవర్తము మార్కండేయము భవిష్యము వామనము బ్రాహ్మము నను నాఱుపురాణంబులు రాజసంబులు. వైష్ణవము నారదీయము భాగవతము గారుడము పాద్మము వారాహము నను నాఱుపురాణంబులు సాత్త్వికంబులు. ఇట్లె గౌతమము బార్హస్పత్యము సాంవర్తము యమము శార్ఙ్గము నౌశనసము నను నాఱుస్మృతులు తామసంబులు. యాజ్ఞవల్క్యము నాత్రేయము తైత్తిరము దాక్షము కాత్యాయనము వైష్ణవము నను నాఱుస్మృతులు రాజసంబులు. వాసిష్ఠము హారీతము వ్యాసము పారాశరము భారద్వాజము కాశ్యపము నను నాఱుస్మృతులు సాత్త్వికంబులు. 3254

ఆ. సాత్త్వికములు మోక్షసంధాయకంబులు, స్వర్గదములు రాజసములు దామ
సములు నరకదాయకములు గావున క్షేమ, కామి విధువవలయుఁ దామసముల.

క. అని నుడువుటయును బార్వతి, విని సర్వము నాథ నాకు విష్ణుసపర్యన్
బొనరింప వాంఛ పొడమెడి, ననుమతి యి మ్మనుచు వేడ హరుఁ డి ట్లనియెన్.
సీ. గౌరి నీకోర్కికిఁ గడు సంతసించితిఁ, బురుషో త్తమునిపూజ పుణ్యదంబు
వైష్ణవి నగునిన్ను వనితఁగాఁ గొనుట నా, చేసినతప మెల్ల సిద్ధి నొందె
జనదు గురూపదేశంబు లేకుండఁగ, నంబుజాక్షునిపూజ నాచరింపఁ
ద్వద్గురూ త్తముఁ డై నవామదేవునికడ, కరిగి తదుపదేశ మంది రమ్ము
గీ. నావుడు భవాని మిగుల సంతసము నొంది, వామదేవునికడ కేఁగి వాసుదేవ
మంత్రనామార్చనాదు లమ్మౌని చెప్ప, నంతయు గ్రహించి రజతాద్రి కరుగుదెంచి.
క. అది మొదలు విష్ణుపూజను, మొదటను గావించి మంత్రమును నామములన్
బిదప జపించుచు నిత్యము, వదలక వై కుంఠభ క్తివశ యై యుండెన్. 3258
సీ. అని వచింప దిలీపుఁ డాశ్చర్యమును జెంది, గురువర నేను నీకరుణవలన
వినఁదగినవి శేషవిషయంబులను నెల్ల, నాలించి ధన్యుఁడ నైతి నింక
నొక సంశయముమాత్ర మున్నది మదిలోన, నది తీర్ప దక్షుఁడ వగుదు వీవ
బ్రహ్మవిష్ణుమహేశ్వరత్రిమూర్తులలోనఁ, దథ్యంబుగను బరదైవ మెవరొ
గీ. చెప్పు మనుచు వసిష్ఠుఁడు క్షితివరేణ్య, యడుగఁ దగినరహస్యంబు నడిగి నాకు
సంతసముగొల్పితివి బుద్ధిశాలి వగుదు, వినిచెదను సర్వమును విను విశదముగను.

—: వ ర దై వ ని ర్ణ య క థ న ము :—

సీ. మున్ను మందరశైలమునకు స్వాయంభువ, మను వేఁగి బహుతపోధనులతోడ
సంకల్ప మొనరించెఁ జలుప సచ్చట దీర్ఘ, సత్త్రయాగంబు నాసమయమందుఁ
జను దెంచి రఖిలదేశంబులనుండి వి, ద్వాంసులు యోగులు దాపసులును
నప్పు డాసభలోన నయ్యోనివాదంబు, పరదైవ మెవ రనుప్రశ్న మందుఁ
గీ. గొందఱు వచించి రజుఁ డని కొందఁ ఱాఖండ
లేందుధరుఁ డని హరి యని కొంద ఱనిరి
యంతయును విని శుద్ధసత్త్వాత్ముఁ డెవఁడొ
యతఁడె పరదైవ మని మను వానతిచ్చె. 3260
గీ. అపుడు ఋషు లెల్ల మను వాడినట్టిమాట, సత్య మని సమ్మతించి తత్సత్త్వగుణము
భృగుమహర్షి యొకండె పరీక్షసేయ, దక్షుఁ డని యెంచి యతనిఁ బ్రార్థనమొనర్ప.
సీ. భృగుమౌని యంగీకరించి తత్ప్రార్థన, కైలాసమునకు శీఘ్రముగ నేఁగి
హరమందిరద్వారమం దుండునందినిఁ, గాంచి గిరీశ శంకరునిఁ జూడ
నరుగుదెంచితి భృగు వనుబ్రాహ్మణుఁడ నేను, శివునకు నారాక చెప్పు మనియె
నదది విని నంది యనాదరంబున వానిఁ, గానిచి విప్రుఁడ వైన నేమి

గీ. వేఁగ గాదిది ఘోరమ్ము మాశూలపాణి, కేళిలో నున్నవాఁ డని కినువడంగ
భృగువు శాంతి వహించి యనేకదినము, లచ్చటనె వేచికొనియుండి హరునికొఱకు.

సీ. సర్వజ్ఞుఁ డయ్యును శర్వుఁ డజ్ఞుఁడువోలె, నంగనాసంగలౌల్యమునఁ జిక్కి
తనగతి యేమియుఁ గనుఁగొనకునికి లో, నావిర్భవింపంగ నాగ్రహంబు
యోనిలింగాకార మొందంగ శంభునిఁ, దిట్టి నందిని జూచి తీవ్రముగను
శైవుల కెల్లఁ బాషండత్వ మొదవంగ, శాపంబు నొసఁగి తత్క్షణమునంద

గీ. బ్రహ్మలోకంబునకుఁ బోయి బ్రహ్మ కెఱఁగి, నిలువఁబడ ధాత యేమియుఁ బలుకఁడయ్యె
దాని కమర్షని కోపించి ధాత కెందు, నర్చనము లేకపోవుఁగా కని శపించి. 3263

సీ. విష్ణులోకమునకు వెంటనె చని శార్ఙ్గి, మందిరద్వారంబులందుఁ దన్ను
వారింప కునికి నెవ్వరును గోవిందుని, యంతఃపురంబునయందుఁ జొచ్చి
పద్మ యొత్తుచు నుండఁ బదములు శయ్యపైఁ, బవళించియున్న మాధవునిఁ జూచి
దరి కేఁగి బిరబిరఁ దదురఃప్రదేశంబు, నెడమపాదంబున నెగసి తన్నె

గీ. నపుడు సంభ్రమమున లేచి యచ్యుతుండు, పట్టికొని యొత్తుచుఁ దదంఘ్రిపద్మములను
స్వామి ధన్యుఁడ నైతిఁ దావకపదాబ్జ, రేణువులు సోఁకుటను మచ్ఛరీరమందు. 3264

గీ. వివిధసంపదవాప్తిహేతువు లపార
భవజలధిసేతువులు విప్రపాదపద్మ
పాంసువులు వేనిమేనను బడునో వాని
తనువునం దుండుఁ బుణ్యతీర్థంబు లెల్ల. 3265

క. అని పలికి స్వర్ణకలశం, బున ను మహాలక్ష్మి జలముఁ బోయుచు నుండం
గను గడిగి తత్పదంబులు, తనశిరమునఁ జల్లుకొనియెఁ దజ్జలకణముల్. 3266

గీ. అది గనుంగొని భృగువు హర్షాశ్రుపూర్ణ, లోచనుం డయి పంకజలోచనునకు
వందన మొనర్చి శుద్ధసత్త్వప్రధాన, మయినతద్గుణమునకు విస్మయము నొంది. 3267

గీ. ఔర రూపంబు విజ్ఞాన మౌర శాంతి, యౌర క్షమ యౌర కారుణ్య మౌర శుద్ధ
సత్త్వగుణ మౌర కలదె యీశక్తి ముజ్జ, గంబులం దెందు నేని యొక్కనికి నైన.

సీ. అని మెచ్చుకొని పంకజాక్షునిగుణముల, నంతరంగమున నత్యద్భుతముగఁ
దిలకించి శార్ఙ్గిని దేవాదిదేవ నీ, వంటి దేవుఁడు లేఁడు వాస్తవముగ
బ్రహ్మణ్యుఁడవు నీవు పరమాత్ముఁడవు నీవు, సర్వలోకావనక్షముఁడ వీవు
సర్వజ్ఞుఁడవు నీవు సర్వశక్తివి నీవు, సర్వబృందారకస్వామి వీవు

గీ. సత్త్వమూర్తివి నీవు నీసత్త్వ మెఱుఁగఁ
దలఁచి యపచారమును నేను జలిపినాఁడఁ
దప్పు సైఁపు మ టంచుఁ దత్పదములందు
భక్తిభరితాంతరంగుఁడై పడియె హరిని. 3269

గీ. అప్పు డాదరమేదురస్వాంతుఁ డగుచు, భృగుమహర్షిని లేవంగ నెత్తి శౌరి
ఋషివతంసమ నీయందు దోసెంత యేని, నేర మనునది లే దని యూరడించె. 3270

వ. అంతట భృగుమహాముని వాసుదేవానుమతిం గైకొని మందరపర్వతంబున కరుదెంచి మహర్షిజనసభామధ్యంబునం జేరి తపోధనపూజితుం డై యి ట్లనియె. 3271

గీ. శంకరుఁడు తామసుండు రాజసుఁడు బ్రహ్మ, సాత్త్వికుఁడు వాసుదేవుఁడు సత్యముగను
జని త్రిమూర్తులకడకు నే ననుభవించి, తెలిసికొనినట్టివిషయంబుఁ దెలిపినాఁడ. 3272

వ. తామసుం డై నరుద్రుండు మచ్ఛాపంబున యోనిలింగాకారముం జెందె. తద్భక్తు లగుశైవు లెల్లరును బాషండు లై భస్మలింగాస్థిధారణంబుం జేయుచు వేదబాహ్యమతంబుల నవలంబించిరి. రాజసుం డై నబ్రహ్మ మచ్ఛాపంబుచేతన జగంబులందుఁ బూజానర్హుం డయ్యె. సాత్త్వికమూర్తి యగునారాయణుం డొక్కఁడ మత్పూజ్యత్వముం బడసె నని చెప్పుటయు మనువును దపోధనులును సంశయరాహిత్యముం జెంది సాత్త్వికమూర్తి యగువాసుదేవుని నొక్కనినె పరదైవంబుగా నిశ్చయించి విష్ణునైవేద్యతీర్థనిర్మాల్యాదు లన్నియును గ్రాహ్యంబు లనియును మహేశ్వరున కర్పితము లై నవస్తువు లగ్రాహ్యంబు లనియును సిద్ధాంతీకరించి మాధవారాధనంబు గావింపం దొడంగిరి. 3273

క. కావున జనవల్లభ నీ, భావంబునఁ గోర్కి పరమపద మొందంగా
నావిర్భవించు నెడఁ బర, దైవం బగుహరిని గొలిచి ధన్యుఁడ వగుమా. 3274

క. అని నుడువుటయు దిలీపుఁడు, మనమున సంతసము నొంది మాధవుసేవల్
బొనరించుచుఁ గాంచి యిహం, బున సౌఖ్యము లెల్లఁ దుదను మోక్షము నొందెన్.

క. ఇది పద్మోత్తరఖండము, విదితం బొనరించినాఁడ విశదము గాఁగన్
దుదిది యగుటఁ బాద్మమునకు, గుదిగ్రువ్వంబడియె నిందు గోప్యము లెల్లన్. 3276

—: పద్మపురాణపఠనశ్రవణాదిఫలకథనము :—

సీ. సాత్త్వికంబును వేదసమ్మితంబును నైన, యీపురాణము నిల నెవ్వ రేని
వినినఁ బఠించిన వినిచినఁ బాత్రు లై, హరికృపాపూర్ణకటాక్షములకు
ననుభవించి యిహంబునందు సౌఖ్యము లెల్ల, నపవర్గ మొందుదు రంతమందు
శ్రవణర్త్పూర్ణిమాగ్రహణకాలములందు, ద్వాదశియం దమావాస్యయందుఁ

గీ. గాని దినదినంబునఁ గాని దీన నర్ధ, పద్యమో పాదపద్యమో భక్తిఁ జదువ
నశ్వమేధసహస్రంబు నాచరించి, నట్టిఫల మొందుదురు సంశయంబు లేదు. 3277

క. కనకకలశసముపేతము, గను బద్మపురాణపుస్తకమును సమర్పిం
చినఁ బౌరాణికుఁ డగువి, ప్రున కెపుడును దాత విష్ణుపురమున నుండున్. 3278

వ. అని వచియించుటయు శౌనకాదిమహామునులు పరమానందముం జెంది సూతున కుచితసత్కారంబు గావించి యథేచ్ఛంబుగం జనిరి. 3279

క. శ్రీనాథహృదయ హృదయ, శ్రీనాథ ముఖార్యభిన్న చిన్మయరూపా
యానందకాననాఢ్య, శానా శ్రీవిశ్వనాథ సద్గురునాథా. 3280

క. స్మరహర కాశీవిశ్వే, శ్వర సంసారవ్యథానివారణనిపుణా
హరివిధిమహేంద్రముఖని, ర్జరకోటికిరీటరత్నరంజితచరణా. 3281

—: వా ణీ వృ త్త ము :—

శమధనహృన్నివాస బుధసన్నుతప్రభావా
కమలజముఖ్యనిర్జరనికాయదుర్లభాత్మా
సుమశరగర్వనిర్మథనశౌరి యాశ్రితాప
త్తిమిరవిభేదచండకర దేవ విశ్వనాథా. 3282

గ ద్య ము

శ్రీమచ్చిదంబరకవీంద్రప్రణీతం బైన
శ్రీ మ దాం ధ్ర ప ద్మ పు రా ణం బు న
నుత్తరఖండంబు సర్వంబును
సంపూర్ణంబు.

—◆—

శ్రీ కా శీ వి శ్వే శ్వ రా ర్ప ణ మ స్తు.





# శతావధాని శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రికృతగ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీమదాంధ్రపద్మపురాణము (ప్రథమసంపుటము) | క్యాలికోబైండు | 8-0-0 |
| | ,, ,, (ద్వితీయసంపుటము) | ,, | 4-0-0 |
| | ,, ,, (తృతీయసంపుటము) | ,, | 5-0-0 |
| | ,, ,, (చతుర్థసంపుటము) | ,, | 6-0-0 |
| 2. | హైమవతీవిలాసము (ప్రబంధము) | | 0-8-0 |
| 3 | కపోతకిరాతము (ప్రబంధము) | | 0-6-0 |
| 4. | శ్రీరామాంజనేయము (నాటకము) | | 1-0-0 |
| 5. | శ్రీకృష్ణసందేశము (నాటకము) | | 0-12-0 |
| 6. | భారతీయప్రబోధము (నేటిపరిస్థితుల విమర్శించుకావ్యము) | | 0-6-0 |
| 7. | పీఠికాపురశతావధానము | | 0-4-0 |
| 8. | నబాబుపేటశతావధానము | | 0-4-0 |
| 9. | బెజవాడ శతావధానము | | 0-4-0 |
| 10. | రాజసభావిహారము (అచ్చు కానున్నది) | | |
| 11. | పంచాయతనపంచశతి (సంస్కృతము) | | 1-0-0 |
| 12. | అవధానాదర్శము (సంస్కృతము)<br>పి. సుబ్రహ్మణ్యశాస్త్రికృతభావబోధినీవ్యాఖ్యానమలంకృతము | | 0-2-0 |
| 13. | రాజధర్మకావ్యము (సంస్కృతము - అచ్చుకానున్నది)<br>విద్వాన్ పి. విశ్వేశ్వరశాస్త్రికృతజయవ్యాఖ్యానమలంకృతము | | |

## పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రికృతులు

| | | |
|---|---|---|
| 14. | శంకరవిజయము (గద్యము) | 1-8-0 |
| 15. | త్యాగరాజనాటకము (అముద్రితము) | |
| 16. | మాయావిలాసము (ప్రబంధము - అముద్రితము) | |

## విద్వాన్ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రికృతులు

| | | |
|---|---|---|
| 17. | శ్రీరత్నపాంచాలిక (శ్రీసర్వజ్ఞసింగభూపాలునిసంస్కృతకృతి కాంధ్రీకృతి) | 1-8-0 |
| 18. | దూతవాక్యము (అచ్చుకానున్నది - భాసకృతి కాంధ్రీకృతి) | |
| 19. | ప్రద్యుమ్నాభ్యుదయము ,, (శ్రీరవివర్మభూపాలునిసంస్కృతకృతి కాంధ్రీకృతి) | |

వ్యాకరణవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ, సాహిత్యాలంకార

## పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రికృతులు

| | | |
|---|---|---|
| 20. | పాణినీయము–శావ్యవాఙ్మయము | 1-8-0 |
| 21. | ఆంధ్రవాఙ్మయవిమర్శము | 0-6-0 |

ప్రాప్తిస్థానము
శ్రీ చిదంబరగ్రంథమాల
రామారావుపేట
కాకినాడ

ప్రాప్తిస్థానము
విద్వాన్ పి. విశ్వేశ్వరశాస్త్రి
ఆంధ్రాధ్యాపకుడు వి. ఆర్. కాలేజి
నెల్లూరు